# సంపూర్ణ వాల్మీకి రామాయణము

వచనం
2345 పేజీలు



- శ్రీ ఎం.వి.సుబ్రహ్మణ్యం




ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

# Valmiki Ramayanam
in
Telugu by



Sri. M.V.Subrahmanyam,B.A.,B.G.L.,
Former Registrar AP High Court,
2-31 Chaitanyapuri Colony,
Hyderabad 500060
South India
Phone No.24048104
Mobile: 9866140619

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీమద్రామాయణము

ఆదికవి శ్రీ వాల్మీకి విరచితము.

సరళమైన తెలుగులో

భవదీయుడు

యం.వి.సుబ్రహ్మణ్యం

యం.వి.సుబ్రహ్మణ్యం,

రిటైర్డు రిజిస్ట్రారు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు

2.31, చైతన్యపురి,

హైదరాబాదు 500036.

ఫో: 040 24048104

సెల్: 9391134792

# రామాయణము.

(దాని పుట్టు పూర్వోత్తరాలు).

రామాయణము ఒక మహా కావ్యము. దానిని రచించినది ఆది కవి శ్రీ వాల్మీకి.

రామాయణము, మహాభారతము, భాగవతము మనకు మన పూర్వీకులైన మహాఋషుల నుండి లభించిన సాంస్కృతిక సంపద.

ఈ ప్రపంచంలో తండ్రి, తల్లి, కుమారులు, అన్నదమ్ములు, భార్య, సేవకుడు, ఆదర్శవంతంగా ఎలా ఉండాలో సవివరంగా తెలిపిన మహా కావ్యము రామాయణము. రామాయణములోని పాత్రలే మనకు ఆదర్శములు అనడంలో అతిశయోక్తి లేదు.

రామాయణము అంటే రామ అయనము అనే రెండు పదాలు కలిసి రామాయణము అయింది. అయనము అంటే మార్గము. అనగా, రాముని మార్గము. రాముడు నడిచిన మార్గము. రాముడు అనుసరించిన మార్గము అని అర్థము. రామాయణములో రాముడు ధర్మాన్ని తాను అనుసరించి, ఆచరించి, ధర్మమార్గంలో తాను నడిచి, ఆ దారిని మనకు చూపించాడు. అదే రామాయణము యొక్క గొప్పతనము.

రామాయణంలో 24,000 శ్లోకములు ఉన్నాయి. అవి 7 కాండములు, 500 సర్గలు గా విభజింపబడ్డాయి. రామాయణ ములోని శ్లోకములు అనుష్టుప్ ఛందస్సులో రాయ బడ్డాయి. అంటే ఒక్కో శ్లోకానికి 32 అక్షరాలు ఉంటాయి.

రామాయణము కూడా ఒక కథమాదిరి నడుస్తుంది. కాని అందులో ఉన్న రాముడు, లక్ష్మణుడు, భరతుడు, సీత, హనుమంతుడు మొదలగు పాత్రలు మన సంస్కృతీ సంప్రదాయాలకు ప్రతీకలు.

రామాయణము హిందూ మతములోనే కాదు, బౌద్ధ, జైన మతములలో కూడా ప్రచారంలో ఉంది. మన దేశంలోనే కాకుండా ఇండోనేషియా, ఫిలిప్పైన్స్, థాయిలాండ్, లావోస్, బర్మా మరియు మలయా దేశములలో కూడా ప్రచారంలో ఉంది.

రామాయణ కాలము త్రేతాయుగము. రామాయణం ఉత్తర కాండలో వాల్మీకి ఆశ్రమంలో రాముని కుమారులు అయిన లవకుశు లు జన్మించారు అని ఉంది. కాబట్టి వాల్మీకి త్రేతాయుగము నాటి వాడని కొందరి అభిప్రాయము. కానీ, ఈ వాల్మీకి రామాయణం క్రీ.పూ.4,5 శతాబ్దములలో రాయబడినది అని కొంతమంది అంటారు. రామాయణంలో వైష్ణవ తత్త్వము క్రీ.పూ.2 వశతాబ్దములో కానీ దానికి తరువాత కానీ చేర్చబడింది. ఎందుకంటే రామాయణము అసలు ప్రతిలో రాముడు విష్ణువు అవతారము అని లేదు. తరువాతి కాలంలో రాముడు విష్ణువు అవతారము అని చేర్చబడింది అని కొందరి అభిప్రాయము.

రామాయణము కూడా మహాభారతము మాదిరి అనేక దశలలో అభివృద్ధి చెందింది. రామాయణము అత్యంత పురాతన మైన ప్రతి క్రీ.పూ.11వ శతాబ్దమునకు చెందినది అని చరిత్రకారుల అభిప్రాయము. తరువాత అది కాలక్రమేణా అభివృద్ధి చెందుతూ వచ్చింది. క్రీ.పూ.4,5 శతాబ్దాలకు ప్రస్తుత రూపంలోకి వచ్చింది.

వాల్మీకి రామాయణాన్ని చాలా మంది మహానుభావులు తమ తమ భాషలలో, తమ తమ శైలిలో రచించారు. అందులో ముఖ్యమైనవి క్రీ.శ.11,12 శతాబ్దములలో కంబన్ అనే కవి చేత తమిళ భాషలో రచించ బడిన కంబరామాయణము; తెలుగు భాషలో మొల్లచే రచింప బడినమొల్ల రామాయణము, 14వ శతాబ్దములో నరహరి అనే కన్నడ రచయితచే రచింపబడిన తొరవె రామాయణ్, 15వ శతాబ్దములో కృత్తివాస ఓఝూ అనే కవిచేత బెంగాలిలో రచింప బడిన కృత్తివాస రామాయణము, 16వ శతాబ్దములో తులసీదాస్ అవధూత చేత హిందీలో రచించబడిన రామచరిత మానస్.

రామాయణంలో ని పాత్రల పేర్లు వేద కాలంలో అక్కడక్కడా కనపడినప్పటికీ, రామాయణం లాంటి కథ వేద కాలంలో జరిగినట్టు ప్రస్తుతము ఉన్న వేదములలో ఎక్కడా కనపడటం లేదు. కాని చారిత్రక ఆధారాలు పరిశోధించిన తరువాత హెచ్.డి.సంకాలియా అనే చరిత్రకారుడు రామాయణము క్రీ.పూ.4 వ శతాబ్దిలో రాయబడి ఉంటుంది అనీ, ఎ.యల్. భాషం అనే చరిత్రకారుడు రాముడు క్రీ.పూ.8,7 శతాబ్దములలో ఉండేవాడని అభిప్రాయపడ్డారు.

కాబట్టి రామాయణములో రకరకాల రామాయణాలు ఉన్నట్టే, రామాయణము గురించి రామాయణ కాలము గురించి రకరకాల అభిప్రాయాలు ఉన్నాయి అనేది తెలుస్తూ ఉంది. రామాయణం గురించి రోమిలా థాపర్ అనే చరిత్రకారిణి ఇలా అన్నారు.

పాళీ భాషలో రాయబడిన బుద్ధ జాతక కథలలో రామాయణం ఉంది. అందులో దశరధుడు కాశీ రాజు. రాముడు, లక్ష్మణుడు, సీత అన్న చెల్లెల్లు. వీరు దశరధుని మొదటి భార్య పిల్లలు. దశరధుడు తనరెండవ భార్య నుండి వీరిని రక్షించడానికి వారిని హిమాలయాలకు పంపాడట. పన్నెండు సంవత్సరాల తరువాత వీరు ముగ్గురూ కాశీకి తిరిగి వచ్చారు. రాజ్యాభిషిక్తులయ్యారు. ఇందులో రావణుడు సీతను అపహరించుకు పోవడం గురించి లేదు.

ఇంక జైనుల రామాయణంలో రావణుని లక్ష్మణుడు చంపాడు. రాముడు చంపలేదు. రాముడు ఆఖరున సన్యాసం తీసుకొని తీర్థాంకరుడై మోక్షాన్ని పొందాడు. అందుకే వాల్మీకిరామాయణం కన్నా జైనుల రామాయణం భిన్నంగా ఉంది.

జైన రామాయణం ప్రకారము, సాకేత పురాన్ని పరిపాలించే రాజు దశరధుడు. ఆయనకు నలుగురు భార్యలు. అపరాజిత, సుమిత్ర, సుప్రభ, కైకేయి. అపరాజిత కుమారుడు పద్మడు (అనగా రాముడు), సుమిత్ర కొడుకు నారాయణుడు (లక్ష్మణుడు), సుప్రభ కొడుకు శత్రుఘ్నుడు, కైకేయి కొడుకు భరతుడు. రాముడికి నలుగురు భార్యలు. మైథిలి, ప్రభావతి, రతినిభ, శ్రీదమ. రాముడు వదిలిపెట్టిన తరువాత మైథిలి అనగా సీత సన్యాసము పుచ్చుకుంది. సన్యాసినిగా

మారిపోయింది. లక్ష్మణుడు చనిపోయిన తరువాత రాముడు కూడా సన్యాసి అయ్యాడు. తరువాత మోక్షాన్ని పొందాడు.

దీనివలన మనకు తెలిసిందేమిటంటే రామాయణాన్ని ఎవరి మతానికి తగ్గట్టు వాళ్లు ఎవరి ఇష్టం వచ్చినట్టు వాళ్లు మలచుకున్నారు. పైన చెప్పినట్టు రామాయణం మన దేశంలోనే కాకుండా ఇతర దేశాల్లో కూడా ప్రాచుర్యం పొందింది. రామాయణ మహాకావ్యము దేశవిదేశాల్లో గొప్ప కావ్యంగా కొనియాడబడింది. కాని అన్నింటి లోకల్లా వాల్మీకి రామాయణం ప్రాచీన మయింది అనడంలో ఎలాంటి సందేహము లేదు. అందుకే రామాయణ కర్త వాల్మీకి ఆది కవి అయ్యాడు.

ఆ వాల్మీకి రామాయణాన్ని సరళమైన తేట తెలుగులో అందరికీ అర్థం అయ్యేలాగ రాయడానికి సంకల్పించాను. నా సంకల్పం నిర్విఘ్నంగా నెరవేరాలని శ్రీవేంకటేశ్వర స్వామినీ, శ్రీరామ చంద్ర మూర్తిని భక్తితో వేడుకుంటున్నాను.

తేదీ: 1.5.2011

భవదీయుడు
మొదలి వెంకట సుబ్రహ్మణ్యం,

2-31, చైతన్యపురి,
హైదరాబాద్ 500060
ఫోన్:24048104
సెల్:9391134792

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### మొదటి సర్గ.

వాల్మీకి మహర్షి దేవర్షి నారదుడిని ఇలా అడిగాడు.

"ఓ నారద మహర్షీ! ఈ భూలోకంలో మంచి గుణములు కలవాడు, పరాక్ర మవంతుడు, ధర్మాత్ముడు, ఎదుటి వారి ఎడల ఆదర భావము కలవాడు, చేసినమేలు మరువని వాడు, ఎల్లప్పుడూ సత్యమునే పలుకువాడు, గట్టి సంకల్పము కలవాడు, అనుకున్న పని నెరవేర్చే గుణము కలవాడు, ఈ సద్గుణములు కలవాడు ఎవరైనా ఉ న్నారా!

అంతేకాదు, మంచి నడవడి కలవాడు, సర్వభూతములయందు ప్రీతి కలవాడు, అన్ని విద్యలు నేర్చినవాడు, తనకు అసాధ్యము అంటూ లేదు అని నిరూపించినవాడు, ఎల్లప్పుడూ ఆనందంతో తొణికిస లాడేవాడు, అటువంటి వ్యక్తి ఎవరున్నారు?

ఓ మహర్షీ! మొక్కవోని ధైర్యము కలవాడు, కోపము అంటే ఎరుగని వాడు, మంచి తేజస్సుతో విరాజిల్లేవాడు, అసూయ, ద్వేషములను దగ్గరకు రానీయని వాడు, యుద్ధరంగంలో దిగితే దేవతలకు కూడా భయపడని వాడు,. ఇటువంటి సద్గుణములు కల

నరుడిని (మానవుడిని) గురించి వినవలెనని నాకు చాలా కుతూహలముగా ఉంది. దయచేసి నాకు వివరించండి. ఎందుకంటే నీవు ముల్లోకములు సంచరిస్తూ ఉంటావు. అందువలన నీకు తెలిసే అవకాశం ఉంది. కాబట్టి అటువంటి లోకోత్తర పురుషుడిని గురించి నాకు తెలియజేయండి." అని వాల్మీకి మహర్షి నారదుని అడిగాడు.

అప్పుడు నారదుడు వాల్మీకితో ఇలా అన్నాడు. " ఓ మహర్షీ! నీవు చెప్పిన గుణములు సామాన్య మానవులలో సాధారణంగా కనిపించవు. ఎందుకంటే అవి అసాధారణము లైన దుర్లభములైన గుణములు. కాని అట్టి గుణములు కలిగిన ఒక మహాపురుషుడు ఉన్నాడు. ఆయన గురించి చెబుతాను. విను.

ఈ భూమండలంలో ఇక్ష్వాకు వంశము ప్రసిద్ధి చెందింది. ఆ వంశములో రాముడు అనే పేరు గల ఒక మహా పురుషుడు జన్మించాడు. ఆ రాముడు జనుల అందరి చేత కీర్తింపబడ్డాడు. ఆ రాముడు స్థిరమైన బుద్ధి కలవాడు. మహావీరుడు. మంచి ప్రకాశము కలవాడు. అసాధారణమైన ధైర్యము కలవాడు.

అంతేకాదు ఆ రాముడు బుద్ధిమంతుడు. నీతిమంతుడు. సకల శాస్త్ర పారంగతుడు. శ్రీమంతుడు. రాముడు శత్రు భయంకరుడు. ఆజానుబాహుడు. స్ఫురద్రూపి. అందగాడు. విశాలమైన వక్షస్థలము కలవాడు. రాముని ధనుస్సు చాలా గొప్పది. శత్రువులను నాశనం చేస్తుంది. రాముడు అంత పొట్టి కాదు, అని చెప్పి మరీ పొడుగు కాదు. రామునికి అన్ని అవయవములు సమపాళ్లలో ఉన్నాయి. సకల శుభ లక్షణ సమన్వితుడు రాముడు.

రాముడు సకల ధర్మములు తెలిసిన వాడు. సత్యమునే పలికెడు వాడు. ఎల్లప్పుడూ ప్రజల హితమును  కోరేవాడు. మంచి యశస్వి. జ్ఞాన సంపన్నుడు. ఎల్లప్పుడూ శుచిగా ఉంటాడు. శరణు కోరిన వారిని రక్షించేవాడు.  ఆ రాముడు ప్రజాపతితో సమానమైన వాడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ పట్ల ఆసక్తి కలవాడు. ధర్మాన్ని  ఎల్లప్పుడూ పరిరక్షించేవాడు.

రాముడు తనను తాను రక్షించుకుంటూ, తన వారిని కూడా రక్షించేవాడు. రాముడు వేదములు వేదాంగములు చదివిన వాడు. ధనుర్వేదములో దిట్ట. రాముడు సకల శాస్త్రముల అర్థములను తెలిసిన వాడు. మంచి జ్ఞాపక శక్తి కలవాడు. మంచి ప్రతిభావంతుడు. సర్వలోక ప్రియుడు. సాధుజనుల యందు, దీనుల యందు దయగలవాడు. నదులన్నీ సముద్రము చేరినట్టే, సత్పురుషులందరూ రాముని వద్దకు చేరుతారు.  రాముడు అందరినీ సమానంగా ఆదరిస్తాడు. రాముడు సముద్రము వలె గంభీరంగా ఉంటాడు. హిమాచలము వలె ధైర్యంగా నిలబడతాడు.

ఇటువంటి సకల సద్గుణ సంపన్నుడు కౌసల్యకు పుత్రుడిగా జన్మించాడు. ఆ రాముడు పరాక్రమములో విష్ణువుతో సమానుడు. చంద్రుడిని చూస్తే ఎంత ఆనందకరంగా ఉంటుందో రాముని చూస్తే కూడా అంతే ఆనందం కలుగుతుంది. కాని రాముడు కోపం వస్తే ప్రళయాగ్నిస్వరూపుడు.  ఇంకా రాముడు ఓర్పులో భూదేవిని, దానములో కుబేరుని, సత్యము పలుకుటలో ధర్మదేవతను  మించిన వాడు.

అటువంటి రామునికి తండ్రి దశరధుడు. దశరధుడు సకలగుణాభిరాముడైన రామునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేయాలని సంకల్పించాడు. ఇది దశరధుని భార్య అయిన కైకకు నచ్చలేదు. ఆ సమయంలో ఆమె దశరధుని తనకు పూర్వము ఇస్తానన్న రెండు వరములు ఇమ్మని కోరింది. ఆ రెండు వరములలో ఒకటి రాముడిని రాజ్యము నుండి వెళ్లగొట్టడం, రెండవది తన కుమారుడైన భరతునికి పట్టాభిషేకం జరగడం. మాట తప్పని, తప్పలేని దశరధుడు రాముని వనవాసమునకు వెళ్లమని చెప్పాడు. తల్లితండ్రుల మాటలను శిరసావహించి, రాముడు రాజ్యము విడిచి అరణ్యములకు వెళ్లాడు.

రాముని తమ్ముడు లక్ష్మణుడు. అన్న రాముని విడిచి క్షణం కూడా ఉండలేడు. అందుకని లక్ష్మణుడు కూడా రాముని వెంట అరణ్యము లకు వెళ్లాడు. రాముని భార్య సీత. రామునికి ప్రాణసమాను రాలు. ఆమె జనక మహారాజు కుమార్తె. సర్వలక్షణ సంపన్న. నారీలోకములో ఉ త్తమురాలు. చంద్రుని అనుసరించి రోహిణి ఉన్నట్టుగా , రాముని విడిచి ఉండలేక, సీత కూడా రాముని వెంట అడవులకు వెళ్లింది.

రాముడు, లక్ష్మణుడు సీత అడవులకు వెళుతుంటే అయోధ్య ప్రజలు రామునితో పాటు గంగానది దాకా వచ్చారు. తరువాత రాముని ఆదేశము మేరకు అయోధ్యకు మరలిపోయారు. రాముడు, సీత, లక్ష్మణుడు ఆ రాత్రికి శృంగిభేరపురములో ఉన్న గుహుడు అనే నిషాదుడిని కలుసుకున్నారు. తరువాత రాముడు తన సారధిని రధమును వెనక్కు తీసుకొని వెళ్ల మని పంపివేసాడు.

మరునాడు వారు గంగానదిని దాటారు. ఒక వనమునుండి

మరొక వనమునకుపోతూ, భారద్వాజమహర్షి ఆదేశము మేరకు చిత్రకూటము అను ప్రదేశమునకు చేరుకున్నారు. అక్కడ ఒక పర్ణశాలను నిర్మించుకున్నారు. అక్కడ ఏ చీకూ చింతా లేకుండా హాయిగా నివసిస్తున్నారు.

ఇక్కడ అయోధ్యలో ఉన్న దశరధుడు పుత్రవియోగము తట్టుకోలేక స్వర్గస్థుడయ్యాడు. దశరధుని మరణం తరువాత భరతుని రాజ్యాభిషిక్తుని కమ్మని వసిష్టుడు మొదలగు వారుకోరారు. కాని భరతుడు ఒప్పుకొన లేదు. రాముని ఆజ్ఞ కొరకు భరతుడు రాముడు ఉన్న చోటికి వెళ్లాడు. రామునికి తండ్రి మరణ వార్త తెలిపి, తిరిగి అయోధ్యకు వచ్చి రాజ్యము స్వీకరించమని కోరాడు. ధర్మాత్ముడైన రాముడు తండ్రి ఆజ్ఞ పాలించడం తన ధర్మమని, రాజ్యపాలనకు ఒప్పుకొనలేదు. రాముడు తన పాదుకలను భరతునికి ఇచ్చాడు. తనకు బదులుగా సింహాసనము మీద వాటిని ఉంచమన్నాడు. తగు మాటలు చెప్పి భరతుని వెనక్కు పంపివేసాడు. భరతుడు రామ పాదుకలను భక్తితో స్వీకరించి, అయోధ్య వెలుపల ఉన్న నంది గ్రామమునకు వెళ్లాడు. అక్కడు రాముని పాదుకలను ఉంచాడు. రాముని ఆగమనమును కోరుకుంటూ అక్కడి నుండి రాజ్యపాలన సాగించాడు.

తరువాత రాముడు దండకారణ్యము ప్రవేశించాడు. అక్కడ నివసిస్తున్న విరాధుడు అనే రాక్షసుని చంపాడు. శరభంగ మహర్షిని, సుతీక్ష్ణ మహర్షిని, అగస్త్య మహర్షిని, ఆయన భ్రాతను సందర్శించాడు. ఆ ప్రకారంగా అరణ్యములో నివసించుచున్న రాముని అక్కడ ఉన్న మునులు చూడడానికి వచ్చారు. తమకు రాక్షస బాధ ఎక్కువగా ఉన్నదని, ఆరాక్షసులను సంహరించి తమకు రక్షణ కల్పించమని రాముని

కోరారు. తాను రాక్షస సంహారము చేస్తాను అని రాముడు ఆ ఋషులకు మాట ఇచ్చాడు.

ఆ దండకారణ్యములో రావణుని సేనలు ఉన్నాయి. రావణుని చెల్లెలు పేరు శూర్పణఖ. ఆమె కామ రూపిణి. ఆమె రాముని కామించింది. రాముడు ఆమె ముక్కు చెవులు కోసి విరూపిగా చేసాడు. శూర్పణఖ వెళ్లి రావణుని సైన్యాధి పతులైన ఖర, దూషణ, త్రిశిరులకు తనకు జరిగిన అవమానము గురించి చెప్పింది. వారందరూ రాముని మీదికి యుద్ధానికి వచ్చారు. రాముడు వారితో యుద్ధము చేసి వారినందరినీ సంహరించాడు. ఆ ప్రకారంగా రాముడు తాను దండకారణ్యము లో ఉన్నపుడు జనస్థానములో నివసించుచున్న రాక్షసులను 14,000 మందిని సంహరించాడు.

ఈ వార్త రావణాసురుడికి తెలిసింది. అతనికి కోపం వచ్చింది. తనకు సాయం చెయ్యమని మారీచుడు అనే రాక్షసుని కోరాడు. కాని మారీచుడు ఒప్పుకొనలేదు. ఖర, దూషణాది రాక్షసవీరులను సంహరించిన రాముడు వంటి మహావీరునితో వైరము పెట్టుకోవద్దని హితవు చెప్పాడు. కాని రావణుడు వినలేదు. మారీచుని బలవంతంగా ఒప్పించాడు. మారీచుని వెంటబెట్టుకొని రావణుడు రాముడు ఉండే ఆశ్రమమునకు వెళ్లాడు. మారీచుని సాయముతో రాముని, లక్ష్మణుని దూరంగా పంపాడు. మాయోపాయంతో రావణుడు సీతను అపహరించాడు. అడ్డు వచ్చిన జటాయువును చంపాడు.

రామలక్ష్మణులు ఆశ్రమమునకు తిరిగి వచ్చారు. సీత కనపడలేదు. సీతను వెదుకుతుంటే జటాయువు కనిపించాడు. సీతను రావణుడు

అపహరించాడు అని తెలుసుకున్నారు.  జటాయువుకు దహన సంస్కారములు చేసారు. తరువాత సీతను వెదుకుతూ అడవిలో తిరుగుతున్నారు. కబంధుడు అనే రాక్షసుని చూచారు. తమకు అపకారము చేయబోయిన కబంధుని చంపి అతనికి శాపవిముక్తి కలిగించారు. కబంధుడు వారిని శబరి ఆశ్రమమునకు వెళ్లమని చెప్పాడు. కబంధుని శరీరమునకు అంత్యక్రియలు చేసారు రామలక్ష్మణులు.

తరువాత వారు శబరి ఆశ్రమమునకు వెళ్లారు. శబరి వారిని పూజించింది. తరువాత వారు పంపా తీరమునకు వెళ్లారు. అక్కడ హనుమంతుని చూచారు. వానర రాజైన సుగ్రీవునితో స్నేహము చేసారు. రాముడు తన గురించి సీతాపహరణము గురించి సుగ్రీవునికి చెప్పాడు. సుగ్రీవుడు తనకు, తన అన్న వాలికి ఉన్న  వైరము గురించి రామునికి చెప్పాడు. రాముడు వాలిని చంపుతానని ప్రతిజ్ఞచేసాడు. కాని రాముడు వాలిని చంపగలడా అని సుగ్రీవునికి అనుమానము కలిగింది.  అంతకు పూర్వము వాలి చేతిలో చచ్చిన దుందుభి అనే రాక్షసుని శరీరమును రాముడికి చూపాడు. రాముడు ఆ రాక్షసుని శరీరమును తన  కాలి గోటితో పది యోజనములు దూరంగా పడేటట్టు విసిరివేసాడు.  ఒకే బాణంతో ఏడు మద్దిచెట్లను కూల్చాడు. అప్పుడు సుగ్రీవునికి రాముని మీద నమ్మకం కుదిరింది.

రాముని వెంటతీసుకొని వాలి ఉన్న గుహ వద్దకు వెళ్లాడు సుగ్రీవుడు. బయట ఉండి సుగ్రీవుడు గట్టిగా అరిచాడు.  ఆ అరుపు విని వాలిబయటకు వచ్చాడు.  వాలి భార్య తార వాలిని యుద్ధమునకు వెళ్ల వద్దని వారించింది. కాని వాలి వినలేదు. వాలి సుగ్రీవునితో

యుద్ధము చేసాడు. రాముడు ఒకే బాణంతో వాలిని చంపాడు. సుగ్రీవుని వానర రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసాడు.

తరువాత సుగ్రీవుడు సీతాదేవిని వెదుకుటకు వానరులను నలుదిక్కులకు పంపాడు. హనుమంతుడు దక్షిణ దిక్కుగా వెళ్లాడు. సముద్రమును దాటి లంక చేరుకున్నాడు. అశోకవనంలో రాముని కొరకు శోకించుచున్న సీతను చూచాడు. హనుమంతుడు సీతను కలుసుకున్నాడు. రాముడు ఇచ్చిన ఉంగరమును గుర్తుగా చూపించాడు. రామ సుగ్రీవుల మైత్రి గురించి చెప్పాడు. తరువాత హనుమంతుడు అశోకవనము యొక్క తోరణ ద్వారమును ధ్వంసము చేసాడు. తనను పట్టుకోబోయిన రావణుని సేనాపతులను ఐదుగురిని చంపాడు. అక్షకుమారుని చంపాడు. తుదకు బంధింప బడ్డాడు. తరువాత తనను తాను విడిపించుకొని లంకాదహనము చేసాడు.

హనుమంతుడు లంక నుండి రాముని వద్దకు వచ్చాడు. సీతను చూచాను అని రామునితో చెప్పాడు. తరువాత వానర సేనలతో సముద్ర తీరము చేరుకున్నారు రాముడు సుగ్రీవుడు. తనకు దారి ఇవ్వని సముద్రుని తన రామబాణముతో అల్లకల్లోలము చేసాడు. సముద్రుని మాట ప్రకారము రాముడు నీలునితో వారధి కట్టించాడు. ఆ సేతువుమీదుగా లంకకు చేరుకున్నాడు. రావణునితో యుద్ధముచేసి రావణుని సంహరించాడు. కాని అన్నిరోజులు పరాయి వాడి వద్ద ఉన్న సీతను పరిగ్రహించడానికి సందేహ పడ్డాడు. ఆ మాటలు భరించలేక సీత అగ్నిప్రవేశము చేసింది. అగ్నిదేవుడు వచ్చి సీత కల్మషము లేనిది అని చెప్పాడు. అప్పుడు రాముడు సీతను స్వీకరించాడు.

రావణసంహారము చేసిన రాముని సమస్త దేవతలు ఋషులు ఎంతగానో శ్లాఘించారు. రాముడు విభీషణుని లంకారాజ్యమునకు రాజును చేసాడు. రాముని చూడడానికి వచ్చిన దేవతలు వరాలు ఇచ్చారు. ఆ వరాల ప్రభావంతో యుద్ధములో చనిపోయిన వానరు లందరూ బతికారు. అందరూ పుష్పకవిమానము ఎక్కి అయోధ్యకు వెళ్లారు.

రాముడు ముందు భరద్వాజ ఆశ్రమమునకు వెళ్లాడు. హనుమంతుని నంది గ్రామములో ఉన్న భరతుని వద్దకు పంపాడు. తరువాత రాముడు నందిగ్రామమునకు వెళ్లాడు. తన సోదరులను కలుసుకున్నాడు. ముని వేషములను వదిలి క్షత్రియోచితము లైన దుస్తులు ధరించారు రాముడు, సీత, లక్ష్మణుడు. రాముడు అయోధ్యకు పట్టాభిషిక్తుడయ్యాడు. రామ పట్టాభిషేకమునకు లోకములు అన్నీ సంతోషించాయి.

రాముడి పాలనలో ప్రజలందరూ ధర్మబద్ధంగా నడుచుకున్నారు. సకాలంలో వానలు కురిసి దుర్భిక్షము అంటూ లేకుండా పోయింది. తండ్రి జీవించి ఉండగా పుత్రులు మరణించడం లేదు. స్త్రీలకు వైధవ్యము లేదు. స్త్రీలందరూ పతివ్రతలుగా ఉన్నారు. రామ రాజ్యంలో అగ్ని భయం, చోర భయం, జలభయం, ఆకలి భయం గానీ, లేవు. రాజ్యములో ధనధాన్యములు సమృద్ధిగా ఉండేవి. ప్రజలందరూ సంతోషంగా జీవించారు.

రాముడు లెక్కలేనన్ని అశ్వమేధ యాగములు చేసాడు. లక్షల కొలదీ గోవులను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు. రామ రాజ్యములో

నాలుగు వర్ణముల వారు తమ తమ పనులను సక్రమంగా చేసుకుంటూ సంతోషంగా జీవించారు. ఆ ప్రకారంగా రాముడు 11,000 సంవత్సరములు రాజ్యపాలన చేసి తుదకు బ్రహ్మలోకము చేరుకున్నాడు.

ఈ రామ చరిత్ర అతి పవిత్రమైనది. సమస్త పాపములను నాశనం చేస్తుంది. పుణ్యములను కలుగజేస్తుంది. ఈ రామ కథ వేదసమ్మతము. ఈ రామ చరిత్రను చదివినవారికి సమస్త పాపములు తొలగిపోతాయి. వారికి ఆయువు వృద్ధి చెందుతుంది.   పుత్రపౌత్రాదులతో సకలసుఖములు అనుభవిస్తారు. తరువాత స్వర్గలోకము చేరుకుంటారు.

ఈరామాయణము చదివిన బ్రాహ్మణులు అన్ని విద్యలలో ప్రావీణ్యులవుతారు. క్షత్రియులకు రాజ్యప్రాప్తి కలుగుతుంది. వైశ్యులకు వ్యాపారాభివృద్ధి కలుగుతుంది. శూద్రులు కీర్తివంతులవుతారు.

ఇది వాల్మీకి విరచిత
శ్రీమద్రామాయణ మహాకావ్యములో
బాలకాండలో మొదటి సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

# రెండవ సర్గ.

నారదుడు చెప్పిన సంక్షిప్త రామాయణమును విని వాల్మీకి మహర్షి, మరియు ఆయన శిష్యులు నారదుని ఎంతో భక్తితో పూజించారు. తరువాత నారదుడు దేవలోకము వెళ్లిపోయాడు.

తరువాత వాల్మీకి మహర్షి తమసానదీ తీరమునకు వెళ్లాడు. ఏ మాత్రం మలినము లేని ఒక రేవు వద్దకు వెళ్లాడు. తన శిష్యుని తనకు కావలసిన  పాత్ర, నార బట్టలు తెమ్మన్నాడు వాల్మీకి. ఆ రేవులో స్నానం చేయడానికి సంకల్పించాడు. ఆ ప్రకారంగా శిష్యుడు వాల్మీకికి చెంబు, నార బట్టలు ఇచ్చాడు. వాటిని తీసుకొని వాల్మీకి ఆ వనమంతా ఒక సారి కలయ చూచాడు.

కొంచెం దూరంలో ఒక చెట్టు మీద నిర్భయంగా విహరిస్తున్న క్రౌంచ పక్షుల జంటను చూచాడు.  అంతలో ఒక బోయవాడు ఆ క్రౌంచ పక్షుల జంటలో మగపక్షిని తన బాణముతో నిర్దయగా కొట్టి చంపాడు.  ఆమగపక్షి రక్తం కారుతూ కింద పడిపోయింది. కింద పడిపోయిన మగపక్షిని చూచి ఆడ పక్షి ఎంతో  దు:ఖించింది. కింద పడ్డ మగపక్షి చుట్టూ తిరుగుతూ దీనంగా  ఏడుస్తూ ఉంది.

ఏడుస్తున్న ఆ ఆడ పక్షిని చూచాడు వాల్మీకి. ఆయన మనస్సు ద్రవించిపోయింది. వాల్మీకి ఆ బోయవానిని చూచి ఇలా అన్నాడు.

మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమ: శాశ్వతీ: సమా: ।
యత్ క్రౌఞ్చమిథునాదేకమవధీ: కామమోహితమ్॥

"ఓయీ బోయవాడా! నీవు మన్మధావస్థలో ఉన్న పక్షుల జంటలో ఒక దానిని చంపావు. కాబట్టి నీవు కూడా అల్పాయుష్కుడవు అవుదువు కాక!" అనే వాక్యము వాల్మీకి నోటి వెంటవచ్చింది.

అంతలో తనలో తాను ఇలా అనుకున్నాడు. "ఇదేమిటి! నేను ఈ పక్షుల జంటను చూచి ఇలా అనుకోవడం ఏమిటి!  నానోటి నుండి ఇటువంటి వచనములు రావడం ఏమిటి!" అని అనుకున్నాడు. వెంటనే తన శిష్యుని పిలిచి ఇలా అన్నాడు. "ఆ క్రౌంచపక్షులలో ఒక దానిని బోయవాడు చంపగా, దానిని చూచి నేను చలించిపోయి పాదబద్ధంగా  ఒక వాక్యము చెప్పాను. అది వృధా కారాదు. అది శ్లోకముగా ప్రసిద్ధి చెందుతుంది." అని పలికాడు వాల్మీకి.

శిష్యుడు వెంటనే ఆ శ్లోకమును కంఠస్థము చేసాడు. తరువాత వాల్మీకి స్నానము చేయడానికి వెళ్లాడు. స్నానము చేసిన తరువాత తన ఆశ్రమమునకు పోతూ ఆ శ్లోకమునే మననం చేసుకుంటున్నాడు. ఆయన వెంట భరద్వాజుడు అనే ఆయన శిష్యుడు వెంట వెళుతున్నాడు. వాల్మీకి ఆశ్రమమునకు పోయి తన నోటి వెంట వచ్చిన  శ్లోకమును మననం చేసుకుంటూ ధ్యానములో కూర్చున్నాడు. ఆ ధ్యానములో ఆయనకు ఇతర వాక్యాలు కథలు స్ఫురించాయి.

ఆసమయంలో బ్రహ్మదేవుడు వాల్మీకిని చూడటానికి ఆయన ఆశ్రమమునకు వచ్చాడు. బ్రహ్మగారిని చూచి వాల్మీకి సంభ్రమంతో లేచి చేతులు జోడించి నిలబడ్డాడు. బ్రహ్మదేవునికి అర్ఘ్యము, పాద్యము సమర్పించాడు. ఉచితాసనము మీద కూర్చోపెట్టాడు. బ్రహ్మదేవుని ఆదేశము మేరకు తాను కూడా ఒక ఆసనము మీదకూర్చున్నాడు. వాల్మీకి మనసులో మాత్రము ఆ క్రౌంచపక్షుల జంట గురించి ఆలోచిస్తున్నాడు. "ఆ హా! అందముగా విహరిస్తున్న ఆ క్రౌంచ పక్షుల జంటలో ఒక దానిని ఆ క్రూరుడు నిర్దయగా కొట్టాడు కదా!" అని ఆలోచిస్తున్నాడు. వాల్మీకి మనస్సు దు:ఖంతో నిండి పోయింది. అప్రయత్నంగా ఆ వాక్యము ఆయన నోటి వెంట వచ్చింది.

ఆ వాక్యములను విన్నాడు బ్రహ్మ. " ఓ వాల్మీకి మహర్షి! నీ నోట ి వెంట వచ్చిన వాక్యము శ్లోకమే. అందుకు సందేహము లేదు. ఇది నా సంకల్పమే. నా సంకల్పము వల్లనే నీ నోటి వెంట ఆ వాక్యము వెలువడింది. అది శ్లోకము అయింది. నీవు పుణ్యప్రదమును, మనస్సులను రమింపచేయునదియును అగు రాముని యొక్క చరితమును శ్లోకరూపంలో కావ్యంగా రచించు. రాముడు ధర్మాత్ముడు. గుణవంతుడు. బుద్ధిమంతుడు. రాముని కథను నీకు నారదుడు చెప్పాడు కదా. అదే కథను సవిస్తరముగా చెప్పు. రాముడు, సీత, లక్ష్మణుడు, రాక్షసులు మొదలగు వారి గురించి నీకు తెలిసిన విషయములూ, తెలియని విషయములూ అన్నీ ఇప్పుడు నీకు స్పష్టంగా గోచరమవుతాయి. ఈ రామాయణ కావ్యములో నీవు రాసిన ఏ ఒక్కమాట కూడా అసత్యము కాదు. కాబట్టి నీవు రామ కథను శ్లోకరూపంలో రచించు. ఈ చరాచర జగత్తు ఉన్నంత వరకూ రామ చరిత్ర ఈ లోకంలో నిలిచి ఉంటుంది. నీ చే రచింప బడిన

రామాయణ కావ్యము ఎంత కాలము ప్రచారంలో ఉంటుందో అంత కాలమూ నేను సృష్టించిన సమస్తలోకములలో నీవు నివసిస్తావు." అని పలికాడు బ్రహ్మదేవుడు. తరువాత బ్రహ్మదేవుడు అంతర్ధానమయ్యాడు.

ఇది అంతా విన్న వాల్మీకి మహర్షి శిష్యులు ఆశ్చర్యపోయారు. రామాయణ కావ్యమునకు మూలమైన ఆ శ్లోకమును మరలా మరలా స్మరించుకుంటున్నారు. ఒకరితో ఒకరు చెప్పుకుంటూ మననం చేసుకుంటున్నారు. నాలుగు పాదములతో, సమసంఖ్యగల అక్షరములతో, మహర్షి నోటి నుండి వచ్చిన ఆ శ్లోకము శిష్యులు మాటిమాటి కీ గానం చేయడం వలన శ్లోకత్వము పొందింది.

ఇదంతా గమనించిన వాల్మీకి మహర్షి "రామాయణ మహా కావ్యమును అంతా  ఇదే విధంగా శ్లోకరూపంలో రచిస్తాను" అని నిశ్చయించుకున్నాడు. వాల్మీకి మహర్షి రామ చరితమును ఉదారమైన పదములతో, మనోహరములైన అక్షరములతో కూర్చిన వందలాది శ్లోకములలో రచించాడు. ఆ మహా కావ్యము  సమాసములతోనూ, సంధులతోనూ, వృత్తవృత్తులతోనూ, సుమధురములు, అర్థవంతములు అయిన వాక్యములతోనూ అలరారింది.

ఇది వాల్మీకి విరచిత
శ్రీమద్రామాయణ మహాకావ్యములో
బాలకాండలో రెండవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

# మూడవ సర్గ.

తనకు నారద మహర్షి  చెప్పిన రామ కధ సమగ్రమైనదా లేక ఇంకా అధికంగా  ఏమైనా ఉన్నదా అని వాల్మీకి మహర్షి ఆలోచించాడు.  తరువాత వాల్మీకి మహర్షి ఆచమనం చేసాడు. తూర్పు దిక్కుగా ముఖం పెట్టి  ధర్భాసనం మీద  కూర్చున్నాడు.  శ్రీరాముడిని మనసులో ధ్యానించాడు.  నమస్కరించాడు. తన తపోబలంతో ఆలోచించాడు. దశరథుడు, శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు ఏమేమి చేసారో, ఏమేమి మనసులో అనుకున్నారో, ఆలోచించారో, రాముడు సీత  ఏకాంతంగా ఉన్నప్పుడు ఏమేమి చేసారో, ఏమేమి మాట్లాడుకున్నారో,  ఎలా నవ్వుకున్నారో,   ఏ ఏ దారుల వెంట నడిచారో, ఎక్కడెక్కడ నివసించారో, రాముడు, సీత,  లక్ష్మణుడు ముగ్గురూ అడవులలో   ఎక్కడెక్కడ తిరిగారో ఎక్కడెక్కడ నివసించారో, ఆ విషయముల నన్నింటినీ ఆమూలాగ్రంగా, యధాతథంగా తన యోగదృష్టితో  చూచాడు  వాల్మీకి.  అన్ని విషయములను స్పష్టంగా తెలుసుకున్నాడు.

మహాతపస్వి అయిన  వాల్మీకికి రామ చరిత్ర అంతా కరతలామలకము అంటే  చేతిలో ఉసిరిక కాయ మాదిరి స్పష్టంగా

కనపడింది. ఆ ప్రకారంగా మహా తపస్వి అయిన వాల్మీకి రామ చరిత్రను దర్శించిన తరువాత, తాను చూచినది చూచినట్టు, నాలుగు పురుషార్థములు అయిన ధర్మార్థకామ మోక్షములలో, ధర్మము ఎక్కువ ప్రకాశించేటట్టు, మిగిలిన పురుషార్థములు కూడా కూడి ఉండేటట్టు, నారదుడు చెప్పిన విషయములు అన్నీ పొందుపరిచి, అందరికీ వినడానికి మనోహరంగా ఉండేటట్టు, రఘువంశ చరిత్ర అయిన రామాయణ మహా కావ్యమును రచించాడు.

ఆ రామాయణ మహా కావ్యములో రాముని జననము, ఆయన ధర్మనిరతి, పరాక్రమము, ఓర్పు గుణము, రాముని సౌందర్యము సత్యశీలత అన్నీ మధురంగా వర్ణించాడు వాల్మీకి. రాముడు, లక్ష్మణుడు విశ్వామిత్ర మహర్షితో అడవులలో వెళుతున్నప్పుడు చెప్పిన అనేక కథలు, గాథలు, శివధనుర్భంగము, సీతా స్వయంవరము మనోహరంగా కళ్లకు కట్టినట్టు రచించాడు. తరువాత పరశురామునితో రాముని వాగ్వివాదము, రాముని యౌవరాజ్య పట్టాభిషేక సన్నాహములు, కైకేయి వరములు కోరడం, రాముడు వనములకు పోవడం, దశరథుని నిర్యాణము, రాముడు అడవులకు పోతుంటే అయోధ్య ప్రజలు దు:ఖించడం, రాముడు వారిని ఓదార్చి పంపివేయడం;

గంగానదిని దాటడం, గుహునితో రాముడు మాట్లాడటం, తన సారథి అయిన సుమంతుని రథము తీసుకొని వెనుకకు మరలు మనడం, సీతారామ లక్ష్మణులు భరద్వాజ ఆశ్రమం చేరుకోడం, ఆయన ఆదేశాను సారం చిత్రకూటమునకు వెళ్లడం, చిత్రకూటములో పర్ణశాల నిర్మించుకొని ఉండటం, ఇంతలో భరతుడు వచ్చి రాముని తిరిగి రాజ్యము స్వీకరించమని ప్రార్థించడం, రాముడు నిరాకరించడం,

రాముడు తన తండ్రి మరణ వార్త విని దు:ఖించడం, తండ్రికి అంత్యక్రియలు జరిపించడం, తనపాదుకలను భరతునికి ఇవ్వడం, భరతుడు రాముని పాదుకలను తీసుకొని వెళ్లి నంది గ్రామములో నివసించడం, అక్కడే రామ పాదుకలకు పట్టాభిషేకం చేసి రాముని బదులు తాను రాజ్యపాలన సాగించడం,

తరువాత సీతారామలక్ష్మణులు దండకారణ్యము వెళ్లడం, అక్కడ విరాధుడు మొదలగు రాక్షసులను వధించడం, శరభంగుడు, సుతీక్ష్ణుడు మొదలగు మహాఋషుల దర్శనం చేసుకోవడం, సీత అనసూయ తో మాట్లాడటం, అనసూయ సీతకు ఒంటికి పూసుకొనే లేపనము ఇవ్వడం, తరువాత రామలక్ష్మణులు శూర్పణఖను చూడటం, ఆమెను విరూపిగా చెయ్యడం, ఖరుడు మొదలగురాక్షసులను సంహరించడం,

ఈ విషయాలన్నీ రావణునికి తెలియడం, రావణుడు మారీచుని సాయంకోరడం, మారీచుడు నిరాకరించడం, తుదకు ఆంగీక రించడం, రాముడు మారీచుని చంపడం, రావణుడు పర్ణశాలలో ఒంటరిగా ఉన్న సీతను అపహరించడం, రాముడు సీత కోసరం శోకించడం, కబంధుని చూడటం, పంపాసరస్సువద్దకు వెళ్లడం, శబరిని కలుసుకోవడం, అక్కడనుండి ఋష్యమూక పర్వత ప్రాంతమునకు వెళ్లడం, హనుమంతుడు రాముని కలవడం,

రామ సుగ్రీవుల మైత్రి, వాలి సుగ్రీవుల యుద్ధము, వాలి వధ, వాలి కోసరం తార విలపించడం, రాముడు సుగ్రీవునకు కిష్కింధా రాజ్యము ఇవ్వడం, సీతను వెదకడానికి సాయం చేస్తానని సుగ్రీవుడు

అంగీకరించడం, కాని సుగ్రీవుడు మాట తప్పడంతో రామునికి కోపం రావడం, అది తెలిసి సుగ్రీవుడు వానరులను నలుదిక్కులకు సీతను వెదకడానికి పంపడం, సుగ్రీవుడు భారతదేశమును గురించి వానరులకు వర్ణించడం, రాముడు హనుమంతునికి తన ఆనవాలుగా ఉంగరము ఇవ్వడం,

హనుమంతుడు సాగరమును లంఘించడం, మధ్యలో మైనాకుని చూడటం, సింహికను చంపడం, లంకా నగరము దగ్గర ఉన్న పర్వతమును చూడటం, రాత్రియందు హనుమంతుడు లంకానగరము ప్రవేశించడం, సీతను వెదుకుతూ పుష్పక విమానములో ప్రవేశించడం, రావణుని అంత:పుర దర్శనం, తరువాత హనుమంతుడు అశోక వనములో ఉన్న సీతను చూడటం, ఆమెకు ఆనవాలుగా రాముడు ఇచ్చిన ఉంగరము ఇవ్వడం, సీతను రాక్షస స్త్రీలు భయపెట్టడం, త్రిజటకు వచ్చిన స్వప్నవృత్తాంతము, హనుమంతుడు రాక్షస స్త్రీలను భయపెట్టడం, అశోక వనమును నాశనం చెయ్యడం, ఇంద్రజిత్తుకు పట్టుబడటం, లంకాదహనము,

హనుమంతుడు సముద్రమును దాటి కిష్కింధకు రావడం, దారిలో మధువనమును నాశనం చేయడం, రామునికి సీతను చూచాను అనిచెప్పడం, సీత ఇచ్చిన చూడామణిని ఆనవాలుగా సమర్పించడం, రాముడు సుగ్రీవుడు వానర సేనతో సముద్రము వద్దకు చేరుకోవడం, నీలుని సాయంతో సేతువును నిర్మించడం, లంకా నగరం చేరుకోవడం,

లంకానగర ముట్టడి, రావణుని తమ్ముడు విభీషణునితో మైత్రి, విభీషణుడు రావణుని ఎలా వధించాలో చెప్పడం, యుద్ధములో కుంభకర్ణుడు, మేఘనాధుడు మరణించడం, రామరావణ యుద్ధము, రావణ వధ, సీతను స్వీకరిం చడం, విభీషణుని లంకకు పట్టాభిషిక్తుని చేయడం, సీతా సమేతుడై రాముడు పుష్పకవిమానములో అయోధ్యకు తిరిగి రావడం, రామ పట్టాభిషేకము, వానర సైన్యమును వారి వారి స్థావరములకు పంపివేయడం, రామరాజ్యవర్ణన, లోకాప నిందకు వెరచి తిరిగి సీతను అడవులలో వదిలిపెట్టడం వరకూ వాల్మీకి రామాయణ మహాకావ్యంలో రచించాడు. తరువాత జరుగబోవు విషయములను వాల్మీకి ఉత్తర కావ్యములో రచించాడు.

ఇది వాల్మీకి విరచిత
శ్రీమద్రామాయణ మహాకావ్యములో
బాలకాండలో మూడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

# నాల్గవ సర్గ.

వాల్మీకి మహర్షి రామాయణ మహా కావ్యమును 24,000 శ్లోకములలో, 500 సర్గలలో, ఆరు కాండలలో, రామ పట్టాభిషేకము, మరియు అశ్వమేధ యాగము వరకు రచించాడు. తరువాత ఘట్టములను ఉత్తర కాండలో రచించాడు.

రామాయణ కథను చక్కగా పఠించగలవారు ఎవరా అని ఆలోచించాడు వాల్మీకి. ఆ ప్రకారంగా ఆలోచిస్తున్న వాల్మీకికి ముని వేషధారులైన ఇద్దరు గాయకులు తారసిల్లారు. వారిపేరు కుశలవులు. వాల్మీకి ఆశ్రమంలో ఉన్న వారు కుశలవులను చూచి ఎంతో సంతోషించారు.

వాల్మీకి తాను రచించిన రామాయణమును ఆ కుశలవులకు ఉపదేశించాడు. వాల్మీకి రచించిన రామ కథను, రామాయణము అనీ, సీతా చరితము అనీ, పౌలస్త్య వధ అనీ పిలువ సాగారు. వాల్మీకి ఉపదేశించిన రామాయణమును కుశలవులు శ్రావ్యమైన కంఠంతో, శృతిలయలు తప్పకుండా మృదు మధురంగా గానముచేయసాగారు.

ఇంకొక విశేషము ఏమంటే ఆ కుశలవులు రాముని పోలికలతో విరాజిల్లుతున్నారు. వారు ఇరువురూ గంధర్వ కుమారులవలె వెలిగిపోతున్నారు. వారు రామాయణమును అర్థవంతంగా, శృతిబద్ధంగా గానం చేస్తున్నారు. కుశలవులు రామాయణమును పూర్తిగా కంఠస్థము చేసారు. వాల్మీకి వారికి ఏ ప్రకారంగా ఉపదేశించారో అదే ప్రకారముగా, ఋషుల సమక్షము లోనూ, బ్రాహ్మణుల సమక్షము లోనూ, సభల యందూ, సత్పురుషుల సమావేశములలోనూ ఎవ్వరూ తప్పపట్టలేని విధంగా  గానం చేస్తున్నారు.

ఒకసారి కుశలవులు రామాయణమును  సర్వలక్షణ సమన్వితులైన ఋషుల సమక్షములో గానం చేసారు. ఆ గానమును విని ఆ ఋషులందరూ కుశలవులను మెచ్చుకున్నారు. "వీరి కంఠము మధురముగా ఉంది. ఎన్నడో జరిగిన రామ కథను కళ్లకు కట్టినట్టు గానం చేసారు. వీరి జన్మ ధన్యమైనది." అని వేనోళ్ల పొగిడారు. అందులో ఒక ఋషి కుశలవులకు ఒక కలశమును, మరొక ఋషి వీణను బహూకరించారు. ఆ ప్రకారంగా కుశలవులు రాజ మార్గముల యందు, వీధులలోనూ రామాయణ గానము చేస్తున్నారు.

ఈ విషయము ఆ నోటా ఆనోటా శ్రీరాముని చెవికి చేరింది. శ్రీ రాముడు కుశలవులను తన రాజభవనమునకు పిలిపించాడు. తాను, తన  సోదరులు, మంత్రులు ఉన్న సభలో రామాయణ గానము చెయ్యమని కుశలవులను కోరాడు. శ్రీ రాముని కోరిక మేరకు కుశలవులు రామ కథను శ్రావ్యంగా మృదుమధురంగా గానం చేసారు. వినువారికి వీనుల విందు చేసారు.

కుశలవులను చూచి శ్రీరాముడు ఇలా అన్నాడు.

"మహాజనులారా! ఈ కుశలవులను చూడండి. వీరు మునికుమారుల వేషములలో ఉన్నను, వీరి మొహంలో రాచ కళ ఉట్టిపడుతూ ఉంది. వీరు గానము చేసిన నా కథ నా మనసుకు ఎంతో ఊరట కలిగించింది. నా మనస్సుకు శాంతి చేకూరింది." అని అన్నాడు శ్రీరాముడు.

వాల్మీకి ఉపదేశింపగా, కుశలవులు రాముని ఎదుట గానం చేసిన రామాయణ కథ ఈ విధంగా ఉంది.

ఇది వాల్మీకి విరచిత
శ్రీమద్రామాయణ మహాకావ్యములో
బాలకాండలో నాల్గవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

# ఐదవ సర్గ.

## రామాయణ కథా ప్రారంభము.

పూర్వము ఈ భూమినంతా ఎందరో మహారాజులు చక్రవర్తులు పరిపాలించారు. సగరుడు అనే మహారాజు సాగరమును త్రవ్వించాడు అని ప్రతీతి. సగరుడు త్రవ్వించాడు కాబట్టి దానికి సాగరము అని పేరు వచ్చింది అని నానుడి. సగరుడు ఇక్ష్వాకు వంశములోని వాడు. ఆ సగరునికి 60,000 మంది కుమారులు ఉండేవారు. ప్రస్తుతము మనము చదువుతున్న రామాయణము కూడా ఆ ఇక్ష్వాకు వంశ రాజుల చరిత్ర.

సరయూ నదీ తీరంలో కోసల దేశము ఉండేది. ఆ దేశము ఎల్లప్పుడూ ధనధాన్యములతో నిండి సంతుష్టులైన ప్రజలతో అలరారుతూ ఉండేది. ఆ నగరంలో ఎన్నో సాంస్కృతిక సంఘములు ఉండేవి. నటీనటులు ఉండేవారు. ఆ నగరంలో ఎన్నో ఉద్యానవనములు ఉండేవి. ఆ నగరము చుట్టు శత్రువులు రాకుండా ఎత్తైన ప్రాకారములు ఉండేవి. ఆ ప్రాకారము వెలుపల లోతైన అగడ్త ఉండేది.

ఆ నగరములో ఏనుగులు, గుర్రములు, ఒంటెలు, గాడిదలు సమృద్ధిగా ఉండేవి. ఆ నగరము ఎల్లప్పుడూ వర్తకమునకు వచ్చిన వర్తకులతోనూ, కప్పము కట్టడానికి వచ్చిన సామంత రాజులతోనూ కిటకిటలాడుతూ ఉండేది. ఆ నగరములో రాజగృహములు, ఎత్తైన మేడలు, క్రీడాశాలలు సమృద్ధిగా ఉండేవి. ఆ నగరము సమతల ప్రదేశములో నిర్మింపబడినది. ఆ నగరములో గృహములు మొదలగు కట్టడములు పూర్తిగా కట్టబడి ఉన్నవి. వృధాగా ఏ ప్రదేశము వదిలి పెట్టబడలేదు.

ఆ నగరములో సంగీత వాద్య కచేరీలు ఎల్లప్పుడూ జరుగుతూ ఉండేవి. ఆ నగరంలో ఎంతో మంది యోధులు, వీరులు ఉండేవారు. వారు విలువిద్యలో సిద్ధహస్తులు. శబ్దవేది విద్యలో ప్రావీణ్యము సంపాదించినవారు.

(శబ్దవేది అంటే టార్గెట్‌ను చూడకుండా కేవలం ఆ టార్గెట్ నుండివెలువడే శబ్దమును విని టార్గెట్‌ను కొట్టడం.)

మానవులకు హాని చేయు క్రూర మృగములను ఆయుధములు ఉపయోగించికానీ, ఆయుధములు అందుబాటులో లేకుంటే ఒట్టి చేతులతో కానీ చంపగలిగిన బలపరాక్రమములు కలిగిన వారు అయోధ్యలో ఉండేవారు. అటువంటి సర్వలక్షణ సమన్వితమైన మహానగరమే అయోధ్య. కోసలదేశ రాజధాని.

అయోధ్యను రాజధానిగా చేసుకొని దశరథ మహారాజు కోసల

దేశమును పరిపాలిస్తున్నాడు. ఆ నగరములో నాలుగు జాతులవారు నివసించేవారు. అందులో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు అందరూ పరమ నిష్టాగరిష్ఠులు. ప్రతిరోజూ అగ్నిహోత్రము చేసేవారు. వారందరూ వేద వేదాంగములు చదివిన వారు. మంచి గుణములతో అలరారే వారు. నిత్యము అతిథులకు అన్నదానము చేసేవారు. ఎల్లప్పుడూ సత్యమునే పలికే వారు. మహాబుద్ధిమంతులు. అందరూ మహర్షుల మాదిరి స్వచ్ఛమైన జీవితమును గడుపుతున్నారు.

ఇది వాల్మీకి విరచిత

శ్రీమద్రామాయణ మహాకావ్యములో

బాలకాండలో ఐదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

## ఆరవ సర్గ.

అయోధ్యానగరమును పరిపాలించు దశరథుడు వేదములను అధ్యయనము చేసాడు. పండితులను పూజించాడు. అమితమైన పరాక్రమ వంతుడు. దశరథుడు అంటే అయోధ్య ప్రజలకు ఎంతో ఇష్టం. ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించే వాడు. దశరథుడు ఎన్నో యజ్ఞము లను యాగములను చేసాడు. రాజర్షి. దశరథుని మంచితనము మూడులోకములలో చెప్పుకొనెడి వారు. దశరథుడు తన శత్రువులకు భయంకరుడు. తన శత్రువులను కూడా మిత్రులుగా చేసుకొనే నేర్పుకలవాడు. అధిక మైన సంపదలు కలవాడు.

అన్నింటికంటే గొప్ప విషయం దశరథుడు తన ఇంద్రియములను జయించిన వాడు. జితేంద్రియుడు అని పేరు గాంచాడు. దశరథుడు ఎల్లప్పుడూ సత్యమునే పలికెడు వాడు. అసత్యము అన్నది ఎరుగడు. పూర్వము మనువు ఎలా పరిపాలించాడో ఆ ప్రకారము పరిపాలన సాగించాడు దశరథుడు.

ఇంక అయోధ్యలో ఉన్న ప్రజలందరూ విద్యావంతులు. నిత్యసంతోషులు.  ఉన్నదానితో తృప్తిపడేవారు. ధర్మము తప్పని వారు.

వేదములను చదివినవారు. అత్యాశాపరులు కారు. ఎల్లప్పుడూ సత్యమునే పలికెడి వారు. దశరధుని రాజ్యములో పేదవాడు గానీ, విద్యలేని వాడు కానీ మచ్చుకు కూడా కానరాడు. అలాగే కాముకులు, లోభులు, క్రూరులు, నాస్తికులు కూడా వెదికినా దొరకరు. అయోధ్యలోని స్త్రీలు కూడా ధర్మపరులు. మంచి శీలము, ఇంద్రియ నిగ్రహము కలవారు. నిర్మలమైన మనస్సుకలవారు.

అయోధ్యా నగరములో చెవులకు కుండలములు లేనివాడు, కిరీటములు లేనివాడు, పుష్పమాలలతో అలంకరించుకొనని వాడు, ప్రతిరోజూ అభ్యంగనస్నానముచేయని వాడూ ..... చూద్దామన్నా కానరారు. అలాగే కడుపునిండా భోజనము చేయని వాడు కానీ, అతిథికి పెట్టకుండా తాను తినేవాడుకానీ, దానధర్మములు చేయని వాడు కానీ, ఇంద్రియ నిగ్రహము లేనివాడు కానీ అయోధ్యలో లేడు.

అయోధ్యలో దొంగలు లేరు, దొంగతనములు లేవు. ఏ వర్ణము వాడు వాడికి విధించిన పనిమాత్రమే చేసేవాడు. యజ్ఞములు, యాగములు చేసేవారు. బ్రాహ్మణులు నిత్యమూ అగ్నిహొత్రము చేసేవారు. వేదాధ్యయనము చేసేవారు. అతిథి పూజ, దానధర్మములు చేసేవారు. స్వంత భార్యతోనే సంగమించేవారు. పరాయి స్త్రీలను కన్నెత్తి కూడా చూచేవారు కాదు. అత్యవసర పరిస్థితులలో తప్ప ఇతరుల నుండి దానములు స్వీకరించేవారు కాదు.

దశరధునిపాలనలో నాస్తికులు గానీ, అసత్యము పలుకువారు కానీ, అసూయా ద్వేషములు కలవారు కానీ, అశక్తులు కానీ, విద్యనేర్చుకొనని వారు కానీ లేరు. అయోధ్యలో ఎవరికీ

ఎటువంటిబాధలు ఉండేవి కావు. అందరు ప్రజలూ సుఖసంతోషాలతో తులతూగుతూ ఉండేవారు. ఆడవారుకానీ, మగవారు కానీ అందరూ ఐశ్వర్యవంతులే గానీ పేదవారు లేరు.

అయోధ్యావాసులకు రాజభక్తి ఎక్కువ. అందరూ దీర్ఘా యుష్షులు. పెద్ద వారు బతికి ఉండగా చిన్నవారు చనిపోవడం ఎరుగరు. బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్య,శూద్రులు తమ తమ వృత్తులను నియమం తప్పకుండా చేసుకొనే వారు.

అయోధ్యలో యోధులకు కొదవ లేదు. అందరికీ అస్త్ర విద్య, శస్త్ర విద్యా నైపుణ్యము మెండుగా ఉండేది. అయోధ్యావాసులు కాంభోజ, బాహ్లిక, దేశముల నుండి అశ్వములను తెప్పించుకొనెడి వారు. వింధ్య పర్వత ప్రాంతమునుండి ఉత్తమ జాతి ఏనుగులను దిగుమతి చేసుకొనెడి వారు. అందులో కూడా భద్రగజములు, మంద్ర గజములు, భద్ర మంద్ర గజములు, మదగజములు మొదలగు జాతుల ఏనుగులతో అయోధ్య నిండి ఉండెడిది. అయోధ్య చుట్టు రెండు యోజనముల దూరములో శత్రువు అనే వాడు లేకుండా రాజ్యపాలన సాగించాడు దశరథుడు.

ఇది వాల్మీకి విరచిత
రామాయణ మహాకావ్యములో
బాలకాండలో ఆరవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ఏడవ సర్గ.

ఆవిధంగా అయోధ్యను పరిపాలిస్తున్న శ్రీ దశరథ మహారాజునకు సమర్థులైన అమాత్యులు ఉండేవారు. దశరథుని మంత్రులు ఎంతో గుణవంతులు. మంచి లోకజ్ఞానము, నేర్పు కలవారు. ఎల్లప్పుడు రాజు క్షేమము కోరుతూ రాజుకు హితమైన పనులు చేసేవారు. నీతి మంతులు. అటువంటి మంత్రులు దశరథునికి ఎనిమిది మంది ఉండేవారు. వారి పేర్లు ధృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు,సుమంతుడు.

వీరుగాక వసిష్ఠుడు, వామదేవుడు అనే పురోహితులు ఉండేవారు. పైన చెప్పిన మంత్రులు కాక ఉపమంత్రులు కూడా ఉండే వారు. వారందరూ అన్ని విద్యలందూ నేర్పరులు. బుద్ధిమంతులు. ఇంద్రియములను నిగ్రహించినవారు. శ్రీమంతులు. గొప్పవారు. శాస్త్రపరిజ్ఞానము కలవారు. పరాక్రమ వంతులు. కీర్తిమంతులు. కార్యశూరులు. చెప్పిన పని చేసేవారు. మంచి తేజస్సు కలవారు. క్షమాగుణము కలవారు. ఎప్పుడూ చిరునవ్వుతో మృదువుగా మాట్లాడే గుణము కలవారు. కోపంలో గానీ, కామ ప్రకోపము వలన గానీ, ధనము కోసం గానీ, అబద్ధము చెప్పరు.

వారు గూఢ చారుల ద్వారా స్వదేశములో గానీ, పరదేశములో గానీ ఏమేమి జరుగుతూ ఉందో తగిన సమాచారము ఎప్పటికప్పుడు తెప్పించుకొనుచుండెడివారు. తన మంత్రులకు ఎటువంటి స్నేహితులు ఉన్నారో దశరథుడు  ఎప్పటికప్పుడు పరీక్షిస్తూ ఉండేవాడు. మంత్రుల వ్యవహార శైలిని పర్యవేక్షిస్తూ తగిన సూచనలు ఇస్తూ ఉండేవాడు దశరథుడు.

దశరథుని పాలనలో న్యాయాధికారులు స్వపర బేధము లేకుండా స్వంతకుమారులనైనా తప్పు చేస్తే తగిన దండన విధించేవారు. మంత్రులు అందరూ రాజ్య నిర్వహణకు కావలసిన ధనమును సంపాదించుటలో, రాజ్యరక్షణకు తగిన సైన్యమును సమకూర్చడంలో ఎల్లప్పుడూ నిమగ్నమై  ఉండెడి వారు.  తమకు ఏ విధమైన అపకారము చేయని వాడు శత్రువైనా అతనిని హింసించేవారు కాదు.

దశరథుని మంత్రులు వీరులు. ఎప్పుడూ ఉత్సాహంగా ఉండేవారు. రాజనీతి శాస్త్రమును అధ్యయనం చేసి దాని ప్రకారము రాజ్యపాలన సాగించేవారు. దేశములో ఉన్న సాధుజనులను  ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉండేవారు. ప్రజలకు ఇబ్బంది కలగని రీతిలో పన్నులు వేసి వసూలు చేసేవారు.  చేసిన అపరాధమును బట్టి దండన విధించేవారు. మంత్రులందరూ తమలో తమకు బేధాభిప్రాయములు లేకుండా ఒకే త్రాటి మీద నిలబడి రాచ కార్యములు నిర్వర్తించేవారు.

అటువంటి మంత్రుల పాలనలో ప్రజలు సుఖంగా, శాంతితో అబద్ధములు చెప్పకుండా నీతిగా జీవించేవారు.  అయోధ్యలో చెడ్డవారు గానీ, పరభార్యలను కామించేవారు కానీ ఉండేవారు కాదు. దశరధుని

మంత్రులకు తమ రాజ్యము లోనే కాదు ఇతర రాజ్యములలో కూడా గౌరవ ప్రతిష్టలుఉండేవి. ఆ మంత్రులు ఏ ఏ సమయములలో శత్రు రాజులతో సంధి చేసుకొనవలెనో, ఏ ఏ సమయములలో యుద్ధము చేయవలెనో బాగుగా తెలిసినవారు. తమకు తెలిసిన రహస్యములను కాపాడుటలోనూ, తగిన సమయములలో సముచిత నిర్ణయములు తీసుకోడం లోనూ ఆ మంత్రులు సిద్ధహస్తులు. మంత్రులందరూ నీతి శాస్త్రమును చదివినవారు. ఎదుటి వారి మనస్సుకు బాధ కలగకుండా మాట్లాడటంలో నేర్పుకలవారు.

ఇటువంటి సకలసద్గుణ సంపన్నులగు మంత్రుల తో దశరధుడు రాజ్యపాలన చేయసాగాడు. దశరధుడు కూడా ఎప్పటికప్పుడు రాజ్యములో జరిగే సంగతులు గూఢచారుల ద్వారా తెలుసుకొనుచూ ప్రజలను రక్షించుటకు తగిన చర్యలు తీసుకొనుచూ, రాజ్యపాలన సాగించాడు. దశరధునకు ఎంతోమంది మిత్రరాజులు,సామంత రాజులు ఉండెడి వారు. తనకు ఎదురు తిరిగినవారిని నిర్దాక్షిణ్యంగా సంహరించెడి వాడు. అందుకే దశరధునకు శత్రువులే లేరు. సమర్ధులైన మంత్రుల సాయంతో దశరథుడు అయోధ్యను పరిపాలిస్తూ ఉన్నాడు.

(ఇక్కడ ఒక గమనిక. మనకు ప్రాచీన గ్రంధములలో, కథతో పాటు ఆ నాటి రాజకీయ,సామాజిక పరిస్థితులను కూడా కళ్లకు కట్టినట్టు చెప్పేవారు పూర్వపు ఋషులు. దాదాపు 5,000 ఏళ్ల కిందట రాయబడిన రామాయణములో ఆనాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను ఎలా వివరించారో చదివారు కదా. రాజు (అంటే నేటి ముఖ్యమంత్రి), మంత్రులు (నేటి మంత్రులు) ఎలా ఉండాలో, ఎలా

నడుచుకోవాలో, వారికి ఏఏ అర్హతలు ఉండాలో. మంత్రులు ఎంత నీతిగాఉండాలో, ఎలా మాట్లాడాలో, చక్కగా వివరించారు.  నేటి పాలకులను వారితో పోల్చుకోగలమా చెప్పండి.)

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో     ఏడవ  సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ఎనిమిదవ సర్గ.

అటువంటి పుణ్యచరితుడైన దశరధమహారాజుకు చాలా కాలం వరకూ పుత్రసంతానము కలగలేదు. వంశాంకురము లేడని దశరధ మహారాజు నిరంతరము చింతిస్తున్నాడు. పుత్రులు కలగడానికి అశ్వమేధ యాగము చేయడానికి నిశ్చయించాడు. వెంటనే మంత్రులను పిలిపించాడు. వారితో సంప్రదించాడు. మంత్రి సుమంతుని తన గురువులను, పురోహితులను పిలిపించమని ఆదేశించాడు. దశరధుని ఆదేశము మేరకు పురోహితులైన వశిష్టవామదేవులను, సుయజ్ఞుడు, జాబాలి, కశ్యపుడు, ఇంకా ఇతర బ్రాహ్మణులను తీసుకొని వచ్చాడు సుమంతుడు.

దశరథుడు వారి నందరినీ సాదరంగా ఆహ్వానించి పూజించి ఉచితాసనముల మీద కూర్చో పెట్టాడు. "మహాత్ములారా! మీకు తెలుసు కదా! నాకు పుత్రసంతానము లేరు.  ఈ విషయము నన్ను నిరంతరమూ బాధించుచున్నది.  పుత్రసంతానము కొరకు నేను అశ్వమేధ యాగము చేయదలచుకొన్నాను. ఆ యాగము ఎలా చేయవలెనో మీరు చెప్పండి." అని అడిగాడు.

దశరథుని నిర్ణయమును వశిష్టవామదేవులు ప్రశంసించారు.

“ఓ దశరథమహారాజా! మీకు పుత్రులు కావాలి అనే కోరిక సమంజస మైనదే. మీకు తప్పక పుత్రసంతానము కలుగుతుంది. మీరు వెంటనే ఒక ఉత్తమాశ్వమును విడిచిపెట్టండి.” అని పలికారు. ఆ మాటలకు దశరథుడు ఆనందించాడు. వెంటనే ఒక ఉత్తమాశ్వమును పంపమనీ, దాని వెంట అశ్వరక్షణకు తగు పరివారమును పంపమని ఆదేశాలు ఇచ్చాడు. సరమూ నదీ తీరమున ఒక యజ్ఞశాలను నిర్మించమని, శాంతి యాగములను జరిపించమని, ఆదేశించాడు. ఇంకా ఇలా పలికాడు దశరథుడు.

“ఈ యజ్ఞమునకు ఆటంకములు కలుగచేయుటకు విద్వాంసులైన బ్రహ్మ రాక్షసులు పొంచి ఉంటారు. యాగమునకు ఆటంకము కలిగినచో నాకు ఆపద కలుగును. మీరందరూ విద్వాంసులే కదా. కాబట్టి మీరందరూ యజ్ఞమును జాగ్రత్తగా ఏ అవరోధమూ లేకుండా జరిపించండి.” అని పలికాడు దశరథుడు.

“తమరు ఆదేశించిన ప్రకారము మేము యజ్ఞము జరిపించెదము.” అని పలికారు పురోహితులు. తరువాత పురోహితులు బ్రాహ్మణులు వెళ్లిపోయారు. దశరథుడు తన మంత్రులను చూచి “మీరందరూ పురోహితులకు సహకరించండి. యాగము నిర్విఘ్నముగా జరిగేట్టు చూడండి.” అని ఆజ్ఞాపించాడు.

తరువాత దశరథుడు అంత:పురములోకి వెళ్లాడు. తన భార్యలను చూచి “నేను పుత్రసంతానము కొరకు అశ్వమేధ యాగము

చేస్తున్నాను. నాతో పాటుమీరూ యాగ దీక్ష వహించండి." అని చెప్పాడు. ఆమాటలు విని దశరధుని భార్యలుసంతోషించారు. తమకు పుత్ర సంతానము కలగబోతోందని ఎంతగానో ఆనంద పడ్డారు. భర్త చెప్పిన ప్రకారము యాగ దీక్ష స్వీకరించారు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో ఎనిమిదవ  సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### తొమ్మిదవ సర్గ.

ఇదంతా జాగ్రత్తగా గమనిస్తున్న సుమంతుడు ఏకాంతంగా దశరథునితో ఇలా అన్నాడు.

“మహారాజా! ఋత్విక్కులు చెప్పిన మాటలు నేను విన్నాను. తమరికి సంతానము కలిగే విషయం గురించి పూర్వము సనత్కుమారుడు ఇతర ఋషులతో చెప్పగా నేను విన్నాను. అదేమిటంటే...............

కశ్యపునకు విభాండకుడు అనే కుమారుడు ఉన్నాడు. విభాండకుని కుమారుడు ఋష్యశృంగుడు. ఋష్యశృంగుడికి తన తండ్రి, తాను ఉన్న అరణ్యము తప్ప వేరు ప్రపంచము తెలియదు. అతను లోక ప్రసిద్ధము లైన రెండు రకముల బ్రహ్మచర్యములను అవలంబించిన వాడు.

ఆ సమయంలో అంగదేశమును రోమపాదుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడు అమితమైన బలపరాక్రమములు కలవాడు. అతడు ఎప్పుడూ ధర్మము తప్పి నడుస్తూ ఉంటాడు. ఆ రాజు అధర్మ

వర్తన   ఫలితంగా ఆయన దేశంలో తీవ్రమైన కరువు వచ్చింది. రోమపాదుడు తన రాజ్యంలో వచ్చిన కరువుకు ఎంతో దు:ఖించాడు. వెంటనే తనరాజ్యంలో  ఉన్న వృద్ధులైన బ్రాహ్మణులను పిలిపించాడు. "ఓ బ్రాహ్మణులారా! మీకు అన్ని ధర్మములు తెలుసు. ఈ అనావృష్టి పోవడానికి నా అధర్మ ప్రవర్తన వలన కలిగిన పాపము తొలగి పోవడానికి మంచి ఉపాయము చెప్పండి." అని అడిగాడు.

దానికి ఆ బ్రాహ్మణులు ఇలా పలికారు. "ఓ మహారాజా! నీ పాపము పోవడానికి, ఈ కరువు నివారణకు  ఒకటే ఉపాయము కలదు.  విభాండకుని కుమారుడు, ఋష్యశృంగుడు అనే ముని కుమారుడు ఉన్నాడు. ఆయనను పిలిచి నీ కుమార్తె శాంత అనే కన్యను ఆయనకు ఇచ్చి వివాహం జరిపించు. ఈ అనావృష్టి తొలగిపోతుంది. కాని  ఆ ఋష్యశృంగుడు ఇక్కడకు రావడమే చాలా కష్టం." అని అన్నారు.

ఋష్యశృంగుని తన రాజ్యమునకు రప్పించుటకు తగిన ఉ పాయము ఆలోచించాడు రోమపాదుడు. తన మంత్రులను పిలిచి "మీరు వెంటనేపోయి ఋష్యశృంగుని తీసుకొనిరండి." అని ఆజ్ఞాపిం చాడు. విభాండకునికి భయపడి వారు "మేము వెళ్లము" అని అన్నారు. కాని వారు ఋష్యశృంగుని తీసుకొని వచ్చుటకు ఒక ఉపాయమును చెప్పారు. అది ఏమంటే కొంతమంది వేశ్యలను పంపి స్త్రీసాంగత్యము గురించి తెలియని ఋష్యశృంగునికి స్త్రీ సంగమము రుచి చూపించి, తీసుకొని రావచ్చును అనీ, అప్పుడు శాంతను ఋష్యశృంగునికి ఇచ్చి వివాహము చేసి అతని ఇంటనే ఉంచుకొన వచ్చును అనీ, ఋష్యశృంగుడు ఉన్నచోట సుభిక్షముగా

ఉంటుందని తెలియజేసారు.

రోమపాదుడు వారు చెప్పిన  ప్రకారము చేసి ఋష్యశృంగుని తన రాజ్యమునకు రప్పించుకొని, తన కుమార్తె   శాంతను ఇచ్చి వివాహము చేసాడు. ఓ దశరథమహారాజా! తమరు కూడా ఋష్యశృంగుని తీసుకొని వచ్చి యజ్ఞము జరిపించిన తమకు పుత్రసంతానము కలుగుతుంది అని చెప్పుకుంటుంటే నేను విన్నాను."అని చెప్పాడు సుమంతుడు.  ఆ మాటలకు ఎంతో సంతోషించాడు దశరథుడు.

"సుమంతా! రోమపాదుడు ఋష్యశృంగుని తన రాజ్యమునకు ఎలా తీసుకు రాగలిగాడు. వివరంగా చెప్పు." అని అడిగాడు దశరథుడు

సుమంతుడు ఇలాచెప్పసాగాడు.

ఇది వాల్మీకి విరచిత
రామాయణ మహాకావ్యములో
బాలకాండలో తొమ్మిదవసర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

## పదవ సర్గ.

దశరథుడు అడిగినప్రశ్నకు సుమంతుడు ఈ విధంగా సమాధానం చెప్పసాగాడు.

"మహారాజా! రోమపాదుని మంత్రులు రోమపాదునితో ఇలా చెప్పారు.

"మహారాజా! ఋష్యశృంగుడు తాను పుట్టినప్పటినుండి తండ్రిని తప్ప వేరే వారిని చూడలేదు. అతడికి స్త్రీ అంటే ఎలా ఉంటుందో స్త్రీ సుఖం ఎలా ఉంటుందో తెలియదు. అందుకని మనము కొంతమంది వేశ్యలను అక్కడికి పంపి వారి హావభావవిలాసములతో ఋష్యశృంగుని ఆకర్షించి మన నగరమునకు రప్పించెదము." అని అన్నారు. దానికి రోమపాదుడు అంగీకరించాడు. వెంటనే మంత్రులు కొంతమంది వేశ్యలను రావించి వారిగి తగిన విధంగా సూచనలు ఇచ్చి ఋష్యశృంగుని ఆశ్రమము వద్దకు పంపారు.

ఆ వేశ్యలు విభాండకుడు ఆశ్రమములో లేని సమయములో ఋష్యశృంగుని వద్దకు వెళ్లారు. ఋష్యశృంగునికి కనపడేటట్టు అటూ

ఇటూ తిరగ సాగారు. ఋష్యశృంగునికి వారు వింతగా కనపడ్డారు. ఎందుకంటే అతడు అప్పటిదాకా ఆడవాళ్లను  చూడలేదు. వారు ఋష్యశృంగుని ముందు తమ ఆటపాటలు ప్రదర్శిస్తున్నారు. అతడు వారి వద్దకు వెళ్లాడు. ఆ వేశ్యలు ఋష్యశృంగునితో ఇలా అన్నారు.

"ఓ బ్రాహ్మణోత్తమా! మీరు ఎవరు? ఇక్కడు ఏమి చేస్తున్నారు." అని అడిగారు.

"నేను విభాండకుని పుత్రుడను. నాపేరు ఋష్యశృంగుడు. నేను మిమ్మల్ని ఎప్పుడూ చూడలేదు. మీరు ఎవరు. ఇలా ఎందుకు ఉన్నారు." అని అన్నాడు. వారిని తన ఆశ్రమమునకు తీసుకొని వెళ్లాడు. వారికి మగవారికి ఇచ్చినట్టు అర్ఘ్యము పాద్యము సమర్పించాడు. కాని ఆ వేశ్యలకు లోపల భయంగానే ఉంది. అతని తండ్రి విభాండకుడు వచ్చి తమని చూచి ఎక్కడ శపిస్తాడేమో అని భయపడుతున్నారు. అందుకని వడి వడిగా అక్కడి నుండి వెళ్లాలి అనుకున్నారు. ఆ వేశ్యలు తమ వెంట తెచ్చిన మధురము లైన భక్ష్యములను ఋష్యశృంగునికి ఇచ్చారు.

" ఓ బ్రాహ్మణోత్తమా! ఇవి మధుర ఫలములు.  ఆరగింపుడు." అని అన్నారు. అతను వాటిని తింటుంటే వారు అతనిని కౌగలించుకొన్నారు. ఋష్యశృంగుడు అటువంటి అనుభూతిని ఎప్పుడూ పొందలేదు.  వారు ఇచ్చిన ఆ భక్ష్యములను మధుర ఫలములు అనుకొన్నాడు. కడుపారా తిన్నాడు. తరువాత ఆ వేశ్యలు వెళ్లిపోయారు.

వారు వెళ్లి పోయిన తరువాత ఋశ్యశృంగునికి మనసు వికలమయింది. వారినే తలచు కుంటూ, వారి స్పర్శసుఖమును

మరలా మరలా మానసికంగా అనుభవిస్తూ కాలం గడిపాడు.

మరునాడు ఋష్యశృంగునికి మనసు నిలువ లేదు. ఆ వేశ్యలను మరలా కలుసు కోడానికి వారు నిన్న కలిసిన చోటుకు వెళ్లి నిలబడ్డాడు. వేశ్యలు కూడా మరునాడు ఋష్యశృంగుని కొరకు ఆక్కడకు వెళ్లారు. అతనితో ఇలా అన్నారు.

"ఓ బ్రాహ్మణోత్తమా! నిన్న మేము నీ ఆశ్రమమునకు వచ్చినాము కదా. ఈరోజు నీవు మా ఆశ్రమమునకు వచ్చి మా ఆతిధ్యము స్వీకరించ వలెను. నిన్న మీకు ఇచ్చిన ఫలములు నేడు కూడా సమృద్ధిగా ఇచ్చెదము. వాటిని తమరు తనివితీరా ఆరగింప వచ్చును" అని అన్నారు.

ఋష్యశృంగుడు సరే అని వారి వెంట వెళ్లాడు. ఆ వేశ్యలు ఋష్యశృంగుని అలా అలా ముద్దు చేస్తూ మురిపిస్తూ, అంగదేశమునకు తీసుకొని వెళ్లారు. ఋష్యశృంగుడు అంగదేశములో ప్రవేశించగానే విస్తారంగా వానలు కురిసాయి. పంటలుపండాయి. కరువుకాటకాలు తీరిపోయాయి.

రోమపాదుడు ఋష్యశృంగుని సాదరంగా రాజభవనమునకు ఆహ్వానించాడు. అర్ఘ్యపాద్యములు ఇచ్చిసత్కరించాడు. "మహాత్మా! తమరి రాకచే మా అంగరాజ్యము పావనము అయింది. మా కరువు కాటకాలు తొలగిపోయాయి. తమరి తండ్రిగారు నా మీద కోపించకుండా నన్ను అనుగ్రహించురడి. నాకుమార్తె శాంతను వివాహమాడండి. " అని ప్రార్థించాడు.

ఋష్యశృంగుడు అలాగే అన్నాడు. రోమపాదుడు తన కుమార్తె శాంతను ఋష్యశృంగునికి ఇచ్చి వివాహం వైభవంగా జరిపించాడు. తరువాత ఋష్యశృంగుడు భార్య శాంతతో కొంత కాలం పాటు అంగరాజ్యములోనే ఉన్నాడు.

ఇది

వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో పదవసర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

## పదకొండవ సర్గ.

"ఓ దశరథమహారాజా! తమరి గురించి సనత్కుమారుడు ఇంకా ఏమి చెప్పాడో వినండి.

'రాబోవు కాలంలో ఇక్ష్వాకు వంశంలో ధర్మాత్ముడు, శీలవంతుడు అయిన దశరథుడు అనే రాజు జన్మిస్తాడు. ఆయనకు పుత్రసంతానము కలుగదు. రోమపాదుడు దశరథునకు మిత్రుడు. దశరథుడు రోమపాదుని వద్దకు వెళ్లి ఋశ్యశృంగుని అయోధ్యకు పంపమని, తనకు పుత్రసంతానము కలిగేట్టు ఒకయాగం చేయించమని అర్థిస్తాడు. దానికి రోమపాదుడు అంగీకరిస్తాడు. రోమపాదుడు ఋష్యశృంగుని అయోధ్యకు పంపుతాడు. తనకు సంతాన ప్రాప్తి కలిగేటట్టు యజ్ఞము చేయించమని దశరథుడు ఋష్యశృంగుని ప్రార్థిస్తాడు. ఋష్యశృంగుడు దశరథుని చేత యజ్ఞము చేయిస్తాడు. ఫలితంగా దశరథునకు అమిత పరాక్రమవంతులు, వంశోద్ధారకులు అయిన నలుగురు పుత్రులు కలుగుతారు.' అని సనత్కుమారుడు చెప్పగా నేను విన్నాను.

కాబట్టి ఓ దశరథ మహారాజా! ఆ మహాఋషి మాటలు తప్పవు.

నీవు వెంటనే అంగదేశమునకు స్వయముగా పోయి ఋష్యశృంగుని తీసుకొని రమ్ము. యజ్ఞము చేయింపుము. నీకు పుత్ర సంతానము కలుగుతుంది." అని సుమంతుడు చెప్పాడు.

ఆ మాటలకు ఎంతో సంతోషించాడు దశరథుడు. పురోహితుడైన వశిష్టుని అనుమతి తీసుకున్నాడు. తన మంత్రులతో సహా అంగదేశము నకు వెళ్లాడు. అంగరాజు దశరథుని సాదరంగా ఆహ్వానించాడు. అతిథి సత్కారములు చేసాడు. అంగరాజు పక్కన అగ్ని వలె ప్రకాశించు చున్న ఋష్యశృంగుని చూచాడు దశరథుడు. రోమపాదుడు దశరథుని ఋష్యశృంగునికి పరిచయం చేసాడు. ఋష్యశృంగుడు దశరథునికి నమస్కరించాడు.

దశరథుడు అంగరాజ్యములో ఏడురోజులు ఉన్నాడు. ఎనిమిదవ రోజున తాను వచ్చిన పని తెలిపాడు.

"ఓ అంగరాజా! నేను ఒక యజ్ఞము చేయ సంకల్పించాను. ఆ యజ్ఞమునకు నీ కుమార్తె శాంతను, అల్లుడు ఋష్యశృంగుని అయోధ్యకు పంపవలసింది." అని ప్రార్థించాడు. దానికి అంగరాజు అంగీకరించాడు.

ఋష్యశృంగుడు సతీసమేతంగా అయోధ్యకు ప్రయాణమయ్యాడు. తమ రాకను దశరథుడు ముందుగా నే అయోధ్యావాసులకు తెలియజేసాడు. స్వాగత సత్కారములు ఘనంగా చేయమని ఆదేశించాడు.

దశరధుడు ఋష్యశృంగుని తీసుకొని అయోధ్యా నగరము ప్రవేశించాడు. అయోధ్యాపురవాసులు వారికి  మంగళవాద్యములతో ఘనస్వాగతం పలికారు. శాంతను చూచి అంత:పుర స్త్రీలు ఎంతో సంతోషించారు.  ఆమెను సాదరంగా ఆహ్వానిం చారు. శాంతా ఋష్యశృంగులు అయోధ్యలో కొంతకాలము ఉన్నారు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో  పదకొండవసర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

## పన్నెండవ సర్గ.

వసంత ఋతువు ప్రవేశించింది. వసంత ఋతువులో తాను తలపెట్టిన యజ్ఞమును చేయ సంకల్పించాడు దశరథుడు. దశరథుడు మునిశ్రేష్టుడైన ఋష్యశృంగుని వద్దకుపోయి తనకు పుత్రసంతానము కలిగేటట్టు  యజ్ఞము చేయించవలసిందిగా ప్రార్థించాడు. దానికి ప్రధాన ఋత్విక్కుగా ఋష్యశృంగుని ఉండవలసిందిగా అభ్యర్థించాడు. దానికి అంగీకరించాడు ఋష్యశృంగుడు.

" ఓ దశరథ మహారాజా! అటులనే కానిమ్ము. నేను మీ చేత అశ్వమేధ యాగము చేయిస్తాను. తరువాత పుత్ర సంతానము కొరకు మరొక యాగము చేయిస్తాను. ముందు అశ్వమేధ యాగమునకు కావలసిన సంభారములు సేకరించుము.  ఒక ఉత్తమాశ్వమును సేకరించి, దానిని యజ్ఞాశ్వముగా  విడువుము."  అని అన్నాడు. ఆ మాటలకు  మహదానందము పొందాడు దశరథుడు. వెంటనే తన మంత్రి సుమంతుని రావించాడు.

"సుమంతా! మనము అశ్వమేధయాగము చేయబోతున్నాము. నీవు వెంటనే మన పురోహితులు వసిష్ఠుని, బ్రాహ్మణులను, ఋత్విక్కులను, సుయజ్ఞుడు మొదలగు వారిని పిలిపింపుము," అని

ఆదేశించాడు.

సుమంతుడు దశరధుని ఆజ్ఞ ప్రకారము అందరినీ సమావేశపరిచాడు. దశరధుడు వారినందరినీ పూజించి సత్కరించాడు. వారితో ఇలా అన్నాడు.

"బ్రాహ్మణోత్తములారా! నేను అశ్వమేధయాగము చేయబోతున్నాను. దానికి ఋష్యశృంగుడు ప్రధాన ఋత్విక్కుగా ఉండుటకు అంగీకరించాడు. మీరందరూ ఆ యజ్ఞమును నిర్విఘ్నముగా జరిపించాలి." అని వారిని ప్రార్థించాడు.దానికి వారందరూ సమ్మతించారు.

"రాజా నీవు ధర్మసమ్మతంగా యాగము చేస్తున్నావు. నీకు యాగఫలము దక్కుతుంది. నీకు నలుగురు పుత్రులు జన్మిస్తారు"అని వారు దశరథుని ఆశీర్వదించారు. ఆ మాటలకు ఎంతో సంతోషించాడు దశరథుడు. తరువాత యాగమునకు కాలవసిన ఏర్పాట్లు చేయడానికి మంత్రులను నియమించి, దశరథుడు అంత:పురమునకు వెళ్లాడు.

ఇది వాల్మీకి విరచిత
రామాయణ మహాకావ్యములో
బాలకాండలో పన్నెండవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమత్ రామాయణము.

## బాలకాండ

### పదమూడవ సర్గ.

యజ్ఞమునకు కావలసిన ఏర్పాట్లు చేయడానికి ఒక సంవత్సరము పట్టింది. మరలా వసంత ఋతువు వచ్చింది. దశరథుడు సంతానము కొరకు యజ్ఞము చేయుటకు యాగశాలలో ప్రవేశించాడు. పురోహితులైన వశిష్టులకు బ్రాహ్మణులకు నమస్కరించాడు. "మీరందరూ ఈ యజ్ఞమును వేదోక్తముగా నిర్విఘ్నముగా జరిపించండి." అని వారిని ప్రార్థించాడు.

"మహారాజా! మీరు కోరినట్లే జరుగుతుంది" అని బ్రాహ్మణులు ఆశీర్వదించారు.

తరువాత పురోహితుడైన వశిష్టుడు జ్ఞానవృద్ధులైన బ్రాహ్మణులను, వాస్తు శిల్పులను, శిల్పులను, కొయ్యపనిచేసే వారిని, మట్టిపని చేసేవారిని, వినోద కార్యక్రమములకు నటులను, నటీమణులను, గాయకులను, చారిత్రకారులను, వీటన్నిటికీ లెక్కలు కట్టుటకు గణకులను, ఇంకా ఇతర రంగములలో నిష్ణాతులను పిలిపించాడు. వారితో ఇలా అన్నాడు.

“దశరథమహారాజు గారు అశ్వమేధ యాగము చేయ సంకల్పించారు. మీరందరూ ఆ కార్యక్రమునకు తగు భవనములను, వేదికలను, యాగశాలలను నిర్మించండి. తగు ఏర్పాట్లు చేయండి. యజ్ఞమునకు వచ్చువారికి భోజన సదుపాయములు వసతి సదుపాయములు చేయండి. తగినన్ని వసతి గృహములు నిర్మించండి. ఎవరికీ ఏలాంటి అసౌకర్యము కలగకుండా చూడండి. అన్ని వర్ణముల వారిని సమంగా ఆదరించండి. ఎవరి మీద కోపతాపములు చూపకండి. ఆహూతులను బాధపెట్టకండి. ఈయజ్ఞమునకు కావలసిన పనులు చేయువారికి తగిన భోజన వసతి సౌకరర్యములు కల్పించండి. వారికి తగిన పారితోషికములు ఇవ్వండి. సత్కరించండి. అన్ని పనులను శ్రద్ధతో జరిగేటట్టు చూడండి. అలక్ష్యము పనికిరాదు.” అని ఆదేశించాడు వశిష్టుడు.

పిమ్మట వశిష్టుడు మంత్రి సుమంతుని పిలిపించాడు. “సుమంతా! నీవు ఈ యాగమునకు భూమండలములోని రాజులందరికీ ఆహ్వానములు పంపించు. మిథిలాధిపది జనకుడు మనకు బంధువు. ఆయనను స్వయంగా, ప్రత్యేకంగా ఆహ్వానించు. అలాగే కాశీరాజును కూడా నీవు స్వయంగా వెళ్లి తీసుకొని రా. ఇంకా మహారాజు గారి మామగారు కేకయ దేశాధి పతి కేకయ రాజును కూడా స్వయంగా ఆహ్వానించు. అలాగే అంగదేశాధీశుడు రోమపాదుని కూడా సాదరంగా ఆహ్వానించు. ఇంకా తూర్పుదేశపు రాజులను, దక్షిణదేశపు రాజులను, సింధు, సౌరాష్ట్ర దేశాధీశులను ఆహ్వానించు. మన రాజ్యముతో స్నేహ సంబంధములు కలిగిన రాజులందరినీ ఆహ్వానించు. పైన చెప్పిన వారందరినీ సకుటుంబ, సపరివార

సమేతముగా యజ్ఞమునకు రమ్మని ఆహ్వానించు.” అని పలికాడు వశిష్టుడు.

వశిష్టుని ఆదేశానుసారము సుమంతుడు జనకుని, కేకయరాజును, కాశీరాజును స్వయంగా ఆహ్వానించడానికి త్వరితముగా వెళ్లాడు. ఆయాకార్యములకు నియమింపబడిన కార్యనిర్వాహకులు, ఆయాపనులలో నిష్ణాతులైన పనివారు ఆయా కార్యములు చేయుటలో పూర్తిగా నిమగ్నమైనారు.

అన్ని ఏర్పాట్లు పూర్తి అయ్యాయి. యజ్ఞమునకు ఆహ్వానము అందుకొన్న రాజులందరూ వారి వారికి తోచిన రత్నములు, మణులు మొదలగు కానుకలతో అయోధ్యా నగరానికి వచ్చారు. వసిష్టుడు వారందరికీ అతిథి సత్కారములకు చేయుటకు తగిన ఏర్పాట్లు చేసాడు. ఆవిషయము దశరథునికి చెప్పాడు.

వశిష్టుడు, ఋష్యశృంగుడు దశరథమహారాజు వద్దకు పోయి “ ఓ దశరథమహారాజా! మనము ఆహ్వానించిన రాజులందరూ అయోధ్యకు వచ్చారు. యజ్ఞమునకు కావలసిన ఏర్పాట్లు అన్నీ పూర్తి అయ్యాయి. మీరు యజ్ఞ శాలకు రావాలి.” అనిపలికారు.

ఒక శుభముహూర్తమున దశరథమహారాజు, తన ముగ్గురు భార్యలతో సహా యజ్ఞశాలకు వచ్చాడు. ఋష్యశృంగుని ఆధ్వర్యములో, వసిష్టుని పౌరోహిత్యములో అశ్వమేధయాగము ప్రారంభము అయింది.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో  పదమూడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### పదునాలుగవ సర్గ.

ఒక సంవత్సరకాలం గడిచింది. అశ్వవమేధయాగముకొరకు వదిలి పెట్టబడిన అశ్వము తిరిగి వచ్చింది. దశరథుడు సరయూ నదీ తీరమున ఉత్తర భాగమున అశ్వమేధ యాగము ప్రారంభించాడు. ఋష్యశృంగుని ప్రధాన ఋత్విక్కుగా ఉంచుకొని పురోహితులు యజ్ఞము ప్రారంభించారు.

వేదవిదులయిన ఋత్విక్కులు వేదములలో చెప్పిన ప్రకారము యజ్ఞము చేస్తున్నారు. అశ్వమేధ యాగములో ముఖ్య అంశములైన ప్రవర్గ్యము, ఉపసదమును బ్రాహ్మణులు వేదోక్తముగా నిర్వహించారు. ఇంద్రునికి హవిర్భాగములను అర్పించారు. శ్రేష్ఠమైన సోమ లతను నలగగొట్టి,రసము తీసారు. దీనితో యాగములో మాధ్యందిన సవము వేదోక్తముగా చేసారు.

తరువాత ఋత్త్విక్కులు దశరధునితో తృతీయ సవనమును కూడా నిర్వర్తింపచేసారు. ఆ యాగములో ఏ చిన్న తప్పుకూడా దొర్లకుండా చాలా జాగ్రత్తగా చేస్తున్నారు.

ఆ యాగమునకు వచ్చిన బ్రాహ్మణుల కందరకూ ఆకలి అనేది తెలియకుండా మృష్టాన్న భోజనములు సమకూర్చారు. ఆ యాగము జరిగిన అన్ని రోజులు బ్రాహ్మణులు, రాజాధిరాజులు, వారి వెంట వచ్చిన ఉద్యోగులు, భటులు, సన్యాసులు, తాపసులు అందరికీ సమృద్ధిగా భోజన సదుపాయములు చేసారు. తృప్తిగా భోజనములు చేసిన వారికి వస్త్రములు కూడా ఇచ్చి సత్కరించారు.

వచ్చిన వారందరూ తృప్తిగా భోజనము చేసి దశరధుని పుత్రవంతునిగా దీవించారు. ఆ మాటలు విని దశరధుడు పరమానంద భరితుడయ్యాడు. యాగము జరుగుతున్న సమయములో వేద పండితుల మధ్య వాగ్వివాదములు రసవత్తరముగా జరుగుతుండేవి.

యాగములో ఊపస్తంభములు నిలుప వలసిన సమయము వచ్చినది. బిల్వ వృక్షము కర్రతో చేసిన ఊపస్తంభములు ఆరు, చండ్రకర్రతో చేసినవి ఆరు, మోదుగ కర్రతో చేసినవి ఆరు, శ్లేషాత్మకము అనే కర్రతో చేసినది ఒకటి, దేవదారు కర్రతో చేసినవి రెండు యాగ వాటికలో పాతారు. ఒకదానికి మరొక దానికి బారెడు వెడల్పు ఉండేట్టు పాతారు. ఆ ఊపస్తంభములను బంగారముతో అలంకరించారు. ఆ ఇరవై యొక్క ఊపస్తంభములను రంగు రంగుల వస్త్రములతో అలంకరించారు.

వేదములలో చెప్పిన ప్రకారము యజ్ఞ కుండము లను ఏర్పాటుచేసారు. దశరథుడు, ఆయన భార్యలు కూర్చొనుటకు వీలుగా గరుడుని ఆకారములో ఒక వేదికను నిర్మించారు.

దేవతలకు బలి ఇచ్చేనిమిత్తము ఆ ఊపస్తంభములకు రకరకాల పక్షులను, పశువులను, పాములను కట్టారు. యజ్ఞము కొరకు వదిలిన అశ్వమును ఒక ఊపస్తంభమునకు కట్టారు. మూడు వందల పశు వులను, యజ్ఞాశ్వమును ఆ ఊపస్తంభములకు కట్టారు.

తరువాత దశరధుని పట్టమహిషి కౌసల్య అక్కడకు వచ్చింది. అశ్వమును కట్టిన ఊపస్తంబమునకు మూడుమార్లు ప్రదక్షిణము చేసింది. ఆ యజ్ఞాశ్వమును మూడు కత్తులతో చంపింది. శాస్త్రములో చెప్పిన ప్రకారము ఆ రోజు రాత్రి అంతా కౌసల్య ఆ గుర్రము పక్కన నివసించింది.

మరునాడు ఆ యాగమునకు హెూత, అధ్వర్యువు, ఉద్గాత అనే ముగ్గురు ఋత్విక్కులు పట్టపురాణి కౌసల్యను ఆమె ఇద్దరు పరిచారికలను దానముగా తీసుకున్నారు. తరువాత మరొక ఋత్విక్కు చంపబడిన ఆ గుర్రము మెదడును పక్వము చేసి హెూమం చేసాడు. దశరథుడు ఆ హెూమము లో నుండి వచ్చిన పొగను తృప్తిగా వాసన చూచాడు.

తరువాత పదహారు మంది ఋత్విక్కులు చంపబడిన ఆ అశ్వము యొక్క శరీర భాగములను శాస్త్రోక్తముగా హెూమం చేసారు.

కల్పసూత్ర ప్రకారంగా అశ్వమేధ యాగము మూడు రోజులు వేదోక్తంగా జరపాలి. మొదటి రోజు యజ్ఞమునకు చతుష్టోమము, రెండవ రోజు కార్యక్రమమునకు ఉక్థము, మూడవ రోజు కార్యక్రమమునకు అతి రాత్రము అని పేరు. ఇవే కాకుండా దశరథుడు

ఇతరములైన అనేక కార్యక్రమములు చేయించాడు.

యాగము పూర్తి అయిన తరువాత దశరథుడు తూర్పుదిక్కున ఉన్న తన రాజ్యమును హోతకును, పశ్చిమ దిక్కున ఉన్న తన రాజ్యమును అధ్వర్యునకును, దక్షిణదిక్కున ఉన్న దేశమును బ్రహ్మకు దానంగా ఇచ్చాడు. ఈ విధంగా చేయవలెనని వేదములు సూచిస్తున్నాయి. యాగఫలమును పొందుటకు దశరథుడు ఈ విధంగా తనరాజ్యమును బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు. కాని ఆ బ్రాహ్మణులు ఆ రాజ్యమును తిరిగి దశరథునికి ఇచ్చి దానికి తగిన ప్రతిఫలముగా పదిలక్షల గోవులు, వందకోట్ల బంగారు నాణెములు, నాలుగు వందల కోట్ల వెండి నాణెములు తీసుకున్నారు.

ఆ బ్రాహ్మణులు ఆ ధనమును వశిష్టునకు ఋష్యశృంగునకు ఇచ్చారు. వారు ఆ ధనమును అందరికి న్యాయప్రకారంగా పంచి పెట్టారు. అందరూ సంతృప్తి చెందారు. ఇది కాకుండా యాగమును చూడటానికి వచ్చిన వారికి కోటి బంగారు నాణెములు దానంగా ఇచ్చాడు దశరథుడు.

అన్ని అయిపోయిన తరువాత ఒక పేద బ్రాహ్మణుడు వచ్చి తనకు కూడా ఏమన్నా ఇవ్వమని యాచించాడు. ఆ సమయంలో దశరథుని చేతిలో ఉన్న బంగారు ఆభరణమును ఆ పెద బ్రాహ్మణునికి బహూకరించాడు. తరువాత యాగమునకు వచ్చిన బ్రాహ్మణులందరికీ భక్తితో నమస్కరించి వారి ఆశీర్వాదములు తీసుకున్నాడు దశరథుడు. ఆ ప్రకారంగా అశ్వమేధ యాగమును పూర్తి చేసాడు దశరథుడు.

తరువాత దశరథుడు ఋష్యశృంగుని చూచి "ఓ మహాత్మా! అశ్వమేధ యాగము నా చేత చేయించారు. తరువాత నాకు పుత్ర సంతానము కలిగి నా వంశము వృద్ధిచెందేటట్టు నాచేత ఒక యాగము చేయించవలసినది" అని ప్రార్థించాడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో  పదునాలుగవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### పదిహేనవ సర్గ.

ఋష్యశృంగుడు బాగా ఆలోచించాడు. తరువాత దశరథునితో ఇలా అన్నాడు. "మహారాజా! తమకు పుత్ర సంతానము కలగడం కోసరం, మీకు పుత్ర సంతానమును కలిగించే ఒక ఇష్టిని (యాగమును) మీచేత చేయిస్తాను. ఈ యాగమును వేదములో చెప్పబడిన అధ్వర శిరస్సు అనే మంత్రముల ఆధారంగా చేయిస్తాను." అని పలికాడు.

దశరథుడు సంతోషంగా ఒప్పుకున్నాడు. యాగం ఆరంభం అయింది. వేద మంత్రములు చదువుతూ హెూమం చేస్తున్నారు. యా యజ్ఞములో హవిర్భాగములు స్వీకరించుటకు దేవతలు అక్కడకు వచ్చారు. ఆ సమయంలో దేవతలందరూ బ్రహ్మదేవుని కలిసి ఆయనతో ఇలా అన్నారు.

" ఓ బ్రహ్మదేవా! భూలోకంలో రావణుడు అనే రాక్షసుడికి మీరు ఎన్నో వరాలు ఇచ్చారు. ఆ వరాల ప్రభావంతో గర్వించి ఆ రాక్షసుడు దేవతలను, మునులను, సజ్జనులను బాధిస్తున్నాడు. అతనిని కట్టడి చేయడం మా వల్ల కావడం లేదు. ఎందుకంటే మీరు అతనికి వరాలు ఇచ్చారు. వాటిని మేము గౌరవించాలి కదా. అందుకని మేము అతని

మీద కఠినంగా వ్యవహరించలేకపోతున్నాము. అతడు చేయు అకృత్యములను చూచీ చూడకుండా పోతున్నాము.

(మంత్రిగారి అండదండలు ఉంటే పేరు మోసిన రౌడీలను మాత్రం పోలీసులు ఏమి చేయగలరు చెప్పండి.)

తమరి వరాల అండ చూచుకొని అతడు ముల్లోకములను బాధిస్తున్నాడు. దిక్పాలకులను లెక్కచెయ్యడం లేదు. ఇంద్రునికూడా ధిక్కరిస్తున్నాడు. ఇంక భూలోక వాసుల కష్టములకు అంతు లేదు. మునులను బ్రాహ్మణులను బాధిస్తున్నాడు. వారిని యజ్ఞయాగములు చేసుకోనివ్వడం లేదు. వాడి మాటలకు ఎదురు చెప్పే సాహసం ఎవరికీ లేదు.

ఇంక సూర్యుడు అతని దగ్గర చల్లగా ఉంటాడు. వాయువు అతని వద్ద మెల్లగా వీస్తాడు. సముద్రుడు కూడా అతనిని చూడగానే అలలను వెనక్కు లాక్కుంటాడు. శాంతంగా ఉంటాడు. ఆ రావణుని వలన భయపడని వాడు లేదు. అందుకని అతనిని సంహరించి ముల్లోకము లను రక్షించే ఉపాయం ఆలోచించండి." అని ప్రార్థించారు.

బ్రహ్మదేవుడు ఆలోచించాడు. "దేవతలారా! వాడిని చంపడానికి ఒకే ఒక ఉపాయం ఉంది. నేను ఇచ్చిన వర ప్రభావంతో వాడు నరులు చేతిలో తక్క ఇంక ఎవరి చేతిలోనూ చావడు. అలాంటి వరం ఇచ్చాను . కాబట్టి రావణుడు మనుష్యుల చేతిలోనే చావాలి. అది తక్క మరొక ఉపాయము లేదు." అని అన్నాడు బ్రహ్మ.

అమ్మయ్య! రావణుడి చావుకు ఏదో ఒక కారణం దొరికింది అని సంతోషించారు దేవతలు. ఇంతలో విష్ణుమూర్తిఅక్కడకు వచ్చాడు. దేవతలందరు విష్ణువుకు నమస్కరించారు. ఆయనతో ఇలా అన్నారు.

" ఓ దేవదేవా! ముల్లోకములను కాపాడటానికి మిమ్మల్ను ఒక పని చేయమని కోరుతున్నాము. అయోధ్యకు రాజు అయిన దశరథుడు పుత్రుల కొరకు ఒక యాగము చేస్తున్నాడు. ఆయనకు ముగ్గరు భార్యలు ఉన్నారు. తమరు మా మీద దయయుంచి మీరు నలుగురుగా విడిపోయి, ఆయన ముగ్గురు భార్యలకు పుత్రులుగా జన్మించండి. బ్రహ్మదేవుని వరగర్వంతో రావణుడు అనే రాక్షసుడు ముల్లోకములలో బ్రాహ్మణులను, మునులను, దేవతలను బాధపెడు తున్నాడు. మితి మీరుతున్న ఆ రావణుని సంహరించండి. లోకాలను కాపాడండి. ఒక్క నరుడే ఆ రాక్షసుని సంహరించగలడు. కాబట్టి తమరు మానవుడిగా జన్మించి ఆ రాక్షసుని సంహరించండి." అని వేడుకున్నారు.

విష్ణుమూర్తి వారి ప్రార్థనలను సాంతం విన్నాడు. వారితో ఇలా అన్నాడు. "ఓ దేవతలారా! మీరు భయపడకండి. మీకు త్వరలో రావణుని బారి నుండి విముక్తి లభిస్తుంది. మీరుకోరినట్టు నేను భూమి మీద అవతరిస్తాను. ఆ రావణుని సంహరిస్తాను. పదకొండు వేల సంవత్సరములు ఈ భూమిని పాలిస్తాను. ధర్మసంరక్షణ చేస్తాను." అని పలికాడు విష్ణుమూర్తి.

ఆ ప్రకారంగా దేవతలకు వరం ఇచ్చిన విష్ణువు భూలోకంలో తన జన్మస్థానము ఎక్కడా అని ఆ లోచించాడు. తాను నాలుగు

అంశలుగా విడిపోయి,  దశరథ మహారాజుకు నలుగురు కుమారు లుగా జన్మించాలి అని సంకల్పించాడు. దేవతలు, అప్సరసలు మునులు అందరూ విష్ణుదేవుని స్తుతించారు.

" ఓ విష్ణుదేవా! నీవు లోక భయంకరుడైన రావణుని సంహరించి తిరిగి స్వర్గలోకమునకు  తిరిగి రమ్ము." అని వేడుకొన్నారు.

ఇది వాల్మీకి విరచిత
రామాయణ మహాకావ్యములో
బాలకాండలో  పదిహేనవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

## పదహారవ సర్గ.

విష్ణు మూర్తి దేవతల ప్రార్థనలను శ్రద్ధతో ఆలకించాడు. అన్ని విషయములు తెలిసి కూడా ఏమీ తెలియని వాని వలె వారితో ఇలా అన్నాడు.

" ఓ దేవతలారా! నేను మనుష్యునిగా అవతారము ఎత్తుతాను. కాని లోక కంటకుడైన రావణుని ఎలా సంహరించాలి. దానికి ఉ పాయము ఏమి?" అని అడిగాడు. దానికి దేవతలు ఇలాఅన్నారు.

" ఓ మహావిష్ణూ! నీవు మనుష్య శరీరమును ధరించి, రావణుని తో యుద్ధము చేసి సంహరించు. అసలు జరిగిన విషయం ఏమిటంటే.......... రావణాసురుడు చాలాకాలము బ్రహ్మదేవుని గూర్చి తపస్సు చేసాడు. రావణుని తపస్సుకు మెచ్చి బ్రహ్మగారు ఆయనకు వరాలు ఇచ్చారు. 'మనుషులతో తప్ప అతనికి వేరే వారిచేత మరణభయము లేకుండు గాక!' అని వరం ప్రసాదించాడు. మానవులు బలహీనులని, వారంటే రావణునికి చులకన. అందుకని అటువంటి వరము కోరాడు. ఆ వరగర్వంతో రావణుడు ముల్లోకములోని దేవతలను, మునులను, మానవులను బాధించసాగాడు. కేవలము మనుష్యులు తప్ప అతనిని వేరే ఎవరూ చంపలేరు. మామూలు

మనుష్యులకు రావణుని ముందు నిలబడే ధైర్యము లేదు. కాబట్టి తమరు మానవునిగా అవతరించి రావణుని సంహరించాలి." అని వివరంగా చెప్పారు దేవతలు. దశరథునికి కుమారులుగా పుట్టడానికి నిశ్చయించుకొని, విష్ణుమూర్తి అంతర్ధానము అయ్యాడు.

అయోధ్యలో దశరథుడు పుత్రులకొరకు యాగము చేస్తున్నాడు. ఆ హోమ గుండము నుండి తేజోవంతుడైన, మహావీరుడు, మహాబలుడు, నల్లని ఎర్రని వస్త్రములను ధరించిన వాడు, రక్త వర్ణముకల ముఖము కలవాడు, దుందుభి వంటి కంఠధ్వని కలవాడు, సింహము వంటి కేశములు కలవాడు, శుభలక్షణములు కలవాడు, దివ్యమైన ఆభరణములు ధరించిన వాడు, పర్వతశిఖరము మాదిరి ధృఢమైన వాడు, పెద్దపులి వంటి పరాక్రమము కలవాడు, సూర్యుని వంటి తేజస్సుకలవాడు, భగభగమండే అగ్ని శిఖల మాదిరి వెలుగు చున్నవాడు, చేతిలో ఒక బంగారు కలశముతో, దానిమీద ఒక వెండి మూతతో, ఆ బంగారు పాత్ర నిండా పాయసముతో, ఒక భూతాకారము ఆవిర్భవించింది. ఆ భూతమును చూచి దశరధుడు చేతులు జోడించి నమస్కరించాడు.

" ఓమహానుభావా! తమరు ఎవరు? తమరికి నేను ఏమి సేవ చేయగలను." అని ప్రార్థించాడు.

ఆ భూతము దశరధుని చూచి ఇలా పలికింది.

"ఓ దశరధమహారాజా! నన్ను ప్రజాపతి పంపాడు. ఈ పాయస పాత్రను మీకు ఇమ్మన్నాడు. ఇది దేవతలచేత తయారుచేయబడిన

పాయసము. ఈ పాయసము  సంతానమును,  ఆయుష్షును, ఆరోగ్యమును, సంపదలను ప్రసాదిస్తుంది. నీవు పుత్రులను కోరి యాగము చేస్తున్నావు. ఈ పాయస పాత్రను నీ భార్యలకు ఇమ్ము. నీకు పుత్ర సంతానము కలుగుతుంది." అని పలికి ఆ దివ్యమైన పాయస పాత్రను దశరథుడికి ఇచ్చాడు.

దశరథుడు భక్తి శ్రద్ధలతో ఆ పాయస పాత్రను అందుకున్నాడు. తరువాత ఆ భూతమునకు ప్రదక్షిణపూర్వకముగా నమస్కరించాడు. తరువాత ఆ భూతము అంతర్ధానము అయింది.

దశరథుడు సంతోషముతో ఆ పాయస పాత్రను తీసుకొని అంత:పురములో ప్రవేశించాడు.  ఆ పాయసములో సగ భాగము కౌసల్యకు ఇచ్చాడు. మిగిలిన పాయసములో సగభాగం(అనగా నాల్గవ భాగము) సుమిత్రకు ఇచ్చాడు. మిగిలిన పాయసంలో సగం(అనగా ఎనిమిదవ భాగము) కైకకు ఇచ్చాడు. మిగిలిన పాయసం(అనగా మిగిలిపోయిన ఎనిమిదవ భాగము) ఏంచెయ్యాలా అని ఆలోచించి, దానిని  మరలా సుమిత్రకు ఇచ్చాడు.

ఈ ప్రకారంగా ప్రజాపతి ప్రసాదించిన పాయసమును దశరథుడు తన ముగ్గురు భార్యలకు పంచి ఇచ్చాడు. కాని దశరథుని భార్యలు తమకు పాయస పంపకంలో హెచ్చుతగ్గులు వచ్చినందుకు ఏ మాత్రం చింతింపక, పాయసము దొరికి తమకు పుత్రసంతానము కలగడమే మహాభాగ్యం అనుకొని సంతోషించారు.

కాల క్రమేణా కౌసల్య, సుమిత్ర, కైకేయిలు గర్భవతులయ్యారు. ఆ వార్త విని దశరధుడు పరమానంద భరితుడయ్యాడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో  పదహారవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

## పదిహేడవ సర్గ.

ఆ విధంగా విష్ణువు దశరథునికి పుత్రుడుగా జన్మించాలి అని నిర్ణయించుకొన్న తరువాత బ్రహ్మదేవుడు దేవతలందరినీ పిలిచి వారితో ఇలా అన్నాడు.

“ శ్రీ మహావిష్ణువు రావణాసురుని సంహరించడానికి  మానవ రూపంలో జన్మించబోతున్నాడు. మీరంతా ఆయనకు సాయంగా వెళ్లాలి. మీ మీ అంశలతో కామరూపులు, అత్యధిక బలవంతులు అయిన పుత్రులను సృష్టించండి. వారికి అన్ని మాయలు తెలిసి ఉండాలి. వారు శూరులు గానూ, వాయువేగముతో ప్రయాణించగలవారు గానూ అయి ఉండాలి. విష్ణువుతో సరి తూగ గల పరాక్రమ వంతులు అయి ఉండాలి. అదే కాకుండా నీతి మంతులు అయి ఉండాలి. వారు ఎవరి చేత గానీ, ఏ ఆయుధము చేత గానీ చంపబడకూడదు. సర్వ అస్త్ర సంపన్నులు అయి ఉండాలి.  అటువంటి వారిని మీరందరూ అప్సరసల యందు, గంధర్వ స్త్రీలయందు సృష్టించండి. వారందరూ వానరులు అయి ఉండాలి.  ఇంతకు ముందే జాంబవంతుడు అనే ఋక్ష శ్రేష్టుడు (ఎలుగుబంటి) నేను ఆవలించి నపుడు నా ముఖము నుండి పుట్టాడు. వీరందరూ ఆ జాంబవంతునికి తోడుగా ఉంటారు.” అని పలికాడు.

బ్రహ్మదేవుని ఆజ్ఞ ప్రకారము దేవతలు అందరూ తమ తమ అంశలతో వానరులను సృష్టించారు.

దేవేంద్రుని అంశతో వాలి జన్మించాడు.

సూర్యుని అంశతో సుగ్రీవుడు జన్మించాడు.

బ్రహస్పతి అంశతో తారుడు అనే వానరుడు జన్మించాడు.

కుబేరుని అంశతో గంధమాధనుడు అనే వానరుడు పుట్టాడు.

అగ్ని అంశతో నీలుడు, అశ్వినీ దేవతల అంశలతో  మైందుడు, ద్వివిదుడు, వరుణుని అంశతో సుషేణుడు, పర్జన్యుని అంశతో శరభుడు, వాయుదేవునికి హనుమంతుడు,  ఇంకా అనేకానేక దేవతల అంశలతో లక్షల కొద్దీ వారనులు సృజింపబడ్డారు.

వారందరూ కామరూపులు, బలశాలురు. ఆ వానరులు ఏ దేవతల అంశలతో జన్మించారో ఆ వానరులకు ఆయా దేవతల  శక్తులు, బలపరాక్రమములు సంక్రమించాయి. ఆ వానరులందరూ యుద్ధ విద్యలో కౌశలము కలవారు. వారి ఆయుధములు శిలలు, వృక్షములు, వారి గోళ్లు,  దంతములు. వారందర ఋక్షవత పర్వతము మీద నివసిస్తున్నారు.

ఆ వానరులందరూ తమ తమ నాయకులుగా  వాలి, సుగ్రీవుడు, నలుడు, నీలుడు, హనుమంతుడు మొదలగు వారిని సేవిస్తున్నారు.

అమిత బలశాలి అయిన వాలి తన బాహు బలముతో వానరులందరినీ రక్షిస్తున్నాడు. ఆ వానరులు ఈ భూమి అంతా ఆక్రమించి ఉన్నారు. ఆ వానరులందరూ శ్రీ రామునికి సహాయము చేయుటకు సృష్టింప బడ్డారు.

ఇది వాల్మీకి విరచిత
రామాయణ మహాకావ్యములో
బాలకాండలో  పదిహేడవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### పదునెనిమిదవ సర్గ.

దశరథుడు తలపెట్టిన అశ్వమేధ యాగము, పుత్రుల కొరకు చేసిన యాగము పూర్తి అయ్యాయి. తమ తమ హవిర్భాగములను తీసుకొని దేవతలు తమ తమ స్థానములకు వెళ్లిపోయారు. పత్నీ సమేతంగా అయోధ్యా నగరంలో ప్రవేశించాడు. తరువాత ఋష్య శృంగుడు తన భార్య శాంతతోనూ, రోమపాదుని తోనూ అంగదేశము నకు వెళ్లిపోయాడు. అందరూ తమ తమ స్థానములకు వెళ్లిపోయిన తరువాత దశరథుడు పుత్రోదయం కొరకు ఎదురు చూస్తున్నాడు.

యజ్ఞము పూర్తి అయి ఒక సంవత్సరము గడిచింది. మరలా చైత్రమాసము వచ్చింది. వసంత ఋతువులో, చైత్రమాసములో, పునర్వసు నక్షత్రము నాడు, నవమి తిథి యందు, ఐదు గ్రహములు ఉచ్ఛ స్థానములో ఉండగా, కర్కాటక లగ్నమందు, కౌసల్యాదేవి గర్భవాసమున, సర్వలక్షణ సమన్వితుడు, సకల లోకములచే పూజింప తగినవాడు, విష్ణువు యొక్క ప్రథమ అంశ ఐన వాడు, మహాభాగుడు, ఇక్ష్వాకు వంశ వర్ధనుడు అయిన రాముడు జన్మించాడు.

విష్ణువులో నాల్గవభాగము అయిన వాడు, సత్యవంతుడు, పరాక్రమ వంతుడు, సకల సద్గుణ సంపన్నుడు  అగు భరతుడు పుష్యమీ నక్షత్రంలో మీన లగ్నంలో   కైకేయీ గర్భ వాసమున జన్మించాడు.

సర్వ అస్త్ర కుశలురు, వీరులు, విష్ణువులో నాలుగవ వంతు అంశ కలవారు అయిన లక్ష్మణ శత్రుఘ్నులు ఆశ్లేషా నక్షత్రంలో, కర్కాటక లగ్నంలో    సుమిత్రా గర్భ వాసాన జన్మించారు.

ఆ ప్రకారంగా దశరథునకు ముగ్గురు భార్యల యందు నలుగురు కుమారులు జన్మించారు.  ఆ సమయంలో గంధర్వులు గానం చేసారు. దేవ దుందుభులు మోగాయి. అయోధ్యలో సంబరాలు మిన్నుముట్టాయి. దశరథుడు ఎన్నో దాన ధర్మాలు చేసాడు. పారితోషికాలు ఇచ్చాడు.

పదకొండవ రోజున నామకరణ మహోత్సవము జరిగింది. జ్యేష్ఠ పుత్రునకు రాముడు అనీ, తరువాత పుట్టిన కైకేయి సుతునకు భరతుడు అనీ, తరువాత పుట్టిన సుమిత్రా నందనులకు లక్ష్మణుడు, శత్రుఘ్నుడు అనీ కుల గురువు, పురోహితుడు అయిన వసిష్టుడు నామకరణం చేసాడు. ఆ నామకరణ సందర్భంలో దశరథుడు బ్రాహ్మణులకు, అయోధ్యా పౌరులకు, జానపదులకు, సంతర్పణలు చేసాడు. వారికి ఎన్నో కానుకలు, దక్షిణలు  ఇచ్చాడు.

తరువాత దశరథుడు తన కుమారులకు నామకరణము తరువాత జరిగే అన్ని సంస్కారములు యధావిధిగా అత్యంత వైభవంగా

జరిపించాడు.

దశరథుని కుమారులందరిలోకి రాముడు చుక్కల్లో చంద్రుని వలె దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. రాకుమారులందరూ అన్ని విద్యలు అవలీలగా నేర్చుకుంటున్నారు. రాముడు గజములు, అశ్వములు, రథముల మీద ఎక్కియుద్ధము చేయుటలో నేర్పు సంపాదించాడు. రాముడు ధనుర్వేదము నందు ఎక్కువ ఆసక్తి చూపించేవాడు.అలాగే తండ్రి ఎడల ఎనలేని భక్తి శ్రద్ధలు చూపేవాడు. తండ్రికి సేవ చెయ్యడంలో ఎంతో ఆసక్తి కనపరిచేవాడు రాముడు.

రాముడు ఇలా ఉంటే లక్ష్మణుడికి అన్న రాముడు అంటే ఎనలేని ప్రేమ. రాముని విడిచి పెట్టి క్షణం కూడా ఉండే వాడు కాదు. చూచేవాళ్లకు ఇద్దరి శరీరములు వేరు కానీ, ప్రాణము ఒకటే అన్నట్టు ఉండేవాళ్లు. అలాగే రాముడు కూడా లక్ష్మణుని చూడంది ఒక్క క్షణం కూడా ఉండలేడు. రాత్రిళ్లు కూడా లక్ష్మణుడు పక్కన లేనిది నిద్రపోయేవాడు కాదు. ఆహార, నిద్రా, విహారలలో రాముడు లక్ష్మణుని విడిచి ఉండేవాడు కాదు. రాముడు వేటకు వెళితే లక్ష్మణుడు ధనుస్సు చేత పట్టుకొని అన్న వెంట రక్షణగా వెళ్లేవాడు.

రామ లక్ష్మణులు ఇలా ఉంటే, భరత శత్రుఘ్నులు కూడా ఒకరిని విడిచి ఒకరు ఉండలేకపోయేవారు. ఒకరి మీద ఒకరు ప్రేమానురాగాలు కలిగిన నలుగురు కుమారులను చూచుకొని దశరథుడు పొంగిపోయేవాడు. నా కన్న అదృష్టవంతుడు ముల్లోకాలలో లేడని సంబరపడిపోయేవాడు దశరథుడు.

ఇంతలో రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు వివాహ వయస్సు వచ్చింది. నలుగురికీ వివాహములు చేయవలెనని సంకల్పించాడు దశరథుడు. పురోహితులతోనూ, బంధుమిత్రులతోనూ ఆలోచిస్తున్నాడు.

ఇది ఇలా ఉండగా, ఒక రోజు విశ్వామిత్ర మహర్షి దశరథుని వద్దకు వచ్చాడు. విశ్వామిత్ర మహర్షి రాకను తెలుసుకొన్న దశరథుడు తన భార్యలతో సహా ఆయనకు ఎదురు వెళ్లి ఆయనను సాదరంగా ఆహ్వానించాడు. అర్ఘ్య పాద్యములు ఇచ్చి సత్కరించాడు. ఉచితాసనము మీద ఆసీనుని చేసాడు.

“ఓ దశరథ మహారాజా! నీ రాజ్యములో ప్రజలందరూ క్షేమమే కదా! నీ మిత్రులు బంధువులు క్షేమంగా ఉన్నారు కదా! నీ ధనాగారము సమృద్ధిగా ఉన్నదా! నీ సామంత రాజులు నీకు అణిగి మణిగి ఉన్నారు కదా! నీకు శత్రుభయము లేదు కదా! నీవు దేవతలకు ప్రీతిగా యజ్ఞ యాగములు చేయుచున్నావా! ” అని అడిగాడు. తరువాత దశరథుని ఆస్థానములో ఉన్న వసిష్టుని మిగిలిన ఋషులను కుశల ప్రశ్నలు వేసాడు. అందరి క్షేమ సమాచారములు తెలుసుకొన్నాడు విశ్వామిత్రుడు.

“ ఓ విశ్వామిత్ర మహర్షీ! నీరాకతో మా మందిరము పావనమైనది. తమరి దయ వలన అందరమూ క్షేమముగా ఉన్నాము. తమరు రాజర్షులు, బ్రహ్మర్షులు. మాకు అత్యంత పూజనీయులు. తమరి రాకకు కారణమేమి! సెలవివ్వండి! అది ఎంతటి క్లిష్టతరమైన కార్యము అయినను నెరవేరుస్తాను. ఎందుకంటే తమరు నాకు దైవ సమానులు.” అని వినయంగా అడిగాడు దశరథుడు.

దశరథుడు పలికిన మాటలు వినిన విశ్వామిత్రుడు ఎంతో సంతోషించాడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో **పదునెనిమిదవ** సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

# బాలకాండ

## పందొమ్మిదవ సర్గ.

దశరథుని చూచి విశ్వామిత్రుడు ఇలా అన్నాడు.

" ఓ దశరథ మహారాజా! ఇక్ష్వాకు వంశంలో పుట్టి, వసిష్ఠుని పురోహితుని గా గల నీవు ఇంతటి వినయ విధేయతలతో మాట్లాడటం సమంజసముగా ఉంది. నేను ఏమి కోరినా నెరవేరుస్తాను అన్నావు. నేను వచ్చిన కార్యము చెబుతాను. జాగ్రత్తగా విను. విన్న తరువాత నీ మాట నిలబెట్టుకో. నేను ఒక సిద్ధికొరకు ప్రయత్నిస్తున్నాను. దానికి కొన్ని నియమాలు అవలంబిస్తున్నాను. కాని ఆ నియమాలకు మారీచుడు, సుబాహుడు అనే ఇద్దరు రాక్షసులు అవరోధము కలిగిస్తున్నారు. నేను పూనిన వ్రతము సమాప్తి అయ్యే కాలములో ఆ రాక్షసులు యజ్ఞవేదిక మీద రక్తమును మాంసమును పడవేసి అపవిత్రము చేస్తున్నారు. ఆ ప్రకారంగా ఆ వ్రతము చెడిపోయింది. అందువల్ల నిరాశతో నీ వద్దకు వచ్చాను. నేను ఆ రాక్షసులను కట్టడి చేయగలను. కానీ వ్రత సమయములో కోపము తెచ్చుకోకూడదు. శపించకూడదు. ఆ కారణం చేత నాకు ఒక వీరుడి అవసరం వచ్చింది. నీ కుమారుడు, మహావీరుడు అయిన రాముని నాకు ఇమ్ము. రాముడు ఆ రాక్షసులను సంహరించడానికి సమర్థుడు. రాముడు ఆ రాక్షసులను

సంహరించి ముల్లోకములలో కీర్తివంతుడౌతాడు. ఆ మారీచ సుబాహులను రాముడు తప్ప వేరెవ్వరూ చంపలేరు. నీవు పుత్ర వ్యామోహముతో వెనకాడకుము. నీ రాముని కి ఏం అపకారము కలగకుండా నీకు అప్పచెబుతాను.

ఓ దశరథ మహారాజా! రాముని గురించి నీకన్నా నాకు వసిష్ఠునకు మాత్రమే ఎక్కువగా తెలుసు. నీకు, నీ కుమారుడు రాముడు సామాన్యుడు గా కనపడుతున్నాడు. కాని రాముని అసలు స్వరూపము మా వంటి తపశ్శాలులకు మాత్రమే తెలుసు. ఓ రాజా! నీవు ధర్మాత్ముడవైతే, నీ రాముని కీర్తి ముల్లోకములకు తెలియవలెనంటే రాముని నా వెంట పంపు. నీ పురోహితుడు వసిష్ఠుని, మంత్రులను సంప్రదించి రాముని నా వెంట పంపు. కాని తొందరగా పంపు. ఎందుకంటే నా యాగము పదిదినములు జరుగుతుంది. ఆ పది దినములు రాముడు నా వెంట ఉండాలి. కాబట్టి సమయము మించి పోకుండా ఒక నిర్ణయము తీసుకో. నీకు క్షేమం కలుగుతుంది." అని పలికాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుడు రాక్షసులను చంపడానికి రాముని పంపు అన్న మాట విన్నప్పటి నుండి దశరథుడు శోకంతో కుమిలిపోతున్నాడు. విశ్వామిత్రుని మాటలు దశరథునికి పిడుగుపాటు లాగా తగిలాయి. సింహాసనము మీద కూర్చోలేకపోయాడు దశరథుడు.

ఇది వాల్మీకి విరచిత రామాయణ మహాకావ్యములో

బాలకాండలో **పందొమ్మిదవ** సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

ఇరవయ్యవ సర్గ.

దశరథుడు విశ్వామిత్రునితో దు:ఖముతో కూడిన గద్గద స్వరంతో ఇలా అన్నాడు.

"ఓ మునీశ్వరా! నా రాముడు పదహారు సంవత్సరములు కూడా నిండని బాలుడు. రామునికి రాక్షసులతో యుద్ధము చేయగల శక్తి పరాక్రమములు ఉన్నవి అని నేను అనుకోడం లేదు. నా వద్ద ఒక అక్షౌహిణి సైన్యము ఉంది. నేను దానికి అధిపతిని. నేను నా సైన్యముతో వెళ్లి ఆ రాక్షసులను హతమారుస్తాను. నాకు అనుజ్ఞ ఇవ్వండి. నేను ధనుర్ధారినై నా శరీరంలో ప్రాణములు ఉన్నంత వరకూ యాగ సంరక్షణ చేస్తాను.

ఈ పనికి రాముడు అనవసరం కదా మునీంద్రా! ఎందుకంటే రాముడు వయసులో చిన్నవాడు. యుద్ధ తంత్రములు తెలియని వాడు. ఇంకా యుద్ధ విద్యలు పూర్తి గానేర్వని వాడు. అందులోనూ మాయావులైన రాక్షసులతో యుద్ధం చేయడం రామునికి చేత కాదు.

ఓ మునీంద్రా! రాముడు నాకు ప్రాణంతో సమానం. రాముడు లేనిది నేను జీవించలేను. రాముని నా నుండి వేరు చేయకండి.

కావాలంటే నన్ను నా సైన్యమును తీసుకొని వెళ్లండి. రాముడు నా పెద్దకుమారుడు. చాలాకాలం తరువాత కలిగిన పుత్ర సంతానము. రాముని నేను పంపలేను.

ఇంతకూ మునీంద్రా! ఆ రాక్షసులు ఎవరు? ఎక్కడి వారు? ఎవరి కుమారులు? వారి పరాక్రమమేమి? వారికి అండగా ఎవరు ఉన్నారు? వారిని ఎలా ఎదుర్కోవాలి?" అని వినయంగా అడిగాడు దశరథుడు. దానికి విశ్వామిత్రుడు ఇలా అన్నాడు.

"ఓ దశరథమహారాజా! పౌలస్త్య వంశంలో పుట్టిన వాడు, విశ్రవసుని కుమారుడు, కుబేరుని సోదరుడు అయిన రావణుడు అనే రాక్షస అంశ కలవాడు ఉన్నాడు. వాడు మహా బలవంతుడు. వీర్య వంతుడు. బ్రహ్మ చేత వరములు పొందిన వాడు. లెక్కలేనన్ని రాక్షస సైన్యము కలవాడు. బ్రహ్మ ఇచ్చిన వరములతో గర్వించి ముల్లోకముల లోని వారిని బాధిస్తున్నాడు. మారీచుడు, సుబాహుడు అనే వారు రావణుని సహచరులు. వారే ఇప్పుడు నేను చేయు యాగమునకు విఘ్నము కలుగ చేస్తున్నారు." అని చెప్పాడు విశ్వామిత్రుడు.

ఆ మాటలు విన్న దశరథుడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! మీరు చెప్పినదానిని బట్టి చూస్తుంటే నేను ఆ రాక్షసుల ముందు నిలువ లేను అని అనుకుంటున్నాను. అటువంటప్పుడు నా చిన్ని రాముడు వారిని ఎదిరించగలడా! తమరు చెప్పినట్టు దేవ, దానవ, గంధర్వులే రావణునికి ఎదురు నిలువ లేనపుడు మానవులము మేమెంత! కాబట్టి నేను గానీ నా కుమారులు

గానీ ఆ రాక్షసులతో యుద్ధ చేయలేము. నా కుమారుడు రాముడు నన్ను పున్నామ నరకమునుండి రక్షించే వాడు. అతనిని తమరి వెంట రాక్షసులతో యుద్ధమునకు పంపలేను. సాక్షాత్తు యమునితో సమానమైన ఆ మారీచ సుబాహులను రాముడు ఎదుర్కొనలేడు. నేను వచ్చినా వారిలో ఒకరితో మాత్రమే యుద్ధము చేయగలను. ఈ సారికి మమ్ములను మన్నించి వదిలివేయండి.” అని ప్రార్థించాడు దశరథుడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో ఇరవయ్యవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

## ఇరవై ఒకటవ   సర్గ.

ఎప్పుడైతే దశరథుడు రాముని యాగ సంరక్షణార్థము విశ్వామిత్రుని వెంట పంపను అని అన్నాడో, విశ్వామిత్రుడు ఆగ్రహోదగ్రుడు అయ్యాడు. ఆయన కోపం తారస్థాయి కి చేరుకుంది.

"దశరథా! ఇక్ష్వాకుల వంశములో జన్మించిన నీవు  ఆడిన మాట తప్పావు. ఇది రఘు వంశము వారికి ఉచితము కాదు. ఆడిన మాటను తప్పడం నీకు ఉచితము అని తోస్తే నేను వచ్చిన దారినే వెళ్లిపోతాను.  ఇచ్చిన మాటను తప్పిన నీవు నీ భార్యాబిడ్డలతో సుఖంగాఉండు." అనిఅన్నాడు విశ్వామిత్రుడు కోపంగా.

విశ్వామిత్రునికి కోపం వచ్చింది అని తెలుసుకున్నాడు పురోహితుడు, కులగురువు వసిష్టుడు. వెంటనే లేచాడు. దశరథుని వద్దకు వచ్చి ఇలా అన్నాడు.

"ఓ దశరథ మహారాజా! నీవు ఇక్ష్వాకు వంశంలో పుట్టావు. ధర్మ సంస్థాపనకు కంకణము కట్టుకున్నావు. మంచి ధైర్యవంతుడివి. అటువంటి నీవు  ఈ మాదిరి పుత్ర వ్యామోహంతో ధర్మము తప్పి ఆడిన మాట తప్పడం తగునా! నీవు నీ ధర్మమును ఆచరించి. అధర్మమును

విడిచిపెట్టు. ఆడిన మాట తప్పడం అంటే నీవు ఇప్పటి దాకా సంపాదించుకున్న పుణ్యమును నశింపచేసుకోవడమే. కాబట్టి నీవు ఇచ్చిన మాట ప్రకారము రాముని విశ్వామిత్రుని వెంట పంపు.

ఓ దశరథ మహారాజా! నా మాట విను. విశ్వామిత్రుడు వెంట ఉంటే నీ రామునికి వచ్చిన భయం ఏమీ లేదు. ఎందుకంటే విశ్వామిత్రునికి తెలియని అస్త్ర శస్త్రములు ఏమీ లేవు. ఆయనకు తెలిసిన అస్త్ర శస్త్రములు దేవతలకు, రాక్షసులకు, గంధర్వులకు ఎవరికీ తెలియవు. పూర్వము భృశాశ్వసుడు తనకు తెలిసిన అస్త్ర శస్త్రములు అన్నీ విశ్వామిత్రునికి ఇచ్చాడు.ఆ అస్త్రములు సామాన్యమైనవి కావు. అవి భృశాశ్వసునకు దక్షప్రజాపతి కుమార్తెలకు జన్మించిన అస్త్రములు. అవి గొప్ప పరాక్రమము, శక్తి కలవి.

పూర్వము దక్షప్రజాపతి కుమార్తె జయ అను ఆమె రాక్షసులను సంహరించుటకు యాభై మంది పుత్రులను కన్నది. వారు కామ రూపులు, మహాబలురు. పరాక్రమవంతులు. వారే ఇప్పుడు అస్త్ర రూపములలో విశ్వామిత్రుని వద్ద ఉన్నారు. అవే కాదు ఈ విశ్వామిత్రుడు కొత్త కొత్త అస్త్రములను సృష్టించుటలో కూడా సమర్థుడు. అటువంటి మహాపురుషుని వెంట రాముని పంపుటకు ఎందుకు సందేహిస్తావు?

నీకు ఇంకో విషయం తెలుసా! ఆ రాక్షసులను చంపడానికి విశ్వామిత్రునకు ఒక క్షణం కూడా పట్టదు. కాని నీకు నీ కుమారులకు పేరు ప్రతిష్ఠలు తీసుకు రావడానికే నీ దగ్గరకు వచ్చి నీ కుమారుడు రాముని పంపమని అర్థిస్తున్నాడు. ఈ విషయం  నీవు అర్థం చేసుకొని

రాముని విశ్వామిత్రుని వెంట పంపు." అని పలికాడు.

కులగురువు వసిష్టుని మాటలకు ప్రసన్నుడయ్యాడు దశరథుడు. రాముని విశ్వామిత్రుని వెంట పంపుటకు అంగీకరించాడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో **ఇరవై ఒకటవ** సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

ఇరవై రెండవసర్గ.

వసిష్ఠుని మాటలకు ఎంతో సంతోషించాడు దశరథుడు. వెంటనే స్వయంగా వెళ్లి రాముని, రాముని వెంట లక్ష్మణుని  సభా భవనము నకు తీసుకొని వచ్చాడు.  కౌసల్య, సుమిత్ర, దశరథుడు కలిసి రామునికి లక్ష్మణునికి మంగళాచరణము చేసారు. తమ పుత్రులను ప్రియమారా ముద్దులు పెట్టుకున్నారు. దశరథుడు రాముని, లక్ష్మణుని విశ్వామిత్రుని చేతిలో పెట్టాడు. రాముడు, లక్ష్మణుడు  వెంట నడువగా, విశ్వామిత్రుడు సభాభవనము నుండి బయలుదేరాడు.

ముందు విశ్వామిత్రుడు నడుస్తున్నాడు, ఆయన వెనుక కోదండము చేతబూని  కోదండ రాముడు, రాముని వెనుక ధనుర్ధారియైన లక్ష్మణుడు నడుస్తున్నారు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో సహా ఒకటిన్నర యోజనములు నడిచాడు. వారందరూ  సరయూ నదికి దక్షిణ ప్రాంతమునకు చేరుకున్నారు.

అప్పుడు విశ్వామిత్రుడు రాముని "రామా!" అంటూ ప్రేమగా పిలిచాడు.రాముడు విశ్వామిత్రుని దగ్గరగా వచ్చాడు.

"రామా! నీవు  ఆచమనము చేసి నా దగ్గరకు రా!  నీకు బల,

అతిబల అనే విద్యలను ఉపదేశిస్తాను. ఈ విద్యలను నీవు నేర్చుకుంటే నీకు ఆకలి, దప్పిక, శ్రమ, జ్వరము, ఉండవు,. నిన్ను ఎలాంటి రాక్షసులు కూడా ఏమీ చేయలేరు. రామా! నీవు ఈ విద్యలు నేర్చుకుంటే నీ తో సమానమైన వీరుడు, పరాక్రమ వంతుడు ముల్లోకములలో ఉండడు.

రామా! సౌభాగ్యమునందు గానీ, సామర్థ్యము నందు గానీ, జ్ఞానము నందు గానీ, బుద్ధి యందు గానీ, నీతో సమానమైన వాడు ముల్లోకములలో లేడు. దానికి తోడు నీవు ఈ బల, అతిబల అనే విద్యలు నేర్చుకుంటే, నీతో సమానమైన వాడు వర్తమానములో గానీ, భవిష్యత్తులో గాని ఉండడు, ఉండబోడు. ఈ విద్యలు బ్రహ్మదేవునిచే సృష్టింపబడినవి, వాటిని అభ్యసించుటకు నీవే తగినవాడవు." అని పలికాడు విశ్వామిత్రుడు.

ఆ మాటలను సావధానంగా విన్న రాముడు వెంటనే ఆచమనము చేసి విశ్వామిత్రుని ముందు కూర్చున్నాడు. నిశ్చలమైన మనస్సుతో రాముడు విశ్వామిత్రుని వద్దనుండి బల, అతిబల అనే విద్యలను స్వీకరించాడు. ఆ రోజు రాత్రి విశ్వామిత్రుడు, రామలక్ష్మణులతో కలిసి సరయూ తీరమున విశ్రమించాడు. అంతకు ముందు అలవాటు లేని దర్భ చాపలపై పడుకొనుటకు రామ లక్ష్మణులు కొంచెం ఇబ్బంది పడ్డారు. కాని విశ్వామిత్రుడు వారిని బుజ్జగించి పడుకోబెట్టాడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో **ఇరవై రెండవ** సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

ఇరవై మూడవసర్గ.

మరునాడు సూర్యోదయం కాబోతున్నది. సూర్యోదయానికి ముందు విశ్వామిత్రుడు రామ లక్ష్మణులను తన మృదుమధురమైన మాటలతో నిద్రలేపాడు.

కౌసల్యా సుప్రజా రామ పూర్వా సన్ధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్॥

కౌసల్య గర్భవాసాన జన్మించిన ఉత్తమ పుత్రుడవైన ఓ రామా! ప్రాత: కాల సంధ్యకు సమయము ఆసన్నమైనది. ఓ రామా! నిద్ర లే! ప్రాత:కాల కృత్యములు. సంధ్యావందనాది కార్యక్రములు నీవు చేయవలసి ఉన్నది.

(పైశ్లోకము అందరికీ శ్రీ వేంకటేశ్వరసుప్రభాతములో మొదటి శ్లోకంగానే తెలుసు. ఆ శ్లోకము మూలం వాల్మీకి రామాయణంలో ఉందని కొద్దిమందికి మాత్రమేతెలుసు. అందుకే ఈ శ్లోకమును ఇక్క యధాతథంగా రాసాను).

విశ్వామిత్రుని మాటలు విన్న రామ లక్ష్మణులు వెంటనే నిద్ర లేచారు. కాలకృత్యములు తీర్చుకొన్నారు. స్నానము, సంధ్యావందనము ఆచరించారు. సూర్యునికి అర్ఘ్యము ఇచ్చారు. గాయత్రీ మంత్రము పఠించారు.  తరువాత ముగ్గురూ తమ ప్రయాణము కొనసాగించారు.

వారు సరయూనదీ గంగానదిలో కలిసే సంగమస్థానము చేరుకున్నారు. ఆ ప్రదేశంలో ఉన్న  పురాతనమైన ముని ఆశ్రమములను చూచారు.   ఆ ఆశ్రమములను చూచిన రామలక్ష్మణులు  "ఓ మహర్షీ! ఈ ఆశ్రమములు ఎవరివి?' ఈ ఆశ్రమములలో ఎవరుఉంటారు?". అని అడిగారు.

దానికి విశ్వామిత్రుడు ఇలా సమాధానము చెప్పాడు. "ఓ రామా! ప్రస్తుతము మన్మధుడు దేహము లేకుండా అనంగుడిగా ఉన్నాడు కానీ, పూర్వము మన్మధుడు దేహము కలవాడు.  మన్మధునికి కాముడు అని పేరు.  పూర్వము  శివుడు ఈ ప్రదేశములో తపస్సు చేసుకునేవాడు. తరువాత శివుడు వివాహం చేసుకొని వెళ్లిపోయాడు. . అటువంటి శివుని మన్మథుడు ఎదిరించాడు. అప్పుడు శివుడు హుంకరించి, మన్మధుని వంక కోపంగా చూచాడు. శివుని కోపాగ్నికి మన్మధుడు భస్మము అయిపోయాడు. మన్మధుని శరీర అవయవములు అన్ని చోట్లా చెల్లాచెదరుగా పడిపోయాయి. అప్పుడు మన్మధుడు శరీరం లేనివాడు అయ్యాడు.

పూర్వము పరమశివుడు తపస్సు చేసిన ఆశ్రమము ఇదే. ఇప్పుడు ఇక్కడ ఉన్న  ఋషులు అందరూ పూర్వము పరమశివునికి శిష్యులుగాఉండేవారు. వారే ఇప్పటికీ తపస్సు చేసుకుంటూ

ఉన్నారు. వీరు ధర్మపరులు. వీరికి పాపం అటే ఏమిటో తెలియదు. మనము ఈ రాత్రికి ఇక్కడే ఉండి రేపుఉదయము మన ప్రయాణము కొనసాగిద్దాము. మనము ఇప్పుడు స్నానము, సంధ్య ఆచరించి, శుచులై ఈ ఆశ్రమములలోని ప్రవేశిద్దాము" అని అన్నాడు విశ్వామిత్రుడు.

వీరు ఈ ప్రకారము మాట్లాడుకుంటూ ఉండగా, ఆ ఆశ్రమములలో ఉన్న ఋషులు వీరి రాకను చూచి ఎంతో ఆనందించారు. రామలక్ష్మణులను విశ్వామిత్రుని సాదరంగా ఆహ్వానిచి సత్కరించారు. తరువాత ఆ ఋషులు సాయంసంధ్యాసమయంలో చేయ వలసిన సంధ్యావందనము, గాయత్రీజపము కార్యములు ఏకాగ్రచిత్తంతో చేసారు.

ఆ రాత్రికి విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు ఆ ఆశ్రమములో నిద్రించారు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు మార్గాయాసము తెలియకుండా అనేక పుణ్య కథలను చెప్పి ఆనందింపచేస్తూ ఉన్నాడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో **ఇరవై మూడవ** సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

ఇరవై నాల్గవసర్గ.

మరునాడు ఉదయమే రామ లక్ష్మణులు, విశ్వామిత్రుడు ప్రాత: కాలము లో చేయవలసిన సంధ్యావందనాది కార్యక్రములు ముగించుకొని ప్రయాణము సాగించారు. గంగానదీ తీరమునకు వచ్చారు.

అక్కడ ఉన్న మునులు విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు నదిని దాటడానికి ఒక నావను తీసుకొని వచ్చారు. విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు ఆ నావను ఎక్కి గంగా నదిని దాటుతుండగా నది మధ్యలో నీరు బ్రద్దలగుతున్నట్టు పెద్దగా శబ్దం వచ్చింది. "మహర్షీ! ఆ శబ్దము ఏమిటి?" అని రామ లక్ష్మణులు విశ్వామిత్రుని అడిగారు. దాని గురించి విశ్వామిత్రుడు ఇలా చెప్పాడు.

" ఓ రామా! పూర్వము బ్రహ్మ దేవుడు తన సంకల్ప మాత్రం చేత హిమాచలము మీద ఒక సరస్సును నిర్మించాడు. దానికి మానస సరోవరము అని పేరు. ఆ సరస్సులో నుండి ఒక నది పుట్టింది. దాని పేరు సరయూ నది. ఆ సరయూ నది అయోధ్య మీదుగా ప్రవహిస్తూ ఉన్నది. ఆ సరయూ నది మానస సరోవరమునుండి పుట్టుటచే

పవిత్రమైనది. ఆ సరయూ నది ఈ ప్రదేశములో గంగానదిలో కలియుచున్నది.  ఆ రెండు నదుల సంగమము  వలననే ఈ ధ్వని పుట్టింది.” అని చెప్పాడు విశ్వామిత్రుడు.

రామ లక్ష్మణులు ఆ నదులకు భక్తితో నమస్కరించారు. తరువాత వారు గంగానది ఆవల ఒడ్డుకు చేరుకున్నారు. త్వర త్వరగా ప్రయాణము చేస్తున్నారు. మార్గ మధ్యంలో వారికి ఒక మానవ సంచారము లేని నిర్జనమైన అడవి కనపడింది.  ఆ అడవి చాలా భయంకరంగా లోపలకు పోవడానికి వీలులేకుండా ఉంది.  ఆ అడవిలో అనేక క్రూర   జంతువులు సంచరిస్తున్నట్టు వాటి అరుపులు వినిపిస్తున్నాయి.  ఆ వనము గురించి చెప్పమని రామలక్ష్మణులు అడిగారు. అప్పుడు విశ్వామిత్రుడు ఇలా చెప్పసాగాడు.

“ ఓ రామలక్ష్మణులారా! పూర్వము   ఈ ప్రదేశములో రెండు రాజ్యములు ఉండేవి. ఇంద్రుడు  వృ త్రా సురుని సంహరించాడు. దాని వలన ఇంద్రునికి బ్రహ్మ హత్యా పాతకము చుట్టుకుంది.   ఆ పాతకము వలన ఇంద్రునికి  ఆకలి వేయసాగింది. అప్పుడు దేవతలు, ఋషులు దేవేంద్రునికి   మంత్రించిన నీటితో స్నానం చేయించారు. దేవేంద్రుడు తనకు అంటుకున్న ఆకలిని,  బ్రహ్మ హత్య వలన కలిగిన మయలను ఈ ప్రదేశంలో వదిలిపెట్టాడు.  అప్పుడు ఇంద్రుడు శుచి అయినాడు.

ఇంద్రుడు ఈ రెండు దేశములు మలదము కరూశము అనే పేర్లతో  పిలువ బడుతాయి అని వరం ఇచ్చాడు. అప్పటి నుండి ఈ రెండు దేశములు ధనధాన్యములతో  కళ కళ లాడుతున్నాయి.

కొంత కాలము తర్వాత ఒక యక్షిణి ఇక్కడకు వచ్చింది. ఆ యక్షిణి మహా బలశాలి. ఆ యక్షిణి సుందు అనే రాక్షసుని భార్య.. ఆమె కుమారుడే మారీచుడు అనే రాక్షసుడు. ఆ మారీచుడు గొప్ప బలవంతుడు. మాయావి. ఎల్లప్పుడూ ప్రజలను బాధిస్తూ ఉండేవాడు.

తాటక అనే రాక్షసి ఈ రెండు దేశములను నాశనం చేసింది. ఇలా అరణ్యములుగా మార్చింది. ఆ అరణ్యములలో తన నివాసము ఏర్పరచు కున్నది. అందుకే దీనిని తాటక వనము అని అంటారు. ఈ అరణ్యము లోనికి ఎవరూ పోవడానికి సాహసించరు. ఇప్పుడు నువ్వు ఆ తాటక అనే రాక్షసిని సంహరించాలి. అది ఈ రెండు రాజ్యములను సర్వ నాశనము చేసింది. దానిని చంపితే గానీ ఇక్కడి మానవులు సుఖంగా జీవించలేరు." అని విశ్వామిత్రుడు రాముడితో ఆ తాటక వృత్తాంతము వివరంగా చెప్పాడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో **ఇరవై నాల్గవ** సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ఇరవై ఐదవ సర్గ.

విశ్వామిత్రుని మాటలు శ్రద్ధగా విన్న రాముడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు.

" ఓ మునిపుంగవా! సాధారణంగా యక్షులు తక్కువ బలం కలవారు అంటారు కదా. యక్షిణి అయిన తాటకకు అంత బలం, వీరత్వము ఎలా వచ్చింది." అని అడిగాడు.

దానికి విశ్వామిత్రుడు ఇలా చెప్పాడు. "ఓ రామా! పూర్వము సుకేతుడు అనే బలవంతుడు అయిన యక్షుడు ఉండేవాడు. అతనికి సంతానము లేదు. సంతానము కొరకు అతడు బ్రహ్మదేవుని గురించి ఘోరమైన తపస్సు చేసాడు. సుకేతుడికి బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయ్యాడు. ఏమి వరము కావాలో కోరుకో అని అడిగాడు. ఆ యక్షుడు సంతానము కావాలి అని అడిగాడు. బ్రహ్మదేవుడు వేయి ఏనుగుల బలవంతురాలైన కుమార్తెను ప్రసాదించాడు కాని పుత్ర సంతానము మాత్రము ఇవ్వలేదు. ఆమె పేరు తాటక.

తాటక పెరిగి పెద్దది అయింది. సుకేతుడు తన కుమార్తె తాటకను సుందుడు అనే వాడికి ఇచ్చి వివాహం చేసాడు. సుందుడికి,

తాటకకు మహా బలవంతుడు అయిన మారీచుడు అనే కుమారుడు జన్మించాడు.

అగస్త్యుని శాపము వలన సుందుడు మరణించాడు. అప్పుడు తాటక, మారీచుడు ఇద్దరూ కలిసి  అగస్త్యుని  చంపి తినడానికి అతని మీదికి వెళ్లారు.అప్పుడు అగస్త్యుడు మారీచుని "నీవు రాక్షసుడివి కా!" అని శపించాడు. తాటకను "నీవు  వికృత రూపంతో, భయంకరంగా మనుష్యులను చంపి తింటూ,  జీవించు" అని శపించాడు. అప్పటి నుండి తాటక  అగస్త్యుడు సంచరించిన ఈ వనమును నాశనం చేయసాగింది.

ఓ రామా! తాటక  స్త్రీ అని సంకోచించ వద్దు. ఆమె దుర్మార్గురాలు. లోకకంటకు రాలు. మునులను, బ్రాహ్మణులను రక్షించుటకు ఆమె సంహరించు. ఈమెకు ఉన్న వరములు, శాపములు వలన ఈమెను నీవు తప్ప వేరెవ్వరూ సంహరించలేరు.

లోకము యొక్క హితము కోరి రాజు  స్త్రీ, పురుష బేధము లేకుండా ఎవరినైనా సంహరించవచ్చును. రాజు ప్రజలను రక్షించ డానికి చేసే పని పాపము అయినా సరే రాజుకు ఆపాపము అంటదు. ఇది రాజ్యపాలనలో ముఖ్యసూత్రము. ధర్మానికి విరుద్ధంగా, ప్రజలకు కంటకంగా పరిణమించిన తాటకను సంహరించడం పాపము కాదు.

పూర్వము విరోచనుని కుమార్తె,  భూదేవిని చంపబోయింది. అప్పుడు దేవేంద్రుడు  ఆమెను చంపాడు. పూర్వము శుక్రాచార్యుని తల్లి, లోకములో ఇంద్రుడు ఉండకూడదు,  అనే కోరికతో  తీవ్రంగా

తపస్సుచేసింది. ధర్మ విరుద్ధమైన ఆమె తపస్సును భగ్నం చేసి ఆమెను చంపాడు విష్ణువు.

ఓ రామా! వీరే కాదు. ధర్మవిరుద్ధంగా ప్రవర్తించిన స్త్రీలను ఎందరినో చంపారు. కాబట్టి నీవు కూడా స్త్రీ అని సంకోచించక తాటకను సంహరించు." అని అన్నాడు విశ్వామిత్రుడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో **ఇరవై ఐదవ** సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ఇరవై  ఆరవ సర్గ.

విశ్వామిత్ర మహర్షి మాటలను శ్రద్ధగా విన్న రాముడు వినయంతో ఇలా అన్నాడు. " ఓ మహర్షి! మా తండ్రి దశరథుడు నన్ను తమరి వెంట పంపాడు. తమరు ఏమి చెబితే అలా చెయ్యమన్నాడు. నా తండ్రి గారి మాటను జవదాటలేను.  అందుకే తమరి మాట నాకు శిరోధార్యము. తమరు ఏం చెబితే అలా చేస్తాను. గోవులు, బ్రాహ్మణుల  యొక్క హితము కొరకు, లోక క్షేమము కొరకు తమరు చెప్పినట్టే చేస్తాను. " అని పలికాడు రాముడు.

వెంటనే తన ధనుస్సు చేతిలోకి తీసుకున్నాడు.  వింటి నారిని గట్టిగా లాగి వదిలాడు. ఆ శబ్దానికి తాటకా వనములోని వారందరి గుండెలు అదిరిపోయాయి. భయంతో గడా గడా వణికిపోయారు. ఆ శబ్దము విన్న తాటక పరుగు పరుగున ఆ శబ్దము వచ్చిన వైపుకు వచ్చింది.

వికారంగా ఉన్న తాటకిని చూచి రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఆ భయంకరాకారముతో ఉన్న యక్షిణిని చూడు. పిరికి వాళ్లు అయితే ఆమెను చూచి  గుండె ఆగి చనిపోతారు కదా! ఆమె మాయావి. అందుకని ఈమె ముక్కు చెవులు కోసి వదిలేద్దాము.

ఎందుకంటే ఈమె స్త్రీ. అదే ఈమెను రక్షిస్తూ ఉంది. కాబట్టి ఈమెను చంపకుండా ఈమె పరాక్రమును నశింప చేస్తాను."అని అన్నాడు రాముడు.

రాముడు అలా లక్ష్మణుడితో చెబుతూ ఉండగానే తాటకి రాముని మీదికి గర్జిస్తూ దూకింది. ఇంతలో విశ్వామిత్రుడు కోపంతో హుంకరించాడు. తాటకిని అదిలించాడు. రామలక్ష్మణులకు స్వస్తి వాచకం పలికాడు. రాముడికి జయం కలగాలని ఆశీర్వదించాడు.

విశ్వామిత్రుని హుంకారమునకు తాటకి భయపడలేదు. తన మాయా శక్తిచేత వారి మీద రాళ్ల వర్షము కురిపించింది. రాముడికి కోపం వచ్చింది. వెంటనే తాటకి మీద శరవర్షము కురిపించి ఆ రాళ్ల వర్షమును ఆపు చేసాడు.

తాటకి ఊరుకోలేదు. తన చేతులుచాచి రాముని మీదికి వచ్చింది. రాముడు తన బాణములతో తాటకి రెండు చేతులు ఖండించాడు. లక్ష్మణుడు ఒక కత్తి తీసుకొని తాటకి ముక్కు చెవులు కోసి ఆమెను విరూపిని చేసాడు. అయినా తాటకి ఊరుకోలేదు. తన మాయా శక్తితో వివిధము లైన ఆకారములను ధరించి మరలా రామ లక్ష్మణుల మీద రాళ్ల వర్షము కురిపించింది. రామలక్ష్మణుల మీద రాళ్ల వర్షం కురుస్తుంటే విశ్వామిత్రుడు చూచాడు.

అప్పుడు విశ్వామిత్రుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! ఆమె మీద జాలి చూపకు. ఈమె పాపాత్మురాలు. దుర్మార్గురాలు. ఈమె మాయావి. వివిధములైన రూపములను ధరించగలదు. రాత్రి

సమీపించుచున్నది. ఈ లోపలే ఈమెను చంపి వెయ్యి. సంధ్యాకాలములో రాక్షసుల బలం పెరుగుతుంది. త్వరపడు." అని అన్నాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుని మాటలు విన్న రాముడు వెంటనే శబ్దవేధి బాణాన్ని ఎక్కుపెట్టాడు.

(శబ్ద వేధి అంటే , టార్గెట్ కనిపించనపుడు, కేవలం శబ్దం ఆధారంగా, శబ్దమును విని టార్గెట్ ను కొట్టడం).

తాటక నుండి వచ్చు శబ్దమును బట్టి రాముడు బాణాన్ని విడిచాడు. ఆ బాణం సూటిగా తాటకిని తాకింది. రామ బాణం తగిలిన తాటకి రెట్టించిన కోపంతో రాముని మీదికి ఉరికింది. రాముడు మరొక బాణంతో తాటకి వక్షస్థలము మీద కొట్టాడు. ఆ బాణము సరిగా తాటకి గుండెలోంచి దూసుకుపోయింది. తాటకి కిందపడి మరణించింది.

తాటకి మరణించడం చూచి దేవతలు అంతా సంతోషించారు. దేవతల అందరి బదులు దేవేంద్రుడు విశ్వామిత్రుని తో ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! నీవు రాముని యందుఎక్కువ వాత్సల్యము చూపుము. భృశాశ్వునిచే సృష్టింప బడిన అస్త్ర శస్త్రములను అన్నింటినీ రామునికి ఉపదేశింపుము. ఎందు కంటే రాముడు భవిష్యత్తులో లోక కంటకులైన రాక్షసులను సంహరించవలసి ఉన్నది. " అని పలికాడు.

తరువాత దేవేంద్రుడు దేవతలు వెళ్లిపోయారు. ఇంతలో సంధ్యాసమయము అయింది. తాటకను చంపిన రాముని సంతోషంతో చూచాడు విశ్వామిత్రుడు. వాత్సల్యంలో అతని తల నిమిరాడు.

" ఓ రామా! సంధ్యాసమయము అయినది. మనము ఈ రాత్రికి ఇచ్చటనే విశ్రమించి రేపుఉదయము మన ప్రయాణము కొన సాగిద్దాము" అని అన్నాడు. రామ లక్ష్మణులు దానికి అంగీకరించారు.

అందరూ ఆరాత్రికి తాటకా వనములో విశ్రమించారు. మరునాడు ఉదయము విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మేల్కొలిపాడు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో ఇరవై ఆరవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

ఇరవై ఏడవ సర్గ.

మరునాడు అందరూ నిద్ర లేచారు. ప్రాత:కాలము లో ఆచ రించ వలసిన సంధ్యావందనము మొదలగు కార్యక్రమములు నిర్వర్తించారు.

విశ్వామిత్రుడు రామునితో "రామా! నీకు దివ్యాస్త్రములు అన్ని ఇస్తాను. వాటితో నీవు దేవతలను, అసురులను, గంధర్వులను యుద్ధములో జయింపగలవు.

రామా! నీకు దివ్యమైన దండ చక్రమును, ధర్మ చక్రమును, కాల చక్రమును, విష్ణు చక్రమును, అతి ఉగ్రమైన ఇంద్రాస్త్రమును, వజ్రాస్త్రమును, శివుని శూలముతో సమానమైన శూలాస్త్రమును, బ్రహ్మశిరోనామకాస్త్రమును, అన్నిటి కంటే ఉత్తమము, శ్రేష్ఠము అయిన బ్రహ్మాస్త్రమును నీకు ప్రసాదించెదను. ఇవి కాకుండా నీకు మోదకి, శిఖరి అనే రెండు గదాయుధములను కూడా ఇస్తాను.

రామా! నీకు ధర్మపాశము, కాలపాశము, వారుణాస్త్రము ఇస్తాను. ఇవే కాకుండా నీకు రెండు పిడుపాటులను అనగా తడిగా ఉన్న పిడుగు, పొడిగాఉన్న పిడుగు ఇచ్చెదను.నీకు పినాక అస్త్రమును,

నారాయణాస్త్రమును ఇచ్చెదను.

రామా! నీకు ఆగ్నేయాస్త్రమును, వాయవ్యాస్త్రమును ఇచ్చెదను.

ఓ రామా! నీకు హయశిరము, క్రౌంచ అస్త్రము అనే రెండు శక్తులను ప్రసాదిస్తున్నాను. రాక్షసులు వాడేటటు వంటి అస్త్రములు, అనగా కంకాళము, ముసలము, కపాలము, కంకణము నీకు ఇస్తున్నాను.

ఓ రామా! నీకు విద్యాధరముఅనే మహాస్త్రమును, నందనము అనే ఖడ్గమును ఇస్తున్నాను. నీకు గాంధర్వ అస్త్రమును, సౌర అస్త్రమును ఇస్తున్నాను. ఇవి నిద్రావస్థను కలుగ చేస్తాయి. నిద్రావస్థనుండి విముక్తులను చేస్తాయి. వీటికి ఆ ప్రభావము ఉంది.

ఓ రామా! నీకు దర్పణ, శోషణ, సంతాపన, విలాపన, మొదలగు అస్త్రములు, మన్మథుడు ఉపయోగించే మదనాస్త్రమును, పిశాచములు వాడే మోహనాస్త్రమును ప్రసాదిస్తున్నాను.

ఓ రామా! ఇంకా నీకు తామసాస్త్రము, సౌమనాస్త్రము, సంవర్థాస్త్రము, ముసలము, సత్యము అనే అస్త్రము, పరమ శ్రేష్టమైన మాయాధరాస్త్రము, అత్యంత శక్తి వంతము, భయంకరము అయిన త్వష్టరాస్త్రము, మొదలగు అస్త్రములను నీకు ఇస్తున్నాను.

ఓ రామా! ఈ అస్త్రములు అన్నీ కామ రూపులు. తమకు ఇష్టం వచ్చిన రూపములు ధరింపగలవు. అత్యంత బలము కలవి. వీటిని

నానుండి వెంటనే గ్రహించు." అని అన్నాడు విశ్వామిత్రుడు.

రాముడు వాటిని భక్తి శ్రద్ధలతో గ్రహించాడు. ఆ అస్త్రములు అన్నీ దేవతలకు కూడా ప్రయోగ ఉపసంహారములతో గ్రహించడం దుర్లబము. అటువంటిది రాముడు ఆ అస్త్రసముదాయమును అవలీలగా అధ్యయనం చేసాడు.

విశ్వామిత్రుడు మంత్రములనుఉచ్ఛరిస్తూ ఒకటి వెంట ఒక అస్త్రమును రామునికి ఇస్తూ ఉంటే, ఆ అస్త్రమునకు అధి దేవతలు వచ్చిరాముని ముందు నిలబడి "రామా! ఇకనుండి మేమందరమూ నీకు దాసులము" అని పలికారు. విశ్వామిత్రుడు ఉపదేశించిన అస్త్రములు అన్నింటినీ రాముడు భక్తితో స్వీకరించాడు. ఆ అస్త్రములకు అధిదేవతలను చూచి "మీరంతా నా మనసులో ఉంటూ నేను మిమ్ములను స్మరించి నపుడు నా వద్దకు రండి" అనిపలికాడు.

తరువాత రామ లక్ష్మణులు విశ్వామిత్రుని వెంట ప్రయాణమ య్యారు.

ఇది వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో ఇరవై ఏడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్‌ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

ఇరవై  ఎనిమిదవ సర్గ.

ఆ ప్రకారంగా విశ్వామిత్రుని వెంట నడుస్తున్న రాముడు మార్గ మధ్యంలో ఆయనను చూచి ఇలా అన్నాడు.

“ఓ మహర్షీ!  తమరు నాకు ఎన్నో అస్త్రములను ఉపదేశించారు. ఇప్పుడు నేను దేవతలకు, రాక్షసులకు అజేయుడనయ్యాను. కాని వాటికి ఉపసంహారము కూడా తెలియజేస్తే బాగుంటుంది కదా!” అని అడిగాడు.

(అస్త్రములను ఉపసంహరించడం అంటే ఒక సారి వేసిన అస్త్రమును, టార్గెట్ ను ఢీకొట్టక ముందే  వెనుకకు తీసుకోడం.  ఆ రోజుల్లో అస్త్రము వేసే శక్తీ దానిని ఉపసంహరించే శక్తీ రెండూ ఉండేవి. నేటి రోజుల్లో తుపాకీ గానీ, పిస్టల్ గానీ, పెద్ద పెద్ద మిసైల్సు కానీ ఒకసారి ప్రయోగిస్తే,  ఇంతే సంగతులు.... ఇంక వెనకకు తిరిగి రావు. టార్గెట్‌ను ధ్వంసంచేస్తాయి.  అదీ నేటి అస్త్ర శక్తి.).

ఆ మాటలకు సంతోషించాడు విశ్వామిత్రుడు. రామునికి తాను ఉపదేశించిన అన్ని అస్త్రములకు ఉపసంహారము కూడా

ఉపదేశించాడు.

అంతే కాకుండా, పూర్వము భృశాశ్వుని చే సృష్టింపబడిన అస్త్రములు అన్నిటినీ రాముని కి ఉపదేశించాడు. ఆ అస్త్రముల పేర్లు వాల్మీకి 7 శ్లోకములలో చెప్పాడు. ఆ అస్త్రముల పేర్లు ఏవంటే......

సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖము, అవాఙ్ముఖము, లక్షాక్షము, విషమము, ధృఢనాభము, మహానాభము, దుందునాభము, సునాభము, జ్యోతిషము, కృశనము, నైరాశ్యము, విమలము, యోగంధరము, హరిద్రము, దైత్యము, ప్రశమనము, సార్చిర్మాలి, ధృతి, మాలి, వృత్తిమంతము, రుచిరము, పితృసౌమనసము, విధూతము, మకరము, కరవీరకరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచి, మోహము, ఆవరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము.

(వీటి పేర్లు చూస్తుంటే ఇవి మానవుల లక్షణములు, ఉదాహరణకు... మోహము, రుచిరము, విమలము; ఇంకా మానవులకు ఉన్న సంపదలు ఉదా: సంతానము, కొన్ని శాస్త్రములు ఉదా: జ్యోతిషము. ఇలాగా అస్త్రములు అంటే కేవలము ఆయుధములు అనే కాదు శాస్త్రములు, లక్షణములు వాటి ఆవశ్యకత అని అర్థం స్ఫురిస్తూ ఉంది.)

రాముడు ఆ అస్త్రములను సంతోషంతో తీసుకున్నాడు. ఆ అస్త్రదేవతలు అందరూ రాముని ముందు నిలిచి ఆయన ఆజ్ఞ కోసరం ఎదురు చూచారు. రాముడు వారిని మనసులో నిలుపుకొని తాను కోరినపుడు రమ్మని పంపివేసాడు. ఆ అస్త్రదేవతలు అందరూ

రామునికి ప్రదక్షిణ పూర్వక నమస్కారము చేసి వెళ్లిపోయారు.

తరువాత రాముడు విశ్వామిత్రుని వెంట నడుస్తున్నాడు. వారికి ఒక ఆశ్రమము కనపడింది. ఆ ఆశ్రమము మంచి ఫలవృక్షములతోనూ, పూల తీగలతోనూ, అత్యంత మనోరంజకంగా ఉంది. విశ్వామిత్రుని వెంట నడుచుచూ రాముడు ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! ఈ ప్రదేశము చాలా మనోహరముగా ఉంది. మనము ఆ రాక్షస ప్రాంతము వదిలి పెట్టినాము అనుకుంటాను. ఇంత మనోహరముగా ఉన్న ఈ ఆశ్రమము ఎవరిది? వివరించండి. ఇంతకూ తమరి ఆశ్రమము ఎక్కడ ఉంది. మీరు యజ్ఞము ఎక్కడ చేస్తున్నారు. రాక్షసులు మీ యాగమును ఎక్కడ పాడుచేస్తున్నారు. నేను తమరి యాగమును ఎక్కడ ఉండి రక్షించాలి. నేను ఆ రాక్షసులను ఎక్కడ ఉండి చంపాలి. వీటి గురించి నాకు వివరంగా చెప్పండి" అని అడిగాడు రాముడు.

(ఇప్పటి దాకా రాముడు చెప్పిన పని చేస్తున్నాడు, ఇచ్చినవి (అస్త్రములు) పుచ్చుకుంటున్నాడు, కానీ నోరు మెదప లేదు. ఇప్పుడు ఒక ఆర్మీ మేజర్ అడిగినట్టు తాను నెరవేర్చవలసిన మిషన్ గురించి వివరాలు అడుగుతున్నాడు. గమనించండి.)

అప్పుడు విశ్వామిత్రుడు రామునితో ఇలా చెప్పసాగాడు.

వాల్మీకి విరచిత రామాయణ మహాకావ్యములో
బాలకాండలో ఇరవై ఎనిమిదవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

ఇరవై తొమ్మిదవ సర్గ.

రాముడు ఆ వనమును గురించి ప్రశ్నించగా, విశ్వామిత్రుడు ఇలా బదులు చెప్పాడు.

" ఓ రామా! ఈ ప్రదేశములోనే శ్రీ మహా విష్ణువు వంద యుగముల పాటు తపస్సు చేసాడు. వామనావతారమునకు ముందు శ్రీ మహా విష్ణువు ఇక్కడనే నివసించేవాడు. కశ్యపుడు ఇక్కడ తపస్సు చేసి సిద్ధి పొందినందువలన, దీనిని సిద్ధాశ్రమము అని అంటారు. శ్రీ మహా విష్ణువు ఇక్కడ తపస్సు చేస్తూ ఉన్న కాలంలో బలి చక్రవర్తి దేవత లందరినీ జయించి ముల్లోకములనూ పరిపాలిస్తున్నాడు. ఆ బలి చక్రవర్తి ఒక సారి యాగము చేస్తున్నాడు. ఆ సమయంలో దేవతలందరూ ఇక్కడ తపస్సు చేస్తున్నా విష్ణు మూర్తి దగ్గరకు వచ్చి ఇలా అన్నారు.

" ఓ విష్ణూ! బలి చక్రవర్తి యజ్ఞము చేస్తున్నాడు. అది పూర్తి అయే లోపలనే మన కార్యము పూర్తి కావాలి. ఈ యాగ సమయములో బలి చక్రవర్తి ఎవరు ఏది అడిగితే దానిని కాదు లేదు అనకుండా ఇస్తున్నాడు.

ఓ దేవా! నీవు దేవతల మేలు కోరి, వామనుడిగా బలి చక్రవర్తి యొద్దకు పోయి, మాకు మేలు చేయుము. " అని ప్రార్థించారు.

అదే సమయంలో కశ్యపుడు తన భార్యా సమేతంగా వేయి సంవత్సరములు విష్ణువును గూర్చి తపస్సు చేసాడు. తరువాత విష్ణువును ఇలా ప్రార్థిస్తున్నాడు.

" ఓ పురుషోత్తమా! నీవు తపోమయు డవు. తపోరాశివి. తపోమూర్తివి. తపమే నీ రూపము. అట్టి నిన్ను నా తపో మహిమ వలన చూడగలుగుతున్నాను. నీకు ఆది, అంతము లేదు. నీవు సర్వాంతర్యామివి. నిన్ను శరణు వేడుచున్నాను. " అని ప్రార్థించాడు.

అప్పుడు విష్ణువు కశ్యపునకు ప్రత్యక్షమయ్యాడు. ఏమి వరం కావాలో కోరుకోమన్నాడు. అప్పుడు కశ్యపుడు ఇలా అడిగాడు.

"భగవాన్! నీవు నాకు అదితికి పుత్రుడుగా జన్మించు. దేవేంద్రునికి తమ్ముడుగా జన్మించు. దేవతలకు మేలు కలిగించు. నా ఇన్ని సంవత్సరములు తపస్సు ఫలిస్తుంది. నీ అనుగ్రహంతో ఈ ప్రదేశము సిద్ధాశ్రమము అని ప్రసిద్ధి చెందుతుంది. హే భగవాన్! నాకు పుత్రుడుగా జన్మించి నన్ను కృతార్థుడిని చెయ్యి" అని ప్రార్థించాడు కశ్యపుడు.

కశ్యపుడు కోరుకున్నట్టు విష్ణు మూర్తి, కశ్యపునకు అదితికి వామనుడిగా జన్మించాడు. వెంటనే బలిచక్రవర్తి వద్దకు వెళ్లాడు. తనకు మూడు అడుగుల స్థలము కావాలి అని అడిగాడు. బలి చక్రవర్తి వెంటనే వామనుడు అడిగిన మూడు అడుగుట స్థలమును ఇస్తూ

నీటిని ధారపోసాడు. వామనుడు బలి చక్రవర్తి నుండి మూడు అడుగుల స్థలమును గ్రహించాడు. వెంటనే త్రివిక్రముడిగా పెరిగాడు. ముల్లోకములను ఆక్రమించాడు. బలి చక్రవర్తిని ఓడించాడు. స్వర్గాధిపత్యమును మరలా మహేంద్రునికి అప్పగించాడు. దాంతోముల్లోకములు మరలా మహేంద్రుని అధీనంలోకి వచ్చాయి. వామనుడి మీద ఉన్న భక్తి చేత నేను కూడా ఇదే ఆశ్రమములో నివసిస్తున్నాను. ఇక్కడనే నేను యజ్ఞము చేస్తున్నాను. రాక్షసులు ఇక్కడకు వచ్చి నా యజ్ఞమును పాడు చేస్తున్నారు. నీవు వారిని ఇక్కడే సంహరించాలి.

రామా! ఇప్పుడు మనము సిద్ధాశ్రమములో ప్రవేశిస్తున్నాము. రామా! ఈ ఆశ్రమములో నీవు స్వేచ్ఛగా ఉండవచ్చు. " అని అన్నాడు విశ్వామిత్రుడు .

రామ లక్ష్మణులు విశ్వామిత్రుని ఆశ్రమములో ప్రవేశించారు. విశ్వామిత్రుడు రావడం చూచి ఆ ఆశ్రమములో ఉన్న మునులందరూ వచ్చి విశ్వామిత్రుని, రామలక్ష్మణులను సాదరంగా లోపలకు తీసుకొని వెళ్లారు. వారిని పూజించారు. అతిథి సత్కారములు చేసారు. రామ లక్ష్మణులు కొంచెం సేపు విశ్రాంతి తీసుకున్నారు.

తరువాత వారు విశ్వామిత్రుని చూచి ఇలా అన్నారు.

"ఓ విశ్వామిత్ర మహర్షీ! తమకుశుభం కలుగుతుంది. తమరు ఈ రోజునుండే యాగము ప్రారంభించండి. మేము యాగ రక్షణ చేస్తాము." అని అన్నారు.

ఆ మాటలు విన్న విశ్రామిత్రుడు ఎంతో సంతోషించాడు. యాగ దీక్షను స్వీకరించాడు. రామ లక్ష్మణులు ఆ రాత్రి అంతా జాగరూకతతో ఉన్నారు. మరునాడు  ఉదయమే లేచి కాలకృత్యములు తీర్చుకొని ప్రాత:కాల సంధ్యావందనము ఆచరించి, విశ్వామిత్రుని వద్దకు వచ్చి ఆయనకు నమస్కరించి, ఆయనతో ఇలా అన్నారు.

వాల్మీకి విరచిత

రామాయణ మహాకావ్యములో

బాలకాండలో  ఇరవై తొమ్మిదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పయ్యవ సర్గ.

మరునాడు రామ లక్ష్మణులు విశ్వామిత్రునితో ఇలాఅన్నారు.

"ఓ మహర్షీ! మీ యాగము భగ్నము చేయుటకు రాక్షసులు ఎప్పుడు వస్తారు. మేము ఎప్పుడు వారిని ఎదుర్కొనవలెను. ఎందుకంటే రాక్షసులు వచ్చిన తక్షణం మేము వారిని ఎదుర్కోవాలి కదా!" అని అడిగారు.

ఆసమయములో విశ్వామిత్రుడు మౌనముద్రలో ఉన్నాడు. అందుకని ఆయన పక్కనే ఉన్న ఋషులు రామలక్ష్మణులతో ఇలా అన్నారు.

"మహర్షుల వారు మౌనదీక్షలో ఉన్నారు. నేటి నుండి ఆరు రాత్రులు మీరు యాగమును రక్షించవలెను." అని పలికారు.

వారి ఆజ్ఞను శిరసావహించారు రామలక్ష్మణులు. నిరంతరమూ ధనస్సును చేత బూని రామ లక్ష్మణులు ఆరు పగళ్లు ఆరు రాత్రులు యాగమును రక్షించారు. వారు విశ్వామిత్రుని పక్కను ఉండి ఆయనకు ఎలాంటి ఆపదా రాకుండా రక్షించారు.

ఆరవ దినము గడుచు చున్నది. రాముడు లక్ష్మణుని చూచి "లక్ష్మణా! ఇది ఆరవ రోజు. చాలా అప్రమత్తంగా ఉండు.రాక్షసులు ఏ క్షణమునైనా దాడి చేయవచ్చు." అని లక్ష్మణుని హెచ్చరించాడు.

ఋషులు యజ్ఞము చేస్తున్నారు. అగ్నిహోత్రము మండుచున్నది. ఒక్కసారిగా అగ్నిహోత్రము లోనుండి మంటలు భగ్గున పైకి లేచాయి. ఏదో జరగబోతోంది అని అనుకున్నాడు రాముడు.

ఇంతలో ఆకాశము నుండి ఒక భయంకరమైన శబ్దము వినిపించింది. మారీచుడు, సుబాహుడు అనే రాక్షసులు మేఘముల రూపములో ఆకాశము అంతా కమ్ముకున్నారు. ఆ రాక్షసులు ఆకాశము నుండి రక్తమును వర్షము వలె కురిపించారు. రక్తము పడిన హోమ గుండము లో నుండి అగ్ని జ్వాలలు పైకి ఎగిసాయి.

ఇదంతా చూచిన రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! రాక్షసులు ఆకాశము నుండి రక్త వర్షము కురిపించు చున్నారు. నేను నా బాణములతో ఆ మేఘరూపములో ఉన్న రాక్షసులను తరిమి వేస్తాను." అని అన్నాడు.

రాముడు కోపంతో మానవాస్త్రమును ఆ రాక్షసుల మీద ప్రయోగించాడు. రాముడు ప్రయోగించిన మానవాస్త్రము మారీచుని వక్షస్థలము మీద సూటిగా తగిలింది. ఆ అస్త్రము దెబ్బకు మారీచుడు నూరు యోజనముల దూరములో ఉన్న సముద్రములో పోయి పడ్డాడు.

అప్పుడు రాముడు లక్ష్మణుని చూచి ఇలాఅన్నాడు. "లక్ష్మణా! నేను సంధించిన మానవాస్త్రము  ఎవరినీ చంపదు. కేవలము మూర్ఛపోయేట్టు చేస్తుంది. ఆ రాక్షసుడు కూడా అచేతనుడై సముద్రములో పడ్డాడు. కాని  ఈ రాక్షసులను క్షమించరాదు. వీరి ప్రాణములు తీయడమే సరిఅయిన మార్గము" అని అన్నాడు.

వెంటనే రాముడు ఆగ్నేయాస్త్రమును సుబాహుని మీద సంధించాడు.  ఆ అస్త్రము తగిలి సుబాహుడు నేలకూలాడు. వెంటనే గిలా గిలా కొట్టుకొని మరణించాడు. రాముడు మిగిలిన రాక్షసులను వాయవ్యాస్త్రము ప్రయోగించి నాశనం చేసాడు.

ఆ ప్రకారంగా రాముడు విశ్వామిత్రుని యజ్ఞమునకు భంగము కలిగించు రాక్షసుల నందరినీ తన దివ్యాస్త్రములతో సమూలంగా చంపాడు.

యజ్ఞము నిర్విఘ్నముగా పూర్తి అయింది. విశ్వామిత్రుడు దీక్ష నుండి లేచాడు. రామ లక్ష్మణులను చూచాడు. ఎంతోసంతోషంతో ఇలా అన్నాడు.

"రామా! నేను సంకల్పించిన యాగము నిర్విఘ్నముగా పూర్తి అయింది. నీవు నీ తండ్రి ఆజ్ఞప్రకారము  యాగమును రక్షించావు.  ఈ సిద్ధాశ్రమముపేరు సార్థకం చేసావు." అని అన్నాడు.

శ్రీమద్రామాయణము బాల కాండ ముప్పయ్యవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పది ఒకటవ సర్గ.

యాగమును సంరక్షించాము అన్న ఆనందంతో రామలక్ష్మణులు ఆ రాత్రి సుఖంగా నిద్రించారు.

మరునాడు ప్రాత:కాలమునే లేచి సంధ్యావందనాది కార్యములు పూర్తి చేసుకొని రామలక్ష్మణులు విశ్వామిత్రుడు, తదితర ఋషుల వద్దకు వెళ్లారు. వారు విశ్వామిత్రునికి భక్తితో నమస్కరించి ఇలా అన్నారు.

" ఓ మహర్షీ! మేము నీ భటుల మాదిరి వచ్చినిలిచి ఉన్నాము. ఏమి చేయవలెనో ఆజ్ఞాపించండి." అని చేతులుకట్టుకొని వినయంగా నిలబడ్డారు.

వారిని చూచిన మహర్షులు విశ్వామిత్రుని అనుమతితో ఇలా అన్నారు. " ఓ రామా! మిథిలాధిపతి అయిన జనక మహారాజు ఒక యజ్ఞము చేయుచున్నాడు. మేము అందరమూ ఆ యజ్ఞమునకు పోవుచున్నాము. మీరు కూడా మా వెంట మిథిలకు వచ్చినచో అక్కడ ఉన్న ఒక మహాధనుస్సును చూడవచ్చును. ఆ ధనుస్సు సామాన్యమైనది కాదు. చాలా బలము కలది. భయంకరమైనది. ఆ ధనుస్సును

పూర్వము యజ్ఞములో దేవతలు జనకునికి ఇచ్చారు. దానిని దేవతలు, గంధర్వులు, అసురులు,రాక్షసులు ఎవరు కూడా ఎత్తలేరు. ఎక్కుపెట్టలేరు. ఇంక మానవుల సంగతి చెప్ప పనిలేదు కదా! అంతటి బలమైనది ఆ ధనుస్సు. ఎందుకంటే ఎంతో మంది రాజులు ఆ ధనుస్సును ఎత్తబోయి విఫలమయ్యారు. ఎవరూ ఆ ధనుస్సును ఎక్కుపెట్టలేకపోయారు. ప్రస్తుతము ఆ మహత్తర ధనుస్సు జనక మహారాజు పూజా మందిరములో పూజింపబడుతూ ఉంది." అని పలికారు.

తరువాత విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో, తదితర ఋషులతో కూడా కలిసి మిథిలకు ప్రయాణము అయ్యాడు. అందరూ ఉత్తర దిక్కుగా వెళుతున్నారు. దాదాపు నూరు బండ్లలో అందరూ వెళు తున్నారు.

చాలా దూరము ప్రయాణము చేసి అందరూ శోణ నదీ తీరము చేరుకున్నారు. ఆ రాత్రికి అక్కడే గడపాలను కున్నారు. సాయంకాలము చేయవలసిన సంధ్యావందనము, అగ్ని కార్యములను పూర్తి చేసుకొని అందరూ విశ్వామిత్రుని ముందు కూర్చున్నారు. ఆ సమయంలో రాముడు విశ్వామిత్రుని ఇలా అడిగాడు.

"ఓ మహర్షీ! ప్రస్తుతము మనకు ఉన్న వనము ఫలములతోనూ పుష్పములతోనూ శోభిల్లుచున్నది. ఈ వనము పేరు ఏమి? దీని గురించి నాకు తెలియజేయండి." అని అడిగాడు.

దానికి విశ్వామిత్రుడు ఇలా చెప్పసాగాడు.

శ్రీమద్రామాయణము

బాల కాండ

ముప్పది ఒకటవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పది రెండవ సర్గ.

" ఓ రామా! పూర్వము కుశుడు అనే మహా  తపస్వి ఉండే వాడు.  అతడు బ్రహ్మదేవుని కుమారుడు. అతడు సకల ధర్మములను తెలిసిన వాడు. మంచి వాడు. విదర్భ రాజకుమారి ఆయన భార్య. వారికి నలుగురు కుమారులు.వారిపేర్లు  కుశాంబుడు. కుశనాభుడు. అధూర్తజసుడు. వసువు. వారందరూ తండ్రి వలె ధర్మాత్ములు. సుగుణ వంతులు.

ఆయనకు రాజ్యపాలన చేయవలెనని కోరిక కలిగింది. అప్పుడు ఆ కుశుడు తన పుత్రులతో ఇలా అన్నాడు. " ఓ పుత్రులారా! మీరు ధర్మమును అనుసరించి  రాజ్యపాలన చెయ్యండి." అని అన్నాడు.

తండ్రి మాటను అనుసరించి ఆ నలుగురూ జనపదములను నిర్మించారు.

కుశాంబుని చేత నిర్మింప బడిన నగరము పేరు కౌశాంబి.

కుశనాభుని చేత నిర్మింప బడిన నగరము పేరు మహోదయము.

అధూర్త రజసుడు నిర్మించిన నగరము పేరు ధర్మారణ్యము.

వసువు నిర్మించిన నగరము పేరు గిరివ్రజపురము.

మనము ఇప్పుడు ఉన్న ప్రాంతము ఆ వసువు నివసించిన గిరివ్రజపురము భూమి. దీని చుట్టూ ఐదు పర్వతములు ఉన్నాయి. మగధ దేశములో పుట్టిన శోణ నది ఈ ఐదు పర్వతముల మధ్య ప్రవహించుచున్నది. ఈ శోణ నది తూర్పునుండి పడమరకు ప్రవహిస్తూ ఉంటుంది. ఈ నదీ పరీవాహక ప్రాంతము లన్నీ సస్యశ్యామలములైన పంట పొలాలతో నిండి ఉన్నాయి.

కుశనాభుని భార్య ఘృతాచి. వారికి నూర్గురు కుమార్తెలు. ఆ కన్యలందరూ లోకోత్తర సౌందర్య వతులు. వారికి యుక్త వయసు వచ్చింది.

ఒకరోజు ఆ కన్యలందరూ వన విహారము చేస్తున్నారు. అప్పుడు వాయుదేవుడు వారిని చూచి ఇలా అన్నాడు. “నేను వాయుదేవుడను. నేను మీ అందరనూ వివాహమాడదలిచాను. మీరు నన్ను వివాహం చేసుకుంటే మీకు దైవత్వము సిద్ధిస్తుంది. దానితో పాటు మీరు కలకాలము జీవిస్తారు. మీ మానవులకు యౌవనము కొద్ది కాలమే ఉంటుంది. కాని మా దేవతలు నిత్య యౌవనులుగా ఉంటారు. కాబట్టి నన్ను పెళ్లి చేసుకోండి.” అని అన్నాడు వాయుదేవుడు.

ఆ మాటలను పరిహాసంగా తీసుకున్నారు ఆ కన్యలు.

" ఓ వాయుదేవా! నీవు సకల జీవరాసులలో సంచరిస్తుంటావు. అందరికీ ప్రాణ దాతవు. నీ శక్తి మాకు తెలుసు. కాని నీవు ఇలా మాట్లాడటం బాగాలేదు. మేము కుశనాభుని కుమార్తెలము. మాకు నిన్ను శపించే శక్తి కలదు కాని మా తపశ్శక్తిని మేము వృధా చేయము. ఎందుకంటే మేము  స్వతంత్రు లము కాము. మా తండ్రి మాటను జవదాటము. మేమే కాదు ఈ లోకంలో ఏ కన్యకూడా తల్లి తండ్రుల మాటను జవదాటే దుస్థితి కలుగకుండు గాక!  మాకు మా తండ్రి ప్రభువు. దైవము. మా తండ్రి మమ్ములను ఎవరికి ఇచ్చి వివాహము చేస్తాడో వారినో మేము వివాహము చేసుకుంటాము." అని చెప్పారు ఆ కన్యలు.

వారి మాటలకు వాయుదేవునకు కోపం వచ్చింది. వెంటనే వాయుదేవుడు తన మహిమ చేత వారి శరీరములు అన్నీ బలము లేకుండా చేసాడు. ఏ మాత్రం బలము లేని ఆ కన్యలు ఎలాగోలాగ అంత:పురము చేరుకున్నారు. కిందపడిపోయారు. బాధతో కన్నీరు కారుస్తున్నారు.

వారి తండ్రి అయిన కుశనాభుడు కుమార్తె ల దుస్థితి చూచాడు. వారితో ఇలా అన్నాడు.

" ఓ పుత్రికలారా! ఏమిజరిగింది? మీకు ఈ దుస్థితి ఎలా దాపురించింది. దీనికి కారణం ఎవరు." అని అడిగాడు.

శ్రీమద్రామాయణము

బాల కాండ ముప్పది రెండవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్  ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పది మూడవ సర్గ.

తండ్రి మాటలు విన్న కుమార్తెలు ఆయనకు నమస్కరించి ఇలా అన్నారు.

"వాయుదేవుడు ధర్మము తప్పి మమ్ములను వివాహము చేసుకుంటాను అని అన్నాడు. మేము తిరస్కరించాము. మా తండ్రి గారు ఉన్నారు. మేము అస్వతంత్రులము. మా తండ్రి గారిని అడుగు."అని అన్నాము. దానికి ఆయన కోపించి మమ్ములను దుర్బలులుగా చేసాడు. ఇదీ జరిగిన సంగతి." అని చెప్పారు.

వారి మాటలు విన్న కుశ నాభుడు వారితో ఇలా అన్నాడు.

"కుమార్తెలారా! మీరు మంచి పని చేసారు. మీ ఓర్పును మెచ్చుకుంటున్నాను. మీరు వాయుదేవుని క్షమించి విడిచి పెట్టారు. పురుషులకు, స్త్రీలకు ఓర్పు అలంకారము. ఓర్పు దానము, ఓర్పు యజ్ఞము, ఓర్పు సత్యము, ఓర్పు కీర్తి. ఓర్పు ధర్మము. ఓర్పు మీదనే ఈ ధరణి అంతా నిలిచి ఉంది. కాని దేవతలకు ఓర్పు ఉండదు. కాబట్టి మీ ఓర్పును ప్రశంసిస్తున్నాను." అని పలికాడు.

తరువాత కుశధ్వజుడు మంత్రులతో తన కుమార్తెల వివాహముల గురించి మంతనాలు సాగించాడు.  ఆ సమయమున చూళి అనే మహర్షి తపస్సు చేస్తున్నాడు. ఆయనకు సోమద అనే గంధర్వ కాంత పరిచర్యలు చేస్తూ ఉంది. ఆ గంధర్వ కన్య పరిచర్యలకు చూళి చాలా సంతోషించాడు.

"ఓ కన్యా! నీకు ఏమి కావాలో కోరుకో!" అని అడిగాడు.

"ఓ మహర్షీ! నాకు పుత్ర సంతానము కావాలి. కాని నాకు భర్త లేడు. నేను ఎవరికీ భార్యను కాను. అందుకే మీకు సేవలు చేస్తున్నాను. తమ వలన నాకు బ్రహ్మ తేజస్సు కలిగిన పుత్రుడు కలిగే వరమును ప్రసాదించండి." అని అడిగింది.

చూళి ఆమె కోర్కెను మన్నించాడు. ఆమెకు తన తేజస్సుతో ఒక కుమారుడిని ప్రసాదించాడు. ఆయనే చూళి మానస పుత్రుడు. ఆయన పేరు బ్రహ్మదత్తుడు. సోమద కుమారుడైన బ్రహ్మదత్తుడు కాంపిల్య నగరంలో నివసిస్తున్నాడు.

ఇది ఇలా ఉండగా కుశనాభుడు తన నూర్గురు కుమార్తెలను బ్రహ్మదత్తునికి  ఇచ్చి వివాహము చేయవలెనని నిశ్చయించుకున్నాడు. ఆ విషయం బ్రహ్మ దత్తునితో సంప్రదించాడు. ఈ వివాహానికి బ్రహ్మ దత్తుడు ఒప్పుకున్నాడు. కుశనాభుడు తన నూర్గురు కుమార్తెలను బ్రహ్మ దత్తునికి ఇచ్చి వివాహం జరిపించాడు.

బ్రహ్మ దత్తుని చేతి స్పర్శ తగలగానే వారికి వాయుదేవుని వలన

కలిగిన దుర్బలత్వము తొలగిపోయింది. పరిపూర్ణ ఆరోగ్యంతో ప్రకాశించారు.

బ్రహ్మ దత్తుడు తన నూర్గురు భార్యలతో కాంపిల్యల నగరం చేరుకున్నాడు. సోమద తన కోడళ్లను చూసి మురిసిపోయింది. వారి అందచందాలను చూసి  ఎంతో సంతోషపడింది.

శ్రీమద్రామాయణము
బాల కాండ ముప్పది మూడవ సర్గ సంపూర్ణము.
ఓంతత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పది నాల్గవ సర్గ.

ఆ ప్రకారంగా కుమార్తెల వివాహము వైభవంగా జరిపించాడు కుశనాభుడు. కుమార్తెలు అత్తవారి ఇంటికి వెళ్లారు. అప్పుడు తనకు పుత్రసంతానము కావాలని అనుకున్నాడు కుశనాభుడు. పుత్రసంతానము కోసరము పుత్రకామేష్టి యాగము చేసాడు.

ఆయాగము జరుగుతున్న సమయములో కుశుడు తన కుమారుడైన కుశనాభునితో ఇలా అన్నాడు. “కుమారా! నీకు సకల సద్గుణ సంపన్నుడు ధార్మికుడు అయిన కుమారుడు జన్మించగలడు.” అనిపలికి తాను బ్రహ్మ లోకమునకు వెళ్లిపోయాడు.

కొంత కాలము జరిగింది. కుశనాభునకు గాధి అనే కుమారుడు జన్మించాడు. ఓ రామా! ఆ గాధి నా తండ్రి. శుకుని వంశమున పుట్టడం చేత నేను కౌశికుడు అనే పేరుతో కూడా పిలువబడు తున్నాను. నాకు ఒక జ్యేష్ట సోదరి (అక్కగారు) ఉండేది. ఆమెను నా తండ్రి గాధి ఋచకుడు అను వానికి ఇచ్చి వివాహము చేసాడు. ఆమె తన భర్తతో పాటు సశరీరంగా స్వర్గమునకు వెళ్లింది.

ఆమె ఈ భూమి మీద కౌశికి అనే పేరుతో ఒక మహానదిగా ప్రహిస్తూ ఉంది. దివ్యమైన పుణ్యోదకములతో కూడిన ఆ కౌశికీ నది సకల లోకములకు హితము కలిగించడం కోసరం హిమవత్పర్వతము మీద ప్రవహిస్తూ ఉంది. నేను నా సోదరి మీద ఉన్న ప్రేమతో ఆ మహానదీ తీరమున ఆశ్రమము నిర్మించుకొని తపస్సు చేసుకుంటున్నాను.

రామా! ఈ యాగము చేయుట కొరకు సిద్ధాశ్రమమునకు వచ్చాను. నీవలన యాగమును నిర్విఘ్నముగా పూర్తిచేయ గలిగాను. నా కార్యము సిద్ధించింది. ఓరామా! నీవు అడిగినట్టు నా గురించి, నా జన్మ గురించి నీకు చెప్పాను. రామా! ఇప్పటికే అర్ధ రాత్రి దాటినది. ఇంక మీరు నిద్రకు ఉపక్రమించండి. మరలా రేపు ఉదయమే మనము ప్రయాణము సాగించాలి కదా!" అని అన్నాడు విశ్వామిత్రుడు. విశ్వామిత్రుని వృత్తాంతమును విన్న రామ లక్ష్మణులు, మహా మునులుఅందరూ ఆయనను అభినందించారు.

"ఓ విశ్వామిత్ర మహర్షీ! మీ వలనకుశ వంశము పూజ్యమైనది. మీరు బ్రహ్మ దేవునితో సమానమైన వారు. మీ అక్కగారు పేరుతో ప్రవహించు కౌశికీ నది మీ వంశమునకు కీర్తి తెచ్చింది." అని విశ్వామిత్రుని, కౌశికీ నదిని పొగిడారు. తరువాత అందరూ తమ తమ నివాసములలో నిద్రకు ఉపక్రమించారు.

శ్రీమద్రామాయణము

బాలకాండ ముప్పదినాలుగవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పది ఐదవ సర్గ.

మరునాడు  విశ్వామిత్రుడు రామ లక్ష్మణులు వారి వెంట వచ్చిన మునులు అంతరూ ప్రాత: కాలముననే నిద్ర లేచి, సంధ్యావందనము అగ్నిహెూత్రము మొదలగు కార్యక్రమములు ముగించుకొని ప్రయాణమునకు సిద్ధము అయ్యారు. అందరూ తమ ప్రయాణమును కొనసాగించారు. మధ్యాహ్న సమయమునకు గంగానదీ తీరమునకు చేరుకున్నారు.

గంగానదీ దర్శనము చేసుకున్న రామలక్ష్మణులు, మునులు ఎంతో సంతోషించారు. వారందరూ గంగానదిలో స్నానములు చేసి పితృ తర్పణములు విడిచారు. మధ్యాహ్న భోజనములు అయిన తరువాత అందరూ విశ్వామిత్రుని చుట్టు కూర్చున్నారు.

విశ్వామిత్రుని చూచి రాముడు ఇలా అన్నాడు. " ఓ మహర్షీ! ఇచ్చట గంగానది మూడు పాయలుగా ప్రవహించుచున్నది కదా. ఇది ఎలా ఏర్పడినది.  ఈ గంగానది ఎక్కడ సముద్రములో కలుస్తుంది. వివరించండి." అని అడిగాడు.

విశ్వామిత్రుడు గంగా నది గురించి దాని ఉత్పత్తి గురించి ఇలా చెప్పసాగాడు.

" ఓ రామా! హిమవంతుడు అనే రాజు ఉండేవాడు. అతనికి హిమవత్పర్వతము నివాసము. హిమవత్పర్వతము సకల ధాతువులకు. ఓషధులకు నిలయము.

హిమ వంతుని భార్య పేరు మనోరమ. ఆమె మేరు పర్వతము కుమార్తె. వారికి ఇద్దరు కుమార్తెలు ఉండేవారు. వారి పేర్లు గంగ, ఉ మ. దేవతలందరూ హిమవంతుని వద్దకు పోయి గంగను తమకు ఇమ్మని అడిగారు. లోకముల యొక్క మేలు కోరిన హిమవంతుడు, తన పెద్ద కుమార్తె గంగను దేవతలకు ఇచ్చాడు. గంగ దేవతలతో పాటు వెళ్లిపోయింది.

హిమవంతుని రెండవ కుమార్తె ఉమ తపస్సు చేయడం మొదటు పెట్టింది. హిమ వంతుడు తనరెండవ కుమార్తె ఉమను మహాశివునికి ఇచ్చి వివాహము చేసాడు. గంగ, ఉమ అక్కా చెల్లెళ్లు. గంగ ఆ ప్రకారము దేవతల వెంట ఆకాశమునకు వెళ్లింది. ఉమశివుని వెంట కైలాసమునకు వెళ్లింది.

గంగ నదీ రూపంలో దేవతల నదిగా దేవలోకములో ప్రవహిస్తూ ఉంది.

శ్రీమద్రామాయణము

బాలకాండ 35వ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పది ఆరవ సర్గ.

అంత వరకువిన్న రాముడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు.

" ఓ మహర్షీ! హిమవంతుని పెద్ద కుమార్తె గంగ ఎందుకని మూడు మార్గములలో ప్రవహిస్తూ ఉంది. ఎందుకని గంగానదీ ముల్లోకములలో పవిత్రమైన నదిగా ప్రసిద్ధి చెందింది. వివరించండి." అని అడిగాడు. విశ్వామిత్రుడు ఇలా చెప్పసాగాడు.

" మహాశివుడు తన భార్య ఉమాదేవితో సురత సౌఖ్యాలు అనుభవిస్తున్నాడు. కానీ ఉమా దేవికి మహాశివునికి ఎంత కాలానికి పుత్ర సంతానము కలగ లేదు. దేవతలందరికీ ఒక అనుమానం కలిగింది. మహాశివునికి, ఉమాదేవికి పుట్టబోయే పుత్రుని భరించే శక్తి ఈ లోకాలకు ఉందా అని. దేవతలందరు బ్రహ్మదేవుని తీసుకొని మహా శివుని వద్దకు వెళ్లారు.

బ్రహ్మ దేవుడు మహాశివునితో ఇలా అన్నాడు. " ఓ మహాదేవా! మీకు ఉమాదేవికి పుట్టబోయే తేజోవంతుడయిన పుత్రుని ముల్లోకములు భరించలేవు. కాబట్టి మీరు ఉమాదేవి తపస్సు చేయండి. మీ తేజస్సును మీ యందే నిక్షిప్తం చేసుకోండి." అని ప్రార్థించారు.

వారి ప్రార్థనను మన్నించాడు మహాదేవుడు. "దేవతలారా! మీరు చెప్పినట్టే చేసెదను. కాని నా వీర్యమును ఎవరు ధరిస్తారో తెలియజేయండి." అని అన్నాడు.

దేవతలందరూ ముక్త కంఠంతో "మీ వీర్యమును భూదేవి ధరిస్తుంది" అని పలికారు. ఆ ప్రకారమే మహాశివుడు తన వీర్యమును భూదేవి యందు నిక్షిప్తం చేసాడు. ఆ వీర్యము భూమి అంతా వ్యాపించింది.

అప్పుడు దేవతలు అగ్ని దేవుని చూచి " ఓ అగ్నిదేవా! నీవు వాయు దేవుని సాయంతో  మహాదేవుని వీర్యమును నీలో నిక్షిప్తము చేసుకో" అని ప్రార్థించారు. అప్పుడు అగ్నిదేవుడు మహాశివుని వీర్యమును తనలో ధరింపజేసుకొన్నాడు.

మహాదేవుని వీర్యము ప్రభావము వలన అగ్ని దేవుని లో నుండి మహా వీరుడు కుమారస్వామి జన్మించాడు. అప్పుడు దేవతలు అందరూ మహా శివుని ఉమాదేవిని భక్తితో పూజించారు. ఇదంతా చూచి ఉ మాదేవికి పట్టరాని కోపం వచ్చింది.

" ఓ దేవతలారా! నేను నా భర్తయందు పుత్రుని కనవలెనని కోరికతో ఉన్నాను. దానికి మీరు అడ్డు తగిలారు. నా భర్త వీర్యమును భూమిలో అగ్నిలో నిక్షిప్తం చేసారు. కాబట్టి మీరందరికీ మీ భార్యలవలన సంతానము కలుగకుండు గాక!" అని తీవ్రంగా శపించింది.

తన భర్త వీర్యమును ధరించిన భూదేవిని కూడా ఉమాదేవి

శపించింది.

"ఓ భూదేవీ! నీవు అనేక రూపములతో అనేక మంది భర్తలకు భార్యగా ప్రవర్తించు. నావలెనే నీకు కూడా పుత్రుల వలన ఆనందము కలుగ కుండు గాక!" అని శపించింది.

తరువాత మహా శివుడు ఉమా దేవితో సహా పశ్చిమదిక్కుగా పోయి హిమవత్పర్వతము మీద ఉత్తర దిక్కుగా ఉన్న కైలాస గిరి మీద తపస్సు చేసాడు.

ఓరామా! ఇప్పుడు నీకు గంగాదేవి కథ చెబుతాను విను. " అని విశ్వామిత్రుడు గంగాదేవి యొక్క కథ చెప్పసాగాడు.

శ్రీమద్రామాయణము
బాల కాండ ముప్పది ఆరవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పది ఏడవ సర్గ.

ఓ రామా! పూర్వము దేవతల సేనలకు ఒక సైన్యాధి పతి కావాల్సి వచ్చాడు. దేవతలు అందరూ బ్రహ్మ దేవుని వద్దకు పోయి అగ్ని దేవుని ముందు పెట్టుకొని తమ కోరిక ను బ్రహ్మదేవునికి ఈ విధంగా విన్నవించుకున్నారు.

" ఓ బ్రహ్మ దేవా! ఇప్పటి దాకా దేవతా సేనలకు మహేశ్వరుడు సైన్యాధి పతిగా ఉండేవాడు. కాని ప్రస్తుతము మహేశ్వరుడు హిమాచలము మీద తపస్సు చేసుకుంటున్నాడు. కాబట్టి మాకు వేరొక సైన్యాధి పతిని నీవే ఏర్పరుప వలెను." అని వేడుకున్నారు.

ఆ సమయంలో మహేశ్వరుడు హిమాచలము మీద తపస్సు చేసుకుంటున్నాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు.

" ఓ దేవతలారా! ఉమాదేవి శాపము వలన మీలో ఎవ్వరికీ సంతానయోగ్యత లేదు. కాబట్టి మీలో ఎవరూ సైన్యాధి పతిని పుట్టించలేరు. ఆకాశ గంగ ఉన్నది కదా. అగ్ని దేవుని యందు ఆ మహాదేవుని వీర్యము నిక్షిప్తమై ఉన్నది కదా. గంగాదేవి అగ్నిదేవుని నుండి మహేశ్వరుని వీర్యమును స్వీకరించును. గంగాదేవికి అగ్ని

దేవుని ద్వారా  ఒక పుత్రుడు జన్మించును ఆయనే మీ దేవసేనకు అధిపతి కాగలడు. దీనికి ఉమాదేవి కూడా ఏమీ అభ్యంతరపెట్టదు." అని అన్నాడు.

బ్రహ్మదేవుని మాటలకు సంతోషించి దేవతలందరూ తమ తమ స్థానములకు వెళ్లిపోయారు. తరువాత దేవతలందరూ పుత్రుని కొరకై అగ్నిదేవుని ప్రార్థించారు.

అగ్నిదేవుడు గంగ దేవి దగ్గరకు పోయి " ఓ గంగాదేవీ! దేవతల కోరిక మేరకు నీవు నావలన గర్భము ధరింపుము." అని కోరాడు.

గంగాదేవి ఒక దివ్యమైన రూపము ధరించింది.  అగ్నిదేవుడు గంగాదేవిని ఆవహించాడు. తనలో నిక్షిప్తమైన మహాదేవుని వీర్యమును గంగాదేవిలో విడిచిపెట్టాడు.  గంగాదేవి దేహమంతయూ తాపంతో రగిలిపోయింది.

"ఓ అగ్నీ! నేను ఈ వీర్యమును ధరింపలేను. నా వళ్లు అంతా దహించికుపోతూ ఉంది. నాకు శరీరం వశం తప్పి పోతూ ఉంది. నా వల్ల కాదు." అని చెప్పింది.

"ఓ గంగాదేవీ! అటులయిన నేను నీలో విడిచిన వీర్యమును నీవు హిమాచలము వద్ద ఉన్న ఒక పర్వతము మీద విడువుము." అని అన్నాడు అగ్ని.

గంగానది అగ్ని దేవుడు చెప్పినట్లే మహాదేవుని వీర్యమును ఒక

పర్వతము మీద విడిచింది. అప్పుడు ఆ పర్వతము మహాదేవుని వీర్య ప్రభావము వలన బంగారము, వెండి, రాగి, ఇనుము మొదలగు ఖనిజ సంపదలతో నిండిపోయింది.

మహాదేవుని వీర్యము పడిన చోట రెల్లు పొదలు దట్టంగా పెరిగాయి. ఆ రెల్లు పొదలలో నుండి ఒక కుమారుడు పుట్టాడు. అది చూచి దేవతలు అందరూ సంతోషించారు. ఆ కుమారుని పాలు ఇచ్చి పెంచే బాధ్యత కృత్తికలకు అప్పగించారు. దేవతల ఆజ్ఞను శిరసావహించిన కృత్తికలు ఆ బాలునికి స్తన్యము ఇచ్చి పెంచారు. అందుకని ఆ బాలుడు కార్తికేయుడు అనే పేరుతో పిలువ బడ్డాడు.

గంగాదేవి గర్భము నుండి జారి పడ్డాడు కాబట్టి స్కంధుడు అని కూడా పిలువ బడ్డాడు. కృత్తికలు ఆరుగురు. ఆరుగు కృత్తికలు ఒకే సమయంలో ఆ బాలునికి స్తన్యము(చనుబాలు) ఇచ్చారు. ఆ బాలుడు కూడా ఒకే సారి ఆరుముఖములతో ఆ తల్లుల చనుబాలు తాగాడు. అందుకని ఆ బాలునికి షణ్ముఖుడు అనే పేరు వచ్చింది.

తరువాత ఆ కుమారుడు దేవ సేనలకు సైన్యాధి పతి గా నియమింప బడ్డాడు. అసురులను జయించాడు. ఓ రామా! దీనినే కుమార సంభవము అని అంటారు." అని విశ్వామిత్రుడు రామునికి కుమార స్వామి జననము గురించి చెప్పాడు.

శ్రీమద్రామాయణము

బాలకాండ ముప్పది ఏడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### ముప్పది ఎనిమిదవ సర్గ.

" ఓ రామా! ఇప్పుడు నీకు సగరుడి కధ చెబుతాను విను. పూర్వము అయోధ్యా నగరమును సగరుడు అనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు.ఆయనకు పుత్ర సంతానము లేదు. విదర్భ రాజ కుమారి కేశిని అతని మొదటి భార్య.. సుమతి ఆయన రెండవ భార్య..

పుత్ర సంతానము కొరకు సగరుడు ఇద్దరు భార్యలతో సహా హిమవత్పర్వతమునకు పోయి అక్కడ భృగుప్రస్రవణము అనే పర్వతము మీద నూరు సంవత్సరముల పాటు తపస్సు చేసారు. వారి తపస్సునకు మెచ్చిన భృగు మహర్షి వారికి పుత్ర సంతానము ప్రసాదించాడు.

"ఓ సగర చక్రవర్తీ! నీకు ఒక భార్య యందు ఒక కుమారుడు, మరొక భార్య యందు అరవైవేల మంది కుమారులు జన్మిస్తారు." అని వరము ఇచ్చాడు. వారు ఎంతో సంతోషించారు.

కాని వారికి ఒక సందేహము కలిగింది. " ఓ మహర్షీ! మాలో ఎవరికి ఒక పుత్రుడు కలుగుతాడు." అని అడిగారు.

"ఆ విషయం మీలో మీరే తేల్చుకోండి." అని అన్నాడు.

భృగుమహర్షి.

అప్పుడు కేశిని " ఓ మహర్షి! నాకు వంశము నిలిపే ఒక కుమారుని ప్రసాదించండి." అని కోరుకుంది.

రెండవ భార్య సుమతి "నాకు 60,000 వేల మంది కుమారులను ప్రసాదించండి." అని కోరుకుంది.

భృగుమహర్షి వారిని ఆ ప్రకారము అనుగ్రహించాడు. భృగుమహర్షికి నమస్కరించి అయోధ్యకు తిరిగి వచ్చారు. కాలక్రమేణా ఇరువురు గర్భములు ధరించారు. పెద్ద భార్య కేశిని అసమంజుడు అనే కుమారుని ప్రసవించింది. రెండవ భార్య ఒక పెద్ద పిండమును ప్రసవించింది. అది పగిలి అందులో నుండి 60,000 మంది పుత్రులు జన్మించారు. వారందరూ పెరిగి పెద్ద వారు అయ్యారు.

వారందరూ ఆటలు ఆడుతు ఉండగా పెద్దవాడు మిగిలిన వారిని నీటిలో ముంచి, వారు అరిచి కేకలు పెడుతుంటే, ఆనందించేవాడు. అనేక రకములైన పాప కార్యములను చేయుతూ జనులను బాధ పెడుతూ ఉండేవాడు. వాడి బాధ పడలేక సగరుడు అసమంజుని రాజ్యమునుండి వెళ్లగొట్టాడు. ఆ అసమంజుని పుత్రుడు  అంశు మంతుడు. అతడు తండ్రి మాదిరి కాకుండా ఎంతో ధార్మికుడు. సజ్జనుడు. అందరూ అతను అంటే ఇష్టపడేవారు.

కొంత కాలము తరువాత సగరుడు ఒక యజ్ఞమే చేయ సంకల్పించాడు.  పురోహితులను, ఋత్త్విక్కులను సంప్రదించాడు. యజ్ఞమునకు కావలసిన సంభారములు సమకూర్చుకున్నాడు. యజ్ఞము చేయ పూనుకున్నాడు.

శ్రీమద్రామాయణము

బాల కాండ ముప్పది ఎనిమిదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

ముప్పది తొమ్మిదవ సర్గ.

శ్రీ రాముడు విశ్వామిత్రుని చూచి ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! సగరుడు తాను సంకల్పించిన యజ్ఞమును ఎలా నిర్వహించాడు. తెలియ జేయండి." అని అడిగాడు.

విశ్వామిత్రుడు ఇలా చెప్పనారంభించాడు. " ఓ రామా! సగరుని యజ్ఞము హిమాచలము వింధ్యపర్వతము మధ్య జరిగింది. సగరుడు యజ్ఞాశ్వమును విడిచి పెట్టాడు. సగరుని మనుమడైన అంశు మంతుడు ఆ యజ్ఞాశ్వమునకు రక్షణగా వెంట బయలుదేరాడు. సగరుడు యజ్ఞము చేయడం ఇష్టం లేని ఇంద్రుడు రాక్షస రూపం ధరించి వచ్చి యజ్ఞాశ్వమును అపహరించాడు. అశ్వము కనపడలేదు. ఋత్విక్కులందరూ సగరునితో ఇలా అన్నారు.

" ఓ సగర చక్రవర్తీ! యజ్ఞాశ్వమును ఎవరో అపహరించారు. యజ్ఞాశ్వము లేనిదే యజ్ఞము జరగదు. కాబట్టి యజ్ఞాశ్వమును తీసుకొని రావలెను." అని అన్నారు.

ఆ మాటలు విన్న సగరుడు తన 60,000 మంది కుమారులతో ఇలా అన్నాడు. " ఓ కుమారులారా! ఇది మంత్రములతో పవిత్రమైన స్థలము. ఇక్కడకు రాక్షసులు రాలేరు. ఇది రాక్షసుల పని కాదు. కాబట్టి మీరు భూమండలము అంతా వెదకండి. భూమి ఉపరి తలము మీద దొరకకపోతే మీ రందరూ ఒక్కొకరు ఒక్కొక్క యోజనము చొప్పున భూమిని తవ్వండి. అశ్వము దొరికే వరకు తవ్వండి. యజ్ఞాశ్వమును తీసుకొని రండి. మీరు అశ్వమును తీసుకొని వచ్చే వరకూ నేను.ఋత్విక్కులు, నా మనుమడు ఇక్కడనే మీ కోసము నిరీక్షిస్తూ ఉంటాము." అని పలికాడు సగరుడు..

తండ్రి ఆజ్ఞ ప్రకారము సగర పుత్రులు యజ్ఞాశ్వమును వెదుకుతూ వెళ్లారు. వారికి ఎక్కడా అశ్వము కనపడలేదు. వారు భూమిని తవ్వ నారంభించారు. వారు అలా భూమిని తవ్వుతూ ఉండగా ఎన్నో సర్పములు, అసురులు బయటకు వచ్చారు. 60,000 మంది సగర పుత్రులు ఒక్కొక్కరు ఒక్కొక్క యోజనము వంతున అరవై వేల యోజనములు తవ్వారు. భూమి అంతా పాతాళంగా మారి పోయింది. పెద్ద గొయ్యిగా తయారయింది. సగర పుత్రులు జంబూ ద్వీపము అంతా తవ్వేశారు.

ఇది చూచి దేవతలరు, గంధర్వులు, నాగులు అందరూ బ్రహ్మ దేవుని వద్దకు వెళ్లారు. "ఓ బ్రహ్మ దేవా! యజ్ఞాశ్వము కొరకు సగర పుత్రులు భూమి నంతా తవ్వుతున్నారు. పాతాళంలో తపస్సు చేసుకుంటున్న ఋషులను చంపుతున్నారు. దొరికన వాడిని దొరికనట్టు చంపుతున్నారు. ఎన్నో జీవజాలములు నశించి పోతున్నాయి. నీ సృష్టి అంతా సర్వ నాశనము అయి పోతోంది. మీరే

కాపాడాలి.” అని బ్రహ్మదేవునితో మొరపెట్టుకున్నారు.

శ్రీమద్రామాయణము

బాల కాండ  ముప్పది తొమ్మిదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

నలభయ్యవ సర్గ.

భయంతో వణికి పోతున్న దేవతలతో బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు.

" ఓ దేవతలారా! భయపడకండి. ఈ భూమి ఆ సర్వేశ్వరుడు విష్ణువుకు చెందినది. ఆయన కపిలావతారములో ఈ భూమిని రక్షిస్తున్నాడు. ఆ సగర కుమారులను ఆయనే శిక్షిస్తాడు. ఆ సగర కుమారుల చావు కపిలుని చేతిలో ఉంది." అని అన్నాడు.

ఆ మాటలు విన్న దేవతలు తమ తమ స్థానములకు వెళ్లిపోయారు. సగర కుమారులు భూమిని తవ్వుతూనే ఉన్నారు. కాని వారికి యజ్ఞాశ్వము కనపడలేదు. కాని వారికి ఒక పెద్ద శబ్దము వినిపించింది. కాని వారు ఆ శబ్దమును లక్ష్యపెట్టలేదు. తమ తండ్రి సగరుని వద్దకు తిరిగి వచ్చారు.

"తండ్రీ! మీరు చెప్పినట్టు మేము భూమి అంతా తవ్వాము. యక్ష, గంధర్వ, నాగ జాతులను చంపాము. కాని మాకు యజ్ఞాశ్వము కనపడలేదు. ఇప్పుడు ఏం చెయ్యాలో చెప్పండి." అని అడిగారు.

కుమారుల మాటలు విన్న సగరుడికి కోపం మిన్నుముట్టింది.

"మీరు ఇంకా భూమిని తవ్వండి. అశ్వమును పట్టండి. అశ్వము లేకుండా తిరిగిరాకండి." అని ఆజ్ఞాపించాడు సగరుడు.

సగరకుమారులు మరలా భూమిని తవ్వడం మొదలెట్టారు. అందరూ పాతాళ లోకము చేరుకున్నారు.

వారికి భూమండలమును మోస్తున్న విరూపాక్షము అనే ఏనుగు కనపడింది. సగరకుమారులు దానికి నమస్కరించి మరలా తవ్వనారంభించారు. వారికి తూర్పుదిక్కుగా మరొక ఏనుగు కనిపించింది. దాని పేరు మహాపద్మము అనే దిగ్గజము. అది కూడా తన శిరస్సు మీద భూమండలమును మోస్తున్నది. ఆ ఏనుగును చూచి సగర కుమారులు ఆశ్చర్య పోయారు. సగరకుమారులు ఆ ఏనుగుకు కూడా ప్రదక్షిణము చేసి నమస్కారము చేసారు. ఆ సారి పశ్చిమ దిక్కుగా తవ్వసాగారు. పశ్చిమ దిక్కున కూడా వారికి భూమండలము తన శిరస్సున మోస్తున్న సౌమనసము అనే దిగ్గజము కనిపించింది. వారు ఆ దిగ్గజమునకు కూడా నమస్కరించి, ఉత్తర దిక్కుగా తవ్వనారం భించారు. ఉత్తరదిక్కున కూడా వారికి భూమండలము ను మోస్తున్న భద్ర అనే దిగ్గజము కనిపించింది. సగర కుమారులు ఆ దిగ్గజమునకు కూడా పూజాదికములు నిర్వహించి నమస్కరించారు.

తరువాత వారు ఈశాన్య దిక్కుగా తవ్వనారంభించారు. ఈశాన్య దిక్కుగా వారికి గడ్డిమేయుచున్న యజ్ఞాశ్వము కనిపించింది. ఆ అశ్వమునకు కొంత దూరంలో మహావిష్ణు అవతారమైన కపిల మహర్షి తపస్సు చేసుకుంటూ కనిపించాడు.

అశ్వమును చూడగానే వారి శరీరాలు కోపంతో కంపించాయి. ఆ కపిలుడే తమ అశ్వమును దొంగిలించాడు అని అనుకొని తమ వద్దఉన్న ఆయుధములతో  కపిలుని మీదికి దూకారు.

"ఓరీ! నీవేనా మా యజ్ఞాశ్వమును దొంగిలించినది. మేము ఎవరమో తెలియునా! మేము సగర చక్రవర్తి కుమారులము. మా యజ్ఞాశ్వమునే దొంగిలిస్తావా!" అంటూ కపిలుని చుట్టుముట్టారు.

కపిలుడు కళ్లు తెరిచాడు. వారిని చూచాడు. ఒక్కసారి కోపంతో హుంకరించాడు. ఆ కపిలుని హుంకారం లోనుండి  పుట్టిన అగ్నిలో సగరుని కుమారులు 60,000 మంది భస్మం అయిపోయారు.

శ్రీమద్రామాయణము
బాలకాండ నలభయ్యవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్  ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### నలభై ఒకటవ సర్గ.

ఇక్కడ సగరుడు తన కుమారుల రాక కోసరం ఎదురు చూస్తున్నాడు. ఎన్నాళ్లకూ తన కుమారులు యజ్ఞాశ్వముతో తిరిగి రాలేదు. అందుకని సగరుడు తన మనుమడైన అంశుమంతుని పిలిచి అతనితో ఇలా అన్నాడు.

"కుమారా! నీవు వీరుడవు. పరాక్రమవంతుడవు. నీ పినతండ్రులు యజ్ఞాశ్వము కొరకు వెళ్లి చాలా కాలం అయింది. వారు ఇంకా తిరిగి రాలేదు. నీవు పోయి వారి జాడ కనుక్కొని రా. యజ్ఞాశ్వముతో తిరిగి రా! జాగ్రత్త! నీవు మహాబలవంతులతో పోరాడవలసి ఉంటుంది. కాబట్టి కావలసిన అస్త్ర శస్త్ర ములను తీసుకొని వెళ్లు. నీకు నమస్కరించిన వారికి తిరిగి నమస్కరించు. నిన్ను ఎదిరించినవారిని నాశనం చెయ్యి. విజయుడవై తిరిగిరా!" అని పలికాడు.

సగరుడి మనుమడు అయిన అంశుమంతుడు తాతగారికి నమస్కరించి తన పినతండ్రులను వెతుకుతూ బయలుదేరాడు. అంశు మంతుడు తన పిన తండ్రులు తవ్విన మార్గమును వెతుకు కుంటూ వెళ్లాడు. దారిలో అంశుమంతుడు దిగ్గజములను చూచాడు. వారిని తన పినతండ్రుల జాడను గురించి అడిగాడు. ఆ దిగ్గజములు చూపిన

మార్గములో వెళ్లి అంశుమంతుడు తన పినతండ్రుల భస్మరాసుల వద్దకు వెళ్లాడు. తన పిన తండ్రులు అలా భస్మరాసులుగా మారడం చూచి ఎంతో బాధపడ్డాడు. పక్కనే పచ్చిమేయుచున్న యజ్ఞాశ్వమును చూచాడు.

ఇంక మిగిలింది తన పిన తండ్రులకు తర్పణములు విడవాలి. దానికి జలము కావాలి. చుట్టూ చూచాడు ఎక్కడా జలాశయము కనపడలేదు. అప్పుడు గరుడుడు అక్కడకు వచ్చాడు. గరుడుడు వరుసకు సగర పుత్రులకు మేనమామ అవుతాడు. గరుడుడు అంశు మంతుని చూచి ఇలా అన్నాడు.

"కుమారా! నీ పినతండ్రుల మరణమునకు చింతింపకుము. వారి మరణమునకు లోకములు అంతా హర్షిస్తున్నాయి. నీ పినతండ్రులు అటువంటి దుర్మార్గులు. నీ పిన తండ్రులు కపిల మహర్షి శాపముతో భస్మము అయ్యారు. వీరికి ఉదక తర్పణము ఇవ్వడం ఉచితము కాదు. నీవు గంగానదిలో వీరికి తర్పణములు విడువుము. ఆ గంగానదీమ తల్లి వీరి భస్మరాసులను తడిపినపుడు మాత్రమే వీరికి స్వర్గలోక ప్రాప్తి కలుగ గలదు. కాబట్టి నీవు వీరిని గురించి చింతింపక హయమును తీసుకొని పోయి నీ తాతగారి యజ్ఞమును నిర్వర్తింపుము." అని అన్నాడు.

గరుడుని మాట ప్రకారము అంశుమంతుడు యజ్ఞాశ్వమును తీసుకొని తన పురమును చేరుకున్నాడు. యజ్ఞ దీక్షలో ఉన్న సగర చక్రవర్తితో జరిగినది అంతా చెప్పాడు. గరుడుడు తనకు తెలిపిన విషయములు అన్నీ చెప్పాడు. యజ్ఞాశ్వమును ఆయనకు

అప్పగించాడు.

సగరుడు తన కుమారుల మరణమునకు చింతించాడు. తరువాత తేరుకొని యధావిధిగా యజ్ఞమును పూర్తిచేసాడు. ఇప్పుడు గంగను తీసుకొని వచ్చి కుమారుల భస్మరాసులను తడపడం ఎలాగా అని ఆలోచిస్తున్నాడు సగరుడు. ఎందుకంటే పవిత్రగంగాజలం వారి భస్మరాసుల మీద పారితే గానీవారికి స్వర్గలోకము సిద్ధించదు. గంగ దేవతల అధీనములో స్వర్గములో ప్రవహిస్తూ ఉంది. దానిని భూమి మీదకు తీసుకొని వచ్చు ఉపాయము దొరకలేదు సగరునకు.

సగరుడు 30,000 సంవత్సరములు రాజ్యపాలన చేసాడు కానీ గంగను మాత్రము భూమి మీదకు తీసుకొని రాలేకపోయాడు. కాలము తీరి సగరుడు స్వర్గస్థుడయ్యాడు.

శ్రీమద్రామాయణము
బాలకాండ నలుబది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### నలభై రెండవ సర్గ.

సగర చక్రవర్తి మరణించిన తరువాత ఆయన మనుమడు అంశు మంతుడు చక్రవర్తి అయ్యాడు. అంశు మంతుని కుమారుడు దిలీపుడు. అంశు మంతుడు దిలీపునకు రాజ్యము కట్టబెట్టి తాను తపస్సు చేసుకోడానికి అరణ్యములకు వెళ్లాడు.

దిలీపుడు తన పితామహులకు స్వర్గ లోక ప్రాప్తి కలిగించుటకు ఆకాశ గంగను భూమి మీదికి ఎలా తీసుకురావాలా అని ఆలోచిస్తున్నాడు. కాని తగిన ఉపాయము దొరకలేదు. ఆ మనోవ్యధతోనే దిలీపుడు మరణించాడు.

ఆ దిలీపుని కుమారుడు భగీరథుడు. భగీరథునికి పుత్ర సంతానము లేదు. భగీరథునికి సంతానము కావలెనని తీవ్రమైన కోరిక కలిగింది. దానికి తోడు తన ప్రపితామహులకు స్వర్గలోక ప్రాప్తి కలిగించుట. ఈ రెండు కోరికలతో భగీరథుడు బ్రహ్మదేవుని గూర్చి తపస్సు చేసాడు. భగీరథుని తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయ్యాడు.

" ఓ భగీరథా! నీ తపస్సుకు మెచ్చాను.నీకు ఏం వరం కావాలో

కోరుకో" అని అడిగాడు బ్రహ్మ.

"దేవా! నాకు పుత్ర సంతానము ప్రసాదించండి. తరువాత ఆకాశ గంగను భూమీ మీదకు పంపండి. ఆ ఆకాశ గంగతో నా ప్రపితా మహులకు జలతర్పణము వదులుతాను."అని కోరుకున్నాడు.

" ఓ భగీరథా! నీకు సంతాన ప్రాప్తి కలుగుతుంది. కాని ఆకాశ గంగను భూమి మీదికి తేవడం అత్యతం కష్టమైన పని. కాని నీవు కోరావు కాబట్టి ఆ వరం కూడా ప్రసాదిస్తున్నాను. గంగాదేవి హిమవంతుని పెద్దకుమార్తె. హిమవంతుని రెండవ కుమార్తె ఉమను సదాశివుడు వివాహమాడాడు. ఆకాశము నుండి భూమి మీదికి దూకే గంగానదిని భరించే శక్తి ఆ మహేశ్వరునికి తప్ప వేరే ఎవరికీ లేదు. ఎందుకంటే ఆకాశము నుండి భూమి మీదికి దిగే గంగాప్రవాహాన్ని భరించే శక్తి భూమికి లేదు. మధ్యలో మహేశ్వరుడు ఆ గంగను భరించాలి. కాబట్టి నీవు మహేశ్వరుని ప్రార్థించి గంగాదేవిని వహించమని కోరాలి." అని అన్నాడు బ్రహ్మదేవుడు.

బ్రహ్మదేవుడు ఈ విషయం గంగాదేవితో కూడా చెప్పాడు. ఆమె అనుమతి కూడా తీసుకున్నాడు. తరువాత బ్రహ్మదేవుడు తన లోకమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

బాలకాండ నలుబది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

నలభై మూడవ సర్గ.

బ్రహ్మదేవుడు వెళ్లిపోయిన తరువాత భగీరథుడు  ఒంటికాలి మీద నిలబడి ఒక సంవత్సరము పాటు మహాశివుని గూర్చి తపస్సు చేసాడు. భగీరథుని తపస్సుకు మెచ్చి మహాశివుడు ప్రత్యక్షం అయ్యాడు.

"ఓ భగీరథా! నీ తపస్సుకు మెచ్చాను. నీవు కోరినట్టు హిమవంతుని కుమార్తె అయిన గంగను నా శిరస్సున ధరిస్తాను."అని అన్నాడు.

అప్పుడు దేవలోకములో ప్రవహించు గంగానది మహా వేగంతో భూమి మీదికి దూకింది. ఆ ప్రవాహాన్ని శివుడు తన శిరస్సును అడ్డుపెట్టి ఆపాడు. గంగకు కోపం వచ్చింది.

" ఏమీ! నా ప్రవాహ వేగాన్ని శివుడు ఆపగలడా! నేను ఆ మహాశివునితో సహా పాతాళము ప్రవేశిస్తాను." అని మనసులో అనుకొంది గంగ.

గంగ ఆలోచనను గ్రహించాడు శివుడు. మహాశివుడు తన శిరస్సుమీద పడ్డ గంగను తన శిరస్సుమీద  ఉన్న జటాజూటములలో

బంధించాడు. గంగా దేవి ఎంత ప్రయత్నించిననూ ఆ జటాజూటములలో నుండి బయటకు రాలేకపోయింది.

ఆకాశము నుండి బయలు దేరిన గంగ భూమి మీదికి దిగి రాలేదు. కారణం తెలియక భగీరథుడు వ్యాకుల పడ్డాడు. మరలా ఈశ్వరుని గూర్చి తపస్సు చేసాడు. భగీరథుని తపస్సుకు సంతోషించిన మహాశివుడు గంగను  బిందు సరోవర ప్రాంతంలో భూమి మీదికి విడిచి పెట్టాడు.

శివుని జటాజూటములలో నుండి విడివడిన గంగ తీవ్రమైన వేగంతో భూమి మీదికి ఏడు ప్రవాహములుగా   ప్రవహించింది.  ఆ ఏడు ప్రవాహములలో హ్లాదినీ, పావనీ, నళినీ అనే మూడు నదులు తూర్పుదిక్కుగా ప్రవహించాయి. సుచక్షువు, సీత, సింధు అనే మూడు నదులు పడమర దిక్కుగా ప్రవహించాయి. ఏడవది ఆఖరుది అయిన ప్రవాహము భగీరథుని అనుసరించింది.

భగీరథుడు తన రథము మీద ముందు వెళుతుంటే ఆ రథము వెంట గంగ ప్రవహించింది. గంగానది ఆకాశము నుండి భూమి మీదక ప్రవహిస్తుంటే దేవతలు, గంధర్వులు ఆశ్చర్యంగా చూస్తున్నారు. గంగావతరణమును కనులారా చూచుటకు దేవలోకములోని వారందరూ తమ తమ వాహనముల మీద ఆకాశములో నిలబడ్డారు.

ఆ గంగానది నురగలు కక్కుకుంటూ భూమి మీదికి దూకుతూ ఉంది. భూమి మీదికి దిగిన గంగ కొన్ని చోట్ల మెల్లగానూ, మరి కొన్ని చోట్ల దూకుడుగాను, కొన్ని చోట్ల వంకర టింకర గానూ, కొండలను

కోనలను దాటుకుంటూ ప్రవహిస్తూ ఉంది.

ఆగంగానది మొదట ఆకాశమునుండి మహాశివుని శిరస్సు మీద పడి అక్కడి నుండి భూమి మీదికి తన నిర్మల జలాలను ప్రవహించింది. ఆ గంగలో స్నానము చేసిన వారి సమస్త పాపములు నశించి పోయాయి. గంగా స్నానము ఆచరించిన వారు స్వర్గలోక ప్రాప్తి పొందారు. గంగలో మునిగిన వారి శారీరక బాధలు అన్నీ మటుమాయం అయ్యాయి.

భగీరథుని వెంట గంగానది వెళుతుంటే గంగానది వెంట దేవతా గణములు అన్ని వెళుతున్నాయి. సర్వ పాపములను పోగొట్టే గంగానది భగీరథుడు ఎటు వెళితే అటువెళుతూ ఉంది.

మార్గ మధ్యంలో జహ్ను మహాముని ఆశ్రమం వచ్చిది. తన ఆశ్రమం వద్ద జహ్నుమహాఋషి యాగము చేస్తున్నాడు. గంగానది ఆ ఆశ్రమమును ముంచి వేసింది. అది చూచిన జహ్ను మహాఋషికి కోపం వచ్చింది. గంగానది గర్వము అణచుటకు ఉధృతంగా ప్రవహిస్తున్న గంగా జలమును అంతా త్రాగివేసాడు.

ఇది చూచి దేవతలు అందరూ ఆశ్చర్యపోయారు. భగీరథుడు, దేవతా గణములు అందరూ జహ్ను మహాఋషిని పూజించి గంగను విడువమని వేడుకున్నారు. వారి పూజలకు సంతసించిన జహ్నువు తన చెవులనుండి గంగా ప్రవాహమును విడిచిపెట్టాడు. అప్పటి నుండి గంగానదికీ జాహ్నవి, జహ్నుసుత అనే పేర్లు వచ్చాయి.

గంగానది మరలా భగీరథుని అనుసరించి ప్రవహించసాగింది. సగర పుత్రులకు మోక్షము కల్గించాడినికి భగీరథుడు గంగను పాతాళమునకు తీసుకొని వెళ్లాడు. గంగ సగరపుత్రుల భస్మరాసుల మీదుగా ప్రవహించింది. పవిత్రమైన గంగాజలములలో మునిగి సగర పుత్రులు అందరూ వారి వారి పాపములు నశించి, స్వర్గలోకము చేరుకున్నారు.

శ్రీమద్రామాయణము,

బాలకాండ, నలుబది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### నలభై నాల్గవ సర్గ.

భగీరథుని మనోరథమునెరవేరినది. గంగా జలము సగర పుత్రుల భస్మరాసుల మీద ప్రవహించినది. వారిని పునీతులను చేసినది. వారందరికీ స్వర్గలోక ప్రాప్తి కలిగించినది. అప్పుడు బ్రహ్మదేవుడు భగీరథునితో ఇలా పలికాడు.

" నీవు కోరినట్టు గంగ సగరపుత్రుల భస్మరాసుల మీదుగా ప్రవహించినది. 60,000 మంది సగర కుమారులు స్వర్గమునకు వెళ్లినారు. సాగరములు ఉన్నంత వరకూ వారు స్వర్గములో ఉండగలరు. గంగను నీవు స్వర్గము నుండి భూమికి తీసుకొని వచ్చావు కాబట్టి ఆమె నీకు పుత్రికతో సమానము. అందుకని గంగ ఇప్పటి నుండి భాగీరథి అనే పేరులో పిలువబడుతుంది. ఈ గంగ దేవ లోకము నుండి భూలోకమునకు అక్కడి నుండి పాతాళమునకు ప్రవహించింది కాబట్టి గంగకు త్రిపథ అనే పేరుతో కూడా పిలువ బడుతుంది.

ఓ భగీరథా! ఈ పవిత్ర గంగా జలముతో నీ పితరులకు తర్పణములు విడిచి నీ మాట నిలబెట్టుకో. ఎందుకంటే పూర్వము సగర

చక్రవర్తి మనుమడు అంశుమంతుడు, దిలీపుడు, ఎవరూ ఈ పని చేయలేకపోయారు. దేవలోకములో ఉన్న గంగను భూలోకమునకు తీసుకొని వచ్చి మహోపకారము చేసావు. అఖండ మైన కీర్తి ప్రతిష్టలు సంపాదించుకున్నావు. ఈ రోజు నుండి ప్రతిరోజూ ఈ పుణ్య గంగాజలములలో స్నానము చేసి పునీతుడవు కా! నీకు పుణ్యం వస్తుంది." అని పలికాడు బ్రహ్మ. తరువాత బ్రహ్మ తనలోకమునకు వెళ్లిపోయాడు.

తరువాత భగీరథుడు తన పితరులకు, పితామహులకు, ప్రపితామహులకు జల తర్పణములు విడిచి వారికి పుణ్యలోకములు ప్రాప్తించేటట్టు చేసాడు.

ఓ రామా! ఇదీ గంగావతరణము కథ. ఈ గంగావతరణము కథ చదివిన వాడు, విన్న వాడు పాపములు నశించి పుణ్యలోకములు పొందుతాడు. రామా! సంధ్యాకాలము అయినది. వెళ్లి సంధ్యావందనాది కార్యక్రమములు నిర్వర్తించెదము." అని పలికాడు విశ్వామిత్రుడు.

శ్రీమద్రామాయణము

బాలకాండ నలుబది నాలుగవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

నలభై ఐదవ సర్గ.

విశ్వామిత్రుడు చెప్పిన గంగావతరణము కథను ఆశ్చర్యముతో విన్నారు రామ లక్ష్మణులు. ఆ రాత్రి అంతా  గంగావతరణము కథనే మననం చేసుకుంటూ నిద్రపోయారు.

మరునాడు పొద్దుటే లేచారు. సంధ్యావందనాది కార్యములు పూర్తి చేసుకున్నారు. ఇద్దరూ విశ్వామిత్రుని వద్దకు వచ్చారు. విశ్వామిత్రునికి నమస్కరించి ఆయన పక్కన నిలబడ్డారు. అప్పుడు రాముడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! మీరు చెప్పిన గంగావతరణము కథ మాకు ఎంతో సంతోషమును ఆశ్చర్యమును కలిగించింది. గడిచిన రాత్రి అంతా నేను లక్ష్మణుడు ఆ కథనే మననం చేసుకున్నాము. మనము ఇప్పుడు ఆ పవిత్ర గంగానదిని దాటాలి కదా. అందుకు తగిన ఏర్పాట్లు  ఈ ఆశ్రమములో ఉన్న మునికుమారులు చేసారు." అని వినయంగా చెప్పాడు రాముడు.

తరువాత విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు, వారితో వచ్చిన మునులు అందర గంగానదిని దాటారు. విశాల నగరము చేరుకున్నారు.

ఆ విశాల నగరము చూచి రాముడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు. " ఓ మహర్షీ! ఈ నగరమును ఎవరు పరిపాలిస్తున్నారు? వారు ఏ రాజవంశమునకు చెందిన వారు? వారి చరిత్ర ఏమిటి? మాకు వివరించండి." అని అడిగాడు.

అప్పుడు విశ్వామిత్రుడు రామ లక్ష్మణులకు మునులకు విశాల నగర వృత్తాంతమును చెప్పడం మొదలు పెట్టాడు.

" ఓ రామా! ఇప్పుడు నీకు ఈ ప్రదేశములో ఏమి జరిగిందో సవిస్తరంగా చెబుతాను విను. కృతయుగములో దితి పుత్రులు, అదితి పుత్రులు ఉండేవారు. వారు మహా బలవంతులు. పరాక్రమ వంతులు. ధార్మికులు కూడా. వారందరికీ ఒక కోరిక కలిగింది. తమకు రోగములు, ముసలి తనము, మరణము, లేకుండా ఉండాలని కోరుకున్నారు. దానికి తగిన ఉపాయము గురించి ఆలోచింప సాగారు.

వారికి ఒక అద్భుతమైన ఆలోచన వచ్చింది. క్షీర సాగరమును మథించి అమృతమును పొందాలని అనుకున్నారు. దితి పుత్రులు, అదితి పుత్రులు క్షీరసాగరమును మథించాలని నిశ్చయించుకున్నారు. మంథర పర్వతమును పెకలించి తెచ్చి క్షీరసాగరం లో పడవేసారు. వాసుకిని తాడుగా ఆ పర్వతమునకుచుట్టారు. మంథర పర్వతము కవ్వముగా, వాసుకి తాడుగా క్షీరసాగరమును చిలకసాగారు.

ఒక వెయ్యి సంవత్సరములు గడిచాయి. వాసుకి తన తలల నుండి విషాన్ని కక్కడం మొదలెట్టాడు. ఆ విషంలో నుండి హాలా హలము పుట్టింది.  ఆ హాలా హలము జగత్తును అంతటినీ దహించసాగింది. దేవతలందరూ ఆ హాలా హలము నుండి లోకాలను రక్షించమని మహేశ్వరుడిని ప్రార్థించారు.

ఇంతలో విష్ణు మూర్తి కూడా అక్కడకు వచ్చాడు.  మహావిష్ణువు చిరునవ్వు నవ్వుతూ మహేశ్వరునితో ఇలా అన్నాడు. "ఓ మహా దేవా! నీవు అందరి కన్నా పెద్ద వాడివి. దేవాసురులు క్షీరసాగరం మథిస్తుంటే ముందు హాలా హలము పుట్టింది. అందరి కన్నా పెద్దవాడికి నువ్వు కాబట్టి, ముందు పుట్టిన హాలా హాలమును గ్రహించుటకు నీవే సమర్థుడివి. కాబట్టి పెద్దవాడిగా ఆ హాలా హలమును తీసుకో." అని అన్నాడు.

తరువాత మహావిష్ణువు అక్కడి నుండి వెళ్లిపోయాడు. మహా శివుడు హాలా హలమును అమృతము మాదిరి తాగాడు. తరువాత శివుడు కూడా వెళ్లిపోయాడు. మరలా దేవతలు అసురులు క్షీరసాగరమును మథించసాగారు.

ఇంతలో మరొక ఉత్పాతము జరిగింది. కింద ఆధారము ఏమీ లేక పోవడంతో, మంధర పర్వతము క్షీరసాగరం అడుక్కు పోసాగింది. అప్పుడు మరలా దేవతలు, అసురులు విష్ణుమూర్తిని ప్రార్థించారు.

" ఓ మహాబాహో! సర్వ భూతములకు నీవే దిక్కు. మా మొర ఆలకించి ఈ మంధర పర్వతమును పైకెత్తు. మాకు సాయం చెయ్యి."

అని ప్రార్థించారు.

దేవతల మొరను విన్న విష్ణువు తాను కూర్మ రూపం (తాబేలురూపం) ధరించి ఆ మంధర పర్వతము కింద చేరాడు. మంథర పర్వతము కుంగి పోకుండా ఎత్తి పట్టుకున్నాడు. తరువాత దేవ దానవులు మరలా క్షీరసాగరమును మథించసాగారు.

మరలా వేయి సంవత్సరములు గడిచిపోయాయి. అప్పుడు ధన్వంతరి, అప్సరసలు క్షీరసాగరంలో నుండి పుట్టారు. "ఓ రామా! నీళ్లను మథించగా వచ్చిన రసము నుండి పుట్టిన వారు కాబట్టి వారికి అప్సరసలు అనే పేరు వచ్చింది. ఆ అప్సరసలు అరవైకోట్ల మంది పుట్టారు. ఆ అప్సరసలను వివాహం చేసుకోడానికి దేవదానవులలో ఎవరూ ముందుకు రాలేదు. అందుకని వారు ఎవరికీ చెందని సాధారణ స్త్రీలుగా ఉండిపోయారు.

తరువాత వరుణుని కుమార్తె వారుణి (మద్యమునకు అధిదేవత) తనను ఎవరు పరిగ్రహిస్తారా అని అనుకుంటూ బయటకు వచ్చింది. ఆ వారుణిని దితి పుత్రులు స్వీకరించలేదు. అదితి పుత్రులు స్వీకరించారు. ఆ కారణం చేత అనగా వారుణిని (సురను) స్వీకరించకపోవడం చేత దితి పుత్రులు అసురులు అయ్యారు. సురను స్వీకరించడం చేత అదితి పుత్రులు (దేవతలు) సురులు అయ్యారు.

మరలా క్షీర సాగర మథనం జరిగింది. క్షీర సాగరం లోనుండి ఉచ్చైశ్రవము అనే గుర్రము, కౌస్తుభము అనే మణి, దాని తరువాత అమృతము పుట్టాయి.

ఆ అమృతము కోసరము దేవతలు అసురులు యుద్ధము చేసుకున్నారు. అసురులు నాశనం అయ్యారు. ఆ యుద్ధములో అసురులు, దైత్యులు ఒక పక్షం చేరారు. అదితి పుత్రులైన దేవతలు ఒక పక్షం చేరారు. ఆ యుద్ధంలో అందరూ నాశనం అయ్యారు.

తరువాత శ్రీ మహావిష్ణువు మోహినీ రూపంలో అమృతమును హరించుకు పోయాడు. దానితో దానవులకు కోపం వచ్చింది. దానవులు, దైత్యులు అందరూ విష్ణువు తో యుద్ధానికి దిగారు. శ్రీ మహావిష్ణువు వారి నందరినీ సంహరించాడు. దేవతలకు అధిపతి దేవేంద్రుడు. దేవదానవ యుద్ధంలో అసురులను అందరినీ చంపి, దేవేంద్రుడు ముల్లోకములకు అధిపతి అయ్యాడు.

శ్రీమద్రామాయణము
బాలకాండ నలుబది ఐదవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### నలభై ఆరవ సర్గ.

"ఓ రామా! దేవాసుర యుద్ధంలో దితి కుమారులు అయిన దైత్యులు మరణించారు అని చెప్పాను కదా. తన కుమారుల మరణమునకు తల్లి దితి ఎంతో చింతించింది. తన భర్త అయిన కశ్యపుని  వద్దకు పోయి  ఇలా అడిగింది.

"నాధా! నీ కుమారులైన దేవతలు నా కుమారులైన దైత్యులను చంపివేసారు. ఆ దేవతలను చంపేవాడు నాకు పుత్రుడుగా కావాలి. దేవేంద్రుని చంపగల పరాక్రమ వంతుడిని నాకు పుత్రుడుగా ప్రసాదించు. నాకు కుమారుడు కావాలని నేను తపస్సు చేస్తాను. నాకు అనుమతి ఇవ్వండి." అని అడిగింది.

ఆ మాటలు విన్న కశ్యపుడు దితి తో ఇలా అన్నాడు. " ఓ దితీ! నీ కోరిక నెరవేరుతుంది. యుద్ధంలో ఇంద్రుని జయించ గల పుత్రుడు నీకు కలుగుతాడు." అని వరం ఇచ్చాడు. దితిని తన చేతితో ఒళ్లంతా తడిమాడు. దితిని ఆశీర్వదించి తపస్సుకు వెళ్లిపోయాడు కశ్యపుడు.

కశ్యపుని మాటలకు దితి చాలా ఆనందపడింది. తాను కూడా

కుశప్లవనము అనే ప్రదేశములో తపస్సు చేసింది.

ఆమె తపస్సు చేస్తున్న సమయంలో దేవేంద్రుడు స్వయంగా వచ్చి ఆమెకు పరిచర్యలు చేసాడు. అగ్ని కార్యము చేయుటకు సమిధలు, దర్భలు, నీళ్లు, పళ్లు అన్నీ సకాలములో సమకూర్చేవాడు. ఆమెకు శ్రమగా ఉంటే ఆమె కాళ్లు పట్టేవాడు. సకల ఉపచారములు చేసేవాడు. ఆ ప్రకారంగా 999 సంవత్సరములు ఆమె తపస్సు చేసింది. ఆమెకు దేవేంద్రుడు సేవలు చేస్తూనే ఉన్నాడు.

దేవేంద్రుడు చేసే సేవలకు చాలా ఆనందించింది దితి. "ఓ దేవేంద్రా! నేను పరాక్రమ వంతుడైన కుమారుని కొరకు నీ తండ్రి, నాభర్త అయిన కశ్యపుని వరం అడిగాను. వేయి సంవత్సరముల తరువాత నాకు కుమారుడు కలుగుతాడు అని నా భర్తనాకు వరం ప్రసాదించాడు. ఇంకొక పది సంవత్సరములలో నీకు మరొక సోదరుడు పుట్టబోతున్నాడు. నీవు, నా కుమారుడు కలిసి ఈ ముల్లోకములను పాలించండి." అని పలికింది.

తరువాత ఆమె నిద్రించడానికి లోపలకు వెళ్లింది. కాని తొందరగా నిద్ర పోవలెనని కోరికతో పొరపాటున ఆమె తల పెట్టుకొని నిద్రించ వలసిన వైపు కాళ్లు పెట్టుకొని నిద్రించింది. ఆమె ప్రమేయం లేకుండానే ఆమె తల వెంట్రుకలు ఆమె కాళ్లకు తగులుతున్నాయి. ఆ కారణం చేత ఆమె అపవిత్రము అయింది. ఆ ప్రకారంగా అపవిత్రమైన దితిని చూచి దేవేంద్రుడు సంతోషించాడు.

తరువాత ఇంద్రుడు ఆమె గర్భములోకి ప్రవేశించాడు. ఆమె

గర్భములో పెరుగుతున్న పిండమును ఏడు ముక్కలుగా నరికాడు. ఆ ప్రకారంగా నరక బడ్డ ఆ పిండము గట్టిగా ఏడ్చింది.

ఇంద్రుడు ఆ పిండమును చూచి " ఏడవ వద్దు ఏడవ వద్దు" అని అనునయిస్తూనే ఆ పిండమును ఖండిస్తున్నాడు.

ఆ ఏడుపు విని దితి మేలుకొంది. తన కడుపులోని పిండమును చంపవద్దని ఇంద్రుని వేడుకొంది. తన తల్లి అయిన దితి మాటను గౌరవించి ఇంద్రుడు ఆమె గర్భము లోనుండి బయటకు వచ్చాడు. దితిని చూచి ఇంద్రుడు ఇలా అన్నాడు.

"తల్లీ! నన్ను క్షమించు. నీవు తల వైపు కాళ్లు పెట్టుకొని, నీ తల వెంట్రుకలు నీ పాదములకు తగులునట్లు నిద్రించావు. అపచారము చేసావు. ఆ అపచారమును అవకాశముగా తీసుకొని నేను నీ గర్భములో ప్రవేశించాను. యుద్ధములో నన్ను చంపబోవు నీ కుమారుని గర్భములోనే ఏడు ముక్కలుగా ఖండించాను. నన్ను క్షమించు." అని ప్రార్థించాడు.

శ్రీమద్రామాయణము
బాల కాండ నలుబది ఆరవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము.

## బాలకాండ

### నలభై ఏడవ సర్గ.

తన గర్భములోనే ఏడు ముక్కలుగా ఖండింప బడిన తన కుమారుని తలుచుకొని దితి ఎంతో దు:ఖించింది. కాసేపటికి తేరుకుంది. దేవేంద్రుని చూచి ఇలా అంది.

"కుమారా! తప్పు నాది. నిన్ను అనవలసిన పని లేదు. నీ రక్షణ నీవు చూచుకున్నావు. నా గర్భస్థ శిశువును ఏడు ముక్కలుగా ఖండించావు. ఎటూ నా గర్భము విచ్ఛిన్నము అయింది. కానీ నీవు నాకు ఒక ఉ పకారము చెయ్యి. ఈ ఏడు ఖండములను ఏడు మరుత్తుస్థానములకు పాలకులుగా నియమించు.

నా ఏడుగురు కుమారులు దివ్య రూపములతో వాతస్కంధములకు స్థాన పాలకులు అగుదురు గాక! వారికి మరుత్తులు అనే పేరు సార్థకమగును గాక! ఈ మరుత్తులలో ఒకరు బ్రహ్మ లోకములోనూ, ఒకరు ఇంద్రలోకములోనూ, మూడవ వాడు వాయు లోకములోనూ నిత్యమూ తిరుగుతూ ఉండుదురుగాక! మిగిలిన నా నలుగురు కుమారులు నీ ఆజ్ఞకు లోబడి నాలుగు దిక్కులను పరిపాలించుదురు గాక!

నీవు నా కుమారుని ఖండించు నప్పుడు ఏడవకు ఏడవకు (మా రుత మా రుత) అని అనునయించావు. నా కుమారులు అదే పేరుతో మరుత్తులు అని పిలువ బడతారు." అని పలికింది దితి.

ఆమె మాటలు విని ఇంద్రుడు ఆమెకు సాష్టాంగ నమస్కారము చేసాడు. ఆమె ముందు చేతులు జోడించి నిలబడ్డాడు. "అమ్మా నీవు చెప్పినట్లే జరుగుతుంది. నీకు శుభం జరుగుతుంది." అని అన్నాడు. తరువాత దితి, దేవేంద్రుడు స్వర్గలోకము వెళ్లిపోయారు.

ఓ రామా! దితి ఇదే ప్రదేశములో తపస్సు చేసింది. ఆమెకు ఇంద్రుడు ఇక్కడనే ఉపచార ములు చేసాడు.

తరువాతి కాలంలో ఇక్ష్వాకునకు ఆలంబుస అను ఆయన భార్యకు విశాలుడు అనే కుమారుడు జన్మించాడు. ఆ విశాలుడు ఈ నగరాన్ని నిర్మించాడు. ఆయన పేరుతోనే ఈ నగరము విశాలపురము అని పిలువబడుతూ ఉంది.

ఆ విశాలుని కుమారుడు హేమ చంద్రుడు. హేమ చంద్రుని కుమారుడు సుచంద్రుడు. సుచంద్రుని కుమారుడు ధూమ్రాశ్వుడు. ధూమ్రాశ్వుని కుమారుడు సృంజయుడు. సృంజయుని కుమారుడు సహదేవుడు. సహదేవుని కుమారుడు కుశాశ్వుడు. కుశాశ్వుని కుమారుడు సోమదత్తుడు. సోమదత్తుని కుమారుడు కాకుత్థ్సుడు.

ఆ కాకుత్థ్సుని కుమారుడు ప్రస్తుతము విశాల నగరము పరిపాలిస్తున్న సుమతి. మనకు ఈ రాత్రికి ఇక్కడే విశ్రమించి రేపు

ఉదయము మిథిలానగరమునకు  ప్రయాణము కొనసాగిస్తాము." అని అన్నాడు విశ్వామిత్రుడు.

తాము వచ్చిన సంగతి విశాలపురమునకు రాజు సుమతికి వర్తమానము పంపారు. వెంటనే సుమతి సపరివార సమేతంగా విశ్వామిత్రుని ఎదురు వచ్చి ఆయనకు, ఆయన వెంట వచ్చినవారిని సాదరంగా ఆహ్వానించాడు. అర్ఘ్య పాద్యములను ఇచ్చి సత్కరించాడు. విశ్వామిత్రుని చూచి సుమతి ఇలా అన్నాడు.

"మహాత్మా! తమరు మా నగరానికి వచ్చి మమ్ములను కృతార్థులను చేసారు. మేము ధన్యులము అయ్యాము. నన్ను మించిన అదృష్టవంతుడు ఈ లోకంలో లేడు." అని పలికాడు సుమతి.

శ్రీమద్రామాయణము
బాలకాండ నలుబది  ఏడవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్  ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణం

## బాలకాండము

## నలభైఎనిమిదవ సర్గ.

సుమతి విశ్వామిత్రుడు పరస్పరము క్షేమసమాచారములు అడిగి తెలుసుకున్నారు. తరువాత సుమతి విశ్వామిత్రునితో ఇలా అన్నాడు.

"ఓ విశ్వామిత్ర మహర్షి! నీతో పాటు ఇద్దరు రాకుమారులు వచ్చారు. వారి మొహంలో దేవతలతో సమానమైన తేజస్సు కనపడుతూ ఉంది. వారి నడక సింహము నడకను పోలిఉంది. వారు అమితమైన బల పరాక్రమ ములు కలవారిగా కన్పట్టుచున్నారు. వారు విల్లు అమ్ములు ధరించి ఉన్నారు కాబట్టి క్షత్రియ కుమారుల వలె ఉన్నారు. ఇప్పుడిప్పుడే యౌవనము లోకి అడుగుపెడుతున్నారు. వారి సౌందర్యము అశ్వినీ దేవతలను మరిపించుచున్నది. వీరు ఎవరు? ఏ దేశపు రాకుమారులు? వీరి తల్లి తండ్రులు ఎవరు? మీ వెంట ఈ దుర్గమమైన అరణ్యములలో కాలి నడకన తిరుగుటకు కారణమేమి? తమరికి అభ్యంతరము లేకపోతే తెలపండి." అని అడిగాడు సుమతి.

విశ్వామిత్రుడు సుమతికి తాను సిద్ధ ఆశ్రమములో నివసించుట,

ఆశ్రమములో యాగము చేయ సంకల్పించుట, దానిని రాక్షసులు భగ్నచేయ ప్రయత్నించుట, తాను అయోధ్యకు పోయి దశరథుని రామలక్ష్మణులను యాగ సంరక్షణ కొరకు పంపమని అర్థించుట, దశరథుడు రామలక్ష్మణులను తన వెంట పంపుట, రామలక్ష్మణులు రాక్షసులను చంపుట, యాగమును రక్షించుట, తరువాత తాను రామలక్ష్మణులతో కలిసి మిథిలకు పోతూ దారిలో సుమతిని చూచుట వరకూ అన్ని విషయములు  చెప్పాడు.

విశ్వామిత్రుని మాటలకు సుమతి ఎంతో సంతోషించాడు. దశరథపుత్రులైన రామ లక్ష్మణులకు అతిథి సత్కారములు చేసాడు. ఆ రాత్రికి విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు, సుమతి మందిరములో విశ్రమించారు. మరునాడు వారు మిథిలకు ప్రయాణము అయ్యారు.

మిథిలా నగరముసమీపమునకు వచ్చారు. అక్కడ వారికి నిర్మానుష్యంగా ఉన్న ఒక  ఆశ్రమము కనపడింది. ఆ ఆశ్రమమును రాముడు చూచాడు. "ఓ విశ్వామిత్ర మహర్షీ! ఈ వనము ఎవరిది? ఇక్కడ ఎవ్వరూ లేరు. దీనికి కారణమేమి?" అని అడిగాడు. దానికి విశ్వామిత్రుడు ఇలా చెప్పసాగాడు.

"ఓ రామా! ఇది గౌతమ ముని ఆశ్రమము. ఆయన భార్య పేరు అహల్య. గౌతముడు ఈ ఆశ్రమములో తపస్సు చేసుకుంటూ ఉండే వాడు. ఒక రోజు దేవేంద్రుడు గౌతమముని ఆశ్రమములో లేని సమయమున, ఆయన  వేషము వేసుకొని ఆశ్రమములో ప్రవేశించాడు. అహల్యను చూచి ఇలా అన్నాడు.

"ఓ సుందరీ! నేను కాముకుడను. నిన్ను కామించాను. కాముకులు సమయము కొరకు వేచి ఉండరు కదా! నేను నీతో రతి సంగమ మును కోరుచున్నాను." అని అన్నాడు.

తన భర్త వేషములో వచ్చిన వాడు దేవేంద్రుడు అని తెలుసుకున్నది అహల్య. అహల్యకు దేవేంద్రునితో రతిక్రీడ సలుప వలెనని దుర్బుద్ధి పుట్టింది. దేవేంద్రుని మీద ఉన్న కోరికతో అతనితో రతిక్రీడకు అంగీకరించింది. తరువాత అహల్య సంతృప్తి చెందిన మనస్సుతో దేవేంద్రునితో ఇలా అన్నది.

"ఓ దేవేంద్రా! నేను కృతార్థురాలను అయ్యాను. (కోరిక తీరినదానను అయ్యాను). దేవేంద్రా! ఇక్కడి నుండి తొందరగా వెళ్లిపొండి. నా భర్త గౌతముడు వస్తే మన ఇద్దరికీ ప్రమాదము."అని అంది అహల్య.

అహల్య మాటలకు ఇంద్రుడు నవ్వాడు. " ఓ సుందరీ! నాకు చాలా ఆనందంగా ఉంది. ఎంతో తృప్తిగా ఉంది. నేను ఎలా వచ్చానో అలాగే వెళతాను." అని అన్నాడు ఇంద్రుడు.

ఓ రామా! ఆ ప్రకారంగా అహల్యతో సంగమించిన ఇంద్రుడు, ఎక్కడ గౌతముడు వచ్చి తనను చూస్తాడేమో అని భయపడుతూ, గౌతముని ఆశ్రమము నుండి త్వర త్వరగా బయటకు వచ్చాడు. ఇంతలో గౌతముడు, సమిధలను, దర్భలను తీసుకొని, ఆశ్రమమునకు రానే వచ్చాడు. తన వేషములో ఉన్న ఇంద్రుని చూచాడు. జరిగిన విషయం గ్రహించాడు.

గౌతముని చూచిన ఇంద్రుని మొహం వెల వెల బోయింది. ముని వేషములో ఉన్న ఇంద్రుని చూచి గౌతముడు ఇలా అన్నాడు.

"ఓ దుర్మతీ! నేను ఆశ్రమములో లేని సమయమున నా వేషము ధరించి నా ఆశ్రమములో ప్రవేశించి నాభార్యతో సంగమించిన నీకు ఇదే నా శాపము. నీ వృషణములు కిందపడిపోవు గాక!" అని శపించాడు. గౌతముని శాపము ఫలించింది. ఇంద్రుని వృషణములు నేల మీద పడిపోయాయి.

తరువాత గౌతముడు అహల్యను చూచాడు. తన భర్త ఇంద్రుని శపించడం చూచి గడా గడా వణికిపోయింది. గౌతముడు తన భార్య అహల్యను చూచి ఇలా అన్నాడు.

" అహల్యా! నీవు పాపం చేసావు. అందుకని నీవు ఇక్కడ అదృశ్యరూపంలో వేల సంవత్సరములు, మట్టిలో దొర్లుతూ, నిరాహారంగా, కేవలం గాలిని ఆహారంగా తీసుకుంటూ, తపస్సు చేసుకుంటూ, ఈ ఆశ్రమములో పడి ఉండు.

దశరథ కుమారుడైన రాముడు ఈ ఆశ్రమములో ప్రవేశించినపుడు నీకు శాపవిముక్తి కాగలదు. నీవు రాముని పూజించి ఆయనకు ఆతిధ్యము ఇచ్చి, శాపవిమోచనము పొందిన తరువాత, నీలో ఉన్న మోహము నశించి, పరిశుద్ధురాలవై నన్ను చేరగలవు." అని పలికాడు.

తరువాత గౌతముడు ఈ ఆశ్రమమును విడిచి హిమవత్పర్వమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము నలభై ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

బాలకాండ

నలభైతొమ్మిదవ సర్గ

ఆ ప్రకారంగా గౌతముని శాపముతో ఇంద్రుని వృషణములు కిందపడిపోయాయి. దానికి ఇంద్రుడు ఎంతో చింతించాడు. తన దగ్గరకు వచ్చిన అగ్ని, మొదలగు దేవతలతోనూ, ఋషులతోనూ ఇలా అన్నాడు.

"నేను మీ కోసం ఇదంతా చేసాను. గౌతమునికి కోపం తెప్పించి ఆయన తపస్సు భగ్నం చేసాను. ఆయన నాకు శాపం ఇచ్చేటట్లుగా చేసి ఆయన తపస్సు వృధా చేసాను. తద్వారా దేవ కార్యము సాధించాను. తుదకు నా వృషణములు పోగొట్టుకున్నాను. నేను మీ కోసం ఇదంతా చేసాను కాబట్టి మీరే నా వృషణములు నాకు మరలా వచ్చేట్టు చెయ్యాలి." అని అన్నాడు దేవేంద్రుడు.

దేవేంద్రుని మాటలు విన్న అగ్ని మిగిలిన దేవతలు అందరూ కలిసి పితృదేవతల వద్దకు వెళ్లారు.

"ఓ పితృ దేవతలారా! మానవుడు యజ్ఞములు చేయునపుడు మేషములను(మేకలు, గొర్రెలు) బలి ఇస్తారు. అందులో మేషము యొక్క వృషణములు మీకు హవిస్సుగా సమర్పిస్తారు. ఆ ప్రకారంగా యజ్ఞ సమయములో మీకు ఇవ్వబడిన మేషము యొక్క

వృషణములను మీరు వృషణములు లేని  దేవేంద్రునికి ఇవ్వండి." అని అన్నాడు.

అదే ప్రకారంగా పితృదేవతలు తమకు యజ్ఞములలో అర్పించిన వృషణములను దేవేంద్రునికి ఇచ్చారు. మేషము యొక్క వృషణము లను దేవేంద్రునికి అతికించారు.  పితృదేవతలు  తమకు యజ్ఞములలో లభించిన వృషణములను దేవేంద్రుడికి ఇచ్చారు కాబట్టి, అప్పటి నుండి పితృదేవతలు వృషణములు లేని మేషములనే ఆహారముగా తీసుకొంటున్నారు. దేవేంద్రుడు మేషవృషణుడు అయ్యాడు.

రామా! మనము ఇప్పుడు అహల్య ఉన్న ఆశ్రమములో ప్రవేశించి ఆమెకు శాపవిమోచన కలిగిద్దాము." అని అన్నాడు విశ్వామిత్రుడు.

తరువాత విశ్వామిత్రుడు, రామ లక్ష్మణులతో కలిసి అహల్య ఉన్న ఆశ్రమములోనికి ప్రవేశించాడు. రాముడు అహల్యను చూచాడు. అప్పటి దాకా గౌతముని శాప ప్రభావం వలన ఆమె ఎవరికి కనపడటం లేదు. కేవలం రామునికి మాత్రమే కనపడింది. రాముని దర్శనంతో ఆమె శాపం అంతం అయింది. ఆమె అందరికి కనపడింది. రామలక్ష్మణులు అహల్య పాదాలకు నమస్కరించారు.

అహల్యకు గౌతముని మాటలు గుర్తుకు వచ్చాయి. రాముని గుర్తించింది. అహల్య రామ లక్ష్మణులకు అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించింది. వారికి అతిథి మర్యాదలు చేసింది. ఈ అపూర్వ దృశ్యమును చూచి దేవతలు దుందుభులు మ్రోగించారు. అప్సరసలు నాట్యం చేసారు. దేవతలందరూ  అహల్యను మెచ్చుకున్నారు.

ఆ సమయంలో గౌతముడు కూడా అక్కడకు వచ్చాడు. శ్రీరామ దర్శనంతో పునీతమైన అహల్యను భార్యగా స్వీకరించాడు. అహల్య గౌతములు రాముని పూజించారు. రాముడు వారి పూజలందు కున్నాడు.

గౌతముడు అహల్యతో కూడి తపస్సుకు వెళ్లిపోయాడు. రాముడు, లక్ష్మణునితో సహా విశ్వామిత్రుని అనుసరించి మిథిలకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము
బాలకాండ నలభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభయ్యవ సర్గ

రాముడు, లక్ష్మణుడు, విశ్వామిత్రుడు మునులు అందరూ మిథిలా నగరము చేరుకున్నారు. జనకుడు చేయు యాగమునకు వచ్చిన ఆహూతులతో మిథిలా నగరము క్రిక్కిరిసి పోయింది. యాగమునకు వచ్చిన మునులకు వేసిన ఋషివాటికలతో మిథిలా నగరము నిండిపోయింది.

అప్పుడు రాముడు విశ్వామిత్రుని చూచి ఇలా అన్నాడు. "ఓ మునీంద్రా! ఇక్కడ అంతా జనసమ్మర్దముగా ఉంది. మనకు ఉండుటకు తగిన ప్రదేశమును నిర్ణయింపుడు." అని అన్నాడు.

అప్పుడు విశ్వామిత్రుడు జనసమ్మర్దములేని ప్రదేశములో, జలము బాగా దొరికే ప్రదేశములో తమకు అతిథిగృహమును ఏర్పాటు చేసాడు. ఇంతలో జనకునకు విశ్వామిత్రుడు యాగమునకు వచ్చాడు అన్న విషయం తెలిసింది.

జనక మహారాజు తన పురోహితుడు అయిన శతానందుని, ఋత్విక్కులను వెంట బెట్టుకొని విశ్వామిత్రుని వద్దకు వచ్చాడు. విశ్వామిత్రునకు అర్ఘ్యము పాద్యము అర్పించి పూజించాడు. జనకుడు ఇచ్చిన ఆతిథ్యమును సంతోషంతో స్వీకరించాడు విశ్వామిత్రుడు.

"ఓ జనక మహారాజా! నీకు క్షేమమేనా! నీ రాజ్యములో ప్రజలు క్షేమముగా ఉన్నారా! యజ్ఞము ఎట్టి అవాంతరములు లేకుండా

సక్రమంగా జరుగుతూ ఉందా!" అని అడిగాడు.

తరువాత విశ్వామిత్రుడు అక్కడకు వచ్చిన ఋత్విక్కులను, ఉపాధ్యాయులను, పురోహితులను ఉచిత రీతిని కుశల ప్రశ్నలు వేసి వారి క్షేమములు అడిగాడు. అప్పుడు జనక మహారాజు విశ్వామిత్రునికి నమస్కరించి ఆయనకు ఉచితాసనము సమర్పించాడు. విశ్వామిత్రుడు ఆసనము మీద కూర్చున్నాడు. తరువాత ఋత్విక్కులు, పురోహితులు, మంత్రులు కూడా తమ తమ ఆసనముల మీద కూర్చున్నారు. అప్పుడు జనక మహారాజు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు.

" ఓ మహర్షీ! మహాత్ములు, పుణ్యాత్ములు అయిన మీరు ఈ యజ్ఞమునకు వచ్చి నన్ను ధన్యుడిని చేసారు. తమరి దర్శనభాగ్యముతో నా యజ్ఞము సఫలమైనది. తమరి అనుగ్రహము నాకు పూర్తిగా లభించింది. ఓ విశ్వామిత్ర మహర్షీ! యజ్ఞము సమాప్తమగుటకు ఇంక పన్నెండు దినములు మిగిలి ఉన్నది. తరువాత వారి వారి హవిర్భాగములు స్వీకరించుటకు దేవతలు అందరూ వస్తారు." అని అన్నాడు..

తరువాత జనకుని దృష్టి రామలక్ష్మణుల మీద పడింది. వారిని చూచి జనకుడు విశ్వామిత్రుని ఇలా అడిగాడు.

"ఓ మహర్షి! ఈ రాకుమారులు ఎవరు? వీరు మహా పరాక్రమవంతుల మాదిరి కనపడుతున్నారు. వీరి నేత్రములు పద్మపత్రముల మాదిరి ఉన్నవి. వీరు దేవతల మాదిరి ప్రకాశిస్తున్నారు. వీరు ఇరువురూ ఒకే పోలికలతో ఉన్నారు. ఇప్పుడిప్పుడే యౌవనములోకి

అడుగుపెడుతున్నారు. వీరు ధనుర్బాణములను, ఖడ్గములను ధరించి ఉన్నారు. వీరిని చూస్తుంటే సూర్య చంద్రులు ఒకే సారి ప్రకాశిస్తున్నట్టు ఉంది. వీరు ఏ దేశము రాకుమారులు? మీ వెంట కాలి నడకన వచ్చుటకు కారణమేమి? మా దేశమునకు ఏ పనిమీద వచ్చారు? సెలవియ్యండి." అని వినయంగా అడిగాడు.

అప్పుడు విశ్వామిత్రుడు జనకునితో ఇలా అన్నాడు.

"ఓ జనకమహారాజా! వీరు క్షత్రియ కుమారులు. అయోధ్యా నగరమునకు అధిపతి అయిన ఇక్ష్వాకు వంశమునకు చెందిన దశరథ మహారాజునకు పుత్రులు. నేను సిద్ధాశ్రమములో ఒక యజ్ఞము తలపెట్టాను. ఆ యజ్ఞమును రాక్షసులు భగ్నం చేస్తున్నారు. అందుకని వీరిని వారి తండ్రి అనుమతితో యాగ సంరక్షణకు తీసుకొని వచ్చాను. వీరు ఇరువురు రాక్షసులను సంహరించి యాగమును సంరక్షించారు. తరువాత అహల్యా దర్శనము చేసుకొని, గౌతమ మహామునిని కలుసుకొని, అనంతరము మిథిలకు వచ్చారు. నీ వద్ద ఉన్న ధనుస్సును చూడటానికి కుతూహలపడుతున్నారు." అని విశ్వామిత్రుడు జనకునితో రామ లక్ష్మణులకు గురించి వివరంగా చెప్పాడు.

శ్రీమద్రామాయణము
బాలకాండము యాభయ్యవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై ఒకటవ సర్గ

జనకుని పక్కను ఉన్న శతానందుడు విశ్వామిత్రుని మాటలు విని పరమానంద భరితుడు అయ్యాడు. వెంటనే శతానందుడు విశ్వామిత్రుని చూచి సంభ్రమంతో ఇలా అన్నాడు.

" ఓ మహర్షీ! శ్రీరాముడు మా తల్లి అహల్యను చూచాడా! నీవు రామునికి మా తల్లి అహల్యను చూపించావా! మా తల్లి అహల్య రామునికి అతిథి సత్కారములు చేసినదా! దైవము ప్రతికూలించడం వలన మా తల్లి గారికి జరిగిన దురదృష్టము గురించి వివరంగా చెప్పావా! రాముని అర్చించిన తరువాత మా తల్లి అహల్య మా తండ్రి గౌతముని వద్దకు వెళ్లినదా! మా తండ్రి గౌతముడు ఆమెను స్వీకరించాడా! నా తండ్రి అయిన గౌతముడు శ్రీ రాముని పూజించాడా! అతిథి సత్కారములు చేసాడా! శ్రీ రాముడు నా తండ్రిని ఆదరించాడా! గౌరవించాడా! మహాత్ముడైన నా తండ్రిని శ్రీరాముడు పూజించాడా!" అని శతానందుడు ఆతురతతో విశ్వామిత్రుని ప్రశ్నించాడు.

ఆ మాటలు విన్న విశ్వామిత్రుడు శతానందునితో ఇలా అన్నాడు. "ఓ శతానందా! నేను చెప్పవలసినది అంతా రామునికి చెప్పాను. చేయవలసినది అంతా చేసాను. రేణుకా దేవి జమదగ్నిని చేరి నట్టు నీ తల్లి అహల్య  నీ తండ్రి గౌతముని చేరినది." అని విశ్వామిత్రుడు

శతానందునితో అన్నాడు.

ఆ మాటలు విన్న శతానందుడు శ్రీరామునితో ఇలా అన్నాడు. "శ్రీ రామా! సకల మహిమాన్వితుడైన విశ్వామిత్రుని వెంట మా మిథిలకు వచ్చిన నీకు మా స్వాగతము. ఈ విశ్వామిత్రుడు బ్రహ్మర్షి. వీరి సాంగత్యము చే నీవు ధన్యుడవు అయ్యావు. విశ్వామిత్రుడు తన గురించి నీకు చెప్పి ఉండడు. ఆ మహానుభావుని గురించి నేను చెబుతాను విను.

ఈ విశ్వామిత్రుడు జన్మతో క్షత్రియుడు. చక్రవర్తి. ధర్మవేత్త. సకల విద్యలను అభ్యసించాడు. శత్రువులను నిర్మూలించి ధర్మంగా రాజ్యపాలన చేసాడు. వీరి వంశము గురించి చెబుతాను విను.

ప్రజాపతి పుత్రుడు కుశుడు.  ఆ కుశుని కుమారుడు కుశనాభుడు. కుశనాభుని కుమారుడు గాధి. ఆ గాధి కుమారుడే ఈ విశ్వామిత్రుడు. అందుకే ఈయనను గాధేయుడు అని కూడా అంటారు. ఈ విశ్వామిత్రుడు వేల సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. ఒక అక్షౌహిణీ సైన్యముతో ఈ భూమి అంతా జైత్రయాత్ర చేసాడు. అందరు రాజులను ఓడించాడు.

ఆ ప్రకారంగా నగరములు, అరణ్యములు. ఋషివాటికలు అన్నీ తిరుగుతూ  వసిష్ఠుని ఆశ్రమమునకు వచ్చాడు. వసిష్ఠుని ఆశ్రమము వన్యమృగములు, ఫల వృక్షములతో చాలా ప్రశాంతంగా ఉంది.  ఎంతో మంది దేవ ఋషులు, దేవతలు, బ్రహ్మ ఋషులు వసిష్ఠుని దర్శనార్థము  ఆ ఆశ్రమమునకు వచ్చి వెళుతూ ఉండేవారు.  ఆ

ఆశ్రమములో ఉన్నవారికి ఈర్ష్య ద్వేషములు, కోప తాపములు అసూయ లేవు. వాలఖిల్యులూ, వైఖానసులు, ఋషులు జపములు, హోమములు, తపస్సు చేసుకుంటూ ఉంటారు. కొంత మంది ఫలములనే ఆహారము తీసుకుంటూ, కొంత మందికేవలము నీరు తాగుతూ మరి కొంత మంది కేవలం గాలి పీలుస్తూ తపస్సు చేసుకుంటూ ఉండేవారు. ఆ ఆశ్రమములో ఎటుచూచినా పవిత్రత ప్రశాంతత వెల్లి విరుస్తూ ఉండేది. అటువంటి ప్రశాంత వాతావరణము లో ఉన్న వసిష్ఠుని ఆశ్రమమునకు వచ్చాడు విశ్వామిత్ర మహారాజు.

శ్రీమద్రామాయణము,

బాల కాండము యాభైఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై రెండవ సర్గ

విశ్వామిత్రుడు వసిష్ఠుని చూచి వినయంగా నమస్కారం చేసాడు. వసిష్ఠమహర్షి విశ్వామిత్రుని సాదరంగా తన ఆశ్రమమునకు ఆహ్వానిం చాడు. అర్ఘ్యము పాద్యము ఉచితాసనము ఇచ్చి సత్కరించాడు. ఫలములను, కందమూలములను ఆహారంగా ఇచ్చాడు.

అప్పుడు విశ్వామిత్రుడు వసిష్ఠుని ఇలా అడిగాడు. "ఓ మహర్షీ! మీకు మీ శిష్యులకు క్షేమమే కదా! మీ ఆశ్రమములో అందరూ సుఖంగా ఉన్నారు కదా! మీ తపస్సు అగ్నిహోత్రములు నిర్విఘ్నముగా కొనసాగుతున్నాయి కదా! " అని అడిగాడు.

"విశ్వామిత్ర మహారాజా! తమ పాలనలో మేమందరమూ సుఖంగానే ఉన్నాము. మీరు ఎలా ఉన్నారు. మీరు క్షేమంగా ఉన్నారా! మీరు ధర్మము తప్పకుండా రాజ్యపాలన చేస్తున్నారు కదా! రాజధర్మాన్ని చక్కగా పాటిస్తున్నారు కదా! నీ రాజ్యములో నీ సేవకులు నీ మాట మీరకుండా నిన్ను సేవిస్తున్నారు కదా! నీ పాలనలో వారందరూ సుఖంగా ఉన్నారు కదా! నీవు శత్రుసంహారము చేసి, శాంతి స్థాపన చేసావు కదా! ఓ విశ్వామిత్రా! నీ సేనలు, నీ కోశాగారము, నీ మిత్రులు, నీ పుత్రులు అందరూ క్షేమమే కదా! " అని కుశల ప్రశ్నలు అడిగాడు

వసిష్ఠుడు.

వసిష్ఠుడు అడిగిన దానికి "ఓ మహర్షీ! తమరి దయవలన అంతా సవ్యంగానే ఉంది. మేమందరమూ కుశలముగానే ఉన్నాము." అని అన్నాడు విశ్వామిత్రుడు.

తరువాత వసిష్ఠుడు విశ్వామిత్రుడు ఎన్నో విషయములను పరస్పరం చర్చించుకున్నారు. అలా కొంచెము సేపు మాట్లాడుకున్న తరువాత వసిష్ఠుడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు. "ఓ విశ్వామిత్ర మహారాజా! మీరు మీ పరివారము ఈ రోజు మాకు అతిథులు. అతిథులను సత్కరించడం మన సంప్రదాయము. అందువలన, నీకును నీ పరివారమునకూ నేను అతిథి సత్కారములు చేస్తాను. దయతో అంగీకరించు." అని అడిగాడు.

"ఓ వసిష్ఠ మహర్షీ! మీరు మాకు మీ ఆశ్రమములో దొరికే ఫలములు కందమూలములు ఇచ్చారు. మేము ఆరగించాము. మీతో మనస్సు విప్పి మాట్లాడాము. అదే మాకు మీరు ఇచ్చే ఆతిథ్యము, అతిథి సత్కారము. తమరు అనుజ్ఞ ఇస్తే ఇంక మేము వెళ్లి వస్తాము." అని అన్నాడు విశ్వామిత్రుడు.

కాని వసిష్ఠుడు ఒప్పుకొనలేదు. తప్పకుండా తాను ఇచ్చు ఆతిథ్యము స్వీకరించవలెనని బలవంతం చేసాడు. ఎట్టకేలకు విశ్వామిత్రుడు ఒప్పుకున్నాడు.

వెంటనే వసిష్ఠుడు తన వద్దఉన్న కామధేనువును పిలిచాడు.

“ఓ కామధేనువా! ఈరోజు విశ్వామిత్రుడు తన పరివారముతో మన ఆశ్రమమునకు వచ్చారు. వారికి మనకు అతిథి సత్కారములు చేయవలెను. దానికి తగిన ఏర్పాట్లు చెయ్యి. ఎవరికి ఏది ఇష్టమో దానిని వారికి అందించేటట్టు ఏర్పాటు చెయ్యి. రక రకాల అన్నములు, భక్ష్యములు, లేహ్యములు, చోష్యములు, పానీయములు మొదలగు ఆహార పదార్థమఋలు సమృద్ధిగా సమకూర్చుము. ఎవరికీ ఎట్టి లోపము రానీయవద్దు.” అని పలికాడు వసిష్ఠుడు.

శ్రీమద్రామాయణము,
బాలకాండము యాభైరెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై మూడవ సర్గ

వసిష్ఠుడు ఆజ్ఞాపించిన ప్రకారము కామధేనువు విశ్వామిత్రునకు అతని పరివారమునకు షడ్రసోపేతమైన విందు భోజనము సమకూర్చింది. చెరకు గడలు, తేనె, మద్యము, పానీయములు, రకరకాలైన భక్ష్యములు అడిగినవారికి అడిగినట్టు అన్ని పదార్థములు వడ్డించింది. అందరూ తృప్తిగా భోజనము చేసారు. వసిష్ఠుని ఆతిథ్యమునకు ఎంతో ఆనందించారు. విశ్వామిత్రుడు, అతని అంత:పుర కాంతలు, వారి వెంటవచ్చిన పురోహితులు, పరివారము, అందరూ ఎంతో సంతోషించారు.

అప్పుడు విశ్వామిత్రుడు వసిష్ఠునితో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! నీ ఆతిథ్యమునకు మేమందరమూ ఎంతో ఆనందించాము. తమరిని ఒకటి అడుగుతాను. నేను తమరికి లక్ష గోవులను ఇస్తాను. ఈ కామధేనువు నాకు ఇవ్వండి. ఓ మహర్షీ! ఈ కామధేనువు రత్నము వంటిది. ఇలాంటివి మా వంటి మహారాజుల వద్ద ఉండాలి. రాజ్యములో ఉన్న సంపద అంతా రాజు యొక్క అధీనము కదా! కాబట్టి ఈ కామధేనువు కూడా మా అధీనము. వెంటనే ఈ కామధేనువును మాకు ఇవ్వండి." అని అడిగాడు.

ఆ మాటలకు వసిష్ఠుడు ఇలా బదులు చెప్పాడు. "ఓ విశ్వామిత్రా!

నీవు వందల వేల ఆవులు ఇచ్చినను, వెండి బంగారము రాసులు ఇచ్చినను. నా కామధేనువును నేను నీకు ఇవ్వను. ఇది నా ప్రాణము. మా బంధము శాశ్వతము. నేను ప్రతిరోజూ చేసే అగ్నిహోత్రమునకు కావలసిన పాలు, పెరుగు, నెయ్యి, నేను దేవతలకు అర్పించు హవిస్సులు ఈ కామధేనువు సమకూరుస్తుంది. ఈ కామధేనువు లేకపోతే నాకు రోజు గడవదు. అందుకని నేను ఈ కామధేనువును నీకు ఇవ్వలేను. " అని చెప్పాడు వసిష్ఠుడు.

"అది కాదు మహర్షీ! ఒక్క ఆవులే కాదు. బంగారముతో అలంకరింపబడిన 14,000 ఏనుగులను నీకు కానుకగా ఇస్తాను. ఇంకా ఒక్కొక్క దానికి నాలుగు తెల్లని ఉత్తమాశ్వములను కట్టిన 8 బంగారు రథములు ఇస్తాను. అంతేకాదు 11,000 మంచి జాతి గుర్రములను కూడా ఇస్తాను. అంతెందుకు నీకు కోటి పాడి ఆవులను ఇస్తాను. ఈ కామధేనువును నాకు ఇవ్వు. సరే...... అదీకాకపోతే నీకు ఏం కావాలో కోరుకో ....అవి అన్నీ ఇస్తాను. రత్నములా, బంగారమా, ఏం కావాలంటే అది కోరుకో..... అవన్నీ ఇస్తాను. కానీ ఈ కామధేనువును మాత్రం నాకు ఇవ్వు. " అని అడిగాడు విశ్వామిత్రుడు.

"నీవు ఎన్ని ఇచ్చినను నేను మాత్రము ఈ కామధేనువును నీకు ఇవ్వను. ఎందుకంటే నాకు ఈ కామధేనువే బంగారము, రత్నములు, ధనము, సర్వస్వము. నా జీవితము. ఇదే నాకు అన్ని యజ్ఞములు, యాగములు, దక్షిణలు, అన్ని రకములైన క్రియలు.

నేను చేసే అన్ని యజ్ఞములకు, యాగములకు, క్రియలకు ఇదే మూలము. అందుచేత, ఎట్టి పరిస్థితులలోనూ నేను నా

కామధేనువును నీకు ఇవ్వలేను.... ఇవ్వను” అని చెప్పాడు వసిష్ఠుడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము యాభైమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై నాల్గవ సర్గ

ఈ ప్రకారంగా వసిష్ఠుడు కామధేనువు ఇవ్వడానికి ఎంతకూ ఒప్పుకోలేదు. అందుకని విశ్వామిత్రుడు తన పరివారంతో ఆ కామ ధేనువును బలవంతంగా లాక్కొని పోతున్నాడు.

ఈ దుశ్చర్యకు ఆ కామధేనువు దీనంగా ఏడిచింది. తనలో తాను ఇలా అనుకొంది. "ఇదేమిటి. ఈ రాజు నన్ను బలవంతంగా లాక్కొని పోతున్నాడు. ఇంతకాలము నేను వసిస్ఠుని వద్ద ఉన్నాను కదా. వసిష్ఠుడు నన్ను విడిచి పెట్టినాడా! లేక పోతే ఈ మహారాజు నన్ను ఇలా ఎందుకు బలవంతంగా తీసుకొని పోతాడు. ఈ మహర్షికి నేను ఏమి అపకారం చేసాను. ఇంతకాలము మహర్షికి ఇష్టమైన పనులే చేసాను కదా. ఈ రోజుకూడా వసిష్ఠుని ఆదేశానుసారము  ఈ మహారాజుకు విందు భోజనము సమకూర్చాను కదా! మరి ఎందుకు నన్ను వదిలివేసాడు. ఆయననే అడుగుతాను." అని తనలో తాను అనుకుంది.

వెంటనే ఒక్కసారి హుంకరించింది. తనను పట్టుకొన్న భటులను విదిల్చి కొట్టింది. పరుగుపరుగున వసిష్ఠుని వద్దకు వెళ్లింది. ఏడుస్తూ వసిష్ఠునితో ఇలా పలికింది.

" ఓ బ్రహ్మర్షీ! దుర్మార్గులైన రాజ భటులు నన్ను నీ వద్దనుండి

లాక్కొని పోతున్నారు. నన్ను వారికి ఇచ్చేసావా. నేను  ఏం అపరాధము చేసానని నన్ను వాళ్లకి ఇచ్చావు." అని అడిగింది కామధేనువు.

ఆ మాటలు విన్న వసిష్ఠుని హృదయం తల్లడిల్లిపోయింది. తాను కూడా దు:ఖించాడు.  ఆ కామధేనువుతో వసిష్ఠుడు ఇలాఅన్నాడు.

"ఓ కామధేనువా! నేను నిన్ను విడవలేదు. నువ్వు ఏ అపరాధమూ చెయ్యలేదు. నువ్వు నాకు ఏ అపకారమూ చెయ్యలేదు. బలవంతుడైన ఆ రాజు నిన్ను బలవంతంగా నా వద్దనుండి తీసుకొని పోతున్నాడు. నా వంటి వాడు బలవంతుడైన ఆ రాజుతో ఎలా పోరాడ గలడు. అతడు ఈ ప్రాంతమునకు రాజు. పరాక్రమవంతుడైన క్షత్రియుడు. ఆయన వద్ద అశ్వములు, ఏనుగులు, సైన్యము ఉన్నాయి. దాదాపు ఆ రాజు వద్ద ఒక అక్షౌహిణీ సైన్యము ఉంది. కాబట్టి అతడు నా కంటే ఎంతో బలవంతుడు. ఆయనను నేను ఎలా ఎదుర్కోను. నిన్ను ఎలా రక్షించుకోను. " అని అన్నాడు వసిష్ఠుడు.

"ఓ బ్రహ్మర్షీ! విశ్వామిత్రునిది క్షత్రియ బలము. నీకు ఉన్న బ్రహ్మ బలమునకు అది సాటి రాదు. అతని కన్నా నీవే బలవంతుడివి. నీ తేజస్సు ముందర ఆ రాజు క్షణకాలము కూడా నిలువలేడు. ఓ మహర్షీ! నీ బ్రహ్మ బలంతో నన్ను ఆజ్ఞాపించు. అతని సైన్యమును సర్వనాశనము చేస్తాను." అని పలికింది కామధేనువు.

వెంటనే వసిష్ఠుడు పైకి లేచాడు. "ఓ కామధేనువూ! నీవు ఆ రాజుకు దీటైన సైన్యమును సృష్టించు." అని ఆజ్ఞాపించాడు.

మహాఋషి ఆజ్ఞమేరకు కామధేనువు ఒక్కసారి అంబా అని హుంకరించింది. ఆ హుంకారము నుండి  అపారమైన సేనలను సృష్టింపబడ్డాయి. ఆ సేనలు విశ్వామిత్రుని సేనలమీద పడి వారిని ఓడించాయి. తరిమికొట్టాయి.

తన కళ్లఎదుటే తన సైన్యము నాశనం కావడం చూచాడు విశ్వామిత్రుడు. తానే స్వయంగా రథం ఎక్కాడు. కామధేనువు సృష్టించిన సేనలను ఎదుర్కొన్నాడు. ఆ సేనలను నాశనం చేసాడు.

ఇది చూచింది కామధేనువు. కోపంతో ఊగిపోయింది. మరలా అపారమైన సేనలను సృష్టించింది. ఆ సేనలు విశ్వామిత్రుని సేనలను సర్వనాశనం చేసాయి. అది చూచిన విశ్వామిత్రుడు దివ్యాస్త్రములను ప్రయోగించి కామధేనువు సృష్టించిన సేనలను చెల్లాచెదరు చేసాడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము యాభైనాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్  ఓం తత్సత్  ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై ఐదవ సర్గ

కామధేనువు సృష్టించిన సేనలు విశ్వామితుని పరాక్రమమునకు చెల్లా చెదరు కావడం చూచాడు వసిష్ఠుడు.

"ఓ కామధేనువా! ఇంకా సేనలను సృష్టించు." అని ఆదేశించాడు వసిష్ఠుడు. మరలా కామధేనువు అంబా అని అరిచింది. ఆ అంబారవము నుండి సూర్య తేజస్సుతో సమానమైన కాంభోజవీరులు పుట్టారు. ఆవు పొదుగు నుండి ఆయుధములు ఉద్భవించాయి. ఆవు కాళ్ల నుండి ప్లవులు అనే సేనలు, యోనినుండి యవనులు, గోమయమునుండి శకులు, ఆవు రోమకూపముల నుండి మ్లేచ్ఛులు పుట్టారు. వారందరూ ఒక్కుమ్మడిగా విజృంభించి విశ్వామిత్రుని సేనలను సర్వనాశనం చేసారు.

తమ సేనలు నాశనం కావడం చూచారు విశ్వామిత్రుని నూర్గురు కుమారులు. వారందరూ ఒక్కుమ్మడిగా వసిష్ఠుని మీదికి దుమికారు. వసిష్ఠుడు తన తపశ్శక్తితో వారిని తుదముట్టించాడు. తన కుమారులు, సైన్యము నాశనం కావడం కళ్లారా చూచాడు విశ్వామిత్రుడు. చాలా సేపు చింతించాడు, సిగ్గుపడ్డాడు. విశ్వామిత్రుని శౌర్యము, సాహసము, పరాక్రమము ఎందుకూ పనికిరాకుండా

పోయాయి. కొడుకులను పోగొట్టుకున్న విశ్వామిత్రుడు రెక్కలు తెగిన పక్షిమాదిరి మిగిలిపోయాడు. తుదకు ఒక కుమారుడు బతికి ఉన్నాడని తెలుసుకున్నాడు. వెంటనే ఆ కుమారునికి రాజ్యాభిషేకము చేసాడు. విశ్వామిత్రుడు సన్యసించి తపస్సు చేసుకోడానికి అడవులకు వెళ్లిపోయాడు.

విశ్వామిత్రుడు హిమాలయ పర్వతముల మీద ఈశ్వరుని గూర్చి తపస్సు చేసాడు. కొన్ని సంవత్సరములు గడిచాయి. విశ్వామిత్రుని తపస్సునకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షం అయ్యాడు. "ఓ రాజా! నీవు ఎందుకు ఇంతఘోర తపస్సు చేస్తున్నావు.నీకు ఏమి కావాలి. కోరుకో!" అని అడిగాడు.

"ఓ మహాదేవా! తమరు నాయందు దయయుంచి ధనుర్వేదమును, అందలి రహస్యములను, సాంగోపాంగముగా ఉపదేశించండి. దేవతలకు, దానవులకు, మహర్షులకు, యక్ష, రాక్షస, గంధర్వ, కిన్నెర, కింపురుషులకు తెలిసిన అన్ని అస్త్రవిద్యలను నాకు ఉపదేశించండి. ఆ విధంగా నన్ను అనుగ్రహించండి" అని ప్రార్థించాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుని కోరికకు నవ్వి "నీవు కోరిన విద్యలు అన్నీ నీకు ప్రసాదించాను." అని వరం ఇచ్చాడు మహాశివుడు. మహాశివుడు అంతర్ధానము అయ్యాడు.

విశ్వామిత్రుడు అజేయుడయ్యాడు. వెంటనే వసిష్ఠుని ఆశ్రమమునకు వెళ్లాడు. అతని ఆశ్రమమును సర్వనాశనం చేసాడు.

అహం కారంతో అట్టహాసం చేసాడు. ఆశ్రమములోని మునులు అందరూ తలా ఒక దిక్కుగా పారిపోయారు. పక్షులు, జంతువులు కొన్నిచనిపోగా మరి కొన్నిపారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాయి.

"భయపడకండి. నేను విశ్వామిత్రుని ఎదిరిస్తాను. మిమ్ములను రక్షిస్తాను." అని వసిష్ఠుడు అరుస్తున్నాడు. కాని ఎవరూ అతని మాట వినలేదు. అందరూ పారిపోయారు.  వసిష్ఠుని ఆశ్రమము అంతా శ్మశానము మాదిరి మారిపోయింది.

విశ్వామిత్రుడు చేసిన మారణ కాండ చూచి వసిష్ఠుడు అతనితో ఇలా అన్నాడు. "ఓ విశ్వామిత్రా! నేనుఎంతో కాలంగా పెంచి పోషించిన జీవ జాలమును, వృద్ధిచేసిన ఆశ్రమమును క్షణ కాలంలో నాశనం చేసావు. నీకు భవిష్యత్తులేదు. నిన్ను నాశనం చేస్తాను." అని తన దండమును చేతిలోకి తీసుకొని విశ్వామిత్రుని ఎదురుగా నిలబడ్డాడు.

శ్రీమద్రామాయణము
బాలకాండము యాభై  ఐదవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ తత్సత్ తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై ఆరవ సర్గ

వసిష్ఠుడు రెండవ యమ దండము మాదిరి ప్రకాశిస్తున్న తన బ్రహ్మ దండము పట్టుకొని “ఓరి దుష్టుడా! నా బ్రహ్మ తేజస్సు ముందర నీ క్షత్రియ బలము అస్త్రశస్త్రములు క్షణకాలము కూడా నిలువ లేవు. నీ అస్త్రశస్త్రములను సర్వనాశనం చేస్తాను” అని విశ్వామిత్రుని ఎదురుగా నిలబడ్డాడు.

విశ్వామిత్రుడు వసిష్ఠుని లెక్క చెయ్యలేదు. వసిష్ఠునిమీద ఆగ్నేయాస్త్రము ప్రయోగించాడు. వసిష్టుని బ్రహ్మదండము ముందు ఆ ఆగ్నేయాస్త్రము నీటి ముందు అగ్ని మాదిరి శాంతించింది. వెనక్కు తిరిగి పోయింది. తరువాత విశ్వామిత్రుడు తాను మహాశివుని వలన పొందిన వారుణాస్త్రము, రుద్ర అస్త్రము, ఇంద్రాస్త్రము, పాశు పతాస్త్రము, ఇషీకాస్త్రము, మానవాస్త్రము, మోహనాస్త్రము, గాంధర్వాస్త్రము, స్వపనాస్త్రము, జృంభణాస్త్రము, మాదనాస్త్రము, సంతాపనాస్త్రము, విలాపనాస్త్రము, శోషణాస్త్రము, ధారణాస్త్రము, వజ్రాస్త్రము, బ్రహ్మపాశము, వరుణ పాశము, పైనాక, ద్వైత అస్త్రములు, శుష్కము, ఆర్ద్రము, దారుణము మొదలగు అస్త్రములు, దండము, పైశాచము, క్రౌంచము అను అస్త్రములు, ధర్మ చక్రము, కాల చక్రము, విష్ణుచక్రములను, వాయవ్యాస్త్రము, మదనాస్త్రము, హయశిరోస్త్రము, కంకాళము, ముసలము అను ఆయుధములు, విద్యాధరము అనే

మహాస్త్రము, కాలాస్త్రము, త్రిశూలము, కపాలాస్త్రము, కంకణాస్త్రము మొదలగు చిత్ర విచిత్ర అస్త్రములను వసిష్ఠుని మీద  ప్రయోగించాడు.

విశ్వామిత్రుడు ప్రయోగించిన ఆ అస్త్రములను అన్నింటినీ వసిస్ఠుని బ్రహ్మదండము అవలీలగా మింగేసింది.  ఇంక విశ్వామిత్రుని వద్ద మిగిలింది బ్రహ్మాస్త్రము. దానిని కూడా వసిష్ఠుని మీద ప్రయో గించాడు విశ్వామిత్రుడు. ఆ బ్రహ్మాస్త్రము వినాశనాన్ని సృష్టించింది. లోకములు అన్నీ  ఆ బ్రహ్మ అస్త్ర శక్తికి మండిపోతున్నాయి. ముల్లోకములు  తల్లడిల్లిపోతున్నాయి.

దేవతలు, గంధర్వులు అందరూ వసిష్ఠుని వద్దకు వెళ్లారు. బ్రహ్మాస్త్రమును శాంతింపచేయమని ప్రార్థించారు. బ్రహ్మ తేజస్సు వెదజల్లుతున్న వసిష్టుని బ్రహ్మ దండము విశ్వామిత్రుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమునుకూడా మింగేసింది. లోకాలు శాంతించాయి.

ఆ సమయంలో వసిష్ఠుడు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు. వసిష్ఠుని దేహం నుండి అగ్ని జ్వాలలు వస్తున్నాయి. వసిష్ఠుని చేతిలోని బ్రహ్మ దండము యమ దండము మాదిరి ప్రజ్వరిల్లుతూ ఉంది. అప్పుడు దేవతలందరూ వసిష్ఠుని ఇలా ప్రార్థించారు.

" ఓ మహర్షీ! నీ బ్రహ్మ తేజస్సు అమోఘమైనది. బ్రహ్మాస్త్రము తేజస్సును నీ బ్రహ్మ తేజస్సులో ఐక్యము చేసుకో. నువ్వు శాంతించు. నీ దండమును శాంతింపచెయ్యి." అని ప్రార్థించారు.

దేవతల ప్రార్థనను మన్నించ వసిష్ఠుడు శాంతించాడు. బ్రహ్మాస్త్రము

వసిష్ఠుని బ్రహ్మతేజస్సులో లీనమైపోయింది.

ఇంత చేసిన విశ్వామిత్రునికి భంగపాటు మిగిలింది. అవమానభారంతో కుంగిపోయాడు. క్షాత్రము కన్నా బ్రహ్మ తేజస్సు గొప్పది అని తెలుసుకొన్నాడు.

"ఆహా! ఏమి ఆశ్చర్యము. వసిష్ఠుని బ్రహ్మ తేజస్సు ముందు నా అస్త్ర,శస్త్రములు అన్నీ వృధా అయిపోయాయి. ఆయన బ్రహ్మ దండము నా అస్త్రములను అన్నీ మింగేసింది. కాబట్టి క్షాత్రము నిరుపయోగము. బ్రహ్మ తేజము కొరకు ప్రయత్నము చేస్తాను. మనస్సును ఇంద్రియము లను నిగ్రహిస్తాను. బ్రాహ్మణత్వము సిద్ధించడం కొరకు తీవ్రమైన తపస్సు చేస్తాను" అని అనుకొన్నాడు విశ్వామిత్రుడు.

శ్రీమద్రామాయణము
బాలకాండము యాభై ఆరవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై ఏడవ సర్గ

"ఓ రామా! వసిష్ఠుని చేతిలో ఓడిపోయి పరాభవము చెందిన తరువాత, ఆ  అవమాన భారము తట్టుకోలేని విశ్వామిత్రుడు తన భార్యతో సహా దక్షిణ దిశగా వెళ్లాడు. అక్కడ కేవలం ఫలములు మాత్రము ఆహారముగా తీసుకుంటూ,   ఘోరమైన తపస్సుచేసాడు.  ఆ సమయంలో విశ్వామిత్రునకు హవిష్యందుడు, మధుస్యందుడు, ధృడనేత్రుడు, మహారథుడు అనే నలుగురు కుమారులు జన్మించారు. అప్పటికి వేయి సంవత్సరములు గడిచాయి.

విశ్వామిత్రుని తపస్సునకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయ్యాడు. "ఓ విశ్వామిత్రా! నీ తపస్సునకు నేను మెచ్చాను. నీవు క్షత్రియుడవు. ఇప్పుడు బ్రాహ్మణత్వము అవలంబించి తపస్సు చేసావు. అందుచేత నీవు రాజర్షివి అయ్యావు." అని పలికాడు.

తరువాత బ్రహ్మదేవుడు స్వర్గలోకమునకు వెళ్లిపోయాడు. బ్రహ్మదేవుడు చెప్పిన మాటలతో విశ్వామిత్రునకు తృప్తి కలగలేదు. పైగా కోపం వచ్చింది.  ఇంత కాలము తపస్సు చేసిన తనను రాజర్షి అంటాడా. నేను బ్రహ్మర్షిని ఎందుకు కాకూడదు. బ్రహ్మర్షి అని పిలువబడేవరకు తపస్సు చేస్తాను. అని నిర్ణయించుకున్నాడు. మరలా

తపస్సు చేయడం మొదలు పెట్టాడు విశ్వామిత్రుడు.

ఆవిధంగా విశ్వామిత్రుడు తీవ్రంగా తపస్సు చేస్తున్న కాలంలో ఇక్ష్వాకు వంశంలో త్రిశంకు అనే రాజుఉండేవాడు. అతనికి ఈ శరీరంతోపాటు స్వర్గానికి వెళ్లాలి అనే కోరిక బలీయంగా ఉండేది. ఆయన ఆస్థానములో వసిష్ఠుడు పురోహితుడుగా ఉండేవాడు.

త్రిశంకు వసిష్ఠుని పిలిచి తన కోరిక తెలిపాడు. త్రిశంకుని విపరీతమైన కోరిక విన్న వసిష్ఠుడు ఆ పని తన వల్లకాదు అని చెప్పాడు.

"నీ వల్ల కాక పోతే నీ కుమారులతో చేయిస్తాను" అని పలికి త్రిశంకుడు వసిష్ఠుని కుమారుల వద్దకు వెళ్లాడు. వసిష్ఠుని నూర్గురు కుమారులు తమతమ ఆశ్రమములలో తపస్సు చేసుకుంటున్నారు. వారి వద్దకు వెళ్లాడు త్రిశంకు. వాళ్లముందు చేతులు జోడించి ఇలా ప్రార్థించాడు.

"ఓ ముని కుమారులారా! నేను ఒక యజ్ఞము చేయ సంకల్పించాను. కాని మీ తండ్రిగారు వసిష్ఠులవారు నా చేత ఆ యజ్ఞము చేయించుటకు ఒప్పుకొనలేదు. అందు వలన మీ వద్దకు వచ్చాను. నేను ఈ శరీరముతో స్వర్గలోకమునకు పోవుటకు తగిన యజ్ఞమును మీరు నా చేత చేయించాలి. మీరు మహానుభావులు. అటువంటి యజ్ఞచేయించుటకు మీరే సమర్థులు.

వసిష్ఠుడు నాకు పురోహితుడు. ఆయన కాదన్నపుడు ఆ కార్యము ఆయన కుమారులైన మీరే నెరవేర్చాలి. రాజులకు పురోహితులు

దైవసమానులు కదా!. అందువలన మీరు నాకు దైవ సమానులు. కాబట్టి నా కోరిక కాదనకండి. నా చేత యజ్ఞము చేయించి నన్ను సశరీరంగా స్వర్గలోకమునకు పంపండి" అని వేడుకున్నాడు త్రిశంకు.

శ్రీమద్రామాయణము

బాలకాండము యాభైఏడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై ఎనిమిదవ సర్గ

త్రిశంకు ఆ మాటలు అంటున్నంత సేపూ వసిష్ఠుని కుమారులు కోపంతో ఊగి పోతున్నారు. వారి కోపము కట్టలు తెంచుకొంది.

" ఓ త్రిశంకూ! నీవు దుర్బుద్ధివి. చెడ్డవాడివి. నీ కుల గురువు వసిష్ఠుడు. ఆయన సత్యసంధుడు. ఆయన నిరాకరించిన తరువాత నీవు మరొకరి వద్దకు ఎలా వెళ్ల గలవు? నీకే కాదు... వసిష్ఠుడు ఇక్ష్వాకు వంశమునకే పురోహితుడు. గురువు. ఎల్లప్పుడూ సత్యమునే పలికేవాడు. అటువంటి కులగురువు మాటను నీవు ఎలా అతిక్రమి స్తున్నావు? మా తండ్రిగారు, నీ కులగురువు అయిన వసిష్ఠుడు తన వల్లకాదు అని చెప్పిన యజ్ఞమును మేము ఎలా చేయిస్తాము అని అనుకున్నావు?

నీవు మూర్ఖుడవు. లేకపోతే సశరీరంగా స్వర్గమునకు పోవడం సాధ్యమా కాదా అని కూడా తెలుసుకోలేక పోతున్నావు. వసిష్ఠుడు మూడు లోకములలో ఎవరిచేతనైనా ఎటువంటి యాగము నైనా చేయించగల సమర్థులు. అటువంటి వసిష్ఠుడు తన వల్ల కాదు అన్నాడంటే అది ఎంత దుర్లభమో అర్థం చేసుకో. ఆయన కాదు అన్న యాగమును మేము చేయించి ఆయనను అవమానించలేము. కాబట్టి, వెంటనే నీవు తిరిగినీ నగరమునకు వెళ్లు. ఈ దుష్ట ఆలోచన

మానుకో. " అని కోపంతో పలికారు వసిష్ఠుని కుమారులు.

ఆ మాటలు విన్న త్రిశంకు వినయంతో వారితో ఇలా అన్నాడు. "ముని కుమారులారా! మీ తండ్రిగారు నా చేత సశరీరంగా స్వర్గమునకు పోవుటకు తగిన యజ్ఞము చేయించుటకు సమ్మతించలేదు. మీ వద్దకు వచ్చాను మీరూ నిరాకరించారు. ఏం చేస్తాను. వేరేవాళ్లదగ్గరకు పోయి నా కోరికను నెరవేర్చుకుంటాను. నాకు సెలవు ఇప్పించండి." అని అన్నాడు త్రిశంకు.

తాము ఇన్ని విధాలుగా చెప్పినా తన మూర్ఖపు పట్టు వీడని త్రిశంకుని చూచి వసిష్ఠుని కుమారులు కోపగించుకున్నారు.

"ఓ త్రిశంకూ! నీవు క్షత్రియుడుగా ఉండ తగవు. నీవు ఛండాలుడివిగా మారిపో!" అని శపించారు.

ఆ మునికుమారుల శాపము ప్రకారము ఇక్ష్వాకు వంశపు రాజు త్రిశంకు ఛండాలుడిగా మారి పోయాడు. నల్లని వస్త్రములు, నల్లని శరీరము, చింపిరి జుట్టు, కపాల మాలికలు, ఇనుముతో చేసిన ఆభరణములు, వీటితో వికృతంగా మారిపోయాడు త్రిశంకు.

అతని ఆకారమును చూచి అతని వెంట ఉన్న రాజబంధువులు, మంత్రులు, సేనలు అందరూ భయపడి పారిపోయారు.

త్రిశంకు ఒంటరి వాడయ్యాడు. అలా నడుచుకుంటూ విశ్వామిత్రుడు తపస్సు చేసుకుంటున్న చోటికి వచ్చాడు. అతనిని చూచి

విశ్వామిత్రుడు జాలి పడ్డాడు.

"నీవు త్రిశంకు మహారాజువు కదూ! ఇక్ష్వాకు వంశ రాజువు కదూ. నీవు నీ కులగురువు వసిష్ఠుని చేత నిరాకరింపబడ్డావు. అతని కుమారులచేత శపించబడ్డావు. నీకు ఏం భయం లేదు. నీ కోరిక నేను తీరుస్తాను. నీకు ఏంకావాలో అడుగు." అని పలికాడు విశ్వామిత్రుడు.

అప్పుడు త్రిశంకు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు. "ఓమహర్షీ! నాకు ఈ శరీరంతోనే స్వర్గమునకు వెళ్లవలెనని కోరిక. దాని కొరకు నూరు యజ్ఞములు చేసాను. నా కోరిక తీరలేదు. నా పురోహితుడు వసిష్ఠుడు నా కోరికను నిరాకరించాడు. ఆయన కుమారులు నా కోరిక తీర్చకపోగా నన్ను ఛండాలుడివి కమ్మని శపించారు. దిక్కుతోచని స్థితిలో మీ వద్దకు వచ్చాను. మీరే నా కోరిక తీర్చాలి.

ఓ మహర్షీ! నా గురించి మీకు తెలుసు కదా! నేను అసత్యమాడను. ధర్మపరుడను. ఎన్నో యజ్ఞములు చేసాను. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాను. పెద్దలను గౌరవించాను. ఎవరికీ ఎటువంటి అపకారము చేయలేదు. కాని నా కోరిక తీరలేదు. దైవము నా యందు అనుకూలముగా లేనపుడు పురుష ప్రయత్నము కూడా ఫలించదు కదా! దైవోపహతుడనైన నేను ఇప్పుడు మిమ్ములను ఆశ్రయించాను. ఇంక మీ దయ. మీరు కాదంటే నాకు వేరు గతి లేదు." అని ప్రార్థించాడు త్రిశంకు.

శ్రీమద్రామాయణము

బాలకాండము యాభైఎనిమిదవ సర్గ

సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## యాభై తొమ్మిదవ సర్గ

ఛండాలరూపంలో ఉన్న త్రిశంకు మాటలు విన్న విశ్వామిత్రుడు జాలి పడ్డాడు. అతని తో ఇలా అన్నాడు.

"ఓ త్రిశంకూ! బాధ పడకు. నిన్ను ,నీ కోరికను, నేను స్వాగతిస్తున్నాను. భయపడకు. నీ వంటి ధర్మాత్మునకు నేను సాయ పడతాను. నీచేత యాగము చేయిస్తాను. ఎంతో మంది మహా ఋషులను నీవు చేయబోయే యాగమునకు ఆహ్వానిస్తాను. నిన్ను ఇదే శరీరముతో అంటే ఈ ఛండాల శరీరముతో స్వర్గమునకు పంపిస్తాను. నీవు నా శరణు పొందావు. నీకు ఏం భయంలేదు. స్వర్గము నీ అరిచేతిలో ఉన్నట్టే."అని అన్నాడు విశ్వామిత్రుడు.

వెంటనే తన కుమారులను పిలిచాడు. యజ్ఞమునకు కావలసిన వస్తువులు సమకూర్చమని ఆదేశించాడు.

విశ్వామిత్రుడు తన శిష్యులను పిలిచాడు. "మీరందరూ వెళ్లి విశ్వామిత్రుడు త్రిశంకు చేత యజ్ఞము చేయిస్తున్నాడు. అందరూ రండి అని బ్రాహ్మణులను, ఋత్విక్కులను, ఋషులను అందరినీ ఆహ్వానించండి. వారిని మీ వెంట తీసుకొని రండి."అని ఆజ్ఞాపించాడు.

విశ్వామిత్రుని ఆజ్ఞమేరకు ఆయన శిష్యులు అందరూ నలు దిక్కులకు వెళ్లారు. బ్రాహ్మణులను, ఋత్విక్కులను, ఋషులను ఆహ్వానించి వారిని తమ వెంట తీసుకొని వచ్చారు. ఆ విషయమును విశ్వామిత్రునికి విన్నవించుకున్నారు.

"గురువు గారూ! తమరి ఆదేశము మేరకు అందరికీ మీరు చేయించబోవు యజ్ఞమును గూర్చి తెలిపి తీసుకొని వచ్చాము. కాని మహోదయుడు, వసిష్ఠుని కుమారులు రాలేదు. మీరు చెప్పిన మాటలు విన్న వారు ఈ విధంగా అన్నారు.

'ఒక ఛండాలుడు యజ్ఞము చేయాలని సంకల్పించడం. దానిని ఒక క్షత్రియు డైన విశ్వామిత్రుడు చేయించడం. బాగుంది. ఆ యజ్ఞములో అర్పించు హవిష్షులు దేవతలు, ఋషులు ఎలా స్వీకరిస్తారు. క్షత్రియుడైన విశ్వామిత్రుని మాటలు విని ఛండాలుడైన త్రిశంకు చేచి భోజనము చేసినవారు బ్రాహ్మణులైనా, ఋషులైనా వారు స్వర్గానికి ఎలావెళతారు? ఇది సంభవమా!'

అని చాలా దుర్భాషలాడారు గురువు గారూ!" అని విశ్వామిత్రుని శిష్యులు విశ్వామిత్రునితో అన్నారు.

ఆ మాటలు విన్న విశ్వామిత్రుడు కోపంతో ఊగిపోయాడు. "ఎంతో పవిత్రంగా తపస్సు చేసుకుంటున్న నన్ను వారు ఇన్ని మాటలు అంటారా! వసిష్టకుమారులు అందరూ భస్మమైపోతారు. వారందరూ యమలోకములో శవములను తింటూ ఏడు వందల జన్మలు పడి ఉంటారు. వారందరూ కుక్కమాంసము తినే ముష్టిక జాతిలో

పుడతారు.  నన్ను పరిహసించిన మహోదయుడు నిషాదుడుగా పుడతాడు. జంతువును చంపి తింటూ చాలాకాలము నిషాదుడుగా జీవిస్తాడు." అని శపించాడు విశ్వామిత్రుడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము యాభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## అరవయ్యవ సర్గ

ఆ ప్రకారంగా వసిష్టకుమారులను, మహెూదయుని శపించిన తరువాత అక్కడకు వచ్చిన ఋత్విక్కులను, బ్రాహ్మణులను, ఋషులను చూచి విశ్వామిత్రుడు ఇలా అన్నాడు.

" ఇక్ష్వాకు వంశ రాజు, పరమ ధార్మికుడు అయిన త్రిశంకు నా వద్దకు తనను సశరీరంగా స్వర్గమునకు పంపేటందుకు ఒక యజ్ఞము చేయించమని నా సహాయము కోరాడు. ఆయన కోరికను నేను మన్నించాను. త్రిశంకును ఈ శరీరంతో స్వర్గమునకు పంపడానికి నేను ఒక యజ్ఞము చేస్తున్నాను. ఆ యజ్ఞమునకు మీరందరూ సాయపడాలి." అని అన్నాడు విశ్వామిత్రుడు.

ఆ మాటలు విన్న ఋత్విక్కులు, బ్రాహ్మణులు, ఋషులు తమలో తమరు ఇలా అనుకున్నారు. "ఈ విశ్వామిత్రుడు మహా కోపిష్టి. మన కళ్ల ముందే వసిష్ఠకుమారులను దారుణంగా శపించాడు. ఆయన మాట వినక పోతే మనలకు కూడా శపించగలడు. అందుకని ఆయన చెప్పినట్టు చెయ్యడమే ప్రస్తుత కర్తవ్యము" అని అనుకున్నారు.

తరువాత విశ్వామిత్రునితో ఇలా అన్నారు. "ఓ విశ్వామిత్ర మహర్షీ! నీవు చెప్పినట్లే మేము చేస్తాము. యజ్ఞమును ప్రారంభం చేస్తాము."అని

అన్నారు. తరువాత అందరూ కలిసి యజ్ఞము ఆరంభించారు. యజ్ఞమునకు యాజకుడుగా విశ్వామిత్రుడు ఉన్నాడు. ఋత్విక్కులు వేద మంత్రములు చదువుతున్నారు. వేదోక్తంగా యజ్ఞము చేస్తున్నారు.

విశ్వామిత్రుడు ఆయా దేవతలను వారి వారి యజ్ఞ భాగములను స్వీకరించుటకు మంత్రపూతంగా ఆహ్వానించాడు. కాని  విశ్వామిత్రుని ఆహ్వానమును మన్నించి దేవతలు ఎవరూ వారి వారి హవిర్భాగము లను స్వీకరించుటకు రాలేదు. విశ్వామిత్రునకు కోపం వచ్చింది. యజ్ఞము చేసే స్రువను చేతిలోకి తీసుకున్నాడు. త్రిశంకుని చూచి ఇలా అన్నాడు.

"ఓ త్రిశంకూ! నా తపఃప్రభావాన్ని చూడు. నిన్ను ఈ శరీరంతో స్వర్గానికి పంపిస్తాను. ఇప్పటిదాకా సశరీరంగా ఎవ్వరూ వెళ్లలేని స్వర్గానికి నీవు వెళుతున్నావు. నేను సంపాదించిన తపస్సు ఫలంలో కొంత ధారపోసి నిన్ను స్వర్గానికి పంపుతున్నాను. వెళ్లు. ఈ శరీరంతో స్వర్గానికి వెళ్లు." అని అన్నాడు.

విశ్వామిత్రుని తపఃశక్తిలో త్రిశంకు శరీరంతో స్వర్గానికి వెళ్లాడు. మానవ శరీరంతో స్వర్గానికి వస్తున్న త్రిశంకును దేవతలు చూచారు. దేవేంద్రునికి చెప్పారు. త్రిశంకును చూచి దేవేంద్రుడు ఇలా అన్నాడు.

"ఓరి త్రిశంకూ! నీవు మానవ శరీరంతో స్వర్గంలో అడుగుపెట్టలేవు. నీవు మూఢుడవు. సశరీరంగా స్వర్గములో ఉండలేవని నీకు తెలియదా! అందుకని తల్లక్రిందులుగా భూమి మీద పడు." అని శపించాడు దేవేంద్రుడు.

“ఓ విశ్వామిత్ర మహర్షీ! నన్ను రక్షించు నన్ను రక్షించు” అని పెద్దగా అరుస్తూ  త్రిశంకు తల్లక్రిందులుగా భూమి మీదకు వస్తున్నాడు.

అది చూచాడు విశ్వామిత్రుడు. “ఆగు త్రిశంకూ ఆగు. అక్కడే ఉండు” అని పెద్దగా అరిచాడు.

వెంటనే విశ్వామిత్రుడు అపర బ్రహ్మగా మారిపోయాడు ఆకాశంలో దక్షిణ దిక్కున, ఒక నక్షత్ర మండలాన్ని  ఒక సప్తర్షి మండలాన్ని సృష్టించాడు.  “ఓ దేవేంద్రా! చూడు. నేను మరొక స్వర్గాన్ని, మరొక దేవేంద్రుడిని సృష్టిస్తున్నాను. అది సాధ్యం కాకపోతే నిన్ను నీ దేవేంద్రలోకాన్ని నాశనం చేస్తాను.” అని అన్నాడు.

ఆ మాటలకు దేవతలు గడగడలాడిపోయారు. దేవతలు, రాక్షసులు, సప్తఋషులు, గంధర్వులు విశ్వామిత్రుని వద్దకు వచ్చారు. “ఓ విశ్వామిత్ర మహర్షీ! నీకు తెలియనిది ఏమున్నది. ఇతడు మానవుడు. పైగా ఛండాలుడు. ఇతడు శరీరంతో స్వర్గ ప్రవేశమునకు అర్హుడు కాడు కదా!” అని అన్నారు.

దేవతల మాటలతో విశ్వామిత్రుడు శాంతించాడు. “మీరు చెప్పినది నిజమే. కాని నేను ఇతనిని సశరీరంగా స్వర్గానికి పంపుతానని మాట ఇచ్చాను. ఇప్పుడు నేను ఇతనిని స్వర్గానికి పంపకపోతే నేను ఇచ్చిన మాట తప్పినవాడను అవుతాను కదా! నాకు అసత్య దోషము అంటుతుంది కదా! కాబట్టి నేను సృష్టించిన నక్షత్ర మండలము శాశ్వతంగా అంతరిక్షంలో ఉండేట్టు నాకు అనుమతి ఇవ్వండి. ఆ నక్షత్ర మండలంలో ఈ త్రిశంకు శాశ్వతంగాఉంటాడు.” అని అన్నాడు.

దానికి దేవతలు అంగీకరించారు. "ఓ విశ్వామిత్రా! నీవు చెప్పినట్లే జరుగుతుంది. కాని నీవు సృష్టించిన నక్షత్రమండలము జ్యోతిశ్చక్రము వెలుపల ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ నక్షత్ర మండలములో త్రిశంకు ఇప్పుడు ఉన్నట్టు తల్లక్రిందులుగా ప్రకాశిస్తూ ఉంటాడు. నీవు సృష్టించిన నక్షత్ర మండలములోని నక్షత్రములు త్రిశంకు చుట్టు తిరుగుతూ అతనిని సేవిస్తూ ఉంటాయి. "అని అన్నారు.

దానికి విశ్వామిత్రుడు సమ్మతించాడు. ఆ విధంగా విశ్వామిత్రుడు తన యజ్ఞమును పూర్తి చేసాడు. యజ్ఞమునకు వచ్చిన ఋత్విక్కులు, ఋషులు బ్రాహ్మణులు క్షేమంగా తమ తమ స్థానములకు తిరిగి వెళ్లారు.

శ్రీమద్రామాయణము
బాలకాండము అరవయ్యవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## అరవై ఒకటవ సర్గ

ఆ ప్రకారంగా త్రిశంకు స్వర్గము సృష్టించి త్రిశంకును అక్కడ తలకిందులుగా నిలిపాడు విశ్వామిత్రుడు. తరువాత యాగమునకు వచ్చిను ఋషులతో ఇలా అన్నాడు. "ఇప్పటి వరకూ నేను దక్షిణ దిక్కున తపస్సు చేసాను. ఇక్కడ అన్నీ విఘ్నములు కలుగుతున్నాయి. ఇంక మీదట  పడమర దిక్కున ఉన్న పుష్కర క్షేత్రములో తపస్సు చేసు కుంటాను."అని అన్నాడు.

ఆ ప్రకారంగా విశ్వామిత్రుడు పశ్చిమ దిక్కుగా ప్రయాణమై వెళ్లాడు. పుష్కర క్షేత్రము చేరుకున్నాడు. అది ఒక పవిత్రమైన వనము. అక్కడ విశ్వామిత్రుడు కేవలము ఫలములు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ ఘోరమైన తపస్సు చేసాడు.

అదే కాలంలో అంబరీషుడు అనే రాజు ఉండేవాడు. అంబరీషుడు ఒక యాగము చేస్తున్నాడు. అంబరీషుడు యాగం చేయడం ఇష్టం లేని ఇంద్రుడు, యాగపశువును దొంగిలించాడు. యాగ పశువు కనపడకపోయేసరికి పురోహితుడు అంబరీషునితో ఇలా అన్నాడు.

"రాజా! యజ్ఞపశువును ఎవరో తీసుకొని పోయారు. నీవు చేసిన

అధర్మము వలననే ఈ ప్రకారము జరిగింది. దీనికి ప్రాయశ్చిత్తము చేయాలి. నీవు యజ్ఞపశువును అయినా తీసుకొని రా లేక పోతే పశువుకు బదులు ఒక మనిషిని అన్నా తీసుకొని రా. అప్పుడు యజ్ఞము పూర్తి అవుతుంది." అని అన్నాడు పురోహితుడు.

అంబరీషుడు వేల కొలదీ ఆవులు ఇస్తాను ఒక్క మనిషిని ఇవ్వండి అని ఎందరినో అడిగాడు. కాని ఎవరూ ఒప్పుకోలేదు. గ్రామములు, జనపదములు, పురములు ఎన్నో తిరిగాడు. కాని ఫలితం లేక పోయింది. ఆ సమయంలో ఋచీకుడు అనే మహర్షి తన భార్యా పుత్రులతో భృగుతుంగ పర్వతము మీద ఆశ్రమము నిర్మించుకొని తపస్సు చేసుకుంటూ ఉన్నాడు.

అంబరీషుడు ఆ ఋచీకమహర్షి వద్దకు వెళ్లాడు. జరిగినది అంతా చెప్పాడు. " ఓ మహర్షీ! నేను నీకు లక్ష ఆవులను ఇస్తాను. నీ కుమారుని నాకు యజ్ఞపశువుగా ఇవ్వగలరా!" అని అడిగాడు.

"లేదు. నేను నా పెద్ద కుమారుడిని ఇవ్వను. తండ్రికి పెద్ద కుమారుడు అంటే ప్రేమ కదా!" అని అన్నాడు.

ఋచీకుని భార్య ఇలా అంది. "నాకు నా చిన్న కుమారుడు అంటే ఎంతో ఇష్టం. కాబట్టి నేను నా చిన్న కుమారుని ఎట్టి పరిస్థితులలో కూడా ఇవ్వను." అని చెప్పింది.

ఋచీకునకు ముగ్గురు కుమారులు. పెద్దకుమారుని తండ్రి, చిన్న కుమారుని తల్లి ఇవ్వను అన్నారు. మిగిలింది మధ్యముడైన

శునశ్శేపుడు. ఆ శునశ్శేపుడు అంబరీషునితో ఇలా అన్నాడు.

"ఓ అంబరీషా! పెద్ద కుమారుని నా తండ్రి, చిన్న కుమారుని నా తల్లి అమ్మడానికి ఇష్టపడటంలేదు అంటే మధ్యముడనైన నన్ను అమ్మడానికి ఇష్టపడుతున్నారు అని అర్థం కదా. కాబట్టి మీరు వారికి తగిన మూల్యం ఇచ్చి నన్ను తీసుకొని వెళ్లండి." అని అన్నాడు.

అంబరీషుడు సంతోషంగా ఋచీకునకు లక్షగోవులు మూల్యంగా చెల్లించి శునశేపుని తన వెంట యజ్ఞపశువుగా తీసుకొని వెళ్లాడు.

శ్రీమద్రామాయణము
బాలకాండము అరవైఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## అరవై రెండవ సర్గ

ఋచీకుని వద్దనుండి అతని కుమారుడైన శునశేపుని లక్షగోవులు ఇచ్చి కొనుక్కున్న అంబరీషుడు, అతనిని తన రథము మీద ఎక్కించుకొని తీసుకొని పోతున్నాడు. మార్గ మధ్యంలో పుష్కర క్షేత్రము చేరుకున్నాడు. అక్కడ విశ్రాంతి తీసుకుంటున్నాడు.

ఈ శునశేపునకు విశ్వామిత్రుడు మేనమామ అవుతాడు. అంబరీషుడు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో శునశేపుడు అక్కడ ఉన్న ఋషులతో తన దురదృష్టం గురించి చెప్పుకొని బాధపడ్డాడు. వారందరూ శునశేపుని విశ్వామిత్రుని వద్దకు తీసుకొని వెళ్లారు. శునశేపుడు మేనమామ ఒడిలో తల పెట్టుకొని ఏడిచాడు.

"ఓ మహర్షీ! నాకు తల్లి లేదు. తండ్రిలేడు. ఇద్దరూ నన్ను వదిలేసారు. బంధువులు లేరు. కాబట్టి నన్ను తమరే రక్షించాలి. నీవు అందరినీ రక్షిస్తావు అని ప్రతీతి. కాబట్టి అంబరీషుని కార్యము నెరవేరేటట్టు, నాకు దీర్ఘాయుష్షు కలిగేటట్టు దీవించండి. మీరే నాకు తండ్రివంటివారు. తండ్రి కుమారుని రక్షించినట్టు తమరు నన్ను రక్షించండి. " అని వేడుకున్నాడు.

శునశేపుని మాటలు విన్న విశ్వామిత్రుడు ఎంతో జాలిపడ్డాడు. తన కుమారులను చూచి ఇలా అన్నాడు. "కుమారులారా! తండ్రులు పుత్రులను ఏ ఫలాన్ని ఆశించి కంటారో ఆ సమయము వచ్చినది. ఈ బాలుడు తనకు ప్రాణదానము చేయమని నన్ను వేడుకొనుచున్నాడు. ఇతనికి మీలో ఒకరు ప్రాణదానము చెయ్యండి. అతనికి సాయం చెయ్యండి. మీరు ఎన్నో పుణ్యకార్యములు చేసారు. అంబరీషునికి యజ్ఞపశువుగా వెళ్లడం కూడా ఒక పుణ్యకార్యమే. అలా చేస్తే మీరు శునశేపునికి ప్రాణదానం చేసిన వారు అవుతారు. అంబరీషుని యజ్ఞము నిర్విఘ్నముగా సాగుతుంది. దేవతలు సంతోషిస్తారు. నేను శునశేపునికి ఇచ్చిన మాట నిలబడుతుంది." అని అన్నాడు.

తండ్రి మాటలు విన్న మధుష్యందుడు మొదలగు విశ్వామిత్రుని కుమారులు తండ్రితో ఇలా అన్నారు. "తండ్రీ! మీరు శునశేపుని రక్షించుటకు మమ్ములను అంబరీషునికి బలిపశువుగా వెళ్లమం టున్నారు. అలా చెయ్యడం కుక్కమాంసము తినడంతో సమానం. కాబట్టి మేము ఎవరమూ వెళ్లము." అని చెప్పారు.

కుమారుల మాటలు విన్న విశ్వామిత్రునికి కోపం వచ్చింది. "ఏమన్నారు. పరులకు సాయం చెయ్యడం కుక్కమాంసం తినడంతో సమానమా! అయితే మీరు ముష్టిక జాతిలో జన్మించి కుక్కమాంసము తింటూ వేయి సంవత్సరములు భూమి మీద బతకండి. ఇదే నా శాపము." అని కుమారులను శపించాడు విశ్వామిత్రుడు.

ఇదంతా చూచిన శున శేపునకు దు:ఖము ముంచుకొచ్చింది. విశ్వామిత్రుడు అతనికి ధైర్యము చెప్పాడు. అతనికి రక్ష కట్టాడు. అతనితో

ఇలా అన్నాడు.

"ఓ శునశేపా! యజ్ఞము జరిగేటప్పుడు నిన్ను బలి ఇచ్చే నిమిత్తము నీకు ఎర్రని పుష్పమాలలు వేసి, ఊపస్తంభమునకు కడతారు. అపుడు నీవు నేను చెప్పే మంత్రములతో అగ్నిదేవుని స్తుతించు. నీకు కార్యసిద్ధి కలుగుతుంది." అని అన్నాడు విశ్వామిత్రుడు.

శునశేపునకు రెండు మంత్రములను ఉపదేశించాడు. ఆ మంత్రములను స్వీకరించిన శునశేపుడు అంబరీషుని వెంట వెళ్లాడు. అందరూ యజ్ఞవాటిక చేరుకున్నారు. శునశేపునకు ఎర్రటి వస్త్రములు కట్టారు. ఎర్రటి పూలమాలలు వేసారు. ఊపస్థంభమునకు కట్టారు. బలిపశువును సిద్ధం చేసినట్టు సిద్ధం చేసారు.

అప్పుడు శునశేపుడు ఇంద్రుని, అగ్నిని, దేవతలను, ఉపేంద్రుని వేదమంత్రములతో స్తుతించాడు. ఆ స్తోత్రములకు దేవేంద్రుడు ఎంతో సంతోషించాడు. శునశేపునకు దీర్ఘాయుష్షు ప్రసాదించాడు. అలాగే అంబరీషునికి ఆ యజ్ఞఫలమును కూడా కలిగేట్టు వరం ఇచ్చాడు. ఆ ప్రకారంగా శునశేపునకు ప్రాణములు రక్షింపబడ్డాయి.

తరువాత విశ్వామిత్రుడు వేయి సంవత్సరములు పుష్కరక్షేత్రములో తపస్సు చేసాడు.

శ్రీమద్రామాయణము
బాలకాండము అరవైరెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓ తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## అరవై మూడవ సర్గ

విశ్వామిత్రుడు పుష్కర క్షేత్రంలో వేయి సంవత్సరములు తపస్సు చేసాడు. అతడి తపస్సుకు మెచ్చుకొన్న బ్రహ్మదేవుడు ఇతర దేవతలు అతనికి వరాలు ఇవ్వడానికి వచ్చారు.

విశ్వామిత్రుని చూచి బ్రహ్మ "ఓ విశ్వామిత్రా! నీవు ఆచరించిన తపస్సు వలన నీవు ఋషివి అయ్యావు."అని చెప్పాడు. తరువాత బ్రహ్మ తన లోకమునకు వెళ్లిపోయాడు.

కాని విశ్వామిత్రునికి తృప్తి కలగలేదు. తాను కూడా వసిష్ఠుని మాదిరి  బ్రహ్మర్షి కావాలని ఆయన కోరిక.  అందువల్ల మరలా తపస్సు చేయడం మొదలెట్టాడు. కొన్ని సంవత్సరములు గడిచాయి.

ఒకరోజు మేనక అనే అప్సరస విశ్వామిత్రుడు తపస్సు చేస్తున్న ఆశ్రమమునకు దగ్గరలో ఉన్న ఒక కొలనులో స్నానం చేస్తూ ఉంది. విశ్వామిత్రుడు మేనకను చూచాడు. మేనక అందచందాలు చూచి మోహితుడైనాడు. ఆమె దగ్గరకు వెళ్లాడు. " ఓ అప్సరసా! నీకు నా ఆశ్రమమునకు స్వాగతము. నిన్ను చూచి నేను పరవశుడను అయ్యాను. మన్మథబాధకు తట్టుకోలేకున్నాను. నన్ను కరుణించు."అని

వేడుకున్నాడు.

విశ్వామిత్రుని కోరికను మన్నించింది మేనక. విశ్వామిత్రుని ఆశ్రమంలోనే ఉండిపోయింది. పది సంవత్సరములు ఇద్దరూ సుఖంగా కాలం గడిపారు.

అప్పుడు విశ్వామిత్రునికి జ్ఞానోదయం అయింది. తన ప్రవర్తనకు తానే సిగ్గుపడ్డాడు. తన తపస్సును భగ్నం చేయడానికి దేవతలు మేనకను తన వద్దకు పంపారేమో అని కూడా అనుమానం వచ్చింది. మేనక వంక చూచాడు. ఆమె భయంతో గడా గడా వణికి పోయింది. ఆమె మీద జాలిపడ్డాడు విశ్వామిత్రుడు. ఆమెతో ప్రేమగా మాట్లాడి మేనకను పంపించి వేసాడు.

తరువాత హిమాలయ పర్వతములకు వెళ్లాడు. ఇంద్రియము లను నిగ్రహించుకున్నాడు. కౌశికీ నదీ తీరములో తపస్సు చేయడం మొదలెట్టాడు. ఆ ప్రకారంగా వేయి సంవత్సరములు తీవ్రంగా తపస్సు చేసాడు విశ్వామిత్రుడు. ఆయన తపస్సుకు దేవతలందరూ భయపడి పోయారు. దేవతలందరూ కలిసి బ్రహ్మదేవుని వెంటబెట్టుకొని విశ్వామిత్రుని వద్దకు వెళ్లారు.

బ్రహ్మదేవుడు విశ్వామిత్రుని చూచి ఇలా అన్నాడు. " ఓ విశ్వామిత్రా! నీ తపస్సు ఫలించింది. నాకు ఎంతో సంతోషంగా ఉంది. నీవు మహా ఋషివి అయ్యావు. ఓ విశ్వామిత్రా! నీవు మహర్షివి." అని అన్నాడు.

కాని విశ్వామిత్రునికి సంతోషము కలగలేదు. బ్రహ్మదేవుని చూచి

ఇలా అన్నాడు.

"ఓ బ్రహ్మదేవా! నాకు మహర్షి పదవి లభించినది అనే మీరు అన్నారు. అయితే నేను జితేంద్రియుడను (అనగా ఇంద్రియములను జయించినవాడు) అయ్యానా!" అని అడిగాడు.

ఆ మాటలకు బ్రహ్మదేవుడు నవ్వి "నీవు ఇంకా జితేంద్రియుడికి కాలేదు. నీవు ఇంకా తపస్సు చేయాలి." అని అన్నాడు.

తరువాత బ్రహ్మ తన లోకమునకు వెళ్లిపోయాడు. దేవతలు కూడా ఆయన వెంట స్వర్గలోకమునకు వెళ్లిపోయారు. విశ్వామిత్రుడు మరలా తపస్సు చేయడం మొదలుపెట్టాడు.

ఈ సారి చేతులుపైకెత్తి కేవలం గాలిని మాత్రం ఆహారంగా తీసుకుంటూ తపస్సుచేయడం మొదలెట్టాడు. విశ్వామిత్రుడు ఎండా కాలంలో ఐదు అగ్నుల మధ్య, వర్షాకాలములో ఆరుబయల వానలో, చలికాలంలో నీటిలో నిలబడి, వేయి సంవత్సరములు తపస్సుచేసాడు. విశ్వామిత్రుని ఘోర తపస్సుచూచి దేవేంద్రునకు దేవతలకు భయం పట్టుకుంది.

దేవేంద్రుడు వెంటనే రంభను పిలిపించాడు.

శ్రీమద్రామాయణము
బాలకాండము అరవైమూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## అరవై నాల్గవ సర్గ

దేవేంద్రుడు రంభను చూచి ఇలా అన్నాడు.

"ఓ రంభా! విశ్వామిత్రుడు ఘోర తపస్సు చేస్తున్నాడు. నీవు నీ అందరందాలతో అతనిని వశపరచుకొని అతని తపస్సు భగ్నం చేయాలి. ఇది దేవతా కార్యము. నీవు చేయాలి. తప్పదు."అని అన్నాడు.

ఆ మాటలు విన్న రంభ చేతులు జోడించి ఇలా పలికింది. "ఓ దేవేంద్రా! నీమాటలు మాకు శిరోధార్యము. కాని ఆ విశ్వామిత్రుడు మహా కోపిష్టి. నా చేష్టలకు ఆయన నన్ను కోపంతో శపించగలడు. నాకు చాలా భయంగా ఉంది. తరువాత మీ ఇష్టం."అని చెప్పింది.

దానికి దేవేంద్రుడు ఇలా అన్నాడు. "రంభా! నీకేం భయం లేదు. నేను, మన్మధుడు, కోకిలల రూపంలో నీ పక్కనేఉంటాము. సమ యానికి వచ్చి ఆదుకుంటాము. నీవేం భయపడపనిలేదు. నీ హావభావవిలాసములతో విశ్వామిత్రుని మత్తెక్కించు. నా మాట మన్నించు." అని అన్నాడు.

రంభకు ఒప్పుకోక తప్పలేదు. సరే అని విశ్వామిత్రుని వద్దకు

వెళ్లింది. ఆయన ముందు నాట్యం చేసింది. ఆడింది. పాడింది. విశ్వామిత్రుని దృష్టిని ఆకర్షించింది. విశ్వామిత్రుడు రంభను చూచాడు. అందంగా ఉంది అనుకున్నాడు.

ఇంతలో విశ్వామిత్రునికి ఒక సందేహము కలిగింది. ఇది అంతా ఆ దేవేంద్రుని కుతంత్రము కాదు కదా అని అనుమాన పడ్డాడు. రంభను శపించాడు.

“తపస్సు చేసుకుంటున్న నన్ను  నీ అందచందములతో ప్రలోభ పరచడానికి ప్రయత్నించావు కాబట్టి నీవు పదివేల సంవత్సరములు రాయిగా పడి ఉండు. నీకు ఒక బ్రాహ్మణుని వలన శాపవిమోచన కలుగుతుంది.” అని శాపము, విమోచనము అనుగ్రహించాడు. వెంటనే రంభ రాతిబండగా మారిపోయింది.

ఇది చూచి దేవేంద్రుడు, మన్మధుడు పారిపోయారు.

తరువాత విశ్వామిత్రుడు చాలా పశ్చాత్తాప పడ్డాడు.

“అయ్యో అనవసరంగా రంభ మీద కోపించాను. శపించాను. నా తపస్సును వృథా చేసుకున్నాను. నేను ఇంకా ఇంద్రియాలను ముఖ్యంగా  కోపాన్ని జయించలేక పోతున్నాను. దీనితో నాకు మనశ్శాంతి లేకుండా పోయింది.  ఇంక ఎవరి మీదా కోపగించు కోకూడదు. నన్ను ఎవరు ఏమి చేసినా ఎవరి మీదా కోపపడను. ఇంద్రియములను జయించి తపస్సు చేస్తాను. నాకు బ్రాహ్మణ్యము సిద్ధించువరకూ ఘోర తపస్సు చేస్తాను. ” అని  కఠోరంగా

నిర్ణయించుకున్నాడు విశ్వామిత్రుడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము అరవైనాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## అరవై ఐదవ సర్గ

ఆ ప్రకారంగా నిర్ణయించుకొన్న విశ్వామిత్రుడు ఉత్తర దిక్కును విడిచి పెట్టాడు. తూర్పు దిక్కుగా వెళ్లాడు. అచ్చట ఆశ్రమమును నిర్మించుకొని వేయి సంవత్సరములు ఘోరమైన తపస్సుచేసాడు.

విశ్వామిత్రుని శరీరము ఎండుకట్టె మాదిరి అయింది. అతని తపస్సుకు ఎన్నో విఘ్నాలు కలిగాయి. కాని విశ్వామిత్రుడు చలించలేదు. ఇంద్రియములకు లోబడలేదు.

వేయి సంవత్సరములు పూర్తి అయ్యాయి. ఇంక తపస్సు పూర్తి అయింది అనుకొని ఆహారము తీసుకొనడానికి కూర్చున్నాడు. ఇంతలో ఇంద్రుడు బ్రాహ్మణ వేషములో వచ్చాడు. చాలా ఆకలితో ఉన్నాను. అన్నం పెట్టమని యాచించాడు. మారు మాటాడకుండా విశ్వామిత్రుడు తాను తెచ్చుకున్న ఆహారాన్ని ఇంద్రుడికి ఇచ్చాడు. బ్రాహ్మణ వేషములో ఉన్న ఇంద్రుని ఒక్కమాట కూడా అనలేదు. ఇంద్రుడి మీద కోప పడలేదు. తాను నిరాహారంగా ఉండిపోయాడు.

మరలా తపస్సుకు పూనుకొన్నాడు. కేవలం గాలిని ఆహారంగా తీసుకుంటూ మరలా వేయి సంవత్సరములు తపస్సు చేసాడు. విశ్వామిత్రుని తలలో నుండి పొగలు చెలరేగా.యి ఆ మంటలు

లోకాలను దహిస్తాయేమో అని దేవతలు భయపడ్డారు. అందరూ బ్రహ్మ వద్దకు వెళ్లారు.

" ఓ బ్రహ్మదేవా! విశ్వామిత్రుని మీరు మహర్షి అన్నారు. కాని ఆయన తపస్సు మానలేదు. రంభను పంపాము. ఆమెను రాయిని చేసాడు. ఆయన ఆహారాన్ని లాక్కున్నాము. కోపగించలేదు. ఎన్ని ప్రలోభాలు పెట్టినా చలించలేదు. ఘోరంగా తపస్సు చేస్తున్నాడు. ఆయన శరీరంనుండి మంటలు చెలరేగి లోకాలను దహిస్తున్నాయి. తమరే రక్షించాలి. తమరు వచ్చి ఆయనకు వరాలు ఇవ్వాలి. లేకపోతే లోకాలు నాశనమైపోతాయి. సూర్యుడు ప్రకాశించడం లేదు. గాలి వీచడం లేదు. భూమి కంపిస్తూ ఉంది. కావున తమరు వెంటనే రండి." అని వేడుకున్నారు.

దేవతల కోరిక మేరకు బ్రహ్మదేవుడు వారి వెంట విశ్వామిత్రుని వద్దకు వచ్చాడు. విశ్వామిత్రునితో ఇలా అన్నాడు.

" ఓ బ్రహ్మర్షీ! నీవు బ్రాహ్మణత్వమును పొందావు. బ్రహ్మర్షివైనావు. నీ తపస్సుకు చాలా సంతోషించాను. నీకు దీర్ఘాయుష్షు ప్రసాదిస్తున్నాను. ముల్లోకములలో నీ ఇష్టం వచ్చినట్టు సంచరించు. నీకు శుభం కలుగుతుంది." అని వరాలు ఇచ్చాడు బ్రహ్మ.

విశ్వామిత్రుని మనస్సు ఎంతో సంతోషం పొందింది. ఆయన బ్రహ్మదేవుని చూచి ఇలా అన్నాడు. " ఓ బ్రహ్మదేవా! మీరు నాకు బ్రాహ్మణత్వము, బ్రహ్మర్షి పదవి ప్రసాదించారు. నేను బ్రహ్మర్షిని అయితే దానితో పాటు ఓంకారము, వషట్కారములు, వేదములు నాకు

లభ్యమగును గాక! వాటిని నేను ఇతరులకు బోధించు అధికారము లభించును గాక! యజ్ఞములు యాగములు చేయించు అధికారము నాకు కలుగు గాక! బ్రహ్మర్షిఅయిన వసిష్ఠుడు నన్ను బ్రహ్మర్షిగా అంగీరించును గాక! ఇవి కూడా నాకు ప్రసాదించండి.” అని అడిగాడు.

బ్రహ్మదేవుడు అలాగే అన్నాడు. తరువాత దేవతలు అందరూ వసిష్ఠుని వద్దకు వెళ్లారు. “ఓ వసిష్ట మహర్షీ! విశ్వామిత్రుడు చేసిన ఘోరమైన తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు విశ్వామిత్రుని “బ్రహ్మర్షి” అని అన్నాడు. తమరు కూడా వచ్చి విశ్వామిత్రుని “బ్రహ్మర్షి” అని అంగీకరించండి.” అని ప్రార్థించారు.

ఆ మాటలకు వసిష్ఠుడు సరే అన్నాడు. వారి వెంట విశ్వామిత్రుని వద్దకు వచ్చాడు. “ఓ విశ్వామిత్రా! నీవు బ్రహ్మర్షివి. నేను అంగీకరిస్తున్నాను.” అని అన్నాడు.

వెంటనే దేవతలు కూడా ఇలా అన్నారు. “ఓ విశ్వామిత్రా! నీవు బ్రహ్మర్షి అని అందరూ అంగీకరించారు. నీవు కోరిన వరములు అన్నీ నీకు లభ్యమవుతాయి. ఇంక మేము వెళుతున్నాము.” అని పలికి దేవతలు స్వర్గలోకమునకు వెళ్లిపోయారు.

వెంటనే విశ్వామిత్రుడు లేచి వసిష్ఠునిసాదరంగా ఆహ్వానించాడు. అర్ఘ్యము పాద్యము సమర్పించి పూజించాడు.

ఓ రామా! విశ్వామిత్రుడు పై చెప్పిన విధంగా బ్రాహ్మణత్వమును సంపాదించి బ్రహ్మర్షి అయ్యాడు. ఈ విశ్వామిత్రుడు మునులలో

ఉత్తముడు. ధర్మాత్ముడు. వీరుడు." అని శతానందుడు రామలక్ష్మణులకు విశ్వామిత్రుని వృత్తాంతమును సవిస్తరముగా వివరించాడు. రామలక్ష్మణులతో పాటు జనక మహారాజు కూడా విశ్వామిత్రుని వృత్తాంతమును విన్నాడు. విశ్వామిత్రునికి చేతులు జోడించి నమస్కారము చేసాడు.

"ఓ విశ్వామిత్రమహర్షీ! ధన్యోస్మి. తమరు ఇక్ష్వాకు వంశములో జన్మించిన రామలక్ష్మణులతో సహా మా నగరమునకు వచ్చి మమ్ములను అనుగ్రహించినందుకు నాకు మహోదానందముగా ఉంది. తమరి దర్శనభాగ్యముచే నేను పవిత్రుడను అయ్యాను. తమరి గురించి శతానందులవారు చెప్పిన మాటలను నేను శ్రద్ధాభక్తులతో విన్నాను. నీ గుణగణములను మేము అందరమూ విని తరించాము. నీవు చేసిన తపస్సు ఊహాతీతము. పరులకు అసాధ్యము. అటువంటి ఘోర తపస్సుచెయ్యడం నీకే చెల్లింది. తమరి యొక్క తపో విశేషము లను ఎన్ని సార్లు విన్నా తనివితీరడం లేదు. కాని ప్రస్తుతము సూర్యుడు అస్తమించుచున్నాడు. తమరు సాయంకాల సంధ్యావందనాది కార్యములు నిర్వర్తించవలెను కదా! కాబట్టి నాకు సెలవు ఇప్పించండి. రేపు ఉదయము తమరి దర్శనము చేసుకుంటాను. తమరిని సాదరముగా మిథిలా నగరమునకు ఆహ్వానించి నా వెంట తీసుకొని వెళతాను." అని వినయంగా పలికాడు జనకమహారాజు.

ఆ మాటలకు విశ్వామిత్రుడు ఎంతో సంతోషించాడు. జనకునకు వెళ్లడానికి అనుజ్ఞ ఇచ్చాడు.

జనక మహారాజు విశ్వామిత్రునకు ప్రదక్షిణపూర్వక నమస్కారము చేసాడు. తరువాత  అమాత్యులు పురోహితులతో కలిసి మిథిలకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము అరవై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## అరవై ఆరవ సర్గ.

మరునాడు ఉదయం జనకమహారాజు కాలకృత్యములను తీర్చుకొనని విశ్వామిత్రుని వద్దకు వెళ్లాడు. విశ్వామిత్రుని, రామ లక్ష్మణులను, వారితో వచ్చిన ఋషులను తన భవనమునకు తీసుకొని వచ్చాడు. విశ్వామిత్రునికి పూజలు చేసాడు.

"ఓ విశ్వామిత్ర మహర్షీ! రామలక్ష్మణులారా! మీకు ఇదే మా స్వాగతం. నేను మీ ఆజ్ఞాబద్ధుడను. తమరికి ఏమి కావాలో నన్ను ఆజ్ఞాపించండి. తక్షణమే నెరవేరుస్తాను." అని పలికాడు జనకుడు.

"ఓ జనకమహారాజా! నీ వినయవిధేయతలు అత్యంత ప్రశంసనీయములు. వీరు ఇరువురు అయోధ్య చక్రవర్తి దశరథ మహారాజు పుత్రులు. వీరు నీ వద్ద ఉన్న శ్రేష్ఠమైన ధనుస్సును చూడాలని అనుకుంటున్నారు. కాబట్టి నీవు వారికి ఆ ధనుస్సు చూపించు. వారు ఆ ధనుస్సును చూచి అయోధ్యకు తిరిగి వెళ్లిపోతారు."అని అన్నాడు.

అప్పుడు జనకుడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు. "ఓ విశ్వామిత్ర మహర్షీ! వారికి ఆ ధనుస్సును చూపించే ముందు ఆ ధనుస్సు గురించి వివరిస్తాను. ఆ ధనుస్సు శివధనుస్సు. పూర్వము దక్షయజ్ఞ

సమయములో రుద్రుడు తనకు యజ్ఞములో హవిర్భాగమును ఇవ్వనందుకు  ఈ శివధనుస్సును ధరించి దేవతలందరి శిరస్సులను ఖండించడానికి పూనుకున్నాడు. అప్పుడు దేవతలు అందరూ ఈశ్వరుని ప్రార్థించారు. ఈశ్వరుడు దేవతలను క్షమించాడు. అప్పుడు తాను ఎత్తిన శివధనుస్సును ఎక్కడ ఉంచాలా అని ఆలోచించి, పరమశివుడు ఆ ధనుస్సును  నిమి చక్రవర్తి వంశంలో ఆరవ వాడైన దేవ రాతుని వద్ద  ఉంచాడు. ఆ దేవరాతుడు మా పూర్వీకుడు. ఆ ప్రకారంగా ఈ శివధనుస్సు మా భవనంలో ఉన్న పూజా మందిరంలో వంశపారంపర్యంగా పూజలందుకుంటూ ఉంది.

తరువాత నేను ఒక సారి యజ్ఞము చేయ సంకల్పించాను. యజ్ఞశాల నిర్మించడానికి భూమిని దున్నుతున్నాను. అప్పుడు నాగేటి చాలులో నాకు ఒక కన్య దొరికింది. ఆమె పేరు సీత. అయోనిజ. (మానవ యోని నుండి జన్మించనిది).

సీతకు యుక్తవయసువచ్చినది. ఆమెను వివాహమాడటానికి ఎందరో రాజకుమారులు ప్రయత్నించారు. కాని సీతను వివాహమాడే వాడు అత్యంత పరాక్రమ వంతుడు అయి ఉండాలని నేను ఒక నియమం పెట్టాను. సీతను "వీర్యశుల్క" గా ప్రకటించాను.(అనగా సీతను వివాహమాడాలంటే వీరత్వమును
 శుల్కముగా ఇవ్వాలి).

సీతను వివాహ మాడటానికి మిథిలకు వచ్చిన రాకుమారులకు నేను ఈ ధనుస్సును చూపించి దానిని ఎక్కు పెట్టమన్నాను. వారందరిలో  ఏ ఒక్కరు కూడా ఈ ధనుస్సును కనీసం కదల్చలేక

పోయారు. అందుకని నేను ఎవరికీ సీతను ఇచ్చి వివాహము చేయలేదు.

ఓ మహర్షీ! నేను నా కుమార్తె సీతను వీర్య శుల్కగా ప్రకటించి, వారికి అలవి కాని పరీక్ష పెట్టి, సీతను ఇచ్చి వివాహము చేయలేదని, ఆ రాజకుమారులందరూ నా మీద కోపగించారు. నా మీదకు యుద్ధానికి వచ్చారు. మిథిలను ముట్టడించారు. నా వద్ద ఉన్న సైన్యముతో వారిని ఎదిరించలేకపోయాను.

ఆ విధంగా ఒక సంవత్సరము గడిచింది. మిథిలానగరములో ఉన్న అత్యవసర వస్తువులు, ధాన్యములు తరిగిపోయాయి. ప్రజలు ఆహారము కోసరము అలమటిస్తున్నారు. అప్పుడు నేను తపస్సుచేసి దేవతలను ప్రార్థించాను. దేవతలు నా ప్రార్థనను మన్నించి నాకు సైన్యమును సమకూర్చారు. నేను దేవతలు సమకూర్చిన సైన్యముతో ఆ రాజులను ఓడించి పారద్రోలాను. దేవతా సైన్యము ధాటికి తట్టుకోలేక శత్రురాజులు తలొక దిక్కు పారిపోయారు.

ఓ విశ్వామిత్ర మహర్షీ! ఇదీ ఈ ధనుస్సు వృత్తాంతము. నేను శివధనుస్సును రామలక్ష్మణులకు చూపిస్తాను. రాముడు ఆ ధనుస్సును ఎక్కుపెట్టగలిగితే అన్న మాట ప్రకారము నేను నా కుమార్తె సీతను రామునికి ఇచ్చి వివాహము జరిపిస్తాను." అని అన్నాడు జనకుడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము అరవైఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## అరవై ఏడవ సర్గ.

జనకుడు చెప్పిన మాటలు విన్నాడు విశ్వామిత్రుడు. "ఓ జనక మహారాజా! నీవు చెప్పినది అంతా విన్నాము. నీవద్ద ఉన్న ధనుస్సును రామునికి చూపించు." అని అన్నాడు.

జనకుడు పూజా మందిరములో పూజలందుకుంటున్న ఆ ధనుస్సును తీసుకొని రమ్మని సామంతులను ఆజ్ఞాపించాడు. జనకుని ఆజ్ఞను అనుసరించి సామంతులు ఎనిమిది చక్రముల గల ఒక వాహనము మీద అమర్చి ఉన్న ఆ శివ ధనుస్సును తీసుకొని వచ్చారు. 5,000 మంది ధృడకాయులు ఆ ధనుస్సు ఉన్న వాహనమును లాగుకొని వచ్చారు.

"జనక మహారాజా! తమరు ఆదేశించినట్టు, నీవు రామునికి చూపదలచుకొన్న శివధనుస్సును తీసుకొని వచ్చాము." అని అన్నారు సామంత రాజులు.

జనకుడు విశ్వామిత్రుని, రామలక్ష్మణులను చూచి ఇలా అన్నాడు. "ఓ విశ్వామిత్ర మహర్షీ! ఈ ధనుస్సు మాకు వంశపారంపర్యముగా వచ్చింది. దీనిని ఎంతో మంది రాజులు, రాజకుమారులు

ఎక్కుబెట్టబోయి విఫలమయ్యారు. రాజులే కాదు, దేవతలు, గంధర్వులు, అసురులు కూడా దీనిని ఎక్కుపెట్టలేకపోయారు. కాబట్టి ఈ ధనుస్సును ఎత్తుటకు గానీ, ఎక్కుబెట్టుటకు కానీ మానవ మాత్రులకు సాధ్యము కాదుకదా! ఓ విశ్వామిత్ర మహర్షీ! దీనిని రామలక్ష్మణులకు చూపుము."అని అన్నాడు జనకుడు.

విశ్వామిత్రుడు రాముని వంక చూచాడు. "రామా! ఈ ధనుస్సును చూడు." అన్నాడు.

విశ్వామిత్రుని మాటలను విన్న రాముడు "అలాగే మహాత్మా! తమరు చెప్పినట్టు నేను ఆ ధనుస్సు ఉన్న పేటికను తెరిచి ఆ ధనుస్సును చూస్తాను. తాకుతాను. ఆ ధనుస్సును ఎత్తడానికి, నాకు శక్తి ఉంటే దానిని ఎక్కుపెట్టడానికి ప్రయత్నిస్తాను." అని అన్నాడు.

అంగీకార సూచకంగా విశ్వామిత్రుడు తల ఊపాడు. రాముడు ఆ ధనుస్సును అవలీలగా ఎత్తి పట్టుకున్నాడు. దానిని నిలబెట్టాడు. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. రాముడు ఆ ధనుస్సును ఏ మాత్రం శ్రమపడకుండా ఎక్కుపెట్టాడు. ఆ ధనుస్సుకు ఉన్న నారిని పట్టుకొని తన చెవి దాకా లాగాడు. ఆ ధనుస్సు ఒంగింది. ఫెడేల్ మని మధ్యకు విరిగిపోయింది. రెండు ముక్కలు అయింది.

ఆ ధనుస్సు విరిగినపుడు పిడుగు పడ్డట్టు భయంకర మైన శబ్దం వచ్చింది. భూమి కంపించినట్టయింది. ఆ శబ్దానికి అక్కడ ఉన్న వారంతా కిందపడి మూర్ఛపోయారు. ఇదంతా తనకు ముందే తెలుసు అన్నట్టు విశ్వామిత్రుడు చూస్తున్నాడు.

తరువాత జనకుడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! దశరథుని కుమారుడైన శ్రీరాముని వీరత్వమును బలపరాక్రమ ములను ప్రత్యక్షంగా చూచాను. నా దేహం గగుర్పొడిచింది. మనసంతా ఆశ్చర్యంతో నిండిపోయింది. ఇది కలా నిజమా అని నమ్మలేకున్నాను. ఇది అత్యద్భుతము, ఊహాతీతము. అనుకున్న ప్రకారము నా కుమార్తె సీత, దశరథపుత్రుడు రాముని వివాహమాడి మా వంశమునకు కీర్తి ప్రతిష్ఠలు తీసుకురాగలదు అని విశ్వసిస్తున్నాను. సీతను "వీరశుల్క" గా అనగా సీతను వివాహమాడుటకు వీరత్వమునే శుల్కముగా నిర్ణయించాను. ఆ వీరత్వము రాముని వద్ద ఉన్నది అని గ్రహించాను. నా ప్రాణసమానమైన నా కుమార్తె సీతను రామునికి మనస్ఫూర్తిగా సమర్పిస్తాను.

ఓ విశ్వామిత్ర మహర్షీ! తమరు ఆజ్ఞాపిస్తే మా మంత్రులు వెంటనే అయోధ్యకు పోయి, రామలక్ష్మణులు తమరి సంరక్షణలో సుఖంగా ఉ న్నారని తెలిపి, రాముడు శివధనుర్భంగము చేయడం, నేను నా కుమార్తె సీతను రామునికి ఇచ్చి వివాహం చేయ సంకల్పించడం మొదలగు విషయములన్నిటి గురించి దశరథమహారాజుకు వివరంగా చెప్పి, దశరథ మహారాజును బంధుమిత్ర సపరివార సమేతము గా మిథిలకు తోడ్కొని రాగలరు. " అని వినయంగా పలికాడు.

అలాగే కానిమ్ము అని విశ్వామిత్రుడు జనక మహారాజుకు అనుజ్ఞ ఇచ్చాడు. వెంటనే జనక మహారాజు తన మంత్రులతో సంప్రదించాడు. అయోధ్యకు వెళ్లి దశరథమహారాజుకు జరిగిన విషయములు అన్నీ

చెప్పి వారిని సగౌరవంగా మిథిలకు తీసుకొని వచ్చుటకు మంత్రులను పంపించాడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము అరవై ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

### అరవై ఎనిమిదవ సర్గ.

జనకమహారాజు పంపిన దూతలు అత్యంత ప్రయాసల కోర్చి మూడుదినములకు అయోధ్య నగరమునకు చేరుకున్నారు. రాజభవనమునకు వెళ్లారు. బయట ఉన్న ద్వార పాలకులకు "మిథిలా నగరము నుండి జనకమహారాజు దూతలు వచ్చారు అని దశరథ మహారాజు గారికి మనవి చేయండి." అని వర్తమానము పంపారు.

ఆ వర్తమానమును అందుకున్న దశరథుడు వారిని లోపలకు రమ్మన్నాడు. జనక మహారాజు పంపిన దూతలు జ్ఞానవృద్ధుడు, వయోవృద్ధుడు అయిన దశరథమహారాజును చూచి వినయంతో నమస్కరించారు. ఆయనతో ఇలా అన్నారు.

"దశరథ మహారాజా! తమరికి జయము కలుగు గాక! మేము మిథిలాధి పతి అయిన జనకమహారాజు వద్దనుండి దూతలుగా వచ్చాము. జనక మహారాజు తమరియొక్క, తమరి మంత్రి, సామంత, పురోహితుల యొక్క  యోగ క్షేమ సమాచారములు విచారించు చున్నారు. తమరి కుశలము కనుక్కోమని చెప్పారు. తమరి కుమారులు రాముడు, లక్ష్మణుడు విశ్వామిత్రుల వారి సంరక్షణలో సురక్షితముగా ఉన్నారని తమరికి చెప్పమన్నారు. విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు మిథిలలో జనక మహారాజు అతిథి సత్కారములు

అందుకుంటున్నారు అని చెప్పమన్నారు. విశ్వామిత్రుల వారి అనుమతితో తమరితో ఈ మాటలు, వారి మాటలుగా చెప్పమన్నారు.

"నేను నా కుమార్తె సీతను వీరత్వమునే శుల్కముగా నిర్ణయించి వివాహము జరిపిస్తాను అని ప్రతిజ్ఞ చేసిన విషయం తమరికి తెలుసు. కాని నా కుమార్తెను వరించి వచ్చిన వీరులందరూ నా చేత పరాజితులై పారిపోయారు. వీర్యశుల్క అయిన నా కుమార్తె సీతను, విశ్వామిత్ర మహర్షి వెంట మిథిలకు వచ్చిన తమరి కుమారుడు, రాముడు, తన వీరత్వముతో గెల్చుకున్నాడు. తర తరాలుగా మా గృహములో పూజలందుకొనుచున్న శివధనుస్సును తమరి కుమారుడు రాముడు అవలీలగా ఎక్కుపెట్టి మధ్యకు విరిచి లోకానికి తన పరాక్రమమును చాటాడు. వీర్యశుల్క అయిన నా కుమార్తె సీతను నా ప్రతిజ్ఞ ప్రకారము తమరి కుమారుడు రామునికి ఇచ్చి వివాహము చేయుటకు నాకు అనుజ్ఞ ఇవ్వవలసినదిగా ప్రార్థించుచున్నాను. తమరు బంధువులు, మిత్రులు, పురోహితులు సహితంగా మిథిలకు విచ్చేయవలసినదిగా కోరుచున్నాను. తమరుమిథిలకు వచ్చి శ్రీరాముని వివాహ మహోత్సవమును జరిపించవలసిందిగా ప్రార్థిస్తున్నాను." అని జనక మహారాజు విశ్వామిత్రుల అనుమతి పొంది, తమ పురోహితులు శతానందులవారి అనుమతి పొంది తమరితో పైవిధముగా చెప్పమన్నారు." అని ఆ దూతలు జనక మహారాజు సందేశమును దశరథునికి సవినయంగా మనవిచేసారు.

తన కుమారునికి వివాహము అని తెలిసి దశరథుడు ఎంతో సంతోషించాడు. వసిష్ఠుని, పురోహితులను పిలిపించాడు.

వారితో ఇలా అన్నాడు. "రాముడు, లక్ష్మణుడు విశ్వామిత్రునితో కలిసి విదేహ పురములో ఉన్నాడని వర్తమానము వచ్చింది. మన రాముని బల పరాక్రమములు చూచి విదేహ మహారాజు జనకుడు తన కుమార్తె సీతను మన రామునికి ఇచ్చి వివాహము చేయ సంకల్పించాడట. కాబట్టి మీరు జనకుని గురించి వివరాలు సేకరించండి. జనకునితో సంబంధము మీ అందరకూ ఇష్టం అయితే. జనకుని ఆచార వ్యవహారాలు మీకు నచ్చితే, మనము విదేహ పురమునకు బయలుదేరి వెళుదాము." అని అన్నాడు.

దశరథుని ఆస్థానములో ఉన్న పురోహితులు, ఋషులు తమలో తాము తర్కించుకొని అందరూ ఏక కంఠంతో జనకునితో సంబంధము తమకు ఇష్టమే అని చెప్పారు. ఆ మాటలకు దశరథుడు ఎంతో సంతోషించాడు. "రేపే ప్రయాణము" అని నిర్ణయించాడు.

జనక మహారాజు దూతలు ఆ రాత్రికి దశరథమహారాజు అతిథులుగా అయోధ్యలో ఉన్నారు.

శ్రీమద్రామాయణము

బాలకాండము అరవై ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

### అరవై తొమ్మిదవ సర్గ.

రాత్రి గడిచి తెల్లవారింది. దశరథుడు తెల్లరాజుజామున లేచి కాలకృత్యములు సంధ్యావందనాది కార్యక్రమములు నిర్వర్తించుకొని తన మంత్రి సుమంతుని పిలిపించాడు.

"సుమంతా! రాముని వివాహమునకు మనకు మిథిలకు వెళు తున్నాము. ముందు ధనరాసులు, రత్నములు, ఆభరణములతో కొంతమంది వెళ్లాలి. తరువాత మా వెంట చతురంగ బలములు బయలుదేరాలి. మన పురోహితులు వసిష్ఠుడు, వామదేవుడు, మహాఋషులు జాబాలి, కశ్యపుడు, మార్కండేయుడు, కాత్యాయనుడు కూడా వస్తున్నారు. వారి ప్రయాణానికి తగిన ఏర్పాట్లు చెయ్యండి. ఆలస్యము చేయవద్దు." అని ఆదేశాలు ఇచ్చాడు.

సుమంతుడు దశరథుని ప్రయాణానికి తగు ఏర్పాట్లు చేసాడు. నాలుగు రోజుల ప్రయాణము తరువాత అందరూ మిథిలకు చేరుకున్నారు. జనకుడు వారిని తగు మర్యాదలతో ఆహ్వానించాడు. అతిథి సత్కారములు, విడిది ఏర్పాట్లు చేసాడు. దశరథ మహారాజును కలుసుకొని జనకుడు ఇలా అన్నాడు.

"ఓ దశరథమహారాజా! తమరికి మిథిలాధిపతి జనకుడు స్వాగతము పలుకుతున్నాడు. తమరి రాకతో మా మిథిలా నగరము పావనముఅయింది. తమరి కుమారుల పరాక్రమము అనుపమానము, అద్వితీయము. మా భాగ్యము కొద్దీ వసిష్ఠ మహర్షి మా నగరమునకు వచ్చారు. మాకు ఎంతో ఆనందముగా ఉంది.

ఓ దశరథమహారజా! మా భాగ్య వశమున రఘువంశ రాజులతో వియ్యమందడంతో అన్ని విఘ్నములు తొలగిపోయాయి. మా కులము పావనమయింది. రేపు నేను తలపెట్టిన యజ్ఞము పూర్తి అయిన తరువాత వివాహ మహోత్సవ కార్యక్రమము జరుపుటకు అనుమతిని ఇవ్వండి." అని అన్నాడు జనకుడు.

అప్పుడు దశరథుడు ఇలా అన్నాడు. "ఓ జనకమహారాజా!తమరు కన్యాదాతలు. తమరు కన్యాదానం చేస్తేనే కదా మేము కన్యను స్వీకరించేది. కాబట్టి కన్యాదాన ముహూర్త నిర్ణయము మీది. తమరు ఎలా చెపుతారో అలాగే చేస్తాము." అని అన్నాడు దశరథుడు.

ఆ మాటలకు జనకుడు ఎంతో సంతోషించాడు. ఆ రాత్రికి దశరథుడు, ఆయన వెంట వచ్చిన మునులు, పురోహితులు, పరివారము మిథిలానగరములో సుఖంగా గడిపారు. దశరథుడు విశ్వామిత్రుని వద్ద ఉన్న రామలక్ష్మణులను చూచి ఎంతో ఆనందించాడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము అరువదితొమ్మిదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## డెబ్బదియవ సర్గ.

మరునాడు ఉదయం జనకుడు అగ్ని కార్యము, యజ్ఞము పూర్తిచేసాడు. తనపురోహితుడు అయిన శతానందునితో ఇలా అన్నాడు.

"శతానందులవారూ! మా తమ్ముడు శతధ్వజుని, ఆయన కుటుంబమును ఈ వివాహమునకు తీసుకొని వచ్చుటకు తగిన ఏర్పాట్లు చేయండి." అని చెప్పాడు. శతానందుడు వెంటనే జనకని సోదరుడు కుశధ్వజుని తీసుకొని వచ్చుటకు సాంకాశ్యనగరమునకు దూతలను పంపారు. వారు వాయువేగ మనోవేగములతో సాంకాశ్యనగరము చేరుకున్నారు. జనక మహారాజు సందేశమును వినిపించారు. తమతో మిథిలకు రమ్మని ఆహ్వానించారు.

వెంటనే కుశధ్వజుడు అన్నగారి ఆజ్ఞమేరకు బంధుమిత్ర పరివారములతో మిథిలకు వచ్చాడు. జనకునికి అభివాదము చేసి పురోహితుడు శతానందునికి నమస్కరించాడు. అన్నదమ్ములు ఇరువురూ ఆలోచించుకొని తమ మంత్రులలో శ్రేష్టుడు అయిన సుదాముని దశరథమహారాజును విడిది నుండి బంధుమిత్రులతో సహా తీసుకొని వచ్చుటకు పంపారు.

సుదాముడు దశరథుడు విడిది చేసి ఉన్న చోటికి వెళ్లాడు.

దశరథునితో ఇలా అన్నాడు.

"దశరథమహారాజా! తమకు శుభం కలుగుగాక! మా మహారాజు జనకుడు తమరిని సపరివారసమేతంగా తోడ్కొని రమ్మని నన్ను నియోగించాడు. తమరిని చూచుటకు మా మహారాజు గారు ఆతురతగా ఉన్నారు." అని పలికాడు.

సుదాముని ఆహ్వానము అందుకున్న దశరథుడు తన పురోహితులు, ఋషులు వెంట రాగా, జనకుని వద్దకు వెళ్లాడు. జనకుని చూచి దశరథుడు ఇలా అన్నాడు.

"ఓ జనక మహారాజా! మా కులగురువు, వసిష్టుడు అని మీకు తెలియును కదా! బ్రహ్మర్షి విశ్వామిత్రుల వారి అనుమతితో మా కులగురువు వసిష్ఠుడు తమరికి మా వంశ వృక్షము గురించి, మా వంశములోని పూర్వ రాజుల గురించి వివరంగా చెప్పగలడు." అని పలికి దశరథుడు వసిష్ఠునని వంక చూచాడు.

దశరథుని మాటలు విన్న వసిష్ఠుడు లేచి నిలబడ్డాడు. సభాసదులను, జనకుని, సదానందుని చూచి ఇలా అన్నాడు.

"ఓ జనకమహారాజా! సభాసదులారా! ఇప్పుడు నేను ఇక్ష్వాకు వంశము గురించి చెప్పబోవుచున్నాను. సావధానముగా వినండి. అవ్యక్తము నుండి బ్రహ్మదేవుడు పుట్టాడు. బ్రహ్మ దేవుడు శాశ్వతుడు, నిత్యుడు, అవ్యయుడు. ఆ బ్రహ్మ కుమారుడు మరీచి. మరీచి కుమారుడు కశ్యపుడు. కశ్యపుని కుమారుడు సూర్యుడు. సూర్యునికి

మనువు పుట్టాడు. ఆ మనువు ప్రజాపతి అయ్యాడు. ఆ మనువు కుమారుడే ఇక్ష్వాకువు. ఆ ఇక్ష్వాకువు అయోధ్యను మొట్టమొదటి సారిగా పరిపాలించాడు. ఆయన పేరుతోనే ఇక్ష్వాకు వంశము ఆవిర్భవించింది.

ఇక్ష్వాకుని కుమారుడు కుక్షి. కుక్షి కుమారుడు వికుక్షి. వికుక్షి కుమారుడు బాణుడు. బాణుడు అమితమైన తేజస్సు పరాక్రమము కలవాడు. బాణుని కుమారుడు అనరణ్యుడు. అనరణ్యుని కుమారుడు పృథువు. పృథువు కుమారుడు త్రిశంకువు. త్రిశంకువు కుమారుడు దుందుమారుడు. దుందుమారుని కుమారుడు యువనాశ్వుడు. యువనాశ్వుని కుమారుడు మాంధాత. ఆయన గొప్ప చక్రవర్తి. మాంధాత కుమారుడు సుసంధి. సుసంధికి ఇరువురు కుమారులు వారు ధ్రువసంధి, ప్రసేనజిత్తు. ధ్రువసంధి కుమారుడు భరతుడు. భరతుని కుమారుడు అసితుడు.

హైహయ రాజులైన హైహయుడు, తాలజంఘుడు, శశిబిందు అనువారు అసితునితో శతృత్వము వహించారు. వారందరూ కలిసి అసితుని యుద్ధములో ఓడించారు. అసితుడు రాజ్యము వదిలిపెట్టి తన మంత్రులతోనూ కొద్దిపాటి సేనతోనూ హిమవత్పర్వతము వద్ద ఉన్న భృగుప్రస్రవణము అనే ప్రదేశములో నివసిస్తున్నాడు.

ఆ సమయములో అతని ఇద్దరు భార్యలు గర్భవతులు. ఆ భార్యలిద్దరికీ పడదు. అందులో ఒకామె రెండవ ఆమెకు గర్భస్రావము అగుటకు విషప్రయోగము చేసింది. ఆ సమయములోనే భృగు వంశములో పుట్టిన చ్యవనుడు అక్కడకు రావడం జరిగింది. అసితుని

భార్య ఆయనకు నమస్కరించి తనకు తేజశ్శాలి అయిన కుమారుని ప్రసాదించమని కోరింది. అప్పటికే ఆమె మీద విషప్రయోగము జరిగింది. తన సవతికి విషము పెట్టిన కాళింది అనే అసితుని భార్య కూడా చ్యవనునికి నమస్కరించి తనకు కూడా మంచి పుత్రుడు పుట్టాలని కోరింది.

చ్యవనుడు మొదట నమస్కరించిన ఆమెను చూచి "ఓ భాగ్యశాలీ! నీ గర్భములో మహా బలవంతుడైన కుమారుడు పెరుగుతున్నాడు. అతడు మహా వీరుడు. తేజశ్శాలి. ఆ కుమారుడు నీ శరీరములో ఉన్న విషముతో కూడా జన్మించగలడు." అని పలికాడు. చ్యవనుని మాటలు నిజం చేస్తూ ఆమె ఒక తేజశ్శాలి అయిన కుమారుని ప్రసవించింది. ఆ కుమారుడు విషముతో కూడా జన్మించుటచే సగరుడు అనే పేరుతో పిలువబడ్డాడు.

ఆ సగరుని కుమారుడు అసమంజుడు. అసమంజుని కుమారుడు అంశుమంతుడు. అంశుమంతుని కుమారుడు దిలీప చక్రవర్తి. దిలీపుని కుమారుడు భగీరథుడు. ఆ భగీరథుడే గంగను భూమిమీదికి తీసుకొని వచ్చాడు. ఆ  భగీరథుని కుమారుడు కకుత్థుడు. కకుత్థుని కుమారుడు రఘువు. ఆయన పేరుమీదనే రఘువంశము మొదలయింది.

రఘువు కుమారుడు ప్రవృద్ధుడు. ఆ ప్రవృద్ధుడు శాప వశాత్తు మనిషి మాంసము తినే రాక్షసుడయ్యాడు. ఆయనకు కల్మాషపాదుడు అనే పేరుకూడా ఉంది. ఆ కల్మాషపాదుని కుమారుడు శంఖణుడు. శంఖణుని కుమారుడు సుదర్శనుడు. సుదర్శనుని కుమారుడు

అగ్నివర్ణుడు. అగ్నివర్ణుని కుమారుడు శ్రీఘ్రగురు. శ్రీఘ్రగురు కుమారుడు మరువు. మరువు కుమారుడు ప్రశుక్రుడు. ప్రశుక్రుని కుమారుడు అంబరీషుడు.

అంబరీషుని కుమారుడు నహూషుడు. నహూషుని కుమారుడు నాభాగుడు. నాభాగుని కుమారుడు అజుడు. అజుని కుమారుడే అయోధ్యానగరాధిపతి దశరథమహారాజు. ఈ దశరథమహారాజు పుత్రులే రామలక్ష్మణులు.

ఓ జనక మహారాజా! వీరి వంశక్రమము వింటివి కదా! వీరు మొదటి నుండీ విశుద్ధమైన వంశములో పుట్టినవారు. పరమ ధార్మికులు. ఇక్ష్వాకు వంశములో పుట్టిన వారు. వీరులు. సత్యసంధులు. ఇటువంటి సర్వలక్షణ సమన్వితులను నీ కుమార్తెలు వరించినారు. అందువలన నీవు నీ కుమార్తెలను రామలక్ష్మణులకు ఇచ్చి వివాహము చేయడం శుభప్రదము.

శ్రీమద్రామాయణము

బాలకాండము డెబ్బయ్యవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## డెబ్బదిఒకటవ సర్గ.

ఆ ప్రకారంగా వసిష్ఠుడు దశరథుని వంశము గురించి చెప్పిన తరువాత, జనకుడు చేతులు జోడించి ఇలా అన్నాడు.

“ఓ దశరథ మహారాజా! తమరి వంశక్రమమును గూర్చి విని చాలా ఆనందించాను. కన్యాదాన సమయములో వధువు యొక్క వంశమును గూర్చి కూడా వివరించడం సాంప్రదాయము. కాబట్టి మా వంశ చరిత్రను వివరిస్తాను. అవధరించండి.

మాది మిథిలా నగరము. ఈ మిథిలా నగరమును నిర్మించిన వాడు మిథి అనే చక్రవర్తి. మిథి, నిమి చక్రవర్తి కుమారుడు. ఆయనే మా వంశమునకు మూలపురుషుడు. మిథిని జనకుడు అని కూడా పిలుస్తారు. ఆయనే మా వంశములో మొట్ట మొదటి జనకుడు.

మిథి కుమారుడు ఉదావసువు. ఉదావసుని కుమారుడు నందివర్ధనుడు. నంది వర్ధనుని కుమారుడు సుకేతువు. సుకేతుని కుమారుడు దేవరాతుడు. దేవరాతుని కుమారుడు బృహద్రథుడు. బృహద్రథుని కుమారుడు మహావీరుడు. మహావీరుని కుమారుడు సుధృతి. సుధృతి కుమారుడు దుష్టకేతువు. ఆయన రాజర్షి.

రాజర్షిఅయిన దుష్టకేతువు కుమారుడు హర్యశ్వుడు. హర్యశ్వుని కుమారుడు మరుడు. మరుని కుమారుడు ప్రతింధకుడు. ప్రతింధకుని కుమారుడు కీర్తిరథుడు. కీర్తిరథుని కుమారుడు దేవమీఢుడు. దేవమీఢుని కుమారుడు విబుధుడు. విబుధుని కుమారుడు మహీధ్రకుడు. మహీధ్రకుని కుమారుడు కీర్తిరాతుడు. ఆయన కూడా రాజర్షి.

రాజర్షి అయిన కీర్తిరాతునికి మహారోముడు జన్మించాడు. మహారోముని కుమారుడు స్వర్ణరోముడు. స్వర్ణరోముని కుమారుడు హ్రస్వరోముడు. ఆ హ్రస్వరోమునికి ఇరువురు కుమారులు పుట్టారు. అందులో పెద్దవాడను నేను. రెండవ వాడు నా తమ్ముడు కుశధ్వజుడు.

మా తండ్రిగారైన హ్రస్వరోమ మహారాజు నన్ను ఈ మిథిలా నగరమునకు రాజుగా చేసాడు. నా తమ్ముని బాధ్యతను నాకు అప్పగించి ఆయన వనములకువెళ్లాడు. కాలవశాత్తు నా తండ్రిగారు స్వర్గస్థులయ్యారు. నేను నా తమ్ముని పోషణభారము వహించి రాజ్యము చేస్తున్నాను.

కొంత కాలము తరువాత సాంకాశ మహారాజు సుధన్వుడు నా రాజ్యము మీదికి దండెత్తి వచ్చాడు. నా వద్ద ఉన్న శివధనుస్సును, నా కుమార్తె సీతను తనకు ఇవ్వమని నాకు వర్తమానము పంపాడు. నేను నా కుమార్తెను గానీ శివధనుస్సును గానీ సుధన్వునికి ఇవ్వడానికి అంగీకరించలేదు. మా ఇరువురికి యుద్ధము జరిగింది.

నేను సుధన్వుని యుద్ధములో ఓడించి వధించాను. సాంకాశ పురమును ఆక్రమించుకున్నాను.  తరువాత నా తమ్ముడు కుశధ్వజుని సాంకాశ పురమునకు రాజుగా పట్టాభిషిక్తుని చేసాను.

ఓ వసిష్ట మునీంద్రా! మా సోదరులలో నేను పెద్ద వాడను. నా కుమార్తె పేరు సీత. నా తమ్ముడు కుశధ్వజుని కుమార్తె పేరు ఊర్మిళ. సీతను రామునికి, ఊర్మిళను లక్ష్మణునికి ఇచ్చి వివాహము జరిపించడానికి సంకల్పించాను. ఈ విషయమును ఏ మాత్రము సందేహమునకు తావు లేకుండా  మూడు మారులు నొక్కి చెప్పుచున్నాను. నా కుమార్తెలైన సీత, ఊర్మిళ లను  దశరథమహారాజు కుమారులైన రామునికి లక్ష్మణునికి ఇచ్చి వివాహం జరిపించుటకు ఎంతో ఆనందించుచున్నాను.

ఓ దశరథ మహారాజా! రామ లక్ష్మణులతో గోదానము మొదలగు శుభకార్యములను చేయించండి. పితృకార్యము జరిపించిన తదుపరి వివాహమహోత్సవమును జరిపించెదను.

ఓ దశరథ మహారాజా! నేడు మఘా నక్షత్రము. నేటికి మూడవ రోజున అనగా ఉత్తరఫల్గునీ నక్షత్రములో వివాహము జరిపించెదము. ఈ రెండు రోజులలో రామ లక్ష్మణుల చేత గోదానము మొదలగు దానములు ఇచ్చు కార్యక్రములు నిర్వర్తింపుడు." అని వినయంతో పలికాడు జనకుడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము డెబ్బది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## డెబ్బది రెండవ సర్గ.

జనకుని మాటలు విన్న వసిష్ఠుడు విశ్వామిత్రునితో సంప్రదించాడు. తరువాత ఇరువురు మహాఋషులు జనకునితో ఇలాఅన్నారు.

"ఓ జనకమహారాజా! అటు ఇక్ష్వాకు వంశము, ఇటు విదేహ వంశమూ రెండూ విశిష్ఠమైనవే. ఒకదానికి ఒకటి తీసిపోవు. ఈ రెండు వంశములు కలవడం అత్యంత శుభదాయకము. నీ కుమార్తె అయిన సీతను రామునికి, నీ తమ్ముడు కుశధ్వజుని కుమార్తె అయిన ఊర్మిళను లక్ష్మణునికి ఇచ్చి వివాహం చెయ్యడం వారి వంశ గౌరవములకు, రూప సంపదలకు తగిఉన్నది.

ఈ సందర్భములో ఒక మాట చెప్పాలని మాకు అనిపించింది. నీ తమ్ముడు కుశధ్వజుడు ధర్మాత్ముడు. ఆయనకు ఊర్మిళ కాకుండా ఇంకా ఇరువురు కుమార్తెలు ఉన్న సంగతి మాకు తెలుసు. ఆయన ఇరువురు కుమార్తెలను దశరథుని కుమారులైన భరత శత్రుఘ్నులకు ఇచ్చి వివాహము జరిపించండి. రెండు వంశములు ధన్యమవుతాయి. దశరథుని కుమారులైన భరత శత్రుఘ్నులు అంద చందములలోనూ, రూప లావణ్యములలోనూ, బల పరాక్రమములలోనూ రామ లక్ష్మణు లకు ఏ విధంగానూ తీసి పోరు. ఈ వివాహములతో మీ ఇరువురి

రాజ్యములు ధృఢమైన సంబంధ బాంధవ్యములు కలిగి ఉంటాయి." అని పలికారు.

ఆ మాటలు విన్న జనకుడు, వసిష్ఠ విశ్వామిత్రులతో ఇలా అన్నాడు. " ఓ మునిశ్రేష్ఠులారా! మీ సంబంధములతో నేను నా తమ్ముడు ధన్యులమయ్యాము. నా తమ్ముడు కుశధ్వజుని కుమార్తెలు అయిన మాండవి, శ్రుతకీర్తి లను దశరథుని కుమారులు భరతుడు శత్రుఘ్నులకు ఇచ్చి వివాహము చేయుటకు నేను నాతమ్ముడు మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాము. ఈ నాలుగు వివాహములు ఒకే రోజున ఒకే సమయములో ఒకే వివాహ వేదిక మీద జరిపిస్తాను.

ఉత్తర ఫల్గునీ నక్షత్రమునకు సంతాన ప్రదాత అయిన భగుడు దేవత. ఆ శుభనక్షత్రములో ఈ నాలుగు వివాహములు వైభవంగా జరిపించడానికి అనుమతి ఇవ్వండి. మీరు ఇరువురు దగ్గర ఉండి ఈ శుభకార్యములను జరిపించండి. ఈ వివాహములతో అయోధ్య, విదేహ రాజ్యములు ఒకటవుతాయి." అని వినయంతో పలికాడు జనకుడు.

ఆమాటలు విన్న దశరథుడు ఇలాఅన్నాడు. "ఓ జనక మహారాజా! నీవు, నీ సోదరుడు కుశధ్వజుడు సద్గుణ సంపన్నులు. ధర్మపరులు. మీతో సంబంధము నాకు ఎంతో ఆనంద దాయకము. నేను ఇంక మా నివాసమునకు వెళ్ళెదను. నా కుమారుల చేత వివాహమునకు ముందు జరుగు శ్రాద్ధకర్మలను, దానములను నిర్వర్తింప జేస్తాను." అని పలికాడు.

తరువాత వసిష్ఠుడు విశ్వామిత్రులతో కూడా తన నివాసమునకు వెళ్లాడు. ఆరోజు ంతన కుమారుల చేత  వేదోక్తంగా శ్రాద్ధకర్మలను నిర్వర్తింపజేసాడు. మరునాడు స్నాతక వ్రతమును జరిపించాడు. ఒక్కొక్క కుమారునిచేత లక్ష గోవులను బ్రాహ్మణులకు దానము ఇప్పించాడు. ఆ విధంగా దశరథుడు తన కుమారులచేత బంగారు తొడుపులు వేసిన కొమ్ములు కలవి, లేగ దూడలతో పాలు ఇచ్చే పాడి ఆవులు నాలుగులక్షల ఆవులను ఇంకా ఇతర ద్రవ్యములను గోదానంగా బ్రాహ్మణులకు  ఇప్పించాడు.

(ఈ సర్గలో పెళ్లికి ముందు శ్రాద్ధ కర్మలు జరిపించారు అని ఉంది. మనం ఈ రోజుల్లో పెళ్లిళ్ల ముందు పెద్దలకు పెట్టుకుంటాము అని అంటారు కదా.  శ్రాద్ధ కర్మలు అంటే శుభకార్యము జరిపించే ముందు పెద్దలను పూజించడం అని అర్థం చేసుకోవచ్చు.)

శ్రీమద్రామాయణము
బాలకాండము, డెబ్బది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్  ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## డెబ్బదిమూడవ సర్గ.

దశరథుడు తన కుమారులచేత గోదానములు ఇప్పించు చున్న సమయంలో భరతుని మేనమామ యుధాజిత్తు అక్కడకు వచ్చాడు.

(భరతుని మేనమామ అంటే దశరథుని మూడవ భార్య, భరతుని తల్లి అయిన  కైకేయి సోదరుడు అనగా కేకయ రాజు కుమారుడు).

కేకయ రాజ కుమారుడు, భరతునికి మేనమామ అయిన యుధాజిత్తును చూచి దశరథుడుఎంతో సంతోషించాడు. యుధాజిత్తు దశరథునితో ఇలా అన్నాడు.

"బావగారూ! మా తండ్రికేకయ రాజుగారు తమరిని కుశలము అడగమని అన్నాడు. ఇక్కడ మీరందరూ క్షేమమే కదా! మా తండ్రిగారు తన మేనల్లుడు అయిన భరతుని చూడవలెనని ముచ్చట పడు తున్నాడు. భరతుని నా వెంట తీసుకొని రమ్మని నన్ను పంపాడు. అందుకని నేను అయోధ్యానగరమునకు వెళ్లాను. మీరందరూ మీ కుమారుల వివాహములు జరిపించుటకు  విదేహ కు వెళ్లారని తెలిసి ఇక్కడకు వచ్చాను." అని అన్నాడు యుధాజిత్తు.

దశరథుడు ఎంతో సంతోషంగా యుధాజిత్తుకు అతిథి సత్కారములు చేసాడు. అందరూ సంతోషంగా ఆ రాత్రి గడిపారు. మరునాడు ఉదయము అందరూ పెందలకడనే నిద్రలేచి ప్రాత:కాల సంధ్యావందనాది కార్యక్రమములు నిర్వర్తించుకొన్నారు. తరువాత వారందరూ విశ్వామిత్రుడు, వసిష్ఠుడు మొదలగు ఋషులు ముందు నడువగా యజ్ఞవాటికకు చేరుకున్నారు.

పెళ్లి కుమారులైన రామలక్ష్మణభరతశత్రుఘ్నులు శుభ ముహూర్తంలో తోరము కట్టడం మొదలగు మంగళ కార్యములు ఆచరించారు. తరువాత నలుగురు సోదరులు, పురోహితులు, అందరూ దశరథుని వద్దకు వెళ్లారు. దశరథుని అనుమతితో వసిష్ఠుడు జనక మహారాజు వద్దకు పోయి ఇలాఅన్నాడు.

“ఓ జనక మహారాజా! దశరథమహారాజు తన కుమారులకు కౌతుక మంగళకార్యములనుపూర్తిచేసుకొని తమరి కొరకు ఎదురు చూస్తున్నారు. కన్యాదాన కార్యక్రమము కన్యాదాతలైన మీ అనుమతితో జరగాలికదా! ” అని అన్నాడు.

“అదేమిటి మహర్షీ! మిథిల కూడా వారిదే కదా! వారికి అడ్డేమున్నది. వారునా అనుమతి కోసరం ఎదురు చూడ్డం ఏమిటి? అవశ్యం వారిని రమ్మనండి. ఇక్కడ నా కుమార్తెలు కూడా కౌతుక మంగళ కార్యములను పూర్తిచేసుకొని కల్యాణ వేదిక వద్దకు వచ్చి ఉన్నారు. నేను కూడా వేదిక వద్దకు వెళుతున్నాను. సుముహూర్తము సమీపించుచున్నది. ఇంక ఆలస్యము చేయకుండా దశరథుల వారిని వారి కుమారులను వివాహ వేదిక వద్దకు తోడ్కొని రండు.” అని

అన్నాడు జనకుడు.

జనకుని మాట మేరకు దశరథుడు, తనకుమారులతో సహా పురోహితులు ముందు నడువగా వివాహ వేదిక వద్దకు చేరుకున్నాడు. జనకుడు వారి నందరినీ వివాహ వేదిక వద్దకు సాదరంగా ఆహ్వానించాడు. జనకుడు వసిష్ఠుని చూచి ఇలా అన్నాడు.

" ఓ వసిష్ఠ మహర్షీ! తమరు ఈ వివాహమునకు పౌరోహిత్యము వహించాలి. నా కుమార్తెల వివాహములను దశరథపుత్రులతో వేదోక్తంగా జరిపించమని ప్రార్థిస్తున్నాను." అని అన్నాడు.

ఆ మాటలకు వసిష్ఠుడు తన అంగీకారము తెలిపాడు. తరువాత వసిష్ఠుడు విశ్వామిత్రుని, శతానందుని చెరి ఒక పక్క ఉంచుకొని వివాహ కార్యక్రమమును నిర్వర్తించడానికి ఉపక్ర మించాడు.

వివాహ మండపము మధ్యలో ఉన్న అగ్ని కుండములో అగ్నిహోత్రమును  ఉంచాడు. హోమ కుండము చుట్టు గంధము, పుష్పములు, సువర్ణ కలశములలో పాలికలు, అంకురార్పణ చేసిన కుంభములు, మూకుళ్లు, ధూప పాత్రలు, శంఖ పాత్రలు, హోమము చేయు సాధనములు, నేతితో నిండినపాత్రలు, లాజలతో నిండిన పాత్రలు, అక్షతలు అన్నీ సిద్ధంగా ఉంచుకున్నాడు. వసిష్ఠుడు శాస్త్రోక్తముగా అగ్నిని వేల్చాడు. దర్భలు అగ్నిహోత్రము చుట్టూ పరిచాడు. వేద మంత్రములను పఠిస్తూ హోమ కార్యక్రమమును నిర్వర్తించాడు.

తరువాత జనక మహారాజు సర్వాలంకార భూషిత అయిన తన కుమార్తె సీతను తీసుకొని వచ్చి అగ్ని హెూత్రము వద్ద నిలబడి ఉన్న రాముని ఎదురుగా నిలబెట్టాడు. రాముని చూచి ఇలా అన్నాడు.

"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా॥"

"ఓ రామా! ఈమె నా కుమార్తె సీత. నీకు సహధర్మచారిణి కావడానికి సిద్ధంగా ఉంది. ఈమెను నీ సహధర్మచారిణిగా స్వీకరించు. నీ హస్తముతో నా కుమార్తె సీత హస్తమును గ్రహింపుము. పాణిగ్రహణము చేయుము. ఓరామా! ఈమె పతివ్రతయై నిన్ను ఎల్లప్పుడూ నీడవలె వెన్నంటి ఉండగలదు." అని పలుకుతూ జనక మహారాజు సీత చేతిని రామునికి అందించి జలమును వదిలాడు. కన్యాదానం చేసాడు.

ఆ సమయంలో ఆకాశం నుండి దేవతలు దుందుభులు మోగించారు. పూలవర్షము కురిపించారు. ఆ ప్రకారంగా సీతారాముల కల్యాణము వైభవంగా జరిపించాడు జనకుడు.

తరువాత జనకుడు లక్ష్మణుని పిలిచాడు. "లక్ష్మణా! ఈమె నా కుమార్తె ఊర్మిళ. ఈమెను నీ సహధర్మచారిణిగా స్వీకరింపుము. ఇంక ఆలస్యము చేయకుండా ఈమెను పాణిగ్రహణము గావించు." అని తన కుమార్తె ఊర్మిళ చేతిని లక్ష్మణుని చేతికి అందించాడు.

తరువాత జనకుడు భరతుని చూచి “ ఓ భరతా! ఈమె నా కుమార్తె మాండవి. ఈమెను పాణిగ్రహణము గావించు.

ఓ శత్రుఘ్నా! ఈమె నా కుమార్తె శ్రుత కీర్తి. నీవు ఈమె పాణిని గ్రహించు.

ఓ రామ,లక్ష్మణ,భరత,శత్రుఘ్నులారా! మీరందరూ సౌమ్యులు. గుణవంతులు. మంచి ప్రవర్తన కలవారు. నాకుమార్తెలను మీ మీ భార్యలుగా స్వీకరించండి.” అని అన్నాడు.

అప్పుడు రాముడు సీత చేతిని, లక్ష్మణుడు ఊర్మిళ చేతిని, భరతుడు మాండవి చేతిని, శత్రుఘ్నుడు శ్రుతకీర్తి చేతిని పట్టుకొన్నారు. పాణిగ్రహణ మహోత్సవము జరిగిపోయింది. దశరథుని కుమారులు నలుగురు తమ తమ భార్యల చేతులను పట్టుకొని అగ్నికి నమ స్కారము చేసారు. తరువాత మామగారు జనకునికి నమస్కారము చేసారు. తరువాత పురోహితులు వసిష్ఠమహర్షికి నమస్కారము చేసారు. తరువాత వసిష్ఠుడు దశరథ కుమారుల వివాహ కార్యక్రమ మును వైభవోపేతంగా జరిపించాడు.

తరువాత రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు తమ తమ భార్యల చేతులు పట్టుకొని అగ్నిహోత్రము చుట్టు మూడు సార్లు ప్రదక్షిణము చేసారు. ఆ ప్రకారంగా సీతా రాములు, ఊర్మిళా లక్ష్మణులు, మాండవీ భరతులు, శ్రుతకీర్తి శత్రుఘ్నులు దంపతులు అయ్యారు.

వివాహ కార్యక్రమము తరువాత రామ లక్ష్మణ, భరత శత్రుఘ్నులు తమ తమ భార్యలతో విడిది గృహములకు వెళ్లారు. వారి వెంట ఋషులు, పురోహితులు, బ్రాహ్మణులు కూడా వెళ్లారు. కుమారులను కోడళ్లను తృప్తిగా చూసుకుంటూ దశరథుడు కూడా వారి వెంట విడిదిగృహమునకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము డెబ్బదిమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## డెబ్బదినాల్గవ సర్గ.

సీతారాముల కల్యాణం జరిగింది. ఆ రాత్రి అందరూ సుఖంగా నిద్రించారు. మరునాడు ఉదయం విశ్వామిత్రుడు, నూతన వధూవరు లందరినీ ఆశీర్వదించి, జనకుని వద్ద, దశరథుని వద్ద సెలవు తీసుకొని హిమవత్పర్వతమునకు వెళ్లిపోయాడు.  విశ్వామిత్రుడు వెళ్లిపోయిన తరువాత జనక మహారాజు వద్ద అనుమతి తీసుకొని దశరథుడు కూడా అయోధ్యకు బయలుదేరాడు.

అప్పుడు జనక మహారాజు తన కుమార్తెలకు అంతులేని ధనము, ఆభరణములు కానుకగా ఇచ్చాడు. లక్ష ఆవులను, అనేక వస్త్రాభరణము లను, ఏనుగులు, హయములు, రథములను అరణంగా ఇచ్చాడు. దాసులను దాసీజనమును దన కుమార్తెల వెంట అయోధ్యకు పంపాడు. దారిలో రక్షణ గా చతురంగ బలములను పంపాడు. వారితో పాటు మిథిలా నగరము బయట దాకా వచ్చి వారికి వీడ్కోలు పలికాడు. తరువాత వెను తిరిగి మిథిలకు వచ్చాడు.

దశరథుడు కుమారులు కోడళ్లతో ప్రయాణమై వెళుతున్నాడు. దారిలో వారికి కొన్ని దుశ్శకునములు కనపడ్డాయి. వెంటనే దశరథుడు వసిష్ఠుని పిలిచి ఆ దుశ్శకునముల కు అర్థం చెప్పమని అడిగాడు. అప్పుడు వసిష్ఠుడు ఇలా అన్నాడు.

"ఓ దశరథమహారాజా! మనకు ఏదో ఒక ఆపద వచ్చి పడుతుంది అని ఈ దుశ్శకునములు సూచిస్తూ ఉన్నాయి. కాని ఆ ఆపద సులభంగా తొలగి పోతుంది అని కొన్ని శుభశకునములు కూడా కనపడుతున్నాయియి. కాబట్టి మీరు ఏమీ కంగారు పడనవసరం లేదు." అని వివరించాడు వసిష్ఠుడు.

ఇంతలో తీవ్రంగా పెను గాలులు వీచాయి. భూమి కంపించింది. సూర్యుని కాంతి వెల వెల బోయింది. చీకట్లు కమ్మాయి. ఈ ఉత్పాతాలకు దశరథుడు భయభ్రాంతుడు అయ్యాడు.

అప్పుడు యావత్తు క్షత్రియ కులమును సర్వనాశనము చేసిన పరశురాముడు అక్కడకు వచ్చాడు. వెంటనే దశరథుడు, వసిష్ఠుడు, బ్రాహ్మణులు పరశురాముని సాదరంగా ఆహ్వానించారు. ఆయనకు అర్ఘ్యము పాద్యము సమర్పించారు. ఉచితాసనము ఇచ్చి సత్కరించారు.

శ్రీమద్రామాయణము

బాలకాండము డెబ్బది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## డెబ్బది ఐదవ సర్గ.

వసిష్ఠుడు, దశరథుడు, అర్పించిన అర్ఘ్య పాద్యములు, అతిథి మర్యాదలు స్వీకరించిన పరశురాముడు,రాముని చూచి ఇలా అన్నాడు.

"ఓ రామా! నీ పరాక్రమము గురించి విన్నాను. నీవు శివుని విల్లు విరిచావని కూడా తెలిసింది. నీవు శివుని విల్లు విరవడం నాకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. నీవు పరమశివుని విల్లు విరుస్తావని నేను ఊహించలేదు. అందుకే మరొక మహత్తరమైన విల్లు తీసుకొని వచ్చాను. ఈ విల్లు నాకు మా తండ్రి జమదగ్ని ఇచ్చాడు. ఈ విల్లును కూడా నీవు ఎక్కుపెట్టి నీ పరాక్రమమును ప్రదర్శించు. అప్పుడు నేను నీవు పరాక్రమ వంతుడవనీ, వీర్య వంతుడవనీ ఒప్పుకుంటాను. నీతో ద్వంద్వ యుద్ధము చేస్తాను. రా! ఈ విల్లు తీసుకో! " అని రాముని పిలిచాడు పరశురాముడు.

ఆ మాటలు విని దశరథుడు నిలువెల్లా వణికిపోయాడు. చేతులు జోడించి పరశురాముని ఎదుట నిలబడి ఇలా అన్నాడు.

"ఓ పరశురామా! నీ కీర్తి లోకమంతా వ్యాపించింది. నీవు బ్రాహ్మణుడవు. కాని నీవు క్షత్రియుల మీద కోపించి వారిని 21 మార్లు ఓడించావు. తరువాత శాంతిని పొందావు. కాని ఇప్పుడు అకారణంగా బాలుడైన  నా కుమారుని యుద్ధానికి పిలుస్తున్నావు. ఇది న్యాయమా! నా కుమారులను ఏమీ చేయనని అభయము ఇమ్ము.

ఓ పరశురామా! నీవు సామాన్యుడవుకావు. పవిత్రమైన భృగు వంశంలో జన్మించావు. దేవేంద్రుని సమక్షంలో ఆయుధములను విడిచిపెట్టావు. నీవు జయించిన ఈ భూమండలము నంతా కశ్యపునకు దానం చేసావు. మహేంద్ర పర్వతము మీద తపస్సు చేసుకుంటున్నావు. అటువంటి నీవు అకారణంగా నా కుమారుడు రాముని యుద్ధమునకు పిలుస్తున్నావు. రాముడు నీతో యుద్ధము చేసి జయించలేడు. రాముడు లేనిచో మేము ఎవరమూ బతుకలేము. కాబట్టి మా కందరకూ ప్రాణభిక్ష పెట్టు." అని వేడుకున్నాడు.

కాని పరశురాముడు దశరథుని మాటలు లెక్కచేయలేదు. రాముని చూచి ఇలా అన్నాడు.

"ఓ రామా! నీవు విరిచిన ధనుస్సు, నా చేతిలో ఉన్న ధనుస్సు రెండూ గొప్పవి. దివ్యలోకములకు సంబంధించినవి. బాగా ధృడమైనవి. బలమైనవి. ఈ రెండు ధనుస్సులను విశ్వకర్మ తయారు చేసాడు. అందులో ఒక ధనుస్సును త్రిపురాసుర సంహార సమయంలో దేవతలు పరమేశ్వరునికి ఇచ్చారు. ఆ ధనుస్సునే నీవు విరిచావు. ఈ రెండవ ధనుస్సు దేవతలు విష్ణువుకు ఇచ్చారు. కాబట్టి దీనిని విష్ణు ధనుస్సు అని అంటారు. ఈ ధనుస్సు కూడా శివధనుస్సుతో సమానమైనది.

ఒక సారి దేవతలు అందరూ బ్రహ్మదేవుని వద్దకు పోయి శివుడు, విష్ణువు వీరిలో అత్యధిక బలవంతుడు ఎవరు? అని అడిగారు. బ్రహ్మ కూడా చెప్పలేకపోయాడు. శివకేశవులలో ఎవరు బలవంతులో తెలుసుకోడానికి వారిద్దరి మధ్య భేదాభిప్రాయాలు కల్పించాడు. అవి వారిద్దరి మధ్య యుద్ధమునకు దారి తీసాయి. శివకేశవులకు మధ్య భయంకరమైన యుద్ధము జరిగింది. అప్పుడు విష్ణువు పెద్దగా హుంకారము చేసాడు. ఆ హుంకారమునకు శివుడు భయపడి పోయాడు. అప్పుడు విష్ణువే అధికుడు అని నిర్ణయించారు.

పరమశివునికి కోపం వచ్చింది. తన చేతిలో ఉన్న శివ ధనుస్సును విదేహ దేశాధీశుడు అయిన దేవరాతుడు అనే రాజర్షి వద్ద ఉంచాడు. విష్ణువు కూడా తన ధనుస్సును భృగు వంశీకుడు అయిన ఋచీకుని వద్ద ఉంచాడు. ఋచీకుడు మా తాతగారు. మా తాత గారైన ఋచీకుడు ఆ విష్ణు ధనుస్సును తన కుమారుడు. మా తండ్రి అయిన జమదగ్నికి ఇచ్చాడు.

పాపాత్ముడైన కార్తవీర్యార్జునుడు నా తండ్రి జమదగ్ని ని చంపాడు. నా తండ్రిని చంపాడన్న కోపంతో కార్తవీర్యార్జునుని వాని కుమారులను చంపాను. అతనినే కాదు క్షత్రియ వంశములో ఉన్న ప్రతి వానినీ పుట్టిన వాడిని పుట్టినట్టు సంహరించాను. క్షత్రియకులమును సర్వనాశనము చేసాను. భూమి మీద రాజు అనేవాడు లేకుండా చేసాను. క్షత్రియులను చంపి నేను జయించిన ఈ భూమిని కశ్యపునకు దానంగా ఇచ్చాను. తరువాత నేను మహేంద్రపర్వతము మీద తపస్సు చేసుకుంటున్నాను. ఇప్పుడు నీవు శివధనుస్సును విరిచావు అని దివ్యదృష్టి ద్వారా తెలుసుకొని నీ దగ్గరకు వచ్చాను.

ఓ రామా! నీవు క్షత్రియుడవు. క్షత్రియ ధర్మము ప్రకారము మాకు వంశపారంపర్యముగా సంక్రమించిన ఈ విష్ణుధనుస్సును తీసుకో. దీనిని కూడా ఎక్కుపెట్టి సంధించు. నాతో ద్వంద్వ యుద్ధము చెయ్యి. " అని పలికాడు పరశురాముడు.

శ్రీమద్రామాయణము
బాలకాండము డెబ్బదిఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

బాలకాండ

డెబ్బది ఆరవ సర్గ.

అప్పటి వరకూ శ్రీ రాముడు తండ్రి మీద ఉన్న గౌరవంతో ఒక్క మాట కూడా మాట్లాడలేదు. కాని ఇంక ఊరుకోలేక పోయాడు. తండ్రి వంక చూచి ఆయన అనుమతితో పరశురామునితో ఇలా అన్నాడు.

"పరశురామా! మీ గురించి విన్నాను. నీవు తండ్రి ఋణమును తీర్చుకోడానికి యావత్తు క్షత్రియ లోకమును మట్టు బెట్టిన సంగతి నాకు తెలుసు. దానికి నిన్ను అభినందిస్తున్నాను. కాని నాకు నీవు పరీక్ష పెడుతున్నావు. నేను పరాక్రమము లేని వాడిగా నీవు భావిస్తున్నావు. దానిని నేను నాకు జరిగిన అవమానముగా భావిస్తున్నాను. ఇప్పుడు నా పరాక్రమమును నీకు ప్రదర్శిస్తాను. చూడు." అని పలికి పరశు రాముని చేతిలోని ఆ దివ్యమైన ధనుస్సును బాణమును తీసుకున్నాడు. ఆ ధనుస్సుకు ఉన్న నారిని సవరించాడు. ధనుస్సును ఎక్కుపెట్టాడు. బాణమును ఆ ధనుస్సులో సంధించాడు. పరశురాముని చూచి ఇలా అన్నాడు.

"ఓ పరశురామా! మీరు బ్రాహ్మణులు. నాకు పూజ్యులు. కాబట్టి ఈ బాణమును మీ మీద ప్రయోగింపలేను. కాని సంధించిన బాణము వృధాకారాదు. కాబట్టి ఈ బాణమును దేని మీద ప్రయోగింప వలెనో

చెప్పండి. నీ పాదములకు ఎక్కడికైనా పోగల శక్తి ఉంది. నా బాణమును ఆశక్తి మీద ప్రయోగింపనా. లేక నీవు ఇప్పటిదాకా తపస్సు చేసి సంపాదించుకున్న ఉత్తమలోకముల మీద సంధించనా! ఏదో ఒకటి చెప్పు. ఎందుకంటే ఈ విష్ణుబాణము వృధాకావడానికి వీలు లేదు. నీవు పట్టు బట్టి నా చేత ఈ బాణమును సంధింపజేసావు. ఆ ఫలితాన్ని నీవే అనుభవించాలి." అని అడిగాడు రాముడు.

ఆ మాటలకు పరశురాముని బలపరాక్రమములు నశించి పోయాయి. శరీరం నిర్వీర్యము అయింది. అలానే చూస్తూ ఉండి పోయాడు. విష్ణుబాణము సంధించిన రాముడు సాక్షాత్తు విష్ణుమూర్తి మాదిరి కనిపించాడు. ఆశ్చర్యపోయాడు పరశురాముడు. చేతులు జోడించి నమస్కరించాడు.

"ఓ రామా! నీవు సామాన్యుడవు కావు. విష్ణు ధనుస్సును ధరించిన విష్ణుమూర్తివి. నీకు అసాధ్యము ఏమీ లేదు. యుద్ధములో నిన్ను జయించడం ఎవరి తరమూ కాదు. నీ చేతిలో నేను ఓడి పోయాను. నన్ను క్షమించు. నేను క్షత్రియ సంహారము చేసి ఈ భూమి నంతా కశ్యపునకు ఇచ్చాను. అప్పుడు కశ్యపుడు నన్ను ఈ దేశములో నివసించవద్దు అని ఆజ్ఞాపించాడు. అందుకని నేను మహేంద్రపర్వతము మీద తపస్సుచేసుకుంటున్నాను. నువ్వు నా గమనశక్తిని నీ బాణంతో హరిస్తే నేను మహేంద్రగిరికి పోలేను. కాబట్టి నా గమన శక్తిని కొట్టవద్దు. దానికి బదులు నేను తపస్సు చేసి సంపాదించిన నా పుణ్యలోకముల మీద నీ బాణమును సంధించు. తరువాత నేను మహేంద్రగిరికి పోతాను." అని అన్నాడు పరశు రాముడు.

పరశురాముని మాటలను మన్నించి రాముడు విష్ణుబాణము ప్రయోగించాడు. పరశురాముడు తపస్సు చేసి సంపాదించుకున్న పుణ్యలోకములు అన్నీ ధ్వసం అయ్యాయి. తరువాత పరశురాముడు రామునికి ప్రదక్షిణము చేసి నమస్కరించి,  తన దివ్యమైన గమన శక్తితో మహేంద్రపర్వతమునకు వెళ్లిపోయాడు. ఇదంతా ఆశ్చర్యంతో చూచాడు  దశరథుడు.

శ్రీమద్రామాయణము

బాలకాండము డెబ్బది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## బాలకాండ

## డెబ్బది ఏడవ సర్గ.

పరశురాముడు మహేంద్రగిరికి వెళ్లిన తరువాత రాముడు తన వద్ద ఉన్న విష్ణుధనుస్సును, బాణమును, వరుణ దేవునికి ఇచ్చాడు. తరువాత రాముడు వసిష్ఠుడు మొదలగు ఋషులకు బ్రాహ్మణులకు నమస్కరించాడు. తండ్రి దశరథుని చూచి ఇలాఅన్నాడు.

"తండ్రీ! పరశురాముడు వెళ్లిపోయాడు. ఇంక మనము అయోధ్యకు ప్రయాణము సాగిద్దాము. మన పరివారమునకు సేనలకు అనుజ్ఞ ఇవ్వండి." అని అన్నాడు.

అప్పటి దాకా ఆశ్చర్యంతో చూస్తున్న దశరథుడు ఒక్కసారి తెలివిలోకి వచ్చాడు. రాముని గట్టిగా కౌగలించుకున్నాడు. శిరస్సును ముద్దుపెట్టుకున్నాడు. అటు ఇటు చూచి పరశురాముడు వెళ్లి పోయాడు అని నిర్ధారించుకున్నాడు. ఆనందంతో పొంగిపోయాడు. రామలక్ష్మణభరతశత్రుఘ్నులు మరలా జన్మమెత్తినట్టు భావించాడు. దశరథుని మనస్సు కుదుట పడింది. తన సైన్యమునకు అయోధ్యకు ప్రయాణము సాగించమని ఆజ్ఞాపించాడు. అందరూ అయోధ్యకు చేరుకున్నారు.

వీరి రాక ముందు తెలిసిన అయోధ్యాపుర వాసులు వారికి ఘనస్వాగతం పలికారు. నగరమంతా మామిడి తోరణములతోనూ, అరటి స్తంభములతోనూ, రకరకాల పూలతోనూ అలంకరించారు. మంగళ వాద్యములతో రామునికి ఎదురేగి స్వాగతం పలికారు. అందరూ రాజనగరు ప్రవేశించారు.

కౌసల్య, సుమిత్ర, కైకేయీ ఎదురుగా వచ్చి కొత్త కోడళ్లను ఆహ్వానించి లోపలకు తీసుకొని వెళ్లారు. సీతకు, ఊర్మిళకు,మాండవికి, శ్రుతకీర్తికి కొత్త పట్టుబట్టలు అలంకరింపజేసారు. నూతన వధూవరులు గృహప్రవేశ కార్యక్రమును నిర్వర్తించారు. గృహదేవతలను పూజించారు. జనకుని పుత్రికలు అత్తగార్లకు, పెద్దలకు నమస్కరించి వారి ఆశీర్వాదములు తీసుకున్నారు. బ్రాహ్మణులకు గోదానములు, సువర్ణదానములను చేసి వారిని తృప్తిపరిచారు. ఆ రాత్రికి వారి వారి భర్తలతో సాంసారిక సుఖములను అనుభవించారు. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు తండ్రి దశరథునికి సేవచేసు కుంటూ ఉన్నారు.

కొన్ని రోజులు గడిచిన తరువాత దశరథుడు భరతుని చూచి ఇలా అన్నాడు.

"నాయనా భరతా! నీ మేనమామ యుధాజిత్తు నిన్ను తన వెంట తీసుకొని వెళ్లుటకు కేకయ రాజ్యము నుండి వచ్చాడు. ఆ విషయము నాకు మిథిలలోనే చెప్పాడు. శుభకార్యములు జరుగు చుండుట వలన వీలు కాలేదు. నీవు నీ తాత గారింటికి వెళ్లి ఆయనను సంతోష పెట్టు." అని అన్నాడు.

భరతుడు తండ్రి మాట ప్రకారము చేసాడు. తండ్రికి తల్లులకు, పెద్దలకు పురోహితులకు నమస్కరించి వారి ఆశీర్వాదము వారి అనుమతి తీసుకున్నాడు. శత్రుఘ్నుడు వెంట రాగా తన తాతగారి ఇంటికి ప్రయాణమయ్యాడు.

భరత శత్రుఘ్నులు వెళ్లిన తరువాత రామ లక్ష్మణులు తండ్రిగారికి సేవజేసుకుంటూ ఉన్నారు. తండ్రి అనుమతితో రాముడు ప్రజలకు ఉపయోగపడే ఎన్నో పనులను చేసాడు. పూర్తిగా నియమములను పాటిస్తూ తండ్రికి రాజ్యపాలనలో సాయం చేస్తున్నాడు. ఎవరి మనస్సూ నొప్పించకుండా అందరికీ అనుకూలంగా ప్రవర్తిస్తున్నాడు.

రాముని ప్రవర్తనకు, గుణగణములకు అయోధ్య ప్రజలు ఎంతో సంతోషించారు. రాముని వంటి ప్రభువు తమకు కావాలని కోరు కున్నారు.

రాముడు రాజ్యకార్యములలో పడి భార్యను నిర్లక్ష్యము చేయలేదు. సీతను ఎంతో ప్రేమానురాగాలతో చూసుకొనేవాడు. ఎల్లప్పుడూ ఆమెను తన హృదయ పీఠము నందు నిలుపుకొనే వాడు.

సీత కూడా రాముని ఎడల ఎంతో ప్రేమతో ప్రవర్తించేది. రాముని విడిచి ఒక్క క్షణం కూడా ఉండేది కాదు. రాముడు సీత మధ్య ఉన్న ప్రేమ దినదినాభివృద్ధి చెందుతూ ఉండేది. ఒకరి హృదయము తెలిసి మరొకరు నడుచుకొనేవారు. వారి అన్యోన్యాను రాగములతో కూడిన దాంపత్యము చూచి కౌసల్య ఎంతో మురిసి

పోయేది. ఆ ప్రకారంగా రాముడు సీత సాక్షాత్తు శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవిలాగా ప్రకాశిస్తున్నారు.

శ్రీమద్రామాయణము

బాలకాండము డెబ్బది ఏడవ సర్గ సంపూర్ణము.

బాలకాండము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ప్రథమ సర్గ.

భరతుడు తన మేమతో కూడా తాత గారి ఇంటికి వెళ్లాడు. తనతో కూడా శత్రుఘ్నుని తీసుకొని వెళ్లాడు. భరత శత్రుఘ్నులు మేనమామ ఇంట్లో సుఖసంతోషాలతో ఉన్నప్పటికీ, అయోధ్యలో ఉన్న తల్లి తండ్రు లను మరిచిపోలేదు. ప్రతిరోజూ తమ తల్లి తండ్రులను మనసారా తల్చుకుంటూ ఉన్నారు.

అదే ప్రకారంగా దశరథుడు కూడా తన కుమారులు భరత శత్రుఘ్నులు ఏం చేస్తున్నారో ఏమో అని ప్రతి రోజూ తల్చుకుంటూ ఉండే వాడు. ఎందుకంటే దశరథునికి తన నలుగురు కుమారులను సమానంగా ప్రేమించాడు, ఆదరించాడు. అందుకనీ భరత శత్రుఘ్నులు తన ఎదుట లేకపోయినా అనుదినమూ వారిని తల్చుకుంటూ ఉండే వాడు.

కాని తన నలుగురు కుమారులలోనూ పెద్ద కుమారుడు రాముడు అంటే దశరథునకు ప్రేమాభిమానాలు కొంచెం ఎక్కువగా ఉండేవి. కౌసల్యకు కూడా రాముడు అంటే పంచప్రాణాలు. రాముని విడిచి ఒక్కనిముషం కూడా ఉండేది కాదు.  ఇంక రాముడు కూడా అందుకు తగ్గట్టుగానే ఉండేవాడు.

రాముడు మంచి రూపవంతుడు. శౌర్యవంతుడు. పైగా దశరథుని కుమారుడు. రాముడు ఎల్లప్పుడూ ప్రశాంతమైన మనస్సుతో ఉండేవాడు. అందరితో మృదువుగా మాట్లాడేవాడు. తనతో ఎవరైనా కటువుగా మాట్లాడినా మౌనంగా ఉండేవాడే కాని వారితో పరుషంగా మాట్లాడేవాడు కాదు.

రాముడు అల్ప సంతోషి. ఎవరైనా తనకు చిన్న ఉపకారము చేసినా అమితంగా సంతోషించేవాడు. తనకు ఎవరు ఎన్ని అపకార ములు చేసినా వాటిని మనసులో పెట్టుకొనే వాడు కాదు. రాముడు అస్త్రవిద్య శస్త్ర విద్యలు సాధన చేసేవాడు. తీరిక సమయములలో వయోవృద్ధులు జ్ఞానవృద్ధుల వద్దకు పోయి మంచి విషయములు నేర్చుకొనే వాడు. అంతేగాని వినోద విలాసములతో సమయమును వృథాచేసేవాడు కాదు.

రాముడు అందరితోనూ చాలా కలుపుగోలుగా ఉండేవాడు. ముందు తనే అందరినీ పలుకరించి వారి యోగక్షేమములు అడిగి తెలుసుకొనేవాడు. తాను అమితమైన పరాక్రమ వంతుడైనను కొంచెం కూడా గర్వము లేకుండా అందరితో కలిసిపోయేవాడు.

రాముడికి ఉన్న మరొక మంచిలక్షణము రాముడు ఎన్నడూ అసత్యము పలికేవాడు కాదు. బ్రాహ్మణులను, పెద్దలను గౌరవించే వాడు. ప్రజలు తనను ఏ ప్రకారం గౌరవిస్తారో అదే ప్రకారము రాముడు కూడా ప్రజలను గౌరవించేవాడు. రాముడికి కోపం అంటే ఏమిటో తెలియదు. అందరి మీద దయకలిగి ఉండేవాడు. దీనులను చూచి జాలిపడేవాడు. తోచిన సహాయము చేసేవాడు.

రాముడు ధర్మపరుడు. సకల ధర్మములను తెలిసినవాడు. కానీ ఏమీ తెలియనట్టు ఉండేవాడు. తనకు అన్నీ తెలుసు అని గర్వించేవాడు కాదు. రాముడు మచ్చలేని మానవుడు. ఇంద్రియము లను అదుపులో ఉంచుకొని ప్రవర్తించేవాడు. రాముడు క్షత్రియుడు. అందుకని తన స్వధర్మము అయిన క్షత్రియ ధర్మమును ఆచరించే వాడు. రాముడు తనకు కానీ, ఇతరులకు కానీ  కీడు చేసే  కార్యముల యందు ఏమాత్రం ఆసక్తి చూపేవాడు కాదు.  ధర్మవిరుద్ధంగా ఏ పనీ చేసేవాడు కాదు. ఎదుటి వారి ఆంతర్యమును గ్రహించి తగు విధంగా నేర్పుగా మాట్లాడేవాడు.

రాముడు తన ఆరోగ్యమును చక్కగ కాపాడుకొనేవాడు. ఎలాంటి దురలవాట్లకు లోనయ్యేవాడు కాదు. ఏ కాలములో ఎలా ఉండాలో, ఏ పని చెయ్యాలో తెలుసుకొని  అలా ఉండేవాడు, ఆ పనులే చేసేవాడు. సాటివారలలో  సాధువర్తనుడు అని పేరుతెచ్చుకున్నాడు. అంతేకాదు అయోధ్యపుర ప్రజలలో కూడా రాముడు సాధు వర్తనుడు అని పేరు తెచ్చుకున్నాడు.

అటువంటి రాముడు విద్యాభ్యాసము పూర్తి చేసు కున్నాడు. వేద వేదాంగములలో ప్రావీణ్యము సంపాదించాడు.  ధనుర్విద్యలో తండ్రి దశరథుని మించిపోయాడు. తాను జన్మించిన ఇక్ష్వాకు వంశమునకు తన సద్గుణములతో  వన్నె తెచ్చే వాడయ్యాడు. పురుషార్థములైన ధర్మము, అర్థము, కామము, మోక్షము వీటి గురించి న తత్త్వమును బాగా ఆకళింపు చేసుకొని తదనుగుణంగా నడుచుకొనేవాడు. క్షత్రియోచితములైన ఆచార వ్యవహారములను చక్కగా అనుసరించేవాడు.

రాముడు తనలోని ఆలోచనలను పైకి కనపడనీయడు. పైకి నవ్వుతూనే ఉండేవాడు. మనసులోని భావములను ముఖంలో కనపడనిచ్చేవాడు కాదు. అనవసరంగా కోపగించుకోడం, సంతోషంతో పొంగిపోవడం చేసేవాడు కాదు. ఎల్లప్పుడూ సౌమ్యంగా ఒకే విధంగా ఉండేవాడు. ఏ విషయంలోనూ మొండిగా పట్టుబట్టడం మొండిగా వాదించడం చేసేవాడు కాదు. స్థిరమైన బుద్ధికలవాడు.

ఏ పరిస్థితులతో కూడా మనస్సును చలింపనీయడు రాముడు. రామునికి సోమరి తనము అంటే తెలియదు. ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉండేవాడు. ఎదుటి వారిలో ఉన్న తప్పులు పట్టేముందు తనలో ఉన్న తప్పులు తెలుసుకొని వాటిని సరిదిద్దు కొనేవాడు. ఎవరైనా తనకు చిన్న మేలు చేసినా దానిని గుర్తు పెట్టుకొని తగిన సమయ ములో  ప్రత్యుపకారము చేసేవాడు.

రాముడు న్యాయశాస్త్రములో కూడా ప్రావీణ్యము సంపాదించాడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణలో అత్యంత నేర్పును ప్రదర్శించేవాడు. రాముడు రాజ్యపాలనలలో కూడా నిష్ణాతుడు. మంచి వారిని చేరదీసి ఆదరించేవాడు. దుర్మార్గులను దగ్గరకు చేరనిచ్చేవాడు కాదు. రాజ్యపాలన కు కావలసిన ధనమును నేర్పుగా ప్రజలనుండి రాబట్టేవాడు.  ఆ ధనమును వ్యయం చేయడంలోకూడా సంయమనం పాటించేవాడు. అనవసరమైన ఖర్చులను నివారించేవాడు.

రాముడు వేద వేదాంగములనే కాదు, ఇంకా ఇతరత్రా ఉన్న శాస్త్రములను కూడా బాగా అధ్యయనం చేసాడు. అన్నింటిలోనూ ప్రావీణ్యం సంపాదించాడు.   తగు మాత్రంగా సుఖములను

అనుభవించేవాడు. సుఖములను అనుభవించేటప్పుడు కూడా ఎంతో జాగరూకతతో ఉండేవాడు.  రాముడు సంగీత నృత్యములలో కూడా ప్రవేశము ఉన్నవాడు.

పైన చెప్పిన లక్షణములను బట్టి, రాముడు సాత్వికుడు భోగలాలసుడు అనుకుంటే పొరపాటే. ఆయనకు యుద్ధరీతులు అన్ని కూడా బాగా తెలుసు.  గుర్రములను ఏనుగులను లొంగదీసుకొని మచ్చిక చేసుకొనేవాడు. ధనుర్విద్యలో ప్రావీణ్యము సంపాదించాడు. శత్రువుల ఎడల నిర్దాక్షిణ్యంగా వ్యవహరించేవాడు. యుద్ధములో దేవతలు, రాక్షసులు ఎదురైనా జంకేవాడు కాదు. ధైర్యంతో ఎదిరించి గెలిచే సామర్థ్యము ఉన్నవాడు. అనిచెప్పి అందరి మీదా అనవసరంగా యుద్ధానికి కాలుదువ్వేవాడు కాదు.

రాముడు ఎవరిమీద కోపగించుకోడు. అవసరం అయి నప్పుడు కోపం తెచ్చు కుంటాడు. అవసరం తీరగానే ఆ కోపాన్ని వదిలేస్తాడు. ఇన్ని సుగుణ ములు ఉన్నవాడు కాబట్టే రాముడు మూడులోకములలో కీర్తింప బడ్డాడు. రాముడు తన సుగుణములతో సూర్యుని వలె ప్రకాశించే వాడు.

ఇటువంటి సకలసద్గుణసంపన్నుడైన రాముడు తమకు రాజు కావాలని అయోధ్యా ప్రజలు కోరుకొనేవారు.  ఇదే ఆలోచన దశరథునికి కూడా వచ్చింది. "తన జీవిత కాలంలో రాముడు రాజు అవుతాడా! రాముని రాజుగా నేను చూడగలనా!" అని అనుకున్నాడు. రాముడికి రాజు కాదగ్గ లక్షణములు ఉన్నాయా అని ఆలోచించాడు.

అయోధ్యావాసులందరూ రాముడు రాజు కావాలని కోరుకుంటున్నారు. ఎందుకంటే రాముడు ఎల్లప్పుడూ ప్రజల యొక్క వృద్ధిని కోరుకొనే వాడు. అయోధ్యా ప్రజలకు దశరథుని కంటే కూడా రాముడు అంటేనే ఎక్కువ గౌరవము అభిమానము. రాముడు బల పరాక్రమములలో యమునితోనూ ఇంద్రునితోనూ సమానమైనవాడు. బుద్ధిలో బృహస్పతి వంటి వాడు. ధైర్యములో మేరుపర్వతము వంటి వాడు. ఒక రాజుకు ఉండవలసిన మంచి లక్షణములు అన్నీ రామునికి ఉన్నాయి.

ఆ ఆలోచన వచ్చిందే తడవుగా దశరథుడు తనమంత్రులను పిలిపించాడు. వారితో ఆలోచించాడు. “అమాత్యులారా! నేను పెద్దవాడిని అయ్యాను. వయసు మీద పడింది. ఇంక రాజ్యపాలన చేయలేను. అయోధ్యప్రజలందరూ రాముడు రాజు కావాలని కోరుకుంటున్నారు. రాముడు రాజు అవడం అందరికీ సమ్మతమే. రాముడు రాజు అయితే నేను కూడా నిశ్చింతగా విశ్రాంతి తీసుకుంటాను. దీనికి మీరంతా అనుమతిస్తారని ఆశిస్తున్నాను.” అని అన్నాడు.

మంత్రులంతా దశరథుని మాటలకు సంతోషంగా తమ ఆమోదము తెలిపారు. వారి అనుమతితో రాముని యువరాజును చేయడానికి నిశ్చయించాడు దశరథుడు. తరువాత దశరథుడు సభను ఏర్పాటు చేసాడు. సామంత రాజులను, పురప్రముఖులను, అధికారులను, ఉద్యోగులను సభకు ఆహ్వానించాడు..

ఇన్ని చేసాడు కానీ కేకయ దేశంలో ఉన్న భరతునికి, శత్రుఘ్నునికి ఈ విషయం తెలియజేయలేదు. తరువాత వారే తెలుసుకుంటారులే అని నిర్లక్ష్యం చేసాడు.

(అలా కాకుండా భరతుని, శత్రుఘ్నుని పిలిపించి వారితో కూడా చెప్పి వారి సమ్మతి కూడా తీసుకొని ఉంటే రామాయణ మహాకావ్యము ఇంతటితో ఆగిపోయి ఉండేదేమో!)

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ప్రథమ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ద్వితీయ సర్గ.

రాజ సభ ఏర్పాటు అయింది. దశరథ మహారాజు సింహాసనం అలంకరించాడు. సభను అలంకరించిన సామంత రాజులను, మంత్రులను, పుర ప్రముఖులను ఇతర పౌరులను చూచి ఇలాఅన్నాడు.

"సభాసదులారా! మా పూర్వీకులైన ఇక్ష్వాకు వంశీయులు ఈ అయోధ్యను తర తరాలుగా పరిపాలిస్తున్నారు. ఇక్ష్వాకు వంశపురాజుల పాలనలో మీ రందరూ సుఖసంతోషాలతో వర్ధిల్లుతున్నారు. వారి వంశీకుడనైన నేను కూడా అనేక సంవత్సరములుగా ఈ అయోధ్యను నా పూర్వీకులు చూపిన మార్గములోనే ధర్మబద్ధంగా పరిపాలిస్తున్నాను. నా జీవితమంతా ఈ సింహాసనమునకు ఉన్న శ్వేతఛత్రము నీడలో గడిచి పోయింది. నాకు వయసు అయిపోయింది. వృద్ధుడను అయ్యాను. శరీరంలో పట్టు సన్నగిల్లింది. రాజ్యపాలన చేసే శక్తి కోల్పోయాను. ఈ శరీరం విశ్రాంతిని కోరుకుంటూ ఉంది. రాజ్య భారము వహించడం చాలా కష్టమైన విషయము. జితేంద్రియుడు కాని వాడు ఈ రాజ్య భారము మోయలేడు. అందుకని నేను వసిష్ఠుల వారిని, పురోహితు లను పిలిపించి వారితో సంప్రదించాను. వారి అనుమతితో నా పెద్ద కుమారుడు, దేవేంద్రునితో సమానమైన పరాక్రమ వంతుడు, శత్రువులకు భయంకలిగించేవాడు, ధర్మపరుడు అయిన రాముని అయోధ్యకు యువరాజుగా చేయడానికి

నిశ్చయించుకున్నాను. రాముడు యువరాజు అయితే అయోధ్య క్షేమంగా ఉంటుందని, సకల సంపదలతో శోభిల్లుతుందని అనుకుంటున్నాను. అందుకని నేను ఈ రాజ్యభారమును రామునికి అప్పగించి, విశ్రాంతితీసుకోదలచాను. ఇది నా నిర్ణయము. ఎంతో ఆలోచించి ఈ నిర్ణయము తీసుకున్నాను. నా నిర్ణయము అయోధ్య ప్రజలకు సకల ప్రయోజనములు కలిగిస్తుందని అనుకుంటున్నాను. నా నిర్ణయాని కన్నా మెరుగైన నిర్ణయం మరొకటి ఉందని మీకు తోస్తే నిర్భయంగా నాకు సభాముఖంగా తెలియజేయండి. సంకోచించవద్దు. ఎందుకంటే పాలకులు ప్రజాభిప్రాయము గౌరవించాలి. అది పాలకుల విధి. నేను రాముని ఎడల పక్షపాతంతో ఈ నిర్ణయం తీసుకొని ఉండవచ్చు.కాని మీరు నిష్పక్షపాతంగా నిర్ణయం తీసుకోగల సమర్థులు. మీ నిర్ణయం ఎలాంటిదైనా నాకు శిరోధార్యము." అని అన్నాడు దశరథుడు.

దశరథుని మాటలు విన్నపౌరులందరూ ఒక్కసారి హర్షధ్వానాలు చేసారు. రాముడే మా ప్రభువు అని ప్రకటించారు. కాని సభలో ఉన్న బ్రాహ్మణులు, పురప్రముఖులు, పురోహితులు, అందరూ ఒకరితో ఒకరు సంప్రదించుకున్నారు. ఆలోచించుకున్నారు. అందరూ ఏకాభిప్రాయానికి వచ్చారు. తరువాత దశరథునితో ఇలా అన్నారు.

"ఓ దశరథమహారాజా! మీ నిర్ణయాన్ని మేమందరమూ సమర్ధిస్తున్నాము. మీరు వృద్ధులయ్యారు. అందుకని తమరి పెద్దకుమారుడైన రాముని యువరాజుగా పట్టాభిషిక్తుని చేస్తున్నారు. అది మాకందరకూ సమ్మతమే. ఎందుకంటే రాముడు ఆజానుబాహుడు. మహావీరుడు. రాముడు అయోధ్య యువరాజుగా పట్టాభిషిక్తుడై

భద్రగజము మీద ఊరేగుతుంటే చూడాలని అయోధ్య పౌరులు ఉత్సాహపడుతున్నారు." అని అన్నారు.

అప్పుడు దశరథుడు పురప్రముఖులతో ఇలా అన్నాడు. "పురప్రముఖులారా! నేను చెప్పాను కదా అని నా నిర్ణయానికి మీరు అంగీకారం తెలిపారేమో అని నాకు సందేహంగా ఉంది. నేను ఏమన్నా అనుకుంటానేమో అని మీరు నా నిర్ణయం ఆమోదించినట్టు ఉంది. మీకు ఆ సందేహము అక్కరలేదు. మీ నిర్ణయాన్ని నిర్భయంగా చెప్పవచ్చు. ప్రస్తుతము నేను ధర్మబద్ధంగా రాజ్యపాలన చేస్తున్నాను గదా! మీరు రాముడు యువరాజు కావాలని ఎందుకు కోరుకుంటున్నారు. రాముడిని యువరాజుగా ఎందుకు చెయ్యాలో కారణాలు వివరించండి." అని అడిగాడు.

అప్పుడు ఆ పురప్రముఖులు ఇలా చెప్పసాగారు.

"ఓ దశరథమహారాజా! నీ కుమారుడైన రాముడు సకల సద్గుణ సంపన్నుడు. ధర్మపరుడు. పరాక్రమ వంతుడు. దేవేంద్రునితో సమానమైన వాడు. ఇప్పటి వరకూ ఇక్ష్వాకు వంశములో జన్మించిన రాజులందరిలోకీ శ్రేష్టుడు. సత్యము పలకడంలోనూ, ధర్మము ఆచరించడం లోనూ రామునికి ఆసక్తి మెండు. చంద్రుని చూస్తే ఎంత ఆనందం కలుగుతుందో రాముని చూస్తే అంతే ఆనందం కలుగుతుంది. రాముడు బుద్ధిలో బృహస్పతితో సమానుడు. రాముడు క్షమాగుణంలో భూదేవితో సమానుడు. రామునికి తెలియని ధర్మము లేదు. రామునికి ఎవరి మీదా అసూయా, ద్వేషము లేవు. ఓర్పు మెండు. మృదువుగా మాట్లాడుతాడు. బాధలలో ఉన్నవారిని చూస్తే ఆ బాధలు

తనవిగా బాధపడతాడు రాముడు. రాముడు ఇంద్రియ నిగ్రహము కలవాడు.

ఓ దశరథ మహారాజా! రాముడు ఎల్లప్పుడూ స్థిర చిత్తముతో ఆలోచిస్తాడు. రామునికి బ్రాహ్మణులు అంటే భక్తి, గౌరవము. రాముడు వివిధ శాస్త్రములను అధ్యయనం చేసాడు. దేవతలకు, రాక్షసులకు, మానవులకు తెలిసిన అన్ని అస్త్ర శస్త్రములు ప్రయోగ, ఉపసంహారములతో సహా, రామునికి తెలుసు. రాముడు వేద వేదాంగములను శ్రద్ధతో అధ్యయనం చేసాడు. అంతే కాదు, రామునికి సంగీత, నృత్య కళలలో కూడా ప్రవేశం ఉంది. అనేకములైన ధర్మసూక్ష్మములను రాముడు గురువుల వద్ద శ్రద్ధతో అభ్యసించాడు. రాముడు లక్ష్మణునితో సహా జైత్ర యాత్రకు వెళితే విజయుడైగాని తిరిగిరాడు. జైత్రయాత్ర నుండి తిరిగి వచ్చిన తరువాత, రాముడు తల్లి తండ్రులకు నమస్కరించి, అంత:పురములోని వారినీ, బంధువులను, స్నేహితులను, పౌరులనూ పేరు పేరునా వారి యోగక్షేమములు అడిగి తెలుసుకుంటాడు.

ఓ దశరథ మహారాజా! ఎవరికైనా బాధ కలిగితే రాముడు తనకు కలిగినట్టు బాధ పడతాడు. ఎవరికైనా సంతోషము కలిగితే తానుకూడా వారితో పాటు ఆనందిస్తాడు. ధర్మరక్షణలో రాముని మించిన వారు లేరు. రాముడు అనవసరంగా కోపం తెచ్చుకోడు. అలాగే అనవసరంగా ఇతరుల మీద అభిమానం కురిపించడు. రాముడు  అమాయకులను శిక్షించడు. నేరము చేసిన వారిని శిక్షించకుండా వదిలిపెట్టడు. ప్రజాపాలనలో తత్వమును బాగాతెలిసినవాడు రాముడు. మూర్తీభవించిన శాంతస్వరూపుడు

రాముడు. అటువంటి రాముడు ఒక్క అయోధ్యనే కాదు ముల్లోకములను పాలించగల సమర్థుడు. అటువంటి రాముడు తమకు ప్రభువు కావాలని అయోధ్య ప్రజలు మనసారా కోరుకుంటున్నారు. అటువంటి రాముడు తమరికి పుత్రుడుగా జన్మించడం మీ పూర్వజన్మ సుకృతము. అటువంటి రామునికి సదా ఆయురారోగ్య ఐశ్వర్యములు కలగాలని అయోధ్యా వాసులు, స్త్రీలు, వృద్ధులు, నిరంతరమూ సర్వదేవతలకూ మొక్కుకుంటూ ఉంటారు. కాబట్టి రాముని యువరాజుగా పట్టాభిషిక్తుని చెయ్యండి. మేము చూచి ఆనందిస్తాము." అని పలికారు అయోధ్య పురప్రముఖులు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ద్వితీయ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### తృతీయ సర్గ.

పైవిధంగా రాముని గుణగణాలను కీర్తించి, రాముడే యౌవరాజ్య పట్టాభిషేకమునకు తగినవాడు అని ముక్తకంఠంతో చెప్పి పురప్రముఖులు అందరూ చేతులు జోడించి నిలబడ్డారు. వారి మాటలు వినిన దశరథుడు ఎంతో సంతోషించాడ.

"పుర ప్రముఖులారా! నా జ్యేష్ఠపుత్రుడు, నాకు అత్యంత ప్రియుడు, అయిన రాముని యువరాజుగా పట్టాభిషిక్తుని చేయుటకు మీరందరూ అంగీకరించినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. రాముని పాలనలో మీకు శుభమగు గాక!" అనిపలికి తన పురోహితు లైన వసిష్ఠుడు, వామదేవులను చూచి ఇలా అన్నాడు.

"రాబోవు చైత్రమాసము పట్టాభిషేకమునకు అనువైన సమయము. చైత్ర మాసములో రాముని పట్టాభిషేకమునకు తగిన ఏర్పాట్లు చేయండి." అని ఆదేశించాడు.

ఆమాటలు వినిన పురజనులు పెద్దగా హర్షధ్వానాలు చేసారు. తరువాత దశరథుడు వసిష్ఠునితో ఇలా అన్నాడు. "మహాత్మా! రాబోవు చైత్రమాసములో జరుగబోవు రామ పట్టాభిషేకమునకు తగిన ఏర్పాట్లు చేయుటకు ఆదేశాలు ఇవ్వండి." అని అన్నాడు.

ఆ మాటలు వినిన వసిష్ఠుడు అక్కడే ఉన్న అధికారులను చూచి ఇలా ఆదేశించాడు.

" పట్టాభిషేకమునకు కావలసిన సంభారములు సిద్ధం చెయ్యండి. బంగారము, రత్నములు, అభిషేకమునకు కావలసిన ద్రవ్యములు, రకరకాల పుష్పములు, పుష్పమాలలు, లాజలు, తేనె, నెయ్యి, కొత్త బట్టలు, రథములు, ఆయుధములు, చతురంగ బలములు,శుభలక్షణములు ఉన్న గజములు, ఛత్రము, చామరములు, తెల్లటి ధ్వజము, బంగారముతో చేసిన పాత్రలు, బంగారు తొడుగులు వేసిన కొమ్ములు కల వృషభము, పులి చర్మములు, వీటిని అన్నిటినీ రాజుగారి యొక్క అగ్నిహోత్రము చేయు గృహములో సిద్ధంగా ఉంచాలి.

అంత:పురమును, ద్వారములను పుష్పమాలలతో అలంకరింపుడు. సుగంధ ద్రవ్యములతో సువాసనలతో అంత:పురము నిండి పోవాలి. పాలు,పెరుగు, నెయ్యి మొదలగు ఆహారపదార్థములను సమృద్ధిగా ఉండేట్టు చూడండి. బ్రాహ్మణ సంతర్పణలు ఏ లోటూ లేకుండా జరగాలి. బ్రాహ్మణులను సత్కరించుటకు కావలసిన సంభారములు ఏర్పాటు చేయండి. రేపు ఉదయమే బ్రాహ్మణులు స్వస్తివాచనము పలకాలి. అందుకు కావలసినవి సిద్ధం చేయండి. ఇంక రాజవీధులను పన్నీటితో తడపండి. పురవీధులను బాగా అలంకరించండి. పతాకములు కట్టండి. అరటి స్తంభములు, తోరణములు కట్టండి. రామునికి స్వాగతము పలకడానికి వేశ్యాస్త్రీలను ద్వారముల వద్ద వేచి ఉండమనండి. అయోధ్యలో ఉన్న అన్ని దేవాలయములలో పూజలు జరిపించండి. దేవునికి నివేదించుటకు అన్న ప్రసాదములు మొదలగునవి ఏర్పాటు చేయండి. సైన్యములో

యోధులు అందరూ మంచి మంచి దుస్తులు ధరించి, పొడవైన కత్తులు అలంకారంగా పట్టుకొని ఊరేగింపుగా ముఖద్వారము వద్దకు వచ్చి ఉండాలి. ఇంకా ఏమైనా ఏర్పాట్లు మిగిలిపోయి ఉంటే వాటిని అన్నింటినీ జాగ్రత్తగా చేయించండి." అని ఆదేశాలు ఇచ్చారు.

వసిష్ఠుడు వామదేవుడు తాము చేసిన ఏర్పాట్లు గురించి దశరథునికి తెలియజేసారు. తాను అనుకొన్న ఏర్పాట్లు అన్నీ సక్రమంగా జరుగుతున్నందుకు దశరథుడు ఎంతో సంతోషించాడు. వెంటనే సుమంతుని పిలిచాడు.

"సుమంతా! నీవుపోయి రాముని నా దగ్గరకు తీసుకొనిరా." అని ఆదేశించాడు. దశరథుని ఆదేశాను సారము సుమంతుడు రాముని వద్దకు వెళ్లాడు.

దశరథుడు తన రాజ్యములో ఉన్న సామంంతులందరితో సమావేశము అయ్యాడు. ఇంతలో సుమంతుడు పోయి రాముని రథము మీద ఎక్కించుకొని దశరథుని వద్దకు తీసుకొని వచ్చాడు. రాముని రాకను దూరంనుండే చూచాడు దశరథుడు. రథము మీద ఠీవిగా కూర్చున్న రాముని చూడడానికి దశరథునికి వేయి కన్నులు ఉ న్నా ఇంకా చాలవేమో అనిపించింది. "ఎంత చూచినా ఇంకా చూడాలని పించే సౌందర్యము రామునిది" అని అనుకున్నాడు దశరథుడు.

రాముడు రథం దిగాడు. రాముడు దశరథుని వద్దకు వస్తుంటే రాముని వెనక సుమంతుడు చేతులు కట్టుకొని

నడుస్తున్నాడు. రాముడు దశరథుని వద్దకు వచ్చి తండ్రి పాదములకు నమస్కరించాడు. దశరథుడు రాముని రెండు చేతులతో పైకి లేపి గట్టిగా కౌగలించుకున్నాడు. తరువాత తన పక్కను ఉన్న ఒక ఉన్నతాసనము మీద కూర్చోపెట్టాడు.

దశరథుడు రామునితో ఇలా అన్నాడు. " ఓ రామా! నీవు నాకు జ్యేష్ట పుత్రుడవు. నీ తల్లి కౌసల్య నాకు పెద్ద భార్య. పట్టపు రాణి. ఆమెకు సకల సద్గుణ సంపన్నుడవు యోగ్యుడవు అయిన నీవు జన్మించావు. నీవు అంటే నాకు చాలా ప్రేమ, అభిమానము. నిన్ను అయోధ్యకు యువరాజును చేయాలని సంకల్పించాను. రాబోవు పుష్యమీ నక్షత్రము నందు నీకు యౌవరాజ్య పట్టాభిషేకము జరుపనిశ్చయించాను. ఈ సందర్భంలో నీకు ఒక స్నేహితుడుగా కొన్ని విషయాలు చెబుతున్నాను. శ్రద్ధగా విను.

నీవు ఈ అయోధ్యకు కాబోయే మహారాజువు. నీవు అందరితో వినయంగా ఉండాలి. నీ ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. కామము, క్రోధము మొదలగు వాటిని దగ్గరకు రానీయకూడదు. నీవు అమాత్యులతో నేర్పుగా నడుచుకోవాలి. కోశాగారము, ధాన్యాగారము, ఆయుధాగారము ధనముతోనూ, ధాన్యముతోనూ ఆయుధములతోనూ ఎల్లప్పుడూ సమృద్ధిగా ఉండేట్టు చూచుకోవాలి. ఆ ప్రకారంగా రాజ్యపాలన చెయ్యాలి." అనిఅన్నాడు దశరథుడు.

ఇంతలో రాముని మిత్రులు ఈసంతోష వార్తను కౌసల్యకు చెప్పడానికి ఆమె వద్దకు పరుగు పరుగున వెళ్లారు. కౌసల్యకు

రాముని పట్టాభిషేక వార్త చెప్పగానే ఆమె సంతోషంతో పొంగి పోయింది. ఆ వార్త తెచ్చినవారికి బంగారు ఆభరణములు బహు మానంగా ఇచ్చి సత్కరించింది.

దశరథుని వద్ద ఉన్న రాముడు, తండ్రికి నమస్కరించి, తన గృహమునకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము,
అయోధ్యాకాండము తృతీయ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### నాల్గవ సర్గ.

తరువాత దశరథుడు మంత్రులతో మరలా దీర్ఘంగా ఆలోచించాడు. మరునాడే పుష్యమీ నక్షత్రము. అందుకని, ఆలస్యం లేకుండా రాముని మరునాడు పుష్యమీ నక్షత్రము ఘడియలలో పట్టాభిషిక్తుని చేయవలెనని నిశ్చయించాడు. మంత్రులందరూ ఆ నిర్ణయానికి తమ ఆమోదము తెలిపారు.

తరువాత దశరథుడు సభాభవనము నుండి తన అంత:పురమునకు వెళ్లాడు. సుమంత్రుని పిలిచి రాముని తన మందిరమునకు తీసుకొని రమ్మని ఆదేశించాడు. దశరథుని ఆదేశాను సారము సుమంత్రుడు రాముని వద్దకు వెళ్లాడు.

"ఇప్పుడేగా తండ్రి గారి వద్దనుండి వచ్చాను మరలా ఎందుకు వచ్చావు?" అని అడిగాడు.

"దశరథమహారాజుగారు తమరిని చూడాలని అనుకుం టున్నారు. మీరు మీ తండ్రి గారి వద్దకు వెళ్లాలో లేదో మీరే నిర్ణయించు కోండి." అని అన్నాడు సుమంత్రుడు. మారు మాటాడకుండా రాముడు సుమంత్రునితో కూడా దశరథుని వద్దకు వచ్చాడు. తండ్రి గారికి నమస్కరించి, ఆయన ఎదుట చేతులు కట్టుకొని నిలబడ్డాడు

రాముడు. దశరథుడు రాముని ప్రేమగా లేవనెత్తి కౌగలించుకొని, పక్కనే ఉన్న ఆసనము మీద కూర్చోపెట్టాడు.

"రామా! నేను చెప్పబోవు మాటలు శ్రద్ధగా విను. నాకు వయసు అయిపోయింది. వృద్ధుడను అయ్యాను. రాజభోగాలు తనివితీరా అనుభవించాను. ఎన్నో యజ్ఞములు, యాగములను చేసాను. ఈ భూలోకంలో సాటిలేని మేటి వీరులను సంతానంగా కలిగి ఉన్నాను. దేవ ఋణము, ఋషి ఋణము, పితృ ఋణము, విప్ర ఋణము, ఆత్మఋణము తీర్చుకున్నాను. ఇంక నీ పట్టాభిషేకము మాత్రము మిగిలి ఉన్నది. నీవు ఈ అయోధ్యకు రాజు కావాలని ప్రజలందరూ కోరుకుంటున్నారు. అందుకని నిన్ను యౌవరాజ్యాభిషిక్తుని చేయ సంకల్పించాను.

ఎందుకనో నాకు కొన్ని దుశ్శకునములు పొడసూపు తున్నాయి. నా జాతకములో చెడ్డ గ్రహము లైన సూర్య, అంగారక, రాహు గ్రహములు ఉచ్ఛస్థితిలో ఉన్నట్టు జ్యోతిష్కులు చెప్పారు. ఇలాంటి పరిస్థితులలో నాకు మరణము కానీ, లేక తీవ్రమైన ఆపద కాని సంభవించే అవకాశం ఉంది. మనస్సు చంచల మైనది. ఏ నిముషానికి ఎలా ఆలోచిస్తుందో తెలియదు. అందుకే నాకు చాలా తొందరగా ఉ ంది. నా మనసులో మరొక ఆలోచన పొడసూపక ముందే నీ యౌవరాజ్యపట్టాభిషేకము జరిగిపోవాలి అని అనుకుంటున్నాను.

ఈ రోజు పునర్వసు నక్షత్రము. రేపు చంద్రుడు పుష్యమీ నక్షత్రములో ఉంటాడు. ఆ శుభ ముహూర్తము లో నీ పట్టాభిషేకము జరిగిపోవాలి. ఈ సందర్భములో నీవు ఈ రోజు రాత్రి అంతా నీ భార్య

సీతతో సహా ఉపవాసము చేసి దర్భాసనము మీద నిద్రపోవాలి.

ప్రస్తుతము భరతుడు అయోధ్యలో లేడు. భరతుడు అయోధ్యలో లేని సమయములోనే నీ పట్టాభిషేకము జరగాలని నా కోరిక. అంటే భరతుడు దుర్మార్గుడు అనికాదు. నీ సోదరుడు భరతుడు ఎల్లప్పుడూ నిన్ను అనుసరించి ఉంటూ నీ క్షేమమునే కోరుతుంటాడు. పైగా భరతుడు ధర్మాత్ముడు, దయాళువు. ఇంద్రియములను జయించిన వాడు. కానీ, మనస్సు చంచలమైనది. ఎటువంటి ధర్మాత్ముల మనస్సులు కూడా చలింపవని నమ్మకము లేదు కదా. ఎప్పుడు ఎవరికి ఎలాంటి బుద్ధిపుడుతుందో ఎవరికి తెలుసు! నీ పట్టాభిషేక వార్త విని నీ తమ్ముడు భరతుని మనస్సు కూడా మారుతుందే మో అని నా అనుమానము. అందుకని ఈ తొందర. ఇంక నీవు వెళ్లవచ్చు." అని పలికాడు దశరథుడు.

తండ్రి చెప్పిన మాటలు సావధానంగా విన్న రాముడు, తండ్రి గారి వద్ద సెలవు తీసుకొని నేరుగా తన తల్లి కౌసల్య అంత:పురమునకు వెళ్లాడు. రాముని పట్టాభిషేక వార్త అంతకు మునుపే కౌసల్యకు తెలియడంతో, ఆమె సీతను, సుమిత్రను, లక్ష్మణుని తన వద్దకు పిలిపించుకొంది. కౌసల్య పట్టుబట్టలు ధరించి లక్ష్మీదేవికి పూజచేస్తూ ఉంది. ఆమె పక్కనే సుమిత్ర, సీత, లక్ష్మణుడు కూర్చుని ఉన్నారు.

రాముడు వచ్చి తల్లి కౌసల్యకు, సుమిత్రకు నమస్కరించాడు. ఆమెతో ఇలా అన్నాడు. "అమ్మా! తండ్రిగారు నన్ను ఇంక నుంచి ప్రజాపాలన చూడమన్నారు. అందుకని నన్ను యువరాజుగా పట్టాభిషిక్తుని చేయడానికి నిశ్చయించారు. రేపే యౌవరాజ్య

పట్టాభిషేకము. ఈ రోజు రాత్రి అంతా నేను నా భార్య సీత ఉపవాసము చేసి దర్భాసనము మీద నిద్రించవలెనని ఋత్తిక్కులు, తండ్రిగారు ఆదేశించారు. అమ్మా! నీవు నాకూ, సీతకూ, రేపు జరగబోవు శుభకార్యమునకు చేయవలసిన మంగళకర కార్యక్రములు జరిపించు." అని అన్నాడు.

తన కుమారునికి యౌవరాజ్యపట్టాభిషేకము అని తన కుమారుని నోటి నుండి విని ఆ తల్లి పొంగిపోయింది. ఆమె కండ్ల వెంట ఆనందభాష్పాలు రాలాయి. "వత్సా! రామా! చిరంజీవ, చిరంజీవ. చిరంజీవిగా వర్ధిల్లు. నీవు నీ తమ్ములకు, నీ తల్లి సుమిత్రకు సంతోషము కలుగచెయ్యి. నాయనా! నీవు పుట్టిన వేళా విశేషము చాలామంచిది. నీవు నీ మంచి గుణములతో నీ తండ్రిని సంతోషింపజేసావు. నేను శ్రీ మహావిష్ణువుకు లక్ష్మీదేవికి చేసిన పూజలు అన్నీ ఫలించాయి. అందుకే ఇక్ష్వాకు వంశానికి రాజువు అవుతున్నావు. సుఖంగా వర్ధిల్లు." అని మనసారా దీవించింది.

తల్లి దీవనలు అందుకున్న రాముడు, లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "సోదరా! లక్ష్మణా! ఈ పట్టాభిషేకము నాకు కాదు. మన ఇద్దరికీ. మనం ఇద్దరం ఒకరికి ఒకరం తోడుగా రాజ్యపాలన చేద్దాము. నీవు నాకు రెండో ఆత్మ. అందుకే నీవే ఈ అయోధ్యకు యువరాజువు. నీ ఇష్టంవచ్చి రాజభోగములు అనుభవించు. పరిపాలన సాగించు. అసలు నీ కోసమే నేను ఈ యౌవరాజ్య పట్టాభిషేకము చేసుకుంటున్నాను." అని అన్నాడు.

తరువాత సీతా రాములు కౌసల్యకు, సుమిత్రకు నమస్కరించి, తమ మందిరమునకు వెళ్లిపోయారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము నాలుగవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ఐదవ సర్గ.

తన దగ్గరనుండి రాముడు వెళ్లి పోయిన తరువాత దశరథుడు తన పురోహితుడు వసిష్ఠుని పిలిపించాడు. ఆయనతో ఇలా అన్నాడు.

"ఓ వసిష్ఠ మహాముని! రేపే రామునికి యౌవరాజ్య పట్టాభిషేకము నిశ్చయించాము కదా. అందుకని మీరు రాముని మందిరమునకు వెళ్లి, రాజ్యము, యశస్సు, సంపదలు కలిగేటట్టు రామునితో, సీతతో ఈ రోజు ఉపవాసవ్రతము చేయించండి." అని అన్నాడు.

దశరథుని ఆదేశాను సారము వసిష్ఠుడు రాముని మందిరమునకు వెళ్లాడు. తన మందిరమునకు వచ్చిన వసిష్ఠునికి రాముడు ఎదురు వచ్చి, స్వాగత సత్కారములు చేసాడు. ఉచితా సనము మీద కూర్చో పెట్టాడు. అప్పుడు వసిష్ఠుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! రేపు ఉదయము నీకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయవలెనని నీ తండ్రి దశరథుడు సంకల్పించాడు.  ఆ సందర్భంలో నీవు ఈరోజు రాత్రి నీ భార్య సీతతో సహా ఉపవాస వ్రతము చేయాలి." అని అన్నాడు. రాముడు సరే అన్నాడు. వసిష్ఠుడు రామునితో సీతతో వేదోక్తంగా ఉపవాసవ్రతము చేయించాడు.  రాముడు సీత తమ

గురువు గారైన వసిష్ఠను యధోచితంగా పూజించారు. తరువాత వసిష్ఠుడు రాముని మందిరము నుండి వెళ్లిపోయాడు.

ఈ వార్తవిన్న రాముని మిత్రులు, బంధువులు రాముని మందిరమునకు చేరుకున్నారు. రాముడు వారందరితో ప్రేమతో మాట్లాడాడు. రాముని మందిరము అంతా ఆ రాత్రి బంధుమిత్రులతో కళకళలాడింది.

మరునాడే పట్టాభిషేక మహోత్సవము కావడంతో అయోధ్యానగర వీధులన్నీ జనంతో కిట కిట లాడుతున్నాయి. నగరమంతా పచ్చని మామిడి తోరణాలతో అలంకరిస్తున్నారు. పుర వీధులు అన్నీ పన్నీటితో తడిపారు. అరటి స్తంభాలు కట్టారు. తోరణాలు కట్టారు. జండాలతో అలంకరించారు. ఆ రాత్రి ఎవరికీ నిద్రలేదు. స్త్రీలు, బాలురు, వృద్ధులు ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా ఎప్పుడు రామ పట్టాభిషేకము చూద్దామా అని ఉవ్విళ్లూరుతున్నారు. రామ మందిరము నుండి బయలు దేరిన వసిష్ఠుడు, దారిలో క్రిక్కిరిసి ఉన్న జనమును తోసుకుంటూ అతి ప్రయాసతో దశరథుని భవనమును చేరుకున్నాడు. దశరథుని కలుసుకున్నాడు.

" ఓ వసిష్ట మహామునీ! రామునితో నేను చెప్పినవి అన్నీ చేయించారా!" అని అడిగాడు.

"అంతా మీరుచెప్పినట్టే చేయించాను." అని చెప్పాడు వసిష్ఠుడు.

అప్పటిదాకా దశరథుడు పురప్రముఖులతో మంతనాలు సాగిస్తున్నాడు. వసిష్టుడు వచ్చిన తరువాత, వారందరినీ పంపివేసాడు. తాను కూడా తన అంత:పురములోకి వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఆరవ సర్గ.

వసిష్ఠుడు తన మందిరము నుండి వెళ్లిపోయిన తరువాత రాముడు, సీతతో కలిసి మంగళ స్నానము చేసి, భక్తితో శ్రీ మహా విష్ణువును పూజించాడు. తరువాత అగ్నికార్యము నిర్వర్తించాడు. శ్రీ మహావిష్ణు మంత్రములు జపిస్తూ అగ్నిలో నేతిని హెూమం చేసాడు. అగ్నిలో వేల్చగా మిగిలిన హవిస్సును తాను భుజించాడు. తరువాత తన భార్య సీతతో కూడా దర్భలతో చేసిన చాప మీద పడుకున్నాడు.

మరునాడు తెల్లవారుజామునే నిద్రలేచాడు. తన మందిరమును చక్కగా అలంకరింపచేసాడు. ఇంతలో వంది మాగధులు వచ్చి స్తోత్రపాఠములతో వారి వంశచరిత్రను చక్కగా రామునికి వినిపించారు. రాముడు ప్రాత:కాల సంధ్యావందనము నిర్వర్తించాడు. గాయత్రీ మాతను ఉపాసించాడు. బ్రాహ్మణులు పుణ్యాహవాచనము చేసారు.

రామపట్టాభిషేకము జరుగబోవుచున్నదని అయోధ్యా నగర పౌరులందరూ తెల్లవారుజామునే మేల్కొన్నారు. పురమును అంతా అలంకరించారు. రాజ ప్రాసాదముల మీద, కార్యాలయముల మీద, దేవాలయముల మీద పతాకములను ఎగురవేసారు. గాయకులు పాటలు పాడుతున్నారు. నర్తకులు చక్కగా తయారయి

రాజభవనమునకు వెళ్లుటకు సిద్ధమవుతున్నారు. నర్తకులు నర్తిస్తున్నారు. అందరూ మంగళకరమైన మాటలు మాట్లాడు కుంటున్నారు. ఎవరి నోట విన్నా రాముని గుణగణములు, రామ పట్టాభిషేకము గురించి మాటలు వినబడుతున్నాయి. రామ పట్టాభిషేకం గురించి తప్ప ఎవరూ మరొక మాట మాట్లాడుకోవడం లేదు. రామ పట్టాభిషేక మహోత్సవము ఎంతసేపు జరుగుతుందో, చీకటి పడుతుందేమో అని పట్ట పగలే చిత్ర విచిత్రములైన దీపములు వీధులలో వెలిగించి పెట్టారు.

తాను వృద్ధుడైన సంగతి ఎరింగి దశరథుడు తగిన నిర్ణయం తీసుకొన్నాడని, ఇంక నుంచి రాముని పాలనలో తాము సుఖ సంతోషాలు అనుభవిస్తామని అయోధ్యావాసులు పొంగిపోతున్నారు. రాముడు తామందరినీ తన సోదరుల మాదిరి వాత్సల్యముతో ఆదరిస్తాడని జనులంతా ఆనంద పరవశులౌతున్నారు. రాముని పట్టాభిషేక వార్త విన్న చుట్టుపక్కల జనపదములలో నివసించు జానపదులు తండోప తండములుగా అయోధ్యకు తరలి వస్తున్నారు. వారందరితోటీ అయోధ్యానగరము క్రిక్కిరిసిపోయింది. వారందరూ మాట్లాడుకుంటూ కేరింతలు కొడుతుంటే వారి ఘోష సముద్రఘోషను మరిపిస్తూ ఉంది. ఆ రోజు అయోధ్యానగరము మహేంద్రుని రాజధాని అమరావతిని తలపిస్తూ ఉంది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

వాల్మీకి రామాయణంలో ఈ విధంగా ఉంటే వ్యాసుడు రచించిన బ్రహ్మాండపురాణంలో భాగమయిన ఆధ్యాత్మ రామాయణంలో ఒక కొత్త విషయం ఉంది. అదేమి టంటే....

ఒక రోజు నారదుడు శ్రీరాముని వద్దకు వచ్చాడు. రాముని తో ఇలా అన్నాడు. "ఓ రామా! నన్ను బ్రహ్మ నీవద్దకుపంపాడు. నీకు నీ తండ్రి దశరథుడు పట్టాభిషేకము చేయవలెనని నిశ్చయించాడు. కాని నీ జననము రావణ సంహారము కొరకు జరిగినది కదా! నీవు రాజ్యపాలన చేస్తుంటే, రావణ సంహారము మాటేమిటి? భూభారము తగ్గించుటకు నీకు రాక్షస సంహారము చేయవలయును కదా! రామా! నీవు దేని కొరకు అవతరించితివో ఆ విషయము మరిచిపోవద్దు" అని అన్నాడు. దానికి రాముడు ఇలా అన్నాడు. "నారదమహర్షీ! నాకు తెలియని విషయము ఏమున్నది. నేను ఆడిన మాట తప్పను. రాక్షస సంహారము చేసెదను. కాలము తీరిన దైత్యులను సంహరించెదను. రేపే దండకారణ్య ప్రయాణము. పదునాలుగు సంవత్సరములు అరణ్య వాసము చేసెదను. సీతాపహరణము మిషతో రావణుని సంహరించెదను.. ఇది సత్యము." అని రాముడు నారదునితో అన్నాడు. రాముని మాటలకు సంతోషించిన నారదుడు అక్కడి నుండి వెళ్లిపోయాడు. (ఇక్కడ రాముడు సామాన్య మానవుడు కాదు. కారణ జన్ముడు. సాక్షాత్తు విష్ణు అవతారము, భూత, భవిష్యత్ వర్తమానములు తెలిసినవాడు అని చెప్పబడింది.)

తరువాత వసిష్ఠుడు రామునితో ఉపవాసవ్రతము చేయించిన తరువాత వెళ్లిపోయాడు. ఆ సమయంలో దేవలోకంలో దేవతలు

సరస్వతీదేవి వద్దకు వెళ్లారు. “అమ్మా సరస్వతీ దేవీ! నీవు ఇప్పుడు వెంటనే భూలోకమునకు వెళ్లాలి. నీవు రామునికి జరుగబోవు పట్టాభిషేకమునకు విఘ్నము కలిగించాలి. ఇది బ్రహ్మదేవుని ఆదేశము. అమ్మా! నీవు ముందుగా మంధర అనే దాసి వాక్కులో ప్రవేశించాలి. తరువాత కైకేయి వాక్కులో ప్రవేశించాలి. శ్రీరాముని పట్టాభిషేక ప్రయత్నము భగ్నము అయిన తరువాత మరలా తిరిగిరావాలి.” అని ప్రార్థించారు. సరస్వతీ దేవి దేవతల ప్రార్థన మన్నించి అయోధ్యా నగరమునకు వచ్చి మంధర వాక్కులో ప్రవేశించింది.

(ఈ సంఘటనలు మనకు ఆధ్యాత్మ రామాయణంలో కనపడతాయి. ఇంక ఈ సందర్భంలో తులసీరామాయణం లో ఏముందో తెలుసుకుందాము.)

అయోధ్యలో పౌరులందరూ రామపట్టాభిషేక సందర్భములో ఉత్సవాలు జరుపుకుంటుంటే దేవలోకములో దేవతలు విచారంగా ఉన్నారు. వారందరూ సరస్వతీదేవి వద్దకు పోయి ఇలా అన్నారు.

“అమ్మా! రామ పట్టాభిషేకము జరుగబోవు చున్నది. నీవు ఎలాగైనా దానిని భగ్నము చేసి, రాముని అరణ్యములకు పంపాలి. దాని వలన దేవతల కార్యము సఫలమవుతుంది.” అని అన్నారు. ఆ మాటలకు సరస్వతీ దేవి నేను ఇటువంటి పాడు పని చెయ్యాలా అని చింతించింది. ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉంది. అప్పుడు దేవతలు ఇలా అన్నారు.

“అమ్మ తమరు ఈ పని చేసినందువలన తమరికి ఏ

దోషమూ అంటదు. ఇది దేవ కార్యము. రాముడు సామాన్య మానవుడు కాడు. ఖేదమోదములకు అతీతుడు. సుఖము దు:ఖము సామాన్య మానవులకు కానీ రామునికి అంటవు. కాబట్టి తమరు అయోధ్యకు వెళ్లాలి." అని ప్రార్థించారు.

అప్పుడు సరస్వతీ దేవి తనలో తాను ఇలా అనుకొన్నది.

"ఆహా! ఈ దేవతలు ఎంత అల్పబుద్ధులు. వీరు ఉండేచోటు అత్యున్నత స్థానమైన స్వర్గము. కానీ వీరి బుద్ధులు మాత్రము పరమ నీచములు. ఇతరులు బాగుపడుతుంటే చూచి సహించలేరు. పోనీ. ఇదీ ఒకందుకు మంచిదే... రాముడు వనవాసము వెళితే రాక్షససంహారము జరుగుతుంది. రామాయణ కథ లోకంలో ప్రచారం అవుతుంది. ఎంతో మంది కవులు గాయకులు రామ కథను గానం చేస్తారు. నేను ఆ కవులు గాయకుల నాలుకల మీద నాట్యం చేస్తుంటాను. రామ కథను గానం చేస్తుంటాను. దీనివలన భూలోకంలో నా పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయి." అని అనుకొన్నది సరస్వతీ దేవి. దేవతల కోరిక ప్రకారము అయోధ్యకు వచ్చింది. ఇదీ తులసీరామాయణంలో ఉన్నకథ.

పై చెప్పిన కథా సంఘటనలు వాల్మీకి రామాయణంలో లేవు. రాముడు వనవాసమునకు పోవడంలో దేవరహస్యాలు ఏమీ లేవు. మామూలు మానవుల్లో ఎలాజరుగుతుందో అలా జరిగింది.

దశరథుడు భరతుడు ఇంటలేని సమయంలో కావాలనే రామ పట్టాభిషేకమునకు ముహూర్తము నిర్ణయించాడు అని స్పష్టంగా

తెలుస్తూ ఉంది.

యుగధర్మము ప్రకారము రాజ్యము జ్యేష్టునికి చెందుతుంది. దశరథుని కుమారులలో పెద్దవాడు రాముడు. అందుకని రామునికి పట్టాభిషేకం చెయ్యడంలో ఎవరికీ అభ్యంతరం ఉండదు. కాని భరతుడు ఏమైనా పేచీ పెడతాడేమో అని దశరథుడు సందేహించాడు. అందుకని భరతుడు లేని వేళ పట్టాభిషేకము నిర్ణయించాడు.

వాల్మీకి రామాయణము ప్రకారము ఇందులో దేవతల ప్రసక్తి కానీ, దేవరహస్యము కానీ ఏమీలేవు.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ఏడవ సర్గ.

దశరథుని ముగ్గురు భార్యలలో మూడవ భార్య కైక. కేకయ రాజ కుమార్తె. ఆమెకు దశరథునితో వివాహం అయిన తరువాత ఆమెకు తోడుగా మంథర అనే దాసి ఆమె వెంట అయోధ్యకు వచ్చింది. మంథర కైకేయికి ఆంతరంగిక దాసి. సలహాదారు. అటువంటి మంథర ఆ రోజు మేడమీదికి ఎక్కి అయోధ్యానగరాన్ని చూచింది. అయోధ్య అంతా కోలాహలంగా కనపడింది. రాజమార్గములు అన్నీ తోరణముల తోనూ పతాకములతోనూ అలంకరింపబడి ఉన్నాయి. పౌరులందరూ హడావిడిగా రాచ నగరుకు వస్తున్నారు.

ఇదంతా చూచిన మంథరకు ఏమి జరుగుతూ ఉందో అర్థం కాలేదు. పక్కను ఉన్న ఒక దాసీని పిలిచి "అయోధ్యలో ఏమి జరుగుతూ ఉంది? ఆ కౌసల్య ఒట్టి పిసినారి కదా. ఆమె కూడా దానధర్మములు చేస్తూ ఉందా? ఏమి కారణం? దశరథుడు ఏమైనా ఘనకార్యం చేసాడా!" అని అడిగింది.

ఆ దాసి మంథరతో ఇలా అంది. " అవును. దశరథమహారాజు గారు రేపు ఉదయం పుష్యమీ నక్షత్రంలో రామునికి యువరాజుగా పట్టాభిషేకము జరిపిస్తున్నాడు." అని చెప్పి హడావిడిగా వెళ్లిపోయింది.

ఎదుటి వారి ఉన్నతిని చూచి ఓర్వలేని మంథర లో కోపము, అసూయ ప్రవేశించాయి. వెంటనే విసా విసా కైకేయి మందిరమునకు వెళ్లింది. ఆ సమయంలో కైకేయి మెత్తటి పరుపు మీద పడుకొని ఉంది.

కైకను చూచి మంథర కోపంతో "ఓసి తెలివితక్కువదానా! బయట కొంపలు మునుగుతుంటే నువ్వు ఇక్కడ తీరిగ్గా పడుకొని ఉన్నావా! నీకు రాబోయే ఆపదలు నీకు తెలియడం లేదు." అని అంది మంథర.

కైకకు ఏమీ అర్థం కాలేదు. మంథర వంక ఏమి జరిగింది అన్నట్టు చూచింది.

"అయ్యో నీకు ఇంకా ఏమీ అర్థం కాలేదా! నీ భర్తకు నీవు అత్యంత ప్రియమైన భార్యవు అని అనుకుంటున్నావా! కాదమ్మా కాదు. ఎన్నటికీ కాదు. అదంతా నీ భ్రమ. నీ సౌభాగ్యం అంతా ఎండాకాలంలో నీటి మడుగు వలె ఎంది పోయిందే తల్లీ" అని పరుషంగా మాట్లాడింది మంథర.

ఆ మాటలు విన్న కైక ఆలోచనలో పడింది. "మంథరా! ఏం జరిగిందో చెప్పకుండా ఏమిటా మాటలు! అసలు నీకు ఇంత కోపం దు:ఖం ఎలా కలిగింది. ఎందుకు కలిగింది. కాస్త వివరంగా చెప్పవే" అంది కైక. ఆమాటలకు ఇంకాస్త ఏడుపు ఎక్కువ చేసింది మంథర.

" ఏం చెప్పమంటావే తల్లీ! నీ కొంప నట్టేట మునిగింది. నీకు అంతులేని కష్టం వచ్చి పడింది. నీకు ఈ విషయం తెలుసా. దశరథుడు రామునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేస్తున్నాడట. నీతో ఒక మాటన్నా అన్నాడు. నీ అనుమతి తీసుకున్నాడా." అని సన్న సన్నగా నొక్కుతూ అంది.

"అసలు ఆ విషయం తెలియగానే నాకు ఒళ్లంతా మండి పోయింది అనుకో! పట్టరాని దు:ఖంలో మునిగిపోయాను. నీతో చెప్పి నీకేదో మేలు చేద్దామని వస్తే నీవేమో తీరుబడిగా పడుకొని ఉన్నావు. నీకు చీమ కుట్టినట్టయినా లేదు.

అమ్మ కైకా! నేను నీ వెంట ఇంత దూరం వచ్చాను కదా. నీ సుఖం నా సుఖం అనీ, నీ కష్టం నా కష్టం అనుకొని ఇన్నాళ్లు నిన్ను అంటిపెట్టుకొని ఉన్నాను కదా! అయ్యో! రాజ వంశంలో పుట్టి దశరథమహారాజు గారికి ముద్దుల భార్య వు అయి ఉండీ రాచనగరులో జరిగే కుట్రలు తెలుసుకోలేకపోతే ఎలాగా! నీ భర్త నీతో పైపైన ఇష్టంగా ఉన్నట్టు నటిస్తూ ప్రేమగా మాట్లాడుతున్నా, లోలోపల నీకు తీరని అపకారం చేస్తున్నాడమ్మా. అది నీవు గ్రహించలేక పోతున్నావు.

అయినా నిన్ను అని ప్రయోజనం లేదు. నీవు అసలే అమాయకురాలివి. తెల్లనివి అన్నీ పాలు నల్లనివి అన్నీ నీళ్లు అని నమ్ముతావు. అందుకే నీ భర్త నీకు ఇంత ద్రోహం, మోసం చేస్తున్నా తెలుసుకోలేకపోతున్నావు. పైపై ఇచ్చకపు మాటలు నీకు, ప్రయోజనాలన్నీ కౌసల్యకు. ఇదమ్మా నీ భర్త వరస. అందుకే కాస్త నా

మాట విను. నీ భర్త,  నీ కుమారుడు భరతుని, శత్రుఘ్నుని వాళ్ల మేనమామ గారి ఇంటికి పంపాడా. ఇక్కడ అకస్మాత్తుగా రేపు ఉదయమే  రామునికి యౌవరాజ్య పట్టాభిషేకము జరిపిస్తున్నాడు. భరతుని అడ్డు తొలగించుకొని రాజ్యం అంతా రామునికి కట్టబెడు తున్నాడు.

ఏమోనమ్మా! పామును పక్కలో పెట్టుకొని పడుకుంటున్నావు. అది అదునుచూచి కాటేసింది. నీ విషయంలో దశరథుడు అదే చేసాడు.  నీకేమో కోరినవి అన్నీ తెచ్చి ఇచ్చి ప్రేమతో చూస్తున్నట్టు నటిస్తూ, నీకు తీరని ద్రోహం చేస్తున్నాడు. రామునికి పట్టాభిషేకం చేసి నీకూ నీ కుమారునికీ తీరని అన్యాయం చేస్తున్నాడు. కాబట్టి ఓ కైకా! ఇప్పటి కన్నా మేలుకో. ఏదో ఒకటి చెయ్యి ఈ పట్టాభిషేకమును ఆపు. నిన్ను నీ కుమారుడు భరతుని రక్షించుకో  " అంది మంథర కైకను ఓరగా చూస్తూ.

కైక  "మంథరా!" అని అరిచింది. కైకకు రామ పట్టాభిషేకము అని మాత్రం వినబడింది. మిగిలిన మాటలు ఏమీ వినబడలేదు. "ఏమన్నావే! నా రామునికి పట్టాభిషేకమా! ఎంతటి శుభవార్త చెప్పావే. ఇదుగో ఈ ఆభరణం కానుకగా తీసుకో. ఇంతటి మంగళకరమైన వార్త చెప్పినందుకు ఇది చాలా ఇంకా ఏమన్నా కావాలా" అంటూ తనమెడలోని హారాన్ని మంథరకు కానుకగా ఇచ్చింది. కైక మనస్సు ఆనంద డోలికలలో తేలిపోతూ ఉంది.

"మంథరా! నాకు రాముడన్నా భరతుడన్నా  ఒకటేనే. ఇద్దరూ నాకు సమానమే. అందుకే నా భర్త రామునికి యౌవరాజ్య

పట్టాభిషేకము జరిపిస్తున్నాడు అని తెలిసి నా హృదయం ఆనందంతో ఊగిపోతూ ఉంది. అబ్బా! నీవు కూడా ఆనందంగా ఉండవే. మనకు ఇంతకన్నా సంతోషకరమైన విషయం ఇంకేముంటుంది చెప్పు. అడగవే. నీకేస్త్ర కావాలో అడుగు. కాదనకుండా ఇస్తాను." అని సంతోషంతో మంథరను పట్టుకొని ఊపుతూ కేరింతలు కొట్టింది కైక.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము ఏడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

ఎనిమిదవ సర్గ.

కైక తనకు బహుమానముగా ఇచ్చిన ఆభరణమును విసిరి కొట్టింది మంధర.

"అయ్యో ఎంత తెలివి తక్కువదానివమ్మా నువ్వు. దు:ఖించ తగ్గ సమయంలో సంతోషంతో కేరింతలు కొడుతున్నావు. ముంచు కొస్తున్న ఆపదను గుర్తించలేకున్నావు. నిన్ను, నీ అమాయకత్వాన్ని చూచి నాకు నవ్వు వస్తోంది.

అది కాదమ్మా! నాకు తెలియక అడుగుతాను. సవతి కొడుక్కు పట్టాభిషేకం జరుగుతుంటే సంతోషించే దానివి నువ్వు ఒక్కదానివే కనపడుతున్నావు. నీ చావును నువ్వే కొనితెచ్చుకుంటున్నావు. ఈ రాజ్యము ఎవరిది? దశరథునిది. ఆయనకు రాముడొక్కడే కాదు కదా! భరతుడు కూడా కుమారుడే కదా! భరతునికి కూడా రాజ్యాధి కారము ఉన్నది కాబట్టి రామునికి భరతుని చూస్తే భయము. అందుకే భరతుడు ఇంటలేని సమయములో పట్టాభిషేకము చేసుకుం టున్నాడు. ఈ విషయం ఆలోచించే కొద్దీ నాకు దు:ఖము ఆగటం లేదు తల్లీ నీకు ఎలా ఉందో గాని.

ఇంకో విషయం గమనించావా! రాముడు లక్ష్మణుడు ఒకటి.

భరతుడు శత్రుఘ్నుడు ఒకటి. రాముని తరువాత భరతుడు పుట్టాడు. అందుకనీ, రాముని తరువాత రాజ్యాధికారము భరతునికే చెందాలి. లక్ష్మణుడు, శత్రుఘ్నుడు చిన్నవాళ్లు. రాముడు విద్వాంసుడు. రాజనీతి కోవిదుడు. ధనుర్విద్యాపారంగతుడు. అందుకే, నీ కొడుకు భరతుని అమాయకుడిని చేసి రాజ్యం మొత్తం కాజెయ్యాలని చూస్తున్నాడు. రాముడు. ఆ విషయం నువ్వు గ్రహించలేకున్నావు. నాకుమాత్రం వణుకు పుడుతూ ఉంది.

అయినా ఏమనుకొని ఏమి లాభం. అదృష్టం అంతా ఆ కౌసల్యది. ఆమె కొడుకు యువరాజు కాబోతున్నాడు. నువ్వు ఆమెకు దాసిగా ఉండాల్సిందే. ఆమె ముందు చేతులు కట్టుకొని నిలబడాల్సిందే. నువ్వు కౌసల్యకు దాసివి అయితే నీ కొడుకు భరతుడు రామునికి దాసుడు అవుతాడు. నీ కోడలు రాముని భార్యకు దాసి అవుతుంది. మీ కుటుంబానికి దాస్యవృత్తి తప్పదు. ..." అని ఇంకా ఏమో అనబోతుంటే మంథరను వారించింది కైక.

" మంథరా! ఇంకచాలు ఆపు. రాముడు అంటే ఎవరను కున్నావు? అన్ని ధర్మములు తెలిసినవాడు. గురు ముఖతా విద్య నేర్చుకున్నవాడు. పరుల ఎడల కృతజ్ఞతా భావము కలవాడు. ఎల్లప్పుడూ సత్యమునే పలికెడివాడు. అన్నిటి మించి రాముడు జ్యేష్టుడు. రాజ్య సంప్రదాయ ప్రకారము జ్యేష్టుడే రాజ్యమునకు యువరాజు. ఇందులో తప్పేముంది. దు:ఖించడానికి కేముంది. అసలు నీకు రాముని గురించి నీచ భావము ఎలా కలిగింది. రాముడు యువరాజు అయినా తన తమ్ములను తనతో సమానంగా గౌరవిస్తాడు. ఆదరిస్తాడు. రామ పట్టాభి షేక వార్త వినగానే సంతోషించక ఇలా దు:ఖిస్తావెందుకు?

నువ్వు చెప్పినట్టు రాముని తరువాత భరతునిదే కదా రాజ్యాధికారము. రాముడు పరిపాలించిన తరువాత భరతుడే తదుపరి రాజు అవుతాడు. ఇందులో సందేహమేమున్నది. ఈ సంతోష సమయంలో సంతోషించాలి గానీ దు:ఖించడం అవివేకుల లక్షణం.

మంథరా! ఇంకో మాట చెబుతున్నాను విను. నాకు భరతుడు ఎంతో రాముడూ అంతే. రాముడు నన్ను తన తల్లి కౌసల్య కన్నా ఎక్కువగా ప్రేమిస్తాడు. అభిమానిస్తాడు. గౌరవిస్తాడు. అటువంటి రాముని గురించి నా ఎదుట నిందిస్తావా! రాముడు రాజు అయితే ఒకటీ భరతుడు రాజు అయితే ఒకటీనా! రాముడు రాజు అయితే నా కుమారుడు భరతుడు కూడా రాజు అయినట్టే! అందుకే ఆ చెడ్డ ఆలోచనలుమాని రాముని రాజ్యాభిషేకమును చూచి ఆనందించు.” అని చీవాట్లు పెట్టింది కైక.

కాని మంథర బుద్ధి మారలేదు. దీర్ఘంగా నిట్టూర్చింది. కైక వంక జాలిగా చూసింది. “ఒక పక్క నువ్వు ఎక్కిన పడవను నీ శత్రువు ముంచుతుంటే. నువ్వు ఆ శత్రువునే పొగుడుతున్నావా! ఎంత అమాయకురాలివమ్మా! నువ్వు చెప్పినట్టు రాముడు రాజు అవుతాడు. రాముని తరువాత రాముని కొడుకు రాజు అవుతాడు కానీ భరతుడు ఎలా రాజు అవుతాడు? అసలు అప్పుడు నీ పేరు, నీ కొడుకు భరతుని పేరు ఎవరు తల్చుకుంటారు? అందరూ ‘యువరాజా’ ‘యువరాజా’ అంటూ రాముని కొడుకు వెంట పడతారు. నీ కొడుకు మొహం ఎవరు చూస్తారు.

ఒక రాజుకు నలుగురు కుమారులు ఉంటే అందరూ రాజులు కారు కదా! అందులో జ్యేష్టునికి కానీ, జ్యేష్టుడు పనికి రాని పక్షంలో గుణవంతుడైన తరువాత వాడికి కానీ, రాజ్యాభిషేకము చేస్తారు. ఇది వంశాచారము. అందుకే నా మాటవిను. రాముడు అడ్డు తొలగితే నీ కొడుకే రాజు అవుతాడు. లేకపోతే నీ కొడుకు అనాధ అవుతాడు. రాచమర్యాదలకు సుఖాలకు దూరం అవుతాడు. ఇదంతా నీ మేలుకోరి చెబుతున్నాను. నువ్వేమో రామ పట్టాభిషేక వార్త తెలిసి నాకు కానుకలు ఇస్తున్నావు. ఏంటో!

నీకు ఇంకో రహస్యం తెలుసా! రాముడు రాజు కాగానే, భరతుడు తనకు పోటీ రాకుండా భరతుని దేశాంతరం పంపేస్తాడు. లేకపోతే చంపిస్తాడు. తన మార్గ నిష్కంటకం చేసుకుంటాడు. అసలు నీ కొడుకు మేనమామతో కూడా పంపడానికి ఇదే కారణము. నీ కొడుకు ఎదురుగా లేడు కనుక నీ భర్తకు నీ కొడుకుమీద ప్రేమ తగ్గిపోయింది. రాముడు ఎదురుగా ఉన్నాడు కనుక రాముని యువరాజును చేస్తున్నాడు. అందుకనే, ఈ పట్టాభిషేక విషయం కనీసం నీకు గానీ, నీ కుమారుడు భరతునికి కానీ తెలియనీయలేదు. ఇదంతా నీ మీద జరుగుతున్న కుట్ర. అది నీవు తెలుసుకోలేకున్నావు. నేనేం చెయ్యను.

భరతుడు ఇక్కడ ఉంటే ఎక్కడ తన యౌవరాజ్య పట్టాభిషేకానికి అడ్డు పడతాడో అని ముందుగానే పథకం ప్రకారం మేనమామ ఇంటి పంపించారు. అసలు భరతుడు కూడా తన కళ్లెదుట ఉంటే నీ భర్త దశరథుడు నీ మీద ఉన్న ప్రేమతో నీ కుమారుడు భరతునికే పట్టాభిషేకము చేసేవాడు కదా! ఇదంతా

రాముడు లక్ష్మణుడు కలిసి చేసిన కుట్ర.

రాముని లక్ష్మణుడు ఏమీ చెయ్యడు. రామునికి లక్ష్మణుడు అడ్డురాడు. కాని భరతుడు తనకు పోటీ వస్తాడని చంపించడానికైనా వెనకాడడు రాముడు. అది తెలుసుకో! ఇక్కడకు వచ్చి రాముని చేతిలో చచ్చే కంటే నీ కుమారుడు అటునుండి అటే ఏ అరణ్యములకో పోవడం మంచిది.

కాబట్టి నా మాటవిను. ధర్మం ప్రకారము భరతుడు కూడా యువరాజు పదవికి అర్హుడు. అయోధ్యకు ఉత్తరాధికారి. అప్పుడు నీకు, నీ బంధువులకు గౌరవ ప్రతిష్టలు పెరుగుతాయి. అయోధ్యాధీశుని తల్లిగా నిన్ను అందరూ గౌరవిస్తారు. లేకపోతే నీకు దాస్యము నీ కొడుక్కు చావు రాసి పెట్టి ఉంది. నీ కొడుకును బాలుడిని అమాయకుడిని చేసి ఆడిస్తున్నారు. నీ కొడుకు కూడా రాజ్యమునకు అర్హుడు కాబట్టి, రామునికి భరతుడు సహజ శత్రువు. ఏనుగును సింహము కబళించినట్టు నీ కొడుకును రాముడు కబళిస్తాడు. నా మాటవిని నీ కొడుకును రక్షించుకో!

నీకు గుర్తుందా! నువ్వు నీ భర్తకు ముద్దుల భార్యవు. అందుకని నువ్వు కౌసల్యను ఎన్నోసార్లు హేళన చేసావు. అంతకు అంతా ఇప్పుడు నీ మీద పగ తీర్చుకుంటుంది. సందేహము లేదు. ఇంతెందుకమ్మా! రేపు ఆ కాస్త పట్టాభిషేకము కానీ. ఎల్లుండినుండి నీ గతి, నీ కొడుకు గతి ఏమవుతుందో చూడు! నేనుచెప్పడం ఎందుకు. మీ ఇద్దరూ అత్యంత దయనీయ స్థితిలో అవమానాలపాలవుతారు. ఇంతెందుకమ్మా! ఒకసారి రాముడు రాజైతే నీ కుమారునికి నాశనము

తప్పదు. ఇది యదార్థము. కాబట్టి రాముని పట్టాభిషేకము జరగకుండా  ఉండే ఉపాయము ఆలోచించు.” అని పలికింది మంథర.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము ఎనిమిదవ సర్గసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## తొమ్మిదవ సర్గ.

ఒక అబద్ధాన్ని పదే పదే వల్లిస్తే అదే నిజం అని నమ్మే పరిస్తితి వస్తుంది. ఇది ఏ ఒక్కరికీ పరిమితం కాదు. విద్వాసుల దగ్గరినుంచీ నిరక్షరాస్యులవరకూ జరుగుతుంది. కైక విద్వాంసురాలు. దశరథుని భార్య. కేకయ దేశపు రాకుమార్తె. కాని మంథర మాటలకు లోబడి పోయింది. రాముడు పుట్టినప్పటినుండి, రాముని తన కుమారునికన్న ఎక్కువ గారాబంగా పెంచింది. రాముడు అంటే కైకకు ప్రాణం. కాని మంథర చెప్పుడు మాటల ముందు ఇన్నాళ్లు తాను రాముని మీద పెంచుకున్న ప్రేమ అనురాగము ఎందుకూ కొరగాకుండా పోయాయి. ఒక్కసారిగా రాముని మీద ద్వేషము అసూయ ప్రబలాయి.

మంథర చెప్పిన మాటలు వినగానే కైకకు కోపం తారస్థాయికి చేరుకుంది. రోషంతో మంథరతో ఇలా అంది.

"మంథరా! ఆలోచించగా నీవు చెప్పినదే నిజము అనిపిస్తూ ఉంది. ఇంక ఆలస్యము చేసి ప్రయోజనము లేదు. రాముడు ఉన్నంత వరకూ భరతునికి భవిష్యత్తు లేదు. రాముడు అడవులకు వెళ్లాలి, భరతుడు యువరాజుగా పట్టాభిషిక్తుడు కావాలి. ఇదే నా తక్షణ కర్తవ్యము. మంథరా! నాకు ఏమీ తోచడం లేదు. ఎలాగైనా రేపటి పట్టాభిషేకము ఆగిపోవాలి. భరతుడు రాజ్యాభిషిక్తుడు కావాలి. దీనికి

తగిన ఉపాయం చెప్పు." అని అడిగింది కైక.

తన పాచిక పారినందుకు మంథర లోలోపల సంతోషించింది. ఇందులో మంథరకు లాభించింది ఏమీ లేదు. రాముడు పట్టాభిషేకం ఆగిపోతే మంధరకు ఒరిగింది ఏమీ లేదు. కాని మహారాణి కైక తన మాటకు విలువ ఇచ్చింది. అదే మంథరకు పదివేలు. మంథర రెచ్చిపోయి కైకతో ఇలా అంది.

"నా మాటలకు విలువ ఇచ్చినందుకు చాలా సంతోషంగా ఉందమ్మా. ఏ పని అయిన చెయ్యడం కష్టం కాని చెడగొట్టడం ఎంత సేపు. రేపు జరగబోయే పట్టాభిషేకము పటాపంచలు చేసే ఉపాయము ఒకటి చెబుతాను. సావధానంగా విను. అయినా నీకు తెలియదటమ్మా! నేను చెప్పాలా చెప్పు. నీకు అన్నీ తెలుసు. ఈ ముసలి దాన్ని పరీక్ష చేస్తున్నావు కదూ. అయినా అడిగావు కాబట్టి చెప్పాలి కదా!" అంది మంథర.

వెంటనే కైక తాను కూర్చున్న ఆసనము మీది నుండి లేచి మంథర దగ్గరగా వచ్చింది. "లేదే మంథరా. నాకు ఏ ఉపాయమూ తట్టడం లేదు. భరతునికి పట్టాభిషేకం జరగాలి. అది ఎలాగో చెప్పు." అని అడిగింది కైక.

"దానికే వస్తున్నానమ్మా! నీవు ఒకసారి నాతో ఒక విషయం చెప్పావు గుర్తుందా. అదేనమ్మా! దేవాసుర యుద్ధంజరిగింది కదా. అప్పుడు ఇంద్రుడికి సాయంగా నీ భర్త దశరథుడు కూడా వెళ్లాడు. ఆయనతో పాటు నువ్వు కూడా వెళ్లావు. మీరంతా దండకారణ్యంలో

నివాసం ఉన్న తిమిరధ్వజుడు అనే రాక్షసుని మీదికి యుద్ధానికి వెళ్లారు. ఆ అసురుడు మాయావి. దేవతలనందరినీ ఓడించాడు. ఇంద్రునితో కూడా యుద్ధము చేసాడు. పగలంతా యుద్ధం చేసిన దేవతలు రాత్రి గాయాలతో విశ్రాంతి తీసుకుంటున్నారు. నిశాచరులైన రాక్షసులు రాత్రికి రాత్రి దేవతలను ఊచకోత కోసారు. అప్పుడు దశరథ మహారాజు ఆ అసురులతో యుద్ధానికి దిగాడు. కాని రాక్షసులు దశరథుని ఒళ్లంతా తూట్లు పడేట్లు కొట్టారు. నీ భర్త కిందపడి పోయాడు. స్పృహ కోల్పోయాడు.

అప్పుడు నీవు నీ భర్తను రణరంగము నుండి దూరంగా తీసుకొని పోయి కాపాడావు కదా! కాని రాక్షసులు మిమ్ములను వెంబడించి యుద్ధం చేసారు. మరలా నీవు నీ భర్తను రణరంగంనుండి రాక్షసుల కంట పడకుండా దూరంగా తీసుకొని పోయి కాపాడావు. అలా నీ భర్తను రెండు సార్లు ప్రాణాపాయం నుండి రక్షించావు. నీవు చేసిన మహోపకారమునకు నీ భర్త దశరథుడు ఎంతో సంతోషించాడు. నీకు రెండు సార్లు ఆయన ప్రాణాలు కాపాడావు కాబట్టి నీకు రెండు వరాలు ఇస్తాను అని అన్నాడు. వాటిని నీవు కోరుకోకుండా నీ ఇష్టంవచ్చినప్పుడు కోరుకుంటాను అని అన్నావు. ఇదంతా నీవు చెబితేనే నాకు తెలిసింది.

ఇప్పుడు ఆ వరాలతో పని పడింది. ఆ వరాలను ఇప్పుడు కోరుకో. ఒక వరంగా రామునికి 14 ఏళ్ల వనవాసము. రెండవ వరంగా భరతునికి యౌవరాజ్య పట్టాభిషేకము. దానితో రామ పట్టాభిషేకము ఆగిపోతుంది. నీ కోరిక నెరవేరుతుంది. రాముడు రాజ్యంలో లేకపోతే భరతుడు ప్రజలకు దగ్గర అవుతాడు. వారి ప్రేమ

అభిమానములను చూరగొంటాడు. అయోధ్యావాసులు భరతుని తమ ప్రభువుగా అంగీకరిస్తారు. రాముని మరిచిపోతారు. భరతుడు రాజుగా స్థిరపడతాడు. నీవు రాజమాతగా వెలిగిపోతావు. ఇదీ పథకము.

ఈ పథకము అమలు చేయడానికి ముందు నీవు కోపగృహము అలంకరించాలి. మాసిన వస్త్రములు కట్టుకొని, తలకు కట్టుకట్టుకొని నేలమీద పడుకోవాలి. కొంచెం కష్టమే అయినా తప్పదు కదా! దశరథుడు నీ దగ్గరకు వచ్చినపుడు పెద్దపెట్టున ఏడిచి గోల చేయాలి. ఆయన వంక చూడను కూడా చూడకూడదు. మాట్లాడ కూడదు. ఆయన మాట్లాడించినా ఎడమొహం పెడమొహంగా ఉండాలి.

నువ్వు అంటే దశరథునికి ఎంతో ప్రేమ అభిమానము. నీ కోసం ఏమి చెయ్యమన్నా చేస్తాడు. ఆఖరుకు నిప్పుల్లో దూకమన్నా దూకుతాడు.  నువ్వు బాధతో ఉంటే చూడలేడు. నువ్వు ఏం అడిగినా ఇస్తాడు. తుదకు తన ప్రాణాలు ఇవ్వమన్నా సంతోషంగా ఇచ్చేస్తాడు.  ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకో. దేవాసుర యుద్ధంలో నీకు ఇస్తానన్న రెండు వరాలు ఇప్పుడు అడుగు. నీకు మణులు, రత్నాలు ఆభరణాలు ఇస్తానని ప్రలోభ పెడతాడు. కాని వాటికి ఆశపడవద్దు. రెండు వరాలు జాగ్రత్తగా కోరుకో.

మొదటి వరం రాముని పదునాలుగు సంవత్సరములు అరణ్యవాసమునకు పంపడం. రెండవ వరము గా భరతుని యువరాజుగా పట్టాభిషిక్తుని చేయడం. రాముడు రాజ్యములో ఉంటే నీ కుమారుని ఎవరూ రాజుగా అంగీకరించరు. రాముడు అడవులకు

వెళితే క్రమక్రమంగా భరతుడు రాజుగా వేళ్లూనుకొని స్థిరపడతాడు. రాముడు వనవాసమునకు వెళ్లడం ఒక వరంగా కోరాలి. లేకపోతే రాముడు అయోధ్యలోనే ఉండే ప్రమాదం ఉంది. రాముడు వనములకు వెళితే ప్రజలు రాముని మరిచిపోతారు. నీ కుమారుడు భరతుని రాజుగా అంగీకరిస్తారు. రాముడు ఒక వేళ వనవాసము నుండి తిరిగి వచ్చినా భరతుడు రాజ్యమును ఇయ్యడు. కాబట్టి ముందు రామ పట్టాభిషేకమును ఆపించవలెను." అని మంథర కైకకు ఒకటికి పది సార్లు చెప్పిందే చెప్పి నూరిపోసింది.

మంథర దుర్బోధలు బాగా తలకెక్కాయి కైకకు. తన కొడుకు భరతుడు అప్పుడే యువరాజు అయినట్టు కలలు కంటోంది. తన శ్రేయస్సు కోరి ఇంతగా తనకు ఆలోచనలను చెప్పిన మంథరను మనసులోనే అభినందించింది.

(ఇక్కడ వాల్మీకి ఒక వాక్యం రాసాడు. కైకేయి స్వతాహాగా మంచి గుణములు కలది అయినా తన దాసి మంథర దుర్బోధలను విని ఏమీ తెలియని అమాయకురాలైన బాలిక వలె చెడుతోవలో నడిచింది. అని. ఇలాంటి మంధరలు మనకు ప్రతి ఇంటా కనపడతారు. వాళ్లు మన బంధువులైనా కావచ్చు లేక పక్కింటి వాళ్లు ఎదురింటి వాళ్లు కావచ్చు. వారి చెప్పుడు మాటలకు లోబడి సంసారాలు చెడ గొట్టుకొనే కైకలు ఎంతో మంది మన కళ్లముందే కనపడతున్నారు.)

"ఆ హా మంధరా! నీకు ఎన్ని విషయాలు తెలుసే. నాకు ఎన్ని మంచి విషయాలు చెప్పావు. నీకు ఇన్ని తెలివితేటలు ఉన్నాయని నాకు ఇంతవరకూ తెలియదు. నీమేలు ఎన్నటికీ మరువలేను. మంథరా!

అసలు నువ్వు చెప్పకపోతే నాకు మహారాజు మనసులో ఏముందో తెలిసి ఉండేది కాదు. నీవు రూపానికి కుబ్జవే కాని బుద్ధిలో బృహస్పతివి. నువ్వు చెప్పినట్టు రాముడు అడవులకు పోయి నా కొడుకు భరతుడు రాజైతే నీ ఒళ్లంతా బంగారు తొడుగు వేయిస్తానే. నువ్వు నాకు ఎలా సేవలు చేస్తున్నావో, ఇతర దాసీల చేత నీకు అలా సేవలు చేయిస్తాను. ఆ కౌసల్య దాసీలు నిన్ను చూచి అసూయపడేలా చేస్తాను." అని మంథరను పొగిడింది.

తన రాణి కైక తనను అలా పొగుడుతుంటే మంథర పొంగి పోయింది. "ఏంటమ్మా ఇంకా ఇలాగే ఉన్నావా. నేను చెప్పినవి అన్నీ అప్పుడే మరిచిపోయావా" అంది మంథర.

"లేదు లేవే.  అన్నీ గుర్తున్నాయి." అంటూ తన అలంకారములు అన్నీ ఒకటి ఒకటిగా తీసేసింది. పట్టు బట్టలు విప్పి  మాసిన చీర కట్టుకుంది. తలకు కట్టు కట్టింది. నేలమీద పడుకుంది.

"మంథరా! రాజుగారు వస్తే ఇలా చెప్పు. భరతుడు రాజైనా కావాలి. లేకపోతే నేను చావనన్నా చావాలి. అదే నా కోరిక అని చెప్పు. ఇంకా ఏమంటావంటే అక్కడ రాముడికి పట్టాభిషేకం జరిగితే ఇక్కడ నా ప్రాణాలు పోతాయి అని చెప్పు." అని పలికింది.

"అవన్నీ నాకు తెలుసు లేవమ్మా. నువ్వు మాత్రం రాజుగారితో ఖచ్ఛితంగా ఉండు. రాముని అరణ్య వాసము, భరతుని పట్టాభిషేకము ఇవి రెండే కావాలి అని చెప్పు." అని చెప్పింది మంథర.

"అంతా నువ్వు చెప్పినట్టే చేస్తాను లేవే." అని పలికింది కైక.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### పదవ సర్గ.

కైక, మంధర, ఏమి చెయ్యాలో ఎలా చెయ్యాలో దశరథుడు వస్తే ఇలా మాట్లాడాలో మరొకసారి వివరంగా మాట్లాడు కున్నారు. తరువాత కైక కోపగృహంలో ప్రవేశించింది. ఆభరణాలు అన్నీ విసిరికొట్టింది. వెంట్రుకలు గట్టిగా ముడివేసింది. మాసిన బట్టలు కట్టుకుంది. నేలమీద బోర్లాపడుకొని తెచ్చిపెట్టుకున్న బాధను అభిన యిస్తూ ఉంది.

ఇంతలో మరునాడు జరగ వలసిన రామ పట్టాభిషేకమునకు చేయవలసిన ఏర్పాట్ల గురించి తగు సూచనలు ఇచ్చిన దశరథుడు, వసిష్ఠుడు వామదేవుడు మొదలగు పెద్దల అనుజ్ఞ తీసుకొని, ఈ విషయమును ముందుగా కైకకు తెలుపవలెనని, వడి వడిగా కైక ఉన్న మందిరమునకు వచ్చాడు.

ఎప్పుడూ కళకళలాడే కైకేయీ మందిరము నిశ్శబ్దముగా ఉంది. శయన మందిరములో కైక కనిపించలేదు. దాసదాసీలు అటు ఇటు తిరుగుతున్నారు. కానీ కైక జాడ మాత్రం కానరాలేదు. ఎప్పుడెప్పుడు కైకతో రామ పట్టాభిషేక వార్త చెబుదామా అని వచ్చిన దశరథ మహారాజు కైక కనపడకపోయేసరికి నిరాశపడ్డాడు. అన్ని గదులు తిరిగాడు. ఎక్కడా కైకజాడ లేదు.

ఎప్పుడూ తను వస్తున్న వర్తమానము ముందుగానే తెలుసు కొని కైక తనకు ఎదురు వచ్చి స్వాగతించి లోపలకు తీసుకొని వెళ్లేది. కాని ఈ మాదిరి ఎప్పుడూ జరగలేదు. ఏమై ఉంటుందా అని ఆలోచిస్తున్నాడు దశరథుడు. అక్కడ నిలబడి ఉన్న కైక ఆంతరంగిక పరిచారికలను పిలిచి కైక గురించి అడిగాడు. నిజానికి అలా అడగడం అవమానం. కాని తప్పలేదు. అడిగాడు.

వారు దశరథునికి నమస్కరించి వినయంగా "మహారాజా! కైకేయీ మహారాణీవారు. కోపగృహంలో ఉన్నారు."అని చెప్పారు.

ఆశ్చర్యపోయాడు దశరథుడు. కైకేయికి తన మీద కోపమా! ఎందుకు! ఏమీ కారణము! అని తనలో తాను తర్కించుకుంటున్నాడు దశరథుడు. మెల్ల మెల్ల గా కైకేయీ పడుకొని ఉన్న కోపగృహమునకు వెళ్లాడు. నేలమీద పడుకొని ఉన్న తన ప్రియమైన భార్య కైకను చూచి దశరథునికి దు:ఖము ముంచుకొచ్చింది. దెబ్బతగిలిన లేడిలాగా, దేవలోకము నుండి విసిరివేయబడ్డ దేవకన్యలాగ నేలమీద పడి ఉన్న కైకను చూచి చలించిపోయాడు. వెళ్లి ఆమె పక్కనే నేల మీద కూర్చున్నాడు. ఆమె శరీరాన్ని తన చేతితో మెల్లిగా నిమిరాడు. నెమ్మది అయిన స్వరంతో ఆమెతో ఇలా అన్నాడు.

"దేవీ! ఏమిటీ ఈ అలుక. దేనికి ఈ అలుక. నామీద కోపం ఎందుకు. నేను చేసిన అపరాధము ఏమి? నిన్ను ఎవరన్నా ఏమన్నా అన్నారా! లేక ఎవరన్నా నిన్ను అవమానించారా! నిన్ను ఈ పరిస్థితిలో చూస్తుంటే నాకు దు:ఖము ముంచుకొస్తూ ఉంది. నీవు ఏం కోరితే అది తీర్చే నేను ఉండగా నీకు ఈ కోపమేల? నీ మనసు ఎందుకు

కష్టపెట్టుకుంటావు?

అయ్యో ఇన్ని అడుగుతున్నాను. నీ ఆరోగ్యము సంగతే అడగ లేదు. నీకు ఆరోగ్యము సరిగా లేదా! రాజ వైద్యులను పిలిపించనా! నీకు శరీరంలో ఉన్న బాధ ఏమిటో చెప్పు. పోనీ నీకు ఎవరికైనా మేలు చెయ్యాలని అనుకొంటున్నావా. ఎవరైనా సరే వాళ్లకు ఏం కావాలంటే అది ఇస్తాను. పోనీ నీకు ఎవరి మీదనన్నా కోపం ఉందా చెప్పు. వాళ్లను కఠినంగా శిక్షిస్తాను.

అయ్యో దేవీ! ఏమీ చెప్పకుండా ఎందుకు ఇలా నీ శరీరాన్ని శోషింపచేసుకుంటావు. ఇదిగో ఒకే మాట. చెబుతున్నాను విను. నీవు కోరితే చంప కూడని వాడి నన్నా ఒక్క క్షణంలో చంపేస్తాను. లేక ఉరిశిక్ష వేసినవాడినన్నా నిర్దోషిగా వదిలేస్తాను. కటిక దరిద్రుడిని సకల ఐశ్వర్యవంతుడిని చేస్తాను. లేక ధనవంతుడిని వాడి ధనం అంతా లాక్కొని వాడిని బికారిని చేస్తాను.

దేవీ! నన్ను ఆజ్ఞాపించు. సంభవాన్ని అసంభవంగానూ, అసంభవాన్ని సంభవంగానూ చేస్తాను. కాని నీ కోపం మాత్రం విడిచిపెట్టు. ఇంతెందుకు. నేను నా మంత్రులు, పరివారమూ ఈ రాజ్యము అంతా నీ అధీనమే కదా. నీకు అడ్డేముంది. మేమంతా నీ ఆజ్ఞకు బద్ధులమే కదా! ఇంకా ఈ దిగులు ఎందుకు దేవీ. ఇంతకూ నీకు ఏం కావాలో చెప్పు. నీ కోరికను నా ప్రాణాలు ఇచ్చి అయిన సరే నెరవేరుస్తాను.

నేను యజ్ఞయాగములు చేసి సంపాదించిన పుణ్యఫలము మీద ఒట్టుపెట్టు కొని చెబుతున్నాను. నీ కోరిక ఏదో చెప్పు. నెరవేరుస్తాను. ఈ దేశమే నీది. ఈ రాజ్యమే నీది. ఇందులో ఉన్న సమస్త సంపదలు నీవి. నీకు అడ్డేముంది. కోరుకో! నీ ఇష్టం వచ్చినవి కోరుకో!

నీకు మన రాజ్యము ఎంత ఉందో తెలుసు కదా! ఈ భూమి మీద రథచక్రములు ఎంత మేర తిరుగుతాయో అంత భూమి నా అధీనంలో ఉంది. తూర్పు దిక్కున ఉన్న అన్ని రాజ్యములు, సింధు దేశము. సౌవీర దేశము, సౌరాష్ట్ర దేశమూ, దక్షిణమున ఉన్న అన్ని రాజ్యములు, ఇంకా వంగ, అంగ, మగధ, మత్స్య దేశములు, కాశీరాజ్యము, కోసల రాజ్యమూ అన్నీ మన అధీనములు. ఈ రాజ్యములలో ఉన్న సమస్త సంపదలు మన అధీనములు. ఆ సంపదలలో నీకేది కావాలో కోరుకో ఇస్తాను.

ఓ లలనా మణీ! ఇంతకూ నీ దు:ఖ కారణము, భయ కారణము ఏమి. నాకు చెప్పవా. చెబితేనే కదా నాకు తెలిసేది. ఏం జరిగిందో చెప్పకపోతే నేనేం చేయను చెప్పు." అని సకలవిధాలా అనునయించాడు దశరథుడు.

దశరథుని మాటలు అన్నీ విన్న కైక "ఇనుము బాగా కాలి సమ్మెటదెబ్బలకు అనుకూలంగా ఉంది. మనం ఎలా వంచితే అలా వంగుతుంది." అని మనసులో అనుకొంది కైక.

ఇప్పుడు తన మనసులోని మాట మెల్ల మెల్లగా నేర్పుగా బయట పెట్టడానికి ఉద్యుక్తురాలయింది కైక.

శ్రీమద్రామాయణము
అయోధ్యా కాండము పదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

(ఇంతకుముందు సర్గలో మనకు మంధర పాత్ర వచ్చింది. ఈ సర్గలో దశరథుని పాత్ర ప్రాముఖ్యం వహించింది. మంధర కైకేయి దాసి. పుట్టింటి నుండి వచ్చింది. సాధారణంగా మంథర మాటకు విలువ ఇస్తుంది కైక. కాని కైకకు రాముడు అంటే చిన్నప్పటినుండి ఎంతో ప్రేమ, మక్కువ. తన కుమారుడు భరతుని తో పాటుపెంచింది. రామునికి పట్టాభిషేకము అంటే ఎంతో సంతోషించింది. ఆ మాట చెప్పిన మంథరకు బహుమానం కూడా ఇచ్చింది.

కైక దశరథుని భార్య. బాగా చదువుకున్నది. విచక్షణా జ్ఞానం కలది అనుకోవాలి. కాని చెప్పుడు మాటలకు మోసపోయింది. ఒకే విషయం పదే పదే చెప్పడం వల్ల అది నిజం అవుతుంది అంటారు పెద్దలు. రాముడు అయోధ్యలో ఉంటే భరతునికి భవిష్యత్తులేదు అనేమాటను పదే పదే వల్లించింది మంథర.  రకరకాలుగా వర్ణించి చెప్పింది. అది దాని ఆలోచన. ఒక దాసి అంతకన్నా ఉన్నతంగా ఎలా ఆలోచించగలదు! కాని ఆ మాటలను గుడ్డిగా  నమ్మేసింది కైక.

చెప్పుడు మాటలు వినరాదు అని మనకు అందరికీ తెలుసు. కాని సోదాహరణంగా నిరూపించాడు వాల్మీకి. ఎందరో ఎన్నో

చెబుతుంటారు. కాని ప్రతివాడూ తన విచక్షణా జ్ఞానం ఉ
పయోగించాలి.

ఒకాయన ఆఫీసుకు వెళ్లాడు. ఆయన భార్యకు ఆమె తల్లి హాస్పిటల్ లో చేరిందని ఫోన్ వస్తుంది. ఆమె హడావిడిగా బయటకు వస్తుంది. పక్కింటి రామారావు తన బైక్ మీద అప్పుడే బయటకు వెళుతుంటాడు. హాస్పిటల్ దాకా లిఫ్టుఅడుగుతుంది ఆమె. ఆయన సరే అంటాడు. ఆయన వెనక బైక్ మీద కూర్చుని హాస్పిటలుకు వెళుతుంది. వీళ్లిద్దరూ బైక్ మీద వెళ్లడం ఒక అనుమాన పక్షిచూస్తాడు. దానికి కాస్త మసాలా తగిలించి ఆమె భర్తకు "నీ భార్య ఎవరితోనో తిరుగుతూ ఉంది" అని నూరిపోస్తాడు. వాడు నమ్మేస్తాడు. వ్యవహారం విడాకుల దాకా వెళుతుంది. ఇది సర్వసాధారణం. అతడు కాస్త విచక్షణా జ్ఞానం ఉపయోగించి "నాతో ఇన్నాళ్లు పవిత్రంగా నమ్మకంగా కాపురం చేసిన భార్య ఈనాడు సడన్ గా ఎందుకు పరాయివాడితో తిరుగుతుంది" అని కొన్ని క్షణాలు తర్కించుకుంటే నిజానిజాలు బయటపడతాయి. వాళ్ల కాపురంలో కలతలు రావు. అలాగే "రాముడు నా కుమారుడికి ఇంత ద్రోహం చేస్తాడా. మంథర మాటలలో నిజం ఎంత" అని కైక కొంచెం ఆలోచించి ఉంటే రామాయణం మరొక విధంగా ఉండేది. కాబట్టి చెప్పుడు మాటలు వినడం, తొందరగా నిర్ణయాలు తీసుకోడం ఆత్మహత్యాసదృశం అని మనకు బోధ చేస్తుంది రామాయణం.

తరువాత ఈ సర్గలో దశరథుని పాత్ర. దశరథుడు అయోధ్యకు మహారాజు. ఎన్నో యజ్ఞములు యాగములు చేసాడు. వసిష్ఠుని పురోహితునిగా కలవాడు. జ్ఞానవృద్ధుడు వయోవృద్ధుడు. ఆయన భార్య కైక. మూడో భార్య. కైక మీద ఆయనకు అధికమైన ప్రేమ ఉందని,

ఆయనకు ముద్దులభార్యఅని నానుడి. కాని ఆ విషయం మనకు ఎక్కడా కనపడలేదు. పైగా పాయసం పంచడంలో కైకకు ఎనిమిదవ వంతు మాత్రమే ఇచ్చాడు దశరథుడు. అదీ ఒక వంతు మాత్రం ఇచ్చాడు. రెండవ ఎనిమిదవ భాగం సుమిత్రకు ఇచ్చాడు. దశరథునికి కైక మీద అత్యధిక ప్రేమ ఉంటే సగభాగం ఇచ్చి ఉండేవాడు కదా!. కాబట్టి కైక మీద దశరథునికి అధికమైన ప్రేమ ఉంది అనడానికి ఆధారాలు లేవు.

కాని రాబోవు సర్గలలో ఒక విషయం ప్రస్ఫుటంగా అర్థం అవుతుంది. కౌసల్య పేరుకు పట్టపు రాణి అయినా ఆమెను దశరథుడు నిరాదరించాడు. ఏనాడూ తక్కిన భార్యలతో సమానంగా చూడలేదు. అందుకే కౌసల్య సవతులందరిలో నిరాదరణకు గురి అయింది. రాముడు వనవాసమునకు వెళితో సవతులు తనను బతకనివ్వరు అనివాపోతుంది. దీనిని బట్టి దశరథుడు కైకను ఎక్కువగా ఆదరించాడు అని మనకు తెలుస్తూ ఉంది.

అలాంటి కైక మంథర మాటలు విని కోపగృహంలో పడుకొని ఉంది. దశరథుడు కోపగృహం ప్రవేశించాడు. కోపకారణం అడిగాడు. ఆమె బదులు చెప్పలేదు. అప్పుడు మొదలెట్టాడు. ఈ రాజ్యం నీది అన్నాడు. నేను, నా పరివారము, నీకు దాసులము అన్నాడు. చంపదగని వాడినికూడా నువ్వు కావాలంటే చంపుతాను అన్నాడు. చంపదగిన వాడిని కూడా నువ్వు ఊ అంటే వదిలేస్తాను అన్నాడు. (అంటే నీ కోసం హంతకులను వదిలేస్తాను, నిరపరాధులను ఉ రితీస్తాను అని అర్థం). నువ్వు ఏం కావాలంటే అది ఇస్తాను అంటాడు.

దశరథుడు లాంటి చక్రవర్తి తన భార్య కేవలం కోపంతో ఉంది అన్నంత మాత్రాన ఇంత దిగజారిపోవాలా! పోనీ అన్నీ అబద్ధాలు చెప్పాడు అని అనుకుంటే ఆయన సత్యసంధుడు అని పేరు. మరి వాల్మీకి ఎందుకు అలా రాసాడు? కారణం స్పష్టంగా కనపడుతూనే ఉంది. ఎంతటివారలైనా కాంత దాసులే! రాబోవు కాలంలో జరగబోయే పరిణామాన్ని త్రేతాయుగంలోనే చెప్పాడు వాల్మీకి. నేడు మనం ఎన్నో స్త్రీ సంబంధమైన స్కాండల్సు వింటున్నాము. చూస్తున్నాము. ఎంతటి గొప్పవారైనా తాను కోరుకున్న స్త్రీ ముందు దాసోహం అంటారు. సమస్తం ధారపోయడానికి సిద్ధపడతారు . వాళ్లు చదువుకున్న ఉన్నత విద్యలు, పదవులు, సంస్కారము, ఏవీ గుర్తుకురావు. అడ్డురావు. సమస్తం ఆమెతోడిదే లోకం అన్నట్టు ప్రవర్తిస్తారు. చివరకు ఊబిలో పడిపోతారు. అలాంటి ప్రమాదాల నుండి జాగ్రత్త పడమని వాల్మీకి ఈ సంఘటనల ద్వారా మనకు హెచ్చరిక చేస్తున్నాడు.

అలాగే అహల్య వృత్తాంతం కూడా. అహల్య తన భర్త గౌతముని కాకుండా పరాయి పురుషుడితో కామక్రీడలు కొనసాగించింది. ఫలితం వెంటనే అనుభవించింది. కొన్ని వందల సంవత్సరాల పాటు అచేనంగా ఒంటరిగా దుమ్ము ధూళిలో పడి ఉంది. ఈరోజుల్లో కూడా పరాయి పురుషుడి మోజులో పడిన స్త్రీలు, స్వంత భర్తను, పిల్లలను హతమార్చడం లాంటి సంఘటనలు వింటున్నాము. వెంటనే కటకటాల పాలవుతున్నారు. శిక్షలు అనుభవిస్తున్నారు.

ఈ రోజుల్లో స్త్రీలు పతివ్రతలు కానక్కరలేదు. కనీసం భర్తకు విధేయతగా ఉంటేచాలు. సంసారం సాఫీగా గడిచిపోతుంది. ఈ సందేశాన్ని మనకు అహల్య వృత్తాంతం ద్వారా అందించాడు వాల్మీకి.

రామాయణం కేవలం ఆధ్యాత్మిక కావ్యంగా కాకుండా ఒక సామాజిక గ్రంథంగా చదవగలిగితే ఇలాంటి సూక్తులు ఎన్నో మనకు మన దైనందిన జీవితంలో ఉపకరిస్తాయి అని నా భావన.)

# అయోధ్యా కాండము

## పదకొండవ సర్గ.

దశరథమహారాజు చేత అడిగించుకొని బతిమాలించుకొని తుదకు కైక లేచి కూర్చుంది. మన్మధ బాణములకు బలి అయిన, తన మీది కామానికి దాసోహం అన్న, తన భర్త దశరథమహారాజుతో ఇలా అంది.

"మహారాజా! మీరు అన్నట్టు నన్ను ఎవరూ బాధించలేదు. ఎవరూ అవమానించలేదు. నాకు మిమ్మల్ని కొన్ని వరములు అడగ వలెనని ఒక కోరిక కలిగింది. అది మీరు తీర్చాలి. మీరు తీరుస్తాను అని ప్రతిజ్ఞ చేస్తేనే నా కోరికల గురించి చెబుతాను. తీరా నేను అడిగిన తరువాత మీరు కాదు అంటే నా మనసుకు బాధకలుగుతుంది. మరలా మీరు నన్ను బతిమాలాలి కదా!" అని సన్న సన్నగా సన్నాయి నొక్కులు నొక్కుతున్నట్టు మాట్లాడింది కైక.

ఆ మాటలకు దశరథుడు నవ్వాడు. కైక తల వెంట్రుకలు తన చేతిలోకి తీసుకొని సుతారంగా నిమురుతూ ఇలా అన్నాడు.

"ఓ నా ప్రియమైన కైకా! ఈ లోకంలో ఒక్క రాముడు తప్ప నీకన్నా ప్రియమైన వాళ్లు నాకు ఇంకెవరున్నారు చెప్పు. అందుకని నా రాముని మీద ఒట్టు పెట్టుకొని చెబుతున్నాను. నువ్వు ఏకోరిక కోరినా

దానిని తప్పకుండా నెరవేరుస్తాను. సందేహపడకుండా అడుగు. ఎందుకంటే రాముడు నాకు ఆరోప్రాణము. నా ఐదు ప్రాణాలు లోపల ఉంటే రాముడు నాకు బయట ఉన్న ఆరో ప్రాణము. రాముని చూడనిది నేను ముహూర్త కాలం కూడా జీవించలేను. అటువంటి రాముని మీద ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. ఇంకా నన్ను నమ్మవా!

ఓ కైకా! రాముని రక్షించుకోడానికి నేను నా ప్రాణాలను, నా ముగ్గురు కుమారుల ప్రాణాలను కూడా బలిపెట్టడానికి సిద్ధంగా ఉన్నాను. అటువంటి రాముని మీద ఒట్టుపెట్టుకుంటున్నాను. ఏమిటి ఇంకా ఆలోచిస్తున్నావు. నీ మనసులో ఏముందో తెలుసుకోడానికి నా మనసు అల్లల్లాడిపోతూ ఉంది. నా మీద దయయుంచి నీ కోరిక వెల్లడించు.

అసలు నా మీద నీకు ఎందుకింత అపనమ్మకము. నా మీద నీకు సర్వాధికారాలు ఉన్నాయి కదా! నన్ను శాసించే అధికారం నీకు ఉంది. ఇంకా విను. నేను రాముని మీదనే కాదు. నేను ఇప్పటి దాకా యజ్ఞయాగములు చేసి ఆర్జించిన పుణ్యము మీదకూడా ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. ఇంక నైనా నీ మనసులోని కోరిక బయట పెట్టు. ఇంకా నన్ను చిత్రవధ చెయ్యకు." అని దీనంగా వేడుకున్నాడు దశరథుడు.

ఆ మాటలకు ఎంతో సంతోషించింది కైక. ఇంక తన మనోరథము ఈడేరింది అని మురిసిపోయింది. మెల్లి మెల్లిగా తన మనసులోని కోరికలు దశరథుని తో వెల్లడించసాగింది.

"ఓ దశరథ మహారాజా! మీరు ఎంతో ఒట్టు పెట్టుకొన్నారు కనుక నా కోరికలు మీరు తీరుస్తారు అని నమ్మకం కుదిరింది. అదీ కాకుండా మీరు చేసిన ప్రతిజ్ఞలను అగ్నిదేవునితో సహా దేవతలందరూ సాక్షీభూతంగా విన్నారు. వారే కాదు సూర్య చంద్రులు, ఆకాశము, గ్రహములు, రాత్రింపగళ్లు, భూమి, గంధర్వులు, రాక్షసులు, నిశా చరులు, సమస్త గృహదేవతలు, ఇంకా ఇతరములైన భూతజాతులు అన్నీ వింటున్నారు. ఓ పంచభూతములారా! సకల దేవతలారా! వినండి. నాకు, నా భర్త దశరథమహారాజుగారు, పూర్వముదేవాసుర యుద్ధములలో నాకు ఇస్తాను అని వాగ్దానము చేసిన రెండు వరములు ఇచ్చుటకు అంగీకరించారు. దానికి మీరే సాక్షులు." అని పలికి కైక దశరథుని వచన బద్ధుని చేసింది. కైక ఏమి అడిగితే దానిని ఇవ్వడం తప్ప దశరథునికి మరోగత్యంతరం లేదు అన్న పరిస్థితులు కల్పించింది. కైకమీది మోహంతో దశరథుడు ఆమె అన్న మాటలకు అన్నిటికీ మరోమాట మాట్లాడకుండా తలూపుతున్నాడు.

"ఓ దశరథమహారాజా! ఒక్కసారి మీరు నేను పాల్గొన్న దేవాసుర యుద్ధము జ్ఞప్తికి తెచ్చుకొనుడు. అప్పుడు ఏం జరిగిందో మీకు జ్ఞాపకం ఉంది కదా! ఆ యుద్ధములో మీరు ఓడిపోయే పరిస్తితి వచ్చింది. మీ రథ, గజ, తురగ, పదాతి బలములు అన్నీ నశించి పోయాయి. అప్పుడు నేను మిమ్ములను రెండు సార్లు ప్రాణాపాయము నుండి రక్షించాను. అప్పుడు మీరు నాకు రెండు వరములు ఇస్తాను అని వాగ్దానము చేసారు. మీకు గుర్తు ఉంది కదా! కాని నేను అప్పుడు ఆ వరములు కోరలేదు. నాకు ఇష్టం వచ్చినపుడు కోరుకుంటాను అని మీతో అన్నాను. మీరు సత్యవాక్పరిపాలకులు. ఆడిన మాట తప్పరు. అందుకని ఆ వరములు ఇప్పుడు కోరుకుంటున్నాను. ఆవరములు

మీరు నాకు ప్రసాదించాలి. తీరా నేను అడిగిన తరువాత మీరు ఇవ్వను అంటే నాకు ఆత్మహత్యే శరణ్యము అవుతుంది." అని నేర్పుగా దశరథుని తన మాటల వలలో ఇరికించింది.

వలలో పడ్డ లేడిపిల్లలా అయ్యాడు దశరథుడు. కైకేయి కామ పాశములలో ఇరుక్కుపోయాడు. అన్నిటికీ తలూపాడు. "నీవు ఏం కోరితే అది ఇస్తాను. సందేహించకు" అని వాగ్దానం చేసాడు దశరథుడు.

"ఓ దశరథమహారాజా! ఇప్పుడు నా మనసుకు స్వస్థత చేకూరింది. మీరు చేసిన వాగ్దానమును నెరవేరుస్తారు అనే నమ్మకం కుదిరింది. ఆ నాడు మీరు నాకు ఇచ్చిన వరములు కోరుకుంటు న్నాను. సావధాన చిత్తులై వినండి. మీరు రేపు రాముని పట్టాభిషేకమునకు అనేక సంభారములు సమకూర్చారు కదా! ఎన్నో ఏర్పాట్లు చేసారు కదా! నగరమంతా అలంకరింపచేసారు కదా! చాలాసంతోషము. కాని ఒక చిన్న మార్పు. అదే సంభారములతో, అవే ఏర్పాట్లతో, అవే అలంకరణలతో, రేపు రామునికి బదులు నా కుమారుడు భరతునికి యౌవ్వరాజ్యపట్టాభిషేకము జరిపించండి. ఇది నేను కోరుకునే, మీరు నాకు ఇవ్వడానికి అంగీకరించిన మొదటి వరము." అంది కైక.

దశరథునికి తలతిరిగినట్టయింది. "మరి రాముడు! రాముడు ఏమవుతాడు!" అని అప్రయత్నంగా అన్నాడు దశరథుడు. వెంటనే కైక "రాముడు పదునాలుగు సంవత్సరములు నార చీరలు కట్టుకొని అరణ్యవాసం చెయ్యాలి. అయోధ్యకు దూరంగా ఉండాలి. ఇదే నా

రెండవ వరము." అని పలికింది కైక.

దశరథునికి నోటి మాట రాలేదు. ఒళ్లంతా మొద్దుబారి పోయింది. శరీరం వశం తప్పుతూ ఉంది. ఏమనాలో తోచని స్థితిలో ఉన్నాడు దశరథుడు.

కైక మరలా ఇలా అంది. "నా కుమారుడైన భరతుడు శత్రుభయం లేకుండా రాజ్యం చేయాలి. (అంటే రాముడు భరతునికి శత్రుసమానుడు అని చెప్పకనే చెప్పింది కైక). అందుకే రాముడు ఈ రోజే అరణ్యములకు వెళ్లాలి. రాముడు వనవాసమునకు వెళ్లడం నేను కళ్లారా చూడాలి. ఓ దశరథ మహారాజా! ఓ సత్యవాక్పరిపాలకా! మీరు అన్న మాట నిలబెట్టుకోండి. నా కోరికలు తీర్చండి. ఎందుకంటే సత్యమునే పలకడం, అన్న మాటకు కట్టుబడి ఉండటం ఇక్ష్వాకు వంశ రాజుల ధర్మము. అన్న మాట నిలబెట్టుకుంటే నీకు పరలోకములో సుఖశాంతులు కలుగుతాయి." అని తేల్చి చెప్పింది కైక.

(ఇంక ఈ లోకంలో నీ పని అయిపోయింది అని అప్రయత్నంగా కైక నోటినుండి వెలువడింది.).

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము పదకొండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## పన్నెండవ సర్గ.

కైక మాటలు విన్న దశరథుడికి నోటమాట రాలేదు. అలాగే నిశ్చేష్టుడయ్యాడు. ఇది కలా నిజమా అనే భ్రమలో పడ్డాడు. లేక తనకేమన్నా చిత్తభ్రమ కలిగిందా లేక తనకు ఏమన్నా మానసిక వ్యాధి సోకిందా అని అనుమానపడ్డాడు. దశరథుని మనసు, కైక తన మాటలతో కొట్టిన దెబ్బను తట్టుకోలేకపోయింది. క్రమ క్రమంగా స్పృహ కోల్పోయాడు. కైక చల్లని నీరు తెప్పించి మొహాన చిలకరించింది.

కొంచెం తేరుకున్నాడు దశరథుడు. కళ్లుతెరిచాడు. కైకను చూచాడు. "ఛీ ఛీ పాపాత్మురాలా నీవా" అంటూ మరలా స్పృహ తప్పాడు. చాలా సేపటివరకూ అలాగే ఉన్నాడు. కైక తగు ఉ పచారములు చేసి స్పృహ తెప్పించింది. మెల్లిగా లేచి కూర్చున్నాడు. జరిగిందంతా కొంచెం కొంచెం గుర్తుకు వస్తూ ఉంది. కైక వరాలు కోరడం వరకూ గుర్తుకు వచ్చింది. కోపంతో ఊగిపోయాడు. కైక వంక చూచి ఇలా అన్నాడు.

"ఓసి దుర్మార్గురాలా! నీవేనా ఈ మాటలు అన్నది. నా రాముడు కానీ, నేను కానీ, నీకు ఏమి అపకారము చేసాము. మాకు ఎందుకు ఇంతటి దారుణమైన శిక్ష విధిస్తున్నావు. తాను పుట్టినప్పటినుండి రాముడు నిన్ను తన కన్నతల్లి కన్నా మిన్నగా భావించాడు కదా. అలాంటి రామునికే నీవు ద్రోహం తలపెడతావా! ఇది నీకు న్యాయమా! నీవు

రాచ పుట్టుక పుట్టావని, ఉత్తమ క్షత్రియుని కుమార్తెవని నిన్ను వివాహం చేసుకొని మా కుటుంబంలోకి తీసుకొని వచ్చాను. కాని  ఏం ఇంటి గడప తొక్కావో ఆ ఇంటి నాశనమునే కోరుతావు అని అనుకోలేదు. ఒక భయంకర విషనాగును తెచ్చి ఇంట్లో పెట్టుకున్నట్టు అయింది.

అది సరే. రాముని వనములకు పంపమన్నావు కదా! లోకము అంతా రాముని  సకల సద్గుణ సంపన్నుడు అని కీర్తిస్తుంటే,  అతనిలో ఏ దోషము చూపి నేను రాముని వనములకు పంపాలి.  ఓ కైకా! నీకు తెలుసో లేదో! నేను నా భార్యలైన కౌసల్యను, సుమిత్రను, నిన్ను సైతం వదిలిపెడతానేమో గాని రాముని మాత్రం వదలను తెలుసా! రాముని చూస్తే నాకు పోయిన ప్రాణాలు లేచి వస్తాయి. రాముడు కనపడక పోతే నాకు పై ప్రాణాలు పైకేపోతాయి. ఎందుకంటే సూర్యుడు లేకుండా లోకాలు ఉంటాయేమో కాని, నీరు లేకుండా పంటలు పండుతా యోమే కానీ, రాముడు లేకుండా నేను క్షణకాలం కూడా బతకలేను. ఇది యదార్థము.

కైకా! కోపంలో ఏదేదో అన్నాను. నన్ను క్షమించు. నీ పాదాలంటి వేడుకుంటున్నాను. నీ మంకు పట్టు వదిలిపెట్టు. ఇంకేమన్నా వరాలు కావాలో కోరుకో ఇస్తాను. ” అని కైక మొహంలోకి చూచాడు.

కైక మాట్లాడలేదు. మొహం అటు తిప్పుకుంది. మరలా దశరథుని కోపం తారస్థాయికి చేరింది.

"ఓసి దుర్మార్గురాలా! అసలు ఇంతటి పరమదారుణమైన కోరిక కోరాలనే ఆలోచన నీకు ఎలా వచ్చిందే!" అని అరిచాడు.

అంతలోనే తేరుకొని "అలా కాదులే! ఆ! నాకు తెలిసిందిలే! నాకు భరతుని మీద ఎంత ప్రేమ ఉందో పరీక్ష చేద్దామని అలా అన్నావు కదూ! అంతే అయి ఉంటుంది. లేకపోతే అలాంటి వరాలు ఎందుకు కోరతావు! ఎందుకంటే నీవు ఇదివరకు మాట్లాడేటప్పుడు 'రాముడే నా పెద్ద కుమారుడు. భరతుడు నా రెండవ కుమారుడు' అని ఎన్నిసార్లు నువ్వు అనలేదు. ఆ మాటలు మేమందరమూ విని ఎంతో సంతోషించాము కదా! ఇప్పుడు కూడా అలాగే నన్ను పరీక్షించడానికి అలా అంటున్నావు అని నాకు తెలుసు. అలాగే అగుగాక! లేకపోతే నీకు రాముని మీద ద్వేషభావం ఎందుకు ఉంటుంది. ఏమో!

అది సరే! రాముని పట్టాభిషేక వార్త విని రాముడు అంటే పడని వాళ్లు నీకు ఏమన్నా దుర్బోధలు చేసారా! ఆ మాటలు విని నువ్వు కోపగృహంలో పడుకున్నావా! కైకా! నీవు వివేకము కలదానవు. నీతి మంతురాలివి. ఎవరో చెప్పిన మాటలు వినవచ్చునా! కైకా! నీవు ఇదివరకు ఇలాంటి మాటలు మాట్లాడావా! అందుకే నీవు ఇలాంటి కోరికలు కోరావు అంటే నమ్మలేకపోతున్నాను. నా మీద దయయుంచి ఇదంతా నిజం కాదని చెప్పు. నా మనసు కుదుటపడుతుంది.

ఓ కైకా! నీవు చిన్నప్పటినుండి రాముని, భరతుని నీ ఒడిలో కూర్చోపెట్టుకొని ఎన్నో కథలు చెప్పావు కదా! నీ మెత్తటి ఒడిలో కూర్చున్న రాముడు ముళ్లపొదలతో నిండిన అడవులలో ఎలా ఉండగలడు అని అనుకుంటున్నావు. రాముడు మాత్రం తక్కువ వాడా! తన కన్నతల్లి

కౌసల్య కన్నా నీకు ఎక్కువ సేవలు  చేసాడు కదా! అలాంటి రాముని దూరంగా ఉంచాలని ఎందుకు అనుకుంటున్నావు? నీకు ఎంతో మంది దాసదాసీ జనము ఉన్నా నీకు భక్తితో ఎన్నో సేవలు చేసాడు కదా రాముడు. అసలు రాముడు తప్ప నీకు అత్యధికంగా  సేవలు చేసిన వాళ్లు వేరే ఎవరు ఉన్నారో చెప్పు.

పోనీ రాముడు ఏమన్నా అకృత్యాలు చేసాడా అంటే ...  అదీ లేదు. రాముడు అయోధ్య ప్రజలందరికీ ప్రియమైన వాడు. తాను చేసిన మంచి కార్యములకు అందరి చేతా మన్ననలు పొందిన వాడు. అతని మీద కొంచెం కూడా అపనింద పడే అవకాశము లేదు. మరి ఎందుకు రాముని అరణ్యవాసము చెయ్యమంటున్నావు. ఏ కారణం లేకుండా అలా ఎందుకు అడిగావు.

ఓ కైకా! రాముడు ఎటువంటి వాడో నీకు తెలుసు. అయినా మరొకసారి చెబుతాను విను. రాముడు తన సత్యసంధతతో లోకాలను, తన దాన ధర్మములతో దీనజనమును, తన శుశ్రూషలతో గురువు లను, తన వీరత్వముతో శత్రువులను జయించాడు. సత్యము, దానము, ఏకాగ్రత, త్యాగము, మైత్రి, శౌచము, మంచితనము, విద్య, గురువులకు శుశ్రూష, ఇవన్నీ రామునికి సహజంగా పుట్టుకతో వచ్చిన  గుణాలు. కపటము అనేమాటకు రామునికి అర్థం తెలియదు. అటువంటి రామునికి అపకారము చెయ్యవలెనని దుర్బుద్ధి నీకు ఎలా పుట్టింది.

కైకా! రాముడు ఎవ్వరితోనూ పరుషంగా మాట్లాడటం నేను చూడలేదు. అందరితో ఎంతో ప్రియంగా మాట్లాడేవాడు. అలాంటి రామునితో నీ కోసం పరుషంగా ఎలా మాట్లాడమంటావు. అడవులకు

పో అని ఎలా చెప్పమంటావు?

ఓ కైకా! మరలా వేడుకుంటున్నాను. నాకా వయసు అయిపోయింది. వృద్ధుడను అయ్యాను. ఇప్పుడు నాకు రాముడే దిక్కు. ఈ వయసులో నాకు రాముని దూరం చెయ్యకు. నువ్వు కావాలంటే నా రాజ్యము యావత్తు నీకు ధారపోస్తాను. రాముని మాత్రం నాకు విడిచిపెట్టు.

ఓ కైకా! నీ పాదాలు పట్టుకొని వేడుకుంటున్నాను. ఈ వృద్ధుని మీద కోపం మాను. రాముని విడిచిపెట్టు నా ప్రాణాలు కాపాడు. ఇదే నా కోరిక. నా ఆఖరి కోరిక మన్నించు." అని కైక పాదాల మీద పడిపోయాడు దశరథుడు.

దశరథుని దీన మైన మాటలు కైకలో ఎలాంటి మార్పును తీసుకురాలేకపోయాయి. స్వార్థం ఆమె హృదయంలో కరుడు గట్టిపోయింది. అందుకే దశరథుడు ఎంత దీనంగా వేడుకున్నాడో అంత కఠినంగా ములుకుల వంటి మాటలు మాట్లాడింది.

"ఓ దశరథమహారాజా! నీవు వీరుడవు. యుద్ధరంగంలో నిన్ను రెండు సార్లు కాపాడి నీ ప్రాణాలు రక్షించి నందుకు నాకు రెండు వరాలు ఇస్తాను అన్నావు. ఆ వరాలు ఇప్పుడు కోరాను. ఏవోవో మాటలు చెప్పి నన్ను మభ్యపెట్టాలని చూస్తున్నావు. ఇది నీకు ధర్మమా! ఇది ధర్మాత్ములు చేసే పనేనా! ఆడిన మాట తప్పడానికి ప్రయత్నించే నీవు ధర్మాత్ముడివా! ఈ విషయం నీవు భక్తితో పూజించే ఋషులకు, మునులకు చెప్పు.

'అయ్యో! నా భార్య కైక నా ప్రాణాలను రక్షించింది. కైక అనుగ్రహము వలననే నేను బతుకుతున్నాను. అలాంటి కైకకు నేను ఇచ్చిన మాటను తప్పాను.' అని చెప్పు. వాళ్లు నిన్ను ధర్మాత్ముడు అంటారా! లేక మాట తప్పిన వాడంటారా!

ఓ దశరథ మహారాజా! ఆడిన మాట తప్పి నువ్వు నీ వంశమునకు, నీ పూర్వీకులకు కళంకము తీసుకొని వస్తున్నావు. ఆడిన మాట కోసం శిబి చక్రవర్తి తన శరీరమునే కోసి ఇచ్చాడు. అలర్కుడు తన నేత్రములను దానం చేసాడు. వారంతా నీ వంశములోని వారే. సముద్రుడు దేవతలకు ఇచ్చినమాట ప్రకారము చెలియలి కట్ట దాటడం లేదు. వారంతా ఆడిన మాటకు కట్టుబడి ఉన్నారు కదా! నీకేమయింది. ఇచ్చిన వరాలను వెనక్కు తీసుకుంటున్నావు. నీ దుర్బుద్ధి నాకు తెలుసు. రాముని యువరాజుగా చేసి కౌసల్యను పట్టపురాణిగా చేసి. నన్ను నా కుమారుని అనాధలుగా చెయ్యాలని చూస్తున్నావు.

ఇంతెందుకు. ఓ దశరధమహారాజా! నేను అడిగింది ధర్మమ అధర్మమో, సత్యమో అసత్యమో, నాకు అనవసరము. మీరు నాకు రెండు వరాలు ఇస్తాను అన్నారు. ఆ వరాలు నాకు ఇవ్వాలి అంతే. దీనికి తిరుగు లేదు. నా మాటలు లక్ష్యపెట్టకుండా రామునికి పట్టాభిషేకము చేస్తే నేను నీ ఎదుటనే విషం తాగి చస్తాను. తన కుమారుడు యువరాజు అని విర్రవీగుతున్న నా సవతి కౌసల్యకు నమస్కారం చేసే కంటే చావడం మేలు.

ఓ దశరథ మహారాజా! నా మీద నా కొడుకు భరతుని మీద ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. రాముడు అరణ్యములకు వెళ్లాలి.

నాకుమారుడు యువరాజు కావాలి. అంతే.  ఇంక దేనికీ నేను ఒప్పుకోను. ఆ రెండు తప్ప ఈ లోకంలో ఏవీ నాకు అక్కరలేదు. తరువాత తమరి ఇష్టం." అని పలికి కైక మౌనంగా ఉండిపోయింది.

కైకేయి మనోనిశ్చయము విని దశరథుడు నోటమాట రాకుండా మౌనంగా ఉండిపోయాడు. భరతుని పట్టాభిషేకము కన్నా రామ వనవాసము దశరథుని మనసు బాగా కలచి వేసింది. అటువంటి దుర్గార్గపు వరములు కోరిన కైక వంక చూడటానికి కూడా ఇష్టపడటం లేదు. దశరథునికి మతిభ్రమించి నట్టు అయింది. పిచ్చివాడి మాదిరి దిక్కులు చూస్తున్నాడు. మూర్ఛరోగి మాదిరి వణుకుతున్నాడు. ఉన్మాదిలాగా ప్రవర్తిస్తున్నాడు. ఏమి చేస్తున్నాడో తెలియని పరిస్థితి. అమాయకంగా కైక వంక చూచాడు.

"ఓ కైకా! నీకు ఇటువంటి దుర్మార్గపు ఆలోచన ఎవరు చెప్పారు? ఒకవేళ ఎవరైనా నీకు దుర్బోధ చేసారే అనుకో!  నువ్వు సిగ్గు లేకుండా నన్ను అడుగుతావా! నీకే మన్నా దయ్యం పట్టిందా. లేక పిశాచము ఆవహించిందా. ఇంత విపరీతంగా ప్రవర్తిస్తున్నావు. నీకు చిన్నప్పటినుండీ ఇలాంటి విపరీతమైన ఆలోచనలు ఉన్నట్టు మీ వాళ్లు నాకు చెప్పనేలేదు. అయోధ్య వచ్చిన తరువాత కూడా నువ్వు ఇలా విపరీతంగా ప్రవర్తించలేదు. ఈరోజు నీకేం పుట్టింది. ఇలా మాట్లాడుతున్నావు.

ఇంతకూ నీకు ఎవరి వల్ల భయము. రాముని వల్లనా! లేకపోతే భరతునికి పట్టాభిషేకంతో ఊరుకోక రాముని వనవాసము ఎందుకు కోరుతున్నావు. రాముడంటే నీకు ఎందుకు అంత భయం?

కైకా! మరలా చెబుతున్నాను. నాకు, నా కుమారుడు రామునికి, నీ కుమారుడు భరతునికి, అయోధ్యకు క్షేమం కోరేదానివయితే నీవు కోరిన వరములు ఉపసంహరించుకో. బాగుపడతావు."

అప్పటిదాకా సౌమ్యంగా ఉన్న దశరథుడుఒక్కసారిగా రెచ్చిపోయాడు. తిట్టడం మొదలెట్టాడు.

"ఓసి పాపాత్మురాలా! క్రూరురాలా! క్షుద్రురాలా! దుర్మార్గురాలా! నాలో నా రామునిలో నీకు ఏం దోషాలు కనపడ్డాయే! మేము నీకు ఏం ద్రోహం చేసామే! నీకు తెలుసో లేదో. భరతుని హృదయం నాకు బాగా తెలుసు. రాముని కాదని భరతుడు రాజ్యాభిషేకమునకు ఎంతమాత్రమూ అంగీకరించడు. నీ కొడుకు సంగతి నీకు బాగా తెలియదు. రాముని కన్నా భరతునికి ధర్మములు ఎక్కువ తెలుసు. ధర్మాచరణములో రాముని కన్నా భరతుడే మిన్న."

దశరథుడు వెంటనే దీనంగా మారిపోయాడు.

"కైకా! కైకా! నేను రాముని వద్దకు పోయి 'రామా! నీవు అరణ్యములకు పోవాలి' అని ఎలా చెప్పగలను. అలా చెప్పిన తరువాత రాముని మొహం ఎలా చూడగలను. అది అటుండనీ. నేను రామ పట్టాభిషేక నిర్ణయాన్ని అందరితో చర్చించి వారి ఆమోదము పొందిన తరువాతనే తీసుకున్నాను. సామంత రాజులందరినీ ఆహ్వానించాను. ఇప్పుడు నేను నా నిర్ణయాన్ని మార్చుకుంటే వాళ్లందరూ ఏమంటారు? ఈ ప్రకారంగా క్షణక్షణమూ నిర్ణయాలు మార్చుకొనేవాడు ఇన్నాళ్లు అయోధ్యను ఎలా పరిపాలించాడు అని హేళన చేయరా! అది నీకు

ఇష్టమా! ఇప్పుడు రాముడు వనవాసమునకు వెళితే, రేపు పురప్రముఖులు అంతా వచ్చి "మా రాముడు ఏడీ!" అని అడిగితే నేను వారికి ఏమని సమాధానము చెప్పగలను.

"అయ్యా! నా భార్య కైక మాట విని రాముని అరణ్యములకు పంపాను" అని చెబితే ఎవరూ నా మాట వినరు. దశరథుడు అబద్ధం చెబుతున్నాడు అని అనుకుంటారు. అది నీకు సమ్మతమా!

కౌసల్య వచ్చి నా కుమారుడు రాముని అరణ్యములకు ఎందుకు పంపావు? కారణం ఏమిటి? అన్ని నన్ను నిలదీస్తే ఆమెకు నేను ఏమని సమాధానం చెప్పగలను. నా మూడోభార్య మాటవిని రాముని అరణ్యములకు పంపాను అని చెబితే నాగురించి కౌసల్య ఎంత నీచంగా అనుకుంటుంది. అది నీకు సమ్మతమా!

కైకా! నీకుమారునికి పట్టాభిషేకము అంటే ఏదో నీ కుమారునికి మేలు చేస్తున్నావు అనుకోవచ్చు. కాని రాముని అరణ్యములకు పంపే హక్కు నీకూ నాకూ ఎక్కడిది! ఆలోచించు. నా కుమారుని అడవులకు పంపే అధికారము మీకు ఎక్కడిది అని కౌసల్య నన్ను నిలదీస్తే, నేను ఏమని సమాధానము చెప్పను?

కైకా! నీకు ప్రీతి కలిగించడం కోసరం నేను కౌసల్యను ఎంతగా నిరాదరించానో నీకు తెలుసు కదా! ఆమె నాకు సేవలు చెయ్యడానికి వస్తే నీ మీద ఉన్న వల్లమాలిన ప్రేమతో ఆమెను నిరాకరించాను. ఎవరి కోసం? నీ కోసమే కదా! కనీసం ఆ కృతజ్ఞత కూడా నీకు లేదా! అవునులే! చేసిన మేలు మర్చిపోయే వాళ్లకు ఎంత

చేసి మాత్రం ఏమి లాభం! రోగంతో బాధపడేవాడికి పంచభక్ష్య పరమాన్నాలు పెట్టినట్టు అయింది.

కౌసల్య సంగతి అటుంచు. నీ మాటలు విని నేను రాముని అడవులకు పంపితే, సుమిత్ర నా గురించి ఏమనుకుంటుంది! ఇంక నన్ను నమ్ముతుందా! తనకుమారుడు లక్ష్మణునికి కూడా ఇదే గతి పడుతుంది అని అనుకోదూ!

వీళ్లు సరే కన్న తల్లులు. మరి రాముని నమ్ముకొని పుట్టింటి నుండి అయోధ్యకు వచ్చిన రాముని అర్థాంగి సీత. ఆమె గతేం కావాలి. భర్త అరణ్యవాసము, మామగారి దుర్మరణ వార్తలు సీత వినడం అవసరమా! ఎందుకంటే రాముడు అడవులకు పోతుంటే ఆ సన్నివేశము చూసి సీత రోదిస్తుంటే నా గుండెలు బ్రద్దలవుతాయి. నేను మరణించడం తథ్యం. అప్పుడు నీవు, హాయిగా విధవరాలుగా, కొడుకుతో సహా రాజ్యము ఏలుకుంటావు. ఇదేగా నీవు కోరుకొనేది. అదే నీ కోరికల ఫలితం.

కైకా! నీ అందచందాలు చూసి నీవు మంచిదానవు అనుకున్నాను కానీ నీ కడుపులో ఇంత విషం ఉందనుకోలేదు. కడుపులో ఇంత విషం దాచుకొని నాతో ఇన్నాళ్లు ఎన్నో ప్రీతికరమైన మాటలు మాట్లాడావన్నమాట! ఎంత మోసం? అవునులే. నిన్ను అనుకోని ఏం లాభం. నా ఖర్మ ఇలా కాలింది.

'రాజ్యము ఇస్తానని ఆశపెట్టి తుదకు కొడుకును అడవులకు పంపిన దుర్మార్గుడైన తండ్రి ఈ దశరథుడు' అని లోకులందరూ

నన్ను ఆడిపోసుకుంటుంటే, వారి మాటలు పడాల్సిన దౌర్భాగ్యము నాకు పట్టింది. నీమాటలు విన్నందుకు కదా నాకు ఇన్ని కష్టాలు దాపురించాయి. ఏ జన్మలో ఏం పాపం చేసానో ఈ జన్మలో అనుభవిస్తున్నాను. లేకపోతే ఎక్కడో కేకయ దేశంలో ఉన్న నిన్ను పెళ్లి చేసుకొని నా మెడకు నేను ఉరితాడు బిగించుకున్నాను. నువ్వే నా మృత్యు దేవతవు అని తెలుసుకోలేకపోయాను. ఇన్నాళ్లు భయంకరమైన విషనాగును పక్కలో పెట్టుకున్నాను.

'కన్నకొడుకును అడవులకు పంపిన పాపాత్ముడు వీడూ ఒక తండ్రేనా! ఒక ఆడదాని కోరికలు తీర్చడం కోసం కన్నకొడుకును అరణ్యవాసమునకు పంపిన మూర్ఖుడు' అని అయోధ్యావాసులు అందరూ నన్ను దూషిస్తారు.

పాపం రాముడు. వాడికి చిన్నప్పటి నుండీ అన్నీ కష్టాలే. చిన్నపుడే ఉపనయనం చేసి గురుకులానికి పంపాను. గురువుల వద్ద చదువు, బ్రహ్మచర్యము, కఠోర నియమాలు, వీటితోనే గడిచిపోయింది. ఏదో రాజ్యాభిషిక్తుడై సుఖపడతాడు అనుకుంటే మరలా అరణ్యవాసం సంప్రాప్తమయింది. అడవులలో అన్నీ కష్టాలే. రాముని జీవితంలో సుఖపడే రాత లేదేమో!

పోనీ రాముడైనా "నేను అరణ్యాలకు పోను" అంటే అదొకదారి. కాని నేను రాముడిని పిలిచి "రామా! నీవు పధ్నాలుగేళ్లు అరణ్యములకు వెళ్లాలి అంటే చాలు" మరుక్షణం వెళ్లిపోతాడు. నా మాటంటే రామునికి వేదవాక్కు.

పితృవాక్య పరిపాలనను పక్కన పెట్టి “నేనెందుకు అరణ్యాలు పోవాలి. నేను వెళ్లను” అని రాముడు అంటే ఎంత బాగుంటుంది. కాని అనడు. ఎందుకంటే రామునికి కపటం తెలియదు. నిర్మలహృదయుడు. నా మాట ధిక్కరించడం, అతిక్రమించడం నాకు ఎంతో ఇష్టం అని రామునికి ఎలా తెలిసేది! నేనా చెప్ప లేను. రామునికి ఎవరు చెబుతారు!

రాముడు అరణ్యములకు పోయిన తరువాత మరణించే బదులు ఇప్పుడే నాకు మరణం సంభవిస్తే అని సమస్యలు తీరిపోతాయి. జీవితంలో ఇంకా ఇటువంటి దుర్మార్గాలు చెయ్యకుండా శాశ్వత విముక్తి లభిస్తుంది. నేను కాదు, కొడుకు అరణ్యాలకు పోయి, భర్త మరణిస్తే కౌసల్య ఎలా జీవించి ఉంటుంది. తాను కూడా నాతోపాటు స్వర్గం చేరుకుంటుంది.

ఓ కైకా! మేమందరమూ పోయిన తరువాత హాయిగా సుఖంగా నువ్వు నీ కొడుకూ రాజ్యం ఏలుకోండి. ఇప్పటిదాకా ఇక్ష్వాకు వంశము మచ్చలేకుండా నడిచింది. ఈనాటికి నీ వలన మా వంశము మీద మాయని మచ్చ పడింది. ఇదిగో కైకా! ఇప్పుడే చెబుతున్నాను. రాముని వనవాసము, నా మరణము, ఒకేసారి సంభవిస్తాయి. భరతుని నాకు పితృకార్యాలు చెయ్యవద్దని చెప్పు. రాముని కాదని రాజ్యమేలే వాడు నా కొడుకు కాదు.

ఓసి దుర్మార్గురాలా! ఇన్ని మాటలు అంటున్నా నీ మనసు కరగలేదా! నీది మనసా లేక బండరాయా! నా కొడుకు అరణ్యములకు పోయి నేను మరణిస్తే విధవరాలిగా సుఖాలు అనుభవిద్దాము

అనుకుంటున్నావా! నీ వలన మా వంశం అంతా సర్వ నాశనము అయింది కదే దుర్మార్గురాలా!

ఇంతకాలమూ ఒక రాజకుమారుడిగా, రథములమీద, హయముల మీదా తిరిగిన రాముడు ఇప్పుడు కారడవులలో, కటిక రాళ్ల మీద ఒట్టి కాళ్లతో తిరగాలా! ఇన్నాళ్లు రాచభవనంలో షడ్రసోపేతమైన విందుభోజనము చేసిన వాడు అడవులలో కంద మూలములు తినాలా! అనుక్షణమూ పీతాంబరములు, పట్టువస్త్ర ములు తప్ప వేరు వస్త్రములు ధరించని రాముడు అడవులలో నారబట్టలు ఎలా ధరించగలడు. రాముడు అరణ్యములకు వెళ్లాలి అన్న దురాలోచన నీ మస్తిష్కములో ఎవరు జొప్పించారు కైకా!

నీ ప్రవర్తన చూస్తుంటే మీ ఆడవాళ్లందరూ పైకి ప్రేమ నటిస్తూ లోలోపల గొంతులు కోస్తారని తెలుస్తూ ఉంది. కాని అందరు స్త్రీలు నీ మాదిరి ఉండరులే. మహాపతివ్రతలు కూడా ఉంటారు. ఓ కైకా! ఓ స్వార్థపరురాలా! ఓ దుర్మార్గురాలా! ఓ క్రూరురాలా! ఈరోజు కేవలం నన్ను అష్టకష్టాల పాలు చెయ్యాలని కంకణం కట్టుకున్నావా. ఇలా మాట్లాడు తున్నావు. రాముడు అడవులలో కష్టాలు పడుతున్నాడు అని తెలిసి ఈ జగత్తు అంతా నిన్ను దూషించక మానదు. పురుషులంతా నీ లాంటి భార్యలను వదిలివేస్తారు.

ఓ కైకా! నామాట వినవే. ఒక్కసారి ఆ కల్యాణ రాముని చూడవే! రాముడిని చూస్తుంటే నయనానందం కలగడం లేదా నీకు. కైకా! ఈ ప్రపంచంలో సూర్యుడు ఉదయించకపోయినా బతక వచ్చు. ఇంద్రుడు వానలు కురిపించకపోయినా బతక వచ్చు కానీ రాముడు

లేనిది ఎవరూ బతకలేరు. అలాంటిది నేను ఎలా జీవించి ఉండగలను. నీ వరాలు అనే పాము కాటుతో నాకు మరణం తథ్యం. ఇన్నాళ్లు పాములాంటి నిన్ను పక్కనపెట్టుకొని ఈ నాడు నీ చేత కాటు వేయించుకున్నాను.

ఓ కైకా! మూర్ఖురాలా! నా రాముని అరణ్యములకు పంపి, నన్ను చంపి, నువ్వు నీ కొడుకు నా శత్రువులకు ఆనందం కలగించ దలచుకున్నారా! ఇలాంటి మాటలు మాట్లాడినందుకూ ఇటువంటి కోరికలు కోరినందుకూ నీ తల ఎందుకు వెయ్యివక్కలు కాలేదా అని అనుమానంగా ఉంది. ఎందుకంటే ఎవరితోనూ పరుషంగా మాట్లాడటం తెలియని రామునికి అపకారం చెయ్యడం, అడవులకు పంపాలి అని కోరడం లాంటి మహాపాపం చేసిన తరువాత నువ్వు ఇంకా బతికిఉండటమా!

ఓ కైకా! నా నిర్ణయం విను. నువ్వు ఎంత ఏడ్చినా మొత్తుకున్నా ఆఖరుకు చచ్చినా నువ్వు కోరిన కోరికలు తీర్చను. నీ మాట నెరవేర్చను. నాకు అసత్యదోషం అంటినా సరే. లెక్కచేయను. ఎందుకంటే మంచి వాళ్లకు ఇచ్చిన మాట నిలబెట్టుకోడం ధర్మం కానీ, నీ లాంటి దుర్మార్గులకు, అబద్ధాలు ఆడేవాళ్లకు, దుష్టురాలకు, కులనాశకులకు, నా మనసుకు కష్టము కలిగించిన దానికి, ఆఖరుకు నా హృదయంలో చిచ్చుపెట్టిన పాషండురాలికి ఇస్తానన్న వరాలు ఇవ్వక పోవడమే ధర్మం.

ఓ కైకా! మరలా మరలా చెబుతున్నాను. రాముని విడిచి నేను ఉండలేను. రాముడు లేనిదే బతుకలేను. ఇంక నాకు సుఖసంతోషాలు

ఎక్కడ ఉంటాయి. కాబట్టి నన్ను కరుణించు. నీ పాదాలు పట్టుకుంటాను. నీ వరాలు ఉపసంహరించుకో. నన్ను, లోకాన్ని రక్షించు." అని కైక పాదాలమీద పడబోయాడు  దశరథుడు.

అప్పటి దాకా మౌనంగా అన్నీ వింటూ ఉంది కైక. సహజంగా ఉత్తమురాలైన కైక మనసు ద్రవించి పోయింది.  దీనంగా రోదిస్తున్న భర్త ఎక్కడ తన కాళ్లు పట్టుకుంటాడో, తనపాతివ్రత్యానికి ఎక్కడ భంగం కలుగుతుందో  అని దూరంగా జరిగింది.  కైక కాళ్లు పట్టుకోకుండానే దశరథుడు కిందపడిపోయాడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము పన్నెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## పదమూడవ సర్గ.

దశరథుడు ఎన్నడూ అంతటి దీనస్థితికి లోను కాలేదు. ఒకరిని శాసించడమే కానీ ఒకరి ముందు దేహీ అని నిలబడలేదు. ఈనాడు రాముని కోసరం కైక ముందు చేతులు జోడించి మోకరిల్లాడు. ప్రాధేయపడ్డాడు. భంగపడ్డాడు. కానీ కైక మనసు కరిగినట్టు లేదు. తాను కోరిన వరాలను ఉపసంహరించుకోలేదు. పైగా పుండు మీద కారం చల్లినట్టు మాట్లాడింది.

"ఓ దశరథమహారాజా! నీవేదో సత్యవాక్పరిపాలకుడవు అనీ, ఆడినమాట తప్పవనీ, అడిగినవిఅన్నీ ఇస్తావనీ, లోకమంతా గొప్పగా చెప్పుకుంటారుకదా! ఇదేనా తమరి సత్యవాక్పరిపాలన! ఇదేనా తమరిసత్యసంధత! నీవు ఆడిన మాట తప్పని వాడివే అయితే నేను కోరిన వరములు  ఎందుకు ఇవ్వవు? ఇన్ని కుంటి సాకులు ఎందుకు చెబుతావు. కల్లబొల్లి ఏడుపులు ఎందుకు ఏడుస్తావు? ఏది ఏమైనా, మిన్ను విరిగి మీద పడ్డా, రాముడు వనవాసానికి వెళ్లాలి. భరతుడు పట్టాభిషిక్తుడు కావాలి. ఇది తప్పదు." అని ఖరాఖండిగా చెప్పింది కైక.

తాను ఇంత బతిమాలినా కైక మనసు కరగనందుకు దశరథునికి కోపమూ దు:ఖము ముంచుకొచ్చాయి. తట్టుకోలేక కిందపడిపోయాడు.

తల పైకెత్తి కైకను చూస్తూ----

" ఓసి దుర్మార్గురాలా! నువ్వు నాకు భార్యవా! శత్రువువా! నా చావు కోరుకుంటావా! రాముడు అరణ్యాలకు వెళ్లిన తరువాత నేనుబతికి ఉండటం కలలోని మాట! నా చావు కోరే నీవు, నేను చచ్చిన తరువాత సుఖపడాలని కోరుకొనే నీవు, నాకు భార్యవు ఎలా అవుతావు? నేను చచ్చి స్వర్గానికి పోతే అక్కడ దేవతలు 'ఓ దశరథమహారాజా! భూలోకములో రాముడు క్షేమముగా ఉన్నాడా' అని అడిగితే వారికి ఏమని బదులు చెప్పాలి. ఒక ఆడుదాని మాటకు కట్టుబడి నా కన్నకొడుకును అరణ్యాలకు పంపానని చెప్పనా! నా వంటి వాడు అలా చేసాడు అంటే ఎవరన్నా నమ్ముతారా! ఎంతకాలముగానో సంతానము లేకుండా అలమటించిన నేను, ఈ నాడు నాకు పుత్రులు కలిగితే. వారిని అడవుల పాలు ఎలా చెయ్యను.

ఓ కైకా! నన్ను చంపెయ్యి. రామునికి దు:ఖం కలిగించే బదులు నీ చేతిలో చావడమే మేలు. చంపు నన్ను చంపు" అని ఆవేశంతో అంటూ కూలబడిపోయాడు దశరథుడు.

కైక ఏమీ బదులు చెప్పలేదు.మౌనంగా ఉండిపోయింది. దశరథుడు అలా పడి ఉండగానే రాత్రి అయింది. చంద్రుడు ఉదయించాడు. కైకను బతిమాలి లాభం లేదనుకొని ప్రకృతిని ప్రార్థిస్తున్నాడు దశరథుడు.

" ఓ చంద్రా! ఈ రాత్రి కాళరాత్రి కానీకు. రేపు తెల్లవారనీయకు. తెల్లవారితే రాముడు అడవులకు పోతాడు. ఈ రాత్రి ఇలాగే ఉంటే బాగుంటుంది. ఎందుకంటే సూర్యుని వెలుగులో ఆ నీచురాలు కైక ముఖం చూడటం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు." అని మనసులోనే అనుకున్నాడు.

కాని దశరథునికి ఆశ చావలేదు. "ఏమో ఇంకోసారి బతిమాలితే కైక మనసు మార్చుకుంటుందేమో! మరొక సారి అడిగి చూద్దాం." అని అనుకున్నాడు దశరథుడు. మరలా కైకను చూచి ఇలా అన్నాడు.

" ఓ నా ముద్దుల భార్య కైకా! నువ్వు చాలా మంచిదానివి కదూ! అది తెలియక ఏదేదో అన్నానులే! పట్టించుకోకు. అయినా నా లాంటి వృద్ధునితో పరాచికాలేమిటి చెప్పు. అయినా అయోధ్యకు రాజును కదా! నన్ను ఇలా ఇబ్బంది పెట్టవచ్చా! నీలాంటి మంచి వాళ్లు ఇలా చెయ్యవచ్చా! నా మీద కాస్త కరుణ చూపు. నీ దయ నామీద ప్రసరింపచెయ్యి. అయినా నేను రామునికి పట్టాభిషేకం చెయ్యడం ఏమిటి? ఈ రాజ్యం నీది. నువ్వే రామునికి ఈ రాజ్యాన్ని ఇవ్వు. నీవే రాముని పట్టాభిషిక్తుని చెయ్యి. ఆ కీర్తి ప్రతిష్టలు నువ్వే పొందు. నేను కాదన్నానా! నువ్వు ఆ పని చేసావనుకో నేను, అయోధ్యప్రజలు, సమస్తలోకాలు, గురువులు అంతరూ నిన్ను మెచ్చుకుంటారు. నీ కుమారుడు భరతుడు కూడా రామ పట్టాభిషేకము చేసినందుకు ఎంతగానో శ్లాఘిస్తాడు. ఇంతమంది మెప్పు పొందడం సామాన్యమా చెప్పు. కాబట్టి రామ పట్టాభిషేకము నీ చేతులమీదుగా జరిపించు." అని దీనంగా ప్రార్థించాడు.

కాని కైక మనసు ఇసుమంత కూడా మారలేదు. ఏమీ మాట్లాడకుండా మిన్నకుంది.

దశరథునికి ఆఖరి ఆశకూడా వమ్ము అయి పోయింది. మనసు ఆ దు:ఖాన్ని తట్టుకోలేకపోయింది. కళ్లు బైర్లుకమ్మాయి. అలాగే సొమ్మసిల్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము పదమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### పదునాలుగవ సర్గ.

కైక మరలా తన ధోరణిలో దశరథునితో ఇలా అంది.

"ఓ దశరథమహారాజా! నీవు నీ ప్రాణాపాయ దశలో నాకు ఇస్తాను అన్న వరాలు రెండింటి ఈనాడు నేను కోరాను. ఆ మాత్రానికే ఇలా నేల మీదపడి దొర్లి దొర్లి ఏడవవలెనా! ఇది ఒక మహారాజుకు మర్యాదగా ఉంటుందా! ఆడిన మాట తప్పకపోవడం, ఎల్లప్పుడూ సత్యమునే మాట్లాడటం ఏనాటినుంచో ఉన్న ధర్మము. నేను అదే చెబుతున్నాను. తమరిని సత్యము ధర్మమును పాటించమంటున్నాను. ఆడినమాట తప్పవద్దు అని అంటున్నాను. ఇదేనా నేను చేసిన తప్పు. మీపూర్వులైన శిబిచక్రవర్తి, అలర్కుడు అనుసరించిన మార్గమునే మీరూ అనుసరించి కీర్తి ప్రతిష్టలు పొందమంటున్నాను. అదేనా నేను చేసిన పాపం.

"సత్యము పరబ్రహ్మస్వరూపము. ధర్మమునకు సత్యమే మూలము" అని మీకు నేను చెప్పదగిన దానిని కాదు. తాము సర్వజ్ఞులు. తమరికి అన్నీ తెలుసు. ఆ సత్యనిష్టను, ధర్మనిరతిని నేను పాటించమంటున్నాను. అన్న మాటను నిటబెట్టుకోమంటున్నాను. ధర్మము పాటించమంటున్నాను. నాకు ఇస్తానన్న వరాలు ప్రసాదించండి. అదే నేను కోరేది. నేనేమీ కొత్తగా కోరడం లేదు. నీవు ఆనాడు ఇస్తాను

అన్న వరాలే ఈ నాడు అడుగుతున్నాను. అదే ధర్మము. ఆ ధర్మాన్ని నిలపడం కోసం రాముని అడవులకు పంపండి. మరొక మాట వద్దు. "రాముని అడవులకు పంపాలి", "రాముని అడవులకు పంపాలి" "రాముని అడవులకు పంపాలి" అని మూడు మార్లు నొక్కి చెబుతున్నాను.

ఓ దశరథమహారాజా! మీరు నాకు ఇచ్చిన వరములను తీర్చకపోయినట్టయితే మీరు నన్ను వదిలివేసినట్టే భావిస్తాను. భర్త వదలిన భార్యకు మరణమే శరణ్యము అందుకని నేను మీ ఎదురుగుండా ప్రాణత్యాగము చేసుకుంటాను. ఇది తథ్యము." అని నిక్కచ్చిగా చెప్పింది కైక.

దశరథునికి ఆఖరు ఆశ కూడా అడుగంటి పోయింది. రామునికి వనవాసము తథ్యము అనుకున్నాడు. కుప్పకూలిపోయాడు. అతని హృదయము బరువెక్కింది. ముఖము వివర్ణమయింది. కళ్లు కనిపించడం లేదు. మరలా ధైర్యము కూడగట్టుకున్నాడు. కైకతో తన నిర్ణయాన్ని ఇలా ప్రకటించాడు.

" ఓసీ పాపీ! కైకా! అగ్నిసాక్షిగా నేను నీ పాణిగ్రహణము చేసాను. నీ పాణిగ్రహణము రోజు నేను ఏ చేతిని పట్టుకున్నానో ఆ చేతిని వదిలివేస్తున్నాను. దానితో పాటు నీ వలన నాకు పుట్టిన కుమారుని కూడా వదిలివేస్తున్నాను. ఇంక నీకూ నాకూ సంబంధం లేదు. నీవునా భార్యవు కావు. భరతుడు నా కుమారుడూ కాడు. నీవు నా కుమారుడు రాముని పట్టాభిషేకము చెడగొట్టావు. నేను

మరణించిన తరువాత నీ కుమారుడు నాకు తిలోదకములు వదల నవసరము లేదు. రాముడే నాకు ఉత్తరక్రియలు నిర్వర్తిస్తాడు.

రాముని పట్టాభిషేకము అని నేను ప్రకటించగానే జనము హర్షధ్వానాలు చేసారు. ఇప్పుడు నేను రాముని అడవులకు పంపుతున్నాను అని తెలిసి అయోధ్యలో ఉన్న జనము దు:ఖములో మునిగిపోతారు. వారి దు:ఖము నేను చూడలేను. అందుకే రాముడు అరణ్యములకు పోకముందే నేను ప్రాణములు విడుస్తాను." అని అన్నాడు దశరథుడు.

ఇంతలో తెల తెల వారుతూ ఉంది.పక్షులు కిల కిలారావాలు చేస్తున్నాయి. కాని కైకకు ఇవేమీ పట్టలేదు. తనపట్టు నెగ్గించు కోవాలనేకోరిక తప్ప. అందుకే దీనంగా నేలమీద పడి ఉన్న దశరథుని చూచి ఇలాఅంది.

" ఓ దశరథమహారాజజా! ఎందుకు చెప్పిన మాటలే చెప్పి నీవు బాధపడి అందరినీ బాధపెడతావు. జరగాల్సిన కార్యక్రమం చూడు. రాముని పిలిపించు. అతనికి నీ నిర్ణయాన్ని వినిపించు. రాముని వనవాసమునకు పంపించు. భరతునికి పట్టాభిషేకము ప్రకటించు. తూర్పు తెల్లవారుతోంది. త్వరగా కానివ్వండి." అని తొందరపెట్టింది.

ఆ మాటలకు దశరథుడు చెళ్లున కొరడాతో కొట్టిన గుర్రము మాదిరి పైకి లేచాడు. నిర్వేదంగా ఉన్నాడు. ఆయన బుద్ధిపనిచేయడం మాని వేసింది.

"నేను ధర్మానికి కట్టుబడ్డాను. ధర్మబద్ధుడను. నేను రాముని చూడాలని అనుకుంటున్నాను. రాముని పిలిపించండి." అని అన్నాడు.

అప్పటికే తెల్లవారింది. శుభముహూర్తము సమీపిస్తూ ఉంది. వసిష్ఠుడు  పట్టాభిషేకమునకు కావలసిన సంభారములు తన శిష్యులు తీసుకొని వస్తుంటే అయోధ్యలో ప్రవేశించాడు.

అప్పటికే రాజవీధులన్నీ పన్నీటితో తడిపారు. పతాకాలు కట్టారు. తోరణాలు కట్టారు. రాజవీధులన్నీ రకరకాల పూలతో అలంకరించారు. చుట్టు పక్కల గ్రామాలనుండి వచ్చిన ప్రజలతో, అయోధ్య ప్రజలతో వీధులు క్రిక్కిరిసిపోయాయి.  ప్రజలందరూ రామ పట్టాభిషేకము చూడ్డానికి  ఉవ్విళ్లూరుతున్నారు.

వసిష్ఠుడు రాజమందిరము దగ్గరకు వచ్చాడు. అప్పటికే బ్రాహ్మణులు అసంఖ్యాకంగా అక్కడికి చేరుకున్నారు. వారిని చూచి వసిష్ఠుడు ఎంతో సంతోషించాడు. వారి మధ్యనుండి దారి చేసుకుంటూ రాజభవనము లోకి ప్రవేశించాడు.

సుమంత్రుడు వసిష్ఠునికి ఎదురుగా వచ్చాడు. సుమంత్రుడు వసిష్ఠునికి నమస్కరించాడు. "సుమంత్రా! నీవు వెంటనే దశరథ మహారాజు వద్దకు పోయి నేను వచ్చినట్టు వారికి మనవి చెయ్యి. రామ పట్టాభిషేకమునకు కావాల్సిన సంభారములు అన్ని సిద్ధంగా ఉన్నాయి. అభిషేకమునకు గంగాజలమూ, పుణ్య నదీజలములు, సముద్రజలము సిద్ధంగా ఉన్నాయి. నవధాన్యాలు, తేనె, పెరుగు,నెయ్యి, పేలాలు, దర్భలూ, పూలు, పాలు, కన్యముత్తయిదువలు, ఏనుగులు, రథములు,

ఖడ్గములు, ధనుర్బాణములు, పల్లకీలు, ఛత్రచామరములు, వింజామరములు, బంగారు కలశములు, తెల్లని ఎద్దు, తెల్లని గుర్రములు, పులి చర్మమూ, అగ్నిహెూత్రము, రకరకాల వాద్య విశేషములు, చక్కగా అలంకరించుకున్న స్త్రీలు,  గురువులు, విప్రులు, గోవులు, అయోధ్యాప్రజలు, చుట్టుపక్కల గ్రామాల ప్రజలు అందరూ రామ పట్టాభిషేకమునకు సిద్ధంగా ఉన్నారు. సూర్యోదయము అయింది. శుభముహూర్తము సమీపిస్తూ ఉంది. కాబట్టి సుమంత్రా! నీవు రాజు గారి వద్దకు పోయి మేము వచ్చామని చెప్పి, తొందరగా సిద్ధంకమ్మను." అని అన్నాడు వసిష్ఠుడు.

ఆ మాటలు విన్న సుమంత్రుడు వసిష్ఠునికి నమస్కరించి దశరథుని వద్దకు వెళ్లాడు. అప్పటిదాకా జరిగిన విషయములు ఏవీ తెలియవు సుమంత్రునకు. అందుకని దశరథుని స్తుతించడం మొదలెట్టాడు.

"మహారాజు దశరథులవారికి జయీభవ. విజయీభవ. ఈ పట్టాభిషేక మహెూత్సవము తమరికి అపరిమితమైన సంతోషించు గాక! దేవేంద్రుని సారథి మాతలి ఇంద్రుని స్తుతించి నట్టు నేను దేవేంద్ర సమానుడైన తమరిని స్తుతిస్తున్నాను. స్వయంభువు, వేదవేదాంగ ములను సృష్టించిన వాడూ అయిన బ్రహ్మను స్తుతించినట్టు నేను తమరిని స్తుతిస్తున్నారు. ఉదయమే సూర్యుడు, రాత్రి చంద్రుడూ వచ్చి భూదేవిని మేల్కొలిపి నట్టు నేను తమరిని మేల్కొలుపుతున్నాను.

ఓ మహారాజా! సూర్యోదయము అయింది. రామ పట్టాభి షేకమునకు కావాల్సిన సంభారములు అన్ని సిద్ధంచేయబడ్డాయి.

ఓ దశరథమహారాజా! తమరు వెంటనే మేల్కొని మంగళ స్నానం చేసి, రామ పట్టాభిషేకమునకు సిద్ధం కావాలని వసిష్ఠులవారి ఆదేశము. ఓ మహారాజా! తమరికి సూర్య చంద్రులు, శివకేశవులు, అగ్ని వరుణుడు, ఇంద్రుడు తమరికి సకలైశ్వర్యములు కలిగించుగాక!

ఓ దశరథమహారాజా! వసిష్ఠులవారు బ్రాహ్మణసమూహము లతో రాజద్వారము వద్ద తమరి రాక కోసం వేచిఉన్నారు. తమరు తొందరగా వచ్చి రామ పట్టాభిషేకమునకు అనుజ్ఞ ఇవ్వవలసినదిగా వేడుకొనుచున్నాను." అనిపలుకుతున్న సుమంత్రుని పలుకులు విన్న దశరథునికి దు:ఖము ఇంకా ఎక్కువ అయింది. అమంగళము జరగబోతూ ఉంటే సుమంత్రుని మంగళవాచకములు దశరథునికి కర్ణకఠోరంగా వినిపించాయి.

"ఆపు. ఇంక చాలు" అని గట్టిగా అరిచాడు. ఆ అరుపుకు సుమంత్రుడు భయపడిపోయాడు. ఒక పక్కకు ఒదికి నిలబడ్డాడు.

ఇదంతా చూస్తూ ఉన్న కైక అక్కడకు వచ్చింది. "సుమంత్రా! రాత్రి అంతా మహారాజుగారు పట్టాభిషేకసన్నాహముల గురించి చర్చించి చర్చించి రాత్రి అంతా నిద్రలేకుండా గడిపారు. అందువలన కొంచెం చిరాకుగా ఉన్నారు. నీవు పోయి మహారాజు గారు రమ్మన్నారని చెప్పి శీఘ్రముగా రాముని ఇక్కడకు తీసుకొని రా." అని ఆజ్ఞాపించింది కైక.

"అలాగే మహారాణీ! తమ ఆజ్ఞ నెరవేరుస్తాను. రాముని ఇక్కడకు వెంటనేరమ్మని మనవిచేస్తాను." అని పలికి సుమంత్రుడు

అక్కడినుండి వెళ్లిపోయాడు. అప్పటికే  రాజద్వారము వద్ద నిలబడి ఉన్న సామంతరాజులను, అయోధ్యలోని ధనవంతులను, పౌరులను చూచాడు  సుమంత్రుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము పదునాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## పదునైదవ సర్గ.

వేదపారంగతులైన బ్రాహ్మణులు పొద్దుటే పట్టాభిషేక మండపమునకు చేరుకున్నారు. అయోధ్యా నగర మంత్రులు, సేనాధిపతులు, పురప్రముఖులు అందరూ పట్టాభిషేక మంటపము వద్దకు వచ్చారు. అందరి ముఖంలో ఆనందం వెల్లివిరుస్తూ ఉంది. ఎప్పుడెప్పుడు రామ పట్టాభిషేకము చూద్దామా అని ఉవ్విళ్లూరు తున్నారు.

రాముని జన్మ లగ్నము కర్కాటకము. అదే లగ్నంలో పుష్యమీ నక్షత్రంలో రాముని పట్టాభిషిక్తుని చేయవలెనని వేద పండితులు నిశ్చయం చేసారు. పట్టాభిషేక మంటపం చుట్టు పూర్ణకుంభాలు పెట్టబడి ఉన్నాయి. రాముడు ఎక్కడానికి స్వర్ణ రథం ఏర్పాటు చేసారు. రాముడు కూర్చోడానికి పులి చర్మము పరిచారు. అక్కడ ఉన్న బంగారు కలశములలో, గంగానదీ, యమునా నదీ, సరస్వతీ నదీ కలిసే చోట (త్రివేణీ సంగమము....ప్రస్తుతము అలహాబాద్) నుండి సేకరించిన జలము, ఇతర పుణ్యనదుల నుండీ, సరస్సులనుండీ, నదీనదముల నుండి, నాలుగు సముద్రముల నుండీ తెచ్చిన జలములను నింపి ఉంచారు.

పట్టాభిషేకమునకు కావలసిన లాజలు, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పూలు, దర్భలు అన్నీ మండపము దగ్గర బంగారు పాత్రలలో అమర్చి ఉన్నాయి. సర్వాభరణ భూషితలైన వేశ్యలు అటూ ఇటూ తిరుగుతూ అన్ని పనులలో పాలుపంచుకుంటున్నారు. రాముడు పట్టాభిషిక్తుడు కాగానే, సింహాసనము మీద కూర్చోగానే ఆయనకు అటు ఇటు వింజామరలు వేయుటకు రత్నఖచితమైన వింజామరలు సిద్ధంగా ఉంచారు. అయోధ్య సామ్రాజ్యమునకు కాబోయే చక్రవర్తి అయిన రామునికి పట్టుటకు పాలనురగలాగా తెల్లగా స్వచ్ఛంగా మెరిసిపోయే పట్టు గొడుగు సిద్ధంగా ఉంచారు.

యువరాజు రాముని సేవించుటకు తెల్లని ఎద్దు, తెల్లటి గుర్రము, మదము కారే ఏనుగు రాజద్వారము బయట కట్టివేయబడి ఉన్నాయి. పట్టాభిషేక సమయంలో రాముని పక్కన ఉండటానికి ఎనిమందిమంది కన్యముత్తయిదువలు సకలమైన అలంకారములు చేసుకొని పట్టాభిషేక మంటపము దగ్గర నిలబడి ఉన్నారు. పట్టాభిషేక సమయములో మ్రోగించుటకు రకరకాల వాద్యములు, వాద్యకారులు సిద్ధంగా ఉన్నారు. రాముడు యువరాజుగా పట్టాభిషిక్తుడు కాగానే రాముని, రాముని వంశములో మూల పురుషులను కీర్తించుటకు వందులు, మాగధులు ఒక పక్కగా నిలబడి ఉన్నారు.

పట్టాభిషేకమునకు కావలసిన సంభారాలు అన్నీ, అన్నివిధాలా అమర్చి ఉన్నాయి కానీ పట్టాభిషేకము నిర్వహించే దశరథ మహారాజు, పట్టాభిషేకము జరిపించుకొనే రాముడు అక్కడలేరు. వారి రాక కోసం అందరూ వేయికళ్లతో ఎదురుచూస్తున్నారు. వారిలో వారు

గుసగుసలాడుకుంటున్నారు.

"సుముహూర్తము సమీపిస్తూ ఉంది. ఇంకా దశరథుడు, రాముడు, రాజమాతలు రాలేదు. ఏమయి ఉంటుంది. అసలు పట్టాభిషేకము జరుగుతుందా! లేదా!" అని వారిలో వారే అనుకుంటున్నారు.

ఇంకా కొంతమంది "మనమంతా పట్టాభిషేకము కొరకు అన్ని సంభారములు సమకూర్చుకొని సిద్ధంగా ఉన్నాము. దశరథమహారాజు ఇంకా రాలేదు. మనమంతా సిద్ధముగా ఉన్నట్టు దశరథమహారాజుకు ఎవరిద్వారా తెలియపరచాలి." అని తమలో తాము అనుకుంటున్నారు.

ఇంతలో సుమంత్రుడు అక్కడకు చేరుకున్నాడు. అక్కడ వేచి ఉన్న సామంతులను, పురప్రముఖులు సుమంత్రుని చూచి ఇలా అన్నారు.

"సుమంత్రా! ఏమి ఆలస్యము. రామ పట్టాభిషేకమునకు సుముహూ ర్తము మించిపోడుతున్నది. ఇంకా మహారాజు గారు రాలేదు. కారణం తెలియడం లేదు. నీ కేమైనా తెలుసునా!" అని అడిగారు. దానికి సుమంత్రుడు ఇలా అన్నాడు.

"దశరథమహారాజుగారి ఆజ్ఞ ప్రకారము నేను రాముని వద్దకు వెళుతున్నాను. మీరు అన్నట్టుగా సుముహూర్తము సమీపిస్తూ ఉంది. మీరందరూ సర్వ సంభారములతో ఎదురుచూస్తున్నారు. దశరథ మహారాజుగారు ఇంకా ఇక్కడకు రాలేదు. రాజుగారు పట్టాభిషేకము

నకు సుముఖంగా ఉన్నాడా లేదా అన్న విషయం, రాజుగారు ఇంకా ఇక్కడకు రాకపోవ డానికి కారణము నాకూ తెలియదు. ఇప్పుడే నేను మహారాజు గారి వద్దకు వెళ్లి  మీ మాటగా నేను మహారాజుగారిని అడుగు తాను. మీరందరూ దయతో ఓపికతో వేచిఉండండి." అని పలికాడు.

వెంటనే సుమంత్రుడు రాజాంత: పురమునకు వెళ్లాడు. దశరథుని శయన మందిరములోకి ప్రవేశించాడు. బయట నిలబడి దశరథుని, ఆయన వంశమును స్తుతించాడు.

" ఓ దశరథమహారాజా! తమకు జయమగుగాక! ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, శివుడు, కుబేరుడు వారి కృపను తమ మీద ప్రసరింతురు గాక! రాజేంద్రా! పట్టాభిషేక ముహూర్తము సమీపించుచున్నది. బ్రాహ్మణులు, సామంతులు, పురప్రముఖులు పట్టాభిషేకమంటపము వద్ద తమరి రాక కోసరము వేచి ఉన్నారు. తమరు వెంటనే అక్కడకు రావలసినది.." అని పలికాడు.

అప్పుడు దశరథుడు బయటకు వచ్చి సుమంత్రుని చూచి "రాముని ఇక్కడకు తీసుకొని రమ్మని ఈమె నీకు చెప్పింది కదా! నీవు రాముని ఇక్కడకు ఎందుకు తీసుకొని రాలేదు. నా ఆజ్ఞ ఎందుకు పాటించ లేదు.  నేను చెబితే ఒకటీ కైక చెబితే ఒకటీనా. నేను నిద్రించుటలేదు. మేలుకొనే ఉన్నాను. నన్ను ఎవరూ మేలుకొలుప నవసరము లేదు. నీవు  వెంటనే రాముని ఇక్కడకు తీసుకొని రా. వెళ్లు." అని ఆజ్ఞాపించాడు దశరథుడు.

ఇంక చేసేది లేక సుమంత్రుడు రాజాజ్ఞ పాలించుటకు రాజాంత:పురము నుండి బయటకు వచ్చాడు. రాముని రాజభవనము వద్దకు వచ్చాడు.

రాముని మందిరమును కూడా శోభాయమానంగా అలంకరించారు. రాముని భవనము ఎదుట కూడా ప్రజలు గుమి గూడి రాముని చూడటానికి వేచి ఉన్నారు. సుమంత్రుని రథము వారిని దాటుకుంటూ రామ మందిరము వద్దకు సమీపించింది. అయోధ్యా పౌరులు, జానపదులు, రాముని మిత్రులు  అప్పటికే అక్కడకు చేరుకున్నారు.   రాముని పట్టాభిషేక మంటపమునకు తీసుకొని పోవుటకు ఏర్పాటు చేయబడిన సుందరంగా అలంకరించిన మద గజము (మదించిన ఏనుగు)  ద్వారము వద్ద వేచి ఉన్నది. వీరందరినీ దాటుకుంటూ సుమంత్రుడు రాముని అంత:పురములోకి ప్రవేశించాడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము పదునైదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### పదునారవ సర్గ.

రాముని అంత:పురములో ఒక్కొక్క ద్వారమును దాటు కుంటూ వెళుతున్నాడు సుమంత్రుడు. రాముని అంత:పురము బయట కాపలా ఉన్న భటులతో "రాముని దర్శనము కొరకు సుమంత్రుడు వచ్చి ఉన్నాడు" అని చెప్పండి అని చెప్పి పంపించాడు. సీతతో ముచ్చటిస్తున్న రామునితో భటులు సుమంత్రుడు వచ్చాడు అన్న మాటను చెప్పారు. "సుమంత్రుని సాదరంగా లోపలకు తీసుకొని రండి" అని ఆదేశించాడు రాముడు.

సుమంత్రుడు రాముని అంత:పురములోకి వెళ్లాడు. రాముని చూచాడు. రామునికి నమస్కరించాడు. రాముని చూచి ఇలా అన్నాడు.

" ఓ కౌసల్యా నందనా! రామా! మీ తండ్రిగారు దశరథ మహారాజు గారూ, తమరి తల్లి కైకేయీ మహారాణి గారూ తమరిని చూడవలెనని అనుకుంటున్నారు. తమరు వెంటనే దశరథుల వారి అంత:పురమునకు బయలు దేరండి." అని పలికాడు.

ఆ మాటలు విన్న రాముడు పక్కనే ఉన్న సీతను చూచి ఇలా అన్నాడు. "సీతా! నా తండ్రి దశరథుడు, నా తల్లి కైక నా పట్టాభిషేకము

గురించి నాతో చర్చించవలెనని అనుకుంటున్నారు. నన్ను తీసుకొని రమ్మని సుమంత్రుని పంపారు. నేను వెంటనే  నా తల్లి తండ్రుల వద్దకు వెళ్లుతున్నాను." అని చెప్పాడు.

సీత చిరునవ్వుతో భర్తను సాగనంపింది. ద్వారము దాకా తోడు వచ్చింది. "ఆర్యపుత్రా! మీకు జయమగుగాక! తమరు త్వరలో ఈ అయోధ్యకు పట్టాభిషిక్తులు కాబోతున్నారు. తమరు పట్టాభిషిక్తులు కావడం చూచి నేను ఎంతో ఆనందిస్తాను.  దిక్పాలకులైన ఇంద్రుడు, యముడు,  వరుణుడు, కుబేరుడు తమరిని సదా రక్షించు గాక! శు భంగా వెళ్లిరండి." అని భర్తను సాగనంపింది సీత. సీత వద్దనుండి అనుమతి తీసుకున్న రాముడు, సుమంత్రునితో సహా దశరథ మహారాజు మందిరమునకు బయలుదేరాడు.

ద్వారము దగ్గర లక్ష్మణుడు అన్నగారి కోసరము వేచి ఉన్నాడు. లక్ష్మణుని కూడా తనతో రమ్మన్నాడు రాముడు.  ముగ్గురూ కలిసి వెళు తున్నారు. దారిలో తన కోసం వేచి ఉన్న తన మిత్రులను చూచి రాముడు వారికి 'తండ్రిగారిని కలుసుకొని ఇప్పుడే వస్తాను' అని చెప్పాడు. రాముడు లక్ష్మణుడు రథంలోకి ఎక్కారు. సుమంత్రుడు రథం తోలుతున్నాడు.  రాముడు ఎక్కిన రథము రాజాంత:పురమునకు బయలుదేరింది. లక్ష్మణుడు రాముని వెనక నిలబడి రాముని అప్రత్తంగా రక్షిస్తున్నాడు. రాముని రథము వెంట గుర్రములు, ఏనుగులు ఎక్కిన సైనికులు అనుసరించారు. కవచములు, ఆయుధములు ధరించిన భటులు రాముని రథమును అనుసరించి వెళుతున్నారు.

రాముని చూచి మార్గమునకు అటు ఇటు నిలబడ్డ ప్రజలు హర్షధ్వానాలు చేస్తున్నారు. రాముని గుణగణములను స్తుతిస్తున్నారు. మేడల మీద నిలబడ్డ స్త్రీలు రాముని మీద పూలు చల్లుతున్నారు. దారికి అటు ఇటు నిలబడ్డ ప్రజలు రామునికి భక్తితో నమస్కరిస్తున్నారు. అటువంటి రాముని భర్తగా పొందిన సీతను అయోధ్యావాసులు మనసులోనే అభినందించారు. "పూర్వజన్మలో ఏ తపస్సు చేసిందో ఏమో ఈ జన్మలో రాముని వంటి ఉత్తముని భర్తగా పొందినది" అ ని సీత అదృష్టాన్ని పొగిడారు.

వారందరి మాటలు చిరునవ్వుతో వింటున్నాడు రాముడు. ఈ నాడే రాముడు మనకందరికీ పాలకుడు కాబోతున్నాడు. ఇంక మనకోరికలు అన్నీ తీరుతాయి.  ఇంక అయోధ్యా ప్రజలకు దు:ఖము అనే మాట వినపడదు. అని అయోధ్యావాసులు ఆనందంతో కేరింతలు కొడుతున్నారు.

ఆ ప్రకారంగా రాముడు, ముందు వంది మాగధులు కైవారములు చేస్తూ ఉంటే, వెనక ఆశ్విక బలము, గజబలము వెంట వస్తూ ఉంటే, రాజాంత:పురమునకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము పదునారవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## పదిహేడవ సర్గ.

రాముడు  అయోధ్యా పురవీధుల గుండా వెళుతున్నాడు. శోభాయమానంగా అలంకరించిన అయోధ్యానగరాన్ని తనివిదీరా చూస్తున్నాడు. రాజమార్గములో అటు ఇటూ నిలబడ్డ పౌరులు రాముని దీవిస్తున్నారు.

"ఓ రామా! నీవు అయోధ్యానగరమునక పట్టాభిషిక్తుడవై నీ తాత ముత్తాతలు అనుసరించిన ధర్మమార్గమును అనుసరించి ప్రజలను పాలింపుము. నీ పాలనలో ప్రజలు నీ తండ్రిపాలనలో కన్నా ఎక్కువగా సుఖిస్తారు." అని మనసారా దీవిస్తున్నారు.

ఇంకొంతమంది. "ఆహా! పట్టాభిషేకము చేసుకోబోతున్న రాముని చూస్తుంటేనే కడుపు నిండిపోయింది. ఇంక మనకు అన్నపానీయాలు అక్కరలేదు." అని అనుకొంటున్నారు.

ఇంకొంత మంది రాముడు వెళ్లినంత సేపూ అలాగే చూస్తున్నారు. ఈ రోజు రాముని చూడని జన్మ కూడా ఒక జన్మేనా అని అనుకొంటున్నారు.

ఆ ప్రకారంగా రాముడు అయోధ్యాపురవీధుల గుండా వెళు

తున్నాడు. తుదకు దశరథమహారాజు మందిరము చేరుకున్నాడు.

రాముడు మహారాజు మందిరము బయట రథము దిగి నడుచుకుంటూ అంత:పురములోనికి వెళ్లాడు. రామునితో వచ్చిన వాళ్లందరూ రాజ మందిరము బయటనే నిలబడ్డారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము పదిహేడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## పదునెనిమిదవ సర్గ.

రాముడు తండ్రిగారైన దశరథ మహారాజు అంత:పురములో ప్రవేశించాడు. లక్ష్మణుడు ద్వారము బయట నిలబడ్డాడు. ఉన్నతాసనముమీద కూర్చొని ఉన్న తండ్రి గారిని చూచాడు రాముడు. తండ్రి మొహములో ఆనందము కనపడటం లేదు. ఏదో చింత తండ్రిమొహంలో కనపడటం చూచాడు రాముడు.

రాముడు ముందుగా తన తండ్రి దశరథునకు పాదాభి వందనము చేసాడు. తరువాత పక్కనే నిలబడిఉన్న తన తల్లి కైకకు పాదాభివందనము చేసాడు.

దశరథుడు రాముని వంక దీనంగా చూచాడు. "రామా!" అని ఒక్కమాట అతికష్టం మీద అన్నాడు. దు:ఖము పొంగుకొని రాగా తల వంచుకొని తలను చేత్తో పట్టుకొని కూర్చున్నాడు.

తండ్రిగారి పరిస్థితి చూచి రాముడు ఆశ్చర్యపోయాడు. ఇంతకు ముందు తండ్రిని ఇలాంటి పరిస్థితిలో ఎన్నడూ చూడలేదు రాముడు. ఎంతటి క్లిష్టమైన రాచకార్యములలో మునిగి ఉన్నా, తనను చూడగానే దశరథుడు "నాయనా! రామా! నా దగ్గరకు రా!"అని ఆప్యాయంగా పిలిచి తన పక్కనే కూర్చోపెట్టుకొనే వాడు. అలాంటిది

ఇప్పుడు, తన పట్టాభిషేక సమయములో, ఇంతటి సంతోష సమయంలో, తండ్రిగారు ఇలా చింతా క్రాంతమైన ముఖంతో ఉండటం రామునికి ఆశ్చర్యం కలిగించింది. తనను ఎప్పుడూ సంతో షంగా పలకరించే తండ్రి ఇలా ముభావంగా ఉండటానికి కారణం తెలియక తల్లడిల్లిపోతున్నాడు రాముడు.

కైక వంక చూచాడు. "అమ్మా! తండ్రిగారికి నా వలన ఏమైనా అపరాధము జరిగిందా! నేను ఏమన్నా పొరపాటు చేసానా! నా తండ్రి నా మీద కోపంగా ఉండటానికి కారణమేమి? అమ్మా! నీవైనా తండ్రి గారికి నా మీద అనుగ్రహం కలిగేట్టు చెయ్యమ్మా! లేకపోతే ఎప్పుడూ నేనంటే ప్రసన్నంగా ఉండే తండ్రిగారు ఈరోజు నా మీద కోపంగా ఉ న్నారెందుకు?

అమ్మా! తండ్రిగారికి శరీరంలో బాగా లేదా! రాజవైద్యులను సంప్రదించారా అమ్మా! లేక మానసికంగా ఏమైనా బాధపడుతున్నారా! చెప్పమ్మా! అమ్మా! మానవులకు సుఖదు:ఖాలు సహజం కదమ్మా!

అమ్మా! వారి మేనమామ గారింట్లో భరతుడు, శత్రుఘ్నుడు క్షేమంగా ఉన్నారు కదా! వారి కేమీ కాలేదు కదా! అమ్మా! మీకు గానీ, మా తల్లి కౌసల్యకు గానీ సుమిత్రకు గానీ అసౌకర్యము ఏమీ కలగలేదు కదా!

అమ్మా! నాన్నగారి దు:ఖము పోగొట్టడానికి ఏమైనా చేస్తాను అమ్మా! తండ్రిగారు దు:ఖపడుతుంటే నేను క్షణకాలం కూడా జీవించలేనమ్మా! ఎందుకంటే నాకు ఈ జన్మను, ఈ శరీరాన్ని ఇచ్చింది

నా తండ్రి. ఈ శరీరం ఆయన అధీనము. ఆయన కోసం, ఆయన సంతోషం కోసం నేను  ఏమైనా చేస్తాను.

అమ్మా! నాకు ఒక సందేహము. తమరికీ మా తండ్రి గారికీ ఏమైనా మనస్పర్థలు వచ్చాయా! మీరేమన్నా తండ్రిగారిని అనకూడని మాటలు అన్నారా!  అమ్మా! నిజం చెప్పమ్మా! ఎందుకంటే నాకు ఊహ తెలిసిన తరువాత నా తండ్రిని నేను ఎప్పుడూ ఇటువంటి దీనస్థితిలో చూడలేదు." అని కైకను బతిమాలాడు రాముడు.

రాముని ఆవేదన చూచి ఇదే సమయము అని అనుకొంది కైక. తన మనసులో మాట బయట పెట్టింది.

"రామా! మీ తండ్రిగారికి శరీరంలో ఎలాంటి జబ్బులేదు. ఆయన ఆరోగ్యంగానే ఉన్నారు. కాని తన మనసులో ఉన్న విషయం నీతో ఎలా చెప్పాలా అని మధనపడుతున్నారు.  ఆ విషయం నీతో చెప్పడానికి భయపడుతున్నాడు కూడా." అని ఒక క్షణం ఆగింది కైక.

"చెప్పమ్మా! తండ్రిగారు నాతో చెప్పడానికి సంకోచిస్తున్న విషయం ఏమిటి? త్వరగా చెప్పమ్మా!" అని తొందర పెట్టాడు రాముడు.

"ఏమీ లేదు రామా! చాలా స్వల్పమైన విషయం. పూర్వము దేవాసుర యుద్ధంలో మీ తండ్రిగారు నాకు రెండు వరములు ప్రసాదించారు. ఆ వరములు ఇప్పుడు నేను కోరుకున్నాను. ఆ వరముల గురించి నీతో చెప్పడానికి భయపడుతున్నారు మీ తండ్రిగారు.

రామా! ధర్మము నీకు తెలుసుకదా! సత్యము పలకడం, ఆడినమాట తప్పక పోవడం ఉత్తములకు పరమ ధర్మము కదా! మీ తండ్రి  నీ కోసరం ఆడినమాట తప్పుతాను అని అంటున్నాడు. ఇదేమి న్యాయం?" అని పలికింది కైక.

"అమ్మా! ఆ వరాలు ఏమిటమ్మా.నాతో చెప్పమ్మా!" అని అడిగాడు రాముడు.

"అవి నీకు దు:ఖము కలిగించేవి రామా! నీవు ఏమీ అనుకోనంటే చెబుతాను. విన్న తరువాత నన్ను దూషించకూడదు. అసలు ఈ వరాల సంగతి మీ తండ్రిగారే నీకు చెప్పాలి. కానీ నీకు చెప్పడానికి నీతండ్రి సంకోచిస్తున్నాడు." అని మరలా ఆగింది కైక.

ఈ సందిగ్ధము భరించలేకపోతున్నాడు రాముడు.

"అమ్మా! నా సంగతి తెలిసికూడా నీవు ఇలా మాట్లాడటం తగునా అమ్మా! నా తండ్రిగారు చెబితే నేను నా ప్రాణములు కూడా గడ్డిపోచలాగా విడిచిపెడతాను. అగ్నిలో దూకమన్నా దూకుతాను. విషం తాగమన్నా తాగుతాను. సముద్రంలో దూకమన్నా దూకుతాను.

అమ్మా! నా తండ్రి ఏది చెబితే అది చేస్తాను అని ప్రతిజ్ఞ చేస్తున్నాను. అమ్మా! నేను రెండు మాటలు మాట్లాడను. నాది ఒకే మాట. చెప్పమ్మా! నేనేం చెయ్యాలి? నా తండ్రి దు:ఖము ఎలా పోగొట్టాలి?" అని అడిగాడు రాముడు.

కైకకు లోలోపల ఎంతో సంతోషంగా ఉంది. రాముడు దారిలోకి వచ్చాడు అనుకొంది. తన కోరికలు తీరే సమయం ఎంతోదూరం లేదు అనుకొంది. మెల్ల మెల్లగా తన మనసులో ఉన్న కోరికలు బయటపెట్టింది.

"పూర్వము జరిగిన దేవాసురయుద్ధములో నేను నీ తండ్రి దశరథుని ప్రాణములు కాపాడినపుడు ఆయన నాకు రెండు వరములు ఇచ్చాడు. అవి ఇప్పుడు నేను కోరాను. అందులో మొదటిది. భరతుని అయోధ్యకు పట్టాభిషిక్తుని చేయడం. రెండవది నీవు పదునాలుగు సంవత్సరములు నారచీరలు ధరించి,కందమూలములు తింటూ దండకారణ్యములో వనవాసము చెయ్యడం.

నీ తండ్రి మాటను నిలబెట్టాలన్నా, నీవు పలికిన మాటలు, చేసిన ప్రతిజ్ఞ, నిలుపుకోవాలన్నా నేను చెప్పినట్టు చేయాలి. మీ తండ్రి గారి ఆజ్ఞ పాలించడం నీ ధర్మం. అందుకని నీవు పదునాలుగు సంవత్సరములు వనవాసము చెయ్యాలి. నీ పట్టాభిషేకము కొరకు జరిగిన ఏర్పాట్లతోనే నీకు బదులు భరతునికి పట్టాభిషేకము జరగాలి. భరతుడు రాజ్యము చేస్తుంటే, అతనికి నీవు అడ్డు కాకుండా వనములలో ఉండాలి.

ఈ విషయములను నీతో చెప్పడానికి నీ తండ్రి సంకోచి స్తున్నాడు. బాధపడుతున్నాడు. అందుకని ఆయన మాటలుగా నేను నీకు చెబుతున్నాను. నీ తండ్రి మాటను నిలబెట్టి, ఆయన కీర్తిని ముల్లోకాలలో వ్యాపింపజెయ్యి. కుమారుడుగా అదే నీ కర్తవ్యము కదా! నీ సత్యవాక్పరిపాలన వలన నీ తండ్రి తరిస్తాడు." అని పలికింది కైక.

కైక ఆ మాదిరి చెబుతూ ఉంటే దశరథుడు  కోపంతో రగిలిపోతున్నాడు. బాధతో కుమిలిపోతున్నాడు. రాముని మొహం చూడలేక సిగ్గుతో తలదించుకున్నాడు.

కాని రాముడు మాత్రము చిరునవ్వుతో తల్లి కైక మాటలు విన్నాడు. ఆయన మొహంలో ఏ మాత్రం బాధ కనిపించలేదు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము పదునెనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### పంతొమ్మిదవ సర్గ.

తన తల్లి కైక మాటలు విన్న రాముడు ఏ మాత్రం బాధ పడలేదు. "అమ్మా! కైకా! అన్నీ నీవు చెప్పినట్లే జరుగుతాయమ్మా. నేను తండ్రి గారి మాట ప్రకారము జటలు, నార చీరలు ధరించి అరణ్యవాసము చేస్తాను. ఈ చిన్న విషయానికి తండ్రి గారు ఎందుకు బాధపడుతున్నారో నాకు అర్థం కావడం లేదు. తండ్రిగారి మాట నేను ఎప్పుడు కాదన్నాను. ఆయన మాట నేను కాదు అని అంటే కదా వారు బాధ పడాలి. వారి మాట నాకు శిరోధార్యము.

అమ్మా! నాకు జన్మనిచ్చిన వాడు నా తండ్రి. నన్ను పెంచి, పెద్దచేసి, నాకు విద్యాబుద్ధులు చెప్పించాడు. అటువంటి తండ్రి మాటను నేను కాదంటానా అమ్మా! కాని తండ్రిగారు ఈ విషయము నాకు స్వయంగా చెప్పిఉంటే బాగుండేది. తండ్రిగారు "రామా! నేను భరతునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయదలిచాను" అని ఒక్కమాట నాతో అంటే నేను రాజ్యమును భరతునికి అప్పగించి ఉండేవాడిని. ఒక్క రాజ్యమే కాదు తండ్రిగారు కోరితే నా సర్వస్వమును భరతునికి అర్పిస్తాను. ఇందులో సందేహము లేదు.

అమ్మా! నీవు తండ్రి గారిని ఓదార్చు. అమ్మా! అమ్మా! చూడమ్మా. తండ్రి గారు నా మొహం లోకి చూడలేక నేల చూపులు చూస్తూ

కన్నీరు కారుస్తున్నారు. నేను తండ్రిగారి మాటలను పాటిస్తాను అని చెప్పమ్మా. వెంటనే నేను భరతుని తీసుకొని వచ్చుటకు దూతలను కేకయ దేశమునకు పంపుతాను.

అమ్మా! నా తండ్రిగారి మాటలు మంచివా, మంచివి కావా అని నేను తర్కించను. తండ్రి గారి నిర్ణయం నాకు అనుకూలమా ప్రతికూలమా అని ఆలోచించను. తండ్రిగారి మాటలను తప్పకుండా పాటిస్తాను. పదునాలుగేళ్లు వనవాసము చేస్తాను. నా మాట నమ్మండి."అని నిశ్చయంగా అన్నాడు రాముడు.

అప్పుడు రాముని మాటలలో నమ్మకం కుదిరింది కైకకు. కైక మనసు సంతోషంతో పరవళ్లు తొక్కింది. కాని పైకి మాత్రం ఆ సంతోషమును బహిర్గతము చేయలేదు. రాముని తొందరపెట్టసాగింది.

"రామా! వెంటనే వేగముగా పరుగెత్తే గుర్రముల మీద దూతలను భరతుని మేనమామ ఇంటికి పంపు. భరతుడు వెంటనే ఇక్కడకు రావాలి. భరతుడు వచ్చువరకు నీవు ఆగనవసరం లేదు.నీవు వెంటనే అరణ్యములకు ప్రయాణమై వెళ్లు. నీ తండ్రి గారు స్వయంగా నీతో చెప్పలేదని సందేహించకు. పాపం మీ తండ్రిగారు నీతో ఈ విషయం ఎలా చెప్పాలా అని తనలో తనే మధనపడుతున్నాడు. నీవు ఇక్కడ ఉంటే ఆ బాధతో నీ తండ్రి ఆహారము కానీ, నీరు కానీ ముట్టడు. కాబట్టి నీవు తక్షణం వనములకు వెళితేనే ఆయన ఆహారం తీసుకుంటాడు." అని పలికిన కైక వంక అసహ్యంగా చూచాడు దశరథుడు.

రాముని మొహంలోకి చూడలేక మరలా తల దించుకున్నాడు. రామునికి విషయం అర్థం అయింది. తన తల్లి కైకతో ఇలా అన్నాడు.

"అమ్మా! నేను ఎల్లప్పుడూ ధర్మమును తప్పను. తండ్రి మాటలను పాటిస్తాను. నా తండ్రి మాట ముందు ఈ రాజ్యము, భోగములు నాకు గడ్డిపరక తో సమానము. అమ్మా! నీకు ఇందాకే చెప్పాను. నా తండ్రి గారి మాటను నెరవేర్చడానికి నేను నా ప్రాణములను కూడా లెక్కచెయ్యను. ఇంక ఈ వనవాసము ఒక లెక్కలోది కాదు.

అమ్మా! తమరికి తెలియనిది ఏమున్నది. పుత్రునికి తండ్రికి సేవచెయ్యడం, తండ్రి మాటను పాటించడం కన్నా వేరే ధర్మము ఏముంటుంది. తండ్రి గారి నోటివెంట నా వనవాసము గురించి ఒక మాట కూడా రాక పోయినా, నీవు చెప్పావు కాబట్టి ఆ మాటలు నా తండ్రి గారు చెప్పినట్టే భావిస్తాను.

అదికాదమ్మా! నేను నీ పుత్రుడను. నాపై నీకు సర్వాధి కారములు ఉన్నాయి. భరతుని రాజ్యాభిషేకము గురించి నాతో ఒక్క మాట చెబితే సరిపోయేది కదా. దీనికి తండ్రి గారిని ఇంత బాధపెట్ట వలెనా! అంటే ఈ రాముడి మీద తమరికి నమ్మకం లేదా అమ్మా! నాకు తమరు ఒకటీ, మా తండ్రి ఒకటీ కాదు. మీ ఇద్దరి మాటా ఒకటే. ఇంక నాకు సెలవు ఇప్పించండి. నేను వెళ్లి మా తల్లి కౌసల్య దగ్గర అనుమతి తీసుకొని, నా భార్య సీతను ఊరడించి, తరువాత అరణ్యవాసమునకు వెళతాను.

అమ్మా! తండ్రిగారిని జాగ్రత్తగా చూచుకొనమని భరతునికి చెప్పమ్మా!   ఎందుకంటే తండ్రికి సేవచెయ్యడం మన సనాతన ధర్మం." అని అన్నాడు రాముడు.

రాముని ఒక్కొక్క మాటా వింటుంటే దశరథుననికి దు:ఖము పొర్లుకొని వస్తూ ఉంది. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. నోటమాట రావడం లేదు. శరీరం వశం తప్పుతూ ఉంది. తూలిపోతున్నాడు. అయినా నిలదొక్కుఉంటున్నాడు. రాముడు తండ్రి పాదములకు, కైక పాదము లకు నమస్కరించాడు. తరువాత రాజ మందిరము నుండి బయటకు వచ్చాడు.

ఇదంతా ద్వారము వద్ద వేచి ఉన్న లక్ష్మణుడు వింటూ ఉన్నాడు. కోపంతో రగిలిపోతున్నాడు. కాని అన్నగారి మొహం చూచి కోపాన్ని అణుచుకుంటున్నాడు. రాముడు బయటకు రాగానే రాముని వెనకగా వెళ్లాడు. రాముడు అక్కడ అమర్చిన పట్టాభిషేక ద్రవ్యములకు నమస్కరించాడు. సమస్తము త్యజించిన యోగివలె అక్కడి నుండి వెళుతున్నాడు. ఛత్రమును చామరమును వద్దన్నాడు. తన వెంట వచ్చిన స్నేహితులను వెళ్లిపొమ్మన్నాడు. రథమును కూడా వద్దన్నాడు. పాదచారియై తన తల్లి కౌసల్య మందిరమునకు వెళ్లాడు.

ఇంతజరిగినా రాముని మొహం మీద ఉన్న చిరునవ్వు చెరగలేదు. అందరినీ చిరునవ్వుతూ పలకరిస్తున్నాడు. రాముని వెంట ఉన్న లక్ష్మణుడు మాత్రం కోపంతో రగిలిపోతున్నాడు. కోపం ఆపుకోలేకపోతున్నాడు. లక్ష్మణుని కోపం అతని మొహంలో స్పష్టంగా కనపడుతూ ఉంది.

రాముడు కౌసల్యాభవనములో ప్రవేశించేటప్పటికి ఆమె భవనమంతా ఆనందోత్సాహాలతో నిండి ఉంది.

రాముడు తన మొహంలో ఏ మాత్రం వికారము కనపడ్డా ఆ ఆనందంఅంతా విషాదంగా మారుతుందని గ్రహించి, తన పెదవుల మీద చిరునవ్వు చెరగనీయకుండా తల్లివద్దకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము పంతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## (ఇరువదవ సర్గ.)

(ఇంతకు ముందు సర్గలో వాల్మీకి మహర్షి రాముడు కౌసల్య మందిరము ప్రవేశించాడు అని చెప్పాడు. కాని ఈ సర్గలో కొంచెం వెనక్కు వెళ్లాడు. ఇప్పుడు మనము ఇంకా దశరథుని అంతఃపురము లోనే ఉన్నాము. ఇంక చదవండి.)

కైక మాటలను మన్నించి రాముడు అక్కడనుండి బయటకు వచ్చిన తరువాత కైక అంతఃపురములోని స్త్రీలు, దశరథుని ఇతర భార్యలు భోరున ఏడ్చారు. అయ్యో రాముడు అడవులకు వెళ్లిపోతున్నాడా అని దుఃఖించారు. (దశరథునికి కౌసల్యా, సుమిత్ర,కైకేయీ కాక ఇంకా మూడువందలయాభై మంది భార్యలు ఉన్నట్టు ప్రతీతి.)

“తండ్రి నోటి నుండి మాట వెలుపలికి వచ్చీ రాకముందే ఆ కార్యములను చక్కబెట్టే రాముడు, అంతఃపురములోని వారికి ఏ లోటూరాకుండా అన్నీ అమర్చేరాముడు అరణ్యములకు పోతున్నాడు. తన తల్లి పట్ల ఎటువంటి భక్తి, ప్రేమ చూపుతున్నాడో, మన యందు కూడా అలాంటి భక్తి వినయము ప్రేమ చూపిన రాముడు అరణ్యము లకు పోతున్నాడు. కోపమంటే ఎరుగని రాముడు, ఎవరైనా తన మీద కోపగించినా వారి మీద కోపించని రాముడు ఇప్పుడు అరణ్యములకు పోతున్నాడు. ఇన్నాళ్లు దశరథుడు ఏదో తెలివిగల రాజు అనుకున్నాము,

కాని ఇంత తెలివితక్కువగా కన్నకొడుకును కారడవులకు పంపే మూర్ఖుడు అనేకోలేదు." ఈ ప్రకారంగా అంత:పుర స్త్రీలందరూ తలొక మాటా అనుకుంటూ దు:ఖిస్తున్నారు.

వారి మాటలు విన్న దశరథునికి శోకము ఇంకా ఎక్కువ అయింది. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. అంతలోనే స్పృహ తప్పుతున్నాడు. మరలా తేరుకుంటున్నాడు. రాముని కోసం చుట్టు వెర్రి చూపులు చూస్తున్నాడు.  రాముడు కనపడక మరలా హతాశుడవుతున్నాడు.

కౌసల్య అంత:పురము బయట ద్వారముల వద్ద అనేక మంది బ్రాహ్మణులు  నిలబడి ఉన్నారు. రాముని చూడగానే వారందరూ లేచి నిలబడ్డారు. అందులో ఒక వృద్ధబ్రాహ్మణుడు "రామా! నీకు జయమగు గాక" అని ఆశీర్వదించాడు. రాముడు అక్కడ నిలబడి ఉన్న బ్రాహ్మణులకు అందరికీ భక్తితో నమస్కరించాడు.

తరువాత ద్వారము వద్ద బ్రాహ్మణులు, ముత్తయిదువలు నిలబడి ఉన్నారు. రాముని రావడం చూచి వారందరూ లేచి నిలబడ్డారు. వారందరూ జయజయ ధ్వానములతో రాముని కౌసల్యా మందిరమునకు స్వాగతించారు.

మరి కొంత మంది లోపలకు పరుగు పరుగున వెళ్లి కౌసల్యకు రాముడు వస్తున్నాడు అన్న వార్తను అందించారు.

కౌసల్య రాత్రి అంతా జాగారము చేసి పొద్దుటే లేచి, స్నానాదికములు ఆచరించి, తెల్లని పట్టుచీర కట్టుకొని రాముని క్షేమం

కోరుతూ విష్ణు పూజ చేసింది. తరువాత అగ్నిలో మంగళ ద్రవ్యములు హోమం చేస్తూ ఉంది. రాముడు అంత:పురములో ప్రవేశించి హోమము చేస్తూ ఉన్న తల్లిని చూచాడు.

రాముడు రావడం చూచి కౌసల్య లేచి రాముని దగ్గరగా వచ్చింది. రాముడు తల్లి పాదములకు నమస్కరించాడు. కౌసల్య రాముని ఆశీర్వదించింది. తరువాత రాముని రెండు చేతలతో లేపి గట్టిగా కౌగలించుకొని తలమీద ముద్దు పెట్టుకొంది.

"నాయనా రామా! నీవు కూడా నీపూర్వీకుల వలె కీర్తి ప్రతిష్టలు పొందుదువు గాక! నీవు నీ వంశకర్తలు ఆచరించిన ధర్మములను పాటించెదవు గాక! నీ తండ్రి దశరథ మహారాజు నిన్ను ఈ రోజు యువరాజుగా పట్టాభిషిక్తుని చేస్తాను అన్నాడు. నీ తండ్రి మాట తప్పడు. నీకు ఈ రోజే యౌవరాజ్య పట్టాభిషేకము జరగ గలదు.

రామా! రాత్రి ఎప్పుడు తిన్నావో ఏమో. రా నాయనా భోజనము చేద్దువు గానీ." అని ఆప్యాయంగా రాముని భోజనానికి పిలిచింది.

రాముడు మరలా తన తల్లి కౌసల్యకు నమస్కరించి ఇలా అన్నాడు. "అమ్మా! ఇప్పుడు మనకు ఒక అనుకోని ఆపద ఒకటి వచ్చి పడినది. నేను ఇప్పుడు అత్యవసరంగా దండకారణ్యము పోవలెను. దీని వలన నీవు, సీత, లక్ష్మణుడు దు:ఖిస్తారు అని నాకు తెలుసు. కాని ఇది తప్పదు. నేను వెళ్లి తీరాలి. కాబట్టి నాకు నేటి నుండి ఈ రాజభోగము లు, రాజ భోజనములు, సింహాసనములు నిషిద్ధములు. నేను

కందమూలములు తింటూ, దర్భాసనము మీద పడుకోవాలి. ఈ విధముగా నేను పదునాలుగేళ్లు వనవాసము చెయ్యాలి. నాకు బదులుగా భరతుడు రాజ్యాభిషిక్తుడు అవుతాడు.  ఇది తండ్రి గారి నిర్ణయము. నాకు శిరోధార్యము." అని అన్నాడు.

రాముడు ఈ మాటలు అంటూ ఉండగానే కౌసల్య నిట్టనిలువునా కూలిపోయింది. రాముడు వెంటనే తల్లిని పైకి లేపి పక్కనే ఉన్న ఆసనము మీద కూర్చో పెట్టాడు. పరిచారికలు చల్లని నీళ్లు ఆమె మొహం మీద చల్లి సేదదీర్చారు. కౌసల్యకు దు:ఖము ఆగటం లేదు. కళ్లనుండి నీరు ధారాపాతంగా కారిపోతూ ఉంది. నోటమాట పెగలడంలేదు.

"రామా! నువ్వు నా కడుపున ఎందుకు పుట్టావయ్యా! నాకు ఈ వార్త చెప్పడానికేనా! అసలు నాకు పిల్లలు లేకుండా ఉంటేనే బాగుండేది. పిల్లలు లేరు అని ఒకే దిగులు ఉండేది. కాని ఇప్పుడు నువ్వు పుట్టి పెరిగి ప్రయోజకుడవు అయి నాకు ఎనలేని దు:ఖము కలిగిస్తున్నావు. ఇది నీకు న్యాయమా రామా!

రామా! నేను పెళ్లి చేసుకొని ఇక్కడకు వచ్చిన తరువాత సుఖము అనేది ఎలా ఉంటుందో నాకు తెలియదు. నా భర్త రాజుగా ఉన్న రోజుల్లో  నాకు ఏనాడూ సుఖము లేదు. కనీసము నువ్వు పట్టాభిషిక్తుడవు అయిన తరువాత అన్నా సుఖపడదామనుకున్నాను. ఆ ఆశకూడా అడియాస చేసావు రామా!

రామా! నేను అందరి కంటే పెద్ద భార్యను అయి ఉండి కూడా, నీ వనవాసముతో అందరి ముందూ తలదించుకోవాల్సిన పరిస్థితి, వారి సూటీ పోటీ మాటలు పడాల్సిన దౌర్భాగ్యము నాకు దాపురించింది. ఇంతకు మించి స్త్రీలకు దు:ఖము ఏముంటుంది. రామా! నీవు ఇక్కడ ఉండగానే నా సవతులు నన్ను నిరాదరిస్తున్నారు. ఇంక నీవు లేకపోతే చెప్పవలెనా. నా బతుకు దుర్భరము అవుతుంది. అందుకే నాకు మరణమే శరణ్యము.

రామా! నా భర్త నన్ను ఏనాడూ అందరితో పాటు ఆదరించలేదు. ముఖ్యంగా ఆ కైక, ఆమె దాస దాసీల పాటి కూడా నేను చెయ్యలేదు. నా భర్త వారి కన్నా హీనంగా నన్ను చూచాడు. పేరుకు పెద్దభార్యనే కానీ స్వతంత్రించి ఏ పనీ చెయ్యలేను. నాది ఒక బానిసబతుకు. నువ్వు చెప్పినట్టు రేపు భరతుడు రాజైతే. ఈరోజు నన్ను పలకరించే వాళ్లు కూడా రేపు నా మొహం చూడరు. నాతో మాట్లాడరు. ఇంక కైక సంగతి చెప్ప పనిలేదు. రేపటి నుండి నన్ను ఒక మనిషిగా కూడా చూడదు. చీటికీ మాటికీ నన్ను నిందిస్తూ ఉంటుంది. అసలు ఆమె మొహం చూడటానికే నాకు భయంగా ఉంటుంది.

రామా! నిన్ను చూచుకొని, ఇన్నాళ్లు ఈ దుర్భరమైన బాధలు భరించాను. నీకు ఉపనయనము అయిన నాటి నుండి దాదాపు పదిహేడు సంవత్సరములు నువ్వు రాజ్యాభిషిక్తుడవు అవుతావనీ, నా కష్టములు తీరుస్తావని ఆశతో ఎదురు చూచాను. నీ మాటలతో ఆ ఆశ నిరాశ అయింది. ఈ వృద్ధాప్యంలో నేను, నా సవతుల సూటీ పోటీ మాటలు, వారు చేయు అవమానములు భరించలేను.

ఇన్నాళ్లు నీ ముద్దులొలికే మొహం చూస్తూ ఈ బాధలన్నీ దిగమింగుకున్నాను. ఇంక నువ్వు నాకు కనపడవు. నేను ఈ బాధలు భరించలేను. నేను ఎంతో దురదృష్టవంతురాలను. లేకపోతే నీ క్షేమం గురించి, నీకు ఆయురారోగ్య ఐశ్వర్యములు కలగాలనీ, నీవు రాజ్యాభిషిక్తుడివికావాలనీ ఎన్నో పూజలు వ్రతాలూ ఉపవాసాలు చేసాను. ఏ దేవుడూ నన్ను కరుణించలేదు. నా బాధలను తీర్చలేదు. అవన్నీ వ్యర్థమైపోయాయి.

రామా! నా గుండె చాలా కఠినమయింది లేకపోతే నీవు చెప్పిన ఈ దుర్వార్త విని నా గుండెలు ఈ పాటికి పగిలిపోవాల్సింది. కాని అలా జరగలేదు.. నాగుండెలు రాతి బండలు. అవి పగలవు. నాకు మరణము రాదు.

రామా! నాకు పుత్ర సంతానము కావాలని ఎన్నో పూజలు, ఎన్నెన్నో వ్రతాలూ యజ్ఞాలు యాగాలు చేసాను. నీవు పుట్టావు. కానీ ఏం లాభం. అవి ఫలించలేదు. నీకు వనవాసము ప్రాప్తించింది.

రామా! మానవులకు తమ ఇష్టం వచ్చినప్పుడు మరణించే అవకాశము లేదు కదా! లేకపోతే నీవు ఈ మాట చెప్పగానే హాయిగా మరణించి ఉండేదాన్ని. ఎందుకంటే రామా! ఇంక నేను ఎందుకు బతకాలి. ఎవరి కోసం బతకాలి. ఏం అనుభవించడానికి బతకాలి. వ్యర్థంగా కలకాలం బతకడం కంటే మరణించడం మేలు కదా!

లేకపోతే రామా! ఒకపని చెయ్యి. నన్నుకూడా నీ వెంట అరణ్యములకు తీసుకొని వెళ్లు. నీ యోగక్షేమాలు చూసుకుంటూ నీ వెంటే ఉంటాను." అని కౌసల్య రాముని చూచి తన మనసులో ఉన్న బాధను ఆవేశాన్ని అంతా వెళ్లగక్కింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఇరువదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఇరువది ఒకటవ సర్గ.

రాముడు అరణ్యములకు పోతాను అని చెప్పడం, ఆ మాటలు విని కౌసల్య భోరున ఏడవడం అంతా చూస్తున్నాడు లక్ష్మణుడు. వారిని చూచి ఇలా అన్నాడు.

"అమ్మా కౌసల్యా! అన్నా రామా! ఒక స్త్రీ కోరిన కోరికలు నెరవేర్చడం కోసరం రాముడు అడవులకు వెళ్లడం నాకు అసలే ఇష్టం లేదు. మన తండ్రి దశరథుడు కామపీడితుడు, భోగలాలసుడు. విషయ వాంఛలకు లోబడ్డవాడు. అలాంటి రాజు, కైక మాటలకు లోబడి ఏమైనా మాట్లాడవచ్చును. కాని అది ఆచరణయోగ్యము కాదు. ఎందుకంటే రాముడు అయోధ్యనుండి వెడలగొట్టబడవలసిన తప్పు ఏమీ చేయలేదు. చేయడు కూడా.   అటువంటప్పుడు రాముడు అడవులకు ఎందుకు వెళ్లాలి.

రామునికి పరమ శత్రువు కూడా రాముని గురించి చెడ్డగా మాట్లాడడు. ధర్మాచరణము చేయు వాడు ఎవరూ గుణవంతుడు, ఋజువర్తనుడు అయిన కుమారుని అడవులకు పంపడు. రాజధర్మము తెలిసిన వాడు ఎవడూ దశరథ మహారాజు మాటలను ధర్మ సమ్మతము గా అంగీకరింపడు. ధర్మసమ్మతము కాని రాజు ఆదేశములను మనము పాటించ నవసరము లేదు. రాజ్యం వీరభోజ్యము. నాకు

అనుమతి ఇవ్వండి బలప్రయోగంతో రాజ్యము స్వాధీనము చేసుకుంటాను. ఎవరు అడ్డు వస్తారో చూస్తాను.

రామా! నేను నీ పక్క ధనుస్సు పట్టుకొని నిలబడి ఉండగా నీ నీడను కూడా ఎవరూ తాకలేరు. రామా! ఈ అయోధ్యా నగరము నీది. ఈ అయోధ్యలో నీకు ఎవరైనా అపకారము చేయడానికి సాహసిస్తే, ఈ అయోధ్యానగరాన్నే నేలమట్టం చేస్తాను.

రామా! ఈ లోకం తీరే అంత. మెతకగా ఉంటే నెత్తికెక్కుతారు. భరతునికి పట్టాభిషేకము చెయ్యాలి అనే వాడు ఎవడినైనాసరే భరతుని పక్షానమాట్లాడే ఎవడి నైనా సరే వాడిని వధిస్తాను. కైక పక్షము వహించి, కైక మీది ప్రేమతో నిన్ను అడవులకు పంపుతున్న మన తండ్రి దుర్మార్గుడు. దుర్మార్గుడు బంధింపతగినవాడు. అందుకని దశరథుని బంధించెదను. అవసరమైతే వధిస్తానుకూడా. గురువు అయినా సరే, దుర్మార్గుడు అయితే అతడు శిక్షార్హుడు.

రామా! మన తండ్రి ఎవరి అండచూచుకొని, పెద్దవాడైన నిన్ను కాదని రాజ్యమును భరతునికి ఇవ్వదలచుకున్నాడో అర్థం కావడం లేదు. నీతో నాతో విరోధము పెట్టుకొని భరతునికి రాజ్యాభిషేకము చేసే ధైర్యము దశరథునికి ఎక్కడిది?

అమ్మా! కౌసల్యాదేవీ! నాకు రాముడు అంటే ప్రాణము. నా ధనుస్సు మీద నేను చేసిన యజ్ఞయాగముల మీద ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. రాముడు సామాన్యుడు కాడు. రాముడు అరణ్యములలోనూ అగ్నిలోనూ ప్రవేశింపగలడు. కానీ, దేనికైనా సరే,

రాముని కన్నా ముందు నేను ఉంటాను. నేను ఉండగా మీకు ఎలాంటి భయము లేదు. నిశ్చింతగా ఉండండి." అని ఆవేశంతో పలికాడు లక్ష్మణుడు.

ఆవేశంతో పలికిన లక్ష్మణుని మాటలు విన్న కౌసల్య రాముని తో దు:ఖిస్తూ ఇలాఅంది. "రామా! నీ తమ్ముడు లక్ష్మణుని మాటలు విన్నావు కదా! నీకు ఇష్టం అయితే ఆ ప్రకారము చెయ్యి. అధర్మపరురాలు అయిన నా సవతి కైకేయీ మాటలు మనము పాటించ నవసరము లేదు. నీవు అరణ్యములకు వెళ్ల నవసరము లేదు.

రామా! నీకు అన్ని ధర్మములు తెలుసు. మాతృసేవ చెయ్యడం పరమ ధర్మము. కాబట్టి నీవు అయోధ్యలో ఉండి ఈ వృద్యాప్యంలో నా దగ్గర ఉండి నాకు సేవలు చెయ్యి. నీ ధర్మమును ఆచరించు. రామా! పూర్వము కాశ్యపుడు తన తల్లికి సేవలు చేసి తరించాడు. రామా! నీకు నీ తండ్రి ఎంతటి పూజనీయుడో, నేనూ అంతటి పూజనీయురాలనే కదా. కాబట్టి నేను చెబుతున్నాను. నీవు అరణ్యములకు వెళ్ల నవసరము లేదు. అరణ్యములకు వెళ్లుటకు నేను అనుమతి ఇవ్వను. నీవు నా దగ్గర ఉండి నాకు సేవలు చేసుకో.

నీవు అరణ్యములలో ఉంటే నేను ఇక్క మృష్టాన్నములు ఎలా భుజించగలను. నీతోపాటు ఉంటూ ఆకులు అలములు తినడం నాకు ఎంతో ఇష్టం. అలా కాకుండా నీవు అరణ్యములకు వెళితే నేను అన్నపానీయములను తీసుకోకుండా ప్రాయోపవేశము చేస్తాను. క్రుంగి, కృశించి మరణిస్తాను. నీ కోసరం నిన్ను తల్చుకుంటూ నేను మరణిస్తే నీకు దుర్గతులు కలుగుతాయి. తర్వాత నీ ఇష్టం." అని పలికింది

కౌసల్య.

తమ్ముడు లక్ష్మణుని మాటలూ, తల్లి కౌసల్య మాటలూ సావధానంగా విన్నాడు రాముడు. వారితో ఇలా అన్నాడు.

"అమ్మా! నాకు నా తండ్రి దైవసమానుడు. ఆయన ఆజ్ఞను ధిక్కరించే శక్తి నాకు లేదు. కాబట్టి నిన్ను వేడుకుంటున్నాను. నన్ను అరణ్యములకు వెళ్లనీ. పూర్వము పితృవాక్య పరిపాలన కొరకు కండు మహర్షి గోవును కూడా చంపాడు. మన వంశములోని సగర కుమారులు తండ్రి ఆజ్ఞ మేరకు భూమి నంతా తవ్వారు. ఆ ప్రయత్నంలో తమ ప్రాణాలు కోల్పోయారు. అంతెందుకు, తన తండ్రి జమదగ్ని ఆజ్ఞమేరకు, పరశు రాముడు, తన తల్లి రేణుకను గొడ్డలితో నరికి చంపాడు. అమ్మా! మన పూర్వీకులందరూ పితృవాక్పరిపాలనకు తమ ప్రాణాలుకూడా అర్పించారు. నేను నా తండ్రి మాట మేరకు కేవలం అరణ్యములకు పోతున్నాను. నా పూర్వీకులు ఆచరించిన ధర్మమునే నేనూ ఆచరిస్తున్నాను.

ఈనాడు నేను నా స్వార్థము కొరకు, పితృవాక్యమును పాటించకుండా, కొత్త ధర్మమును సృష్టించలేను. తండ్రి మాటను పాటించిన వాడికి దోషము అంటదు. తండ్రిమాటను ధిక్కరించి నేను నా పూర్వీకులముందు దోషిగా నిలబడలేను." అని తల్లితో పలికిన రాముడు తమ్ముడు లక్ష్మణుని చూచి ఇలాఅన్నాడు.

"తమ్ముడా లక్ష్మణా! నీకు నా మీద ఎంత ప్రేమ, వాత్సల్యము గౌరవము ఉన్నాయో నాకు తెలుసు. నా తల్లికి ధర్మసూక్ష్మములు

వేదాంత రహస్యములు తెలియక పోవడం వలన, పామరత్వం చేత దు:ఖము పొందుతూ ఉంది.

లక్ష్మణా! ఈ లోకంలో ధర్మాచరణ ఎంతో ముఖ్యము. ధర్మము నందే సత్యము ప్రతిష్ఠితమై ఉన్నది. తండ్రిగారు తన ధర్మమును తాను పాటించారు. తల్లికి వరాలు ఇస్తాను అన్నారు. ఆమె కోరుకొన్నది ఇవ్వడం రాజు ధర్మము. ఆ ధర్మమును ఆయన నిర్వర్తించాడు. పితృవాక్పరిపాలన నా ధర్మము. కాబట్టి నా ధర్మమును నేను నిర్వర్తించాలి కదా! ధర్మమును ఆశ్రయించిన వాడు తండ్రికి, తల్లికి, గురువుకు ఇచ్చిన మాటను తప్పకూడదు. నా తండ్రి మాటలను నా తల్లి కైకేయీ నాకు చెప్పింది. ఇందులో ఆమె తప్పేముంది. తండ్రి మాటలను ఆచరించడం నా ధర్మము.

కాని క్షత్రియ ధర్మము వేరుగా ఉంటుంది. బలవంతంగా రాజ్యము ఆక్రమించుకోడం క్షత్రియ ధర్మము. ప్రస్తుతము మనకు కులధర్మమే ముఖ్యము. క్షత్రియ ధర్మము కాదు. నీవు కూడా క్షత్రియ ధర్మమును పక్కనపెట్టి ధర్మాచరణము చెయ్యి. నీ కోపము వదిలి పెట్టు. నేను చెప్పిన మాటలను ఆచరించు." అని అన్నాడు రాముడు.

తరువాత తల్లి కౌసల్యను చూచి చేతులు జోడించి ఇలా అన్నాడు. "అమ్మా! నేను అరణ్యములకు పోవడానికి నాకు అనుమతి ఇవ్వు. దీనికి మారు పలికితే నా మీద ఒట్టు. నా ప్రయాణమునకు కావలసిన వస్తువులను సేకరించు. అమ్మా! పదునాలుగు సంవత్స రములు ఎంతలో అయిపోతాయి. ఇలా వెళ్లి అలాతిరిగి వస్తాను. నామాట నమ్ము. అమ్మా! నీ మనసులో నా గురించి దు:ఖించకు.

తండ్రిమాటప్రకారము వెళుతున్నాను. నీ మాట ప్రకారము తిరిగి వస్తాను.

అమ్మా! మనకందరకూ పెద్ద తండ్రి గారు. నీవు, నేను, సీత లక్ష్మణుడు, అందరమూ తండ్రిగారి మాటను గౌరవించాలి కదా! అదియే కదా సనాతనధర్మము. అమ్మా! ఇంక నా పట్టాభిషేకమునకు ఏర్పాట్లు చేయడం ఆపి, నా వనవాసమునకు ఏర్పాట్లు చెయ్యి." అని అన్నాడు రాముడు.

రాముడు అలా మాట్లాడుతుంటే కౌసల్యకు ఏమనాలో తోచలేదు. రాముని చూచి ఇలా అంది. "రామా! నీవు సనాతన ధర్మము గురించి చెప్పావు. సనాతన ధర్మములో తండ్రి మాటకు ఎంత విలువ ఇవ్వాలో తల్లి మాటకూ అంతే విలువ ఇవ్వాలి కదా. కాబట్టి నేను చెబుతున్నాను. నీ తల్లి మాట ప్రకారము నీ తల్లిని విడిచి నీవు వెళ్లవద్దు. నన్ను దు:ఖముల పాలు చెయ్యవద్దు. నేను నీకు తల్లిని, గురువును. నేను నీకు వనములకు పోవడానికి అనుజ్ఞ ఇవ్వను. నీవు వెళ్లడానికి వీలు లేదు.

రామా! నీవు లేని ఈ బ్రతుకు నిరర్థకము. నేను చచ్చి స్వర్గానికి వెళ్లినా, అక్కడ లభించే అమృతము కూడా నీకుసాటి రాదు. నీవు ముహూర్తకాలము నా ఎదుట ఉంటేచాలు, ఏ స్వర్గసుఖములు దానికి సమానం కావు. రామా! నన్ను విడిచి వెళ్లకు." అంటూ దీనంగా ఏడుస్తున్న తల్లిని చూచి రాముని మనస్సు ద్రవించి పోయింది. ఆమెను ఎలా ఓదార్చాలో తెలియలేదు రామునికి. అందుకని లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"లక్ష్మణా! నీవు కూడా తల్లిగారితో చేరి నన్ను ఆపడానికి ప్రయత్నం చేస్తున్నావు. ఇది ధర్మమా! తల్లిగారు చూడు ఎలా పరితపిస్తూ ఉందో. ఆమెను ఊరడించాల్సింది పోయి, ఆమెను, నన్ను, నీ మాటలతో బాధపెట్టావు.

లక్ష్మణా! అర్థకామములు ధర్మ సమ్మతము లైనపుడే అవి మంచి ఫలములను ఇస్తాయి. అందుకని అర్థకామముల కంటే ధర్మమునకే ప్రాధాన్యము. ధర్మాచరణము అత్యంత ఆవశ్యకము. మనము ఎల్లప్పుడూ ధర్మసమ్మతములైన పనులను చేయడంలోనే ఆసక్తి కలిగి ఉండాలి. కేవలము అర్థము, కామము తో కూడిన పనులను చేయడం వలన రాగ ద్వేషములు ప్రబలుతాయి. అవి ధర్మపరులకు మంచివి కావు. మన తండ్రి వృద్ధుడు. మనకు పూజ్యుడు. ఆయన కామ ప్రకోపంతో గానీ, కోపంతో గానీ మనలను ఒక పనిచెయ్యమని చెప్పినప్పుడు, అది ధర్మంకాదు అని మనం నిరాకరించడం, ధర్మాచరణము అనిపించుకోదు. కేవలము దుష్టులు మాత్రమే అలా చేస్తారు.

లక్ష్మణా! మన తండ్రిగారు నీకు, నాకు తండ్రి, గురువు, దైవము. అలాగే మన తల్లి గారికి ఆయన భర్త. భర్త మాట భార్యకు శిరోధార్యము. కాబట్టి మనందరికీ దశరథ మహారాజు ఆజ్ఞను పాటించడం తప్ప మరోమార్గము లేదు. పైగా, తన భర్త అయిన దశరథమహారాజు గారు జీవించిఉండగా, భర్తను వదిలిపెట్టి, తల్లిగారు నా వెంట అడవులకు ఎలా రాగలరు. అది ధర్మము కాదు."అని తల్లి వంక తిరిగి

"అమ్మా! నాకు అరణ్యములకు వెళ్లుటకు అనుమతి ఇవ్వు. పదునాలుగు  సంవత్సరముల తరువాత నేను క్షేమంగా అయోధ్యకు తిరిగి రావాలని నన్ను ఆశీర్వదించు. నా తండ్రి మాటను పాటించడం, నాపూర్వీకులు నడిచిన బాటలో నడవడం--వీటితో పోలిస్తే, ఈ తుచ్ఛమైన రాజ్యభోగములు నాకు తృణప్రాయములు.  కేవలం రాజ్యం కోసరం శాశ్వత కీర్తి ప్రతిష్టలను వదులుకోలేను.

అమ్మా! ఈ జీవితము నీటి బుడగ వంటిది. నాలుగు రోజులు రాజ్యం పాలించడం కోసరం, ధర్మము తప్పి, అధర్మంగా రాజ్యమును కైవసం చేసుకోవడం మంచిది కాదు." అని తన మనస్సులో ఉన్న మాటను అమ్మకు, తమ్ముడికి స్పష్టం చేసాడు. తల్లికి ప్రదక్షిణపూర్వకంగా నమస్కారముచేసాడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ఇరువది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఇరువది రెండవ సర్గ.

రాముడు ధృఢచిత్తంతో ఉన్నాడు. తనకు కావలసిన పట్టాభిషేకము అర్ధాంతరంగా ఆగిపోయినా చలించలేదు. తన లోపల ఉన్న భావాలను బయటకు కనిపించకుండా జాగ్రత్త పడుతున్నాడు. ఆవేశంతో ఊగిపోతున్న లక్ష్మణునితో ఇలా అన్నాడు.

"తమ్ముడా లక్ష్మణా! నీ కోపాన్ని విడిచిపెట్టు. కోపము ప్రదర్శించడానికి ఇది సమయము కాదు. ధైర్యంగా ఉండు. ఆనందంగా ఉండు.  ఈరోజు నాకు పట్టాభిషేకము అన్న విషయము మరిచిపో. నా పట్టాభిషేకమునకు సేకరించిన వస్తువులు అన్నీ పక్కన పెట్టు.

పాపము నా తల్లి కైక నాకు పట్టాభిషేకము జరుగబోవు చున్నది అని బాధపడిపోతూ ఉంది. ఆమె బాధను మనము పోగొట్టాలి. పట్టాభిషేకము ఆగిపోయింది అని ఆమెకు తెలియజెయ్యాలి. ఎందుకంటే నా తల్లి కైక మనసులో బాధ, అనుమానము ఉంటే నేను సహించలేను. నేను పుట్టిన తరువాత నా తల్లులకు గానీ నా తండ్రికి గానీ మనసు బాధపెట్టలేదు. నా తండ్రి సత్యమునే పలుకుతాడు. ఆడిన మాట తప్పడు. ఆయన  నా తల్లి కైకకు ఇచ్చిన మాట నెరవేర్చడం నా కర్తవ్యము.

మీరు అనుకున్నట్టు నాకు పట్టాభిషేకము జరిగితే నా తండ్రి నా తల్లి కైకకు ఇచ్చిన మాట తప్పిన వాడు అవుతాడు. అది నాకు ఇష్టం లేదు. కాబట్టి, నా పట్టాభిషేక కార్యక్రమమును ఇంతటితో నిలిపివేసి వెంటనే అరణ్యములకు వెళ్లే పనిలో ఉంటాను. అదే నా ప్రస్తుత కర్తవ్యము. నేను అడవులకు వెళితే నా తల్లి కైక మనస్సు శాంతిస్తుంది. ఆమె పరిపూర్ణంగా సంతోషిస్తుంది. తన కుమారుడు భరతునికి నిర్విఘ్నంగా పట్టాభిషేకము జరిపించు కుంటుంది.

లక్ష్మణా! నీకు తెలుసో లేదో. మన తండ్రిగారు కూడా ఈ నిర్ణయాన్ని చాలా బాధతో తీసుకున్నారు. ఆయన తీసుకున్న నిర్ణయం అమలు పరచడం మన బాధ్యత. మనం ఇంకొక విషయం మరిచి పోకూడదు. నేను కోరుకోకుండానే నా పట్టాభిషేకము నిర్ణయం అయింది. కాని అది అర్ధాంతరంగా ఆగిపోయింది. ఇది కూడా నా ప్రమేయం లేకుండానే జరిగింది. ఈ విచిత్ర పరిణామాలకు ఎవరూ కారణం కాదు.  ఎవరినీ తప్పుపట్టనవసరం లేదు. ఇది అంతా దైవ నిర్ణయం అని సరిపెట్టుకోవాలి.

మన తల్లి కైకకు నా పట్టాభిషేకము  ఆపించవలెనని ఆ దైవమే బుద్ధిపుట్టించి ఉంటుంది. లేకపోతే   ఇదివరలో ఎప్పుడూ నన్ను పల్లెత్తు మాటకూడా అనని మన తల్లి కైక,  నాకు ఎందుకు ఈ రకమైన బాధ, కష్టం కలిగిస్తుంది. నన్ను అడవులకు పొమ్మని శాసిస్తుంది.  నేను నా తల్లి కైకకు ఎన్నడూ మనసుకు కష్టం కలిగించి ఎరుగను. అలాగే నా తల్లి కైక నన్ను, తన కుమారుడు భరతుని ఎన్నడూ బేధబుద్ధితో చూడలేదు. మాఇద్దరినీ సమానంగా చూచింది. ఇవన్నీ నీకూ తెలుసు.

కాబట్టి లక్ష్మణా! కైక నా గురించి పరుషంగా మాట్లాడటం గానీ, నా పట్టాభిషేకమును నిలిపివేయడం గానీ, ఆమె స్వతాహాగా చేసినది కాదు. అంతా దైవ నిర్ణయం. లేకపోతే ఉత్తమ రాజవంశము లో పుట్టిన కైక, ఒక సామాన్య స్త్రీ వలె, తన భర్తముందు, పట్టాభిషేకము చేసుకోబోవు తన కుమారుని తూలనాడుతుందా! అతని పట్టాభి షేకమును ఆపిస్తుందా! ఆ మె విపరీత ప్రవర్తనకు దైవమే కారణము కానీ వేరుకాదు.

దైవ నిర్ణయములు చాలా కఠినంగా ఉంటాయి. దైవ నిర్ణయాన్ని అడ్డుకోడానికి ఎవరికీ సాధ్యం కాదు. అందుకే నా తల్లి కైక నన్ను అడవులకు వెళ్లమని కోరింది. ఆ దైవనిర్ణయాన్ని అమలు పరచడం నా కర్తవ్యం. దైవము ఎలా నడిపిస్తే అలా నడవడం మన కర్తవ్యం. అలాంటి దైవ నిర్ణయానికి ఎవడు ఎదురీదగలడు?

లక్ష్మణా! మనము ఏదో చేస్తున్నాము ఏదో సాధిస్తున్నాము అని అనుకుంటాము. అది పొరపాటు. మనకు అనుదినమూ కలిగే సుఖదు:ఖాలు, భయము, క్రోధమూ, లాభనష్టాలూ, ఉండటం, లేకపోవడం, ఇవి అన్నీ దైవ నిర్ణయంబట్టి జరుగుతూ ఉంటాయి. మానవుల ప్రమేయము ఏమీ లేదు. పూర్వము ఇంద్రియములను జయించాము అని చెప్పుకొన్న మహాఋషులు కూడా దైవప్రేరితులై, కామ కోరికలకు లోబడి, తమ తపస్సులను నాశనం చేసుకున్నారు. ఏదైనా ఒక పని మనము సంకల్పించినపుడు. ఆ పని పూర్తి కావచ్చే సమయంలో ఏదైనా అడ్డు తగిలితే దానిని దైవనిర్ణయంగానే భావించాలి. కాబట్టి ఇంకొంచెం సేపటిలో జరుగబోవు నా పట్టాభి షేకము, ఏ కారణం చేతనైనా, ఆగిపోయింది అంటే అది దైవ

నిర్ణయమే గాని వేరు కాదు. నా పట్టాభిషేకము అగిపోయినందుకు నాకు ఎలాంటి దు:ఖము లేదు. నేను బాధపడటం లేదు. నీవు కూడా నీ మనసులో ఉన్న బాధను తీసి వెయ్యి. వెంటనే పట్టాభిషేకమునకు జరుగుచున్న పనులను నిలిపివెయ్యి.

లక్ష్మణా! నా పట్టాభిషేకము కొరకు సముద్రముల నుండి పవిత్ర పుణ్య నదీనదముల నుండి తెచ్చిన నీటితో నేను రేపటినుండి గడపబోవు తాపస వ్రతమునకు దీక్షా స్నానం చేస్తాను. అయినా వద్దులే. ఎక్కడెక్కడి నుంచో అతి కష్టం మీద తెచ్చిన ఈ పుణ్య నదీజలములు నాకు ఎందుకు. నేను బావిలో నుండి నీరు తోడుకొని స్నానం చేస్తాను. రేపటి నుండి నేను అలా చెయ్యాలి కదా!

తమ్ముడూ! నాకు రాజ్యలక్ష్మి లభించలేదని బాధ పడకు. దానికి బదులు నాకు వనలక్ష్మి లభించిందని సంతోషించు. నా దృష్టిలో రెండూ ఒకటే." అని అని లక్ష్మణుని అనునయించాడు రాముడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఇరువదిరెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఇరువది మూడవ సర్గ.

రాముడు చెప్పిన మాటలన్నీ శ్రద్ధగా బుద్ధిగా విన్నాడు లక్ష్మణుడు. కాని లక్ష్మణుని మనసులో కోపం అగ్ని వలె మండుతూ ఉంది. నుదురు ముడుతలు పడింది. దీర్ఘంగా శ్వాస తీస్తున్నాడు. అప్పుడు లక్ష్మణుని మొహం కోపంతో ఉన్న సింహంలా ఉంది. రాముని మొహంలోకి సూటిగా చూడలేక క్రీగంటితో చూస్తూ ఇలా అన్నాడు.

"అన్నయ్యా! కేవలము తండ్రిమాటను పాటించడం కోసం ఏమైనా చెయ్యాలనో, తండ్రి మాటను ధిక్కరిస్తే లోకము ఏమను కుంటుందో అనే భయంతోనూ నీవు అరణ్యములకుపోవడం అంత బాగాలేదు. పైగా దైవనిర్ణయము అంటున్నావు. దైవము ఇలా చేస్తుందా. దైవానికి ఒకరి మీద కోపము మరొకరి మీద ద్వేషము ఎందుకుం టుంది. కాబట్టి దీనిని దైవనిర్ణయము అనడానికి వీలులేదు. ఇదంతా కుయుక్తితో కైక, ఆమె మాటలకు తలూపిన దశరథుడు, చేసిన కుతంత్రము. ముందు వారిద్దరినీ అనుమానించాలి.

కైక, దశరథుడు పైకి ధర్మములు బోధిస్తూ, లోలోపల నీకు అపకారము చేస్తున్నారు. 'ఆడిన మాట తప్పకూడదు' అనే ధర్మాన్ని అడ్డుపెట్టుకొని నీ రాజ్యము అపహరిస్తున్నారు. ఇది అధర్మము. ఇది నీకు అర్థం కావడం లేదు.

నా ఉద్దేశంలో కైక, దశరథుడు కలిసి ఆడిన నాటకము. లేకపోతే ఎన్నడో ఇస్తాను అన్న వరములు ఇప్పుడు కోరడం ఏమిటి? అసలు దశరథుడు వరాలు ఇస్తాను అని కైకకు మాట ఇచ్చాడు అని ఎవరికి తెలుసు. ఒకవేళ వరాలు ఇచ్చిఉంటే ఇన్నాళ్లు ఎందుకు ఊరు కుంటాడు. ఎప్పుడో తీర్చి ఉండేవాడు కదా! కాబట్టి కైక ఈ వరాలు కోరడం, వాటిని ఈ సమయంలో అడగడం, రాజు ఇవ్వడం, అంతా బూటకం. నిన్ను అడ్డు తొలగించుకోడానికి దశరథుడు, కైక కలిసి ఆడుతున్న నాటకము.

నీవు జ్యేష్టుడవు. రాజ్యము జ్యేష్టునికే చెందుతుంది. అది లోక ధర్మము. కాబట్టి నీవు అరణ్యములకు వెళ్లడం నేను సహించను. నన్ను మన్నించు. నీ బుద్ధిని పెడతోవ పట్టిస్తున్న ఈ ధర్మాచరణమును నేను ఖండిస్తున్నాను. నీకు శక్తి యుక్తులు ఉండి కూడా, నీ తండ్రి దశరథుడు, నీ తల్లికైక మాటలకు ఎందుకు తలూపుతున్నావో అర్థం కావడం లేదు. కైక చేస్తున్నది కపటోపాయము అని స్పష్టంగా తెలుస్తూ ఉంది. కాని దానిని నీవు కపటము అని గ్రహించలేకపోవడం దురదృష్టము.

ధర్మంగా నడిచే వారిపట్ల మనం కూడా ధర్మంగా ప్రవర్తించాలి. కాని కైక, దశరథుడు లాంటి అధర్మ వర్తనులపట్ల ధర్మాచరణము యోగ్యము కాదు. పైగా అది నిందింపతగినది. రామా! నీ తండ్రి దశరథుడు, నీ తల్లి కైక నీ క్షేమమును కోరేవారు కాదు. వారు నీకు శత్రువులు. అటువంటి వారి కోరికను తీర్చాలని నీవు మనసులో కూడా తలచడం మహాపాపము. నీవు అన్నట్టే వారి చేయు పనులు

దైవనిర్ణయములు అని అనుకొందాము. దైవనిర్ణయమైనా, అది అధర్మము అయినపుడు దానిని పాటించకపోవడమే ధర్మము.

చేతకాని వాళ్లు, పిరికివాళ్లు, దైవము మీద ఆధారపడతారు. మన లాంటి వీరులు, ధైర్యవంతులు దైవము మీద ఆధారపడరు. దైవనిర్ణయములను లెక్కచెయ్యరు. నీ స్వశక్తితో, వీరత్వముతో నీవు దైవనిర్ణయమును ఎదిరించినా, దైవము నిన్ను ఏమీ చెయ్యదు, చెయ్యలేదు. ఎందుకంటే నీవు ధర్మము ప్రకారము నడుచుకుంటు న్నావు కాబట్టి.

అయినా చూద్దాము. మానవునికి ఉండే శక్తి ఎంతో, దైవమునకు ఉండే శక్తి ఎంతో నేడు తేలిపోతుంది. ఎవరు గెలుస్తారో చూద్దాం. నీవు చెప్పినట్టు నీ పట్టాభిషేకమును ఏ దైవమైనా అడ్డు కుంటూ ఉంటే, ఆ దైవమును నేను నా స్వశక్తితో ఎదిరిస్తాను. నీ పట్టాభిషేకమును నేను జరిపిస్తాను. ఏ దైవము అడ్డుకుంటుందో చూస్తాను.

రామా! ఆ దైవమే కాదు, దిక్పాలకులు, ముల్లోకములు ఒకటై వచ్చినా సరే నీ పట్టాభిషేకమును ఆపలేరు. ఇంక ఆ దశరథుడు ఒక లెక్కా! ఎవరైతే రహస్యంగా నీకు పదునాలుగేళ్లు వనవాసము విధించారో, వారినే అరణ్యాలకు పంపుతాను. కైక ఆశలు ఈ జన్మలో నెరవేరకుండా చేస్తాను. నన్ను ఎదిరించిన వాడిని ఆ దైవము కూడా రక్షించలేదు.

రామా! నేను అంటున్నాను. నీవు అయోధ్యను వెయ్యి సంవత్స రాలు పాలిస్తావు. తరువాత నీ కుమారులు పాలిస్తారు. భరతుడు కలలో కూడా రాజు కాడు, కాలేడు. నీ తండ్రి రాజ్యము నీకు సంక్రమించినట్టే, నీ రాజ్యము నీ కుమారులకు సంక్రమిస్తుంది. అదే ధర్మము.

రామా! దశరధుడు కామాతురుడై ఉన్నాడు, ఆయన మనసు సరిగా పనిచెయ్యడంలేదు. అందుకని రాజు మాటలు పాటించ నవసరము లేదు. నీవు పట్టాభిషేకము చేసుకోడానికి సిద్ధంగా ఉండు. నీకు రక్షణగా నేను ఉంటాను. ఎవరైనా అడ్డం వస్తే వారి అంతు తేలుస్తాను. రామా! నా చేతులు, నా చేతుల్లో ఉన్న ఈ ధనుర్బాణములు కేవలం అలంకారము కొరకే కాదు. శత్రువులను ఎదిరించడానికి కూడా పనికి వస్తాయి. నాతో శత్రుత్వము వహించి నాకు ఎదురు నిలిచిన వాడిని నేను బతకనివ్వను. ఆ దేవేంద్రుడు వచ్చి నా ఎదుట నిలిచినా సరే వాడి తలతెగి కిందపడటం తథ్యం.

ఓ శ్రీరామచంద్ర మహారాజా! నన్ను ఆజ్ఞాపించండి. ఈ మాదిరి అస్తవ్యస్త నిర్ణయాలు తీసుకుంటున్న దశరథుని మహారాజ పదవి నుండి తొలగించి నిన్ను అయోధ్యకు మహారాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేస్తాను. ఎవరడ్డు వస్తారో చూస్తాను. ఈ దాసుడు తమరి ఆజ్ఞ కోసరము ఎదురుచూస్తున్నాడు." అని ఆవేశంతో అంటున్న లక్ష్మణుని తన సౌమ్యమైన మాటలతో ఓదార్చి

"లక్ష్మణా! నన్ను ఆజ్ఞాపించమన్నావు. అందుకని ఆజ్ఞాపిస్తున్నాను.

నీకూ నాకూ తండ్రిమాటను పాటించడమే ధర్మము. ఇదే నా నిర్ణయము." అని స్థిరంగా పలికాడు రాముడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము ఇరువదిమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఇరువది నాల్గవ సర్గ.

రాముని నిశ్చయమును విని కౌసల్య తల్లడిల్లి పోయింది. ఆమెకు నోట మాట రాలేదు. రాబోవు చీకటి రోజులను తలచు కొని తల్లడిల్లి పోయింది.

“రామా! ప్రతిదినము మృష్టాన్నములు భుజించుటకు అలవాటు పడ్డవాడికి అడవులలో మున్యాశ్రమములలో వారు ఇచ్చు ఆకులు, దుంపలు, పండ్లతో ఎలా జీవిస్తావయ్యా? ఎందుకంటే అయోధ్యలో నీ సేవకులు కూడా నీ కన్నా మెరుగైన భోజనము చేస్తుంటారు కదా! నీవు అడవులలో కందమూలములు ఎలా తిని బతుకుతావు. రామా! నీవంటి సద్గుణములు కలవాడిని, ప్రీతి పాత్రుడిని, నిర్దయగా రాజు అరణ్యము లకు పంపుతున్నాడే ఇంక మాలాంటి వారిగతి ఏమిటి? రామా! నీవు వెళ్లిన తరువాత అయోధ్యలో ఉండటానికి మాకు భయంగా ఉంది.

రామా! నీవు చెప్పినది సత్యము. నీ లాంటి వాడినే అరణ్యము లకు పంపడానికి అనుకూలించిన విధి ఎంత బలమైనదో ఇప్పుడు తెలుస్తూ ఉంది. నీవు వెళ్లిన తరువాత నాకు ఇంక శోకమే మిగిలింది. ఆ శోకాగ్నిలో నేను దగ్ధం అవడం తథ్యం. అందుకే రామా! నన్ను కూడా నీ వెంట తీసుకొని పో. నీవు ఎక్కడ ఉంటే అదే నాకు రాజమందిరము. పద పోదాము.” అని రాముని వెంట వెళ్లడానికి కౌసల్య

ఉద్యుక్తురాలయింది. తన కోసం శోకిస్తున్న తల్లి కౌసల్యను చూచి రాముడు ఇలా అన్నాడు.

"అమ్మా! అన్నీ తెలిసిన నీవే ఇలా మాట్లాడితే నేనేమి అనగలను. నీకు తెలుసు గదా! కైక తండ్రి గారిని తన చెప్పుచేతల్లో ఉంచుకొని తన ఇష్టం వచ్చి నట్టు ఆడిస్తూ ఉంది. ఇంక నువ్వు కూడా ఇక్కడ లేక పోతే తండ్రి గారి పరిస్థితి ఏమిటి? ఆయన బాగోగులు ఎవరు చూచుకుంటారు. నీవు కూడా తండ్రిగారిని విడిచి పెట్టి నాతో అరణ్యములకు వస్తే, తండ్రిగారు జీవించడం కల్ల. కాబట్టి నీవు తండ్రి గారిని చూచుకుంటే ఇక్కడే ఉండాలి. పైగా, నీ వంటి పతివ్రత భర్తను వదిలిపెట్టి అరణ్యములకు పోవడం అత్యంత క్రూరమైన పని. అది నీ వంటి సౌశీల్యవతులకు తగని పని. ఒక భార్యగా జీవితాంతము భర్తకు సేవ చెయ్యడం నీ కర్తవ్యము. ధర్మము. కాబట్టి నీవు ఇక్కడే ఉండి నీ ధర్మమును పాటించమని చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను." అన్నాడు రాముడు.

రాముని మాటలకు కౌసల్య బదులు చెప్పలేక పోయింది. "రామా! నీవు చెప్పినట్టే చేస్తాను." అని మాత్రం అనగలిగింది. తల్లి మాటలకు రాముడు సంతోషించాడు.

"అమ్మా! నా తండ్రి దశరథుడు మహారాజు, మనకందరికీ పూజనీయుడు. మనల నందరినీ ఆజ్ఞాపించగల సమర్థుడు. ఆయన ఆజ్ఞలను పాటించడం మన అందరి కర్తవ్యము. నీవు అలా చూస్తూ ఉండగానే పదునాలుగేళ్ల వనవాసము పూర్తి చేసుకొని వచ్చి నీ కళ్లముందు నిలబడతాను. నీవు ఏమి చెబితే అది చేస్తాను." అని

అన్నాడు రాముడు. కుమారుని మాటలకు కౌసల్యకు ఒక పక్క దు:ఖము, మరొక పక్క సంతోషమూ కలిగాయి. కాని రాముడు వెళ్లిన తరువాత సవతుల మధ్య తన పరిస్థితి ఏమిటి అని తలచుకొనే సరికి ఆమెకు శరీరం వణికిపోయింది.

"రామా! నీవు లేని అయోధ్యలో నేను ఉండలేను. ఈ సవతులు నన్ను బతుకనీయరు. నన్ను నీ వెంట తీసుకొని పో" అని భోరున ఏడవసాగింది.

వ్యవహారం మరలా మొదటికి వచ్చింది అనుకున్నాడు రాముడు. తల్లి ఏడుపు చూచి రామునికి కూడా దు:ఖము పొర్లుకొచ్చింది. తల్లిని ఎలా ఓదార్చాలో ఆమె నిర్ణయాన్ని ఎలా మార్చాలో తెలియలేదు రామునికి. ఏమైనా సరే మరలా మరొక సారి చెప్పి చూద్దాము అని అనుకున్నాడు రాముడు. తల్లి కౌసల్యతో ఇలా అన్నాడు.

"అమ్మా! అదేంటమ్మా అలా అంటావు. నీవు అయోధ్యకు పట్టమహిషివి. దశరథునికి పట్టపురాణివి. నిన్ను ఎవరేమంటారు. అందరూ నీ కనుసన్నలలో మెలగవలసిన వారే కదా! పైగా మహారాజు గారు నీవెంటనే ఉంటారు. నీకు అన్యాయం ఎందుకు జరుగుతుంది. రాజు ఉన్నంతకాలము నీవు అనాధవు ఎలా అవుతావు? పైగా నా తరువాత యువరాజు భరతుడు ఉంటాడు. భరతునికి నీవు అంటే పంచప్రాణాలు. పైగా భరతుడు ధర్మనిరతి ఎక్కువగా కలవాడు. ఎవరి మాటా విని అధర్మమునకు తలవంచడు. ఇంక నీకేం భయం. కాబట్టి ఆ భయాలు, అనుమానాలు నీ మనసులో నుండి తొలగించు. వృద్ధుడైన మహారాజును కనిపెట్టుకొని ఉండు.

ఒక భార్యగా అది నీ ధర్మము, కర్తవ్యము.

అమ్మా! స్త్రీలు ఎన్ని వ్రతములు, ఉప వాసములు, పుణ్య కార్యములు చేసినను, భర్తను నిర్లక్ష్యము చేసిన భార్యకు నరక ప్రాప్తి కలుగుతుందని ధర్మశాస్త్రము చెబుతుంది కదా! అలాగే ఏ దేవతలకూ పూజలు చేయకున్నా ఏ వ్రతములు ఆచరించకున్నా, కేవలం భర్తను దైవంగా పూజించే భార్యకు ఉత్తమ లోకాలు కలుగుతాయి అని కూడా చెబుతారు కదా! భర్తకు అనుకూలవతిగా, ఆయనను జీవితాంతం విడిచిపెట్టకుండా ఉండటం భార్యకు పరమధర్మము అని వేదములు, శాస్త్రములు, శ్రుతులు, స్మృతులలో చెప్పబడింది కదా!

అమ్మా! నీవు అయోధ్యలో ఉండి తండ్రి గారిని సేవించు కుంటూ, నా క్షేమం కోసం వ్రతాలూ, పూజలూ చేస్తూ బ్రాహ్మణులను పూజిస్తూ ఉంటే నేను అరణ్యాలలో ఏ బాధా లేకుండా క్షేమంగా ఉంటానమ్మా! నీవు చేసే పూజలూ, వ్రతాలూ నన్ను సదా ఆపదలనుండి రక్షిస్తూ ఉంటయమ్మా! నీవు ఇలా చేసావనుకో ఈ పదునాలుగేళ్లు ఇట్టే గడిచిపోతాయి. నేను ఇక్కడ లేని లోటు నీకు తెలియదు. నేను వచ్చిన తరువాత నీవు ఎలా చెబితే అలా చేస్తాను." అని తల్లిని బుజ్జగించాడు రాముడు.

కౌసల్య కొడుకు మాటలకు మారు మాటాడలేకపోయింది. కళ్లు తుడుచుకొంది.

"రామా! విధి బలీయమయింది. అంతకన్నా నీ నిశ్చయము బలమైంది. దానిని ఎవరూమార్చలేరు. నీవు అరణ్యములకు క్షేమంగా

వెళ్లిరా. నీకు నా దీవెనలు ఎప్పుడూ ఉంటాయి. నీకు సదా క్షేమము కలుగు గాక! నీవు వచ్చిన తరువాత నా దు:ఖములు అన్నీ తొలగి పోతాయి అనే ఆశతో నీ రాక కోసం వెయ్యికళ్లతో ఎదురుచూస్తూ ఉంటాను. కాని రామా! మా అందరి మాటను కాదని నిన్ను అరణ్యము లకు వెళ్లమని ప్రేరేపించు చున్న ఆ దైవము యొక్క లీలలను ఎవరూ అర్థం చేసుకోలేరు.  రామా! నీ పద్నాలుగేళ్ల వనవాసము ఒక్కరోజులో గడిచిపోయి ఈరోజే నీవు వనములనుండి తిరిగి వచ్చే రోజు అయితే ఎంత బాగుంటుంది!' అని ఆశాభావంతో పలికింది కౌసల్య. తనకు నమస్కరించిన రామునికి సదా మంగళం కలగాలని మనసారా ఆశీర్వదించింది.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ఇరువది నాల్గవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ఇరువది ఐదవ సర్గ.

మనసు దిటవు పరచుకొన్న కౌసల్య కళ్లు తుడుచుకొని, ముఖం కడుక్కొని, పాదప్రక్షాళనముచేసుకొని ఆచమనము చేసి, రామునికి మంగళకరమైన పనులు చేయుటకు ఉపక్రమించింది.

“రామా! నిన్ను అడవులకు వెళ్లకుండా ఆపుటకు సర్వవిధాలా ప్రయత్నించాను. కాని నీ పట్టు విడవకున్నావు. నాయనా రామా! ధర్మం తప్పకుండా, మంచి మార్గములో నడుస్తూ, వనవాసము పూర్తి చేసుకొని త్వరగా ఈ తల్లి వద్దకు చేరుకో! నీకు సదా శుభం కలుగుతుంది.

రామా! నీవు ఏ ధర్మ పరిరక్షణ కొరకు అరణ్యములకు వెళు తున్నావో, ఆ ధర్మమే నిన్ను సదా రక్షిస్తూ ఉండును గాక!. రామా! నీవు దేవాలయములకు వెళ్లి సమస్త దేవతలకు ప్రణామం చెయ్యి. ఆ దేవతలే నిన్ను సదా కాపాడుదురు గాక!

నీకు విశ్వామిత్ర మహర్షి ఇచ్చిన అస్త్రములు, శస్త్రములు నిన్ను సదా కాపాడుగాక! రామా! నీవు నమ్ముకున్న సత్యము, నీవు ఇప్పటి వరకూ చేసిన మాతృ సేవ, పితృ సేవ నిన్ను రక్షించును గాక! ఓ రామా! మంగళ కరములైన సమిధలు, దర్భలు, అగ్నిహోత్రము, దైవ

సన్నిధి నిన్ను అనునిత్యమూ రక్షించు గాక! ఈ ప్రకృతి లోని వృక్షములు, నదులు, పక్షులు, క్రూరమృగములు, సరీసృపములు నీకు ఎలాంటి హానీ చెయ్యకుండా, నిన్ను సదా కాపాడుగాక!

ఓ రామా! సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, విశ్వేదేవతలు, మరుత్తులు, మహర్షులు, బ్రహ్మదేవుడు, విధి, సూర్యుడు, దేవేంద్రుడు, లోకపాలకులు నీకు సదా మేలు చేయుదురు గాక! ఓ రామా! నీకు కాలము, ఋతువులు, పక్షములు, మాసములు, సంవత్సరములు, రాత్రింబగళ్లు, సుముహూర్తములు నిన్ను కంటికి రెప్పలాగా కాపాడుగాక! ఓ రామా! స్మృతులు, శ్రుతులు, బృహస్పతి, సప్తఋషులు, నారదుడు, చంద్రుడు, కుమారస్వామి నిన్ను దయతో కాపాడుడుదురు గాక!

నీ అరణ్యవాస కాలములో దిక్కులు నిన్ను సదా కాపాడుగాక! అరణ్యములలో ఉన్న పర్వతములు, కొండలు, గుహలు, భూమి, ఆకాశము, స్వర్గము, నక్షత్రములు, గ్రహములు, వాటి అధిష్టాన దేవతలు నిన్ను రాత్రింబగళ్లు, రెండు సంధ్యవేళల్లో కాపాడుదురు గాక! నీవు అరణ్యములలో ఉన్న ప్రతిదినము, మాసము, సంవత్సరము,నీకు సదా సుఖము నిచ్చు గాక! నీ అరణ్య వాస కాలములో సమస్త దేవతలు, దైత్యులు, నిన్ను కాపాడుదురు గాక!

నీ వనవాస కాలములో నీకు రాక్షసుల నుండి, రుద్రులు, పిశాచముల నుండి క్రూరమృగముల నుండి నీకు భయము లేకుండు గాక! అరణ్యములో ఉన్న కోతులు, తేళ్లు, పాములు, ఇతర కీటకములు, అలాగే సింహములు, పులులు, ఏనుగులు ఇతర మాంసాహార జంతువులు నిన్ను బాధించకుండా ఉండు గాక!

ఆకాశంలోనూ, భూమి మీదా ఉండే సమస్త దేవతలు నీకు శుభం కలిగించు గాక! నీకు శత్రుభయం లేకుండు గాక! రామా! అనునిత్యము నేను పూజించే విష్ణువు, మహేశ్వరుడు, పంచ భూతములు, నవగ్రహములు, నా పూజలకు సంతసించి నిన్ను సదా రక్షింతురు గాక!" అని కౌసల్య సమస్త దేవతల రక్షలను రామునికి అందించింది.

సమస్త దేవతలకు పూజలు చేసింది. బ్రాహ్మణుల చేత హోమములు చేయించింది. మంగళాచరణము చేయించింది. హోమము చేసిన బ్రాహ్మణులకు సంతృప్తిగా దక్షిణలు ఇచ్చింది. కౌసల్యకు ఇంకా తృప్తి కలగ లేదు. తాను స్వయంగా మంగళా చరణము చేయసాగింది.

"ఓ రామా! వృత్రాసుర సంహార సమయంలో ఆ దేవేంద్రునికి కలిగిన మంగళము నీకు కలుగుగాక! పూర్వము అమృతము తీసుకు రావడానికి వెళుతున్నప్పుడు గరుత్మంతునికి అతని తల్లి వినత చేసిన మంగళాశాసనము నీకు కలుగుగాక! వామనావతారములో విష్ణువు మూడు అడుగులు కొలిచినప్పుడు విష్ణువునకు కలిగిన మంగళము నీకు కలుగు గాక!" అని రాముని తలమీద అక్షతలు వేసి ఆశీర్వదించింది కౌసల్య.

విశల్యకరణి అనే ఓషధిని రామునికి రక్షగా కట్టింది. కౌసల్య ఇవన్నీ చేస్తూ ఉంది కానీ లోపల దు:ఖము పొర్లుకొస్తూ ఉంది. బలవంతాన అణుచుకుంటూ ఉంది.

"రామా! నీవు వనవాసకాలమును అతి త్వరగా పూర్తి చేసుకొని తిరిగి వచ్చి రాజ్యాధికారమును చేపట్టు. నన్ను, నీ భార్య సీతను సంతోషపెట్టు. రామా! శుభంగా వెళ్లిరా. నేను నిత్యమూ పూజించే శివుడు, విష్ణువు, మహర్షులు, సమస్త దేవతలు నిన్ను సదా రక్షించుదురు గాక! " అని కళ్ల నిండా నీళ్లు నిండగా కౌసల్య రామునికి వీడ్కోలు పలికింది.

రాముడు కూడా తల్లి కౌసల్యకు భక్తితో ప్రదక్షిణము చేసి పాదాభివందనము చేసి, ఆమె దగ్గర సెలవు తీసుకొని సీత ఉన్న మందిరమునకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యా కాండము ఇరువది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ఇరువది ఆరవ సర్గ.

తల్లి కౌసల్య నుండి ఆశీర్వాదములు పొందిన రాముడు అక్కడనుండి బయలు దేరాడు. ఇంక వనవాసమునకు వెళ్లడానికి మనస్సును సిద్ధం చేసుకుంటున్నాడు. కౌసల్య మందిరమునుండి బయటకు వచ్చాడు.

రాత్రి అంతా ఉపవాసము చేసి జాగరణ చేసిన సీత ఉదయము రాముని రాకకై ఎదురు చూస్తూ ఉంది. "పట్టాభిషేక ముహూర్తము సమీపిస్తూ ఉంది. కాని రాముడు ఇంకా రాలేదు. కారణం ఏమయి ఉంటుంది" అని తనలో తాను తర్కించుకుంటూ ఉంది.

ఇంతలో రాముడు సీత ఉన్న మందిరములోకి ప్రవేశించాడు. రాముని ముఖంలో కనపడుతున్న బాధను, వ్యధను చూచి సీత మనస్సు కలత చెందింది. అప్పటిదాకా తనలో ఉన్న బాధను అతి కష్టం మీద అణిచి పెట్టుకున్న రాముడు సీతను చూడగానే ఇంక తట్టుకోలేక పోయాడు.

రాముని ముఖంలో కనిపిస్తున్న బాధను చూచి సీత "ప్రభూ! ఏమి జరిగింది. ఎందుకు మీరు మనసులో బాధపడుతున్నారు.

ఈరోజు పుష్యమీ నక్షత్రము. తమరి పట్టాభిషేకము జరుగురోజు. వసిష్ఠుల వారు సుముహూర్తము నిశ్చయించినారు కదా! ఆనందము గా ఉండక ఎందుకు మీరు బాధతో విలవిలలాడిపోతున్నారు. ఎంతటి విపత్కర సమయంలో కూడా తమరి ముఖంలో మాయని చిరునవ్వు ఈ సంతోష సమయంలో మాయమగుటకు కారణమేమి? కాబోయే యువరాజును స్తుతించుటకు నియమింప బడ్డ వంది మాగధులు కనపడటం లేదు. ఏమి కారణము?

ఇంకనూ పట్టాభి షేకము జరగలేదా! తమరి తల మీద మంగళకరమైన తేనె, పెరుగు బ్రాహ్మణులు అభిషేకించలేదా! తమరి వెంట అమాత్యులు, జానపదులు ఎందుకు అనుసరించి రాలేదు. తమరు కాలి నడకన వచ్చారు. పట్టాభిషేక చిహ్నముగా అలంకరించిన రథము ఏమయినది? మీరు వస్తూ ఉంటే మీ ముందు నడవ వలసిన మదగజము కనపడటం లేదు. అసలు తమరి ముఖంలో పట్టాభిషేకము చేసుకొనబోవు రాకుమారుడి సంతోషము ఆనందము కనబడటం లేదు. కారణమేమి?" అని పరి పరి విధాల ప్రశ్నల వర్షం కురిపించింది సీత.

దానికిరాముడు ఇలా బదులు చెప్పాడు. "ఓ సీతా! నా తండ్రి నన్ను అరణ్యవాసమునకు వెళ్లమన్నాడు. నీకు ధర్మములు అన్నీ తెలుసు కదా! ఈ విపరీత పరిణామము ఎందు వల్ల సంభవించినదో వివరంగా చెబుతాను విను.

నా తండ్రి దశరథమహారాజు నిత్యసత్యవ్రతుడు. ఎన్నడూ ఆడిన మాట తప్పడు. నా తండ్రి నా తల్లి కైకకు పూర్వము

రెండువరములు ఇచ్చాడట. నా పట్టాభిషేక వార్త విన్న కైక, నా తండ్రిని ఆ రెండు వరములు ఇవ్వమని కోరింది. అందులో మొదటి వరము నేను పదునాలుగు సంవత్సరములకు అరణ్యవాసము చెయ్యాలి. రెండవ వరము--నాకు మారుగా భరతునికి యౌవరాజ్య పట్టాభిషేకము జరగాలి. దానికి నా తండ్రి సమ్మతించాడు. నా తండ్రి ఆజ్ఞ మేరకు నేను వనవాసమునకు పోవుచున్నాను. ఈ మాట నీతో చెప్పిపోదామని వచ్చాను.

నేను లేని సమయములో నీవు చాలా జాగ్రత్తగా ఉండాలి. యువరాజు భరతుని ముందు నా గురించి గానీ, నా గుణగణముల గురించి గానీ నీవు మాట్లాడకూడదు. ఎందుకంటే రాజులు తమ ముందు ఇతరులను పొగడటం సహించలేరు. ఇంకొకమాట. నిన్ను పోషించవలసిన బాధ్యత భరతునికి లేదు. నీవు భరతునికి అనుకూలంగా ఉన్నంత కాలమే నీవు ఇక్కడ క్షేమంగా, నిశ్చింతగా ఉండగలవు.

నా తండ్రి దశరథుడు వంశపారంపర్యముగా జ్యేష్టునికి చెందవలసిన రాజ్యమును, భరతునికి ఇచ్చాడు. కాబట్టి నీవు నీ మామగారు దశరథునికి, యువరాజు భరతునికి అనుకూలంగా నడచుకోవాలి. చాలా జాగ్రత్తగా ఉండాలి. నేను వనవాసము వెళు తున్నాను. నీవు ధైర్యంగా ఉండు. నేను లేని సమయములో నీవు వ్రతములు, ఉపవాసవ్రతములు చేస్తూ ఉండు.

నీవు పొద్దుటే లేచి, పూజాదికములు అయిన తరువాత, నా తండ్రి దశరథునికి నమస్కరించడం మరిచిపోవద్దు. నా తల్లి, నీ

అత్తగారు, వృద్ధురాలు అయిన కౌసల్య నేను అడవులకు వెళుతున్నాను అని కృంగి, కృశించి పోవుచున్నది. ఆమె యోగక్షేమములు చూడటం నీ ధర్మము. ఆమెను గౌరవించు. నా తల్లి కౌసల్య ఒకతేకాదు. నా తల్లులందరూ నీకు పూజనీయులే. వారి నందరినీ గౌరవించు.

నా తమ్ములు భరతుడు, శత్రుఘ్నుడు నీకు సోదర సమానులు మరియు పుత్రసమానులు. వారిని తగురీతిగా ఆదరించు. పైగా భరతుడు ఇక్ష్వాకుకులమునకు, అయోధ్యకు రాజు. అతని మీద పగ ద్వేషము పెంచుకోకు. సాధారణంగా రాజులు తమను సేవించేవారిని ఆదరిస్తారు. లేకపోతే ద్వేషిస్తారు. కాబట్టి భరతుని నువ్వు ఒక రాజుగా ఆదరించు. నీ ధర్మమును నువ్వు నిర్వర్తించు. ఈ పదునాలుగు సంవత్సరములు నువ్వు అయోధ్యలోనే ఉండు. నేను వనవాసమునకు పోతున్నాను అని మనసు కష్టపెట్టుకోకు. ధైర్యంగా ఉండు. నన్ను సంతోషంగా అరణ్యములకు సాగనంపు." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఇరువది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

అయోధ్యా కాండము

ఇరువది ఏడవ సర్గ.

రాముని మాటలు విన్న సీతకు చిరుకోపం వచ్చింది.

"ఏమిటండీ మీరు మాట్లాడేది. నాకు ఏమీ అర్థం కావడం లేదు. కేవలం హాస్యానికి అంటున్నారా. నన్ను ఆట పట్టించడానికి అంటున్నారా. హాస్యానికైనా ఒక హద్దు ఉంటుంది కదా! మీనోటి నుండి రావాల్సిన మాటలేనా ఇవి. ఒకవేళ అరణ్యానికి వెళ్లాల్సివస్తే, మీరు మాత్రమే అరణ్యములకు పోవడం ఏమిటి?

ఎందుకంటే తల్లి, తండ్రి, సోదరుడు, సంతానము, కోడళ్లు వారందరూ వారి వారి పూర్వజన్మ కర్మలను మాత్రమే అనుభవిస్తారు. ఎవరు చేసిన పుణ్యఫలములను కానీ పాప ఫలములను కానీ వారే అనుభవిస్తారు. కాని భార్య అలా కాదు. భార్య తన భర్త చేసిన పుణ్యములో కానీ పాపమలో కానీ భాగము పంచుకుం టుంది. భర్త కష్టసుఖములలో పాలు పంచుకుంటుంది. అది భార్య ధర్మము. దానిని ఎవరూ కాదనలేరు.

మామగారు తమరిని అడవులకు వెళ్లమంటే నన్నుకూడా వెళ్లమన్నట్టు కాదా! అది వేరుగా చెప్పవలెనా! ఎందుకంటే భార్యకు భర్తతో పాటు ఎక్కడికైనా వెళ్లే హక్కు ఉంటుంది. ఇహలోకంలో కానీ,

పరలోకంలో గానీ భర్త ఒక్కడే భార్యకు ఉత్తమ గతులు కల్పించగలడు. కాబట్టి తమరి వెంటే నేను. అది అడవి కానీ, అంత:పురము కానీ. మీరు అడవులలో నడుస్తూ ఉంటే నేను మీ ముందు నడుస్తూ మీరు వెళ్లే దారిలో ముళ్లు రాళ్లు లేకుండా శుభ్రం చేస్తాను. కాబట్టి నన్ను కూడా తమరి వెంట అరణ్యములకు తీసుకొని వెళ్లండి. నా వల్ల తమరికి ఎలాంటి కష్టము కలగ కుండా నేను చూసుకుంటాను.

ఓ నాధా! నేను అంత:పురములో ఉన్నను, అరణ్యములలో ఉన్నను, నాకు నా భర్తతోటిదే లోకము. మరే సుఖములు, భోగములు నాకు అక్కరలేదు.  ఈ విషయములన్నీ నాకు నా తల్లి తండ్రులు నాకు ఇదివరకే ఉపదేశించారు. ఇప్పుడు నేను ఎలా నడుచుకోవాలో నాకు ఎవరూ వేరుగా చెప్ప పనిలేదు. మీరు వెళ్లే ప్రదేశము క్రూరమృగము లతో నిండిన దుర్గమారణ్యము కానీ నేను కూడా మీతో వస్తాను. నేను అడవిలో ఉన్నా నా పుట్టింట్లో ఉన్నట్లు ఉంటాను. ఏ కష్టములను లెక్కచెయ్యను. నేను నిత్యము తమరి సేవ చేసుకుంటూ బ్రహ్మ చర్యమును పాటిస్తూ, అడవులలో స్వేచ్ఛగా విహరిస్తాను. నేను కూడా తమరితో పాటు ఫలములు, కందమూలములు తింటూ బతుకుతాను. మిమ్మల్ని అది తెమ్మని ఇది తెమ్మని ఇబ్బంది పెట్టను.

నాకు కూడా ఎన్నాళ్లనుండో అడవులలో విహరించాలని, అక్కడ ఉన్న హంసలను, నెమళ్లను వాటి సౌందర్యమును చూడాలని, తామర పూల కొలనులో స్నానమాడాలని, ఎంతో కోరికగా ఉంది. ఆ కోరిక ఇన్నాళ్లకు తీరుతున్నందుకు ఎంతో ఆనందంగాఉంది.  ఆ మాదిరిగా మీతో లక్ష సంవత్సరములు కూడా ఆనందంగా

గడుపుతాను. ఇంక నా భద్రత అంటారా. మహావీరులు మీరు నా పక్కన ఉండగా నా భద్రత గురించి నాకు భయమెందుకు. కాబట్టి మీరు ఎలా తండ్రిమాటను మన్నించి అడవులకు వెళ్లాలని నిర్ణయించు కున్నారో, నేను కూడా తమరి వెంట రావాలని నిర్ణయించుకున్నాను. నా నిర్ణయంలో మార్పులేదు. ఎందుకంటే నాకు తమరు లేకుండా స్వర్గము కూడా తృణప్రాయము. తమరు ఎదురుగా ఉంటే దుర్గమారణ్యము కూడా స్వర్గతుల్యము. కాబట్టి నన్ను తమరి వెంట తీసుకొని వెళ్లండి. లేకపోతే నేను ఆత్మహత్య చేసుకొని మరణిస్తాను కాని మిమ్ములను విడిచి ఒక్క క్షణం కూడా బతకలేను." అని సీత తన నిర్ణయాన్ని స్పష్టంగా రామునికి తెలిపింది.

సీత చెప్పిన మాటలను ఎంతో ఓపిగ్గా విన్నాడు రాముడు. అరణ్యము అంటే ఏమిటో అది ఎలా ఉంటుందో వివరంగా చెప్పి సీతను తనతో పాటు వనవాసమునకు రావడాన్ని ఆపుదాము అని అనుకొన్నాడు రాముడు. సీతతో ఇలా చెప్పసాగాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఇరువదిఏడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఇరువది ఎనిమిదవ సర్గ.

సీత తనతో కూడా వస్తే అరణ్యములలో ఆమె పడే అవస్థల గూర్చి కష్ట నష్టములగూర్చీ ఆలోచిస్తున్నాడు రాముడు. ఆమెను ఎలాగైనాఆపాలని అనుకున్నాడు. సీతతో ఇలా అన్నాడు.

" ఓసీతా! నీవు ఉత్తమ కులములో పుట్టావు. సుకుమారంగా పెరిగావు. పుట్టింట్లో గానీ అత్తగారి ఇంట్లోగానీ ధర్మం తప్పకుండా సంచరిస్తున్నావు. ఇప్పుడు కూడా నామాట విని ఇక్కడే ఉండు. భర్త మాట వినడం భార్య ధర్మం కదా. అది నీకూ నాకూ సుఖప్రదము. అరణ్యములలో ఉండే బాధలు నీకు తెలియవు. నీమేలుకోరి చెబుతున్నాను. నా మాట విని నువ్వు ఇక్కడే ఉండు. నీకు ఏలోటూ రాదు.

చిన్నప్పటి నుండి సుఖములలో పెరిగిన దానవు. ఆ అడవులలో కలిగే కష్టములను తట్టుకోలేవు. అడవులలో సుఖము అనే మాట వినపడదు. అన్నీ కష్టాలే. ఎత్తైన కొండల మీది నుండి దుమికే సెల ఏళ్ల ధ్వనులు, పులుల గాండ్రింపులు, సింహగర్జనలు, అడవి ఏనుగుల ఘీంకారములు, భయంకరంగా ఉంటాయి. అడవులలో సంచరించు క్రూరమృగములు మానవులను చూడగానే మీద పడతాయి. వాటి బారి నుండి తప్పించుకోడం చాలా కష్టం.

పైగా నగరములలో ఉన్నట్టు అడవులలో రాచ మార్గములు ఉండవు. అన్నీ ముళ్లు రాళ్లతో నిండిన కాలి మార్గములే. పైగా తాగడానికి మంచి నీరు కూడా దొరకదు. తినడానికి తిండి దొరకదు. రాలి పడిన పండ్లు తినాలి. లేకపోతే దొరికినవాటితో కడుపు నింపు కోవాలి. ఒక్కోసారి అవీ దొరక్కపోతే ఉపవాసములుచెయ్యాల్సి ఉంటుంది.  పగలంతా నడక. రాత్రి నేలమీద పడక. నిద్రపట్టదు. జీవితం దుర్భరంగా ఉంటుంది. కట్టుకోడానికి బట్టలుఉండవు. నారచీరలు, ఆకులు కట్టుకోవాలి.

వనవాసవ్రతములో ఉన్నవారు నిత్యమూ దేవతలను, పితరులను, అతిధులను  పూజించాలి. మూడుపూట్లాస్నానం చెయ్యాలి. స్వయంగా పూలు పండ్లు కోసుకొని రావాలి. ఋషులకు, మునులకు పెట్టాలి. మిగిలింది మనం తినాలి. అదీ మితంగా తినాలి. దొరికింది తినాలి. అది కావాలి ఇది కావాలి అంటే దొరకదు. అందుకే వనవాసము అత్యంత దుర్భరము. నీవు చేయలేవు.

ఇంకా సీతా! వనవాస సమయములో మనము ప్రకృతి వైపరీత్యములను తట్టుకోవాల్సి ఉంటుంది. పెనుగాలులు, వర్షాలు, గాడాంధకారమైన చీకటి, ఆ చీకట్లో సంచరించే వివిధ రకాలైన విషము చిమ్మే పాములు,  దీనికి తోడు భయంకరమైన ఆకలి దప్పులు, సకాలమునకు దొరకని ఆహారము, ఇవన్నీ అంతులేని బాధలు..... వనవాసములో కలుగుతాయి. వాటిని నీవు తట్టుకోలేవు.

వీటికి తోడు వ్యాధులు కలిగించు కీటకములు, దోమలు, భయంకరమైన విషపూరితములైన తేళ్లు, స్వేచ్ఛగా సంచరించు

అరణ్యములలో నీవు ఒక్క క్షణమైనా ఉండలేవు. అరణ్యములలో నివసించు వారు కామ,క్రోధములను విడిచి పెట్టి మనసును తపస్సుమీదనే లగ్నం చేయాలి. భయము అనే మాటను మనసులోకి రానీయకూడదు.  అది నీ బోటి దానికి సాధ్యం కాదు. కాబట్టి నీ వంటి సుకుమారికి అరణ్యవాసము యోగ్యము కాదు. నీవు ఇచ్చటనే వ్రతములు, ఉపవాసములు చేస్తూ నా క్షేమమును కోరుతూ ఉండు. నేను క్షణములో వనవాసమును పూర్తి చేసుకొని నీ చెంత వాలుతాను." అని వనవాసములోని కష్టనష్టముల గురించి వివరంగా చెప్పాడు రాముడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ఇరువది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఇరువది తొమ్మిదవ సర్గ.

రాముడు తనను వనములకు తీసుకుపోవడానికి సుముఖంగా లేడని తెలిసిన సీత దు:ఖంతో ఇలా అంది.

"నాధా! వనవాసములో కష్టములు ఉండక సుఖాలు ఉంటాయా. ఎన్ని కష్టనష్టములు ఉన్నను, ఎన్ని భయానక దృశ్యములు ఉన్నను, అవన్నీ తమరి ప్రేమ ప్రవాహములో కొట్టుకుపోతాయి కాని నాకు కష్టము కలిగించవు. తమరి సన్నిధిలో నేను నిరంతరమూ సుఖసంతోషాలతో ఉంటాను కానీ ఏమాత్రం దు:ఖము చెందను. నాధా! మీరుచెప్పిన క్రూరమృగములు అన్నీ తమరిని చూడగానే అల్లంత దూరముననే పారిపోవును గానీ మనలను ఏమి చేయవు.

తమరు పెద్దల ఆదేశము మేరము అరణ్యములకు వెళు తున్నారు. నేను కూడా తమరి వెంట వస్తాను. లేకపోతే ఇప్పుడే ఇక్కడే ప్రాణత్యాగము చేస్తాను. తమరు నా పక్కనుంటే సాక్షాత్తు ఇంద్రుడు కూడా నా వంక తేరిపారచూడలేడు. అదీ కాకుండా, భార్యకు భర్తతోడిదే జీవితము, భర్త లేనిదే భార్య బతుకజాలదు అని తమరే కదా నాకు బోధించినది.

అదీ కాకుండా, నాధా! నాకు చిన్నప్పుడు జ్యోతిష్కులు

నాజాతకము చూచి నాకు వనవాసక్లేశము ఉన్నది అని చెప్పారు. కాబట్టి నేను తప్పక వనవాసము చేయాల్సి ఉంది. ఆ మాటలు విన్నది మొదలు ఎప్పుడెప్పుడు వన వాసమునకు వెళదామా అని నా మనసు ఉత్సాహపడుతూ ఉంది. ఆ కోరిక ఇన్నాళ్లకు తీరుతూ ఉంది. అదీ మీ వెంట వనవాసము చెయ్యడం నాకు ఎంతో ఆనందదాయకము. కాబట్టి నన్ను కూడా తమరి వెంట అరణ్యములకు తీసుకొని వెళ్లండి.

నాథా! మీరు చెప్పినట్టు అరణ్యవాసములో ఎన్నో దు:ఖములు ఉంటాయి. కాని అవి అన్నీ అధైర్యపరులకు కానీ తమరి వంటి ధీరోదాత్తులకు కాదు కదా!

అవునండోయ్! మరిచి పోయాను. నేను మిథిలలో ఉండగా ఒక రోజు ఒక బిక్షుకి కూడా నా జాతకములో వనవాసము రాసి పెట్టి ఉన్నదని జోస్యము చెప్పినది. అవి అన్నీ ఇప్పుడు నిజము అవుతున్నాయి. నాడు జ్యోతిష్కుడు చెప్పినప్పటి నుండి, భిక్షుకి చెప్పినప్పటినుండి ఎప్పుడెప్పుడు వనవాసమునకు వెళదామా అని ఉత్సాహంతో ఉన్నాను. కాబట్టి తమరి వెంట నన్నుకూడా వనములకు తీసుకొని వెళ్లండి.

ఏమండీ! ఏమండీ! అక్కడ నేను మిమ్ములను ఎంతో ప్రేమగా చూచుకుంటానండీ. మీరు ఎక్కడికి పోతే అక్కడకు వస్తాను. ఎందుకంటే నా భర్తయే నాకు దైవము. మీరు ఎక్కడ ఉంటే నేనూ అక్కడే కదా! ఒక్క వనవాసమే కాదు, మరణంలో కూడా నేను మిమ్ములను అనుసరించి వస్తాను. ఏనాడైతే తల్లి తండ్రులు తమ కుమార్తెను ఎవరికైతే మంత్రపూర్వకముగా ధారపోసారో ఆ నాటి నుండి ఆమె అతనికి సహధర్మచారిణి అవుతుంది. మరణానంతరము

కూడా ఆమె అతనినే అనుసరిస్తుంది అని వేదములు ఘోషిస్తున్నాయి కదా! ఆ వేదవాక్కును అనుసరించి మీరు ఎక్కడకు పోతే అక్కడకు నేను మిమ్ములను ఒక భార్యగా అనుసరిస్తాను. చివరకు మరణంలో కూడా.

అది సరే. అసలు మీరు నన్ను ఎందుకు వద్దంటున్నారు. నేను మంచి దాననుగానా?నేను పతివ్రతనండీ. పైగా మీ భక్తురాలను. సుఖదు:ఖములను సమంగా చూడగలిగిన నేర్పు కల దానను. మీసుఖమే నా సుఖమనీ, మీ కష్టమే నా కష్టమనీ భావించే మనసు కలదానను. ఇవన్నీ మీకు తెలుసు కదా! అటువంటప్పుడు నన్ను వెంట తీసుకొని పోవడానికి ఎందుకు నిరాకరిస్తున్నారు. కాబట్టి నేను మీ వెంట వస్తాను. లేకపోతే ఇప్పుడు ఇక్కడే ప్రాణములు వదులుతాను." అని నయానా భయానా బతిమాలింది సీత.

సీత ఎన్ని చెప్పినను అటువంటి సుకుమారిని వనములకు తీసుకొని పోయి ఆమెను కష్టముల పాలు చేయడం ఇష్టం లేని రాముడు, ఆమె తన వెంట రావడానికి సుతరామూ ఒప్పుకోలేదు. సీతకూడా తన పట్టు విడవ లేదు. ఏడుపు మానలేదు. సీత ఏడుపు మాన్పడానికి, ఆమెను ఓదార్చడానికి, ఆమెను తనతో రాకుండా నివారించడానికి రాముడు శతవిధాలా ప్రయత్నిస్తున్నాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఇరువది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

అయోధ్యా కాండము

ముప్పదవ సర్గ.

రాముడు సీతను వనములకు రావద్దని ఎన్నో విధాలా నచ్చచెప్పబోయాడు. కాని సీత వినలేదు. పైగా సీతకు కోపం వచ్చింది. అప్పటి దాకా నయానా భయానా చెప్పింది. ఆఖరుకు చస్తానని బెదిరించింది. అయినా కాని రాముడు వినలేదు. ఇంక పతి భక్తి పక్కన బెట్టి రాముని దూషించడం మొదలు పెట్టింది.

"రామా! నీవు అసలు మగాడివేనా! కాదు. నీవు పురుష రూపంలో ఉన్న స్త్రీవి. పురుష రూపంలో ఉన్న ఒక స్త్రీని నా తండ్రి జనక మహారాజు కోరి కోరి అల్లుడుగా ఎలా చేసుకున్నాడో తెలియడం లేదు." కాని అంతలోనే సర్దుకుంది. "నాథా! నాకు ఒక సందేహము. సూర్యునిలో తేజస్సు లేదు అని అన్నా ఈ లోకం ఒప్పుకుంటుందేమో గానీ, రామునిలో పరాక్రమము లేదు అంటే ఒప్పుకోదు కదా. ఎందుకంటే అది తిరుగులేని సత్యం కాబట్టి. అలాంటి పరాక్రమ వంతుడివి.... నన్ను అడవులకు తీసుకొనివెళ్లడానికి ఎందుకు భయపడుతున్నావు? దానికి ఏమైనా బలమైన కారణం ఉందా! ఉంటే అదేమిటి? కట్టుకున్న భార్యను ఒంటరిగా వదిలి అడవులకు వెళ్లడానికి కారణమేమి? భయమా! లేక పరాక్రమము లేకనా! నీ భయమునకు కారణమేమి?

మీరు సావిత్రీ సత్యవంతుల కథ వినలేదా! సావిత్రి భర్తను అనుసరించి యమలోకమునకు కూడా వెళ్లింది. నేను కేవలం అడవులకు మాత్రం వస్తాను అంటున్నాను. అంతే కదా!

నాథా! నేనుసామాన్య స్త్రీల వంటి దానను కాను. పరపురుషుని కన్నెత్తి కూడా చూడను. నేను ఇక్కడ ఒకరి పంచన బతకలేను. నువ్వు ఎక్కడ ఉంటే అక్కడే ఉంటాను. నేను స్వయంగా నీ భార్యను. యవ్వనంలో ఉన్నాను. నీతో కొంతకాలము కాపురము చేసాను. అటువంటి నన్ను దిక్కులేని దాని మాదిరి పరాయి వాళ్ల ఇంట ఉంచడం ఉచితమా! నీవేమో తండ్రి మాటను అనుసరించి అడవులకు వెళుతున్నావు. నన్నేమో ఇక్కడ నీ తండ్రిని, తల్లిని, నీ తమ్ముడు భరతునికి విధేయురాలిగా ఉండమంటున్నావు. రామా! నీకు నీ వారు ఎక్కువ కానీ నాకు కాదు కదా! నాకు నా భర్త ఎక్కువ. ఎవరి కోసరమో నేను నిన్ను విడిచి ఒంటరిగా అయోధ్యలో ఉండలేను.

మీకు అన్నీ తెలుసు. అలాంటప్పుడు నన్ను ఒంటరిగా వదిలి వెళ్లడం ఉచితము కాదు. మీ సన్నిధిలో నాకు అరణ్యమైనా స్వర్గమైనా సమానమే! మీరు ఎక్కడ ఉంటే అదే నాకు రాజభవనము. నేను రాజభవనములో ఎలాఉంటానో అరణ్యములో కూడా అలాగే ఉంటాను. మీతో కలిసి ప్రయాణము చేస్తుంటే నాకు ముళ్లు కూడా పూల మాదిరి ఉంటాయి. అడవులలో ఉన్న దుమ్ముకూడా చందనముతో సమానమే. హాయిగా, ఆకాశమే పందిరిగా పచ్చికబయళ్లే పూల పానుపుగా మీతో పాటు శయనించడం కన్నా, రాజభవనములలో ఉన్న హంసతూలికా తల్పములు ఎక్కువ సుఖాన్ని ఇవ్వవు. మీరు తీసుకొని వచ్చిన కందమూలములు, ఫలములే నాకు పంచభక్ష్యపరమాన్నములు. నేను

అడవులలో ఉన్నప్పుడు  మా పుట్టింటికానీ నా తల్లితండ్రులను గానీ తలచుకొని బెంగపెట్టుకోను. నా వలన మీకు ఎలాంటి కష్టము కలగనీయను. నాకు అది కావాలి ఇది కావాలి అని అడగను. దొరికిన దానితో తృప్తిపడతాను.

నాధా! మరలాచెబుతున్నాను. నాకు నీతోటిదే స్వర్గము. నీవు లేనిచోట నరకమే. కాబట్టి నన్ను తమరి వెంట తీసుకొని వెళ్లండి. ఇన్ని చెప్పినా వినకపోతే నాకు మరణమే శరణ్యము. అంతే గాని, అయోధ్యలో మీ శత్రువుల మధ్య ఉండలేను.  ఎందుకంటే, మీ వియోగముతో నేను కొంతకాలము తరువాత అయినా  కృంగి కృశించి చచ్చిపోతాను. అలాంటిది నీ ఎదుటనే చావడం మేలు కదా!  ఒక్కక్షణమైనా మిమ్ములను విడిచి బతకలేని నేను పదునాలుగు సంవత్సరములు మిమ్ములను విడిచి పరాయి పంచన  ఎలా ఉంటాను అని అనుకుంటున్నారు." అంటూ సీత రాముని కౌగలించుకొని పెద్దగా ఏడవసాగింది.

సీత కళ్లనుండి కన్నీళ్లు ధారాపాతంగా కారుతున్నాయి. శరీరం వశం తప్పుతూ ఉంది. అలాగే రాముని చేతులలో నుండి కిందికి జారిపోయింది. రాముడు సీతను గట్టిగా పట్టుకున్నాడు. ఓదారుస్తున్నాడు.

"ఓ సీతా! ఎందుకీ ఏడుపు. నీవు  ఇలా దు:ఖిస్తూ ఉంటే నాకు స్వర్గములో  కూడా సుఖము లభించదు. నేను ఎవరికీ భయపడను. తుదకు ఆ బ్రహ్మదేవునికికూడా! నేను నిన్ను సర్వవేళలా రక్షించు కొనుటకు సమర్థుడను. కానీ నీ అభిప్రాయము తెలుసుకొనడానికి

అలా అన్నాను. అలా కాకుండా, నిన్ను నా వెంట అరణ్యములకు రమ్మంటే, పురుషాహంకారముతో నేను నిన్ను శాసిస్తున్నాను అని  నీవు నన్ను అపార్థము చేసుకొనే అవకాశము ఉంది కదా!

ఓ సీతా!  నేను మాత్రము నిన్ను విడిచి క్షణమైనా బతుక గలనా! ఆ బ్రహ్మ మన ఇద్దరికీ వనవాసము చెయ్యమని రాసి పెట్టినట్టున్నాడు. అందుకే ఈ విపరీత పరిణామము.

సీతా! ఇంక నేను వనవాసమునకు ఎందుకు వెళుతున్నానో వివరిస్తాను. పితృవాక్యపరిపాలన మా కులధర్మము. దానిని నేను పాటించి తీరవలెను. కారణములు ఏవైనా,  నా తండ్రి వాక్యము నాకు వేదవాక్కు. ఆయన మాటలు అనుసరించి నేను అడవులకు వెళు తున్నాను. ఒకకుమారుడిగా తల్లి తండ్రుల ఎడల నా ధర్మమును అతిక్రమించుటకు నేను ఇష్టపడను. నాకు నా తల్లి, తండ్రి, గురువు మూడు లోకములతో సమానము. వీరి తరువాతే నాకు దేవుడు. నా తల్లి తండ్రుల సేవ కన్నా యజ్ఞయాగములు ముఖ్యము కావు. నా తండ్రి ఆజ్ఞను పాలించడంతోనే,  నాకు స్వర్గము, ధనము, ధాన్యము, విద్య, సంతానము, రాజభోగములు లభించినట్టు భావిస్తాను.  తండ్రి ఆజ్ఞను ధిక్కరించిన నాడు, నాకు ఇవేవీ దొరకవు. మాతాపితరుల సేవతో నేను ఉత్తమ లోకములు పొందుతాను. ఎందుకంటే పితృవాక్య పరిపాలన మన సనాతన ధర్మము.

నిన్ను నాతో పాటు అరణ్యములకు తీసుకొని పోయి కష్టముల పాటు చేయడం నాకు ఇష్టం లేదు. కానీ నీ ధృఢనిశ్చయము విని నిన్ను

నాతో అరణ్యములకు రావడానికి అనుమతిస్తున్నాను. నా సహధర్మ చారిణిగా నా వెంట అడవులకు రా. నీవు నాతో వస్తాను అని అనడం నాకు ఎంతో సంతోషాన్ని ఇచ్చింది. ఇటువంటి నిర్ణయం తీసుకొని మన వంశగౌరవము కాపాడావు.

కాబట్టి సీతా! మనకు వనవాసమునకు అవసరమైన ఏర్పాట్లు చెయ్యి. నిన్ను విడిచి నేనుకూడా ఒక క్షణము కూడా ఉండలేను కదా! బ్రాహ్మణులకు దానధర్మములుచెయ్యి. వారికి భోజనము పెట్టి సంతృప్తి పరుచు. నీవు ధరించు ఆభరణములు, విలువైన వస్త్రములు, వస్తువులు అన్నీ నీ పరిచారికలకు బ్రాహ్మణులకు దానంగా ఇవ్వు." అని అన్నాడు రాముడు.

రాముని మాటలు విని సీత సంతోషంతో పొంగి పోయింది. రాముడు చెప్పినట్టు తనది అన్న ప్రతి వస్తువు అందరికీ దానంగా ఇచ్చివేసింది. విలువైన బంగారు ఆభరణములు, రత్నములు, మణులు, పట్టు వస్త్రములు తన పరిచారికలకు ఇచ్చింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము ముప్పదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ముప్పది ఒకటవ సర్గ.

సీతారాములు వనవాస విషయము గురించి వాదించు కుంటున్నప్పుడు లక్ష్మణుడు అక్కడకు వచ్చాడు. బయట ఉండి వారి మాటలు అన్నీ విన్నాడు. ఆ దంపతుల అన్యోన్యతకు చలించి పోయాడు. అన్న రాముని కాళ్ల మీదపడ్డాడు.

"రామా! క్రూరమృగములతో నిండిన అరణ్యములలో నీకు తోడుగా ఉండడానికి సుకుమారి అయిన వదిన రాగా లేనిది నేను నీ వెంట రాలేనా. నేనుకూడా నీ వెంట వస్తాను. నీకు ముందు ఉండి దారి చూపిస్తాను. రామా! చిన్నప్పటి నుండి నేను నిన్ను విడిచి ఒక్క క్షణం కూడా ఉండలేదు. ఇప్పుడు కూడా ఉండలేను. నీవు లేని ఈ అయోధ్య కానీ, త్రిలోకాధి పత్యము కానీ నాకు అక్కరలేదు." అన్నాడు లక్ష్మణుడు.

ఇప్పటి దాకా తల్లి కౌసల్యను భార్య సీతను వనవాసమునకు రావద్దని వాదించాడు. తల్లి ఒప్పుకుంది. భార్య ఒప్పుకోలేదు. ఇప్పుడు తమ్ముడు లక్ష్మణుని వంతు వచ్చింది. యధాప్రకారము లక్ష్మణుని కూడా తన వెంట అడవులకు రావద్దని నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు రాముడు. లక్ష్మణుడు ససేమిరా ఒప్పుకోలేదు.

"రామా! నన్ను నీ వెంట అరణ్యమునకు ఎందుకు రావద్దు అంటున్నావో కారణం చెప్పు" అని నిలదీసాడు.

దానికి రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! నీవు నాకు మంచి స్నేహితుడవు. ధర్మతప్పకుండా చరించే వాడివి. వీరుడివి. ఎల్లప్పుడూ సన్మార్గములో పయనిస్తావు. అదీ కాకుండా నాకు నీవు ప్రాణంతో సమానం. నేను ఏది చెబితే అది చేస్తావు. అటువంటి నీవు నాతో పాటు వనమునకు వస్తే నా తల్లి కౌసల్య, నీ తల్లి సుమిత్ర ఒంటరి వాళ్లు అవుతారుకదా! వారి ఆలనాపాలనా ఎవరు చూస్తారు. వారి గురించి ఎవరు పట్టించుకుంటారు. కాబట్టి నీవు అయోధ్యలో ఉండటమే ధర్మము.

ప్రస్తుతము మన తండ్రి దశరథుడు తన భార్య కైక మోహ పాశములో చిక్కుకొని ఉన్నాడు. భరతుని పట్టాభిషేకము తరువాత కైక తన సవతులైన మన తల్లులను ఎన్ని కష్టముల పాలు చేస్తుందో ఏమో. ఇంక భరతుడు కూడా తన తల్లి కైక మాటలను విని మన తల్లుల గురించి పట్టించుకోడు. కాబట్టి నువ్వు ఇక్కడే ఉండి వాళ్లను జాగ్రత్తగా చూచుకోవాలి కదా! నీవు అలా చేసావనుకో నీకు నా మీదున్న ప్రేమ, భక్తి ప్రకటితమవుతుంది. తల్లులకు సేవ చెయ్యడం కన్నా పరమ ధర్మము ఏముంటుంది. కనీసము నా మొహం చూచి అయినా నీవు ఇక్కడే ఉండి తల్లుల సంరక్షణ చూసుకో." అని రాముడు లక్ష్మణునితో అన్నాడు.

కాని లక్ష్మణుడు ఆ మాటలకు ఒప్పుకోలేదు. "రామా! అదేమిటి

అలా అంటావు. నీవు అంటే భరతునికి భయం, భక్తి, గౌరవము. నీ పరాక్రమమునకు భయపడి భరతుడు మన తల్లులను అత్యధికంగా గౌరవిస్తాడు కానీ అవమానించడు. ఇందులో ఎలాంటి సంశయము లేదు.

అదీ కాకుండా నీ తల్లి కౌసల్యకు ఆమె పుట్టింటి ఆస్తి వెయ్యి గ్రామాలు ఉన్నాయి. ఆ గ్రామాలలలో ప్రజలు ఆమెను అత్యంత భక్తిశ్రద్ధలతో సేవిస్తారు. వాటి మీద వచ్చే ఆదాయంతో ఆమె వెయ్యిమందిని పోషించ గలదు. అందుకని మన తల్లుల గురించి మనకు భయం లేదు. కాబట్టి నన్ను నీతో కూడా రావడానికి అనుమతించు. నాజన్మ ధన్యము అవుతుంది. అరణ్యములలో నీవు సీత విహరిస్తూ ఉంటే మీకు సేవలు చేసుకుంటూ ఉంటాను. మీకు కావలసినవిఅన్నీ అమరుస్తాను."అని అన్నాడు లక్ష్మణుడు.

ఇంక ఎంత చెప్పినా లక్ష్మణుడు వినడు అనుకున్నాడు రాముడు. లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! నీ నిర్ణయము నాకు ఎంతో సంతోషాన్ని కలిగించింది. మనము వనవాసము పోవుటకు తగిన ఏర్పాట్లు చెయ్యి. నీ స్నేహితులందరికీ చెప్పి వారి దగ్గర సెలవు తీసుకొని రా. వెళ్లు. లక్ష్మణా!జనక మహారాజు యజ్ఞమునకు మనము వెళ్లినపుడు, వరుణ దేవుడు మన ఇద్దరికీ ఒక దివ్య ధనుస్సు, అక్షయతూణీరములు, దివ్య కవచములు, రెండు ఖడ్గములు ప్రసాదించాడు కదా. వాటిని మనము గురువుగారు వసిష్ఠుల వారి ఇంట్లో ఉంచి పూజిస్తున్నాము కదా. వాటిని మన వెంట తీసుకొని రా. " అని అన్నాడు రాముడు.

అన్నగారి మాట ప్రకారము లక్ష్మణుడు తనమిత్రుల వద్ద సెలవు తీసుకొని, వసిష్ఠువారి ఇంటి నుండి ఆయుధములను తీసుకొన్నాడు. వాటిని తీసుకొని వచ్చి రాముడికి చూపించాడు.

"లక్ష్మణా! నేను వనవాసమునకు వెళుతున్నాను కదా! అందుకనీ నా వద్ద ఉన్న ధనము, ఆభరణములు సదాచారులైన బ్రాహ్మణులకు దానంగా ఇవ్వతలచుకొన్నాను. నీవు వెళ్లి వసిష్ఠుని కుమారుడు సుయజ్ఞుని నీ వెంట తీసుకొని రా. ఆయనతో కూడా సదాచార పరాయణులైన అనేక మంది బ్రాహ్మణులను తీసుకొని రా. నా ధనము, ఆభరణములు వారికి దానంగా ఇస్తాను." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ముప్పది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ముప్పది రెండవ సర్గ.

అన్నగారి ఆదేశము మేరకు లక్ష్మణుడు వసిష్ఠుని కుమారుడైన సుయజ్ఞుని ఇంటికి వెళ్లాడు. అప్పుడు సుయజ్ఞుడు అగ్నికార్యము చేసుకుంటున్నాడు. అతనిని చూచి లక్ష్మణుడు ఇలా అన్నాడు. "మిత్రమా! రాముడు నిన్ను తీసుకొని రమ్మన్నాడు. రాముడు ఏంచేస్తున్నాడో నువ్వే స్వయంగా వచ్చి చూడు."అని అన్నాడు లక్ష్మణుడు.

సుయజ్ఞుడు అగ్ని కార్యమును, సంధ్యావందనమును ముగించుకొని లక్ష్మణుని వెంట రాముని మందిరమునకు వెళ్లాడు. సుయజ్ఞుని చూడగానే రాముడు లేచి అతనికి దగ్గరగా వచ్చాడు. సీతను కూడా రమ్మన్నాడు. సీతారాములు సుయజ్ఞుని చుట్టూ తిరిగి నమస్కారము చేసారు. తన దగ్గర ఉన్న ఆభరణములు, ధనము సుయజ్ఞునికి ఇచ్చాడు. ఇంకా ఇలా అన్నాడు.

"మిత్రమా! నేను నాభార్య అరణ్యములకుపోతున్నాము. నేను నా ఆభరణములు అన్నీ నీకు ఇచ్చాను. సీత కూడా తనవద్ద ఉన్న ఆభరణములను నీ భార్యకు ఇవ్వవలెనని అనుకుంటూ ఉన్నది. దయతో స్వీకరించు. అవే కాకుండా నేను నాకు నా మేనమామ ఇచ్చిన ఏనుగులు కూడా నీకు ఇస్తున్నాను. స్వీకరించు." అని అన్నాడు.

సుయజ్ఞుడు సీతారాములు ఇచ్చినవి అన్నీ స్వీకరించి సీతారాములను ఆశీర్వదించాడు.

తరువాత రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఇప్పుడు నువ్వు బ్రాహ్మణోత్తములైన అగస్త్యుని, కౌశికునీ పిలిపించి వారిని అర్చించి వారికి నీ వద్ద ఉన్న అమూల్య ఆభరణములు, రత్నములు వారికి దానంగా ఇవ్వు. తరువాత తైత్తిరీయ ఆచార్యులను, వేద పండితులను మనము లేని సమయములో మనతల్లులకు ప్రతిరోజూ ఆశీర్వచనములను అందించే బ్రాహ్మణోత్తములను పిలిపించి వారికి ధన, కనక, వస్తు వాహనములను దానముగా ఇమ్ము. మన తండ్రి గారికి అనుకూలుడైన మంత్రి చిత్రరథుడు మన ఇంట్లోనే ఉ న్నాడు. అతడిని పిలిపించి అతనికి కూడా రత్నములు, వస్త్రములు, వాహనములు దానముగా ఇమ్ము. మన వేదపాఠశాలలలో నిత్యము వేదమును నేర్చుకొను విద్యార్థులు ఉన్నారు. వారికి కూడా రథములు, వాహనములు, గోవులను, రుచికరమైన మంచి మంచి ఆహార పదార్థములను దానంగా ఇమ్ము. ఇంకా మన తల్లులు సంతోష పడేట్టు వారు ఎవరికి దానం చెయ్యమంటే వారికి దానములుచెయ్యి. మన తల్లుల సంతోషమే మనకు ముఖ్యం." అని అన్నాడు రాముడు.

రాముడు ఆదేశించి నట్టు లక్ష్మణుడు దానములు విరివిగా చేసాడు. రాముడు కూడా అప్పటి వరకూ తనకు సేవచేస్తూ తనను అనుసరించి ఉన్న సేవకులకు అపారంగా ధనాన్నిపంచిపెట్టాడు.

"సేవకులారా! నేను లక్ష్మణుడు తిరిగి వచ్చువరకూ మా మందిరములను జాగ్రత్తగా చూస్తూ ఉండండి. వీటిలో మేము ఉన్నట్టే

అందరూ అనుకోవాలి. అలాగా వీటిని అనుదినమూ శుభ్రం చేసి దీపములు వెలిగించి ఉంచండి." అని ఆదేశించాడు. తరువాత రాముడు లక్ష్మణుడు కలిసి అపార మైన ధనమును బ్రాహ్మణులకు బాలురకు వృద్ధులకు పంచిపెట్టారు.

ఆ సమయంలో అయోధ్యలో త్రిజటుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు భార్య బిడ్డలు ఉన్నారు. కానీ కడుపేదవాడు. అడవులలో కందమూలములు తవ్వుకొని జీవిస్తూ ఉండేవాడు. రాముడు దానములు చేస్తున్నాడని విని అతని భార్య అతనితో ఇలా అంది. "రాముడు దానములు విరివిగా చేస్తున్నాడట. మీరుకూడా వెళ్లి ఏమైనా అడగండి." అని త్రిజటుని రాముని వద్దకు పంపింది. త్రిజటుడు రాముని వద్దకు వెళ్లాడు. తన పరిస్థితి గురించి చెప్పి ఏమైనా దానం చెయ్యమని అడిగాడు. అప్పుడు రాముడు అతనితో ఇలాఅన్నాడు. "నేను ఇప్పటి దాకా గోదానము చెయ్యలేదు. నువ్వు నీ చేతిలో ఉన్న గునపమును ఎంత దూరము విసరగలవో అంత దూరము పట్టే గోవులను నీకు ఇస్తాను." అని అన్నాడు. దానికి ఆ బ్రాహ్మణుడు తన చేతిలో ఉన్న చిన్నగునపమును బలంగా విసిరాడు. అది సరయూ నదీ తీరంలో వెళ్లి పడింది. రాముడు అంతమేరా పట్టే ఆవులను త్రిజటునికి దానంగా ఇచ్చాడు.

"ఓ బ్రాహ్మణోత్తమా! ఏదో పరిహాసమునకు మిమ్ములను గునపము విసరమన్నాను. నా అజ్ఞానానికి మన్నించండి. మీకు ఇంకా ఏమి కావాలో కోరుకోండి. నేను నా ధనమును అంతా బ్రాహ్మణులకు దానంగా ఇస్తున్నాను. ఇంత అని నియమము లేదు. నీ ఇష్టం వచ్చినంత కోరుకో" అని అన్నాడు రాముడు.

"రామా! నాకు ఇవి చాలు. ఇంక ఏమీ అక్కరలేదు." అని రాముని ఆశీర్వదించాడు. తరువాత రాముడు తనవద్ద ఇంకా మిగిలిన ధనమును అంతా తన మిత్రులకు దానంగా ఇచ్చాడు.  ఆ సమయంలో రాముని చేతిమీదుగా దానం తీసుకోని వాడు అయోధ్యలో లేడు అంటే అతిశయోక్తిలేదు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ముప్పది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ముప్పది మూడవ సర్గ.

రాముడు, లక్ష్మణుడు, సీత తమకు ఉన్నదంతా బ్రాహ్మణు లకు దానము చేసిన తరువాత, వారు ముగ్గురూ దశరథుని వద్ద సెలవు తీసుకొనడానికి ఆయన మందిరమునకు వెళ్లారు. అప్పటికే రామపట్టాభిషేకము నిలిచి పోయినది అను వార్త దావానలము మాదిరి అయోధ్య అంతా పాకిపోయింది. దశరథుని మందిరమునకు వెళ్లు సీతారామలక్ష్మణులను చూచుటకు జనము వీధులలో బారులు తీరి నిలబడ్డారు. అందరి ముఖాలలో దైన్యము కనబడుతూ ఉంది. రాజలాంఛనములైన ఛత్రచామరములు లేకుండా కాలినడకన వెళు తున్న రాముని చూచి అయోధ్య ప్రజలు దు:ఖము ఆపుకోలేక పోయారు.

కేవలము తండ్రి మాటను మన్నించడానికి రాజ్యమును వదులుకొన్నాడు రాముడు అని అందరూ చెప్పుకుంటున్నారు. అప్పటిదాకా వారు సీతను ముఖాముఖి చూడలేదు. ఎండ అంటే అసలు తెలియని సీత  ఈనాడు భర్త వెంట నడిచి వెళుతుంటే అందరూ ఆశ్చర్యం చూస్తున్నారు.

కొందరు ఆశావాదులు మాత్రము "రాజు రాజ్యమును ఇవ్వక పోతే మానె, రాముని ఊరువెళ్ల గొట్టడం ఎందుకు. ఏదో ఊరికే అని

ఉంటాడు. రాముడు ఎక్కడకూ వెళ్లడు."అని తమలో తాము సర్దిచెప్పుకుంటున్నారు.

మరి కొంతమంది "ఆ... ఈరోజుల్లో పెద్దవాడైన కొడుకును కూడా మమకారంతో ఇంటి నుండి బయటకు పొమ్మనడం లేదు. అలాంటిది రాముని వంటి సుగుణాల రాసిని ఇంటినుండి ఎందుకు పొమ్మంటాడు. అదేమీ కాదు. మనం పొరపాటు వినిఉంటాము."అని తమలో తాము అనుకుంటున్నారు.

కాని అందరూ రాముడు తమను విడిచి అడవులకు వెళు తున్నాడు అనే మాటను కూడా జీర్ణం చేసుకోలేక పోతున్నారు. ఇన్నాళ్లు తమ కష్టసుఖాలలో పాలుపంచుకున్న రాముడు ఇలా అర్ధాంతరంగా అడవులకు వెళ్లడంలోని ఆంతర్యం వారికి అవగతం కావడం లేదు. ఎవరికి తోచినట్టు వారు అనుకుంటున్నారు.

ఇంతలో కొంతమందికి ఒక ఆలోచన వచ్చింది. "రాముడు లేని అయోధ్యలో మనం మాత్రం ఎందుకు. మనం కూడా రాముని వెంట అరణ్యములకు వెళుదాము. రాముడు ఎక్కడ ఉంటే అదే మనకు అయోధ్య." అని రాముని వెంట వెళ్లడానికి సిద్ధం అయ్యారు.

ఆ మాట ఆనోటా ఆనోటా పాకి అందరూ రాముని వెంట అడవులకు  వెళ్లడానికి సిద్ధమవుతున్నారు.  ఇంతలో కైకేయీ వల్లనే ఇదంతా జరిగింది అని అందరికీ తెలిసిపోయింది. దాంతో వారి ఆలోచన బలపడింది.

“మనం అంతా అయోధ్యను విడిచి వెళ్లిపోతే ఇక్కడెవరుం టారు. ఇండ్లు అన్నీ పాడుపడిపోతాయి. అగ్నిహోత్రములు వెలగవు. పంటలు పండించే వాళ్లు ఉండరు. వీళ్లకు పనిపాటలు చేసేవాళ్లు ఉండరు. ఈ పాడుబడ్డ శ్మశానములాంటి అయోధ్యను కైక ఒక్కతే ఏలుకుంటుంది” అని కసిదీరా అనుకొన్నారు.

మరికొందరు “రాముడు ఎక్కడ ఉంటే అదే అయోధ్య. అరణ్యమే అయోధ్య. ఈ అయోధ్య అరణ్యము అవుతుంది.” అని శపిస్తున్నారు.

ఇంకొంత మంది అయితే “ఒరేయ్! మనం అంతా రాముని వెంట అడవులకు వెళితే, మనలను చూచి, అడవులలో ఉన్న క్రూరమృగములు, ఏనుగులు, పాములు, తేళ్లు అన్నీ అడవులు వదిలి అయోధ్యలోకి వస్తాయి. అప్పుడు కైకకు మంచి శాస్తిఅవుతుంది. మనం అంతా రాముని పాలనలో అడవిలో సుఖంగా ఉంటే ఇక్కడ అయోధ్యలో కైక క్రూరమృగముల బారిన పడి నానా బాధలు పడుతుంది” అని కసిదీరా తిడుతున్నారు.

ఈ మాటలన్నీ రాముడు, సీత లక్ష్మణుడు వింటూ ముందుకు నడుస్తున్నారు. ముగ్గురూ దశరథమహారాజు మందిరమునకు సమీపించారు. మందిరము లోపల సుమంత్రుడు దీనంగా మొహం పెట్టుకొని కూర్చుని ఉన్నాడు. అతని చుట్టు కొంతమంది పౌరులు గుమిగూడి ఉన్నారు.

వారందరినీ చూచి రాముడు చిరునవ్వు నవ్వి వారిని పలకరించాడు.

“సుమంత్రా! నేను, సీత, లక్ష్మణుడు వచ్చామని మహారాజు గారికి మనవి చెయ్యి.” అని అన్నాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ముప్పదిమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ముప్పది నాల్గవ సర్గ.

రాముడు ఆదేశానుసారము సుమంత్రుడు రామ,లక్ష్మణ,సీతల రాకను దశరథునికి ఎరింగించుటకు అంత:పురములోకి వెళ్లాడు. అంత:పురములో దశరథుడు గ్రహణం పట్టిన చంద్రుడి మాదిరి కళావిహీనంగా కూర్చుని ఉన్నాడు. సుమంత్రుడు దశరథుని వద్దకుపోయి "మహారాజులకు జయము. తమరి కుమారుడు రామలక్ష్మణులు, తమరి కోడలు సీత తమరి దర్శనార్థము వచ్చి ఉన్నారు."అని అన్నాడు.

ఆ మాటలువిన్న దశరథుడు ఒక్కసారి ఉలిక్కి పడ్డాడు. సుమంత్రుని వంక బేలగా చూచాడు. మరలా సుమంత్రుడు ఇలా అన్నాడు. "మహారాజా! వారు అరణ్యములకు పోయే ముందు తమరి దర్శనార్థము ద్వారము వద్ద నిలబడి ఉన్నారు. వారికి తమరి దర్శన భాగ్యము కలిగించండి. అంతేకాదు అడవులకు పోయే ముందు మీరు కూడా రాముని ఒక సారి కనులారా చూడండి. తరువాత మీకు ఆ భాగ్యం కలుగుతుందో లేదో." అని అన్నాడు సుమంత్రుడు.

అప్పుడు దశరథుడు సుమంత్రునితో ఇలా అన్నాడు."సుమంత్రా! అంత:పురములో ఉన్న నా భార్యలను అందరినీ తీసుకొని రమ్ము. వారితో కలిసి నేను రాముని చూడదలచాను."అని అన్నాడు.

వెంటనే సుమంత్రుడు అంత:పురములోనికి వెళ్లి దశరథుని భార్యలనందరినీ పిలుచుకొని వచ్చాడు. దశరథునికి 350 మంది భార్యలు. వారి అందరిలోకి పెద్దభార్య కౌసల్య. కౌసల్య ముందురాగా, 350 మంది అక్కడకు వచ్చారు. అందరూ వచ్చారు అని సరి చూసుకొని తృప్తిపడిన తరువాత దశరథుడు సుమంత్రుని చూచి "సుమంత్రా! ఇప్పుడు రాముని లోపలకు తీసుకొని రా!" అని ఆదేశించాడు.

సుమంత్రుడు బయటకు వెళ్లి రాముడు,లక్ష్మణుడు,సీతను లోపలకు తీసుకొని వెళ్లాడు. లోపల దశరథుడు తన 350మంది భార్యలు చుట్టు ఉండగా ఒక ఆసనము మీద కూర్చుని ఉన్నాడు. రాముని చూడగానే దశరథునకు దు:ఖము ఆగలేదు. వెంటనే ఆసనము మీదినుండి లేచాడు. రాముని వద్దకు గబా గబా నడుచుకుంటూ వెళ్లాడు. కాని మధ్యలోనే దు:ఖము ఆపుకోలేక కిందపడిపోయాడు. స్పృహ తప్పాడు.

తండ్రి గారు కిందపడటం చూచిన రామలక్ష్మణులు ఆయన వద్దకు పరుగెత్తుకొని వెళ్లారు. రాముని చూడగానే అంత:పుర స్త్రీలందరూ దు:ఖము ఆపుకోలేక హా హా కారాలు చేసారు. వారి దు:ఖమును చూచి రామలక్ష్మణులకు కూడా దు:ఖము ఆగలేదు. వారు తమ తండ్రి దశరథుని పైకి లేపి ఒక పాన్పు మీద పడుకోబెట్టారు. దశరథుడు స్పృహలోకి వచ్చాడు. దు:ఖించుచున్న తండ్రిని చూచి రాముడు ఇలా అన్నాడు.

"మహారాజా! మీరు మాకందరికీ అధిపతులు. తమరి వద్దనుండి నేను దండకారణ్యములకు పోవుటకు అనుమతి కోరుచున్నాను. కాస్త తల ఎత్తి నన్ను చూడండి. నాతో పాటు నా భార్య సీత, నా తమ్ముడు లక్ష్మణుడు కూడా వనవాసమునకు  వచ్చుటకు అనుమతి ఇవ్వండి. నేను ఎన్నోసార్లు చెప్పి చూచాను. వీరిద్దరూ నా మాట వినలేదు. నాతోపాటు అరణ్యములకు వస్తానని పట్టుబట్టారు. ఆకారణంగా  వీరు కూడా నా వెంట అడవులకు  వస్తున్నారు. కాబట్టి మా ముగ్గురికీ అనుమతి ప్రసాదించండి." అని పలికి రాముడు చేతులు కట్టుకొని తండ్రి ఎదురుగా నిలబడ్డాడు.

అప్పుడు దశరథుడు బలవంతంగా గొంతు పెగుల్చుకొని ఇలా అన్నాడు. "రామా! ఎప్పుడో ఇచ్చిన వరములను కోరి కైక నన్ను మోసం చేసింది. ఈ మోసాన్ని నువ్వు అంగీకరించ నవసరం లేదు. నీ రాజ్యము నీవు తీసుకొనుము." అని పలికి ఊరుకున్నాడు.

తండ్రిమాటలు విని రాముడు ఇలా అన్నాడు. "మహారాజా! తమరు అయోధ్యను ఎన్నో సంవత్సరముల నుండి పరిపాలిస్తున్నారు. అందుకని తమరు అయోధ్యలోనే ఉండండి. నేను అడవులలో ఉంటాను. నా గురించి మీరు ఆడినమాట తప్పకండి. తమరు విధించిన పదునాలుగు సంవత్సరముల వనవాసము తృటిలో పూర్తిచేసుకొని మీ పాదముల చెంత వాలుతాను. నాకు అనుమతి ఇవ్వండి." అని పలికాడు రాముడు.

దశరథుని పక్కనే ఉన్న కైక "ఏమిటా మంతనాలు. తొందరగా అడవులకు వెళ్లమనండి. మరలా భరతుడు వచ్చేస్తాడు. ఇంకా ఆలస్యం

చెయ్యడం మంచిది కాదు" అని రహస్యంగా దశరథునితో చెప్పింది.

రామునితో తనివితీరా మాట్లాడుకోడానికి కూడా అనుమతించని కైకను చూచి దు:ఖిస్తూ దశరథుడు రామునితో ఇలాఅన్నాడు. "రామా! నీకు, నీ భార్యకు, తమ్ముడికి మంగళమగు గాక! నీవు అన్నట్టు ఈ వనవాసము తృటిలో ముగించుకొని రమ్ము. నీ రాకకోసం ఎదురు చూస్తూ ఉంటాను. రామా! నీవు ధర్మము పాటిస్తావు. అందుకని నిన్ను వెళవద్దు అన్నా వెళ్లడం మానవు. నీ బుద్ధి మరల్చడం నాకు చేతకాదు. కాని ఒక కోరిక. ఈ రాత్రికి ఇక్కడే ఉండి పొద్దుటే వెళ్లు. ఈ ఒక్కరోజు నిన్ను కనులారా చూస్తూ కాలం గడిపేస్తాను. నాకు నీ తల్లి కౌసల్యకు కనువిందు చేస్తూ ఈ రాత్రికి నువ్వు ఇచ్చటనే ఉండు. రేపుఉదయమే వెళ్లు.

ఓరామా! నేను అన్న మాటను నిలబెట్టడానికి నువ్వు అరణ్యములకు వెళుతున్నావు. ఇంతవరకూ ఎవరూ చేయలేని పని నువ్వు చేస్తున్నావు. రామా! నువ్వు అరణ్యములకు పోవడం నాకు ఏమాత్రం ఇష్టంలేదు. ఇదుగో ఈ దుష్టురాలు కైక నన్ను మోసం చేసింది. నా దగ్గర నుండి ముందు మాట తీసుకొని తరువాత ఈ వనవాస విషయం విషం కక్కినట్టు కక్కింది. ఇది సత్యము. నువ్వు నా జ్యేష్ట పుత్రుడవు కాబట్టి, తండ్రిమాట నిలబెట్టడానికి, ఆ వంచకి మాటలను నువ్వు నిజం చేస్తున్నావు. నీరాజ్యం నీవు తీసుకోమని చెప్పినా నీవు వినడం లేదు. ఏం చేసేది."అని దు:ఖిస్తున్నాడు దశరథుడు.

ఆమాటలు విన్న రాముడు ఇలా అన్నాడు. "తండ్రీ! ఈ రాజభోగములు శాశ్వతములు కావు కదా! ఈనాడు ఉంటాయి రేపుపోతాయి. శాశ్వతముగా నిలిచిపోయేది, సత్యము పలకడం, ఆడిన మాట తప్పకుండా ఉండటం. నీవు ఇచ్చిన మాటకు నేను కట్టుబడి ఉన్నాను. అయోధ్యమీద నాకు ఉన్న రాజ్యాధికారమును నేను వదులుకొంటున్నాను. ఈ రాజ్యమును భరతునికి ఇమ్ము. తల్లి కైకకు ఇచ్చిన రెండు వరములు పూర్తిగా నెరవేర్చుము. భరతుని రాజ్యాభిషిక్తుని చేయుము.

మీరు అన్న మాట నేను ఎలా నిలబెట్టుకుంటున్నానో తమరు కూడా తల్లి కైకకు ఇచ్చిన మాట నిలబెట్టుకోండి. మీమాట ప్రకారము నేను పదునాలుగు సంవత్సరములు అరణ్యములలో ఉంటాను. మీరు కూడా భరతునికి రాజ్యాభిషేకము చేయండి. నాకు ఈ రాజ్యము మీద గానీ, రాజభోగముల మీద గానీ ఎలాంటి వ్యామోహము లేదు. తమరి ఆదేశము నెరవేర్చడమే నా కర్తవ్యము. నా గురించి మీరు దు:ఖపడ వద్దు. మీరు అన్న మాటను నిలబెట్టుకోండి.

నేనుకూడా సత్యము మీద ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. నానిర్ణయము నేను మార్చుకోను. నేను ఇక్కడ ఒక్కక్షణం కూడా ఉండలేను. ఈ ఒక్కరాత్రి ఉన్నంత మాత్రాన ఒరిగేదేముంది. నా తల్లి కైక నన్ను అడవులకు వెళ్లమంది. నేను వెళతాను అని అన్నాను. ఆమాట నిలబెట్టుకుంటాను." అని అన్నాడు రాముడు.

రాముడు ఎన్ని విధముల అనునయించిననూ దశరథుడు దు:ఖము మానలేదు. రాముడు మరలా ఇలా అన్నాడు.

"రాజా! తమరు మా గురించి దిగులు పెట్టుకోకండి. మీరు నాకు పితృదేవులు. దైవసమానులైన  మీ మాట నాకు శిరోధార్యము. ఓ రాజా! మరలా చెప్పుచున్నాను. ఈ పదునాలుగు సంవత్సరములు నిమేషమాత్రములో గడిపి మరలా మీపాదముల చెంతకు వస్తాను. అప్పుడు నేను శాశ్వతంగా మీ వద్దనే ఉంటాను. ఇప్పుడు మాకు వెళ్లడానికి అనుమతి ఇవ్వండి.

తండ్రిగారూ! అటు చూడండి. అయోధ్యా వాసులు ఎంతో దు:ఖపడుతున్నారు. మీరు మహారాజులు. వారిని మీరు ఓదార్చాలి. అటువంటి మీరే ఇలా దు:ఖిస్తే వారిని ఎవరూ ఓదారుస్తారు.  కాబట్టి వెంటనే మాకు అడవులకు పోవుటకు అనుమతి ఇవ్వండి. మీరు వెంటనే  భరతునికి పట్టాభిషేకము చేయించండి. అన్నమాట నిలబెట్టుకోండి."అనిపలికాడు రాముడు.

రాముని మాటలకు దశరథునికి దు:ఖము పొంగుకొని వచ్చింది. ఏడుస్తూ కిందపడిపోయాడు. ఒక్క కైక తప్ప మిగిలిన రాణులందరూ హాహాకారాలుచేసారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ముప్పది నాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ముప్పది ఐదవ సర్గ.

అప్పటి దాకా జరిగినది అంతా మౌనంగా చూస్తున్నాడు సుమంత్రుడు. అతని మనస్సు కోపంతో రగిలిపోతూ ఉంది. చేతులు నులుముకుంటున్నాడు. మాటి మాటికీ తల కొట్టుకుం టున్నాడు. అతని కళ్లు ఎర్రబడ్డాయి. ఇంక తట్టుకోలేక పోయాడు. కైకను చూచి ఇలా అన్నాడు.

“ఓ కైకా దేవీ! మీరు మా మహారాజు భార్య అని ఇంతవరకూ గౌరవించాము. మీరు మా మహారాజునే వదిలి పెట్టాము అన్నారు. మా మహారాజునే వదిలిన మీరు ఎంతకైనా తెగించగలరు. మా మహారాజును నీ దుర్మార్గపు పనుల వలన చిత్రవధ చేసి చంపుతున్నావు. నీవు ఇక్ష్వాకు కులమును నాశనం చేయడానికి వచ్చావు. మహారాజుగారు నీవుకోరిన వరాలు ఇస్తానన్నాడు కదా. ఇలాంటి వరాలు కోరాలా! స్త్రీలకు భర్త కంటే వేరు దైవము లేరని తెలియదా! రాజుగారు మరణించినపుడు జ్యేష్టుడు రాజ్యాధి కారము వహిస్తాడు. ఈ ధర్మము నీకు తెలియదా! నేడు ఆ రాజధర్మమును ఎందుకు మార్చాలని ప్రయత్నిస్తున్నావు.

నీ కుమారుడు భరతుడే రాజైతే మేమందరమూ రామునితో పాటు అడవులకు వెళుతాము. నీవు చేస్తున్న దుర్మార్గాలనూ

ధర్మవిరుద్ధమైన పనులనూ చూస్తూ బ్రాహ్మణుడు  ఎవరూ అయోధ్యలో ఉండడు. అయోధ్యలో ఉన్న బ్రాహ్మణులు ప్రజలా అంతా రాముని అనుసరించి వెళ్లాక, నీవు, నీకొడుకు ఒంటరిగా ఈ నిర్మానుష్యమైన అయోధ్యను ఏలుకోండి.. ఈ శ్మశానాన్ని ఏలుకుంటూ నీవు ఏమి ఆనందాన్ని పొందుతావో నేనూ చూస్తాను.

నీవు ఇన్ని దుర్మార్గాలు చేస్తుంటే ఈ భూమి ఎందుకు బ్రద్దలయి నిన్ను  తనలో కలుపుకోలేదో నాకు ఆశ్చర్యంగా ఉంది. రాముని అరణ్యములకు పంపుతున్నావు అన్న వార్త విని నిన్ను ఛీ కొట్టుచున్న వారి శాపములతో నీవు ఇంకా ఎందుకు భస్మం కాలేదా అని నాకు ఆశ్చర్యంగా ఉంది. వేపచెట్టుకు పాలుపోసి పెంచినా దాని చేదు పోనట్టు మా మహారాజుగారు నిన్ను ఎంత ప్రేమగా చూచినా ఆయన పట్ల నువ్వు ఇంత క్రూరంగా ప్రవర్తిస్తున్నావు. ఈ క్రూరత్వము నీకు జన్మతా వచ్చినదా అని సందేహము గా ఉంది. ఎందుకంటే నీ తల్లి నీ కన్నా క్రూరురాలు అని మేము విన్నాము.

నీ తండ్రికి ఒక ఋషి ఒక వరం ఇచ్చాడు. దాని ప్రభావం వలన ఆయనకు అన్ని జంతువుల భాషలూ అర్థం అయ్యేవి. ఒకరోజు నీ తండ్రి పడుకొని ఉండగా నేల మీద పాకుచున్న చీమ మాటలు విని, పక్కున నవ్వాడు. ఆ విషయము తెలియని నీ తల్లి తనను చూచి ఎగతాళిగా నవ్వుతున్నాడు అని అనుకొంది. "నన్నుచూచి ఎందుకు నవ్వుతున్నావు,కారణమేమి" అని నీ తండ్రిని నిలదీసింది. "దేవీ! నా నవ్వుకు కారణం చెబితే నాకు మరణం సంభవిస్తుంది. అందుకని దాని గురించి నన్ను అడగవద్దు." అని అన్నాడు. అప్పుడు నీ తల్లి ఏమన్నదో తెలుసా! "నీవు బతికితే బతుకు, లేకపోతే చావు. కాని నన్ను

పరిహసించి నవ్విన దానికి కారణం చెప్పి తీరాలి" అనిపట్టుబట్టింది. అప్పుడు నీ తండ్రి ఏమన్నాడో తెలుసా! "నీ పట్టుదల కోసం నా ప్రాణాలు పోగొట్టుకోలేను. నువ్వు ఉంటే ఉండు పోతే పో. నేను మాత్రము చెప్పను." అని అన్నాడు.

ఓ కైకా! నీకూ నీ తల్లి బుద్ధులు వచ్చినట్టున్నాయి. అందుకే ఇలా ప్రవర్తిస్తున్నావు. మా మహారాజు నీ తండ్రి వలె ప్రవర్తించకపోవడం వల్లనే రాముడు అరణ్యములకు వెళుతున్నాడు. కొడుకులకు తండ్రి గుణాలు, కూతుళ్లకు తల్లి గుణాలు వారసత్వంగా సంక్రమిస్తాయి అని నీవల్ల ఋజువు అయింది. కనీసం ఇప్పటి కన్నా నీ బుద్ధి మార్చుకొని, నీ పట్టుదల మాని, నీ వరములు ఉపసంహరించుకో. ఈ అయోధ్యను, ప్రజలను కాపాడు.

మరి ఇది నీవు పుట్టిన బుద్ధో లేక ఎవరి చెప్పుడు మాటలు విన్నావో తెలియదు కానీ నీచేతల వలన మా మహారాజును అధర్మపరుడిగా చేయకు. మా మహారాజు నీకు ఇస్తానన్న వరాలు ఇస్తాడు. కానీ నీవే నీ మాట మార్చుకో. వేరే ఏవైనా కోరుకో. జ్యేష్ఠుడైన రామునికి పట్టాభిషేకము జరిపించు. అలా కాకుండా రాముడు అరణ్యములకు వెళితే ఈ లోకంలో నీకు తీరని అపవాదు కలుగుతుంది. ఇంతకాలము బాగా బతికి ఇప్పుడు ఎందుకు ఇంతటి అపవాదును మూటగట్టుకుంటావు. నా మాట విను. రామ పట్టాభిషేకము జరిపించు. తన పూర్వీకుల మాదిరి దశరథుడు సంతోషంగా తపస్సుచేసుకోడానికి అడవులకు వెళతాడు." అని సుమంత్రుడు నయానా భయానా కైకకు నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు.

కాని కైకకు సుమంత్రుడి మాటలు రుచించలేదు. తన పట్టు వీడలేదు. రాముడు అరణ్యములకు వెళ్లాల్సిందే అని మొండిగా వాదించింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ముప్పది ఐదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ముప్పది ఆరవ సర్గ.

సుమంత్రుడి మాటలు, కైక మొండి పట్టు చూస్తున్నాడు దశరథుడు. సుమంత్రుని చూచి ఇలా అన్నాడు.

" ఓ సుమంత్రా! ఈ మూర్ఖురాలు ఎంత చెప్పినా వినదు. కాబట్టి రాముని అరణ్యవాసమునకు ఏర్పాట్లు చెయ్యి. రామునికి రథము ఏర్పాటు చెయ్యి. రాముని వెంట వెళ్లుటకు చతురంగ బలములతో సైన్యమును ఏర్పాటుచెయ్యి. రాముని వెంట వాద్య విశేషములను, నర్తకులను, వేశ్యలను పంపించు. రామునికి ఎవ్వరైతే ఇష్టమో వారిని ఎంత ధనమైనా ఇచ్చి రాముని వెంట అరణ్యములకు పంపు. రాముని వెంట అనేక రకములైన ఆయుధములను, బండ్లమీద పంపు. రామునికి వేటలోసాయం చెయ్యడానికి వ్యాధులను (బోయవారిని) పంపు. రామునికి అవసరమైన ధనమును ధాన్యములను సమృద్ధిగా పంపించు. రాముడు అరణ్యములలో కూడా యాగములు యజ్ఞములు చేస్తూ, ఋషులకు బ్రాహ్మణులకు దక్షిణలు ఇస్తూ, సుఖంగా ఉండాలి. ఇక్కడ భరతుడు రాజ్యము చేస్తూ ఎలాంటి సుఖములు అనుభవిస్తాడో, అన్ని సుఖములను రాముడు అరణ్యములలో అనుభవిస్తాడు. ..."అని చెబుతున్నాడు దశరథుడు.

ఇవన్నీ విన్న కైకకు భయం పట్టుకొంది. ఇవన్నీ ఉంటే రాముడు అడవులలో ఉన్నా ఒకటే అయోధ్యలో ఉన్నా ఒకటే అనుకొంది. దశరథుని చూచిఇలా అంది.

"ఓ మహారాజా! సైనికులు, బ్రాహ్మణులు, జానపదులు అందరూ వెళ్లిపోతే ఇక్కడ ఎవరు ఉంటారు తాగుబోతులు, దుండగులు తప్ప. ఇలాంటిరాజ్యము భరతునికి అక్కరలేదు. అంతా తిన్న తరువాత మిగిలిన ఎంగిలి మెతుకుల్లాంటి ఈ రాజ్యము భరతునికి ఎందుకు? ఇదేనా మీ మాట నిలబెట్టుకోవడం?" అనిసూటిగా అడిగింది.

దానికి దశరథుడు కోపంతో ఇలా అన్నాడు. " ఓ కైకా! నువ్వునాకు భార్యవు కావు. శత్రువు. నన్ను బండికి కట్టి లాగమంటు న్నావు. అదీ కాకుండా కర్రతో పొడుస్తావా. రామునికి ఎలాంటి సౌకర్యాలు ఉండకూడదు అని మొదటే చెప్పవచ్చు కదా. నన్ను అన్నీ చెప్పనిచ్చి ఇప్పుడు కాదు అంటావా దుర్మార్గురాలా!" అని కోపంతో అన్నాడు దశరథుడు.

అంతే కోపంతో కైక దశరథునికి బదులు చెప్పింది. " ఓ రాజా! తమరి వంశంలో సగరుడు తన పెద్దకొడుకు అసమంజుని రాజ్యం ఇవ్వకుండా వెళ్లగొట్టాడు. రాముడు కూడా అలా కట్టుబట్టలతో వెళ్లాలి."అని ఖచ్చితంగా పలికింది కైక.

దశరథుడుకైక వంక అసహ్యంగా చూచాడు. "ఛీ..."అని మాత్రం అన్నాడు. తలదించుకున్నాడు. కైక మాటలకు అంతా సిగ్గుపడ్డారుకానీ కైక మాత్రం తనకు ఏమీ పట్టనట్టు ధీమాగా నిలబడి

ఉంది. ఆసమయంలో అక్కడే ఉన్న సిద్ధార్థుడు అనే దశరథుని మంత్రి ఇలా అన్నాడు.

"కైకకు అసలు విషయం తెలియనట్టు ఉంది. సగరుడి పెద్దకొడుకు అసమంజుడు దుర్మార్గుడు. ఆడుకొనే పిల్లలను పట్టుకొని సరయూ నదిలో విసిరేసేవాడు. వాళ్లు గిలా గిలా కొట్టుకుంటుంటే చూచి ఆనందించేవాడు. అప్పుడు పౌరులందరూ సగరుని చూచి "ఓ రాజా! మీకు దుర్మార్గుడైన కుమారుడు అసమంజుడు కావాలా లేక అయోధ్య కావాలా తేల్చుకోండి" అని అన్నారు. సగరుడకి ఏమీ అర్థం కాలేదు. " ఎందుకు అలా అడుగుతున్నారు?"అని అడిగాడు. అప్పుడు ప్రజలు ఇలా చెప్పారు. " ఓ రాజా! నీ కుమారుడు అసమంజుడు బుద్ధిలేనివాడు, మూర్ఖుడు. క్రూరుడైన మీ కుమారుడు మా పిల్లలను సరయూనదిలోకి విసిరేసి ఆనందిస్తున్నాడు. అందుకని అలా అన్నాము అని అన్నారు పౌరులు. వెంటనే సగరుడు తనపెద్దకుమారుడు అసమంజుని,అతని భార్యను కట్టుబట్టలతో రాజ్యము నుండి వెళ్ల గొట్టాడు.

కాబట్టి, దుర్మార్గుడు, దుష్టుడు, క్రూరుడు అయిన అసమంజునికి రామునికి పోలికా. రాముడు ఏం తప్పుచేసాడని ఆయనను కట్టుబట్టలతో రాజ్యము నుండి వెళ్లగొడు తున్నారు. చంద్రునిలో ఏ దోషమూ లేనట్టు రామునిలో మాకు గానీ, అయోధ్యా పౌరులకు కానీ ఏదోషమూ కనపడటం లేదు. ధర్మాత్ముడైన రామునిలో ఏ దోషమూ ఉండటానికి అవకాశము లేదు. పోనీ మీ కళ్లకు రామునిలో ఏ దోషమైనా కనబడితే అది అందరి ముందూ స్పష్టంగా చెప్పండి. రామునిలో దోషము ఉన్నట్టు మీరు నిరూపించ గలిగితే

రాముని అడవులకు పంపవచ్చును. అలా కాకుండా, ఏ దోషమూ లేని, ధర్మాన్ని పాటించే రాముని అకారణంగా అడవులకు పంపడం అధర్మం. అక్రమం. అది ఈ అయోధ్యనే సర్వనాశనం చేస్తుంది. కాబట్టి ఓ కైకా! మీరు అయోధ్యను కాపాడండి. మీకూ చెడ్డపేరు తెచ్చుకోకండీ. మామాట మన్నించండి."అని అన్నాడు సిద్ధార్ధుడు అనేమంత్రి.

ఆ మాటలకు కైక ఏమీ బదులు చెప్పలేదు. మౌనంగా ఉన్న కైకను చూచి దశరథుడు ఇలా అన్నాడు. "ఓ కైకా! నీకు నిజంగానే బుద్ధిలేదు. లేకపోతే అంత విపులంగా నీ మేలుగోరి సిద్ధార్ధుడు చెప్పిన మాటలను కూడా లెక్కచెయ్యడం లేదు. ఇంక నీతో వాదించి లాభం లేదు. నేను కూడా నా రామునితో పాటు అరణ్యములకు పోతాను. నీవు నీ కుమారుడు సుఖంగా రాజ్యం ఏలుకోండి. " అని అక్కసుగా అన్నాడు దశరథుడు.

శ్రీమద్రామాయణము,
అయోధ్యాకాండము ముప్పదిఆరవ సర్గసంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

అయోధ్యా కాండము

ముప్పది ఏడవ సర్గ.

సుమంత్రుడు, మంత్రి సిద్ధార్థుడు పలికినమాటలు అన్నీ విన్నాడు రాముడు. తరువాత వినయంగా దశరథునితో ఇలా అన్నాడు. "తండ్రిగారూ! తమరు ఏల శ్రమ తీసుకుంటారు. వనములో ఉంటూ కందమూలములు భుజిస్తూ భూమి మీద పడుకొనేవాళ్లము మాకు ఈ సైన్యములు, పరివారము, రథములు ఎందుకు. ఇక్కడ జరిగేది ఎలా ఉందంటే, ఉత్తమమైన ఏనుగును ఇచ్చిన తరువాత, దానికి కట్టే తాడు గురించి వాదులాడుకుంటున్నట్టు ఉంది. రాజ్యమే పోయిన తరువాత పరివారము రాజలాంఛనాలు ఎందుకు చెప్పండి. మాకు ఏమీ అవసరము లేదు. ఆ రాజభోగములు అన్నీ భరతుని అనుభవించ మని చెప్పండి. మాకు కట్టుకోడానికి నారచీరలు తెప్పించండి. మేము రేపటి నుండి వనవాసము చేయబోతున్నాము. మాకు కావలసినవి నేల చదును చేసుకోడానికి ఒక గునపము, గంప. అంతే. అవి తీసుకు వెళ్లడానికి అనుమతి ఇవ్వండి." అని అన్నాడురాముడు.

ఇంతలో కైక కలుగచేసుకొని "నారచీరలు సిద్ధంగా ఉ న్నాయి. మీరు కట్టుకోవడమే తరువాయి" అని అప్పటికే సిద్ధంగా ఉంచిన నారచీరలు అక్కడకు తెప్పించింది. రాముడు భక్తితో కైక చేతుల మీదుగా ఆ నారచీరలు అందుకున్నాడు. తాను ధరించిన రాజవస్త్రములు విడిచి ఆ నారచీరలుకట్టుకున్నాడు. లక్ష్మణుడు కూడా

నార చీరలు ధరించాడు.

కాని సీత మాత్రం ఆ నారచీరలు కట్టుకోడానికి చాలాఅవస్థ పడింది. ముందు ఆ నారచీరలను చూచి భయపడింది. పుట్టినప్పటి నుండి పట్టు వస్త్రములు తప్ప వేరు వస్త్రములు ధరించి ఎరుగదు. అసలు అప్పటిదాకా సీత నారచీరలను చూడనే లేదు. అందుకని కైక ఇచ్చిన నారచీరలు చూచి భయపడింది సీత. కళ్లనిండా నీళ్లు తిరిగాయి. రాముని వంక చూచింది. “వనములలో నివసించే మునికాంతలు ఈ నారచీరలు ఎలా ధరిస్తారో నాకు తెలియదు. నేను ఏమి చెయ్యాలి. ఎలా కట్టుకోవాలి”అని రాముని అడిగింది.

రాముడు కూడా అయోమయంగా చూస్తున్నాడు. సీత ఆ నారచీరలను చేతిలో పట్టుకొని సిగ్గుతో తలవంచుకొని నిలబడి ఉంది. ఇంక చేసేది లేక రాముడు స్వయంగా తానే సీతకు ఆమె కట్టుకున్న బట్టల మీదనే ఆనారచీరలు చుట్టబెట్టాడు.ఆ దృశ్యం చూచి అంతఃపుర కాంతలు కన్నీరుమున్నీరుగా ఏడిచారు.

ఇంక తట్టుకోలేక వారందరూ రాముని వద్దకు వచ్చి “రామా! నిన్ను అడవులకు వెళ్లమన్నారు కానీ సీతను కాదు కదా! నీవునీ తండ్రి మాటను కాదనలేక అడవులకుపోతున్నావు. నీతో కూడా సీత ఎందుకు. నీవు లక్ష్మణుడు అడవులకు వెళ్లండి. సీత సుకుమారి. ఈమె అడవులలో నివసించలేదు. కాబట్టి, మా ప్రార్థనను మన్నించి సీతను ఇక్కడనే వదిలిపెట్టు.  మేము ఆమెను కంటికి రెప్పలాగా చూచుకుంటాము. నీకు తప్పదు కాబట్టి నీవు వెళ్లు.” అని ముక్త కంఠంతో అన్నారు.

రాముడు వారి మాటలు వినీ విననట్టు సీతకు చీర కడుతున్నాడు. ఆ సమయంలో వసిష్ఠుడు కైకనుచూచి ఇలా అన్నాడు.

“ ఓ కైకా! నీవు మరీ మితిమీరుతున్నావు. ధర్మాధర్మ విచక్షణ లేకుండా ప్రవర్తిస్తున్నావు. నీ చర్యల వలన ఇక్ష్వాకు వంశమును అపవిత్రము చేస్తున్నావు. నీవు నీ భర్తను మోసం చేసావు. అంతటితో తృప్తి పడకుండా నీ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తున్నావు. రాజపురోహితు నిగా ఆదేశిస్తున్నాను. సీత అడవులకు వెళ్ల వలసిన అవసరం లేదు. రాముని బదులు సీత సింహాసనము మీద కూర్చుని రాజ్యపాలన చేస్తుంది. భర్తకు భార్య ఆత్మ వంటిది. కాబట్టి రాముని శరీరం అడవులకు వెళ్లినా రాముని ఆత్మఅయిన సీత రాజ్యపాలన చేస్తుంది.

అలా కాకుండా సీత కూడా అరణ్యములకు వెళితే మేముకూడా అరణ్యములకు వెళతాము. అయోధ్య సొంతం మమ్ములను అనుసరిస్తుంది. రాముడు ఎక్కడ ఉంటే అదే అయోధ్య. జనం అంతా అక్కడేఉంటారు. మంత్రులు సేనానులు రాజోద్యోగులు జానపదులు అంతా రాముడి వెంట ఉంటారు. ఇంతమంది రాముని వెంట ఉంటే రాముడు అంటే ప్రాణంపెట్టే భరత శత్రుఘ్నులు అయోధ్యలో ఉంటారా! వారు కూడా నార చీరలు ధరించి రాముని వెంట అరణ్యములలో ఉంటారు. అప్పుడు నీ పరిస్థితి ఏమిటి! నిర్మానుష్యమైన పాడుబడ్డ నగరంలో నీవు ఒంటరిగా నికృష్టమైన జీవితం అనుభవిస్తావు. అది నీకు ఇష్టమా! రాముడు లేని అయోధ్య రాజధాని కాదు. రాముడు లేని రాజ్యము రాజ్యము కాదు. రాముడు ఎక్కడ ఉంటే అదే అయోధ్య. ఆ సంగతి తెలుసుకో!

మరొక విషయం గుర్తు పెట్టుకో. భరతుడు దశరథుని కుమారుడు. అందువలన తండ్రి ఇష్టపడి రాజ్యము ఇవ్వనిదే తాను రాజ్యము స్వీకరించడు. నీ మాట విని భరతుడు రాజ్యము స్వీకరిస్తే అతడు దశరథుని కుమారుడు కాజాలడు. నీవు భరతునికి రాజ్యాభి షేకము చేసి రాజమాతగా రాజభోగములు అనుభవించాలని ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్నావు. కానీ రఘువంశ చరిత్రను తెలిసిన భరతుడు నీ మాట వినడు. రాముడు త్యజించిన రాజ్యమును స్వీకరించడు.

ఓ కైకా! వల్లమాలిన పుత్ర ప్రేమతో నీవు నీ కుమారునికి తీరని అపకారము చేస్తున్నావు. ఒక్క భరతుడే కాదు, రాముని మాట జవదాటే వాడు ఈ లోకంలో ఎవ్వరూ లేరు. రాముడు వనవాసము నకు వెళుతుంటే అయోధ్యలో ఉన్న ఏనుగులు గుర్రములు, ఇతర జంతువులు, తుదకు పక్షులు, చెట్లు చేమలు కూడా రాముడు వెళ్లినవైపు చూస్తూ నిలుచుంటాయి. ఆ దృశ్యము ఇప్పుడే నీవు కనులారా చూడగలవు.

కాబట్టినా మాటవిను. సీతకు ఇచ్చిన నారచీరను వెనక్కు తీసుకో. ఆమెకు పట్టు బట్టలు ఇవ్వు. ఆభరణాలు ఇవ్వు. ఎందుకంటే నీవు రాముని నారచీరలు కట్టుకొని అరణ్యవాసము చెయ్యమని కోరావు కానీ సీతను లక్ష్మణుని నారచీరలు కట్టుకొనమని కోరలేదుగా." అని వసిష్ఠుడు సీతను చూచి

"సీతా! నీవు నారచీరలు కట్టుకో నవసరములేదు. నీవు మామూలుగానే నీవు రోజూ ధరించే వస్త్రములు,ఆభరణము

ధరించు. సీత వెంట ఆమె పరివారము, ఆమెకు రోజూ కావలసిన వస్త్రములు, ఆభరణములు, వస్తువులు అశేషంగా పంపబడతాయి. ఓ కైకా! దీనికి నీవు అడ్డుపెట్టలేవు. ఎందుకంటే నీవు కోరిన కోరికలలో సీత కూడా అరణ్యవాసము చెయ్యాలి అని నీవు కోరలేదు. అది గుర్తుంచుకో!" అని వసిష్ఠుడు కైకతో కోపంగా పలికాడు.

ఆయన మాటలు విన్న తరువాత కూడా సీత, తననిర్ణయం మార్చుకోలేదు. రాముని వెంట వనములకు వెళ్లడానికి సిద్ధం అయింది.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ముప్పది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ముప్పది ఎనిమిదవ సర్గ.

వసిష్ఠుడు కైకతో మాట్లాడిన మాటలు విన్న అంత:పుర స్త్రీలు నార చీర కట్టుకోడానికి రాక అవస్థలుపడుతున్న సీతను చూచి, కైకను దశరథుని మనసులోనే తిట్టుకున్నారు. వారి మనోభావాలను గ్రహించాడు దశరథుడు.

దశరథుడు కైక వంక చూచి "ఓ కైకా! వసిష్ఠుల వారి మాటలు విన్నావు కదా! వారు చెప్పినది యదార్థము. సీత నారచీరలు ధరించనవసరము లేదు. సీత సుకుమారి. వయసులో చిన్నది. పుట్టినప్పటినుండి రాజభోగాలలో మునిగితేలింది. సీతకు వనవాసము సరికాదు. అని వసిష్ఠులవారు చెప్పినది అక్షరాలా సత్యము. జనకమహారాజు కుమార్తె సీత ఒక యోగిని వలె నారచీరలు ధరించనవసరం లేదు. ఓ కైకా! సీత నీకు ఏమి అపకారము చేసిందని ఆమెకు నారచీరలు ఇచ్చావు. నేను నీకు, 'సీత కూడా నార చీరలు ధరించి అడవులకు వెళుతుంది' అని వరం ఇచ్చానా! మరి సీతకు ఎందుకు ఇచ్చావు నారచీరలు? ఆమె ఎవరో తెలుసా! జనకమహారాజు కూతురు. ఆమె నారచీరలు ధరించాలా! కాబట్టి, ఆమెకు పట్టుబట్టలు ఇవ్వు. అంతే కాదు ఆమె వెంట పట్టుబట్టలు, ఆభరణములు పంపించమని ఆదేశిస్తున్నాను.

నాకే జీవించడానికి అర్హత లేదు. అటువంటి వాడిని నేను నీకు వరాలు ఇచ్చాను. నా మాటను రాముడు పాటిస్తున్నాడు అడవులకు వెళుతున్నాడు. వింతగా ఉంది కదూ! కాని నేను నీకు ఇచ్చిన  వరాలతో, నేను నీకు ఇచ్చిన మాటతో సీతకు ఎలాంటి సంబంధము లేదు. రాముడు నీ కేమైనా అపకారము చేస్తాడని అడవులకు వెళ్లగొడుతున్నావు. అలాంటి అపకారము సీత వలన కలగదుకదా! మరి ఆమె ఎందుకు అడవులకు వెళ్లాలి? వెళ్లినా ఎందుకు  నారచీరలు ధరించాలి? నీ పట్ల ఆమె ఏమి అపరాధము చేసింది?

ఓ కైకా! నీవు రాముని అడవులకు పంపుతూ మహాపాపము చేస్తున్నావు. అది చాలదన్నట్టు వాళ్లకు నారచీరలు ఇచ్చి ఘోరమైన అపరాధము చేస్తున్నావు. నరకానికిపోతావు. నరకానికి పోతావు" అని వలా వలా ఏడిచాడు దశరథుడు.

ఏడుస్తున్న తండ్రిని చూచి రాముడు ఆయన దగ్గరగా వెళ్లాడు. దశరథుని దగ్గర కూర్చుని ఇలా అన్నాడు. "ఓ మహారాజా! నా తల్లి కౌసల్య వృధ్ధ్యాప్యములో ఉంది. ఆమెకు ఏ పాపమూ తెలియదు. నేను వనములకు వెళ్లడం చూచి ఆమెకూడా మీ మాదిరి శోక సముద్రంలో మునిగి పోయింది. మీరు కూడా ఇలా శోకిస్తూ  ఉంటే ఆమెను ఎవరు ఓదారుస్తారు. నా తల్లి కౌసల్యను ఆదరంతో చూడండి. ఆమెను నిరాదరించకండి. నా మీద ప్రేమతో నా తల్లి కౌసల్య ప్రాణ త్యాగము చేసుకోకుండా చూడండి. అదే మీరు నాకు ఇచ్చే వరము. ఈ ఒక్కవరాన్ని నాకు ప్రసాదించండి. నాకు వనములకు పోవుటకు అనుమతి ఇవ్వండి." అని అన్నాడు రాముడు.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ముప్పది తొమ్మిదవ సర్గ.

దశరథుడు రాముని వంక చూచాడు. అప్పటికే రాముడు నారచీరలు ధరించాడు. ముని కుమారుని వేషంలో ఉన్నాడు. పట్టాభిషేకము చేసుకుంటూ పట్టు పీతాంబరములు ధరించి సింహాసనము మీద కూర్చుండగా చూడవలసిన రాముని నార చీరలలో మునివేషధారణలో చూడగానే దశరథునికి దు:ఖం ముంచుకొచ్చింది. రామునికి బదులు చెప్పలేకపోయాడు. శరీరం వశం తప్పుతూ ఉంది. నిలదొక్కుకున్నాడు. దు:ఖంతో తలవంచుకొని కూర్చున్నాడు.

"పూర్వము నేను ఎందరినో పిల్లలను తమ తల్లి తండ్రుల వద్దనుండి విడదీసిఉంటాను. అందుకే నాకు  ఈనాడు ఈ దుర్గతి దాపురించింది. లేకపోతే నా రాముడు నన్ను విడిచి అడవులకు పోవడం ఏమిటి. రాముని మునివేషధారణలో చూచి కూడా నా ప్రాణములు పోలేదంటే నాకు ఇంకా కాలం ఆసన్నం కాలేదన్నమాట. ఈ నాడు ఒక్క కైక స్వార్థము కొరకు అయోధ్యా ప్రజలందరూ బాధపడు తున్నారు. ఒక్కరి లాభం కోసం ఇంతమంది బాధపడవలెనా!" అని తనలో తనే కుమిలిపోతున్నాడు.

ఇంకతప్పదని సుమంత్రుని చూచి "సుమంత్రా! రాముని

ప్రయాణమునకు రథము సిద్ధం చెయ్యి. రాముని అందులో ఎక్కించుకొని ఈ దేశపు సరిహద్దులు దాటించి అవతల ఉన్న అరణ్యములో విడిచిపెట్టు. సుమంత్రా! మనిషి మంచివాడుగా ఉండవచ్చు కానీ అతి మంచి వాడు కాకూడదు. రాముని అతి మంచితనమే అతనికి చేటు తెచ్చింది. ఏమి చేస్తాం. నేను నా భార్య మాట విన్నాను. రాముడు నా మాట విన్నాడు. అయోధ్య కష్టాల పాలయింది"అన్నాడు దశరథుడు.

రాజు ఆజ్ఞమేరకు సుమంత్రుడు ఉత్తమ జాతి అశ్వములను కట్టిన రథమును తీసుకొని వచ్చి రాజమందిర ద్వారము దగ్గర నిలిపాడు. "రామా! రథము సిద్ధము ఉంది" అని చెప్పి ఊరుకున్నాడు సుమంత్రుడు. దశరథుడు తన కోశాధికారిని పిలిపించి అతనితో ఇలా అన్నాడు.

"సీత అరణ్యములో ఎన్ని సంవత్సరములు ఉండవలెనో, అన్ని సంవత్సరములకూ సరిపడా అమూల్యమైన దుస్తులు, అలంకారములు, ఆభరణములు తీసుకొనిరా. " అని ఆదేశించాడు. కోశాధికారి అదే ప్రకారము దుస్తులు ఆభరణములు తెచ్చి సీతకు ఇచ్చాడు. సీత మారు మాటాడకుంటా పూర్వము మాదిరి విలువైన దుస్తులు, ఆభరణములు అలంకరించుకొంది. సాక్షాత్తు లక్ష్మీదేవి లాగా ప్రకాశిస్తూ ఉంది. లక్ష్మీకళ ఉట్టిపడుతున్న కోడలిని చూచి కౌసల్య ఆమెను గట్టిగా కౌగలించు కొంది.

"అమ్మా! సీతా! సాధారణంగా శీలవంతులు కాని స్త్రీలు తమ భర్తలు ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు ఆదరిస్తారు. నీచ స్థితిలో ఉన్నప్పుడు

అవమానిస్తారు. . భర్తపట్ల ఏ మాత్రం గౌరవము చూపరు. అవకాశం వస్తే మొగుడిని వదిలేస్తారు. అది ఆడువారి స్వభావము. ఎప్పుడూ చెడ్డ ఆలోచనలు కలవారికి శీలము ఉండదు. అటువంటివారు ఈ క్షణంలో భర్త మీద అనురాగం చూపినా మరుక్షణంలో వారిని ద్వేషిస్తారు. వారు చాలా చంచలంగా ఉంటారు. స్థిరమైన బుద్ధి ఉండదు.

కాని శీలవంతులూ, సత్యవ్రతులూ, స్థిరమైన బుద్ధి కలవారు మాత్రము తమ భర్త ఏ పరిస్థితిలో ఉన్నా వారిని ఆదరిస్తారు. గౌరవిస్తారు. నా కుమారుడు రాముడు ఈ అయోధ్యకు రాజు. ప్రస్తుతము అడవులలో ఉన్నాడని రాముని అగౌరవంగా చూడకు. ధనము లేదని రాముని నిందించకు. భర్తయే పతికి దైవము. నీవు రాముని దైవసమానుడిగా భావించాలి." అని పలికింది కౌసల్య.

అత్తగారి మాటలలో ఆంతర్యం గ్రహించింది సీత. అత్తగారితో ఇలా అంది. "అత్తగారూ! నన్ను సాధారణ స్త్రీ అనీ, దుష్టస్వభావము కల స్త్రీ అనీ ఎందుకు అనుకుంటున్నారు. నేను అలాంటి దానిని కాను. కష్టసుఖములలో భర్తతో ఎలా ప్రవర్తించాలో నాకు బాగా తెలుసు. దీని గురించి నేను ఇదివరకే చాలా చదివాను, విన్నాను. భర్త లేనిదే స్త్రీకి సుఖము లేదని నాకు బాగా తెలుసు. తల్లిగానీ, తండ్రి గానీ, కుమారుడు కానీ, కుమార్తె గానీ స్త్రీకి పరిమితమైన సుఖము, ఆనందము కలిగించగలరు. కానీ భర్త మాత్రము జీవితాంతము భార్యము సుఖాన్ని ఆనందాన్ని పంచి ఇస్తాడు. అట్టి భర్తను ఏ భార్య ఆదరించదు? గౌరవించదు? స్త్రీలకు భర్తయే దైవము. ఆవిషయం నాకు బాగా తెలుసు. అట్టి దైవాన్ని నేను ఎందుకు అవమానిస్తాను? ఆ విషయంలో మీరు ఎలాంటి చింతాపెట్టుకోవద్దు." అని వినయంగా

పలికింది సీత. సీత మాటలు విన్న కౌసల్యము మనసులో ఉన్న బాధంతా చేత్తో తీసినట్టు మాయం అయింది. సీతను ఆదరంగా దగ్గరకు తీసుకొంది.

రాముడు తల్లి కౌసల్యకు ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించి ఇలా అన్నాడు. "అమ్మా! నీవు ఎంత మాత్రమూ దు:ఖపడవద్దు. నేను అతి త్వరలో వనవాసము ముగించుకొని నీ ముందు నిలబడతాను. నీవుమాత్రము తండ్రి గారిని జాగ్రత్తగా చూచుకో. అమ్మా! పద్నాలుగు సంవత్సరాలు అంటే ఎంతసేపు. ఇట్టే గడిచిపోతుంది. నువ్వు అలా నిద్రపోయి ఇలా లేచేసరికి నేను అరణ్యవాసము ముగించుకొని నీ కళ్లముందు ఉంటాను." అని తల్లి కన్నీరు తుడిచాడు రాముడు.

తరువాత అక్కడే ఉన్న తన 350 మంది తల్లుల వంకా చూచాడు. వారందరికీ భక్తి నమస్కరించాడు. "తల్లులారా! నాకు మీతో ఉన్న పరిచయం చేత గానీ, లేక నా అవివేకము వలన గానీ తెలిసో తెలియకో ఏమైనా తప్పులు చేసి ఉంటే నన్ను క్షమించండి. నేను మీ అందరి దగ్గరా సెలవు తీసుకుంటున్నాను. నన్ను ఆశీర్వదించడి." అని అందరికీ నమస్కరించాడు.

రాముని మాటలు విని దశరథుని భార్యలందరూ గట్టిగా రోదించారు. అలాగే రాముని ఆశీర్వదించారు. ఎల్లప్పుడూ మంగళవాద్యములతోనూ వేద మంత్రములతోనూ మార్మోగే దశరథుని గృహము ఇప్పుడు రోదనలతో నిండిపోయింది.

శ్రీమద్రామాయణము అయోధ్యాకాండము

ముప్పది తొమ్మిదవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### నలుబదవ సర్గ.

సీతారామలక్ష్మణులు వనవాసమునకు పోవడానికి సర్వం సిద్ధం అయింది. వారు దశరథునికి నమస్కరించి ఆయనకు ప్రదక్షిణం చేసారు. సాష్టాంగ పడ్డారు. ఆయన పాదములు తాకారు. దశరథుడు మౌనంగా వారిని ఆశీర్వదించాడు. వనవాసానికి అనుమతి ఇచ్చాడు. తరువాత వారు కౌసల్యకు నమస్కరించారు. ఆమె ఆశీర్వాదము తీసుకున్నారు. లక్ష్మణుడు తన తల్లి సుమిత్రకు నమస్కరించి ఆమె ఆశీర్వాదముతీసుకున్నాడు. సుమిత్ర లక్ష్మణుని తలను నిమిరి ఇలా అంది.

"నాయనా లక్ష్మణా! రాముడు నీ అన్న వనవాస సమయము లో రాముని జాగ్రత్తగా కాపాడుతూ ఉండు. ఎందుకంటే సుఖదు:ఖము లలో రాముడే నీకు దిక్కు. రాముని నీ తండ్రి దశరథుని గా భావించు. ఇంక నీ వదిన సీతను నీ తల్లి అంటే నేనుగా భావించు.  నీ తల్లి తండ్రులకు సేవ చేసినట్టు వారికి కూడా  సేవలు చెయ్యి.  జాగ్రత్తగా వెళ్లిరా!" అనిపలికింది సుమిత్ర.

అందరూ రథము దగ్గరకు వచ్చారు. సుమంత్రుడు రథమువద్ద నిలబడి ఉన్నాడు. రాముని చూచి "రామా! రథము సిద్ధముగా ఉన్నది. మీరు రథము ఎక్కండి. మనము ఎక్కడికి వెళ్లాలో చెబితే అక్కడకు

తీసుకొని వెళుతాను." అని అన్నాడు సుమంత్రుడు. రాముడు, లక్ష్మణుడు, సీత రథం ఎక్కారు. రథములో దశరథుని ఆదేశము మేరకు సీత కొరకు అనేకమైన విలువైన వస్త్రములు, ఆభరణములు పెట్టబడి ఉన్నాయి. రామలక్ష్మణులు ఉపయోగించుటకు అనేక రకములైన ఆయుధములు, కత్తులు, డాలులు మొదలగునవి రథములో పెట్టించాడు దశరథుడు.

రథము బయలు దేరింది. రాముడు అరణ్యములకో పోవడం చూచి అయోధ్యప్రజలు విలపిస్తున్నారు. అయోధ్య అంతా శోక సముద్రములో మునిగిపోయింది. అందరూ రాముని రథము వెంట పరుగెత్తుతున్నారు. వెనక నుండి అరుస్తున్నారు.

"ఓ సుమంత్రా! రథము కొంచెం నెమ్మదిగా పోనీయవయ్యా. మేము రాముని ఆఖరుసారిగా చూడాలి." అని అరుస్తున్నారు.

ఇంకొంతమంది అక్కడక్కడా నిలబడి "కన్నకొడుకు అడవులకు వెళుతుంటే ఆ కౌసల్య ఎలా భరించింది." అని అనుకుంటున్నారు.

ఇంకొంత మంది "ఆహా! ఆ సీతది ఏమి అదృష్టము. రాముని వెన్నంటి అడవులకు వెళుతూ ఉంది. లక్ష్మణుడుకూడా ఎంత పుణ్యం చేసుకున్నాడో. ఈ పధ్నాలుగేళ్లు రాముని వెంట ఉండే భాగ్యానికి నోచుకున్నాడు." అని వారిఅదృష్టానికి పొంగిపోతున్నారు.

ఆ ప్రకారంగా అయోధ్యా ప్రజలు రకరకాలుగా అనుకుంటూ కన్నీరు కారుస్తున్నారు. భవనముల పైన ఉన్న కిటికీల దగ్గర నిలబడి

స్త్రీలు రాముని చూచి "పట్టాభిషేకము చేసుకోవాల్సినవాడు, అడవులకు వెళుతున్నాడు. ఏం విచిత్రము" అని శోకిస్తున్నారు.

అయోధ్యావాసుల శోకమును చూడలేక రాముడు "సుమంత్రా! రథమును తొందరగా తోలు. వీరి బాధ చూడలేకున్నాను." అని అన్నాడు. కాని వెనక నుండి పౌరులు రథము ఆపమని అరుస్తున్నారు. ఎవరి మాట వినాలో తెలియక సుమంత్రుడు అయోమయంలో పడ్డాడు. రథము వేగమును అందుకోలేక చాలా మంది కిందపడి పోయారు. కొంతమంది మూర్ఛపోయారు. ఇంకొంతమంది పట్టువిడవకుండా రథము వెంట పరుగెత్తుతున్నారు.

రాముడు రథము మీద పోతూ ఉంటే, దశరథుడు,కౌసల్య ఇంకా కొంతమంది దశరథుని భార్యలు రాముని రథము వెంట కొంత దూరం వచ్చారు. ఇంక ముందుకు సాగలేక అక్కడే నిలబడ్డారు. తన రథము వెంట నడిచివస్తున్న వారిని చూచి రాముడు కళ్లనిండా నీళ్లు పెట్టుకున్నాడు. కాని బైటికి గంభీరంగా ఉన్నాడు. వారి బాధ చూడలేక రథమును తొందరగా పోనివ్వమన్నాడు.

కాని కౌసల్యమాత్రమూ రథము వెంట పరుగెత్తు తూనే ఉంది. "రామా రామా ఆగు రామా ఆగు" అంటూ అరుస్తూ ఉంది. రాముడు వెనక్కుతిరిగి తల్లిని చూచాడు. మనసు ఆగలేదు.కాని నిగ్రహించు కున్నాడు. వెనకనుండి కౌసల్యఅరుపులు సుమంత్రునికి వినిపిస్తున్నాయి. కాని రాముడు రథాన్ని ముందుకు పోనివ్వ మంటున్నాడు. సందిగ్ధంలో పడ్డాడు సుమంత్రుడు. రథం సాగిపోతూనే ఉంది. ఇంక రాముని వెంట నడవలేక, పరుగెత్తలేక కొంత మంది అయోధ్యా ప్రజలువెనుకకు

తిరిగి వెళ్లిపోయారు. కాని మధ్యలో ఆగిపోయిన దశరథుడు ఉండ బట్టలేక మరలా రథం వెంట నడుస్తున్నాడు. అప్పుడు మంత్రులు ఆయనతో ఇలా అన్నాడు.

"మహారాజా! మనము ఎవరినైతే తిరిగి రావాలని కోరుకుంటామో, వారిని ఎక్కువ దూరము సాగనంపకూడదు. కాబట్టి వెనకుకు పోదాముపదండి." అని అన్నారు. మంత్రులమాటలను మన్నించాడు దశరథుడు. ఆగిపోయాడు. రాముడువెళ్లిన దారివెంట చూస్తున్నాడు. రథము ధూళి కనపడ్డమేరా చూస్తున్నాడు. రాముని రథము కనుచూపుమేర దాటిపోయింది.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము నలభైయవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## నలుబది ఒకటవ సర్గ.

ఎప్పుడైతే రాముడు అంత:పురస్త్రీలకు అందరికీ నమస్కరించి బయటు దేరాడో, వారందరూ ఏడవడం మొదలుపెట్టారు.

“ఇంత కాలమూ రాముడు మాకు రక్షకుడుగా ఉండేవాడు. ఆ రాముడు ఇప్పుడు ఏడీ!మనము ఎలా బతకాలి!”అని వాపోతున్నారు. రాముని మంచి గుణములను తలచుకుంటూ ఏడుస్తున్నారు.

“రాముడికి అసలు కోపమే రాదు. ఎవరి మీద కోపగించడు. ఒకవేళ ఎవరన్నా రాముని మీద కోపించిన, తిరిగి వారి మీద కోపింపడు. అటువంటి ఉత్తముడు రాముడు. అందరి కష్టసుఖములు తనవిగా అనుకొని ఆదరించెడి వాడు రాముడు.  రాముడు తన తల్లి కౌసల్యను ఏ మాదిరి ఆదరించేవాడో మా అందరిని కూడా అంతే గౌరవంతో ఆదరించేవాడు.  ఈ నాడు ఈ కైకేయి వలన మాకు రాముని అండలేకుండా పోయింది. అయినా కైక వరాలు కోరిందే అనుకో. మహారాజుగారు ఏదో ఒక వరం ఇచ్చి సరిపుచ్చవచ్చుకదా. ఆమె మాట విని రాముని వనములకు పంపాలా! బుద్ధిలేకపోతే సరి!” అని దశరథుని కూడా నిందిస్తున్నారు.

అసలే రాముడు అడవులకుపోయిన దు:ఖంతో ఉన్న

దశరథునికి అంత:పుర స్త్రీల సూటిపోటీ మాటలు భరించరానివిగా ఉన్నాయి. కానీ ఏమీ అనలేడు. తను చేసిన పని అటువంటిది కదా!

రాముడు లేని అయోధ్యలో బ్రాహ్మణులు అగ్నిహోత్రములు వెలిగించలేదు. ఎవరి ఇంట్లో కూడా పొయ్యి వెలిగించలేదు. రాముడే లేని మాకు అన్నము ఎందుకు అని అనుకున్నారు ప్రజలు. వారి మూలపురుషుడైన సూర్యుడు కూడా మొహం చాటేసాడా అన్నట్టు ఆకాశంలో మబ్బులు కమ్ముకున్నాయి. ఏనుగులు ఆహారం తీసుకోలేదు. ఆవులు తమ దూడలకు పాలుఇవ్వలేదు.

అయోధ్యలో ఉన్న ప్రజలలో ఎవరి మొహంలోనూ సంతోషము ఆనందమూ కనపడలేదు. అందరూ రాముని గురించే ఆలోచిస్తున్నారు. అయోధ్యావాసులందరూ తమ తమ దైనందిన పనులు చెయ్యడంలో ఆసక్తి చూపడం లేదు. రామునికి ఏమవుతుందో ఏమో అని దిగులుతో ఉన్నారు. ఇంక రాముని స్నేహితులు అయితే ఏకంగా మంచానికి అతుక్కుపోయారు. లేవడానికి కూడా వారికి ఓపిక లేదు. రాముడు లేని అయోధ్య ప్రాణం లేని శరీరంలాగా తయారయింది. రాముని వియోగము భరించలేక అయోధ్యలోని ప్రజలేకాదు, పశువులు, ఏనుగులు, గుర్రములు, పక్షులు కూడా ఆహారం ముట్టకుండా విలపిస్తున్నాయి.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నలుబదిఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## నలుబదిరెండవ సర్గ.

రాముని రథము వెళుతున్నంత దూరమూ దశరథుడు అటువేపు  చూస్తూనే ఉన్నాడు. రథము పోవు వేగముతో రేగిన ధూళితో రథము కనపడటం లేదు. రామునికి తనకూ దూరము పెరిగిపోతున్నట్టు భావించాడు దశరథుడు.  దశరథునికి దు:ఖము ముంచుకొచ్చింది. ఇంక రాముడు తనకు కనపడడు అనే భావనను తట్టుకోలేకపోయాడు. అలాగే నేలమీద కూలబడ్డాడు.  పక్కనే ఉన్న కౌసల్య, కైక ఆయననుపట్టుకున్నారు.

దశరథుడు కైక వంక దీనంగా చూచాడు. "ఓ కైకా! దయచేసి నన్ను తాకవద్దు. నీకూ నాకూ ఎలాంటి సంబంధము లేదు. నువ్వు నాకు భార్యవు కావు, బంధువుకావు. నీవు ఎవరని నన్ను తాకుతున్నావు. నీకే కాదు నీ వారికి కూడా నేను ఏమీ కాను. మీకూ నాకూ ఎలాంటి సంబంధము లేదు. నువ్వు ఎప్పుడైతే ధర్మాన్ని విడిచిపెట్టావో అదే క్షణంలో నేనూ నిన్ను విడిచిపెట్టాను. నీచేయి పట్టుకొని పాణిగ్రహణము చేసి అగ్నిహోత్రము చుట్టు మూడు ప్రదక్షిణములు చేసిన నాడు ముడివడిన మన బంధము నేటితో తెగిపోయినది.  ఈ లోకంలో కానీ, పరలోకంలో కానీ మన ఇద్దరికీ ఎలాంటి సంబంధము లేదు. నీకూ నీ కుమారుడు భరతునికీ ఈ రాజ్యము కావాలి. తీసుకోండి. నన్ను విడిచిపెట్టండి. నేను చచ్చిపోయిన

తరువాత మీరు నాకు జలతర్పణము విడవడానికి కూడా నేను అంగీకరించను. మీరు నా శవాన్ని కూడా తాకడానికి నేను అనుమతించను." అని అన్నాడు దశరథుడు.

చేసేది లేక కైక ఆయనను విడిచిపెట్టింది. కౌసల్య దశరథుని పట్టుకొని లేవనెత్తి ఆయన రథములో కూర్చోపెట్టింది. తరువాత తన అంత:పురమునకు వెళ్లిపోయింది. దశరథుడు రాముని తల్చుకుంటూ తనలో తానే కుమిలిపోతున్నాడు. బ్రహ్మహత్యాపాతకము చేసిన వాడి మాదిరి భయంతో వణికిపోతున్నాడు. ఇంతలో వార్తాహరులువచ్చి రాముడు అయోధ్యను దాటి వెళ్లిపోయాడు అని చెప్పారు.

"అవును. రాముడు వెళ్లిపోయాడు. రాముడు వెళ్లిన రథచక్రముల జాడలు, రథమునకు కట్టిన గుర్రముల గిట్టల గుర్తులు మాత్రము అయోధ్యలో కనపడుతున్నాయి. రాముని జాడ మాత్రం కనపడటం లేదు. ప్రతిరోజూ చందనము పూసుకొని హంసతూలికా తల్పము మీద నిద్రించే రాముడు ఈ రోజు ఒళ్లంతా మట్టికొట్టుకొని ఉండగా, కటిక నేల మీద నిద్రిస్తాడు కాబోలు. మెత్తని తలగడ లేకుండా నిద్రించని రాముడు కటిక పాషాణమును తల కిందపెట్టుకొని నిద్రిస్తాడేమో! అయోధ్యలో స్నేహితులు, వందిమాగధులు వెంట రాగా విహరించిన రాముడు రేపటి నుండి మునికుమారులు వెంట రాగా అడవులలో విహరిస్తాడేమో! మెత్తటి తివాచీల మీద నడిస్తేనే కంది పోయే సీత పాదాలు, రేపటి నుండి కటిక రాళ్ల మీద నడవాలి కాబోలు. క్రూరమృగములు అంటేనే భయపడే సీత రేపటినుండి ఆ క్రూర మృగముల భయంకరమైన అరుపులు వింటుందేమో!" అని తనలో తాను అనుకుంటున్నాడు దశరథుడు.

ఇంతలో కైక గుర్తుకు వచ్చింది.

"ఓకైకా! నీ కోరిక తీరిందా! నీకళ్లు చల్లబడ్డాయా! ఇంక నీ ఇష్టం. నీకు మొగుడు లేడు. నీవు విధవరాలవు. రాముడు లేని ఈ లోకంలో నేను ఉండను. నీవే ఈరాజ్యాన్ని పాలించుకో."అని అరుస్తున్నాడు.

ఈ విధంగా దశరథుడు రాముని కోసరం శోకిస్తున్నాడు. వెనకకు తిరిగి పాడుబడినట్టు ఉన్న అయోధ్యలో ప్రవేశించాడు. అటు ఇటు చూస్తూ వెళుతున్నాడు. అయోధ్యలో ఏ ఇంటి ద్వారము తెరవ బడలేదు. ఏ ఇంటి ముందరా జనం లేరు. దేవాలయాలు, అంగళ్లు, అన్నీ మూసి ఉన్నాయి. రహదారుల మీద జనసంచారము లేదు. అటువంటి అయోధ్య వీధులగుండా దశరథుడు తన అంత:పురము చేరుకున్నాడు.

ఆరోజు దాకా రాముని మాటలతో రాముని ఆటపాటలతో సందడిగా ఉన్న అంత:పురము నిశ్శబ్దముగా ఉంది. నిర్మానుష్యమైన ఆ అంత:పురములో ఉండలేకపోయాడు దశరథుడు. "నేను ఇక్కడ ఉండలేను. నన్ను వెంటనే కౌసల్యమందిరమునకు తీసుకొని వెళ్లండి." అని ఆదేశించాడు. వెంటనే పరిచారికలు దశరథుని కౌసల్య మందిరము నకు తీసుకొని వెళ్లారు. కౌసల్య మందిరములో దశరథుడు ఒక శయ్యమీద పడుకొన్నాడు.

కొడుకులు కోడళ్లు లేని ఆ గృహము దశరథునికి చంద్రుడు లేని ఆకాశము మాదిరి అనిపించింది. ఉన్నట్టుండి దశరథుడు ఉ లిక్కిపడుతున్నాడు. ఏడుస్తున్నాడు. "రామా నన్ను విడిచి వెళ్లిపోయావా"

అని అరుస్తున్నాడు. "పద్నాలుగేళ్ల వనవాసము ముగించుకొని నా రాముడు తిరిగి అయోధ్యకు వచ్చినపుడు, ఈ అయోధ్యా పౌరులందరూ రామునికి ఘనస్వాగతము ఇస్తారు. అప్పటికి నేను ఉండను కదా! ఆ అదృష్టానికి నేను నోచుకోలేదు కదా!" అని వాపోతున్నాడు దశరథుడు.

ఇంతలో రాత్రి అయింది. దశరథుడు భోజనము చేయలేదు. నిద్రపోలేదు. అర్థరాత్రి కౌసల్యను పిలిచాడు. "కౌసల్యా! నాకుకళ్లు కనిపించడం లేదు. నా దృష్టి రామునితో పాటు వెళ్లిపోయింది. రాముని చూచిన కళ్లతో నేను దేనినీ చూడలేను. నన్ను తాకు. నిన్ను గుర్తుపడతాను." అని అన్నాడు దశరథుడు.

భర్తమాటలకు కౌసల్యకు దు:ఖము ముంచుకొచ్చింది. దశరథుని చేతి మీద తన చెయ్యివేసి నిమురుతూ ఆయన పక్కనే కూర్చుంది కౌసల్య.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము నలుబదిరెండవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## నలుబదిమూడవ సర్గ

వీళ్ల పరిస్థితి ఇలా ఉంటే కౌసల్య పరిస్థితి కూడా ఇందుకు భిన్నంగా లేదు. ఆమె కూడా రాముని విడిచి ఉండలేక మనసులోనే కుమిలిపోతూ ఉంది. దశరథుని చూచి ఇలా అంది:

“మహారాజా! మన జీవితములలో కైక విషము చిలకరించి నది. ఇప్పుడు కుబుసము విడిచిన పాము వలె నిగ నిగ లాడుతూ మెరిసిపోతూ ఉంది. మనకు దు:ఖంతో కుమిలిపోతున్నాము. ఓ మహారాజా! రాముని అయోధ్యనుండి వెడలగొట్టిన కైక నన్నుకూడా విడిచిపెట్టదు. నన్ను వెంటాడి వేధిస్తుంది. పాము వలె కాటేస్తుంది. కనీసము కైక రాముని అరణ్యములకు పంపకుండా తన వద్ద దాసునిగా నియమించుకొనినా కూడా ఎంతో బాగుండేది. నాకళ్ల ఎదుట నా కుమారుడు ఉండే వాడు. నాలుగు ఇళ్లలో బిక్ష తీసుకొని వచ్చి నన్ను పోషించేవాడు.

ఓ మహారాజా! నీవుమాత్రము తక్కువ చేసావా! దేవతలకు ఇవ్వవలసిన హవిస్సులను రాక్షసులకు ఇచ్చినట్టు, రాముడికి ఇవ్వవలసిన రాజ్యమును భరతునికి ఇచ్చావు. ఓ మహారాజా! ఈ పాటికి నా రాముడు అడవిలోకి ప్రవేశించి ఉంటాడంటావా! సీత, లక్ష్మణుడు వెంటరాగా అడవులలో దిక్కు లేకుండా తిరుగుతూ

ఉంటాడంటావా! ఎన్నడూ కష్టములు అంటే తెలియని రాముని, సీతను లక్ష్మణుని, ఆ కైక మాటవిని అడవులకు పంపావు. వాళ్లు ఎన్ని కష్టాలు పడుతున్నారో! ఏమో!   ఈ వయసులో వారు సుఖాలు అనుభవించాల్సింది పోయి, అరణ్యములలో అష్టకష్టాలు పడుతున్నారు. పంభక్ష్యపరమాన్నములు తినడానికి అలవాటు పడ్డవాళ్లు ఆ అడవిలో దిక్కులేని వాళ్లమాదిరి కందమూలములు ఎలా తింటున్నారో కదా!

ఓ మహారాజా! రాముడు సీతతోనూ లక్ష్మణునితోనూ అయోధ్యకు వచ్చినపుడు చూడటానికి నేను బతికి ఉంటానా! ఆ మంగళకరమైన దృశ్యము కళ్లారా చూడగలనా! రామలక్ష్మణులు తిరిగి రాగానే అయోధ్య అంతా పౌర్ణమి నాటి సముద్రము మాదిరి ఎంత ఉప్పొంగిపోతుందోకదా! రాముడు సీతను రథము మీద తన పక్కన కూర్చుండపెట్టుకొని ఎప్పుడు అయోధ్యలో ప్రవేశిస్తాడో కదా! సీతారామలక్ష్మణులు అయోధ్యలోకి ప్రవేశిస్తుంటే అయోధ్యా ప్రజలు వారి మీద పూలు, లాజలు,చల్లే దృశ్యము ఎప్పుడు కనపడుతుందోకదా! అయోధ్యలోకి ప్రవేశించేముందు సీతారాములు అయోధ్య పట్టణమునకు ప్రదక్షిణము చేస్తూ కన్యలకు, బ్రాహ్మణులకు కానుకలు ఇచ్చే దృశ్యము ఎన్నడు చూస్తానో కదా!

ఓ మహారాజా! రాముడు ఈ పధ్నాలుగుసంవత్సరములు అరణ్యములలో మునుల వద్ద ఉండి ఎన్నో ధర్మములు,శాస్త్రములు నేర్చుకొని బుద్ధి పరిణతిచెంది వస్తాడేమో కాని నా రాముడు నాకు మాత్రం ఆడుకునే మూడేళ్ల చంటి వాడి మాదిరి గానే ఉంటాడు. రాముడు రాగానే నేను వాడితో ఆడుకుంటాను. మీరు కాదనకూడదు. అసలు నాకు ఈ పుత్రవియోగము కలగడానికి కారణం నేను

ఏజన్మలోనో పాలు తాగే దూడలు వాటి తల్లుల వద్ద పాలుతాగడానికి పోయినపుడు  నేను ఆ ఆవుల స్తన్యములను కోసివేసి ఉంటాను. అందుకనే నాకు ఇలాంటి దుర్గతి కలిగింది.

ఓ మహారాజా! నేను గోవునైతే నా రాముడు గోవత్సము. అట్టి మా ఇద్దరినీ సింహము వంటి కైక వేరు చేసినది. ఆ పాపము ఊరికే పోదు. ఓ మహారాజా! నా రాముని విడిచి నేనుజీవించడం కల్ల. ఇంక ఒక్కరోజుకూడా రాముని లేకుండా నేనుజీవించడం నా వల్ల కాదు. ఆ శక్తి నాకు లేదు. ఎందు కంటే  దావానలము అరణ్యమును కాల్చివేసి నట్టు, పుత్రశోకము అనే అగ్ని నన్ను అనునిత్యమూ దహించి వేస్తూ ఉంది. ఆ అగ్నిలో నేను కాలి బూడిద అవడం తథ్యం.” అని భోరు భోరున ఏడుస్తూ ఉంది కౌసల్య.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నలుబదిమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

౧.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## నలుబదినాలుగవ సర్గ

కౌసల్య తన కుమారుడు రాముని తలచుకొని విలపిస్తూ ఉంటే పక్కనే ఉన్న సుమిత్ర ఆమెను ఓదారుస్తూ ఉంది. ఆ మాటకొస్తే సుమిత్రకుమారుడు లక్ష్మణుడు కూడా రాముని వెంట అరణ్యములకు వెళ్లాడు. కాని సుమిత్ర ఎంతో గుండె నిబ్బరంతో కౌసల్యను ఊరడించింది.

"అక్కా! కౌసల్యా! రాముడి గురించి ఏడవడం ఎందుకు? రాముడు సకల సద్గుణ సంపన్నుడు. ఎక్కడ ఉన్నా రాణించగలడు. రాముని కోసం విలపించడం తగదు. రాముడు కేవలము తన తండ్రి మాటను నిలబెట్టడానికి అరణ్యాలకు వెళ్లాడు. అది ఉత్తములు అనుసరించే మార్గము కదా. రాముడు ధర్మం నిలబెట్టాడు. ఇహ పరాలను సాధించాడు. రాముని కోసం విలపించడం వృధా!

అంతెందుకు రాముని వెంట నా కుమారుడు కూడా వెళ్లాడు. రామునికి సేవచేస్తూ కాపాడుతూఉంటాడు. రాముని గురించి భయం ఎందుకు. పైగా సీత. సుకుమారి. ఎండకన్నెరుగనిది. సుఖములు తప్ప దు:ఖము అంటే ఏమిటో తెలియనిది. అటువంటి సీత కూడా రాముని వెంట అడవులకు వెళ్లింది కదా. రాముడు ధర్మమును సత్యమును నమ్ముకున్నాడు. రాముని కీర్తి ప్రతిష్టలు ముల్లోకములలోనూ

వ్యాపిస్తుంది. దీనికి సంతోషించాలి గానీ దు:ఖిస్తావెందుకు.

సూర్యుడు తన కిరణములతో రాముని శోషింపచేయడు. గాలి మెల్లగా వీస్తూ  నీ కుమారునికి హాయి చేకూరుస్తుంది. రాత్రివేళలలో చంద్రుడు తనకిరణములతో రామునికి ఆహ్లాదము కలిగిస్తాడు. పైగా రామునికి ఎంతో దివ్య అస్త్ర సంపద ఉంది. కాబట్టి రామునికి శత్రు భయము లేదు. రాముడు అడవిలో ఉన్నా అంత:పురములో ఉన్నట్టే భావించు.  పైగా రాముడు ధైర్యానికి శౌర్యానికి పెట్టింది పేరు. ఇంక రామునికి తిరుగేముంది. రాముడు ఇట్టే వనవాసమును ముగించుకొని రాగలడు.

ఓ కౌసల్యా! ఇంకా రాముడు సూర్యునికి సూర్యుని వంటి వాడు. అలాగే అగ్నికి అగ్ని, సంపదకు సంపద, కీర్తికి కీర్తి, ఓర్పుకు ఓర్పు, దేవతలకు దేవత, భూతములకు భూతము కాగల సమర్థత కలవాడు. (సాధారణంగా మానవులను కుంగదీసేది,దౌర్బల్యాన్ని కలుగజేసేది భయం. కాని రాముడు, అటువంటి  భయానికే భయం పుట్టించే వాడు అని అర్ధము).  అటువంటి రామునికి అడవీ అంత:పురమూ ఒకటే కదా!

నువ్వు చూస్తూ ఉండు. 14 సంవత్సరాలు క్షణంలో గడిచిపోతాయి. రాముడు తన పక్కన సీతను కూర్చోబెట్టుకొని, రాజ్యలక్ష్మిని వరిస్తాడు. రాముడికి శక్యంకానిది పొందలేనిది ఈలోకంలో ఏదీలేదు. అన్నీ రామునికి పాదాక్రాంతమవుతాయి. అంతే కాకుండా ధనుర్బాణములు ధరించి లక్ష్మణుడు ముందు నడుస్తూ ఉండగా రామునికి అసాధ్యముఅనేది ఏముంటుంది చెప్పు.

ఓ కౌసల్యా! నేనుసత్యము చెబుతున్నాను. రాముడు తిరిగి అయోధ్యలో అడుగు పెట్టిననాడు నువ్వు ఎదురేగి రామునికి హారతులుఇచ్చి నీ వెంట తీసుకొని వస్తావు. అయోధ్యకు తిరిగి వచ్చిన తరువాత రాముడు తన స్నేహితులతో నీ దగ్గరకు వచ్చి నీకు నమస్కరించిననాడు, నీవు  ఆనందపడేరోజు..... రాముడు వచ్చి నీ పాదములను పట్టుకొని ఆశీర్వదించమని అడిగే రోజు.... ఆ రోజు ఎంతో దూరంలో లేదు.

అయినా నువ్వు మా అందరికీ పెద్దదానివి. నువ్వు మా అందరినీ ఓదార్చాల్సింది పోయి, నువ్వే ఇలా బాధ పడితే మా గతి ఏమిటి. రాముని వంటి సకల సద్గుణ సంపన్నుడైన  కుమారుని కన్నందుకు నీవు జీవితాంతము సంతోషించాలి కానీ, కేవలం పదునాలుగేళ్లు వనవాసమునకే ఇంత దు:ఖించాలా! రాముని జీవిత కాలములో ఇది ఎంత. కాబట్టి నువ్వు నిశ్చింతగా ఉండు." అని సుమిత్ర కౌసల్యను ఓదార్చింది.

సుమిత్ర ఆదరంతో చెప్పిన మాటలు విన్న కౌసల్య తన శోకమును మెల్ల మెల్లగా విడిచిపెట్టింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నలుబది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## నలుబదిఐదవ సర్గ

అయోధ్యలో పరిస్థితి ఇలా ఉంట, అక్కడ రాముడు రథము మీద అరణ్యములకు వెళుతున్నాడు. రాముని రథం వెంట ఎంతో మంది అయోధ్యాపౌరులు రాముని అనుసరిస్తున్నారు. రాముడు ఎంత చెప్పినా వారు వినకుండా ఆయన రథమును వెంబడిస్తున్నారు. రాముని మీద వారికి ఉన్న ప్రేమ వారిని రాముని నుండి విడదీయ లేక పోయింది. తన తండ్రి మాట నిలబెట్ట డానికి రాముడు అడవులకు వెళుతున్నప్పుడు, రామునికి తోడుగా మేము కూడా అడవులకు ఎందుకు వెళ్లకూడదు అని వారు అనుకున్నట్టు న్నారు.

తన వెంటవచ్చు అయోధ్యాపౌరులను చూచి రాముడు తన రథమును ఆపించాడు. వారిని చూచి ఇలా అన్నాడు. "ఓ అయోధ్యా ప్రజలారా! మీరు నా మీద చూపుతున్న ప్రేమాభిమానములకు నాకు ఎంతో ఆనందంగా ఉంది. కాని నాది ఒక కోరిక. నా మీద మీరు చూపుతున్న ప్రేమాభిమానములు ఇదేరీతిలో భరతుని మీద కూడా చూపించండి. అలా చేస్తే నాకు ఇంకా ఆనందం కలుగుతుంది.

భరతుడు నా తమ్ముడు. సద్గుణవంతుడు. నా కొన్న బాగుగా రాజ్యమును పరిపాలించగలడు. నా తమ్ముడు భరతుడు వయసులో

నా కన్నా చిన్న వాడయినా జ్ఞానములో నా కన్నా పెద్దవాడు. నా కంటే పరాక్రమ వంతుడు. అయోధ్యకు తగిన రాజు అనిపించుకుంటాడు. భరతుడు అన్నివిధములా రాజు కాదగినవాడు.

మనందరికీ ప్రభువు దశరథమహారాజు. ఆయన తన కుమారుడు భరతుని యువరాజుగా ప్రకటించాడు. మనకు మన మహారాజు మాటలను మన్నించాలి. నేను సంతోషంగా అడవులకు వెళ్లాలంటే మీరందరూ మన మహారాజు దశరథుడు కంటనీరు పెట్టకుండా చూచుకోవాలి. కాబట్టి మీరందరూ వెనుకకు మరలండి." అని అన్నాడు రాముడు.

కాని వారు రాముని మాట వినలేదు.మౌనంగా ఉన్నారు. కొంతమంది వృద్ధ బ్రాహ్మణులు రాముని చూచి ఇలాఅన్నారు. "రామా! నీవు అరణ్యములకు వెళ్లవద్దు. రాముని రథమునకు కట్టిన ఓ హయములారా! మీరు ముందుకు సాగకండి. మన రాముని తిరిగి అయోధ్యకు తీసుకొని రండి. ధర్మాత్ముడు, సకల సద్గుణ సంపన్నుడు అయిన రాముని మీరు అయోధ్యకు తీసుకొని రావలెనే గానీ, అడవులకు తీసుకొని వెళ్లకూడదు." అని దీనంగా పలికారు.

వారి దీనాలాపములను విన్న రాముడు రథం దిగాడు. సీతను, లక్ష్మణుని కూడా రథం దిగమన్నాడు. నడుచుకుంటూ అడవులకు వెళుతున్నాడు. అయోధ్యావాసులు కూడా ఆయన వెంట నడిచివెళుతున్నారు. వారు రామునితో ఇలా అన్నారు.

"ఓ రామా! మేమంతా బ్రాహ్మణులము. నీవు బ్రాహ్మణులకు

హితుడవు. అందకని మేమంతా నీ వెంట వచ్చుచున్నాము. మేము ప్రతిరోజూ అర్చించే అగ్నులను మా వెంట మోసుకొని వస్తున్నాము. మేము వా.జపేయము చేసినప్పుడు మాకు లభించిన తెల్లని గొడుగులు(ఛత్రములు) కూడా మా వెంట వస్తున్నాయి. ప్రస్తుతము నీకు ఛత్రము లేదు. నీవు మా ఛత్రముల నీడలో విశ్రాంతి తీసుకో.

మాకు వేదాధ్యయనము, వేద పఠనము తప్ప మరోవ్యాపకము లేదు. ప్రస్తుతము నీ వెంటవచ్చుటయే మాకు వ్యాపకము. నీవు ఎక్కడ ఉంటే మేము అక్కడ ఉంటాము. మా వెంట వేదములు ఉంటాయి. మా భార్యలు మమ్ములను తలుచుకుంటూ అయోధ్యలో ఉండగలరు. నీవు అయోధ్యకు తిరిగి రావలెనని మా నిర్ణయము. మా నిర్ణయము ధర్మసమ్మతము. ధర్మసమ్మతమైన మా నిర్ణయమును ధర్మాత్ముడవైన నీవే మన్నించకపోతే వేరువాళ్లు ఎవరు మన్నిస్తారు. మేమందరమూ వృద్ధులము. మా వెంట్రుకలు కూడా తెల్లబడ్డాయి. మా ఆశలు కూడా తెల్లబడనీయకు. అయోధ్యకు మరలిరా!

నీ వెంబడి వచ్చుచున్న బ్రాహ్మణులు చాలామంది ఎన్నో యజ్ఞములు మొదలు పెట్టారు. వారందరూ తమ తమ యజ్ఞములను వదిలి వచ్చారు. వారు తాము మొదలు పెట్టిన యజ్ఞములు పూర్తిచేయాలంటే నీవు అయోధ్యకు తిరిగిరావాలి. వారు నీ వెంట అడవులకు వస్తే, వారు తాము మొదలు పెట్టిన యజ్ఞములను ఎలా పూర్తి చేస్తారు.

ఓ రామా! మేమే కాదు. అయోధ్యలో ఉన్న చరాచరములు,

సకల జీవరాసులు అన్నీ నీ రాక కొరకు ఎదురుచూస్తున్నాయి.

రామా! ఆ వృక్షములను చూడు. అవి కూడా నీ వెంట అడవులకు రావలెనని ఎంతో కుతూహలముగా ఉన్నాయి కాని వాటి వేళ్లు భూమిలో పాతుకొని పోవడం వల్ల కదలలేక, నీకోసం విలపిస్తున్నాయి.  ఆ వృక్షములే కాదు, ఆ వృక్షముల మీద గూళ్లు కట్టుకొని నవసిస్తున్న పక్షలు కూడా  ఆహారము మాని నీ కోసం జాలిగా ఎదురు చూస్తున్నాయి. నిన్ను వెనుకకు మరలమని వేడుకుంటున్నాయి."అని ఆ బ్రాహ్మణులు రాముని వెంట నడుస్తున్నారు.

రాముడు అడవులకు వెళ్లడం తనకు కూడా ఇష్టంలేదు అన్నట్టు తమసానది వాళ్లకు అడ్డంగా వచ్చింది. అందరూ తమసా నదీ తీరము చేరుకున్నారు. సుమంత్రుడు రథమునకు కట్టిన గుర్రములను విప్పి వాటికి స్నానం చేయించి నీరు త్రాగించాడు. వాటికి తిండి పెట్టాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నలుబదిఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### నలుబది ఆరవ సర్గ.

తమసానదీ తీరమునకు చేరుకున్న రాముడు, సీతతో, లక్ష్మణునితో ఇలా అన్నాడు.

“ఓ సీతా! లక్ష్మణా! ఇప్పుడు మనము వనవాసములోకి ప్రవేశించాము. మన వనవాసములో ఇది తొలి రాత్రి. చీకట్లు కమ్ముకుంటున్నాయి. పక్షులు కూడా తమ తమ గూళ్లకు చేరి నిశ్శబ్దంగా నిద్రపోతున్నాయి. అయోధ్యలోని మనవారందరూ మన కోసము దు:ఖిస్తూ ఉంటారు. ముఖ్యంగా నా తల్లి కౌసల్య, నా తండ్రి దశరథుడు నా కోసం ఏడ్చి ఏడ్చి అంధులుగా మారిపోతారా అని భయంగా ఉంది. నా తల్లి తండ్రులను ఇంక భరతుడే ఓదార్చాలి. అయినా ధర్మాత్ముడు అయిన భరతుడు ఉండగా నా తల్లితండ్రులకు భయమేముంటుంది.

లక్ష్మణా! నీవు నా వెంబడి రావడం నా మంచికే జరిగింది. లేకపోతే నేను ఒక్కడినే సీతా సంరక్షణ భారం వహించవలసి వచ్చేది. ఓ లక్ష్మణా! ఈ రాత్రికి నేను ఆహారం ఏమీ తీసుకోను. కేవలము నీళ్లు తాగి ఉంటాను. నాకు భోజనము చెయ్యాలని కోరిక లేదు. నీవు మాత్రము మన రథాశ్వములను జాగ్రత్తగా చూచుకో. వాటికి కావలసిన ఆహారపానీయాలు అందాయోలేదో చూడు.” అని అన్నాడు

రాముడు.

రథమును తోలుకొని వచ్చిన సుమంత్రుడు గుర్రములకు కావలసిన ఆహారము పెట్టాడు. వాటిదగ్గరే ఉన్నాడు. తరువాత సుమంత్రుడు రామునకు, సీతకు, లక్ష్మణునకు చెట్ల ఆకులతో కూడిన శయ్యలు(పడకలు) ఏర్పాటు చేసాడు. రాముడు, సీత, లక్ష్మణుడు ఆ శయ్యలమీద పడుకున్నారు. రాముడు సీత నిద్రపోయారు గానీ, సుమంత్రునికి లక్ష్మణునికి నిద్రపట్టలేదు. వారు ఇద్దరూ రాముని సద్గుణముల గురించి ఒకరితో ఒకరు చెప్పుకుంటున్నారు. ఇంతలో రాత్రి గడిచిపోయింది. తెల్లవారింది. సూర్యోదయము కావచ్చింది. రాముని వెంట వచ్చిన బ్రాహ్మణులుకూడా తమసానదీ తీరంలో నిద్రించారు.

పెందరాడే నిద్రలేచిన రాముడు లక్ష్మణునితో ఇలాఅన్నాడు. "ఓ లక్ష్మణా! వీరిని చూడు. నాకోసరము, నామీద ప్రేమతో అభిమానంతో తమ తమ గృహములను విడిచి నా వెంట అడవులకు వచ్చారు. చెట్ల కింద, కటిక నేలమీద నిద్రిస్తున్నారు. వీరు నా కోసం తమ ప్రాణములనైనా ఇస్తారు కానీ తమ తమ నివాసములకు వెళ్లేటట్టులేదు. కాబట్టి అధర్మమైనా నాకు ఒక మార్గము తోచుచున్నది. వీరందరూ నిద్రలేచే లోపు మనము రథం ఎక్కి దూరంగా వెళ్లి పోదాము. అప్పుడు వీరు చేసేది లేక తిరిగి అయోధ్యకు వెళ్లిపోతారు. మనతో పాటు వీరికీ వనవాసము తప్పుతుంది. ఇంక వీళ్లకు ఈ చెట్లకింద నిద్రించే అవసరము ఉండదు. పౌరులకు ఏదైనా దు:ఖము కలిగితే రాజులు తొలగించాలి కానీ, రాజులే పౌరులకు దు:ఖము కలిగించకూడదు." అని అన్నాడు రాముడు.

"రామా! నీ మాటలు చాలా బాగున్నాయి. అలాగే చేద్దాము. సుమంత్రా రథమును సిద్ధం చెయ్యి. మనం వెంటనే బయలుదేరాలి." అని అన్నాడు లక్ష్మణుడు.

సుమంత్రుడు త్వరత్వరగా రథమును సిద్ధం చేసాడు. రాముడు, సీత, లక్ష్మణుడు రథం ఎక్కారు. వారు రథము మీద తమసా నదీ తీరాన్ని దాటారు. రాముడు సుమంత్రునితో ఇలా అన్నాడు. "ఓ సుమంత్రా! నీవు ఉత్తరదిక్కుగా కొంతదూరం ప్రయాణించి తరువాత రథమును వెనుకకు తిప్పుకొనిరమ్ము. మా వెంట వచ్చిన బ్రాహ్మణులకు కనపడకుండా మరలా మావద్దకు రథమును తీసుకొని రా. ఎట్టి పరిస్థితులతోనూ మా విషయం వారికి తెలియనియ్యకు." అని అన్నాడు. సుమంత్రుడు.

రాముడు చెప్పినట్టే చేసి రథమును మరలా రాముని వద్దకు తీసుకొని వచ్చి నిలిపాడు. తరువాత సీతారామలక్ష్మణులు రథం ఎక్కారు. సుమంత్రుడు రథమును అరణ్యమార్గములో పోనిచ్చాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నలుబది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## నలుబది ఏడవ సర్గ.

రాముని వెంట అడవులకు వచ్చిన బ్రాహ్మణులు పౌరులు ఉదయమే నిద్ర లేచారు. కాలకృత్యములు తీర్చుకున్నారు. సంధ్యా వందనము ఆచరించారు. రాముని కొరకు చూచారు. కాని సీతారామలక్ష్మణులు కనిపించలేదు. అడవి అంతా వెతికారు. కాని వారి జాడలేదు. వారిలో వారు ఇలా అనుకుంటున్నారు.

"ఏమిటీ మనము ఒళ్లు తెలియకుండా నిద్రపోయాము. ఉదయమే మెలుకువ రాలేదు. మన కోసం చూచి రాముడు తన దారిన తాను వెళ్లిపోయి ఉంటాడు. ఏం చేస్తాం. రాముడు ఇన్నాళ్లు మనలను కన్నబిడ్డలవలె చూచుకున్నాడు. ఇప్పుడు ఆయనకు అరణ్యవాసము దాపురించింది. అందుకే మనలను విడిచి వెళ్లి పోయాడు. ఇంక మనకు దిక్కు ఎవ్వరు. రాముని విడిచి మనము జీవించలేము. మనము కూడా రాముడు వెళ్లిన ఉత్తర దిక్కుగా వెళ్దాము. ఏనాటి కైనా రాముడు మనకు కనపడకపోతాడా! రాముడు లేకుండా జీవించడం కంటే రాముని వెదకడమే ఉత్తమము. లేకపోతే ఇక్కడే మనము పెద్ద చితి పేర్చుకొని అందులో అందరమూ అగ్ని ప్రవేశము చేస్తాము.

ఇప్పుడు మనము రాముడు లేకుండా అయోధ్యకు వెళితే,

మన ఇంట్లో వాళ్లు "రాముడు ఏడీ!" అని అడిగితే ఏమని సమాధానము చెప్పగలము. రాముని అరణ్యములలో వదిలి వచ్చాము అని చెప్పాలా! మనమందరమూ రాముని తిరిగి తీసుకు వస్తామని అయోధ్యావాసులు అందరూ మనకోసం ఎదురు చూస్తూ ఉంటారు. మనము రాముడు లేకుండా వెళితే వారి దు:ఖమునకు అంతు ఉండదు.

రాముడు ఉన్నప్పుడు మనము అయోధ్యలో ఉన్నాము. రాముని వెంట అడవులకు వచ్చాము. రాముడు లేని అయోధ్యలో మరలా అడుగుపెట్టలేము. ఇప్పుడు ఏమి చెయ్యడం." అంటూ తమలో తాము వ్యాకులపడుతున్నారు.

కొంత మంది రథము పోయిన జాడలు అనుసరించి పోదామన్నారు. అందరూ రథము జాడల అనుసరించి వెళ్లారు.కాని ప్రయోజనం లేకపోయింది. ఇంక చేసేది లేక అందరూ తిరిగి అయోధ్య దారి పట్టారు. సాయంత్రానికి అయోధ్యానగరము చేరుకున్నారు. రాముని లేని అయోధ్య వారికి పాడుబడినట్టు కనిపించింది. చంద్రుడు లేని ఆకాశము లాగా వెలవెలబోతున్న అయోధ్యను వారు చూడలేక పోయారు. రాముని వదిలివచ్చిన దు:ఖముతో ఎవరి గృహములకు వారు వెళ్లిపోయారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నలుబది ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## నలుబది ఎనిమిదవ సర్గ.

రామునితో వెళ్లిన పౌరులు తిరిగి రావడం చూచారు అయోధ్యపుర స్త్రీలు. వారు రాముని తిరిగి తీసుకొని వస్తారు అని ఎంతో ఆశతో ఉన్నారు. వారి ఆశలు అన్నీ నిరాశలు అయ్యాయి. రాముని అడవిలో వదిలి ఇళ్లు చేరిన పౌరులు తమ తమ భార్యా పుత్రులకు తమ ముఖములు చూపించలేక పోయారు. అయోధ్యలో ఎవరూ తమ తమ ఇళ్లలో వంటచేసుకోలేదు. దేవాలయములలో పూజలు జరగలేదు. వర్తకవాణిజ్యములు మూతబడ్డాయి.

రాముడు అడవులకు పోయినందుకు ప్రతి ఇంటిలోనూ దు:ఖము శోకము తాండిస్తూ ఉంది. రాముని లేని అయోధ్యలో తమకు సుఖసంతోషాలు ఎక్కడివని అందరూ అనుకుంటున్నారు. ఈ లోకంలో ఎవరన్నా పుణ్యము చేసుకున్న వాడు ఉన్నాడు అంటే అతడు లక్ష్మణుడే. ఎందుకంటే అతడు ఒక్కడే రాముడి వెంట అరణ్యములకు వెళ్లాడు. రామునికి సేవచేస్తున్నాడు. ఇది వారందరి నిశ్చితాభిప్రాయము. రామునికి అనునిత్యమూ ఫలములను ఇస్తూ సేవ చేసే వృక్షములు తమ కన్నా ఎంతో మేలు అని అనుకొన్నారు. సీతారాములకు ఆనందం కలిగించే వివిధరకములైన పూలు తమకన్నా ఎంత పుణ్యం చేసు కున్నాయి అని అనుకొన్నారు.

కొండల మీదినుండి పర్వతముల మీది నుండి జలజలపారే సెల ఏళ్లు రామునికి స్నానమునకు కావలసిన నీటిని సమకూరు స్తున్నాయి. ఇవి తమ కన్నా ఎంతో మేలైనవి అని అనుకొన్నారు. తాము అయోధ్యలో ఉన్నా సుఖపడలేమని, రాముని తో పాటు అరణ్యములలో ఉంటేనే  తాము సుఖసంతోషాలతో ఉండగల మని అనుకొన్నారు. అయోధ్యావాసము తమకు ఎలాంటి సంతోషాన్ని ఇవ్వలేదని వారి నిశ్చితాభిప్రాయము.

ప్రస్తుతము అయోధ్యకు రాణి కైక. దశరథుడు నామమాత్రపు రాజు. రాజ్యము కొరకు రాముని, తనభర్తను వదిలి వేసిన కైక ఇంక ఎవరిని లక్ష్యపెడుతుంది. కైక రాజ్యములో ఆమెకు సేవకులుగా ఎంతమాత్రము ఉండజాలము అని అందరూ అనుకున్నారు. రాముని అడవికి పంపిన దుర్మార్గురాలు. ఆమె పాలనలో ఎవరు సుఖపడతారు. సుఖంగా జరుగుతున్న అయోధ్య పాలన, కైక వలన అస్తవ్యస్తము అయింది. సర్వనాశనము అయింది.

రాముడు అరణ్యములకు వెళ్లాడు, రాముని చూడనిదో దశరథుడు జీవించలేడు. దశరథుని మరుణానంతరము అయోధ్యలో సుఖము, సంతోషము కరువవుతాయి. అంతా శోకమయం అవుతుంది. అయోధ్యా వాసుల పుణ్యము అంతరించింది. అందుకే రాముడు మనలను విడిచి వెళ్లిపోయాడు. ఇప్పుడు రాముడు వెంట అడవులకు వెళ్లడమో లేక విషంతాగి చావడమో రెండే మార్గాలు అయోధ్యా వాసులకు మిగిలి ఉన్నాయి. అంతేగాని భరతుని పాలనలో బతకడం అసాధ్యము. రాముడు ఎక్కడ ఉంటే అక్కడ వెలుగు వెన్నెల ఉంటాయి.”

ఈ ప్రకారంగా అయోధ్యలో ఉన్న స్త్రీపురుషులు ఎవరికి తోచినట్టు వారు అనుకుంటున్నారు.  ఇంతలో సూర్యాస్తమయము అయింది. చీకట్లు అలుముకుంటున్నాయి. నగరంలో జనసంచారము తగ్గిపోయింది. ఆరోజు అయోధ్యలో ఉన్న ప్రజలు తమ తమ కుమారు లను, సోదరులను పోగొట్టుకున్నట్టు శోకసముద్రంలో మునిగి పోయారు. అయోధ్యలో ఎటువంటి వినోదకార్యక్రమములు, ఉత్సవములు జరగడం లేదు. అయోధ్యలో ఆనందమే కరువైపోయింది. చంద్రుడి లేని ఆకాశమువలె నీరులేని సముద్రము వలె రాముడు లేని అయోధ్య అనాథ అయింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నలుబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## నలుబది తొమ్మిదవ సర్గ.

తనతో వచ్చిన అయోధ్యావాసులు నిద్ర లేవకముందే లేచిన రాముడు తన ప్రయాణం కొనసాగించాడు. సూర్యోదయము అయేటప్పటికి చాలా దూరం వచ్చేసారు. రామ లక్ష్మణులు ప్రాత:సంధ్యను పూర్తి చేసుకొని మరలా ప్రయాణం అయ్యారు. అనేక గ్రామాల గుండా ప్రయాణిస్తున్నారు. ఆ గ్రామ ప్రజలు రాముని వనవాసము గురించి రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు.

“ఆ దశరథుడు కామానికి వశుడై తన భార్య కైక మాటలు విని కన్నకుమారుని అడవులకు వెళ్లగొట్టాడు. ధర్మాత్ముడైన రాముడు తండ్రి మాట కాదనలేక అడవులకు వెళ్లాడు ఏమి ఆశ్చర్యము. అయినా రాముడు అడవులకు వెళ్లాడు. ఆయనతో పాటు సీత ఎందుకు వెళ్లాలి? సుకుమారి అయిన సీత అడవులలో ఎలా ఉండగలదు? రామునితోపాటు సీత కూడా అన్ని కష్టాలు పడవలసిన దేనా! ఎంత దారుణము.” అని రక రకాలుగా అనుకుంటున్నారు.

వారి మాటలు వింటూ రాముడు అరణ్యముల వంక సాగుతున్నాడు. వారు వేదశ్రుతి అనే నదిని దాటారు. దక్షిణ దిక్కుగా ఉన్న అగస్త్య ఆశ్రమము వైపు ప్రయాణం చేస్తున్నారు. అలా ప్రయాణం చేస్తూ వారు గోమతీ నదీ తీరానికి చేరుకున్నారు. గోమతీ నదిని

దాటిన తరువాత వారు స్యందికా నదిని చేరుకున్నారు. ఆ నదిని కూడా దాటి వారు పూర్వము మను చక్రవర్తి రాముని మూల పురుషుడైన ఇక్ష్వాకువునకు ఇచ్చిన విశాలమైన భూములలోకి ప్రవేశించారు. ఆ భూమి నంతనూ రాముడు సీతకు చూపించి దాని గురించిన వృత్తాంతమును సీతకు వివరించాడు. సారవంతమైన ఆ భూముల గుండా వారు ప్రయాణం చేస్తున్నారు. అనేక వన్యప్రాణులతో నిండిన అడవులలో గుండా వారు వెళుతున్నారు. అప్పుడు సుమంత్రుని చూచి రాముడు ఇలా అన్నాడు.

"సుమంత్రా! నేను వనవాసము ముగించుకొని తిరిగివచ్చి తల్లితండ్రుల దర్శనము చేసుకొని ఈ వనసీమలలో ఎప్పుడు తనివితీరా వేటాడెదనో కదా! వేట క్షత్రియులకు ఉచితమే కానీ నాకు ఎందుకో సరయూనదీతీరములో ఉన్న ఈవనములలో వేటాడవలెనని కోరిక అంతగా లేదు. అసలు నాకు వేట మీద అంత మక్కువ లేదు. అరణ్యములలో వాటి మానాన అవి బతుకుతున్న అమాయకమైన ఆ ప్రాణులను, కేవలం మన ఆనందం కోసరం, వేట మిషతో చంపడం పాపం కదా! అందుకనే నాకు వేట మీద అంతగా కోరిక లేదు. కాని క్రూర మృగములు విజృంభించినపుడు వేటాడక తప్పదు." అని వేట గురించి ముచ్చటించుకుంటూ రాముడు సుమంత్రుడు నడిపే రథం మీద ప్రయాణిస్తున్నాడు.

శ్రీమద్రామాయణము,

అయోధ్యాకాండము నలుబదితొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ఏబదవ సర్గ.

రాముడు సీతాలక్ష్మణ సమేతుడై రథము మీద కోసల దేశపు సరిహద్దుల వద్దకు వచ్చాడు. అయోధ్య ఉన్న వంక తిరిగాడు. రెండు చేతులు ఎత్తి నమస్కరిస్తూ "కాకుత్థ్స వంశస్థులచే పరిపాలింప బడుతున్న ఓ అయోధ్యా నగరమా! పుట్టినప్పటి నుండి నీ ఒడిలో పెరిగాను. ఇప్పుడు విధి వశాత్తు నిన్ను విడిచి వెళుతున్నాను. నిన్ను, నీలో నివసించు ప్రజలను విడిచిపోవుటకు మీ అనుమతి కోరుతున్నాను. అచిరకాలములోనే నేను వనవాసము పూర్తి చేసుకొని తిరిగి వస్తాను. అయోధ్యానగర ప్రవేశము చేస్తాను."అని అయోధ్యాపురికి నమస్కరించాడు.

అప్పటికే రాముడు వచ్చాడని వార్త తెలిసి సమీప గ్రామ ప్రజలు రాముని చూడటానికి అక్కడకు చేరుకున్నారు. వారిని చూచి రాముడు ఇలా అన్నాడు. "మీరు నా మీద జాలి చూపించారు. కాని మీ మీ పనులు మానుకొని నాకోసం దు:ఖించడం మంచిది కాదు. మీ పనులు చూచుకొనుడు." అని వారికి నమస్కరించి చెప్పాడు. వారుకూడా రామునికి పట్టిన దుర్దశకు దు:ఖిస్తున్నారు. తరువాత రాముడు కోసల దేశమును దాటి వెళ్లిపోయాడు.

రాముడు ప్రయాణించు రథము పరమ పవిత్రమైన గంగాతీరము చేరుకొంది. గంగానదీ తీరమున గల మున్యాశ్రమములు గంగానదికి అలంకారముగా శోభిల్లుతున్నాయి. దేవలోకమునుండి అప్సరసలు గంగా స్నానము కొరకు అక్కడకు వస్తూ ఉంటారు. పవిత్రమైన ఆ గంగను దేవతలు, దానవులు,గంధర్వులు సదా సేవిస్తూ ఉంటారు.గంగ కొన్ని ప్రదేశములలో వేగంగానూ కొన్ని ప్రదేశములలో నెమ్మదిగానూ ప్రవహిస్తూ ఉంటుంది. ఆ గంగానదిలో హంసలు, సారస పక్షులుయధేచ్ఛగా విహరిస్తుంటాయి. గంగానదికి ఆ ఒడ్డున ఈ ఒడ్డున ఉన్న పచ్చని చెట్లు గంగానదికి అలంకరించిన పూలమాలల వలె ప్రకాశిస్తున్నాయి. గంగానదీజలములు నిర్మలంగా స్వచ్ఛంగా పారుతున్నాయి. కాని అక్కడక్కడ మదగజములు గంగానదిలో దిగి స్నానము చేయడం వల్ల నీరు కలుషితము అవుతూ మరలా నిర్మలంగా మారుతూ ఉంది. గంగానదీ తీర ప్రాంతము అంతా మధురమైన ఫల వృక్షములతోనూ.పూల మొక్కలతోనూ నిండి సర్వాలంకార శోభిత అయిన మంగళకరమైన స్త్రీ వలె శోభిల్లుతూ ఉంది. అటువంటి గంగాతీరము వెంట ప్రయాణించి రాముడు శృంగిభేరపురమునకు చేరుకున్నాడు.

"సుమంత్రా! రథమును ఆపుము. ఇక్కడ ఒక ఇఙ్గుదీ వృక్షము ఉన్నది. ఈ వృక్షము ఫలములతో నిండి ఉంది. ఈ రాత్రికి మనము ఇక్కడే ఉండెదము. పవిత్ర గంగానదిలో స్నానము చేసి, ఈ చెట్టు కిందనే నిద్రించెదము." అని అన్నాడు రాముడు.

రాముని ఆదేశము ప్రకారము సుమంత్రుడు రథమును ఆవృక్షము కింద నిలిపాడు. రాముడు, లక్ష్మణుడు, సీత రథము దిగారు.

సుమంత్రుడు కూడా రథము దిగి రథమునకు కట్టిన గుర్రములను మేతకు విడిచి పెట్టి, రాముని వద్దకు వచ్చాడు.

ఆ శృంగిభేరపురంలో బోయజాతికి చెందిన వాడు, అక్కడ ఉన్న బోయలకు నాయకుడు, రామునికి మిత్రుడు అయిన గుహుడు అనే బోయవాడు నివసిస్తున్నాడు. రాముడు తన రాజ్యమునకు వస్తున్నాడని వార్త ముందే తెలిసిన గుహుడు కుల పెద్దలతోనూ, సేవకులతోనూ రాముని వద్దకు వచ్చాడు. గుహుని రాక విని రాముడు అతనికి ఎదురుపోయి అతనిని కౌగలించుకున్నాడు. గుహుని క్షేమసమాచారములు అడిగి తెలుసుకున్నాడు.

"రామా! ఇది నీకుపరాయి ఇల్లు కాదు. నీకు అయోధ్య ఎలాగో ఇదీ అలాగే. నీ ఇష్టం వచ్చినట్టు ఉండవచ్చును. నీ వంటి మిత్రుడు అతిథిగా రావడం నేను చేసుకున్న అదృష్టం. నీకు ఏమి కావాలో ఆజ్ఞాపించు. క్షణంలో సమకూరుస్తాను." అని అన్నాడు గుహుడు. రామునికి, సీత, లక్ష్మణుడు,సుమంత్రునికి రకరకాలైన భోజనములు, పానీయములు సమకూర్చాడు.

"రామా! భోజన పదార్థములు సిద్ధంగాఉన్నాయి. మీరందరూ భోజనం చేయండి." అని అన్నాడు. అప్పుడు రాముడు గుహునితో ఇలా అన్నాడు. "నీవు నా వద్దకు వచ్చి నన్ను ఆదరించడమే నీవు మాకు ఇచ్చే ఆతిధ్యము. నేను ప్రస్తుతము వనవాసములో మునివృత్తిలో ఉన్నాను. ఎవరు ఏమి ఇచ్చినా తీసుకొనను. ఫలములు తప్ప వేరే ఆహారము తీసుకొనను. కాని నా రథమునకు కట్టిన అశ్వములు మా తండ్రిగారికి ఎంతో ప్రియమైనవి. వాటికి కావలసిన ఆహారము సమకూర్చుము. అదే

నాకుమహదానందము." అని అన్నాడు రాముడు.

వెంటనే గుహుడు అశ్వములకు కావలసిన ఆహార ఏర్పాట్లు చేసాడు. ఆ రాత్రికి రాముడు కేవలము నీరు ఆహారంగా తీసుకొని నిద్రించాడు. గుహుడు ఆ రాత్రికి అక్కడే ఉన్నాడు. లక్ష్మణునితోనూ, సుమంత్రునితోనూ మాట్లాడుతూ మేలుకొని  ఉన్నాడు.

రామునికి ఓ పట్టాన కటిక నేలమీద నిద్రపట్టలేదు. ఆ రాత్రి చాలా దీర్ఘంగా ఉన్నట్టు అనిపించింది రామునికి.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఏబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఏబది ఒకటవ సర్గ.

గుహుడు లక్ష్మణునితో ఇలాఅన్నాడు. "లక్ష్మణకుమారా! వనవాస వ్రతము రామునికి కానీ నీకు కాదు కదా! నీకోసరము మెత్తని శయ్య సిద్ధమే చేసాము. నీవు దీని మీద పడుకో. మాకు ఈ కటికరాళ్ల మీద పడుకోవడం అలవాటే. నీవు రాచబిడ్డవు. నీవు పడుకోలేవు. మేము రాత్రి అంతా మేలుకొని రామునికి, నీకు కాపలా కాస్తాము.

లక్ష్మణా! నాకు ఈ లోకములో రాముని కంటే ఇష్టమైన వాడు ఎవరూ లేరు. అటువంటి రాముడు ఇలా ఒంటరిగా అడవిలో కటికనేల మీద నిరాహారంగా నిద్రించడం బాధాకరంగా ఉంది. నీకు, రామునికి ఈ అరణ్యములో ఎలాంటి భయమూ లేదు. మాకు ఈ అరణ్యము కొత్త కాదు. నీవు సుఖంగా నిద్రించు." అని అన్నాడు.

అప్పుడు లక్ష్మణుడు గుహునితో ఇలా అన్నాడు."మిత్రమా! నీవు మా పక్కన ఉండగా మాకు ఏమి భయము. అటుచూడు. నా అన్న, నా వదిన అలా కటికనేల మీద పడుకొని ఉండగా నాకు సుఖంగా నిద్ర ఎలా వస్తుంది. అసలు నాకు సుఖాలు పొందాలనే కోరిక ఎలా కలుగుతుంది. రాజాంత:పురములలో పట్టుపరుపుల మీద పవళించిన సీతారాములు నేడు ఆ గడ్డిపానుపు మీద ఎలా సుఖంగా నిద్రిస్తున్నారో

చూడు. రాముడు దశరథునికి, ఎన్నో పూజలు వ్రతాలు, యజ్ఞాలు, యాగాలు చేస్తే పుట్టిన వాడు. అటువంటి రాముడు అడవులకు వెళితో దశరథుడు జీవించగలడా! ఏమోకొద్ది రోజులలో అయోధ్య అనాధ అవుతుందేమో అని భయంగా ఉంది. రాముని కొరకు  ఏడ్చి ఏడ్చి అంత:పుర స్త్రీలు అందరూ ఈ పాటికి మౌనం వహించి ఉంటారు. రాముని తల్లి కౌసల్య, దశరథుడు, రాముడు లేడు అనే శోకంతో ఏమయ్యారో అని దిగులుగా ఉంది.

నా తల్లి సుమిత్ర నా తమ్ముడు శత్రుఘ్నుని చూచుకుంటూ జీవించి ఉంటుందేమో కానీ, ఒక్కగా నొక్క కొడుకును దూరం చేసుకున్న కౌసల్య జీవించి ఉండలేదు. అదే నాకు బాధగా ఉంది. రాముడు లేని అయోధ్య కూడా నిర్జీవము అయిపోయింది. చిన్నప్పటినుండి ప్రాణానికి ప్రాణంగా చూసుకొన్న రాముడు దూరం కాగానే దశరథుని ప్రాణాలు అతని దేహంలో ఉండటం కష్టమే. రాజు మరణించగానే, కౌసల్య ప్రాణత్యాగము చేస్తుంది. కౌసల్య చనిపోగానే నా తల్లి కూడా ఆమెనే అనుసరిస్తుంది. వారి కందరికీ భరతుడు ఉత్తర క్రియలు నిర్వర్తించాలేమో!

మిత్రమా! నేను ఏమేమో ఊహించుకొనుచున్నాను. అవన్నీ నిజం కావేమో. మేము అయోధ్యకు తిరిగి వచ్చువరకూ దశరథుడు మా కోసరం అయోధ్యానగర ముఖద్వారము వద్ద వేచి ఉండి, మమ్ములను సాదరంగా ఆహ్వానించి లోపలకు తీసుకుపోతాడేమో! మేమందరమూ మా తల్లులతో ఆనందంగా ఉంటామేమో! మిత్రమా! ఏదైనా జరగ వచ్చు. దేనినీ మనము కాదనలేము కదా!" అంటూ పరి

పలివిధముల మాట్లాడుచున్న లక్ష్మణుని మాటలు వింటూ ఉన్న గుహుని కూడా దు:ఖము ఆగలేదు. రామునికి, అయోధ్యకు పట్టిన దుర్గతి తలుచుకుంటూ బాధపడ్డాడు. వారిరువురి దీనాలాపములతో ఆ రాత్రి గడిచి పోయింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఏబదిఒకటవ సర్గసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

అయోధ్యా కాండము

ఏబది రెండవ సర్గ.

మరునాడు తెల్లవారింది. రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"లక్ష్మణా! మనము గంగానదిని దాటిఆవలి ఒడ్డుకు చేరుకోవాలి.గుహునితో చెప్పి గంగానదిని దాటుటకు ఒక నావను సిద్ధం చేయమని చెప్పు."అని అన్నాడు.

లక్ష్మణుడు వెంటనే గుహుని పిలిచి ఒక నావను సిద్ధము చేయమని చెప్పాడు. వెంటనే గుహుడు రామలక్ష్మణులు గంగానదిని దాటుటకు ఒక నావను సిద్ధం చేసాడు. అప్పుడు రాముడు గుహునితో ఇలా అన్నాడు. "మిత్రమా! నన్ను నావను ఎక్కించుము" అని అన్నాడు. గుహుడు రామలక్ష్మణులను సీతను నావ ఉన్న ప్రదేశమునకు తీసుకొని వెళుతున్నాడు.

అప్పుడు సుమంత్రుడు రాముని చూచి ఇలాఅన్నాడు. "రామా! మీరు గంగానదిని దాటి ఆవల ఒడ్డుకు వెళుతున్నారు.నేనేమి చేయాలి. సెలవివ్వండి."అని అడిగాడు.

రాముడు సుమంత్రుని వీపుమీద చేయి వేసి ఆప్యాయంగా

నిమిరి "సుమంత్రా! నీవు అయోధ్యకు తిరిగి పొమ్ము. మా తండ్రి దశరథుని జాగ్రత్తగా చూచుకొమ్ము. నీవు చేసిన సాయమునకు కృతజ్ఞుడను. ఇంక నేను కాలి నడకన అరణ్యములలోకి వెళ్లెదను. నీవు అయోధ్యకు వెళ్లుము." అని అన్నాడు రాముడు.

అప్పుడు సుమంత్రుడు రాముని చూచి ఇలాఅన్నాడు. "రామా! అయోధ్యకు రాజువై ఉండి కూడా, నీవు సామాన్యుని వలె అడవులలో తిరుగుతున్నావు. తండ్రి ఆజ్ఞప్రకారము ఇటువంటి పని నీవు మాత్రమే చేయగల సమర్థుడవు. కాని నీకు వచ్చిన కష్టము సామాన్యమైనది కాదు. జీవితములో ఇలాంటి కష్టములు కూడా సంభవిస్తుంటే ఇంక వేదాధ్యయనము చేసి గానీ, మంచి ప్రవర్తన కలిగి ఉండి గానీ ప్రయోజనమేమి. రామా! నీవు చేసిన వనవాసము వృధాపోదు. ఈవనవాసమునకు ప్రతిఫలముగా నీకు సద్గతులు లభిస్తాయి. కాని మేమే దురదృష్ట వంతులము. నిన్ను అడవుల పాలుచేసిన ఆ కైక చేతి కింద బ్రతుక వలసిన దౌర్భాగ్య ము పట్టినది. ఏం చేస్తాము." అని రాముని చూచి ఏడ్చాడు సుమంత్రుడు.

రాముడు సుమంత్రుని చూచి ఇలా అన్నాడు. "సుమంత్రా! అన్ని తెలిసినవాడవు నీవే ఇలా దు:ఖిస్తే ఎలాగ. మా ఇక్ష్వాకు వంశమునకు, ముఖ్యంగా మా తండ్రిగారికి నీవు ఆప్తుడవు. కాబట్టి నీవు మా తండ్రిగారి మంచి చెడ్డలు చూడాలి కదా. ఆ కైకను సంతోషపెట్టడానికి మా తండ్రిగారు ఏమి చెప్పినా, ఆయన మనస్సు బాధపడ కుండా నీవు ఆపనులు అన్నీ చేయాలి కదా! ప్రస్తుతము దశరథుడు అయోధ్యకు రాజు ఆయన మాట పాలించడం మన అందరి కర్తవ్యము. దశరథమహారాజు అనుచితమైన పనులు చెప్పినా

అవి చేయడం మన కర్తవ్యము. కాబట్టి నీవు అయోధ్యకు పోయి దశరథ మహారాజుకు, నేను నమస్కరించినట్టుగా చెప్పి, ఇంకా నా మాటలుగా ఇలా చెప్పు.

“తండ్రిగారూ! నేను గానీ, లక్ష్మణుడు గానీ, సీత గానీ, మేము అడవులలో నివసించవలసి వచ్చినదే అని ఏ మాత్రమూ బాధపడటం లేదు. అరణ్యవాసము పదునాలుగుసంవత్సరములు పూర్తిచేసుకొని మేము అయోధ్యకు తిరిగి వస్తాము. అప్పుడు మేమందరమూ నీ కళ్ల ఎదుటనే ఉంటాము.” అని నా మాటగా మా తండ్రిగారికి చెప్పు.

అలాగే మాతల్లి కౌసల్యను, కైకను, ఇతర తల్లుల యోగక్షేమము లను అడిగినట్టు చెప్పు. నేను, సీత, లక్ష్మణుడు మా తల్లి కౌసల్యకు పాదాభి వందనము చేసామని చెప్పు. మా తండ్రిగారికి మేమందరమూ పాదాభివందనము చేసామని చెప్పు. వీలైనంత త్వరగా మా తమ్ముడు భరతుని తీసుకొని వచ్చి అయోధ్యకు రాజుగా అభిషేకము చేయమని నామాటగా మా తండ్రిగారికి చెప్పు. రాజ్యాభిషిక్తుడు అయిన తరువాత భరతునితో ఈ విధంగా నా మాటగా చెప్పు.

“భరతా! నీకు నీ తల్లి కైక ఎలాగో. నా తల్లి కౌసల్య, లక్ష్మణుని తల్లి సుమిత్రకూడా అలాగే. మన తండ్రిగారి కోరిక అనుసరించి నీవు అయోధ్యకు పట్టాభిషిక్తుడవై ఇహపరములలో సుఖాలు అనుభవించు.” ఈ విధంగా భరతునికి చెప్పు. సుమంత్రా! ఇంక నీవు అయోధ్యకు బయలు దేరు.” అని అన్నాడు.

రాముడు చెప్పి మాటలన్నీ విన్న సుమంత్రుడి దు:ఖానికి అంతులేదు. రామునితో ఇలా అన్నాడు. "రామా! నేను నీ అనుచరుడను. భక్తుడను. కాని, నీవు చెప్పిన పనులన్నీ నేను చేయలేను. నన్ను క్షమించు. నిన్ను ఈ అడవులలో విడిచి పెట్టి నేను ఒంటరిగా అయోధ్యకు వెళ్లలేను. రాముడు నా రథము మీద అడవులకు వస్తున్నప్పుడు, అయోధ్యా వాసులు ఆ రథం వెంట పరుగెత్తి ఎంతో దు:ఖించారు. ఇప్పుడు రాముడు లేకుండా నేను రథాన్ని మాత్రం అయోధ్యకు తీసుకొని వెళితే వారి గుండెలు బద్దలవుతాయి. ఎందుకంటే అయోధ్యావాసుల గుండెల్లో నీవు కొలువుదీరి ఉన్నావు. వారు దూరంగా ఉన్నా అనుక్షణం నిన్ను తలచుకుంటూనేఉంటారు.

ఓ రామా! నీవు అరణ్యమునకు నారథము మీద వచ్చునప్పుడు అయోధ్యాపౌరులు ఎంతగా ఏడ్చారో, ఇప్పుడు నీవు లేకుండా వచ్చిన రథమును చూచి అంత కన్నా ఎక్కువ ఏడుస్తారు. కాబట్టి నీవు లేని రథమును నేను అయోధ్యకు తీసుకొని వెళ్లలేను.

అది సరే! నేను కౌసల్య వద్దకు పోయి ఏమని చెప్ప మంటావు? నీ కుమారుని అరణ్యములలో విడిచివచ్చాను అని చెప్పమంటావా! అది నా వల్లకాదు. ఆమాట చెప్పి నీ తల్లిని మరింత దు:ఖపెట్టలేను. కాబట్టి నేను అయోధ్యకు తిరిగి వెళ్లలేను. నీ వెంటనే ఇక్కడే ఉంటాను. అలా కాకుండా నన్ను వదిలిపెట్టి నీవు వెళ్లిపోతే, నేను ఇక్కడే చితి పేర్చుకొని అగ్నిలో దూకుతాను.

ఓ రామా! నేను నీకు ఎలాంటి ఇబ్బంది కలిగించను. నీకు

సాయంగాఉంటాను. అనువైన మార్గములలో  నిన్ను రథం మీద తీసుకొని వెళతాను.  ఇంతకాలము నీవు ఎక్కిన రథము తోలాను. ఇప్పుడు నీ వెంట ఉండి నీతో వనవాససుఖము అనుభవిస్తాను.

ఓ రామా! నేనే కాదు. నీకు సేవచేసిన ఈ హయములు కూడా ఉత్తమ గతులు పొందగలవు. నాకు స్వర్గలోక సుఖములు కూడా వద్దు. నీతోపాటు అరణ్యములలో ఉంటాను. నీవు లేని అయోధ్యలో ఉండలేను. వనవాసము పూర్తి అయిన తరువాత మనమందరమూ ఇదే రథము మీద అయోధ్యకు పోదాము. ఓ రామా! నీ వెంట ఉంటే ఈ పదునాలుగు సంవత్సరములు క్షణాల్లా గడిచిపోతాయి. కాబట్టి నన్ను నీ వెంట ఉండేటట్టు అనుగ్రహించు." అని వేడుకున్నాడు  సుమంత్రుడు.

ఆ మాటలువిన్న రాముడు సుమంత్రునితో ఇలా అన్నాడు. "నీకు నా మీద ఉన్న భక్తి, గౌరవము నాకు తెలియవా చెప్పు. అయినా నిన్ను అయోధ్యకు ఎందుకు పంపుతున్నానో తెలుసా! నేను నిజంగా వనవాసమునకు వెళ్లాను అని నీవు కైకకు చెబితే ఆమె నమ్ముతుంది. లేకపోతే మహారాజు దశరథుడు నన్ను వేరేచోటికి పంపి వనవాసము నకు పంపాను అని అబద్ధం చెప్పాడు అని అనుకుంటుంది. కాబట్టి నీవు వెళ్లి మా వనవాసము సంగతి చెప్పి, కైక మనసులో ఉన్న శంకను పోగొట్టాలి.

నీ మాట నమ్మి కైక తన కుమారునికి పట్టాభిషేకము చేయిస్తుంది. లేకపోతే అయోధ్య అనాథగా ఉండిపోతుంది. కాబట్టి నీవు అయోధ్యకు వెళ్లక తప్పదు. అయోధ్యకు పోయి నీకు ఏమేమి

చెయ్యమని చెప్పానో అవన్నీ చేయి." అని పలికాడు రాముడు.

తరువాత గుహుని చూచి రాముడు ఇలా అన్నాడు. "మిత్రమా! నేను జనావాసములలో నివసించరాదు. కేవలము అరణ్యములలో ఆశ్రమములలో మునివేషధారణలో నివసించాలి. కాబట్టి నేను లక్ష్మణుడు జటలు ధరించాలి. దానికి అనువగు మర్రిపాలు తెప్పించు." అని అన్నాడు.

వెంటనే గుహుడు మర్రిపాలు తెప్పించాడు. ఆ మర్రిపాలను రాముడు లక్ష్మణుడు తమ వెంట్రుకలకు పట్టించారు. తన కేశములను పైకి ఎత్తి ముని కుమారుల వలె కట్టుకున్నారు. అప్పుడు రామలక్ష్మణులు ముని కుమారులవలె శోభించారు. తరువాత రాముడు వెంటనే త్వర త్వరగా గంగానది వైపు వెళ్లాడు. సీత, లక్ష్మణుడు రాముని అనుసరించారు. అందరూ పడవను సమీపించారు.

"లక్ష్మణా! ముందు నీవు పడవలో ఎక్కి తరువాత సీతను ఎక్కించుము." అని అన్నాడు. కాని లక్ష్మణుడు ముందు సీతను పడవలో ఎక్కించి తరువాత తాను ఎక్కాడు. తరువాత రాముడు పడవలో ఎక్కాడు. పడవ మెల్లిగా గంగానదిలో కదిలింది. రాముడు, సీత, లక్ష్మణుడు  గంగానదీమతల్లికి నమస్కరించారు. రాముడు గుహునికి, సుమంత్రునికి వీడ్కోలు చెప్పాడు.

పడవ గంగానది మధ్యకుచేరుకుంది. అప్పుడు సీతాదేవి గంగానదికి నమస్కరించి ఇలా మొక్కుకుంది. "తల్లీ గంగా మాతా! నేను, రాముడు, లక్ష్మణుడు పద్నాలుగేళ్లు వనవాసము చేసి సుఖంగా

తిరిగి వచ్చేట్టు దీవించు. తిరిగి వచ్చునపుడు నిన్ను పూజిస్తాను. నీ దీవెనలు ఫలించి రాముడు అయోధ్యకు తిరిగి వచ్చి పట్టాభిషేకము చేసుకున్న నాడు, నీకు సంతోషము కలిగేటట్టు బ్రాహ్మణులకు లక్షలాది గోవులను, వస్త్రములను,  దానంగా ఇస్తాను. బ్రాహ్మణులకు భోజనము పెడతాను. నేను వనవాసము నుండి తిరిగి వచ్చిన తరువాత నీకు నూరు కుండలతో సురను (మద్యమును), మాంసాహారమును సమర్పించుకుంటాను. నీకే కాదు, నీ తీరమున గల సమస్త దేవాలయములలోనూ పూజలు చేయిస్తాను. మేము క్షేమంగా అయోధ్యకు తిరిగి వచ్చేట్టు దీవించు." అని గంగా దేవికి మొక్కుకుంది సీత.

పడవ గంగానది దక్షిణ తీరమునకు చేరింది. సీతారామ లక్షణులు పడవ దిగి అడవిలోకి నడుచుకుంటూ వెళ్లారు. రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! మనము జనావాసములలో ఉన్నను, జనములు లేని ప్రదేశములో ఉన్నను, మన జాగ్రత్తలో మనం ఉండాలి. మనలను మనం రక్షించుకోవాలి. ఈ అరణ్యములో జన సంచారము కనపడటంలేదు. వన్యమృగములనుండి మనలను మనం రక్షించుకోవాలి. అందుకని నీవు ముందు నడువు. నేను నీ వెనక నడిచెదను. మనమధ్య సీత ఉంటుంది. మనము ఇద్దరము ఒకరిని ఒకరు రక్షించుకుంటూ సీతను కూడా రక్షించాలి.

లక్ష్మణా! మనకు  ముందుజాగ్రత్త అవసరము. పరిస్థితి చేయి దాటిపోయిన తరువాత, చింతించి ప్రయోజనము లేదు. సీతకు వనవాసములోని కష్టముల గురించి తెలియదు. ఇంక మీదట తెలుసుకుంటుంది. సీతా! ఈ అరణ్యములలో ఉద్యానవనములు

ఉండవు. అగాధమైన లోయలు ఉంటాయి. కాబట్టి జాగ్రత్తగా నడవాలి."అని అన్నాడు రాముడు.

రాముడు చెప్పినట్టు లక్ష్మణుడు ముందు నడుస్తూ దారిని చూపిస్తున్నాడు. తరువాత సీత, ఆమె వెనక రాముడు నడుస్తున్నారు.

వీరి సంగతి ఇలాఉంటే అక్కడ సుమంత్రుడు, పడవ కంటికి కనపడినంతవరకూ రాముని చూస్తూ ఉన్నాడు. పడవ కనుమరుగు కాగానే, దు:ఖంతో కుమిలిపోయాడు. రథమును తీసుకొని అయోధ్యకు వెళ్లాడు.

రాముడు, సీతా లక్ష్మణులతో అడవులలో ప్రయాణం చేసి వత్సదేశము చేరుకున్నాడు. ఇంతలో చీకటి పడింది. రామ లక్ష్మణులు అడవిలో దొరికే వరాహములను, దుప్పులను, చంపి వాటి మాంసమును సేకరించారు. అందరూ ఒక పెద్ద వృక్షము మొదట విశ్రమించారు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ఏబది రెండవ సర్గ సంపూర్ణము
- ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఏబది మూడవ సర్గ.

రాముని అరణ్యవాసములో మొదటి రోజు సాయంకాలము అయింది. రాముడు సాయం సంధ్యను పూర్తిచేసుకొని ఒక చెట్టు కింద కూర్చున్నాడు. లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"ఓ లక్ష్మణా! మన వనవాసములో  ఒంటరిగా మొదటి రాత్రి గడప బోతున్నాము. సీత నిద్ర పోతుంటే నువ్వు, నేను, రాత్రిళ్లు ఆమెను రక్షించాలి. ఆకులతో మనకు పడకలు సిద్ధము చేయుము." అని అన్నాడు.

లక్ష్మణుడు అదే ప్రకారము చెట్లఆకులతో మెత్తని పడకలు సిద్ధం చేసాడు. వాటి మీద పడుకున్నారు రామలక్ష్మణులు. సీత నిద్ర పోయింది. రామ లక్ష్మణులకు నిద్రపట్టలేదు. లక్ష్మణునితో రాముడు ఇలా అన్నాడు.

"లక్ష్మణా! మన తండ్రి దశరథునికి రాత్రిళ్లు నిద్రపడుతుం దంటావా! భరతుడు రాగానే, రాజ్యము కోసరము కైక మహారాజును చంపివేయదు కదా! ఏం చేస్తాం. మహారాజు కామంతో భార్యకు లొంగిపోయాడు. అందరినీ దూరం చేసుకున్నాడు. ఇప్పుడు ఆయనకు ఏం జరిగినా అడిగే దిక్కు లేదు. మన మహారాజు చేసిన పని

చూస్తుంటే ఆయన అర్థ కామములలో కామానికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చినట్టు కనపడుతూ ఉంది. అర్థమును వదిలి కామమునకే ప్రాధాన్యము ఇచ్చువాడు ఎల్లప్పుడూ చిక్కుల్లో పడతాడు అనడానికి మన మహారాజే ఉదాహరణ.

అయినా కానీ లక్ష్మణా, లోకం లో ఎంత తెలివి తక్కువాడైనా, భార్య మాట విని కొడుకును దూరం చేసుకుంటాడా! కాని మన మహారాజు అలా చేసుకున్నాడు. పోనీలే, భరతుడు తన భార్యా సమేతంగా అయోధ్యారాజ్యమును  ఏలగలడు. రాజ్యసుఖాలు అనుభవించగలడు. ఎందుకంటే మహారాజు వృద్ధాప్యముతో మరణిస్తాడు. అగ్రజుడనైన నేను అడవులలో ఉన్నాను. ఇంక భరతునికి అడ్డేముంది. హాయిగా రాజ్యము చేసుకుంటాడు.

లక్ష్మణా! నాకు ఒకటి అనిపిస్తూ ఉంది. కేవలము మన మహారాజును చంపడానికి, నన్ను అడవులకు పంపడానికి, భరతుని అయోధ్యకు రాజును చెయ్యడానికీ, కైక మన ఇల్లు చేరిందా అని నాకు అనుమానంగా ఉంది. లేకపోతే ఈ విధంగా వరాలు కోరడం ఏమిటి! అవి మహారాజు ఇస్తాను అనడంఏమిటి! నేను అడవుల పాలు కావడం ఏమిటి! అంతా వింతగా ఉంది కదూ.

లక్ష్మణా! ఇప్పుడు మన మహారాజు  కైకమాటకు అడ్డు చెప్పడం లేదు కదా! అది సాకుగా తీసుకొని కైక మన తల్లులను బాధలు పెట్టదుకదా! లక్ష్మణా! నా వలన నువ్వు, నీతల్లి సుమిత్ర, బాధలు పడటం ఎందుకు. రేపుఉదయమే నువ్వు అయోధ్యకు తిరిగి వెళ్లు. నీతల్లిని కైక నుండి రక్షించుకో. నేను, నా వెంట సీత, అరణ్యవాసము చేస్తాము.

నువ్వు వెళ్లి నా తల్లి కౌసల్యను భరతునికి అప్పగించు. భరతుడు ధర్మము తెలిసినవాడు. నా తల్లికి ఏ అపకారమూ చెయ్యడు. ఆ ప్రకారంగా నువ్వు నా తల్లిని కైక బారినుండి రక్షించు.

లక్ష్మణా! నా తల్లి కౌసల్య, పూర్వజన్మలో, ఎప్పుడో, తల్లి బిడ్డలను దూరం చేసి ఉంటుంది. అందుకని ఈజన్మలో తనబిడ్డలకు దూరం అయింది. కొడుకులు పెరిగి పెద్దవారయి తల్లులను సుఖపెడతారని ప్రతీతి. నేను పెరిగి, పెద్దవాడనయి, నా తల్లిని సుఖపెట్టవలసిన సమయమున, ఆమెకు దూరం అయి అమెను దు:ఖపెట్టుచున్నాను. నేను నా తల్లికి ఒకే కొడుకును. నా తల్లి దు:ఖిస్తుంటే ఆమెకు నేను ఏమీ చేయలేకపోతున్నాను. నేను ఎంత పాపాత్ముడను. ఏ తల్లికీ నా మాదిరి తల్లికి కష్టములను కలిగించే పుత్రుడు కలగకూడదు.

లక్ష్మణా! నేను తల్చుకుంటే, ఒకే ఒక బాణంతో శత్రుసంహారము చేసి అయోధ్యను తిరిగి పొందగలను. కాని ఇది నా వీరత్వాన్ని చూపడానికి సమయం కాదు అని ఊరుకుంటున్నాను. ఎందుకంటే లక్ష్మణా! నేను అధర్మానికి భయపడుతున్నాను. నాకు అధర్మంగా రాజ్యమును పొందడం ఇష్టంలేదు. పైగా రాజ్యం కోసరం అధర్మంగా ప్రవర్తిస్తే, ఉత్తమలోకాలు కలుగవు కదా!" ఈ విధంగా రాముడు పరి పరి విధములుగా చింతిస్తున్నాడు.

రాముడు చెప్పిన మాటలన్నీ విన్నాడు లక్ష్మణుడు. రాముని ఓదారుస్తున్నాడు. "రామా! నీవు లేని అయోధ్య చంద్రుడు లేని ఆకాశము వలే కాంతి విహీనంగా ఉంది. అయినా ధీరుడవైన నీవు భీరువు వలె ఈ ప్రకారం దు:ఖపడటం మంచిది కాదు. నీవు దు:ఖపడి,

నన్ను సీతను కూడా దు:ఖపడేట్టు చేస్తున్నావు. రామా! నిన్ను చూసి నేను, సీత  ఈ వనవాస కష్టములను తృణప్రాయంగా అనుభవిస్తున్నాము. నీవు లేకపోతే మేము నీటి లోనుండి బయటకు తీసిన చేపల మాదిరి గిలా గిలా కొట్టుకుంటాము.

ఓ రామా! నాకు నీవే సర్వస్వము. నీ తరువాతనే నా తల్లి, తండ్రి, అన్నదమ్ములు, బంధువులు, స్నేహితులు. తుదకు నిన్నువిడిచి స్వర్గమునకు వెళ్లమన్నా వెళ్లను. ఇది నానిశ్చయము. కాబట్టి  ఇంక నిశ్చింతగా నిద్రించు." అని అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలతో కొంచెం ఊరట చెందాడు రాముడు. ఈ పదునాలుగేళ్లు వనవాసము లక్ష్మణుని సాయంతో  సంపూర్ణం చేయాలి అని అనుకున్నాడు. ఆ ఊహలతోనే నిద్రలోకి జారుకున్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఏబది మూడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఏబది నాలుగవ సర్గ.

సీతా,రామ,లక్ష్మణులు మరునాడు ఉదయమే నిద్రలేచారు. సంధ్యావందనాది కార్యక్రమములు ముగించుకొని ఆ ప్రదేశము విడిచి వెళ్లిపోయారు. వారు అలా నడుస్తూ గంగానదీ యమునా నదీ కలిసే ప్రయాగ క్షేత్రమునకు చేరుకున్నారు. అప్పటికి చీకటి పడింది.

“లక్ష్మణా! మనము గంగా యమునా సంగమ స్థానమునకు చేరుకున్నట్టున్నాము. ఒక నదీజలాలతో మరొక నదీజలాలు కొట్టుకుంటున్న శబ్దము వినపడుతూ ఉంది. ఇక్కడే ఏదో ఒక ముని ఆశ్రమము ఉండాలి. ఎందు కంటే ఇక్కడ వంట చేసుకోడానికి కట్టెలు కొట్టి కొన్ని ఇక్కడే పడవేసినట్టున్నట్టు కనపడుతూ ఉంది.” అని అన్నాడు.

రామలక్ష్మణులు అలా నడుస్తూ భరద్వాజముని ఆశ్రమము చేరుకున్నారు. భరద్వాజముని ఉన్న కుటీరము బయట రామలక్ష్మణులు, సీత నిలబడ్డారు. ఎవరూ బయటకు రాలేదు. అందుకని రాముడు కుటీరములోకి వెళ్లాడు. కుటీరము లోపల అగ్నిహోత్రము ముందు, శిష్యుల మధ్య అగ్ని మాదిరివెలుగుతున్న భరద్వాజమహర్షిని చూచాడు రాముడు. రాముడు, లక్ష్మణుడు, సీత ఆయనకు నమస్కరించారు. రాముడు తమ్ముతాము పరిచయం చేసుకున్నాడు.

“ ఓ భగవాన్ భరద్వాజ మహర్షీ! ప్రణామాలు. మేము అయోధ్యాధిపతి దశరథుని కుమారులకు. రామలక్ష్మణులకు. ఈమె నా అర్ధాంగి సీత. జనక మహారాజు కుమార్తె. నా తండ్రి తన భార్య కైకకు ఇచ్చిన మాట ప్రకారము, నేను వనవాసమునకు వచ్చాను. నా తమ్ముడు, నా మిత్రుడు అయిన లక్ష్మణుడు కూడా నా వెంట వచ్చాడు. నా అర్ధాంగి సీత కూడా నన్ను  అనుసరించి అడవులకు వచ్చింది. మా తండ్రి మాట ప్రకారము వనవాసము చేస్తూ అడవులలో దొరికే పండ్లు ఫలములు దుంపలు తింటూ,  నేల మీద పడుకుంటూ వనవాసము పూర్తిచేయాలని అనుకుంటున్నాము.”అని వినయంగా అన్నాడు రాముడు.

రాముని మాటలువిన్న భరద్వాజుడు వారికి అర్ఘ్యమును, పాద్యమును ఇచ్చాడు. మధుపర్కమును ఇచ్చాడు. అడవిలో దొరికే పండ్లు వారికి తినడానికి ఇచ్చాడు. ఆ ప్రకారంగా భరద్వాజుడు రామునికి స్వాగత సత్కారాలు చేసాడు.

“ఓ రామా! చాలా కాలం తరువాత నిన్ను చూస్తున్నాను. నిన్ను మహారాజు అడవులకు పంపాడు అన్న విషయం కూడా విన్నాను. ఈ గంగా యమున సంగమము వద్ద జనములు ఎక్కువగా ఉండరు. ప్రశాంతంగా ఉంటుంది. ఫలములు, పుష్పములు సమృద్ధిగా దొరుకుతాయి. కాబట్టి,  నీవు ఇక్కడ ఆశ్రమము నిర్మించుకొని సుఖముగా  ఉండవచ్చును.” అని అన్నాడు భరద్వాజుడు.

ఆ మాటలు వినిన రాముడు ఇలా అన్నాడు. “ఓ మహర్షీ!  ఈ ప్రదేశమునకు సమీపములో జనపదాలు ఉన్నాయి. నేను, సీతా

లక్ష్మణులతో సహా ఇక్కడ ఉన్నాను అని తెలిసి, ఆ జనపదాలలో ఉన్న ప్రజలు నన్ను చూడ్డానికి ఇక్కడకు వస్తారు. అది నాకు ఇష్టం లేదు. నేను ఇక్కడ నివసించలేను. కాబట్టి నాకు ఏకాంతముగా ఉన్న ప్రదేశము ఎక్కడ ఉందో చెప్పండి. అక్కడ ఉంటాము." అని అన్నాడు రాముడు.

ఆమాటలు విన్న భరద్వాజుడు ఇలాఅన్నాడు. "ఓ రామా! ఇక్కడి నుండి పది క్రోసుల దూరములో చిత్రకూటము అనే పర్వతము ఉంది. ఆ పర్వతము గంధమాధన పర్వతముతో సమానమైన ఖ్యాతి చెందినది. అక్కడ వానరములు మొదలగు చిన్న చిన్న జంతువులు విరివిగా సంచరిస్తుంటాయి. ఆ పర్వతము మీద ఎందరో మహాఋషులు తపస్సుచేసుకుంటున్నారు. అదిమీరు ఉండటానికి తగిన ప్రదేశము. అక్కడ క్రూరమృగములకు, వికృతమైన ఆలోచనలకు తావు లేదు. అంతా ప్రశాంతంగా ఉంటుంది. అక్కడ నీవు నివాసము ఏర్పాటు చేసుకొని నీ వనవాసము పూర్తిచేయుము. లేని ఎడల, ఇక్కడే నా ఆశ్రమ ప్రాంతంలో ఒక కుటీరము నిర్మించుకొని ఇక్కడే ఉండి నీ వనవాస కాలము గడుపుము." అని అన్నాడు భరద్వాజుడు.

ఇంతలో రాత్రి అయింది. ఆ రాత్రికి సీతారామలక్ష్మణులు భరద్వాజ ఆశ్రమములోనే గడిపారు. మరునాడు ఉదయము రాముడు భరద్వాజుని వద్దకుపోయి ఇలా అన్నాడు.

"ఓ మునీంద్రా! నిన్న రాత్రి మాకు ఆశ్రయము ఇచ్చినందుకు కృతజ్ఞులము. మేము ఇక్కడి నుండి వెళ్లుటకు అనుమతి ఇవ్వండి." అని ప్రార్థించాడు రాముడు.

"రామా! నీవు చిత్రకూటమునకు పొమ్ము. అక్కడ మీకు ఫలములు, తేనె, దుంపలు సమృద్ధిగా లభిస్తాయి. అక్కడి సెలయేళ్లలో మీకు స్వచ్ఛమైన నీళ్లు లభిస్తాయి. నీవు, సీత, విహరించడానికి ఎన్నో సుందర ప్రదేశాలు ఉన్నాయి. అక్కడ మీరు సుఖంగా వనవాసము చేయవచ్చును. మీరు ఉండటానికి అదియే యుక్తమైన ప్రదేశము." అని అన్నాడు భరద్వాజుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఏబది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఏబది ఐదవ సర్గ.

ఆ రాత్రి అడవిలో గడిపిన తరువాత రామలక్ష్మణులు, సీత, మరునాడు అక్కడి నుండి బయలుదేరి చిత్రకూట పర్వతమునకు పోవడానికి సిద్ధం అయ్యారు. భరద్వాజుని వద్దకు పోయి ఆయనకు నమస్కారం చేసారు. భరద్వాజుడు సీతారామలక్ష్మణులకు మంగళాచరణము చేసి వీడ్కోలు పలికాడు. వారితో పాటు కొంతదూరము వెళ్లాడు. అక్కడ నిలబడి రామునితో భరద్వాజుడు ఇలా అన్నాడు.

"ఓ రామా! మీరు గంగా యమునా సంగమ స్థానము చేరిన తరువాత యమునా నది ఒడ్డునే పడమటి వైపుగా వెళ్లండి. అక్కడ మీరు ఒక తెప్పను కట్టుకొని యమునను దాటండి. మీరు యమునను దాటిన తరువాత మీకు ఒక పెద్ద మర్రిచెట్టు కనపడుతుంది. ఆ చెట్టు పేరు శ్యామము. అక్కడ ఎంతో మంది సిద్ధులు తపస్సు చేసుకుంటూ ఉంటారు. సీత ఆ చెట్టుకు నమస్కారము ఏ కోరికలు కోరుకుంటే అవి తీరుతాయి. మీరు ఆ చెట్టు కింద ఆగి కొంచెం సేపు విశ్రాంతి తీసుకొన వచ్చును. లేని ఎడల మీరు ప్రయాణము కొనసాగించవచ్చును.

అలా ఒక క్రోసెడు దూరము వెళ్లగానే మోదుగ చెట్లతోనూ,

రేగు చెట్లతోనూ వెదురు పొదలతోనూ నిండి ఉన్న ఒక అరణ్యము కనిపిస్తుంది. అది యమునా నది ఒడ్డున ఉంటుంది. అదే చిత్రకూటమునకు పోవు దారి. నేను ఆమార్గములో ఎన్నోసార్లు ప్రయాణము చేసాను. అది ఎంతో సురక్షితమైన మార్గము. ఏ ప్రమాదమూ ఉండదు." అని అన్నాడు భరద్వాజుడు.

ఆ మాటలు విన్న రాముడు భరద్వాజుని చూచి నమస్కరించి "మీరు చేసిన సాయమునకు కృతజ్ఞతలు. ఇంక మీరు ఆశ్రమమునకు వెళ్లండి. మాకు ముందుకు వెళ్లడానికి అనుజ్ఞ ఇవ్వండి." అని ప్రార్థించాడు. ఆమాటలు విన్న భరద్వాజుడు వారిని ఆశీర్వదించి వెనుకకు వెళ్లిపోయాడు. రామలక్ష్మణులు సీత ముందుకు సాగారు.

వారు యమునా నదిని సమీపించారు. రాముడు లక్ష్మణుడు అక్కడక్కడా వెతికి కొన్ని కర్రలను తీసుకొని వచ్చారు. వాటిని తీగలతో కట్టి ఒక తెప్పను తయారు చేసారు. దాని మీద ఆకులతో మెత్తగా ఆసనములను ఏర్పాటు చేసారు. ముందు సీతను తెప్పలోకి ఎక్కించారు. తరువాత సీత వెంట దశరథుడు పంపిన వస్త్రములను, ఆభరణములను, రామ లక్ష్మణులు తమ వెంట తెచ్చుకున్న ఆయుధము లను, తెప్పలో పెట్టారు. తరువాత రామ లక్ష్మణులు ఎక్కారు. అందరూ ఆ తెప్పలో యమునను దాటుతున్నారు.

తెప్ప యమునానదీ మధ్యకు రాగానే సీత యమునకు నమస్కరించింది. "అమ్మా యమునా నదీమతల్లీ! మమ్ములను చల్లగా కాపాడు. మా అరణ్య వాసము నిర్విఘ్నంగా జరిగేటట్టు చూడు. మేము సురక్షితముగా అయోధ్యకు తిరిగి వస్తే నీకు వేయి గోవులను, వంద

ఘటముల మద్యమును సమర్పించుకుంటాను." అని మొక్కుకుంది.

తరువాత అందరూ యమునా నది దక్షిణతీరము చేరుకున్నారు. అందరూ తెప్పను దిగారు. భరద్వాజుడు చెప్పిన శ్యామ అనే వటవృక్షమును సమీపించారు. సీత ఆ వటవృక్షమునకు నమస్కరించింది. తమను చల్లగా చూడమని ప్రార్థించింది.

తరువాత వారు ముందుకు సాగారు. ముందు లక్ష్మణుడు నడుస్తున్నాడు, మధ్యలో సీత వెనక రాముడు నడుస్తున్నారు. ఆ వనములోని అందాలు చూస్తూ నడుస్తున్నారు. సీత తాను అంతకు ముందు చూడని వృక్షముల గూర్చి మొక్కలు, లతల గూర్చీ రాముని అడిగి తెలుసుకుంటూ ఉంది. లక్ష్మణుడు వెళ్లి ఆయా చెట్లయొక్క ఆకులను పూలను తీసుకొని వచ్చి సీతకు ఇచ్చాడు.

ఆ ప్రకారంగా వారు ఒక క్రోసెడు దూరము నడిచారు. అక్కడ రామలక్ష్మణులు తినడానికి యోగ్యమైన జంతువులను చంపి తీసుకొని వచ్చారు. వాటిని తిని ఆకలి తీర్చుకున్నారు. అంతలో చీకటి పడింది. వారు ఒక సమతల ప్రదేశములో ఆ రాత్రికి  ఉండటానికి వసతి ఏర్పాటుచేసుకున్నారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము  ఏబది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఏబది ఆరవ సర్గ.

మరునాడు ఉదయం రాముడు ముందుగా మేల్కొన్నాడు. లక్ష్మణుని నిద్రలేపాడు. "లక్ష్మణా! మనము బయలుదేరు వేళ అయినది. తొందరగా నిద్రలే." అని నిద్రలేపాడు. తరువాత సీతకూడా నిద్రలేచింది. అందరూ యమునలో స్నానం చేసారు. ప్రాత:సంధ్యా కార్యక్రమములు నిర్వర్తించి చిత్రకూటమునకు ప్రయాణము అయ్యారు.

రాముడు సీతకు దారిలో కనపడ్డ వృక్షముల గురించి, పుష్పముల గురించి వివరిస్తున్నాడు. చిత్రకూట పర్వతము మీద ఏనుగులు గుంపులు గుంపులుగా తిరుగుతున్నాయి. వాటిని సీతకు చూపించాడు రాముడు. అలా నడుచుకుంటూ వారు ముగ్గురూ చిత్రకూట పర్వతమును చేరుకున్నారు. అక్కడ కాసేపు ఆగాడు రాముడు.

"లక్ష్మణా! ఇక్కడ మనము ప్రశాంతంగా వనవాసము చేయవచ్చును. మనకు కావలసిన ఫలములు,కాయలు దుంపలు, ఆహారమునకు పనికి వచ్చు జంతువులు, స్వచ్ఛమైన నీరు పుష్కలంగా ఉన్నాయి. ఈ పర్వతము మీద చాలామంది ఋషులు తపస్సు చేసుకుంటూ ఉన్నారు." అని అన్నాడు.

వారు అలా మాట్లాడుకుంటూ వాల్మీకి ఆశ్రమమునకు చేరుకున్నారు. వాల్మీకి వారిని సాదరంగా ఆహ్వానించాడు. కుశల ప్రశ్నలు వేసాడు. తన గురించి తనయొక్క వనవాసము గురించి వాల్మీకి మహర్షికి వివరంగా తెలిపాడు రాముడు.

తరువాత రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా!మనము ఇచ్చటనే ఒక కుటీరము నిర్మించుకొని నివసిస్తాము. కాబట్టి వెంటనే బలమైన కర్రలు తీసుకొని వచ్చి కుటీరము నిర్మించు." అని అన్నాడు.

లక్ష్మణుడు రాముడు చెప్పిన మేరకు ఒక కుటీరము నిర్మించాడు. ఆ పర్ణశాలను చూచి ఎంతో సంతోషించాడు రాముడు. "లక్ష్మణా! మనకు ఈ పర్ణశాలలో చాలాకాలము నివసింపబోవుచున్నాము. కాబట్టి వాస్తుదేవతలను పూజించాలి. వారిని శాంతింపజేయాలి. ముందుగా మనము లేడి మాంసముతో వాస్తుపూజ చేద్దాము. కాబట్టి ఒక లేడిని చంపి దాని మాంసము తీసుకొని రా. శాస్త్రము ప్రకారము చేయవలసిన కర్మ కనుక లేడిని చంపిన పాపము అంటదు." అని అన్నాడు రాముడు.

వెంటనే లక్ష్మణుడు అడవిలోకి పోయి ఒక లేడిని వేటాడి తీసుకొనివచ్చాడు. దాని మాంసమును అగ్నిమీద ఉడికించాడు. గృహపూజకు సిద్ధం చేసాడు. "రామా! లేడి మాంసము ఉడికించాను. పూజకు అన్నీసిద్ధం చేసాను.ఇంక పూజకు ఉపక్రమించండి." అని అన్నాడు లక్ష్మణుడు.

రాముడు స్నానము చేసి శుచిగా వచ్చి కూర్చున్నాడు. వేదమంత్రములను పఠిస్తూ గృహపూజ,వాస్తుదేవతా పూజను శాస్త్రోక్తంగా చేసాడు. దేవతల నందరినీ పూజించాడు. సీతా సమేతంగా ఆ పర్ణశాలలో గృహప్రవేశము చేసాడు రాముడు. తరువాత రాముడు విశ్వేదేవతలకు, త్రిమూర్తులకు బలులు సమర్పించాడు.

లక్ష్మణుడు పర్ణశాల లోపల వేదికలను, అగ్ని గృహమును నిర్మించాడు. తరువాత సీతారాములు అడవిలో లభించు ఫలములు, పుష్పములు, పక్వమైన మాంసముసేకరించి వాటితో భూతతృప్తి గావించారు. తరువాత అందరూ ఆ పర్ణశాలలో ప్రవేశించారు. అప్పటి నుండి సీతారామలక్ష్మణులు ఆ పర్ణశాలలో నివసిస్తున్నారు. అరణ్యములలో విహరిస్తూ, ఫలములు, కాయలు, దుంపలు, తేనె మొదలగు తినే పదార్థములు సేకరిస్తూ, వాటిని తింటూ, ఆహ్లాదంగా జీవితం గడుపుతున్నారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఏబది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఏబది ఏడవ సర్గ.

గంగానదిని దాటడానికి రాముడు, సీత, లక్ష్మణుడు నావ ఎక్కిన తరువాత నావ గంగానదిలో సాగిపోయింది. తరువాత సుమంత్రుడు, గుహుడు చాలాసేపు రాముని వనవాసము గురించి మాట్లాడుకున్నారు. తరువాత సుమంత్రుడు రథము తోలుకుంటూ అయోధ్యకు వెళ్లాడు. గుహుడు తన మనుషులద్వారా రాముడు భరద్వాజ ఆశ్రమము చేరుకున్నాడని తెలుసుకున్నాడు. సుమంత్రుడు తన రథమును అయోధ్యవైపు తీసుకొని వెళుతున్నాడు.

మూడవ రోజు సాయంత్రానికి సుమంత్రుడు అయోధ్యకు చేరుకున్నాడు. అయోధ్య అంతా అంధకార బంధురంగా ఉంది. ఎవరి ఇంట్లోనూ దీపాలు వెలగటం లేదు. ఎప్పుడూ ఆనందోత్సాహాలతో కళకళలాడే అయోధ్య రాముని వియోగంతో విలవిలలాడిపోతోంది అని బాధపడ్డాడు సుమంత్రుడు.

సుమంత్రుడు నగరప్రవేశము చేసాడు. రాముని రథము చూచి పౌరులు గుంపులు గుంపులుగా సుమంత్రుని వెంట బడ్డారు. "రాముడు ఎక్కడ? రాముని ఎక్కడ వదిలి వచ్చావు?" అని ప్రశ్నల వర్షము కురిపిస్తున్నారు. సుమంత్రుడురథము ఆపి వారితో ఇలా అన్నాడు.

"నేనురాముని గంగానదిని దాటించి వచ్చాను. రాముని వద్దనుండి ఆజ్ఞతీసుకొని వచ్చాను." అని బాధతో చెప్పాడు సుమంత్రుడు.

"రాముడు వనవాసమునకు వెళ్లిపోయాడా. రాముడు ఇంకమాకు కనపడడా" అనుకుంటూ వారు ఎవరి దారిన వారు వెళ్లారు.

సుమంత్రుడు దశరథుని అంత:పురమునకు వెళ్లాడు. అంత:పురములోని స్త్రీలు, రాముడు లేకుండా వంటరిగా వచ్చిన సుమంత్రుని చూచి విలపించారు. సుమంత్రుని చూచి దశరథుని భార్యలు తమలో తాము ఇలా అనుకుంటున్నారు.

"సుమంత్రుని చూచిన కౌసల్య "నా రాముడు ఏడీ" అనిఅడిగితే  కౌపల్యకు  ఏమి సమాధానము చెబుతాడు. కొడుకు కోడలు తనను విడిచి పెట్టి పోయినా కూడా కౌసల్య ఇంకా జీవించి ఉంటుందా! ఏమో  ఆమె బతకడం చాలా కష్టము. ఏం జరుగుతుందో ఏమో!" అని తమలో తాము ఆందోళన చెందుతున్నారు.

ఆ మాటలన్నీవింటూ సుమంత్రుడు దశరథుని మందిరము వైపు వెళుతున్నాడు. సుమంత్రుడు దశరథుని చూచి రాముడు తనతో చెప్పమన్న మాటలు యథాతథంగా వినిపించాడు. రాముని మాటలు విన్న దశరథుడు మూర్ఛపోయాడు. అంతలో అంత:పుర స్త్రీలు అందరూవచ్చి ఆయనకు ఉపచారములు చేసారు. ఇంతలో కౌసల్యసుమిత్ర అక్కడకు వచ్చారు. దశరథుని పట్టుకొని లేవదీసారు.

దశరథునితో కౌసల్య ఇలాఅంది.

"మహారాజా! రాముని అడవిలో వదిలిపెట్టి రామసందేశమును తీసుకొని వచ్చిన సుమంత్రునితో మాట్లాడవేమి. మహారాజా! చెయ్యవలసినది అంతా చేసి ఇప్పుడు మాట్లాడ కుండా మౌనంగా ఉ ంటావెందుకు. ఎలాగైనా నీ మాట నిలబెట్టుకున్నావు. ఆడి తప్పని వాడివని పేరు ప్రతిష్ఠలు గడించావు. సత్యవాక్పరిపాలకుడవై పుణ్యం సంపాదించుకున్నావు. అది చాలులెండి. ఇక్కడ కైక లేదులెండి. మీరు భయపడనవసరం లేదు. నిర్భయంగా సుమంత్రునిలో మాట్లా డ వచ్చును." అని కౌసల్య పలికి ఆమెకు దు:ఖము ముంచుకురాగా కిందపడిపోయింది.

కిందపడిపోయిన దశరథుని, కౌసల్యను చూచి దశరథుని భార్యలు ఏడుస్తున్నారు. వారి దు:ఖానికి అంతులేదు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఏబది ఏడవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఏబది ఎనిమిదవ సర్గ.

కొంచెం సేపటికి దశరథుడు తెప్పరిల్లాడు. సుమంత్రుని పిలిపించాడు. సుమంత్రుడు దశరథుని వద్దకు వెళ్లాడు. దశరథుడు ఏదో దీర్ఘాలోచనలో ఉన్నాడు. తల ఎత్తి సుమంత్రుని చూచి దశరథుడు ఇలాఅన్నాడు.

“సుమంత్రా! రాముడు ఎలా ఉన్నాడు? ఎక్కడ పడుకుంటు న్నాడు? ఏమి తింటున్నాడు? సుమంత్రా! రాముడు ఎన్నడూ అడవులలో ఉండలేదు. ఇటువంటి కష్టములు అతనికి తెలియవు. రాజ భోజన ములు ఆరగించి హంసతూలికా తల్పముల మీద శయనించు రాముడు అడవులలో కందమూలములు తింటూ, కటిక నేల మీద ఎలా పడుకుంటున్నాడో కదా! రాముడు ఎప్పుడు బయటకు వెళ్లినా అతని వెంట రథములు, కాల్బలములు, ఏనుగులు వెంట ఉండేవి. అవన్నీ లేకుండా అడవులలో ఎలా ఉంటున్నాడో కదా! సీతా రామ లక్ష్మణులు క్రూరజంతువులు, పాములుఉన్న వనములలో ఎలా ఉంటున్నారో కదా!

సుమంత్రా! సీతారాములు నీ రథము దిగి అడవులలో ఎలా ప్రవేశించారు? ఏది ఏమైనా నా కన్నా నువ్వే అదృష్టవంతుడవు. రాముడు అడవులలో ప్రవేశించు వరకూ అతని వెన్నంటి ఉన్నావు.

రాముడు, సీత, లక్ష్మణుడునాతో చెప్పమని ఏమన్నా చెప్పారా! వివరంగా చెప్పు." అని అన్నాడు దశరథుడు.

సుమంత్రుడు ఇలా బదులుచెప్పాడు. "మహారాజా! రాముడు తమకు నమస్కరించి తమరితో ఇలా చెప్పమన్నాడు.

"సుమంత్రా! నా తండ్రికి నేను తలవంచి నమస్కారము చేసానని చెప్పు. అంత:పురములోని అందరినీ వారు వీరు అనే బేధము లేకుండా పేరుపేరునా అడిగినట్టు చెప్పు. నా తల్లి కౌసల్యకు నేను తలవంచి అభివాదము చేసినట్టు చెప్పు. నా మాటలుగా నా తల్లికి ఈ విధంగా చెప్పు.

"అమ్మా! నీవు ధర్మము తప్పకుండా అగ్ని కార్యములు నిర్వర్తించుచూ నా తండ్రిదశరధునికి ఏ కష్టము రాకుండా సేవలు చేస్తూ ఉండు. అమ్మా! నీవు పట్టపు రాణివి అని అహంకరించకుండా దశరథుని ఇతర భార్యలనుకూడా ఆదరించు. నా తల్లి కైకను నా తండ్రి దశరథుని పట్ల అనుకూలంగా ఉండేట్టు చెయ్యి. అమ్మా! భరతుడు నీ కుమారుడే అయినప్పటికీ, అతనిని రాజుగానే గౌరవించు. అదే కదా రాజధర్మము. తల్లులందరి పట్లా ఆదర భావంతో ఉండమని నా మాటగా భరతునికి చెప్పు. భరతునితో నా మాటగా ఇలా చెప్పు:

"భరతా! నీ తండ్రి ఆజ్ఞ ప్రకారము నీవు అయోధ్యను పరిపాలించు. దశరథుడు వృద్ధుడైనాడు. అందుకని ఆయన మాటలను కూడా గౌరవిస్తూ, రాజ్యపాలన సాగించు. భరతా! నా తల్లి కౌసల్యను కూడా నీ తల్లి వలెనే ఆదరించు." అని కౌసల్యకు చెప్పమని

రాముడు నాతో చెప్పాడు.

మహారాజా! లక్ష్మణుడు మాత్రము చాలా కోపంతో తమతో ఇలా చెప్పమన్నాడు. "రాముడు ఏ నేరం చేసాడని రాజ్యము నుండి వెడలగొట్టారు. మహారాజు తన అధికారమును మరిచి కైక మాటలకు లోబడి మమ్ములను అడవులకు పంపాడు. దానివలన మేము ఎన్నో బాధలు పడుతున్నాము. రాజ్యముమీద దురాశతో గానీ, లేక వరములు అడుగు మిషమీద గానీ, అన్న మాటను నిలబెట్టుకోడం కోసం గానీ, కారణం ఏదైనా రాముని అడవులకు పంపడం దుష్కృత్యము. తాను మహారాజు అనే అహంకారంతో రాముని అడవులకు పంపాడే కానీ, వేరు కాదు. కనీసము ఇది  మంచా లేక చెడ్డా అనే ఆలోచించకుండా రాముని అడవులకు పంపడం చాలా శోచనీయము. అందుకనే నేను దశరథుని నా తండ్రిగా అంగీకరించడం లేదు. నాకు తల్లీ, తండ్రీ అన్నా అన్నీ రాముడే. ఎందుకంటే సకల జనులకు ఆరాధ్యుడైన రాముని విడిచి పెట్టిన వాడిని ఎవరు గౌరవిస్తారు. అయోధ్య ప్రజల అభీష్టమునకు విరుద్ధంగా రాముని అడవులకు పంపి వారి ఆగ్రహమునకు గురి అయిన  దశరథుడు మహారాజుగా ఉండటానికి ఎంత మాత్రమూ అర్హుడు కాదు." అని లక్ష్మణుడు అన్నాడు.

శోక రాసిగా నిలిచిన సీత మాత్రమూ నాతో ఏమీ చెప్పలేదు. రాముని చూస్తూ కన్నీటి సముద్రంలో మునిగిపోయింది కానీ ఆ ఇల్లాలు  ఎవరినీ ఒక్కమాట కూడా అనలేదు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఏబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఏబది తొమ్మిదవ సర్గ.

సుమంత్రుడు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నాడు దశరథుడు. "సుమంత్రా! ఇంతేనా! వారు ఇంక ఏమీ అనలేదా! పోనీలే. తరువాత ఏమి జరిగిందీ వివరంగాచెప్పు." అని అడిగాడు.

సుమంత్రుడు తరువాత జరిగిన విషయాలు ఇలా చెప్పసాగాడు.

"మహారాజా! రామలక్ష్మణులు తమ వెంట్రుకలకు మర్రిపాలు పూసుకొని జడలు కట్టుకున్నారు. వారు గంగానదిని దాటి ప్రయాగ క్షేత్రము వైపు వెళ్లారు. లక్ష్మణుడు ముందు నడుస్తుంటే, సీతమధ్య నడుస్తుంటే, రాముడు వెనక నడుస్తూ వారు వెళ్లిపోయారు. నేను వారు వెళ్లిన వంక చూస్తూ వారు కనుమరుగు కాగానే వెనుకకు తిరిగి వచ్చాను.

రాముడు తన మనసు మార్చుకొని వెనకుకు వస్తాడేమో అని మూడురోజులు గుహుడు ఉన్నచోట ఉండి పోయాను. కాని రాముడు తిరిగిరాలేదు. ఇంక చేసేది లేక వెనకకు తిరిగివచ్చాను. దారిలో ఉన్న ఉద్యానవనములు కూడా రాముని వియోగమునకు శోకిస్తున్నాయా అన్నట్టు వాడిపోయి ఉన్నాయి.

నేను అయోధ్యలో ప్రవేశించగానే రాముని కోసరం అయోధ్యా ప్రజలు విడిచే నిట్టూర్పులు వినబడ్డాయి. రాజవీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి. మేడమీద నిలబడి ఉన్న స్త్రీలు, నేను రాముని లేని రథమును తీసుకొని రావడం చూచి రోదించడం స్వయంగా చూచాను. రామునికి శత్రువులు కూడా రాముని వంటి శత్రువు మనకు దొరకడని దు:ఖించడం చూచాను." అని అన్నాడు సుమంత్రుడు.

ఆమాటలు విన్న దశరథుడు సుమంత్రునితో ఇలాఅన్నాడు. "సుమంత్రా! నిజమేనయ్యా. కైక వరములు కోరినదే తడవుగా నేను ఎవరినీ సంప్రదించకుండా ఆ వరాలు ఇవ్వడం వలన ఎంతటి తీవ్రపరిణామాలు వస్తాయో ఊహించకుండా, ఆ వరాలు ఇచ్చేసాను. ఇది నేను చేసినఘోరమైన తప్పు. నేను వృద్ధులైన వారితో ఆలోచించి నిర్ణయం తీసుకొని ఉండాల్సింది. నా తొందరపాటుకు ఫలితం అనుభవిస్తున్నాను. నేను కాదు అయోధ్య అంతా అనుభవిస్తూ ఉంది. దీని కంతటికీ కారణము నా కాముకత్వము. అదే  నా వంశనాశనానికి కారణమయింది.

సుమంత్రా! నాకు ఒక సాయం చెయ్యి. నన్ను రాముని వద్దకు తీసుకొని వెళ్లు. లేకపోతే నీవు అన్నా వెళ్లి రాముని వెనకకు తీసుకొని రా. నా ఆజ్ఞను రాముడు పాలించనవసరం లేదని చెప్పి తీసుకొని రా. నీ మాట వినడు అనుకుంటే నాకు దారి చూపించు. నేనే వెళతాను. నేను వెంటనే నా రాముని చూడాలి. లేకపోతే నా దేహంలో ప్రాణములు నిలవడం కష్టం. ఇలాగే ఇక్కడే ఉంటే నేను మరణించడం తథ్యం. నేను అనాధగా మరణించాను అన్న విషయం నా రామునికి ఎలా తెలుస్తుంది? ఎవరుచెబుతారు. ఏమో ఏమవుతుందో!" అంటూ

బిగ్గరగా ఏడుస్తూ ఆసనం మీద పడిపోయాడు దశరథుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఏబదితొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## అరవయ్యవ సర్గ.

ఇంతలో కౌసల్య సుమంత్రుని చూచి ఏడుస్తూ ఇలా అంది. "సుమంత్రా! నేను రాముని విడిచి ఒక్క క్షణం కూడా ఉండలేను. నన్ను కూడా రాముని వద్దకు తీసుకొనిపో. నీవు నన్ను రాముని వద్దకు తీసుకొని పోతావా లేక నన్ను యమలోకానికి పొమ్మంటావా నువ్వే చెప్పు. రథమును వెనక్కు మరల్చు." అని ఆవేశంతో పలికింది కౌసల్య.

అప్పుడు సుమంత్రుడు చేతులు జోడించి ఇలా అన్నాడు. "అమ్మా! మీరు శోకమును వదిలిపెట్టండి. రాముడికి అడవులలో ఏ కష్టమూ రాదు. లక్ష్మణుడు రాముని పక్కన ఉండగా రామునికి ఏలోటూ రాదు. ఇంక సీత కూడా ఇక్కడ ఉన్నట్టే అక్కడ కూడా ఉంది. ఏ మాత్రం భయం బాధ పడటం లేదు. భర్తతో సంతోషంగా ఉంది. ఇక్కడ ఉద్యానవనములలో ఎలా విహరిస్తూ ఉందో అడవులలో కూడా అలాగే విహరిస్తూ ఉంది. సీత తనకు ఇచ్చిన ఆభరణములు ధరించి ఎంతో ఉల్లాసంగా ఉద్యానవనములో తిరుగుతున్నట్టు అడవులలో విహరిస్తూ ఉంది. ఆమెలో ఆత్మ విశ్వాసము కనపడుతూ ఉంది. ఏ మాత్రం దు:ఖము కనపడటం లేదు. సీత హృదయము ఎల్లప్పుడూ రాముని యందే లగ్నం అయి ఉంది. రాముడు ఎక్కడ ఉంటే అదే ఆమెకు అయోధ్య. రాముడు లేని అయోధ్య సీతకు అడవులతో సమానమే. కాబట్టి మనము రామ లక్ష్మణుల గురించి గానీ సీత

గురించి గానీ శోకించనవసరము లేదు.

ఇంక సీత కైకను గురించి ఏమేమో అన్నది కానీ నాకు గుర్తు లేదు. కానీ సీతారామలక్ష్మణులు మాత్రం ఎంతో ఉల్లాసంగా ఉన్నారు అని మాత్రం చెప్పగలను." అని సుమంత్రుడు పరి పరి విధాలుగా ఓదారుస్తున్నా కౌసల్య తన దు:ఖము మానలేదు. రామా రామా అని పలవరిస్తూ ఉంది.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము అరువదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### అరవయ్యి ఒకటవ సర్గ.

తరువాత కౌసల్య, మహారాజు దశరథుని చూచి ఇలా పలికింది. "మహారాజా! తమరు దయగలవారని ముల్లోకములలో అనుకుంటారు కదా! కాని కన్నకుమారుని, కోడలిని, ఎలా అడవులకు పంపగలిగావు. నీ దయాగుణము అంతా ఏమియింది? అది సరే! ఏ పాపమూ ఎరుగని సీతను కూడా అడవులకు  పంపావు కదా! ఆమె అడవులలో ఎలా తిరుగ గలదు? ఆ కందమూలములు ఎలా తినగలదు అని ఆలోచించావా! పొద్దుటే మంగళవాద్యములను వినడానికి అలవాటు పడిన సీత క్రూరమృగముల అరుపులు ఎలా వినగలదు అని ఎన్నడైనా ఆలోచించారా! తమరి కన్న కుమారుడు అడవులలో ఎటువంటి బాధలు పడుతున్నాడో మీకు తెలుసా! రాముని చూడకుండా ఉండటానికి మీది హృదయమా లేక బండరాయా!

మహారాజా! రాముడు పదునాలుగు సంవత్సరములు వనవాసము ముగించుకొనితిరిగి అయోధ్యకు  వచ్చిన నాడు భరతుడు తిరిగి రాజ్యమును రామునికి ఇస్తాడంటారా! ఒక వేళ భరతుడు ఇచ్చినా రాముడు తిరిగి రాజ్యము స్వీకరిస్తాడా!  ఏమో నాకు మాత్రం ఊహకు కూడా అందటం లేదు.  ఎందుకంటే మరొక మృగము తిన్న ఆహారమును పెద్దపులి తినదు. అలాగే భరతుడుకి ఇవ్వబడిన రాజ్యమును రాముడు తిరిగి స్వీకరించడు. రాముడు

ఆత్మాభిమానము కలవాడు కదా! యుద్ధము చేసి అన్నా రాజ్యము తీసుకుంటాడు కానీ భరతుని దయాధర్మభిక్ష కిందతీసుకోడు. రామునికి జరిగిన అవమానానికి ఆరోజే రాముడు తమరిని నరికి వేసి ఉండేవాడు. కానీ తండ్రి అనే గౌరవంతో విడిచి పెట్టాడు అని అనుకుంటాను. లేకపోతే రాముని పరాక్రమునకు ముల్లోకములలో తిరుగులేదు కదా! తన తోకతొక్కిన వాడిని వ్యాఘ్రము ఎలా క్షమించదో అలాగే  తనకు అపకారము చేసిన వాడిని రాముడు కూడా క్షమించడు.  అటువంటి రాముని పరాక్రమాన్ని వీరత్వాన్నీ నీవు నాశనం చేసావు. దేశం నుండి వెళ్లగొట్టావు. ఇది ధర్మాత్ములు చెయ్యదగిన పనేనా!

ధర్మ శాస్త్రము ప్రకారము స్త్రీకి మొదటి రక్షకుడు భర్త. రెండవ రక్షకుడు కుమారుడు. మూడవ రక్షకుడు జ్ఞాతి. నాకు భర్తగా నువ్వు ఉండీ లేనట్టే. నాకు నా కుమారుని దూరం చేసావు. నన్ను గతిలేని దానిని చేసావు. అధోగతి పాలు చేసావు. నన్నే కాదు ఈదేశాన్నే నాశనం చేసావు. దిక్కులేకుండా చేసావు. నీవు చేసిన పనుల వలన నీ భార్య కైక, నీ కుమారుడు భరతుడు మాత్రమే ఆనందిస్తారు. తక్కినవాళ్లు దు:ఖములో మునిగితేలుతున్నారు. కేవలం ఇద్దరి సుఖం కోసం ఇంతమందిని క్షోభపెట్టడం ధర్మమా!" అని కౌసల్య దశరథుని అనరాని మాటలు అంటూ ఉంటే దశరథుడు కిమ్మనకుండా అన్నీ భరిస్తున్నాడు. తాను చేసిన తప్పుకు ఇదే సరైన శిక్ష అని అనుకుంటూ అన్నింటినీ భరిస్తున్నాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము అరువది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## అరవయ్యి రెండవ సర్గ.

రాముని వియోగంతో కుమిలిపోతున్న కౌసల్య అన్న మాటలకు దశరథుడు బదులు చెప్పలేకపోయాడు. తనలో తాను దు:ఖిస్తున్నాడు.

ఆ దు:ఖంలోనే దశరథునికి తాను పూర్వము చేసిన పాపము గుర్తుకు వచ్చింది. తాను వేసిన శబ్దవేధి బాణముల వలన కలిగిన మహాపరాధము తలచుకొని తలచుకొని ఏడుస్తున్నాడు. తానుచేసిన పాపము మరొకరితో పంచుకొంటేనేగాని తీరదు అని అనుకున్నాడు. కౌసల్య వంక తిరిగాడు. ఆమెకు చేతులుజోడించి నమస్కరిస్తూ ఇలా అన్నాడు.

“కౌసల్యా! భర్త గుణవంతుడైనా, దుర్మార్గుడైనా, సతికి పతియే కదా ప్రత్యక్ష దైవము. నీకు దు:ఖము లేదు అని నేను అనను. కాని ఎంత దు:ఖములో కూడా భర్తనైన నన్ను ఈ విధంగా తిట్టడం ధర్మమేనా! ఆలోచించు.” అని అన్నాడు.

ఆ మాటలకు కౌసల్య తన కన్నీటితోనే బదులు చెప్పింది. అలాగే దశరథుని పాదముల మీద వాలి పోయింది. ఆయన పాదములు తన కన్నీటితో అభిషేకించింది.

"మహారాజా! మీరు నన్ను వేడుకొనడం ద్వారా నన్ను మీరు ఖండ ఖండాలుగా ఖండించినట్టయింది. మిమ్మల్ని తిట్టడం ద్వారా నేను మహాపరాధమే చేసాను. కాని మీరు కోపించకుండా నన్ను అనునయిస్తున్నారు. నేను ఎంత పాపం చేసానో ఇప్పుడు నాకు అర్థం అయింది. ఓ మహారాజా! మీరు ధర్మాత్ములు అని నాకు తెలియును. నాకూ ధర్మం తెలుసు. అంత అవివేకురాలిని కాను. కానీ పుత్రశోకం తట్టుకోలేక ఆ బాధలో మిమ్మల్ని అనరాని మాటలు అన్నాను.

మహారాజా! తమరికి తెలియనిది కాదు. శోకము అన్ని అపరాథములకు మూలము. శోకసముద్రములో మునిగిన వాడికి మంచి చెడూ తెలియదు. శాస్త్రజ్ఞానము నశిస్తుంది. ధైర్యాన్ని కోల్పోతాడు. తాను ఏం చేస్తున్నాడో ఏం మాట్లాడుతున్నాడో తెలియని స్థితిలో ఉంటాడు. శోకము మనిషికి కనపడని శత్రువు. సర్వనాశనం చేస్తుంది. ఎదురుగా ఉన్న శత్రువు కొట్టిన దెబ్బను తప్పుకోవచ్చు కానీ, మనసులో పుట్టిన చిన్నపాటి దు:ఖమును తట్టకోడం కష్టం. అన్ని ధర్మములు తెలిసినవారు, సర్వసంగపరిత్యాగులు అయిన సన్యాసులు కూడా శోకముతో కుమిలిపోవడం, మూర్ఖంగా ప్రవర్తించడం మనకు తెలుసుకదా!

ఓ మహారాజా! రాముడు మనలను విడిచిపోయి నేటికి ఐదు దినములు అయినది కానీ నాకు ఐదు సంవత్సరములు అయినట్టుంది. రాముడు మనసులో మెదిలితేనే నాకు దు:ఖము ముంచుకొస్తూ ఉంది. ఆ శోకావేశములో ఏమేమో మాటలాడి ఉంటాను. నన్ను క్షమించండి." అని ప్రార్థించింది కౌసల్య.

ఇంతలో సాయంకాలము అయింది. దశరథుడు అలాగే ఒరిగిపోయి నిద్రలోకి జారుకున్నాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము అరువది రెండవ భాగము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## అరవయ్యి మూడవ సర్గ.

దశరథుడు కలతనిద్రలో ఉన్నాడు. పూర్వము జరిగిన సంఘటనలు పదే పదే గుర్తుకు వస్తున్నాయి. నిద్రపట్టడం లేదు. ఆ విషయం కౌసల్యకు చెబితే తన దు:ఖము కొంచెమైనా ఉపశమిస్తుంది అని అనుకున్నాడు. కౌసల్యను పిలిచాడు. తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు. ఆమెతో ఇలా చెప్పసాగాడు.

" ఓ కౌసల్యా! మానవుడు తాను చేసిన పుణ్యమునకు పాపమునకు ఈ జన్మలోనే తగిన ఫలితాన్ని అనుభవిస్తాడు. వాడు ఎవరైనా సరే, ఒక పనిని మొదలు పెట్టే ముందు, తాను చేయబోయే పని మంచిదా, చెడ్డదా, ఆ పని వలన మంచి ఫలితము వస్తుందా లేక చెడ్డ ఫలితము వస్తుందా అని తెలుసుకొని తరువాత ఆ పని మొదలుపెట్టాలి. అలా చెయ్యని వాడు మూర్ఖుడు, ఏమీ తెలియని వాడు అని పెద్దలు అంటారు.

మోదుగుపూలు పెద్దవిగా ఉంటాయి. కాని మామిడి పూత చాలా చిన్నదిగా ఉంటుంది. మోదుగ పూలు పెద్దవి కాబట్టి పెద్ద పెద్ద కాయలు, పండ్లు కాస్తాయి అని మామిడి చెట్లను నరికి, మోదుగ చెట్లను పెంచిన వాడు మూఢుడు కాక మరేమవుతాడు. ఎందుకూ పనికిరాని మోదుగ కాయలను చూచి ఏడుస్తాడు. తాను

చేయబోయే పనికి ఎలాంటి ఫలితం వస్తుందో తెలియకుండా ఆ పని చేసేవాడు, పూతా పిందే లేని చెట్టుకు నీరు పోసి పెంచిన వాడితో సమానము. మామిడి చెట్టులాంటి రాముని అడవులకు పంపి, మోదుగ చెట్లను పెంచుతున్నాను. కాని ఈ పాపమునకు బలమైన కారణము ఉంది.

నేను మంచి యవ్వనములో ఉండగా నాకు శబ్దవేధి విద్యనేర్చుకున్నాను. ఎంత చీకటిలో  ఉన్న మృగము నైనా అది చేయు శబ్దమును విని దానిని గురితప్పకుండా కొట్టగల నేర్పు నాకు ఉండేది. అదే నాకు చేటు తెచ్చింది. మహా పాపము చేయించింది.

ఓ కౌసల్యా! అప్పటికి నాకు వివాహము కాలేదు. మంచి యవ్వనములో ఉన్నాను. పైగా యువరాజును. కోరికలు ఎక్కువ. దానితో కూడా మదము, గర్వము కూడా ఎక్కువే.  ఒక వర్షాకాలంలో నేను సరయూనది సమీపములోని అడవికి వేటకు వెళ్లాను. వేటాడి వేటాడి అలసి పోయాను. అంతలో చీకటి పడింది. నాకు రాత్రిళ్లు వేటాడటం చాలా ఇష్టం. సరోవరములో నీటిని తాగుటకు వచ్చు జంతువులు నీరు తాగునపుడు చేయు గుడ గుడ శబ్దములను బట్టి వాటిని బాణములతో కొట్టి వినోదించేవాడిని.

అదే ప్రకారము ఆ రాత్రికూడా నేను ఒక సరోవరము దాపున మాటు వేసి కూర్చున్నాను. ఆ రోజు ఒక ఏనుగును వేటాడవలెనని సంకల్పముతో ఉన్నాను. ఇంతలో నీటిలో దిగిన శబ్దము, కుండలో నీరు నింపునపుడు వచ్చే శబ్దము నాకు వినపడ్డాయి. నేను ఏనుగు తన తొండముతో నీరు తాగుతూ ఉంది అని అనుకున్నాను. ఒక బాణము

తీసి, ఆ శబ్దము వచ్చు వైపు గురిపెట్టి కొట్టాను. ఏనుగు ఘీంకారమునకు బదులు "అయ్యో అమ్మా అమ్మా" అంటూ మనిషి అరిచిన  శబ్దము వినపడింది.

నేను పరుగు పరుగున ఆ సరోవరము వద్దకు వెళ్లాను. అక్కడ ఒక ముని కుమారుడు పడి ఉన్నాడు. నేను వదిలిన బాణము అతని గుండెల్లో గుచ్చుకొని ఉంది.

"మేము ఈ అడవితో తపస్సుచేసుకుంటుంటే మా మీద ఏ దుర్మార్గుడు బాణప్రయోగము చేసినాడో కదా! మేము ఎవరికీ అపకారము చేయలేదే! నీళ్లు తీసుకొని పోవడానికి నేను ఇక్కడికి వచ్చాను. కాని నన్ను ఎవరో బాణంతో కొట్టారు. మేము హింస అంటే ఏమిటో ఎరుగము. ఎవరికీ  ఏ విధమైన అపకారమూ చెయ్యము. అటువంటిమాకు ఈ విధంగా బాణంతో కొట్టి మరణ శిక్ష విధించుటకు కారణమేమి? నేను ఎవరికీ ఏ అపకారము చెయ్యలేదు. అంటువంటిది నన్ను ఎందుకు బాణంతో కొట్టాల్సివచ్చింది. అతడు ఎవరో కానీ ఏ విధంగానూ మంచి ఫలితము ఇవ్వని ఈ పని చేసి మహాపాపం చేసాడు. నేను చనిపోతున్నందుకు నాకు విచారములేదు. కాని నా తల్లి తండ్రుల గురించే నాకు బాధగా ఉంది. నా తల్లి తండ్రులను వారి వృధ్ధాప్యములో నేను వారిని పోషిస్తున్నాను. నేను ఇలా అర్థాంతరంగా మరణిస్తే వారికి దిక్కు ఎవరు? ఆ మూర్ఖుడు ఎవరో గానీ నన్ను మాత్రమే చంపలేదు. నాతోపాటు నా తల్లితండ్రులను కూడా చంపాడు. " అని పరి పరి విధములుగా బాధతో విలపిస్తున్నాడు.

ఆ మాటలు విన్న మా మనసు వికలమైపోయింది. ఏమి

చెయ్యడానికి తోచలేదు. ఆ ముని కుమారుని దగ్గరగా వెళ్లాను. అతడు తెచ్చిన కుండా పక్కనే పడి ఉంది. అతని శరీరం అంతా రక్తంతో తడిసిపోయి ఉంది. నేను అతని పక్కనే కూర్చున్నాను. ఆ ముని కుమారుడు కళ్లు పైకెత్తి నన్ను చూచాడు.

"ఓ రాజా! నువ్వేనా నన్ను బాణంతో కొట్టింది. నేను నీకు ఏమి అపకారము చేసానని నన్ను బాణంతో కొట్టావు. నేను నా తల్లి తండ్రుల కొరకు నీళ్లు తీసుకొని పోవడానికి వచ్చాను. అది అపరాధమా! నువ్వు నన్నే కాదు. నా తల్లి తండ్రులనుకూడా చంపావు. నా తల్లి తండ్రులు దాహంతో అలమటిస్తున్నారు. నేను నీళ్లు తీసుకొని వస్తానని నా కోసం ఎదురు చూస్తూ ఉంటారు. కాని నేను ఇక్కడ బాణము తగిలి చనిపోయినట్టు వారికి తెలియదు. నా తండ్రకి నేను చనిపోయానని తెలిసినా ఏమీ చేయలేడు కదా! ఒక వృక్షమును నరుకుతుంటే పక్కన ఉన్న వృక్షము ఏమీ చేయలేనట్టు, నేను చనిపోతున్నా నా తండ్రి ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో ఉన్నాడు. కాని, నా తండ్రి, నాకు ఈ దుస్థితి కలిగించిన నిన్ను, దారుణంగా శపించగలడు. అందుకని నీవు ఈ జలమును తీసుకొని పోయి నా తండ్రికి ఇచ్చి ఆయన దాహము తీర్చు. ఆయన శాంతిస్తాడు. అదుగో ఆ కనపడే కాలి బాట వెంట వెళితే మా ఆశ్రమము వస్తుంది. నీవు వెంటనే వెళ్లి మా తండ్రికి ఈ విషయం చెప్పు.

ఓ రాజా! నీవు కొట్టిన బాణము నా శరీరంలో గుచ్చుకొని చాలా బాధకలిగిస్తూ ఉంది. నీవు దానిని బయటకు లాగు. నాకు సత్వరమే మరణం ప్రసాదించు." అని ఆ ముని కుమారుడు నాతో అన్నాడు.

నేను ఆ బాణమును తీస్తే అతను వెంటనే మరణిస్తాడు. తియ్యకపోతే మరణయాతన అనుభవిస్తాడు. ఏం చేయాలో నాకు తోచలేదు. నేను పడుతున్న బాధను గ్రహించాడు ఆ ముని కుమారుడు. కాని అప్పటికే ఆ ముని కుమారుడు బాధతో నేల మీదపడి గిలా గిలా కొట్టుకుంటున్నాడు. అంత బాధలో కూడా నాతో ఇలా అన్నాడు.

"ఓ రాజా! నీవు బ్రహ్మ హత్య చేసానని భయపడకు. ఎందుకంటే నేను బ్రాహ్మణుడను కాను. నా తండ్రి వైశ్యుడు. నా తల్లి శూద్ర వనిత. కాబట్టి నీకు ఆభయం లేదు." అని అంత బాధలో కూడా నా మనసుకు ఊరట కలిగించాడు. ఆ ముని కుమారుడి బాధను చూడలేక నేను అతని శరీరము నుండి బాణమును లాగేసాను. ఆ ముని కుమారుడు నా వంకే చూస్తూ ప్రాణములు విడిచాడు. నేను కొట్టిన బాణముచే మృతిచెందిన ఆ ముని కుమారుని చూచి నా మనస్సుకు చాలా బాధకలిగింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము అరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

అరువది నాల్గవ సర్గ.

"కౌసల్యా! ఆ ప్రకారంగా నేను నా ప్రమేయం లేకుండానే ఆ ముని కుమారుని మరణానికి కారకుడిని అయ్యాను. అప్పుడు నాకు ఏంచెయ్యాలో తోచలేదు. కొంచెం సేపు ఆలోచించాను. అప్పుడు నాకు ఒక ఉపాయము తట్టింది. నేను  కుండ నిండుగా స్వచ్ఛమైన జలమును తీసుకొని ఆ ముని కుమారుడు చెప్పిన మార్గములో నడుచుకుంటూ వారి ఆశ్రమమునకు చేరుకున్నాను.

ఆ ఆశ్రమములో ఒక వృద్ధ దంపతులు ఉన్నారు. వారు అంధులు. లేవలేకుండా ఉన్నారు.ఎవరైనా లేచి నడిపిస్తే గానీ నడవలేకున్నారు. వారే ఆ మునికుమారుని తల్లి తండ్రులు అని అనుకున్నాను. వారు తమ కుమారుని రాక కోసరము ఎదురు చూస్తున్నారు.తమ కుమారుని మంచి తనము గురించి మాట్లాడు కుంటున్నారు. కాని  వారి కుమారుడు ఇంక ఎప్పటికీ తిరిగి రాడు అని తెలిస్తే వారి గుండె ఎలా బద్దలవుతుందో తల్చుకుంటేనే నా హృదయం తల్లడిల్లిపోయింది. ఆ ముని కుమారుని చంపిన దు:ఖము కంటే ఆవృద్ధ దంపతులను చూచిన తరువాత కలిగిన దు:ఖము రెట్టింపు అయింది.

నేను వారికి దగ్గరగా వెళ్లాను. నా అడుగుల చప్పుడు విన్న ఆ

వృద్ధులు నన్ను వారి కుమారుడు అని అనుకున్నారు. "కుమారా! ఏమి నాయనా. నీళ్లు తీసుకురావడానికి ఇంత ఆలస్యం అయింది. నాకు చాలా దాహంగా ఉంది. కొంచెము నీళ్లు ఇవ్వు నాయనా. తాగుతాను. అయినా నీకు ఇంకా నీటిలో ఆటలు ఏమిటి చెప్పు. నీ కోసరం మీ అమ్మ బెంగపెట్టుకుంది.లోపలకు వెళ్లి ఆమెను పలకరించు" అని అన్నాడు ఆ వృద్ధుడు.

నేను వారికి ఏమి సమాధానము చెప్పలేదు. "నాయనా కుమారా! ఏమి నాయనా మాతో మాట్లాడవు. నామీద కోపమా. ఈ వృద్ధుల మీద కోపం ఎందుకు కుమారా! మాకు నువ్వే కదా రెండు కళ్లు. నీ కళ్లతో మేము ఈ ప్రపంచాన్ని చూస్తున్నాము. నీ మీద ఆధార పడ్డ మామీద కోసం ఎందుకు కుమారా!" అని కొడుకు కోసం ఆరాటపడుతున్న ఆ వృద్ధుని చూస్తుంటే నా కడుపు తరుక్కుపోయింది. ఆయనను చూచి భయం కూడా వేసింది. అందుకని తత్తరపాటుతో భయం భయంగా ఆయనతో ఇలా అన్నాను.

"మహాత్మా! నేను మీ కుమారుడిని కాదు. దశరథుడు అనే క్షత్రియుడను.  అహంకారముతో, అజ్ఞానముతో అవివేకముతో ఈ దు:ఖమును చేజేతులా తెచ్చిపెట్టు కున్నాను. నేను వేటకోసరము సరయూ నదీ తీరమునకు వచ్చాను. ఏనుగును చంపవలెనని మాటువేసి ఉన్నాను. నీ కుమారుడు నీరు కుండలో నీరు నింపు ధ్వని వినపడినది. అది ఏనుగు నీరు త్రాగు శబ్దము అని భ్రమించి శబ్దవేధి బాణముతో కొట్టాను. ఒక మానవ స్వరము హాహాకారము చేయడం వినిపించింది. వెంటనే పోయి చూచాను. అక్కడ నా బాణము దెబ్బతిన్న తమరి కుమారుడు కనిపించాడు. కేవలము ఏనుగును చంపవలెనని

నేను వదిలిన బాణము మీ కుమారునికి తగిలినది. మీ కుమారుడు మీ గురించి నాకు తెలియజేసాడు. నేను మీ కుమారుని కోరిక ప్రకారము ఆయన బాధను తొలగించుటకు ఆయన గుండెలలో గుచ్చుకున్న బాణమును లాగివేసితిని. వెంటనే మీ కుమారుడు మరణించాడు. నేను నీరు తీసుకొని మీ కుమారుడు చెప్పిన మార్గములో మీ వద్దకు వచ్చాను. నేను కావాలని మీకుమారుని చంపలేదు. కేవలము అవివేకము వలన తొందరపాటువలన జరిగినది. మీరు ఏ శిక్షవేసినా నేను స్వీకరిస్తాను. మీ ఇష్టము." అని వారి ముందు నిలబడ్డాను.

ఆయన కొంచెము సేపు మాట్లాడలేదు. తరువాత ఇలా అన్నాడు. "ఓ రాజా! నీవు ఇక్కడకు వచ్చి నా కుమారుని మరణ వార్త చెప్పావు కాబట్టి బతికిపోయావు. లేకపోతే నీ శిరస్సు వేయి వక్కలు అయి ఉండేది. ఎవరైనా క్షత్రియుడు తెలిసీ తెలిసీ ముని కుమారుని చంపితే అతను దేవేంద్రుని పదవిలో ఉన్నాసరే అతడుశిక్షార్హుడే. ఎవరైనా తపస్సు చేసుకుంటున్న మునిని కానీ, మునికుమారుని గానీ చంపితే అతని శిరస్సు వెంటనే బద్దలయిపోతుంది. కాని నీవు ఈ అకృత్యమును తెలియక పొరపాటున చేసావు. కాబట్టి ఇంకా బతికి ఉన్నావు. లేకపోతే నీవే కాదు నీ వంశము సొంతము నాశనము అయి ఉండేది. జరిగింది ఏదో జరిగింది. ఇప్పుడు నీవు మా ఇద్దరినీ మా కుమారుని శరీరము ఉన్నచోటికి తీసుకొని వెళ్లు. మా కుమారుని శరీరాన్ని కడసారిగా తడిమి తడిమి చూచుకుంటాము." అని అన్నాడు.

అప్పుడు నేను ఆ ఇరువురు వృద్ధ దంపతులను వారి కుమారుడు చనిపోయిన స్థలమునకు తీసుకొని వెళ్లాను. ఆతల్లి

తండ్రులు వారి కుమారుని శవమును మీదపడి ఏడుస్తున్నారు. వారి శోకానికి అంతులేదు.

"కుమారా! నేను రా. మీ తండ్రిని వచ్చాను. లేచి నమస్కారము చేయి నాయనా! అయ్యో నేలమీద పడుకొని ఉన్నావా. లే నాయనా. మా మీద కోపం ఎందుకు నాయనా. మాతో మాట్లాడు. రేపటినుండి ప్రతి రోజూ ప్రాత:కాలమున మాకు వేదము ఎవరు చదివి వినిపిస్తారు నాయనా! రేపటి నుండి నీ మధురమైన కంఠస్వరము మాకు వినపడదా! రేపటి నుండి ఎవరు పొద్దుటే స్నానసంధ్య ముగించుకొని నా పక్కన కూర్చుని నాకు సేవలు చేస్తారు. రేపటి నుండి మాకు ఎవరు ఫలములు కందమూలములు తెచ్చి తినిపిస్తారు. కుమారా! నీ తల్లిని చూడు నాయనా. కళ్లులేని కబోధి. రేపటి నుండి ఆమె ఆలనా పాలనా ఎవరు చూస్తారు.

రా నాయనా. నీవు యమలోకమునకు వెళ్లకు. మన ఇంటికి రా పోదాము. రేపు మేము కూడా నీ వెంట యమలోకమునకు వస్తాము. అందరమూ కలిసే వెళదాము. నీవు లేని ఈ లోకంలో మేము ఉండలేము. అక్కడ యమునితో నేనుమాట్లాడతాను. నీవు మా ఇద్దరినీ పోషించడానికి అనుమతి తీసుకుంటాను. నిస్సహాయులమైన మాకు యముడు ఆ మాత్రం అనుమతి ఇవ్వడా! తప్పకుండా ఇస్తాడు.

నాయనా! కుమారా! నీవు ఏం పాపం చేసావనిరా ఈ పాపాత్ముడు నిన్ను పొట్టన పెట్టుకున్నాడు. నీవు వీరగతిని పొందావు. నీవు కూడా వీరులు పోయే లోకములకు పోతావు. నీవు కూడా దిలీపుడు, సగరుడు, శైబ్యుడు, జనమేజయుడు, నహుషుడు,

దుందుమారుడు మొదలగు మహానుభావులు పొందిన వీరగతినే నీవు పొందుతావు. అదీ కాకపోతే, నీవు ముని కుమారుడవు. నీకు సాధువులకు ఏ ఉత్తమగతి లభిస్తుందో ఆ ఉత్తమ గతులు పొందుతావు. నీకూ నిన్ను చంపిన వాడికీ ఉత్తమ గతులు కలుగుతాయి." అని ఆ వృద్ధుడు కొడుకును తలచుకుంటూ విలపిస్తున్నాడు.

తరువాత ఆ వృద్ధుడు తన కుమారునికి ఉదక క్రియలు నిర్వర్తించాడు. వారు ఆ కార్యక్రమము చేయు నప్పుడు నేను వారి పక్కనే చేతులు కట్టుకొని నిలబడి ఉన్నాను. ఆ వృద్ధుడు తన కుమారునికి జలతర్పణములు వదిలిన తరువాత నన్ను చూచి ఇలా అన్నాడు. "ఓ రాజా! నీవు నీ బాణముతో నా ఒక్కగానొక్క కొడుకును నిర్దాక్షిణ్యంగా చంపి నన్ను నా పుత్రునికి దూరం చేసావు. మేము బతికీ ప్రయోజనము లేదు. కాబట్టి మా ఇద్దరినీ కూడా చంపెయ్యి. మేము మరణమును గురించి చింతించడం లేదు. కాని నీవు నా కుమారుని తెలిసి చంపినా తెలియక చంపినా, తప్పు తప్పే. దానికి నీవు శిక్ష అనుభవించక తప్పదు.

"నేను ఎలాగైతే నీ వలన నా పుత్రుని పోగొట్టుకొని కుమారా కుమారా అని ఏడుస్తూ మరణిస్తున్నానో, నువ్వు కూడా నీ కొడుకును చేజేతులా పోగొట్టుకొని హా పుత్రా హా పుత్రా అని ఏడుస్తూ మరణించు. ఇదే నేను నీకు ఇచ్చే శాపము." అని నన్ను శపించాడు.

తరువాత వారు ఒక చితిని పేర్పించుకొని అగ్నికి ఆహుతి అయ్యారు.

కౌసల్యా! ఆ ప్రకారంగా నేను ఆ ముని కుమారుని మృతికి కారకుడినయి ఆతని తండ్రి శాపానికి ఆహుతి అయ్యాను. ఈ నాడు ఆ శాప ప్రభావంతో నా కుమారుని చేజేతులా అడవులపాలు చేసుకొని రామా రామా అంటూ ఏడుస్తున్నాను. నేను కూడా ఆ వృద్ధుడి వలెనే కొడుకా కొడుకా అని ఏడుస్తూ మరణించవలసిన సమయము ఆసన్నమయినట్టుంది." అని ఏడుస్తున్నాడు దశరథుడు.

కౌసల్యకు భర్తను ఎలా ఓదార్చాలో తెలియడం లేదు. మౌనంగా ఉంది. తరువాత దశరథుడే అన్నాడు. "ఓ కౌసల్యా! నేను తెలివితక్కువగా అడవులకు వెళ్లమంటే, రాముడు ధర్మం ధర్మం అంటూ అడవులకు వెళ్లాడు. రాముడు చేసింది ధర్మమే. కాని నేనే అధర్మానికి పాలుబడ్డాను. కొడుకును అడవులకు పంపాను.

లేకపోతే ఎవడైనా చేజేతులా కొడుకును పోగొట్టుకుంటాడా! పోనీ నేను తెలివి తక్కువ వాడిని. ఏ కొడుకైనా తండ్రి అడవులకు పో అంటే కోపించకుండా ఉంటాడా! కాని రాముడు కోపం తెచ్చుకోలేదు. అదే ధర్మం అంటాడు. నేను అధర్మంగా ప్రవర్తించినా రాముడు ధర్మంగా ప్రవర్తించాడు. కాని నాకు అవసాన దశ సమీపించింది. ఈ ఆఖరి ఘడియలలో రాముడు నా దగ్గర ఉంటే ఎంత బాగుంటుంది. కౌసల్యా! అటు చూడు.యమదూతలు నాకోసరం వస్తున్నారు. శాప వశాత్తు నాకు నా మరణ కాలంలో నా రాముడు దూరం అయ్యాడు.

కౌసల్యా! నా ప్రాణాలు యమభటులు తీసుకుపోనవసరం లేదు. రాముడు నాకు దూరం కావడమే నా పుత్రశోకమే నాప్రాణాలు తీసేస్తుంది. రాముడు పద్నాలుగు సంవత్సరాల తరువాత అయోధ్యకు

వచ్చినపుడు చూచే అదృష్టం నాకు లేదు. ఆ అదృష్టానికి నేను నోచుకోలేదు. కేవలము దేవతలే ఆ దృశ్యము చూడగలరు. నా వంటిపాపాత్ముడికి ఆ అర్హత లేదు.

కౌసల్యా! ఒక్కొక్కటిగా నా అవయవాలు చలనం కోల్పోతున్నాయి. నా ఆయువు క్షీణించి పోతూ ఉంది. ఈ ఆఖరు క్షణాలలో కూడా రాముని స్మరణ నన్ను వదలడం లేదు.

రామా! రామా! ఎక్కడున్నావయ్యా! ఏం చేస్తున్నావయ్యా! ఒక్కసారి నా కళ్లకు కనపడవయ్యా! కౌసల్యా! నేను మరణిస్తున్నాను. ఓ కైకా! నీ ఉసురు కొట్టి నేను చచ్చిపోతున్నాను. నీవు ఆనందంగా ఉండు. నా కులాన్ని నాశనం చేసావు. నన్ను మరణానికి గురిచేసావు. నీవు కోరుకున్నట్టు నేను చచ్చిపోతున్నాను. చచ్చిపోతున్నాను." అంటూ పలవరిస్తున్నాడు దశరథుడు. అలా పలవరిస్తూనే దశరథుడు ప్రాణాలు వదిలాడు.

దశరథుడు తాను పొందిన ముని శాపము గురించి చెబుతూ ఉండగానే కౌసల్య శోకభారంతో నిద్రలోకి జారుకుంది. అంతకు ముందే సుమిత్రకూడా నిద్రపోయింది. అందుకని వారికి నిద్రలోనే పలవరిస్తూ దశరథుడు ప్రాణాలు వదిలిన సంగతి తెలియదు. అప్పటికి అర్ధరాత్రి దాటింది. కౌసల్య అంత:పురములో నిశ్శబ్దము ఆవరించింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము అరువదినాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## అరువది ఐదవ సర్గ.

మరునాడు తెల్లవారింది. రోజూ మాదిరి వంది మాగధులు దశరథ మహారాజును నిద్రలేపడానికి వచ్చారు. వారు దశరథుని గూర్చి మంగళకరములైన వాక్యములు పలుకుతూ స్తోత్రపాఠములు చదువుతున్నారు. గాయకులు దశరథుని వంశ చరిత్రను గానం చేస్తున్నారు. వారి స్తోత్రపాఠములతో కౌసల్యా మందిరము మారుమోగిపోయింది.

పరిచారికలు దశరథుని నిద్రలేపడానికి ఆయన పడుకున్న శయ్య దగ్గరకు వచ్చారు. మరి కొంత మంది మంచి గంధము కలిపిన నీరుతో నిండిన కుండలు తీసుకొని వచ్చారు. వారు దశరథుని శయ్యకు కొంచెం దూరంలో నిలబడ్డారు. సాధారణంగా మహారాజు ఈపాటికి నిద్రలేచేవారు. కాని ఇన్ని స్తోత్రపాఠములు చదువుతున్నా ఆయన అటు ఇటు కూడా కదలడం లేదు. వారికి అనుమానం కలిగింది. కాని అలాగే నిలబడి పోయారు.

ఇంతలో కొంతమంది వృద్ధ పరిచారికలు, దశరథుని వద్ద చనువు ఉన్న వాళ్లు, అక్కడకు వచ్చారు. విషయం తెలుసుకున్నారు. వారు దశరథుని శయ్య దగ్గరకువెళ్లారు. ఆయనను సున్నితంగా తట్టి లేపడానికి ప్రయత్నించారు. ఆయనలో చలనం లేదు. వారికి భయం

వేసింది. వణుకుతూ అలాగే నిలబడిపోయారు. వారి మనస్సు కీడు శంకించింది. మహారాజు మరణవార్తను బయటకు చెప్పడానికి వారికి ధైర్యము చాలడం లేదు.

వారు పరుగుపరుగున కౌసల్య సుమిత్రల వద్దకు వెళ్లారు. అప్పటికి వారు నిద్రలేవలేదు. అప్పటికి వారికి విషయం  బోధపడింది. రాత్రి అందరూ నిద్రించిన తరువాత దశరథుని ప్రాణాలు నిద్రలోనే పోయాయి. ఆవిషయం రాణులకు తెలియదు అని వారికి అవగతమయింది. వారు ఏడుస్తూ కౌసల్యను నిద్ర లేపారు. వారికి ఏం చెప్పాలో తోచలేదు. దశరథుని వంక చూపించారు.

కౌసల్య దశరథుని వద్దకు వెళ్లింది. ఆయన మరణించాడు అనిఅర్థం అయింది. "హా నాథా!' అంట బిగ్గరగా కేకపెట్టి దశరథుని మీద పడిపోయింది. దశరథుని మరణ వార్త అంత:పురము అంతటా వ్యాపించింది. దశరథుని భార్యలందరూ అక్కడకు చేరుకున్నారు. అందరూ బిగ్గరగా ఏడుస్తున్నారు. కైకకు కూడా దు:ఖము కట్టలు తెంచుకొని వస్తోంది. ఆమెకూడా బిగ్గరగా ఏడుస్తోంది. వారి రోదనలతో అంత:పురము నిండిపోయింది. పరిచారికలకు ఏం చెయ్యాలో తోచడం లేదు. అటుఇటు పరుగెత్తుతున్నారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము అరువై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## అరువది  ఆరవ సర్గ.

కౌసల్య తన భర్త దశరథుని తలను ఒడిలో పెట్టుకొని దు:ఖిస్తూ ఉంది. తలపైకెత్తి  కైకను చూచింది. ఆమె కోపం కట్టలు తెంచుకొంది.

“ఏమ్మా! కైకా! నీ కోరిక తీరిందా! నీ మనస్సు శాంతించిందా! ఇంక నువ్వు, నీ కొడుకు, ఈ అయోధ్యను ఏలుకోండి. మీకు అడ్డు వస్తాడని నా కొడుకును అడవులకు పంపావు. ఇప్పుడు మొగుడిని చంపావు.  ఇంక నీకు అడ్డేముంది. నా కొడుకు రాముడు నన్ను విడిచి అడవులకు  వెళ్లిపోయాడు. నా భర్త నన్ను విడిచి స్వర్గానికి పోయాడు. ఇంక నాకు  ఎవరు మిగిలారు. ఎవరి కోసం బతకాలి. నీ లాంటిది తప్ప మొగుడు లేకుండా  ఏ స్త్రీ బతకలేదు. బతకడానికి ఇష్టపడదు కూడా.

ఓ కైకా! నీవు  ఏం చేస్తున్నావో నీకు తెలిసే చేసావా! లేక ఆ గూని దాని మాటలు విని ఇంతటి ఘోరానికి ఒడిగట్టావా! ఏది ఏమైనా మాకు మా భర్తను దూరం చేసావు.  ఓ కైకా! నీవు మాకే కాదు. జనక మహారాజును కూడా దు:ఖములో ముంచావు. తన కూతురు అడవులలో ఎన్ని కష్టములు పడుతున్నదో అని జనకుడు ఎంతదు:ఖిస్తున్నాడో కదా!  ఇంతకూ రామునికి తన జనకుని మరణ వార్త ఎలా తెలుస్తుంది. తన తల్లి అనాథ అయింది అని ఎవరు

చెబుతారు.  రాముడు ఎక్కడ ఉన్నాడని వెతుకుతారు! నా భర్త రాముని గూర్చి, సీతను గూర్చి, తలంచుకొని ఏడ్చి ఏడ్చి ప్రాణాలు వదిలాడు. నేను కూడా ఆయన వెంటనే వెళతాను. నా భర్తతో పాటు చితి మీదకూర్చుని అగ్నికి ఆహుతి అవుతాను. నా భర్తను అనుసరించడం తప్పనాకు వేరుమార్గము లేదు." అంటూ కౌసల్య భర్త శవాన్ని కౌగలించుకొని భోరు భోరున ఏడుస్తూ ఉంది.

ఇంతలో కులగురువు వసిష్టులు, అమాత్యులు అక్కడకు చేరుకున్నారు. వసిష్ఠుని ఆదేశము మేరకు   అంతఃపురపరిచారికలు కౌసల్యను లేపి అక్కడి నుండి దూరంగా తీసుకొని పోయారు. అమాత్యులు దశరథుని శరీరమును ఒక తైలద్రోణిలో పదిలపరిచారు. శవమునకు చేయవలసిన కర్మక్రతువులు అన్నీ నిర్వర్తించారు.  ఆ సమయంలో దశరథుని కుమారులు ఎవరూ అయోధ్యలో లేరు. రామలక్ష్మణులు అడవులలో ఉన్నారు. భరత శత్రుఘ్నులు వారి మేనమామల ఇంట్లో ఉన్నారు. అందుకని దశరథునికి దహనక్రియలు నిర్వర్తించడానికి వీలులేదు. వారు వచ్చేదాకా నిరీక్షించాలి. కాబట్టి దశరథుని శరీరమును తైలద్రోణిలో భద్రపరిచారు.

(తైలద్రోణి అంటే పలు విధములైన నూనెలు(preservatives) కలిగిన తొట్టె అని అర్థము. ఈ రోజుల్లో కూడా శవాలను చెడిపోకుండా భద్రపరచడానికి యాసిడ్లు పూసి భద్రపరుస్తారు. మమ్మీలు అన్నీ అలా భద్రపరచబడినవే. ఇదే ప్రక్రియ త్రేతాయుగములో కూడా ఉంది అని తెలుస్తూ ఉంది.)

అప్పటి  దాకా దూర దూరంగా ఉన్న దశరథుని భార్యలు అందరూ దగ్గరగా వచ్చారు. తైలద్రోణిలో ఉన్న మహారాజు శవాన్ని చూచి బిగ్గరగా రోదిస్తున్నారు.

"ఓ మహారాజా! మాకు రాముడిని దూరం చేసావు. ఇప్పుడు నువ్వుకూడా దూరంగా వెళ్లిపోయావా! చేతులారా తన భర్తను చంపిన కైక పాలనలో మేము ఎలా ఉండగలము. రాముడూ లేకుండా, నీవూ లేకుండా, ఈ కైక పెట్టే బాధలనుసహిస్తూ మేము ఎలా జీవించగలము. ఈ కైక సామాన్యురాలు కాదు. తన స్వార్థం కోసరం రాముని అడవులకు పంపింది. కట్టుకున్న భర్తను చంపించింది. ఇక మమ్మల్ని మాత్రం విడిచి పెడుతుందా?" అని అగమ్యగోచరమైన వారి భవిష్యత్తును తలచుకుంటూ నేలమీద పడి దొర్లి దొర్లి ఏడుస్తున్నారు.

వీరి పరిస్థితి ఇలా ఉంటే, అటు రాముని, ఇటు మహారాజును పోగొట్టుకున్న అయోధ్యావాసుల జీవితాలలో చీకట్లు ముసురు కున్నాయి. అందరూ శోకసముద్రంలో మునిగిపోయారు. పురజనులు అందరూ వీధులలో గుంపులు గుంపులుగా చేరి కైక అకృత్యములను గురించి తదుపరి పరిణామాల గురించి చర్చించుకుంటున్నారు. కన్నీరు కారుస్తున్నారు. చంద్రుడు లేని ఆకాశం వలె మహారాజులేని అయోధ్య శోభావిహీన అయింది. సూర్యవంశపు మహారాజు అయిన దశరథుని మరణమును చూడలేక సూర్యుడు కూడా పడమటి దిక్కున దాక్కున్నాడు. అయోధ్య అంతా చీకట్లు అలముకున్నాయి.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము అరువది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## అరువది ఏడవ సర్గ.

మరునాడు సూర్యోదయము అయింది. మంత్రులు బ్రాహ్మణులు పురప్రముఖులు సభకు వచ్చారు. ఆ సభకు మార్కండేయుడు, మౌద్గల్యుడు,వామదేవుడు,కాశ్యపుడు, కాత్యాయనుడు, గౌతముడు, జాబాలి మొదలగు మహామునులు కూడా వచ్చారు. వారందరూ రాజ పురోహితుడైన వసిష్ఠుని చూచి వేర్వేరుగా ఇలా అన్నారు.

"నిన్న రాత్రి మహారాజు దశరథుడు చనిపోయాడు. పెద్దకుమారుడు రాముడు ఇక్కడ లేడు. అరణ్యములకు వెళ్లాడు. లక్ష్మణుడు కూడా రాముని అనుసరించాడు. మిగలిన ఇద్దరు కుమారులు వారి మాతామహుని ఇంటిలో (తాతగారి ఇంటిలో) ఉన్నారు. ప్రస్తుతము అయోధ్యకు రాజు లేడు. రాజు లేకుండా రాజ్యము ఉండకూడదు. రాజులేని రాజ్యములో అన్ని రకములైన అనర్థములు జరుగుతాయి. యజ్ఞయాగములు జరగవు. పుణ్యకార్యములు జరగవు. అరాచకము ప్రబలుతుంది.

రాజు లేని రాజ్యములో న్యాయము చెప్పేవారు ఉండరు. తప్పుచేసిన వారిని శిక్షించే వారు ఉండరు. ఆస్తి తగాదాలు పరిష్కారం కావు. రాజు లేని రాజ్యములో గోవులకు రక్షణ ఉండదు. వ్యవసాయము

కుంటుపడుతుంది. రాజులేని రాజ్యములో విద్యాలయాలు, యుద్ధ విద్యను బోధించు శిక్షణాలయాలు మూతబడతాయి. సైన్యము నిర్వీర్యము అవుతంఉది. రాజు లేని రాజ్యములో ప్రజలకు రక్షణ ఉండదు. ప్రజలునిర్భయంగా తిరగడానికి భయపడతారు.

శత్రు రాజులు మన దేశము మీదికి దండెత్తే అవకాశము ఉంది. రాజ్యములోని సమస్త సంపదలు రాజు అధీనములు, ఆ రాజే లేకపోతే ఆ సంపదలకు అధిపతి ఎవరు అనే సందేహము వస్తుంది. రాజు లేని రాజ్యములో దుండగులు చెలరేగి అన్ని రకాల నేరాలకు పాల్పడతారు.రాజ్యములోని ప్రజలకు రాజే తల్లి, తండ్రి, హితుడు. ధర్మాధర్మ విచక్షణ చేసేదిరాజు. అందుకనే రాజును యమ,కుబేర, ఇంద్ర, వరుణులతో పోలుస్తారు. రాజులేని రాజ్యము అంధకార బంధురము అవుతుంది.

కాబట్టి ఓ వసిష్ట మహర్షీ! మేము చెప్పిన విషయములను పరిశీలించి, ఇక్ష్వాకు వంశములోని వారిని ఎవరినైనా ఒక ఉత్తముని రాజ్యాభిషిక్తుని చేయడం ధర్మం." అని పలికారు.

శ్రీమద్రామాయణము
అయోధ్యా కాండము, అరువది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## అరువది ఎనిమిదవ సర్గ.

ఋషులు మాట్లాడిన మాటలు అన్నీ శ్రద్ధగా విన్నాడు వసిష్ఠుడు. మంత్రులతో ఆలోచించాడు. వారితో ఇలా అన్నాడు.

"మహా ఋషులారా! ప్రస్తుతము భరత శత్రుఘ్నులు వారి మేనమామగారి ఇంట ఉన్నారు. వారిని తీసుకొని వచ్చుటకు వెంటనే దూతలను పంపెదను. దశరథుడు, తాను చనిపోకముందే భరతునికి రాజ్యము ఇస్తానని కైకకు మాట ఇచ్చిఉన్నాడు. కాబట్టి రాజ్యము ఎవరిది అన్న సమస్య తలెత్తదు. భరతుడు రాగానే అతనికి పట్టాభిషేకము జరిపించెదము." అని చెప్పాడు.

వసిష్ఠుని ఆదేశము ప్రకారము సిద్ధార్థుడు,జయంతుడు, విజయుడు, అశోకుడు, నందుడు అనే దూతలను పిలిపించాడు. వారితో ఇలా అన్నాడు. "దూతలారా! జాగ్రత్తగా వినండి. మీరు వెంటనే భరతుని వద్దకు వెళ్లండి. అతనికి దశరథుని మరణ వార్త తెలియనీయకండి. మీ మొహంలో ఎక్కడా విషాద ఛాయలు కనపడకూడదు. నా మాటగా భరతునికి ఇలా చెప్పండి. "పురోహితులు అందరూ నీ హితము కోరుతున్నారు. నీతో ఒక అవసరమైన పని ఉన్నది. నీవు వెంటనే అయోధ్యకు రావలెను." అని చెప్పండి. రాముడు వనవాసమునకు వెళ్లిన విషయము ఏమాత్రము భరతునికి

తెలియనీయకండి. మీరు వెళ్లునపుడు కేకయ రాజుకు భరతునికి శత్రుఘ్నునికి అనేక కానుకలు తీసుకొని వెళ్లండి." అని ఆదేశించాడు.

వసిష్ఠుని ఆదేశము ప్రకారము ఆ దూతలు భరతుని వద్దకు బయలుదేరారు. ఆ దూతలు హస్తినాపురము దాటి తరువాత గంగానదిని చేరుకొని, అక్కడి నుండి పశ్చిమంగా ప్రయాణించి పాంచాల దేశము చేరుకొని అక్కడి నుండి శరండా నదిని దాటి కులింగా నగరిని చేరుకున్నారు. అక్కడి నుండి ఇక్షుమతీ నదిని దాటి బాహ్లీక దేశము గుండా సుదామ పర్వతమును చేరుకున్నారు. అక్కడి నుండి విపాసా నదిని దాటి గిరివ్రజపురమును ప్రవేశించారు.

( పైన చెప్పబడిన పట్టణములు, ప్రదేశములు, నదుల పేర్లు ప్రస్తుతము మనకు తెలియక పోవచ్చు. కాని క్రీ.పూ. మన భారత దేశ పటమును చూచినట్టయితే కొన్ని అన్నా కనపడే అవకాశము ఉంది. ఆనాటి మహాకవులు ఇతిహాసములు చెబుతూ నాటి దేశ కాల మాన పరిస్థితులను తరువాతి తరాలకు తెలియజేయడానికి పడే తపన దీనిని బట్టి మనకు అర్థం అవుతుంది. కిష్కింధా కాండలో కూడా సీత ను ఎక్కడెక్కడ వెతకాలో సుగ్రీవుడు వివరించేటప్పుడు నాటి భారతదేశములో ఉన్న ప్రదేశములను పర్వతములను నదులను గురించి  పూర్తిగా వర్ణిస్తాడు.

అలాగే న్యాయ సూత్రముల గురించి కూడా అక్కడక్కడ ప్రస్తావించడం జరిగింది. నాటి ధర్మసూత్రముల ప్రకారము రాజ్యము జ్యేష్టుడికి చెందుతుంది. జ్యేష్ఠుడు రాజ్యమును త్యజించి అడవులకు

వెళ్లిపోతే తరువాతి వాడికి చెందుతుంది. అందుకని నేర్పుగా రాముని అడవులకు పంపింది కైక. అలాగే 14 సంవత్సరములు కాల పరిమితి విధించడం. సాధారణంగా 12 సంవత్సరములు దాటితే ఆస్తి మీద హక్కు పోతుంది. కాని రామాయణ కాలంలో 14 సంఖ్యకు ప్రాధాన్యము ఉంది. అదేమిటో ముందు ముందు మీరు చూస్తారు.

ఇక్కడ యుగ ధర్మం గురించి కూడా మనకు అవగాహన కలుగుతుంది. కృతయుగంలో అంతా సిద్ధంగా ఉంచారు. కేవలం మానవులు ఆ ప్రకారం నడుచుకోవడమే ఆనాటి వారి కర్తవ్యము. కృతము అనగా చేయబడినది అని అర్థం. కాని త్రేతాయుగములో అలా కాదు. వాదమునకు ప్రతి వాదము అమలులో కి వచ్చింది. ఇది లక్ష్మణుని వాదనలో కనపడుతుంది. రాముడు--- రాజు ఏమి చేసినా అది న్యాయమే అవుతుంది. రాజాజ్ఞను శిరసావహించడమే మన విధి-- అని అంటాడు. దానికి ప్రతిగా లక్ష్మణుడు,-- రాజు కామాతురుడై చేసిన నిర్ణయాన్ని ప్రజలు అమలు పరచనవసరం లేదు-- అని వాదిస్తాడు. రాజు మీద తిరుగుబాటుకు ఇది నాంది.

అలాగే దశరథుడు కూడా ఆలోచిస్తాడు. ఒక సందర్భంలో దశరథుడు "నేను అడవులకు వెళ్లమన్నాను. కానీ రాముడు "ఇది అధర్మము, నేను వెళ్లను" అని అనవచ్చు కదా. అలా అంటే నేను కాదంటానా! ఎవరైనా రామునికి ఆ ప్రకారము చెయ్యమని చెప్పవచ్చు కదా" అని అంటాడు.

ఈ నాడు కూడా కొంతమంది ప్రభుత్వాధి కారులు లొసుగులతో కూడిన ఉత్తర్వులను జారీ చేసి, అవతల వారితో "మేము

చేసింది చేసాము, మీరు వెంటనే కోర్టుకు వెళ్లి స్టే తెచ్చుకోండి.” అని అనడం, వారే ఫలానా అడ్వొకేట్ దగ్గరకు వెళ్లమని సలహా ఇవ్వడం, సర్వసాధారణం అయిపోయింది.

పోలీసులు కూడా పై అధికారుల మెప్పుకోసరం  ఎడా పెడా అరెస్టులు చేసి, అలా అరెస్టులు చేసిన వారి పక్షాన పోలీసులే ప్లీడర్లను కూడా  నియమించి అరెస్టులు చేసిన వారికి  బెయిలు ఇప్పిస్తున్నారు.

ఇలాంటివి ముందు ముందు రామాయణంలో మనకు ఎన్నో కనపడతాయి.)

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము అరువది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## అరువది తొమ్మిదవ సర్గ.

అయోధ్యనుండి వచ్చిన దూతలు భరత శత్రుఘ్నులు ఉన్న నగరంలో ప్రవేశించిన రాత్రి, భరతునికి ఒక చెడ్డ కల వచ్చింది. అదీ తెల్లవారు జామున వచ్చింది. మరునాడు భరతుని మనస్సు అంతా వ్యాకులంగా ఉండింది. స్నేహితులతో వినోద సంభాషణలలో పాలుపంచుకోలేక పోయాడు. విదూషకుల హాస్యపు మాటలకు స్పందించడంలేదు. మనసంతా వికలమయింది.

ఇది చూచి ఒక స్నేహితుడు భరతుడు అలా విషాదంగా ఉండటానికి కారణం అడిగాడు. అప్పుడు భరతుడు తన మనసులో మాట ఈ విధంగా చెప్పాడు. "మిత్రమా! ఈ రోజు నాకు ఒక చెడ్డ కల వచ్చింది. నా తండ్రి దశరథుడు ఒళ్లంతా మట్టికొట్టుకొని, వెంట్రుకలు విరబోసుకొని, ఆవు పేడ ఉన్న గుంటలో పడిపోయినట్టు కలవచ్చింది. అలా పడ్డ నా తండ్రి నూనె తాగుతున్నాడు. తరువాత నువ్వులు కలిసిన అన్నం తింటున్నాడు. తరువాత తలవంచుకొని నూనెలో మునిగి పోయాడు. మిత్రమా! ఇంకా నాకు సముద్రము ఎండిపోయినట్టు గానూ, చంద్రుడు నేలమీద పడిపోయినట్టుగానూ, పట్టపగలే చీకట్లు కమ్మినట్టుగానూ. అయోధ్యలో ఉన్న రాజులు ఊరేగే ఏనుగునకు దంతములు విరిగినట్టుగానూ, ప్రతి ఇంట్లోనూ వెలిగే అగ్నులు ఆరిపోయినట్టుగానూ, భూకంపము వచ్చినట్టుగానూ, నాకు కలలో

కనపడింది. మిత్రమా!ఇదే కాకుండా నా తండ్రి ఇనపసింహాసనము మీద నల్లని దుస్తులు ధరించి కూర్చున్నట్టుగానూ, ఆయనను చూచి అందరూ నవ్వుతున్నట్టుగానూ, నా తండ్రి గాడిదలు కట్టిన రథము మీద దక్షిణ దిక్కుగా వెళుతున్నట్టుగానూ కల వచ్చింది.

ఈ స్వప్నములను బట్టి చూస్తే మా కుటుంబములో ఎవరో ఒకరికి మరణము ఆసన్నమయినది అని అర్థం అవుతూ ఉంది. ప్రస్తుతము వృద్ధుడు మా తండ్రి. ఆయన గురించే నాకు చింతగా ఉంది. ఎందుకంటే ఎవరైతే గాడిదలు కట్టిన రథంమీద దక్షిణ దిక్కుగా వెళ్లినట్టు కల వస్తుందో, అతని యొక్క చితి మంటలు త్వరలోనే చూడబడతాయి అని శాస్త్రప్రమాణము. ఎలాంటి దుర్వార్త వినవలసి వస్తుందో అని నా మనస్సులో చాలా ఆందోళనగా ఉంది. మరలా నా తండ్రిని చూస్తానా లేదా అని మనసంతా వ్యాకులంగా ఉంది." అని అన్నాడు భరతుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము అరువది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## డెబ్బదవ సర్గ.

భరతుడు తనకు వచ్చిన కల గురించి తనస్నేహితునికి చెబుతున్న సమయంలో అయోధ్యనుండి వచ్చిన దూతలు భరతుని వద్దకు వచ్చారు. కేకయ రాజును కలుసుకున్నారు. కేకయ రాజు కుమారుడు యుధామన్యుని కలుసుకున్నారు. అయోధ్యనుండి తెచ్చిన కానుకలు వారికి సమర్పించారు. కేకయ రాజు అనుమతితో భరతునితో ఇలా అన్నారు.

"రాజకుమారా! తమ కులగురువు వసిష్ఠుడు, తక్కిన గురువులు తమరి కుశలము అడగమని చెప్పారు. వసిష్ఠుల వారికి నీతో అత్యవసరంగా చర్చించవలసిన అవసరము ఉన్నదట. అందుకని తమరిని వెంటనే అయోధ్యకు బయలుదేరి రమ్మని చెప్పారు. " అని దూతలు వసిష్ఠుడు చెప్పినట్టు చెప్పారు.

భరతుడు ఆ దూతలకు కానుకలు ఇచ్చి సత్కరించాడు. "దూతలారా! నా తండ్రి దశరథుడు క్షేమంగా ఉన్నాడా. నా అన్న రాముడు, లక్ష్మణుడు క్షేమంగా ఉన్నారా! రాముని తల్లి కౌసల్య ఆరోగ్యంగా ఉన్నదా! లక్ష్మణ, శత్రుఘ్నుల తల్లి సుమిత్రాదేవి క్షేమంగా ఉన్నదా! స్వాతిశయము కలదీ, ఎల్లప్పుడూ తన సుఖము మాత్రమే చూచుకొనేదీ, కోపస్వభావము కలదీ,గర్విష్టీ అయిన మా తల్లి కైక

క్షేమంగా ఉన్నదా! మా అమ్మ నాతో చెప్పమని ఏమైనా సమాచారము పంపినదా! ” అని ఆతురతగా అడిగాడు భరతుడు.

ఆ మాటలకు దూతలు ఇలా బదులు చెప్పారు.“రాకుమారా! నీవు ఎవరెవరినీ అయితే అడిగావో వారందరూ క్షేమంగా ఉన్నారు. నిన్ను లక్ష్మీదేవి వరించినది. (నిన్ను రాజ్యలక్ష్మి వరించినది. అయోధ్యకు రాజు కాబోతున్నావు అని నర్మగర్భంగా చెప్పారు). తమరు మాత్రం వెంటనే అయోధ్యకు బయలుదేరండి.” అని అన్నారు.

దూతలు తొందర పెట్టడం చూచిన భరతుడు తన మేనమామ, తాతగారికి నమస్కరించి వారితో ఇలా అన్నాడు.

“మహారాజా! అయోధ్యనుండి నన్నుతీసుకొని పోవుటకు దూతలు వచ్చారు. మా కులగురువు వసిష్టులవారు నన్ను వెంటనే రమ్మన్నారట. అందుకని నాకు అనుమతి ఇస్తే నేను, శత్రుఘ్నుడు అయోధ్యకు వెళతాము. మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాము.” అనికేకయ రాజు అనుమతి కోరాడు భరతుడు.

కేకయ రాజు సంతోషంగా అనుమతించాడు. “నాయనా! భరతా! నీ తండ్రి దశరథుని, నీ తల్లి కైక క్షేమము అడిగినట్టు చెప్పు. పురోహితులు వసిష్ఠునికి, బ్రాహ్మణులకు నా నమస్కారములు తెలియచెయ్యి. నీసోదరులు రామ లక్ష్మణులకు నా ఆశీర్వచనములు తెలియచెయ్యి.” అని పలికాడు.

తరువాత కేకయ రాజు అనేక విలువైన వస్తువులను

కానుకలను అయోధ్యకు పంపాడు. భరత శత్రుఘ్నులకు కూడా విలువైన కానుకలు ఇచ్చాడు. మార్గములో సహాయానికి విశ్వాసము గల సైనికులను పంపాడు.

భరతునికి తనకు వచ్చిన స్వప్నము, ఇప్పుడు దూతలు తొందర పెట్టడం చూచి ఏదో కీడు శంకిస్తున్నాడు. అందుకని తాతగారు, మేనమామ ఇచ్చిన కానుకలు అతనికి సంతోషము కలిగించడం లేదు. భరత శత్రుఘ్నులు రథంఎక్కారు. వారు ఎక్కిన రథము అయోధ్యకు బయలుదేరింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము డెబ్బదియవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## డెబ్బది ఒకటవ సర్గ.

భరత శత్రుఘ్నులు ఎక్కిన రథము అయోధ్య వైపు వేగంగా వెళుతూ ఉంది. శతద్రూనదిని దాటారు. శిలావహనదిని దాటారు. త్రివేణీ సంగమమును సమీపించారు. వీరమత్స్యదేశమును దాటి భారుండ వనమును ప్రవేశించారు. కులింగనదిని, యమునా నదిని దాటారు. అక్కడ కొంచెం సేపు విశ్రమించారు. ప్రాగ్వట పురమును దాటి గంగానదిని సమీపించారు. గంగానదిని దాటి ధర్మవర్ధనము అనే గ్రామమును సమీపించారు. జంబూప్రస్థమును దాటి వరూథమనే గ్రామము చేరుకున్నారు. తరువాత ఉజ్జిహానగరమును, సర్వతీర్థమును, ఉత్తానికా నదిని, కుటికానదిని, కపీవతి నదిని, స్థాణుమతీ నదిని, గోమతీ నదిని దాటారు. కళింగ నగరములో కొంచెము సేపు విశ్రమించారు. తరువాత సాలవనమును దాటారు. ఆ ప్రకారము ఏడు రోజులు అవిశ్రాంతంగా ప్రయాణము చేసి అయోధ్యానగరము చేరుకున్నారు.

ఎల్లప్పుడూ సందడిగా కళ కళ లాడుతూ ఉండే అయోధ్యానగరము కళాహీనంగా ఉంది. భరతునికి ఏం జరిగిందో అర్థం కాలేదు. భరతుడు తన సారథిని చూచి అయోధ్యా నగరము అలా ఎందుకు ఉంది అని అడిగాడు.

"సారథీ! ఎల్లప్పుడూ స్త్రీపురుషుల సంచారముతో సందడిగా ఉండే అయోధ్యానగరము ఇప్పుడు నిశ్శబ్దముగా ఉందేమి? ఎక్కడా రథములు వాహనములు కనపడటం లేదు. ఏమి కారణము? అయోధ్యానగరములోని గృహముల నుండి వాద్యముల గోష్టి మృదు మధురంగా వినపడటం లేదేమి? నాకు చాలా చెడ్డ శకునములు కనపడుతున్నాయి. కాని ఏం జరిగిందో అర్థం కావడం లేదు. నాకు కావలసిన వారికి ఏదో కీడు జరిగి ఉంటుంది అని నా మనసుకు తడుతూ ఉంది. నీ కేమైనా తెలుసా!" అని అడిగాడు భరతుడు.

సారథి మాట్లాడలేదు. భరత శత్రుఘ్నులు అయోధ్యలోకి ప్రవేశించారు. మరలా సారథిని చూచి భరతుడు ఇలా అన్నాడు.

"ఓ సారథీ! అసలు నన్ను ఇంత తొందరగా ఎందుకు పిలిపించారు. నా మనస్సు ఏదో కీడు శంకిస్తూ ఉంది. ఎందుకంటే పూర్వము రాజులు మరణించినపుడు ఎలాంటి శకునములు, గుర్తులు కనపడతాయో అవన్నీ నాకు గోచరమవుతున్నాయి. అదీ కాకుండా అయోధ్యలో వీధులు దుమ్ముకొట్టుకొని ఉన్నాయి. ఎవరూ శుభ్రం చేస్తున్నట్టులేదు. దేవాలయములలో పూజలు వేదఘోషలు వినపడటం లేదు. ఎక్కడా పూలు అమ్ముతున్న ఛాయలు లేవు. యజ్ఞములు చేస్తున్నట్టు అగ్నిధూమములు కనిపించడం లేదు. వ్యాపార సంస్థలు అన్నీ మూసి ఉన్నాయి. ఏమి కారణము. నీకేమైనా తెలుసా!" అని అడిగాడు.

సారథి మౌనంగా ఉన్నాడు. భరతుడు రాజభవనంలోకి

ప్రవేశించాడు. రాజభవనం కూడా నిర్మానుష్యంగా ఉంది. పరిచారకుల సందడి కూడా లేదు. భరతుడు లోపలకు వెళుతున్నాడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము డెబ్బది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### డెబ్బది రెండవ సర్గ.

భరతుడు అలా ఆలోచిస్తూ తన తండ్రి దశరథుని మందిరములో ప్రవేశించాడు. అక్కడ దశరథుడు కనిపించలేదు. వెంటనే తన తల్లి కైక మందిరమునకు వెళ్లాడు. కొడుకును చూడగానే కైక మనస్సు సంతోషంతో నిండిపోయింది. కొడుకుకు ఎదురువెళ్లింది. భరతుడు తల్లి కైక పాదములకు నమస్కరించాడు. కైక భరతుని లేవదీసి నుదుటిన ముద్దు పెట్టుకొని తన పక్కన కూర్చుండబెట్టుకొంది.

"నాయనా భరతా! నీ ప్రయాణము బాగా సాగిందా! తాతగారి ఇంట్లో ఎప్పుడు బయలుదేరావు. మార్గములో ఆయాసము కలగలేదు కదా! మీ తాతగారు, మేనమామ అంతా క్షేమంగా ఉన్నారా! ఇంకా కేకయ దేశపు విశేషములు ఏమిటి వివరంగా చెప్పు." అని ఆతురతగా అడిగింది కైక.

భరతుడు తల్లి అడిగిన ప్రశ్నలకు అన్నిటికీ సమాధానాలు చెప్పాడు.

"అమ్మా! నేను తాతగారి ఇంటి నుండి బయలుదేరి ఏడుదినములు అయింది. అక్కడ తాతగారూ, మామయ్య అంతా క్షేమంగా ఉన్నారు. వారు మీకు, తండ్రి గారికీ, పంపిన కానుకలు వెనుక

తీసుకొని వస్తున్నారు. అమ్మా! అయోధ్యలో ప్రవేశించినప్పటి నుండి నా మనస్సులో కొన్ని ప్రశ్నలు తలెత్తాయి. వాటికి సమాధానాలు చెబుతావా అమ్మా!" అని అడిగాడు భరతుడు. కైక మాట్లాడలేదు. మౌనంగా ఉంది. భరతుడు ఇలాఅడిగాడు.

"అమ్మా! నాన్న గారు ప్రతిరోజూ పడుకొనే బంగారు శయ్యమీద నాన్న గారు లేరు. కారణమేమి? ఈ మందిరములో పరిజనులందరి మొహంలో చింత, శోకము, ప్రస్ఫుటంగా కనపడుతూ ఉంది. కారణమేమి? దశరథ మహారాజు గారు ఎక్కువ సమయము నీ అంత:పురములోనే గడుపుతారు కదా! మరి ఇప్పుడు ఆయన నీ అంత:పురములో కనిపించడం లేదు. ఎందుకనీ? నేను చాలా రోజుల తరువాత వచ్చాను. నాన్న గారికి పాదాభి వందనము చేసి ఆయన ఆశీర్వాదము తీసుకొనవలెనని చాలా ఆతురతగా ఉన్నాను. ఆయన ఎక్కడ ఉన్నారు. నీ మందిరములో లేరు. కౌసల్య మందిరములో ఉన్నారా! చెప్పమ్మా! నేను నాన్నగారు ఎక్కడ ఉంటే అక్కడకు వెళ్లాలి."అని గుచ్చి గుచ్చి అడిగాడు.

ఇంక కైక తప్పించుకోలేక పోయింది. కాని నర్మగర్భంగా చెప్పసాగింది. "కుమారా భరతా! నీ తండ్రిగారు సాధారణంగా అన్ని జీవులు ఏ గతి పొందుతాయో అదే గతిని పొందారు." అని చెప్పింది.

భరతునికి అర్థం అయింది. తండ్రి మరణవార్త విని అలాగే కుప్పకూలిపోయాడు భరతుడు. అతనికి నోటమాట రాలేదు. దు:ఖంతో కుమిలిపోతున్నాడు. కైక భరతుని వద్దకు వచ్చి అతనిని లేపి పక్కన

ఉన్న ఆసనము మీద కూర్చోపెట్టింది.

“భరతా! అదేమిటి అలా పడిపోయావు. నీ వంటి రాకుమారులు, కాబోయే మహారాజులు ఇలా దిగులు చెందవచ్చునా! నీ శోకము మాను.” అని ఊరడించింది కైక.

కాని భరతునికి శోకము ఆగలేదు. పెద్దగా ఏడుస్తున్నాడు.

“అమ్మా! వసిష్ఠులవారు శీఘ్రముగా రమ్మన్నారు అంటే రామునికి పట్టాభిషేకమునకు సుముహూర్తము నిశ్చయించినారేమో అనుకున్నాను. కాని ఇంతటి దుర్వార్త వినవలసి వస్తుందని అనుకోలేదు. అమ్మా! ఇంత హటాత్తుగా తండ్రిగారు చనిపోవుటకు కారణమేమి! ఏమైనా వ్యాధి సోకినదా! తండ్రిగారి అవసాన కాలములో దగ్గర ఉండి ఆయన అంత్యక్రియము జరిపించిన రాముడు ధన్యుడు. ఆ భాగ్యమునకు నేను నోచుకోలేదు. నేను వచ్చాను అని తెలియగానే నాకు ఎదురు వచ్చి నా శరీరమును అంతా నిమిరి, నా  శిరమును ఆఘ్రాణించు తండ్రిగారు  కనపడనప్పుడే అనుకున్నాను. ఇలాంటిది ఏదో జరిగి ఉంటుందని. నా తండ్రిగారి చేతి స్పర్శ అనుభవించు భాగ్యము ఈ జన్మకు లేదు కదా!

అమ్మా తండ్రి గారి తరువాత తండ్రి అంతటివాడు రాముడు. ఆయన నాకు అన్నగారే కాదు, తల్లి, తండ్రి, గురువు, దైవము. రామునికి నా రాక గురించి తెలపండి. నా తండ్రికి బదులు నా అన్నగారి పాదాలు పట్టుకొని ఆశీర్వాదము తీసుకుంటాను. రాముడు నన్ను ఆశీర్వదిస్తే నా తండ్రి ఆశీర్వదించినట్టే! అమ్మా! తండ్రిగారి మరణసమయములో నేను

దగ్గర లేను కదా! నాతో చెప్పమని ఏమైనా చెప్పాడా అమ్మా! చెప్పమ్మా! నా తండ్రి గారి మాటలు యథాతథంగా చెప్పమ్మా!" అని కైకను ప్రార్థించాడు భరతుడు.

కైక జరిగింది చెప్పసాగింది. "కుమారా! నీ తండ్రి దశరథ మహారాజు తన ఆఖరి ఘడియలలో హా రామా! హా లక్ష్మణా! హా సీతా! అని వారిని తల్చుకుంటూ ప్రాణాలు వదిలాడు. ఇంకా ఇలా అన్నాడు. "రాముడు సీతతో లక్ష్మణునితో అయోధ్యకు తిరిగి వచ్చినపుడు చూచిన వారు ధన్యులు కదా!"అని అన్నాడు.

భరతునికి అనుమానం కలిగింది. "అమ్మా! రాముడు, లక్ష్మణుడు, సీత ఎక్కడకు వెళ్లారు. ఎందుకు వెళ్లారు? ఎప్పుడు వస్తారు." అని అడిగాడు భరతుడు.

తాను చెప్పబోవు సంగతులు భరతునికి సంతోషము కలిగిస్తాయి అనే భ్రమలో జరిగింది జరిగినట్టు చెప్పసాగింది కైక.

"కుమారా భరతా! నీ అన్న రాముడు నార చీరలు ధరించి భార్యాసమేతుడై, లక్ష్మణుని వెంటబెట్టుకొని అరణ్యములకు వెళ్లాడు." అని చెప్పింది.

భరతుడు ఆశ్చర్యపోయాడు. ధర్మము తప్ప మరొకటి తెలియని రాముడు ఏ తప్పుచేసాడని రాజ్యము నుండి వెడలి పోయాడు అని ఆలోచించాడు. తల్లి కైకను ఇలా అడిగాడు.

"అమ్మా! రాముడు ఏమి తప్పు చేసాడని రాజ్యమునుండి వెడలగొట్టబడ్డాడు. రాముడు బ్రాహ్మణుల సొత్తును దొంగిలించాడా! రాముడు ఎవరి నైనా నిరపరాధిని దండించాడా! లేక రాముడు ఇతర స్త్రీలను, ఇతరుల భార్యలను కామవాంఛతో కోరుకున్నాడా. లేక ఏమైనా భ్రూణ హత్య లాంటిది చేసాడా! రాముడు ఏ అపరాధమూ చెయ్యకుండా రాజ్యమునుండి ఎందుకు అరణ్యములకు పంపబడ్డాడు." అని నిలదీసాడు భరతుడు.

ఇంక చెప్పక తప్పదని అసలు విషయాన్ని చెప్పసాగింది కైక.

"రాకుమారా! రాముడు నీవు చెప్పిన ఏ పాపమూ చెయ్యలేదు. నీ తండ్రి దశరథుడు రామునికి పట్టాభిషేకము చేయుటకు ముహూర్తము నిశ్చయించాడు. ఆ విషయమును విన్న నేను ఆందోళనపడ్డాను. వెంటనే నీ తండ్రి వద్దకు పోయి, నీకు యౌవరాజ్యము పట్టాభిషేకము చేయమనీ, రాముని పదునాలుగేళ్లు అరణ్యములకు పంపమని కోరాను. నీ తండ్రి నాకు ఇదివరలో ఇచ్చిన వరములను సఫలము చేయుటకు రాముని అరణ్యములకు పంపాడు. రాముని వెంట సీత, లక్ష్మణుడు కూడా వెళ్లారు. రాముడు అరణ్యములకు పోవడంతో నీ తండ్రి దిగులుతో రాముని ఇంక చూడలేనేమోనని చింతతో మరణించాడు.

నాయనా భరతా! ఇదంతా నేను నీ కోసమే, నీ మేలు కోరి, నీ భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని చేసాను. కాబట్టి వెంటనే నీవు రాజ్యాభిషిక్తుడివికా! ఈ తల్లి కోర్కె నెరవేర్చు. నీ తండ్రి మాట ప్రకారము రాముడు అడవులకు వెళ్లాడు. నా మాట ప్రకారము నీవు

పట్టాభిషిక్తుడివి కా! కాబోయే మహారాజువు. నీవు దిగులు పడకూడదు. ధైర్యంగా ఉండు. ఇప్పుడు నీకు దాయాదుల బాధ లేదు. నీ ఇష్టం వచ్చినట్టు అయోధ్యను పాలించు. నీవు వెంటనే వసిష్ఠుని కలిసి, నీ తండ్రికి శాస్త్రోక్తంగా అంత్య క్రియలు నిర్వర్తించి, తరువాత రాజ్యాభిషిక్తుడివి కా! " అని పలికింది కైక.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము డెబ్బది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

డెబ్బది మూడవ సర్గ.

తన తల్లి కైక ఎంతో సంతోషంతో చెప్పిన మాటలు విన్న భరతుడు కోపంతో ఊగిపోయాడు. కాని ఎదురుగా ఉన్నది కన్నతల్లి. అందుకని తనకోపాన్ని బలవంతాన అణుచుకున్నాడు. కైకతో ఇలా అన్నాడు.

“అమ్మా! నా తండ్రి అకాల మరణం చెందాడు. నా సోదరులు అడవుల పాలయ్యారు. ఇంకా నాకు ఎందుకమ్మా ఈ రాజ్యము. అమ్మా! నా అన్న రాముడు అరణ్యానికి పోవుటకు, రాముని మీద ప్రేమతో నా తండ్రి మరణించుటకు నీవా కారణము? మా వంశమునకు అగ్నిలాగా దాపురించి కాల్చివేసావు కదమ్మా! ఈ విషయం తెలియక నా తండ్రి నిన్ను ఎంతో ఆదరించాడు కదా అమ్మా! నీ పాపముతో కూడిన ఆలోచనలకు నా తండ్రిని బలితీసుకున్నావు. నీ వలన మా ఇక్ష్వాకు వంశమే అపవిత్రమయింది. మా అందరికీ సుఖసంతోషాలు దూరం చేసావు. నీవు చేసిన అనాలోచితపు పని వలన నా తండ్రి మరణించాడు.

చెప్పమ్మా! ఇదంతా ఎందుకు చేసావు? రాముని ఎందుకు అడవులకు పంపావు? నా తండ్రిని ఎందుకు చంపావు? ఇంతా చేసిన దానివి కౌసల్యను సుమిత్రను బతుకనిస్తావా! వాళ్లకు కూడా నీ చేతిలో మరణం తథ్యం. అమ్మా! రాముడు నిన్ను తన కన్నతల్లి కౌసల్య కంటే ఎక్కువగా గౌరవించాడు కదమ్మా! మా పెద్దమ్మ కౌసల్య కూడా నిన్ను తన సహోదరి కంటే ఎక్కువగా ఆదరించింది కదమ్మా! అటువంటి రామునికి నారచీరలు కట్టి అడవులకు ఎలా పంపగలిగావు. కౌసల్యకు పుత్రశోకము ఎందుకు కలుగజేసావు? ఎవరి కోసం చేసావు ఇదంతా? ఇంత చేసికూడా సంతోషంగా ఎలా ఉండగలుగుతున్నావు? నీవు మనిషివేనా లేక బండరాయివా!

అమ్మా! నేను, నీ కుమారుడు భరతుని, అడుగుతున్నాను. రాముని అరణ్యములకు పంపుటకు కారణమేమి? నాకురాజ్యము కట్టబెట్టడానికేనా! నాకు రాముని మీద ఉన్న భక్తి గౌరవము తెలిసే ఈ పని చేసావా? రాముడు లేకుండా ఈ రాజ్యభారం వహించే శక్తి నాకు ఉందనుకుంటున్నావా! నీకు తెలుసో లేదో! నా తండ్రి దశరథుడు కూడా తన వృద్ధాప్యంలో రాముని సహాయంతోనే ఈ రాజ్యాన్ని పరిపాలించాడు. అటువంటిది, రాముడు లేకుండా, నేను ఈ రాజ్యభారమును ఎలా మోయగలను అనుకున్నావు? ఒక వేళ నేను నా శాయశక్తులా ప్రయత్నించి ఈ రాజ్యభారమును మోయగలనేమో గానీ, నీ కోరిక మాత్రము తీర్చను. నీ కొడుకు మీద ఉన్న అతి ప్రేమతో ఇదంతా చేసావు కాబట్టి నీ కోరిక ఎంత మాత్రమూ తీరదు.

అసలు నీవు నా తల్లివే కాదు. నిన్ను ఈక్షణముననే విడిచిపెడదామనుకుంటున్నాను. కానీ, రాముడు నిన్ను తన కన్న తల్లి

కంటే ఎక్కువ ప్రేమతో చూచుకొనే వాడు. అందుకని ఆ పని చేయలేకపోతున్నాను.

అమ్మా! నాకు తెలియక అడుగుతాను! నీవు ఈ పని చేసేటప్పుడు కొంచెం ఆలోచించావా! దీని వలననీకు ఎంత అపకీర్తి వస్తుందో, మన వంశప్రతిష్ఠకు ఎంత భంగం వాటిల్లుతుందో ఒక్క క్షణమైనా ఆలోచించావా! అసలు నీకు ఈ బుద్ధి ఎలా పుట్టింది. నీకే పుట్టిందా లేక ఎవరి ప్రోద్బలముతోనన్నా ఇంతటి ఘోరానికి ఒడిగట్టావా! నీకు రాజధర్మము, మా వంశాచారము తెలిసే ఈ పని చేసావా!

మా వంశాచారము ప్రకారము కొడుకులు అందరిలోకీ పెద్దవాడు రాజ్యభారము వహిస్తే, మిగిలిన వారు అన్నగారిని భక్తితో సేవిస్తారు. ఈ మాత్రం నీకు తెలియదా లేక నీకు మా వంశాచారము మీద, రాజ ధర్మము మీద గౌరవము లేదా!

అమ్మా! ఇప్పుడు చెబుతున్నాను విను. మా ఇక్ష్వాకు వంశంలో, అందరిలోకీ పెద్దవాడు రాజ్యాభిషిక్తుడు అవుతాడు. ఇది మా కుల ధర్మము. మా ఇక్ష్వాకు వంశరాజులందరూ పాటిస్తున్న ఆచారము. ధర్మాచరణములో మా ఇక్ష్వాకు వంశీయులు ఎల్లప్పుడూ ముందుం టారు. ఈ నాడు నీవు మా రాజధర్మానికి చేటుతెచ్చావు. నీ పుత్ర వ్యామోహంతో మా వంశములోని రాజులందరికీ అపకీర్తి తెచ్చావు. అందుకని నేను మా ఇక్ష్వాకురాజధర్మము తప్పి ప్రవర్తించను. ఈ రాజ్యము నాకు అక్కరలేదు. ప్రాణత్యాగము అయినా చేస్తాను కానీ నీ కోరిక నెరవేర్చను. నేను ఇప్పుడే రాముని వద్దకు పోయి ఆయనను

ప్రార్థించి వెనుకకు తీసుకొని వస్తాను. రాజ్యాభిషిక్తుని చేస్తాను. నేను రామునికి దాసునిగా ఉంటాను. నీకు ఇష్టంఉన్నా, లేకపోయినా ఇదే నా నిశ్చయము."అని ఆవేశంతో అన్నాడు భరతుడు.

భరతుని ఆవేశం చల్లారింది. తండ్రి మరణం గుర్తుకు వచ్చింది. ఆ దు:ఖము తట్టుకోలేక బిగ్గరగా ఏడవడం మొదలెట్టాడు భరతుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము డెబ్బదిమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## డెబ్బది నాల్గవ సర్గ.

తన కొడుకు భరతుడు ఎంత దూషించినా కైక మారు పలక లేదు. మౌనంగా ఉంది. భరతుడు తండ్రి మరణాన్ని తలచుకొని తలచుకొని ఏడుస్తున్నాడు. తన తండ్రి మరణానికి కారణం తన తల్లి కైక అని గుర్తుకు తెచ్చుకున్నాడు భరతుడు. తల్లి వంక తీక్షణంగా చూచాడు.

"అమ్మా! నీవు తండ్రి గారినే కాదు నన్ను కూడా మరణించేట్టు చేసావు. అమ్మా నేను మరణించిన తరువాత నా శవాన్ని, ఈ రాజ్యాన్ని చూచుకుంటూ తీరిగ్గా ఏడుద్దువుగానీ. ఏమ్మా! నీ కొడుకు మరణిస్తే నీకు దు:ఖం వచ్చిందా! ఏ పాపమూ ఎరుగని రాముని అరణ్యాలకు పంపినపుడు ఈ దు:ఖము ఏమయింది? నీ వలన నా తండ్రి అకాల మరణము పొందినపుడు ఈ దు:ఖము ఏమయింది? నీకు ఏమి అపకారము చేసాడని నా రాముని అడవులకు వెళ్లమని చెప్పావు?

నీవు చేసినపాపాలకు నీకు నరకమే సరి అయిన గతి. స్వర్గములో నీకు, భార్యగా నా తండ్రి పక్కన ఉండే అర్హత నీకు లేదు. అమ్మా! ఈతుచ్ఛమైన రాజ్యము కోసరం నీవు చేసిన పనులు చూస్తుంటే నాకే భయం వేస్తోంది. రేపు నన్నుకూడా ఏమైనా చేస్తావేమో అని భయపడుతున్నాను. నా రాముని అడవులకు పంపినది నీవే అయినా, నా తండ్రిమరణానికి కారణం నీవే అయినా, నేనే రాజ్యం

కోసరం ఇదంతా చేయించానని నాకు శాశ్వత అపకీర్తి అంటగట్టావు. తల్లి తన కుమారుని క్షేమం కోరుతుంది. నీవు మాత్రం నా నాశనాన్ని కోరావు. నువ్వు నా తల్లివి కావు. నావు శత్రువుతో సమానము. భర్త మరణానికి కారకురాలవైన నీ వంటి క్రూరురాలను నా తల్లి అని చెప్పుకోడానికి నాకు సిగ్గుగా ఉంది. నీ మూలంగా కౌసల్యకు, సుమిత్రకు కూడా చెడ్డ పేరు వచ్చింది.

నీవు ఇక్ష్వాకు వంశమునకే కాదు నీ తండ్రి అశ్వపతి వంశమునకు కూడా అపకీర్తి తెచ్చిపెట్టావు. మా తాత గారి వంశములో పుట్టిన రాక్షసివి. నీవు చేసిన పాపపు పనులకు నాకు పితృవియోగము, సోదరుల వియోగము కలిగాయి. ఇన్ని పాపములు చేసిన నీకు నరకము కూడా సరి అయినది కాదు. నీకు మరొక పాపలోకము సృష్టింపబడవలెను.

అమ్మా! నీకు రాముని సంగతీ, నా తండ్రి దశరథుని సంగతీ తెలియదా! వారు ధర్మము తప్పని వారనీ, ఆడి తప్పని వారనీ తెలియదా! వారికి ఇంత ద్రోహం ఎలా చేసావమ్మా! నేను నీ కన్న కొడుకును. నీ శరీరం నాకు పంచి ఇచ్చావు. మరి నాకు ఈ పితృవియోగము, భ్రాతృవియోగము ఎందుకు కలిగించావమ్మా! తల్లి ప్రేమ గురించి నీకు తెలుసో లేదో నేను చెబుతాను విను

....పూర్వము ఒక సారి కామధేనువు తన సంతతిలో పుట్టిన పుత్రులు (కోడె దూడలు) భూమిని దున్నుతూ సొమ్మసిలి పడిపోవడం చూచిందట. అలా పడిపోయిన దూడలను చూచి కామధేనువు ఏడ్చిందట. ఆ కామధేనువు కంటి నీరు దేవేంద్రుని మీద పడినవట. ఆ

కంటినీరు కామధేనువువి అని అనుకున్నాడు దేవేంద్రుడు. వెంటనే దేవేంద్రుడు కామధేనువు దగ్గరకు వెళ్లాడట. ఇంద్రుని చూచి కామధేనువు ఆయనకు నమస్కరించి ఇలా అంది.

"దేవేంద్రా! నా పుత్రులు అయిన ఈ వృషభములు కష్టించి పనిచేస్తూ సొమ్మసిలి పడిపోయాయి. కాని దయజాలి లేని ఆ రైతు వాటిని కర్రతో కొడుతూ తోక మెలితిప్పుతూ బాధపెడుతున్నాడు. నా కుమారుల దుస్థితి చూచి నాకు కన్నీళ్లు వచ్చాయి. బరువుమోయలేక పడిపోయిన ఆ ఎద్దులు నా శరీరము పంచుకొని పుట్టాయి. ఎవరికైనా పుత్రులను మించిన ప్రియమైన వస్తువు వేరే ఉండదు కదా!" అని పలికింది కామధేనువు.

అమ్మా! ఈ లోకంలో ఉన్న కోటాను కోట్ల ధేనువులు అన్నీ కామధేనువు పుత్రులే. కానీ, కేవలం రెండు ఎద్దులు బాధపడుతుంటే తట్టుకోలేక కన్నీరు కార్చింది ఆ కామధేనువు. అటువంటిది లేక లేక కలిగిన  కన్నకొడుకులను పోగొట్టుకున్న ఆ కౌసల్య, సుమిత్ర నిరంతరమూ కార్చే కన్నీరు నీకు కనపడలేదా అమ్మా! వారి దు:ఖము నీ మనసును కదిలించలేదా?

అమ్మా! కన్నకొడుకులను కన్నతల్లికి దూరం చేసిన వారికి ఏ పాపం చుట్టకుంటుందో ఆ పాపం నీకు కూడా చుట్టుకుంటుంది. నేను వెంటనే నీవు చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తము చేసుకుంటాను. నేను వెంటనే రాముని వద్దకు పోయి ఆయనను అయోధ్యకు తీసుకొని వస్తాను. రామునికి బదులుగా నేను మునివేషము ధరించి అడవులకు పోతాను. అప్పుడు పుత్రవియోగంతో నీవు చేసిన పాపానికి

ఫలితం అనుభవిస్తావు. లేకపోతే నీవు కూడా నా వెంట అరణ్యములకు రా! అదీ కాకపోతే ఆత్మహత్యచేసుకొని మరణించు. ఇదితప్ప నీకు వేరుమార్గము లేదు. రాముని తిరిగి రాజ్యాభిషిక్తుని చేస్తేగానీ నీవు చేసిన పాపానికి ప్రాయశ్చిత్తము కలుగదు." అని కోపంతో ఊగి పోతూ తల్లి కైకను శతవిధాలా దూషించాడు భరతుడు. ఆయాసం వచ్చి నేలమీద కూలబడి పోయాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము డెబ్బదినాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### డెబ్బది ఐదవ సర్గ.

పుత్ర వ్యామోహం ఇంత చేటు తెస్తుందని కలలోనైనా తలపని కైక, తన కొడుకు కోసరం ఇదంతా చేసింది. అపకీర్తి పాలయింది కైక. కాని తనకొడుకు భరతుడు తననే నిందిస్తున్నాడు. శాపాలు పెడుతున్నాడు. తన తల్లివే కాదు పొమ్మన్నాడు. ఈ మాటలు విని కైక కుమిలిపోతోంది. నోట మాట రావడం లేదు. నేల మీద పడి ఉన్న కొడుకు భరతుని నిస్సహాయంగా చూస్తూ ఉంది.

ఇంతలో భరతుడు లేచాడు. భరతుని రాకను విని అమాత్యులు అందరూ అక్కడకు చేరుకున్నారు. కాబోయే మహారాజు భరతుడు నేలమీద పడి ఉన్నాడు. వాళ్లకు ఏం చెయ్యాలో తోచడం లేదు. అలా చూస్తూ ఉన్నారు. ఇంతలో భరతుడు తల పైకి ఎత్తి అమాత్యులను చూచాడు. భరతునికి ఒక అనుమానం పట్టుకొంది. రాముడు అరణ్యములకు వెళితే, తన తండ్రి మరణిస్తే, తానే రాజు అవుతాడు. ఈ చర్యల వల్ల లబ్ధి పొందేది తను. అమాత్యులు తానే ఇదంతా తన తల్లి కైక తో చేయించానని అపోహ పడే అవకాశం ఉంది. తనకు ఏమీ తెలియదు అనీ, తాను అమాయకుడననీ అందరికీ తెలియజేయాల్సిన బాధ్యత తన మీద ఉందని గుర్తించాడు భరతుడు. అందుకే అమాత్యులతో బిగ్గరగా ఇలా అన్నాడు.

"అందరూ వినండి. నేను ఇప్పటిదాకా మా తాతగారి ఇంట్లో ఉన్నాను. ఇప్పుడే అయోధ్యకు వచ్చాను. ఇక్కడ జరిగిన పరిణామాలు ఏవీ నాకు తెలియవు. నేను చాలా దూరంలో ఉన్నాను కాబట్టి తెలిసే అవకాశం కూడా లేదు. అందరికీ తెలియజేసేది ఏమంటే నాకు అయోధ్యకు రాజు కావాలని కోరిక లేదు. అలా అని నేను ఎవరినీ కోరలేదు. నా తల్లి కైక కూడా నాతో ఈ విషయం ఎప్పుడూ చర్చించ లేదు. రాముడు వనవాసము వెళ్లినట్టుగానీ, వారిని సీత, లక్ష్మణుడు అనుసరించినట్టుగానీ నాకు ఏ మాత్రం తెలియదు. వారు ఏ కారణం చేత అడవులకు వెళ్లారో కూడా నాకు తెలియదు. ఇది నిజం." అని బిగ్గరగా అరిచాడు.

భరతుని కంఠస్వరమును విన్నది కౌసల్య. సుమిత్రను పిలిచింది. "సుమిత్రా! అది భరతుని కంఠస్వరము కదూ! భరతుడు తన మేనమామ ఇంటినుండి వచ్చినట్టున్నాడు. పద. వెళ్లి భరతుని పలకరించి వద్దాము." అని అంది కౌసల్య. కౌసల్య సుమిత్రలు భరతుని చూడ్డానికి బయలుదేరారు. ఇంతలో భరతుడు, శత్రుఘ్నునితో కలిసి కౌసల్య మందిరము వైపువస్తున్నాడు.

భరతుని చూచినకౌసల్యకు దు:ఖము ఆగలేదు. ఏడుస్తూ భరతుని పొదిపట్టుకొంది. గట్టిగా కౌగలించుకొని ఏడుస్తూ ఉంది. "నాయనా భరతా! నీవు రాజ్యము కావాలని కోరుకున్నావు. నీకు అన్నదమ్ముల బాధ కానీ దాయాదుల బాధ కానీ లేని రాజ్యము లభించింది. నీ తల్లి కైక చేసిన దుశ్చర్యల వలన నీకు రాజ్యప్రాప్తి సులభంగా కలిగింది. కైక తన కొడుక్కు రాజ్యము కావాలని కోరుకోడంలో తప్పులేదు. కానీ నా కొడుకును నార చీరలుకట్టించి

అడవులకు పంపడం దేనికి? దాని వలన ఆమెకు కలిగే ప్రయోజనము ఏమి? అంతకన్నా నన్ను కూడా రామునితో పాటు అడవులకు పంపాలి అని ఆమె కోరుకొని ఉంటే బాగుండేది. ఆమె కోరుకున్నా కోరుకోక పోయినా నేను, సుమిత్రా, మా కుమారుల వద్దకు వెళ్లడానికి నిశ్చయించుకున్నాము. నీ అనుమతి కోసరం ఎదురుచూస్తున్నాము. నీకు మామీద దయ ఉంటే మమ్ములను రాముడు ఉన్నచోటికి తీసుకొని వెళ్లు. ఇదే మేము నిన్ను కోరేది." అని భరతుని సూదుల వంటి మాటలతో బాధపెట్టింది కౌసల్య.

ఆ మాటలకు చలించిపోయాడు భరతుడు. తనకు ఏ పాపమూ తెలియకపోయినా అంతా తనకు తెలిసే జరిగిందని అంతా అనుకుంటున్నారు. తుదకు కౌసల్యకూడా ఆ ప్రకారము మాట్లాడింది. ఏం చెయ్యాలో తోచక భరతుడు అలాగే కిందికి జారిపోయాడు. గట్టిగా కౌసల్య కాళ్లు పట్టుకున్నాడు. భోరునవిలపిస్తున్నాడు. కౌసల్యముందు చేతులు జోడించి మోకాళ్ల మీద నిలబడ్డాడు. ఆమెతోఇలా అన్నాడు.

"అమ్మా! నా సంగతి నీకు తెలియదా. రాముడు అంటే నాకు ఎంత ప్రేమా భక్తి ఉందో నీకు తెలియదా. ఎందుకమ్మా నువ్వు కూడా నన్ను నిందిస్తావు. నా అన్న రాముని అరణ్యములకుపంపిన వారికి ధర్మశాస్త్రము గురించి ఏమీ తెలియదు. వారి బుద్ధి చెడిపోయినది.

అమ్మా! నాకు తెలిసీ, నేను రాముని అడవులకుపంపడానికి సమ్మతించినట్టయితే నేను నిద్రించుచున్న గోవును కాలితో తన్నిన పాపమును, సూర్యుని ఎదురుగా మలమూత్రవిసర్జన చేసిన పాపమును, పాపాత్ములను సేవించిన పాపమును పొందుతాను.

అమ్మా! నేనే కనక రాముని అడవులకు పంపినట్టయితే నేను పనివాళ్ల చేత పనిచేయించుకొని వారికి పారితోషికము ఇవ్వని పాపమున పోతాను.

రాముడు అడవులకు పోవడం నాకు తెలిసీ నేను ఊరకుంటే నేను రాజద్రోహము చేసిన పాపమున పోతాను.

నేను కనక రాముడు అడవులకు పోవడానికి సమ్మతి తెలియజేసినట్టయితే నేను ప్రజల నుండీ పన్నులు వసూలు చేస్తూ ప్రజలకు ఎలాంటి రక్షణ కల్పించని పాపమున పోతాను.

(ప్రస్తుత రాజకీయ నాయకులందరూ ఇదే పాపం చేస్తున్నారు.)

అమ్మా! నేను కనక రాముని అరణ్యములకో పోవుటకు నా సమ్మతి తెలిపినట్టయితే నేను యాగము చేయించుకున్న తరువాత ఋత్విక్కులకు బ్రాహ్మణులకు దక్షిణలు ఇవ్వకుండా ఎగ్గొట్టిన పాపాన పోతాను.

నేను కనక నా అన్న రాముని అరణ్యవాసమునకు కారణము అయితే నేను యుద్ధములో పారిపోయి వచ్చిన వాడు పొందే పాపమును, పెద్దలను అవమానించిన పాపమును, వేదాధ్యయనము చెయ్యని పాపమును, మిత్రద్రోహము చేసిన పాపమును, భార్యాబిడ్డలకు, బంధువులకుపెట్టకుండా నేనొక్కడినే మృష్టాన్నమును భుజించిన పాపమును, సంతానము కలుగని వాడు పొందే పాపమును, రాజును, స్త్రీలను, బాలురను వృద్ధులను చంపిన

పాపమును, తాను పోషించ వలసిన వారిని పోషించకుండా వదిలివేసిన పాపమును, అక్రమ వ్యాపారములను చేసిన వాడు పొందే పాపమును, ఇతరుల ఇండ్లు తగలపెట్టిన వాడు పొందే పాపమును, ఉదయమూ, సాయంత్రమూ నిద్రించేవాడు పొందే పాపమును, గురువుగారి భార్యను కామించే వాడు పొందే పాపమును, దేవతలను ఆరాధించని వాడు, తల్లితండ్రులకు సేవచేయని వాడు పొందే పాపమును, క్రూరపు పనులు చేయుచూ, అబద్ధాలు ఆడుతూ, అపవిత్రంగా, అధర్మంగా, అందరికీ భయపడుతూ దొంగవలె బతికేవాడు పొందే పాపమును, కట్టుకున్న భార్యను వదిలి, పరస్త్రీల వెంట తిరిగేవాడు పొందే పాపమును, తాగే నీరు పాడుచేసేవాడు, ఇతరులకు విషం ఇచ్చేవాడు పొందే పాపమును, సిద్ధంగా ఉన్న పూజను పాడుచేసేవాడు పొందేపాపమును, దూడకు కూడా మిగల్చకుండా ఆవునుండి పాలు అన్నీపితికేవాడు పొందే పాపమును, నా దగ్గర జలం ఉండీ, దప్పికతో ఉన్న వారికి జలం ఇవ్వని వాడు పొందే పాపమును, ఇద్దరు కొట్టుకుంటుంటే వారిని విడదీయకుండా వినోదంగా చూచేవాడు పొందే పాపమును, పొందుతాను.

అమ్మా! నేను కనక రాముని అడవులకు పంపడానికి అనుమతి ఇచ్చినట్టు నీవు భావిస్తే నేను ప్రజలందరిచేతా అందరికీ అపకారము చేసేవాడి గానూ, కృతఘ్నుడు గానూ, ఆత్మహత్యాసదృశు డుగానూ, సిగ్గులేని వాడిగానూ అవమానింపబడతాను. నేను మీ అందరి శాపములు తగిలి బిచ్చము ఎత్తుకొంటూ పిచ్చివాని వలె బతుకుతాను. నిత్యమూ మద్యము సేవిస్తూ స్త్రీలతో క్రీడిస్తూ, పాపములు చేస్తూ బతుకుతాను. ధర్మభ్రష్టుడిని, సత్కర్మ భ్రష్టుడిని అయిపోతాను. ఈ పాపాలన్నీ నేనే చేసిన ఫలితాన్ని పొందుతాను.

ఇకనైనా నన్ను నమ్మవా అమ్మా." అని భరతుడు ఎన్నో ఒట్లు పెట్టుకున్నాడు.  కౌసల్య పాదాల మీద పడ్డాడు భరతుడు.

భరతుని మాటలు విన్న కౌసల్యకు నోట మాట రాలేదు. భరతుని పైకి లేవదీసింది. "కుమారా భరతా! నీవు ఇన్ని ఒట్లు పెట్టుకొని నా దు:ఖము మరింత ఎక్కువ చేసావు. భరతా! నీవు ధర్మాత్ముడివి. ఆవిషయం నాకు తెలుసు. కాని రాముని మీద ఉన్న ప్రేమతో ఏదేదో అన్నాను. ఏమీ అనుకోకు" అంటూ భరతుని కౌగలించుకొని కౌసల్య దు:ఖిస్తూ ఉంది.

ఆ ప్రకారంగా భరతుడు, కౌసల్య దు:ఖిస్తూ ఒకరిని ఒకరు ఓదార్చుకుంటూ ఉన్నారు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము డెబ్బది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## డెబ్బది ఆరవ సర్గ.

మరునాడు తెల్లవారింది. భరతుడు వచ్చాడు అన్న వార్త విని కులగురువు వసిష్ఠుడు భరతుని వద్దకు వచ్చాడు. భరతునితో ఇలా అన్నాడు.

"నాయనా భరతా! నీకు శభము అగుగాక! నీ తండ్రి మరణము గురించి దు:ఖించకుము. నీ తండ్రికి కర్మకాండలు జరిపించు." అని పలికాడు.

కులగురువు వసిష్ఠుని ఆదేశము ప్రకారము భరతుడు తన తండ్రికి ఉత్తర క్రియలు అన్ని యధావిధిగా జరిపించాడు. దశరథ మహారాజు శరీరమును తైలద్రోణిలో నుండి బయటకు తీసి నేల మీద ఉంచారు. తైల ద్రోణిలో ఉంచడం వల్ల మహారాజు శరీరములో ఏ మార్పూ రాలేదు. నిద్రపోతున్నట్టు ఉన్నడు దశరథుడు. తరువాత మహారాజును రత్నములు పొదిగిన శయ్యమీద పడుకోబెట్టారు. తన తండ్రి శవమును చూచి భరతుడు ఎంతో దు:ఖించాడు.

"మహారాజా! నేను ఇంట్లో లేని సమయం చూచి రాముని అడవులకు ఎందుకు పంపావు? అటువంటి నిర్ణయము ఎందుకు

తీసుకున్నావు? నీకేం హాయిగా స్వర్గానికి వెళ్లావు. రాముడు లక్ష్మణునితో కలిసి అరణ్యములకు వెళ్లాడు. నేను జీవచ్ఛవము లాగా ఇక్కడ ఉన్నాను. ఇంక ఈ అయోధ్య యోగక్షేమములు ఎవరు చూస్తారు? మహారాజా! నీవులేని అయోధ్య చంద్రుడు లేని ఆకాశము వలె కళావిహీనంగా ఉంది." అని విలపిస్తున్నాడు భరతుడు.

ఆ ప్రకారంగా శోకిస్తున్న భరతుని చూచి వసిష్ఠుడు ఇలా అన్నాడు.

"భరతా! పోయినవారి గురించి చింతించి ప్రయోజనములేదు. జరుగవలసిన కార్యము గురించి ఆలోచించు. మహారాజుకు ప్రేతకర్మలు నిర్వర్తించు. మహారాజును ప్రేతత్వము నుండి విముక్తి కలిగించు." అని అన్నాడు.

అగ్ని గృహమునుండి ఋత్విక్కులు అగ్నిని తీసుకొని వచ్చారు. దశరథుని పార్థివశరీరమును బయటకుతీసుకొని వచ్చారు. ఆయన శరీరమును పల్లకీలో పరుండబెట్టారు. ఆ పల్లకిని ఊరేగింపుగా శ్మశానమునకు తీసుకొని వెళ్లారు. దారిలో పురజనులు ఆయన శరీరము మీద వెండి, బంగారము, పూలు చల్లారు. చందనము కర్రలతో చితిని పేర్చారు. సుగంధ ద్రవ్యములను చితిలో వేసారు. దశరథుని శరీరమును చితిమీద ఉంచారు. ఋత్విక్కులు హెూమం చేసారు. వేదములు పఠించారు. దశరథుని భార్యలందరూ తమ తమ వాహనములలో శ్మశానమునకు చేరుకున్నారు.

ఋత్విక్కులు, దశరథుని భార్యలు దశరథుని చితికి అప్రదక్షిణంగా తిరిగారు. అంత:పుర స్త్రీలందరూ రోదిస్తున్నారు. భరతుడు దశరథుని చితికి నిప్పంటించాడు. భరతుడు, మహారాజు భార్యలు, అందరూ దశరథునికి జలతర్పణములు విడిచారు. పదిదినములు గడిచిపోయినవి.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము డెబ్బది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## డెబ్బది ఏడవ సర్గ.

దశరథుడు మరణించిన పదవ రోజున శుద్ధిజరిగింది. పన్నెండవ రోజున మహారాజుకు శ్రాద్ధ కర్మలు భరతుడు నిర్వర్తించాడు. శ్రాద్ధ కర్మను పురస్కరించుకొని భరతుడు బ్రాహ్మణులకు, ఋత్విక్కులకు, బంగారము, వెండి, భూదానము, గోదానము, గృహదానము, వాహన దానము, వస్త్రదానములు విరివిగా చేసాడు. పదమూడవ రోజున భరతుడు అస్థిసంచయనము కొరకు శ్మశానమునకు వెళ్లాడు. తండ్రిచితిని చూచి భరతుడు తనలో తాను ఇలా అనుకున్నాడు.

"తండ్రీ! నన్ను నీవు రామునికి అప్పగించావు. నీవు వెళ్లిపోయావు. రాముడు నన్ను వదిలి అరణ్యములకు వెళ్లిపోయాడు. నేను ఒంటరిగా మిగిలిపోయాను. రాముడు అరణ్యములకు పోగా, కౌసల్య నిన్ను చూచుకొని జీవించుచున్నది. ఇప్పుడు నువ్వుకూడా ఆమెను ఒంటరిని చేసి వెళ్లిపోయావు."అని పరిపరి విధాల ఏడుస్తున్నాడు.

ఆజానుబాహుడు అయిన దశరథుని కాష్టములో బూడిద చిన్న కుప్పగా పడి ఉండడం చూచి ఏడుపు ఆపుకోలేకపోయాడు. అస్థికలను ఏరుతూ కింద పడిపోయాడు. పక్కనే ఉన్న మంత్రులు

భరతుని పట్టుకున్నారు. ఇదంతా చూచిన శత్రుఘ్నునికి దు:ఖము ఆగలేదు. పిచ్చివాడి వలె ఏడుస్తున్నాడు.

"తండ్రీ! కైక కోరిన కోరికలు అనే సముద్రంలో పడి మునిగి పోయావా! నీవు భరతుని ఎంతో గారాబం చేసావే. అటువంటి భరతుడు ఏడుస్తున్నాడు. ఓదార్చవా! మాకు కావలసిన వస్త్రములు, భోజనపదార్థములు ఏమి కావలిస్తే అవి మాకు తెచ్చి ఇచ్చే వాడివి. ఇప్పుడు మాకు ఎవరు తెచ్చి ఇస్తారు. ధర్మాత్ముడవు అయిన నీవు పోగానే ఈ భూమి బ్రద్దలు కావాల్సింది. కాని ఎందుకో అలా జరగలేదు. తండ్రీ! మీరు వెళ్లిపోయారు. రాముడు అరణ్యములకు వెళ్లాడు. ఇంక నేను ఎవరిని చూచుకొని బతకాలి. నేనుకూడా అగ్నిప్రవేశము చేస్తాను. లేని ఎడల తపోవృత్తిని స్వీకరించి అడవులకు వెళతాను. అంతేకానీ అయోధ్యలో అడుగుపెట్టను." అని ఏడుస్తున్నాడు శత్రుఘ్నుడు.

ఆ అన్నదమ్ముల శోకమును చూచి అక్కడ ఉన్నవారికి కూడా దు:ఖము ఆగలేదు. అప్పుడు వసిష్ఠుడు వారి వద్దకు వచ్చి ఇలా అన్నాడు. "భరతా! నీ తండ్రి మరణించి నేటికి పదమూడవ దినము. నీవు అస్థి సంచయనము చేయవలెను. ఇంకనూ నీవు ఇలా శోకిస్తూ కూర్చుంటే ప్రయోజనమేమి? సకల జనులకు మూడు అవస్థలు తప్పవు. అవే ఆకలి దప్పులు, సుఖదు:ఖములు, జరామరణములు. ధనికుడైనా, పేదవాడైనా, మహారాజైనా కటిక దరిద్రుడైనా ఇవి అనుభవించ వలసినదే. కాబట్టి నీ తండ్రి మరణము గురించి చింతించడం అవివేకము." అని అన్నాడు.

సుమంత్రుడు శత్రుఘ్నుని ఓదార్చాడు. వారి ఓదార్పుమాటలతో భరత శత్రుఘ్నులు తమ శోకమును విడిచిపెట్టారు. తదుపరి కార్యక్రమమును నిర్వర్తించారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము డెబ్బది ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### డెబ్బది ఎనిమిదవ సర్గ.

దశరథ మహారాజు కర్మకాండలు అన్నీ పూర్తి అయ్యాయి. తదుపరి కార్యక్రమము గురించి ఆలోచిస్తున్నాడు భరతుడు. ఎందుకంటే ప్రస్తుతము అయోధ్యకు రాజులేడు. రాజు లేకుండా రాజ్యము ఉండకూడదు. అందుకని వెంటనే భరతుడు పట్టాభిషిక్తుడు కావాలి. కాని ముందుగా రాముని కలుసుకొని రాముని అనుమతి పొందాలని భరతుడు అనుకుంటున్నాడు. ఆ సమయంలో శత్రుఘ్నుడు భరతుని వద్దకు వచ్చాడు. భరతునితో ఇలా అన్నాడు.

"భరతా! మనము ఇంట లేని సమయములో ఒక ఆడుది రాముని అడవులకు పంపి వేసినది. రాముడు తండ్రి మాటను పాటించాడు. లక్ష్మణునికి ఏమయింది. కనీసం లక్ష్మణుడు అయినా దశరథుని కట్టడి చేసి ఆ వనవాసమును ఆపవచ్చు కదా! స్త్రీలోలత్వముతో వరములు ఇచ్చిన మహారాజును ముందే కట్టడి చేసినచో వ్యవహారము ఇంతదూరము వచ్చిఉండెడిది కాదు. అలా లక్ష్మణుడు ఎందుకు చేయలేదో అర్థం కావడం లేదు." అని అన్నాడు శత్రుఘ్నుడు.

ఆ సమయంలో ఒంటి నిండా నగలు వేసుకొని కైక దాసి మంథరం అటుగా వెళుతూ ఉంది. ఆమెను చూచాడు శత్రుఘ్నుడు.

ఒంటినిండా నగలు అలంకరించు కున్న మంథర శత్రుఘ్నునికి తాళ్లతో కట్టిన ఆడకోతి లాగ కనపడింది. ఈ అనర్థములకు అన్నిటికీ మూలము మంథర అని అందరికీ తెలుసు. అందుకని ద్వారపాలకుడు మంథరను పట్టుకొని శత్రుఘ్నుని వద్దకు తీసుకొని వచ్చారు.

"శత్రుఘ్నకుమారా! ఈమె కైక ఆంతరంగిక దాసి. పేరు మంథర. ఈమె రాముని వనవాసమునకు, మహారాజు మరణమునకు, కారణము. ఈమెను నీ ముందర నిలబెట్టాము. ఈమెను నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి." అని అన్నారు.

ఆ మాటలు విన్న శత్రుఘ్నునికి కోపం మిన్నుముట్టింది. "మా అన్నదమ్ములకు మా మహారాజుకు తీరని అపకారము చేసిన ఈ దాసికి తగిన గుణపాఠము చెబుతాను." అని అన్నాడు. ఆసమయంలో మంథర తో వచ్చిన వాళ్లు శత్రుఘ్నుని కోపం చూచి తలోకదిక్కుకూ పారిపోయారు. "ఈరోజు మంథర శత్రుఘ్నుని చేతిలో చచ్చింది" అని అందరూ అనుకున్నారు.

కొందరు గబగబా కౌసల్యకు ఈ వార్త చెప్పడానికి వెళ్లారు. శత్రుఘ్నుడు మంథరను నేల మీద పడేసి ఈడ్చుకుంటూ వచ్చాడు. మక్కువతో మంథర అలంకరించుకున్న ఆభరణములు అన్నీ నేల మీద చెల్లాచెదురుగా పడిపోయాయి. ఇంతలో కైక అక్కడికి వచ్చింది. శత్రుఘ్నుడు మంథర మెడ పట్టుకొని తిడుతున్నాడు. కైకకు భయం వేసింది. భరతుని వద్దకు పోయి మంథరను కాపాడమని బతిమాలింది.

భరతుడు శత్రుఘ్నుని చూచి "శత్రుఘ్నా! ఆగు. ఎంత

అపరాధము చేసినా స్త్రీలను చంపరాదు.. కాబట్టి మంథరను విడిచి పెట్టు. దాని పాపాన అదే పోతుంది. అంతెందుకు నాకు వచ్చిన కోపానికి నిన్ననే నేను మా తల్లి కైకను చంపి ఉండేవాడిని. కాని రాముడికి అది ఇష్టంలేదు. అందుకని నాకోపాన్ని దిగమింగుకొని ఊరుకున్నాను. ఈ మంథర ఒక దాసి. ఆమె ఏమి చేస్తుంది. ఆమెను క్షమించు." అని అన్నాడు భరతుడు.

భరతుని మాటలకు శత్రుఘ్నుడు తనకోపాన్ని దిగమింగుకొని మంథరను విడిచిపెట్టాడు. మంథర కైక పాదాల మీద పడి ఏడుస్తూ ఉంది. కైక ఆమెను ఓదారుస్తూ ఉంది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము డెబ్బడి ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### డెబ్బది తొమ్మిదవ సర్గ.

పదమూడవ రోజు అలాగడిచిపోయింది. పదునాలుగవ రోజున మంత్రులు పురోహితులు భరతుని వద్దకు వెళ్లారు.

"కుమారా! భరతా! మన మహారాజు గారు మృతిచెందారు. పెద్దకుమారుడైన రాముడు తండ్రిమాట ప్రకారము అడవులకు వెళ్లాడు. ప్రస్తుతము అయోధ్యకు రాజు లేడు. రాజు లేని రాజ్యములో అరాచకము చెలరేగుతుంది. అయోధ్య ప్రజలు ధర్మపరులు అందుకని అటువంటి ఉ పద్రవము చెలరేగలేదు. పట్టాభిషేకమునకు నీవు ఆలస్యము చేస్తే, దేశంలో అరాచకము చెలరేగే ప్రమాదము ఉంది. రాజప్రముఖులు, పురప్రముఖులూ పురోహితులూ పట్టాభిషేకమునకు కావలసిన సంభారములు సిద్ధం చేసుకొని నీ అనుమతి కోసరం ఎదురు చూస్తున్నారు. వంశపారపర్యముగా నీవే అయోధ్యకు మహారాజువు. కాబట్టి నీవు అయోధ్యకు రాజ్యాభిషిక్తుడవై మమ్ములను పాలించు."అని అన్నాడు.

భరతుడు ఆలోచించాడు. వారితో ఇలా అన్నాడు. "మీకందరికీ రాజధర్మము బాగా తెలుసు. రాచరిక వ్యవస్థలో రాచకుటుంబము లోని పెద్దవాడు రాజ్యమునకు అర్హుడు. మహారాజు కుమారులలో పెద్దవాడు రాముడు. అందుకని రాముడే రాజ్యమునకు అర్హుడు.

నేను కాదు. నన్ను పట్టాభిషేకము చేసుకోమనడం యుక్తము కాదు. కాబట్టి, రాముని రాజ్యాభిషిక్తుని చేద్దాము. రాముని బదులు నేను పదునాలుగు సంవత్సరములు అరణ్యవాసము చేస్తాను. అందుకని చతురంగ బలములు సిద్ధం చేయండి. వెంటనే నేను రాముని ఉన్నచోటికి వెళ్లి ఆయనను ఒప్పించి అయోధ్యకు తీసుకొని వస్తాను. లేకపోతే రామునికి అక్కడే పట్టాభిషేకము జరిపించి అయోధ్యాధి పతిగా ఆయనను అయోధ్యకు తీసుకొని వస్తాను. ఎట్టి పరిస్థితులలో కూడా నా తల్లి కైక కోరిక తీరడానికి వీలులేదు. మా తల్లి కోరికకు భిన్నంగా జరగాలి. రాముడు రాజుకావాలి. నేను పదునాలుగు సంవత్సరములు అరణ్యవాసము చెయ్యాలి. కాబట్టి మన ప్రయాణమునకు తగిన ఏర్పాట్లు చేయండి." అని ఆదేశించాడు భరతుడు.

ఆయన మాటలకు అందరూ సంతోషంతో అంగీకరించారు. రాముని మీద భరతునికి ఉన్న అనురాగానికి, భక్తికి, అక్కడ ఉన్న వారికండ్ల వెంట ఆనందభాష్పాలు రాలాయి. "భరత కుమారా! తమరి ఆజ్ఞ ప్రకారము తమరి ప్రయాణమునకుఅన్ని ఏర్పాట్లు చేస్తాము." అని అన్నారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యా కాండము డెబ్బది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఎనుబదవ సర్గ.

అమాత్యులు భరతుని ప్రయాణమునకు తగిన ఏర్పాట్లు చేసారు.. ఆయాప్రదేశముల స్వభావములను తెలిసిన వారు, నేలను త్రవ్వేవారు, కొలతలు వేసేవారు, యంత్రకోవిదులు, శిల్పులు, తగిన యంత్రములను నడుపువారు, చెక్కపని వారు, బావులు తవ్వువారు, మార్గములు వేయువారు, వారిని పర్యవేక్షించేవారు ఎవరెవరు ఏ యే పనులకు నియమింపబడ్డారో ఆ పనులను సమర్ధవంతంగా చేస్తున్నారు.

ముందుగా, భరతుడు, ఆయన సైన్యము, రధములు, శకటములు  అడవులలో పోవుటకు, మార్గములు, రహదారులు వేస్తున్నారు. అడ్డంగా ఉన్న చెట్లను,  పొదలను, తీగలను నరికి మార్గము చేస్తున్నారు. నేలంతా చదును చేస్తున్నారు. పల్లము ప్రదేశములలో మట్టిపోసి, ఎత్తైన ప్రదేశములను చదును చేసి, గుంతలను కప్పివేసి, మార్గములు ఏర్పరుస్తున్నారు. దారిలో సైన్యములకు, భరతుని అనుసరించు వారికీ, కావలసిన నీరు కాలవల ద్వారా అందించే ఏర్పాట్లు చేస్తున్నారు. నదులు కాలువలు లేని ప్రదేశములలో బావులుత్రవ్వి నీటిని పైకి తోడుతున్నారు. సేనలు నడచు మార్గమును సున్నముతో గట్టిచేసారు. దారిలో పూలచెట్లు నాటించారు. పతాకములతో అలంకరించారు.

ఈ పనులన్నీ చేయుటకు జ్యోతిష్కులు మంచి ముహూర్తములు నిర్ణయించారు. దారిలో భరతుడు, అంత:పురస్త్రీలు, రాజోద్యోగులు విడిది చేయుటకు వివిధములైన గృహములు నిర్మించారు. భరతుడు విడిది చేయు గృహమును ఇతర గృహముల కంటే బాగా అలంకరించారు. ఆ విధముగా కట్టబడిన విడిది గృహములు సరయూనది నుండి గంగానది వరకూ వ్యాపించి ఉన్నాయి. ఆ ప్రకారంగా భరతుని ప్రయాణమునకు ఏర్పాట్లు చేయబడ్డాయి.

(ఆ రోజుల్లో కూడా దేశాధినేత ప్రయాణమునకు నేడు చేసిన మాదిరే ఏర్పాట్లు చేయడం, అప్పటికప్పుడు అన్నీ అమర్చడం నేడు కూడా చూస్తూనే ఉంటాం.)

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ఎనుబదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఎనుబది ఒకటవ సర్గ.

దశరథుడు చనిపోయి 13 రోజులు గడిచిపోయాయి. కర్మకాండలు అన్నీ పూర్తి అయ్యాయి. శోకదినములు గడిచిపోయాయి. 14వరోజున రాచరిక లాంఛనాలు ప్రారంభం అయ్యాయి. తెల్లవారు జామునే వందిమాగధులు భరతుని స్తోత్రం చేస్తున్నారు. దుందుభులు మ్రోగిస్తున్నారు. మంగళవాద్యములు మోగుతున్నాయి. వేశ్యలు నృత్యం చేస్తున్నారు. అంతా కాబోయే మహారాజు  భరతుని మేలుకొలుపు తున్నారు. కాని ఈ రాజలాంఛనాలు అన్నీ భరతునికి చికాకు పుట్టించాయి. అతనికి ఇంకా దు:ఖము ఎక్కువ అయింది.

"ఆపండి. నేను రాజును కాను." అని గట్టిగా అరిచాడు.

అన్నీ ఆగిపోయాయి. భరతుడు శత్రుఘ్నుని చూచి ఇలా అన్నాడు.

"శత్రుఘ్నా! చూచావా. కైక వలన ఎంతటి అనర్థము వాటిల్లిందో. మహారాజు రాజ్యభారము నా మీద మోపి తాను హాయిగా స్వర్గసుఖములు అనుభవిస్తున్నాడు. ఈ కష్టములు అన్నీ నాకు వదిలి రాముడు హాయిగా వనవిహారము చేస్తున్నాడు. నేను ఒంటరిగా

మిగిలిపోయాను.' అని రోదిస్తున్నాడు.

ఇది ఇలా ఉంటే వసిష్ఠుడు రాజసభను ఏర్పాటు చేసాడు. అయోధ్యలో ఉన్న అన్ని కులముల వారినీ, అమాత్యులనూ, పురప్రముఖులను, గణాధ్యక్షులను, సభకు ఆహ్వానించాడు. వారందరూ సభలో తమ తమ ఆసనములమీద కూర్చున్నారు. తరువాత వసిష్ఠుడు భరతుని, శత్రుఘ్నుని, యుధాజిత్తును, సుమంత్రుని తీసుకొని రమ్మని భృత్యులను పంపించాడు. భరతుడు, శత్రుఘ్న సమేతంగా వచ్చిసభలో కూర్చున్నాడు. భరతుడు రాగానే అందరూ లేచి ఆయనకు అభివాదములు తెలియ జేసారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఎనుబది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఎనుబది రెండవ సర్గ.

రాజసభలో వసిష్ఠుడు ఆదేశము ప్రకారము మంత్రులు సామంతులు పురప్రముఖులు ఎవరికి నిర్దేశించిన ఆసనములలో వారు కూర్చున్నారు. భరతుడు ఉన్నతాసనము అలంకరించాడు. పక్కనే శత్రుఘ్నుడు కూడా కూర్చున్నాడు. అప్పుడు వసిష్ఠుడు లేచి సభను, భరతుని ఉద్దేశించి ఇలా పలికాడు.

" రాకుమారా! నీకు జయము కలుగు గాక! ఇప్పటి వరకు నీ తండ్రి దశరథుడు ఈ అయోధ్యను ధర్మమును ఆచరించుచూ ప్రజారంజకంగా పరిపాలించాడు. ఈ రాజ్యమును నీకు అప్పగించి దశరథుడు స్వర్గస్థుడయ్యాడు. నీ అన్న రాముడు తండ్రి మాట ప్రకారము రాజ్యమును నీకు వదిలి అరణ్యములకు వెళ్లాడు. కాబట్టి, ఓ భరతా! నీ తండ్రి, నీ అన్న, నీకు అప్పగించిన రాజ్యభారమును నీవు వహించవలెను. వెంటనే అయోధ్యకు పట్టాభిషిక్తుడవు కమ్ము. ఈ అయోధ్యకు, ఉత్తరదేశపు రాజులు, పశ్చిమ దేశపు రాజులు, దక్షిణదేశపు రాజులు, సరిహద్దులలో ఉన్న రాజ్యాధీశులు , ఇంకా నీ అధీనములో ఉన్న ద్వీపములను పరిపాలించు రాజులు నీకు కప్పములు చెల్లించెదరు. ఈ సువిశాల సామ్రాజ్యమును నీవు పరిపాలించు." అని పలికాడు వసిష్ఠుడు.

అప్పుడు భరతుడు ఇలా అన్నాడు. "కులగురువులు వసిష్టులు ఇలా మాట్లాడటం ఉచితము కాదని నా అభిప్రాయము. నా తండ్రి దశరథుడు ఈ రాజ్యమునకు అధినేత. ఆయన మరణానంతరము ఆయన పెద్దకుమారుడు రాముడు ఈ రాజ్యమునకు అధినేత. రామునికి తప్ప వేరెవ్వరికీ ఈ రాజ్యము మీద అర్హత లేదు. ఇప్పుడు నేను అయోధ్యకు పట్టాభిషిక్తుడను అయితే అంత కన్నా మహాపాపము వేరొకటి ఉండదు. ఆ పాపము చేసి నేను ఇక్ష్వాకువంశమునకు కళంకము తీసుకు రాలేను. నా తల్లి చేసిన పాప కార్యములో నేను పాలుపంచుకోలేను. నా అన్న రామునికి ఇక్కడి నుండి నమస్కారము చేయుచున్నాను. రాముని బదులు నా తల్లి కోరిక నేను తీర్చెదను. రామునికి పట్టాభిషేకము చేసి ఆయన బదులు నేను వనవాసము చేసెదను. ఇది నానిర్ణయము." అని పలికాడు భరతుడు.

భరతుని నిర్ణయానికి సభలో ఉన్న వారందరూ జయజయధ్వానాలు చేసారు. భరతుడు ఇంకా తన ప్రసంగము కొనసాగించాడు.

"మీ అందరి సహకారంతో నేను ఎలాగైనా రాముని అయోధ్యకు తీసుకురావడానికి శతవిధాలా ప్రయత్నిస్తాను. ఒక వేళ రాముడు తండ్రికి ఇచ్చిన మాట ప్రకారము తిరిగి రాకపోతే, నేను కూడా లక్ష్మణునితో పాటు అడవులలోనే ఉంటాను. రాముని వద్దకు వెళ్లుటకు నేను అన్ని ఏర్పాట్లు చేయించాను. సుమంత్రా! నీవు వెళ్లి రాముని వద్దకు పోవుటకు అన్ని ఏర్పాట్లు చెయ్యి. నా వెంట సైన్యము కూడా రావలెను. రాముని రాజలాంఛనములతో అయోధ్యకు తీసుకురావలెను. వెంటనే నా రథమును కూడా సిద్ధము చెయ్యి. " అని

అన్నాడు.

భరతుని ఆదేశము ప్రకారము సుమంత్రుడు రథము సిద్ధము చేసాడు. సైన్యాధ్యక్షులు తమ తమ అధీనములో ఉన్న సైన్యములను ప్రయాణానికి సమాయత్తం చేసారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఎనుబది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఎనుబది మూడవ సర్గ.

మరునాడు ఉదయము భరతుడు నిద్ర లేచాడు. ప్రాత:కాల సంధ్యావందనాదికార్యక్రమములు నిర్వర్తించాడు. తన రథముఎక్కి బయలుదేరాడు. భరతుని వెంట పురోహితులు, మంత్రులు తమ తమ వాహనములలో బయలుదేరారు.

భరతుని వెనక 9,000 ఏనుగులు, 60,000 రథములు, వాటిలో ధనుస్సులు ధరించిన సైనికులు,  ఒక లక్ష మంది ఆశ్విక సైన్యము రక్షణగా బయలుదేరింది. కౌసల్య, కైకేయీ, సుమిత్ర తమ తమ రథములలో భరతుని వెంట రాముని వద్దకు బయలుదేరారు. రాజకుటుంబము వారికి సన్నిహితంగా ఉన్నవారు, వర్తకులుకూడా రాముని వద్దకు బయలుదేరారు. వీరు కాకుండా వివిధ చేతి వృత్తులవారు ఎప్పుడు ఎవరి అవసరము వస్తుందో అని భరతుని వెంట బయలుదేరారు. వారి వెనక వేదములు వల్లిస్తూ బ్రాహ్మణులు ఎడ్లబండ్ల మీద భరతుని అనుసరించారు.

వారందరూ శృంగిభేర పురము దగ్గర ప్రవహించుచున్న గంగానదిని సమీపించారు. భరతుడుఅక్కడ ఆగాడు. అమాత్యులను పురోహితులను సైన్యాధ్యక్షులను చూచి ఇలాఅన్నాడు.

"ఈ రాత్రికి మనము ఈ గంగానదీ తీరములో విడిది చేద్దాము. రేపుఉదయము మన ప్రయాణము కొనసాగిస్తాము. నేను నా తండ్రికి గంగానదిలో జలతర్పణములు విడుస్తాను. మీరందరూ సేనలతో విశ్రాంతి తీసుకోండి" అని అన్నాడు.

భరతుని ఆదేశము మేరకు అందరూ ఆ రాత్రికి గంగానదీ తీరమున విడిదిచేసారు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ఎనుబది మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఎనుబది నాల్గవ సర్గ.

గంగానదీతీరమున ఉన్న శృంగిబేరపురమునకు రాజు గుహుడు. రామునికి ఆప్తమిత్రుడు. గంగానది పొడుగునా విడిది చేసిన సైన్యములను చూచాడు గుహుడు. వెంటనే తన మంత్రులను, బంధువులను  సమావేశపరిచాడు.

“మీరంతా చూచి ఉంటారు. గంగానదీ తీరాన అశేష సైన్యము విడిది చేసి ఉన్నది. దీని లెక్క నాకు ఊహకు అందడం లేదు. ఈ సైన్యము అయోధ్యనుండి వచ్చినట్టు కనపడుతూ ఉంది. భరతుడు రాముని వెదుకుతూ వచ్చాడేమో తెలియదు. మనము రాముని మిత్రులమని మనలను బంధించడానికి వచ్చాడా! లేక మనలనందరినీ చంపుతాడా! రాముడు బతికి ఉంటే శాశ్వతముగా తనకు రాజ్యము లభించదని రాముని కూడా చంపడానికి వచ్చాడా! రాముడు మనకు రాజే కాదు. మనకు మిత్రుడు కూడా. అందుచేత రాముని రక్షించడం మన  కర్తవ్యము.

అందుకని మీరందరూ ఆయుధములను చేత బట్టి గంగానదీ తీరములో నిలబడండి. మనము కేవలము గంగాతీరమును రక్షిస్తున్నాము అనే మిషతో అక్కడ ఉండండి. మనసేనలను కూడా సమాయత్తము చేయండి. మనకు ఐదువందల పడవలు ఉన్నాయి.

వాటిలో ఒక్కొక్క పడవలో నూరుగురు సైనికులు ఉండండి. గంగా తీరమును రక్షిస్తూ ఉన్నట్టు పడవల మీద తిరగండి. భరతుడు ఏ బుద్ధితో వచ్చాడో తెలియదు. భరతుడు రాముని క్షేమం కోరే వాడయితే అతనిని వెళ్లనిద్దాము. లేని ఎడల అతనిని అడ్డుకుందాము. దీనికి మీరు సంసిద్ధంగా ఉండండి." అని పలికాడు.

తరువాత సాంప్రదాయ ప్రకారము తన శక్తికొద్దీ కానుకలు తీసుకొని గుహుడు భరతుని వద్దకు వెళ్లాడు. గుహుని రాకను సుమంత్రుడు చూచాడు. ఆ విషయము భరతునికి చెప్పాడు.

"మహారాజా! గుహుడు తన బంధుమిత్రులతో తమ దర్శనానికి వచ్చాడు. గుహుడు రామునికి మంచి మిత్రుడు. రాముడు అడవులకు వెళ్లేటప్పుడు రామునికి ఆతిధ్యము ఇచ్చాడు. రామలక్ష్మణులు ఎక్కడ ఉన్నారో గుహునికి తెలిసి ఉంటుంది. కాబట్టి గుహుని ఆదరించు." అని అన్నాడు సుమంత్రుడు. ఆ మాటలకు భరతుడు చాలా సంతోషించాడు. "సుమంత్రా! వెంటనే గుహుని నా వద్దకు తీసుకొని రా!" అని ఆదేశించాడు. సుమంత్రుడు గుహుని భరతుని వద్దకు తీసుకొని వెళ్లాడు.గుహుడు భరతునికి వినయంగా నమస్కరించాడు. "ఈ శృంగిబేర పురమునకు నేను రాజును. నాపేరు గుహుడు. మీకు దాసుడను. ఈ పురము మీ పురమే అనుకొనుడు. మీ ఇష్టం వచ్చినట్టు ఇక్కడ ఉండండి. మేము నీ కోసరము ఫలములు, దుంపలు, మాంసము తీసుకొని వచ్చాము. మా సపర్యలను స్వీకరించి మీరు ఈ రాత్రికి ఇక్కడే విశ్రమించండి." అని అన్నాడు గుహుడు.

శ్రీమద్రామాయణము అయోధ్యాకాండము

ఎనుబది నాల్గవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఎనుబది ఐదవ సర్గ.

గుహుని మాటలను విన్న భరతుడు గుహునితో ఇలా అన్నాడు. "నీవు మా అన్నగారు రామునికి మిత్రుడు అని తెలిసినది. మేము అశేష సేనావాహినితో వచ్చాము. మా అందరికీ ఆతిథ్యము ఇవ్వవలెనని నీ కోరిక బహు ప్రశంసనీయము. ఈ ప్రాంతమంతయు చాలా దుర్గమంగా ఉంది. మేము భరద్వాజుని ఆశ్రమమునకు పోవలెను. దానికి మంచి మార్గము చూపగలవా!" అని అడిగాడు.

ఆమాటలు విన్న గుహుడు "మహారాజా! మేము నీకు దాసులము. నేను, మా వాళ్లు ధనుస్సులతో నీకు ముందు నడుస్తూ నీకు దారి చూపిస్తారు. కాని ఒక్క సందేహము. తమరు రాముని వద్దకు వెళ్లుచున్నట్టు కనపడుతూ ఉంది. మీరు రామునికి అపకారము చేయడానికి వెళుతున్నారా అని సందేహముగా ఉన్నది. నా సందేహ మును తమరు తీరుస్తారు అని ఆశిస్తున్నాను." అని వినయంగా అసలు విషయం బయట పెట్టాడు గుహుడు.

"నీవు రామునికి మిత్రుడవు కాబట్టి నాకూ మిత్రుడవే. ఓ మిత్రమా! రాముడు నాకు అన్న. నా తండ్రితో సమానుడు. ఆయనకు అపకారము తలపెట్టే దుర్బుద్ధి నాకు కలలో కూడా కలగకుండు గాక! నేను నిజం చెబుతున్నాను. నేను రాముని వద్దకు పోయి ఆయనను

అయోధ్యకు తీసుకొని వచ్చి పట్టాభిషిక్తుని చేయవలెనని అనుకుంటున్నాను. అంతే కానీ రామునికి అపకారము చేయుటకు కాదు" అని అన్నాడు గుహుడు.

ఆ మాటలకు గుహుడు పరమానంద భరితుడయ్యాడు. "ఓ మహారాజా! నీకు శ్రమ లేకుండా రాజ్యము లభించింది. కాని దానిని నీవు రాముని కొరకు త్యాగం చేస్తున్నావు. నీ వంటి త్యాగధనుడు లోకంలో పుట్టబోడు. అడవులలో కష్టములు పడుతున్న రాముని తిరిగి అయోధ్యకు తీసుకొని వెళ్లవలెనని కోరుకుంటున్న నీ కీర్తి ముల్లోకము లలో వ్యాపిస్తుంది. నీకు జయమగు గాక!" అని గుహుడు భరతుని పొగడ్తలతో ముంచెత్తాడు.

ఇంతలో చీకటి పడింది. భరతుడు, శత్రుఘ్నుడు తమ తమ శయ్యలమీద పడుకున్నారు.  భరతునికి నిద్రపట్టలేదు. రాముడు ఎక్కడ ఉన్నాడో ఎన్ని కష్టములు పడుతున్నాడో అని శోకిస్తున్నాడు.

భరతుని శోకము ఒక పర్వతము మాదిరి వ్యాపించింది. భరతుని ఆలోచనలు ఆ పర్వతశిలల మాదిరి ఉన్నాయి. భరతుని నిట్టూర్పులే ఆ పర్వతములో నిక్షిప్తమైన ధాతువులు మాదిరి ఉన్నాయి. భరతుని దైన్యమే ఆ పర్వతము మీది వృక్షములు మాదిరి కనపడుతున్నాయి. భరతుని శోకములో ముంచిన మోహము, ఆ పర్వతము మీది .జంతువులు, భరతునికి కలిగిన మనస్తాపము ఆ పర్వత శిఖరములు. భరతునికి కలిగిన సంతాపము ఆ పర్వతము మీది ఓషధులు. ఆ ప్రకారంగా భరతుడు కొండంత దు:ఖమును మనసులో దాచుకొని బాధపడుతున్నాడు.

ఆ రాత్రంతా మనశ్శాంతి లేకుండా నిద్రలేని రాత్రి గడిపాడు భరతుడు. ఇదంతా చూస్తున్నాడు గుహుడు. భరతుని తన మృదుమధురమైన మాటలతో ఓదార్చాడు గుహుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఎనుబది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఎనుబది ఆరవ సర్గ.

ఆ రాత్రి గుహుడు లక్ష్మణుని సద్గుణముల గురించి భరతునికి వివరించాడు.

"ఓ మహారాజా! రాముడు అడవులలోనికి పోయే ముందు ఇక్కడ నిద్రించాడు. ఆ రాత్రి లక్ష్మణుడు నిద్ర లేకుండా రామునికి సీతకు రక్షణగా ఉన్నాడు.

ఆ సమయంలో నేను లక్ష్మణునితో "లక్ష్మణా! నీకోసరము మా వాళ్లు సుఖకరమైన శయ్య ఏర్పాటు చేసారు. నీవు నిద్రించు. నేను రామునికి ఏ ఆపదా రాకుండా చూసుకుంటాను. ఎందుకంటే లక్ష్మణా! మేము కష్టములు పడటానికి అలవాటు పడ్డాము. రాత్రి నిద్రలేకుండా మేలుకొనడం మాకు అలవాటే. నీవు రాకుమారుడవు. నీవు నిద్రలేకుండా ఉండలేవు. అందుకని వెళ్లి నిద్రించు.

మిత్రమా లక్ష్మణా! నాకు రాముని కంటే ప్రియమైన వాళ్లు ఈ లోకంలో ఎవరూ లేరు. రాముడు అడవులలో ఉన్నంతవరకూ రాముని రక్షణ బాధ్యత నాది. దానిని ఎవరికీ అప్పచెప్పను. నేను రాముని సేవలోనే ఆయన అనుగ్రహమును పొందుతాను. కాబట్టి నేను నా ధనుస్సు చేత బూని సీతారాములను రక్షిస్తాను. నేను సదా ఈ

వనములో సంచరిస్తుంటాను కాబట్టి ఈ వనములలో నాకు తెలియనిది అంటూ లేదు. ఎంతటి సైన్యమునైనా ఎదిరించే శక్తి మాకు ఉంది. రామునికి వచ్చిన భయము లేదు. కాబట్టి రాముని రక్షణ బాధ్యత నాకు అప్పచెప్పి నీవు వెళ్లి సుఖముగా నిద్రించు." అని అన్నాను.

నామాటలు విన్న లక్ష్మణుడు ఇలా అన్నాడు. "మిత్రమా! నాతోపాటు రాజభోగములు అనుభవించిన రాముడు కటికనేల మీద నిద్రించుచుండగా నాకు సుఖమైన శయ్యమీద నిద్ర ఎలా పడుతుంది. అటుచూడు. హంసతూలికా తల్పము మీద శయనించ వలసిన రాముడు గడ్డి మీద పడుకొని  ఉన్నాడు.

ఈ రాముడు సామాన్యుడు కాడు. దశరథుడు ఎన్నో యజ్ఞములు యాగములు చేస్తే, ఆయాగముల ఫలితంగా రాముడు జన్మించాడు. ఈ రాముని వదిలి దశరథుడు ఎంతోకాలము జీవించలేడు. నా ఉద్దేశ్యము ప్రకారము దశరథుడు ఈ పాటికి రామ వియోగమును భరించలేక పరలోకగతుడై ఉంటాడు. నా తల్లి సుమిత్ర, రాముని తల్లి కౌసల్యకూడా రాముని విడిచి జీవించలేరు. కనీసము నా తమ్ముడు శత్రుఘ్నుని చూచుకుంటూ నా తల్లి సుమిత్ర ఉండగలదేమో కాని, రాముని వదిలి కౌసల్య జీవించలేదు.

రాముని రాజ్యాభిషిక్తుని చేయలేక పోగా, అరణ్యములకు పంపిన దు:ఖంతో దశరథుడు మరణించడం తథ్యం.  ఆ సమయంలో దశరథునికి ప్రేతసంస్కారములు చేయు అదృష్టము కలిగిన భరతుడు, శత్రుఘ్నుడు ధన్యులు. తరువాత భరతుడు పట్టాభిషిక్తుడగును. అందరూసంతోషంగా ఉంటారు. కాని మేమే ఈ పదునాలుగు

సంవత్సరముల వనవాసము పూర్తిచేసుకొని తిరిగి అయోధ్యలో అడుగుపెట్టగలమా అని అనుమానము.” అని లక్ష్మణుడు ఆ రాత్రి పరి పరి విధములు గా చింతించుచూ నిద్రలేకుడా గడిపాడు.

మరునాడు సీతారామలక్ష్మణులు పడవ మీద గంగానదిని దాటారు. ఆ నావను నేనే వారికి సమకూర్చాను. రాముడు ఇక్కడే మర్రిపాలు పూసుకొని జటలు కట్టుకున్నాడు. నారచీరలు ధరించాడు. వారు గంగానదిని దాటివెళ్లిపోయారు.” అని గుహుడు భరతునికి ఆ రాత్రి జరిగిన వృత్తాంతమును వివరించాడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము ఎనుబది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ఎనుబది  ఏడవ సర్గ.

గుహుడు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్న భరతుడు దీర్ఘాలోచనలో పడ్డాడు. రాముని వనవాసము తండ్రిమరణము లక్ష్మణుని వాక్కులు అతని మనసును కలచి వేసాయి.  ఆ మానసిక క్షోభకు తట్టుకోలేక భరతుడు కిందపడిపోయాడు. స్పృహ తప్పాడు. పక్కన ఉన్న శతృఘ్నుడు పట్టుకున్నాడు. శయ్యమీద పడుకోబెట్టాడు.

ఈ వార్త తెలిసి కౌసల్య, సుమిత్ర కైక పరుగు పరుగున అక్కడకు వచ్చారు. కౌసల్య స్పృహ తప్పిన భరతుని చూచి బిగ్గరగా ఏడవడం మొదలెట్టింది.

"నాయనా! భరతా! ఇక్ష్వాకు వంశమునకు నీవే దిక్కు. నీకేమయింది. ఏదైనా శారీరక వ్యాధి వచ్చిందా. రామ లక్ష్మణులు అడవులకు  వెళ్లారు. ఎక్కడున్నారో ఏమి చేస్తున్నారో తెలియదు. మహారాజుగారు పరమపదించారు. నువ్వు ఒక్కడివే ఈ సామ్రాజ్యానికి వారసుడివి. మాకు రక్షకుడవు. నిన్ను చూచుకొని మేమందరమూ ప్రాణాలు నిలుపుకొని ఉన్నాము. నాయనా! భరతా! రామలక్ష్మణుల గురించి గానీ, సీత గురించి గానీ ఏమైనా దుర్వార్త తెలిసినదా! చెప్పు భరతా! ఏం జరిగింది. మామనసులు తల్లడిల్లిపోతున్నాయి." అని

రోదిస్తూ ఉంది కౌసల్య. పరిచారికలు భరతునికి పరిచర్యలు చేసారు.

ఇంతలో భరతుడు తేరుకున్నాడు. కౌసల్యను ఓదార్చాడు. గుహుని చూచి ఇలా అన్నాడు.

“మిత్రమా! ఆ రోజు రాత్రి రాముడు, లక్ష్మణుడు, సీత ఎక్కడ నిద్రించారు. ఏమి ఆహారము తీసుకున్నారు. వివరంగా చెప్పు” అని అడిగాడు.

భరతుడు ఆరోగ్యంగా ఉండటం చూచి గుహుడు సంతోషించాడు. రాముని చూచి ఇలా అన్నాడు. “రాకుమారా! ఆరోజు రాత్రి నేను ఎన్నోరకములైన ఆహారపదార్థములను రాముని కొరకు తీసుకొని వచ్చాను. కాని రాముడు వాటిని ముట్ట లేదు. వెనుకకు తీసుకొని వెళ్లమన్నాడు. ఆ రోజు రాత్రి రాముడు కేవలము నీటిని ఆహారంగా తీసుకున్నాడు. రామునితో పాటు సీత, లక్ష్మణుడు కూడా జలమునే ఆహారంగా తీసుకున్నారు.

తర్వాత లక్ష్మణుడు రామునికి సీతకు శయ్యలను ఏర్పాటు చేసాడు. రాముడు సీత ఆ శయ్యల మీద శయనించారు. లక్ష్మణుడు వారి పాదముల వద్ద నిలబడి వారిని కంటికి రెప్పలా కాపలా కాస్తున్నాడు.  ఆ రాత్రి రాముడు సీత ఇదుగో ఈ  ఇంగుదీ వృక్షము కిందనే శయనించారు. వారు శయనించిన గడ్డి శయ్యలను నేను భద్రపరిచాను. లక్ష్మణుడు ఆ రాత్రి అంతా ధనుస్సును చేతబూని కునుకు లేకుండా కాపలా కాసాడు. నేను కూడా నా వారితో కూడా పరిసరప్రాంతములలో ఉండి రామునికి ఏ ఆపదా రాకుండా కాపలాగా

నిలబడిఉన్నాము.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఎనుబది ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( ఎనభై ఎనిమిదవ సర్గ.)

గుహుడు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నాడు భరతుడు. అందరూ కలిసి ఆ రోజు రాముడు శయనించిన ఇంగుదీవృక్షము దగ్గరకు వెళ్లారు. రాముడు పడుకున్న గడ్డితో చేసిన శయ్యను చూచారు.

భరతుడు తన తల్లులను చూచి "అమ్మా! రాకుమారుడు అయిన రాముడు పడుకున్న శయ్య ఇదేనమ్మా! చూడమ్మా రామునికి ఎంత దుర్గతి పట్టిందో. రాముడు ఇక్ష్వాకు వంశంలో పుట్టాడు. రాచబిడ్డ. రాచ మర్యాదలు, రాజభోగములు అనుభవించాడు. కానీ, ఈ నాడు నేల మీద గడ్డి పరుచుకొని పడుకుంటున్నాడు. ప్రతిరోజూ హంసతూలికా తల్పముల మీద శయనించిన రాముడు కటిక నేల మీద ఎలా పడుకుంటున్నాడో కదా! రాజ ప్రాసాదములలో నివసించిన రాముడు కొండగుహలలో, పర్ణశాలలో ఎలా ఉంటాడో కదా! ప్రతిరోజూ మంగళవాద్య ఘోషలతో వంది మాగధుల కైవారములతో నిద్రలేచే రాముడు ఈ నాడు క్రూరమృగముల అరుపులతో నిద్రలేవడం ఎంతటి దౌర్భాగ్యం. ఎవరికైనా చెబితే నమ్మేట్టుగా లేదు. అందరూ ఇదినిజం కాదు అని అంటారు.

నా మటుకు నాకు ఇదంతా ఒక కలలాగా అనిపిస్తూ ఉంది. కాని ఇది అంతా యదార్థము అని తెలిసిన నాడు మనస్సు తల్లడిల్లి పోతూ ఉంది. అంతా కాలమహిమ అని సరిపెట్టుకోక తప్పదు. ఎందుకంటే రాజాధిరాజులకంటే, వారి బలప్రతాపముల కంటే, కాలము బలవత్తరమైనది అనుట యదార్థము.

రాముడు సరే తండ్రి మాట ప్రకారము అరణ్యములలో కష్టములు పడుతున్నాడు. మరి జనకరాజ పుత్రి సీతకూడా రాముని తోపాటు కష్టములు అనుభవిస్తూ ఉంది కదా. దీనికి ఏమను కొనవలెను. అంతా విధివిలాసము అనుకోడం తప్ప.

అమ్మా! చూడండమ్మా! రాముడు, సీత పడుకొన్న ఈ గడ్డి శయ్య. ఈ శయ్యల మీద బంగారు ఆభరణముల చిహ్నాములు కనపడుతూఉన్నాయి. సీత ఈ శయ్యమీద తన ఆభరణములతోనే శయనించినట్టు ఉంది. సీత మహా పతివ్రత. భర్తతో పాటు ఉంటే కష్టములు కూడా ఆమెకు సుఖముల మాదిరి కనపడుతున్నట్టు ఉంది.

అయినా, నేను అనుకున్నట్టు, ఇందులో విధి విలాసము ఏమున్నది, నా కోసరము నా తల్లి చేసిన ఘాతుకము తప్ప. నేనే లేకపోతే నా తల్లి ఇంతటి ఘోరమునకు ఒడికట్టదు కదా! దీని కంతటికీ నేనే కారణము. నా వలననే రాముడు సీత లక్ష్మణుడు అరణ్యముల పాలయ్యారు. నా తండ్రి దశరథుడు అకాల మరణం చెందాడు. రాముడు ఇక్ష్వాకు వంశపు రాజు అయి ఉండి కూడా, తన రాజ్యమును సుఖములను త్యజించి నేడు ఇలా కటిక నేల మీదనిద్రిస్తున్నాడు.

రాముని అరణ్యములకు అనుసరించిన సీత, లక్ష్మణులు అదృష్టవంతులు. నేనే అదృష్టహీనుడను. రాముని విడిచి జీవచ్ఛవము మాదిరి బతుకుతున్నాను. లేక పోతే రాజు కావలసిన రాముడు అరణ్యములకు పోవడం ఏమిటి! మహారాజు మరణించడం ఏమిటి! ఈ రాజ్యభారము నా పాలబడటం ఏమిటి! నేను దిక్కుతోచకుండా ఈ అరణ్యములలో తిరగడం ఏమిటి!

అయినా రామునికి రాజ్యము, నాకు అరణ్యము సముచితమే. రాముడు అరణ్యములలో ఉన్నా రాజే. నేను అయోధ్యలో ఉన్నా అడవులలో ఉన్నట్టే. అందుకని నేను కూడా నారచీరలు ధరించి ఈ అడవిలోనే ఉంటాను. నాతో పాటు శత్రుఘ్నుడు కూడా అడవిలోనే ఉంటాడు. మేము ఇద్దరం జడలు కట్టుకొని మునివృత్తి అవలంబిస్తాము.

అయోధ్యలో రాజులేడు. సైన్యము లేదు. పరిపాలన లేదు. అరాచకం ప్రబలుతోంది. ఈ విషమ పరిస్థితులలో నైనా రాముడు సీతా లక్ష్మణ సమేతుడై అయోధ్యకు వచ్చి రాజ్యపాలన చేపట్టడా! ఈ మూలంగానైనా రాముడు రాజ్యపాలన చేపడితే అయోధ్యా ప్రజలే కాదు దేవతలు కూడా సంతోషిస్తారు.

అందుకే నేను ఒక నిశ్చయానికి వచ్చాను. రాముని వద్దకు పోయి నా తలను ఆయన పాదాల మీద పెట్టి అయోధ్యకు వచ్చి రాజ్యపాలన చేపట్టమని ప్రార్థిస్తాను. అప్పటికీ రాముడు ఒప్పుకోకపోతే నేను కూడా ఇక్కడే ఉండిపోతాను. రాముడు నన్ను కాదనడు. ఇదే

నా నిశ్చయము." అని ధృఢంగా అనుకున్నాడు భరతుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము ఎనుబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### (ఎనభై తొమ్మిదవ సర్గ.)

భరతుని మాటలకు అక్కడున్నవారికి దు:ఖము ఆగలేదు. ఏమనాలో తెలియక ఎవరి నివాసములకు వారు వెళ్లారు.

ఆరాత్రి అలా గడిచిపోయింది. మరునాడు సూర్యోదయము అయింది. భరతుడు శత్రుఘ్నునితో ఇలా అన్నాడు. "శత్రుఘ్నా! సూర్యోదయము అయింది. నిద్రలే. తొందరగా గుహుని ఇక్కడకు తీసుకొని రా. అతడు మన సైన్యమును గంగానదిని దాటిస్తాడు. మనకు కూడా గంగానదిని దాటడానికి తగిన ఏర్పాట్లు చేస్తాడు." అని అన్నాడు.

అప్పుడు శత్రుఘ్నుడు భరతునితో ఇలా అన్నాడు. "నేను నిద్రపోవడం లేదన్నయ్యా. అన్న రాముని గురించి ఆలోచిస్తూ కళ్లు మూసుకొనిపడుకున్నాను. నీ ఆదేశము ప్రకారము గుహుని తీసుకొని వస్తాను."అని పోబోయాడు. ఇంతలో గుహుడు అక్కడకు వచ్చాడు. ఇద్దరికీ నమస్కరించాడు.

"రాజకుమారులారా! మీకు మీసైన్యమునకు ఎలాంటి అసౌకర్యము కలగలేదు కదా! గంగాతీరమున మీరుసుఖంగా నిద్రించారుకదా!" అని కుశల ప్రశ్నలు వేసాడు గుహుడు.

"మిత్రమా! మాకు ఎలాంటి అసౌకర్యమూ కలగలేదు. మేము గంగానదిని దాటవలెను. మీ పరివారమునకు  చెప్పి మా అందరినీ గంగానది దాటించు."అనిఅన్నాడు.

వెంటనే గుహుడు తన నివాసమునకు వెళ్లాడు. తన పరివారమును అందరినీ పిలిచాడు. "భరతుని ఆదేశము ప్రకారము మనమందరమూ భరతుని ఆయన పరివారమును, సైన్యమును గంగానదిని దాటించవలెను.పడవలను సిద్ధం చేయండి." అని ఆదేశించాడు.

గుహుని ఆదేశము ప్రకారము ఐదువందల పడవలను సిద్ధం చేసారు. భరతుని కోసరము బాగా అలంకరింపబడిన స్వస్తికము అనే పడవను సిద్ధం చేసాడు గుహుడు. ముందుగా వసిష్ఠుడు మొదలగు బ్రాహ్మణులు ఆ పడవలో ఎక్కారు. తరువాత రాజ మాతలు ఎక్కారు. తరువాత భరతుడు, శత్రుఘ్నుడు ఎక్కారు. భరతుని వెంట వచ్చిన పరివారము, సైన్యములు వారి వారికి నియమింపబడ్డ పడవలలో ఎక్కారు. అందరూగంగానదిని క్షేమంగా దాటారు.

ఏనుగులు మొదలగు జంతువులు హాయిగా ఈదుకుంటూ ఆవల ఒడ్డుకు చేరాయి. మరి కొందరు ఔత్సాహికులు గంగానదిని ఈదుకుంటూ దాటారు.  అందరూ ప్రయాగ వనమును చేరుకున్నారు.

అందరినీ అక్కడవిడిది చేయమని చెప్పి, భరతుడు వసిష్ఠుడు

మొదలగు పురోహితులతో భరద్వాజ ఆశ్రమమునకువెళ్లారు. అందరూ ఫలవృక్షములతో నిండి ఉన్న భరద్వాజ ఆశ్రమము చేరుకున్నారు.

శ్రీమద్రామాయణము అయోధ్యాకాండము

ఎనుబది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( తొంభయ్యవ సర్గ.)

భరద్వాజ మహర్షి ఆశ్రమము క్రోసెడు దూరము ఉండగానే భరతుడు తన సేనలను పరివారమును అక్కడే ఆగిపొమ్మన్నాడు. ఆయుధములను విడిచిపెట్టాడు. తాను పట్టుబట్టలు ధరించాడు. కులగురువు వసిష్ఠుడు ముందు నడుస్తూ ఉండగా, తన మంత్రులు వెనక రాగా, కాలి నడకన భరద్వాజ మహర్షి ఆశ్రమమునకు వెళ్లాడు.

భరద్వాజుని ఆశ్రమము కనుచూపు దూరములో ఉండగానే మంత్రులను ఆగిపొమ్మన్నాడు. వసిష్ఠుడు వెంటరాగా ఆశ్రమమునకు వెళ్లాడు. వసిష్ఠుని చూడగానే భరద్వాజుడు సంభ్రమంతో ఎదురు వచ్చాడు. అర్ఘ్య పాద్యములు ఇచ్చిసత్కరించాడు. భరతుని ఆదరంతో ఆహ్వానించాడు. భరతునికి అర్ఘ్యము పాద్యము ఇచ్చాడు. ఇరువురికీ ఫలములు ఇచ్చాడు. భరతుని యోగక్షేమములు కనుక్కున్నాడు భరద్వాజుడు.

భరతుడు భరద్వాజునితో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! మేమంతా కుశలమే. మీరు మీ ఆశ్రమ వాసులు ఏ బాధా లేకుండా తపస్సు చేసుకుంటూ ఉన్నారు కదా!" అని అడిగాడు భరతుడు.

"మహారాజా! మాకు ఏ బాధా లేదు. ప్రశాంత జీవనము గడుపుతున్నాము. కానీ అయోధ్యలో ఉండి రాజ్యపాలన చేయవలసిన వాడివి, ఇలా అడవుల వెంట తిరగడానికి కారణమేమి? నీ అన్న రాముడు తండ్రి ఆదేశమును పాలించుటకు అరణ్యములకు వెళ్లాడు. అదినాకు తెలుసు. కాని నీవు ఇక్కడకు ఎందుకు వచ్చావు. రామునికి ఏదైనా అపకారము తలపెడుతున్నావా? లేకపోతే రాజ్యమును విడిచి ఇక్కడకు రావడానికి కారణమేమి?"అని అడిగాడు భరద్వాజుడు.

భరద్వాజుడు కూడా తనను అనుమానించడం చూచి తట్టుకోలేకపోయాడు భరతుడు. తన తల్లి చేసిన పాపపు పనికి తాను శిక్ష అనుభవిస్తున్నాడు అని అనుకున్నాడు మనసులో. భరద్వాజునితో ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! తమరు కూడా నన్ను అనుమానిస్తే నాకు ఇంక మరణమే శరణ్యము. రాముని అరణ్యవాసములో నా ప్రమేయము ఎంతమాత్రమూ లేదు. నన్ను నమ్మండి. ఆ సమయములో నేను అయోధ్యలో లేను. నేను లేని సమయమున నా తల్లి కైక నా తండ్రిని అనుచితములైన వరములు కోరి నాకు ఇంత చేటు తెచ్చిపెట్టినది. రాముని అడవులపాలు చేసినది. నాకు రాజ్యము లభిస్తుంది అని నాకు  ఎంత మాత్రము సంతోషముగా లేదు. నా తల్లి కోరికను నేను అనుమతించను.  ఆచరించను.

ప్రస్తుతము నేను ఇక్కడకువచ్చినకారణము....రాముని ప్రార్థించి, అర్థించి,  అయోధ్యకు తీసుకొని వెళ్లి ఆయనకు పట్టాభిషేకము జరిపించడం. అదే నా ప్రథమ కర్తవ్యం. కాబట్టి

రాముడు ప్రస్తుతము ఎక్కడ ఉన్నాడో నాకు తెలుపండి."అని అడిగాడు.

భరతుని మాటలు విన్న భరద్వాజుడు అతని పట్ల ప్రసన్నుడయ్యాడు.

"రాకుమారా! నీవు ఇక్ష్వాకు వంశములో పుట్టవలసినవాడవు. ధర్మాత్ముడవు. ధర్మము కోసరం అయాచితముగా వచ్చిన రాజ్యమును త్యజిస్తున్నావు. మరింత శ్లాఘనీయుడవు. నీ మనసులో మాట నాకు తెలియును. కానీ నీ శీలమును పదిమందికి తెలియజేయుట కొరకు ఆవిధంగా అడిగాను. ఇప్పుడు నీ ధర్మప్రవర్తన లోకమునకు వెల్లడి అయింది. రాముడు, లక్ష్మణుడు సీత ఎక్కడ ఉన్నారో నాకు తెలియును. ప్రస్తుతము వారు చిత్రకూట పర్వతము మీద నివసిస్తున్నారు. నీవు ఈరోజు ఇక్కడే విశ్రాంతి తీసుకొని రేపు చిత్రకూటమునకు వెళ్లవచ్చును." అని పలికాడు భరద్వాజుడు.

భరద్వాజుని మాట మన్నించి భరతుడు ఆ రాత్రికి ఆయన ఆశ్రమములోనే విశ్రాంతి తీసుకున్నాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొంభయ్యవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

( తొంభయ్యి ఒకటవ సర్గ.)

ఆ రాత్రికి భరద్వాజుడు భరతునికి అతని పరివారమునకు సేనలకు భోజన సదుపాయములను చెయ్యాలని అనుకున్నాడు. దానికి భరతుడు ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! మీరు వసిష్ఠుల వారికి, నాకూ అర్ఘ్యము పాద్యము ఫలములు ఇచ్చి సత్కరించారు కదా! అది చాలు నాకు." అని అన్నాడు.

"భరతా! నీవు ఏదీ కోరవు అని నాకు తెలుసు. కాని కాదనకుండా నా ఆతిధ్యము స్వీకరించు. నీవు నీ పరివారమును, సైన్యమును ఎందుకు దూరంగా ఉంచావు. మా ఆశ్రమమునకు తీసుకొని రావలసినది." అని అన్నాడు భరద్వాజుడు.

దానికి భరతుడు ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! తమ ఆశ్రమ ప్రశాంతతకు భంగము కలిగించడం ఇష్టం లేక, తమరి మీద ఉన్న భయ భక్తులతో నేను నాపరివారమును సైన్యమును దూరంగా ఉంచి వచ్చాను. అదీ కాకుండా రాజులు తమ మందీ మార్బలములను, మునులకు దూరంగా ఉంచాలని రాజధర్మము కదా! నా వెంట చతురంగ బలములు వస్తూ ఉన్నాయి. అవి ఇక్కడకు వస్తే ఇక్కడి వృక్ష

సంపద, జలసంపద కలుషితము అవుతాయి. అందుకని తీసుకొని రాలేదు." అని అన్నాడు భరతుడు.

దానికి భరద్వాజుడు నవ్వి "మాకు ఏమీ అసౌకర్యము లేదు. నీ సేనలను ఇక్కడకు రమ్మని చెప్పు" అని ఆదేశించాడు. ఆ ప్రకారము భరతుని సేనలు భరద్వాజుని ఆశ్రమము వద్దకు వచ్చాయి.

భరద్వాజుడు అగ్ని గృహములోనికి ప్రవేశించి భరతుని పరివారమునకు ఆతిథ్యము ఇచ్చుటకు విశ్వకర్మను ఆహ్వానించాడు. దేవేంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడుమొదలగు లోక పాలకులను ఆహ్వానించాడు. భూమి మీద ఉన్న నదులను ఆహ్వానించాడు. దేవతలను, గంధర్వులను, అప్సరసలను ఆహ్వానించాడు. స్వర్గము నుండి, బ్రహ్మలోకమునుండి దేవతా స్త్రీలను ఆహ్వానించాడు. కుబేరునికి, దివ్యమైన వస్త్రములను తీసుకు రమ్మని ఆదేశించాడు. చంద్రుని పిలిచి భరతుని పరివారమునకు సైన్యమునకు కావలసిన ఆహార పదార్థములను, భక్ష్యములను, పానీయములను, మాంసాహారములను, ఫలములను  సమకూర్చమని ఆదేశించాడు.

భరద్వాజుడు ఆహ్వానించిన దేవతలందరూ భరద్వాజుని వద్దకు వచ్చారు. ఆయన ఆదేశములు స్వీకరించారు. భరతునికి, ఆయన పరివారమునకు, సైన్యమునకు కావలసిన ఏర్పాట్లు చేసారు. వాయుడు మంద్రంగా వీచ సాగాడు. అప్సరసలు తమ నృత్యగానవినోదములతో వారిని ఆనందపరచసాగారు. విశ్వకర్మ ఆ రాత్రి వారందరూ ఉండటానికి ఒక విశాలమైన మందిరమును

సృష్టించాడు.

భరతుడు తన పురోహితుడు వసిష్ఠుడు, తమ్ముడు శత్రుఘ్నుడు, తన తల్లులతో ఆ భవనములోనికి ప్రవేశించాడు. ఆ భవనములో ఒక పెద్ద రాజ సభ అందులో ఒక సింహాసనము ఉంది. భరతుడు ఆ సింహాసనమునకు నమస్కరించి, తాను పక్కన ఉన్న ఆసనము మీద కూర్చున్నాడు. బ్రహ్మలోకము నుండి వచ్చిన స్త్రీలు, కుబేరుడు పంపగా వచ్చిన స్త్రీలు వారికి సేవలు చేయసాగారు. అప్సరసలు భరతుని తమ నృత్యగానవినోదములతో సంతోషపరచారు.

భరతుని వెంట వచ్చిన వారు. పరివారము, సైనికులు తిన్నంత తిని, తాగి మైమరచిపోయారు. ఆహా ఇంతటి విందు వినోదము తాము ఎప్పటికీ చూడలేము అని అనుకొన్నారు. తాము రాముని వద్దకు కానీ, అయోధ్యకు కానీ రాము. ఇక్కడే ఉంటాము అనితాగిన మత్తులో శపథాలు చేసారు.

తెల్లవారగానే అవేమీ ఉండవు. అంతా మిధ్య అని వారికి తెలియదు. సైనికులకే కాదు, వారి వాహనములు అయిన గుర్రములు ఏనుగులకు, ఒంటెలకు కూడా రుచికరమైన ఆహారము సమకూర్చబడింది. అడిగే వారు లేకపోవడంతో సైనికులు ఇష్టం వచ్చినట్టు తింటూ తాగుతూ స్వైరవిహారం చేసారు. అప్సరసలతో పాలు నృత్యం చేసారు. కేకలుపెడుతున్నారు.

(ఇక్కడ వాల్మీకి మహర్షి ఒక శ్లోకం రాసాడు. భరద్వాజుడు ఇచ్చిన ఆతిథ్యము ఆ మనుషులకు అనగా భరతుని పరివారమునకు,

సైనికులకు  స్వప్నంలో జరిగినట్టు ఉంది. ఆ రాత్రి గడవగానే అప్సరసలు అందరూ వచ్చిన వారు వచ్చినట్టుగానే వెళ్లిపోయారు.   తాగిన మత్తులో జోగుతున్న సైనికులు మాత్రం అక్కడ పడి ఉన్నారు. రాత్రి కనపడ్డ భవనాలు లేవు, ఆహార పదార్థాలు లేవు. పానీయాలు లేవు. అడవి అందులో చెట్లు ఉన్నాయి. ఈ ప్రపంచంలో మనము అనుభవించే సుఖాలు సంతోషాలు అన్నీ మిధ్య.  ఏవీ శాశ్వతాలు కావు. తెల్లవారగానే కరిగిపోతాయి. అని ఈ సన్నివేశాన్ని వివరించడం ద్వారా లోకానికి తెలియజెప్పాడు వాల్మీకి.)

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొంభయ్యి ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( తొంభయ్యి రెండవ సర్గ.)

మరునాడు తెల్లవారింది. భరతుడు భరద్వాజుని వద్దకు పోయి రాముని వద్దకు పోవుటకు ఆయన అనుమతి కోరాడు. అప్పుడే అగ్నికార్యము ముగించుకొని కూర్చుని ఉన్న భరద్వాజుని ఎదుట చేతులు జోడించి నిలబడ్డాడు భరతుడు.

"ఓ భరతా! నీవు నీ పరివారమూ రాత్రి సుఖంగా గడిపారా! మీకు మా ఆతిథ్యము సంతోషాన్ని కలిగించిందా! మీరు మా ఆతిథ్యముతో తృప్తి చెందారా!" అని అడిగాడు భరద్వాజుడు.

"మహర్షీ! తమరు మాకు ఇచ్చిన ఆతిథ్యము మాకు మా పరివారమునకు ఎంతో సంతోషము కలిగించింది. మా వారందరూ హాయిగా భుజించి నిద్రించారు. నేను నా రాముని వద్దకు పోవడానికి తమరి అనుమతి కోరుతున్నాను. రాముడు ఎక్కడ ఆశ్రమము నిర్మించుకున్నాడో, అది ఇక్కడికి ఎంత దూరం ఉన్నదో, అక్కడకు పోవడానికి మార్గము ఏమిటో తెలియజేయవలసినదిగా కోరుతున్నాను." అని అడిగాడు భరతుడు.

"ఓ భరతా! ఇక్కడికి మూడున్నర క్రోసుల దూరములో చిత్రకూటము అనే పర్వతము ఉంది. అక్కడే మందాకినీ నది ప్రహిస్తూ

ఉంది. అక్కడ ఒక నిర్జన ప్రదేశములో రాముడు పర్ణశాలను నిర్మించుకొని నివసిస్తున్నాడు. నీవు ఇక్కడినుండి నీ సేనలతో, పరివారముతో, దక్షిణముగా గానీ, నైఋతి దిశగా గానీ ప్రయాణం చేస్తే రాముని పర్ణశాలకు చేరుకుంటావు." అని చెప్పాడు భరద్వాజుడు.

ఇంతలో దశరథుని భార్యలు అక్కడకు చేరుకున్నారు. అందరూ భరద్వాజుని కాళ్లకు నమస్కరించారు.

"భరతా!నీ తల్లులను నాకు పరిచయం చెయ్యి" అని అడిగాడు భరద్వాజుడు.

"ఓ మహర్షీ! దీనంగా ఉండి ఉపవాసములతో శరీరం శుష్కింప చేసుకున్న ఈమె దశరథమహారాజు పట్టమహిషి కౌసల్యాదేవి. రాముని కన్న పుణ్యమూర్తి. ఆమెకు ఎడమ పక్కగా నిలబడి ఉన్న ఆమె లక్ష్మణ, శత్రుఘ్నుల తల్లి సుమిత్ర. వారి పక్కనే తలవంచుకొని ఉన్న ఆమె నా తల్లి కైకేయి. కోపస్వభావురాలు. ఏ మాత్రమూ వివేచన లేనిది. గర్విష్ఠి. అందము, ఐశ్వర్యము, అధికారమునకే ప్రాధాన్యం ఇస్తూ వాటి కోసరం ఏమి చెయ్యడానికైనా వెనుకాడని వ్యక్తి. ఈమె కారణంగానే నా అన్న రాముడు అడవుల పాలయ్యాడు. నా తండ్రి అకాలమృత్యువు వాత పడ్డాడు. నేను ఈనాడు పడుతున్న ఇన్ని బాధలకు ఈమెయే మూలకారణము."అని అన్నాడు భరతుడు.

భరతుని మాటలు సావధానముగా విన్న భరద్వాజుడు ఇలాఅన్నాడు. "ఓ భరతా! అలా మాట్లాడకూడదు. ఇందులో నీ తల్లి దోషము ఏమాత్రమూ లేదు. రాముని అరణ్యవాసము భవిష్యత్తులో

ఎన్నో శుభములకు సూచన మాత్రమే. నీ కైక కేవలము నిమిత్త మాత్రురాలు. రాముడు అరణ్యములకు రావడం వలన ఇక్కడ ఉన్న మునులకు, ఋషులకు, దేవతలకు హితము చేకూరుతుంది.' అని పలికాడు భరద్వాజుడు.

తరువాత భరతుడు ఆయనకు నమస్కరించి ప్రయాణము నకు సిద్ధం కమ్మని తన సైన్యమునకు ఆదేశాలు ఇచ్చాడు. అందరూ తమ తమ రథములను ఎక్కారు. సైన్యం కదిలింది. వారు దక్షిణ దిక్కుగా ప్రయాణం సాగించారు. కొండలు గుట్టలుదాటిప్రయాణము చేస్తున్నారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొంభయ్యి రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( తొంభయ్యి మూడవ సర్గ.)

మహాసముద్రము వలె ఉన్న భరతుని సైన్యము పరివారము ఆ అడవులలో ప్రయాణం చేస్తూ ఉంటే అడవిలో ఉన్న మృగములు భయపడి పారిపోతున్నాయి. ఆ సైన్యము నడిచేటప్పుడు రేగిన ధూళితో ఆకాశం ఎర్రగా కవురు వేసినట్టు అయింది. వారందరూ చిత్రకూట పర్వతమును సమీపించారు. భరతుడు వసిష్ఠునితో ఇలా అన్నాడు.

“మహాత్మా! పరిసరములను బట్టి చూడగా మనకు చిత్రకూటపర్వతమును సమీపించినట్టు కనపడు చున్నది. అదుగో అదే మందాకినీ నది. ఇక్కడ కిన్నరులుసంచరిస్తూ ఉంటారని ప్రతీతి.

(ఇక్కడ వాల్మీకి ఒక శ్లోకం రాసాడు. అదేమిటంటే----
కుర్వన్తికుసుమాపీడాన్ శిరస్సు సురభీనమీ।
మేఘప్రకాశై: ఫలకైర్దాక్షిణాత్యా యథానరా:॥
ఈపర్వత శిఖరములు, మేఘములతో సమానంగా, దాక్షిణాత్య నరుల వలె ప్రకాశిస్తున్నాయి. అని స్థూలంగా చెప్పుకోవచ్చు. దూరానికి మేఘములు, పర్వత శిఖరములు నల్లగాఉంటాయి. అంటే దక్షిణదేశ నరులు నల్లగా ఉంటారని మనం అనుకోవచ్చునా. అలా కాకపోతే, ఇక్కడ దాక్షిణాత్యుల ప్రసక్తి తీసుకురావడం ఎందుకు? ఉత్తరదేశస్థులు తెల్లగా ఆజానుబాహులుగా ఉంటారని మనకు తెలిసిందే. కాబట్టి మన

చరిత్రలో చెప్పినట్టు ఆర్యులు దస్యులు అనే రెండు తెగలు ఉన్నాయని స్పష్టం అవుతున్నట్టుగా ఉంది. ఇది కేవలము ఊహ మాత్రమే రూఢి కాదు.)

తరువాత భరతుడు శత్రుఘ్నుని చూచి "సోదరా! ఈ ప్రశాంత మైన అరణ్యమును చూస్తుంటే ఇక్కడ ఋషులు నివసిస్తున్నారు అని స్పష్టం అవుతోంది. ఇప్పుడు మనము రాముని పర్ణశాల కొరకు వెతకవలెను. మన సైన్యమును నలుదిక్కులకు పంపి రాముని జాడ కనుగొనమని చెప్పు."అని అన్నాడు.

భరతుని ఆదేశము మేరకు సైన్యము నలుదిక్కులకు వెళ్లారు. వారికి కొంచెం దూరంలో పొగ లేస్తున్నట్టు కనపడింది. వెంటనే వారు భరతుని వద్దకు వచ్చి "మహారాజా! ఈ అరణ్యములో ఆ ప్రదేశములో పొగవస్తోంది అంటే అక్కడ జనసంచారము ఉన్నట్టే. అక్కడే రామలక్ష్మణులు ఉండవచ్చు అని అనుమానంగా ఉంది. అలా కాకపోతే అక్కడ ముని ఆశ్రమములు ఉండవచ్చు. వారిని అడిగితే రాముని జాడలు చెప్పగలరు." అని అన్నారు.

భరతుడు వారితో ఇలా అన్నాడు. "మీరందరూ ఇక్కడే ఉండండి. నేను, వసిష్ఠుడు సుమంత్రుడు పోయి చూచి వస్తాము. అంతదాకా మీరు ఇక్కడే వేచి ఉండండి."అని అన్నాడు.

తరువాత భరతుడు ఆపొగవస్తున్న దిక్కుగా చూచాడు. చాలారోజుల తరువాత తాను రాముని చూడబోవుచున్నానని ఎంతో సంతోషించాడు భరతుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొంభయ్యి మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( తొంభయ్యి నాలుగవ సర్గ.)

భరతుడు రాముని గురించి వెతుకుతుంటే, రాముడు సీతతో కలిసి వనవిహారం చేస్తున్నాడు. సీతకు చిత్ర విచిత్రములైన మొక్కలను వృక్షములను చూపించి వాటి గురించి వివరిస్తున్నాడు.

"సీతా!ఇక్కడ ఉన్న సౌందర్యశోభలను, ఈ వనముల అందములను చూచిన తరువాత ఇక్కడి నుండి అయోధ్యకు పోవాలని అనిపించడంలేదు. ఈ పర్వతములు అనేకములైన ఓషధులకు, వన్యమృగములకు, పక్షులకు నిలయము. ఈ ప్రశాంత వాతావరణములో ఈ పర్వత శిఖరములను, వృక్షములను చూస్తూ ఎన్నాళ్లు ఉన్నా విసుగు అనిపించదు. ఈ అరణ్యములో వేప, మామిడి, నేరేడు, వేగిస, లోధ్ర, ప్రియాళ,పనస,చండ్ర, అంకోల, బిల్వ, తుమ్మ, వెదురు,కశ్మ, ఇప్ప, తిలక, బదరి, ఆమలక, పేము పొదలు, మద్ది మొదలగు వృక్షజాతులతో నిండి ఉన్నది.

(వాల్మీకి తన రామాయణకావ్యంలో ఆనాడు ఉన్న వృక్షజాతులను తరువాతి తరాల వారికి పరిచయం చేస్తున్నాడు.)

ఓ సీతా! అటు చూడు, కిన్నరులు, గంధర్వులు, విద్యాధరులు ఆ పర్వత శిఖరముల మీద జంట జంటలుగా విహరిస్తున్నారు. నేను ఈ

వనవాసము చేయడం వలన నా తండ్రి మాటను నిలబెట్టడం, భరతుని రాజ్యాభిషేకమునకు ఆటంకం తొలగి పోవడం లాంటి గొప్ప పనులు సాధించాను. దీని వలన నా పితృఋణము తీర్చుకున్నట్టు అయింది. నాతో పాటు నువ్వు కూడా నన్నుఅనుసరించి వచ్చి ఈ వనసౌందర్య మును ఆస్వాదించడం నాకెంతో ఆనందాన్ని కలిగించింది. రాజులకు మరణానంతరము ఉత్తమ లోకములు లభించుటకు వనవాసమే ఉ త్తమైనది అయి పూర్వపు రాజర్షులు చెప్పి ఉన్నారు కదా!

సీతా! ఈ చిత్రకూటపర్వతము మీద ఎన్నోఓషధులు ఉ న్నాయి. ఆ ఓషధుల మీది నుండి వీచే గాలి అన్ని రోగములను పోగొడుతుంది అని పెద్దలుచెబుతారు. సీతా! అటు చూడు! ఇక్కడ కొన్ని ప్రదేశములు సహజముగా ఏర్పడిన ఉద్యానవనముల మాదిరి, మరి కొన్ని పూపొదరిళ్లు గృహముల మాదిరి, కనపడుతున్నాయి కదా! ఈ చిత్రకూట పర్వతము భూమిని చీల్చుకొని పైకి వచ్చినట్టు ఎలా గర్వంగా నిలబడిఉన్నదో చూడు! ఇక్కడ

కామాతురు లైన స్త్రీపురుషులు, ఈ నిర్జన ప్రదేశములలో కుష్ఠ, పున్నాగ, భూర్జర చెట్ల ఆకులతో శయ్యలు ఏర్పరచుకొని ఉన్నారు చూడు. ఆ కాముకులు నలిపి పారవేసిన పూలమాలలు, తినగా మిగిలిన ఫలములు అక్కడక్కడా పడి ఉన్నాయి చూడు." అని చిత్రకూటపర్వత విశేషములను సీతకు రాముడు చూపిస్తున్నాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొంభయ్యి నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( తొంభయ్యి ఐదవ సర్గ.)

రాముడు సీతతో కలిసి మందాకినీ నదీ తీరంలో విహరిస్తున్నాడు.

“సీతా! ఈ మందాకినీ నదీతీరము చూడు. ఎంత సుందరముగా ఉన్నదో! ఆఇసుక తిన్నెలు, నదీజలములలో ఈదుచున్న హంసలు, పైన ఎగురుచున్న సారస పక్షులు, జలముల మీద తేలుచున్న పద్మములు ఎంత శోభాయమానముగా ఉన్నవో చూడు! అదుగో ఆ లేళ్ల గుంపులు నదీజలములు తాగుటకు ఎలా వస్తున్నాయోచూడు! ఆవల తీరమున ఋషులు మందాకినీ నదిలో స్నానం చేస్తున్నారు. మరికొందరు సూర్యోపాసన చేస్తున్నారు. సీతా! ఆ చక్రవాక పక్షులు ఎంత మధురంగా కూయుచున్నవో.

ఇంతటి మనోహరముగా ఉన్న ఈ నదీప్రాంతమును విడిచి వెళ్లుటకు మనసు రాకున్నది. అయోధ్య కన్నా ఇక్కడే బాగుంది కదూ! సీతా నీవు కూడా ఈ నదిలో దిగి జలక్రీడలు ఆడుతావా! ఈ చిత్రకూట పర్వతమే అయోధ్య అనుకో. ఈ మందాకినీ నది సరయూనది. హాయిగా నదిలో దిగి జలకాలాడు. నీవు, లక్ష్మణుడు, తోడుగా ఉండగా ఇంతటిసుందర ప్రదేశములలో విహరిస్తూ నేను అయోధ్యనే మరిచిపోతున్నాను. ప్రస్తుతము నాకు అయోధ్య మీద కాని, ఆ

రాజ్యము మీద కానీ ఆసక్తి లేదు.ఇక్కడే ఉండాలని ఉంది." అని అన్నాడు రాముడు.

(ఇక్కడ ఒక చిన్న విషయం గమనించాలి. రాముడి గురించి వారి వనవిహారము గురించి వాల్మీకి ఇంతగా రాయాల్సిన పనిలేదు. దీని వెనక ఏదో చెప్పాలని ఆయన తాపత్రయం. ఈరోజుల్లో ఉన్న ఊరి నుండి మరో ఊరికి ట్రాన్సఫర్ అయితే చాలు ప్రపంచం మొత్తం మునిగిపోయినట్టు బాధపడుతుంటారు కొందరు. ఉన్న ఊరు వదలడానికి తెగ బాధపడిపోతుంటారు. మరి కొంతమందికి ఏ ఊరిలో ఎన్ని సౌకర్యాలు ఉన్నా తృప్తి ఉండదు. ఏం ఊరు వెధవ ఊరు అని తిడుతూ ఉంటారు.  అటువంటి వారికి రాముని వనవాసము ఒక గుణపాఠము.

రాముడు అయోధ్యకు యువరాజు. పుట్టినప్పటినుండి ఎన్నో రాజభోగములు అనుభవించాడు. విధివశాత్తు అరణ్యవాసం చెయ్యాల్సివచ్చింది. సంతోషంగా అడవులకు వచ్చాడు. అరణ్యములోనే సుఖాలను వెతుక్కుంటున్నాడు. అరణ్యమునే అయోధ్యగా మార్చుకున్నాడు. పైగా అరణ్యములోనే ఎక్కువసుఖం ఉందని మనసుకు నచ్చచెప్పుకుంటున్నాడు. ఉన్నదానినతో తృప్తి చెందుతున్నాడు. నిరాశకు నిస్పృహకు చోటు ఇవ్వలేదు.

'బాధే సౌఖ్యమనే భావన రానీవోయ్' అని ఒక సినీ కవి అన్నట్టు, బాధలలో కూడా సుఖాలను వెతుక్కోవడం మానవులకు అలవడాలి. అప్పుడే జీవితం సుఖమయమవుతుంది. ఈ జీవితసత్యాన్ని

రాముడు తాను అనుభవించి మనకు తెలియజేస్తున్నాడు. అని నా భావన. అందుకే రాముడు దేవుడు అయ్యాడు.)

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొంభయ్యి ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( తొంభయ్యి ఆరవ సర్గ.)

ఆ విధంగా మందాకినీ నదీతీరములో ఆనందముగా విహరిస్తున్న సీతా రాములకు, భరతుని సైన్యము వచ్చునప్పుడు రేగిన ధూళి కనపడింది. సేనలు వచ్చునపుడు పుట్టే ధ్వనులు, ఏనుగుల ఘీంకారములు, అశ్వముల పదఘట్టనములు, సైనికుల కోలాహలము రామునికి లీలామాత్రంగా వినపడ్డాయి. ఆ సైన్యముల రాకతో భయపడి పారిపోతున్న మృగములను కూడా చూచాడు రాముడు.

రాముడు వెంటనే లక్ష్మణుని పిలిచాడు. "లక్ష్మణా! .జాగ్రత్తగా విను. ఏదో మహో సైన్యము వచ్చుచున్న సవ్వడి వినిపించడంలేదూ! ఆ ఏనుగుల ఘీంకారములు, సైనికుల పదఘట్టనములు, గుర్రముల సకిలింపులు, సైన్యములకు బెదిరి పారిపోవు అడవిమృగములు--ఇవన్నీ చూస్తుంటే ఏదో మహాసైన్యముఇక్కడకు వస్తున్నట్టు కనపడుతూఉంది. ఇక్కడకు సైన్యము రావడం ఆశ్చర్యం గా ఉంది. ఎవరైనా రాజ కుమారుడు ఈ అరణ్యమునకు వేట నిమిత్తము వచ్చాడా! లేక ఏదైనా భయంకర మృగముల దండు ఈ అరణ్యములోని ప్రవేశించిందా! నీవు పోయి దాని విషయం కనుక్కోనిరా."అని అన్నాడు రాముడు.

వెంటనే లక్ష్మణుడు పోయి ఒక పొడుగాటి సాలవృక్షమును ఎక్కాడు. నలుదిక్కులా చూచాడు. తూర్పు దిక్కునుంచి వస్తున్న ఒక

రథ, గజ, తురగ, పదాతి దళములతో కూడిన మహా సైన్యము కనపడింది. లక్ష్మణుడు వెంటనే చెట్టు దిగి వచ్చి ఆ సైన్యము రాక గురించి రామునికి చెప్పాడు.

వెంటనే రాముడు తగుజాగ్రత్తలు తీసుకున్నాడు. బయట మండుతున్న అగ్నిని ఆర్పివేసారు. సీతను ఒక గుహలో దాచిపెట్టారు. రామలక్ష్మణులు ఇద్దరూ తమతమ వింటినారిని సంధించారు. అమ్ములపొదులను సరిచేసుకున్నారు.  కవచములను ధరించారు.

మరలా రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఆసేన ఎవరిదో ఆనవాలు పట్టగలవా!" అని అడిగాడు.

మరలా లక్ష్మణుడుచెట్టు ఎక్కి పరిశీలనగా పతాకములను చూచి అవి అయోధ్యానగరపతాకములు అని గుర్తించాడు. చెట్టు దిగివచ్చి "అన్నయ్యా! అది భరతునిసేన. భరతుడుసేనా సమేతంగా ఇక్కడకు వస్తున్నాడు. భరతుడు తన మార్గమును నిష్కంటకము చేయదలచుకొని మనలనిద్దరినీ చంపడానికి వస్తున్నాడని నా ఊహ. ఆ రథము మీద అయోధ్య రాజ చిహ్నమగు కోవిదార వృక్షము గల పతాకము ఎగురుతూ ఉంది.

రామా! మనము ఇద్దరమూ ఇక్కడే ఉందామా! లేక పర్వతశిఖరములు ఎక్కి అక్కడ పొంచి ఉందామా! ఈ భరతుడు మనలను ఇక్కడ కూడా సుఖంగా ఉండనీయక తన సైన్యముతో మనమీదకు దాడి వస్తున్నాడు. ఏం చేద్దాము? రామా! ఎవరి కొరకు కైక నిన్ను అడవులకు పంపిందో, ఆ భరతుడు నీ మీదికి వస్తున్నాడు.

కాబట్టి భరతుడు మనకు శత్రువు. శత్రుడైన భరతుడు చంపతగ్గవాడు. భరతుడు నీ రాజ్యము అపహరించి నీకు అపకారమే చేసాడు. కాబట్టి అతనిని చంపుటలో దోషము ఏమీ లేదు.

నేను భరతుని సంహరిస్తాను. నీ రాజ్యము నీకు ఇప్పిస్తాను. అడవులలో ఉన్న మనలను వదలకుండా, భరతుడు మన మీదికి వచ్చినపుడు అతనిని సంహరించడంలో తప్పులేదు కదా! దీనితో కైకకు తగినశాస్తి జరుగుతుంది. నాచే చంపబడిన భరతుని చూచి కైక కుళ్లి కుళ్లి ఏడవాలి. అలా ఏడుస్తున్న కైకను కూడా నిర్దాక్షిణ్యంగా సంహరిస్తాను. దానితో పాపశేషము తొలగిపోతుంది. పాపాత్ముల నుండి భూదేవికి విముక్తి కలుగుతుంది. నాడు నిన్ను అడవులకు పంపునపుడు నాకు వచ్చిన కోపము ఈ రోజుతో చల్లారుతుంది. మన శత్రువుల రక్తంతో ఈ చిత్రకూట పర్వతమును తడిపివేస్తాను. భరతుని చతురంగ బలముల శవాలతో ఈ అడవిలో ఉన్న క్రూరమృగములు విందు చేసుకుంటాయి. నేను ఈ ధనుర్బాణములు ధరించినందుకు, భరతుని సేనలను చంపి వాటి ఋణం తీర్చుకుంటాను. ఇందుకుసందేహము లేదు."అని పౌరుషంగా పలికాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొంభయ్యి ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( తొంభయ్యి ఏడవ సర్గ.)

భరతుని మీద కోపంతో ఊగిపోతున్న లక్ష్మణుని చూచి రాముడు ఇలా అన్నాడు. "లక్ష్మణా! శాంతించు. తొందర పడకు. వచ్చేవాడు భరతుడు అని నువ్వే చెప్పావు. భరతుడు మన సోదరుడు. పైగా ధర్మాత్ముడు. ఇప్పుడు మనకు కత్తులతోనూ విల్లుతోనూ అస్త్ర శస్త్రములతోనూ పని ఏమున్నది. నేను నా తండ్రి ఆజ్ఞను పాటించుటకు అరణ్యములకు వచ్చాను. ఇప్పుడు భరతుని చంపి ఆ రాజ్యమును ఏమి చేసుకుంటాను. ఎందుకంటే నేను14 సంవత్సరముల దాకా రాజ్యపాలన చేయలేను కదా. అదీకాకుండా సోదరుని చంపితే వచ్చేరాజ్యము విషము వంటిది. దానిని నేను ముట్టను.

మరొక విషయం. నేను ఈ రాజ్యమును కోరుతున్నానుఅంటే అది మీ కొరకే గానీ నాకు కాదు. నాకు ఏమీ అక్కరలేదు. ఈ పదునాలుగు సంవత్సరముల తరువాత కూడా నేను మీ కొరకు మాత్రమే రాజ్యపాలన చేస్తాను. నాకు రాజ్య కాంక్ష ఏ మాత్రమూ లేదు. ఇది నా ప్రతిజ్ఞ. మరొక మాట. నేను కావాలి అనుకుంటే శత్రువుల నందరినీ సమూలంగానాశనం చేసి రాజ్యము కైవసము చేసు కోగలను. కానీ అది నాకు ఇష్టం లేదు. ఎందుకంటే అధర్మపరంగా వచ్చే

ఇంద్రపదవి కూడా నాకు ఇష్టం లేదు. అయినా మీకు లేని సుఖము నాకు ఎందుకు. భరతుడు, శత్రుఘ్నుడు, లేని రాజ్యము నాకు ఎందుకు. కాబట్టి శాంతించు. అసలు విషయం తెలుసుకో.

నా ఊహ ప్రకారము భరతుడు తన మాతామహుల ఇంటి నుండి తిరిగి వచ్చి, తన తల్లి మూలంగా మనము అరణ్యములకు వెళ్లినట్టు తెలుసుకొని, తిరిగి మనలను అయోధ్యకు తీసుకొని వెళ్లుటకు వచ్చిఉంటాడు. ఎందుకంటే మన కులధర్మము ప్రకారము జ్యేష్టుడే రాజు కావలయును కదా. అందువలన భరతుడు పట్టాభిషేకమునకు అంగీకరించడు. కేవలము మనలను చూచుటకే వస్తూఉంటాడు.

అదీకాకుండా తన తల్లి మూలంగా ఇది అంతా జరిగింది అని తెలుసుకొని నన్ను తిరిగిఅయోధ్యకు తీసుకొనివెళ్లి పట్టాభిషేకము జరిపించవలెనని నా రాజ్యము తిరిగి నాకు ఇవ్వవలెననే ఉద్దేశ్యముతోనే వస్తూ ఉంటాడు. కాబట్టి భరతుడు మనకు కలలో కూడా అపకారము తలపెట్టడు.

అదీకాకుండా లక్ష్మణా! భరతుని సంగతి నీకు తెలియదా! ఇంతకు పూర్వము భరతుడు నీకు ఎప్పుడైనా ఎలాంటి అపకారమైనా చేసాడా! ఇలాంటి భయమును కలిగించాడా! లేదు కదా. మరి ఇప్పుడు ఎందుకు భరతుడు మనకు అపకారము చేస్తాడు అని భయపడు తున్నావు. కాబట్టి భరతుని ఒక్క మాట కూడా అనకు. ఎందుకంటే భరతుని తిడితే నన్ను తిట్టినట్టే.

మరొక మాట ఈ లోకంలో ఎవరైనా ఎంతటి ఆపదలో ఉన్నా కన్న తండ్రిని, తోడబుట్టిన సోదరులను చంపుకుంటారా! పోనీ నీవు రాజ్యము కావలెనని కోరుకుంటూ ఉంటే చెప్పు. భరతునితో చెప్పి అయోధ్యను నా బదులు నీకు ఇప్పిస్తాను. హాయిగా రాజ్యము ఏలుకో. ఎందుకంటే, 'భరతా! ఈరాజ్యము లక్ష్మణునికి ఇమ్ము' అని అనగానే భరతుడు సంతోషంగా నీకు రాజ్యము ఇస్తాడు. ఆ నమ్మకము నాకు ఉంది. చెప్పు నీకు రాజ్యము కావాలా!" అని అడిగాడు రాముడు.

లక్ష్మణుడు తన అవివేకపు మాటలకు సిగ్గుతో తల దించుకున్నాడు.

"లక్ష్మణా! అసలు విషయం ఏమిటంటే, భరతుడు రాగానే, మన తండ్రి దశరథుడు, భరతుని వెంటబెట్టుకొని మనలను చూడటానికి వస్తున్నాడు అని అనుకుంటున్నాను. అంతే కాదు, మనము పడుతున్న కష్టములను చూచి, మనలను తిరిగి అయోధ్యకు ఆహ్వానించుటకు వస్తున్నాడేమో అని కూడా అనుమానంగా ఉంది. ఒక వేళ మనము అయోధ్యకు రావడానికి ఇష్టపడక పోతే, కనీసము సీతనైనా తన వెంట తీసుకొని వెళతాడు దశరథుడు.

లక్ష్మణా! అటుచూడు అది మన తండ్రిగారి భద్రగజము కదా! మంద్రగమనంతో ఇటే వస్తూ ఉంది. కాని ఆగజము మీద మన తండ్రి గారి చిహ్నమైన తెల్లటి గొడుగు ఉండాలే. అది కనపడటం లేదు. ఏమయి ఉంటుంది. తండ్రిగారు వస్తుంటే ఆయనవెంట రాజచిహ్నమైన శ్వేతఛత్రము తప్పనిసరిగా ఉంటుంది కదా! అంటే తండ్రిగారు రావడం లేదా! భరతుడు ఒక్కడే వస్తున్నాడా! సరేలే.నువ్వు ఇక్కడే ఉండు.

నేనుచెప్పువరకూ కదలకు."అని ఆదేశించాడు రాముడు.

ఇక్కడ ఇలా ఉంటే, అక్కడ భరతుడు తన సేనలకు ఆజ్ఞఇచ్చాడు. "ఇక్కడ రాముని ఆశ్రమము ఉంది. ఆ ఆశ్రమము వద్ద శాంతికి భంగము కలగకూడదు. కాబట్టి సైన్యము అంతా ఈ పర్వతము చుట్టు విడిది చేయండి." అని ఆజ్ఞాపించాడు. భరతుని ఆజ్ఞ ప్రకారము భరతుని సైన్యము చిత్రకూట పర్వతము చుట్టూ ఆవరించింది.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము తొంభయ్యి ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( తొంభయ్యి ఎనిమిదవ సర్గ.)

భరతుడు తనసేనలను చిత్రకూట పర్వతము చుట్టు నిలిపి, రాముని వెతుక్కుంటూ కాలినడకన బయలుదేరాడు. శత్రుఘ్నుని చూచి ఇలాఅన్నాడు.

"శత్రుఘ్నా! నీవుకొంత మంది సైనికులను, ఆటవికులను తీసుకొని, ఈఅరణ్యములో రాముని ఆశ్రమము ఎక్కడ ఉందో వెతుకు. గుహుడు తన పరివారముతో మరియొక పక్కనుండి వెతుకుతాడు. నేను కూడా నా పరివారముతోనూ, వసిష్ఠులవారితోనూ బ్రాహ్మణులతో కలిసి మరొక పక్కనుండి వెతుకుతాను. ఆ రాముని దర్శనభాగ్యము ఎవరికి కలుగుతుందో వారుఅదృష్టవంతులు.. రాముని చూచేటంత వరకూ నాకు మనశ్శాంతి లేదు.

రాముని చూచిన వెంటనే ఆయన పాదముల మీద నా తలపెట్టి నా కన్నీటితో ఆయన పాదములకు అభిషేకము చేసెదను. రాముడు తిరిగి అయోధ్య వచ్చి తన రాజ్యమును స్వీకరిస్తాను అని చెప్పేవరకూ నేను ఆయన పాదములు వదలను. రాముని పక్కనే ఉండి రాముని ముఖకమలమును సర్వదా దర్శించు లక్ష్మణుడు ఎంతటి అదృష్టవంతుడో కదా!

అన్ని కష్టములకు ఓర్చి రాముని అనుసరించిన మా వదిన సీతమ్మ కృతార్థురాలు. రాముడు తిరుగాడు ఈ పర్వతము, ఈ వనములు, ఈ నది ఎంతో పుణ్యము చేసుకొన్నాయి. లేకపోతే ఎక్కడో అయోధ్యలో ఉండవలసిన రామపాద స్పర్శ వీటికి లభిస్తుందా." అని ఆ పరిసరముల యొక్క శోభను పొగుడుతూ భరతుడు రాముని వెదకడానికి ఉపక్రమించాడు.

పర్వత చరియలు,చెట్లు,పుట్టలు కొండగుహలు అన్నీ గాలిస్తున్నాడు. వారంతా ఒక పెద్ద సాలవృక్షము వద్దకు వచ్చారు. వారికి గాలిలోకి లేస్తున్న పొగ కనపడింది. అక్కడ ఏదో ఆశ్రమము ఉండవచ్చు అని అనుకున్నారు. అది రాముని ఆశ్రమము అక్కడ రాముడు ఉంటాడు అని మనసులో రూఢిగా అనుకున్నాడు భరతుడు. ఇంతలో గుహుడు కూడా అక్కడకు వచ్చాడు. భరతుడు గుహునితో కలిసి రాముని ఆశ్రమము వద్దకు కాలి నడకన వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము తొంభయ్యి ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( తొంభయ్యి తొమ్మిదవ సర్గ.)

శత్రుఘ్నుడు తన వెంటరాగా భరతుడు వడి వడి గా రాముని వద్దకు వెళుతున్నాడు. భరతుని వెనక వసిష్ఠుడు, దశరథుని ముగ్గురు భార్యలను తీసుకొని వెళుతున్నాడు. సుమంత్రుడు కూడా భరతుని వెనుకనే వెళుతున్నాడు.

భరతునికి దూరంగా ఒక పర్ణశాల కనపడింది. ఆ పర్ణశాల ముందు కొన్ని కట్టెలు,పుష్పములు కనపడ్డాయి. అక్కడ ఉన్న చెట్లకు కొన్ని నారచీరలు వేలాడుతున్నాయి. రాముడు అక్కడే ఉన్నాడు అని రూఢి అయింది భరతునికి. ఉద్వేగంతో వెళుతున్నాడు భరతుడు.

"శత్రుఘ్నా! చూచావా! ఇదే భరద్వాజుడు చెప్పిన ప్రదేశము. ఇక్కడే మందాకినీ నదిప్రవహించుచున్నది. ఇక్కడి చెట్లకు నారచీరలు వేలాడుతూ ఉన్నాయి. అదుగో ఆపర్ణశాల దగ్గర ఉన్న అగ్నినుండిపుట్టిన పొగ పైకి లేస్తూ ఉంది. రాముడు ఇక్కడే ఉన్నాడు అని నా అనుమానము. మనము ఇక్కడే రాముని చూస్తాము.

సుమంత్రా! అయోధ్యా సింహాసనముమీద కూర్చోవలసిన రాముడు ఇక్కడ కటిక నేల మీద పద్మాసనము వేసుకొని కూర్చొని ఉన్నాడు. దీని కంతటికీ నేనేకారణము. నా మూలముననే రామునికి

ఇన్ని కష్టములు వచ్చినవి. నేను, రాముడు సీత పాదముల మీద పడి క్షమాపణ కోరిన కాని నా మనసు శాంతించదు." అని అంటూ భరతుడు దూరంగా ఉన్న ఆ పర్ణశాల వైపు నడుస్తున్నాడు.

భరతుడు ఆ పర్ణశాలను సమీపించాడు. భరతుని మనస్సంతా ఉద్వేగపూరితంగా ఉంది. ఆ పర్ణశాల లోపలికి తొంగి చూచాడు. జటలు కట్టిన వెంట్రుకలతో, నేల మీద జింక చర్మము పరచుకొని దాని మీద కూర్చుని ఉన్న రాముని చూచాడు భరతుడు. రామునికి అటు ఇటు సీత లక్ష్మణులు కూర్చొని ఉన్నారు.

భరతునికి దు:ఖము పొంగుకొని వచ్చింది. రాముడి దగ్గరకు పరుగెత్తుకొని వెళ్లాడు. భరతుని కళ్లనిండా నీళ్లు తిరిగాయి. కళ్లు సరిగా కనిపించడం లేదు. దు:ఖముతో గొంతు బొంగురుపోయింది. ఆ బొంగురుగొంతుతో భరతుడు ఇలా అన్నాడు.

"రామా! నీవా ఈ నేలమీద కూర్చొని ఉన్నది. అమాత్యులు సేవిస్తూ ఉంటే, రాజ సింహాసనము మీద కూర్చోవలసిన నీవు జింక చర్మమీద కూర్చొని ఉన్నావా! పట్టు పీతాంబరములు ధరించవలసిన నీవు నారచీరలు కట్టుకొని ఉన్నావా! చిత్ర విచిత్రములైన పుష్పములు ధరించవలసిన నీ శిరస్సు మీద ఆ జటలు ఎలా ధరించావు? ఒక రాజుగా యజ్ఞయాగములు చేయవలసిన నీవు, ఇక్కడ అడవులలో కష్టములు పడుతున్నావా? అగరు, చందనముతో అలరార వలసిన నీ శరీరము మట్టికొట్టుకొని పోయినదా! సుఖపడవలసిన నీవు ఇలా కష్టములు పడుతుంటే ఆ కష్టములకు కారణమైన నాకు ఈ సుఖములు ఎందుకు?"అని ఏడుస్తూ రాముని పాదముల మీద

పడ్డాడు భరతుడు. రాముని పాదములను తన కన్నీటితో తడుపుతున్నాడు.

ఒక సారి తల ఎత్తి రామా! అని పిలిచి మరలా రాముని పాదముల మీదపడిపోయాడు భరతుడు. తరువాత భరతునికి మాటలు రాలేదు. బిగ్గరగా ఏడుస్తున్నాడు. శత్రుఘ్నుడు కూడాదు:ఖము ఆపుకోలేక రాముని పాదముల మీద పడ్డాడు.

రాముడు తమ్ములను చూచిన సంభ్రమంతో  భరత శత్రుఘ్నులను తన రెండు చేతులతో పొదివి పట్టుకొని లేవనెత్తాడు. రాముడు భరత శత్రుఘ్నులను గట్టిగా తన హృదయానికి హత్తుకున్నాడు, రామునికి కూడా దు:ఖము ఆగలేదు. భోరున విలపిస్తున్నాడు.

ఇంతలో వెనుకగా వస్తున్న సుమంత్రుడు, వసిష్ఠుడు కూడా పర్ణశాల లోపలికి వచ్చారు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము తొంభయ్యి తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

( నూరవ సర్గ.)

భరతుడు మరలా రాముని పాదాల మీదకు జారిపోయాడు. రాముని పాదాలు తన కన్నీటితో కడుగుతున్నాడు. రాముడు వాత్సల్యముతో భరతుని రెండు చేతులతో పైకి లేవనెత్తాడు. తన తొడమీద కూర్చోపెట్టుకున్నాడు. భరతుని కళ్లు తుడిచాడు. శిరస్సు ముద్దుపెట్టుకున్నాడు.

"భరతా! నీవు ఒంటరిగా ఈ అరణ్యములకు ఎందుకు వచ్చావు? తండ్రిగారు దశరథమహారాజుగారు రాలేదా!ఆయన ఎక్కడికి వెళ్లారు? నీవు ఒంటరిగా ఎందుకు వచ్చావు? ఎందుకంటే తండ్రిగారు జీవించి ఉండగా నా కొరకు అరణ్యములకు రావలసిన అవసరము నీకు లేదు కదా! మన వివాహముల తరువాత నీవు నీ మాతామహుల ఇంటికి వెళ్లావు. మరలా ఇన్నాళ్లకు నిన్ను చూడగలిగాను. నాకు చాలాసంతోషంగా ఉంది.

కాని నీవు అరణ్యములకు రావలసిన అవసరమేమి ఉన్నదో నాకు తెలియడం లేదు? తండ్రి గారు క్షేమముగా ఉన్నారా! నేను అడవుల పాలు అయ్యాను అన్న దు:ఖంతో స్వర్గస్థులు కాలేదు కదా! లేకపోతే నీవు చిన్నవాడవు, రాజ్యము చేయుటకు అర్హుడవు కావు అని నీ తండ్రిగారు నీకు రాజ్యము ఇచ్చుటకు నిరాకరించలేదు కదా!

ఏకారణము చేత నీవు ఇక్కడకు వచ్చావో తెలియజెయ్యి.

భరతా! నేను అనవసరంగా ఏదేదో ఊహించు కుంటున్నాను. తండ్రిగారు క్షేమంగా ఉన్నారని అనుకుంటున్నాను. నీవు ఆయనకు ప్రతిరోజూ సేవలు చేస్తున్నావు కదా! నాకే ఆ భాగ్యము లేదు.

మన పురోహితుల వారు వసిష్ఠుల వారు క్షేమంగా ఉన్నారా. నీవు ప్రతిరోజూ ఆయనను పూజిస్తున్నావు కదా! నా తల్లులు కౌసల్య, సుమిత్ర కైకేయి క్షేమంగా ఉన్నారు కదా! మన పురోహితులు, వారి కుమారుడు నీకు సర్వవేళలా అండగా ఉంటూ నీచేత అగ్ని కార్యములు, హోమములు చేయిస్తున్నారు కదా! నీకు ధర్మాధర్మములను బోధిస్తున్నారు కదా!

నీవు దేవతలను, పితరులను, తల్లి తండ్రులను, గురువులను ప్రతిరోజూ పూజిస్తున్నావు కదా! బ్రాహ్మణులను, వృద్ధులను ఆదరిస్తున్నావు కదా! మనకు అస్త్రవిద్య చెప్పిన గురువు సుధన్వుని తగురీతిలో సత్కరిస్తున్నావు కదా!

నీవు రాజ్యాభిషిక్తుడవు అయిన తరువాత నీతిమంతులు, బుద్ధిమంతులు, విద్యావంతులు, రాజనీతి విశారదులనే మంత్రులుగా నియమించావు కదా! ఎందుకంటే, మంత్రులు రాజనీతికోవిదులు, రాజుయొక్క రహస్యములను కాపాడకలిగిన వారు అయిఉండడం ఎంతో ముఖ్యం. (ఈ నాడు కూడా మంత్రుల చేత ఓత్ ఆఫ్ సీక్రెసీ ప్రమాణం చేయించడం ఆచారం).

భరతా! నీ పాలన ఎలా ఉంది! జాగరూకతతో ఉంటున్నావా లేక సమయం కాని సమయాలలో నిద్రపోతున్నావా! రాజుకు నిద్ర చేటు తెస్తుంది. సదా జాగరూకుడవై ఉండాలి. నీవు ఎల్లప్పుడూ తెల్లవారు జామున లేచి మంత్రాంగములు మంత్రులతో చర్చించాలి. అప్పుడు ఏకాంతము లభిస్తుంది. మరొక మాట! నీవు ఒక్కడివే ఆలోచించి నిర్ణయం తీసుకోడమూ తప్పు. అలాగని ఎక్కువమందితో ఆలోచించడము కూడా తప్పే. ఎందుకంటే నీ ఆలోచనలు అందరికీ తెలిసే ప్రమాదం ఉంది.

భరతా! ఎల్లప్పుడూ తక్కువ శ్రమతో ఎక్కువ ఫలితాన్ని ఇచ్చేపనులకు ప్రాధాన్యం ఇవ్వాలి. అటువంటి పనులను ఆలస్యం చేయకుండా వెంటనే చేయాలి. కాని ఒక విషయంలో జాగ్రత్త వహించాలి. నీవు ఒక పనినిపూర్తి చేసిన తరువాతనే దానిని బహిరంగ పరచాలి. అంతేగానీ, చేయబోయే పనులను ఎవరికీ తెలియనీయ కూడదు. ఎందుకంటే నీ శత్రువులు, నీవు తలపెట్టిన పనులకు ఆటంకం కలిగించే అవకాశం ఉంది.

నీవు, నీ మంత్రులు నీతిమంతులుగా, రహస్యములను బట్టబయలు చేయకున్నా, మీ చుట్ట పక్కల వారు నేర్పుగా మీ రహస్యములను రాబట్ట వచ్చు. అటువంటి వారిని దూరంగా ఉంచుతున్నావు కదా!

భరతా! అవసరమైతే వేయి మంది మూర్ఖులనైనా వదులు కోగాని, ఒక పండితుని మాత్రము నీ దగ్గరకు చేర్చుకో. పండితులు నీకు ఆపదలలో సాయం చేయగలరు. మూర్ఖులు ఎంతమంది ఉన్నా,

తిండి చేటు తప్ప ఎలాంటి సాయమూ చెయ్యరు. మూర్ఖులైన మంత్రులు పది మంది కన్నా మేధావి, పరాక్రమంతుడు, నిజాయితీ పరుడు, పండితుడు అయిన ఒక్క మంత్రి చాలు. ఆ రాజు క్షేమంగా ఉండగలడు.

నీ సేవకులను వారి వారికి తగిన స్థానములలో నియమించావు కదా! ఎక్కువ సామర్ధ్యం ఉన్నవారిని గొప్ప స్థానములలోనూ, కాస్త మధ్యస్థంగా తెలివితేటలు ఉన్నవారిని, మధ్యమ స్థానములలోనూ, పూర్తిగా తెలివితేటలే లేనివారిని అధమ స్థానములలోనూ నియమించావా!

(అంటే మెరిట్ ను బట్టి ఉద్యోగస్థులను నియమించాలి అని రామరాజ్యంలో ఉన్న నిబంధన. ఈ రోజుల్లో ప్రతిభకు పట్టకట్టడం మానేసారు. 60 ఏళ్లుదాటినా రిజర్వేషన్ల పేరిట ప్రతిభను కాల రాస్తున్నారు. మీకు చదువు అక్కర్లేదు, తెలివితేటలు అక్కర్లేదు. పది మార్కులు వచ్చినా చాలు, మీకు రిజర్వేషన్లు ఉన్నాయి అని భరోసా ఇస్తున్నారు. ఇదీ నేటి రాజకీయ రామాయణం.)

నీవు ఉద్యోగులను నియమించే ముందు వారిని కఠిన మైన పరీక్షలకు గురిచేసి అందులోనే నెగ్గిన వారినే ఉద్యోగులుగా నియమిస్తున్నావు కదా! (నేడు మనము అనుసరిస్తున్న యు.పి.యస్.సి లేక ఏ.పి.పి.యస్.సి అలాంటివే కదా.)

నీదేశములో ప్రజలు శాంతి భద్రతలు లోపించి, భయభ్రాంతు లవుతుంటే నీ మంత్రులు చూస్తూ ఊరుకోడం లేదు కదా!

(విజయవాడలో స్కూలుకు పోతున్న చిన్నారిని కిడ్నాప్ చేసి, చంపి, బాయిలర్‌లో వేసి కాల్చిన కేసు, రెండు సంవత్సరాలు దాటినా ఒకకొలిక్కిరాలేదు. మన గెవర్నమెంటు వారికి చీమ కుట్టినట్టయినా లేదు. ఇదీ నేటి మంత్రుల నిర్వాహకము. పైగా మాది రామరాజ్యము అని గొప్పలుచెప్పుకోడం.).

భరతా! నిన్ను నీ మంత్రులు గౌరవిస్తున్నారా లేక నిన్ను ఎదిరించి అవమానించడం లేదు కదా! (మంత్రులు ముఖ్యమంత్రికి ఎదురు తిరగడం, బహిరంగంగా దూషించడం, అధిష్ఠానానికి ఫిర్యాదు చేయడం నేడు పరిపాటి అయిపోయింది.)

ఎందుకంటే భరతా! నీ ఆంతరంగికులు, మంత్రులు ఎవరైనా నీకు ఎదురు తిరిగితే అటువంటి వారిని ఉపేక్షించరాదు. అలా ఉపేక్షిస్తే ఆ రాజు ప్రాణాలకే ముప్పు. (ముఖ్యమంత్రి పక్కనే ఉండి, అసమ్మతిని రెచ్చగొట్టి, ముఖ్యమంత్రి పదవికి, ప్రాణానికి ఎసరు పెట్టడం సర్వసాధారణం అయిపోయింది.)

భరతా! ఇంక నీసేనాపతులు ఎలా ఉన్నారు. సమర్థుడు, విద్యావంతుడు, పరాక్రమ వంతుడు,నిజాయితీ పరుడు, నీకు విశ్వాసపాత్రుడు అయిన వారిని నీ సేనాపతులుగా నియమించావు కదా! బలవంతులు, యుద్ధములో నేర్పుప్రదర్శించినవారిని గౌరవిస్తున్నావు కదా!

నీ సైనికులకు సకాలంలో, ఏ మాత్రం ఆలస్యం చేయకుండా, జీత భత్యములు అందజేస్తున్నావు కదా! ఎందుకంటే సకాలంలో

జీతభత్యములు అందక పోతే సైనికులలో అసంతృప్తి చెలరేగుతుంది. తిరుగుబాటు వచ్చే అవకాశం ఉంది.

నీ రాజ్యములో ఉండే ప్రజలందరూ నీ పట్ల విధేయులుగా ఉన్నారు కదా. నీకోసం తమ ప్రాణములను సైతం అర్పించుటకు సిద్ధంగా ఉన్నారు కదా!

నీ దూతలుగా ఎవరిని నియమించుకున్నావు? వారు నీ దేశములో పుట్టిన వారు అయి ఉండాలి. అన్ని విషయములను తెలిసిన సమర్థుడు అయి ఉండాలి. నీవు చెప్పిన విషయములను నేర్పుగా ఉన్నదిఉన్నట్టు ఎదుటివారికి చెప్పే సామర్థ్యం కలిగి ఉండాలి. పైగా అతడు పండితుడు అయి ఉండాలి. ఇటువంటి అర్హతలు కలిగిన పురుషుని నీ దూతగా నియమించు కున్నావు కదా!

నీ స్వదేశములో గానీ, నీ శత్రుదేశములలో గానీ జరిగే విషయములను ఎప్పటి కప్పుడు గూఢచారుల వలన తెలుసుకుంటూ అప్రమత్తంగాఉంటున్నావు కదా!

ఓ భరతా! ఒకసారి నీతో యుద్ధము చేసి ఓడి పోయిన నీ శత్రువు వాడేం చేస్తాడులే అని విడిచిపెట్ట కూడదు. వాడి పట్ల జాగరూకతగాఉండాలి. వాడు మరలా తన బలాన్ని పెంచుకొని నిన్ను దొంగదెబ్బ తీయగలడు.

భరతా! కేవలము లౌకికసుఖములగురించి ఆలోచించే

నాస్తికవాదుల పట్ల జాగ్రత్తగా ఉండు. వారిని దగ్గర చేరనీయకు. అలాగే, చాలా మంది అజ్ఞానులు, తాము పండితులమనీ, తమకు అంతా తెలుసు అనీ విర్రవీగుతుంటారు. అలాంటివారి పట్ల జాగ్రత్తగా ఉండు. ఎందుకంటే ఇలాంటి వారు ధర్మశాస్త్రములను నమ్మరు. అనవసరమైన తర్కములు చేస్తూ, ప్రజలకు ధర్మశాస్త్రముల పట్ల అపనమ్మకము కలిగిస్తుంటారు. వీరి మాటలు నమ్మకు.

భరతా! అతి పురాతనమైనదీ, ఎందరో చక్రవర్తులు పరిపాలించినదీ అయిన అయోధ్యను జాగ్రత్తగా కాపాడుకుంటున్నావు కదా! ఎందుకంటే అయోధ్య పురాతనమైనా అన్నీ సౌకర్యములు కల నగరము. అయోధ్యలో ఉన్న వ్యవసాయభూములకు, నివాస స్థలములకు నిర్దిష్టమైన హద్దులు, వాటిని తెలిపే గుర్తులు కలిగి ఉన్నాయి. అందు వలన న్యాయపరమైన చిక్కులు వచ్చే అవకాశం లేదు. (నేడు మన న్యాయస్థానములలో ఉన్న వ్యాజ్యాలలో 90 శాతము భూమి సరిహద్దు తగాదాలే.) అయోధ్యలో దేవాలయములు, సత్రములు, చెరువులూ సమృద్ధిగా ఉన్నాయి. అయోధ్యలో ఏటా ఉత్సవములు జరుగుతుంటాయి. ప్రజలందరూ సుఖసంతోషాలతో అలరారుతుంటారు. అయోధ్యలో పంటభూములు సమృద్ధిగా ఉన్నాయి. పశుసంపద అపారంగా ఉంది. ఖనిజ సంపదకు ఆలవాలమైన గనులు అనేకం ఉన్నాయి. హింస అనే పదానికి అయోధ్యలో తావు లేదు. అయోధ్యలో పాపాత్ములు లేరు. అయోధ్య కోట సురక్షితమైనది. అటువంటి అయోధ్యను నీవు చక్కగా రక్షిస్తున్నావు కదా!

నీ రాజ్యములో వర్తక వాణిజ్యములు ఎలాంటి ఆటంకములు లేకుండా సాగుతున్నాయి కదా! వర్తకులు నీకు అనుకూలంగా ఉన్నారు

కదా! నీ రాజ్యములో గోరక్షణ సాగుతున్నదికదా! నీ పాలనలో ప్రజలు సురక్షితంగా ఉన్నారు కదా! ఎందుకంటే ప్రజారక్షణ రాజు బాధ్యత.

నీ అంత:పుర స్త్రీలకు నీ రహస్యములను వెల్లడి చేయకుండా, వారిని సరససంభాషణలతో సంతోషపెడుతున్నావు కదా! కాని వారి మాటలకు మోసపోయి తప్పుదారి తొక్కవద్దు.

నీవు గజసంపదను చక్కగా పోషిస్తున్నావు కదా! గజ సంపదను ఎప్పటికప్పుడు పెంచుకుంటూ ఉండు. రాజ్య రక్షణకు గజసంపద చాలా కీలకము.

ఓభరతా! నీవు ప్రతిరోజూ నీ ప్రజలను కలుసుకుంటూ వారి కష్టసుఖములు తెలుసుకుంటున్నావు కదా!

ఓ భరతా! నీ దగ్గర పని చేసే వారి పట్ల కఠినంగా వ్యవహరించి వారు నిన్ను చూడగానే భయపడేట్టు చేయవద్దు. అలాగని వారికి అధిక చనువు ఇవ్వవద్దు. మధ్యేమార్గంగా వారితో మెలుగుతూ ఉండు.

నీ రాజ్యములో ధనము, ధాన్యము, నీరు, నిలవలు సమృద్ధిగా ఉన్నాయికదా. నీకు చాలినంత సైన్యము, యంత్రసామగ్రి సమకూర్చు కున్నావు కదా!

ఓ భరతా! నీ ఆర్థిక పరిస్థితి ఎలా ఉంది. నీ ఆదాయము

ఎక్కువ, వ్యయము తక్కువగా ఉందికదా!
(నేటి కాలంలో లోటుబడ్జెట్ సర్వసాధారణం అయిపోయింది. ఆదాయం తక్కువ, ఖర్చు ఎక్కువ. దాని కోసరం అప్పులు. వాటికి వడ్డీలు. ఆదాయంలోసగం వడ్డీలకే పోతుంది. ఇదీ నేటి ఆర్థికవ్యవస్థ).

ఓ భరతా! ప్రజాధనము అపాత్రుల చేతులలోనికి వెళ్లడం లేదు కదా! నీవు నీ ధనమును దేవ కార్యములకు, పితృకార్యములకు, అతిథి సత్కారములకు, బ్రాహ్మణులకు, సైనికులకు, మిత్రవర్గములకు వ్యయం చేస్తున్నావు కదా!

భరతా! ఇంక న్యాయ విషయాలకు వస్తాము. నిరపరాధుల మీద నేరం మోపితే, వారిని విచారించకుండా, వారికి తన వాదన వినిపించడానికి అవకాశం ఇవ్వకుండా, దురాశతో అతనికి మరణదండన విధించడం లేదు కదా!
(న్యాయసూత్రాలలో ప్రధానమైనది సహజన్యాయసూత్రము. అంటే ఎవరికైనా అతనికి విరుద్ధంగా ఆదేశాలు ఇచ్చేముందు, అతనికి తన వాదన చెప్పకొనే అవకాశం ఇవ్వాలి. అలాంటి అవకాశం ఇవ్వకుండా అతనికి విరుద్ధంగా ఏ విధమైన ఆదేశాలు ఇవ్వకూడదు. దీనినే ప్రపంచ వ్యాప్తంగా ప్రిన్సిపల్స్ ఆఫ్ నాచురల్ జస్టిస్ అని పిలువబడుతుంటాయి. దీనిని త్రేతాయుగంలోనే రాముడు ఆవిష్కరించాడు.)

భరతా! ఎవరైనా దొంగతనముచేస్తూ ఉంటే ప్రత్యక్షంగా చూచి పట్టుకొంటే, అతడు దొంగతనం చేస్తున్నట్టు ప్రత్యక్ష సాక్షులు చెబితే, అటువంటి దొంగలను నీ అధికారులు ధనలోభము చేత

విడిచిపెట్టడం లేదు కదా!
(దీనికి వివరణ అనవసరం. అన్నీకాదు కానీ, కొన్ని పోలీసు స్టేషన్‌లలో జరిగే తంతు ఇదే. అసలు నేరస్తులను విడిచిపెట్టడం, అమాయకుల మీద కేసులు బనాయించడం కొంతమంది పోలీసుల దైనందిన చర్య.)

న్యాయ నిర్ణయము చేసేటప్పుడు నీ న్యాయాధికారులు వీడు ధనికుడు, వీడు పేదవాడు అనే బేధబుద్ధి లేకుండా నిష్పక్షపాతంగా న్యాయ నిర్ణయం చేస్తున్నారు కదా!

భరతా! ఒక విషయం గుర్తుపెట్టుకో. ఏ రాజైనా తన ఇష్టం వచ్చినట్టు శాసనములను చేసి, అమాయకులను కష్టముల పాలు చేస్తాడో, అయాయకుల మీద అక్రమంగా నేరములు మోపి శిక్షిస్తాడో, ఆ రాజు ఎక్కువ కాలము రాజుగా ఉండలేడు. అతని రాజ్యంలో ప్రజలు కార్చిన కన్నీళ్లే ఆ రాజును శిక్షిస్తాయి. సర్వనాశనం చేస్తాయి.

ఓ భరతా! నీ రాజ్యములో శిశువులను, వృద్ధులను, పండితులను ఆదరిస్తున్నావు కదా!
(శిశుసంరక్షణాలయాలు, వృద్ధాశ్రమాలు, వృద్ధాప్య పెన్షన్లు, పండితులకు, కళాకారులకు పెన్షన్లు ఈకోవకే చెందుతాయి. రాముని కాలంలోనే ఇవి అమలులో ఉన్నాయి.).

ఓ భరతా! నీవు ధన సంపాదనకోసం ధర్మాన్ని విడిచిపెట్డడం, సుఖములు మరిగి భోగలాలసుడవై ధర్మమును విడిచి, ధనమును దుర్వినియోగం చెయ్యడం లాంటివి చేయడం లేదుకదా! నీవు ధర్మపరంగా ధనసంపాదన చేస్తూ, ధర్మమార్గంలో సంపాదించిన

ధనమునకు తగ్గ కోరికలతో తృప్తిపడుతూ, రాజ్యము చేస్తున్నావుకదా!

ఓభరతా! నీవు ఎల్లప్పుడూ నీ రాజ్యములో ఉన్న ప్రజల క్షేమము కోరుతున్నావు కదా!

ఓ భరతా! రాజు చెయ్యకూడనివి,ఆచరించరానివి చెబుతాను విను. రాజునాస్తికుడు కారాదు. అసత్యము పలుకరాదు. రాజుకు కోపము పనికిరాదు. రాజుకు నిర్లక్ష్యం పనికిరాదు. రాజు విషయములను గురించి దీర్ఘంగా ఆలోచిస్తూ సాగదీయడం, నాన్చడం పనికిరాదు.
(నేటి రాజకీయ నాయకులకు ఇదే తారక మంత్రము. పార్కలాం. వ్యవహారములను నాన్చడం, సాగదీయడం, కమీటీలపేరుతో కాలయాపన చేయడం,వాటికవే పరిష్కారం అవుతాయి అనుకోవడం నేటి రాజకీయనాయకుల తీరు. ఇది తప్పు, చేయకూడదు అని రాముడు స్పష్టంగా చెప్పాడు.)

జ్ఞానులను నిర్లక్ష్యం చేయకూడదు. రాజులకు సోమరి తనంపనికిరాదు. ఇంద్రియ సుఖములకు లోనుకాకూడదు. సమిష్టిగా నిర్ణయాలు తీసుకోవాలే గానీ, ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకోకూడదు. తీసుకొన్ననిర్ణయాలను అమలు చేయకుండా ఉండకూడదు. (రాజకీయనాయకులు ఆర్భాటంగా పునాదిరాళ్లు వేయడం, పనులుమాత్రం మొదలు పెట్టకపోవడం మనం చూస్తూనే ఉన్నాము..)

రాజు తన ఆలోచనలను రహస్యంగా ఉంచాలి. బహిర్గతం చేయకూడదు. ప్రజాక్షేమం పాటించాలి. ప్రజావ్యతిరేక పనులు

చేయకూడదు. శత్రువులను నేర్పుగా ఎదుర్కోవాలి కానీ, మూర్ఖంగా ఒక్కుమ్మడిగా ఎదుర్కోకూడదు. రాజైన వాడు పైచెప్పిన వాటిని విడిచిపెట్టాలి.

భరతా! మరలా చెప్పుచున్నాను. ఎప్పుడూ నీ సొంత నిర్ణయాలు తీసుకోకు. మంత్రులతో కూలంకళంగా చర్చించి సమిష్టి నిర్ణయాలు తీసుకో. మంత్రులతో నీ చర్చలను చాలా రహస్యంగాఉంచు. నీవు ప్రతిరోజూ నీ భార్యతో కలిసి వేదాధ్యయనము చెయ్యి. అది మంచి ఫలితాలనిస్తుంది.నీ బుద్ధిని ఎల్లప్పుడూ ధర్మము నందే ఉంచు. ధర్మము వలననే అర్థ,కామములను పొందు. మన తండ్రిగారు, మన తాత ముత్తాతలు ఈ మార్గమునే అనుసరించారు. నీవుకూడా అదే ధర్మమార్గము అనుసరించి రాజ్యపాలన చెయ్యి.

మరొక మాట. నీవు భుజించునపుడు నీ మిత్రులతో సహాభుజించు. ఒంటరిగా భుజించవద్దు. పైచెప్పిన ప్రకారము రాజ్యపాలన చేసిన రాజు మరణానంతరము నరకమునకుకాకుండా స్వర్గమునకు వెళతాడు. ”అని రాముడు భరతునికి రాజనీతి ఉపదేశించాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము  నూరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూట ఒకటవ సర్గ.)

భరతుని రాజ్యమునకు సంబంధించిన విషయములు అన్నీ తెలుసుకున్న తరువాత, రాముడు మరలా అసలు విషయానికి వచ్చాడు. "భరతా! ఇంతకూ నీవు ఈ ముని వేషము ఎందుకు ధరించావు. ఈ అడవులకు ఎందుకు వచ్చావు. దశరథుల వారు నిన్ను అయోధ్యకు రాజ్యాభిషిక్తుని చేసారు కదా. హాయిగా రాజ్యపాలన చేయక, ఈ వనవాసము ఎందుకయ్యా నీకు?" అని అడిగాడు.

దానికి భరతుడు రామునికి ఇలా సమాధానము చెప్పాడు. "రామా! నీకు ఒక అప్రియమైన విషయము చెప్పాలి. నీవు నాకు రాజ్యమును వదిలి అడవులకు రాగానే ఆ దు:ఖము తట్టుకోలేక మన తండ్రి దశరథుడు స్వర్గస్థుడయ్యాడు. అప్పుడు నేను కూడా దగ్గర లేను. నా తల్లి ప్రేరణతో ఈ మహాపాపము చేసాడు మన తండ్రి దశరథుడు. కాని నా తల్లికి ఫలితము దక్కలేదు. ఇటు రాజ్యమూ లేదు. సరికదా.. అటు వైధవ్యము మాత్రము ప్రాప్తించింది. నీవు ఉండగా నేను రాజ్యాభిషిక్తుడను అవడం సాధ్యం కాదు. నీవు మాట ఇచ్చిన తండ్రి ఇప్పుడు లేడు. ఆ మాటకు ఇపుడు విలువ లేదు. కాబట్టి నీవు వనవాసము విడిచి అయోధ్యకు వచ్చి, రాజ్యపాలన చేయుము. అదే నేను కోరేది. మన తల్లులు ముగ్గురూ ఇదే మాట మీద ఉన్నారు. నిన్ను మరలా అయోధ్య తీసుకుపోవడానికి వారందరూ వచ్చారు.

రామా! మనవంశాచారము నీకు తెలుసు. మన వంశములో పెద్దవాడికే రాజ్యాభిషేకము జరుగుతుంది. ఇది అనువంశికంగా వస్తున్న ఆచారము. కాబట్టి నీవు రాజ్యాభిషిక్తుడివి కావడం ధర్మమే కాని అధర్మము కాదు. నీ రాక కొరకు అయోధ్య ఎదురుచూస్తూ ఉంది. నేను, శత్రుఘ్నుడు, మన మంత్రులు అందరూ శిరస్సువంచి నీకు నమస్కారము చేస్తున్నాము. మామాట మన్నించు. వంశాచారమును మన్నించు.  పెద్దల ఆచారములను గౌరవించు." అనిచెప్పిచేతులు కట్టుకొని నిలబడ్డాడు భరతుడు.

రాముడు భరతుని కౌగలించుకొని అనునయించాడు. "ఓ భరతా! కులీనుడు, సత్త్వసంపన్నుడు, తేజస్వి, ధృడనిశ్చయము కలవాడు ఎవరైనా తుచ్ఛమైన రాజ్యము కోసరం మాట తప్పుతాడా! నేనూ అంతే. భరతా! నీవు చిన్నవాడవు. నీవు అనవసరంగా నీ తల్లిని దూషిస్తున్నావు. తప్పు. నీ మీద ఉన్న ప్రేమతో అలా చేసింది కానీ వేరుకాదు.

పెద్దలకు భార్యను, పుత్రులను, శాసించే అధికారము ఉంది. ఆ అధికారం తోనే దశరథుడు నాకు నార చీరలుకట్టబెట్టి అరణ్యానికి పంపాడు. నేను ఆయన ఆదేశము పాటించాలి. నేను నా తండ్రి యందు ఎలాంటి గౌరవము చూపిస్తున్నానో, నీవు నీ తల్లి పట్ల అంత గౌరవము చూపించు. నీ తల్లి తనస్వార్థము కోసరం ఇదంతా చేయలేదు. కేవలం నీకోసరమే చేసింది. నీ తల్లి కూడా నా తల్లితో సమానము. నా తల్లి కైక, నా తండ్రి దశరథుడు నన్ను అడవులకు వెళ్లమన్నారు. నేను అడవులకు వచ్చాను. ఇంతకన్నా వేరు విధంగా నేను ఎలా చేయగలను? తల్లి తండ్రుల మాట నాకు శిరోధార్యము కదా!

నా తరువాత రాజ్యమునకు అర్హుడవు నీవు. అందుకని నీవు రాజ్యము చేయవలెను. నేను అరణ్యములలో ఉండవలెను. నా తండ్రి దశరథుడు పదిమంది ఎదుట ఈవిధంగా భాగపంపకములు చేసాడు. నీకు రాజ్యము ఇచ్చాడు. నాకు 14 ఏళ్లు వనవాసము ఇచ్చాడు. దీనిని మనము పాటించాలి. ఇప్పుడు మన తండ్రి స్వర్గస్థుడయ్యాడు. ఆయన లేడు కదా అని మనకు ఆయన మాటను వమ్ముచేయలేము కదా!కాబట్టి నేను రాజ్యాభిషిక్తుని కాలేను." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నూట ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( నూటరెండవ సర్గ.)

రాముని మాటలు శ్రద్ధగా విన్నాడు భరతుడు. తిరిగి రామునితో ఇలా అన్నాడు. "రామా! నేను ధర్మహీనుడను. నాకు రాజధర్మము గురించి ఏమితెలుసు. నాకు తెలిసిందల్లా ఒకటే. అది మన కులధర్మము. మనవంశాచారము. ఇక్ష్వాకు వంశములో ఇంతవరకూ పెద్దవాడే రాజ్యభారము వహించాడు. పెద్దవాడు ఉండగా చిన్నవాడు రాజు కాలేదు. కాకూడదు. ఇప్పుడు నీవు మన వంశములో పెద్దవాడవు. నేను నీ కన్నా చిన్నవాడను. కాబట్టి నీవు రాజ్యాభిషిక్తుడవు కమ్ము. అదే నాకోరిక.

రామా! మామూలు ప్రజల దృష్టిలో రాజుకూడా ఒక సాధారణమానవుడే. కానీ, రాజు అంటే సాక్షాత్తు విష్ణుస్వరూపుడు. రాజుకాదగ్గ లక్షణాలే నీకే ఉన్నాయి. నాలో ఎంత మాత్రమూ లేవు. కాబట్టి అయోధ్యకు రాజుకాదగ్గ వాడవు నీవే. ఇంక అసలు విషయానికి వద్దాము. నేను కేకయ దేశములో ఉండగా. నీవు అరణ్యములకు వెళ్లగా, మన తండ్రిగారు దశరథమహారాజుగారు స్వర్గస్థులయ్యారు. నేను శత్రుఘ్నుడు కలిసి తండ్రి గారికి అంత్యక్రియలు చేసాము. ఇప్పుడు నీవు తండ్రిగారికి జలతర్పణములు విడువ వలెను. తండ్రిగారికి జ్యేష్టుడవు, ప్రియపుత్రుడవు నీవు. కాబట్టి నీవు విడిచే జలతర్పణములు మన తండ్రిగారికి అత్యంత ప్రియమైనవి.

ఎందుకంటే నేను విన్నదాని ప్రకారము దశరథుడు తన అవసాన కాలములో నిన్నే తలచుకుంటూ, నీమీద దిగులు చేత మరణించాడు. కాబట్టి నీవు జలతర్పణములు విడిస్తేగాని తండ్రిగారి ఆత్మశాంతించదు." అనిఅన్నాడు భరతుడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము నూట రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( నూటమూడవ సర్గ.)

భరతుడు చెప్పిన తండ్రి మరణ వార్తను వినగానే రాముడు కిందపడి మూర్ఛపోయాడు.

(ఇక్కడ మీకు ఒక సందేహము రావచ్చు. 101వ సర్గలో భరతుడు రామునికి దశరథుని మరణ వార్త చెప్పాడు. "గత: స్వర్గం మహాబాహు: పుత్రశోకాభిపీడిత:" పుత్రశోకంతో స్వర్గస్థుడయ్యాడు అని చెప్పాడు. 101వ సర్గ ఆఖరులో రాముడు "ఏవంకృత్వా మహారాజో విభాగం లోకసన్నిధౌ వ్యాదిశ్య చ మాహాతేజ దివం దశరథో గత:" ఈ విధంగా రాజ్యవిభాగము చేసి దశరథుడు దివంగతుడయ్యాడు అని రాముడు కూడా అన్నాడు. కాని 103 వ సర్గ మొదటి భాగంలో తండ్రి మరణ వార్త విని రాముడు మూర్ఛపోయాడు అని ఉంది. ఈ మూర్ఛపోవడం మొదట భరతుడు తండ్రి మరణ వార్త చెప్పినపుడే జరిగి ఉండాల్సింది. ముందు ముందు ఇలాంటి పరస్పర వ్యతిరేక సన్నివేశాలు వస్తుంటాయి.గమనించండి.)

మొదలు నరికిన చెట్టులా కిందపడిపోయిన రాముని చూచి సీత ఏడుస్తూ అతని దగ్గరగా వచ్చింది. రాముని మీద నీళ్లు చల్లి అతనికి సేదతీర్చింది. రాముడు మూర్ఛనుండి తేరుకున్నాడు. దీనంగా కన్నీళ్లు కారుస్తూ ఏడుస్తున్నాడు. రాముడు తన తండ్రి మరణ వార్త విని

భరతునితో ఇలా అన్నాడు.

"భరతా! నా తండ్రే లేనపుడు నాకు అయోధ్యతో ఏమి పని! దశరథుడులేని అయోధ్యను నేను మాత్రము ఎలా పరిపాలింపగలను. నా మీద దు:ఖముతో మరణించిన నా తండ్రికి నేను అంతిమ సంస్కారములు చేయడానికి కూడా నోచుకోలేదు కదా! నేను ఆయనకు చెడ పుట్టాను. నేను పెద్దకొడుకుగా ఉండి ఆయనకు ఏమి చేయగలిగాను. పెద్దకొడుకుగా  కనీసం నా విధులను కూడా నేను నిర్వర్తించలేకపోయాను.

ఓ భరతా! శత్రుఘ్నా! మీరు ఇద్దరూ పుణ్యాత్ములు. తండ్రి గారికి అంతిమ సంస్కారములు చేయగలిగారు. భరతా! ఇప్పుడే చెబుతున్నాను. ఇప్పుడే కాదు, ఈ పధ్నాలుగు సంవత్సరముల వనవాసము తరువాత కూడా, దశరథుడు లేని అయోధ్యలో నేను అడుగుపెట్టను. దశరథుడులేని అయోధ్యను ఊహించలేను. ఎందుకంటే, వనవాసానంతరము నేను రాజ్యాధికారము చేపడితే నాకు దిశానిర్దేశము ఎవరు చేస్తారు. నాకు మంచీ చెడూ ఎవరు చెబుతారు. నేను అయోధ్యలో ఉన్నప్పుడు నేను చేసిన మంచి పనులను మెచ్చుకుంటూ తండ్రిగారు నాకు ఎన్నో మంచి మాటలు చెప్పేవారు. ఇప్పుడు నాకు అలా ఎవరు చెబుతారు." అని శోకిస్తున్నాడు రాముడు.

సీతను చూచి రాముడు ఇలా అన్నాడు. "సీతా! నీకు పితృసమానులు, నీ మామగారు మరణించారు. లక్ష్మణుడు పితృహీనుడయ్యాడు. ఇంక మనకు దిక్కు ఎవ్వరు?' అని

విలపిస్తున్నాడు రాముడు. రాముడు ఇలా ఏడుస్తుంటే మిగిలిన తమ్ముళ్లు కూడా ఏడుస్తున్నారు.

కొంచెం సేపటికి లక్ష్మణుడు తేరుకొని అన్నరాముని చూచి "అన్నయ్యా! మనప్రస్తుత కర్తవ్యము తండ్రి గారికి జలతర్పణములు ఇవ్వాలి." అని గుర్తుచేసాడు.

పితృసమానుడైన మామగారు పరమపదించారు అన్నవార్త విన్న సీత దు:ఖంతో కుమిలిపోయింది. కళ్లనిండా నీళ్లుకమ్ముకున్నాయి. ఏడుస్తున్న సీతను చూచాడు రాముడు. ఆమెను ఓదార్చాడు. లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"లక్ష్మణా!మనము తండ్రిగారికి పిండప్రదానముచేయవలెను. నీవుపోయి పిండి, బదరీఫలములు సిద్ధ చేయి." అని అన్నాడు.

ముందు సీత నడుస్తుంటే వెనక లక్ష్మణుడు నడుస్తుంటే రాముడు వారి వెనక మందాకినీ నదీ తీరానికి వెళ్లాడు. వారి వెంట సుమంత్రుడు వెళ్లాడు. అందరూ మందాకినీ నదీ తీరానికి చేరుకున్నారు. సుమంత్రుడు తాను ముందుగా నదిలోకిదిగి, తరువాత రామలక్ష్మణులను, సీతను వారి చేతులుపట్టుకొని నదిలోకి దింపాడు. అందరూ స్నానములు చేసారు.రాముడు దోసిలి నిండా నీళ్లు తీసుకొని దక్షిణము వైపుతిరిగి "ఓ తండ్రీ! నీకు జలమును విడుస్తున్నాము. పితృలోకములో ఉన్న నీకు ఈజలము అక్షయంగా ఉపతిష్ఠమగును గాక!"అని ఆ జలమును నదిలో విడిచి పెట్టాడు.

తరువాత రామలక్ష్మణులు మందాకినీ నది ఒడ్డున దశరథునకు పిండితో పిండప్రదానము చేసారు. నేల మీద దర్భలు పరిచారు. ఆ దర్భల మీద బదరీఫలములతో కూడిన పిండిని పిండములుగాచేసి పెట్టారు. "ఓ తండ్రీ! మేమే ప్రతిదినమూ తినే ఆహారమునే నీకు పిండములుగా సమర్పించుకుంటున్నాము. స్వీకరించు. ఈ లోకంలో పురుషులు దేనిని తింటారో దానినే పితృలోకంలో ఉన్నపితృదేవతలు కూడా తింటారుకదా!" అని పలికాడు రాముడు.

పిండప్రదానకార్యక్రమము ముగిసినతరువాత అందరూ పర్ణశాలకు చేరుకున్నారు. తరువాత కూడా అన్నదమ్ములు తండ్రిమరణానికి బాధపడుతూనే ఉన్నారు. అన్నదమ్ములు చేస్తున్న రోదన ధ్వనులు దూరంగా ఉన్న సైనికులకు వినబడ్డాయి. 'భరతుడు రాముని చేరుకున్నాడు, అందరూ దశరథుని మరణానికి దు:ఖిస్తున్నారు' అని వారు తెలుసుకున్నారు. వారంతా ఎప్పుడెప్పుడు రాముని చూద్దామా అని ఆతురతగా ఉన్నారు. అందరూ రాముని పర్ణశాల వైపుకు ప్రయాణం అయ్యారు.

అందరూ రాముని పర్ణశాలకు చేరుకున్నారు. పర్ణశాల ముందు నేలమీదకూర్చొని ఉన్న రాముని చూచారు. రామునికి ఆ గతి పట్టించిన కైకను, మంథరను నోటికొచ్చినట్టు తిడుతూ ఏడుస్తున్నారు. ఆ పరిస్థితిలో ఉన్న రాముని చూచి వారికి కన్నీళ్లు ఆగలేదు.

రాముడు అందరినీ చూచాడు. పురుషులను, స్త్రీలను తన కన్న తల్లి తండ్రులవలె కౌగలించుకొని వారి ఓదార్పువచనములను

విన్నాడు. కొంతమంది రామునికి నమస్కరించారు. కొంత మంది రాముని పరామర్శించారు. రాముడు అందరినీ వారి వారి అర్హతలను బట్టి గౌరవించాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము  నూట మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( నూటనాల్గవ సర్గ.)

దశరథుని భార్యలు అయిన కౌసల్య, సుమిత్ర, కైకేయీ కులగురువు వసిష్ఠుని వెంట రాముని ఆశ్రమానికి వస్తున్నారు. వారుమందాకినీ నది ఒడ్డున నడుస్తున్నారు. అక్కడి వారు, రాముడు, సీత స్నానమునకుఉపయోగించు నదీతీరమును చూపించారు. కౌసల్యకు దు:ఖము ఆగలేదు. తనవెంట ఉన్న సుమిత్రను చూచి ఇలా అంది.

"చూచావా సుమిత్రా! రాజభోగములు అనుభవించవలసిన నీ కుమారుడు లక్ష్మణుడు, నా కుమారుడు రాముడు, నా కోడలు సీత, అయోధ్యనుండి వెడలగొట్టబడి, దిక్కులేని వారి మాదిరి ఒంటరిగా ఈ నదీతీరంలో స్నానం చేస్తున్నారు. సుమిత్రా! నీ కుమారుడు ఇక్కడి నుండి రాముని కొరకు, సీతకొరకు జలములు తీసుకొనిపోవడం నీచకార్యము అని అనుకోకు. తన అన్నకు సేవ చేసే నిమిత్తం చేసే ఏ కార్యమైనా అది దోషము కాదు. అయినా ఇంక ఎన్నాళ్లు? భరతుడు ఇప్పటికే రాముని అయోధ్యకు వచ్చి తన రాజ్యము స్వీకరించమని ప్రార్థిస్తూ ఉంటాడు. రామలక్ష్మణుల కష్టాలు గట్టెక్కుతాయి. లక్ష్మణునికి అన్నగారి దాస్యము తప్పుతుంది." అని అన్నది కౌలస్య.

ఇంతలో వారు రాముడు తన తండ్రికి పిండప్రదానము చేసినచోటికి చేరుకున్నారు. దక్షిణ ముఖంగా పరచిన దర్భలు, వాటి

మీద పెట్టబడిన పిండి తో చేసిన పిండములు చూచారు.

“చూడండి. రాముడు ఇక్కడే తన తండ్రికి పిండప్రదానం చేసాడు. ఆ పిండములు ఇంకా ఇక్కడే ఉన్నాయి. ప్రతిరోజూ పంచభక్ష్య పరమాన్నములతో భోజనము చేసే దశరథుడు ఈ పిండితో చేసిన పిండములను  ఎలా ఆరగించగలడో.. ఏమో! అయోధ్యాపతి అయిన రాముడు తన తండ్రికి పిండితో పిండప్రదానము చెయ్యడం చాలా బాధాకరంగా ఉంది. ఈ లోకంలో పురుషులు ఏమి తింటారో దానిని పితృదేవతలకు సమర్పిస్తారట. అంటే రాముడు ఈ పిండి తిని బతుకుతున్నాడా! రాజాధిరాజైన రామునికి ఎంత దుర్గతిపట్టింది. ఇది చూచి కూడా నా హృదయం ముక్కలు కాలేదంటే నా హృదయం రాయి కంటే కఠినమై ఉండాలి.” అని శోకించింది కౌసల్య.

మిగిలిన భార్యలు ఆమెను ఓదార్చారు.  ఈప్రకారంగా రాముని గురించి తలచుకుంటూ దు:ఖపడుతూ అందరూ రాముని పర్ణశాలకు చేరుకున్నారు. పర్ణశాల వద్ద నేల మీద కూర్చుని ఉన్న రాముని చూడగానే దశరథుని భార్యలకు దు:ఖము ఆగలేదు. భోరున ఏడ్చారు. వారిని చూడగానే రాముడు వారి వద్దకు వెళ్లాడు. తనతల్లులందరికీ పాదనమస్కారము చేసాడు. వారంతరూ రాముని వీపునిమిరి, తలను నిమిరి ఆశీర్వదించారు. రాముని వెంట లక్ష్మణుడుకూడా తల్లులందరి పాదములు తాకి నమస్కరించాడు. వారందరూ లక్ష్మణుని శిరస్సునిమిరి ఆశీర్వదించారు. తరువాత సీత తన అత్తగార్లు అందరికీ పాద నమస్కారము చేసి వారి ఆశీర్వ చనములు స్వీకరించింది.

సీతను చూచిన కౌసల్యకు దు:ఖము ఆగలేదు. సీతను తన కూతురును కౌగలించుకున్నట్టు  గట్టిగా కౌగలించుకుంది.

"జనకమహారాజు కూతురు, దశరథ మహారాజు కోడలు, రామునిభార్య, నిర్మానుష్యంగా ఉన్న ఈ అరణ్యములలో ఎన్ని కష్టములు పడుతూ ఉందోకదా! అమ్మా సీతా! వాడి పోయిన కమలము వలె ఉన్న నీ ముఖం చూస్తుంటే నాకు దు:ఖం ఆగడం లేదమ్మా!"అనిసీతను పట్టుకొని ఏడిచింది.

వీరు ఇలా దు:ఖపడుతూ ఉంటే, రాముడు వసిష్ఠునికి పాదాభివందనం చేసాడు. ఆయన ఆశీర్వాదము తీసుకున్నాడు. తరువాత అందరూ విశ్రాంతిగా కూర్చున్నారు. వసిష్ఠుడు రాముని పక్కన కూర్చున్నాడు. లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు మరొకపక్క కూర్చున్నారు. మంత్రులు, దండనాధులు, పురప్రముఖులు వారి వారి అర్హతకుతగ్గట్టు కూర్చున్నారు. అందరూ భరతుడు రామునితో ఏం మాట్లాడతాడో అని ఆతురతగా ఎదురుచూస్తున్నారు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము  నూట నాల్గవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( నూటఐదవ సర్గ.)

అంతా మౌనంగా కూర్చుని ఉన్నారు. ఆ నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ భరతుడు లేచాడు. రాముని వంక చూచి ఇలా అన్నాడు.

"రామా! నా తల్లి కైక మాటను మన్నించి నాకు రాజ్యమును వదిలి, నీవు అరణ్యములకు వచ్చావు. ఇప్పుడు అయోధ్యా రాజ్యము నాది. నా రాజ్యమును నా ఇష్టమువచ్చిన వారికి ఇచ్చే అధికారము నాకు ఉంది. నాది అయిన ఈ రాజ్యమును తిరిగి నీకు ఇస్తున్నాను. దీనిని స్వీకరించి అయోధ్యను పాలించు. ఎందుకంటే దశరథుని తరువాత ఈ రాజ్యమును పాలించే శక్తి, అర్హత నీకు మాత్రమే ఉన్నాయి. నాకు ఆ అర్హత ఎంత మాత్రము లేదు. ఎందుకంటే గాడిద గుర్రము ఒకటి కావు కదా!

ఎవని మీద అందరూ ఆధారపడి బతుకుతారో, అతని జీవనము చాలా గొప్పది. కాని ఎవరైతే ఇతరుల మీద ఆధారపడి జీవిస్తాడో అతని జీవితము దుర్భరము. ఈ అయోధ్యప్రజలు, మేము అంతా నీ మీద ఆధారపడి ఉన్నాము. నీ పాలనకొరకు ఎదురు చూస్తున్నాము. అలాంటిది నీవు ఈ అరణ్యములో ఒకరి మీద ఆధారపడి బతకడం దుర్భరంకాదా! ఒకడు ఒక వృక్షమును నాటి, పెంచి పోషించాడు. అది పెద్ద మాను అయింది కానీ ఫలములు

ఇవ్వడం లేదు. ఆ చెట్టుఎందుకూ ఉపయోగపడదు కదా! అలాగే తండ్రి దశరథుడు నిన్ను ఈ అయోధ్యకు మహారాజుగా తీర్చిదిద్దాడు. సకల విద్యలు నేర్పించాడు. వేదాలు, ధర్మశాస్త్రములు చదివించాడు. కాని ఈనాడు నువ్వు రాజ్యమును పాలించను అంటున్నావు. నీవు నేర్చుకున్న విద్యలు అన్నీ ఫలితం లేకుండా పోవలసిందేనా! దశరథుని శ్రమ అంతా వృధా కావలసిందేనా!

నీవు అయోధ్యను పాలిస్తుంటే ఆనందించని వారు ఉండరు. రాజ్యములో ప్రజలు కానీ అంత:పురములోని జనులు కానీ అంతా సుఖసంతోషాలలో ఓలలాడుతారు. అందరికీ ఆమోద యోగ్యుడవైన నీవు రాజ్యమును పాలించకుండా అడవులలో తిరగడం ధర్మమా! కాబట్టి నీవు వెంటనే అయోధ్యకుతిరిగి వచ్చి పట్టాభిషిక్తుడవు కావాలని సకలజనులకోరిక.” అని ముగించాడు భరతుడు.

రాముడు లేచి భరతుని వీపు తట్టి ఇలా పలికాడు. “ భరతా! ఈ చరాచర జగత్తులో తాను అనుకున్న పని అనుకున్నట్టు చేసే స్వాతంత్ర్యము ఎవరికీ లేదు. అంతా విధిచేతిలో కీలుబొమ్మలమే. విధి ఎలా ఆడిస్తే అలా ఆడవలసినదే! ప్రతివానికీ ఉత్థానపతనాలు తప్పవు. ఎంత ధనము సంపాదించినా ఆధనము తుదకు అతనిని వదిలి పోతుంది. అలాగే ఎంత ఉన్నత స్థితికి చేరినా, చివరకు పతనం తప్పదు. (సత్యం రామలింగరాజు, సన్‌టివి అధినేతలు, గాలి జనార్ధనరెడ్డి లాగా).

పుట్టినవాడు గిట్టడం ఎలాగో, పుట్టుకతో వచ్చిన మానవ సంబంధాలు చావుతో సమసిపోతాయి. ఏవీ శాశ్వతము కాదు. పండిన పండు రాలడం ఎంత నిజమో, పుట్టిన మనిషి చావడం అంతే

నిజం. కాని అంతా శాశ్వతం అనుకోవడం అవివేకము.

మనం గృహములు ఎంత ధృడంగా కట్టుకున్నా, కాలక్రమేణా అవి కూలిపోవడం తథ్యం. అలాగే ఈ శరీరాన్ని ఎంత ప్రేమగా పెంచి పోషించినా, తుదకు అది భూగర్భంలో కలిసిపోవలసిందే!

నిన్నటి దినం మరలా రాదు. సముద్రంలో కలిసిన నదీజలములు తిరిగి వెనక్కురావు కదా! ఒక్కొక్క రోజు గడుస్తుంటే, మానవుల జీవితంలో ఒక్కొక్క రోజు తరిగిపోతుంటుంది. చావుకు దగ్గర అవుతుంటాడు.

మానవుడు భూమి మీద ఉన్న అంతరిక్షంలో ఉన్నా, మృత్యువు అతని వెన్నంటి ఉంటుంది. కాలం తీరగానే కబళిస్తుంది. కాబట్టి మానవుడు సదా మృత్యువును వెంటబెట్టుకొని తిరుగుతుంటాడు.

కాబట్టి భరతా! నీగురించి ఆలోచించుకో. నాగురించి ఎందుకు ఆలోచిస్తావు. ఎందుకంటే మన మానవ సంబంధాలు క్షణికములు. ఒక నదిలో రెండు దుంగలు కొట్టుకొని వస్తుంటాయి., అవి కలిసి కొంతదూరం ప్రయాణం చేస్తాయి. మరలా అవి విడిపోయి దేని దారిన అవి వెళతాయి. అలాగే భార్యలు, పుత్రులు, బంధువులు, ధనము, అన్నీ కొంతకాలము కలిసి ఉంటాయి.తరువాత విడిపోతుంటాయి.  దాని కోసరం ఇప్పుడు బాధపడటం ఎందుకు?

లోకములో ఏ ప్రాణికూడా తన ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించలేదు. జనన మరణములు వారి చేతిలో లేవు. వాటి గురించి

చింతించడం  నిష్ప్రయోజనము.

నేను ఇంతకు ముందుచెప్పినట్టు, మన జీవితము మన చేతిలో లేదు. ఏది ప్రాప్తమో అది అనుభవించవలసిందే. ఇప్పుడు నీకు రాజ్యాధికారము సంక్రమించింది. దానిని అనుభవించడమే నీ బాధ్యత. మన పూర్వులు అదే చేసారు. నువ్వుకూడా అదే చెయ్యి. మన పితృపితామహులు పోయిన మార్గముననే మనమూ నడుద్దాము. నిన్నటి రోజు మరలా రాదు. ప్రవహించిన నీరు తిరిగి రాదు. వయస్సు కూడా అంతే.

కాబట్టి నీ జీవితమును ధర్మమార్గములో నడిపించు. ప్రజలను పాలించి వారికి సుఖమైన పాలనను అందించు. దానికి మన తండ్రి దశరథుడే నిదర్శనము. ఆయన ఎన్నో యజ్ఞములు, యాగములు చేసి, ప్రజలను చక్కగా పాలించి, దానధర్మములు చేసి, చివరకు స్వర్గము  చేరుకున్నాడు.

మనము మన తండ్రి గారి గురించి చింతించవలసిన అవసరము లేదు. ఆయన పరిపూర్ణజీవితము అనుభవించి స్వర్గము చేరుకున్నాడు.  ఆయనను గురించి దు:ఖించడం మాను. కర్తవ్యమును విస్మరించకు.

అయోధ్యను పాలించమని దశరథుడు నిన్ను ఆదేశించాడు. ఆయన ఆదేశములను పాటించు. అయోధ్యను పాలించు. ఎందుకుంటే, తండ్రిగారు నన్ను వనములకు వెళ్లమని ఆదేశించారు. ఆయన ఆదేశానుసారము నేను అడవులకు వచ్చానుకదా! అలాగే నీవు

కూడా తండ్రి గారి ఆదేశమును పాటించి రాజ్యమును పాలించు. అదే నీ కర్తవ్యము.

ఇప్పుడు నేను నీ మాట విని అయోధ్యకు వస్తే తండ్రిగారి ఆదేశమును ధిక్కరించిన వాడిని అవుతాను. అది అధర్మము. అలాగే నీవు రాజ్యపాలన చెయ్యపోతే నీవుకూడా తండ్రిగారి ఆజ్ఞను ధిక్కరించినట్టే. అది కూడా అధర్మమే.

కాబట్టి నీవు అధర్మము చెయ్యకు. నన్ను అధర్మము వైపుకు లాగకు. తండ్రి గారి ఆదేశము ప్రకారము నీవు అయోధ్యనుపాలించు. నేను అరణ్యమునుపాలించెదను. అదే మన ధర్మము. అప్పుడే మనకు ఇహములో కానీ పరములో కానీసుఖము లభిస్తుంది.

కాబట్టి మనము ఇద్దరమూ మన తండ్రి గారి ఆజ్ఞను పాటించి ఆయన  పేరు నిలబెడదాము. ఆయన ఆత్మకు శాంతి చేకూరుద్దాము." అని పలికాడు రాముడు.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము  నూట ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( నూటఆరవ సర్గ.)

రాముడు చేసిన వాదనను శ్రద్ధగా విన్నాడు భరతుడు. మరలా తనదైన శైలిలో తన వాదనను వినిపించసాగాడు.

"ఓ రామా! నీవు జితేంద్రియుడవు. నీకు సుఖమువస్తే సంతోషము, దు:ఖమువస్తే బాధా రెండూ లేవు. నీలాంటి వారు ఈ లోకంలో అరుదుగా ఉంటారు. మేమంతా సామాన్యులము. సుఖదు:ఖములను అనుభవిస్తూ ఉంటాము.

జీవించి ఉన్నా, మరణించినా, మంచి చేసినా, చెడు చేసినా, ఆ వ్యక్తి పట్ల సమభావనతో ఉండే వ్యక్తికి దు:ఖము కానీ సుఖము కానీ కలగవు. రెండూ సమభావనలో ఉంటాయి. ఆ గుణాలు నీలో ఉన్నాయి. కానీ నీవు బాధపడుతున్నావు. తండ్రికి ఇచ్చిన మాటను ఎక్కడ తప్పుతానో అని బాధపడుతున్నావు. నీ లాంటివాడికి అలా బాధపడటం యుక్తంకాదు.

నీవు రాజ్యం చేసినా, అరణ్యంలో ఉన్న ఒకటే కదా. అందుకని అయోధ్యకు వచ్చి రాజ్యం చేయి. తప్పేముంది. నీవు అన్నిటికీ అతీతుడవు కదా! నీవు రాజ్యం తీసుకుంటే నేను బాధ పడను. ఎందుకంటే నేను దేశాంతరములో ఉన్నప్పుడు నా తల్లి చేసిన అనాలోచిత కార్యము

వలన ఇదంతా సంభవించింది. నా తల్లి చేసిన పని నాకు అసలు ఇష్టం లేదు. దానికి నా అంగీకారమూ లేదు. నా తల్లి చేసినది రాజద్రోహము. దానికి మరణదండనే సరి అయిన శిక్ష. కాని ఇక్కడ నిందితురాలు నా తల్లి కాబట్టి నేను ఆ దండన అమలు చేయలేక పోతున్నాను.

నేను పవిత్రమైన ఇక్ష్వాకు వంశములోపుట్టాను. ధర్మానికి ప్రతిరూపమైన దశరథమహారాజుకు పుత్రుడుగా జన్మించాను. అటువంటి నేను అధర్మమునకు పాల్పడతాను అని నీవు ఎలా అనుకుంటావు.? ఈ అధర్మములో నా తండ్రికి కూడా భాగం ఉంది. ఆయన నా తల్లి మాటను వినకపోతే ఇంత అనర్థము వాటిల్లదు.

ఆయన నా తండ్రి , పైగా వృద్ధుడు, ఈ లోకం విడిచి వెళ్లాడు కాబట్టి  సభలో ఆయనను నిందించడం భావ్యం కాదు. ఎందుకంటే ధర్మము తెలిసిన వాడు ఎవరైనా ఒక స్త్రీకి ప్రియం చేకూర్చడానికి మరొకరికి అప్రియం చేస్తాడా! కాని నా తండ్రి ధర్మం తప్పి తన భార్యకు వరములు ఇచ్చే మిషమీద నీకు అపకారము చేసాడు.

రామా! వినాశకాలే విపరీత బుద్ధి అని వినాశకాలము దాపురించబట్టి దశరథునికి ఇటువంటి విపరీత బుద్ధి పుట్టింది. తండ్రి మంచి కార్యము చేస్తే దానిని పుత్రుడు శ్లాఘించాలి, అభినందించాలి. కాని తండ్రి అధర్మానికి పాల్పడితే, దానిని పుత్రుడు ఖండించాలి. ఆ అధర్మము వలన కలిగిన తప్పును సరిదిద్దాలి. నా తండ్రి దశరథుడు చేసిన అధర్మము వలన అయోధ్య అరాచక మయింది. ఆ తప్పును నీవు సరిదిద్ది, నీ రాజ్యము నీవు పరిపాలించు. అందరికీ ఆనందము

చేకూర్చు. తండ్రి చేసిన అధర్మమును చక్కదిద్దిన సుపుత్రుడిగా ప్రఖ్యాతి చెందు.

ఎందుకంటే నా తండ్రి చేసిన అధర్మమును, పాపపు పనిని లోకమంతా ఖండిస్తూ ఉంది. ఆ అధర్మమును సరిదిద్దిడం నీ చేతిలో ఉంది. నా తల్లి కైక కూడా దీనికి తన అంగీకారము తెలిపింది. ఆమెను కూడా ఈ అధర్మకార్యము నుండి రక్షించు.

పైగా క్షత్రియునకు స్వధర్మపాలనను మించిన ధర్మము మరొకటి లేదు. క్షత్రియ ధర్మము రాజ్యమును పాలించుట. నీవు నీ ధర్మమును వదిలి జటలు కట్టుకొని అరణ్యములలో ఉండటం భావ్యమా! అయోధ్య ఎక్కడా? అరణ్యము ఎక్కడ? రాజ కిరీటము ఎక్కడ? జటాజూటములు ఎక్కడ? రెండింటికీ దోమకు ఏనుగుకు ఉన్నంత తేడా  ఉంది కదా! నీకు తెలియనిది ఏమున్నది.

పైగా రాజ్యపాలన క్షత్రియధర్మము. అది తక్షణ ఫలములను ఇస్తుంది.  వనవాస వృత్తి కాలాంతరమున మోక్షరూపంలో ఫలిస్తుంది. క్షత్రియుడైన వాడు రజోగుణప్రధానుడు కానీ తమోగుణ ప్రధానుడు కాదు కదా! కాబట్టి రామా! ఈ తాపస ధర్మము నీకు తగినది కాదు. నీకు క్షత్రియ ధర్మమే ఉచితము.

రామా! బ్రహ్మచర్య,గృహస్థ,వానప్రస్థ,సన్యాస ఆశ్రమములు ఒకదాని తరువాత ఒకటి ఆచరించాలి. అందులోనూ గృహస్థాశ్రమము శ్రేష్టమైనది అని పెద్దలు చెబుతారుకదా! మరి నీవు ఆ పెద్దల మాటలను పెడచెవిని పెట్టి గృహస్థాశ్రమమును విడిచిపెట్టడం ధర్మమా!

రామా! మరొక మాట. నేనునీ కన్నా చిన్నవాడను. నా కన్నా పెద్దవాడు బతికి ఉండగా, చిన్నవాడు రాజ్యపాలన చెయ్యడం ధర్మం కాదు కదా! పైగా నాకు నీ తోడిదే జీవితము. నీవు లేనిది నేను లేను. అటువంటిది నీవు లేకుండా నేను రాజ్యపాలన చెయ్యడం అసంభవము.

రామా! ఈ రాజ్యము పిత్రార్జితము. అది కుటుంబములో జ్యేష్టునికే చెందుతుంది కానీ కనిష్ఠునికి కాదు. కాబట్టి జ్యేష్టుడి వైన నీవు రాజ్యపాలన చెయ్యడం ఉత్తమోత్తమము. నువ్వు ఉండగా నీకన్నా చిన్నవాడినైన నేను రాజ్యమును పాలించడం అధమాధమము. అందుకనే మన కులగురువు వసిష్ఠులవారిని, మంత్రులను, సేనాధిపతులను పురముఖ్యులను మన తల్లులను వెంటబెట్టుకొని వచ్చాను.

ఆలస్యం అమృతం విషం. అందరి సమక్షంలో, ఇక్కడే ఇప్పుడే, వేదోక్తముగా నిన్ను అయోధ్యకు రాజ్యాభిషిక్తుని చేస్తాను. దయతో అంగీకరించు. ఇక్కడే రాజ్యాభిషిక్తుడవై సకల రాజలాంఛనములతో అయోధ్యలో ప్రవేశించు. సింహాసనముఅధిష్ఠించు. రాజమకుటము ధరించు. రాజ్యపాలన గావించు. ఇది మా అందిరికీ సమ్మతము.

దీని వలన పితృఋణము తీర్చినట్టు అవుతుంది. తండ్రిగారు చేసిన తప్పును సరిదిద్దినట్టు అవుతుంది. ఈ పాపపు కార్యము వలన నా తల్లికి తండ్రికి అంటిన పాపమును తొలగించు. వారిని పాపవిముక్తులను చెయ్యి. నీకు శిరస్సువంచి పాదములు అంటి అర్థిస్తున్నాను. నా మీద, అయోధ్య మీద దయచూపించు. నేను

ఇంతచెప్పినా కాదని నీవు అరణ్యములలో ఉండటానికి నిశ్చయించుకుంటే. నేనుకూడా నీతో అరణ్యవాసము చేస్తాను. నా తల్లి చేసిన పాపమునకు నేను ప్రాయశ్చిత్తము చేసుకుంటాను. అయోధ్యకు వెళ్లనే వెళ్లను. ఇదే నా కృతనిశ్చయము." అని పలికి భరతుడు చేతులు జోడించి రాముని ముందు నిలబడ్డాడు.

అక్కడ ఉన్న వారు కూడా శాయశక్తులా రాముని తిరిగి అయోధ్యకు రమ్మని ప్రార్థించారు. కాని రామునిలో చలనం లేదు. తన పట్టు వీడలేదు. అయోధ్యకు రావడానికి ఒప్పుకోలేదు. అక్కడ ఉన్న వారికి రాముని మనోనిశ్చయానికి అభినందించాలో లేక రాముడు అయోధ్యకు రాక పోవడానికి విచారించాలో తెలియక కొట్టుమిట్టాడు తున్నారు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నూట ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( నూటపేడవ సర్గ.)

తన మనోనిశ్చయాన్ని రాముడు భరతునికి ఈ విధంగా తెలిపాడు.

"భరతా! ఇప్పటి దాకా నీ వు చెప్పినది అంతా మిగుల యుక్తి యుక్తముగా ఉంది. అందులో ఏ దోషమూ లేదు. చాలా చక్కగా చెప్పావు. నిన్ను అభినందించకుండా ఉండలేకపోతున్నాను. కానీ నీకు తెలియని విషయములు కొన్ని నీకు చెప్పక తప్పదు.

మన తండ్రి దశరథుడు తాను నీ తల్లి కైకను వివాహమాడు సందర్భంలో తన రాజ్యమునకు ఉత్తర అధికారిగా నిన్ను చేస్తాను అని మీ మాతామహులకు (కైక తండ్రికి) వాగ్దానం చేసాడట. అదీకాకుండా దేవాసుర సంగ్రామంలో నీ తల్లి మన తండ్రి ప్రాణములు రెండు సార్లు కాపాడినందుకు గాను, రెండు వరములు ఇస్తాను అని వాగ్దానము చేసాడట. నీ తల్లి ఆ వరములను తనకు తరువాత ప్రసాదించమని అడిగినదట. ఆ వరములను నా పట్టాభిషేక సందర్భములో కోరినది. అందులో మొదటి వరము నాకు 14 ఏళ్ల వనవాసము. రెండవ వరము నీకు అయోధ్య రాజ్య పట్టాభిషేకము. ఆ వరములను మన తండ్రి నీ తల్లికి ఇచ్చాడు. నన్ను 14 ఏళ్లు అరణ్యములకువెళ్లమని ఆజ్ఞాపించాడు. ఆయన ఆజ్ఞమేరకు నేను అరణ్యములకు వచ్చాను.

నన్ను విడిచి ఉండలేక నా భార్య సీత, నా తమ్ముడు లక్ష్మణుడు నా వెంట అడవులకు వచ్చారు. దీనితో మొదటి వరము నెరవేరినది.

మన తండ్రి నీ తల్లికి ఇచ్చిన రెండవ వరమును అనుసరించి నీవు అయోధ్యకు పట్టాభిషిక్తుడివి కావాలి. అప్పుడే నీవు నీ తల్లి తండ్రుల మాటను పాటించినట్టవుతుంది. నీవు నీ తండ్రిని ఋణవిముక్తుని చేసినట్టవుతుంది. దీనికి ఒక ఇతిహాసమును కూడా చెబుతాను విను.

పూర్వము గయుడు గయా క్షేత్రంలో పితృదేవతల గురించి ఒక యాగము చేసాడట. ఆ సందర్భంలో గయుడు ఈవిధంగా చెప్పాడు అని పెద్దలుచెబుతారు. పుత్రుడు అనే వాడు పితరులను పున్నామ నరకము నుండి రక్షిస్తాడట. అందుకని అతడికి పుత్రుడు అనే పేరు వచ్చిందట. అందుకే తల్లితండ్రులు తమకు చాలా మంది పుత్రసంతానము కావాలని కోరుకుంటారట. ఎందుకంటే, అందులో కనీసం ఒకడైనా గయకు వెళ్లి అక్కడ పితృకార్యము చేస్తాడని వారి ఆశ.

ఓభరతా! నీవు కూడా నీ తండ్రి మాటను పాటించి ఆయనను పున్నామ నరకమునుండి రక్షించు. నీ తండ్రి నీ తల్లికి ఇచ్చిన మాట ప్రకారము వెంటనే అయోధ్యకు వెళ్లి, పట్టాభిషిక్తుడివై, శత్రుఘ్నుని సాయంతో అయోధ్యను పాలించు. నేను కూడా ఇక్కడ ఉండను. సీత, లక్ష్మణులతో కలిసి దండకారణ్యమునకు వెళతాను. నీవు అయోధ్యను పాలిస్తుంటే, నేను అడవిలో ఉన్న మృగములను పాలిస్తాను. నీవు సంతోషంగా అయోధ్యకు వెళ్లు, నేను అంతే సంతోషంగా దండకారణ్యమునకు వెళతాను.

నీకు నీ సింహాసనము మీద ఉన్న తెల్లటి గొడుగు (శ్వేతఛత్రము) ఎలా నీడనిస్తుందో, నాకు కూడా ఈ అడవిలో ఉన్న ఫలవృక్షములు నీడనిస్తాయి. నీవు శ్వేతఛత్రఛాయలో, నేను వటవృక్షఛాయలో సుఖిద్దాము. నీకు తోడుగా శత్రుఘ్నుడు ఉంటాడు. నాకు తోడుగా లక్ష్మణుడు ఉంటాడు. దశరథునికి కుమారులుగా పుట్టినందుకు, మనము నలుగురము ఆయన మాటను సత్యవ్రతమును నిలబెడదాము." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నూట ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూటఎనిమిదవ సర్గ.)

త్రేతాయుగంలో జాబాలి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన నాస్తిక వాది. ఈ ప్రాకృతిక ప్రపంచము తప్ప వేరే ఏమీ లేదు.ఉన్నంత కాలం సుఖాలు అనుభవించడం మాత్రమే మనము చెయ్యాల్సిన పని అని నమ్మే వాడు. అలాంటి భావాలు ఉన్న జాబాలి ఆసభలో ఉన్నాడు. రాముడు, భరతుడు చేసిన సంవాదమును విన్న జాబాలి ఇలామాట్లాడసాగాడు.

"రామా! నీవు ఎంతో బుద్ధిమంతుడికి, జ్ఞానము కలవాడవు అనుకున్నాను. కాని ఇంతమూర్ఖంగా ఆలోచిస్తావు అని అనుకోలేదు. నీ ఆలోచన ఎందుకూ పనికిరాదు.

రామా! మానవుడు పుట్టేటప్పుడు ఒంటరి వాడు. చచ్చేటప్పుడు ఒంటరి వాడే. ఈ బంధుత్వాలు, మమతలు మమకారాలు అన్నీ నడుమ వచ్చినవే. చచ్చిన తరువాత ఎవరూ ఎవరికీ ఏమీ కారు. అందుకే ఈ బంధుత్వాలు అన్నీ వ్యర్థము. తల్లి, తండ్రి,మనకు దైవసమానులు,  వాళ్ల మాటలను పాటించాలి, అని అనుకోవడం అవివేకము. నీ తండ్రి మరణించాడు. ఇంక ఆయన మాటకు విలువేముంది.

దూర ప్రయాణాలు చేసే వాళ్లు రాత్రిళ్లు సత్రములలో బస చేస్తారు. ఆ రాత్రికి కొంతమందితో పరిచయం ఏర్పడుతుంది. మరునాడు ఉదయం ఎవరి దోవన వారు వెళతారు. ఈ జీవితాలూ అంతే. తల్లి, తండ్రి, ధనము, భార్య, సంతానము అన్నీ సత్రములలో పరిచయాల్లాంటివే. కాలం తీరగానే ఎవరి దోవ వారిది. ఆ కాస్త పరిచయంతో మాటకు కట్టుబడి ఉండాలి అని అనుకోవడం అవివేకము. విజ్ఞులైన వారు ఈ బంధుత్వాలకు విలువ ఇవ్వరు.

నీకు రాజ్యము సంక్రమించింది. భరతుడు కూడా అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడవై రాజ్యపాలన చెయ్యమంటున్నాడు. హాయిగా రాజభోగాలు  అనుభవించక తండ్రిమాటకు కట్టుబడి వనవాసము చెయ్యడం ఏమిటి? ఈ చెడు ఆలోచన నీకు ఎలా కలిగింది. రామా! నా మాటవిను. అయోధ్య నీ కోసం ఎదురు చూస్తూ ఉంది. వెంటనే అయోధ్యకు వెళ్లి పట్టాభిషిక్తుడివై స్వర్గలోకముతో సమానమైన రాజభోగాలు అనుభవించు.

అసలు దశరథుడు ఎవరు? నీకు జన్మను ఇచ్చాడు. వెళ్లిపోయాడు. అంతే. అతనికి నీకు ఏమి సంబంధం? ఆయన మాటకు నీవు ఎందుకు కట్టుబడి ఉండాలి? మరొక మాట. తండ్రి బీజము. తల్లి క్షేత్రము. తల్లి తండ్రి సంగమించినప్పుడు, తండ్రి బీజము(శుక్లము) తల్లి శోణితములో కలిసి అండము అవుతుంది. అది శిశువుగా మారుతుంది. వీడు నీ తండ్రి అని తల్లి చెబితేనే అతను నీ తండ్రి అని తెలుస్తుంది. (తల్లి సత్యం. తండ్రి నమ్మకం అనే సామెత ఉంది.) నీ తండ్రి తన జీవిత కాలము నీ తండ్రిగా నిన్ను పెంచి పెద్దచేసాడు. కాలం తీరగానే తన దారిన తాను వెళ్లిపోయాడు.

చనిపోయిన తండ్రి గురించి నీవు బాధలు పడటం ఎందుకు? నీ మాదిరి ధర్మము, ధర్మము ప్రకారమే అర్థకామములు అనుభవించాలి అనే వాళ్లు అవివేకులు. వారు ఏ సుఖాలు అనుభవించకుండానే చచ్చిపోతారు. అలాంటి వారిని చూచి నాకు జాలికలుగుతుంది.

ఇంకొక మాట. మానవులు పితరులకు శ్రాద్ధకర్మము చేస్తూ ఉంటారు. ఎందుకు? చచ్చిన వాడు తింటాడా? ఇక్కడ బ్రాహ్మణులు తింటే, చచ్చినవాడు తిన్నట్టేనా! ఒకరు తిన్న ఆహారము మరొకరి ఆకలి ఎలా తీరుస్తుంది. అలాగైతే, దూరదేశములలో ఉన్న వారికీ, మనము ఇక్కడ శ్రాద్ధము పెట్టి, బ్రాహ్మణునికి అన్నం పెడితే, ఇతర దేశములలో ఉన్న వారికి ఆకలి తీరుతుందా! ఈ భూమిమీద ఉన్న వారి ఆకలే తీరనప్పుడు, చచ్చిన వాడి ఆకలి ఏమి తీరుతుంది.

రామా! యజ్ఞములు చేయమనీ, దానాలు ఇవ్వమనీ, తపస్సు చేయమనీ గ్రంథాలు రాసి, దానాలు చెయ్యమని ప్రోత్సహిస్తారు. దానాలు స్వీకరించి లాభం పొందుతారు. దానాలు ఇచ్చినవాడు నాశనమై పోతాడు. ఇక్కడ దానాలు చేస్తే, శ్రాద్ధాలు పెడితే పరలోకంలో ఉన్న వాళ్లు సంతోషిస్తారు అన్న మాట శుద్ధ అబద్ధం. అసలు పరలోకమే లేనపుడు ఇంక సంతోషించడం ఎక్కడిది. నీవు ఏమి చేసినా నీ తండ్రి చూడడు కదా. కాబట్టి భరతుని మాటవిని అయోధ్యకు పోయి హాయిగా రాజ్యపాలన చెయ్యి సుఖించు." అని చెప్పాడు జాబాలి.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నూట ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూటతొమ్మిదవ సర్గ.)

జాబాలి చెప్పినది అంతా శ్రద్ధగా విన్నాడు రాముడు. జాబాలితో ఈ విధంగా పలికాడు.

"ఓ మహాత్మా! మీరు నా హితము కోరి చెప్పినమాటలు నాకు బాగున్నా లోకసమ్మతము కావు. అవి లోకానికి హితమును చేకూర్చలేవు. మీ మాటలు ఆచరిస్తే ప్రజలలో కట్టుబాటు తప్పుతుంది. స్వేచ్ఛా విహారము పెచ్చరిల్లుతుంది. ఎవడి ఇష్టం వచ్చినట్టు వారు ప్రవర్తిస్తారు. అరాచకము నెలకొంటుంది. అటువంటి వారిని ఎవరూ గౌరవించరు.

ఒక మనిషియొక్క గుణగణములు అతని ప్రవర్తనను బట్టి తెలుస్తాయి. అదీ కాకుండా పైకి ఒకటీ లోన ఒకటి పెట్టుకొని ప్రవర్తించేవారు అంటే పైకి గౌరవనీయుల మాదిరి కనపడుతూ లోపల ఎన్నో చెయ్యకూడని పనులుచేసేవారు, పైకి ఉత్తమ లక్షణములు కనబరుస్తూ లోపల పరమ నీచంగా ప్రవర్తించేవారు, పైకి నీతి మంతుడి మాదిరి కనపడుతూ లోపల నీతి బాహ్యమైన పనులు చేసేవారు, అటువంటి వారు ఎల్లప్పుడూ ధర్మము విడిచి అధర్మమునే ఆచరిస్తారు. కాని పైకి మాత్రం ధర్మాత్ములు మాదిరి కనపడతారు.

మీరు చెప్పిన మాదిరి చేస్తే నేను కూడా అలాగే అవుతాను. పైకి నీతులు చెబుతూ లోపల సింహాసనము కోసరం వెంర్లాడేవాడి నవుతాను. ఈనాడు నన్ను వెంటనే అయోధ్యకు రమ్మని ఆహ్వానించే వారు కూడా రేపు నన్ను దురాత్ముడని నిందిస్తారు. నన్ను ఎవరూ గౌరవించరు. గౌరవం లేని రాముడు జీవించి కూడా వృధా!

నేను నా తండ్రి మాటను పక్కన బెట్టి రాజ్యము స్వీకరిస్తే, లోకంలో అందరూ నా మాదిరే ఆడిన మాట తప్పడంలో పోటీ పడతారు తప్ప నన్ను ఎవరూ గౌరవించరు. నీమాటలు నమ్మిన వారికి నీవు నమ్మిన ఈలోకంలో సుఖం దక్కదు. పైగా, వారికి, నేను నమ్మిన పరలోకంలో నరకం ప్రాప్తిస్తుంది.

రాజు అనే వాడు ప్రజలకు ఆదర్శప్రాయుడుగా ఉండాలి. రాజు ఆచరించే ఆదర్శాలను ప్రజలుకూడా ఆచరిస్తారు. అలా కాకుండా నేనే మాటతప్పి రాజ్యం స్వీకరిస్తే, ప్రజలుకూడా నా మార్గాన్నే అనుసరిస్తారు. స్వేచ్ఛాజీవులు అవుతారు. అది దీర్ఘకాలంలో చెడుఫలితాలను ఇస్తుంది.

రాజధర్మము సనాతనమైనది. సత్యము, ధర్మము ఈ రెంటి మీదనే రాజ్యము నడవాలి. అప్పుడు ప్రజలకు రాజుమీద నమ్మకం కలుగుతుంది. కాబట్టి సత్యమును మించిన ధర్మము మరొకటి లేదు. మేమే చేసే యజ్ఞాలు, యాగాలు, క్రతువులు అన్నీ ఆ సత్యము మీదనే ఆధారపడ్డాయి. కాబట్టి మానవునకు సత్యవ్రతమును అవలంబించడం ఆవశ్యకము. నేను కూడా ఆ సత్యవాక్పరిపాలననే నమ్ముకున్నాను. ఆడిన మాట తప్పను. నా తండ్రికి ఇచ్చిన మాటను జవదాటను.

ఈ లోకంలో జనులు పలురకాలు. ఒకడు రాజ్యపాలన చేస్తాడు. మరొకడు పాపపు పనులు చేస్తాడు. మరొకడు వంశ గౌరవాన్ని కాపాడుతాడు. మరొకడు నరకద్వారాలు వెతుక్కుంటూ నరకానికివెళతాడు. ఎవరు చేసిన కర్మలకు తగ్గ ఫలములను వారు అనుభవిస్తారు. నేను సత్యమును పాటించడమే ధర్మంగా పెట్టుకున్నాను. అదే ఆచరిస్తాను. తగిన ఫలితాన్ని పొందుతాను.

నేను నా తండ్రి గారికి ఇచ్చిన మాటను, మోహము చేతగానీ, ఆశాపాశముల చేతగానీ, చిత్తభ్రమలో గానీ, అజ్ఞానమువలన గానీ, ఇంకా ఎటువంటి పరిస్థితులలో గానీ తప్పను. ఇదే నా నిశ్చయం. నేనే గనక ఆడిన మాట తప్పితే దేవతలు గానీ, నా పితృదేవతలు గానీ నేను చేసిన పనిని సమర్థించరు.

నేను ఆడిన మాట కోసరము నా క్షత్రియ ధర్మమును కూడా త్యజించుటకు వెనుకాడను. ఎందుకంటే క్షత్రియ ధర్మంలో ఎక్కువగా క్రూరత్వానికి, దురాశకు తావు ఉంటుంది కానీ సత్యధర్మానికి తావు లేదు.

మానవుడు తాను చెప్పదలచుకొన్నది ముందుగా మనసులో తలచుకుంటాడు. దానిని వాక్కురూపంలో బయటకు చెబుతాడు. కాబట్టి నీవు చెప్పినవి అన్నీ నీచెడ్డ ప్రవర్తనను సూచిస్తున్నాయి. నేను నా తండ్రి ఎదుట వనవాసమునకు పోతాను అని అంగీకరించాను. అప్పుడు నా తండ్రి దశరథుడు, నా తల్లి కైక, ఎంతోసంతోషించారు. ఇప్పుడు భరతుని మాట, నీ మాట విని ఎలా అయోధ్యకు పోగలను. కాబట్టి వనవాసమే నాకు శ్రేయోదాయకము. ఇక్కడ స్వచ్ఛమైన గాలీ

పీలుస్తూ, కందమూలములు తింటూ, నిర్మలమైన జలములు త్రాగుతూ, హాయిగా కాలం గడుపుతాను.

ఇది కర్మభూమి. మనం చేసే పనులను బట్టి మనకు ఫలితాలు వస్తాయి. నీ మాట విని నేను అధర్మంగా ప్రవర్తిస్తే నాకు చెడుఫలితాలే వస్తాయి. దేవేంద్రుడు నూరు అశ్వమేధ యాగములు చేసి ఇంద్రపదవి అధిష్ఠించాడు. ఎంతో మంది మహాఋషులు ఘోరమైన తపస్సులు చేసి ఉత్తమలోకములు పొందారు. వారే కాకుండా, సత్యము, ధర్మము, పరాక్రమము, భూతదయ, సరళమైన మాట, దేవతలను, బ్రాహ్మణులను పూజించడం, వీటిని మార్గములుగా చేసుకొని  మానవులు ఉత్తమ లోకములు పొందారు. ఆ మానవులలో కూడా,  బ్రాహ్మణులు, పైన చెప్పబడిన  మార్గంలో పయనించి ఉత్తమలోకములు పొందారు.

నీవు బ్రాహ్మణుడవు. కాని అపమార్గంలో పయనిస్తున్నావు. నీ వంటి అధర్మపరుడిని, అవినీతి పరుడిని దగ్గర చేర్చి నా తండ్రి తప్పుచేసాడు. నీవు ఎవరిని ఆదర్శంగా తీసుకొని ఈ మాటలు అన్నావో ఆ బుద్ధుడు, తథాగతుడు, పరమ నాస్తికుడు, ఒట్టి దొంగ. అందుకే ప్రజలు అతనినినమ్మలేదు. జ్ఞానులు ఎప్పుడూ నాస్తికులతో సంబంధం పెట్టుకోరు.

ఓ జాబాలీ! నీకు పూర్వులు చాలామంది ఉన్నారు. వారు ఎన్నో యజ్ఞయాగములు, శుభమైన కర్మలు చేసారు. వారు ఈ లోకము లోనూ పరలోకములోనూ సుఖాలు అనుభవించారు. బ్రాహ్మణులు మానవుల చేత యజ్ఞములు, యాగములు మొదలగు మంగళ కరమైన కార్యములు చేయిస్తారు కానీ నీ మాదిరి నాస్తిక వాదమును

వ్యాప్తి చేయరు. ఎల్లప్పుడూ ధర్మమును ఆచరించువారు. మంచివారి స్నేహము చేయువారు, తేజస్సు కలవారు, దానవ్రతులు, అహింసాపరులు, పాపము చేయని వారూ, ఉత్తములు అయిన వారు లోకములో పూజింపబడతారు. నీ లాంటి వారిని ప్రజలు గౌరవించరు." అని కోపంతో అన్నాడు రాముడు.

రాముని మాటలు విన్న జాబాలి రాముని అనునయిస్తూ ఈ విధంగా అన్నాడు. "రామా! నీవు పొరపడుతున్నావు. నేను నాస్తికుడను కాను. నాస్తికత్వమును వ్యాప్తిచేయడం లేదు. కేవలము నిజాలు చెప్పడమే నా సంకల్పము అది నాస్తికత్వము మాదిరి అనిపిస్తుంది. నేను కూడా ఆస్తికుని వలె మాట్లాడగలను. కేవలము నిన్ను మరలా అయోధ్యకు పట్టాభిషిక్తుని చేసి, అయోధ్యాప్రజలు, భరతుని కోరిక నెరవేర్చవలెననే కోరికతో అలా మాట్లాడాను కానీ వేరు కాదు." అని రాముని అనునయించాడు జాబాలి. అంతటితో ఆ వివాదము ముగిసిపోయింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నూట తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(ఈ సర్గలో మీకు ఒక శ్లోకము కనిపిస్తుంది. అందులో బుద్ధుడు, తథాగతుని ప్రస్తావన వచ్చింది. రాముడు బుద్ధుని చోరుడు అని కూడా అంటాడు. "యథాహి చోర: స తథా హి బుద్ధ స్తథాగతం నాస్తికమత్ర విద్ధి,". ఇది ఎలా సంభవము. రాముడు త్రేతాయుగము కాలము నాటి వాడు. బుద్ధుడు క్రీ.పూ.563 వ సంవత్సరములో జన్మించాడు. 80 సంవత్సరాలు జీవించాడు. క్రీ.పూ.483 సంవత్సరములో మరణించాడు.

ఆయన బౌద్ధమతమును వ్యాప్తిచేసాడు. బౌద్ధము భారతదేశంలో వ్యాప్తి చెందకపోయినా ప్రపంచ దేశాలలో అవలంబింపబడుతూ ఉంది. రామాయణ ప్రాశస్త్యమునకు ముగ్ధులై బౌద్ధులు రామాయణమును తమకు అనుకూలంగా మార్చి రాసుకున్నారు అని అంటారు. కాబట్టి బుద్ధుని కాలం నాటికే రామాయణము ఉంది అని తెలుస్తూ ఉంది. ఆ కారణం చేత రాముడు బుద్ధుని గూర్చి చెప్పడం, దూషించడం అసంగతం అని అర్థం అవుతూ ఉంది. అందువలన ఈ శ్లోకములు ప్రక్షిప్తములు అనగా తరువాత "తరువాత చేర్చబడినవి" అని నిర్ధారణ అయింది. ఈ విషయమును శ్రీమద్రామాయణమునకు వ్యాఖ్య రాసిన బ్రహ్మశ్రీ ఆచార్య పుల్లెల శ్రీరామ చంద్రుడు గారు కూడా ధృవీకరించారు. వారి అభిప్రాయము ప్రకారము ఈ శ్లోకములు ఛందస్సు మార్చి రాయబడ్డాయి. అప్పటిదాకా అనుష్టుప్ ఛందస్సులో నడిచిన రామాయణ కథ ఈ సర్గలో ఆఖరి పదిశ్లోకములు ఉపజాతి వృత్తంలో రాయబడ్డాయి. కాబట్టి ఈ పదిశ్లోకములను ప్రక్షిప్తములు అనడంలో సందేహము లేదు. అని అభిప్రాయపడ్డారు. రాముడు బుద్ధుని గురించి చెప్పడంలోనే ఈ విషయం తేటతెల్లము అవుతోంది. బుద్ధుని మీద, బౌద్ధము మీద ద్వేషము ఉన్న అజ్ఞాత రచయిత, ఎవరో ఔచిత్యమును మరిచి, ఈ శ్లోకములను రామాయణములో చేర్చి ఉండవచ్చు అని అనుకొనవలసి వస్తోంది.)

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూటపదవ సర్గ.)

సభలో జరుగుతున్న వాదోపవాదాలను జాగ్రత్తగా గమనిస్తున్నాడు కులగురువు వసిష్ఠుడు. ఎవరు చెప్పినా రాముడు ఒప్పుకోడంలేదు. జాబాలిమాటలతో రాముడు కోపగించుకున్నాడు అని అర్థం అయింది వసిష్ఠునకు. జాబాలి సామాన్యుడు కాదు. అందుకని జాబాలి మాటలను సర్దిచెప్పడానికి ప్రయత్నం చేసాడు వసిష్ఠుడు.

“ఓ రామా! ఈ లోకంలో జనులు పుడుతూ చస్తూ ఉంటారనీ, పుణ్యలోకాలకు, పాప లోకాలకూ పోయి మరలా జన్మ ఎత్తుతుంటారనీ జాబాలికి కూడా తెలుసు. కానీ నిన్ను ఎలాగైనా అయోధ్యకు రప్పించాలనే తాపత్రయంతో అలా మాట్లాడాడు కానీ వేరు కాదు. ఇంతకూ ఈ సృష్టి ఎలా మొదలయిందో నాకు తెలిసినంత వరకూ చెబుతాను విను.

ఈ సృష్టి ప్రారంభం కాక ముందు ఈ లోకమంతా నీటితో నిండి ఉంది. ఆ జలంలో నుండి భూమి ఆవిర్భవించింది. తరువాత దేవతలు, బ్రహ్మదేవుడు పుట్టారు. తరువాత బ్రహ్మ వరాహ రూపంలో భూమిని పైకి తీసుకొని వచ్చాడు. ( విష్ణుదేవుడు వరాహావతారంలో భూమిని పైకి తీసుకొని వచ్చాడు అని నానుడి కాని బ్రహ్మ దేవుడు వరాహావతారము ధరించాడని కొన్ని పురాణాలలో ఉంది అని

పండితులఅభిప్రాయము.) శాశ్వతుడు, నిత్యుడు, నాశరహితుడు అయిన బ్రహ్మ నుండి మరీచి, కశ్యపుడు పుట్టారు. కశ్యపునికి సూర్యుడు కుమారుడు. సూర్యుని కుమారుడు మనువు. మనువుకుమారుడు ఇక్ష్వాకువు. ఆ ఇక్ష్వాకువు మొట్ట మొదటగా ఈ అయోధ్యను పాలించాడు. అందుకే మీ వంశమును ఇక్ష్వాకు వంశము అని పిలుస్తారు.

ఇక్ష్వాకు కుమారుడు కుక్షి. కుక్షికి వికుక్షి అనే కుమారుడు పుట్టాడు. వికుక్షికి బాణుడు జన్మించాడు. బాణుడి కుమారుడు అనరణ్యుడు. అనరణ్యుడు ఈ దేశమును సుభిక్షంగా పరిపాలించాడు. అనరణ్యుని కుమారుడు పృథువు. పృథువు కుమారుడు త్రిశంకుడు. ఆ త్రిశంకువే విశ్వామిత్రుని సాయంతో సశరీరంగా స్వర్గమునకు వెళ్లాడు. ఆ త్రిశంకుని కుమారుడు  దున్ధుమారుడు, దున్ధుమారుని కుమారుడు యవనాశ్వుడు. ఆ యవనాశ్వుని కుమారుడు మాంధాత. మాంధాత కుమారుడు సుసంధి. సుసంధి కుమారుడు ధృవసంధి. ధృవసంధికుమారుడు భరతుడు. (ఆ భరతుని పేరు మీదనే భారత దేశము, భరత ఖండము  అని పిలువబడుతూ ఉంది.)

భరతుని కుమారుడు అసితుడు. ఈ అసితునికి ఒక కథ ఉండి. అసితునికి హైహయులు, తాలజంఘులు, శశిబిందువులు అనే రాజవంశీయులు శత్రువులు. వారు అసితుని రాజ్యము నుండి తరిమివేసారు. అసితుడు భార్యలతో సహా అడవులకు పారిపోయాడు. అప్పుడు అసితుని భార్యలు గర్భవతులు. అసితుని భార్యలకు ఒకరంటే ఒకరికి పడదు. అందులో ఒకామె రెండవ ఆమెకు గర్భం స్రావం అయేట్టు  విషం పెట్టింది.

భృగు వంశమునకు చెందిన చ్యవనుడు హిమవత్పర్వతము మీద ఉంటున్నాడు. అసితుని భార్య కాళింది. కాళిందికే ఆమె సవతి విషం పెట్టింది. కాళింది  చ్యవనుడి దగ్గరకు పోయి ఆయనకు నమస్కరించింది. "నీకు లోకముచే పూజింపబడేవాడు, ధార్మికుడు, మంచి శీలము కలవాడు, మీ వంశము నిలబెట్టేవాడు అయిన పుత్రుడు జన్మిస్తాడు" అని ఆశీర్వదించాడు.

చ్యవనుని ఆశీర్వాదము ఫలించి కాళిందికి సర్వలక్షణ సమన్వితుడైన కుమారుడు జన్మించాడు. విషమును విరిచి పుట్టాడు కాబట్టి అతనికి సగరుడు అనే పేరు సార్థకమయింది.  సగర చక్రవర్తి ఒక యజ్ఞము చేసాడు. యజ్ఞాశ్వమును వదిలిపెట్టాడు. ఆయజ్ఞాశ్వము మాయం అయింది. దానిని వెదికించే ప్రయత్నంలో సముద్రమును తవ్వించాడు. సముద్రమును తవ్వడానికి సగరుడు కారకుడు అయ్యాడు కాబట్టి ఆయనపేరు మీద సముద్రమునకు సాగరము అనే పేరు సార్థకమయింది.

సగరునకు అసమంజుడు అనే కుమారుడు పుట్టాడు. వాడుచిన్నప్పటినుండి పాపకృత్యాలకు అలవాటుపడ్డాడు. కాబట్టి సగరుడు అసమంజుని వదిలివేసాడు. (ఈ అసమంజుడి గురించే కైక వాదించింది. దానిని మంత్రులు తిప్పికొట్టారు). అసమంజుని కుమారుడు అంశుమంతుడు. అంశుమంతుని కుమారుడు దిలీపుడు. దిలీపుని కుమారుడు భగీరథుడు. (ఈ భగీరథుడే గంగను భూమి మీదికి తీసుకొని వచ్చాడు. అందుకే గంగానదికి భాగీరథి అనే పేరు వచ్చింది).

భగీరథుని కుమారుడు కకుత్థ్సుడు. ఆ కకుత్థ్సుని పేరు మీద మీ వంశమునకు కాకుత్థ్స వంశము అనేపేరు వచ్చింది. కకుత్థ్సునకు రఘువుకుమారుడు. అతని పేరుమీదుగానే మీ వంశమునకు రఘువంశము అనే పేరు, మీ అందరికీ రాఘువులు అనే పేరు వచ్చింది.

రఘువు కుమారుడు కల్మాషపాదుడు. కల్మాషపాదుని కుమారుడు శంఖణుడు. శంఖణుని కుమారుడు సుదర్శనుడు. సుదర్శనుని కుమారుడు అగ్నివర్ణుడు. అతని కుమారుడు శీఘ్రగుడు. అతని కుమారుడు మరువు. మరువుకుమారుడు ప్రశుశ్రువుడు. అతని కుమారుడు అంబరీషుడు. అంబరీషుని కుమారుడు నహుషుడు. నహుషుని కుమారుడు నాభాగుడు. నాభాగుని కుమారుడు అజుడు. అజుని కుమారుడు మీ తండ్రి దశరథమహారాజు. నీవు ఆ దశరథుని పెద్దకుమారుడవు.

మీ వంశములో అందరూ తమ పెద్దకుమారులకు రాజ్యాధికారము సంక్రమింపజేసారు. వంశపారంపర్యంగా పెద్దవాడివైన నీకు రాజ్యాధికారము లభించింది. అందుకని నీవు కాదనకుండా అయోధ్యను పాలించు. ఇక్ష్వాకు వంశములో ఇప్పటి వరకూ జ్యేష్టుడే రాజు అయ్యాడు. జ్యేష్టుడు ఉండగా చిన్నవాడు రాజుకావడం ధర్మవిరుద్ధము.

కాబట్టి ఓ రామా! ఇప్పుడు నీవు నీ వంశ గౌరవమును వారు కాపాడుకుంటూ వస్తున్న రాజధర్మమును నాశనం చెయ్యవద్దు. నీ

తండ్రి పరిపాలించినట్టు నీవు కూడాఅయోధ్యను పాలించు." అని అన్నాడు వసిష్ఠుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము  నూట పదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూటపదకొండవ సర్గ.)

వసిష్ఠుడు ఇక్ష్వాకు వంశరాజుల నందరి గురించి చెప్పి, వారందరూ రాజధర్మమును పాటించారనీ, ఆ వంశముల రాజులందరూ జ్యేష్టునికే పట్టం కట్టారనీ వివరించాడు. కానీ రాముడు ఏమీ మాట్లాడలేదు. వసిష్ఠుడు మరలా చెప్పనారంభించాడు.

"ఓరామా! జన్మఎత్తిన ప్రతివాడికీ ముగ్గురు గురువులు ఉంటారు. వారు తల్లి, తండ్రి, విద్యనేర్పిన గురువు. తండ్రి పురుషుని జన్మకు కారకుడవుతాడు. తల్లి జన్మనిస్తుంది. గురువు జ్ఞానమును ఉపదేశిస్తాడు. నేను నీ తండ్రిగారికీ. ఇప్పుడు నీకూ గురువును. గురువుచెప్పిన మాటలు వినడం లోకధర్మం. గురువుచెప్పిన మాటలు వినకపోతే నీవు పెద్దల మాటలను ఎదిరించినవాడివి అవుతావు.

నీకు సహజ గురువు నీ తల్లి కౌసల్య. ఆమె భర్తను పోగొట్టుకొని వృద్ధాప్యములో ఉంది. ఒకకుమారునిగా నీ తల్లికి సేవచేయడం నీ ధర్మం. నీ తల్లి సేవను మరిచి, నీవు అడవులలో ఉంటే నీవు నీ ధర్మమును అతిక్రమించిన వాడవు అవుతావు. భరతుడు నీ తమ్ముడు. చిన్న వాడి మాటలు మన్నించడం పెద్దల ధర్మము. కాబట్టి నీ తమ్ముని మాటలు మన్నించు.ఒక గురువుగా ఇంతకన్నా ఎక్కువ చెప్పలేను." అని పలికాడు వసిష్టుడు.

కులగురువు వసిష్ఠుడుచెప్పిన మాటలను సావధానంగా విన్నాడు రాముడు. గురువు గారికి నేరుగా ప్రత్యుత్తరం ఇచ్చి వారిని అగౌరవ పరచినట్టు కాకుండా, పక్కన ఉన్న వారితో అన్నట్టు  ఇలా అన్నాడు.

"నా తల్లి, తండ్రి  నన్ను పుట్టినప్పటి నుండి  అల్లారు ముద్దుగా పెంచారు. నేను కోరకుండానే అన్నీ సమకూర్చారు. వారి ఋణం తీర్చుకోడం నా కర్తవ్యము. నా తండ్రి దశరథుని ఎదుట నేను ప్రతిజ్ఞ చేసాను. దానిని పాటించడం నా ధర్మము. నా తండ్రి ఇప్పుడు లేడని ఏవేవో కుంటి సాకులు చెప్పి ఆయనకు ఇచ్చిన మాటను అబద్ధం చేయలేను. కాబట్టి నేను అయోధ్యకు రాలేను. ఇది నా నిశ్చయము." అని ముక్తసరిగా చెప్పి ఊరుకున్నాడు.

రాముని మాటలు విన్న భరతుడు సుమంత్రునితో ఇలా అన్నాడు. "సుమంత్రా! నీవు దర్భలు తీసుకొని వచ్చి ఇక్కడ పరుచు. రాముడు అయోధ్యకు వచ్చువరకు రాముని కదలనీయను. నేను ఇక్కడే పడుకుంటాను. ఆహారము, నీరు ముట్టను. రాముడు అయోధ్యకు రావడానికి అంగీకరించే వరకూ ఇక్కడే పడుకుంటాను." అని అన్నాడు. (ప్రస్తుతము మన నాయకులు చేస్తున్న ఘొరావ్, హర్తాళ్, నిరాహారదీక్షలకు ఆద్యుడు భరతుడు అని చెప్పవచ్చు. కాని నిరాహారదీక్షలు చేసి చచ్చిన రాజకీయనాయకుడు ఒక్కడూ లేడు, ఒక్క పొట్టిశ్రీరాములు తప్ప.)

భరతుని ఆదేశము మేరకు సుమంత్రుడు దర్భలు తెచ్చి అక్కడ పరిచాడు.  ఇదంతా చూస్తున్న రాముడు భరతునితో ఇలా అన్నాడు.

"భరతా! ఏమిటీ పని. నేనేం పాడు పని చేసానని నీవు ఇలా దీక్ష చేస్తున్నావు. ఎవరైనా బ్రాహ్మణుని వద్ద అప్పుతీసుకొని ఎగవేస్తే, వారి ఇంటి ముందు, ఆ బ్రాహ్మణుడు ఇలా నిరాహార దీక్ష చెయ్యవచ్చు కానీ క్షత్రియులకు ఇది తగదు. కాబట్టి ఈ నిరశనవ్రతమును విడిచిపెట్టి అయోధ్యకు వెళ్లు." అని అన్నాడు.

దీనితో భరతునికి తిక్కరేగింది. అక్కడ ఉన్న పురప్రముఖులను చూచి ఇలా అన్నాడు. "మీరందరూ ఇక్కడకువచ్చి ఏం చేస్తున్నారు. ఎంత సేపటికీ నేను మాట్లాడటం తప్ప మీరు ఏమీ మాట్లాడరా. రాముని అయోధ్యకు తీసుకురావడినికి మీవంతు ప్రయత్నం చేయరా! మీరంతా అన్నగారికి చెప్పండి." అని అన్నాడు భరతుడు.

అప్పుడు వారంతా భరతునితో ఇలాఅన్నారు."భరతా! రాముడు అన్యాయంగా అధర్మంగా మాట్లాడుతుంటే ఆయనను వారించ వచ్చుగానీ, రాముడు ధర్మంగా, న్యాయంగా మాట్లాడుతున్నాడు. ఆయనను మేము ఏమని వారించగలము. రాముడు చెప్పే ప్రతి మాటా యుక్తియుక్తముగా ఉంది. రాముడు తండ్రి మాటను మీరడం లేదు. అది ప్రతి పౌరుడి ధర్మము. ఆ ధర్మాన్నే రాముడు నెరవేరుస్తు న్నాడు. రాముడే తండ్రి మాటను కాదని రాజు అయితే ఇంక రాజ్యంలో రాముని మాట ఎవరు వింటారు. అది అరాచకానికి దారి తీస్తుంది. కాబట్టి రామునికి ఎదురు చెప్పలేము." అని ముక్తకంఠంతో పలికారు పౌరులు.

రాముడు చిరునవ్వు నవ్వాడు. "భరతా! చూచావాపౌరులు ఏమంటున్నారో! వారిది ధర్మదృష్టి. అందుకే ధర్మం చెప్పారు. నీవు కూడా

ధర్మం ఆలోచించు. నీ ప్రయత్నం మానుకో. అయోధ్యకు వెళ్లు."అని అన్నాడు రాముడు.

భరతుడు పైకి లేచాడు. ఆచమనం చేసాడు. అక్కడ సమావేశమయిన మంత్రులు, విద్వాంసులు, సేనానాయకులు, పురప్రముఖులను ఉద్దేశించి ఇలా అన్నాడు.

" నా మాటలను శ్రద్ధగా వినండి. నేను ఎన్నడూ రాజ్యము నాకు ఇమ్మని నా తండ్రిని అడగలేదు. బలవంతం చేయలేదు. నేను రాజు కావాలని ఎన్నడూ నా తల్లి కైకతో అనలేదు. ఆమెను ఆ దిశగా ప్రేరేపించలేదు. నా తల్లి చేసిన పనికి నా అనుమతి లేదు. కాని దురదృష్టవశాత్తు ఈ పరిణామాలకు నేను కారణం అయ్యాను కాబట్టి నా తండ్రిగారి మాట ప్రకారము రామునికి బదులు నేను పదునాలుగు సంత్సరములు అరణ్య వాసము చేస్తాను. నన్ను వద్దు అనడానికి ఎవరికీ అధికారము లేదు." అని అన్నాడు భరతుడు.

రాముడు ఆశ్చర్యంగా భరతుని వంక చూచాడు. ఒక్క నవ్వు నవ్వి ఇలా అన్నాడు. "పౌరులారా! నా తండ్రి గారి పాలనలో జరిగిన అమ్మకాలూ, కొనుగోళ్లు, కుదువలు, ఆయన చనిపోయినాడని రద్దు చేస్తామా. లేక మరొకరి పేరుతో మార్చుకుంటామా! లేదు కదా. ఇదీ అంతే. నా తండ్రి నన్ను అరణ్యములకు వెళ్లమన్నాడు. నేను అరణ్యము లకు వచ్చాను. ఇప్పుడు మా తండ్రిగారు లేరని నా ప్రతిజ్ఞను మార్చుకోలేము కదా! నాకు మారుగా భరతుడు అరణ్యవాసము చేయలేడు కదా! నాక ప్రతినిధిగా భరతుడు రాజ్యం చేయవచ్చుకానీ, అరణ్యవాసం చెయ్యడం హాస్యాస్పదము, జుగుప్సాకరము. నా తల్లి

వరాలు కోరడం, నా తండ్రి ఆ వరాలు ఇవ్వడం, నేను అరణ్యములకు రావడం అన్నీ ధర్మబద్ధములే. భరతుడు రాజ్యం చేస్తాడు. అతనికి అన్నీ శుభాలే జరుగుతాయి. నేను తొందరలోనే వనవాసము నుండి తిరిగి వచ్చి లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల సాయంతో రాజ్యపాలన చేస్తాను.

భరతా! మహారాజు దశరథుడు నీకు రాజ్యము, నాకు వనములు ఇచ్చాడు. వాటిని మనం సమర్థవంతంగా పాలిద్దాము. మహారాజునకు అసత్యదోషం రాకుండా చేద్దాము. నేను చెప్పిన మాటల్లోని ఆంతర్యాన్ని అర్థం చేసుకొని ప్రవర్తించు" అని అన్నాడు రాముడు.

(అరణ్యంలో నేను శత్రు సంహారం చేసి అయోధ్యను శత్రుశేషం లేకుండా చేస్తాను. అంతవరకూ నీవు అయోధ్యను పాలించు అని రాముని మాటల్లోని భావము అని చెప్పవచ్చు.)

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నూట పదకొండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూటపన్నెండవ సర్గ.)

ఆ ప్రకారంగా రాముడు, భరతుని మధ్య జరిగిన వాదోప వాదములు చూచి, విని అక్కడ ఉన్న వారు ఆశ్చర్యపోయారు. వారంతా రాముని ధర్మనిరతిని ప్రశంసించారు. అక్కడ ఉన్న ఋషులు భరతునితో ఇలా అన్నారు.

“భరతా! నీవు గొప్పవంశములో జన్మించావు. సకల శాస్త్రములు అభ్యసించావు. బుద్ధిమంతుడవు. నీ అన్న రాముడు ఎలా చెబితే అలా చెయ్యి. రాముని బలవంత పెట్టకు. నీ తండ్రి దశరథుడు తన భార్య ఋణము తీర్చుకొని స్వర్గానికి వెళ్లాడు. రాముడు తండ్రి ఋణము తీర్చుకుంటున్నాడు. కాబట్టి రాముని వనవాసము చెయ్యనివ్వు.” అని చెప్పారు. తరువాత వారు  ఎవరి ఆశ్రమములను వారు  వెళ్లిపోయారు. కాని భరతునికి మాత్రము వారి మాటలు రుచించలేదు. ఆఖరి ప్రయత్నంగా, మాటలు తొట్రుపడుతుంటే గద్గద స్వరంతో, వణుకుతూ, చేతులు జోడించి, భయం భయంగా  రామునితో ఇలా అన్నాడు.

“అన్నయ్యా! రాజధర్మము, కులధర్మము ప్రకారము పెద్దవాడే రాజుగా ఉండాలి కానీ చిన్నవాడు కాదు. ఇప్పుడు నీవు రాజధర్మము నకు కులధర్మమునకు విఘాతము కలిగించకు. నా మాట నా తల్లి

మాట మన్నించు. అయోధ్యకు వచ్చి రాజ్యపాలన చేపట్టు. ఎందుకంటే నేను నీ కన్నా చిన్నవాడిని. ఈ రాజ్యభారము మోయలేను. నేను అసమర్ధుడను. మన బంధువులు మిత్రులు అందరూ నీవే రాజు కావాలని ఎదురు చూస్తున్నారు. వారందరి దృష్టిలో నీవే రాజు కావడానికి సమర్ధుడివి. కాబట్టి వెంటనే అయోధ్యకు బయలుదేరు." అని అన్నాడు భరతుడు.

అనడమే కాదు. రాముని పాదముల మీద పడి ప్రార్థించాడు. రాముడు భరతుని రెండు చేతులతో లేవనెత్తాడు. తన తొడమీద కూర్చోపెట్టుకున్నాడు. భరతుని తల ప్రేమతో నిమిరాడు.

"భరతా! నీవు సామాన్యుడివి కావు. బుద్ధిమంతుడివి. గురువుల దగ్గర అన్ని విద్యలూ నేర్చుకున్నావు. నీవు రాజ్యమును పాలించడానికి సమర్ధుడివి. అధైర్యపడకు. ధైర్యంగా అయోధ్యకు వెళ్లు. రాజ్యాధికారము చేపట్టు. నీకు తోడుగా కులగురువు వసిష్ఠులవారు, అమాత్యులు, సైన్యాధిపతులు ఉన్నారు. వారి సాయంతో రాజ్యము పాలించు. అంతేగాని నన్ను అయోధ్యకు రమ్మని కోరకు.

చంద్రుడు తన వెన్నెలను కోల్పోయినా, హిమవత్పర్వతము తన చల్లదనాన్ని కోల్పోయినా, సముద్రము చెలియలి కట్టదాటినా, నేను మాత్రము తండ్రి ఆజ్ఞను అతిక్రమించను, అయోధ్యకు రాను. మరొకమాట. నీ తల్లి మితి మీరిన ఆశవలననో, నీ మీద ఉన్న అధిక ప్రేమ వలననో ఇదంతా చేసింది. ఫలితం మనం ఇద్దరం అనుభవిస్తున్నాము. నాతో పాటు సీత, లక్ష్మణుడు అనుభవిస్తున్నారు

గతం గత:. అంతా మరిచిపో. నీ తల్లి కేవలం నిమిత్త మాత్రురాలు. ఇప్పటికే భర్తను కోల్పోయి పుట్టెడు దు:ఖంలో ఉంది. ఆమెను ఏమీ అనవద్దు. దూషించవద్దు. ఒక కొడుకు తల్లిని గౌరవించినట్టు గౌరవించు. ఆమె మనసు బాధపెట్టకు." అని హితబోధ చేసాడు రాముడు.

అప్పుడు భరతుడు బంగారముతో చేసిన పాదుకలు తెప్పించాడు. రాముని పాదముల వద్ద పెట్టాడు. రామునితో ఇలా అన్నాడు.

"రామా! ఇవి బంగారముతో చేసిన పాదుకలు. వీటిమీద నీ పాదములు ఉంచు. ఇవే నాకు శిరోధార్యములు. ఇంక నుంచి ఈ రామ పాదుకలే అయోధ్యను నీకు బదులుగా పాలిస్తాయి. నేను కేవలం నీ ప్రతినిధిని మాత్రమే. నీ ప్రతినిధిగా అయోధ్యను పాలిస్తాను." అని అన్నాడు.

రాముడు భరతుని మాటలను మన్నించాడు. ఆ పాదుకల మీద తన పాదములను పెట్టి ఆ పాదుకలను భరతునికి ఇచ్చాడు. భరతుడు ఆ పాదుకలకు నమస్కరించాడు.

"రామా! నేటి నుంచి ఈ పాదుకలు నాకు దిశానిర్దేశము చేస్తాయి. నేను కూడా నీ మాదిరి నారచీరలు, జటలు ధరిస్తాను. అయోధ్య బయట ఆశ్రమము వేసుకొని ఉంటాను. అక్కడ ఈ పాదుకలను ప్రతిష్ఠిస్తాను. నీకు ప్రతినిధిగా రాజ్యపాలన చేస్తాను. నీరాక కోసం నిరీక్షిస్తూ ఉంటాను.

రామా! ఈ పదునాలుగు సంవత్సరములు గడువు పూర్తి అయిన మరునాడు నువ్వు అయోధ్యకు రావలెను. అలా రాకపోతే ఆరోజే నేను అగ్నిప్రవేశము చేస్తాను." అని పలికాడు భరతుడు. రాముడు భరతుని మాటలకు అంగీకరించాడు. శత్రుఘ్నుని దగ్గరకు తీసుకొని కౌగలించుకొని శిరస్సు ముద్దుపెట్టుకున్నాడు. తరువాత భరతుని చూచి ఇలా అన్నాడు.

"భరతా! నీ తల్లిని జాగ్రత్తగా చూసుకో. ఆమెపై కోపించవద్దు. నీవు ఆమెను చిన్న మాట అన్నా నామీద, సీత మీద ఒట్టు." అని అన్నాడు. కళ్లనిండా నీళ్లు నిండగా రాముడు భరతునికి వీడ్కోలు పలికాడు. భరతుడు రాముని పాదుకలకు పూజచేసాడు. వాటిని భద్రగజము మీద రాజు కూర్చునే స్థానములో పెట్టాడు. అయోధ్యకు ప్రయాణం అయ్యాడు. రాముడు అయోధ్యనుండి వచ్చిన వారికి సాదరంగా వీడ్కోలు పలికాడు. రాముడు తన తల్లులందరికీ పాద నమస్కారము చేసాడు. దు:ఖము ఆపుకోలేక పర్ణశాలలోకి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నూట పన్నెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

ఇంతటితో అయోధ్య గురించిన వారసత్వపు వివాదము ముగిసింది. అది త్రేతాయుగము. ధర్మం మూడు పాదాలతో నడిచింది అని పెద్దలు చెబుతారు. రాముడు, భరతుడు రాజ్యం నీది అంటే నీది అను వాదులాడుకున్నారు. అప్పనంగా అయాచితంగా వచ్చిన రాజ్యాన్ని

తీసుకోడానికి రాముడు ఇష్టపడలేదు. తనది కాని దానిని అనుభవించడానికి భరతుడు ఇష్టపడలేదు. ఇదే ఆనాటి ధర్మము.

ద్వాపరం లో అలా కాదు. అంతా నాదే. నీకు ఏమీ లేదు. అనేది దుర్యోధనుడి మనస్తత్వం. కనీసం నా భాగం అన్నా నాకు ఇవ్వు. లేకపోతే చావగొట్టి తీసుకుంటాను అనేది ధర్మరాజు మనస్తత్వం. యుద్ధం ఎందుకు దండగ-- పాచికలు ఉండగా. ఒక్క రక్తం బొట్టు చిందకుండా పేకాటలో సర్వస్వం గెల్చుకుందాము, ఎదుటి వాడి తల గొరిగిద్దాము అన్నది శకుని మనస్తత్వము. అందరికీ అన్నిమాటలు చెబుతూ, తాను మాత్రం అంటీముట్టనట్టు జితేంద్రియుడిలాగా ఉన్నాడు శ్రీకృష్ణుడు. ఇదీ ద్వాపర యుగ ధర్మము.

ఇంక కలియుగ ధర్మము మనం చూస్తూనే ఉన్నాము. అందినంత వరకూ దోచుకోవడం. ఆఖరుకు జైలుపాలవడం. బంగారు పళ్లాలలో తిన్న వారు, సత్తుకంచాలలో, చిప్పకూడు తినడం వారి జీవితాలలో పరాకాష్ట. నాకు, నా కొడుకులకు, నా మనుమలకు, మునిమనుమలకు కూడా ఆస్తి సంపాదించాలి అన్న అత్యాశతో అన్ని అక్రమాలు చెయ్యడం. అడ్డం వచ్చిన వాళ్లను అడ్డంగా నరికెయ్యడం. ఇదీ నేటి కలియుగ ధర్మము.

యుగ యుగానికీ ధర్మం మారుతూ ఉంటుంది. మనుషుల మనస్తత్వాలూ మారుతుంటాయి. కాని, నాడూ జాబాలి లాంటి నాస్తిక వాదులు ఉన్నారు. నేడూ రాముడు, కృష్ణుడు లాంటి జితేంద్రియులూ ఉన్నారు. (రమణ మహర్షి, కంచి పరమాచార్య, మొదలగు వారు). మంచి చెడూ ఎప్పుడూ ఉంటాయి. కాకపోతే చెడు వైపుకు

ఆకర్షితులైనంత త్వరగా మంచి వైపు ఆకర్షితులం కాము. అదే మానవ బలహీనత. ఈ బలహీనతలను జయించిన వాడు రాముడు. అందుకే రాముడు అందరికీ ఆదర్శప్రాయుడు అయ్యాడు.

నేడు రామాలయం లేని ఊరు లేదు. "శ్రీరామ" రాయని పత్రమూ లేదు. రామనామం చెయ్యని భక్తుడూ లేడు. రామరాజ్యం రావాలని కోరని వాడూ లేడు.

ఇంతకూ రామరాజ్యం అంటే ఏమిటి? ఎలా ఉంటుంది? అందరూ తలోకవిధంగా చెబుతారు. కాని దీనికి రాముడి జీవితమే జవాబు. రాముడు తన జీవితం ద్వారా రెండు విషయాలు ప్రపంచానికి చెప్పాడు. ఒకటి తనది కాని దానికి ఆశించక పోవడం. రెండవది పెద్దల మాట పాటించడం. తండ్రి ఆజ్ఞను శిరసావహించడం. ఈరెండు గుణాలు నేడు ఎవరిలోనూ లేవు.

అంతర్లీనంగా రాముడు తన నడవడి ద్వారా మరొక విషయం కూడా చూచాయగా చెప్పాడు. అదేమిటంటే......

దశరథుడు మహారాజు. మహారాజు ఆదేశాలను పాటించడం పౌరుల ధర్మము. ఒక సామాన్య మానవుడిగా రాముడు మహారాజు ఆదేశాలను పాటించాలి. అదే చేసాడు రాముడు. అంతేగానీ మహారాజు ఇచ్చిన ఆదేశాల వెనక ఉన్న కారణాలు వెదక లేదు. రాజు చెప్పాడు. నేను పాటించాలి. రాజు ఎప్పుడూ తప్పు చెయ్యడు. ఒకవేళ రాజు తప్పు చేసినా ప్రజలు దానిని ప్రశ్నించకూడదు. అదీ రాముడు ప్రతిపాదించిన ధర్మం. అందుకే రాముడు దేవుడు అయ్యాడు.

ఈనాడు మనము దానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాము. ప్రభుత్వము ఆదేశాలను పాటించకపోవడం మనకు దైనందిన కృత్యము అయిపోయింది. ప్రభుత్వాన్ని మోసం చేయడం, ప్రభుత్వ ఆస్తులను ఆక్రమించడం, ప్రభుత్వ ధనాన్ని అపహరించడం అలవాటయిపోయింది.

పెద్ద వాళ్లను గౌరవించడం, తల్లితండ్రుల మాటలను మన్నించడం ప్రజలు ఎప్పుడో మరిచిపోయారు. గురువులను గౌరవించడం మహా పాపం అన్నట్టు ప్రవర్తిస్తున్నారు విద్యార్థులు. తండ్రిగా భావించవలసిన గురువులతో ప్రేమాయణాలు సాగిస్తున్నారు నేటి విద్యార్థినులు.

గురువులు కూడా తక్కువ తిన లేదు. క్లాసురూములలో పాఠాలు చెప్పడం మానేసి రాజకీయ నాయకుల చుట్టూ తిరుగుతూ, రాజకీయాలలో మునిగితేలుతూ, రాజకీయ నాయకుల మాదిరి ప్రవర్తిస్తూ విద్యార్థులను స్కూళ్లకు పోవద్దనీ, కాలేజీలకు పోవద్దని బోధిస్తూ, రైళ్లు, బస్సులు ఆపమనీ, హింస చేయమనీ ప్రేరేపిస్తున్నారు. అలాంటప్పుడు మనది రామరాజ్యం ఎలా అవుతుంది. రామరాజ్యం అని ఎలా అనగలము. ఆలోచించండి.

ఇంక భరతుడు. కులధర్మం, రాజ ధర్మం గొప్పది అన్నాడు. క్షత్రియ కులంలో పెద్ద వాడు రాజు కావడం సాంప్రదాయం. దానిని పాటించమన్నాడు. వసిష్ఠుడు కూడా ఇక్ష్వాకు వంశచరిత్రను ఏకరువుపెట్టాడు. కాని రాముడు చలించలేదు. తన తండ్రికి ఇచ్చిన మాటకు కట్టుబడి ఉన్నాడు.

వీరి మధ్యలో లక్ష్మణుడు ఒక వాదాన్ని లేవదీసాడు. అందులో ఒకటి రెండు న్యాయ సూత్రాలు ఇమిడి ఉన్నాయి కాబట్టి ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

లక్ష్మణుడు ప్రతిపాదించిన మొదటి సూత్రము. కైక వరాలు అడిగింది. దశరథుడు ఇస్తాను అన్నాడు. అడగడం, ఇవ్వడం, పుచ్చుకోడం వారి ఇద్దరి మధ్య జరిగిన ఒప్పందం. అంతే కాని మూడవ వ్యక్తి అయిన రామునికి ఆ ఒప్పందంతో  ఎలాంటి సంబంధము లేదు. దశరథుడు కైకకు వరాలు ఇవ్వడం వలన మూడవ వ్యక్తి నష్టపోకూడదు. కాని  దశరథుడు కైకకు ఇచ్చిన వరాల వల్ల రాముడు అంటే మూడవ వ్యక్తి నష్టపోయాడు. ఇది అధర్మము. ఇతరులకు నష్టం, కష్టం కలిగించని రీతిలో దశరథుడు ఎన్ని వరాలు అయినా ఇవ్వవచ్చు. కైక పుచ్చుకోవచ్చు. కాని ఆ వరాలు ఇవ్వడం వల్ల మూడవ వ్యక్తి నష్టపోతే ఆ వరాలను, దాని మూలంగా రాజు ఇచ్చిన ఆదేశాలను పాటించనవసరం లేదు. రాముడిని కాదని భరతుడికి రాజ్యాభిషేకం చెయ్యవచ్చు. కానీ రాముడు అడవులకు పోవడం దేనికి. ఇదీ లక్ష్మణుని వాదన.

ఈ రోజుల్లో సర్వీసు రూల్సులో ఇది పాటిస్తున్నారు. పైవాడికి అనుగ్రహం కలిగితే ప్రమోషన్లు, అన్ని నిబంధనలను తుంగల్లో తొక్కి యధేచ్ఛగా  ఇస్తున్నారు. కాని ఆ ప్రమోషను ఇవ్వడం ద్వారా  మూడవ వ్యక్తికి నష్టం కలిగించకూడదు. అది చట్టవిరుద్ధం.  అలా మూడవ వ్యక్తికి నష్టం జరిగితే కోర్టు జోక్యం చేసుకొని ఆ నష్టాన్ని  నివారిస్తుంది.

మీరు అధిక ప్రసంగం అని అనుకోకపోతే ఇక్కడ నా స్వానుభవం వివరిస్తాను. అప్పుడు నేను కోర్టుమాస్టరు గా హైకోర్టులో పనిచేస్తున్నాను. హైకోర్టులో అన్ని ఉద్యోగనియామకాలు చీఫ్‌జస్టిస్ చేస్తాడు. అసిస్టెంటు రిజిస్ట్రారు పోస్టుకు, లా గ్రాడ్యుయేట్ అయి ఉండాలి. ఒక అసిస్టెంటు రిజిస్ట్రారు పోస్టుఖాళీ అయింది. నా పైన నలుగురు సీనియర్సు ఉన్నారు. కాని వారు మెట్రిక్యులేట్సు. నేను లా గ్రాడ్యుయేట్. న్యాయప్రకారం, ధర్మ ప్రకారము ఆ పోస్టులో నన్ను నియమించాలి. కాని అప్పటి చీఫ్‌జస్టిస్, కేవలం మెట్రిక్యులేట్ అయిన సీనియర్‌ను, ఆయన సెంట్రల్ లా మినిస్టరుకు తెలియడం వల్ల, అన్ని నిబంధనలను తోసి పుచ్చి అసిస్టెంటురిజిస్ట్రారు గా నియమించారు. "అయ్యా! మీరు మీ ఇష్టంవచ్చినవారిని ఇష్టం వచ్చినట్టు నియమించు కోవచ్చు. కానీ దానివలన ఇతరులకు అన్యాయం జరగకూడదు. అది రూలు." అని మేము వాదించాము. కాని మా వాదన అరణ్యరోదన అయింది లెండి. న్యాయం చెయ్యవలసిన న్యాయమూర్తులే ఆశ్రిత పక్షపాతంతో అన్యాయాలకు పాల్పడుతుంటే, మనది రామరాజ్యం ఎలా అవుతుంది.

ఇంక రెండవ సూత్రం. దశరథుడు మహారాజు. ఇంటికి పెద్ద వాడు. రాజ్యము పిత్రార్జితము. దశరథుడు తన ఇష్టం వచ్చిన వాళ్లకు ఇవ్వడానికి వీలు లేదు. కులధర్మాన్ని పాటించి పెద్దవాడికే ఇవ్వాలి. కానీ దశరథుడు స్త్రీవ్యామోహంలో పడి చిన్నవాడైన భరతుడికి రాజ్యాన్ని కట్టబెట్టాడు. అడ్డం వస్తాడని రాముని అడవులకు పొమ్మన్నాడు. ఇదంతా స్త్రీవ్యామోహంతో చేసాడు కాబట్టి రాముడికి తండ్రి ఆదేశాలను పాటించనవసరం లేదు. తండ్రి చేసిన పనులు చట్టరీత్యా చెల్లవు. ఈ నాడు కూడా ఈ సూత్రం అమలులో ఉంది. దీనినే పయస్ ఆబ్లిగేషన్

అంటారు. ఉమ్మడి కుటుంబంలో తండ్రి ఆస్తిని అజమాయిషీ చేస్తుంటాడు. కుటుంబక్షేమం కోసం అప్పులు చేస్తాడు. ఆస్తులు అమ్ముతాడు, కొంటాడు. తండ్రి చనిపోతే, తండ్రి చేసిన అప్పులకు కొడుకులు బాధ్యులు అవుతారు. కాని, కొడుకులు మైనర్లుగాఉ న్నప్పుడు, తండ్రి స్త్రీవ్యామోహంతోనో, జూదం ఆడటానికో అప్పులు చేస్తే కుటుంబ ఆస్తులను అన్యాక్రాంతం చేస్తే, కొడుకులు తండ్రి చేసిన పనులకు బాధ్యులు కారు. కొడుకులు ఆ అప్పులు తీర్చనవసరం లేదు. పైగా ఆ ఆస్తులను తిరిగి స్వాధీనం చేసుకోవచ్చు. తండ్రి చేసిన లావాదేవీలకు కట్టుబడనవసరం లేదు. ఇదీ నేటి సూత్రము. దీనినే నాడు లక్ష్మణుడు సూత్రప్రాయంగా ప్రతిపాదించాడు.

ఇదిఇలా ఉంటే, అయోధ్యా కాండ చదివిన తరువాత ఒక సందేహము వస్తుంది. కైక రాముని అల్లారుముద్దుగా పెంచింది. రాముడు అంటే ఎంతో ప్రేమ. అలాంటి కైక కేవలం ఒక దాసి చెప్పిన మాటలు విని రామునికి ఇంతటి అపకారము తలపెడుతుందా. ఒక వేళ పుత్రవ్యామోహంతో భరతునికి పట్టాభిషేకము చెయ్యాలని కోరినా, రాముని అడవులకు పంపుతుందా. అంత క్రూరంగా ప్రవర్తిస్తుందా! కాని కైక అలాఎందుకు చేసింది. ఎందుకు నిందలపాలయింది. దీని వెనక బలమైనకారణం ఏమైనా ఉందా! ఊహిస్తే ఉంది అని అనిపించక మానదు. ఇలా జరగడానికి అవకాశం ఉందేమో ఆలోచించండి..

దశరథుడికి హటాత్తుగా రాముడికి పట్టాభిషేకము చెయ్యాలని ఆలోచన వచ్చింది. అదీ మరునాడే. ఆలోచించుకోడానికి కూడా వ్యవధి లేదు. రాముని పిలిచి తన నిర్ణయం చెప్పాడు. కైకకు కూడా చెప్పలేదు. కాని కైకకు మంథర ద్వారా తెలిసింది. మొదట్లో ఆనందించింది. కాని

ఆలోచించింది.

కైక సామాన్యురాలు కాదు. గొప్పరాజనీతిజ్ఞురాలు. భర్తకు రాజకీయాలలో చేదోడు వాదోడుగా ఉండేది. యుద్ధాలలో కూడా పాల్గొంది. దేవ దానవ యుద్ధంలో, దశరథుడి తోపాటు స్వయంగా తాను కూడా పాల్గొని యుద్ధం చేసింది. దశరథుని రెండు సార్లు ప్రాణాపాయస్థితినుండి కాపాడింది. కైక అంతటి వీరనారి. పూర్వాపరాలు ఆలోచించగల దిట్ట.

రాముడికి పట్టాభిషేకము అనగానే మొదట్లో సంతోషము కలిగినా, తరువాత కొంచెం భయం వేసింది. రాముడు చిన్నవాడు. యౌవనంలో ఉన్నాడు. రాజకీయాలు కొత్త. అస్సలు అనుభవం లేదు. ఇంతటి భారాన్ని మొయ్యలేడు. ఇప్పుడు రాముడు రాజు అయితే చిన్న వయసులో భోగలాలసుడు అయ్యే ప్రమాదం ఉంది. రాజ్యము అరాచకము అవుతుంది. రాముడికి తన రాజ్యము ఎంతవరకూ విస్తరించింది. ఏమేమి సామంత రాజ్యాలు ఉన్నాయి. మిత్రులు ఎవరు? శత్రువులు ఎవరు? ఏమీ తెలియదు. పైగా దక్షిణ దిశలో దండకారణ్యంలో రాక్షస మూకలు తమ స్థావరాలను ఏర్పరచుకొని ఉన్నాయి. వారు ఇంకా ముందుకు చొచ్చుకొని వచ్చే ప్రమాదం ఉంది. రాక్షసులు మునులకు, జానపదులకు అపకారం చేస్తున్నారని, వేధిస్తున్నారని వార్తలు వస్తున్నాయి. దానిని నివారించాలి.

ఈ పరిస్థితులలో రాముడు రాజు అయి అంత:పురంలో కూర్చుంటే అతనికి దేశం గురించి తెలిసే అవకాశం లేదు. కాబట్టి రాముడు దేశాటన చెయ్యాలి. అడవులలో తిరగాలి. అక్కడి స్థితి గతులు

తెలుసుకోవాలి. దానికి మార్గం వెతకాలి." ఇదీ కైక ఆలోచన.

కైక మరొక కోణంలోనుండి కూడా ఆలోచించింది. రాముడు కేవలం స్వలాభం కోసం పాటుపటేవాడా. లేక ప్రజా క్షేమం కోసం రాజ్యాన్ని కూడా త్యజించే జితేంద్రియుడా. రాముడు స్వార్థపరుడా లేక ప్రజల మేలుకోరేవాడా. అందుకే ఈ వరాలు కోరే నాటకం ఆడింది. అందుకే రాముని 14 సంవత్సరాలు అరణ్య వాసం చెయ్యాలి అని కోరింది. రెండవది భరతునికి పట్టాభిషేకము.

ఇందులో రెండు సూత్రాలు ఇమిడీ ఉన్నాయి.

మొదటిది.... నాటి న్యాయసూత్రాల ప్రకారం, రాముడు రాజ్యాన్ని తనకు తెలిసీ 14 ఏళ్లు అన్యాక్రాంతం చేస్తే, తిరిగి దానిని కోరే హక్కు లేదు. (అది ఈ రోజుల్లో అడ్వర్సుపొసేషన్ సూత్రం ప్రకారం12 ఏళ్లుగా ఉంది. ) తన రాజ్యం పోతుందని తెలిసీ రాముడు అడవులకు పోతాడా. లేక తండ్రి మీద తిరగబడతాడా అని పరీక్షించవచ్చు.

రెండవది.... రాముడు తిరిగి వస్తే భరతుడు తిరిగి రాజ్యం రామునికి ఇస్తాడా. లేక నీకు హక్కులేదు పొమ్మంటాడా! దీనితో భరతుని నిజాయితీ కూడా తేలిపోతుంది.

కాబట్టి కైక రాముని ఒక పరిపూర్ణ మహారాజుగా తీర్చిదిద్దాలని అనుకుంది. రాజ్యపాలన గురించి అవగాహన కలిగించాలి అనుకొంది. ప్రజల కష్టసుఖాలు రాముడు తెలుసుకోవాలి అనుకొంది. రాజ్యంలో శత్రువులను నాశనం చెయ్యడం, రాజ్య విస్తరణ ముఖ్యం అనుకొంది.

ఇవన్నీ జరగాలంటే రాముడు దేశాటన చెయ్యాలి. అందుకే తన గుండెల నిండా బాధనునింపుకొని, కన్నీళ్లు ఆపుకుంటూ, మనసులోనే కుమిలిపోతూ, అత్యంత కఠినంగా ప్రవర్తించింది. అందరితోనూ ఛీ అనిపించుకుంది.

నాడే రాముడు పట్టాభిషిక్తుడు అయి ఉంటే మనకు రామాయణం లేదు. రాముని గురించి అనుకొనే వాడే లేడు. మనకు రామాయణాన్ని అందించిన ఘనత కైకకు దక్కుతుంది. రాముని కీర్తి ఆసేతుహిమాచలము వ్యాపింపచేసింది. రాముడి రాజ్యాన్ని లంక దాకా విస్తరింపచేసింది. రాముని చేత రాక్షస సంహారం చేయించింది. అయోధ్యకు శత్రుశేషం లేకుండా చేసింది. కాని పుట్టెడు అపకీర్తిని మూట గట్టుకొంది. తుదకు భర్తను కూడా కోల్పోయింది. అంతటి త్యాగమూర్తి కైక. కాని అందరి మనసుల్లో ఒక స్వార్ధపరురాలిగా, చరిత్రహీనురాలిగా మిగిలిపోయింది కైక.

ఈ నాడు రాముని ఊరూరా, ఇంటింటా పూజించు కుంటున్నా మంటే దానికి మూలకారణం కైక అని మనం తెలుసుకుంటే, ఆమె జీవితం ధన్యం అయినట్టే. )

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూటపదమూడవ సర్గ.)

భరతుడు, శత్రుఘ్నుడు, తల్లులు, మంత్రులు, వసిష్ఠుని తో సహా అందరూ అయోధ్యకు తిరుగు ప్రయాణం అయ్యారు. భరతుడు రాముని పాదుకలను గౌరవ పురస్సరంగా తన శిరస్సుమీద ధరించాడు. వారందరూ చిత్రకూటపర్వతమును దాటి మందాకినీ నది వైపుకు ప్రయాణం చేసారు. భరద్వాజ ఆశ్రమమునకు చేరుకున్నారు.

భరతుడు, వసిష్ఠుడు వెంటరాగా భరద్వాజుని దర్శనార్థము వెళ్లాడు. భరతుని చూచి భరద్వాజుడు కుశల ప్రశ్నలు వేసాడు. వెళ్లిన కార్యము సఫలము అయిందా అని అడిగాడు. భరతుడు భరద్వాజునితో ఇలా అన్నాడు.

“మహాత్మా! నేను రాముని అయోధ్యకురమ్మని పలువిధముల ప్రార్థించాను. రాముడు అంగీకరించలేదు. “నా తండ్రి ఆజ్ఞ ప్రకారము నేను పదునాలుగు సంవత్సరములు అరణ్యములలో ఉండెదను” అని తన నిర్ణయాన్ని తెలియజేసాడు.

అప్పుడు కులగురువు వసిష్ఠుడు రాముని తో ఇలా అన్నాడు. “రామా! ఇవిగో బంగారముతో చేసిన పాదుకలు. వీటిని నీవు తొడుగుకొని వాటిని మాకు ఇమ్ము. ఇవి నీ ప్రతినిధిగా మనసులో

తలంచి,  భరతుడు అయోధ్యను పాలిస్తాడు.” అని అన్నాడు. రాముడు సంతోషంతో అంగీకరించాడు. రాముడు తూర్పు వైపుకు తిరిగి ఆ బంగారు పాదుకలను తొడుగుకొన్నాడు. వాటిని నాకు ఇచ్చాడు. నేను ఆ పాదుకలను రామునికి బదులుగా స్వీకరించాను.  రాముని అనుజ్ఞ తీసుకొని నేను ఈ రామ పాదుకలను తీసుకొని  అయోధ్యకు వెళుతున్నాను.” అని అన్నాడు భరతుడు.

“భరతా! నీవు సుగుణ శీలుడవు. పుణ్యాత్ముడవు. నీ వంటివాడు దశరథునికి కుమారుడిగా జన్మించడం ఆయన అదృష్టం. నీవలన నీ తండ్రి కీర్తిని పొందాడు.” అని అన్నాడు భరద్వాజుడు.

తరువాత భరతుడు భరద్వాజునకు నమస్కరించి తన పరివారముతో సహా  అయోధ్యకు ప్రయాణము అయ్యాడు. వారందరూ గంగానదిని దాటి శృంగిభేరపురము ప్రవేశించారు. అక్కడ గుహుని కలుసుకొని, అయోధ్యకు ప్రయాణం అయ్యారు. భరతుడు అయోధ్యకు చేరుకున్నాడు. రాముడు లేని అయోధ్య కళావిహీనంగా ఉండటం చూచాడు  భరతుడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము  నూట పదమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

( నూటపదునాలుగు, పదునైదవ సర్గలు.)

భరతుడు అయోధ్యలో ప్రవేశించాడు. అయోధ్య నిర్మానుష్యంగా ఉంది. కళావిహీనంగా ఉంది. పిల్లులు గుడ్లగూబలు తిరుగుతున్నాయి కానీ మనుషులు, పెంపుడు జంతువుల సంచారం లేదు. హెూమాగ్నులు జ్వలించనందున, హెూమధూమములు పైకి లేవడంలేదు. కార్యాలయములు పనిచేయడం లేదు. విపణివీధులలో వ్యాపారం జరగడం లేదు. సంగీతవాద్యధ్వనులు, నాట్య విన్యాసములు మచ్చుకైనా కానరావడం లేదు.

ఇదంతా జాగ్రత్తగా గమనిస్తూ వెళుతున్నాడు భరతుడు . రాముడు అయోధ్యను విడిచి వెళ్లడం తోటే రాజ్యలక్ష్మి రామునితోనే వెళ్లిపోయినట్టుంది అని అనుకున్నాడు భరతుడు.

భరతుడు దశరథుని మందిరములోని ప్రవేశించాడు. సింహము వెళ్లిపోయిన తరువాత సింహము నివసించిన గుహ ఎలా ఉంటుందో అలా ఉంది దశరథుని మందిరము. భరతునికి కన్నీళ్లు ఆగలేదు. ధారాపాతంగా కారుతున్నాయి.

తరువాత భరతుడు తన తల్లులతోనూ కులగురువు వసిష్ఠునితోనూ బ్రాహ్మణులతోనూ సమావేశం అయ్యాడు. అక్కడ తన

నిర్ణయాన్ని వెల్లడించాడు.

"నేను ఇప్పుడు అయోధ్య సరిహద్దులలో ఉన్న నందిగ్రామ మునకు వెళుతున్నాను. నా తండ్రి దశరథుడు, నా అన్న రాముడు లేని అయోధ్యలో నేను ఉండలేను. నేను నందిగ్రామము నుండి రాముడి రాజ్యప్రతినిధిగా రాజ్యపాలన చేస్తాను. రాముడు వచ్చేవరకూ అక్కడే వేచి ఉంటాను."అని అన్నాడు భరతుడు.

భరతుని మాటలకు అందరూ తమ ఆమోదమును తెలిపారు. వెంటనే రథము సిద్ధ చేయమన్నాడు భరతుడు. తల్లులందరికీ నమస్కరించి భరతుడు రథం ఎక్కాడు. శత్రుఘ్నుడు భరతుని అనుసరించాడు. వసిష్ఠుడు, గురువులు, బ్రాహ్మణులు వారిని అనుసరించారు. అందరూ నందిగ్రామము చేరుకున్నారు. పురప్రముఖులు కూడా వారి వెంట నంది గ్రామమునకు వెళ్లారు.

భరతుడు కుల గురువు వసిష్ఠుని చూచి ఇలా అన్నాడు. "గురువర్యా! మా అన్న రాముడు ఈ రాజ్యభారమును నాయందు ఉంచాడు. ఆయనకు బదులు ఆయన పాదుకలు నాకు ఇచ్చాడు. రాజలాంఛనములు, ఛత్రచామరములు అన్నీ ఈ పాదుకలకు జరుగుతాయి. రాజ్యపాలన ఈ పాదుకలే నిర్వహిస్తాయి. రాముడు తిరిగి వచ్చువరకూ ఈ పాదుకల సాక్షిగా నేను రాజ్యపాలన నిర్వహిస్తాను.

రాముడు తిరిగి వచ్చిన తరువాత నేనే స్వయంగా ఈ పాదుకలు రాముని పాదములకు తొడిగి ఆయన పాదములకు

నమస్కరిస్తాను. తరువాత ఆయన రాజ్యము ఆయనకు అప్పగించి రామునికి పట్టాభిషేకము చేస్తాను. అయోధ్య ప్రజలందరూ రాముని పరిపాలనలో సుఖంగా ఉంటారు."అని ప్రతిజ్ఞాపూర్వకంగా పలికాడు.

భరతుడు రాముని పాదుకలకు పట్టాభిషేకము జరిపించాడు. రాముని బదులు అయోధ్యను పాలిస్తున్నాడు. రాముడికి లేని సుఖాలు నాకు ఎందుకు అని జటలు, నారచీరలు ధరించాడు భరతుడు. ప్రతిరోజూ తాను నిర్వహించిన రాజ్యపాలనా విశేషములను ఆ పాదుకలకు నివేదించేవాడు. ఏ సమస్య వచ్చినా ఆ పాదుకలకు నివేదించేవాడు భరతుడు. రామునికి సేవకుడి వలె రాజ్యపాలన సాగించాడు భరతుడు. ఎవరు ఏమి తెచ్చి ఇచ్చినా, ఏ కానుకలు వచ్చినా అవన్నీ పాదుకలకు సమర్పించేవాడు భరతుడు. ఆ ప్రకారంగా భరతుని రాజ్యపాలన సాగిపోయింది.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము నూట పదునాలుగు, పదునైదవ సర్గలు
సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూటపదునారవ సర్గ.)

భరతుడు అయోధ్యకు వెళ్లిపోయాడు. రామలక్ష్మణులు, సీత, వనవాసము చేస్తున్నారు. రాముడు అక్కడున్న ఋషుల మొహాల్లో ఏదోభయాన్ని చూచాడు. వారు ఆందోళనగా ఉన్నట్టు గమనించాడు. వారు ఆ ప్రదేశమును వదిలి వెళ్లబోతున్నట్టు తెలుసుకున్నాడు. రాముని చూచి వారు ఏదో గుసగుసగా రహస్యంగా మాట్లాడుకోవడం చూచాడు రాముడు.

రామునికి ఏమీ అర్థం కావడం లేదు. తాము అక్కడ ఉండటం వలన ఆ ఋషులకు ఏమైనా అసౌకర్యం కలిగిందేమో అని అనుమాన పడ్డాడు. ఏమైనా సరే అనుమానము నివృత్తి చేసుకోవాలని అనుకున్నాడు. ఆ ఋషుల కందరిలోకీ పెద్దవాడి దగ్గరకు వెళ్లాడు. ఆయనకు భక్తితో నమస్కరించి ఇలా అన్నాడు.

"మహాత్మా! గత కొద్దిరోజులుగా ఇక్కడ ఉన్న ఋషుల ప్రవర్తనలో ఏదో మార్పుకనపడుతూ ఉంది. కారణం తెలియడం లేదు. మా వల్ల ఏదైనా అపరాధము జరిగిందా? నా తమ్ముడు తమరి పట్ల ప్రమాదవశాత్తు అనుచితంగా ప్రవర్తించాడా! నా భార్య సీత తమరికి కూడా సేవలు చేస్తూ ఉంది కదా. ఆమెసేవలలో ఏమైనా లోపం కనిపించిందా! మా వల్ల ఏమైనా అపరాధము జరిగితే చెప్పండి

సరిదిద్దుకుంటాము." అని అన్నాడు రాముడు.

దానికి ఆ వృద్ధుడైన ఋషి ఇలాఅన్నాడు. "రామా! నీ భార్య సీత కల్యాణి. కల్యాణ స్వభావము కలది. ఆమె వల్ల లోపం ఎందుకుంటుంది. కాని ఒకవిషయం నీకు చెప్పాలి. మీరు ఇక్కడ నివసిస్తున్నారు కదా. మీమీద రాక్షసులకు వైరము ఉంది. మీకూ రాక్షసులకు ఉన్న వైరము కారణంగా మా తాపసులకు ఏమైనా అపకారము కలుగుతుందేమో అని ఈ ఋషులు భయపడుతున్నారు. దాని గురించి వారు రహస్యంగా మాట్లాడు కుంటున్నారు. నీ ఎదుట పడి చెప్పడానికి భయపడుతున్నారు.

రామా! ఇక్కడ రావణుని తమ్ముడు ఖరుడు అనే రాక్షసుడు ఉన్నాడు. వాడు సామాన్యుడు కాడు. అతి క్రూరుడు. నరమాంస భక్షకుడు. మహావీరుడు.   వాడు జనస్థానములో తపస్సు చేసుకుంటున్న  ఋషులను అందరినీ చంపాడు.  వాడికి నీ మీద కోపముగ ఉందని తెలిసింది. నీవు ఇక్కడకు వచ్చి పర్ణశాల నిర్మించుకొన్నది మొదలు ఆ రాక్షసుల బాధ ఎక్కువ అయింది.

రాక్షసులు మమ్ములను నానాబాధలకు గురి చేస్తున్నారు. వారు చూడటానికే భయంకరంగా ఉండే ఆకారాలతో వచ్చి మమ్ములను బాధిస్తున్నారు. మేము చేసు కొనే హెూమములలో తినకూడని పదార్థములను వేస్తున్నారు. మా ఎదుటనే ఋషులను చంపుతూ మమ్ములను భయభ్రాంతులను చేస్తున్నారు. వాళ్లు ఎక్కడుంటారో ఎక్కడి నుంచి వస్తారో తెలియదు. హటాత్తుగా వస్తారు. అందినవాడిని అందినట్టు చంపుతారు. ఆనందంతో కేరింతలు

కొడతారు. హెూమగుండంలో నీళ్లు పోసి ఆర్పుతారు. మేము వాడుకొనే పాత్రలు పగుల కొడతారు. తరువాత అందకుండా పారిపోతారు.

వారి బాధలు భరించలేకుండా ఉన్నాము. ఈ చోటు విడిచి వేరేచోటికి పోదామని అందరూ అనుకుంటున్నారు. వాళ్లు మమ్ములను శారీరకంగా హింసిస్తున్నారు. వారి బాధలు పడలేకుండా ఉన్నాము. ఇక్కడికి సమీపములోనే మరొక అరణ్యము ఉంది. అక్కడ ఫలవృక్షములు సమృద్ధిగా ఉన్నాయి.మేము తపస్సు చేసుకోడానికి అక్కడ అనువుగా ఉంటుంది. అందుచేత  అక్కడకు పోదామని నన్ను బలవంతం చేస్తున్నారు. ఇంతలో నువ్వే అడిగావు.అందుకని వివరంగా చెప్పాను.

ఆ ఖరుడు మమ్ములనే కాదు నిన్ను కూడా బాధించగలడు. నీకు కూడా ప్రాణాపాయము కలుగుతుంది. అందుకని నీకు ఇష్టం అయితే నువ్వు కూడా ఈ ప్రదేశము విడిచి  మా వెంట వచ్చెయ్యి. ఎందుకంటే మీ తోపాటు నీ భార్యకూడా ఉంది. ఆమెను ఎల్లప్పుడూ రక్షించుకోడం కష్టం కదా! ఎప్పుడో ఒకప్పుడు ఆమె ఒంటరిగా ఉండవలసి వస్తుంది.  మీరు ఎంత జాగ్రత్తగా ఉన్న సీతకు రాక్షసుల వలన ఏదో ఒక ఆపద కలుగుతుంది. అందువలన మీరు ఇక్కడ ఉండటం  అంతక్షేమంకాదు. " అన్ని గబా గబా చెప్పాడు.

తరువాత ఆ మునులందరూ ఆ ప్రదేశమును విడిచి వెళ్లడానికి ఉద్యుక్తులవు తున్నారు. రాముడు మాత్రము అక్కడ నుండి వెళ్లడానికి ఇష్టపడలేదు. అందుకని ఆ మునులందరూ రాముని అక్కడే విడిచి వెళ్లిపోయారు. రాముడు కొంతదూరము వారితో వెళ్లి వారికి

వీడ్కోలు చెప్పాడు. తిరిగి తన పర్ణశాల వద్దకు వచ్చాడు.

ఆరోజుదాకా ఋషులతో వారి వేదఘోషలతో మార్మోగిన ఆ ప్రదేశములో ఒక్కసారి నిశ్శబ్దం ఆవరించింది.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము  నూట పదునారవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

## ( నూటపదునేడవ సర్గ.)

మునులందరూ వెళ్లిపోయిన తరువాత రాముడు ఆలోచనలో పడ్డాడు. మునులు చెప్పినది నిజమే అనిపించింది. ఆ ప్రదేశంలో ఉండటం క్షేమం కాదనుకున్నాడు. దానికి తోడు రామునికి పాతజ్ఞాపకాలు వెంటాడ సాగాయి. ఆ పర్ణశాలలోనే రాముడు భరతుని, శత్రుఘ్నుని, తనతల్లులను కలుసుకున్నాడు. ఇప్పుడు వారు లేకపోవడంతో మాటి మాటికీ వారే మనసులో మెదులు తున్నారు. వారి జ్ఞాపకాలతోనే మనసు నిండిపోయింది. స్థలం మారితేనే గానీ ప్రయోజనం లేదు అని అనుకున్నాడు.

దానికి తోడు భరతుడు తన సేనలతో వచ్చిఅక్కడ ఉన్నాడు. వారు అక్కడ ఉన్న కాలంలో వారు వాడేసిన వ్యర్థ పదార్థాలు, గుర్రములు, ఏనుగులు వదిలిన మలమూత్రములతో ఆ ప్రదేశం అంతా దుర్గంధం వ్యాపించింది. ఆ కారణం చేత కూడా ఆ ప్రదేశం తమ నివాసమునకు అనుకూలంగా లేదు అని అనుకున్నాడు రాముడు.

అందుకని ఆ ప్రదేశము విడిచి సీతతో, లక్ష్మణునితోకలిసి అత్రి మహాముని ఆశ్రమమునకు వెళ్లాడు. అత్రి మహాముని రాముని తన కుమారుని వలె ఆదరించాడు. వారికి అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించాడు. తినడానికి ఫలములు ఇచ్చాడు. తన భార్య వృద్ధురాలు

అయిన అనసూయకు రాముని, సీతను పరిచయం చేసాడు.

"రామా! ఈమె నా భార్య అనసూయ. నా సహధర్మచారిణి. ఒకసారి పది సంవత్సరములు కరువు వచ్చి లోకము అంతా దగ్ధము అయిపోతున్న సమయంలో, జనులకు ఫలములను జలములను ఇచ్చి కాపాడింది. ఈమె గొప్ప తపస్వి. ఈమె నీకు తల్లి వంటిది. ఈమె సార్థక నామధేయురాలు. అసూయ అంటే ఏమిటో తెలియని అనసూయ. పైగా వృద్ధురాలు. సీతకు ఆమె గురించి చెప్పి పరిచయం చెయ్యి." అని అన్నాడు అత్రి.

రాముడు సీతతో ఇలా అన్నాడు. "సీతా! విన్నావుగా మహాఋషి మాటలు. మహాతపస్వి అనసూయా దేవిని సేవించు. నీకు శుభం కలుగుతుంది."అనిఅన్నాడు.

వెంటనే సీత అనసూయవద్దకు వెళ్లి ఆమెకు ప్రదక్షణ పూర్వకంగా నమస్కారము చేసింది. తన పేరు, తన గురించి చెప్పుకుంది. వృద్ధురాలు అనసూయ కూడా సీతను ఆలింగనము చేసుకొని ఆమెను కుశలప్రశ్నలు వేసింది.

ఇంకా ఇలా అంది. "సీతా! నీవు ధర్మమును పాటిస్తున్నావు. అందుకే ఏ మాత్రంఅహంకారము, అభిజాత్యము, కోపం లేకుండా, నీ రాజభోగములను, ఐశ్వర్యమును వదిలిపెట్టి, పతి వెంట వనవాసము నకు వచ్చావు. నీ వంటి సౌభాగ్యవతి ఎక్కడా లేదు. తన భర్త రాజుగా రాజాంతఃపురములలో ఉన్నా, లేక వనములలో కష్టాలు పడుతూ ఉన్నా, తన భర్త పుణ్యాత్ముడైనా, పాపాత్ముడైనా, భర్తను విడిచిపెట్టకుండా

సదా అనుసరించి  ఉంటుందో ఆ భార్య ఉత్తమలోకములను పొందుతుంది. ఉత్తమ స్త్రీలకు తన భర్త ధనవంతుడైనా, దరిద్రుడైనా, గుణవంతుడైనా, దురభ్యాసాలకు అలవాటు పడినవాడైనా, అతడే దైవము. అటువంటి స్త్రీ తన భర్తమును దైవము వలె పూజిస్తుంది. స్త్రీలకు భర్తను మించిన ఆప్త బంధువు వేరొకరు లేరు అనడంలో అతిశయోక్తిలేదు. కాని కొంత మంది స్త్రీలు కోరికలకు బానిసలై, తన భర్త తాను కోరిన కోరికలు తీర్చలేదని భర్తను నిరాదరిస్తుంటారు. భర్తలమీద అధికారము చేస్తూ ఉంటారు. అటువంటి స్త్రీలు ధర్మభ్రంశమును పొంది అపకీర్తి పాలవుతారు.

(అనసూయ కైకను దృష్టిలో పెట్టుకొని ఈ మాటలు చెప్పిందా అనిపిస్తుంది.)

కాని నీ వంటి స్త్రీలు మంచి చెడ్డలను పరిశీలించి భర్తకు అనుకూలంగా నడుచుకుంటూ ఉత్తమలోకములు పొందుతారు. అందుకని నీవు కూడా ఎల్లప్పుడూ నీ భర్తనే అనుసరిస్తూ, భర్త మాట జవదాటకుండా, ఉత్తమ స్త్రీగా వర్ధిల్లు. దాని వలన నీకు కీర్తి, సౌభాగ్యము సంప్రాప్తిస్తాయి."అని పలికింది అనసూయ.

శ్రీమద్రామాయణము
అయోధ్యాకాండము  నూట పదునేడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( నూటపదునెనిమిదవ సర్గ.)

అత్రిమహాముని భార్య అనసూయ చెప్పిన మాటలను సావధానంగా విన్న సీత, ఆమెతో ఇలా అన్నది.

"పూజ్యురాలా! స్త్రీకి పతియే దైవము అన్న విషయం నాకు బాగా తెలుసు. భర్త గుణవంతుడైనా, గుణహీనుడైనా, నాకు పూజ్యుడే. అటువంటప్పుడు గుణవంతుడు, దయాగుణము కలవాడూ, ఇంద్రియములను జయించినవాడు, నా మీద అమితమైన ప్రేమకలవాడూ, ధర్మము తెలిసినవాడూ, నన్ను నా తల్లితండ్రులకంటే ఎక్కువగా ఆదరించేవాడు అయిన నా భర్త రాముని నేను పూజించకుండా ఎలా ఉండగలను.

రాముడు నా మీదనే కాదు, తన తల్లి కౌసల్యమీదా, ఆయన ఇతర తల్లుల మీదా సమానమైన పూజ్యభావంతో ఉంటాడు. మా మామగారు దశరథునికి ఎంతో మంది భార్యలు ఉన్నారు. రాముడు వారి నందరినీ మాతృభావంతో గౌరవిస్తాడు. వారేకాదు. నన్ను తప్ప లోకంలో మిగిలిన స్త్రీలనందరినీ మాతృ భావంతో చూస్తాడు. మీరు చెప్పినమాటలే నేను వనవాసమునకు వచ్చునపుడు మా అత్తగారు కౌసల్యాదేవిగారు కూడా చెప్పారు. అవి ఇంకా నా మనసులో మెదులుతున్నాయి.

అంతేకాదు, నాకు వివాహము చేసి అత్తగారి ఇంటికి పంపేటప్పుడు మా తల్లిగారు కూడా ఇదే ఉపదేశము చేసారు. అది కూడా నాకు జ్ఞాపకం ఉంది. ఇప్పుడు మీ మాటలు వినగానే నాకు మా అమ్మ, అత్తగారు చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి. మీరు కూడా నాడు సావిత్రి వలె పతిసేవలో తరించి ఉత్తమ లోకాలు పొందుతారు. పూర్వము కూడా ఎంతో మంది స్త్రీలు తమ భర్తలనుసేవించి తరించారు."అని పలికింది సీత.

సీత మాటలకు అనసూయ ఎంతోసంతోషించింది. సీతను పొదివి పట్టుకొని ఆమె తలనిమిరి నుదుటి మీద ముద్దుపెట్టుకుంది. "అమ్మా సీతా! నేను ఎంతో తపశ్శక్తి సంపాదించాను. రాక రాక మా ఇంటికి వచ్చావు. నీకు ఏమైన కానుక ఇవ్వాలని ఉంది. నీకు ఇష్టమైనది ఏమైనా కోరుకో ఇస్తాను." పలికింది అనసూయ.

"అమ్మా! మిమ్ములను చూడటం, కలుసుకోవడం, మీతో మాట్లాడటమే గొప్ప వరం. ఇంకా నాకు ఏమీ కావాలి. మీ సన్నిధిలో నేను తృప్తిగా ఉన్నాను." అని పలికింది సీత.

అనసూయ నవ్వింది. "సీతా! నీ మనోభావన. కానీ స్త్రీలకు అలంకారముల మీద మమకారము ఉంటుంది కదా. అందుకని నీకు దివ్యమైన ఆభరణములు, వస్త్రములు, అంగరాగములు ఇస్తున్నాను. వాటిని అలంకరించుకో. నేను ఇచ్చే ఆభరణములు, వస్త్రములు దివ్యమైనవి. ఎన్నటికీ మాయవు, నలగవు. నిత్యనూతనంగా ఉంటాయి. వాటిని ధరించి నీ భర్తకు ఆనందము కలిగించు." అని పలికి అనసూయ సీతకు దివ్యమైన ఆభరణములు, వస్త్రములు, మైపూతలు

తన తపశ్శక్తితో సృష్టించి ఇచ్చింది. సీత కూడా వాటిని భక్తితో తీసుకుంది. సీత అనసూయ పక్కనే కూర్చుని ఆమెను సేవించింది. ఇంక ఇద్దరూ పాత విషయాలను ముచ్చటించుకుంటున్నారు.

"సీతా! నీ వివాహం ఎలా జరిగింది. నీ తండ్రి నీకు స్వయంవరము ప్రకటించాడని విన్నాను. వాటి విశేషములు ఏమిటి నాకు చెప్పవా!" అని మాతృవాత్సల్యముతో అడిగింది. సీత కూడా తన పెళ్లినాటి ముచ్చట్లు ఒక్కసారి గుర్తుకు తెచ్చుకుంది. అనసూయకు ఇలా చెప్పసాగింది.

"అమ్మా! నా తండ్రి జనకుడు మిథిలా నగరానికి రాజు. న్యాయంగా ధర్మంగా పరిపాలన చేస్తున్నాడు. ఒకసారి ఆయన ఒక యజ్ఞమును చేయ సంకల్పించాడు. దాని కోసరం లాంఛనంగా భూమిని నాగలితో దున్నుతూ చదును చేస్తున్నాడట. అప్పుడు నేను ఆ నాగేటి చాలులో  దొరికానట. నేను దొరికినప్పుడు ఆకాశము నుండి ఒక వాక్కు వినపడినదట "ఓరాజా! ఈ శిశువు మనుష్యజాతికి చెందినది కాదు. దేవతా కాంత. నీవు ఆమెను పుత్రికా ధర్మంతో పెంచు." అని వినపడినదట.

తరువాత జనకుడు నన్ను తన కుమార్తె వలె పెంచి పెద్దచేసాడట. జనకుని భార్యకూడా నన్ను తన తల్లివలె ఆదరించి అల్లారు ముద్దుగా పెంచిందట. ఇంతలో నాకు వివాహము చేయదగిన వయసు వచ్చింది. నా తండ్రి జనకునకు నా వివాహము గురించి దిగులు పట్టుకుంది. ఎందుకంటే నేను అయోనిజను. దేవతా అంశ కలదానిను. కాబట్టి నాకు సమానమైన భర్త దొరకడం దుర్లభం.

ఆయనకు ఏమీ తోచలేదు. అందుకని నాకు స్వయం వరము ప్రకటించాడు.

అంతకు ముందు వరుణ దేవుడు మా తండ్రి జనకునకు ఒక దివ్యమైన ధనుస్సు, రెండు అమ్ముల పొదులు ఇచ్చి అవి దాచమన్నాడు. ఆ ధనస్సు చాలా బరువైంది. ఎవరూ కనీసం కదపను కూడా కదపలేరు. ఎక్కుపెట్టడం ఎంతటి బలవంతునికైనా అసాధ్యం. అవి గుర్తుకు వచ్చాయి మా తండ్రిగారికి.

నా స్వయంవరానికి వచ్చిన రాజులందరినీ పిలిచి నా తండ్రి జనకుడు ఈ విధంగా ప్రకటించాడు.

“ఈ ధనుస్సు దివ్యమైనది. దీనిని ఎవరైతే ఎత్తి ఎక్కుపెట్ట గలరో,వారికి నా కుమార్తె సీతను ఇచ్చి వివాహం చేస్తాను. ఇందులో సంశయం లేదు.” అని ప్రకటించాడు.

ఎంతో మంది రాజులు ప్రయత్నించారు కానీ కనీసం ఆ ధనుస్సును కదల్చనుకూడా కదల్చ లేకపోయారు. ఇంక ఎత్తడం, ఎక్కుపెట్టడం అనేది వారందరికీ అసాధ్యం అయింది. అందుకని రాజులందరూ ఆదివ్యమైన ధనుస్సుకు నమస్కరించి వెళ్లిపోయారు.

అలాచాలాకాలము గడిచింది. ఆ దివ్య ధనుస్సును ఎవరూ ఎత్తలేకపోయారు. ఎక్కుపెట్టలేకపోయారు. ఇంతలో రఘువంశము లో పుట్టిన రాముడు విశ్వామిత్రుని తో సహా మిథిలకు వచ్చాడు.

విశ్వామిత్రుడు, రామలక్ష్మణులను మా తండ్రికి పరిచయం చేసాడు.

"ఓ జనకమహారాజా! వీరు రామలక్ష్మణులు, అయోధ్యాధిపతి దశరథుని కుమారులు. నీ దగ్గర దివ్యమైన ధనుస్సు ఉందని విన్నాము. దానిని చూడటానికి వచ్చారు. ఆ ధనుస్సును వీరికి చూపించు." అని అన్నాడు విశ్వామిత్రుడు.

నా తండ్రి ఆ ధనుస్సును అతి కష్టం మీద అక్కడకు తెప్పించాడు. రాముడు ఆ ధనుస్సును అవలీలగాఎత్తి ఎక్కుపెట్టాడు. నారి పట్టుకొని ఒక్కసారి ఆకర్ణాంతము లాగాడు. (ఎడమ చేతితో ధనుస్సు పట్టుకొని, కుడి చేతితో దానికి కట్టిన తాడు పట్టుకొని చెవి దాకా లాగడం.)

రాముడు లాగిన వేగానికి పిడుగు పడిన శబ్దం వచ్చింది. ఆ దివ్యమైన ధనుస్సు మధ్యకు విరిగి రెండు ముక్కలయింది. నా తండ్రి జనకుడు ఎంతో సంతోషించాడు. తాను చేసిన ప్రతిజ్ఞ ప్రకారము నన్ను రామునికి ఇచ్చి కన్యాదానము చేయ నిశ్చయించాడు.  వెంటనే జలము తెమ్మని ఆదేశించాడు.

కాని రాముడు తన తండ్రి అనుమతి లేనిదే వివాహము చేసుకోను అని అన్నాడు. వెంటనే దశరథునికి వర్తమానము పంపించారు. దశరథమహారాజు మిథిలానగరమునకు వచ్చాడు. నా జనకుడు నన్ను రామునికి ఇచ్చి వివాహము చేసాడు. నా చెల్లెలు ఊర్మిళను లక్ష్మణునికి ఇచ్చి వివాహము చేసాడు. ఆ విధంగా నా వివాహము రామునితో జరిగింది. అప్పటి నుండి నేను నా భర్త రాముని

దైవము వలె పూజిస్తున్నాను."అని తన వివాహ వృత్తాంతమును అనసూయకు తెలిపింది సీత.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము నూట పదునెనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అయోధ్యా కాండము

### ( నూట పంతొమ్మిదవ సర్గ.)

సీతారాముల కల్యాణ గాధను విన్న అనసూయ ఆనందంతో పరవశించిపోయింది. సీతను గాఢంగా కౌగలించుకొని ఆమె నుదుటి మీద ముద్దుపెట్టుకుంది. అంతలోనే రాత్రిఅయింది. మునులు అందరూ వారి వారి సాయంకాల సంధ్యావందనాది కార్యక్రమములను ముగించుకొని తమ కుటీరములకు వస్తున్నారు. అంతలో చంద్రోదయము అయింది.

అనసూయ సీతను చూచి, "సీతా! ఇంక నీవు రాముని వద్దకు వెళ్లు. నేను ఇచ్చిన ఆభరణములను, వస్త్రములను నా ఎదుటనే అలంకరించుకో. నిన్ను చూచి ఆనందిస్తాను." అన్నది అనసూయ.

ఆమె కోరిక మేరకు సీత అనసూయ ఇచ్చిన దివ్య వస్త్రములను, ఆభరణములను ధరించి, అనసూయకు నమస్కారము చేసింది. తరువాత సీత అనసూయ వద్ద సెలవు తీసుకొని రాముని వద్దకు వెళ్లింది.

సర్వాలంకార భూషిత అయిన సీతను చూచి రాముడు ఎంతో సంతోషించాడు. సీత కూడా అనసూయ తనకు ఇచ్చిన దివ్య

వస్త్రములను, ఆభరణములను రాముని చూపించింది. మహాపతివ్రత అనసూయతో సత్కారమును పొందిన సీతను చూచి రాముడు లక్ష్మణుడు ఎంతో ఆనందించారు. రాముడు, సీత, చల్లని వెన్నెలలో ఆనందంగా విహరించారు.

ఆ రాత్రిగడిచిపోయింది. మరునాడు ఉదయము రామలక్ష్మణులు, ప్రాత:సంధ్యావందనాది కార్యక్రములు ముగించు కున్నారు. తరువాత అక్కడ నివసించు ఋషుల వద్దకు వెళ్లి వారి ఆశీర్వాదము తీసుకున్నారు. ఆ మునులు రామలక్ష్మణులతో వారు ప్రయాణము చేయు మార్గములో రాక్షస బాధ ఎక్కువగా ఉంటుందని హెచ్చరించారు.

"రామా! ఈ అరణ్యములో నరమాంసభక్షకులైన రాక్షసులు నివసిస్తున్నారు. వారినుంచి జాగ్రత్తగా ఉండు. ఒంటరిగా ఎవరైనా కనపడితే వారిని పట్టుకొని చంపి తింటారు. కాబట్టి మీ ముగ్గురూ ఒకటిగా ప్రయాణం చెయ్యండి. ఒంటరిగా ఉండవద్దు. సీతను ఒంటరిగా వదలవద్దు."

రాముడు వారి సూచనలను అన్నీ శ్రద్ధగా విన్నాడు. వారి వద్ద సెలవు తీసుకొని సీత, లక్ష్మణునితో సహా అరణ్యములలోకి ప్రయాణం అయ్యాడు.

శ్రీమద్రామాయణము

అయోధ్యాకాండము  నూట పంతొమ్మిదవ సర్గ సంపూర్ణము

అయోధ్యాకాండము సర్వం సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## అరణ్య కాండము

### మొదటి సర్గ.

రాముడు సీత, లక్ష్మణుడు వెంటరాగా దండకారణ్యములోనికి ప్రవేశించాడు. ఆ దండకారణ్యములో ఎంతో మంది మహా మునులు ఆశ్రమములు కట్టుకొని తపస్సు చేసుకుంటూ ఉండటం చూచాడు రాముడు. ఆ మునుల ఆశ్రమముల దగ్గర వన్య మృగములు పరస్పర వైరము, భయమూ లేకుండా స్వేచ్ఛగా సంచరిస్తున్నాయి. పక్షుల కిల కిలారావములతో, వన్యప్రాణుల విహారములతో ఆ వనసీమలో ఉన్న ముని ఆశ్రమములు ఎంతో శోభాయమానంగా ఉన్నాయి.

ఆ మునుల ఆశ్రమములు విశాలమైన అగ్ని గృహములతోనూ, యజ్ఞమునకు కావలసిన సంభారములతోనూ, వేలాడుతున్న జింక చర్మములతోనూ, దర్భలతోనూ, అగ్నికార్యమునకు కావలసిన సమిధలతోనూ, నీళ్లతో నిండి ఉన్న పాత్రలతోనూ, తినడానికి కావలసిన ఫలములతోనూ నిండి ఉన్నాయి. ఒక పక్కనుండి వేదమంత్రములు చదువుతున్న ధ్వనులు, మరొక పక్క నుండి పూజా కార్యక్రమముల మంత్ర ధ్వనులు వీనుల విందుగా వినపడుతున్నాయి. ఆ ఆశ్రమములలో కేవలము తపస్సుచేసుకొనే మునులు మాత్రమే నివసిస్తున్నారు. రామలక్ష్మణులకు ఆ ప్రాంతము బ్రహ్మలోకము వలె కనిపించింది.

రాముడు, సీత, లక్ష్మణుడు తమ ఆశ్రమముల వంక రావడం ఆ మునులు చూచారు. వారంతా రామ లక్ష్మణులకు ఎదురు వెళ్లి స్వాగతము పలికారు. వారికి అర్ఘ్యము పాద్యము సమర్పించారు. కొందరు మునులు రామ లక్ష్మణుల దేహధారుఢ్యము, అంగసౌష్ఠవము చూచి ఆశ్చర్యపోయారు. వారిని రెప్ప వెయ్యకుండా చూస్తున్నారు.

ఆ మునులందరూ రామ లక్ష్మణులకు, సీతకు ఒక పర్ణశాలను చూపించారు. వారు అందులో నివాసము ఉండవచ్చునని తెలిపారు. కొందరు రామలక్ష్మణులకు నీళ్లు తెచ్చి ఇచ్చారు. మరి కొందరు తినడానికి మధురమైన ఫలములను తీసుకొని వచ్చి ఇచ్చారు. అందులో ముఖ్యులు, పెద్దవారు అయిన మునులు రాముని చూచి ఇలా అన్నారు.

“రామా! నీవు అయోధ్యకు మహారాజువు. రాజు లోక పూజ్యుడు. రాజు ప్రజలను ధర్మమార్గంలో నడిపిస్తాడు. రాజు దుష్టులను శిక్షిస్తాడు. ప్రజలను రక్షిస్తాడు. అందుకే రాజును అందరూ గౌరవించాలి, పూజించాలి. ప్రజారక్షకుడైన రాజు ఇంద్రునిలో నాలుగవ అంశ అని అంటారు. అందు చేతనే రాజు ప్రజల మన్ననలు పొందుతూ, రాజభోగములు ఇంద్రుని వలె అనుభవిస్తుంటాడు. ఈ ప్రదేశము అయోధ్యారాజ్యములో ఉంది. కాబట్టి నీవే మాకు రాజువు. నీవే మమ్ములను రక్షించాలి. నీవు ప్రస్తుతము వనములో ఉన్నావని రాజువు కాకపోవు. రాజు అయోధ్యలో ఉన్నా, అడవిలో ఉన్నా, రాజు రాజే.

రామా! మా సంగతి నీకు తెలుసు కదా! మేమే అన్ని సంగములను విడిచి పెట్టి జితేంద్రియులమై, ఆ అడవిలో ప్రశాంతంగా

తపస్సు చేసుకుంటున్నాము. మాకు ఎవరైనా అపకారము చేసినా, వారి మీద కోపగించకోడానికి కూడా మేము ఇష్టపడము. కాబట్టి మా అందరినీ రాజువైన నీవే మా అందరినీ రక్షించాలి." అని పలికారు.

తరువాత ఆ మునులు రామలక్ష్మణులకు, సీతకు అనేక ఫలములు, కంద మూలములు, ఇతరములైన ఆహార పదార్థములు తెచ్చి ఇచ్చారు. రాముడు వారు చెప్పిన మాటలను శ్రద్ధగా ఆలకించాడు. వారు ఇచ్చిన పదార్థములను, ఫలములను భక్తితో స్వీకరించాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము మొదటి సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్య కాండము

## రెండవ సర్గ.

రామలక్ష్మణులు, సీత ఆ రాత్రికి ఆ పర్ణశాలలోనే విశ్రమించారు. మరునాడు ఉదయము ఆ మునుల వద్ద అనుజ్ఞ తీసుకొని రాముడు, లక్ష్మణుడు, సీతతో సహా అరణ్యములోకి వెళ్లాడు. వారు అడవిలో ప్రయాణము చేస్తూ ఎన్నో వన్యమృగములను చూచారు.

హటాత్తుగా వారి ఎదురుగా ఒక రాక్షసుడు ప్రత్యక్షం అయ్యాడు. వాడి శరీరం ఒక కొండ మాదిరి ఉంది. వాడు

నరమాంసభక్షకుడు అని రాముడు గ్రహించాడు. రామలక్ష్మణులు వాడి వంక నిశితంగా చూచారు.

వాడు నల్లగా కొండ మాదిరి ఉన్నాడు. కళ్లు ఎర్రగా ఉన్నాయి. వికృతాకారంతో ఉన్నాడు. వాడి శరీరం అంతా రక్తంతో తడిసి ఉంది. వాడి బుజం మీద ఒక శూలం ఉంది. దానికి మూడు సింహాలను, నాలుగు పెద్దపులులను, రెండు తోడేళ్లను, పది జింకలను, గుచ్చి తీసుకొని వెళుతున్నాడు.

ఆ రాక్షసుడు రామ లక్ష్మణులను చూచాడు. గట్టిగా అరిచాడు. వారిని చంపడానికి వారి దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చాడు. వాడి కళ్లక అందమైన సీత కనిపిపించింది. రావడం రావడం సీతను పట్టుకొన్నాడు. సీతను తీసుకొని పక్కకు వెళ్లాడు. రామలక్ష్మణులను చూచి ఇలా అన్నాడు.

"జటలు ధరించిన మీరు ఎవరు? ఇక్కడకు ఎందుకు వచ్చారు? మీరు ఎవరైనా ఈ రోజు  నా చేతిలో చావడం ఖాయం. మీరు ఇద్దరూ ముని కుమారుల వేషాలలో ఉన్నారు కదా! మీ వెంట ఈ స్త్రీ ఎందుకు ఉంది? ఈమె ఎవరు? ఈమెతో మీకు ఏమి సంబంధం? మునులు జితేంద్రియులు, సన్యాసులు కదా! మరి ముని ధర్మమునకు విరుద్ధంగా ప్రవర్తించి మీరు ఎందుకు పాపం చేస్తున్నారు?" అని అన్నాడు ఆ రాక్షసుడు.

దానికి రాముడు ఆ రాక్షసుని చూచి ఇలా అన్నాడు. "నీవు మమ్ములను ఇలా అడుగుతున్నావే. ఇంతకూ నీవు ఎవరు? ఇక్కడ

ఎందుకు ఉన్నావు?" అని అడిగాడు.

"నేను ఒక రాక్షసుడను. నా పేరు విరాధుడు. నేను ఈ అరణ్యములో ఉన్న మునులను చంపి ఆహారంగా తింటూ ఉంటాను. మీ వెంట ఉన్న ఈ స్త్రీ నాకు కావాలి. ఈమెను నేను పెళ్లి చేసుకుంటాను. ముని వేషములలో ఉండి కూడా ఈ స్త్రీని వెంటబెట్టుకొని తిరుగుతూ పాపం చేస్తున్న మిమ్ములను చంపి తింటాను." అని అన్నాడు విరాధుడు.

ఆ మాటలు విన్న సీత చాలా భయపడింది. సీత శరీరం అంతా భయంతో వణికిపోయింది. విరాధుని ఒడిలో చిగురుటాకులా వణికిపోతున్న సీతను చూచి రాముడు చలించి పోయాడు. రాముడి మొహం పాలిపోయింది. లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"లక్ష్మణా! ఆ దుర్మార్గుడు విరాధుడు సీతను తన ఒడిలోకి ఎలా లాక్కున్నాడో చూచావా! కైక మనకు ఏమి జరగాలని మనసులో అనుకున్నదో అదే జరుగుతూ ఉంది. లక్ష్మణా! కైక తన కుమారుడు భరతునికి రాజ్యం ఇప్పించుకోవచ్చు. మనలను అడవులకు పంపి ఇన్ని కష్టాలకు గురిచెయ్యడం ఎందుకు? కైక మనకు ఏమి జరగాలని కోరుకుంటూ అడవులకు పంపిందో అదే జరుగుతూ ఉంది. నాకు వనవాస ప్రాప్తి, నా తండ్రిమరణము, ఇదుగో ఇప్పుడు నా భార్యను పరపురుషుడు తాకడం, ఒడిలోకి లాక్కోవడం... ఇంతకన్నా కష్టాలు ఏముంటాయి?"అని వాపోయాడు రాముడు.

ఆ మాటలు విన్న లక్ష్మణుడు కోపంతో రగిలిపోయాడు.

"రామా! ఏమిటీ వెర్రి? నీవు దేవేంద్రునితో సమానమైన పరాక్రమము కలవాడవు. ఇలా బేలగా మాట్లాడటం నీకు తగునా? అసలు ఇలా ఎందుకు పరితపిస్తున్నావు? రామా! నువ్వు చూస్తూ ఉండు. ఒకే బాణంతో వీడిని మట్టి కరిపిస్తాను. వీడి రక్తంతో నేలను తడిపేస్తాను. దేవేంద్రుడు పర్వతముల మీద వజ్రాయుధమును ప్రయోగించినట్టు విరాధుని మీద నేను బాణప్రయోగము చేస్తాను. వీడు కొండ కూలినట్టు కూలిపోతాడు. వీడి వక్షస్థలమును చీలుస్తాను. వీడి ప్రాణాలు హరిస్తాను." అని కోపంతో ఊగిపోతూ అన్నాడు లక్ష్మణుడు. (ఒక్కమాట. విరాధుడురాక్షసుడు. నరమాంసము తినేవాడు. వాడు అన్న మాటలు చదివారు కదా. సన్యాసులు జితేంద్రియులు. వారి వెంట స్త్రీ ఉండకూడదు. వారికి స్త్రీ సాంగత్యము పనికిరాదు. ఇదీ ఆ రాక్షసునికి తెలిసిన నీతి. కాని ఈ నాడు మన మధ్యఉన్న స్వామీజీలు, సన్యాసుల చుట్టు ఉండేది ఆడవాళ్లే. సిల్కుజుబ్బాలు, చుట్టు ఆడవాళ్లు, తాము ఉండే గదుల్లో కిలోల కొద్దీ వెండి బంగారాలు, అక్రమ ఆస్తులు, పోలీసుకేసులు, అరెస్టులు ఇవి నిత్యకృత్యం అయ్యాయి. మరి ఆ రాక్షసుడికి ఉన్న జ్ఞానం కూడా మన స్వామీజీలకు లేదా! ఏమో! మీరే ఆలోచించండి.)

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## మూడవ సర్గ.

తాను రామలక్ష్మణులను వివరాలు అడుగుతుంటే వాళ్లిద్దరూ ఏవేవో మాట్లాడుకోవడం చూచి సహించలేకపోయాడు విరాధుడు.

“నేను మీ ఇద్దరి గురించి అడుగుతుంటే మీలో మీరే ఏం మాట్లాడుకుంటున్నారు. చెప్పండి మీరు ఎవరు? ఈ అరణ్యములకు ఎందుకు వచ్చారు? ఎక్కడికి వెళుతున్నారు?” అని అడిగాడు.

అప్పుడు రాముడు విరాధునితో ఇలా అన్నాడు. “ఓ రాక్షసుడా! మేము క్షత్రియులము. మునులము కాము. నా పేరు రాముడు. ఇతను నా తమ్ముడు లక్ష్మణుడు. ఆమె నా భార్య సీత. కాల వశమున ఈ అరణ్యములో తిరుగుతున్నాము. ఇంతకూ నీవు ఎవరు? ఇక్కడ ఎందుకు తిరుగుతున్నావు?” అని అడిగాడు రాముడు.

“ఓ రామా! నేను రాక్షసుడను. నాపేరు విరాధుడు. నా తండ్రి పేరు జవుడు. నా తల్లి పేరు శతహ్రద. నేను బ్రహ్మదేవుని గురించి తపస్సు చేసాను. ఆయన వలన ఎవరిచేతా గాయపడకుండా, చావకుండా వరము పొందాను. నాకు ఈమె మీద మోహము కలిగింది. కాబట్టి మీరు ఇద్దరూ ఈమెను నాకు విడిచి పెట్టి ఇక్కడ నుండి పారిపొండి. లేకపోతే మీ ఇద్దరిని చంపి తింటాను. వెంటనే వెళ్లిపొండి.” అనిఅన్నాడు విరాధుడు.

ఆ మాటలకు రామునికి కోపం వచ్చింది. కళ్లు ఎర్రబడ్డాయి. కోపంతో విరాధునితో ఇలా అన్నాడు. "ఓ రాక్షసుడా! నీకు నా చేతిలో చావు మూడింది. అందుకే ఇలా మాట్లాడుతున్నావు. నిన్ను ప్రాణాలతో వదలను."అని ధనుస్సు ఎక్కుపెట్టి ఒక బాణాన్ని సంధించి విరాధుని మీదికి వదిలాడు.

వరసగా విరాధుని మీద బాణాలు ప్రయోగించాడు రాముడు. రాముడు వదిలిన బాణాలు విరాధుని శరీరం నిండా గుచ్చుకున్నాయి. విరాధుని శరీరం అంతా రక్తంతో తడిసిపోయింది. ఆ బాణాల బాధకు తట్టుకోలేక విరాధుడు తన తొడమీద ఉన్న సీతను కిందికి దించాడు. శూలాన్ని పట్టుకొని పెద్దగా అరుస్తూ  రామలక్ష్మణుల మీదికి దూకాడు.

రామునికి లక్షణుడు కూడా తోడైనాడు. రామలక్ష్మణులు విరాధుని మీద బాణములను వర్షంలా కురిపించారు. ఆ రాక్షసుడు ఒక్కసారి ఆవులించి ఒళ్లు విదిలించగానే అతని శరీరమునకు గుచ్చుకున్న బాణములు అన్నీ జలజలా కింద రాలిపోయాయి. బ్రహ్మ వరప్రభావము వలన రామ లక్ష్మణులు వదిలిన బాణములు విరాధుని ఏమీ చేయలేకపోయాయి.

విరాధుడు మరలా శూలమును పైకెత్తి రామలక్ష్మణుల మీదికి దూకాడు. తన శూలమును రాముని మీదికి విసిరాడు. రాముడు రెండు బాణములతో ఆ శూలమును మధ్యలోనే ఖండించాడు. విరాధుని శూలము రెండు ముక్కలై కిందపడిపోయింది. రామలక్ష్మణులు రెండు కత్తులను తీసుకున్నారు. విరాధునిమీదికి దూకారు. ఆ కత్తులతో విరాధుని బలంగా కొట్టారు. ఇలా కాదని

విరాధుడు రామలక్ష్మణులను తన చేతుల మధ్య బంధించాలని అనుకొన్నాడు. విరాధుని ఊహను పసికట్టాడు రాముడు. లక్ష్మణునితో ఇలా అన్నాడు.

"లక్ష్మణా! వీడు మన ఇద్దరినీ చేతులతో ఎత్తుకొని మోసుకొని పోవాలని చూస్తున్నాడు. వాడి ఇష్టం వచ్చినట్టు మనలను మోసుకుంటూ పోనిద్దాము. ఎందుకంటే మనం కూడా ఇదే దారిలో వెళ్లాలి కదా!"అని అన్నాడు.

ఇంతలో విరాధుడు రామలక్ష్మణులను తన చేతులతో ఎత్తుకొని తన బుజాల మీద కూర్చోపెట్టుకున్నాడు. అరణ్యంలోకి పరుగెత్తాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## నాలుగవ సర్గ.

ఆ ప్రకారంగా రాముని లక్ష్మణుని విరాధుడు ఎత్తుకొని పోవడం చూచి సీత పెద్దగా ఏడవసాగింది. పెద్ద పెద్ద గా కేకలు వేసింది.

"ఓ రాక్షసుడా నీకు ఓ నమస్కారము. వాళ్లను వదిలిపెట్టు. కావాలంటే నన్ను తీసుకొనిపో. నాకు భయంగా ఉంది. నేను ఒంటరిగా ఇక్కడ ఉంటే ఈ అరణ్యములో ఉండే క్రూర మృగాలు నన్ను తినేస్తాయి." అని పెద్ద పెట్టున కేకలు వేసింది.

ఆ కేకలు విన్నారు రామలక్ష్మణులు. వెంటనే విరాధుని చంపడానికి పూనుకున్నారు. వెంటనే లక్ష్మణుడు తన చేతిలో ఉన్న కత్తితో విరాధుని ఎడమచేతిని ఖండించాడు. రాముడు విరాధుని కుడి చేతిని విరిచేసాడు. రెండు చేతులు విరిగిన విరాధుడు రామలక్ష్మణులను కిందికి విసిరేసాడు. బాధతో గిలా గిలా కొట్టుకుంటూ కిందపడి మూర్ఛపోయాడు.

కిందపడ్డ విరాధుని రామలక్ష్మణులు కాళ్లతోనూ చేతులతోనూ మర్దించారు. పైకి ఎత్తి నేల మీద పడేసారు. కత్తులతో చీల్చారు. ఏమి చేసినా విరాధుని ప్రాణం పోలేదు. వరప్రసాది అయిన విరాధుడు ఆ ప్రకారంగా చావడు అని గ్రహించాడు రాముడు.

"లక్ష్మణా! ఈ విరాధుడు కత్తులతోనూ, ఆయుధములతోనూ చావడు. అలా చావు రాకుండా వీడికి వరం ఉంది. అందుకని మనం వీడిని గొయ్యి తీసి పాతిపెడదాము. సహజంగా వాడికి ప్రాణం పోతుంది. కాబట్టి నువ్వు వీడిని పూడ్చి పెట్టడానికి తగినంత గొయ్యి తవ్వు." అని అన్నాడు. గొయ్యి తవ్వే లోపల విరాధుడు లేవకుండా రాముడు వాడి గొంతు మీద కాలు పెట్టి నిలుచున్నాడు.

అప్పుడే మూర్ఛనుండి తేరుకున్న విరాధుడు రాముని మాటలు

విన్నాడు. విరాధుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! నువ్వు ఎవరో గుర్తించాను. నీభార్య సీతను, నీ తమ్ముడు లక్ష్మణుని కూడా గుర్తించాను. మీరు మహా పరాక్రమ వంతులు. మీచేతిలో నేను ఎప్పుడో చచ్చాను. ఇప్పుడు ప్రత్యేకంగా చంపడం ఎందుకు. ఇంక నా గురించి చెబుతాను.

నేను తుంబురుడు అనే పేరుగల గంధర్వుడను. ఒక సారి నేను రంభయొక్క వ్యామోహంలో పడి కుబేరుని సేవకు పోలేదు. కుబేరుని శాపము వలన నాకు ఈ రాక్షస రూపము ప్రాప్తించింది. "దశరథుని కుమారుడు రాముడు ఎప్పుడు నిన్ను యుద్ధంలో చంపుతాడో అప్పుడు నీకు నిజరూపం వస్తుంది" అని కుబేరుడు నాకు శాపవిమోచన మార్గము చెప్పాడు. ఇప్పుడు మీ దర్శనభాగ్యము కలిగింది. నాకు శాపవిమోచనము అయింది. నేను నా లోకానికి వెళ్లిపోతాను. నాకు అనుజ్ఞ ఇవ్వండి." అని ప్రార్థించాడు.

రామ లక్ష్మణులు విరాధుని ప్రార్థనను మన్నించారు. విరాధుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! ఇక్కడికి ఒకటిన్నర యోజనముల దూరములో శరభంగుడు అనే ముని ఆశ్రమము ఉంది. మీరు అక్కడకు వెళ్లండి మీకుశుభం కలుగుతుంది. ప్రస్తుతము మీరు నన్ను ఒక గోతిలో పాతిపెట్టండి. మరణించిన రాక్షసులను గొయ్యి తీసి అందులో పాతి పెట్టడం పురాతన ఆచారము. అలా చేస్తే మాకు పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి." అని అన్నాడు.

తరువాత విరాధుడు తన ప్రాణాలు వదిలాడు. విరాధుని కోరిక

ప్రకారము లక్ష్మణుడు గొయ్యి తీసాడు.  రాముడు విరాధుని గొంతు మీది నుండి తన కాలు తీసాడు. విరాధుడు పెద్దపెట్టున అరిచాడు. ఆ అరుపులకు అడవి మారుమోగిపోయింది. వెంటనే లక్ష్మణుడు పెద్దపెద్ద గా కేకలు పెడుతున్న  విరాధుని గోతిలో పడదోసాడు.

ఆ ప్రకారంగా రామలక్ష్మణులు, ఏ ఆయుధము చేత కూడా చావని విరాధుని, గోతిలో పెట్టి పూడ్చిపెట్టడం ద్వారా సంహరించారు. రాముని చేతనే చావ వలెనని కోరిక కల విరాధుడు, తన మరణ రహస్యమును కూడా రామునికి చెప్పాడు. అందుకని రాముడు అతడిని గోతిలో పాతిపెట్టడం ద్వారా సంహరించాడు. విరాధుడు మరలా లేవకుండా ఆ గోతి మీద పెద్ద పెద్ద బండ రాళ్లను కూడా పెట్టారు. తరువాత వారు సీత వద్దకు పోయి ఆమె భయాన్ని పోగొట్టారు. విరాధుని మరణంతో  సీతారామలక్ష్మణులు సంతోషంగా ఉన్నారు.

(విరాధుని కథ మనకు కొంచెం విచిత్రంగా ఉంది కదూ! పైన చెప్పిన విధంగా గోరఖపూర్ ప్రతిలో ఉంది. రాముడు మహా బలవంతుడు. అస్త్రశస్త్ర సంపన్నుడు. అటువంటి రాముడు విరాధుడు సీతను ఎత్తుకొని పోగానే ఏడుస్తాడు. అదీ సీతను విరాధుడు ఎత్తుకొని పోయినందుకు కాదు. తమకు కలిగిన కష్టములను చూచి  కైక కళ్లు చల్లబడ్డాయి కదా అని ఏడుస్తాడు. అప్పుడు లక్ష్మణుడు రాముని పరాక్రమమును గుర్తుచేస్తాడు. అయినా రాముడు ఏమీ చేయడు. తరువాత విరాధుడు రామ లక్ష్మణులను బుజాల మీద ఎత్తుకొని పోతుంటే, “ఎటూ మనం అటే వెళతాము కదా కాస్త దూరం కలిసి వచ్చిందిలే” అని అనుకుంటాడు రాముడు. అంతేగానీ సీత ఒంటరిగా ఉంది, ఆమెకు ఏమన్నా ఆపద కలుగుతుంది అని గుర్తుకు రాదు. సీత

కూడా "రామా నన్ను రక్షించు" అని ఏడవదు. విరాధునితో "నన్ను ఇక్కడ క్రూరమృగాలు తింటాయి. కావాలంటే నన్నుఎత్తుకొని పో, రామలక్ష్మణులను వదిలిపెట్టు" అని అరుస్తుంది. అప్పుడు రామునికి సీత ఒంటరిగా ఉంది అని గుర్తుకు వస్తుంది. తాము విరాధుని చంపాలి అని అనుకుంటాడు. తరువాత విరాధుడు కూడా తనశాపవృత్తాంతము చెబుతాడు. తన శరీరాన్ని గోతిలో పెట్టి పాతిపెట్టమని కోరతాడు. తరువాత ప్రాణాలు విడుస్తాడు. రాముడు విరాధుని గొంతు మీద కాలు తీయగానే పెద్దగా అరుస్తాడు. అలా అరుస్తూ గిలా గిలా కొట్టుకుంటున్న విరాధుని రామలక్ష్మణులు గోతిలోకితోసి కప్పెడతారు. వాడు లేవకుండా బండరాళ్లు పెడతారు. విరాధుడు ఇలాగే చస్తాడు అని రాముడు లక్ష్మణునికి చెబుతాడు. ఇవన్నీ ఒకదానికి ఒకటి పొంతన లేకుండా ఉన్నాయి కదా!

కాని రామాయణం ప్రాచ్య ప్రతిలో కథ వేరుగా ఉంది. విరాధుడు సీతను లాక్కుని తన తొడమీద కూర్చోపెట్టుకోగానే సీతకు కలిగిన దుస్థితికి రాముడికి దు:ఖము కలుగుతుంది. లక్ష్మణుడు రామునికి ధైర్యము చెప్పి విరాధుని మీద ఏడు బాణాలు ప్రయోగిస్తాడు. విరాధుడు లక్ష్మణుని మీద శూలం విసురుతాడు. రాముడు దానిని రెండు ముక్కలుగా విరిచేస్తాడు. మరొక బాణంతో రాముడు విరాధుని వక్షస్థలం చీలేట్టు కొడతాడు. విరాధుడు కిందపడతాడు. కాని చావడు. రామునికి తనశాప వృత్తాంతము చెబుతాడు. రామునికి కోపం తెప్పించడానికే, రాముని చేతిలో మరణించి శాపవిముక్తి పొందడానికే సీతను లాక్కున్నాను అని చెబుతాడు. తరువాత రాక్షసుల ఆచారం ప్రకారం తన శరీరాన్ని గోతిలో కప్పెట్టమంటాడు. తరువాత శరభంగ ముని గురించి చెప్పి, తన నిజ స్వరూపంతో గంధర్వలోకానికి

వెళ్లిపోతాడు. ఈకథ సంధర్భోచితంగా ఉంది. కాబట్టి మనము దీనినే అనుసరిద్దాము. పైవిషయములను నేను ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారి శ్రీమద్రామాయణము అరణ్యకాండ నుండి గ్రహించాను. వారికి నా పాదాభివందనములు. కృతజ్ఞతలు.)

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఐదవ సర్గ

విరాధుని బారి నుండి సీతను కాపాడిన రాముడు, ఆమెను కౌగలించుకొని ఓదార్చాడు. సీత ఆ భయం నుండి తేరుకుంది. తరువాత రాముడు లక్ష్మణుని చూచి ఇలాఅన్నాడు. "లక్ష్మణా! మొదటి సారిగా మనము రాక్షసులను ఎదుర్కొన్నాము. మనకు ఈ వనవాసము అలవాటు లేదు కదా. ముఖ్యంగా సీతకు. అందువల్ల చాలా కష్టంగా ఉంది. కాబట్టి మనము త్వరగా శరభంగ ముని ఆశ్రమమునకు వెళదాము." అని అన్నాడు.

లక్ష్మణుడు దారి చూపుతూ ఉండగా రాముడు సీత లక్ష్మణుని వెంట నడిచారు. అందరూ శరభంగ ఆశ్రమమునకు చేరుకున్నారు. శరభంగ మహాముని దర్శనము చేసుకున్నారు. అక్కడ వారు చాలా

ఆశ్చర్యకరమైన సంఘటనలు చూచారు. శరభంగ ముని వద్దకు దేవేంద్రుడు, దేవతల సమేతంగా తన రథం మీద ముని వద్దకు వచ్చాడు. దేవేంద్రుని, గంధర్వులు, అమరులు, సిద్ధులు, మునులు స్తుతిస్తున్నారు. దేవేంద్రుడు శరభంగ మహర్షితో మాట్లాడుతూ ఉండగా రామలక్ష్మణులు శరభంగ ఆశ్రమము దగ్గరకు వచ్చారు. ఆకాశంలో నిలిచి ఉన్న దేవేంద్రుని రథమును రాముడు లక్ష్మణునికి చూపించి దాని గురించి చెప్పాడు.

తరువాత రాముడు, లక్ష్మణుని అక్కడే ఉండమని, తాను మాత్రము శరభంగ ఆశ్రమము వైపు వెళ్లాడు. ఆశ్రమము వద్దకు వస్తున్న రాముని దేవేంద్రుడు చూచాడు. అక్కడే ఉన్న దేవతలతో ఇలా అన్నాడు. “రాముడు ఇక్కడకు వస్తున్నాడు. రాముడు ఇక్కడకు వచ్చి నాతో మాట్లాడక ముందే మీరు రాముడికి ఏమి కావాలో అవి సమకూర్చండి. రాముడు దేవ కార్యము నిమిత్తము అరణ్యములకు వచ్చాడు. ఆ పని పూర్తి అయిన తరువాతనే నేను రామునితో మాట్లాడతాను. మీరుమాత్రము రామునికి అన్నివిధాలా సాయం చెయ్యండి.” అని అన్నాడు. తరువాత దేవేంద్రుడు శరభంగ ముని వద్ద అనుజ్ఞ తీసుకొని తన రథము మీద స్వర్గమునకు వెళ్లిపోయాడు.

తరువాత రాముడు, లక్ష్మణుడు, సీతతో కలిసి శరభంగ ముని వద్దకు వెళ్లాడు. అందరూ ఆమహామునికి పాదాభివందనము చేసారు. ఆయన ఆశీర్వాదము తీసుకున్నారు. ఆ మహాముని అనుమతితో ఆయన పక్కన కూర్చున్నారు.

రాముడు శరభంగ మహర్షిని చూచి “ఓ మహర్షీ!

దేవేంద్రుడు ఇక్కడకు ఎందుకు వచ్చాడో నాకు తెలుపగోరుతాను." అని అన్నాడు. దేవేంద్రుడు తన ఆశ్రమమునకు వచ్చిన పని గురించి శరభంగ మహర్షి రామునికి వివరంగా చెప్పాడు.

"రామా! నేను ఎంతో తపస్సు చేసాను. ఆ తపస్సు ఫలితంగా దేవేంద్రుడు నన్ను బ్రహ్మలోకమునకు తీసుకొని పోవడానికి వచ్చాడు. ఇంతలో నీవు వస్తున్నట్టు నాకు తెలిసింది. నిన్ను చూడకుండా బ్రహ్మలోకమునకు పోవడం నాకు ఇష్టం లేదు. నిన్ను కలుసుకొని, నీతో మాట్లాడిన తరువాతనే నేను బ్రహ్మలోకమునకు వెళ్లడానికి నిశ్చయించుకున్నాను. రామా! నేను ఎంతో తపస్సు చేసి బ్రహ్మ లోకములను, స్వర్గలోకములను జయించాను. వాటిని నీకు ఇవ్వదలిచాను. స్వీకరించు." అని అన్నాడు.

దానికి రాముడు ఇలా అన్నాడు. "ఓ మహర్షి! పుణ్యలోకములు ఎవరికి వారు సంపాదించు కోవాలేగానీ, ఒకరు ఇస్తే స్వీకరించ కూడదు.కాబట్టి నన్ను మన్నించండి. నా తండ్రి ఆజ్ఞప్రకారము నేను వనవాసము చేస్తున్నాను. కాబట్టి  ఈ అరణ్యములో మేము నివసించుటకు అనువైన ప్రదేశమును చూపించండి." అని అడిగాడు.

ఆ మాటలకు శరభంగ మహాముని ఇలాఅన్నాడు."ఓ రామా! ఈ అరణ్యములో సుతీక్ష్ణుడు అనే పేరుగల ముని ఉన్నాడు. నీవు వెళ్లి ఆయనను కలుసుకో. ఆయన నీకు తగిన మార్గము ఉపదేశించ గలడు.  నీకు నివసించడానికి తగిన ప్రదేశమును కూడా చూపగలడు. నీవు మందాకినీ నది ప్రవాహము నకు ఎదురు వెళితే, (అంటే ఎగువభాగంలో అని అర్థం)  సుతీక్ష్ణుడి ఆశ్రమము వస్తుంది.

రామా! నీతో మాట్లాడాను. నాకు తృప్తిగా ఉంది. ఇంక నేను ఈ శరీరమును విడిచిపెడతాను. నీవు అలా చూస్తూఉండు.” అని అన్నాడు. తరువాత శరభంగ మహర్షి అగ్ని గుండము ఏర్పాటు చేయించాడు. అందులో మంత్రపూతంగా హెూమాదులు చేసాడు. తరువాత తాను ఆ అగ్నిలో ప్రవేశించాడు. ఆ అగ్ని శరభంగుని శరీరమును పూర్తిగా కాల్చివేసింది. శరభంగుడు అగ్ని కుండము నుండి నవయౌవనుడిగా ప్రకాశిస్తూ దివ్యమైన రూపంతో అగ్ని నుండి వెలుపలికి వచ్చాడు. రాముడు చూస్తూ ఉండగానే బ్రహ్మలోకము వైపుకు వెళ్లిపోయాడు. బ్రహ్మలోకములో శరభంగమహర్షికి ఘన స్వాగతము లభించింది. బ్రహ్మదేవుడు శరభంగ మహర్షిని సాదరంగా బ్రహ్మలోకమునకు ఆహ్వానించాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్య కాండము

## ఆరవ సర్గ.

ఆ ప్రకారంగా శరభంగ మహర్షి బ్రహ్మలోకము చేరుకున్నాడు. తరువాత ఆ వనములో నివసించుచున్న మునులు, ఋషులు అందరూ రాముని వద్దకు వచ్చారు. ఆ వచ్చిన వారిలో వైఖానసులు, వాలఖిల్యులు, సంప్రక్షాలులు, మరీచులు, మొదలగు మహాఋషులు

అక్కడకు వచ్చారు. వారందరూ రాముని ఇలా అన్నాడు.

"ఓ రామా! నీవు ఇక్ష్వాకు వంశములో శ్రేష్ఠుడవు. దేవేంద్రుడు స్వర్గ లోకమును పాలించినట్టు నీవు ఈ భూమిని పాలిస్తున్నావు. నీవు సత్యమునే పలుకుతావు. అమితమైన పరాక్రమ వంతుడవు. పితృవాక్య పరిపాలన నీ ప్రధానధర్మము. నీకు తెలియని ధర్మము లేదు. అందుకని మీతో మా బాధలను చెప్పకో దలిచాము. నీవు ఏమీ అనుకోవద్దు.

రాజధర్మము గురించి నీకు చెప్ప పనిలేదు. రాజు తన ప్రజల నుండి ఆరవ వంతు ఆదాయమును పన్నుగా తీసుకొని, దానికి ప్రతిగా ప్రజలకు అన్ని సౌకర్యములు కలిగించాలి. ప్రజలను రక్షించాలి. ఇదీరాజధర్మము. తన పాలనలో ఉన్న ప్రజలందరినీ కన్న బిడ్డలవలె రక్షించే రాజు చిరకాలము రాజ్యము చేస్తాడు. మరణానంతరము అటువంటి రాజుకు బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. మేము మునులము. తాపసులము. మేము రాజుకు పన్నురూపంలో ఏమీ ఇచ్చుకోలేము. కాని మేము చేసే తపస్సులో నాలుగవ వంతు ఫలము రాజుకు దక్కుతుంది. కాబట్టి మమ్ములను రక్షించే బాధ్యత రాజువైన నీ మీద ఉన్నది.

ప్రస్తుతము మేము నివసించుచున్న ఈముని ఆశ్రమములన్నీ నీ పాలనలో ఉన్నాయి. నీ పాలనలో ఉండి కూడా మేము అభద్రతా భావంతో బతుకుతున్నాము. మాకు ఎలాంటి రక్షణ, భద్రత లేదు. ఈ అరణ్యములో రాక్షసులు ఎక్కువగా ఉన్నారు. వారు ఎంతో మంది మునులను చంపారు. మాకు ఎన్నో బాధలను కలిగిస్తున్నారు. రామా! మాతో రా! ఆ చనిపోయిన మునుల శవములను మీకు చూపిస్తాము.

ఈ రాక్షసులు మందాకినీ నదీ ప్రాంతములోనూ, చిత్రకూట పర్వతప్రాంతములోనూ, పంపానదీ ప్రాంతములోనూ ఎక్కువగా తిరుగుతున్నారు. ఆ యా ప్రాంతములలో నివసించే మునులను చంపుతున్నారు. వారు పెట్టేబాధలకు అంతు లేదు. ఆ రాక్షసులు చేసే వినాశనమును ఇంక ఎంతమాత్రము మేము సహించలేకపోతున్నాము. నీవే మమ్ములను రక్షించాలి. మేమంతా నీ రక్షణ కోరుతున్నాము. ఆ రాక్షసుల చేతిలో మేము చావకుండా మమ్ములను కాపాడు రామా! ఎందుకంటే నిన్ను మించిన వీరుడు ఈ లోకంలో లేడు అని మా నమ్మకము. నీవే ఈ రాక్షస సంహారమునకు సమర్ధుడవు.” అని పలువిధములుగా తమ బాధలు రామునితో విన్నవించుకున్నారు.

రాముడు ఆ మునుల మాటలను శ్రద్ధగా విన్నాడు. తరువాత రాముడు ఆ మునులకు నమస్కరించి ఇలా అన్నాడు.

“ఓ మహామునులారా! మీరు ఇంత దీనంగా నన్ను ప్రార్థించడం తగదు. మీరు నన్ను ఆజ్ఞాపించాలి కాని అర్థించకూడదు. మిమ్మల్ని రక్షించే అవకాశము నాకు కల్పించినందులకు నేనే మీకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఈ రాక్షసులు పెట్టే బాధల గురించి నేను వింటూనే ఉన్నాను. మీ బాధలు తీర్చడం రాజుగా నా కర్తవ్యం. బాధ్యత.  అందుకే మా తండ్రి గారి ఆజ్ఞ ప్రకారము  నేను ఈ అరణ్యములో ప్రవేశించాను. రాక్షస సంహారంతో  నా వనవాసమునకు గొప్ప ఫలము లభిస్తుంది. మీరింక నిర్భయంగా తపస్సు చేసుకోండి. మీ రక్షణ బాధ్యత నేను వహిస్తాను.” అని రాముడు ఆ మునులకు అభయము ఇచ్చాడు.

తరువాత రాముడు, సీతతో, లక్ష్మణునితో కలిసి సుతీక్ష్ణుని ఆశ్రమమునకు వెళ్లాడు. రాముని వెంట కొంతమంది మునులు అనుసరించారు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఏడవ సర్గ.

రాముడు, సీతతోనూ, లక్ష్మణుని తోనూ, ఇంకా కొందరు మునులతోనూ సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమమునకు వెళ్లాడు. సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమము ఒక మహారణ్యములో చదునైన ప్రదేశములో ఉంది. ఆ అడవిలో ఫలవృక్షములు పుష్కలంగా ఉన్నాయి.

రాముడు ఆ  ఆశ్రమములో ప్రవేశించాడు. తపస్సులో ఉన్న సుతీక్ష్ణ మహర్షిని చూచాడు. భక్తితో నమస్కరించాడు. తనను తాను పరిచయం  చేసుకున్నాడు.

"ఓ మహర్షీ! నా పేరు రాముడు. అయోధ్యాధి పతి దశరథుని కుమారుడను. తండ్రి ఆజ్ఞ మేరకు, నా భార్య, సోదరునితో కలిసి అరణ్యవాసము చేస్తున్నాను. శరభంగ మహర్షి ఆదేశము మేరకు తమ దగ్గరకు వచ్చాను. కళ్లు తెరిచి నాతో మాట్లాడండి." అని ప్రార్థించాడు.

సుతీక్ష్ణ మహర్షి కళ్లు తెరిచాడు.రాముని చూచాడు. పరమానందంతో రాముని కౌగలించుకున్నాడు.

"రామా! నీకు స్వాగతము. నీరాకచే మా ఆశ్రమమునకు ఒక నాథుడు దొరికినట్టయింది. రామా! నీ గురించి విన్నాను. నీవు అరణ్యములలో సంచరిస్తున్నావని తెలిసి నీ రాక కొరకు ఎదురు చూస్తున్నాను. దేవేంద్రుడు వచ్చి నన్ను స్వర్గలోకమునకు ఆహ్వానించాడు. నేను స్వర్గమునకు వెళ్లవలెనని నిశ్చయించుకున్నాను. కాబట్టి నేను ఆర్జించిన తపోఫలమును నీకు ధారపోస్తాను. నీవు స్వీకరించు." అని అన్నాడు.

అప్పుడు రాముడు ఆ మహర్షితో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! నీ గురించి శరభంగ మహర్షి వలన విని ఉన్నాను. తమరు నాకు ఉండటానికి తగిన ప్రదేశమును నిర్ణయిస్తారని శరభంగ మహర్షి చెప్పాడు." అని అన్నాడు.

"రామా! ఈ అడవిలో ఈ ప్రాంతము నివాసయోగ్యమైనది. ఇక్కడ ఫలవృక్షములు, పూదోటలు విస్తారముగా ఉన్నాయి. పర్ణశాల నిర్మించుకోడానికి అనువైన చదునైన ప్రదేశము ఉంది. కాబట్టి నీవు పర్ణశాల నిర్మించుకొని ఇక్కడే ఉండవచ్చును. కాని ఈ ప్రదేశమునకు పెద్ద పెద్ద జంతువులు గుంపులు గుంపులుగా వస్తాయి. కాని అవి ఎవరికీ హాని చెయ్యవు. కాసేపు అటూ ఇటూ తిరిగి వెళ్లిపోతాయి. అది తప్ప ఇక్క ఏ విధమైన భయము లేదు. ప్రశాంతంగా ఉంటుంది." అని అన్నాడు సుతీక్ష్ణ మహర్షి.

అప్పుడు రాముడు ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! నాకు మృగముల వలన భయము లేదు. నేను వనవాసిని కాను కదా. క్షత్రియుడను. ఈ ధనుర్బాణములతో మనకు హాని కలిగించు మృగములను చంపగలను. కాని నేను మృగములను చంపడం సహజంగా దయాళువులైన మీకు కష్టం కలిగించవచ్చును. కాబట్టి నేను ఇక్కడ ఎక్కువ కాలము ఉండలేను అనిపిస్తూ ఉంది." అని అన్నాడు రాముడు.

తరువాత రాముడు, లక్ష్మణుడు సంధ్యావందనాది కార్యక్రమములు నిర్వర్తించారు. సుతీక్ష్ణ మహర్షి రామలక్ష్మణులకు, సీతకు, వారితో వచ్చిన మునులకు ఫలములను ఇచ్చి సత్కరించాడు. ఆ రాత్రికి వారు సుతీక్ష్ణుని ఆశ్రమములోనే ఉన్నారు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఎనిమిదవ సర్గ.

సీతా రామ లక్ష్మణులు మరునాడు ఉదయం నిద్రలేచారు. సంధ్యావందనాది కార్యక్రమములు నిర్వర్తించారు. రాముడు సుతీక్ష్ణుని వద్దకు వెళ్లాడు.

"మహాత్మా! రాత్రి మీ ఆతిథ్యము స్వీకరించాము. మాకు చాలా సంతోషము అయింది. మీరు అనుమతి ఇస్తే మేము ముగ్గురమూ, మాతో వచ్చిన మునులు కలిసి, ఈ అరణ్యములో ఉన్న ముని ఆశ్రమములను చూచి వస్తాము. ఆ మునుల ఆశీర్వాదములు తీసుకుంటాము." అని అన్నాడు రాముడు..

"రామా! నీకు శుభమగు గాక! నీ ఇష్టము ప్రకారము ఈ వనములో ఉన్న ముని ఆశ్రమములను అన్నిటినీ దర్శించు. ఈ వనములో ఫలములు, పుష్పములు సమృద్ధిగా ఉన్నాయి. నిర్మలమైన నీరు కల జలాశయములు ఎన్నో ఉన్నాయి. కొండలమీది నుండి నేల మీదికి దుముకుచున్న జలపాతములు కూడా చాలాఉన్నాయి. జింకలు, నెమళ్లు తదితర వన్యప్రాణులు మీకుకనువిందు చేస్తాయి. ఈ అడవిలో ఉన్న అందాలన్నీ తనివిదీరా చూడండి. మరలా మన ఆశ్రమమునకు చేరుకోండి." అని అన్నాడు.

"మహర్షీ! అలాగే చేస్తాను." అని ఆ మహర్షికి నమస్కరించి, లక్ష్మణుడు, సీత, మునులతో వనములోకి వెళ్లడానికి ప్రయాణము అయ్యాడు. సీత రామునికి లక్ష్మణునికి ధనుర్బాణములు, ఖడ్గములు తెచ్చి ఇచ్చింది. వాటిని రామలక్ష్మణులు ధరించారు. ఆయుధధారులైన రామ లక్ష్మణులు, సీతతో కలిసి ఆ అరణ్యములో ప్రయాణం చేస్తున్నారు.

శ్రీమద్రామాయణము

అరణ్య కాండము ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## తొమ్మిదవ సర్గ.

రాముడు, లక్ష్మణుడు, సీత అరణ్యమార్గములో పోతూ ఉన్నారు. అప్పుడు సీత రాముని చూచి ఇలా పలికింది.

“నాధా! ధర్మము, ధర్మ సంపాదన చాలా నిశితమైనవి. కోరికలకు, వ్యసనములకు దూరంగా ఉన్నవారే ధర్మముగా జీవించగలరు. వ్యసనములకు మూలము కామము. కామము వలన ముఖ్యంగా మూడు వ్యసనములు కలుగుతాయి. అందులో మొదటిది అసత్యము పలకడం. రెండవది పరుల భార్యలను కోరడం. మూడవది ఎదుటి వారి మీద ఎలాంటి విరోధము లేకుండానే వారిని హింసించడం.

ఇంక నీ సంగతి తీసుకుంటే నీవు సత్యవాక్పరిపాలకుడవు. అసత్యము పలకడం అంటే ఎలాంటిదో నీకు తెలియదు. ఇంక నీకు పరస్త్రీలమీద వాంఛ మనసులో కానీ, వాక్కులో కానీ, కర్మలో గానీ లేదు. అది నాకు తెలుసు. నీవు తండ్రిమాటకు విలువ ఇచ్చి రాజ్యమును త్యజించి, అడవులకు వచ్చావు. పైగా నీవు జితేంద్రియుడవు. ఇంతకన్నా సుగుణములు ఇంకా ఏమి కావాలి.

ఇంక మూడవది ఎదుటి వారిమీద ఎలాంటి వైరభావము లేకపోయినా, వారిని వధించడం. ఈ వ్యసనము నీకు ఎందుకో

వచ్చింది. కారణం తెలియదు. ఈ దండకారణ్యములో నివసించు రాక్షసులను చంపుతానని ఋషులకు మాట ఇచ్చావు. ఆ కార్యక్రమము మీద నీవు లక్ష్మణునితో కలిసి ఆయుధములు ధరించి బయలుదేరావు. ఇది చూచి నా మనసు చాలా వికలమయింది. దీని గురించి నేను అన్ని విధాలా ఆలోచించాను. నా మనసుకు సరిఅయిన సమాధానము దొరకలేదు.

నీవు ఈ విధంగా ధనుర్బాణములను, కత్తులను ధరించి దండకారణ్యములోనికి వెళ్లడం నాకు ఏమాత్రం ఇష్టం లేదు. ఎందుకంటే చేతిలో ధనుర్బాణములు ఉంటే దొరికిన మృగాన్ని చంపాలి అన్న ఆలోచన వస్తుంది. ఆలోచన వచ్చినపుడు అమాయకమైన మృగాలను చంపకుండా వదులుతావా! చేతిలో ధనుస్సు, కత్తి ఉన్నప్పుడు ఏదో ఒక రకంగా హింస చేయవలెనని బుద్ధిపుట్టడం క్షత్రియులకు సహజం. దీని గురించి నీకు ఒక కథచెబుతాను.

ఒక వనములో ఒక ఋషి తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన తపస్సుకు విఘ్నం కలిగించాలని అనుకున్నాడు ఇంద్రుడు. ఇంద్రుడు ఒక భటుని రూపంలో చేతిలో ఒక కత్తితో ఆ ఋషి దగ్గరకు వచ్చాడు. "ఓ మహాత్మా! నేను అత్యవసరమైన పని మీద వెళుతున్నాను. నేను వచ్చువరకు ఈ ఖడ్గమును తమరి దగ్గర ఉంచండి. నా పని అయిపోయిన తరువాత వచ్చి తీసుకుంటాను." అని అన్నాడు. ఆ ఋషి సరే అన్నాడు. ఆ ఖడ్గమును తన ఆశ్రమములో ఒక మూల పెట్టించాడు. భటుని రూపంలో ఉన్న ఇంద్రుడు వెళ్లిపోయాడు.

తాను ఆశ్రమములో లేని సమయములో ఆ కత్తిని ఎవరైనా

ఎత్తుకుపోతారని, ఆఋషి ఎప్పుడూ ఆ కత్తిని తనతోపాటు తీసుకొని వెళుతూ ఉండేవాడు. ఎల్లప్పుడూ కత్తి అతని వద్ద ఉండటంతో ఆ కత్తిని ఉపయోగించడం మొదలు పెట్టాడు. ఆ ఋషి బుద్ధి క్రూరంగా మారిపోయింది. వినోదం కొరకు  ఏదో ఒక జంతువును చంపడం అలవాటు అయింది. క్రమంగా అతని బుద్ధి తపస్సు మీదినుండి వేటమీదికి మళ్లింది. తుదకు ఆ ఋషికి నరకం సంప్రాప్తించింది. ఇంద్రుడి కోరిక నెరవేరింది.

నాధా! సత్త్వగుణ సంపన్నుడు అయిన ఆ ఋషి కూడా ఎల్లప్పుడూ ఆయుధము తన వద్ద ఉండటం వల్ల, అతని మనసు క్రూరంగా మారిపోయింది. ఆయుధములకు ఆ శక్తి ఉంది. ఆయుధము, అగ్ని రెండూ ప్రమాదహేతువులు అని మీకు తెలియనిది కాదు. మీ దగ్గర నాకు ఉన్న చనువు వలన మీకు చెబుతున్నాను. అంతేగానీ  ఈ విషయములు అన్నీ మీకు తెలియవు అని కాదు.

నాధా! ఈ అడవిలో ఉన్న రాక్షసులకు మీకూ ఎలాంటి వైరము లేదు.  వారు మనకు ఎలాంటి అపకారమూ చేయలేదు. కేవలము మీ వద్ద ఆయుధములు ఉన్న కారణంగా వాళ్లను చంపాలి అని అనుకుంటున్నారు. ఆ ఆలోచన మంచిది కాదు అని నా అభిప్రాయము. వారు ఏ అపరాధమూ చేయకుండా వారిని శిక్షించడం లోకసమ్మతం కాదు. ప్రజలు దానిని హర్షించరు.

ప్రజారక్షణ కోసరం ఆయుధములను ధరించడం క్షత్రియధర్మము. దానిని నేను కాదనను. కాని మీరు ప్రస్తుతము ముని వృత్తిలో ఉన్నారు. మీరు క్షత్రియధర్మము పాటించడం అనుచితము అని

నా అభిప్రాయము. అయినా అడవులు ఎక్కడ! ఆయుధములు ఎక్కడ! క్షత్రియధర్మమెక్కడ! తపోవృత్తి ఎక్కడ! ఇవి పరస్పరమూ విరుద్ధముగా ఉన్నాయి కదా! కాబట్టి మీరు దేశధర్మమును పాటించడం మంచిది. అంటే మీరు ప్రస్తుతము వనములో ముని వృత్తిలో ఉన్నారు కాబట్టి మునుల వలె ప్రవర్తించడం మంచిది. అంతేకానీ హింసకు పాల్పడకూడదు.

మీరు అయోధ్యకు వెళ్లిన తరువాత మీ ఇష్టం వచ్చినట్టు ఆయుధములు ధరించి క్షత్రియ ధర్మమును పాటించవచ్చును. నీ తల్లి తండ్రులు నిన్ను నార చీరలు ధరించి. జటలు కట్టుకొని వనవాసము చేయమని నిర్దేశించారు. వారి ఆజ్ఞప్రకారము ముని వృత్తిలో ఉంటే వారూ సంతోషిస్తారు. అదే ధర్మము. ధర్మాచరణమే మీ కర్తవ్యము. కాబట్టి నాథా! మీరు అడవులలో ఉన్నారు కాబట్టి మంచి బుద్ధితో సత్వగుణమును, తపోధర్మమును పాటించండి. క్షాత్రమును వదిలిపెట్టండి. అనవసరంగా నీకు ఏ మాత్రం హాని చేయని వారిని హింసించకండి.

ఏదో స్త్రీ చాపల్యంతో మాట్లాడాను. ఏమీ అనుకోకండి. ఎందుకంటే తమరికి తెలియని ధర్మము లేదు. నేను చెప్పానని కాకుండా ఈ విషయం లక్ష్మణునితో కూడా ఆలోచించి తగు నిర్ణయం తీసుకోండి." అని సీత మెత్త మెత్తగా తన అభిప్రాయాన్ని రామునికి తెలియజేసింది.

శ్రీమద్రామాయణము

అరణ్య కాండము తొమ్మిదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## పదవ సర్గ.

తన భార్య సీత చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నాడు రాముడు. సీతతో ఇలా అన్నాడు."ఓ జనకరాజపుత్రీ! సీతా! నీకు అన్ని ధర్మాలూ తెలుసు.  నీవు పలికిన పలుకులు నీ సాత్విక ప్రవృత్తికి తగినట్టుగానూ, ధర్మబద్ధంగానూ, యుక్తియుక్తంగానూ ఉన్నాయి.

దీనులను రక్షించడానికే క్షత్రియులు ఆయుధములు చేపడతారని నీవే చెప్పావు కదా! ఈ దండకారణ్యములో ఎంతో మంది మునులు ఉన్నారు. వారికి తపస్సు తప్ప వేరొక పని లేదు. వారందరూ పూజనీయులు. గౌరవింపతగ్గవారు. అటువంటి వారిని రాక్షసులు అనేక రకాలుగా బాధలు పెడుతున్నారు. చంపుతున్నారు. ఆ పరిస్థితులలో ఆ మునులు తమ బాధలనుండి రక్షించమని నన్ను శరణుకోరారు.

ఆ మునులు ఎవరికీ అపకారముచెయ్యరు. దొరికిన కందమూలములు, ఫలములు తిని తపస్సు చేసుకుంటున్నారు. అటువంటి వారికి ఈ రాక్షసుల వలన శాంతి, సుఖము లేకుండా పోయాయి. నరమాంస భక్షకులైన రాక్షసులు ఎప్పుడు ఎవరిని చంపుతారో అని భయంతో వణికిపోతున్నారు. వారందరూ రాక్షసుల బారినుండి తమను కాపాడమని నన్ను అర్థించారు.

ఒక క్షత్రియుడుగా, ఒక రాజుగా నేనే వారి వద్దకుపోయి, "మీకు నేను ఏమి సేవ చేయాలి" అని అడగడం పోయి, వారే నా దగ్గరకు వచ్చి తమను కాపాడమని నన్ను అర్థించారు. అందుకు ఒక రాజుగా నేను సిగ్గుపడాలి. నేను వారిని "నేను మీకు ఏమిసేవ చేయగలను" అని అడిగినప్పుడు వారు చెప్పిన మాటలను నీకు చెబుతున్నాను.

"రామా! ఈ దండకారణ్యములో కామరూపులైన రాక్షసులు స్థావరములు ఏర్పరచుకొని ఉన్నారు. వారు నరమాంసభక్షకులు. మేము హెూమాలు, యాగాలు చేస్తుంటే వాటిని పాడుచేస్తున్నారు. అదేమని అడిగితే చంపుతున్నారు. మా తపోబలముచేత వారిని మేము ఎదుర్కోగలము, చంపగలము. కాని ఎంతో కష్టపడి ఆర్జించిన మా తపోమహిమలను ఈ నీచుల కోసరం వెచ్చించడం మాకు ఇష్టం లేదు. అందుచేత, ఆ రాక్షసులు మమ్ములను ఎన్ని బాధలు పెడుతున్నా, మా యజ్ఞాలు పాడుచేస్తున్నా, మమ్ములను చంపుతున్నా, భరిస్తున్నాము, సహిస్తున్నాము. ఇప్పుడు నీవు వచ్చావు కాబట్టి, నిన్ను అర్థిస్తున్నాము. ఈ ప్రాంతము నీరాజ్యములో ఉన్నది కాబట్టి నీవే మాకు రక్షకుడవు."

సీతా! ఈ ప్రకారంగా వారు నాతో పలికిన పలుకులు విని నేను ఊరుకోలేకపోయాను. వారికి అపకారము చేస్తున్న రాక్షసులను సంహరిస్తానని వారికి మాట ఇచ్చాను. ఆ మాట నెరవేర్చడం క్షత్రియునిగా నా కర్తవ్యం. నా శరీరంలో ప్రాణం ఉన్నంత వరకూ వారికి ఇచ్చిన మాటను నెరవేర్చడానికే ప్రయత్నిస్తాను. అవసరం అయితే మీ అందరినీ, నా ప్రాణాలను సైతం విడిచిపెడతాను కానీ ఆ బ్రాహ్మణులకు

ఇచ్చిన మాటను నెరవేరుస్తాను. ఇదే నా నిశ్చయము. ఒక క్షత్రియునిగా, ఒక రాజుగా, వారు అడగకపోయినా, నేను వారి కష్టాలు తీర్చాలి. వారికి రక్షణ కల్పించాలి. వారే అడిగినప్పుడు ఇంక వేరుచెప్పాలా!

ఓ సీతా! నీకు తగినట్టు నీవు చెప్పావు. అందులో తప్పులేదు. నిన్ను నేను నా ప్రాణముల కంటే ఎక్కువగా ప్రేమిస్తాను. మునులకు ఇచ్చిన మాటనుకూడా నెరవేరుస్తాను." అని అన్నాడు రాముడు.

తరువాత అందరూ దండకారణ్యములోనికి ప్రవేశించారు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము పదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## పదకొండవ సర్గ.

ఆ అడవిలో రాముడు ముందు నడుస్తున్నాడు. సీత మధ్యలో ఉంది. వెనక లక్ష్మణుడు నడుస్తున్నాడు. వారు అనేకములైన కొండలను, సెలయేళ్లను దాటుకుంటూ వెళుతున్నారు. నదీతీరములలో ఇసుక తిన్నెల మీద ఎగురుతున్న సారస పక్షులను, చక్రవాక పక్షులను, జలపక్షులను చూస్తూ ఆనందిస్తున్నారు. గుంపులు గుంపులుగా పోవుచున్న వన్య ప్రాణులను చూచి, ఆగి అవి వెళ్లిన మీదట

వెళుతున్నారు. సాయంత్రము అయింది. వారు ఒక సరస్సును సమీపించారు.

ఆ సరస్సులో నుండి గీతాలాపనలు, వాద్య ధ్వనులు శ్రవణానందంగా వినిపిస్తున్నాయి. కాని ఆ దరిదాపులలో మానవ సంచారము లేదు. సీతారామలక్ష్మణులు ఆ ధ్వనులు విని ఆశ్చర్యపోయారు. తమ వెంట వస్తున్న ఋషులను ఆ వాద్య ధ్వనులు ఎక్కడినుండి వస్తున్నాయి అని అడిగారు. అందులో ధర్మభృతుడు అనే వృద్ధుడైన ఒక ఋషిఇలా చెప్పసాగాడు.

"రామా! ఈ సరస్సుపేరు పంచ అప్సర సరస్సు. ఈ తటాకము అన్ని ఋతువులలోనూ ఒకే విధంగా నీటితో నిండి ఉంటుంది. ఈ సరస్సును మాణ్డకర్ణి అనే ఋషి నిర్మించాడు. మాణ్డకర్ణి అనే ఆ ఋషి పదివేల సంవత్సరములు తీవ్రంగా తపస్సు చేసాడు. ఆ తపస్సుకు దిక్పాలకులు వణికిపోయారు. ఎవరి పదవిని కోరి ఆ ఋషి తపస్సు చేస్తున్నాడో అని భయపడ్డారు. వెంటనే వారుమెరుపు తీగల వలె మెరిసిపోతున్న ఐదుగురు అప్సరసలను పిలిపించారు. ఆ ఋషి తపస్సును భగ్నం చేయమని వారిని పంపారు.

ఆ అప్సరసలు మాణ్డకర్ణి వద్దకు వచ్చారు. తమ శృంగార హావభావాలతో ఆ మునిని ఆకట్టుకున్నారు. తమకు దాసుడిగా చేసుకున్నారు. శృంగార చేష్టలలో ఓలలాడించారు. ఆ ముని తన తపోబలంతో యువకుడిగా మారిపోయాడు. ఆ ఐదుగురు అప్సరసలను పెళ్లి చేసుకున్నాడు. వారి కొరకు ఈ సరస్సును సృష్టించి,

ఈ సరస్సు అడుగుభాగంలో ఒక గృహమును ఏర్పరిచి అందులో వారితో పాటు నివసిస్తున్నాడు. ఆ ఐదుగురు అప్సరసలు ఆలపించే గీతాలు, వాద్య ధ్వనులే మీరు వింటున్నారు." అని అన్నాడు.

ఆ మాటలు విన్న రామలక్ష్మణులు సీత ఆశ్చర్యపోయారు. రాముడు అక్కడ కొన్ని మున్యాశ్రమములు చూచాడు. ఆ ఆశ్రమములలో ఉన్న మునులు రాముని సాదరంగా ఆహ్వానించారు. అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించారు. రాముడు ఆ ముని ఆశ్రమములలో కొంత కాలము నివసించాడు. తరువాత రాముడు ఆ అడవిలో ఎన్నో ఆశ్రమములు సందర్శించాడు. ఆయా ఆశ్రమములలో కొంత కాలము నివసించాడు.

ఒక ఆశ్రమములో పది మాసములు, మరొక ఆశ్రమములో ఒక సంవత్సరము, మరొక ఆశ్రమములో నాలుగు మాసములు, ఐదు మాసములు, ఆరు మాసములు, ఒక మాసము, ఒకటిన్నర మాసము, మూడు మాసములు, ఎనిమిది మాసములు ఈ ప్రకారంగా రాముడు, సీత, లక్ష్మణుడు ఒక్కొక్క ఆశ్రమములో పై చెప్పిన విధంగా నివసించారు. ఆ విధంగా ముని ఆశ్రమములలో నివసిస్తూ రాముడు, సీత, అక్ష్మణుడు తమ వనవాస కాలములో పది సంవత్సరములు ఆనందంగాగడిపారు.

(దీనికి సంబంధించిన శ్లోకము ఇక్కడ ఉదహరిస్తాను. చదవండి.)

తదాసంవసతస్తస్య మునీనామాశ్రమేషు వై,

రమతశ్చానుకూల్యేన యయు: సంవత్సరా దశ.

ఆ విధంగారాముడు ఆశ్రమములలో నివసిస్తూ ఉండగా పది సంవత్సరములు అనుకూలంగా గడిచిపోయాయి. అంటే ఈ

పదిసంవత్సరములు రాముడు ఒక్క రాక్షసుని కూడా చంపలేదు. మరి రాముడు మునులను రక్షిస్తాను అని వారికి ఇచ్చిన మాట ఏమైనట్టు. వారు రాక్షసుల చేతిలో అనుదినమూ బాధలు పడుతున్నారా! చస్తున్నారా! సీతను, లక్ష్మణుని అయినా వదులుకుంటాను కానీ నేను మునులకు ఇచ్చిన మాట తప్పను. అందుకే ధనుర్బాణాలు ధరించాను అన్న రాముడు వారి ఊసెత్తకుండా  పది సంవత్సరాలు ఆనందంగా గడిపాడు. కానీ వారి కష్టాలు బాధలు తీర్చలేదు. దీనిని ఎలా అర్థం చేసుకోవాలి?దీని  అర్థం ఏమయి ఉంటుంది.

దీనికి సమాధానం మనకు ముప్పదవ సర్గలో కనిపిస్తుంది. రాముడు ఒక్కొక్క రాక్షసుని చంపడానికి ఇష్టపడలేదు. ఒకేసారి రాక్షసులనందరినీ మట్టు పెట్టాలని అనుకున్నాడు. అదును కోసం వేచి ఉన్నాడు. శూర్పణఖ వల్ల ఆ అవకాశం వెతుక్కుంటూ వచ్చింది. మొత్తం 14,000+5,000 సైనికులను ఖరుని, దూషణుని, త్రిశిరుని ఒకేసారి సంహరించి దండకారణ్యములో రాక్షస బాధను శాశ్వతంగా నివారించాడు. రాముడు తాత్కాలిక పరిష్కారం కోసం కాకుండా శాశ్వత పరిష్కారం కోసరం వేచిఉన్నాడు. ఇలా అర్థం చేసుకుంటే రాముని ఆంతర్యం మనకు అర్థం అవుతుంది.)

తరువాత ధర్మజ్ఞుడైన రాముడు, సీతతో, లక్ష్మణునితో ఆయా ఆశ్రమములలో నివసిస్తూ, తుదకు సుతీక్ష్ణుని ఆశ్రమమునకు చేరుకున్నాడు. రాముడు సుతీక్ష్ణుని ఆశ్రమంలో కొంతకాలము నివసించాడు.

ఒకరోజు రాముడు సుతీక్ష్ణ మహామునిని చూచి ఇలా

అన్నాడు. "మహాత్మా! అగస్త్యుడు ఈ అరణ్యములోనే ఆశ్రమము నిర్మించుకొని నివసిస్తున్నాడు అని వారి గురించి కథలు కథలు గా విన్నాము. మాకు ఆయనను దర్శించవలెనని కోరికగా ఉంది. ఆయన ఆశ్రమము ఎక్కడ ఉందో దయచేసి తెలియజేయండి." అని ప్రార్థించాడు.

"రామా! మంచి పని చేస్తున్నావు. నేనే నిన్ను అగస్త్యుని ఆశ్రమమునకు వెళ్లమని చెబుదాము అని అనుకుంటున్నాను. ఇంతలో నీవే అడిగావు. చాలా సంతోషము. ఈ ఆశ్రమము నుండి నాలుగు యోజనముల దూరంలో దక్షిణ దిశగా అగస్త్యుని సోదరుడు (అగస్త్యభ్రాత) ఆశ్రమము కలదు.

(ఈ అగస్త్య భ్రాత గురించి మన ఇంట్లో పెద్ద వాళ్లకు తెలుసు. అగస్త్యుని సోదరునికి పేరు లేదు. అంతా అగస్త్య భ్రాత అంటారు. "వీడెవడో అగస్త్య భ్రాతలా ఉన్నాడే!" అని అనడం మనం వింటూ ఉంటాము. అగస్త్యభ్రాత అనేది ఒక నానుడి.)

రామా! నీవు అగస్త్య భ్రాత ఆశ్రమములో ఒక రాత్రి ఉండి మరునాడు అగస్త్యుని ఆశ్రమమునకు వెళ్లు. అగస్త్య భ్రాత ఆశ్రమము నకు ఒక యోజన దూరంలో అగస్త్యుని ఆశ్రమము ఉంది." అని అన్నాడు.

తరువాత రాముడు సుతీక్ష్ణుని వద్ద అనుజ్ఞ తీసుకొని అగస్త్యుని ఆశ్రమమునకు బయలు దేరాడు. దక్షిణ దిశగా నాలుగు యోజనములు ప్రయాణము చేసి అగస్త్య భ్రాత ఆశ్రమమును

చేరుకున్నారు.

ఫలవృక్షములు సమృద్ధిగా కల ఆ ప్రాంతమును చూచి రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఇక్కడ ఉన్న ఫలవృక్షములు, పిప్పళ్ల చెట్లు, ఆశ్రమము బయట ఉన్న సమిధలు, సేకరించిన దర్భలు, ఆరవేసిన నార చీరలు, చూస్తుంటే సుతీక్ష్ణ మహాముని చెప్పిన అగస్త్య భ్రాత ఆశ్రమము ఇదే అని తెలుస్తోంది. అటు చూడు, ఆ ఆశ్రమము పైనుండి అగ్ని హోత్రము నుండి వెలువడే పొగ ఆకాశంలోకి ఎలా పోతోందో! సందేహము లేదు. ఇదే అగస్త్య భ్రాత ఆశ్రమము.

లక్ష్మణా! నీకు తెలుసా! అగస్త్యుడు ఈ దక్షిణ ప్రాంతము అరణ్యములలో నివసించు బ్రాహ్మణులకు తాపసులకు వారికి ఎంతో ఉపకారము చేసాడు. ఎలాగంటే.....

ఈ అడవిలో వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరు రాక్షసులు ఉండేవారు. వారు ఇక్కడ నివసించే బ్రాహ్మణులను, తాపసులను మోసం చేసి చంపి తినేవారు. ఇల్వలుడు ఒక బ్రాహ్మణుడిగా వేషం వేసుకొనేవాడు. " ఈ రోజు నా తండ్రి ఆబ్దికము మీరు భోజనానికి భోక్తగా రావాలి" అని బ్రాహ్మణులను తన ఇంటికి తీసుకొని వెళ్లేవాడు. వాతాపి ఒక గొర్రెగా మారి పోయేవాడు. శాస్త్రములలో చెప్పబడిన శ్రాద్ధకర్మల విధి ప్రకారము ఇల్వలుడుఆ గొర్రెను చంపి ఆ మాంసముతో ఆ భోక్తగా వచ్చిన బ్రాహ్మణునకు భోజనం పెట్టేవాడు.

బ్రాహ్మణుడు భోజనం చేసిన తరువాత "వాతాపీ! బయటకు రా!" అని బిగ్గరగా అరిచేవాడు. ఆ బ్రాహ్మణుని పొట్టలో ఉన్న వాతాపి

గొర్రెగా మారి, ఆ బ్రాహ్మణుని పొట్టను చీల్చుకొని బయటకు వచ్చేవాడు. వాతాపి, ఇల్వలుడు ఇద్దరూ కలిసి ఆ బ్రాహ్మణుని చంపి తినేవారు. ఈ ప్రకారము ఆ రాక్షసులు ఇద్దరూ ఎంతో మంది బ్రాహ్మణులను చంపారు. ఈ సంగతి తెలిసి దేవతలు, బ్రాహ్మణులు అగస్త్యుని శరణు వేడారు. అగస్త్యుడు సరేఅన్నాడు.

ఒక రోజు అగస్త్యుడు ఇల్వలుని ఇంటికి భోక్తగా వెళ్లాడు. వాతాపి గొర్రెగా మారాడు. ఇల్వలుడు వాతాపిని చంపి ఆ మాంసమును వండి అగస్త్యునికి వడ్డించాడు. అగస్త్యుడు తృప్తిగా భోజనం చేసాడు. “జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం” అంటూ బ్రేవ్‌మంటూ త్రేన్చాడు. అంతే. అగస్త్యుని పొట్టలో ఉన్న వాతాపి జీర్ణం అయిపోయాడు. ఇది తెలియని ఇల్వలుడు “వాతాపీ! బయటకు రా!’ అని అరిచాడు. ఎంత అరిచినా వాతాపి రాలేదు.

అగస్త్యుడు నవ్వాడు. “ఇంకెక్కడి వాతాపి. వాడు నా పొట్టలో ఎప్పుడో జీర్ణం అయిపోయాడు.” అన్నాడు తన పొట్ట నిమురుకుంటూ. దానికి కోపించి ఇల్వలుడు అగస్త్యుని మీద దాడి చేసాడు. అగస్త్యుడు తన తపోశక్తితో ఇల్వలుని భస్మం చేసాడు. ఆ ప్రకారంగా అగస్త్యుడు ఈ ప్రాంతంలో ఉన్న బ్రాహ్మణులకు, మునులకు రాక్షస బాధ తొలగించాడు. ఆ అగస్త్యుని సోదరుడే ఈ అగస్త్య భ్రాత” అని వివరించాడు రాముడు.

(ఈ రోజుల్లో కూడా తల్లులు పసిబిడ్డలకు ఉగ్గు, పాలు పట్టిన తరువాత “జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం మా అబ్బాయి తాగిన పాలుజీర్ణం” అని పొట్ట మీద నిమురడం మనం చూస్తూ ఉంటాము.)

అంతలో సాయంత్రం అయింది. రామలక్ష్మణులు సాయంసంధ్యలు నిర్వర్తించారు. అగస్త్యభ్రాత ఆశ్రమములోనికి ప్రవేశించి ఆయనకు పాదాభివందనము చేసారు. అగస్త్యభ్రాత కూడా రాముని సాదరంగా ఆహ్వానించాడు. ఫలములు పుష్పములు ఇచ్చి సత్కరించాడు. రాముడు, లక్ష్మణుడు, సీత ఆ రాత్రికి ఆ ఆశ్రమములోనే ఉన్నారు.

మరునాడు ఉదయమే లేచి రాముడు సంధ్యావందనాది కార్యక్రమములు పూర్తి చేసుకొని అగస్త్యభ్రాత వద్దకు వెళ్లి అగస్త్యుని ఆశ్రమమునకు వెళ్లుటకు ఆయన అనుమతి కోరాడు. అగస్త్య భ్రాత రామునికి తన అన్న అగస్త్యుని ఆశ్రమమునకు పోవుటకు మార్గము చెప్పాడు. రాముడు, సీత, లక్ష్మణులు వెంట రాగా అగస్త్య ఆశ్రమమునకు బయలుదేరాడు. అగస్త్య భ్రాత చెప్పిన గుర్తుల ప్రకారము ప్రయాణం చేస్తున్నాడు.

ఒకచోట ఫలవృక్షములు మెండుగా కనిపించాయి. లేళ్లు గుంపులు గుంపులుగా తిరుగుతున్నాయి. హోమధూమము పైకి లేస్తోంది. దానిని బట్టి అగస్త్యుని ఆశ్రమము అక్కడకు దగ్గరలోనే ఉంది అని రాముడు అనుకొన్నాడు. అంతలోనే నారచీరలు ఆరవేసి ఉన్న ఆశ్రమ ప్రాంగణము కనపడింది. మృగములు తమ సహజ వైరము మరిచి ప్రశాంతంగా సంచరిస్తున్నాయి.

"ఎవరి తపోప్రభావంచేత రాక్షసులు ఈ ప్రాంతానికి రావడానికి భయపడుతుంటారో ఆ అగస్త్య మహా ముని ఆశ్రమము ఇదే. ఇక్కడకు దేవతలు గంధర్వులు నియమం తప్పకుండా వచ్చి

అగస్త్య మహాముని సేవిస్తుంటారు.

ఈ అగస్త్య మహాముని ఆశ్రమములో అబద్ధాలు చెప్పేవారికి, క్రూరులకు, వంచకులకు, సాటి మానవులను హింసించేవారికి స్థానము లేదు. ఎంతో మంది మహర్షులు ఇక్కడ తపస్సు చేసి, స్వర్గానికి వెళ్లారు. ఈ ఆశ్రమ ప్రాంతములో ఎవరైనా తపస్సు చేసి కోరికలు కోరుకుంటే వాటిని దేవతలు తప్పకుండా నెరవేరుస్తారు. ఇదీ ఆ ఆశ్రమ మహాత్మ్యం.

లక్ష్మణా! ముందు నీవు ఆశ్రమములోనికి ప్రవేశించి నేను, సీత మహాముని దర్శనానికి వచ్చామని అగస్త్యునికి విన్నవించు" అని రాముడు లక్ష్మణునితో అన్నాడు.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము పదకొండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత& ఓం తత్సత్.

# అరణ్య కాండము

పన్నెండవ సర్గ.

రాముని ఆదేశానుసారము లక్ష్మణుడు అగస్త్యముని ఆశ్రమంలోకి వెళ్లాడు. లోపల అగస్త్యముని శిష్యుని వద్దకు పోయి "అయోధ్యాధీశుడు, దశరథ మహారాజు కుమారుడు, రాముడు, తన భార్య సీతతో సహా అగస్త్యులవారి దర్శనానికి వచ్చి వేచి ఉన్నారని

మనవి చెయ్యి." అని అన్నాడు.

ఆ శిష్యుడు లక్ష్మణుని చూచి "మీరుఎవరు?" అని అడిగాడు.

"నేను రాముని తమ్ముడను. లక్ష్మణుడను, సదా రాముని హితము కోరేవాడిని. రాముడు తండ్రికి ఇచ్చిన మాట ప్రకారము అరణ్యవాసము చేయుచున్నాడు. ఆయన భార్య సీత, నేను ఆయనను అనుసరించు చున్నాము. " అని అన్నాడు.

"మంచిది. మీరు ఇక్కడే ఉండండి. నేను మహర్షులవారికి మీ గురించి చెప్పి వస్తాను." అని లోపలకు వెళ్లాడు.

అగ్ని గృహములో ఉన్న అగస్త్యుని వద్దకు పోయి రాముడు, లక్ష్మణుడు, సీత రాక గురించి తెలిపాడు. ఆ మాటలు వినిన అగస్త్యుడు ఎంతో సంతోషించాడు.

"ఎన్నోనాళ్ల నుండి నేను రాముని దర్శనము కొరకు ఎదురుచూస్తున్నాను. ఇంతకాలానికి రాముడు నన్నే వెదుకు కొనుచూ నా వద్దకు వచ్చాడు. నాకు చాలా ఆనందంగా ఉంది. నీవు వెంటనే పోయి రాముని, సీతను, లక్ష్మణుని సగౌరవంగా నా వద్దకు తీసుకొని రా. అయినా రాముని రాక గురించి నాకు చెప్పవలెనా. రాముని అంతసేపు బయట నిలబెట్టవలెనా. వెంటనే నావద్దకు తీసుకొని రావలదా! " అని శిష్యునితో అన్నాడు.

వెంటనే ఆ శిష్యుడు పరుగు పరుగున రాముని వద్దకు

పోయి "రాముడు ఎక్కడ? రాముడు ఎక్కడ? రామునికి ఎలాంటి అనుమతి అవసరం లేదు. వెంటనే లోపలకు రావచ్చును."అని అన్నాడు.

అప్పుడు లక్ష్మణుడు ఆ శిష్యునకు ద్వారము వద్ద ఉన్న రాముని సీతను చూపించాడు. వెంటనే ఆ శిష్యుడు రాముని గౌరవించి, సత్కరించి అగస్త్యుని వద్దకు తీసుకొని వెళ్లాడు.

రాముడు లోపలకు రావడం చూచి అగస్త్యుడు రామునికి ఎదురు వచ్చాడు. రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"లక్ష్మణా! అటు చూడు! అగ్ని వలె వెలుగుతున్న అగస్త్యమహర్షి మనకోసం వస్తున్నాడు." అని అన్నాడు.

రాముడు అగస్త్యుని పాదాల మీద పడి నమస్కరించాడు. తరువాత సీత, లక్ష్మణుడు కూడా మహామునికి పాద నమస్కారము చేసారు. అగస్త్యుడు రామునికి అర్ఘ్యము, పాద్యము ఇచ్చాడు. ఒక ఆసనము చూపించాడు. తరువాత అగ్నిహోత్రము ముగించుకొని, అతిథిపూజ చేసి రామలక్ష్మణులకు సీతకు ఆహారము ఇచ్చాడు. భోజన కార్యక్రమము అయిన తరువాత రాముడు అగస్త్యుని పక్కనే ఒదిగి కూర్చున్నాడు.

అగస్త్యుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! ముందుగా అగ్నిహోత్రము చేసి, అతిధులను పూజించి, తరువాత భోజనము చేయవలెను. అలాచేయని వాడు

నరకానికి పోతాడు.

రామా! నీవు క్షత్రియుడవు. అయోధ్యకు రాజువు. ధర్మము తెలిసినవాడవు. అందరి చేతా గౌరవింప తగినవాడవు. అలాంటి నీవు ఈ రోజు మాకు అతిథిగా వచ్చావు. మాకు చాలా సంతోషంగా ఉంది.

రామా! నీకు కొన్ని ఆయుధములను ఇస్తాను. ఇది విష్ణుదేవుని ధనుస్సు. ఇది విశ్వకర్మ నిర్మించాడు. ఇది అక్షయతూణీరము. ఈ తూణీరములో బాణములు ఎప్పటికీ నిండుగా ఉంటాయి. ఈ ఖడ్గము దేవేంద్రుడు ఇచ్చాడు.

ఇవన్నీ దివ్యమైన ఆయుధములు. ఇవన్నీ విష్ణువు, ఇంద్రుడు దేవాసుర యుద్ధములో ఉపయోగించి విజయలక్ష్మిని వరించారు. ఈ ఆయుధములను నీవు స్వీకరించు. నీకు జయం కలుగుతుంది." అని పలికి అగస్త్యుడు దివ్యమైన ధనుర్బాణములను, ఖడ్గమును రామునికి ఇచ్చాడు.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము పన్నెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## పదమూడవ సర్గ.

అగస్త్యుడు రామునికి ఆయుధములను ఇచ్చిన తరువాత ఇలా అన్నాడు.

“ఓ రామా! మీరు నన్ను చూడటానికి ఇంత దూరము వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. మీరు చాలా దూరము ప్రయాణము చేసి వచ్చారు. సుకుమారి అయిన సీత బాగా అలసి పోయినట్టు కనపడుతూ ఉంది. తండ్రి ఆదేశము ప్రకారము వనములకు వచ్చిన నీతో పాటు అనుసరించి వచ్చిన నీభార్య సీత ఇప్పటికి ఎవ్వరూ చేయని మహత్తరమైన పని చేసింది. కాబట్టి ఆమె కష్టపడకుండా చూడవలసిన బాధ్యత నీది.

సాధారణంగా స్త్రీలు సుఖములలో భర్తను వదలకుండా అంటిపెట్టుకొని ఉంటారు. కష్టకాలములో భర్తను వదిలివేస్తారు. ఈ సృష్టి మొదలైనప్పటి నుండి అది స్త్రీ నైజము. ఇంకా స్త్రీల గురించి చెప్పాలంటే వారు మెరుపుల మాదిరి చంచలస్వభావులు. వాడియైన కత్తి మాదిరి చాలా తీక్షణంగా ఉంటారు. గరుడుని మాదిరి వేగంగా ఆలోచిస్తారు.

కానీ నీ భార్య సీతలో ఈ దోషములు ఏవీ లేవు. సీత శాంత స్వభావురాలు. ఉత్తమ పతివ్రత. అందుకే నిన్ను అనుసరించి అడవులకు వచ్చి నీతోపాటు కష్టములు పడుతూ ఉంది. ఓ రామా! నీవు, సీత,

లక్ష్మణుడు ఎక్కడ ఉంటారో అక్కడ సుఖశాంతులు వెల్లివిరుస్తాయి." అని వారిని శ్లాఘించాడు అగస్త్యుడు.

అగస్త్యుడు పలికిన మాటలు విన్న రాముడు వినయంగా ఇలా అన్నాడు. "నా గురించి, నా భార్య గురించి, నా తమ్ముని గురించి తమరు నాలుగు మంచి మాటలు చెప్పినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. మీ అనుగ్రహానికి పాత్రుడను అయ్యాను. నేను ఈ అడవిలో ఒక పర్ణశాల నిర్మించుకొని అక్కడ నా వనవాస కాలమును గడపదలచుకున్నాను. దానికి అనువైన ప్రదేశమును మీరు సూచించండి." అని అడిగాడు రాముడు.

"రామా! ఇక్కడికి రెండు యోజనముల దూరంలో పంచవటి అనే ప్రదేశము ఉంది. అక్కడ ఫలములు, కందమూలములు, నిర్మలమైన జలము సమృద్ధిగా లభిస్తుంది. నీవు పంచవటిలో ఒక ఆశ్రమమును నిర్మించుకొని అక్కడ నీ వనవాసకాలమును గడపవచ్చును. నీకు ఇప్పటికే వనవాసకాలము చాలావరకు గడిచిపోయింది. కొద్దికాలము మాత్రమే మిగిలి ఉంది. ఆ కొద్ది కాలము కూడా పూర్తి చేసి, నీవు నీ తండ్రిమాట నిలబెట్టు. ఆయనను తరింపజెయ్యి.

అసలు నిన్ను ఇక్కడే ఉందామనుకున్నాను. కాని ఒంటరిగా ఉండాలి అన్న నీ మనసులో మాట తెలుసుకొని నిన్ను పంచవటికి పంపుతున్నాను. పంచవటి ఇక్కడకు ఎంతో దూరంలో లేదు. కాబట్టి నీవు ఇక్కడ ఉన్నట్టే పంచవటిలో ఉండవచ్చును. పంచవటి సమీపములో గోదావరీ నది ప్రవహిస్తూ ఉంది. అక్కడ జనసంచారము

అంతగా ఉండదు. నీవు ప్రశాంతముగా అక్కడ ఉండవచ్చును.

అటు చూడు. అక్కడ ఒక మధూక చెట్ల వనము కనపడుతూ ఉంది. ఆ మధూక వనమునకు ఉత్తరంగా వెళ్లండి. మీరు ఒక ఎత్తు అయిన ప్రదేశము చేరుకుంటారు. అక్కడి నుండి చూస్తే మీకు పంచవటి కనపిస్తూ ఉంటుంది." అని పంచవటికి పోవు మార్గము చెప్పాడు అగస్త్యుడు.

రామలక్ష్మణులు, సీత అగస్త్యునికి నమస్కరించి ఆయన వద్ద అనుజ్ఞ తీసుకున్నారు. అక్కడి నుండి పంచవటికి బయలుదేరారు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము పదమూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## పదునాల్గవ సర్గ.

రాముడు సీత, లక్ష్మణులతో సహా పంచవటికి వెళుతున్నాడు. దారిలో వారికి ఒక వటవృక్షము మీద కూర్చుని ఉన్న పెద్ద ఆకారము కల పక్షి కనపడింది. ఆ అరణ్యములో కామరూపులైన రాక్షసులు నివసిస్తుంటారు అని విని ఉన్నాడు. అందుకని ఆ పక్షిని రాక్షసుడిగా తలచాడు రాముడు.

"నీవుఎవరవు? ఇక్కడ ఎందుకు ఉన్నావు?" అని అడిగాడు రాముడు.

"రామా! నేను నీకు తెలియకపోయినా నీవు నాకు తెలుసు. నీవు దశరథుని కుమారుడైన రాముడివి. నీ తండ్రి దశరథుడు నాకు మంచి మిత్రుడు." అని అన్నాడు.

తన తండ్రికి మిత్రుడైన వాడు తనకు గౌరవింపతగ్గవాడు అని అనుకొన్నాడు రాముడు. ఆ పక్షికి అభివాదము చేసాడు. ఆ పక్షి రామునితో ఇలా పలికింది.

"రామా! నీకు పూర్వము ఎంతమంది ప్రజాపతులున్నారో వారి గురించి చెబుతాను శ్రద్ధగా విను.

ప్రజాపతులలో ప్రథముడు కర్దముడు. అతని తరువాతి వాడు విక్రీతుడు. ఆ తరువాత శేషుడు. అతని తరువాత సంశ్రయుడు, స్థాణువు, మరీచి, అత్రి, క్రతువు, పులస్త్యుడు, అంగిరసుడు, ప్రచేతసుడు, పులహుడు, దక్షుడు, వివస్వంతుడు వరుసగా ప్రజాపతులయ్యారు.

ఆఖరి వాడు కశ్యప ప్రజాపతి. ఆయనకు అరిష్టనేమి అనే పేరుకూడా ఉంది. నీకు చెప్పానే దక్షుడు అని, ఆయనకు అరవై మంది కుమార్తెలు. వారిలో అదితి, దితి, దనువు, కాళిక, తామ్ర, క్రోధవశ,మను, అనల అనే ఎనిమిది కన్యలను కశ్యపప్రజాపతి పెళ్లిచేసుకున్నాడు.

కశ్యపుడు తన భార్యలతో "మీరందరూ నాతో సమానమైన

ముల్లోకములను పోషించగలిగే పుత్రులను ప్రసవించండి." అని కోరాడు. వారిలో అదితి, దితి, కాళిక అనే వారు మాత్రము కశ్యపుని మాట మన్నించారు. మిగిలినవారు ఆయన మాటమీద మనసు పెట్టలేదు.

కశ్యపుని కోరిక ప్రకారము అదితికి పన్నెండు మంది ఆదిత్యులు (ద్వాదశాదిత్యులు), ఎనిమిది మంది వసువులను (అష్టవసువులు. అందులో ఆఖరి వసువే శాపకారణంగా గంగాదేవికి భీష్ముడిగా పుట్టాడు. మహాభారత కధకు మూలపురుషుడు అయ్యాడు), పదకొండు మంది రుద్రులు, ఇద్దరు అశ్వినులు, మొత్తం ముప్పది ముగ్గురు దేవతలుపుట్టారు.

కశ్యపునకు దితి యందు దైత్యులు జన్మించారు. వారందరూ ఈ భూమికి అధిపతులయ్యారు. పూర్వము ఈ భూమి అంతా దైత్యుల అధీనంలో ఉండేది.

కశ్యపునకు దనువు అనే భార్య ద్వారా హయగ్రీవుడు అనే పుత్రుడు కలిగాడు. కాళి అనే భార్యకు నరకుడు, కాలకుడు అనే పుత్రులు జన్మించారు. తామ్ర అనే భార్య క్రౌంచి, భాసి,శ్యేని,ధృతరాష్ట్రి, శుకి అనే ఆడపిల్లలకు జన్మనిచ్చింది. (ఇవి అన్నీ పక్షిజాతుల పేర్లు).ఆ తరువాత క్రౌంచికి ఉలూకములు (గుడ్లగూబలు), భాసి అనేకూతురు భాస పక్షులకు జన్మనిచ్చింది. శ్యేని అనే కూతురుకు శ్యేనములు (డేగలు) పుట్టాయి. ధృతరాష్ట్రికి రకరకాలైన హంస జాతులు, చక్రవాక పక్షులు, జన్మించాయి. ఈ ప్రకారంగా పక్షిజాతి అభివృద్ధిచెందింది.

శుకి అనే కూతురుకు నత అనే కుమారుడు కలిగాడు.

నతకు వినత అనే కూతురు పుట్టింది. కశ్యపునకు క్రోధవశ అనే భార్య ద్వారా మృగి, మృగమంద, హరి, భద్రమద, మాతంగి, శార్దూలి, శ్వేత, సురభి, సురస, కద్రువ అనే పదిమంది పుత్రికలు జన్మించారు. (ఇవన్నీ మృగజాతుల పేర్లు). మృగి సంతానము లేళ్లు, దుప్పులు, జింకలు. ఎలుగుబంట్లు, చామరీ మృగములు ఇంకా ఇతర మృగములు మృగమంద సంతానము. హరికి సింహములు, వానరములు పుట్టాయి. (అందుకే సింహమునకు కోతులకు, హరి అనే పేరు వచ్చింది.

భద్రమదకు ఇరావతి అనే కూతురు పుట్టింది. ఇరావతికి ఐరావతము పుట్టింది. మాతంగికి ఏనుగుజాతి జన్మించింది. శార్దూలి అనే కూతురికి పెద్దపులులు, కొండముచ్చులు జన్మించాయి. శ్వేతకు దిగ్గజములు జన్మించాయి.

సురభి రోహిణి, గంధర్వి అనే ఇద్దరు కూతుళ్లకు జన్మనిచ్చింది. రోహిణికి గోవులు, గోసంతతి, గంధర్వికి అశ్వజాతి, సురసకు రెండు తలలు అంతకన్నా ఎక్కువ తలల పాములు, కద్రువకు ఒక్కొక్క పడగ ఉన్న పాములు జన్మించాయి.

మనువుకు మానవులు జన్మించారు. ఆ మానవులు వారి వారి గుణముల బట్టీ చేసే వృత్తులబట్టీ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా విభజింపబడ్డారు. అనల మంచి మంచి ఫలములను ఇచ్చు వృక్షజాతికి జన్మనిచ్చింది.

రామా! నీకు పక్షిజాతులకు జన్మనిచ్చిన వినత, నాగులకు జన్మనిచ్చిన కద్రువ గురించి చెబుతాను విను. వినత శుకికి

మనుమరాలు. కద్రువ సురసకు సోదరి. కద్రువకు ఆదిశేషుడు కుమారుడుగా పుట్టాడు. వినతకు గరుడుడు, అరుణుడు అనే పుత్రులు జన్మించారు.

(గరుడుడు విష్ణువుకు వాహనము అయ్యాడు. అరుణుడుకి కాళ్లు లేకపోవడం వల్ల సూర్యుని రథమునకు సారథి అయ్యాడు).

ఆ అరుణుడికి ఇద్దరు కుమారులు. నేను, సంపాతి. నా పేరు జటాయువు. నేను శ్యేని జాతికి చెందిన వాడిని. ఇదీ నా జన్మ వృత్తాంతము.

(అవకాశము వస్తే చాలు, పూర్వకాలపు కవులు కొత్త కొత్త విషయాలను ఆయాపాత్రల ద్వారా  మనకు తెలియజేస్తారు. వాల్మీకి ఇక్కడ ఎన్నో కొత్త విషయాలు మనకు చెప్పాడు. ఈభూమి మీద మనుషులు, జంతువులు, పక్షులు,  వృక్షములు ఎలా పుట్టాయి, వాటి పుట్టు పూర్వోత్తరాలు ఏమిటి అనే విషయాలను వివరంగా చెప్పాడు.)

రామా! ఈ వనమంతా నాకు బాగాతెలుసు.  నీకు ఇష్టం అయితే నేను నీకు ఏదైనా సాయం కావలిస్తే చేస్తాను. నీకు సహాయకుడుగా ఉంటాను. ఈ అడవిలో అనేక క్రూర మృగములు, నరమాంసభక్షకులైన రాక్షసులు ఉన్నారు. నీవు కోరితే మీరు ఇంట లేనపుడు సీత రక్షణ బాధ్యతను నేను వహిస్తాను." అని అన్నాడు.

జటాయువు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నాడు రాముడు. జటాయువును చూచి తన తండ్రిని గుర్తుకు   తెచ్చుకున్నాడు. తండ్రికి

మారుగా జటాయువును పూజించాడు రాముడు. తరువాత జటాయువు పంచవటికి మార్గం చూపించాడు. జటాయువుతో కలిసి రాముడు, లక్ష్మణుడు సీతతో సహా పంచవటికి వెళ్లాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము పదునాల్గవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## పదునైదవ సర్గ.

రాముడు, లక్ష్మణుడు, సీత, జటాయువు అందరూ కలిసి పంచవటి ని చేరుకున్నారు.

రాముడు లక్ష్మణుని చూచి "లక్ష్మణా! ఇక్కడ పూలు చక్కగా పుష్పించి ఉన్నాయి. ఫలవృక్షములు సమృద్ధిగా  ఉన్నాయి. నేల చదునుగా ఉంది. పక్కనే సెల ఏళ్లు ఉన్నాయి. అగస్త్యుడు చెప్పిన పంచవటి ఇదే కావచ్చును. ఇక్కడ మనము పర్ణశాల నిర్మించు కొనుటకు అనవైన ప్రదేశము చూడుము. లక్ష్మణా! జలాశయము పక్కన, దగ్గరగా ఫలవృక్షములు ఉన్న చోట, దర్భలు, సమిధలు దొరకుచోట,  తగిన ప్రదేశమును నిర్ణయింపుము. " అని పలికాడు.

"రామా! అట్లు కాదు. స్థల నిర్ణయములో నీ కన్నా సమర్థుడు లేడు. నీవు సీత కలిసి ఆలోచించి స్థల నిర్ణయము చెయ్యండి. అక్కడ

నేను సుందరమైన ఆశ్రమమును నిర్మించెదను." అని అన్నాడు.

రాముడు, సీత చుట్టపక్కల ప్రదేశములు తిరిగి గోదావరీ నదీ తీరంలో ఉన్న సమతల ప్రదేశమును ఎన్నుకొన్నారు.

"లక్ష్మణా! ఈ ప్రదేశములో పర్ణశాలను నిర్మింపుము. ఈ ప్రదేశము మనకు అనుకూలముగా ఉంది. పక్కనే గోదావరీ నది ప్రవహించుచున్నది. మనకు జలమునకు కొదవ లేదు. ఈ సమతల ప్రదేశములో ఫల వృక్షములు సమృద్ధిగా ఉన్నాయి. చుట్టూ పర్వతములు పెట్టని కోటలాగా ప్రకాశిస్తున్నాయి. ఆ పర్వతముల మీద మామిడి, అశోక, చంపక, చందన,శమీ, కింశుక వృక్షములు సమృద్ధిగా ఉన్నాయి. అదీ కాకుండా ఇక్కడ ఉన్న వటవృక్షముల మీద అనేక పక్షిజాతులునివసిస్తున్నాయి. జటాయువు కూడా ఈ చెట్ల మీద నివసించడానికి అనుకూలంగా ఉంటుంది. కాబట్టి పర్ణశాల నిర్మించుటకు ఇదే అనువైన చోటు." అని అన్నాడు రాముడు.

రాముని మాటను శిరస్సున దాల్చాడు లక్షణుడు. రాముడు కోరినట్టు అక్కడ ఒక సుందరమైన పర్ణశాలను నిర్మించాడు. మట్టితో గోడలు కట్టాడు. మధ్యలో స్తంభాలు పాతాడు. పొడుగాటి వెదుళ్లతో నిలువుగా అడ్డంగా కట్టాడు. దానిమీద తాళ ఆకులు, దాని మీద రెల్లు గడ్డి కప్పాడు. పర్ణశాల ముందు ఉన్న స్థలమును చదునుచేసాడు. చుట్టు కంచె కట్టాడు. ఆ ప్రకారంగా ఒక సుందరమైన పర్ణశాలను లక్ష్మణుడు నిర్మించాడు.

తరువాత లక్ష్మణుడు గోదావరికి వెళ్లి స్నానము చేసి అక్కడ

పుష్పించిన తామర పువ్వులు కోసుకొని వచ్చాడు. లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాలను చూచి సీతారాములు ముగ్ధులయ్యారు. రాముడు లక్ష్మణుని కౌగలించుకొని "లక్ష్మణా! నా కోరిక మేరకు మనకు ఒక అనువైన పర్ణశాలను నిర్మించినందుకు నీకు నేనేమి ఇవ్వగలను నా గాఢపరిష్వంగము తప్ప" అంటూ లక్ష్మణుని ప్రేమతో కౌగలించుకున్నాడు రాముడు. రాముని ప్రేమకు లక్ష్మణుడు పొంగిపోయాడు. ఆ ఆశ్రమములో రాముడు, సీత, లక్ష్మణుడు సుఖంగా నివసించసాగారు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము పదునైదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## పదునారవ సర్గ.

రాముడు సీతతో సహా పంచవటిలో ఆనందంగా గడుపు తున్నాడు. ఇంతలో శరదృతువు ముగిసి, హేమంత ఋతువు ప్రవేశించింది. చలికాలము మొదలయింది.

ఒక రోజు రాముడు పొద్దునే గోదావరినదికి స్నానానికి వెళ్లాడు. రాముని వెంట సీత, లక్ష్మణుడు కూడా వెళ్లారు. ఆ హేమంత ఋతువు అందాలను చూచి లక్ష్మణుడు రాముని తో ఇలా అన్నాడు.

"రామా! నీకు హేమంత ఋతువు అంటే ఎంతో ఇష్టం కదా.

ఇప్పుడు హేమంత ఋతువు ప్రవేశించింది.  మంచు కురుస్తూ ఉంది. నదీజలాలు స్నానానికి అనుకూలంగా లేవు. చలికి వెచ్చగా అగ్నిహోత్రము దగ్గర ఉండవలెనని కోరికగా ఉంది. పంటలు బాగా పండి కొత్త ధాన్యములు ఇంటికి చేరుతున్నాయి. ఉత్తరాయనము రాగానే పితృదేవతలను పూజించి జనులు తరిస్తున్నారు. వర్షాకాలము ముగియడంతో రాజులు ఇతర రాజ్యముల మీదికి దండెత్తడానికి ఆసక్తిగా ఉన్నారు. అసలే మంచుతో కప్పబడిన హిమవత్పర్వతము సూర్యుడు భూమికి దూరంగా ఉండటంతో ఇంకా ఎక్కువ మంచుతో శోభిల్లుతోంది..

మనుష్యులు మధ్యాహ్నపు ఎండలో హాయిగా ఉంటున్నారు. రాత్రిళ్లు చలితో వణుకుతున్నారు. పగటి భాగమున కూడా సూర్యుడు తన తీక్ష్ణతను కోల్పోయాడు. పగలు కూడా చలిగాలులు వీస్తున్నాయి. అడవులలో జంతువులు కూడా తిరగడం లేదు. గుహలకే పరిమిత మైనాయి. మంచు కురవడంతో రాత్రిళ్లు ఎవరూ ఆరుబయట పడుకోడం లేదు. చంద్రుడు గుండ్రంగా అందంగా ఉంటాడు. కాని ఆ అందాలు ఇప్పుడు సూర్యునికి సంక్రమించాయి. సూర్యుడు కూడా మంచు చేత కప్పబడి, తీక్ష్ణత తగ్గి, పూర్ణ చంద్రుని వలె ప్రకాశిస్తున్నాడు. పడమటి దిశనుండి చలిగాలులు వీస్తున్నాయి.

రాత్రి అంతా చలిగా ఉండి, పొద్దున్నే సూర్యోదయం కాగానే పక్షులు కిలా కిలా రావాలతో రెక్కలు విప్పుకొని ఎగిరిపోతున్నాయి. సూర్యకిరణములను పొగ మంచు కప్పడం వలన, సూర్యుడు బాగా పైకి వచ్చినా తీక్ష్ణత తగ్గి  నిండు చంద్రుని వలె కనపడుతున్నాడు. ఎండ కొద్ది కొద్దిగా నేల మీద పాకుతూ ఉంది. కాని వేడిగా లేదు.

మధ్యాహ్నము ఎండ చాలా సుఖంగా ఉంది. ఈ అడవిలో ఉన్న పచ్చిక మీద పడ్డ మంచు బిందువులు, పొద్దుటి ఎండలో ముత్యాలమాదిరి ప్రకాశిస్తున్నాయి.

రామా! అటు చూడు! పాపము ఆ ఏనుగు నీళ్లు తాగుదామని తన తొండమును నీటిలో పెట్టి, నీళ్లు జివ్వుమని చల్లగా తగలగానే తన తొండమును వెనక్కు లాగేసుకుంది. అంతెందుకు ఆ పక్షులు కూడా ఆ చల్లదనానికి నీటిలో దిగడానికి జంకుతున్నాయి. రామా! ఈ నదిలో నీరుకూడా అధికంగా చల్లగా ఉండటం వలన తాగడానికి వీలులేకుండా ఉంది కదా!

రామా! అడవిలో ఉన్న మన పరిస్థితి ఇలా ఉంది కదా! మరి అయోధ్యలో భరతుడు ఎలా ఉన్నాడో! నీ యందు భక్తితో అయోధ్యలో ఉన్నా అరణ్యములో ఉన్నట్టు ఉన్నాడేమో! రాజభోగములను విడిచిపెట్టి, నేల మీద పడుకుంటూ, మన మాదిరి ఫలములను ఆహారముగా తీసుకుంటూ జీవనము గడుపుతున్నాడేమో! రామా! మనము స్నానానికి గోదావరి నదికి వచ్చినట్టు భరతుడు కూడా సరయూనదికి స్నానానికి వెళుతూ ఉంటాడనుకుంటాను.

దక్షిణాపథములో ఉన్న మనకే ఇంత చలిగాఉంటే ఉత్తరదేశంలో అయోధ్యలో ఉన్న భరతునికి ఇంకెంత చలిగా ఉందో కదా! ఈ తెల్లవారుజామున సరయూనదిలో ఎలా స్నానం చేస్తున్నాడో కదా! ఎందుకంటే, భరతుడు అయోధ్యలో ఉన్నా, అరణ్యములో ఉన్నా నిన్ను అనుసరిస్తున్నాడు. నీ రాకకై తపిస్తున్నాడు. అటువంటి వాడు స్వర్గలోకాధిపత్యమునకు అర్హుడు.

రామా! సాధారణంగా కుమారుడికి తల్లి బుద్ధులు, కుమార్తెకు తండ్రి బుద్ధులు వస్తాయి అంటారు. కానీ, భరతుడికి తల్లి కైకకు ఉన్న కుటిల బుద్ధి ఏమాత్రమూ రాలేదు. అయినా రామా! దశరథ మహారాజు భార్యగా ఉండి, భరతునికి కన్నతల్లిగా ఉన్న కైకకు ఇంత కుటిలబుద్ధి ఎలా వచ్చిందో తెలియదు కదా!..."అని లక్ష్మణుడు ఇంకా ఏదో చెప్పబోతుంటే రాముడు అడ్డుకున్నాడు.

"లక్ష్మణా! దయచేసి నీవు ఎట్టి పరిస్థితులలోనూ మాత కైకను దూషించకూడదు. నేను వనవాసము చెయ్యాలని చేస్తున్నాను. ఇందులో ఆమె ప్రమేయము ఎంత మాత్రమూ లేదు. నా బాధ అంతా ఒకటే. భరత శత్రుఘ్నులు నా దగ్గర లేరే అని. అంతే కానీ ఈ వనవాసము నాకు ఎంతో ఆనందమూ కలిగిస్తూ ఉంది. నువ్వు, భరత శత్రుఘ్నులు ఎప్పుడు నా దగ్గరగా ఉంటారో కదా అని ఆతురతగా ఎదురుచూస్తున్నాను." అని అన్నాడు రాముడు.

ఈ విధంగా మాట్లాడుకుంటూ అందరూ గోదావరీ తీరము చేరుకున్నారు. అందరూ గోదావరిలో దిగి స్నానాలు చేసారు. సీతా రామ లక్ష్మణులు గోదావరిలో పితృతర్పణము, దేవ తర్పణము, నిర్వర్తించారు. సూర్యోదయ కాలములో అర్ఘ్యము విడిచారు. తరువాత అందరూ ఆశ్రమమునకు వెళ్లారు.

(వాల్మీకి ఈ సర్గలో కేవలము శరదృతువు ఎలా ఉంటుందో వర్ణించాడు. ఈ రోజుల్లో ఈ జనారణ్యాలలో ఉన్న మనకు, పల్లెసీమలలో హేమంత ఋతువులో, ప్రకృతి సౌందర్యము ఎలా ఉంటుందో చూడ్డం

కుదరడం లేదు. అందుకని ఆ ప్రకృతి అందాలను మనముందు ఆవిష్కరించాడు మహర్షి వాల్మీకి.)

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము పదహారవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్య కాండము,

## పదిహేడవ సర్గ.

రాముడు ఆశ్రమానికి వచ్చిన తరువాత అగ్నిహెూత్రము మొదలగు కార్యములు నిర్వర్తించాడు. సీతతో, లక్ష్మణునితోనూ ఇష్టాగోష్టిగా మాట్లాడుతూ ఆశ్రమము బయట కూర్చుని ఉన్నాడు. ఇంతలో జటాయువు వారి వద్దకు వచ్చాడు.

“రామా! నేను ఇక్కడకు వచ్చి చాలాకాలము అయినది. నాకు నా బంధువులను, మిత్రులను చూడవలెనని కోరికగా ఉన్నది. నేను పోయి నా బంధుమిత్రులను చూచి వెంటనే వస్తాను. అనుజ్ఞ ఇవ్వండి.” అని అడిగాడు. రాముడు సంతోషంతో సమ్మతించాడు. జటాయువు వెళ్లిపోయాడు.

కొంత సేపు తరువాత  ఒక రాక్షస స్త్రీ  ఆ ప్రదేశమునకు వచ్చింది. ఆమె పేరు శూర్పణఖ. రావణుని చెల్లెలు. ఆమె అక్కడకు వచ్చి

రాముని చూచింది. బలిష్టమైన బాహువులతో, సింహము వక్షస్థలము వలె విశాలమైన వక్షస్థలముతో, తామర రేకుల వంటి కన్నులతో, ఆజానుబాహుడైన రాముని చూచింది. జగన్మోహనాకారుడైన రాముని చూచి శూర్పణఖ మోహపరవశురాలయింది. మన్మధుడు ఆమె మీద పుష్పబాణములు ప్రయోగించాడు.

రాముని మొహం చాలా అందంగా ఉంటే, శూర్పణఖ ముఖం వికృతంగా ఉంది. రాముని నడుము సన్నగా ఉంటే, ఆమెది బానపొట్ట. రాముని కళ్లు విశాలంగా ఉంటే, ఆమె కళ్లు వికృతంగా ఉన్నాయి. రాముని జుట్టు అందంగా ఉంటే ఆమె జుట్టు ఎర్రగా వికారంగా ఉంది. రామునిది మోహనాకారమైతే ఆమెది వికారరూపము. రాముని కంఠస్వరము మధురంగా ఉంటే ఆమె కంఠధ్వని గార్ధభమును తలపిస్తూ ఉంది. రాముడు నవయౌవనుడు. ఆమె వయసుమళ్లిన స్త్రీ. రాముని మాటలు మృదువుగా ఉంటే ఆమె భాష గ్రామ్యంగా కఠోరంగా ఉంది. రాముని ప్రవర్తన ధర్మపరంగా ఉంటే ఆమెది అధర్మ ప్రవర్తన. రాముని చూస్తే ఆనందం కలిగితే ఆమెను చూస్తే ఏహ్యాభావము కలుగుతూఉంది. ఇలా హస్తిమశకాంతర వైవిధ్యము ఉన్న శూర్పణఖ రాముని చూచి మోహించింది.

తన సహజరూపంతో పోతే రాముడు తనను వరించడని, వెంటనే తన రూపంమార్చింది. నవయౌవన వతిగా తయారయింది. రాముని సమీపించింది.

"ఓ సుందరాకారా! నీవుఎవరు? ఇక్కడ ఎందుకు ఉన్నావు?

ఈమె నీ భార్య అనుకుంటాను. భార్యాసమేతంగా భయంకరమైన ఈ అడవిలో ఎందుకు ఉన్నావు. నీ వాలకం చూస్తుంటే నీవు గృహస్తులా లేవే. జటాజూటములు ధరించి  ముని కుమారుని వలె ఉన్నావు. నీ చేతిలో ఉన్న ధనుర్బాణములను బట్టి  నీవు క్షత్రియుడవు అని తెలుస్తూ ఉంది. ఇంతకూ నీవు ఎవరు? ఎక్కడి నుంచి వచ్చావు? ఏ పనిమీద వచ్చావు? నిజం చెప్పు." అని నిలదీసింది శూర్పణఖ.

అప్పుడు రాముడు ఆమెతో ఇలా అన్నాడు. "ఓ తరుణీ! నా పేరు రాముడు. నేను అయోధ్యాధీశుడు దశరథుని కుమారుడను. ఈమె నాభార్య సీత. అతను నా తమ్ముడు లక్ష్మణుడు. మేము మా తండ్రిగారి ఆజ్ఞమేరకు వనవాసము చేస్తున్నాము. ఇంతకూ నీవు ఎవరు? నీ నివాసము ఎక్కడ? నీ భర్తపేరు ఏమిటి?" అని అడిగాడు రాముడు. దానికి శూర్పణఖ ఇలా బదులు చెప్పింది.

"ఓరామా! నేను ఒక రాక్షస స్త్రీని. నా పేరు శూర్పణఖ. నేను రాక్షస స్త్రీని అయినా నేను కామరూపము ధరించు శక్తి కలదానను. ఈ అరణ్యమే నా నివాసము. విశ్రవసుని కుమారుడు రావణుడు నా అన్న. మహా పరాక్రమ వంతుడు. నీవు ఆయన గురించి వినేవుంటావు. ఆయన తమ్ముడు, మహాబలవంతుడైన  కుంభకర్ణుడు. ఎల్లప్పుడూ నిద్రాదేవిని సేవిస్తుంటాడు.  రాక్షస వంశములో తప్పపుట్టిన వాడు విభీషణుడు. ఆయన కూడా నా సోదరుడే.  ఇక్కడే జనస్థానములో నివాసము ఏర్పరచుకున్న ఖరుడు, దూషణుడు కూడా నా సోదరులే. నేనువారి వద్దనే ఉంటున్నాను.

తొలిసారిగా అతిలోకమన్మథాకారుడవైన నిన్ను చూచాను. నీ మోహంలో పడ్డాను. నిన్ను ప్రేమించాను. నా మనసులో నువ్వే నా భర్తవు అని అనుకొన్నాను. దానికి తిరుగులేదు. ఈమె నీ భార్య అంటున్నావు. నేను ఉన్నానుగా. ఇంకా ఈమెతో నీకు ఏం పని. నా అందంతో పోలిస్తే ఈసీత వికారంగా ఉంది కదూ! ఈమెను వదిలెయ్యి. నువ్వు ఊ అంటే నేను ఈమెను నీ తమ్ముని విరుచుకొని తింటాను. తరువాత మనం ఇద్దరం ఈ అరణ్యములో, పర్వతశిఖరములలో ఆనందంగా విహరిద్దాము. నాతో వచ్చెయ్యి." అని పలికింది శూర్పణఖ.

(శూర్పణఖ మాటలు వింటుంటే మీకు ఏమనిపిస్తూ ఉంది. లవ్ ఎట్ ఫస్ట్ సైట్  అనే కాన్సెప్ట్ శూర్పణఖతోనే మొదలయిందా అనిపించడం లేదూ!

ఇంకా చూడండి....ఈ కాలం కుర్రాళ్లు అనేమాట.....
"నేను నిన్ను చూడగానే ఫిక్స్ అయ్యాను. ఐ లవ్ యూ. నేను నిన్ను ప్రేమిస్తున్నాను.  నువ్వు నన్ను ప్రేమించాలి, నేను ఫిక్స్అయ్యానుగా.... తప్పదు. లేకుంటే ఆసిడ్ పోస్తా, బ్లేడుతో గొంతుకోస్తా. నాకు దక్కనిది వేరే ఎవరికీ దక్కడానికి వీలులేదు. అడ్డం వచ్చిన వాళ్లని నరుకుతా" ఇవే కదా నేటి డైలాగులు.

ఈ తరహా ప్రవృత్తి రాక్షస ప్రవృత్తి. ఇది శూర్పణఖతోనే మొదలయినట్టుంది. ఈ నాటిదాకా కొనసాగుతూ ఉంది.  నాడు శూర్పణఖ కూడా తాను రాముడికి ఇష్టమా లేదా అని ఆలోచించలేదు. ఈ నాడు కూడా కుర్రాళ్లు తనంటే ఆ అమ్మాయికి ఇష్టమా లేదా అని ఆలోచించరు. ఏదో ఒక లాగ  లైన్ లో పెట్టడానికీ, బుట్టలో

వేసుకోడానికి ప్రయత్నిస్తారు. లేకపోతే ఆసిడ్ ఉందిగా అంటారు. అదీకాకపోతే చంపడం, చావడం. దీనికి ప్రతీక శూర్పణఖ కామం. దీనిని లవ్ అనరు. కామం(లస్ట్) అంటారు. అది తెలుసుకోవాలి.)

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము పదిహేడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్య కాండము.

## పదునెనిమిదవ సర్గ.

కామంతో కాలిపోతున్న శూర్పణఖను చూచాడు. రాముడు. చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు. "ఓ సుందరీ! నీవు నన్ను పెళ్లిచేసు కుంటాను అన్నావు. కాని నాకు ఇదివరకే పెళ్లి అయింది. ఈమే నా భార్య. ఈమె అంటే నాకు ప్రాణము. నీవు మళ్లీ నన్ను పెళ్లిచేసుకుంటే నీకు సవతి పోరు తప్పదు. నాతో కోరికలు తీర్చుకోవాలి అని గాఢంగా కోరుకున్న నీకు సవతి పోరు ఉండటం నీవు సహించగలవా! నీవంటి కాముకులు సవతి పోరు అస్సలు సహించలేరు.

అడుగో అక్కడ నిలబడి ఉన్నాడు. ఆయన నా తమ్ముడు లక్ష్మణుడు. మంచి అందగాడు.
(ఇక్కడ వాల్మీకి 'అకృతదారశ్చ' అని వాడాడు. దీనికి అర్థం పెళ్లికానివాడు, అనీ, భార్య దగ్గరలేని వాడు అనీ అర్థం చెప్పుకోవచ్చు.

పెళ్లికాని వాడు అంటే రాముడు అబద్ధం చెప్పినట్టు అవుతుంది కదా! అందుకని ఒంటరి వాడు. భార్య దగ్గర లేని వాడు అని అర్థం చెప్పుకోవడం సమంజసంగా ఉంటుంది అని నా భావన)

పాపం అతనికి భార్యాసౌఖ్యము లేదు. ప్రస్తుతము అతనికి భార్య అవసరము ఉంది. కాబట్టి అతడు నీకు తగిన భర్త. పైగా నీవు అతనిని పెళ్లిచేసుకుంటే నీకు సవతి బాధ ఉండదు. కాబట్టి నన్ను విడిచిపెట్టి అతని వద్దకు పో!" అని అన్నాడు రాముడు.

ఇద్దరూ అందగాళ్లే. ఎవరైనా ఒకటే అనుకుంటూ శూర్పణఖ లక్ష్మణుని వద్దకు వెళ్లింది. శూర్పణఖ మొదట రాముని వద్దకు పోవడం, ఆయనతో మాట్లాడటం, తరువాత తన వద్దకు రావడం చూస్తున్నాడు లక్ష్మణుడు. శూర్పణఖ చకా చకా లక్ష్మణుని వద్దకు వెళ్లింది.

"ఓ సుందరాకారా! నా పేరు శూర్పణఖ. నన్ను వివాహం చేసుకుంటే నీకు అమర సుఖాలు అందిస్తాను. ఈ వనసీమలలో మనం హాయిగా విహరిద్దాము. రా! నాతోరా!" అని తొందరపెట్టింది శూర్పణఖ.

లక్ష్మణుడు ఆమెను చూచి ఇలా అన్నాడు. "ఓ లలనా! నేను నా అన్న రామునికి సేవకుడను. నా అన్నకు వదినకు దాసుడను. నేనే వారికి సేవలు చేస్తుంటే, నువ్వు కూడా నన్ను పెళ్లిచేసుకొని వారికి సేవలుచేస్తావా! ఎవరైనా రాణి కావాలని కోరుకుంటారు కానీ సేవకురాలు కావాలని కోరుకుంటారా చెప్పు. కాబట్టి నేను నీకు తగినవాడను కాను. నీవు రాముని వద్దకు వెళ్లు. ఆయనకు

చిన్నభార్యగా ఉన్నా, ఆనందం అనుభవిస్తావు. అప్పుడు నేనేనీకు సేవలు చేస్తాను. రాముని భార్యను చూడు. ఎంత అందవికారంగా ఉందో! పైగా ముసలిది. పొట్టలోపలికి పోయి ఎంత వికృతంగా ఉందో చూడు! ఇంకొక్కసారి అడిగావనుకో రాముడు తన అందవికారి అయిన భార్యను విడిచి నిన్నే పెళ్లాడతాడు. రామునితో అమర సుఖాలు అనుభవించు. అయినా లోకోత్తర సుందరి అయిన నిన్ను వదిలి బుద్ధి ఉన్నవాడు ఎవరైనా ఆ మనుష్యకాంతను కోరుకుంటారా చెప్పు! కాబట్టి వెంటనే రాముని వద్దకు వెళ్లు. నీ మంచికోరి చెబుతున్నాను. విను." అని బంతిని తిరిగి రాముని వద్దకు నెట్టాడు.

లక్ష్మణుడు తనను ఆట పట్టిస్తున్నాడు అని దాని మట్టి బుర్రకు తోచలేదు. ఇదేదో బాగానే ఉందనుకొని, శూర్పణఖ తిరిగి రాముని వద్దకు పోయింది.

"రామా! నన్ను చూడు. నీ భార్యను చూడు. నేను లోకోత్తర సౌందర్యవతిని. నీ భార్య కురూపి. పైగా ముసలిది. దానితో ఏం సుఖపడతావు. నాతో రా. నన్ను పెళ్లిచేసుకో. నీకు అమరసుఖాలు రుచి చూపిస్తాను.

(సీతను చూపిస్తూ) ఈ అందవికారిని చూచా నన్ను వద్దంటున్నావు. ఇది ఉండబట్టి కదా నువ్వు నన్ను కాదంటున్నావు. చూస్తూ ఉండు. ఇప్పుడే దీనిని కరా కరా నమిలి తింటాను. అప్పుడు నాకు సవతి పోరు ఉండదుగా! రా రామా! మనం హాయిగా పెళ్లిచేసుకొని సుఖిద్దాము." అని రాముని బలవంతం చేసింది శూర్పణఖ. సీతను చంపడానికి ఆమె మీదికి వెళ్లింది. వెంటనే

రాముడు శూర్పణఖను అడ్డుకున్నాడు. పక్కకు నెట్టాడు. లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"లక్ష్మణా! ఇలాంటి దుష్టులతోనా నీ పరిహాసాలు. ఇప్పుడు చూడు ప్రమాదం త్రుటిలో తప్పిపోయింది. లేకపోతే ఈ దుష్టురాలు సీతను చంపి ఉండేది. సీత చూడు భయంతో ఎలా వణికిపోతూ ఉందో! లక్ష్మణా! దీనికి దీని అందం చూచుకొని గర్వం. ఆ గర్వం పోగొట్టు. దీనిని అంగవిహీనురాలిగా, అందవిహీనురాలిని చెయ్యి. లేకపోతే ఇది సీతను చంపుతుంది." అని అన్నాడు రాముడు.

అప్పుడు లక్ష్మణుడు కత్తి తీసుకొని శూర్పణఖ ముక్కు చెవులు కోసి అంగవిహీనురాలిని, అందవిహీనురాలిని చేసాడు లక్ష్మణుడు. హటాత్తుగా జరిగిన ఈ పరిణామానికి తట్టుకోలేకపోయింది శూర్పణఖ. పైగా తెగి పడిన ముక్కు,చెవుల నుండి రక్తం ధారాపాతంగా కారుతూ ఉంది. వెంటనే రాముని వదిలి అడవిలోకి పారిపోయింది.

(ఇటీవల కొంత మంది విమర్శకులు, స్త్రీవాదులు ఈ సంఘటనను విమర్శిస్తుంటారు. శూర్పణఖ ఒక స్త్రీ. ఇష్టంలేకపోతే ఇష్టంలేదని చెప్పవచ్చుకాని, ముక్కు చెవులు కోయడం అమానుషం, దారుణం అని వాదిస్తుంటారు. కాని ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి. శూర్పణఖ ఆటవికురాలు. రాక్షసి. నరమాంసభక్షకి. సీతను చంపడానికి ఆమె మీదికి ఉరికింది. అప్పుడు ఏం చెయ్యాలి. " అయ్యో! శూర్పణఖ స్త్రీ. ఆమెను ఏమీ చేయకూడదు"అని ఊరుకోవాలా! అలా ఊరుకుంటే శూర్పణఖ సీతను మిరపకాయ బజ్జీ తిన్నట్టు కరా కరా నమిలి తిని ఉండేది. తన భార్య అయిన సీతను

రక్షించుకోవడం రాముని ధర్మం కాదా!

"తనకు కానీ, తన వారికి కానీ, తన ఆస్తికి కానీ ఆపద కలిగినప్పుడు, ఆ ఆపద కలిగించేవారిని చంపినా, గాయపరిచినా అది నేరం కాదు." అని నేటి న్యాయశాస్త్రం కూడా చెబుతుంది. దానిని రైట్ ఆఫ్ సెల్ఫ్ డిఫెన్స్ అంటారు. రాముడు కూడా అదే పని చేసాడు. అయినా రాముడు శూర్పణఖను చంపలేదు. కేవలం ముక్కు చెవులుకోయించాడు. సీత ప్రాణాలు రక్షించాడు. కాబట్టి నేటి విమర్శకులు అనుకుంటున్నట్టు రాముడుకానీ, లక్ష్మణుడుకానీ శూర్పణఖ ముక్కు చెవులుకోయడంలో అనుచితంగా ప్రవర్తించలేదు. పైగా న్యాయసూత్రాలు పాటించారని చెప్పుకోవచ్చు.)

ఆ ప్రకారంగా ముక్కునుండి చెవుల నుండి రక్తం కారుతుంటే శూర్పణఖ పరుగెత్తిపోయింది. జన స్థానములో తన చుట్టు రాక్షస సేనలు ఉండగా, శూర్పణఖ అన్న ఖరుడు కూర్చొని ఉన్నాడు. శూర్పణఖ సరాసరి తన అన్న ఖరుని వద్దకు వెళ్లింది. ఏడుస్తూ నేలమీద పడిపోయింది.

తన చెల్లి అలా పడిపోవడం చూచి సహించలేక పోయాడు ఖరుడు. ఆమె వద్దకు వచ్చి ఆమెను లేవనెత్తాడు. ఆమె చెవుల నుండి, ముక్కునుండి రక్తం కారడం చూచాడు. ఏం జరిగింది అని అడిగాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము పదునెనిమిదవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## పంతొమ్మిదవ సర్గ.

ముక్కులలో నుండి చెవుల నుండి రక్తం కారుతూ తన ముందు నేల మీద పడి రోదిస్తూ ఉన్న చెల్లెలు శూర్పణఖను చూచాడు ఖరుడు. ఆమెను రెండుచేతులతో లేవనెత్తాడు.

"చెల్లెలా శూర్పణఖా! ఏమిటీ ఘోరము. ఎవరు చేసారీ పని? నీవు ఎవరో తెలిసే ఈ పని చేసాడా! వాడు తాచు పాముతో ఆడుకుంటున్నాడు అని మరిచిపోయినట్టున్నాడు. వాడికి మూడింది. వాడికి కాలపాశం మెడకు చుట్టుకోబట్టే ఇలాంటి పని చేసాడు. ఎవడు వాడు! ఎక్కడ ఉంటాడు! ఉన్నది ఉన్నట్టు చెప్పు.

అయినా నీవు సహజంగా బలవంతురాలివి కదా! పైగా కామరూపివి. నిన్ను చూస్తే యముడిని చూచినట్టే కదా! అలాంటి నీకు ఈ గతి పట్టించిన వాడు ఎవడు? వాడు దేవతా! గంధర్వుడా! భూతమా! లేక ఎవరన్నా పరాక్రమ వంతుడైన ఋషిపుంగవుడా! ఎందుకంటే సాక్షాత్తు దేవేంద్రుడు కూడా నాకు అపకారం చెయ్యడానికి వెనుకాడుతాడు. అటువంటిది నీవు నా చెల్లెలు అని తెలిసికూడా నీకు అవమానం చేసాడంటే వాడికి ఆయువు మూడింది.

ఇప్పుడే నేను వాడిని సంహరించి నీకు జరిగిన అవమానము నకు ప్రతీకారము చేస్తాను. వాడి శరీరమును కాకులు, గ్రద్దలు తింటాయి. దేవతలు గానీ, గంధర్వులు కానీ, రాక్షసులు గానీ,

పిశాచములు గానీ ఎవరు అడ్డం వచ్చినా సరే వాడిని చంపకుండా విడువను. చెల్లెలా! చెప్పు. నీ భయందోళనలనుండి తేరుకొని అన్నీ వివరంగా చెప్పు." అని అడిగాడు ఖరుడు.

శూర్పణఖ కళ్లనుండి నీళ్లు కారుతున్నాయి. కళ్లు తుడుచుకుంటూ ఖరునితో ఇలా చెప్పింది. "ఎవరో అయోధ్యను పరిపాలించే దశరథమహారాజు కుమారులట. పేరు రాముడు, లక్ష్మణుడు. వారు సుకుమారులు. సుందరాకారులు. కాని మంచి బలంగా ఉన్నారు. మునివేషములో ఉన్నా చేతిలో ధనుర్బాణాలు ఉన్నాయి. వారి ముఖంలో రాజసం తొణికిసలాడుతూ ఉంది. వారు దేవతలో మనుష్యులో చెప్పలేను. వారి పక్కనే ఒక సౌందర్యవతి అయిన స్త్రీ ఉంది. ఆ స్త్రీమూలంగానే నాకు ఈ అవమానము జరిగింది. నువ్వు వెళ్లి ఆ స్త్రీని, ఆ ఇద్దరు యువకులనుచంపి వారి రక్తముతో నా దాహము తీర్చు. అప్పటి దాకా నా పగ చల్లారదు." అని రోషంతో పలికింది శూర్పణఖ.

ఆమె మాటలకు రగిలిపోయాడు ఖరుడు. వెంటనే తన వద్ద ఉన్న అత్యధిక బలసంపన్నులైన 14 మంది రాక్షస వీరులను పిలిపించాడు. (ఇక్కడ గమనించండి. రామాయణంలో ఈ 14 అంకె విశిష్టమైనది. రాముని వనవాసము 14 సంవత్సరములు. ఖరుడు పంపిన వారు 14 మంది. ఇంకా ఈ 14 సంఖ్య వస్తూనే ఉంటుంది. భారతంలో 18 అంకె ఉన్నట్టు రామాయణంలో 14 అంకెకు ప్రాధాన్యత ఉన్నట్టు ఉంది.).

"ఓ రాక్షసవీరులారా! ముని వేషములో ఉన్న ఇద్దరు క్షత్రియ కుమారులు, ఒక స్త్రీ దండకారణ్యములో ప్రవేశించారట. మీరు వెళ్లి ఆ ముని కుమారులను, ఆ స్త్రీని చంపండి. వారి రక్తము నా సోదరి శూర్పణఖ తాగవలెనని కోరుతూ ఉంది. వెళ్లండి. వాళ్లను చంపి వారి రక్తమును పట్టి  తీసుకురండి." అని ఆజ్ఞాపించాడు ఖరుడు.

ఆ 14 మంది రాక్షసవీరులూ శూర్పణఖను తీసుకొని రామలక్ష్మణులను వెతుక్కుంటూ వెళ్లారు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము పంతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఇరువదవ సర్గ.

శూర్పణఖ ఆ పదునాలుగు మంది రాక్షస వీరులను రాముని పర్ణశాలకు తీసుకొని వెళ్లింది. పర్ణశాల ముందు కూర్చుని ఉన్న రామలక్ష్మణులను వారికి చూపించింది. ఆ రాక్షసులు బలవంతులైన రామలక్ష్మణులను, సౌందర్యరాసి అయిన సీతను చూచారు.

రాముడు కూడా శూర్పణఖ వెంట వచ్చిన రాక్షసులను చూచాడు. లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! నేను వెళ్లి ఆ

రాక్షసులను సంహరించి వస్తాను. నీవు ఇక్కడే ఉండి సీతను రక్షిస్తూ ఉండు." అని అన్నాడు.

లక్ష్మణుడు సరే అని సీత రక్షణ బాధ్యతను స్వీకరించాడు. రాముడు తన ధనుస్సుకు నారిని సంధించాడు. ఆ రాక్షసులను చూచి ఇలా అన్నాడు.

"ఓ రాక్షసులారా! నా పేరు రాముడు. నా తమ్ముడి పేరు లక్ష్మణుడు. ఆమె నా భార్య సీత. మేము వనవాసము నిమిత్తము ఈ దండకారణ్యములో ప్రవేశించాము. మేము ముని వృత్తిలో ఉన్నాము. కందమూలములు, ఫలములు తింటూ కాలక్షేపము చేస్తున్నాము. మేము గానీ, మా లాంటి తాపసులు కానీ మీకు ఎలాంటి అపకారము చెయ్యలేదు. మీరు ఎందుకు మాబోటి తాపసులను బాధిస్తున్నారు. చంపుతున్నారు. మీలాంటి దుర్మార్గులను చంపడానికే మేము ధనుర్బాణములను ధరించాము. మీకు ప్రాణముల మీద ఆశ ఉంటే వెనక్కు తిరిగి వెళ్లిపోండి. లేకపోతే ఇక్కడే ఉండి మీ ప్రాణాలు పోగొట్టుకోండి." అని అన్నాడు రాముడు.

ఆ మాటలు విన్న రాక్షస వీరులు కోపంతో ఊగిపోయారు. ఇప్పటి దాకా వారిని చూచి భయపడ్డవారే గానీ, వారిని ఎదిరించి భయపెట్టిన వారు లేరు. అలాంటిది వీళ్లు ఎదిరిస్తున్నారు అంటే కోపం ఆపుకోలేకపోయారు.

"మా ప్రభువు ఖరుడు. నీవు ఆయన చెల్లెలు ముక్కు

చెవులుకోసి, అవమానించి, ఆయనకు కోపం తెప్పించావు. నీవు ఇంక బతకడం కల్ల. ఎందుకంటే మేము 14 మంది ఉన్నాము. నీవు ఒక్కడివి. మమ్ములను ఎలా ఎదుర్కొంటావు? మేము కనక మా చేతిలో ఉన్న శూలములు మొదలగు ఆయుధములు నీ మీద ప్రయోగిస్తే నీవు నీ ధనుస్సు వదిలిపారిపోతావు. కాచుకో!" అంటూ ఆ 14 మంది రాక్షసులు రాముని మీదికి తమ తమ ఆయుధములను విసిరారు.

రాముడు ఒక్కొక్క ఆయుధమును ఒక్కొక్కబాణంతో ముక్కలు చేసాడు. తరువాత రాముడు 14 నారాచములను వారి మీద ప్రయోగించాడు. ఆ బాణములు సూటిగా వచ్చి ఆ రాక్షసుల గుండెలను చీల్చివేసాయి. వారి శరీరములు రక్తముతో తడిసి ముద్ద అయినాయి. వారి గుండెలు చీలడంతో, ఆ 14 మంది రాక్షసులు నేల మీద పడి ప్రాణాలు వదిలారు.

శూర్పణఖ ఆశ్చర్యంలో ఆ రాక్షసుల వంక చూచింది. రామలక్ష్మణుల వంక చూచింది. శూర్పణఖకు కోపము, భయము, ఒక్కసారిగా ఆవహించాయి. పెద్దగా అరవడం మొదలు పెట్టింది. అక్కడి నుండి పరుగెత్తింది. ఖరుని వద్దకు పరుగుపరుగున వచ్చింది. ఖరుని ముందు నేల మీద పడి భోరు భోరున ఏడుస్తూ ఉంది.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము ఇరువదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఇరువది ఒకటవ సర్గ.

పదునాలుగు మంది రాక్షస వీరులను వెంటబెట్టుకొని వెళ్లిన శూర్పణఖ వెంటనే ఒంటరిగా రావడం చూచి ఆశ్చర్యపోయాడు ఖరుడు.

"ఏంటి శూర్పణఖా! ఏమయింది. నీవు కోరితేనేకదా నీ వెంట 14 మంది రాక్షస వీరులను పంపాను. మరలా ఏడుస్తూ వచ్చావెందుకు. ఊరికే అలా భయపడితే ఎలాగా! నేను ఉన్నాగా నీకెందుకు భయం. ఏం జరిగిందో చెప్పు" అన్నాడు ఖరుడు.

ఖరుని చూచి వ్యంగ్యంగా ఇలా అంది శూర్పణఖ. "ముక్కు చెవులూ కోయించుకొని రక్తంకారుకుంటూ ఏడ్చుకుంటూ నీదగ్గరకు వచ్చానా! నీవు నన్ను ఓదార్చావు కదా! రామలక్ష్మణులను చంపడానికి 14 మంది రాక్షస వీరులను పంపావు కదా! మహావీరుల మాదిరి శూలాలు ధరించి ఆ 14మంది నా వెంట వచ్చారు కదా! క్షణకాలంలో రాముడిచేతిలో గుండెలు పగిలి చచ్చారు. ఇదీ మనవాళ్ల ప్రతాపం. ఇంక భయపడక చస్తానా! వాళ్లందరూ అలా క్షణకాలంలో నేలమీద పడగానే నాకు వణుకు పుట్టింది. పరుగెత్తుకుంటూ వచ్చాను.

ఓ ఖరా! నాకు భయంగా ఉంది. రామలక్ష్మణులు ఏవైపు నుంచి అన్నా రావచ్చు. నిన్ను, నన్ను చంపవచ్చు నీకు నా మీద జాలి దయ ఉంటే, ఆ రామలక్ష్మణులను ఎదిరించే శక్తి, బలము ఉంటే,

దండకారణ్యములో నివాసమేర్పరచుకొన్న ఆ రామలక్ష్మణులను వెంటనే చంపు. వాళ్లు సామాన్యులు కాదు. రాక్షసులను చంపడానికి వచ్చిన దేవతలు. నీవు కనక రాముడిని చంపకపోతే నేను నీ ఎదుటనే ఆత్మహత్య చేసుకొని చస్తాను.

అయినా నీకు ఇంత సైన్యము, ఇంత బలము, పరాక్రమములు ఉండి ఏం ప్రయోజనం. ఇద్దరిని చంపలేకపోయావు. అసలు నువ్వు అయినా రాముని ఎదుటనిలిచి యుద్ధం చెయ్యగలవా అని నా అనుమానము.

ఖరా! వాళ్లు సామాన్య మానవులు. నీ సైన్యము ఆ మానవులను చంపలేకపోయాయి. నీవేదో పెద్ద పరాక్రమవంతుడవని డంబాలు పలుకుతున్నావు. నీ పరాక్రమము శూరత్వము ఎందుకు తగలపెట్టనా! నా మాటవిని ఈ జనస్థానము వదిలి ఎక్కడికన్నా వెళ్లి బతుకు పో! నువ్వు రాక్షసకులంలో చెడ బుట్టావు. అందుకే మానవులకు భయపడుతున్నావు.

ఓ ఖరా! ఆఖరుసారిగా చెబుతున్నాను విను. నీకు రాముని ఎదిరించే వీరత్వము ఉంటే, నీ సైన్యంతో వెళ్లి రామలక్ష్మణులనుచంపు. లేకపోతే, నీ బంధుమిత్రులతో ఈ జనస్థానము వదిలి పారిపో! అదే ఉత్తమము. రాముని తేజస్సు ముందు నీవు నిలువలేవు. అందుకే నా ముక్కు చెవులు కోసినా ఇంకా రామలక్ష్మణులు బతికే ఉన్నారు." అని సూటిపోటీ మాటలతో ఖరుని రెచ్చగొట్టింది శూర్పణఖ.

శ్రీమద్రామాయణము అరణ్యకాండము

ఇరువది ఒకటవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్.

# అరణ్యకాండము

## ఇరువది రెండవ సర్గ.

శూర్పణఖ తనను అన్న సూటీ పోటీ మాటలు అన్నీ మౌనంగా విన్నాడు ఖరుడు. అవమానభారంతో కుమిలిపోయాడు. అతనిలో పౌరుషం పెల్లుబికింది. కోపం తారస్థాయికి చేరుకుంది. శూర్పణఖను చూచి ఇలా అన్నాడు.

" నీకు జరిగిన అవమానము నాకు జరిగినట్టే భావిస్తాను. నాకు పట్టలేనంతగా కోపం వస్తూ ఉంది. ప్రతీకార జ్వాలలలో రగిలిపోతున్నాను. ఏదో ఒకటి చెయ్యాలి. ఒక మానవుడికి నేను భయపడడమా! ఆ మానవుడు ఒక అల్పాయుష్కుడు. వాడి ప్రాణాలు హరిస్తాను. నీవు ఏడవకు. వాడి మరణవార్తను నీకు త్వరలో తెలియజేస్తాను. ఇప్పుడే వాడితో యుద్ధానికి వెళుతున్నాను. నా గొడ్డలితో వాడిని నరుకుతాను. వాడి వెచ్చని రక్తాన్ని నీకు పానీయంగా అందిస్తాను. ఇది నా నిర్ణయము." అని పలికాడు ఖరుడు.

"అదేంటి అన్నయ్యా! నీ పరాక్రమం గురించి నాకు తెలీయదా. నీకు సాటి వీరుడు ముల్లోకములలో ఎవరు ఉన్నారు. రాక్షస వీరులలో నీకు సాటిగలవారు ఎవరున్నారు." అని పొగిడింది.

శూర్పణఖ మాటలతో ఉప్పొంగి పోయాడు ఖరుడు. వెంటనే తన సేనాపతులను పిలిచాడు.

"సేనాపతీ! మన దగ్గర 14 వేల మంది సైనికులు ఉన్నారు కదా. వారినందరినీ యుద్ధమునకు సిద్ధం చేయండి. నేనే స్వయంగా వారికి నాయకత్వము వహిస్తాను. నా కొరకు ఒక రథము, ఆయుధములు, ధనుస్సులు, బాణములు సిద్ధం చేయండి. మనమందరమూ ఆ రాముని మీదికి యుద్ధానికి పోతున్నాము." అని ప్రకటించాడు.

ఖరుడి మాట వినగానే దూషణుడు ఖరుడు కోరినట్టు రథం సిద్ధం చేసాడు. రథం తీసుకొచ్చి ఖరుడి ముందు నిలిపాడు. ఖరుడు ఆ రథం ఎక్కాడు. ఖరునికి దూషణునికి రక్షణగా రాక్షస వీరులు చుట్టు వలయాకారంలో నిలబడ్డారు. ఖరుడు అందరికీ బయలుదేరుటకు అనుజ్ఞ ఇచ్చాడు. జనస్థానమునుండి 14,000 మంది రాక్షసవీరులు ముద్గరలు, పట్టిసములు, శూలములు, పరశువులు, కత్తులు, చక్రాయుధములు, తోమరములు, శక్తి ఆయుధములు, పరిఘలు, కార్ముకములు (బాణములు), గదాయుధములు, ముసలములు, వజ్రాయుధములు ధరించి, రాముని మీదికి యుద్ధానికి బయలుదేరారు.

(ఇక్కడ కూడా 14 వేల మంది రాక్షస సైన్యము, బయలుదేరింది. ఇది మూడవ 14 సంఖ్య.)

ముందు సైనికులు నడువగా ఖరుని రథము వారిని అనుసరించింది. ఖరుడు కోపంతో ఊగి పోతున్నాడు.

"త్వరగా పదండి. శత్రువును చంపండి. నరకండి" అని పెద్దగా అరుస్తున్నాడు.

ఖరుని అరుపులతో, రాక్షసవీరుల పదఘట్టనలతో ఆ అరణ్యము మార్మోగిపోయింది.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఇరువది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఇరువదిమూడవ సర్గ.

రాముని మీదికి ఉత్సాహంగా బయలుదేరిన ఖరునికి ఎన్నో దుశ్శకునములు గోచరించాయి. వారి మీద రక్తవర్షము కురిసింది. ఖరుని రథమునకు కట్టిన గుర్రములు సమతలప్రదేశము మీద కూడా తడబడుతూ పరుగెడుతున్నాయి. దేదీప్యమానంగా వెలుగుతున్న సూర్యుని చుట్టూ నల్లని వలయం ఏర్పడింది. ఒక గ్రద్ద ఖరుని రథముమీద ఎగురుతున్న ధ్వజము మీద నిలబడింది. అనేకములైన క్రూర మృగములు జనస్థానము వద్ద గుమిగూడి వికృతంగా అరుస్తున్నాయి. ఒక పక్కనుంచి నక్కలు తలలు పైకెత్తి ఏదో అమంగళము జరగబోతున్నట్టు కూస్తున్నాయి. పక్షులు,డేగలు, గ్రద్దలు ఖరుని రథానికి అడ్డంగా ఎగురుతున్నాయి.

ఇంతలో సాయం సమయం అయింది.. గ్రహణ కాలం కాకుండానే రాహువు సూర్యుని మింగుతున్నాడా అన్నట్టు సూర్యుడు అస్తమించాడు. ఆకాశంనుండి ఉల్కాపాతం జరిగింది. స్వల్పంగా భూమి కంపించింది. రథం మీద కూర్చుని పెద్దగా అరుస్తున్న ఖరుడికి ఎడమ భుజము అదిరింది. మాట తడబడుతూ ఉంది. కళ్లు మండటం మొదలెట్టాయి.

ఇన్ని అపశకునాలు కనపడుతున్నా ఖరుడు చలించలేదు. వెనుకకు మరలలేదు. ముందుకు దూకుతున్నాడు. "సైనికులారా! ఈ ఉత్పాతాలకు భయపడకండి. ఇలాంటివి పిరికి వాళ్లను భయపెడతాయి కానీ మనలను కాదు. ధైర్యంగా ముందుకు దూకండి. ఆ రామలక్ష్మణులను చంపి గానీ వెనకకు తిరగ వద్దు. వాళ్లను చంపి వాళ్ల రక్తం తాగితేనే గానీ నా సోదరి శూర్పణఖ అవమానము చల్లారదు. మనం ఎన్నడూ యుద్ధంలో ఓడిపోలేదు. ఇప్పుడూ ఓడిపోము. నేను తల్చుకుంటే ఆ దేవేంద్రుని కూడా సంహరించగలను. ఈ మానవులు ఎంత?" అని ఖరుడు తనకు తానే ధైర్యము చెప్పుకుంటూ సేనలను ఉత్సాహపరుస్తున్నాడు.

ఈ విధంగా రాక్షసులు యుద్ధానికి కదలడం చూచి ఆ అడవిలో ఉన్న ఋషులు, మునులు, ఏంజరుగుతుందో అని ఆతురతగా చూస్తున్నారు. అందరూ లోక క్షేమాన్ని కోరి (అంటే రాక్షస సంహారాన్ని కోరి) ప్రార్థనలు చేస్తున్నారు. "చక్రాయుధమును ధరించిన శ్రీమహావిష్ణువు దానవులను సంహరించినట్టు ధనుర్ధారి అయిన రాముడు రాక్షస సంహారము చేయుగాక!" అని మనసులో

ఆకాంక్షిస్తున్నారు. ఇంక పైనుంచి దేవతలు విమానములు ఎక్కి రాక్షస సైన్యమును చూస్తున్నారు. ఖరుని సేనలో పన్నెండు మంది మహావీరులైన రాక్షసులు ఉన్నారు. వారు శ్యేనగామి, పృథుగ్రీవుడు, యజ్ఞశత్రువు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు, కాలకార్ముకుడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుడు, రుధిరాశనుడు ( పైన చెప్పి పేర్లలో వారి అలవాట్లు, గుణగణాలు ప్రతిబింబిస్తున్నాయి. ఉదాహరణకు.... శ్యేనగామి==పక్షిలా తిరిగేవాడు. యజ్ఞశత్రువు= యజ్ఞములను పాడుచేసేవాడు, విహంగముడు=పక్షిలా ఎగిరేవాడు, పరుషుడు=ఎప్పుడూ పరుషంగా, కఠినంగా మాట్లాడేవాడు, రుధిరాశనుడు=రక్తంతాగేవాడు.). వీరే కాకుండాదూషణుని వెంట మహాకపాలి,, స్థూలాక్షుడు, ప్రమాథీ, త్రిశిరస్సుడు అనే మరో నలుగురు రాక్షస సేనానాయకులు తమ తమ సేనలతో నడుస్తున్నారు. వీరందరూ రామలక్ష్మణులు ఉన్న ప్రదేశానికి వెళుతున్నారు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఇరువదిమూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఇరువది నాలుగవ సర్గ.

జనస్థానములో ఖరుడికి కనపడ్డ దుశ్శకునములు అన్నీ పంచవటిలో ఉన్న రామలక్ష్మణులకు కూడా కనపడ్డాయి. వాటిని చూచిన రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు.

"లక్ష్మణా! ఆకాశంలో కనపడే దుశ్శకునములను చూచావు కదా! ఇవన్నీ రాక్షస సంహారాన్ని సూచిస్తున్నాయి. ఇటువంటి శకునములు ఒక మహాయుద్ధమునకు ముందుకనపడతాయి. అరణ్యములో మృగములు అరిచే అరుపులు వింటుంటే మనకు కూడా అపాయము కలుగుతుంది అని అనిపిస్తూ ఉంది. ప్రాణాపాయము కూడా కలగ వచ్చు. కాబట్టి ఇక్కడ ఒక మహాయుద్ధము జరగబోతోంది అనుటలో సందేహము లేదు.

లక్ష్మణా! జాగ్రత్తగా విను. రాక్షసుల అరుపులు, భేరీనినాదములు వినిపిస్తున్నాయి. రాక్షసులు మనమీదికి యుద్ధానికి వస్తున్నారు. కాబట్టి మనము జరగబోయే దానికి దు:ఖిస్తూ కూర్చోకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. కాబట్టి నేనుచెప్పినట్టు చెయ్యి. నీవు  ధనుర్బాణములు ధరించి, సీతను తీసుకొని, చెట్లతోనూ, పొదలతోనూ కప్పబడి ఉన్న ఆ గుహలో ప్రవేశించు. నా మాటకు అడ్డు చెప్పవద్దు.

"నేనే రాక్షసులను చంపుతాను." అనే మాటలు చెప్పవద్దు. మనకు సీత క్షేమము ముఖ్యము. నీవు సీతకు రక్షణగా ఉండు. నేను రాక్షసులను చంపుతాను. అంటే నీవు రాక్షసులను చంపలేవని కాదు. నీవు వీరాధివీరుడవు, శూరుడవు. నీవు ఒక్కడివే అందరు రాక్షసులను మట్టుపెట్టగలవు. కానీ నేను ఒక్కడినే రాక్షస సంహారము చేయవలెనని కోరికగా ఉంది. అందుకనీ నీవు సీతను తీసుకొని వెళ్లు." అని అన్నాడు రాముడు.

రాముని మాటను మీరలేక, లక్ష్మణుడు, సీతను తీసుకొని గుహలోకి ప్రవేశించాడు. రాముడు కవచమును ధరించాడు.

ధనుర్బాణములు తీసుకున్నాడు. ధనుష్టంకారము చేసాడు. రాముడు మొదటిసారిగా రాక్షసులతో యుద్ధ చేయబోతున్నాడు. అందుకని ఆకాశంలో దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులు అందరూ సమావేశమయ్యారు.

"రాముడు ఒక్కడు. రాక్షస సేనలు 14,000. ఎలా యుద్ధం చేస్తాడు." అని ఒకరితో ఒకరు అనుకుంటున్నారు. వాళ్ల కళ్లకు రాముడు ప్రళయ కాల రుద్రుడిలా కనపడుతున్నాడు.

ఇంతలో రాక్షస సైన్యము అక్కడకు చేరుకుంది. నాలుగు పక్కల నుండి రాక్షసులు రాముని చుట్టుముట్టారు. పెద్దగా కేకలుపెడుతున్నారు. కొందరు ధనుస్సులను ఠంగు ఠంగున మోగిస్తున్నారు. యుద్ధభేరీలు మోగుతున్నాయి. ఆ భయంకర ధ్వనులకు అడవిలో ఉన్న క్రూరమృగములు సైతము పారిపోయాయి. రాక్షస సైన్యము నలుదిక్కుల నుండి రాముని దగ్గర దగ్గరగా వస్తూ ఉంది.

రాముడు చుట్టూ చూచాడు. తనను చుట్టుముట్టిన రాక్షసులను పరికించి చూచాడు. అమ్ములపొదిలోనుండి బాణములను తీసాడు. రాక్షసుల మీదికి సంధించాడు. రాక్షస సంహారం కోసరము తీవ్రమైన కోపమును తెచ్చుకున్నాడు.

(ఈవిషయము మనకు బాల కాండలో రాముని గుణగణముల గురించి చెప్పేటప్పుడు చదువుకున్నాము. రాముడు శాంతస్వభావుడు. కోపం అనేది తెలియదు. కాని అవసరమైనప్పుడు కోపాన్ని తెచ్చుకుంటాడు. అవసరం తీరిపోగానే కోపాన్ని వదిలేస్తాడు. మరలా

శాంత మూర్తి అవుతాడు. అందుకే రాముడు దేవుడు అయ్యాడు.  కాని మనం చీటికి మాటికీ కోపం తెచ్చుకుంటాము. అన్ని అనర్థాలను తలకు చుట్టుకుంటాము. కష్టనష్టాలను అనుభవిస్తాము. అన్ని కష్టాలు నాకే పెట్టావా భగవంతుడా అని దేవుడిని తిడతాము. అందుకే మనం మానవులం  అయ్యాము.)

రాముని కోపం ఆవహించింది.  రాక్షసుల మీద కోపంతో ఊగిపోయాడు రాముడు. దక్షయజ్ఞంలో విజృంభించిన రుద్రునిలా ప్రకాశించాడు రాముడు. రాక్షస సైన్యము ఆయుధములతో రాముని చుట్టుముట్టింది..

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము ఇరువది నాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఇరువది ఐదవ సర్గ.

ఖరుడు తన రథాన్ని తన  సేనల ముందు నిలబెట్టాడు. ధనుర్బాణములతో నేలమీద నిలుచుని ఉన్న రాముని చూచాడు.

"రథమును రాముని మీదికి నడిపిపంచు" అని సారథిని ఆజ్ఞాపించాడు ఖరుడు.

ఖరుని ఆజ్ఞను అందుకొని సారథి రథమును రాముని మీదికి పోనిచ్చాడు. అది చూచి రాక్షస సేనలు కూడా రాముని మీదికి తమ తమ రథములను నడిపించాయి. రాముని చుట్టుముట్టాయి. రాముని మీద బాణముల వర్షము కురిపించాయి.

ఆ బాణఘాతములను రాముడు చిరునవ్వుతో స్వీకరించాడు. ఆ బాణములు తన దేహమును బాధించినా ఓర్చుకున్నాడు. రాక్షసులు ప్రయోగించిన బాణములతో, ఆయుధముల దెబ్బలతో రాముని శరీరం అంతా రక్తసిక్తము అయింది. కాని రాముడు చలించలేదు.

అన్ని వేల మంది రాక్షసులు ఒక్కుమ్మడిగా ఒంటరిగా ఉన్న రాముని చుట్టుముట్టి గాయపరచడం చూచి ఆకాశంలో నిలబడ్డ దేవతలు, గంధర్వులు ఎంతో వ్యధచెందారు. అన్ని దెబ్బలు తింటేగానీ, రామునికి రాక్షసులను చంపాలి అన్నంత కోపం రాలేదు. (రాముడు కోపం తెచ్చుకున్నాడు అన్న మాటకు అర్థం ఇదేకాబోలు.)

అప్పుడు రాముడు కోపంతో కంపించి పోయాడు. తన ధనుస్సును మండలాకారంగా వంచి వేలకొలది బాణములను రాక్షసుల మీద ప్రయోగించాడు. (ధనుస్సు నిలువుగా ఉంటుంది. ఎక్కుపెడితో గుండ్రంగా వంగుతుంది. రాముని ధనుస్సు గుండ్రంగా ఉంది అంటే రాముడు ఎంత వేగంగా బాణాలు ప్రయోగిస్తున్నాడో అర్థం చేసుకోవచ్చు)

రాముడు తన వద్దఉన్న దివ్యాస్త్రములను వెంట వెంటనే ఒకదాని వెంట ఒకటిగా రాక్షసుల మీద ప్రయోగించాడు. రాముని

బాణముల ధాటికి తట్టుకోలేక రాక్షస సైన్యము నేలకొరిగింది. రాముడు వదిలిన ఒక్కొక్క బాణము  ఒక్కొక్క రాక్షసుని గుండెలు చీల్చింది. రాముడు ప్రయోగించిన వేలకొలది బాణములు వేలకొలది రాక్షసులను మట్టుబెట్టాయి. రాముడు తన బాణములతో రాక్షసుల రథములను విరగ్గొట్టాడు. హయములను, గజములను చంపాడు.  పతాకములను విరిచాడు. రథికులు, ఆశ్వికులు, పదాతి దళము అందరూ రామ బాణములకు ఆహుతి అయ్యారు. రాముని బాణముల దెబ్బలకు తాళలేక రాక్షసులు చేయు హాహాకారములతో ఆ ప్రాంతము అంతా మార్మోగి పోయింది.

చావగా మిగిలిన రాక్షస వీరులు రాముని మీదికి గండ్రగొడ్డళ్లను, శూలములను, కత్తులను విసిరారు. రాముడు నిర్విరామంగా బాణప్రయోగం చేస్తూ వారు విసిరిన నానారకాల ఆయుధములను మధ్యలోనే తుంచేసాడు. ఆ ఆయుధములు ప్రయోగించిన వారి కంఠములు ఖండించాడు. అలా రాక్షసుల తలకాయలు తెగి పడుతుంటే, ఆ ప్రాంతమంతా రాక్షసుల కళేబరాలతో నిండిపోయింది. చావగా మిగిలిన రాక్షసులు పరుగు పరుగున ఖరుని వద్దకు పోయి దాక్కున్నారు.

ఖరుని పక్కనే ఉన్న దూషణుడు వారినందరినీ ఓదార్చి, ధైర్యము చెప్పి, వారినందరినీ వెంటబెట్టుకొని పట్టరాని కోపంతో రాముని మీదికి ఉరికాడు. దూషణుని నాయకత్వంలో రాక్షసులు చేతికి అందిన రాళ్లను, చెట్లను  పట్టుకొని రాముని మీదికి లంఘించారు. రాముని మీదికి చెట్లను రాళ్లను విసిరారు. రాముడు వాటిని తన శరములతో పిండి పిండి చేసాడు.

ఆ ప్రకారంగా రాక్షసులకు రామునికి ఘోరయుద్ధము జరిగింది. ఇలా కాదని రాక్షసులు అందరూ రాముని చుట్టుచేరి ఆయుధములను ప్రయోగించారు. అది చూచిన రాముడు వారి మీద గాంధర్వము అనే అస్త్రమును  ప్రయోగించాడు.

ఆ అస్త్రప్రభావంతో రాక్షసులకు తాము ఎక్కడ ఉన్నారో ఏమి చేస్తున్నారో తెలియడం లేదు. రాముడు ఎప్పుడు బాణం తీస్తున్నాడో ఎప్పుడు వదులుతున్నాడో తెలియడం లేదు. రాముని ధనుస్సు మండలాకారంలో ఉండటం మాత్రం కనపడుతూ ఉంది వారికి. కాని రాముని ధనుస్సునుండి వెలువడిన బాణములు రాక్షసులను హతమారుస్తున్నాయి.

ఆ ప్రాంతమంతా రాక్షసుల తలలతోనూ, కాళ్లతోనూ, మొండెములతోనూ నిండిపోయింది. వారి వారి ఆయుధములు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. వారే కాదు వారు ఎక్కి వచ్చిన గుర్రములు, ఏనుగులు కూడా చచ్చి పడి ఉన్నాయి. రథములు, వాటికి కట్టిన పతాకములు  తునా తునకలుగా విరిగిపడి ఉన్నాయి. రాక్షసుల మృతకళేబరములతో ఆ ప్రాంతం అంతా భయంకరంగా,  భీభత్సంగా ఉంది.

శ్రీమద్రామాయణము
అరణ్యపర్వము ఇరువది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఇరువది ఆరవ సర్గ.

తన సైన్యము అంతా రాముని బాణములకు ఆహుతి కావడం చూచాడు దూషణుడు. దూషణుడు తన వెంట వచ్చిన రాక్షస సేనలను ఐదువేల మందిని తీసుకొని రాముని మీదికి వెళ్లాడు. (అంటే అప్పటి దాకా ఖరుని వెంట వచ్చిన 14,000 మంది రాక్షసులు చచ్చారు.) ఆ ఐదువేల మంది రాక్షస సైన్యము రాముని చుట్టు ముట్టారు. రాముని మీద శూలములు, పట్టిసములు, కత్తులు, రాళ్లు, చెట్లు, బాణములు వర్షంలా కురిపిస్తున్నారు. రాముడు కూడా తన బాణములతో వారు తన మీదికి విసురుతున్న శూలములను, పట్టిసములను, కత్తులను, చెట్లను, సమర్థంగా ఎదుర్కొంటున్నాడు.

రాక్షసులు తన మీద ఆయుధములు ప్రయోగించే కొద్దీ రాముని కోపం పెరుగుతూ ఉంది. రాముడు వేలకొలది బాణములతో దూషణుని సైన్యమును కప్పివేసాడు.  ఇది చూచిన దూషణుడు రాముని మీద వాడి అయిన బాణములను ప్రయోగించాడు. రాముడు అర్ధచంద్రాకారములో ఉన్న బాణముతో దూషణుని విల్లు విరిచాడు. నాలుగుబాణములతో దూషణుని రథమునకు కట్టిన హయములను చంపాడు. మరొక అర్ధచంద్రబాణముతో సారథి తల నరికాడు. మూడుబాణములతో దూషణుని కొట్టాడు.

దూషణుని ధనుస్సు విరిగింది. రథం కూలింది. సారథి చచ్చాడు. దూషణుడు నేలమీదికి దూకాడు. ఒక పెద్ద పరిఘను తీసుకున్నాడు. రాముని మీదికి పరుగెత్తాడు. అది చూచి రాముడు రెండు బాణములతో దూషణుని రెండు చేతులను బుజాల వద్ద నరికాడు. వాడి చేతులు పరిఘతో సహా నేలకూలాయి. చేతులు విరిగిన దూషణుడు నిలువునా కింద పడ్డాడు.

ఇది చూచి దూషణుని సేనాధి పతులు అయిన మహాకపాలుడు, స్థూలాక్షుడు, ప్రమాథీ అను ముగ్గురు తమ తమ ఆయుధములను తీసుకొని రాముని మీదికి వెళ్లారు. మహాకపాలుడు శూలమును, స్థూలాక్షుడు పట్టిసమును, ప్రమాథి గండ్రగొడ్డలిని ధరించారు. వారిని చూచి రాముడు వారి మీద బాణవర్షము కురిపించాడు. మహాకపాలుని తల    నరికాడు. స్థూలాక్షుని కళ్లలో రాముడు వదిలిన బాణములు గుచ్చుకున్నాయి. ప్రమాథి గుండెలను చీల్చాడు రాముడు. ఆ ప్రకారంగా రాముడు దూషణుని, అతని సేనాధి పతులు ముగ్గురను, ఐదువేలమంది సైనికులను మట్టుబెట్టాడు.

తన సోదరుడు దూషణుడు అతని సైన్యము సమూలంగా నాశనం అవడం చూచాడు ఖరుడు. తన సేనాధి పతులను పిలిచాడు.

"సేనానాయకులారా! నా సోదరుడు దూషణుడు అతని సైన్యము రాముని చేతిలో హతం అయ్యారు. మీరు మీ మీ సేనలతో రాముని హతమార్చండి. వెళ్లండి" అని ఆజ్ఞాపించాడు.  ఈ విధంగా తన సేనానాయకులను ఆజ్ఞాపించిన ఖరుడు తాను కూడా ఆయుధములు

ధరించి రాముని మీదికి పరుగెత్తాడు. ఖరుని సేనానాయకులైన శ్యేనగామి, పృథుగ్రీవుడు, యజ్ఞశత్రువు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు, కాలకార్ముకుడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుడు, రుధిరాశనుడు అనే పన్నెండు మంది సేనానాయకులు ఖరుని వెంట రాముని మీదికి ఉరికారు.

రాముడు తన వజ్రసమానములైన బాణములతో ఖరుని సేనలను తుత్తునియలు చేసాడు. రాముడు  కర్ణి అనే పేరుగల నూరు బాణములతోనూ, మరో వెయ్యిమందిని వాడి అయిన బాణములతోనూ సంహరించాడు. రాముని చేత చంపబడ్డ రాక్షసుల శరీరములతో ఆ ప్రాంతమంతా కప్పబడిపోయింది.

ఏ వాహనమూ లేకుండా, ఇతర సైన్యసాయము లేకుండా రాముడు ఒంటరిగా ధనుర్ధారియై 14,000 మంది రాక్షసులను మట్టుబెట్టాడు. వారిలో ఖరుడు, త్రిశిరుడు మిగిలారు. తన సైన్యము అంతా సర్వనాశనం కావడం చూచి ఖరుడు కోపంతో రగిలిపోయాడు. తన రథం ఎక్కి, ఆయుధములను ధరించి, రాముని మీదికి వెళ్లాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఇరువది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఇరువది ఏడవ సర్గ.

త్రిశిరస్సుడు అనే సైన్యాధిపతి ఖరుడు రాముని వైపు దూసుకువెళ్లడం చూచాడు. వెంటనే త్రిశిరస్సుడు ఖరుడి వద్దకు వచ్చాడు.

"ఓ వీరుడా! ఒక సాధారణ మానవుని సంహరించడానికి నీవు వెళ్లవలెనా! మేము లేమా! నాకు అనుజ్ఞ ఇమ్ము. నేను వెళ్లి రాముని సంహరిస్తాను. ఈ రాముడి చావు నా చేతిలో ఉంది. నేను చంపుతాను. లేకపోతే రాముని చేతిలో నేను చస్తాను. నువ్వు మాత్రం చూస్తూ ఉండు. ఒక వేళ నేను రాముణ్ణి చంపితే మనం అందరం ఆనందంతో జనస్థానమునకు వెళ్దాము. లేక రాముడు నన్ను చంపితే, అప్పుడు నువ్వే వెళ్లి రాముని చంపవచ్చును." అని అన్నాడు త్రిశిరుడు.

ఆమాటలు విన్న ఖరుడు ఆనందంతో త్రిశిరునికి రామునితో యుద్ధము చేయమని అనుమతి ఇచ్చాడు. త్రిశిరుడు తన రథము ఎక్కి రాముని మీదికి యుద్ధమునకు వెళ్లాడు. రాముని మీద బాణములను వర్షము వలె కురిపించాడు. ఆ బాణములనన్నింటికీ రాముడు మధ్యలోనే తుంచాడు.

రాముడు త్రిశిరస్సుల మధ్య పోరు భయంకరంగా జరిగింది. త్రిశిరుడు రాముని నుదుటిపై తగిలేటట్టు మూడు బాణములను వదిలాడు. రాముడు కోపించి సర్పములవలె దూసుకు వెళ్లే నాలుగు

బాణములను త్రిశిరుని గుండెలకు గురిపెట్టి కొట్టాడు. మరొక నాలుగు బాణములతో త్రిశిరుడు ఎక్కిన రథమునకు కట్టిన గుర్రములను చంపాడు. త్రిశిరుడు తేరుకొనే లోపల రాముడు అతని రథము నడుపుతున్న సారథిని చంపాడు. మరొక బాణంతో త్రిశిరుని పతాకమును విరిచాడు.

త్రిశిరుడు రథమునుండి పైకి ఎగరబోయాడు. ఎగిరే ఆ త్రిశిరుని గుండెలకు గురిపెట్టి రాముడు నాలుగు బాణములను ప్రయోగించాడు. మరొక మూడు బాణములను సంధించి త్రిశిరుని మూడు తలలను ఖండించాడు. త్రిశిరుని తలలు తాటికాయల మాదిరి నేలమీద పడ్డాయి. ఆ వెంటనే త్రిశిరుని శరీరము నేలమీద పడింది.

ఎప్పుడైతే త్రిశిరుడు చచ్చాడో, అతని సేనలు చెల్లాచెదురుగా పారిపోయాయి. రాక్షస సేనలు వెనుతిరిగి పారిపోవడం చూచాడు ఖరుడు. త్రిశిరుడు చచ్చాడు అని తెలుసుకున్నాడు ఖరుడు. పారిపోతున్న సేనలను కూడగట్టుకొని రాముని మీదికి యుద్ధానికి వెళ్లాడు ఖరుడు.

శ్రీమద్రామాయణము,
అరణ్యకాండము ఇరువదిఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఇరువది ఎనిమిదవ సర్గ.

రాముని మీదికి పోతున్నాడే కానీ ఖరునికి లోలోపల భయంగానే ఉంది. ఎందుకంటే అప్పటికే రాముడు మహా వీరులు, అసమాన బలవంతులు అయిన దూషణుని, త్రిశిరుని సంహరించాడు. ఇంక తన వంతు వచ్చింది అనుకున్నాడు. పైగా సైన్యము అంతా నశించి పోయింది. కొద్దిమంది మాత్రమే మిగిలి ఉన్నారు. ఆ కొద్దిమందితో రాముని ఎదుర్కోగలనా అని సందేహిస్తున్నాడు. కానీ ధైర్యంగా ముందుకు దూకాడు.

ఖరుడు రాముని మీద నారాచములను(ఇనుప ములికలు అమర్చిన బాణములను) ప్రయోగించాడు. ఖరుడు ఒక చోట ఉండకుండా రణభూమి అంతా కలయ తిరుగుతూ, బాణప్రయోగం చేస్తున్నాడు. రాముని కదలనీయకుండా నాలుగు దిక్కులను తన బాణములతో కప్పివేసాడు.

రాముడు తన ధనుస్సు ఎక్కుపెట్టాడు. ఖరుడు సంధించిన బాణములను ఛిన్నాభిన్నం చేసాడు రాముడు. తన బాణములతో ఆకాశం అంతా నింపాడు రాముడు. సూర్యుడు కూడా కనపడటం లేదు. రాముడు ఖరుడు ఒకరితో ఒకరు భీకరంగా పోరాడుతున్నారు. ఖరుడు రాముని మీద నారాచములు, నాళీకములు, వికర్ణికలు మొదలగు బాణపరంపరలు ప్రయోగించాడు. ఆ సమయంలో రథము మీద ఉన్న ఖరుడు యమధర్మరాజు మాదిరి కనిపించాడు.

అప్పటికే యుద్ధము చేసి పదునాలుగువేలమంది రాక్షసులను చంపిన రాముడు బాగా అలసిపోయి ఉంటాడు అని అనుకొన్నాడు ఖరుడు. కాని రామునిముఖంలో అలసట ఏమాత్రం కనిపించడం లేదు. పైగా రాముడు ఖరుని చంపడానికి అవకాశము కొరకు ఎదురు చూస్తున్నాడు అని ఖరునికి తెలియదు.

ఖరుడు రాముని ధనుస్సును సగ భాగంలో విరగగొట్టాడు. మరొక బాణంతో రాముని కవచమును విరిచాడు. రాముని కవచము విరిగి నేలమీద పడింది. అదే అవకాశముగా, ఖరుడు రాముని శరీరం అంతా బాణములతో కొట్టాడు. విజయోత్సాహంతో పెద్దగా అరిచాడు. రాముడు వెంటనే తనకు అగస్త్యమహాముని ఇచ్చిన వైష్ణవ ధనుస్సుకు నారి బిగించి సంధించాడు. ముందు ఖరుని ధ్వజమును కూల్చాడు. అది చూచిన ఖరుడు కోపించి రాముని మర్మస్థానముల మీద నాలుగు తీవ్రమైన బాణములు ప్రయోగించాడు. ఆ బాణములు రాముని శరీరమునకు తగిలి రాముని శరీరం అంతా రక్తంతో తడిసి ముద్ద అయింది.

రాముని కోపము కట్టలు తెంచుకుంది. ఒక బాణముతో ఖరుని శిరస్సును, రెండు బాణములతో ఖరుని రెండు చేతులను, మూడు అర్ధచంద్రాకారపు బాణములతో ఖరుని వక్షస్థలమును కొట్టాడు. ఎలాగైనా ఖరుని చంపాలని నిశ్చయించుకొన్న రాముడు ఖరుని మీద తీవ్రమైన 13 నారాచములను ప్రయోగించాడు. అందులో ఒక బాణముతో ఖరుని రథము యొక్క నొగలను, నాలుగు బాణములతో నాలుగు గుర్రాలను, ఒక బాణముతో రథ సారథిని, మూడు బాణములతో రథం ముందు భాగమును, రెండు బాణములతో

ఖరుని రథము ఇరుసులను, ఒక బాణముతో ఖరుని కంఠమును కొట్టాడు. ఇలా 13 బాణములతో ఖరుని ఆపాదమస్తకము కొట్టాడు రాముడు.

ఖరునికి రథము విరిగిపోయింది. సారథి చచ్చాడు. రథానికి కట్టిన గుర్రాలు నేలకూలాయి. విల్లు విరిగిపోయింది. చేసేది లేక ఖరుడు తన గదను తీసుకొని నేలమీదికి దూకాడు. ఖరుని ఆ విధంగా కొట్టినందుకు ఆకాశంలలో నిలబడి చూస్తున్న దేవతాసమూహములు రాముని అభినందించారు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఇరువది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఇరువది తొమ్మిదవ సర్గ.

ఒంటరిగా గద ధరించి తన మీదికి వస్తున్న ఖరుని చూచి రాముడు ఇలా అన్నాడు. "ఓ రాక్షసాధమా! నీవు సామాన్యుడివి కావు. చతురంగ బలములు కలిగిన 14,000 మంది సేనలకు అధిపతివి. కాని సాధు జనులు అసహ్యించుకొనే ఎన్నో అకృత్యాలు చేసావు. నీవలన సాధు జనులకు ప్రాణ భయం కలిగింది. ఎల్లప్పుడూ పాపకృత్యములు చేసే నీ వంటి పాపాత్ముడు ఎల్లకాలము జీవించలేడు. అతని పాపములే అతనిని నాశనం చేస్తాయి. అసలు నిన్ను ఆ జనులే

చంపాల్సింది. కానీ వారి బదులుగా నేను నిన్ను చంపుతున్నాను. కాని నీవు చేస్తున్నది తప్పు, పాపము అని నీకు తెలియదు. అందుకే ఇన్ని పాపపు పనులు చేసావు. చేసిన పాపములకు ఫలితము అనుభవిస్తున్నావు.

ఈ దండకారణ్యములో ఎంతో మంది ఋషులు, మునులు ప్రశాంతంగా తపస్సు చేసుకుంటున్నారు. వారు నీకు ఏమి అపకారము చేసారని వారిని అనేక బాధలు పెట్టావు. అడ్డం వచ్చిన వారిని చంపావు. నీకు ధనబలము, అంగ బలము, సైనిక బలము ఉంది కదా అని విర్రవీగావు. కాని సాధుజనుల ఆగ్రహము ముందు నీ బలము నిలువలేదు. అందుకే పతనమయ్యావు.

నీవే కాదు ఈ సృష్టిలో ప్రతి ప్రాణి కూడా తాను చేసిన పాపపు పనులకు ఫలితమును అనుభవింపక తప్పదు. విషం కలిపిన అన్నం తింటే వెంటనే ఎలా మరణం సంభవిస్తుందో, పాపపు పనులుచేస్తే, ఆ పాపఫలము కూడా వెంటనే కట్టికుడుపుతుంది. దుష్ట శిక్షణ కొరకు ఈ దండకారణ్యములో ఉన్న ఋషులు, మునులు నన్ను ఆశ్రయించారు. అందుకే నేను దుష్టుడవైన నిన్ను చంపుతున్నాను. ఓ ఖరుడా! ఇప్పటిదాకా నీవు నీ అనుచరులు ఈ దండకారణ్యములో ఉన్న మునులను, ఋషులను ఎలా యమపురికి పంపారో, అలాగే నీవు కూడా నీ అనుచరులను అనుసరించి యమపురికి వెళుతున్నావు. నీవు చంపిన మునులందరూ స్వర్గ ద్వారముల వద్ద నిలబడి, నువ్వు నరకానికి పోవడం కళ్లారా చూస్తారు. ఓ దురాత్ముడా! కాచుకో! ఒకే ఒక్క బాణంతో నీ తల తాటి పండు మాదిరి నేల మీద దొర్లుతుంది." అని తన ధనుస్సు ఎక్కుపెట్టాడు రాముడు.

రాముని సూటీ పోటీ మాటలు విన్న ఖరుడు అవమాన భారంతో కోపంతో రగిలిపోయాడు. "ఓ రామా! ఇదేంటి! నిన్ను నువ్వే పొగుడుకుంటున్నావు. నా సైన్యము నశించినా నేను ఇంకా బతికే ఉన్నాను. అప్పుడే నన్ను గెల్చానని గర్వపడుతున్నావు. నిన్ను నీవే అభినందించుకుంటున్నావు.

నీకు తెలుసో లేదో పరాక్రమ వంతులు, వీరులు తమ విజయాన్ని తాము ఎప్పుడూ చెప్పుకోరు. ఇతరులు చెబితే ఆనందిస్తారు. వినయము వివేకము లేని నీ వంటి క్షత్రియాధములు మాత్రమే తమను తాము అభినందించుకుంటారు. అదే పని నీవు చేస్తున్నావు. నిన్ను నీవే పొగుడుకుంటున్నావు.

రామా! నీకు మృత్యువు ఆసన్నమయింది. ముందు అది తెలుసుకో. నిన్ను అభినందించుకోడం మానుకో! లేకపోతే కాలిన దర్భలాగా మసి అయిపోతావు. నీ ఎదుట పాశమును చేత ధరించిన కాల యముడి వలె గదాయుధమును ధరించి కదులుతున్న పర్వతము మాదిరి  నిలబడ్డ నన్ను చూస్తున్నావు కదా! జీవులు యముని కాలపాశమునకు బలి అయినట్టు నువ్వు నా గదాయుధమునకు బలి అవుతావు.

ఓ రామా! ఇంకా నీ గురించి ఎంతో చెప్పాలి. కానీ సూర్యాస్తమయము కాబోతోంది. సూర్యాస్తమయం తర్వాత యుద్ధం చేయకూడదని నియమం ఉంది కదా!  అందుకని చెప్పడం లేదు. నీవు నా సేనలను 14,000 మందిని మట్టుబెట్టావు. ఈ రోజు నేను నిన్ను చంపి వాళ్ల బంధు మిత్రుల కన్నీళ్లు తుడుస్తాను."

ఇలా మాట్లాడిన ఖరుడు తన గదను రాముని మీదికి విసిరాడు. రాముడు ఒకే ఒక బాణంతో ఆ గదను ముక్కలు చేసాడు. ఆ ముక్కలు ఉల్కాపాతముల వలె నేలమీద పడ్డాయి.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఇరువది తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్య కాండము

## ముప్పదవ సర్గ.

రాముడు ఖరుని గదను తుత్తునియలు చేయగానే ఖరుడు నివ్వెరపోయాడు. రాముడు ఖరుడు అప్పటిదాకా మాట్లాడిన మాటలకు ప్రత్యుత్తరము ఇచ్చాడు.

"ఓ రాక్షసాధమా! నీ బలం ఎంతో తేలిపోయింది కదా! వృధాగా అరుస్తావు ఎందుకు. ఏ గదాఘాతముతో నన్ను చంపుదామనుకున్నావో ఆ గద నా బాణఘాతముతో విరిగి ముక్కలై నేలమీద పడిపోయింది. మరి ఇప్పుడు నీవు పోయి మరణించిన నీ సైనికుల బంధుమిత్రుల కన్నీళ్లు ఎలా తుడుస్తావు. నీ మాటలు వమ్ముఅయినట్లే కదా!

దుష్టుడు, దుర్మార్గుడు అయిన నిన్ను చంపడానికి నాకు కారణం ఉంది. నీవు చంపదగ్గవాడవు. అందుకే నిన్ను చంపుతున్నాను.

నీ కంఠమును తెగనరుకుతాను. నీ నెత్తురుతో భూమాతను తడుపుతాను. నీకు భూపతనము తప్పదు. నిన్ను చంపి ఈ దండకారణ్యమును శత్రుపీడ, రాక్షస పీడ లేకుండా చేస్తాను.

ఇప్పటి దాకా ఈ దండకారణ్యములో నిత్యము బ్రాహ్మణులను, మునులను నీవు నీ పరివారము బాధిస్తున్నారు, చంపుతున్నారు. ఈ రోజు నుంచి  ఈ దండకారణ్యములో ఋషులు, మునులు, బ్రాహ్మణులు నిర్భయంగా తపస్సు చేసుకొనేలా చేస్తాను. ఎంతోమంది ఋషులకు, మునులకు ఈ దండకారణ్యము ఆశ్రయము కాగలదు. ఇప్పటి దాకా ఋషులను, మునులను భయపెడుతూ, వారి యజ్ఞయాగములను నాశనం చేస్తూ, వారిని చంపుతున్న రాక్షస స్త్రీలు ఇంక ఈ దండకారణ్యము విడిచిపోకతప్పదు. నీ భార్యలందరూ నీ శవం మీద పడి ఏడ్చేరోజు వచ్చింది." అని నిర్భయంగా మాట్లాడుతున్న రాముని చూచి ఖరుడు రాముడి బెదిరించడానికి పూనుకున్నాడు.

"ఓ రామా! నీవు అవివేకివే అనుకున్నాను. గర్విష్ఠివి కూడా. నీకు మహా గర్వము ఉంది. అవసాన దశలో మానవులకు ఇలాంటి గర్వమే ఉంటుంది.  చచ్చేముందు సంధిప్రేలాపన లాగా నీవు కూడా ఏదేదో మాట్లాడుతున్నావు." అంటూ ఖరుడు తగిన ఆయుధము కొరకు చుట్టూ చూచాడు. దగ్గరలోనే ఉన్న ఒక సాలవృక్షమును కూకటి వేళ్లతో పెకలించాడు. దానిని ఆయుధంగా ధరించి, "రామా! ఈ దెబ్బతో నువ్వు  చచ్చావురా!" అంటూ ఆ చెట్టును బలంగా రాముని మీదికి విసిరాడు.

రాముడు తన మీదికి అత్యంత వేగంతో దూసుకువస్తున్న సాలవృక్షమును తన వాడి అయిన బాణములతో రెండుగా ఖండించాడు. వెంటనే రాముడు వేయి బాణములను ఒకదాని వెంట ఒకటిగా సంధించి ఖరుని శరీరం అంతా తూట్లు పడేట్టు కొట్టాడు. ఖరుని శరీరం నుండి రక్తం జలపాతంలాగా బయటకు ఉరికింది. తన శరీరం అంతా నెత్తురు కారుతుండగా ఖరుడు రాముని మీదికి పరుగెత్తాడు. రాముడు ఆగ్నేయాస్త్రమును సంధించాడు. ఖరుని గుండెలకు గురిపెట్టి కొట్టాడు. ఆ అస్త్రము ఖరుని గుండెలను చీల్చింది. ఖరుడు మొదలు నరికిన చెట్టులాగా కిందపడ్డాడు. ఖరుని ప్రాణవాయువులు అనంత వాయువుల్లో కలిసిపోయాయి. దండకారణ్యమునకు శాశ్వతంగా రాక్షస పీడ విరగడ అయింది.

ఆ దృశ్యమును చూచిన దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులు రాముని ఎంతో ప్రశంసించారు. అప్పుడు దేవతలు అసలు విషయాన్ని తమలో తాము చెప్పుకున్నారు.
"దేవేంద్రుడు శరభంగాశ్రమమునకు ఇందుకే వెళ్లాడట. ఈ ఖరుని దూషణుని సంహరించడానికే ఆ మునులు రాముని ఈ ప్రాంతమునకు తీసుకొని వచ్చారట. ఇంక దండకారణ్యములో ఋషులు, మునులు, బ్రాహ్మణులు సుఖంగా జీవించగలరు." అని అనుకొన్నారు. అంతట దేవతలు దేవ దుందుభులు మ్రోగించారు. రాముని మీద పుష్పవర్షము కురిపించారు.

రాముడికి, ఖరునికి, దూషణునికి, 14,000 మంది రాక్షసులకు జరిగిన యుద్ధము దాదాపు ఒకటిన్నర ముహూర్తకాలము జరిగింది. (ముహూర్తము అనగా 48 నిమిషములు. అనగా ఒక గంటా

పన్నెండు నిమిషముల పాటు జరిగింది.) రాముని వీర్యమును పరాక్రమమును యుద్ధకౌశలమును తలుచుకుంటూ దేవతలు తమ తమ నివాసములకు వెళ్లారు.

రామునికి రాక్షసులకు మధ్యయుద్ధము ముగిసింది అని తెలుసుకొన్న లక్ష్మణుడు సీతతో సహా గుహ నుండి వెలుపలికి వచ్చాడు. రాముని తో వచ్చిన మునులు ఋషులు రాముని అభినందిస్తూ ఉండగా రాముడు సీతా సమేతంగా పర్ణశాలలో ప్రవేశించాడు.

పర్ణశాలలోకి రాగానే సీత తన భర్త రాముని అభినందన పూర్వకంగా కౌగలించుకుంది. తరువాత సీతారాములు బయటకు వచ్చారు. యుద్ధములో చనిపోయిన రాక్షసులను చూచింది సీత. రామునికి ఏ అపాయము కలగనందుకు ఎంతో ఆనందపడింది.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ముప్పదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

(రామాయణంలో మొట్టమొదటి సారిగా రాముడు విల్లు పట్టి ఒంటరిగా రాక్షస సంహారం చేసాడు. ఒక విధంగా దీనిని మనం రామ రావణ యుద్ధం ముందు జరిగిన రిహార్సల్‌గా భావించవచ్చు. మహా భారతంలో కూడా ఉత్తరగోగ్రహణ సందర్భంలో అర్జునుడు ఒంటరిగా భీష్మ,ద్రోణ,కృప,అశ్వత్థామ, కర్ణ,సుయోధనులతో పోరాడి గెలుస్తాడు. అది కూడా మహాభారత యుద్ధానికి ముందు జరిగిన రిహార్సల్ లాంటిది.

ఈ ప్రకారంగానే మనకు రామాయణ భారత గాధలలో చాలా పోలికలు కనిపిస్తాయి. కుతూహలం కొద్దీ వాటిని ఇక్కడ ప్రస్తావిస్తు న్నాను.

1. రామాయణంలో కైక, ముందు వరాలు కోరి, దశరథునిచేత ఇస్తాను అని మాటతీసుకొని, తరువాత రాముని వనవాసమునకు పంపమని అడిగింది. అంటే రామ వనవాసము సంగతి ముందు చెప్ప కుండా దశరథుని మోసం చేసింది.

మహాభారతంలో కూడా సుయోధనుడు ధర్మరాజును జూదం ఆడటానికి రమ్మని పిలిచాడు. తీరా వచ్చి కూర్చున్న తరువాత, నేను జూదం ఆడను, మామ శకుని ఆడతాడు, నేనుపందెం ఒడ్డుతాను అని మాట మార్చి, మోసం చేసి శకుని చేత జూదం ఆడించాడు. ధర్మరాజును ఓడించాడు.

2. కైక వరాల పర్యవసానము రాముని అరణ్యవాసము.

మాయాద్యూతం పర్యవసానము పాండవుల అరణ్యవాసము.

3. రావణుడు సీతను అరణ్యంలో ఉండగా అపపహరించి అవమానించాడు.

సైంధవుడు అరణ్యంలో ఉండగా ద్రౌపదిని అపహరించి అవమానించాడు. సుయోధనుడు నిండు కొలువులో ద్రౌపదిని

అవమానించాడు.

4.రామరావణ యుద్ధానికి ముందు రాముడు ఒంటరిగా ఖర, దూషణాదులతో, 14,000 మంది సైనికులతో యుద్ధం చేసి గెలిచాడు.

మహాభారత యుద్ధానికి ముందు, ఉత్తర గోగ్రహణ సమయంలో అర్జునుడు ఒంటరిగా కౌరవ ప్రముఖులతోనూ, అపారమైన కౌరవ సేనతోనూ యుద్ధం చేసి గెలిచాడు.

5. రామరావణ యుద్ధానికి ముందు అంగదుడు, తరువాత హనుమంతుడు రావణుని వద్దకు రాయబారానికి వెళ్లారు.

మహాభారత యుద్ధానికి ముందు ద్రుపదుని పురోహితుడు, తరువాత శ్రీకృష్ణుడు సుయోధనుని వద్దకు రాయబారులుగా వెళ్లారు.

6. రెండు రాయబారాలు విఫలం అయ్యాయి.

7. రాయబారానంతరము రావణుడు హనుమంతుని పట్టుకోడానికి ప్రయత్నిస్తే హనుమంతుడు లంకాదహనం చేసాడు.

రాయబారానంతరము సుయోధనాదులు శ్రీకృష్ణుని బంధించడానికి ప్రయత్నిస్తే కృష్ణుడు తన విశ్వరూపం ప్రదర్శించాడు.

8.రామ రావణ యుద్ధంలో విభీషణుడు ఇంటి గుట్టును రాముడికి చెప్పాడు. రావణుని మరణానికి కారకుడయ్యాడు.

భీమసుయోధనుల గదా యుద్ధంలో శ్రీకృష్ణుడు సుయోధనుని మరణ రహస్యం భీమునికి తొడ చరచడం ద్వారా సూచించాడు. సుయోధనుని మరణానికి కారకుడయ్యాడు.

9.రామరావణ యుద్ధం తరువాత రాముడు తన ప్రతినిధిగా విభీషణుని లంకకు రాజ్యాభిషిక్తునిగా చేసాడు.

మహాభారత యుద్ధానంతరము ధర్మరాజు హస్తినాపురానికి పట్టాభిషిక్తు డయ్యాడు.

10. రాముడు ఒక రజకుని మాటను విని అగ్నిపరీక్షకు గురి అయిన సీతను కూడా వదిలేసాడు.

స్వర్గారోహణం చేస్తూ ధర్మరాజు, ద్రౌపది కిందపడిపోతే, చనిపోతే, ఆమెకు అర్జునుని మీదనే ప్రేమ ఎక్కువ అనీ, తన మీద కాదు అని చెప్పి నిర్దయగా, తిరిగి కూడా చూడకుండా వదిలేసాడు ధర్మరాజు.

11.రామాయణంలో కథానాయిక సీత అయోనిజ అంటే నాగేటి చాలులో పుట్టింది.

మహాభారతంలో కథానాయిక ద్రౌపది కూడా అయోనిజ అగ్ని కుండంలో నుండి జన్మించింది.

ఈ ప్రకారంగా రామాయణ, భారత కధలలో ఇన్ని పోలికలు ఉన్నాయి. యుగాలు మారినా మనుషులు, వారి బుద్ధులు మారవు. వారి కధలూ మారవు. అన్నీ ఒకేలా ఉంటాయి. ఈనాడు కూడా అంతే. నాడు రాజ్యం కోసరం, స్త్రీల కారణంగా యుద్ధాలు జరిగితే, నేడు కూడా ఆస్తుల కారణంగా, ఆడవాళ్ల కారణంగా కుటుంబ కలహాలు, కుటుంబాలు విడిపోవడం, వైరాలు, వైషమ్యాలు కలుగుతున్నాయి. అందుకే ఇంటింటి  రామాయణం అనే సామెత పుట్టింది.)

# అరణ్యకాండము

ముప్పది ఒకటవ సర్గ.

(ఈ సర్గ ప్రాచ్యప్రతిలో లేదు. ఇది ప్రక్షిప్తము అనగా తరువాత చేర్చబడినది అని పండితుల అభిప్రాయము)

ఖరుడు, దూషణుడు తమతమ సేనలతో సహా యుద్ధంలో మరణించారు అన్న వార్త జనస్థానంలో దావానలంలా పాకిపోయింది. వెంటను అకంపనుడు అనే రాక్షసుడు లంకానగరానికి బయలు దేరాడు. రావణుని కలుసుకున్నాడు.

“ఓ రావణా! నేను జనస్థానము నుండి వస్తున్నాను. అక్కడ మీ ప్రతినిధులుగా ఉన్న ఖరుడు, దూషణుడు, వారి సైన్యము పూర్తిగా యుద్ధంలో చంపబడ్డారు. నేను మాత్రము తప్పించుకొని ఈ వార్త తమకు చెబుదామని వచ్చాను.” అని జరిగింది క్లుప్తంగా వివరించాడు.

ఆ మాటలు విన్న దశగ్రీవుడు కోపంతో మండి పడ్డాడు. అకంపనుని చూచి ఇలా అన్నాడు.

“ఓ అకంపనా! ఇది నిజమా! నా అధీనంలో ఉన్న జనస్థానమును నాశనం చేసి, ఖరదూషణాదులను చంపిన వాడు ఎవరు? వాడికి ఆయువు మూడిందా! లేకపోతే ఇలా ఎందుకు చేస్తాడు. నాకు అపకారము చేసిన తరువాత దేవేంద్రుడైనా, కుబేరుడైనా, యముడైనా ఆఖరుకు విష్ణువైనా సుఖంగా బతకలేరు కదా! ఇంక వీడెంత? వాడెవరో వాడికి నా సంగతి తెలియనట్టుంది. నేను యముడికి యముడను. అగ్నిని కూడా కాల్చివేయగల సమర్థుడను. మృత్యుదేవతకే మృత్యువును. నాకు కోపం వస్తే సూర్యుడిని, అగ్నిని కూడా దహించివేస్తాను. వాయువును కూడా శాసించగలను. అకంపనా! ఇంతకూ వాడెవడు? ఎక్కడ నుంచి వచ్చాడు. ఎక్కడ ఉంటాడు?” అని కోపంగా అడిగాడు రావణుడు.

ప్రళయాగ్నితో సమానమైన రావణుని కోపం చూచి అకంపనుడు భయంతో వణికిపోయాడు. “నన్ను తమరు చంపను అని అభయం ఇస్తే జరిగింది చెబుతాను” అని అన్నాడు గడగడా వణుకుతూ.

రావణుడు కొంచెం శాంతించాడు. “అలాగే అభయం ఇచ్చాను. ఏం జరిగిందో సవిస్తరంగా చెప్పు” అని అన్నాడు. అకంపనుడు ఇలా చెప్పసాగాడు.

“అయోధ్యానగరమును పరిపాలించు దశరథుని కుమారుడు రాముడు. యువకుడు. మహా పరాక్రమశాలి. ఆజానుబాహుడు. గొప్ప వీరుడు. అతడే ఒంటరిగా ఖరుని, దూషణుని, ససైన్యంగా సంహరించాడు.” అని మరలా క్లుప్తంగానే చెప్పాడు ఏం చెబితే ఏమవుతుందో అని భయంతో.

ఆ మాటలు విన్న రావణుడు ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చాడు. రావణునిలో ఇదివరకు ఉన్న కోపం స్థానంలో ఆలోచన చోటు చేసుకుంది. “అకంపనా! రాముడు ఒంటరిగా జనస్థానమునకు వచ్చాడా లేక ఇంద్రుని, దేవతలను తోడుగా తీసుకొని వచ్చాడా?” అని అడిగాడు, రాముని వెనుక ఉన్న శక్తులు ఏమిటో తెలుసుకుందామనే ఆలోచనతో.

రావణుని కోపం తగ్గగానే అకంపనుడిలో ధైర్యం పుంజుకుంది. మరలా రాముడి గురించి చెప్పసాగాడు.

“ఆ రాముడు మహాతేజస్సు కలవాడు. సర్వశ్రేష్ఠధనుర్ధారి. దివ్యాస్త్రసంపన్నుడు. ఇంతెందుకు దేవేంద్రునితో సమానమైన వాడు. ఆ రాముడి వెంట లక్ష్మణుడు అని అతని తమ్ముడు ఉన్నాడు. అన్నకంటే మించిన వాడు. మహా బలశాలి. రామ లక్ష్మణుల చేరికతో అగ్నికి వాయువు తోడైనట్టే. అటువంటి రాముడు ఒంటరిగానే జనస్థానమును సర్వనాశనం చేసాడు. అంతేగానీ తమరు అన్నట్టు దేవేంద్రుడు గానీ, దేవతలు గానీ జనస్థానమునకు రాలేదు. రాముడు ప్రయోగించిన బాణములు కాలసర్పముల వలె జనస్థానములో ఉన్న రాక్షసులను కబళించి వేసాయి.

ఓ రాక్షసరాజా! రాముడు ఒక్కడైనా ప్రతి రాక్షసుని ముందు ఒక్కోరాముడిలాగా ప్రత్యక్షం అయి వాళ్లను నాశనం చేసాడు. " అని అన్నాడు అకంపనుడు.

అకంపనుని మాటలు సావధానంగా విన్నాడు రావణుడు. ఎవరిని పంపినా లాభం లేదు అనుకున్నాడు. తానే జనస్థానమునకు పోవాలి అని నిశ్చయించుకున్నాడు.

"అకంపనా! ఇంక నీవు వెళ్లవచ్చు. నేనుస్వయంగా జనస్థానమునకు వెళ్తాను." అని అన్నాడు.

"రాక్షసరాజా! నా మనవి వినండి. రాముడు సామాన్యుడు కాడు. రాముని జయించడం మన వల్లకాదు. రాముడికి కోపం వస్తే వేగవంతమైన నదీప్రవాహాన్ని కూడా నిలువరించగల సమర్థుడు. రాముడు భూమ్యాకాశాలను ఏకం చేయగల వీరుడు. సప్తసముద్రము లను ఏకం చేసి ఈ భూమిని ముంచివేయగల పరాక్రమశాలి. రాముడు ఈ లోకములనన్నిటినీ నాశనం చేసి మరలా సృష్టించగల మేటి. (సృష్టి, స్థితి, లయకారకుడు అని అర్థం. రాముడు భగవంతుడు అని అకంపనుడి అభిప్రాయం). ఓ రావణా! నీవుగానీ, నీ రాక్షస సైన్యము కానీ రాముని జయించడం కల్ల. నీవే కాదు. దేవాసురులు ఏకమై వచ్చినా రాముని యుద్ధంలో ఎదుర్కొనలేరు.

కాని రావణా! ఎటువంటి వాడికైనా ఒక బలహీనత ఉంటుంది కదా! ఆ మార్గంలో వెళితే రాముని చంపవచ్చు. ఆ రామునికి సీత అనే అతిలోకసౌందర్యవతి భార్య ఉంది. మంచి యౌవనవతి. దేవతా

స్త్రీలుగానీ, అప్సరసలు కానీ అందంలో ఆమెకు సాటిరారు. సీత అంటే రాముడికి పంచప్రాణాలు. సీత లేకుండా రాముడు బతకలేడు. నీవు కనక సీతను అపహరించి తీసుకొని వస్తే, సీత మీద బెంగతో రాముడు ప్రాణాలు విడుస్తాడు. రాముని చంపడానికి ఇది ఒకటే మార్గము." అని ఒక ఉపాయం చెప్పాడు అకంపనుడు.

రావణునికి ఈ మాటలు కర్ణపేయంగా వినపడ్డాయి. ఒక దెబ్బతో రెండు పిట్టలు. సీతను అపహరిస్తే అటు రాముడు చస్తాడు, ఇటు సీతా తనకు దక్కుతుంది. ఇలా వక్రంగా ఆలోచించాడు రావణుడు, అకంపనుని చూచి ఇలా అన్నాడు.

"అకంపనా! మంచి ఆలోచన చెప్పావు. నేను ఒక్కడినే రేపే జనస్థానమునకు వెళ్లి, సీతను నా రథము మీద కూర్చుండపెట్టుకొని లంకకు తీసుకొని వస్తాను." అని అన్నాడు.

వెంటనే మంచి గాడిదలు కట్టిన రథమును సిద్ధం చేయమన్నాడు. గాడిదలు కట్టిన రథంలో రావణుడు ఆకాశమార్గంలో జనస్థానమునకు వెళ్లాడు. జనస్థానము దగ్గర ఉన్న రాముని వద్దకు వెళ్లే ముందు, రావణుడు మారీచుని వద్దకు వెళ్లాడు. రావణుని చూచి మారీచుడు అతనికి సకల ఉపచారములు చేసాడు. భక్ష్యములను, భోజన పదార్థములను సమర్పించాడు. రావణుడు భోజనం చేసి మారీచుడు చూపిన ఉచితాసనము మీద కూర్చున్నాడు. అప్పుడు మారీచుడు రావణునితో ఇలా అన్నాడు.

"రాక్షసరాజా! నీకు జయము కలుగు గాక! లంకలో అందరూ

క్షేమమే కదా! ఎందుకంటే ఏ కార్యమైనా నీ కనుసైగతో పూర్తి చేయగల సమర్థుడవు, అటువంటిది నీవే స్వయంగా ఇక్కడకు వస్తే నాకు ఏదో సందేహముగా ఉంది. అందుకని అడిగాను. తమరు ఏదో తొందరపని మీద ఇక్కడకు వచ్చి ఉంటారు అని అనుకుంటాను." అని అన్నాడు మారీచుడు, "ఏం పని మీద వచ్చారు" అని సూటిగా రావణుని అడక్కుండా.

మారీచుని మాటలు విన్న రావణునికి మారీచుని మనసులోని సందేహం అర్థం అయింది. అందుకని సూటిగానే చెప్పాడు.

"మారీచా! ఎవరో రాముడు అట. జనస్థానములో ఉన్న ఖరుడు, దూషణుడు, వారి 14,000 సైన్యమును ఒంటి చేత్తో తుదముట్టించాడట. ఎవరికీ తేరిపార చూడటానికి శక్యం కాని జనస్థానమును సర్వనాశనం చేసాడట. ఆ రాముని ఉపాయంతో చంపవలెనని అనుకుంటున్నాను. ఆ రామునికి తన భార్య సీత అంటే ప్రాణము. ఆ సీతను అపహరిస్తే, రాముడు ప్రాణాలు విడుస్తాడు. అందుకని రాముని భార్య సీతను అపహరించవలెనని అనుకుం టున్నాను. దానికీ నీ సాయం కావాలి." అని సూటిగా అడిగాడు రావణుడు.

ఒక్కసారిగా ఉలిక్కి పడ్డాడు పడ్డాడు మారీచుడు. "రావణా! నీకు ఇటువంటి ఆలోచన చెప్పిన వాడు ఎవరు? రాముని భార్య సీతను అపహరించమని చెప్పిన ఆ దుర్మారుడు, దుష్టుడు ఎవరు? వాడు నీకు ఆప్తుడు కాదు. నీకు పరమశత్రువు. నీ నాశనం కోరి నీకు

ఇటువంటి ఆలోచన కలిగించాడు. "సీతను అపహరించాలి" అనే ఆలోచనే నీ సర్వనాశనానికి దారితీస్తుంది. నీకు ఈ ఆలోచన చెప్పినవాడు ఎవరో కానీ, నిన్ను తప్పుదోవ పట్టించాడు. వాడు నీకు శత్రువు కాకపోతే నీకు కాలసర్పము నోటిలో కోరలు పీకమని చెబుతాడా?

రావణా! నేను చెబుతున్నాను విను. రాముడు ఒక మదగజము. దాని కాళ్ల కిందపడి నలిగిపోతావు. రాముడు ఒక సింహము. ఆ సింహము జూలుపట్టి లాగకు. లేడిపిల్ల మాదిరి దాని కోరలకు బలి అయిపోతావు. రాముడు ఒక సుడిగుండము. అనవసరంగా ఆ సుడిగుండములో దూకకు. మరలా ప్రాణాలతో బయటకు రాలేవు. ఆ ప్రవాహవేగానికి కొట్టుకుపోతావు. ఓ లంకేశ్వరా! నా మాటవిను. తిరిగి లంకకు వెళ్లు. హాయిగా లంకను పాలించు. నీ భార్యలతో సుఖించు. రాముడిని తన భార్యతో ఆ అడవిలోనే ఉండనీ. రాముని జోలికి పోకు." అని హెచ్చరించాడు మారీచుడు. రావణుడు మారీచుని మాటలు విని తిరిగి లంకకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము ముప్పది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(ఈ సర్గలో ఒక కొత్త పాత్ర ప్రవేశపెట్టబడింది. అతని పేరు అకంపనుడు అనే రాక్షసుడు. ఈ అకంపనుడు ఎవరు? ఇంతదాకా వీడిపేరు రాలేదు. వీడు రాక్షసుల గూఢచారా! ఖరదూషణుల మంత్రి అయితే

కాదు. ఎందుకంటే అందరి మంత్రుల పేర్లు పైన వివరంగా చెప్పబడ్డాయి. ఇంతకూ అసలు పాత్రధారి శూర్పణఖ ఏమయింది. ఆమెకు కదా అవమానము జరిగింది. ఆమె కదా ముందుగా వచ్చి రావణునికి చెప్పాలి. ఆమెకన్నా ముందుగా ఈ అకంపనుడు ఎందుకు వచ్చినట్టు? అకంపనుడికి రాముడికి పరిచయం ఉన్నట్టు వాల్మీకి చెప్పలేదు. కాని అకంపనుడు రాముడి గురించి ఎన్నోవిషయాలు చెప్పాడు. సృష్టి,స్థితి,లయకారుడు అని వర్ణించాడు. రామునితో అకంపనుడికి అంతపరిచయం ఉందా! పైగా సీతను అపహరించమని సలహా ఇచ్చాడు. ఒక అనామకుడైన రాక్షసుడు చెప్పగానే గాడిదలు కట్టిన రథం మీద ఆకాశంలో ఎగురుకుంటూ వెళ్లాడు రావణుడు. ఇది నమ్మశక్యంగా ఉందా! వెళ్లిన వాడు నేరుగా జనస్థానానికి వెళ్లాలి. కానీ లంచ్‌బ్రేక్ కు అన్నట్టు మారీచుని వద్దకు వెళ్లాడు. ఇంతకూ మారీచుడు ఎక్కడ ఉన్నాడు. జనస్థానములోనా లేక వేరే ఇంకొకచోటా! ఆ విషయం చెప్పబడలేదు. మారీచుడు వద్దు అనగానే రావణుడు వెనక్కుతిరిగి వెళ్లిపోయాడు. దిక్పాలకులను శాసించగల రావణుడు ఇలా చేస్తాడా! ఇవన్నీ జవాబులు లేని ప్రశ్నలు. బ్రహ్మశ్రీ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రులవారి వ్యాఖ్యానం ప్రకారం ఈ సర్గ ప్రాచ్యప్రతిలో లేదు. పైగా ఈ సర్గలో ఉన్న శైలి, మిగిలిన సర్గలలో ఉన్న శైలికి భిన్నంగా ఉంది. పైగా వాల్మీకి ఒక కొత్త వ్యక్తిని కానీ, కొత్త ప్రదేశమును కానీ పరిచయం చేసేటప్పుడు వారి గురించి కొన్ని పరిచయ శ్లోకాలు రాస్తాడు. ఇక్కడ మారీచుని గురించి కానీ, ఆయన ఉండే ప్రదేశము గురించి గానీ, అకంపనుడి గురించి ఏమీ చెప్పబడలేదు. అందుకని ఈ సర్గ మూల రామాయణంలో లేదనీ, తరువాత చేర్చబడినది అని పెద్దలు అభిప్రాయపడ్డారు.)

# అరణ్యకాండము

## ముప్పది రెండవ సర్గ.

తన అన్నలు ఖరుడు, దూషణుడు, వారి 14,000 సైన్యము తన కళ్లముందు నాశనం కావడం చూచి తట్టుకోలేక పోయింది శూర్పణఖ. ఒక్క రాముని చేతిలోనే ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు చావడం చూచి పెద్దగా కేకలుపెట్టింది. భయంతో శూర్పణఖ వణికిపోయింది. వెంటనే ఈ విషయం తన అన్న రావణునకు చెప్పడానికి శూర్పణఖ లంకకు పరుగెత్తింది.

లంకానగరంలో, రావణుడు, మూర్తీభవించిన దేవేంద్రుని వలె, సభాప్రాంగణంలో, తన బంగారు సింహాసనము మీద, కూర్చుని ఉన్నాడు. రావణుని చుట్టు అతని మంత్రులు కూర్చుని ఉన్నారు.

రావణుడు సామాన్యుడు కాడు. దేవతలను, గంధర్వులను యుద్ధములో గెలిచినవాడు. ముల్లోకములలో అతనికి తిరుగు లేదు. శత్రువులకు యముడు లాగా వెలుగుతున్నాడు రావణుడు. దేవాసుర యుద్ధములో అతని శరీరమునకు ఇంద్రుని వజ్రాయుధము వలనా, విష్ణువు చక్రాయుధము వలన  తగిలిన గాయముల మచ్చలు అతని విజయాలకు చిహ్నాలుగా రావణుని ఒంటిమీద  ప్రకాశిస్తున్నాయి. రావరణుని ఒంటికి తగిలి  దేవతల ఆయుధములు తమ శక్తిని కోల్పోయాయి.

రావణుడు దశకంఠుడు. అంటే పది తలలు కలవాడు. అతనికి ఇరువది చేతులు, పది తలలు. ఆ కనకపు సింహాసనము మీద వెండి కొండమాదిరి ప్రకాశిస్తున్నాడు రావణుడు. రావణుడు పరాక్రమవంతుడే కాదు. ఇతరుల భార్యలు అంటే అతనికి మక్కువ ఎక్కువ. ఒకసారి భోగవతీ నగరానికి పోయి, తక్షకుని భార్యను బలాత్కారంగా తీసుకొని వచ్చాడు. రావణునికి ధర్మాచరణము మీద నమ్మకము లేదు. రావణుడు కుబేరుని ఓడించి అతని వద్ద ఉన్న పుష్పక విమానమును అపహరించాడు.

రావణుడు దివ్యాస్త్రములను ఎంత నేర్పుగా ప్రయోగిస్తాడో, అంతే నేర్పుతో సాధుజనులు చేయు యజ్ఞయాగములను భగ్నం చేస్తాడు. రావణునికి కోపం వస్తే సుందర ఉద్యానవనములను, అందమైన వనములను, సరస్సులను నాశనం చేస్తాడు. ఎదుటివారు బాధపడుతుంటే ఆనందించే తత్వం రావణునిది. రావణుడు ఎంతటి అధర్మపరుడైనా గొప్ప తపశ్శాలి. పూర్వము బ్రహ్మను గూర్చి పదివేల సంవత్సరములు తపస్సు చేసాడు. తన శిరస్సులను ఖండించి బ్రహ్మదేవునికి సమర్పించాడు. దాని ప్రతిఫలంగా బ్రహ్మదేవుని వద్దనుండి తనకు యుద్ధములో దేవతలు, దానవులు, గంధర్వులు, పిశాచములు, పక్షిజాతులు, సర్పజాతులు, ఒక్క మానవులు తప్ప ఏ ఇతర జీవ జాతుల నుండి కూడా తనకు మరణము లేకుండా వరం పొందాడు. మానవులు తనను ఏమీ చేయలేరని గుడ్డినమ్మకం రావణునిది.

రావణునికి దేవతలు అంటే మంట. ఋత్విక్కులు యజ్ఞయాగములలో హవిస్సులు దేవతలకు ఇవ్వకుండా ఆ

యజ్ఞములను నాశనం చేసేవాడు. రావణుడు బ్రాహ్మణులను, ఋషులను, మునులను క్రూరంగా చంపేవాడు. అతని హృదయము పాషాణము. జాలి అనే పదానికి రావణునికి అర్థం తెలియదు. ప్రజలను హింసించడంలో ఆసక్తి చూపేవాడు.

అటువంటి రావణునికి శూర్పణఖ చెల్లెలు. తన గోడు చెప్పుకోడానికి శూర్పణఖ పరుగు పరుగున రావణుని వద్దకు వచ్చింది. కోయబడిన తన ముక్కు, చెవులను రావణుని చూపించి ఇలా పలికింది.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ముప్పది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ముప్పదిమూడవ సర్గ.

"అన్నా రావణా! అక్కడ జనస్థానములో జరగకూడని ఘోరాలు జరిగిపోతూ ఉంటే నువ్వు ఇక్కడ, సంతోషంగా బంగారు సింహాసనము మీద కూర్చుని రాజభోగములు, అంత:పుర స్త్రీలతో కామసుఖాలు అనుభవిస్తున్నావా! నీ రాజ్యములో ఏమి జరుగుతూ ఉందో తెలుసుకోవాలి అన్న జ్ఞానం కూడా నీకు లేదా! నీ వలె కామోప భోగములలో మునిగి తేలుతూ రాజ్యక్షేమమును మరిచే రాజును ప్రజలు గౌరవించరు. అది తెలుసుకో! రాజు ఏ కాలంలో చేయాల్సిన

పనులను ఆయాకాలములలో చేయక పోతే, ఆ రాజు, అతని రాజ్యము నశించిపోవడం తథ్యం.

ప్రజలకు దూరంగా ఉంటూ, గూఢచారుల ద్వారా ప్రజల కష్టనష్టములు తెలుసుకోకుండా, ఇంద్రియలోలుడై ప్రవర్తించేరాజును ప్రజలు పదవీచ్యుతుడిని చేస్తారు. తమ ఇంద్రియములను తాము నిగ్రహించుకోలేని రాజులు, ప్రజలను ఏమి రక్షిస్తారు? అత్యంత బలవంతులైన దేవతలు, గంధర్వులు, దానవులు నీకు ప్రబల విరోధులు. వారి వలన నీకు ఎప్పుడూ ముప్పు పొంచి ఉంది. కాని నీవు వారి కదలికలను గూఢచారుల వలన తెలుసుకోకుండా ప్రమత్తుడవై ఉంటున్నావు. అటువంటి వాడివి నీవు రాజుగా ఎలా ఉండగలవు?

ఓ రావణా! రాజు అయిన వాడు తన కోశాగారమును, గూఢచార వ్యవస్థను, పరిపాలనా వ్యవహారములను, తన అధీనములో ఉంచుకొని జాగరూకతతో ప్రవర్తించాలి. అలా చేయకపోతే నీకూ, మామూలు మనిషికి తేడా లేదు. ఓ రాజా! నీకు గూఢచారులు కళ్లలాంటి వారు. వారిని నీవు నిర్లక్ష్యం చేస్తే, నీవు గుడ్డివాడి కింద లెక్క. నీవే కాదు నీ మంత్రులు కూడా అసమర్థులు అని తెలుస్తూ ఉంది. లేకపోతే కనీసం వారు అయినా జనస్థానంలో ఏమి జరుగుతూ ఉందో తమ గూఢచార వ్యవస్థద్వారా తెలుసుకోకుండా ఉంటారా!

ఒక్క మానవుడు, రాముడు అనే వాడు, 14,000 మంది రాక్షస వీరులను ఒంటి చేత్తో మట్టుపెట్టాడు. ఇది నీకు తెలుసా! ఆ రాముడు రాక్షసులను చంపి దండకారణ్యములో ఉన్న ఋషులకు మునులకు రక్షణ కల్పించాడు. జనస్థానములో రాక్షసులకు

నిలువనీడలేకుండా చేసాడు. ఇవన్నీ నీకు తెలియవు. నీ సుఖములు, భోగలాలసత నీది. అధికార మదంతో నీవు  ఏదీ పట్టించుకోవు. నీ రాజ్యము ప్రమాదంలో ఉంది అన్న విషయాన్ని కూడా నీవు గ్రహించలేకపోతున్నావు.

ఓ రావణా! నీవు గర్వాంధుడవు. మొండివాడివి. ప్రమత్తుడివి. ఇతరుల కష్టములను చూచి ఆనందించేవాడివి. అటువంటి నీవు కష్టములలో ఉంటే నీకు ఎవరూ సాయం చెయ్యరని, నీ మొహం కూడా చూడరని గుర్తుపెట్టుకో!  నీ లాంటి గర్వాంధుడిని, ప్రజల కష్టసుఖములు పట్టించుకోనివాడిని, కోపిష్టిని ప్రజలే అంతమొం దిస్తారు. కార్యాకార్య విచక్షణ తెలియని రాజు రాజ్యభ్రష్టు డవుతాడు. ఒకసారి రాజ్యభ్రష్టత పొందిన రాజు, ఎంతటి సమర్థుడైనా, ప్రజల చేత గడ్డిపరక కన్నా హీనంగా చూడబడతాడు.
(అందుకే ఈ రోజుల్లో రాజకీయ నాయకులు ఏదో ఒక  పదవికోసం పాకులాడుతుంటారు.) అందుకని రాజు ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉండాలి. ఏమరుపాటు పనికిరాదు. అటువంటి రాజును ప్రజలు గౌరవిస్తారు. నీతి మంతుడైన రాజును, ఎల్లప్పుడూ అప్రత్తంగా ఉండే రాజును,  అతడిని ప్రజలు దేవుడి వలె పూజిస్తారు.

ఓ అన్నా! రావణా! నీలో పైన చెప్పిన సుగుణములు ఏవీ లేవు. అందుకనే నీకు జనస్థానములో జరిగిన విషయములు ఏమీ తెలియవు. ఎందుకంటే నీవు మునులను., ఋషులను అవమా నించడం, చంపడం, కామోపభోగములను అనుభవించడం,  వీటితోనే కాలం గడుపుతున్నావు. నీకు విచక్షణా జ్ఞానం లేదు. మంచి చెడులను నిర్ణయించే బుద్ధిలేదు. అందుకే నీవు అతి త్వరలో ఆపదలలో

చిక్కుకుంటావు. నీ రాజ్యం నశిస్తుంది. తర్వాత నీ ఇష్టం." అని నానా విధాలుగా తిట్టి ముగించింది శూర్పణఖ.

ఆ మాటలు అన్నది వేరేవాళ్లు అయితే రావణుడు వాడి తలనరికి ఉండేవాడు. కానీ ఈ మాటలు అన్నది స్వయానా తన చెల్లెలు. ఎంతో ఆపద వస్తేనే గానీ ఆమె అలా అనదు. అందుకని శూర్పణఖ మాటలలో అంతరార్థాన్ని గ్రహించడానికి ప్రయత్నిస్తున్నాడు రావణుడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ముప్పదిమూడవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

ముప్పది నాలుగవ సర్గ.

నిండు సభలో, మంత్రి సామంత దండనాధుల ముందు తనను తన చెల్లెలు శూర్పణఖ ఆ ప్రకారంగా కించపరిచి మాట్లాడటం సహించలేకపోయాడు రావణుడు. ఆమె మాటలలో నిజం ఉన్నా, ఆ నిజాన్ని ఒప్పుకోడానికి అతని అహం అంగీకరించలేదు. అందుకని పెద్ద స్వరంతో ఇలా అన్నాడు.

"శూర్పణఖా! ఎవరి గురించి నువ్వు మాట్లాడుతున్నావు? రాముడు రాముడు అంటున్నావు. ఎవరా రాముడు! అతని

బలపరాక్రమములు ఏపాటివి? అతను ఎలా ఉంటాడు? అతడు దండకారణ్యములోకి ఎందుకు ప్రవేశించాడు? నా సోదరులు ఖరుని, దూషణుని చంపాడు అంటున్నావు. అతని వద్ద ఏయే ఆయుధములు ఉన్నాయి. అనవసరమైన మాటలు మాని అసలు విషయం చెప్పు!" అని అన్నాడు రావణుడు.

అప్పటికి శూర్పణఖకు కూడా ఆవేశం చల్లారింది. రావణునికి ఉన్నది ఉన్నట్టు చెప్పడం మంచిది అని తలచి ఇలా చెప్పసాగింది.

"ఓ రాక్షసేంద్రా! ఆ రాముడు అయోధ్యాధిపతి దశరథుని కుమారుడు. అతడు ఆజానుబాహుడు. అరవిందదళాయతాక్షుడు. ముని వేషములో ఉన్నాడు కానీ ధనుర్బాణములను ధరించాడు. సౌందర్యములో మన్మథుని మించినవాడు. అతడు నారాచ బాణములను అత్యంత వేగముగా ప్రయోగించగల నేర్పుగలవాడు. అతడు ఎప్పుడు బాణం తీస్తాడో ఎప్పుడు సంధిస్తాడో ఎప్పుడు వేస్తాడో ఎవరికి తెలియదు. కాని ఆబాణాలుతగిలి రాక్షసులు చావడం మాత్రం కనపడుతుంది.

అతని ధనుస్సుమాత్రం ఎల్లప్పుడు ఒంగి వర్తులాకారంలో ఉంటుంది. అతని యుద్ధము నేను ప్రత్యక్షముగా చూచాను. అతడు ఖరదూషణులను, వారి సేనాధిపతులను, 14,000 సైనికులను ఒకటిన్నర ముహూర్తకాలములో సంహరించాడు. (ముహూర్తము అంటే 48 నిమిషముల కాలము. అంటే మొత్తము యుద్ధము 72 నిమిషము లలో ముగిసిపోయింది అని అర్థము.). ఆ యుద్ధములో నేను తప్ప తక్కిన రాక్షసులు అందరూ మరణించారు. నేను స్త్రీని కాబట్టి నన్ను

చంపలేదు అని అనుకుంటున్నాను.

ఆ రామునికి ఒక తమ్ముడు ఉన్నాడు. వాడి పేరు లక్ష్మణుడు. అతనికి మహాకోపము. అన్నతో సమానమైన బలపరాక్రమములు కలవాడు. అతనిని జయించడం కూడా చాలా కష్టము. రామునికి కుడిభుజము లక్షణుడు.  ఇంక ఆ రామునికి ఒక భార్య ఉంది. ఆమె పేరు సీత. మహా సౌందర్యవతి. దేవతాస్త్రీలు, అప్సరసలు, గంధర్వ కాంతలు అందరూ అందంలో ఆమె కాలిగోటికి కూడా చాలరు. ముల్లోకములలో సీత వంటి సౌందర్యవతిని, దేవ, దానవ, గంధర్వ, యక్ష, కిన్నెర స్త్రీలలో  నేను  ఇంతవరకు చూడలేదు.

రాముడు తన భార్యను అమితంగా ప్రేమిస్తాడు.   అటువంటి సీత ప్రేమను పొందిన రాముడు దేవేంద్రుని కన్నా గొప్పవాడు. (ఇప్పటిదాకా ఉన్నది ఉన్నట్టు చెప్పిన శూర్పణఖ మాట మార్చింది.) రావణా! నా ఉద్దేశంలో సీత లాంటి సౌందర్యవతి నీ వంటి వాడి దగ్గర ఉండాలి కానీ ఆ మానవునికి భార్యగా తగదు. నీవే ఆమెకు తగిన భర్తవు. ఆమె సౌందర్యమును చూచిన తరువాత నీవే ఆమెకు తగినవాడివి అనుకొని, ఆ మాట చెప్పడానికి, సీతను తీసుకురావడానికి వారి వద్దకు వెళ్లాను. ఆ సీతను బలవంతంగా నీ వద్దకు తీసుకు రావడానికి ప్రయత్నించాను. అపుడు ఆ ధూర్తుడైన లక్ష్మణుడు నన్ను పట్టుకొని నా ముక్కు చెవులు కోసి నన్ను అవమానించాడు.

నా సంగతి అటుంచు. ఈ సీతను నీవు ఒకసారి చూస్తే  ఆమె లేకుండా తిరిగి లంకానగరానికి రావు. ఆమె చూపులు అనే మన్మథ బాణములకు బలి అయిపోతావు. నా కైతే ఆమె నీకు భార్యగా తగినది

అనిపించింది. నీకు కూడా అదే ఉద్దేశ్యం ఉంటే వెంటనే బయలు దేరు. ఆ రామలక్ష్మణులను చంపి సీతను తీసుకొని రా. నీ భార్యగా చేసుకో. అమరసుఖాలు అనుభవించు. ఆ రామలక్ష్మణులను చంపి, రాముని చేతిలో చచ్చిన రాక్షసుల ఆత్మలకు శాంతి చేకూర్చు.

లక్ష్మణుని చంపితేనే నా అవమానానికి ప్రతీకారం చేసిన వాడివి అవుతావు. రామలక్ష్మణులు చస్తే సీత నీ వశం అవుతుంది. సీతలాంటి సౌందర్యరాసి భార్యగా ఉన్న నిన్ను ముల్లోకాలు శ్లాఘిస్తాయి. నీ ఇష్టం అయితే నేను చెప్పినట్టు చెయ్యి. సీత మంచి మాటలతో నీకు లొంగకుంటే, బలత్కారంగానైనా తీసుకొనిరా! నీ భార్యగా చేసుకో!

రాక్షసేంద్రా! అన్నింటి కన్నా ముందు, ఆ రాముడు నీ రాక్షససేనలను సర్వనాశనం చేసాడు అని గుర్తుంచుకో! రాముని సంహరించకపోతే దండ కారణ్యములో నీ సార్వభౌమత్వానికి విలువ ఉండదు. తరువాత నీ ఇష్టం." అని లేని పోని మాటలతో రావణుని రెచ్చగొట్టింది శూర్పణఖ.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ముప్పది నాలుగవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ముప్పది ఐదవ సర్గ.

శూర్పణఖ చెప్పిన విషయాలను సావధానంగా విన్నాడు రావణుడు. సభచాలించాడు. మంత్రులకు దండనాధులకు వెళ్లడానికి అనుమతి ఇచ్చాడు. శూర్పణఖ చెప్పిన విషయములను ఒకటికి రెండు సార్లు ఆలోచించాడు. ఒక నిర్ణయానికి వచ్చాడు.

శూర్పణఖ మాటల్లో అతనికి నచ్చింది సీత సౌందర్యవర్ణన. ఎక్కడ తగలాలో అక్కడే తగిలింది శూర్పణఖ వదిలిన మాటల బాణము. అంతా రహస్యంగా జరగాలి అనుకున్నాడు. మారువేషంలో రథశాలకు వెళ్లాడు. సారథిని వెంటనే రథము సిద్ధం చేయమన్నాడు. సారథి రథం సిద్ధం చేసాడు. రథానికి గాడిదలను కట్టాడు. వాటి ముఖాలు పిశాచాల మాదిరి ఉన్నాయి. రావణుడు రథం ఎక్కి సముద్రం వైపుకు వెళ్లాడు.

రావణుడు సముద్రం తీరం వెంట తన రథములో ప్రయాణం చేస్తున్నాడు. దారిలో ఎన్నో ముని ఆశ్రమములను చూస్తున్నాడు. ఆ అరణ్యములలో నాగులు, పక్షులు, గంధర్వులు, కింనరులు, వైఖానసులు, వాలఖిల్యులు, ఋషులు, సిద్ధులు, చారణులు స్వేచ్ఛగా నివసిస్తున్నారు. దారిలో రావణునికి దేవతలు ప్రయాణిస్తున్న విమానాలు కనపడుతున్నాయి. ఈ ప్రకారంగా అనేకములైన అరణ్యములను ఉద్యానవనములను, సరస్సులను దాటుకుంటూ ప్రయాణిస్తున్నాడు రావణుడు.

రావణుడు ప్రయాణిస్తున్న ప్రదేశమును జలప్రాయ ప్రదేశము అని అంటారు. ఆ ప్రదేశములో ఒక పెద్ద వటవృక్షము ఉంది. దాని కొమ్మలు, ఊడలు నూరు యోజనముల మేర విస్తరించి ఉన్నాయి. ఆ చెట్టు మీద కొంత మంది ఋషులు తపస్సు చేసుకుంటున్నారు. వాలఖిల్యులు అనే ఋషులు కేవలము చంద్రకిరణములను మాత్రం ఆహారంగా తీసుకుంటూ ఆ కొమ్మలకు తలకిందులుగా వేలాడుతూ తపస్సుచేసుకుంటున్నారు.

ఒక సారి గరుడుడు తన తల్లి దాస్య విముక్తి కొరకు స్వర్గలోకము నుండి అమృతము తీసుకొని రావడానికి వెళుతున్నాడు. ఆహారంగా ఒక ఏనుగును, ఒక తాబేలును రెండు కాళ్లతో పట్టుకొని ఎగురుతున్నాడు. అంతలో విశాలమైన ఈ వటవృక్షము కనిపించింది. గరుడుడు నూరుయోజనముల పొడవు గల ఒక బలిష్టమైన కొమ్మమీద ఆ గజ,కచ్ఛపములతో వాలాడు. గరుడుని బరువుకు ఆ కొమ్మ పెళపెళమని విరిగింది. ఆ కొమ్మ విరిగితే దాని మీద తపస్సు చేసుకుంటున్న ఋషులకు, వేలాడుతున్న వాలఖిల్యులకు తపోభంగము అవుతుందని, గజకచ్ఛపములను చెరి ఒక కాలితో పట్టుకొని, ఆ కొమ్మను నోట కరచుకొని మరలా పైకి ఎగిరాడు. వారిని ఒక సమతల ప్రదేశముమీద దింపి, ఆ కొమ్మను నిషాదులు ఉన్న చోట విసిరేసాడు. తరువాత గరుడుడు గజ కచ్ఛపములను ఆరగించి, తరువాత అమృతం తేవడానికి స్వర్గమునకు వెళ్లాడు. (ఈ కథ మహాభారతంలో ఉన్నది).

రావణుడు ఆ వటవృక్షమును దాటుకుంటూ వెళ్లాడు. అలా ప్రయాణిస్తూ రావణుడు సముద్రమును దాటాడు. సముద్రమునకు

ఆవల ఉన్న ఒక ఆశ్రమమునకు వెళ్లాడు.

అది మారీచుడు అనే రాక్షసుని ఆశ్రమము. మారీచుడు జన్మత: రాక్షసుడే అయినా ముని వృత్తి స్వీకరించి, జటావల్కలములు ధరించి ఆ ఆశ్రమంలో తపస్సుచేసుకుంటున్నాడు. రావణుడు తన ఆశ్రమమునకు రావడం చూచాడు మారీచుడు. రావణునికి స్వాగతం పలికాడు. అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి ఉచిత రీతిని సత్కరించాడు. రావణునికి భోజన, పానీయాలుసమకూర్చాడు. కాస్త సేద దీరిన తరువాత మారీచుడు రావణుని ఇలా అడిగాడు.

"రావణా! రాక రాక ఇన్నాళ్లకు ఈ మారీచుని ఆశ్రమానికి వచ్చావు. ఏమి కారణము? లంకలో అంతా క్షేమంగా ఉన్నారు కదా!" అని కుశల ప్రశ్నలు వేసాడు. అప్పుడు రావణుడు మారీచునితో ఈ విధంగా ఉన్నాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ముప్పది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ముప్పది ఆరవ సర్గ.

మారీచుడు రావణుని కన్నా పెద్దవాడు. అందుకని రావణుడు మారీచుని గౌరవంగా సంబోధిస్తున్నాడు.

"ఓ తాతా! మారీచా! నేను చెప్పేమాటలను శ్రద్ధగా విను. ప్రస్తుతము నేను చాలా కష్టాలలో ఉన్నాను. నువ్వే నాకు మార్గం చూపించాలి. నా సోదరుడు ఖరుడు, దూషణుడు, వారి సేనాధిపతులు, 14,000 రాక్షస సేనలు, నరమాంస భక్షకుడైన త్రిశిరుడు, నా ఆజ్ఞమేరకు దండకారణ్యంలో స్థావరం ఏర్పరచుకొని జనస్థానంలో ఉంటున్నారు అని నీకు తెలుసు కదా!

ఈ మధ్య ఎవరో రాముడు అట. దండకారణ్యమునకు వచ్చాడు. మన వాళ్లు అతనిని ప్రతిఘటించారు. ఇద్దరి మధ్య పోరు సాగింది. మన వాళ్లు సాయుధులు, రథములు మొదలగు వాహనములు కలవారు. కాని ఆ రాముడు కేవలం ధనుస్సు మాత్రమే ఆయుధంగా కలవాడు. అతనికి ఏ వాహనమూ లేదు. కాని యుద్ధంలో రాముడు మన సేనలు 14,000 మందిని తుదముట్టించాడు. వారినే కాకుండా మహాబలవంతులు పరాక్రమవంతులు అయిన ఖరుని, దూషణుని, త్రిశిరుని కూడా చంపాడు.

ఇంతకూ ఆ రాముడు ఎవరంటే, అయోధ్యా రాజు దశరథుని కుమారుడు. రాముడు చిన్నప్పటినుండి దుష్టుడు. దుర్మార్గుడు. ఇంద్రియలోలుడు. ఎప్పుడూ ఇతరులను హింసిస్తూ ఉండేవాడు. అధర్మపరుడు అటువంటి రాముని ఆగడములు సహించలేక అతని తండ్రి దశరథుడు రాముని, భార్యాసహితంగా దేశంనుంచి వెళ్లగొట్టాడు. ఆ రాముడు ఇప్పుడు దండకారణ్యమునకు వచ్చాడు. మనవాళ్లను అన్యాయంగా అక్రమంగా చంపాడు.

మారీచా! అంతేకాదు. రాముడు ఇంకో ఘోరం కూడా చేసాడు. తనకే కదా బలం, దర్పం ఉన్నాయని విర్రవీగుతూ, ఏ పాపమూ ఎరుగని నా చెల్లెలు శూర్పణఖ ముక్కు చెవులు కోసి తన భార్యముందు నా చెల్లెలును అవమానించాడు. దీనికి ప్రతీకారము చెయ్యాలని నిశ్చయించుకున్నాను. రాముడు నా చెల్లెలును అవమానించాడు కాబట్టి నేను కూడా అతని భార్యను అవమానించాలి. రాముని భార్యను అపహరించి లంకకు తీసుకొని రావాలి.

ఈ కార్యంలో నాకు నీ సహాయం కావాలి. ఎందుకంటే, నీవు నా పక్కన ఉంటే నాకు కొండంత బలం. నీ సహాయంతో నేను దేవతలను కూడా జయించగలను. నాకు సాయం చెయ్యడానికి నీవే సమర్థుడవు. నీ కన్నా బలవంతుడు, పరాక్రమ వంతుడు ముల్లోకాలలో ఎవరున్నారు. నీకు బలము, పరాక్రమమేకాదు, చతురోపాయములలో కూడా ప్రావీణ్యం ఉంది. ఉపాయంతో ఏ కార్యమునైనా సాధించగల నేర్పు ఉంది.

పైగా నీకు ఎన్నో మాయలు తెలుసు. అందుకనే నీ దగ్గరకు వచ్చాను. నీ సాయం అర్థిస్తున్నాను. ఇంతకూ నీవు చేయాల్సిన పని ఏమిటంటే......రాముడు, అతని భార్య సీత, అతని తమ్ముడు లక్ష్మణుడు దండకారణ్యంలో ఒక పర్ణశాలలో నివసిస్తున్నారు. నీవు ఒక బంగారు వర్ణం కల లేడి రూపం ధరించి, సీతకు కనపడేటట్టు అటు ఇటు సంచరించు. నీ అందమైన రూపం చూచి. సీత తనకు ఆ బంగారు లేడి కావాలి అని రాముని అడుగుతుంది. నిన్ను పట్టుకోడానికి, ముందు రాముడు, తరువాత లక్ష్మణుడు నీ వెంట వస్తారు. నీవు వారికి అందకుండా దూరంగా పరుగెత్తు. రామలక్ష్మణులు నిన్ను వెంబడిస్తారు.

అప్పుడు సీత ఒంటరిగా ఉంటుంది. అప్పుడు నేను సీతను అపహరిస్తాను.

తన భార్య సీత లేకపోవడంతో రాముడు మానసికంగా, శారీరకంగా బలం కోల్పోతాడు. అప్పుడు సమయం చూచి నేను రాముని సంహరిస్తాను. యుద్ధములో ప్రాణాలు కోల్పోయిన 14,000 మంది రాక్షసులకు, నా సోదరులు ఖర,దూషణాదులకు ఆత్మశాంతి కలిగిస్తాను. నా చెల్లెలు రాముని మీద పెంచుకున్న పగ, ప్రతీకారము చల్లారుస్తాను. నాకీ సాయం చేసి పెట్టు." అని బతిమాలాడు.

రావణుడు చెబుతున్న కథ మారీచుడు శ్రద్ధగా విన్నాడు కానీ రాముని పేరు వినగానే మారీచునికి గొంతులో తడి ఆరిపోయింది. శరీరం వణికిపోయింది,. పెదాలు ఎండిపోయాయి. అలాగే గుడ్లప్పగించి రావణుని వంక చూస్తున్నాడు. రావణుడు చెప్పడం ఆపి మారీచుని మొహంలోకి చూచాడు. మారీచుడు ధైర్యము కూడగట్టుకొని గొంతు సవిరించుకొని రావణునితో ఇలా అన్నాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ముప్పది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ముప్పది ఏడవ సర్గ.

"ఓ రాక్షసరాజా! నీ చుట్టూ ఎల్లప్పుడూ నిన్ను పొగిడేవాళ్లు, ప్రియంగా మాట్లాడేవాళ్లు ఉంటారు కానీ నీకు హితము చెప్పేవాళ్లు ఉండరు. ఒకవేళ అలాంటి వాళ్లు ఉన్నా నీలాంటి రాజులు వాళ్లు చెప్పే మాటలు వినరు. ఎందుకంటే అవి మీకు చెవులకు ఇంపుగా తోచవు కాబట్టి.

నీవు ఎవరి మీద కైనా యుద్ధానికి పోయేముందు వారి గురించి తెలుసుకోడానికి గూఢచారులను నియమించావా? అలా నియమించి ఉంటే నీకు రాముని గురించి తెలిసి ఉండేది. నీకు రాముని గురించి ఏమీ తెలియదు అని తెలుస్తూ ఉంది. రాముడు గుణవంతుడు, పరాక్రమవంతుడు. వీరుడు. రాముడు తలుచుకుంటే ఈ భూమి మీద రాక్షసుడు అనేవాడు లేకుండా చేయగలడు. రాముడు అంత సమర్థుడు.

ఇప్పుడు నీవు సీత గురించి మాట్లాడుతున్నావు. ఆ సీత నీకు మృత్యువు అయిందేమో అని నా అనుమానము. లేకపోతే నీకు సీతను అపహరించవలెనని ఆలోచన పుట్టదు. దానికి నన్ను సాయం అడగవు. సీతాపహరణంలో నేను నీకు సాయం చేస్తే నాకు కూడా మృత్యువు తప్పదు. నీవు లంకారాజ్యానికి రాజుగా ఉన్నందుకు, లంక సర్వనాశనం కాక తప్పదు. నీ వలన లంకా వాసులు అష్టకష్టాలు పడక తప్పదు.

ఓ రావణా! నీ వంటి వాడు రాజుగా ఉంటే, ఆ రాజే కాదు అతడు పాలించే రాజ్యము కూడా నశించిపోతుంది. ఇంక అసలు విషయం చెబుతాను విను. రాముడు తండ్రిచేత వెళ్లకొట్టబడలేదు. నీకు ఎవరో కల్పించి చెప్పారు. రాజ్యమునుండి వెళ్లగొట్టబడేంత చెడ్డపనులు చేసేవాడు కాదు రాముడు. రాముడు నీవు అనుకున్నంత లుబ్ధుడు, దుశ్శీలుడు, దుష్టుడు, అధర్మపరుడు కాడు.

అసలు విషయం నేను చెబుతాను విను. దశరథుని భార్య కైక రాముని అడవులకు పంపమని దశరథుని వరం కోరితే, తల్లితండ్రుల మాట ప్రకారము అడవులకు వచ్చాడు రాముడు. కేవలము తండ్రి మాటను గౌరవించడానికి సమస్త రాజభోగములను, రాజ్యమును విడిచి అరణ్యవాసం చేస్తున్నాడు. అంతేగాని నీవు అనుకున్నట్టు రాజ్యం నుండి వెళ్ల గొట్టబడలేదు.

(ఇక్కడ మారీచుడు చెప్పినట్టు వాల్మీకి ఒక శ్లోకం రాసాడు. అది ఇప్పుడు ఒక నానుడి అయిపోయింది.)

రామో విగ్రహవాన్ ధర్మ: సాధు: సత్య పరాక్రమ:।
రాజాసర్వస్య లోకస్య దేవానాం మఘవానివ.॥

రాముడు సాక్షాత్తు ధర్మ స్వరూపుడు. రాముని శరీరమే ధర్మానికి ప్రతీక. రాముడు సాధువు. నిజమైన పరాక్రమవంతుడు. దేవేంద్రుని వలె సకలలోకములను పాలించగల సమర్థుడు. రాముని భార్య సీత. రాముడు ఆమెను ఎల్లప్పుడూ కంటికి రెప్పలా కాపాడు తుంటాడు. సూర్యుని నుండి తేజస్సును వేరుచేయునట్లు రాముని నుండి సీతను వేరుచేయాలనే దుర్బుద్ధి నీకు ఎలా పుట్టింది. రామ

బాణము అనే మంటలలోకి నీవు శలభము వలె దూకపోతున్నావు. జాగ్రత్త. నా మాటవిను. సుఖంగా రాజ్యం చేసుకో. రాముని జోలికి వెళ్లకు. కోరి కోరి రాముని కోపజ్వాలలో పడి దగ్ధంకాకు.

రాముని రక్షణలో ఉన్నంత కాలము సీతను నీవు హరించలేవు. ఆ సీత కూడా రాముని విడిచి ఉండలేదు. అందుకే కదా సమస్తరాజభోగములను తృణప్రాయంగా త్యజించి రాముని వెంట అడవులకు వచ్చింది. సీతంటే ఎవరనుకున్నావు? అయోనిజ. మిథిలాధిపతి జనకమహారాజు కూతురు. ఆమె నీవంటి దుర్మార్గులకు అగ్నిజ్వాల వంటిది. కాబట్టి నా మాట విని సీత జోలికి పోకు.

ఇటువంటి వ్యర్థమైన పనికి ఎందుకు పూనుకుంటావు? సీతను అపహరిస్తే నిన్ను రాముడు ఎదుర్కొంటాడు. రాముని ఎదుటపడ్డ నీకు మరణం తప్పదు. ఎంతో కాలము రాజ్యము పాలిస్తూ, రాజభోగములు అనుభవించవలసిన వాడివి. అర్ధాంతరంగా నీ జీవితాన్ని ఎందుకు అంతం చేసుకుంటాడు. నాలుగు కాలాలపాటు బతకాలని ఉంటే రాముని జోలికి పోకు. నా జోలికి రాకు.

నామాట మీద నమ్మకం లేకపోతే, నీ తమ్ముడు విభీషణుడు ఉన్నాడుకదా! అతనితో ఆలోచించు. నీ ఆలోచన మంచిదో కాదో వారిని అడిగి తెలుసుకో. వారుచెప్పినట్టు చెయ్యి. రామునితో వైరం పెట్టుకొనే ముందు, రాముని బలాన్ని నీ బలాన్ని తులనాత్మకంగా పరిశీలించు. హితాహితములు పరిశీలించి ఒక నిర్ణయం తీసుకో. అంతేగానీ తొందరపాటు నిర్ణయం తీసుకొని కష్టాలపాలుగాకు. ఇంతెందుకు.

రాముడితో నా స్వానుభవం గురించి చెబుతాను విను. అప్పుడు నీకు తెలుస్తుంది, రామునితో వైరం మంచిదో కాదో!"అని మారీచుడు రామునితో తన అనుభవాన్ని ఈ విధంగా చెప్పాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ముప్పదిఏడవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము.

## ముప్పది ఎనిమిదవ సర్గ.

"ఓ దానవేంద్రా! ఆ రోజుల్లో నేను మహా పరాక్రమంతో నాకు ఎదురు ఎవరూ లేరనే గర్వంతో భూమి అంతా తిరుగుతుండేవాడిని. చేతిలో పరిఘను ఆయుధంగా ధరించి అడ్డం వచ్చిన మునులను, ఋషులను చంపుతూ, వారి మాంసము తింటూ ఇష్టం వచ్చినట్టు సంచరించేవాడిని.

ఆ సమయంలో విశ్వామిత్రుడు అనే ఋషి ఒక యజ్ఞం చేస్తున్నాడు. ఆ యజ్ఞాన్ని మేము భగ్నం చేసేవాళ్లము. మా బాధలు తట్టుకోలేక విశ్వామిత్రుడు రాముని తండ్రి దశరథుని వద్దకు పోయి

"ఓ దశరథ మహారాజా! మారీచుడు అనే రాక్షసుని వలన మాకు చాలా కష్టాలు కలుగుతున్నాయి. వాడి వలన మాకు చాలా భయంగా ఉంది. నీవు రాముని పంపి మా యజ్ఞాలు మారీచుని బారి

నుండి కాపాడు” అని అడిగాడు. దశరథుడు కొంచెం సేపు తటపటాయించి, తరువాత రాముని విశ్వామిత్రుని వెంట పంపాడు. రాముడు విశ్వామిత్రుని యజ్ఞాన్ని రక్షిస్తున్నాడు.

ఇదంతా తెలియని నేను విశ్వామిత్రుని యజ్ఞమును భగ్నం చేయడానికి నా పరిఘను చేత పట్టుకొని అట్టహాసంగా విశ్వామిత్రుని ఆశ్రమానికి వెళ్లాను. ఆశ్రమంలోకి ప్రవేశిస్తున్న నన్ను చూచి రాముడు తన వింటికి నారి సంధించాడు. నేను రాముని వంక చూచాను. ఇంకా మీసములు కూడా రాని బాలుడు కదా అని రాముని గురించి నేను పట్టించుకోలేదు. నేను గబా గబా విశ్వామిత్రుడు యజ్ఞం చేస్తున్న వేదిక వద్దకు వెళ్లాను.

రాముడు ఒక బాణమునుసంధించి నా మీద ప్రయోగించాడు. ఆ బాణం దెబ్బకు నేను ఎగిరి నూరుయోజనముల దూరంలో ఉన్న సాగరంలో పడ్డాను. ఏం జరిగిందో తెలుసుకొనేటప్పటికి నేను నట్టనడిసముద్రంలో ఉన్నాను. రాముడు నన్ను చంపాలనుకోలేదు అందుకని సముద్రంలో పడవేసాడు. లేకపోతే నీతో ఇలా మాట్లాడ టానికి నేను మిగిలి ఉండేవాడిని కాదు. ఆ ప్రకారంగా సాగరజలాలలో పడ్డ నాకు ఎంతో సేపటికి గానీ స్పృహ రాలేదు. తరువాత నానా పాట్లు పడి లంకానగరం చేరుకున్నాను. తరువాత తెలిసింది నన్ను సాగరంలో పడేట్టు కొట్టిన తరువాత రాముడు నా తోటి రాక్షసుల నందరినీ సంహరించాడని.

ఓ రావణా! అప్పుడు రాముడు బాలుడు. ఇంకా అస్త్రవిద్య పూర్తిగా నేర్చుకోలేదు. ఇప్పుడు చూచావుగా రాముని ప్రతాపము.

14,000 వేల మందిని ముహూర్తకాలంలో చంపాడు. కాబట్టి రాముడితో విరోధము పెట్టుకోకు. తరువాత నీ ఇష్టం.

లంకా నగరము దూరంగా సముద్రమధ్యలో ఉంది కాబట్టి లంకావాసులందరూ భోగాలు అనుభవిస్తూ సుఖంగా జీవిస్తున్నారు. నీ పుణ్యమా అని వారిని ఆ సుఖాలకు దూరం చెయ్యకు. సీత కారణంగా లంకానగరం నాశనం చెయ్యకు. ఇనుముతో కూడిన అగ్ని సమ్మెట దెబ్బలుతిన్నట్టు, నీవు రాజుగా ఉన్న కారణంగా లంకానగరం అంతా ఆపదలలో చిక్కుకుంటుంది. నీ మూలంగా రాక్షసులు అంతా మరణిస్తే, వారి భార్యలకు దిక్కు ఎవ్వరు. ఒక్క స్త్రీ కారణం ఎంతోమంది రాక్షసస్త్రీలను అనాధలుగా చేస్తావా! నువ్వు సీతను అపహరించినట్టు వాళ్లను కూడా ఎవరైనా అపహరిస్తే వాళ్లకు దిక్కెవ్వరు?

ఓ దానవేంద్రా! నీకు ఎంతో మంది అందమైన అప్సరసలవంటి భార్యలు ఉన్నారు కదా! ఇంకా ఈ పరభార్యల మీద నీకు ఎందుకయ్యా వ్యామోహము. పరదారాపహరణము పాపం అని తెలియదా! నా మాట విను. నీ భార్యలతో సంతృప్తి చెందు. వారితో సుఖించు. సీతను మరిచిపో. నీవు నాలుగు కాలాల పాటు నీభార్యలతో రాజభోగాలు అనుభవించాలంటే రామునితో వైరం పెట్టుకోకు.

నేను ఇన్ని చెప్పినా వినకుండా సీతను అపహరిస్తే, రాముని కోపాగ్నిలో మాడి మసి అయిపోతావు. నీ లంకా నగరం అంతా నాశనం అయిపోతుంది. నీవు బంధు మిత్రులతో సహా యమసదనానికి ప్రయాణం కడతావు." అని రావణునికి హితోపదేశం చేసాడు మారీచుడు.

మారీచుడు రావణుని వంక చూచాడు. రావణునిలో ఏమాత్రం మార్పు కనిపించలేదు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ముప్పది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ముప్పది తొమ్మిదవ సర్గ.

తాను చేసిన హితోపదేశములు రావణునికి తలకెక్కలేదని గ్రహించాడు మారీచుడు. ఇంకా తన అనుభవాలు చెప్పడం మొదలెట్టాడు.

“ఓ రాక్షసరాజా! రాముని చేతిలో దెబ్బతిన్న నాకు ఇంకా బుద్ధిరాలేదు. నేను మాయారూపములు ధరించడంలో సిద్ధహస్తుణ్ణి. నేను ఒక మృగరూపము ధరించి, ఇంకా ఇద్దరు రాక్షసులను నా వెంట తీసుకొని  దండకారణ్యమునకుపోయాను. అప్పుడు నా రూపము మహా భయంకరంగా ఉండేది. పెద్ద దేహము, ఎర్రటి నాలుక, వాడిఅయిన కోరలు, మహాభయంకారాకారముతో దండకారణ్యములో సంచరిస్తూ మునులను, ఋషులను బెదిరిస్తూ వారిని హింసిస్తూ, వారిని చంపి తింటూ ఉండేవాడిని.

ఒకసారి నాకు రాముడు తారసపడ్డాడు. అంతకు ముందు రాముడు నన్ను కొట్టిన దెబ్బ నాకు గుర్తుకు వచ్చింది. రాముడు ఇప్పుడు మునివేషములో ఉన్నాడు. నన్నేమి చెయ్యగలడు అని అనుకొన్నాను. అంతకు ముందు రాముడు నన్ను కొట్టిన దెబ్బకు ప్రతీకారము తీర్చుకోవాలి అనుకున్నాను. వెంటనే మహోగ్రరూపంతో రాముని మీదికి దూకాను.

తన మీదికి దూకుతున్న నన్ను చూచి రాముడు, తన ధనుస్సు నుండి మూడు బాణములు ప్రయోగించాడు. ఆ బాణములు వాయు వేగంతో వచ్చి నాకు తాకాయి. రామ బాణములను చూచి నాకు భయం వేసి పక్కకు తప్పుకున్నాను. కాని నా వెంట ఉన్న ఇద్దరు రాక్షసులు ఆ బాణాలకు బలి అయ్యారు.

మొదటి సారి రాముని చేతిలో దెబ్బ తిన్నాను. రెండవసారి రామ బాణము నుండి తప్పించుకున్నాను. ఇంక మరలా రాముని జోలికి పోదలుచుకోలేదు. అందుకని అప్పటి నుండి ముని వృత్తి అవలంబించి ఇక్క ఆశ్రమము నిర్మిచుకొని సన్యాసిగా జీవించు చున్నాను.

జటాజూటములతో నార చీరలతో ఎవరు కనపడ్డా నాకు రాముడే గుర్తుకువస్తున్నాడు. రాముడు కలలో కనిపించినా భయంతో వణికిపోతున్నాను. అసలు నాకు “ర” అనే అక్షరంలో ప్రారంభం అయ్యే ఏ వస్తువును చూచినా రాముని చూచినట్టే భయం కలుగుతూ ఉంది. నాకు రామ బాణము శక్తి తెలుసు కాబట్టి ఇంతదాకా చెప్పవలసి

వచ్చినది. తరువాత నీ ఇష్టం.

నీకు ఇష్టం అయితే రామునితో యుద్ధం చెయ్యి. లేకపోతే మానెయ్యి. కాని నన్ను మాత్రము ఇందులోకి లాగకు. నేను నాలుగు కాలాల పాటు జీవించాలని నీకు ఉంటే, నా ముందు రాముని మాట ఎత్తకు. నీవు చేసే పాపపు పనులకు నన్ను బాధ్యుడిని చేయకు. నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో. నేను మాత్రము నీ వెంటరాను. నీకు సాయం చెయ్యను. ఆ రాముడు రాక్షసుల పాలిట మృత్యువు అని నీవు తెలుసుకోలేకపోతున్నావు.

ఓ రావణా! ఇందులో రాముని తప్పు ఏముంది చెప్పు. ఆ శూర్పణఖ మాటలు విని ఖరుడు దూషణుడు రాముని తో యుద్ధానికి పోకపోతే వ్యవహారము ఇంతవరకూ రాదు కదా! 14,000 మంది బలి అయ్యేవారుకాదు కదా! రాముడు తనంత తాను నీ స్థావరమునకు వచ్చి నీతో యుద్ధము చేయలేదుకదా! నీ సోదరులను, సైన్యాది పతులను అపార సేనలను పోగొట్టుకున్నా ఇంకా నీకు బుద్ధిరాలేదా! మిగిలిన బంధువులను, మిత్రులను రామ బాణములకు బలి చేయ దలచుకున్నావా! నా హితోక్తులు విని నీవు రామునితో వైరము మానకపోతే నీకు సర్వనాశనం తప్పదు." అని అన్నాడు మారీచుడు.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము ముప్పది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## నలుబదవ సర్గ.

మారీచుడు సుదీర్ఘంగా చెప్పిన హితోక్తులు రావణునికి రుచించలేదు. చావబోయేవాడికి అమృత తుల్యమైన ఔషధము రుచించనట్టు మారీచుని మాటలు రావణునికి తలకెక్కలేదు. పైగా తన ముందు తన శత్రువు అయిన రాముని మారీచుడు పొగడటం చూచి రావణునికి కోపం వచ్చింది.

"మారీచా! నీవు ఏవేవో వ్యర్థములైన మాటలు మాట్లాడు తున్నావు. వాటి వల్ల ఏమీ ప్రయోజనము లేదు. నీవు పొగిడిన రాముడు కేవలం ఒక మానవమాత్రుడు. పైగా మూర్ఖుడు. నీ మాటలు విని ఒక మానవునికి భయపడే పిరికిపంద కాడు ఈ రావణుడు. ఒక స్త్రీకోరిన కోరికలు తీర్చడానికి, తల్లితండ్రులను బంధుమిత్రులను విడిచి భార్యతో సహా పారిపోయిన పిరికి పంద ఆ రాముడు.

ఆ రాముడు నా ప్రియాతి ప్రియమైన సోదరుడు ఖరుని చంపాడు. దానికి ప్రతీకారంగా నేను కూడా రాముడు తన ప్రాణంకన్నా మిన్నగా ప్రేమించే అతని భార్యను అపహరిస్తాను. దానికి నీ సాయం కావాలి తప్పదు. నేను ఒక నిర్ణయం తీసుకున్న తరువాత, దేవేంద్రుడు దిగివచ్చినా నా నిర్ణయం మార్చుకోను. నేను నిన్ను సాయం చెయ్యమని అడిగాను అంతే కానీ, నా నిర్ణయం తప్పా ఒప్పా అని నేను నిన్ను అడగలేదు. కాబట్టి నీవు అలా మాట్లాడటం తగదు. అయినా, నీ మాటలు నేను పట్టించుకోనవసరం లేదు.

మంత్రులు రాజు అడిగినప్పుడు మాత్రమే తగిన సమాధానము వినయంగా చేతులు కట్టుకొని మరీ  చెప్పాలి. అదీకూడా రాజుకు ఇష్టమైనవి, అంగీకారయోగ్యమైన మాటలు మాత్రమే చెప్పాలి. ఇష్టం వచ్చినట్టు చెప్పకూడదు.

ఓ మారీచా! నీవు చెప్పేది ఎంత హితమైనా, చెప్పేవిధానంలో తిరస్కారధోరణి ఉంటే ఆ హితోక్తులను రాజులు హర్షించరు. నీకు ఆ మాత్రం జ్ఞానం కూడా లేదు. నేను నిన్ను వెతుక్కుంటూ నీ వద్దకు వచ్చాను. అటువంటి నాతో ఇంత పరుషంగా మాట్లాడతావా! నేను నిన్ను సాయం చెయ్యమని అడిగాను. నేను చెయ్యబోయే పని మంచిదా చెడ్డదా! నేను చెయ్యగలనా లేదా! నేను సమర్థుడినా కాదా! అని నేను నిన్ను అడగలేదు.

కాబట్టి నేను చెప్పింది విను. ఈ కార్యంలో నీవు నాకు సాయం చేస్తున్నావు. ఇది నా ఆజ్ఞ. నీవు ఏమి చెయ్యాలో చెబుతాను శ్రద్ధగా విను. నీవు మాయారూపములు ధరించుటలో ప్రజ్ఞాశాలివి. అందుకని నీవు  ఒక బంగారు వర్ణము కల లేడి రూపము ధరించు. రాముని ఆశ్రమమునకు వెళ్లు. సీత చూచేట్టు ఆ పరిసరములలో సంచరించు. ఆమె నిన్ను చూచి నీ మీద ఆసక్తి పెంచుకుంటుంది. తరువాత నీ ఇష్టం. ఎటైనా పరుగెత్తు.

సీత మృగరూపంలో ఉన్న నిన్ను చూచి “ఆ బంగారు లేడి నాకు కావాలి” అని రాముని అడుగుతుంది. భార్య మాటలు విని రాముడు ధనుర్బాణములు ధరించి నిన్ను పట్టుకోడానికి నీ వెంట వస్తాడు. నీవు పరుగెత్తు. చాలా దూరం పోయిన తరువాత “హా సీతా’

హా లక్ష్మణా" అనిపెద్దగా రాముని గొంతుకతో, రాముడు అరిచినట్టు అరువు. ఆశ్రమంలో ఉన్న లక్ష్మణుడు ఆ అరుపులు వింటాడు. కంగారు పడుతూ రాముని వెదుక్కుంటూ వస్తాడు. రాముడు లక్ష్మణుడు ఆశ్రమంలో లేని సమయంలో నేను ఆశ్రమంలో ప్రవేసించి సీతను బలవంతంగా తీసుకొని వస్తాను. నీవు రామ బాణమునకు అందకుండా పరుగెత్తు. నీ ఇష్టం వచ్చినట్టు వెళ్లిపో. నీవు నాకు ఈ పని చేసి పెడితే, నీకు నా రాజ్యంలో అర్థ రాజ్యం ఇస్తాను.

ఓ మారీచా! వెంటనే బయలుదేరు. నేను నీ వెంటనే నా రథం మీద వస్తాను. నీవు రాముని తీసుకొని అడవులలోకి పరుగెత్తు. నేను సీతను అపహరించి లంకకు తీసుకొని వస్తాను. మనం లంకలో కలుసుకుందాము. నేను చెప్పినట్టు చేయకపోతే నిన్ను ఇప్పుడే ఇక్కడే చంపుతాను. లేకపోతే బలవంతంగా నైనా నీతో ఈ పని చేయిస్తాను. రాజును ఎదిరించి ఎవరూ సుఖంగా బతకలేరు అన్న సత్యాన్ని తెలుసుకో!

మారీచా! ఇంకొక విషయం. నీవు రాముని చేతిలో చావ వచ్చు, చావ కుండా తప్పించుకోనూవచ్చు. కాని నేనుచెప్పినట్టు చేయకపోతే నా చేతిలో నీ చావు తప్పదు. కాబట్టి బాగా ఆలోచించుకొని ఏది మంచిదో అది చెయ్యి." అని తన నిర్ణయాన్ని తెలియజేసాడు రావణుడు.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము నలుబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## నలుబది ఒకటవ సర్గ.

రావణుడు చెప్పిన పని చేస్తే రాముడు చంపుతాడు. తను చెప్పిన పని చెయ్యకపోతే రావణుడు చంపుతాడు. ఎవరో ఒకరి చేతిలో తనకు చావు తప్పదు. అందుకని మరలా ఒకసారి రావణునికి చెప్పి చూస్తే మంచిదేమో అనుకున్నాడు మారీచుడు. అయితే ఈ సారి స్వరం మార్చి కొంచెం కటువుగా మాట్లాడాడు.

"ఓ రావణా! నీవు సకుటుంబంగా నశించే ఈ మార్గాన్ని ఎవరు చెప్పారు? వాళ్లు చెప్పినా నీవు ఎలా విన్నావు?నాకు తెలుసు. నీవు సుఖంగా ఉండటం చూచి ఓర్వలేక నీకు గిట్టని వాళ్లు నీకు ఈ దురూపదేశం చేసి ఉంటారు. ఇంతకూ వారు ఎవరో నాకు తెలియాలి. నీ చావు చూడాలని కోరుకొనే నీ శత్రువులు ఎవరో నాకు తెలియాలి.

రాముని శత్రువులు ఎవరో కానీ వాళ్లు రాముని చంపలేక, మహా పరాక్రమ వంతుడైన నీ చేత చంపించాలని చూస్తున్నారు. వారి మాయమాటలకు లోబడి నీవు రామునితో వైరం పెట్టుకుంటున్నావు. నీ సర్వనాశనాన్ని కొని తెచ్చుకుంటున్నావు. వాళ్లు ఎవరో నాకు చెప్పు. వాళ్లు నీ మంత్రులే అయితే వారిని వెంటనే చంపెయ్యి.

నీవు దారి తప్పి నడిచినా, నిన్ను సక్రమ మార్గంలో పెట్టే వాళ్లే నీ మంత్రులు కానీ నీ చావును కోరే వారు నీకు మంత్రులు, హితులు ఎలా అవుతారు? రాజు చెడ్డ మార్గంలో పోతుంటే, మంత్రులు రాజుకు

హితం చెప్పి, మంచి మార్గంలో నడిచేట్టు చెయ్యాలి. అటువంటి మంత్రులు నీ వద్ద లేరనుకుంటాను!

(మారీచుడు చెప్పిన ఈ మాటలు నేటికి కూడా వర్తిస్తాయి. ముఖ్యమంత్రి చెడు నిర్ణయాలు తీసుకుంటుంటే కాబినెట్ మంత్రులు అడ్డుకోవాలి. ముఖ్యమంత్రిని సక్రమమైన మార్గంలో నడిపించాలి. ముఖ్యమంత్రి, మంత్రులు తప్పుడు నిర్ణయాలు తీసుకుంటుంటే సెక్రటరీలు (ఐ.ఏ.యస్ ఆఫీసర్లు) వారికి మార్గనిర్దేశం చెయ్యాలి. వారి తప్పుడు నిర్ణయాలను అడ్డుకోవాలి. ప్రజాక్షేమాన్ని కాపాడాలి. కానీ ఈ నాడు జరుగుతున్నదేమిటి. ముఖ్యమంత్రికి కాబినెట్ మంత్రులు తాన అంటే తందానా అంటున్నారు. ఎక్కడ సంతకం పెట్టమంటే అక్కడ పెడుతున్నారు. లేకపోతే వారి మంత్రి పదవులు పోతాయని భయం.

అలాగే సెక్రటరీలు మంత్రులకు అనుకూలంగా నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఆ నిర్ణయాలు తప్పని తేలితే మాదేం లేదు అంతా మంత్రులు చెప్పినట్టే చేసాము అని సమర్థించు కుంటున్నారు. మంత్రులు చెప్పింది చెయ్యడానికి ఐ.ఏ.యస్ లు ఎందుకు. గుమాస్తాలు చాలు కదా. పాలకులను సక్రమమార్గంలో నడిపించడమే కార్యదర్శుల పని. ఈ విషయాన్నే నాడు మారీచుడు రావణునికి స్పష్టంగా చెప్పాడు.)

రాజు మంచి వాడైతే మంత్రులకు కూడా మంచి పేరు వస్తుంది. రాజు చెడ్డ వాడైతే మంత్రులు రాజును సరిదిద్దాలి లేకపోతే ప్రజలకు నష్టం జరుగుతుంది. రాజ్యానికి మూలం రాజు. అటువంటి రాజును మంచి మార్గంలో నడిపించి, రాజును రక్షించుకోవడం

మంత్రులవిధి. ప్రజావ్యతిరేకుడైన రాజు, ప్రజలను పీడించేరాజు ప్రజాభిమానము చూరగొనలేడు. అటువంటి రాజుకు రాజ్యమును పాలించే అర్హత లేదు.

రాజు మంచి వాడైనా, మంత్రులు చెడ్డ వారైతే, మంత్రుల చెడు సలహాల ఫలితంగా, రాజు కూడా వారితో పాటు నశించి పోతాడు. ప్రజాక్షేమాన్ని మరిచిన రాజు పాలనలో ప్రజలు అష్టకష్టాల పాలవుతారు. ఇప్పుడు నీవు తీసుకునే ఈ నిర్ణయంతో నీతోపాటు అమాయకులైన నీ ప్రజలు కూడా నశించిపోతారు.

ఓ రావణా! నాకు ఎటూ చావు తప్పదు. అది నాకు తెలుసు. నా బాధ అంతా నీ గురించే. పోతే నేను ఒక్కడినే పోతాను. కానీ నీవు, నీ ప్రజలు, సైన్యంతో సహా నశించిపోతావు. నీవు చెప్పిన పని నేను చేస్తాను. రాముడి చేతిలో చస్తాను. కాని నేను చచ్చిన కొద్ది కాలంలో నువ్వు కూడా నా మార్గాన్నే అనుసరిస్తావు.

నీవు నాకు ఇస్తానన్న రాజ్యాన్ని ఆశించి నేను ఈ పని చేయడం లేదు. రాముని చూడగానే నాకు చావు తప్పదు అని నాకు తెలుసు. కాని సీతను అపహరించిన తరువాత, లంకను పాలించ డానికి నీవు ఉండవు అని తెలుసుకో!

కాబట్టి ఓ రావణా! ఇదే మన ఆఖరు సమావేశము. నేను నీతో వచ్చి రాముని దూరంగా తీసుకొని వెళ్లగానే నేను చస్తాను. సీతను అపహరించగానే నీవు చస్తావు. అప్పుడు ఈ లంకా ఉండదు. ఈ రాక్షసులూ ఉండరు.

నేను ఏమి చెప్పినా నీవు వినవు అని నాకు తెలుసు. కానీ చెప్పడం నా ధర్మం కనుక చెప్పాను. తరువాత నీ ఇష్టం. ఇంక పోదాం పద." అని అన్నాడు మారీచుడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము నలుబది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## నలుబది రెండవ సర్గ.

అప్పటికి రెండు సార్లు రాముడి చేతిలో చావు తప్పించుకున్నా, మూడవసారి రాముడి చేతిలో తనకు చావు తప్పదని రూఢి చేసుకొని రావణుని వెంట బయలుదేరాడు మారీచుడు. ఎన్ని మాటలు మాట్లాడినా తుదకు మారీచుడు తన మాటను మన్నించి తన వెంట వస్తున్నందుకు చాలా సంతోషించాడు రావణుడు. అప్పుడే సీత తన ఒడిలో వాలినట్టు సంతోషపడ్డాడు.

మారీచుని కౌగలించుకొని "మారీచా! నామాట విని ఇప్పుడు నువ్వు అసలైన మారీచుడవు అనిపించుకున్నావు. నువ్వు ఇంతకు ముందు మాదిరి రాముడికి భయపడే మారీచుడవు కావు. నీవు కూడా నాతో రా. రథం ఎక్కు. మనం ఇద్దరం రాముని ఆశ్రమం దాకా వెళదాము తరువాత తెలుసుగా. కాస్త సీతను ప్రలోభ పెట్టి నువ్వు నీ ఇష్టంవచ్చినట్టు పారిపో.

రామ లక్ష్మణులు అటు పోగానే నేను సీతను తీసుకొని ఇటు వచ్చేస్తాను." అని వ్యవహారాన్ని చాలా తేలిగ్గా తేల్చేశాడు రావణుడు.

తరువాత రావణుడు, మారీచుడు ఇద్దరూ గాడిదలు కట్టిన రథం ఎక్కి దండకారణ్యం వైపు ప్రయాణం సాగించారు. కొన్ని దినములు ప్రయాణించి ఇద్దరూ రాముని ఆశ్రమం దగ్గరకు చేరుకున్నారు. రావణుడు, మారీచుడు ఇద్దరూ రథం దిగారు.

"మారీచా! అటు చూడు. అదే రాముని ఆశ్రమము అనుకుంటాను. నేనుచెప్పింది గుర్తు ఉంది కదా. ఆ ప్రకారం చెయ్యి. నేను ఈ పరిసరాలలో దాక్కొని ఉంటాను." అని అన్నాడు రావణుడు.

వెంటనే మారీచుడు తన కామరూప విద్య ప్రభావంతో ఒక బంగారు వన్నెకల లేడి రూపం ధరించాడు. రాముని ఆశ్రమం దగ్గర అటు ఇటు తిరుగుతున్నాడు. సీత దృష్టి లో పడేట్టు సంచరిస్తున్నాడు. మారీచుడు ధరించిన ఆ లేడి రూపము చాలా సుందరంగా ఉంది. దాని ముఖము సగం తెల్లగా సగం నల్లగా ఉంది. మెడ కొంచెం ఎత్తుగా ఉంది. దాని శరీరము బంగారు రంగుతో మెరుస్తూ ఉంది.

ఆ లేడి అక్కడ ఉన్న పచ్చికను కొరుకుతూ అటు ఇటు తిరుగుతూ ఉంది. అటు ఇటు పరుగెత్తుతూ, గెంతుతూ, భయం భయంగా చూస్తూ ఉంది. కాసేపు అలా ఆడుకొని, కొంచెం సేపు అలసటగా పడుకొంది. మరలా లేచి గెంతుతూ ఆశ్రమ ద్వారం దగ్గర తచ్చాడుతూ ఉంది. ఎలాగైనా సీత దృష్టిలో పడాలని నానా పాట్లు పడుతూ ఉంది ఆ మాయ లేడి.

ఇంతలో కొన్ని లేళ్లు అక్కడకు గుంపుగా వచ్చాయి. ఈ మాయలేడి కూడా వాటితో కలిసి ఆడుతూ ఉంది. కాని మిగిలిన లేళ్లు ఈ మాయలేడిని వాసన చూచి ఎందుకో దూరంగా పరుగెడు తున్నాయి. మారీచునకు ఆ లేళ్లను చూస్తుంటే వాటిని కరా కరా నమిలి తినాలని మహాకోరికగా ఉంది. కాని తాను ఉన్న పరిస్థితులలో ఆ పని చేయకూడదని ఆ కోరికను చంపుకున్నాడు.

అదే సమయంలో సీత పూలు కోయడానికి ఆశ్రమం నుండి వెలుపలికి వచ్చింది. ఆశ్రమం బయట ఉన్న పూల చెట్ల నుండి పూలు కోస్తూ ఉంది. ఇంతలో ఆ మాయలేడి సీత కంటపడింది. బంగారు వర్ణంతో మిలా మిలా మెరిసిపోతున్న ఆ లేడి వంక కుతూహలంగా చూచింది సీత. ఆ అరణ్యంలో అంతవరకూ అటువంటి లేడిని సీత చూడలేదు. అందుకని ఆశ్చర్యం ఆ లేడి వంక చూస్తూ ఉంది.

అమ్మయ్య వచ్చిన పని అయిందనుకున్నాడు మారీచుడు. సీత దగ్గరగా వెళ్లి ఆమె తనను అందుకొనేటట్టు ఆమెకు దగ్గరగా అటు ఇటు తిరుగుతున్నాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము నలుబది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## నలుబది మూడవ సర్గ.

ఆశ్రమము వెలుపల పూలను కోసుకుంటున్న సీతకు ఆ మాయామృగము కనపడింది. సీతకు సంతోషము, ఆశ్చర్యము ఒకేసారి కలిగాయి.

"ఆర్యపుత్రా! లక్ష్మణా! రండి! త్వరగా రండి. ఇక్కడకు రండి. ఇటు చూడండి. ఈ లేడిని చూడండి. అబ్బా! ఎంత బాగుందో! ఎంత ముచ్చటగా ఉందో!" అని అరిచినట్టు పిలిచింది.

రాముడు, అక్ష్మణుడు గబగబా అక్కడకు వచ్చారు. సీత వారికి ఆ లేడిని చూపించింది. సీతతో పాటు రాముడు కూడా ఆ మృగమును చూచి ఆనందించాడు.  కాని లక్ష్మణునికి ఆ మృగమును చూచి అనుమానం కలిగింది.

"రామా! ఈ మృగము సామాన్య మృగము మాదిరి లేదు. ఎవరో రాక్షసుడు ఈ మృగవేషము ధరించినట్టు కనపడుతూ ఉంది. ఇదివరలో మారీచుడు కూడా ఇలాంటి మాయావేషములను ధరించి, వేటకు వచ్చిన రాజులను వంచించి, వారు ఒంటరిగా ఉన్నప్పుడు వారిని చంపి తినేవాడని మనకు తెలుసు. ఆ మారీచుడు ఈ మృగముకాదు కదా! నాకు అనుమానంగా ఉంది. ఎందుకంటే మనము ఎన్నో లేళ్లను చూచాము. కానీ ఇంతటి ప్రకాశవంతమైన, బంగారు వర్ణములో ఉన్న లేడిని చూడలేదు. ఇదేదో రాక్షస మాయగా ఉంది. అసలు ఇటువంటి

లేడి భూలోకములో ఉంటుందా అని నా అనుమానము.

రామా! సందేహము లేదు. ఆలోచించిన కొద్దీ నా అనుమానము బలపడుతూ ఉంది. ఇది నిస్సంశయముగా మాయాలేడి. రాక్షస మాయ." అని అన్నాడు లక్ష్మణుడు.

అప్పుడు సీత లక్ష్మణుని చూచి ఇలా అంది. "లక్ష్మణా! నీకు అన్నీ అనుమానాలే. అందమైన లేడి పిల్లను చూచి ఆనందించక అనుమా నిస్తావెందుకు. ఈ లేడి పిల్లను మన ఆశ్రమములో ఉంచి పెంచు కుందాము. రోజూ దీనితో నాకు కాలక్షేపము అవుతుంది.

రామా! నాకు ఆ లేడిని తెచ్చి ఇవ్వరా! ప్రాణములతోటి పట్టి తెండి. మన ఆశ్రమ ప్రాంతములో ఎన్నో లేళ్లు సంచరిస్తున్నాయి. కానీ అవి ఈ లేడి అంత అందంగా ఆకర్షణీయంగా లేవు. అసలు ఇలాంటి మృగమును నేను ఇంతవరకూ చూడలేదు. చూడండి. దాని శరీరం చిత్రవిచిత్రరంగులతో ఎలా మెరిసిపోతోందో! ఆ లేడి మనుషులను చూచి భయపడటం లేదు. నిర్భయంగా తిరుగుతూ ఉంది. దీనిని పెంచుకొని దీనితో వినోదించవలెనని నాకు కోరికగా ఉంది.

ఆహా! ఏమి రూపము! ఏమి సౌందర్యము. దాని అరుపులు కూడా మధురంగా ఉన్నాయి నాథా! దీనిని చూడగానే నా మనసు దీని యందే లగ్నం అయింది. అది నా మనసు హరించింది. దీనిని వదిలి నేను ఒక్కక్షణం కూడా  ఉండలేకపోతున్నాను. కాబట్టి నాథా! దీనిని సజీవంగా పట్టి తెండి. మనము వనవాసకాలములో దీనితో వినోదించి, మరలా మనము అయోధ్యకు పోవునపుడు దీనిని మన

వెంట అయోధ్యతీసుకొని పోవుదము. దీనిని చూచి అత్తయ్యగారు, భరతుడు, నా చెల్లెళ్లు  ఎంతో సంతోషిస్తారు.

పోనీలెండి. ఈ మృగమును సజీవంగా పట్టుకోలేక పోతే, కనీసము దీని చర్మమును అన్నా నాకు బహుమతిగా ఇవ్వండి. నేను దాచుకుంటాను. నేను పూజచేసుకొనేటప్పుడు దీని మీద కూర్చుని పూజచేసుకుంటాను. ఏంటి అలా చూస్తున్నారు! స్త్రీలు ఇటువంటి విపరీతమైన కోరికలు కోరకూడదను మాట నిజమే. కాని, ఈ బంగారు లేడిని చూచి కోరకుండా ఉండలేకపోతున్నాను. ఈ సారికి మన్నించండి." అని గోముగా ప్రేమగా అడిగింది సీత.

రామునికి కూడా ఆ మృగమును చూస్తే ఆనందం కలిగింది. వెంటనే ఆశ్చర్యము కూడా కలిగింది. సీత ఆ మృగమును కావాలి అంటూ ఉంది. తనకు కూడా ఆ మృగమును వేటాడవలెనని కోరికగా ఉంది. అందుకని లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"లక్ష్మణా! సీత మాటలు విన్నావు కదా. సీతకు ఈ మృగము అంటే ఎంతో ఆసక్తిగా ఉంది. నాకు చూడ ఇటువంటి మృగమును మనము ఈ దండకారణ్యములో ఇంతవరకూ చూడలేదు. అంతే కాదు ఇది దేవలోకములో ఉండవలసిన మృగము. భూలోకములోకి ఎలా వచ్చిందో! అటువంటిది మన కంటపడింది. దీని ఒంటి మీద ఉన్న బంగారుచుక్కలు అతిమనోహరంగా ఉన్నాయి. అసలు ఇటువంటి మృగమును చూచి ఎవరు ఆనందించరు! ఈ మృగము అందరినీ ఆకర్షిస్తుంది.

లక్ష్మణా! సాధారణంగా రాజులు వినోదము కొరకు వేటకు పోయి ఇటువంటి మృగములను చంపుతారు. వాటి మాంసమును తింటారు. అది క్షత్రియులకు సహజము. కాబట్టి మనము ఈ మృగమును చంపి దాని చర్మమును సీతకు ఇస్తాము. నేను సీత ఈ మృగచర్మము మీద సుఖంగా ఆసీనులము అవుతాము. ఏ మృగ చర్మము కూడా దీని చర్మము అంత మృదువుగా ఉండదు అని నేను అనుకుంటాను.

పోనీ నీవు చెప్పినట్టు ఇది రాక్షస మాయ అని అనుకుంటే, మనము దీనిని వెంటనే చంపుదాము. ఆ రాక్షసుడు కూడా చస్తాడు. నీవు చెప్పినట్టు వీడు మారీచుడు అనే రాక్షసుడు అయితే ఇంకా మంచిది. ఈ మారీచుడు ఇదివరకు ఈ దండ కారణ్యములో ఎంతో మంది మునులను తన మాయలతో చంపి తిన్నాడు. వీడే మారీచుడు అయితే అవశ్యం వీడిని చంపితీరాలి. వీడు చంపతగ్గవాడు కదా! ఇదివరలో అగస్త్యుడు వాతాపిని చంపినట్టు మనము మారీచుని చంపుదాము. వీడిపీడను, ఈ ప్రాంతంలో వేటకు వచ్చే రాజులకు, ఇక్కడ నివసించే ఋషులకు, లేకుండా చేద్దాము.

అలాకాకుండా, ఈ మృగము మామూలు మృగము అయితే దీనిని చంపి సీతకు చర్మము ఇద్దాము. ఇది రాక్షసుడు అయితే దీనిని చంపి ఇక్కడివారలకు రాక్షసపీడను విరగడ చేద్దాము. కాబట్టి దీనిని చంపడం అవశ్యం ఆచరించతగినది.

లక్ష్మణా! నేను ఈ మృగమును వేటాడి చంపుతాను. నేను వచ్చేదాకా నీవును సీతను రక్షిస్తూ ఉండు. నేను ఒక్కక్షణములో ఈ

మృగమును చంపి దాని చర్మమును తీసుకొని వస్తాను. నీవుమాత్రము ఒంటరిగా ఉన్న సీతను నేను వచ్చువరకూ జాగ్రత్తగా రక్షిస్తూ ఉండు. లక్ష్మణా! కావాలంటే జటాయువు సాయం తీసుకో. నీవు, జటాయువు కలిసి సీతను జాగ్రత్తగా రక్షిస్తూ ఉండండి." అని పలికాడు రాముడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము నలుబదిమూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## నలుబది నాలుగవ సర్గ.

ఈ విధంగా రాముడు లక్ష్మణునికి ఆ లేడిని చంపాలి అన్న తన నిర్ణయాన్ని, సీత గురించి తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పాడు. ఒక కత్తిని తన నడుముకు కట్టుకున్నాడు. ధనర్బాణములను తీసుకున్నాడు. వీపుకు రెండు అమ్ములపొదులను కట్టుకున్నాడు.

ఇదంతా క్రీగంటితో చూస్తున్నాడు మారీచుడు. ఇంక రాముడు తనను వేటాడటానికి వస్తున్నాడని గ్రహించి ముందుకు దూకాడు. చెంగు చెంగున గెంతుతూ దూరంగా పారిపోయాడు. అది చూచి రాముడు ఆ మృగము వెంట పరుగెత్తాడు. మారీచుడు రామునికి చిక్కినట్టే చిక్కి మరలా దూరంగా పరుగెత్తుతున్నాడు. రాముడు తన బాణములతో దానిని కొడుతున్నాడు. ఆ బాణములను చిత్రవిచిత్రంగా తిరుగుతూ తప్పించుకుంటూ పరుగెడుతున్నాడు

మారీచుడు. మెరుపు తీగవలె ఒక క్షణం కనపడుతూ మరొక క్షణం మాయమౌతూ పారిపోతున్నాడు మారీచుడు.

రామునికి పట్టుదల పెరిగింది. ఆ మృగాన్ని వెంబడిస్తున్నాడు. ఆ ప్రకారంగా మారీచుడు రాముని పర్ణశాలకు దూరంగా తీసుకొని వెళ్లాడు. రామునికి విపరీతంగా కోపం వచ్చింది. ఒక చిన్న జింకపిల్ల తనకు చిక్కకుండా పారిపోయిందని ఉక్రోషంతో ఊగిపోతున్నాడు.

అప్పటికే రాముడు అలిసిపోయాడు. ఒక చెట్టు కింద కూర్చున్నాడు. మారీచుడు తనకు తానుగా మరి కొన్ని మృగములను సృష్టించుకొని ఆ లేళ్లగుంపులో తాను మెరిసిపోతూ రాముని ముందు తిరుగాడుతున్నాడు.

రామునికి కోపంపెరిగింది. లేచి మరలా పరుగెత్తాడు. మారీచుడూ అందకుండా పరుగెత్తాడు. రాముడు ఒక దివ్యాస్త్రమును సంధించాడు. ఆ లేడికి గురిపెట్టి ప్రయోగించాడు. ఆ దివ్యాస్త్రము నిప్పులు కక్కుకుంటూ ఆ లేడిని తరుముతూ దూసుకుపోయింది. ఆ దివ్యాస్త్రము బారి నుండి మారీచుడు తప్పించుకోలేకపోయాడు. ఆ దివ్యాస్త్రము మారీచుని గుండెలు చీల్చింది. ఆ దెబ్బకు మారీచుడు పైకి ఎగిరి దబ్బున కిందపడ్డాడు.

మరణ కాలంలో మారీచునకు తన నిజస్వరూపము వచ్చింది. అప్పుడు మారీచునికి రావణుని మాటలు గుర్తుకు వచ్చాయి. వెంటనే మారీచుడు రాముని కంఠధ్వనిని అనుకరిస్తూ “హా సీతా! హా లక్షణా!”

అని బిగ్గరగా అరిచాడు. మారీచుడు తన భయంకరమైన రాక్షస స్వరూపముతో నేలమీద పడిపోయాడు. మారీచుని శరీరం అంతా రక్తంతో తడిసిపోయింది.

లేడి రూపంలో తనను అంతదాకా తీసుకొని వచ్చిన రాక్షసుని చూచిన తరువాత రామునికి లక్ష్మణుని మాటలలో ఉన్న అంతరార్థం అవగతమయింది. అప్పుడు సీతకు ఏమయిందో అని కంగారు పడ్డాడు రాముడు. రామునికి సర్వం బోధపడింది.

“వీడు మారీచుడే. సందేహము లేదు. లక్ష్మణుని మాటలు యదార్థములు. అయినా వీడు చస్తూ “సీతా లక్ష్మణా” అని ఎందుకు అరిచాడు. ఆ అరుపులు విని సీత నా గురించి కంగారు పడదు కదా! ఈ అరుపులు విని లక్ష్మణుడు నాకు ఏమైనా ఆపద కలిగిందని అనుకోడు కదా!”

ఈ ఆలోచన రాగానే రాముడి మనసులో కీడు శంకించాడు. రాముని ఒళ్లు జలదరించింది. కొంచెం భయం కూడా కలిగింది. ఇప్పుడు తీసుకుపోడానికి లేడి లేదు. దాని చర్మం లేదు. అందుకని మరొక చుక్కల లేడిని చంపి దాని మాంసమును, చర్మాన్ని తీసుకొని తన పర్ణశాల వైపు వెళుతున్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము నలుబది నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## నలుబది ఐదవ సర్గ.

మారీచుడు గొంతు మార్చి రాముని గొంతుతో "హా సీతా! హా లక్ష్మణా!" అంటూ అరిచిన అరుపులు ఆశ్రమంలో ఉన్న సీతకు, బయట నిలబడి ఉన్న లక్ష్మణునికి వినపడ్డాయి..

లక్ష్మణుడు ఆ అరుపులను పట్టించుకోలేదు. 14,000 మంది రాక్షసులను ఒంటి చేత్తో మట్టుబెట్టిన రాముడు, కేవలం ఒక రాక్షసునికి బెదిరి అలా అరుస్తాడా! అసంభవం. ఇదేదో రాక్షస మాయ. ఆ మాయలకు లోబడరాదు"అని నిర్ణయించుకున్నాడు.

కాని సీతలో స్త్రీ సహజమైన భయము ఆందోళనా మొదలయ్యాయి. వెంటనే లక్ష్మణుని పిలిచింది.

"లక్ష్మణా! విన్నావుగా మీ అన్నగారు అరిచిన అరుపులు. మీ అన్నగారు ఏదో భయంకరమైన ఆపదలో ఉన్నట్టు ఉన్నారు. లేకపోతే అలా కేకలుపెట్టరు. నువ్వు సత్వరమే వెళ్లి మీ అన్నగారిని రక్షించు."అని తొందర పెట్టింది.

సీత మాటలకు లక్ష్మణుడు చలించలేదు. మరలా సీత లక్ష్మణుని తొందర పెట్టింది. "లక్ష్మణా! నా మనసు అంతా ఆందోళనగా ఉంది. నా ప్రాణములు నిలవడం లేదు. తొందరగా వెళ్లు. ఏమయిందో తెలుసుకో. రాముని రక్షించు. రాముడు ఏ రాక్షసుల వాత పడ్డాడో. లేక

పోతే అలా అరవడు. తొందరగా వెళ్లవయ్యా!!" అని తొందర పెట్టింది సీత.

అయినా లక్ష్మణుడు కదలలేదు. చుట్టు ఏమైనా ఆపద పొంచి ఉన్నదా అని పరికిస్తున్నాడు. అప్పుడు సీతలో అనుమాన బీజం మొలకెత్తింది. అనుమానం మనసులో నాటుకోవాలే కానీ, దానికి హద్దు ఉండదు. శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. సీత ప్రస్తుతం అదే అవస్థలో ఉంది. అనుమానానికి కోపం తోడైతే ఇంక చెప్పేదేముంది. ఏం మాట్లాడుతున్నారో తెలియకుండా మాట్లాడతారు.

"లక్ష్మణా!ఏమీటా మౌనం. మీ అన్న అరుపులు నీకు వినపడలేదా! నేను చెప్పిన మాటలూ వినపడలేదా! నీ అన్న ఆపదలో ఉంటే రక్షించవలసిన బాధ్యత నీకు లేదా! నీ అన్నను రక్షించడానికి నీవు వెళ్లడం లేదంటే నీవు నీ అన్నకు మిత్రుడివి కావు. శత్రువు.

ఆ! నాకు అర్థం అయింది. నీకు నా మీద కోరిక ఉంది. అందుకే నీ అన్న రాముని అడ్డు తొలగించుకోవాలని చూస్తున్నావు. నీకు నా మీద దురాలోచన ఉండటం వలననే నీవు రాముని రక్షించడానికి వెళ్లడం లేదు. రాముడికి ఆపద కలగాలనీ, మరణించాలనీ నీవు కోరుకుంటున్నావు కదూ! రాముడు తిరిగి రాడని నమ్మకంతో ఉన్నావు కదూ! నీకు రాముని మీద ఏ మాత్రం ప్రేమలేదు. నా మీద కోరిక ఉంది. అందుకే ఇలా చేస్తున్నావు.

లక్ష్మణా! అసలు నువ్వు మాతో అరణ్యాలకు ఎందుకు వచ్చినట్టు? రాముని రక్షించడానికే కదా! ఆ రాముడే ఇప్పుడు ఆపదలో ఉన్నప్పుడు ఇక్కడ ఉండి ఏం చేస్తున్నావు? లక్ష్మణా! నీకు

రాముని రక్షించడమే ప్రధానమైన కర్తవ్యము అంతే కానీ నా ఎదురుగా నిలబడటం కాదు. నన్ను రక్షించడం కాదు ముఖ్యం. ముందు నీవు రాముని వద్దకు వెళ్లు. ఆపదలో ఉన్న రాముని రక్షించు." అంటూ సీత కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ కిందపడిపోయింది.

అది చూచి లక్ష్మణుడు ఊరుకోలేకపోయాడు. సీతతో ఇలా అన్నాడు. "ఓ విదేహ రాజపుత్రీ! ఊరడిల్లుము. రామునికి ఏమీ కాదు. రాముని రాక్షసులు గానీ, దేవతలు గానీ, గంధర్వులు కానీ, నాగులు కానీ, ఆఖరుకు మానవులు కానీ జయించలేరు. ఇందులో సందేహము ఏ మాత్రము లేదు. యుద్ధములో దేవేంద్రుని కూడా జయించగల రామునికి ఒక రాక్షసుని వల్ల ఆపద కలగడం అసంభవం. రాముని చంపడం ఎవరి తరమూ కాదు. రాముడు నన్ను నీకు రక్షణగా ఇక్కడ ఉంచాడు. నిన్ను ఒంటరిగా ఈ అడవిలో వదిలి నేను వెళ్లడం క్షేమం కాదు. కాబట్టి నీ దు:ఖాన్ని వదిలిపెట్టు. నీ భర్త ఆ మృగాన్ని చంపి తీసుకురాగలడు.

ఓ జనకరాజపుత్రీ! సావధానంగా ఆలోచించు. అది రాముని కంఠస్వరము కాదు. రాక్షసుల మాయ. నా అనుమానము నిజం అయితే ఆ మాయా మృగము మారీచుడు. వాడే రామబాణంతో చచ్చేటప్పుడు అలా అరిచిఉంటాడు. నిన్ను జాగ్రత్తగా కాపాడమని రాముడు నిన్ను నా వద్ద ఉంచాడు. నిన్ను అంతేజాగ్రత్తగా రామునికి అప్పగించవలసిన బాధ్యత నాది. అందుకని నిన్ను ఈ అడవిలో ఒంటరిగా విడిచి ఇక్కడి నుండి వెళ్లడం నాకు ఇష్టం లేదు.

సీతా! మరొక మాట. రాముడు జనస్థానములో ఉన్న

రాక్షసులను అందరినీ చంపాడు. అది నీకు తెలుసు. ఆ కారణం చేత రాక్షసులు అంతా రాముడి  మీద కోపంతో, శత్రుత్వంతో ఉన్నారు. రాక్షసులు వింత వింత గొంతులతో అరుస్తూ ఉంటారు. వాటిని మనము పట్టించుకోకూడదు. కాబట్టి నీవు రాముని గూర్చి చింతపడవలదు. రాముడు క్షేమంగా తిరిగి వస్తాడు. " అని అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలు సీత చెవికి ఎక్కలేదు. ఆమెకు అనుమానము ఎక్కువ అయింది. కోపంతో లక్ష్మణునితో ఇలా అంది.

"ఓ లక్ష్మణా! నీవు రఘువంశములో చెడ బుట్టావు. నీ బుద్ధి ఇప్పుడు తెలిసింది. ఈ అడవిలో రామునికి ప్రాణాపాయము ఎప్పుడు కలుగుతుందా అని ఎదురు చూస్తున్నావు. ఇప్పుడు నీ కోరిక సిద్ధించింది. అందుకే రామునికి సాయంగా వెళ్లను అంటున్నావు. నీకు దుర్బుద్ధి పుట్టింది అనడానికి ఇంతకన్నా ఏమి కావాలి?

ఇది నీకు పుట్టిన బుద్ధా! లేక నువ్వు భరతుడు కలిసి ఆడుతున్న నాటకమా! ఏది ఏమైనా మీ కోరిక సిద్ధించదు. నేను మీకు దక్కను. మనసా వాచా కర్మణా రాముడినే కోరుకుంటున్న నేను మీకు వశం అవుతానని ఎలా అనుకున్నారు! నా రాముడు లేకుండా నేను ఈ భూమి మీద క్షణకాలం బతకలేను. నీ ఎదుటనే ప్రాణత్యాగము చేసుకుంటాను." అని వలా వలా ఏడుస్తోంది సీత.

లక్ష్మణునికి ఆమెను ఎలా ఓదార్చాలో, ఎలా అనునయించాలో, ఎలా నమ్మించాలో అర్థం కావడం లేదు.

"అమ్మా సీతా! నీకు ఎలా బదులు చెప్పాలో అర్థం కావడం లేదు. నీవు అలా మాట్లాడటంలో ఆశ్చర్యం లేదు. నీ పరిస్థితులలో ఉన్న ఏ స్త్రీ అయినా ఇలాగే మాట్లాడుతుంది అనేది లోకవిదితము. కాని నీవు జనకుని కుమార్తెవు. రాముని భార్యవు. నీవు కూడా ఇలా మాట్లాడటం భావ్యం కాదు. నీ మాటలు నా చెవులలో ములుకుల వలె గుచ్చుకుంటూ ఉన్నాయి.

ఇప్పటిదాకా ఓర్పుతో సహించాను. ఇంక సహించలేను. నేను నా అన్నగారి ఆజ్ఞను పాటిస్తున్నాను. దీనికి ఈ వనదేవతలే సాక్షులు. కాని నీవే మనసులో దురాలోచన పెట్టుకొని నన్ను నిందిస్తున్నావు. నీవు కోరినట్టే నేను రాముని రక్షించడానికి వెళుతున్నాను.

ఓ జనకరాజపుత్రీ! ఈ వనదేవతలే నీకు రక్షగా ఉందురు గాక! నీకు క్షేమం అగుగాక! ఓ సీతా! ప్రస్తుతము నాకు అనుకూలమైన శకునములు కనపడటం లేదు. మరలా నేను, నువ్వు రాముడు కలిసి ఉండగా చూస్తానో లేదో అని అనుమానంగా ఉంది. " అని వెళ్లనా వద్దా అని తటపటాయిస్తున్నాడు లక్ష్మణుడు.

అది చూచి మరలా సీత సూటీ పోటీ మాటలు అనడం మొదలెట్టింది. "ఓ లక్ష్మణా! ఎందుకు అనవసరంగా ఆలస్యం చేస్తున్నావు. రామునికి ఏదైనా ప్రమాదం జరగాలని కోరుకుంటున్నావా! రామునికి జరగకూడనిది జరిగితే నేను గోదావరిలో దూకుతాను. ఉరిపోసుకొని చస్తాను. లేదా ఆ ఎత్తైన పర్వతము మీదికి ఎక్కి కిందికి దూకుతాను. విషం తాగుతాను. అగ్నిలో దూకుతాను. చస్తాను. అంతేగానీ నేను పరపురుషుని నా పాదముతో కూడా తాకను." అని నెత్తీ నోరూ

బాధుకుంటూ ఏడుస్తూ ఉంది సీత.

సీత ఏడుపు భరించలేకపోయాడు లక్ష్మణుడు. ఏమి అయితే అది అవుతుందని, సీతకు నమస్కరించాడు. మరలా మరలా వెనక్కు తిరిగి చూచుకుంటూ, కనులనిండా నీరు నిండగా, ఆ స్థలం వదిలి రాముని వెదుక్కుంటూ వెళ్లాడు లక్ష్మణుడు.

(ఇక్కడ ఒక మాట. మనకు అనుశ్రుతంగా ఉన్న కథలలో లక్ష్మణుడు ఆశ్రమము ముందు ఒక గీతగీచాడనీ, రావణుడు దగ్గర రాగానే ఆ గీత మంటలు విరజిమ్మింది అనీ, అందుకని రావణుడు సీతను గీతదాటి రమ్మన్నాడనీ, సీత గీత దాటగానే, తీసుకొని వెళ్లాడని, సీతను తాకకుండా ఆమె ఉన్న ప్రదేశమును మొత్తం పెకలించి తీసుకువెళ్లాడనీ, రావణుడు సీతను తాకితో భస్మం అయిపోతాడని శాపం ఉందనీ, అందుకని సీతను తాకకుండా తీసుకొని వెళ్లాడనీ రకరకాల కథలు ప్రచారంలో ఉన్నాయి. అవే సినిమాలలో, టివిలలో కూడా చూపించారు. కాని వాల్మీకి రామాయణంలో ఇవన్నీ లేవు. లక్ష్మణుడు గీతా గీయలేదు. సీత గీత దాటనూ లేదు. రావణుడు సీతను మెడ కింద ఒక చెయ్యి, నడుము కింద ఒక చెయ్యి వేసి ఎత్తుకొని రథం మీద కూర్చోపెట్టాడు. తాను కూర్చుని సీతను తన ఒడిలో కూర్చోపెట్టుకొని తీసుకొని వెళ్లాడు.
(అఙ్కేనాదాయ వైదేహీం రథమారోపయత్తదా) అని వాల్మీకి రామాయణంలో ఉంది.)

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము నలుబది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్య కాండము

## నలుబది ఆరవ సర్గ.

సీత మాట్లాడిన పరుషమైన వాక్యములకు బాధపడి లక్ష్మణుడు రాముని వెతుకుతూ వెళ్లిన వెంటనే ఈ అవకాశము కొరకు వేచి ఉన్న రావణుడు తను దాగి ఉన్న పొదలమాటు నుండి బయటకు వచ్చాడు. ఆ సమయంలో రావణాసురుడు ఒక సన్యాసి వేషంలో ఉన్నాడు. కాషాయ బట్టలు ధరించాడు. చేతిలో దండము, కమండలము పట్టుకున్నాడు. జటాజూటములు కట్టుకున్నాడు. ఒక గొడుగు పట్టుకున్నాడు. కాళ్లకు పాదుకలు ధరించాడు. కపట సన్యాసి వేషంలో ఉన్న రావణుడు సీత ఉన్న చోటికి వచ్చాడు.

రావణుని రాకతో అక్కడి ప్రకృతి కూడా వణికిపోయింది. గాలి ఆడటం మానేసింది. పక్కనే ప్రవహిస్తున్న గోదావరి నది కూడా మెల్లగా శబ్దం చెయ్యకుండా ప్రవహించసాగింది. రావణుడు సీత దగ్గరగా వచ్చాడు. ఆ సమయంలో సీత రామునికి ఏమి ఆపద సంభవించిందో అని బాధపడుతూ దు:ఖిస్తూ కూర్చుని ఉంది. సీతను చూడగానే రావణుడికి మన్మథుని బాధ ఎక్కువ అయింది. సీతను చూచి రావణుడు ఇలా అన్నాడు.

“ఓ తరుణీ! నీవు ఎవరవు? అన్నిశుభలక్షణములు కల నీవు ఎవరు? నీవు ఆ శివుని అర్ధాంగి పార్వతివా? లేక కీర్తికి అధిష్టాన

దేవతవా! లేక కాంతి దేవతవా! లేక లక్ష్మివా! దేవ కాంతవా! అప్సరసవా! లేక మన్మధుని మనోహారిణి రతీదేవివా!

(ఇక్కడ రావణుడు సీతను అంగాంగము వర్ణించాడు. సీత చనుదోయిని, తొడలను, నడుమును, పిరుదులను వర్ణించాడు. వాల్మీకి అలా వర్ణిస్తాడా! ఎంత సన్యాసి అయినా పరాయిస్త్రీని అలా వర్ణిస్తుంటే ఆ స్త్రీ ఊరుకుంటుందా! కాబట్టి ఇవి వాల్మీకి రాసినవి కావేమో అనిపిస్తుంది. చదవండి.)

ఓ తరుణీ! నీ జఘనము విశాలంగా ఉంది. నీ తొడలు ఏనుగు తొండముల మాదిరి ఉన్నాయి. నీ స్తనములు గుండ్రంగా తాటి పండ్లమాదిరి అందంగా ఉన్నాయి (తాలఫలోపమౌ) ఓ తరుణీ! నీవు నా మనసును హరించావు. నీ నడుము నా పిడికిలి అంత ఉంది. నీ వెంట్రుకలు అందంగా ఉన్నాయి. నీ స్తనములు దగ్గరగా ఉన్నాయి. ....
( ఈ వర్ణన బట్టి మీరే నిర్ణయించండి)

ఓ లలనా! నీ వంటి సౌందర్యవతిని నేను ఇంతవరకూ భూమండలములోనే కాదు ముల్లోకములలో  చూడలేదు. నీవు ఈ అరణ్యములలో ఉండతగవు. నిన్ను ఆ అరణ్యములో ఈ పర్ణశాలలో చూస్తుంటే నాకు బాధగా ఉంది. ఈ అరణ్యము రాక్షసుల నివాసము. ఎక్కడో రాజభవనములలో, అంత:పురములలో రాచభోగములు అనుభవించవలసినదానికి ఇక్కడ ఎందుకున్నావు.

నీకు వివాహ మైనదా! నీ భర్త ఎవరు? నీవు మానవ కాంతవు మాత్రము కావు! నీవు దేవతాస్త్రీవి అయి ఉండవలెను. రాక్షసులు

సంచరించు ఈ అరణ్య ప్రాంతమునకు దేవతలు, గంధర్వులు, కింనరులు కూడారారు. అటువంటిది నీవుఎందుకు వచ్చావు? ఈ అరణ్యములో ఉన్న పులులు, సిహములు మొదలగు క్రూరమృగములను చూచి నీకు భయం వెయ్యడం లేదా!

మరలా అడుగుతున్నాను. నీవు ఎవరు? నీ భర్త ఎవరు? నీవు ఎక్కడి నుండి వచ్చావు? ఈ రాక్షసరాజ్యంలో ఒంటరిగా ఎందుకు ఉన్నావు?" అని అడిగాడు రావణుడు.

బ్రాహ్మణుడు, సన్యాసి వేషములో ఉన్న రావణునికి సీత అర్ఘ్యము, పాద్యము ఇచ్చి సత్కరించింది. అతిథి పూజలు చేసింది. తినడానికి పండ్లు కూడా ఇచ్చింది. సీత తనకు అతిథి మర్యాదలు చేస్తుంటే, రావణుడు ఆమెను ఎలా బలవంతంగా తీసుకొని పోవాలా అని ఆలోచిస్తున్నాడు. తన చావు తానే కొనితెచ్చుకుంటున్నాడు.

రావణునికి అతిథి సత్కారములు చేసి, గుమ్మము వద్దకు వచ్చి సీత రాముడు, లక్ష్మణుడు వస్తున్నారా అని చూసింది. కాని రామలక్ష్మణులు ఎంతకూ కనపడలేదు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము నలుబది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## నలుబది ఏడవ సర్గ.

సన్యాసివేషములో ఉన్న రావణుడు తన గురించి గుచ్చి గుచ్చి అడుగుతుంటే, సీత మనసులో ఇలా అనుకుంది.

"ఇతడు సన్యాసి. బ్రాహ్మణుడు. పైగా అతిథి. ఈయన అడిగిన వివరాలు చెప్పకపోతే శపిస్తాడేమో. ఉన్నవి ఉన్నట్టు చెబితే తప్పేమిటి" అని మనసులో అనుకొంది. అప్పుడురావణుని చూచి ఇలా అంది.

" ఓ బ్రాహ్మణోత్తమా! నేను మిథిలా నగరానికి రాజు జనకుని కుమార్తెను. అయోధ్యా నగరాధి పతి దశరథుని కోడలను. రాముని భార్యను. నా పేరు సీత. నేను చిన్నతనమునుండి రాజభోగములు అనుభవించాను. నా వివాహము అయిన తరువాత కూడా 12 సంవత్సరములు నా అత్తవారి ఇంట రాజభోగములు అనుభవించాను.

నా భర్త రామునికి పట్టాభిషేక సమయములో మా మామగారి మూడవ భార్య కైక ఆయనను రెండు వరములు కోరింది. ఒకటి రాముని అరణ్యవాసము. రెండవది తన కుమారుడు భరతుని పట్టాభిషేకము. అప్పుడు నా భర్తకు 25 సంవత్సరాలు. నా భర్త పట్టాభిషేకము ఆగిపోయింది. తండ్రి మాట ప్రకారము నా భర్త 14 ఏళ్లు అరణ్యవాసము చేస్తున్నాడు. ఆయన సహధర్మచారిణిగా నేను కూడా ఆయనతో పాటు అరణ్యవాసము చేస్తున్నాను. ఆయన సవతి తల్లి కుమారుడు లక్ష్మణుడు కూడా మాతో అరణ్యములకు వచ్చాడు. ఆ

ప్రకారంగా మేము ముగ్గురము ఈ అరణ్యములో నివసిస్తున్నాము. నా భర్త రాముడు, నా మరిది లక్ష్మణుడు అడవిలో ఒక జింకను వేటాడటానికి వెళ్లారు. వారు తొందరలోనే వస్తారు. శ్రేష్టమైన జింక మాంసము తెస్తారు.

ఇంతకూ తమరు ఎవరు? ఎక్కడి నుండి వచ్చారు? తమరి గోత్రనామములు ఏమిటి? ఈ దండకారణ్యములో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నారు?" అని ఎదురు ప్రశ్నలు వేసింది సీత.

సీత వేసిన ప్రశ్నలకు రావణుడు ఇలా బదులు చెప్పాడు. "ఓ సీతా! నా పేరు రావణుడు. నేను రాక్షస రాజును. నన్ను చూస్తే దేవతలు, అసురులు, పన్నగులు, అందరూ భయపడతారు. నిన్ను చూచిన వెంటనే నాకు నీ మీద మోహము కలిగింది. నిన్ను చూచిన తరువాత, నేను నీ దగ్గర తప్ప నా ఇతర భార్యల దగ్గర కామభోగములు అనుభవింపలేను అని అనుకుంటున్నాను.

నేను ఎంతో మంది స్త్రీలను పట్టి తెచ్చి నా భార్యలుగా చేసుకున్నాను. నీవు నాతో వస్తే నిన్ను వారందరికీ పట్టమహిషిని చేస్తాను. నేనుపాలించే నగరము పేరు లంకానగరము. సముద్రమధ్యలో ఒక పర్వతము మీద నిర్మించబడి ఉంది. నా నగరములో అనేక సుందర ఉద్యానవనములు ఉన్నాయి. నీకు ఈ అరణ్యవాసము ఎందుకు, నాతో వస్తే ఆ ఉద్యానవనములలో హాయిగా విహరించవచ్చును. సీతా! నీవు నాకు భార్యవు అయితే నీకు అయిదు వేలమంది దాసీలు సేవలు చేస్తారు. నన్ను వరించు. నాతో రా!" అని అన్నాడు రావణుడు.

ఆ మాటలు విన్న సీతకు కోపము ముంచుకొచ్చింది.

"రావణా! నేను నా భర్త రాముని తప్ప మరొకరిని కలలో కూడా తలంచను. నా రాముడు మహాపర్వతము వంటి వాడు. అజేయుడు. సర్వలక్షణ సంపన్నుడు., వటవృక్షము వంటి వాడు. సత్యవాక్పరిపాలకుడు. అట్టి రాముడు నాకు భర్త. నేను నా భర్తను తప్ప మరొకరిని కన్నెత్తికూడా చూడను. ఇంకా నా రాముడు మహా బాహుడు. ఉన్నతవక్షస్థలము కలవాడు. నరులలో ఉత్తముడు. సింహము వంటి వాడు. నా రాముడు జితేంద్రియుడు. కీర్తిమంతుడు.

సింహము వంటి భర్తకు భార్యనైన నన్ను ఒక నక్కమాదిరి కోరుతున్నావు. నీకు కనీసము నన్ను తాకే అర్హత కూడా లేదు. నన్నుకోరుతున్నావు అంటే నీకు మరణము ఆసన్నమయినది అని తెలుస్తూ ఉంది. ఎందుకంటే సింహము వంటి రాముని జూలు పట్టుకొని లాగుతున్నావు. మంధర పర్వతమును పైకిఎత్తాలని, కాలకూట విషాన్ని తాగాలని ఉత్సాహపడుతున్నావు. సూదితో కంటిలో నలుసును తీసుకుంటూ నీ కళ్లు నీవే పొడుచుకుంటున్నావు. అలాగే వాడియైన కత్తిని నాలుకతో నాకుతున్నావు. పెద్ద రాయి కట్టుకొని సముద్రమును ఈదాలని అనుకుంటున్నావు. సూర్యచంద్రులను మింగాలని చూస్తున్నావు. అగ్నిని కొంగున ముడి వెయ్యాలని ప్రయత్నిస్తున్నావు. రాముడి భార్యను పొందాలి అని అనుకోడం వాడి అయిన శూలాల మీద నడవడమే. నాశనమైపోతావు. జాగ్రత్త!

ఓ రావణా! నీవు రాముని కాలి గోటికి కూడా చాలవు. అది తెలుసుకో! రాముడు సింహం అయితే నువ్వు నక్క. రాముడు

సముద్రము అయితే నువ్వు మురికినీరు ప్రవహించే పిల్లకాలువ. రాముడు ఏనుగు అయితే నువ్వు దోమ. రాముడు గరుడుడు అయితే నువ్వు కాకి. రాముడు నెమలి అయితే నువ్వు నీటి కొంగ. రాముడు హంస అయితే నువ్వు గ్రద్ద. నీకూ రామునికి అంత తేడా ఉంది. నీచేయి నామీద పడితే రాముడు నిన్ను సంహరించగలడు. జాగ్రత్త!" అని అన్నది సీత.

కానీ సీతకు లోలోపల భయంగానే ఉంది. ఆ భయం తట్టుకోలేక నేలమీద పడిపోయింది. రావణుడు సీతను మరింత భయపెట్టడానికి తన గురించి ఇంకా చెప్పనారంభించాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము నలుబది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## నలుబది ఎనిమిదవ సర్గ.

"ఓ సీతా! నా గురించి నీకు పూర్తిగా తెలియదు. నేను దశకంఠుడను. నేను కుబేరునికి తమ్ముడిని. నా పేరు రావణుడు. మృత్యువుకు భయపడి మానవులు ఎలా పారిపోతారో అలాగా నన్ను చూచి దేవతలు, గంధర్వులు, దానవులు భయంతో పారిపోతారు. నేను నా సోదరుడు కుబేరునితో యుద్ధమే చేసి జయించాను. నాకు భయపడి కుబేరుడు సకల భోగములతో తులతూగుతున్న తన

నగరమును విడిచి కైలాసంలో తలదాచు కొన్నాడు. నేను కుబేరుని జయించి అతని పుష్పక విమానమును అపహరించాను. దాని మీద నేను ఆకాశంలో విహరిస్తుంటాను.

నాకు కోపం వచ్చింది అని తెలిసిన మరుక్షణం దేవతలు దేవేంద్రునితో సహా పారిపోతారు. నేను ఉన్నచోట వాయువు నెమ్మదిగా వీస్తాడు. సూర్యుడు తన కిరణముల తీవ్రతను తగ్గించుకుంటాడు. నేను ఉన్నచోట చెట్టుకూడా తమ ఆకులను కదల్చలేవు. నదులు ప్రవహించ లేవు. నేను ఈ ప్రకృతినంతా శాసిస్తాను.

సముద్రము మధ్యలో ఉన్న నా లంకానగరము సకల భోగములలో దేవేంద్రుని అమరావతిని తలదన్నుతుంది. లంకా నగరం బంగారు ప్రాకారాలు, బంగారు మేడలు మణితోరణాలతో నిండి ఉంటుంది. నా లంకా నగరము ప్రశస్తమైన ఏనుగులు, గుర్రములతో నిండి ఉంటుంది. ఎల్లప్పుడూ మంగళ వాద్యములు మ్రోగుతూ ఉంటాయి. నువ్వు నాతో కలిసి లంకా నగరంలో అడుగుపెడితే నీ రాముని, నీ వాళ్లను అందరినీ మరిచి పోతావు. భోగాలలో మునిగితేలుతావు. ఆ రాచ భోగాలలో మునిగిన నీకు సామాన్యమానవుడైన రాముడు ఎన్నటికీ గుర్తుకురాడు.

నీకు తెలుసో లేదో. అసలు దశరథుడు రాముడికి రాజ్యం ఇవ్వకుండా అడవులకు ఎందుకు పంపాడంటావు. రాముడంటే అతని తండ్రి దశరథునికి ఇష్టం లేదు. అందుకే తన ప్రియపుత్రుడు భరతునికి రాజ్యం ఇచ్చాడు. నీ భర్త రాముడు రాజ్యభ్రష్టుడు. తెలివితక్కువవాడు. పైగా తాపస వృత్తిలో ఉన్నాడు. అటువంటి మొగుడి పక్కన ఉన్నంత

కాలమూ నీవు ఈ జన్మలో అయోధ్యకు రాణివి కాలేవు. నువ్వు ఊ అంటే లంకా రాజ్యానికి రాణివి అవుతావు.

ఇంక నేనంటావా ఈ లోకంలో ఉన్న రాక్షసులందరికీ రాజును. పైగా నువ్వు అంటే కామంతో పడిచస్తున్నాను. నేనే నిన్నుకోరి లంకనుండి నీ వద్దకు వచ్చాను. కాబట్టి నన్ను కాదనకు. నన్ను కాదంటే ఇంతటి అదృష్టాన్ని కాలదన్నుకున్నానే అని జీవితమంతా పశ్చాత్తాపంతో కుమిలిపోతావు. యుద్ధంలో రాముడు నా కాలి గోరు కూడా కదపలేడు. నీ అదృష్టం కొద్దీ నీవు నా కంటపడ్డావు. నాతోరా! నిన్ను సుఖాలలో ముంచెత్తుతాను. "అని సీతను ప్రలోభపెట్టాడు రావణుడు.

రావణుని మాటలు విన్న సీత కోపంతో ఊగిపోతున్న నాగ కన్య మాదిరి బుసలు కొట్టింది.

"ఓరి రాక్షసా! దుర్బుద్ధివి. ఇంద్రియ లోలుడివి. రావణా! నీవు నీ వాళ్లతో సహా సర్వనాశనం అయిపోతావు. నీ లంకా రాజ్యము సముద్రంలో కలిసిపోతుంది. ఇంద్రుని వద్దనుండి శచీదేవిని బలాత్కారంగా తీసుకొని పోయి జీవిస్తావేమోగానీ, రాముని వద్దనుండి నన్ను అపహరించి క్షణకాలము కూడా నీవు జీవించలేవు. నువ్వు అమృతము తాగినా నీకు రాముని చేతిలో చావు తప్పదు." అని పరుషంగా పలికింది సీత.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము నలుబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## నలుబది తొమ్మిదవ సర్గ.

సీత మాట్లాడే మాటలు వింటుంటే రావణుకి కోపం నసాళానికి అంటింది. అసహనంతో, కోపంతో గంతులేసాడు. రెండు చేతులు గట్టిగా చరిచాడు. పెద్దగా గాండ్రించాడు.

"ఓ సీతా! నీకేమైనా పిచ్చా! నా మాటలు అర్థం కావడం లేదా! నా గురించి, నా ఐశ్వర్యము గురించి, నా పరాక్రమము గురించి, నా వైభవము గురించీ ఎంత చెప్పినా నీ చెవికి ఎక్కడం లేదు. నా గురించి నీకు బాగా తెలియదు. నేను ఆకాశంలో నిలబడి ఈ భూమిని బంతిలా పైకి ఎత్తి ఆడుకుంటాను. సముద్రాలన్నీ కలిపి తాగేస్తాను. నా ఎదుట నిలిస్తే మృత్యువును కూడా చంపేస్తాను. సూర్యగమనాన్ని అడ్డుకుంటాను. భూమిని బద్దలు కొడతాను. నా ఇష్టం వచ్చి రూపం ధరించగలను. ఇప్పుడు నేను ఉన్నది సన్యాసి రూపంలో. నా అసలు రూపం చూడు." అంటూ రావణుడు తన సన్యాసి రూపం వదిలి పెట్టి తన అసలు రూపం సీత ముందు ప్రదర్శించాడు.

పదితలలతో, ఎర్రటి కళ్లతో, ఒంటినిండా బంగారు ఆభరణములతో, నల్లని మేని ఛాయతో, ధనుర్బాణములను ధరించిన రావణుడు సీత ముందు నిలిచాడు.

"ఓ సీతా! చూచావా నా నిజస్వరూపము. ముల్లోకములను శాసించే భర్త కావాలనుకుంటే నన్ను వరించు. నీ లాంటి అతిలోక

సౌందర్యవతికి నేను తగిన భర్తను. నేను నీ మాట ఎన్నడూ జవదాటను. నీకు దాసుడిగా ఉంటాను. ఆ వనచరుడైనా రాముని మీదినుండి నీ మనసు మరల్చుకో. నా మీద మనసు లగ్నం చెయ్యి. నీకు శుభం జరుగుతుంది.

నేను ఇంకా నువ్వు చాలా తెలివిగలదానవు మంచి నిర్ణయం తీసుకుంటావు అనుకున్నాను. కాని నీవు ఇంత తెలివి తక్కువదానికి అని అనుకోలేదు. ఒక ఆడుదాని మాటలు విని అడవులకు వచ్చిన బుద్ధిహీనుడిని, రాజ్యభ్రష్టుడిని, అల్పాయుష్కుడిని, మానవమాత్రుడిని నువ్వు  ఏం చూసి వరించావో నాకు అర్థం కావడం లేదు. రా! నాతో రా!" అంటూ రావణుడు ముందుకు దూకాడు.

సీతను గట్టిగా పట్టుకున్నాడు. ఒక చేతితో సీత జుట్టు పట్టుకున్నాడు. మెడ కింద చెయ్యి వేసాడు. మరొక చెయ్యి నడుము కింద వేసాడు. సీతను ఎత్తుకొని పోయాడు. రావణుని రథము అతని ముందు సాక్షాత్కరించింది. సీతను రథంలో కూర్చోపెట్టాడు. పెద్ద పెద్ద గా అరుస్తూ సీతను భయపెడుతున్నాడు. తాను కూడా రథం ఎక్కి సీతను తన ఒడిలో కూర్చోపెట్టుకున్నాడు.

సీతకు ఏం జరుగుతుందో తెలీడం లేదు. "రామా రామా" అంటూ అరుస్తూ ఉంది. పాములా మెలికలు తిరిగిపోతూ ఉంది. రావణుడి కబంధ హస్తాలనుంచి తప్పించుకోవాలని ప్రయత్నిస్తూ ఉంది. కాని రావణుడు తన పట్టు వీడలేదు.  తన రథంతో సహా ఆకాశంలోకి ఎగిరాడు. సీత "రామా రామా" అంటూ అరుస్తూనే ఉంది.  రావణుడు ఆమెను గట్టి పట్టుకున్నాడు. రథం ఆకాశమార్గాన వేగంగా పోతూ

ఉంది.

"రామా! నన్ను ఈ దుర్మార్గుడు అపహరించుకొని పోతున్నట్టు నీకు ఎలా తెలుస్తుంది. ఇంక నీవు నన్ను చూడలేవు కదా! నేను ఎక్కడ ఉన్నదీ నీకు ఎలా తెలుస్తుంది! రామా! నీవు దుష్టులను శిక్షిస్తావు కదా! దుర్మార్గుడైనా ఈ రాక్షసుని శిక్షించి నన్ను రక్షించవా! ఈ రాక్షసుని చెరనుండి నన్ను విడిపించవా! ఒరేయి రావణా! తప్పు చేస్తున్నావు. పాపం చేస్తున్నావు, ఈ పాపానికి ఫలితం అనుభవిస్తావు. రాముడి చేతిలో చస్తావు! అయ్యో! రామా! నా బాధ ఎవరికి చెప్పుకోను. ఆహా! ఆ కైక కోరిక ఈ నాటికి తీరినట్టుంది. నాకు ఇన్నికష్టాలు వచ్చాయి.

ఓ వనదేవతలారా! ఓ వృక్షములారా! ఓ పర్వత పంక్తులారా! ఈ దుర్మార్గుడు రావణుడు నన్ను అపహరించుకొని పోతున్న సంగతి నా రామునికి చెప్పండి. గలా గలా పారే ఓ గోదావరీ నదీ మాతా! నన్ను ఈ రాక్షసుడు అపహరించుకుపోతున్న సంగతి నా రామునికి తెలియజేయి! ఓ వన్య మృగములారా! ఓ పక్షులారా! నిస్సహాయ స్థితిలో ఉన్న  నన్ను ఈ దుర్మార్గుడు తీసుకుపోతున్న సంగతి నా రామునికి చెప్పండి.

నాకు తెలుసు. నేను యమలోకంలో ఉన్నా నా రాముడు నన్ను తన బలపరాక్రమాలతో  మరలా వెనక్కు తీసుకురాగలడు.  మీరు నా రామునికి నా గురించి తెలియజెయ్యండి చాలు." అని పరి పరి విధాలా ప్రకృతితో మొరబెట్టుకుంటూ ఉంది సీత.

ఇంతలో సీతకు ఒక వటవృక్షము మీద కూర్చుని ఉన్న

జటాయువు కనిపించాడు. "ఓ జటాయువూ! ఇటు చూడు. నేను! సీతను! ఈ రాక్షసుడు నన్ను అపహరించుకొని తీసుకొని పోతున్నాడు. ఈ విషయం రామునికి చెప్పు. వీడు రాక్షసుడు. క్రూరుడు. చేతిలో ఆయుధం ఉంది. వీడిని నువ్వు ఏమీ చేయలేవు. నన్ను కాపాడలేవు. కనీసం నా గురించి రామునికి తెలియజెయ్యి. నన్ను ఈ దుర్మార్గుడు అపహరించుకు పోతున్న సంగతి రామునికి లక్ష్మణునికి తెలియజెయ్యి." అని బిగ్గరగా అరుస్తూ ఉంది సీత.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము. నలుబది తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము.

## ఏబదియవ సర్గ.

రావణుడు సీతను అపహరించుకొని వెళ్లే సమయంలో జటాయువు ఒక వట వృక్షము మీద నిద్రపోతున్నాడు. సీత అరుపులు, రావణుని హుంకారములు విని జటాయువు నిద్రలేచాడు. జటాయువుకు ఏం జరుగుతుందో అర్థం అయింది. వెంటనే ఎగురుతూ పోయి రావణుని రథం మీద వాలాడు. రాముడు తన రథం ఆపాడు. అప్పుడు జటాయువు రావణునితో ఇలా అన్నాడు.

"రావణా! నేను నిత్యసత్యవ్రతుడను. నా పేరుజటాయువు. నేను గరుడ వంశజుడను. మహా బలిశాలిని. రాముడు అయోధ్యాధి పతి

దశరథుని కుమారుడు. ముల్లోకములచేత పూజింపబడేవాడు. ఈమె రాముని భార్య. పేరు సీత.

నీవు ధర్మమార్గంలో పయనించే మహారాజువు. అటువంట ి నీవు ఇతరుల భార్యలను అపహరించ వచ్చునా! ముఖ్యముగా సాటి రాజుల భార్యలను గౌరవించాలి. ఆపదలలో ఉంటే రక్షించాలి కానీ, నీ లాగా అపహరించకూడదు. అదే లోక ధర్మము. కాబట్టి ఇతరుల భార్యల మీద ఉన్న నీ కోరికను మానుకో. ఇది నీ వంటి ధర్మాత్ములు చేయదగ్గపనికాదు. నీ భార్యను ఇతరులు అపహరిస్తుంటే నువ్వు ఎలా రక్షించుకుంటావో, అలాగే ఇతరుల భార్యలను ఎవరైనా అపహరిస్తుంటే నువ్వు రక్షించాలి. కానీ, నువ్వే ఇతరుల భార్యలను అపహరించడం తప్పు కదా! అలాంటి తప్పు చేయకు. ఇతరులు నిన్ను నిందించే పని చేయడం తప్పు కదా!

రావణా! సామాన్యులు ధర్మము, అర్థము, కామము వీటి ఆచరణలో సందేహము కలిగినపుడు, రాజు ఏం చేస్తాడో దానినే అనుసరిస్తారు. కాబట్టి రాజు తన ప్రజలకు ఆదర్శప్రాయుడుగా ఉండాలి. అటువంటి రాజువైన నీవే ఇటువంటి నిందార్హమైన పని చేస్తే, నీ ప్రజలు ఎవరిని అనుసరించాలి. ఆలోచించు.

ఓ రాక్షస రాజా! నీవు నిరంతర పరకాంతాబిలాషివే. చపలచిత్తుడివే. నీకు రాజ్యాధికారము, లంకాధిపత్యము ఎలా లభించింది అని సందేహముగా ఉంది. దీనిని బట్టి చూడ నీది దుష్టస్వభావము అని స్పష్టంగా తెలుస్తూ ఉంది. నీకు పుణ్యకార్యములు చేయడం తెలిసినట్టు లేదు. అందుకే పాపపు పనులలో నిమగ్నుడవై

ఉన్నావు.

పోనీ, నీకు ఎవరైనా అపకారము చేస్తే వారికి అపకారం చేయడం లోక ధర్మము. ఎక్కడో అరణ్యములో ఆకులు అలములు తింటూ కాలం గడుపుతున్న రాముడు, లంకలో ఉన్న నీకు ఎలాంటి అపకారమూ చేయలేదే? అటువంటప్పుడు నీవు రాముని భార్యను ఎందుకు అపహరిస్తున్నావు? అతని పట్ల ఎందుకు అపరాధము చేస్తున్నావు?

నీ సోదరులు ఖరుని దూషణుని చంపాడు అని కదా నీ వాదన. కాని వారిని ఎందుకు చంపాడు. శూర్పణఖ పోయి, వారిని రాముని మీదికి యుద్ధానికి పురికొల్పింది. రాముడు ఒక్కడు. వారు 14,000 మంది. రాముడు ఏం చేస్తాడు. యుద్ధం చేసాడు. యుద్ధంలో వారు చచ్చారు. అందులో రాముని తప్పు ఏముంది? రాముడు మీ మీదికి యుద్ధానికి కాలు దువ్వలేదు కదా! మరి ఎందుకు రాముని భార్యను అపహరిస్తున్నావు. కాబట్టి వెంటనే సీతను వదిలిపెట్టు. లేకపోతే రాముని బాణములకు ఆహుతి అవుతావు. ఈ సీతాపహరణంతో నీవు త్రాచుపామును కొంగున కట్టుకొని తిరుగుతున్నావు. నీ మెడకు చుట్టుకొని ఉన్న కాలపాశమును నీవు గుర్తించడం లేదు.

ఓ రావణా! సాధారణంగా మనకు అలవి అయిన పనులే మనం చేయాలి. మనకు జీర్ణం అయ్యే పదార్థాలే మనం తినాలి. అలాగే ధర్మవిరుద్ధమైనవి, అపకీర్తిని తెచ్చిపెట్టేవి అయిన పనులు మనం చేయకూడదు కదా! రావణా! నా సంగతి నీకు తెలుసుగా! నేను పుట్టి

60,000 సంవత్సరములు అయింది. నేను వృద్ధుడను. కాని నీవు యువకుడవు. నేను నిరాయుధుడను. నీవు సాయుధుడవు. అయినా నేను నిన్ను సీతను తీసుకొని పోనీయను. అడ్డుకుంటాను. నా కంఠంలో ప్రాణం ఉండగా నీవు సీతను తీసుకొని పోవడానికి వీలు లేదు. నీవు శూరుడవు అయితే నాతో యుద్ధం చెయ్యి. నిన్ను ఖరుడు పోయిన చోటికే పంపుతాను.

నీవు ఎంతో మందిని చంపి ఉంటావు. కానీ ఇప్పుడు రాముడు నిన్ను చంపగలడు. రాముడు లక్ష్మణుడు ఇక్కడ ఉంటే నీ మరణం ఈ క్షణము సంభవించి ఉండేది. వాళ్లు ఇక్కడ లేకపోబట్టి బతికిపోయావు. చేతనైతే వారు వచ్చేదాకా ఉండి వారితో యుద్ధం చెయ్యి అంతేగానీ, వారు లేనప్పుడు సీతను అపహరించడం వీరత్వము అనిపించుకోదు.

నేను జీవించి ఉండగా నీవు సీతను తీసుకొని ఒక్క అడుగు కూడా ముందుకు కదలలేవు. నా ప్రాణాలు ఒడ్డి అయిన సరే నేను సీతను కాపాడతాను. రా! నాతో యుద్ధానికి రా! నిన్ను ఈ క్షణమే నీ రథం నుండి కిందకు పడదోస్తాను." అని వీరోచితంగా పలికాడు జటాయువు.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము ఏబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఏబది ఒకటవ సర్గ.

జటాయువు పలికిన పలుకులను చాలా తేలిగ్గా తీసుకున్నాడు రావణుడు. రావణుని దృష్టిలో జటాయువు ఒక సామాన్య పక్షి. అందువల్ల జటాయువు మాటలను లెక్కచేయలేదు. జటాయువు మాటలకు బదులు కూడా పలకలేదు. కానీ ఒక పక్షి తనను అంతలేసి మాటలు అంటుదా. తనకే నీతులు చెబుతుందా అని కోపం ముంచుకొచ్చింది. ఒక్క ఉదుటున జటాయువు మీదికి ఎగిరాడు.

రావణునికి జటాయువుకు ఘోరయుద్ధం జరిగింది. రెండు పర్వతములు ఢీకొన్నట్టు ఉంది. రావణుడు జటాయువు మీద నారాచముల వర్షం కురిపించాడు. జటాయువు ఆ బాణములను తనరెక్కలతో చెల్లాచెదరు చేసింది. వాడి అయిన తన గోళ్లతో ముక్కుతో రావణుని మొహం, శరీరం అంతా రక్కింది. రావణుడు పదిబాణములను జటాయువు మీద ప్రయోగించాడు.

జటాయువుకు రావణుని రథంలో కన్నీళ్లు కారుస్తూ ఏడుస్తూ ఉన్న సీత కనపడింది. ఆమె బాధ చూచి జటాయువు రావణుడు ప్రయోగించిన బాణములను లెక్కచేయలేదు. రాముని ధనుస్సును అతని చేతిలోనుండి ఎగురగొట్టాడు. బాణములను విరిచాడు. రావణుడికి కోపం ముంచుకొచ్చింది. మరొక ధనుస్సు తీసుకున్నాడు. వేలకొలది బాణములను జటాయువు మీద ప్రయోగించాడు.

రావణుడు వదిలిన బాణములు జటాయువును కప్పివేసాయి.

జటాయువు ఆకాశంలో ఎగురుతూ ఆబాణములను తనరెక్కలతో చెదరగొట్టింది. మరలా రావణుని ధనుస్సును తన కాళ్లతో విరిచింది. రావణుని కవచమును తన ముక్కుతో చీల్చింది. తన రెక్కలతో ఆ కవచమును ఊడగొట్టింది. తరువాత జటాయువు రావణుని రథమునకు కట్టిన గాడిదలను చంపింది. రావణుని రథమును విరుగగొట్టింది. రావణుని రథానికి కట్టిన పతాకమును విరిచింది. రావణుని తలమీద తన కాళ్లతో తన్నుతూ ఉంది. ముక్కుతో పొడుస్తూ ఉంది.

రావణుడు సీతను పొదివి పట్టుకొని నేలమీదికి దూకాడు. అప్పటికి జటాయువు అలసినట్టు కనపడ్డాడు. రావణుడు సీతను పట్టుకొని మరలా ఆకాశంలోకి ఎగిరాడు. లంక వైపుగా పోసాగాడు. జటాయువు కూడా రావణుని తో పాటు పైకి ఎగిరాడు. రావణునికి అడ్డంగా నిలిచాడు. రావణుని తో ఇలా అన్నాడు.

“రావణా! ఇంకా నీకు బుద్ధిరాలేదా! నీవు సీతను అపహరించడం నీ వినాశనానికి దారి తీస్తుంది. నువ్వే కాదు రాక్షస వంశము మొత్తం నాశనం అవుతుంది. సీతను అపహరించడం అంటే విషం కలిపిన నీరు తాగడం వంటిది అని తెలుసుకోలేకపోతున్నావు. నువ్వు బుద్ధిలేకుండా ప్రవర్తిస్తూ నీ నాశనాన్ని కొని తెచ్చుకుంటున్నావు. నీ కంఠం చుట్టు యమపాశము బిగుసుకుంటూ ఉంది. నీవు దానిని తప్పించుకోలేవు. రామలక్ష్మణులు నిన్ను ఎన్నటికీ క్షమించరు. అయినా రావణా! చేతనైతే రామలక్ష్మణులతో వీరోచితంగా పోరాడు. వారిని

ఓడించి సీతను తీసుకుపో. అంతే గానీ వారు ఆశ్రమంలో లేని సమయంలో, దొంగమాదిరి సీతను అపహరించడం వీరత్వం అనిపించుకోదు. నీవంటి వీరుడు చేయదగ్గపనికాదు. చావు దగ్గర పడ్డవాడే ఇటువంటి పనిచేస్తాడు. చెడ్డ ఫలితములను ఇచ్చు కర్మలను నీవు వరాలిచ్చిన బ్రహ్మకూడా చేయడే. నీవు ఎందుకు చేస్తున్నావు?" అని రావణునికి హితోక్తులు చెప్పాడు.

కాని రావణునిలో ఏమాత్రం మార్పు రాలేదు. అందుకని జటాయువు మరలా రావణుని వీపు మీద వాలి రావణుని గోళ్లతో చీల్చాడు. అతడి జుట్టు పీకాడు. ముక్కుతో రక్కాడు. రావణుడు తప్పించుకోలేకపోతున్నాడు. కోపంతో ఊగిపోతున్నాడు. ఒక చేత్తో సీతను చంకలో ఇరికించుకున్నాడు. రెండో చేత్తో జటాయువు వీపు మీద బాదాడు. జటాయువు పైకి ఎగిరి రావణుని పది బుజములను చీల్చింది. రావణుని బుజాలు విరిగి కిందపడ్డాయి. విచిత్రంగా రావణునికి కొత్తగా బుజాలు మొలిచాయి.

అప్పుడు రావణుడు సీతను కింద దింపాడు. జటాయువును రెండు చేతులతో కొట్టాడు. జటాయువుకు, రావణునికి కొంచెంసేపు ముష్టియుద్ధం జరిగింది. రావణుడు కిందపడి ఉన్న ఖడ్గమును తీసుకొన్నాడు. తన మీదికి వస్తున్న జటాయువు రెక్కలను నరికాడు. పక్షికి రెక్కలే ఆయుధములు. ఆ రెక్కలు విరగగానే జటాయువు నేలకూలాడు.

నేల మీద పడిన జటాయువును చూచి సీత బిగ్గరగా రోదించింది. ఆఖరి ఆశకూడా అలా నేలకూలినందుకు సీతకు

దు:ఖము ఆగలేదు. గబా గబా జటాయువు వద్దకు పరుగెత్తింది. జటాయువు మీద పడి ఏడిచింది సీత.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఏబది రెండవ సర్గ.

"అయ్యో! నన్ను కాపాడటానికి వచ్చిన జటాయువు కూడా ఈ దుర్మార్గుడి దౌష్ట్యానికి బలి అయ్యాడే. ఈ పాపాత్ముడు ఈ జటాయువును పక్షి అని కూడా చూడకుండా చంపాడు. "ఓ రామా! ఓ లక్ష్మణా! ఎక్కడున్నారు. రండి. నన్ను రక్షించండి" అని ఎలుగెత్తి అరిచింది.

అది చూచిన రావణుడు సీత దగ్గరగా వెళ్లాడు. వికటాట్టహాసం చేసాడు. సీత జుట్టు పట్టుకున్నాడు. అది చూచి ప్రకృతి రోదించింది. వృక్షములు తలలు వంచాయి. గాలి వీచడం మానింది. సీత మాత్రం రామా రామా అంటూ అరుస్తూనే ఉంది. రావణుడు సీతను జుట్టుపట్టుకొని లేవదీసి,తన సందిట ఇరికించుకొని ఆకాశంలో కి ఎగిరాడు. సీతను తీసుకొని ఆకాశమార్గంలో పోతున్నాడు.

ఆ సమయంలో తనను ఎవరన్నా రక్షిస్తారా అని సీత కిందకు

చూస్తూ ఉంది. సీత కట్టుకున్న వస్త్రములు గాలికి ఎగురుతూ ఉన్నాయి. సీత పెట్టుకున్న ఆభరణములు చెల్లాచెదురుగా నేల మీద రాలి పడుతున్నాయి. సీత కళ్ల నుండి కన్నీరు ధారాపాతంగా కారుతూ ఉంది. ఆమె జుట్టు ముడి వీడిపోయింది. సీత నోటి నుండి రామా రామా అనే మాట తప్ప మరోమాట రావడం లేదు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబదిరెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఏబది మూడవ సర్గ.

రావణుడు ఆకాశమార్గాన ఎగురుతున్నాడు. సీత వాడి చేతిలో పిట్ట మాదిరి నలిగిపోతూ ఉంది. రావణుని చూచి సీత ఇలా అంది.

“ఓరి రావణా! నీచుడా!నాభర్త ఇంటలేని సమయంలో, కుక్క మాదిరి ఇంట్లోకి దూరి, దొంగమాదిరి నన్ను అపహరించుకొని పోతున్నావే. నీకు సిగ్గులేదట్రా! నీదీ ఒక పరాక్రమమేనా! దమ్ముంటే, ధైర్యం ఉంటే నా భర్త ఉన్నప్పుడు నా వంక కన్నెత్తిచూడు. నా భర్త నిన్ను భస్మం చేస్తాడు.

ఒక ఆడదాన్ని అపహరించడానికి ఇంత పన్నాగమా! ఒక లేడిని

పంపి, నా భర్తను దూరంగా పంపి నన్ను అపహరిస్తావా! నీదీ ఒక మగతనమేనా నీచుడా! నా మామగారి చిరకాల మిత్రుడు అయిన జటాయువు నన్ను రక్షించడానికి వస్తే ఆయనను కూడా చంపుతావా! నీ దుర్మార్గానికి హద్దులేదా! నీ పేరు గొప్ప గా చెప్పకుంటున్నావు. ఇదా నీ పరాక్రమము. పక్షిని చంపడమా నీ వీరత్వము.

ఎటువంటి దుర్మార్గుడైనా ఒంటరిగా ఉన్న స్త్రీని కన్నెత్తి కూడా చూడడే. అటువంటిది నువ్వు ఎంతటి నీచుడివి అయితే నన్ను అపహరించుకు పోతావు! ఇంతటి నీచమైన పని చేయడానికి నీకు సిగ్గుగా లేదా! ఇటువంటి సిగ్గుమాలిని పని చేసినందుకు, నీ ప్రజలే నిన్ను నిందిస్తారని నీకు తెలియదా!

నీవు పుట్టిన వంశము ఎట్టిది! నీవు చేసే పని ఎట్టిది! నీ వంశంలో చెడబుట్టావు కదా దుర్మార్గుడా! నీకు ధైర్యం ఉంటే కాసేపు నన్ను భూమి మీద దింపు. రామలక్ష్మణులు వచ్చేంత వరకూ ఆగు. అప్పుడు నీ సైన్యంతో కూడా రా. రాముడితో యుద్ధం చెయ్యి నువ్వు యమపురికి వెళతావో నన్ను తీసుకొని లంకకు వెళుతావో అప్పుడు తెలుస్తుంది. రామలక్ష్మణుల బాణములు నిన్ను దహించి వేస్తాయి.

కాబట్టి ఓ రావణా! నా మాట విను. నన్ను విడిచిపెట్టు. లేకపోతే నీ సర్వనాశనం తథ్యం. నీవు నన్ను బలాత్కారంగా తీసుకుపోతే మాత్రం నేను నీకు లొంగుతాను అని అనుకుంటున్నావా! అది కలలో మాట. నేను నీకు ఏ మాత్రం లొంగను. నా ప్రాణాలు అన్నా విడుస్తాను కానీ నిన్ను తాకను. కాబట్టి నీ ప్రయాస అంతావ్యర్థము అవుతుంది. నీకు మరణకాలము సమీపించింది అందుకనే ఇటువంటి వ్యర్థమైన

పనికి పూనుకున్నావు. నీకు నరకములో వైతరిణీ నది, కత్తులో బోను సిద్ధంగా ఉన్నాయి.

నాకు ఇంత అపకారము చేసిన నీవు ఎంతో కాలము జీవించలేవు. నీవు నన్ను ఎక్కడ దాచి పెట్టినా నా భర్త ఆ చోటికి రాగలడు. నిన్ను చంపి నన్ను దక్కించుకుంటాడు. నా భర్త రాముని బారి నుండి తప్పించుకోడం నీ తరం కాదు. ఓ రావణా! నా రాముడు ఒంటరిగా, ఎవరి సాయమూ లేకుండా, 14,000 మంది రాక్షసులను, నీ తమ్ములను చంపాడు అని గుర్తులేదా! అటువంటి రాముడు, తన భార్యను ఒక రాక్షసుడు ఎత్తుకుపోతే వాడిని తన బాణాలకు బలి చేయకుండా ఊరుకుంటాడా!"ఈ విధంగా సీత రాముని నిందిస్తూ ఉంది. సీత మాటలను రావణుడు లక్ష్యపెట్టలేదు. సీతను సందిట ఇరికించుకొని ఆకాశమార్గంలో లంకవైపు ప్రయాణం చేస్తున్నాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబది మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఏబది నాలుగవ సర్గ.

రావణాసురుడు సీతను తీసుకొని ఆకాశమార్గాన పోతుంటే ఎవరైనా తనను చూస్తారా రక్షిస్తారా అనే ఆశతో సీత కిందికి చూస్తూ ఉంది. అంతలో ఒక కొండశిఖరం మీద కొంత మంది వానరులు

కూర్చుని ఉండటం గమనించింది సీత.

సీతకు ఒక ఆలోచన వచ్చింది. రావణుడు వెళుతున్న వేగానికి ఎగురుతున్న తన వల్లెవాటును పట్టుకుంది. తన ఆభరణాలు ఆ వల్లెవాటు వస్త్రములో మూటగా కట్టింది. సరిగ్గా రావణుడు ఆ పర్వతము మీద ఎగురుతున్నప్పుడు. ఆ ఆభరణాల మూటను ఆ వానరుల మధ్య పడేటట్టు జారవిడిచింది. రావణుడు ముందుకు చూస్తూ ఎగురుతూ ఉండటంతో సీత చేసిన పనిని గుర్తించలేదు.

తమ మీద దబ్బున పడ్డ మూటను చూచారు ఆ వానరులు. వెంటనే తలలు పైకెత్తి చూచారు. వారికి ఆకాశంలో ఎగురుతున్న రావణుడు, రావణుని సందిట్లో బందీ అయిన సీత కనిపించారు. వారు రావణుడు వెళ్లిన వేపు చూస్తున్నారు. రావణుడు సీతను తీసుకొని పంపానదిని దాటి దక్షిణదిక్కుగా వెళ్లాడు.

రావణుడు అడవులు, పర్వతములు, నదులు, సరస్సులు దాటుకుంటూ లంకా నగరం వైపు వేగంగా ఎగురుతున్నాడు. తుదకు సముద్రం వద్దకు వచ్చాడు. వేగంగా సముద్రాన్ని దాటాడు. సీతను సందిట్లో ఇరికించుకున్న రావణుడు లంకానగరంలో ప్రవేశించాడు.

నేరుగా తన అంత:పురానికి వెళ్లాడు రావణుడు. సీతను తన అంత:పురములో ఒక గదిలో ఉంచాడు. తన అనుచరులను పిలిచాడు.

"ఈమెను నేను చెరబట్టి తీసుకొని వచ్చాను. నా అనుజ్ఞ లేకుండా ఎవరూ ఈమెను తాకడానికి కూడా వీలులేదు. బయట వాళ్లు పురుషులు కానీ, స్త్రీలుకానీ ఈమెను కలవకుండా చూడండి.

ఈమె ఏది కోరితే అది ఇవ్వండి. లేదు అనే మాట ఉండకూడదు. ఎవరైనా ఈమెతో నా గురించి చెడుగా మాట్లాడితే వాళ్లకు అదే ఆఖరు రోజు అని గుర్తుపెట్టుకోండి.  ఇదినా ఆజ్ఞ." అని కఠినమైన ఆజ్ఞలు ఇచ్చాడు.

తరువాత రావణుడు అక్కడి నుండి వెళ్లిపోయాడు. వెంటనే నరమాంసమును తినే ఎనిమిది మంది రాక్షసులను పిలిచాడు.

"మీరు ఆయుధ ధారులై వెంటనే జనస్థానమునకు వెళ్లండి. అక్కడ ఇదివరకు ఖరుడు, దూషణుడు ఉండేవారు. ఇప్పుడు వారు లేరు. మీరు వారి స్థానములో జనస్థానములో నివసించండి. జనస్థానములో ఉన్న ఖరదూషణులను, 14,000 మంది రాక్షసులను రాముడు అనే మానవుడు సంహరించాడు. అందుకని రామునితో మనకు విరోధము ఏర్పడింది. ఇప్పుడు మనము ఆ రాముని మీద పగ, ప్రతీకారము తీర్చుకోవాలి. రాముని చంపిన గాని నాకు నిద్ర పట్టదు. అందుకని మీరు జనస్థానములో నివసిస్తూ, ఆ రాముని ప్రతి కదలికను నాకు తెలియజేయండి. మీరు ఆ రాముని చంపడానికి సకల సన్నాహాలు చేయండి. మీరు ఎన్నో యుద్ధములలో నాతో పాటు పాల్గొని మీ ధైర్యసాహసాలు, పరాక్రమాలు ప్రదర్శించారు. అందుకని మిమ్ములను ఈ మహత్కార్యం మీద జనస్థానానికి  పంపుతున్నాను." అని పలికాడు.

రావణుని మాటలను శిరస్సున దాల్చారు ఆ ఎనిమిది మంది రాక్షసులు. రావణుడికి నమస్కరించి, లంకను విడిచి జనస్థానము నకు బయలుదేరారు.

అప్పటికి రావణుడు శాంతించాడు. అతిలోక సౌందర్యవతి అయిన సీత తన అధీనంలో ఉంది కదా అని పొంగిపోయాడు. ఈ ఎనిమిది మంది రాక్షసుల చేతిలో రాముడు హతం అవుతాడు అని ఆనందించాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబది నాల్గవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఏబది ఐదవ సర్గ.

ఆ ప్రకారంగా ఎనిమిది మంది రాక్షసులను జనస్థానమునకు పంపిన తరువాత రావణుడు, ఇంక రాముని వలన ఇబ్బంది లేదనుకున్నాడు. సీత గురించి ఆలోచంచడం మొదలెట్టాడు. సీతను తలచుకుంటేనే రావణుడికి మదనతాపం ఎక్కువ కాసాగింది. ఎప్పుడెప్పుడు సీతను చూద్దామా అని తొందర తొందరగా అంత:పురమునకు వెళ్లాడు.

రాక్షస స్త్రీల మధ్య మూర్తీభవించిన శోకదేవత మాదిరి ఉన్న సీతను చూచాడు రావణుడు. సీత కళ్లనుండి కన్నీరు ధారాపాతంగా కారుతూ ఉంది. ఆమెతలవంచి కూర్చుని ఉంది. రావణుడు సీత దగ్గరకు వెళ్లాడు ఆమెను చెయ్యిపట్టుకొని లేవనెత్తాడు. బలవంతంగా ఆమెను తనతో తీసుకువెళ్లాడు. సీతకు తన అంత:పురము అంతా

చూపించాడు.

రావణుని అంత:పురము అనేక మేడలతోనూ, ప్రాసాదము లతోనూ నిండి ఉంది. అక్కడ వేలకొలది దాసదాసీ జనములు నివసిస్తున్నారు. రావణుని అంత:పురము అంతా రత్నములతోనూ మణి మాణిక్యాదులతోనూ తులతూగుతూ ఉంది. ప్రాసాదములకు అమర్చిన స్తంభములు అన్నీ బంగారు, వెండితో నిర్మింపబడి ఉన్నాయి. ముఖ ద్వారముల వద్ద దుందుభుల ధ్వనులు శ్రావ్యంగా వినబడుతున్నాయి.

రావణుడు సీతను తీసుకొని సోపానములు అన్నీ ఎక్కాడు. ప్రాసాదములు అన్నీ చూపించాడు. తన అంత:పురము బయట ఉన్న అందమైన సరస్సులను, బావులను సీతకు చూపించాడు రావణుడు. తన ఐశ్వర్యము అంతా చూచి సీత తనకు వశము అవుతుందని రావణుని భ్రమ.

“ఓ సీతా! ఈ లంకలో బాలురు, వృద్ధులు, యువకులు కలిపి 32 కోట్ల మంది రాక్షసులు ఉన్నారు. వారి కందరికీ నేనే రాజును. నేను కనుసైగ చేస్తే చాలు వేయి మంది పరిచారికలు నాముందు చేతులు కట్టుకొని నిలబడతారు. నా కోరిక మన్నిస్తే నేనే నీ దాసుడిని అవుతాను. నా పరిచారికలు అందరూ  నీ ఆజ్ఞానువర్తులు అవుతారు.

నేను చేసిన దండయాత్రలలో అనేక మంది అందమైన స్త్రీలను తీసుకొని వచ్చి నా అంత:పురములో ఉంచాను. వారందరికీ నీవే యజమానివి. వారందరూ నీకు పరిచర్యలు చేస్తారు. అందుకని

నీవు నా భార్యగా ఉండు. ఇంత ఐశ్వర్యము, ఇన్ని సంపదలు చూచి కూడా ఇంకా సందేహిస్తావు ఎందుకు. వెంటనే నా మదన తాపాన్ని చల్లార్చు. నా రాణిగా ఉండు.

నాచే పరిపాలింపబడు లంకారాజ్యము నూరుయోజనముల విస్తీర్ణంతో శోభిల్లుతూ ఉంది. ఈ లంక చుట్టు భయంకరమైన సముద్రము ఉంది. అందువలన మానవమాత్రులు లంక వంక కన్నెత్తి కూడా చూడలేరు. అంతెందుకు సురులు, అసురులు, దేవేంద్రుడు సైతం వచ్చినా నా లంకను జయించలేరు. ముల్లోకములలో నన్ను మించిన పరాక్రమశాలి ఇంకొకరు లేరు.

నీ రామునికి నాకు పోలికే లేదు. రాముడు రాజ్యభ్రష్టుడు. నేను లంకాధీశుడను. రాముడు ముని వృత్తిలో ఉన్నాడు. నేను రాజభోగములు అనుభవించుచున్నాను. రాముడు మానవమాత్రుడు. నేను దైవాంశసంభూతుడను. రాముడు అల్పాయుష్కుడు. నాకు చావు లేకుండా బ్రహ్మ వరం ఉంది. ఇంకా ఆ రాముని గురించి ఎందుకు ఆలోచిస్తావు.

ఓ సీతా! రా! నన్ను వరించు. నేనే నీకు తగిన భర్తను. యౌవనంలో ఉండగానే మనం రతిసుఖాలు అనుభవిద్దాము. నేటి సుఖం నేటిదే. రేపురాదు కదా!

ఓ సీతా! ఇంకా రాముడు వచ్చి నిన్ను రక్షించి తీసుకువెళతాడని ఆశపడుతున్నావేమో! అది ఒట్టి మాట. రాముడు నీ ఊహల్లో కూడా లంక దరిదాపులకు రాలేడు. ఒక వేళ రాముడు

సముద్రము దాటి లంకకు వచ్చినా, నా రక్షణలో ఉన్న నిన్ను చూడటం, తాకడం, తీసుకొని వెళ్లడం అసాధ్యం.

నీవు నన్ను వరించి నా రాణివి అయితే, దేవ, దానవ, గంధర్వ, కిన్నెరలు నీకు దాస్యం చేస్తారు. నీవు నేను లంకారాజ్య సింహాసనము మీదకూర్చొని పట్టాభిషేకము చేయించుకుందాము. ఆ అభిషేక జలములతో ఇద్దరం పునీతులము అవుదాము.

సీతా! నీ కొరకు అనేక రకములైన పుష్పములను, సుగంధ ద్రవ్యములను, మైపూతలను తెప్పించాను. వాటిని అలంకరించుకో.

ఓ సీతా! నీకు ఇంకొక విషయం చెప్పడం మరిచాను. నేను నా సోదరుడు కుబేరుడిని జయించి అతని వద్దనుండి పుష్పకము అనే మహా విమానమును తీసుకొని వచ్చాను. ఆ విమానము అద్భుతమైనది విశాలమైనది. నీవు నేను కలిసి పుష్పకవిమానములో విహరిద్దాము.

నేను ఇన్ని చెప్పినా, నా వైభవము అంతా చూపించినా నీ ముఖం అలా దీనంగా ఉండటం బాగాలేదు. నాపట్ల ప్రసన్నంగా ఉండు." అని పరి పరి విధములుగా బతిమాలుకున్నాడు రావణుడు.

రావణుడు అన్ని మాటలు మాట్లాడుతున్నా సీత రావణుడు చూపించిన వాటి వంక కన్నెత్తి కూడా చూడలేదు. తన ముఖాన్ని పమిట చెంగుతో కప్పుకొని ఏడుస్తూ ఉంది. సీత బాధపడటం చూచాడు రావణుడు సీతలో ఇలా అన్నాడు.

"ఓ సీతా! నీకు పెళ్లి అయిందనీ, నన్ను వరిస్తే ధర్మహాని జరుగుతుందనీ అపోహ పడవద్దు. బహు భార్యాత్వము మాదిరి మా రాక్షసులలో బహుభర్తృత్వము ఆచరణలో ఉంది. కాబట్టి దానిని గురించి నీవు దిగులుపడవద్దు. ఓ సీతా! నాకు నీ పాదములే శరణ్యము నీ పాదములు అంటి వేడుకుంటున్నాను. నన్ను నీ దాసునిగా అనుగ్రహించు. నన్ను స్వీకరించు. నీకు తెలుసో లేదో! ఈ రావణుడు ఇంతవరకూ ఏ స్త్రీ ముందరా ఇలా మోకరిల్లి నమస్కరిస్తూ నిలబడలేదు. ఆ గౌరవం నీకే దక్కింది." అని ప్రాధేయ పడ్డాడు. లోలోపల ఇంక నాకు సీత వశము అయింది అని సంతోషంతో పొంగిపోయాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## ఏబది ఆరవ సర్గ.

తన ముందు అలా ప్రాధేయపడుతున్న రావణుని చూచింది సీత. పక్కన పడి ఉన్న ఒక గడ్డిపరకను తీసి తనకూ రావణుని మధ్య పడవేసింది. రావణునితో ఇలాఅంది..

"ఓ రావణా! ధర్మానికి ప్రతిరూపము, సత్యసంధతకు

నిలయము అయిన దశరథుని కుమారుడు రాముడు, ఆజాను బాహుడు, అరవిందదళాయతాక్షుడు అయిన ఆ రాముడు, నా భర్త. నా భర్తే నాకు దైవము. రాముని సోదరుడు లక్ష్మణుడు. వీరిద్దరూ కలిసి నీ ప్రాణములు బలి తీసుకుంటారు. అది తథ్యము. నీవు రాముని ఎదుట నా మీద చేయివేసినట్టయితే, నీసోదరుడు ఖర, దూషణులకుపట్టిన గతే నీకూపట్టి ఉండేది.

ఇందాకటినుండి, నీవు నీ రాక్షస వీరుల గురించి ఏవేవో గొప్పలు చెప్పావు. కానీ అటువంటి రాక్షసులు 14,000 మందిని నా రాముడు ఒంటిచేత్తో మట్టికరిపించాడు. అది మరిచిపోయావా! నా రాముని ధనుస్సునుండి వచ్చిన ఒక్కొక్క బాణము నీ ఒక్కొక్కప్రాణము తీస్తుంటే అప్పుడు తెలుస్తుంది నా రాముని ప్రతాపం ఏమిటో!

నీవు దేవతలు, దానవులు, అసురులు, గంధర్వులు మొదలగు దేవాసుర గణములతో చావక పోవచ్చు. కాని మానవమాత్రుడైన నా రాముని చేతిలో నీకు చావు తప్పదు. యజ్ఞములో ఊపస్తంభమునకు కట్టిన పశువులాగా నువ్వు గిలా గిలా కొట్టుకుంటున్నావు. నీ చావు త్వరలోనే ఉంది. రాముడు రావడం, నిన్ను చంపడం, నన్ను నీ చెరనుండి విడిపించడం తథ్యం. నీకు ఆయువు మూడింది. నీ వైభవం నశించింది. నీ లంకా రాజ్యలక్ష్మికి వైధవ్యము రానుంది. అది తెలుసుకో!

నేను నా భర్త కలిసి ఉండగా మా ఇద్దరికీ వియోగం కల్పించావు. నీకు కూడా రాబోవు జన్మలలో భార్యవియోగం తప్పదు. వినాశకాలే విపరీతబుద్ధి అని నీకు పోయేకాలం దాపురించబట్టే ఇటువంటి దుర్బుద్ధిపుట్టింది. నేను పవిత్రమైన యజ్ఞభూమిని. నన్ను నీ

వంటి ఛండాలుడు తాకనుకూడా తాక జాలడు. నేను రాముని ధర్మ పత్నిని. నా భర్తను తక్క పరపురుషుని కలలో కూడా తలవని దానను. పాపాత్ముడవైన నీవు నన్ను తాకను కూడా తాకలేవు.

నేను రాజహంసను. నీవు కాకివి. నీతో నాకు పొందేమిటి? ఈ శరీరం నీ ఇష్టం. నన్ను బంధించు. చిత్రహింసలకు గురిచెయ్యి. లేకపోతే చంపెయ్యి. నీనుంచి నా ప్రాణాలను కాపాడుకోవాలనే కోరిక నాకు లేదు. నీవు ఏమి చేసినా నేను మాత్రం నీకు లొంగను. జాగ్రత్త!" అని పలికి తలవంచుకొని నిలుచుంది సీత.

సీత మాటలు విని రావణుడు కోపగించుకోలేదు. ఇప్పటిదాకా రావణుడు తన సంపదలు ఐశ్వర్యము చూపి ఆశపెట్టాడు. కానీ సీత లొంగలేదు. ఇప్పుడు సీతను బెదిరించి లొంగదీసుకోవాలని అనుకున్నాడు. సీతను చూచి పరుషంగా ఇలా అన్నాడు.

"ఓ సీతా! ఇంక నీవు ఏమి చెప్పినా నేను వినదలచుకోలేదు. నీకు పన్నెండు మాసాలు గడువు విధిస్తున్నాను. ఈ లోపల నీవు నా సరసన చేరాలి. లేకపోతే నిన్ను వంటశాలకు పంపించి, ముక్కలు ముక్కలు గా నరికించి, నాకు ఆహారంగా తయారు చేయించు కుంటాను. జాగ్రత్త!" అని పలికాడు.

సీతకు కాపలాగా ఉన్న రాక్షస స్త్రీలతో రావణుడు ఇలా అన్నాడు. "మీరు సీతకు కాపలాగా ఉండండి. నయానో భయానో సీతను నాకు వశం చేయండి." అని పలికాడు. వెంటనే ఆ రాక్షస స్త్రీలు సీత చుట్టు వలయాకారంలో నిలబడ్డారు.

"ఈ సీత రాజాంత:పురములో ఉండటానికి అర్హురాలు కాదు. మీరు ఈమెను అశోక వనమునకు తీసుకొని వెళ్లండి. ఈమెను ఒక రహస్య ప్రదేశములో ఉంచండి. ప్రతిరోజూ ఈమెను బతిమాలో భయపెట్టో ఆమె మనసు నా మీద లగ్నం అయేట్టు చేయండి." అని ఆదేశించాడు.

వెంటనే ఆ రాక్షస స్త్రీలు సీతను అశోకవనమునకు తీసుకొని వెళ్లారు. లంకారాజ్యములో ఉన్న అశోక వనము ఫలవృక్షములతోనూ పూల తోటలతోనూ, చిన్న చిన్న సరోవరములతో నిండి శోభాయ మానంగా ఉంది. ఆ అశోకవనములో శోకదేవత వలె ఉన్న సీత ఆ రాక్షస స్త్రీల వశంలో బందీగా ఉంది. చిన్నప్పటి నుండిసుకుమారంగా పెరిగిన సీత, భయంకారాకారులైన ఆ రాక్షసస్త్రీల ఆకారములు చూచి, అరుపులు విని భయంతో మూర్ఛపోయింది.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఏబది ఏడవ సర్గ.

లంకలో సీత పరిస్థితి ఇలాఉంటే, అక్కడ అరణ్యములో మారీచుని చంపిన రాముడు, వెనక్కు తిరిగి పర్ణశాలకు వస్తున్నాడు. అప్పుడు రామునికి నక్కకూత వికృతంగా వినిపించింది. అపశకున

సూచకమైన ఆ నక్కకూత విని రాముడు మనసులో కీడు శంకించాడు. సీతకు లక్ష్మణునికి ఏదైనా ఆపద కలిగిందేమో అని భయపడ్డాడు. అప్పుడు మారీచుడు తన గొంతును అనుకరిస్తూ సీతా లక్ష్మణా అని అరిచిన అరుపులు గుర్తుకు వచ్చాయి రామునికి.

"అయ్యో! ఆ అరుపులు నావి అనుకొని, నాకేమైనా ఆపద కలిగిందని శంకించి, సీత లక్ష్మణుని నా రక్షణ కొరకు పంపలేదు కదా! ఆ సమయంలో రాక్షసులు సీతకు ఏమైనా అపాయము తలపెట్టారో ఏమో! అవును ఇప్పుడు అంతా అర్థం అయింది. ఇది రాక్షసుల మాయోపాయమే. మారీచుడు మాయాలేడి రూపం ధరించి నన్ను ఆశ్రమానికి దూరంగా తీసుకొని వెళ్లాడు. నేను మారీచుని కొట్టినపుడు హా సీతా! హా లక్ష్మణా! అని అరిచాడు. సీత తప్పకుండా లక్ష్మణుని నా రక్షణ కోసం పంపి ఉంటుంది.

నేను, లక్ష్మణుడు, దగ్గర లేని సమయంలో సీత క్షేమంగా ఉంటుందా! అసలే ఈ జనస్థానములో ఉన్న రాక్షసులతో నాకు విరోధము ఉంది. ఆ విరోధమును మనసులో పెట్టుకొని రాక్షసులు సీతకు ఏమైనా అపాయం తలపెట్టారో ఏమో!దానికి తోడు అప శకునములు కూడా కనపడుతున్నాయి." ఈ విధంగా ఆలోచిస్తూ రాముడు ఆశ్రమం వైపు వడి వడిగా వస్తున్నాడు.

ఎంత కాదనుకున్నా రాముని మనస్సు సీత గురించి లక్ష్మణుని గురించి వారి క్షేమం గురించి ఆలోచిస్తూ ఉంది. ఇంతలో తనను వెదుక్కుంటూ వస్తున్న లక్ష్మణుడు కనిపించాడు. లక్ష్మణుని చూడగానే రాముడికి కోపం వచ్చింది. దానితో పాటు దు:ఖం కూడా వచ్చింది.

లక్ష్మణుని చేతులుపట్టుకొని ఇలా అన్నాడు.

"నేను నిన్ను సీతకు రక్షణగా ఆశ్రమంలో ఉండమన్నాను. కానీ నీవు సీతను ఒంటరిగా ఆశ్రమంలో విడిచి వచ్చావు. అలా ఎందుకు చేసావు. ఇంకా సీత క్షేమంగా ఉందంటావా? లక్ష్మణా! నాకు అన్నీ అపశకునములు కనపడుతున్నాయి. సీత గురించి నా మనసంతా ఆందోళన చెందుతూ ఉంది. వీటిని బట్టి చూస్తే సీతకు ఏదో ఆపద కలిగి ఉంటుంది. లేదా సీత సంహరింపబడి ఉంటుంది. రాక్షసులు ఆమెను భక్షించి ఉంటారు. ఇందులో సందేహం ఉండటానికి వీలు లేదు.

లక్ష్మణా! మనము మరలా సీతను ప్రాణాలతో చూడగలము అంటావా! ఆ మృగాల అరుపులు, నక్కల కూతలు వింటుంటే సీత క్షేమం మీద అనుమానం కలుగుతూ ఉంది.

అసలు జరిగిందేమిటంటే, సీత ఆ మృగము కావాలని కోరిన తరువాత నేను ఆ మృగమును వెంబడించాను. ఆ మృగాన్ని నా బాణంతో కొట్టాను. నా బాణం తగిలిన ఆ మృగం పెద్దరాక్షసునిగా మారిపోయింది. అప్పుడు అర్థం అయింది అది రాక్షస మాయ అని. అందుకే అంటున్నాను.

ఆశ్రమంలో సీత క్షేమంగా ఉండదు. ఆమెను ఎవరన్నా అపహరించి ఉండాలి. లేక ఆమెను రాక్షసులు చంపి ఉండాలి. ఒక వేళ ఆమెను ఏ రాక్షసుడైనా అపహరించి ఉంటే, ఎంతో దూరం వెళ్లి ఉ ండరు. మార్గ మధ్యంలోనే ఉంటారు." అని రాముడు తనలో తాను

అనుకుంటూ వడి వడిగా పర్ణశాల వంక వస్తున్నాడు. లక్ష్మణుడు రాముని అనుసరించి వస్తున్నాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఏబది ఎనిమిదవ సర్గ.

అప్పటిదాకా రాముడు లక్ష్మణుడిని ఏం జరిగింది అని అడగలేదు. తాను ఏం చేసిందిచెప్పాడు. ఇప్పుడు అడగడం మొదలెట్టాడు.

“లక్ష్మణా! నేను నిన్నుసీతకు రక్షణగా ఉంచాను కదా! నా సీతను ఒంటరిగా ఎందుకు వదిలి వచ్చావు? నా సీత ఇప్పుడు ఎక్కడ ఉంది.? పర్ణశాలలో క్షేమంగా ఉందా! ఉందని నీవు చెప్పగలవా? నేను అరణ్యాలకు వస్తున్నా కష్టనష్టాలకు ఓర్చి నన్ను అనుసరించిన సీత ఇప్పుడు ఎక్కడ ఉంది? సీత లేకపోతే నేను క్షణకాలం కూడా జీవించలేను కదా! మరి నా సీత ఎక్కడుందో చెప్పవా?

లక్ష్మణా! నాకు సీత తోడిదే లోకం. సీత లేకుండా నేను స్వర్గాధిపత్యము కూడా అంగీకరించను. అటువంటి నా సీతను ఏమి చేసావు? సీత జీవించి ఉంటుందంటావా! నా సీత మరణిస్తే, ఆమె

దు:ఖంతో నేను మరణిస్తే, మమ్ములను అడవులకు పంపిన కైక ఆనందిస్తుందేమో కదా! అప్పుడు నాతల్లి కౌసల్య, కైకకు ఊడిగం చేస్తుందేమోకదా!

లక్ష్మణా! నిజంచెప్పు. సీత జీవించి ఉంది అంటేనే నేను ఆశ్రమానికి వస్తాను. లేకపోతే ఇక్కడే ప్రాణ త్యాగం చేస్తాను. నేను ఆశ్రమం చేరగానే సీత ఎదురొచ్చి చిరునవ్వుతో నన్ను పలకరించక పోతే నేను బతికి ఉండీ వృధా! లక్ష్మణా! సీత ఇంకా జీవించి ఉందంటావా! లేక నువ్వు ఇటు రాగానే రాక్షసులు ఆమెను చంపి తిని ఉంటారా! ఒకవేళ సీత బతికి ఉంటే, నా వియోగబాధతో ఎంతగా పరితపిస్తూ ఉందో కదా!

లక్ష్మణా! మారీచుడు హా లక్ష్మణా! అని అరిచినప్పుడు నీకు కూడా నాకు అపకారం జరిగిందని అనుమానం కలిగిందా! నేను అరిచినట్టు వినపడ్డ అరుపులు విని నిన్ను సీత పంపగా నా వద్దకు వచ్చావా! లేక నువ్వే ఆ రాక్షసుని అరుపులు విని నాకేమైనా ఆపద జరిగిందని సీతను ఒంటరిగా వదిలి వచ్చావా!

ఏది ఏమైనా నీవు ఈ అరణ్యంలో సీతను ఒంటరిగా వదిలి వచ్చి చాలా పెద్ద తప్పు చేసావు. నీవు రావడంతో రాక్షసులకు మన మీద పగ తీర్చుకోడానికి ఆస్కారం కల్పించినట్టయింది. ఎందుకంటే, నేను ఖరుడిని, దూషణుడిని, రాక్షసులను చంపానుకదా. అందుకని నా మీద ప్రతీకారము తీర్చుకోడానికి రాక్షసులందరూ పొంచి ఉన్నారు. నీవు కూడా లేని సమయం చూచి రాక్షసులుసీతను చంపి ఉంటారు!

లక్ష్మణా! చూచావా! అడవిలో ఉన్నా నాకు ఎన్ని కష్టాలు వచ్చి పడ్డాయో! ఇదంతా నా పూర్వజన్మపాపఫలం. లేకపోతే నాకే ఇన్ని కష్టాలు రావాలా!"అని కాసేపు తనలో తాను అనుకుంటూ, కాసేపు లక్ష్మణుని చూచి మాట్లాడుతూ వడి వడిగా ఆశ్రమం వేపు నడుస్తున్నావు రాముడు.

రామ లక్ష్మణులు పర్ణశాలను చేరుకున్నారు. పర్ణశాల వద్ద సందడి లేదు. నిర్మానుష్యంగా ఉంది. నడిచి నడిచి అలసి పోయిన ముఖంతో రాముడు ఆశ్రమం చుట్టు పక్కల సీత కోసం ఆతురతగా వెదుకుతున్నాడు. సీత ఎక్కడా కనపడలేదు. చేతులతో ముఖం కప్పుకొని కూలబడ్డాడు రాముడు.

"లక్ష్మణా! నేను అనుకున్నట్లే జరిగింది." అని రోదిస్తున్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## ఏబది తొమ్మిదవ సర్గ.

అప్పటి దాకా సీత ఆశ్రమంతో ఉంటుంది అనే ఆశతో వడివడిగా ఆశ్రమానికి వచ్చారు రామలక్ష్మణులు. కాని సీత ఆశ్రమంలో

లేదు అని తెలిసిన తరువాత సీతను రాక్షసులు అపహరించడం కానీ, చంపడం కానీ చేసి ఉంటారని రూఢి చేసుకున్నాడు రాముడు.

ఇప్పుడు లక్ష్మణుని చూచి సూటిగా ఒక ప్రశ్న వేసాడు. "లక్ష్మణా! నేను నీ మీద ఉన్న నమ్మకంతో, విశ్వాసంతో, సీతను నట్టడివిలో వదిలి వచ్చాను కదా! మరి నా ఆజ్ఞలేకుండా నీవు ఆమెను ఎందుకు వదిలివచ్చావు? ఇది నీకు భావ్యమా!" అని సూటిగా ప్రశ్నించాడు రాముడు.

అప్పుడు లక్ష్మణుడు రామునితో జరిగింది జరిగినట్టు పూసగుచ్చినట్టు వివరించాడు. "రామా! నేను స్వయంగా సీతను విడిచి రాలేదు. నేను నా ఇష్టం వచ్చిన నిర్ణయం తీసుకోలేదు. నీ మాట శిరసావహించి సీతను కాపాడుతున్నాను. కానీ సీత హా సీతా హా లక్ష్మణా అన్న నీ అరుపులు విని నన్ను నీ వద్దకు పొమ్మని, నిన్ను రక్షించమనీ ప్రేరేపించింది. ఆమె బలవంతంతోనే నేను ఆమెను విడిచి నీ వద్దకు వచ్చాను.

నీవు అరిచినట్టు అరుపులు వినపడగానే, సీత తల్లడిల్లిపోయింది. నన్ను చూచి "లక్ష్మణా! మీ అన్న ఆపదలో ఉన్నాడు. వెళ్లు. ఆయనను రక్షించు." అని నన్ను తొందరపెట్టింది. అయినా నేను కదలలేదు. నన్ను వెళ్లమంటూ అనేక సార్లు తొందరపెట్టింది. అప్పటికీ నేను ఆమెతో ఇలా అన్నాడు. "సీతా! రాముని భయపెట్టే, రామునికి అపకారం చేసే వాడు ఈ భూమి మీద లేడు. నీవు నిశ్చింతగా ఉండు. అది రాముని కంఠస్వరము కాదు. ఎవరో రాముని అనుకరించారు.

ఓ సీతా! దేవతలు కూడా రాముని రక్షణ కోరతారే! అటువంటి రాముడు ఒకరి రక్షణ కోరతాడా! అసంభవము. ఇది రాక్షసుల పన్నాగము. రాక్షసమాయ. దీనికి మీరు ఒక సాధారణ స్త్రీ వలె భయపడవద్దు. నిశ్చింతగా ఉండండి. ఓ సీతా! రాముడి బలపరాక్రమములు నాకు తెలుసు. రాముని జయించగలవాడు ముల్లోకములలో లేడు. ఇంక ఈ సామాన్య రాక్షసుడు ఎంత?" అని ఆమెను అనునయించాను.

కాని రామా! సీత నన్ను అనకూడని పరుషమైన మాటలు అన్నది. "నీ సోదరుడు మరణించిన తరువాత నువ్వు నన్నుపొందడానికి ప్రయత్నం చేస్తున్నట్టు ఉంది. నీవు ఎన్నటికీ నన్ను పొందలేవు.నీవు భరతుడు కలిసి ఈ పన్నాగము పన్నినట్టు ఉన్నారు. లేకపోతే రాముడు అంతగా అరుస్తున్నా ఎందుకు వెళ్లవు? నీవు అవకాశం కొరకు ఎదురు చూస్తున్న శత్రువువు. నీవు రాముని వెంట ఉంటూ రాముని చావు కోరుకుంటున్న కనపడని శత్రువు." అని నన్ను నానారకాలుగా నిందించింది.

ఆ నిందలు భరించలేక నేను సీతను విడిచి నీకోసం రావలసి వచ్చింది." అని వివరించాడు లక్ష్మణుడు.

అయినా రాముడు ఆ సమాధానంతో తృప్తి చెందలేదు. "ఏది ఏమైనా లక్ష్మణా! నీవు నా ఆజ్ఞను ధిక్కరించి సీతను అడవిలో విడిచి రావడం మంచిది కాదు. నా బలపరాక్రమములు తెలిసి కూడా, సీత ఆవేశంతో కోపంతో ఏవేవో అన్నదని, నీవు సీతను ఒంటరిగా అడవిలో విడిచి రావడం ఏం బాగుంది? నీవు సీతను నిస్సహాయ స్థితిలో విడిచి

రావడం నాకు ఏ మాత్రం సంతోషంగా లేదు.

ఏవో నాలుగు పరుష వాక్కులు సీత పలికిందని అలా ఒంటరిగా విడిచి పెట్టి వస్తావా! అంటే అంది. ఏమయింది. ఆమెకు కోపం వచ్చింది సరే! నీవు కూడా ఎందుకు కోపం తెచ్చుకున్నావు. నా ఆజ్ఞను ఎందుకు ధిక్కరించావు. నీవు అన్ని విధాలా తప్పుచేసావు. సరిదిద్దుకోలేని తప్పుచేసావు.

నేను వెంబడించిన మృగాన్ని నేను నా బాణంతో కొట్టాను. వెంటనే వాడు రాక్షసుడిగా మారి కిందపడ్డాడు. నేను అరిచినట్టు నా గొంతుతో అరిచాడు. ఆ అరుపులను సీత గుడ్డిగా నమ్మింది. ఆమె కోపాన్ని తట్టుకోలేక నీవు ఆమెను వదిలి వచ్చావు. అంతే కదా! దాని ఫలితంగా నాసీత నాకు దూరం అయింది.” అని రాముడు లక్ష్మణుని చేతలను తప్పు పట్టాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము ఏబది తొమ్మిదవ సర్గ.
సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## అరవయ్యవ సర్గ.

రాముడు సీత కోసం పిచ్చిగా పర్ణశాల అంతా తిరుగు తున్నాడు పరిసరాలు వెతికిన చోటనే వెతుకుతున్నాడు. సీత ఎక్కడన్నా

దొరక్కపోతుందా అనే కొన ఆశతో వెదుకుతున్నాడు. సీత నిలబడ్డ చోటు, సీత కూర్చున్న చోటు, సీత వాడిన దర్భాసనము, వీటిని చూచి భోరున విలపిస్తున్నాడు.

“నాసీతను రాక్షసులు పీక్కుతిని ఉంటారు. లేదా రాక్షసులను చూచి సీత మరణించి ఉంటుంది. లేక సీతను ఎవరైనా అపహరించి ఉంటారు. లేక సీత నన్ను వెదుక్కుంటూ అరణ్యంలో దారి తప్పిపోయి ఉంటుంది. లేక సీత నన్ను ఆట పట్టించడానికి ఎక్కడైనా దాక్కుని ఉంటుంది. లేదా పుష్పములు ఫలములు తీసుకురావడానికి ఆడవిలోకి వెళ్లి ఉంటుందేమో! సీతకు తామర పూలుఅంటే ఇష్టం. వాటిని కోయడానికి సరస్సు వద్దకు వెళ్లిందేమో. లేక సీత నీరు తీసుకురావడానికి గోదావరి తీరాననికివెళ్లి ఉంటుందా!” ఇలా పరి పరి విధములుగా ఆలోచిస్తూ ఆ ప్రాంతం అంటా కలయ తిరుగుతున్నాడు రాముడు.

ఒక చెట్టు దగ్గర నుండిమరొక చెట్టు వద్దకు, ఒక కొండ నుండి మరొక కొండవద్దకు, ఒక కాలువనుండి మరొక కాలువ వద్దకు తిరుగుతున్నాడు. పొదలు,పుట్టలు గుట్టలువెదుకుతున్నాడు.చెట్లను అడుగుతున్నాడు. సీతకు ఇష్టమైనపూలమొక్కలను అడుగుతున్నాడు. పూలను అడుగుతున్నాడు. పిచ్చివాడి వలె వాటితో మాట్లాడుతున్నాడు. ఏడుస్తున్నాడు.

చెట్లు,పుట్టలు,మొక్కలు అయిపోయిన తరువాత అక్కడ ఉన్న సీత పెంపుడు జంతువులను అడుగుతున్నాడు. జింకలను, ఏనుగులను అడుగుతున్నాడు. తరువాత సీత తనకళ్ల ఎదురుగాఉన్నట్టు ఊహించు

కుంటూ తనలో తాను మాట్లాడుకుంటున్నాడు. సీత పరుగెత్తుతున్నట్టు ఊహించుకుంటూ ఆమెను ఆగమని అరుస్తున్నాడు. అంతలోనే నిరాశ. సీతను ఎవరో చంపేసి ఉంటారు అని కుమిలిపోతున్నాడు. రాక్షసులు ఆమెను చంపేటప్పుడు, గొంతునులిమే టప్పుడు సీత ఎలా బాధపడి ఉంటుందో తలచుకుంటూ ఏడుస్తున్నాడు. "సీతను నేను రాక్షసులకు ఆహారంగా వదిలి వెళ్లినట్టున్నాను." అని అనుకుంటూ కుమిలి పోతున్నాడు.

లక్ష్మణునిపట్టుకొని "లక్ష్మణా! సీతనీకు ఎక్కడైనా కనిపించిందా" అని నిలదీసి అడుగుతున్నాడు. దాదాపు ఉన్మత్త స్థితిలో ఉన్నాడు రాముడు.

(రాముడు ఇలా అధైర్యంగా, బేలగా, ఏడవడం గురించిన ఈ సర్గ ప్రాచ్యప్రతిలో లేదు అని పండితుల అభిప్రాయము).

శ్రీమద్రామాయణము.
అరణ్యకాండము అరువదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

# అరణ్యకాండము

అరువది ఒకటవ సర్గ.

ప్రాణాధికంగా ప్రేమించిన భార్య సీత హటాత్తుగా కనపడక పోయేసరికి రాముడికి దు:ఖము,కోపము ముంచుకొచ్చాయి. దానికి

కారణం లక్ష్మణుడు అని రాముని అభిప్రాయము. సీతను గూర్చి అడగాలంటే లక్ష్మణుని అడగాలి. అందుకే పదే పదే లక్ష్మణుని అడుగుతున్నాడు.

"లక్ష్మణా!చెప్పు. నా భార్య సీత ఎక్కడ ఉంది. నీకు అప్పగించి వెళ్లాను కదా. నా భార్యను ఏమి చేసావు? ఆమె ఎక్కడకు వెళ్లి ఉంటుంది. నా భార్యను ఎవరు బలవంతంగా తీసుకొని వెళ్లారు? నా భార్యను ఎవరు చంపి తిన్నారు? చెప్పు" అంటూ నిలదీస్తున్నాడు.

లక్ష్మణుడికి సీత గురించి తెలియదు అని రామునికి తెలుసు. కాని మనసు నిలవడం లేదు. ఏదో ఒకటి చెయ్యాలి. కాబట్టి చేస్తున్నాడు. లక్ష్మణుని విడిచి పెట్టాడు.

చెట్ల దగ్గరకుపోయి "సీతా సీతా రా! ఎక్కడ దాక్కుని ఉన్నావు" అని బిగ్గరగా పిలుస్తున్నాడు.

"ఓ సీతా! నీవు ఎక్కడన్నా ఆడుకుంటున్నావా! ఇందాక లేడిపిల్ల కావాలి అని అడిగావు కదా. నీకు ఏదైనా లేడి దొరికిందా. దానితో ఆడుతున్నావా. త్వరగా రా" అని ఎలుగెత్తి పిలుస్తున్నాడు.

మరలా రాముడు లక్ష్మణుని వద్దకు వచ్చాడు. "లక్ష్మణా! సీత లేకుండా నేను బతకలేను లక్ష్మణా! సీతా వియోగంతో కృంగి కృశించి చచ్చిపోతాను. నా తండ్రి దశరథుని పరలోకంలో కలుసుకుంటాను. కాని నాకు ఒకటే భయం. నా తండ్రి నన్ను చూచి "నిన్ను 14 ఏళ్లు వనవాసము చెయ్యమన్నాను కదా. వనవాస కాలము పూర్తి కాకుండా

అప్పుడే వచ్చావేమిటి" అని అడిగితే ఏమి చెప్పాలి? నా తండ్రి నన్ను "నువ్వు మాట మీద నిలబడే వాడివి కాదు. నీవు అన్నీ అబద్ధాలు చెబుతావు" అని నిందిస్తే ఎలా భరించాలి. " అని లక్ష్మణునితో వాపోయాడు.

మరలాసీత గుర్తుకు వచ్చింది. "సీతా!సీతా! ఎక్కడున్నావు సీతా! నన్ను విడిచి పెట్టి ఎక్కడకుపోయావు సీతా! నన్ను విడువకు సీతా. నీవులేనిదే నాకు జీవితం లేదుసీతా!"అనిబిగ్గరగా ఏడుస్తున్నాడు.

రాముడు ఎంత ఏడ్చినా సీత తిరిగి రాలేదు. ఇదంతా మౌనంగా చూస్తున్నాడు లక్ష్మణుడు. ఇదంతా తన వల్లే కదా అని మనసులో బాధపడుతున్నాడు. కాసేపు సీత అన్న మాటలను భరిస్తే, కాసేపు సీతకు కనపడకుండా మొహం తప్పిస్తే, ఇంత ఆపద వచ్చి ఉ ండేది కాదు కదా అని వాపోతున్నాడు. కాని తన బాధను బయటకు కనపడనీయకుండా రామునికి ధైర్యం చెబుతున్నాడు లక్ష్మణుడు.

"అన్నయ్యా! ఏమిటీ వెర్రి. నీవంటి ధైర్యవంతుడు, పరాక్రమవంతుడు, ఇంత విషాదము చెందవలెనా! సీత ఎక్కడకూ వెళ్లదు. నీళ్లుతీసుకురావడానికి సరస్సుకు వెళ్లి ఉంటుంది. లేక ఈ అరణ్యములో ఎన్నో కొండగుహలు ఉన్నాయి కదా! ఏ గుహలోనో దాని అందాలు చూస్తూ ఉండి ఉంటుంది. లేక స్నానము చేయడానికి నదికి వెళ్లిందేమో! లేక నిన్ను ఆట పట్టించడానికి ఎక్కడైనా దాక్కుని ఉందేమో! తను కాసేపు కనపడకపోతే మనము ఏమి చేస్తామో అని చూడటానికి ఎక్కడన్నా దాగిఉండవచ్చును.

కాబట్టి ఓ రామా! మనము ఆమెను వెదకడానికి ప్రయత్నం చేద్దాము. అంతేకానీ ఇలా దు:ఖించడం వలన ప్రయోజనము లేదు కదా! నీవు దు:ఖము మాని నాకు అనుజ్ఞ ఇస్తే నేను అడవి అంతా గాలించి సీత జాడ తెలుసుకొనివస్తాను." అని అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుడి మాటలకు ఎంతోసంతోషించాడు రాముడు. "లక్ష్మణా! నువ్వు ఒక్కడివే ఎందుకు.మనం ఇద్దరం కలిసి వెదుకుదాము." అని అన్నాడు.

తరువాత రాముడు లక్ష్మణుడు కలిసి సీతను వెదకడం మొదలెట్టారు. అడవి అంతా గాలించారు. పక్కనున్న పర్వతములు అన్నీ కలయతిరిగారు. నదీతీరములు వెదికారు. సరస్సులవద్ద వెతికారు. ఎంత వెదికినా సీత కనపడలేదు.

"లక్ష్మణా! ఎంతవెదికినా సీత కపపడటం లేదు. ఏం చేద్దాము." అని నిరాశగాఅన్నాడు రాముడు.

"రామా! అంతలోనే నిరాశచెందకుము. సీత మనకు తప్పకుండా కనపడుతుంది. నాకు ఆ నమ్మకం ఉంది. సీత బతికేఉంది. అందులో సందేహము లేదు."అని అన్నాడు లక్ష్మణుడు.

"ఏం దొరకడమో ఏమో! మనం  ఇద్దరం ఈ అడవి అంతా గాలించాము కదా! సీత సాధారణంగా వెళ్లే ప్రదేశాలు, సరస్సులు, నదీతీరము, పర్వతములు అన్నీ వెదికాము కదా! కాని సీత కనిపించలేదు. ఏం చెయ్యాలో తోచడంలేదు." అని దు:ఖిస్తున్నాడు

రాముడు. "సీతాసీతా!" అని మాటి మాటికీ సీతను తలుచుకుంటున్నాడు.

లక్ష్మణుడు రాముని శాయశక్తులా ఓదారుస్తున్నాడు. కాని రాముని దు:ఖము ఉపశమించడం లేదు. అలా సీత కోసం దు:ఖిస్తూనే ఉన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము అరువది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## అరువది రెండవ సర్గ.

వివాహం అయినప్పటి నుండి తనను క్షణం కూడా ఎడబాయని సీత ఒక్కసారిగా తనను విడిచి పోవడం చూచి రాముడు హతాశుడయ్యాడు. రాముడికి కన్ను మూసినా తెరిచినా సీత రూపమే కనిపిస్తూ ఉంది. సీత చెట్ల నుండి పూలు కోస్తున్నట్టు, పూపొదలలో తిరుగుతున్నట్టు ఊహించుకుంటున్నాడు. ఆమెను తన దగ్గరకు రమ్మని పిలుస్తున్నాడు. తన దగ్గరకు రాలేదేమా అని అలుగుతున్నాడు. సీత తనను ఆట పట్టించడానికి తనకు దూరంగా తనకు కనపడకుండా ఉందని ఆమెను రా రమ్మని పిలుస్తున్నాడు. నీవు లేకపోతే పర్ణశాల శూన్యంగా ఉందని నిష్ఠూరం ఆడుతున్నాడు. ఎంతకూ సీత కనపడలేదు.

మరలా లక్ష్మణుడి వంక చూచాడు. "లక్ష్మణా! నేను ఇంతగా పిలుస్తుంటే, ఇంతగా పరితపిస్తుంటే సీత ఎందుకు రావడం లేదు. సీతను రాక్షసులు చంపి తిని ఉంటారంటావా!" అని తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

మరలా తనలో తాను మాట్లాడుకుంటున్నాడు. "ఓ సీతా! నీకు ఎంత ఆపద సంభవించినది. ఇది తెలిస్తే పాపం కైక ఎంత సంతోషిస్తుందో! ఆమె కోరిక తీరినట్టయింది కదా! సీతా! నీతో కలిసి అయోధ్యనుండి బయటకు కాలు పెట్టాను. వనవాసానంతరము నీవు లేకుండా అయోధ్యలో ఎలా కాలు పెట్టను? సీతను ఎవరికో అప్పగించి వచ్చాను అని తలిస్తే జనం నన్ను పిరికి వాడనీ, పరాక్రమం లేని వాడనీ నిందించరా!

నిజమే! నేను పిరికివాడినే! లేకపోతే చేతిలో ధనుర్బాణములు ఉండగా నిన్ను పోగొట్టుకున్నానే! నేను నిజంగా పిరికివాడినే! మీ తండ్రి జనక మహారాజు వచ్చి 'నాకుమార్తె సీత ఎక్కడ?' అంటే నేను ఏమి సమాధానం చెప్పాలి. ఆయనకు నా మొహం ఎలా చూపించాలి? అసలు నీవు నా పక్కన లేకుండా చూచి మీ తండ్రి జనకుడు మూర్ఛ చెందడా! అందుకే నేను మరలా అయోధ్యకు వెళ్లను? సీతలేని అయోధ్యలో నేను ఉండలేను." అని సీత తన ఎదురుగా ఉన్నట్టు ఊహించుకొనని మాట్లాడుతున్నాడు.

ఇంతలో లక్ష్మణుని వంక తిరిగాడు. "లక్ష్మణా! నీవు అయోధ్యకు వెళ్లు. నా కోసరం నువ్వుకూడా ఎందుకు ఈ అడవులలో బాధలుపడతావు. భరతుని శాశ్వతంగా రాజ్యం ఏలుకోమని నామాటగా

చెప్పు. నాకు బదులు నా తల్లి కౌసల్యకు నీ తల్లి సుమిత్రకు అభివాదము చెయ్యి. నా తల్లిని జాగ్రత్తగా చూసుకో! ఆమె చెప్పిన పనులు చేస్తూ ఉండు. లక్ష్మణా! నా తల్లికి నీవు ఇక్కడ జరిగిన విషయాలు సవిస్తరంగా వివరించు. మాయలేడి రావడం, సీత ఆ లేడి కావాలని కోరడం, నేను దాని కోసరం వెళ్లడం, దానిని కొట్టడం, ఆ లేడి రాక్షసుడుగా మారి అరవడం. నువ్వు రావడం, సీత కనపడకపోవడం, సీత కోసరం నేను విలపించడం, అన్నీ వివరించు." అని అప్పగింతలు పెడుతున్న రాముని చూచి లక్ష్మణుడు భయంతో వణికిపోయాడు. సీతావియోగదు:ఖం తట్టుకోలేక రాముడు ఎటువంటి దుస్థితికి లోనవుతాడో అని భయపడ్డాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము అరువది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## అరువది మూడవ సర్గ.

రాముడి దు:ఖానికి అంతులేకుండా పోయింది. లక్ష్మణుడు ఎంత ఓదారుస్తున్నా రాముడు సీత మీద ఉన్న ప్రేమ వలన ఆమెకోసం విలపిస్తున్నాడు. తనలో తనే మాట్లాడుకుంటున్నాడు.

"నేను ఎన్నో పాపాలు చేసి ఉంటాను. అందుకనే నాకు కష్టాలు

ఒకదాని వెంట ఒకటి వస్తున్నాయి. నేను ఊరికే అనడం లేదు లక్ష్మణా! నాకు రాజ్యం పోయింది. బంధుమిత్రులు దూరం అయ్యారు. తల్లి దూరం అయింది. తండ్రి మరణించాడు. ఇప్పుడు నా భార్యకూడా నాకు దూరం అయింది. ఇది పాపకర్మల ఫలితం కాదా!

సీతను ఎవరైనా ఎత్తుకుపోతుంటే ఆమె ఎంతగా విలపించి ఉంటుందో తలచుకుంటేనే భయంగా ఉంది. సందేహము లేదు. సీతను రాక్షసులే అపహరించారు. నరమాంస భక్షకులైన రాక్షసులు సీతను అపహరించి, ఆమె కంఠమును ఖండించి ఆమె నెత్తురు తాగి ఉంటారు.  ఆ సమయంలో ఆమె ఎంతగా ఏడ్చిందో కదా!

లక్ష్మణా! నీకు తెలుసుకదా! సీత, నేను, ఆ శిలాఫలకము మీద కూర్చుని ఎన్నో సాయంత్రాలు గడిపాము కదా! లక్ష్మణా! సీత గోదావరికి స్నానం నిమిత్తం వెళ్లి ఉంటుందంటావా! కాని ఆమె ఎప్పుడూ  ఒంటరిగా గోదావరికి స్నానానికి వెళ్లదే! నేను తోడు లేనిదే సీత కనీసము తామరపూల కోసరం కూడా తటాకమునకు వెళ్లదు. ఎందుకంటే సీత మహాభయస్తురాలు." అని లక్ష్మణునితో అన్నాడు.

తల పైకి ఎత్తాడు. ఆకాశంలో సూర్యుడు వెలుగుతున్నాడు. "ఓ సూర్యభగవానుడా! నీవు లోకమంతా వెలుగుతుంటావు కదా! నా సీత ఎక్కడైన కనపడిందా! నీవు చూచావా! చూస్తే నాకు చెప్పవా!" అని సూర్యుడిని వేడుకున్నాడు. అలాగే వాయుదేవుడిని కూడా వేడుకున్నాడు.

ఇదంతా చూచిన లక్ష్మణుడికి కూడా దు:ఖం ముంచు

కొచ్చింది. తనూ దు:ఖిస్తే రాముడు ఇంకా దైన్యానికి లోనవుతాడని తనలో తాను తమాయించుకున్నాడు, రాముని చూచి ఇలా అన్నాడు.

"రామా! ఇంక చాలు. సీత కోసం దు:ఖించడం మాను. ఇలా దు:ఖిస్తూ కూర్చుంటే సీత తిరిగి వస్తుందా! పద. సీతను వెదుకుదాము. నీ వంటి బుద్ధిమంతులు కష్టములు వచ్చినప్పుడే ఎంతో ధైర్యాన్ని ప్రదర్శిస్తారు. కాబట్టి రామా! ధైర్యము తెచ్చుకో. " అని రామునికి ధైర్యవచనాలు పలికాడు. కానీ రాముడి మీద అవి పనిచేయలేదు. (ఈ సర్గ కూడా ప్రాచ్యప్రతిలో లేదు. అందుకని ఈ సర్గ కూడా తరువాత చేర్చబడినది అని పండితుల అభిప్రాయము.)

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము. అరువది మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము.

## అరువదినాల్గవ సర్గ.

రాముడికి ఇంకాఆశ చావలేదు. 'ఏమో సీత ఎక్కడికైనా వెళ్లిందేమో. మనము అనవసరంగా ఆందోళన పడుతున్నామేమో' అనే ఆలోచన వచ్చింది. వెంటనే లక్ష్మణుని పిలిచి

"లక్ష్మణా! నీవు వెంటనే గోదావరీనదీ తీరానికి వెళ్లు. అక్కడ సీత తామరపూలు కొయ్యడానికి కానీ,స్నానానికి కానీ వెళ్లిందేమో

చూడు.' ఇదే ఆఖరి ఆశ." అన్నాడు రాముడు.
అన్న మాట ప్రకారము లక్ష్మణుడు గోదావరీ నదీతీరానికి వెళ్లాడు. తీర ప్రాంతము అంతా వెదికాడు. కానీ సీత జాడ ఎక్కడా కనపడలేదు. నిరాశతో రాముని వద్దకు వచ్చాడు.

"అన్నయ్యా! నేను గోదావరి తీరం అంతా వెదికాను. బిగ్గరగా అరిచాను. సీత ఎక్కడా కనిపించలేదు." అని చెప్పాడు.

ఆఖరి ఆశకూడా వమ్ముకావడంతో రాముడు హతాశు డయ్యాడు. కాని రామునికి ఇంకా కొస ఆశ మిగిలి ఉంది. "లక్ష్మణుడు సరిగా చూచాడో! లేదో ఏమో!" అని తానే స్వయంగా గోదావరీ నదీ తీరానికి వెళ్లాడు. సీతా! సీతా!అని బిగ్గరగా అరుస్తూ ఆ ప్రాంతమంతా కలయ తిరిగాడు.

రావణుడు సీతను అపహరించిన సంగతి అక్కడ ఉన్న వృక్షములకు, జంతువులకు, పక్షులకు, గోదావరీ నదికి తెలుసు. కాని అవి చెప్పలేవు. రాముడు నిరాశ చెందాడు. లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! నేను ఎంత ఎలుగెత్తి పిలిచిననూ ఈ వనములో ఉన్న చెట్లు, పక్షులు, జంతువులు, గోదావరి నది ఎవరూ బదులు చెప్పడం లేదు. ఏం చేయాలి. నీ పాణిని గ్రహించిన సీత ఏదీ అని సీత తల్లి తండ్రులు అడిగితే నేను ఏమి సమాధానము చెప్పాలి.

లక్ష్మణా! నా రాజ్యము పోయినా, అరణ్యవాసము సంప్రాప్తిం చినా, నేను అధైర్యపడక సీతను చూచి బతుకుతున్నాను. ఇప్పుడు ఆ సీత నన్ను విడిచి పోయింది. ఇప్పుడు నేను ఎవరిని చూచి బతకాలి.

నాకు ధైర్యము చెప్పేవాళ్లు ఎవరు.

లక్ష్మణా! చూచావా! ఈ మృగములు నన్ను చూచి తలలు ఎత్తి ఏమో చెప్పాలి అనుకుంటున్నాయి. కాని చెప్పలేకపోతున్నాయి. సీత గురించి వీటికి తెలిసి ఉంటుంది. ఉండు వీటిని అడుగుతాను." అని రాముడు ఒక్కొక్క మృగం దగ్గరకు పోయి "సీత ఎక్కడ ఉందో నీకు తెలుసా!" అని ప్రతి మృగమును అడుగుతున్నాడు.

వాటి కళ్ల వెంట కన్నీరు కారుతూ ఉంది. కాని ఏమీ చెప్పలేకపోతున్నాయి. కాని అవి ఒక సంకేతమును ఇచ్చాయి. ఆ మృగములు తమ మోరలు ఎత్తి అరుస్తూ దక్షిణ దిక్కుకు పరుగెడుతున్నాయి. ఆకాశం వంక చూస్తున్నాయి. మరలా దక్షిణ దిక్కుగా పరుగెడుతున్నాయి.

రాముడు సీతా వియోగ దు:ఖంలో ఉన్నాడు. కానీ లక్ష్మణుడు సూక్ష్మబుద్ధితో వాటి సంకేతాలు గ్రహించాడు. "రామా! గమనించావా! నువ్వు "మీరు సీతను చూచారా!సీత ఎక్కడకు వెళ్లింది" అని అడగగానే ఈ మృగములు ఆకాశం వంక చూస్తూ దక్షిణ దిక్కుగా పరుగెడుతున్నాయి. ఎవరో సీతను ఆకాశ మార్గంలో దక్షిణదిక్కుగా తీసుకువెళ్లినట్టు వాటి చర్యలను బట్టి తెలుస్తూ ఉంది. కాబట్టి మనము దక్షిణ దిక్కుగా వెళ్లి వెదుకుదాము. సీత జాడ ఏమైనా తెలుస్తుందేమో!" అని అన్నాడు లక్ష్మణుడు.

ప్రవాహంలో కొట్టుకుపోతున్నవాడికి గడ్డిపరక దొరికినా లాభమే అన్నట్టు రాముడికి లక్ష్మణుడు చెప్పిన ఈ చిన్న మాట ఆశను రేకెత్తించింది. "లక్ష్మణా! అలాగే చేద్దాము. పద పోదాం." అన్నాడు

రాముడు. రాముడు లక్ష్మణుడు ఇద్దరూ దక్షిణ దిక్కుగా వెళు తున్నారు.మార్గంలో సీత ధరించిన పూలు చెల్లాచెదురుగా పడిఉ ఒడటం చూచారు.

రాముడు ఆపూలను చూచాడు. "లక్ష్మణా! ఈ పూలు చూచావా! ఈ రోజు ఉదయం నేను అడవిలో నుండి కోసుకొని వచ్చి సీతకు ఇచ్చాను. ఈ పూలు ఇంకా వాడిపోలేదు. ఇప్పుడు ఈ పుష్పాలు మనకు దారి చూపుతున్నాయి." అని సంతోషించాడు.

మరలా రాముడు తన ధోరణిలో మాట్లాడుతున్నాడు. "ఓ పర్వతములారా! మీకు సీత జాడ తెలుసు. ఎవరు తీసుకొనిపోయారో తెలుసు. తెలిసీ చెప్పకపోయారో నా బాణములతో మిమ్ములను పిండి పిండి చేస్తాను." అని పెద్దగా అరిచాడు. రాముని మాటలకు పర్వతములు బదులు చెబుతున్నాయా అన్నట్టు రాముని మాటలు ప్రతిధ్వనించాయి.

ఇంతలో నేలమీద అటు ఇటు పరుగెట్టినట్టు పెద్ద పెద్ద అడుగులు, చిన్న చిన్న అడుగులు కనపడ్డాయి. పెద్ద అడుగులు రాక్షసునివి గానూ చిన్న అడుగులు సీతవి గానూ పోల్చుకున్నారు రామలక్ష్మణులు. ఆతురతగా ముందుకు నడిచారు.

వారికి ఒక వటవృక్షము దగ్గర విరిగిన ధనుస్సు బాణములు, ముక్కలైన రథము కనపడ్డాయి. అక్కడ ఒక యుద్ధం జరిగినట్టు ఆనవాళ్లు కనపడ్డాయి. అక్కడక్కడా విరిగిన ఆభరణములు చెల్లాచెదురుగా పడిఉన్నాయి. వాటిని సీత ఆభరణములుగా

గుర్తించాడు రాముడు. వారు అక్కడ సీత జాడ కోసరం నిశితంగా వెదుకుతున్నారు. "లక్ష్మణా! ఇటు చూడు. ఇక్కడ నేల మీద రక్త బిందువులు కనపడుతున్నాయి. ఇది చూస్తుంటే ఇక్కడ ఆ రాక్షసుడు సీతను చంపి ఉంటాడు. లక్ష్మణా! చూస్తుంటే ఇక్కడఇద్దరు రాక్షసులు యుద్ధము చేసిన గుర్తులు కనిపిస్తున్నాయి. ఇదుగో ఇటు చూడు! బంగారముతో అలంకరింపబడిన ధనుస్సు ఇక్కడ విరిగిపడి ఉంది. ఇది ఎవరిదిఅయి ఉంటుందో తెలియదు. లక్ష్మణా! ఇటుచూడు. ఇక్కడ బంగారుకవచము పడిఉంది. " అని అన్నాడు రాముడు.

"అన్నయ్యా! ఇక్కడ ఎవరిదో పెద్ధఛత్రము పడిఉంది. అదుగో అక్కడ పిశాచముఖములు కలిగిన గాడిదలు చచ్చి పడిఉన్నాయి. ఇవన్ని చూస్తుంటే నువ్వు అన్నట్టు ఇక్కడ ఏదో యుద్ధము జరిగినట్టు కనపడుతూ ఉంది." అని అన్నాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! ఈ రథము ఎవరిదో మహారాజుదిగా ఉంది. అంతా బంగారంతో చేయబడి ఉంది. ఇక్కడ పడిఉన్న బాణములు కూడా చాలా పొడుగ్గా ఉన్నాయి. బంగాచపు ములికలు కలిగి ఉన్నాయి. రెండు అమ్ములపొదులు కూడా ఉన్నాయి. రథసారథికూడా చచ్చిపడి ఉన్నాడు. ఈసారథి చేతిలో రథమునకు కట్టిన గాడిదల కళ్లెములు, కొరడా ఉన్నాయి. ఇక్కడ ఇద్దరు చామరములు వీచే వాళ్లుకూడా చంపబడినట్టున్నారు. వాళ్ల శరీరాలు చెల్లాచెదరుగా పడిఉన్నాయి. వీరందరూ ఇక్కడ జరిగిన యుద్ధములో చంపబడినట్టున్నారు" అని రాముడు అక్కడ పడి ఉన్న మృతదేహాలను చూస్తున్నాడు.

లక్ష్మణుడు కూడా వారిని చూచి వారు రాక్షసులు అని

పోల్చుకున్నాడు. కాని సీత ఏమయిందో తెలయడం లేదు. రామునికి అర్థం అయింది. ఇదంతా రాక్షసుల పని అని. లక్ష్మణుని చూచి రాముడు  ఇలా అన్నాడు.

"ఓ లక్ష్మణా! ఇదంతా చూస్తుంటే ఇక్కడ రాక్షసుల మధ్య యుద్ధం జరిగినట్టు కనపడుతూ ఉంది. సీతను తీసుకువెళ్లడం గానీ, చంపి తినడం గానీ జరిగి ఉండవచ్చు. సీత గురించి ఇక్కడ ఘోరయుద్ధం జరిగినట్టు ఆనవాళ్లు కనపడు తున్నాయి. దేవతలుగానీ వనదేవతలు గానీ సీతను రక్షించలేదు.  ఏది ఏమయినా నాకు తీరని నష్టం కలుగజేసారు. నాకు సహజంగా దయాగుణం ఉంది. అనవసరంగా నేను ఎవరికీ అపకారము చెయ్యను. నా దయా గుణమును దేవతలు, వనదేవతలు, రాక్షసులు నా చేతగాని తనంగా భావిస్తున్నారు. నన్ను పరాక్రమము లేని వాడుగా అనుకొంటున్నారు. నా దయాగుణమే నాకు శత్రువుగా పరిణమించింది.

అందుకని,  నేను నా దయాగుణమును తొక్కిపట్టి, విజృంభిస్తాను. సకల భూతములను, రాక్షసులను నాశనం చేస్తాను. యక్ష,గంధర్వ,పిశాచ,దానవులను క్షోభపెడతాను. ఎవరినీ సుఖంగా బతకనివ్వను. నా అస్త్ర,శస్త్రములతో ముల్లోకములను అల్లకల్లోలం చేస్తాను. ఈ దేవతలు నా సీతను నాకు క్షేమంగా అప్పగించకపోతే నా పరాక్రమము ఏమిటో వారికి తెలియజేస్తాను." అని పలికి విల్లు ఎక్కుపెట్టాడు రాముడు.

"లక్ష్మణా! ఇక్కడ ఉన్న వారందరికీ నా సీతకు ఏమయిందో తెలుసు. కానీ నాకు చెప్పడం లేదు. వారు,  దేవతలు కానీ, రాక్షసులు

గానీ, నా సీత జాడ చెప్పకపోయినా, నా సీతను నాకు సజీవంగా నాకు అప్పగించకపోయినా, ఈ బాణంతో ముల్లోకములను క్షోభింపజేస్తాను." అని విల్లు ఎక్కుపెట్టాడు రాముడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము అరువది నాల్గవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## అరువది ఐదవ సర్గ.

సీతా వియోగంతో రామునికి తాను ఏం చేస్తున్నాడో తెలియడం లేదు. ముల్లోకాల్ని నాశనం చేస్తానని విల్లు ఎక్కుపెట్టడం చూచి లక్ష్మణుడు తల్లడిల్లిపోయాడు. వెంటనే రామునితో ఇలా అన్నాడు.

"రామా! నీవు సౌమ్యుడవు. మృదుస్వభావుడవు. సకల జనులకు హితుడవు. అటువంటి నీవు ముల్లోకములకు హాని కలిగిస్తాను అనడం భావ్యమా! నీ శాంత స్వభావాన్ని విడిచిపెట్టవచ్చునా! చంద్రునికి వెన్నెల, సూర్యునికి వేడి, భూమికి క్షమ ఎలా అలంకారాలో నీకు సౌమ్యత, సాధుజన ప్రియత్వము అలంకారాలు. ఇన్నాళ్లు సంపాదించుకున్న కీర్తిని ఒక్కసారిగా నాశనం చేసుకుంటావా!

సీతను అపహరించింది ఎవడో ఒక రాక్షసుడు. వాడిని శిక్షించాలి గానీ, ముల్లోకాలను క్షోభింపజేయడం యుక్తము కాదు

కదా! ఇక్కడ ఏం జరిగిందో, ఎవరెవరికి యుద్ధం జరిగిందో, అసలు ఈ యుద్ధముతో సీతాపహరణమునకు సంబంధం ఉందో లేదో తెలియదు. ఈ రక్తపు మరకలు ఎవరివో తెలియదు.

కాని ఇక్కడ ఒక యుద్ధము జరిగింది అన్నమాట వాస్తవము. కాని ఈ యుద్ధము ఇద్దరి మధ్య జరిగిందే కానీ, పెద్ద సైన్యము మధ్య జరిగింది కాదు. పెద్దసైన్యము వచ్చిన గుర్తులు కనిపించడం లేదు. ఇద్దరు యుద్ధం చేసుకుంటే ఒకడు చావాలి. మరొకడు గెలవాలి. కాబట్టి ఆ చచ్చినవాడు ఇక్కడే ఎక్కడో పడి ఉంటాడు. వాడిని పట్టుకుంటే మనకు సీత జాడతెలియవచ్చు. కాబట్టి ఆ ఇద్దరి గురించి నీవు నీ ఆయుధమును ప్రయోగించడం ఉచితం కాదు.

నీ భార్యను అపహరించడం క్షమించరాని నేరము. మనము ఆ నేరము చేసిన అపరాధిని పట్టి శిక్షిస్తాము. నీకు ఈ ప్రకృతి సాయం చేయడం లేదు అని అనుకుంటున్నావు. అలా అని ఎందుకు అనుకుంటావు. దక్షిణ దిక్కుగా పొమ్మని చెప్పింది ఆ మూగజీవాలే కదా! ఇంక చెట్టు, పుట్టలు, పర్వతాలు, నదులు తాము చూచిన విషయాన్ని నీకు ఎలా తెలియజేయగలవు. వాటికి నీకు సాయం చేయాలని ఉన్నా చేయలేవు కదా! అందుకని శాంతం వహించు.

మనము ఇక్కడ ఉన్న మునులను, ఋషులను కలిసి వారి సాయంతో సీతను గురించి వెదుకుదాము. ఈ అడవి, పర్వతములు, నదీతీరములు అణువు అణువునా గాలిద్దాము. సీత జాడ తెలిసే వరకూ, సీతను అపహరించిన వాడు దొరికే వరకూ మనకు అన్ని లోకములు వెదుకుదాము. ఒక వేళ దేవతలు గానీ, దానవులు గానీ ఈ పని చేసి

ఉంటే, వారికి ఒక అవకాశం ఇద్దాము. అప్పటికీ వారు దారికి రాకపోతే, అప్పుడు వారిని కఠినంగా శిక్షిద్దాము. ముందు మనము సామోపాయముతోనూ, మన ఉదాత్తమైన శీలము తోనూ, వినయంగా అడుగుదాము. వారు మాట వినకపోతే, అప్పుడు నీ పరాక్రమం చూపించవచ్చును." అని రాముని శాంతింపజేసాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము. అరువది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్య కాండము

## అరువది ఆరవ సర్గ.

లక్ష్మణుని మాటలు రాముని మీద పనిచేయలేదు. ప్రస్తుతానికి లోకాలను క్షోభింపజేసే కార్యక్రమము విరమించాడు కానీ, సీతను గురించి శోకించడం మానలేదు. రాముని మానసిక స్థితి పూర్తిగా దిగజారి పోయింది. మానసికంగా శక్తిని, బలాన్ని కోల్పోయాడు. రాముని స్థితిని గమనించిన లక్ష్మణుడు రామునికి ధైర్యం చెప్పడం మొదలెట్టాడు.

"రామా! మన తండ్రి దశరథుడు అనేక సంవత్సరాలు పుత్రసంతతి లేక. యజ్ఞములు, యాగములు చేసి మనలను పొందాడు. నీ వియోగమును తట్టుకోలేక ఈ లోకాన్నే విడిచిపెట్టాడు

మన తండ్రి దశరథుడు. నీవు రాజ్యాని పోగొట్టుకున్నావు. ఇటువంటి కష్టములను ధీరోదాత్తుడవైన నీవే తట్టుకోలేకపోతే సామాన్య ప్రజలు ఎలా తట్టుకోగలరు.

యయాతి లాంటి మహారాజుకే కష్టములు తప్పలేదు. ఇంక మనము ఎంత! కష్టములు, సుఖములు, ఒకదాని వెంట ఒకటి రావడం లోక సహజం. వాటిని తట్టుకొని నిలబడడమే మానవుని కర్తవ్యము. మన తండ్రి పురోహితులు వసిష్ఠులవారికి ఒకే రోజు నూర్గురు కుమారులు కలిగారు. వారందరూ విశ్వామిత్రుని కోపాగ్నికి బలి అయి ఒకేరోజు మరణించారు.

ఇంతెందుకు, భూదేవి కూడా ప్రతిరోజూ ఈ మానవుల చేతిలో ఎన్నో కష్టములను భరిస్తూ ఉంది. సూర్య చంద్రులు కూడా రాహు కేతువుల చేతిలో గ్రహణములను అనుభవిస్తున్నారు. దేవతలకు అధిపతి ఇంద్రుడు కూడా ఒక్కోసారి తప్పుడు పనులు చేసి కష్టాల పాలు కావడం మనకు తెలుసు కదా! కాబట్టి ఎంతటి వారికైనా కష్టములు తప్పవు. కష్టములు వచ్చాయని ఇలా దు:ఖించడం అవివేకము అనిపించుకుంటుంది.

ఇప్పుడు మన ముందు ఉన్నవి రెండే రెండు విషయాలు. ఒకటి సీత అపహరించబడింది. లేక సీత చంపబడింది. ఫలితంగా సీత నీ నుండి దూరం అయింది. ఏది జరిగినా నీవు సామాన్య మానవుల వలె దు:ఖించరాదు. ధైర్యంగా ఉండాలి. సత్యము గురించి తెలిసిన వారు ఎంత పెద్ద కష్టము వచ్చినా చలించరు. కాబట్టి రామా! దు:ఖమును మాని జరిగిన విషయములను బుద్ధితో ఆలోచించు.

ప్రశాంత మనస్సుతో ఆలోచిస్తే ప్రతి సమస్యకూ పరిష్కారం దొరుకుతుంది..

మనము చేసే కర్మలను బట్టి మనకు ఫలితాలు వస్తుంటాయి. ఆ ఫలితములను అనుభవించడమే మన కర్తవ్యము. కొన్ని కర్మలు సుఖాన్ని ఇస్తాయి. కొన్ని కర్మలు దు:ఖాన్ని కలుగజేస్తాయి. సుఖము కానీ, దు:ఖము కానీ ఎల్లకాలమూ ఉండవు. కొంతకాలము తరువాత అవి నశించిపోతాయి.

మనము అనుభవించు ఫలములు ఈ జన్మలో చేసిన కర్మల ఫలితములే అనుకొనరాదు. మనము పూర్వజన్మలో చేసిన కర్మలకు ఫలితములు ఈ జన్మలో అనుభవానికి వస్తాయి. ఇప్పుడు మనకు కలిగిన ఈ దు:ఖము మన పూర్వ జన్మలో మనము చేసిన కర్మల ఫలము అయి ఉండవచ్చు. కాబట్టి ఇప్పుడు మనకు లభించిన ఫలితములను బట్టి పూర్వ జన్మలో మనము చేసిన కర్మలను ఊహించుకొనవచ్చును. చేసిన కర్మలకు ఫలితము అనుభవింపక తప్పదు. కాబట్టి దు:ఖించి ప్రయోజనము లేదు.

రామా! ఇవన్నీ నీకు కొత్త కాదు. నీవే నాకు ఇవన్నీ చెప్పావు. ప్రస్తుతము నీవు సీతావియోగ దు:ఖములో ఉన్నావు కాబట్టి నేను నీకు చెప్పవలసి వచ్చినది. లేక పోతే సాక్షాత్తు బృహస్పతికి కూడా నీవు ధర్మములు చెప్ప సమర్థుడవు. ప్రస్తుతము నీలో ఉన్న జ్ఞానము సీతను గురించి శోకించడంలో మరుగున పడి ఉన్నది. నీలో అంతర్గతముగా ఉన్న జ్ఞానమును నేను వెలికి తీస్తున్నాను.

ఓ రామా! నీవు మానవుడవే అయినా దేవతలకు ఉన్న పరాక్రమము ఉంది. కాబట్టి నీవు శోకము మాని మనకు అపకారము చేసిన శత్రువుల గురించి ఆలోచిద్దాము. అంతేగానీ ఈ ప్రకారంగా అస్త్ర,శస్త్రములను ప్రయోగించి లోకాలను నాశనం చేయడం వలన ఏమీ ప్రయోజనము లేదు. ముందు సీతను అపహరించిన వాడు ఎవడో తెలుసుకొని వాడిని తగిన విధంగా దండిస్తాము. ముందు నీ శోకము మాను." అని అన్నాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము అరువది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## అరువది ఏడవ సర్గ.

"వినదగునెవ్వరుచెప్పిన" అని ఈ నాడు ఒక సామెత ఉంది.. శ్రీరాముడు అక్షరాలా ఆ సూత్రాన్నే పాటించాడు. లక్షణుడు తన కన్నా చిన్న వాడు. కానీ తనకు నీతిబోధ చేసాడు. శ్రీరాముడు లక్ష్మణుడు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నాడు. ఎదురు చెప్పలేదు. బదులు చెప్పలేదు. తర్కించలేదు. విమర్శించలేదు. మౌనంగా అంగీకరించాడు. తన కోపాన్ని తనలోనే అణచుకొన్నాడు. ఎత్తిన ధనుస్సును దించాడు. తమ్ముని ముందు తలవంచి క్లుప్తంగా ఇలా అన్నాడు.

"తమ్ముడా లక్ష్మణా! ఇప్పుడు మనం ఏమి చేద్దాము? ఎక్కడికి వెళదాము. సీత గురించిన ఆధారాలు ఏ ఉపాయంతో దొరుకుతాయో ఆలోచించు." అని అన్నాడు.

అన్నయ్య శాంతించడంతో లక్ష్మణుడికి ఉత్సాహం పెల్లుబికింది. "అన్నయ్యా! ఎటువంటి పెనుగాలి వీచినా పర్వతము చలించనట్టు, ఎన్ని కష్టములు వచ్చినా నీ వంటి ధీరోదాత్తులు చలించకూడదు. ధైర్యంగా ఎదుర్కోవాలి. విజయం సాధించాలి. అన్నయ్యా! సీతను ఆ రాక్షసులు ఏమి చేసినా ఈ అడవిలోనే చెయ్యాలి. ఎందుకంటే ఈ జనస్థానము రాక్షసులకు బలమైన స్థావరము. అందుకని మనము ఈ అడవిని క్షుణ్ణంగా వెదుకుదాము. మనకు సరిఅయిన ఆధారాలు లభిస్తాయి. వాటి ద్వారా సీత జాడ తెలుసుకుందాము. మనం ఇద్దరం కలిసి వెదుకుదాము. " అని అన్నాడు.

వెంటనే మారు మాటాడక రాముడు లక్ష్మణుని అనుసరించాడు. ఇద్దరూ అడవిలో సీత కోసం వెదకడం మొదలెట్టారు. వారి శ్రమ త్వరలోనే ఫలించింది. రావణుడు తన రెక్కలు విరగ గొట్టగానే జటాయువు ఎగురుతూ పోయి అల్లంత దూరంలో పడ్డాడు. బాధతో మూలుగుతున్నాడు. కొండంత ఎత్తున నేలమీద పడి ఉన్న జటాయువును చూచారు రామలక్ష్మణులు. రామునిలో ఆవేశం పెల్లుబికింది. ఆ కొండంత పక్షికూడా రాక్షసుడే అనుకున్నాడు. ఎందుకంటే అంతకు ముందే లేడి రూపంలో ఉన్న మారీచుని సంహరించాడు. ఇప్పుడు వీడు పక్షిరూపంలో ఉన్న రాక్షసుడు అనుకున్నాడు. అందుకే విల్లు ఎక్కుపెట్టి అర్ధచంద్ర బాణం సంధించాడు.

"లక్షణా! అడుగో సీతను అపహరించి తినివేసిన రాక్షసుడు. సీతను భక్షించి తీరిగ్గా కూర్చుని ఉన్నాడు. వాడిని ఇప్పుడే హతమార్చుస్తాను." అంటూ ఆవేశంతో పలికాడు.

దూరం నుండి రాముని మాటలను విన్నాడు జటాయువు. "నేను రాక్షసుడిని కాను రామా! నీ తండ్రిగారి స్నేహితుడు జటాయువును. సీత జాడ నాకు తెలుసు." అని పెద్దగా అరిచాడు.

రామ లక్ష్మణులు గబా గబా జటాయువు దగ్గరకు వెళ్లారు. రెక్కలు విరిగి శరీరం అంతా రక్తంతో తడిసిముద్దఅయి ఉన్న జటాయువును చూచారు. జటాయువు అవసాన దశలో ఉన్నాడు. అందుకని పరామర్శలకు తావు ఇవ్వకుండా తనకు తెలిసిన విషయాలు గబా గబా చెప్పనారంభించాడు.

"రామా! లక్ష్మణా! జాగ్రత్తగా వినండి. సీతను అపహరించింది, నా రెక్కలు విరుగ గొట్టినది రావణుడు అనే రాక్షసరాజు. సీతను రావణుడు అపహరించి ఎత్తుకు పోవడం నేను కళ్లారా చూచాను. అతనితో నేను పోరాడాను. అతని రథాన్ని విరుగగొట్టాను. సారథిని చంపాను. రథానికి కట్టిన గాడిదలను చంపాను. రావణుని కవచం ఛేధించాను. రావణుడు కత్తితో నారెక్కలు ఖండించాడు. నేను కింద పడిపోగానే రావణుడు సీతను ఎత్తుకొని ఆకాశమార్గంలో ఎగిరిపోయాడు. ఇప్పటికే ఆ రాక్షసుడు నన్ను చంపాడు. ఇంకా నువ్వు ఏమి చంపుతావు." అని అన్నాడు జటాయువు.

రాముడు ధనుస్సును కింద పడేసాడు. రామలక్ష్మణులు జటాయువు ను కౌగలించుకున్నారు. సీత కోసరం తన ప్రాణాలను బలిపెట్టిన జటాయువును పట్టు కొని ఏడ్చారు. జటాయువు ఊపిరి భారంగా తీస్తున్నాడు.

"చూచావా నా దౌర్భాగ్యము. రాజ్యం పోయింది. తండ్రి పోయాడు. నా భార్య అపహరింపబడింది. ఇప్పుడు నా పితృసమానుడు జటాయువు కూడా పోతున్నాడు. నేను ముట్టుకుంటే మహాసముద్రాలు కూడా ఎండి పోతున్నాయి. నావంటి దౌర్భాగ్యుడు ఈ లోకంలో మరొకడు ఉంటాడా! " అని వలా వలా ఏడ్చాడు.

రాముడు జటాయువును కౌగలించుకొని "నా సీతను ఆ రాక్షసుడు ఎక్కడకు తీసుకువెళ్లాడు. ఇప్పుడు ఆమె ఎక్కడ ఉంది." అని అడిగాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము అరువది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## అరువది ఎనిమిదవ సర్గ.

జటాయువు ఆఖరి క్షణాలలో ఉన్నాడు. అది చూచి రాముడు ఇలా అన్నాడు. "లక్ష్మణా! జటాయువు మనకు ఏదో చెప్పాలని

అనుకుంటున్నాడు. కానీ చెప్పలేకపోతున్నాడు. ఇతని కంఠస్వరము క్షీణిస్తూ ఉంది.” అన్నాడు.

జటాయువును చూచి “జటాయువూ! ఒక్కసారి కళ్లు తెరువు. మాట్లాడు. సీత గురించి చెప్పు. సీతను రావణుడు ఎందుకు తీసుకెళ్లాడు. ఎక్కడకు తీసుకెళ్లాడు. రావణునికి నేను ఏమీ అపకారము చేయలేదే. మరి సీతను ఎందుకు తీసుకెళ్లినట్టు? ఆ సమయంలో సీత ఎలా ఉంది. ఆమె ఏమైనా చెప్పిందా! ఇంతకూ ఆ రావణుడు అనే రాక్షసుడు ఎలా ఉంటాడు. అతని గురించి చెప్పు. అతను మహా పరాక్రమవంతుడా! అతని నివాసము ఎక్కడ. అతడు ఏమి చేస్తుంటాడు. జటాయూ! మాట్లాడు” అని ఆతురతగా అడుగుతున్నాడు రాముడు.

జటాయువు నెమ్మదిగా కళ్లు తెరిచాడు. రాముని వంక చూచి ఇలా అన్నాడు. “రామా! రావణుడు రాక్షసుడు. మాయావి. తన మాయతో అధికమైన వాయువును సృష్టించి, సీతను ఆకాశమార్గంలో తీసుకెళ్లాడు. అతడు దక్షిణ దిక్కుగా వెళ్లాడు. రామా! నా చూపు మందగిస్తోంది. నాకు ప్రాణాలు పోతున్నాయి. రావణుడు సీతను విందముహూర్తంలో అపహరించాడు. ఆ ముహూర్తంలో ఏవస్తువు పోయినా, తొందరలోనే ఆ వస్తువు తిరిగి తన యజమానికి లభిస్తుంది. ఆ విషయం రావణునికి తెలియదు. నీ సీత నీకు తొందరలోనే లభిస్తుంది. నీవు తొందరలలోనే రావణునితో యుద్ధము చేసి, రావణుని చంపి, నీ సీతను తిరిగి పొందుతావు.” అని అంటూ ఉండగానే జటాయువు నోటి నుండి రక్తం పడింది. కళ్లు మూతలు పడ్డాయి.

మరలా జటాయువు ఓపిక తెచ్చుకొని రామునితో "రామా! రావణుడు విశ్రవసుని కుమారుడు. కుబేరునికి సోదరుడు....."అని ఇంకా ఏమో చెప్పబోతూ ప్రాణాలు వదిలాడు జటాయువు.

అది తెలుసుకోలేని రాముడు "ఇంకా ఇంకా రావణుని గురించి చెప్పు" అని జటాయువును కుదిపి కుదిపి అడుగుతున్నాడు. జటాయువు ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి. జటాయువు తల వాల్చి కిందకు జారిపోయాడు.

జటాయువు చనిపోయాడని తెలుసుకున్న రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఈ జటాయువు నా తండ్రికి స్నేహితుడు. ఈ దండకారణ్యంలో తన మానాన తాను బతుకుతూ, నా కొరకు, సీతను రక్షించుట కొరకు, తన ప్రాణాలు సైతం బలిపెట్టాడు. ఇంకా ఎంతో కాలము బతకవలసిన వాడు మనకోసం ప్రాణాలు కోల్పోయాడు. కేవలము నాకు సాయం చెయ్యాలని, సీతను రక్షించాలని, రావణునితో యుద్ధం చేసి, రావణుని చేతిలో చంపబడ్డాడు.

మంచివారు, వీరులు, శూరులు, పరోపకారము చేసేవారు, మనుష్యులలోనే కాదు, జంతువుల లోనూ పక్షులలోనూ ఉంటారని ఈ జటాయువు నిరూపించాడు. ఈ జటాయువు మరణము, అందులోనూ నా కోసం మరణించడం నాకు అత్యంత దు:ఖమును కలిగించింది. సీతా వియోగము కన్నా ఎక్కువ దు:ఖము అనుభవిస్తున్నాను. నా తండ్రి నాకు ఎంత పూజనీయుడో ఈ

జటాయువు కూడా అంతే పూజనీయుడు..

లక్ష్మణా! మనము ఈ జటాయువుకు దహన సంస్కారములు జరిపిద్దాము. కట్టెలు తీసుకురా!" అని అన్నాడు.

తరువాత రాముడు, లక్ష్మణుడు జటాయువుకు దహనసంస్కారములు చేసారు. రాముడు జటాయువు ఆత్మశాంతికి ప్రార్థించాడు. "ఓ జటాయువూ! ఎల్లప్పుడూ యజ్ఞములు చేసే వారికి, నిత్యము అగ్నిహోత్రము చేసేవారికి ఎటువంటి పుణ్యలోకములు లభిస్తాయో, ఆ పుణ్యలోకములు నీకు లభించుగాక! సన్యాసులకు, యుద్ధములో మరణించినవారికి ఎలాంటి ఉత్తమ లోకాలు లభిస్తాయో అవి నీకు లభించునుగాక! నా చేత దహన సంస్కారములు పొందిన నీవు ఉత్తమ లోకములు పొందుతావు!" అని పలికాడు రాముడు.

తరువాత లక్ష్మణుడు దర్భలను తీసుకొని వచ్చాడు. రోహి మృగములనుచంపి ఆ మాంసమును తీసుకొని వచ్చాడు. రాముడు దర్భలు నేలమీద పరిచాడు. రోహి మృగము మాంసముతో ముద్దలు చేసి ఆ దర్భల మీద పెట్టి జటాయువుకు మంత్రపూర్వకంగా పిండప్రదానము చేసాడు. తరువాత రాముడు లక్ష్మణుడు గోదావరీ నదికి వెళ్లి స్నానం చేసి శాస్త్రోక్తంగా జటాయువుకు జలతర్పణములు విడిచారు. రాముని చేత ఉత్తర క్రియలు జరిపించుకున్న జటాయువు ఉత్తమలోకములకు వెళ్లాడు. తరువాత రామలక్ష్మణులు సీతను వెదుక్కుంటూ అడవిలోకి వెళ్లారు.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము అరువది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# అరణ్యకాండము

## అరువది తొమ్మిదవ సర్గ.

రామలక్ష్మణులు ఆ ప్రకారంగా జటాయువుకు ఉత్తర క్రియలు నిర్వర్తించి, దక్షిణ దిక్కుగా సీతను వెదుకుతూ వెళ్లారు. పొదలతో, పెద్ద పెద్ద వృక్షములతో, సూర్యరశ్మికూడా చొరకుండా ఉన్న కీకారణ్యములో వారు ప్రయాణిస్తున్నారు. అలా ప్రయాణిస్తూ జనస్థానము నుండి మూడు కోసుల దూరం వెళ్లారు. అలా వెళుతూ వారు అరణ్యము నంతా సీత కోసం అణువు అణువునా గాలిస్తున్నారు.

సీతను రావణుడు అనే రాక్షసుడు తీసుకువెళ్లాడు అని తెలుసు కానీ ఎక్కడకు తీసుకు వెళ్లాడో రామలక్ష్మణులకు తెలియదు. జటాయువు చెప్పలేదు. అందుకని అడవి అంతా గాలిస్తున్నారు. వారు క్రౌంచారణ్యము దాటారు. మతంగుని ఆశ్రమము వైపుకు వెళుతున్నారు.

వారికి మధ్యలో ఒక పర్వతము కనపడింది. ఆ పర్వతము దగ్గర ఒక పెద్ద గుహను వారుచూచారు. ఆ గుహలో అంతా చీకటి మయంగా ఉంది. రామలక్ష్మణులు ఆ గుహ వద్దకు వెళ్లారు. ఆ గుహ దగ్గర వారు వికృతాకారంతో ఉన్న ఒక రాక్షసి ని చూచారు. ఆ రాక్షసిని చూస్తే మామూలు మనుష్యులయితే భయంతో ప్రాణాలు విడుస్తారు.

అలాంటి రాక్షసికి రాముని వెనక నడుస్తున్న లక్ష్మణుడి మీద

మోహం కలిగింది. లక్ష్మణుని పట్టుకొని తన వైపుకు లాక్కుంది. తన కోరిక తీర్చమని అడిగింది.

"ఓ సుందరాంగా! నా పేరు అయోముఖి. నేను నిన్ను ప్రేమించాను. నువ్వు నాకు కావాలి. మనం ఇద్దరం హాయిగా క్రీడిద్దాము." అని లక్ష్మణుని పట్టుకొని లాగింది.

లక్ష్మణునికి ఒళ్లు మండింది.. అసలే అయాచితంగా వచ్చి పడిన కష్టాలతో సతమతమవుతున్న లక్ష్మణునికి ఆమె మాటలు విని ఒళ్లు మండి పోయింది. వెంటనే కత్తి తీసి అలవాటైన ప్రకారము, ఆ రాక్షసి ముక్కు చెవులు కోసాడు.  అనుకోకుండా జరిగిన ఆ సంఘటనకు భయభ్రాంతురాలైన ఆ రాక్షసి అక్కడి నుండి పారిపోయింది. రాముడు ఇదేమీ పట్టించుకోలేదు. తన పాటికి తాను ముందుకు పోతున్నాడు. లక్ష్మణుడు వెంట నడుస్తున్నాడు.

కొంచెం దూరం పోగానే లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "అన్నయ్యా! నాకు బుజాలు అదురుతున్నాయి. మనసంతా కల్లోలంగా ఉంది. ఎన్నో అపశకునములు కనపడుతున్నాయి. మనకు ఏదో ఆపద జరగబోతున్నట్టు అనిపిస్తూ ఉంది. దానికి సిద్ధంగా ఉండు. కాని మరొక పక్క మనకు జయము కలిగే సూచనగా వంచులకము అని పక్షి కూతకూడా వినపడుతూ ఉంది. " అని అన్నాడు.

రాముడు లక్ష్మణుని మాటలు విని ఏమీ పలకలేదు. మాట్లాడలేదు. ముందుకుపోతున్నాడు. ఇంతలో వారికి ఒక భయంకరమైన శబ్దము వినిపించింది. ఆ శబ్దానికి అడవిలో

జంతువులు అన్నీ చెల్లాచెదురుగా పారిపోయాయి. లక్ష్మణుడు ఆ శబ్దము ఎటునుండి వచ్చినదో ఆ వైపుకు వెళ్లాడు.

ఒక పొదలో లక్ష్మణునికి ఒక భయంకరమైన రాక్షసుడు కనిపించాడు.  ఆ రాక్షసుని పేరు కబంధుడు. ఆ రాక్షసునికి కేవలము శరీరము ఉంది. శిరస్సు లేదు. అతని పొట్ట వద్ద ముఖం ఉంది. వక్షస్థలములో ఒక కన్ను ఉంది. పొట్ట దగ్గర పెద్ద నోరు, ఆ నోట్లో పెద్దనాలుక ఉంది. ఆ రాక్షసుడు తన ఒంటి కంటితో ఎంతదూరం అయినా చూడగలడు. తన పొడుగాటి నాలుకను చాచి ఎంతటి జంతువునైనా నోట్లోకి లాక్కోగలడు.   ఆ రాక్షసుని శరీరం పెద్ద పర్వతములాగా ఉంది. ఆ రాక్షసుని చేతులు చాలా పొడుగ్గా ఉన్నాయి. ఆ చేతులతో ఆ రాక్షసుడు ఎన్నో జంతువులను తన వైపుకు లాక్కుని తింటూఉండేవాడు.

ఇప్పుడు వాడి చేతులకు రామలక్ష్మణులు తగిలారు. ఆ రాక్షసుడు తన రెండు చేతులతో రామలక్ష్మణులను పట్టుకొని తన వైపుకు లాక్కుంటున్నాడు. రామలక్ష్మణులు నిస్సహాయంగా అతని చేతులలో బందీలుగా అయ్యారు.

లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! ఈ రాక్షసుడు నన్ను తినేస్తాడు. కనీసం నువ్వు అన్నా వీడిని ఎదిరించి బయటపడు. సీతను వెదుకు. నీకు జయం కలుగుతుంది." అని అన్నాడు.

కాని రాముడు కూడా అదే స్థితిలో ఉన్నాడు. కాని ధైర్యంగా ఉ న్నాడు. "లక్ష్మణా! ధైర్యంగా ఉండు. మనకేం భయం లేదు. నేను వీడిని

సంహరిస్తాను." అని అన్నాడు.

తన చేతులలో చిక్కికూడా రాముడు అలా అనడం కబంధునికి ఆశ్చర్యం కలిగించింది.

"ఓ వీరులారా! మీరు ఎవరు? ఎక్కడి నుండి వచ్చారు. ఈ భయంకరమైన అడవిలోకి ఎందుకు వచ్చారు?మీరు ఎవరైనా ఈరోజు నాకు ఆహారంగా మారారు. నా చేతులకు చిక్కిన వారు బతికి బయటకు పోలేరు." అని అన్నాడు కబంధుడు.

కబంధుని మాటలు విని రాముడు వ్యధ చెందాడు. "లక్ష్మణా! మరలా ఇదేమి కష్టము. మనకు కష్టము మీద కష్టము వచ్చి పడుతూ ఉంది. మనము వెతుకుతున్న సీత కనిపించలేదు సరికదా ఇప్పుడు మన ప్రాణం మీదికి వచ్చింది. కాల ప్రవాహంలో ఎంతటి వాళ్ళు అయినా కొట్టుకుపోవలసిందే కదా!" అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము అరువది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## డెబ్బదియవ సర్గ.

తన బాహుబంధములలో చిక్కిన రామలక్ష్మణులను చూచి కబంధుడు ఇలా అన్నాడు. "ఏంటి అలా చూస్తున్నారు. ఈరోజు

మీ ఇద్దరినీ నాకు దేవుడు ఆహారంగా పంపాడు. మీరు ఎంత ప్రయత్నించినా నా నుండి తప్పించుకోలేరు. (అందుకే కబంధ హస్తాలు అనే సామెత వచ్చింది.) ఈ రోజు మీ ఇద్దరూ నాకు ఆహారం కాక తప్పదు." అని అన్నాడు.

రాముడు ఆలోచించే పరిస్థితిలో లేదు. సీత పోయిన దు:ఖములో ఉన్న తాను  కబంధుని హస్తాలలో చిక్కుకోడంతో రాముడు ఆలోచించే శక్తి కోల్పోయాడు. అప్పుడు లక్ష్మణుడు రాముని తో ఇలా అన్నాడు.

"రామా! ధైర్యం కోల్పోవద్దు. మనం ఇద్దరం వీడి హస్తాలలో బందీలుగా ఉన్నాము. ఈ పరిస్థితులను మనకు అనుకూలంగా మలచుకోవాలి. నీవు నీ శక్తిని అంతా కూడగట్టుకొని నీ చేతిలో ఉన్న ఖడ్గంతో నీ పక్క ఉన్న చెయ్యినరుకు. నేను ఈ పక్క ఉన్న చెయ్యి నరుకుతాను. ఇందాకటి నుండి వీడిని పరిశీలిస్తున్నాను. వీడి శక్తి అంతా వీడి బాహువులలో ఉంది. వీడి బాహువులను ఖండిస్తే వీడు మనలను ఏమీ చెయ్యలేడు." అని అన్నాడు లక్ష్మణుడు.

(ఇక్కడ ఒకటి గమనించండి. ఈ సూత్రం మనకు అందరికీ వర్తిస్తుంది. మనకు ఆపదలు వచ్చినపుడు, ప్రాణాపాయ స్థితిలో ఉన్నప్పుడు రాముని వలె  మనం ఆలోచించే శక్తి కోల్పోతాము. కాని మనం లక్ష్మణుని వలె ఆలోచించాలి. మనకు ప్రతికూల పరిస్థితులను అనుకూలంగా మలచుకోవాలి. తగిన ఉపాయం ఆలోచించాలి. ఆపదల నుండి బయట పడాలి.  అంతేకాని, ఆపదలు వచ్చినప్పుడు మనలను మనం తిట్టుకుంటూ ఎదుటి వారిని తిట్టడం వలన ఏమీ

ప్రయోజనం లేదు. రామాయణం నుండి దీనిని మనం గ్రహించి ఆచరణలో పెట్టి మన జీవితాలను సఫలం చేసుకోవాలి.)

లక్ష్మణుని మాటలు విన్నాడు కబంధుడు. రామలక్ష్మణులను తినబోయాడు. రాముడు, లక్ష్మణుడు వెంటనే స్పందించారు. క్షణం ఆలస్యం చేయకుండా కబంధుడి రెండు బాహువులను ఖడ్గములతో ఖండించారు. ఎప్పుడైతే చేతులు ఖండింపబడ్డాయో కబంధుడు పెద్దగా అరిచాడు కేకలు పెట్టాడు. వెనక్కు విరుచుకు పడ్డాడు.

ఖండింపబడిన తన బాహువులను చూచుకున్నాడు కబంధుడు. రామలక్ష్మణుల వంక చూచి "ఎవరు మీరు?" అని అడిగాడు.

అప్పుడు లక్ష్మణుడు కబంధునితో "ఇతడు ఇక్ష్వాకు వంశములో జన్మించిన దశరథుని కుమారుడు రాముడు. నేను అతని తమ్ముడు లక్ష్మణుడను. కారణాంతరముల చేత మేము వనవాసము చేస్తున్నాము. మేము ఇంట లేని సమయమున ఎవడో రావణుడు అనే రాక్షసుడు రాముడి భార్య సీతను అపహరించాడు. మేము సీతను వెదుకుతూ నీకు చిక్కాము. ప్రాణాపాయ పరిస్థితులలో, మా ప్రాణాలు కాపాడుకోడానికి  నీ చేతులు ఖండించాము.  ఇంతకూ నీవు ఎవరవు? ఈ వికృత రూపం ఎందుకు వచ్చింది. ఈ అడవిలో ఒంటరిగా ఎందుకు ఉన్నావు?" అని అడిగాడు లక్ష్మణుడు.

కబంధుడికి ఒక్కసారిగా ఇంద్రుడు చెప్పినమాటలు గుర్తుకు వచ్చాయి. "ఓ పుణ్యపురుషులారా! మీకు శుభం కలుగుగాక! నా

అదృష్టం కొద్దీ నాకు మీ దర్శనభాగ్యం కలిగింది. నాకు మేలు చేయడానికే మీరు నా బాహువులను ఖండించారు. నాకు ఈ వికృతరూపము ఎలా వచ్చిందో మీకు సవిస్తరంగా తెలియజేస్తాను.” అని కబంధుడు తన పూర్వ వృత్తాంతమును రామలక్ష్మణులకు ఈ విధంగా చెప్పాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము డెబ్బదియవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్య కాండము.

## డెబ్బది ఒకటవ సర్గ.

“ఓ రామా! నేను దనువు కుమారుడను. దానవుడను. నేను బ్రహ్మను గూర్చి తపస్సు చేసాను. నా తపస్సుకు మెచ్చి బ్రహ్మ నాకు దీర్ఘాయుష్షు ప్రసాదించాడు. ఆ వర గర్వముతో నేను నా ఇష్టం వచ్చినట్టు తిరిగేవాడిని. నా పూర్వ రూపము చాలా అందంగా ఉండేది. నేను దేవేంద్రునితో సమానంగా ప్రకాశిస్తూ ఉండేవాడిని. నేను కామ రూపుడను. కోరిన రూపము ధరించగలవాడను. నేను అప్పుడప్పుడు భయంకరమైన రూపములను ధరించి అరణ్యములో తపస్సుచేసుకొనుచున్న మునులను ఋషులను భయపెట్టేవాడిని.

ఒక సారి నేను ప్రస్తుతము ఉన్న కబంధ రూపములో

స్థూలశిరుడు అనే పేరుగల ఋషిని భయపెట్టాను. అప్పుడు నాకు అవయవములు అన్నీ సక్రమంగానే ఉండేవి. కాని వికృతముగా ఉండే విధంగా ఆయనను భయపెట్టాను. ఆయనకు కోపం వచ్చింది. "నీవు ఇదే రూపంలోనే శాశ్వతంగా ఉండుదువుగాక!" అని శపించాడు. నాకు భయం వేసింది. ఆ ముని కాళ్ల మీద పడి శరణు వేడుకున్నాను. శాపమునకు విమోచనము ప్రసాదించమని అడిగాను. అప్పుడు ఆ ముని "రాముడు నీ దగ్గరకు వచ్చి నీ భుజములను ఖండించిన రోజు నీకు నీ స్వస్వరూపము వస్తుంది." అని శాపవిమోచనము ప్రసాదించాడు. తరువాత నాకు ఈ వికృత రూపము వచ్చింది.

ఒక సారి నేను ఇంద్రుని ఎదిరించాను. ఇంద్రుడు తన వజ్రాయుధముతో నా తలమీద ఋజాల మీద కొట్టాడు. దానితో నా తల పొట్టలోకి దూరిపోయింది. నా బాహువులు, నా కాళ్లు, తొడలు శరీరంలోకి చొచ్చుకుపోయాయి. మరీ వికృతంగా తయారయ్యాను. నడవలేను. "ఇంద్రా! నన్ను ఈ విధంగా చేసావు. నేను ఆహారం ఎలా సంపాదించుకోవాలి? ఎలా జీవించాలి ?"అని అడిగాను. అప్పుడు ఇంద్రుడు నాకు ఒక యోజనము పొడవు ఉండే చేతులు, పొట్టలోనే ఒక నోరు ప్రసాదించాడు. "రామలక్ష్మణులు ఎప్పుడు నీచేతులు ఖండిస్తారో అప్పుడు నీకు పూర్వరూపము వస్తుంది." అని చెప్పాడు. అప్పటినుండి నేను నా చేతులు చాచి యోజనము లోపల ఉన్న జంతువులను నా చేతులతో పట్టి తింటూ మీ రాక కోసం ఎదురు చూస్తున్నాను. ఇప్పుడు మీరు నా బాహువులు ఖండించి నాకు శాప విమోచన కలిగించారు.. మీరు నాకు దహన సంస్కారములు చేయండి. అప్పుడు నాకు పూర్వ రూపము వస్తుంది. ఇంతకూ మీకు వచ్చిన కష్టం ఏమిటో చెప్పండి. నేను మీకు తగిన సాయం చేస్తాను."

అని అన్నాడు కబంధుడు.

రాముడు ఇలా చెప్పాడు. "నేను, నా సోదరుడు లక్ష్మణుడు ఆశ్రమములో లేని సమయములో రావణుడు అనే రాక్షసుడు నా భార్య సీతను అపహరించాడు. మాకు అతని పేరు రావణుడు అనీ, అతను రాక్షస రాజు అనీ తెలుసు. అతను ఎలా ఉంటాడో, ఎక్కడ ఉంటాడో తెలియదు. మేము దారీ తెన్నూ లేకుండా సీత కోసరము వెతుకుతున్నాము. నీకు తెలిసినట్టయితే, మాకు ఆ రాక్షసుని గురించి తెలియచెయ్యి. మేము నీకు శాపవిమోచనము కావించాము కాబట్టి నీవు కూడా మాకు తగిన సాయం చెయ్యి. నీవు కోరినట్టు నీకు దహన సంస్కారములు చేస్తాము." అని అన్నాడు రాముడు.

"రామా! నాకు ఎలాంటి దివ్యదృష్టి లేదు. అందుకని నేను ఆ రాక్షసుని గురించి చెప్పలేను. కాని మీకు సీత జాడ గురించి చెప్పగల వారిని గురించిన సమాచారము ఇవ్వగలను. అతనికి ఈ మూడు లోకములలో ఎవరు ఎక్కడ ఉన్నదీ బాగా తెలుసు. కొన్ని కారణాంతరాల వల్ల అతడు ముల్లోకములూ తిరిగాడు. నీవు అతనితో స్నేహం చేసి సీత జాడతెలుసుకో! రామా!సూర్యుడు అస్తమించ బోతున్నాడు. మీరు సూర్యాస్తమయమునకు ముందు నన్ను దహనం చేసి నాకు పూర్వరూపము వచ్చేట్టు చెయ్యండి." అని చెప్పాడు కబంధుడు.

శ్రీమద్రామాయణము

అరణ్య కాండము డెబ్బది ఒకటవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్య కాండము

## డెబ్బది రెండవ సర్గ.

తరువాత రామలక్ష్మణులు కబంధుని శరీరమును పెద్ద లోయ లోకి తోసి నిప్పుపెట్టారు. కబంధుని శరీరము పూర్తిగా కాలిపోగానే, ఆ చితిలోనుండి దివ్యమైన వస్త్రములను ధరించిన ఒక దివ్యపురుషుడు బయటకు వచ్చాడు.

"రామా! నీకు సీత ఎలా దొరుకుతుందో చెబుతాను విను. ప్రస్తుతము నీవు సీతా వియోగముతో, రాజ్యము పోగొట్టుకొని బాధపడుతున్నావు. నీ లాగానే రాజ్యము పోగొట్టుకొని, భార్యను పోగొట్టుకొని  బాధపడుతున్న వానితో నీవు స్నేహం చెయ్యి. నీకు లాభం కలుగుతుంది. ప్రస్తుతము నీకు అటువంటి మిత్రునితో స్నేహము అవసరము. వాని వలన నీవు మిత్రలాభమును పొందుతావు.

వాలి, సుగ్రీవుడు అనే  ఇద్దరు సోదరులు ఉన్నారు. వారు వానరులు. అందులో వాలి సుగ్రీవుని భార్యను అపహరించి, సుగ్రీవుని రాజ్యమునుండి వెళ్ల గొట్టాడు. ప్రస్తుతము ఆ సుగ్రీవుడు పంపానదీ తీరములో  ఉన్న ఋష్యమూక పర్వతము మీద తన అనుచరులతో నివసిస్తున్నాడు. సుగ్రీవునితో పాటు ఇంకా నలుగురు వానరులు ఉన్నారు. సుగ్రీవుడు మహా పరాక్రమ వంతుడు, సత్యవంతుడు, వినయము కలవాడు. మంచి ధైర్యముకలవాడు. దానికి తోడు మంచి బుద్ధిమంతుడు. కాని కాలము కలిసి రాక, వాలి చేత సుగ్రీవుడు

రాజ్యము నుండి బయటకు వెళ్లగొట్టబడ్డాడు. నీలాగే భార్యను, రాజ్యమును పోగొట్టుకొన్న సుగ్రీవుడు సీతను వెదకడంలో నీకు సాయం చెయ్యగలడు. నీవు సుగ్రీవునితో మైత్రి చెయ్యి. నీకు శుభం కలుగుతుంది.

రామా! సీత కోసరము నీవు శోకింపరాదు. కాలమును ఎవరూ అతిక్రమించలేరు. ఏ కాలానికి ఏది జరగాలలో అది జరిగితీరుతుంది. నువ్వు దేనినీ ఆపలేవు. కాబట్టి నీవు వెంటనే సుగ్రీవుని వద్దకు పోయి అగ్ని సాక్షిగా అతనితో మైత్రి చేసుకో. అతడు వానరుడు కదా నాకేం సాయం చేస్తాడులే అని అనుకోకు. అతనిని అవమా నించకు. ప్రస్తుతము అతనికి ఇతరుల సాయం కావాలి. నీవు అతనికి సాయం చేస్తే అతడు నీకు సాయం చేస్తాడు. ఒకవేళ నీవు అతనికి సాయం చెయ్యలేకపోయినా, అతడు నీకు సాయం చెయ్య గలడు.

ఇంక సుగ్రీవుని గురించి చెబుతాను విను. సుగ్రీవుడు సూర్యునికి ఒక వివాహిత అయిన వానర స్త్రీ వలన జన్మించాడు. వాలికి భయపడి ఋష్యమూక పర్వతము మీద దాక్కుని ఉన్నాడు.

సుగ్రీవునకు ఈ లోకములో ఉన్న రాక్షసుల స్థావరములు అన్నీ బాగా తెలుసు. ఈ లోకంలో సూర్యుని కిరణములు ఎంతవరకూ ప్రసరిస్తాయో అంతమేరా సుగ్రీవునకు తెలుసు. అతడు వానరులను పంపి సీత జాడ తెలుసుకోగల సమర్థుడు.

కాబట్టి సుగ్రీవునితో స్నేహం చెయ్యి. నీభార్య సీత మేరుపర్వతము మీద ఉన్నా, పాతాళములో ఉన్నా వెతికి తీసుకురాగల శక్తి ఉన్నవాడు సుగ్రీవుడు" అని పలికాడు కబంధుడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము డెబ్బది రెండవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్య కాండము

## డెబ్బది మూడవ సర్గ.

కబంధుడు ఇంకా రామునితో ఇలా అన్నాడు. "ఓ రామా! నీవు ఇక్కడి నుండి పశ్చిమ దిక్కుగా వెళ్లు. నీకు దారితో ఫలవృక్షములు, పూలు సమృద్ధిగా పూచే చెట్లు కనిపిస్తాయి. నీవు ఆ వనము దాటిన తరువాత మరొక వనము కనిపిస్తుంది. ఆ వనములో ఉన్న వృక్షములు అన్ని ఋతువులలోనూ పూలు, పండ్లు ఇస్తాయి. అదీ ఆ వనము మహాత్మ్యము. మీరు ఆ వనము దాటితే పంపా సరోవరము చేరుకుంటారు.

ఆ పంపా సరస్సు కలువలతోనూ, పద్మములతోనూ నిండుగా ఉంటుంది.. ఆ సరస్సులో హంసలు, క్రౌంచపక్షులు, ఇంకా ఇతర రకములైన పక్షులు సమృద్ధిగా ఉంటాయి. మీరు ఆ వనములో ఉన్న పండ్లను, సరస్సులో ఉన్న చేపలను తిని ఆ సరస్సులో ఉన్న నీరు తాగి

మీ ఆకలి దప్పులు తీర్చుకోవచ్చును. మనోహరమైన ఆ వనములో ప్రవేశించగానే నీ శోకము తీరిపోతుంది.

పూర్వము ఆ వనములో మతంగ మహాముని శిష్యులు నివసించేవారు. ఆ శిష్యులు తమ గురువుగారికి కావలసిన సమిధలు, పండ్లు పూలు తెచ్చేటప్పుడు వారి శరీరమునుండి కారిన చెమట వలన ఆ వనములో పండ్ల చెట్లు పూల చెట్లు మొలిచాయి. అందుకని ఆ చెట్లకు పూచిన పూలు ఎప్పటికీ వాడిపోవు.

ఆ మతంగ మహాముని శిష్యులైన ఋషులకు సేవ చేసిన శబరి అనే సన్యాసిని ఇంకా ఆ వనములో నివసిస్తూ ఉంది. ఆ శబరి నీ దర్శనము కోసరం ఎదురు చూస్తూ ఉంది. నీ దర్శనభాగ్యము కలిగిన తరువాత ఆమె పరలోకము చేరుకుంటుంది.

ఆ పంపా సరస్సు పశ్చిమంగా ఒక ఆశ్రమము ఉంది. ఆ ఆశ్రమములో ఇప్పటికీ మతంగ మహాముని ఏర్పరచిన నియమాలు పాటింపబడుతున్నాయి. ఆ ఆశ్రమమును అడవి జంతువులు గానీ ఇతరులు గానీ పాడు చేయలేరు.

పంపా సరస్సు పక్కనే ఋష్యమూక పర్వతము ఉంది. ఆ పర్వతము మీద చిన్న చిన్న ఏనుగులు స్వేచ్ఛగా విహరిస్తుంటాయి. ఆ పర్వతము బ్రహ్మచే సృష్టింపబడినది అని అంటారు. ఆ పర్వతము మీద నిద్రించిన వారికి స్వప్నములో ఏమి కనిపిస్తుందో మెలుకువ రాగానే అది లభిస్తుంది.. మనసులో చెడు ఆలోచనలు ఉన్నవారు ఆ పర్వతము ఎక్కలేరు. ఒకవేళ ఎక్కినా, నిద్రపోతున్నపుడు రాక్షసులు వారిని

చంపుతారు. ఆ ఋష్యమూక పర్వతముమీద ఒక పెద్ద గుహ ఉంది. ఆ గుహలోనే సుగ్రీవుడు తన అనుచరులతో నివసిస్తున్నాడు. సుగ్రీవుడు అతని నలుగురు అనుచరులు అప్పుడప్పుడు పర్వతశిఖరము మీద కు వచ్చి కొంతసేపు విహరించి మరలా గుహాంతర్భాగమునకు వెళు తుంటారు. నీవు వెంటనే వెళ్లి ఆ సుగ్రీవుని కలుసుకో. అతనితో మైత్రి చెయ్యి. నీకు శుభం కలుగుతుంది." అని పలికాడు కబంధుడు.

తరువాత కబంధుడు తన లోకమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము డెబ్బదిమూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## డెబ్బది నాలుగవ సర్గ.

తరువాత రామలక్ష్మణులు పశ్చిమ దిక్కుగా ప్రయాణం చేసి పంపాసరోవరము చేరుకున్నారు. వారు సుగ్రీవుని వెతుక్కుంటూ వెళు తున్నారు. వారు పంపా సరోవరము పశ్చిమదిక్కుకు చేరుకున్నారు. అక్కడ వాళ్లకు శబరి నివసించే ఆశ్రమము కనపడింది. వారు ఆ ఆశ్రమము దగ్గర ఉన్న శబరిని చూచారు.

రామలక్ష్మణులను చూచిన శబరి సంభ్రమంతో లేచి వారికి ఎదురు వచ్చింది. రామలక్ష్మణుల పాదములకు నమస్కరించింది.

వారికి అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించింది. అడవిలో తాను సేకరించిన పళ్లను వారికి సమర్పించింది. (ఎంగిలి పళ్లను ఇచ్చింది అన్న విషయం వాల్మీకి రామాయణంలో లేదు). రాముడు శబరిని పరామర్శించాడు.

"ఓ మాతా! నీ తపస్సు నిర్విఘ్నంగా కొనసాగుతూ ఉందా! నీ తపస్సు సిద్ధించిందా!" అని అడిగాడు.

"రామా! ఈ రోజు నీ దర్శన భాగ్యంతో నా తపస్సు సిద్ధించింది. నీ రాకకోసరమే నేను వేచిఉన్నాను. నీ రాకతో నేను చేసిన తపస్సు, నేను చేసిన గురుసేవ సార్ధకం అయ్యాయి. నీ దయార్ద్రదృష్టి తగిలి నేను ఉత్తమ లోకములకు  వెళ్లగలను. నేను సేవచేసిన మునులందరూ ఉత్తమలోకములు పొందారు. నేను మాత్రము నీ దర్శనము కొరకు ఎదురుచూస్తున్నాను. ఎందుకంటే నీగురించి వారే నాకు చెప్పారు. "ఇక్ష్వాకు వంశములో పుట్టిన  రాముడు లక్ష్మణ సమేతుడై నీ ఆశ్రమమునకు రాగలడు. నీవు రామునికి అతిథి సత్కారములు చేసి తరించు." అని చెప్పారు. అప్పటి నుండి మీ రాక కోసరం ఎదురు చూస్తున్నాను.. రామా! నీవు ఎప్పుడు వస్తావో ఏమోఅని ఈ పంపాతీరంలో దొరికే తినే పదార్థములనుసేకరించి  ఉంచాను వాటిని నీవుస్వీకరించు." అని అన్నది శబరి.

శబరి మాటలకు రాముడు ఎంతో సంతోషించాడు. శబరితో ఇలా అన్నాడు. "ఓ శబరీ! దనువు అనే వాని నుండి నీ గురించి, ఈ ప్రాంతము గురించి, విన్నాను. ఇప్పుడు ప్రత్యక్షముగా చూడాలని అనుకుంటున్నాను." అని అన్నాడు.

అప్పుడు శబరి తన వెంట రామలక్ష్మణులను తీసుకొని వెళ్లి ఆ వనము నంతా చూపించింది. “రామా! ఈ వనము మతంగ వనము అని ప్రసిద్ధిచెందింది. మతంగ మహాముని శిష్యులైన నా గురువులు ఇక్కడ ఎన్నో యజ్ఞాలు చేసారు. ఆ ఋషులు ఇక్కడే దేవతలకు పుష్పములు సమర్పించారు. వారు స్మరించగానే సప్తసముద్రములు ఇక్కడకు వచ్చాయి. ఆ సముద్రములలో వారు స్నానము చేసి ఆరవేసిన నార చీరలు ఇంకా వేలాడుతున్నాయి చూడు. వారి ప్రభావము చేత ఇక్కడ పూచిన పూలు వాడిపోవు. ఫలములు చెడిపోవు.

రామా! నీకు ఈ వనములోని విశేషములు అన్నీ చూపించాను. ఇంక నాకు అనుమతి ఇస్తే ఈ దేహమును విడిచిపెడతాను. ఉత్తమ లోకములు పొందిన నా గురువులను చేరుకుంటాను.” అని పలికింది శబరి.

ఆ శబరి మాటలు విన్న రామలక్ష్మణులు ఎంతో సంతోషించారు. శబరికి అనుజ్ఞ ఇచ్చారు. అప్పుడు శబరి తన శరీరమును అగ్నిలో ఆహుతి చేసి ఉత్తమలోకములకు వెళ్లిపోయింది. శబరి తన తపోబలము చేత తాను సేవించిన గురువులు పొందిన ఉత్తమ లోకాలు పొందింది.

శ్రీమద్రామాయణము

అరణ్యకాండము డెబ్బది నాల్గవసర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# అరణ్యకాండము

## డెబ్బది ఐదవ సర్గ.

శబరి తన భౌతిక శరీరమును విడిచి ఉత్తమలోకములు పొందిన తరువాత రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు.

"లక్ష్మణా! మనము ఆశ్చర్యకరమైన ఈ వనమును చూచినాము. ఏడు సముద్రములు కలిసిన ఈ తీర్థములలో స్నానము చేసాము. మన పితరులకు జలతర్పణములు విడిచాము. మనకు ఉన్న అశుభములు అన్నీ తొలగిపోయాయి. మనస్సు చాలా ప్రశాంతంగా ఉంది. మనము ఇప్పుడు పంపాసరస్సు దగ్గర ఉన్న ఋష్యమూక పర్వతమునకు పోవుదము. వానరులకు రాజు అయిన సుగ్రీవుని చూడవలెనని అతనితో మైత్రిచేసుకొనవలెనని నాకు చాలా ఆతురతగా ఉంది. ఎందుకంటే సీతాన్వేషణ కార్యక్రమము సుగ్రీవుని మీదనే ఆధారపడి ఉంది" అని అన్నాడురాముడు.

"అలాగే అన్నయ్యా! మనము తొందరగా ఋష్యమూక పర్వతము వద్దకు పోవుదము." అని అన్నాడు లక్ష్మణుడు.

తరువాత రామలక్ష్మణులు పంపాసరోవరతీరమునకు చేరుకున్నారు. ఆ పంపాసరోవరము చాలా మనోహరంగా ఉంది. ఆ సరోవరం నిండా తామరపూలు పూచి ఉన్నాయి. ఆ సరోవరము పక్కనే ఉన్న మతంగ సరస్సు లో రాముడు స్నానం చేసాడు. తరువాత రామలక్ష్మణులు అనేక వృక్షములతో నిండి ఉన్న వనములో

ప్రవేశించారు. దాని పక్కనే ఉన్న ఋష్యమూక పర్వతమును చూచారు.

"లక్ష్మణా! అదే ఋష్యమూక పర్వతము దాని మీదనే ఋక్షరజస్సు అనే వానరుని కుమారుడు సుగ్రీవుడు తన అనుచరులతో నివసిస్తున్నాడు. లక్ష్మణా! నీవు సుగ్రీవుని వద్దకు పోయి మన రాక గురించి చెప్పు. నీకు తెలుసు కదా! నేను రాజ్యమును, నా భార్య సీతను పోగొట్టుకొని అపారమైన దు:ఖములో ఉన్నాను. నీవు వెళ్లి నా బదులుగా సుగ్రీవునికి మన గురించి చెప్పు" అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండము డెబ్బదిఐదవ సర్గ సంపూర్ణము.
అరణ్యకాండ సర్వం సంపూర్ణం.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## కిష్కింధాకాండము

సంస్కృత మూలము
భగవాన్ వాల్మీకి మహర్షి

తేటతెలుగులో
మొదలి వెంకట సుబ్రహ్మణ్యం

2-31, చైతన్యపురి,
హైదరాబాదు 500060
ఫో: 24048104
సెల్: 9391134792

# కిష్కింధా కాండము

## మొదటి సర్గ.

రామ లక్ష్మణులు పంపా సరస్సును సమీపించారు. ఆ సరస్సు చూడటానికి చాలా మనోహరంగా ఉంది. సరస్సునిండా పద్మములు,కలువలు వికసించి ఉన్నాయి. ఆ సరస్సు అందాలు చూడగానే రాముని హృదయం అంతా బాధతో నిండి పోయింది.

“లక్ష్మణా! ఈ సరస్సు చూడు ఎంత హృదయానందాన్ని కలిగిస్తూ ఉందో. కాని సీతా వియోగంతో బాధపడుతున్న నాకు ఈ సరస్సు అందాలు ఏమాత్రం సంతోషాన్ని కలిగించడం లేదు. సీతా వియోగంతో బాధపడుతున్న నాకు ఈ ప్రకృతి అందాలు ఇంకా దు:ఖమును ఎక్కువ చేస్తున్నాయి. నా మనోవ్యధ ఎప్పుడు తీరుతుందో ఏమో! కాని లక్ష్మణా! ఈ వనములో ఉన్న పుష్పముల మీదినుండి వీచు గాలి మనకు మార్గాయాసమును పూర్తిగా తొలగించినది.

లక్ష్మణా! ఆ కోయిలలు చూడు ఎలా కూస్తున్నాయో. సీత కూడా ఆ కోయిల కూతలు విని నన్ను పిలిచి ఆ కోయిల కూతలు నాకూ వినిపించేది. నా సీత నాకు దొరకని పక్షంలో, నా సీతను నేను చూడని పక్షంలో నేను బతికి ఉండటం వృధా! ఇటువంటి సుందర దృశ్యములు ఎన్ని చూచినా సీతను చూచిన దానితో సాటి రావు కదా! పైగా ఈ వసంత ఋతువు దృశ్యములు, ఈ మలయమారుతము, వసంత శోభ నా వ్యధను ఎక్కువ చేస్తున్నాయి. నా సీతను ఆ రాక్షసుడు ఎత్తుకొని పోకపోయి ఉంటే నేను కూడా సీత తో కలిసి ఈ

వసంత ఋతువు శోభను తనివితీరా అనుభవించేవాడిని కదా!

లక్ష్మణా! సీత బతికి ఉంటే, సీత ఉన్న చోటున కూడా ఈ వసంత ఋతువు ఉంటుంది కదా! సీత కూడా నా మాదిరే విరహవేదన అనుభవిస్తూ ఉంటుంది కదా! నా మాదిరే సీత కూడా ఈ వసంత శోభను అనుభవించలేదు కదా! అవును. ఈ మనోహర దృశ్యములు ఆమెకు కూడా ఏమాత్రం ఆనందాన్ని కలిగించలేవు. ఎందుకంటే నేను, సీత దేహాలు వేరైనా మా మనసులు ఒకటే. నా మనస్సు ఆమె మీద, ఆమె మనస్సు నా మీదా లగ్నం అయి ఉన్నాయి.

లక్ష్మణా! నేను సీత కలిసి ఉన్నప్పుడు మా ఇద్దరికీ ఆహ్లాదమును కలిగించిన ఈ మలయమారుతము ప్రస్తుతము నాకు అగ్ని వీచికలవలె తాకుతూ ఉన్నాయి. లక్ష్మణా! చూచావా! ఆ కాకి ఎలా అరుస్తూ ఉందో! నాకు మరలా సీతా సంయోగం కలుగుతుందని చెబుతూ ఉన్నట్టు లేదూ! సీతకు పద్మములు అంటే ఎంతో ఇష్టం. ఈ పంపా సరోవరములో ఉన్న పద్మములను చూచి సీత ఎంత సంతోషించేదో కదా! సీత లేకుండా నేను ఈ పద్మముల శోభను అనుభవించలేకున్నాను.

లక్ష్మణా! సీత నా దగ్గరగా ఉన్నప్పుడు నాకు ఏ యే వస్తువులు, దృశ్యములు ఆనందాన్ని కలిగించాయో అవే వస్తువులు,అవే దృశ్యములు ఇప్పుడు నాకు ఖేదాన్ని కలిగిస్తున్నాయి. లక్ష్మణా! సీత నాకు కనపడితే, సీతతో సహా నేను ఇక్కడనే స్థిరనివాసము ఏర్పరచు కొనవలెనని కోరికగా ఉంది. సీతతో సహా ఇక్కడ ఉంటే, నాకు దేవేంద్రపదవి కూడా అక్కరలేదు అనిపిస్తూ ఉంది. అయోధ్యకు కూడా

తిరిగి వెళ్లను. ఇక్కడే ఉండిపోతాను. ఈ వనసీమలలో, ఈ సరోవర తీరములలో, పచ్చికబయళ్లలో సీతతో విహరిస్తూ ఉంటే, నాకు ఏ చింతా ఉండదు. ఏ వస్తువూ కావాలని అనిపించదు. ఈ అందమైన పంపాసరస్సులో నేను సీత జలకాలాడటం కన్నా ఆనందం ఏముంటుంది చెప్పు.

లక్ష్మణా! నేను లేకుండా నా సీత ఇంకా ప్రాణాలతో ఉంటుందంటావా! ఏమో! ఆలోచించే కొద్దీ నా మనసు వికలం అవుతూ ఉంది. సీత తండ్రి జనకమహారాజు వచ్చి నా సీత ఏదీ అని అడిగితే ఏమని చెప్పాలో అర్థంకావడం లేదు. నా దురదృష్టం కొద్దీ నేను రాజ్యాన్ని పోగొట్టుకొని అడవులకు వచ్చాను. సీత కూడా నా వెంట రావాలా! ఒకవేళ వచ్చినా రాక్షసుల చేత అపహరింపబడాలా! అంతా నా దురదృష్టం కాకపోతే మరేమిటి! రాజ్యభ్రష్టుడు, బుద్ధిలేని వాడు అయిన నన్ను నమ్ముకొని నా వెంట వచ్చిన సీత లేకుండా నేను ఎలా జీవించేది!

లక్ష్మణా!సీత ఎంత మధురంగా మాట్లాడేది. నాతో పరిహాసమాడేది. అటువంటి సీత పలుకులు మరలా ఎప్పుడు వింటానో కదా! నాతో పాటు అడవిలో ఎన్నో కష్టములు అనుభవించుచున్నా, సీత తాను ఏ కష్టములు పడనట్టుగా ఆనందించుచున్నట్టు కనపడేది. నా తో ఎంతో సంతోషంగా మాటలాడుతూ ఉండేది. అటువంటి సీతను వదిలి నేను ఒంటరిగా అయోధ్యకు వెళితే, నా తల్లి కౌసల్య "రామా! నా కోడలు సీత ఎక్కడ. ఆమెను ఎక్కడ వదిలి వచ్చావు"అని అడిగితే నేను ఏమని సమాధానము చెప్పాలి.

ఓ లక్ష్మణా! నేనుసీత లేకుండా అయోధ్యకు రాలేదు. కాబట్టి

నీవు ఒంటరిగా అయోధ్యకు వెళ్లు. నేను ఈ అరణ్యములలోనే సీతా వియోగంతో ఆ తనువు చాలిస్తాను.” అని విలపించాడు రాముడు.

ఆ మాటలు అన్నీ ఓపిగ్గా విన్నాడు లక్ష్మణుడు. “ఓ రామా! ఉత్తమకులములో పుట్టిన వాడవు. అమిత పరాక్రమవంతుడవు. నీవే ఇలా అధైర్యపడితే ఎలా! నీ వంటి నిర్మల బుద్ధి కలవారికి ఈ ప్రకారము మందబుద్ధితో ఆలోచించడం శోభించదు. రామా! మనకు ఎక్కువ ప్రియమైన వాళ్లు దూరమైనపుడు దు:ఖముకలగడం సహజము. దానికి ఉపాయం వెతకాలి కానీ, ఇలా దు:ఖించడం వలన ప్రయోజనము లేదు. ముందు మనము ఆ రావణునిజాడ కనుక్కోవాలి. వాడు ఆకాశంలో ఉన్నా పాతాళంలో ఉన్నా వాడిని వదిలేది లేదు. వాడు సీతను తెచ్చి అప్పగించాలి. లేకపోతే మనచేతిలో చావాలి.

అన్నిటికన్నా ముందు నీవు ధైర్యంగా ఉండాలి. ఈ దీనత్వాన్ని వదిలిపెట్టాలి. కార్యరంగంలోకి దూకాలి. దానికి తగిన ఉత్సాహమును తెచ్చుకోవాలి. మానవ శరీరానికి ఉత్సాహాన్ని మించిన బలం వేరొకటి లేదు. ఉత్సాహవంతునకు లభించనిది ఏదీ లేదు. ఉత్సాహవంతుడు ఓటమిని ఎరుగడు. కాబట్టి రామా! నీవుకూడా ఉత్సాహమును తెచ్చుకో. సీతను తిరిగి సాధించుటకు ప్రయత్నము చెయ్యి. నీ పరాక్రమాన్ని గుర్తుకు తెచ్చుకో. నీ శోకాన్ని పక్కనపెట్టు. మనస్సును నిగ్రహించుకో.” అని రామునికి హితబోధ చేసాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలతో రాముడు తన శోకాన్ని విడిచిపెట్టాడు. ధైర్యము, ఉత్సాహాన్ని తెచ్చుకున్నాడు. రాముడు, లక్ష్మణుడు

పంపాసరోవరమును దాటారు.

వీరిద్దరినీ ఋష్యమూక పర్వతము పైనుండి సుగ్రీవుడు అనే వానర రాజు చూస్తున్నాడు. సుగ్రీవునికి భయం పట్టుకుంది. ఆ మానవులు ఇద్దరూ వాలి పంపగా తనకోసం వచ్చారేమో, తనను చంపుతారేమో అని భయపడ్డాడు. ఆ భయంతో కుంగిపోయాడు సుగ్రీవుడు. వెంటనే సుగ్రీవుడు తన వెంట ఉన్న వానరులతో సహా అక్కడి నుండి పారిపోయాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధాకాండము మొదటి సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధాకాండము

రెండవ సర్గ.

రామ లక్ష్మణులను చూచి పారి పోయిన సుగ్రీవుడు ఇంకా భయపడుతూనే ఉన్నాడు. ఒక చోట నిలవడం లేదు. అన్ని దిక్కులా చూస్తున్నాడు. రామలక్ష్మణులు ఎటు వైపు నుండి వచ్చి తన మీద దాడి చేస్తారేమోనని భయంతో వణికిపోతున్నాడు. మహాబలవంతులు, ధనుర్బాణములు ధరించిన రామలక్ష్మణులను చూచి సుగ్రీవునకు ధైర్యం సడలిపోయింది. బాగా ఆలోచించాడు. తన బలం గొప్పదా లేక ఆ మానవుల బలం గొప్పదా అని తనలో తాను తర్కించుకుంటున్నాడు. తనతో పాటుగా ఉన్న మంత్రులను పిలిచాడు. వారికి రామలక్ష్మణుల గురించి చెప్పాడు.

"అదుగో అటు చూడండి. ఆ మానవులు ఇద్దరూ నారచీరలు కట్టుకొని, ధనుర్బాణములు ధరించి దేనికోసమో వెదుకుతున్నారు. వారు వాలి పంపిన వారు అని నా అనుమానము. లేకపోతే క్రూరమృగములు సంచరించు, మానవులు చొరరాని ఈ దుర్గమారణ్యములో ఈ మానవులకు ఏమి పని. వీరు నిశ్శంశయంగా వాలి నాకోసం పంపినవారే. మనము ఇక్కడి నుండి వేరు చోటికి వెళ్లడం మంచిది." అని అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుని మాట ప్రకారము ఆ వానరులు అందరూ వేరే ప్రదేశానికి వెళ్లారు. అక్కడ అందరూ వలయాకారంలో కూర్చున్నారు. మధ్యలో సుగ్రీవుడు కూర్చున్నాడు. ఆ వానరులలో హనుమంతుడు అనే పేరుగల వానరుడు, రామలక్ష్మణులను గురించి భయపడుతున్న సుగ్రీవుని చూచి ఇలా అన్నాడు.

"ఓ వానర రాజా! నీవు ఎందుకు వాలిగురించి భయపడ తావు. మనము మలయ పర్వతము మీద ఉన్నాము. వాలి ఈ పర్వతము మీదికి రాలేడు. కాబట్టి వాలి వలన మనకు భయం లేదు. అదీ కాకుండా మనకు కనుచూపు మేరలో వాలి కనపడటం లేదు కదా. మరి నువ్వు వాలి గురించి ఎందుకు భయపడుతున్నావు. నీ భయానికి నాకు కారణం కనిపించడం లేదు. నీవు వాలి గురించి అనవసరంగా భయపడుతున్నావు. ఆ భయం వలన నీకు బుద్ధి క్షీణించింది. పైగా వానరసహజమైన చపలత్వము నిన్ను ఆవహించింది.

సుగ్రీవా! నీవు వానర రాజువు. రాజే ఇలా భయపడితే ఎలాగ? నీ మనస్సును ధృఢంగా ఉంచుకో. అనవసరంగా

భయాందోళనలకు గురి కావద్దు. స్థిరమైన బుద్ధితో ఆలోచించు. స్థిరబుద్ధితో ఆలోచించ లేని రాజు ప్రజలను పాలించడానికి అర్హుడు కాడు. కాబట్టి భయపడటం మాను." అని హితోపదేశం చేశాడు హనుమంతుడు.

హనుమంతుని మాటలతో సుగ్రీవుని భయం తగ్గింది. హనుమంతునితో సుగ్రీవుడు ఇలా అన్నాడు. "అది కాదు హనుమాన్! ఆ మానవులను చూడు. వారు ఆజానుబాహులు. ధృడకాయులు. ధనుర్బాణములు ధరించిన వారు. వారిని చూచి ఎవరికి భయం కలగదు చెప్పు. వారు వాలి పంపగా నాకోసం వచ్చినవారే. సందేహము లేదు. లేకపోతే ఆ మానవులకు ఈ ఘోరారణ్యములో ఏమి పని.

వాలికి ఎంతో మంది స్నేహితులు ఉన్నారు. వారిలో వీరూ ఒకరేమో! వీరిని వాలి పంపాడేమో! వాలిని నమ్మకూడదు. శత్రువులను ఒక కంటితో కనిపెట్టి ఉండటం రాజధర్మం కదా! అందులోనూ కపటంగా వ్యవహరించే వాలితో ఇంకా జాగ్రత్తగా ఉండాలి. మనం భయపడకుండా, వారేం చేస్తారులే అని నిర్లక్ష్యంగా ఉంటే, అదును చూచి శత్రువులు మన మీద దెబ్బతీస్తారు. పైగా వాలి చాలా తెలివిగలవాడు. మన గురించి అన్ని విషయములను సేకరిస్తూ ఉంటాడు. అలాంటి వారి గురించి మనం చాలా జాగ్రత్తగా ఉండాలి.

కాబట్టి మనం ఒక పని చేద్దాము. ఓ వానర వీరుడా! హనుమా! నువ్వు సామాన్య మానవుని వేషంలో ఆ మానవుల వద్దకు వెళ్లు. వారి ఇంగితమును గ్రహించు. నీ మాటలతో వారు ఎవరో! ఎక్కడ నుండి వచ్చారో! ఇక్కడకు ఎందుకు వచ్చారో! ఎవరి కోసరం

వచ్చారో నేర్పుగా మాట్లాడి తెలుసుకో! వారిని నీ పొగడ్తలతో సానుకూల పరుచుకో. చక్కగా మాట్లాడు. వారి మనోభావాలను గుర్తించు. వారికి నీ మీద విశ్వాసం కలిగేటట్టు ప్రవర్తించు. అసలు వారు ఇక్కడకు ఎందుకు వచ్చారో తెలుసుకో. ఆ మానవులు ఏమైనా దురాలోచనలతో వచ్చారా! లేక నిర్మలమైన మనస్సులతో వచ్చారా అనే విషయం గ్రహించు. అసలు వాళ్లు మంచి వాళ్లా లేక చెడ్డ వాళ్లా అనే విషయాన్ని వారి మాట్లాడే మాటలను బట్టి పసిగట్టు. వెళ్లు. కార్యము సానుకూలం చేసుకొని రా!" అని సుగ్రీవుడు హనుమంతుని రామలక్ష్మణుల వద్దకు దూతగా పంపాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధాకాండము రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధాకాండము
మూడవ సర్గ.

సుగ్రీవుడు చెప్పిన మాటలను జాగ్రత్తగా విన్నాడు హనుమంతుడు. వెంటనే ఋష్యమూక పర్వతము నుండి రామలక్ష్మణులు ఉన్నచోటికి వెళ్లాడు. హనుమంతుడికి ఆ మానవులు ఎవరో తెలియదు. అందుకని నిజరూపంతో పోకుండా ఒక సన్యాసి వేషము ధరించాడు. రామలక్ష్మణుల ముందుకు వెళ్లాడు. రామ లక్ష్మణులు సన్యాసి వేషములో ఉన్న హనుమంతుని చూచి అభివాదము చేసారు.

రామలక్ష్మణులను చూచి హనుమంతుడు ఇలా అన్నాడు. "మీరు ముని కుమారులవలె ఉన్నారు. కాని మీ చేతిలో ధనుర్బాణములు ఉన్నవి. మీరు వీరుల వలె కనపడుతున్నారు. కాని జటాజూటములు ధరించి ఉన్నారు. మీరు ఒకరిని ఒకరు పోలి ఉన్నారు. కవలలవలె ఉన్నారు. మీరు దేవలోకము నుండి దిగివచ్చిన సూర్య చంద్రుల మాదిరి కనపడుతున్నారు. దేవతారూపములలో ఉన్న మానవుల మాదిరి కనపడుతున్నారు.

మీరు ఆజానుబాహులుకదా! మరి మీరు ఎటువంటి అలంకారములు ధరించలేదేమి? మిమ్ములను చూస్తుంటే మీరు ఈ భూమండలము అంతా పరిపాలించ గల సమర్థులు అని నమ్ముతున్నాను. మీ గురించి మాకు తెలపండి.

ఇంక నా గురించి చెబుతాను వినండి. నా పేరు హనుమంతుడు. వానర రాజు సుగ్రీవుడు మా ప్రభువు. ఈ ఋష్యమూక పర్వతము మీద ఉన్నాడు. ఆయన మీ గురించి తెలుసుకొని రమ్మని నన్ను పంపాడు. కాబట్టి మీ వివరాలు నాకు తెలియజేయండి." అని పలికాడు హనుమంతుడు.

ఆ మాటలకు రాముడు చాలా సంతోషించాడు. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టయింది అని అనుకున్నాడు. లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! మనము ఎవరి కోసరం వెదుకుతున్నామో ఆ సుగ్రీవుని మంత్రి మనవద్దకు వచ్చాడు. ఈ వానరుని మాటలు చూడగా మనతో స్నేహము చేయవలెనని తలంపుతో ఉన్నట్టు కనపడుతూ ఉంది. ఇతడు చాకచక్యంగా

మాట్లాడటం తెలిసిన వాడు. మంచి స్నేహశీలి. కాబట్టి లక్ష్మణా! ఇతనితో నీవు మాట్లాడు. నాకు చూడగా ఇతడు నాలుగు వేదములు, వ్యాకరణశాస్త్రము చదివిన వాడులాగా కనపడుతున్నాడు. లేకపోతే ఇంత చాకచక్యముగా, ఒక్క అపశబ్దము కూడా లేకుండా మాటలాడలేడు.

లక్ష్మణా! ఇతని శరీరములో ఎక్కడా ఒక్క అవలక్షణము కూడా కనపడటం లేదు. సర్వలక్షణ సంపన్నుడు లాగా ఉన్నాడు. ఇతని మాటలు వింటుంటే ఇంకా వినాలని అనిపిస్తూ ఉంది కానీ విసుగురావడం లేదు. కాబట్టి నీవు అతనితో మాటలాడుము." అని అన్నాడు రాముడు.

అప్పుడు లక్ష్మణుడు హనుమంతునితో తాము వచ్చిన పని సూటిగా తెలిపాడు. " మేము అయోధ్యాధిపతి దశరథుని కుమారులము. ఇతను రాముడు. నా పేరు లక్ష్మణుడు. నా అన్న రాముని భార్యను ఎవరో రాక్షసుడు అపహరించాడు. ఆమెను మేము వెతుకుతున్నాము. మీ రాజు సుగ్రీవుడు కూడా ఇదే పరిస్థితిలో ఉన్నాడని తెలిసింది. అందువలన మీ రాజు సుగ్రీవునితో స్నేహము చేయవలెనని, పరస్పరసాయము చేసుకొనవలెనని అభిలషించుచున్నాము."అని సూటిగా బదులు చెప్పాడు లక్ష్మణుడు. లక్ష్మణుడు పలికినపలుకులు విన్న హనుమంతుడు చాలా సంతోషించాడు. తన రాజు సుగ్రీవుని పని కూడా సానుకూలము అవుతుందని మనసులో అనుకున్నాడు.

శ్రీమద్రామాయణముకిష్కింధాకాండము మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధాకాండము

## నాలుగవ సర్గ.

లక్ష్మణుని మాటలు విన్న హనుమంతుడు వారు తమకు శత్రువులు కారనీ, వాలి పంపిన వారు కారనీ, ఒక కార్యము నిమిత్తము తిరుగుతున్నారనీ, వీరి మైత్రితో సుగ్రీవుని కష్టములు కూడా గట్టెక్కుతా యని సంతోషించాడు. వీరు కూడా సుగ్రీవుని వలె కష్టములలో ఉన్నట్టున్నారు. వీరి కష్టములను సుగ్రీవుడు తీర్చగలడు. అప్పుడు వీరు కూడా సుగ్రీవునకు సాయము చెయ్యగలరు. వాలి నుండి సుగ్రీవునికి రాజ్యప్రాప్తి కలుగుతుంది." అని సంతోషించాడు.

తరువాత హనుమంతుడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "మీరు చూడబోతే మునికుమారులవలె ఉన్నారు. కాని చేతిలో ధనుర్బాణములు ఉన్నవి. మీరు ఎవరికోసమో వెతుకుతున్నట్టు కనపడుతూ ఉంది. మీ గురించి వివరంగా చెప్పండి. మీ మాటలు నేను మా రాజుకు చెప్పాలి కదా!" అని అన్నాడు హనుమంతుడు.

అప్పుడు లక్ష్మణుడు హనుమంతునితో ఇలా అన్నాడు. "ఓహనుమా! ఈయన పేరు రాముడు. ఇక్ష్వాకు వంశములో జన్మించిన అయోధ్యాధిపతి దశరథుని పెద్ద కుమారుడు. గుణవంతుడు, రాజ్యము చేయుటకు అర్హుడు. కాని ఒకానొక కారణమున రామునికి రాజ్యము లభించలేదు. పైగా అరణ్యవాసము సంప్రాప్తించింది. రాముని భార్యపేరు సీత. సూర్యుని విడిచి కాంతి ఉండలేనట్టు, రాముని భార్య సీతకూడా, భర్తను విడిచి ఉండలేక, రామునితోపాటు అరణ్యములకు వచ్చింది.

# కిష్కింధా కాండము

నేను రాముని తమ్ముడను. నా పేరు లక్ష్మణుడు. నేను నా అన్న వదిలను సేవించుకుంటూ వారి వెంట అరణ్యములకు వచ్చాను. మేము పర్ణశాలలో లేని సమయమున, సీత ఒంటరిగా ఉన్నప్పుడు, మాయావి అయిన ఒక రాక్షసుడు రాముని భార్య సీతను అపహరించాడు. మేము సీతను వెతుకుతూ ఉండగా, మా తండ్రి దశరథునికి మిత్రుడు అయిన జటాయువు అనే పక్షిరాజు కనిపించి, సీతను రావణుడు అనే రాక్షసుడు అపహరించి, దక్షిణ దిక్కుగా ఆకాశమార్గమున తీసుకొని వెళ్లాడు అని చెప్పాడు.

తరువాత మేము అడవిలో సీతను గూర్చి వెతుకుతూ ఉండగా, దనువు అనే వాడు శాపవశమున వికృతాకారముతో మమ్ములను కబళించడానికి ప్రయత్నించాడు. అతని వలన మాకు మీ రాజు సుగ్రీవుని గురించి తెలిసింది. సీతను అపహరించిన వారి గురించి తెలుసుకొనడంలో సుగ్రీవుడుసామర్థ్యము కలవాడు అని అతడు మాకు తెలిపాడు. సుగ్రీవుని వెతుకుతూ మేము ఇక్కడకు వచ్చాము.

నీ ప్రశ్నలకు సమాధానంగా నేను మా గురించి, ఇక్కడకు మా రాక గురించి వివరంగా చెప్పాను. మేము మీ రాజు సుగ్రీవుని సహాయము కోరుతున్నాము. నేను, రాముడు మీ రాజు సుగ్రీవుని శరణు పొందాము. అయోధ్యాధిపతిగా ఉన్నప్పుడు ఏ రాముడు తన ప్రజలకు ధనకనకవస్తువాహనములను విరివిగా పంచి పెట్టాడో, ఏ రాముడు ముల్లోకములకు రక్షకుడో ఆ రాముడు మీ రాజు సుగ్రీవుని సహాయము కోరుతున్నాడు. ఏ దశరథుడు అందరికీ శరణాగత రక్షకుడుగా ఉండేవాడో, ఆ దశరథకుమారుడు రాముడు మీ రాజు

సుగ్రీవుని శరణు కోరుతున్నాడు. ధర్మాన్ని పాలిస్తూ, లోకమునకు రక్షణ అందించిన నా రాముడు మీ రాజు సుగ్రీవుని శరణు కోరుతున్నాడు. ఏ రాముని అనుగ్రహంతో అయోధ్యాప్రజలు సుఖంగా ఉన్నారో ఆ రాముడు మీ రాజు సుగ్రీవుని అనుగ్రహాన్ని కాంక్షిస్తున్నాడు. ఏ దశరథ మహారాజు తన  సామంతురాజులందరినీ అనుగ్రహదృష్టితో చూస్తుంటాడో, ఆ దశరథ మహారాజు కుమారుడు, రాముడు మీ రాజు సుగ్రీవుని అనుగ్రహ వీక్షణాల కోసం ఎదురు చూస్తున్నాడు.  తన భార్య సీతా వియోగంతో బాధపడుతున్న రాముని మీద మీ రాజు సుగ్రీవుడు తన అనుగ్రహం చూపాలి." అని దీనంగా ప్రార్థించాడు లక్ష్మణుడు.

(పైనచెప్పబడిన లక్ష్మణుని దీనాలాపములు ప్రాచ్యప్రతిలో లేవు. ధీరోదాత్తుడైన లక్ష్మణుడు ఈ మాదిరి దీనంగా మాట్లాడటం అనుచితంగా ఉంది. కాబట్టి ఇవి తరువాత చేర్చబడినవిగా ఊహింపబడుతూ ఉంది.)

లక్ష్మణుని మాటలు విన్న హనుమంతుడు చాలా సంతోషించాడు. "మా సుగ్రీవుడు మీతో తప్పకుండా మైత్రి చేస్తాడు. సుగ్రీవుడు కూడా బాధలలో ఉన్నాడు. సుగ్రీవుడు తన అన్న వాలితో వైరము పెట్టుకున్నాడు. ఎందుకంటే, వాలి తన తమ్ముడు సుగ్రీవుని భార్యను అపహరించాడు. సుగ్రీవుని అవమానించాడు. రాజ్యము నుండి వెళ్లగొట్టాడు. మీ మాదిరి మా రాజు సుగ్రీవుడు కూడా అరణ్యములలో దీనంగా కాలం గడుపుతున్నాడు. మా రాజు సుగ్రీవుడు మాతో కలిసి సీతను వెదకడంలో మీకు సాయపడగలడు. మేమందరమూ కలిసి సీతను వెదుకుతాము. రండి మనం అందరము మా రాజు సుగ్రీవుని వద్దకు వెళదాము." అని అన్నాడు హనుమంతుడు.

ఆ మాటలు విన్న లక్ష్మణుడు రాముని చూచి "రామా! సుగ్రీవునికి కూడా మన అవసరము ఉంది. మనకూ సుగ్రీవుని అవసరము ఉంది. కాబట్టి మన కార్యము సఫలము అయినట్టే. ఇతని మాటలు ముఖ కళవళికలు చూస్తుంటే నాకు ఇతని మీద నమ్మకం కలుగుతూ ఉంది. ఇతని ముఖం చూస్తే ఇతడు అబద్ధం ఆడతాడు అని అనిపించడం లేదు. మనం వీరితో స్నేహం చేయవచ్చు." అని అన్నాడు లక్ష్మణుడు.

ఇంతలో హనుమంతుడు తన సన్యాసి రూపము విడిచి తన నిజరూపము అయిన వానర రూపము ధరించాడు. శరీరం పెంచాడు. రామలక్ష్మణులను తన బుజాల మీద ఎక్కించుకొని సుగ్రీవుని వద్దకు తీసుకొని వెళ్లాడు. హనుమంతుడు కూడా తన రాజు సుగ్రీవునికి మరలా రాజ్య ప్రాప్తి కలుగుతుందనే సంతోషంతో రామలక్ష్మణులను సుగ్రీవుని వద్దకు తీసుకొని వెళ్లాడు.

శ్రీమద్రామాయణము,
కిష్కింధా కాండము నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ఐదవ సర్గ.

హనుమంతుడు రామలక్ష్మణులను తన బుజముల మీద ఎక్కించుకొని ఋష్యమూక పర్వతము నుండి మలయ పర్వతమునకు తీసుకొని వెళ్లాడు. రామలక్ష్మణులను మలయ

పర్వతము మీద దించి, సుగ్రీవుని వద్దకు వెళ్లాడు.

"ఓ సుగ్రీవా! వీరు రాముడు లక్ష్మణుడు అనే పేర్లు గల రాజకుమారులు. నేనే వీరిని నా వెంట తీసుకొని వచ్చాను. రాముడు మహా పరాక్రమ వంతుడు. రాముడు ఇక్ష్వాకు వంశములో పుట్టిన వాడు. ధర్మము తెలిసిన వాడు. దశరథుని కుమారుడు. తండ్రి ఆజ్ఞప్రకారము వనవాసము చేస్తున్నాడు. రాముడు వనవాసము చేయుచుండగా రావణుడు అనే రాక్షసుడు ఈయన భార్య సీతను అపహరించాడు. ఆ రాముడు ప్రస్తుతము నీ శరణు కోరుతున్నాడు. రాముడు, లక్ష్మణుడు నీతో స్నేహము చేయవలెనని అభిలషిస్తున్నారు. వీరి స్నేహమును అంగీకరించు. దీని వలన మీ ఇద్దరికీ లాభము చేకూరుతుంది. వీరిరువురూ పూజింప తగిన వారు. వీరిని మిత్రులుగాస్వీకరించి పూజించు." అని పలికాడు హనుమంతుడు.

ఆ మాటలు విన్న సుగ్రీవుడు చాలా సంతోషించాడు. రాముని చూచి ఇలా అన్నాడు. "ఓ రామా! మీ గుణగణముల గురించి హనుమంతుడు నాతో చెప్పాడు. మీరు ఉత్తమ మానవులు. నేను వానరుడను. ఈ వానరుడితో స్నేహము కోరుతున్నారంటే, ఇది మీరు నాకు చేస్తున్న సత్కారముగా భావిస్తున్నాను. మీకు నాతో స్నేహం చేయడం ఇష్టం అయితే, నా చేతులు మీకోసం చాస్తున్నాను. మీ చేతితో నా చేతిని తాకండి. కరచాలనం చెయ్యండి." అని అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుడు పలికిన పలుకులు విన్న రాముడు చాలా సంతోషించాడు. సుగ్రీవుని హస్తము పట్టుకున్నాడు. సుగ్రీవునితో స్నేహం

అంగీకరించాడు. సుగ్రీవుని గాఢంగా కౌగలించుకున్నాడు. ఈ సన్నివేశము చూచి హనుమంతుడు చాలా ఆనందించాడు. రెండు కర్రలతో నిప్పుపుట్టించాడు. అగ్ని రగిల్చాడు. ఆ అగ్నిని రాముడు సుగ్రీవుని మధ్య ఉంచాడు. రాముడు, సుగ్రీవుడు ఆ అగ్ని చుట్టు ప్రదక్షిణము చేసారు. అగ్నిసాక్షిగా రాముడు సుగ్రీవులు మిత్రులయ్యారు.

సుగ్రీవుడు రామునితో ఇలా అన్నాడు. "మనము ఇద్దరమూ సమానమైన దు:ఖములో ఉన్నాము. ఒకరి దు:ఖములను ఒకరం పంచుకుందాము. ఇకమీదట మన సుఖదు:ఖములను సమానంగా పంచుకుందాము." అని అన్నాడు సుగ్రీవుడు. సుగ్రీవుడు పక్కనే ఉన్న సాల వృక్షము నుండి ఒక కొమ్మను విరిచాడు. కింద పరిచాడు. రాముడు సుగ్రీవుడు దాని మీద కూర్చున్నారు. తరువాత హనుమంతుడు ఒక చందన వృక్షము కొమ్మను తెచ్చి లక్ష్మణునికి కానుకగా ఇచ్చాడు. సుగ్రీవుడు రాముని చూచి ఇలా అన్నాడు.

"ఓ రామా! నా అన్న వాలి నన్ను చాలా అవమానించాడు. నాతో శత్రుత్వము పెంచుకున్నాడు. నా నుండి నా భార్యను లాక్కున్నాడు. నన్ను రాజ్యము నుండి తరిమేసాడు. నేను, నా అన్న వాలికి భయపడి, అపరిమిత మైన దు:ఖమును అనుభవిస్తూ ఈ ఋష్యశృంగ పర్వతము మీద నివసిస్తున్నాను. రామా! ఇప్పుడు నాకు నీ అభయము కావాలి. నాకు వాలి నుండి రక్షణ కావాలి. నా రాజ్యము నాకు కావాలి. నా భార్య నాకు కావాలి. ఇదంతా నీ వల్లే జరగాలి." అని అన్నాడు సుగ్రీవుడు.

రాముడు సుగ్రీవుని మాటలకు నవ్వుతూ ఇలా అన్నాడు.

“నేను నీకు తప్పకుండా సాయము చేస్తాను. నీ భార్యను అపహరించిన వాలిని చంపి నీ భార్యను నీకు తెచ్చి అప్పగిస్తాను. ఈ బాణములు చూచావు కదా. ఇవి అమోఘమైనవి. వీటితో వాలిని వధిస్తాను.” అని అన్నాడు రాముడు.

రాముని మాటలు విని సుగ్రీవుడు పరమానంద భరితుడయ్యాడు. “ఓ రామా! నీ మాటలు వింటుంటే నాకు నా భార్యను తిరిగి పొందినంత ఆనందంగా ఉంది. నాకు వాలి వలన కలిగిన భయాన్ని శాశ్వతంగా తొలగించు. వాలి నన్ను మరలా ఎటువంటి బాధ పెట్టకుండా చెయ్యి.” అని అన్నాడు సుగ్రీవుడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ఆరవ సర్గ.

సుగ్రీవుడు రాముని చూచి ఇలా అన్నాడు. “రామా! నీ గురించి హనుమంతుడు నాకు అంతా చెప్పాడు. నీవు నీ సోదరుడు లక్ష్మణుడు ఈ అరణ్యవాసము ఎందుకు చేస్తున్నారో వివరంగా చెప్పాడు. నీ భార్య సీతను మీరు లేని సమయమున ఒక రాక్షసుడు అపహరించిన విషయం కూడా చెప్పాడు. నీవు నాకు మిత్రుడవు అయినావు. ఇంక నీ దు:ఖమును విడిచి పెట్టు. నీ భార్య సీత ఎక్కడ

ఉన్నా వెతికి తీసుకొని వచ్చి నీకు అప్పగిస్తాను. నీ దు:ఖాన్ని తొలగిస్తాను. నీ భార్య ఆకాశములో ఉన్నా, పాతాళములో ఉన్నా వెతికి తీసుకొని వస్తాను. ఇది సత్యము. నేను మాట తప్పను.

రామా! నీవు చెబుతుంటే నాకు ఒక విషయం గుర్తుకు వస్తూ ఉంది. ఒక రోజు మేమందరమూ ఈ పర్వత శిఖరము మీద కూర్చుని ఉండగా ఒక  రాక్షసుడు  ఒక స్త్రీని అపహరించుకు పోవడం, ఆమె రామా, రామా అని అరవడం మేము చూచాము. ఆమె సీతయే. సందేహము లేదు. ఆ రాక్షసుడు రావణుడు అయి ఉంటాడు. ఆమె అలా ఏడుస్తూ తన పైనున్న వస్త్రములో కొన్ని ఆభరణములను మూటగా కట్టి జారవిడిచినది. ఆ మూట మా దగ్గర పడింది. మేము వాటిని మా దగ్గరే ఉంచాము. వాటిని నీకు చూపిస్తాను. ఆ ఆభరణములను నీవు గుర్తు పట్టగలవేమో చూడు."అని అన్నాడు సుగ్రీవుడు.

ఆ మాటలు విని రాముడు ఉత్సాహంగా "మిత్రమా! ఆ ఆభరణములు వస్త్రము  త్వరగా తీసుకొనిరా. నా సీత ఆభరణములు, వస్త్రము నేను చూడాలి." అని ఆతురతగా అన్నాడు రాముడు.

సుగ్రీవుడు వెంటనే పక్కనేఉన్న గుహలోకి వెళ్లాడు. క్షణములో ఒక ఉత్తరీయములో కట్టబడిన ఆభరణములను తీసుకొని వచ్చాడు. "రామా! ఇదే ఆ వస్త్రము. ఇవే ఆ ఆభరణములు. చూడు. ఇవి నీ భార్య సీతకు చెందినవేమో!"అని అన్నాడు.

రాముడు ఆ ఉత్తరీయమును, ఆభరణములను చూచాడు. రాముని కళ్లనిండా నీళ్లు కమ్మాయి. ఏమీ కనిపించడం లేదు మనసు

వశం తప్పింది. "హా సీతా!" అంటూ కిందపడి పోయాడు. రామునుడు ఆ ఆభరణములను ఉత్తరీయమును తన గుండెలకు హత్తుకున్నాడు. రాముని శ్వాస భారంగా వస్తూ ఉంది. నోట మాట రావడం లేదు. ఉద్వేగంతో ఉన్నాడు. రాముని కళ్ల నుండి నీరు ధారాపాతంగా కారుతూ ఉంది. ఏడుస్తూ లక్ష్మణుని వంక చూచాడు.

"లక్ష్మణా! సీతను ఆ రాక్షసుడు అపహరించుకు పోతున్నప్పుడు సీత జారవిడిచిన ఆభరణములు, ఉత్తరీయము చూడు. ఇవి మెత్తని గడ్డి మీద పడి ఉంటాయి. అందుకనే విరిగిపోకుండా ఉన్నాయి. లక్ష్మణా! సీత ఆభరణములను నీవు గుర్తు పట్టగలవా!"అని అడిగాడు. అప్పుడు లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! నాకు సీత ధరించే ఏ ఆభరణముల గురించి అంతగా తెలియదు. నేను ప్రతిరోజూ ఆమెకు పాదాభివందనము చేయునపుడు ఆమె కాళ్లకు ధరించే నూపురములు చూస్తూ ఉంటాను. కాబట్టి అవి మాత్రమే గుర్తు పట్టగలను." అని అన్నాడు. (లక్ష్మణుడు చెప్పినట్టుగా రాయబడి ఉన్న ఈ శ్లోకము ప్రాచ్య ప్రతిలో లేదు అని పండితుల అభిప్రాయము.)

ఆ ఆభరణములను చూచి రాముడు సుగ్రీవునితో ఇలా అన్నాడు. "సుగ్రీవా! ఇవి నిస్సంశయముగా నా సీత ఆభరణములే. ఇది నా సీత ధరించిన ఉత్తరీయము. సీతను అపహరించిన ఆ రాక్షసుడు సీతను ఏ దేశమునకు తీసుకొని వెళ్లాడో చెప్పగలవా? ఆ రాక్షసుడు ఎక్కడ ఉంటాడో చెప్పగలవా? వాడి మూలంగా రాక్షస జాతి అంతా సర్వనాశనం అవుతుంది. ఇది సత్యము. సీతను అపహరించి ఆ

రాక్షసుడు తన మృత్యువును తానే కొని తెచ్చుకున్నాడు. సుగ్రీవా! చెప్పు. ఆ రాక్షసుడి గురించిన వివరాలు చెప్పు. వాడు ఎక్కడ ఉంటాడో చెప్పు. ఇప్పుడే వాడిని సంహరిస్తాను." అని కోపావేశంతో ఊగిపోతూ అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధాకాండము ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధాకాండము
ఏడవ సర్గ

రాముని పలుకులు విన్న తరువాత సుగ్రీవునకు కూడా దు:ఖము ముంచుకొచ్చింది. దు:ఖముతో పూడుకుపోయిన గొంతుతో సుగ్రీవుడు ఇలా అన్నాడు.

"రామా! సీతను అపహరించిన ఆ రాక్షసుని నివాసము గానీ, వాడి పరాక్రమము గానీ, బలము కానీ నాకు తెలియదు. కాని నా శాయశక్తులా ప్రయత్నించి వాడిని గురించి తెలుసుకుంటాను. నీ దు:ఖమును విడిచి పెట్టు. నన్ను నమ్ము. నిశ్చింతగా ఉండు. నీ భార్యను నీకు తెచ్చి ఇచ్చే బాధ్యత నాది. ఇదే నా ప్రతిజ్ఞ. నీవు అతి త్వరలో సీతను అపహరించిన ఆ రావణుడు అనే రాక్షసుని చంపి సీతను పొందు తావు.

కాని ముందు నీవు ఈ దు:ఖమును, దీనత్వమును, వదిలి

పెట్టు. ధైర్యము అవలంబించు. నీ పరాక్రమాన్ని, వీరత్వాన్ని గుర్తుకు తెచ్చుకో. నీ వలెనే నా భార్యను కూడా ఎత్తుకు పోయారు. కానీ నేను నీ వలె దు:ఖించడం లేదు. క్రుంగి పోవడం లేదు. ధైర్యము విడిచి పెట్టలేదు. నా భార్యను ఎత్తుకుపోయిన వాలిని ఎలా చంపాలా అని ఆలోచిస్తున్నాను. నా వంటి సాధారణ వానరుడే పోయిన భార్యను గురించి చింతించడం లేదంటే ఇంక నీ వంటి ధీరోదాత్తుడు, పరాక్రమవంతుడు, పండితుడు ఇలా దీనంగా భార్యకోసరం ధైర్యాన్ని విడనాడి దు:ఖించడం ఏమాత్రం తగదు.

బుద్ధిమంతుడైన వాడు ఆపదలలో గానీ, ధన నష్టము సంభవించి నప్పుడు గానీ, ప్రాణాపాయ స్థితిలో గానీ, ధైర్యమును విడిచిపెట్టడు. దు:ఖించడు. బుద్ధికి పదును పెట్టి తగిన ఉపాయము గురించి ఆలోచిస్తాడు. అలా కాకుండా మూర్ఖత్వముతో ఎల్లప్పుడూ దీనత్వముతో ఉండేవాడు, తన మనసును తన అధీనములో ఉంచుకోలేక, నడి సముద్రంలో నావలాగా మునిగిపోతాడు. కాబట్టి ఓ రామా! ఒక స్నేహితుడుగా నిన్ను వేడుకుంటున్నాను. దీనత్వాన్ని వదిలిపెట్టు. శోకానికి స్వస్తి చెప్పు. బుద్ధికి పదునుపెట్టు. పౌరుషాన్ని తెచ్చుకో. ఎందుకంటే అనుక్షణం శోకంతో కుమిలిపోయేవాడికి సుఖం ఎంతో దూరంలో ఉంటుంది. శోకార్తునకు అన్నీ సందేహాలే కలుగుతాయి. వాడు ఏ పనీ సక్రమంగా చెయ్యలేడు. ధైర్యవంతుడు అన్ని పనులు సక్రమంగా నిర్వహించగలడు. రామా! నేను నీకు నీతులు ఉపదేశించడం లేదు. కేవలం ఒక స్నేహితుడుగా నీ దు:ఖాన్ని పోగొట్టడానికి ప్రయత్నిస్తున్నాను." అని సుగ్రీవుడు రామునికి సాంత్వన చేకూర్చడానికి ప్రయత్నించాడు.

సుగ్రీవుని మాటలకు రాముడు స్వస్థత పొందాడు. సుగ్రీవుని కౌగలించుకొని ఇలా అన్నాడు. “మిత్రమా సుగ్రీవా! నా హితమును కోరే స్నేహితుడు ఎలా చేస్తాడో అదే నువ్వు చేసావు. నీ సాంత్వన వచనములతో నాకు స్వస్థత లభించింది. నీ వంటి స్నేహితుడు, బంధువు నాకు దొరికినందుకు చాలా ఆనందంగా ఉంది. నీవు నాకు ఇచ్చిన మాట ప్రకారము, సీతను, ఆ రావణుడు అనే రాక్షసుని వెతికే ప్రయత్నం చెయ్యాలి. దానికి ప్రతిఫలంగా నేను నీకు ఏం చెయ్యాలో వివరంగా చెప్పు. మన ఇరువురి కార్యములు సఫలం అవుతాయి అనే నమ్మకం నాకు ఉంది. నా సాయం గురించి నీవు సందేహించకు. నేను ఇప్పటి దాకా అబద్ధము చెప్పలేదు. ఇంక మీదట చెప్పను కూడా. నీకు సాయం చేస్తాను అని ప్రతిజ్ఞచేస్తున్నాను.” అని అన్నాడు రాముడు.

రాముని మాటలు విని సుగ్రీవుడు, హనుమంతుడు ఎంతో సంతోషించారు. రాముడు చేసిన ప్రతిజ్ఞను విని సుగ్రీవుడు తన పని సఫలం అయినట్టే అని ఎంతో సంతోషించాడు.  తరువాత రాముడు, సుగ్రీవుడు ఒక ఏకాంత ప్రదేశములో కూర్చుని తమ కష్టసుఖములు ఒకరితో ఒకరు చెప్పుకున్నారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధాకాండము
ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధాకాండము

## ఎనిమిదవ సర్గ .

అలా మాట్లాడు కోడంలో సుగ్రీవుడు తనకూ, తన అన్న వాలికి శత్రుత్వము ఎందుకు వచ్చిందీ అన్న విషయం రామునితో చెప్పసాగాడు. “ఓ రామా! నీవు నా స్నేహితుడవు కావడం నా అదృష్టం. దేవతలు నా మీద కరుణ చూపడం వలననే నీవు నా మిత్రుడివి అయ్యావు. నీవు నాకు మిత్రుడుగా, నాకు అండగా ఉంటే నేను ఒక్క కిష్కింధా రాజ్యమే కాదు, స్వర్గలోక ఆధిపత్యము కూడా పొందగలను.

ఓ రామా! నీతో స్నేహం చేయడం వలన నాకు నా బంధుమిత్రులలో గౌరవం పెరిగింది. నా గురించి, నా గుణగణముల గురించి నేను చెప్పుకోకూడదు కానీ, నేను నీకు మంచి స్నేహితుడిని అవుతాను అని మాత్రం చెప్పగలను. ఎందు కంటే అతడు ధనికుడైనా, పేద వాడైనా, సుఖాలలో మునిగి తేలుతున్నా, దు:ఖాలలో కుంగి పోతున్నా, మంచి వాడైనా, చెడ్డ వాడైనా, ఎటువంటి వాడికైనా స్నేహితుడే దిక్కు. స్నేహమునకు మించినది ఈ లోకములో ఏదీ లేదు. స్నేహాన్ని గురించి బాగా తెలిసిన వాళ్లు తన స్నేహితుని కొరకు ధనమును గానీ, సుఖములను గానీ, సంపదలను కానీ ఆఖరుకు ఉన్న ఊరును కానీ, త్యజించుటకు వెనుకాడరు. అటువంటి స్నేహము మనది.”అని అన్నాడు సుగ్రీవుడు. రాముడు నవ్వి “మిత్రమా! నువ్వు చెప్పినది యదార్థము.” అని అన్నాడు.
(స్నేహాన్ని గురించి వాల్మీకి ఇచ్చిన అద్భుత నిర్వచనము ఈ నాటికీ అనుసరణీయము. మన సినిమా రచయితలు తమ డైలాగులలో వాల్మీకి చెప్పిన పదాలనే అటు ఇటు తిప్పి తిప్పి వల్లె వేస్తుంటారు).

"రామా! నా సోదరుడు వాలి నన్ను అవమానించాడు. నా భార్యను నా నుండి లాక్కున్నాడు. నన్ను రాజ్యము నుండి వెళ్ల గొట్టాడు. వాలికి భయపడి నేను ఇక్కడ తలదాచుకున్నాను. కాబట్టి నీవు నాకు ఉపకారము చెయ్యాలి" అని మరలా గుర్తు చేసాడు సుగ్రీవుడు.

"మిత్రమా! స్నేహమునకు ఫలము ఒకరికి ఒకరు సాయం చేసుకోవడమే కదా! ఒకరికి ఒకరు అపకారము చేసుకోవడం శత్రువుల లక్షణము. నేను నీ మిత్రుడను కాబట్టి నీకు అపకారము చేసిన వారిని వధించి, నీకు మేలు చేస్తాను." అని తన ప్రతిజ్ఞను గుర్తు చేసాడు రాముడు.

సుగ్రీవుడు చాలా దీన స్థితిలో ఉన్నాడు అందుకని రామునికి పదే పదే గుర్తు చేస్తున్నాడు. వానరులు చపల స్వభావులు కదా! "రామా! నీవు నా స్నేహితుడవు. అందుకని నా కష్టములను నీతో చెప్పుకుంటున్నాను. సాయం చెయ్యమని పదే పదే అడుగుతున్నాను. ఏమీ అనుకోకు. నీతో నా కష్టములు అన్నీ చెప్పాలని ఉంది. కాని నోరు పెగలడం లేదు." అని కళ్ల నిండా కన్నీరు కారుస్తున్నాడు సుగ్రీవుడు. అతి కష్టం మీద తన దు:ఖమును ఆపుకుంటూ, సుగ్రీవుడు రామునితో ఇలా అన్నాడు.

"నీకు చెప్పాను కదా! వాలి నా అన్న. చాలా బలవంతుడు. నన్ను తిట్టాడు. అవమానించాడు. రాజ్యము నుండి వెళ్ల గొట్టాడు. నేను నా భార్యను నా ప్రాణం కంటే ఎక్కువగా ప్రేమించాను. అటువంటి భార్యను నా నుండి దూరం చేసాడు. నా అన్న వాళ్లందరినీ బంధించాడు. నన్ను చంపడానికి ఎంతో మందిని పంపాడు. నేను

వారి నందరినీ చంపాను. అందుకే నిన్ను చూచినప్పుడు కూడా నీవు వాలి పంపిన వాడివి అని అనుమానించాను. భయపడ్డాను.

శరీరంలో భయం ఉంటే, దేనిని చూచి అయినా భయపడడం, మానవ స్వభావము కదా! ఇంక మా వానరుల సంగతి చెప్పాలా! ఇదుగో! హనుమంతుడు మొదలగు వారు నా వెంట ఉన్నారు కాబట్టి ధైర్యంగా ఉండగలుగుతున్నాను. వీళ్లే నేను నమ్మిన స్నేహితులు. అనుక్షణం నన్ను కంటికి రెప్పలా కాపాడుతున్నారు. ఇదీ నా వృత్తాంతము. ఇంతకన్నా వివరాలు అనవసరము అనుకుంటున్నాను.

వాలి నాకు శత్రువు. వాలి నా సోదరుడే అయినప్పటికీ, వాలి చస్తేనే గానీ నా దు:ఖము ఉపశమించదు. నా సమస్తదు:ఖములకు కారకుడు వాలి. నా సుఖజీవనము వాలి మరణం మీద ఆధారపడి ఉంది. రామా! నా దు:ఖమునకు కారణము, నా దు:ఖము ఎలా తీరుతుందో వివరంగా చెప్పాను. కష్టాలలో ఉన్న మిత్రుడికి మిత్రుడే గతికాబట్టి, ఒక మిత్రుడుగా నాకు సాయం చెయ్యి." అని అన్నాడు సుగ్రీవుడు.

రాముడికి ఒక విషయం బోధపడటం లేదు. సుగ్రీవుడు ఇన్ని విషయాలు చెబుతున్నాడు కానీ అసలు తనకూ, వాలికీ ఎందుకు వైరం వచ్చిందో చెప్పడం లేదు. అడిగితే గానీ చెప్పేట్టు లేడు అని అనుకున్నాడు.

"మిత్రమా! సుగ్రీవా! నీకూ నీ అన్న వాలికీ వైరం ఎందుకు, దేని గురించి, ఏ కారణం చేత కలిగింది. వివరంగా చెప్పు. అప్పుడు

మీ ఇద్దరిలో తప్పు ఒప్పు నిర్ణయించడానికి వీలు కలుగుతుంది. అసలు వైరకారణం తెలిస్తే గానీ, మా బలాబలములను సరి చూచుకోడానికి వీలు ఉండదు కదా! అప్పుడు వాలిని సులభంగా అంతమొందించ వచ్చును. నీకు నీ అన్న వలన జరిగిన అవమానమును విని నాకూ కోపం తారస్థాయిని చేరుకుంది. నేను నీ అన్నను చంపేలోగా మీ ఇద్దరి మధ్య ఉన్న వైరమునకు కారణం తెలుసుకోగోరుతున్నాను. నా మీద విశ్వాసము ఉంచి మీ ఇరువురి మధ్య ఉన్న విరోధమునకు కారణం చెప్పు" అని అన్నాడు రాముడు.

ఇంక తప్పదని సుగ్రీవుడు రామునికి తనకు అన అన్న వాలితో ఎందుకు విరోధము వచ్చిందో వివరంగా చెప్పనారంభించాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధాకాండము ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
తొమ్మిదవ సర్గ.

"రామా! వాలి, నేను, అన్నదమ్ములము. వాలి అంటే మా నాన్న గారికి ఎంతో ప్రేమ. నాకు కూడా వాలి అంటే ఎంతో ప్రేమ, అభిమానము. నా తండ్రి గారు చనిపోయిన తరువాత, పెద్ద కుమారుడు అయిన వాలిని కిష్కింధా రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసారు. వంశపారంపర్యముగా వచ్చిన రాజ్యమును వాలి పరిపాలిస్తూ ఉంటే, నేను వాలికి సేవకునిలా అతనిని సేవించేవాడిని. మయునికి

ఇద్దరు కుమారులు. వారు మాయావి, దుందుభి. మాయావికి, మా అన్న వాలికి ఒక స్త్రీమూలకంగా విరోధము ఏర్పడింది. ఒకరోజు అర్ధ రాత్రి అందరమూ నిద్రపోతున్నాము. అప్పుడు మాయావి మా కోట వద్దకు వచ్చి పెద్దగా అరుస్తూ వాలిని యుద్ధానికి పిలిచాడు. పరాక్రమ వంతుడైన వాలి మాయావితో యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. అర్ధరాత్రి శత్రువు యుద్ధానికి వచ్చాడంటే అందులో ఏదో మర్మం ఉంటుందని ఎంత నచ్చచెప్పినా వినకుండా వాలి మాయావితో యుద్ధానికి వెళ్లాడు. నేను కూడా వాలితో పాటు వెళ్లాను.

మా ఇద్దరినీ చూచి మాయావి పారిపోయాడు. నేను, వాలి, మా అనుచరులతో మాయావిని వెంబడించాము. ఆ మాయావి భూమిలో ఉన్న సొరంగములోకి ప్రవేశించాడు. ఆ సొరంగము గడ్డితో కప్పబడి ఉంది. నేను వాలి బయట నిలబడ్డాము. అప్పుడు వాలి నాతో ఇలా అన్నాడు. "తమ్ముడా! సుగ్రీవా! నేను ఈ బిలములో ప్రవేశించి, శత్రువును చంపి వస్తాను. నేను వచ్చువరకూ నీవు ఈ బిలము వద్ద నా కోసం వేచి ఉండు." అని అన్నాడు.

దానికి నేను ఒప్పుకోలేదు. నేను కూడా తన వెంట వస్తానని ఎంత బతిమాలుకున్నా వాలి వినలేదు. తాను ఒక్కడే ఆ సొరంగము లోకి వెళ్లాడు. నేను సొరంగము బయట నిలబడి ఉన్నాను. దాదాపు ఒక సంవత్సర కాలము గడిచిపోయింది. వాలి బయటకు రాలేదు. నేను ఓపికగా ఆ సంవత్సరకాలము సొరంగము బయట వేచి ఉన్నాను. నాలో ఏదో శంక మొదలయింది. వాలి మహావీరుడు. కానీ సంవత్సరకాలము రాకపోవడంతో నామనసు కీడు శంకించింది. అయినా గుండె నిబ్బరంతో ఎదురు చూచాను.

కొంత కాలానికి ఆ సొరంగము నుండి నురుగతో కూడిన రక్తం మడుగులాగా బయటకు ప్రవహించింది. రాక్షసులు గట్టిగా అరుస్తున్నట్టు ధ్వనులు వినబడ్డాయి. కాని నా సోదరుడు అరుస్తున్న గొంతు వినబడలేదు.  నా సోదరుడు వాలి ఆ రాక్షసుని చేతిలో చంపబడినట్టు నిర్ధారణ చేసుకున్నాను. ఇంక అక్కడ ఉండి చేసేది ఏమీ లేకపోవడంతో,  నేను ఆ బిలమును పెద్ద పెద్ద బండ రాళ్లతో మూసి వేసాను.  నా అన్న వాలికి జలతర్పణములు కూడా విడిచాను. తరువాత కిష్కింధకు తిరిగి వచ్చాను.

నా అన్న వాలి మరణాన్ని ఎవరికీ చెప్పకుండా దాచి పెట్టాను. కాని మంత్రులు ఆ విషయాన్ని పసిగట్టారు. తెలుసుకున్నారు. నేను ఎంత వద్దన్నా, అందరూ కలిసి నన్ను ఈ కిష్కింధకు రాజ్యాభిషిక్తుని చేసారు. ఆ విధంగా నేను కిష్కింధకు రాజునై ధర్మంగా పరిపాలిస్తున్నాను.

ఇంతలో వాలి ఆ రాక్షసుడు మాయావిని చంపి కిష్కింధకు తిరిగి వచ్చాడు. నన్ను కిష్కింధకు రాజుగా చూచాడు. తట్టుకోలేక పోయాడు. నా మీద ఆగ్రహించాడు. నా మంత్రులను బంధించాడు.

నేను వాలి అంతటి పరాక్రమ వంతుడనైనా, అన్నగారి మీద గౌరవంతో నేను వాలిని ఎదిరించలేదు. నా అన్నకు అభివాదము చేసాను. గౌరవించాను. కాని వాలి నన్ను ఆదరించలేదు. నా మీద ఆగ్రహించాడు.

నేను వాలి పాదాల మీద పడి ప్రార్థించాను. కాని వాలికి నా మీద కోపం పోలేదు. నన్ను అనుగ్రహించలేదు.

శ్రీమద్రామాయణము
కిష్కింధాకాండము తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధాకాండము
## పదవ సర్గ.

నేను నా అన్నకు జరిగిన విషయము వివరంగా చెప్పాను. నా మీద కోపగించవద్దని బతిమాలుకున్నాను.

"అన్నయ్యా! నేను చెప్పేది విను. నీవు మన శత్రువును సంహరించి విజయోత్సాహంతో తిరిగి వచ్చావు. నాకు చాలా సంతోషంగా ఉంది. మా కందరికీ ఇప్పటికీ నీవే రక్షకుడవు. నీవే ఈ సింహాసనము అధిష్ఠించు. నేను నీ వెనక నిలబడి ఛత్రము పట్టి నిల్చుంటాను. అన్నా! నీవు ఆదేశించినట్టు నేను ఆ బిలము బయట ఒక సంవత్సరము పాటు వేచి ఉన్నాను. నీవు రాలేదు. ఇంతలో ఆ బిలము లో నుండి రక్తం ఏరులుగా ప్రవహించింది. అది చూచి నాకు భయం వేసింది. నిన్ను ఆ రాక్షసుడు చంపి ఉంటాడని అనుకున్నాను. ఆ బిలమును పెద్ద పెద్ద బండరాళ్లతో మూసివేసాను. కిష్కింధకు తిరిగి వచ్చాను. నేను ఎంత వద్దన్నా, ఈ మంత్రులు నన్ను రాజును చేసారు. ఇది అన్నా జరిగిన సంగతి.

నేను ఈ కిష్కింధకు రాజుగా తగను. నీవే రాజువు. నీవు వచ్చేవరకూ నేను ఈ రాజ్యాన్ని నీ బదులు సంరక్షిస్తూ ఉన్నాను. ఇప్పుడు నీ రాజ్యమును నీకు అప్పగిస్తున్నాను. నేను ఇదివరకటి మాదిరి నిన్ను సేవిస్తూ ఉంటాను. నా మీద కోపించకు. శాంతం వహించు. నీ పాదాల పడి ప్రార్థిస్తున్నాను. అన్నయ్యా! మరొకసారి చెబుతున్నాను. నేను నాకుగా ఈ రాజ్యానికి అభిషిక్తునిగా కాలేదు. మంత్రులు, ప్రజలు, రాజ్యమునకు రక్షకుడు లేకుండా ఉండకూడదని, నన్ను రాజుగా చేసారు. ఇందులో నా తప్పు ఏమీ లేదు. " అని ఎన్నోవిధాలుగా వాలిని వేడుకున్నాను.

కాని నా అన్న వాలి నా ప్రార్థనలను పెడచెవిని పెట్టాడు. నన్ను ఛీ కొట్టాడు. "ఏరా! ఒకనాడు అర్ధరాత్రి మాయావి వచ్చి నన్ను యుద్ధానికి పిలిచాడు అని నీకు తెలుసు కదా! అప్పుడు వాడితో తలపడడానికి నేను వెళ్లాను కదా! అప్పుడు క్రూరుడవైన నీవు నా వెంట వచ్చావు కదా! మన ఇద్దరిని చూచి ఆ రాక్షసుడు పారిపోయాడు కదా! ఒకబిలములో ప్రవేశించాడు కదా! "నేను ఈ రాక్షసుడిని చంపి గానీ కిష్కింధకు తిరిగిరాను. నేను వచ్చువరకు నీవు ఈ బిలము బయుట వేచి ఉండు" అని ఆదేశించి నేను ఆ బిలములో ప్రవేశిం చాను కదా!

నీవు బిలము వద్ద ఉన్నావు కదా అనే ధైర్యముతోనే కదా నేను బిలములోకి ప్రవేశించింది. నేను వాడి కోసరము సంవత్సరము పాటు వేచి ఉండి, వాడిని వాడి బంధుమిత్రులను సమూలంగా సంహరించాను. వారి రక్తముతో ఆ బిలము పూర్తిగా తడిసిపోయింది. నడవడానికి కూడా వీలు కాలేదు. అందువల్ల నేను బయుటకు

రావడం ఆలస్యం అయింది. నేను బిలద్వారము దగ్గరకు వచ్చాను. కాని అది మూసి ఉంది. "సుగ్రీవా! సుగ్రీవా" అంటూ అరిచాను. కేకలు పెట్టాను. కాని నీవు అక్కడ లేవు. నాకు దు:ఖము వచ్చింది. ఎంతో ప్రయాస పడి నీవు బిలద్వారమునకు అడ్డుగా పెట్టిన రాళ్లను తొలగించి బయటకు వచ్చాను.

క్రూరుడు, దుర్మార్గుడు అయిన నా తమ్ముడు సుగ్రీవుడు నా అడ్డు తొలగించుకొని ఈ రాజ్యమును అపహరించవలెననే దురుద్దేశముతో నన్ను ఆబిలములో బంధించి, సమాధి చేసాడు అని అర్థం అయింది. ఇప్పుడు తెలిసిందా నీవు చేసిన తప్పు ఏంటో! కాబట్టి నీవు ఈ రాజ్యములో ఉండ తగవు." అంటూ నా అన్న వాలి నన్ను కట్టుబట్టలతో రాజ్యము నుండి వెడలగొట్టాడు. నా భార్యను తన వద్దనే ఉంచుకున్నాడు.

నేను వాలికి భయపడి ఈ భూమి అంతా చుట్టబెట్టాను. ఎక్కడా నాకు వాలి నుండి ఆశ్రయం దొరకలేదు. కారణాంతరాల వల్ల వాలి ఈ ఋష్యమూక పర్వతము మీదకు రాలేడని తెలిసింది. అందువల్ల ఇక్కడ తలదాచుకుంటున్నాను. రామా! విన్నావు కదా నా కథ. ఇందులో నా తప్పు ఏమీ లేకపోయినా, నా అన్న వాలి నన్ను రాజ్యభ్రష్టుని చేసాడు. నా భార్యను అపహరించాడు. వాలికి భయపడి నేను ఈ పర్వతము మీద నివసిస్తున్నాను." అని పలికాడు సుగ్రీవుడు.

రాముడు సుగ్రీవునితో ఇలా అన్నాడు. "మిత్రమా! సుగ్రీవా! వాలిని చంపడానికి తగిన కారణం దొరికింది. నా బాణములతో వాలిని చంపుతాను. వాలి నా కంటపడనంతవరకే జీవించి ఉంటాడు. నిన్ను

మరలా కిష్కింధకు రాజుగా చేస్తాను. నీ భార్యను నిన్ను చేరుకుంటుంది. నా మాట నమ్ము." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము పదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధాకాండము
పదకొండవ సర్గ.

తనలో సంతోషాన్ని వృద్ధి చెందేట్టు రాముడు పలికిన మాటలకు సుగ్రీవుడు ఎంతో ఆనందించాడు. "రామా! నాకు ఆ మాత్రం తెలియదా! నీకు కోపం వస్తే ముల్లోకములనే భస్మం చేయగల శక్తి, సామర్థ్యము నీకు ఉంది. కాని వాలికి ఎంత పౌరుషము, పరాక్రమము ఉందో తెలుసుకొని దానికి తగ్గట్టుగా చేయమని నా కోరిక. రామా! వాలి సూర్యోదయానికి ముందే లేచి, ఏ మాత్రం శ్రమలేకుండా నాలుగు సముద్రములకు వెళ్లి, సంధ్యావందనము చేస్తాడు.

(ఇక్కడ ఒక చమత్కారము ఉంది. కన్యాకుమారి దగ్గరకు వెళితే, మూడు సముద్రాలు పక్క పక్కనేఉన్నాయి. ఇంక నాలుగో సముద్రం అప్పట్లో ఉందేమో తెలియదు. ప్రస్తుతం హిమాలయాలు ఉన్నాయి. కాబట్టి అది అతిశయోక్తి కావచ్చును. పైగా పంపానది, ఋష్యమూకము కన్యాకుమారికి దగ్గరగానే ఉన్నాయి. వాలి ఏ మాత్రం శ్రమ లేకుండా మూడు సముద్రాలలో సంధ్యావందనము చేసాడు అనేది సంభవమే కదా! ఆలోచించండి.).

వాలి పర్వతముల మీద ఎక్కి పెద్ద పెద్ద రాళ్లను బంతుల మాదిరి పైకి ఎగరవేసి ఆడుకుంటూ ఉంటాడు. వాలి తన బల ప్రదర్శన కొరకు పెద్ద పెద్ద వృక్షములను పెకలించి వేస్తూ ఉంటాడు.

దుందుభి అనే రాక్షసుడు ఉండేవాడు. వాడు మహా బలవంతుడు. పెద్ద కొండ వంటి శరీరము కలవాడు. గర్వముచే మదించిన వాడు. వాడు ఒక సారి సముద్రుని వద్దకుపోయి తనతో యుద్ధానికి రమ్మని సముద్రుని పిలిచాడు. సముద్రుడు ఆ రాక్షసునితో ఇలా అన్నాడు. "ఓ దుందుభీ! నేను నీతో యుద్ధము చేయలేను. కానీ నీతో యుద్ధము చేయగల వీరుడి గురించి చెపుతాను. హిమవంతుడు అనే పర్వత రాజు ఉన్నాడు. ఆయన సాక్షాత్తు మహాశివునికి మామగారు. ఆయన ఎంతో మంది మునులకు, ఋషులకు తపస్సుచేసుకోడానికి ఆశ్రయం ఇచ్చాడు. నీతో యుద్ధము చేయుటకు ఆయన సమర్థుడు." అని చెప్పాడు సముద్రుడు.

సముద్రుడు తనకు లొంగి పోయాడు అనే గర్వంతో దుందుభి హిమవంతుని వద్దకు వెళ్లాడు. హిమవంతుని పర్వత శిఖరములను పడగొట్టాడు. నలుమూలలకూ విసిరివేసాడు. అప్పుడు హిమవంతుడు దుందుభితో ఇలా అన్నాడు. ఎందుకు నా శిఖరము లను ధ్వంసం చేస్తావు. నా శిఖరముల మీద ఎంతో మంది మునులు, ఋషులు తపస్సు చేసుకుంటున్నారు. వారి తపస్సుకు ఆటంకము కలిగించకు. నేను సాత్వికుడను. నాకు యుద్ధం చేయడం చేతకాదు." అని అన్నాడు.

ఆ మాటలకు దుందుభి ఇలా అన్నాడు. "నీవు నాతో యుద్ధం చేయగలవనే నీ దగ్గరకు వచ్చాను. నీవు నాతో యుద్ధం చెయ్యి లేకపోతే నాతో యుద్ధం చేయగల పరాక్రమవంతుడు ఎవరో చూపించు." అని అన్నాడు.

"ఓ దుందుభీ! ఇంద్రుని కుమారుడు, కిష్కింధ రాజ్యాధిపతి, అమిత ప్రతాపవంతుడు, వాలి నామధేయుడు ఉన్నాడు. అతడు నీతో యుద్ధము చేయగల సమర్థుడు. వెంటనే అతని వద్దకు పోయి అతనితో యుద్ధము చెయ్యి. కాని ఇంతవరకూ యుద్ధములో వాలిని ఎవరూ గెలవ లేదు. అది గుర్తుపెట్టుకో." అని చురక అంటించాడు హిమవంతుడు.

దుందుభికి కోపం మిన్ను ముట్టింది. మారు మాటాడకుండా దుందుభి వాలి వద్దకు వెళ్లాడు. దుందుభి మహిష రూపం(దున్నపోతు) ధరించాడు. కిష్కింధా పుర ద్వారము వద్ద నిల్చి పెద్ద పెద్దగా రంకెలు వేసాడు. పక్కనే ఉన్న వృక్షములను పెకలించాడు. సింహద్వారములను తన కొమ్ములతో కుమ్ముతున్నాడు. దుందుభి చేస్తున్న ఆగడాలు అంత:పురంలో ఉన్న వాలి దృష్టికి వచ్చాయి. వాలి తన అంత:పుర స్త్రీలతో కలిసి బయటకు వచ్చాడు. దుందుభిని చూచాడు.

"ఓ దుందుభీ! నువ్వా! నీ సంగతి నాకు తెలుసు కానీ, వెళ్లి నీ ప్రాణాలు కాపాడుకో. నాతో అనవసరంగా యుద్దం చేసి నీ ప్రాణాల మీదికి తెచ్చుకోకు." అని అన్నాడు. ఆ మాటలకు దుందుభి కోపం మిన్నుముట్టింది. "వాలీ! అంత:పుర స్త్రీల ముందు ప్రగల్భాలు పలుకకు.

ధైర్యం ఉంటే నాతో యుద్ధం చెయ్యి. లేకపోతే ఓడిపోయానని ఒప్పుకొని అంత:పురానికి వెళ్లు. నీకు మరొక అవకాశము ఇస్తున్నాను. రాత్రి అంతా నీ అంత:పుర స్త్రీలతో కామ సుఖాలు అనుభవించు. నీ వాళ్లందరికీ వీడ్కోలు చెప్పు. నీ కిష్కింధను ఆఖరు సారిగా తనివిదీరా చూసుకో. మరలా ఇంకొక సారి కామభోగములు అనుభవించు. రేపు ఉదయం నా వద్దకు రా! నాతో యుద్ధం చెయ్యి. నా చేతిలో నీకు చావు తప్పదు.

రేపటిదాకా ఎందుకు సమయం ఇస్తున్నాను అంటే ప్రస్తుతం నీవు మద్యం మత్తులో ఉన్నావు. అంత:పుర స్త్రీలతో కామ సుఖాలు అనుభవిస్తున్నావు. నీ చేతిలో ఏ ఆయుధమూ లేదు. ఆయుధములు లేని వానినీ, మద్యం మత్తులో ఉన్నవాడినీ, ఏమరుపాటుగా ఉన్న వాడినీ, నీ వంటి బలం లేని వాడినీ, ఓడి పోయిన వాడినీ, నీ లాగా కామసుఖాలలో మునిగి తేలుతూ సగంలో లేచి వచ్చిన వాడినీ చంపడం మహా పాపం అని నాకు తెలుసు. అందుకే రేపు ఉదయం రా!" అని గర్వంతో పలికాడు దుందుభి.

ఆ మాటలకు వాలి నవ్వాడు. తనతో ఉన్న అంత:పుర కాంతలను లోపలకు పంపాడు. దుందుభి వద్దకు వచ్చాడు. "నేను మద్యం మత్తులో లేను. యుద్ధం చేసే ముందు మద్యం సేవించడం ఆచారం. అదే నేను చేసాను. నాతో యుద్ధానికి రా!"అని దుందుభిని యుద్ధానికి పిలిచాడు.

తన తండ్రి దేవేంద్రుడు తనకు ఇచ్చిన మాలను మెడలో వేసుకున్నాడు. దుందుభి కొమ్ములు పట్టుకున్నాడు. దుందుభిని పట్టుకొని గిరా గిరా తిప్పి నేలకేసి కొట్టాడు. దుందుభికి దిమ్మ తిరిగింది.

చెవులలో నుండి రక్తం కారింది. పైకి లేచి వాలిని పట్టుకున్నాడు. వాలికి, దుందుభికి ఘోర యుద్ధం జరిగింది. ఒకరిని ఒకరు పిడికిళ్లతో గుద్దుతూ, కాళ్లతో తన్నుతూ, వృక్షములు, బండరాళ్లు ఒకరి మీద ఒకరు విసురుకుంటూ యుద్ధం చేసారు.

యుద్ధం చేసే కొద్దీ దుందుభి బలం తగ్గుతూ ఉంది. వాలి బలం పెరుగుతూ ఉంది. వాలి, దుందుభిని పైకి ఎత్తి నేల మీద పడవేసి తొక్కుతున్నాడు. దుందుభి నవ రంధ్రముల నుండి రక్తం ధారాపాతంగా కారిపోతూ ఉంది. వాలి బలానికి తట్టుకోలేక దుందుభి ప్రాణాలు విడిచాడు. వాలి దుందుభి శరీరాన్ని రెండు చేతులతో పైకి ఎత్తి ఒక యోజన దూరంలో పడేట్టు విసిరి వేసాడు.

ఆ మాదిరి విసిరి వేయడంలో దుందుభి శరీరం నుండి కారిన రక్తం మతంగాశ్రమము మీద చల్లినట్టు పడింది. ఆ రక్తపు బిందువులను చూచి మతంగ మహర్షి కోపించాడు. ఆ రక్తము చల్లిన వాడు ఎవడా అని చూచాడు.  మహర్షికి దున్నపోతురూపంలో చచ్చి పడి ఉన్న దుందుభి మృతకళేబరము కనిపించింది. ఆ మహర్షి తన తపోబలంతో ఆ పని చేసిన వాడు వాలి అని గ్రహించాడు. అనవసరంగా ఆ రాక్షసుని మృతకళేబరమును తన ఆశ్రమ ప్రాంతంలో విసిరివేసిన వాలిని శపించాడు.

"నా ఆశ్రమ ప్రాంతంలో ఈ రాక్షసుని శరీరాన్ని విసిరి, నా ఆశ్రమంలోని వృక్షములను నాశనం చేసి, ఈ దుష్టుని రక్తంతో కలుషితం చేసిన వాలి నా ఆశ్రమ ప్రాంతంలోకి కానీ, నా ఆశ్రమము నకు ఒక యోజన విస్తీర్ణములో గానీ  ప్రవేశించకూడదు. అలా ప్రవేశిస్తే

వెంటనే మరణిస్తాడు అంతే కాదు ఇప్పటి దాకా ఈ అరణ్యములో నివసించుచున్న వాలి అనుచరులు, వానరులు తక్షణమే ఈ వనమును విడిచి పెట్టి వెళ్లవలెను. నేను ఈ ఆశ్రమమును ఈ ఆశ్రమములోని వృక్షములను, లతలను కన్నబిడ్డలవలె కాపాడుకుంటున్నాను. ఆ వృక్షములను, లతలను వానరములు పాడుచేస్తున్నారు. కాబట్టి వానరజాతి అంతా ఈ ప్రాంతమును విడిచిపెట్టి వెళ్లాలి. వారికి ఒక్కరోజు గడువు ఇస్తున్నాను. ఒక్కరోజు లోగా వానరులందరూ వెళ్లకపోతే వారిని కూడా శపించవలసి వస్తుంది. రేపటి నుండి నా కంటబడిన వానరుడు శిల అయి పోతాడు." అని వాలికి, వాలికి శాపం ఇచ్చాడు మతంగ మహర్షి.

ముని శాపము విషయం తెలుసుకొని వానరములు అన్నీ మతంగ మహర్షి వనము విడిచిపెట్టి వాలి వద్దకు వెళ్లాయి. "మీరంతా ఇక్కడకు ఎందుకు వచ్చారు. మీకు క్షేమమే కదా!"అని అడిగాడు. అప్పుడు ఆ వానరులు వాలికి, మతంగ మహర్షి ఇచ్చిన శాపము గురించి చెప్పారు. వెంటనే వాలి పరుగు పరుగున మతంగ ముని వద్దకు వెళ్లాడు. ఆయన కాళ్ల మీద పడి క్షమించమని ప్రార్థించాడు. కాని మహర్షి కనికరించలేదు.

ఆ నాటి నుండి వాలి శాపగ్రస్తుడయ్యాడు. ఈ ఋష్యమూక పర్వతము మీదికి వచ్చుటకు కానీ, కనీసము ఈ పర్వతము వంక కన్నెత్తి చూచుటకు కానీ భయపడేవాడు. నా అన్న వాలి ఇక్కడకు రాలేడని తెలిసి, నేను ఇక్కడ నివాసము ఏర్పరచుకొని నిర్భయంగా జీవించుచున్నాను. రామా! అదుగో ఆ నాడు వాలి విసిరిన దుందుభి అస్థిపంజరము కొండవలె ఎలా పడి ఉన్నదో చూడు. దాని పక్కనే ఏడు

సాల వృక్షములు ఉన్నవి. వాలి అప్పుడప్పుడు వాటిని ఊపి వాటికి ఉన్న ఆకులు, పండ్లు రాలగొడుతూ ఉంటాడు.

మిత్రమా రామా! వాలి గురించి అతని బల పరాక్రమముల గురించి నీకు వివరంగా చెప్పాను. అటువంటి వాలిని నీవు చంప గలవా! ఆలోచించుకో!" అని రాముని మనసులో సందేహాన్ని రేకెత్తించాడు సుగ్రీవుడు.

ఆమాటలు విని లక్ష్మణుడు నవ్వాడు. "ఓ సుగ్రీవా! నీవు చెప్పావు సరే. ఇప్పుడు రాముడు ఏమి చేస్తే, నీవు రాముడు వాలిని చంపగలడు అని నమ్మగలవు" అని అడిగాడు.

ఇప్పుడు సుగ్రీవుడు తన మనసులో మాట బయట పెట్టాడు. "రామా! పూర్వము వాలి ఈ సాలవృక్షములు ఏడింటిని అటు ఇటు ఊపేవాడు అని చెప్పాను కదా! రాముడు తన బాణముతో ఈ సాల వృక్షములలో ఒక దానిని పడగొట్ట గలిగితే, రాముడు వాలిని చంపగలడు అని నమ్మడానికి అవకాశము ఉంది. పోనీ రాముడు అక్కడ ఉన్న దుందుభి అస్థిపంజరమును తన కాలితో ఎత్తి రెండు వందల ధనుస్సు ప్రమాణముల అవతల విసర గలిగితే అప్పుడు కూడా రాముడు వాలిని చంపగలడు అని నమ్ముతాను." అని అన్నాడు సుగ్రీవుడు.

(ధనుస్సు పొడుగు 6 అడుగులు. అంటే రెండు గజాలు. 200 ధనుస్సులు అంటే 400 వందల గజాలు.).

సుగ్రీవుడు ఇంకా ఇలా అన్నాడు. “రామా! మరొక మాట. వాలి మహా బలవంతుడు. పరాక్రమశాలి. ఇప్పటి వరకూ ఎవరి చేతిలోనూ ఓడిపోవడం అనేది ఎరుగడు. వాలి దేవతలకు కూడా అజేయుడు. అందుకనే వాలికి భయపడి నేను ఇక్కడ తలదాచుకుంటున్నాను. వాలిని ఓడించుటకు కానీ, జయించుటకు కానీ ఎవరికీ సాధ్యము కాదు. ఇంక నా మాట చెప్పడం ఎందుకు. అందుకే ఎప్పుడు ఏ ఆపద వస్తుందో అని అనుక్షణం భయపడుతూ నా మంత్రులతో సహా ఇక్కడ దాక్కున్నాను.

ఇదంతా ఎందుకు చెబుతున్నాను అంటే. నాకు వాలి పరాక్రమము గురించి తెలుసు. కానీ నీ పరాక్రమము గురించి నాకు తెలియదు. అని చెప్పి నిన్ను పరీక్షించవలెనని గానీ, నీ పరాక్రమమును వీరత్వమును శంకించిగానీ నేను ఇలా అనడం లేదు. వాలి వలన కలిగిన భయంతోనే ఇలా మాట్లాడుతున్నాను. కాని నిన్ను, నీ ఆకారాన్ని, నీ ధనుస్సును చూస్తే నీవు వాలిని చంపగలవని నమ్మకం నాకు ఉంది. నీ తేజస్సు అటువంటిది.” అని తాను చెప్పదలచుకున్నది స్పష్టంగా చెప్పాడు సుగ్రీవుడు.

రాముడు సుగ్రీవుడు చెప్పిన మాటలు అన్నీ శ్రద్ధగా విన్నాడు. “మిత్రమా సుగ్రీవా! నీవు నా మీద నమ్మకం పెట్టు. నీకు నా పరాక్రమము మీద నమ్మకము లేకుంటే. నేను నీకు నమ్మకం కలిగేట్టు చేస్తాను.” అని అన్నాడు.

వెంటనే దుందుభి అస్థిపంజరము వద్దకు వెళ్లాడు. తన కాలి బొటనవేలితో ఆ అస్థి పంజరమును పదియోజనముల దూరం

పడేటట్టు విసిరాడు. అది చూచిన సుగ్రీవునికి మనసులో మరొక సందేహము కలిగింది. . రాముని చూచి ఇలా అన్నాడు.

"మిత్రమా! వాలి ఈ కళేబరమును విసిరినపుడు ఇది పూర్తిగా రక్త మాంసములతో బరువుగా ఉండింది. ఇప్పుడు ఎండిపోయి, అస్థిపంజరంగా మారింది. తన మునుపటి బరువును కోల్పోయింది. దీనిని బట్టి నీ బలము అధికమా, వాలి బలము అధికమా అని నిర్ణయించలేము కదా! అందుకని, నీవు ధనుస్సుకు బాణము సంధించి ఆ సాలవృక్షమును కొట్టినచో నాకు నమ్మకము కలుగుతుంది. రామా! నాకు తెలుసు. నీవు ఆ సాలవృక్షమును కొట్టగలవు. ఈ ఒక్కపని చేసి. నాలో ఉన్న సందేహమును తొలగించు." అని తన మనసులో ఉన్న సందేహమును బయట పెట్టాడు సుగ్రీవుడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధాకాండము పదకొండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధాకాండము
## పండ్రెండవ సర్గ.

సుగ్రీవుని మాటలను విన్న రాముడు, అతని మనసులో ఉన్న సందేహమును నివారించ నిశ్చయించుకున్నాడు. .మారుమాటాడ కుండా తన ధనుస్సును చేత బట్టుకున్నాడు. శరమును సంధించాడు. ఒకే ఒక బాణంతో ఒక సాల వృక్షము కాదు, వరుసగా ఉన్న ఏడు సాలవృక్షములను పడగొట్టాడు. సుగ్రీవునికి నోట మాట రాలేదు.

ఆశ్చర్యపోయాడు. తాను ఒక్క వృక్షమును కొట్ట మంటే ఏడు వృక్షములను కొట్టాడు రాముడు. రాముని కాళ్ల మీద సాష్టాంగ పడ్డాడు.

"రామా! చాలు చాలు. నీవు సాక్షాత్తు ఇంద్రుడినే చంపగల సమర్థుడవు. నీకు వాలి ఒక లెక్కా! ఏడు సాలవృక్షములను కూల్చిన నీముందు ఎవడు నిలిచి యుద్ధము చేయగలడు? నీవు నాకు మిత్రుడుగా లభించినందుకు నా మనసంతా ఆనందంతో నిండి పోయింది. రామా! చేతులుజోడించి ప్రార్థిస్తున్నాను. వాలిని చంపి నాకు మనశ్శాంతిని చేకూర్చు." అని అన్నాడు సుగ్రీవుడు.

"మిత్రమా! సుగ్రీవా! నీవు చెప్పినట్టే చేద్దాము. ముందు నీవు కిష్కింధకు వెళ్లు. నీ వెనువెంటనే మేము వస్తాము. నీవు వెళ్లి వాలిని యుద్ధానికి రమ్మని పిలువు. వాలితో యుద్ధము చెయ్యి. నేను చాటుగా ఉండి నా బాణముతో వాలిని చంపుతాను." అని అన్నాడు రాముడు.

రాముని మాటల మీద నమ్మకంతో సుగ్రీవుడు కిష్కింధకు వెళ్లాడు. సుగ్రీవుని మంత్రులు, రాముడు, లక్ష్మణుడు అతని వెంటనే వెళ్లి సమీపములో ఉన్న పొదల మాటున దాగి ఉన్నారు. సుగ్రీవుడు పెద్దగా అరుస్తూ వాలిని యుద్ధానికి పిలిచాడు. సుగ్రీవుని పిలుపు విని వాలి బయటకు వచ్చాడు.

తాను ఇంతకాలము ఎవరి కోసరం వెతుకుతున్నాడో ఆ సుగ్రీవుడు కంటపడేసరికి, వాలికి కోపం ముంచుకొచ్చింది. సుగ్రీవునితో తలపడ్డాడు. ఇద్దరూ ఘోరంగా యుద్ధం చేసుకుంటున్నారు. రాముడు

పొదల మాటున నిలబడి వాలిని తన బాణంతో కొట్టవలెనని శతవిధాలా ప్రయత్నించాడు. కానీ వాలి, సుగ్రీవుడు ఒకే రూపంలో ఉండటం వలన ఎవరు వాలి, ఎవరు సుగ్రీవుడు అని పోల్చుకోలేకపోయాడు. వాలికి బదులుగా సుగ్రీవుని కొడతానేమో అని భయపడ్డాడు. అందువలన బాణప్రయోగము చేయలేదు.

ఈ లోపల వాలి సుగ్రీవుని చావ చితక కొట్టాడు. వాలి కొట్టిన దెబ్బలకు సుగ్రీవుని శరీరం అంతా రక్తసిక్తము అయింది. ఆ దెబ్బలు తట్టుకోలేక సుగ్రీవుడు ఋష్యమూక పర్వతము మీదికి పారిపోయాడు. వాలి సుగ్రీవుని కొంత దూరం తరిమాడు. కాని సుగ్రీవుడు ఋష్యమూక పర్వతము మీదికి పోవడం చూచి, శాపానికి భయపడి వెనుదిరిగి పోయాడు. సుగ్రీవుని వెంట అతని మంత్రులు, రామలక్ష్మణులు వెళ్లారు.

రాముని చూచి సుగ్రీవుడు ఇలా అన్నాడు. “ఓ రామా! ఏమిటీ పని! వాలిని యుద్ధానికి పిలువ మన్నావు. వాలిని చంపుతానని నన్ను నమ్మించావు. కాని వాలి చేత నన్ను కొట్టించావు. చావు దెబ్బలు తిని పారిపోయి వచ్చాను. ఇలా ఎందుకు చేసావు. నేను వాలిని చంపను అని ముందే చెప్పి ఉంటే నేను అసలు వాలితో యుద్ధానికి పోను కదా!” అని దీనంగా పలికాడు.

సుగ్రీవుని చూచి రాముడు జాలి పడ్డాడు. “మిత్రమా! నేను ఏ పరిస్థితులలో బాణం వెయ్యలేదో వివరిస్తాను. కోపం లేకుండా విను. నీవు, వాలి, ఎత్తు, లావు, శరీర ఛాయ అన్నిటిలోనూ ఒకే విధంగా ఉన్నారు. నిన్ను, వాలిని, పోల్చుకోలేకపోయాను. నేను వదిలిన బాణం

నీకు తగిలి నీవు మరణిస్తావేమో అని భయపడ్డాను. అప్పుడు మిత్రునికి ద్రోహం చేసినవాడిని అవుతానుకదా! అందుకని బాణం వదలలేదు. నా తొందరపాటుతో గానీ, పొరపాటున గానీ, ఆ బాణం నీకు తగిలితే. శాశ్వతంగా నీ వంటి మంచి మిత్రుని పోగొట్టుకున్నవాడిని అవుతాను కదా!

నేను నీకు అభయం ఇచ్చాను. వాలిని చంపకపోయినా బాధ లేదు కానీ నిన్ను చంపితే అభయం ఇచ్చిన వాడిని చంపిన పాపం నాకు చుట్టుకుంటుంది. నీవు లేకపోతే మాకు ఎవరు దిక్కు. కాబట్టి నీవు మరలా వాలిని యుద్ధానికి పిలువు. కాని నిన్ను గుర్తించుటకు ఒక ఆనవాలు పెట్టుకో. ఆ ఆనవాలు సాయంతో నేను వాలిని ఒకే ఒక బాణంతో నేలకూలుస్తాను. నీవు నిశ్చింతగా ఉండు." అని అన్నాడు రాముడు.

రాముడు చుట్టూ చూచాడు. రామునికి ఎదురుగా ఒక పుష్పములతో కూడిన ఒక తీగ కనపడింది. "లక్ష్మణా! పుష్పములతో కూడిన ఆ తీగను తెచ్చి సుగ్రీవుని మెడలో హారంగా అలంకరించు." అని అన్నాడు. వెంటనే లక్ష్మణుడు పోయి గజపుష్పములతో నిండి ఉన్న తీగను తీసుకొని వచ్చి సుగ్రీవుని మెడలో వేసాడు. ఎర్రగా ఉన్న ఆ పూలు సుగ్రీవుని మెడలో మెరిసిపోతున్నాయి. అందరూకలిసి తిరిగి కిష్కింధకు వెళుతున్నారు.

శ్రీమద్రామాయణము

కిష్కింధాకాండము పండ్రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## పదమూడవ సర్గ.

అందరూ కిష్కింధకు వెళుతున్నారు. ముందు లక్ష్మణుడు నడుస్తున్నాడు. తరువాత ధనుర్ధారియై రాముడు నడుస్తున్నాడు. రాముని వెనక సుగ్రీవుడు, హనుమంతుడు, నలుడు, నీలుడు, తారుడు నడుస్తున్నారు. వారుకొండలను గుహలను, సరస్సులను దాటుకుంటూ వెళుతున్నారు. మార్గమధ్యంలో రాముడు ఒక వనమును చూచాడు. దాని గురించి సుగ్రీవుని అడిగాడు. సుగ్రీవుడు ఆ వనము గురించి ఇలా చెప్పసాగాడు.

"ఓ రామా! ఇక్కడ సప్తజనులు అనే మునులు ఉండేవారు. వారు జలములో తలకిందులుగా తపస్సు చేస్తూ ఉండేవారు. వారు ఆహారము తీసుకొనేవారు కాదు. ఏడురోజులకొక సారి గాలి మాత్రం పీల్చుకొనే వారు. ఆ ప్రకారంగా వారు ఏడు వందల సంవత్సరములు తపస్సుచేసి శరీరంతో స్వర్గమును చేరుకున్నారు. ఆ మునుల తపస్సు ప్రభావంతో ఈ వనములోకి దేవతలు గానీ, మనుషులు గానీ, జంతువులు గానీ ప్రవేశించలేవు. ఒకవేళ ప్రవేశిస్తే తిరిగి వెళ్లలేవు. ఈ వనములో నిత్యమూ మూడు అగ్నిహోత్రములు అనగా దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము మండుతూ ఉంటాయి. వాటినుండి వెలవడే పొగ అదుగో అలా కనపడుతూ ఉంటుంది. రామా! మీరు ఆ మునులకు నమస్కారం చేయండి. మీకు మేలుజరుగుతుంది." అని అన్నాడు సుగ్రీవుడు.

రాముడు, లక్ష్మణుడు ఆ మునులకు భక్తితో

నమస్కరించారు. తరువాత వారందరూ కిష్కింధకు చేరుకున్నారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము పదమూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
పదునాల్గవ సర్గ.

అందరూ కిష్కింధా నగరము ప్రవేశించారు. సుగ్రీవుడు రామునితో ఇలా అన్నాడు."రామా! ఇదే కిష్కింధా నగరము. ఇక్కడ ద్వారములు అన్నీ బంగారంతో నిర్మించారు. ఇక్కడ అనేక యంత్రములు అమర్చబడ్డాయి. వాలిని చంపడానికి తగిన కాలము సమీపించింది. నీవు దానిని సఫలం చేస్తావని ఆశిస్తున్నాను." అని అన్నాడు అనుమానంగా అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుని మనసులోని సందేహాన్ని గ్రహించాడు రాముడు. అతని మనసులోని సందేహ నివృత్తి కోసరం ఇలా అన్నాడు.

"సుగ్రీవా! ఈ సారి వాలిని గుర్తు పట్టడంలో పొరపాటు జరగదు. ఎందుకంటే నీ మెడలో ఉన్న గజమాల నువ్వు సుగ్రీవుడు అని తెలియజేస్తుంది. ఒకే ఒక బాణంతో నేను వాలిని చంపుతాను. నీవు నిశ్చింతగా ఉండు. ఈ సారి వాలి నా కంటబడి తప్పించుకుంటే, నువ్వు నన్ను తప్పు పట్టు. నన్ను నిందించు. నీ ఎదురుగానే కదా నేను ఏడు సాలవృక్షములను ఛేధించాను. ఈ వాలిని చంపడం పెద్ద కష్టమేమీ

కాదు. నన్ను నమ్ము.

నేను ఎన్ని కష్టములలో ఉన్నా ఎప్పుడూ అసత్యము చెప్పలేదు. ఇక మీదట కూడా అసత్యము చెప్పను. చెప్పలేను. నేను నా ప్రతిజ్ఞను నెరవేర్చుకుంటాను. ఇది సత్యము. నీలోని భయాన్ని వదిలిపెట్టు. ధైర్యంగా వాలితో యుద్ధం చెయ్యి. వాలిని యుద్ధానికి పిలువు. అతడు బయటకు వచ్చేట్టు చెయ్యి. నీవు యుద్ధమునకు పిలవగానే వాలి బయటకు వస్తాడు. ఎందుకంటే అతడు ఇప్పటి దాకా ఓటమి ఎరుగడు అని నువ్వే చెప్పావు కదా!

అతనికి తన బలము మీద పరాక్రమము మీద నమ్మకము ఎక్కువ. తనను తాను పొగుడుకుంటూ ఉంటాడు. కాబట్టి నీతో యుద్ధానికి వస్తాడు. నా చేతిలో చస్తాడు. మరొక విషయం. అతను ఇప్పుడు స్త్రీలతో కామభోగములు అనుభవిస్తూ ఉంటాడు. స్త్రీల మధ్య ఉన్న వాలి తనను ఎవడైనా ఎదిరిస్తే సహించలేడు. వెంటనే బయటకు వస్తాడు. కాబట్టి సుగ్రీవా! వాలిని యుద్ధానికి పిలువు." అని అన్నాడు రాముడు సుగ్రీవునికి ధైర్యం చెబుతూ.

రాముడు పలికిన ధైర్యవచనాలకు సుగ్రీవుడు పొంగిపోయాడు. గట్టిగా గర్జించాడు. తొడ చరిచి వాలిని యుద్ధానికి పిలుస్తూ పెద్ద పెద్దగా రంకెలు వేసాడు. సుగ్రీవుడు అరుస్తున్న అరుపులకు, వేస్తున్న రంకెలకు, కిష్కింధ అదిరిపోయింది. వాలి బయటకు వచ్చేవరకూ సుగ్రీవుడు అలా అరుస్తూనే ఉన్నాడు.

శ్రీమద్రామాయణము కిష్కింధాకాండము

పదునాల్గవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

పదునైదవ సర్గ.

సుగ్రీవుడు అంత:పురంలో తన భార్య వద్ద ఉన్నాడు. ఇంతలో సుగ్రీవుని అరుపులు గావు కేకలు వినిపించాయి. దిగ్గున లేచాడు వాలి. సేవించిన మద్యం మత్తు దిగిపోయింది. కోపం వచ్చింది. యుద్ధానికి సన్నద్ధం అయ్యాడు. అంత: పురము నుండి బయటకు వచ్చాడు. వాలి వెంట ఆయన భార్య తార కూడా వచ్చింది. వాలిని వారించింది. వాలిని ప్రేమతో కౌగలించుకొని ఇలా చెప్పింది.

"నాధా! నీకు అకాల కోపము పనికి రాదు. కోపము వదిలిపెట్టి ప్రశాంతంగా ఆలోచించు. ఇప్పుడే యుద్ధం చెయ్యాలా. రేపు చెయ్యవచ్చు కదా! నీ శత్రువు ఎక్కడకు పోడుకదా! పైగా యుద్ధానికి వచ్చింది ఒక్కడే కానీ పదిమంది కాదుకదా! నీవు పరాక్రమము లేని వాడవు, దుర్బలుడవు కాదు కదా! అయినా నీవు అకాలంలో యుద్ధమునకు పోవడం నాకు ఎంత మాత్రమూ ఇష్టం లేదు. దానికి కారణం చెబుతాను విను.

ఇంతకు ముందే నీవు నీ తమ్ముని సుగ్రీవుని యుద్ధంలో ఓడించావు. చావగొట్టి పంపించావు. చావు తప్పి పారిపోయాడు సుగ్రీవుడు. కాని వెంటనే యుద్ధానికి వచ్చాడు. ఈ కొద్దికాలంలో అతని బలం ఎలా పెరిగింది. ఆలోచించు. ఇంత కొద్దికాలంలో అతను నీ కన్నా బలవంతుడు అయ్యాడంటే నాకు నమ్మకం కుదరం లేదు. ఇందులో ఏదో మోసం ఉంది. సుగ్రీవునికి బయట నుండి సాయం అందుతూ

ఉంది. ఆ సాయం ఎవరు, ఏ రూపంలో చేస్తున్నారో తెలియదు. ఇంతకూ సుగ్రీవునికి సాయం చేసే వాళ్లు ఎవరు? ఎక్కడ నుండి వచ్చారు? సుగ్రీవునికి సాయం చెయ్యాల్సిన అవసరం వారికి ఏముంది? బయట నుండి సాయం లేకుండా సుగ్రీవుడు ఇంతధైర్యంగా మరలా నీ మీదికి యుద్ధానికి కాలు దువ్వడు.

సుగ్రీవుడు బలవంతుడు కాకపోయినా బుద్ధిమంతుడు. నేర్పు కలవాడు. తనకు ఏ లాభమూ లేకుండా ఎవరితోనూ స్నేహం చెయ్యడు. ఇప్పుడు సుగ్రీవుడు ఎవరితో స్నేహం చేసాడో తెలుసుకోవడం అవసరం కదా! ఇటీవల మీ కుమారుడు అంగదుడు నాకు ఒక వార్త చెప్పాడు. దానిని ఇప్పుడు నీకు చెబుతున్నాను. మన సరిహద్దుల్లో కాపలా ఉండే గూఢచారులు అంగదునికి ఈ వార్త చెప్పారట.

అదేమిటంటే....... ఇక్ష్వాకు వంశములో పుట్టిన వారు, దశరథుని కుమారులు, రామ లక్ష్మణులు అనే పేరు గల వాళ్లు మన వనములో సంచరిస్తూ ఉన్నారట. వారితో సుగ్రీవునికి స్నేహం కలిసిందట. వారు సుగ్రీవుని కోరిక తీర్చడానికి ఒప్పుకున్నారట. ఇంక ఆ రాముడు ధనుస్సును ప్రయోగించడంలో గొప్ప నేర్పరి. బాణములను వేగంగా వేయగలడు. ఆ రాముడు ధర్మపరుడు. ఆపదలలో ఉన్నవారిని కాపాడే గుణం కలవాడు. మంచి లౌకిక జ్ఞానము శాస్త్రజ్ఞానము కలవాడు. తండ్రి ఆజ్ఞను పాలించేవాడు. రాముని యుద్ధంలో జయించడం అసాధ్యం అని తెలిసింది.

అటువంటి వాడు ఇప్పుడు నీసోదరుడు సుగ్రీవునికి సాయం చేస్తున్నాడట. కాబట్టి రామునితో నీకు విరోధము తగదు అని

నా భావన. నీవు నా మీద కోపం తెచ్చుకోకపోతే నీకు ఒక విషయం చెబుతాను. సావధానంగా విను.

నీకు తెలుసు. సుగ్రీవుడు ఏ తప్పూ చేయలేదు. కాబట్టి నీ తమ్ముని ఆదరించు. అతని రాజ్యము అతనికి ఇవ్వు. సుగ్రీవునితో విరోధము మాను. నీవు సుగ్రీవునితోస్నేహం చేసుకుంటే, రాముడు కూడా నీకు స్నేహితుడు అవుతాడు. నాధా! సుగ్రీవుడు పరాయివాడు కాదు కదా! నీకు స్వంత తమ్ముడు. అతని మీద ప్రేమ చూపించాలి గానీ ద్వేషించకూడదు. ప్రస్తుతము నీకు నీ సోదరుడు సుగ్రీవునితో సంధి చేసుకొనడం తప్ప వేరు మార్గము లేదు. నేను నీ హితము కోరి ఈ మాటలు చెబుతున్నాను. నీవు నా భర్త కాబట్టి, నీ క్షేమమును నేను సదా కోరుతాను కాబట్టి చెబుతున్నాను. కోపము, ద్వేషము విడిచి పెట్టు. నా మాటవిను. సుగ్రీవునితో యుద్ధము మాను. " అని తార తన భర్త వాలికి హితోపదేశము చేసింది. కాని తార మాటలు వాలికి రుచించలేదు.

(ఇది విదురుడు సుయోధనునికి హితము చెప్పినట్టు ఉంది కదా! వాలి-- సుయోధనుడు. సుగ్రీవుడు-- ధర్మరాజు. సుగ్రీవునితో రామునికి మైత్రి కుదిరింది. ధర్మరాజుతో కృష్ణునికి బంధుత్వతము మైత్రి రెండు ఉన్నాయి. ఇద్దరి మధ్యా రాజ్యము వలన తగాదా వచ్చింది. సుగ్రీవుని భార్యను వాలి అవమానిస్తే, ధర్మరాజు భార్యను సుయోధనుడు అవమానించాడు. వాలి సుగ్రీవుని అడవులకు తరిమితే, సుయోధనుడు ధర్మరాజును అడవులకు పంపాడు. అరణ్య వాసం తరువాత ధర్మరాజు యుద్ధం చేస్తే, అరణ్యవాసం తరువాత సుగ్రీవుడు వాలితో యుద్ధం చేసాడు. రాముని సాయంతో సుగ్రీవుడు వాలిని చంపితే, కృష్ణుడు

చెప్పిన ఉపాయంతో భీముని చేతిలో సుయోధనుడు చచ్చాడు. కృష్ణుడు ఏ పక్కన ఉంటే అక్కడ జయం ఉంటుంది. రాముడు ఎక్కడ ఉంటే అక్కడ జయం ఉంటుంది. విదురుడు సుయోధనునితో సంధి చేసుకోమంటే, ఇక్కడ తార కూడా వాలిని సంధిచేసుకోమని చెప్పింది. యుగాలు మారినా, కథలు వేరైనా, ధర్మం ఒకటే. అదే కలియుగంలో చిన్న సామెత రూపంలో ఉంది. పోరు నష్టము పొందు లాభము.)

శ్రీమద్రామాయణము

కిష్కింధాకాండము పదునైదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## పదునారవ సర్గ.

తార చెప్పిన మాటలు వాలి పెడచెవిని పెట్టాడు. తారను నాకు చెప్పేంత దానివా అని కసురుకున్నాడు. విదిలించి కొట్టాడు. పురుషాహంకారము అతని ఆలోచనా శక్తిని హరించి వేసింది.

"నా కన్నా బలహీనుడు నన్ను యుద్ధానికి రమ్మని పిలుస్తుంటే నేను ముందూ వెనకా ఆలోచిస్తూ కూర్చోవాలా! కుదరదు. నీవు భయస్తురాలవు. పిరికిదానికి. నా వంటి వీరుడు శూరుడు యుద్ధానికి వెనుదియ్యడం కన్నా మరణించడం మేలు. శత్రువు యుద్ధానికి కాలు దువ్వుతుంటే, ఓర్పుతో ఉండటం మరణం కన్నా సహించరానిది. ఇంక రాముని గూర్చి నాకు భయం లేదు. నీవే అన్నావు కదా. రాముడు ధర్మాత్ముడు. ఆర్తజనులను రక్షించేవాడు అని.

అటువంటి రాముడు అధర్మానికి ఎలా ఒడిగడతాడు. సుగ్రీవుని కోసరం పాపం ఎలా చేస్తాడు? ఏదో స్త్రీసహజమైన చాపల్యంతో నీకు తోచింది చెప్పావు. ఇంకచాలు లోపలకు  వెళ్లు.

పిచ్చిదానా! నేను నా సోదరుని చంపుతాను అనుకున్నావా! లేదు. నేను కేవలం సుగ్రీవుని అహంకారము అణిచి బుద్ధి చెప్పి పంపేస్తాను. అంతే. ప్రస్తుతము సుగ్రీవుడు రాజ్యం కోరడం లేదు. యుద్ధం కోరుకుంటున్నాడు. వాడు కోరుకున్న యుద్ధాన్ని వాడికి ఇస్తాను. నీకు నా మీద ఉన్న ప్రేమకొద్దీ, నీ బుద్ధికి తోచిన ఉపాయము చెప్పావు. అది చాలు. ఇంక లోపలకు వెళ్లు. నేను చిటికలో సుగ్రీవుని గర్వము అణిచి అతనిని పారిపోయేట్టు చేసి వస్తాను." అని పలికాడు వాలి.

తార ఇంక చేసేది లేక దు:ఖిస్తూ వాలికి ప్రదక్షిణపూర్వక నమస్కారము చేసింది. భర్త విజయాన్ని కాంక్షిస్తూ అతనికి వీరతిలకము దిద్దింది. అంత:పుర కాంతలతో సహా లోపలకు వెళ్లింది. వాలి కోపంతో బుసలు కొడుతూ నగరం బయటకు వచ్చాడు. సుగ్రీవుడు ఎక్కడ ఉన్నాడా అని నలుదిక్కులా చూస్తున్నాడు. అల్లంత దూరంలో నడుముకు ధట్టీకట్టుకొని ధైర్యంగా నిలబడి రంకెలు వేస్తున్న సుగ్రీవుని చూచాడు. వాలి కోపంతో సుగ్రీవుని వైపుకు వెళ్లాడు.

వాలి మెడలో ఇంద్రుడు ఇచ్చిన బంగారు మాల ఉంది. సుగ్రీవుని మెడలో రాముడు వేసిన గజపుష్పమాల ఉంది. సుగ్రీవుని చూచి వాలి ఇలా అన్నాడు. "ఒరేయ్ సుగ్రీవా! ఈ పిడికిలితో  గట్టిగా గుద్దితే చస్తావురా! నాతో ఎందుకురా నీకు" అని అన్నాడు.

"ఓ వాలీ! నాకూ పిడికిలి ఉంది. నేనూ నీ తల మీద ఒక గుద్దు గుద్దితే తలపగిలి చస్తావు." అని మాటకు మాట బదులు చెప్పాడు సుగ్రీవుడు.

ఇంక వాలి ఊరుకోలేకపోయాడు. సుగ్రీవుని పిడికిలితో మోదాడు. సుగ్రీవునికి ఒళ్లంతా రక్తసిక్తము అయింది. సుగ్రీవుడు పక్కనే ఉన్న సాలవృక్షమును పీకి వాలి మీదికి విసిరాడు. ఆ వృక్షము దెబ్బకు వాలి కదిలిపోయాడు. వాలి సుగ్రీవులు ద్వంద్వయుద్ధమునకు తలపడ్డారు. ఒకరితో ఒకరు ఘోరంగా పోరాడుతున్నారు. తన మెడలో ఉన్న సువర్ణమాల మహిమతో వాలి బలము క్షణక్షణము వృద్ధి చెందుతుంటే, సుగ్రీవుని బలము క్షీణించసాగింది. కాని పట్టుదలతో యుద్ధం చేస్తున్నాడు. రాముని సాయం కోసం ఎదురు చూస్తున్నాడు.

వాలి సుగ్రీవులు కొమ్మలతోనూ, రాళ్లతోనూ, చెట్లతోనూ, గోళ్లతోనూ, పిడికిళ్లతోనూ ఒకరితో ఒకరు యుద్ధం చేసుకుంటున్నారు. ఇద్దరి దేహముల నుండి రక్తం కారుతూ ఉంది. వాలి దెబ్బకు తట్టుకోలేక సుగ్రీవుడు దిక్కులు చూస్తున్నాడు. సుగ్రీవుని బలం సన్నగిల్లింది అని గ్రహించాడు రాముడు. వాలిని చంపడానికి బాణం ఎక్కుపెట్టాడు. ధనుస్సును ఆకర్ణాంతము లాగి, వాలి మీదికి గురి చూచి, బాణమును వదిలాడు. రాముడు వదిలిన బాణము సరిగ్గా వాలి వక్షస్థలమును చీల్చుకుంటూ వీపు నుండి బయటకు వచ్చింది. ఆ బాణము దెబ్బతిన్న వాలి, పక్షిమాదిరి నేలకూలాడు. ఆ రోజు ఆశ్వయుజ శుద్ధపౌర్ణమి. ఆరోజు వాలి నేలకూలాడు.

వాలికి క్రమ క్రమంగా స్పృహ తప్పుతూ ఉంది. గొంతులో

గుర గుర శబ్దం వస్తూ ఉంది. వాలియుద్ధరంగంలో దీనంగా పడి ఉ న్నాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము పదునారవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

పదునేడవ సర్గ.

రాముని బాణం దెబ్బ తిన్న వాలినేల మీద పడిపోయాడు. శరీరం పడిపోయింది కానీ అతని తేజస్సు తగ్గలేదు. వాలి మెడలో ఉన్న ఇంద్రమాల, అతని గుండెల్లో గుచ్చుకున్న రామ బాణము అతనిలో ఉన్న తేజస్సును సడలిపోనివ్వడం లేదు.

తన బాణము దెబ్బకు వాలి పడి పోగానే, రాముడు, లక్ష్మణుడు వాలి దగ్గరకు వెళ్లారు. వాలి ముందు గౌరవ సూచకంగా తలవంచి నిలబడ్డారు. కొన ఊపిరితో ఉన్న వాలి రాముని చూచాడు. యుద్ధంలో గెలిచాను అన్న గర్వంతో ఉన్న రామునితో తనలో ఉన్న గర్వం తగ్గని వాలి ఇలా అన్నాడు. వాలి మాటల్లో రాముని పట్ల వినయం ఉంది. కాని పౌరుషం తగ్గలేదు. ధర్మబద్ధంగా మాట్లాడుతున్నాడు వాలి.

"నేను సుగ్రీవునితో యుద్ధం చేస్తూ నీ మూలంగా మరణిస్తున్నాను. నేను నీతో యుద్దం చేయడం లేదు కదా! నీవంక తిరిగి నీ తో యుద్ధం చేయని వాడిని చంపి నీవు ఏం సాధించావు?

నేను విన్నదానిని బట్టి రాముడు కులీనుడు. సత్త్వగుణ సంపన్నుడు. తేజస్వి. వ్రతనిష్ట కలవాడు. రాముడు కరుణామయుడు. ఎల్లప్పుడూ ప్రజలహితం కోరేవాడు. ఇతరుల పట్ల జాలి, దయ కలవాడు. ఉత్సాహవంతుడు. సమయస్ఫూర్తి కలవాడు. ధృడమైన బుద్ధికలవాడు. ఈ లోకంలో ఉన్న వారంతా నిన్ను పై గుణములతో కీర్తిస్తుంటారు కదా! పైగా నీవు రాజువు. రాజైన వాడు ఇంద్రియనిగ్రహము, ఓర్పు, ధైర్యము, బలము, పరాక్రమము, తప్పుచేసిన వారిని దండించే గుణము కలిగి ఉండాలి.

నీవు సుగ్రీవునికి అండగా, మిత్రుడుగా ఉన్నావని తార చెప్పింది. కానీ సకల సద్గుణ సంపన్నుడవైన నీవు తప్పు చేయవని నేను సుగ్రీవునితో యుద్ధానికి తలపడ్డాను. నేను సుగ్రీవునితో యుద్ధం చేసేటప్పుడు నీవు నాకు కనపడలేదు. (అంటే రాముడు చెట్టు చాటునో పొదలమాటునో దాక్కుని ఉన్నాడని వాలి అంటున్నాడు.) కాని నీ బాణం దెబ్బనాకు తగిలింది. అంటే నేను సుగ్రీవునితో యుద్దం చేస్తుంటే, నీవు నాకు కనపడకుండా మాటు వేసి నన్ను కొట్టావు అని నేను అనుకుంటున్నాను.

ధర్మాత్ముడవు అని పేరుగాంచిన నీ బుద్ధి ఇంత చెడ్డదనీ, నీవు ధర్మాత్ముడు అనే ముసుగులో అధర్మాలను ఆచరించే దుర్మార్గుడవు అనీ, పాపాత్ముడవనీ, గడ్డితో కప్పబడిన నేలబావి లాంటి వాడివనీ  నాకు తెలియక, నేను సుగ్రీవునితో ధర్మయుద్ధానికి తలపడ్డాను. రామా! నీవు సాత్వికుని వేషంలో ఉన్న పాపాత్ముడివి, నివురు కప్పిన నిప్పులాంటి వాడివి అని తెలుసుకోలేకపోయాను.

రామా! నేను నీ దేశానికి రాలేదు. నీ నగరానికి రాలేదు. నీ దేశంలో కానీ, నీ నగరంలో కానీ ఏ నేరమూ, తప్పూ చేయలేదు. నిన్ను నేను ఎన్నడూ అవమానించలేదు. నీకు ఎటువంటి అపకారము చేయలేదు. నామానాన నేను అడవులలో ఉంటూ ఫలములు, మూలములు తింటూ బతుకుతున్నాను. నీవు నరుడవు. నేను కాయలు పండ్లు తినే వానరమును. పాపం చెయ్యడం అంటే ఏమిటో నాకు తెలియదు. నేను నీతో యుద్ధం చేయడం లేదు. మరొకరితో యుద్ధం చేస్తున్నాను. అటువంటి నన్ను ఏ కారణంతో చంపావు?

రామా! నీవు రాజులలో ప్రసిద్ధుడవు. ఎన్నో శాస్త్రములను చదివావు. ప్రస్తుతము జటలు, నారచీరలు ధరించి మునివేషములో ఉన్నావు. ముని వేషములో ఉన్న నీవు ఇటువంటి క్రూరమైన పని చేయడం తగునా!

రామా! నీవు రఘు వంశములో పుట్టావు. పైకి మాత్రం ధర్మానికి ప్రతిరూపంగా కనపడతావు. కాని లోలోపల దుష్టుడివి. నీవు క్రూరత్వానికి ప్రతిరూపం. లోకానికి మాత్రం ధర్మాత్ముడు, మంచి వాడు అని చెప్పుకుంటూ తిరుగుతున్నావు. రామా! రాజుకు ఉండవలసిన గుణములు ఏవంటే---సామము, దానము, క్షమ, ధర్మగుణము, సత్యము పలకడం, పరాక్రమము, ధైర్యము. ఇవీ రాజుకు ఉండవలసిన గుణములు. రామా! మేము అడవులలో ఉంటూ ఆకులు, కాయలు, పండ్లు తిని బతికే వానరులము. నీవు నరుడివి. నరులకు రాజువు. మీకు అనుభవించడానికి రాజ్యము, వెండి, బంగారము కావాలి. కాని ఎక్కడో మారుమూల ఉన్న నా అరణ్యరాజ్యము నీకు ఎందుకు?

నీతిగా ఉంటడం, వినయము కలిగి ఉండటం, దండించతగినవారిని దండించడం, నిరపరాధులను విడిచిపెట్టడం, ఇవీ రాజు పాటించవలసిన ధర్మములు. రాజులు ఈ ధర్మములకు లోబడి ప్రవర్తించాలి కానీ వారి ఇష్టము వచ్చినట్టు ప్రవర్తించరాదు. కాని నీవు రాజువై ఉండీ పై ధర్మములను పాటించలేదు. నీ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించావు. నీకు నీ కోరికలు తీరాలి. దాని కోసం ఏమి చెయ్యడానికైనా వెనుదీయవు. పైగా నీకు కోపం ఎక్కువ. నీ మనస్సు నిలకడలేదు. రాజధర్మములను ఆచరించడంలో నీకు స్థిరమైన బుద్ధిలేదు. ఆయుధము నీ చేతిలో ఉంది కదా అని అందరినీ చంపుకుంటూపోతావు. అదీ నీ తత్త్వము.

ఓ మనుజేశ్వరా! రామా! నీకు ధర్మాచరణములో శ్రద్ధ, భక్తి లేవు. నీవు కామానికి దాసుడవు. నీ కోరికలు ఎటు లాగితే అటు వెళతావు. నాకు తెలిసీ నేను ఏ అపరాధమూ చెయ్యలేదు. అటువంటి నన్ను అకారణంగా చంపావు. ఈ చర్యను లోకుల ముందు, సాటి రాజుల ముందు, ఎలా సమర్థించుకుంటావు?

ఓ రామా! రాజును, బ్రాహ్మణుని, గోవును, అమాయకమైన జంతువులను నిర్దాక్షిణ్యంగా చంపేవాడు, వేదప్రమాణమును నమ్మని వాడు, ఇతరుల మీద చాడీలు చెప్పేవాడు, మిత్రుడికి ద్రోహం చేసేవాడు, గురువుగారి భార్యను కామించేవాడు, నరకానికి వెళతారు. నేను మనిషినికాను జంతువును. నన్ను అకారణంగా చంపావు. నీకు ఏ గతి పడుతుందో ఆలోచించుకో?

నేను జంతువును కాబట్టి నన్ను వేటాడావు అని అనుకోడానికీ వీలు లేదు. ఎందుకంటే నన్ను వేటాడి, చంపినందువలన నీకు ఏమన్నా ప్రయోజనము ఉందా అంటే అదీలేదు. నా చర్మము దేనికీ పనికిరాదు. నా వెంట్రుకలు, ఎముకలు, మీ వంటి మంచివారు తాకను కూడా తాకరు. నా మాంసము తినడానికి పనికిరాదు. ఏ ప్రయోజనమూ లేకుండా నన్ను ఎందుకు వేటాడావు?

రామా! నీ క్రూర బుద్ధిని ఊహించిన నా భార్య నాకు హితోపదేశము చేసింది. కానీ గర్వాంధుడనై ఆమె ఉపదేశము పెడచెవిని పెట్టాను. తగిన ఫలితము అనుభవించాను. ఒక శీలవతికి దుర్మార్గుడైన భర్త ఉన్నా ఒకటే లేకా ఒకటే. అలాగే నీ రాజ్యానికి, ఈ భూమికి, దుర్మార్గుడైన, శీలవంతుడుకాని నీవంటిరాజు ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే! దొంగచాటుగా దెబ్బతీసేవాడివి, ఇతరులకు అకారణంగా హాని చేసేవాడివి, నీచ బుద్ధి కలవాడివి, పైకి మాత్రం మంచి వాడిగా కనిపిస్తూ లోపల కుచ్ఛితమైన బుద్ధి కలవాడివి, పాపాత్ముడవు అయిన నీవు ఆ దశరథునికి కుమారుడిగా ఎలా జన్మించావో అర్థం కావడం లేదు. సత్పురుషులు, యోగ్యులు అయిన వాళ్లు నిందించే పనిని నీవు చేసావు. వారి ముందు నీ చర్యను ఎలా సమర్థించుకుంటావు?

రామా! నేను నీకు శత్రువును కాను. మిత్రుడను కాను. నీవు నిజంగా వీరుడవు, పరాక్రమ వంతుడివి అయితే నీ శత్రువులతో యుద్ధం చేసి గెలువు. అదీ వీరత్వము అంటే! నేను నీకు శత్రువును అని నీవు అనుకుంటే, నాతో యుద్ధమే చేయాల్సింది. ఈ పాటికి నిన్ను

యమునికి అతిథిగా పంపి ఉండేవాడిని. నన్ను ఎదిరించి పోరాడే ధైర్యము లేక, చేత కాక, చాటున ఉండి నన్ను చంపావు.

మద్యము మత్తులో నిద్రించు వాడిని పాము కాటు వేసినట్టు, నువ్వు నన్ను చాటునుండి చంపావు. నీ భార్యను వెతికి పెట్టడానికి నీవు సుగ్రీవునితోస్నేహం చేసావు అని నాకు తెలిసింది. దానికి ప్రతిఫలంగా సుగ్రీవునికి మేలు చేయడానికి నన్ను చంపావు.

రాజ్యభ్రష్టుడైన సుగ్రీవునితో స్నేహం చెయ్యడానికికి బదులుగా నీవు నా వద్దకు వచ్చి నాతో స్నేహం చేసి ఉంటే నేను ఆ రావణుని కాళ్లు చేతులు కట్టితెచ్చి నీ పాదాల ముందు పడవేసేవాడిని. ఆకాశములో గానీ, పాతాళములోకానీ, నీ సీత ఎక్కడ ఉన్నా వెతికి తెచ్చి నీకు అప్పగించి ఉండేవాడిని.

రామా! సుగ్రీవుడు నాసోదరుడు. నా తరువాత కిష్కింధకు రాజు అవుతాడు. అది ధర్మమే. కానీ నీవు నన్ను చాటునుండి చంపడం మాత్రం అధర్మము. క్షమించరాని నేరము. నీకు చేతనయితే నీవు చేసిన కార్యము ధర్మబద్ధము అని నిరూపించుకో." అని పలికి వాలి మౌనంగా ఉండిపోయాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము పదిహేడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## పదునెనిమిదవ సర్గ.

వాలి అన్న మాటలు అన్నీ ఓపికగా విన్నాడు రాముడు. వాలి మౌనం వహించగానే రాముడు వాలి చేసిన ఆరోపణలను అన్నీ సమర్థవంతంగా తిప్పికొట్టాడు.

"ఓ వాలీ! నీకు ధర్మము, అర్థము, కామము అంటే ఏమిటో తెలియవు. లోక మర్యాదలు తెలియవు. నన్ను మాత్రము నీ ఇష్టం వచ్చినట్టు నిందించావు. నాతో మాట్లాడే ముందు. నన్ను నిందించే ముందు, నీవు నీ పెద్దలతో, పండితులతో చర్చించి ఉండాల్సింది.

ఈ అరణ్యములు, పర్వతములు, సమస్తజంతుజాలము అన్నీ ఇక్ష్వాకు వంశపు రాజులకు చెందినవి. ఈ అడవిలోని జంతు జాలమును. మనుష్యులను, రాక్షసులను రక్షించడానికి కానీ, శిక్షించడానికి కానీ, ఇక్ష్వాకు వంశము రాజులకే అధికారము కలదు. ప్రస్తుతము ఈ భూమినంతా భరతుడు పరిపాలిస్తున్నాడు. అతడు నిత్యసత్యవ్రతుడు. ధర్మము తెలిసినవాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయగల సమర్థుడు. భరతుడు దేశ,కాల,మాన పరిస్థితులను గుర్తెరిగి పాలించే రాజు.

భరతుని ఆజ్ఞమేరకు, ధర్మరక్షణ చేయుటకు, మేము ఈ ప్రాంతం అంతా సంచరిస్తున్నాము. ధర్మనిరతుడైన భరతుని పాలనలో అధర్మమునకు తావు లేదు. ధర్మవిరుద్ధముగా ఎవరూ ప్రవర్తించరు. కాని మేము భరతుని ఆజ్ఞమేరకు ధర్మవిరుద్ధముగా ప్రవర్తించే వారిని

గుర్తించి, వారిని తగిన విధంగా శిక్షిస్తూ, ధర్మరక్షణ చేస్తూ ఉంటాము. ఆ క్రమంలో మేము నీ రాజ్యమునకు వచ్చాము. నీవు ధర్మాతిక్రమణ చేసినట్టు ఋజువు అయింది. కామభోగములకు ప్రాధాన్యము ఇచ్చి, నిందార్హమైన పనులుచేసినట్టు మా దృష్టికి వచ్చింది.

నీకు ధర్మం గురించి చెబుతాను విను. జన్మనిచ్చిన తండ్రి, తనకన్నా ముందు పుట్టిన అన్న, విద్య చెప్పిన గురువు, వీరు ముగ్గురూ కన్న తండ్రితో సమానము. అలాగే, తన కన్నా తరువాత పుట్టిన తమ్ముడు, తన కుమారుడు, తన శిష్యుడు. పుత్రసమానులు. ఓ వానరా! సత్పురుషులు ఆచరించే ధర్మమును కేవలము ఆత్మతో తెలుసువలెనే కానీ, బాహ్య కర్మల వలన తెలుసుకోలేరు. గుడ్డి వాడిని మరొక గుడ్డివాడు నడిపించినట్టు, చంచల స్వభావుడవైననీవు, నీ మాదిరే చంచల స్వభావులైన నీ తోటి వానరులతో ఆలోచించి ధర్మాధర్మనిర్ణయము చేయగలవా!

నీవు ఇంతవరకూ నేను నిన్ను చంపాను అన్న కోపంతో మాట్లాడావు. నేను నిన్ను ఎందుకు చంపానో చెబుతాను విను. నీ తమ్ముని భార్య నీకు కోడలి వంటిది. నీవు ధర్మము తప్పి నీ సోదరుడు జీవించి ఉండగానే అతని భార్య రుమను కామాంధుడవై నీ వద్ద ఉంచుకున్నావు. ఓ వానరా! నీవు ధర్మమును అతిక్రమించి నీ తమ్ముడి భార్యను కామవాంఛతో తాకావు కాబట్టి, నీవు చేసిన పాపమునకు నీకు మరణదండన విధించడమైనది. లోకాచారమును మరిచి, ధర్మవిరుద్ధముగా ప్రవర్తించు వారికి మరణ దండనే సరి అయిన ప్రాయశ్చిత్తము.

నేను ఉత్తమ కులములో పుట్టిన క్షత్రియుడను. ఇటువంటి అధర్మకార్యము సహించను. ఎవరైనా కామము చేత తన కుమార్తెను, సోదరిని, తమ్ముని భార్యను కోరితే, వారికి దండన విధించడం క్షత్రియ ధర్మము. ఆ ధర్మమే నేను నిర్వర్తించాను.

మరలా చెబుతున్నాను. ఈ భూమి అంతా భరతుని రాజ్యములోనిది. మేము భరతుని ఆజ్ఞను పాలిస్తున్నాము. ధర్మరక్షణ చేస్తున్నాము. నీవు ధర్మమార్గము తప్పి నడుస్తున్నావు అని తెలిసి కూడా నిన్ను ఎలా క్షమించగలము. ధర్మము ప్రకారము రాజ్యము చేయు భరతుడు అధర్మపరులను నాశనం చేస్తాడు. మేము భరతుని ఆజ్ఞమేరకు నీవంటి అధర్మపరులను శిక్షించడానికి కంకణము కట్టుకున్నాము.

ఓ వానర రాజా! నీవు అన్నట్టు నేను సుగ్రీవునితో స్నేహం చేసాను కానీ, ధర్మబద్ధంగా స్నేహము చేసాను. దానికి మూలము రాజ్యము, నా భార్యసీత. సుగ్రీవుడు నాకు సాయం చేస్తాడు. నేను అతనికి సాయం చేస్తాను. రెండూ ధర్మబద్ధంగా చేసే సహాయాలే. నేను వానరుల ఎదుట, నిన్ను చంపి సుగ్రీవునికి రాజ్యము ఇప్పిస్తానని ప్రతిజ్ఞ చేసాను. ఆ ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నాను. ఇందులో తప్పేముంది. ధర్మబద్ధంగా చేసిన ప్రతిజ్ఞనునెరవేర్చడం క్షత్రియ ధర్మం కదా!

నేను పైన చెప్పిన కారణముల వలన నీకు ధర్మబద్ధంగా తగిన దండన విధింపబడింది. ఆ దండన నీవు అంగీకరించక తప్పదు. నీకు దండన విధించడం ధర్మసమ్మతము అని నీవు గ్రహించాలి. నేను ధర్మమును పాటిస్తున్నాను కాబట్టి స్నేహితుడ వైన నీకు దండన విధించి

ఉపకారమే చేసాను.

ఈ సందర్భంలో నీకు మనువుచెప్పిన మాటలు వినిపిస్తాను. విను. పాపములు చేసిన మానవులు, రాజులచే దండింపబడి, వారు చేసిన పాపములనుపోగొట్టుకొని, పుణ్యాత్ములై స్వర్గమునకు వెళ్తారు. చేసిన పాపమునకు దండన అనుభవిస్తే, ఆ పాపము పోతుంది. ఆ నేరము చేసిన వాడు పాపము నుండి విముక్తుడవుతాడు. ఒక వేళ రాజు పాపము చేసిన వాడికి దండన విధించకపోతే, ఆ పాపము రాజుకు సంక్రమిస్తుంది. పూర్వము మాంధాత అనే చక్రవర్తి, నీవు చేసినటువంటి  పాపమే చేసిన ఒక వ్యక్తిని దండించకుండా వదిలిపెట్టాడు. దాని ఫలితంగా, అతడు చేసిన పాపము మాంధాతకు సంక్రమించింది. ఒక్క మాంధాత కాదు. ఎంతో మంది రాజులు, దండించతగిన వారిని దండించకుండా వదిలిపెట్టి, పాపములను పొందారు.

ఓ వానర రాజా! నేనేదో స్వతంత్రంగా ప్రవర్తించి నిన్ను చంపాను అని అనుకోవద్దు. నేనుస్వతంత్రుడను కాను. ధర్మశాస్త్రము ప్రకారము నడుచుకోవలసిన వాడను. నా ఇష్టం వచ్చినట్టు చేయడానికి వీలులేదు.

ఓ వానర రాజా! నిన్ను దండించుటకు మరొక కారణము కూడా చెబుతాను విను. మానవులకు, ప్రత్యేకించి క్షత్రియులకు, వేట నిషిద్ధము కాదు. జంతువులను వేటాడేటప్పుడు మాటు వేసిచంపడం సర్వసాధారణం. వేటలో మృగములు పరుగెత్తుతున్నా, భయపడి నిలిచిపోయినా, ఏమరిపాటుగా ఉన్నా, అటువంటి మృగములను

చంపడం పాపం కాదు. ధర్మము తెలిసిన ఎంతో మంది రాజర్షులు కూడా వేటకు వెళ్లేవారు. నీవు వానరుడవు. మృగజాతికి చెందినవాడివి. అందుకని క్షత్రియధర్మము ప్రకారము నిన్ను వేటాడాను. నీవు నాతో యుద్ధం చేస్తున్నా లేక సుగ్రీవుడితో యుద్ధం చేస్తున్నా, నువ్వు వానరుడివే కదా! నువ్వు నాతో యుద్ధం చేసేటప్పుడు మాత్రమే చంపాలి అనే నియమం లేదు.  అందుకని ఒక రాజుగా నిన్ను దండించే ప్రక్రియలో భాగంగా నిన్ను చంపాను.

రాజులు ధర్మమును రక్షించడానికే పుట్టారు. క్షత్రియులు మానవరూపంలో భూమి మీద నడయాడుతున్న దేవతలు. అందుచేత దండన విధించిన రాజులను నిందించడం ధర్మం కాదు. నేను మా తండ్రి తాతల నుండి అనుసరిస్తున్న ధర్మము ప్రకారము నీకు దండన విధించాను. నీవేమో ధర్మం తెలియక నన్ను నిందించావు." అని అనునయంగా చెప్పాడు రాముడు.

రాముని మాటలు విన్న వాలికి కనువిప్పు కలిగింది. ధర్మము తెలుసుకున్న వాలి, రాముని యందు తప్పులేదని గ్రహించాడు. అప్పుడు వాలి రామునికి నమస్కరించి ఇలా అన్నాడు.

"ఓ రామా! నీవు చెప్పినది అక్షరసత్యము. ఏ సందేహమూ లేదు. ధర్మం తెలియకుండా, అజ్ఞానంతో నేను పలికిన మాటలను పట్టించుకోవద్దు. నీవు అన్ని ధర్మములను తెలిసిన వాడవు. ప్రజలకు మేలుచెయ్యాలని ఎల్లప్పుడూ కోరుకొనేవాడివి. అందుకని ధర్మాధర్మ నిర్ణయమునకు నీవే సమర్థుడివి.

ఓ రామా! నేను అధర్మంగా ప్రవర్తించాను. తగిన దండన అనుభవించాను. రామా! నా దిగులు అంతా నా కుమారుడు అంగదుడి గురించి. అంగదుడు చిన్నప్పటి నుండి చాలా గారాబంగా పెరిగాడు. నేను కనపడకపోతే ఆహారమూ నీరూ ముట్టడు. నా కుమారుడు చిన్నవాడు. లోకానుభవము లేదు. వాడిని నీవు రక్షించాలి. నీవు సుగ్రీవుని యందు ఎంతటి అనురాగం చూపుతావో అదే మాదిరి అంగదుని కూడా దయతో చూడు.

ఓ రామా! నీవు నీ తమ్ములు లక్ష్మణుని, భరతుని ఏ విధంగా మన్నిస్తావో, అదే మాదిరి సుగ్రీవునీ, అంగదునీ మన్నించు. చేసిన తప్పంతా నాదే. ఇందులో నా భార్య తారకు ప్రమేయం లేదు. నేను చేసిన అపరాధమునకు నా భార్య తారను నా తమ్ముడుసుగ్రీవుడు అవమానించకుండా చూడు.   నా భార్య తార నీ గురించి చెప్పి నన్ను వారించినా, నేను ఆమె మాటలను పెడచెవిని బెట్టి సుగ్రీవునితో యుద్ధానికి తలపడినందుకు ఫలితంగా నీ చేతిలో మరణిస్తున్నాను." అనిపలికి మౌనంగా ఉన్నాడు వాలి.

వాలి పలికిన పలుకులు విన్న రాముడు ఈ విధంగా సమాధానం ఇచ్చాడు. "ఓ వానర రాజా! నీ కొడుకు అంగదుని గురించి, నీ భార్య తార గురించి నీవు దిగులు చెందవద్దు. మరొక మాట. నేను నిన్ను అనవసరంగా అన్యాయంగా చంపానని నీవు మనసులో బాధపడవద్దు. నీవేదో మహా పాపము చేసావని తలంచ వద్దు. నీవు పొరపాటు చేసావు. నేను నిన్ను దండించడానికి నిశ్చయించుకున్నాను. శిక్షింప తగ్గవాడిని శిక్షించిన రాజు, శిక్ష అనుభవించతగి ఉండి. ఆ శిక్షను అనుభవించిన నేరస్తుడు, ఇద్దరూ

ఉత్తమ గతులుపొందుతారు. ఆ కారణం చేత తప్పుచేసిన నీవు నేను విధించిన దండనతో నీవు చేసిన పాపములు అన్నీ తొలగిపోయాయి. నీవు ఇప్పుడు నీ సహజమైన వాలి స్థితిని (సుగ్రీవుని వెళ్లగొట్టి అతని భార్య రుమను కామంతో పొందక ముందు ఉన్న స్థితి) పొందావు.

ఓ వాలీ! ఇది దైవ నిర్ణయము. దీనిని తప్పించుకోలేవు. కాబట్టి నీలో ఉన్న కోపమును మోహమును విడిచి శాంతము వహించు. నీవు కోరినట్టు గానే, అంగదుడు ఇప్పటిదాకా నీ పట్ల ఎంతటి అనురాగాన్ని, ప్రేమను ప్రదర్శిస్తున్నాడో, సుగ్రీవుని పట్ల, నా పట్ల అదే అనురాగాన్ని ప్రదర్శించగలడు." అని వాలిని అనునయించాడు రాముడు.

రాముని మాటలను విని వాలి "ఓ రామా! నీవు నన్ను బాణంతో కొట్టి చంపావు అన్న కోపంలో శక్తి తగ్గి, కోపం పెరిగి, నిన్ను ఏమేమోఅన్నాను. నన్నుక్షమించు." అని అన్నాడు వాలి.

తాను చేసిన ఆరోపణలకు రాముడు ఇచ్చిన సమాధానానికి హేతుబద్ధమైన ప్రతిసమాధానాన్ని ఇవ్వలేకపోయాడు వాలి. పైగా అవసాన దశలో ఉన్నాడు. శరీరం క్షణక్షణానికి క్షీణించి పోతూ ఉంది. శక్తి తగ్గిపోతూ ఉంది. వాలి ప్రాణాలు అతని దేహాన్ని విడువ డానికి సిద్ధంగా ఉన్నాయి. ఆ సమయంలో వాలి స్పృహ తప్పి పడిపోయాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము 18 సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# కిష్కింధా కాండము 19 సర్గ

వాలిని రాముడు తన బాణంతో కొట్టడం, వాలి పడిపోవడం, చనిపోయే స్థితిలో ఉండటం వాలి భార్య తారకు తెలిసింది. వాలి, తారల కుమారుడు అంగదుడు ఆమె పక్కనేఉన్నాడు. తార, అంగదులు వాలి దుర్మరణానికి ఎంతో దు:ఖించారు. వాలి దగ్గరకు పరుగు పరుగున వస్తున్నారు.

అప్పటికే, ధనుస్సును ధరించి, కాలయముని మాదిరి నిలబడి ఉన్న రాముని చూచి వానరులు అందరూ పారిపోయారు. పారి పోతున్న వానరులను చూచింది తార. తార వారిని చూచి ఇలా పలికింది. “ఓ వానరులారా! ఇప్పటి వరకూ మీరు మీ రాజు వాలి వెంట ఉండే వాళ్లు కదా. ఇప్పుడు ఎందుకు ఇలా పారిపోతున్నారు. రాజ్యం కోసరం సుగ్రీవుడు, తాను ఏమీ చేయలేక, రాముని సాయంతో మీ రాజు వాలిని చంపించాడు. మీరు ఎందుకు పారిపోతున్నారు? భయపడకండి. పారిపోకండి.  నాతో రండి.” అని అన్నది తార.

పారిపోతున్న వానరులు తార మాటలు విని వెనక్కు తిరిగి వచ్చారు. తారను చూచి ఇలా అన్నారు. “అమ్మా తారా! ముందు నీవు, నీ కుమారుడు అంగదుడిని రక్షించుకో. లేకపోతే రాముడు  అంగదుడిని కూడా చంపుతాడు. సుగ్రీవునికి అడ్డం లేకుండా చేస్తాడు. రాముడు వాలిని చంపగానే, మేమందరమూ భయంతో పారిపోయాము. అమ్మా తారా! నీవు అంగదుని రాజుగా అభిషేకించు. మేమందరమూ అంగదుని, వాలిని సేవించినట్టు సేవిస్తాము.” అని ఎవరికి తోచినట్టు

వారు అరిచారు.

మరి కొందరు తారను చూచి "తారా! నీవు అంగదుడు ఇక్కడ ఉండటం మంచిది కాదు. సుగ్రీవుడు, అతని మంత్రులు రాజదుర్గములను ఆక్రమించుకుంటున్నారు. ఇప్పటిదాకా మనము సుగ్రీవుని అతని మంత్రులను నానా కష్టాలుపెట్టాము. వాళ్లు ఇప్పుడు మనమీద పగతీర్చుకొనే అవకాశం ఉంది. కాబట్టి నీవు అంగదునితో కలిసి పారిపో" అని సలహా ఇచ్చారు.

ఆ మాటలు విన్న తార వారితో ఇలా అంది.
"ఓ వానరవీరులారా! నా సర్వస్వము అయిన నా భర్త పోయాక, నాకు ఈ రాజ్యంతో, నా కొడకుతో, ఈ శరీరంతో పనేముంది. నేను నా భర్త వద్దకు వెళ్లాలి. నా భర్త ఎక్కడ ఉన్నాడు. ఏస్థితిలో ఉన్నాడు." అంటూ ఏడుస్తూ వాలి వద్దకు పరుగెత్తింది.

దుందుభి లాంటి రాక్షసులను మట్టుబెట్టిన వాలి, పరాక్రమంలో దేవేంద్రునితో సమానమైన వాలి, మరణావస్థలో నేలమీద పడి ఉండటం చూచింది. వాలి దేహము పక్కన ధనుస్సు ఊతంగా పట్టుకొని నిలబడి ఉన్న రాముని, లక్ష్మణుని, తన భర్త వాలి తమ్ముడు సుగ్రీవునీ చూచింది. నేరుగా వెళ్లి తన భర్త శరీరం మీద పడిపోయింది. "ఆర్య పుత్రా! లేవండి. నేను మీ తారను వచ్చాను లేవండి." అంటూ రోదిస్తూ ఉంది.

తన వదిన తారను, తన అన్నకుమారుడు అంగదుని చూచి సుగ్రీవునికి దు:ఖము ఆగలేదు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము పంతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ఇరవదవ సర్గ.

రాముని బాణం దెబ్బతిని చావుబతుకుల్లో ఉన్న భర్త వాలిని చూచి తార భోరున ఏడిచింది. "ఓ వీరుడా! నీవు లోకోత్తర వీరుడవే. నీ వీరత్వము, పరాక్రమము ఏమైపోయాయి. ఎందుకు ఇలా దీనంగా నేల మీద పడి ఉన్నావు. నేను, నీ భార్య తారను, వచ్చాను. లే. నన్ను పలకరించు. నీవు మహారాజువు. ఇలా నేల మీద పడుకోవడం తగునా. లేచి మెత్తని హంసతూలికా తల్పం మీద పడుకో. ఓ భూనాధా! ఇన్నాళ్లు ఈ భూమిని పాలించిన నీవు, అవసాన సమయంలోకూడా భూదేవిని వదల లేక. ఆమెను కౌగలించుకొని పడుకున్నావా!

ఓ వానరవీరా! ఎంతో కష్టపడి, స్వర్గాన్ని తలదన్నే విధంగా, ఈ కిష్కింధను నిర్మించావు. ఇప్పుడు ఆ కిష్కింధను వదిలి ఎక్కడకు పోతున్నావు? నాధా! నేను నీ వియోగము తట్టుకోలేకున్నాను. నన్ను విడిచి వెళ్లవద్దు. నిన్ను ఈ స్థితిలో చూచి కూడా నా హృదయం బద్దలు కాలేదంటే, నా గుండె కఠినమైన పాషాణము అనుకుంటాను. అయినా కాలగతిని ఎవరు తప్పించగలరు. ఈ కాలమే నిన్ను సుగ్రీవుని

చేతిలో మరణించేట్టు చేసింది.

నాథా! నేను నీకు భార్యగా ఉన్నాను. నేను కాకుండా ఎంతో మంది స్త్రీలు ఉన్నారు కదా! కానీ నీవు ఆ సుగ్రీవుని భార్యను కోరుకున్నావు. అతనిని రాజ్యము నుండి వెళ్లగొట్టావు. దాని ఫలితమే నీకు సంప్రాప్తించిన ఈ దుర్మరణం. నాథా! నీవు సుగ్రీవునితో యుద్ధానికి పోకముందు ఎన్నోవిధాలుగా చెప్పాను. సుగ్రీవునితో సంధి చేసుకోమన్నాను. కానీ నీవు నా మాటలను పెడచెవిని పెట్టావు. పైగా నన్ను నిందించావు. కోరి కోరి మరణాన్ని కౌగలించుకున్నావు.

నాథా! రాముడు నిన్ను చంపినందుకు నేను విచారించడం లేదు. కానీ ఏ నాడూ కష్టము గానీ, దు:ఖము కానీ అనుభవించని నేను ఈ వైధవ్య దు:ఖమును అనుభవించవలసి రావడం చాలా బాధగా ఉంది. నాథా! నీ కుమారుడు అంగదుని చూడండి. చిన్నప్పటి నుండి అల్లారుముద్దుగా పెరిగాడు. ఇప్పుడు పినతండ్రి సుగ్రీవుని వశమయ్యాడు. ఎన్ని బాధలు పడతాడో ఏమో!

నాయనా! అంగదా! నీ తండ్రివాలిని చూడు. కడసారి దర్శనం చేసుకో. ఇంక మీదట రోజూ చూచే నీ తండ్రి ముఖం రేపటి నుండి నీకు కనిపించదు. నాథా! నీ కుమారుడు అంగదుడు నిన్నుపిలుస్తున్నాడు. అంగదుని పలకరించు. అతనికి జీవితంలో నడుచుకోవలసిన జాగ్రత్తలు చెప్పు.

నాథా! నిన్ను చంపడం ద్వారా రాముడు తన ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నాడు. సుగ్రీవునికి ఇచ్చిన మాటను నిలబెట్టుకున్నాడు.

ఓ సుగ్రీవా! నీ కోరిక తీరింది కదా! ఇంక నీ భార్య రుమ నీకు లభిస్తుందిలే. నీవు ఏ దిగులు, భయమూ లేకుండా ఈ కిష్కింధను ఏలుకో! నీ అన్న వాలిని చంపించావు కదా! ఇంకనీకు అడ్డేముంది.

నాధా! నేను ఇంతగా మాట్లాడుతున్నా నువ్వు ఒక్కమాట కూడా పలుకవేమి? మాట్లాడు. నేనే కాదు. నీ భార్యలందరూ వచ్చి ఉన్నారు. వారి వంక కన్నెత్తి చూడు. వారిని పలకరించు." అని తార, ఆమెతో వచ్చిన వాలి భార్యలు వలా వలా ఏడుస్తున్నారు. అంగదుని పట్టుకొని రోదిస్తున్నారు.

తారకు ఇంకా ఆశ చావలేదు. వాలి మరలా బతుకుతాడని ఆశతో వాలిని కుదిపి కుదిపి ఏడుస్తూ ఉంది. "ఓ నాధా! నేను, అంగదుడు ఏమి అపరాధము చేసామని మమ్ములను విడిచి పోతున్నావు. తెలిసో తెలియకో మేము నీ పట్ల ఏమైనా అపరాధము చేస్తే దానిని క్షమించు. నీ పాదాలు పట్టి వేడుకుంటున్నాను." అని వాలి పాదాల మీద తల పెట్టి ఏడుస్తూ ఉంది తార. భర్త లేని బతుకు తనకు వ్యర్థమని ఎంచి, తార తన భర్త వాలితో పాటు ప్రాయోపవేశము చెయ్యాలని నిర్ణయించుకుంది.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ఇరువదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## ఇరువది ఒకటవ సర్గ.

తార అలా ఏడుస్తుంటే హనుమంతుడు ముందుకు వచ్చి ఆమెను ఓదారుస్తున్నాడు.

"అమ్మా! తారా! మనము చేసిన కర్మలను బట్టి ఫలితాలు వస్తుంటాయి. వాలి తాను చేసిన అకృత్యములకు ఫలితము అనుభవించాడు. దీనికి చింతించి ప్రయోజనము లేదు. ఈ దేహములు నీటి బుడగలు. కాలానుగుణంగా అవి బద్దలు అవుతుంటాయి. అందరూ ఎప్పుడో ఒకప్పుడు పోవలసిన వారమే. పోయిన వాలి గురించి విచారించే కంటే బతికి ఉన్న అంగదుని క్షేమం గురించి విచారించు. పుట్టిన ప్రతి ప్రాణీ చావక తప్పదు. కాబట్టి చనిపోయిన వారి గురించి ఆలోచించక, నీ శేషజీవితములో శుభం కలగాలని కోరుకో! అదే ప్రస్తుత కర్తవ్యము.

ఇప్పటి దాకా ఈ కిష్కింధలో ఉన్న వేలకొలది వానరులు వాలి సంరక్షణలో హాయిగా జీవించారు. ఇప్పుడు వాలి లేడు. స్వర్గమునకు వెళ్లాడు. స్వర్గసుఖములు అనుభవించుచున్న వాలి గురించి దు:ఖించడం అవివేకము. ఈ కిష్కింధలో ఉన్న వేలాది వానరులకు, భల్లూకములకు వాలి మరణానంతరము నీవు, అంగదుడు రక్షకులు. అంగదునికి పట్టాభిషేకము చేస్తాము. నీ సంరక్షణలో అంగదుడు రాజ్యము చేస్తాడు. తదుపరి కార్యక్రమములు

నిర్వర్తించమని సుగ్రీవునికి ఆదేశములు ఇవ్వు. ఇప్పుడు అంగదుడు, సుగ్రీవుడు, వాలికి శాస్త్రములలో నిర్ణయింపబడినట్టు ఉత్తర క్రియలు నిర్వహించాలి. వాలికి దహన సంస్కారములు చెయ్యాలి." అని పలికాడు హనుమంతుడు.

భర్త మరణముతో బాధ పడుతున్న తార, హనుమంతుని మాటలు విని ఇలా అంది. "హనుమా! నాకు నా భర్త లేకపోయిన తరువాత అంగదుని వంటి కుమారులు నూరు మంది ఉన్నా ఏమి ప్రయోజనము. నా శక్తి, నా సామర్థ్యము అన్నీ నా భర్తతోనే పోయాయి. నేను అశక్తురాలను. అన్ని వ్యవహారములు అంగదుని పినతండ్రి సుగ్రీవుని ఆజ్ఞప్రకారమే చెయ్యండి. అంగదుని యోగక్షేమములు విచారించుటకు నేను అర్హురాలిని కాను. అది తండ్రి బాధ్యత. తండ్రి లేనపుడు పినతండ్రి బాధ్యత. కాబట్టి అంగదుని యోగక్షేమముల గురించి సుగ్రీవుడు చూచుకొన గలడు. ఇన్నాళ్లు నేను నా భర్త వాలిని సేవించాను. ఇప్పుడు ఆయన పోయిన మార్గమునే అనుసరిస్తాను. నా భర్త పక్కనే నేను ఉంటాను. ఇది నా నిశ్చయము." అని పలికింది తార.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ఇరువది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

ఇరువది రెండవ సర్గ.

అప్పటికి వాలి ప్రాణాలు ఇంకా పోలేదు. కొన ఊపిరితో కొట్టుకుంటున్నాడు. నెమ్మదిగాకళ్లు తెరిచాడు. తార వంక చూచాడు. తన కుమారుడు అంగదుని వంక, తార వంక మార్చి మార్చి చూచాడు. సుగ్రీవుని తన దగ్గరకు పిలిచాడు. అతి కష్టం మీద ఇలా అన్నాడు.

“సుగ్రీవా! నేను నీ పట్ల చాలా అపరాధము చేసాను. నన్ను క్షమించు. నా బుద్ధి వక్రించి నీ భార్యను నా దగ్గర ఉంచుకొని నిన్ను రాజ్యము నుండి వెడలగొట్టాను. మన ఇద్దరిలో ఎవరో ఒకరే ఉండవలెనని బ్రహ్మ రాసి ఉన్నాడు. అందుకే నేను యమలోకమునకు పోతున్నాను. నీవు ఈ కిష్కింధను పాలించు. ఎవరి చేతిలోనూ ఓడి పోని నేను రామునిచేతిలో ఓడిపోయాను. ధర్మానికి ఓడిపోయాను.

నా మరణావస్థలో నేను నీకు ఒక మాట చెపుతాను. సావధానంగా విను. వీలైతే ఆచరణలో పెట్టు. నా కొడుకు అంగదుడు. చిన్నవాడు. చూడు ఎలా నేల మీద పడి పొర్లుతున్నాడో. అంగదుడు చిన్నప్పటి నుండి. సుఖాలలో పెరిగాడు. కష్టము అంటే ఎరుగడు. వాడిని నేను నా ప్రాణముల కంటే ఎక్కువగా చూచుకున్నాను. నా కుమారుడు అంగదుని నీ కుమారునిగా భావించు. వాడికి ఏ లోటూ రాకుండా చూచుకో. ఇంక మీదట నుండి అంగదునికి తండ్రివి, దాతవు, రక్షకుడివి, అభయ ప్రదాతవు అన్నీ నువ్వే.

అంగదుడు నీకు అన్ని విధాలా తోడ్పడగలడు. యుద్ధములో

నీకు అండగాఉండి అన్ని విధాలా నా కొడుకు అనిపించుకుంటాడు. ఇంక ఈమె నా భార్య తార. సుషేణుని కుమార్తె. ఎంతటి క్లిష్ట సమస్యనైనా చక్కగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోడంలో సమర్థురాలు. ఎటువంటి ఉపద్రవకర పరిస్థితులకు కూడా ఎదురు నిలిచి, సమర్థంగా ఎదుర్కొనే సామర్థ్యం కలది. తార ఆలోచించి చేయమన్న కార్యమును నీవు నిస్సందేహంగా చేయవచ్చును. నీకు జయం లభిస్తుంది.

తరువాత, నీవు రామునితో ఏ కార్యము నిమిత్తము మైత్రి చేసుకున్నావో ఆ కార్యమును తక్షణం నెరవేర్చు. రాముడిని అవమానించకు. మోసగించకు. అలాచేస్తే రాముడు నా మాదిరి నిన్ను కూడా చంపుతాడు.

సుగ్రీవా! నా మెడలో ఉన్న బంగారు మాల నాకు ఇంద్రుడు ఇచ్చాడు. దానిని నీవు వెంటనే తీసుకో. అది నా ఒంటిమీద ఉండగా నేను చనిపోతే దానికి శవదోషం తగులుతుంది. అప్పుడు దాని మహత్తు పోతుంది. కాబట్టి వెంటనే తీసుకొని నీ మెడలో వేసుకో." అని అన్నాడు వాలి.

వాలి మాటలు విని సుగ్రీవునికి దు:ఖము పొర్లుకొచ్చింది. ఏడుస్తూనే వాలి మెడలో ఉన్న బంగారు మాలను తీసుకొని తనమెడలో వేసుకున్నాడు. వాలి అంగదుని వంక చూచి ఇలా అన్నాడు. "కుమారా! అంగదా! ఇంక మీదట నీకు అన్నీ నీ పినతండ్రి సుగ్రీవుడే. సు:ఖము వచ్చినా, దు:ఖము వచ్చినా ఓర్చుకో. కాలానుగుణంగా ప్రవర్తించు. సుగ్రీవుని ఆజ్ఞలను పాలించు. నేను కాబట్టి నీవు ఏమి చేసినను

ఓర్చుకున్నాను. సహించాను. కాని ఇదివరకటి మాదిరి చేస్తే సుగ్రీవునికి కోపం రావచ్చు. కాబట్టి జాగ్రత్తగా నడుచుకో. సుగ్రీవునికి కోపం తెప్పించకు.

ఇంకొక మాట. నీవు ఇంక మీదట సుగ్రీవుని అధీనంలో ఉండబోతున్నావు. సుగ్రీవుని శత్రువులతో స్నేహం చేయకు. అలాగే సుగ్రీవుని మిత్రులతో శత్రుత్వం పెట్టుకోకు. సుగ్రీవునికి ఇష్టమైన పనులనే చేస్తూ ఉండు.   ఇంకొక విషయం. నీవు ఎవరి పట్ల ఎక్కువ ప్రేమ, అలాగే ఎక్కువ ద్వేషము కలిగి ఉండకు. ఎందుకంటే అతిగా ఉండటం ఎప్పుడూ అనర్థాలకు దారి తీస్తుంది. కాబట్టి రాగద్వేషాలలో సమతుల్యం పాటించు. మధ్యస్తంగా వ్యవహరించు."

అలా మాట్లాడుతూనే వాలి ఆఖరిశ్వాస విడిచాడు. వాలి మరణించాడు అని తెలియగానే వానరులందరూ బిగ్గరగా ఏడవడం మొదలెట్టారు. వాలి మరణంతో కిష్కింధా నగరము కళావిహీన మయింది. వాలి యొక్క పరాక్రమము, వీరత్వము, వాలి చేసిన యుద్ధములు, వాలి చంపిన వారి గురించి వానరులు తలచుకొని తలచుకొని ఏడుస్తున్నారు. తన కళ్ల ఎదుటే ప్రాణాలు విడిగిన తనభర్త వాలినిచూచి తట్టుకోలేక తార వాలి శరీరం మీద పడి ఏడుస్తూ ఉంది.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ఇరువది రెండవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# కిష్కింధాకాండము

## ఇరువది మూడవ సర్గ.

తార తన భర్త ముఖాన్ని చూస్తూ తట్టుకోలేక ఈ విధంగా విలపిస్తూ ఉంది. "నాధా! అర్ధరాత్రి సుగ్రీవునితోయుద్ధానికి పోవద్దని నేను నీకు శతవిధాలా చెప్పాను. కానీ నీవు నా మాటను పెడచెవిని పెట్టావు. అందుకే నేను ఇక్కడే ఉన్నా భూదేవిని కౌగలించుకొని పడుకున్నావు. ముల్లోకాలను గడగడలాండిచి ఎవరికీ లొంగని నీవు, నీ తమ్ముడు, నీ కన్నా దుర్బలుడైన సుగ్రీవుని చేతిలో ఓడిపాయావా! ఎంత ఆశ్చర్యము.

నాధా! వానర నాయకులు, భల్లూకనాయకులు నిన్ను సేవించడానికి వచ్చారు. లే. వారిని ఆదరించు. వారితో మాట్లాడు. నీవు నీ శత్రువులను చంపి వారిని భూతల శయనము చెందేట్లు చేసావు. ఇప్పుడు నీవు కూడా నీశత్రువు చేతిలో చంపబడి భూతలము మీద శయనించి ఉన్నావా!

నాధా! నన్ను అనాధనుచేసి నీవు ఒంటరిగా వెళ్లిపోవడం నీకు న్యాయంగా ఉందా నాధా! ఈ లోకంలో బుద్ధి ఉన్న వాడు ఎవ్వడూ తన కుమార్తెను వీరుడికి, పరాక్రమవంతుడికి ఇవ్వకూడదు. ఎందుకంటే శూరుడి భార్యకు నా మాదిరి అకాల వైధవ్యము తప్పదుకదా! వారు శోక సముద్రములో మునిగి పోక తప్పదు కదా! నీ మరణము కనులారా చూచికూడా నా హృదయము బద్దలు కాలేదంటే, నా గుండె కఠిక పాషాణముతో సమానము కదా! నాధా! ఈ లోకంలో స్త్రీకి ఎన్ని సంపదలు ఉన్నా, ఎంత వైభవము

ఉన్నా, భర్తలేకపోతే ఆమెను విధవ అనే అంటారు. అటువంటి వైధవ్యము నాకు సంప్రాప్తించింది. ఎలాభరించాలి! ఈ సమయంలో నిన్ను తనివిదీరా కౌగలించుకొని ఏడవకుండా నీ శరీరం రక్తసిక్తమయింది. సుగ్రీవుని ఆశలు నెరవేర్చిన ఈ రాముని బాణము ఇంకా నీ శరీరంలో ఎందుకు ?"అంటూ తార వాలి శరీరంలో నుండి రాముని ధనుస్సు వెడలిన బాణమును బయటకు లాగింది.

వాలి శరీరంనుండి రామ బాణమును బయటకు లాగ గానే, ఆ గాయము నుండి రక్తం జలధార మాదిరి పైకి ఉబికింది. తార తన కళ్లనుండి నీరు కారుతుండగా వాలి గాయము నుండి స్రవించిన రక్తాన్ని తుడిచింది. తార తన కుమారుడు అంగదుని చూచి ఇలా అంది.

"నాయనా! అంగదా! నీ తండ్రిని కడసారి చూచి నమస్కారం చెయ్యి."

వెంటనే అంగదుడు పైకి లేచి తన తండ్రి వాలికి భక్తితో నమస్కారం చేసాడు. "నాథా! నేను తమరి కుమారుడు అంగదుడు మీపక్కనే కూర్చుని ఉన్నాము. తమరి కుమారుడు అంగదుడు నమస్కరించు చున్నాడు. ఆశీర్వదించండి" అని విలపించింది తార.

ఓనాథా! మీరు, మీ తమ్ముడు సుగ్రీవునితో యుద్ధము అనే యజ్ఞమును చేసి, మీ భార్యనైన నేను లేకుండానే, రక్తంతో అవభృధ స్నానం చేస్తున్నారా!

(యజ్ఞము చేసిన తరువాత భార్యా భర్తలు కలిసి పవిత్రమైన అవభృధ

స్నానము చేయడం ఆచారం. రాజసూయ యాగము అయిన తరువాత అవభృథ స్నానంతో పవిత్రమైన తనకురులను ఆ దుష్టుడు దుశ్శాసనుడు తాకాడని ద్రౌపది కోపంతో ఊగిపోయింది.)

నా మాట వినకుండా యుద్ధమనే యజ్ఞము చేసి ఒంటరిగా అవభృథ స్నానం చేసారా! నాథా! మరణించింది నీవు మాత్రమే కాదు. నేను, నా కుమారుడు అంగదుడు కూడా మరణించాము. జీవచ్ఛవాల మాదిరి మిగిలిపోయాము. నీవు మమ్ములను విడిచిపోయినట్టు మా ఐశ్వర్యము కూడా మమ్ములను విడిచి పెట్టి పోయింది." అని ఏడుస్తూ ఉంది తార.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ఇరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

## కిష్కింధా కాండము

## ఇరువది నాలుగవ సర్గ.

వాలి బతికి ఉన్నప్పుడు వాలి చావాలి అని కోరుకున్న సుగ్రీవుడు వాలి మృతదేహము చూడగానే దు:ఖము ఆపుకోలేక పోయాడు. రాముని వద్దకు వెళ్లి ఇలా అన్నాడు.

"రామా! మిత్రమా! ఏదో ఆవేశంలో నా అన్న వాలిని చంపమని నిన్నుకోరాను. కానీ ఇప్పుడు నా అన్న మృతదేహాన్ని ప్రత్యక్షంగా చూస్తుంటే నాకు నా జీవితమే వ్యర్థము అనిపిస్తూ ఉంది. ఇహలోక భోగముల మీద ఆసక్తి పోయింది. కిష్కింధకు మహారాజు

వాలి మరణించాడు. కిష్కింధా మహారాణి తార, భర్త దేహము మీద పడి ఏడుస్తూ ఉంది. కిష్కింధా నగరమంతా శోకసముద్రంలో మునిగిపోయింది. అంగదుని భవిష్యత్తు ఏమిటో తెలియడం లేదు. ఇవన్నీ చూస్తుంటే నాకూ రాజ్యాభిలాష చచ్చిపోయింది.

రామా! పూర్వము వాలి నా భార్యను అపహరించి, నన్ను రాజ్యము నుండి వెళ్ల గొట్టాడని అతని మీద పట్టరానికోపం ఉండేది. కానీ ఇప్పుడు చచ్చిపడి ఉన్న వాలిని చూస్తుంటే ఆ కోపం అంతా మటుమాయం అయింది. కోపం స్థానంలో దు:ఖము ఆవరించింది. కిష్కింధలో ఉండి రాజ్యము చేసే దాని కన్నా  ఇదివరకు మాదిరి ఋష్యమూక పర్వతము మీద కందమూలములు, ఫలములు ఆరగిస్తూ ప్రశాంత జీవనం గడపడం మేలు అనిపిస్తూ ఉంది. నా అన్న వాలి లేకపోయిన తరువాత నాకు స్వర్గ సుఖములు కూడా వృథా అనిపిస్తూ ఉన్నాయి.

రామా! నా అన్న వాలి నన్ను ఎన్నడూ చంపాలి అని అనుకోలేదు. “పోరా పో! ఎక్కడైనా ప్రాణాలతో బతుకు పో” అని అనేవాడు. కాని నేను నా అన్న వాలిని చంపాలని అనుకున్నాను. అది ఆయన గొప్పతనం.  ఇది నా అల్పబుద్ధి.

రామా! ఎంత రాజ్యము మీద కోరిక ఉన్నా, అన్నను చంపి రాజ్యము చేయాలనే కోరిక నాకు ఏనాడూ లేదు. నా అన్న వాలి తన ఉదార బుద్ధితో నన్ను చంపడానికి ఏనాడూ ఇష్టపడలేదు. కానీ నేను నా బుద్ధి పెడతోవబెట్టి నా అన్నను చంపడానికి నిన్ను ఆశ్రయించాను. నేను తప్పుచేసినపుడు నా అన్న నన్ను చిన్న చెట్టు కొమ్మతో కొట్టి బుద్ధి చెప్పేవాడు. కాని నేను నా క్రోధముతో, వక్రబుద్ధితో, వానరస్వభావముతో

నా అన్ననే చంపడానికి పూనుకున్నాను. నా అన్నను చంపి ఎనలేని పాపమును మూటకట్టుకున్నాను. ఆ పాపము ఈ జన్మలో తీరేది కాదు. జన్మజన్మలకూ నన్ను వెంటాడుతూ ఉంటుంది.

పూర్వము ఇంద్రుడు విశ్వరూపుని చంపి బ్రహ్మహత్యా పాతకము మూటగట్టుకున్నాడు. ఆ పాపమును భూమికి, జలానికి, వృక్షములకు, స్త్రీలకు, పంచి పెట్టాడు. కాని నేను నాఅన్నను చంపిన పాపమును స్వీకరించడానికి ఎవరు ఉన్నారు రామా! నేను స్వయంగా అనుభవించాలి తప్పదు.

నా అన్నను చంపి నేను అధర్మానికి ఒడిగట్టాను. లోక నిందకు పాల్పడ్డాను. నేను రాజ్యాధికారమునకు అర్హుడను కాను. నేను చేసిన పాపము ఏనుగు రూపంలో నన్ను కకావికలు చేస్తూ ఉంది. నా శరీరంలో మంచితనము మృగ్యము అయి పోయింది.
పాపం ప్రవేశించింది. తండ్రిని పోగొట్టుకొని అంగదుడు జీవించలేడు. కొడుకును పోగొట్టుకొని తార జీవించలేదు. నా అనే వాళ్లు అందరినీ పోగొట్టుకొని నేను మాత్రం జీవించడం ఎందుకు వృధా. నేను నా అన్న వాలితో పాటు అగ్నిలో ఆహుతి అవుతాను. ఈ వానరులు సీతను వెదకడంలో నీకు సాయపడతారు. నేను మరణించినా నీ కార్యము మాత్రం సిద్ధిస్తుంది. కులనాశమునకు కారణమైన నేను ఈ లోకంలో జీవించడం వృధా. నేను మరణించడానికి అనుమతి ఇవ్వండి." అని రాముని ముందు దీనంగా వేడుకున్నాడు.

సుగ్రీవుని మాటలు విని రాముడు కన్నీళ్ల పర్యంతం అయ్యాడు. రాముడు, భర్త శవం మీద పడి ఏడుస్తున్న తార వంక

చూచాడు. తార తల ఎత్తి రాముని వంక చూచింది. చేతిలో ధనుర్బాణములను ధరించి ఠీవిగా నిలబడి ఉన్న సూర్యుని వంటి తేజస్సుతో వెలిగిపోతున్న రాముడిని చూచింది. తన భర్తను చంపిన రాముడు అతడే అని గుర్తించింది. తార, భర్త శవం పక్కనుండి లేచి, రాముని వద్దకు వెళ్లింది.

"రామా! నీవు ధర్మపరుడవు. ఇంద్రియములను జయించిన వాడవు. కీర్తివంతుడవు. అమితమైన పరాక్రమ వంతుడవు. ధనుర్బాణములను ధరించిన వాడవు. నా పట్ల కూడా నీ ధర్మం నెరవేర్చు. భర్తలేనిదే భార్యకు జీవితం లేదు. ఏ బాణంతో నా భర్త ప్రాణం తీసావో అదే బాణంతో నా ప్రాణం కూడా తియ్యి. నన్ను నా భర్త వద్దకు పంపు. దయచేసి ఆ పుణ్యం కట్టుకో. ఎందుకంటే నా భర్త స్వర్గానికి పోయినా అక్కడ ఉన్న అప్సర స్త్రీల వంకచూడడు. నా కోసం ఎదురు చూస్తుంటాడు. నేను దగ్గర లేకపోతే వాలికి స్వర్గం కూడా నిస్సారంగా కనిపిస్తుంది. కాబట్టి నన్ను కూడా చంపి నా భర్త వద్దకు పంపు. నేను స్త్రీ అనీ, స్త్రీని చంపితే స్త్రీ హత్యా పాతకము చుట్టుకుంటుందని సందేహించకు. నేను కూడా వాలినే అనుకో. అప్పుడు నీకు ఆ దోషం అంటదు. ఒకసారి వివాహము అయిన తరువాత భర్త, భార్య వేరు కాదు. ఇరువురి శరీరాలు ఒకటే. ఇది వేదములలో చెప్పబడినది. కాబట్టి వేదవిహితమైన కార్యము దోషము కాదు కదా!

ఓ రామా! ఈ పెద్దలు నన్ను నా భర్తను వేరు చేస్తున్నారు. ఇది న్యాయం కాదు. నువ్వు నన్ను చంపితే నేను కూడా సత్వరమే నా భర్త వద్దకు చేరుకుంటున్నాను. నీవు ఇప్పుడు నన్ను చంపకపోయినా, వాలి లేకుండా నేను ఎక్కువ కాలము జీవించలేను. కాబట్టి నన్ను

వెంటనే చంపు." అని రాముని దీనంగా వేడుకుంది తార.

దీనాలాపనలు విని రాముడు చలించి పోయాడు. ఆమెను చూచి ఇలా అన్నాడు. "అమ్మా తారా! నువ్వు వీరుని భార్యవు. ఇలా బేలగా మాట్లాడటం తగదు. నువ్వు విపరీతంగా మాట్లాడుతున్నావు. ఈ ప్రపంచాన్ని బ్రహ్మ సృష్టించాడు. సృష్టిలోని అన్ని జాతులకూ సుఖ దు:ఖాలను పెట్టాడు. ఎవరు కూడా బ్రహ్మ సృష్టిని అతిక్రమించ లేరు. కాబట్టి దు:ఖము మాని ఓర్పు వహించు.

కిష్కింధా రాజ్యానికి నీ కుమారుడు యువరాజుగా పట్టాభిషిక్తుడవుతాడు. నీవు వీర పత్నివి. వీర మాతవు. ఇది బ్రహ్మ విధించిన అందరికీ సమ్మతమైన విధానము. దీనిని ఎవరూ అతిక్రమించలేరు. నీ వంటి వీర పత్ని ఇలా విలపించరాదు."అని రాముడు తారతో చెప్పాడు.

(తార ఇలా సుదీర్ఘంగా విలపించడం ప్రాచ్యపాఠములో లేదని, ఎవరో తదుపరి చేర్చారని పండితుల అభిప్రాయము. అదే కాదు, తార రామునికి ఒక శాపం ఇచ్చినట్టు ప్రాచ్య పాఠంలో ఉందని, " నాకు నా భర్తకు అకాల వియోగం కల్పించావు కాబట్టి, నీకు తాత్కాలికంగా నీ భార్య లభించినా, శాశ్వతంగా భార్యావియోగం కలుగుతుంది" అని తార రామునికి శాపం ఇచ్చినట్టు ప్రాచ్యపాఠంలో ఉందని పండితుల అభిప్రాయము.)

శ్రీమద్రామాయణము,

కిష్కింధా కాండము ఇరువది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## ఇరువది ఐదవ సర్గ.

తరువాత రాముడు సుగ్రీవుని, తారను, అంగదుని ఓదారుస్తూ ఇలా అన్నాడు. "మీరు ఈ ప్రకారంగా ఒకరికి మించి ఒకరు శోకంతో రోదిస్తుంటే, ఏమీ ప్రయోజనము లేదు. జరుగ వలసిన కార్యము గురించి ఆలోచించండి. మీరు ఈవిధంగా శోకిస్తుంటే మరణించిన వాలి ఆత్మకు శాంతి కలుగదు. లోకాచారము ప్రకారము వాలికి జరుగ వలసిన అంత్య క్రియల గురించి ఆలోచించండి.

ముల్లోకములు కాలమునను సరించి నడుస్తున్నాయి. మానవులు చేసే కర్మలకు అన్నింటికీ కాలమే మూలము. కాలము ననుసరించి అందరూ కాలధర్మము చెందవలసిన వారే. కాకపోతే కొంచెం అటు ఇటు అంతే. సమస్త భూతములను కర్మచేయమని ప్రేరేపించునది కాలమే కదా! అంతే కానీ, ఎవరూ ఎవరినీ ఏమీ చేయలేరు. అలా చేయడానికి సమర్థులు కూడా కారు. జనన మరణాలను నిర్ణయించేది కాలమే కానీ వేరు కాదు. ముల్లోకములు ఆ కాలమునకు లోబడి ప్రవర్తించవలసినదే!

ఆ కాలము కూడా తన ఇష్టంవచ్చినట్టు ప్రవర్తించ జాలదు. దానికీ ఒక నియమము ఉంది. కాలాన్ని మార్చడానికి ఎవరి తరమూ కాదు. ఏ వస్తువూ కాల స్వభావమును దాటలేదు. అంతే కాదు. కాలము ఎవరి పక్షమూ వహించదు. కాలమునకు పక్షపాతము లేదు. కాలమును ఎవరూ వశము చేసుకోలేరు. ఎవరూ జయించలేరు.

మిత్రులు కానీ, శత్రువులు కానీ, జ్ఞాతులు కానీ, ఏ కులము కానీ, ఏ జాతీ కానీ, కాలానుగుణంగా ప్రవర్తించవలసిన వారే కానీ ఎవరూ కాలమును వశపరచుకోలేరు. కాబట్టి తెలివి కలవారు, కాలము యొక్క స్వభావమును పరిశీలించి, తెలుసుకొని, దానికి అనుగుణంగా ప్రవర్తిస్తారు.

వానర రాజు అయిన వాలి ఈ దేహమును విడిచి తన స్వస్వరూపమును పొందాడు. వాలి అశాశ్వతమైన ఈ దేహమును అంటిపెట్టుకొని ఉండక, శాశ్వతమైన స్వర్గలోకమునకు వెళ్లాడు. అందుకని, మీరు వాలి కోసరం శోకించడం మాని, కాలోచితముగా జరగవలసిన కార్యముల గురించి ఆలోచించండి." అని రాముడు కాల స్వభావమును తెలిపి, జరుగ వలసిన కార్యములను జరిపించమని సుగ్రీవునికి చెప్పాడు.

రాముని మాటలు విన్న లక్ష్మణుడు, సుగ్రీవుని వద్దకు వెళ్లి ఇలా అన్నాడు. "ఓ సుగ్రీవా! రాముడు చెప్పిన మాటలు వింటివి కదా! వెంటనే వాలికి జరుగ వలసిన ప్రేతకార్యములు, దహన సంస్కారములు గూర్చి ఆలోచించు. వాలి దహన సంస్కారమునకు కావలసిన ఎండి పోయిన కాష్ఠములు (కట్టెలు) చందనపు కర్రలు తెప్పించు. తండ్రి మరణాన్ని తట్టుకోలేక పోతున్న అంగదుని ఓదార్చు. కిష్కింధకు ఇంక నీవే దిక్కు. పుష్పమాలలు, సుగంధ ద్రవ్యములు, వస్త్రములు, నెయ్యి, ఇతరములు తెప్పించు. వాలిని ఊరేగింపుగా తీసుకొనిపోవుటకు ఒక పల్లకినీ సిద్ధం చేయండి. దానిని మోయుటకు తగిన బలిష్ఠులైన వాహకులను ఏర్పాటు చేయండి. ఈ కార్యములు అన్నీ వేగంగా జరగాలి. ఈ సమయంలో ఆలస్యము పనికిరాదు." అని లక్ష్మణుడు సుగ్రీవునితో చెప్పి, రాముని పక్కన వచ్చి నిలబడ్డాడు.

తారుడు పల్లకినీ దానిని మోయడానికి బలిష్ఠులైన వానరులను సిద్ధం చేసాడు. ఆ పల్లకిలో వాలిని కూర్చోపెట్టడానికి తగిన ఆసనము ఏర్పాటు చేసారు. పల్లకి రాగానే రాముడు లక్ష్మణునితో "ప్రేత కార్యము ప్రారంభించండి" అని ఆదేశించాడు. సుగ్రీవుడు మొదలగు వానరులు వాలిని మంచి వస్త్రములతోనూ, పూలమాలలతోనూ అలంకరించారు. వాలిని  పట్టుకొని తీసుకొనివెళ్లి ఆ పల్లకిలో కూర్చోపెట్టారు.

సుగ్రీవుడు తన అనుచరులతో ఇలా అన్నాడు: "ఇప్పుడు మనము అన్నగారైన వాలికి ప్రేతకార్యము నిర్వర్తించాలి. దానికి తగిన ఏర్పాట్లు చేయండి. కొంత మంది వానరులు పల్లకి ముందు నడుస్తూ రత్నములను వెదజల్లండి. భూలోకములో రాజులకు ఏ విధమైన ఐశ్వర్యములు ఉండునో అట్టి ఐశ్వర్యములతో వాలికి అంతిమ సత్కారములు చేయండి" అని ఆజ్ఞాపించాడు.

సుగ్రీవుని ఆజ్ఞ ప్రకారము వాలికి అంతిమ సంస్కారాలు జరిగాయి. తారుడుమొదలగు వానరులు తండ్రిని కోల్పోయిన అంగదుని పట్టుకొని విలపిస్తూ పల్లకీ వెంట వెళ్లారు. వాలి భార్యలందరూ భర్తను గురించి ఆయన గుణగుణములను తలచుకుంటూ పల్లకీవెంట నడిచారు. వానరులు నదీ తీరంలో, జనావాసాలకు దూరంగా, సమతల ప్రదేశంలో, ఒక ఇసుక దిబ్బ మీద చితిని ఏర్పాటు చేసారు.

(ఇక్కడ ఒక విషయం గమనించండి. దహన సంస్కారాలు

జనావాసాలకు దూరంగా జరగాలి అని రామాయణ కాలం నుండి, వానరులలో కూడా ఉన్న ఆచారము. గ్రామీణప్రాంతాలలో కొంత వరకూ ఈ ఆచారము అమలులో ఉంది. కాని నాగరికులు నగరాల్లో, ఆనియమాలను పూర్తిగా గాలికి వదిలారు. నగరంలో శ్మశానాలన్నీ నగర నడిబొడ్డులోనే ఉన్నాయి. (హైదరాబాద్ లో అంబర్ పేట, పంజగుట్ట, బన్సీలాల్ పేట మొదలగునవి) శ్మశానాల చుట్టు అపార్టుమెంటులు, ఇండ్లు వెలిసాయి. కాలుష్యం ప్రబలి పోయింది. రోగాలు పెరిగాయి. మరణాలూ పెరిగాయి. శ్మశానాలకు గిరాకీ పెరిగింది. ఇదీ నేటి సంస్కృతి.)

తరువాత వానర ప్రముఖులు పల్లకీనుండి వాలి మృతదేహమును కిందికి దించారు. తార తన భర్త మృతదేహమును ఒడిలో పెట్టుకొని విలపించింది.

"నాధా! నీవు మరణనించిననూ నీముఖంలో ఉన్న తేజస్సు తగ్గలేదు. చూడండి. నిన్ను చంపిన రాముడు ఒకే ఒక్క బాణంతో మా అందరినీ అనాధలుగా మార్చాడు. నాధా! చూడండి. నీ భార్యలందరూ నిన్ను అనుసరించి నీ వెంట అందరూ ఇక్కడకు వచ్చారు. నీ మంత్రులు అందరూ నీచుట్టునిలబడి శోకించుచున్నారు. వారితో మాట్లాడు." అని తీరని శోకంతో బాధపడుతూ ఉంది తార. పక్కన ఉన్న వానర స్త్రీలు ఆమెను లేవదీసి పక్కకు తీసుకొని వెళ్లారు.

తరువాత అంగదుడు, సుగ్రీవుడు వాలి శరీరమును చితి మీద ఉంచారు. అంగదుడు తన తండ్రి వాలి చితికి శాస్త్రోక్తముగా నిప్పు అంటించాడు. తండ్రి చితి చుట్టు అప్రదక్షిణముగా తిరిగాడు. తరువాత అందరూ జలతర్పణములు విడవడానికి నదీ తీరానికి వెళ్లారు.

అంగదుడు, సుగ్రీవుడు మొదలగు వానరులు వాలికి జలతర్పణములు విడిచారు. అంతిమ సంస్కారములు పూర్తి అయిన తరువాత సుగ్రీవుడు అంగదుని ముందుంచుకొని, రాముని వద్దకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ఇరువది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## ఇరువది ఆరవ సర్గ.

వాలికి దహన సంస్కారములు చేసిన అనంతరము, సుగ్రీవుడు, మిగిలిన వానర ప్రముఖులు అందరూ కలిసి రాముని వద్దకు వెళ్లారు. వారందరి సమక్షములో హనుమంతుడు రామునితో ఇలాఅన్నాడు.

"ఓ ప్రభో! కాకుత్థ్సా! నీ అనుగ్రహము వలన సుగ్రీవునికి తిరిగి రాజ్యము లభించింది. నీ అనుజ్ఞ అయితే సుగ్రీవుడు కిష్కింధలో ప్రవేశించి యథావిధిగా రాజ్యాభిషిక్తుడై, కిష్కింధను పాలిస్తాడు. నీకు తగిన కానుకలు సమర్పించుకొని నిన్ను పూజించవలెనని అనుకుంటున్నాడు. కాబట్టి మా అందరి కోరిక మేరకు నీవు కిష్కింధా నగరమునకు వచ్చి మా సత్కారములను అందుకని మమ్ములను ఆనందింపజేయమని ప్రార్థించుచున్నాము." అని వినయంగా అన్నాడు హనుమంతుడు.

ఆ మాటలకు రాముడు ఇలా అన్నాడు. "హనుమా! నేను నా తండ్రి ఆజ్ఞమేరకు వనవాసము చేయుచున్నాను. ఈ పదునాలుగు సంవత్సరములు జనావాసములలోకి అడుగుపెట్టను. మీరందరూ కలిసి సుగ్రీవునికి పట్టాభిషేకము చేయండి." అని అన్నాడు రాముడు. తరువాత సుగ్రీవునితో ఇలా అన్నాడు. "మిత్రమా! సుగ్రీవా! వాలి కుమారుడు అంగదుని యువరాజుగా అభిషేకించు. నీ అన్నగారి కుమారుడు అంగదుడు యువరాజుగా అభిషేకించడానికి తగినవాడు. ఇప్పుడు వర్షకాలము ఆరంభమయినది. ఈ నాలుగు నెలలు సీతాన్వేషణకు తగిన సమయము కాదు. కాబట్టి ఈ నాలుగు నెలలు నీవు కిష్కింధకుపోయి రాజ్యాభిషిక్తుడవై, రాచ కార్యములు చక్కబెట్టుకో. ఈ నాలుగునెలలు నేను, లక్ష్మణుడు, ఈ పర్వతము మీద నివాసము ఉండెదము. కార్తీక మాసము రాగానే సీతను వెదకడానికీ, సీతను అపహరించిన రావణుని చంపడానికీ ప్రయత్నాలు మొదలు పెట్టాలి. అదీ మన ఒప్పందము. మిత్రమా! ఇప్పుడు నీవు కిష్కింధకు వెళ్లి పట్టాభిషిక్తుడివి కా!" అని పలికాడు రాముడు.

రాముని అనుజ్ఞపొంది సుగ్రీవుడు కిష్కింధకు బయలు దేరాడు. సుగ్రీవుడు వెళుతుంటే వానరులందరూ ఆయనకు సాష్టాంగపడి నమస్కారాలు చేస్తున్నారు. సుగ్రీవుడు వారిని లేవదీసి ఆదరిస్తున్నాడు. వానరులందరూ సుగ్రీవుని కిష్కింధకు రాజుగా అభిషిక్తుని చేసారు.

బంగారుతో చేసిన తెల్లని గొడుగును, తెల్లని వింజామరలను సిద్ధం చేసారు. రత్నములు, మణులు, మాణిక్యాలు

సుగ్రీవునికి సమర్పించారు. సుగంధ ద్రవ్యములు, తేనెను, నవధాన్యములను సిద్ధం చేసారు. తూర్పుగా ప్రవహించే నదుల నుండి, నాలుగు సముద్రముల నుండి బంగారు కలశములలో పుణ్యజలములు తీసుకొని వచ్చారు. బ్రాహ్మణులకు దానములు చేసారు. అగ్నిని ప్రజ్వరిల్లజేసి హోమం చేసారు. వానర శ్రేష్టులు అయిన గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గన్ధమానుడు, మైందుడు, ద్వివిదుడు, హనుమంతుడు, జాంబవంతుడు ఇంకా ఇతర వానర ప్రముఖులు పుణ్యజలములతో సుగ్రీవుని అభిషేకించారు. వానరులందరూ ఆనందంతో ఊగిపోయారు.

అదే సమయంలో వాలి కుమారుడైన అంగదుని యువరాజుగా అభిషేకించారు. అంగదునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేసినందుకు సుగ్రీవుని అందరూ అభినందించారు. సుగ్రీవుని రాజుగా అభిషిక్తుడు కావడానికి, అంగదుడు యువరాజుగా అభిషిక్తుడు కావడానికి కారణమైన రామలక్ష్మణులను అందరూ వేనోళ్ల స్తుతించారు. సుగ్రీవుడు కిష్కింధా రాజ్యమును, తన భార్య రుమను మరలాపొంది ఇంద్రుని వలె రాజ్యపాలన సాగించాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ఇరువది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# కిష్కింధా కాండము

కిష్కింధా కాండము

ఇరువది ఏడవసర్గ.

రాముడు, లక్ష్మణుడు ప్రస్రవణ పర్వతము చేరుకున్నారు. ఆ పర్వతము మీద పులులు, సింహములు, మొదలగు క్రూరజంతువులు నివాసముంటున్నాయి. అవే కాకుండా ఎన్నోరకములైన వానరములు, భల్లూకములు కూడా నివాసముంటున్నాయి. అనేకములైన పొదలు, లతలు, వృక్షములతో ఆ పర్వతము శోభిల్లుతూ ఉంది.

ఆ పర్వతము మీద ఉన్న ఒక పెద్ద గుహను తమ నివాసంగా చేరుకున్నారు రామలక్ష్మణులు. "లక్ష్మణా! ఈ గుహ మనకు నివాస యోగ్యముగా ఉన్నది కదూ! వర్షాకాలము అంతా ఇక్కడే ఉందాము. ఇక్కడకు దగ్గరలో ఒక సరస్సుఉంది. అందులో అందమైన పద్మములు వికసించి ఉన్నాయి. కొంచెం దూరంలో ఒక నది ప్రవహిస్తూ ఉంది. అందులో మనము స్నానాదులు చేయవచ్చును. ఈ నదీ తీరంలో వందలాది పక్షులు గుంపులు గుంపులుగా ఎగురుతున్నాయి. ఈ అందమైన ప్రదేశములో మనము సుఖంగా జీవించెదము. పైగా ఇక్కడి నుండి కిష్కింధా నగరము కనుచూపుమేరలోనే ఉంది. వానర రాజైన సుగ్రీవుడు తన రాజ్యమును, తన భార్యను తిరిగి పొంది, తన బంధుమిత్రులతో కలిసి సుఖంగా జీవిస్తున్నాడు." అని అన్నాడు రాముడు.

కాని రాముని మనసులో తన భార్య తనకు దూరంగా ఉంది అనే బాధ మాత్రం తొలుస్తూనే ఉంది. రాత్రిళ్లు నిద్ర పట్టడం లేదు. అనుక్షణం సీత గుర్తుకు వస్తూనే ఉంది. రాముని బాధను చూచి

లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! నీవు వీరుడవు. వీరుడవైన నీవు ఇలా దు:ఖించడం తగదు. దు:ఖముతో అన్నిపనులు నాశనం అవుతాయి. నీవు భగవంతుడిని నమ్ముతావు. నీవు చేయవలసిన పనులను సక్రమంగా చేస్తావు. ఎల్లప్పుడూ ధర్మంగా ప్రవర్తిస్తావు. అలాంటి నీవు ఇలా దు:ఖపడుతూ ఉంటే, నీ భార్యను అపహరించిన దుర్మార్గుడైన రాక్షసుని ఎలా సంహరిస్తావు. కాబట్టి దు:ఖమును విడిచి పెట్టు. ధైర్యం తెచ్చుకో. అప్పుడు సరిగా ఆలోచించ గలుగుతావు. రాక్షస సంహారము చేయగలుగుతావు.

ఓ రామా! నీవు తలచుకుంటే ముల్లోకములను గడగడ లాడించగలవు. అటువంటప్పుడు ఈ రాక్షసుడు రావణుడు ఒక లెక్కా! ఈ వర్షాకాలము పోయి శరత్కాలము రాగానే వానర వీరులతో కలిసి రాక్షస సంహారము చేయగలవు. రామా! నేను నీకు నీతులు చెప్పడం లేదు. నీలో నివురు కప్పిన నిప్పులా ఉన్న పరాక్రమాన్ని ప్రజ్వరిల్ల జేస్తున్నాను." అని అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలు విన్న రాముడు ఇలా అన్నాడు. "లక్ష్మణా! నీవు నాకు నీతులు చెప్పలేదు. ఒక మంచి మిత్రుని మాదిరి హితబోధ చేసావు. నా కర్తవ్యాన్ని నాకు గుర్తు చేసావు. అన్ని అనర్థములకు మూలమైన ఈ శోకమును తక్షణము విడిచిపెడుతున్నాను. ధైర్యము తెచ్చుకుంటున్నాను. శరత్కాలము కొరకు,సుగ్రీవుని రాక కొరకు ఎదురుచూస్తుంటాను."అనిఅన్నాడు రాముడు. రాముని మాటలకు సంతోషించాడు లక్ష్మణుడు. రామునితో ఇలా అన్నాడు.

"రామా! ఈ నాలుగు నెలలు ఇట్టే గడిచిపోతాయి. సుగ్రీవుడు నీకు ఇచ్చిన మాట ప్రకారము సీతను వెదకడానికి వానరులను పంపుతాడు. శత్రు సంహారము జరుగుతుంది. అంత దాకా కోపమును అణిచి పెట్టి ఓపిక వహించు. ఈ నాలుగునెలలు మనము ఈ పర్వత గుహలో ఆనందంగా గడుపుదాము." అని అన్నాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ఇరువది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ఇరువది ఎనిమిదవ సర్గ.

వర్షాకాలము మొదలయింది. ఆకాశమంతా మేఘావృతము అయింది. వేసవి కాలము అంతా ఆకాశము సూర్య కిరణముల ద్వారా నీటిని తాగి, వర్షాకాలములో ఆ జలములను మరలా భూమి మీదికి వదులుతూ ఉంది. ఆకాశమునుండి కారుతున్న వర్షపు ధారలు సీత కళ్ల నుండి కారుతున్న కన్నీళ్ల మాదిరి కనపడుతున్నాయి రామునికి.

మేఘాలు వర్షిస్తున్నాయి. నదులన్నీ నిండుగా ప్రవహిస్తున్నాయి. నెమళ్లు నర్తిస్తున్నాయి. అప్పటి వరకూ నిద్రాణంగా ఉన్న రకరకాలైన కప్పజాతులు, వర్షము పడగానే భూమిపైకి వచ్చి రణగొణధ్వనులు చేస్తున్నాయి. నదులన్నీ గట్లు తెంచుకొని ప్రవహిస్తూ తమ నాధుడైన సముద్రుని చేరుటకు ఉరకలు వేస్తున్నాయి.

ఇవన్నీ చూచి రాముడు ఇలా అనుకుంటున్నాడు.

"అయోధ్యలో కూడా సరయూ నది నిండుగా ప్రవహిస్తూ ఉంటుంది. భరతుడు కూడా తన దైనందిన కర్మలు పూర్తి చేసుకొని ఆషాఢ మాస వ్రతమును ప్రారంభించి ఉంటాడు. భరతుడు అయోధ్యలో వ్రతాలు చేస్తుంటే నేను ఇక్కడ భార్యను పోగొట్టు కొని దు:ఖిస్తున్నాను.

సుగ్రీవుడు ఎప్పుడు వస్తాడో ఏమో! ఒకవేళ వచ్చినా ఈ వర్షాకాలంలో వానరులు వెళ్లి వెతకడం అసాధ్యం కదా! అందుకే సుగ్రీవుడు వర్షాకాలము అయిపోయిన తరువాత వస్తాడు. అప్పుడు సీతను వెదకడం సులభం అవుతుంది. సుగ్రీవుని కోసరం వేచి ఉండక తప్పదు" అని అనుకొన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ఇరువది ఎనిమిదవ సర్గ సంపూర్ణం
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ఇరువది తొమ్మిదవ సర్గ.

వర్షాకాలము పూర్తి అయింది. శరదృతువు ప్రవేశించింది. ఆకాశం నిర్మలమయింది. కాని సుగ్రీవుడు ఇంకా కామభోగములలో మునిగి తేలుతున్నాడు. అంత:పురము విడిచి రావడం లేదు. స్త్రీల

సాహచర్యంలోనే గడుపుతున్నాడు. తన భార్య రుమతోనూ, తన అన్న భార్య తార సాహచర్యంలోనూ ఆనందంగా గడుపుతున్నాడు.

(స్వాం చ పత్నీమభిప్రేతాం తారాం చాపి సమీప్సితామ్, విహరన్తమహోరాత్రం అంటే తన భార్యను, తానుకోరిన తారను అహోరాత్రాలు విహరిస్తున్నాడు... అని ఉంది. అలాగే ముప్పది ఒకటవ సర్గలో కూడా ఈ క్రింది శ్లోకము ఉంది. "తారయా సహిత: కామాసక్త:" అంటే తారతో కలిసి కామాసక్తుడై ఉన్నవాడు అనిఉంది. అంటే వాలి చని పోయిన తరువాత వాలి భార్య తార సుగ్రీవుని వశం అయిందని అర్థం అవుతూ ఉంది. మరి వాలి చేసిన తప్పే సుగ్రీవుడు చేస్తున్నాడు కదా! అంటే సుగ్రీవుడు బతికి ఉండగానే వాలి, సుగ్రీవుని భార్య రుమను అనుభవించాడు. కానీ సుగ్రీవుడు, వాలి చనిపోయిన తరువాత, వాలి భార్య తారను అనుభవించాడు అని అర్థం చెప్పుకోవాలి.)

సుగ్రీవుడు కనీసం మంత్రులకు కూడా దర్శనం ఇవ్వడం లేదు. కార్యభారము అంతా మంత్రులకు అప్పచెప్పాడు. ఇంక ఎవరి వల్లా తనకు ఆపదలేదు అని నిర్భయంగా స్వేచ్ఛగా విహరిస్తున్నాడు.

సుగ్రీవుని వ్యవహారము హనుమంతునికి నచ్చలేదు. రాముడికి ఇచ్చిన మాట, చేసిన వాగ్దానము సుగ్రీవునికి గుర్తుచేయాలని అనుకున్నాడు. సుగ్రీవుని వద్దకు పోయి ఇలా అన్నాడు. " ఓ రాజా! నీవు రాముని మూలంగా ఈ రాజ్యమును, కీర్తిని సంపాదించుకున్నావు. ఇంక నీవు, నీ మిత్రుడు రామునికి ఇచ్చిన మాటలను నిలబెట్టుకోవలసిన సమయము ఆసన్నమయింది. నీవు రాముని కార్యము నిర్వర్తించాలి.

మిత్రుల విషయంలో బాగా ప్రవర్తించే వాళ్లు కీర్తిమంతులు అవుతారు. ఒక రాజుకు తన కోశాగారము, సైన్యము, తన మిత్రులు, తన ప్రభుత్వము ఈ నాలుగు అత్యంత ముఖ్యమైనవి. అందుకని, నీ మిత్రుడు రామునికి ఇచ్చిన మాట నెరవేర్చు. మిత్రునికి ఇచ్చిన మాట నెరవేర్చని వాడు అన్ని కష్టాలను ఎదుర్కొంటాడు.

రాజా! ఏకార్యము చేసినా సకాలంలో చెయ్యకపోతే, తరువాత ఎంత గొప్పగా చేసినా దానికి ఫలితం ఉండదు. పైగా ఆ పనిచెయ్యనట్టే అవుతుంది. ఓ రాజా! రాముని కార్యం చెయ్యడంలో ఇప్పటికే కాలం మించిపోయింది. ఇప్పటికైనా రామకార్యములో నిమగ్నమవ్వు. వానలు తగ్గిపోయాయి.

సీతాన్వేషణ ప్రారంభించడానికి ఇప్పటికే సమయం దాటిపోయింది. వానాకాలము ఆగిపోయింది, సమయం మించి పోయింది అని రామునికి తెలిసినా, నిన్ను తొందర పెట్టడం మంచిది కాదని రాముడు నీకోసం ఎదురుచూస్తున్నాడు. రాముడు నీకు మేలు చేసాడు. తిరిగి రాముడికి మేలు చెయ్యడానికి ఆలస్యం చెయ్యడం మంచిదికాదు. రాముడు వచ్చి నీ మాటను నీకు గుర్తుచేసే వరకూ ఆగకు. అప్పటిదాకా ఆగితే, నీవు కావాలని ఆలస్యము చేసినట్టు అవుతుంది.

ఓ రాజా! నీకు ఏ సాయమూ చేయని వారికి కూడా నీవు సాయం చేస్తావు కదా! మరి నీకు ఇంత సాయం చేసిన రామునికి సాయం చెయ్యడంలో ఎందుకు ఆలస్యం చేస్తున్నావు? వానరులను

పిలిచి వారికి సీతాన్వేషణకు ఆదేశాలు ఎందుకు ఇవ్వడం లేదు? రాముడు తన బాణములతో దేవతలను, రాక్షసులను అంతమొందించ గల సామర్థ్యము కలవాడు. కానీ నీ సాయం కొరకు ఎదురు చూస్తున్నాడు. నీవు చేసిన ప్రతిజ్ఞను నెరవేరుస్తావా లేదా అని వేచి ఉన్నాడు.

కాబట్టి ఓ వానర రాజా! నీకు ముందుగా ఉపకారము చేసిన రామునికి ప్రత్యుపకారము చేయడానికి ఉద్యమించు. మేమందరమూ నీ ఆజ్ఞ కొరకు ఎదురుచూస్తున్నాము. నీ ఆజ్ఞ అయితే మేము భూమ్యాకాశములను గాలించి సీత జాడ తెలుసుకుంటాము. నీ అధీనములో ఒక కోటి కంటే ఎక్కువ సంఖ్యలో వానరులు ఉన్నారు. వారిని రామకార్యమునకు తగిన విధంగా నియోగించు. త్వరపడు." అని హితబోధ చేసాడు హనుమంతుడు. తనమంత్రి అయిన హనుమంతుని మాటలను శ్రద్ధగా విన్నాడు సుగ్రీవుడు. వెంటనే నీలుని పిలిపించాడు. సీతాన్వేషణ కొరకు వానర సేనలను అన్నిదిక్కులనుండి కిష్కింధకు రప్పించమని ఆదేశాలు ఇచ్చాడు. సమస్త వానరసేనలను తన ముందు నిలుప మని ఆదేశాలు ఇచ్చాడు. "పదిహేను దినములలో వానరులందరూ కిష్కింధ చేరు కోవాలి. ఆ గడువు మించితే మరణదండన విధించబడుతుంది." అని వానరులను ఆదేశించాడు. హనుమంతుని, అంగదుని కొంతమంది వానర ప్రముఖులను కలిసికొనమని ఆదేశించాడు. ఆ ప్రకారంగా ఆదేశాలు ఇచ్చిన సుగ్రీవుడు అంత:పురమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము కిష్కింధా కాండము

ఇరువది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## ముప్పదవ సర్గ.

వర్షాకాలము గడిచి పోయినను సుగ్రీవుడు తన వద్దకు రాలేదని రాముడు చింతిస్తున్నాడు. సుగ్రీవుడు కామాసక్తుడై తనకు ఇచ్చిన మాటను మరచినాడని, తన భార్య సీతను తలచుకొని దు:ఖిస్తున్నాడు. "ఈ శరత్కాలములో పండువెన్నెలలో సీతతో కూడా విహరించవలసిన తాను ఈ ప్రకారము భార్యావియోగము అనుభవించవలసి వచ్చినదే అని మనసులో ఆరాటపడుతున్నాడు రాముడు. ఒకవేళ బతికి ఉంటే సీత ఈ శరత్కాల రాత్రులను ఎలా గడుపుతూ ఉందో అని ఆలోచిస్తున్నాడు. సీత తన దగ్గర లేకపోవడంతో రాముడు శరత్కాల వైభవాలను ఆస్వాదించలేకపోతున్నాడు.

మరలా తన అన్నగారు రాముడు సీత గురించి ఆలోచించడం చూచాడు లక్ష్మణుడు. మరలా రాముని ఉత్తేజపరచి కార్యోన్ముఖుడిని చేయదలిచాడు. రామునితో ఇలా అన్నాడు.

"రామా! ఏమిటీ వెర్రి! ఈ ప్రకారము కామానికి వశుడు కావడం వలన ప్రయోజనము ఏముంది! దీని వలన మానసిక స్థైర్యము నశించడం తప్ప వేరే ఏమీ జరగదు. ఏ కార్యమూ సిద్ధించదు. కాబట్టి నీవు నీ మనసులో నుండి చింతను తొలగించి, మనసును నిర్మలం చేసుకొని, కాగల కార్యము నందు శ్రద్ధ చూపు. ధైర్యము చేత ఏ కార్యము నైననూ సిద్ధింప చేసుకొన వచ్చును కదా! మనం ధైర్యంగా ఉంటే దైవము కూడా మనకు తోడుపడుతుంది. ముందు సుగ్రీవుడు

మనకు ఎంత వరకూ సాయ పడగలడో ఆలోచించాలి." అని లక్ష్మణుడు రామునికి కర్తవ్యమును బోధించాడు.

రాముడు లక్ష్మణునితో ఇలాఅన్నాడు. "లక్ష్మణా! అప్పుడప్పుడు నా మనసు అలా దైన్యము చెందుతూ ఉంటుంది. నీ మాటలతో మరలా ధైర్యము తెచ్చుకుంటూ ఉంటాను. మనము తల పెట్టిన కార్యమును నెరవేరేట్టు చూడాలి.

లక్ష్మణా! వర్షాకాలము పూర్తి అయినది. వర్షములు ఆగిపోయినవి. శరత్కాలము ప్రవేశించినది. ఆకాశము నిర్మలంగా ఉంది. రాత్రుళ్లు చంద్రుడు తన కాంతితో ఈ జగత్తును అంతా తేజోమయం చేస్తున్నాడు. నేలంతా తడి ఆరిపోయి నడవడానికి అనుకూలంగా ఉంది. రాజులు శత్రురాజుల మీద దండయాత్రలు చేయుటకు తగు సమయము ఆసన్నమయింది. కానీ సుగ్రీవుడు ఎందుకో ఇంకా నా వద్దకురాలేదు. కనీసము సీతను వెదకడానికి ప్రయత్నం కూడా చేస్తున్నట్టు కనిపించడం లేదు.

నేనేమో ఇక్కడ సీతా వియోగ దు:ఖంతో అలమటిస్తుంటే, అక్కడ సుగ్రీవుడు కామభోగాలలో మునిగి తేలుతున్నాడు. అటు రాజ్యం పోగొట్టుకొని, ఇటు భార్యను పోగొట్టుకొని బాధ పడుతున్న నా మీద సుగ్రీవునికి దయ కలగడం లేదు. సుగ్రీవుడు తన పని అయిపోయింది కదా అని నిర్లక్ష్యంగా ఉన్నాడు.

"ఈ రాముడు తండ్రి చేత రాజ్యము నుండి వెళ్ల గొట్టబడిన అనాథ. పైగా రావణుడు అతని భార్యను అపహరించాడు. నా శరణు

వేడాడు. ప్రస్తుతము నేనే రామునికి దిక్కు" అని సుగ్రీవుడు నన్ను అవమానిస్తున్నాడు. సుగ్రీవుడు, తన పని పూర్తి కాగానే, నాతో చేసుకొన్న ఒడంబడికను మరచి పోయినట్టున్నాడు.

లక్ష్మణా! నీవు కిష్కింధకు పోయి, సుగ్రీవుని కలిసి నా మాటగా చెప్పు.

" మిత్రుని వలన తన పనిపూర్తి కాగానే, తాను మిత్రునికి ఇచ్చిన మాట మరచిన వాడు అధముడు. అది పుణ్యమైనను, పాపమైనను, మిత్రునికి ఇచ్చిన మాటను నిలబెట్టుకొనేవాడు ఉత్తముడు. తనకు సంబంధించిన పనులు పూర్తి అయిన తరువాత, ఇంకా పనులు పూర్తి కాని మిత్రులకు ఎవరైతే సాయం చెయ్యరో అటువంటి వారి మాంసమును కుక్కలు కూడా ముట్టవు. ఇది ధర్మము.

సుగ్రీవుడు మరలా నా ధనుష్టంకారమును వినదలచు కొన్నాడో ఏమో అడిగి తెలుసుకో. ఈ సారి నేను బాణం ఎక్కుబెడితో అది సుగ్రీవుని మీదనే అవుతుంది. సుగ్రీవుడు లేకపోయినా నీ సాయంతో నేను కార్యం సాధించగలను. కానీ, సుగ్రీవుడు తన పని పూర్తి అయిన తరువాత, మనలను మరచిపోయినట్టున్నాడు. అది గుర్తు చెయ్యి. సుగ్రీవుడు మనలను వర్షాకాలము వరకూ ఆగమన్నాడు. వర్షాకాలము అయిపోయినా, సుగ్రీవుడు ఇంకా మద్యపాన మత్తులో, కామభోగములలో మునిగి తేలుతున్నాడు. ఇంకా మత్తు వదిలినట్టు లేదు. మనలను పూర్తిగా మరచినట్టున్నాడు.

లక్ష్మణా! నీవు పోయి సుగ్రీవుని కలిసి, నాకు కోపం వస్తే జరిగే పరిణామాలను అతనికి తెలియజెయ్యి.

"సుగ్రీవా! వాలి వెళ్లిన మార్గము ఇంకా మూసివేయబడ లేదు. నీ కోసం ఇంకా తెరిచి ఉంచాను. వాలి వెళ్లిన మార్గంలో వెళ్లడానికిప్రయత్నించకు.

ఓ సుగ్రీవా! నేను వాలిని ఒక్కబాణంతోనే చంపాను. కానీ మాట తప్పిన నిన్ను మాత్రం బంధు మిత్రులతో సహా చంపుతాను.

ఓ సుగ్రీవా! అశాశ్వతములైన కామసుఖములను విడిచి పెట్టి, శాశ్వతమైన ధర్మాన్ని అనుసరించు. పూర్వము నాకు ఇచ్చిన మాటను నిలబెట్టుకో. అంతేకాని, నా బాణములకు ఎరగా మారి, పరలోకంలో ఉన్నవాలిని కలవడానికి ప్రయత్నించకు."

అని నా మాటగా చెప్పు. ఇంకా నీకు తోచినవి, మనకు హితము చేకూర్చే మాటలు చెప్పు. ఇంక ఆలస్యముచేయకు." అని రాముడు లక్ష్మణునితో అన్నాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ముప్పదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

కిష్కింధా కాండము

ముప్పది ఒకటవ సర్గ.

రాముడు మాట్లాడుతున్నంత సేపూ లక్ష్మణుడు తన కోపాన్ని అణుచు కుంటున్నాడు. అన్నమాట తప్పి నందుకు లక్ష్మణునికి సుగ్రీవుని మీద కోపం ముంచుకొచ్చింది.

"అన్నయ్యా! వానరుడైన ఈ సుగ్రీవుడు మంచి వాడిలా ప్రవర్తించడం లేదు. తానుచేసే పనుల వలన కలిగే ఫలితములను తెలుసుకోడం లేదు. మాట తప్పినందుకు సుగ్రీవునికి కాలం మూడింది. రామా! నీవు చేసిన ఉపకారము వలన వచ్చిన రాజ్యమును, భార్యను అనుభవిస్తున్నాడే కానీ, అనుకున్న ఒప్పందము ప్రకారము ప్రత్యుపకారము చేయవలెననే ఆలోచన వానికి ఉన్నట్టు లేదు. వీడిని తన అన్న వాలి వద్దకు పంపడమే ఉత్తమము. ఇటువంటి వాడు రాజ్యము చేయుటకు అనర్హుడు. సుగ్రీవుని తలచుకుంటేనే నాకు కోపం మిన్నుముట్టుతూ ఉంది. వాడిని చంపకుండా వదలను. అంగదునికి రాజ్యాభిషేకము చేద్దాము. అంగదుడే సీతను అన్వేషించడంలో మనకు సాయపడగలడు." అంటూ లక్ష్మణుడు ధనుస్సు తీసుకొని లేచాడు.

రాముడు లక్ష్మణుని అనునయించి ఇలా అన్నాడు. "లక్ష్మణా! సుగ్రీవుడు పాపం చేసాడని మనం కూడా పాపం చేస్తామా! సుగ్రీవుని చంపి పాపం ఎందుకు మూటకట్టుకుంటావు? నీలోని వివేకంతో ఆలోచించు. కోపాన్ని వదిలిపెట్టు. మనకు సుగ్రీవునితో స్నేహపూర్వక ఒప్పందం ఉంది. దానిని అనుసరించి ప్రవర్తించు. సుగ్రీవుడు తాను

అన్న మాట తప్పాడు. మనము కూడా అతనితో సానుకూలంగా మాట్లాడి, కార్యము చక్కపరచుకోవాలి. కాబట్టి ముందు సుగ్రీవునితో సౌమ్యంగా మాట్లాడు. వినకపోతే అప్పుడు తగిన విధంగా దండించవచ్చును.” అని అన్నాడు రాముడు.

అన్నగారి మాటలను శిరస్సున దాల్చి, లక్ష్మణుడు కిష్కింధకు వెళ్లాడు.  తన ధనుస్సును చేతబూని యమధర్మరాజు మాదిరి నిలబడ్డాడు. తాను సుగ్రీవునితో ఏమి మాట్లాడాలి, దానికి సుగ్రీవుని ఇచ్చే సమాధానాన్ని బట్టి తిరిగి తాను ఏమి మాట్లాడాలి అని ఒకటికి రెండు సార్లు ఆలోచించుకున్నాడు లక్ష్మణుడు. కిష్కింధ వెలుపల సంచరించు వానరులను చూచాడు లక్ష్మణుడు.

కోపంతో ఊగిపోతున్న లక్ష్మణుని చూచి ఆ వానరులు చేతి కందిన చెట్ల కొమ్మలను, రాళ్లను పట్టుకొని నిలుచున్నారు. ఆ వానరులను చూచి లక్ష్మణుడు కోపంతో హుంకరించాడు. వానరులందరూ భయపడా తలొకదిక్కుకు పారిపోయారు.

కొంత మంది వానరులు, సుగ్రీవుని వద్దకు పరుగు పరుగునపోయి లక్ష్మణుడు వచ్చి కోపంతో ద్వారము వద్దకు నిలబడి ఉన్నాడు అని చెప్పారు. కాని తారతో కూడి కామ సుఖములు అనుభవిస్తున్న సుగ్రీవుడు, వారి మాటలు వినిపించేకోలేదు. వానరులందరూ బయటకు వచ్చారు. వారు తమ చేతులలో చెట్ల కొమ్మలను, రాళ్లను, ఆయుధములను పట్టుకొని లక్ష్మణునికి కనపడునట్టుగా నిలబడ్డారు. తాను వచ్చిన విషయము తెలిసికూడా సుగ్రీవుడు తన దగ్గరకు రానందుకు లక్ష్మణుని కోపం తారస్థాయికి

చేరుకుంది. కోపంతో మండిపడుతున్నాడు. ఈ విషయం అంగదునికి తెలిసింది. లక్ష్మణుని కోపం చూచి అంగదుడు భయపడ్డాడు.

లక్ష్మణుడు అంగదుని పిలిచి “కుమారా! నీవు వెళ్లి నీ పినతండ్రి సుగ్రీవునికి నేను వచ్చానని తెలియజెయ్యి. ” అని అన్నాడు. వెంటనే అంగదుడు సుగ్రీవుని అంత:పురమునకు వెళ్లాడు. సుగ్రీవుని పాదములకు, రుమ పాదములకు నమస్కరించాడు. లక్ష్మణుని రాక గురించి సుగ్రీవునికి తెలియజేసాడు. కాని సుగ్రీవుడు, మద్యం మత్తులో ఉన్నాడు. అందుకని అంగదుడు ఏం చెప్పాడో అతనికి వినపడలేదు. అంగదుని వెంట ఉన్న మంత్రులు ప్లక్షుడు, ప్రభావుడు కూడా సుగ్రీవునికి లక్ష్మణుని రాక గురించి తెలియజేయడానికి ప్రయత్నించారు.

“ఓ రాజా! సుగ్రీవా! రామ లక్ష్మణుల అనుగ్రహంతో నీకు రాజ్యము లభించింది. వారునీకు మిత్రులు. లక్ష్మణుడు వచ్చి ద్వారము ధనుర్ధారియై నిలబడి ఉన్నాడు. అతనిని చూచి వానరులందరూ భయంతో వణికిపోతున్నారు. రాముడు నీతో చెప్పమన్న మాటలు చెప్పుటకు లక్ష్మణుడు నీ వద్దకు వచ్చాడు. తాను వచ్చినట్టు నీ తో చెప్పమని లక్ష్మణుడు ఈ అంగదుని నీ వద్దకు పంపాడు. అతని వెంట మేము కూడా వచ్చాము. లక్ష్మణుడు అమితమైన కోపంతో ద్వారం వద్ద నీకొరకు వేచిఉన్నాడు.

కాబట్టి ఓ రాజా! నీవు వెంటనే వెళ్లి, లక్ష్మణుని కలుసుకొని, అతనికి నమస్కరించి, అతని కోపము తగ్గించు. నీవు రామునితో చేసుకున్న ఒప్పందము ప్రకారము చేస్తానని లక్ష్మణునికి వినయంగా

చెప్పు. రాముడు ఏమి చెప్పి పంపాడో ఆవిధంగా చెయ్యి. అదే ప్రస్తుత కర్తవ్యము." అని మంత్రులు సుగ్రీవునికి హితోపదేశము చేసారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ముప్పది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

కిష్కింధా కాండము
ముప్పది రెండవ సర్గ.

లక్ష్మణుడు కోపంతో వచ్చి ద్వారము వద్ద నిలబడి ఉన్నాడు అని తెలుసుకున్న సుగ్రీవునికి మత్తు పూర్తిగా దిగింది. ఆసనము మీది నుండి లేచాడు. తన మంత్రులను చూచి ఇలా అన్నాడు.

"అయ్యో! లక్ష్మణునికి ఎందుకు కోపం వచ్చింది. నేనేమీ ఆయనతో చెడుగా మాట్లాడలేదే! ఏమీ తప్పుగా ప్రవర్తించలేదే! మరి లక్ష్మణునికి కోపం ఎందుకు వచ్చినట్టు. నా శత్రువులు ఎవరో నామీద చెడుగా లక్ష్మణునికి చెప్పి ఉంటారు. మీరందరూ ఆలోచించి మనము లక్ష్మణునితో ఎలా మాట్లాడాలో నిర్ణయం చెయ్యండి.

నాకు రాముడు అన్నా లక్ష్మణుడు అన్నా భయం లేదు. కానీ, అకారణంగా లక్ష్మణుడు ఎందుకు కోపించాడా అని సంభ్రమంగా ఉంది. రాముడు లాంటి మిత్రుడు దొరకడమే చాలాకష్టము. అటువంటి మిత్రుని వదులుకుంటానా! రాముడు నాకు చేసిన సాయము ఈ జన్మలో మరువలేనిది. నేను ఎంత చేసినా, రాముడు చేసిన

సాయమునకు సాటి రాదు. కాని చిన్న చిన్న విషయములకు కూడా స్నేహమునకు విఘాతము కలుగుతుంది. అందుకే నేను రామునికి భయపడుతున్నాను." అని అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుడు నేర్పుగా అంటున్న మాటలు విన్న హనుమంతుడు సుగ్రీవునితో ఇలా అన్నాడు. "సుగ్రీవా! నీకు రాముడు చేసిన ఉపకారమును నీవు మరచిపోలేదు అనడంలో ఆశ్చర్యం ఏమీలేదు. నీకోసమే కదా రాముడు వాలిని చంపాడు. రాముడు ఎప్పటికీ నీకు మిత్రుడే. మరి అటువంటి రాముడు కోపించి లక్ష్మణుని పంపాడు. నీవు సుఖలాలసతతో మునిగి తేలుతూ కాలము ఎలా గడిచిపోతున్నదీ తెలుసుకోలేకున్నావు. నీవు అనుకొన్న వానాకాలము పోయి శరత్కాలము ప్రవేశించినది. రామునితో చేసుకున్న ఒప్పందము మేరకు మనము సీతను వెదకుటకు సమయము ఆసన్నమైనది అని నీవు గుర్తించడం లేదు. నీవు రామునితో చేసుకున్న ఒప్పందము మరిచిపోయినావనే, నీకు గుర్తుచేయడానికి రాముని దూతగా లక్ష్మణుడు వచ్చాడు అన్నవిషయం తెలుస్తూనే ఉంది.

నీవు నీ భార్యతో సుఖంగా ఉన్నావు. రాముడు తన భార్యను పోగొట్టుకొని కష్టాలలో ఉన్నాడు. అది గ్రహించు. కాబట్టి రాముడు ఏమన్నా నీవు సహించాలి. సీతను వెదకడంలో నీవు ఆలస్యంచేసి తప్పుచేసావు కాబట్టి, నీవు లక్ష్మణుని వద్దకు పోయి అతని కోపం ఉపశమింపచేయడం తప్ప మరొక మార్గం లేదు. మంత్రులు అయిన వాళ్లు రాజుకు హితము చెప్పవలెను. అందుచేతనే. మంత్రులైన మేము, నీతో భయం విడిచి, హితమును చెప్పుచున్నాము. రాముడికే కోపం వస్తే ఏం జరుగుతుందో మా కన్నా నీకే బాగా తెలుసు. రాముడు నీకు

చేసిన ఉపకారమును మనసులో ఉంచుకొని, కృతజ్ఞతా భావంతో రాముని ప్రసన్నం చేసుకో. రామునికి కోపం తెప్పించడం కిష్కింధకు మంచిది కాదు."అని హితోక్తులు పలికాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ముప్పది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

కిష్కింధా కాండము
ముప్పదిమూడవ సర్గ.

సుగ్రీవుని ఆదేశము మేరకు అంగదుడు మొదలగు వారు వెంటనే వెళ్లి లక్ష్మణుని వినయంగా లోపలకు ఆహ్వానించారు. లక్ష్మణుడు కిష్కింధా నగరంలోకి ప్రవేశించాడు. లక్ష్మణుని చూచి వానరులందరూ భక్తితో నమస్కరించారు. లక్షణుని మొహంలో కోపాన్ని చూచి వానరులు భయం భయంగా దూర దూరంగా నిలబడ్డారు.

విశాలమైన రాజమార్గముల గుండా లక్ష్మణుడు వెళు తున్నాడు. లోపల ఉన్న పలు అంతస్థుల భవనములను చూచాడు లక్ష్మణుడు. రాజ మార్గములో పోతూ, అంగదుడు, మైందుడు, ద్వివిదుడు, గవయుడు, గవాక్షుడు, గజుడు, శరభుడు, విద్యున్మాలి, సంపాతి, సూర్యాక్షుడు, హనుమంతుడు, వీరబాహుడు, సుబాహుడు, నలుడు, కుముదుడు, సుషేణుడు, తారుడు, జాంబవంతుడు, దధివక్త్రుడు, నీలుడు, సుపాటలుడు,సునేత్రుడు మొదలగు వానర వీరుల గృహములను చూచాడు లక్ష్మణుడు.

దేవేంద్రుని భవనము వలె వెలిగిపోవుచున్న వానర రాజు సుగ్రీవుని ప్రాసాదమును చూచాడు లక్ష్మణుడు. ఆ ప్రాసాదము కైలాస శిఖరము మాదిరి తెల్లగా ప్రకాశిస్తూ ఉంది. ఆయుధములు ధరించిన వానరులు ఆ భవనమును నిరంతరమూ కాపలా కాస్తున్నారు. ముఖద్వారము గుండా లక్ష్మణుడు సుగ్రీవుని ప్రాసాదము లోనికి ప్రవేశించాడు. లక్ష్మణుడు ఏడు గవాక్షములను దాటి విశాలమైన అంత:పురములోని ప్రవేశించాడు.

లోపల నుండి మధురమైన వీణానాదములు, వివిధ వాద్యధ్వనులు వినిపిస్తూ ఉన్నాయి. అత్యంత సౌందర్యవతులైన స్త్రీలు అటు ఇటూ తిరుగుతున్నారు. అందుకని లక్ష్మణుడు వెళ్లి కాస్త దూరంగా నిలబడ్డాడు. తన ధనుస్సును ఎక్కుపెట్టి వింటి నారిని మ్రోగించాడు.

ఆ ధ్వని విని సుగ్రీవుడు ఆసనముమీది నుండి లేచాడు. లక్ష్మణుడు వచ్చాడని తెలుసుకున్నాడు. పక్కనే ఉన్న తారతో ఇలా అన్నాడు. “ఓ తారా! సాధారణంగా శాంతస్వభావుడైన లక్ష్మణుడు ఎందుకు కోపంగాఉన్నాడు? దీనికి కారణమేమి? సాధారణంగా లక్ష్మణునికి అకారణంగా కోపం రాదు కదా! లక్ష్మణుని పట్ల మనము ఏమి అపరాధము చేసాము? నీవు ఆలోచించి చెప్పు. లేకపోతే నీవు స్వయంగా వెళ్లి, లక్ష్మణునితో అనునయంగా మాట్లాడి, ఆయన కోపకారణం తెలుసుకో! సాధారణంగా ఎంత కోపంలో ఉన్నా మానవులు స్త్రీలను చూడగానే శాంతము వహిస్తారు కదా! ముందు నీవు వెళ్లి లక్ష్మణుని శాంతపరచు. లక్ష్మణుడు ప్రసన్నుడైన తరువాత నేను వెళ్లి లక్ష్మణునితో మాట్లాడతాను.” అని తారతో అన్నాడు.

అప్పుడు తార లక్ష్మణుని వద్దకు వెళ్లింది. తారను చూడగానే లక్ష్మణుని కోపం తగ్గిపోయింది. ఆమె ముందు తలవంచుకొని వినయంగా నిలబడ్డాడు లక్ష్మణుడు. తార ఆయనతో ఇలాఅంది.

"ఓ రాజకుమారా! నీ కోపమునకు కారణమేమి? ఇక్కడ నీకు ఎవరు ఎదురు చెప్పారు? నీ ఆజ్ఞను ధిక్కరించిన వాడు ఎవరు?" అనిసూటిగా అడిగింది.

అప్పుడు లక్ష్మణుడు తారతో ఇలా అన్నాడు."నీ భర్త అయిన సుగ్రీవుడు, ధర్మమును విడిచి కామభోగములలో ఎందుకు మునిగి తేలుతున్నాడు. ఆయన చేసిన తప్పు నీకు తెలియడం లేదా! సుగ్రీవుడు రాచకార్యములను మరిచి, మాకు ఇచ్చి మాట కూడా మరిచి, ఉపకారము చేసిన రాముని గురించి ఆలోచించక, కామభోగము లలో తేలియాడడం లేదా! అది నీకు తెలియదా!

సుగ్రీవుడు మాకు నాలుగు మాసములు వ్యవధి కావాలని అడిగాడు. ఆ నాలుగు మాసములు పూర్తి అయిన విషయం కూడా సుగ్రీవునకు గుర్తు లేదు. అవునా! ఈ విధంగా మద్యపాన మత్తులో, స్త్రీల సాంగత్యంలో గడపడం ధర్మము తెలిసిన వారికి తగదు. ఇది ధర్మహాని కలిగిస్తుంది. మిత్రుని వలన మేలును పొంది, దానికి ప్రతిగా మేలు చేయని వాడు ధర్మము తప్పినట్టే కదా! అటువంటి వాడు ఒక మంచి మిత్రుని పోగొట్టుకున్నవాడవుతాడు. నీభర్త అయిన సుగ్రీవుడు ధర్మమును, సత్యమును మరిచాడు. ప్రస్తుతము ఇదీ విషయము. ఇప్పుడు ఏం చేయాలో నువ్వే చెప్పు." అని అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని చెప్పిన మాటలను సావధానంగా విన్న తార లక్ష్మణునితో ఇలా అంది."రాజకుమారా! దయచేసి కోపం తెచ్చుకోకు. ఇది కోపానికి సమయం కాదు. కార్యసాధకులకు కోపం పనికిరాదు. నీ వంటి గుణవంతుడు, గుణహీనుడైన సుగ్రీవుని పట్ల కోపం తెచ్చుకో వచ్చునా! సుగ్రీవుడు మీ పట్ల అపరాధం చేసాడు. దానిని మీరు సహించండి. రాముడి కోపం గురించి నాకు బాగాతెలుసు. మేము చేసిన అపరాధము గురించి మాకు తెలుసు. దానికి ఏమి చేయాలో కూడా మాకు తెలుసు.

ఓ రాజకుమారా! మన్మధుడు ఎంత బలవంతుడో నీకు తెలుసు. సుగ్రీవుడు ఆ మన్మధ బాణములకు చిక్కుకొని, కామ సుఖములలో మునిగి తేలుతున్నాడు. అదికూడా నాకు తెలుసు. కామాసక్తుడైన వాడికి ధర్మము గురించి పట్టించుకోడుకదా! ఆ సుగ్రీవుడు కామాసక్తుడై సిగ్గు లేకుండా, ఇప్పటిదాకా నా దగ్గరే ఉ న్నాడు. నీవు అతనిని క్షమించు.

మరొక మాట! నిరంతరమూ తపస్సుచేసుకొనే మహా ఋషులు కూడా కామమునకు లోబడి ప్రవర్తించడం మనకు తెలుసు. అటువంటిది, వానరుడు, చపలస్వభావుడు అయిన సుగ్రీవుడు కామానికి లోబడటం వింత ఏమీ కాదు కదా! ఓ రాజకుమారా! అసలు విషయం ఏమిటంటే, సుగ్రీవుడు ఎంత కామాసక్తుడైనా, తన కర్తవ్యమును పాలించాడు. వానాకాలము ముగియగానే, మీ కార్యము సాధించుటకు వానరులను సమీకరించడానికి, వార్తాహరులను నలుదిక్కులకూ పంపాడు. కాబట్టి నీవు అంత:పురములోని వచ్చి సుగ్రీవునితో మాట్లాడు." అని లక్ష్మణుని సవినయంగా

అంత:పురములోనికి ఆహ్వానించింది తార. తార ఆహ్వానమును మన్నించి లక్ష్మణుడు సుగ్రీవుని అంత:పురములోనికి ప్రవేశించాడు. కనకపు సింహాసనము మీద, తన భార్య రుమతో సహా కూర్చుని ఉన్న సుగ్రీవుని చూచాడు లక్ష్మణుడు. సుగ్రీవునికి, ధనుర్బాణములు ధరించిన లక్ష్మణుడు, దండధరుడైన యముడి మాదిరి కనపడ్డాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ముప్పది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

కిష్కింధా కాండము

ముప్పది నాలుగవ సర్గ.

లక్ష్మణుని చూడగానే సుగ్రీవుడు తన ఆసనమునుండి కిందికి దిగాడు. అతని తోపాటు అతని భార్యలు రుమ మొదలగు స్త్రీలు కూడా లేచి నిలబడ్డారు. సుగ్రీవుడు చేతులు జోడించి లక్ష్మణుని ఎదురుగా నిలబడ్డాడు. స్త్రీల మధ్య నిలబడ్డ సుగ్రీవుని చూచి లక్ష్మణుడు కోపంతో ఇలా అన్నాడు.

"ఓ సుగ్రీవా! బలవంతుడు, ఉత్తములైన బంధువులు ఉన్నవాడు, జాలి, దయకలవాడు, ఎల్లప్పుడు సత్యమునే పలుకువాడు, అయిన రాజు లోకములో అందరిచేతా పూజింపబడతాడు. ధర్మము తప్పినవాడు, ఇచ్చిన మాటను మరచువాడు, అసత్యము పలుకువాడు అయిన రాజు కంటే క్రూరుడు మరొకడు ఉండడు.

అశ్వమును దానము చేస్తాను అని చెప్పి దానం చేయకుండా ఉన్నవాడు నూరు అశ్వములను చంపిన పాపమును పొందుతాడు. అలాగే గోవును దానం చేస్తాను అని చెప్పి మాటతప్పితే వాడికి వేయి గోవులుచంపిన పాపం అంటుకుంటుంది. అలాగే మిత్రునికి ఇచ్చిన మాట తప్పినవాడికి బంధు మిత్రులను చంపి, తనను తాను చంపుకున్న పాపం అంటుకుంటుంది. తన పని పూర్తి అయిన తరువాత, తనకు సాయం చేసిన మిత్రులకు ప్రత్యుపకారముచేయని కృతఘ్నుని జనం అంతాకొట్టి చంపుతారు.

చేసిన మేలు మరచి పోయే కృతఘ్నుని గురించి బ్రహ్మదేవుడు చెప్పిన మాటలు విను. "గోవును చంపిన వానికి, మద్యము తాగిని వానికి, దొంగతనము చేసిన వానికి, ప్రాయశ్చిత్తము కలదుకానీ, చేసిన మేలు మరచిపోయిన కృతఘ్నునికి ఎలాంటి ప్రాయశ్చిత్తములేదు". ఇది బ్రహ్మవాక్కు.

ఓ సుగ్రీవా!ముందు నీ పని పూర్తి చేసుకున్నావు. ఇప్పుడు రాముని పని చేయడానికి ఉత్సాహం చూపడం లేదు. నీవు అసత్యము పలికేవాడివి. కృతఘ్నుడవు. దుర్మార్గుడవు. నీవు కోరిన ప్రకారము రాముడు నీ అన్న వాలిని చంపి నీకు రాజ్యమును, నీ భార్యను ఇప్పించాడు. నీవు కూడా నీవు చేసిన ప్రతిజ్ఞ ప్రకారము సీతను వెదకడంలో రామునికి సాయం చెయ్యాలి కదా! కానీ నీవు నీ ప్రతిజ్ఞను నిలుపుకోకుండా, ఇలాస్త్రీలతో సుఖించడం మంచిదా! నీవు ఇలాంటివాడివి అని రామునికి తెలియదు. తెలిస్తే నీతో స్నేహం చేసేవాడే కాదు. నీ వంటి దుర్మార్గుడిని, అసత్యవాదిని, పాపాత్ముడిని,

చెడ్డ బుద్ధి కలవాడిని ఈకిష్కింధకు రాజును చేసేవాడే కాదు.

ఓ సుగ్రీవా! నీవు, రాముడు నీకు చేసినమేలు గుర్తుంచుకొని, ప్రత్యుపకారము చేయకపోతే, నీవుకూడా వాలిని కలుసుకుంటావు. నీకు రాముని ధనుస్సునుండి వెలువడిన బాణము శక్తి ఇంకా తెలిసినట్టు లేదు. అందుకే రామునికి ఇచ్చిన మాట మరిచి హాయిగా కామసుఖాలలో తేలియాడుతున్నావు." అని సుగ్రీవుని తన వాడి అయిన మాటలతో హెచ్చరించాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము కిష్కింధాకాండము

ముప్పదినాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

ముప్పది ఐదవసర్గ.

లక్ష్మణుడు చెప్పిన మాటలు విని సుగ్రీవుడికి నోట మాట రాలేదు. కాని చతురంగా మాట్లాడటంలో నేర్పరి అయిన తార లక్ష్మణునితో ఇలా అంది. "ఓ లక్ష్మణ కుమారా! నీ నోటి నుండి ఇటువంటి పరుష వాక్యములు రాకూడదు. అటువంటి మాటలు సుగ్రీవుడు వినకూడదు. నీవు అనుకుంటున్నట్టు ఈ సుగ్రీవుడు కృతజ్ఞత లేనివాడు కానీ, శఠుడు కానీ, దారుణమైన పనులు చేయువాడుకానీ, అసత్యములు ఆడువాడు కానీ, కుటిలమైన బుద్ధి కలవాడు కానీ కాడు.

సుగ్రీవునికి రాముడు మహోపకారముచేసాడు. అది నిజము. రాముడు చేసిన ఉపకారమును సుగ్రీవుడు మరచిపోలేదు. ఇదీ నిజమే. రాముని అనుగ్రహము వలననే సుగ్రీవుడు ఈ రాజ్యమును, తన భార్య రుమను, నన్ను పొందగలిగాడు. కొన్ని సంవత్సరముల పాటు వాలి చేతిలో బాధలు పడి నిద్ర, ఆహారము లేకపోవడం వలన, ఒక్కసారి సుఖములు వచ్చి మీద పడేటప్పటికి, సుగ్రీవునికి కాలము తెలియలేదు. ఇదీ నిజమే.

పూర్వము విశ్వామిత్రుని వంటి మహాఋషి మేనక మోహంలో పడి సంవత్సరములు రోజులుగా గడిపాడు. మహాత్ముడైన విశ్వామిత్రుడే కాలమును గుర్తించలేనపుడు, వానరుడు అయిన ఈ సుగ్రీవుడు ఎంత? దొరక్క దొరక్క దొరికిన దేహసుఖములను, కామసుఖములను అనుభవించడంలో అలసిపోయి శరత్కాలము వచ్చినది అనుమాట మరిచిన ఈ వానర రాజును రాముడు క్షమించాలి. కాబట్టి లక్ష్మణకుమారా! నీవు నిజానిజములు తెలుసుకొని తరువాత నిందించు. అంతే కానీ, తాత్కాలిక కోపమునకు వశము కాకు.

ఓ లక్ష్మణా! సుగ్రీవుని బదులుగా నేను నిన్ను వేడుకుంటు న్నాను. నీ కోపమును విడిచి పెట్టు. శాంతము వహించు. సుగ్రీవుడు పట్టిన పట్టు వదిలి పెట్టడు. రామ కార్యము నిర్వహించడంలో సుగ్రీవుడు ఈ రాజ్యమును, సమస్త సంపదలను, అంగదుని, తన భార్య రుమను, నన్ను కూడా విడిచిపెట్టడానికి వెనుకాడడు అని నా నమ్మకము. సుగ్రీవుడు, ఆ రావణుడు సీతను ఎక్కడదాచాడో వెదికి

పట్టి, రావణుని హతమార్చి, సీతను రాముని దగ్గరకు చేర్చగలడు.

రావణుని నివాసమైన ఆ లంకలో శతకోటి సహస్ర రాక్షసులు ఉన్నారట. (అంటే నూరుకోట్లవేల రాక్షసులు---1,000,000,000,000 ఇదీ సంఖ్య), ముప్పదిఆరు ఆయుతముల రాక్షసులు ఉన్నారని ప్రతీతి. (ఆయుతము అంటే పదివేలు). ముందు వీరిని చంపకుండా రావణుని జయించడం, సీతను తీసుకు రావడం సాధ్యము కాదు. నీవు, రాముడు, ఎవరి సాయమూ లేకుండా రాక్షస సేనలను నిర్మూలించడం సాధ్యం కాదు. సుగ్రీవుడు కూడా ఒంటరిగా ఆ రాక్షసులను చంపలేడు. కాబట్టి మీకు సుగ్రీవుని సాయము తో పాటు కోట్ల కొద్దీ వానరులసాయము అత్యావశ్యకము.

రావణుని గురించి, రావణుని బలము గురించి నా భర్త వాలికి బాగా తెలుసు. ఆయనే నాకు పైవిషయములుచెప్పాడు. నేను నా భర్త వాలి నుండి విన్న విషయములను నీకు చెప్పాను. కాబట్టి, మనకు కావలసిన వానర సైన్యములను సమకూర్చుటకు సుగ్రీవుడు వానర ప్రముఖులను నలుదిశలకు పంపాడు. వారు ఈరోజే ఇక్కడకు రావాలి. సుగ్రీవుడు ఇదవరకే చేసిన ఏర్పాటు ప్రకారము కోట్లకొలది వానరులు, భల్లూకములు కిష్కింధకు చేరుకుంటున్నారు. వారందరూ తమరి అధీనంలో ఉంటారు. కాబట్టి నీకోపాన్ని విడిచి పెట్టి శాంతము వహించు.

నేను, రుమ, అంత:పుర స్త్రీలు అందరూ నీ కోపముతో నిండిన ముఖమును చూచి భయంతో వణికిపోతున్నాము. సుగ్రీవునికి కూడా వాలికి పట్టిన గతి పడుతుందని అల్లాడుతున్నాము. కాబట్టి నీ

కోపం ఉపసంహరించుకో." అని వినయంగా ఉన్న విషయం చెప్పింది తార.

శ్రీమద్రామాయణము
కిష్కింధాకాండము ముప్పది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ముప్పది ఆరవసర్గ.

ఎంతో సున్నితంగా, ధర్మబద్ధంగా యుక్తియుక్తంగా పరిస్థితులను వివరించిన తార మాటలను లక్ష్మణుడు అంగీకరించాడు. లక్ష్మణుడు శాంత పడ్డాడు అని ధృవపరచుకున్న సుగ్రీవుడు తన భయాన్ని విడిచిపెట్టాడు. లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"ఓ లక్ష్మణకుమారా! నేను రాముని దయచేత ఈ కిష్కింధా రాజ్యాన్ని, నా ఐశ్వర్యాన్ని, నా కీర్తిని, నా భార్యను తిరిగి పొందాను. దానిని నేను ఎన్నటికీ మరచిపోలేను. నాకు ఇంత మహోపకారము చేసిన రామునికి నేను ఎంత ప్రత్యుపకారము చేసినా తక్కువే అవుతుంది. రామునికి కేవలము నేను సహాయకుడుగానే ఉంటాను. రాముడే రావణుని చంపి, సీతను పొందగలడు. ఒకే బాణము చేత ఏడు సాల వృక్షములనుకూల్చిన రామునికి నా సాయం ఎందుకు. రావణ సంహారము కొరకు ముందు రాముడు నడుస్తుంటే నేను ఆయన వెనక వెళతాను.

ఈ లోకంలో తెలిసో తెలియకో అపరాధము చేయని వాడు

ఎవడూ ఉండడు కదా! రాముని పట్ల నేను తెలిసో తెలియకో ఏదైనా అపరాధము చేస్తే నన్ను క్షమించు." అని రెండు చేతులూ జోడించి ప్రార్థించాడు సుగ్రీవుడు.

సుగ్రీవుని మాటలకు లక్ష్మణుడు ఎంతో సంతోషించాడు. సుగ్రీవునితో ఇలా అన్నాడు. "ఓ వానర రాజా! నీ వినయమునకు విధేయతకు చాలా సంతోషించాను. నీవలన రామకార్యము నెరవేరుతుంది అన్న నమ్మకము నాకు ఉంది. నీవు ఇంతటి ధర్మాత్ముడవు, వినయ వంతుడవు అవడం వలననే ఈ కిష్కింధా రాజ్యమునకు రాజువు కాగలిగావు. నీసాయముతో రాముడు రాక్షసులతో యుద్ధము చేసి వారిని చంపగలడు. ఇందులో ఎలాంటి సందేహము లేదు.

నీవు ధర్మమునను సరించి పలికిన మాటలు నాకు ఎంతో సంతోషాన్ని కలుగచేసాయి. ఎందుకంటే నీ తప్పును నీవు తెలుసుకొని యుక్తియుక్తంగా మాట్లాడటం నీకే చెల్లింది. దేవతలే నిన్ను రామునికి సహాయకుడిగా పంపారని అనుకుంటున్నాను. ఓ సుగ్రీవా! నీవు నా వెంట వచ్చి రామునికి జరిగినది అంతా చెప్పి, సీతా వియోగముతో బాధపడుతున్న రాముని ఓదార్చు. రాముని బాధ చూడలేక, జరిగింది తెలుసుకోకుండా, తొందరపడి నీతో పరుషంగా మాట్లాడాను. నన్ను క్షమించు." అని అన్నాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ముప్పది ఆరవసర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## ముప్పది ఏడవ సర్గ.

లక్ష్మణుని మాటలు విని సుగ్రీవుని మనస్సు సంతుష్టి చెందింది. వెంటనే పక్కనే ఉన్న హనుమంతుని చూచి ఇలాఅన్నాడు.

"హనుమా! మహేంద్రపర్వతము మీద, వింధ్యపర్వతము మీద, కైలాస పర్వతము మీద, మందరపర్వతము మీద, నివసించు చున్న వానరము లందరినీ కిష్కింధలో సమావేశము కావాలని వర్తమానము పంపించు. అలాగే సముద్ర ప్రాంతములలో నివసించు వానరములను, పశ్చిమ దిక్కున ఉన్న ఆదిత్య పర్వతము మీద ఉన్న వానరములను, పద్మాచలము మీద ఉన్న వానరములను, అంజనా పర్వతము మీదున్న వానరములను, మేరు పర్వత శిఖరములలో ఉన్న వానరములను, ధూమ్రగిరి మీద నివసించే వానరములను, మహారుణ పర్వతము మీద నివసించే వానరములను, ఇంకా ఇతర ప్రాంతము లలో భూమి మీద, కొండల మీద, పర్వత శిఖరముల మీద నివసించే సమస్త జాతుల వానములను కిష్కింధలోసమావేశము కావాలని సుగ్రీవాజ్ఞగా తెలియచెయ్యండి. ఇంతకు పూర్వము మనము పంపిన వానర ప్రముఖులను తొందరగా పనిపూర్తిచేసుకొని రమ్మని వర్తమానము పంపు. ఇదంతా పది రోజులలో జరగాలి. నా ఆజ్ఞను ధిక్కరించిన వారికి మరణ దండన విధింపబడుతుంది అని తెలియచెయ్యి. నా అధికార పరిధిలో ఉన్న సమస్త జాతుల వానరములు ఇక్కడకు రావాలి. నా ఆజ్ఞను అందరికీ తెలియ జేయుటకు వేగంగా ఎగురగలిగే వానరములను, అన్ని ప్రదేశములను

క్షుణ్ణంగా తెలిసిన వానరములను నలుదిక్కులకు పంపు. ఇదంతా ఈరోజుజరగాలి." అని హనుమంతునికి ఆదేశాలు ఇచ్చాడు సుగ్రీవుడు.

సుగ్రీవుని ఆజ్ఞ ప్రకారము వానరములు నలుదిక్కులకు వెళ్లాయి. సముద్రప్రాంతములలోనూ, పర్వత శిఖరముల మీద, కొండ లోయలలోనూ, అడవులలోనూ, సరస్సుల వద్ద నివసించు సమస్త వానరములను రామ కార్యము నిమిత్తము కిష్కింధకు రావలసినదిగా సుగ్రీవుని ఆజ్ఞను తెలియజేసాయి. మృత్యువుతో సమానమైన సుగ్రీవుని ఆజ్ఞను అనుసరించి సమస్త వానరములు కిష్కింధకు ప్రయాణం కట్టాయి.

పర్వత ప్రాంతముల నుండి మూడు కోట్లవానరములు వచ్చాయి. బంగారు ఛాయగల పదికోట్లవానరములు వచ్చాయి. కైలాస శిఖరము నుండి వెయ్యి కోట్ల వానరములు వచ్చాయి. హిమవత్పర్వతము మీది నుండి వెయ్యికోట్ల వానరములు వచ్చాయి. వింధ్య పర్వతము నుండి లెక్కలేనన్ని వానరములు వచ్చాయి. ఇంకా అరణ్యములనుండి, కొండ గుహల నుండి లెక్కలేనన్ని వానరములు వచ్చాయి.

హిమవత్పర్వతము మీద ఉన్న వానరములను పిలవడానికి వెళ్లిన వానరులు అక్కడ ఒక మహావృక్షమును చూచారు. పూర్వము ఆ ప్రదేశములో మహేశ్వరుని గురించి ఒక యజ్ఞము చేయబడింది. ఆ సమయంలో అక్కడ పడిన యజ్ఞశేషములనుండి ఉద్భవించిన ఆ మహా వృక్షములకు కాసిన మధురమైన ఫలములను వారు చూచారు. ఆ ఫలములను తిన్న వారికి ఒకమాసము వరకూ

ఆకలిదప్పులుఉండవు. అది తెలిసిన వానరులు, ఆ ఫలములను, పుష్పములను, ఆ చెట్టు వేళ్లను తీసుకొని వచ్చారు. ఆ మహిమ గల ఫలములను వారు సుగ్రీవునికి కానుకగా ఇచ్చారు.

వానరులందరికీ సుగ్రీవుని ఆదేశాన్ని అందించామని, వానరులందరూ వెంటనే వస్తున్నారనీ సుగ్రీవునికి తెలియజేసారు. ఆ మాటలు విన్న సుగ్రీవుడు ఎంతో సంతోషించాడు. వారు తెచ్చిన కానుకలు స్వీకరించాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ముప్పది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ముప్పది ఎనిమిదవ సర్గ.

హిమాచలము నుండి వానరులు తెచ్చిన కానుకలు తీసుకొని వారిని పంపివేసాడు సుగ్రీవుడు. సుగ్రీవుడు చేస్తున్న ప్రయత్నములను చూచి లక్ష్మణుడు తృప్తి చెందాడు.

"ఓ సుగ్రీవా! ఇంక మనము రాముని వద్దకు పోవుదము. రాముడు మన రాక కొరకు ఎదురు చూస్తూ ఉంటాడు." అని అన్నాడు.

"అవశ్యము లక్ష్మణా! అలాగే వెళ్లెదము." అని అన్నాడు

సుగ్రీవుడు.

తారను మిగిలిన స్త్రీలను లోపలకు పంపివేసాడు. తన అనుచరులకు పల్లకినీ తీసుకు రమ్మని ఆదేశించాడు. వెంటనే వానరులు అందమైన పల్లకిని తీసుకొని వచ్చారు. ఆ పల్లకిలో సుగ్రీవుడు, లక్ష్మణుడు ఎక్కారు. వంది మాగధులు స్తుతిస్తూ ఉండగా, అనుచరులు తెల్లని ఛత్రము పట్టి, వింజామరలు వీచుచుండగా, లక్ష్మణుడు, సుగ్రీవుడు కలిసి  పల్లకిలో ఎక్కి రాముని వద్దకు వెళ్లారు. సుగ్రీవుడు పల్లకి దిగి, రాముని ఎదురుగా రెండు చేతులు కట్టుకొని నిలబడ్డాడు. సుగ్రీవుని వెంట వచ్చిన వానర వీరులు కూడా అదేమాదిరి చేతులు కట్టుకొని వినయంగా నిలబడ్డారు.

వారిని అందరినీ  రాముడు మిత్రభావంతో చూచాడు. సుగ్రీవుడు రాముని పాదాల మీద పడి నమస్కరించాడు. రాముడు సుగ్రీవుని బుజాలు పట్టుకొని లేవ నెత్తాడు. ప్రేమతోనూ గౌరవంతోనూ కౌగలించుకున్నాడు.  సుగ్రీవుని తన పక్కనే కూర్చోపెట్టుకున్నాడు రాముడు. రాముడు సుగ్రీవునితో ఇలా అన్నాడు.

"మిత్రమా! సుగ్రీవా! ధర్మమును, అర్థమును, కామమును ఆయా కాలములందు అనుభవించు వాడు రాజు అనిపించుకుంటాడు. అటువంటి రాజు నిరంతరము జాగరూకతతో ఉంటాడు.  కాని ధర్మమును, అర్థమును విడిచి కేవలము కామాసక్తుడైన వాడు మాత్రము,  ఆపదలు వచ్చినపుడు మాత్రమే మేలుకుంటాడు. తన తప్పును తెలుసుకుంటాడు.  శత్రువులను ఓడిస్తూ, మిత్రులను ఆదరించే వాడు ఉత్తముడైన రాజు.

కాబట్టి ఓ మిత్రమా! మన ఒప్పందము ప్రకారము మనము సీతను వెదకడానికి ప్రయత్నాలు మొదలెట్టాలి. నీ మంత్రులతో ఆలోచించి తగు నిర్ణయం తీసుకో!" అని సుగ్రీవునికి తన తప్పు తెలిసేటట్టు సున్నితంగా మాట్లాడాడు రాముడు.

రాముని మాటలలో ఉన్న అంతరార్థమును గ్రహించిన సుగ్రీవుడు రామునితో ఇలా అన్నాడు.

"ఓ రామా! నేను నీ వలన మహోపకారము పొందాను. నేను పోగొట్టుకున్న రాజ్యమును, ఐశ్వర్యమును, నా భార్యను నీ అనుగ్రహము వలన పొందగలిగాను. మీరు చేసిన ఉపకారమునకు నేను ప్రత్యుపకారము చేయనిచో, నేను ధర్మము తప్పిన వాడిని అవుతాను.

నేను నా ప్రయత్నాలు శరదృతువురాగానే మొదలెట్టాను. వివిధ ప్రాంతముల నుండి వానరసేనలను కిష్కింధకు చేరుకోవాలని ఆదేశాలు ఇచ్చాను. లెక్కకు మించిన వానరములు కిష్కింధకు చేరుకుంటున్నాయి. ఇంకా చాలా మంది వానర వీరులు తమ తమ సైన్యములతో మార్గమధ్యములో ఉన్నారు.

ఓ రామా! శతములు, శతసహస్రములు (లక్షలు), కోట్లు, ఆయుతములు, శంకువు, అర్బుదములు, శతాధిక అర్బుదములు సంఖ్యలో రకరకాల వానరజాతులు కిష్కింధకు చేరుకుంటున్నారు. వీరందరూ నీ అధీనములో ఉంటారు. వీరంతా రావణుని రాజ్యము మీదికి దండెత్తి, రావణుని సంహరించి, సీతను తీసుకురాగలరు." అని

క్లుప్తంగా వినయంగా చెప్పాడు సుగ్రీవుడు.

సుగ్రీవుని మాటలకు రాముడు ఎంతో సంతోషించాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ముప్పది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ముప్పది తొమ్మిదవ సర్గ.

రెండు చేతులూజోడించి తనముందు నిలబడి పైవిధంగా పలికిన సుగ్రీవుని చూచి రాముడు సంతోషంతో అతనిని కౌగలించుకున్నాడు.

"చంద్రుడు వెన్నెల కురిపించినట్టు నీ వంటి మిత్రుడు తన చర్యలతో నాకు ఆనందము కల్గిస్తున్నాడు అనడంలో ఆశ్చర్యం ఏముంటుంది? నీ గురించి నాకు బాగా తెలుసు. ఏదన్నా ఒక కార్యము తలపెడితే, దానిని నిర్విఘ్నముగా నెరవేరుస్తావు. నీ సాయం ఉంటే నేను యుద్ధములో శత్రువులను అందరినీ జయిస్తాను. ఆ రావణుడు తనకు వినాశ కాలము దాపురించి నా సీతను అపహరించాడు." అని అన్నాడు రాముడు.

ఇంతలో భూమ్యాకాశాలు దద్దరిల్లేటట్లు పెద్ద పెద్ద శబ్దములు వినిపించాయి. లక్షల కోట్ల సంఖ్యలో వానరములు అక్కడకు వస్తున్నాయి. ముందు వానర సేనానాయకులు నడుస్తూ ఉంటే వారి వెనక వానరాలు వస్తున్నాయి. లక్షకోట్లు వానరములతో వచ్చిన శతబలి అనే వానర వీరుడినిచూచాడు సుగ్రీవుడు. తరువాత వేల కోట్ల వానరములతో తార తండ్రి సుషేణుడు వచ్చాడు. రుమ తండ్రికూడా వేయి కోట్ల వానరములతో వచ్చాడు. హనుమంతుని తండ్రి కేసరి వేల కోట్ల వానరములతో వచ్చాడు. గవాక్షుడు అనే వానర రాజు వేయి కోట్ల వానరములతో వచ్చాడు.

ధూమ్రుడు అనే భల్లూక రాజు రెండు వేల కోట్ల భల్లూకములతో(ఎలుగు బంట్లు) వచ్చాడు. పనసుడు అనే వానర సేనా నాయకుడు మూడుకోట్ల వానరములతో వచ్చాడు.  నీలుడు అనే వానర వీరుడు పదికోట్ల వానరములతో వచ్చాడు. గవయుడు అనే వానర సేనాధి పతి ఐదుకోట్ల మంది వానరములతో వచ్చాడు. దరీముఖుడు అనే వానర సేనాని వెయ్యికోట్ల వానరములతో వచ్చాడు.

అశ్వినీ దేవతల కుమారులు అయిన మైందుడు, ద్వివిదుడు అనే వానర శ్రేష్ఠులు ఒక్కొక్కరు వేయి కోట్ల వానరులతో వచ్చారు. గజుడు అనే వానర వీరుడు మూడుకోట్ల వానరులతో వచ్చాడు. జాంబవంతుడు అనే భల్లూకరాజు పదికోట్ల భల్లూకములతో వచ్చాడు. రుమణుడు అనే వానర వీరుడు వందకోట్ల మంది వానరవీరులతో వచ్చాడు. గంధమాధనుడు అనే వానర వీరుడు పదివేల కోట్ల వానరులతో వచ్చాడు.

వాలికుమారుడు అంగదుడు వేయి పద్మములు, నూరు శంకువుల సంఖ్య వానరములతో సహా వచ్చాడు. తారుడు అనే వానర వీరుడు ఐదుకోట్ల వానరములతో వచ్చాడు. ఇంద్రజానువు అనే వానరసేనాని పదకొండుకోట్ల వానరములతో వచ్చాడు. రంభుడు అనే వానర వీరుడు శత,సహస్ర,ఆయుతముల వానరములతో వచ్చాడు. దుర్ముఖుడు అనే వానర సేనాని రెండు కోట్ల వానరములతో వచ్చాడు.

హనుమంతుడు తన అధీనములో ఉన్న వెయ్యికోట్ల వానరములతో వచ్చాడు. నలుడు అనే వానర వీరుడు వందకోట్ల, ఒకవెయ్యి, ఒక వంద వానరములతో వచ్చాడు. వీరే కాకుండా శరభుడు, కుముదుడు, వహ్ని, రంభుడు అనే వానర వీరులు అసంఖ్యాకములైన వానర సేనలతో వచ్చారు.

ఆ వానర సేనకు నాయకులు అందరూ వచ్చి సుగ్రీవునికి తాము వచ్చినట్టు విన్నవించుకున్నారు. ఆ వానర సేనానాయకులను సుగ్రీవుడు రామునికి పేరుపేరునా పరిచయం చేసాడు. తరువాత సుగ్రీవుడు ఆ వానరసేనానాయకులతో ఇలా అన్నాడు. "ఓ వానర సేనానాయకులారా! మీరందరూ మీ మీ సేనలతో ఈ పర్వతముల మీద అనుకూల మైన ప్రదేశములతో విడిది చేయండి. అప్పుడు రాముడు మన బలగముల గురించి తెలుసు కోడానికి వీలవుతుంది."అని అన్నాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ముప్పది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## నలుబదవ సర్గ.

వానర సేనానాయకులకు ఆ ప్రకారంగా ఆదేశాలు ఇచ్చాడు సుగ్రీవుడు. తరువాత రాముని చూచి ఇలా అన్నాడు.

"ఓ రామా! ఎంతో బలవంతులు, కామరూపులు, ఎక్కడికైనా క్షణంలో పోగలవారూ అయిన వానరులు కోట్ల సంఖ్యలో వచ్చి ఉన్నారు. వీరంతా దైత్యులను, దానవులను, రాక్షసులను సమర్థవంతంగా ఎదిరించగల సామర్థ్యము కలవారు.

ఓ రామా! ఈ వానరులు నేల మీద, నీటి మీద, ఆకాశంలోనూ సంచరించగల సమర్థులు. పైగా వీరికి అలసట అనేది లేదు. పూర్వము ఎన్నోయుద్ధములలో పాల్గొన్న అనుభవము కలవారు. వీరంతా ఇప్పుడు నీ ఆజ్ఞల కోసరము ఎదురుచూస్తున్నారు. నీవు ఏ పని చెబితే ఆ పని చేయడానికి సిద్ధంగా ఉన్నారు. ఇప్పుడు ఏమి చేయాలో చెప్పండి. మన సైనికులకు ఆజ్ఞలు ఇవ్వండి. ఏమి ఆజ్ఞలు ఇవ్వాలో నాకు తెలిసినా, అవి నీ నోటి నుండి వస్తే బాగుంటుంది." అని అన్నాడు సుగ్రీవుడు.

అప్పుడు రాముడు సుగ్రీవునితో ఇలా అన్నాడు. "మిత్రమా! సుగ్రీవా! ప్రస్తుతము మనము సీత గురించి అన్వేషించాలి. ఆమె జీవించి ఉన్నదా లేక మరణించినదా! జీవించి ఉంటే ఎక్కడ ఉంది! ఆ రావణుడు సీతను ఎక్కడ దాచి ఉంచాడు? ఈ విషయములను

మనము కనుక్కోవాలి. సీతను గురించి, రావణుని నివాసము గురించి, సీతను ఉంచిన ప్రదేశమును గురించి తెలిసిన తరువాత, తదుపరి కార్యక్రమమును ఆలోచిస్తాము. సీతను వెదికే కార్యక్రమములో నాకు గానీ, లక్ష్మణునికి గానీ ఎలాంటి అనుభవము సామర&ధ్యము లేవు. అది నీవే నిర్వహించాలి. ఈ అన్వేషణా కార్యక్రమము నిర్వహించుటకు నీవే సమర్ధుడవు. ఎందుకంటే ఏయే ప్రదేశాలు ఎక్కడెక్కడ ఉన్నాయో నీకు బాగా తెలుసు. కాబట్టి నీవే వానరులకు తగు ఆదేశాలు ఇవ్వు." అని అన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు వినతుడు అనే వానరసేనానిని పిలిచాడు. "ఓ వానరోత్తమా! నీవు నీ సైన్యముతో తూర్పు దిక్కుకు వెళ్లు. అక్కడ ఉన్న పర్వతములలోనూ గుహలలోనూ అడవులలోనూ నదుల తీరాలలోనూ, సమతల ప్రదేశాలలోనూ సీతను గురించి వెదుకు. గంగా, సరయూ, కాళిందీ, యమునా, కౌశికీ, సరస్వతీ మొదలగు నదీతీరాలలో వెదుకు. విదేహ, మాళవ,కాశీ,కోసల,పౌండ్ర, అంగ దేశములలో అన్ని పట్టణములను గ్రామములను, జనపదములను సీత కొరకు వెదకండి.

అంతే కాదు కొన్ని పర్వతములు సముద్రములో మునిగి ఉంటాయి. అక్కడకూడా వెతకండి. భూమి మీద ఉన్న పర్వత శిఖరము లను వెదకండి. అక్కడ మనుష్యులను చంపి తినే కిరాతులు ఉంటారు. అక్కడ కూడా వెదకండి. సముద్రమధ్యలో ఉన్న ద్వీపములను కూడా విడిచిపెట్టకుండా వెదకండి. కొంతమంది నీటి మధ్యలో ఉంటూ ఉంటారు. వారిని కూడా వదలకండి.

యవద్వీపము ఉంది. అక్కడ ఏడురాజ్యాలు ఉన్నాయి. ఆ

రాజ్యాలలో కూడావెదకండి. తరువాత బంగారు గనులతో విరాజిల్లు సువర్ణ ద్వీపమును, రజితద్వీపమును, వెదకండి. యవద్వీపము అవతల శిశిరము అనే పర్వతము ఉంది. ఆ పర్వత శిఖరము మీద దేవతలు దానవులు నివసిస్తూ ఉంటారు. ఆ పర్వతము మీద కూడా సీత కొరకు వెదకండి.

అక్కడ నుండి, ఎర్రని నీళ్లు గల శోణ నది దగ్గరకు వెళ్లండి. అక్కడ సముద్రమును దాటండి. సముద్రము ఆవల ఉన్న అరణ్యములను సీతకొరకు వెదకండి. సముద్రము మధ్య ఉన్న ద్వీపములలో కూడా వెదకండి. అక్కడ పెద్ద పెద్ద శరీరములతో ఉన్న అసురులు మనుష్యులను, జంతువులను, వాటి నీడను పట్టుకొని తమ వద్దకు లాగుకొని, ఆహారంగా తింటూ ఉంటారు. (ఇప్పటి బెర్ముడా ట్రయాంగిల్ ఇలాంటిదే)

దానిని దాటిన తరువాత ఎర్రని నీళ్లతో కూడిన లోహితము అనే సముద్రము కనిపిస్తుంది. అక్కడ ఒక పెద్ద కూటశాల్మలీ వృక్షము కనిపిస్తుంది. అక్కడే గరుత్మంతుడు నివాసము ఉంటాడు. ఆయన గృహమును విశ్వకర్మ నిర్మించాడు. అక్కడున్న పర్వతముల మీద మందేహులు అనే భయంకరమైన రాక్షస జాతి నివసిస్తూ ఉంటుంది. అక్కడకూడా వెదకండి. తరువాత పాలవంటి నీరు కల క్షీరసముద్రము వద్దకు వెళ్లండి. ఆ సముద్రము మధ్యలో ఋషభ అనే తెల్లని పర్వతము ఉంది. ఆ పర్వతము మీద సుదర్శనము అనే సరస్సు ఉంది. అక్కడకు దేవతలు, చారణులు, యక్షులు, కిన్నరులు, వానరులు క్రీడించడానికి వస్తుంటారు. ఆ పర్వతము మీద కూడా వెదకండి.

క్షీరసముద్రము దాటగానే మీకు జలసముద్రము

కనిపిస్తుంది. అ సముద్రములో బడబాగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంటుంది. ఆ సముద్రము ఉత్తర తీరంలో జాతరూపశిలము అనే పెద్ద పర్వతము ఉంది. ఆ పర్వతము మీద భూభారమును మోయుచున్న వేయి పడగల ఆదిశేషువు కనపడతాడు. ఆయనకు మూడు తలలు ఉన్న తాళవబుక్షము కేతనము (పతాకము).

దాని తరువాత మీకు ఉదయ పర్వతము కనపడుతుంది. దాని మీద సౌమనసము అనే శిఖరము ఉంది. అది బంగారు వర్ణంలో ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ శిఖరము యోజనము విస్తీర్ణము కలిగి ఉ ంది. పూర్వము త్రివిక్రమావ తారంలో శ్రీమహావిష్ణువు ఒక పాదమును ఇక్కడ, మరొక పాదమును మేరు పర్వతము మీద మోపాడని అంటారు. సూర్యుని సంచారము ఇక్కడ నుండి మొదలవుతుంది. ఆ పర్వతము మీద వాలఖిల్యులు అనే మునులు తపస్సు చేసుకుంటూ ఉంటారు. అక్కడే సుదర్శన ద్వీపము ఉంది.

ఈ ఉదయ పర్వత శిఖరము ప్రాత:కాలసమయమున సూర్యుని తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంటుంది. బ్రహ్మ ఈ పర్వతమును మొట్ట మొదటగా తూర్పు దిక్కున, ఈ భూమికి ద్వారముగానూ, సూర్యుడు ఉదయించడానికి స్థానముగానూ సృష్టించాడు. అందుకే సూర్యుడు ఉదయించు దిక్కును తూర్పు దిక్కు (పూర్వదిక్కు) అని పిలుస్తారు. మీరు వెళ్లి ఆ ఉదయ పర్వతముమీద పూర్తిగా వెదకండి. ఉదయ పర్వతము ఆవలకు ఎవరూ వెళ్లలేరు. అక్కడ సూర్యుడు లేనందు వలన అంధకారంగా ఉంటుంది. ఉదయ పర్వతము గుహలలోనూ శిఖరముల మీదా సీత కోసరం వెదకండి. మీరు ఉ దయ పర్వతము వరకు మాత్రమే వెళ్లగలరు. ఉదయ పర్వతము ఆవల

ఏముంటుందో నాకు కూడా తెలియదు. అందుకని మీరు ఉదయ పర్వతమువరకూవెళ్లి, సీతను వెదకి, ఒక నెలలోపు తిరిగి రావాలి. నెలరోజులలోపు మీరు తిరిగా రాకపోతే మీకు మరణదండన విధింపబడుతుంది." అని సుగ్రీవుడు వానర యోధులను ఆదేశించాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము నలుబదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము
## నలుబది ఒకటవ సర్గ.

ఆ ప్రకారము సుగ్రీవుడు వానరులను తూర్పుదిక్కుకుపంపిన తరువాత, మరి కొంత మంది వానరులను దక్షిణదిక్కుగా పంపాడు. దక్షిణ దిక్కుకు పంపబడిన వానరులలో ప్రముఖులైన అగ్నికుమారుడు నీలుడు, వాయుపుత్రుడు హనుమంతుడు, బ్రహ్మదేవుని కుమారుడైన జాంబవంతుడు, సుహెూతుడు, శరారి, శరగుల్ముడు, గజుడు, గవాక్షుడు, సుషేణుడు, వృషభుడు, మైందుడు, ద్వివిదుడు, విజయుడు, గంధమాధనుడు, అగ్నిపుత్రులైన ఉల్కాముఖుడు, అనంగుడు, వాలి కుమారుడు అంగదుడు వెళ్లారు. ఆ వానర వీరులందరికీ వాలి కుమారుడు అంగదుని నాయకుడుగా చేసాడు సుగ్రీవుడు. అంగదుని నాయకత్వంలో వానరవీరులు దక్షిణ దిక్కుకు వెళ్లడానికి సిద్ధంగా ఉన్నారు. దక్షిణ దిక్కున ఉన్న ప్రదేశముల గురించి సుగ్రీవుడు ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ వానవీరులారా! దక్షిణ దిక్కున వింధ్యపర్వతము, నర్మదానది, గోదావరీ నది, కృష్ణవేణి అనేమహానది, వరదానది, మేఖల దేశము, ఉత్కలదేశము, దశార్ణదేశము, ఆబ్రవంతి, అవంతి నగరములు ఉన్నాయి అక్కడ అంతా వెదకండి. ఇంకా విదర్భ, ఋష్టిక, మత్స్య, కళింగ, కౌశిక, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ దేశములలో వెదకండి. ఇంకా దట్టమైన దండకారణ్యము, గోదావరీ తీరము పూర్తిగా వెదకండి. దానికి దక్షిణముగ ఉన్న మలయపర్వతము మీద కూడా వెదకండి.

తరువాత మీకు కావేరీ నది కనపడుతుంది. అక్కడే అగస్త్యమహాముని ఆశ్రమము ఉంది. ఆ మహామునిని దర్శించి, ఆయన ఆశీర్వాదము తీసుకొని, తామ్రపర్ణి నదిని దాటండి. తరువాత పాండ్యదేశము చేరుకోండి. అక్కడి నుండి సముద్ర తీరము చేరుకోండి. ఆ సముద్రమధ్యలో అగస్త్యుడు నిలిపిన మహేంద్రపర్వతము ఉంది. ఆ పర్వతము సముద్రములోనికి చొచ్చుకొని ఉన్నది. మహేంద్రుడు పర్వదినములలో ఆ పర్వతము వద్దకు వస్తుంటాడు.

సముద్రము ఆవలి ఒడ్డున నూరు యోజనముల వైశాల్యము గల ఒక ద్వీపము ఉంది. ఆ ద్వీపమునకు మానవులు వెళ్లలేరు. మీరు ఆద్వీపమునకు పోయి వెదకండి. రావణుడు ఆ ద్వీపములోనే ఉంటాడు. అందుకని అక్కడ సీతను ఉంచే అవకాశము ఉంది. దక్షిణ సముద్ర మధ్యలో ఒక స్త్రీ ఉంది. ఆమె పేరు అంగారక. ఆమె ప్రాణులయొక్క నీడను బట్టి ఆ ప్రాణులను తన వద్దకు లాగి తింటూ ఉంటుంది. దక్షిణ దిక్కున ఉన్న నేను చెప్పిన ప్రదేశములలో సీతను వెదకండి.

ఈ ద్వీపమును దాటిన తరువాత సముద్రము నూరు యోజనములు విస్తరించి ఉంది. సముద్రమధ్యలో పుష్పితకము అనే పర్వతము ఉంది. ఆ పర్వతము ఆకాశము అంత ఎత్తులో ఉంది. ఆ పర్వతము మీత చంద్రుడు నివాసము ఉంటాడు. దుర్మార్గులు, నాస్తికులు, ఆపర్వతమును చూడలేరు. మీరు ఆ పర్వతమునకు నమస్కరించండి. తరువాత ఆపర్వతము మీద కూడా వెదకండి.

ఆ పర్వతమునకు పదునాలుగు యోజనముల దూరంలో సూర్యవంతము అనే పర్వతము ఉంది. ఆ పర్వతము దాటిన తరువాత మీకు వైద్యుతము అనే పర్వతము ఉంది. ఆ పర్వతమును దాటి ముందుకు వెళ్లండి. తరువాత మీకు కుంజరము అనే పర్వతము కనిపిస్తుంది. ఆ పర్వతము మీద అగస్త్యుని గృహము ఉంది. ఆ గృహమును విశ్వకర్మ బంగారంతో నిర్మించాడు.

తరువాత మీకు భోగవతీ నగరము కనిపిస్తుంది. ఆ నగరము సర్పములకు నివాసము. ఆ నగరంలో వాసుకి నివసిస్తూ ఉంటాడు. మీరు ఆ భోగవతీనగరంలో కూడా వెదకండి. భోగవతీ నగరమును దాటిన తరువాత మీకు ఋషభ అనే పర్వతము కనిపిస్తుంది. ఆ పర్వతము ఋషభాకారంలో ఉంటుంది కాబట్టి ఆ పేరు వచ్చింది. ఆ పర్వతము మీద ఉన్న అరణ్యములలో రకరకాలైన చందనపు చెట్లు ఉన్నాయి. ఆ వనమును గంధర్వులు రక్షిస్తుంటారు. ఆ పర్వతము మీద శైలూషుడు, గ్రామణి, శిక్షుడు, శుకుడు, బభ్రువు అనే ఐదుగురు గంధర్వులు నివసిస్తూ ఉంటారు.

ఆ పర్వతము తరువాత మీకు పితృలోకములు కనిపిస్తాయి. మీరు అక్కడకు వెళ్లవద్దు. అది యమలోకము. అంతా చీకటిగా ఉంటుంది. శరీరంతో ప్రాణులు అక్కడకు వెళ్లలేరు. కాబట్టి మీరూ అక్కడకు వెళ్లవద్దు.

నేను చెప్పిన ప్రదేశములన్నింటినీ సీతకోసం వెదకండి. ఆమెజాడ తెలుసుకోండి. మీరు ఈ పనిని నెలరోజులలో పూర్తిచేయాలి. ఈ పని మీరు చేస్తే మీకు నా తో సమానమైన గౌరవము లభిస్తుంది. మీరు ఎన్ని అపరాధములు చేసినా క్షమిస్తాను. కాబట్టి మీరందరూ వెంటనే సీతను వెదకడం కోసరం బయలుదేరండి." అని అన్నాడు సుగ్రీవుడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము నలుబది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## నలుబది రెండవ సర్గ.

కొంతమంది వానరప్రముఖులను దక్షిణ దిక్కుకు పంపిన తరువాత తార తండ్రి, తనకు మామగారు అయిన సుషేణుని నాయకత్వములో కొంతమంది వానరులను పశ్చిమదిక్కుగా పంపాడు. తన కన్నా పెద్ద వాడు తనకు మామగారు అయిన సుషేణునికి నమస్కరించి సుగ్రీవుడు ఇలా అన్నాడు.

"మీనాయకత్వంలో రెండులక్షల వానరములను తీసుకొని మీరు పశ్చిమ దిక్కుగా వెళ్లండి. మీకు సాయంగా అర్చిష్మంతుడు, అర్చి, మాల్యుడు ఉంటారు. మీరు సౌరాష్ట్ర, బాహ్లిక,చంద్రచిత్ర దేశములలో సీతకోసం వెదకండి. అక్కడి నుండి పశ్చిమ సముద్రము వైపుగా వెళ్లండి. పశ్చిమ సముద్ర తీరంలో ఉండే పర్వతములను గుహలను, అరణ్యములను సీత కోసరం, రావణుని కోసరం వెదకండి. సముద్రతీర పట్టణములైన మురచీ, జటాపురము, అవంతీనగరము, అంగలేపాపురము, మొదలగు నగరములను వెదకండి.

అక్కడినుండి పడమరగా వెళ్లండి. అక్కడ సింధునది సముద్రంలో కలిసేచోట ఒక పెద్ద పర్వతము ఉంది. దాని పేరు సోమగిరి. దానిమీద సింహములు, ఏనుగులు నివసిస్తూ ఉంటాయి. మీరు ఆ పర్వతశిఖరమును ఆమూలాగ్రం వెదకండి. తరువాత మీరు పశ్చిమ సముద్రములో ఉన్న పారియాత్ర పర్వతమునకు వెళ్లండి. ఆ పర్వతశిఖరము మీద ఇరువది నాలుగుకోట్లమంది గంధర్వులు నివసిస్తూ ఉంటారు. వారి వద్దకు మాత్రం వెళ్లకండి. ఆ పర్వతము మీద ఉన్న వృక్షములకు కాసిన ఫలములు తినకండి. గంధర్వులు ఆ చెట్లను రక్షిస్తూ ఉంటారు. మీరు సాధారణ వానరులుగా పోయి సీత కోసం వెదకండి. ఆ గంధర్వులు మిమ్ములను ఏమీ చేయరు.

అక్కడకు దగ్గరలో నూరుయోజనముల ఎత్తుగల ఒక మహాపర్వతము ఉంది. ఆ పర్వతము మీద గుహలలో మీరు వెదకండి. సముద్రమును నాలుగవ వంతు ఆక్రమించే చక్రవంతము అనే పర్వతము ఉంది. ఆ పర్వతము మీద విశ్వకర్మ వేయి అంచులు కల

చక్రమును ఒక దానిని నిర్మించాడు. ఆచక్రాన్ని హయగ్రీవుడు అనే దానవుడు రక్షిస్తూ ఉండేవాడు. శ్రీమహావిష్ణువు ఆ దానవుని సంహరించి ఆ చక్రమును, పంచజనుడు అనే వానిని చంపి పాంచజన్యమును అనే శంఖమును స్వీకరించాడు. ఆ పర్వతము మీద ఉన్న గుహలయందు, అడవులయందు సీత కోసం వెదకండి.

తరువాత సముద్ర గర్భంలో వరాహము అనే పర్వతము ఉంది. అక్కడే ప్రాగ్జ్యోతిష పురము అనే పట్టణము ఉంది. ఆ పట్టణాన్ని నరకుడు అనే దానవుడు పరిపాలిస్తున్నాడు. వరాహ పురమును దాటిన తరువాత మీకు సర్వసౌవర్ణము అనే పర్వతము కనిపిస్తుంది. ఆ పర్వతము మీద రకరకాల క్రూరమృగములు సంచరిస్తూ ఉంటాయి. దాని తరువాత మేఘము అనే పర్వతము ఉంది. దాని మీదనే దేవతలు మహేంద్రునికి పట్టాభిషేకము నిర్వహించారు.

ఆ మేఘ పర్వతము తరువాత మీకు అరవై వేల బంగారు పర్వతములు కనిపిస్తాయి. ఆ పర్వతముల మధ్య మేరు పర్వతము ఉంది. ఆ పర్వతము మీద ఉన్న ప్రతి వస్తువు మీద, దేవ, గంధర్వ, దానవుల మీదా తన కిరణములు పడి, బంగారు రంగులో ప్రకాశిస్తూ ఉంటాయి అని మేరు పర్వతమునకు సూర్యుడు ఒక వరము ప్రసాదించాడు. ఆ పర్వతము మీద విశ్వే దేవతలు, అష్టవసువులు, సప్తమరుత్తులు, ఇతర దేవతలు కలిసి సూర్యుని సేవిస్తూఉంటారు. ఆ మేరు పర్వతము మీద విశ్వకర్మ వరుణుని కొరకు ఒక దివ్యమైన భవనమును నిర్మించాడు. ఆ భవనంలో వరుణుడు నివాసము ఉంటాడు.

మేరు పర్వతమునకు పదివేలయోజనముల దూరంలో అస్తాద్రి అనే పర్వతము ఉంది. అక్కడే సూర్యుడు అస్తమిస్తాడు. మేరు పర్వతము అస్తాద్రి మధ్యలో పదితలలు కలిగిన పెద్ద బంగారు తాటిచెట్టు ఉంది. మీరు ఆయాప్రదేశములలో సీత కోసరం వెదకండి.

ఆ ప్రాంతములోనే ధర్మాత్ముడు అయిన మేరుసావర్ణ అనే ఋషి తపస్సుచేసుకుంటున్నాడు. మీరు ఆఋషికి నమస్కరించి సీత గురించి ఆయనను అడగండి.

మీరు నేను చెప్పిన విధంగా అస్తాద్రి వరకూ ప్రయాణించి సీత కోసం వెదకండి. మరలా ఒక నెలలోపు తిరిగిరండి. మాసము దాటిన వారికి మరణదండన తప్పదు. మీ అందరికీ మా మామగారు సుషేణుడు నాయకత్వము వహిస్తాడు. మీరు ఆయన మాటను నా మాటగా శిరసావహించండి. మీరు సీత జాడ తెలుసుకుంటే. నాకు మహోపకారము చేసిన వారు అవుతారు. నేను కూడా రాముని ఋణం తీర్చుకున్నవాడిని అవుతాను." అని సుగ్రీవుడు సుషేణునితోనూ, వానర సేనానాయకులతోనూ అన్నాడు. సుషేణుడు వానరవీరులతో కలిసి సీతను వెదుకుతూ పశ్చిమదిక్కుకు వెళ్లడానికి సమాయత్తము అయ్యాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము నలుబది రెండవ సర్గ సంపూర&ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# కిష్కింధా కాండము

## నలుబది మూడవసర్గ.

పడమట దిక్కుకు సుషేణుని పంపిన తరువాత, శరబలుడు అనే వానర శ్రేష్ఠుని చూచి సుగ్రీవుడు ఇలా అన్నాడు.

"శరబలా! నీ మంత్రులతోనూ, ఒక లక్షమంది వానరులతోనూ మీరు ఉత్తర దిక్కుగా బయలుదేరండి. ఉత్తర దిక్కు పూర్తిగా సీత కోసం వెతకండి. మహాత్ముడైన రాముడు నాకు ఎంతో ఉపకారము చేసాడు. మనము సీతను వెతికి ఆయన వద్దకు చేరిస్తే మనము కూడా రామునికి ప్రత్యుపకారము చేసి ఋణము తీర్చుకున్నవారము అవుతాడు. రామ కార్యము నిర్వర్తించినందుకు మన జన్మలు కూడా సఫలమవుతాయి.

మీరు అడవులలో, పర్వతములమీద, కొండ గుహలలోనూ వెతకండి. ఉత్తర దిక్కుగా ఉన్న మ్లేచ్ఛ, పుళింద, శూరసేన, ప్రస్థల, భరత, కురు, మద్రక, కాంభోజ, యవన, శక, బాహ్లీక, ఋషిక, పౌరవ, టంకణ,(టిబెట్ కావచ్చు) చీన, పరమచీన,(నేటి చైనా కావచ్చు) నీహార, వరద మొదలగు దేశములలో వెదకండి.

తరువాత మీరు సోమాశ్రమమునకు, కాల పర్వతమునకు వెళ్లండి. ఆ పర్వతము అణువు అణువునా సీత కోసం వెదకండి. కాల పర్వతమును దాటి సుదర్శన పర్వతమునకు వెళ్లండి. దాని తరువాత దేవసఖ అనే పేరుగల పర్వతము ఉంది. ఆ పర్వతము మీద ఉన్న అరణ్యలలో సీతకొరకు వెదకండి.

దేవసఖ పర్వతమునకు నూరు యోజనముల దూరంలో శూన్యప్రదేశము కనిపిస్తుంది. అక్కడ పర్వతములు గానీ, అడవులు గానీ, సరోవరములు గానీ లేవు. ఆ శూన్యప్రదేశమును దాటితే మీరు కైలాస పర్వతమును చేరగలరు. అక్కడ కుబేరుని భవనము ఉంది. అక్కడే పద్మ సరస్సు ఉంది. ఆ సరస్సులో అందమైన హంసలు, పద్మములు, కలువలు కనువిందుగా కనిపిస్తాయి. ఆభవనములో ముల్లోకములలో పూజింపబడేవాడు, యక్షులకు రాజు, ధనముల కలవాడు అయిన వైశ్రవణుడు అనే రాజు నివసిస్తుంటాడు. అక్కడకూడా మీరు రావణుని గురించి, సీతను గురించి వెదకండి.

దాని తరువాత మీరు క్రౌంచపర్వతము వద్దకు వెళ్లండి. అది ఎవరికినీ ప్రవేశించడానికి శక్యము కాదు. మహాత్ములు అయిన ఋషులు కైలాసపర్వతముమీద తపస్సు చేసుకుంటూ ఉంటారు. మీరు కైలాస పర్వతమును, క్రౌంచపర్వతమును పూర్తిగా వెతకండి.

క్రౌంచపర్వతము పక్కన మానసపర్వతము ఉంది. అక్కడ ఏ రకమైన వృక్షములు ఉండవు కానీ పక్షులు ఎగురుతూ ఉంటాయి. మానవులు, దేవతలు, రాక్షసులు అక్కడకు వెళ్లలేరు. క్రౌంచ పర్వతము దాటిన తరువాత మీరు మైనాక పర్వతమును చేరుకుంటారు. ఆ పర్వతముమీద మయుడు అనే దానవుడు ఒక భవనమును నిర్మించుకొని నివసిస్తూ ఉంటాడు. మీరు ఆ మైనాక పర్వతము మీదపూర్తిగా వెదకండి.

మైనాక పర్వతమును దాటిన తరువాత మీకు సిద్ధులు

నివసించే ఆశ్రమము కనిపిస్తుంది. అక్కడ సిద్ధులు, వైఖానసులు, వాలఖిల్యులు  నివసిస్తూ ఉంటారు. మీరు వారికి సీత గురించి చెప్పి ఆమె జాడతెలుసుకోండి. అక్కడ వైఖానసులకు సంబంధించిన ఒక సరస్సు ఉంది. పద్మములతో నిండిన ఆ సరస్సులో హంసలు విహరిస్తూ ఉంటాయి.

ఆ సరస్సు దాటిన తరువాత కేవలము ఆకాశము మాత్రము ఉంటుంది. అక్కడ సూర్య చంద్రులు ప్రకాశించరు. అంతా శూన్యము. అక్కడ విశ్రాంతి తీసుకుంటున్న సిద్ధుల తపశ్శక్తి  వలన ఆ  ప్రదేశం అంతా కాంతిమంతమవుతుంది.

మీరు ఆ ప్రదేశమును దాటిన తరువాత మీరు శైలోద అనే నదిని చేరుకుంటారు. అక్కడే ఉత్తర కురుదేశము ఉంది. అక్కడ ఎన్నో నదులు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడ మణులు, రత్నములు, ముత్యములు దొరుకుతాయి. అక్కడ ఉన్న వృక్షములు అన్ని ఋతువుల లోనూ ఫలములతో పుష్పములతో నిండుగా ఉంటాయి.  అక్కడ గంధర్వులు, సిద్ధులు, కిన్నరులు, నాగులు, విద్యాధరులు విహరిస్తూ ఉంటారు. అక్కడ ఎవరూ వాయించ కుండానే రకరకాలైన వాద్యముల ధ్వనులు వినబడుతూ ఉంటాయి. అక్కడ సంతోషమే కానీ దు:ఖమునకు తావు లేదు.

ఆ పర్వతమును దాటిన తరువాత ఉత్తర సముద్రము వస్తుంది. దాని మధ్యలో సోమగిరి అనే పర్వతముఉంది. ఆ పర్వతము నుండి కాంతి ప్రసరిస్తూ ఉంటుంది.  అక్కడ ఏకాదశ రుద్ర స్వరూపుడు అయిన పరమశివుడు, బ్రహ్మ నివసిస్తూ ఉంటారు. మీరు కురుదేశమును దాటి ఆవలకు వెళ్లకండి. సోమగిరి మీదికి దేవతలు

కూడా వెళ్లలేరు. మీరుకూడా సోమగిరిని చూచి తిరిగి రండి.

ఉత్తర దిక్కుగా ఉన్న నేను చెప్పిన ప్రదేశములలో సీతకోసం వెదకండి. మీరు సీత జాడ తెలుసుకుంటే మనము రామునికి ఎంతో ప్రియము చేసిన వాళ్లము అవుతాము. మీరంతా సీత జాడ తెలుసుకుంటారు అని ఆశిస్తున్నాను." అని సుగ్రీవుడు వానర వీరులతో అన్నాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము నలుబది మూడవ సర్గ సంపూర్ణం.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## నలుబది నాలుగవ సర్గ.

సుగ్రీవుడు వానర ప్రముఖులను నలుదిక్కులకు సీతను వెదకడానికి పంపడాన్ని నిశితంగాచూస్తున్నాడు రాముడు. ఇంతలో దక్షిణ దిక్కుగా వెళ్లడానికి నియమించిన వానర ప్రముఖులలో ఒకడుగా ఉన్న హనుమంతుని పిలిచి సుగ్రీవుడు ఇలా అన్నాడు.

" ఓ హనుమా! నీవు బాగా ఎగురగలవు. భూమి మీద గానీ, ఆకాశంలో గానీ, నీ మార్గానికి అడ్డు లేదు. పైగా నీకు దేవ, గంధర్వ, నాగ, నరలోకముల గురించి బాగుగా తెలియును. నీవు గమన వేగంలో నీ తండ్రి వాయుదేవునితో సమానుడవు. ఆ లోకంలో ఉన్న ప్రాణులలో నీతో సమానమైన ప్రాణి లేదు. కాబట్టి సీతను అన్వేషించ

డంలో ఏది మంచి మార్గమో నీవే ఆలోచించు. ఎందుకంటే, వానరులలో కల్లా బాగుగా ఆలోచించగల సమర్థుడివి నీవే! నీకు అమితమైన దేహబలము, బుద్ధి బలము, దేశకాలములను బట్టి ప్రవర్తించు తెలివితేటలు నీకు పుష్కలంగా ఉన్నాయి. కాబట్టి ఈ కార్యము నిర్వహించుటకు నీవే సమర్థుడివి." అని అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుని మాటలు విని రామునికి కూడా హనుమంతుని మీద గొప్పనమ్మకం కలిగింది. పైగా హనుమంతుడు దక్షిణ దిక్కుగా పోతున్నాడు. రావణుడు కూడా సీతను దక్షిణ దిక్కుగా తీసుకువెళ్లాడు అని జటాయువు వలన తెలిసింది. కాబట్టి హనుమంతుడే సీతను కనుగొనే అవకాశం మెండుగా ఉంది. పైగా సుగ్రీవుడు కూడా ప్రత్యేకించి హనుమంతుని మీదనే ఎక్కువ విశ్వాసము ఉంచాడు. పైగా హనుమంతుడు కార్యదీక్ష కలవాడు అనితెలుస్తూ ఉంది.

ఇదివరకు హనుమంతుడు సాధించిన కార్యములను బట్టి, రాజైన సుగ్రీవుడు హనుమంతుని మీద ఉంచిన నమ్మకమును బట్టి, కష్టకాలములో కూడా సుగ్రీవుని విడిచిపెట్టని హనుమంతుని ధర్మనిరతిని బట్టి హనుమంతుడు ఈ కార్యమును సాధించగలడని నమ్మకము కుదిరింది రామునికి. హనుమంతుని వలన తనకార్యము సాధింపబడుతుంది అని నిశ్చయించుకున్నాడు రాముడు.

తనవేలికి ఉన్న ఉంగరము తీసాడు. దాని మీద రాముని పేరు చెక్కబడి ఉంది. "ఓ హనుమంతుడా! నీవు సీతను చూచినపుడు నీవు మాయా రూపములో ఉన్న రాక్షసుడివి అని సీత భయపడే అవకాశము ఉంది. అందుకని, నా పేరు చెక్కబడిన ఈ ఉంగరము నీ

దగ్గర ఉంచుకో. నీవు నా వద్దనుండి వచ్చావని సీతకు నమ్మకం కలిగించడం కోసరం ఈ ఉంగరము సీతకు చూపించు. ఆమె నిన్ను నమ్ముతుంది. ఓ వానరవీరా! నీ ఉత్సాహము, నీ పరాక్రమము, బలము, సుగ్రీవుడు నీ గురించి చెప్పిన మాటలు విన్న తరువాత ఈ కార్యము నీ వలననే సాధ్యమవుతుంది అని నాకు నమ్మకం కలిగింది. అందుకని ఈ ఉంగరము నీకు ఇస్తున్నాను." అని తన పేరు ముద్రించిన ఉంగరమును హనుమంతునికి ఇచ్చాడు రాముడు.

హనుమంతుడు ఆ ఉంగరమును భక్తితో స్వీకరించాడు. రామునికి పాదాభివందనము చేసాడు. ఆ ఉంగరమును భద్రంగా దాచుకున్నాడు.

తరువాత వానర సైన్యముతో అంగదుని పర్యవేక్షణలో వానర సైన్యము దక్షిణ దిక్కుగా ప్రయాణం అయింది. "ఓ సింహబలుడవైన వాయు పుత్రా! నేను నీ బలముపై ఆధారపడి ఉన్నాను. నీ పరాక్రమంతో సీత జాడ తెలుసుకో!" అని రాముడు మనసులోనే అనుకున్నాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము నలుబది నాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# కిష్కింధా కాండము

## నలుబది ఐదవ సర్గ.

సీతను వెదకడానికి నాలుగు దిక్కులకు ప్రయాణమైన వానర సేనలు ఉత్సాహంతో బయలుదేరుతున్నాయి. ఎవరికి వారు తామే సీత జాడ కనుక్కోగలము అనే ధీమా వ్యక్తం చేస్తున్నారు. శతబలుడు తన సేనలతో ఉత్తర దిక్కుగా బయలుదేరాడు. వినతుడు తూర్పుదిక్కుగా వెళ్లాడు. హనుమంతుడు, తారుడు, అంగదునితో కలిసి దక్షిణ దిక్కుగా వెళ్లాడు. సుషేణుడు పశ్చిమ దిక్కుగా వెళ్లాడు. అందరూ అన్ని దిక్కులకు ప్రయాణమయ్యారు.

వానరులంతా తమ సహజసిద్ధమైన చపలత్వంతో అరుచుచూ, కేకలు పెట్టుచూ, ఎగురుతూ వెళుతున్నారు. వారంతా "ఆ దుర్మార్గుడు రావణుని చంపి సీతను తీసుకొని వస్తాము" అని శపధాలు చేస్తూ వెళుతున్నారు.

మరికొందరైతే "ఆ రావణుని చంపడానికి ఇంత మంది కావాలా! నేను ఒక్కడినే రావణుని చంపుతాను. రాక్షసులందరినీ చంపుతాను, సీతను తీసుకొని వస్తాను" అని ప్రగల్భాలు పలుకుతున్నాడు.

మరి కొందరు "మీరంతా ఇక్కడే ఉండండి. నేను ఒక్కడినే వెళ్లి సీత పాతాళంలో ఉన్నా సరే తీసుకొని వస్తాను." అని జబ్బలు చరుస్తున్నాడు.

మరి కొందరు "నేనుపెద్దపెద్దచెట్లనే పెకలిస్తాను. కొమ్మలు

విరుస్తాను. పర్వతాలను నుగ్గునుగ్గు చేస్తాను. సముద్రాలను ఇంకింపచేస్తాను." అని మీసాలు మెలేస్తున్నారు.

ఇంకా ఒక్కొక్కళ్లు తమ బలా బలాల గురించి చెప్పుకుంటున్నారు. ఒకడు "నే నూరుయోజనముల దూరం ఎగరగలను" అని అంటే మరొకడు నేను ఇంకా ఎక్కువ దూరము ఎగురగలను అని గంతులేస్తున్నాడు.

మరొకడైతే "ఈ ముల్లోకాలలో నాకు అడ్డులేదు. రానీ ఎవడొస్తాడో చూస్తాను" అని తన వీరత్వాన్ని ప్రదర్శిస్తున్నాడు. బలగర్వితులైన వానరులు ఇలా తమ బలా బలముల గురించి ఒకరితో ఒకరు చెప్పుకుంటున్నారు.

శ్రీమద్రామాయణము కిష్కింధా కాండము
నలుబది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
నలుబది ఆరవ సర్గ.

సుగ్రీవుడు వానరవీరులతో చెప్పిన మాటలన్నీ శ్రద్ధగా విన్నాడు రాముడు. రామునికి ఒక సందేహం కలిగింది. కిష్కింధలో ఉన్న సుగ్రీవునికి భూమండలం గురించిన ఇంతటి పరిజ్ఞానము ఎలా కలిగింది అని విస్మయం కలిగింది. సుగ్రీవుని చూచి ఇలా అన్నాడు. "మిత్రమా! నీవు వానర నాయకులతో వారు ఎక్కడెక్కడ వెదకాలి అన్న

విషయాన్ని ఎంతో విపులంగా చెప్పావు కదా! నీకు ఈ భూమండలం లోని వివిధ ప్రదేశాల గురించి ఎలా తెలుసు?" అని అడిగాడు.

సుగ్రీవునితో ఇలా చెప్పసాగాడు. "రామా! ఇదివరకు నీకు వాలి, దుందుభి సంగతి చెప్పాను కదా. మహిష రూపములో వచ్చిన దుందుభి అనే దానవుని తరుముతూ నా అన్న వాలి వెళ్లాడు. దుందుభి మలయపర్వతము గుహలో ప్రవేశించాడు. వాలి కూడా దుందుభిని తరుముతూ ఆగుహలో ప్రవేశించాడు. నేను గుహద్వారము వద్ద నా అన్న వాలి కోసరము వేచి ఉన్నాను.

ఒక సంవత్సరము గడిచిపోయినది. వాలి బయటకు రాలేదు. కాని ఆ గుహ లో నుండి రక్తము ప్రవాహంలాగా ప్రవహించింది. ఆ దుందుభి నా అన్న వాలిని చంపేసాడు అని దు:ఖించాను. నాకు ఆ దుందుభి మీద కోపం వచ్చింది. నా అన్న వాలిని చంపిన వాడు బయటకు రాకూడదు. ఆ గుహలోనే చావాలి అనే ఉద్దేశంతో ఆ గుహ ముఖద్వారమును రాళ్లతోనూ బండలతోనూ మూసివేసాను.

నేను కిష్కింధకు తిరిగి వచ్చాను. వాలి లేడు కాబట్టి వాలి భార్య తారను, నా భార్య రుమను, వాలి రాజ్యమును యధేచ్ఛగా అనుభవిస్తున్నాను. కొన్నాళ్లకు వాలి తిరిగి వచ్చాడు. నాకు భయం వేసింది. నేను సింహాసనము నుండి లేచి వాలికి నమస్కరించి వాలి సింహాసనమును వాలికి తిరిగి ఇచ్చివేసాను. కాని వాలి నా మీద కోపగించాడు. నన్ను చంపడానికి ప్రయత్నించాడు. నేను నా మంత్రులతో సహా పారిపోయాను. వాలి నన్ను వెంబడించాడు.

నేను పరుగెడుతున్నాను. వాలి నన్ను తరుముతున్నాడు. నేను అనేక నదులు, పర్వతములు, అరణ్యములు దాటి పరుగెడు తున్నాను. నాలుగు దిక్కులు పరుగెత్తాను. భూమండలము మొత్తము చుట్టేసాను. తూర్పుదిక్కున ఉదయ పర్వతము వరకు పరుగెత్తాను. క్షీర సాగరమును చూచాను. తరువాత దక్షిణదిక్కుగా పరుగెత్తాను. వింధ్య పర్వతములు దాటి పరుగెత్తాను. అక్కడి నుండి పడమటి దిక్కుకు, అక్కడి నుండి ఉత్తర దిక్కుకు పరుగెత్తాను. మేరు పర్వతమును దాటి ఉత్తర సముద్రమును చేరుకున్నాను. నా వెంట నా మంత్రులు కూడా పరుగెడుతున్నారు. నా మంత్రి హనుమంతుడు నన్ను చూచి ఇలా అన్నాడు.

"రాజా! ఇలా ఎంత కాలము పరుగెడతారు. మనము ఒక సురక్షితమైన ప్రదేశమును చేరుకోవాలి. నాకు ఇప్పుడే జ్ఞాపకము వచ్చింది. మతంగ మహా ముని వాలికి శాపం ఇచ్చాడు. వాలి మతంగ ముని ఆశ్రమ ప్రాంతములలో ప్రవేశిస్తే, అతను మరణిస్తాడు. ఆ మతంగ ముని ఆశ్రమ ప్రాంతము మనకు సురక్షిత ప్రాంతము. మనము అక్కడకు పోదాము." అని అన్నాడు.

హనుమంతుని మాట ప్రకారము మేమందరమూ ఋష్యమూక పర్వత ప్రాంతము చేరుకున్నాము. అక్కడే మతంగ ముని ఆశ్రమము ఉంది. వాలి నన్ను తరుముతూ ఋష్యమూక పర్వతము వరకూ వచ్చి, భయపడి వెనుదిరిగి పోయాడు. ఆ సందర్భములో నేను ఈ భూమండలము అంతా తిరిగి చూచాను. అందువలన నాకు అన్ని ప్రదేశములు అన్నీతెలుసు." అని అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుడు పడ్డ బాధలకు రామునికి సంతోషమూ, దు:ఖము రెండూ కలిగాయి.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము నలుబది ఆరవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

కిష్కింధా కాండము
నలుబది ఏడవ సర్గ.

సుగ్రీవునిచే ఆజ్ఞాపింప బడ్డ వానర వీరులు నలుదిక్కులకు వెళ్లారు. సుగ్రీవుడు చెప్పి చోటులన్నీ వెదికారు. పర్వతములు, నదులు, సరస్సులు, అరణ్యములు, కొండ గుహలు గాలించారు. ఎక్కడా సీత గానీ, రావణుడు గానీ కనపడలేదు. సుగ్రీవుడు విధించిన మాసము రోజులు గడిచిపోయినవి. కాని సీత జాడ తెలియలేదు. అందరూ మరలా కిష్కింధకు చేరుకున్నారు. ప్రసవణ పర్వతము మీద ఉన్న సుగ్రీవుని వద్దకు వచ్చారు. తూర్పుదిక్కుకు పోయిన వినతుడు, పడమట దిక్కుకు పోయిన సుషేణుడు, ఉత్తర దిక్కుకు పోయిన శత బలుడు తమ తమ వానర సేనలతో తిరిగి వచ్చారు. రాముని తో కూర్చుని ఉన్న సుగ్రీవుని వద్దకు పోయి ఇలా విన్నవించుకున్నారు.

“రాజా! మీరు ఆదేశించినట్టు మేము అందరమూ అన్ని దిక్కులకూ పోయి నదులు, పర్వతములు, అరణ్యములు, గుహలు, అన్నీ వెదికాము. వెదికిన చోటనే మరలా మరలా వెదికాము. కానీ సీత జాడ

తెలియలేదు. కాని మన అంగదుని నాయకత్వంలో హనుమంతుడు మొదలగు వారు ఇంకా తిరిగి రాలేదు. ఈ మూడు దిక్కులలో సీత కనపడలేదు. కాబట్టి తప్పకుండా దక్షిణ దిక్కున ఆమె జాడ తెలియ గలదు. బుద్ధిమంతుడైన హనుమంతుడు సీత జాడ కనుగొనగలడు." అని వినయంగా చెప్పారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము నలుబది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
నలుబది ఎనిమిదవ సర్గ.

అందరూ అన్ని దిక్కులకు వెళితే అంగదుని నాయకత్వంలో హనుమంతుడు మొదలగు వానర వీరులు దక్షిణదిక్కుగా బయలు దేరారు. వారి వెదకడం వింధ్యపర్వతముల వద్దనుండి మొదలయింది. వానర వీరులందరూ వింధ్యపర్వతముల మీద ఉన్న శిఖరములను, గుహలను, అరణ్యములను, నదులను, సరోవరములను అన్నింటినీ వెతికారు. కాని సీత జాడ కనపడలేదు. కాని వారు తమ పట్టుదల వీడలేదు. అలా వెదుకుతూనే ఉన్నారు. ఒక ప్రదేశము నుండి మరొక ప్రదేశమునకు మారుతూ వెతుకుతున్నారు.

ఆ ప్రకారంగా వెతుకుతుంటే ఒక చోట చెట్లకు పండ్లు కానీ కాయలు కానీ లేవు. అక్కడ ఏ విధమైన జంతువులు లేవు. నిర్మానుష్యంగా ఉంది. సందడి లేదు. జంతువుల అరుపులు

వినిపించడం లేదు. పూల మొక్కలు లేవు. ఓషధీ లతలు లేవు. సరోవరములు లేవు. నీరు లేదు.

కాని అక్కడ ఒక మహర్షి తపస్సు చేసుకుంటూ ఉండే వాడు. ఆయన పేరు కండు మహర్షి. ఆయన నిత్యసత్యవ్రతుడు. ధర్మ తత్పరుడు. ఆయన కుమారుడు, పది సంవత్సరముల బాలుడు, ఆ అరణ్యములో మరణించాడు. కండు మహర్షికి కోపం వచ్చింది. ఆ అరణ్యము మనుషులకు కానీ, జంతువులకు కానీ, పక్షులకు కానీ, వృక్షములకు కానీ జీవించడానికి యోగ్యము కాకుండా శపించాడు.

అటువంటి ప్రదేశములోకి ప్రవేశించారు వానర వీరులు. అక్కడ కూడా వెతుకుతున్నారు. సీత కానీ, సీతను అపహరించిన రావణుడు కానీ కనపడలేదు. కాని వారికి ఒక రాక్షసుడు కనిపించాడు. వాడు పర్వతము మాదిరి ఆకారము కలవాడు. భయంకరంగా ఉన్నాడు. వాడితో యుద్ధం చేయడానికి వానర వీరులు సన్నద్ధం అయ్యారు. తన మీదికి వస్తున్న వానరులను చూచి ఆ రాక్షసుడికి కోపం వచ్చింది.

"ఈ రోజు మీరందరూ నా చేతిలో చచ్చారు" అంటూ తన పిడికిలి పైకెత్తి వారి వెంట పడ్డాడు.

"అమ్మయ్య వీడే రావణుడు" అని అనుకున్నారు. వాలి కుమారుడు అయిన అంగదుడు ఆ రాక్షసుడిని తన చేతితో చాచి ఒక దెబ్బ కొట్టాడు. అంగదుడి దెబ్బకు వాడి మొహం నుండి ముక్కుల నుండి రక్తం కారింది. వాడు కొండమాదిరి కిందపడ్డాడు. చచ్చాడు.

రావణుడు చచ్చాడు కాబట్టి సీతను అక్కడే దాచి ఉంటాడు అని అనుకొని వానరులందరూ వాడు ఉన్న గుహను అంతా వెతికారు. వారికి సీత కనపడలేదు. పక్కనే ఉన్న మరొక గుహలోకి ప్రవేశించారు. ఆ గుహలో కూడా వెదికారు కానీ వారికి సీత కనపడలేదు. అలసి పోయారు. వారందరూ గుహ నుండి బయటకు వచ్చి ఒక చెట్టు కింద కూర్చున్నారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము నలుబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము
## నలుబది తొమ్మిదవ సర్గ.

ఎంత వెతికినా సీత కనపడలేదని వానరులందరూ దీనంగా ఆ చెట్టుకింద కూర్చున్నారు. అంగదుడు వారి వద్దకు పోయి వారికి ఉత్సాహకరమైన మాటలు చెప్పి వారిని మరలా సీతను వెదకడానికి సమాయత్తం చేసాడు.

"వానర వీరులారా! మనము అందరమూ పర్వతములు, వనములు, కొండలు గుహలు అన్నీ వెదికాము. కానీ సీత జాడ కానీ, రావణుని నివాసము కానీ కనిపెట్టలేకపోయాము. మనము బయలు దేరి చాలా కాలము అయినది. సుగ్రీవుడు ఇచ్చిన సమయం అయిపోవచ్చింది. సీత జాడ తెలియలేదు. అసలే సుగ్రీవుడు చండ

శాసనుడు. చెప్పిన సమయానికి తిరిగా రాకపోతే మనకు మరణ దండన తప్పదు.

కాని మనము సుగ్రీవునికన్నా రామునికే ఎక్కువ భయపడాలి. ఎందుకంటే రాముడు సీతావియోగంతో దు:ఖిస్తున్నాడు. కాబట్టి దిగులు చెందకుండా వెదకండి. మనకు తప్పకుండా సీత జాడ దొరుకుతుంది. కార్యసిద్ధి కలగాలంటే నేర్పు, ఓర్పు, ఉత్సాహము ముఖ్యమైన లక్షణములు. కాబట్టి మనము రెట్టించిన ఉత్సాహముతో వెదుకుదాము. తప్పకుండా మనకు సీత జాడ లభిస్తుంది. నాకు తోచినది నేను చెప్పాను. తరువాత మీ ఇష్టము." అని అన్నాడు అంగదుడు.

అప్పటికే బాగా అలసిపోయి ఉన్న గంధమాదనుడు ఇలా అన్నాడు. "అంగదుడు బాగా చెప్పాడు. మనము ఈ శరీరంలో ప్రాణం ఉన్నంతవరకూ సీతను గురించి వెదుకుదాము. వెదికిన చోటునే మరలా మరలా వెదుకుదాము." అని అన్నాడు.

వెంటనే వానరు లందరూ ఉత్సాహంతో లేచారు. నలుదిక్కులకు పోయి వెదకడం మొదలెట్టారు. కొంత మంది పర్వతములు ఎక్కారు. మరి కొంత మంది అరణ్యములలో వెదుకుతున్నారు. ఎంత వెదికినా సీత జాడ కనపడలేదు. కొంచెపు సేపు అలసట తీర్చుకొని మరలా వెదకడం మొదలెట్టారు.

హనుమంతుడు మొదలగు వానర వీరులు పర్వత గుహలలో వెదకడం ఆరంభించారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము నలుబది తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము
## ఏబదియవ సర్గ.

హనుమంతుడు, తారుడు, అంగదుడు తమ తమ వానర సమూహములతో కలిసి వింధ్య పర్వత గుహలను వెదుకు తున్నారు. గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, మైన్దుడు, ద్వివిదుడు, హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు, తారుడు, జట్టు జట్టుగా విడిపోయి ఆ పర్వత గుహలను వెదుకు తున్నారు.

అలా వెదుకుతూ వారు ఒక దానవునిచేత రక్షింపబడుతున్న ఋక్షబిలము అనే గుహను చూచారు. అప్పటికే వారికి బాగా ఆకలిగా, దాహం వేస్తూ ఉంది. ఎక్కడా నీటి చుక్క దొరకలేదు. ఆహారము దరిదాపుల్లో దొరకడం లేదు. ఆ సమయంలో నీటిలో స్నానం చేసి ఒళ్లంతా తడి తడిగా నీళ్లు కారుతున్న చక్రవాక పక్షులు ఆ గుహాలో నుండి బయటకు ఎగురుతూ రావడం వారికి కనిపించింది.. వారు ఆ బిలములోనికి వెళ్లడానికి ప్రయత్నించారు. కాని వారికి ఎటునుండి వెళ్లాలో తెలియడం లేదు. ఆ బిలమునకు ద్వారము కనిపించలేదు.

అప్పుడు హనుమంతుడు మిగిలిన వానరవీరులతో ఇలా అన్నాడు. “మనము అందరమూ సీత కోసం వెదికి వెదికి అలసిపోయినాము. కాని సీత జాడ తెలియలేదు. ఇక్కడ వృక్షములు పచ్చగా ఉన్నాయి. నీటిలో తడిసిన పక్షులు బయటకు వస్తున్నాయి. ఈ బిలము లోపల నీటి సరోవరము ఉండవచ్చును. మనము ఈ బిలము లోనికి ప్రవేశించి మన దాహము తీర్చుకుందాము.”అని అన్నాడు. హనుమంతుని మాట విని అందరూ దారీ తెన్నూ లేని, ఆ బిలము లోనికి అతి కష్టం మీద ప్రవేశించారు. లోపల అంతా చీకటిగా ఉంది. ఒకరిని ఒకరు పట్టుకుంటూ, ఆ గుహలో వారు ఒక యోజన దూరము వెళ్లారు. కాని వారికి జలాశయముకనిపించలేదు. నిరాశ చెందారు.

ఆ సమయంలో వారికి ఒక వెలుగు కనిపించింది. వారు ఆ వెలుగు కనిపించిన చోటికి వెళ్లారు. వారికి బంగారము వలె ప్రకాశించు చున్న వృక్షములు, పుష్పించిన లతలు కనపడ్డాయి. అక్కడ రత్నములతో అలంకరింప బడిన వేదికలు ఉన్నాయి. అక్కడ పద్మములతో నిండి ఉన్న సరోవరము కనపడింది. ఆ వానరులు చుట్టు చూచారు. అక్కడ బంగారముతో నిర్మింపబడిన గృహములు, కనపడ్డాయి. ఫలపుష్పములతో నిండి ఉన్న చెట్లు ఆ ఇళ్ల చుట్టు ఉన్నాయి. ఆ ఇళ్లలో తినడానికి మధురమైన పదార్థములు, పానీయములు అమర్చబడి ఉన్నాయి. బంగారు నాణెములు రాసులు రాసులుగా పోసి ఉన్నాయి. ఆ వానరులు ఇవి అన్నీ చూచి ఆశ్చర్య పోయారు.

అక్కడ ఎవరన్నా ఉన్నారా అని ఆ వానరులు వెదుకుతుంటే వారికి ఒక స్త్రీ కనపడింది. ఆమె నార చీరలు ధరించి, జింక చర్మము మీద కూర్చుని ఉంది. ఆమె దివ్యమైన తేజంతో ప్రకాశిస్తూ ఉంది. వానరులందరూ ఆమె చుట్టు నిలబడ్డారు. అప్పుడు హనుమంతుడు ఆమెను చూచి ఆమెకు భక్తితో నమస్కరించి ఇలా అన్నాడు. "అమ్మా! మీరు ఎవరు? ఇక్కడ ఎందుకు ఉన్నారు? ఈ బిలము ఎవరిది? ఈ భవనములు, సంపదలు ఎవరివి?" అని అడిగాడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము ఏబదియవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము

## ఏబది ఒకటవ సర్గ.

హనుమంతుడు ఆ తాపసితో ఇంకా ఇలా అన్నాడు. "మాతా! మేము ప్రస్తుతము ఆకలి దప్పులతో బాధ పడుతున్నాము. ఈ బిలములో చీకటిలో యోజన దూరం నడిచాము. అందరమూ బాగా అలసిపోయి ఉన్నాము. ఈ బిలములో జలము దొరుకుతుందని ఆశతో వచ్చాము. కాని ఇక్కడ ఇన్ని పదార్థములను చూడగానే మాకు ఆశ్చర్యం కలిగింది. ఈ బంగారు గృహములు. ఈ వృక్షములు ఎవరివి? ఎలా పుట్టాయి. మీరే సృష్టించారా! లేక మరి ఎవ్వరి తపోబలము వలన ఉద్భవించాయా! మాకు ఏమీ అర్థం కావడం లేదు. మాకు వివరంగా చెప్పండి" అని వినయంగా అడిగాడు హనుమంతుడు.

హనుమంతుని మాటలు విన్న ఆ తాపసి హనుమంతునితో ఇలా చెప్పింది. “ఓ వానరములలో గొప్పవాడా! మయుడు అనే దానవుడు ఉన్నాడు. అతనికి అన్ని మాయలు తెలుసు. ఆ మయుడు పూర్వము దానవులకు శిల్పిగా ఉండేవాడు. ఈ భవనములను ఆయనే నిర్మించాడు. ఆ మయుడు ఈ గుహలో వేలకొలది సంవత్సరములు బ్రహ్మదేవుని గురించి తపస్సు చేసి, ఆయన వలన వరములను పొందాడు. ఆ మయుడు ఇక్కడ ఈ భవనములను నిర్మించుకొని ఇక్కడే సుఖంగా కాలం గడిపాడు.

ఆ మయుడు హేమ అనే దేవ కన్య ప్రేమలో పడ్డాడు. ఆ విషయం తెలిసిన ఇంద్రుడు తన వజ్రాయుధముతో ఆ మయుని చంపాడు. మయుడు మరణించిన తరువాత బ్రహ్మ దేవుడు ఆ మయునికి చెందిన ఈ గృహములను, సంపదలను దేవ కన్య హేమకు ఇచ్చాడు.

ఇంక నా పేరు స్వయంప్రభ. నా తండ్రి మేరుసావర్ణుడు. దేవకన్య హేమ నాకు మంచి స్నేహితురాలు. ఆమె ఆదేశము ప్రకారము ప్రస్తుతము నేను ఈ భవనములను, సంపదలను కాపాడుతున్నాను.

ఇంతకూ మీరు ఎవరు? ఏ పనిమీద ఈ వింధ్యపర్వత ప్రాంతములకు వచ్చారు? ఈ అడవులలో ఎందుకు, ఎవరి కోసరం తిరుగుతున్నారు? ఇక్కడకు ఎలా వచ్చారు?

ఇవన్నీ తరువాత చెబుదురు కానీ మీరంతా మంచి ఆకలి,

దప్పికతో ఉన్నట్టున్నారు. ఇక్కడ ఉన్న ఫలములను, తినుబండారములను తృప్తిగా తిని, మధురమైన పానీయములను తాగి సేదతీరండి. తరువాత మీ గురించి నాకు చెప్పండి.” అని ఆ తాపసి చెప్పింది.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము ఏబది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
ఏబది రెండవ సర్గ.

ఆ తాపసి అనుమతి పొందిన ఆ వానరులు అక్కడ ఉన్న మధురమైన ఫలములను, తినుబండారములను తృప్తిగా తిని, మధురమైన పానీయములను సేవించి భుక్తాయాసంతో పడుకున్నారు. తాపసి తమను అడిగిన విషయం మర్చిపోయారు.

అది చూచి ఆ తాససి స్వయంప్రభ వారి దగ్గరకు వచ్చి “మీ ఆకలి తీరినదా! విశ్రాంతి తీసుకున్నారా! ఇప్పుడైనా మీ గురించి నాకు చెబుతారా!” అని అడిగింది. అప్పుడు హనుమంతుడు స్వయంప్రభతో తమ గురించి చెప్పసాగాడు.

“ఓ మాతా! నా పేరు హనుమంతుడు. మాది కిష్కింధ. వీరంతా నా సహచరులు. మేము వానరులము. అయోధ్యను పరిపాలించు మహారాజు దశరథుని కుమారుడు రాముడు. ఆయన తన భార్య సీతతో వనవాసము చేస్తున్నాడు. దండకారణ్యములో,

జనస్థానములో, రామలక్ష్మణులు ఆశ్రమములో లేని సమయమున, రావణుడు అనే రాక్షసుడు ఒంటరిగా ఉన్న సీతను అపహరించాడు. రాముడు మా వానర రాజు సుగ్రీవునితో మైత్రి చేసుకున్నాడు. సీతను వెతికిపెట్టమని సుగ్రీవుని అడిగాడు. ఆ సుగ్రీవుని ఆజ్ఞమేరకు, వాలి కుమారుడు అంగదుని నాయకత్వంలో, అగస్త్యుడు సంచరించిన ఈ దక్షిణ దిక్కున మేము సీతకోసరం, రావణుని కోసరం వెదుకు తున్నాము. అలా వెదుకుతుంటే మాకు ఆకలి దప్పిక వేసాయి. ఈ గుహలో నుండి నీటితో తడిసిన పక్షులు రావడం చూచి, ఈ గుహలో నీరు ఉండవచ్చని తెలిసి ఈ గుహలో ప్రవేశించాము. నిన్ను చూచాము. నీ వలన మాకు ఆకలి దప్పిక తీరాయి. ఆకలితో మరణించబోవుచున్న మమ్ములను ఆహారము ఇచ్చి కాపాడావు. మేము నీకు ఏమి ప్రత్యుపకారము చేయగలము." అని అడిగాడు హనుమంతుడు.

హనుమంతుని యుక్తియుక్తములైన మాటలు విన్న ఆ స్వయంప్రభ ఇలా పలికింది. "నేను తాపసిని. మీ వలన నాకు కావాల్సిన ఉపకారము ఏమీ లేదు. మీకు ఆకలి తీరింది అంతే చాలు." అని పలికింది స్వయంప్రభ.

అప్పుడు హనుమంతుడు ఆమెతో ఇలా అన్నాడు. "మాతా! మీరు ధర్మమూర్తులు. మా రాజు సుగ్రీవుడు మాకు ఇచ్చిన గడువు మేము ఈ బిలములో దిక్కుతోచకుండా తిరగడంలో గడిచిపోయింది. గడువు లోపల చెప్పిన పని పూర్తిచేయనందుకు, మారాజు సుగ్రీవుడు మాకు మరణ దండన విధిస్తాడు. మేము సీతాన్వేషణము అనే గొప్ప కార్యమును నిర్వర్తించవలసి ఉంది. కాని ఈ గుహలో చిక్కుకు

పోవడం వల్ల ఆ పని చేయలేకపోయాము. ఏం చెయ్యాలో మాకు తోచడం లేదు. మాకు ఆహారం ఇచ్చి కాపాడావు. ఈ ఆపదనుంచి కూడా నువ్వే మమ్ములను కాపాడాలి." అని అన్నాడు హనుమంతుడు.

హనుమంతుని మాటలకు ఆ తాపసి నవ్వి ఇలా పలికింది. "ఈ బిలములో ప్రవేశించిన వాడు ప్రాణాలతో బయటకు వెళ్లలేడు. మీరంతా కళ్లుమూసుకోండి. నేను నా తప:ప్రభావంతో మిమ్ములను ఈ బిలము దాటిస్తాను. కళ్లు తెరిస్తే మాత్రం మీరు ఈ బిలము దాటలేరు." అని చెప్పింది.

ఆ వానరులందరూ గబగబా తమ చేతులతో తమ కళ్లను గట్టిగా మూసుకున్నారు. స్వయంప్రభ తన తపోబలంతో ఆ వానరులను బిలము బయటకు తీసుకొని వచ్చింది. అప్పుడు ఆ తాపసి ఆ వానరులతో ఇలా అంది. "మీరు ఉన్నది వింధ్యపర్వతము. అది ప్రస్రవణ పర్వతము. అది మహాసముద్రము. ఇంక నేను నా స్వస్థానమునకు వెళ్ళెదను." అని పలికి స్వయంప్రభ తన బిలంలోకి వెళ్లిపోయింది.

శ్రీమద్రామాయణము కిష్కింధా కాండము
ఏబది రెండవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

ఏబది మూడవ సర్గ.

అంగదుని సారధ్యంలో బయలు దేరిన వానర వీరులు అందరూ సాగర తీరం చేరుకున్నారు. వారందరికీ వింధ్యపర్వత బిలంలోనే సుగ్రీవుడు ఇచ్చిన  ఒక నెల రోజులు గడువు తీరిపోయింది. తాపసి తపో మహిమ వల్ల సాగర తీరం చేరుకున్నారు.  వారందరూ వింధ్యపర్వత ప్రాంతంలో  కూర్చుని ఏమి చెయ్యాలో తోచక చింతిస్తున్నారు. పుష్పించిన లతలను చూచి వారు వసంత ఋతువు ప్రవేశించినది అని తెలుసుకున్నారు. తమకు సుగ్రీవుడు ఇచ్చిన గడువు ముగిసి పోయింది అని చింతిస్తున్నారు.

అప్పుడు అంగదుడు వారిని చూచి ఇలా అన్నాడు. “మనము అందరము సీతను వెదకడానికి సుగ్రీవుని ఆజ్ఞ మేరకు బయలు దేరాము. మనకు ఇచ్చిన గడువు ఒక మాసం రోజులు. ఆ మాసం రోజులు మనము ఆ బిలంలో ఉండగానే గడిచిపోయింది. అది మీకు తెలుసు. మనం ఆశ్వయుజ మాసంలో బయలు దేరాము. ఇప్పుడు  చైత్రమువచ్చింది.

మీరంతా సుగ్రీవునికి విశ్వాస పాత్రులు. ధర్మం తెలిసిన వారు. నీతి మంతులు. ఇప్పటి దాకా మీరు చేపట్టిన కార్యములు అన్నింటిలోనూ మంచి ఫలితములను సాధించారు. సుగ్రీవుని ఆజ్ఞప్రకారము నేను మీకు నాయకుడు అయ్యానే గానీ, దిశానిర్దేశం చెయ్యడంలో మీరే సమర్థులు. సుగ్రీవుని ఆజ్ఞ మీరినందుకు మనకు

మరణం తప్పదు. కాబట్టి మనం అందరం మరణించవలసిందే. కిష్కింధకు పోయి మరణ దండన పొందే కంటే ఇక్కడే ప్రాయోపవేశం చేసి మరణించడం మంచిది.

సుగ్రీవుడు చాలా తీక్షణ స్వభావము కలవాడు. ఎట్టి పరిస్థితులలోనూ కాలాతిక్రమణ చేసిన మనలను క్షమించడు. సీత గురించిన వార్తను మనము తీసుకుని వెళ్లకుంటే మనకు మరణ దండన తప్పదు. కాబట్టి మనకు ప్రాయోపవేశమే ప్రస్తుత కర్తవ్యము. సుగ్రీవుని చేతిలో చిత్రహింసలు పడి మరణించేకంటే సుఖంగా ప్రాయోపవేశం చెయ్యడం మంచిది కదా!

మీరు ఇంకొక విషయం మరిచి పోతున్నారు. నేను వాలి కుమారుడను. సుగ్రీవునికి నా మీద లోలోపల కోపం ఉంది. రాముని ప్రోద్బలంతో సుగ్రీవుడు నన్ను యువరాజును చేసాడే కానీ, నా మీద ఉన్న ప్రేమతో చెయ్యలేదు. కాబట్టి సుగ్రీవుడు నన్ను ఊరికే వదలడు. నా తండ్రి మీద ఉన్న తన కోపాన్ని, పగను ఇప్పుడు నా మీద చూపిస్తాడు. నాకు తీక్షణ మైన శిక్ష విధించి నన్ను చంపిస్తాడు. వాలి కుమారుడిగా బతికి, కిష్కింధలో దిక్కులేని చావు చచ్చేకంటే. ఇక్కడ పవిత్రమైన సముద్రతీరంలో ప్రాయోపవేశం చేసి మరణించడం మంచిది అని నా అభిప్రాయము." అని అన్నాడు అంగదుడు.

యువరాజైన అంగదుని మాటలు విని వానరులు ఇలా అన్నారు. "నీవు చెప్పింది నిజము. రాముడు సీతను చూడవలెనని కోరికతో ఉన్నాడు. రాముడి కోరిక తీర్చవలెనని సుగ్రీవుడు పట్టుబట్టి ఉన్నాడు. మనము సీత జాడ తెలుసుకోకుండా వెళితే మనకు దండన

తప్పదు. అదీ కాకుండా మనము గడువులోపల వెళ్లడం లేదు. సుగ్రీవుడు మనకు ఇచ్చిన గడువు ఎప్పుడో తీరిపోయింది. రాముడికి సంతోషము కలిగించాలనే మిషమీత సుగ్రీవుడు మనలను తీవ్రంగా దండిస్తాడు. చంపిస్తాడు. తప్పుచేసిన వాళ్లము ప్రభువు దగ్గరకుపోవడం మంచిది కాదు. మనము అందరం సుగ్రీవునికి మంత్రులము. ఆయనే మనలను ఈ కార్యము మీద పంపాడు. కాబట్టి మనము సీతను వెదికి ఆమె జాడ తెలుసుకొని వెళ్లాలి కానీ ఒట్టి చేతులతో వెళ్లకూడదు." అని అన్నారు.

ఆ మాటలు విన్న తారుడు అనే వానరుడు ఇలా అన్నాడు. "మనము ఇక్కడే ఉంటే సుగ్రీవుని వలన భయం ఉండదు. ఈ లోపల మనము సుగ్రీవుని బారి నుండి మరణ దండన తప్పించుకొనే ఉపాయం ఆలోచించాలి." అని అన్నాడు. తారుని మాటలకు అంతా సంతోషించారు.

ఈ మాటలు విన్న హనుమంతుడు నిరాశతో నిస్స్పృహతో ఉన్న అంగదునికి కర్తవ్యబోధ చేయాలని అనుకున్నాడు. ముందు అంగదుని భేదోపాయముతో మిగిలిన వానరుల నుండి విడదీసి, తరువాత దండోపాయముతో బయపెట్టి, కిష్కింధకు తీసుకొని వెళ్లవలెనని అనుకున్నాడు. ఆ ప్రకారము అంగదునితో ఇలా అన్నాడు.

"ఓ అంగదా! నీవు వాలి పుత్రుడవు. యుద్ధం చేయడంలో నీ తండ్రి వాలి కంటే సమర్థుడవు. ఈ వానర రాజ్యమును పాలించుటకు అన్ని అర్హతలు నీకు ఉన్నాయి. కానీ ఈ వానరులకు ధైర్యము లేదు. చపలచిత్తులు. ఏదో మాట్లాడుతుంటారు.  వీరికి తమ

భార్యబిడ్డలను వదిలి వచ్చామే అని దిగులు. అందుకని ఏమేమో మాట్లాడుతున్నారు. వీరు నీ ఆజ్ఞలను పాటించరు. ఈ జాంబవంతుడు, నీలుడు, సుహోత్రుడు నీతో కలవరు. నేను కూడా వారితోనే ఉంటాను. సుగ్రీవుడు మనము ఎక్కడ ఉన్నా మనలను వెదికి వెదికి చంపుతాడు. అప్పుడు నీవు ఎన్ని చెప్పినా సుగ్రీవుడు వినడు.

బలవంతుడు బలము లేని వాడితో విరోధము పెట్టుకో వచ్చును కానీ బలహీనుడు బలవంతునితో వైరముపెట్టుకోరాడు. సుగ్రీవుని కంటే మనము దుర్బలులము. సుగ్రీవునితో విరోధం పెట్టుకోవడం మంచిది కాదు. మనము ఇక్కడే ఉంటే, మనలను లక్ష్మణుడు తన బాణములతో హతమారుస్తాడు. లక్షణుని వద్ద నారాచబాణములు అనేకం ఉన్నాయి. మనం ఎక్కడ ఉన్నా అవి మనలను చీలుస్తాయి.

ఈ వానరులందరూ తమ తమ భార్యా పిల్లలను తలచుకుంటూ నిన్ను వదిలేస్తారు. ఎవరి దోవన వారు వెళతారు. వీరు భయస్తులు. ఊరికే బయపడతారు. భయం మనసులో ప్రవేశిస్తే గడ్డిపరక కదిలినా భయంగానే ఉంటుంది. కాబట్టి భయాన్ని వదిలిపెట్టు. సుగ్రీవుని గురించి అనవసరంగా భయపడకు.

మనం అందరం సుగ్రీవుని వద్దకు వెళతాము. జరిగిన విషయాలు చెబుదాము. సుగ్రీవుడు అంత దుర్మార్గుడు కాదు. దయ కల వాడు. నీవు యువరాజువు. కాబోయే రాజువు. సుగ్రీవుడు ధర్మం తప్పి నడవడు. మంచి మనసు కలవాడు. సత్యవ్రతుడు. సుగ్రీవుడు నీకు అపకారం చెయ్యడు. పైగా సుగ్రీవునికి నీ తల్లి తార అంటే ఎంతో

ప్రేమ అభిమానము. తార కోసరం ఏమైనా చేస్తాడు. పైగా సుగ్రీవునికి సంతానము లేదు. నీవు ఒక్కడివే సుగ్రీవుడికి వారసుడివి. కాబట్టి సుగ్రీవుని వలన నీకు వచ్చిన నష్టము ఏమీలేదు. మనం సుగ్రీవుని వద్దకు పోదాము.” అని హనుమంతుడు అన్నాడు.

శ్రీమద్రామాయణము
కిష్కిధా కాండము యాభయి నాలుగవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
యాభయి ఐదవ సర్గ.

తన ప్రభువు సుగ్రీవునికి అనుకూలంగా, ధర్మసమ్మతంగా హనుమంతుడు మాట్లాడిన మాటలు విన్నాడు అంగదుడు. హనుమంతునితో ఇలా అన్నాడు.

“హనుమా! సుగ్రీవుడు నీవు అనుకున్నంత మంచి వాడు కాదు. అతనిలో మంచితనము ఏకోశానా లేదు. అతని మనసు శుద్ధమైనది కాదు. అతనిలో ఋజువర్తన లేదు. కపటి. హనుమా! సుగ్రీవుడు నా తండ్రి దుందుభిని వెతుకుతూ బిలములోకి వెళితే ఆయన కోసరం వేచి ఉండక, బిలమును మూసి వేసి, రాజ్యమును హరించాడు. అంతే కాకుండా వాలి భార్య, నా తల్లి అయిన తారను కూడా భార్యగా స్వీకరించాడు. అటువంటి వాడు ధర్మాత్ముడు ఎలా

అవుతాడు? అన్నభార్య తల్లి వంటిది కదా. అటువంటి అన్నభార్య తారను, అన్న బతికి ఉండగానే, భార్యగా స్వీకరించడం ధర్మమా!

అంతే కాదు. అగ్నిసాక్షిగా సుగ్రీవుడు రామునితో మైత్రి చేసుకున్నాడు. సుగ్రీవునికి ఇచ్చిన మాట ప్రకారము రాముడు నా తండ్రి వాలిని చంపి సుగ్రీవునికి కిష్కింధకు రాజును చేసాడు. కాని సుగ్రీవుడు ఏం చేసాడు? చేసిన మేలు మరిచి, శరత్కాలము వచ్చినా, రాముని పని గురించి ఆలోచించలేదు. ఇటువంటి వాడు ఎవరు చేసిన ఉపకారమును గుర్తుంచుకుంటాడు.

హనుమా! శరదృతువువచ్చిన తరతువాత ఎంత కాలానికీ సుగ్రీవుడు రాకపోతే, లక్ష్మణుడు వచ్చి చంపుతానని బెదిరిస్తే, లక్ష్మణుని బాణాలకు భయపడి మనలను సీతను వెదకడానికి పంపాడే కానీ, ధర్మం అంటే భయం ఉండి కాదు.

సుగ్రీవుడు అధర్మపరుడు, పాపాత్ముడు, చేసిన మేలు మరిచేవాడు, చంచలస్వభావుడు. అటువంటి వాడిని ఎవరైనా నమ్ముతారా! ముఖ్యంగా వానరులు ఎవరూ సుగ్రీవుని నమ్మరు. నేను సుగ్రీవుని అన్న కొడుకును. తన కొడుక్కు రాజ్యం ఇవ్వకుండా నాకు రాజ్యం ఇస్తాడని నేను ఎలా అనుకోను. పైగా నేను తన శత్రువు కొడుకును. గుణవంతుడైనా గుణహీనుడైన స్వంత పుత్రుడే రాజు అవుతాడు కానీ, శత్రువు కొడుకును ఐన నేను రాజు ఎలా అవుతాను.

నేను సుగ్రీవుని చేతిలో చంపదగిన వాడిని కానీ రాజు కాదగినవాడిని కాను. పైగా నా వల్ల అపరాధము జరిగింది. నేను సుగ్రీవుడు ఇచ్చిన సమయము అతిక్రమించాను. ఒక వేళ సుగ్రీవుడు నన్ను క్షమించినా, కిష్కింధలో దుర్బలుడుగా జీవించలేను. క్రూరుడు, భ్రాతృఘాతకుడు అయిన సుగ్రీవుడు నన్ను రహస్యముగా బంధించి, చంపిస్తాడు. వాడి చేతిలో బంధింపబడి చావడం కంటే ఇక్కడే ప్రాయోపవేశము చెయ్యడం ఉత్తమం.

నేను ఇక్కడే ఉంటాను. కిష్కింధకు రాను. మీరంతా వెళ్లిపొండి. నేను ఇక్కడే మరణిస్తాను. మీరు కిష్కింధకు వెళితే, రామ లక్ష్మణులకు, సుగ్రీవునికి నా నమస్కారాలు చెప్పండి. నా తల్లి రుమను అడిగినట్టు చెప్పండి. నా తల్లి తారను ఓదార్చండి. నా తల్లి తారది జాలి గుండె. నేను మరణించాను అని తెలిస్తే తట్టుకోలేదు. తాను కూడా మరణిస్తుంది. " అని అన్నాడు అంగదుడు.

అంగదుని మాటలు విన్న వృద్ధ వానరులకు దు:ఖము ముంచుకొచ్చింది. మేము కూడా వెళ్లము. నీతో పాటు ఉంటాము అన్నారు. అందరూ నేల మీద దర్భలు పరుచుకొని ప్రాయోపవేశమునకు ఉపక్రమించారు. వానరులందరూ అంగదుని చుట్టుచేరి, సుగ్రీవుని తిడుతూ ప్రాయోపవేశము చెయ్యడానికి నిశ్చయించుకున్నారు.

సముద్రతీరంలో దర్భలు పరిచారు. తూర్పుముఖంగా కూర్చున్నారు. ఆచమనం చేసారు. రాముని గురించి మాట్లాడుకున్నారు. రాముడు అడవులకు రావడం, జనస్థానంలో ఉండగా రాముడు

రాక్షసులను చంపడం, రావణుడు సీతను అపహరించడం, జటాయువు చావడం, సుగ్రీవునితో స్నేహం, వాలి మరణం ఇవన్నీ తలచుకుంటున్నారు. అందరూ ఆ దర్భాసనముల మీద పడుకున్నారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము యాభైఅయిదవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము
## యాభై ఆరవ సర్గ.

అంగదుని నిర్ణయం ప్రకారము వానరులందరూ ప్రాయోపవేశము చేస్తున్నారు. ఆ సమయంలో జటాయువు సోదరుడు సంపాతి అనే పక్షి రాజు వింధ్యపర్వతగుహలలో నివసిస్తున్నాడు. ఈ వానరుల కోలాహలము విని, సంపాతి గుహలో నుండి బయటకు వచ్చాడు. సంపాతి ఆ వానరులను చూచి చాలా సంతోషించాడు. చాలా రోజుల తరువాత తనకు మంచి రుచికరమైన ఆహారము దొరికింది అనుకున్నాడు.

సంపాతి ఆ వానరులను చూచి " ఎవరెవరి కర్మఫలములను బట్టి వారికి ఆహారము దొరుకుతుంది. నా అదృష్టంకొద్దీ ఈ రోజు మీరు అందరూ నాకు ఆహారము అవుతున్నారు. ముందు ఏ వానరుని భక్షించాలో చెప్పండి. కోరుకునే అవకాశము మీకే ఇస్తున్నాను." అని అన్నాడు సంపాతి.

సంపాతి మాటలు విన్న అంగదుడు హనుమంతుని చూచి దు:ఖంతో ఇలా అన్నాడు. "హనుమా! మనము చావాలని అనుకున్నాము. సాక్షాత్తు యమధర్మరాజు ఈ పక్షిరూపంలో మనవద్దకు వచ్చాడు. మనము రాముని కార్యము సాధించలేకపోయాము. రాజాజ్ఞను పాటించలేకపోయాము. ఇప్పుడు ఈ ఆపద వచ్చింది.

రామునికి జటాయువు ఎలాంటి సాయం చేసాడో మీకంతా తెలుసు. ధర్మాత్ముడు అయిన జటాయువు సీతను రక్షించడం కోసరం తన ప్రాణాలనే బలి పెట్టాడు. ఒక్క జటాయువే కాదు, జంతువులు అన్నీ రామునికి ఎంతో కొంత సాయం చేసాయి. మోరలెత్తి రావణుడు వెళ్లిన మార్గము చూపించాయి. కాబట్టి మనం కూడా రాముని కొరకు మన ప్రాణాలను విడిచిపెడదాము. సీతాన్వేషణలో మన ప్రాణాలను త్యాగం చేద్దాము.

ఆ నాడు జటాయువుకు సుగ్రీవుని భయం లేదు. ఎలాంటి స్వార్థం లేకుండా రావణునితో యుద్ధం చేసి రామునికి సాయం చెయ్యడం కోసరం తన ప్రాణాలు త్యాగం చేసాడు. ఉత్తమగతిని పొందాడు. కాబట్టి మనం కూడా రాముని కార్యము కొరకు ప్రాణత్యాగము చేసి ఉత్తమగతులను పొందుతాము. రాముని కొరకు ఆయన తండ్రి దశరథుడు మరణించాడు. రాముని కొరకు జటాయువు మరణించాడు. మనమూ అదేమార్గాన్ని అనుసరిద్దాము." అని అన్నాడు అంగ దుడు.

ఆ మాటలు విన్నాడు సంపాతి. వాలి మాటలలో తన అన్న

జటాయువు ప్రసక్తి రావడం గమనించాడు. తాను కూడా దు:ఖిస్తూ ఇలా అన్నాడు.

"జటాయువు నా సోదరుడు. నేను నా సోదరుని నా ప్రాణం కన్నా అధికంగా ప్రేమిస్తాను. నా సోదరుడు జటాయువు గురించి మాట్లాడే మీరు ఎవరు? జటాయువు చావడం ఏమిటి? జటాయువుకు రావణునికి యుద్ధం జరగడం ఏమిటి? ఎందుకు జరిగింది? జటాయువు మిత్రుడు దశరథమహారాజు ఎలా మరణించాడు? జటాయువు గురించిన సమాచారము చాలా కాలము తరువాత ఇప్పుడే వింటున్నాను. మీరు నా సోదరుని గురించి మాట్లాడటం నాకు చాలా ఆనందంగా ఉంది. దండకారణ్యంలో జనస్థానంలో సుఖంగా జీవిస్తున్న నా సోదరుడు జటాయువు ఎలా మరణించాడో వివరంగా చెప్పండి. ఆయన మిత్రుడు దశరథుని గురించి చెప్పండి. మిత్రులారా! సూర్యుని కిరణముల వేడికి నా రెక్కలు కాలిపోయాయి. నేను కదలలేను. నన్ను ఈ పర్వతశిఖరము మీది నుండి కిందికి దింపండి." అని అన్నాడు సంపాతి.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము యాభైఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# కిష్కింధా కాండము

## యాభైఏడవ సర్గ.

సంపాతి మాటలు వానరులు నమ్మలేదు. "వీడెవడో రాక్షసుడు. కామరూపంలో ఉన్నాడు. వీడిని కిందికి దించితే మనలనందరినీ తినేస్తాడు." అని అనుమానపడ్డారు. అందుకని సంపాతిని పర్వతశిఖరము మీదినుండి  కిందికి దింపాలా వద్దా అని ఆలోచిస్తున్నారు.

వారికి మరో ఆలోచన కూడా వచ్చింది. "ఎటూ తాము చావడానికే ప్రాయోపవేశం చేస్తున్నారు. అటువంటిది తాము ఈ రాక్షసుడి చేతిలో చావడం మేలుకదా. తొందరగా చావాలనే కోరిక ఈ విధంగా నెరవేరుతుంది." అని కూడా అనుకున్నారు.

ఇలా ఆలోచించిన తరువాత, అంగదుడు సంపాతిని ఆ పర్వత శిఖరము మీది నుండి  కిందికి దింపి నేలమీద పెట్టారు. అప్పుడు అంగదుడు సంపాతితో తమ వృత్తాంతము ఇలా చెప్పసాగాడు.

"ఓ పక్షిరాజా!  పూర్వము ఋక్షజుడు అనే వానర రాజు ఉండేవాడు. ఆయన నా పితామహుడు. (తాతగారు).  వాలి, సుగ్రీవుడు ఆయనకు ఔరసపుత్రులు. వాలి నా తండ్రి. నా తండ్రి తన పరాక్రమంతో ఈ లోకంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు.  ఇక్ష్వాకు వంశంలో దశరథుడు అనే మహారాజు జన్మించాడు. ఆయన కుమారుడు రాముడు. తండ్రి ఆజ్ఞ పాటించడానికి రాముడు, తన భార్య సీత, సోదరుడు లక్ష్మణునితో అరణ్యవాసం చేస్తూ దండకారణ్యానికి వచ్చాడు.

రావణుడు అనే రాక్షసుడు రాముని భార్య సీతను జనస్థానము నుండి బలవంతంగా తీసుకుపోయాడు. రావణుడు సీతను తీసుకుపోతుంటే జటాయువు అనే పక్షిరాజు చూచాడు. సీతను రక్షించాలని రావణునితో యుద్ధం చేసాడు. కాని రావణుడు జటాయువు రెక్కలు ఖండించి చంపాడు. రామకార్యంలో మరణించిన జటాయువు ఉత్తమగతులు పొందాడు.  రాముడు సీతను వెతుకుతూ నా పినతండ్రి సుగ్రీవుని వద్దకు వచ్చాడు. రాముడు సుగ్రీవునితో స్నేహం చేసాడు. సుగ్రీవునికి ఇచ్చినమాట ప్రకారము రాముడు నా తండ్రి వాలిని చంపాడు. సుగ్రీవుడు కిష్కింధకు రాజయ్యాడు.

సుగ్రీవుని ఆజ్ఞప్రకారము మేము సీతను వెదుకుతూ ఇక్కడకు వచ్చాము. కాని సీత జాడను తెలుసుకోలేకపోయాము. సీతను వెదుకుతూ, నీరు దొరుకుతుందేమో అని మేము  ఒక బిలము లోకి ప్రవేశించాము. ఆ బిలములో మేము ఆహారము, నీరు కొరకు వెదుకుతండగానే సుగ్రీవుడు మాకు ఇచ్చిన  ఒక మాసము కాలము దాటి పోయింది. ఇప్పుడు మేము కిష్కిందకు పోతే సమయపాలన చేయనందుకు సుగ్రీవుడు మమ్ములను చంపుతాడు. రాముడికి, లక్ష్మణునికి సుగ్రీవునికి కోపం తెప్పించి మేము కిష్కిందలో బతకలేము. అందుకని మేము ఇక్కడ ప్రాయోపవేశము చేస్తున్నాము.”  అని చెప్పాడు అంగదుడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము యాభైఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## కిష్కింధా కాండము
## యాభై ఎనిమిదవ సర్గ.

అంగదుడుచెప్పిన మాటలు విని సంపాతికి కన్నీళ్లు ఆగలేదు. సోదరుడు జటాయువు మరణాన్ని తలుచుకొని ఏడుస్తున్నాడు. సంపాతి ఆ వానరులతో ఇలా అన్నాడు.

“రాముని కోసరం, సీతను కాపాడటం కోసరం, తన ప్రాణాలు అర్పించాడు అని మీరు చెబుతున్న జటాయువు నా తమ్ముడు. నాకు ఈ విషయము ఇంతకు ముందే కొద్దిగా తెలుసు. ఇప్పుడు మీ నుండి పూర్తిగా రూఢిపరచుకున్నాను. ఇప్పుడు నాకు రెక్కలు లేవు. అందుకని నా తమ్ముడి మరణానికి నేను రావణుని మీద ప్రతీకారము తీర్చుకోలేను.

పూర్వము వృత్రాసుర వధ జరిగినకాలంలో నేను, నా తమ్ముడు జటాయువు, పోటీలు పడి సూర్యమండలము వైపుకు ఎగురుతున్నాము. సూర్యవేడికి నా తమ్ముడు జటాయువు సొమ్మసిల్లాడు. నేను నా రెక్కలతో నా తమ్ముడు జటాయువుకు రక్షణ కల్పించాను. అప్పుడు సూర్యుని వేడికి నా రెక్కలు కాలిపోయాయి. నేను వింధ్యపర్వతము మీద పడ్డాను. నా తమ్ముడు జటాయువు ఎక్కడ పడ్డాడో తెలియదు. ఇప్పుడు మీ మాటల వలన నా తమ్ముడి గురించి తెలిసింది.” అని అన్నాడు సంపాతి.

అప్పుడు అంగదుడు సంపాతితో ఇలా అన్నాడు. "రావణుడు సీతను అపహరించాడు అని జటాయువు వలన రామునికి తెలిసింది. కాని ఆ రావణుడు ఎక్కడ ఉంటాడో చెప్పకుండానే జటాయువు మరణించాడు. ఆ రావణుని నివాసము గురించి నీకు ఏమైనా తెలిస్తే మాకు చెప్పు. దాని వలన మేము సీత యొక్క జాడ కనుక్కోడానికి వీలు కలుగుతుంది." అని అన్నాడు అంగదుడు.

ఆ మాటలకు సంపాతి ఇలా చెప్పాడు. "నా తమ్ముడు జటాయువు రాముని కోసరం తన ప్రాణాలు అర్పించాడు. నాకు రెక్కలు లేవు కాబట్టి నేను కేవలం మాట సాయం చేస్తాను. నాకు వరుణలోకము, భూలోకము, స్వర్గలోకము పాతాళలోకము, దేవాసుర యుద్ధము, అమృతాన్ని మథించడం అన్నీ నాకు తెలుసు. రావణుడు సీతను తీసుకుపోవడం నేను కూడా చూచాను. అప్పుడు సీత "రామా రామా" అని అరుస్తూ ఉంది.

ఇంక ఆ రావణుని గురించి చెబుతాను వినండి. రావణుడు విశ్రవసుని కుమారుడు, కుబేరునికి తమ్ముడు. ఆ రావణుడు లంకానగరంలో నివసిస్తున్నాడు. ఇక్కడికి నూరుయోజనముల దూరంలో సముద్రమధ్యలో ఒక ద్వీపము ఉంది. ఆ ద్వీపములో విశ్వకర్మచే నిర్మింప బడిన లంక అనే నగరము ఉంది. ఆ నగరము చాలా విలాస వంతంగా ఉంటుంది. బంగారు ద్వారములు, బంగారు అరుగులు, పెద్ద పెద్ద భవనములు ఆ నగరంలో ఉన్నాయి. ఆ నగరం చుట్టు శత్రువులకు ప్రవేశించరాని పెద్ద ప్రాకారము ఉంది.

రావణుడు సీతను ఆ లంకా నగరంలో బంధించి ఉంచాడు. మీరు లంకా నగరం వెళ్లగలిగితే అక్కడ సీతను చూడగలరు. కాని మీరు నూరు యోజనములు సముద్రము దాటి వెళ్లాలి. అక్కడి నుండి సముద్రమధ్యలో ఉన్న లంకను చేరాలి. మీరు తొందరగా వెళ్లండి. మీరు సీతను చూడగలరు అని నా దివ్యదృష్టికి గోచరమవుతూ ఉంది.

నాకు మా పక్షుల గురించి బాగా తెలుసు. కొన్ని పక్షులు కేవలం ధాన్యము తిని జీవించేవి భూమికి సమాంతరంగానే ఎగురుతాయి. రెండవ జాతి పక్షులు అంటే కాకులు మొదలగునవి ఇంకొంచెం పైగా ఎగురగలవు. క్రౌంచ పక్షులు మొదలగునవి ఇంకా పైన ఎగురగలవు. ఇంక నాలుగవ జాతి పక్షులు అయిన గ్రద్దలు మొదలగునవి ఆకాశంలో చాలా ఎత్తులో ఎగురగలవు. ఇంకా హంసలుమొదలగు పక్షులు ఇంకా ఎత్తులో ఎగురగలవు.

వినతకు గరుడుడు, అరుణుడు జన్మించారు. వారిది ఇంకా ఎత్తున ఎగురగల పక్షి సంతతి. మేము అరుణుని సంతతివారము. రావణుడు నా సోదరుడు జటాయువును చంపాడు. కాబట్టి నేను రావణుని మీద ప్రతీకారము తీర్చుకోవాలి. మేము ఆకాశంలో ఎంత ఎత్తున ఎగురుతున్నా, నేల మీద ఉన్న ఎంత చిన్న  వస్తువునైనా నిశితంగా చూడగలము. నాకు లంకలో ఉన్న సీత స్పష్టంగా కనపడుతూ ఉంది.

మేము మాకు సహజంగా ఉన్న తీక్ష్ణమైన చూపు చేత నూరుయోజనముల దూరంలో ఉన్న ఏ వస్తువునైనా చూడగలము.

ఎందుకంటే మేము ఆకాశంలో ఎగురుతూ ఎంతో కింద భూమి మీద ఉన్న సూక్ష్మమైన జంతువులను కూడా చూడగల శక్తిని మాకు ఆ భగవంతుడు ఇచ్చాడు. మీరు ముందుగా సముద్రమును దాటే ఉపాయమును ఆలోచించండి. సముద్రమును దాటితే గానీ లంకా నగరము చేరలేరు.

మీరు నన్ను సముద్రము వద్దకు తీసుకొని వెళ్లండి. చనిపోయిన నా సోదరుడు జటాయువుకు జలతర్పణము విడవాలి." అని అన్నాడు సంపాతి.

సంపాతి చెప్పిన మాటలకు వానరులు ఎంతో సంతోషించారు. రెక్కలు కాలిపోయిన సంపాతిని ఎత్తుకొని అందరూ సముద్ర తీరమునకు వెళ్లారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము యాభైఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
యాభైతొమ్మిదవ సర్గ.

సంపాతి చెప్పిన మాటలు వానరుల చెవులకు ఇంపుగా తోచాయి. వారు ఆనందంతో ఉరకలు వేసారు. వారందరిలోకి పెద్ద వాడైన జాంబవంతుడు లేచి సంపాతితో ఇలా అన్నాడు.

"సీత ఎక్కడ ఉంది? సీతను ఎవరు చూచారు? సీతను అపహరించిన వాడు ఎవరు? ఇవన్నీ నీకు ఎలా తెలుసు? మాకు తెలియజెయ్యి. పైవివరాలు మాకు తెలియజేస్తే నీవు మాకు మహోపకారము చేసినవాడివి అవుతావు. ఇంతకూ సీత రాముని భార్యఅని తెలిసీ, రాముని బాణము శక్తీ, మహిమ తెలిసీ సీతను అపహరించిన ఆ మూర్ఖుడు ఎవరు? " అని అన్నాడు జాంబవంతుడు.

. దానికి సంపాతి ఇలా చెప్పసాగాడు. "సీతను అపహరించడం గురించి నాకు ఎలా తెలిసిందో, నాకు ఎవరు చెప్పారో, ఇప్పుడు సీత ఎక్కడ ఉందో, మీకు వివరంగా చెబుతాను. వినండి. మీకు ఇదివరకే చెప్పాను కదా. నేను సూర్యకిరణముల వేడికి తాళలేక, రెక్కలు కాలిపోయి ఈ పర్వతము మీద పడిపోయాను. కదలలేక పడిఉన్నాను. పైగా నేను వృద్ధుడను. నా బలము, పరాక్రమము నశించిపోయాయి. కదలలేను.

అట్టి పరిస్థితిలో నా కుమారుడు సుపార్శ్వుడు నాకు ప్రతి దినము ఆహారము తెచ్చి పెట్టేవాడు. గంధర్వులకు కామము అధికము. పాములకు కోపము ఎక్కువ. లేళ్లకు భయం ఎక్కువ. అలాగే పక్షులమైన మాకు ఆకలి అధికము. ఒక రోజు నా కుమారుడు నాకు ఆహారము ఏమీ తేలేదు. సూర్యాస్తమయ సమయానికి వట్టి చేతులతో వచ్చాడు. నాకు ఆకలితో కడుపు నకనకలాడిపోతోంది. ఆకలికి తట్టుకోలేక నేను నా కొడుకును ఆహారం తేలేదని తిట్టాను. నా కొడుకు నన్ను తిట్టవద్దని ప్రార్థించాడు. తాను ఆహారము తీసుకురాకపోవడానికి కారణం ఈ విధంగా చెప్పాడు.

"తండ్రీ! నేను ప్రతి దినము వలె ఆహారము కొరకు మహేంద్రపర్వత శిఖరము మీద కూర్చుని ఉన్నాను. నా తల వంచి సముద్రములో ఉన్న చేపలను పట్టడానికి ప్రయత్నిస్తున్నాను. ఆ సమయంలో ఒకడు పెద్ద రాక్షసుడు, నలట్లికొండ మాదిరి ఆకారముతో ఉన్నవాడు, ఒక స్త్రీని తన చేతులతో ఎత్తుకొని ఆకాశంలో తీసుకు పోతున్నాడు. వాడిని నేను చూచాను.

సముద్రంలో జంతువులను పట్టుకొనే బదులు, వీరిద్దరినీ ఆహారంగా తీసుకు పోవచ్చుకదా అని ఆ రాక్షసుని అడ్డగించాను. వాడు తనను పోనివ్వమని నన్ను వేడుకున్నాడు. తనకు దారి ఇవ్వమని బతిమాలే వాడిని చంపడం నాకు ఇష్టం లేదు. వాడిని వదిలి పెట్టాను. వాడు ఆ స్త్రీని తీసుకొని వాయువేగంతో వెళ్లిపోయాడు.

ఆ సమయంలో ఆకాశంలో సంచరించు సిద్ధులు నా వద్దకు వచ్చి నాతో ఇలా అన్నారు. "ఆమె ఎవరో కాదు. దశరధ మహారాజు కుమారుడు, రాముని భార్య. ఆమెను రావణుడు అనే రాక్షసుడు అపహరించుకొని పోతున్నాడు. నీవు వాడిని విడిచిపెట్టావు." అని అన్నారు.

ఇదంతా జరిగేటప్పటికి సూర్యాస్తమయము అయింది. అందుకని నేను నీకు ఏమీ ఆహారము తీసుకురాలేకపోయాను." అని అన్నాడు నా కుమారుడు.

నాకు వెంటనే పోయి ఆ రావణుని చంపి సీతను రక్షించవలెనని కోరిక కలిగింది. కానీ రెక్కలు లేక జీవచ్ఛవంలా పడి

ఉన్న నాకు అది సాధ్యంకాదు కదా! అందువలన సీతను రక్షించలేక పోయాను.

కాని నేను మీకు కొంత ఉపకారము చేయగలను. రాముని సాయం చెయ్యడం అంటే నాకు కూడా ఇష్టమే కదా! సుగ్రీవుడు వానర రాజు. రాముడు గొప్ప పరాక్రమ వంతుడు. రామ బాణమునకు తిరుగు లేదు. కానీ మీ వానరుల సాయం లేనిది వారు ఏమీ చేయలేరు. మీ బుద్ధికి పదును పెట్టండి. కార్యరంగములోకి దూకండి. కార్యసాధకులకు అసాధ్యము ఏమీ లేదు."అని అన్నాడు సంపాతి.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము యాభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

అరవయ్యవ సర్గ.

వానర నాయకులు అందరూ సంపాతితో కలిసి చనిపోయిన జటాయువుకు జలతర్పణములు విడిచారు. తరువాత తీరుబడిగా అందరూ సంపాతి చుట్టు కూర్చున్నారు. అప్పుడుసంపాతి వారితో ఇలా అన్నాడు.

"ఇప్పుడు నేను మీకు సీత ఎక్కడ ఉన్నదీ అనే విషయం

నాకు ఎలా తెలుసో చెబుతాను. సావధానంగా వినండి. నేను సూర్యుని వేడికి రెక్కలు కాలిపోయి వింధ్య పర్వతము పడిపోయాను అని మీకు చెప్పాను కదా! నాకు ఏమీ తెలియడం లేదు. నేను ఎక్కడ ఉన్నది కూడా తెలియదు. తెలివి తప్పి పడి ఉన్నాను. నాకు తెలివి వచ్చి చుట్టు చూచాను. నేను దక్షిణ సముద్ర తీరము దగ్గర ఉన్న వింధ్యపర్వతము మీద ఉన్నట్టు, నాకు దగ్గరలో నిశాకరుడు అనే ఋషి ఆశ్రమము దగ్గర ఉన్నట్టు తెలుసుకున్నాను.

(ఇక్కడ మీకు ఒక సందేహము రావచ్చు. దక్షిణ దిక్కుగా వెదకమంటూ అంగదుని వింధ్యపర్వతము దగ్గర నుండి వెదక మన్నాడు సుగ్రీవుడు. మనకు తెలిసీ వింధ్యపర్వతము భారతదేశము మధ్యభాగంలో ఉంది. పంపానది కేరళ ప్రాంతంలో ఉంది. కిష్కింధ కూడా అక్కడే ఉండి ఉండవచ్చు. సీతను గోదావరీ తీరం నుండి రావణుడు అపహరించాడు అని మనము చదువుకున్నాము. ఒకదానికి ఒకటి సంబంధం లేకుండా ఉంది కదూ. ఈ శ్లోకంలో మన సందేహాలు అన్నీ తీర్చాడు వాల్మీకి మహర్షి.

హృష్టపక్షిగణాకీర్ణ: కన్దరోదరకూటవాన్।
దక్షిణస్యోదధేస్తీరే విన్ధ్యో అయమితి నిశ్చిత:॥

దక్షిణస్య=దక్షిణదిక్కున ఉన్న
ఉదధే:=సముద్రము యొక్క
తీరే= తీరమున ఉన్న
విన్ధ్య: ఇతి= వింధ్య అను పర్వతము అని
నిశ్చితి= నిశ్చయించుకున్నాను.

కాబట్టి ఇప్పటి దాకా మనము అనుకున్నట్టు భారతదేశ మధ్యలో ఉండే వింధ్యపర్వతము కాదు. దక్షిణ సముద్ర తీరములో

మరొక వింధ్యపర్వతము ఉంది అని తెలుస్తూ ఉంది. రామాయణ కథ త్రేతాయుగానికి సంబంధించింది. అప్పుడు ఉన్న భౌగోళిక పరిస్థితులు ఇప్పుడు లేవు. కొన్ని నగరాలు పట్టణాలు పర్వతాలు కాలగర్భంలో కలిసిపోయాయి. కొన్ని కొత్త కొత్తవి వెలిసాయి. కాబట్టి ఈనాడు ఉన్న భారతదేశంతో మనం ఆనాటి భారతదేశాన్ని పోల్చడం సరికాదు అని నా భావన.)

నేను ఆ పర్వతము మీద ఎనిమిది వేల సంవత్సరములు ఉన్నాను. అతికష్టం మీద నేను ఆ వింధ్యపర్వతశిఖరము నుండి కిందికి దిగి  వచ్చాను. నాకు ఆ ఋషిని చూడవలెనని కోరిక పుట్టింది. ఒకచెట్టు కింద కూర్చుని ఆ ఋషి కొరకు ఎదురుచూస్తున్నాను. అప్పుడు ఆ ఋషి సముద్రములో స్నానం చేసి వస్తుండగా చూచాను. ఏనుగులు, సింహాలు, పాములు, పులులు మొదలగు క్రూరజంతువులు ఆయనను చుట్టు ముట్టి వస్తున్నాయి. ఆ ఋషి ఆశ్రమము లోనికి వెళ్లగానే అవి అన్నీ ఎవరి దోవన అవి వెళ్లిపోయాయి.

ఆ ఋషి దారి మధ్యలో చెట్టుకింద కూర్చుని ఉన్న నన్ను చూచాడు. లోపలకు వెళ్లిన కొంచెంసేపటికి బయటకు వచ్చాడు. నా వద్దకు వచ్చి నన్ను చూచాడు.

“నేను ఇదివరకు నిన్ను చూచాను. నువ్వు సంపాతి కదూ. నీ రెక్కలు కాలిపోయి వికృతంగా ఉండడం వలన నిన్ను వెంటనే గుర్తించలేకపోయాను. నీ తమ్ముడు జటాయువు కదూ! ఇంతకు పూర్వము  మీరు నన్ను కలిసేవాళ్లు.

ఇంతకూ నీ రెక్కలు ఎందుకు కాలిపోయాయి? నీవు వికృతంగా ఎందుకు అయ్యావు. వివరంగా చెప్పు." అని అడిగాడు ఆ ఋషి..

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము అరువదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
అరువది ఒకటవ సర్గ.

అప్పుడు నేను సూర్యమండలము వైపు వెళ్లడం, సూర్యుని వేడికి నా రెక్కలు కాలిపోవడం, అన్ని విషయాలు ఆ ఋషికి వివరంగా చెప్పాను. కాలిన గాయములతో నా ఒళ్లు స్వాధీనం తప్పిందని చెప్పాను. అసలు అలా ఎందుకు చేసారు అని ఆ ఋషి అడిగాడు. అప్పుడు నేను ఆ ఋషితో ఈ విధంగా చెప్పాను.

"నేను, నా తమ్ముడు జటాయువు, ఒక సారి పందెం వేసుకున్నాము. నాకు ఎక్కువ బలం ఉందంటే నాకు ఎక్కువ బలం ఉందని గర్వించాము. సూర్యునితో పాటు ఉదయాద్రి నుండి అస్తాద్రివరకూ ఎగరాలని, హిమాచలము మీద ఉన్న ఋషుల ముందు, ఇద్దరం పోటీ వేసుకొన్నాము.

ఇద్దరం ఆకాశంలోకి ఎగిరాము. సూర్యుని అనుసరించి ఎగురుతున్నాము. దగ్గర దగ్గరగా సూర్యుని సమీపానికి వెళ్లాము. సూర్యుని సమీపానికి వెళ్లేటప్పటికి మా ఇద్దరికీ తీవ్రంగా చెమట

పట్టింది. భయం వేసింది. మూర్ఛవచ్చినట్టయింది. అక్కడ ఉన్న మాకు ఏ దిక్కూ తెలియడం లేదు. అంతా మండుతున్న అగ్నిగోళం లాగా ఉంది. నాకు మనస్సు పనిచేయడం మానేసింది. కేవలం నేత్రాలతో చూస్తూ వెళుతున్నాను.

అప్పుడు మాకు సూర్యుడు భూమిప్రమాణంలో కనపడ్డాడు. నేను నా తమ్ముడు జటాయువు వంక చూచాను. అతను భూమి మీదికి జారిపోతున్నాడు. నాకుకూడా భయం వేసింది. నా తమ్ముడితో నేను కూడా భూమి మీదికి జారిపోయాను. నా తమ్ముడి దగ్గరగా వెళ్లి నా రెక్కలను నా తమ్ముడికి రక్షణగా నిలిపాను. నా రెక్కల రక్షణలో జటాయువు శరీరం కాలిపోలేదు. కాని, నారెక్కలమీద సూటిగా సూర్యరశ్మిపడటం వలన నా రెక్కలు పూర్తిగా కాలిపోయాయి.

నేను వింధ్యపర్వత ప్రాంతంలో పడిపోయాను. నా తమ్ముడు జటాయువు దండకారణ్యంలో జనస్థానంలో పడ్డట్టు ఊహించాను. ఇప్పుడు నాకు ఎవరూ లేరు. ఒంటరి వాడను. ఈ విధంగా బతకడం వృధా. అందుకని చనిపోదలచుకున్నాను." అని ఆ ఋషితో నా వృత్తాంతము సవిస్తరంగా చెప్పాను.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము అరువది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

అరువది రెండవ సర్గ.

నేను ఆ ఋషితో నా విషయం గురించి చెప్పి దు:ఖిస్తున్నాను. అప్పుడు ఆ ఋషి కొంచెం ఆలోచించి ఇలా అన్నాడు. "నీకు కాలక్రమేణా రెక్కలు, బుద్ధి, జ్ఞానము అన్నీ వస్తాయి. అధైర్యపడకు. దానికి ముందు నేను చెప్పేది విను. నేను ఈ విషయాలన్నీ నా దివ్యదృష్టితో గ్రహించాను. ఇక్ష్వాకు వంశంలో దశరథుడు అనే మహారాజు పుడతాడు. ఆయనకు నలుగురు కుమారులు కలుగుతారు. అందులో రాముడు పెద్దవాడు. తండ్రి అయిన దశరథుని ఆదేశము మేరకు రాముడు, తన భార్య సీత, తమ్ముడు లక్ష్మణునితో కలిసి అరణ్యములకు వెళతాడు. అప్పుడు కొన్ని కారణముల వలన రావణుడు అనే రాక్షస రాజు రాముని భార్యను జన స్థానము నుండి అపహరిస్తాడు. సీత రావణుని సంపదలకు భోగములకు విలాసములకు లొంగదు. ఈ విషయాన్ని తెలుసుకొన్న దేవేంద్రుడు అమృతముతో సమానమయిన పరమాన్నమును సీతకు ఇస్తాడు. ఆ పరమాన్నమును దేవేంద్రుడు ఇచ్చాడు అని తెలుసుకొన్న సీత, ఆ పరమాన్నములో కొంత భాగమును తీసి నేల మీద పెట్టి "ఇది నా భర్తరామునికి, నా మరిది లక్ష్మణునకు, వారు జీవించి భూమి మీద ఉన్నా, చచ్చి స్వర్గాన ఉన్నా, వారికి చెందుతుంది." అని పలుకుతుంది.

తరువాతి కాలంలో సీతను వెతుకుతూ రాముడు పంపగా వచ్చిన వానరులు నిన్ను కలుస్తారు. వారికి నీవు సీత గురించి చెప్పాలి. అందుకని నీవు ఇక్కడే ఉండి వారి రాక కోసరము నిరీక్షిస్తూ ఉండాలి. నేను నా తపోబలముతో నీకు ఇప్పుడే రెక్కలు తెప్పించగలను. కానీ

నీకు రెక్కలు వస్తే నీవు ఇప్పుడే ఎగిరిపోతావు. నీవు ఇక్కడ వానరుల కోసరం వేచి ఉండటం అవసరము. ఎందుకంటే రామ దూతలకు సాయం చెయ్యడం లోకోపకారము చెయ్యడం వంటిది. నాకు కూడా అప్పటి దాకా బతికి ఉండి రాముని లక్ష్మణుని చూడవలెనని కోరికగా ఉంది. కానీ శరీరం సహకరించదు కదా! అందుకని ఈ శరీరాన్ని వదిలిపెడుతున్నాను." అని ఆ ఋషి నాతో సీతను గురించి చెప్పాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము అరువది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
అరువది మూడవ సర్గ.

"ఓ వానరులారా! ఆ తరువాత ఆ ఋషి నాతో ఇంకా కొన్ని మాటలు చెప్పి తన ఆశ్రమమునకు వెళ్లిపోయాడు. అప్పటి నుండి నేను ఈ వింధ్యపర్వతము మీద కూర్చుని మీ కొరకు ఎదురు చూస్తున్నాను. ఆ మహర్షి చనిపోయి నూరు సంవత్సరముల కాలము గడిచిపోయినది. నాకు అప్పుడప్పుడు ఈ దుర్భర జీవితము గడపలేక చనిపోవాలని అనుకొన్నాను. కానీ, ఆ ఋషి చెప్పిన మాటలు మీకు చెప్పాలి కదా! అందుకని మీ రాక కోసం ఎదురు చూస్తూ, జీవించి ఉన్నాను.

దశరథ మహారాజు నాతమ్ముడు జటాయువు కే కాదు నాకు కూడా మిత్రుడు. సీత దశరథుని కోడలు అని తెలిసి కూడా నా

కుమారుడు ఆమెను కాపాడలేకపోయాడు. రావణుని విడిచిపెట్టాడు. అందుకని నేను నా కుమారుని తిట్టాను. కాని ఏమి చేసేది. జరగాల్సింది జరిగిపోయింది."అని వానరులతో మాట్లాడుతూ ఉండగానే సంపాతికి రెక్కలు మొలిచాయి.

"ఓ వానరోత్తములారా! ఆ మహాఋషి ఆజ్ఞప్రకారము ఆయన చెప్పిన మాటలు మీకు చెప్పగానే నాకు ఆ ఋషి ప్రభావము వలన రెక్కలు మొలిచాయి. ఇప్పుడు నేను ఎక్కడి కంటే అక్కడకు ఎగిరిపోగలను. నా బలము పరాక్రమము నాకు తిరిగి లభించాయి. నేను ఇప్పుడు నవయవ్వనంలో ఉన్నంత ఉత్సాహంగా ఉన్నాను. మీరు అన్నివిధాలా ప్రయత్నం చేయండి. సీత మీకు లభిస్తుంది. ఆ మహాఋషి మహిమ వలన నాకు రెక్కలు ఎలా వచ్చాయో, మీకు కూడా సీత జాడ లభిస్తుంది. సందేహము లేదు." అని చెప్పి ఆ పక్షిరాజు సంపాతి తనకు నిజంగా ఎగిరే సామర్థ్యము వచ్చిందా అని పరీక్షించుకోడానికి ఒక్కసారి తన రెక్కలు టపటపలాడించి పైకి ఎగిరాడు. సంతోషంగా ఎగురుకుంటూ వెళ్లిపోయాడు. వానరులు సముద్రం ఎలా దాటాలా, లంకకు ఎలా చేరాలా అని ఆలోచిస్తున్నారు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము అరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

అరువది నాలుగవ సర్గ.

ఇప్పుడు వానరులకు సీత ఎక్కడ ఉందో తెలిసింది. సీత రావణుని రాజ్యమైన లంకలో ఉంది. ఆ లంక దక్షిణ సముద్ర మధ్యలో ఉన్న దీవిలో ఉంది. ఆ దీవి సముద్ర తీరము నుండి నూరు యోజనముల దూరములో ఉంది. ఆ దీవికి ఎలా చేరాలి? అదే ఇప్పుడు వారి ముందు ఉన్న ప్రశ్న. అందరూ సముద్ర తీరంలో నిలబడి సముద్రం వంక చూస్తున్నారు. ఆకాశము భూమి కలిసినట్టుఉన్న ఆ సముద్రమును చూస్తుంటేఆ వానరులకు దిగులు పుట్టింది. ఈ సముద్రాన్ని ఎలా దాటాలి! ఇదే వారి అందరి మనసుల్లో మెదిలే ప్రశ్న.

వారికి నాయకుడు అయిన అంగదుడు వారిని చూచి ఇలా అన్నాడు. "మనము ఇలా సముద్రాన్ని చూస్తూ దిగులుపడితే ప్రయోజనము లేదు. ఏదో ఒకటి చెయ్యాలి. మన మనసులో దిగులు, భయం ప్రవేశిస్తే మనము ఏమీ చెయ్యలేము. ఆ దిగులు భయం మనలను మింగేస్తుంది. కాబట్టి ధైర్యం తెచ్చుకోండి. ఏమి చెయ్యాలో ఆలోచించండి. " అని పలికాడు అంగదుడు.

కాసేపు అటు ఇటు చూచాడు. మరలా ఇలా అన్నాడు.

"మనలో ఈ సముద్రమును దాటగల సమర్థుడు ఎవరు? ఎవరు నూరుయోజనముల దూరము కల ఈ సముద్రమును దాటగలరు? రాముని కార్యము నెరవేర్చగల సమర్ధుడు ఎవరు? అతడే మనలను అందరనూ సుగ్రీవుని బారినుండి కాపాడగలడు.

మరలామన భార్యాబిడ్డలను చూడటానికి కారణం కాగలడు. లేకపోతే మనం అందరం ఇక్కడ చావడం తప్పదు. మీలో ఎవరికి ఈ నూరు యోజనముల విస్తీర్ణము కల సముద్రము దాటగల సమర్ధత ఉంది?" అని పలికి అందరి వంకా చూచాడు.

వానరులలో ఎవరూ మాట్లాడలేదు. అంతా మౌనంగా ఉన్నారు. మరలా అంగదుడు ఈ విధంగా అన్నాడు. "మీరంతా ఎందుకు ఊరుకున్నారు. ఎవరూ ఎందుకు ముందుకు రావడం లేదు. మీరంతా సామాన్యులు కారు. ఇదివరకు ఎన్నో ఘనకార్యాలు సాధించారు. మీరంతా వీరులు, పరాక్రమ వంతులు. మీకు సాటిరాగల వారు ఈ లోకంలో లేరు. కాబట్టి ఎవరెవరు ఎంతెంత దూరము ఎగరగలరో చెప్పండి!" అని అడిగాడు అంగదుడు.

శ్రీమద్రామాయణము

కిష్కింధా కాండము అరువది నాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

అరువది ఐదవ సర్గ.

తరువాత ఒక్కొక్కరూ లేచారు. తమ తమ బలాబలాల గురించి చెప్పసాగారు. గజుడు అనే వానరుడు లేచి నేను పది యోజనముల దూరము ఎగురగలను అని అన్నాడు. గవాక్షుడు నేను ఇరువది యోజనముల దూరము ఎగురగలను అని అన్నాడు. శరభుడు ముప్పది యోజనములు, ఋషభుడు నలుబది

యోజనములు, గంధమాధనుడు యాభైయోజనములు, మైందుడు అరువది యోజనములు, ద్వివిదుడు డెబ్బది యోజనములు, సుషేణుడు ఎనుబది యోజనములు ఎగురగలము అని వరుసగా లేచి చెప్పారు. వారు చెప్పినది అంతా విన్న జాంబవంతుడు లేచి ఇలా అన్నాడు.

"ఇదివరకు నేను కూడా ఎంతో కొంత ఎగురగలను. కానీ ఇప్పుడు వార్ధక్యములో ఉన్నాను. అందుకని ఎగురలేను. కాని ఇది రామ కార్యము. సుగ్రీవుని ఆజ్ఞ. కాబట్టి ఏదో ఓపిక చేసుకొని నేను తొంబది యోజనములు ఎగురగలను. పూర్వము నాకు ఇంకా ఎగిరే శక్తి ఉండేది. పూర్వము బలి చక్రవర్తి చేసిన యజ్ఞములో, బలి చక్రవర్తి త్రివిక్రమునికి మూడు అడుగులు దానం ఇచ్చాడు. ఆ త్రివిక్రముని చుట్టు నేను ప్రదక్షిణం చేసాను. అప్పుడు అంత శక్తి ఉండేది. వార్ధక్యము వలన నా శక్తి అంతా తగ్గిపోయింది. కాని కేవలము తొంబది యోజనములు ఎగరడం వలన రామ కార్యము సిద్ధించదు కదా! " అని అన్నాడు, జాంబవంతుడు.

తరువాత అంగదుడు లేచాడు. "నేను మంచి యవ్వనములో ఉన్నాను. నాకు నూరుయోజనములు దూకే శక్తి ఉంది. కానీ తిరిగి రావడానికి నా శక్తి చాలుతుందో లేదో తెలియడం లేదు. " అని అన్నాడు అంగదుడు.

అంగదుని మాటలు విన్న జాంబవంతుడు ఇలా అన్నాడు. "అంగదా! నీ శక్తి నాకు తెలియదా! నీకు అమోఘమైన శక్తి ఉంది. నీవు

నూరు కాదు ఇంకా ఎక్కువ దూరము ఎగుర గలవు తిరిగి రాగలవు. కాని నీవు మా నాయకుడవు. మాకు మార్గదర్శకుడవు. నీవు మమ్ములను ఆజ్ఞాపించాలి కానీ నీవు కార్య రంగములోకి దిగకూడదు. నిన్ను పంపడం మంచి పద్ధతి కాదు. మేమందరమూ కలిసి నిన్ను రక్షించుకోవాలి కానీ, నిన్ను ప్రమాదములోని నెట్టకూడదు. నీవు లేకపోతే మాకు ఆజ్ఞలు ఇచ్చే వాళ్లు ఎవరు? మూలము స్థిరముగా ఉన్నప్పుడే కదా చెట్టుకు మంచి ఫలములు కాస్తాయి. మా నాయకుడివి నీవు క్షేమంగా ఉంటేనే మేము రామ కార్యమును చేయగలుగుతాము. కాబట్టి నీవు వెళ్లకూడదు. "అని పలికాడు జాంబవంతుడు.

ఆ మాటలు విన్న అంగదుడు ఇలా అన్నాడు. "జాంబవంతా! అందరి కంటే ఎక్కువ దూరం ఎగురగలిగిన వాడను నేనే కదా. నేనూ వెళ్లక, ఇతర వానరులూ వెళ్లక పోతే, రామ కార్యము ఎలా సఫలము కాగలదు. అటువంటప్పుడు మనకు మరలా మరణమే శరణ్యము. మనము సీతజాడ తెలుసుకొని వెళితే సుగ్రీవుడు మనలను ఆదరిస్తాడు. వట్టిచేతులతో వెళితే మనమీద ఆగ్రహిస్తాడు. నీవు అన్నీ తెలిసిన వాడవు. మా అందరికంటే వయస్సులో పెద్దవాడవు. ఈ పరిస్థితులలో ఏమి చెయ్యాలో నీవే నిర్ణయించు." అని అన్నాడు అంగదుడు.

ఆ మాటలు విన్న జాంబవంతుడు ఇలా అన్నాడు. "అంగదా! రామ కార్యము గురించి నీవు దిగులు చెందనవసరము లేదు. రామ కార్యము సాధించగల వానిని నేను ఉత్సాహపరుస్తాను. ఉద్యుక్తుడిని చేస్తాను. ." అని అన్నాడు.

వానరులందరూ తమ బలాబలముల గురించి చెబుతూ ఉంటే హనుమంతుడు దూరంగా కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు. జాంబవంతుడు దూరంగా కూర్చుని ఉన్న హనుమంతుని వద్దకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము అరువది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము
అరువది ఆరవ సర్గ.

జాంబవంతుడు దూరంగా కూర్చుని ఉన్న హనుమంతుని వద్దకు వెళ్లాడు. హనుమ పక్కనే కూర్చుని ఇలా అన్నాడు. "హనుమా! ఇక్కడ ఉన్న వానరులలో కెల్లా వీరుడవు నీవే కదా. పైగా సమస్త శాస్త్రములు చదివినవాడవు. అందరూ వారి బలాబలాలు గురించి చెబుతూ ఉంటే నీవు ఏంటి ఇలా ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తున్నావు.

ఓ హనుమా! నీ గురించి నీకు సరిగా తెలియదు. నీవు తేజస్సులోనూ, బలంలోనూ, పరాక్రమం లోనూ రామలక్ష్మణులతోనూ, రాజైన సుగ్రీవునితోనూ సమానుడవు. పక్షులలో కెల్లా గరుడుడు ఉత్తముడు. ఆ గరుత్మంతుడు సముద్రము మీద ఎగురుతూ సముద్రగర్భములో ఉన్న పెద్ద పెద్ద పాములను పైకి లాగడం నేను ప్రత్యక్షంగా చూచాను. గరుత్మంతుని రెక్కలకు ఎంత బలమూ, శక్తి

ఉన్నాయో నీ భుజాలకు కూడా అంతే శక్తి, బలం ఉన్నాయి. బలంలో కానీ ఎగిరే శక్తిలో కానీ నీవు గరుడునికి ఏ మాత్రం తీసిపోవు. ఇది నిజం.

నీ తల్లి సామాన్యురాలు కాదు. నీ తల్లి పుంజికస్థల అనే అప్సరస. పుంజికస్థలకు అంజన అనే పేరుకూడా ఉంది. ఆమె శాప వశమున కుంజరుడు అనే వానర ప్రభువుకు కుమార్తెగా వానర స్త్రీగా జన్మించింది. ఆమె వానర స్త్రీగా జన్మ ఎత్తినా, మనుష్య రూపముతోనే లోకోత్తర సుందరిగా ప్రకాశించింది. కేసరి అను వానరుని వివాహమాడింది.

ఒక నాడు ఆమె పర్వత శిఖరము మీద విహరిస్తూ ఉంది. వాయుదేవుడు మంద్రంగా వీస్తున్నాడు. ఆ సున్నితమైన గాలికి ఆమె వేసుకున్న పమిట తొలగిపోయింది. అప్పుడు వాయు దేవుడు ఆమెను, ఆమె అంగాంగ సౌందర్యమును చూచి మోహించాడు. వాయు దేవునిలో కామ వాంఛ తలెత్తింది. వాయుదేవుడు ఆమెను కౌగలించు కున్నాడు.

అప్పుడు ఆమె భయపడింది. "ఎవరు వాడు! నా పాతివ్రత్యమును భంగపరచు వాడు ఎవరు?" అని అడిగింది.

"అంజనా! నేను వాయుదేవుడను. నిన్ను ఏమీ చేయను. భయపడకు. నేను నిన్ను కౌగలించుకున్నాను. నా మనస్సులో నిన్ను కోరుకున్నాను. మానసికంగా నీతో సంగమించాను. నీ పాతివ్రత్యము నకు భంగము కలగ కుండా, నా వలన నీకు ఒక కుమారుడు

జన్మిస్తాడు. నా కుమారుడు నాతో సమానమైన పరాక్రమము వేగము కలవాడు. ఎగరడంలో, దుమకడంలో నాతో సమానమైన బలపరాక్రమములు కలవాడు." అని అన్నాడు.

తరువాత వాయుదేవుడు వెళ్లిపోయాడు. నీ తల్లి అంజన పక్కనే ఉన్న ఒక గుహలో నిన్ను ప్రసవించింది. పుట్టగానే నీకు అమిత మైన బల పరాక్రమములు వాయువుతో సమానమైన వేగము సంక్రమించాయి. అప్పుడే సూర్యుడు తూర్పుదిక్కున ఉదయిస్తున్నాడు. నీ తల్లి నీకు బాలసూర్యుడిని చూపించింది. బాలసూర్యుని చూచి నీవు ఫలము అనుకున్నావు. బాలసూర్యుని పట్టుకొనవలెనని నీవు ఆకాశం లోకి ఎగిరావు. నీవు మూడు వందల యోజనముల దూరము ఎగిరావు. సూర్యుని తేజస్సు నిన్ను ఆక్రమించింది. కాని నీవు భయపడలేదు. అలా ఎగురుతూనే ఉన్నావు.

సూర్యుని మీదికి వెళుతున్న నిన్ను చూచి ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని నీ మీద ప్రయోగించాడు. ఆ వజ్రాయుధము నీ ఎడమ వైపు గడ్డానికి తగిలింది. అక్కడ నీ గడ్డము కొంచెము పగిలింది. అందువలన నీకు హనుమంతుడు అనే పేరు సార్ధకము అయింది.

నిన్ను ఇంద్రుడు తన వజ్రాయుధముతో కొట్టడం చూచాడు వాయుదేవుడు. తన కుమారుని కొట్టాడు అన్న కోపంతో ముల్లోకము లలో వాయువును బంధించాడు. మూడు లోకములు గాలి లేక అల్లల్లాడిపోయాయి. అప్పుడు దేవతలందరూ వాయుదేవుని ప్రార్ధించారు. బ్రహ్మదేవుడు కూడా నీ తండ్రి వాయుదేవుని వద్దకు

వచ్చాడు. నీకు ఏ అస్త్రములతో కానీ, శస్త్రములతో కానీ చావులేకుండా నీకు వరం ఇచ్చాడు. నీకు వజ్రాయుధముతో కూడా ఎలాంటి అపకారము జరగలేదు కాబట్టి, నువ్వు కోరినపుడు నీకు మరణం వచ్చేట్టు వరం ప్రసాదించాడు.

నీవు కేసరికి క్షేత్రజ న్యాయమున పుత్రుడవు. కాని వాయుదేవునికి ఔరస పుత్రుడవు. మహా బలవంతుడవు. వాయుదేవునితో సమానమైన బలము, వేగము కల వాడవు. ప్రస్తుతము మా అందరిలోకీ బలవంతుడివి, పరాక్రమ వంతుడివి, వేగముగా ఎగురగలవాడివి నీవు ఒక్కడివే. కాబట్టి నీవు విజృంభించు. సముద్రాన్ని దాటు. సీతను చూడు. మాకందరికీ మేలు చేకూర్చు. నీ వేగము పరాక్రమము చూడాలని మా అందరికీ కోరికగా ఉంది. హనుమంతా! అంజనీ పుత్రా! లే! నీ శక్తిని చూపించు. సముద్రాన్ని లంఘించు." అని హనుమంతుని జాంబవంతుడు ఉత్సాహపరిచాడు.

జాంబవంతుని మాటలతో హనుమంతుడు పొంగిపోయాడు. తనేమిటో తన శక్తి ఏమిటో తెలుసుకున్నాడు. తన శరీరాన్ని పెంచాడు. అలా పెరిగిపోతున్న హనుమంతుని చూచి వానరులందరూ జయజయధ్వానాలు చేసారు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము అరువది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

కిష్కింధా కాండము

అరువది ఏడవ సర్గ.

హనుమంతునికి తాను నూరు యోజనముల దూరము ఎగరాలని తెలుసు. అందుకు తగ్గట్టు తన శరీరాన్ని పెంచాడు. వేగాన్ని అందుకోడానికి ముందుకు దూకబోతున్నాడు. త్రివిక్రముని వలె ప్రకాశిస్తున్న హనుమంతుని చూచి వానరులు హర్షధ్వానాలు చేసారు. ఆనందంతో పెద్దగా అరుస్తున్నారు.

హనుమంతుడు కూడా సంతోషంతో తన తోకను విదిలించాడు.  ఒక్కసారి ఆవులించాడు. తన కన్నా పెద్దవారికి నమస్కరించాడు.

"నా తండ్రి వాయుదేవుడు తన బలముతో పర్వతశిఖరములను కూడా ఎగురగొట్టగలడు. నేను వాయుదేవుని ఔరస పుత్రుడను. ఎగరడంలో ఆయనకు సమానుడను.  మేరు పర్వతము చుట్టు  లెక్కలేనన్ని సార్లు చుట్టిరాగలను. ఈ సముద్రమును అవలీలగా దాటగలను. నేను ఎగిరే వేగానికి సముద్రములో ఉన్న జలచరములు అన్నీ పైకి లేస్తాయి. నేను కూడా గరుడుని కన్నా అత్యంత  వేగంగా ఎగురగలను. సూర్యోదయము అయిన తరువాత నేను సూర్యుని వద్దకు వెళ్లి, భూమి మీదకు వచ్చి మరలా సూర్యాస్తమయము లోపు ఆయనకు ఎదురు వెళ్లగలను. ఆకాశంలో ఎగిరే అన్ని పక్షులను అధిగమించగలను. భూమిని బద్దలు కొట్టగలను. సర్వతములను పడగొట్టగలను. మహాసముద్రములనే దాటగలను. నేను ఎగిరే వేగానికి వృక్షములు లతలు

కిందపడిపోతాయి.

ఓ వానరులారా! ఆకాశాన్ని మింగుతూ ఎగురుతున్న నన్ను మీరు కనులారా చూడండి. నేను మేఘములను ఎగురగొడుతూ ఎగురుతాను. నేను ఎగిరేటప్పుడు నన్ను నా తండ్రి వాయువు, గరుత్మంతుడు తప్ప ఇంకెవరూ నన్ను అనుసరించలేరు. నేను నూరుయోజనములు కాదు, పదివేల యోజనముల దూరము కూడా ఎగురగలను అని అనుకొంటున్నాను. నేను దేవేంద్రుని ఓడించి అమృతమును తేగలను. లంకా పట్టణమునే పెకలించి తేగలను." అని ఆత్మవిశ్వాసంతో పలుకుతున్న హనుమంతుని చూచి వానరులు, జాంబవంతుడు సంతోషంతో హర్షధ్వానాలు చేసారు. వారు కూడా హనుమంతుని కీర్తించడం మొదలెట్టారు.

"ఓ హనుమంతా! వీరుడా! కేసరీ కుమారుడా! వేగవంతుడా! మారుతాత్మజుడా! నీవే ఈ పనిచేయగల సమర్థుడవు. మా శోకమును పోగొట్టగల వీరుడవు. మేము నీ శుభాన్ని కోరుతున్నాము. నీ క్షేమం కొరకు ఆ భగవంతుని ప్రార్థిస్తాము. మహాఋషుల అనుగ్రహముచేతా, పెద్ద వారైన వానరుల ఆశీర్వచనములచేతా నీవు సముద్రమును దాటగలవు. నీవు వచ్చువరకూ మేము ఒంటి కాలిమీద నిలబడి నీ రాక కొరకు ఎదురుచూస్తుంటాము. శుభంగా వెళ్లిరా!" అని హనుమంతుని స్తుంతించారు వానరులు.

హనుమంతుడు ఆ వానరులతో ఇలా అన్నాడు. "ఓ వానరవీరులారా! మీ అందరి శుభాశీస్సులతో నేను ఈ సముద్రాన్ని అవలీలగా లంఘిస్తాను. నా వేగాన్ని ఎవరూ తట్టుకోలేరు. నేను ఎత్తైన

ఈ మహేంద్రపర్వతము మీద ఎక్కి ఎగురుతాను. నా వేగానికి ఈ పర్వతము కదిలిపోతుంది." అని మిక్కిలి ఆత్మవిశ్వాసంతో అన్నాడు.

తరువాత హనుమంతుడు మహేంద్రపర్వతము మీదికి ఎక్కాడు. తన కాళ్లతో మహేంద్రపర్వతశిఖరమును తన్నాడు. మహా వేగంతో పైకి లేచాడు. ఆ వేగానికి తట్టుకోలేక మహేంద్ర పర్వతము మీద ఉన్న వృక్షములు కూలిపోయాయి. జంతువులు భయపడి పరుగెత్తిపోయాయి. బండరాళ్లు కిందికి దొర్లాయి.

హనుమంతుడు లంకవైపుకు సాగిపోయాడు.

శ్రీమద్రామాయణము
కిష్కింధా కాండము అరవై ఏడవ సర్గ సంపూర్ణము.
కిష్కింధా కాండ సర్వం సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్రామాయణము

## సుందర కాండము

సంస్కృత మూలము

భగవాన్ వాల్మీకి మహర్షి

తేటతెలుగులో

మొదలి వెంకట సుబ్రహ్మణ్యం

2-31, చైతన్యపురి,

హైదరాబాదు 500060

ఫో: 24048104

సెల్: 9391134792

ఇప్పుడు మనము రామాయణంలో సుందర కాండములో ప్రవేశించబోతున్నాము. ఈ కాండను సుందర కాండ అని ఎందుకు అన్నారో చాలా మంది పండితులు రకరకాలుగా విశ్లేషించారు. వాటిని మీరు చదివే ఉంటారు. కాబట్టి మనం ఈ కాండమునకు సుందర కాండము అని ఎందుకు పేరు వచ్చింది అనే విషయం మీద చర్చిండం లేదు.

ఈ సుందర కాండమును చాలా మంది పారాయణం చేస్తుంటారు. కొంత మంది స్వయంగా పారాయణం చేస్తారు. ఇంకొంత మంది పండితుల చేత పారాయణం చేయించి వింటూ ఉంటారు. కాని మనం స్వంతంగా పారాయణం చేస్తే వచ్చే ఫలితం వేరుగా ఉంటుంది.

కాని సుందర కాండము వాల్మీకి సంస్కృతంలో శ్లోకరూపంలో రచించాడు. పారాయణం చేస్తే శ్లోక రూపంలోనే చెయ్యాలి అని కొందరు అంటుంటారు. కాని ఇక్కడ చదవడం కన్నా చదివి అర్థంచేసుకోవడం, అర్థం చేసుకున్నదాన్ని ఆచరిచండం ముఖ్యం అని నా అభిప్రాయము. సుందర కాండము మనము పారాయణం చేసి ఏమి నేర్చుకున్నాము. సుందర కాండము లో ఉన్న విషయములను మనము నిజజీవితంలో ఎలా అమలుపరుస్తున్నాము అనేది ముఖ్యం కానీ యాంత్రికంగా పారాయణం చెయ్యడం కాదు. కాబట్టి సుందర కాండములో మనకు ఉపయోగించే విషయాలు ఏమి ఉన్నాయి అనే విషయం చర్చించుకుందాము. మీరు సుందర కాండము చదువుతున్నప్పుడు ఈ క్రింది విషయాలు ఎక్కడెక్కడ పొందు పరచబడ్డాయిఅనే విషయాన్ని  మీరు అవగాహన చేసుకోవాలి.

# సుందర కాండము

సుందర కాండము శ్రద్ధగా చదివితే మనకు కొన్ని విషయాలు ద్యోతకము అవుతాయి.

నిరాశా, నిస్పృహలకు లోనైన మనిషిని పునరుజ్జీవితుణ్ణి చేస్తుంది సుందర కాండము.

మానసికంగా బలహీనమైన వాడిని మానసికంగా బలోపేతుణ్ణి చేస్తుంది సుందర కాండము.

కేవలం పురుష ప్రయత్నం చాలదు. దైవయత్నం కూడా ఉండాలి. అలాగని, కేవలం దైవప్రార్థన చాలదు. మానవ ప్రయత్నం కూడా ఉండాలి. పురుష ప్రయత్నము, దైవయత్నము కలిస్తేనే కార్యసిద్ధి కలుగుతుంది అని చాటి చెప్పినది సుందర కాండము.

మనం చేసే కార్యంలో చిత్తశుద్ధి ఉంటే, మన ప్రమేయం లేకుండానే మనకు బయట నుండి సాయం అందుతుంది అని మనకు తెలియజేసేది సుందర కాండము.

మన సమస్యకు పరిష్కారము ఎదురుగా ఉన్నా, మన మనస్సు కల్లోలంగా ఉన్నప్పుడు ఆ పరిష్కారం మనకు కనపడదు. నిర్మలమైన మనస్సుతో ఆలోచిస్తే, ఓస్ ఇంతేనా అని అనిపిస్తుంది, పరిష్కారం కట్టెదుట కనపడుతుంది అని బోధించింది సుందర కాండము.

జీవితంలో ఎన్ని కష్టాలు వచ్చినా, తాను నమ్మిన ధర్మానికి కట్టుబడి ఉంటే, జయం మనదే అవుతుంది అని నిరూపించింది సుందర కాండము.

ఏ సమస్యనైనా ధైర్యంగా ఎదుర్కొంటే, మనకు సాయం చేసేవాళ్లు మనకు కనపడకుండా మన పక్కనేఉండి సాయం చేస్తుంటారు అని తెలియజేసేది సుందర కాండము.

కోపం అన్ని అనర్థాలకు మూలము, కోపంలో ఏమి చేస్తున్నామో తెలియకుండా చేసేస్తాము తుదకు దు:ఖాలపాలవుతాము అని బోధించేది సుందర కాండము.

మనిషికి ఎంత శారీరక బలం ఉన్నా, దానికి బుద్ధిబలం తోడైతేగాని రాణించదు అన్న విషయాన్ని తెలియజెప్పేది సుందర కాండము.

ఎన్ని శివపూజలు చేసినా, ఎంతటి నిష్టాగరిష్టుడైనా, గుణగణాలు మంచివి కాకపోతే ఆ శివపూజలు అతనిని రక్షించలేవు, అతనికి పతనం తప్పదు అని నిరూపించినది సుందర కాండము.

ఎవరి శక్తి వారికి తెలియదు. ప్రతి మనిషిలోనూ అంతర్గతంగా అపారమైన శక్తి ఉంటుంది. ఆ శక్తి ఒక్కొసారి తనంతట తానే బహిర్గతమవుతుంది. మరి కొన్ని సందర్భాల్లో ఇతరులు చెబితేనే గానీ బయట పడదు. కాబట్టి పెద్దవారి మాటలు, మన శ్రేయోభిలాషుల మాటలు శ్రద్ధగా విని, ఆచరించి, మనశక్తి యుక్తులను సమర్థవంతంగా వినియోగించుకోవాలి అని చాటి చెప్పినది సుందర కాండము.

ఇలా చెప్పుకుంటూ పోతే సుందర కాండలో మన దైనందిన జీవితానికి ఉపయోగపడని విషయం ఒక్కటీ లేదు అని చెప్పవచ్చు. అందుకే సుందర కాండమును పారాయణం చెయ్యడమే కాదు, అర్థం చేసుకొని ఆచరణలో పెట్టినపుడే పారాయణం చేసిన దానికి సార్థకత అని మరొక సారి మనవిచేసుకుంటున్నాను.

మీరు నేను రాయబోయే సుందర కాండ వచనమును పారాయణ చెయ్యదలచుకుంటే ఈ క్రింది ప్రార్థనా శ్లోకములు చదివి ప్రారంభించండి.

# సుందర కాండము

## గణపతి ప్రార్థన:

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే
అగజాననపద్మార్కం గజాననమహర్నిశమ్
అనేకదం తం భక్తానామేకదంతముపాస్మహే॥

## సరస్వతీ ప్రార్థన:

యా కుందేందుతుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకరప్రభృతిభిర్దేవై: సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా॥

## వాల్మీకి ప్రార్థన:

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్

## హనుమంతుని ప్రార్థన:

గోష్పదీకృవారాశిం మశకీకృతరాక్షసమ్
రామాయణమహామాలారత్నం వందే అనిలాత్మజమ్
మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

## శ్రీరామ ప్రార్థన:

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్
అగ్రేవాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్య: పరం
వ్యాఖ్యాతం భరతాదిభి: పరివృతం రామం భజే శ్యామలం॥
నమోస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యై చ తస్యై జనకాత్మజాయై
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్య:

# శ్రీమద్రామాయణము

## సుందర కాండము

## మొదటి సర్గ.

జాంబవంతుని ప్రేరణతో, వానర వీరులు ఇచ్చిన ప్రోత్సాహంతో, అమితమైన ఉత్సాహంతో, హనుమంతుడు ఆకాశవీధిన లంకకు పోవడానికి నిశ్చయించుకున్నాడు. తన మెడను ముందుకు చాచాడు. తల పైకి ఎత్తాడు. ఆకుపచ్చని రంగులో ఉన్న హనుమంతుడు వైడూర్యము వలె ప్రకాశిస్తున్నాడు.

హనుమంతుడు ఎగరడానికి ఆయత్తమైన మహేంద్ర పర్వతము మీద ఎంతో మంది యక్షులు, కిన్నరులు, గంధర్వులు, నాగులు నివసిస్తున్నారు. వారే కాకుండా సింహములు, ఏనుగులు, పెద్దపులులు కూడా ఆ పర్వతము మీద  స్థిరనివాసము ఏర్పరచు కున్నాయి.

ఆకాశంలోకి ఎగరడానికి ముందు హనుమంతుడు తూర్పు దిక్కుగా తిరిగి,  బ్రహ్మదేవునికి, దేవేంద్రునికి, తన తండ్రి వాయు దేవునకు, ప్రత్యక్షదైవము సూర్యభగవానుడికి, సమస్తదేవతలకు భక్తిపూర్వకంగా నమస్కరించాడు.  తరువాత దక్షిణ దిక్కుగా తిరిగి లంకాద్వీపమునకు పోవుటకు తన శరీరమును పెంచాడు. అక్కడ ఉన్న వానర వీరులు, వానరులు అందరూ హనుమంతుని వంక కళ్లప్పగించి చూస్తున్నారు.

వీలైనంత పెద్దదిగా తన శరీరాన్ని పెంచాడు హనుమంతుడు. తన చేతులను, కాళ్లను పర్వత శిఖరము మీద తొక్కిపట్టాడు. హనుమంతుడు తన బలమంతా ఉపయోగించి మహేంద్ర పర్వత శిఖరమును తొక్కిపట్టడంతో ఆ పర్వతము ఊగిపోయింది. దాని మీద ఉన్న జంతువులు, భూకంపము వచ్చినది అనే భ్రమతో, అన్నీ కకావికలై అటు ఇటు పరుగులు తీసాయి. ఆ జంతువుల వికృతమైన అరుపులతో ఆ పర్వతము ప్రతిధ్వనించింది. విష సర్పాలు అన్నీ భయపడి విషాన్ని కక్కాయి. చెట్లనుండి పూలు జలా జలా రాలాయి. పెద్ద పెద్ద బండరాళ్లు కిందికి దొర్లాయి. మరి కొన్ని రాళ్లకు బీటలు ఏర్పడ్డాయి.

ఆ పర్వతము మీద తపస్సు చేసుకుంటున్న మునులు, ఆ ఉత్పాతాలకు భయపడి ఆశ్రమాలు విడిచిపెట్టి పారిపోయారు. అప్పటిదాకా తమ తమ ప్రియురాళ్లతో, మద్యపానము చేస్తూ ఆనందిస్తున్న విద్యాధరులు, ఆఉత్పాతాలు చూచి, పాన పాత్రలు అక్కడే పడవేసి, తమ తమ ప్రియురాండ్రతో పారిపోయారు.

దేవతలు, విద్యాధరులు, మహర్షులు, చారణులు,సిద్ధులు ఈ చోద్యాన్ని చూడటానికి ఆకాశంలో బారులు తీరారు. ఆకాశంలో నిలబడిన వారంతా ఇలా అనుకుంటున్నారు. “అహెూ ఏమి ఆశ్చర్యము. రామ కార్యము కొరకు హనుమంతుడు ఎవరూ చేయలేని సాహసం చేస్తున్నాడు. నూరుయోజనముల సముద్రమును లంఘించు చున్నాడు.” అని తమలో తాము అనుకుంటున్నారు.

అలా నిలబడ్డ హనుమంతుడు ఒక్కసారి భయంకరంగా గర్జించాడు. తన తోకను గట్టిగా విదిలించాడు. హనుమంతుని తోక నిటారుగా నిలబడింది. హనుమంతుడు తన చేతలను గట్టిగా బిగించాడు. పాదములను ఎగరడానికి సిద్ధంగా ఉంచాడు. తన భుజములను మెడను ముందుకు వంచాడు. చూపు తన వెళ్లవలసిన ఆకాశ మార్గము వైపు నిలిపాడు. ఎటు వైపు ఎగరాలో నిర్ణయించుకున్నాడు. ఆకాశం వంక చూస్తూ తన ఊపిరిని స్తంభింపజేసాడు. హనుమంతుని చెవులు రిక్కపొడుచుకున్నాయి.

హనుమంతుడు వానరులను చూచి ఇలా అన్నాడు. "నేను రాముని ధనుస్సునుండి వెడలిన బాణము మాదిరి లంక వైపుకు ఎగిరిపోతాను. లంకలో సీత కనపడకపోతే అటునుంచి అటే స్వర్గలోకమునకు వెళతాను. స్వర్గలోకంలో కూడా సీత జాడ తెలియకపోతే, ఆ రావణుని కట్టి తెచ్చి రాముని పాదముల మీద పడవేస్తాను. నేను వెళ్లి రామ కార్యమును సాధించుకొని వస్తాను. సీతతో వస్తాను. లేకపోతే రావణుని బంధించి తెస్తాను. అదీ కాకపోతే లంకను కూకటి వేళ్లతో పెకలించి తీసుకొని వస్తాను. ఇదే నా నిశ్చయము" అని పలికాడు.

హనుమంతుడు తన కాళ్లను పర్వతశిఖరము మీద తన్నిపెట్టి పైకి ఎగిరాడు. ఆ సమయంలో తాను గరుత్మంతుడు అని అనుకొన్నాడు హనుమంతుడు. హనుమంతుడు పైకి ఎగిరిన వేగానికి మహేంద్ర పర్వతము మీద ఉన్న పెద్ద పెద్ద వృక్షములు కూకటి వేళ్లతో సహా పైకి ఎగిరి అల్లంత దూరంలో పడ్డాయి. హనుమంతుని వేగానికి పెకలింప బడ్డ వృక్షాలు ఎగిరి సముద్రంలో పడ్డాయి. ఆ వృక్షముల

నుండి రాలిన పూలు ఆకాశంలో చెల్లాచెదరుగా ఎగురుతూ నేలమీద రాలుతున్నాయి.

హనుమంతుడు ఆకాశంలో దూసుకుపోతుంటే, ఆకాశాన్ని మింగుతున్నాడా అన్నట్టు కనపడుతూ ఉంది. హనుమంతుడు తన రెండు చేతులూ ముందుకు, రెండు కాళ్లు వెనక్కు, చాచి, తోక పై కి ఎత్తి దూసుకుపోతంటే, ఐదుతలలతో ఉన్న మహాసర్పము ఆకాశంలో ఎగురుతూ ఉన్నదా అని భ్రమకలికిస్తూ ఉంది. నిప్పుకణముల మాదిరి మండుతున్న హనుమంతుని కళ్లు సూర్యచంద్రుల మాదిరి ప్రకాశిస్తున్నాయి. హనుమంతుడు ఎగురుతుంటే, హనుమంతుని పొడవాటి తోక పైకి లేచి నిటారుగా నిలబడి ఇంద్రుని ధ్వజము మాదిరి ప్రకాశిస్తూ ఉంది.

సముద్రము మీద హనుమంతుడు మహావేగంతో ఎగురుతూ ముందుకు దూసుకుపోతుంటే, కిందకు నెట్టబడిన గాలి జంఝామారుతంలాగా పెద్దగా ధ్వని చేస్తూ ఉంది. ఆకాశంలో ఎగురుతున్న హనుమంతుడు చూచేవారికి పెద్ద కాంతి పుంజము మాదిరి కనపడుతున్నాడు. సముద్రము మీద ఆకాశంలో హనుమంతుడు ఎగురుతుంటే ఆయన నీడ కూడా సముద్రము నీటి మీద అదే వేగంతో అనుసరిస్తూ ఉంది. హనుమంతుని నీడ ముప్పది యోజనముల పొడవు, పదియోజనముల వెడల్పు కలిగి ఉంది.

మహావేగంతో హనుమంతుడు సముద్రము మీద ఎగురుతుంటే ఆ వేగానికి సముద్రము అలలు ఉవ్వెత్తున లేచి కిందపడుతున్నాయి. సముద్రపు నీటి అలలతో పాటు ఆ సముద్రములో

ఉన్న జలచరములు కూడా పైకి లేస్తున్నాయి. హనుమంతుడు సముద్రము మీద ఎగురుతుంటే మహేంద్రపర్వతము రెక్కలు వచ్చి ఆకాశంలో ఎగురుతూ ఉందా అన్నట్టు చూచేవారికి భ్రమకలుగుతూ ఉంది. సముద్రజలముల మీద హనుమంతుడు ఏ ప్రాంతంలో ఎగురుతుంటే, ఆ ప్రాంతంలో జలము సుడులు తిరుగుతూ ద్రోణి ఏర్పడుతూ ఉంది. తనకు అడ్డం వచ్చిన మేఘాలను చీల్చుకుంటూ పోతున్న హనుమంతుడు, మబ్బుల్లో చంద్రుడి మాదిరి ప్రకాశిస్తున్నాడు. హనుమంతుని ప్రయాణాన్ని ఆశ్చర్యంతో తిలకిస్తున్న దేవతా గణాలు, హనుమంతుని మీద పూలవాన కురిపించారు.

హనుమంతునికి ఎక్కడ వేడి తగులుతుందో అని సూర్యుడు తన కిరణాల తీవ్రతను తక్కువ చేసాడు. వాయుదేవుడు కూడా హనుమంతుడు వెళ్లే దిశకు అనుకూలంగా వీస్తున్నాడు. రామకార్యము నిమిత్తము తన మీదుగా ఎగురుతున్న హనుమంతుని చూచిన సముద్రుడు ఇలా అనుకున్నాడు. “ఇప్పుడు నేను హనుమంతునికి సాయం చెయ్యకపోతే అందరూ నన్ను తప్పు పట్టడానికి అవకాశము ఇచ్చిన వాడిని అవుతాను. రాముడు పుట్టిన ఇక్ష్వాకు వంశము వాడైన సగర చక్రవర్తి వల్లనే కదా సముద్రములు ఏర్పడినవి. నూరుయోజనములు ఎగరాలంటే సామాన్యము కాదు. హనుమంతుడు ఎగిరి ఎగిరి అలసి పోతాడు. హనుమంతునికి కొంత విశ్రాంతి అవసరము. కొంచెం సేపు విశ్రాంతి తీసుకున్న తరువాత మరలా హనుమంతుడు రెట్టించిన బలంతో ఎగురగలడు.” అని ఆలోచించాడు.

వెంటనే సముద్రుడు తనలో మునిగి ఉన్న బంగారముతో నిండిన మైనాక పర్వతమును చూచి ఇలా అన్నాడు. "ఓ పర్వత రాజమా! పాతాళంలో దాగి ఉన్న అసురులు పైకి రాకుండా దేవేంద్రుడు నిన్న పాతాళ ద్వారానికి అడ్డుగా నిలిపాడు. నీవు పాతాళ ద్వారమును మూసివేసి అడ్డుగా నిలబడి ఉన్నావు. నీకు పైకి లేచే శక్తి ఉంది. కొంచెంగా ఎగుర గలవు. ఇక్ష్వాకు వంశమునకు చెందిన రాముని కార్యము నిమిత్తము హనుమంతుడు సముద్రం మీద ఎగురుతూ నీవు ఉన్న ప్రదేశము మీదుగా వస్తున్నాడు. మనకు ఆయనకు సాయం చెయ్యాలి. కాబట్టి నీవు నిటారుగా పైకి లేచి, నీ మీద హనుమంతుడు కాసేపు విశ్రాంతి తీసుకొనేట్టు చెయ్యి. నీ శిఖరము మీద కాసేపు విశ్రాంతి తీసుకొని మరలా హనుమంతుడు లంక వైపు సాగిపోగలడు. ఇది మనము చేయవలసిన పని. చేయవలసిన పని చేయకపోతే అది అధర్మము అవుతుంది. కాబట్టి హనుమంతుడు నీ స్వర్ణ శిఖరము మీద నిలబడటానికి వీలుగా నీవు సముద్రజలాల నుండి పైకి లేచి నిలబడు. హనుమంతుడు నీ మీద కొంచెం సేపు విశ్రాంతి తీసుకోగలడు." అని అన్నాడు.

సముద్రుని మాటలు మన్నించాడు మైనాకుడు. సముద్ర గర్భంలో ఉన్న మైనాక పర్వతము నీటిని ఛేదించుకుంటూ పైకి లేచింది. నట్టనడిసముద్రములో నిలబడింది. స్వర్ణ శిఖరములతో ప్రకాశిస్తున్న ఆ పర్వత రాజము ఉదయించు చున్న సూర్యుమాదిరి ప్రకాశించింది.

తన దారిన తాను వెళుతుంటే ఈ పర్వతము ఏంటి తనకు అడ్డంగా వచ్చి నిలబడింది అని అనుకున్నాడు హనుమంతుడు. తనకార్యమునకు విఘ్నము కలిగించడానికి అలా నిలబడింది అని

అనుకున్నాడు. కాని ఆగలేదు. ఆ పర్వతశిఖరమునకు హనుమంతుని వక్షస్థలము ఢీకొట్టింది. అంత పెద్ద మైనాక పర్వతశిఖరము హనుమంతుని వక్షస్థలము దెబ్బకు ఛిన్నాభిన్నమై పక్కకు పడిపోయింది. హనుమంతుడు ఎగురుతున్న వేగానికి ఆశ్చర్యపోయాడు మైనాకుడు. మనుష్యరూపము దాల్చి హనుమంతుని ఎదుట నిలిచాడు.

"వానరోత్తమా! నా పేరు మైనాకుడు. నేను పర్వత రాజును. నీవు ఇక్ష్వాకు వంశ రాజైన రాముని కార్యము నిమిత్తము లంకకు పోతున్నావని సముద్రునికి తెలుసు. ఇక్ష్వాకు వంశము వారి వలననే కదా సముద్రుడు అభివృద్ధి చెందాడు. కాబట్టి ఇక్ష్వాకు వంశము రాజైన రామునికి ప్రత్యుపకారము చేయవలెనని సముద్రుడు తలిచాడు. అందుకని నన్ను పంపాడు. నీవు నూరు యోజనముల దూరము ప్రయాణిస్తున్నావు. నీకు అలసట కలిగి ఉంటుంది. కాబట్టి కాసేపు నా శిఖరము మీద విశ్రాంతి తీసుకొని వెళ్లు. ఇది సముద్రుని అభిలాష. నా విజ్ఞప్తి.

నీవు తినడానికి కంద మూలములు ఫలములు సిద్ధము చేసాను. వాటిని ఆరగించి కాసేపు విశ్రాంతి తీసుకో. ఈ రోజు నీవు మాకు అతిథివి. అతిథిని సత్కరించడం మా ధర్మము. పైగా నీవు వాయుదేవుని కుమారుడవు. నిన్ను సత్కరిస్తే వాయుదేవుని సత్కరించినట్టే. అదీ కాకుండా, మనకు దగ్గర సంబంధము ఉంది. పూర్వము పర్వతములకు రెక్కలు ఉండేవి. పర్వతములు కూడా గరుడునితోనూ, వాయువుతోనూ సమానమైన వేగముతో ఎగురుతూ ఉండేవి. ఆ ప్రకారంగా పర్వతములు ఎగురుతుంటే కింద ఉన్న ఋషులు, మునులు, దేవతా గణములు, మానవులు, ఇతర

జంతుజాలములు ఆ పర్వతములు ఎక్కడ తమ మీద పడతాయో అని భీతి చెందేవారు. అప్పుడు దేవేంద్రుడు కోపించి పర్వతములకు ఉన్న రెక్కలను తన వజ్రాయుధము తో ఖండించాడు. ఆ ప్రక్రియలో నా రెక్కలు కూడా ఖండించడానికి దేవేంద్రుడు వజ్రాయుధమును చేతబూని వస్తుంటే, నీ తండ్రి వాయుదేవుడు అడ్డు పడి నన్ను దూరంగా తీసుకొని వెళ్లి ఈ సముద్రగర్భంలో దాచి పెట్టాడు. ఆ ప్రకారంగా నేను నా రెక్కలు ఖండింపబడకుండా రక్షింపబడ్డాను. అందువలన వాయుదేవుడు నాకు ప్రాణదాత. ఆ వాయుదేవుని కుమారుడవు నువ్వు. అందుచేత, నువ్వు కూడా నాచేత గౌరవింపతగ్గవాడవు. కాబట్టి నువ్వు మా ఆతిధ్యము స్వీకరించి నన్ను, సముద్రుని సంతోషపెట్టు. మేము చేయుపూజలు అందుకో. నా మీద కొంచెము సేపు విశ్రాంతి తీసుకో." అని వినయంగా పలికాడు మైనాకుడు.

మైనాకుని మాటలు విన్న హనుమంతుడు ఇలా అన్నాడు. "ఓ పర్వత రాజా! నీ ఆతిధ్యమునకు చాలా సంతోషించాను. కాని, ప్రస్తుతము నీ ఆతిధ్యము స్వీకరించలేను. నాకు సమయము మించి పోతూ ఉంది. సీతాన్వేషణలో ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. అందుకని నేను మార్గ మధ్యలో ఎక్కడా ఆగలేను. ఏమీ అనుకోకు" అని అంటూనే తన దారిన తాను ఎగురుకుంటూ వెళ్లాడు హనుమంతుడు. అలా వెళుతున్న హనుమంతుని కార్యదీక్షకు ముగ్ధులయ్యారు మైనాకుడు, సముద్రుడు. హనుమంతునికి తమ ఆశీస్సులు అందించారు.

హనుమంతుడు మైనాక పర్వతమును వదిలి ఆకాశంలోకి ఇంకా ఎత్తుగా ఎగిరాడు. దక్షిణ దిక్కుగా ఆకాశంలో ప్రయాణం చేస్తున్నాడు. ఈ సంగతి విన్న దేవేంద్రుడు కూడా ఎంతో సంతోషించాడు. మైనాకునికి అభయం ఇచ్చాడు. "ఓ మైనాకుడా! నీవు రామకార్యము మీద పోతున్న హనుమంతునికి ఎంతో సాయం చేసావు. నాకు చాలా ఆనందం కలిగింది. ఇంక నా వలన నీకు ఏలాంటి భయము లేదు. నీ ఇష్టం వచ్చినచోట ఉండ వచ్చును." అని అన్నాడు. దేవేంద్రుని మాటలు విని మైనాకుడు చాలా సంతోషించాడు. ఇంక తనకు దేవేంద్రుని వలన ఎలాంటి భయం లేదనుకున్నాడు.

అప్పటికి హనుమంతుడు చాలాదూరం వెళ్లిపోయాడు. హనుమంతుని గమనమును చూస్తున్న దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు హనుమంతునికి కొంచెము విఘ్నములు కల్పిచవలెనని అనుకున్నారు. సురస అనే నాగమాతను పిలిచారు. "అమ్మా, నాగమాతా! హనుమంతుడు సముద్రము మీద ఎగురు తున్నాడు. నీవు అతనికి విఘ్నము కల్పించాలి. నీవు పర్వత సమానమైన రాక్షస రూపము ధరించి, నీ నోరు పెద్దదిగా తెరిచి హనుమంతునికి అడ్డంగా నిలబడు. హనుమంతుడు ఉపాయంతో నిన్ను జయిస్తాడా లేక తాను తల పెట్టిన కార్యమునకు విఘ్నము కలిగినదని విచారిస్తాడా తెలుసుకోవాలని అనుకుంటున్నాము." అని అన్నాడు.

దేవతల కోరికను మన్నించింది సురస. ఆమెకు కూడా హనుమంతుని పరీక్షించవలెనని కోరిక పుట్టింది. వెంటనే కొండంత రాక్షస రూపం ధరించింది. తన నోరు తెరిచి హనుమంతుని మార్గమునకు అడ్డంగా నిలిచింది.

"ఓ వానరా! ఈరోజు నీవు నాకు ఆహారము అయ్యావు. నేను నిన్ను నమిలి తింటాను. నువ్వు నా నోట్లో ప్రవేశించు." అని నోరు తెరిచింది సురస. హనుమంతుడు ఏమీ తొణక లేదు. ఆమెకు రెండు చేతులు ఎత్తి నమస్కరించాడు. "అమ్మా! నీవు ఎవరో నాకు తెలియదు. నేను రామ కార్యము నిమిత్తము వెళుతున్నాను. దశరథుని కుమారుడు రాముడు, ఆయన భార్య సీత, తమ్ముడు లక్ష్మణుడు దండకారణ్యములో ఉండగా, రావణుడు అనే రాక్షసుడు రాముని భార్యను సీతను అపహరించి తీసుకొని వెళ్లాడు. లంకలో ఉంచాడని తెలిసింది. ప్రస్తుతము నేను రాముని దూతగా సీత వద్దకు వెళు తున్నాను. నీవు కూడా రాముని రాజ్యములోనే ఉన్నావు కదా! రాజుకు సాయం చెయ్యడం మన ధర్మం కదా! అందుకని నాకు దారి వదులు. నేను రామ కార్యము ముగించుకొని తిరిగి వచ్చునపుడు నీ ముఖంలోకి ప్రవేశించి నీకు ఆహారం అవుతాను. నేను సత్యమునే పలుకుతున్నాను." అని అన్నాడు హనుమంతుడు.

కాని సురస అంగీకరించలేదు. నన్ను దాటి ఎవరూ పోలేరు. ఆ ప్రకారంగా నాకు బ్రహ్మ ఇచ్చిన వరం ఉంది. కాబట్టి నువ్వు నన్ను దాటి పోలేవు.నువ్వు నా ముఖంలోకి ప్రవేశించాలి. తప్పదు."అని పలికింది సురస. సురస మాటలకు హనుమంతునికి కోపం వచ్చింది. కాని తమాయించుకున్నాడు.

"అలాగా! అయితే నీవు ఎంత పెద్దగా నీ నోరు తెరవగలవో తెరువు. అప్పుడు నేను నీ నోట్లో దూరుతాను." అని అన్నాడు. సురస నోరు తెరిచింది. అంతకన్నా తన దేహమును పెంచాడు హనుమంతుడు. సురస తన నోటిని ఇరువది యోజనముల వెడల్పు

తెరిచింది. హనుమంతుడు ముప్పది యోజనముల లావు పెరిగాడు. సురస నోరు పట్టలేదు. సురస తన ముఖమును నలుబది యోజనముల వెడల్పు పెంచింది. హనుమంతుడు ఇంకా లావు పెరిగాడు. ఆఖరుకు సురస తన ముఖమును 80 యోజనముల వెడల్పు పెంచింది. హనుమంతుడు తన శరీరమును 90 యోజనముల లావు పెంచాడు. వెంటనే హనుమంతుడు చిన్న బొటన వేలి ప్రమాణం అంత చిన్న వాడయ్యాడు. చటుక్కున సురస నోట్లోకి వెళ్లి మరలా బయటకు వచ్చేసాడు.

"ఓ మాతా! నీవు కోరినట్టు నీ ముఖంలోకి ప్రవేశించి బయటకు వచ్చాను కదా! ఇంక నాకు దారి ఇవ్వు. నేను తొందరగా వెళ్లాలి." అని అన్నాడు. ఆమాటలకు సురస ఎంతో సంతోషించింది. తన నిజస్వరూపంతో హనుమంతుని ఎదుట నిలిచింది.

"కుమారా హనుమా! నీ బుద్ధికుశలతకు సమయస్ఫూర్తికి మెచ్చాను. నీవు రామ కార్యము మీద వెళ్ల వచ్చును. నీకు విజయం సిద్ధిస్తుంది." అని ఆశీర్వదించింది సురస. ఇది చూచిన దేవతలు హనుమంతుని తెలివికి ఎంతో సంతోషించారు.

(ఇక్కడ ఒక్క మాట. హనుమంతుడు దాటవలసిన దూరము 100 యోజనములు. అప్పటికే కొంత దూరం ప్రయాణం చేసాడు. సురస 80 యోజనములు పెరిగితే, ఇంకేముంది, ఆమె మీదుగా దూకుతూ లంకలోకి దూకవచ్చు కదా!హనుమంతుడు తన శరీరమును 90 యోజనములు పెంచాడు అని ఉంది. 90యోజనముల లావు ఉన్న హనుమంతుడు మధ్య నిలబడితే అటు

ఐదు, ఇటు ఐదు యోజనముల దూరమే ఉంటుంది. వానరులందరూ అటునుంచి ఇటు ఇటు నుంటి అటు లంకలో దూకేయవచ్చుకదా! ఈ ఎగరడాలు ఎందుకు? కాబట్టి, ఈ సురస కధలో ఇచ్చిన దూరముల కొలతలు హనుమంతుని తెలివి తేటలగురించి, శక్తి సామర్థ్యముల గురించి మనకు బాగా తెలియజెయ్యడానికి, చిన్న పిల్లలకు ఆసక్తి కలిగించడానికి చమత్కారంగా రాయబడినవి అని పండితుల అభిప్రాయము.)

తరువాత హనుమంతుడు తన ప్రయాణమును కొనసాగించాడు. మరలా హనుమంతునికి ఒక ఆటంకం కలిగింది. సింహిక అనే రాక్షసి ఉంది. ఆ రాక్షసి ఆకాశమార్గంలో పోతున్న హనుమంతుని చూచింది. ఇవ్వాళ నాకు మంచి ఆహారము దొరికింది అని అనుకొంది. ఆ సింహికకు నేల మీద పడ్డ నీడను పట్టుకొని పైన ఎగురుతున్న పక్షులను పట్టుకొనే శక్తి ఉంది. ఆ ప్రకారంగా పైన ఎగురుతున్న హనుమంతుని నీడను పట్టుకొంది. కిందికి లాగుతూ ఉ ంది. ఎవరో తనను పట్టి లాగుతున్నట్టు అనిపించింది హనుమంతునికి. కిందికి చూచాడు. సింహిక కనపడింది. సముద్ర జలాల మీద పడ్డ నీడను పట్టుకొని పక్షులను, జంతువులను తన వైపుకు లాక్కునే వికృతమైన ఆకారాల గురించి సుగ్రీవుడు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి హనుమంతునికి. సుగ్రీవుడు చెప్పిన వికృతమైన ఆకారము ఇదే అనుకున్నాడు హనుమంతుడు.

హనుమంతుడు తన దేహమును పెంచాడు. అది చూచిన సింహిక తన నోరు అంత కన్నా పెద్దగా తెరిచి అరుస్తూ హనుమంతుని వైపుకు వెళ్లింది. హనుమంతుడు తన శరీరమును

చిన్నదిగా చేసి సింహిక నోట్లోకి దూరాడు. ఆమె శరీరములోకి ప్రవేశించిన హనుమంతుడు తన వాడిఅయిన గోళ్లతో ఆమె లోపల భాగములను, గుండెను, ఊపిరితిత్తులను, పేగులను చీల్చాడు. వెంటనే బయటకు వచ్చాడు. శరీరం ఛిన్నాభిన్నం కావడంతో సింహిక సముద్రంలో పడి మరణించింది. ఆకాశంలో సంచరిస్తున్న సిద్ధులు, గంధర్వులు మొదలగు దేవతలు హనుమంతుడు సింహికను చంపడం చూచి బాగు బాగు అని మెచ్చుకున్నారు.

సింహికను చంపిన హనుమంతుడు మరలా పైకి ఎగిరాడు. ఆకాశంలో ప్రయాణం సాగిస్తున్నాడు. సముద్రము ఆవల ఒడ్డుకు చేరుకున్నాడు. సముద్రము ఒడ్డున వరుసగా ఉన్న వృక్షములను చూచాడు. హనుమంతుడు ఆకాశము నుండి కిందికి దిగుతున్నాడు. అప్పటికి హనుమంతుడు తన శరీరమును చాలా రెట్లు పెద్దది చేసాడు. తన ఆకారమును చూచి రాక్షసులు భయపడతారని తన వంక అనుమానంగా చూస్తారని అనుకున్నాడు హనుమంతుడు. అందుకని తన నిజరూపమును ధరించాడు. సాధారణ వానర రూపమును ధరించాడు హనుమంతుడు. హనుమంతుడు లంకా ద్వీపములో ఉన్న త్రికూట పర్వత శిఖరము మీదకు దిగాడు. ఆ పర్వతము పైన నిర్మింపబడిన లంకా పట్టణమును చూచాడు హనుమంతుడు.

ఆ లంకా పట్టణము దేవేంద్రుని రాజధాని అయిన అమరావతి మాదిరి శోభిల్లుతూ ఉంది. ఆ పర్వత శిఖరము మీద పూలచెట్ల కింద నిలబడి ఉన్న హనుమంతుని మీద ఆ పూల చెట్లు పూలవాన కురిపించాయి. ఆ పూలతో నిండిపోయిన హనుమంతుడు

కదులుతున్న పూలవిగ్రహము మాదిరి శోభించాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము మొదటి సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందరకాండము

రెండవ సర్గ.

హనుమంతుడు ఏ మాత్రమూ అలసట చెందకుండా నూరుయోజనముల దూరము కల దక్షిణ సముద్రమును దాటి లంకా ద్వీపంలో ప్రవేశించాడు. త్రికూట పర్వత శిఖరము మీద నిలబడి లంకా నగరమును చూచాడు. లంకా నగరములో ఉన్న అనేక రకములైన వృక్షజాతులు, పుష్పలతలను చూచాడు హనుమంతుడు.. అనేకము లైన సరోవరములూ, ఉద్యానవనములనుచూచాడు.. లంకా నగరము మరో అమరావతిని తలపిస్తూ ఉంది.

ఆ లంకా నగరమును పూర్వము విశ్వకర్మ నిర్మించాడు. ఆ లంకా నగరము మొదట కుబేరునికి చెందినది. లంకా నగరము చుట్టు పెద్ద అగడ్తను చూచాడు.

(శత్రువులు నగరంలోకి ప్రవేశించకుండా కోట చుట్టు గొయ్యి తవ్వి దానిని నీటితో నింపి అందులో మొసళ్లను వదులుతారు. దాని పేరు అగడ్త, పరిఖ అంటారు.)

ఆ లంకా నగరము పర్వతశిఖరము మీద ఉండటం వలన గాలిలో తేలుతున్న నగరంలా ప్రకాశిస్తూ ఉంది. లంకా నగరంలో తెల్లటి ఎత్తైన భవనములు, విశాలమైన వీధులు, వందలకొలదీ కోట బురుజులు, భవనముల మీద ఎగురు పతాకములు, ధ్వజములతో లంకా నగరము దేవేంద్రుని రాజధాని అమరావతిని తలపిస్తూ ఉంది.

లంకా నగరము చుట్టు బంగారు ప్రాకారము ఉంది. లంకానగరమును అనుక్షణము ఆయుధములు ధరించిన సైనికులు కాపలా కాస్తున్నారు. లంకానగర కోట గోడల మీద శతఘ్నులు అమర్చబడి ఉన్నాయి. లంకా నగరమునకు అమర్చబడిన పటిష్టమైన రక్షణ విధానమును, చుట్టు ఉన్న సముద్రమును చూచి రావణుని అంత సులభంగా గెలువలేమని అనుకున్నాడు హనుమంతుడు. దేవతలకే గెలువ శక్యము కాని ఈ లంకా నగరమును వానరులు ఎలా గెలువగలరు అని సందేహంలో పడ్డాడు హనుమంతుడు. రాముడు స్వయంగా వచ్చినా రావణుని గెలిచి లంకను స్వాధీనం చేసుకోడం అంత సులభం కాదు అని అనుకొన్నాడు హనుమంతుడు. ఇంకా ఇలా ఆలోచిస్తున్నాడు.

“ఈ రాక్షసులు సామ,దాన, భేదోపాయములకు లొంగరు. ఇంక యుద్ధమే శరణ్యము. యుద్ధము చేసి లంకను గెలవడం సాధ్యము అయ్యేట్టు లేదు. నేను, సుగ్రీవుడు, నీలుడు, అంగదుడు మేము నలుగురము మాత్రమే ఈ లంకానగరములోకి రాగలము. మరి మిగిలిన వారి సంగతి ఏమిటి? ముందు నేను పోయి సీత ఎక్కడ ఉన్నదో తెలుసుకోవాలి? అసలు సీత జీవించి ఉన్నదా లేదా అనే విషయం ధృవపరచుకోవాలి. తరువాత యుద్ధము విషయం

ఆలోచించవచ్చును. " అని తనలో తాను అనుకున్నాడు హనుమంతుడు.

"ఇప్పుడు లంకానగరంలోకి ఎలా ప్రవేశించాలి. కాపలాగా ఉన్న రాక్షసులను ఏమార్చి  ఏ రూపంతో ప్రవేశించాలి. నేను ఈ రూపంతో లోపలకు వెళితే రాక్షసులు పట్టుకొంటారు. కాబట్టి రాక్షసులను ఏదో విధంగా వంచించి సీతను వెదకాలి." అని ఆలోచిస్తున్నాడు  హనుమంతుడు.

కాని హనుమంతుని ఆలోచనలు ఎంతకూ ఒక కొలిక్కిరావడం లేదు. ఉపాయంతో కార్యం సాధించాలి అని అనుకొన్నాడు. "ఏమి చేసినా, ఇతరుల కంట పడకుండా, కనపడీ కనపడకుండా ఉన్న అతి చిన్నరూపమును ధరించి లంకలో ప్రవేశించాలి.  సీతను వెదకాలి. రామకార్యము చెడిపోకుండా నెరవేర్చాలి. ఒంటరిగా ఉన్న సీతను చూచినపుడు ఎవరైనా చూస్తే ఏం చెయ్యాలి? అసలు సీత కనపడిన తరువాత ఆమె దగ్గరకు ఎలా వెళ్లాలి?

ఎక్కడ ఏ చిన్న పొరపాటు జరిగినా మొత్తం కార్యము చెడిపోతుంది. స్థిరమైన మనసు లేకుండా పనులు చేస్తే, ఆ పనులు చెడిపోవడం తథ్యం. నాకు అన్నీ తెలుసు అని అహంకరిస్తే, ఆ అహంకారంతో తప్పులు చేయడం, ఆ కార్యము చెడిపోవడం జరుగుతుంది నూరు యోజనముల సముద్రము దాటిన ఫలము చిన్న పొరపాటుతో సర్వనాశనము అవుతుంది. అలా కాకుండా కార్యము ఎలా నిర్విఘ్నంగా నెరవేర్చాలి? పొరపాటున నేను రాక్షసుల కంటపడితే,

రాముని కార్యము సమూలంగా నాశనం అవుతుంది.

ఒకవేళ రాక్షస రూపంలో సంచరిస్తే? అప్పుడు కూడా రాక్షసులు నన్ను గుర్తు పడితే. రాక్షసులకు తెలియకుండా వాళ్లలో ఒక రాక్షసుడుగా లంకలో సంచరించడం అతి కష్టం. లంకలో రాక్షసులకు తెలియని ప్రదేశము లేదు. వారికి తెలియకుండా గాలి కూడా లంకలో చొరబడలేదు. నేను ఈ రూపంతో లంకలో ప్రవేశిస్తే రాక్షసులు నన్ను పట్టుకొని చంపుతారు. కాబట్టి అతి చిన్న రూపంతోనే ఈ రాత్రికి లంకలో ప్రవేశించాలి. రాక్షసులకు కనపడీ కనపడకుండా సీతను వెదకాలి. అదే ప్రస్తుత కర్తవ్యము. ఈరాత్రికి లంకా నగరంలో ప్రవేశించి, రావణుని మందిరము అంతా సీత కోసం వెదుకుతాను." అని నిశ్చయించుకున్నాడు హనుమంతుడు. చీకటి పడేదాకా వేచి ఉన్నాడు.

సూర్యుడు అస్తమించాడు. చీకట్లు నలుమూలలా అలముకున్నాయి. అప్పుడు హనుమంతుడు అతి సూక్ష్మ రూపం ధరించాడు. దాదాపు ఒక మార్జాలము (పిల్లి) అంత రూపం ధరించాడు. చకా చకా ఎగురుతూ సుందరమైన లంకానగరంలోకి ప్రవేశించాడు హనుమంతుడు. లంకానగరాన్ని తేరిపార చూచాడు.

లంగా నగరంలో ఎత్తైన భవనాలు బారులు తీర్చి ఉన్నాయి. బంగారు, వెండి స్తంభములతో ప్రకాశిస్తున్నాయి. ఆ ఎత్తు అయిన భవన పైభాగములకు స్ఫటికములు, మణులు అమర్చిఉన్నాయి. హనుమంతుడు ఆ లంకా నగరమును ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఇంత పెద్ద నగరంలో సీతను కనుక్కొడం సాధ్యమా అని దిగులుపడు

తున్నాడు.

ఆనగరము అంతా భయంకరమైన రాక్షసులు అనుక్షణం కాపలా కాస్తున్నారు. వారి కంట పడకుండా సీతను ఎలా వెదకడం అనే సందేహం పట్టుకుంది హనుమంతునికి. ఇంతలో చంద్రోదయం అయింది. చంద్రుడు తెల్లటి చల్లటి వెన్నెల కురిపిస్తున్నాడు. లంకా నగరంలో సీతను వెదకడానికి హనుమంతునికి సాయం చేయడానికా అన్నట్టు చంద్రుడు ఆకాశంలో పైపైకి వస్తున్నాడు. మనసుకు ఆహ్లాదాన్ని కలిగించే చంద్రుని చూచాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము రెండవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

మూడవ సర్గ.

హనుమంతుడు ధైర్యం చేసి లంకానగర ముఖద్వారము వద్దకు వచ్చాడు. అక్కడి నుండి లంకా నగరాన్ని చూచాడు. లంకా నగరంలో భవనాలు తెల్లగా అందంగా ఉన్నాయి. లంకా నగరము ముఖద్వారము వద్ద అసంఖ్యాకంగా ఏనుగులు నిలిచి ఉన్నాయి. అక్కడ సైనికులు కాపలా కాస్తున్నారు. లంకా నగరము చుట్టు బంగారముతో కట్టబడిన ప్రాకారమును చూచాడు హనుమంతుడు. మెల్లిగా ఆ ప్రాకారము దగ్గరకు వెళ్లాడు. అక్కడి నుండి లంకానగరమును దూరంనుండి చూచాడు.

లంకా నగరంలో ఉన్న ఇండ్లకు అమర్చబడిన ద్వారములు అన్నీ బంగారముతో నిర్మించబడి ఉన్నాయి. ఆ భవనములకు ఉన్న అరుగులు అన్నీ మణులు, మాణిక్యములతో అలంకరింపబడి ఉన్నాయి. లంకా నగరములో భవనములు అన్నీ ఆకాశాన్ని  అంటుతున్నాయి. అంత ఎత్తుగా ఉన్నాయి. దేవేంద్ర నగరమువలె ఉన్న ఆ లంకా నగరమును చూచి హనుమంతుడు ఎంతో సంతోషించాడు.

అంతలోనే హనుమంతునికి ఒక సందేహము కలిగింది. "ఈ లంకా నగరమును రావణుని సైన్యములు అహర్నిశములు కాపలా కాస్తున్నారు. కాబట్టి వీరిని బలప్రయోగంతో ఎదిరించడం చాలా కష్టము. అసలు ఇక్కడి దాకా వానరులు రావాలి కదా! కుముదుడు, అంగదుడు, సుషేణుడు, మైందుడు, ద్వివిదుడు వీరు మాత్రము సముద్రము దాటి ఈ లంకకు రాగలరేమో! తరువాత సుగ్రీవుడు, కుశపర్వుడు, ఋక్షుడు, నేను మాత్రము ఇక్కడికి రాగలము." అని అనుకున్నాడు. "అయినా రామలక్ష్మణుల పరాక్రమము ముందు ఈ రాక్షసులు ఎంత;?" అని తనలో తాను సమాధాన పరచుకున్నాడు. ఇంతలో లంకా నగరంలో ఉన్న గృహములలో దీపములు వెలిగాయి. లంకా నగరము దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంది. అటువంటి లంకా నగరంలోకి ప్రవేశించాడు హనుమంతుడు.

లంకా నగరానికి ఒక అధిదేవత ఉంది. ఆమె పేరు కూడా లంక. అమె లంకను నిరంతరమూ రక్షిస్తూ ఉంటుంది. హనుమంతుడు ఎంత చిన్న రూపంలో ఉన్నా లంకకు అధి దేవత అయిన లంక దృష్టిని తప్పించుకోలేక పోయాడు. లంక  హనుమంతుని చూచింది.  తన అనుమతి లేకుండా లంకలో ప్రవేశించిన హనుమంతుని చూచిన

లంక భయంకర రూపంతో హనుమంతుని పట్టుకొంది.

"ఓ వానరా! నీవు ఎవరు? లంకా నగరంలో ఎందుకు ప్రవేశించావు? నేను నిన్ను చంపేలోగా నిజం చెప్పు. ఈ లంకా నగరాన్ని అనుక్షణం రాక్షసులు కాపలా కాస్తుంటారు. నీవు అడుగు కూడా ముందుకు వెయ్యలేవు. కాబట్టి నీ గురించి చెప్పు." అని గద్దించింది లంక.

హనుమంతుడు  ఆ లంకాధి దేవతను చూచి ఇలా అన్నాడు. "నేను ఉన్నది ఉన్నట్టు చెబుతాను కానీ ఇంతకూ నువ్వు ఎవరు? ఈ లంకా నగర ద్వారము వద్ద ఎందుకు ఉన్నావు? నన్ను ఎందుకు బెదిరిస్తున్నావు?" అని అడిగాడు హనుమంతుడు.

అప్పటి దాకా తనను చూచి భయపడ్డ వాళ్లేకానీ తనను ఎదిరించిన వాళ్లు లేకపోవడంతో లంకకు కోపం వచ్చింది. "లంకాధినేత రావణుని ఆజ్ఞ మేరకు నేను ఈ లంకానగరమును రక్షిస్తుంటాను. నా అనుమతి లేకుండా ఎవరూ ఈ లంకానగరంలో ప్రవేశించలేరు. ఇప్పుడు నువ్వు ప్రవేశించావు కాబట్టి నీకు చావు తప్పదు. నాచేతిలో చావడానికి సిద్దంగా ఉండు. నేను ఎవరో చెప్పాను కదా! ఇంక నువ్వు ఎవరో చెప్పు? " అని పరుషంగా అడిగింది లంక. అవసరమైతే లంక అధిదేవతను ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నాడు హనుమంతుడు. ఆమె మాటలు విని ఇలా అన్నాడు.

"ఏమీలేదు. ఈ లంకానగరం ఎంతో సుందరంగా ఉంది. ఎత్తైన బురుజులతోనూ, ప్రాకారములతోనూ, తోరణములతోనూ

అందంగా ఉంది. అందుకని చూడటానికి వచ్చాను. ఈ లంకా నగరంలో ఉద్యానవనములు, తోటలు, సరోవరములు, ఎత్తైన భవనములు చాలా బాగున్నాయి. మరి ఇవన్నీ నేను చూడాలి కదా! నన్ను పోనివ్వు." అని అన్నాడు హనుమంతుడు అమాయకంగా.

"నా అనుమతి లేకుండా ప్రవేశించావు. నన్ను జయించు. తరువాత ముందుకు నడువు." అంది లంక.

"నేను కేవలం లంకానగరాన్ని చూడటానికి వచ్చాను. ఈ జయించడాలు ఎందుకు. అలా చూచి ఇలా పోతాను. నన్ను పోనివ్వు."అని అన్నాడు హనుమంతుడు.

వీడు మాటలతో వినే రకం కాదని లంక తన అరిచేతితో హనుమంతుని ఒక చరుపు చరిచింది. ఆ దెబ్బకు హనుమంతుడు కుయ్యోమని అరిచాడు. ఎడమ చేతి పిడికిలితో ఒక్కపోటుపొడిచాడు. ఆ దెబ్బకు లంక దిమ్మతిరిగి నేలమీద పడింది. "అయ్యో ఆడదాన్ని కొట్టానే." అని బాధపడ్డాడు హనుమంతుడు.

హనుమంతుని పిడికిలి దెబ్బతిన్న లంక హనుమంతునితో ఇలా అంది. "ఓవానరా! నన్ను చంపకు. నీ లాంటి బలవంతులు స్త్రీలను చంపరు కదా! నీవు నన్ను జయించావు. నేను లంకా నగరాన్ని. నువ్వు నీ పరాక్రమంతో లంకను జయించావు. పూర్వము బ్రహ్మ నాకు ఓ వరం ప్రసాదించాడు. ఎప్పుడైతే నన్ను ఒక వానరుడు జయిస్తాడో అప్పుడే రాక్షసులకు భయం అనేది తెలుస్తుంది. ఇప్పుడు వానరుడవైన నీవు నన్ను జయించావు. బ్రహ్మ చెప్పిన సమయము ఆసన్నమయింది.

రాక్షసులకు చేటుకాలము దాపురించింది. సీత మూలంగా రావణునికి, లంకలో రాక్షసులకు వినాశము సమీపించింది. ఓ వానరా! నీవు నీ ఇష్టం వచ్చినట్టు లంకలో ప్రవేశించు. సీత కోసరం వెదుకు. నీవు ఏం చెయ్యాలను కొన్నావో అది చెయ్యి. ఈ లంకా నగరానికి శాపం తగిలింది. దానిని ఎవరూ తప్పించలేరు." అని పలికింది లంక.

శ్రీమద్రామాయణము
సుందర కాండము మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము
## నాలుగవ సర్గ.

లంక అధిదేవతను ఓడించిన హనుమంతుడు లంకలోకి ఎలా ప్రవేశించాలా అని ఆలోచించాడు. తాను రావణునికి మిత్రుడు కాదు. అందుకని సింహద్వారము గుండా ప్రవేశించడం ఉచితం కాదు. కాబట్టి, శత్రువు మాదిరి నగరము చుట్టుకట్టిన ప్రాకారము పైకి ఎక్కి లోపలకు దూకాడు. ఎడమ కాలు ముందు పెట్టి లంకానగరంలో ప్రవేశించాడు. లంకా పుర రాజమార్గముల గుండా వెళుతున్నాడు హనుమంతుడు.

లంకాపురములోని గృహముల నుండి వాద్య ధ్వనులు శ్రావ్యంగా వినపడుతున్నాయి. గృహములన్నీ మంగళకరంగా అలంకరింపబడి ఉన్నాయి. లంకానగరములోని గృహములు అన్నీ వాస్తు ప్రకారము నిర్మింపబడి ఉన్నాయి. ఒక్కొక్క గృహము ఒక్కొక్క

విధముగా కట్టబడి ఉన్నాయి. కొన్ని గృహముల నుండి స్త్రీలు నాట్యము చేయు ధ్వనులు వినబడుతున్నాయి. కొన్ని చోట్ల మల్లయోధులు చేయు సింహ నాదములు వినపడుతున్నాయి. కాని కొన్ని గృహముల నుండి సుస్వరంతో మంత్రోచ్ఛారణలు, వేదాధ్యయనములు వినపడుతున్నాయి. హనుమంతుడు ఒక్కొక్క ఇంటినీ చూచుకుంటూ వెళుతున్నాడు.

లంకలో ఉన్న సైనిక సమూహములను, ప్రచ్ఛన్నవేషములతో తిరుగుతున్న రావణుని గూఢచారులను కూడా చూచాడు హనుమంతుడు. రాక్షసులు అంటే అందరూ దుష్టులు క్రూరులు అనుకున్నాడు కానీ, వారిలో కొందరు వేదాధ్యయన పరులు, నిష్ఠాగరిష్టులు కూడా ఉన్నారని అనుకున్నాడు హనుమంతుడు.

రాక్షసులలో కొందరు యజ్ఞదీక్ష వహించి ఉన్నారు. కొందరు శిరోముండనము చేయించుకున్నారు. (నున్నగా గుండు గీయించుకున్నారు) మరి కొందరు మంత్రోచ్ఛాటన చేస్తున్నారు. కొందరు శత్రువులను నాశనం చెయ్యడానికి మంత్రించిన దర్భలు చేత ధరించి ఉన్నారు. మరి కొందరు మారణహోమములు చేయడంలో నిమగ్నమయి ఉన్నారు. మరి కొందరు ఆయుధ ధారులై ఉన్నారు. మరి కొందరు వికృత రూపాలతో ఉన్నారు. ఇంకా మరి కొందరు శృంగార పురుషులుగా చేత పూల మాలలు ధరించి, లేపనములు పూసుకొని ఉన్నారు.

రావణుని అంత:పురము దగ్గర లక్ష మంది సైనికులతో ఒక సైనిక నివేశము ఎటువంటి పరిస్థితి నైనా ఎదుర్కొనడానికి సిద్ధంగా

ఉండటం హనుమంతుడు చూచాడు. అలా చూచుకుంటూ హనుమంతుడు రావణుని అంత:పురము వద్దకు వచ్చాడు.

అంత:పురము చుట్టు ఇతరులు ఎవరూ ప్రవేశించకుండా ఎత్తైన ప్రాకారము కట్టబడి ఉంది. ఆ ప్రాకారమునకు పెద్ద ముఖ ద్వారము ఉంది. రావణుని గృహము స్వర్గము వలె ప్రకాశిస్తూ ఉంది. రావణుని అంత:పురము నుండి మధురమైన సంగీతధ్వనులు, నాట్యరవళులు వినిపిస్తున్నాయి. రావణుని గృహమును నిరంతరమూ రాక్షసులు కాపలా కాస్తున్నారు. అటువంటి రావణుని గృహములోకి హనుమంతుడు రహస్యముగా ప్రవేశించాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
ఐదవ సర్గ.

హనుమంతుడు రావణుని అంత:పురము ప్రవేశించే సమయానికి చంద్రుడు ఆకాశంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. చల్లని వెన్నెలలు వెదజల్లుతున్నాడు.లక్ష్మీకళలతో ఉట్టిపడుతున్నాడు. సూర్య కిరణములు తన మీద పడుతూ ఉంటే వాటిని ప్రతిబింబిస్తున్నాడు చంద్రుడు. చీకట్లను నశింపజేసి వెన్నెలలను నలుమూలలకూ పంచిపెడుతున్నాడు. అటువంటి చంద్రుని చూచాడు హనుమంతుడు. చంద్రుడు క్రమక్రమంగా పైకి వస్తున్నాడు.

ఆ వెన్నెల రాత్రిలో రాక్షసులు మాంసమును తింటూ మద్యం తాగుతున్నారు. వనితలు కూడా తమ తమ ప్రియులతో కలిసి క్రీడిస్తున్నారు. ఉత్తములైన స్త్రీలు తమ తమ భర్తలతో నిద్రిస్తున్నారు. కొంత మంది నిశాచరులు ఇంకా పురవీధుల్లో తిరుగుతున్నారు. హనుమంతుడు సీత కోసరం అంతటా వెతుకుతున్నాడు.

మద్యపానమత్తులో ఒకరి ఒకరు దూషించుకోడం చూచాడు హనుమంతుడు. కొంత మంది స్త్రీలు నిద్రిస్తుంటే మరి కొంత మంది స్త్రీలు తమ ప్రియుల మీద కోపించి, అలిగి, నిట్టూర్పులు విడుస్తున్నారు. వీరందరినీ నిశితంగా చూస్తున్నాడు హనుమంతుడు. వీరే కాకుండా రాక్షసులలో బుద్ధిమంతులను, విద్యావంతులను, గానకళా కోవిదులను, వేదవిద్యాపారంగతులను కూడా చూచాడు హనుమంతుడు.

రాక్షస స్త్రీలలోకూడా విద్యావంతులు, గుణవంతులను భర్తల పట్ల గౌరవ ప్రమత్తులు కలవారిని కూడా చూచాడు హనుమంతుడు. కొందరు స్త్రీలు తమ తమ మేడలపై కూర్చొని భర్తలతో సరస సల్లాపములతో మునిగి తేలుతున్నారు. రాక్షస స్త్రీలలో కూడా అత్యంత సౌందర్యవతులను, అత్యంత వికృత రూపులను కూడా చూచాడు హనుమంతుడు.

హనుమంతునికి ఇంతమంది స్త్రీలు కనపడ్డారు కానీ రాముని కోసరం పరితపించు చున్న సీత మాత్రం కనపడలేదు. రాముని విడిచి దు:ఖిస్తున్న సీత, కళ్లలో నీళ్లు తప్ప కాంతి కనపడని

సీత, శోకమూర్తిఅయిన సీత హనుమంతునికి కనపడలేదు. ఇంతమంది స్త్రీలలో సీత కనపడకపోయేసరికి హనుమంతునికి దు:ఖము ముంచుకొచ్చింది. ఎంతో ఉత్సాహంతో సీత కోసం వెతుకుతున్న హనుమంతుని ఉత్సాహం అంతా క్షణాల్లో ఆవిరి అయిపోయింది.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఆరవ సర్గ.

సీత కోసరం లంకా నగరంలో వెదికి వెదికి విసిగిపోయి దు:ఖిస్తున్న హనుమంతుడు, ఈ సారి రావణుని అంత:పురంలో వెదకాలని అనుకున్నాడు. రావణుని గృహం దగ్గరకు వచ్చాడు. రావణుని భవనానికి కాపలా చాలా కట్టుదిట్టంగా ఉంది.

రావణుని భవనమునకు అమర్చిన ముఖద్వారము బంగారముతో చేయబడి ఉంది. ఆ భవనములో ఉన్న సింహాసనములు, వస్తువులు బంగారంతో తయారు చేయబడి, రత్నాలు, మణులు పొదగబడి ఉన్నాయి. బంగారు ఆభరణములతో అలంకరింపబడిన రథములు అక్కడక్కడా నిలిచి ఉన్నాయి. రావణ భవనంలో అనేక రకములైన మృగములు, పక్షులు సంచరిస్తున్నాయి. రావణుని భవనము నిండా ఉత్తమ జాతి స్త్రీలు అక్కడక్కడా అటు

ఇటు తిరుగుతున్నారు. రావణుని భవనము నిండా రాజ లాంఛనములు అయిన ఛత్రములు, చామరములు కనపడు తున్నాయి. భవనమంతా అగరు, చందనముల సువాసనలతో గుబాళిస్తూ ఉంది.

ఒక పక్క భేరీ మృదంగ నాదములు వినిపిస్తుంటే, మరొక పక్క శివార్చనలు, హోమములు జరుగుతున్నాయి. రావణుని భవనమంతా పరిశీలనగా చూస్తున్నాడు హనుమంతుడు. హనుమంతుడు రావణుని భవనములో ఒక గృహము నుండి మరొక గృహమునకు తిరుగుతూ సీత కోసరం వెతుకుతున్నాడు. తరువాత ప్రముఖుల భవనముల వద్దకు వచ్చాడు హనుమంతుడు.

ముందుగా ప్రహస్తుని గృహమును చూచాడు. అక్కడి నుండి మహాపార్శ్వుని గృహము మీదికి దుమికాడు. తరువాత కుంభకర్ణుని గృహము, అక్కడి నుండి విభీషణుని గృహము పరిశీలించాడు. ఎక్కడా సీత కనిపించలేదు. తరువాత హనుమంతుడు వరుసగా మహోదరుడు, విరూపాక్షుడు, విద్యుజ్జిహ్వుడు, విద్యున్మాలి, వజ్రదంష్ట్రుడు, అనే రాక్షస వీరుల భవనముల మీదికి దూకి వారి భవనములను కూడా వెదికాడు. శుకుడు, సారణుడు, ఇంద్రజిత్తు గృహములు కూడా వెదికాడు. అంతటితో ఆగకుండా జంబుమాలి, సుమాలి, రశ్మికేతువు, సూర్యకేతువు, వజ్రకాయుడు, అనే రాక్షస వీరుల గృహములను కూడా గాలించాడు. ఎక్కడా సీత కనపడలేదు.

# సుందర కాండము

ప్రముఖుల గృహములు అయిన తరువాత, రెండవ శ్రేణి రాక్షసులు అయిన ధూమ్రాక్షుడు, సంపాతి, విద్యుద్రూపుడు, భీముడు, ఘనుడు, విఘనుడు, శుకనాసుడు, వక్రుడు, శఠుడు, వికటుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, విద్యుజ్జిహ్వుడు, ఇంద్రజిహ్వుడు, హస్తిముఖుడు, కరాళుడు, శోణితాక్షుడు మొదలగు రాక్షసుల గృహములను కూడా క్షుణ్ణంగా వెదికాడు. హనుమంతుడికి వారి వారి ఐశ్వర్యములు, విభవములు కనపడ్డాయి గానీ, సీత మాత్రం కనిపించలేదు.

ఆఖరున రావణుడు నివసించే గృహము చేరుకున్నాడు. ఆసమయంలో రావణుడు నిద్రపోతున్నాడు. రావణునికి రక్షణగా భయంకరాకారము కల రాక్షస స్త్రీలు ఆయుధ ధారులై కాపలా కాస్తున్నారు. రావణుని భవనము చాలా విశాలంగా ఉంది. రావణుని భవనములోనే దాదాపు వెయ్యి వాహినుల సైనిక సమూహములు ఉన్నాయి. గుర్రాలు ఉన్నాయి. ఏనుగులు ఉన్నాయి.

రావణుని గృహములో రకరకాల పల్లకీలు, విహార గృహములు, లతా గృహములు, క్రీడా గృహములు, చిత్రశాలలు ఉన్నాయి. అనేక పడక గదులు ఉన్నాయి. ఆ గదులలో ఉన్న ఆసనములు, మంచములు అన్నీ బంగారముతో చేయబడి రత్నములు, మణులు పొదగబడి ఉన్నాయి. మణులు, రత్నములు పొదగబడిన పాత్రలలో వివిధము లైన మధుర పానీయములు సిద్ధంగా ఉన్నాయి. రావణుని భవనములో వందలకొద్దీ స్త్రీలు ఉన్నారు.

రావణ భవనము అంతర్భాగము లోనే ఎన్నో ప్రాసాదములు ఉన్నాయి. వాటితో వేరు వేరు శాలలు, గదులు ఉన్నాయి. ఆ భవన నిర్మాణ శైలికి ఆశ్చర్యపోయాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఆరవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

ఏడవ సర్గ.

రావణుని అంత:పురములోని ప్రాసాదములు అన్నీ ఒకటి వెంబడి ఒకటిగా గాలిస్తున్నాడు హనుమంతుడు. ఆ గృహము లన్నీ ధన,ధాన్యములతో నిండి ఉన్నాయి. ఆ గృహ నిర్మాణంలో ఏ మాత్రం దోషం లేకుండా నిర్దుష్టం నిర్మించబడి ఉన్నాయి. సాక్షాత్తు మయుడే ఆ గృహాలు నిర్మించాడా అన్నట్టు ఉన్నాయి ఆ గృహములు. అన్నిటి లోకీ రావణుడు నివసించే గృహము అత్యంత శోభాయమానంగా ప్రకాశిస్తూ ఉంది.

ఆ రావణుని అంత:పురము లోనే ఒక విమానమును చూచాడు హనుమంతుడు. దాని పేరు పుష్పకము. ఈ విమానము ఆకాశం నుండి భూమి మీదికి జారిపడిన స్వర్గధామం లాగా ఉంది. ఆ విమానము భూమి మీద నిలబడ కుండా గాలిలో తేలుతున్నట్టు ఉంది. ఆ పుష్పక విమానంలో భవనాలు నిర్మింపబడి ఉన్నాయి. సరస్సులు ఉన్నాయి. ఉద్యాన వనములు ఉన్నాయి. ఆ పుష్పక విమానాన్ని ఎంతో

ఆసక్తిగా చూస్తున్నాడు హనుమంతుడు. ఆ విమానాన్ని బంగారము తోనూ మణులు, మరకతములు, వైడూర్యములతోనూ అలంక రించారు. ఆ విమానము రెక్కలను కూడా పగడములు, బంగారు పుష్పములతో అలంకరించారు. ఆ విమానములో లక్ష్మీదేవిని ప్రతిష్ఠించారు. చేతిలో పద్మములను ధరించి, పద్మములు ఉన్న సరస్సులో పద్మము మీద కూర్చుని ఉన్న లక్ష్మీదేవి అత్యంత మనోహరంగా ఉంది.

పర్వతము మాదిరి నిలబడి ఉన్న ఆ విమానమును ఆసక్తితో చూచాడు హనుమంతుడు. ఆ విమానంలో కూడా సీత కోసరం వెదుకుతున్నాడు. కాని సీత ఎక్కడా కనపడలేదు. హనుమంతుడు నిరాశ చెందాడు. అయినా వెదుకుతూనే ఉన్నాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఎనిమిదవ సర్గ.

హనుమంతుడు పట్టిన పట్టు వదలకుండా, ఒక పక్క ఆ పుష్పక విమానములోని వింతలు విశేసాలు చూస్తూనే విమానం అంతా క్షుణ్ణంగా వెదుకుతున్నాడు. ఆ విమానములో అన్ని వస్తువులు, నిర్మాణములు వేటికవే సాటి గా ఉన్నాయి. విశేషం కానిది ఏదీ లేదు. అన్నీ గొప్పగా ఉన్నాయి. ఆ విమానంలో మరొక విశేషం ఏమిటంటే ఆ

విమానంలో కూర్చున్న వాళ్లు ఎటు వెళ్లాలని మనసులో అనుకుంటే ఆ విమానం అలా వెళుతుంది. ఆ విమానము యొక్క నిర్మాణము అత్యంత విశిష్టంగా ఉంది.

ఆ విమానము ఒక భవనము ఆకారంలో, పెద్ద పెద్ద శిఖరములతో నిర్మింపబడి ఉంది. ఆ విమానమును భయంకరా కారులు అయిన రాక్షసులు రక్షిస్తున్నారు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
తొమ్మిదవ సర్గ.

హనుమంతుడు రావణుని భవనమును, అందులో ఉన్న పుష్పక విమానమును చూచిన తరువాత, అసలు ఈ భవనము పొడుగు ఎంత, వెడల్పు ఎంత, వైశాల్యము ఎంత, ఇంత పెద్ద భవనమును ఎలా నిర్మించారు అన్న విషయం కనుక్కోడానికి ప్రయత్నం చేసాడు. రావణుని భవనము ఒక యోజనము పొడుగు, (ఎనిమిది మైళ్లు,) అందులో సగం(నాలుగు మైళ్లు) వెడల్పు ఉన్న స్థలంలో నిర్మించబడి ఉంది.  అంత పెద్ద స్థలములో నిర్మించబడ్డ ఆ భవనమును సుశిక్షితులైన రాక్షస సైనికులు అనుక్షణం అప్రమత్తంగా కాపలా కాస్తున్నారు.

# సుందర కాండము

రావణాసురుని భవనం అంతా రావణుని భార్యలతోనూ, రావణుడు వివిధ దేశాధిపతులను, రాజులను, జయించి వారి వద్దనుండి బలాత్కారంగా తీసుకురాబడిన స్త్రీలతోనూ, మునులను చంపి వారి వద్దనుండి బలాత్కారంగా తీసుకురాబడిన కన్యలతోనూ నిండి ఉంది.

అందులో ఉన్న పుష్పక విమానము రావణునిది కాదు. దానిని పూర్వము విశ్వకర్మ బ్రహ్మదేవుని కోసరం స్వర్గంలో నిర్మించాడు. కుబేరుడు బ్రహ్మ గురించి తపస్సు చేసి ఆ విమానమును బ్రహ్మ వద్దనుండి పొందాడు. కుబేరుని సోదరుడు రావణుడు. రావణుడు కుబేరుని జయించి లంకా నగరాన్ని, దానితో పాటు పుష్పక విమానాన్ని బలవంతంగా తన సొంతం చేసుకున్నాడు.

హనుమంతుడు ఆ పుష్పక విమానము మీదికి ఎక్కాడు. ఆ విమానములో ఉన్న వంటశాలల నుండి ఆహారపదార్థాల ఘుమ ఘుమలు హనుమంతుని నాసికా పుటాలకు సోకుతున్నాయి. “రా, రా, ఇక్కడకు రా, మమ్ములను ఆరగించు” అని పిలుస్తున్నాయా అన్నట్టు ఆ ఘుమఘుమలు విమానం అంతటా వ్యాపించి ఉన్నాయి.

హనుమంతుడు ఆ విమానంలోకి ప్రవేశించాడు. వెండి బంగారములతో నిర్మించి మణులు, రత్నములు పొదిగిన స్తంభములు కల ఒక విశాలమైన ప్రాంగణమును చూచాడు. అది ఒక చిత్రశాల. ఆ శాలలో నేల కనపడకుండా రత్నములతో కూడిన కంబళి పరిచి ఉంది. ఆ శాలలో రావణుడు సురలోక భోగములు అనుభవిస్తున్నాడు. ఆ శాలను చూస్తుంటేనే మనసుకు ఆహ్లాదం కలుగుతూ ఉంది.

"ఇది స్వర్గలోకమా లేక దేవతల నివాసమా" అని ఆశ్చర్యపోయాడు హనుమంతుడు. అక్కడ వెలుగుతున్న దీపస్తంభములు కూడా బంగారముతో చేయబడి మణులు పొదగబడి ఉండటం గమనించాడు హనుమంతుడు.

ఆ శాలలో ఎంతో మంది ఉత్తమ స్త్రీలు రకరకాలైన రంగు రంగుల దుస్తులు ధరించి రత్నకంబళముల మీద పడుకొని ఉండటం చూచాడు హనుమంతుడు. వారంతా దాదాపు వేయి మంది ఉన్నారు. వారు రాత్రి అంతా రావణునితో కామక్రీడలు జరిపి, కామభోగములలో తేలియాడి, అలసి, సొలసి ఒళ్లు తెలియ కుండా నిద్రపోతున్నారు. వాళ్లంతా కళ్లుమూసుకొని గాఢనిద్రలో ఉన్నారు. ఆ స్త్రీల మధ్య పడుకొని ఉన్న రావణుడు తారల మధ్య ఉన్న చంద్రుడిలా వెలిగిపోతున్నాడు.

"ఈ స్త్రీల ముఖములను పద్మములని భ్రమసి తుమ్మెదలు మకరందము కొరకు రావు కదా!" అని అనుకొన్నాడు హనుమంతుడు. ఆ స్త్రీలందరూ రాత్రంతా రావణుని తో కూడి మద్యము సేవించి, రతిక్రీడలు సలిపినందున వారు ధరించిన హారములు అన్నీ చెల్లాచెదరు అయ్యాయి. కొంత మంది స్త్రీలకు నుదుటి మీద ఉన్న తిలకము చెదిరిపోయింది. ఆ దృశ్యము ఒక పూలవనములో ఒక మదించిన ఏనుగు ప్రవేశించి ఆ వనమును చెల్లాచెదరు చేసినట్టు ఉంది.

కొందరి శరీరము మీద వస్త్రములు తొలగిపోయాయి. హారములు చెదిరిపోయాయి. వడ్డాణములు ఊడిపోయాయి. ఆ స్త్రీల

ఉఛ్వాస నిశ్వాసములకు వారు ధరించిన వస్త్రములు, కుండలములు ఊగుతున్నాయి. గాఢనిద్రలో ఉన్న కొందరు స్త్రీలు, పక్కనున్న స్త్రీలను రావణుడు అని కౌగలించుకొని ముద్దులు పెట్టుకుంటున్నారు. ఆ స్త్రీలు కూడా రావణుడే తమను ముద్దులాడుచున్నాడని భ్రమించి, వారుకూడా ప్రతిగా పక్కన ఉన్న స్త్రీలకు  ముద్దులు అందిస్తున్నారు.

అందరికీ సరి అయిన తలగడలు లేకపోవడంతో పక్కనున్న వారి చేతులను తలగడలుగా చేసుకొని నిద్రిస్తున్నారు. మరి కొందరు పక్కన ఉన్నవారి వక్షస్థలమునే తలగడలుగా చేసుకొని నిద్రిస్తున్నారు. మరి కొందరు పక్కనున్న స్త్రీల తొడలను తలగడలుగా చేసుకొని నిద్రిస్తున్నారు. అలా ఒకరి మీద ఒకరు పడిపోయి ఒళ్లు తెలియకుండా నిద్రపోతున్నారు ఆ స్త్రీలు. ఎవరి చేతులు ఎక్కడ ఉన్నాయో, ఎవరి భుజాలు ఎక్కడ ఉన్నాయో ఎవరి కాళ్లు ఎక్కడ ఉన్నాయో తెలియడం లేదు. రావణుడు మేల్కొని ఉండగా కన్నెత్తికూడా చూడలేని ఆ స్త్రీల వంక, రావణుడు నిద్రపోవు సమయంలో,  ఆ అందమైన స్త్రీల వంక కన్నార్పకుండా చూస్తున్నాయా అన్నట్టు ఆ విశాల ప్రాంగణంలో దీపాలు నిశ్చలంగా వెలుగుతున్నాయి.

ఆ స్త్రీలలో రాజర్షులకు చెందిన వారు, పితృదేవతలకు చెందిన వారు, దైత్యులకు చెందిన వారు, గంధర్వ స్త్రీలు, రాక్షస స్త్రీలు ఉన్నారు. వారందరూ రావణుని మోహావేశానికి వశులై ఆయనతో కామక్రీడలు సలిపారు. రావణుడు ఎందరో రాజులను జయించి తెచ్చిన స్త్రీలలో, కామానికి వశులైన స్త్రీలు మాత్రమే రావణుని పక్కలో చేరారు. తమ తమ భర్తలను దైవంగా భావించే స్త్రీ ఒక్కత్తె కూడా అక్కడ లేదు. కులీనయైన ఒక్క స్త్రీకూడా అక్కడ లేదు. రావణునిచేత బలవంతంగా

ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా తేబడిన ఒక్క స్త్రీ కూడా అక్కడ లేదు. అందుకే సీత అక్కడ లేదు అని అనుకున్నాడు హనుమంతుడు.

కాని రావణుని ఇష్టపడి వివాహము చేసుకున్న వారందరూ మంచి కులములో పుట్టి, సకల సద్గుణములతో ప్రకాశించేవారే! వారందరినీ చూచి హనుమంతునికి తన సహజమైన చపల స్వభావంతో ఒక అనుమానం క్షణం సేపు అతని మనస్సులో పొడసూపింది.

"వీరందరూ సీత వలె ఉత్తమ జాతి స్త్రీలే. మరి ఇంతమంది ఉత్తమ జాతి స్త్రీలు రావణుని ఐశ్వర్యమునకు బలమునకు పరాక్రమమునకు మోహమునకు లోబడి వశులైనపుడు, సీత కూడా వీరి మాదిరి రావణునికి వశమై ఉండవచ్చును కదా! ఒకవేళ అలా జరిగితే రావణుడు అంత అదృష్టవంతుడు ఉండబోడు. ఒక వేళ అదే జరిగితే, రావణుడు చాలా తప్పుచేసాడు. సరిదిద్దుకోలేని తప్పు చేసాడు. వీడికి రాముని చేతిలో చావు తప్పదు." అని పిచ్చిపిచ్చి ఆలోచనలు చేసాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

పదవ సర్గ.

హనుమంతుడు సీత కోసరం రావణుని అంత:పురము అంతటా వెదుకుతున్నాడు. రావణుని పడక గదిలోకి ప్రవేశించాడు. ఆ గదిలో ఎన్నో ఆసనములు శయ్యలు ఉన్నాయి. అవి అన్నీ మణులతో రత్నములతో అలంకరింపబడి ఉన్నాయి. ఒక ఉన్నతమైన శయ్య మీద రావణుడు నిద్రపోతున్నాడు.

రావణుడు దీర్ఘమైన బాహువులు, ఎర్రటి కళ్లు, నల్లని రూపముతో ఉన్నాడు. అతని ఒంటికి సువాసనలు వెదజల్లే చందనము పూయబడి ఉంది. రావణుని శయనాగారంలో మణులతో అలంకరింపబడిన తెల్లని గొడుగు ఒకటి, ఒక మూలగా నిలబెట్టబడి ఉంది. దాని పక్కనే బంగారముతో నిర్మించిన ఉన్నతాసనము ఉంది.

రావణుడు రాత్రి అంతా రతికేళి జరిపి సొక్కి సోలి గాఢంగా నిద్రపోతున్నాడు. రావణుని చూస్తే హనుమకు కించిత్ భయం కలిగింది. అందుకని కాస్త దూరంగా ఉండి చూస్తున్నాడు. ఎందు కన్నా మంచిదని పక్కన ఉన్న అరుగు ఎక్కి అక్కడి నుండి రావణుని చూస్తున్నాడు హనుమంతుడు. అక్కడి నుండి రావణుడు బాగా కనపడుతున్నాడు.

విశాల మైన అతని బాహువుల మీద ఇంద్రుని ఏనుగు ఐరావతము పొడిస్తే ఏర్పడిన గాయము మచ్చలు కనపడుతున్నాయి. ఆ బుజముల మీద ఇంద్రుని వజ్రాయుధముతోనూ, విష్ణువు తన

సుదర్శన చక్రముతోనూ  కొడితే ఏర్పడిన గాయముల వలన కలిగిన మచ్చలు  కనపడుతున్నాయి.

రావణుడు వెల్లకిలా పడుకొని నిద్రపోతున్నాడు. అతని కిరీటము ముత్యములు, మణులు పొదగబడి చిత్రవిచిత్రంగా ప్రకాశిస్తూ ఉంది.  అతని విశాలమైన వక్షస్థలము మీద ముత్యాల హారములు ప్రకాశిస్తున్నాయి. రావణుడు పీతాంబరమును ధరించి ఉన్నాడు. పైన తెల్లటి పట్టు వస్త్రమును ఉత్తరీయముగానూ ధరించి ఉన్నాడు. రావణుడు నిద్రపోతూ కూడా కళ్లు సగం తెరిచి ఉన్నాడు.

హనుమంతుడు రావణుని కాళ్ల దగ్గర నిద్రపోతున్న అతని భార్యలను చూచాడు. వారందరూ ఎంతో సౌందర్యవంతులు. వారి ముఖములు పద్మముల వలె ప్రకాశిస్తున్నాయి. వారు ధరించిన పూలమాలలు ఇంకా వాడిపోలేదు. కాని చెల్లాచెదరు అయ్యాయి. ఆ స్త్రీలు కొందరు రావణుని భుజముల దగ్గర కొందరు రావణుని తొడల దగ్గర తలలు పెట్టి నిద్రపోతున్నారు. వారంతా రావణునితో రతికేళి సలిపి అలసి పోయి గాఢంగా నిద్రపోతున్నారు.

ఒకామె తాను నిద్రపోతున్నప్పుడుకూడా తాను నేర్చిన నృత్యభంగిమలోనే పడుకొని ఉంది. ఒకామె వీణ వాయిస్తూ అలాగే నిద్రవచ్చి వీణ మీద పడిపోయి నిద్రపోతూ ఉంది. మరొక యువతి మడ్డుకము అనే వాద్య విశేషమును వాయిస్తూ, ఇంతలో నిద్రముంచు కొచ్చి,  తల్లి కుమారుని కౌగలించుకొని నిద్రిస్తున్నట్టు, ఆ వాద్యమును కౌగలించుకొని నిద్రిస్తూ ఉంది.  మరొక స్త్రీ పటహమ అనే వాద్యమును గట్టి గా పట్టుకొని నిద్రలోకి జారుకుంది. మరొక మదవతి వేణువును

ఊదుతూ, ఆ వేణువును తన పెదాలకు అదుముకొని నిద్రపోయింది. మరొక వనిత ఏడు తీగలు కలిగిన వీణను, ప్రియురాలు ప్రియుని కౌగలించుకున్నట్టు కౌగలించుకొని నిద్రిస్తూ ఉంది. మరియొక సుందరాంగి మృదంగము వాయిస్తూ అలాగే దానిమీద పడిపోయి నిద్రపోయింది. మరియొక యువతి పణవము అనే వాద్యమును వాయిస్తూ అలాగే సోలిపోయింది. మరియొక వనిత డిండిమము అనే వాద్యమును ఒడిలో ఉంచుకొని నిద్రపోయింది. మరొక వనిత ఆడంబరము అనే వాద్యమును వాయిస్తూ  నిద్ర ఆపుకోలేక అలాగే పడిపోయి నిద్రలోకి జారుకుంది. మరియొక వనిత నిద్రమత్తులో పక్కనేఉన్న నీటి కలశమును తన్నింది. ఆ నీళ్లు ఆమె కిందికి వచ్చి ఆమె పూర్తిగా తడిసిపోయింది. కానీ ఆ నిద్రమత్తులో ఆమెకు మెలుకువ రాలేదు. గాఢనిద్రలో ఉంది. మరియొక పద్మనేత్ర తన పక్కన మరియొక యువతిని తన ప్రియుడు అనుకొని గట్టిగా కౌగలించుకొని నిద్రలోకి జారుకుంది. అదే మాదిరి రకరకాల వాద్య విశేషములను తమ తమ గుండెలకు అదుముకుంటూ అక్కడ ఉన్న వనితలు గాఢనిద్రాపరవశులై ఉన్నారు.

ఇంతమంది యువతులు, మదవతులు నిద్రిస్తూ ఉంటే, చుక్కల్లో చంద్రుడు లాగా వారందరి మధ్యలో ఒక ఉత్తమ జాతి స్త్రీ నిద్రిస్తూ ఉంది. ఆమెయే రావణుని పట్టమహిషి మండోదరి. ఆ అంత:పురమునకు అధిపతి. ఆమె రకరకాల బంగారు ఆభరణములు ధరించి ఉంది. ముత్యములు, రత్నములు పొదిగిన అలంకారములను ఒంటి నిండా అలంకరించుకొని ఉంది. ఆమెను చూడగానే హనుమంతునికి ప్రాణం లేచి వచ్చింది. అమ్మయ్య సీత కనపడింది అనుకున్నాడు. రూపవతి, యౌవనవతి, సౌందర్యవతి అయిన

మండోదరిని చూచి సీత అని భ్రమపడ్డాడు హనుమంతుడు. హనుమంతుని ఆనందానికి అవధులు లేవు. గంతులు వేసాడు. పక్కనే ఉన్న స్తంబమును ఎక్కాడు. కిందికి దుమికాడు. బుజాలు చరచు కున్నాడు. తోకను పట్టుకొని ముద్దులుపెట్టుకున్నాడు. వచ్చినపని అయిందని పరమానందభరితుడు అయ్యాడు. అటు ఇటు గబా గబా తిరిగాడు. స్తంబాలు ఎక్కాడు. దిగాడు. ఆ చోటంతా కలయతిరిగాడు. వానరములకు ఉన్న చాపల్యము అంతా ప్రదర్శించాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము పదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము
## పదకొండవ సర్గ.

ఎగిరీ ఎగిరీ దుమికీ దుమికీ అలసిపోయాడు హనుమంతుడు. ఒకచోట స్థిరంగా కూర్చున్నాడు. సీత కనపడింది అన్న ఆనందాన్ని పక్కన బెట్టి ఆలోచించసాగాడు.

"ఈమె నిజంగా సీతయేనా! ఈమే నిజంగా సీత అయి ఉంటే రాముడు దగ్గర లేకుండా ఇంత సుఖంగా, నిశ్చింతగా, ఆనందంగా నిద్రపోతుందా! రాముడు దగ్గర లేని సీత ఇన్ని ఆభరణములు ధరిస్తుందా! మద్యపానము చేస్తుందా! పరపురుషుడైన దేవేంద్రుని కూడా కన్నెత్తి చూడని సీత, ఇలాగా రావణుని పక్కన నిద్రిస్తుందా! సందేహం లేదు. ఈమె సీత కాదు. మరొక స్త్రీ. ఈమె సీత

కాకపోతే మరి సీత ఎక్కడ ఉంది?" ఇలా పరి పరి విధాల ఆలోచించిన హనుమంతుడు, మరలా సీతకోసం వెదకడం మొదలెట్టాడు హనుమంతుడు.

మరొక పాన గృహమునకు వెళ్లాడు. అక్కడ కూడా అందమైన యువతులు, మద్యపానంతో, రతికేళితో సొక్కి సోలి ఒళ్లు తెలియకుండా నిద్రపోతున్నారు. ఎక్కడబడితే అక్కడ వాలిపోయి నిద్రపోతున్నారు. అందరి వనితల మధ్య రావణుడు ఆడ ఏనుగుల గుంపుమధ్య ఉన్న మగ ఏనుగుమాదిరి ప్రకాశించాడు. హనుమంతుడు సీతను వెదుకుతూ పక్కనే ఉన్న పానభూమిని చూచాడు.

అక్కడ రక రకాల మృగముల మాంసములు అందమైన పాత్రలలో పెట్టబడి ఉన్నాయి. లేళ్లు, దుప్పులు, అడవి దున్నలు, అడవి పందుల మాంసములు వేరు వేరుగా అమర్చబడి ఉన్నాయి. బంగారుపాత్రలలో ఉన్న నెమళ్లు, కోళ్ల మాంసములను, తిన్నంత తిని మిగిలింది వదిలేసారు అక్కడ ఉన్న యువతులు. చక్కగా వండబడిన పంది మాంసము, గొర్రె మాంసము, లేడి మాంసము, రకకరాల పక్షుల మాంసములు అందమైన పాత్రలలో అమర్చబడి ఉన్నాయి. అంతే కాదు, అక్కడ ఉన్న బంగారు పాత్రలలో రకరకాల భోజ్యములు, లేహ్యములు, చోష్యములు, భక్ష్యములు, లేళ్లు, దుప్పులు మాంసములు అందంగా అమర్చబడి ఉన్నాయి. ఆ పదార్థము లన్నీ తినగా తిని మిగిలినవి నేల మీద చెల్లాచెదరుడా చల్లబడి ఉన్నాయి.

ఈ ఆహార పదార్థములతో పాటు రకరకాల మద్యములు, పానీయములు, బంగారు పాత్రలలోనూ, వెండి పాత్రలలోనూ అమర్చబడి ఉన్నాయి. ఆ పాత్రలకు రత్నములు, మణులు పొదగబడి ఉన్నాయి. అలా అమర్చబడిన మద్యమును కొన్ని పాత్రలలో నుండి పూర్తిగా తాగేశారు. కొన్ని పాత్రలను అసలు ముట్టుకోలేదు. కొన్ని పాత్రలలో సగం సగం తాగగా మిగిలి ఉన్న మద్యము దొర్లిపోయి కారిపోతూ ఉంది. ఈ ప్రకారంగా చెల్లాచెదరుగా పడి ఉన్న మద్యపాత్రలను, భోజన పాత్రలను చూస్తూ హనుమంతుడు సీత కోసరం అణువు అణువునా గాలిస్తున్నాడు.

అక్కడి నుండి మరొక చోటికి వెళ్లాడు హనుమంతుడు. అక్కడా అందమైన స్త్రీలు నిద్రిస్తున్నారు. వారికి ఒంటిమీద వస్త్రములు తొలగినట్టుకూడా తెలియడం లేదు. ఒకరి వస్త్రమును మరొకరు లాగుకుంటూ కప్పుకుంటూ నిద్రపోతున్నారు. వారు ఒంటికి పూసుకున్న చందనము వాసన, వారు సేవించిన మద్యము వాసనా, వారు తిన్న మధురమైన పదార్ధముల వాసనా కలగలిపి ఒక రకమైన వింత వాసన వస్తూ ఉంది. ఆ వాసనలన్నీ ఆఘ్రాణిస్తూ హనుమంతుడు వారి మధ్య తిరుగుతూ సీత కోసరం వెదుకుతున్నాడు.

రావణుని అంత:పురములో ఉన్న స్త్రీలు రకరకాలైన రంగులలో ప్రకాశిస్తున్నారు, కొందరు బంగారు వర్ణములోనూ కొందరు చామచాయలోనూ మరి కొందరు నల్లగానూ, మరి కొందరు పచ్చని పసిమి ఛాయలోనూ ప్రకాశిస్తున్నారు. వారందరి ముఖములు వికసించిన పద్మముల మాదిరి ప్రకాశిస్తున్నాయి. ఇంతమంది సౌందర్యవతుల మధ్య హనుమంతునికి సీత కనపడలేదు. ఇప్పుడు

హనుమంతునికి మరొక సందేహము పట్టుకుంది. తాను ఇప్పటి దాకా ఎంతో మంది యువతులను ఎన్నోచిత్ర విచిత్ర భంగిమలలో చూచాడు. పరస్త్రీలను ఈ విధంగా చూడటం వలన తాను ధర్మం తప్పానా! పాపం చేసానా! అని సందేహం కలిగింది హనుమంతునికి.

"నేను ఇప్పటి దాకా పరస్త్రీలను కన్నెత్తికూడా చూడలేదు. అటువంటిది ఇప్పుడు నిద్రపోతున్న పరాయి స్త్రీలను ఈ విధంగా వివిధ భంగిమలలో చూచాను. అది కాకుండా పట్టి పట్టి పరీక్షగా చూచాను. అంగాంగములు చూచాను. మరి ఇది ధర్మద్రోహము కాదా!" అని తనలో తాను తర్కించుకున్నాడు. ఇంతలో హనుమంతునికి మరొక ఆలోచన వచ్చింది. "నా అంతట నేను స్వతాహాగా పరాయి స్త్రీలను చూడలేదు కదా! కేవలం సీతను వెదికే ప్రక్రియలో భాగంగా చూచాను. అదీ కాకుండా వారిని చూచినపుడు నా మనసులో ఎలాంటి వికారమూ కలగలేదు. ఇంద్రియములు ఏ పని చేయాలన్నా మనసే కారణము. మనస్సులో సంకల్పించనిది ఇంద్రియములు ఏపనీ చేయలేవు. నేను నా మనసులో ఈ స్త్రీల పట్ల ఎలాంటి వికారము సంకల్పించలేదు. కాబట్టి నాకు ఏ పాపమూ అంటదు. అదీ కాకుండా సీత ఒక స్త్రీ. సీతకోసరం స్త్రీల మధ్యలో వెదకాలి కానీ పురుషుల మధ్యలో వెదకలేను కదా! కాబట్టి నేను స్త్రీలను చూడటం తప్పని సరి. నా మనసు పరిశుద్ధంగా ఉన్నప్పుడు, నేను ఎంతమంది స్త్రీలను ఎలా చూచినా నాకు ఏ ధర్మహానీ కలగదు." అని తన మనసును సమాధాన పరచుకున్నాడు. మరలా సీతను వెదకడం మొదలెట్టాడు.

రావణుని అంత:పురములో, దేవతా స్త్రీలు, నాగ కన్యలు, గంధర్వకన్యలు కనపడ్డారు కానీ, ఎంత వెదికినీ సీత కనపడలేదు. ఇంక అక్కడ ఉండి ప్రయోజనము లేదని కొంచెం దూరంగా వెళ్లి ఒక చోట కూర్చుని ఆలోచించడం మొదలెట్టాడు హనుమంతుడు. సీత అంత:పురములలో ఉండదు. విలాసవంతమైన అంత:పురములో వెదకడం వృధా. కాబట్టి బయట వెదకాలని అనుకున్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము పదకొండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## పన్నెండవ సర్గ.

హనుమంతుడు రావణుని అంత:పురము నుండి బయటకు వచ్చాడు. పక్కనే ఉన్న ఉద్యానవనములు, పొదరిళ్లు, చిత్రగృహములు, ఏదీ వదల కుండా వెదుకుతున్నాడు. లంక పూర్తిగా గాలించడం అయింది. సీత జాడ కనపడలేదు. ఇంక సీత ఈలోకంలో బతికి లేదు. మరణించి ఉంటుంది. సీత బతికే ఉంటే ఎక్కడో ఒకచోట కనపడాలి కదా! అనే నిర్ధారణకు వచ్చాడు హనుమంతుడు.

ఇంక హనుమంతుని ఆలోచనలు ఆ విధంగా సాగాయి. సీత మరణించి ఉంటుంది అన్న వార్త గానీ, , సీత దొరకలేదు అన్న వార్తను గానీ తీసుకొని కిష్కింధకు వెళితే పరిణామాలు ఎలా ఉ

ంటాయి అనే దాని మీద రకరకాల ఊహాగానాలు చేయసాగాడు హనుమంతుడు.

"ఎంతకూ తనకు లొంగకుండా ధర్మమార్గాన్ని అంటిపెట్టుకొని ఉన్న సీతను, రావణుడు కోపం వచ్చి చంపేసి ఉంటాడేమో! అదీ కాక పోతే ఎప్పుడూ కని విని ఎరుగని ఈ భయంకర రాక్షసులను చూచి, వారి బెదిరింపులకు భయపడి, తట్టుకోలేక సీత మరణించిందేమో! కాబట్టి సీత ఇంక నాకు కనిపించదు. సుగ్రీవుడు ఇచ్చిన గడువు ఎప్పుడో దాటి పోయింది. ఇన్నిరోజులూ అక్కడా ఇక్కడా తిరిగి ఇప్పుడు సీత కనపడలేదు అని చెబితే సుగ్రీవుడు ఊరుకుంటాడా! వాడసలే మహాబలవంతుడు. చచ్చేట్టు చావ గొడతాడు. మరణ దండన విధిస్తాడు.

నేను మాత్రం ఊరికినే ఉన్నానా! రావణుని అంత:పురం అంతా చూచాను. ఎంతో మంది స్త్రీలను చూచాను. కాని సీత ఎక్కడా కనపడలేదు. ఏం చెయ్యను? నూరుయోజనముల సముద్రం దాటడం, లంకలోకి ప్రవేశించడం, లంక అంతా అణువు అణువునా గాలించడం ఈ శ్రమ అంతా వృధా అయింది. నా కోసరం సముద్రము ఆవల ఎంతో మంది వానరులు వేచి ఉన్నారు. నేను వారి దగ్గరకు పోగానే "నూరుయోజనముల సముద్రము దాటి లంకకు వెళ్లావు కదా! ఏమి సాధించావు? సీత జాడ తెలుసుకున్నావా? ఏమయింది? సీత ఎక్కడుంది?" అని వాళ్లు అడిగితే ఏమని సమాధానము చెప్పాలి? పోనీ వారి దగ్గరకు వెళ్లకుండా ఇక్కడే ఉంటే, నా కోసరం ఎదురు చూచి చూచి వారు ప్రాయోపవేశం చేసి మరణిస్తారేమో!

నేను ఏదో ఘనకార్యం చేసుకొని వస్తానని జాంబవంతుడు, అంగదుడు నా కోసం ఎదురు చూస్తుంటారు. వారికి ఏమని చెప్పాలి?" అని ఆవేదన చెందుతున్నాడు హనుమంతుడు.

ఇంతలో హనుమంతుని లోని వివేకము మేల్కొంది. తనను తాను సంబాళించుకున్నాడు. "ఏమిటిది! నేను ఇలా ఆలోచిస్తున్నాను. నాకు ఇంత నిర్వేదము పనికిరాదు! అన్ని అనర్థములకు హేతువు నిర్వేదము. నిర్వేదము లేకపోవడమే కార్యసిద్ధికి మూలము. మానవుడు తాను ఏమీ  చేయలేను అనుకుంటే ఏమీ చేయలేడు. చేయ గలను అనుకుంటే ఏమైనా చేయగలడు. నిర్వేదము లేకపోవడమే కార్యము సఫలం కావడానికి మూలము. కాబట్టి నాలో పుట్టిన ఈ నిర్వేదమును సమూలంగా నాశనం చేసి, రెట్టించిన ఉత్సాహంతో సీత కోసం వెదుకుతాను." అని తనకు తానే ఉత్తేజితుడు అయ్యాడు హనుమంతుడు.

వెంటనే తాను అప్పటి వరకూ సీత కోసరం ఎక్కడెక్కడ వెదికిందీ ఒక్కసారి ఆకళింపు చేసుకున్నాడు. తాను ఇప్పటి దాకా పానశాలలు, ఉద్యానవనములు, పూపొదరిళ్లు, క్రీడా మందిరములు, శయ్యాగారాలు, భోజన శాలలు, పుష్పక విమానము లోని అంతర్భాగములు, ఇంకా లంకలోని అన్ని గృహములు, ప్రాంగణములు వెదికాడు. ఇంకా వెదకవలసినవి నేలమాళిగలు, జనులు సాధారణంగా గుమిగూడే మంటపాలు, చిన్న చిన్న గృహాలూ. వీటిని కూడా వెదకాలి అని నిర్ణయించుకున్నాడు.

# సుందర కాండము

అంతే హనుమంతుడు చిన్న మర్కటము మాదిరి చెంగు చెంగున ఎగురుతూ, దుముకుతూ అన్ని ఇళ్లలోకి దూరి వెదకడం మొదలెట్టాడు. చిన్నా, పెద్దా అని తేడా లేకుండా అన్ని గృహములనూ ఒక్కటీ వదలకుండా, అంగుళము మేరకూడా వదలకుండా వెదికాడు. కాని సీత కనపడలేదు. ఇంక మిగిలినవి బావులూ, సరస్సులూ, వీధులూ. అక్కడ కూడా క్షుణ్ణంగా వెదికాడు హనుమంతుడు. సీత కనపడలేదు. ఎంతోమంది రాక్షస స్త్రీలు, ఇతర జాతుల స్త్రీలు కనపడ్డారు కానీ సీత మాత్రం కనపడలేదు. ఇంక వెదకవలసిన స్థళాలు ఏవీ లేకపోవడంతో హనుమంతునిలో మరలా నిరుత్సాహము ఆవరించింది. తాను సముద్రాన్ని లంఘించడం, సీతను వెదకడం అన్నీ వృధా అయిపోయినాయి కదా! అని ఆలోచిస్తున్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము పండ్రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
పదమూడవ సర్గ.

హనుమంతుడు ఒక గృహము మీది నుండి మరొక గృహము మీదికి దుముకుతూ, అన్ని గృహములూ వెదికాడు.ఎక్కడా సీత జాడ కనపడలేదు. విసిగిపోయాడు. ఒక చోట ఏకాంతముగా కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"నేను రామకార్యము నిమిత్తము లంకకు వచ్చాను. లంక అంతా గాలించాను. కానీ సీత ఎక్కడా కనపడలేదు. కాని జటాయువు సోదరుడు, పక్షిరాజు సంపాతి చెప్పిన ప్రకారము సీత రావణాసురుని స్థావరమైన లంకలోనే ఉండాలి. కాని లంక అంతా ఎంత వెతికినా సీత కనపడలేదు. నిస్సహాయురాలైన సీత రావణుని చెరలో ఉండి చేసేది లేక రావణునికి లొంగి పోయిందా! లేక రావణుడు సీతను ఆకాశ మార్గంలో అతి వేగంగా తీసుకొని వస్తుంటే, ఆ వేగానికి తట్టుకోలేక సీత మార్గమధ్యంలో ఎక్కడైనా పడిపోయిందా! రావణుడు సీతను సముద్రము మీదుగా తీసుకొని వచ్చి ఉండాలి. ఆకాశంలో వస్తున్నప్పుడు కింద ఉన్న అపారమైన జలరాసిని చూచి భయపడి, సీత సముద్రంలో పడిపోయిందా! జలచరములకు ఆహారంగా మారిందా!

అయోనిజ అయిన సీత, దుర్మార్గుడు, దుష్టుడు అయిన రావణుడు, తనను తాకి, తనను పట్టుకొని, తన అంగాంగములు తాకుతూ, తీసుకొని వస్తుంటే, ఆ అవమానమును తట్టుకోలేక దారిలోనే ప్రాణములు విడిచిందా! అదీ కాకుండా, రావణుడు సీతను తీసుకొని వస్తుంటే, ఆమె పెనగులాడితే, ఆ పెనగులాటలో జారి సముద్రంలో పడిపోయిందా! సీత ఎంత కాలానికి తనకు లొంగక పోతే, రావణుడు విసుగుచెంది ఆమెను చంపించి, భక్షించాడా! రావణుడు సీతను తీసుకొని వచ్చి అంత:పురములో ఉంచినపుడు, రావణుని ఇతర భార్యలు అతిలోకసౌందర్యవతి అయిన సీతను చూచి, అసూయ చెంది, రావణుడు తమకు దక్కడేమోఅన్న అనుమానంతో సీతను అంతమొందించారా!

రావణుడు సీతను ఒంటరిగా బంధించి ఉంచినపుడు, సీత రాముని తలచు కొని తలచుకొనీ, కృంగి, కృశించి, చివరకు మరణించినదా! లేక సీత రావణుని అంత:పురములోనే ఎక్కడైనా ఉందా! నాకు కనపడలేదా! అయినా నా వెర్రిగానీ, మహాపతివ్రత అయిన సీత, రాముని తప్ప మరొకరిని కన్నెత్తి కూడా చూడని మహాసాధ్వి, రావణునికి లొంగిపోతుందా! ఏది ఏమైనా సీత నాకు కనపడలేదు.

సీత మరణించి ఉన్నా, లేక జీవించి ఉన్నా, లేక ఆత్మాహుతి చేసుకున్నా, ఎవరికీ కనపడకుండా పోయినా, ఈ విషయం రామునికి తెలియచెయ్యడం మంచిది కాదు. అలాగని సీత గురించి రామునికి చెప్పకుండా ఎంత కాలము దాచగలము! సీత గురించి రామునికి తెలిసినా దోషమే! తెలియకపోయినా దోషమే! ఇప్పుడు నేను ఏం చెయ్యాలి? నాకేది మార్గము? అంతా అగమ్యగోచరంగా ఉంది. సముద్రమును దాటాను, లంకకు వచ్చాను అనుకుంటే, రామ కార్యము అంతా రసాభాస అయింది.” అని హనుమంతుడు పరి పరి విధాలా ఆలోచిస్తున్నాడు.

కాని ఆయన ఆలోచనలు ఒక కొలిక్కిరావడం లేదు. మరలా హనుమంతుని ఆలోచనా ప్రవాహం సాగి పోయింది. “ఇప్పుడు నేను ఏమి సాధించానని కిష్కింధకు తిరిగి వెళ్లాలి. సముద్రము దాటడం, లంకకు రావడం, లంక అంతా వెదకడం అంతా వృధా అయింది కదా! ఒకవేళ నేను కిష్కింధకు వెళితే, సీత జాడ తెలిసిందా అని అడిగితే, రామలక్ష్మణులకు, సుగ్రీవునికి ఏమి సమాధానము చెప్పాలి?

నేను రాముని ముందు నిలబడి సీత కనపడలేదు అని ఒక మాట చెబితే రాముడు కుప్పకూలి పోతాడు, సీతా వియోగబాధతో మరణిస్తాడు. సీత కనపడలేదు అన్న మాట కన్నా రాముని దృష్టిలో మరొక పరుషమైన మాట ఉండదు. రాముడు మరణించడం చూచిన లక్ష్మణుడు కూడా ప్రాణత్యాగము చేస్తాడు. రాముడు, లక్ష్మణుడు మరణించారు అన్న వార్త అయోధ్యకు చేరగానే భరతుడు కూడా మరణిస్తాడు. సోదరుల మరణవార్త విన్న శత్రుఘ్నుడు కూడా మరణించడం తథ్యము. లేక లేక కలిగిన వాళ్లు, పుత్రకామేష్టి యాగఫలంగా జన్మించిన కుమారులు మరణించగానే, కౌసల్యా, కైకేయీ, సుమిత్రల మేనిలో ప్రాణములు నిలువవు. తనకు మిత్రుడు, తనకు సాయం చేసిన వాడు అయిన  రాముడు మరణించగానే, సుగ్రీవుడు కూడా మరణిస్తాడు. సుగ్రీవుని మరణం చూచి సుగ్రీవుని భార్య రుమ కూడా భర్తను అనుసరిస్తుంది. అసలే భర్త వాలిని కోల్పోయి, సుగ్రీవుని పంచన చేరిన తార, సుగ్రీవుడు కూడా మరణించగానే, తాను కూడా మరణిస్తుంది. తండ్రి వాలి, తల్లి తార, పిన తండ్రి సుగ్రీవుడు, పినతల్లి రుమ చనిపోగానే, గుండెపగిలి అంగదుడు కూడా మరణిస్తాడు. కిష్కింధ అనాధ అయి పోతుంది. తమ ఆలనా పాలనా చూచే నాధుడు లేక వానరులు అందరూ ప్రాణత్యాగము చేసుకుంటారు. ఇదంతా నేను కిష్కింధకు వెళ్లి సీత కనపడలేదు అన్న ఒక్క మాట చెప్పినందువల్ల సంభవిస్తుంది. అటు రాముని వంశము, ఇటు సుగ్రీవుని వంశము అంతరిస్తుంది. కాబట్టి నేను కిష్కింధకు వెళ్లనే వెళ్లను. సీత జాడ తెలియకుండా నేను సుగ్రీవుని వద్దకు వెళ్లడం వృథా!

నేను తిరిగి కిష్కింధకు వెళ్లకుండా ఉంటే "ఎప్పటికైనా హనుమంతుడు వస్తాడు, సీత గురించి వార్త తెస్తాడు" అనే ఆశతో రామలక్ష్మణులు, సుగ్రీవుడు, వానరులు జీవించి ఉంటారు. నేను మాత్రము ఇక్కడే ఉండి ఇక్కడ ఉన్న కాయలు పండ్లు తింటూ వానప్రస్థ జీవనము గడుపుతాను. కాలగతిన మృతి చెందుతాను. లేదా చితి పేర్చుకొని అందులో దూకుతాను. లేక సముద్రము ఒడ్డున ప్రాయోపవేశము చేస్తాను. నాశరీరాన్ని పక్షులు, మృగములు తింటాయి. ఇంతకన్నా నాకు మరొక మార్గము కనిపించడం లేదు. నేను ఇంత కాలము సంపాదించుకున్న పేరు, ప్రతిష్ట రామ కార్యము సాధించలేకపోవడం వలన భగ్నమైపోయాయి." అని హనుమంతుడు శోకిస్తున్నాడు.

హనుమంతునికి ఏమి చెయ్యాలో తోచడం లేదు. మితిమీరిన దు:ఖంతో హనుమంతుని ఆలోచనా శక్తి నశించింది. కోపం ఎక్కువ అయింది. ఆ కోపంలో ఇలా అనుకున్నాడు.

"దీనికంతటికీ మూల కారణము ఈ దుష్టుడైన రావణుడు. ముందు వీడిని చంపితే గానీ నా కసి తీరదు. లేకపోతే వీడిని పట్టుకొని పశువును కట్టినట్టు కట్టి, రాముని ముందు పడవేస్తాను. వీడి సంగతి రాముడే చూచుకుంటాడు." అని అనుకున్నాడు హనుమంతుడు.

మరలా హనుమంతుని ఆలోచనలు మొదటికి వచ్చాయి. "లాభం లేదు. సీత కనిపించేవరకూ లంకను మాటి మాటికీ వెదుకుతాను. ఎన్నిసార్లు అయినా వెదుకుతాను. సీత లంకలోనే

ఉందని సంపాతి చెప్పాడు. సంపాతి చెప్పాడు కదా అని రాముని వద్దకు పోయి, రాముని ఇక్కడకు తీసుకొని వస్తే, ఇక్కడ తన భార్య సీత కనపడకపోతే, రాముడు వానరులందరినీ వరస బెట్టి చంపుతాడు. కాబట్టి లంకను వదలకూడదు. వెదకాలి. వెదికి తీరాలి. నేను తగుదునమ్మా అంటూ కిష్కిందకు పోయి అందరి మరణానికి కారణం అయ్యే బదులు ఇక్కడే ఉండి వెదుకుతూ ఉంటే ఎప్పటికైనా సీత జాడ తెలియకపోదు. సీత జాడ తెలిసిన తరువాతనే కిష్కింధకు వెళతాను" అని తనలో తాను అనుకుంటూ తల ఎత్తి చూచాడు హనుమంతుడు.

ఎదురుగా అశోక వనము కనిపించింది. దాని వంక చూచాడు హనుమంతుడు. "ఇదేమిటి. లంక అంతా వెతికాను. ఇక్కడ వెతికినట్టు లేదే! ఇక్కడ కూడా వెదికితే ఒక పని అయిపోతుంది కదా! " అని అనుకున్నాడు.

వెంటనే సమస్త దేవతలకు, ఆదిత్యులకు, రుద్రులకు, అశ్వినీ దేవతలకు, మరుత్తులకు నమస్కారం చేసాడు. "ఈ అశోక వనములో సీత కనపడాలి. నేను సీతను రాముని వద్దకు చేర్చాలి. దానికి మీ సాయం కావాలి." అని అందరినీ ప్రార్థించాడు. జైశ్రీరాం అంటూ పైకి లేచాడు. రాముడికి, సీతకు మనసులోనే నమస్క రించాడు. అశోక వనము వైపు వెళ్లాడు. అశోక వనము ముందు నిలబడ్డాడు.

ఇదివరకు మాదిరి ఎక్కడంటే అక్కడ వెదకకుండా, ఒక పద్ధతి ప్రకారం వెదకాలని నిర్ణయించుకున్నాడు. ఎక్కడెక్కడ రక్షక

భటులుఉన్నారో తెలుసుకున్నాడు. వారికి కనపడకుండా చిన్ని వానరంగా మారాడు. మరలా మరొక సారి సమస్త దేవతలకు రుద్రునికి, బ్రహ్మకు, దేవేంద్రునికి, సూర్యచంద్రులకు నమస్కరించాడు. సకలభూతములకు అధిపతి అయిన మహేశ్వరునికి కార్యసిద్ధి కలిగించమని  మనసారా మొక్కాడు. అశోకవనంలో ప్రవేశించాడు హనుమంతుడు.

(ఇక్కడ మనకు రెండు విషయాలు కనపడుతున్నాయి. మొదటిది. హనుమంతుడు లంక అంతా వెతికాడు.  వెతికే ముందు ఏ దేవునికి మొక్కలేదు. తన స్వశక్తిని నమ్ముకున్నాడు. కాని ఫలితం కనిపించలేదు. ఇప్పుడు అన్ని దేవుళ్లకు మొక్కాడు. అశోక వనంలో సీత కనిపించింది. చాలామంది తమ శక్తిని నమ్ముకుంటారు. దైవాన్ని నమ్మరు. కొంతమంది కేవలం దైవాన్ని నమ్ముతారు. ఏ ప్రయత్నమూ చెయ్యరు. రెండూ పనికిరావు.  మానవ ప్రయత్నమూ దైవశక్తీ కలిసినపుడే కార్యసిద్ధి కలుగుతుంది. అదే హనుమంతుడు చేసాడు. దేవతలందరినీ ప్రార్థించాడు. వారి సాయాన్ని అర్థించాడు.  తన శక్తిని ఉపయోగించి అశోకవనము అంతా వెతికాడు. సీతను కనుగొన్నాడు. కార్యసిద్ధి పొందాడు.

ఇంక రెండవది. హనుమంతుడు అశోకవనము ముందు కూర్చుని   నిర్వేదము పొందాడు. కాని ఆ అశోక వనములోనే సీత ఉందని తెలియదు హనుమంతునికి. సమస్య ఎక్కడ ఉంటుందో దానికి పరిష్కారం అక్కడే ఉంటుంది. కాకపోతే ప్రశాంతమైన మనస్సుతో ఆలోచించాలి. ప్రయత్నం చెయ్యాలి. దైవసాయం అర్థించాలి. అప్పుడు కార్యం సఫలమవుతుంది. చిన్న సమస్య ఎదురైనా కంగారు

పడిపోతాం. ఏమేమోఆలోచిస్తాం. ఏమి చెయ్యలో అది చెయ్యం. అందరినీ తిడతాం. మనలను మనం తిట్టుకుంటాం. హనుమంతుడూ అదే చేసాడు. కాని హనుమంతుని సమస్యకు పరిష్కారం ఎదురుగానే ఉంది. అది గుర్తించిన హనుమంతుడు కార్యరంగంలోకి దూకాడు. దైవ సాయం కోరాడు. రామ కార్యాన్ని సాధించాడు. కాబట్టి మనకు ఏ సమస్య ఎదురైనా కంగారు పడకుండా, ప్రశాంతంగా ఆలోచించాలి. పరిష్కారం వెంటనే దొరుకుతుంది. మనం సుందర కాండము చదివి తెలుసుకోదగిన మంచి విషయాలలో ఇది ఒకటి.)

శ్రీమద్రామాయణము

సుందర కాండము పదమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

పదునాలుగవ సర్గ.

హనుమంతుడు కాపలా వాళ్ల కంటపడకుండా అశోకవనం లోకి ప్రవేశించాడు. ప్రాకారము మీదికి ఎక్కి కిందికి దుమికాడు. చుట్టు చూచాడు.

అశోక వనము చాలా పెద్దది. పుష్పించిన పుష్పములతోనూ, లతలతోనూ, సంపెంగ, పొన్న, జాజి, మామిడి చెట్లతో ఇంకా రకరకాల వృక్షములలోనూ లతలతోనూ నిండి ఉంది. హనుమంతుడు అక్కడే ఉన్న మామిడి చెట్ల సమూహంలోకి ప్రవేశించాడు. అక్కడ లెక్కలేనన్ని మామిడి చెట్లు ఉన్నాయి. ఆ వనములో మృగములు, పక్షులు

యధేచ్ఛగా విహరిస్తున్నాయి. మృగముల అరుపులతో, పక్షుల కిలా కిలా రావాలతో ఆ వనం ప్రతిధ్వనిస్తూ ఉంది. హనుమంతుడు సీతను వెదుకుతూ ఇంకా లోపలకు వెళ్లాడు.

హనుమంతుడు ఒక చెట్టు మీద నుండి మరొక చెట్టు మీదికి వేగంగా దుముకుతుంటే ఆ చెట్ల మీద ఉన్న పక్షులు భయపడి టపా టపా రెక్కల చప్పుడు చేసుకుంటూ ఎగిరిపోయాయి. హనుమంతుడు అలా దుముకుతుంటే పుష్పించిన వృక్షములు పుష్పవర్షము కురిపించాయి. (పూలన్నీ రాలిపోయాయి). ఆ చెట్లమధ్య వేగంగా తిరుగుతున్న హనుమంతుడు వసంత ఋతువులో తిరుగాడు వసంతుని వలె ప్రకాశించాడు. అశోకవనములో ఉన్న నేల అంతా పుష్పములతో నిండి పోయి పుష్పముల తివాచీ పరచినట్టు శోభించింది.

ఒకచెట్టు మీద నుండి మరొక చెట్టు మీదికి లంఘించే హనుమంతుని వేగానికి ఆ చెట్లకు ఉన్న పండ్లు అన్నీ రాలిపోయాయి. ఆకులు ఎగిరిపోతున్నాయి. హనుమంతుడు అడ్డం వచ్చిన చెట్ల కొమ్మలను విరుస్తున్నాడు. చిన్న చిన్న చెట్లను పెకలించి అవతల పారేస్తున్నాడు. పెద్ద పెద్ద తీగలు అల్లుకొన్న పొదలను చిందర వందర చేస్తున్నాడు.

ఆ అశోక వనములో పెద్ద పెద్దదిగుడు బావులు ఉన్నాయి. వాటిలో పక్షులు కూర్చోడానికి చిన్న చిన్న తిన్నెల మాదిరి ఉన్నాయి. ఆ బావులలో తామరలు, కలువలు వికసించి ఉన్నాయి. ఆ బావులలో ఉన్న నీటిలో చక్రవాక పక్షులు, నీటి పక్షులు, హంసలు, సారస పక్షులు

ఈదుతున్నాయి. ఆ అశోక వనములో పెద్ద పెద్ద కొండలు, వాటిలో గుహలు కూడా ఉన్నట్టు హనుమంతుడు చూచాడు. ఆకొండల మీద, గుహలలోనూ సీత కోసం గాలించాడు.

ఆ కొండల మీది నుండి చిన్న చిన్న నదులు వేగంగా కిందికి దుముకుతున్నాయి. అవి మొగుడి మీద అలిగి పుట్టింటికి పోయే భార్యల వలె శోభిల్లుతున్నాయి. ఆ నదుల ప్రవాహానికి అడ్డంగా అక్కడక్కడా కొన్ని చెట్టు కొమ్మలు ఉన్నాయి. అవి ఎలా ఉ న్నాయంటే "మొగుడి మీద అలిగి పుట్టింటికి పోవడంమంచిది కాదు" అని ఆ భామలను అడ్డగిస్తున్న బంధువుల మాదిరి ఉన్నాయి. అవి చూచుకుంటూ హనుమంతుడు ముందుకుసాగాడు.

హనుమంతుడు తామరపూలతో, రకరకాల పక్షులతో శోభిల్లుతున్న సరోవరములను చూచాడు. ఈ సరోవరముల దగ్గర హనుమంతుడు ఒక శింశుపా వృక్షమును చూచాడు. దాని చుట్టు బంగారు అరుగులు కట్టబడి ఉన్నాయి. హనుమంతుడు ఆ శింశుపా వృక్షము మీదకు ఎక్కి ఒక కొమ్మ మీద కూర్చున్నాడు.

"సీత ఇక్కడే ఎక్కడో ఉన్నదని నా మనస్సు చెబుతూ ఉంది. సీత ఇక్కడే తిరుగుతూ ఉంటుంది. సందేహం లేదు. దైవం అనుకూలిస్తే సీత ఇక్కడే నాకు కనపడవచ్చు. ఈ శింశుపావృక్షము, ఈ పద్మము లతో కూడిన సరస్సు చాలా మనోహరంగా ఉన్నాయి. సీతకు ఇటువంటి ప్రదేశము అంటే ఎంతో ఇష్టము. అందుకని సీత ఇక్కడే ఉండాలి. ఇక్కడ లేకపోయిన తప్పకుండా ఈ ప్రదేశానికి రావచ్చు. రాముని మీది విరహముతో బాధపడుతున్న సీత రమ్యమైన హర్మ్యములలో

ఉండదు. ఈ వనములో, ఈ పద్మ సరస్సు చెంత, ఈ అందమైన పక్షులు, మృగముల మధ్యనే ఉంటుంది. సీతకు నియమనిష్టలు ఎక్కువ. ఇప్పుడు సంధ్యాసమయము అయింది. సాయం సంధ్య ఉపాసన కొరకు సీత ఈ పద్మసరోవరము వద్దకు తప్పక వస్తుంది. నిజంగా సీత జీవించి ఉంటే ఈ సుందరమైన సరోవర ప్రాంతమునకు తప్పకుండా వస్తుంది." అని అనుకొన్నాడు హనుమంతుడు.

సీత రాక కోసరం ఎదురు చూస్తూ హనుమంతుడు చుట్టు పక్కలను పరిశీలనగా చూస్తున్నాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము పదునాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

పదునైదవ సర్గ.

హనుమంతునికి ఆ అశోక వన సౌందర్యము ఎంత చూచినా తనివి తీరడం లేదు. ఆ వృక్షములను, లతలను, మృగములను, పక్షులను, సరోవరములను, బావులను, అందులో తిరుగాడే నీటిపక్షులను ఆనందంగా చూస్తున్నాడు. అశోక వనము అనే పేరుకు తగ్గట్టు ఆ వనమంతా అశోక వృక్షములతో నిండి ఉంది. దేవేంద్రుని నందన వనము మాదిరి ప్రకాశిస్తూ ఉంది. ఆ వనంలో ఉన్న చెట్లు లతలు అన్ని ఋతువులలోనూ పుష్పములు, ఫలములు అందిస్తున్నాయి.

అలా చూస్తున్న హనుమంతునికి ఆ శింశుపా వృక్షము దగ్గరలో, పద్మసరోవరము వద్ద ఒక చైత్యప్రాసాదము (మండపము లాంటి ఎత్తైన రాతి కట్టడము) ను చూచాడు. ఆ కట్టడము బాగా ఎత్తుగా, తెల్లటి రంగుతో, కైలాస పర్వతము మాదిరి ఉంది. ఆ కట్టడము దగ్గం. రాక్షస స్త్రీల మధ్యలో, మాసి పోయిన వస్త్రములు ధరించిన ఒక ఉత్తమ జాతి స్త్రీ కనపడింది. సరిగా ఆహారము తినక పోవడం వలన ఆమె బాగా చిక్కిపోయి ఉంది. ఆమె శరీరం చిక్కిపోయినను ఆమె దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంది. మాసిపోయిన వస్త్రమును కట్టుకొన్న ఆమె బురదలో ఉన్న పద్మంలాగా ప్రకాశిస్తూ ఉంది. ఆమె దిగులుతో తల వంచుకొని కూర్చుని ఉంది. ఏమేమో ఆలోచిస్తూ ఉంది. ఆమె చుట్టు రాక్షస స్త్రీలు ఉన్నారు. తన వాళ్ల నుండి తప్పిపోయిన లేడి పిల్ల, తోడేళ్ల గుంపుమధ్య ఉంటే ఎలా ఉంటుందో, ఆ రాక్షస స్త్రీల మధ్య ఆమె తలవంచుకొని కూర్చుని ఉంది.

హనుమంతుడు ఆమెను చూచాడు. ఆమె సీత కావచ్చు అని అనుకున్నాడు. ఆమె అందము, కూర్చున్న తీరు, ఆమె ముఖంలో గూడుకట్టుకున్న విషాదము, ఒక తాపసి వలె ఆమె కూర్చొనడం చూస్తుంటే, ఆమె సీతయే అని హనుమంతుని మనస్సు చెబుతూ ఉంది. పొగతో కప్పబడిన అగ్నిజ్వాల మాదిరి ఆమె ప్రకాశిస్తూ ఉంది. ప్రతిరోజూ స్నానాదికములు చేయక పోవడం వల్ల ఆమె శరీరం మలినంగా ఉంది. నిరంతరమూ కన్నీళ్లు కార్చడం వలన ఆమె చెక్కిళ్ల మీద కన్నీటి చారికలు కనపడు తున్నాయి. మేఘములతో కప్పబడిన సూర్యుని వలె ఆమె ప్రకాశిస్తూ ఉంది.

హనుమంతుడు ఆమెను తదేక దృష్టి తో చూస్తున్నాడు. ఈమె సీత అవునా కాదా అనే మీమాంసలో పడ్డాడు. పైకి కనిపించే లక్షణాలు చూస్తుంటే ఈమె సీత అని నమ్మకం కలుగుతూ ఉంది. కాని మరలా సందేహము. హనుమంతునికి మరొక విషయం గుర్తుకు వచ్చింది. రాముడు తమను కలిసి నపుడు, ఆకాశం నుండి తమ మధ్య పడిన ఆభరణముల మూటను రామునికి చూపినపుడు, రాముడు, సీత అపహరింపబడిన రోజున ధరించిన ఆభరణముల గురించి వివరంగా చెప్పాడు. ఆ మాటలు హనుమంతునికి బాగా జ్ఞాపకం ఉన్నాయి. రాముడు ఏయే ఆభరణములు సీత ఒంటిమీద ఉన్నాయని చెప్పాడో అవే ఆభరణములు ఇప్పుడు కూడా సీత ఒంటిమీద ఉన్నాయి కానీ సంస్కారము లేక పోవడం వలన మట్టికొట్టుకొని పోయి ఉన్నాయి. ఆ ఆభరణములను గుర్తించాడు హనుమంతుడు.

రావణుడు అపహరించుకుపోతున్నప్పుడు సీత కొన్ని ఆభరణములను మూటగట్టి కిందికి జారవిడిచింది. ఆ ఆభరణములు ఇప్పుడు ఆమె ఒంటి మీద లేవు. మిగిలిన ఆభరణములు ఆమె ఒంటి మీద ఉన్నాయి. అంతే కాకుండా సీత తన ఉత్తరీయమును చించి ఆభరణములను కట్టి తమ మధ్య జార విడిచింది. ఆమె ఆభరణము లను కట్టిన ఉత్తరీయపు రంగు, ఇప్పుడు ఆమె ధరించిన వస్త్రము రంగు ఒకటే. ఆభరణములు కట్టిన వస్త్రము ఎలా మెరిసిపోతూ ఉందో ఈమె కట్టుకున్న వస్త్రము కూడా అదే మాదిరి మెరిసిపోతూ ఉంది. కాకపోతే చాలారోజుల నుండి కట్టుకోవడం వలన కొంచెం మాసినట్టు కనపడుతూ ఉంది.

ఈమె శరీర ఛ్ఛాయ, ముఖవర్చస్సు ఈమె కట్టుకున్న వస్త్రములు అన్నీ ఈమె సీత అని చెప్పకనే చెబుతున్నాయి. అదీ కాకుండా ఈమె నిరంతరము తన భర్త రాముని తలచుకోవడం వలన, ఈమె ముఖంలో విషాదం గూడుకట్టుకొని ఉంది. ఈమె సీత కాకపోతే ఇలా విషాదంతో ఉండాల్సిన పని లేదు. పైగా ఈమె ముఖ వర్చస్సు, అందము, అవయవముల పొందిక, రాముని ముఖవర్చస్సు, రాముని అందము, రాముని అవయవముల పొందిక, సరిగ్గా సరిపోయాయి. రాముడు అనుదినమూ సీత కోసరం విషాదంతో దు:ఖిస్తుంటే ఈమె కూడా రాముని కోసరం దు:ఖిస్తూ ఉంది.  ఎవరి కోసరం రాముడు అనుదినమూ పరితపిస్తూ అలమటిస్తున్నాడో ఆసీత ఈమెయే. సందేహము లేదు." అని నిశ్చయించుకున్నాడు హనుమంతుడు.

హనుమంతుని ఆనందానికి అవధులు లేవు. సంతోషంతో పొంగిపోయాడు. ఒక్కసారి మనసులో రాముని స్మరించుకున్నాడు. మనసులోనే రామునికి నమస్కరించాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము పదునైదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# సుందర కాండము

## పదునారవ సర్గ.

అశోక వనములో సీత కనపడగానే హనుమంతుని ఆనందానికి అవదులు లేవు. రాముని మనసారా స్మరించుకున్నాడు. సీత పడుతున్న కష్టాలు చూచి హనుమంతుని హృదయం ద్రవించి పోయింది. హనుమంతుని కనుల నుండి కన్నీళ్లు ధారాపాతంగా కారుతున్నాయి. సీత కష్టములను తలచుకొని ఈ విదంగా బాధపడుతున్నాడు హనుమంతుడు.

"పరాక్రమమును, వినయ విధేయతలను, సమానంగా పుణికిపుచ్చుకున్న లక్ష్మణునికి వదిన అయి ఉండీ సీతమ్మ ఇన్న బాధలు పడుతూ ఉందంటే, కాల గమనమును ఎవరూ అతిక్రమించలేరు కదా! ఇన్ని కష్టములలో కూడా సీత ఇంత నిబ్బరముగా ఉందంటే ఆమెకు రాముని మీద, లక్ష్మణుని మీద అపారమైన నమ్మకము. వారు వచ్చి తనను రావణుని చెర నుండి విడిపించెదరని ప్రగాఢవిశ్వాసముతో ఉంది. రామునికి తగిన భార్య సీత. సీతకు తగిన భర్త రాముడు. ఇందులో సందేహము ఏ మాత్రము లేదు.

సీత ఇంతటి సుగుణవతి, సహనశీలి, సౌందర్యవతి కనుకనే రాముడు సీత గురించి అన్ని కష్టములు పడుతున్నాడు. సీత కోసమే కదా రాముడు, విరాధుడు, ఖరదూషణులు, త్రిశిరుని, ఇంకా పదునాలుగు వేల మంది రాక్షసులను తుదముట్టించాడు. ఈ సీత కారణంగానే కదా, సుగ్రీవుడు రాముని చేత వాలిని చంపించి, తన రాజ్యమును తిరిగి పొందగలిగాడు. నేను కూడా ఈ సీత కోసమే కదా

నూరు యోజనముల దూరము కల సముద్రమును లంఘించి ఈ లంకలో ప్రవేశించింది. ఇటువంటి గుణవతి, రూపవతి, పతివ్రత కోసరం రాముడు ఒక్క లంకనే కాదు ఈ భూమండలమును అంతా జయించిన ఆశ్చర్యపోబని లేదు. ముల్లోకములమీద ఆధిపత్యము ఒక వైపు, సీతను ఒకవైపు ఉంచితే., ముల్లోకాధిపత్యము సీతకు పదహారవ వంతుకు కూడా సరిపోదు. అంతటి మహిమాన్విత సాధ్వి సీత.

ఈ సీత అయోనిజ. సీత తండ్రి జనకుడు యజ్ఞము చేయగోరి, యజ్ఞభూమిని చదును చేయడానికి నాగలి పట్టి దున్నుతుంటే ఆ నాగేటి చాలులో దొరికిన సాధ్వి ఈ సీత. పాతివ్రత్యములో ఈమెకు ఈమెయే సాటి. జనకుని కూతురేకాదు, ఈమె దశరథుని కోడలుకూడా. దశరథుని పెద్దకుమారుడు రామునికి భార్య. అటువంటి సాధ్వి ఈనాడు ఈ ప్రకారంగా రాక్షసస్త్రీల మధ్య కష్టాలు పడుతూ ఉంది. అడవులకు వెళ్లాల్సింది రాముడే అయినా, భర్తమీద అనురాగము, గౌరవం చేత, సమస్తరాజభోగములను వదిలి, నారచీరలు ధరించి, కేవలము కందమూలములు తింటూ, నేల మీద శయనిస్తూ రామునితోపాటు అరణ్యవాసము చేస్తూ ఉంది ఈ సీత. అటువంటి సీతకు రావలసిన కష్టాలా ఇవి!

రావణుడు ఎంత భయపెట్టినా, ప్రలోభ పెట్టినా, చలించని మహాసాధ్వి ఈ సీత. ఇటువంటి సీతను ఇప్పుడు రాముడు చూస్తే ఎంత సంతోషిస్తాడో కదా! సీతను చూచిన రామునికి తిరిగి అయోధ్యకు పట్టాభిషిక్తుడు అయినంత ఆనందం కలుగుతుంది. ఈ సీత రావణుని చెరలో ఇన్ని కష్టములు అనుభవిస్తూ, రాముని గురించి తలచుకుంటూ, ఎప్పటి కైనా రాముడు రాక పోతాడా, తనను ఈ

రాక్షసుని చెరనుండి విడిపించకపోతాడా అని ఎదురు చూస్తూ ఉంది. ఈమెను చూస్తుంటే ఈమెకు తన ఎదురుగా ఉన్న భయంకరా కారులైన రాక్షస స్త్రీలు కానీ, చుట్టు పక్కల ఉన్న లతలు కానీ, పుష్పములు కానీ, అందమైన పూపొదరిళ్లు కానీ, కనిపించడం లేదు. కేవలం ఆమె కనులకు రాముడే కనపడుతున్నాడా అని అనిపిస్తూ ఉంది. స్త్రీకి ఎన్ని ఆభరణములు, అలంకారములు ఉన్నా, భర్తను మించిన అలంకారము వేరొకటి లేదు. అటువంటి సీతకు భర్త దగ్గర లేకపోవడం వల్ల, అలంకార విహీనంగా కనపడుతూ ఉంది. సీతవంటి భార్య అపహరింపబడినా, ఈమెనే తలచుకుంటూ రాముడు కాలం గడుపుతున్నాడు అంటే రాముని మించిన భర్త మరియొకడు ఉండబోడు.

ఎటువంటి సంబంధము లేని నాకే ఈమెను చూస్తే మనసు ద్రవించి పోతూఉంటే, ఇంక ఈమెను భార్యగా పొంది, అకారణంగా ఈమెను పోగొట్టుకున్న రాముని సంగతి వేరే చెప్పాలా! అరణ్యవాస సమయంలో ఈ సీతను రామలక్ష్మణులు కంటికి రెప్పలా కాపాడేవారు. ఇప్పుడు ఈమె ఈ రాక్షసస్త్రీల కాపలాలో ఉంది. ఎంత విచిత్రము. అరణ్యవాసంతోనే సతమతమవుతున్న సీతకు ఈ అపహరణము, రాక్షస స్త్రీల సహచర్యము ఎంత బాధకలిగిస్తూ ఉందో కదా! ఈమె సీతయే. సందేహము లేదు." అని సీత పడుతున్న కష్టములను చూచి హనుమంతుడు బాధపడుతున్నాడు. ఆమెనే చూస్తూ ఆ చెట్టు మీద కూర్చొని ఉన్నాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము పదునారవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# సుందర కాండము

## పదునేడవ సర్గ.

ఇంతలో చీకటి పడింది. చంద్రోదయం అయింది. చంద్రుడు పండువెన్నెల కురిపిస్తున్నాడు. వాతావరణము ఎంతో ఆహ్లాదకరంగా ఉంది. ఆ వెన్నెలలో హనుమంతునికి సీత స్పష్టంగా కనపడుతూ ఉంది. సీత కనపడింది అన్న సంతోషంలో హనుమంతుడు చుట్టుపక్కల ఉన్న రాక్షస స్త్రీలను సరిగా చూడలేదు. ఇప్పుడు హనుమంతుడు వారి మీద దృష్టి పెట్టి చూస్తున్నాడు.

ఆ రాక్షస స్త్రీల ఆకారాలు ఒకటీ సరిగా లేదు. అన్నీ వికృతాకారులే! ఒక దానికి ఒక కన్ను , దొప్పల్లాంటి చెవులు ఉన్నాయి. మరొక దానికి చెవులే లేవు. మరొక దానికి చెవులు మొనలు దేలి ఉన్నాయి. ఒక దానికి శరీరం సన్నగా తల పెద్దదిగా ఉంది. ఇంక వాళ్ల కేశ సంపద గురించి చెప్ప పనిలేదు. అందరికీ దాదాపు తైల సంస్కారములేని చింపిరి .జుట్టు. కొన్నిటికీ పొట్ట, స్తనములు వేలాడుతూ ఉన్నాయి. ఒకతి పొట్టిది. మరొకతి పొడుగు. ఒకదానికి ఎత్తు పళ్లు మరొక దానికి అసలు పళ్లే లేవు. ఇలా ఒకదానిని మించి ఒకటి వికృతాకారంతో ఉన్నాయి. ఆ వికృతాకారులైన రాక్షస స్త్రీలను చూచాడు హనుమంతుడు.

వారు తమ చేతిలో శూలములు, ముద్గరలు ధరించి ఉన్నారు. ఆ రాక్షస స్త్రీలు ఆ శింశుపా వృక్షము చుట్టు కూర్చుని ఉన్నారు. వారికి మద్యము, మాంసము అంటే ఎంతో ఇష్టము లాగుంది. వారు

నిరంతరమూ మాంసము తింటూ మద్యము సేవిస్తున్నారు. వారి మధ్యలో మూర్తీభవించిన శోకదేవతలా కూర్చుని ఉంది సీత.

సీతకు ఆభరణములు లేక పోయినా పాతివ్రత్యము అనే ఆభరణంతో ప్రకాశిస్తూ ఉంది. సీత ఒంటి మీద ఎన్ని ఆభరణములు ఉ న్నా భర్త అనే ఆభరణం లేకపోవడంతో దరిద్రురాలిగా కనిపిస్తూ ఉంది. ఎల్లప్పుడూ భర్త సన్నిధిలో కాలం గడపవలసిన సీత ఈ ప్రకారంగా రాక్షస స్త్రీల సమూహంతో కాలం గడపవలసి రావడం ఎంతో బాధగా ఉంది. కాని రాముని పరాక్రమము ఎరిగిన సీత, తన కష్టములకు బాదపడటం లేదు. ఆమె పాత్రివ్రత్యమే ఈమెను రక్షిస్తూ ఉంది. ఎంతో సహనంతో ఓర్పుతో ఉన్న సీత సాక్షాత్తు భూదేవిని తలపిస్తూ ఉంది. తన పాతివ్రత్యమే ఆభరణంగా కలిగిన సీత, మాసిపోయిన చీర ధరించి, భయంకరమైన ఆకృతులుకలిగిన రాక్షస స్త్రీల మధ్య కూర్చుని ఉండటం చూచాడు హనుమంతుడు.

ఎవరైనా తనను చూస్తారేమో అని చెట్ల ఆకుల మధ్యన నక్కి నక్కి కూర్చుని ఉన్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము పదునేడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## పదునెనిమిదవ సర్గ.

రాత్రి మెల్లిగా గడిచింది. ఇంక ఒక జాము రాత్రి మాత్రమే మిగిలి ఉంది. తూర్పున తెల తెల వారుతూ ఉంది. లంకా నగరంలో దుర్మార్గులైన రాక్షసులే కాదు. వేదవేదంగపారంగతులు అయిన రాక్షసులు కూడా ఉన్నారు. వారు తెల్లవారుజామునే లేచి స్నానమాచరించి వేదపఠనం చేస్తున్నారు. ఆ వేదఘోషలు హనుమంతుని చెవికి సోకుతున్నాయి. రావణుని అంత:పురములో వంది మాగధులు రావుణుని నిద్రలేపుతున్నారు. మంగళ వాద్యములు మనోహరంగా వినపడుతున్నాయి.

మంగళవాద్యములు మధురంగా చెవి సోకుతుండగా, రావణుడు నిద్రనుండి మేల్కొన్నాడు. లేచీ లేవగానే రావణునికి సీత గుర్తుకు వచ్చింది. వెంటనే సీత మీద మోహము, కామము రావణుని మనసులో పెల్లుబికాయి. సీతను చూడంది నిలువలేకపోతున్నాడు రావణుడు. గబగబా కాలకృత్యాలు తీర్చుకున్నాడు. ఆభరణములు అలంకరించుకున్నాడు. మైపూతలు పూసుకున్నాడు. సీతను ఉంచిన అశోక వనంలోకి ప్రవేశించాడు.

రావణుని అనుసరించి సౌందర్యవతులైన నూరుమంది కన్యలు వెళుతున్నారు. కొంత మంది వింజామరలు వీస్తున్నారు. మరి కొంత మంది ఛత్రములు పడుతున్నారు. మరికొందరు బంగారు కాగడాలు పట్టుకొని దారి చూపిస్తున్నారు. కొంత మంది సుగంధ

పానీయములు తీసుకొని వెళుతున్నారు. మరి కొందరు ఆయుధములు ధరించి రావణునికి రక్షణగా వెళుతున్నారు. ఒక వనిత మద్యము నింపిన బంగారు పాత్రను పట్టుకొని రావణుని పక్కనే నడుస్తూ ఉంది. వారి వెనక రావణుడు అపహరించుకు వచ్చిన ఉత్తమజాతి స్త్రీలు నడుస్తున్నారు. వారి వెనక రావణుని భార్యలుకొంత మంది రావణుని మీద గౌరవంతో కానీ, రావణుని మీద కోరికతో కానీ, కామంతో కానీ ఆయన వెంట వెళుతున్నారు. వారందరికీ నిద్రమత్తు, రాత్రి తాగిన మద్యము మత్తు వదల లేదు. తూలుతూ నడుస్తున్నారు. వారి జుట్టు వీడిపోయింది. పూలమాలలు వాడి పోయాయి. ఆభరణములు చెదిరిపోయాయి. అటువంటి స్త్రీలు అనుసరించి రాగా, రావణుడు సీత మీద కోరికతో ఆమెను పొందవలెననే గాఢమైన కాంక్షతో సీత ఉన్న అశోకవనానికి వెళుతున్నాడు.

రావణుడు తన పరివారముతో అశోకవనము ద్వారమును సమీపించాడు. హనుమంతుడు రావణుని ద్వారం దగ్గర ఉండగానే చూచాడు. రావణుని మొహంలో కామము, దర్పము, మదము స్పష్టంగా కనపడుతూ ఉంది. హనుమంతుడు ఆకుల సందులలో నుండి రావణుని నిశితంగా పరిశీలిస్తున్నాడు. హనుమంతుడు రావణుని వెంట నడుస్తున్న ఉత్తమ జాతి స్త్రీలను కూడా పరిశీలనగా చూచాడు. రాత్రి తాగిన మత్తు ఇంకా దిగని, ఒంటినిండా ఆభరణము లను ధరించిన, ఉత్తమ జాతి స్త్రీలు వెంటరాగా, విశ్రవసు పుత్రుడైన రాక్షస రాజు రావణుని చూచాడు హనుమంతుడు. రావణుని తేజస్సు చూచి హనుమంతుడు ఆశ్చర్యపోయాడు. రావణుడు సరిగా కనిపించడం లేదని ఒక కొమ్మమీది నుండి మరొక కొమ్మ మీదికి దూకుతూ, రావణుని పరిశీలనగా చూస్తున్నాడు హనుమంతుడు.

ఎప్పుడెప్పుడు సీతను చూద్దామా అనే ఆతురతతో రావణుడు గబ గబా సీత ఉన్న చోటికి వస్తున్నాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము పదునెనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
పంతొమ్మిదవ సర్గ.

తెల్లవారుజామున అట్టహాసంగా పరిజనులతో కూడా బయలు దేరిన రావణుడు సీత ఉన్న అశోక వనమునకు వచ్చాడు. ఆ సమయంలో వచ్చిన రాక్షస రాజు రావణుని చూచి సీత మనసు తల్లడిల్లిపోయింది. ఆమె లేత చిగురాకులా వణికిపోయింది. సీత తన అవయవములను దగ్గరగా చేర్చుకొని ముడుచుకొని కూర్చుంది.

రాక్షస స్త్రీల మధ్య కూర్చుని ఉన్న సీతను చూచాడు రావణుడు. మనసులో రాముని తప్ప మరొకరిని తలంపని సీతను చూచాడు రావణుడు. సీత శరీరం లంకలో ఉన్నా మనసు మాత్రం రాముని వద్దనే ఉన్న సీతను చూచాడు రావణుడు. మంత్ర తంత్రములతో కట్టబడిన మహాసర్పము వలె ఉన్న సీతను చూచాడు రావణుడు. నివురు గప్పిన నిప్పులా శోకముతో కప్పబడిన అగ్నిజ్వాలలాంటి సీతను చూచాడు రావణుడు. రాముని కోసరం పరితపిస్తూ, కేశసంస్కారములేక, మాసిన బట్టలతో కూర్చుని ఉన్న

సీతను చూచాడు రావణుడు. నిత్య ఉపవాసములతోనూ, రాముని గురించిన ఆలోచనలతోనూ, రావణుని వలన భయంతోనూ, మనసులో కేవలము రాముని ధ్యానిస్తూ కృశించిన శరీరంతో ఉన్న సీతను చూచాడు రావణుడు. తన మనసులో, రాముడు ఎప్పుడు వచ్చి రావణుని చంపుతాడా, తనను రావణ చెరనుండి విడిపిస్తాడా, అని నిరంతరము కోరుకుంటున్న సీతను చూచాడు రావణుడు.

ఆ సమయంలో వచ్చిన రావణుని చూచి సీత విలపిస్తూ ఉంది.

శ్రీమద్రామాయణము
సుందర కాండము పంతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
ఇరువదవ సర్గ.

రాక్షస స్త్రీల మధ్య మూర్తీభవించిన శోకదేవతవలె కూర్చుని ఉన్న సీతను చూచాడురావణుడు. రావణుడు సీత దగ్గరగా వచ్చాడు. సీతను చూచి అనునయంగా ఇలా అన్నాడు.

“ఓ సీతా! నన్ను చూచి ఎందుకు భయపడి అలా ముడుచుకొని కూర్చుంటావు. నేనంటే నీకు ఎందుకు భయము? నేను కేవలము నిన్ను కోరుకుంటున్నాను. నువ్వు అంటే నాకు ఎంతో ఇష్టం. నేను నీ నుండి ప్రేమను ఆశిస్తున్నాను. నా మనోహారిణీ! నన్ను

కరుణించు. ఇక్కడ ఎవరిని చూచి భయపడుతున్నావు. ఇక్కడ మనుషులు ఎవరూ లేరే! లేక కామరూపులైన రాక్షసులు కూడా ఎవరూ లేరే! అంతా మనవాళ్లే కదా. వాళ్లని చూచి ఎందుకు భయము. ఇంక నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. నువ్వు అంటే పడి చస్తున్నాను. నేనంటే ఎందుకంత భయము?

ఓహో! వివాహితవైన నిన్ను నీ భర్తకు తెలియకుండా తీసుకొని వచ్చాననా! అలా తీసుకురావడం మా రాక్షసులలో ఆచారము సీతా! ఇతరుల భార్యలతో సంగమించడం, ఇతర స్త్రీలను బలవంతంగా ఎత్తుకు రావడం, రాక్షసుల ధర్మము. మా ధర్మం మేము చేస్తున్నాము. దీనికి భయపడటం ఎందుకు. రాక్షస ధర్మము ప్రకారము నిన్ను బలవంతంగా నైనా అనుభవించగలను. కానీ, నేను అలా చేయను. నీకు నా మీద ప్రేమ కలగాలి. నీ అంతట నువ్వే నా కౌగిట్లో చేరాలి. అప్పటి దాకా నిన్ను ముట్టను. తెలిసిందా నేనెంత మంచి వాడనో!

ఓ సీతా! నన్ను నమ్ము. నేను అబద్ధము ఆడటం లేదు. నిజమే చెబుతున్నాను. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు కూడా నన్ను ప్రేమించు. ఇద్దరం ప్రేమసాగరంలో ఓలలాడతాము. అంతే కానీ, తిండితినకుండా ఇలా నీ అందమైన శరీరాన్ని కృశింపచేసుకుంటే ఏమి లాభం? అయ్యో! సీతా! ఏమిటీ పనులు. ఒకే జడ వేసుకుంటావు. నేలమీద పడుకుంటావు. సరిగా భోజనం చెయ్యవు. నీ లాంటి రాజకుమారికి, సౌందర్యవతికి ఇలా చేయడం తగునా? అదే నువ్వు నన్ను ప్రేమించావనుకో, క్షణంలో నీ రూపు రేఖలు మారిపోతాయి. రకరకాల చందనములు, లేపనములు, మైపూతలు, ఆభరణములు,

మద్యములు, శయనాగారములు, హంసతూలికా తల్పములు, నృత్యగీతావినోదములు, ఓహ్ నిన్ను  మహారాణిగా మార్చేస్తాను.

ఓ సీతా!  నువ్వు ముల్లోకములలో ఉన్న స్త్రీలందరిలో రత్నము వంటి దానవు. అటువంటి నీవు అలంకారములు లేకుండా ఆభరణములు లేకుండా ఉండటం ధర్మమా! నా దగ్గరకు రా! నీకు సమస్త భోగములు సమకూరుస్తాను. నీకు ఉన్న నవయవ్వనంలో ఒక్కొక్కరోజు వృధాగా గడిచిపోతుంటే నాకు ఎంతో బాధగా ఉంది. యవ్వనం ఉండేది అనుభవించడానికే కదా! మరి అటువంటి యౌవ్వనాన్ని ఎందుకు వృధా చేసుకుంటావు? ప్రవహిస్తున్ననీరు తిరిగి రానట్టు, గతించిన యవ్వనం తిరిగి రాదు కదా!

ఓ సీతా! నీకో విషయం తెలుసా! బ్రహ్మ దేవుడు అందమైన సౌందర్యవతులను సృష్టిస్తూ, నిన్ను అతిలోక సౌందర్యవతిగా సృష్టించి, తరువాత,  సృష్టిని ఆపివేసినట్టున్నాడు. అందుకనే నీ లాంటి సౌందర్యవతి ముల్లోకములలో లేదు! అంతెందుకు,  ఆ బ్రహ్మదేవుడు నిన్ను సృష్టించి భూలోకంలో పడేసాడు కాబట్టి సరిపోయింది. లేకపోతే, రూపయవ్వనములతో ప్రకాశిస్తున్న నిన్ను చూసి, ఇప్పుడు  ఆ బ్రహ్మదేవుడు కూడా నిన్ను  వదిలిపెట్టడు.  ఇంక నేనెంత.

సీతా! నీ ప్రతి అయవయములో సౌందర్యం తొణికిసలాడుతూ ఉంటుంది. నీలో ఏఅవయానికి ఆ అవయవమే అందంగా కనిపిస్తుంది.  నీ శరీరంలో ఏ అవయవాన్ని చూచినా నా చూపు అక్కడే నిలిచి పోతుంది. అంత అందంగా ఉంటావు నువ్వు. కాబట్టి ఈ మూర్ఖత్వాన్ని విడిచిపెట్టు. జీవితాన్ని సుఖమయం చేసుకో.

నన్ను వరించు. నాకు భార్యవు కా! నేను ఎన్నో దేశాల నుండి ఎందరో రాకుమార్తెలను తీసుకొని వచ్చి నా అంత:పురంలో ఉంచాను. నీకు వారందరూ సేవలు చేస్తారు. వారందరికీ నిన్ను యజమానురాలిని చేస్తాను. నిన్ను నా పట్టమహిషిగా చేసుకుంటాను. నేనూ, నా లంకా రాజ్యము, నా సంపదలు అన్నీ నీ అధీనములు. అంతెందుకు. ఈభూమి సమస్తమును జయించి నీకు కానీ, నీ తండ్రి జనకునకు గానీ ఇస్తాను.

ఓ సీతా! ఈలోకంలో నన్ను ఎదిరించి నిలబడగలిగిన వీరుడు ఎవడూ లేడు. నేను అజేయుడను. నేను ఎన్నోసార్లు దేవతల మీద, దానవులమీద దండెత్తి వారిని జయించాను. వారి రాజ్యములను స్వాధీనపరచు కున్నాను. ఇప్పటికీ వారెవరూ నన్ను కన్నెత్తి కూడా చూడలేరు. ఇంతటి పరాక్రమవంతుడనైన నేను నీ కోసం ప్రాధేయపడుతున్నాను. నా మీద దయచూపు. నన్ను కరుణించు. వరించు. బాగా అలంకరించుకో. ఆభరణాలు ధరించు. నీకు ఇష్టంవచ్చిన పదార్థాలు తిను. తాగు. ఆనందాన్ని అనుభవించు. నీకు ఇష్టం వచ్చినట్టు దానములు, ధర్మములు చెయ్యి. నేను నీకు దాసుడను. నన్ను ఆజ్ఞాపించు. నేనునీ కనుసన్నలలో మెలగుతాను.

నీ కీర్తిని ఐశ్వర్యమును చూచి నీ బంధువులు,మిత్రులు ఎంతో సంతోషిస్తారు. రావణుని పట్టమహిషి అంటే నీకు ఎంతో గౌరవ మర్యాదలు లభిస్తాయి. అంతేకానీ, రాజ్యముపోగొట్టుకొని నార చీరలు కట్టుకొని అడవులను పట్టి తిరిగే ఆ రాముడి దగ్గర ఏముంది? అసలు ఇంత కాలము రాముడు జీవించి ఉన్నాడో లేదో అని నా అనుమానము. మా రాక్షసులు ఆ రాముని ఎప్పుడో చంపి తినేసి ఉంటారు! ఒక వేళ రాముడు జీవించి ఉన్నా, తన జీవిత కాలంలో నిన్ను

చూడలేడు, కలుసుకోలేడు. హిరణ్యకశిపుడైనా ఇంద్రుడు అపహరించిన తన భార్యను తిరిగి పొందగలిగాడేమో గానీ, రాముడు మాత్రం నా చేతిలో చిక్కిన నిన్ను పొందలేడు.

అదేమిటో గాని సీతా! నా మనసును నువ్వు గరుడుడు నేల మీద ఉన్న సర్పాన్ని హరించి నట్టు హరించావు. నువ్వు నా మనోహారిణివి. చూడు. నువ్వు మాసిపోయిన చీర కట్టుకున్నావు. నగలు పెట్టుకోలేదు. అలంకరించుకోలేదు. అయినా నిన్ను చూస్తుంటే, నాకు నీ మీద మోహం పుడుతోంది. నిన్ను చూసిన తరువాత నా భార్యలతో ఆనందంగా గడపలేకపోతున్నాను. మరలా చెబుతున్నాను. ఓ సీతా! నా అంత:పురములో నీ వంటి గుణవతులు, శీలవతులు సౌందర్యవతులు అయిన స్త్రీలు ఎంతో మంది ఉన్నారు. వారందరికీ నిన్ను రాణిని చేస్తాను. వారందరూ దేవతలు లక్ష్మీదేవిని కొలిచినట్టు నిన్ను సేవిస్తారు.

నీకు తెలుసుకదా! కుబేరుడు ముల్లోకములకు ధనాధి పతి. ఆ కుబేరుని సంపద అంతా నా వద్ద ఉంది. ఆ సంపద అంతా నీది. నీవే దానికి అధిపతివి. ఆ సంపదలను, నన్ను, నీ ఇష్టం వచ్చినట్టు అనుభవించు. ఐశ్వర్యములోగానీ, పరాక్రమములోగానీ, తపశ్శక్తిలో గానీ, ధనములో గానీ, కీర్తిలోగానీ, ఆ రాముడు నా కాలి గోటికి కూడా సాటి రాడు.

కాబట్టి ఓ సీతా! నా సంపదలను అనుభవించు. నన్ను నీ వాడిని చేసుకో. ఇష్టం వచ్చినట్టు తిను. తాగు. క్రీడించు. భోగములు అనుభవించు. నాతో కలిసి ఉద్యానవనములలో, సముద్ర తీరాలలో,

పూల పొదరిళ్లలో విహరించు. నీ బంధువులనందరినీ పిలిపిపంచు. వారందరితో ఆనందంగా గడుపు. నీ ఇష్టం." అని సీతను సకల విధాలుగా ప్రలోభపెట్టాడు రావణుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఇరువదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

ఇరువది ఒకటవ సర్గ.

రావణుడు పలికిన పలుకులు అన్నీ సావధానంగా వింది సీత. పక్కనే ఉన్న ఒక గడ్డి పరకను తీసింది. రావణుడికి తనకూ అడ్డుగా పెట్టింది. ఆ గడ్డి పరకనే రావణుని గా భావించి బదులుచెప్పింది.

" ఓ రావణా! నీకు ఎంతో మంది భార్యలు ఉన్నారు. నన్ను ఇంతగా బతిమాలే బదులు నీ ప్రేమను నీ భార్యలకు పంచి ఇవ్వు. వారిని ప్రేమించు. అంతే కానీ, పరుల భార్యను అయిన నా వెంట ఎందుకు పడతావు.

నీవు రాక్షసుడవు. నీకు ఇతరుల భార్యలను అపహరించి అనుభవించడం ధర్మమే కావచ్చు కానీ నేను మానవ కాంతను. ఉత్తమమైన వంశంలో పుట్టాను. మరొక ఉత్తమమైన ఉత్తమ వంశంలోకి కోడలిగా వెళ్లాను. నా భర్తనే దైవంగా భావించిన

పతివ్రతను. నీ రాజ్యమును, ఐశ్వర్యమును, భోగములను ఆశించి నేను ఇటువంటి నీచమైన కార్యమును చేయలేను." అని సౌమ్యంగా చెప్పింది సీత.

తరువాత రావణుని వంక కాకుండా, శూన్యంలోకి చూస్తూ ఇలా అంది.

"నీవు ధర్మములు తెలిసినవాడవు. నీ పూర్వీకులు పాటించిన ధర్మమును పాటించు. పరస్త్రీని కోరుకోకు. నేను నీకు తగిన దానిని కాను. నీవు నీ భార్యలను ఎలా రక్షించుకుంటావో, ఇతరుల భార్యలు కూడా అలా రక్షింపబడవలసిన వారే కదా! నీ భార్యలను ఇతరులు అపహరిస్తే నీకు ఎంత బాధ కలుగుతుందో, నీవు ఇతరుల భార్యలను అపహరిస్తే వారికి కూడా అంతే బాధకలుగుతుంది కదా! ఆ విషయాన్ని గ్రహించుకో! అందుకని నీ భార్యలతో సుఖించు. ఇంట్లో ఉన్న భార్యలతో సుఖములు అనుభవించకుండా పరుల భార్యలతో సుఖాలు కోరుకునే వాళ్లను, ఆ పరుల భార్యలు పరాభవిస్తారు, శపిస్తారు.

ప్రస్తుతము నీ బుద్ధి ఇతరుల భార్యల మీద ఉంది. ఇంత విపరీత బుద్ధికల రాజుకు హితబోధ చేసే మంత్రులు, గురువులు, హితులు నీ రాజ్యంలో లేరా! నీ రాజ్యంలో అంతా నీ లాంటి విపరీత బుద్ధులు కలవారేనా! లేక, నీకు హితులైన వారు నీకు హితబోధ చేసినా, నీకు వినాశ కాలము దాపురించి, వారి హితోక్తులను నీవుపెడచెవిని పెడుతున్నావా! ఇంద్రియ నిగ్రహము లేని రాజు పాలనలో నగరములు, రాష్ట్రములు నాశనం అవుతారు. ప్రజలు కష్టాల పాలవుతారు. పరదారాసంగమం కోరుకునే నీ లాంటి రాజు దొరకడం

వలన ఈ లంకారాజ్యము తొందరలో నాశనం కాబోతోంది. దుర్మార్గుడు, పాపాత్ముడు అయిన నీ పతనం చూచి సకల జనులు సంతోషిస్తారు. నిన్ను అయ్యోపాపం అనే వాడు ఉండడు. నీచేత బాధలు పడిన వారంతా నీ పీడ విరగడ అయిందని ఆనందంతో పండుగలు చేసుకుంటారు.

నువ్వు నీ ఐశ్వర్యమును, ధనమును చూపి నన్ను ప్రలోభపెట్టావు. నేను నీ ఐశ్వర్యమునకు ధనమునకు, భోగములకు లొంగను. సూర్యుని నుండి కాంతిని ఎలా వేరు చెయ్యలేరో, రాముని నుండి నన్ను ఎవరూ వేరు చెయ్యలేరు. నేను రాముని పాణిగ్రహణము చేసినది మొదలు, ప్రతిరోజూ రాముని చేతిని నా తలగడగా పెట్టుకొని నిద్రిస్తున్నాను. అటువంటిది ఇప్పుడు మరొక పురుషుని చేతిని తలగడగా ఎలా పెట్టుకొని నిద్రించగలను. నేను రాముని భార్యను, నా జీవితాంతము నేను రామునికే భార్యను. మరొకరికి కాదు. కాబట్టి ఇప్పటి కన్నా తెలివి తెచ్చుకొని నన్ను రాముని వద్దకు చేర్చు. నీ ప్రాణాలు కాపాడుకో. నీవు నాలుగా కాలాల పాటు నీ భార్యలతో సుఖంగా ఉండాలన్నా, ఆనందంగా రాజ్యము చేయాలన్నా, వెంటనే రామునితో స్నేహం చెయ్యి. చేసిన తప్పు ఒప్పుకొని రాముని శరణు వేడు. రామునికి నన్ను అప్పగించు. రాముడు తప్పకుండా నిన్ను క్షమిస్తాడు. కాబట్టి రామునితో స్నేహంచేసుకోవడమే యుక్తము.

రావణా! నన్ను రాముని వద్దకు చేరిస్తేనే నువ్వు బతుకుతావు. లేకపోతే చస్తావు. ఇంద్రుడు ప్రయోగించిన వజ్రాయుధము వేటును నువ్వు తప్పించుకోవచ్చు. యమధర్మరాజు పాశము బారి నుండి నువ్వుబయట పడవచ్చు కాని రాముని వింటి

నుండి వెలువడ్డ బాణము మాత్రము నిన్ను వదిలిపెట్టదు. రాముడు కూడా నిన్ను విడిచి పెట్టడు. వెతికి వెతికి చంపుతాడు. నీవు ఇంద్రుని వజ్రాయుధము యొక్క ప్రచండ ధ్వని వినిఉంటావు. కానీ రాముని ధనుష్టంకారమును విని ఉండవు. వింటే నీ గుండెలు బద్దలవుతాయి. తొందరలోనే రాముని పేరు లక్ష్మణుని పేరు చెక్కబడిన బాణములు నీ లంకారాజ్యంలో పడతాయి. రాక్షసులను హతమారుస్తాయి. లంకా నగరమంతా రామ బాణములతో కప్పబడిపోతుంది. గరుత్మంతుడు పాములను చంపినట్టు రామ బాణములు రాక్షసులను హతమారుస్తాయి.

రాముడు జనస్థానములో ఉన్న 14,000 మంది రాక్షసులను చంపి దానిని శ్మశానంగా మార్చాడు. అప్పుడు రాముని ఏమీ చేయలేక రాముడు ఇంటలేని సమయంలో నన్ను అపహరించావు. పెద్దపులుల ఎదుట కుక్క ఎలా నిలువలేదో, రామలక్ష్మణుల ముందు నువ్వు కూడా నిలువలేవు.

రావణా! మరలా చెబుతున్నాను విను. రాముడు తొందరలోనే వచ్చి నిన్ను చంపి నన్ను తీసుకొని వెళతాడు. నీకు వినాశకాలము దాపురించింది. నీవు ముల్లోకములలో దాగినను, రామ బాణము నిన్ను విడిచి పెట్టదు. వెతికి వెతికి హతమారుస్తుంది. జాగ్రత్త!" అని పలికి మౌనం వహించింది సీత.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఇరువది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# సుందర కాండము

## ఇరువది రెండవ సర్గ.

సీత పలికినపలుకులు అన్నీ సావధానంగా విన్నాడు రావణుడు. అతనికి కోపం తలకెక్కింది. కాని తమాయించుకున్నాడు. స్త్రీలను వశం చేసుకొనేటప్పుడు కోపం పనికిరాదు అని అనుకున్నాడు రావణుడు. అందుకని సౌమ్యంగానే మాట్లాడాడు.

"ఓ సీతా! స్త్రీలకు మంచి మాటలు చెప్పేకొద్దీ వాళ్లు మగాళ్లను తిరస్కరిస్తుంటారు. కానీ ఆ స్త్రీలే బుజ్జగించిన కొద్దీ పురుషుడు వాళ్లకు స్వాధీనుడవుతాడు. దాసుడవుతాడు. ఇదీ స్త్రీలతో వ్యవహరించేటప్పుడు ఆచరించవలసిన ధర్మము. నీ మాటలు విన్న కొద్దీ నాకు కోపం ఎక్కువ అవుతూ ఉంది. కానీ నీ మీద నాకు ఉన్న కోరిక, కామము ఆ కోపాన్ని అణగదొక్కుతూ ఉంది. కామానికి వ్యతిరేక స్వభావము ఉంది. నువ్వు ఎంత కాదన్నా నీమీదనే నాకు మనసు అవుతూ ఉంది. నీ మీద కోరిక ఇంకా ఇంకా పెరుగుతూ ఉంది.

సకలైశ్వర్యవంతుడనైన నన్ను విడిచి అడవులలో తిరిగే ఆ రాముని నీవు ఎల్లప్పుడూ తలచుకుంటున్నావో అప్పుడే నిన్ను చంపాలనీ, నరకాలనీ అనుకున్నాను. కానీ నీ మీద నాకు ఉన్న కోరిక నన్ను ఆ పని చెయ్యనివ్వడం లేదు. ఇప్పటి దాకా నువ్వు నన్ను అన్న పరుషమైన మాటలకు ఒక్కొక్క మాటకూ ఒక్కొక్కసారి నిన్ను నరకాలని ఉంది. నీ మీద ఉన్న ప్రేమతో, కామంతో, ఆ పని చేయలేకపోతున్నాను. నీకుగా నీవు నా దగ్గరకు వచ్చేవరకూ నేను నిన్ను తాకను. అందుకే నీకు రెండు మాసములు గడువు ఇస్తున్నాను. ఈ రెండు మాసములు

దాటగానే నువ్వు నా పడక మీదికి రావాలి. తప్పదు. ఈ రెండు మాసములలోగా నీవు నన్ను నీ భర్తగా, ప్రియునిగా అంగీకరించాలి. ఈ రెండు మాసములలో నీవు నన్ను వరించకపోతే, రెండు మాసములు గడువు తీరిన మరునాడు నిన్ను మా వంటశాలకు తీసుకొని పోయి వధించి, నీ మాంసమును వండి, నాకు ఆ రోజు ఉదయము తీసుకొనే అల్పాహారముగా నాకు వడ్డిస్తారు. తరువాత నీ ఇష్టం." అని పరుషంగా పలికాడు రావణుడు.

రావణుని మాటలకు రావణుని వెంట వచ్చిన స్త్రీలు కన్నీళ్లు పెట్టుకున్నారు. కానీ రావణునికి భయపడి వారు ఎవరూ నోరు మెదపలేదు. ఆ మాటలు విన్న సీత రావణునితో ఇలా అంది:

"నీ మాటలు వింటూ ఉంటే నీ రాజ్యములో నీ క్షేమము కోరేవారు, నీకు హితము చెప్పేవారూ ఎవరూ లేరని అనిపిస్తూ ఉంది. నేను రాముని భార్యను. నీ లాంటి మూర్ఖుడు తప్ప వేరెవరూ పరాయివాడి భార్యను కోరుకోడు. రాముని భార్యను అయిన నాతో ఇటువంటి ప్రేలాపనలు పేలినందుకు రాముని చేతిలో నీకు దండన తప్పదు. రాముడు ఏనుగు లాంటి వాడు. రాముని ముందు నీవు కుందేలు వంటి వాడివి. రాముని పాదాల కిందపడి నలిగిపోతావు.

నీకు నిజంగా వీరత్వము, పరాక్రమము ఉంటే ఇలా పిరికిపందలా లంకలో కూర్చుని ఆడవాళ్లతో, ఆడవాళ్ల ముందు బీరాలు పలుకవు. నీకు ధైర్యం ఉంటే రాముని ముందు నిలిచి మాట్లాడు. రాముని ఎదుట పడటానికి భయపడే నీవు ఒక వీరుడివా! నన్ను కామ దృష్టితో చూచుచున్న నీ కనుగుడ్లు ఎందుకు రాలి కింద పడిపోవడం

లేదో అర్థం కావడం లేదు. ఇక్ష్వాకు వంశపురాజు దశరథుని కోడలిని, రాముని భార్యను అయిన నన్ను  ఈ ప్రకారంగా దుర్భాషలాడిన నీ నాలుక ఇంకా ఎందుకు తెగి కిందపడలేదో అర్థం కావడం లేదు.

ఓ రావణా! నా పాతివ్రత్య మహిమతో నిన్ను ఇక్కడే ఈ క్షణమే భస్మం చేయగలను. కానీ పతివ్రతలు భర్త అనుజ్ఞలేనిదే ఏ పనీ చేయరు. అందుకని నీ ప్రేలాపనలు అన్నీ సహించాను. రాముడు ఇంటలేని సమయమున నన్ను అపహరించిననాడే నీకు మృత్యువు ఆసన్నమయింది. ఓ రావణా! నీ గురించి నీ బల పరాక్రమముల గురించి నీవు గొప్పలు చెప్పుకున్నావు కదా! మరి రామలక్ష్మణులు ఉండగానే వారితో యుద్ధము చేసి ఓడించి నన్ను తీసుకు రావచ్చు కదా! మరి దొంగలాగా వచ్చి ఎందుకు అపహరించావు? రాముడికి భయపడే కదా!..." అని ఇంకా సీత ఏమో అనబోతూ ఉండగానే రావణుడు కళ్లు పెద్దవి చేసి సీత వంక చూచాడు.

"సీతా! ఇంక చాలు. ఆపు నీ వాచాలత్వము. అడవులలో తిరిగే రాముని భార్యవు నీవు కూడా నన్ను అంటావా. నీవు నన్ను భస్మం చేయడం కాదు. నేనే నిన్ను ఇక్కడే ఇప్పుడే సర్వనాశనం చేస్తాను. ఎవరు అడ్డం వస్తారో చూస్తాను." అని పరుషంగా పలికి సీతకు కావలిగా ఉన్న రాక్షస స్త్రీలను చూచి ఇలా అన్నాడు.

" ఓ ఏకాక్షీ! ఓ మేకకర్ణీ! ఓ గోకర్ణీ! ఓ హస్తికర్ణీ! ఓ లంబకర్ణీ! ఓఅకర్ణీ! ఓ గోపాదీ! ఓ హస్తిపాదీ!  ఓ మేకపాదీ! ఓ అపాదీ! ఓ దీర్ఘజిహ్వా! ఓ అనాసికా! ఓ సింహముఖీ! ఓ గోముఖీ! ఓ సూకరీముఖీ! మీరంతా నేను చెప్పేది శ్రద్ధగా వినండి. మీ శక్తి

యుక్తులు ఉపయోగించి ఈ సీతను నాకు వశురాలను చెయ్యండి. నయానా భయానా చెప్పి చూడండి. సామ,దాన,భేద, దండోపాయా లను ప్రయోగించండి. సీతను లొంగదీసుకోండి.” అని ఆజ్ఞాపించాడు.

ఈ మాటలు విన్న ధాన్యమాలిని అనే రాక్షస వనిత రావణుని వద్దకు పోయి ఇలా అంది. “ ఓ రాక్షస రాజా! మేము ఇంతమందిమి ఇక్కడ ఉండగా ఈ అనాకారి ఎందుకు నీకు. నాతోరా. నీకు స్వర్గసుఖాలు చూపిస్తాను. అయినా సుఖాలు అనుభవించడానికి కూడా బ్రహ్మరాత ఉండాలి. నీతో పాటు సురలోకభోగాలు అనుభవించే రాత ఈమె మొహాన బ్రహ్మరాయలేదు. నిన్ను కావాలని కోరుకొనే స్త్రీని నువ్వు కోరుకోవాలి గానీ, నిన్ను వద్దు అన్న స్త్రీ వెంట బడితే శ్రమ మాత్రమే మిగులుతుంది కానీ కోరిక తీరదు. కాబట్టి నిన్ను కావాలని కోరుకొనే స్త్రీలతోనే అమరసుఖాలు అనుభవించు.” అని ఇంకా ఏదో చెప్పబోతూ ఉండగా, రావణుడు ఆమెను పట్టుకొని పక్కకునెట్టి, నవ్వుకుంటూ వెనక్కు తిరిగివెళ్లిపోయాడు. రావణుని వెంట వచ్చిన కన్యలుకూడా ఆయనను అనుసరించారు. అందరూ తమ తమ నివాసములకు వెళ్లిపోయారు.

సుందర కాండము ఇరువది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఇరువది మూడవ సర్గ.

రావణుడు వెళ్లిపోగానే రాక్షస స్త్రీలు సీత చుట్టు చేరారు. కొంత మంది ఆమెతో పరుషంగా మాట్లాడారు. "ఒసేయ్ సీతా! రావణుడు అంటే ఎవరనుకున్నావు. పులస్త్య వంశంలో పుట్టాడు. మహాత్ముడు. వరిష్ఠుడు. పదితలలు కలవాడు. అటువంటి రావణుడు కోరి వస్తే అతడికి భార్యకావడానికి ఎందుకు నిరాకరిస్తున్నావు." అంటూ సీత మీద విరుచుకుపడ్డారు.

అంతలో ఏకజట అనే రాక్షసస్త్రీ సీతతో ఇలా అంది. "ఓ సీతా! ప్రజాపతులు ఆరుగురు. వారు బ్రహ్మమానస పుత్రులు. వారిలో నాలుగవ వాడు పులస్త్య ప్రజాపతి. ఆ పులస్త్యుని మానస పుత్రుడు విశ్రవసుడు. ఈ విశ్రవసుని కుమారుడే రావణుడు. అటువంటి రావణుడు నిన్ను తన భార్యగా కోరుకుంటున్నాడు. ఇంకా ఎందుకు సందేహిస్తావు. నా మాట విను. రావణునికి భార్యగా ఉండు." అని పలికింది.

ఇంతలో హరిజట అనే రాక్షసి ముందుకు వచ్చి ఇలా అంది. "మా రావణుడు దేవేంద్రుని, సకల దేవతలను జయించాడు. అటువంటి రావణునికి భార్య కావడం మంచిది. నా మాట విను." అంది.

ఇంతలో మరొక రాక్షసి ప్రఘస అనేపేరు కలది సీతను ఇలా

భయపెట్టింది. "రావణుడు మహా బలవంతుడు, వీర్యవంతుడు, శూరుడు, యుద్ధములో రావణునికి సాటి ఎవరూ లేరు. అటువంటి పరాక్రమ వంతుడికి భార్య కావడం కన్నా అదృష్టం ఏముంటుంది? పైగా మండోదరి  రావణునికి పట్ట మహిషి. ఆమెను కూడా కాదని రావణుడు నిన్ను కోరుకుంటున్నాడు. ఇంకా సందేహిస్తావెందుకు. రావణుని అంత:పురమునకు నీవే మహారాణివి. కాబట్టి ఒప్పుకో." అని పలికింది.

వికట అనే రాక్షసి సీతతో ఇలా అంది. "దేవ, దానవ, గంధర్వులను ఓడించిన రావణుడు నిన్ను వేడుకుంటున్నాడు. అట్టి మహాత్ముడు కోరి వచ్చి నిన్ను తన భార్యగా చేసుకుంటాను అంటే, కాదంటావెందుకే మూర్ఖురాలా! " అని పలికింది.

దుర్ముఖి అనే రాక్షస స్త్రీ ఇలా అంది. "ఏ రావణుని పేరు చెబితే సూర్యుడు తన తేజస్సును పరిమితం చేసుకుంటాడో, ఏ రావణునికి భయపడి వాయుదేవుడు మంద్రంగా వీస్తాడో,  ఎవరి ఆజ్ఞలకు భయపడి అన్ని ఋతువులలోనూ పుష్పములు వర్షంగా కురుస్తాయో, ఏ రావణుడు కోరినప్పుడలా మేఘాలు వర్షాలు కురుస్తాయో, అట్టి రావణుడు నిన్ను కోరి వచ్చాడు. మారుమాటాడక ఒప్పుకో! ఒప్పుకోకపోతే ఏమవుతుందో తెలుసుగా! మేమందరమూ నిన్ను నంజుకొని తింటాము." అంది.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఇరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఇరువది నాలుగవ సర్గ.

ఆ ప్రకారంగా సీత చుట్టు ఉన్న రాక్షస స్త్రీలు సీతకు రావణుని వరించమని, నయానా భయానా నచ్చ చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. కాని సీతలో మాత్రం ఎలాంటి మార్పురాలేదు. అయినా వాళ్లు తమప్రయత్నాలు వదలడంలేదు.

"ఓ సీతా! నువ్వు ఎప్పుడూ రావణుని అంత:పురమును ఎప్పుడూ చూడలేదేమో! చాలా బాగుంటుంది. ఆ శయన మందిరములు, హంసతూలికా తల్పములు, మణిమాణిక్యములతో అలంకరింపబడిన దీపములు, ఇంకా ఎన్నో అలంకరణ వస్తువులు ఉన్నాయి. మరి అటువంటి భోగములు ఎందుకు వదులుకుంటావు? అవునులే రావణుడు రాక్షసుడు అని కదా నీ బాధ. నీవు మానవ కాంతవు. నీవు మరొక మానవుడికి మాత్రమే భార్యగా ఉండటానికి ఇష్టపడుతున్నావు. కానీ ఒక్కసారి రాక్షసుని సాంగత్యము పొందితే జన్మలో మరిచిపోవు. ఎందుకంటే నీ రాముడు అయోధ్యకు మాత్రమే రాజు. రావణుడు మూడులోకములకు రాజు. మరి ఎవరు ఎక్కువ చెప్పు. అందుకని రావణుని వరించి సుఖించు.

అయినా రాముడు కేవలం మానవుడు. రాజ్యము పోగొట్టుకొని అడవులు పట్టుకొని తిరుగుతున్నాడు. వాడితో నీవు ఏం సుఖాలు అనుభవించగలవు. రాముడితో చేరితే నీకు కష్టాలు తప్ప సుఖాలు ఉండవు. రావణుని వరిస్తే నీకు సుఖాలు తప్ప కష్టాలు అంటే ఏమిటో తెలియవు. కాబట్టి మామాటలు విని రావణుని వరించు." అని

సీతకు నచ్చచెప్పడానికి ప్రయత్నించారు ఆ రాక్షస స్త్రీలు. వారి మాటలన్నీ ఓపిగ్గా వింది సీత. కన్నీరు కార్చింది. చీర కొంగుతో కన్నీళ్లు ఒత్తుకుంటూ వారితో ఇలా అంది.

"మీరందరూ మీ ప్రభువును కీర్తిస్తూ నాతో అనకూడని మాటలు అంటున్నారు. అలా నాతో పరపురుషుడి గురించి మాట్లాడటం మీకు పాపము అనిపించడం లేదా! నేను మానవ కాంతను. రావణుడు రాక్షసుడు. ఎక్కడైనా మానవులు రాక్షసులను వరిస్తారా? మీరు నన్ను ఖండ ఖండములుగా ఖండించినా నేను ఒక రాక్షసుని వరించడానికి ఒప్పుకోను. నా రాముడికి రాజ్యము లేకపోవచ్చు. అడవులు పట్టి తిరుగుతుండవచ్చు. భార్యను పోగొట్టు కొని దీనుడి మాదిరి శోకిస్తూ ఉండవచ్చు అయినా రాముడే నా భర్త. నా దైవము. నా ప్రేమ, నా అనురాగము, నా భర్తకే గానీ వేరే వాళ్లకు కాదు. శచీదేవికి ఇంద్రుని మీద వలె, అరుంధతికి వసిష్ఠుని మీద వలె, రోహిణికి చంద్రుని మీద వలె, లోపాముద్రకు అగస్త్యుని మీద వలె, సుకన్యకు చ్యవనుని మీద వలె, సావిత్రికి సత్యవంతుని మీద వలె, శ్రీమతికి కపిలుని మీద వలె, మదయంతికి సౌదాసుని మీద వలె, కేశినికి సగరుని మీద వలె, దమయంతికి నలుని మీద వలె, నాకు రాముని మీద అమితమైన ప్రేమ, అనురాగము. నేను రాముని అనుసరిస్తాను కానీ పరపురుషుని కాదు. కాబట్టి మీ మాటలతో నన్ను ప్రలోభపెట్టడం మానండి." అని పలికింది సీత.

సీత మాటలు విన్న రాక్షస స్త్రీలకు కోపం మిన్నుముట్టింది. కోపంతో ఊగిపోయారు. రావణుడు రావడం, ఏదేదో మాట్లాడటం, సీత దానికి సమాధానం ఇవ్వడం, రాక్షసస్త్రీలు సీతను బెదిరించడం

సీత వారికి తగురీతిగా సమాధానం ఇవ్వడం అంతా చెట్టు పైన కూర్చున్న హనుమంతుడు చూస్తున్నాడు వింటున్నాడు. హనుమంతునికి ఆ రాక్షసులను పట్టుకొని ఒక్కొక్క రాక్షసిని ఉతుకుదామని అనిపించింది. కానీ ఆ సమయంలో తాను బయట పడటం మంచిది కాదనీ, రామ కార్యం చెడుతుందనీ ఆలోచించి, తన కోపాన్ని అణుచుకున్నాడు. ఆ రాక్షస స్త్రీల మాటలు ఓపిగ్గా వింటున్నాడు.

సీత మాటలు విన్న రాక్షస వనితలు కోపంతో ఊగిపోయారు. వీరంగం తొక్కారు. సీతను చంపుదామని నోళ్ళు పెద్దగా తెరిచి, నాలుకలు బయట పెట్టి సీత మీది మీదికి వచ్చారు. మరి కొందరు తమ ఆయుధములను చేత ధరించి "ఇంక ఈమె జీవించి ఉండటం వ్యర్థము. ఈమె రావణుని భార్యగా ఉండటం తగదు. కాబట్టి చంపండి. నరకండి" అని అరుస్తున్నారు. వాళ్ల మధ్య ఉండటం ఇష్టం లేక, సీత అక్కడి నుండి దూరంగా వెళ్లి నిలబడింది. ఆ రాక్షస వనితలు ఆమెను వదల లేదు. బిలబిల మంటూ వారంతా ఆమె దగ్గరకు పోయి ఆమె చుట్టు నిలబడ్డారు. పెద్దగా అరుస్తూ కేకలు పెడుతూ సీతను భయపెడుతున్నారు.

వాళ్లలో ఉన్న వినత అనే రాక్షసి సీతను చూచి ఇలా అంది. "చూడు సీతా! ఇప్పటిదాకా నీవు నీ రాముని మీద చూపిన ప్రేమ చాలు. ఇంక రాముని విడిచిపెట్టు. ఏదీ అతి చేయవద్దు. అతి అన్ని విధాలా అనర్థకము. సమయాన్ని బట్టి పోవాలి కానీ మూర్ఖపు పట్టుదల పనికిరాదు. మూర్ఖంగా ప్రవర్తించి కష్టములను కొనితెచ్చుకోకు. నువ్వు ఇప్పటి దాకా మనుష్య ధర్మముల గురించి చెప్పావు. నేను చెప్పేదికూడా

విను. ముల్లోకములలో ఉన్న రాక్షసులకందరికీ ప్రభువు రావణుడు. ఆయనే నీకు తగిన భర్త. రావణుడు అత్యంత పరాక్రమ వంతుడు, సుందరుడు. శూరుడు. దేవేంద్రునితో సమానుడు. త్యాగధనుడు. అందరికీ ఆనందం కలిగించేవాడు. కేవలం ఒక దీనుడైన మానవుని కోసరం త్రిలోకాధి పతి అయిన రావణుని తిరస్కరించకు. నేటి నుండి నువ్వు కూడా త్రిలోకములకు మహారాణివి అవుతావు. రావణుని వరించు. భోగాలు అనుభవించు. అంతే గానీ అడవుల పట్టి తిరిగే రాముని వలన ఏమి ప్రయోజనం ఉంది.

పైగా ఆ రాముడు ఉన్నాడో, చచ్చాడో తెలీదు. ఒకవేళ బతికి ఉన్నా అతని ఆయుర్దాయము తీరిపోయింది. రాముడు రావణుని చేతిలో చావడం తప్పదు. నేను ఎంతో మంచి దాన్ని కాబట్టి ఇంతదూరం చెబుతున్నాను. నా మాట వినకపోయావో, మేమందరం కలిసి నిన్ను చంపి, నీ మాంసమును పంచుకొని, నంజుకొని తింటాము." అని చెప్పింది వినత అనే రాక్షసి.

ఇంతలో మరొక రాక్షసి పిడికిలి బిగించి "ఓ సీతా! ఇప్పటి దాకా నువ్వు ఏమేమి మాట్లాడినా, నీ మీద జాలితో నిన్ను ఇంతసేపూ సహించాము. ఇంక మా ఓపిక నశించింది. మేము ఏమి చెప్పినా నీవు వినడం లేదు. ఇప్పుడు నువ్వు ఎక్కడున్నావో తెలుసా. భయంకర మైన సముద్రము మధ్యలో ఉన్న లంకలో ఉన్నావు. నిన్ను రక్షించడానికి నీ రాముడే కాదు కదా సాక్షాత్తు ఆ దేవేంద్రుడు కూడా రాలేడు. అనవసరంగా ఏడ్చి ఏడ్చి నిన్ను నువ్వు హింసించుకోకు. దు:ఖాన్ని విడిచి పెట్టి సుఖాల్ని అనుభవించు. సుఖసంతోషాలతో గడపవలసిన నీ వయసును దు:ఖభూయిష్టం చేసుకోకు. రావణుని వరించు. సుఖాలు

అనుభవించు. ఈ వయసు, ఈ యవ్వనము శాశ్వతం కావు. రోజురోజుకూ తరిగిపోతుంటాయి. ఈరోజు అనుభవించాల్సిన సుఖం రేపు రాదు. కాబట్టి రావణుని వరించి. అతనితో విహరించు. స్వర్గసుఖాలు అనుభవించు. నీ యవ్వనాన్ని సార్థకం చేసుకో.

ఓ సీతా! ముల్లోకములలోని రాక్షసులకు అధిపతి అయిన రావణుని వరిస్తే, రావణుని వద్ద ఉన్న ఏడువేల మంది సుందరీ మణులు నీకు దాసీలు అవుతారు. నీ వశంలో ఉంటారు. నామాట వినకపోతే ఇప్పుడే నీ గుండెలు చీల్చి నమిలి తింటాను." అని తీవ్రంగా పలికింది.

చండోదరి అనే రాక్షసి తన చేతిలో ఉన్న పెద్ద శూలమును తిప్పుతూ ఇలా అంది. "రావణుడు ఈ సీతను అపహరించి తీసుకొని వచ్చినపుడు నాకు ఒక ఆశ పుట్టింది. బాగాబలిసి అత్యంత సుందరంగా ఉన్న ఈమె గుండె కుడిభాగమును, ఎడమ భాగమును చీల్చి తినవలెననీ, ఈమె తలను పగులగొట్టి లోపల ఉన్న మెత్తటి మెదడును ఆరగించవలెననీ, ఈమె పేగులను జుర్రుకోవలెనని, ఈమె రక్తమును తాగవలెననీ, మహా కోరికగా ఉండింది. ఆ కోరిక ఇప్పుడు నెరవేరబోతూ ఉంది." అంది.

ప్రఘస అనే రాక్షసి వారందరినీ చూచి "అబ్బా ఇంకా ఏమిటా మాటలు. అనవసరంగా మాటలతో కాలక్షేపం చేస్తున్నారు. ముందు దీని కంఠాన్ని పట్టుకొని నులమండి. క్షణంలో చస్తుంది. మనం పోయి రావణునితో "ప్రభూ! సీత మరణించినది" అని చెబుదాము. అప్పుడు రావణుడు "మీరంతా దానిని తినండి" అంటాడు.

అంతే మనం అంతా దీని మాంసంతో విందు చేసుకుందాము." అని పలికింది.

ఇంతలో అజాముఖి అనే రాక్షసి ఇలా అంది."అది సరే! ముందు దీనిని చంపి దీని మాంసమును మన కందరికీ సమానంగా ముక్కలు ముక్కలు గా పంచండి. ఒకరికి ఎక్కువా మరొకరికి తక్కువా రాకూడదు. అది నాకు ఇష్టం లేదు. వెంటనే మద్యము, మంచి మంచి లేహ్యములు తీసుకొని రండి. మనం అందరూ మద్యం తాగుతూ దీని మాంసమును నంచుకొని తింటాము." అంది.

శూర్పణఖ అనే మరో రాక్షసి ఇలాఅంది." మరి ఎందుకు ఆలస్యం. మంచి మద్యము తీసుకొని రండి. దీనిని ముక్కముక్కలుగా నరకండి. మద్యం తాగుతూ దీని మాంసమును కొరుక్కుంటూ, మన నికుంభిలాదేవికి ప్రీతిగా  నృత్యం చేద్దాము." అని పలికింది. ఆ ప్రకారంగా అక్కడ ఉన్న రాక్షస స్త్రీలందరూ తలొక విధంగా సీతను భయపెడుతున్నారు. వారి మాటలు విన్న సీత భయంతో వణికిపోయింది..

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఇరువది నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఇరువది ఐదవ సర్గ.

అంత:పుర కాంతల మధ్య, మృదుమధుర వీణావాదలను వింటూ, ఆహ్లాదంగా గడపవలసిన సీతకు, ఈ ప్రకారంగా అతి వికారంగా, క్రూరంగా కనపడుతున్న రాక్షస స్త్రీల మధ్య వారి పరుషమైన మాటలను, బెదిరింపులను వింటూఉంటూ దు:ఖము ముంచు కొచ్చింది. శరీరం అంతా భయంతో కంపించిపోయింది. నోట మాట రావడం లేదు. అతి ప్రయత్నం మీద నోరుపెగల్చుకొని ఇలా అంది.

"చూడండీ. నేను మానవ కాంతను. నేను రాక్షసుని వరించడం కలలోని మాట. మీరు చంపి తిన్నా సరే నా నిశ్చయం ఇదే. ఇప్పటి దాకా రావణుడు భయపెట్టాడు. ఇప్పుడు మీరు భయపెడు తున్నారు. ఎవరెన్ని భయపెట్టినా నా నిశ్చయంమారదు. ఇంకమీ ఇష్టం." అని పలికింది. తోడేళ్ల మధ్య ఉన్న లేడి పిల్లలాముడుచుకొని కూర్చుంది సీత.

రాముని గురించి విలపించసాగింది. "హా రామా! హా లక్ష్మణా! ఎక్కడున్నారు మీరు. అయ్యో కౌసల్యాదేవీ! చూడండి నాకు ఎన్ని కష్టాలు వచ్చాయో! హా సుమిత్రా! మాతో పాటు మీ కుమారుడు లక్ష్మణుడు కూడా ఎన్నో కష్టాలు పడుతున్నాడు. నేను నా రామునికి దూరంగా ఉన్నాను. ఈ రాక్షస స్త్రీల మధ్య ఉన్నాను వీరి బెదిరింపులకు వణికిపోతున్నాను. ఇంక ఒక్క క్షణకాలము కూడా జీవించలేను. ఎవరైనా కానీ, మరణించాలని కోరుకున్నా కూడా, వారికి మరణం

ఆసన్నమయ్యే వరకూ జీవించి ఉండటం తప్పదు కదా. అందుకే జీవించి ఉన్నాను. నా రాముడు ఎన్నటికైనా రాకపోతాడా నన్ను ఈ కష్టముల నుండి రక్షించక పోతాడా అనే ఆశతో జీవించి ఉన్నాను. నేను ఏ జన్మలో తక్కువ పుణ్యం చేసుకున్నానో, ఈ జన్మలో నా భర్తకు దూరమై ఈ రాక్షసుల మధ్య బతుకుతున్నాను.

అటు నా భర్తకు దగ్గరవలేను. ఇటు ఈ రాక్షసులకు లొంగి పోయి వారు చెప్పినట్టు వినలేను. నడిసముద్రంలో నావలాగా కొట్టుకుంటున్నాను. అయినా జీవితాంతం భర్తతో కలిసి జీవించే సుఖం కూడా అందరికీ లభించదు. కేవలం కొంతమంది అదృష్టవంతులకే ఆ సుఖం దక్కుతుంది. అతి భయంకరమైన విషము తిన్న తరువాత జీవించడం ఎంత కష్టమో, నా రాముని విడిచి ఉండటం అంతే కష్టంగా ఉంది నాకు. పూర్వజన్మలో ఏం పాపం చేసానో ఈ జన్మలో నా భర్తకు దూరమై అష్టకష్టములు అనుభవిస్తున్నాను.

ఓ రామా! నిన్ను విడిచి నేను జీవించలేదు. నేను చచ్చిపోదామన్నా ఈ రాక్షసులు నన్ను చావనివ్వడం లేదు. ఏంచెయ్యాలి? ఇష్టం వచ్చినప్పుడు చావడానికి కూడా స్వేచ్ఛలేని ఈ మనుష్యజీవితము ఎంతో దుర్భరం కదా!" అని పలువిదములుగా విలపిస్తూ ఉంది సీత.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఇరువది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

ఇరువది ఆరవ సర్గ.

అతి చిన్నవయసులోనే ఇన్ని కష్టములను పడుతున్న సీత, కన్నీరు మున్నీరుగా విలపిస్తూ ఉంది. నేల మీద పడి దొర్లుతూ ఏడుస్తూ ఉంది. " ఓ రామా! నీవు ఇంటలేని సమయంలో ఈ రాక్షసుడు నన్ను ఎత్తుకొని వచ్చాడు. ఇప్పుడు ఈ రాక్షసులు నన్ను దారుణంగా భయపెడు తున్నారు. ఇన్ని బాధలు పడుతూ జీవించడం దుర్భరంగా ఉ ంది.

ఓ రామా! నీవే లేనపుడు నాకు ఈ ఆభరణములతోనూ, ప్రాణములతోనూ పని ఏముంది. ఇటువంటి కష్టములు మరొకరికి వచ్చి ఉంటే వారి హృదయము ఈ పాటికి బద్దలయి ఉండేది. కానీ నా హృదయము పాషాణము. ఇనుముతో చేయబడింది. అందుకనే ఆగిపో లేదు. ఇంకో కొట్టుకుంటూ ఉంది. ధర్మశాస్త్రము ప్రకారము భర్త దగ్గర లేకుండా భార్య క్షణకాలం కూడా జీవించ కూడదు. కాని నేను నీవు దగ్గర లేకుండా ఇంతకాలము జీవించి ఉన్నాను. నేను ఎంతటి పాపాత్మురాలనో కదా! ఈ భరతఖండమునకు ప్రభువు అయిన నా రాముని విడిచి ఉన్న నాకు, ఈ భోగముల మీద కానీ, సుఖముల మీద కానీ, ఆఖరుకు ఈ జీవితము మీద కానీ ఆసక్తి లేదు. నేను ఇంక క్షణకాలం కూడా జీవించి ఉండలేను. వీళ్లు నా శరీరమును చీల్చినా సరే, తిన్నా సరే, నాకు సంబంధము లేదు. నేను ఈ శరీరాన్ని విడిచిపెట్టడానికి సిద్ధంగా ఉన్నాను.

ఇంక ఈ కష్టములను, దు:ఖమును భరించడం నా వల్లకాదు. ఆఖరుకు చావనైనా చస్తాను కానీ, ఆ రావణుని నా ఎడమకాలుతో కూడా తాకను. అయినా ఆ రావణుడు ఎంత మూర్ఖుడు. నువ్వు అంటే నాకు ఇష్టంలేదురా అంటే కూడా వినడు. నన్ను వరించమని నా వెంటపడుతున్నాడు. కనీసం తాను పుట్టిన కులము, వంశము గురించి కూడా ఆలోచించడం లేదు. నా కాళ్ల మీద పడుతున్నాడు.

ఓసీ రాక్షసులారా! మీరు నన్ను కొయ్యండి. నరకండి. అగ్నిలో పడెయ్యండి. మీ ఇష్టం వచ్చినట్టు భయపెట్టండి. నేను మాత్ర ము మీ రావణుని వంక కన్నెత్తికూడా చూడను. నా రాముని గురించి మీకు తెలియదు. అత్యంత పరాక్రమ వంతుడు. మంచి జాలి గుండె కలవాడు. కాని ఎందుకో నా మీద జాలి చూపడం లేదు. లేకపోతే ఈ పాటికి ఈ లంకకు వచ్చి రావణుని చంపి నన్ను తీసుకుపోవాలి కదా! ఎందుకంటే, జన స్థానములో 14,000 మందిరాక్షసులను ఒంటి చేత్తో చంపిన రామునికి అల్పుడైన ఈ రావణుడు ఒక లెక్కా! ఒక్క బాణంతో ఈ రావణుని నేలకూల్చ గలడు. మరి ఎందుకు రావడం లేదు. రామునికి నా మీద ప్రేమ తగ్గిందా అని అనుమానంగా ఉంది.

దండకారణ్యంలో విరాధుని చంపిన వీరుడు రాముడు నన్ను రక్షించడానికి ఎందుకు రాలేదు? ఈ లంక సముద్ర మధ్యలో ఉంది అని సందేహిస్తున్నాడా! రామబాణమునకు అడ్డేముంది? ఒక రాక్షసుడు మాయ చేత నన్ను అపహరించాడు అని రామునికి తెలుసు కదా! మరి రాముడు నన్ను రక్షించడానికి రాకపోవడానికి కారణం ఏమైఉంటుంది? అంటే రామునికి నేను ఇక్కడ లంకలో, రావణుని

చెరలో  ఈ అశోక వనములో ఉన్నాను అని తెలిసి ఉండకపోవచ్చు. తెలిస్తే ఎందుకు రాడు! రావణుడు నన్ను ఇక్కడ దాచాడు అని ఏ మాత్రం తెలిసినా ఈ అవమానమును సహించి ఊరుకోడు. తప్పకుండా వస్తాడు. నన్ను విడిపిస్తాడు.

నన్ను రావణుడు అపహరించి తీసుకొని వస్తుంటే జటాయువు అనే పక్షిరాజు నన్ను రక్షించడానికి ప్రయత్నించి రావణుని చేతిలో మరణించాడు. ఆ పక్షిరాజు వృద్ధుడైనా తన వంతు ప్రయత్నం తాను చేసాడు. వృద్ధుడైన జటాయువు చేసినంత మాత్రం  రాముడు చేయలేడా! నేను ఇక్కడ ఉన్నట్టు తెలిస్తే, రాముడు లంకకు వచ్చి రావణుని చంపడా! రాముడు తలుచుకుంటే,  అసలు ఈ లోకంలో రాక్షసుడు అనే వాడు లేకుండా చేస్తాడు కదా!  కానీ నా రాముడు ఎందుకు రావడం లేదో అర్థం కావడం లేదు. రాముడు తలచు కుంటే ఈ సముద్రమును ఇంకింపచేసి, లంకకు వచ్చి రావణుని చంపి, నన్ను తీసుకువెళ్లాలి కదా! మరి రాముడు ఎందుకు తలచు కోలేదు?

రాముడు వచ్చి ఈ లంకలో ఉన్న రాక్షసులందరినీ చంపితే, ఆ రాక్షసుల భార్యలు కూడా  నా మాదిరి ఏడుస్తారేమో! అప్పుడు ప్రతి ఇంట్లో కూడా రాక్షస స్త్రీల  ఏడుపులు వినిపిస్తాయేమో!  రాముని కంట పడిన తరువాత ఈ రావణుడు క్షణకాలం కూడా జీవించి ఉండలేడు. కానీ రాముడు ఇక్కడకు రావాలి కదా! ఎప్పుడు వస్తాడో ఏమో! నా రాముడు రావాలే కానీ, ఈ లంక శ్మశానంగా మారడం ఎంతసేపు! లంక అంతా శవాలు కాలుతున్న పొగతో నిండి పోతుంది. లంక మీద శవాల కోసరం గద్దలు ఎగురుతుంటాయి.

ఓ రాక్షసులారా! ఈ లంక దానితో పాటు మీరందరూ సర్వనాశనం అయ్యేరోజు దగ్గరలోనే ఉంది. ఎందుకుంటే లంకలో అశు భ శకునములు చాలా కనపడుతున్నాయి. చాలా తొందరలోనే రావణుడు చావడం, ఈ లంక తన వైభవాన్ని కోల్పోవడం జరుగుతుంది. రావణుడు, రాక్షసులు అందరూ మరణిస్తే, లంకలో రాక్షస స్త్రీలు మాత్రం మిగులుతారు. లంకతో పాటు వారూ అనాధలు అవుతారు. ఇంటింటా రాక్షస స్త్రీల ఏడుపులను నేను త్వరలోనే వింటాను.

ఇదంతా జరగాలంటే నేను ఇక్కడ ఉన్నట్టు రామునికి తెలియాలి కదా! రామునికి నేను రావణుని అధీనములో ఉన్నట్టు ఎలా తెలుస్తుంది? రావణుడు నాకు పెట్టిన రెండు నెలల గడువు కూడా అయిపోవచ్చింది. అలాంటి గడువు మృత్యు దేవత ఆ రావణునికి ఎందుకు పెట్టలేదు. గడువు తీరిపోగానే మృత్యువు వాడినే కబళించవచ్చు కదా.

పచ్చి మాంసము తినే ఈ రాక్షసులకు ధర్మం అంటే ఏమిటో అధర్మం అంటే ఏమిటో అసలు తెలియదు. ఏది చెయ్యాలో ఏది చెయ్యకూడదో ఏమీ తెలియదు. తెలిస్తే కోరి కోరి ఇంతటి ఉపద్రవాన్ని కొనితెచ్చుకుంటారా! ఏం చేస్తాం. గడువు తీరి పోగానే ఆ రాక్షసుడు రావణుడు నన్ను తన ప్రాతఃకాల భోజనం లోకి నంజుకుంటాడు. ఈ రెండు నెలల కాలంలో, ఎక్కడో ఉన్న రాముడు ఇక్కడకుక ఎలా వస్తాడు? నన్ను ఎలా రక్షిస్తాడు? ఇక్కడ నాకు ఇంత విషం ఇచ్చే దిక్కు కూడా లేదు. లేకపోతే హాయిగా విషం తాగి యమలోకం చేరుకొనే దాన్ని.

ఇంతకూ రాముడికి నేను ఇక్కడ ఉన్నట్టు తెలిసి ఉండదు. లేకపోతే నన్ను వెదకకుండా ఉంటాడా! అసలు రాముడు బతికి ఉన్నాడా లేక నా వియోగాన్ని భరించలేక ఈ లోకాన్ని విడిచిపెట్టాడా! ఈ లోకంలో ఉంటే నన్ను వెదుక్కుంటూ రాకుండా ఉంటాడా! ఈ లోకంలో రాముని చూచే అదృష్టానికి నేను నోచుకోలేదు కానీ స్వర్గంలో ఉన్న దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు రాముని దివ్యదర్శన భాగ్యమునకు  నోచుకున్నారు.

కాదు. అలా ఎన్నటికీ జరగదు. నా ఊహ  అబద్ధము. రాముడు ఎన్నటికీ నన్ను విడిచి స్వర్గానికి ఒంటరిగా వెళ్లడు. కాకపోతే రాముడు రాజర్షి కదా! అందుకని రామునికి నా అవసరము ఏముంటుంది. అందుకని నన్ను మర్చిపోయి ఉండవచ్చు. అందుకనే నా కోసరం రాలేదు.  లోకంలో ప్రజలకు భార్య ఎదురుగా ఉన్నప్పుడే ప్రేమలు అనురాగాలు పొంగి పొర్లుతుంటాయి.  భార్య కాస్త కనుమరుగు అయితే ఆ ప్రేమానురాగాలు ఆవిరి అయిపోతాయి లేక మరొకరి మీదకు  మరలుతాయి.

కాని నా రాముడు అలాంటి వాడు కాడు. నా మీద ఉన్న ప్రేమను అంత సులభంగా మర్చిపోడు. నేను రాముడిని అనవసరంగా శంకిస్తున్నాను. రాముడికి దూరమై కృంగిపోతున్నాను. సద్గుణములు లేని వారే భర్తకు దూరం అవుతారు. అంటే నాలో సద్గుణములు లేవా! నా పుణ్యము క్షీణించి పోయిందా! నా సౌభాగ్యము అంతరించిందా! ఎందుకిలా జరుగుతూ ఉంది? దీనికంతటికీ కారణమేమి! ఎంత ఆలోచించినా  ఏమీ అంతు చిక్కడం లేదు.

దీని కంతటికీ ఒకే పరిష్కారము. రాముడు లేకుండా నేను జీవించ ఉండటం వృధా. నాకు మరణమే శరణ్యము. రామలక్ష్మణులు అడవులలో ఆకులలములు తింటూ కృంగి కృశించి పోతుంటే, నేను జీవించి ఉండటం వలన లాభం ఏమిటి! లేదా! ఈ రావణుడు తన మనుషులతో రామలక్ష్మణులను చంపించాడేమో! అప్పుడు కూడా నేను బతికి ఉండటం వృధా! ఏది ఏమైనా నేను మరణించక తప్పదు.

ఎన్ని కష్టాలు వచ్చినా మాలాంటి మామూలు వారికే గానీ, జితేంద్రియులు, తపశ్శాలులు అయిన మహాత్ములకు కష్టములే ఉండవు కదా! వారికి ఇది కావాలి అనికానీ, ఇది వద్దు అని కానీ ఉండదు. వారు దేనికోసరమూ వెంపర్లాడరు. ఏది వచ్చినా వద్దనరు. వారికి సుఖము దు:ఖము సమానములు.  వారు ధన్యజీవులు. వారందరికీ నా నమోవాకములు. నేను ప్రస్తుతము అదే స్థితికి చేరుకున్నాను. రాముడు లేని ఈ లోకంతోనూ, ఈ జీవితంతోనూ  నాకు పనిలేదు. నేను ప్రాణత్యాగము చేస్తాను." అని ధృఢంగా నిశ్చయించుకుంది సీత.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఇరువది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము
## ఇరువది ఏడవ సర్గ.

సీతకు ఎంత చెప్పినా లాభం లేదు అని అనుకొన్నారు ఆ రాక్షస స్త్రీలు. వారిలో కొంతమంది సీత గురించి, సీత మూర్ఖత్వాన్ని

గురించీ రావణునికి తెలియజెయ్యాలని వెళ్లారు. మిగిలిన రాక్షస వనితలు మరలా పరుష వాక్యములతో సీతను నిందించడం మొదలెట్టారు.

"సీతా! ఇంక నీకు ఏమి చెప్పీ ప్రయోజనము లేదు. నిన్ను తినడం తప్ప మారు మరోమార్గము లేదు." అని సీత మీద పడి చంపుదామని అనుకుంటూ ఉండగానే వారిలో ఒక వృద్ధరాక్షసి త్రిజట అనే పేరుకలది అప్పటి దాకా నిద్రపోతూ ఉంది. రాక్షస వనితల ఆర్భాటము చూచి నిద్రలేచింది. తన తోటి రాక్షస స్త్రీలను చూచి ఇలా అంది.

"ఏమిటే! ఏమి చేస్తున్నారు? మూర్ఖుల్లారా! మీరు ఎవరిని చంపి తింటున్నారో తెలుసా! దశరథుని కోడలిని. రాముని భార్యను. మీరు సీతను తినడం లేదు. మిమ్మల్ని మీరే చంపుకొని తింటున్నారు. అసలు సంగతి చెబుతాను వినండి. నేను ఇప్పటిదాకా నిద్రపోతున్నానా! ఆ నిద్రలో నాకు ఒళ్లు గగుర్పొడిచే ఒక కల వచ్చింది. అదీ ఈ తెల్లవారుజామున వచ్చింది. తెల్లవారుజామున వచ్చే కలలు నిజం అవుతాయంటారు కదా! ఆ కలలో రాక్షసులు అంతా నాశనమైనట్టు, రాముడు సీతను తీసుకువెల్లినట్టు కల వచ్చింది. తెలుసా!" అని కాసేపు ఆగింది.

ఆ మాటలకు ఆ రాక్షస వనితల శరీరంలో వణుకు పుట్టింది. "త్రిజటా! నిజంగానా! నీకు అలాంటి కల వచ్చిందా. అబ్బా వివరంగా చెప్పవే. ఇక్కడ మేము భయంతో వణికి చస్తున్నాము. తొందరగా చెప్పు." అని త్రిజటను తొందర చేసారు.

వారితో త్రిజట ఇలా చెప్పసాగింది. "సీత మొగుడు రాముడు, రాముని తమ్ముడు లక్ష్మణుడు తెల్లని వస్త్రములు ధరించి ఒక పల్లకీ ఎక్కి వస్తున్నారు. ఆ పల్లకీని వెయ్యి హంసలు మోసుకొని ఎగురుకుంటూ వస్తున్నాయి. మన సీత కూడా తెల్లని వస్త్రములు ధరించి దేదీప్యమానంగా వెలుగుతూ కనపడింది. రాముడు సీతను తన వెంట  తీసుకొని వెళ్లాడు.

అంతలో నాకు నాలుగు దంతములు కలిగిన ఒక ఏనుగు కనపడింది. సీత, రాముడు, లక్ష్మణుడు ఆ ఏనుగు ఎక్కి వెళుతున్నారు. రాముడు, లక్ష్మణుడు తెల్లని వస్త్రములు ధరించి సీత దగ్గరకు రావడం నేను చూచాను. రాముడు ఎక్కిన ఏనుగు సీత ముందుకు వచ్చి ఒంగింది. సీతకు రాముడు చెయ్యి అందిచ్చాడు. రాముని చెయ్యి పట్టుకొని సీత ఆ ఏనుగు మీదికి ఎక్కింది. తరువాత ఏం జరిగిందో తెలుసా!" అని ఆగింది త్రిజట.

అప్పటికే భయంతో వణుకుతున్న రాక్షసులు "ఏం జరిగిందే!" అని అడిగారు.

"అప్పుడు ఏ ఏనుగు రాముని, సీతను ఎక్కించుకొని లంకమీద నిలబడింది. ఇంతలో ఆ దృశ్యం మారి పోయింది. తెల్లటి ఎనిమిది ఎద్దులు కట్టిన ఒక రథం కనిపించింది. అందులో రాముడు సీత కూర్చుని ఉన్నారు. అంతలో దృశ్యము మారి పోయింది. రాముడు, లక్ష్మణుడు, సీత కలిసి పుష్పక విమానము ఎక్కి ఉత్తర దిక్కుగా వెళ్లిపోయారు.  నా స్వప్నంలో రాముడు సాక్షాత్తు విష్ణుమూర్తిలా ప్రకాశిస్తున్నాడు. ఇంక మన రావణుడు ఆ రాముని ఎలా జయిస్తాడు?

మీకు ఇంకో సంగతి తెలుసా! మన రావణుడు ఎర్రని వస్త్రములు ధరించి, ఎర్రని పూల మాలలు వేసుకొని, ఒంటి నిండా నూనె పూసుకొని, నూనె తాగుతూ, కిందపడి దొర్లుతూ ఉండటం నేను నా స్వప్నంలో చూచాను. అంతలోనే రావణుడు నున్నగా గుండు కొట్టించుకొని కనపడ్డాడు. అప్పుడు రావణుడు నల్లని వస్త్రములు ధరించి ఉన్నాడు. రావణుడు పుష్పక విమానం నుండి అమాంతం కింద పడ్డాడు. అప్పుడు ఒక ఆడది పుష్పకము నుండి కింద పడ్డ రావణుని నేలమీద ఈడ్చుకుంటూ వెళుతూ ఉంది." అని ఆగింది.

రాక్షస స్త్రీలు భయంతో వణికిపోతున్నారు. త్రిజట చెప్పింది నోళ్లు వెళ్లబెట్టి వింటున్నారు. మరలా త్రిజట చెప్పడం మొదలెట్టింది.

"ఇంతలో మరొక దృశ్యం. ఇందాక చెప్పానే, రావణుడు ఎర్రటి వస్త్రములు కట్టుకున్నాడని, అలాగే రావణుడు నూనె తాగుతూ గాడిదలు కట్టిన రథం ఎక్కి, రథం మీద పిచ్చివాడిలా నృత్యం చేస్తూ దక్షిణ దిక్కుగా పోతున్నాడు. పోతూ పోతూ జారి రథంనుండి తలకిందులుగా కిందపడ్డాడు. కింద పడ్డ రావణుడు పైకి లేచాడు. పిచ్చి పిచ్చి గా మాట్లాడుతున్నాడు. ఒంటిమీద బట్టలు చించుకున్నాడు. విప్పుకున్నాడు. దిగంబరంగా నృత్యం చేస్తున్నాడు. అక్కడే ఉన్న ఒక చెడువాసన వేస్తున్న బురద గుంటలో పడిపోయాడు. మునిగిపోయాడు. అంతే. మళ్లీ పైకి లేవలేదు.

అంతలోనే దృశ్యం మారింది. నల్లని వస్త్రములు కట్టుకున్న స్త్రీ ఒకత్తి రావణుని మెడకు ఉరి తాడు బిగించి లాగుకుంటూ దక్షిణ దిక్కుగా ఈడ్చుకుంటూ వెళ్లింది. మీకు తెలుసో లేదో! రావణుని

తమ్ముడు కుంభకర్ణుడు, రావణుని కుమారులు కూడా ఇలాగే నూనె తాగుతూ బురదగుంటలో పడిపోతున్నారు. వాళ్లను కూడా నేలమీద పడేసి ఈడ్చుకుంటూ వెళుతున్నారు. రావణుడు పందినీ, ఇంద్రజిత్తు మొసలిని, కుంభకర్ణుడు ఒంటెను, ఎక్కి దక్షిణ దిశగా వెళ్లడం నాకు కలలో కనపడింది.

కానీ విభీషణుడు మాత్రం తెల్లని వస్త్రములు ధరించి తెల్లని గొడుగు ధరించి నాలుగు దంతాలు కల ఏనుగు ఎక్కి ఆకాశంలో తిరుగుతున్నాడు.

వీళ్ల సంగతి ఇలా ఉంటే, రావణుని అనుచరులు అయిన రాక్షసులు కూడా నూనె తాగుతూ ఎర్రని వస్త్రములు కట్టుకొని మద్యము తాగుతూ పిచ్చిపిచ్చిగా ఆడుతున్నారు. ఇంక ఈ లంకా నగరం లోని ఇళ్లు, గోపురములు తోరణములు, అన్నీ కూలిపోయాయి. సముద్రము పొంగి లంకను మొత్తం ముంచేసింది. " అని త్రిజట భయంకరంగా చెబుతుంటే రాక్షసస్త్రీలు వణికిపోతున్నారు.

ఇప్పటి దాకా రావణునికి ప్రియం చేకూర్చడానికి సీతను భయపెట్టారు కానీ, ఆ రావణునికే దిక్కులేకుండా లంక మొత్తం మునిగిపోతుంటే వాళ్లు బెంబెలు ఎత్తిపోయారు. ఇంకా త్రిజట ఏం చెబుతుందో అని భయపడి చస్తున్నారు. త్రిజట మరలా చెప్పడం మొదలెట్టింది.

"మీకు మరో సంగతి చెప్పడం మరిచిపోయాను. మన లంకలోకి ఒక కోతి వచ్చింది. ఆ కోతి రాముడు పంపగా వచ్చిందట. ఆ

కోతి లంకను మొత్తం తగలపెట్టింది. ఇదంతా నాకు కలలో కనపడింది. లంక అంతా తగలబడి పోతుంటే రాక్షస స్త్రీలు అందరూ నూనెలు తాగుతూ పిచ్చిపిచ్చిగా గంతులువేస్తున్నారు. కుంభకర్ణుడు మొదలగు రాక్షసులు అందరూ బురద గుంటలలో కూరుకుపోయారు. ఇదీ నాకు వచ్చిన కల.

దీనిని బట్టి చూస్తే రావణుడు చావడం ఖాయం. కాబట్టి మనమన్నా బతుకుదాము. సీతను వదిలి పెట్టి వెళ్లిపోండి. లేకపోతే తన భార్యను భయపెట్టిన మీ అందరినీ కూడా రాముడు చంపుతాడు. ఎందుకుంటే రాముడికి తన భార్య సీత అంటే ప్రాణం. సీతను ఎవరు ఏమన్నా రాముడు సహించడు. వాళ్లను చంపేదాకా వదలడు. మనకెందుకు చెప్పండి. సీతకు మంచిగా చెప్పిచూద్దాము. రావణుని మాటలు విని సీతను భయపెట్టి మన ప్రాణాల మీదికి తెచ్చుకోడం ఎందుకు. పైగా నాకు ఈ కల తెల్లవారుజామున వచ్చింది. తెల్లవారు జామున వచ్చిన కల జరుగుతుంది అంటారు.

ఇదంతా ఎందుకు చెప్పండి! సీత కోసరం రాముడు వస్తాడు. ఆమెను రావణుని వద్దనుండి తీసుకొని వెళతాడు. మధ్యలోమనం చస్తాము. ఇప్పటిదాకా సీతను భయపెట్టినా ఏమీ ప్రయోజనం లేదుకదా! అందుకని ఇంక సీతను భయపెట్టడం మానేద్దాము. మంచిమాటలు చెబుదాము. ప్రార్థిద్దాము. మనం సీతను మంచి చేసుకున్నాము అనుకో సీత రామునికి చెప్పి మనలను ఏమీ చెయ్యకుండా రక్షిస్తుంది. ఎందుకంటే నాకు వచ్చిన కలను బట్టి చూస్తే రాముడు రావడం రావణుడు చావడం తధ్యం అనిపిస్తూ ఉంది.

అటు చూడండి. సీతకు ఎడమ కన్ను ఎడమ భుజము అదురుతూ ఉంది. ఇవి శుభ సూచకములు. కాబట్టి రాముడు తొందరలోనే లంకకు వస్తాడు. సీతను చెర విడిపిస్తాడు." అని త్రిజట తనకు వచ్చిన స్వప్నమును గురించి రాక్షసస్త్రీలకు వివరించింది.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఇరువది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము
## ఇరువది ఎనిమిదవ సర్గ.

త్రిజటకు వచ్చిన స్వప్నము గురించి కానీ, దాని గురించి త్రిజట తోటి రాక్షస వనితలకు చెప్పడం కానీ సీతకు తెలియదు. రావణుడు వచ్చి తనను అన్న మాటలను తలచుకొని, తరువాత రాక్షస స్త్రీలు తనను చంపుతానని బెదిరిస్తూ మాట్లాడిన మాటలను తలచుకొని  బాధపడుతూ ఉంది సీత.

"నేను ఎంత పాపం చేసానో గానీ, వీళ్ల చేత ఇన్ని మాటలు పడుతూకూడా నా ప్రాణములు నా శరీరమును వదలకుండా ఉన్నాయి. కాలము తీరనిది మరణము కూడా దగ్గరకు రాదు అన్న విషయం సత్యము అని తోస్తూ ఉంది. నేను సుఖాలకు నోచుకోలేదు. నా జీవితము అంతా దు:ఖ మయము. అయినా కూడా నా హృదయము పాషాణము కంటే గట్టిగా ఉంది. అందుకే జీవితాంతము కష్టములు వచ్చినా బద్దలు కాకుండా ఇంకా వజ్రసమానంగా ఉంది.

అసలు నా తప్పు ఏమీ లేకుండానే రావణుడు నన్ను చంపమని ఆజ్ఞాపించాడు. ఈ రావణుడు ఏమి చేసినా వీడిని మాత్రము నేను దగ్గరకు రానివ్వను. ఈ రెండు నెలల గడువులోపల రాముడు రాకుంటే ఈ రావణుడు నన్ను చంపుతాడు. రాముడు ఎప్పుడు వస్తాడో తెలియదు. నాకు ఎన్ని కష్టములు వచ్చి పడ్డాయి. రామా! లక్ష్మణా! తొందరగా రండి. నన్ను ఈ రాక్షసుని చెరనుండి నన్ను విడిపించండి.

ఆ రోజు కాలమే మృగరూపంలో వచ్చి నన్ను ప్రలోభ పెట్టింది. నేను రాముని ఆ మృగమును తెచ్చి ఇమ్మని అడిగాను. నా తెలివి తక్కువతనంతో లక్ష్మణుని కూడా దూరంగా పంపాను. అంతా కాలమహిమ. నా దురదృష్టము. రామలక్ష్మణులు తిరిగి వచ్చునప్పటికి నేను అపహరింపబడ్డాను. రామునికి, లక్ష్మణునికి నా గురించి ఎలా తెలుస్తుంది. నాగురించి తెలిసిన జటాయువు కూడా ఈ రాక్షసుని చేతిలో మరణించాడు. నేను చేసిన పూజలు, నోములు, వ్రతాలు, నా పాతివ్రత్యము, నేను అనుసరించిన ధర్మము అన్నీ వృధా అయి పోయాయి.

కనీసము నా భర్తను చేరుకోడానికి కూడా పనికిరాని ఈ పాతివ్రత్యము ఎందుకు? నిరర్థకము కదా! రామా! నీవు నీ తండ్రి ఆజ్ఞ మేరకు పదునాలుగేండ్ల గడువు ముగిసిన తరువాత అయోధ్యకు పోయి, పట్టాభిషిక్తుడివై, కోరిన స్త్రీలతో సుఖించు. నేను ఇక్కడే ఈ రాక్షసుని చేతిలో మరణిస్తాను. నాకు నీ మీద ఉన్న ప్రేమ, నీకొరకు ఆచరించిన పాతివ్రత్యము నా వినాశము కొరకే దాపురించాయి. నా అంత దురదృష్టవంతురాలు లోకంలో ఉండబోదు. ఏం చెయ్యను. చచ్చిపోదామన్నా ఇంత విషం ఇచ్చే వాళ్లు కూడా లేరు. ఈ రాక్షసుని

మందిరంలో విషానికి కూడా కరువే కదా!" అని పరి పరి విధముల విలపిస్తూ ఉంది సీత.

చావడానికి విషము కానీ, ఆయుధము కానీ లేకపోవడంతో, అందుబాటులో ఉన్న తన పొడుగాటి జడనే తాడుగా ఉపయోగించి, మెడకు ఉరివేసుకొని ప్రాణత్యాగము చేయడానికి ప్రయత్నించింది సీత. "నేను ఈ జడతో ఉరి పోసుకొని, చచ్చిపోయి, యమలోకాని వెళతాను" అని మనసులో అనుకొంది సీత.

చావడానికి నిశ్చయించుకున్న సీత లేచి నిలబడింది. ఆ చెట్టు కొమ్మ కింద నిలుచుంది. చావడానికి సిద్ధంగా ఉన్న సీతకు శుభశకునములు కనపడ్డాయి. అటువంటి శకునములు కనపడినపుడు సీతకు ఎన్నో శుభాలు జరిగాయి. అటువంటి శుభ శకునములు మరలా కనపడ్డాయి సీతకు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఇరువది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఇరువది తొమ్మిదవ సర్గ.

చెట్టుకొమ్మకు తన పొడుగాటి జడతో ఉరి పోసుకొని చావాలను కున్న సీతకు ఎన్నో శుభశకునములుకనిపిపించాయి. సీతకు ఎడమ కన్ను అదిరింది. ఎడమ భుజము కూడా అదిరింది.

శరీరంలో ఎడమ భాగము అంతా అదురుతూ ఉంది. ఈ ప్రకారంగా శరీరంలో ఎడమ భాగంలో ఉన్న అవయవములు అదిరి నపుడు సీతకు ఎన్నో శుభాలు జరిగాయి. ఇప్పుడు తనకు ఎడమ భాగం అదరడంతో సీతకు తనకు శుభాలుజరగబోతున్నాయి అన్న భావనకలిగింది.

సీత మనసంతా ఆనందంతో నిండి పోయింది. సీత ముఖపద్మము దివ్యంగా ప్రకాశించింది. సీత ఆత్మహత్యా ప్రయత్నాన్ని తాత్కాలికంగా విరమించింది.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఇరువది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ముప్పదవసర్గ.

శింశుపా వృక్షము మీద ఆకుల మాటున దాగి ఉన్న హనుమంతుడు చెట్టు కింద జరుగుతున్న విషయములను అన్నీ ఓపికగా చూస్తున్నాడు. సీత విలపించడం, రాక్షసస్త్రీలు సీతను భయపెట్టడం, సీత బయపడటం, త్రిజట తనకు వచ్చిన కల గురించి రాక్షసస్త్రీలకు చెప్పడం, సీత తన దుస్థితిని తలచుకొని దు:ఖించడం అన్నీ చూస్తున్నాడు వింటున్నాడు హనుమంతుడు.

# సుందర కాండము

హనుమంతుని దృష్టి అంతా సీత మీదనే ఉంది. హనుమంతుడు తనలో తాను ఇలా ఆలోచిస్తున్నాడు. "నాలుగు దిక్కులకు వెళ్లిన వానరములకు పట్టని అదృష్టం తనకు పట్టింది. సీతను తాను చూడగలిగాడు. ఎవరికీ కనపడకుండా కూర్చుని అన్నివిషయములను ఆకళింపు చేసుకున్నాను. లంకను గురించి సంపూర్ణంగా తెలుసుకున్నాను. రావణుని గురించి అతని ప్రవర్తన గురించి బాగుగా అధ్యయనం చేసాను.

రాముని భార్య సీత ఎప్పుడెప్పుడు తన భర్త రాముని చూద్దామా అని ఆతురతగా ఉంది. ఆమె దు:ఖసముద్రంలో మునిగి ఉంది. ఇప్పుడు ఆమెను కలుసుకొని ఓదార్చడం తన తక్షణ కర్తవ్యం. సీతను చూస్తుంటే ఆమె ఇంతకు ముందు ఎన్నడూ ఇటువంటి కష్టములను అనుభవించినట్టులేదు. ఇప్పుడు ఆమెను కలిసి, ఆమెకు నాలుగు ఓదార్పు వచనములు చెప్పడం  అత్యంత ఆవశ్యకము.

ఏదో సముద్రం దాటాను, లంకకు వచ్చాను, సీతను చూచాను అంటూ వెళ్లిపోతే నేను ఇక్కడకు వచ్చిన దానికి ఫలితం ఉండదు. నేను ఆమెకు కనపడకుండా వెళ్లిపోతే, నేను అటు వెళ్లగానే ఆమె దు:ఖము తట్టుకోలేక ఆత్మత్యాగము చేసుకుంటే, నేను పడ్డ శ్రమఅంతా వృధా అవుతుంది. అంతేకాకుండా, ఇప్పుడు నేను సీతను కలవకుండా రాముని వద్దకు వెళితే, "హనుమా! సీతను చూచావుకదా! సీత నాతో ఏమి చెప్పమని చెప్పింది" అని అడిగితే ఏమని సమాధానము చెప్పాలి. సీత నుండి నేను సందేశము తీసుకొని వెళ్లకపోతే రాముడికి కోపం వస్తుంది కదా!

ఇప్పుడు నేను సీతను కలవకుండా వెళ్లి, సుగ్రీవుని వానరసేనలతో తీసుకొని వచ్చి రావణునితో యుద్ధము చేసి, రావణుని సంహరించి సీత కోసం వెదికితే, అప్పటికే సీత ప్రాణత్యాగము చేసుకుని ఉంటే, ఈ ప్రయత్నములన్నీ వృధా అవుతాయి కదా! అందుకని తక్షణమే సీతను కలవడం అత్యావశ్యకము. సీతను కలిసి ఆమెను ఓదార్చాలి. రామునికి సీత గురించి చెప్పి రామునీ ఓదార్చాలి.

కానీ సీతను ఒంటరిగా ఎలా కలవాలి. ఈ రాక్షసస్త్రీలు ఆమెను చుట్టుముట్టి ఉన్నారు. వీళ్లు చూడ కుండా సీతను కలవడం ఎలాగ! ఇప్పుడు నేను ఈమెను కలవక పోతే ఈమె ప్రాణత్యాగము చేసుకుంటుంది. కాబట్టి ఈ రాక్షస స్త్రీలు ఏమరుపాటుగా ఉన్నప్పుడు సీతను కలవాలి. ఆమెను ఓదార్చాలి." అని అనుకున్నాడు

హనుమంతుడు. తనశరీరం వంక చూచుకున్నాడు. చాలా చిన్న శరీరంతో ఉన్నాడు. మరలా ఇలా ఆలోచిస్తున్నాడు. "తాను వానర రూపంలో ఉన్నా సంస్కృతములో మాట్లాడగలుగుతున్నాడు. కాని తాను సంస్కృతములో మాట్లాడితే తనను రాక్షసుడు అని సీత భ్రమించగలదు. పైగా తాను వానరుడు. తాను మానుష భాషలో మాట్లాడటం అసంభవం కదా! కాని తాను మానుష భాషలో మాట్లాడితే గానీ, సీతకు అర్థం కాదు. కాబట్టి సీతకు అర్థము అయ్యేభాషలో మాట్లాడి ఆమెను ఓదార్చాలి.

అంతవరకూ బాగానే ఉంది. కానీ సీత ముందుకు ఏ రూపంలో వెళ్లాలి. వానర రూపంలో వెళితే, అసలే రాక్షసుల వలన భయపడుతున్న సీత ఇంకా భయపడుతుంది. తనను

మాయారూపములు ధరించు రావణునిగా భయపడుతుంది. అరుస్తుంది. అప్పుడు ఈ రాక్షసులు లేస్తారు. వాళ్లంతా ఆయుధములు పట్టుకొని వస్తారు. నన్ను పట్టుకొని చంపడానికి ప్రయత్నం చేస్తారు. నేను వాళ్లకు దొరకకుండా పారిపోగలను. కానీ వారికి అనుమానం వస్తుంది. పోనీ నా భయంకరాకారముతో కనపడితే, ఈ రాక్షస స్త్రీలు పెద్దగా అరిచి గోల చేస్తారు. అప్పుడు రాక్షస సేనలు వస్తాయి. వారితో యుద్ధం చేయాల్సివస్తుంది. వాళ్లందరినీ చంపి నేను సముద్రము ఒడ్డుకు చేరుకోవడం అసంభవమవుతుంది. నేను తిరిగి కిష్కింధకు వెళ్లకపోతే, పడిన శ్రమ అంతా వృధా అవుతుంది.

అదీ కాకుండా, నేను సీతను కలుసుకోకముందే రాక్షసులు నన్ను పట్టుకుంటే, వచ్చిన పని నెరవేరదు. నా మీద కోపంతో వారు సీతను చంపినా చంపుతారు. అప్పుడు రామకార్యము మొత్తము చెడిపోతుంది." ఈ విధంగా అన్ని విషయములనూ కూలంకషంగా ఆలోచిస్తున్నాడు హనుమంతుడు.

"ఈ ప్రదేశము లంకకు ఒక మూలగా ఉంది. ఇక్కడ కట్టుదిట్టమైన కాపలా ఉంది. ఏ మాత్రం తప్పటడుగు వేసినా తాను చావడం ఖాయం. అప్పుడు మరొకడు వచ్చి రామ కార్యమును పూర్తిచేస్తాడు అని అనుకోడానికి వీలు లేదు. వానరులలో అంతసామర్థ్యము కలవారు లేరు. సీతతో మాట్లాడితే రాక్షసులు నన్ను పట్టుకుంటారు. సీతతో మాట్లాడకుండా వెళ్లిపోతే తనకు ఏ దిక్కూలేదని సీత ప్రాణాలు తీసుకుంటుంది. ఇప్పుడే జడతో ఉరి పోసుకోబోయింది. కాబట్టి ఈ కార్యమును నేర్పుతో చక్కదిద్దాలి.

నా వలన రామ కార్యము చెడింది అన్న అపవాదు నాకు రాకూడదు. ఏది చెయ్యాలో ఏది చెయ్యకూడదో నిర్ణయించుకున్న తరువాత కూడా, అవివేకుడైన దూత వలన కార్యము మొత్తము చెడిపోయే ప్రమాదం ఉంది. కాబట్టి దూతకు తనకు అంతా తెలుసు అన్న అహం పనికిరాదు. అహంకారులు, దురభిమానులు అయిన దూతలవలన కార్యము సర్వనాశనము అవుతుంది. కాబట్టి బాగా ఆలోచించి ఒక నిర్ణయంతీసుకోవాలి. ఆ నిర్ణయం వలన కార్యం సానుకూలం కావాలి గానీ, చేసిందంతా చెడిపోకూడదు.

అందుకని, ఎవరూ చూడకుండా సీతను కలవాలి. తనను తాను తెలియ పరచుకోవాలి. సీత తనను చూచి భయపడకుండా చూచుకోవాలి. సీతకు తన మీద నమ్మకం కలిగించుకోవాలి. ఇవన్నీ నేర్పుగా సాధించాలి. ఇప్పుడు నేను ఈమెకు కనపడకుండా రాముని గురించి కీర్తిస్తే సీతకు నా మీద నమ్మకం కుదిరే అవకాశం ఉంది. పైగా సీత తనను చూచి భయపడదు. కాబట్టి రాముని గురించి కీర్తించడం ఒక్కటే ప్రస్తుత కర్తవ్యము." అని మనసులో నిశ్చయించు కున్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ముప్పదియవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# సుందర కాండము

## ముప్పది ఒకటవ సర్గ.

ఆలోచించి ఆలోచించి హనుమంతుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. చెట్లచాటున కూర్చుని సీతకు వినబడేటట్టుగా రామకథను గానం చెయ్యాలని అనుకున్నాడు. అదేవిధంగా హనుమంతుడు రామ కథను గానం చెయ్యసాగాడు.

"ఇక్ష్వాకు వంశంలో ఒక మహారాజు ఉండేవాడు. ఆయన పేరు దశరథుడు. ఆయన గొప్ప కీర్తి మంతుడు, ఐశ్వర్యవంతుడు. ధర్మాత్ముడు. బలంలో దేవేంద్రుని మించిన వాడు. దశరథుడు గొప్ప రాజర్షి. అహింసావ్రతమును, సత్యవాక్పరిపాలనను అవలంబించిన వాడు. దశరథుడు నాలుగుసముద్రముల మధ్య ఉన్న భూమిని పరిపాలించేవాడు.

ఆ దశరథుని పెద్ద కుమారుని పేరు రాముడు. రాముని ముఖం చంద్రుని వలె ప్రకాశిస్తూ ఉంటుంది. రాముడు మానవులలో ఉత్తముడు. గొప్ప ధనుర్ధారి. రాముడు ఎల్లప్పుడూ ధర్మమునే పాటించేవాడు. ఎల్లప్పుడూ సత్యమునే పలికెడి వాడు. అటువంటి రాముడు, తన తండ్రి ఆదేశము మేరకు అరణ్యవాసమునకు వెళ్లాడు. రాముని వెంట ఆయన భార్య సీత, తమ్ముడు లక్ష్మణుడు, కూడా అరణ్యవాసమునకు వెళ్లారు. పరాక్రమవంతుడైన రాముడు అడవిలో ఉండగా అనేకమంది రాక్షసులను చంపాడు.

రాముడు రాక్షసులను చంపాడు అన్న విషయం రావణునికి తెలిసింది. రాముని మీద ప్రతీకారము తీర్చుకోవాలి అనుకున్నాడు రావణుడు. రావణుడు ఒక మాయమృగమును పంపి, రాముని, లక్ష్మణుని దూరంగా పంపి, సీతను వంచనతో అపహరించాడు. రాముడు సీతను వెతుకుతూ అరణ్యములో తిరుగుతూ, వానర రాజు అయిన సుగ్రీవునితో స్నేహం చేసాడు. సుగ్రీవుని కోరిక మేరకు, రాముడు వాలిని చంపి, సుగ్రీవునికి రాజ్యం ఇప్పించాడు. సుగ్రీవుని ఆజ్ఞమేరకు వానరులు సీతను వెదకడానికి నలుమూలలకూ పంపబడ్డారు. ఆ వానరులలో నేనూ ఒకడిని. సంపాతి చెప్పిన మాటలను బట్టి సీత లంకలో ఉన్నదని తెలుసుకున్నాను. నూరు యోజనముల దూరము కల సముద్రమును దాటిలంకలో ప్రవేశించాను. రాముడు చెప్పిన గుర్తులుబట్టి ఇక్కడ ఈ అశోకవనములో, శింశుపా వృక్షము కింద ఉన్న ఉత్తమురాలు సీత అని గుర్తించాను." అని మౌనం వహించాడు హనుమంతుడు.

హనుమంతుడు పలికిన పలుకులు అన్నీ సీత ఆశ్చర్యంతో వినసాగింది. తల పైకి ఎత్తి చూచింది. శింశుపావృక్షము మీద కొమ్మల చాటున ఉన్న హనుమంతుని చూచింది. రామ కథను హనుమంతుని నోట విన్న సీత ఎంతో సంతోషించింది.

హనుమ మాటలు ఎవరన్నా విన్నారా అని అనుమానంతో అటు ఇటు చూచింది. మనసులో రాముని స్మరించుకుంది. తనకు విముక్తి లభించబోతున్నదని ఆనందించింది సీత.

మరలా తల పైకి ఎత్తి హనుమంతుని వంక చూచింది సీత.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ముప్పది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

ముప్పది రెండవ సర్గ.

శింశుపా వృక్షము చెట్ల ఆకుల మాటున, ఆకు పచ్చని శరీర ఛాయతో, తెల్లని వస్త్రమును ధరించి, రామకథను గానం చేసిన హనుమంతుని చూచింది సీత. ఆలోచనలో పడింది. చూడబోతే కోతి. మహాభయంకరంగా ఉన్నాడు. ఆ కోతి ముఖం తేజస్సుతో వెలిగిపోతూ ఉంది. కానీ రామ కథను గానం చేసాడు. ఏమీ అర్థం కాలేదు సీతకు. ఆమెలో భయం ప్రవేశించింది. "రామా! రామా! ఏంటి నాకీ పరీక్ష. ఇతను ఎవరు? ఎందుకొచ్చాడు? నీ చరిత్ర ఎందుకు గానం చేసాడు. కొంపదీసి నేను కనగంటున్నానా! ఇదీ కలా! నిజమా!" అని మనసులోనే మథనపడసాగింది. మరలా తల పైకి ఎత్తి హనుమంతుని వంక చూచింది.

(ఒకసారి మాయ లేడి విషయంలో మోసపోయి అంతులేని కష్టాల్లో ఇరుక్కుంది. అందుకే ఎవర్ని నమ్మడం లేదు సీత.)

సీత తన గురించి ఏమి అనుకుంటూ ఉందో అని సీత వంక తదేకంగా చూస్తున్నాడు హనుమంతుడు. హనుమంతుని చూపులు చూచి సీతకు పైప్రాణాలు పైనే పోయాయి. కాసేపు స్పృహ

తప్పినట్టయింది. అంతలోనే తేరుకుంది. సీతకు హనుమంతుడు కనపడటం స్వప్నంలాగా అనిపించింది.

"వికృతమైన వానరము కలలో కనిపిస్తే మంచిది కాదంటారు. నా రామునికి, లక్ష్మణునికి, నా తండ్రి జనకునికి ఏమీ కాకూడదు. భగవంతుడు వారి నందరినీ క్షేమంగా చూడాలి." అని అనుకొంది. కాని అంతలోనే సీతకు మరో సందేహము వచ్చింది.

"స్వప్నములు నిద్రలో వస్తాయి కదా! నిత్యము  కష్టాలు తలచుకుంటూ దు:ఖించే నాకు నిద్రే రానపుడు ఇంక కల రావడం ఏమిటి? కాబట్టి ఇది కలకాదు. నేను సదా రామ నామమును జపిస్తూ ఉంటడం వలన, నాకు ఎవరు ఏమి మాట్లాడినా రామ కధలాగానే వినిపిస్తూ ఉంది. ఇదంతా నా భ్రమ" అని అనుకొంది సీత.

అంతలోనే మరొకసందేహము. "ఇది భ్రమ అయితే మరి ఎదురుగా కనపడుతున్న ఆ వానరము సంగతేమిటి? మనసులో అనుకొన్నది, కలలో కనిపించింది,  రూపం ధరించి ఎదురుగా కనపడుతుందా! నాకు ఈ వానరము కనపడుతూ ఉంది కదా! పైగా ఈ వానరుడు మానుష భాషలో స్పష్టంగా మాట్లాడుతున్నాడు. మరి దీన్ని ఏమనాలి? అతడు ఎవరైనా కానీ, అతడు చెప్పిన మాటలు సత్యం కావాలి. నాకు నా రామునకు శుభం జరగాలి." అని మనసులోనే బ్రహ్మదేవునికి, ఇంద్రునికి, సమస్త దేవతలకు నమస్కరించింది సీత.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ముప్పది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందరకాండము

ముప్పది మూడవ సర్గ.

సీత పడుతున్న మనోవేదనను గమనించాడు హనుమంతుడు. ఇలా కాదనుకున్నాడు. చెట్టు దిగాడు. సీత ముందు నిలబడ్డాడు. రెండు చేతులు జోడించి తల మీద పెట్టుకొని వినయంగా నమస్కారం చేసాడు. సీతతో ఇలా అన్నాడు.

"అమ్మా! మీరు ఎవరు? మీ ముఖంలో లక్ష్మీకళ ఉట్టిపడుతూ ఉంది. కాని మాసిన చీర కట్టుకొని ఉన్నారు. ఈ చెట్టుకొమ్మను పట్టుకొని నిలబడి ఉన్నారు. మీరు ఎవరు? మీ రెండు కళ్లనుండి నిరంతరమూ నీళ్లు కారుతున్నాయి. ఎందుకు దు:ఖిస్తున్నారు. నీవు ఏ జాతికి చెందిన స్త్రీవి. దేవకాంతవా! రాక్షస కాంతవా! గంధర్వ కాంతవా! నాగదేవతవా! యక్షిణివా! లేక కిన్నెర కాంతవా! పోనీ రుద్రగణములు, మరుత్ గణములు, వసుగణములు, ఈ గణములకు చెందిన కాంతవా!

నీవు మానవ కాంతవు కావు. దేవతా స్త్రీవి అని అనిపిస్తూ ఉంది. స్వర్గం నుండి భూమికి దిగిన అప్సరసవా! వసిష్టుని భార్య అరుంధతివి కాదు కదా! నీ భర్త మీద కోపంతో ఆయనను వదిలి వచ్చి ఆయన కోసం దు:ఖిస్తున్నావా! లేక పోతే నీ వాళ్లు ఎవరన్నా చనిపోతే వారి కోసరం ఏడుస్తున్నావా! ఆ చనిపోయింది నీ కొడుకా, భర్తా, సోదరుడా లేక నీ తండ్రియా! ఎందుకోసం ఏడుస్తున్నావు?

నీవు ఏడవడం చూస్తుంటే నీవు దేవతా స్త్రీవి కాదని అనిపిస్తూ

ఉంది. ఎందుకంటే దేవతలకు ఏడుపురాదు కదా! మరి రాజలక్షణములు కలిగిన మానవ కాంతవా! నీ ముఖ కళవళికలు, నీ శరీర లక్షణాలను బట్టి నీవు క్షత్రియ కాంతవనీ, చక్రవర్తి భార్యవు అనీ నాకు అనిపిస్తూ ఉంది. అవునూ! నువ్వు జనస్థానము నుండి రావణుడు అపహరించి తీసుకొని వచ్చిన సీతవు కావు కదా! నీ ముఖంలో కనపడుతున్న దీనత్వము, శోకము, నీ శరీర సౌందర్యము, నీ పవిత్రత చూస్తుంటే నీవు రాముని భార్య సీత అని నాకు అనిపిస్తూ ఉంది. నీవు రాముని భార్య సీతవే కదా! " అని ఊరుకున్నాడు

హనుమంతుడు. సీతకు ఇంక తన గురించి తాను చెప్పకోక తప్పలేదు. హనుమంతుని చూచి ఇలాఅంది.

"అవును. నువ్వు చెప్పింది నిజమే. నేను దశరథమహారాజు కోడలిని. విదేహ మహారాజు జనకుని కూతురిని. రాముని భార్యను సీతను. నా వివాహము అయిన తరువాత నేను అయోధ్యలో పన్నెండు సంవత్సరములు నా భర్తతో సకల రాజభోగములు అనుభవించాను. పదమూడవ సంవత్సరంలో దశరథ మహారాజు రామునికి పట్టాభిషేకము చేయ నిశ్చయించాడు.

రాముని పట్టాభిషేకానికి ఏర్పాట్లు జరుగుతుంటే, దశరథుని మూడవ భార్య కైక దశరథునితో "రామునికి పట్టాభిషేకము జరిగితే నేను ఆహారము నీరు ముట్టను. బలవంతంగా ప్రాణం తీసుకుంటాను. నీవు నాకు ఇచ్చిన మాట నిలబెట్టుకోదలచుకుంటే రాముని పదునాలుగేళ్లు అడవులకు పంపు. " అని శపథం చేసింది.

ఆమాటలు విన్న దశరథుడు మూర్ఛపోయాడు. మూర్ఛనుండి తేరుకొని, రామునికి వారసత్వంగా సంక్రమించిన రాజ్యాధికారమును తిరిగి తనకు ఇవ్వమని రాముని అడిగాడు దశరథుడు. రాజ్యపట్టాభిషేకము కంటే కూడా తండ్రి మాటకు విలువ ఇచ్చాడు రాముడు. ఒకరికి ఇవ్వడమే కానీ, ఎవ్వరినుండీ ఏదీ తీసుకోని రాముడు, తనకు సంక్రమించిన రాజ్యాధికారమును దశరథునికి ఇచ్చివేసాడు. రాజ్యాధికారమును త్యజించిన రాముడు నార చీరలు ధరించి అడవులకు బయలు దేరాడు. రాముడు లేనిదే నేను బతుకలేనని, నేను కూడా రాముని వెంట అడవులకు బయలుదేరాను. అన్నగారికి రక్షణగా రాముని తమ్ముడు లక్ష్మణుడు కూడా రాముని వెంటఅడవులకు వచ్చాడు.

ఆ ప్రకారంగా మేము ముగ్గురము అరణ్యవాసము చేస్తున్నాము. మేము ముగ్గురమూ దండకారణ్యములో ఉండగా, రావణుడు అనే రాక్షసుడు నన్ను అపహరించాడు. ఇప్పుడు రావణుడు నాకు రెండుమాసములు సమయము ఇచ్చాడు. రావణుడు ఇచ్చిన రెండుమాసములు గడువు తరువాత నేను ప్రాణత్యాగము చేస్తాను." అని తన గురించి క్లుప్తంగా చెప్పింది సీత.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ముప్పది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ముప్పది నాలుగవ సర్గ.

సీత పలికిన పలుకులు అన్నీ శ్రద్ధగా విన్నాడు హనుమంతుడు. సీతతో ఇలా అన్నాడు.

“ఓ వైదేహీ! నేను రాముడు పంపగా దూతగా నీ వద్దకు వచ్చాను. రాముడు క్షేమంగా ఉన్నాడు. నీ క్షేమ సమాచారములు తెలుసుకొని రమ్మని రాముడు నన్ను నీ వద్దకు పంపాడు. రాముని తమ్ముడు లక్ష్మణుడు కూడా ఆయన పక్కనే ఉన్నాడు. లక్ష్మణుడు కూడా నీకు తన అభివాదములు తెలుపమన్నాడు.” అని అన్నాడు హనుమంతుడు.

రామలక్ష్మణుల క్షేమవార్తలు విన్న సీత ఆనందంతో పొంగి పోయింది. “మానవుడు బతికి ఉంటే నూరు సంవత్సరములకైనా క్షేమకరమైన వార్తలు వింటాడు అని లోకోక్తి. నేను ఇన్నిరోజుల నుండి రాముని క్షేమ వార్తల కోసరము ఎదురు చూస్తున్నాను. నీ వలన రామలక్ష్మణుల క్షేమము గురించి తెలుసుకున్నాను. నాకు చాలా సంతోషంగా ఉంది.” అని పలికింది సీత.

హనుమంతుడు ఆమె దగ్గరగా వెళ్లాడు. హనుమంతుడు దగ్గర దగ్గరగా రావడం చూచి మరలా సీత మనసులో అనుమానం పొడసూపింది. వీడు మారువేషములో ఉన్న రావణుడు కాదు కదా! అని అనుమా నించింది.

"అయ్యో! నేనెంత మందమతిని. నా విషయాలన్నీ అనవసరంగా ఇతనికి చెప్పాను. ఇతడు మాయ వేషంలో వచ్చిన రావణుడు. సందేహం లేదు. లేకపోతే నా దగ్గరగా ఎందుకు వస్తాడు. నేను ఇతనికి దూరంగా ఉండాలి." అనీ సీత దూర దూరం గా జరిగి కూర్చుంది.

హనుమంతునికి ఏమీ తోచలేదు. సీతమ్మ తనను అనుమానిస్తూ ఉంది. ఆ అనుమానం తీర్చడం ఎలాగా అని ఆలోచిస్తున్నాడు. రెండు చేతులు ఎత్తి సీతమ్మకు నమస్కారం పెట్టాడు అంతకన్నా ఏమీ చెయ్యలేక. కాని సీత భయంతో వణికి పోతూ ఉంది. కాని తనకు నమస్కరించుచున్న హనుమను చూచి సీత భయం కొద్దిగా తగ్గింది. రావణుడు అయితే నమస్కరించడు కదా! అని అనుకొంది. అందుకని హనుమతో ఇలాఅంది.

"అయ్యా! నీవు ఎవరవో నాకు తెలియదు. నీవు కనుక మాయావేషంలో వచ్చిన రావణుడివే అయితే వెంటనే వెళ్లిపో. నా నిర్ణయం నీకు ముందే చెప్పాను. మరలా మరలా వచ్చి నాబాధను పెంచకు. నీకు మంచిది కాదు. నువ్వు ఎవ్వరవో నాకు బాగా తెలుసు. నేను ఆశ్రమంలో ఉండగా పవిత్రమైన సన్యాసి రూపంలో వచ్చావు. నన్ను అపహరించావు. ఇప్పుడు ఈ వానర రూపంలో వచ్చావు. నువ్వు ఆ రావణుడివే. సందేహము లేదు. ఇలా మాటి మాటికీ వచ్చి నన్ను ఎందుకు బాధ పెడతావు. నీ వంటి వాడికి ఒక స్త్రీ కోసరం ఇలా చెయ్యడం మంచిది కాదు. శోభనివ్వదు." అని దూరంగా జరిగింది. కాని అంతలోనే మరొక ఆలోచన సీతమ్మ మదిలో మెదిలింది. తనలో తాను అనుకుంటున్నట్టు బయటకు అనుకుంది.

"కాని, ఎందుకో, నా మనస్సులో, నువ్వు రావణుడివి కాదు అని అనిపిస్తూ ఉంది. ఎందుకంటే మొదట నిన్ను చూడగానే నా మనసులో అనుకోకుండా నాకు ఆనందం కలిగింది. రావణుని చూస్తే నాకు అసహ్యము తప్ప ఆనందం కలుగదు. నీవు చెప్పినట్టు నీవు రాముని దూతగా వచ్చినట్టయితే చాలా సంతోషము. నీవు గానం చేసిన రామ కథ నాకు చాలా ఇష్టము. ఎన్ని సార్లు విన్నా తనివి తీరదు.

ఓ బాల వానరమా! నాకు ఇంకా రాముని గురించి చెప్పవా! విని సంతోషిస్తాను. నాకు ఇదంతా ఒక స్వప్నము వలె తోస్తూ ఉంది. ఎంతో కాలము కింద రావణునిచేత అపహరింపబడిన నాకు దు:ఖభారంతో నిద్రపట్టడంలేదు. స్వప్నములు కూడా రావడంలేదు. కనీసం స్వప్నములో అయినా రాముడు నాకు కనపడితే ఆ ఆనందంతో నేను రాముని కొరకు ఎంత కాలము అయినా వేచి ఉంటాను. నాకు ఆ భాగ్యము లేదు. కానీ ఇప్పుడు రామదూతగా నువ్వు కనపడు తున్నావు. ఇది స్వప్నము అయినా నిజము అయినా నాకు సంతోషమే!" అని పలికింది.

అంతలో మరలా తనలోతాను ఇలా అనుకొంది. "నాకేమైనా పిచ్చి పట్టిందా! వీడితో ఇలా మాట్లాడుతున్నాను. లేక ఉన్మాదంతో ఇలా పలికానా! కాదు కాదు. నాకు ఏమీ కాలేదు. నేను బాగానే ఉన్నాను. నేను నేనే. నా ఎదుట ఈ వానరము నిలబడి ఉంది. నేను మంచి స్పృహలోనే ఉన్నాను. ఎలాంటి ఉన్మాదస్థితిలో లేను. నా ఎదుట ఉన్నది నిజంగా వానరమే." అని పరి పరి విధాలా ఆలోచించింది.

కానీ ఆమె మనసుకు ఎందుకో హనుమంతుని నమ్మ బుద్ధికావడంలేదు. “సందేహం లేదు. వీడు వానరరూపంలో వచ్చిన రావణుడే.” అని నిర్ధారించుకుంది సీత. వీడు రావణుడు అయినప్పుడు వీడితో మాట్లాడటం అనవసరము అని హనుమతో మాట్లాడకుండా ఊరుకొంది.

సూక్ష్మగ్రాహి అయిన హనుమంతుడు సీత మనసులో మెదిలే ఆలోచనలను పసిగట్టాడు. సీత తనను నమ్మడం లేదు అని నిర్ధారించు కున్నాడు. ఇప్పుడు రాముని గురించి చెప్పడం, రాముని స్తుతించడం తప్ప వేరు మార్గం లేదు అని అనుకొన్నాడు. సీత వినేట్టు ఇలా అంటున్నాడు.

“రాముడు ఎంత తేజోవంతుడు. ఆయన తేజస్సు సూర్యుని తేజస్సుతో సమానమైనది. అంతే కాదు రాముడు చంద్రుని వలె చల్లని వెన్నెల వంటి తన చూపులతో లోకాలకు ఆహ్లాదాన్ని కలిగిస్తాడు. రాముడు కుబేరుని వలె గొప్ప ఐశ్వర్యవంతుడు. విష్ణువు వలె గొప్ప కీర్తి కలవాడు. రాముడు ఎల్లప్పుడూ సత్యములే పలుకుతాడు. బృహస్పతి వలె బుద్ధిమంతుడు. మంచి రూపవంతుడు. మన్మధునికి రూపం వస్తే ఎలా ఉంటాడో అలా ఉంటాడు రాముడు. రామునికి సాధారణంగా కోపం రాదు. సంహరించవలసిన వారిని సంహరించవలసినపుడు, కోపం తెచ్చుకుంటాడు. ఆ కార్య అయిపోగానే మరలా కోపాన్ని విడిచిపెడతాడు.  రాముడు గొప్ప ధనుర్ధారి. మహారథుడు.

ఓ సీతమ్మ తల్లీ! ఈ తుచ్ఛుడైన రావణుడు మాయా మృగమును ప్రయోగించి నీ రాముని దూరంగా పంపి, నిన్ను

అపహరించాడు కదా! ఈ రావణునికి ఎట్టి దుర్గతి పట్టబోతూ ఉందో కళ్లారా చూస్తావు. ఓ సీతమ్మ తల్లీ! ఏ రాముడైతే అతి త్వరలో లంకకు వచ్చి తన బాణములతో రావణుని చంపి నిన్ను రక్షిస్తాడో ఆ రాముడే నన్ను నీ వద్దకు పంపాడు. నన్ను నమ్ము. రాముడు నిన్ను తలచుకుంటూ నీ వియోగముతో చాలా బాధపడుతున్నాడు. నీ క్షేమము గురించి తెలుసుకొని రమ్మని నన్ను పంపాడు.

రాముడు వానరరాజు అయిన సుగ్రీవునితో స్నేహము చేసాడు. ఆ సుగ్రీవుడు కూడా నీ క్షేమము అడగమన్నాడు. మా అందరి అదృష్టము కొద్దీ నీవు రాక్షసుల చెరలో ఉన్ననూ జీవించి ఉన్నావు. రామ,లక్ష్మణ,సుగ్రీవులు అనుక్షణం నిన్ను తలచుకుంటూ నీ గురించి ఆందోళనపడుతున్నారు. నీకు ఈ చెర ఎంతో కాలము ఉండదు. కోట్లాది వానర వీరులతో రామలక్ష్మణులు, సుగ్రీవుడు లంకకు వచ్చి, రావణుని చంపగలరు.

నేను వానర రాజు సుగ్రీవుని మంత్రిని. నా పేరు హనుమంతుడు. ఇది నా నిజస్వరూపము కాదు. హ్రస్వ స్వరూపము. నేను నూరుయోజనముల దూరం ఉన్న సముద్రమును దాటి ఈ లంకలో ప్రవేశించాను. నిన్ను చూడటానికి ఇక్కడకు వచ్చాను. రావణుడు ఇక్కడకు రాక ముందు నుంచే ఈ చెట్టు మీద ఉన్నాను. రావణుడు పలికిన పలుకులు, ఈ రాక్షసస్త్రీల బెదిరింపులు అన్నీ విన్నాను.

ఓ సీతాదేవీ! ఇప్పటికైనా నన్ను నమ్ము. నేను రావణుడను కాను. వానరుడను. నీ సందేహమును విడిచి పెట్టు." అని పలికాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ముప్పది నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
ముప్పది ఐదవ సర్గ.

హనుమంతుడు ఎన్ని చెప్పినా సీత మనసులో ఉన్న సందేహము తీరడం లేదు. ఏమో! మరలా తాను మోసపోతున్నానేమో! అని మనసులో మథనపడుతూ ఉంది సీత. అందుకని హనుమంతునితో ఇలా అంది.

"నీవు రాముని వద్దనుండి వచ్చాను అన్నావు కదా! నీవు రాముని ఎప్పుడు కలిసావు. నీకూ రామునికి సంబంధము ఎలా కలిగింది? నీకు లక్ష్మణుడు ఎలా తెలుసు? మీరు వానరులు. రామలక్ష్మణులు నరులు, వారికీ మీకూ స్నేహం ఎలా కుదిరింది? నువ్వు రాముని, లక్ష్మణుని, నిజంగా చూస్తే రాముడు ఎలా ఉంటాడు. లక్ష్మణుడు ఎలా ఉంటాడు. వివరించి చెప్పు. అప్పుడే నేను నిన్ను నమ్ముతాను." అని అడిగింది సీత.

సీతతో హనుమంతుడు ఇలా చెప్పసాగాడు. "నీకు రాముని గురించి బాగా తెలుసు కాబట్టి రాముని రూపు రేఖల గురించి అడుగుతున్నావు. నేనూ రాముని చూచాను కాబట్టి రాముని గురించి చెబుతాను విను.

రాముని కన్నులు కమలముల వలె ఉంటాయి. రాముడు మనోహరుడు. అందరి మనస్సులనూ తన మంచితనంతో హరించేవాడు. మంచి రూపవంతుడు. మంచి నేర్పుకలవాడు. ఇంకా రాముడు తేజస్సులో సూర్యునితోనూ, బుద్ధిలో బృహస్పతి తోనూ, ఓర్పులో భూదేవితోనూ, కీర్తిలో దేవేంద్రునితోనూ సమానుడు. రాముడు తన పరాక్రమంతో తన వారిని రక్షిస్తాడు. శత్రువులను సంహరిస్తాడు.

ఈ లోకంలో ఉన్న నాలుగు వర్ణముల వారిని సమానముగా రక్షిస్తాడు. అన్ని వర్ణముల వారికీ కట్టుబాట్లు ఏర్పరచి జనులందరూ ఆ కట్టుబాట్ల ప్రకారము నడుచుకొనేటట్లు చేస్తాడు. రాముడికి ఏపనికి ఏ ఫలితము వస్తుందో తెలుసు. అందుకని సత్కర్మలనే ఆచరిస్తాడు. రాముడు రాజనీతిజ్ఞుడు. బ్రాహ్మణులను గౌరవిస్తాడు. రాముడు సకల విద్యలు నేర్చినవాడు. మంచి వినయము కలవాడు. రాముడు యజుశ్శాఖాధ్యాయి. వేదములు చదివిన వారిచేత పూజింపబడేవాడు. వేద, వేదాంగములను చదివినవాడు. విశేషించి ధనుర్వేదమును చక్కగా అభ్యాసించాడు.

రాముడు ఆజానుబాహుడు. విశాలమైన భుజములు కలవాడు. రాముడు శ్యామవర్ణములో ఉంటాడు. రాముడు విశాలమైన

వక్షస్థలము కలవాడు. దీర్ఘబాహుడు. రామునికి అన్ని అవయవములు సమానంగా తీర్చిదిద్దినట్టు ఉంటాయి. రాముని పొట్టమీద మూడు రేఖలు ఉన్నాయి. సాముద్రికశాస్త్రములో చెప్పబడిన శుభలక్షణములు అన్నీ రాముని హస్తరేఖలలో పాద ముద్రలలో ఉన్నాయి. రాముడు నడుస్తుంటే సింహము, ఏనుగు, ఎద్దు నడిచినట్టు ఉంటుంది. రాముని శరీర అవయవములు అన్నీ గుండ్రంగా పద్మము ఆకారంలో ప్రకాశిస్తూ ఉంటాయి. రాముని తేజస్సు, కీర్తి, సంపద మూడులోకములలో ప్రసిద్ధిచెందాయి.

రాముని యొక్క మాతృవంశము పితృవంశము పునీతమైనవి. రాముడు పురుషార్థములైన ధర్మ, అర్థ, కామ, మోక్షములను చక్కగా పాటిస్తాడు. రాముడు సత్యము పలకడం లోనూ, ధర్మాచరణంలోనూ ఆసక్తి కలవాడు. రాముడు తన శరణు కోరిన వారిని అనుగ్రహిస్తాడు. రామునికి యుక్తాయుక్త జ్ఞానము ఎక్కువ. రాముడు అందరితోనూ చాలా ప్రియంగా మాట్లాడతాడు. ఇంక లక్షణుడు పరాక్రమ వంతుడు. ఇప్పటి వరకూ ఎవరిచేతిలోనూ ఓడిపోలేదు.

రామలక్ష్మణులు నీ కోసం వెదుకుతూ మా దగ్గరకు వచ్చారు. నిన్ను చూడాలని ఆతురత పడుతున్నారు. నేను, మా రాజు సుగ్రీవుడు ఋష్యమూక పర్వతము మీద ఉంటాము. రాముడు, లక్ష్మణుడు నిన్ను వెతుక్కుంటూ ఋష్యమూక పర్వతము వద్దకు వచ్చారు. మేము వారిని చూచాము. మా మహారాజు సుగ్రీవుడు తన అన్న వాలితో రాజ్యము నుండి తరిమివేయబడ్డాడు. రాజ్యభ్రష్టుడైన సుగ్రీవుని మేము సేవిస్తున్నాము.

ఆసమయంలో నారచీరలు కట్టుకొని ధనుస్సు, బాణములు చేతులలో ధరించి వస్తున్న రామలక్ష్మణులను నేను సుగ్రీవుడు చూచాము. సుగ్రీవుడు వారిని చూచి భయపడి కొండశిఖరము ఎక్కికూర్చున్నాడు. నన్ను రామలక్ష్మణుల వద్దకు పంపాడు. నేను రామలక్ష్మణుల వద్దకు వెళ్లి నమస్కరించాను. సుగ్రీవుని గురించి జరిగింది జరిగినట్టు చెప్పాను. నేను వారిని నా వీపు మీద ఎక్కించుకొని సుగ్రీవుని వద్దకు తీసుకొని వెళ్లాను.

రాముడు సుగ్రీవుడు ఒకరితో ఒకరు మాట్లాడుకొని ఒకరి కష్టసుఖములు మరొకరితో పంచుకున్నారు. ఇద్దరికీ మైత్రి కుదిరింది. ఇద్దరూ ఒకే విధమైన దు:ఖములో ఉన్నారు. రాముని భార్య సీతను రావణుడు అపహరించాడు. సుగ్రీవుని భార్య రుమను అతని అన్న వాలి లాక్కున్నాడు. రామునికి రాజ్యము పోయింది. సుగ్రీవుడు కూడా రాజ్యభ్రష్టుడు అయ్యాడు. ఒకరికి ఒకరు సాయం చేసుకోవాలని నిర్ణయించుకున్నారు.

ఓ సీతమ్మ తల్లీ! నిన్ను రావణుడు అపహరించి తీసుకొని పోవునపుడు నీవు నీ ఉత్తరీయమును చించి నీ ఆభరణములను మూటకట్టి కింద జారవిడిచావు. ఆ మూట అదృష్టవశాత్తు మా దగ్గర పడింది. మేము ఆ మూటను రామునికి చూపించాము. ఆ ఆభరణములను చూచి రాముడు మూర్ఛపోయాడు. నిన్ను తలచుకుంటూ పరిపరివిధముల శోకించాడు. ఆ ఆభరణములు అప్పటిదాకా అణచుకొన్న రాముని శోకాగ్నిని మరలా ప్రజ్వరిల్లజేసాయి.

మేము రాముని మా శాయశక్తులా ఓదార్చాము. అప్పటినుండి రాముడు నిన్ను తలచుకుంటూ, నీ ఆభరణములను చూస్తూ  ఏడుస్తున్నాడు. రాముడు నిద్ర ఆహారములను విడిచి పెట్టి నిన్నే తలచుకుంటున్నాడు. ఓ సీతమ్మ తల్లీ! రాముడు వెంటనే వచ్చి రావణుని సంహరించి నిన్ను చేరుకుంటాడు.

-- రాముడు, సుగ్రీవుడు ఒకరికి ఒకరు సాయం చేసుకోవాలని ఒప్పందం చేసుకున్నారు. ఆ ఒప్పందం ప్రకారము రాముడు వాలిని చంపి, సుగ్రీవునికి రాజ్యమును, అతని భార్యను ఇప్పించాలి. దానికి బదులుగా సుగ్రీవుడు నీ కోసం వానరులను పంపి వెతికించి, నీ జాడ తెలుసుకొనాలి. తరువాత రావణుని ఓడించి నిన్ను పొందడంలో రామునికి సాయపడాలి.

ఆ ఒప్పందము ప్రకారము రాముడు వాలిని చంపి, సుగ్రీవుని కిష్కింధకు రాజును చేసాడు. అతని భార్య రుమను అతనికి అప్పగించాడు. సుగ్రీవుడు తన ఒప్పందము ప్రకారము నిన్ను వెదకడానికి వానర వీరులను నాలుగు దిక్కులకు పంపాడు.  నన్ను ఇంకా కొంతమంది వానరులను నిన్ను వెదకడానికి దక్షిణ దిశగా పంపాడు. వాలి కుమారుడు అంగదుడు మాకు నాయకుడు.

సుగ్రీవుడు మాకు మాసము రోజులు గడువు ఇచ్చాడు. నిన్ను వెదుకుతూ మేము వింధ్యపర్వత ప్రాంతములో ఒక బిలములో దారి తప్పాము. అక్కడే చాలారోజులు గడిచిపోయాయి. నీ జాడ తెలియలేదు. మాకు సుగ్రీవుడు ఇచ్చిన గడువు దాటిపోయింది. ఒట్టి చేతులతో వెళితే సుగ్రీవుడు మాకు మరణదండన విధిస్తాడు. అందుకని మేము

ప్రాయోపవేశము చేయాలని నిర్ణయించుకున్నాము.

ఆ సమయంలో మా దగ్గరకు ఒక పక్షిరాజు వచ్చాడు. ఆయన పేరు సంపాతి. ఆయన జటాయువుకు సోదరుడు. రామలక్ష్మణుల నుండి మేము, నిన్ను రావణుడు అపహరించడం, జటాయువును రావణుడు చంపడం గురించి విని ఉన్నాము. ఆ విషయం మేము సంపాతికి చెప్పాము. సంపాతికి తన సోదరుని చంపిన రావణుని మీద కోపం వచ్చింది. నీవు రావణుని ఆలయము నందు ఉన్నట్టు సంపాతి మాకు చెప్పాడు.

ఆ మాటలు విన్న మేము, అంగదుడు అక్కడి నుండి బయలేదేరాము. సముద్ర తీరము చేరుకున్నాము. కాని విశాలమైన సముద్రమును చూడగానే దానిని ఎలా దాటాలి అని అందరం చింతిస్తున్నాము. నేను మాత్రము నా శక్తి యుక్తులు ఉపయోగించి, నూరుయోజనముల దూరం ఉన్న సముద్రమును లంఘించాను. రాత్రి లంకలో ప్రవేశించాను. లంక అంతా గాలించాను. రావణుని అంత:పురము అంతా వెతికాను. నీవు కనపడలేదు. ఈ అశోక వనమును వెతుకుతుంటే నీవుకనిపించావు. ఇదీ జరిగింది.

నేను వాయుదేవుని కుమారుడను. రాముని దూతను. సుగ్రీవుడు పంపగా ఇక్కడకు వచ్చాను. కానీ మాయావి రావణుని కాను. నన్ను నమ్ము. నీ భర్త రాముడు, రాముని తమ్ముడు లక్ష్మణుడు క్షేమంగా ఉన్నారు. నేను కూడా కామ రూపుడను. నా ఇష్టం వచ్చిన రూపం ధరించగలవాడను. ఇప్పుడు ఈ చిన్ని వానరరూపంలో

ఉన్నాను. నేను వెంటనే వెళ్లి సముద్రము ఆవల ఒడ్డున ఉన్న వానరులకు నీ గురించి చెప్పి వారి దు:ఖమును తొలగించాలి.

నీకోసం లంక అంతా గాలించి నీవు కనపడకపోతే నేను కూడా ప్రాయోపవేశము చేద్దామని నిర్ణయించుకున్నాను. కానీ నేను సముద్రమును లంఘించి లంకకు చేరుకోడానికి పడ్డ శ్రమ వృధా కాలేదు. నిన్ను చూడగలిగాను. నేను చాలా అదృష్టవంతుడను. నాకు చాలా సంతోషంగా ఉంది.

నా తండ్రి పేరు కేసరి. నా తండ్రి దేవతలు, ఋషుల కోరిక మేరకు శంబసాదనుడు అనే రాక్షసుని చంపాడు. నేను నా తండ్రి భార్య అయిన అంజనా దేవికి, వాయుదేవుని వలన జన్మించాను. ఇంద్రుని వజ్రాయుధ దెబ్బకు నా దవడ విరిగిపోవడంతో నాకు హనుమంతుడు అనే పేరువచ్చింది. ఓ సీతాదేవీ! నీకు నమ్మకం కలిగించడానికి నీకు ఇదంతా చెప్పాను. తరువాత నీ ఇష్టము." అని చెప్పి ఊరుకున్నాడు హనుమంతుడు.

హనుమంతుడు చెప్పిన విషయములను సావధానంగా విన్న సీతకు హనుమంతుని మీద నమ్మకం కుదిరింది. చాలారోజులకు సీత కంటి వెంట ఆనందభాష్పములు రాలాయి. సీత ముఖము ఆనందంతో వెలిగిపోయింది. హనుమంతుడు నిజంగా వానరుడేననీ, మాయారూపంలో ఉన్న రాక్షసుడు కాదనీ నమ్మింది.

సీత ముఖకళవళికలు చూచిన హనుమంతుడు సీత తనను నమ్మినట్టు ధృవపరచుకొన్నాడు. అప్పుడు సీతతో ఇలా అన్నాడు.

"సీతాదేవీ! జరిగినది అంతా నీకు చెప్పాను కదా! నేను నీకు ఇంకా ఏమి చెయ్యాలో చెప్పు. ఇంక నేను రాముని వద్దకు వెళ్లాలి. నీ గురించి రామునికి తెలియజెయ్యాలి." అని అన్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
సుందరకాండము ముప్పది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము
## ముప్పది ఆరవ సర్గ.

అంతా చెప్పి సీత వంక చూచాడు హనుమంతుడు. సీతకు ఇంకా తన మీద నమ్మకం కలిగినట్టులేదు అని అర్థం అయింది హనుమంతునికి. అప్పుడు హటాత్తుగా రాముడు తనకు ఆనవాలుగా ఇచ్చిన ఉంగరము గుర్తుకు వచ్చింది. వెంటనే తాను భద్రపరచిన రాముని ఉంగరమును బయటకు తీసాడు. సీతతో ఇలా అన్నాడు.

"అమ్మా! సీతా! నేను రాముని వద్ద నుండి వచ్చాను, రాముని దూతను అని నిరూపించుకోడానికి నాకు రాముడు ఇచ్చిన ఉంగరమును చూడు. దీనిని నీకు ఆనవాలుగా చూపించమని నాకు రాముడు ఇచ్చాడు." అంటూ హనుమంతుడు రాముడు తనకు ఇచ్చిన ముద్రికను సీతమ్మకు ఇచ్చాడు.

సీత సంభ్రమంతో ఈ ముద్రికను తీసుకొంది. అది రామునిదే. సందేహము లేదు. సీత ఆ ముద్రికను కళ్లకు అద్దుకొంది.

తాను రాముని చేరినట్టు రాముని చెంత ఉన్నట్టు ఆనందపడింది. సీతమ్మ మొహంలో ఆనందం చూచి హనుమంతుడు ఎంతో ఆనందించాడు. సీత మొహంలో నునుసిగ్గులు ఆవరించాయి. హనుమంతుని వంక ప్రశంసా పూర్వకంగా చూచింది.

"ఓ వానరోత్తమా! సందేహము లేదు. నీవు రాముని వద్ద నుండి వచ్చావు. నీవు మహా పరాక్రమ వంతుడివి. లేకపోతే నూరుయోజనముల సముద్రము దాటి ఈ రాక్షస రాజ్యంలోకి ప్రవేశించలేవు. నీకు రావణుని వలన అసలు భయం ఉన్నట్టు లేదు. నీ మొహంలో ధైర్యం ఆత్మవిశ్వాసం కనపడుతున్నాయి. నీవు సామాన్య వానరుడవు కావు. రాముడు నిన్ను నా వద్దకు పంపాడు అంటేనే నీ పరాక్రమము ఏపాటిదో అర్థంఅవుతూఉంది.

నిన్నూ, నీ శక్తిని, నీ పరాక్రమమును, నీ బుద్ధికుశలతను పరీక్షించకుండా రాముడు నిన్ను పంపిఉండడు. నేనెంతో అదృష్ట వంతురాలిని. రాముని యొక్క, లక్ష్మణుని యొక్క క్షేమమును తెలుసుకున్నాను. వారు క్షేమముగా ఉన్నారని తెలిసి నా మనసు కుదుటపడింది. రాముడు క్షేమంగా ఉంటే, అతని కోపము ప్రళయాగ్నిరూపంలో ప్రజ్వరిల్లి ఇంకా ఈ లంకను ఎందుకు దహించలేదు? అని అనుమానపడ్డాను. కాని అది సరి కాదు. వారు పరాక్రమం వంతులు కాక కాదు. నా కష్టములు తీరు కాలము సమీపించలేదు. అందుకని వారు నన్ను విడిపించుటకు ఇంకా రాలేదు.

9హనుమా! రాముడు నా గురించి దు:ఖిస్తున్నాడా! రావణుని మీద దండెత్తడానికి సకల సన్నాహాలు చేసుకుంటున్నాడా! లేక నా మీద దిగులుతో ఏమీ చెయ్యడం లేదా! రాముడు తాను నిర్వర్తించవలసిన కార్యములను ఏ మాత్రమూ దీనత్వమూ భ్రాంతి లేకుండా చేస్తున్నాడా! రాముడు సామ,దాన,బేధ,దండోపాయములను సమర్ధవంతంగా ఉపయోగిస్తున్నాడు. శత్రువులను జయించడానికి మిత్రులతో స్నేహంగా ఉంటున్నాడా! రాముడు మిత్రులందరూ మంచి వారే కదా! వారు రామునికి సాయం చేయువారే కదా! రాముని మిత్రులు రాముని గౌరవ భావంతో చూస్తున్నారు కదా!

రాముడు నిత్యమూ  దేవతలను ఆరాధిస్తున్నాడు కదా! పురుష ప్రయత్నానికి దైవయత్నం తోడు చేసుకొని ప్రవర్తిస్తున్నాడా! హనుమా! రాముడు నా గురించి తలచుకుంటున్నాడా. నేను దగ్గరలేను కదా అని నన్ను మరిచిపోయాడా! రాముడు ఇక్కడకు వచ్చి నన్ను ఈ రాక్షసుని చెరనుండి విడిపించే ప్రయత్నం ఏమన్నా చేస్తున్నాడా! లేదా! ఓహనుమా! రాముడు చిన్నప్పటి నుండి రాజ భోగములకు అలవాటు పడ్డాడు. ఇటువంటి కష్టములు ఉంటాయని కూడా ఆయనకు తెలియదు.  అయినా నేను పక్కన ఉన్నాను కాబట్టి ధైర్యంగా ఉన్నాడు. ఇప్పుడు నేను కూడా పక్కన  లేను కదా! మరి రాముడు దు:ఖభారంతో కృంగి పోతున్నాడా! రాముడు నా గురించి శోకిస్తున్నాడా లేక నన్ను ఈ శోకసముద్రము నుండి గట్టెక్కించే ప్రయత్నం ఏమన్నా చేస్తున్నాడా!

హనుమా! రాముడు కిష్కింధలో ఉన్నప్పుడు అయోధ్యనుండి సుమిత్ర గురించి కానీ కౌసల్యగురించి గానీ వార్తలు ఏమన్నా

వస్తున్నాయా! నన్ను రావణుడు అపహరించిన వార్త భరతునికి చేరినదా! నన్ను రావణుని చెరనుండి విడిపించడానికి భరతుడు తన అశేషసైన్యమును పంపుతున్నాడా! సుగ్రీవుడు తన వానర సైన్యముతో లంకమీదికి దండెత్తుతాడు కదా! నన్ను విడిపిస్తాడు కదా! లక్ష్మణుడు తన వాడి అయిన బాణములతో రావణుని, అతని సైన్యమును హతమారుస్తాడు కదా! రావణుడు రణరంగంలో కూలిపోయినపుడు వాడి శరీరమును ఎప్పుడు చూస్తానో కదా!

హనుమా! ఎప్పుడూ పద్మము వలె వికసించి ఉన్న రాముని ముఖం ఇప్పుడు వాడిపోయిందా! హనుమా! రాముడు తన తండ్రి మాట ప్రకారము నన్ను అడవికి తీసుకొని పోయి అడవులలో రాళ్లమీద, ముళ్లమీద నడిపించినప్పుడు కూడా నేను బాధ పడలేదు. అటువంటి రాముడు ఇప్పుడు నాగురించి బాధపడుతున్నాడా! లేక ధైర్యంగా ఉన్నాడా! రాముడు తన జీవితంలో నన్నే అధికంగా ప్రేమించాడు. నా ప్రేమముందు తన తల్లి కౌసల్య మీద ఉన్న ప్రేమగానీ, తండ్రి దశరథుని మీద ఉన్న ప్రేమగానీ సాటి రాదు. ఆ కారణం వలననే నేను రాముని కొరకు ప్రాణములు అరచేతిలో పెట్టుకొని ఈ రాక్షసుని చెరలో జీవించుచున్నాను." అని పలికి రాముని తలచుకుంటూ ఉంది సీత.

సీత మాటలు విన్న హనుమంతుడు సీతకు నమస్కరించి ఇలా అన్నాడు. "ఓ సీతా దేవీ! నీవు ఇక్కడ ఉన్నట్టు, నీవు ఇన్ని కష్టములు పడుతున్నట్టు రామునికి తెలియదు. అందుకనే రాముడు ఇక్కడకు రాలేదు. నేను పోయి రామునికి నీ గురించి చెప్పగానే రాముడు వెంటనే వానరసైన్యముతో ఇక్కడకు వస్తాడు. నిన్ను ఈ రాక్షసుని చెరనుండి విడిపిస్తాడు. రాముడు తన బాణములతో సముద్రమును

ఎండించి, సముద్రమును దాటి లంకకు రాగలడు. ఆ సమయంలో ఎవరు అడ్డు వచ్చినా ఆఖరుకు మృత్యువు కానీ, దేవతలు కానీ, అసురులు కానీ, అడ్డు వచ్చినా సరే రాముడు లెక్కచెయ్యడు.

ఓ సీతాదేవీ! నీవు కనపడలేదని రాముడు ఇంతకాలము నిన్ను రోజూ తలచుకుంటూ దు:ఖముతో కుమిలిపోతున్నాడు. ఓ సీతాదేవీ! నేను ఈ పర్వతముల మీద, సముద్రము మీదా, చెట్లమీద ఒట్టు పెట్టుకొని చెబుతున్నాను. నేను వెళ్లి నీగురించి చెప్పి రాముని తీసుకొని వస్తాను. నా మాట నమ్ము. నీవు రాముడిని తొందరలోనే చూస్తావు. రాముడు నీ మీద ఉన్న ప్రేమతో నువ్వు దగ్గర లేవని మద్యమాంసములు ముట్టడం లేదు. కేవలము ఫలములు ఆరగించి కడుపునింపుకుంటున్నాడు.

రాముడు ఎల్లప్పుడూ నీ గురించి ఆలోచిస్తూ పరధ్యానంగా ఉంటున్నాడు. నిన్ను తప్ప వేరే ఎవరిగురించీ ఆలోచించడం లేదు. రాముడు చాలావరకూ నిద్రలేని రాత్రులు గడుపుతున్నాడు. ఎప్పుడైనా నిద్రపడితే సీతా సీతా అని కలవరిస్తుంటాడు. రామునికి ఏదైనా అందమైన వస్తువు కనపడి నప్పుడు నువ్వు దగ్గరలేవని బాధపడు తుంటాడు. రాముడు నిన్ను మరువలేదు. సతతమూ నిన్నే స్మరిస్తున్నాడు." అని రాముడు పడుతున్న వేదన గురించి సీతకు తెలియజేసాడు హనుమంతుడు. హనుమంతుడు చెప్పిన మాటలు విని సీత కొంత ఊరట చెందింది.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ముప్పది ఆరవ సర్గము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందరకాండము

మప్పది ఏడవ సర్గ.

హనుమంతుడు చెప్పిన మాటలు విన్న సీత హనుమతో ఇలా అంది. "హనుమా! రాముడు జీవించి ఉన్నాడు అని చెప్పావు. కానీ రాముడు నా గురించి శోకిస్తున్నాడు అని చెప్పావు. రాముడు జీవించి ఉన్నందుకు సంతోషించాలో, నాగురించి శోకిస్తున్నందుకు దు:ఖించాలో అర్థం కావడం లేదు. మనిషికి ఎక్కువ సుఖము వచ్చినా ఎక్కువ దు:ఖము వచ్చినా తట్టుకోలేడు. అదే దైవ లీల. ఆ దైవ లీలను దాటడం ఎవరికీ శక్యముకాదు.

మా ప్రమేయం లేకుండానే నేను, రాముడు, లక్ష్మణుడు ఎటువంటి కష్టములు పడుతున్నామో చూడు! అక్కడ రాముని శోకము ఇక్కడ నా శోకము ఎప్పుడు అంతం అవుతుందో కదా! రాముడు లంకకు వచ్చి రావణుని చంపి నా కష్టములను ఎప్పుడు తీరుస్తాడో కదా! రావణుడు నాకు ఒక సంవత్సరము గడువు ఇచ్చాడు. అందులో పది మాసములు గడిచిపోయినవి, ఇంక రెండు మాసములు మాత్రమే మిగిలి ఉన్నవి. ఈ రెండు మాసములలో రాముడు వచ్చి నన్ను రక్షించడం సాధ్యమా!

హనుమా! నీవు వెళ్లి రామునితో చెప్పు. నీ సీత కేవలము ఇంక రెండు మాసములు మాత్రమే ప్రాణములతో ఉంటుంది అని చెప్పు. రావణుని తమ్ముడు విభీషణుడు అను వాడు "సీతను రామునికి ఇచ్చివేయి" అని ఎంత చెప్పినా రావణుడు వినడం లేదు. నన్ను రామునికి అప్పగించుటకు రావణుడు ఎంత మాత్రమూ

అంగీకరించడం లేదు. రావణునికి మృత్యువు ఆసన్నమయింది. అందుకే ఈ ప్రకారము ప్రవర్తిస్తున్నాడు. ఓ హనుమా! రావణుని తమ్ముడైన విభీషణుని కుమార్తె నల అనే పేరు కలది, స్వయంగా నా వద్దకు వచ్చి ఈ విషయం చెప్పింది.

హనుమంతుడా! నా ఈ ఆందోళన అర్థ రహితంగా తోస్తూ ఉంది. రాముడు తప్పకుండా వచ్చి నన్ను రక్షిస్తాడు అని నా అంతరాత్మ ఘోషిస్తూ ఉంది. నేను ఇక్కడ ఉన్నాను అని తెలిసిన తరువాత రాముడు క్షణకాలము ఊరుకోడు. రామునిలో ఉత్సాహము, పరాక్రమము, పురుషప్రయత్నము, బలము అన్నీ ఉన్నాయి. రాముడు తప్పకుండా వస్తాడు నన్ను రక్షిస్తాడు.

ఏ రాముడు అయితే జనస్థానములో 14,000 మంది రాక్షసులను ఒంటి చేత్తో చంపాడో ఆ రాముడికి ఏ రాక్షసుడు భయపడడు? రాముడు ఎన్ని కష్టములు వచ్చినా ఓర్పుతో సహిస్తాడు. రాముడు ఎవరికీ దేనికీ భయపడడు. రాముడి పరాక్రమము గురించీ, మనోధైర్యము గురించీ నాకు బాగాతెలుసు." అని ఉ ద్వేగంతో పలికింది సీత.

ఆ మాటలు విన్న హనుమంతుడు సీతతో ఇలా అన్నాడు. "అమ్మా సీతా దేవీ! దీనికి ఇంత ఆలోచించాలా! రా అమ్మా! నీ వీపు మీద కూర్చో. నిన్ను క్షణాలలో సముద్రము దాటించి రాముని వద్దకు చేరుస్తాను. నన్ను నమ్ము. అమ్మా సీతా! నిన్నే కాదు. ఈ లంకను రావణునితో సహా పెకలించి తీసుకొని పోగలను. నాకు అంత శక్తి ఉంది. ముందు నిన్ను రాముని వద్దకు చేరుస్తాను. తరువాత రాముడు

వచ్చి రావణుని సంహరిస్తాడు. రాముడు నిన్ను ఎప్పుడు చూస్తానా అని తహతహలాడుతున్నాడు. అందుకని నిన్ను ఇప్పుడే రాముని వద్దకు చేరుస్తాను.

రా అమ్మా! వచ్చి నా వీపు మీద కూర్చో. మనము రాముని వద్దకు వెళుదాము. ఆకాశమార్గములో ప్రయాణమే చేసి సముద్రమును దాటుదాము. ఈ లంకలో ఉన్న రాక్షసులు ఎవ్వరూ మనలను అనుసరించలేరు ఆ భయం నీకు వద్దు. ఓ సీతా దేవీ! నిన్ను రావణుడు ఏ ప్రకారంగా ఆకాశమార్గంలో ఇక్కడకు తీసుకొని వచ్చాడో, అదే ప్రకారంగా నేను నిన్ను ఆకాశమార్గంలో కిష్కింధకు తీసుకొని వెళుతాను." అని అన్నాడు హనుమంతుడు.

హనుమ మాటలు విని సీతకు ఆశ్చర్యము, సంతోషము, సందేహము, ఒక్కసారిగా కలిగాయి. అంత దు:ఖంలో కూడా సీతకు నవ్వు వచ్చింది. హనుమంతునితో ఇలా అంది.

"ఓ వానరుడా! నీవు నన్ను మోసుకొని సముద్రము దాటుతావా! నూరుయోజనముల దూరము నన్ను ఎలా మోసుకొని పోగలవు అని అనుకుంటున్నావు. దీనిని బట్టి నీవు నిజంగా వానరుడవు అని నిరూపణ అయింది." అంటూ సీత చిన్న పిల్లి అంత ఆకారంలో ఉన్న హనుమంతుని తేరిపారచూచి "ఇంత చిన్ని శరీరం గల నీవు నన్ను నూరుయోజనములు మోసుకొని పోయి సముద్రము దాటించగలవా! నన్ను రాముని వద్దకు తీసుకొని పోగలవా! అలా అని నీవు ఎలా అనుకుంటున్నావు? ఇది నీకు సాధ్యమా కాదా అని కూడా నీకు తెలియదా!" అని పక్కున నవ్వింది సీత.

హనుమంతుడు దానిని తీరని అవమానంగా భావించాడు. “ఈమెకు నా బలము శక్తి, నా మాయారూపము తెలియవు. ఇప్పుడు నేను నా శక్తి ఏమిటో చూపించి ఈమెను నమ్మిస్తాను.” అని మనసులో అనుకున్నాడు హనుమంతుడు. వెంటనే లేచి నిలబడ్డాడు. తన నిజస్వరూపమును సీతకు చూపించాడు. నేల మీద నిలబడి అలా అలా ఆకాశంలోకి పెరిగిపోతున్నాడు హనుమంతుడు. సీత ఆశ్చర్యంగా చూస్తూ ఉంది.

నేల మీద కాళ్లు ఆకాశంలో తల మేరు పర్వతము మాదిరి ప్రకాశిస్తున్నాడు హనుమంతుడు. తల పైకి ఎత్తి చూస్తున్న సీతతో ఇలా అన్నాడు హనుమంతుడు. “అమ్మా! సీతా! ఇప్పుడు తెలిసిందా! నాకు ఈ లంకనే పెకలించుకొని పోగల శక్తి ఉందని. కాబట్టి నీ మనసులో ఉన్న సందేహమును వదిలి పెట్టి వచ్చి నా వీపు మీద కూర్చో. నేను క్షణంలో రాముని చెంతకు చేరుస్తాను.” అని అన్నాడు హనుమంతుడు.

భూమ్యాకాశాలు ఒకటిగా వెలుగొందుతున్న వాయుపుత్రుడు హనుమంతుని చూచి సీత ఇలా అంది. “ఓ వాయుపుత్రా! హనుమా! నీ బలము, పరాక్రమము, నీ శక్తి, నీ గమనవేగము అన్నీ నాకు పూర్తిగా తెలిసాయి. నీ వంటి వాడికి  కాక మరొకడికి ఈ సముద్రమును దాటడం సాధ్యమా! ఏదో స్త్రీచాపల్యము వలన అలా అన్నానే కానీ, నీవు నన్ను నీ వీపుమీద మోసుకొని పోయి రాముని వద్దకు చేరుస్తావు అని నాకు తెలుసు.

కాని, ఇప్పుడు మనము రామ కార్యము ఎలా నిర్వర్తించాలా అని ఆలోచించాలి. నేను నీతో రావడం అంత మంచి పని కాదు. నీవు

వాయు వేగముతో పోగలవు కానీ, నీ వేగమును తట్టుకొని నీ వీపు మీద కూర్చొనే శక్తి నాకు లేదు కదా! నీవు వాయు వేగంతో పోతుంటే నీ వీపు మీద ఉన్న నేను ఆ వేగమునకు తట్టకోలేక కళ్లు తిరిగి సముద్రములో పడిపోతానేమో అని భయంగా ఉంది. అలా పడిపోయినపుడు నేను సముద్రములో ఉన్న జలచరములకు ఆహారము అవుతాను కదా!

అదీ కాకుండా, నువ్వు నన్ను తీసుకొని పోతుంటే రాక్షసులు నిన్ను వెంబడిస్తారు కదా! రాక్షసులు నిన్ను నన్ను ఆయుధములతో చుట్టుముట్టినపుడు, నిన్ను నీవు రక్షించుకోవడమే కాకుండా నీవు నన్ను కూడా రక్షించవలసి ఉంటుంది. నువ్వు ఆకాశంలె క్రూరులైన రాక్షసులతో యుద్ధం చేయవలసి ఉంటుంది. అప్పుడు నిన్ను నువ్వు రక్షించుకుంటావా? నీ వీపుమీద ఉన్న నన్నుకూడా రక్షిస్తావా? నిన్ను నువ్వు రక్షించుకుంటూ, నన్ను కూడా రక్షిస్తూ సముద్రము మీద ఎలా ప్రయాణము చేస్తావు? కష్టం కదా!

అంతే కాదు! నువ్వు రాక్షసులతో యుద్ధం చేస్తుంటే, నేను నీ వీపు మీది నుండి కింద పడిపోయే అవకాశము ఉంది కదా! ఆ సమయంలో రాక్షసులు తిరిగి నన్ను పట్టుకొని రావణుని వద్దకు చేరుస్తారు. లేదా కసి కొద్దీ దారిలోనే నన్ను చంపేస్తారు. లేదా నన్ను తీసుకొని పోయి మీకు ఎవ్వరికీ తెలియని ప్రదేశములో దాచిపెడతారు. అప్పుడు నేను ఎక్కడున్నదీ మీకు తెలియడం చాలా కష్టం కదా! అదీకాకుండా, నువ్వు రాక్షసులతో యుద్ధం చేస్తున్నప్పుడు నువ్వే జయించవచ్చు లేక రాక్షసులు జయించ వచ్చు. యుద్ధములో జయాపజయాలు దైవాధీనాలు కదా! అట్టి పరిస్థితులలో నన్ను రాముని

వద్దకు చేర్చడం అన్న నీ ప్రయత్నం సఫలం కాదు.

నువ్వు లంకలో ఉన్న రాక్షసులను అందరినీ సంహరిస్తావని నాకు తెలుసు. నువ్వే అందరు రాక్షసులను చంపేస్తే, రాముని పరాక్రమమునకు, కీర్తికి ముప్పు వాటిల్లుతుంది కదా! ఇవన్నీ ఆలోచిస్తే, నేను నీతో రావడం అంత మంచి పని కాదు. కాబట్టి రాముడు వచ్చి రావణునితో యుద్ధం చేసి, రావణుని సంహరించి నన్ను తీసుకొని పోవడమే మంచి పద్ధతి. రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, వానరులు వీరి జీవితాలు నా మీదనే ఆధారపడి ఉన్నాయి. నేను కనుక దారి మధ్యలో సముద్రములో పడి చనిపోతే, లేక మరలా రాక్షసుల చేతిలో పడితే, వీరందరూ ప్రాణత్యాగము చేసే అవకాశం ఉంది కదా!

అదీ కాకుండా నేను మొదటి నుండీ పతివ్రతా ధర్మమును అనుసరిస్తున్నాను. అందుకని నేను పరపురుషుని శరీరమును తాకను. నన్ను తీసుకొని వచ్చునపుడు రావణుని శరీర స్పర్శ నాకు తగిలింది కదా అని నీకు సందేహము రావచ్చు. రావణుడు నన్ను బలాత్కారంగా తీసుకొని వస్తున్నప్పుడు నేను అశక్తురాలిని, నిస్సహాయురాలిని. నన్ను నేను రక్షించుకొనే పరిస్థితిలో లేను. నా ప్రమేయం లేకుండా జరిగిన దానికి నేను బాధ్యురాలిని కాను కదా!

కాబట్టి రాముడు సైన్య సమేతంగా వచ్చి నన్ను తీసుకొని వెళ్లడమే యుక్తము అని నా అభిప్రాయము. రాముడు తప్పకుండా రావణునితో యుద్ధము చేసి గెలుస్తాడు. రాముని బలపరాక్రమములు నాకు తెలుసు. దేవ, దానవ, గంధర్వ,నాగ,రాక్షసులు ఎవరూ రాముని

ఎదిరించి నిలువలేరు. రామలక్ష్మణులు ధనుస్సులు ధరించి యుద్ధరంగంలో నిలబడితే, వారిని ఎదిరించడం సాక్షాత్తు ఆ దేవేంద్రునికే సాధ్యము కాదు. కాబట్టి నీవు పోయి, రామునితో నా ఉనికిని గురించి చెప్పి, వారిని ఇక్కడకు తీసుకొని రా! రాముని మనస్సుకు నా మనస్సుకు సంతోషమును కలిగించు." అని సీత హనుమంతునికి నచ్చచెప్పింది.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ముప్పది ఏడవసర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ముప్పది ఎనిమిదవ సర్గ.

హనుమంతునికి సీత పలికిన మాటలలో పొరపాటు ఏమీ లేదు అనిపించింది. "సీతా దేవీ! నీవు పతివ్రతలకు అనుకూలమైన మాటలే చెప్పావు. నాకు చాలా సంతోషంగా ఉంది. స్త్రీవైన నీకు నా వీపు మీద కూర్చుని నా వేగమునకు తట్టుకుంటూ నూరుయోజనముల దూరమును దాటడం చాలా కష్టమైన విషయం. రాముని తప్ప పరపురుషుని తాకను అన్న నీ మాటలు రాముని భార్యవు అయిన నీకే తగును. ఇటువంటి కష్టములలో ఉన్న ఏ స్త్రీ కూడా ఇక్కడి నుండి ఎలా బయటకు బయట పడాలా అని ఆలోచిస్తుంది కానీ నీ వలె మాట్లాడదు. అందుకే నీ మాటలు నాకు బాగా నచ్చాయి.

సీతా దేవీ! నీవు ఇప్పుడు నాతో పలికిన పలుకులు అన్నీ నేను రామునికి యథాతథంగా తెలుపుతాను. అమ్మా! నీకూ, రామునికి మేలు చేయవలెననే తలంపుతో నేను అలా చెప్పానే కానీ వేరు కాదు. నాకు నిన్ను నా వీపు మీద మోసుకొని పోవడానికి తగిన సామర్థ్యం ఉంది అనే నమ్మకంతో చెప్పాను కానీ, ఈ మహాసముద్రమును దాటడం కష్టము అని నాకు తెలుసు. నీవు నాతోపాటు రాముని వద్దకు రావడానికి ఇష్టపడటం లేదు. అందుకని నేను నిన్ను కలుసుకొని మాట్లాడినట్టుగా నాకు ఆనవాలుగా ఏదైనా ఇస్తే నేను దానిని రామునికి ఇస్తాను. అప్పుడే నేను నిన్ను చూచాను, కలుసుకున్నాను, నీతో మాట్లాడాను అని రాముడు నమ్ముతాడు." అని అన్నాడు హనుమంతుడు.

అప్పుడు సీతా దేవి హనుమంతునితో ఇలా అంది. "ఓ హనుమా! నేను నీకు ఒక విషయం చెబుతాను. అది నాకూ రామునికి మాత్రమే తెలిసిన విషయము. నీవు ఈ విషయమును రామునికి చెబితే రాముడు నమ్ముతాడు. మేము గంగానదీ తీరంలో ఉన్న చిత్రకూట పర్వతము వద్ద ఉంటూ ఉండగా ఒక సంఘటన జరిగింది. ఆ సంఘటనను నేను రామునికి చెప్పినట్టు చెప్పు.

"ఓ రామా! మనము చిత్రకూట పర్వతము వద్ద పర్ణశాలలో ఉంటున్నప్పుడు, మనము జలములలో జలక్రీడలాడి అలసిపోయి, తడిసిపోయి కూర్చుని ఉన్నాము. అప్పుడు ఒక కాకి వచ్చి నన్ను తన ముక్కుతో పొడవడం మొదలుపెట్టింది. నేను దానిని చిన్న చిన్న మట్టిపెళ్లలు విసిరి తోలసాగాను. కాని అది నన్ను వదలలేదు. నా దగ్గరకు వచ్చి నన్ను పొడవడం, మరలా పారిపోయి దాక్కోవడం చేస్తూ

ఉంది. నాకు ఆ కాకి మీద చాలా కోపము వచ్చింది. ఆ కాకిని తోలడంలో నాకు పై వస్త్రము జారిపోతే నేను దానిని సర్దుకుంటున్నాను. అప్పుడు నువ్వు నన్ను చూచావు. కాకికి భయపడ్డ నన్ను చూచి నీవు ఎగతాళి చేయగా నేను సిగ్గుపడ్డాను. అప్పుడు నాకు నీమీద కోపం కూడా వచ్చింది. నీవు నన్ను దగ్గరకు తీసుకొని ఓదార్చావు. నాకు కళ్లనిండా నీళ్లు తిరిగాయి. నిద్ర వచ్చింది. నేను నీ ఒడిలో పడుకొని చాలాసేపు నిద్రపోయాను. తరువాత నువ్వు కూడా నా మీద పడుకొని నిద్రపోయావు.

మనము నిద్రపోతూ ఉండగా ఆ కాకి మరలా వచ్చింది. నాశరీరం అంతా తన ముక్కుతో చీరుతూ ఉంది. నా శరీరం నుండి రక్తం వచ్చింది. నా శరీరము నుండి వచ్చిన రక్తపు చుక్కలు నీ మీద పడ్డాయి. అప్పుడు నేను నిన్ను నిద్రలేపాను. నా ఒంటి నుండి రక్తం కారడం చూచి నీకు కోపం వచ్చింది. "ఓ సీతా! నిన్ను ఈ ప్రకారంగా గాయపరచిన వాడు ఎవరు?" అని కోపంగా అడిగావు. నేను దూరంగా ఉన్న కాకిని చూపించాను. కాలి గోళ్లనుండి రక్తం కారుతున్న కాకిని చూచావు నువ్వు.

ఇంతకూ అసలు విషయం ఏమిటంటే ఆ కాకి దేవేంద్రుని కుమారుడు. వాయువుతో సమానమైన వేగము కలవాడు. అది తెలుసుకొని నువ్వు పక్కనే ఉన్న ఒక దర్భను తీసుకున్నావు. ఆ దర్భ ద్వారా బ్రహ్మ అస్త్రమును సంధించావు. దర్భను మంత్రించి కాకి మీదికి విసిరావు. ఆ దర్భ కాకిని తరుముకుంటూ వెళ్లింది. ఆ కాకికి దిక్కుతోచక రక్షణ కొరకు ముల్లోకములు తిరిగింది. కడకు ఆ కాకికి తండ్రి అయిన దేవేంద్రుడు కూడా తాను అశక్తుడను అని అన్నాడట.

అప్పుడు ఆ కాకి తిరిగి తిరిగి నీ వద్దకు వచ్చి శరణు వేడింది.

మొదట్లో ఆ కాకిని చంపాలి అనుకున్న నువ్వు, ఆ కాకి వచ్చి నిన్ను శరణు కోరగానే జాలి తలచి దానికి శరణాగతి ప్రసాదించావు. "ఓ కాకమా! నీమీద నేను బ్రహ్మాస్త్రమును ప్రయోగించాను. అది వృధా కారాదు. దానిని ఎవరి మీద ప్రయోగించాలో నీవే నిర్ణయించు" అని అన్నావు. అప్పుడు ఆ కాకి ఇలా అంది. "నీవు సంధించిన బ్రహ్మాస్త్రమును నా కుడికంటి మీదికి మళ్లించు." అని అంది. నీవు వదిలిన బ్రహ్మాస్త్రము శక్తికి, ఆ కాకి కుడి కన్ను పోయింది. ఆ కాకి నీకు నమస్కరించి ఎగిరిపోయింది.

ఓ రామా! కేవలము ఒక కాకి నన్ను హింసించి నందుకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించావు కదా! ఇప్పుడు ఒక రాక్షసుడు నన్ను చెరబట్టాడు. ఇప్పుడు ఎందుకు ఊరుకుంటున్నావు. ఈ రాక్షసుని కూడా క్షమించావా! వీడి మీద బ్రహ్మాస్త్రము ఎందుకు ప్రయోగించవు. ఓ రామా! నీవు వెంటనే వచ్చి శత్రువులనుసంహరించి, నన్ను ఈ రాక్షసుని చెరనుండి విడిపించు. ఓ రామా! నీవు నాకు నాధుడవు. కాని నేను అనాధగా బతుకుతున్నాను.

ఓరామా! అన్ని ధర్మములలో కెల్లా ఇతరుల మీద దయచూపడం ఉత్తమ ధర్మము అని నాకు తెలుసు. ఈ రాక్షసుల మీద కూడా, దయచూపకూడని వారి మీద కూడా, నీ దయా గుణమును ప్రసరింపచేస్తున్నావా!

రామా! నీవు పరాక్రమ వంతుడవు. నీకు తెలియని

అస్త్రములు, శస్త్రములు లేవు. నీవు దేవేంద్రునితో సమానుడవు. నీ శక్తితో పరాక్రమంతో సముద్రములను కూడా ఎండింపచేయగల వాడివి. ఈ రాక్షసుని పట్ల ఎందుకు ఉదాసీనంగా ఉంటున్నావు. ఈ రాక్షసుల మీద ఎందుకు నీ అస్త్రశస్త్రములను ప్రయోగించడం లేదు. యుద్ధమే సంభవిస్తే ఈ రాక్షసులే కాదు, దేవతలు, దానవులు, గంధర్వులు కూడా నీ ఎదుట నిలువలేరు కదా! అట్టి నీవు నన్ను రక్షించడంలో ఎందుకు ఆలస్యం చేస్తున్నావు? పోనీ నీ తమ్ముడు లక్ష్మణునికి అనుజ్ఞ ఇచ్చినా, లక్ష్మణుడు వచ్చి తన పరాక్ర మంతో ఈ రాక్షసుని సంహరించి నన్ను ఈ చెర నుండి విడిపిస్తాడు కదా! మీరు ఇద్దరూ నన్ను ఈ రాక్షసుని చెరనుండి విడిపించడానికి సమర్థులై ఉ ండి కూడా ఎందుకు ఉదాసీనంగా వ్యవహరిస్తున్నారు. నన్ను కాపాడటంలో మీరు ఇంత నిర్లక్ష్యంగా ఉన్నారు అంటే అది మీ తప్పు కాదు. నేనే పూర్వజన్మలో ఏదో పాపం చేసి ఉంటాను. ఆ పాపఫలము అనుభవించే వరకూ నాకు ఈ చెర నుండి విముక్తి లేదు. ఆ కారణం చేతనే మీరు సమర్థులై ఉండి కూడా నన్ను ఈ రావణుని బారి నుండి రక్షించడం లేదు. ఇది నిక్కువము." అని నామాటలుగా రామునికి చెప్పు" అని కన్నీళ్లు కారుస్తూ చెప్పింది సీత.

సీత మాటలు విన్నహనుమంతునికి కూడా దు:ఖము పెల్లుబికింది.

"అమ్మా! సీతమ్మ తల్లీ! నీవు పొరపడుతున్నావు. నీవు ఇక్కడ ఉన్నట్టు రామునికి తెలియదు. నీ వియోగంతో రాముడు ఎంత బాధపడుతున్నాడో నీకు తెలియదు. అన్నగారి దు:ఖమును చూచి, రామునితో పాటు లక్ష్మణుడు కూడా ఎంతగానో శోకిస్తున్నాడు. మన

అందరి అదృష్టము కొద్దీ నీవు నాకు కనపడ్డావు. ఇంక నీ కష్టములు అన్నీ గట్టెక్కినట్టే అనుకో! నీ దు:ఖము అంతం అయ్యేరోజు ఎంతో దూరం లేదు. రాముడు, లక్ష్మణుడు నీ గురించి తెలుసుకోవాలని, నిన్ను చూడాలని ఎంతో ఆతురతగా ఉన్నారు. అతి త్వరలోనే రాముడు లంకకు వచ్చి రావణుని సంహరించి నిన్ను అయోధ్యకు తీసుకొని వెళ్లగలడు. అమ్మా! నీవు ఊరట చెందు. రామునికి, లక్ష్మణునికి, సుగ్రీవునికి నేను చెప్పవలసిన సందేశమును వినిపించు." అని సీతను ప్రార్థించాడు హనుమంతుడు.

ఆ మాటలు విన్న సీత తన దు:ఖమును ఉపశమింప జేసుకొని హనుమంతునితో ఇలాఅంది.

"హనుమా! కౌసల్యాతనయుడైనరామునికి నేను శిరస్సువంచి నమస్కరించి, ఆయన క్షేమమును అడిగినానని చెప్పు. సుమిత్రా తనయుడైన లక్ష్మణుని కూడా క్షేమమును అడిగానని చెప్పు. లక్ష్మణుడు సామాన్యుడు కాడు. తాను అనుభవించతగిన రాజభోగములు అన్నీ విడిచి అన్నతో కూడా అరణ్యమునకు వచ్చిన త్యాగ మూర్తి. లక్ష్మణుడు రాముని తన తండ్రిగానూ, నన్ను తన తల్లి వలె చూచుకొనే వాడు.  ఎల్లప్పుడూ పెద్దలను గౌరవించేవాడు. ఏ కార్యము అప్పగించినా సమర్థవంతంగా పూర్తిచేసేవాడు. మా మామగారు దశరథునకు చాలా ఇష్టమైన వాడు.

లక్ష్మణునికి నన్ను ఈ దుర్మార్గుడు రావణుడు అపహరిస్తాడు అన్న విషయం తెలియదు. తెలిస్తే రావణుని ఆరోజే అంతమొందించే వాడు. అటువంటి లక్ష్మణుని క్షేమమును అడిగినట్టు చెప్పు.  హనుమా!

నా గురించి, నేను ఈ రాక్షసుని చేతిలో పడుతున్న కష్టముల గురించి రామునికి, లక్ష్మణునికి వివరంగా చెప్పు. వారిని సత్వరమే ఇక్కడకు వచ్చేట్టు చెయ్యి. ఆలస్యం చేయవద్దని చెప్పు. రామునికి నేను చెప్పినట్టుగా ఈ విధంగా చెప్పు.

"నాధా! నేను ఇంక జీవించేది ఒక్క మాసము మాత్రమే! మాసము దాటి ఒక్కరోజుకూడా నా శరీరములో ప్రాణములు ఉండవు. ఇది సత్యము. కాబట్టి, నన్ను అవమానించిన రావణుని సంహరించి, నన్ను రక్షించు." అని రామునికి నా మాటగా చెప్పు." అని పలికింది సీత.

అప్పుడు హనుమంతుడు సీతతో ఇలా అన్నాడు. "అమ్మా! సీతా! ఒక్కమాట. నేను నీవద్దకు వచ్చినట్టు గుర్తుగా నీ వద్ద ఉన్న ఆభరణమును ఏదైనా ఇస్తే దానిని రామునికి ఇస్తాను. అప్పుడు నేను నిన్ను చూచినట్టు, కలుసుకున్నట్టు రాముడు నమ్ముతాడు."అని పలికాడు హనుమంతుడు.

వెంటనే సీత తన కొంగున ముడివేసి దాచిన చూడామణిని తీసి హనుమకు ఇచ్చింది. "హనుమా! నీవు నన్ను కలిసినట్టు గుర్తుగా రామునికి ఈ చూడామణిని ఇమ్ము." అని సీత చూడామణిని (శిరస్సున ధరించే ఆభరణము) హనుమంతునికి ఇచ్చింది. హనుమంతుడు దానిని భద్రంగా దాచుకున్నాడు. హనుమంతుడు సీతకు ప్రదక్షిణపూర్వకంగా నమస్కారము చేసి ఒక పక్కగా ఒదిగి నిలబడ్డాడు. అప్పుడు హనుమంతుని మనస్సులో రాముడు మెదిలాడు. తాను అప్పుడే రాముని వద్దకు పోయినట్టు, సీతమ్మ ఇచ్చిన

చూడామణిని రామునికి ఇచ్చినట్టు, రాముడు ఆ చూడమణిని చూచి ఆనందంతో పొంగిపోయినట్టు మనస్సులో ఊహించుకుంటున్నాడు హనుమంతుడు. హనుమంతుని శరీరం మాత్రం అశోకవనములో ఉంది. మనస్సు మాత్రము రాముని చెంత ఉంది.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ముప్పది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
ముప్పది తొమ్మిదవ సర్గ.

సీత తన కొంగున ముడివేసి దాచిపెట్టిన చూడామణిని తీసి హనుమంతునికి ఇచ్చి ఇలా పలికింది.

"హనుమా! ఈ చూడామణిని గురించి రామునికి బాగా తెలుసు.ఈ చూడామణిని చూస్తే రామునికి నా తల్లి, తన తండ్రి దశరథుడు, నేనూ గుర్తుకు వస్తాము. కాబట్టి ఈ చూడామణిని రామునికి ఇవ్వు. తరువాత జరగ వలసిన కార్యమును గూర్చి ఆలోచించి ఏది సమంజసమో అది చెయ్యి. కాని నా దు:ఖము మాత్రము త్వరగా పోగొట్టే మార్గము చూడు." అని పలికింది సీత.

హనుమంతుడు తల వంచి సీతకు నమస్కరించి "నీవు చెప్పినట్టే చేస్తాను." అని అన్నాడు. తరువాత అక్కడి నుండి వెళ్లడానికి

సిద్ధం అయ్యాడు. హనుమ వెళుతుంటే తన ఆప్తుడు తనను విడిచి వెళుతున్నట్టు బాధపడింది సీత.

"ఓ హనుమా! వానరవీరా! రాముని, లక్ష్మణుని, సుగ్రీవుని అడిగినట్టు చెప్పు. రామునితో నన్ను ఈ దు:ఖసాగరమునుండి ఉద్ధరించమని చెప్పు. నా శరీరములో ప్రాణాలు ఉండగానే వచ్చి రక్షించమని రామునితో చెప్పు. కాస్త ఈ మాట సాయం చేసి పుణ్యం కట్టుకో.  హనుమా! నీవు నేను చెప్పిన మాటలు పదే పదే రామునికి చెప్పడం వల్ల రామునికి నన్ను సత్వరమే రక్షించవలెనని కోరిక కలుగుతుంది. రాముడు నా సందేశమును నీ ద్వారా విని, తన పరాక్రమమును ప్రదర్శింపగలడు." అని తన అభ్యర్ధనను మాటి మాటికీ హనుమకు తెలియజేసింది సీత.

సీత మాటలు విన్న హనుమ ఆమెతో ఇలా అన్నాడు. "అమ్మా! నా మాట నమ్ము. రాముడు వానర సేన, భల్లూకసేనలతో వచ్చి, రావణుని సంహరించి నిన్ను రక్షిస్తాడు. రాముని బాణములకు ఎదురు నిలువ గలవాడు ఈ రాక్షసులలో ఎవడూ లేడు. రాముడు యుద్ధరంగములో సాక్షాత్తు సూర్యుని, ఇంద్రుని, యముడిని ఓడించగల సమర్థుడు. రాముడు నీ కొరకు ఈ భూమి యావత్తు జయించగల సమర్థుడు." అని సీతకు ధైర్యవచనాలు పలికాడు హనుమంతుడు.

హనుమంతుని మాటలతో ఊరట చెందింది సీత. హనుమంతుడు వెళుతుంటే తన ఆప్తులు వెళుతున్నట్టు బాధపడించి. అప్పుడు సీతకు ఒక ఆలోచన వచ్చింది.

"పాపము ఈ వానరుడు నూరుయోజనముల దూరము గల సముద్రమును దాటి లంకకు వచ్చి, తన కోసం వెతికి వెతికి అలసిపోయాడు." అని అనుకొంది. అందుకని హనుమంతో ఇలా అంది. "హనుమా! నీకు మంచిది అని అనుకుంటే ఈ రాత్రికి ఇక్కడే ఉండి విశ్రాంతి తీసుకొని, రేపు ఉదయమే వెళ్లవచ్చు కదా! ఇక్కడ ఇన్నాళ్లు ఒంటరిగా ఈ రాక్షసుల మధ్య బాధలు పడుతున్న నాకు, నీవు ఇక్కడే ఉన్నావనే భావన నా మనసుకు కాస్త ఊరట కలిగిస్తుంది. మరలా నీవు లంకకు ఎప్పుడు వస్తావో! అప్పటికి నేను బతికి ఉంటానో లేదో!

హనుమా! ఇప్పటి దాకా నాకు ఎవ్వరూ లేరు అనే దు:ఖంతో బాధపడుతున్నాను. ఇప్పుడు నువ్వు వెళ్లిపోతున్నావనే బాధ నా మనసును  కలిచివేస్తూ ఉంది. ఇలా బాధలు మీద బాధలు నన్ను వెంటాడుతున్నాయి. ఏంచెయ్యను? హనుమా! నువ్వు ఇన్ని చెప్పినా నాకు ఒక సందేహము పట్టి పీడిస్తూ ఉంది. మీ సైన్యము అంతా వానరములు భల్లూకములు కదా! వారు ఈ మహాసముద్రమును ఎలాదాటగలరు? ఇక్కడకు ఎలా రాగలరు? వాళ్లు సరే. రామలక్ష్మణులకు కూడా ఈ మహా సముద్రమును దాటడం శక్యమా!

నాకు తెలిసినంతవరకూ నువ్వు, గరుడుడు, వాయుదేవుడు మాత్రమే ఈ నూరుయోజనముల దూరము కల సముద్రమును దాటగల సమర్థులు. మీరు ఈ కార్యము సాధించడం కష్టమనే అనిపిస్తూ ఉంది నాకు.  నీకు ఏమైనా ఉపాయం తట్టిందా! నీకు తెలివి తేటలు ఎక్కువ కదా! ఏమి ఆలోచించావు? ఈ కార్యమును నీవు ఒంటరిగరానే సాధించగలవు అని నాకు తెలుసు.

కాని రామలక్ష్మణుల సంగతేమిటి? వారు ఎలా ఇక్కడకు రాగలరు? రామలక్ష్మణులు సముద్రమును దాటి లంకకు వచ్చి రావణుని సంహరించి నన్ను అయోధ్యకు తీసుకొని వెళ్లగలరు అనే నమ్మకంతోనే ఉన్నాను. కాబట్టి రామునికి నీవే తగిన ఉపాయము చెప్పి ఇక్కడకు తీసుకొని రావాలి." అని చెప్పింది సీత.

"అమ్మా! సీతమ్మ తల్లీ! వానర సేన భల్లూక సేన అపారము. వారు ఇక్కడకు రావలెనని ధృఢంగా విశ్వసించి ఉన్నారు. వారికి ఏదీ అసాధ్యము కాదు. వానరులు ఎక్కడికి అయినా వెళ్లగల సమర్థులు. వానరులు ఆకాశంలోగానీ, నేల మీద గానీ నీటిలో గానీ ప్రయాణం చేయగల సమర్థులు. వారి తేజస్సు అటువంటిది. వారు ఏ పనిచేయడానికైనా వెనుకాడరు. ఈ వానరులలో ఆకాశంలో ఎగురుతూ భూప్రదక్షిణము చేసిన వారు ఎంతోమంది ఉన్నారు.

వానర సేనలో నా కన్నా మేధావులు. పరాక్రమవంతులు ఎంతో మంది ఉన్నారు. నా కన్నా తక్కువవాడు వానర సేనలో ఎవడూ లేడు. నేనే ఎగురుకుంటూ సముద్రమును దాటి వచ్చానంటే ఇంక మిగిలిన వానరుల మాట చెప్పాలా! అమ్మా! నీకు ఒక విషయం తెలుసా! ఇలా వెతకడంలాంటి చిన్న చిన్న పనులకు నా లాంటి చిన్న చిన్న వాళ్లను పంపుతారు కానీ, శ్రేష్టమైన వారిని పంపరు కదా! కాబట్టి నీవు విచారించకు. నీ శోకమును వదిలిపెట్టు. వానర నాయకులు అందరూ ఒకే ఒక్క గంతులో సముద్రమును దాటి లంకలో బిలా బిలా ప్రవేశిస్తారు. రామలక్షణులను నా బుజాల మీద ఎక్కించుకొని లంకకు తీసుకొని వస్తాను. రామలక్ష్మణులు వానరసేనసాయంతో లంకను నాశనం చేసి నిన్ను రక్షిస్తారు. అయోధ్యకు తీసుకొని వెళ్తాడు. కాబట్టి

నీవు ఏ మాత్రమూ సందేహపడవద్దు. రామలక్ష్మణుల రాకకై వేచి ఉండు. అతి కొద్ది కాలములోనే రాముని చూడగలవు. రావణుని చావు చూడగలవు.” అని ధైర్యవచనములు పలికాడు హనుమంతుడు.

ఇంక వెళ్లడానికి ఉద్యుక్తుడయ్యాడు. ఆఖరి మాటలుగా సీతతో ఇలా అన్నాడు. “అమ్మా! నీవు అధైర్యపడకు. రామలక్ష్మణులను లంకా నగరంలో త్వరలోనే చూస్తావు. ఈ లంకానగరమంతా వానరసేనలతో నిండిపోవడం నీవు త్వరలో చూస్తావు. ఈ లంకలో ఎక్కడ చూచినా, ఏ పర్వతము మీద చూచినా గుంపులు గుంపులుగా వానరసేనలు సంచరించడం త్వరలోనే చూడగలవు.

ఓ సీతా దేవీ! నీవు రాముని కొరకు ఇక్కడ ఎలా శోకిస్తున్నావో అక్కడ రాముడు కూడా నీ కోసం ఇంతకంటే అధికంగా శోకిస్తున్నాడు. కాబట్టి ఊరడిల్లు. అగ్ని, వాయువు తో సమానులైన రామలక్ష్మణులు నీకు అండగా ఉండగా నీకేం భయం. ప్రశాంతంగా ఉండు. లంకకు రాక్షసులకు ఋణం తీరిపోయింది. రాక్షసరాజ్యం అంతరించే కాలము ఆసన్నమయింది. నీవు ఇక్కడ ఎంతో కాలము ఉండవు. నేను వెళ్లి నీ గురించి రామునికి చెప్పడమే ఆలస్యం. రాముడు ఇక్కడకు వస్తాడు. నిన్ను చెర విడిపిస్తాడు. అంతవరకూ ఓపిక పట్టు ” అని అనేకవిధములుగా సీతకు ధైర్యం చెప్పాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ముప్పది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## నలుబదవ సర్గ.

హనుమంతుడు పలికిన ధైర్యవచనములకు ఎంతో సంతోషించింది సీత. "హనుమా! ఇక్కడ ఈ లంకలో, ఈ రాక్షసుల చెరలో, నా చెవికి మంచి మాటలు వినడమే కరువు అయింది. ఇన్నాళ్లకు నీ నోటి నుండి నాలుగు మంచి మాటలు వింటుంటే ఇంకా ఇంకా వినాలని ఉంది. నువ్వు వెళ్లిపోతున్నావు అంటే దిగులుగా ఉంది. నాలో ఉన్న ఉద్వేగముతో మరలా మరలా చెబుతున్నాను. నా గురించి రామునికి చెప్పి రాముని ఇక్కడకు తీసుకొని రా! నేను చెప్పిన కాకి కధను రామునికి నా ఆనవాలుగా చెప్పు.

అంతే కాకుండా ఒక సారి నా నుదుటనున్న తిలకము చెరిగి పోతే రాముడు ఒక శిలను తీసుకొని దానిని అరగదీసి, ఆ గంధమును నా నుదుటికి బదులు గండస్థలము మీద  తిలకముగా దిద్దాడు. ఈ విషయం కూడా రామునికి చెప్పు.  ఇంకా రామునితో నా మాటగా ఇలా చెప్పు.

"నేను ఇక్కడ ఈ రాక్షసుల మధ్య నానాబాధలు పడుతుంటే, దేవేంద్రునితో సమానమయిన పరాక్రమము కలిగి  ఉండీ నా వద్దకు రావడానికి ఎందుకు ఉపేక్షిస్తున్నావు. ఓ రామా! నేను ఇంతకాలమూ  ఈ చూడామణిని చూస్తూ నువ్వు నా దగ్గర ఉన్నట్టే అనుకుంటున్నాను. ఇప్పుడు ఈ చూడామణిని నా ఆనవాలుగా నీకు పంపుతున్నాను. ఓ రామా! నీవు ఏ నాటికైనా రాకపోతావా! ఈ రాక్షసుల చెరనుండి నన్ను విడిపించకపోతావా! అని ఎదురు

చూస్తున్నాను. నేను ఇంక ఒక్క మాసము కాలము మాత్రమే నీ కొరకు ఎదురుచూస్తాను. అటుపైన నీవు నన్ను చూడలేవు. ఈ మాసము లోపల నీవు రాకపోతే నేను జీవించ ఉండను. ఈ రావణుడు చాలా క్రూరుడు. గడువు దాటిన తరువాత నన్ను బతుకనీయడు. తరువాత నీ ఇష్టం." అని నా మాటగా రామునికి చెప్పు." అని పలికింది సీత.

సీత దీనంగా మాటి మాటికీ పలుకుతున్న దీనాలాపములు విన్న హనుమకు కూడా దు:ఖము ఆగలేదు. సీతను ఆ దు:ఖము నుండి మళ్లించడానికి ఇలా అన్నాడు.

"అమ్మా! నేను తప్పకుండా రామునికి నీ గురించి చెబుతాను. కానీ, నీ వద్ద ఇంకా ఏమైనా రామునికి గుర్తుగా ఇవ్వదగిన వస్తువు ఉంటే అది ఇవ్వవా! " అని అడిగాడు హనుమంతుడు. సీత తన వద్ద ఇంకా ఏమైనా వస్తువు ఉందా అని వెతికింది. "హనుమా! నా వద్ద ఉన్న చూడామణిని ఇదివరకే ఇచ్చాను కదా. ఇంకా నా వద్ద నేను శిరోభూషణంగా ధరించే ఒక మణి ఉంది. దీనిని కూడా రామునికి చూపించు. దీనిని కూడా రాముడు బాగా గుర్తుపట్టగలడు. నీవు చెప్పిన మాటలనునమ్ముతాడు." అని తాను శిరస్సున ధరించిన మణిని తీసి ఇచ్చింది. హనుమంతుడు ఆ మణిని తీసుకొని భద్రపరచుకున్నాడు.

తరువాత అక్కడి నుండి వెళ్లడానికి సిద్ధము అయ్యాడు. పైకి ఎగరడానికి అనువుగా తన దేహాన్ని పెంచడం మొదలెట్టాడు. అప్పుడు సీత హనుమతో ఇలా అంది. "హనుమా! రాముని, లక్ష్మణుని, సుగ్రీవుని క్షేమము అడిగానని చెప్పు. నన్ను ఈ రాక్షస స్త్రీలు

భయపెడుతున్నారని రామునికి స్వయంగా చెప్పు. నీవు సుఖంగా వెళ్లిరా." అని సాదరంగా వీడ్కోలు పలికింది సీత. హనుమంతుడు సీత వద్దనుండి ఉత్తర దిక్కుగా బయలుదేరాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము నలుబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

నలుబది ఒకటవ సర్గ.

హనుమంతుడు సీత వద్దనుండి బయలు దేరి కొంత దూరము వెళ్లాడు. అక్కడ నిలబడి ఆలోచించాడు. "లంకకు వచ్చాను, సీతను చూచాను. వచ్చిన పని అయిపోయింది. ఇంకా ఏదో మిగిలిపోయింది అని అనుమానంగా ఉంది. ఊరికే పోవడం ఏం బాగుంటుంది. నా పరాక్రమం కూడా కొంచెం ప్రదర్శిస్తే బాగుంటుంది కదా! ఈ రాక్షసుల విషయంలో సామ,దాన,భేదో పాయములు పనికిరావు. దండోపాయమే యుక్తము. కాబట్టి ప్రస్తుతము నా పరాక్రమమును వీళ్లకు రుచి చూపించడమే మంచిది.

ఒక పని చెయ్యాలంటే ఒకే ఉపాయము పనికిరాదు. అనేక ఉపాయములను ఆలోచించాలి. తొందరలో రాక్షసులతో యుద్ధము జరుగబోతోంది. అలాంటప్పుడు, రాక్షసుల బలం ఎంతో, వీరిలో వీరులు ఎవరెవరుఉన్నారో, వీళ్లలో రావణునికి అండగా నిలిచేవాళ్లు ఎవరో, రావణునితె విభేధించే వాళ్లు ఎవరో తెలుసుకొని సుగ్రీవునికి చెప్పడం

మంచిది. అప్పుడే నేను లంకకు వచ్చిన పని పూర్తి అవుతుంది. కాబట్టి ఇప్పుడు రాక్షసులతో అనవసర కలహం పెట్టుకోవాలి! రావణుని, అతని మంత్రులను, సేనాధిపతులను సైనికులను నాతో యుద్ధానికి వచ్చేట్టు చెయ్యాలి! రాక్షసుల యుద్ధరీతులు ఎలా ఉంటాయో గమనించాలి. ఇదంతా మంచిదే! కానీ, వీరితో కలహం ఎలా పెట్టుకోవాలి? ఏం చేస్తే రాక్షసులకు కోపం వస్తుంది?" అని ఆలోచించి చుట్టూ చూచాడు.

ఎదురుగా రావణుడు తన రాణులతో విహరించే అందమైన ఉద్యానవనము కనపడింది. "అమ్మయ్య. దొరికింది. ఈ ఉద్యానవనమును నాశనం చేస్తే రావణునికి కోపం వస్తుంది. అప్పుడు రావణుడు తన సైన్యములను పిలిపించి నాతో యుద్ధం చెయ్యమంటాడు. అప్పుడు పెద్దయుద్ధం జరుగుతుంది. నేను కూడా రాక్షసులతో యుద్ధము చేసి, వారిని చంపి, కిష్కింధకు తిరిగి వెళతాను." అని నిశ్చయించుకున్నాడు హనుమంతుడు.

పక్షుల కిలా కిలారావములతో, అందమైన పూల చెట్లతో మనోహరంగా ఉన్న ఉద్యానవనములోకి ప్రవేశించాడు హనుమంతుడు. అడ్డం వచ్చిన చెట్లను పెకలించాడు. అందమైన సరోవరముల గట్టు తెగగొట్టి నీటిని విడిచిపెట్టాడు. ఉద్యానవనమంతా జలమయముఅయింది. చిన్న చిన్న కొండలను, గుట్టలను పడగొట్టాడు. ఉద్యానవనమును చిందరవందర చేసాడు.ఈ భీభత్సానికి ప్రశాంతంగా చెట్ల కొమ్మల మీద ఉన్న పక్షులు భయం భయంగా అరుస్తూ ఎగిరిపోయాయి.

హనుమంతుడు పొదరిళ్లను, లతలను నాశనం చేసాడు. అక్కడ ఉన్న పెంపుడుజంతువులను తరిమేసాడు. అక్కడక్కడ ఉన్న విశ్రాంతి భవనములను కూలగొట్టాడు. ఆ ఉద్యానవనము తన పూర్వశోభను కోల్పోయి శ్మశానము మాదిరి అయింది. చెయ్యాల్సింది అంతా చేసి, తన కోసరం ఎవరన్నా వస్తారా అని ఎదురు చూస్తూ ఆ ఉద్యానవనము ముఖద్వారము వద్ద ఉన్న తోరణ స్తంభము మీద ఎక్కి కూర్చుని నలుదిక్కులను చూస్తున్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము నలుబది ఒకటవ సర్గ సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందరకాండము
## నలుబది రెండవ సర్గ.

పక్షులు, జంతువులు భయంతో అరిచే అరుపులు,చెట్లు పెళ పెళా విరిగిన శబ్దాలు, వినిన రాక్షసులు భయంతో వణికిపోయారు. పైగా రాక్షసులకు దుశ్శకునములు విపరీతంగా కనపడసాగాయి. వారంత నలుదిక్కులకు పోయి చూచారు. విరిగిన చెట్లు, పాడైపోయిన వనము, గట్లు తెగిన సరోవరములు, స్తంభము మీద కూర్చున్న హనుమంతుని చూచారు. వారిని చూచిన హనుమంతుడు తన ఆకారమును పెంచి వారిని భయపెట్టాడు. వెంటనే ఆ రాక్షస స్త్రీలు సీత వద్దకు వెళ్లారు.

"వాడు ఎవరు? ఎవరి కోసం వచ్చాడు? నీ కోసం వచ్చాడా? వాడు నీకు తెలుసా? వాడు నీతో ఏమి మాట్లాడాడు? అసలు వాడు ఇక్కడు ఎందుకు వచ్చాడు? వాడికి నీకు ఏమి సంబంధం? చెప్పు." అని గద్దించి అడిగారు. మరి కొంత మంది రాక్షసస్త్రీలు సీతను చూచి "సీతా! నువ్వు ఏమీ భయపడవద్దు. వాడు ఎవరో మాకు చెప్పు? వాడు నీతో ఏమేమి మాట్లాడాడు. చెప్పు." అనునయంగా అడిగారు.

అప్పుడు సీత వారితో ఇలా అంది. "ఆ వానరాన్ని చూడండి ఎంత భయంకరంగా ఉందో. అది మాయా రూపము ధరించిన రాక్షసుడు కాబోలు. అటువంటి రాక్షసుల గురించి తెలుసుకొనే పరిజ్ఞానం నాకు ఎక్కడుంది. వాడిని చూస్తేనే భయంగా ఉంది. అయినా అటువంటి రాక్షసుల గురించి మీకే తెలియాలి. నాకు ఎలా తెలుస్తుంది." అని భయం నటించింది సీత.

సీత మాటలు విన్న రాక్షస స్త్రీలు ఆ వానరము మనలను కూడా చంపుతుందేమో అని భయంతో నలుదిక్కులకూ పారిపోయారు. మరి కొందరు ఈ విషయం రావణునికి చెప్పటకు రావణుని మందిరానికి వెళ్లారు. మరి కొందరు మొండి వాళ్లు, చస్తే చస్తామని అక్కడే సీతకు కాపలాగా ఉన్నారు.

రావణుని దగ్గరకు వెళ్లిన రాక్షస స్త్రీలు, హనుమంతుని గురించి అతని భయంకరాకారము గురించి చిలవలు పలవలుగా కల్పించి చెప్పారు. "ఓ మహారాజా! ఒక భయంకరమైన వానరము అశోకవనములో ప్రవేశించింది. వనమంతా నాశనం చేసింది. సీతతో ఏమేమో మాట్లాడింది. మేము ఎంత అడిగినా సీత ఆ వానరము

గురించి చెప్పడం లేదు. ఆ వానరము దేవేంద్రుని వద్ద నుండి కానీ, మీ సోదరుడు కుబేరుని వద్ద నుండి కానీ, లేక రాముని వద్ద నుండి కానీ వచ్చిన దూత కావచ్చును. ఆ వానరుని రూపము అత్యంత ఆశ్చర్యకరంగా ఉంది. ఇప్పుడు ఇంత ఉంటాడు. మరుక్షణం ఆకాశమంత ఉంటాడు. ఇప్పుడు ఇక్కడ ఉంటాడు. క్షణంలో అక్కడ ఉంటాడు. అశోక వనంలో వాడు విరవని చెట్టు లేదు. నాశనం చెయ్యని ప్రదేశము లేదు.

ప్రభూ! ఆశ్చర్యము ఏమంటే, ఆ వానరము సీత ఉన్న ప్రదేశము తప్ప మిగిలిన వనము అంతా ధ్వంసము చేసింది. కేవలము సీతను రక్షించడానికే అలా చేసాడా లేక వనం అంతా నాశనం చేసి అలసి పోయి సీత ఉన్న ప్రదేశమును మాత్రము నాశనము చేయలేదా! అనే విషయం తెలియడం లేదు ప్రభూ!...అదేంకాదు లెండి. కోతికి అలసట ఏముంది. సీతను రక్షించడానికే వాడు ఈ పని చేసాడు. ప్రభూ! ప్రత్యేకంగా సీత కూర్చున్న శింశుపా వృక్షమును మాత్రము ఆ వానరము  తాకనైనా తాకలేదు.

ప్రభూ! మీరంటే ఏ మాత్రం భయం లేకుండా, అశోక వనంలో ప్రవేశించి, సీతతో మాట్లాడి, అశోకవనమును ధ్వంసము చేసిన ఆ వానరమును పట్టి కఠినంగా శిక్షించండి.  వాడు చావడానికి సిద్ధపడినట్టున్నాడు లేకపోతే తమరి అధీనంలో ఉన్న సీతతో మరొకడు వచ్చి మాట్లాడటం సంభవమా!" అని తలొక విధంగా చెప్పారు రాక్షస స్త్రీలు.

వారి మాటలు విన్న రావణునికి కోపం తలకెక్కింది. అగ్ని వలె మండి పడ్డాడు. వెంటనే  ఎనభై వేలమంది రాక్షస సైనికులను

పిలిచాడు. హనుమంతుని పట్టుకొని చంపమని ఆదేశించాడు. వెంటనే ఆ సైనికులు రకరకాలైన ఆయుధములను పట్టుకొని హనుమంతుని వెతుక్కుంటూ వెళ్లారు. అశోక వనద్వారము వద్ద నిలబడి ఉన్న హనుమంతుని చూచారు.

ఆ రాక్షసులు తమ తమ ఆయుధములను ఝుళిపిస్తూ హనుమంతుని మీదికి ఉరికారు. హనుమంతుని తమ తమ ఆయుధములతో చుట్టుముట్టారు. వారిని చూడగానే హనుమంతుడు తన శరీరమును పెంచాడు. తోకను నేలకేసి బాదాడు. పెద్దగా అరిచాడు. "ఒరేయ్! నేను వాయు పుత్రుడను. నా పేరు హనుమంతుడు. నేను రాముడు పంపగా, సుగ్రీవుడు పంపగా రామదూతగా వచ్చాను. మీరు ఎంత మంది వచ్చినా నేను చంపేస్తాను. వెయ్యిమంది రావణులు కూడా నా ఎదుట నిలువలేరు. నేను సీత కోసరం వచ్చాను. సీతను చూచాను. లంకను నాశనం చేసి, సీతకు నమస్కరించి వెళతాను." అని పెద్దగా అరిచి చెప్పాడు.

హనుమంతుని అరుపులు విని చాలా మంది రాక్షసులకు పై ప్రాణాలు పైనే పోయాయి. రావణుని ఆజ్ఞ తప్పదని, వారందరూ హనుమంతుని మీదికి తమ తమ ఆయుధములతో దూకారు. అప్పుడు హనుమంతుడు అశోకవనమునకు అమర్చిన పెద్ద ద్వారము వద్దకు వచ్చాడు. దానికి అమర్చిన పెద్ద గడియను ఊడపీకాడు. దానిని పట్టుకొని ఆ రాక్షసులను ఒక్కొక్కడిని చావగొట్టాడు. కొద్ది నిమిషములతో రావణుడు పంపిన రాక్షసులు అందరూ పీనుగులయ్యారు. ఇంకా ఎవరైనా వస్తారా అని చూస్తూ మరలా ఆ తోరణ స్తంభము వద్ద నిలబడ్డాడు హనుమంతుడు.

చచ్చిన వాళ్లు చావగా, హనుమంతుని బారి నుండి తప్పించుకొన్న కొంతమంది రాక్షసులు పరుగు పరుగున పోయి రావణునికి జరిగిందంతా చెప్పారు. తాను పంపిన రాక్షస సేన సమస్తం హనుమంతుని దెబ్బకు ఆహుతి అయ్యారు అన్న వార్త విన్న రావణుడు కోపంతో ఊగిపోయాడు. అదే రావణునికి తగిలిన మొదటి ఎదురు దెబ్బ. వెంటనే తన సేనానాయకుడు ప్రహస్తుని పిలిపించాడు. అశేష సేనలతో ప్రహస్తుని హనుమంతుని మీదికి పంపాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము నలుబది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
నలుబది మూడవ సర్గ.

రాక్షస సైనికులను చంపిన తరువాత ఇంకా ఎవరు వస్తారా అని తోరణస్తంభము మీద ఎక్కి కూర్చుని ఎదురు చూస్తున్నాడు హనుమంతుడు. ఎదురుగుండా అశోక వనములో ఉన్న చైత్యప్రాసాదము కనపడింది. అప్పుడు హనుమంతునికి ఒక ఆలోచన వచ్చింది. "అశోకవనము అంతా ధ్వంసము చేసాను. ఈ చైత్యప్రాసాదమును మాత్రము ఎందుకు వదిలిపెట్టాలి. . దీనిని కూడా ధ్వంసం చేస్తే ఓ పనైపోతుంది" అనుకున్నాడు.

అనుకున్నదే తడవుగా పైకి లేచాడు. చైత్యప్రాసాదము మీదికి లంఘించాడు. ఆ చైత్యప్రాసాదము మీద ఎక్కి కూర్చున్నాడు. తరువాత

తన శరీరమును పెంచాడు. లంకా పట్టణం అంతా అదిరిపోయేట్టు తన జబ్బలు చరుచుకున్నాడు. సింహనాదం చేసాడు. ఆ శబ్దానికి తట్టుకోలేక చైత్యప్రాసాదమును రక్షించుచున్న రక్షకభటులు మూర్ఛపోయారు. మరి కొంత మంది సైనికులు వివిధములైన ఆయుధములను పట్టుకొని అక్కడకు వచ్చారు. చైత్యప్రాసాదము మీద ఉన్న హనుమంతుని చూచారు.

హనుమంతుడు కిందికి దుమికాడు. వెంటనే ఆ సైనికులు హనుమంతుని చుట్టుముట్టారు. హనుమంతుడు ఆ చైత్యప్రాసాదము స్తంభమును ఒకదానిని పెకలించి, గిరా గిరా తిప్పి ఆ సైనికుల మీదికి విసిరాడు. హనుమంతుడు ఆ స్తంభమును గిరా గిరా తిప్పుతుంటే అగ్ని ప్రజ్వరిల్లింది. ఆ అగ్ని చైత్యప్రాసాదము మొత్తం పాకింది. చైత్యప్రాసాదము అగ్నికి ఆహుతి అయిపోయింది. స్తంభము తమ మీద పడ్డ సైనికులు అక్కడికక్కడే మృతి చెందారు.

వారిని చూచి ఇలా అన్నాడు హనుమంతుడు. “నా దెబ్బకే ఇంతమంది చచ్చారు. ఇంకా నా లాంటి వాళ్లు సుగ్రీవుని సేనలో లక్షలు కోట్లు ఉన్నారు. వాళ్లను ఎలా తట్టుకుంటారు మీరు. ఒక్కొక్కరు వెయ్యి ఏనుగుల బలం ఉన్న వానరులు ఉన్నారు. కోట్లకొద్దీ వానర సైన్యముతో, రాముడు సుగ్రీవుడు లంకమీదికి దండెత్తి వస్తున్నారు. మీరందరూ చావడం, మీ లంక నాశనం కావడం తథ్యం.

ఒరేయ్! మీ రావణుడు రామునితో అనవసరంగా పెట్టుకున్నాడు. దాని ఫలితంగా మీ రావణుడు, మీరు, మీ లంకానగరం, సర్వనాశనం

అవుతుంది. ఒక్కడు కూడా మిగలడు." అని బిగ్గరగా అరిచి చెప్పాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
సుందరకాండము నలుబది మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
నలుబది నాలుగవ సర్గ.

ప్రహస్తుని కుమారుని పేరు జంబుమాలి. మహా పరాక్రమ వంతుడు. రావణుడు జంబు మాలిని సైన్యసమేతంగా, హనుమంతుని వధించి రమ్మని, పంపించాడు. జంబుమాలి పెద్ద శరీరంతో అతి వికృతంగా క్రూరంగా ఉంటాడు. అప్పటిదాకా జంబుమాలి అపజయము అనే మాట ఎరుగడు. జంబుమాలి ధనుస్సు, బాణములు ధరించి వచ్చాడు. జంబుమాలి చేసే ధనుష్టంకారానికి దిక్కులు మార్మోగు తున్నాయి. గాడిదలు కట్టిన రథం మీద జంబుమాలి అశోకవనము దగ్గర ఉన్న చైత్యప్రాసాదము వద్దకు వచ్చాడు.

జంబు మాలిని చూచి హనుమంతుడు సంతోషంతో కిచా కిచా నవ్వాడు. జంబుమాలి ముఖద్వారము పైన కూర్చుని ఉన్న హనుమంతుని మీద వాడి అయిన బాణములను ప్రయోగించాడు. అర్ధచంద్రబాణముతో హనుమంతుని ముఖము మీద, కర్ణిబాణముతో హనుమంతుని శిరస్సును, పది నారాచబాణములతో హనుమంతుని బాహువుల మీద కొట్టాడు.

హనుమంతుని నుదుటి మీద బాణం తగిలి రక్తం బయటకు చిమ్మింది. హనుమంతుడికి కోపం వచ్చింది. పక్కకు చూచాడు. పక్కన ఒక పెద్ద రాతి బండ కనపడింది. హనుమంతుడు కిందికి దుమికి ఆ రాతి బండను ఎత్తి జంబుమాలి మీదికి విసిరాడు. జంబుమాలి పది బాణములతో ఆ రాతి బండను ముక్కలు చేసాడు. ఇంక లాభం లేదు అనుకొని అశోకవనంలో ఉన్న పెద్ద మద్దిచెట్టును కూకటి వేళ్లతో సహా పెకలించాడు. దానిని రెండు చేతులతో గిరా గిరా తిప్పాడు. హనుమంతుడు మద్దిచెట్టును అలా గిరా గిరా తిప్పుతున్నప్పుడు జంబుమాలి హనుమంతుని మీద బాణప్రయోగం చేసాడు. జంబుమాలి ప్రయోగించిన బాణముల ధాటికి ఆ మద్దివృక్షము తునా తునకలు అయింది.

తరువాత జంబుమాలి హనుమంతుని భుజమును ఐదు బాణములతోనూ, వక్షస్థలమును ఒక బాణంతోనూ కొట్టాడు. ఒక పరిఘను హనుమంతుని మీదికి విసిరాడు. జంబుమాలి ప్రయోగించిన బాణములు తన శరీరం అంతా గుచ్చుకోడంతో హనుమంతుడు కోపంతో ఊగిపోయాడు. జంబుమాలి ప్రయోగించిన పరిఘను పట్టుకొని దానిని తిరిగి వేగంగా జంబుమాలి వక్షస్థమునకు తగిలేట్టు విసిరాడు. జంబు మాలి ఈ పరిణామాన్ని ఊహించలేదు. ఆ పరిఘను వారించడానికి ప్రయత్నించలేదు. అంతే. ఆ పరిఘ జంబుమాలిని బలంగా తాకింది. ఆ పరిఘ దెబ్బకు జంబు మాలి అతను ఎక్కిన రథము, దానికి కట్టబడిన గాడిదలు, తోలుతున్న సారథి అందరూ ముద్దగా అయిపోయారు. జంబుమాలి ఆకారం కూడా కనపడలేదు.

జంబు మాలి మరణించగానే, చావగా మిగిలిన రాక్షస సైనికులు పారిపోయారు. రావణునితో జంబుమాలి మరణ వార్తను చెప్పారు. ప్రహస్తుని కుమారుడు, మహా బలశాలి అయిన జంబుమాలి మరణ వార్త విని రావణుడు కోపంతో ఊగిపోయాడు. తన వద్ద ఉన్న ఏడుగురు మంత్రుల కుమారులను పిలిపించాడు. వారిని అపార సైన్యంతో హనుమంతుని మీదికి యుద్ధానికి పంపాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము నలుబది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## నలుబది ఐదవ సర్గ.

రావణుని చేత ఆజ్ఞాపింపబడిన ఏడుగురు మంత్రుల కుమారులు అశ్వములు కట్టిన రథములను ఎక్కి హనుమంతుని మీదికి యుద్ధానికి బయలుదేరారు. వారు కూడా సామాన్యులు కారు. మహాబలశాలురు. వారంతా ధనుర్బాణములను ధరించి ఉన్నారు. వారి వెంట పెద్ద సైన్యము బయలుదేరింది. ఏడుగురు మంత్రుల కుమారులు ఉత్సాహంతో హనుమంతుని మీదికి యుద్ధానికి బయలు దేరారు. వారి తల్లి తండ్రులు, బంధువులు మాత్రము "జంబుమాలి వంటి మహావీరుడే హనుమంతుని ధాటికి తట్టుకోలేక మరణించాడు. వీళ్లగతి ఏమవుతుందో"అని ఆందోళన చెందారు. కాని ఆ మంత్రి పుత్రులు మాత్రము హనుమంతుని నేను చంపుతాను అంటే నేను చంపుతాను అంటూ ఉరకలు వేస్తూ దూసుకు వెళుతున్నారు.

ఏడుగురు మంత్రుల కుమారులు తమ తమ బాణపరంపరలతో హనుమంతుని కప్పివేసారు. ఆ బాణవర్షంలో తడిసిపోయాడు హనుమంతుడు. కాని ఒక్కబాణము కూడా తనకు తగల కుండా వేగంగా గిరా గిరా తిరుగుతూ తప్పించుకుంటున్నాడు హనుమంతుడు. మంత్రి కుమారులు ప్రయోగించిన బాణములు అన్నీ వృథా అయ్యాయి. హనుమంతుడు అర్భకులైన మంత్రికుమారులతో ఆడుకుంటున్నాడా అన్నట్టు ఉంది.

తరువాత గట్టిగా అరిచాడు హనుమంతుడు. ఆ అరుపుకు రాక్షససేన కకావికలైంది. హనుమంతుడు ఒక్కొక్క మంత్రి కుమారుని పట్టుకొని తలమీద, వీపు మీద చేత్తో చేతులతో బలంగా చరుస్తున్నాడు. కాళ్లతో తొక్కాడు. అక్కడా ఇక్కడా అనకుండా ఒళ్లంతా పిడిగుద్దులు గుద్దాడు. ఆ దెబ్బలకు తట్టకోలేక మంత్రి కుమారులు అందరూ పరలోకం చేరుకున్నారు. వారు చావగానే హనుమంతుడుమిగిలిన సైనికులను గోళ్లతో రక్కాడు. చీల్చాడు. పెద్దగా అరుస్తూ భయపెట్టాడు. హనుమంతుని చేతిలో చావగా మిగిలిన సైనికులు పారిపోయారు. సైనికులు చేస్తున్న ఆర్తనాదాలతో, ఏనుగుల ఘీంకారాలతో, అశ్వముల సకిలింపులతో లంకానగరము మార్మోగిపోయింది. రాక్షసుల రక్తం కాలువలు కట్టి ప్రవహించింది. ఇప్పటికి వీళ్లు అయ్యారు. ఇంకా ఎవరు వస్తారో అని హనుమంతుడు తోరణ స్తంభము ఎక్కి ఎదురుచూస్తున్నాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము నలుబది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# సుందర కాండము

## నలుబది ఆరవ సర్గ.

తను పంపిన ఏడుగురు మంత్రి కుమారులు సైన్యంతో సహా హనుమంతుని చేతిలో మరణించారు అన్న వార్త విన్న రావణాసురునిలో మొట్ట మొదటి సారిగా భయం ప్రవేశించింది. “తాను ఓడిపోతున్నాడా! తాను ఓడిపోవడం మొదలయిందా! ఒక్క వానరాన్ని చంపడానికి ఇంతమంది బలికావాలా! ఏమిటీ విపరీత పరిణామం!” అని మనసులోనే మధనపడసాగాడు. కాని తన భయాన్ని బయటకు కనిపించకుండా నిబ్బరంగా ఉన్నాడు.

ఈ సారి ఐదుగురు సేనానాయకులను పిలిపించాడు. వారు విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు. వారిని పిలిపించాడు రావణుడు.

“ఓ సేనానాయకులారా! మీరందరూ మీకు కావలసిన సైన్యమును తీసుకొని వెళ్లండి. ఆ వానరాన్ని చంపండి. కాని మీరు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. ఇప్పటిదాకా జరిగిన పరిణామాలు, చంపబడిన సైనికులు, వీరులను బట్టి చూస్తే అది సామాన్యమైన వానరము కాదు. ఏదో మహత్తర శక్తి కల భూతము అనిపిస్తూ ఉంది. మనకు బద్ధశత్రువు అయిన ఇంద్రుడు మనలను తుదముట్టించడానికి తన మహత్తర శక్తితో ఆ భూతాన్ని సృష్టించాడా అని అనుమానంగా ఉంది. ఎందుకంటే ఇంతకు ముందు మనం అందరం దేవతలను, నాగులను, గంధర్వులను, యక్షులను ఓడించాము. వారిలో ఎవరో ఒకరు మనమీద పగబట్టి ఈ రూపంలో వచ్చి ఉండవచ్చు. కాబట్టి

మీరు అది సామాన్య వానరమే కదా అని తేలిగ్గా తీసుకోకండి. నిర్దాక్షిణ్యంగా సంహరించండి.

అంతే కాదు, ఇది నిజమైన వానరమే అనుకుంటే అది కూడా సంభవమే అనిపిస్తూ ఉంది. ఎందుకంటే, నేను ఇంతకు పూర్వము వాలి, సుగ్రీవుడు, జాంబవంతుడు, నీలుడు, ద్వివిదుడు మొదలైన వానరములను చూచి ఉన్నాను. వారు లోకోత్తరమైన శక్తి కలవారు. కాని వారికి ఇంత బుద్ధి, చాకచక్యము లేవు. ఈ వానరము వారి కంటే బుద్ధి, బలము, శౌర్యము, శక్తి కల వానరము అనిపిస్తూ ఉంది. కాబట్టి మీరు ఇది వానర రూపంలో ఉన్న ఒక మహాభూతము అని అనుకొని దానితో యుద్ధం చేయండి.

ఇంతకు ముందు మనము చేసిన యుద్ధములలో ఇంద్రుడు కానీ, అసురులు కానీ, గంధర్వులు కానీ, యక్షులు కానీ మనముందు నిలువ లేదు. అని చెప్పి గర్వించకండి. యుద్ధములో జయాపజయములు చంచలంగా ఉంటాయి. ఎల్లప్పుడే మనమే జయిస్తాము అనుకోవడం పొరపాటు. కాబట్టి జాగరూకతతో వ్యవహరించండి. వానరమే కదా అని నిర్లక్ష్యం చేయకండి." అని ఆజ్ఞాపించాడు.

రావణుని మాటలు విన్న ఆ సైన్యాధ్యక్షులు రెట్టించిన ఉత్సాహంతో హనుమంతుని మీదికి యుద్ధానికి బయలుదేరారు. వారి వెంట రథికులు, ఆశ్వికులు, గజారోహకులు, వివిధ అస్త్రశస్త్రములను ధరించిన వారు, బలంతులు అయిన సైనికులు బయలుదేరారు.

అశోకవనము ముఖద్వారము వద్ద నిలబడి ఉన్న హనుమంతుడు వీరిని చూచాడు. మరోఐదుగురు చావడానికి వస్తున్నారు అని మనసులో అనుకున్నాడు. రాక్షసులు హనుమంతుని చుట్టుముట్టారు. వివిధ రకములైన ఆయుధములను హనుమంతుని మీద ప్రయోగించారు.

దుర్ధరుడు ఐదు ఇనప ములికలు కలిగిన బాణములను హనుమంతుని తలకు తగిలేట్టు కొట్టాడు. ఆ అయిదు బాణములు తన తలకు తగలగానే హనుమంతుడు సింహనాదము చేస్తూ ఆకాశంలోకి ఎగిరాడు. దుర్ధరుడు కూడా తన రథముతో సహా ఆకాశంలోకి ఎగిరాడు. హనుమంతుని మీద రకరకాలైన బాణములను ప్రయోగించాడు. హనుమంతుడు చిత్రవిచిత్రముగా తిరుగుతూ ఆ బాణముల నుండి తప్పించుకుంటున్నాడు. ఇలా కాదని హనుమంతుడు తన శరీరమును విపరీతంగా పెంచాడు. దుర్ధరుని రథము మీదికి ఎగిరాడు. అక్కడినుండి మహావేగముతో దుర్ధరుని రథము మీద అడ్డంగా పడ్డాడు. మహాకాయంతో హనుమంతుడు దుర్ధరుని రథం మీద పడగానే, రథం విరిగిపోయింది. దానికి కట్టిన గుర్రాలు మరణించాయి. దుర్ధరుడు కూడా ఆ రథము మీది నుండి వేగంగా కిందపడి మరణించాడు.

దుర్ధరుని మరణం కళ్లారా చూచిన విరూపాక్షుడు, యూపాక్షుడు కోపంతో ఊగిపోయారు. వారిద్దరూ ఆకాశంలోకి ఎగిరారు. ఇద్దరూ ముద్గరలతో హనుమ వక్షస్థలము మీద కొట్టారు. హనుమంతుడు వారి నుండి తప్పించుకొని వేగంగా నేలమీదికి దిగాడు. వారు కూడా కిందికి దిగేలోపు హనుమంతుడు ఒక

సాలవృక్షమును పెకలించి సిద్ధంగా ఉన్నాడు. విరూపాక్ష, యూపాక్షులు కిందికి దిగగానే ఆ వృక్షముతో వారిని బలంగా మోదాడు. ఆ దెబ్బలకు తాళలేక ఆ ఇరువురు రాక్షసులు మరణించారు.

వచ్చిన ఐదుగురిలో ముగ్గురు మరణించారు. ఇంక ఇద్దరు మిగిలారు. వారు ప్రఘనుడు, భాసకర్ణుడు. ఇద్దరూ శూలములను తీసుకొని హనుమంతుని మీదికి వెళ్లారు. వారిద్దరూ హనుమంతునికి చెరి ఒక పక్క నిలిచి యుద్ధం చేస్తున్నారు. ఆ ఇరువురు కొట్టిన దెబ్బలకు హనుమంతుని శరీరం అంతా రక్తసిక్తము అయింది. ఇంక లాభం లేదని, హనుమంతుడు ఒక పెద్ద కొండ శిఖరమును పెకలించి వారి మీదికి విసిరాడు. ఆ కొండ శిఖరము కిందపడి ప్రఘనుడు, భాసకర్ణుడు మరణించారు.

ఐదుగురు సేనాపతులు మరణించగానే వారి సేనలు చెల్లాచెదరు అయ్యారు. హనుమంతుడు వారిని తరిమి తరిమి చంపాడు. ఒక ఏనుగును పట్టు కొని మరొక ఏనుగు మీదికి విసిరాడు. రెండు ఏనుగులు చచ్చాయి. అలాగే గుర్రముల మీదికి గుర్రములను, రథముల మీదికి రథములను, రాక్షసుల మీదికి రాక్షసులను విసురుతూ అందరినీ సంహరించాడు హనుమంతుడు.

చచ్చిపడి ఉన్న సైనికులతోనూ, రథములతోనూ అశ్వములతోనూ ఏనుగులతోనూ ఆ ప్రదేశము అంతా నడవడానికి వీలులేకుండా ఉంది. పీనుగుల పెంట అయింది.

హనుమంతుడు తిరిగి తోరణ స్తంభము ఎక్కి కూర్చున్నాడు. ఈ సారి ఎంతమంది వస్తారా అని ఎదురుచూస్తున్నాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము నలుబది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము
## నలుబది ఏడవ సర్గ.

పట్టుదల, కోపము, అహంకారమూ మనసులో ప్రజ్వరిల్లితే మనిషి కానీ, రాక్షసుడు కానీ యుక్తాయుక్త వివేచన కోల్పోతాడు. రావణుని పరిస్థితి అలాగే ఉంది. వచ్చిన వానరుడు ఒక్కడు. చచ్చిన వాళ్లు వేలకు వేలు. కారణం ఏమిటి? ఆలోచించలేదు. జంబుమాలి చచ్చాడు. ఏడుగురు మంత్రి కుమారులు వధింపబడ్డారు. ఐదుగురు సేనాపతులు పరలోక గతులయ్యారు. కానీ రావణునికి బుద్ధిరాలేదు. అసలు విషయం కనుక్కోవాలనే ఆలోచన రాలేదు.

ఐదుగురు సేనాపతులు మరణించారు అన్న వార్త విని తన ఎదురుగా కూర్చుని ఉన్న తన కుమారుడు అక్షయ కుమారుని వంక చూచాడు రావణుడు. తండ్రి అభిప్రాయాన్ని అర్థం చేసుకున్నాడు అక్ష కుమారుడు. పైకి లేచాడు. అపార సేనావాహినితో హనుమంతుని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. అక్షకుమారుడు ఎక్కిన రథము అతడు ఎంతో తపస్సు చేసి సంపాదించినది. దానికి ఎనిమిది గుర్రములు కట్టి ఉన్నాయి. అది మనస్సు కంటే వేగంగా ప్రయాణం

చేస్తుంది. ఆ రథాన్ని దేవతలు, అసురులు, గంధర్వులు కూడా ఆప శక్యం కాదు. ఆరథము భూమి మీద ఆకాశంలోనూ నిరాఘాటంగా ప్రయాణం చేస్తుంది. అటువంటి రథాన్ని ఎక్కాడు అక్షకుమారుడు. ధనుర్బాణములు ధరించాడు. ఖడ్గములు, తోమరములు, శక్తి అస్త్రములు తన రథంలో పెట్టించాడు. అక్షకుమారుడు హనుమంతుని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. అక్షకుమారుని వెంట అశేష సేనావాహిని బయలుదేరింది.

అక్షకుమారుడు అశోక వనము ముఖద్వారమును సమీపించాడు. హనుమంతుని వంక చూచాడు. అక్షకుమారునికి ఆశ్చర్యము గౌరవము ఒకేసారి కలిగాయి. అక్షకుమారుడు తన బలమును, హనుమంతుని బలమును అంచనా వేసుకున్నాడు. హనుమంతునితో ఎలా యుద్ధం చెయ్యాలో మనసులో నిర్ణయించుకున్నాడు. ముందుగా అక్షకుమారుడు మూడు బాణములను హనుమంతుని మీద ప్రయోగించి హనుమంతుని యుద్ధానికి ఆహ్వానించాడు.

అక్షకుమారుని ఆర్భాటం అంతా తోరణ స్తంభం మీది నుండి ఆసక్తితో చూస్తున్నాడు హనుమంతుడు. అక్షకుమారుడు వాడి అయిన మూడు బాణములతో హనుమంతుని తలమీద కొట్టాడు. ఆ బాణములు హనుమంతుని శిరస్సును గాయపరిచాయి. వెంటనే అక్షకుమారునితో యుద్ధానికి తలపడ్డాడు. తన శరీరమును పెంచాడు. అది చూచిన అక్షకుమారుడు హనుమంతుని మీద బాణములను వర్షం మాదిరి కురిపించాడు. అది చూచి హనుమంతుడు పెద్దగా అరిచాడు. బుజాలు చరచుకున్నాడు.

హనుమంతుడు కాళ్లు చేతులు భయంకరంగా ఆడిస్తూ ఆకాశంలోకి ఎగిరాడు. ఆకాశంలోకి ఎగురుతున్న హనుమంతుని చూచి అక్షకుమారుడు హనుమంతుని మీద బాణములు వేస్తూ తాను కూడా ఆకాశంలోకి ఎగిరాడు.

హనుమంతుడు ఆకాశంలో గిరా గిరా తిరుగుతూ అక్షకుమారుడు తన మీద ప్రయోగిస్తున్న బాణములను తప్పుకుంటున్నాడు. అలా ఆకాశంలో గిరా గిరా తిరుగుతూనే అక్షకుమారుని పరాక్రమాన్ని చూచి ఆలోచనలో పడ్డాడు హనుమంతుడు. ఇంతలో అక్షకుమారుడు తన వాడి అయిన బాణములతో హనుమంతుని వక్షస్థలము మీద కొట్టాడు. అక్షకుమారుని యుద్ధనైపుణ్యము చూచి హనుమంతునికి ముచ్చటేసింది. బాలుడు, అపార యుద్ధనైపుణ్యము చూపుతున్న అక్షకుమారుని చంపడానికి హనుమకు మనసొప్పలేదు. అక్షకుమారుని బాణముల ధాటిని తప్పుకుంటూనే హనుమంతుడు అక్షకుమారుని గురించి ఆలోచిస్తున్నాడు.

"ఈ కుమారుడు మహాపరాక్రమవంతుడు, బుద్ధిమంతుడు. మంచి యుద్ధనైపుణ్యము కలవాడు. ఇతని యుద్ధతంత్రములను దేవతలు, యక్షులు, గంధర్వులు కూడా మెచ్చుకుంటారు. ఇతడిని చంపడానికి మనసురావడం లేదు. కానీ ఇతని పరాక్రమము క్షణక్షణానికీ పెరిగిపోతూ ఉంది. ఇంక లాభం లేదు. ఇతనిని ఉపేక్షిస్తే నన్ను సంహరిస్తాడు. కాబట్టి ఇతని మీద జాలి చూపడం మంచిది కాదు. ఇతనిని చంపక తప్పదు." అని మనసులో నిశ్చయించుకున్నాడు హనుమంతుడు. ఎలా చంపాలా అని పథకం వేసుకున్నాడు.

హనుమంతుడు ఒక్కసారిగా గాలిలోకి ఎగిరాడు. మహావేగంతో కిందికి దిగుతూ అక్షకుమారుని రథమునకు కట్టిన గుర్రములను అరిచేతితో బలంగా చరిచాడు. ఆ దెబ్బలకు తట్టుకోలేక ఆ గుర్రములు కిందపడి మరణించాయి. తరువాత హనుమంతుడు అక్షకుమారుని దివ్య రథమును ఒక్కవేటుతో విరగ్గొట్టాడు. అక్షకుమారుడు రథము నుండి జారి కింద పడ్డాడు. రథము ఆకాశములో ఉన్నందున, అక్షకుమారుడు ఆకాశంలో నుండి గిరా గిరా తిరుగుతూ కిందకు జారుతున్నాడు. అంతలోనే అక్షకుమారుడు ఒక చేత్తో ఖడ్గము ధరించి పైకి ఎగిరాడు. కానీ, హనుమంతుడు అక్షకుమారుని కాళ్లు పట్టుకొని కిందికి బలంగా లాగాడు. హనుమంతుడు అక్షకుమారుని రెండు కాళ్లు పట్టుకొని గిరా గిరా తిప్పి నేలకేసి మోదాడు. ఆ దెబ్బకు అక్షకుమారుని చేతులు, కాళ్లు, నడుము విరిగిపోయాయి. అక్షకుమారుడు నెత్తురు కక్కుకొని మరణించాడు.

అక్షకుమారుడు మరణించడం చూచిన అతని సేనలు ఇంక హనుమంతునితో యుద్ధ చేయకుండా పలాయనం చిత్తగించాయి. యుద్ధం చేయడానికి ఎవరూ లేకపోవడంతో, హనుమంతుడు తిరిగి తోరణ స్తంభము ఎక్కి ఇంకా ఎవరన్నా వస్తారా అని ఎదురుచూస్తున్నాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము నలుబది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## నలుబది ఎనిమిదవ సర్గ.

తన కుమారుడు కూడా హనుమంతుని చేతిలో హతమైనాడు అన్న వార్త విన్న రావణునికి దిక్కుతోచలేదు. దు:ఖాన్ని తట్టుకోలేకపోయాడు. అయినా గుండె నిబ్బరం చేసుకున్నాడు. తన కుమారుడు ఇంద్రజిత్తును హనుమంతుని మీదికి యుద్ధానికి వెళ్లమని ఆదేశించాడు.

ఇంద్రుని జయించిన వాడు ఇంద్రజిత్తు. మహా బలవంతుడు. పరాక్రమవంతుడు. వీర్యవంతుడు. ధైర్యవంతుడు. అప్పటి దాకా ఓటమి ఎరుగని వాడు. అటువంటి ఇంద్రజిత్తును హనుమంతుని మీదికి యుద్ధానికి  పంపుతూ ఇంద్రజిత్తుతో ఇలా అన్నాడు రావణుడు.

"కుమారా! నీవు సకల అస్త్ర, శస్త్ర కోవిదుడవు. నీకు తెలియని అస్త్రము లేదు. నీవు దేవతలను, అసురులను జయించిన వాడవు. నీవు బ్రహ్మదేవుని ఆరాధించి బ్రహ్మవలన బ్రహ్మాస్త్రమును పొందిన వాడవు. దేవేంద్రుడు, దేవతలు, మరుత్తులు, ఎవరు కూడా యుద్ధములో నీ ముందు నిలువలేరు. ముల్లోకములలో నిన్ను ఎదిరించి గెలిచిన వాడు లేడు. నీకు దేశ, కాల మాన పరిస్థితులను బట్టి యుద్ధము  చేయడం తెలుసు.  వీర్యములో కానీ, పరాక్రమములో కానీ, బుద్ధిలోకానీ, బలములోకానీ, అస్త్రశస్త్రనైపుణ్యములో కానీ నీకు సాటిరాగల వాడు ముల్లోకములలో లేడు. నీకు తప్పక విజయము లభిస్తుంది.

నీకు తెలిసే ఉంటుంది. ఆ వింత వానరము చేతిలో జంబుమాలి, మంత్రుల పుత్రులు ఏడుగురు, ఐదుగురు సైన్యాధ్యక్షులు మరణించారు. మన అక్షకుమారుడు కూడా మృతి చెందాడు. ప్రస్తుతము నాతో సమానమైన వాడివి నీవు మిగిలి ఉన్నావు. నీవు తొందర పడకుండా ఆ వానరుని బలమును, పరాక్రమమును తెలుసుకొని, నీ బలాన్ని శక్తిని ఉపయోగించి అతనితో యుద్ధము చెయ్యి. నా ఆశలన్నీ నీ మీదనే పెట్టుకొని ఉన్నాను. ఆ వానరుని చంపి విజయుడవై తిరిగిరా!

మరొక్క మాట. ఎంత మంది సైనికులు ఉన్నను ఆ వానరుని ముందు నిలువలేకపోతున్నారు. కాబట్టి ఎంతమంది సైనికులు ఉన్నారు అన్నది ముఖ్యంకాదు. బుద్ధిబలంతో, పరాక్రమంతో, నీ వద్ద ఉన్న అస్త్రములను, శస్త్రములను సమయానుకూలంగా ప్రయోగించి ఆ వానరుని జయించు. నేను నిన్ను నా కుమారునిగా పంపడం లేదు. యుద్ధయు చేయడం రాజధర్మము. ఆ రాజధర్మము నిర్వర్తించడానికి నిన్ను పంపుతున్నాను. నీ ధర్మాన్ని నువ్వు నిర్వర్తించు." అని పలికాడు రావణుడు.

తండ్రి మాటలను శ్రద్ధగా విన్నాడు ఇంద్రజిత్తు. తండ్రికి ప్రదక్షిణాపూర్వకంగా నమస్కరించాడు. సమరోత్సాహంతో తన రథాన్ని ఎక్కి యుద్ధభూమికి వెళ్లాడు ఇంద్రజిత్తు. హనుమంతుడు ఇంద్రజిత్తు రాకను దూరంనుండే చూచాడు. ఇంద్రజిత్తు చేయుచున్న ధనుష్టంకారమును విన్నాడు. హనుమంతుడు ఇంద్రజిత్తును చూచి తన శరీరమును పెంచాడు. పెద్దగా హుంకారము చేసాడు. ఇంద్రజిత్తు ధనుష్టంకారము చేస్తుంటే హనుమంతుడు పెద్దగా అరుస్తున్నాడు.

హనుమంతుడు, ఇంద్రజిత్తు రణరంగంలోకి దిగాడు.

ఇంద్రజిత్తు హనుమంతుని మీద రకరకాలైన శరములను ప్రయోగించాడు. ఆ శరాఘాతములను తప్పించుకోడానికి హనుమంతుడు ఆకాశంలోకి ఎగిరాడు. హనుమంతుడు ఎక్కడ ఉంటే అక్కడ బాణములను ప్రయోగిస్తున్నాడు ఇంద్రజిత్తు. హనుమంతుడు చిత్రవిచిత్ర రీతులలో ఎగురుతూ ఆ బాణముల బారి నుండి తప్పించుకుంటున్నాడు. ఇంద్రజిత్తు అటు కొడితే ఇటు, ఇటు కొడితే అటు ఎగురుతున్నాడు. ఇంద్రజిత్తు ప్రయోగించిన అస్త్రములు, శస్త్రములు అన్నీ వృథా అవుతున్నాయి.

ఒక్కోసారి హనుమంతుడు ఇంద్రజిత్తు ఎదురుగా నిలబడుతున్నాడు. చిక్కాడు కదా అని హనుమంతుని మీద బాణములు వేస్తే అంతలోనే రెండు చేతులు పైకెత్తి ఆకాశంలోకి ఎగురుతున్నాడు. ఇంద్రజిత్తు వేసిన బాణములు గురితప్పుతున్నాయి. హనుమంతుతని ఎలా జయించాలా అని ఇంద్రజిత్తు నానా రకాలుగా ఆలోచిస్తున్నాడు. హనుమంతుని లోని బలహీనత అంతుచిక్కడం లేదు ఇంద్రజిత్తుకు. అలాగే ఇంద్రజిత్తును ఎలా ఓడించాలా అని హనుమంతుడు శతవిధాలా ప్రయత్నం చేస్తున్నాడు. కాని అతని వల్ల కావడం లేదు.

ఇద్దరూ సమఉజ్జీల మాదిరి యుద్ధం చేస్తున్నారు. గురితప్పదు అనుకున్న బాణం కూడా వ్యర్థం కావడం చూచి ఇంద్రజిత్తు ఆలోచనలో పడ్డాడు. హనుమంతుని ఎలా కొట్టాలా అని ఆలోచిస్తున్నాడు. హనుమంతుని చంపడం తన వల్లకాదు అని

అనుకున్నాడు ఇంద్రజిత్తు. కనీసము హనుమంతుని పట్టుకొని బంధించడానికి ప్రయత్నం చెయ్యాలి అని నిశ్చయించుకున్నాడు. బ్రహ్మాస్త్రమును మనసులో స్మరించాడు. విల్లు ఎక్కుపెట్టి అస్త్రమును సంధించాడు. బ్రహ్మాస్త్రమును ప్రయోగించాడు. ఆ బ్రహ్మఅస్త్రము ధాటికి హనుమంతుని శక్తి తగ్గిపోయింది. తాను బంధింపబడుతున్నాను అని తెలుసుకున్నాడు హనుమంతుడు. తనకు ఇంతకు ముందు బ్రహ్మ ఇచ్చిన వరమును స్మరించుకున్నాడు. హనుమంతునికి తాను బ్రహ్మాస్త్రము చేత బంధింపబడుతున్నాను అని తెలిసింది.

"నేను బ్రహ్మాస్త్రమును గౌరవించాలి. బ్రహ్మాస్త్రము బారి నుండి తప్పించుకొనే శక్తి నాకు లేదు. నేను దీనికి కట్టుబడాలి. తప్పదు. అయినా నన్ను బ్రహ్మ దేవుడు, నా తండ్రి వాయుదేవుడు నిరంతరమూ రక్షిస్తూ ఉండగా నాకు భయం ఎందుకు. ఈ బ్రహ్మాస్త్రము నన్ను ఏమీ చేయలేదు. ఇలా కట్టుబడి ఉండటం వలన నాకు మరొక లాభం కూడా ఉంది. నేను రాక్షస రాజు రావణుని చూడవచ్చును. అతనితో మాట్లాడవచ్చును. రాముని సందేశము వినిపించవచ్చును. రావణుని మనోభావములు తెలుసుకొనవచ్చును." అని మనసులో అనుకున్నాడు హనుమంతుడు. అందుకని  కదలక మెదలక ఊరుకున్నాడు.

రాక్షస సైన్యము హనుమంతుని చుట్టుముట్టింది. హనుమంతుని తాళ్లతో బంధించింది. తనను రాక్షసులు బంధిస్తుంటే తనకు ఇష్టం లేనట్టు నటిస్తూ పెద్దగా అరుస్తున్నాడు హనుమంతుడు. అప్పుడు రాక్షసులు హనుమంతుని పెద్ద పెద్ద తాళ్లతోనూ, నారలతో చేసిన వస్త్రములతోనూ గట్టిగా కట్టారు. హనుమంతుడు తాళ్లతో

చక్కగా కట్టించుకున్నాడు.

రాక్షసులు ఎప్పుడైతే హనుమంతుని తాళ్లతో కట్టారో, బ్రహ్మాస్త్రము ప్రభావము అంతరించింది. బ్రహ్మాస్త్రము హనుమంతుని తన బంధనముల నుండి విడిచిపెట్టింది. ఎందుకంటే మరొక బంధనముతో బంధిస్తే అస్త్రబంధము విడిపోతుంది. ఈవిషయం ఇంద్రజిత్తుకు తెలుసు. "ఇప్పుడు ఈ వానరము బ్రహ్మాస్త్రబంధనములో లేడు. ఈ తాళ్లు ఈ వానరమును ఏమీ చేయలేవు. ఈ బుద్ధిలేని రాక్షసులు ఈ పనిచేసారు. నేను చేసిన శ్రమ అంతా వృధా అయింది. ఈ విషయం హనుమంతునికి తెలిస్తే క్షణంలో తప్పించుకుంటాడు. ఏం చెయ్యడం" అని ఆలోచనలోపడ్డాడు ఇంద్రజిత్తు. కాని ఈ విషయం హనుమంతునికి తెలియదు అన్న విషయం గ్రహించి కాస్త ఊరట చెందాడు.

ఇదేమీ తెలియని రాక్షసులు హనుమంతుని ఈడ్చుకొనుచూ, గుద్దుతూ, కర్రలతో, కాళ్లతో, చేతులతో తన్నుతూ రావణుని వద్దకు తీసుకొని వెళ్లారు. రావణుని ముందు నిలబెట్టారు. "మహారాజా! ఇప్పటిదాకా లంకలో అల్లకల్లోలము సృష్టించిన వానరము ఇదే" అని చెప్పారు.

ఆ సభలో ఉన్న వారికి అందరికీ ఆశ్చర్యము కలిగింది. ఈ చిన్న వానరము ఇంత పని చేసిందా? ఇంతకూ ఈ వానరము ఎవ్వరు? ఎక్కడి నుండి వచ్చింది? ఎవరు పంపారు? ఎందుకు పంపారు? లంకలో ఈ వానరమునకు ఏమి పని? ఈ వానరమునకు లంకలో ఆశ్రయము ఇచ్చినవారు ఎవరు?" అని వాళ్లలో వాళ్లు

గుసగుసలాడుకుంటున్నారు. మరి కొంత మంది పెద్దగా "వీడిని కొట్టండి. చంపండి. తినెయ్యండి. కాల్చెయ్యండి." అని పెద్దగా అరుస్తున్నారు. ఆ రాక్షసులు హనుమంతుని రావణుని ముందు నిలబెట్టారు.

రావణుడు వృద్ధులైన మంత్రుల మధ్య కూర్చుని ఉన్నాడు. రావణుడు హనుమంతుని వంక చూచాడు. హనుమంతుడు కూడా మహాతేజముతో వెలిగిపోతున్న రావణుని చూచాడు. రావణుడు తన మంత్రులను చూచి విచారణ మొదలు పెట్టమన్నాడు. అప్పుడు మంత్రులు హనుమంతుని చూచి "నీవు ఎవరు? ఇక్కడకు ఎందుకు వచ్చావు? నిన్ను ఎవరు పంపారు?" అని అడిగారు.

" నేను సుగ్రీవుడు పంపగా వచ్చాను" అని హనుమంతుడు బదులు చెప్పాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము నలుబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

నలుబది తొమ్మిదవ సర్గ.

ఠీవిగా సింహాసనము మీద కూర్చుని ఉన్న రావణుని చూచి హనుమంతుడు మనసులో "ఇతడేనా రావణుడు. నన్ను కట్టి తన

వద్దకు రప్పించుకున్న వాడు." అని అనుకొన్నాడు. హనుమంతుడు రావణుని నిశితంగా పరిశీలిస్తున్నాడు.

రావణుడు ఆ సమయంలో మెరిసిపోతున్న బంగారు కిరీటమును ధరించాడు. వజ్రములు, మణులు పొదిగిన బంగారు ఆభరణములను ధరించాడు. ఎర్రని పట్టు బట్టలు కట్టుకొని ఉన్నాడు. ఒళ్లంతా ఎర్రని మైపూతలు పూసుకొని ఉన్నాడు. ఆ రావణునికి భయంకరమైన పదితలలు ఉన్నాయి. ఆ రావణుడు ఉన్నతమైన ఆసనము మీద కూర్చుని ఉన్నాడు. అతని ఇరు పక్కల స్త్రీలు వింజామరలు వీస్తున్నారు. రావణుని దగ్గర దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు అనే మంత్రులు ఇరుపక్కల కూర్చుని ఉన్నారు. వీరు కాకుండా ఇంకా కొంత మంది మంత్రులు రావణుని కొలువు కూటములో ఉన్నారు. మంత్రులతో కూడి ఉన్న రావణుని చూచి హనుమంతుడు తన మనసులో ఇలా అనుకున్నాడు.

"ఆహా! ఏమి వీడి తేజస్సు. ఏమి రూపము? ఏమి ధైర్యము. ఏమి పరాక్రమము? వీడే కనుక అధర్మ ప్రవర్తన వీడి ధర్మమును అవలంబించిన ఎడల, వీడు సాక్షాత్తు ఇంద్రుని తో సమానముగా దేవలోకమును ఏలదగిన వాడు. కాని ఇతడు తన బలముతో దేవతలను, దిక్పాలకులను తన సేవకులుగా చేసుకున్నాడు. ఇతడి క్రూరకర్మలే ఇతనిని నాశనం చేస్తున్నాయి." అని మనసులో అనుకున్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము నలుబది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఏబదియవ సర్గ.

రావణుడు కూడా హనుమంతుని చూచి తన మనసులో ఇలా అనుకున్నాడు. "వీడా! ఈ వానరమా తనను ఇంతకాలమూ ముప్పు తిప్పలు పెట్టింది. ఇంత మంది రాక్షస వీరులను చంపింది ఈ వానరమా! పూర్వము నేను కైలాస పర్వతమును ఎత్తినపుడు నన్ను శపించిన నందీశ్వరుడు ఈ రూపంలో రాలేదు కదా! లేక వీడు వానర రూపంలో ఉన్న బాణాసురుడు కాదు కదా! లేక పోతే వీడికి ఇంత బలము పరాక్రమము ఎలా వచ్చాయి." అని మనసులో అనుకున్నాడు.

ప్రహస్తుని చూచి ఇలా అన్నాడు. " ప్రహస్తా! వీడు ఎవరు? ఎక్కడినుండి వచ్చాడు? ఇక్కడకు ఎందుకు వచ్చాడు? ఎవరు పంపితే వచ్చాడు? అశోక వనమును ఎందుకు పాడు చేసాడు? రాక్షసులను ఎందుకు చంపాడు? లంకానగరానికి ఎందుకు వచ్చాడు? రాక్షసులతో ఎందుకు యుద్ధం చేసాడు? వివరంగా అడగండి." అని ఆదేశించాడు.

అప్పుడు ప్రహస్తుడు హనుమంతునితో ఇలా అన్నాడు. "ఓ వానరుడా! నీవు భయపడవద్దు. నీకు ఏమీ అపకారము చెయ్యము. నిన్ను ఇక్కడకు ఎవరు పంపారు? ఇంద్రుడు పంపించాడా? నిజం చెప్పు. నిన్ను ఏమీ చెయ్యము. విడచి పెడతాము. ఇంద్రుడు కాకపోతే వరుణుడు పంపించాడా? నువ్వు ఎవరి గూఢచారివి? నిగూఢంగా ఎందుకు లంకలో ప్రవేశించావు? పోనీ కుబేరుడు పంపాడా?

యముడు పంపాడా? ఎవరు పంపారు? నిజం చెప్పు. లేకపోతే విష్ణువు నిన్ను తన దూతగా పంపాడా!

నీ రూపము వానర రూపము. కానీ నీ ముఖంలో వింతఅయిన తేజస్సు కనబడుతూ ఉంది. నీవు సామాన్య వానరము కావు. అందుకని ఉన్నది ఉన్నట్టు నిజం చెప్పు. వెంటనే నిన్ను విడిచి పెడతాము. అలా కాకుండా అసత్యము పలికావో నీవు జీవించడం కష్టము. అది సరే! పోనీ నిన్ను ఎవరూ పంపలేదు అనుకుందాము. నీ అంతట నీవే వచ్చావా? ఎందుకు వచ్చావు? నీకు లంకలో ఏమి పని? రావణుని గృహంలోకి ఎందుకు ప్రవేశించావు? " అని అడిగాడు ప్రహస్తుడు.

అప్పుడు హనుమంతుడు ప్రహస్తునితో ఇలా అన్నాడు. "మీరు చెప్పినట్టు నేను ఇంద్రునికి కానీ, యమునికి కానీ, వరుణునికి కానీ, విష్ణువుకు కానీ లేక కుబేరునికి కానీ దూతను కాను. నన్ను వారు ఎవరూ పంపలేదు. వారికీ నాకూ ఎలాంటి సంబంధము లేదు. పైగా మీరు అన్నట్టు నేను ఏ మారు రూపములో రాలేదు. నేను వానరుడను. నాది వానరజాతి. నేను వానర రూపంలోనే వచ్చాను. నా అంతట నేను వచ్చాను. రావణుని చూడాలని అనుకున్నాను. రావణుని దర్శనము అంత సులభంగా లభించదు కదా! అందుకని అశోకవనమును నాశనం చేసాను. రాక్షసులు నాతో యుద్ధం చేసారు. నన్ను నేను రక్షించుకోడానికి నేనూ వారితో యుద్ధం చేసాను. వాళ్లు చచ్చారు. నన్ను ఎవరూ ఏ అస్త్రముతో బంధించలేరు. ఇది నాకు బ్రహ్మ ఇచ్చిన వరము. కాని బ్రహ్మాస్త్రమును గౌరవించి పట్టుబడ్డాను. అందువలన నన్ను పట్టుకోగలిగారు. రావణుని వద్దకు తీసుకొని వచ్చారు.

నేను ఒక రాచకార్యము మీద రావణుని వద్దకు వచ్చాను. ఓ రావణా! నేను రాముని దూతను. నీకు నాలుగు మంచి మాటలు చెబుదామని వచ్చాను." అని అన్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఏబదియవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
ఏబది ఒకటవ సర్గ.

హనుమంతుడు రావణుని ఎదురుగా నిలబడి, రావణుని చూచి ఏ మాత్రమూ భయపడకుండా ఈ విధంగా పలికాడు. "ఓ రాక్షసేంద్రా! నేను కిష్కింధను పాలించే సుగ్రీవుని వద్దనుండి వచ్చాను. నేను ఆయన మంత్రిని. నా పేరు హనుమంతుడు. సుగ్రీవుడు నీ క్షేమములు కనుక్కోమన్నాడు. సుగ్రీవుడు నీకు ఒక సందేశము పంపాడు. దానిని సావధానంగా విను.

ఇక్ష్వాకు వంశంలో దశరథుడు అనే మహారాజు ఉన్నాడు. అతని పెద్ద కుమారుడు రాముడు. రాముడు తన తండ్రి దశరథుని ఆదేశము మేరకు తన భార్య సీతతోనూ, తమ్ముడు లక్ష్మణుని తోనూ దండకారణ్యమునకు వచ్చి వనవాసము చేస్తున్నాడు. రాముని భార్య సీత, విదేహ రాజపుత్రి. భర్తను అనుసరించి వనవాసమునకు వచ్చింది.

# సుందర కాండము

కాని ఒక రోజు సీత అరణ్యములో కనపడకుండా పోయింది. తన భార్య సీతను వెదుక్కుంటూ రాముడు, రాముని తమ్ముడు లక్ష్మణుడు ఋష్యమూక పర్వతము వద్దకు వచ్చారు. వారు సుగ్రీవునితో మైత్రి చేసుకున్నారు. సీతను వెదకడానికి సాయం చేస్తానని సుగ్రీవుడు, సుగ్రీవుడు కోల్పోయిన రాజ్యము తిరిగి అతనికి ఇప్పిస్తానని రాముడు ప్రతిజ్ఞలు చేసుకున్నారు. తదుపరి రాముడు వాలిని చంపి, సుగ్రీవుని కిష్కింధకు రాజ్యాభిషిక్తుని చేసాడు. వాలి గురించి నీకు నేను వేరుగా చెప్ప పని లేదు. అటువంటి వాలిని ఒకే ఒక్క బాణంతో రాముడు చంపాడు.

సుగ్రీవుడు కూడా తాను చేసిన ప్రతిజ్ఞలో భాగంగా సీతను వెదకడానికి వానరులను నలుదిక్కులకూ పంపాడు. దక్షిణ దిశగా పంపిన వారిలో నేను ఒకడిని. నా పేరు హనుమంతుడు. నేను వాయుదేవుని కుమారుడను. నేను సీత కోసరము నూరు యోజనముల సముద్రమును దాటిలంకకు వచ్చాను. సీత లంకలో ఉన్నదని కనుక్కున్నాను. నీవే సీతను అపహరించావు అని తెలిసింది.

ఓ లంకేశ్వరా! నీవు ధర్మాధర్మములను తెలిసినవాడవు. గొప్ప తపస్సంపన్నుడవు. ఇతరుల భార్యలను నీ ఇంటిలో ఉంచుకోవడం ధర్మం కాదు. నీ వంటి ధర్మాత్ములు, బుద్ధిమంతులు ఇటువంటి అధర్మమైన పనులుచేస్తారా! తన భార్యను తీసుకు వెళితే రామునికి కోపం రాదా! రాముని, అతని తమ్ముడు లక్ష్మణుని బాణములను ఎదుర్కొనడం ఇతరులకు సాధ్యమా! రామునికి కీడు చేసి ఈ ముల్లోకములలో ఎవడూ బతకలేడు! అందుకని నా మాట విను. సీతను రాముని వద్దకు పంపు. నీవు సుఖంగా ఉండు. నేను అశోకవనములో ఉన్న సీతను

చూచాను. సీతమ్మ దర్శనం నాకు లభించింది. నేను వెళ్లి సీత లంకలో ఉన్న అశోకవనములో ఉన్నదని రామునికి చెబుతాను. తరువాత కథ రాముడే చూచుకుంటాడు.

ఓ రావణా! సీత మీద చెయ్యివేసి చాలా పొరపాటు చేసావు. రాబోయే ప్రమాదాన్ని గుర్తించలేకపోతున్నావు. దానికి ఫలితం అనుభవిస్తావు. సీతను నీ వద్ద ఉంచుకోవడం విషము కలిపిన అన్నము తినడం లాంటిది. తిని బతకడం కష్టం కదా! నీవు ఎంతో తపస్సు చేసి, అనంత ఐశ్వర్యాన్ని, దీర్ఘమైన ఆయుస్సు పొంది ఉన్నావు. దానిని నీ అధర్మ ప్రవర్తనతో నాశనం చేసుకోకు! నీవు తపస్సు చేసి దేవతల చేత, అసురుల చేతిలో మరణం లేకుండా వరం పొందాను అని అనుకుంటు న్నావు. అది సరి కాదు. సుగ్రీవుడు దేవత కానీ, అసురుడు కానీ, గంధర్వుడు కానీ, యక్షుడు కానీ కాదు. కేవలం వానరుడు. నీవు నరుల చేతిలో కానీ, వానరుల చేతిలో చావు లేదని వరం కోరలేదు. మరి సుగ్రీవుని నుండి నీ ప్రాణాలు ఎలా రక్షించుకుంటావో ఆలోచించు!

ఓ లంకేశ్వరా! నీవు ఆర్జించిన పుణ్యఫలము అనుభవించడం పూర్తి అయింది. ఇంక నీ పాపఫలము అనుభవంలోకి రానుంది. దానిని అనుభవించక తప్పదు. ఓ రావణా! నీవు చేసిన పుణ్యం కొంచెమే. పాపం ఎక్కువ. నీ పుణ్యఫలానుభం పూర్తి అయింది. ఇంక నీ పాపాల ఫలితాలను అనుభవించడానికి సిద్ధంగా ఉండు. మరొక్కమాట! జనస్థానములో 14,000 మంది రాక్షసులను ఒంటి చేత్తో రాముడు చంపడం గుర్తుకు తెచ్చుకో. మహా బలశాలి అయిన వాలిని రాముడు ఒకేఒక బాణంతో చంపడం మరిచిపోకు!

సుగ్రీవుడు, రాముడు ఒకరికొకరు సాయం చేసుకోడానికి ప్రతిజ్ఞలు చేసుకున్నారు అని గుర్తుపెట్టుకో! తరువాత నీకు ఏది మంచిదో అది చెయ్యి.

ఇంక నా సంగతి. నేను లంకలో ఏమేమి చేసానో నీకు తెలుసు. జంబుమాలి, ఐదుగురు సేనాపతులు, ఏడుగురు మంత్రి పుత్రులు నాచేతిలో మరణించారు. ఇంక సైన్యం సంగతి చెప్పనక్కరలేదు. నేను తలచుకుంటే ఈ క్షణమే లంకను నాశనం చెయ్యగలను. కానీ, రాముడు నాకు ఆ పని అప్పగించలేదు. కాబట్టి చెయ్యను. ఎందుకంటే రాముడు అందరి ముందరా శత్రువులను నాశనం చేసి, సీతను తీసుకొని వస్తాను అని ప్రతిజ్ఞచేసాడు. రాముని ప్రతిజ్ఞను భంగం చేయడం నాకు ఇష్టం లేదు.

రామునితో విరోధము పెట్టుకొని సాక్షాత్తు దేవేంద్రుడు కూడా సుఖంగా ఉండలేడు. ఇంక నీ సంగతి చెప్పాల్సిన పనిలేదు. నీవు సీతను సామాన్య స్త్రీ అనుకుంటున్నావు. కాలసర్పమును తెచ్చి లంకలో పెట్టుకున్నావు అని మర్చిపోతున్నావు. సీత రూపంలో ఉన్న కాలపాశమును నీ మెడలో తగిలించుకోకు. నీ మంత్రులతో ఆలోచించి ఏది మంచిదో అది చెయ్యి. నీవు నీ మొండి పట్టు వదలక పోతే భగభగమండే మంటలలో భస్మం అయ్యే లంకను చూస్తావు. నీ స్నేహితులు, మంత్రులు, నీ భార్యలు, అంత:పుర స్త్రీలు, బంధువులు, నీ కుమారులు, సోదరులు అందరూ నాశనం కావడం కళ్లారా చూస్తావు.

ఓ రాక్షసరాజా! నేను రాముని దూతను. కేవలం దూతను. నాకు ఎవరి మీదా కోపము ద్వేషమూ లేవు. నీకు నాలుగు మంచి

మాటలు చెబుతున్నాను. ఆలకించు.

నేను సత్యమే చెబుతున్నాను. రాముడు సృష్టి స్థితి లయ కారకుడు. ఈ సృష్టిని అంతా నాశనం చేసి మరలా సృష్టించగల సమర్థుడు. పరాక్రమములో రాముడు విష్ణువుతో సమానుడు. అటువంటి రాముని ఎదుట నిలిచి యుద్ధం చేసి గెలవగల సమర్థుడు దేవతలలో కానీ, అసురులలోగానీ, గంధర్వులలోగానీ, విద్యాధరులలో గానీ, యక్షులలోగానీ, నాగులలో కానీ లేరు.

రాముని భార్యను అపహరించి తెచ్చి నీ ఇంట ఉంచుకున్న నీవు బతకడం చాలా కష్టం. రాముడు ఎవరినైనా చంపదలచుకుంటే వానిని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కానీ, ఇంద్రుడు కానీ, ఎవరూ రక్షించలేరు. తరువాత నీ ఇష్టం." అని పలికాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఏబది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఏబది రెండవ సర్గ.

ముల్లోకములలో తనకు ఎదురు లేదు అన్న అహంకారం రావణునికి నరనరాల్లో పాకిపోయింది. అందుకని హనుమంతుడు చెప్పిన మాటలు రుచించలేదు. కనీసం వాటి గురించి ఆలోచించడానికి కూడా అతని మనసు ఒప్పుకోలేదు. పైగా రావణుని

కోపం హద్దులు దాటింది. రావణుని నోటి నుండి ఒకే మాట వెలువడింది. "ఈ వానరాన్ని చంపండి." అని ఆదేశించాడు.

రావణుని తమ్ముడు విభీషణుడు. ధర్మం తెలిసిన వాడు. రావణునికి కోపం వచ్చిందని, ఆ కోపంలో ఏమి చేస్తున్నాడో తెలియడం లేదని అనుకున్నాడు. దూతను చంపడం ధర్మవిరుద్ధమని రావణునికి ఎలా నచ్చచెప్పాలా అని ఆలోచించాడు. రావణునితో ఇలా అన్నాడు.

"ఓరాక్షసరాజా! నన్ను క్షమించు. నీ కోపము, రోషము విడిచిపెట్టు. నేను చెప్పే మాట విను. ఇతడు సుగ్రీవుడు పంపగా వచ్చిన దూత. దూతగా తన కర్తవ్యమును నిర్వర్తించాడు. ధర్మం తెలిసిన రాజులు దూతను చంపరు. అది ధర్మవిరుద్ధము. ఓ రాజా! నీకు తెలియని ధర్మము లేదు. నీకు సకల ధర్మములు తెలియును. ధర్మము తెలిసిన నీవు ఈ పని చేయకూడదు.

ఓరాజా! నీవు శాస్త్రములు చదువుకున్నావు. అందులో విషయములను ఆకళింపు చేసుకున్నావు. అన్నీ తెలిసిన నీవే కోపంలో ఇలా చేస్తే, ఇంక శాస్త్రములు చదివిన దానికి ఫలితం ఏముంటుంది, కేవలం శ్రమ తప్ప. నీవు శత్రువులను చంప వచ్చు. కానీ ఇతను నీకు శత్రువుకాడు. కేవలం దూత. ఇతను ఏమైనా తప్పుచేసి ఉంటే తగిన దండన విధించు. అంతేకాని చంపడం ఉచితం కాదు." అని అనునయంగా చెప్పాడు విభీషణుడు.

కానీ రావణుని కోపం చల్లారలేదు. కోపంతో ఇలా అన్నాడు. "విభీషణా! వీడు పాపం చేసాడు. పాపాత్ములకు సరైన శిక్ష మరణ

దండన. వీడిని చంపినందువల్ల పాపం రాదు. అధర్మం అంతకంటే కాదు. కాబట్టి వీడిని వధిస్తాను." అని తన నిశ్చయాన్ని ప్రకటించాడు.

అప్పుడు విభీషణుడు రావణునితో ఇలా అన్నాడు. "ఓ రాజా! మరలా చెబుతున్నాను. సావధానంగా విను. ఏ కాలంలో కూడా, ఏరాజ్యంలో కూడా, సత్పురుషులు అయిన రాజులు తమ వద్దకు వచ్చిన దూతలను వధించరు. ఈ వానరుడు దూతగా వచ్చాడు. కానీ కొంచెం మితిమీరి ప్రవర్తించాడు. దానికి సరి అయిన దండన విధించు.

తప్పుచేసిన దూతలకు విధించవలసిన దండనలు చాలా ఉన్నాయి. వికలాంగుడిగా చెయ్యడం, కొరడాలతో కొట్టించడం, తల గొరిగించడం, చేసిన తప్పుకు గుర్తుగా ఒంటి మీద వాతలు పెట్టడం, ఇటువంటి దండనలు విధించవచ్చును. కానీ దూతలను చంపడం మనం ఎక్కడా వినలేదు.

నీవు రాక్షస రాజువు. ధర్మము బాగా తెలిసిన వాడవు. కానీ కోపానికి వశుడైనావు. ఆ కోపంలో అధర్మానికి పాల్పడుతున్నావు. నీవంటి బుద్ధి మంతులు తమ కోపాన్ని అదుపులో పెట్టుకోవాలి కదా! ధర్మాధర్మ విచక్షణలో కానీ, లోకాచారములను పాటించడంలో కానీ, శాస్త్రవిషయములను చర్చించడంలో కానీ, ఇతరుల మనోవృత్తులను అర్థంచేసుకోడంలో కానీ, నిన్ను మించిన వాడు దేవతలలో గానీ, అసురులలో గానీ లేడు.

ఓ రాజా! నీవు అజేయుడవు. దేవతలను అసురులను ఎన్నోమార్లు జయించావు. అటువంటి వాడికి ఈ వానరము ఒక లెక్కా!

అసలు ఈ వానరమును కాదు చంపవలసినది. ఈ వానరమును నీ వద్దకు పంపిన వారిని చంపాలి. వాళ్లు చేసిన తప్పుకు వాళ్లు పంపగా వచ్చిన దూతను చంపడం ధర్మవిరుద్ధము కదా!

ఓ రాజా! దూత మంచి వాడే కావచ్చు, చెడ్డ వాడే కావచ్చు. కాని అతడు ఇతరులు పంపగా వచ్చినవాడే కానీ, తనకు తానుగా నీవద్దకు రాలేదు కదా! దూతలకు తాము అనుకున్న విధంగా చెప్పడానికి స్వతంత్రము లేదు కదా! కేవలము తనను పంపిన వారు చెప్పమన్న మాటలు చెప్పిన ఈ దూతను చంపడం ధర్మం కాదు కదా! ఈ దూత నీ ప్రతాపమును చవిచూడ తగిన వాడు కాదు. నీ ప్రతాపము ఇంద్రుని మీద, దేవతల మీద, ఈ దూతను పంపిన వారి మీద చూపించు. వీడిని తగిన విధంగా దండించి వదిలిపెట్టు.

మరొక మాట! ఇప్పుడు నీవు వీడిని చంపితే, వీడు ఏమయ్యాడో అని వీడిని పంపిన వారికి తెలియదు. అప్పుడు వాళ్లు ఇక్కడకు వచ్చే అవకాశము లేదు. నీవు వాళ్లను చంపే అవకాశము లేదు. అందుకని వీడిని వదిలిపెడితే వీడు పోయి, వీడిని ఎవరైతే నీ వద్దకు పంపారో, వాళ్లను తీసుకొని వస్తాడు. అప్పుడు నీవు వారినందరినీ చంపవచ్చు.

ఓ రాక్షసరాజా! నీవు అజేయుడవు. నిన్ను యుద్ధంలో ఓడించగల వాడు ముల్లోకములలో లేడు. అటువంటప్పుడు, వీడిని చంపడం కన్నా, వీడిని పంపిన వాళ్లతో యుద్ధం చేసి ఓడించి చంపడం వీరత్వము కదా! అదే నీ వంటి వీరుడు చేయదగిన పని. కాబట్టి వీడిని వదిలిపెట్టి, వీడిని పంపిన వారు ఇక్కడకు రావడానికి

మార్గము సుగమం చెయ్యి. నీ దగ్గర ఎంతో మంది రాక్షస వీరులు ఉన్నారు. వారిలో కొంత మందిని యుద్ధానికి పంపి ఆ రాజకుమారులను సంహరించు. వీడిని వదిలిపెట్టు." అని రావణునికి ప్రియం చేకూర్చేట్టు పలికాడు విభీషణుడు. విభీషణుని మాటలు రావణునికి నచ్చాయి.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఏబది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
ఏబది మూడవ సర్గ.

రావణుడు తనలో చెలరేగుతున్న కోపం,రోషం,కసిని కొంచెం తగ్గించుకున్నాడు. విభీషణుని మాటలు సావధానంగా విన్నాడు. కోపంలో తాను ఎంత అధర్మంగా ప్రవర్తిస్తున్నాడో అర్థం చేసుకున్నాడు.

"విభీషణా! నీవు చెప్పినది ధర్మయుక్తంగా సమంజసంగా ఉంది. దూతగా వచ్చిన వాడిని చంపడం పాపము. కానీ వీడిని వదల కూడదు. తీవ్రంగా దండించాలి. ఇతను చేసిన అపరాధములకు తగిన దండన విధించాలి. ఇతను వానరుడు. వానరులకు తోక అలంకారము. ఆ తోకను కత్తిరిస్తే వికలాంగుడు అవుతాడు. ఇతని తోకకు నిప్పు అంటించి కాల్చండి. కాలి పోయిన తోకతో ఇతనిని తరిమెయ్యండి. లంకకు వచ్చి తోక పోగొట్టుకున్న ఇతనిని ఇతని బంధువులు, మిత్రులు అవహేళన చేస్తారు. ఆ దండన చాలు. లంకలో ఉన్న వారందరికీ తెలిసే

లాగ మీరు ఈ వానరం తోకకు నిప్పు అంటించి, వీధులలో ఊరేగించండి. లంక వాసులు అందరూ ఇతనిని చూచి నవ్వుకోవాలి." అని అన్నాడు రావణుడు.

వెంటనే రాక్షసులు పాత వస్త్రములు తీసుకొని వచ్చారు. హనుమంతుని తోకకు చుట్టారు. హనుమంతుడు వాళ్లవంక అదోరకంగా చూస్తున్నాడు. హనుమంతుని తోకకు పూర్తిగా వస్త్రములు చుట్టిన తరువాత, నూనె పోసారు. హనుమంతుని తోక పూర్తిగా నూనెతోతడిసి పోయింది. రాక్షసులు హనుమంతుని తోకకు నిప్పంటించారు. హనుమంతుని తోక మొత్తం నిప్పంటుకుంది. దేదీప్యమానంగా వెలుగుతూ ఉంది. రాక్షసులు హనుమంతుని వీధుల వెంట తిప్పుతున్నారు.

తోకకు నిప్పంటుకున్న హనుమంతుని చూడడానికి లంకలో ఉన్న బాలురు, వృద్ధులు, స్త్రీలు బారులు తీర్చి మార్గమునకు ఇరువైపులా నిలబడ్డారు. హనుమంతునికి పట్టరాని కోపం వచ్చింది. తన చుట్టు ఉన్న రాక్షసుల నందరినీ కింద పడేసాడు. రాక్షసులు ఊరుకోలేదు. మరలా హనుమంతుని మీద పడి బంధించారు. హనుమంతుడు ఇలా ఆలోచించాడు.

"వీరి నందరినీ చంపడం పెద్ద సమస్య కాదు. వీరుకట్టిన కట్లు నన్ను ఆపలేవు. నేను ఈ కట్లు తెంచుకొని, ఆకాశంలోకి ఒక్కసారిగా ఎగిరి వీళ్ల మీదికి దూకి చంపగలను. నేను ఎలాగైతే రాముని ఆజ్ఞమేరకు ప్రవర్తిస్తున్నానో, వీళ్లు కూడా రావణుని ఆజ్ఞమేరకు ఇదంతా చేస్తున్నారు. వీళ్లదేం తప్పులేదు. వీళ్లు చేస్తున్న దానికి నేను

చింతించవలసిన పని లేదు. వీళ్లు నన్ను లంక అంతా తిప్పేట్టు ఉన్నారు. మొన్న రాత్రిపూట లంక అంతా తిరిగాను. లంకలో ఉన్న భవనముల సౌందర్యమును సరిగా చూడలేదు. ఈ వంకతోనైనా మరలా ఒకసారి లంక అంతా ఒకసారి చూస్తాను. తరువాత నేను చేసేది ఏదో నేను చేస్తాను. ఈ కాసేపు ఈ బంధనాలను, ఈ అగ్నిని సహించాలి తప్పదు." అని అనుకున్నాడు హనుమంతుడు. కాని తన మనసులో భావాలను బయటకు తెలియనీయకుండా వారిని కోపంతో చూస్తున్నాడు.

వారు కూడా హనుమంతుడు తమకు పట్టుబడ్డాడు అని సంతోషిస్తూ, మరలా హనుమంతుని తోకకు గుడ్డలు చుట్టి నిప్పు అంటించారు. ముందు భేరీలు, శంఖములు మోగించుకుంటూ హనుమంతుని లంక అంతా ఊరేగిస్తున్నారు. లంకలో ఉన్నవారు హనుమంతుని వింతగా చూస్తున్నారు, అశోక వనము నాశనం చేసిన వాడికి తగిన శాస్తి జరిగిందని ఆనందిస్తున్నారు. హనుమంతుడు కూడా బుద్ధిమంతుడి మాదిరి వాళ్ల వెంట లంక అంతా తిరుగు తున్నాడు. హనుమంతుడు లంక అంతా తిరుగుతూ, గొప్ప గొప్ప భవనములను, భూగృహములను, ఎత్తైన విమానములను, విశాలమైన వీధులను, ఇరుకుగా ఉన్న సందులను, గొందులను, పెద్దపెద్ద రాజమార్గములను, చిన్న చిన్న మార్గములను, చిన్న చిన్న ఇళ్లను పెద్ద పెద్ద భవంతులను ఆసక్తిగా చూచాడు.

రాక్షసులు నాలుగు మార్గముల కూడలిలో హనుమంతుని నిలబెట్టి "ఇతను ఒక శత్రుగూఢచారి. రావణుడు ఇతనికి దండన విధించాడు. ఇతని తోకకు గుడ్డటు చుట్టి, నూనె పోసి నిప్పంటించ బడింది. ఇతని తోక ఎలా కాలుతూ ఉందో చూడండి" అని పెద్దగా

అరుస్తూ తెలియజేస్తున్నారు.

రాక్షసులు అరుస్తున్న అరుపులు సీత చెవిని కూడా పడ్డాయి. సీత మనస్సు క్షోభించింది. తన వలన హనుమంతునికి ఇన్ని కష్టాలు వచ్చాయి కదా అని ఆమె మనసు ఆందోళన చెందింది. తాను ఉపాశించే అగ్నిని మనసులోనే ఆవాహన చేసుకుంది. చిన్న చిన్న పుల్లలను సేకరించి అగ్నిని వేల్చింది. దాని చుట్టూ ప్రదక్షిణ చేస్తూ హనుమంతుని క్షేమం కోరుతూ సీత నిర్మలమైన మనస్సుతో అగ్నిని ప్రార్థించింది.

“ఓ అగ్నిదేవా! నీకు నమస్కారము. నేను త్రికరణ శుద్ధిగా నా పతికి అనునిత్యమూ సేవచేసినదానను అయితే, నేను పతివ్రతను అయితే, నేను ఏమైనా తపస్సుచేసి ఉంటే, వాటి మహిమ వలన హనుమంతునికి నీ వేడి సోకనీయకు. హనుమంతుని చల్లగా కరుణించు. త్రిలోక పూజ్యుడు దయామయుడు అయిన రామునకు నా మీద కరుణ దయ ఉంటే, హనుమంతుని తోకకు అంటించిన అగ్ని చల్లగా తగులుతుంది. నేను సత్ప్రవర్తనతో నా రాముని చూడడానికి కలవడానికి ఉత్సాహపడుతున్నాను అని రాముడు విశ్వసిస్తే, హనుమంతుని దేహమునకు సోకిన అగ్ని అతనిని కాల్చకుండుగాక! ఓ అగ్నీ! నీవు హనుమంతునికి ఏ హానీ చెయ్యకు. ” అని మనస్ఫూర్తిగా వేడుకుంది.

అగ్నిదేవుడు సీత చేసిన ప్రార్థనను మన్నించాడు అన్న విషయం తెలుపడానికే అన్నట్టు సీత వేల్చిన అగ్ని జ్వాలలు సీతతో పాటు ఆమెను తాకుతున్నట్టు ప్రదక్షిన పూర్వకంగా తిరిగాయి. హనుమంతుని

తండ్రి వాయుదేవుడు కూడా, తన కుమారునికి ఏ హానీ జరగకుండా అగ్నికి తోడైనాడు. చల్లగా వీస్తున్నాడు. అక్కడ హనుమంతునికి తోక భగభగ మండుతున్నా చీమ కుట్టినట్టు కూడా లేదు.

"ఏమిటి ఇది! నా తోక ఇలా కాలుతున్నా నాకు అగ్ని సెగ కూడా తగలడం లేదు! ఇది ఏమి విచిత్రము. అగ్ని జ్వాలలుమాత్రము భయంకరంగా ప్రజ్వరిల్లుతున్నాయి. కాని నా తోక మీద మంచు ముద్దలుపెట్టినట్టు చల్లగా ఉంది. నేను సముద్రమును దాటు తున్నప్పుడు రాముని మీద ఉన్న గౌరవం వలన  సముద్రుడు, మైనాకుడు నాకు సాయం చేయడానికి ముందుకు వచ్చారు కదా! ఇప్పుడు అగ్ని కూడా రాముని మీద ఉన్న గౌరవంతో నాకు సాయం చేస్తున్నాడేమో! అందుకే నాకు అగ్ని వలన పుట్టే వేడి సోకడం లేదు. అంతే కాదు, సీతాదేవి పాతివ్రత్య మహిమ వలననూ, రాముని తేజస్సుచేతనూ, నా తండ్రి వాయుదేవునితో అగ్నికి ఉన్న స్నేహము చేతనూ, అగ్ని నన్ను చల్లగా చూస్తున్నాడు. కాబట్టి నేను నా ఇష్టం వచ్చినట్టు చెయ్యవచ్చు." అని మనసులో అనుకున్నాడు.

అప్పటికి హనుమంతుని ఊరేగింపు నగర ద్వారము వద్దకు చేరుకుంది.  అనుకున్నదే తడవుగా హనుమంతుడు ఆ రాక్షసుల మధ్యలో నుండి పైకి ఎగిరాడు. పెద్దగా అరిచాడు. నగర ద్వారము ఎక్కి కూర్చున్నాడు.  ఒక్కసారిగా చిన్నవాడుగా మారాడు. అప్పుడు హనుమంతునికి కట్లు అన్నీ వదులు అయ్యాయి. వాటిని విదిల్చుకున్నాడు. మరలా తన శరీరమును పెంచాడు.  నగర ద్వారమునకు అమర్చిన పరిఘను ఊడపీకాడు. దానిని చేతిలో పట్టుకొని రాక్షసుల మధ్యకు దూకాడు. ఆ పరిఘతో వాళ్లను

చితకబాదాడు. మండుతున్న తోకతో హనుమంతుడు మరలా లంక వైపుకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఏబది మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
ఏబది నాలుగవ సర్గ.

తన తోకకు నిప్పంటించి లంకా పట్టణము అంతా ఊరేగించి సంతోషించారు రాక్షసులు. మరి తను ఏమి చేస్తే వారు దు:ఖిస్తారోఅని ఆలోచిస్తున్నాడు హనుమంతుడు. ఇప్పటి దాకా అశోక వనమును నాశనం చేసాడు. రాక్షసులను చంపాడు. చాలా భాగం రావణ సైన్యాన్ని నాశనం చేసాడు. సైన్యాధిపతులను, మంత్రి కుమారులను చంపాడు. దానికి ప్రతీకారంగా రాక్షసులు తన తోకకు నిప్పంటించారు కాబట్టి తాను కూడా లంకకు నిప్పంటిస్తే దెబ్బకు దెబ్బ సరిపోతుంది కదా అని అనుకున్నాడు. అదీ కాకుండా తాను ఇప్పుడు లంకను నాశనం చేస్తే తరువాత రాముని పని సులభం అవుతుంది కదా అని ఆలోచించాడు హనుమంతుడు. అగ్ని దేవునికి నా తోకను కాల్చడంతో తృప్తి చెందినట్టు లేదు. ఈ లంకా నగరమును దహించి అగ్నిదేవునికి సంతర్పణ చేస్తే అగ్ని దేవుడు తృప్తి పడతాడు అని అనుకున్నాడు హనుమంతుడు.

అనుకోవడమే ఆలస్యం హనుమంతుడు లంకా నగరంలో ఉన్న పెద్ద పెద్ద భవనాల మీదికి ఉరికాడు. ఒక్కొక్క భవనానికి నిప్పు అంటించడం మొదలెట్టాడు. ఒక భవనం మీది నుండి మరొక భవనం మీదికి దూకుతూ అన్ని భవనములకు నిప్పంటిస్తున్నాడు. హనుమంతుడు దేనినీ వదిలిపెట్టలేదు. చిన్న, పెద్ద భవనములను అన్నిటినీ తగులబెట్టాడు. ఉద్యానవనములను అందులో భవనములను కూడా కాల్చాడు. దారిలో రావణుని మంత్రి ప్రహస్తుని గృహము కనపడింది. పనిలో పనిగా దానికి కూడా నిప్పు అంటించాడు. ఆ గృహము మీది నుండి మహాపార్శ్వుడి గృహము మీదికి దుమికాడు. దానికి కూడా  నిప్పుపెట్టాడు. పక్కపక్కనేఉన్న వజ్రదంష్ట్రుడు, శుకుడు, సారణుడు మొదలగు వారి గృహములకుకూడా నిప్పంటించాడు. తరువాత హనుమంతుడు ఇంద్రజిత్తు, జంబుమాలి, సుమాలి గృహములను కూడా దహించాడు.

హనుమంతుడు ఒక్క విభీషణుని గృహమును మాత్రము వదిలిపెట్టాడు. మిగిలిన గృహములను అన్నిటినీ పరశురామ ప్రీతి చేసాడు.  ఒకదాని నుండి మరొక దానికి అగ్ని పాకిపోతూ ఉంది. లంకానగరము అంతా తగలబడి పోతూ ఉంది.  అందులో రశ్మికేతువు, సూర్యశత్రువు, హ్రస్వకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, విద్యుజ్జిహ్వుడు, హస్తిముఖుడు,కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు, కుంభకర్ణుడు, మకరాక్షుడు, యజ్ఞశత్రువు, బ్రహ్మశత్రువు, నరాంతకుడు, కుంభుడు, నికుంభుడు, మొదలగు రాక్షసుల భవనములు అన్నిటినీ ఒక్కటీ వదలకుండా కాల్చాడు హనుమంతుడు. పొరపాటున ఏ ఒక్క భవనమునకు నిప్పు అంటుకోకున్నా, పనికట్టుకొని పోయి ఆ భవనమును కూడా కాల్చి

వచ్చాడు హనుమంతుడు.

ఒక్క రాక్షస ప్రముఖుల గృహములే కాదు, లంకలో ఉన్న పురప్రముఖుల ఇండ్లు కూడా తగలబెట్టాడు హనుమంతుడు. లంకలో ఉన్న సంపన్నులగృహములలో ఉన్న సకల సంపదలు అగ్నికి ఆహుతి అయ్యాయి. ఆఖరున హనుమంతుడు రావణుని గృహము చేరుకున్నాడు. అది ఒక్కటే మిగిలి ఉంది. హనుమంతుడు రత్నశోభితమైన రావణుని గృహమునకు కూడా నిప్పంటించాడు. అగ్నికి వాయువు కూడా తోడవడం వల్ల రావణుని గృహమును దహించు అగ్నికీలలు నలుదిక్కులకు తీవ్రంగా, అతి వేగంగా వ్యాపించాయి. రావణుని గృహముతో సహా లంక అంతా తగులబడి పోతూ ఉంది. హనుమంతుడు కొన్ని గృహములకు నిప్పంటిస్తే, గాలి బలంగా వీచడం వల్ల ఆ అగ్ని మిగిలిన గృహములకు కూడా వ్యాపించింది. ఛటఛటధ్వనులతో ఆ గృహములు కాలిపోతున్నాయి. ఎత్తైన భవనములు నిలువునా కూలిపోతున్నాయి. ఆ భవనముల నుండి వ్యాపించిన మంటలలో ఎగురుతున్న ద్వారములు, కిటికీలు దూరంగా పడుతున్నాయి. అవి పడ్డచోట కూడా మంటలు వ్యాపిస్తున్నాయి.

లంకానగర వాసులు తమ తమ విలువైన వస్తువులు కాపాడుకోడంలో సతమతమవుతున్నారు. అటుఇటు పరుగెడుతున్నారు. “ఈ వానరము ఎక్కడనుండో వచ్చి అగ్నిదేవుడి రూపంలో మన లంకను తగులబెట్టింది కదా! ” అని వాపోతున్నారు. బిగ్గరగా ఏడుస్తున్నారు. తలలు బాదుకుంటున్నారు. కొందరుస్త్రీలు చంటి బిడ్డలను కాపాడుకుంటూ అటు ఇటు పరుగులెడుతున్నారు. కొందరు మేడల మీదినుండి కిందికి దుముకుతున్నారు. కాలి పోయిన

భవనముల నుండి ఆ భవనములకు పొదిగిన మణులు, బంగారము, కరిగి కారిపోతూ ఉంది. అలా లంకానగరమును దహిస్తూ హనుమంతుడు అపర రుద్రుని వలె ప్రకాశించాడు.

హనుమంతుడు అంటించిన అగ్ని పెద్ద పెట్టున లంకను దహిస్తూ, ఆ అగ్ని జ్వాలలు పైపైకి ఎగిసిపడుతూ ఉన్నాయి. ఆ అగ్ని జ్వాలలో పడి కాలిపోతున్న రాక్షసుల దేహముల నుండి స్రవించు ద్రవములు ఆజ్యము మాదిరి మంటలను ప్రజ్వరిల్లజేస్తున్నాయి. భవనములు కాలిపోతున్నప్పుడు వెలువడుతున్న ఛటఛటధ్వనులు పిడుగులు పడ్డట్టు ధ్వనిస్తున్నాయి. "వీడు సామాన్యవానరుడు కాడు. రావణుని మీద పగ తీర్చుకోడానికి వచ్చిన కుబేరుడో,యముడో, దేవేంద్రుడో, రుద్రుడో, సూర్యుడో, లేక సాక్షాత్తు కాలపురుషుడో అయి ఉంటాడు. లేకపోతే ఇంత విధ్వంసము ఎందుకు సృష్టిస్తాడు" అని పరి పరి విధములుగా అనుకుంటున్నారు లంకలో ఉన్న రాక్షసులు. మరి కొందరైతే "రావణునికి వరములు ఇచ్చిన బ్రహ్మదేవుడే రాక్షస సంహారమునకు ఈ వానర రూపంలో వచ్చాడా!" అని అనుకొన్నారు. "కాదు కాదు. ఇది విష్ణు తేజము. వానర రూపంలో వచ్చి లంకను నాశనం చేసింది. రాక్షసుల మీద పగ తీర్చుకొంది." అని మరికొందరు అభిప్రాయపడ్డారు.

లంకానగరము అంతా దైన్యముతో శోకిస్తూ ఉంది. భయంతో వణికిపోతూ ఉంది. కొంత మంది తమ కుమారులను, కుమార్తెలను వెదుక్కుంటూ ఏడుస్తుంటే మరి కొందరు తమ తమ సోదరులను, బంధువులను, తల్లి తండ్రులను, మిత్రులను వెతుక్కుంటూ వారు కనపడకపోతే గుండెలు పగిలేట్టు ఏడుస్తున్నారు.

అగ్నికి ఆహుతి అయిన లంకా నగరము ఎవరో ఒక మహాపురుషుని శాపము తగిలి నాశనం అయినట్టు కనపడుతూ ఉంది. హనుమంతుడు త్రికూట పర్వతము మీద నిలబడి తాను చేసిన నిర్వాహకమును పరిశీలిస్తున్నాడు. హనుమంతుని తోక ఇంకా మంటలు విరజిమ్ముతూనే ఉంది. హనుమంతునిచే దహింపబడిన లంకానగరమును చూచి దేవతలు, అసురులు, గంధర్వులు సంతోషించారు. తమ శత్రువుకు తగిన శాస్తి జరిగిందని సంబరపడ్డారు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఏబది నాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఏబది ఐదవ సర్గ.

తన కళ్లముందు సమూలంగా దహించుకు పోతున్న లంకానగరాన్ని చూచాడు హనుమంతుడు. హనుమంతునికి మనసులో ఒక ఆలోచన దానితో పాటు భయం మెదిలాయి.

“ తనకు జరిగిన అవమానానికి లంకను, లంకలోని ప్రజలను నాశనం చెయ్యడం అవసరమా! రామ కార్యంలో అది భాగం కాదే! మరి తను ఎందుకు లంకను కాల్చినట్టు? తనలో పుట్టిన కోపానికి ఇంత సుందరమైన లంకానగరము బూడిద కుప్ప అయిపోవాలా!

కోపాన్ని అణచుకున్న వాడే బుద్ధికలవాడు. ధన్యుడు. కోపంలో మనిషి ఎంతటి పాపకార్యమైనా చేస్తాడు. ఆఖరుకు పెద్దలను కూడా ఆ కోపంలో చంపడానికి వెనుకాడడు. కోపావేశంలో నరులు ఎంతటి గొప్పవారినైనా పరుషమైన మాటలతో దూషిస్తారు. కోపం ఎక్కువ అయితే నోటికి ఏం మాట వస్తుందో తెలియదు. ఏ మాట మాట్లాడాలో ఏ మాట మాట్లాడకూడదో తెలియదు. ఇష్టం వచ్చినట్టు వాగుతారు. కోపంలో ఉన్న వాడికి చేయకూడని పని, అనకూడని మాట, అంటూ లేదు. అన్ని పనులు తగుదునమ్మాఅని చేసేస్తాడు.

సర్పము తన కుబుసమును విడిచిపెట్టినట్టు, మంచి వారు తమ కోపమును వెంటనే వదిలేస్తారు. ఎదుటి వారు ఏమన్నా ఓర్పుతో సహిస్తారు. ఆ ఓర్పు నాకు లేకుండా పోయింది. రాక్షసులు నా తోకకు నిప్పంటించినంత మాత్రాన నేను లంకను మొత్తం తగులబెట్టాలా! నా వంటి సిగ్గులేని వాడు, దుర్బుద్ధి మరొకడు ఉండడు. నేను నా ప్రభువు రామునికి ద్రోహం చేసాను. ఈ లంకలోనే సీత ఉన్నది అన్న విషయం మరిచి లంకను మొత్తం తగులబెట్టాను. లంక మొత్తం తగులబడి పోయిన తరువాత సీత మాత్రం బతికి ఉంటుందా! ఈ ఒక్క పనితో రామ కార్యము మొత్తం చెడిపోయింది. నా శ్రమ అంతా సర్వనాశనం అయింది. ఎవరి కోసరం నేను నూరు యోజనముల దూరం ఎగిరి వచ్చి నానా కష్టాలు పడి, తుదకు సీతను చూచానో, ఆ సీత నా కోపాగ్నికి ఆహుతి అయిపోయింది. . నేను పడ్డ కష్టం అంతా బూడిదలో పోసిన పన్నీరు అయింది. లంక తగులబడే టప్పుడు సీతను రక్షించాలి అన్న బుద్ధికూడా నాకు లేదు. నేను ఎంత మందమతిని.

సీతను చూడ్డంతోనూ, సీత నుంచి చూడామణిని తీసుకోడంతోనూ నేను వచ్చిన కార్యము పూర్తి అయింది. బుద్ధిగా కిష్కింధకు తిరిగి వెళ్లకుండా, అశోకవనమును నాశనం చెయ్యడం ఎందుకు చేసినట్టు? రాక్షసులను చంపడం ఎందుకు? లంకను తగలబెట్టడం ఎందుకు? లంక అంతా పూర్తిగా కాలిపోయింది. ఇందరు మరణించినపుడు సీత మాత్రం ఎందుకు బతికిఉంటుంది. లంకలో సీత లేనపుడు నేను పోయి సీతను చూచాను అని రాముడికి చెప్పడం ఎందుకు? నేను కూడా ఇక్కడే ప్రాణాలు విడుస్తాను. నాకు ఇదే తగిన శిక్ష.

చావాలంటే ఏం చెయ్యాలి? లంకానగరాన్ని దహిస్తున్న మంటలలో దూకాలా? లేక సముద్రంలో దూకాలా? మొత్తం రామ కార్యమును నాశనం చేసిన తరువాత రామునికి సుగ్రీవునికి నా మొహం ఎలా చూపించాలి? ఏమని చెప్పాలి? నేను రామ కార్యము మీద వచ్చాను అన్న విషయం మరిచి వానరులకు సహజమైన చాపల్యంతో ప్రవర్తించాను. ఎప్పుడూ సత్త్వగుణంతో ఉండే నేను ఇలా రాజస గుణంతో ఎందుకు ప్రవర్తించాను. రాజసము మనసును అదుపులో ఉండనీయదు. చపలత్వమును కలుగజేస్తుంది. ఈ రాజస ప్రవృత్తి వల్లనే లంకను తగులపెట్టాను. కనీసం లంక తగల బటేటప్పుడన్నా సీతను రక్షించాలి అన్న ఆలోచన నాకు రాలేదు. ఇదంతా ఈ రాజస ప్రవృత్తి ప్రభావం కదా!

సీత ఈ లోకంలో లేది అని తెలిస్తే రాముడు మరణిస్తాడు. రాముడు లేనిదే లక్ష్మణుడు ప్రాణాలతో ఉండడు. వీరి మరణం చూచి సుగ్రీవుడుకూడా ప్రాణత్యాగము చేస్తాడు. ఈ వార్త విన్న భరత

శత్రుఘ్నులు కూడా ఆ బాధను తట్టుకోలేక చనిపోతారు. రాజులేని అయోధ్య కిష్కింధ అనాధలవుతాయి. ఇంత వినాశనమునకు నేను కారణము. కేవలం నా లో ఉన్న కోపము, రోషము నా చేత ఇంతపని చేయించింది." అని శోకిస్తున్నాడు హనుమంతుడు.

ఇంతలో హనుమంతుని మనస్సులో ఒక ఊహ మెదిలింది. " నా పిచ్చి గానీ, సీత అయోనిజ. ఆమె అగ్ని స్వరూపము. అగ్నిని అగ్ని కాల్చగలదా? రాముని భార్య, మహా పతివ్రత అయిన సీతను కాల్చే ధైర్యము అగ్నికి ఉంటుందా! నా తోకకు అంటుకున్న అగ్ని నన్నే కాల్చలేదంటే అది అంతా రాముని ప్రభావము, సీత పాతివ్రత్య మహాత్మ్యము. నన్ను కాదు కదా, కనీసం నా తోకనే కాల్చలేని అగ్ని సీతను కాలుస్తుందా. మహాతపస్వి, సత్యవ్రతమును, పాతివ్రత్యమును పాటించు సీతను అగ్ని కాల్చలేదు. ఇది సత్యం."అని తనలో తాను ఊరట చెందుతున్నాడు హనుమంతుడు.

ఇంతలో ఈ లంకా దహనము కార్యక్రమమును పైనుండి చూస్తున్న చారణులు ఈ విధంగా అనుకోవడం హనుమంతుని చెవిని పడింది. "హనుమంతుని చేత దహింపబడిన లంక సర్వనాశనము అయింది కానీ సీత మాత్రం క్షేమంగా ఉంది. ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది కదూ!" అని తమలో తాము అనుకుంటున్నారు. ఆ మాటలు విన్న హనుమంతుని మనస్సు ఊరట చెందింది. వెంటనే సీతను చూడ టానికి అశోకవనమునకు వెళ్లాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఏబది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

ఏబది ఆరవ సర్గ.

అశోకవనములో శింశుపా వృక్షము కింద క్షేమంగా కూర్చుని ఉన్న సీతను చూచాడు హనుమంతుడు. సీతకు నమస్కరించి "అమ్మా! దైవవశాత్తు నీవు క్షేమంగా ఉన్నావు. నిన్ను ఏ అపాయమూ లేకుండా చూడగలిగాను. నాకు చాలా సంతోషంగా ఉంది. తమరు అనుజ్ఞ ఇస్తే ఇంక నేను కిష్కింధకు వెళతాను." అని పలికాడు హనుమంతుడు.

సీత మరలా తాను హనుమంతుని చూడగలిగాను అన్న సంతోషంతో ఇలా పలికింది. "రామ కార్యమును సాధించడానికి నీవు ఒక్కడివే సమర్థుడివి అన్న విషయం ఋజువు అయింది. నీ బలపరాక్రమములు మిక్కిలి ప్రశంసనీయములు. రాముడు ఇక్కడకు వచ్చి నన్ను తీసుకొని వెళితేనే బాగుంటుంది. రాముడు ఆ కార్యము నెరవేర్చుటకు నీవు తగినట్టు సాయము చేయుము." అని పలికింది సీత.

"అమ్మా! సీతాదేవీ! రాముడు వానర సేనలతో వచ్చి, రావణుని వధించి నిన్ను అయోధ్యకు తీసుకొని వెళ్లేరోజు త్వరలోనే రానుంది. నీ శోకము తీరే సమయము ఆసన్నమయింది. ఇంక నేను వెళ్లి వస్తాను." అని సీతకు నమస్కరించాడు.

అక్కడి నుండి బయలు దేరి హనుమంతుడు ఒక పెద్ద పర్వతశిఖరమును ఎక్కాడు. తన దేహమును విపరీతంగా పెంచాడు. ఎదురుగా అలలతో పోటెత్తిన సముద్రాన్ని చూచాడు. ఉత్తర దిక్కుగా తిరిగి ఒక్కసారిగా తన శరీరాన్ని గాలిలోకి లేపాడు. రెండు చేతులు ముందుకు చాచి పైకి ఎగిరాడు. హనుమంతుడు తన పాదాలను ఆ పర్వతశిఖరము మీద తన్ని పెట్టి పైకి ఎగిరాడు.

హనుమంతుని పాదఘట్టనలకు పర్వతశిఖరము మీద ఉన్న పెద్ద పెద్ద రాళ్లు నుగ్గు నుగ్గు అయ్యాయి. వృక్షములు అటు ఇటా ఊగుతూ కూకటి వేళ్లతో సహా పెకలింపబడ్డాయి. ఆ పర్వతము మీద ఉన్న జంతువులు కకావికలై పరుగులెత్తాయి. ఆ పర్వతము మీద నివసించుచున్న పెద్ద పెద్ద సర్పములు హనుమంతుని పాదఘట్టనలకు జారిన, దొర్లిన రాళ్లు, బండలకింద పడి నలిగిపోయాయి. అంతకన్నా పెద్ద విచిత్రము ఏమంటే హనుమంతుడు ఎక్కిన పర్వతము హనుమంతుని పాదాల తాకిడికి తట్టుకోలేక భూమిలోకి కుంగి పోయింది. నేలమట్టము అయింది. అంతకు ముందు అక్కడ ఒక పెద్ద పర్వతము ఉన్నదా అనే సందేహము కలిగింది. ఆ ప్రకారంగా హనుమంతుడు సముద్రమును లంఘించడానికి పైకి ఎగిరాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఏబది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

సుందర కాండము

ఏబది ఏడవ సర్గ.

వాయుదేవుని పుత్రుడు అయిన హనుమంతుడు ఆ మహా సముద్రమును అవలీలగా దాటాడు. హనుమంతుడు ఆకాశంలో సముద్రము మీద ఎగురుతుంటే చూచేవాళ్లకు అతడు ఆకాశమును మింగుతున్నాడా అన్న అనుభూతి కలిగింది. ఆ ప్రకారంగా హనుమంతుడు మేఘముల పంక్తులను దాటుకుంటూ వెళుతున్నాడు. హనుమంతుడు కాసేపు మేఘాల చాటుకు వెళుతూ మరలా బయటకు వస్తూ వాయువేగంతో మేఘాల గుండా ప్రయాణం చేస్తున్నాడు. ఆ ప్రకారంగా ఎగురుతున్న హనుమంతుడు మేఘాల మధ్య దోబూచులాడే చంద్రుడి మాదిరి ప్రకాశిస్తున్నాడు. హనుమంతుడు మేఘాలను చీల్చుకుంటూ, పెద్దగా అరుస్తూ వెళు తుంటే, ఉరుముతున్న ఆకాశంలో గరుడుడు ఎగురుతూ వెళుతున్నాడా అన్నట్టు ఉంది.

హనుమంతుడు దారిలో తన కోసరము ఎదురుచూస్తున్న మైనాక పర్వత శిఖరమును తన చేతితో స్నేహపూర్వకముగా తాకి, మరలా విల్లు నుండి వెలువడిన బాణము వలే మహా వేగముతో తన ప్రయాణమును కొనసాగించాడు. అలా ఎగురుతూ హనుమంతుడు సముద్రమునకు ఆవల ఒడ్డున ఉన్న మహేంద్రగిరిని సమీపించాడు. తన వాళ్ల దగ్గరకు వచ్చాను అన్న సంతోషంతో హనుమంతుడు సింహనాదము చేసాడు. తన మిత్రులను చూడబోతున్నాను అన్న సంతోషంతో తన తోకను చిత్రవిచిత్రంగా తిప్పుతూ పెద్ద పెద్దగా అరుస్తున్నాడు.

హనుమంతుని అరుపులకు ఆకాశము బద్దలయిందా అన్నట్టుంది. హనుమంతుని రాకకోసరం అంగదుడు, జాంబవంతుడు మొదలగు వానరములు, భల్లూకములు ఎదురుచూస్తున్నాయి. వారికి ఒక్కసారిగా ఆకాశము బద్దలయిందా అన్నంత ధ్వని, గాలి వేగమునకు ఊగుతున్న చెట్లు హనుమంతుడు ఎగురుతుంటే వచ్చే భయంకర శబ్దము వినపడ్డాయి. తర్వాత హనుమంతుడు పెద్దగా అరుస్తున్న అరుపులు వినబడ్డాయి. అప్పటి దాకా వారికి హనుమంతుని గూర్చి వార్త ఏమీ తెలియలేదు. హనుమంతుడు లంకకు చేరాడా, సీతను చూచాడా అని వారిలో వారు తర్కించుకుంటున్నారు.

ఇంతలో హనుమంతుని రాకకు గుర్తుగా గాలి వేగము, ఒత్తిడి, హనుమంతుని అరుపులు వినపడ్డాయి. అప్పుడు జాంబవంతుడు మిగిలిన వానరములను చూచి మిక్కిలి సంతోషముతో ఇలా అన్నాడు. “ఓ వానర శ్రేష్టులారా! హనుమంతుడు రామ కార్యము సఫలము చేసుకొని వస్తున్నాడు. హనుమంతుడు సీతను చూడనిచో ఇంత ఆనందంగా కేరింతలుకొట్టడు.” అని అన్నాడు.

ఆ మాటలు విన్న వానరులు ఆనందంతో కేరింతలు కొట్టారు. గంతులు వేసారు. హనుమంతుని చూడవలెనని కోరికతో కొంత మంది ఎత్తైన చెట్లనుఎక్కారు. మరి కొంత మంది కొండలను గుట్టలను ఎక్కారు. చెట్లమీద ఎక్కినవారు, ఆ సంతోషంలో చెట్లకొమ్మలను పట్టుకొని గబా గబా ఊపుతున్నారు. అప్పుడు ఆకాశంలో గంభీరమైన ధ్వని వినపడింది. నల్లని మేఘము కదిలి వస్తున్న చప్పుడు అయింది. హనుమంతుడు ఆకాశము నుండి కిందికి దిగి మహేంద్ర

పర్వతము శిఖరము మీద దిగాడు. హనుమంతుని చూచి వానరులందరూ దోసిలి పట్టుకొని నిలబడ్డారు. హనుమంతుడు సీతను చూచిన సంతోషముతో ఆనందంతో పొంగిపోతున్నాడు.

హనుమంతుని కొరకు వేచి ఉన్న వానరులు గబా గబా హనుమంతుని చుట్టు చేరారు. హనుమంతుని చూచి వారందరూ ఆనందంతో గంతులు వేసారు. కొంత మంది ఫలములను, కంద మూలములను హనుమంతునికి ఇచ్చారు. హనుమంతుడు తన కన్నా పెద్ద వారైన జాంబవంతుడు మొదలగు వానరులకు, యువరాజు అంగదునకు నమస్కరించాడు.

అప్పుడు హనుమంతుడు వారితో ఒకే మాట అన్నాడు. "సీతచూడబడినది" ("దృష్టాసీతేతి".) ఆ మాట విన్న వానరులు ఆనందోత్సాహాలతో ఓలలాడారు. హనుమంతుడు అంగదుని చేయి పట్టుకొని ఒక రాతి మీద కూర్చున్నాడు. మిగిలిన వానరులు వాళ్ల చుట్టు నిలబడ్డారు. అప్పుడు హనుమంతుడు వారితో ఇలా అన్నాడు.

"అశోక వనములో ఉన్న జనకుని కూతురు అయిన సీతను నేను చూచాను. ఆమె కేశ సంస్కారము లేకుండా దీనంగా ఉంది. ఉపవాసములతో ఆమె శరీరం చిక్కిపోయింది. ఆమె మలినమైన వస్త్రములు ధరించి ఉంది. ఆమె చుట్టు రాక్షస స్త్రీలు కూర్చుని ఆమెకు కాపలాగా ఉన్నారు. సీత ఎప్పుడూ రాముని గురించి ఆలోచిస్తూ రాముని చూడవలెనని ఆతురతగా ఉంది." అని పలికాడు హనుమంతుడు.

వానరులందరికీ "సీతను చూచాను" అన్న మాటలు కర్ణపేయంగా వినిపించాయి. కొందరు సింహనాదం చేసారు. మరి కొంత మంది గర్జించారు. మరి కొంత మంది కిచ కిచ మంటూ అరుస్తున్నారు. మరి కొందరు తమ తమ తోకలను పైకెత్తి ఆడిస్తున్నారు. మరి కొంత మంది అక్కడ ఉన్న కొండలను గుట్టలను ఎక్కి కిందికి దుముకుతున్నారు. వారి ఆనందాన్ని ఆ వానరులు రకరకాలుగా వ్యక్తపరుస్తున్నారు. సీతను చూచిన హనుమంతుని వారు అలా అలా తాకి ఆనందిస్తున్నారు. అప్పుడు అంగదుడు హనుమంతునితో ఇలా అన్నాడు.

"ఓ హనుమా! నీ వంటి బలవంతుడు, ధైర్యవంతుడు, పరాక్రమవంతుడు ముల్లోకములలో లేడు. నీవు కాబట్టి నూరు యోజనముల దూరముకల సముద్రమును దాటి లంకకు వెళ్లగలిగావు. నీ ప్రభుభక్తి ప్రశంసనీయము. నీ శక్తి అమోఘము. మా అందరి అదృష్టము కొద్దీ నీవు రాముని భార్య సీతను చూచావు. మా అందరి ప్రాణములను రక్షించావు. రాముని శోకమును పోగొట్టావు. " అని అన్నాడు.

ఆ మాటలకు మిగిలిన వానరులు అందరూ వారి ఇద్దరి చుట్టుచేరి వారిని శ్లాఘించారు. వారందరూ హనుమంతుడు, అంగదుడు, జాంబవంతుని చుట్టు కూర్చుని, హనుమంతుడు సముద్రమును ఎలా దాటాడు, లంకను ఎలా చేరాడు, లంకలో ఏమేమి చేసాడు అనే విషయములను వినడానికి చాలా కుతూహలంగా ఉన్నారు.  వానరులందరూచుట్టు కూర్చుని ఉండగా

అంగదుడు దేవతలు మధ్యఉన్న ఇంద్రుని వలె ప్రకాశించాడు. హనుమంతుడు కూర్చుని ఉన్న ప్రదేశము కూడా అతని కీర్తితో ప్రకాశించింది.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఏబది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
ఏబది ఎనిమిదవ సర్గ.

వారందరిలోకీ పెద్దవాడు అయిన జాంబవంతుడు లేచి హనుమతో ఇలా అన్నాడు. "హనుమా! నీవు సీతను వెదుకుతూ బయలు దేరావు కదా! అప్పటి నుండి ఇప్పటి దాకా ఏమేమి జరిగిందో విపులంగా చెప్పు. నీవు సీతాదేవిని ఎలా చూచావు? సీత లంకలో ఎపక్కడ ఉంది? ఎలా ఉంది? రావణుడు ఆమె పట్ల ఎలా ప్రవర్తిస్తున్నాడు? ఈ విషయములు అన్నీ ఉన్నది ఉన్నట్టు చెప్పు. తరువాత మనము ఏమి చెయ్యాలో నిర్ణయించుకుందాము. మనము కిష్కింధకు వెళ్లిన తరువాత సుగ్రీవునికి ఏయే విషయాలుచెప్పాలి. ఏయే విషయాలు దాచి పెట్టాలి అన్న విషయం కూడా బుద్ధిమంతుడివి అయిన నీవు మాకు తెలియజేయాలి. " అని అన్నాడు జాంబవంతుడు.

ఆ మాటలు విన్న హనుమంతుడి ఒళ్లు పులకరించింది. తన మనసులోనే రామునికి సీతకు నమస్కరించాడు. వారందరితో

ఇలా అన్నాడు.

"నేను మహేంద్రపర్వతము మీది నుండి మీ అందరి ఎదుటనే ఆకాశంలోకి ఎగిరాను కదా! నాకు దారిలో ఒక ఆటంకము ఏర్పడింది. సముద్రము లోనుండి ఒక పర్వత శిఖరము పైకి లేచింది. నాకు అడ్డుగా వచ్చిన ఆ పర్వత శిఖరమును నేను బద్దలు కొట్టాలి అని అనుకున్నాను. నేను నా తోకతో ఆ పర్వత శిఖరమును కొట్టాను. ఆ పర్వత శిఖరము ముక్కలైపోయింది. ఆ పర్వతము మానవ వాక్కులతో ఇలా అంది.

"పుత్రా! నా పేరు మైనాకుడు. నేను నీ తండ్రి వాయుదేవునికి స్నేహితుడను. నేను నీ తండ్రికి సోదరుడి వంటి వాడిని. నేను సముద్రగర్భంలో ఉంటాను. ఇంతకు ముందు భూమి మీద ఉన్న పర్వతములకు రెక్కలు ఉండేవి. ఆ పర్వతములు ఆకాశంలో ఎగురుతూ ఉంటే, అవి ఎక్కడ తమ మీద పడతాయో అని ప్రజలు తల్లడిల్లిపోయేవారు. అందుకని ఇంద్రుడు తన వజ్రాయుధములో పర్వతముల రెక్కలను ఖండించాడు. ఆ సమయంలో ఆకాశంలో తిరుగుతున్న నన్ను నీ తండ్రి వాయుదేవుడు ఎగురగొట్టి ఈ సముద్ర గర్భంలో పడేశాడు. అందుకని ఇంద్రుడు నా రెక్కలు ఖండించలేక పోయాడు. అలా నేను రక్షింపబడ్డాను. నీవు రామ కార్యము మీద వెళు తున్నావు. నేను కూడా రామునికి సాయం చెయ్యాలని అనుకుంటున్నాను. రామ కార్యము మీద వెళ్లే నీవు నా శిఖరము మీద కాసేపు విశ్రాంతి తీసుకొని నా ఆతిథ్యము స్వీకరించి వెళ్లు." అని పలికాడు.

# సుందర కాండము

నేను మైనాకునితో రామకార్యము గురించి తెలిపి అతనిని ఒప్పించి, మైనాకుని అనుమతి తీసుకొని  అక్కడ నిలువ కుండా లంకకు వెళ్లాను. తరువాత మైనాకుడు సముద్రములో మునిగి పోయాడు.

నేను అలా ఎగురుతూ వెళుతుంటే, దారి మధ్యలో దేవతలు పంపిన సురస అనే దేవతాస్త్రీని చూచాను. "ఓ వానరుడా! దేవతలు నిన్ను నాకు ఆహారంగా చూపించారు. నేను నిన్ను భక్షిస్తాను." అని నామీదికి రాబోయింది సురస. నాకు భయం వేసింది. నేను ఆమెకు నమస్కరించి ఇలా అన్నాడు. "సురసాదేవీ! నేను రామ కార్యము మీద వెళుతున్నాను. దశరథుని కుమారుడు రాముడు తన భార్య సీతతో సహా దండకారణ్యంలో ఉంటూ ఉండగా, రావణుడు అనే రాక్షసుడు రాముని భార్య సీతను అపహరించాడు. రాముని ఆదేశము మేరకు నేను రావణుని వద్దకు దూతగా వెళుతున్నాను. నా మార్గమునకు అడ్డురాకు. నీవు కూడా రాముని పాలనలో ఉన్న ప్రదేశములో నివసిస్తున్నావు కదా! అందుకని నీవు కూడా రామునికి సాయం చెయ్యాలి. అది నీ బాధ్యత. నేను లంకకు పోయి సీతను చూచి, ఆ విషయమును రామునికి చెప్పి తరువాత నీకు ఆహారంగా నీ నోట్లో ప్రవేశిస్తాను. ఇది నిజము." అని అన్నాను.

నా మాటలు సురస వినలేదు. "నన్ను దాటి ఎవరూ పోకూడదు అని నాకు వరము ఉంది. అందుకని నీవు నన్ను దాటి పోలేవు." అని పలికింది సురస. నేను పదియోజనముల పొడవుఉన్న నా శరీరాన్ని అందులో సగం అనగా పదిహేను యోజనముల పొడవు పెంచాను.  అది చూచి సురస తన నోటిని నా పొడుగు సరిపోయేట్టు

తెరిచింది. నేను వెంటనే నా దేహమును కుచింప జేసి బొటనవేలి ప్రమాణంఅయ్యాను. సురస నాకోసం వెదుకుతూ ఉంది. నేను వెంటనే సురస నోట్లోకి దూరాను. వెంటనే బయటకు వచ్చాను. అప్పుడు సురస నాతో ఇలా అంది. "ఓ వానరోత్తమా! నీ తెలివికి సంతోషించాను. రామ కార్యము నెరవేర్చుటకు నీవు వెళ్లు. సీతను రామునితో కలుపు. నీకు శుభం కలుగు గాక" అని దీవించింది సురస.

నేను మరలా ఆకాశంలోకి ఎగిరాను. నేను సముద్రం మీద ఆకాశంలో ఎగురుతుంటే నా నీడ సముద్రము నీటి మీద తేలుతూ ఉంది. ఎవరో నా నీడను పట్టుకున్నారు. ఆకాశంలో ఉన్న నేను కదలలేక పోయాను. నేను చుట్టు చూచాను. ఎవరూ కనపడలేదు. నా వేగానికి అంతరాయము కలిగించిన వాళ్లు ఎవరా అని సముద్రము నీటి వంక చూచాను. సముద్రము నీళ్లలో దాగి ఉన్న ఒక భయంకర రాక్షసిని చూచాను. ఆ రాక్షసి భయంకరంగా అరుస్తూ నాతో ఇలా అంది. " ఓ వానరుడా!ఇంత పెద్ద శరీరంతో ఎక్కడకు వెళుతున్నావు. నాకు చాలా ఆకలిగా ఉంది. నిన్ను ఆహారంగా తింటాను. నీవు నాకు ఇష్టమైనా ఆహారము." అని నన్ను తినబోయింది. నేను ఆమె మాటలకు తల ఊపి "అలాగే నన్ను తినెయ్యి" అని అన్నాను. నేను నా శరీరాన్ని ఆమె ముఖం కన్నా రెట్టింపు పరిమాణానికి పెంచాను. నన్ను తినడానికి వీలుగా ఆ రాక్షసి కూడా తన నోటి పరిమాణాన్ని పెంచింది. మరుక్షణంలో నేను నా రూపాన్ని చిన్నదిగా చేసి దాని నోటిగుండా శరీరంలోకి ప్రవేశించాను. దాని గుండెను చీల్చాను. మరలా ఆకాశంలోకి ఎగిరాను. నేను దాని గుండెలు చీల్చడంతో ఆ రాక్షసి సముద్రంలో పడిపోయింది. ఆకాశంలో ఉన్న సిద్ధులు, చారణులు అందరూ "ఆహా! హనుమంతుడు సింహికను చంపేసాడు" అని

అనుకోవడం నేను విన్నాను.

తరువాత నేను ఎగురుతూ వెళ్లి లంకానగరము దక్షిణ తీరాన్ని చేరుకున్నాను. సూర్యుడు అస్తమించేవరకూ  బయటనే ఉండి చీకటి పడగానే లంకానగరంలోకి ప్రవేశించాను. నేను నగరంలోకి ప్రవేశిస్తూ ఉండగానే భయంకరాకారం కల స్త్రీ ఒకత్తి నా ఎదురుగా నిలిచింది. ఆమె నన్ను చంపడానికి ప్రయత్నించింది. కానీ నేను ఆమెను ఎడమ చేతితో ఒక గుద్దుగుద్దాను. అప్పుడు ఆ రాక్షసి నాతో ఇలా అంది. “ఓ వానరుడా! నేను లంక దేవతను. ఈ లంకను రక్షిస్తుంటాను. ఇన్నాళ్లకు నువ్వు నన్ను జయించావు. ఇంక నీకు లంకలో ఎదురు లేదు. రాక్షసులందరినీ జయిస్తావు.” అని పలికి నాకు దోవ ఇచ్చింది.

నేను ఆ రాత్రి లంకా నగరము అంతా వెతికాను. రావణుని అంత:పురము ప్రవేశించాను. అంత:పురము అంతా వెతికాను. ఎంత వెతికినా నాకు సీత కనపడలేదు. నేను నిరాశ చెందాను. నూరు యోజనముల సముద్రము లంఘించిన నేను శోకసముద్రములో మునిగిపోయాను.  అప్పుడు నాకు రావణుని భవనమునకు ఎదురుగా ఉన్న ఒక వనము కనపడింది. దాని పేరు అశోక వనము. నేను అశోకవనములోకి ప్రవేశించాను. ఆ వనములో వెతుకుతుంటే ఒక శింశుపా వృక్షము కనపడింది. నేను ఆ శింశుపా వృక్షము ఎక్కాను. చుట్టూ చూచాను.  ఆ శింశుపా వృక్షము దగ్గరలోనే నేను మాసిన వస్త్రములు కట్టుకొని  నిరంతర ఉపవాసములతో చిక్కి ఉన్న ఒక ఉత్తమురాలైన స్త్రీని చూచాను. ఆమె చుట్టు వికృతాకారులైన రాక్షస స్త్రీలు కూర్చుని ఉన్నారు.

ఆమెను సీతగా పోల్చుకున్నాను. ఆమె నిరంతరమూ తన భర్త రాముని తలచుకుంటూ ఉంది. ఆ రాక్షస స్త్రీలు ఆమెను భయపెడుతున్నారు. ఆ బాధలు తట్టుకోలేక ఆమె మరణించడానికి ఉద్యుక్తురాలయింది. ఆ పరిస్థితులలో ఉన్న సీతను నేను చూచాను. నేను నా రూపమును చిన్నదిగా చేసుకొని ఆ శింశుపావృక్షము మీదనే ఆమెకు కనపడకుండా ఉండిపోయాను. ఇంతలో నాకు కోలాహలము వినపడింది. రావణుడు తన భార్యలతో పరివారముతో సీత వద్దకు వచ్చాడు. రావణుని చూచిన సీత భయంతో వణికిపోతూ తన అవయవములను దగ్గరగా చేర్చుకొని కూర్చుంది. రావణుడు ఆమెను "నన్ను వరించు. నన్ను భర్తగా స్వీకరించు. నీకు ఇంక రెండు మాసముల గడువుమిగిలి ఉంది. ఆ లోపల నన్ను భర్తగా అంగీకరించకపోతే నిన్ను చంపి నీ రక్తము తాగుతాను" అని బెదిరించాడు.

రావణుని మాటలకు సీత కోపించింది. ఆ కోపంలో ఇలా పలికింది. "ఓ రాక్షసుడా! నేను ఇక్ష్వాకు వంశములో పుట్టిన దశరథుని కోడలిని. రాముని భార్యను. నా గురించి ఇంత ఘోరంగా మాట్లాడు తున్న నీ నాలుక ఇంకా ఎందుకు తెగి పడలేదు? నా భర్త ఇంట లేని సమయమున నన్ను అపహరించి తెచ్చావు? నీది కూడా ఒక పరాక్రమమా! నీవు ఒక వీరుడవా! నీకూ రామునికి సామ్యమే లేదు. రాముడు రారాజు. నీవు రామునికి దాసునిగా కూడా పనికిరావు. రాముని కీర్తి ముల్లోకములు ప్రకాశిస్తూ ఉంది." అని పలికింది.

ఆ మాటలకు రావణుడు కోపంతో మండి పడ్డాడు. తన కళ్లు ఇంతింత చేసుకొని చూచాడు. తన పిడికిలి బిగించి సీతను

చంపడానికి తన చెయ్యి పైకి ఎత్తాడు. రావణుని కోపావేశము చూచి అక్కడ ఉన్న రాక్షస స్త్రీలు హాహాకారాలు చేసారు. అప్పుడు రావణుని భార్య అయిన మండోదరి వచ్చి రావణుని చెయ్యిపట్టుకొని వారించింది. “నాథా! నీ పరాక్రమము ముల్లోకములలో కూడా ప్రశంసనీయము. అటువంటి నీకు ఈ మాసిన వస్త్రములతో అంద వికారముగా ఉన్న స్త్రీతో ఏమి పని. నీవు దేవకన్యలతోనూ, గంధర్వ కన్యలతోనూ యక్షకన్యలతోనూ క్రీడించడానికి తగినవాడవు కానీ ఈ మామూలు మానవ స్త్రీతో కాదు. ” అని బతిమాలి రావణుని భార్యలందరూ, అతనిని తమ గృహమునకు తీసుకొని వెళ్లారు.

రావణుడు వెళ్లిపోయిన తరువాత సీత చుట్టు ఉన్న రాక్షస స్త్రీలు సీతను నానా రకాలుగా భయపెట్టారు. కాని సీత వారి మాటలను లెక్కచెయ్యలేదు. తాము ఎంత బతిమాలినా, భయపెట్టినా సీత లొంగలేదని, ఈ విషయం రావణునికి తెలియచెయ్యడానికి కొంతమంది రాక్షస స్త్రీలు రావణుని వద్దకు వెళ్లారు. మిగిలిన స్త్రీలు సీతను ఇంక భయపెట్టి లాభం లేదని, ఆమె చుట్టు పడుకొని నిద్రించారు. రాక్షస స్త్రీలు నిద్రించిన తరతువాత, సీత రాముని తలచుకొని తన దుస్థితికి ఏడుస్తూ ఉంది.

పడుకొని ఉన్న రాక్షస స్త్రీలలో త్రిజట అనే వృద్ధరాక్షసి కూడా ఉంది. ఆమె నిద్ర నుండి లేచి పక్కన ఉన్న రాక్షస స్త్రీలతో ఇలా అంది. “ఈమె సామాన్యురాలు కాదు. జనకుని కూతురు, దశరధుని కోడలు. రాముని భార్య. ఈమెను మీరు చంపలేరు. మీరందరూ చచ్చినా, ఈమె మాత్రము బతికే ఉంటుంది. ఎందుకంటే ఇప్పుడే నాకు ఒక కల వచ్చింది. ఆ కలలో లంకలో ఉన్న రాక్షసులు అందరూ నాశనం

అయినట్టు రాముడు విజయోత్సాహంతో ఉన్నట్టు నాకు కనపడింది. అంతే కాకుండా ఎవరైనా స్త్రీ ఆపదలో ఉంటే, అదే స్త్రీ సుఖంగా ఉన్నట్టు మనకు కలలో కనబడితే, ఆమె దు:ఖములు అన్నీ పోయి సుఖిస్తుంది అని పెద్దలు చెబుతారు. కాబట్టి మనలను అందరినీ కాపాడమని సీతను ప్రార్థిద్దాము అంతకన్నా మనకు వేరు మార్గము లేదు. మనము సీతకు నమస్కారం చేస్తే చాలు ఈమె చాలా సంతోషిస్తుంది." అని త్రిజట ఆ రాక్షస స్త్రీలకు చెప్పింది.

నేను శింశుపా వృక్షము మీద కూర్చుని ఇదంతా చూస్తూ ఉన్నాను. సీత దు:ఖిస్తూ ఉంటే చూస్తూనే ఉన్నాను కానీ ఏమీ చెయ్యలేకపోయాను. సీతతో ఎలా మాట్లాడాలా అని ఆలోచించి, తుదకు నేను ఆకుల మాటున కూర్చుని సీతకు కనపడకుండా రామ చరితమును వర్ణించాను. నేను చెబుతున్న రాముని చరితమును విని సీతకు ఆశ్చర్యము కలిగింది. తన పైకి ఎత్తి చూచింది. నేను ఆమెకు నమస్కరించాను. ఆమె నన్ను చూచి "నువ్వు ఎవరు? ఎక్కడి నుండి వచ్చావు? ఇక్కడికి ఎందుకు వచ్చావా?ఇక్కడికి ఎలా వచ్చావు?" అని ఆతురతగా అడిగింది.

అప్పుడు నేను సీతతో ఇలా అన్నాను. "ఓసీతాదేవీ! నీ భర్త రామునికి మా వానర రాజు సుగ్రీవునికీ మైత్రి కుదిరింది. నేను ఆ సుగ్రీవుని మంత్రిని. నా పేరు హనుమంతుడు. నీవు ఎక్కడ ఉన్నావో వెదకడానికి రాముడు, సుగ్రీవుడు నన్ను పంపారు. నీవు కనపడితే నీకు ఆనవాలుగా చూపమని రాముడు ఈ ఉంగరమును నాకు ఇచ్చాడు. వారి ఆదేశాను సారము నేను లంకకు వచ్చాను. నిన్ను చూచాను.

నువ్వు నాతో వస్తాను అంటే   నేను నిన్ను రామలక్ష్మణుల వద్దకు తీసుకొని వెళతాను. మీ ఆజ్ఞకొరకు వేచి ఉన్నాను." అని పలికి రాముడు ఇచ్చిన ఉంగరమును సీతకు ఇచ్చాను. అప్పుడు సీత నాతో ఇలా పలికింది. "రాముడు లంకకు వచ్చి రావణుని ఓడించి నన్ను తీసుకొని వెళ్లాలి. అంతే కానీ నేను నీతో రాను" అన్నది సీత. ఆమె మాటలకు సంతోషించిన నేను రామునికి చూపుటకు ఆనవాలుగా ఏదైనా గుర్తు ఇమ్మని అడిగాను. సీత తన చూడామణిని తీసి నాకు ఇచ్చింది. దీనిని రామునికి చూపిస్తే రాముడు నమ్ముతాడు అని చెప్పింది. ఆమె రామునితో చెప్పమని నాకు తన సందేశమును కూడా వినిపించింది. తరువాత నేను సీతకు ప్రదక్షిణము చేసి నమస్కరించాను. నేను వెళ్లబోతుంటే సీత నాతో ఇలా అంది.

"ఓ హనుమా! నా రామునికి ఇక్కడ ఉన్న పరిస్థితులను అన్నీ వివరించు. నేను పడుతున్న కష్టములు అన్నీ చెప్పు. నీవు పోయి రాముని, లక్ష్మణుని, నీ రాజు సుగ్రీవుని ఇక్కడకు వచ్చేట్టు చెయ్యి. నేను ఇంక రెండు మాసములు మాత్రమే జీవిస్తాను. రెండు మాసముల తరువాత రాముడు ఇక్కడకు వచ్చినా నన్ను చూడలేడు. ఎందుకంటే అప్పటికి నేను ఒక అనాధ వలె మరణిస్తాను." అని దీనంగా పలికింది సీత. ఆమె మాటలు విని నాకు రావణుని మీద కోపం వచ్చింది. నా శరీరమును విపరీతంగా పెంచాను. ఆ అశోకవనమును సర్వనాశనం చేసాను.

నిద్రపోతున్న రాక్షస స్త్రీలందరూ లేచారు. విరిగిన లతలు, కూలిన  చెట్లు,  ధ్వంసము చేయబడ్డ సరోవరములు చూచారు. వనమును నాశనం చేస్తున్న నన్ను చూచారు. వెంటనే పోయి

రావణునికి నా గురించి చెప్పారు. "ఓ రాక్షసరాజా! అశోక వనమును ఒక కోతి నాశనం చేస్తూ ఉంది. దానిని చంపడానికి అనుజ్ఞ ఇవ్వండి." అని ప్రార్థించారు. వెంటనే రావణుడు కింకరులు అనే పేరుగల రాక్షస మూకను పంపాడు. వాళ్లను చూచి నేను ఒక పరిఘను తీసుకున్నాను. ఎనభయి వేలమంది కింకరులు అనే రాక్షసులను ఆ పరిఘతో సంహరించాను. చావగా మిగిలిన రాక్షసులు పరుగు పరుగున పోయి రావణునితో కింకరులు అందరూ మరణించారు అన్న వార్త చెప్పారు. తరువాత నేను అశోక వనములో ఉన్న చైత్య ప్రాసాదము అనే పెద్ద భవనమును సమూలంగా కూల్చివేసాను. రావణుడు ప్రహస్తుని కుమారుడు అయిన జంబుమాలిని కొంత సైన్యముతో నా మీదికి పంపాడు. నేను జంబుమాలిని, అతని సైన్యమును నా చేతిలో ఉన్న పరిఘతో కొట్టి చంపాను. జంబుమాలి మరణించాడు అన్న వార్త విన్న రావణుడు మంత్రికుమారులను నా మీదికి పంపాడు. నేను ఆ మంత్రి కుమారులను కూడా పరిఘతో కొట్టి చంపాను. తరువాత రావణుడు ఐదుగురు సేనానాయకులను సైన్యంతోసహా నా మీదికి పంపాడు. నేను ఆ ఐదుగురు సేనానాయకులను కూడా సంహరించాను. తరువాత రావణుడు తన కుమారుడు అయిన అక్షకుమారుని నా మీదికి యుద్ధానికి పంపాడు. అక్షకుమారుడు నన్ను చంపడానికి ఆకాశంలోకి ఎగిరాడు. అప్పుడు నేను అతని పాదములు పట్టుకొని గిరా గిరా తిప్పి నేలకేసి మోది చంపాను. అక్షకుమారుడు మరణించాడు అన్న వార్త విన్న రావణుడు క్రుద్ధుడై తన కుమారుడు ఇంద్రజిత్తును నా మీదికి పంపాడు. నేను ఇంద్ర జిత్తు వెంట వచ్చిన సైన్యమును పూర్తిగా చంపాను.

అప్పుడు ఇంద్రజిత్తు నా మీద బ్రహ్మాస్త్రమును ప్రయోగించాడు. నేను బ్రహ్మాస్త్రమును గౌరవించి బంధింపబడ్డాను. తరువాత రాక్షసులు నన్ను తాళ్లతో కట్టి రావణుని ముందు నిలబెట్టారు. రావణుడు నన్ను చూచి "నీవు ఎవరు? లంకకు ఎందుకు వచ్చావు? రాక్షసులను ఎందుకు చంపావు?" అని అడిగాడు. అప్పుడు నేను రావణునితో ఇలా అన్నాను. "నేను సీతను చూడటానికి లంకకు వచ్చాను. సీతను చూచాను. నేను వాయుదేవుని ఔరస పుత్రుడను. నా పేరు హనుమంతుడు. నేను వానరుడను. నేను వానర రాజు వాలి సోదరుడు అయిన సుగ్రీవుని మంత్రిని. రాముని దూతగా లంకకు వచ్చాను. సుగ్రీవుడు నిన్ను క్షేమము అడగమని చెప్పాడు. నీకు కొన్ని హితవచనములు తన మాటలుగా నీకు చెప్పమని చెప్పాడు.

" ఓ రావణా! నేను ఋష్యమూక పర్వతము మీద ఉన్నప్పుడు రాముడు నాకు మిత్రుడు అయ్యాడు. తన భార్యను ఒక రాక్షసుడు అపహరించాడనీ, తన భార్యను వెదకడంలో తనకు సాయం చెయ్యమనీ రాముడు నన్ను అడిగాడు. నేను కూడా వాలి నా రాజ్యమును, నా భార్యను నా నుంచి బలవంతంగా లాక్కున్నాడు అని చెప్పి నాకు సాయం చెయ్యమని రాముని కోరాను. నేను రాముడు అగ్నిసాక్షిగా స్నేహితులము అయ్యాము. ఒకరికి ఒకరం సాయం చేసుకోవాలని ప్రతిజ్ఞలు చేసుకున్నాము. రాముడు నాకు ఇచ్చిన మాట ప్రకారము వాలిని వధించి నన్ను కిష్కింధకు రాజును చేసాడు. నా భార్యను తిరిగి నావద్దకు వచ్చేట్టు చేసాడు. దానికి ప్రతిఫలంగా నేను సీతను వెదకడానికి రామునికి సాయం చేయాలని నిశ్చయించు కున్నాను. అందుకని నా మంత్రి హనుమంతుని నీ వద్దకు పంపుతున్నాను. నేను వానరసైన్యముతో లంకకు వచ్చి నిన్ను చంపక

ముందే నీవు సీతను తీసుకొని వచ్చి రామునికి అప్పగించు. నీకు వానరముల శక్తి సామర్థ్యములు పరాక్రమము తెలియనిది కాదు. " అని సుగ్రీవుడు నీతో చెప్పమన్నాడు. తరువాత నీ ఇష్టం." అని ఊరుకున్నాను.

నా మాటలు విన్న రావణుని కళ్లు ఎర్రబడ్డాయి. కోపంతో ఊగిపోయాడు. వెంటనే నన్ను చంపమని ఆదేశాలు ఇచ్చాడు. ఇంతలో రావణుని సోదరుడు అయిన విభీషణుడు నా గురించి రావణుని ప్రార్థించాడు. "ఓ రాక్షస రాజా! దూతను చంపడం రాజ ధర్మమునకు విరుద్ధము. దూత ఎంత తప్పుచేసినా అవయవములు ఛేదించడం మంచిది కానీ చంపడం శాస్త్ర విరుద్ధము." అని రావణునికి హితము చెప్పాడు. విభీషణుని మాటలు విన్నాడు రావణుడు. నా తోకకు నిప్పు అంటించి కాల్చమని ఆజ్ఞ ఇచ్చాడు.

వెంటనే రాక్షసులు నా తోకకు పాత వస్త్రములు చుట్టి, నూనె పోసి నిప్పంటించారు. తరువాత రాక్షసులు నన్ను చేతులతోనూ కాళ్లతోనూ కర్రలతోనూ పిడికిళ్లతోనూ కొట్టడం, మోదడం చేసారు. నన్ను నగర వీధులలో తిప్పారు. నా గురించి పెద్దగా అరిచి అందరికీ చెప్పారు. నాకు కోపం వచ్చింది. నేను ఆ కట్లను విడిపించుకున్నాను. ఒక పరిఘను తీసుకొని ఆ రాక్షసులను అందరినీ చంపాను. తరువాత నేను మండుతున్న తోకలో నగర ద్వారము మీదికి ఎక్కాను. ఒక గృహము మీది నుండి మరొక గృహము మీదికి దుముకుతూ అన్ని గృహములకు, భవనములకు, ప్రాసాదములకు నిప్పుపెట్టాను. లంక అంతా కాల్చాను.

అప్పుడు నాకు ఒక సందేహము వచ్చింది. లంక అంతా కాల్చాను కదా అందులో సీత కూడా కాలి పోయి ఉంటుంది కదా అని విచారించాను. రామకార్యమును నాశనం చేసాను కదా అని శోకించాను. ఇంతలో ఆకాశంలో వెళుతున్న చారణుల మాటలు నాకు వినబడ్డాయి. "హనుమంతుడు లంకాదహనం చేసాడు. కానీ మహాసాధ్వి సీత మరణించలేదు" అని వారు మాట్లాడుకోవడం నేను విన్నాను. అప్పుడు నాకు అనిపించింది. "నా తోకకు నిప్పంటించినపుడే అగ్ని నా తోకను కాల్చలేదు. ఇంక రాముని భార్య సీతను అగ్ని ఎలా దహిస్తాడు." అని అనుకున్నాను. అదీ కాకుండా సీతకు శుభశకునములు కనపడినప్పుడు సీతకు కీడు ఎలా కలుగుతుంది అని కూడా అనుకున్నాను.

నేను వెంటనే శింశుపా వృక్షము కింద ఉన్న సీత వద్దకు వెళ్లాను ఆమె క్షేమంగా ఉందని తెలుసుకున్నాను. ఆమె అనుజ్ఞను పొంది తిరిగి సముద్రమును లంఘించి మీ వద్దకు వచ్చి వాలాను. రాముని ప్రభావంతో, మీ అందరి ఆశీస్సులతో, సుగ్రీవుడు ఆజ్ఞాపించిన కార్యమును నిర్విఘ్నముగా నెరవేర్చాను. ఇంక మీరు ఎలా చెబితే అలా చేస్తాను." అని వినయంగా జరిగింది జరిగినట్టు చెప్పాడు హనుమంతుడు.(హనుమంతుడు చెప్పడంలో కొన్ని విషయాలు, కొన్ని పేర్లు అటు ఇటు అవడం మీరు గమనించేఉంటారు. ఒక విషయాన్ని తిరిగి చెబుతున్నప్పుడు కొంత వైవిధ్యం కనపడటం మానవ సహజం. ఇంక వానరుల సంగతి చెప్పేదేముంది.)

శ్రీమద్రామాయణము

సుందర కాండము ఏబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము

## ఏబది తొమ్మిదవ సర్గ.

హనుమంతుడు లంకలో తాను చేసిన పనులు జరిగిన విషయములు అన్నీ జాంబవంతునికి, అంగదునకు మిగిలిన వానరశ్రేష్టులకు చెప్పి, ఇంకా ఇలా చెప్పసాగాడు.

"సీతా దేవి మహా పతివ్రత. ఆమె పాతివ్రత్య మహత్తు చేత రాముని ప్రయత్నము సఫలం అవుతుంది అని నా నమ్మకము. కాని రాక్షస రాజు రావణుడు సామాన్యుడు కాడు. మహా బలవంతుడు. అతడికి కోపం వస్తే ఎవరినీ లెక్కచెయ్యడు. తన తపోబలంతో ముల్లోకములను నాశనం చెయ్యగల సమర్థుడు. రావణుడు సీతను తీసుకొని వెళ్లేటప్పుడు ఆమె శరీరాన్ని తాకాడు. కానీ రావణుడు భస్మం కాకపోవడానికి కారణం అతడు చేసిన తపస్సు ఫలితమే. మరొకడు అయితే సీత పాతివ్రత్య మహిమకు భస్మంకాక తప్పదు. సీతకు కోపం వస్తే తన పాతివ్రత్య మహిమతో ఏమైనా చెయ్యగలదు.

ఇదీ పరిస్థితి. మనము ఇప్పుడు ఏం చెయ్యాలి. మనం అందరం లంకకు పోయి సీతను తీసుకొని వచ్చి రామునికి అప్పగించడమా! ఎందుకంటే రావణుని ససైన్యముగా నాశనం చెయ్యడానికి నేను ఒక్కడినే చాలు. నాకు రావణుని సైన్యము యొక్క ఆనుపానులు బాగా తెలుసు. నాకు తోడు మీరందరూ ఉన్నారు. మీరందరూ బలవంతులు, అస్త్రములను శస్త్రములను ప్రయోగించడంలో నిపుణులు. మీరందరూ నా తో ఉంటే ఇంక

చెప్పేదేముంది. క్షణాల్లో రావణుని, రావణుని సోదరులను, రావణుని పుత్రులను, అతని సమస్త సైన్యమును  సంహరించవచ్చును. ఇంద్రజిత్తు చే ప్రయోగింపబడే బ్రహ్మాస్త్రము, ఇంద్రాస్త్రము, రౌద్రాస్త్రము, వాయవ్యాస్త్రము, వారుణాస్త్రము ఇంకా రకరకాల అస్త్రములను నేను దూది పింజల మాదిరి ఎగురగొట్టగలను.  రాక్షసులందరినీ చంపగలను. నా పరాక్రమంతో రావణుని బంధించగలను. నేను కురిపించే రాళ్ల వర్షానికి దేవతలే భయపడతారు. ఇంక ఈ రాక్షసులు ఒక లెక్కా!

నా దాకా ఎందుకు ఈ జాంబవంతుడు చాలు. రాక్షసులనందరినీ తుదముట్టించడానికి. అంతదాకా ఎందుకు మన యువరాజు అంగదుడు చాలు. సకల రాక్షస నాయకులను సంహరించడానికి.  మన పనసుడు, నీలుడు తలచుకుంటే మంధరపర్వతమును కూడా బద్దలు కొట్టగలరు. ఇంక ఆ రాక్షసులు వారి ముందు ఎంత!  దేవాసురులు కానీ, గంధర్వులు, యక్షులు గానీ, పన్నగులు కానీ మన మైందునకు ద్వివిదునకు ఎదురు నిలిచి పోరాడగలరా!  వారే పోరాడలేనపుడు ఈ రాక్షసాధములు ఎంత? ఎందుకంటే ఈ మైందుడు ద్వివిదుడు బ్రహ్మదేవుడు వరము చేత అమృతమును సేవించారు. వీరికి ఎక్కడా అపజయము అనే మాట లేదు. పైగా వీరికి ఎవరి చేతిలోనూ చావు రాదని బ్రహ్మదేవుడు వరం కూడా ఇచ్చాడు. బ్రహ్మదేవుడు ఇచ్చిన వరంతో గర్వించి, వీరు దేవతలను జయించి, వారి వద్ద ఉన్న అమృతమును తాగారు. అందువలన వీరు అజేయులు. కాబట్టి ఈ మైందుడు ద్వివిదుడు కోపిస్తే లంకానగరము సర్వము నాశనమైపోతుంది.

ఇప్పటికే నేను లంకానగరమును అగ్నికి ఆహుతి చేసి మన వానరుల పరాక్రమమును లంకావాసులకు తెలియజేసాను. అంతే కాదు. నేను లంకలో రామలక్ష్మణులయొక్క, మన రాజు సుగ్రీవుని యొక్క బల పరాక్రమముల గురించి రావణునికి తెలియజేసాను. అశోక వనములో ఉన్న సీత సదా రామనామస్మరణ చేస్తూ ఉందే కానీ, రావణుని పేరు ఒక్కసారి కూడా తలవడం లేదు.

మన రాముని భార్య సీత లంకలో బంధింపబడి ఉంది. ఆమె ఎప్పుడూ రాముని మనసులో స్మరిస్తూ ఉంది. సీత నిరంతరమూ శోకిస్తూ ఉంది. అటువంటి సీతను రాక్షస స్త్రీలు నిరంతరమూ భయపెడుతున్నారు. చంపుతామని బెదిరిస్తున్నారు. రావణుడు ఆమెకు రెండునెలల గడువు ఇచ్చాడు. వారి బాధలకు తట్టుకోలేక సీత ప్రాణత్యాగమునకు సిద్ధం అయింది. అది నేను కళ్లారా చూచాను. ఆమెకు నేను కిష్కింధలో జరిగిన విషయములు అన్నీ విపులంగా చెప్పాను. మేమందరమూ కూడా  ఆమె కోసరం నిరంతరమూ బాధపడుతున్నాము అని తెలియజేసాను. నామాటలతో ఆమెకు ఊరట కలుగచేసాను.

అసలు మనమంతా ఎందుకు. సీతకు కోపం వస్తే రావణుని ఈ పాటికి భస్మం చేసి ఉండేది. కానీ అలా చేయలేదు. కారణం ఆమెకు రాముని మీద అచంచల భక్తి, విశ్వాసము. సీతను అపహరించగానే రావణుడు సగం చచ్చాడు. ఇప్పుడు రాముడు రావణుని చంపడం కేవలం నిమిత్తమాత్రమే.

కాబట్టి మనం అంతా కలిసి సీతను రావణుని చెరనుండి విడిపించుటకు తగిన ప్రయత్నములు చేయాలి." అని హనుమంతుడు తన సుదీర్ఘమైన ప్రసంగమును ముగించాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము ఏబది తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
అరువదవ సర్గ.

హనుమంతుని మాటలను సావధానంగా విన్న అంగదుడు ఇలా అన్నాడు. "హనుమంతుడు నూరుయోజనముల సముద్రమును దాటి లంకను చేరి సీతను చూచాడు. సీతను చూచి కూడా మనము సీతను మనతో తీసుకొని వెళ్లకుండా వట్టి చేతులతో పోవడం మంచిది కాదు. మనమంతా రాముని వద్దకు పోయి "రామా! మేము సీతను చూచాము కానీ ఆమెను అక్కడే వదిలి వచ్చాము" అని చెప్పపడం శోభస్కరము కాదని నా అభిప్రాయము. ముల్లోకములలో ఎక్కడి కైనా మనము ఎగిరిపోగల శక్తి మనకు ఉంది. ఇప్పటికే హనుమంతుడు చాలా మంది రాక్షస వీరులను సంహరించాడు. ఇంక మనము లంకకు వెళ్లి సీతను రావడమే మిగిలి ఉంది." అని పలికాడు అంగదుడు.

ఆ మాటలు విన్న జాంబవంతుడు వారితో ఇలా అన్నాడు.

" అంగదా! నీవు చెప్పిన మాటలు బాగుగా ఉన్నాయి. సీతను లంక నుండి తీసుకురావడం మన శక్తికి మించిన పనేం కాదు. కానీ ఇది రామ కార్యము. రాముడు మనలను కేవలం సీతను వెదకడానికి సీత జాడ తెలుసుకోడానికి పంపించాడు. మనం అంతవరకే చెయ్యాలి. ముందు మనం రాముని వద్దకు పోయి, సీత గురించి రామునికి వివరంగా చెబుదాము. రాముడు ఏమి చెబితే అలా చేద్దాము. రాముని ఆలోచన ఎలా ఉందో అలా చేద్దాము. అంతే కానీ మనం స్వతంత్రించి ఏమీ చేయవద్దు." అని అన్నాడు జాంబవంతుడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము అరువదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## సుందర కాండము
## అరువది ఒకటవ సర్గ.

పెద్దవాడు అయిన జాంబ వంతుని మాటలు అంగదునికి మిగిలిన వానరులకు బాగా నచ్చాయి. అందరూ జాంబవంతుడు ఎలా చెబితే అలా చేద్దాము అని అన్నారు. అందరూ కిష్కింధకు తిరిగి వెళ్లిపోదాము అని అనుకున్నారు. అందరూ హనుమంతుని ముందుంచుకొని మహేంద్ర పర్వతమును వదిలి పెట్టి ఆకాశంలో ఎగిరిపోయారు. అందరిలోనూ ఒకటే నిశ్చయము. రాముడికి సీత గురించి చెప్పడం. రావణుని చంపడం. సీతను తీసుకురావడం. ఎంత తొందరగా రాముడికి సీత గురించి చెబుదామా అని ఆతురతగా ఉన్నారు.

వారందరూ ఒక ఉద్యానవనమును చేరారు. దానిని సుగ్రీవుని మేనమామ మహా పరాక్రమ వంతుడు అయిన దధిముఖుడు అనే వానరుడు రక్షిస్తూ ఉంటాడు. ఆ వనము అంటే సుగ్రీవునికి ఎంతో ఇష్టం. అటువంటి వనములో మధువు బాగా దొరుకుతుంది. ఆ మధువును తాగాలని వానరులు అందరూ నిశ్చయించుకున్నారు. అందరూ ఆ మధువనములోకి ప్రవేశించారు.

అసలే వానరులు. అందులోనూ సీతను చూచిన ఆనందంలో ఉన్నారు. వారి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. వానరులు అందరూ ఆ మధువనములోని మధువును తాగడానికి అంగదుని అనుమతి కోరారు. అంగదుడు పెద్దవాడైన జాంబవతుని అనుమతి కోరాడు. వానరుల ఉత్సాహమును చూచి జాంబవంతుడు మధువనములో మధువును తాగడానికి వారికి  అనుమతి ఇచ్చాడు. అంగదుడు వానరులకు మధువును తాగడానికి అనుమతి ఇచ్చాడు.

వానరుల సంతోషానికి అంతు లేదు. వానరులు నృత్యం చేసారు. గంతులు వేసారు.  ఆడారు. పాడారు. కొందరు నవ్వుతున్నారు. కింద పడుతున్నారు. గెంతుతున్నారు. చెట్లు ఎక్కుతున్నారు. దూకుతున్నారు. ఇష్టం వచ్చినట్టు వాగుతున్నారు. ఒకరి మీద ఒకరు ఎక్కుతున్నారు. కొట్టుకుంటున్నారు. ఆడుకుంటున్నారు.  ఒక చెట్టు మీది నుండి మరొక చెట్టు మీదికి దూకుతున్నారు. ఉరుకుతున్నారు. నేల మీది నుండి మహావృక్షముల మీదికి దూకుతున్నారు. ఒకడు పాడుతుంటే మరొకడు వాడిని చూచి నవ్వుతున్నాడు. ఒకడు నవ్వుతుంటే మరొకడు వాడిని ఏడిపిస్తున్నాడు. వారందరూ అక్కడ ఉన్న మధువును పీకల దాకా తాగారు. వారికి మత్తుబాగా తలకెక్కింది.

వారికి ఏమి చేసినా తృప్తి కలగడం లేదు.

ఆ వనమునకు కాపలాగా ఉన్న దధిముఖుడు వానరములు వనము అంతా పాడుచేయడం చూచి వారిని అడ్డుకున్నాడు. వారి మీద కోపించాడు. వారిని భయపెట్టాడు. మత్తులో ఉన్న ఆ వానరులు ఊరుకోలేదు. ఇంకారెచ్చిపోయారు. వనం అంతా ధ్వంసం చేస్తున్నారు.  ఆ దధిముఖుడు కొంత మందిని తిట్టాడు. మరి కొంత మందిని అదిలించాడు. ఇంకొంతమందిని కొట్టాడు. కొంత మందిని అలా చెయ్యవద్దని బతిమాలాడు.

ఎవరూ అతని మాట వినలేదు. వారి ఇష్టం వచ్చినట్టు చేస్తున్నారు. ఆ దధిముఖుని పట్టుకొని లాగుతున్నారు. కొడుతున్నారు. గోళ్లతో రక్కుతున్నారు. కాళ్లతోనూ చేతులతోనూ తంతున్నారు. మధువనములో ఉన్న పదార్థములనన్నిటినీ వానరులు చిందరవందర చేసారు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము అరువది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# సుందరకాండము

## అరువది రెండవ సర్గ.

దదిముఖుడు వానరములను అడ్డుకోవడం చూచి అందరూ హనుమంతుని వద్దకు వెళ్లారు. "హనుమా! మేము ఈ వనములో మధువును సేవించడానికి ప్రయత్నిస్తుంటే ఈ దధిముఖుడు అడ్డుకుంటున్నాడు." అని అన్నారు.

హనుమంతుడు  వానరములను చూచి ఇలా అన్నాడు. "మీరు ఎవరికీ భయపడకండి. మీ ఇష్టం వచ్చినట్టు ఈ మధు వనములో మధువు సేవించండి. మీకు ఎవరైనా అడ్డుచెబితే నేను వాళ్లను అదుపు చేస్తాను." అని అన్నాడు.

ఆ మాటలు విన్న అంగదుడు చాలా సంతోషించాడు. "మీరందరూ ఈ మధువనములో పేకరింపబడిన మధువును తనివిదీరా తాగండి. మన హనుమంతుడు మనము చేయలేని కార్యమును సాధించుకొని వచ్చాడు. ఈ సంతోష సమయంలో మీరు ఏమి చేసినా ఏమీ అనను. ఇక్కడ మధువును తాగడం మనము చేయకూడని పని అయినా, హనుమంతుడు చెప్పాడు కాబట్టి మనం చేద్దాము." అని అనుజ్ఞ ఇచ్చాడు.

ఆ మాటలు విన్న వానరములు అంగదుని అభినందించారు. అందరూ మధువనములో ఉన్న మధువును తాగడానికి ఉద్యమించారు యధేచ్ఛగా మధువును సేవించారు. ఫలములను తిన్నారు.  అడ్డం వచ్చిన వనపాలకులను చావ చితకా

కొట్టారు. కుండలతో మధువును సేవించారు. అందరూ మత్తులో తూలుతున్నారు. అసలే వానరులు. పైగా మధువు సేవించారు. తాగినంత తాగి మిగిలింది పారబోస్తున్నారు.

కొందరు పాన పాత్రలను చేత బట్టుకొని తాగుతూ మధువును ఒకరి మీద ఒకరు పోసుకుంటున్నారు. అందరికీ మత్తు బాగా తలకెక్కింది. మత్తులో తూలుతున్నారు. కొందరు చెట్ల కింద పడుకున్నారు. మరికొందరు చెట్ల మొదళ్లలో కూర్చుని మత్తులో జోగుతున్నారు. కొంత మంది ఒకరిని ఒకరు తోసుకుంటూ నడుస్తున్నారు. కొందరు పెద్దగా అరుస్తున్నారు. కొంతమంది ఈలలు వేస్తున్నారు. మరి కొంతమంది అలాగే ఎక్కడ అంటే అక్కడ నేల మీద పడిపోయి జోగుతున్నారు. మరి కొందరు తాము వనపాలకులను ఎలా కొట్టిందీ ఒకరితో ఒకరుచెప్పుకుంటూ ఆనందిస్తున్నారు. కొంత మంది మత్తులో ఏమి చేస్తున్నారో తెలియ కుండా వికృతమైన పనులు చేస్తున్నారు.

వానరులు ఇలా మధువనమును ధ్వంసము చేస్తుంటే వానరముల ఆగడాలు భరించలేక వన పాలకులు తలొక దిక్కు పారిపోయారు. ఈ వానరులు వాళ్లను తరిమి పట్టుకొని కొట్టి, ఈడ్చి మూల మూలలకు తోసేసారు. ఆ వనపాలకులు అందరూ దధిముఖుని వద్దకు పోయి తమ గోడు వెళ్లబోసుకున్నారు. వానరముల ఆగడములు అన్నీ వివరంగా చెప్పారు. "హనుమంతుని అనుమతితో వానరములు మధువనమును పాడుచేసారు. అడ్డం వెళ్లిన మా అందరినీ తన్నారు. కొట్టారు. నేల మీద పడేసి ఈడ్చారు." దధిముఖునితో మొరపెట్టుకున్నారు.

అప్పటికే వానరులతో తన్నులు తిన్న దధిముఖుడు వారిని ఓదార్చాడు. ఈ సారి అందరూ మూకుమ్మడిగా పోయి వానరములను అడ్డుకుందాము అని అనుకున్నారు. అందరూ మరలా మధు వనమునకు వెళ్లారు. వారందరూ చేతికి అందిన తాటిచెట్లను, మద్దిచెట్లను, వాటి కొమ్మలను, రాళ్లను పట్టుకొని హనుమంతుడు మొదలగు వానరుల దగ్గరకు వెళ్లారు. (దధిముఖుడు, అతని వనపాలకులు కూడా వానరులే).

దధిముఖుడు, వనపాలకులు అందరూ హనుమంతుడు మొదలగు వానరములను చుట్టుముట్టారు. హనుమంతుడు మొదలగు వానరములు దధిముఖుడు మొదలగు వనపాలకులను ఎదిరించడానికి సిద్ధం అయ్యారు. ఆ దధిముఖుడు సుగ్రీవునికి మేనమామ. అయినా లెక్కచెయ్యకుండా అంగదుడు దధిముఖుని తన అరిచేత్తో కొట్టాడు. బాగా మధువు తాగి మత్తులో ఉన్న అంగదుడు దధిముఖుని నేల మీద పడేసి ఈడ్చాడు. అంగదుడు కొట్టిన దెబ్బలకు దధిముఖునికి ఎముకలు అన్నీ విరిగిపోయాయి. శరీరం అంతా రక్తంతో తడసిపోయింది. దధిముఖుడు మూర్ఛపోయాడు. కాని వెంటనే తేరుకున్నాడు.

ఇప్పటి దాకా అంగదుడు యువరాజు అని ఉపేక్షించాడు దధిముఖుడు. ఇంక తప్పలేదు. అక్కడి నుండి తప్పించుకొని ఒక రహస్య ప్రదేశమునకు తన వన పాలకులతో వెళ్లాడు. వారితో ఇలా అన్నాడు. "ఈ వానరులను మనము ఏమీ చేయలేము. వీరిని ఇలాగే ఉండనీ. మనము అందరూ సుగ్రీవుని వద్దకు పోదాము. అంగదుని నాయకత్వములో ఈ వానరములు చేసిన ఆగడములు అన్నీ

సుగ్రీవునికి చెప్పుదాము. అప్పుడు సుగ్రీవుడు కోపించి అందరికీ మరణ దండన విధిస్తాడు. ఎందుకంటే సుగ్రీవునకు ఈ మధువనము అంటే ఎంతో ఇష్టము. ఈ మధువనము సుగ్రీవునికి తన తాత తండ్రుల నుండి సంక్రమించినది. దీనిని ఎవరు పాడు చేసినా సహించలేడు. ఈ మధువనమును పాడు చేస్తున్న వానరులకు ఆయువు మూడింది. సుగ్రీవుని చేతిలో వీరందరికీ మరణ దండన తప్పదు. అప్పుడు మన కోపము చల్లారుతుంది." అని పలికాడు దధిముఖుడు.

తరువాత దదిముఖుడు ఆకాశంలో ఎగురుతూ సుగ్రీవుడు ఉండే చోటికి వెళ్లాడు. అక్కడ రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు కూర్చుని ఉన్నారు. దధిముఖుడు వారి ముందు వాలాడు. వారికి నమస్కారము చేసాడు. సుగ్రీవుని పాదాలపై పడ్డాడు. సాష్టాంగ నమస్కారము చేసాడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము అరువది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాబడము
అరువది మూడవ సర్గ.

సుగ్రీవుడు దధిముఖుని బుజాలు పట్టుకొని లేవ నెత్తాడు. "ఏమయింది దధిముఖా! నీకు నీ వారికి క్షేమమే కదా! ఎందుకు అలా దిగాలుగా ఉన్నావు. ఏం జరిగింది. వివరంగా చెప్పు" అని అడిగాడు సుగ్రీవుడు.

"ఓ మహారాజా! మధువనము నీకు చెందినది. నీ తండ్రి గానీ, నీవు గానీ, నీ అన్న వాలి గానీ, ఆ మధువనమును ఎవరికీ అనుభవించమని ఇవ్వలేదు. ఆ మధువనమునకు మమ్ములను రక్షకులుగా నియమించావు. కాని ఈ రోజు  కొంత మంది వానరులు వచ్చి ఆ మధువనమును ఆక్రమించుకొ.ని, మధువును తాగి. నానా అల్లరీ చేసారు. మా అందరినీ కొట్టారు. వన రక్షకులు అడ్డుకోగా వారిని కూడా లెక్క చేయలేదు. అందరినీ కొట్టారు. వారు మధువును తాగుతూ మిగిలింది పారబోస్తూ అదేమని అడిగితే కళ్లెర్ర చేస్తున్నారు. మేము మరలా మరలా వారిని అలా చేయవద్దు అని వారింపగా మా అందరినీ అక్కడి నుండి తరిమివేసారు. మా అందరినీ కొట్టి, తన్ని ఈడ్చి, మారు మూల ప్రదేశాలకు తరిమేసారు. మీరు మాకు రాజుగా ఉండి కూడా, ఆ వానరులు ఇంతటి దురాగతానికి పాలుబడ్డారు. మధువనమును పూర్తిగా నాశనం చేస్తున్నారు. మీరు వారిని కఠినంగా శిక్షించాలి." అని విన్నవించుకున్నాడు దధిముఖుడు.

ఈ మాటలు అన్నీ విన్న లక్ష్మణుడు సుగ్రీవునితో ఇలా అన్నాడు. "సుగ్రీవా! అతను దేని గురించి ఎవరి గురించి చెబుతున్నాడు?" అని అడిగాడు.

"లక్ష్మణా! ఈ దధిముఖుడు మధువనమునకు రక్షకుడు. కొందరు వానరులు మధువనమును పాడుచేసారు అని అంటున్నాడు. మనము దక్షిణ దిక్కుకు పంపిన వానరులు తిరిగి వచ్చి, దారిలో ఉన్న ఆ మధువనమును పాడుచేస్తున్నారేమో అని అనుమానంగా ఉంది. ఇక్కడ ఉన్న వానరులకు అంత ధైర్యము లేదు. వారు నిశ్చయంగా అంగదుడు, హనుమంతుడు అయి ఉంటారు. వారు వెళ్లిన కార్యము

సిద్ధించనిచో వారు అలా ప్రవర్తించరు. కాబట్టి అంగదుడు, హనుమంతుడు, జాంబవంతుడు ఈ కార్యము సాధించి ఉంటారని అనుకుంటున్నాను. హనుమంతుడు సీతా దేవిని చూచి ఉంటాడు. ఆ ఆనందములో వారంతా ఇలా విచ్చలవిడిగా మధువును తాగుతూ ఉండి ఉంటారు. హనుమంతుడు మంచి జ్ఞాని, బుద్ధిమంతుడు. వివేచనా పరుడు. అతనే సీతను చూచి ఉంటాడు. హనుమంతుడు, జాంబవంతుడు నాయకత్వం వహించే వానరులకు విజయం తప్పదు. ఈ దధిముఖుడు ఆ విషయం చెప్పడానికే ఇక్కడకు వచ్చాడు.

ఓ లక్ష్మణా! రామ కార్యము సఫలమైనది. సీత జాడ తెలిసింది. అందుకే మనము పంపిన వానరులు అంత ఆనందంగా కేరింతలు కొడుతున్నారు. మధువు తాగుతున్నారు. ఎందుకంటే, హనుమంతుడు సీతను చూడకపోయి ఉంటే, ఆ వానరులు ఇంత సాహసం చెయ్యరు. నాకు చెందిన మధువనములోకి ప్రవేశిస్తే మరణదండన తప్పదని అందరికీ తెలుసు." అని అన్నాడు సుగ్రీవుడు.

ఆ మాటలు విన్న రాముడు, లక్ష్మణుడు ఎంతో సంతోషించారు. అప్పుడు సుగ్రీవుడు దధిముఖునితో ఇలా అన్నాడు. "ఓ దధిముఖా! వారు ఎవరో కాదు. సీతను వెదకడానికి దక్షిణదిక్కుగా వెళ్లిన వానర వీరులు. వారు తమ పని పూర్తి చేసుకొని ఉల్లాసంగా ఉన్నారు. వారిని నేను క్షమించాను. అంత మహత్కార్యమును చేసుకొని వచ్చిన వారికి ఆ మాత్రం మధువు గ్రోలే అధికారం ఉంది. అది క్షమించరాని తప్పుకాదు కదా! నీవు పోయి వారందరినీ వెంటనే ఇక్కడకు తీసుకొని రా! నేను, రామలక్ష్మణులు వారి కోసరము వేచి ఉన్నాము అని వారికి తెలియజెయ్యి." అని అన్నాడు సుగ్రీవుడు.

రామలక్ష్మణులు హనుమంతుని రాక కోసరం, అతడు సీత గురించి చెప్పబోయే విషయాల కోసరం ఆతురతగా ఎదురుచూస్తున్నారు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము అరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

## సుందర కాండము

## అరువది నాలుగవ సర్గ.

సుగ్రీవుని మాటలను సావధానంగా విన్నాడు దధిముఖుడు. అసలు విషయం అర్థం అయింది. రామలక్ష్మణులకు, సుగ్రీవునకు నమస్కరించాడు. తనతో వచ్చి వనపాలకులతో కలిసి వెంటనే మధువనమునకు ఎగిరిపోయాడు. అప్పటికే బాగా మధువును సేవించిన వానరులు మత్తులో తూలుతున్నారు. దధిముఖుడు చేతులు జోడించి నమస్కరిస్తూ యువరాజైన అంగదుని వద్దకు వెళ్లాడు.

"యువరాజా! తమరు ఎవరో తెలియక మా వనరక్షకులు మీకు ఆటంకము కలిగించారు. మమ్ములను క్షమించండి. నీవు కిష్కింధకు యువరాజువు. నీకు ఈ మధువనము మీద సర్వాధికారములు కలవు. మా మూర్ఖత్వముచేత మీ గురించి తెలియక అపరాధము చేసినాము. మమ్ములను క్షమించండి. మీరు ఇక్కడకు వచ్చినట్టు నేను మీ పినతండ్రి సుగ్రీవుల వారికి

తెలియజేసాను. మీ రాకను గురించి విని సుగ్రీవుడు ఎంతో సంతోషించాడు. ఈ మధువనము ధ్వంసము అయిన దాని గురించి ఆయన విచారించలేదు. మీ అందరినీ తొందరగా రమ్మని చెప్పారు. మీ రాక కోసం రామలక్ష్మణులు, సుగ్రీవుడు ఆతురతగా ఎదురు చూస్తున్నారు. కాబట్టి మీరందరూ వెంటనే సుగ్రీవుని వద్దకు పోవుట యుక్తము.” అని దధిముఖుడు అంగదునితో చెప్పాడు.

దధిముఖుని మాటలు విన్న అంగదుడు హనుమంతుడు మొదలగు వానరులను చూచి ఇలా అన్నాడు. “మన గురించి, మన రాక గురించి రామునికి, సుగ్రీవునికి తెలిసిపోయింది. ఇంకా మనము ఇక్కడ ఉండడం మంచిది కాదు. ఇప్పటికే మన వాళ్లందరూ మధువు తృప్తిగా తాగి విశ్రాంతి తీసుకున్నారు. ఆడారు. పాడారు. ఇంక చాలు. ఇంక ఇక్కడ మనం చేసే పని ఏమీ లేదు. కాబట్టి మనం అందరం సుగ్రీవుని వద్దకు పోదాము. నేను యువరాజును, మీకు నాయకుడను అయినా మీరంతా నా కన్నా పెద్దవారు. అందుకని మిమ్ములను ఆజ్ఞాపించలేను. మీరంతా ఆలోచించి ఏది యుక్తము అని తోస్తే అది చేద్దాము.” అని అన్నాడు అంగదుడు.

అంగదుని మాటలు విన్న వానరులు చాలా సంతోషించారు. “యువరాజా! నీ మంచి మనస్సుకు మేము ఎంతో సంతోషించాము. రాజు అయిన వాడు, తనకున్న ఐశ్వర్యముతో మదించి, ‘నేను’ ‘నేను’ అంటూ ‘మీరంతా నా మాట వినాలి’ అంటూ గర్వంగా పలుకుతుంటాడు. ఎదుటి వారు చెప్పిన మంచి మాటలు కూడా పట్టించుకోడు. కాని నువ్వు యువరాజువైనా పెద్దలను గౌరవిస్తున్నావు. ఇది నీకే చెల్లింది. మరొక యువరాజు ఇలా మాట్లాడడు. నీలో ఉన్న

వినయము పెద్దల ఎడల విధేయత నిన్ను భావి మహారాజుగా తీర్చిదిద్దుతాయి. నీ మాట ప్రకారము మేము అందరమూ మన మహారాజు సుగ్రీవుల వారి యొద్దకు పోవుటకు వేచి ఉన్నాము. నీ ఆజ్ఞలేకుండా మేమందరమూ ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేము. ఇది నిజము." అని ఆ వానరులందరూ ముక్తకంఠంతో పలికారు.

వారి మాటలకు సంతోషించాడు అంగదుడు. సుగ్రీవుని వద్దకు పోవుటకు ముందు తాను గాలిలోకి ఎగిరాడు. అంగదుని అనుసరించి మిగిలిన వానరములు అన్నీ గాలిలోకి ఎగిరాయి. అంగదుడు సుగ్రీవుని వద్దకు బయలుదేరిన సమయమున సుగ్రీవుడు రామునితో ఇలా అన్నాడు. "ఓ రామా! ఇంక నీ శోకమును విడిచిపెట్టు. నీ భార్య సీత జాడతెలిసినది కదా! నేను వారికి ఇచ్చిన సమయము దాటి పోయినది. సీత జాడ తెలుసుకోకుండా వారు నా దగ్గరకు రాలేరు. వారందరూ మధువనములో మధువును సేవించి సంతోషముతో నా దగ్గరకు వస్తున్నారు అంటే వారు రామ కార్యమును సఫలముచేసుకొని వస్తున్నారు అని అనుకోవచ్చు. అంగదుడు మొదలగు వానరులు తమ అప్పగించిన  కార్యము సఫలము కానిచో మధువనములో అడుగు కూడా పెట్టేవారు కాదు. కాబట్టి వారందరూ సీతను చూచి ఆమె క్షేమములు తెలుసుకొని వస్తున్నారు. సంతోషకరమైన వార్త తీసుకొని వస్తున్నారు.

రామా! నీవు ఇంక ఊరడిల్లు. నేను దక్షిణదిక్కుకు పంపిన హనుమంతుడు కార్యదీక్ష, పట్టుదల కలవాడు. ఆతడు సూర్యుని తేజముతో సమానమైన తేజస్సుకలవాడు. అతడు నీ కార్యము

సఫలముచేసుకొని వస్తున్నాడు.” అని రామునితో అంటూ ఉండగానే ఆకాశంలో వానరులు వస్తున్నట్టు వారు అరుస్తున్న అరుపులు, కేరింతలు వినబడ్డాయి. సుగ్రీవుడు తల ఎత్తి ఆకాశం వంక చూచాడు. ముందు అంగదుడు, తరువాత హనుమంతుడు, తరువాత జాంబవంతుడు, తరువాత మిగిలిన వానరములు వరుసగా వచ్చాయి. అందరూ రాముడు సుగ్రీవుడి ఎదుట నిలబడ్డారు.

హనుమంతుడు రామునికి శిరస్సు వంచి ప్రణామం చేసి “సీతా దేవి క్షేమంగా ఉంది” అని తెలిపాడు.

హనుమంతుని నోటి వెంట సీత క్షేమంగా ఉంది అన్న వార్త విన్న రాముని సంతోషానికి అంతులేకుండా పోయింది. ఆమాట విని లక్ష్మణుడు కూడా ఎంతో సంతోషించాడు. “సీతను చూచాను” అన్న హనుమంతుని వంక రాముడు ఆదరంతోనూ వాత్సల్యంతోనూ చూచాడు.

శ్రీమద్రామాయణము

సుందరకాండము అరువది నాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

అరువది ఐదవ సర్గ.

అంగదుడు మొదలగు వానరులు రామునితో, తాము సీతను చూచామనీ, సీత లంకలో క్షేమంగా ఉందనీ, ఆమె రావణుని

అంత:పురములో బందీగా ఉందనీ, రాక్షస స్త్రీలు ఆమెను భయపెడుతున్నారనీ, సీత ఎల్లప్పుడూ రాముని తలచుకుంటూ ఉందనీ, రావణుడు ఆమెకు రెండు మాసముల గడువు ఇచ్చాడనీ, గబాగబా, గాభరాగా, కలగా పులగంగా చెప్పసాగారు. రాముడు వారిని ఆపి, వారితో ఇలా అన్నాడు.

"ఓ వానరులారా! సీత ఎక్కడ ఉంది? నా గురించి ఏమని అనుకుంటూ ఉంది? సీతను ఎవరు చూచారు. ఆ విషయములు అన్నీ నాకు వివరంగా చెప్పండి." అని అడిగాడు.

అప్పుడు ఆ వానరులు అందరూ సీతను చూచిన హనుమంతుని ముందుకు తోసారు. అప్పుడు హనుమంతుడు తన ఎదురుగా ఉన్న రామునికి, లంక వైపు తిరిగి లంకలో ఉన్న సీతకు నమస్కరించి, సీతను తను ఎలా చూచిందీ, సీత లంకలో ఎలా ఉన్నదీ, రాముని గురించి ఏమనుకుంటూ ఉన్నదీ చెప్పనారంభించాడు.

"ఓ రామా! నేను నూరు యోజనముల దూరము ఉన్న సముద్రమును దాటి లంకకుచేరుకున్నాను. లంకలో సీత కోసరం అన్ని చోట్లా వెదికాను. రావణుని అంత:పురములో నేను సీతను చూచాను. సీత తన ప్రాణములు అన్నీ నీ మీదనే పెట్టుకొని జీవిస్తూ ఉంది. ఆమెకు కాపలాగా వికృతాకారులైన రాక్షస స్త్రీలు ఆమె చుట్టు ఉన్నారు. రావణుని వరించమని సీతను భయపెడుతున్నారు. రాక్షస స్త్రీల మధ్య ఉన్న సీతను నేను చూచాను. నీ భార్య సీత, నీతో ఉన్నప్పుడు సకల భోగములు అనుభవించిన సీత, ఇప్పుడు కష్టములు అనుభవిస్తూ ఉంది. ఆమె దీనంగా ఉంది. ఎల్లప్పుడూ నీ గురించే ఆలోచిస్తూ ఉంది.

నువ్వు ఎప్పుడు వచ్చి తనను ఆ రాక్షసుని చెరనుండి విడిపిస్తావా అని ఎదురు చూస్తూ ఉంది. ఆమె మరణించడానికి సిద్ధంగా ఉంది. అటువంటి సీతను నేను చూచాను.

సీతతో ఎలా మాట్లాడో తెలియక, ఇక్ష్వాకు వంశమును, మీ చరిత్రను ఆమె వినేటట్టు వర్ణించాను. అప్పుడు సీత నన్ను చూచింది. నేను నా గురించి మీ గురించి తెలిపాను. నీకు సుగ్రీవునికీ స్నేహము కుదిరినది అనీ, సుగ్రీవుడు పంపగా నేను వచ్చాను అని చెప్పాను. నా మాటలు విని సంతోషించిన సీతను నేను చూచాను. ఆమె నాతో చాలా విషయాలు మాట్లాడింది. నీవు, సీత చిత్రకూట పర్వతము మీద ఉండగా జరిగిన కాకి వృత్తాంతము నాకు ఆనవాలుగా చెప్పింది.

ఆమెనాతో ఇలా అంది. "ఓ హనుమా! నీవు ఇక్కడ చూచిన విషయాలు చూచినట్టు రామునితో, సుగ్రీవునితో చెప్పు. నన్ను చూచి నట్టు ఆనవాలుగా ఈ చూడామణిని రామునికి ఇవ్వు. రామునితో ఇంకా నామాటగా ఇలా చెప్పు. "ఓ రామా! నేను ఇంక ఒక్క మాసము మాత్రమే జీవిస్తాను. ఆ తరువాత నేను జీవించుట దుర్లభము." అని సీత నీతో చెప్పమని నాతో చెప్పింది " అని హనుమంతుడు రామునితో సీత గురించి చెప్పాడు. సీత తనకు ఆనవాలుగా ఇచ్చిన చూడామణిని రామునికి ఇచ్చాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము అరువది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# సుందర కాండము

## అరువది ఆరవ సర్గ

హనుమంతుడు ఇచ్చిన చూడామణిని చూడగానే రామునికి సీతను చూచినట్టు అనిపించింది. రామునికి దు:ఖము పొర్లుకొచ్చింది. మాటి మాటికీ చూడామణిని చూస్తూ రాముడు ఏడుస్తున్నాడు. రాముడు తన మిత్రుడు సుగ్రీవుని చూచి ఇలా అన్నాడు.

" సుగ్రీవా! ఈ చూడామణి మా వివాహ సమయములో నా మామ గారు అయిన జనక మహారాజు సీత శిరస్సున ధరించడానికి ఆమెకు ఇచ్చారు. ఈ మణి జలములో నుండి పుట్టింది. ఈ మణి తొలుత దేవేంద్రుని వద్ద ఉండేది. జనక మహారాజు ఒక యజ్ఞము చేసినప్పుడు, దేవేంద్రుడు సంతోషించి ఈ మణిని జనకమహారాజుకు ఇచ్చాడు. జనకుడు ఈ మణిని తన కుమార్తె సీతకు ఇచ్చాడు. ఈ మణిని చూస్తుంటే నాకు నా తండ్రి దశరథుడు, నా మామగారు జనక మహారాజు గుర్తుకువస్తున్నారు. సీత ఎల్లప్పుడూ ఈ మణిని తన శిరస్సున ధరించేది. ఈ మణిని చూస్తుంటే నాకు సీతను చూస్తున్నట్టు ఉంది.

లక్ష్మణా! చూచావా! సీత నా దగ్గర లేదు. కానీ సీత ధరించిన మణి నా దగ్గర ఉంది. లక్ష్మణా! సీత ఇంక ఒక మాసము రోజులు మాత్రమే జీవించి ఉండునట! సీత లేనిదే నాకు జీవితము లేదు. నన్ను వెంటనే సీత ఎక్కడ ఉందో అక్కడకు తీసుకొని వెళ్లండి. సీతను చూడకుండా నేను క్షణకాలం కూడా ఉండలేను. సీత ఎక్కడ

ఉన్నదో తెలిసి కూడా నేను ఇక్కడ ఉండలేను. ఆ రాక్షసులు నా సీతను ఎన్నిబాధలు పెడుతున్నారో ఏమో! ఎల్లప్పుడు చంద్ర బింబము మాదిరి ప్రకాశించే నాసీత ముఖం ఆ రాక్షసులు అనే మబ్బులతో కప్పబడి ఉంది. ఓ హనుమంతుడా! ఇంకా నా సీత ఏమేమి చెప్పింది. వివరంగా చెప్పు. సీత మాటలు వింటూ నేను ఊరటపొందుతాను." అని అడిగాడు రాముడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము అరువది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము

ఆరువది ఏడవ సర్గ.

రాముని మాటలు విన్న హనుమంతుడు, రామునితో సీత గురించి ఇలా చెప్పసాగాడు. "ఓ రామా! చిత్రకూట పర్వతము మీద మీరూ, సీతాదేవి ఏకాంతముగా ఉన్న సమయంలో జరిగిన కాకి విషయం ఆనవాలుగా చెప్పమని నాతో చెప్పింది. ఎందుకంటే ఆ విషయము మీకు, సీతాదేవికి తప్ప మూడో వానికి తెలియదట.

మీరు, సీతా దేవి చిత్ర కూడ పర్వతము మీద ఉన్నప్పుడు, మీరు ఇద్దరూ నిద్రపోతున్నారట. సీతాదేవి ముందే మేలుకొన్నదట. మీరు ఇంకా నిద్రపోతున్నారట. అప్పుడు ఒక కాకి వచ్చి సీతాదేవి స్తనముల మధ్య తన ముక్కుతో చీరినదట. అలా మాటి మాటికీ ఆ కాకి చీరుతూ ఉంటే సీతా దేవి శరీరమునుండి రక్తము వచ్చినదట. ఆ రక్తము నీ

శరీరమును తడుపగా నీవు మేల్కొన్నావట. నిద్రలోనుండి మేల్కొన్న నీవు, గాయపడిన సీతను, చూచి కోపంతో ఊగిపోయావట. "సీతా! నిన్ను ఎవరు గాయపరిచారు. చెప్పు" అని అడిగావట. అప్పుడు సీత ఆ కాకిని చూపినదట. నీవు రక్తముతో తడిసిన గోళ్లతో ఉన్న కాకిని చూచావట. నీవు ఒక దర్భను తీసుకొని మంత్రించి ఆ కాకి మీదికి విసిరావట. అప్పుడు ఆ దర్భ మండుతూ, ఆ కాకిని దహించడానికి ఆ కాకిని తరుముతూ వెళ్లిందట. ఆ కాకి తన తండ్రి అయిన దేవేంద్రుని వద్దకు వెళ్లినదట. దేవేంద్రుడు తన నిస్సహాయతను వ్యక్తం చేయడంతో, ఆ కాకి ముల్లోకములు తిరిగి తిరిగి ఆఖరుకు నీ వద్దకు వచ్చి శరణు వేడినదట. నీవు ఆ కాకిని దయతో రక్షించావట. నీవు ప్రయోగించిన అస్త్రము వృథా కారాదని, ఆ మండుతున్న దర్భతో ఆ కాకి కుడి కన్నును పొడిచావట. బతుకుజీవుడా అంటూ ఆ కాకి నీకు, సీతకు నమస్కరించి వెళ్లిపోయినదట.

రామా! ఇంకా సీత నాతో ఇలా చెప్పింది. "కాకి మీదనే బ్రహ్మాస్త్రము ప్రయోగించిన నా రాముడు ఈ రాక్షసులను ఎందుకు ఉపేక్షిస్తున్నాడు. దేవ,దానవ,గంధర్వ,యక్షులు యుద్ధములో నా రాముని ముందు నిలువలేరు అని నాకు తెలుసు. ఇంక ఈ రావణుడు, ఈ రాక్షసులు ఎంత? కాని ఎందుకో రామలక్ష్మణులు నన్ను రక్షించడానికి రావడం లేదు?" అని సీతాదేవి దీనంగా పలికింది.

ఆ మాటలు విన్న నేను సీతాదేవితో ఇలా అన్నాను. "అమ్మా సీతా దేవీ! రాముడు అతి త్వరలో వానర సైన్యముతో లంకకు వచ్చి రావణుని చంపి నిన్ను రక్షిస్తాడు. అయోధ్యకు తీసుకొని వెళతాడు." అని ఆమెను ఊరడించాను. తమరికి ఆనవాలుగా చూపించడానికి ఏదైనా

ఆనవాలు ఇమ్మని అడిగాను. అప్పుడు సీతా దేవి తాను ధరించిన వస్త్రములో మూట కట్టబడి ఉన్న ఈ చూడామణిని తీసి నాకు ఇచ్చింది. నేను ఆ మణిని భక్తితో స్వీకరించి, వెనక్కు వస్తూ ఉండగా సీతాదేవి నాతో ఇలా అంది. "ఓ హనుమా! రాముని లక్ష్మణుని, నీ రాజు సుగ్రీవుని కుశలము అడిగానని చెప్పు." అని చెప్పింది.

ఓ రామా! నేను సీతను చూచాను. సీత చెప్పమన్న మాటలు నీతో చెప్పాను. నన్నునమ్మండి." అని పలికాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
సుందర కాండము అరువది ఏడవసర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

సుందర కాండము
అరువది ఎనిమిదవ సర్గ.

"ఓ రామా! నేను బయలు దేరి వస్తుంటే సీతమ్మ నాతో ఇంకా ఈ విధంగా పలికింది.

"హనుమా! ఇక్కడ జరుగుతున్న విషయములు యధాతథముగా రామునికి చెప్పి రాముని ఇక్కడకు తీసుకొని వచ్చి, రావణ సంహారము చేసి, నన్ను రక్షించునట్టు చెయ్యి. ఓ హనుమా! నీవు ఇక్కడ ఉన్నంత సేపూ నేను ఎంతో ధైర్యంగా ఉన్నాను. ఇప్పుడు నీవు వెళిపోతున్నావు, మరలా నా కష్టాలు మొదలవుతాయి. రాముడు

తన సమగ్రసైన్యముతో వచ్చి, రావణుని జయించి నన్ను తీసుకొని వెళ్లడం రామునికి యశస్సు కలిగిస్తుంది. అంతేకానీ, రావణుడు నన్ను దొంగతనంగా తీసుకొని వచ్చినట్టు నీవు కూడా నన్ను దొంగతనంగా తీసుకొని వెళ్లడం మంచిది కాదు.” అని పలికింది సీత.

ఆ మాటలకు నేను సీతాదేవితో ఇలా అన్నాను. “అమ్మా! సుగ్రీవుని వద్ద ఉన్న వానరులు సామాన్యులు కారు. ఆకాశంలో ఎగురుతూ భూమిని చుట్టిరాగల సమర్థులు. ఆ వానరసేన లంక మీద ఎగరడం, లంకను చుట్టుముట్టడం నీవు తొందరలోనే చూస్తావు. వారితో పాటు వచ్చిన రాముడు, శత్రు సంహారము చేసి, నిన్ను తీసుకొని అయోధ్యానగరము చేరి, అయోధ్యము పట్టాభిషిక్తుడవడం నీవు తొందరలోనే చూడగలవు.ష” అని నేను సీతాదేవికి ధైర్యము చెప్పాను. సీతాదేవి నా మాటలతో మనస్సులో శాంతిని పొందింది.” అని హనుమంతుడు రామునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము

సుందర కాండము అరవైఎనిమిదవ సర్గ సంపూర్ణము.

సుందర కాండము సర్వం సంపూర్ణం.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

దీనితో సుందర కాండముపారాయణపూర్తి అయింది. సుందర కాండము పారాయణ పూర్తి అయిన తరువాత చదువుకోవలసిన శ్లోకములు కింద ఇస్తున్నాను. చదువుకోండి.

స్వస్తి ప్రజాభ్య: పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశా:।
గోబ్రాహ్మణేభ్య: శుభమస్తు నిత్యం లోకా: సమస్తా సుఖినో భవంతు॥

కాలే వర్షతు పర్జన్య: పృథివీ సస్యశాలినీ
దేశోయం క్షోభరహితో బ్రాహ్మణా: సంతు నిర్భయా:॥

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాధాయ నాధాయ సీతాయా: పతయే నమ:॥

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥

కాయేన వాచా మనసేంద్రియైర్వా బుధ్యాత్మనా వా ప్రకృతే: స్వభావాత్।
కరోమి యద్యత్ సకలం పరస్మై శ్రీమన్నారాణాయేతి సమర్పయామి.

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ శ్రీ నారాయణ నమోస్తుతే॥

అనేన శ్రీమద్రామాయణ సుందరకాండ పారాయణేన
భగవాన్ సర్వదేవతాత్మక: సీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత
శ్రీరామచంద్ర: సుప్రీత: సుప్రసన్నో వరదో భవతు.

శుభం.

# శ్రీమద్రామాయణము

## యుద్ధ కాండము

(మొదటి భాగము)

సంస్కృత మూలము

భగవాన్ వాల్మీకి మహర్షి

తేటతెలుగులో

మొదలి వెంకట సుబ్రహ్మణ్యం

2-31, చైతన్యపురి,

హైదరాబాదు 500060

ఫో: 24048104

సెల్: 9391134792

# శ్రీమద్రామాయణము
## యుద్ధకాండము.

శ్రీరాముడు హనుమంతుడు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నాడు. చాలా సంతోషించాడు.

"హనుమా! ఇతరులకు దుర్లభమైన కార్యమును నువ్వు నెరవేర్చావు. నాకు చాలా సంతోషంగా ఉంది. నూరు యోజనముల దూరము ఉన్న సముద్రమును వాయు దేవుడు, గరుడుడు, నీవు తప్ప తక్కిన వారు దాటలేరు. అంతే కాదు, దేవతలకు, దానవులకు, గంధర్వులకు, నాగులకు కూడా ప్రవేశించుటకు వీలుకాని లంకానగరములోకి ప్రవేశించి క్షేమంగా తిరిగి వచ్చావు. అది నీకే సాధ్యమయింది.

దీనిని బట్టి చూస్తే లంకా నగరములోకి హనుమంతుడు, అతనికి సమానమైన బలపరాక్రమ ములు కల వాడు తప్ప, ఇతరులు ప్రవేశించలేరు అని తెలిసింది. కేవలము హనుమంతుడే తన బలమును పరాక్రమమును ఉపయోగించి సుగ్రీవుని ఆజ్ఞను నెరవేర్చాడు. అది ఎంత కష్టమైన కార్యము అయినా, దానిని ఆసక్తితో, చాకచక్యముతో నెరవేర్చినవాడే భృత్యులలో ఉత్తముడు అని చెప్పబడతాడు. బుద్ధిముంతుడు, సమర్థుడు అయి ఉండి కూడా, చెప్పిన పనిని ఎంత వరకు చెప్పాడో అంతవరకే చేసేవాడిని మధ్యముడు అని చెప్పబడతాడు. బుద్ధిమంతుడు, సమర్థుడు అయి ఉండి కూడా, రాజు చెప్పిన కార్యమును శ్రద్ధతో చేయడో, అతడు అధముడుఅని చెప్పబడతాడు. హనుమంతుడు ఉత్తముడైన భృత్యుడు.

సుగ్రీవుడు చెప్పినదాని కంటే ఎక్కువే చేసుకొచ్చాడు

హనుమంతుడు. పైగా అత్యంత చాకచక్యంతో సమర్ధతతో చేసుకొచ్చాడు. సుగ్రీవునకూ, నాకూ సంతోషాన్ని కలిగించాడు. ఈ హనుమంతుడు లంకకు పోయి సీతను చూచి వచ్చి నన్ను, లక్ష్మణుని, రఘువంశమును రక్షించాడు. నాకు ఇంతటి ప్రియమును చేకూర్చిన హనుమంతునికి నేను ఏమీ ప్రత్యుపకారము చేయలేకున్నాను. నాకు చాలా బాధగా ఉంది.

హనుమా! ఇటురా. ఈ ఆనంద సమయంలో నేను నీకు నా ఆలింగనము తప్ప వేరే ఏమీ ఇవ్వలేకున్నాను." అని పలికి రాముడు హనుమంతుని తన రెండు చేతులు చాచి గాఢంగా కౌగలించుకున్నాడు.

తరువాత రాముడు సుగ్రీవుని, దక్షిన దిక్కుకు వెళ్లిన వానరములను, వానర సైన్యాధిపతులను చూచి ఇలా అన్నాడు. "మీరందరూ సీతాన్వేషణమును విజయవంతంగా పూర్తిచేసారు. సీతను గురించిన సమాచారమును తీసుకొని వచ్చారు. కాని నూరు యోజనముల పొడవు ఉన్న సముద్రమును తలచుకుంటేనే భయంగా ఉంది. సీతను గురించి తెలిసినది కానీ, మన వానర సైన్యము ఆ సముద్రమును ఎలా దాటగలదో తెలియకుండా ఉంది." అని చింతాక్రాంతు డయ్యాడు రాముడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము మొదటి సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## రెండవ సర్గ.

రాముడు పలికిన పలుకులు విన్న సుగ్రీవుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! నీవుమహా వీరుడవు. ఈ చిన్నవిషయానికి సామాన్యుని వలె ఇంతగా చింతించవలెనా! ఓరామా! ఇప్పుడు మనకు సీత ఎక్కడ ఉందో తెలిసింది. ఆమెను ఎవరు అపహరించుకొని వెళ్లారో, శత్రువు ఎక్కడ ఉంటాడో తెలిసింది. ఇంక యుద్ధమే మిగిలింది. దీనికి దు:ఖించడం ఎందుకు?

రామా! నీవు బుద్ధిమంతుడవు. సకల శాస్త్ర పారంగతుడవు. మంచి ఆలోచనా శక్తి కలవాడవు. ఎంతటి క్లిష్ట సమయంలో కూడా సరి అయిన నిర్ణయాలు తీసుకోడంలో సమర్ధుడవు. కాబట్టి ఈ చిన్న చిన్న విషయాల గురించి ఆలోచించడం వదిలిపెట్టు. మనం అందరం అపారమైన వానరసేనతో సముద్రమును దాటి లంకకు వెళుతున్నాము. నీ శత్రువును సంహరిస్తున్నాము. సీతను అయోధ్యకు తీసుకొని వస్తున్నాము. ఓరామా! నిరుత్సాహంతో, బుద్ధిమందగించి, చేయబోయే కార్యమును గురించి దిగులు పడే వాడికి అతడు తలపెట్టిన కార్యములు నెరవేరవు. పైగా అన్నీ కష్టాలే కలుగుతాయి.

ఓ రామా! ఒక్కసారి ఈ వానర నాయకులను ఒక్కసారి చూడు. వీరు అత్యంత శూరులు. ఏ పని చెయ్యడానికైనా సమర్ధులు. నీవు ఆజ్ఞాపిస్తే అగ్నిలో కూడా దూకడానికి వెనుకాడరు. వారి మొహాలలో తొణికిసలాడుతున్న సంతోషాన్ని గమనించు. కాబట్టి, లంకను ఎలా చేరుకోవాలా అనే సందేహమును వదిలిపెట్టి, రావణుని ఎలా జయించాలో, సీతను

ఎలా తీసుకురావాలో ఆలోచించు. నూరు యోజనములపొడవు ఉన్న సముద్రము మీద సేతువును ఎలా నిర్మించాలో ఆలోచించు. సముద్రము మీద సేతువును నిర్మించకుండా మనము సాగరమును దాటలేము. మనము సేతువును నిర్మించి, సముద్రము దాటి లంకను చేరితో చాలు, మన రాకను విని రావణుడు సగం చస్తాడు.

ఇదంతా జరగాలంటే ముందు నీ మనస్సులో మెదులుతున్న వైక్లబ్యాన్ని విడిచిపెట్టాలి. ధైర్యంగా ఆలోచించాలి. మనస్సు బలహీనమైతే, మనిషిలో ఉన్న శౌర్యము నశించిపోతుంది. నీ సహజ శౌర్యాన్ని, బలాన్ని ప్రదర్శించు. కార్య సాధనకు ఉపక్రమించు. అంతే గాని సముద్రము ఎలా దాటాలా అనే దాని గురించి ఆలోచిస్తూ దిగులుపడవద్దు. శోకము సకల కార్యములను నాశనం చేస్తుంది. నీకుసాయంగా నేను ఉన్నాను. ఈ వానర వీరులు ఉన్నారు. మనమంతా కలిసి శత్రువును జయిస్తాము. సందేహము లేదు.

రామా! నీవు ధనుస్సు చేత ధరించి, రణరంగములో నిలిస్తే, నీకు ఎదురు నిలిచేవాడు ఈ ముల్లోకములలో లేడు. అటువంటప్పుడు నీవు ఇలా శోకించడంలో అర్థం లేదు. నీ శోకాన్ని విడిచి పెట్టు. మనమంద రమూ సముద్రమును దాటి లంకను చేరి, సీతను చూస్తాము. ఇది నిజం. కాబట్టి మనం అందరం ఇప్పుడు సముద్రమును ఎలా దాటాలా అని ఆలోచించాలి. ఒక సారి సముద్రము దాటితే జయం మనదే అవుతుంది అనడంలో సందేహము లేదు. ఎందుకంటే ఈ వానరులు అందరూ పరాక్రమవంతులు. రాక్షసులను నాశనం చేయగల సమర్థులు. మనం అందరం ఏదో విధంగా సముద్రమును దాటగలమని అనుకుం టున్నాను. నాకు మంచి శకునములు కనపడుతున్నాయి. మనకు విజయం

తథ్యం." అని ధైర్యవచనాలు పలికాడు సుగ్రీవుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
మూడవ సర్గ.

సుగ్రీవుడు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నాడు రాముడు. సముద్రము మీద వారధి కట్టి సముద్రమును దాటాలి అన్న ఆలోచన రామునికి బాగా నచ్చింది. వెంటనే హనుమంతుని చూచి ఇలా అన్నాడు. "హనుమా! సముద్రమును దాటడానికి మూడు మార్గాలు ఉన్నాయి. ఒకటి తపశ్శక్తి. రెండు. సముద్రమును ఎండించి, అప్పుడు దాటడం. మూడవది సముద్రము మీద వారధి కట్టడం. ఈమూడు చేయడానికి నేను సమర్థుడను. నీవు లంకను బాగా పరిశీలించావు కదా! లంకలో ఎన్ని దుర్గములు ఉన్నాయి? అవి ఎలా నిర్మింపబడ్డాయి. రక్షణ ఏర్పాట్లు ఎలా ఉన్నాయి. లంకలో ఎంత మంది సైనికులు ఉన్నారు. నగరంలో ప్రవేశించడానికి ద్వారములు ఎన్ని ఉన్నాయి. నగరం పరిమాణం ఎంత. నాకు సవిస్తరంగా చెప్పు. " అని అడిగాడు.

రాముడికి నమస్కరించి హనుమంతుడు ఇలా చెప్పసాగాడు. "ఓ రామా! నాకు తెలిసినంతవరకూ, లంకా నగరము గురించి, దుర్గ నిర్మాణము గురించి చెబుతాను.

లంకలో లెక్కకు మించి ఏనుగులు, రథములు ఉన్నాయి. లంక చాలా విశాలమైన నగరము. అది ఒక పర్వతము మీద నిర్మింపబడి ఉంది. లంకా నగరమునకు నాలుగు పక్కలా నాలుగు ప్రధాన ద్వారములు ఉన్నాయి. ఆ ద్వారములకు ధృడంగా, గట్టిగా నిర్మించ బడ్డ దుర్భేద్యమైన తలుపులు పెద్ద పెద్ద గడియలతో బంధింపబడి ఉన్నాయి. కోటలో నుండి పెద్ద పెద్ద బండ రాళ్లు, బాణములు శత్రువుల మీద ప్రయోగించడానికి రకరకాలైన యంత్రములు కోట గోడల మీద అమర్చబడి ఉన్నాయి. వాటి సాయంతో బయట నుండి వచ్చే శత్రు సైన్యములను అరికట్టవచ్చును. అవే కాకుండా వందల కొద్దీ శతఘ్నులు ఇనుముతో తయారు చేయబడినవి ద్వారముల వద్ద అమర్చబడి ఉన్నాయి. వాటిని ఏ క్షణంలో అయిన ఉపయోగించడానికి వందలకొద్దీ రాక్షసులు సర్వసన్నద్ధంగా ఉన్నారు.

లంకా నగరమునకు అమర్చబడిన ద్వారములు అన్నీ బంగారుతో చేయబడి ఉన్నాయి. లంకా నగరము చుట్టు ఉన్న పరిఖలలో అంటే కందకములలో నీళ్లు పుష్కలంగా ఉన్నాయి. ఆ కందకములలో భయంకరమైన మొసళ్లు ఉన్నాయి. ఆ పరిఖల మీద నాలుగు ద్వారముల వద్ద నాలుగు వంతెనలు అమర్చబడి ఉన్నాయి. ఆ వంతెనల వద్ద కూడా పెద్ద పెద్ద యంత్రములు అమర్చబడి ఉన్నాయి. శత్రు సైన్యములు దాడి చేసినప్పుడు, రాక్షసులు ఆ యంత్రముల ద్వారా బాణములు, బండరాళ్లు విసిరి ఆ వంతెనలను కాపాడుతూ ఉంటారు.

రావణుడు కూడా ఎల్లప్పుడూ యుద్ధమునకు సిద్ధముగా ఉన్నాడు. చాలా అప్రమత్తంగా ఉన్నాడు. రావణుని సైన్యము కూడా ఏ క్షణంలో ఆపద వచ్చినా ఎదుర్కోడానికి సిద్ధంగా ఉంది. ఆ లంకానగరము

ఎత్తైన పర్వత శిఖరము మీద ఉండటం వలన, చుట్టూ పర్వతములు, దట్టమైన అరణ్యములు ఉండటం వలనా, లంకా నగరము చేరుకోడానికి తగిన ఆధారములు లేవు. మనము లంకకు చేరుకోడానికి నౌకా మార్గము లేదు. లంక నుండి వార్తలు కూడా బయటకు వెళ్లలేవు. ఆ లంకా నగరము చుట్టు ఎత్తైన గోడ, కందకములు, పెద్ద పెద్ద ద్వారములు, వాటిని రక్షించు శతఘ్నులు, యంత్రములు ఉండటం వలన లంకలో వానర సేన ప్రవేశించడం చాలా కష్టం.

లంక తూర్పుద్వారమును పదివేల మంది రాక్షసులు శూలములు, ఖడ్గములు ధరించి రక్షిస్తున్నారు. లంక దక్షిణ ద్వారము వద్ద లక్ష మంది సైనికులు కాపలాగా ఉన్నారు. పశ్చిమ ద్వారము వద్ద పది లక్షల మంది సేనలు ఉన్నాయి. అందరూ కత్తులు, డాలులు ధరించి ఉన్నారు. వారు అస్త్రవిద్యలో కూడా నిపుణులు. ఉత్తర ద్వారము వద్ద కోటి మంది సైనికులు కాపలాగా ఉన్నారు. వారందరూ రథములు, అశ్వములు వాహనములుగా ఉపయోగిస్తున్నారు. లంకా నగరము మధ్యలో ఉన్న సైనిక శిబిరములలో దాదాపు కోటికి మించిన రాక్షస వీరులు ఉన్నారు.

రామా! నేను లంకా దహనము చేసేటప్పుడు నాలుగు పక్కల ఉన్న వంతెనలను కూల్చివేసాను. ప్రాకారములు కూల్చాను. నా మీదికి యుద్ధమునకు వచ్చిన రాక్షస వీరులను చంపాను. రాక్షస సేనలను నాశనం చేసాను. రామా! ఇదీ లంకా నగరస్వరూపము. మనము సముద్రము దాటి లంకా నగరము చేరుకుంటాము. ఇది నిశ్చయము. ఇంక మన సేనల సంగతి. మనవారిలో అంగదుడు, ద్వివిదుడు, మైందుడు, జాంబవంతుడు, పనసుడు, అనలుడు, నీలుడు వీరు చాలు లంకను సర్వనాశనము చేసి, రావణుని చంపి సీతను తీసుకురావడానికి.

కాబట్టి లంక మీద దండయాత్ర చేయడానికి మంచి ముహూర్తము నిశ్చయించండి." అని పలికాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నాలుగవ సర్గ.

హనుమంతుడు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నాడు రాముడు. రామునిలోని శౌర్యము, ప్రతాపము ఉప్పొంగింది. "మనమందరము లంకకు చేరుకొని దానిని నాశనం చేద్దాము. సుగ్రీవా! వెంటనే ప్రయాణమునకు ముహూర్తము నిశ్చయించు. వానర సేనలను సర్వసన్నద్ధము కావించు. నా సీతను అపహరించిన ఆ రావణుడు నన్ను తప్పించుకొని ఎక్కడకు పోగలడు? సుగ్రీవా! నేడు ఉత్తరఫల్గునీ నక్షత్రము. రేపు చంద్రుడు హస్తా నక్షత్రంలో ప్రవేశిస్తాడు. అంతే కాకుండా శుభశకునములు కనపడు తున్నాయి. కాబట్టి ప్రయాణమునకు ఇదే మంచి ముహూర్తము. మనకు విజయము తథ్యము. సుగ్రీవా! సైన్యములను బయలుదేరమని ఆజ్ఞాపించు." అని అన్నాడు రాముడు.

సుగ్రీవుడు, లక్ష్మణుడు రాముని ఆదేశములను శిరసావహించారు. తరువాత రాముడు వానర సేనాపతులకు ఈ ప్రకారంగా ఆదేశాలు ఇచ్చాడు. "నీలుడు లక్షమంది సైనికులను తీసుకొని మార్గమును సరి చూచుకుంటూ ముందు వెళతాడు. మన సైనికులు వెనక వస్తారు.

నీలుడు మార్గమధ్యంలో ఫలములు, దుంపలు, చల్లని నీడనిచ్చే అడవులు, నీరు, తేనె ఉన్న మార్గములను ఎంచుకొని ఆ దారిలో ప్రయాణిస్తూ మనకు మార్గము చూపుతాడు. ఓ నీలుడా! మనము సైన్యముతో వస్తున్నామని తెలిసి రాక్షసులు దారిలో కాపు కాచి మనకు ఆహారము దొరక కుండా చేసే అవకాశము ఉంది. కాబట్టి జాగ్రత్తగా ఉండు. మన సైనికులకు సమృద్ధిగా ఆహారము సమకూర్చే బాధ్యత నీది. నీ సైనికులు మార్గ మధ్యంలో ఉన్న పల్లపు ప్రాంతములు, కొండలు గుట్టలు అన్నీ గాలిస్తూ, రాక్షసులు ఎక్కడన్నా దాక్కుని ఉంటారేమో అని చూడవలెను.

తరువాత, కిష్కింధా నగర రక్షణ కొరకు కొంత మంది సైన్యమును ఇక్కడే ఉంచండి. మిగిలిన సైన్యము గుంపులు గుంపులుగా ఏర్పడి వారి వారి నాయకుల ఆజ్ఞానుసారము ముందుకు నడవాలి. మహాబలవంతులైన గజుడు, గవయుడు, గవాక్షుడు సైన్యము ముందు నడుస్తారు. ఋషభుడు వానర సైన్యమునకు కుడి పక్కన రక్షణగా నడుస్తాడు. మహావీరుడైన గంధమాధనుడు సైన్యము ఎడమ పక్కన రక్షకుడిగా నడుస్తాడు. నేను హనుమంతుడు మీద ఎక్కి సైన్యము మధ్యలో నడుస్తాను.. లక్ష్మణుడు అంగదునిమీద ఎక్కి నడుస్తాడు. జాంబవంతుడు, సుషేణుడు, వేగవంతుడు సేనలకు మధ్యలో నడుస్తారు." అని సైన్యములకు ఆదేశాలు ఇచ్చాడురాముడు.

వెంటనే సుగ్రీవుడు వానర సేనలకు రాముడు చెప్పినట్టు చేయమని ఆజ్ఞాపించాడు. సుగ్రీవుని ఆజ్ఞవినగానే వానరులంతా ఒక్కుమ్మడిగా పైకి లేచాయి. అంతా దక్షిణదిక్కుగా ప్రయాణమయ్యారు. రాముడు, హనుమంతుడు ముందు నడుస్తుంటే వానర సేనలు వారిని

అనుసరించి వెళ్లాయి. వానరులంతా గాలిలో ఎగురుతూ వెళుతున్నారు. దారిలో కనపడ్డఫలములను తింటూ తేనెను తాగుతూ ఆకలి తీర్చుకుంటూ ప్రయాణము చేస్తున్నారు. ఆ వానర సేనలు దారిలో ఆడటాడుకుంటూ ఒకరిని ఒకరు తోసుకుంటూ నెట్టుకుంటూ రాక్షసులను ఎలా చంపాలో ముందుగా చూసుకుంటున్నారు.

రాముడి ఆదేశము ప్రకారము నీలుడు, ఋషభుడు, కుముదుడు ముందు నడుస్తూ సైన్యము ప్రయాణించేమార్గమును సరిచూస్తున్నారు. వానర రాజు సుగ్రీవుడు, రామలక్ష్మణులు, సేనలకు మధ్యలో నడుస్తున్నారు. దాదాపు పదికోట్ల మంది వానర సైన్యమునకు శతబలి అనే వానరుడు సైన్యాధ్యక్షుడుగా ఉన్నాడు. నూరు కోట్ల వానరములకు కేసరి, పనసుడు, గజుడు ఆధిపత్యము వహిస్తున్నారు. సుషేణుడు, జాంబవంతుడు, సైన్యమునకు వెనక భాగమును రక్షిస్తున్నారు. వానర వీరుడు నీలుడు సర్వసైన్యాధ్యక్షుడుగా ఉన్నాడు. వలీముఖుడు, ప్రజంఘుడు, జంభుడు, రభసుడు సైన్యము నాలుగుపక్కలా తిరుగుతూ తొందరగా నడవండని ఉత్సాహపరుస్తున్నారు. కోట్ల కొలది వానర సేన పర్వతములు, కొండలు, గుట్టలు అరణ్యములు దాటుకుంటూ ప్రయాణము చేస్తున్నారు.

కొంతమంది వానరులు గాలిలో ఎగురుతుంటే మరి కొంతమంది దుముకుతూ, మరి కొంతమంది నడుస్తూ ప్రయాణిస్తున్నారు. వారి మధ్యలో ఉన్న రాముడు, లక్ష్మణుడు, సూర్యచంద్రుల మాదిరి వెలిగి పోతున్నారు. రాముడు ఎక్కడ శోకసముద్రంలో మునిగిపోతాడో అని లక్ష్మణుడు రాముని చక్కని మాటలతో ఉత్తేజపరుస్తున్నాడు. "రామా! మనమందరము శీఘ్రమే లంకకు చేరి, రావణుని చంపి, సీతను తీసుకొని

వస్తాము. అందరమూ అయోధ్యకు వెళదాము. మనకు అన్నీ శుభ శకునములు కనపడుతున్నాయి. వాయువు మనకు అనుకూలంగా వీస్తున్నాడు. ఈ సమయములో శుక్రుడు నీకు అనుకూలంగా ఉన్నాడు. (శుక్రమహర్దశ) విశాఖ నక్షత్రము వేరే దుష్టగ్రహములతో కలవకుండా నిర్మలంగా ఉంది. విశాఖ నక్షత్రము మన ఇక్ష్వాకు వంశీయుల నక్షత్రము. రాక్షస నక్షత్రమైన మూలా నక్షత్రమునకు అధిదేవత నిరృతి. ఆ మూలా నక్షత్రమును తోకచుక్క ఆవహించింది. అది రాక్షసులకు అనర్థహేతువు. రాక్షసులకు మృత్యువు ఆసన్నమయింది అనడానికి ఇదే సంకేతము. కాబట్టి రామా! ఈ శుభశకునములను చూచి నీవు సంతోషించాలి." అని పలికాడు లక్ష్మణుడు.

ఆ వానరసేనలు ప్రయాణిస్తుంటే వానరులతో భూమి అంతా కప్పబడి పోయిందా అన్నట్టు కనపడుతూ ఉంది. ఆ వానర సేనలు ఎక్కడా నిలువ కుండా నిరంతరాయంగా ప్రయాణం సాగిస్తున్నాయి. వానర సేనలు సహ్య, మలయ పర్వతములను అధిగమించి ముందుకు సాగుతున్నారు. ఆ పర్వతముల మీద ఉన్న చెట్ల నుండిఫలములను కోసి తింటూ, తేనెను తాగుతూ, చెట్లను కింద పడవేస్తూ, ఆడుతూ పాడుతూ గెంతుతూ, ప్రయాణిస్తున్నారు. వారందరూ సహ్యపర్వతమును, మలయ పర్వతమును దాటి సముద్ర తీరము చేరుకున్నారు.

రాముడు మహేంద్ర పర్వత శిఖరము మీద నిలబడి సముద్రమును చూచాడు. ఇలా అన్నాడు. "సుగ్రీవా! మనము మొదట్లో అనుకున్న చింత మరలా మొదలయింది. ఇంత విశాలమైన సముద్రమును, అలలతో భయంకరంగా ఉన్న సముద్రమును ఎలా దాటడమా అని ఆలోచిస్తున్నాను.

ఈ సముద్రమునకు ఆవల గట్టు కనిపించడం లేదు. దీనిని ఏదో ఒక ఉపాయమే చేత దాటాలి కానీ మరొక విధంగా దాటలేము. కాబట్టి సుగ్రీవా! మన సైన్యమును ఇక్కడే ఉండమని చెప్పు. మనము ఈ సముద్రమును ఎలా దాటాలో ఆలోచిద్దాము." అని అన్నాడు రాముడు.

రాముని ఆదేశము మేరకు సుగ్రీవుడు వానర సేనను అక్కడ ఆగమని ఆజ్ఞాపించాడు. అందరూ అక్కడ ఉన్న చెట్ల కింద విశ్రాంతి తీసుకుంటున్నారు. ఎవరి అధీనములో ఉన్న సేనలను వారు ఆజ్ఞాపిస్తున్నారు. వానర సేన అరిచే అరుపులు, పెట్టే కేకలు, చేసే ధ్వనులు సాగర ఘోషను మించిపోయాయి. అప్పటికి సాయంకాలము అయింది. చంద్రుడు ఉదయిస్తున్నాడు. చంద్రోదయ కాలంలో సాగరము ఉధృతంగా ఉప్పొంగుతూ ఉంది. పెద్ద పెద్ద అలలు ఎగిసిపడుతూ తీరాన్ని తాకుతూ ఉన్నాయి. చూచే వారికి ఆకాశము సముద్రము కలిసిపోయాయా అన్నట్టు కనపడుతూ ఉంది. రెండూ నీలి రంగులో ఉండటం వలన ఆకాశానికి సముద్రానికి భేదం తెలియకుండా ఉంది. సముద్రము ఒడ్డున కూర్చుని ఉన్న వానర ప్రముఖులు అనంతమైన ఆ సముద్రాన్ని చూస్తూ ఉన్నారు. ఆమహాసముద్రమును ఎలాదాటాలా అని ఆలోచిస్తున్నారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# యుద్ధకాండము

## ఐదవ సర్గ.

నీలుడు తన సేనలను సముద్రము ఉత్తరదిక్కుగా నిలిపాడు. మైందుడు, ద్వివిదుడు వానర సేనలు విడిది చేసిన ప్రాంతం అంతా సంచరిస్తూ, వారి రక్షణ గురించి తగు జాగ్రత్తలు తీసుకుంటున్నారు. ఆ సముద్రమును చూస్తున్నరాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు.

"లక్ష్మణా!రోజులు గడిచే కొద్దీ మనిషిలో ఉన్న శోకము తగ్గి పోతుంది అంటారు. కానీ సీత గురించి నేను పడుతున్న శోకము తగ్గకపోగా రోజు రోజుకూ పెరిగిపోతూ ఉంది. లక్ష్మణా! ఈ గాలి ముందు నా సీత మీద ప్రసరించి, తరువాత నా మీద ప్రసరిస్తే నేను నా సీతను స్పృశించిన సుఖమును పొందుతాను. నా సీత ఇప్పుడు చంద్రుడిని చూస్తూ ఉంటుంది. నేను కూడా అదే చంద్రుడిని చూస్తున్నాను. అప్పుడు మా ఇరువుని చూపులు కలిసినట్టే కదా! నేను, సీత ఇదే భూమి మీద ఉన్నాము. అంటే నేను నా సీత దగ్గర దగ్గరగా ఉన్నట్టే కదా! నా సీతను రావణుడు తీసుకొని పోతుంటే నా సీత అరిచిన అరుపులు నాకు హృదయవిదారకంగా వినపడుతున్నాయి. నేను ఏమీ చేయలేని అసమర్థుడిలా మిగిలిపోయాను.

సీత లేని తాపము నేను భరించలేను. ఈ సముద్రము జలములలో మునిగి నా తాపమును చల్లార్చు కుంటాను. నేను ఎన్నడు ఈ సముద్రమును దాటి, రావణుని చంపి, నా సీతను తిరిగి పొందుతానో కదా! ఆ రాక్షసుల మధ్య అనేక బాధలు పడుతూ ఉన్న నా సీత, నాధుడు కలిగి ఉండి కూడా అనాధగా విలపిస్తూ ఉంది కదా! పుట్టినప్పటి నుండీ

జనక మహారాజు సంరక్షణలో ఎన్నోభోగాలు అనుభవించి, తరువాత దశరథమహారాజు ఇంటికి కోడలిగా వచ్చిన నా సీత ఆ క్రూరులైన రాక్షస స్త్రీల మధ్య ఎలా ఉందో కదా! నా మీద దిగులుతో సరిగా ఆహారం కూడా తీసుకోని సీత, ఎంతగా చిక్కిపోయిందో కదా! నేను ఆ రావణుని ఎప్పుడు చంపి నా సీతను పొందుతానో కదా!" అని తీవ్రంగా రాముడు విలపి స్తున్నాడు.

ఆప్రకారంగా విలపిస్తున్న రాముని లక్ష్మణుడు ఓదార్చాడు. తరువాత వారు సాయంసంధ్యలో చేయవలసిన సంధ్యావందనాది కార్యక్రమములు నిర్వర్తించారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

యుద్ధకాండము
ఆరవ సర్గ.

ఇక్కడ పరిస్థితి ఇలా ఉంటే అక్కడ లంకాపురిలో రావణుడు చింతాక్రాంతుడయి ఉన్నాడు. ఒక కోతి వచ్చి లంకను దహనం చేసింది. తన కుమారుని చంపింది. వేలకొద్దీ రాక్షస వీరులను హతమార్చింది. రావణుని మనసంతా కలత చెందింది. తన మంత్రులతో సమావేశము ఏర్పాటు చేసాడు. "ఒక వానరము శత్రుదుర్భేధ్యమైన లంకా నగరంలో ప్రవేశించి అశోక వనములో ఉన్న సీతను చూడగలిగాడు. అంతే కాకుండా అశోక వనములో ఉన్న చైత్యప్రాసాదమును నాశనం చేసాడు. ఎందరో

రాక్షసులను చంపాడు. లంకను కాల్చాడు. ఇప్పుడు మనం ఏం చేయాలి. ఏం చేస్తే బాగుంటుంది. మీకు తోచిన విధంగా నాకు సలహాలు ఇవ్వండి. ఈ సమయములో నేను ఒక్కడినే నిర్ణయం తీసుకోవడం మంచిది కాదు. ఇదంతా రాముని వలన జరిగింది. రాముని విషయంలో మనం ఏం చెయ్యాలి.

లోకంలో మూడు రకాలైన మనుషులు ఉంటారు. వారు ఉత్తములు, మధ్యములు, అధములు. రాజు హితము కోరేవారు, మంత్రాంగములో సమర్థులు, హితులతోనూ, బంధువులతోనూ బాగా ఆలోచించి నిర్ణయం తీసుకొనే వాళ్లు, దైవానుకూలము కొరకు ప్రయత్నము చేసేవారు ఉత్తములు అని పిలువబడుతారు. ఇతరుల ప్రమేయం లేకుండా, ఇతరులతో ఆలోచించకుండా, సొంత నిర్ణయాలు తీసుకొనే వాడు, ఇతరుల సాయం లేకుండా ఒంటరి గానే పనులు చేసేవాడు, మధ్యముడు అని పిలువబడతాడు. పురుష ప్రయత్నం లేకుండా, కేవలం దైవము మీదనే ఆధారపడేవాడు అధముడు అని పిలువబడతాడు.

అలాగే మంత్రాంగములో కూడా ఉత్తమము, మధ్యమము, అధమము అని ఉన్నాయి. శాస్త్రములలో చెప్పిన మాదిరి, మంత్రులతో కలిసి చేసే ఆలోచన ఉత్తమమైన ఆలోచన. మంత్రులతో చర్చించినపుడు బేధాభిప్రాయాలు వచ్చినా, తుదకు చేసే ఏకాభిప్రాయము, సమిష్టినిర్ణయం మధ్యమము అని చెప్పబడుతుంది. అలా కాకుండా ఎవరికి తోచినట్టు వారు మాట్లాడుతూ, ఒకరితో ఒకరు విభేదిస్తూ, ఎంతకూ ఏకాభిప్రాయానికి రాని మంత్రాంగము అధమము అని చెప్పబడుతుంది. కాబట్టి మీరందరూ ఆలోచించి ఒక అభిప్రాయమునకు రండి. దానిని రాజుగా నేను అమలుపరుస్తాను.

అదీ కాకుండా, నాకు అందిన సమాచారము ప్రకారము రాముడు అసంఖ్యాకమైన వానర సేనలతో లంకా నగరము మీదికి దండెత్తి వస్తున్నాడు అని నాకు తెలిసింది. వారంతా సాగరమును దాటి లంకను చేరుకోగలరు అని నేను అనుకుంటున్నాను. రాముడు తన బలపరాక్రమ ములతో సముద్రమును ఎండింపచేయగలడు. లేక మరే ఉపాయము చేతనైనా సముద్రమును దాటవచ్చును. కాబట్టి ఈ క్లిష్ట సమయములో మీరు బాగా ఆలోచించి నాకు ఉత్తమమైన సలహా ఇవ్వండి." అని ముగించాడు రావణుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఆరవర సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
ఏడవ సర్గ.

రాక్షస రాజు రావణుని మాటలు శ్రద్ధగా విన్నారు రావణుని మంత్రులు. బాగా ఆలోచించారు. వారికి తోచిన ఉపాయములను ఇలా చెప్పసాగారు. "రాక్షసేంద్రా! మన రాక్షస బలము తక్కువ కాదు. పరిఘలు, కత్తులు, పట్టిశములు మొదలగు మారణాయుధములను ధరించిన రాక్షససేన లెక్కకు మించి ఉంది. నీకు దిగులుపడాల్సిన పనిలేదు. ఇంక నీ బలపరాక్రమములు తక్కువేమీ కాదు. నీవు పాతాళములో ఉన్న భోగవతీ నగరమును జయించిన వీరుడివి. యక్షులను జయించి, యక్షరాజు, నీ సోదరుడు అయిన కుబేరుని ఓడించిన శూరుడవు. మహేశ్వరునకు సఖుడు అని చెప్పుకొనుచున్న కుబేరుని గర్వము అణిచిన మహాబలుడవు.

కుబేరుని వద్దనుండి పుష్పకమును తీసుకొని వచ్చిన ధీరుడవు. దానవ రాజు మయుడు నీ బలపరాక్రమములకు భయపడి తన కుమార్తె మండోదరిని నీకు ఇచ్చి వివాహం చేసాడు. నీతో బంధుత్వము కలుపు కున్నాడు. దానవ వీరుడు, నీ సోదరి కుంభీనసి భర్త అయిన మధువును ఓడించిన పరాక్రమశాలివి. నీవు రసాతలములో ఉన్న వాసుకి, తక్షకుడు, శంఖుడు మొదలగు నాగులను జయించి, నాగజాతిని వశం చేసుకున్నావు. నీవు ఒంటరిగానే కాలకేయులు అనే దానవులను జయించావు. వాళ్ల దగ్గర నుండి అనేక మాయలను గ్రహించావు. చతురంగ బలములు కలిగిన వరుణ పుత్రులను జయించిన మహా వీరుడవు నీవు.

నీవు యమలోకమును జయించి యముని యమలోకము నుండి పారిపోయేట్టు చేసావు. నీవు ఈ భూలోకములో ఉన్న ఎంతో మంది క్షత్రియులను సంహరించావు. వారితో పోలిస్తే ఈ రాముడు ఎంత? మీరు దీని గురించి ఆలోచించడం అనవసరం. తమరి కుమారుడు ఇంద్రజిత్తు చాలు ఆ వానరులను తుదముట్టించడానికి. ఇంద్రజిత్తు సామాన్యుడు కాదు. మహేశ్వరునే మెప్పించి వరములను పొందిన వాడు. దేవతలను ఓడించి దేవేంద్రుని పట్టిబంధించి తెచ్చిన ధీరుడు ఇంద్రజిత్తు. అంతలో బ్రహ్మదేవుడు జోక్యము చేసుకొని దేవేంద్రుని విడువమని ఇంద్రజిత్తును అర్థించాడు. అప్పుడు ఇంద్రజిత్తు దేవేంద్రుని విడిచిపెట్టగా, దేవేంద్రుడు బ్రహ్మలోకానికి వెళ్లాడు. అటువంటి పరాక్రమవంతుడు ఇంద్రజిత్తు. ఆ ఇంద్రజిత్తును పంపితే చాలు, ఆ వానరసైన్యమును రామునితో సహా సమూలంగా నాశనం చేస్తాడు.

ఓ రాక్షసేంద్రా! ఒక సామాన్యమానవుని వలన వచ్చిన ఈ ఆపదకు చింతించకు. రాముని నీవు వధిస్తావు. విజయము నీకు స్వంతమవుతుంది." అని పలికారు రావణుని మంత్రులు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఏడవసర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
ఎనిమిదవ సర్గ.

తరువాత ప్రహస్తుడు అనే రాక్షస సేనాధిపతి లేచి ఇలా అన్నాడు. "ఓ రాక్షసేంద్రా! నీవు యుద్ధములో దేవతలను, గంధర్వులను, దానవులను, నాగులను జయింప సమర్థుడవు. ఇంక ఈ ఇద్దరు మానవులు నీముందు నిలువగలరా! హనుమంతుడు అనే వానరము వచ్చినప్పుడు మనమందరమూ అప్రత్తంగా, యుద్ధమునకు సిద్ధంగా లేము. అందువలన ఆ వానరము అంతటి దురాగతములు చేయగలిగాడు. లేనిఎడల, ఆ తుచ్ఛ వానరము లంకను దాటి పోగలడా! నీవు ఆజ్ఞాపిస్తే చాలు. ముల్లోకములలో వానరము అనే మాట వినపడకుండా చేస్తాము. వానర జాతిని సర్వనాశనము చేస్తాము. ఓ రాక్షసరాజా! మీరు సుగ్రీవుని విషయం నాకు విడిచిపెట్టండి. వాడిని నేను కట్టడి చేస్తాను. సీతను తీసుకు వచ్చినందుకు మీరేమీ చింతించకండి." అని పలికాడు ప్రహస్తుడు.

తరువాత దుర్ముఖుడు అనే రాక్షసుడు లేచి ఇలా పలికాడు. "ఓ రాజా! ఆ వానరుడు మన లంకకు చేసిన అపకారము సహించరానిది.

ఒక వానరుడు లంకాధిపతిని ఎదిరించడమా! అది మేము సహించడమా! నేను ఇప్పుడే పోయి ఆ వానర జాతిని వారు ఎక్కడ దాక్కున్నా వెతికి వెతికి సర్వనాశనము చేస్తాను." అని అన్నాడు.

తరువాత వజ్రదంష్టుడు అనే రాక్షసుడు ఇలా అన్నాడు. "మనము ఆ వానరము హనుమంతుని గురించి ఆలోచించడం తగని పని. మన దృష్టి ఎప్పుడూ సుగ్రీవుడు, రాముని మీద ఉండాలి. వారిని చంపితే ఈ వానరుడు ఎంత! నాకు అనుమతి ఇస్తే వెంటనే పోయి ఆ రామలక్ష్మణులను, సుగ్రీవుని చంపి వస్తాను. ఎవడైతే సోమరి తనమును విడిచిపెట్టి ఉపాయములతో శత్రునాశనము చేస్తాడో, వాడికి విజయం దక్కుతుంది. మన దగ్గర కామరూపులైన రాక్షసులు ఎందరో ఉన్నారు. వారిచేత మానవ రూపములు ధరింపజేసి, రాముని వద్దకు పంపుదాము. వారు రామునితో ఇలా అంటారు. "ఓ రామా! మేము భరతుని వద్దనుండి వస్తున్నాము. మమ్ములను భరతుడు పంపాడు. భరతుడు తన సేనలతో తమరికి సాయంగా వస్తున్నాడు." అని అంటారు. అప్పుడు రామలక్ష్మణులు, వానర సేన, భరతుని సైన్యముల కొరకు ఎదురు చూస్తూ ఉంటారు. అప్పుడు మనము హటాత్తుగా వారి మీద ఆకాశము నుండి దాడి చేద్దాము. వాళ్ల మీద రాళ్లవాన కురిపిద్దాము. వానర సైన్యమును సర్వనాశనము చేద్దాము. ఆవిధంగా మన వలలో చిక్కిన వానరులను రామలక్ష్మణులను చంపుదాము." అని అన్నాడు.

తరువాత కుంభకర్ణుని కుమారుడు నికుంభుడు అనువాడు లేచి ఇలా అన్నాడు. "మహారాజా! దీనికి ఇంత చర్చ అవసరమా! నన్ను పంపండి చాలు. రామలక్ష్మణులను, సుగ్రీవుని, వానరులను త్రుటిలో చంపి వస్తాను." అని అన్నాడు.

తరువాత వజ్రహనువు అనే రాక్షసుడు లేచి "మీరందరూ పోయి మద్యము సేవిస్తూ, మీ మీ ప్రియురాళ్లతో క్రీడించండి. ఆ వానర సైన్యమును నాకు వదిలిపెట్టండి. ఆ వానరులనంతా నేను ఒక్కడినే తినేస్తాను. నరులను వానరులను చంపుతాను." అని అన్నాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఎనిమిదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## తొమ్మిదవ సర్గ.

తరువాత రాక్షసవీరులైన నికుంభుడు, రభసుడు, సూర్యశత్రువు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, దుర్ధర్షుడు, రశ్మికేతువు, రావణుని కుమారుడు ఇంద్రజిత్తు, ప్రహస్తుడు, విరూపాక్షుడు, వజ్రదంష్ట్రుడు, ధూమ్రాక్షుడు, నికుంభుడు, దుర్ముఖుడు అనే పేరు గల రాక్షస వీరులు రావణునితో తమ తమ శౌర్యప్రతాపాలను ప్రదర్శిస్తూ, వెంటనే హనుమంతుని చంపివేద్దాము అని ప్రతిజ్ఞలు చేసారు. రావణుని మెప్పు సంపాదించడం కోసరం రాక్షస వీరులుచెప్పిన మాటలను రావణుని తమ్ముడు విభీషణుడు శ్రద్ధగా విన్నాడు. వారందరినీ శాంతింపజేసి వారి వారి స్థానములలోకూర్చోపెట్టాడు.

తరువాత విభీషణుడు లేచి సభను ఉద్దేశించి ఇలా అన్నాడు. "ఏదైనా ఒక కార్యమును సాధించాలంటే సామ, దాన, భేదో పాయములను ముందు ప్రయోగించాలి. అవి సఫలము కానప్పుడు దండోపాయమును

ప్రయోగించాలి అని తెలివికలవాళ్లు చెబుతారు. శత్రువు ఏమరిపాటుగా ఉన్నప్పుడు, ఇతర రాజులచేత ఓడింపబడినప్పుడు, వారికి దైవము అనుకూలంగా లేనప్పుడూ, శత్రువును మన పరాక్రమము ఉపయోగించి లొంగదీసుకోవచ్చును.

ప్రస్తుతము మన శత్రువు రాముడు, మహా పరాక్రమవంతుడు. ఏ మాత్రం ఏమరిపాటు లేని వాడు. కోపమును జయించిన వాడు. ఎటువంటి క్లిష్టసమయములోనైనా సరైన నిర్ణయములు తీసుకోగల సమర్థుడు. అటువంటి మహా వీరుడిని మీరంతా ఎలా ఎదుర్కోగలము అని అనుకుంటున్నారు. ఒక వానరము హనుమంతుడు అనే పేరుకలవాడు, సముద్రమము దాటివచ్చి, సీతను చూచి, లంకను దహించి వెళ్లాడు అంటే నమ్మగలరా! కనీసం ఊహించగలరా! మీరంతా ఇప్పటిదాకా మీ మీ పరాక్రమములు గురించి చెప్పుకొన్నారు. మరి శత్రువుల బల పరాక్రమముల గురించి ఆలోచించారా!

ఇంక అసలు విషయానికి వద్దాము. ఈ రాక్షస రాజు రావణుడు, జనస్థానములో ఉన్న రాముని భార్య సీతను, రాముడు ఇంటలేని సమయమున అపహరించి తెచ్చాడు. ఎందుకు? రాముడు రావణునికి ఏమైనా అపకారముచేసాడా! జనస్తానములో ఉన్న ఖరుడు ఏమి చేసాడో విచారించారా! ఖరుడు తన పరిధిని దాటి, మితిమీరి ప్రవర్తించబట్టే రాముడు ఖరుని దండించాడు. రాముడు తన ప్రాణములను, తనవారి ప్రాణములను రక్షించుకోడానికి ఖరుని చంపాడు. తప్పు మన దగ్గర పెట్టుకొని రాముని అనడంలో ఏమి ప్రయోజనము.

అపహరించి తెచ్చిన సీతను తిరిగి రామునికి అప్పగించి యుద్ధమును నివారించడమే ఉత్తమము. మనము యుద్ధమును కొని తెచ్చుకున్నాము. దానికి నివారణ చేయడం మంచిది. మనము రామునితో అకారణంగా వైరము పెట్టుకున్నాము. రాముడు సముద్రమును దాటి లంకకు వచ్చి, రాక్షసులను చంపి చెండాడక ముందే సీతను రామునికి అర్పించి ఆ వైరమును మాన్పుకుందాము. అపారమైన వానర సేన సముద్రమును దాటి లంకను ముట్టడించకముందే సీతను రాముని వద్దకు పంపుదాము. అలా జరగని ఎడల, లంక సర్వనాశనం అవుతుంది. ఇప్పటికే హనుమంతుడు లంకను దహించి అపార నష్టం కలుగచేసాడు.

ఓ రావణా! నేను నీకు మంత్రినే కాదు. తమ్ముడను. బంధువును. అందుచేత ఇంతదాకా చెబుతున్నాను. నీ మెప్పు కోసం మాటలాడటం నాకు చేత కాదు. నీకు మంచి జరిగే మాటలు చెబుతున్నాను. నా మాట విను. సీతను రాముని వద్దకు పంపు. రాముడు తన వాడి అయిన బాణములను లంక మీదికి సంధించకముందే, సీతను రామునికి ఇచ్చివేయి. రాముని మీద నీకు ఉన్న కోపాన్ని విడిచిపెట్టు. లంక సుఖము కోరి యుద్ధము నివారించు. రాముని వద్దకు సీతను పంపితే మనమందరమూ భార్యాబిడ్డలతో సుఖంగా జీవించగలము." అని పలికి విభీషణుడు మౌనంగా ఉన్నాడు. అప్పటిదాకా రాక్షసవీరులు పలికిన వీరోచిత ప్రగల్భాలూ, వాటికి విభిన్నంగా ఉన్న విభీషణుని మాటలు విన్న రావణుడు అందరినీ పంపివేసి మౌనంగా తన అంత:పురమునకు వెళ్లిపోయాడు..

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## పదవ సర్గ.

తాను ఎన్ని హితమైన వాక్యములు చెప్పినా ఏమీ మాట్లాడ కుండా వెళ్లిపోయిన రావణుని ప్రవర్తన చూచి కూడా తన పట్టు వీడలేదు విభీషణుడు. వ్యక్తిగత శ్రేయస్సుకన్నా సమాజ శ్రేయస్సు ముఖ్యమని నమ్మిన విభీషణుడు మరలా తన ప్రయత్నాలను కొనసాగించాడు. మరునాడు ప్రాతఃకాలమునందే లేచి రావణుని గృహమునకు వెళ్లాడు.

రావణుని గృహములో వేదఘోషలు మిన్నుముడుతున్నాయి. రావణుని విజయాన్ని ఆకాంక్షిస్తూ పండితులు వేదములు పఠిస్తున్నారు. మరి కొందరు పుణ్యాహవచనములు చదువుతున్నారు. రాక్షసులతో పూజింపబడుతున్న రావణుని చూచి విభీషణుడు భక్తితో నమస్కరించాడు. రావణుడు విభీషణుని పక్కనే ఉన్న ఆసనము మీద కూర్చోమని సంజ్ఞచేసాడు. విభీషణుడు రావణుడు చూపిన ఆసనము మీద కూర్చున్నాడు. రావణుడు విభీషణుని చూచి ఎందుకు వచ్చావు అన్నట్టు చూచాడు. అప్పుడు విభీషణుడు రావణునితో ఇలా అన్నాడు.

"ఓ రాక్షసరాజా! నీకు జయము కలుగుగాక! సీత లంకలో అడుగు పెట్టినది మొదలు అశుభశకునములు కనపడుతున్నాయి. తరచుగా పాలు విరిగిపోతున్నాయి. హెూమాగ్ని ప్రకాశవంతంగా వెలగడం లేదు. గుర్రములు గాడిదలు ఏదో తెలియని రోగాలతో బాధపడుతున్నాయి. కాకులు గుంపులు గుంపులుగా ఇండ్ల మీద కూర్చుని దీనంగా అరుస్తున్నాయి. అకారణంగా గద్దలు జనావాసాల మీద తిరుగుతున్నాయి. సాయంత్రము వేళలో నక్కలు కూస్తున్నాయి. ఇవన్నీ చూస్తుంటే లంకకు

ఏదో చేటు కలుగుతుందని అనిపిస్తూ ఉంది. దీనికి ఒకటే పరిష్కారము. సీతను తిరిగి రాముని వద్దకు పంపివేయడమే.

ఓ రాజా! నేను ఈ మాటలు నా స్వార్థము కొద్దీ అజ్ఞానంతో పలుకుతున్నాను అని అనుకొన్నాబాధలేదు. లంక క్షేమము నాకు ముఖ్యము. నేను చెప్పిన దుశ్శకునములు నా కు ఒక్కడికే కాదు. ఇక్కడ అందరికీ కనపడు తున్నాయి. కాని వారంతా నీ మీద భయంతో చెప్పడం లేదు. మంత్రులు నీతో ఈ విషయాలు చెప్పడానికి సందేహిస్తున్నారు. కాబట్టి నేను చెప్పవలసి వచ్చింది. తరువాత నీకు ఏది న్యాయము, ధర్మము అని తోస్తే అది చెయ్యి." అని పలికి ఊరుకున్నాడు విభీషణుడు.

రావణునికి విభీషణుడు చెప్పిన మాటలు రుచించలేదు. పైగా కోపం వచ్చింది. విభీషణుని చూచి ఇలా అన్నాడు. "ఓ విభీషణా! ఈ దుశ్శకునములు చూచి భయపడవలసిన కారణము ఏదీ నాకు కనిపించడం లేదు. రాముడు లంకకు రాలేడు. సీతను చూడలేడు. రాముడు ఒక్కడే కాదు. ఇంద్రుడు మొదలగు దేవతలందరూ కలిసి వచ్చినా నన్ను యుద్ధములో గెలువలేరు. ఇది నిశ్చయము. ఇంక నీవు వెళ్లవచ్చు." అని అన్నాడు రావణుడు.

శ్రీమద్రామాయణము.

యుద్ధకాండము పదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# యుద్ధకాండము

## పదకొండవ సర్గ.

సీత మీద రావణుడు పెంచుకున్న వల్లమాలిన కామము విభీషణుడు చెప్పిన మంచి మాటలను తలకు ఎక్కనీయలేదు. రాముడితో యుద్ధము సంభవిస్తే ఎలాంటి వ్యూహములు పన్నాలి అని మంత్రులతోనూ, మిత్రులతోనూ ఆలోచిస్తున్నాడు. ఉదయము ఆచరించవలసిన విధులు నిర్వర్తించి రావణుడు సభకు వెళ్లాడు. రావణుడు రాజమార్గములో వందిమాగధులు వెంటరాగా వెళుతుంటే మార్గమునకు ఇరుపక్కలా జనం నిలబడి జయజయధ్వానాలు చేస్తున్నారు. రావణుడు సభాస్థలిని ప్రవేశించాడు. జయజయధ్వానముల మధ్య సింహాసనము మీద ఆశీనుడయ్యాడు.

యుద్ధము నిశ్చయము అయినది. రాక్షసవీరులను అందరినీ సమావేశపరచమని ఆదేశాలు ఇచ్చాడు. రాక్షస వీరులందరూ రావణుని సభాభవనమునకు వచ్చి రావణునికి పాదాభివందనము చేసి తమకు కేటాయించిన ఆసనముల మీద తివాచీల మీద కూర్చున్నారు. రావణుని మంత్రులందరూ వారి వారి ఆసనముల మీద కూర్చున్నారు.

రావణుని తమ్ముడు విభీషణుడు, మంత్రి ప్రహస్తుడు, శుకుడు రావణుని సభకు వెళ్ళారు. రావణునికి నమస్కరించి ఉచితాసనము మీద కూర్చున్నారు అందరూ రావణుని వంక చూస్తూ రావణుడు ఏమి చెబుతాడా అని ఎదురుచూస్తున్నారు.

రాక్షస సభలో ఉన్న రావణుడు ఇంద్రసభలో ఉన్న దేవేంద్రుని మాదిరి ప్రకాశించాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము పదకొండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## పన్నెండవ సర్గ.

రాబోవు యుద్ధములో సదా విజయమును కాంక్షించు రావణుడు ప్రహస్తుని చూచి ఇలా అన్నాడు. "ప్రహస్తా! ప్రస్తుతము మనం యుద్ధవాతావరణంలో ఉన్నాము. నగరంలో కాపలా కట్టుదిట్టం చేయండి. సైనికులను సర్వసన్నద్ధంచేయండి." అని ఆదేశించాడు. ప్రహస్తుడు రావణుని ఆజ్ఞను అమలుపరిచాడు. తరువాత రావణుడు మంత్రులను సేనాపతులను చూచి ఇలా అన్నాడు.

"ధర్మము, అర్థము, కామము వీటి గురించి సంఘర్షణ తలెత్తినపుడు, మనకు ఏది మంచిదో, ఏది చెడో, ఏది ప్రియమో, ఏది అప్రియమో, ఏది లాభమో, ఏది నష్టమో, నిర్ణయించడంలో మీరందరూ సమర్థులు. మీరు మంత్రాంగము చేసి చెప్పిన ఆలోచనలు ఏనాడూ వృథాకాలేదు. నాకు విజయాన్ని సంపాదించి పెట్టాయి. రాముడు లంకను ముట్టడించడానికి వస్తున్న విషయము కుంభకర్ణునికి ఇంతవరకూ తెలియపరచలేదు. కుంభకర్ణుడు నిద్రలో ఉండటం వలన ఈ విషయాలు ఏమీఅతనికి తెలియవు. ఆరుమాసముల నిద్ర తరువాత కుంభకర్ణుడు

నిద్రలేచే సమయము ఆసన్నమయింది.

నేను, రాముని భార్య సీతను మన రాక్షసుల స్థావరమైన దండకారణ్యములోని జనస్థానము నుండి తీసుకొని వచ్చాను. సీత వంటి సౌందర్యవతి మూడులోకములలోనూ లేదు అన్నది నిర్వివాదాంశము. కాని సీత నాకు లొంగలేదు. నాతో పక్కను పంచుకొనడానికి అంగీకరించడం లేదు. సీత ప్రతి అంగమూ అందంగా, శోభాయమానంగా ఉంటుంది. అందుకే ఆమె అంటే నాకు మక్కువ. నాకు ఆమె మృదువైన పాదాలు చూచినా కామం చెలరేగుతుంది. ఇంక సీత ముఖారవిందము చూస్తే చెప్పేదేముంది. నాలో కామం అగ్ని వలె ప్రజ్వరిల్లుతుంది. నాకు కోపం వచ్చినా, శాంతంగా ఉన్నా, సర్వకాలసర్వావస్థలయందూ సీత మీద మోహము నన్ను నిలువనీయడం లేదు. దాదాపు సంవత్సరకాలము నుండి సీత నన్ను వరిస్తుందేమో అని ఎదురుచూచాను. రాముడు యుద్ధానికి వచ్చాడు కానీ సీతలో మార్పురాలేదు.

రాముడు సముద్రము ఆవల ఉన్నాడు. భయంకరమైన సముద్రమును దాటడం రామునికి సాధ్యం కాదు. కాకపోతే ఒక వానరుని వలన లంక చాలా నష్టపోయింది. ఆ వానరుని రాక గురించి మనకు ముందుగా తెలియక పోవడం వలన ఇంత నష్టం జరిగింది. ఇంకనైనా జాగ్రత్తగా ఉండండి. మీ మీ బుద్ధికి తోచిన సలహాలు ఇవ్వండి. నాకు నరుల వలన వానరుల వలనా ఎలాంటి భయం లేదు. కానీ వారి గురించి కూడా ఆలోచించవలసిన సమయం వచ్చింది. సుగ్రీవుడు రాముని కొరకు తన సేనలతో సముద్రము ఆవలకు వచ్చి ఉన్నాడు. సీతను రామునికి అప్పగించకుండా, రాముని చంపే ఉపాయము గురించి ఆలోచించండి.

ఈ మహాసముద్రమును దాటడానికి కేవలం రాక్షసులకే సాధ్యం అవుతుంది కానీ వానరులకు సాధ్యం కాదు. కాబట్టి జయం మనదే!" అని అన్నాడు రావణుడు.

అప్పుడు ఆ సభలో కూర్చుని ఉన్న కుంభకర్ణుడులేచి రావణునితో ఇలా అన్నాడు. " ఓ రాక్షసరాజా! నీవు ఇప్పుడు చేస్తున్న మంత్రాంగము, ఆలోచన సీతను అపహరించక ముందు చేసి ఉండవలసినది. అప్పుడు ముందూ వెనుకా ఆలోచించకుండా, నిప్పును తెచ్చి మూటగట్టుకున్నట్టు, సీతను తెచ్చి లంకలో పెట్టి ఇప్పుడు విచారించి ప్రయోజనము ఏమి? నీవు సీతను రాముని వద్దనుండి అపపహరించక ముందు ఈ ఆలోచన చేసి ఉండిన బాగుండేది. ఏ రాజు అయిన న్యాయబద్ధంగా ప్రవర్తిస్తే, తరువాత చింతించవలసిన పని ఉండదు. అనాలోచితంగా చేసిన పనులు విపరీత ఫలితాలను ఇస్తాయి. నీతికి అవినీతికి తారతమ్యము తెలియని వాడే ముందు చేయాల్సిన పని వెనుకా, వెనుక చేయాల్సిన పని ముందూ చేసి కష్టాలపాలవుతాడు. మనకే కదా బలం, పరాక్రమము ఉంది కదా అని కాని పనులు చేస్తే సర్వనాశనం తప్పదు.

ప్రస్తుతము నీవు చేయకూడని కార్యము చేసావు. నీ అదృష్టం కొద్దీ నిన్ను రాముడు ఇంకా చంపలేదు. సరే అయినది ఏదో అయింది. మంచో చెడో చేసావు. దానిని గురించి విచారించి ప్రయోజనములేదు. నేను నీ శత్రువులను చంపి నీకు వచ్చిన ఆపదను పోగొడతాను. నిశ్చింతగా ఉండు. మన శత్రువు రాముడే కాదు, ఇంద్రుడు, వరుణుడు, సూర్యుడు, అగ్ని, కుబేరుడు, వాయువు అయినా సరే నేను వారిని జయిస్తాను. రాముడు ఒక బాణం వేసి రెండో బాణము తీసేలోపల నేను రాముడి రక్తం తాగుతాను. ముందు రామలక్ష్మణులను చంపుతాను. తరువాత

వానరసేనను భక్షిస్తాను. రాముని వలన భయం విడిచిపెట్టు. హాయిగా తిని, తాగి, మదనసుఖములు అనుభవించు. రాముడి చావు వార్త వినగానే సీత నీకు వశమవుతుంది." అని పలికాడు కుంభకర్ణుడు.

( పాఠకులకు ఒక్క మనవి. ఇంతకు ముందే రావణుడు "కుంభకర్ణుని ఆరునెలల నిద్ర అయిపోయినది. అతనిని నిద్రలేపండి." అని ఆదేశించాడు. 60వ సర్గలో రాక్షసులు నానాపాట్లు పడి కుంభకర్ణుని నిద్రలేపినట్టు ఉంది. మరి ఈ కుంభకర్ణుడు ఎవరు? రావణుని తమ్ముడు కుంభకర్ణుడు కాడా! కాకపోతే మరెవరు? మరొకడైతే రావణుని ముందు అంత ధైర్యంగా మాట్లాడగలడా! కుంభకర్ణుని మాటలు విని రావణుడు ఊరుకుంటాడా! ఇవన్నీ జవాబు లేని ప్రశ్నలు. కాబట్టి కుంభకర్ణుని గురించిన ఈ సర్గ తరువాత చేర్చబడినది అని పెద్దల అభిప్రాయము.)

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము పన్నెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## పదమూడవ సర్గ.

కుంభకర్ణుడు మాట్లాడిన తరువాత మహా పార్శ్వుడు లేచాడు. కుంభకర్ణుని మాటలతో రావణునికి కోపంవచ్చినట్టు గ్రహించాడు. రావణునికి ప్రీతి కలిగించేవిధంగా ఇలా అన్నాడు. "ఓ రాక్షసరాజా! ఎంతో కష్టపడి మధువును సేకరించి దానిని త్రాగకుండా ఎదురుగా పెట్టుకొని చూస్తూ ఉండటం అవివేకము. నీవు అందరికీ ప్రభువు. ఇంక నీకు ప్రభువు

ఎవరున్నారు? నిన్ను శాసించే వాళ్లు ఎవరున్నారు? నువ్వు ఎవరికి భయపడాలి? కష్టపడి తెచ్చిన సీతను బలవంతంగానైనా తృప్తిగా అనుభవించు. ఆనందించు. తరువాత వచ్చేపరిణామాలను మేము చూసుకుంటాము. సీత నీకు వంటింటి కుందేలు. నీ చెప్పుచేతలలో ఉంది. నీ కోరిక తీర్చుకో. ఆలస్యం చేయకు. నేను, ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు యుద్ధరంగంలో నిలబడితే మాకు ఎదురు నిలిచి పోరాడగల యోధుడు ముల్లోకములలో ఎవరున్నారు. కార్యసాధనకు కొంతమంది సామ, దాన, భేదోపాయములను ఉపయోగిస్తారు. కాని వీరులు దండోపాయమునే ఉపయోగిస్తారు. మనము వీరులము. మనకు దండోపాయమే తరుణోపాయము. నీ శత్రువులను అందరినీ మేము యుద్ధములో అంతమొందిస్తాము. నీవు నిశ్చింతగా ఉండు. " అని వీరోచితంగా పలికాడు మహాపార్శ్వుడు.

మహాపార్శ్వుని మాటలకు రావణుడు ఎంతగానో సంతోషించాడు. అతనితో రావణుడు ఇలా అన్నాడు. "ఓ మహాపార్శ్వా! నీవు చెప్పినది మిగుల యుక్తియుక్తముగా ఉంది. కానీ ఇక్కడ ఒక చిక్కువచ్చిపడింది. అది ఒక రహస్యము. చాలా కాలం కిందట నేను పుంజికస్థల అనే అందమైన అప్సరసను చూచాను. ఆ సమయంలో ఆమె బ్రహ్మలోకానికి వెళుతూ ఉంది. ఆమెను వెంబడించాను. ఆమెను పట్టుకున్నాను. బలవంతంగా అనుభవించాను. ఆమె ఏడుస్తూ బ్రహ్మదేవుని వద్దకు వెళ్లింది. బ్రహ్మదేవునికి జరిగిందంతా చెప్పినట్టుంది. బ్రహ్మదేవుడు నన్ను పిలిపించాడు. "ఇంకమీదట నీవు ఏ స్త్రీనైనా ఆమె అనుమతి లేకుండా, బలవంతంగా అనుభవిస్తే. నీ తల వేయి ముక్కలైపోతుంది. ఇదే నా శాపము." అని దారుణంగా శపించాడు. ఆ కారణంచేత నేను సీతను బలవంతంగా అనుభవించడానికి భయపడుతున్నాను. లేకపోతే నేను సీతను లంకకు తీసుకొని వచ్చినరోజే

అనుభవించి ఉండేవాడిని. అందుకే సీత నన్ను వరించే వరకూ ఎదురు చూడక తప్పదు.

రాముడికి నా గురించి, నా వేగము గురించి బాగా తెలియదు. అందుకని, పర్వతగుహలో నిద్రపోవుచున్న సింహము జూలుపట్టుకొని లాగినట్టు నాతో యుద్ధమునకు కాలుదువ్వుతున్నాడు. రాముని నా బాణములకు బలి చేయడం సీతను నేను అనుభవించడం నిజం. రాముడు దేవేంద్రుని గానీ, వరుణుని గానీ సాయం తెచ్చుకున్నా నేను రాముని జయించి తీరుతాను. నేను కుబేరుని యుద్ధములో ఓడించి లంకానగరమును ఆక్రమించుకున్నానన్న సంగతి రామునికి తెలియదు." అని గర్వంతో పలికాడు రావణుడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము పదమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## పదునాలుగవ సర్గ.

వీళ్ల మాటలన్నీ ఓపిగ్గా వింటున్నాడు విభీషణుడు. తరువాత విభీషణుడు లేచి ఇలా అన్నాడు. "రాక్షసరాజా! వీళ్లంతా కలిసి సీత అనే మహాసర్పమును నీ మెడకు చుడుతున్నారు. వానరులు సముద్రమును దాటి లంకను ముట్టడించక ముందే సీతను రాముని వద్దకు పంపించు. రాముడి వింటి నుండి వెలువడ్డ బాణములు రాక్షసుల కంఠములు

ఉత్తరించకముందే సీతను రాముని వద్దకు పంపించు. నీవు ఎవరి అండచూచుకొని ఈ యుద్ధానికి దిగుతున్నావో ఆ కుంభకర్ణుడు, మహాపార్శ్వుడు, ఇంద్రజిత్తు, మహోదరుడు, నికుంభుడు, కుంభుడు, అతికాయుడు వీరెవ్వరూ యుద్ధములో రాముని ముందు నిలువలేరు. నిన్ను రాముని బాణము తరుముతుంటే అప్పుడు ఇంద్రుడు, సూర్యుడు, మరుత్తులు, యముడు వీరెవ్వరూ నీ మొర ఆలకింపరు. కాబట్టి సీతను రాముని వద్దకు పంపు. రామునితో యుద్ధము నివారించు." అని పలికాడు విభీషణుడు.

వెంటనే ప్రహస్తుడు లేచాడు. "రాక్షసరాజా! మాకు ఇప్పటి వరకూ భయము అనే మాటకు అర్థము తెలియదు. దేవ, దానవ, గంధర్వులు, నాగులు ఎవరి వల్లకానీ మాకు ఎలాంటి భయమూ లేదు. అటువంటిది ఒక నరుని వలన, వానరుల వలన మాకు భయం ఎందుకుంటుంది."అని అన్నాడు.

ఆ మాటలకు విభీషణుడు దీటుగా జవాబు ఇచ్చాడు. "ఓ ప్రహస్తా! నీవు చెప్పినట్టు చేస్తే, మనకు యమలోక ప్రయాణము తప్పదు. రాముడు ధర్మము తప్పని వాడు. మీరు ధర్మము తెలియని వారు. ధర్మము తప్పని రాముని ముందు దేవతలు కూడా తలెత్తి నిలబడలేరు. దేవతలు మనకు భయపడతారు. రాముని గౌరవిస్తారు. ఓ ప్రహస్తా! నీకు రామ బాణముల రుచి తెలియదు. అందుకని ఇటువంటి ప్రగల్భములు పలుకుతున్నావు. రాముడు రణరంగములో నిలిస్తే నీవూ, ఇంద్రజిత్తూ, నికుంభుడు, త్రిశీర్షుడు, దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు, అకంపనుడు ఎవరూ ఎదిరించి నిలువలేరు. ఇంక ఈ వ్యసనపరుడైన రావణుడు ఎంత?

వ్యసనలోలుడు, ఆలోచనా రహితంగా పనులు చేసేవాడు అయిన ఈ రావణుడు చేసే ప్రతిపనీ మీరు పొగుడుతూ తలలు ఊపుతున్నారు. రావణుని వినాశనానికి పునాది వేస్తున్నారు. మీకు రాజుకు హితము చెప్పడం, మంచి చేయడం చేతకాదు. ఇప్పటికైనా మించి పోలేదు. మీ రాజును మంచి దారిలో, సరి అయిన దారిలో నడిపించండి. లంకను రక్షించండి. ఇప్పటి దాకా మీరందరూ రావణుడు చేసే అకృత్యము లను పొగిడి లబ్ధిపొందారు. ఇప్పటికైనా రావణునికి హితబోధచేయండి. యుద్ధము నివారించండి. మరి కొంతకాలము రావణుని వలన లబ్ధిపొందండి. సుఖాలు, భోగాలు అనుభవించండి.

నేను నా స్వార్థము కొరకు ఇలా చెప్పడం లేదు. లంక క్షేమము కోరి, రావణుని క్షేమం కోరి, లంకలోని రాక్షసుల క్షేమంకోరి, మీ అందరి సుఖసంతోషాలు కాపాడటానికి ఈ హితబోధ చేస్తున్నాను. సీతను రాముని వద్దకు పంపండి, యుద్ధము నివారించండి. లంకను కాపాడండి. మరొక్క మాట. తన బలమును ఎదిరి బలమును ఎరింగి, మనకు ఉన్న కష్ట నష్టములను పరిశీలించి, రాజుకు తగిన హితమును చెప్పువాడే ఉత్తముడు అయిన మంత్రి. మీరు ఉత్తములైన మంత్రులో కాదో మీరే తేల్చుకోండి. " అని చెప్పి కూర్చున్నాడు విభీషణుడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము పదునాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## పదునైదవ సర్గ.

విభీషణుడు పలికిన పలుకులకు ఇంద్రజిత్తు కోపంతో ఊగిపోయాడు. "చిన్నాన్నా! ఏమిటి మీరు మాట్లాడేది? తెలివి ఉండే మాట్లాడుతున్నారా! రాక్షసకులములో పుట్టినవాడు మాట్లాడవలసిన మాటలేనా ఇవి! ఒక సామాన్య కులంలో పుట్టిన వాడు కూడా ఇంత పిరికి మాటలు మాట్లాడడు. మీకు ఈ పిరికి తనం ఎలా వచ్చింది? ఉన్నతమైన మన రాక్షస కులంలో ఇంత పిరికివాడు, బలహీనుడు, వీరత్వము లేనివాడు, పరాక్రమము, ధైర్యము, శౌర్యము లేని వాడు మీరొక్కరే కనపడుతున్నారు. లేకపోతే మానవాధములకు భయపడతారా!

ఈ రాముడు, లక్ష్మణుడు రాజకుమారులు, మనుష్యులు. లంకలో పుట్టిన ఒక సామాన్య రాక్షసుడు కూడా వారిని చంపగలడు. ఆ సంగతి తెలిసి కూడా మమ్ములను ఎందుకు ఇంతగా భయపెడుతున్నారు? నా సంగతి మీకు తెలియదా! నేను దేవేంద్రుని జయించిన వీరుడను. నా పరాక్రమానికి జడిసి దేవతలందరూ తలొకదిక్కుకు పారిపోయారు. నేను ఐరావతమును కింద పడదోసి, దాని దంతములు పీకిన వీరుడను. దైత్యులు కూడా నాకు భయపడతారు. అంతటి పరాక్రమవంతుడనైన నేను సామాన్య మానవులను, వారి వెంట వచ్చిన వానరులను ఓడించలేనా! ఇద్దరు రాజ కుమారులకు నేను భయపడాలా! సిగ్గుచేటు." అని కూర్చున్నాడు.

ఇంద్రజిత్తు మాటలు విన్న విభీషణుడు మరలా ఇలా అన్నాడు. "రాకుమారా! నీవు వయసులో చిన్నవాడవు. ఉడుకు రక్తంలో ఉప్పొంగిపోతున్నావు. నీ బుద్ధి ఇంకా వికసించలేదు. నీకు పూర్వాపరాలు

తెలియవు. నీకు మంత్రాంగము గురించి తెలియదు. అందుకే ఆవేశంతో వినాశనానికి దారి వెతుకుతున్నావు. అర్థం లేకుండా మాట్లాడుతున్నావు. నీవు నీ తండ్రి క్షేమం కోరిమాట్లాడటం లేదు. ఆయనకు ఒక శత్రువుగా యుద్ధానికి పురికొల్పుతున్నావు. నీకు ఆవేశము, సాహసము ఎక్కువ. అటువంటివాడిని మంత్రాంగము చేయునపుడు అనుమతించడం తప్పు. నీకు మౌఢ్యము ఎక్కువ. తెలివితో ఆలోచించడం తెలియదు. నీకు ఆవేశం తప్ప ఆలోచన తెలియదు. నీకు రామ బాణముల గురించి తెలియక అలా మాట్లాడుతున్నావు. అవి యమదండములతో సమానమైనవి. ఓ రాక్షసేంద్రా! ఈ బాలుని మాటలు పట్టించుకోకు. నా హితము విను. సీతను రాముని వద్దకు పంపు. భార్యాబిడ్డలతో సుఖంగా జీవించు. " అని అన్నాడు విభీషణుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము పదునైదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## పదునారవ సర్గ.

విభీషణుడు చెప్పిన హితకరమైన మాటలు రావణునికి రుచించలేదు. పైగా కోపం కూడా వచ్చింది. "విభీషణా! నీవు నాకు బంధువు కావు. మిత్రుడు అంతకన్నా కావు. నీవు నాకు శత్రువు. బద్ధశత్రువును అయినా ఇంట్లో పెట్టుకోవచ్చుకానీ, బంధువు, మిత్రుడు అని చెప్పుకుంటూ నా నాశనము కోరేవాడిని ఇంట్లో ఉంచుకొనకూడదు. నీవు నాకు జ్ఞాతివి.

జ్ఞాతులు ఎప్పుడూ సాటి జ్ఞాతుల మేలు కోరరు. అది లోకధర్మము. అదీ కాకుండా తన కన్నా ఉన్నతుడు, ఐశ్వర్యవంతుడు అయిన జ్ఞాతిని చూస్తే ఇతర జ్ఞాతులకు అసూయ, ద్వేషము, పగ. అలాగే నువ్వు కూడా నా ఉన్నతిని నా సుఖమును చూచి ఓర్వలేకున్నావు. పైగా నాకు ఆపద వచ్చినప్పుడు సానుభూతి చూపకపోగా, ఆపదలలో ఉన్న నన్ను చూచి సంతోషిస్తున్నావు.

ఎవరికైనా గానీ అగ్నివలన, అస్త్ర,శస్త్రముల వలన పాశముల వలన కలుగు భయం కంటే క్రూరులైన జ్ఞాతుల వలన కలిగే ఆపదలు, భయాలు ఎక్కువ. కాబట్టి అన్ని భయముల కన్నా జ్ఞాతుల వలన భయం గొప్పది. ఆవులలో సంపద ఉంటుంది. స్త్రీలలో చంచలత్వవు ఉంటుంది. బ్రాహ్మణులలో తపస్సు ఉంటుంది. కానీ జ్ఞాతులలో సాటి జ్ఞాతుల ఎడల శత్రుత్వము ఉంటుంది. నీవు నాకు జ్ఞాతివి. నా గౌరవమును, పేరు ప్రతిష్టలను, నాకు ఉన్న ఐశ్వర్యమును, నా శత్రువులలో నన్ను గురించి ఉన్న భయమును చూచి నీవు ఓర్వలేకున్నావు. నీవు చెడ్డవాడివి. నీతో నాకు స్నేహము తగదు. చెడ్డవారితో స్నేహము అవశ్యము విడువతగినది.

ఓ విభిషణా! నీవు నా శత్రువును పొగుడుతూ ఎప్పుడెప్పుడు నా శత్రువుల వద్దకు పోవలెనా అని ఎదురుచూస్తున్నావు. కాబట్టి నీతో బంధుత్వము, స్నేహము ఎలాంటి ఫలితాన్ని ఇవ్వకపోగా నాకు చేటు తెస్తుంది. ఎంత చెడ్డా నువ్వు నా సోదరుడవు, బంధువు. అందుకని నీవు ఎన్ని మాటలు మాట్లాడినా క్షమించాను. అదే ఇంకొకరయితే ఈ పాటికి వాడి ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయి ఉండేవి. నీవు రాక్షస కులములో చెడబుట్టావు." అని అత్యతంత పరుషమైనమాటలతో విభీషణుని దూషించాడు రావణుడు.

రావణుని నోటినుండి అటువంటి మాటలు విన్న విభీషణుడు ఇంక అక్కడ ఒక్కక్షణం కూడా నిలువలేకపోయాడు. వెంటనే తన గదాయుధమును తీసుకొని ఆకాశంలోకి ఎగిరాడు. విభీషణుని తోపాటు అతని మిత్రులు నలుగురు ఆకాశంలోకి ఎగిరారు. ఆకాశంలో నిలిచి విభీషణుడు రావణునితో ఇలా అన్నాడు.

"ఓ రాక్షసరాజా! నీవు నాకు సోదరుడవు. నాకన్నా పెద్దవాడవు. నీవు ఎన్ని అన్నా తప్పులేదు. నీవు నాకు తండ్రిస్థానములో ఉన్నావు. నీ మీద నాకు అపారమైన గౌరవము భక్తి ఉన్నాయి. ఎందుకంటే, తండ్రి, అన్న అధర్మపరులైనా వారు గౌరవనీయులు. కానీ నువ్వు నేను చెప్పిన హితములను పట్టించుకోకపోగా, నన్ను అత్యంత పరుషమైన పదజాలంతో దూషించావు. వాటిని నేను సహించలేను. నీ వద్ద ఉండలేను.

ఓ రావణా! ప్రస్తుతము నీ మనసు నీ అధీనములో లేదు. కామముతో నిండి పోయింది. కాలానికి లొంగిపోయింది. కాబట్టి నేను చెప్పిన మంచి మాటలు నీ చెవికి ఎక్కలేదు. ఓ రాజా! నిన్ను పొగిడేవారు, నీకు ఇష్టమైన మాటలు మాట్లాడేవారు, నీ ప్రాపకము కోసం పాకులాడేవారు ఎంతో మంది ఉన్నారు. కాని, నీకు ఇష్టం లేకపోయినా, నీ మనసుకు కష్టమైనా, నీకు మంచి మాటలు చెప్పేవాళ్లు దొరకడం కష్టం. ఒకవేళ దొరికినా, వాళ్ల మాటలు నీవు వినవు. సర్వనాశనమునకు మూలమైన దారిలో నీవు నడుస్తున్నావు. అది చూచి నేను ఊరుకోలేకపోతున్నాను.

ఓ రావణా! నిన్ను రాముడు తన బాణములతో చంపుతూ ఉంటే నేను చూడలేను. ఎంత శూరుడైనా, పరాక్రమవంతుడైనా, అజేయుడైనా, కాలాను గుణంగా నశించక తప్పదు. నీకు ఆ గతి

పట్టకూడదని, నీకు అకాల మరణం రాకూడదనీ నా సంకల్పము. అందుకే ఇన్ని మాటలు చెప్పాను. కాని నా మాటలు నీకు నచ్చవని నాకు తెలుసు. నా మాటలతో నీ మనసుకు కష్టం కలిగించి ఉంటే నన్ను క్షమించు. నిన్ను నీవు రక్షించుకో. ఈ లంకను, లంకలో ఉన్న రాక్షసులను రక్షించు. నేను వెళ్లిపోతున్నాను. నీవు శుభం కలుగు గాక!" అని పలికి విభీషణుడు ఆకాశమార్గాన తన అనుచరులతో వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము పదునారవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## పదునేడవ సర్గ.

విభీషణుని అన్న రావణుడు విభీషణునికి శత్రువు అయ్యాడు. రావణుని శత్రువు రాముడు విభీషణునికి మిత్రుడు అయ్యాడు. తన శత్రువుకు శత్రువు తనకు మిత్రుడు అవుతాడు కదా! ఆ రాజనీతి ప్రకారము విభీషణుడు రావణుని శత్రువు రాముడి వద్దకు వెళ్లాడు. సముద్రము దాటి వానర సేన ఉన్న చోటికి వెళ్లాడు.

ఆకాశంలో నిలిచి ఉన్న విభీషణుని నేల మీద ఉన్న వానర నాయకులు చూచారు. విభీషణుని పక్కన ఉన్న నలుగురు రాక్షసులను కూడా వారు చూచారు. వెంటనే ఈ విషయము సుగ్రీవునికి చెప్పారు. సుగ్రీవుడు కూడా ఆకాశంలో వెలిగిపోతున్న ఐదుగురురాక్షస వీరులను చూచాడు. తన వానరనాయకులతో ఇలా ఆలోచించాడు.

"ఆకాశంలో ఉన్న వారు రాక్షసులు. సందేహము లేదు. వారి చేతులలో ఆయుధములు కూడా ఉన్నాయి. వారు కవచములు ధరించి ఉన్నారు. వారు లంక నుండి మనలను చంపడానికి వచ్చిఉంటారు. కాబట్టి మీరు సర్వసన్నద్ధంగా ఉండండి." అని పలికాడు సుగ్రీవుడు.

వెంటనే వానరులు చేతికి అందిన రాళ్లు, వృక్షములు, కొమ్మలు తీసుకొని వారిని ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నారు. "రాజా! మాకు అనుమతి ఇవ్వండి. మేము వెంటనే ఎగిరి పోయి ఆ నలుగురిని హతమారుస్తాము" అని పలికారు వానరులు.

వానరులు వెళ్లి తమ నాయకుడికి చెప్పడం, ఆ నాయకుడు తన వంక చూడ్డం, తన వారితో మాట్లాడటం, వానరులు తలా ఒక ఆయుధము చేత ధరించడం చూస్తూనే ఉన్నాడు విభీషణుడు. అతనికి విషయం అర్థం అయింది. వెంటనే విభీషణుడు, పెద్ద కంఠంతో, సుగ్రీవునికి వానరులకు వినబడేటట్టు ఇలా అరిచాడు.

"ఓ వానర వీరులారా! రావణుడు లంకకు రాజు. రాక్షసుడు. నేను అతని తమ్ముడను. నా పేరు విభీషణుడు. నా అన్న రావణుడు రాముని భార్య సీతను జనస్థానము నుండి అపహరించి తెచ్చాడు. దారిలో అడ్డుకున్న జటాయువును చంపాడు. సీతను అశోక వనములో ఉంచాడు. ఆమెకు రాక్షస స్త్రీలను కాపలా పెట్టాడు. నా అన్న రావణుడు చేసిన పని నాకు నచ్చలేదు. అది తప్పు అని చెప్పాను. సీతను రామునికి ఇచ్చివేయమన్నాను. కాని రావణుడు నా మాట వినలేదు. నన్ను అవమానించాడు. నన్ను రాజ్యములో నుండి వెళ్లగొట్టాడు. అందుకని నేను భార్యాబిడ్డలను వదిలి

రాముని శరణుకోరి వచ్చాను. నా రాక గురించి రామునికి తెలుపండి. ”
అని గట్టిగా అరిచి చెప్పాడు విభీషణుడు.

ఈ మాటలు విన్న సుగ్రీవుడు కంగారుగా రామలక్ష్మణుల వద్దకు వెళ్లాడు. రామునికి ఈ విషయం చెప్పి, విభీషణుని రాక తెలియజేసాడు. ఇంకా ఇలా అన్నాడు. “ఓ రామా! వీడు మనకు శత్రువు. వీడిని మనము మనలో చేర్చుకుంటే గుడ్లగూబ కాకి పిల్లలను తిన్నట్టు వాడు మనలను తినేస్తాడు. కాబట్టి ఓ రామా! బాగా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకో. నీ నిర్ణయం మీద ఈ వానరవీరుల జీవితాలు ఆధారపడి ఉన్నాయి. శత్రువులు ప్రయోగించు మంత్రాంగములు, వ్యూహములు, గూఢచర్యము, వీటిని గుర్తించి నిర్ణయం తీసుకో.

వీరు రాక్షసులు. కామరూపులు. కపటోపాయములు తెలిసిన వారు. అక్కడ మాయం అయి ఇక్కడ ప్రత్యక్షం అవుతుంటారు. వారి మాయలు మంత్రాలు తెలిసి ప్రవర్తించాలి మనం. వారిని ఎన్నటికీ నమ్మకూడదు. ఈ వచ్చిన వాడు రావణుని గూఢచారి అయి ఉంటాడు. వీడు మనలో చేరి, మనలో మనకు విభేదాలు కల్పించి మనలను నిర్వీర్యులుగా చెయ్యడానికే వచ్చాడు అని అనుకుంటున్నాను. లేకపోతే వీడు మనలో ఒకడుగా చేరి. మన విశ్వాసమును పొంది, మన ఆనుపానులు,మన సైనిక రహస్యములు తెలుసుకొని, రావణునికి చేరవేయగలడు.

ఓ రామా! ప్రస్తుతము విభీషణుడు అనబడే రావణుని సోదరుడు, తన నలుగురు అనుచరులతో కలిసి నీ శరణుగోరి వచ్చాడు. ఇతడు రాక్షసుడు. రావణునికి సోదరుడు. రావణుని దగ్గర నుండి

వస్తున్నాడు. ఇతనిని ఎలా నమ్మడం? కాబట్టి వీరిని పట్టి బంధించి చంపివేయడమే ఉత్తమమైన మార్గము. తరువాత మీ ఇష్టము."అని పలికి ఊరుకున్నాడు సుగ్రీవుడు.

రాముడు సుగ్రీవుడు చెప్పిన పలుకులు సావధానంగా విన్నాడు. సుగ్రీవుని పక్కనే హనుమంతుడు, మిగిలిన వానర వీరులు నిలబడి ఉ న్నారు. వారందరినీ చూచి రాముడు ఇలా అన్నాడు. "మన శరణు కోరి వచ్చిన విభీషణుని గురించి సుగ్రీవుడు చెప్పిన మాటలను మీరంతా విన్నారు కదా! మీరంతా నాకు మిత్రులు, శ్రేయోభిలాషులు. మీ మాటలు నాకు ఎంతో విలువైనవి. కాబట్టి ఈ విషయంలో మీ మీ అభిప్రాయాలు తెలియజెయ్యండి." అని అడిగాడు రాముడు.

అప్పుడు హనుమంతుడు రాముని చూచి ఇలా అన్నాడు. "రామా! నీకు తెలియని విషయములు లేవు. మేమంతా నీ శ్రేయోభి లాషులము కాబట్టి మా అభిప్రాయాలు అడుగుతున్నావు. అది నీ మంచి తనము. మాకు నీవు ఇస్తున్న మర్యాద. వానర నాయకులు ఒక్కరొక్కరుగా తమ తమ అభిప్రాయాలు నీకు వినిపిస్తారు. ముందుగా యువరాజు అంగదుడు తన అభిప్రాయాన్ని వినిపిస్తాడు." అని అన్నాడు.

అప్పుడు అంగదుడు లేచి ఇలా అన్నాడు. "రామా! ఇతడు రాక్షసుడు. రాక్షసరాజు రావణుని వద్దనుండి వచ్చాడు. ఇతని రాక సందేహాస్పదంగా ఉంది. ఇతనిని నమ్మడానికి వీలు లేదు. కాబట్టి ఇతనిని తొందర పడి మనలో చేర్చుకోన కూడదు. ఇతనిని అన్నివిధాలా పరీక్షించాలి. ఎందుకంటే మనసులో కుటిలము పెట్టుకొన్న వారు పైకి చాలా సౌమ్యంగా నమ్రతగా కనిపిస్తారు. సమయం వచ్చినప్పుడు దారుణంగా కోలుకోలేని

దెబ్బ తీస్తారు. కాబట్టి మనము ఇతని పట్ల చాలా అప్రత్తంగా ఉండాలి. ఈ విభీషణుడు మంచి వాడైతే స్వీకరించవచ్చును. ఏమాత్రం సందేహము కలిగినా ఇతనిని చంపడమే యుక్తము." అని పలికాడు అంగదుడు.

శరభుడు అనే వానరుడు ఇలా అన్నాడు. "రామా! ఇతనిని పరీక్షించడానికి ఒక సూక్ష్మ బుద్ధిగల గూఢచారిని పంపడం ఉత్తమమైన మార్గము. ఆ గూఢచారి అతనిని అన్ని విధములా పరీక్షించిన తరువాత, అతడు ఉత్తముడు అని తేలితే అతనికి శరణాగతి ఇవ్వవచ్చును. అతని ప్రవర్తన సందేహాస్పదంగా ఉంటే అతనిని విడిచిపెట్టడమే మంచిది." అని పలికాడు శరభుడు.

తరువాత జాంబవంతుడు లేచి ఇలా అన్నాడు. "ఈ వచ్చినవాడు నీ శత్రుడు రావణుని తమ్ముడు. ఇతడు శాంతి కాలంలో రాలేదు. మనము రావణునితో యుద్ధము చేయు సమయములో వచ్చాడు. కాబట్టి ఇతనిని నమ్మడానికి వీలు లేదు." అని అన్నాడు.

తరువాత మైందుడు లేచి ఇలా అన్నాడు. "ఓ రామా! ఇతడు రాక్షస రాజు అయిన రావణుని తమ్ముడు. అందుకని ఇతనిని పరుషంగా కాకుండా సరళంగా ప్రశ్నించడంమంచిది. అప్పుడు అతడు మంచివాడో చెడ్డవాడో తెలుసు కొనవచ్చును. తరువాత ఏది యుక్తమో అది చేయ వచ్చును." అని అన్నాడు.

తరువాత హనుమంతుడు లేచి ఇలా అన్నాడు. "ఓ రామా! నీవు బుద్ధిలో బృహస్పతితో సమానుడవు. నీకు చెప్పదగిన వాడిని కాను. కానీ నీవు నా అభిప్రాయమును చెప్పమన్నావు కాబట్టి చెబుతున్నాను. నాకు

ఉచితము యదార్ధము అని తోచిన విషయాలుచెబుతాను. ఇప్పుడు చెప్పిన వారిలో కొంత మంది మంత్రులు విభీషణుని రాక వలన మనకు కలుగు లాభనష్టములను గురించి మాట్లాడారు. కాని అందులో నాకు దోషము కనపడుతూ ఉంది. ఒక మనిషిలోని సామర్ధ్యము తెలుసుకోవాలంటే అతనిని మనము ఏదైనా పనిలో నియోగించాలి. అతడు ఆ పనిని ఎంత చాకచక్యంతో చేస్తాడో చూడాలి. అప్పుడు అతని సమర్ధత నిర్ణయించాలి. కేవలం అతనితో మాట్లాడినంత మాత్రాన అతని సామర్ధ్యము మనకు తెలియదు కదా!

కొంత మంది విభీషణుని వద్దకు గూఢచారులను పంపవలె నని చెప్పారు. అది కూడా సరికాదు. గూఢచర్యము ఎదుటి మనిషికి తెలియకుండా చెయ్యాలి. మన ఎదురుగా ఉన్న వారి మీద గూఢచర్యము ఎలా చెయ్యగలము. మరి కొందరు ఏమన్నారంటే, విభీషణునికి మనం శత్రువులం. పైగా ఇది యుద్ధసమయం. కాబట్టి దేశంకాని దేశానికి, కాలం కాని కాలంలో వచ్చాడు కాబట్టి విభీషణుని తిరస్కరించాలి అని అన్నారు. అది కూడా సరి కాదు. ఎందుకంటే మనిషిని బట్టి అవసరాన్ని బట్టి దేశ,కాలములు మారుతుంటాయి. ఇతడు రావణుని దుర్మార్గమును, నీతి బాహ్యమైన చర్యలను చూచి విసిగిపోయి మనదగ్గరకు వచ్చాడేమో! అటువంటప్పుడు ఏసమయంలో వచ్చాడు మనము ఎక్కడ ఉండగా వచ్చాడు అన్న ప్రశ్న తలెత్తదు కదా!

మరి కొంత మంది ఇలా అన్నారు. విభీషణునికి తెలియని కొంత మందిని పంపి అతనిని ప్రశ్నించి నేర్పుగా అతని రహస్యములను రాబట్టాలి అని అన్నారు. అది కూడా సరి కాదు. విభీషణుని వద్దకు పోయి అతని గురించి అడిగితే, విభీషణుడు ఆ ప్రశ్నలు అడిగిన వాడి గురించి అనుమాన

పడవచ్చు కదా! విభీషణుడు విముఖుడై వెళ్లిపోతే, మనము ఒక మంచి మిత్రుడిని పోగొట్టుకున్నవాళ్లము అవుతాము కదా!

ఓ రామా! ఎదుటి వాళ్లు ఎలా మాట్లాడుతున్నారో, ఏ కంఠస్వరంతో మాట్లాడుతున్నారో, మాట్లాడేటప్పుడు ఎటువంటి హావభావాలు ప్రదర్శిస్తున్నారో సునిశితంగా పరిశీలిస్తే తప్ప, ఎదుటి వాళ్ల మనసులోని భావాలను కనిపెట్టలేము. విభీషణుడు తన గురించి చెప్పినప్పుడు నేను అతనిని నిశితంగా పరిశీలించాను. అతని మాటల్లో ఎలాంటి దుష్టభావన నాకు కనపడలేదు. అతనిలో నాకు ఎలాంటి కపటము కనపడలేదు. పైగా మనసులో కపటబుద్ధికలవాడు, అంత ధైర్యంగా మనదగ్గరకు రాడు. కాబట్టి అతనిని గురించి అనుమాన పడవలసిన అవసరము లేదు.

అదీకాకుండా, ఓ రామా! మనసులో భావాలను బయట పడకుండా దాచడం అంత సులభంకాదు. ఎందుకంటే, మనసులో మెదులుతున్న భావనలను శరీరం బలవంతంగానైనా బయటకు ప్రకటిస్తుంది. (ఫేస్ ఈజ్ ది ఇండెక్స్ ఆఫ్ ది మైండ్ అన్న విషయాన్ని వాల్మీకి మహర్షి మనకు త్రేతాయుగంలోనే రామాయణ కావ్యంలో చెప్పాడు.) విభీషణుడు సరి అయిన కాలములోనే మన వద్దకు వచ్చాడు. తన అన్న రావణునితో విభేదించి వచ్చాడు. తన అన్న రావణునికి శత్రువైన నీ వద్దకు వచ్చాడు. నీ గురించి బాగా తెలుసుకొని నీ వల్ల ప్రయోజనం పొందడానికి వచ్చాడు.

నీవు వాలిని చంపి సుగ్రీవుని కిష్కింధకు పట్టాభిషిక్తుడిని చేసావు. వాలిని చంపిన నీవు, రావణుని కూడా చంపి తనను లంకకు పట్టాభిషిక్తుని చేస్తావనే ఆలోచనతో, ఆశతో, విభీషణుడు నీ వద్దకు

వచ్చాడు. లంకకు రాజు కావాలనే కాంక్షతోనే విభీషణుడు నీ వద్దకు వచ్చాడు. అతనిని మనం సక్రమంగా ఉపయోగించుకుంటే, మనకు విజయం చేకూరుతుంది. కాబట్టి ఈ రాక్షసుడు, విభీషణుడు, నమ్మదగినవాడు. ఇతనిలో ఏ దుర్బుద్ధి లేదు. అని నా భావన. తరువాత మీ ఇష్టము."అని యుక్తియుక్తముగా పలికి కూర్చున్నాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము పదిహేడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము.

పదునెనిమిదవ సర్గ.

అందరూ మాట్లాడడం అయిన తరువాత రాముడు తన అభిప్రాయాన్ని ఈ విధంగా వెల్లడించాడు.

"వానరవీరులారా! విభీషణుని గురించి మీరంతా చెప్పినది విన్న తరువాత నా అభిప్రాయం కూడా చెబుతున్నాను. ఎవరైనా నా దగ్గరకు వచ్చి "నేను నీకు మిత్రుడను, శరణాగతుడను" అని చెబితే వారిలో ఎన్ని దోషాలు ఉన్నాకూడా, నేను వారిని విడిచిపెట్టను. అది నా వ్రతము. అన్నీ సుగుణములు ఉన్న వాడిని రక్షించే దానికంటే, దోషములు ఉన్న వాడిని రక్షించడంలోనే మన మంచితనం బయటపడుతుంది." అని ఒక్కవాక్యంలో తన నిర్ణయం తెలిపాడు రాముడు.

ఆ మాట విన్న తరువాత కూడా సుగ్రీవుడు తన పట్టుదల విడువ లేదు. "రామా! వచ్చిన వాడు రాక్షసుడు. వాడు దుష్టుడో కాదో మనకు అనవసరము. ఈ విభీషణుడు తనకు బాగా జరిగినంత కాలము తన అన్న రావణుని వద్ద ఉన్నాడు. ఇప్పుడు రావణునితో విభేదము కలిగేటప్పటికి రావణుని విడిచిపెట్టి నీ దగ్గరకు చేరాడు. స్వంత అన్ననే వదిలిన వాడు, రేపు నిన్ను నన్ను కూడా విడిచిపెట్టకుండా ఉంటాడా! అటువంటి వాడు తన స్వార్థం కోసం ఎవరినైనా విడిచిపెడతాడు. ఎంతటి ఘాతుకానికైనా ఒడిగడతాడు. ఇటువంటి స్వార్థపరుడికి, అవకాశవాదికి, ఆశ్రయం ఇవ్వడం శ్రేయస్కరము కాదు." అని పలికాడు సుగ్రీవుడు.

(ఒక పార్టీలో ఉండి ఎన్నికలలో నెగ్గి, ఏపదవీ లేకపోతే, ఏ ప్రాధాన్యము లేకపోతే, నాయకుడితో విభేదించి, అలా సంవత్సరంలో నాలుగు పార్టీలు మార్చి, ఎక్కడా లాభసాటిగా కనపడకపోయే సరికి, మరలా "అబ్బే అదేం లేదు. మనం మనం ఒకటే" అని సన్నాయి నొక్కులు నొక్కుతూ, సిగ్గూ ఎగ్గూ లేకుండా అసలు పార్టీలో చేరిన వాళ్లను మనం రోజూ చూస్తున్నాము. అదే విషయాన్ని సుగ్రీవుడు విపులంగా చెప్పాడు. అవకాశ వాదం నాడూ నేడూ ఒకేవిధంగా ఉంది.).

సుగ్రీవుని మాటలు విన్న రాముడు అతనితో ఏమీ మాట్లాడలేదు. లక్ష్మణుని వంక చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! సుగ్రీవుడు లౌక్యంగా మాట్లాడుతున్నాడు కానీ, శాస్త్ర పరంగా మాట్లాడటం లేదు. ఇటువంటి మాటలు సామాన్యులు కూడా మాట్లాడరు. ఇక్కడ ఒక ధర్మసూక్ష్మము ఉంది. రావణుడు, విభీషణుడు అన్నదమ్ములు. ఇద్దరూ రాక్షస కులమునకు చెందినవారు. కానీ ఒకరికి ఒకరు శత్రువులు అయ్యారు. రావణుడు లంకకు రాజు. రాజైన వాడు ఒక్కోసారి సాటివారు ధర్మపరులు

అయినా వాళ్లను నమ్మరు. పైగాశంకిస్తారు. ఈ విభీషణుడు ధర్మపరుడు కావచ్చును. కానీ రాజధర్మము ప్రకారము రావణుడు అతనిని శంకించి ఉండవచ్చు అంతమాత్రాన మనము ఇతనిని అనుమానించరాదు. మన శత్రువుల వద్దనుండి వచ్చినంత మాత్రాన అతడు కూడా మనకు శత్రువు కానవసరం లేదుకదా! మనశత్రువుకు శత్రువైన విభీషణుడు మనకు మిత్రుడు కావచ్చు కదా!

పైగా మనము విభీషణుని కులమునకు చెందిన వారము కాము. వారు రాక్షసులు. మనము క్షత్రియులము. విభీషణునికి మనకూ సహజమైన శత్రుత్వము లేదు. ఈ విభీషణునికి లంకను పాలించవలెనని కోరికగా ఉన్నటు తెలుస్తూ ఉంది. బుద్ధిహీనత వలన అలా కోరుకుంటున్నాడా అని అనుకున్నాకూడా, రాక్షసులు అందరూ బుద్ధిహీనులు కారు కదా! రాక్షసులలో కూడా విద్వాంసులు, పండితులు, శాస్త్రవేత్తలు, వేద వేదాంగ పారంగతులు  ఉన్నారు. కాబట్టి విభీషణుని మనము మిత్రునిగా స్వీకరించడంలో తప్పులేదు. లోకంలో దాయాదులు ఎవరూ మిత్రుల మాదిరి కలిసి మెలిసి ఉండరు. వారిలో వారికి మనస్పర్థలు ఉంటుంటాయి. అందుకే జ్ఞాతులు సాధారణంగా విడిపోతుంటారు. విభీషణుడు కూడా రావణుడికి తమ్ముడు. సీత కారణంగా అన్నదమ్ములకు భేదాభిప్రాయాలు వచ్చి ఉంటాయి. అందుకే  అన్న తమ్ముడిని తరిమేసాడు.

లక్ష్మణా! సోదరులు అందరూ భరతుని మాదిరి ఉంటారా చెప్పు. అలాగే కుమారులందరూ నా మాదిరి తండ్రి మాటను పాటించేవారు ఉంటారా! సుగ్రీవా! స్నేహితులందరూ నీ వంటి వాళ్లు ఉంటారా!" అని నర్మగర్భంగా అన్నాడు రాముడు.

రాముడి మాటలలో ఉన్న అంతరార్థము అర్థం చేసుకున్నాడు లక్ష్మణుడు. కాని సుగ్రీవుడు మాత్రము తన పాత మాటకే కట్టుబడి ఉన్నాడు. విభీషణుని మిత్రుడిగా అంగీకరించుటకు అతని మనసు ఒప్పుకోడం లేదు. అందుకని రామునితో ఇలా అన్నాడు.

"ఓ రామా! నామాట విను. ఈ రాక్షసుడు రావణుని గూఢచారి. అతనిని నమ్మకు. అతనిని చంపడమే యుక్తము. అతనికి శరణాగతి ఇవ్వడం అనర్థదాయకము. ఈ విభీషణుడు రావణుని ఆదేశము మేరకు నిన్ను, లక్ష్మణుని, నన్ను చంపడానికే ఇక్కడకు వచ్చాడు. ఇందులో సందేహము లేదు. ఇతడు ఆ క్రూరుడైన రావణుని సోదరుడు అని మరిచిపోకూడదు. కాబట్టి ఇతనిని ఇతని మంత్రులతో సహా బంధించి శిక్షించాలి." అని చెప్పి ఊరుకున్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుని మాటలు విన్న రాముడు తన మనోనిశ్చయాన్ని ఇలా ప్రకటించాడు. "వానరవీరులారా! మన వద్దకు వచ్చిన రాక్షసుడు దుష్టుడు అయినా, కాకపోయినా మనకు వచ్చిన భయం ఏమీ లేదు. ఇతడు నాకు గానీ మీలో ఎవరికైనా గానీ ఎటువంటి అపకారమూ చేయలేడు. సుగ్రీవా! నేను తలచుకుంటే ఈ భూమి మీద ఉన్న రాక్షసులను, దానవులను, యక్షులను ఒంటి చేత్తో చంపగలను. ఈ ఐదుగురు రాక్షసులు ఏ పాటి!

ఇంక శరణాగతి గురించి చెబుతాను. ఇది వరకు ఒక పావురము తన శరణు జొచ్చిన శత్రువునకు తన మాంసమునే ఆహారముగా పెట్టినది అని విన్నాము కదా! తన భార్యను చంపిన శత్రువు తన ఇంటికి వస్తే, అతనికి ఆతిధ్యము ఇచ్చినపావురము సంగతి మనకందరికీ తెలుసు కదా! ఒక పక్షి అలా చేసినపుడు మన మానవులము దానికి భిన్నంగా

ఎలా నడుచుకుంటాము? కణ్వమహర్షి కుమారుడు కండుడు అను వాడు ధర్మము తెలిపే కథలను కొన్ని చెప్పాడు. వాటిని ఒకసారి గుర్తుకు తెచ్చుకో!

రెండు చేతులూ జోడించి, దీనంగా తనను శరణు కోరిన శత్రువును క్షత్రియులు చంపకూడదు. అలాగే ఇతరుల చేత చిక్కిన తన శత్రువును, క్షత్రియుడు తన ప్రాణములనైనా పణంగా పెట్టి రక్షించాలి. తన శరణుజొచ్చిన శత్రువును కూడా కాపాడలేక పోయిన క్షత్రియుడు మహాపాపము చేసిన వాడితో సమానమవుతాడు. అలాగే, తన శరణుజొచ్చిన వాడిని తాను కాపాడ లేకపోగా, పైగా, అతడు తన కళ్లముందే మరణిస్తే, ఆ మరణించిన వాడు, తాను శరణుజొచ్చిన వాడి పుణ్యమును అంతా తన వెంట తీసుకొనిపోతాడు.

ఇప్పుడు విభీషణుడు మన శరణు కోరి వచ్చాడు. ఇప్పుడు మనము అతనిని నిరాకరిస్తే, పైన చెప్పిన పాపములు అన్నీ మనకు చుట్టుకుంటాయి. పైగా మనకు అపకీర్తి వస్తుంది. కాబట్టి నేను కండు మహర్షి చెప్పిన ధర్మములను పాటిస్తాను. నా శరణు కోరి వచ్చిన విభీషణునికి అభయం ఇస్తాను. ఈ విభీషణుడే కాదు, ఎవడైనా సరేనా ముందుకు వచ్చి, నన్ను శరణు కోరితే, నేను వాడికి అభయం ఇస్తాను. ఇదే నేను అవలంబించుచున్న వ్రతనియమము. దీనికి తిరుగు లేదు.

ఓ సుగ్రీవా! ఆ వచ్చినవాడు, రావణుని తమ్ముడు విభీషణుడైనా, లేక సాక్షాత్తు రావణుడు అయినా సరే. అతనిని నా వద్దకు తీసుకొని రమ్ము. నేను అతనికి అభయము ఇచ్చాను అని చెప్పు." అని పలికాడు రాముడు. ఆ మాటలు విన్న సుగ్రీవుడు రాముడి ధర్మపాలనకు ఆశ్చర్యపోయాడు. సామాన్యుడైన తనకు రాముని ధర్మాచరణ సాధ్యం కాదనుకున్నాడు.

రామునికి నమస్కరించి ఇలా అన్నాడు.

"ఓ రామా! నీకు తెలియని ధర్మము లేదు. నీవు మూర్తీభవించిన ధర్మస్వరూపుడవు. మహా బలశాలివి. పరాక్రమవంతుడివి. నీవు ఈ విధంగా మాట్లాడటంలో ఆశ్చర్యం ఏముంది. నీమాటలు వింటుంటే నాకు కూడా విభీషణుడు మంచి వాడు, అభయము ఇవ్వతగ్గవాడు అనిపిస్తూ ఉంది. అందుకని ఈ విభీషణుని కూడా మన మిత్రునిగా అంగీకరిద్దాము. ఇప్పటినుండి విభీషణుడు కూడా మనకు అందరికీ మిత్రుడు. నేను ఇప్పుడే వెళ్లి విభీషణుని సగౌరవంగా తీసుకొని వస్తాను." అని అన్నాడు సుగ్రీవుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము పదునెనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## పంతొమ్మిదవ సర్గ.

ఆకాశంలో నిలబడి ఉన్న విభీషణుడు, రాముడి ముందు వానర నాయకులు నిలబడి మాట్లాడటం వారిలో వారు వాదించుకోవడం అంతా చూస్తున్నాడు. చివరకు పర్యవసానము ఎలా ఉంటుందో అని భయపడుతున్నాడు. ఎందుకంటే రాముడి వద్దకు వెళదామని రావణునితో విభేదించి వచ్చాడు. రాముడూ కాదంటే ఎక్కడకు వెళ్లాలి అని ఆలోచిస్తున్నాడు.

ఇంతలో సుగ్రీవుడు విభీషణుని కిందికి రమ్మని చెయ్యి ఊపాడు. పట్టరాని సంతోషంతో విభీషణుడు తన అనుచరులతో కిందికి దిగాడు. పరుగు పరుగున రాముని వద్దకు వెళ్లాడు. రాముని ముందు సాగిల పడ్డాడు. రాముని పాదములను స్పృశించాడు. రామునితో ఇలా అన్నాడు.

“రామా! నా పేరు విభీషణుడు. రావణుని సోదరుడను. నా అన్న రావణుడు నన్ను అవమానించి రాజ్యమునుండి వెళ్లగొట్టాడు. నీవు శరణాగతరక్షకుడవు అని విని నీ శరణుకోరి వచ్చాను. నేను లంకను, లంకలో ఉన్న నా భార్యాబిడ్డలను, నా బంధుమిత్రులను అందరినీ వదిలి వచ్చాను. నా రాజ్యము, నా జీవితము నీ మీదనే ఆధారపడి ఉన్నాయి.” అని అన్నాడు.

రాముడు విభీషణుని పట్టుకొని లేవనెత్తాడు. విభీషణుని ప్రేమతో చూస్తూ ఇలా అన్నాడు. “నీవు రాక్షసుల బలాబలముల గురించి నాకు వివరంగా చెప్పు” అని అడిగాడు. విభీషణుడు విషయం అర్థం చేసుకున్నాడు. రావణుని బలము, బలహీనతల గురించి చెప్పనారంభించాడు.

“ ఓ రామా! రావణుడు బ్రహ్మ గురించి తపస్సు చేసి వరములు పొందాడు. ఆ వర ప్రభావంతో రావణుని దేవ,దానవ,గంధర్వ,నాగజాతులు చంపజాలవు. రావణునికి నాకూ మధ్యలో కుంభకర్ణుడు అనే సోదరుడు ఉన్నాడు. వాడు మహాబలవంతుడు. దేవేంద్రుడు కూడా యుద్ధములో అతని ముందు నిలువలేడు. రావణునికి ప్రహస్తుడు అనే సేనాపతి ఉన్నాడు. అతడు మణిభద్రుడు అనే యక్షుడిని కైలాస పర్వతము మీద

ఓడించాడు. రావణుని కుమారుడు ఇంద్రజిత్తు. యుద్ధవిద్యలలో ఆరితేరినవాడు. అతడు అదృశ్యరూపంలో యుద్ధంచేయగల నేర్పరి. వారు కాకుండా మహోదరుడు, మహాపార్శ్వుడు, అకంపనుడు అని రావణునికి సేనాధిపతులు ఉన్నారు. లంకలో ఉన్న రాక్షసులు అందరూ కామరూపులు. తమ ఇష్టం వచ్చిన రూపములు ధరించడంలో సమర్థులు. వారందరూ మాంసాహారులు. రావణుడు లోకపాలకులను, దేవతలను యుద్ధములో ఓడించాడు. వారిని తన వశంలో ఉంచుకున్నాడు." అని విభీషణుడు లంక రహస్యములను అన్నీ చెబుతూ ఉంటే రాముడు కళ్లు మూసుకొని వింటున్నాడు. అన్నీ మనసుకు పట్టించుకుంటున్నాడు. కళ్ళుతెరిచి విభీషణునితో ఇలా అన్నాడు.

"విభీషణా! నీవు నీ అన్న రావణుని గురించి అతని బలమును, పరాక్రమమును గురించి అతని సేనల గురించి చెప్పావు. నేను వాటిని చక్కగా ఆకళింపుచేసుకున్నాను. ఇప్పుడు నీకు నేను మాట ఇస్తున్నాను. నేను రావణుని, ఇంద్రజిత్తును, ప్రహస్తుని చంపి, నిన్ను లంకకు రాజును చేస్తాను. రావణుడు ముల్లోకములలో ఎక్కడ దాక్కున్నా వెదికి వెదికి చంపుతాను. నేను నా ముగ్గురు సోదరుల మీద ఒట్టుపెట్టుకుంటున్నాను. నేను రావణుని, అతని కొడుకులను, బంధు మిత్రులను చంపకుండా అయోధ్యలో ప్రవేశించను. ఇదే నా ప్రతిజ్ఞ." అని పలికాడు.

ఆ మాటలకు విభీషణుడు ఉబ్బితబ్బిబ్బయ్యాడు. రామునితో ఇలా అన్నాడు. "ఓ రామా! మీరు లంకను ముట్టడించడంలోనూ, లంకను జయించడంలోనూ, రావణుని చంపడంలోనూ నేను సాయం చేస్తాను. నా శక్త్యానుసారము నేను రాక్షసులతో యుద్ధము చేస్తాను."అని అన్నాడు విభీషణుడు.

రాముడు వెంటనే సముద్రము నుండి జలమును తెప్పించాడు. లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. “లక్ష్మణా! ఈ సముద్ర జలముతో నీవు విభీషణుని లంకా రాజ్యమునకు పట్టాభిషిక్తుడిని చెయ్యి. అది చూచి నేను సంతోషిస్తాను.” అనిపలికాడు. రాముని ఆదేశానుసారము లక్ష్మణుడు సమస్తవానరుల సమక్షంలో విభీషణుని లంకా సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుని చేసాడు. అది చూచి వానరులంతా సంతోషంతో కేరింతలుకొట్టారు. ఆడారు పాడారు. ఇప్పుడు హనుమంతుడు, సుగ్రీవుడు కలిసి విభీషణుని సూటిగా ఒక మాట అడిగారు.

“అంతా బాగానే ఉంది. ఇప్పుడు మనమందరము ఈ సముద్రాన్ని దాటి లంకను చేరుకొనేది ఎటుల సాధ్యమో మీరు చెప్పండి.”అని అన్నాడు. దానికి విభీషణుడు ఇలా అన్నాడు. “రాముడు సముద్రమును దారి ఇమ్మని అర్థించడం మంచిది. ఎందుకంటే సముద్రమును త్రవ్వించిన సగరుడు ఇక్ష్వాకు వంశమునకు చెందిన వాడు. రామునికి పూర్వీకుడు. రాముడు అర్థిస్తే సాగరము తప్పక సాయం చేస్తుంది. దారి ఇస్తుంది.” అని అన్నాడు విభీషణుడు. అవేమాటలు సుగ్రీవుడు, హనుమంంతుడు రామలక్ష్మణులకు చెప్పారు. ఈ ఆలోచన రామునికి కూడా నచ్చింది.

రాముడు లక్ష్మణుని, సుగ్రీవుని చూచి ఇలా అన్నాడు. “సుగ్రీవా! విభీషణుని ఆలోచన నాకు బాగా నచ్చింది. మీరు ఇరువురూ కలిసి సుముహూర్తమును నిర్ణయించి నాకు తెలియజేయండి.” అని అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు రాముని చూచి ఇలా అన్నాడు. “రామా! విభీషణుని ఆలోచన నాకూ నచ్చింది. కానీ, ఇంత విశాలమైన సాగరము మీద సేతువు కట్టకుండా దాటడం సాధ్యమా! సేతువు కట్టకుండా దేవతలు, దానవులు కూడా ఈ సముద్రమును దాటలేరు కదా! కాబట్టి సేతువు నిర్మాణమునకు

సముద్రుని సాయం అడగండి.” అని అన్నాడు లక్ష్మణుడు.

వెంటనే రాముడు సముద్ర తీరంలో దర్భలతో ఒక శయ్య ఏర్పాటుచేసుకున్నాడు. దాని మీద పడుకున్నాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము పంతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
ఇరువదవ సర్గ.

విభీషణుడు తన వద్దనుండి వెళ్లగానే రావణుడికి అనుమానం కలిగింది. శార్దూలుడు అనే రాక్షసుని పంపించాడు. శార్దూలుడు మారువేషంలో వానర సైన్యం వద్దకు వచ్చాడు. వానర సైన్యము పన్నిన వ్యూహములు అన్నీ గమనించాడు. వెంటనే లంకకు చేరుకున్నాడు. రావణునికి వానర సైన్యము గురించి వివరంగా చెప్పాడు.

“మహారాజా! వానర సైన్యము అపారంగా ఉంది. ఇంత అని చెప్పవీలు లేదు. వారందరూ సముద్రము ఆవల ఒడ్డున నిలిచి ఉన్నారు. వారికి రామలక్ష్మణులు నాయకత్వము వహిస్తున్నారు. వానర సైన్యము సముద్రము ఒడ్డున పదియోజనముల దూరము విస్తరించి ఉంది. నేను పైపైన చూచి వచ్చాను. తమరు మరి కొంత మంది గూఢచారులను పంపిన వారు సమగ్రమైన సమాచారమును సేకరించగలరు. ప్రస్తుతము ఆ వానర సేనతో యుద్ధయు కన్నా సామో పాయము, దానో పాయము,

భేదోపాయము ప్రయోగించడం ఉచితము." అని అన్నాడు శార్దూలుడు.

శార్దూలుని మాటలు విన్న రావణుడు కొంచెం కంగారు పడ్డాడు. ఏదో వానరులు కదా, రామలక్ష్మణులు నరులు కదా అని ఉపేక్ష చేసాడు. కానీ ప్రస్తుత పరిస్తితి చూస్తుంటే వానరులతో యుద్ధము అంత సులభం కాదనిపించింది. వెంటనే రావణుడు శుకుడు అనే రాక్షసుని పిలిపించాడు. "నీవు నా పంపున సుగ్రీవుని వద్దకు దూతగా వెళ్లు. నేను చెప్పు మాటలను సౌమ్యంగా ఉన్నది ఉన్నట్టు చెప్పు.

"సుగ్రీవా! నీవు ఉత్తమ కుల సంజాతుడవు. ఋక్షస్సు కుమారుడవు. నీకూ నాకు ఎలాంటి వైరము లేదు. నీవు నాకు సోదరుని వంటి వాడవు. ఈ యుద్ధమువలన నీకు ఎలాంటి ప్రయోజనము లేదు. నేను రాముని భార్యను తీసుకొని వచ్చాను. అది నాకూ రామునికి సంబంధించిన విషయము.  ఇందులో నీకు ఎలాంటి సంబంధము లేదు. కాబట్టి నీవు నీ సేనలతో కిష్కింధకు తిరిగి పొమ్ము. పైగా నీ వానర సైన్యము సాగరమును దాటి లంకలో ప్రవేశించడం కష్టం. అందరూ సముద్రములలో మునిగి పోతారు. ఎందుకంటే ఈ సాగరమును దాటడం దేవతలకు, దానవులకు, గంధర్వులకు  కూడా వశం కాదు. ఇంక ఈ నరులు, వానరులు ఎలా దాటుతారు? కాబట్టి ఈ యుద్ధమును విరమించి కిష్కింధకు తిరిగి వెళ్లు." అని నామాటలుగా సుగ్రీవునికి చెప్పు." అని పలికాడు రావణుడు.

రావణుని సందేశమును తీసుకొని శుకుడు రివ్వున ఆకాశంలోకి ఎగిరాడు. సముద్రమునకు ఆవల నిలిచి ఉన్న వానర సేన వద్దకు చేరుకున్నాడు. ఆకాశంలోనే నిలబడి సుగ్రీవునితో ఇలా అన్నాడు.

"సుగ్రీవా! నేను లంకేశ్వరుడు రావణుని వద్దనుండి వచ్చాను. రావణుడు నీకు చెప్పమన్న మాటలను యధాతథంగా చెబుతున్నాను. సావధానంగా విను" అంటూ రావణుడు చెప్పిన మాటలను ఉన్నది ఉన్నట్టు చెప్పాడు. శుకుడు రావణుడు చెప్పమన్న మాటలు చెబుతూ ఉండగానే కొంత మంది వానరులు ఆకాశంలోకి ఎగిరారు. శుకుడిని పట్టుకున్నారు. వాడిని కొట్టుకుంటూ తన్నుకుంటూ కిందికి తీసుకొని వచ్చారు. అప్పుడు శుకుడు పెద్దగా అరుస్తున్నాడు.

"ఓ రామా! నేను రావణుని దూతను. దూతను చంపకూడదని నియమం ఉంది కదా! నన్ను రక్షించు. ఈ వానరులను వెనక్కురమ్మని చెప్పు. నన్ను కొట్టవద్దని చెప్పు నేను రావణుని చెప్పని మాటను ఒక్కటి కూడా అధికంగా చెప్పలేదు. రావణుడు చెప్పమన్న మాటలనే చెప్పాను. రావణుడు చెప్పమన్న దానికన్నా నేను అధికప్రసంగం చేసి ఉంటే నన్ను దండించడం, చంపడం యుక్తము. కాని నేను అలా చేయలేదు. నేను దూత నియమములను తప్పలేదు. నన్ను రక్షించు." అని పెద్దగా అరిచాడు.

శుకుని మాటలను ఆలకించిన రాముడు "అతనిని విడిచి పెట్టండి. చంపకండి" అని ఆదేశించాడు. తనకు ప్రాణభయం లేదని తెలుసుకున్న శుకుడు మరలా ఆకాశంలోకి ఎగిరాడు. ఆకాశంలో నిలిచి ఇలా అన్నాడు. "ఓ సుగ్రీవా! రావణుని సందేశమును విన్నావు కదా! నీవు రావణునికి ఏమి సందేశము ఇస్తావు. రావణునికి నన్ను ఏమని చెప్పమంటావు?" అని అడిగాడు. అప్పుడు సుగ్రీవుడు శుకునితో ఇలా అన్నాడు.

"ఓ రావణా! నీవు నాకు మిత్రుడవు కావు. బంధువు కావు. నీకూ నాకూ మిత్రత్వము కానీ సంబంధము కానీ లేదు. ఇదివరలో నీవు నాకు ఎలాంటి ఉపకారము చేసి ఉండలేదు. కాబట్టి నీ మాటలు పాటించవలసిన అవసరము నాకు లేదు. నీవు అకారణంగా రాముని భార్య సీతను అపహరించావు. రామునితో విరోధము కొనితెచ్చుకున్నావు. పరుల భార్యలను అపహరించిన వాడు దండనార్హుడు. అతనికి మరణదండన విధించవలెను. కాబట్టి నీకు రాముని చేతిలో మరణము తప్పదు. నేను నా వానర సైన్యముతో సముద్రమును దాటి లంకకు వచ్చి, నిన్ను, నీ పుత్రులను, బంధువులను అందరినీ సమూలంగా నాశనం చేస్తాను.

ఓ రావణా! నీవు మూర్ఖుడవు. రామునితో విరోధము పెట్టుకున్నావు. నీవు సూర్యలోకములో గానీ, పాతాళములో కానీ, కడకు ఈశ్వరుని పాదముల వద్ద ఉన్నా గానీ, రాముడు నిన్ను విడిచి పెట్టడు. నిన్ను చంపి తీరుతాడు. నిన్ను రక్షించగల వీరుడు ముల్లోకములలో నాకు కనిపించడం లేదు. నీవు అక్రమంగా సీతను అపహరిస్తున్నావు అని మంచి మాటలు చెప్పిన పక్షిరాజు జటాయువును నిర్దాక్షిణ్యంగా చంపావు.

నీవు నిజంగా వీరుడివి, పరాక్రమవంతుడివి అయితే, నీవు రాముడు ఇంట ఉండగా రాముడికి లక్ష్మణునికి తెలిసేటట్టు సీతను ఎందుకు అపహరించలేదు! రాముడంటే భయమా! రామ బాణము అంటే భయమా! రాముడి గురించి నీకు సరిగా తెలియదు. రాముడు తలుచుకుంటే ఈ భూమి మీద రాక్షసజాతి అనేది లేకుండా చేయగలడు. జాగ్రత్త!" అని అన్నాడు సుగ్రీవుడు.

వానర రాజు సుగ్రీవుడు చెప్పిన తరువాత యువరాజు అంగదుడు కూడా ఇలా అన్నాడు. “ఓ సుగ్రీవా! ఇతడు దూత కాడు. రాక్షసుల గూఢచారి. పైన నిలబడి మన సేనలను తేరిపార చూస్తున్నాడు. మన సేనల వివరాలు తెలుసుకుంటున్నాడు. ఇతడు తిరిగి లంకకు వెళ్లకూడదు. ఇదీ నా అభిప్రాయము.” అని పలికాడు.

ఎప్పుడెప్పుడా అని ఉన్న సుగ్రీవునికి అంగదుని మాటలు ఊతాన్ని ఇచ్చాయి. వెంటనే శుకుని బంధించమన్నాడు. వానరులు వెంటనే ఆకాశం లోకి ఎగిరి శుకుని బంధించారు. శుకుడు పెద్దగా ఏడుస్తున్నాడు. మరలా “రామా రామా రక్షించు” అని అరుస్తున్నాడు. “ఓ రామా! ఈ వానరులు నన్ను బంధించారు. నన్ను కొడుతున్నారు. నా కళ్లు పీకుతున్నారు. ఇప్పుడు నేను వీళ్లచేతిలో చస్తే నా పాపాలన్నీ నీకు చుట్టుకుంటాయి.” అని అరుస్తున్నాడు. మరలా రాముడు జోక్యం చేసుకొని శుకుని వానరుల బారి నుండి రక్షించాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఇరువదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ఇరువది ఒకటవ సర్గ.

పంతొమ్మిదవ సర్గలో ముగించినట్టు రాముడు సముద్ర తీరంలో, సముద్రునికి నమస్కారము చేసి, “నేను ఈ సముద్రమును దాటనైనా దాటవలె. లేకపోతే ప్రాయోపవేశము చేసి మరణించవలె. మరొక

మార్గము లేదు." అని సంకల్పించి, దర్భలమీద పడుకొని ఉన్నాడు. ఆ ప్రకారంగా మూడు రాత్రులు గడిచాయి. మూడు రోజులూ రాముడు సముద్రుని ఉపాసిస్తున్నాడు. కాని, సముద్రుడు రాముని వద్దకు రాలేదు. రాముడికి కోపం వచ్చింది. కళ్లు ఎర్రబడ్డాయి. పక్కనే ఉన్న లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"లక్ష్మణా! ఈ సముద్రునికి ఎంత గర్వము. నేను ఎంత వేడుకున్నను నా వద్దకు రాలేదు. నాలో ఉన్న శాంతి కాముకత, ఓర్పు, మంచి తనము నా చేతగాని తనంగా పరిగణిస్తున్నాడు సముద్రుడు. సాధారణంగా ఈ లోకంలో తనను తాను పొగుడుకొనే వాడికి, దుర్మార్గుడికి, అందరిమీద అధికారము చూపేవాడికి, అకారణంగా అటు ఇటు హడావిడిగా పరుగెత్తేవాడికి, అందరి మీదా బలప్రయోగము చేసేవాడికి ప్రజలు భయపడతారు. భక్తితో కొలుస్తారు. (ఈ సూక్తి ఈనాటి అధికార జులుంకు, గూండాయిజానికి సరిగ్గా సరిపోతుంది.) ఈ లోకంలో మంచి తనంతో, సౌమ్యతతో పనులు సాధించలేము. యుద్ధములో విజయము దక్కించుకోలేము. నేను నా బాణములచేత ఈ సముద్రమును ఎండింపజేస్తాను. సముద్రజలాలు ఇంకిపోయి సముద్రములో ఉన్న జలచరములు అన్నీ బయటపడేట్టు చేస్తాను. నేను ఓర్పుగా ఉన్నానని, నా ఓర్పును నా అసమర్థతగా, చేతగాని తనంగా పరిగణిస్తున్నాడు సముద్రుడు. ఇటువంటి వాని విషయంలో ఓర్పుగా ఉండటం మహా తప్పు.

లక్ష్మణా! నా ధనుర్బాణములు తీసుకొని రా! నా బాణముల శక్తి ఏమిటో ఈ సముద్రునికి తెలియజేస్తాను. ఈ సముద్రమును ఎండింపజేస్తాను. అప్పుడు వానరసేనలు హాయిగా సముద్రములో నడిచి

లంకకు చేరుకుంటాయి." అని పలికి రాముడు తన ధనుస్సును సంధించాడు.

రాముడు కోపం తెచ్చుకున్నాడు. రాముని కళ్లు ఎర్రబడ్డాయి. ప్రజ్వరిల్లుతున్న ప్రళయాగ్నిలాగా ప్రకాశిస్తున్నాడు. సముద్రుని మీద శరవర్షము కురిపిస్తున్నాడు. రామ బాణములు సముద్రములోకి ప్రవేశించాయి. సముద్రములోని నీవు ఆవిరి కాసాగింది. సముద్రములోని జలచరములు ఈ ఉత్పాతానికి తల్లడిల్లిపోతున్నాయి. సముద్రములోనుండి పొగలు చెలరేగుతున్నాయి. సముద్రము అలలు ఆకాశాన్నంటుతున్నాయి. ఆ అలలతోపాటు మొసళ్లు పాములు జలచరములు పైకి ఎగిసి పడుతున్నాయి. రాముని పక్కన ఉన్న లక్ష్మణుడు కూడా రాముని ఉగ్రస్వరూపమును చూచి భయపడ్డాడు. బాణములు సంధిస్తున్న రాముని చేయి గట్టిగా పట్టుకొని "రామా! వద్దు ఇంక చాలు. ఇంక ఆపు" అని వేడుకున్నాడు.

"రామా! మన కార్యము కొరకు కోట్లకొలదీ జలచరములకు ఆలవాలంగా ఉన్న సముద్రమును ఇంకింపజేస్తావా! మనము, మన వానరసేన సముద్రము దాటడానికి, సముద్రాన్ని ఇంతగా క్షోభింపచెయ్యాలా! మన కార్యము వేరేవిధంగా పూర్తిచేసుకోవచ్చు కదా! కోపము అన్ని అనర్ధములకు మూలము. నీ వంటి ఉత్తములు కోపానికి వశులవడం మంచిది కాదు కదా! నీ పూర్వీకుల ఉత్తమ గుణములను గుర్తుతెచ్చుకో! నీ స్వార్ధము కోసరం సముద్రమును క్షోభింపచేసి అపకీర్తిపాలుగాకు!" అని పలికాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము యుద్ధకాండము

ఇరవైఒకటవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## ఇరవై రెండవ సర్గ.

రాముడు తన మాట మీదనే ఉన్నాడు. సముద్రుని చూచి ఇలా అన్నాడు. "ఓ సముద్రమా! నిన్ను ఇప్పుడే ఎండింపచేస్తాను. నేను నా బాణములతో నీ లోని నీటిని ఆవిరిగా మారుస్తాను. జలచరములను అన్నిటినీ చంపుతాను. అప్పుడు వానరులు నీ మీదుగా హాయిగా నడుచుకుంటూ లంకకు చేరుతారు. ఓ సముద్రుడా! నేను ఎన్ని విధముల బతిమాలిననూ, ప్రార్థించిననూ కనీసము నా ముందుకు వచ్చి నాతో మాట్లాడలేదు. నా పౌరుషాన్ని, నా పరాక్రమాన్ని నువ్వు గుర్తించలేదు. కాబట్టి ఇప్పుడు నీకు ఈ గతి పట్టింది." అంటూ రాముడు బ్రహ్మాస్త్రమును సంధించాడు.

అప్పుడు భూమి ఆకాశము బద్దలు అయినట్టు శబ్దము వచ్చింది. పర్వతములు కంపించాయి. లోకమంతా చీకట్లు కమ్మాయి. సరస్సులు, నదులు గతులు తప్పాయి. చంద్రుడు సూర్యుడు తమ తమ గమనమును మార్చుకున్నాయి. ఆకాశం నుండి ఉల్కాపాతము మొదలయింది. మహావేగంతో విపరీతంగా గాలి వీచింది. వృక్షములు కూలిపోతున్నాయి. మేఘాలు చెదిరిపోతున్నాయి. ఆకాశంలో ఉరుములు మెరుపులు ఉధృతిగా ఉన్నాయి. పిడుగులు పడుతూ విద్యుత్ సంబంధమైన మంటలు మండు తున్నాయి. ఆ పిడుగుపాటుకు సమస్తజీవజాతులు అల్లల్లాడి పోతున్నాయి. సముద్రము అల్లకల్లోలము అయింది. ఆకాశం ఎత్తు అలలు తీరం మీద విరుచుకుపడుతున్నాయి. తీర ప్రాంతాలు మునిగిపోతున్నాయి. రాముడు, వానర సేన ఉన్న ప్రాంతము నుండి సముద్రము ఒక యోజనము వెనక్కు వెళ్లింది.

ఆ సమయంలో సముద్రగర్భము నుండి సముద్రుడు బయటకు వచ్చాడు. సముద్రుడు రత్నహారములు ధరించి ఉన్నాడు. సువర్ణ ఆభరణములు ధరించి ఉన్నాడు. సముద్రునిలో కలిసిన నదులన్నీ సముద్రుని వెనుక నిలబడి ఉన్నాయి. సముద్రుడు రాముని ముందు చేతులు జోడించి నిలబడ్డాడు. రామునితో ఇలా అన్నాడు. “ఓ రామా! ఈ సృష్టిలో పంచభూతములైన భూమి, వాయువు, ఆకాశము, జలము, అగ్ని ఇవి అన్నీ తమ తమ స్వభావమును బట్టి ప్రవర్తిస్తుంటాయి. నేను సముద్రుడను. లోతుగా ఉండటం, నీటితో నిండి ఉండటం నా స్వభావము. సముద్రము లోతుగా లేకపోతే అది నా స్వభావమునకే విరుద్ధము. సముద్రంలో జలచరములు, మొసళ్లు విరివిగా ఉంటాయి. వాటికి నేను భయపడి గానీ, నా స్వప్రయోజనమునకు కానీ, లోభము వలన కానీ, నా కోరికలు తీర్చుకోడానికి కానీ, ఆ జలచరములను నేను చంపను. అవి నాతోపాటే ఉంటుంటాయి.

నీవు నీ వానర సేన క్షేమముగా సముద్రమును దాటుటకు తగిన ఏర్పాట్లు నేను చేస్తాను. నాలో ఉన్న జలచరములు మీకు ఏ అపకారమూచెయ్యకుండా నేను చూస్తాను. దయచేసి బ్రహ్మాస్త్రమును ఉపసంహరించు.” అని వేడుకున్నాడు సముద్రుడు.

అప్పుడు రాముడు సముద్రునితో ఇలా అన్నాడు. “ఓ సముద్రమా! నీవు ఎంతకూ రాక పోతే నేను బ్రహ్మాస్త్రమును సంధించాను. దానిని నేను వెనుకకు మరల్చలేను. కాబట్టి ఈ బ్రహ్మాస్త్రమును ఎక్కడ ప్రయోగించాలో చెప్పు.” అని అడిగాడు రాముడు.

“ఓ రామా! ఇక్కడకు ఉత్తరముగా ద్రుమకుల్యము అనే

పవిత్రమైన స్థలము ఒకటి ఉంది. ఆ స్థలమును కొంత మంది దుర్మార్గులు ఆక్రమించుకొని అన్నిరకాల అక్రమాలు చేస్తున్నారు. వాళ్లు దస్యులు. వాళ్లు నా జలములో స్నానం చేస్తున్నారు. వాళ్ల పాపాలన్నీ నాకు అంటుకుంటున్నాయి. నేను ఆ పాపములను సహించలేక పోతున్నాను. కాబట్టి నీవు ఈ బ్రహ్మాస్త్రమును వారి మీద ప్రయోగించు." అని అన్నాడు.

సముద్రుని కోరిక ప్రకారము రాముడు తాను సంధించిన బ్రహ్మాస్త్రమును ద్రుమకుల్యములో ఉన్న దస్యులమీద విడిచిపెట్టాడు. రాముడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రము భూమిని చీల్చుకుంటూ పాతాళములోనికి ప్రవేశించింది. పాతాళ గంగ భూమిని చీల్చుకుంటూ ఆకాశంలోకి ఎగిసింది. బ్రహ్మాస్త్రము పడ్డచోట పెద్ద గొయ్యి ఏర్పడింది. దానికి వ్రణము అనే పేరు వచ్చింది. ఆ వ్రణము నుండి నిరంతరము స్వచ్ఛమైన జలము పైకి ఉబుకుతూ ఉంటుంది. ఆ ప్రదేశమునకు మరుకాంతారము అనే పేరు వచ్చింది. ఆ మరుకాంతారము పెద్ద పెద్ద పచ్చికబయళ్లతో, పశుసంపద, పాడి పంటలు వృద్ధిచెందుటకు అనువుగా ఉండింది. అక్కడ ఫలవృక్షములు, చల్లని నీడ నిచ్చే చెట్లు సమృద్ధిగా పెరిగాయి. అనేక రకములయిన ఓషధులు అక్కడ పెరుగుతున్నాయి. ఆ ప్రకారంగా మరుకాంతారము మంగళకరంగా శోభిల్లింది.

తరువాత సముద్రుడు రామునితో ఇలా అన్నాడు. "ఓ రామా! మీదగ్గర ఉన్న వానరులలో నీలుడు అనేవాడు ఉన్నాడు. అతడు విశ్వకర్మ కుమారుడు. తండ్రి వలన వరములను పొంది ఉన్నాడు. ఆ నీలుడు తన తండ్రి విశ్వకర్మతో సాటిగా నిర్మాణపనులు చేయగలడు. ఆ నీలుడు నా మీద సేతువును నిర్మిస్తాడు. ఆ సేతువును నేను భరిస్తాను."అని పలికి సముద్రుడు వెళ్లిపోయాడు.

అప్పుడు నీలుడు రాముని చూచి ఇలా అన్నాడు. “ ఓ రామా! సముద్రుడు చెప్పిన మాట నిజమే. నేను విశ్వకర్మకుమారుడను. నేను ఈ సముద్రము మీద సేతువును నిర్మించెదను. సముద్రుడు తనలో లోతు లేని ప్రాంతమును మనకు చూపించాడు. అక్కడ నుండి సేతువును నిర్మిస్తాను. ఇంక నా గురించి చెబుతాను. నేను విశ్వకర్మకు ఔరస పుత్రుడను. నా తండ్రితో సమానంగా నిర్మాణ కౌశలము కలవాడిని. మీరు అడగకుండా నా గుణగణముల గురించి నాకుగా నేను చెబితే బాగా ఉండదని నా సంగతి మీకు చెప్పలేదు. ఇప్పుడు సముద్రుడు చెప్పాడు కాబట్టి నా గురించి నేను చెప్పుకున్నాను.ఈ సముద్రము మీద నూరు యోజనముల దూరము సేతువు కట్టే సామర్థ్యము నాకు ఉంది. కాబట్టి వానర వీరులందరూ సేతువును కట్టుటకు తగిన ప్రయత్నములను చేయండి.” అని పలికాడు.

రాముడు సేతువు నిర్మాణానికి అనుమతి ఇచ్చాడు. వెంటనే కోట్లకొద్దీ వానరులు అరణ్యములలోకి పరుగులు తీసారు. వారంతా ఆ అరణ్యములో ఉన్న మహా వృక్షములను, బండరాళ్లను, పర్వతశిఖరములను మోసుకొచ్చి సముద్రంలో పడవేసారు. నీలుడు వాటిని ఒక క్రమపద్ధతిలో అమరుస్తున్నాడు. వానరులు సాలవృక్షములు, అశ్వకర్ణ, ధవ, వెదురు, కుటజ, అర్జున, తాళ, తిలక, తినిశ, మారేడు, కర్ణికార, చూత, అశోక వృక్షములను మోసుకొని వచ్చి సముద్రం ఒడ్డున పడవేసారు. (పైనచెప్పిన చెట్లలో చాలా వరకు నేడు కూడా భవన నిర్మాణపనులలో వాడుతున్నారు కదా!టేకు అనే పదము అప్పుడు వేరే పేరుతో ఉండేదేమో!)

వానరులు ఎక్కువగా తాటి చెట్లను, మామిడి చెట్లను, దానిమ్మ చెట్లను, కొబ్బరి చెట్లను, విభీతక వృక్షములను, వేప చెట్లను పెకలించి

తీసుకొని వచ్చి సముద్రము ఒడ్డున పడవేసారు. చెట్లు తెచ్చే వాళ్లు చెట్లను తెస్తుంటే, మరి కొందరు వానరులు పెద్దపెద్ద బండరాళ్లను మోసుకొని వచ్చి సముద్రము ఒడ్డున పడవేస్తున్నారు.

ఇక్కడ వాల్మీకి ఒక శ్లోకంలో యంత్రములు వాడారు అని రాసారు.
హస్తిమాత్రాన్ మహాకాయాః పాషాణాంశ్చ మహాబలాః
పర్వతాంశ్చ సముత్పాట్య యన్త్రైః పరివహన్తి చ.

పెద్ద పెద్ద శరీరము కల వానరులు, మహాబలవంతులు అయిన వానరులు, ఏనుగుప్రమాణములో ఉన్న బండ రాళ్లను పర్వత ప్రాంతముల నుండి పెకలించి, యంత్రముల ద్వారా మోసుకుంటూ సముద్రతీరమునకు తీసుకువచ్చారు. అంటే ఈ నాటి క్రేన్ల మాదిరి యంత్రములు, ఈ నాటి క్రేన్ల రూపంలో కాకపోయినా మరోరూపంలో ఉండి ఉండవచ్చు. ఈ యంత్రములు అనే మాట లంకా నగర వర్ణనలోకూడా వాడారు. పెద్ద పెద్ద బండరాళ్లను కోట బురుజుల మీది నుండి బయట ముట్టడించి ఉన్న శత్రువుల మీదికి విసరడానికి యంత్రములు అమర్చబడి ఉన్నాయి అని రాసారు కదా!)

వానరములు తెచ్చిన పెద్ద పెద్ద బండ రాళ్లను సముద్రంలో పడవేస్తుంటే, సముద్రము నీరు ఆకాశం అంత ఎత్తుకు ఎగిరిపడుతున్నాయి. ఆ ప్రకారంగా నీలుడు వానరులు తెచ్చిన రాళ్లను చెట్లను పెద్ద పెద్ద వృక్షములను నీటిలో పడవేస్తుంటే కొంత మంది వానరులు దారములు పట్టుకుంటూ ఆ రాళ్లను, వృక్షములను క్రమ పద్ధతిలో పేరుస్తున్నారు. ఆ ప్రకారంగా నూరు యోజనముల దూరం వరకూ కొలతదారములను

పట్టుకొని రాళ్లతోనూ వృక్షములతోనూ సేతువును నిర్మిస్తున్నారు. కొందరు వానరులు రాళ్లను తీసుకొని వస్తున్నారు. మరి కొందరు గడ్డి, కర్రలతో సేతువులోని కొన్ని భాగములను నిర్మిస్తున్నారు. మరి కొందరు వానరులు పెద్ద పెద్ద బండరాళ్లను పట్టుకొని అటు ఇటు పరుగెడుతున్నారు. కొంత మంది వాళ్లు తెచ్చిన బండ రాళ్లను ఒక క్రమంలో అమరుస్తున్నారు.

కోట్ల కొద్దీ వానరుల సాయంతో నీలుడు మొదటి రోజున పదునాలుగు యోజనముల దూరము గల సేతువును నిర్మించాడు. రెండవ రోజున ఇరువది యోజనముల దూరము గల సేతువును నిర్మించాడు. మూడవ రోజున ఇరువది యోజనముల దూరము గల సేతువును నిర్మించాడు. నాలుగవ రోజున ఇంకొక ఇరువది యోజనముల దూరము గల సేతువును నిర్మించాడు. ఐదవ రోజున మరొక ఇరువది మూడు యోజనముల సేతువును నిర్మించి సముద్రము ఆవల ఒడ్డుకు చేరుకున్నారు..విశ్వకర్మ కుమారుడైన నీలుడు వానరుల సాయంతో అత్యంతం నైపుణ్యంతోసముద్రమునకు అడ్డంగా నూరుయోజనముల దూరం గల సేతువును నిర్మించాడు. వానరులు సౌకర్యంగా నడవడానికి ఆ సేతువు మీద చక్కని నున్నటి దారిని ఏర్పరిచారు. ఆ సేతువు ఆకాశంలో కనపడే నక్షత్ర మార్గంలాగా ప్రకాశిస్తూ ఉంది. సముద్రానికి తీసిన పాపిడి లాగా ఉంది. దేవతలు, దానవులు, గంధర్వులు ఆకాశంలో నిలబడి ఈ వింతను తిలకిస్తున్నారు. ఆ సేతువు పది యోజనముల వెడల్పు నూరుయోజనముల పొడవుతో ఉంది.

ఆ సేతువును చూచిన వానరముల సంతోషానికి అంతు లేదు. కొంత మంది వానరులు ఆ సేతువు మీద ఎక్కి దుముకుతున్నారు. ఆడుతున్నారు గెంతుతున్నారు. కొంతమంది వానరులు అప్పుడే ఆవల ఒడ్డుకు

చేరుకున్నారు. సుగ్రీవుడు రాముని హనుమంతుని బుజం మీద, లక్ష్మణుని అంగదుని బుజం మీద ఎక్కమన్నాడు. వారు రామలక్ష్మణులను ఆకాశమార్గంలో ఆవల ఒడ్డుకు తీసుకొని వెళ్లారు. వానరులు కొంత మంది సేతువు మధ్యలో నడిచివెళుతున్నారు. మరి కొంత మంది సేతువు పక్కలనుండి వెళుతున్నారు. కొందరు కాసేపు నీటిలో ఈదుతూ మరికొంతసేపు సేతువు మీద నడుస్తున్నారు. మరి కొందరు ఆకాశంలో ఎగురుతూ వస్తున్నారు. సేతువు మీద నడుస్తున్నప్పుడు వానరులు చేసే ధ్వనులు సముద్రఘోషను మించిపోయాయి.

వానర రాజు సుగ్రీవుడు వానర సేనలను సముద్రము ఆవలకు దాటించి అక్కడ ఫలములు, పుష్పములు, తేనె, స్వచ్ఛమైన జలము దొరికే చోటునందు విడిది చేయించాడు. రాముడు సముద్రమును దాటగానే ఆకాశము నుండి మహర్షులు వారి మీద మంత్రజలమును చల్లి ఆశీర్వదించారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఇరువది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము
## ఇరువది మూడవ సర్గ.

లంకా ద్వీపములో అడుగు పెట్టగానే రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! మన వానర సేనలను వివిధ భాగములుగా, వ్యూహములుగా విభజించి వారిని సమృద్ధిగా ఫలములు, తేనె, జలము దొరుకు స్థలములలో నిలుపు. లక్ష్మణా! మనకు కనపడు శకునములను చూస్తుంటే ఇటు వానరులకు అటు రాక్షసులకు మహాభయంకరమైన ఆపద రాబోతుతున్నదని అనిపిస్తూ ఉంది. భూమి కంపిస్తూ ఉంది. ధూళితో కూడిన గాలి చెలరేగుతూ ఉంది. ఆ గాలి దెబ్బకు పర్వత శిఖరములు కంపిస్తున్నాయి. చెట్లు కూలిపోతున్నాయి. ఆకాశము నుండి ఉల్కాపాతము జరుగుతూ ఉంది. అడవి మృగములు తూర్పుదిక్కుగా చూచి వికృతంగా అరుస్తున్నాయి. చంద్రుడు కాంతి విహీనంగా కనపడుతున్నాడు. సూర్యమండలము చుట్టు ఎర్రని వలయము కనపడుతూ ఉంది, మధ్యలో నల్లని మచ్చ కనపడుతున్నాయి. ఇవన్నీ రాబోవు ప్రళయాన్ని సూచిస్తున్నాయి. ఈ యుద్ధభూమి వానరులు, రాక్షసుల రక్తంతో తడిసిపోయే కాలం సమీపిస్తూ ఉంది. యుద్ధము తప్పదు. లంకను ముట్టడించమని వానర సేనలకు ఆదేశాలు ఇవ్వండి." అని పలికాడు రాముడు. తన ధనుస్సు తీసుకొని లంకా నగరం దిశగా వెళ్లాడు రాముడు. విభీషణుడు, సుగ్రీవుడు వానర సేనలతో రాముని అనుసరించారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఇరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము
## ఇరువది నాలుగవ సర్గ.

రాముని వెంట వెడుతున్న వానర సేన పాదఘట్టనలకు భూమి అదురుతూ ఉంది. లంక బయట ఇలా ఉంటే, లంకా నగరంలో కూడా రాక్షస సేనలు యుద్ధానికి సన్నద్ధమవుతున్నాయి. రాక్షస సేనలు చేసే సింహనాదాలు, భేరీమృదంగ ధ్వనులు లంక బయట ఉన్న వానర సేనలకు వినబడుతున్నాయి. వానర సేనలు కూడా వాటికి మించిన ధ్వనులు చేస్తున్నారు. దూరం నుండి లంకా పట్టణమును చూచిన రామునికి సీత గుర్తుకు వచ్చింది.

"ఆహా!నా సీత ఈ లంకా నగరంలోనే కదా బంధింపబడి ఉంది!" అని మనసులో అనుకున్నాడు. పక్కనే ఉన్న లక్ష్మణుని చూచి రాముడు ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఆ పర్వతశిఖరము మీద విశ్వకర్మచేత నిర్మింపబడిన ఆ కాంచన లంకను చూచావా! ఆ లంకా నగరము ఆకాశాన్ని తాకుతూ ఉన్నదా అన్నట్టు లేదూ! ఎంతో కాలము కిందట నిర్మింపబడిన ఈ లంకా నగరము ఎత్తైన భవనములతో అత్యంత శోభాయమానముగా ఉంది." అని అన్నాడు.

తరువాత రాముడు వానర సేనలను వ్యూహములుగా విభజించాడు. గరుడ వ్యూహాకారంరలో సేనలను నిలబెట్టాడు. సేనలకు ఈ విధంగా ఆదేశాలు ఇచ్చాడు. "అంగదుడు తన సేనలతో, ఈ గరుడవ్యూహమునకు వక్షస్థల భాగమున నిలువ వలెను. ఋషభుడు తన సేనలతో ఈ గరుడ వ్యూహమునకు కుడి వైపున ఉన్న రెక్క భాగములో నిలువ వలెను. గంధమాధనుడు తనసైన్యములతో గరుడవ్యూహమునకు

ఎడమ వైపున ఉన్న రెక్క భాగములో నిలువవలెను. నేను లక్ష్మణుడు గరుడవ్యూహమునకు శిరస్సుస్థానములో నిలుస్తాము. జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి ఈ ముగ్గురూ గరుడవ్యూహమునకు పొట్ట భాగములో నిలుస్తారు. సుగ్రీవుడు తన సేనలతో గరుడ వ్యూహమునకు తోక భాగమును రక్షిస్తూ ఉంటాడు." అని సమస్త వానర సేనను గరుడవ్యూహంగా రచన చేసాడు రాముడు. వానరు లందరూ ఆ గరుడా కారంలో పెద్ద పెద్ద బండరాళ్లు, వృక్షములు ఆయుధములు ధరించి లంక వైపుకు కదిలారు.

అప్పుడు రాముడు సుగ్రీవుని చూచి ఇలా అన్నాడు. "సుగ్రీవా! మనము లంకకు చేరుకున్నాము. గరుడవ్యూహరచన పూర్తి అయింది. ఇంక నీ అధీనములలో ఉన్న శుకుడు అనే రాక్షస దూతను విడిపించు." అని అన్నాడు. రాముని ఆదేశానుసారము సుగ్రీవుడు శుకుడిని విడిపించమని వానరులకు చెప్పాడు. బతుకుజీవుడా అనుకుంటూ శుకుడు రావణుని వద్దకు వెళ్లాడు.

దీనంగా ఉన్న శుకుని చూచి రావణుడు నవ్వుతూ ఇలా అన్నాడు. "ఏంటీ! అలా ఉన్నావు. నీ రెక్కలు విరిగిపోయినట్టున్నాయి. నీవు శత్రువుల చేతికి చిక్కావా!" అని అడిగాడు. అప్పుడు శుకుడు రావణునితో ఇలా అన్నాడు. "రాక్షసేంద్రా! నీకు జయమగుగాక! నేను తమరి ఆజ్ఞానుసారము సుగ్రీవుని వద్దకు పోయి తమరు చెప్పమన్న మాటలు యధాతథంగా సౌమ్యంగా చెప్పాను. నన్ను చూడగానే ఆ వానరులు పైకి ఎగిరి నన్ను పట్టుకున్నారు. నన్ను కొడుతూ, గుద్దుతూ కిందికి తీసుకు పోయారు. నారెక్కలు పీకారు. అమ్మో ఆ వానరులు చాలా కోపం కలవారు. వారితో మాట్లాడటం మనకు శక్యంకాదు. కోపం వస్తే వారు ఏమైనా చేస్తారు.

ప్రస్తుతము రాముడు, సుగ్రీవుడు వానరసేనలతో కలిసి, సముద్రము మీద సేతువును నిర్మించి, సముద్రమును దాటి లంకను చేరుకున్నారు. లంకను ముట్టడించారు. భయంకరమైన వానర సేనలు భూమి కనపడకుండా నిలిచి ఉన్నాయి. రాక్షసులకు, వానరులకు దేవ దానవుల మాదిరి యుద్ధము తప్పేట్టు లేదు. వానరులు లంకా నగర ప్రాకారము దగ్గరకు చేరుకుంటున్నారు.

ఓ రాక్షసేంద్రా! ప్రస్తుతము నీకు మిగిలి ఉన్నవి రెండే మార్గములు. ఒకటి సీతను రామునికి ఇచ్చి సంధిచేసుకోవడము. లేకపోతే రామునితో వానర సేనలతో యుద్ధము చేయడం. మొదటిది లంకను రక్షిస్తుంది. రెండవది, లంకను నాశనం చేస్తుంది. నీకు తోచినది చెయ్యి." అని చెప్పి ఊరుకున్నాడు శుకుడు.

శుకుని మాటలు విన్న రావణుడు కోపంతో మండిపడ్డాడు. శుకునితో ఇలా అన్నాడు. "దేవతలు, దానవులు, గంధర్వులు వచ్చి వేడినను నేను సీతను ఇవ్వను. రామునితో యుద్ధము చేస్తాను. నా శరపరంపరతో రాముని గెలుస్తాను. నా విల్లు నుండి వెలువడ్డ బాణములతో రాముని శరీరం ఎప్పుడు రక్తసిక్తము అవుతుందో కదా! నేను అజేయుడను. వానర సైన్యమును క్షణంలో నిర్మూలిస్తాను. నాకు వాయువు అంత బలము, సముద్రము అంత వేగము ఉన్నాయి. పాపం రాముడు నా గురించి పూర్తిగా తెలియక నాతో యుద్ధానికి వస్తున్నాడు. శలభంలా నా కోపాగ్నికి మాడి పోతాడు. రాముడికి నా వద్ద ఉన్న అస్త్రముల గురించి శస్త్రముల గురించి తెలియదు. అందుకే నాతో యుద్ధానికి వస్తున్నాడు. ఇంతకు ముందు రాముడు ఏ యుద్ధములో పాల్గొనలేదు. నేను ఎన్నోయుద్ధములు చేసి రాటు తేలి ఉన్నాను. రాముడు ఎన్నడూ నాతో యుద్ధము చేయలేదు.

అందుకే నా బాణముల రుచి రామునికి తెలియదు. దేవేంద్రుడు, వరుణుడు, యముడు, కుబేరుడు యుద్ధములో నా ముందు నిలువలేరు. ఇంక ఈ రాముడు ఎంత?" అని గర్వంగా పలికాడు రావణుడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఇరువది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## ఇరువది ఐదవ సర్గ.

తరువాత రావణుడు ఇద్దరు గూఢచారులను పిలిపించాడు. అందులో ఒకడి పేరు శుకుడు. (కొంత మంది పెద్దల వ్యాఖ్యల ప్రకారము పైన చెప్పబడిన శుకుని వృత్తాంతము ప్రక్షిప్తము అని అభిప్రాయము. కాని పైన చెప్పబడిన శుకుని వృత్తాంతము కథాగమనానికి ఎలాంటి భంగం కలిగించలేదు కాబట్టి దానిని అలాగే ఉంచినా తప్పులేదు.కాకపోతే ఇప్పుడు పంపుతున్న గూఢచారి పేరుకూడా శుకుడు అని ఉండడం గమనార్హం. మీరు రామాయణంలో వచ్చిన పేర్లను గమనించి ఉంటారు. అన్నీ పేర్లు వారి వారి గుణగణాలను ఆకారాలను, తెలిపేవి. ఇక్కడ కూడా శుకుడు లాంటి పేరుగల గూఢచారులు ఇద్దరు ముగ్గురు ఉండి ఉండవచ్చు.)

రావణుడు పిలిపించిన గూఢచారుల పేర్లు శుకుడు, సారణుడు. రావణుడు వారితో ఇలాఅన్నాడు. "రాముడు వానర సైన్యముతో సముద్రము దాటినాడు అని వార్త వచ్చింది. ఇదివరలో ఎవరూ చేయజాలని సేతువును రాముడు నిర్మింపజేసాడు.

రాముడు వానరులతో నూరుయోజనముల దూరము సేతువును నిర్మించాడు అంటే ఇప్పటికీ నమ్మలేకపోతున్నాను. ఇంతకూ వానరుల బలము ఎంత అని మనం ముందు తెలుసుకోవాలి. వారి యుద్ధ వ్యూహములను తెలుసుకోవాలి. కాబట్టి మీరు ఇద్దరూ కోటదాటి వెళ్లండి. వానర రూపములతో వానరసేనలలో కలిసిపోండి. వానర సేన ఎంత ఉంది. వారి నాయకులు ఎవరు. ఎవరి దగ్గర ఎంతెంతమంది వానర సేన ఉంది. సముద్రము మీద సేతువును నిర్మించిన వారు ఎవరు. ఎవరి సాయంతో నిర్మించారు. సుగ్రీవునితో ఉన్న మంత్రులు ఎవరు. ఎంత మంది. వానర సేనలకు ముఖ్య సేనాని ఎవరు? వానర సేనలో ముందు నిలిచి యుద్ధం చేసే వారు ఎవరు. వానర సేన ఉపయోగించే ప్రధాన ఆయుధములు ఏవి? నాకు ఈ సమాచారమును వెంటనే సేకరించి తెలియపరచండి." అని ఆదేశించాడు.

రావణుని ఆదేశము ప్రకారము శుకుడు, సారణుడు వానర రూపములను ధరించి వానర సేనలతో ప్రవేశించారు. వారు వానర సేనలను లెక్కబెట్టడానికి ప్రయత్నం చేసారు కానీ వారి వల్ల కాలేదు. వారు ఎక్కడకు పోయినా వానర సైన్యము కనపడుతున్నారు. కొండలు గుట్టలు,పర్వతములు, అడవులు, చెట్లు ఒకటేమిటి నేల ఈనినట్టు ఎక్కడ చూచినా వానర సైన్యము కనపడుతున్నారు. సముద్రము మాదిరి కనపడుతున్న వానర సేనను చూచి శుకసారణులు ఆశ్చర్యపోయారు. వానరులు వీరిని కనిపెట్టలేకపోయారు.

కానీ రాక్షస మాయలు తెలిసిన విభీషణుడు వానర వేషములలో ఉన్న శుకసారణులను సులభంగా కనిపెట్టాడు, వారిని పట్టుకొని రాముని వద్దకు తీసుకొని వచ్చాడు. "రామా! వీరు ఇద్దరూ

రావణుని గూఢచారులు. రావణుడు పంపగా వచ్చారు. వీరి పేరు శుకుడు, సారణుడు. వీరిని వెంటనే చంపమని ఆజ్ఞాపించు." అని అన్నాడు. అప్పటికే శుకుడు సారణుడు ప్రాణాల మీద ఆశ వదులుకున్నారు. చేతులు జోడించి రామునితో ఇలా అన్నారు. " మేము రావణుని గూఢచారులము. వానర సైన్య రహస్యములను తెలుసుకోడానికి మేము రావణుడు పంపగా ఇక్కడకు వచ్చాము." అని వారి తప్పు ఒప్పుకున్నారు.

వారిని చూచి రాముడు నవ్వాడు. "మీరు వచ్చిన పని పూర్తి అయిందా. వానర సేనలను అంతా చూచారా. నన్ను కూడా చూచారా. ఇంక వెళ్లండి. మీ రాజుకు మా గురించి మా సేన గురించి చెప్పండి. మీరు ఇంకా చూడవలసినది ఏమన్నా ఉంటే చూడండి. మీకు తెలియక పోతే మీ రాజు విభీషణుడు మీకు అన్నీ చూపిస్తాడు. హాయిగా చూడండి. మీ ప్రాణములకు వచ్చిన భయం ఏమీ లేదు. మీరు మాకు దూతలుగా వచ్చారు. దూతలను మేము ఎప్పుడూ చంపము. విభీషణా! మనము మన శత్రువులను చంపాలి కానీ మారువేషములలో వచ్చిన గూఢచారులను చంపకూడదు. వీరు వారి రాజు ఆజ్ఞపాలించారు. ఇందులో వీరితప్పు ఏమీ లేదు కదా! కాబట్టి వీరిద్దరినీ విడిచిపెట్టండి.

ఓ శుకసారణులారా! మీరు ఇద్దరూ లంకకు పోయి మీ రాజు రావణునితో నా మాటలుగా ఇలా చెప్పండి. "ఓ రావణా! మేము నీ మీదికి యుద్ధానికి వచ్చాము. నువ్వు ఏ బలం చూచుకొని నా భార్య సీతను అపహరించావో, ఆ బలాన్ని ఇప్పుడు నా ముందు చూపించు. యుద్ధము నకు రేపు ఉదయము ముహూర్తము నిశ్చయించాము. రేపు ఉదయము ననే మేము నీ లంకా నగరమును ముట్టడించి, నువ్వు చూస్తూ ఉండగానే, నీ సైన్యములను నా బాణములతో చించి చెండాడతాను."

ఇవి నా మాటలుగా రావణునితో చెప్పండి. ఇంక వెళ్లండి." అన్నాడు రాముడు.

శుక సారణులు విడిచిపెట్టిందే చాలని లంకకు పారిపోయారు. రావణుని ముందు నిలిచి "ఓ రాక్షసేంద్రా! మీరు ఆదేశించినట్టు మేము మారువేషములలో వానరసైన్యములో చేరాము. కాని విభీషణుడు మా మారువేషములను కనిపెట్టి, మమ్ములను చంపబోగా, రాముడు మాకు ప్రాణభిక్ష పెట్టాడు. రాక్షస రాజా! వానర సేన సముద్రము అంత ఉంది. అది అటుండనిమ్ము. రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు, ఈ నలుగురూ చాలు మన లంకానగరమును నాశనం చెయ్యడానికి. ఇంక వానర వీరులు కూడా విజృంభిస్తే లంక వల్లకాడు అవుతుంది. రాముడు ఒక్కడే చాలు నిన్ను నీ లంకను మట్టుపెట్టడానికి. సుగ్రీవుని ఆధ్వర్యములో ఉన్న వానర సేనను జయించడం ఎవరి వల్లా కాదు. కాబట్టి మా విన్నపము ఏమిటంటే తమరు వెంటనే సీతను రామునికి ఇచ్చి వేసి, రామునితో సంధి చేసుకోవలెను. లంకను రక్షించవలెను." అని పలికి ఊరుకున్నారు.

. శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఇరువది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ఇరువది ఆరవ సర్గ.

ఇంత మంది ఇన్ని సార్లు ఇన్ని మాటలు చెప్పినా రావణుడు తన మూర్ఖపు పట్టుదల విడువ లేదు.

"ఎవరు ఎన్ని చెప్పినా నేను వినను. దేవ, దానవ, గంధర్వ,యక్షులు ఒక్కుమ్మడిగా నా మీదికి వచ్చినా, నేను సీతను విడువను. మీరు ఇద్దరూ వానరుల చేతిలో దెబ్బలు తిని బాగా భయపడినట్టున్నారు. అందుకే భయంతో ఇలా మాట్లాడుతున్నారు. నాకు ఎవరిని చూచినా భయం లేదు. నన్ను ఎవరూ ఓడించలేరు. ఇంతకూ రాముని సైన్యము పరిమాణము ఎంత? వారు ఎక్కడ ఉన్నారు. నాకు చూపించండి." అని అన్నాడు రావణుడు.

శుకుడు, సారణుడు రావణుని ఒక ఎత్తైన ప్రాసాదము మీదికి తీసుకొని వెళ్లారు. అక్కడ ముగ్గురు నిలబడ్డారు. అక్కడి నుండి వానర సైన్యము సుస్పష్టంగా కనపడుతూ ఉంది. వానర సేన భూమి అంతా కప్పినట్టు ఉంది. అసలు భూమి కనిపించడం లేదు. పూర్తిగా వానరులతో నిండిపోయినట్టు ఉంది. రావణునికి వానర సేన మరొక సముద్రం లాగా కనిపిస్తూ ఉంది.

రావణుడు సారణుని చూచి ఇలా అన్నాడు. " ఆ కనిపిస్తున్న వానర సేనలో ముఖ్యమైన వారు ఎవరు? బలవంతులు, శూరులు, పరాక్రమ వంతులు ఎవరు? ముందు నిలిచి యుద్ధము చేసే వాళ్లు ఎవరు? సుగ్రీవుడు ఎవరి మాట వింటాడు? సేనానాయకులుఎవరు? వీళ్లు సాధారణ వానరులా! వీరి ప్రభావము ఎంత? ఈ విషయాలన్నీ నాకు వివరంగా చెప్పు." అని అడిగాడు రావణుడు.

సారణుడు ఇలా చెప్పసాగాడు. "రాక్షస రాజా! అటు చూడండి. లక్ష మంది వానర నాయకులు చుట్టు ఉండగా లంక వంక చూస్తూ పెద్ద పెద్దగా అరుస్తున్నాడో, వాడి పేరునీలుడు. వానర సేనానాయకుడు.

అతడే సుగ్రీవుని ముందు నిలబడి మాట్లాడుతున్నాడు. అదుగో అక్కడ ఒక వానరుడు చేతులు పైకెత్తి లంక వంక చూస్తూ మాటి మాటి కీ తోకను విదిలిస్తూ కోపంతో మాట్లాడుతున్నాడో వాడి పేరు అంగదుడు. వాలి కుమారుడు. కిష్కింధకు యువరాజు. రాముడి కోసరం ఏమి చెయ్యడానికైనా సిద్ధంగా ఉన్నాడు. సీతాన్వేషణ కొరకు దక్షిణదిక్కుగా పంపబడిన వానరసమూహమునకు నాయకుడు ఈ అంగదుడు. అంగదునివెనక నిలబడి ఉన్న వాడు నలుడు. అతని ఆధ్వర్యములో అపారమైన సైన్యమునిలిచి ఉంది. నూరుయోజనముల దూరము గల సముద్రమునకు సేతువు ఇతని ఆధ్వర్యములోనే నిర్మింపబడింది. ఈ నలుడు చందన వనములో ఉంటాడు. ఇతని కింద వెయ్యికోట్ల ఎనిమిది లక్షల వానములు ఉన్నాయి. వారంతా భయంకరమైన వానరములు. ఈ సేనలతో లంకను నాశనం చెయ్యడానికి నలుడు అభిలషిస్తున్నాడు.

వెండి మాదిరి తెల్లని శరీరంతో మెరిసిపోతున్నవాడు, మహాపరాక్రమ వంతుడు శ్వేతుడు అనే వానరుడు సుగ్రీవునితో మాట్లాడి మరలా వెళుతున్నాడు. గోమతీ నదీ ప్రాంతంలో రమ్య అనే పర్వతము ఉంది. ఆ ప్రాంతములో ఉండే వానరములకు అధిపతి కుముదుడు. అతడు లక్షలకొలదీ వానరములకు నాయకుడు. తానొక్కడే తన సేనలతో లంకను ముట్టడిద్దామని ఉత్సాహపడుతున్నాడు. ఓ రాక్షస రాజా! ఎరుపు తెలుపు కల శరీర ఛాయతో, ముఖమంతా జూలుతో, సింహము వలె కనపడుతున్న వాడు రంభుడు. అతడు లక్ష వానరములతో వింధ్యపర్వతము, కృష్ణగిరి, సహ్యాద్రి, సుదర్శనము మొదలగు పర్వతముల మీద నివసిస్తూ ఉంటాడు. వీరు భయంకరమైన వానరులు.

ఆ పక్కన ఉన్న వాడు శరభుడు. వీడికి ఎవరన్నా లెక్కలేదు. చివరకు మృత్యువుకుకూడా భయపడడు. ఇతడు సాల్వేయ పర్వతము మీద నివసిస్తూ ఉంటాడు. ఇతని కింద విహారులు అనే పేరు గల లక్ష వానరములు ఉన్నాయి. వీరు చాలా బలవంతులు. పారి యాత్ర అనే పర్వతము మీద నివసించే వానరుడు పనసుడు యాభైలక్షల మంది వానరములకు ఇతడు నాయకుడు. ఆ యాభైలక్షల మందిని ఇతడు వివిధ యూధములుగా విభజించి వాటికి ప్రత్యేకంగా సేనానాయకులను నియమించాడు. వారందరూ ఈ పనసుని ఆజ్ఞలను జవదాటరు.

ఆ సముద్రము పక్కన రెండవ సముద్రము మాదిరి కదులుతున్న సేనలకు నాయకుడు వినతుడు. ఇతడు వేణీ నదీ తీరంనుండి వచ్చాడు.(వేణీ అంటే క్రిష్ణవేణి అనగా క్రిష్ణానది అని పండితుల అభిప్రాయము) ఇతడు అరువది లక్షల మంది వానరులకు నాయకుడు. తరువాత క్రధనుడు అనే వానర నాయకుడు తన సైన్యమును వివిధ వ్యూహములుగా విభజించాడు. వారందరూ యుద్ధోన్మాదంతో ఊగి పోతున్నారు. గవయుడు అనే వానరుడు బలగర్వితుడు. ఇతని కింద డెబ్బది లక్షల వానరములు ఉన్నాయి. వీరంతా తమ తమ సైనిక సమూహములతో నీ మీద యుద్ధానికి ఉవ్విళ్లూరుతున్నారు." అని పలికాడు సారణుడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఇరువది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## ఇరువది ఏడవ సర్గ.

సారణుడు వానర యూధముల గురించి ఇంకా చెప్పసాగాడు. "ఓ రాక్షస రాజా! రాముని కొరకు తమ ప్రాణములను కూడా లెక్కచేయకుండా యుద్ధము చేయడం కోసం ఉరకలు వేస్తున్న వానర నాయకుల గురించి ఇంకా చెబుతాను విను. నున్నటి తోకతో, ఒళ్లంతా ఎర్రటి,పచ్చటి,తెల్లటి రోమములు విస్తారముగా కలిగిన ఆ వానర నాయకుని పేరు హరి. అతని వెంట వందల కొద్దీ వానరులు ఉన్నారు. వారందరూ సుగ్రీవుని నాయకత్వంలో రాక్షసులతో యుద్ధానికి కాలుదువ్వుతున్నారు.

అదుగో అటు చూడు. నల్లని మేఘముల వలె కనపడుచున్నది భల్లూకసేన. సముద్రము నల్లగా ఉంటే ఈ భల్లూక సేనకూడా నల్లగా మరొక సముద్రంలా ఉంది. వీరందరూ పర్వత ప్రాంతముల నుండీ, సమతల భూముల నుండి, మరి కొందరు నదీతీరముల నుండీన వచ్చారు. వీరంతా చాలా భయంకరంగా యుద్ధం చేయడంలో నిపుణులు. ఈ భల్లూకములకు నాయకుడు ధూమ్రుడు. ఈతడు నర్మదా నదీ తీరంలో ఉన్న ఋక్షవంతము అనే పర్వతము మీద ఉంటాడు. ఆ పక్కనే ఉన్న వాడు ధూమ్రుని తమ్ముడు. ఇద్దరూ ఒకే రూపంలో ఉన్నారు కదూ. ఇతడు అన్నకంటే పరాక్రమ వంతుడు. ఇతని వెంట కూడా ఎన్నో భల్లూక సేనలు ఉన్నాయి. భల్లూకములలోకి అంతటికీ వృద్ధుడు జాంబవంతుడు. ఇతని వెంట అపారమైన భల్లూకసేన ఉంది. జాంబవంతునికి పరాక్రమము దానికి తగ్గ వినయము రెండూ ఉన్నాయి. ఈ జాంబవంతుడే దేవాసుర యుద్ధములో దేవేంద్రుని పక్షమున అసురులతో పోరాడి, దేవేంద్రుని వలన వరములను పొందాడు. జాంబవంతుని సేనలో ఉన్న భల్లూకములు పెద్ద

పెద్ద పర్వతముల మీద ఉండి, బండరాళ్లను కింద ఉన్న శత్రువుల మీదికి విసిరి చంపడంలో ఆరితేరినవారు. వీరికి చావంటే భయం లేదు.

వానర సేనలో మరొక ముఖ్యుడు దంభుడు అనే వానరసేనా నాయకుడు. దేవేంద్రుడు కూడా అప్పుడప్పుడు ఇతని సాయం తీసుకుంటూ ఉంటాడు. ఇతడు వానరులకు సర్వసేనాని. అందరి కన్నా ఎత్తుగా ఉన్న ఆ వానరనాయకుని చూడండి. అతని పేరు. సంనాదుడు. అతడు వానరుల కందరికీ పితామహుడి లాంటి వాడు. అతడు ఒక గంధర్వ కన్యకు అగ్నిదేవుని వలన పుట్టినవాడు. అగ్నివలె తేజోవంతుడు. ఇతడు యుద్ధములో దేవేంద్రునితో కూడా యుద్ధం చేసాడు.

మరొక వాన సేనాని పేరు క్రథనుడు. ఇతడు కైలాస పర్వతము మీది నుండి వచ్చాడు. కైలాస పర్వతము అతని స్థావరము. ఇతనికి వెయ్యికోట్ల వానరసైన్యము ఉంది. అతడు ఒక్కడు చాలు లంకా నగరమును నాశనం చెయ్యడానికి. పూర్వము వానరములకు ఏనుగులకు వైరం ఉండేదట. ఈ వానర నాయకుడు గంగా నదీ ప్రాంతములోఉన్న ఉశీరబీజ పర్వతము, మంధర పర్వతము యొక్క గుహలలో నివసిస్తూ ఏనుగులను భయపెట్టేవాడట. దొరికిన ఏనుగును దొరికినట్టు చంపే వాడట. వాడు కూడా తన వేయి లక్షల వానరములతో ఈ యుద్ధములో పాల్గొనడానికి వచ్చాడు. ఏనుగులను చంపేవాడికి మన రాక్షసులు ఒక లెక్కా! ఇంతకూ ఇతని పేరు చెప్పలేదు కదూ! ఇతని పేరు ప్రమాథి. అదుగో అక్కడ మేఘము మాదిరి ఎగురుతున్నాడు. జాగ్రత్తగా చూడండి. అతని చుట్టు ఉన్నదే అతని సైన్యము.

రాక్షసరాజా! మరొక జాతి వానరములు కనపడుతున్నాయి

చూడండి. నల్లని ముఖములతో భయంకరంగా ఉన్నాయి. వాటి పేరు గోలాంగూలులు. వాటికి నాయకుడు గవాక్షుడు. అతని సేన వంద లక్షలు ఉంటుంది. లంకను ఎప్పుడెప్పుడు నంచుకు తిందామా అని గర్జిస్తున్నారు ఆ వానరులు.

ఓ రాక్షసేంద్రా! వానర నాయకులలో ముఖ్యుడు కేసరి. మీరు ఎవడి తోకకు నిప్పంటిస్తే, అతడు మన లంకనే తగలబెట్టాడే ఆ ఘనుడు, హనుమంతుని తండ్రి ఈ కేసరి. ఇతడు మేరుపర్వతము మీద నివసిస్తూ ఉంటాడు. మేరు పర్వతము ప్రాంతములో ఉన్న అరవైవేల బంగారు పర్వతములలో ఆఖరి పర్వతము మీద కొన్ని వానరములు నివసిస్తూ ఉంటాయి. ఆ వానరములు నల్లగానూ తెల్లగానూ,ఎర్రటి ముఖములతో, పెద్ద ఆకారాలతో ఉంటాయి. వీరు అత్యంత వేగంగా పరుగెత్తగలరు. వీళ్లకు తమ గోళ్లు, కోరలే ఆయుధములు. వీరు పెద్ద పులుల మాదిరి భయంకరులు.

మరొక వానర నాయకుని పేరు శతబలి. ఇతడు సూర్యదేవుని ఉపాసకుడు. ఇతని వెంట కూడా అపారమైన వానర సేన ఉంది. రాముని కొరకు తన ప్రాణములను కూడా లెక్కచెయ్యని వీరుడు శతబలి. వీరు కాక, గజుడు, గవయుడు, నలుడు, నీలుడు, ఒక్కొక్కరు కోట్లకొలది వానరులతో వచ్చి ఉన్నారు. ఇంకా వింధ్యపర్వత ప్రాంతములనుండి లెక్కకు మిక్కిలి వానరములు వచ్చి ఉన్నవి. వీరిని లెక్కించడం మాకు శక్యం కాలేదు. వీరిలో ఎవరూ సామాన్యులుకారు. అందరూ మహాపరాక్రమవంతులు. వీరిని గెలవడం అంత సులభం కాదు." అని చెప్పి ఊరుకున్నాడు సారణుడు.

తరువాత శుకుడు తన అభిప్రాయము కూడా చెప్ప నారంభించాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఇరువది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధ కాండము
## ఇరువది రెండవ సర్గ.

సారణుడు చెప్పడం పూర్తిచేసిన తరువాత శుకుడు తాను తెలుసుకున్న విషయాలు చెప్పనారంభించాడు. "ఓ రాక్షసరాజా! సారణుడు చెప్పినది అక్షర సత్యము ఈ వానరులు మహాబలవంతులు. ఎవరిచేతా జయింప శక్యము కాని వారు. మన మాదిరే కామరూపులు. వారి ఇష్టం వచ్చిన రూపం ధరించగలరు. ఇందులో దేవతలకు, గంధర్వులకు పుట్టిన వానరులు ఎంతోమంది ఉన్నారు. వారందరూ సుగ్రీవునితో పాటు కిష్కింధలో నివసిస్తూ ఉంటారు. అందులో అచ్చము దేవతల వలె పోలికలు ఉన్న వానరులు ఇద్దరు ఉన్నారు. వారి పేర్లు మైందుడు, ద్వివిదుడు. వారు ఇద్దరూ అన్నదమ్ములు. యుద్ధములో వారిని ఎదిరించి నిలిచే వారు లేరు. బ్రహ్మదేవుని కృపచేత వారు అమృతము తాగారు. అందుకే అజేయులు అయ్యారు.

ఓ లంకేశ్వరా! ఇదివరకు లంకకు వచ్చి సీతను చూచి లంకా దహనము చేసిన వాడు మరలా వచ్చాడు. వాడి పేరు హనుమంతుడు. కేసరి పుత్రుడు. వాయుదేవునికి ఔరస పుత్రుడు. నూరుయోజనముల

దూరము కల సముద్రమును దాటగలిగాడు. అతడు కామ రూపుడు. అత్యంత వేగము కలవాడు. ఈ హనుమంతుడు బాలుని గా ఉన్నప్పుడే ఉదయిస్తున్న సూర్యుని చూచి అది ఫలము అని భ్రమించి దానిని తినుటకు సూర్యమండలము వైపునకు ఎగిరిపోయిన మహాబలవంతుడు. అది చూచి ఇంద్రుడు తన వజ్రాయుధముతో కొట్టగా ఉదయ పర్వతము మీద పడ్డాడు. అప్పుడు అతని గడ్డమునకు చిన్న దెబ్బ తగిలింది. అందుకే అతనికి హనుమంతుడు అనే పేరు సార్థకమయింది. ఈ విషయములన్నీ నా ఆప్తుల నుండి సేకరించాను. అతని బల పరాక్రమముల గురించి చెప్పనలవి కాదు. ఈ హనుమంతుడు అంటించిన అగ్ని ఇంకా లంకలో మండుతూనే ఉంది. అతనిని మనము అంత తొందరగా ఎలా మరిచి పోగలము?

మహారాజా! హనుమంతుని పక్కన ఉన్న నీలమేఘచ్ఛాయ కలవాడు రాముడు. అతడే అయోధ్యరాకుమారుడు. అతడు యోధులలో అతిరథుడు. ఇక్ష్వాకు వంశపు మహారాజు. అతడు ఎల్లప్పుడూ ధర్మానికి కట్టుబడి ఉంటాడు. అతడికి బ్రహ్మాస్త్రము ప్రయోగము తెలుసు. రాముడు తన బాణములతో ఆకాశమును, భూమిని ఏకం చేయగలడు. వాటి రెండింటినీ చీల్చివేయగలడు. ఆ రాముని భార్యనే నీవు జనస్థానము నుండి అపహరించుకొని వచ్చావు. ఎప్పుడెప్పుడు లంకమీద దండెత్తి, నిన్ను సంహరించి, సీతను దక్కించుకుందామా అని ఉరకలు వేస్తున్నాడు.

ఆ రాముడు. ఆ రాముని పక్కనే నిలబడి ఉన్న వాడు లక్ష్మణుడు. అతడు రామునికి తమ్ముడు. మహా పరాక్రమవంతుడు. ఈ లక్ష్మణునికి కోపం ఎక్కువ. కాని బుద్ధిమంతుడు. ఎల్లప్పుడూ జయాభిలాష కలవాడు.

రాముని క్షేమం కోరేవాడు. రాముని కోసరం ప్రాణాలు కూడా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇతడొక్కడే రాక్షసులనందరినీ చంపవలెనని ఎదురు చూస్తున్నాడు.

ఆ రామునికి ఆవల పక్క నిలబడి ఉన్నవాడు తమరి తమ్ముడు విభీషణుడు. అతని చుట్టు వలయంగా నిలబడి ఉన్న నలుగురూ విభీషణుని అనుచరులు అయిన రాక్షసులు. తమరు ఉండగానే, రాముడు తమరి తమ్ముడైన విభీషణుని లంకారాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసాడు. వారి దృష్టిలో ఇప్పుడు లంకేశ్వరుడు విభీషణుడే! ఆ విభీషణుడు కూడా లంక మీద యుద్ధానికి కాలుదువ్వుతున్నాడు.

ఇంక ఈ వానర వీరులందరికీ నాయకుడు, కిష్కింధకు రాజు, సుగ్రీవుడు. ఇతడు మహాతేజస్సు కలవాడు. తెలివిగలవాడు. నిరంకుశు డు. అతని మెడలో ఉన్నది దేవతలు వాలికి ఇచ్చిన బంగారు మాల. వాలి మరణించేటప్పుడు ఆ మాలను సుగ్రీవునికి ఇచ్చాడు.

ఓ రాజా! ఇంక వానర వీరుల లెక్కలను చెబుతాను వినండి. వందలక్షలు ఒక కోటి అని అంటారు. అటువంటి కోట్లు లక్ష అయితే శంకువు. అటువంటి శంకువులు వేయి అయితే మహాశంకువు. వెయ్యి మహాశంకువులు ఒక వృందము. అటువంటి వేయి వృందములు ఒక మహావృందము. వెయ్యి మహావృందములు ఒక పద్మము. వెయ్యి మహాపద్మములు ఒక ఖర్వము. వెయ్యి ఖర్వములు మహా ఖర్వము. వెయ్యి మహాఖర్వములు ఒక సముద్రము. వెయ్యి సముద్రములు ఒక ఓఘము. వెయ్యి ఓఘములు ఒక మహౌఘము. ఇదీ పెద్దలుచెప్పిన లెక్క.

ఇప్పుడు వానర సేన ఎంత ఉందంటే వెయ్యి కోట్లు, నూరు శంకువులు, వెయ్యి మహాశంకువులు, నూరు వృందములు, వెయ్యి మహావృందములు, నూరు పద్మములు, వెయ్యి పద్మములు, నూరు ఖర్వములు, నూరు సముద్రములు, ఒకమహౌఘము, కోటి మహౌఘములు సంఖ్యగల వానర సైన్యము నీ మీదికి యుద్ధమునకు వస్తున్నారు. కాబట్టి తమరు మనకు జయము కలిగేట్టు చేయండి." అని వినయంగా చెప్పాడు శుకుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఇరువది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ఇరువది తొమ్మిదవ సర్గ.

రావణుడు శుకుడు సారణుడుచెప్పిన మాటలను సావధానంగా విన్నాడు. కాని తన ముందు తన శత్రువులను, శత్రుసేనలను పొగడడం సహించలేకపోయాడు. కోపంతో ఉగ్రుడయ్యాడు. వారితో ఇలా అన్నాడు. "మీరు నా కింద బతుకుతున్నారు. నా ముందు నాకు అప్రియమైన మాటలు పలకడానికి మీకు నోరు ఎలా వచ్చింది. రాజు ఎదుట రాజుకు ఇష్టము లేని మాటలను పలకడం యుక్తము కాదు అని తెలియదా! శత్రువులు బలవంతులే అయి ఉండవచ్చు అంతమాత్రాన శత్రువును రాజు ముందు పొగుడుతారా! శత్రువును నా ముందు స్తుతిస్తారా! మీరు రాజనీతి నేర్చుకోలేదా! మీ గురువులు రాజనీతి మీకు నేర్పలేదా! లేదా నేర్చుకొని కూడా మీకు అర్థం కాలేదా! లేదా అజ్ఞానంతో ఇలా మాట్లాడుతున్నారా! మీ లాంటి

మూర్ఖులను నా మంత్రులుగా, గూఢచారులుగా పెట్టుకొని ఇంకా నేను బతికి ఉన్నాను అంటే అది నా అదృష్టము కాని వేరు కాదు.

నా ఎదుట ఇలా శత్రువును పొగిడినందుకు మీకు మరణ దండన విధించబడును అన్న విషయం మీకు తెలియదా! ఒకసారి నా ఆగ్రహానికి గురి అయిన వాళ్లు ఈలోకంలో బతకడం కల్ల అన్న విషయం కూడా తెలియదా! కాని ఒకే ఒక కారణం చేత మీ ఇద్దరినీ క్షమిస్తున్నాను. మీరు ఇంతవరకూ నాకు, లంకకు చేసిన సేవలను గుర్తు పెట్టుకొని మీ ఇద్దరినీ క్షమించి వదిలిపెడుతున్నాను. జీవితంలో మీ ముఖాలు నాకు చూపించకండి. నా దృష్టిలో మీ ఇద్దరూ చచ్చినట్టే. వెళ్లండి." అని పరుషంగా దూషించాడు రావణుడు.

ఆ శుక సారణులు, రావణుని ఆగ్రహానికి గురి అయి కూడా, ప్రాణాలతో బయటపడ్డందుకు సంతోషిస్తూ, రావణునికి జయం పలుకుతూ అక్కడినుండి వెళ్లిపోయారు. రావణుడు పక్కనే ఉన్న మహోదరుని చూచి "సమర్దులైన గూఢచారులను పిలిపించు" అని ఆజ్ఞాపించాడు. వెంటనే శార్దూలుడు అనే రాక్షసుడి నాయకత్వంలో కొంతమంది గూఢచారులు వచ్చి రావణుని ముందు తలవంచుకొని నిలబడ్డారు.

"రాముడు అనే నరుడు వానర సేనలతో వచ్చి లంకను ముట్టడించి ఉన్నాడు. మీరు గుప్తంగా ఆ వానర సేనలలో ప్రవేశించి రాముని యుద్ధప్రయత్నములు గురించి తెలుసుకోండి. అతనికి ఎవరు దగ్గరవారు, ఎవరి మాట రాముడు వింటాడు, అతని ఆంతరంగికులు ఎవరు అనే విషయాలు ఆరాతీయండి. రాముని దినచర్య నాకు కావాలి. ఎప్పుడు లేస్తాడు, ఎప్పుడు నిద్రిస్తాడు, దినములో ఎప్పుడు ఏ పని చేస్తాడు.

రాముని అలవాట్లు ఏమిటి? ఈ విషయాలన్నీ నాకు కావాలి. మీ లాంటి సమర్థులైన గూఢచారులు సేకరించిన సమాచారము వలననే రాజులు శత్రువులను సులభంగా జయించగలరు. వెళ్లండి. మీకు అప్పగించిన పని జయప్రదంగా పూర్తిచేసుకొని రండి. " అని ఆజ్ఞాపించాడు రావణుడు.

వెంటనే వాళ్లు కార్యరంగంలోకి దూకారు. వానర సేనలో ప్రవేశించారు. నేరుగా రాముడు ఉన్న ప్రదేశానికి వచ్చారు. సువేల పర్వతము మీద ఉన్న రామలక్ష్మణులను పక్కనే ఉన్న విభీషణ సుగ్రీవులను చూచారు. రామ లక్ష్మణులను, వానర సైన్యమును చూడగానే వాళ్లకు ముచ్చెమటలు పట్టాయి. కాళ్లు తడబడ్డాయి. ఆ తడబాటులో వాళ్లు విభీషణుని కంట బడ్డారు. విభీషణుడు ఆ ఇద్దరినీ రాక్షస గూఢచారులుగా గుర్తుపట్టాడు. వాళ్లను పట్టుకొని రాముని వద్దకు తీసుకొని వచ్చాడు.

"వీడి పేరు శార్దూలుడు. గూఢచారులకు అధిపతి. వీడు రాక్షసుడు. మారువేషంలో ఉన్నాడు." అని చెప్పాడు విభీషణుడు. ఆ మాటలు విన్న వానరులు, వాడి మీద పడి వాడిని చంపడానికి ప్రయత్నిస్తుంటే రాముడు వారిని వారించాడు. వాడితో పాటు వచ్చిన ఇతర రాక్షస గూఢచారులను కూడా విడిపించాడు రాముడు. శార్దూలుడుకూడా బయటపడిందే చాలు అనుకొని తన అనుచరులతోసహా లంకకు పారిపోయాడు. వెంటనే వారు రావణుని వద్దకు పోయి రాముని సైన్యము సువేల పర్వతము దగ్గర ఉంది అని మాత్రము చెప్పారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఇరువది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము
## ముప్పదవ సర్గ.

"ఓ రాక్షసేంద్రా! రాముడు తన అపార మైన సేనలతో సువేల పర్వతము మీద ఉన్నాడు." అని శార్దూలుడు రావణునితో చెప్పాడు. ఈ సారి రావణుడు కొంచెం కంగారు పడ్డాడు. కాస్త భయపడ్డాడు. కాని ఆ భయాన్ని బయటకు కనపడనీయలేదు. శార్దూలుడి మొహంలోకి చూచాడు. వాళ్లమొహంలో సంతోషము ఉత్సాహము లేదు. వీళ్లుకూడా వానరుల చేతిలో తన్నులు తిని వచ్చిఉంటారు అని అనుకున్నాడు. అంత భయంలో కూడా రావణునికి నవ్వు వచ్చింది.

"ఏంటీ! మీ మొహాలు వాడిపోయి ఉన్నాయి. చాలా దీనంగా ఉన్నారు. మీరు కూడా శత్రువులకు పట్టుబడ్డారా!" అని నర్మగర్భంగా అడిగాడు. ఆ మాటలకు శార్దూలుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఓ రాక్షస రాజా! మన గూఢచర్యము వానర సేన ముందు ఫలించడం లేదు. వారందరూ రాముని అనుక్షణం అప్రత్తంగా కాపలా కాస్తున్నారు. కనీసము మాకు రామునితో మాట్లాడటం కూడా కుదర లేదు. వానరుల వలయాన్ని ఛేధించుకొని పోవడం ఎవరికీ సాధ్యం కాదు. మేము వానర సైన్యములో ప్రవేశించగానే విభీషణుడు మమ్ములను గుర్తించాడు. వానరులు మా అందరినీ పట్టుకున్నారు. మమ్ములను కాళ్లతోనూ చేతులతోనూ మర్దించారు. మా శరీరాలు రక్తసిక్తం అయ్యాయి. మమ్ములను రాముని ముందు నిలబెట్టారు. మేము రాముని కాళ్ల మీద పడి క్షమించమని వేడుకున్నాము. రాముడు మాకు క్షమాభిక్ష పెట్టాడు. ఆ కారణం చేత మేము బతికి బయటపడ్డాము.

రాముడు లంక ద్వారమును సమీపించాడు. రాముడు తన సేనలను గరుడవ్యూహాకారంలో నిలిపాడు. వానరులు లంకను నలువైపుల నుండీ చుట్టుముడుతున్నారు. రాముడు లంక ప్రాకారమును దాటి లంకలో ప్రవేశించక ముందే ఏదో ఒకటి చేయండి మహారాజా! సీతను రామునికి అప్పగించండి. లేకపోతే యుద్ధము చేయండి." అని చెప్పి ఊరుకున్నాడు శార్దూలుడు.

"సీతను రామునికి అప్పగించే మాట అటుంచు. మీరు వానరసైన్యములోకి ప్రవేశించారు కదా! ఆ సైన్యములో శూరులు ఎవరు! ఎంత మంది ఉన్నారు? ఏ యే వానరుడు ఎలాంటి ప్రతిభ కలిగి ఉన్నాడు? వారు ఎవరి కుమారులు? వారి పూర్వీకులు ఎవరు? ఈ విషయాలన్నీ వివరంగా చెప్పు.శత్రువుల బలాబలాలను పరిశీలించిన తరువాత తగు నిర్ణయం తీసుకుంటాను." అని అన్నాడు రావణుడు.

శార్దూలుడు రావణునితో ఇలా చెప్పసాగాడు. "ఓ రాక్షసేంద్రా! వానర సేనలో జాంబవంతుడు అనే భల్లూకరాజు ప్రసిద్ధుడు. ఆయన గద్గదుని కుమారుడు. తరువాత సుగ్రీవుడు కిష్కింధ దేశాధి పతి. ఆయన ఋక్షరజస్సు కుమారుడు. వీరిని జయించడం చాలా కష్టము. గద్గదుని మరొక కుమారుడు ధూమ్రుడు అనే వాడు ఉన్నాడు. ఇతడు బృహస్పతి కుమారుడు. ఇతనిని కేసరి అని కూడా అంటారు. ఈ కేసరి కుమారుడే హనుమంతుడు. ఈ హనుమంతుడే నూరుయోజనముల సముద్రము దాటి లంకలో ప్రవేశించి, వేలకొలది రాక్షసులను చంపి, లంకను దహించిన వాడు.

తరువాత యమధర్మరాజు కుమారుడు సుషేణుడు, చంద్రుని కుమారుడు దధిముఖుడు కూడా ఉన్నారు. సాక్షాత్తు మృత్యుదేవతలను బ్రహ్మ సృష్టించాడా అన్నట్టు సుముఖుడు, దుర్ముఖుడు, వేగదర్శి వానరసేనలో ఉన్నారు. యుద్ధంలో వారికి ఎదురుపడితే నేరుగా మృత్యు సదనానికి పోవలసిందే! అగ్నిదేవుని కుమారుడు నీలుడు. ఇతను వానర సేనలకు సైన్యాధిపతి. అలాగే వాయుదేవుని కుమారుడు హనుమంతుడు. వాలి గురించి తమకు తెలుసు. వాలి దేవేంద్రుని కుమారుడు. ఆ వాలి కుమారుడు అంగదుడు. మహావీరుడు. బలవంతుడు.

అశ్వినీదేవతల పుత్రులు మైందుడు, ద్వివిదుడు. యముని కుమారులు గజుడు, గవయుడు, గవాక్షుడు, శరభుడు, గంధమాధనుడు. వారి ఆధ్వర్యంలో కోట్లకొలదీ వానరులు. ఇంక రాముడు వారి మధ్యలో ఉన్నాడు. ఆ రాముడు ఎవరో కాదు. జనస్థానంలో ఖర,దూషణులను, త్రిశిరుడిని చంపిన వాడు. వాళ్లనే కాదు విరాధుడినీ, కబంధుడినీ కూడా చంపాడు ఆ రాముడు. రాముని వంటి వీరుడు పరాక్రమవంతుడు ముల్లోకములలో లేడు. జనస్థానములో ఉన్న 14 వేల మంది రాక్షసులను చంపిన రాముని గురించి మేము తమరికి వేరుగా మీకు చెప్పపనిలేదు. ఎవని బాణములకు పొరపాటున దేవేంద్రుడు అడ్డం వస్తే, ఆ దేవేంద్రుడు కూడా భస్మమైపోతాడో, ఆ మహావీరుడు, లక్ష్మణుడు, రాముడి పక్కనే ఉన్నాడు.

వారే కాకుండా సూర్యుని కుమారులైన శ్వేతుడు, జ్యోతిర్ముఖుడు, వరుణుని కుమారుడైన హేమకూటుడు, విశ్వకర్మ కుమారుడు నీలుడు, వసువుల కుమారుడు దుర్ధరుడు కూడా వానర సేనలో ఉన్నారు. వీరందరికీ ప్రధాన సలహాదారుగా తమరి తమ్ముడు విభీషణుడు రాముని

పక్కనే ఉన్నాడు. రాక్షసేంద్రా! సువేల పర్వతము మీద ఉన్న వానర సేన గురించి, వానర నాయకుల గురించి, రామలక్ష్మణుల గురించి మీకు వివరంగా చెప్పాను. తరువాత ఏ నిర్ణయం తీసుకుంటారో తమరి ఇష్టం." అని చెప్పి ఊరుకున్నాడు శార్దూలుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ముప్పదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
ముప్పది ఒకటవ సర్గ.

రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు కోట్లకొలదీ వానరసైన్యములతో వచ్చి లంకను ముట్టడించారు అన్న విషయం గూఢచారుల వలన తెలుసుకున్నాడు రావణుడు. రావణుని మనసులో భయం ప్రవేశించింది. తన ముందు ఉన్నవి రెండే మార్గాలు. ఒకటి సీతను రామునికి అప్పగించడం. అది తనకు ఇష్టం లేదు. రెండవది రామునితో యుద్ధము చేయడం. తన మంత్రులు తనకు ఈ విషమ సమయంలో ఏదైనా సలహా చెప్పకపోతారా అని ఆశపడ్డాడు. వెంటనే మంత్రులను అందరినీ సభకు రావలసినదిగా ఆదేశాలు పంపాడు. రావణుని మంత్రులందరూ సభకు వచ్చారు. రావణుడు వారితో మంత్రాంగము సాగిస్తున్నాడు.

మంత్రులు తమకు తోచిన ఉపాయములను వారు చెప్పారు. అవి ఏవీ రావణునికి రుచించలేదు. సభచాలించి అంత:పురమునకు వెళ్లాడు. రావణునికి ఒక విషయం స్ఫురించింది. సీతను తను

జనస్థానమునుండి అపహరించుకు రావడమే వంచనతో మొదలయింది. ఇప్పుడు కూడా ఆ వంచనాశిల్పాన్ని ప్రయోగిస్తే ఎలా ఉంటుంది అని అనుకున్నాడు. ఇటువంటి మాయలకు పెట్టింది పేరు అయిన విద్యుజ్జిహ్వుని పిలిపించాడు. వానితో ఇలా అన్నాడు. "జనకుని కుమార్తె సీత మన దగ్గర ఉంది. ఆమెను మాయతో భ్రమింపచేయాలి. సీత భర్త రాముడు. రాముని తలను పోలిన తలను, రాముని ధనుర్బాణములను తయారు చేయించి తీరుకొనిరా." అని ఆజ్ఞా పించాడు.

విద్యుజ్జిహ్వుడు రావణుని ఆజ్ఞమేరకు రాముని తలను పోలిన తలను, రాముడు ధరించే ధనుర్బాణములను, తయారు చేసి తీసుకొని వచ్చాడు. ఆ తలను విద్యుజ్జిహ్వుని ద్వారా మోయించుకొని రావణుడు అశోకవనమునకు వచ్చాడు. విద్యుజ్జిహ్యుని దూరంగా నిలబెట్టాడు. రావణుడు సీత వద్దకు వెళ్లాడు. సీత దీనంగా శింశుపా వృక్షము కింద కూర్చుని ఉంది. సీత మనసులో రాముని ధ్యానిస్తూ ఉంది. సీత చుట్టు రాక్షస స్త్రీలు కూర్చుని ఉన్నారు. వారందరూ రావణుని చూచి లేచి నిలబడ్డారు.

రావణుడు సీతను చూచి ఇలా అన్నాడు. "ఓ సీతా! ఇప్పటి దాకా నీవు ఎవరి అండచూచుకొని నన్ను ఎదిరిస్తున్నావో, ఎవరున్నారనే ధైర్యంతో నా పక్కలోకి రావడానికి ఇష్టపడటం లేదో, ఆ రాముడు యుద్ధంలో నా చేతిలో మరణించాడు. నేను చెబితే నువ్వు నమ్మవు కాబట్టి రాముని తలను తీసుకొని వచ్చాను. ఖండింపబడ్డ రాముని శిరస్సు నుండి వెచ్చటి రక్తం ఇంకా కారుతూ ఉంది. ఇంక నైనా నీ మొండి పట్టుదల మానుకో. నాకు భార్యగా ఉండు. సకల సుఖాలు అనుభవించు. రాముడు రణ రంగంలో ఎలా మరణించాడో సావధానంగా విను.

రాముడు సుగ్రీవునితో కలిసి వానర సేనతో సముద్రమువద్దకు వచ్చాడట. రాముడు తన సైన్యముతో సముద్ర తీరంలో నిలిచి ఉన్నాడు. నేను నా గూఢచారులను పంపాను. వారు వానర సేనలతో కలిసిపోయి, వానర సేనలను బాగా పరిశీలించారు. వెంటనే నా సేనాని ప్రహస్తుడు తన సేనలతో రాత్రి పూట వానరులు నిద్రించువేళ హటాత్తుగా దాడి చేసి వానరసేనలను తునుమాడాడు. వానరులందరినీ సమూలంగా చంపివేసాడు. ఆ సమయంలో ప్రహస్తుడు రాముని శిబిరంలోకి ప్రవేశించాడు. తన ఖడ్గంతో నిద్రిస్తున్న రాముని శిరస్సును ఖండించాడు. విభీషణుని బంధించాడు. లక్ష్మణుడు, వానర నాయకులు తలొకదిక్కుగా పారిపోయారు.

మా రాక్షస వీరులు సుగ్రీవుని పట్టుకొని అతని కంఠమును విరిచారు. హనుమంతుని పట్టుకొని పరిమార్చారు. వృద్ధుడైన జాంబవంతుని ఒక్కవేటుతో నరికారు. మైందుడు, ద్వివిదుడు, మొదలగు వానర వీరులు పారిపోతుంటే మా రాక్షస వీరులు వారిని పట్టుకొని నడుములు విరగగొట్టి చంపారు. పనజుడు, దధీముఖుడు,కుముదుడు నా బాణములకు బలి అయ్యారు. అంగదుడు చావుబతుకుల మధ్య ఉన్నాడు. ఇతర వానరులు మా గజబలము చేత మర్దింపబడ్డారు. మరికొందరు వానరులు పారిపోయారు. కొంత మంది సముద్రములో పడిపోయారు. మరి కొందరు చెట్టమీద తలదాచుకున్నారు. కాని మా రాక్షసులు ఆ వానరులను వెతికి వెతికి చంపారు.

మా సేనానాయకుడు రాముని శిరస్సును నాకు కానుకగా పంపాడు. నేను నీకు చూపించడానికి ఆ శిరస్సును తీసుకొని వచ్చాను." అని సీతతో చెప్పి వెంటనే పక్కనే ఉన్న రాక్షసిని చూచి, "నీవు పోయి ఈ

శిరస్సును యుద్ధరంగము నుండి నా వద్దకు తీసుకొని వచ్చిన విద్యుజ్జిహ్వుడు అనే సైనికుడిని తీసుకొనిరా” అని అన్నాడు. రాక్షసి పోయి పక్కనే ఉన్న విద్యుజ్జిహ్వుని తీసుకొని వచ్చింది. విద్యుజ్జిహ్వుడు ఖండింప బడ్డ రాముని తలను, రాముని ధనుర్బాణములను తీసుకొని వచ్చాడు. రావణునికి నమస్కరించి నిలబడ్డాడు.

“విద్యుజ్జిహ్వా! నీవు కదా రాముని తలను యుద్ధరంగము నుండి తీసుకొని వచ్చినది. ఆ తలను సీతకు చూపించు. తన భర్తకు కలిగిన దురవస్థను సీత కళ్లారా చూస్తుంది.” అని అన్నాడు. విద్యుజ్జిహ్వుడు రాముని తలను రాముని ధనుర్బాణములను సీత దగ్గరగా పెట్టాడు. “సీతా! చూడు. నీ భర్త రాముడు ఇంక ఈ భూమి మీద లేడు. నేను నీకు భర్తను, నాధుడను. ఇంకనైనా నువ్వు నన్ను భర్తగా స్వీకరించక తప్పదు.” అని అన్నాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ముప్పది ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
ముప్పది రెండవ సర్గ.

ప్రశాంతంగా కూర్చుని మనసులో రాముని తలచుకుంటున్న సీతకు ఇదంతా కలగా అనిపించింది. ఎదురుగా పడి ఉన్న రాముని ఖండిత శిరస్సు, ధనుర్బాణములు చూచింది. నాడు హనుమంతుడు వానర సేనానాయకుల గురించి, సుగ్రీవుని గురించి ఏమి చెప్పాడో అవే రావణుడు కూడా చెప్పడం గమనించింది సీత. రాముని శిరస్సు వంక

చూచింది. సంవత్సరాల తరబడి పరిచయం ఉన్న ముఖం రామునిది. ఆ కళ్లు, ముఖము, నుదురు, అవన్నీ చూచి ఆ శిరస్సు రామునిదే అని నిర్ధారించుకుంది సీత. సీతకు దు:ఖము ముంచుకొచ్చింది. తట్టకోలేక పోయింది. వలా వలా ఏడిచింది. ఇన్ని ఆపదలకు కారణమైన తన అత్తగారు కైకను నిందించింది.

"అమ్మా కైకమ్మతల్లీ! నీ కోరిక తీరిందా! రాముని అయోధ్యలో లేకుండా చేద్దామని అనుకున్నావు. తుదకు ఈ లోకంలోనే లేకుండా పోయాడు. నీవు మమ్ములనే కాదు ఇక్ష్వాకు వంశమునే నాశనం చేసావు. నాకు, రామునికి నార చీరలు ఇచ్చి అడవులకు పంపావు. నేను, నా రాముడు, నీకేమి అపకారం చేసాము. నీవు అరణ్యములకు పంపబట్టికదా నాకు రామునికి ఇన్నికష్టాలు వచ్చి పడ్డాయి." అని దీనంగా విలపించింది.

తన పాచిక పారినందుకు రావణుడు లోలోపల సంతోషి స్తున్నాడు, పైకి మాత్రం గంభీరంగా ఉన్నాడు. సీత ఒక్కసారి రాముని శిరస్సు వంక చూచింది. " ఓ రామా! అజేయుడవైన నీవు ఈనాడు ఈ మాదిరి దిక్కులేని చావు చచ్చి నన్నుకూడా జీవచ్ఛవాన్ని చేసావా? వైధవ్యాన్ని నాకు అంటగట్టావా! భార్యలో ఏదైనా దోషం ఉంటే, భర్త భార్యకంటే ముందు మరణిస్తాడు. నాలో ఏదో లోపం ఉండబట్టే నీవు ముందుగా మరణించి నన్ను విధవరాలిగా చేసావు. నన్ను రక్షించడానికి వచ్చి నువ్వు చంపబడ్డావా రామా! ఎంతో మంది జ్యోతిష్కులు నీకు పూర్ణాయుర్దాయము ఉందని చెప్పారు కానీ నీవు అల్పాయుష్కుడవని తెలుసులేకపోయారు గదా! ఆ జ్యోతిష్కులమాటలు అసత్యములు చేసి వెళ్లిపోయావా రామా! కాలాతీతుడ వైన నిన్ను కూడా కాలం కాటేసిందా రామా!

రామా! నీవు ఎంతో పరాక్రమవంతుడివే! నీకు ఎన్నో ఉపాయములు తెలుసు కదా! మరి ఈ మాదిరి శత్రువులచేతికి చిక్కి ఎలా హతమయ్యావు రామా! మహాభయంకరమైన మృత్యుదేవత నిన్ను నా నుండి బలవంతంగా లాగుకొని పోయిందా రామా! ఎదురుగా ఉన్న నన్ను విడిచి పెట్టి భూదేవిని కౌగలించుకొని శాశ్వతంగా నిద్రిస్తున్నావా రామా!

రామా! ఈ ధనుస్సును నీవు ఎల్లప్పుడూ భక్తితో పూజించేవాడివి. అటువంటి ధనుస్సు కూడా నిన్ను రక్షించలేదా రామా!నీవు ఈ పాటికి నీ తండ్రి గారు దశరథుని కలుసుకొని ఉంటావు కదా రామా! ఓ రామా! మన ఇద్దరికీ బాల్యంలో ఉండగానే వివాహం అయింది. ఇంతకాలము ఇద్దరం కలిసిమెలిసి ఉన్నాము. ఈ నాడు నన్ను ఒంటరిగా వదిలివెళ్లి పోయావా రామా! మౌనంగా ఉన్నావు ఎందుకు రామా! మాట్లాడు. నీ సీతకు బదులు చెప్పు. మన వివాహసమయంలో నా చేతిని పట్టుకొని జీవితాంతము నన్ను వదిలిపెట్టనన్నావు. నాతోనే ఉంటానన్నావు. ధర్మాచరణము చేస్తానన్నావు. అవన్నీ మరిచిపోయి ఒంటరిగా వెళ్లి పోయావా! నన్ను కూడా నీతో తీసుకొనివెళ్లు రామా! ఎప్పుడూ మంగళప్రదంగా ఉంటూ సకలాభరణాలతో శోభిల్లే నీ శరీరము ఇప్పుడు యుద్ధభూమిలో మృగములకు ఆహారంగా మారిందా రామా!

రామా! నీవు ఎన్నో యజ్ఞాలు యాగా చేసావు. దాన ధర్మాలు చేసావు. కానీ ఈనాడు నీ శరీరం అంతిమసంస్కారానికి కూషడా నోచుకోలేదు కదా! అనాథ ప్రేతం లాగా మిగిలిపోయింది కదా రామా! మీ తల్లిగారు కౌసల్యనుండి అనుమతి తీసుకొని అయోధ్యనుండి మనము ముగ్గురము అరణ్యములకు వచ్చాము. కాని ఇప్పుడు లక్ష్మణుడు ఒక్కడే

తిరిగి అయోధ్యకు వెళుతున్నాడు. కౌసల్య నీ గురించి అడిగినప్పుడు నిన్ను నీ సైన్యమును శత్రువులు వధించారు అని చెబుతాడు లక్ష్మణుడు. నీవు శత్రువులతో చంపబడ్డట్టు, నేను ఇక్కడ రాక్షసుల మధ్య ఉన్నట్టు తెలిసి కౌసల్య జీవించలేదు. ఓ రామా! నా కోసరము  నూరుయోజనముల సముద్రాన్ని దాటిన నీవు, విధివక్రించికేవలము ఆవు గిట్టంత చిన్న కుంటలో పడి మరణించినట్టు మరణించావు కదా! రామా! నా కొరకు నీవు ఇంతదూరము వచ్చి ఇక్కడ అకాల మృత్యువుకు గురైనావు. నేనే నీ పాలిట మృత్యుదేవతనయ్యాను కదా రామా! ఓ రామా! నేను నీ భార్యనై ఉండి కూడా, నీ తోపాటు ఎన్నో పుణ్యకార్యములు చేసి కూడా, ఈనాడు ఇటువంటి దు:ఖములు అనుభవిస్తున్నాను అంటే నేను ఏ నాడో ఘోరమైన పాపాలు చేసి ఉంటాను. ఆ పాపఫలమును అనుభవిస్తున్నాను." అని పరి పరి విధాలా దు:ఖించింది సీత.

తల ఎత్తి రావణుని చూచి "ఓ రావణా! రాముడు లేని సీత లేదు. రాముడు మరణించగానే సీత కూడా మరణించింది. ఈ శరీరం మాత్రం మిగిలి ఉంది. ఈ శరీరాన్ని ఖండించి నన్ను రామునితో కలుపు. ఓ రావణా! నా రాముని శరీరాన్ని కూడా తెప్పించి నా శిరస్సును రాముని శిరస్సుతోనూ, నా శరీరాన్ని రాముని శరీరంతోనూ కలుపు. నేను స్వర్గంలో నారాముని కలుస్తాను." అని ఏడుస్తూ అంది సీత.

ఇదంతా రావణుడు చూస్తున్నాడు. వింటున్నాడు. ఇంతలో ఒక రాక్షస భటుడు రావణుని వద్దకు వచ్చి ఇలా అన్నాడు. "జయము జయము మహారాజా!  సర్వసైన్యాధిపతి ప్రహస్తులవారు వచ్చి ఉన్నారు. తమరి దర్శనము కోరుతున్నారు." అని పలికాడు. వెంటనే రావణుడు అక్కడి నుండి వెళ్లిపోయాడు.  రాజసభ ఏర్పాటు చేసాడు. ప్రహస్తుని వలన యుద్ధరంగము

విశేషాలు తెలుసుకున్నాడు. ఏ క్షణంలో అయినా యుద్ధ ప్రారంభం కావచ్చు అని తెలుసుకొన్నాడు. సైన్యాధి పతులందరికీ ఈ విధంగా ఆజ్ఞలు ఇచ్చాడు. “సైన్యాలను సిద్ధం చేయండి. యుద్ధభేరీలు మోగించండి. సైన్యములను తరలించండి. యుద్ధము ఎక్కడ ఎవరితో అని ఎవ్వరికి చెప్పవద్దు.” అని పలికాడు. రావణుని సైన్యాధిపతులు రావణుని ఆజ్ఞలను అమలు పరిచారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ముప్పది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## ముప్పది మూడవ సర్గ.

ఎప్పుడైతే రావణుడు, రావణుని వెంట విద్యుజ్జిహ్వుడు అక్కడి నుండి వెళ్లిపోయారో, వారి మాయచేత కల్పితమైన రాముని ఖండిత శిరస్సు, రాముని ధనుస్సు, బాణములుకూడా మాయం అయ్యాయి. అది చూచిన సీత నిశ్చేష్టురాలయింది. ఆ సమయంలో అక్కడే ఉన్న సరమ అనే రాక్షస స్త్రీ సీత దగ్గరకు వచ్చింది. రాక్షసులలో కూడా మంచి వాళ్లు ఉన్నట్టు సరమ రాక్షస స్త్రీ అయినా సీత అంటే ఆమెకు ప్రేమ అభిమానము. సీత కు కూడా సరమ అంటే ప్రీతి, నమ్మకము. సరమ సీతను చూచి ఇలా అంది.

“సీతా! ఏడవకు. ఊరుకో. ఈ పరిణామాలు చూచి బాధపడకు. రావణుడు ఇక్కడకు వచ్చినప్పటి నుండి అతడు పలికిన పలుకులు, నువ్వు నీ భర్త గురించి పడ్డ ఆవేదన, నువ్వు రావణునితో పలికిన పలుకులు

అన్నీ నేను ఆ చెట్టు చాటున ఉండి విన్నాను. నాకు రావణుడు అంటే ఏ మాత్రం భయం లేదు. ఏం చేస్తాడు. చంపుతాడు అంతే కదా. నీకోసం నా ప్రాణాలు కూడా ఇస్తాను. నన్ను నమ్ము. సీతా! నువ్వు ఒక్కటి గమనించావో లేదు. రాముడు చనిపోయాడు అని నిన్ను నమ్మించడానికి రాముని శిరస్సు తీసుకొని వచ్చిన రావణుడు, సేవకుడు వచ్చి ప్రహస్తుడు వచ్చాడు అనగానే వెంటనే ఇక్కడి నుండి వెళ్లిపోయాడు. నేను కూడా వారిని రహస్యంగా వెంబడించి అసలు విషయం తెలుసుకున్నాను.

నీ రాముడు మరణించలేదు. నీ రాముని ఎవరూ చంపలేదు. రావణుడు చెప్పినట్టు ఏ వానరుడూ చావలేదు. వారంతా రాముని రక్షణలో సుఖంగా ఉన్నారు. రావణుడు అన్నీ అసత్యాలు చెప్పాడు. నీ దగ్గర తన మాయలు ప్రయోగించాడు. అందుకే వాడు వెళ్లిపోగానే వాడు మాయతో సృష్టించిన రాముని శిరస్సు ధనుర్బాణములు కూడా మాయం అయ్యాయి. కాబట్టి రాముడు క్షేమంగా ఉన్నాడు. నీవు దిగులు చెంద నవసరం లేదు.

పైగా, రాముడు నూరుయోజనముల సముద్రమును అపారమైన వానర సేనతో దాటి లంకను చుట్టుముట్టాడు. అందుకే రావణుడు తొందర తొందరగా ఇక్కడి నుండి వెళ్లిపోయాడు. ఈ విషయం నిర్ధారణ చేసు కోడానికి నేను నగరం బయటకు వెళ్లి వానర సేనా మధ్యలో ఉన్న రామలక్ష్మణులను నా కళ్లారా చూచాను. ఈ విషయం నిర్ధారించు కోడానికి రావణుడు తన గూఢచారులను పంపాడు. వారు వానరసేన లంకను చుట్టుముట్టినది అన్న వార్త తీసుకొని వచ్చారు. ఈ వార్త విన్న రావణుడు వెంటనే ఇక్కడి నుండి వెళ్లిపోయాడు. తన మంత్రులతో సభచేసి వారితో మంత్రాంగము సాగిస్తున్నాడు. " అని సరమ సీతతో చెబుతూ

ఉండగానే యుద్ధభేరీలు మోగుతున్నాయి. సైనికుల కోలాహలం వినిపించింది.

"సీతా! విన్నావుగా! అదుగో రణభేరి మోగుతూ ఉంది. ఆశ్వికసేన, గజసేన కదన రంగమునకు కదులుతున్న సవ్వడి వినిపిస్తూ ఉంది. సైనికుల హుంకారాలు వినిపిస్తున్నాయి. రావణుడు రాముడి మీదికి యుద్ధానికి వెళుతున్నాడు. రావణుడు పలకినట్టు రాముడు మరణించి, వానరసైన్యము పారిపోతే ఇప్పుడు ఎవరి మీదికి యుద్దానికి వెళుతున్నాడు. కాబట్టి రావణుడు పలికిన పలుకులు అన్నీ అబద్ధము అని తెలుసుకో! నీకు త్వరలో మంచిరోజులు వస్తున్నాయి. నీ రాముడు నిన్ను చేరుకుంటాడు. ఈ రాక్షసులకు పొయ్యేకాలం దాపురించింది. రావణుడు యుద్ధంలో మరణించడం, రాముడు నిన్ను పొందడం తథ్యం. నీ దు:ఖములు అన్నీ తొలగి పోతాయి.. నువ్వు నిశ్చింతగా ఉండు. ప్రత్యక్షదైవమైన ఆ సూర్యునికి నమస్కరించు. నీకు అన్నీ శుభాలు కలుగుతాయి." అని పలికింది సరమ.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ముప్పదిమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## ముప్పది నాలుగవ సర్గ.

అమృతముతో సమానమైన సరమ మాటలు విన్న సీత పరమానంద భరితురాలైంది. రాముడు బతికి ఉన్నాడు మరణించలేదు అన్న మాటలు ఆమె కర్ణపేయములుగా వినిపించాయి. సీత సంతోషమును

చూచి సరమ ఇంకా ఇలా అంది. "ఓ సీతా! ఇప్పటికి ఈ విషయాలు మాత్రము సేకరించాను. నేను ఇప్పుడే పోయి మరిన్ని విశేషములను సేకరించి తీసుకొని వస్తాను. నీవు నిశ్చింతగా ఉండు. ఎలాగా అంటే నాకు ఆకాశగమనము తెలుసు. హాయిగా ఆకాశంలో ఎగురుతూ వెళ్లగలను." అంది సరమ.

ఆ మాటలు విన్న సీత సరమతో ఇలా అంది. "సరమా! నీవు అటు ఆకాశములో గానీ, ఇటు పాతాళములో గాని నిర్భయంగా పోగలవని నాకు తెలుసు. రాముడు బతికి ఉన్నాడని చెప్పావు. చాలా సంతోషంగా ఉంది. కానీ ఈ సమయంలో రావణుడు ఏంచేస్తున్నాడు. అతని యుద్ధతంత్రము ఏమిటి? అనే విషయములు తెలుసుకొని వచ్చి నాకుచెప్పగలవా! ఆ రావణుడు తన మాయలతో నన్ను మోహింపజేస్తున్నాడు. దానికి తోడు ఈ రాక్షస స్త్రీలను ప్రేరేపించి నన్ను భయపెడుతున్నాడు. కాబట్టి ఏది నమ్మాలో ఏది నమ్మకూడదో తెలియడం లేదు. అందుకని రావణుని మాయల గురించి, అతడి యుద్ధతంత్రముల గురించి నాకు తెలియజేస్తే నేనునిశ్చింతగా ఉంటాను." అని అడిగింది సీత.

సీత మాటలకు సరమ ఇలా అంది. "ఓ సీతా! ఆ విషయం నాకు నువ్వు చెప్పవలెనా! చిటికలో వెళ్లి రావణుని మంత్రాంగము అంతా తెలుసుకొని వచ్చి నీకు చెపుతాను." అని పలికి సరమ అక్కడి నుండి తొందరగా వెళ్లిపోయింది. రావణుని మందిరమునకు వెళ్లింది. రావణుడు తన మంత్రులతో మాట్లాడే మాటలను రహస్యంగా పొంచి ఉండి విన్నది. వెంటనే అశోకవనమునకు తిరిగి వచ్చింది. తన రాక కోసం ఎదురు చూస్తున్న సీతను చూచి ఇలా అంది.

"సీతా! నీవు చెప్పిన ప్రకారము నేను రావణుని ఆంతరంగిక మందిరమునకు వెళ్లాను. అక్కడ రావణుడు మంత్రులతో చర్చలు జరుపుతున్నాడు. రావణుని తల్లి కైకసి కూడా అక్కడే ఉంది. నిన్ను వెంటనే విడిచిపెట్టమని, రాముని వద్దకు పంపమనీ కైకసి తన కుమారుడు రావణుని బతిమాలుతూ ఉంది. ఆమే కాదు, అవిద్ధుడు అనే వృద్ధుడైన మంత్రి కూడా నిన్ను వెంటనే రాముని వద్దకు పంపమని, యుద్ధము నివారించమనీ రావణునికి నచ్చచెప్పడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

కైకసి, అవిద్ధుడు రావణునితో ఈవిధంగా అంటున్నారు. "జనస్థానములో రాముడు ఒంటరిగా ఎంత మందిని చంపాడో నీకు తెలుసు కదా! అది తెలిసి కూడా ఇప్పుడు రామునితో యుద్ధము చేయడం అవసరమా! వెంటనే సీతను రాముని వద్దకు సగౌరవంగా పంపించు. యుద్ధము నివారించు. అదీకాకుండా నిన్న కాక మొన్న హనుమంతుడు అనే పేరుగల ఒక వానరము, లంకలో సృష్టించిన భీభత్సము అప్పుడే మరిచిపోయావా! ఆ వానరము నూరుయోజనముల సముద్రమును దాటి, లంకకు వచ్చి, సీతను చూచి, లంకను తగలబెట్టి మరీ పోయింది. ఒక్కడే ఇంత చేస్తే, మిగిలిన వానరములు ఎంతటి ప్రళయాన్నిసృష్టిస్తాయో ఆలోచించు." అని పరి పరి విధాలా రావణునికి నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. కానీ రావణుడు సుతరామూ వారి మాటలు వినలేదు. ఎన్ని చెప్పినా రావణునికి నిన్ను విడవడం ఇష్టం లేదు. యుద్ధములో చావడానికైనా ఇష్టపడుతున్నాడు కానీ, నిన్ను విడవడానికి ఇష్టపడటం లేదు ఆ రావణుడు. సీతా! రావణుడికి పొయ్యేకాలం దాపురించే ఎవ్వరు చెప్పినా వినడం లేదు. వాడు రాముడి చేతిలో చావడం తథ్యం. నువ్వు నీ భర్త రామునితో కలిసి అయోధ్యానగర ప్రవేశం చేయడం ఖాయం." అని చెబుతూ ఉండగానే భూమి కంపిస్తున్నట్టు యుద్ధభేరీలు మోగడం, వానర

సేనల సింహగర్జనలు హుంకారాలు వినిపించాయి. అవి విన్న రాక్షసులు రావణుడు చేసిన అపరాధమునకు మనం అంతా నాశనం కాబోతున్నాము అని ఆందోళన చెందుతున్నారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ముప్పది నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ముప్పది ఐదవ సర్గ.

లంకా నగరము బయట వానర సైన్యము యొక్క యుద్ధ సన్నాహాలు, వారి యుద్ధభేరీ శబ్దాలు విన్న రావణుడు తన మంత్రుల వంక చూచాడు. వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు. “ఓ మంత్రులారా! రాముడు వానర సేనతో సముద్రమును దాటిన విషయము, లంకను ముట్టడించిన విషయము మీ ద్వారా విన్నాను. ఎంత సేపటికీ రాముని పొగడడం, రామునితో సంధిచేసుకోమని నాకు సలహా ఇవ్వడం, సీతను తీసుకొని పోయి రామునికి అప్పగించమనడం తప్ప మీరు ఏమీ చేయడం లేదు. చేతకాని వారిలా చేతులు ముడుచుకొని కూర్చున్నారు. ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటున్నారు. ఇదంతా నేను చూస్తూనే ఉన్నాను. మీ పౌరుషము, పరాక్రమము ఏమైనాయి. రామునికి, వానర సేనలకు భయపడుతున్నారా!” అని నిష్టూరంగా కోపంగా అన్నాడు.

అప్పుడు మాల్యవంతుడు అనే రాక్షస మంత్రి లేచి ఇలా అన్నాడు. "ఓ రాక్షసేంద్రా! నీతి మార్గమును, ధర్మ మార్గమును అనుసరించు రాజు ఎల్లప్పుడూ విజయమును పొందుతాడు. అటువంటి రాజుకు శత్రువులు కూడా భయపడతారు. యుద్ధము వచ్చినపుడు సమయాను కూలంగా ప్రవర్తించాలి. మన బలము ఎదిరి బలమును గుర్తెరిగి యుద్ధము చేయడమో సంధిచేసుకోవడమో చేయడం ఉత్తమం. అటువంటి రాజు ఎల్లప్పుడూ జయమును పొందుతాడు. రాజు యొక్క బలము శత్రువు యొక్క బలము కన్నా తక్కువగా ఉన్నప్పుడు, లేక శత్రు బలంతో సమంగా ఉన్నప్పుడు, జయము సందేహాస్పదము. కావున సంధిచేసుకొనడం ఉత్తమం. రాజు బలము శత్రుబలము కన్నా ఎక్కువగా ఉన్నప్పుడు తప్పకుండా యుద్ధము చేసి శత్రువును జయించవలెను. ఇది రాజధర్మము. యుద్ధనీతి. ప్రస్తుతము ఈ యుద్ధము అనవసరము. రాముని బలము మన బలము కన్నా ఎక్కువగా ఉన్నట్టు కనపడుతూ ఉంది. ఈ సందర్భంలో సంధి చేసుకొనడం ఉత్తమం.

ఇదంతా రాముని భార్య సీత వలన జరిగింది. నీవు ఆ సీతను అపహరించావు. తన భార్యకోసరం రాముడు వానరసేనతో లంక మీదికి దండెత్తివచ్చాడు. నీవు సీతను రాముని వద్దకు సగౌరవంగా పంపితే యుద్ధము నిలిచిపోతుంది. లంక క్షేమంగా ఉంటుంది. ముల్లోక ములలో ఉన్న దేవతలు, దానవులు, గంధర్వులు, ఋషులు అందరూ రామునికే జయము కలగాలని కోరుకుంటున్నారు. నీవు ఒక్కడివి ఒక స్త్రీ కొరకు రామునితో విరోధం సాగించడం అనవసరము. కాబట్టి రామునితో సంధిచేసుకోవడం ఉత్తమం.

ఓ లంకేశ్వరా! బ్రహ్మ దేవతలను, అసురులను సృష్టించాడు. దేవతలు ఎల్లప్పుడూ ధర్మమార్గమునే అనుసరిస్తున్నారు. అసురులు అధర్మమార్గమునే అనుసరిస్తున్నారు. ఆ కారణం చేత దేవతలు అంటే ధర్మ స్వరూపులనీ, అసురులు అధర్మస్వరూపులనీ లోకులు అనుకుం టున్నారు. అధర్మమును ధర్మము ఎప్పుడు అణగదొక్కుతూ ఉంటుందో అప్పుడు కృతయుగము ప్రవర్తిస్తూ ఉంటుంది. ఎప్పుడైతే ధర్మము క్షీణించి, అధర్మము ధర్మమును అణగతొక్కుతుందో అప్పుడు కలియుగము మొదలవు తుంది.

నీవు అధర్మాన్ని ఆశ్రయించావు. ధర్మాన్ని నాశనం చేసావు. అందరి తోనూ శత్రుత్వమును పెంచుకున్నావు. ధర్మం మన శత్రువుల పక్షాన ఉంది. అందుకే వారు మనకన్నా బలవంతులు అయ్యారు. నీవు సీతను అపహరించుకొని వచ్చి అధర్మానికి పాలుపడ్డావు. ధర్మాన్ని కాలదన్నావు. నీ అధర్మమే మనలనందరినీ నాశనం చేస్తూ ఉంది. దేవతలందరూ ధర్మాత్ములయిన శత్రుపక్షము వహించారు. అందుకే శత్రువులు మనకన్నా బలంగా ఉన్నారు.

ఓ లంకేశ్వరా! నీకు భోగములు అనుభవించడంలో ఉన్న ఆసక్తి ధర్మాచరణములో లేదు. అందుకే అగ్నితో సమానులైన మహాఋషులను బాధించావు. వారి ఆగ్రహానికి పాత్రుడవు అయ్యావు. ఋషులు ఎల్లప్పుడూ ధర్మపక్షపాతులు. ధర్మాన్ని కాపాడుతుంటారు. వారి ప్రభావము నీకు బాగా తెలియదు. వారి మనస్సులు తపస్సుచేత పునీతమయినవి. వారు యజ్ఞయాగములు చేస్తూ, వేదములను అధ్యయనము చేస్తూ ఉంటే ఆ వేదమంత్రముల ఘోషలో నీ రాక్షసులు తలొక దిక్కుగా పారిపోతారు. వారు వేల్చే అగ్నిహోత్రముల నుండి వెలువడే

ధూమము నలుదిక్కులా వ్యాపించి రాక్షసుల తేజస్సును హరించి వేస్తుంది. ఆ ఋషులు ప్రతి దినము తమ తమ ప్రాంతాలలో చేసే తీవ్రమైన తపస్సుకు, నీ రాక్షసులు తల్లడిల్లిపోతారు.

ఓ రాక్షసేంద్రా! నీవు దేవతల వలన, దానవుల వలనా, యక్షుల వలనా చావు లేకుండా వరమును పొంది ఉన్నావు. నరులను, వానరులను మరిచావు. ఇప్పుడు ఆ నరులు, వానరులు, భల్లూకములు నీ మీదికి యుద్ధానికి కాలుదువ్వుతున్నాయి. ఎప్పుడెప్పుడు నిన్ను నీ సైన్యాన్ని కబళిద్దామా అని ఉరకలు వేస్తున్నాయి. అదీ కాకుండా లంకలో అనేక దుశ్శకునములు ఉత్పాతాలు కనపడుతున్నాయి. రాక్షస వినాశము కాబోతోంది అని సంకేతాలు ఇస్తున్నాయి. రక్తవర్షము కురుస్తూ ఉంది. అశ్వశాలలో ఉన్న అశ్వములు, గజశాలలో ఉన్న ఏనుగుల కంటి నుండి కన్నీరు పెల్లుబుకుతూ ఉంది. గజాశ్వములు రోదించడం మనకు క్షేమం కాదు. అడవులలో ఉండవలసిన నక్కలు, తోడేళ్లు క్రూరమృగములు నగరంలోకి ప్రవేశిస్తున్నాయి. వికృతాకారులైన స్త్రీలు వికృతంగా నవ్వుతూ స్వప్నములలో సాక్షాత్కరిస్తున్నారు. దేవతలకు అర్పించిన బలులు కుక్కలు తింటున్నాయి. ఇటువంటి దుశ్శకునములు ఎన్నో కనపడుతున్నాయి. మృత్యుదేవత లంకా నగరంలో తాండవం చేస్తూ ఉంది.

ఓ రావణా! రాముడు సామాన్యుడు కాడు. సాక్షాత్తు విష్ణుస్వరూపుడు లేకపోతే నూరుయోజనముల దూరము కల సముద్రము మీద సేతువు కట్టడం ఇతరులకు సాధ్యంకాదు. కాబట్టి రామునితో సంధి చేసుకో. లంకను కాపాడు." అని పలికాడు మాల్యవంతుడు.

రావణుని ముఖం వంక చూచాడు. రామునిలో ఏ మార్పూ లేదు. చేసేది లేక మౌనంగా కూర్చున్నాడు మాల్యవంతుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ముప్పది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ముప్పది ఆరవ సర్గ.

రావణునికి రెండే గుణాలు. అతనికి తెలియదు. ఒకరు చెబితే వినడు. వీళ్లనే మూర్ఖులు అంటారు. ఆ మూర్ఖులలో కెల్లా అగ్రగణ్యుడు రావణుడు. రావణునికి ఎంతో మంది చెప్పారు, తల్లి కైకసి కూడా చెప్పింది. సీతను రామునికి ఇచ్చి యుద్ధము నివారించు అని. కాని వినలేదు. ఇప్పుడు మాల్యవంతుడు చెప్పాడు. రావణుడు వినలేదు. పైగా కోపం వచ్చింది.

(ఇదే లక్షణాలు మీకు దుర్యోధనుడిలో కూడా కనపడతాయి. తన స్వార్థానికి, మూర్ఖత్వానికి పదకొండు అక్షౌహిణీల సైన్యాన్ని బలి పెట్టాడు. కేవలం పాండవులకు ఇవ్వవలసిన రాజ్యభాగమునకు లోభించి యుద్ధాన్ని ఆహ్వానించాడు. రావణుడు కూడా ఎంతో మంది అందమైన స్త్రీలు ఉన్నా కేవలం సీత కోసం రాముడితో యుద్ధాన్ని ఆహ్వానిస్తున్నాడు.)

మాల్యవంతుడు చెప్పిన మాటలకు రావణుడికి కోపం వచ్చింది. మాల్యవంతునితో ఎంతో కఠినంగా ఇలా అన్నాడు. "మాల్యవంతా! నీ

హితబోధలు నాకు అక్కరలేదు. మీరు శత్రుపక్షము వహించి, నాకు హితబోధ చేస్తే అవి నాచెవికి ఎక్కవు. రాముడు కేవలం మానవుడు. రాజ్యము పోగొట్టుకొని అడవులు పట్టి తిరుగుతున్న అభాగ్యుడు. సైన్యము లేక, ఎవరూ దొరక్క, వానరుల సాయం తీసుకున్నాడు. అటువంటి వాడు నన్ను గెలువగలడా! రామునికి అంత సమర్థత ఉందా! నేను ఎవరు; రాక్షసులకు రాజును. దేవతలను జయించిన వాడను. పరాక్రమ వంతుడను. దిక్పాలకులను నా పాద దాసులుగా చేసుకున్న మేటిని. నన్ను భీరుడుగా, బలహీనుడుగా ఎందుకు అనుకుంటున్నావు.

మాల్యవంతా! నీవూ రాక్షసుడవే. నేను రాక్షసుడనే. ఇరువురమూ ఒకే జాతికి చెందిన వారము. కానీ నీవు మానవుల పక్షము వహించి నన్ను కించపరుస్తున్నావు. ఇది శత్రువుల మీద పక్షపాతమా! లేక నా మీద అసూయనా! లేక మీరు ఏమి అన్నా నేను ఏమీ అనడం లేదనా! నా మంచి తన్నాన్ని నా చేతగానితనంగా అనుకుంటున్నారా! నీవు శాస్త్రములను అధ్యయనము చేసిన వాడవు. రాజుతో ఇలాగేనా మాట్లాడేది. ఇది నీకుగా నువ్వు మాట్లాడుతున్నావా! లేక మన శత్రువులు ఎవరైనా నీ చేత ఇలా పలికిస్తున్నారా! సీతను అంత కష్టపడి జనస్థానము నుండి తీసుకొని వచ్చినది రామునికి భయపడి తిరిగి ఇచ్చివేయడానికా! అలా భయపడితే అసలు సీతను తీసుకొని వచ్చి ఉండేవాడినే కాదు!

మాల్యవంతా! యుద్ధము మొదలైన రోజే వానరులు, రామలక్ష్మణులు, సుగ్రీవుడు, వానర వీరులు నాచేతిలో హతమవుతారు. ఇది సత్యము. నాలో సహజంగా వీరత్వము రోషము పౌరుషము ఎక్కువ. నేను చావనైనా చస్తాను కానీ ఎవరికీ లొంగను. ఎవరితోనూ సంధి చేసుకోను. ఎంతో మంది వానరుల సాయంతో సముద్రము మీద సేతువు

నిర్మించి సముద్రమును దాటినంత మాత్రాను రాముడు దేవుడు అయిపోడు. కాబట్టి రాముడికి నేను భయపడవలసిన అవసరము లేదు. సముద్రమును దాటి లంకకు వచ్చిన రాముడు, వానరులు తిరిగి సముద్రాటి వెళ్లరు. ఇదే నా ప్రతిజ్ఞ. " అని అత్యంత పరుషంగా మాట్లాడిన రావణుని మాటలు విన్న మాల్యవంతుడు మౌనంగా ఉండిపోయాడు. వెంటనే రావణునికి జయము పలికి, ఆశీర్వదించి, తన గృహమునకు వెళ్లిపోయాడు.

ఇది చూచిన మిగిలిన మంత్రులు రావణునికి వ్యతిరేకంగా చెప్పడం ఒంటికి మంచిది కాదని రావణుడు చెప్పినట్టు చేయాలని నిశ్చయించుకున్నారు. రావణుడు వారితో లంకా నగరము రక్షణ గురించి తీసుకోవలసిన చర్యలను విపులంగా చర్చించాడు. లంకా నగరానికి పటిష్టమైన రక్షణ ఏర్పాట్లు చెయ్యమని ఆదేశించాడు. ఒక్కొక్క ద్వారము నకు ఒక్కొక్క సేనాధిపతిని నియమించాడు. తూర్పు ద్వారమునకు ప్రహస్తుని, దక్షిణ ద్వారమునకు మహోదరుని, మహా పార్శ్వుడిని, పడమటి ద్వారమునకు తన కుమారుడు ఇంద్రజిత్తును రక్షకులుగా నియమించాడు. ఉత్తర ద్వారమును శుకుడు,సారణుల సాయంతో తానే రక్షిస్తానని చెప్పాడు. విరూపాక్షుడు అనే సైన్యాధ్యక్షుని తన అపారమైన రాక్షస సేనతో మధ్య భాగంలో నిలిపాడు. ఈ విధంగా లంకా నగర రక్షణము తగిన ఏర్పాట్లు చేసిన రావణుడు, ఆ ఏర్పాట్లతో సంతృప్తి చెంది. తన అంత:పురమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ముప్పది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము
## ముప్పది ఏడవ సర్గ.

లంకా నగరంలో రావణుని పరిస్థితి ఇలా ఉంటే, అక్కడ లంకా నగరము వెలుపల మోహరించి ఉన్న వానర సైనికుల మధ్య ఉన్న రాముడు, లక్ష్మణుడు,సుగ్రీవుడు, విభీషణుడు, హనుమంతుడు, అంగదుడు, జాంబవంతుడు, శరభుడు, సుషేణుడు, మైందుడు, ద్వివిదుడు, గజుడు, గవాక్షుడు, కుముదుడు, నలుడు, పనసుడు, ఇంకా తదితరులు కూర్చుని ఆలోచిస్తున్నారు. మనమందరమూ రావణుని చేత పరిపాలింపబడుతున్న లంకా పట్టణమును చేరుకున్నాము. తదుపరి కార్యక్రమమును గురించి ఆలోచించండి అని ఒకరితో ఒకరు అనుకొంటున్నారు.

లంకా పట్టణము గురించి బాగా తెలిసిన విభీషణుడు లేచి ఇలా అన్నాడు. "రామా! నా వెంట నా అనుచరులు నలుగురు రాక్షసులు వచ్చారు. నేను ఆ నలుగురిని లంకకు పంపాను. వారు లంకలో జరుగుతున్న విషయాలను జాగ్రత్తగా పరిశీలించి వచ్చారు. వారు పక్షిరూపములలో రాక్షస సేనలలో ప్రవేశించి వారి ప్రయత్నములు అన్నీ తెలుసుకొని వచ్చారు. రావణుడు చేయుచున్న సైనిక ఏర్పాట్లను గురించి వారు నాకు తెలిపిన విషయాలను నేను మీకు తెలియపరుస్తాను.

లంకకు నాలుగు ప్రధాన ద్వారములు కలవు. తూర్పు ద్వారమునకు ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు దక్షిణ ద్వారము వద్ద, ఇంద్రజిత్తు పశ్చిమ ద్వారము వద్ద, తమ తమ సేనలతో మోహరించి నగరమును రక్షిస్తున్నారు. రావణుడు తానే స్వయంగా ఉత్తర ద్వార పరిరక్షణ గావిస్తున్నాడు. విరూపాక్షుడు తన సైన్యములతో

నగర మధ్యమున ఉండి నగర రక్షణ చేస్తున్నాడు. రావణ సైన్యములో పదివేల మంది గజబలము, పదివేల మంది రథములను అధిష్ఠించిన యోధులు, రెండు వేల మంది అశ్వదళము, కోటికి పైగా సైనికులు ఉన్నారు. వీరందరికీ ఒక్కొక్క వీరునికి పది లక్షల మంది రాక్షసులు పరివారముగా ఉన్నారు. ఇదీ వీరు తెచ్చిన సమాచారము.

రామా! పూర్వము రావణుడు కుబేరుని మీదికి యుద్ధమునకు వెళ్లినపుడు అతనితో పాటు 60 లక్షల మంది రాక్షసులు వెళ్లారు. వారందరూ అధికమైన పరాక్రమవంతులే. రామా! నేను శత్రుబలములను గూర్చి ఎక్కువగా చెబుతున్నందుకు కోపించకు. ఇది కేవలము శత్రుబలముల గురించిన సమాచారము మాత్రమే. నీవు దేవ దానవులను గెలువ సమర్థుడివి. కాబట్టి మనము కూడా వానర సేనను నలుదిక్కులకు నాలుగు వ్యూహములుగా విభజించవలెను. దానికి తగిన వ్యూహములను నిర్ణయించు." అని అన్నాడు విభీషణుడు.

అప్పుడు రాముడు ఇలా అన్నాడు. "సుగ్రీవా! నీలుడు తన వానర సైన్యముతో తూర్పుదిక్కున ఉన్న ద్వారము దగ్గర ప్రహస్తుని ఎదుర్కొంటాడు. అంగదుడు తన సేనలతో దక్షిణ ద్వారమును రక్షిస్తున్న మహాపార్శ్వ మహోదరులను ఎదుర్కొంటాడు. హనుమంతుడు తన సేనలతో పడమటి ద్వారమును రక్షిస్తున్న ఇంద్రజిత్తును ఎదుర్కొంటాడు. ఇంక ఉత్తర ద్వారమును రక్షిస్తున్న రావణుని నేనే స్వయంగా ఎదుర్కొంటాను. నాకు సాయంగా లక్ష్మణుడు ఉంటాడు. మేము ఇద్దరమూ రావణుని ఓడించి ఉత్తర ద్వారము గుండా లంకలో ప్రవేశిస్తాము. సర్వసేనాని సుగ్రీవుడు, భల్లూకములకు నాయకుడు జాంబవంతుడు, విభీషణుడు సైన్యమధ్యలో

ఉండి నలుదిక్కులను రక్షిస్తూ ఉంటారు. వానరులు అందరూ కామ రూపులు. అయినా వారందరూ వానర రూపములలోనే ఉండాలి. ఎవరూ మనుష్యరూపము ధరించకూడదు. అదే మనసైన్యమునకు గుర్తు. నేను, లక్ష్మణుడు, మాత్రము మనుష్యరూపములలో ఉంటాము. విభీషణుడు, అతని అనుచరులు నలుగురు రాక్షసులైనను, వారు కూడా మనుష్యరూపములలో మా వెంట ఉంటారు. వీరు తప్ప మిగిలిన వానరులు అందరూ తమ సహజ వానరూపములలోనే ఉండవలెను. అప్పుడే మన సైన్యమును గుర్తు పట్టడానికి వీలుఅవుతుంది." అని పలికాడు రాముడు.

తరువాత రాముడు లంకలోని సైన్యమును అంతా పైనుంచి విహంగ వీక్షణము చేయవలెనని అనుకున్నాడు. అందుకని సువేల పర్వతము మీదికి ఎక్కాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ముప్పది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ముప్పది ఎనిమిదవ సర్గ.

రాముడు లక్ష్మణునితో సహా సువేల పర్వతమును ఎక్కడానికి నిర్ణయించుకొని, సుగ్రీవుడు, విభీషణునితో ఇలా అన్నాడు. "మేము ఇద్దరమూ సువేల పర్వతమును ఎక్కి అక్కడ ఈ రాత్రికి ఉంటాము. తన చావును చేజేతులా కొనితెచ్చుకున్న రావణుని నివాసమైన లంకా నగరమును నేను లక్ష్మణుడు చూడవలెనని కుతూహలపడుతున్నాము,.

రావణుని పేరు వింటేనే నాకు ఒళ్లంతా తాపము కలుగుతూ ఉంది. వాడి ఒక్కడి మూలంగా రాక్షసజాతి యావత్తు నాశనం కాబోతోంది. ఒక్కడు చేసిన పాపమునకు రాక్షస కులము నశించడం తప్పదు." అని అన్నాడు రాముడు.

తరువాత రాముడు లక్ష్మణునితో కూడి సువేల పర్వతమును ఎక్కడం మొదలెట్టాడు. రామలక్ష్మణుల వెంట సుగ్రీవుడు, అతని మంత్రులు, విభీషణుడు కూడా వెళ్లారు. వారి వెంట హనుమంతుడు, అంగదుడు మొదలగు వానర వీరులు కూడా వెళ్లారు. అందరూ సువేల పర్వతమును ఎక్కి అక్కడి నుండి సుందరమైన కాంచన లంకను చూచారు. లంకా నగరము ప్రాకారముల మీద నల్లని శరీర ఛాయగల కొండల వంటి దేహములు గల  రాక్షసులు నిలబడి ఉండటం వలన, నల్లటి రాళ్లతో మరొక ప్రాకారము కట్టారా అన్న భ్రమ కలుగుతూ ఉంది. ఆ రాక్షసులను చూచి వానరులు  వింత వింత కిచ కిచ ధ్వనులు చేసారు.

అంతలోనే సూర్యాస్తమయము అయింది. రాత్రి వేళ చంద్రుడు వెన్నెల ప్రసరిస్తున్నాడు. రామలక్ష్మణులు, విభీషణుడు, సుగ్రీవుడు ఇతర వానర ప్రముఖులు ఆ రాత్రి సువేల పర్వతము మీద సుఖంగా గడిపారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ముప్పది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## ముప్పది తొమ్మిదవ సర్గ.

వానర సేనలకు అధిపతులు ఆ రాత్రి సువేల పర్వతము మీద ఉండి, అక్కడి నుండి లంకా నగరాన్ని చూచారు. లంకా నగరంలో ఉన్న ఉద్యానవనములను, ఎత్తైన భవనములను, చూచారు. ఇంద్రుని రాజధాని అయిన అమరావతి వలె ప్రకాశించుచున్న లంకా నగర సౌందర్యమునకు వారంతా ఆశ్చర్యపోయారు. కొంత మంది వానరులకు లంకా నగరంలో ప్రవేశించవలెనని కోరిక కలిగింది. వారు సుగ్రీవుని అనుమతి తీసుకొని లంకా నగరం వైపుకు వెళ్లారు. ఆ వానరులు పెద్ద పెద్దగా అరుస్తూ, ఆ పర్వతము మీద ఉన్న మృగములకు ఏనుగులకు భయం కలిగిస్తూ వెళు తున్నారు. వారి అరుపులకు కేకలకు ఆ పర్వత ప్రాంతము అదిరిపోతూ ఉంది. వారి అరుపులకు క్రూరమృగములు నలుదిక్కులకు పారిపోయాయి.

సువేల పర్వతము పక్కన ఎత్తైన త్రికూట పర్వత శిఖరము ఉంది. దానిని ఎక్కడానికి ఎవరి తరమూ కాదు. ఆ త్రికూట పర్వత శిఖరము మీద లంకా నగరము నిర్మింపబడి ఉంది. ఆ లంకానగరము ఇరవై యోజనముల పొడవు, పది యోజనముల వెడల్పు కలిగి ఉంది. ఆ లంకా నగరం ఎత్తైన గోపురములు, బంగారముతోనూ వెండితోనూ కట్టబడిన ప్రాకారములతోనూ, పెద్ద పెద్ద భవనములతోనూ, ఎత్తైన ప్రాసాదములతోనూ, విమానములతోనూ, శోభిల్లుతూ ఉంది. ఆ లంకా నగరంలో వెయ్యి స్తంభముల మీద నిర్మింపబడిన చైత్య ప్రాసాదము లంకా నగరానికే అలంకారంగా నిలిచి ఉంది. లంకా నగరము అంతా బంగారుకట్టడములతో నిండి ఉండి, కాంచన లంక అనే పేరును సార్థకం చేసుకుంది.

ఆ శోభాయమానమైన లంకను దూరంనుండి చూచారు ఆ వానరులు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ముప్పది తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

## యుద్ధకాండము
## నలుబదవ సర్గ.

(ఈ సర్గ వాల్మీకి రామాయణంలోనిది కాదని, తరువాతి కాలంలో ఎవరో ఉత్సాహవంతుడైన కవి కల్పించి చేర్చినది అనీ, ఈ సర్గ ప్రాచ్యపాఠంలో లేదని ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు తమ రామాయణ మహా కావ్యము బాలనందినీ వ్యాఖ్యలో అభిప్రాయ పడ్డారు. కాబట్టి ఈ సర్గను సరదాగా చదువుకోండి. తర్కం కోసరం వెతక్కండి. ఈ నడుమ బద్రీనాద్ అనే సినిమా వచ్చింది. అందులో హీరో బద్రీనాద్‌లో ఎగిరి అమర్‌నాద్‌లో దూకి, అక్కడ కసా కసా మనుషులను నరికి మరలా అమర్‌నాద్ లో ఎగిరి బద్రీనాద్‌లో వచ్చి పడతాడు. ఇదీ అలాంటిదే! సినిమా కథలు, అందులో సంఘటనలు ఎక్కడినుంచో రాలేదు. మన పురాణాల నుంచే వచ్చాయి. పురాణాలు మనం చదవక అదేదో కొత్త సృష్టి అనుకుంటున్నాము.)

రాముడు, సుగ్రీవునితోనూ, వానర సేనాధిపతులతోనూ సువేల పర్వతము మీద ఎక్కాడు. అక్కడి నుండి అన్ని దిక్కుల వంక చూచాడు. విశాలమైన త్రికూట పర్వత శిఖరము మీద నిర్మింపబడిన లంకా నగరాన్ని

చూచాడు. దూరంగా కనిపిస్తున్న లంకా నగరంలో రావణుడు, ఎత్తైన తన మందిరం పైన కూర్చుని ఉండటం రాముడు చూచాడు. రావణుని ఇరు పక్కల సుందరీమణులునిలబడి వింజామరలు వీస్తున్నారు. రావణుని తల మీద విజయ ఛత్రము శోభాయమానంగా ప్రకాశిస్తూ ఉంది. రావణుడు ఎర్రని చందనము పూసుకొని ఉన్నాడు. ఐరావతము పొడిచిన దంతపు పోట్లు రావణుని వక్షస్థలము మీద కనిపిస్తున్నాయి. అటువంటి రావణుని సుగ్రీవుడు చూచాడు.

సుగ్రీవుని కోపం తారస్థాయికి చేరుకుంది. దిగ్గున పైకి లేచాడు. సువేల పర్వతము మీది నుండి రావణుని మందిరము మీదికి దూకాడు. రావణుని ఎదురుగా నిలబడి ఇలా అన్నాడు. "ఓరి రాక్షసాధమా! నేను ముల్లోకములకు ప్రభువైన రాముని మిత్రుడను. ఒక్క మిత్రుడనే కాదు. రాముని దాసుడను. నేను నిన్ను విడువను." అంటూ రావణుని మీదికి దూకాడు. రావణుని కిరీటము లాగి కిందపడేసాడు.

రావణుడు సుగ్రీవుని చూచి ఇలా అన్నాడు. "ఒరేయ్ వానరా! నీవు ఇప్పటిదాకా సుగ్రీవుడవే(మంచి కంఠము కలవాడివే) కాని ఇప్పటి నుండి హీనగ్రీవుడవు(కంఠము లేని వాడివి)." అంటూ రావణుడు సుగ్రీవుడిని పట్టుకొని కిందపడేసాడు. ఇద్దరూ కొట్టుకుంటున్నారు. ఇద్దరి శరీరముల నుండి చెమటలు కారుతున్నాయి. ఇద్దరి దేహముల నుండి రక్తం కారుతూ ఉంది.

(ఇంత జరుగుతున్నా రావణుని దగ్గరకూ అంగరక్షకులు ఎవరూ రాలేదు). సుగ్రీవుడు, రావణుడు ఆ గోపురము మీద ముష్టియుద్ధము చేస్తున్నారు. ఒకరిని ఒకరు కిందపడేసుకుంటున్నారు. మరలా లేస్తున్నారు. ఒకరిని ఒకరు గట్టిగా పట్టుకొని నలిపేసుకుంటున్నారు. పెద్దపులి సింహము మాదిరి

పోరాడుతున్నారు. ఒకరిని ఒకరు పట్టుకోడానికి గుండ్రంగా తిరుగుతున్నారు. మధ్యలో ఉన్న ఆహార పదార్థము కోసరం పోట్లాడే పిల్లులవలె పోట్లాడు కుంటున్నారు. (ఇందాక పెద్దపులి సింహము అన్నారు ఇప్పుడు పిల్లులు అంటున్నాడు. వాల్మీకి ఇలా రాయడు.) రావణుడు సుగ్రీవుడు మల్లయుద్ధము చేస్తున్నారు. చుట్టు తిరుగుతున్నారు. గిరగిరా తిరుగుతున్నారు. వంకర టింకరగా తిరుగుతున్నారు. ఇంతలో రావణుడు తన మాయాజాలాన్ని ప్రయోగించాడు. సుగ్రీవుడు ఈ విషయాన్ని పసికట్టాడు. రావణునికి అందకుండా ఆకాశంలోకి ఎగిరాడు. చేసేది లేక రావణుడు ఆకాశంలోకి చూస్తున్నాడు. సుగ్రీవుడు రావణుని మందిరము పైనుండి ఎగిరి సువేల పర్వత శిఖరము మీద ఉన్న రాముని ముందు దూకాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నలుబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## నలుబది ఒకటవ సర్గ.

రావణునితో బాహాబాహీ యుద్ధము చేసి వచ్చిన సుగ్రీవుని రాముడు కౌగలించుకున్నాడు. "సుగ్రీవా! ఏమిటా సాహసము? నాతో ఒక్కమాట కూడా చెప్పకుండా అలా పోవడమేనా! ఇటువంటి పని చేసి నన్ను లక్ష్మణుని విభీషణుని భయపెట్టావు. నీకు ఏమవుతుందో అని మేమంతా కంగారు పడ్డాము. ఇకమీదట నాకు చెప్పకుండా ఇటువంటి సాహసము చెయ్యకు. నీకు ఏమైనా అయితే నేను లంకను జయించి సీతను పొందినా, నా పక్కన లక్ష్మణుడు, విభీషణుడు ఉన్నా ఏమి

ప్రయోజనము. నీవు తిరిగి వచ్చావు కాబట్టి సరిపోయింది. నీకు ఏదైనా జరగకూడనిది జరిగి ఉంటే నేను ఈ క్షణమే రావణుని, లంకను సర్వనాశనం చేసి ఉండేవాడిని. విభీషణుని లంకకు పట్టాభిషిక్తుని చేసి ఉండేవాడిని. తరువాత భరతునికి అయోధ్యను అప్పగించి, నీ కొరకు నేను నా ప్రాణములు త్యాగము చేసి ఉండేవాడిని. నీ బలపరాక్రమములు నాకు బాగా తెలిసినా నాకు అలా అనిపించింది. అందుకని ఇంక మీదట అటువంటి సాహసములు చెయ్యకు." అనిసున్నితంగా మందలించాడు రాముడు.

సుగ్రీవుడు రాముని చూచి ఇలా అన్నాడు. "రామా! నీ భార్యను ఎత్తుకెళ్లిన ఆ రావణుని చూచిన తరువాత నాకు కోపం ఆవేశం ఆగలేదు. అక్కడికక్కడే వాడిని చంపి సీతను తీసుకొని వద్దామనుకున్నాను. కాని నీకు నియమ భంగం అవుతుందని తిరిగి వచ్చాను." అని అన్నాడు సుగ్రీవుడు.

(ఇక్కడి దాకా ఉన్న శ్లోకములు అన్నీ తరువాత చేర్చబడ్డవి అని పండితుల అభిప్రాయము. ఎందుకంటే ఈ శ్లోకములు వాల్మీకి రామాయణం ప్రాచ్యప్రతిలో లేవు.)

సువేల పర్వతము మీద ఉన్న రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! మనం లంకా నగరాన్ని చూచాము కదా. ఇంక కిందికి వెళుతాము. లక్ష్మణా! ఇంక మనము యుద్ధమునకు సిద్ధముగా ఉండవలయును. మన వానర సైన్యమును ఫలములు, నీరు సమృద్ధిగా ఉన్న ప్రదేశములో ఉండేట్టు చూడు. లక్ష్మణా! లోక నాశనమును భయాన్ని కలిగించే దుర్నిమిత్తములు కనపడుతున్నాయి. ఈ వానర సైన్యము భల్లూక సైన్యము, రాక్షస సైన్యము అంతా సమూలంగా నశించే సూచనలు

కనపడుతున్నాయి. గాలులు తీవ్రంగా వీస్తున్నాయి. భూమి కంపిస్తూ ఉంది. పర్వతముల మీది నుండి వీచే గాలి తీవ్రంగా ధ్వని చేస్తూ ఉంది. ఆకాశంనుండి రక్త బిందువులు వర్షంలాగా కురుస్తున్నాయి. సూర్య మండలము నుండి ఉల్కాపాతం జరుగుతూ ఉంది. ఆకాశం రక్తవర్ణంలో మెరుస్తూ ఉంది. మృగములు పక్షులు సూర్యుని వంక చూస్తూ వికృతంగా అరుస్తున్నాయి. చల్లని వెన్నెల కురిపించాల్సిన చంద్రుడు రాత్రిళ్లు భయంగొల్పుతున్నాడు. సూర్యుని చుట్టు నల్లని వలయము కనపడుతూ ఉంది. నక్షత్రములు గతులు తప్పుతున్నాయి. ఈ దుశ్శకునములు అన్నీ ప్రళయ కాలాన్ని సూచిస్తున్నాయి. ఈ భూమి అంతా రక్తమయం అయే కాలం సమీపించినట్టుంది. కాని యుద్ధము తప్పదు. ఎలాజరగాలో అలా జరగాలి కదా! వానరసేనలను లంకా నగరాన్ని చుట్టుముట్టమని ఆదేశాలు ఇవ్వు. ఇంక మనము కిందికి దిగుదాము." అని అన్నాడు రాముడు.

తరువాత రాముడు లక్ష్మణుడు, సుగ్రీవునితో సహా సువేల పర్వతమును దిగాడు. సుగ్రీవునితో వానర సైన్యమును సిద్ధముగా ఉండమని ఆదేశించాడు. రాముడు తన ధనుస్సును అందుకున్నాడు. లంకా నగరం వైపు నడిచాడు. రాముని వెంట లక్ష్మణుడు, విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, నలుడు,నీలుడు వెళ్లారు. వారి వెనక అపారమైన వానర సేన భల్లూక సేన నడిచింది. వానరులు భల్లూకములు తమ చేతికి ఏది అందితే అది, పెద్ద బండరాళ్లు, వృక్షములు, కొమ్మలు, పట్టుకొని ఉత్సాహంగా నడుస్తున్నారు. అందరూ లంకా నగరాన్ని సమీపించారు. వానర సేనలు లంకా నగరాన్ని చుట్టుముట్టారు.

రాముడు లక్ష్మణునితో సహా ఉత్తర ద్వారము వద్ద నిలిచి లోపలి వారు బయటకు రాకుండా అడ్డుకుంటున్నాడు. రాముని వెంట లక్షలాది

వానరులు నిలిచి ఉన్నారు.

నీలుడు, మైందుడు, ద్వివిదుడు తమతమ సేనలతో తూర్పు ద్వారమును ముట్టడించారు. అంగదుడు, గవాక్షుడు, గజుడు, గవయుడు దక్షిణ ద్వారము చేరుకున్నారు. హనుమంతుడు తన వానర సేనలతో పడమటి ద్వారము వద్ద నిలిచి ఉన్నాడు. సుగ్రీవుడు తన వానర సేనలతో సేనామధ్యంలో నిలిచి ఉన్నాడు. సుగ్రీవుని వెంట ముప్పది ఆరు కోట్ల సైనికులు నిలిచి ఉన్నారు. లక్ష్మణుడు, విభీషణుడు ఒక్కొక్క ద్వారము వద్ద కోటి మంది సైనికులను నిలిపారు. సుషేణుడు, జాంబవంతుడు తమ తమ సైన్యములతో రామునికి పడమటి దిశగా నిలబడి ఉన్నారు. వానరులు అందరూ ఆ అడవిలో ఉన్న పెద్ద పెద్ద వృక్షములను పెకలించి ఆయుధములు గా ధరించి ఉన్నారు. వారికి సహజంగా చేతి వేళ్లు, గోళ్లు, కోరలు ఆయుధములుగా ఉన్నాయి. ఆ వానరులు ఒక్కొక్కరు, పది ఏనుగులు, నూరు ఏనుగులు, వెయ్యి ఏనుగులు బలము కలవారు. ఆ వానర సైన్యమును చేస్తుంటే మిడతల దండు లంకమీద దాడి చేసిందా అన్నట్టు కనపడుతూ ఉంది.

అప్పటికి కొంత మంది వానరులు లంక చుట్టు చేరారు. కొంతమంది చేరుతున్నారు. ఒక్కొక్క యూథములో కోటి మంది వానరులు, కోటి మంది భల్లూకములు లంకకు అన్ని వైపులా నిలిచి ఉన్నాయి. వారంతా కట్టలు తెంచుకున్న సముద్రంలా లంక మీద విరుచుకుపడుతున్నారు. ఆ వానరులు అరిచే అరుపులకు, చేసే శబ్దాలకు లంకా నగరం అదిరిపోతూ ఉంది.

తరువాత రాముడు వానర మంత్రులను సేనాధి పతులను సమావేశ పరిచాడు. బాగా ఆలోచించాడు. రాజ ధర్మము ప్రకారము యుద్ధమునకు ఉపక్రమించే ముందు రావణుని వద్దకు ఒక రాయబారిని పంపడానికి నిశ్చయించుకున్నాడు. ఎవరిని రాయబారిగా పంపాలా అని విభీషణుని సలహా అడిగాడు. విభీషణుడు అంగదుని పంపమని సలహా ఇచ్చాడు. రాముడు అంగదుని పిలిచి ఇలా అన్నాడు.

"ఓ అంగదా! నీవు లంకా నగరమునకు పోయి, రావణుని సముఖమున నిలిచి ఏ భయమూ లేకుండా నేను చెప్పిన మాటలను యధాతథంగా రావణునితో చెప్పు.

"ఓరావణా! నీవు లంకా నగరానికి రాజువు. కాని మదంతో కళ్లు మూసుకు పోయి ఋషులను, మునులను, దేవతలను, గంధర్వులను, అప్సరసలను, నాగజాతిని, యక్షులను, భూలోకములో ఉన్న క్షత్రియులను నానా బాధలు పెట్టావు. పాపం మూటగట్టుకున్నావు. ఆ పాపఫలమును ఇప్పుడు అనుభవించబోతున్నావు. బ్రహ్మ దేవుడు నీకు ఇచ్చిన వర గర్వంతో విర్రవీగిన నీకు అదే వరము నీ నాశనానికి కారణం అయింది. అకారణంగా నా భార్యను నీవు అపహరించావు. ఆ తప్పుకు నీకు తగిన దండన విధించాల్సి ఉంది. నిన్ను శిక్షించుటకు నేను లంకకు వచ్చి లంకా నగర ద్వారము వద్ద నిలిచి ఉన్నాను. నీవు ఇప్పటిదాకా చంపిన వారు ఏ మార్గంలో వెళ్లారో అదే మార్గంలో వెళ్లడానికి సిద్ధంగా ఉండు. నువ్వు ఏ బలం ఏ శక్తి ఏ పరాక్రమము చూచుకొని నేను ఇంటలేని సమయంలో నా భార్యను అపహరించావో, ఆ బలపరాక్రమములు ఇప్పుడు చూపించు.

నీకు చివరి అవకాశము ఇస్తున్నాను. నీవు నా వద్దకు వచ్చి నా సీతను నాకు అప్పగించి నా శరణు వేడితే నేను నిన్ను క్షమించి వదిలిపెడతాను. లేకపోతే ఈ లోకంలో రాక్షసుడు అనే జాతి లేకుండా నాశనం చేస్తాను. నీ తమ్ముడు విభీషణుడు నా దగ్గరే ఉన్నాడు. నిన్ను చంపి విభీషణుని లంకా రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేయుటకు నిశ్చయించుకున్నాను. ఇంక మీదట నీవు లంకా రాజ్యమును పాలించే అర్హతను కోల్పోయావు. ఎందుకంటే నీ మంత్రులు నిన్ను సన్మార్గంలో నడపడం లేదు. నీకు ఆత్మనిగ్రహము, మనోనిగ్రహము లేదు. అటువంటి వాడు రాజుగా ఉండతగడు. నీకు నన్ను శరణుకోరడానికి ఇష్టం లేని పక్షంలో నాతో యుద్ధం చేసి వీరస్వర్గము పొందు. నీవు ముల్లోకములు తిరిగినను నా బాణముల బారి నుండి తప్పించుకోలేవు. నీకు మరణము తథ్యము. కాబట్టి నీవు బతికి ఉండగానే నీ శ్రాద్ధకర్మలు జరిపించుకో. నీవు చచ్చిన తరువాత నీకు అపర కర్మలు జరిపించడానికి ఎవరూ ఉండరు. నీ వారందరినీ ఒక్కసారి తనివితీరా చూచుకో. చావడానికి సిద్ధంగా ఉండు."

అంగదా ఈ మాటలు నా మాటలుగా రావణునితో చెప్పు." అని అన్నాడు రాముడు.

అంగదుడు రాముడి మాటలను శిరసావహించాడు. వెంటనే ఎగిరి లంకా నగరంలో రాముని సభాభవనమునకు చేరుకున్నాడు. సభాభవనంలోకి ప్రవేశించాడు. ఆ సమయంలో రావణుడు తన మంత్రులతో సేనానాయకులతో సభతీర్చి యుద్ధవిషయములను గురించి చర్చిస్తున్నాడు. అంగదుడు వెళ్లి రావణుని దగ్గరగా నిలబడ్డాడు.

"ఓ రావణా! నేను వాలి పుత్రుడను. నా పేరు అంగదుడు. రాముని దూతగా నీ వద్దకు వచ్చాను. రాముని గురించి నీవు విని ఉంటావు. ఆ రాముని భార్యను నీవు దొంగతనంగా అపహరించి తీసుకొని వచ్చావు. ఆ రాముడు ఇప్పుడు లంకకు వచ్చి లంకా నగర ద్వారము వద్ద నిలిచి ఉన్నాడు. ఆ రాముడు నీతో చెప్పమన్న మాటలను చెబుతున్నాను. సావధానంగా ఆలకించు.

"ఓ రావణా! నీవు లంకానగరం బయటకు వచ్చి నాతో యుద్ధం చేయి. నీ పరాక్రమాన్ని చూపించు. నిన్ను బంధు, మిత్ర, సపరివార సమేతంగా యుద్ధంలో చంపుతాను మూడు లోకాలకు రాక్షస బాధ లేకుండా చేస్తాను. నువ్వు ఇప్పటిదాకా, ఋషులకు, దేవ, దానవ, గంధర్వ, నాగ,యక్షులకు ఎన్నో కష్టములు కలుగచేసావు. ఆ పాపాలకు ఫలితం అనుభవించే కాలం వచ్చింది. నీవు వెంటనే సీతను తీసుకొని వచ్చి నాకు అప్పగించకపోతే, నీకు సర్వనాశనం తప్పదు. నీ రాజ్యము విభీషణునికి ఇవ్వక తప్పదు." అని అంగదుడు రాముని చెప్పిన మాటలను రావణునితో చెప్పాడు.

అంగదుడు చెప్పిన ఒక్కొక్క మాటా రావణుని హృదయంలో బాణాల్లా గుచ్చుకున్నాయి. "ఆ కోతిని పట్టుకోండి చంపండి." అని పెద్దగా అరిచాడు రావణుడు. వెంటనే అక్కడ ఉన్న రాక్షసులు అంగదుని గట్టిగా పట్టుకున్నారు. అంగదుడు వారితో గొడవ పడటం ఇష్టం లేక వారికి లొంగిపోయాడు. రావణుడు అంగదుని చంపమని ఆదేశించాడు. అంగదునికి కోపం వచ్చింది. తనను పట్టుకున్న రాక్షసులను పురుగులను విదిలించినట్టు విదిలించాడు. ఆకాశంలోకి ఎగిరాడు. అంగదుని పట్టుకున్న రాక్షసులు నేలమీద పడ్డారు. తరువాత అంగదుడు రావణుని సభాభవనము

మీద ఉన్న శిఖరము మీదికి ఎక్కాడు. అంగదుని వేగానికి ఆ శిఖరము కూలిపోయింది. అంగదుడు అక్కడినుండి ఆకాశంలోకి ఎగిరాడు. లంకను దాటి రాముని వద్దకు వెళ్లాడు. రాముని ముందు నిలబడ్డాడు.

తన సభాభవన ప్రాసాదము పైన ఉన్న శిఖరము కూలిపోవడం చూచి రావణుడు మనసులో కలత చెందాడు. రావణుని ప్రతి చర్య అంగదుని వల్ల విన్న రాముడు ఇంక యుద్ధము అనివార్యము అనుకున్నాడు. సుగ్రీవుడు లంకా ద్వారములను అన్నింటినీ ముట్టడించమని సుషేణుని ఆదేశించాడు. సుషేణుని ఆజ్ఞప్రకారము, వానరులు లంకకు ఉన్న నాలుగు ద్వారములు బంధించారు. సముద్రములో ఉప్పెనలా కదిలివస్తున్న వానరసేనలను చూచి రాక్షసులు భయంతో వణికిపోయారు. అప్పటి దాకా తమను చూచి భయపడే దేవతలను, గంధర్వులను, యక్షులను చూచారు గానీ, తమమీదికి ఉత్సాహంతో ఉరకలు వేస్తూ వస్తున్న వానరులను చూడ్డం ఇదే వారికి ప్రథమం. ఆ వానరుల గంభీర గర్జనలకు రాక్షసులు హాహాకారాలు చేసారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నలుబది ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నలుబది రెండవ సర్గ.

లంకా నగర ద్వారములను రక్షిస్తున్న సైనికులు పరుగుపరుగున రావణుని వద్దకు వెళ్లి వానర సేనలు లంకను ముట్టడించినవని తెలియజేసారు. వెంటనే రావణుడు నగర రక్షణకు తగిన ఏర్పాట్లు చేసాడు. ప్రాకారము మీదికి ఎక్కి వానరసైన్యమును చూచాడు. లంకా నగరమును చుట్టుముట్టిన వానర సేనలను చూచాడు రావణుడు. ఈ వానర సైన్యమును ఎలా జయించడమా అని ఆలోచనలో పడ్డాడు రావణుడు. అంతలోనే ధైర్యము తెచ్చుకున్నాడు. సకల ఆయుధములతో సుశిక్షుతులైన రాక్షసుల ముందర కేవలము రాళ్లు, కొమ్మలతో యుద్ధము చేసే వానరులు నిలబడలేరు అని ధీమాతో ఉన్నాడు రావణుడు.

వానర సైన్యమునకు సూచనలు ఇస్తున్న రాముని చూచాడు రావణుడు. రాముడు కూడా రాక్షస సైన్యములతో రక్షింపబడుతున్న లంకను తేరిపార చూచాడు. లంకను చూడగానే అందులో ఉన్న సీత గుర్తుకు వచ్చింది రామునికి. నా కొరకు కదా సీత కటిక నేల మీద నిద్రిస్తూ రాక్షసుల చెరలో ఉన్నది అని దు:ఖపడసాగాడు రాముడు. అంతలోనే తేరుకున్నాడు రాముడు. కర్తవ్యమును స్మరించుకున్నాడు. వానరులకు యుద్ధము గురించి సూచనలు అందజేస్తున్నాడు.

రాముని అనుజ్ఞ కాగానే వానరులందరూ దిక్కులు పిక్కటిల్లేటట్టు సింహనాదము చేసారు. లంకానగరమును నేలమట్టం చేస్తాము అని రంకెలు వేయసాగారు. వానరులందరూ చేతికి అందిన పెద్ద పెద్ద వృక్షములు, బండలు, శిఖరములు పెకలించి ఆయుధములుగా

చేత ధరించి ఉన్నారు. వానరు లందరూ లంక వైపు దూసుకుపోతున్నారు. ప్రాకారములను, నగర ముఖద్వారములను చేతులతోనూ వృక్షములతోనూ బండరాళ్లతోనూ పగలగొడుతున్నారు. ప్రాకారము చుట్టు ఉన్న కందకము లను చెట్లతోనూ బండలతోనూ మట్టితోనూ పూడ్చారు. వానరులు అందరూ లంకా నగరంలోకి చొచ్చుకుపోసాగారు. లంకలోని బంగారు ముఖ ద్వారములను పగులగొడుతున్నారు. ప్రాసాదములను, వాటి మీద ఉన్న శిఖరములను, గోపురములను నేలమట్టం చేస్తున్నారు. ఆ వానరులు ఎగురుతూ దుముకుతూ అరుస్తూ నగరములోకి ప్రవేశిస్తున్నారు.

వానర వీరులలో వీరబాహుడు, సుబాహుడు, నలుడు, పనసుడు అనే నలుగురు సైన్యాధిపతులు లంకా నగర ప్రాకారమును ఆక్రమించారు. కుముదుడు అనే సేనానాయకుడు తన సైన్యముతో లంకా నగరమునకు ఆగ్నేయభాగమున ఉన్న ప్రాకారమును ఆక్రమించాడు. కుముదునికి సాయంగా ప్రసభుడు, పసనుడు తమ తమ సేనలతో నిలబడ్డారు. మహావీరుడైన శతబలి ఇరువది కోట్ల వానరులతో దక్షిణ ద్వారమును, నైరుతి దిక్కున ఉన్న ప్రాకారమును అడ్డుకున్నాడు. తార తండ్రి సుషేణుడు నైరుతి ద్వారమును కోటి కోట్ల వానరములతో ఆక్రమించాడు. రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు ఉత్తర ద్వారమును ఆక్రమించారు. మహాపరాక్రమ శాలి అయిన ధూమ్రుడు రామునికి సాయంగా రాముని పక్కనే కోటి భల్లూక సేనతో నిలిచి ఉన్నాడు. గదాధారి అయిన విభీషణుడు కూడా రామునికి అండగా ఉత్తర ద్వారము వద్ద నిలబడి ఉన్నాడు. వానర శ్రేష్టులైన గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు నలువైపులా తిరుగుతూ సేనలను పర్యవేక్షిస్తున్నారు.

వానర సైన్యము లంకను నలువైపుల నుండి ముట్టడించడం చూచి రావణుడు కోపంతో ఊగి పోయాడు. తనసేనలకు వానరులను అడ్డుకొమ్మని ఆదేశాలు ఇచ్చాడు. రావణుని ఆదేశములను విన్న రాక్షసులు భయంకరంగా అరుస్తున్నారు. కేకలు వేసారు. రణభేరులను దిక్కులు మార్మోగేట్టు మోగించారు. వేల కొలది శంఖములను ఒక్కసారి పూరించారు. రాక్షస సేనలు వానరులతో యుద్ధమునకు బయలుదేరాయి. లంకా నగరము బయట వానర సేనలు లంకా నగరము లోపల రాక్షస సేనలు చేస్తున్న సింహనాదములతో మలయ పర్వతము మార్మోగిపోయింది. భేరీనినాదాలు, శంఖధ్వనులు, గజసేనలఘీంకారాలు, అశ్వముల సకిలింపులు, రధచక్రములు చేయు ధ్వనులు పదాతి దళములు అరిచే అరుపులతో లంకానగరము హోరెత్తిపోయింది.

వానర రాక్షస యుద్ధము దేవాసుర యుద్ధమును తలపిస్తూ ఉంది. రాక్షసులు వానరులను గొడ్డళ్లతోనూ. కత్తులతోనూ శూలముల తోనూ, గదలతోనూ శక్తిఆయుధముల తోనూ కొడుతున్నారు. దానికి ప్రతిగా వానరులు రాక్షసుల మీద పెద్ద పెద్ద బండ రాళ్లవర్షము కురిపిస్తున్నారు. ఒక్కొక్కక వానరుడు పర్వతశిఖరములను పెద్ద పెద్ద వృక్షములను పెళ్లగించి తెచ్చి రాక్షసుల మీద పడవేస్తున్నారు. ప్రాకారము మీద నిలబడ్డ రాక్షస వీరులు రావణునికి జయజయధ్వానాలు పలుకుతూ వానరులను చించి చెండాడుతున్నారు. దానికి కోపించిన వానరులు ప్రాకారముల మీదికి ఎగిరి అక్కడ నిలబడి ఉన్న రాక్షసులను తమ వాడి గోళ్లతో చీలుస్తున్నారు. ఆ విధంగా జరుగుతున్న యుద్ధములో రాక్షసుల, వానరుల రక్తముతో తడిసి నేల అంతా బురద బురద అయింది.

శ్రీమద్రామాయణము యుద్ధకాండము నలుబది రెండవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్. ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నలుబది మూడవ సర్గ.

ఆ ప్రకారంగా వానరులకు రాక్షసులకు ఘోరంగా యుద్ధం జరుగుతూ ఉంది. రాక్షస సేనలో ఉన్న రాక్షసులకు గుర్రములు, ఏనుగులు, రథములు, కవచములు ఉన్నాయి. కాని వానరములకు ఇవేమీ లేవు. వారికి సహజమైన గోళ్లు కోరలు ఉన్నాయి. తరువాత పెద్ద పెద్ద బండరాళ్లు, వృక్షములు, వారి ఆయుధములు. వానరులు రాక్షసులు ముఖాముఖి పోరాడుతున్నారు.ఒకరితో ఒకరు ద్వంద్వయుద్ధము చేస్తున్నారు.

అంగదునితో అంధకాసురుడు అనే వాడు ద్వంద్వయుద్ధము చేస్తున్నాడు. సంపాతి అనే వానరుడు ప్రజంఘుడు అనే రాక్షసుడితోయుద్ధం చేస్తున్నాడు. హనుమంతుడు జంబుమాలితో యుద్ధం చేస్తున్నాడు. విభీషణుడు శత్రుఘ్నుడు అనే రాక్షస వీరునితో యుద్ధము చేస్తున్నాడు. గజుడు అనే వానర వీరుడు తపసుడు అనే రాక్షస వీరునితో యుద్ధం చేస్తున్నాడు. నీలుడు అనే వానర వీరుడు నికుంభుడు అనే రాక్షస వీరునితో యుద్ధం చేస్తున్నాడు. సుగ్రీవునితో ప్రఘసుడు, లక్ష్మణునితో విరూపాక్షుడు అనే రాక్షసుడు యుద్ధం చేస్తున్నాడు. అగ్నికేతువు, రశ్మికేతువు, మిత్రఘ్నుడు, యజ్ఞకోపుడు అనే రాక్షసులు ఒక్కుమ్మడిగా రామునితో యుద్ధానికి తలపడ్డారు. మైందుడు అనే వానర శ్రేష్టునితో వజ్రముష్టి అనే రాక్షసుడు, ద్వివిదుడు అనే వానరునితో అశనిప్రభుడు అనే రాక్షసుడు యుద్ధం చేస్తున్నారు. ప్రతపనుడు అనే రాక్షస వీరుడు నలునితో యుద్ధం చేస్తున్నాడు. సుషేణుడు అనే వానర వీరుడు విద్యున్మాలితో యుద్ధం చేస్తున్నాడు.

వీరు కాకుండా మిగిలిన వానరులు కూడా ఒక్కొక్క రాక్షసునితో ద్వంద్వయుద్ధము చేస్తున్నారు. రాక్షసులు వానరుల మధ్య ఆ విధంగా యుద్ధం జరుగుతూ ఉంది. రాక్షసులు, వానరుల శరీరముల నుండి కారుతున్న రక్తము ఏరులై ప్రవహిస్తుంటే, ఆ రక్తప్రవాహంలో రాక్షసుల, వానరుల శరీరాలు కొట్టుకుపోతున్నాయి.

ఇంద్రజిత్తు తన గదతీసుకొని అంగదుని కొట్టాడు. అంగదుడు ఆ వేటును తప్పుకొని, ఇంద్రజిత్తు రథమును విరిచాడు. రథమునకు కట్టిన గుర్రములను, రథసారథికి చంపాడు. జంబుమాలి తన రథము మీద నిలబడి యుద్ధము చేస్తున్నాడు. జంబుమాలి శక్తి అనే ఆయుధముతో హనుమంతుని వక్షస్థము పగిలేటట్టు కొట్టాడు. వెంటనే హనుమంతుడు ఒక్క ఎగురు ఎగిరి జంబుమాలి రథము మీద ఎక్కి, రథసారధిని చంపాడు. రథాన్ని విరిచాడు. తన అరిచేత్తో జంబుమాలిని ఒక్క చరుపు చరిచాడు. ఆ దెబ్బకు జంబుమాలి రక్తం కక్కుకొని చచ్చాడు.

రాక్షసవీరుడైన ప్రతపనుడు పెద్దగా గర్జిస్తూ నలుని మీదికి పరుగెత్తాడు. అప్పుడు నలుడు ప్రతపనుడి కళ్లు పొడిచాడు. ప్రఘసుడుఅనే రాక్షసవీరుడు వాడి అయిన బాణములతో సుగ్రీవుని శరీరం అంతా కొట్టాడు. సుగ్రీవుడు ఒక వృక్షమును పెకల్చి ఆ రాక్షసుడు మీదికి విసిరాడు. ఆ వృక్షము కిందపడి ప్రఘసుడు మరణించాడు. లక్ష్మణుడు ఒకేఒక్క బాణంతో విరూపాక్షుడు అనే రాక్షసుని యమపురికి పంపాడు. తమ తమ బాణ పరంపరలతో అగ్నికేతువు, రశ్మికేతువు, మిత్రఘ్నుడు, యజ్ఞకోపుడు అనే రాక్షసులు రాముడిని కొట్టారు. దానికి బదులుగా రాముడు ఆ నలుగురురాక్షసుల శిరస్సులను నాలుగు శరాఘాతములతో ఛేదించాడు.

మైందుడు అనే వానరుడు తన పిడికిలితో వజ్రముష్టి అనే రాక్షసుడు కూలదోసాడు. నికుంభుడు అనే రాక్షసుడు నీలుడు అనే వానర వీరుడిని తన బాణములతో కొట్టాడు. అంతే కాకుండా నీలుడి మీద నూరు బాణములను ప్రయోగించి అట్టహాసంగా అరిచాడు. నీలుడు నికుంభుని రథమును విరిచి, ఆ రథచక్రముతోనే నికుంభుని, అతని రథసారథిని చంపాడు. ద్వివిదుడు అనే వానర ప్రముఖుడు ఒక పెద్ద పర్వత శిఖరముతో అశనిప్రభుడు అనే రాక్షసుని కొట్టాడు. అప్పుడు ఆ రాక్షసుడు తన బాణములతో ద్వివిదుని కొట్టాడు. ద్వివిదుడు ఒక పెద్ద వృక్షమును పెకలించి ఆ వృక్షముతో ద్వివిదుని రథమును విరిచి, రథసారథిని, రథమునకు కట్టిన గుర్రములను చంపాడు. తరువాత అదే వృక్షముతో అశనిప్రభుణ్ణి కూడాచంపాడు.

విద్యున్మాలి అనే రాక్షస వీరుడు తన రథము మీది నుండి సుషేణుడి మీద బాణవర్షము కురిపించాడు. సుషేణుడు ఒక పెద్ద పర్వత శిఖరము తీసుకొని దానితో విద్యున్మాలి రథమును విరిచాడు. అప్పుడు విద్యున్మాలి రథమునుండి కిందికి దూకి, గదాయుధము తీసుకున్నాడు. సుషేణుడు ఒక పెద్ద బండరాయిని తీసుకొని విద్యున్మాలి మీదికి వెళ్లాడు. విద్యున్మాలి తన గదతో సుషేణుడి గుండెల మీద కొట్టాడు. సుషేణుడు ఆ గదాఘాతమును లక్ష్యపెట్టక, తన చేతిలోని బండరాయితో విద్యున్మాలి గుండెల మీద మోదాడు. ఆ బండరాయి మీద పడగానే విద్యున్మాలి కింద పడ్డాడు. ఆ రాతి కిందపడి నలిగిపోయి మరణించాడు.

ఆ ప్రకారంగా వానరులు, రాక్షసులు దేవ దానవుల మాదిరి యుద్ధం చేసుకుంటున్నారు. రణరంగం అంతా వానరులు, రాక్షసుల మృత

దేహాలతో నిండి పోయింది. ఆ రణరంగంలో చచ్చి పడిన మృతదేహము లను తినడానికి నక్కలు, తోడేళ్లు గుంపుగుంపులుగా వస్తున్నాయి. ఇంతలో సూర్యాస్తమయము అయింది.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నలుబది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## నలుబది నాలుగవ సర్గ.

ఆ ప్రకారంగా వానరులకు రాక్షసులకు ఘోరంగా యుద్ధం జరుగుతున్న సమయంలో సూర్యుడు అస్తమించాడు. సాధారణంగా మానవులు రాత్రిళ్లు యుద్ధం చేయరు. కానీ, వానరులు రాక్షసులు రాత్రియుద్ధానికి సంసిద్ధం అయ్యారు. రాత్రి సమయంలో గాఢంగా చీకటి అలుముకుంది. ఆ చీకట్లో ఎవరెవరో కనిపించడం లేదు. అందుకని రాక్షసులు ఎదుటి వాడు వానరుడని " నువ్వు వానరుడవు చావు" అంటూ చంపుతున్నారు. అలాగే వానరులు కూడా "నువ్వు రాక్షసుడవు చావు" అంటూ చంపుతున్నారు. కాని ,చీకట్లో ఎవరెవరో గుర్తు తెలియక, రాక్షసులు రాక్షసులను, వానరులు వానరులను, వారిని వారే చంపుకుంటున్నారు అన్న సంగతి వారికి తెలియదు. ఎంత సేపటికీ చంపు, కొట్టు, పారిపోకు, నిలువు అంటూ అరుపులు కేకలు వినబడుతున్నాయి.

రాక్షసులు నల్లగా ఉండి చీకట్లో కలిసిపోతున్నారు. వారు ధరించిన బంగారు కవచములు మాత్రం తళా తళా మెరుస్తున్నాయి.

కవచాలు అటు ఇటు తిరుగుతున్నాయా అన్నట్టు ఉంది ఆ యుద్ధభూమిలో. ఇంతలో కొంతమంది రాక్షసులు వానరులపై బడి వారిని చంపి తినసాగారు. ఇది చూచిన వానరులు రాక్షసులపైబడి వారిని చీలుస్తున్నారు, వారు ఎక్కిన గుర్రములను ఏనుగులను చంపుతున్నారు. ఆ దెబ్బకు రాక్షస సైన్యము కకావికలైంది. ఏనుగులను హయములను వానరులు తమ గోళ్లతో చీలుస్తూ, పళ్లతో కొరుకుతుంటే అవి కుయ్యోమని అరుస్తూ ఇష్టం వచ్చినట్టు పరుగెడుతున్నాయి. రాముడు లక్ష్మణుడు తమ బాణములతో రాక్షసులను విచక్షణా రహితంగా చంపుతున్నారు. అటు రాక్షసులు, ఇటు వానరులు యుద్ధములో మరణించగా వారి శరీరముల నుండి కారిన రక్తము వరదగా ప్రవహిస్తూ ఉంది. ఎవరికి వారు తాము గెలిచామని భేరీలు, మృదంగములు, పణవములు వాయిస్తున్నారు. శంఖములు ఊదుతున్నారు. ఆ రాత్రి అంతా వానరులు రాక్షసులు ఒకరిని ఒకరు, తమలో తాము, తమవారిని తామే చంపుకుంటున్నారు.

అంతటి చీకట్లో కూడా కొంత మంది రాక్షసులు తమ బాణములను రాముని మీద ప్రయోగించారు. రాముడు కోపించి వాడి అయిన ఆరు బాణములతో ఆ రాక్షసులను కొట్టాడు. యజ్ఞశత్రువు, మహాపార్శ్వుడు, మహోదరుడు, వజ్రదంష్ట్రుడు, శుకుడు, సారణులు అనే ఆ రాక్షసులు రాముని బాణముల దెబ్బలు తిని బతకాలని ఆశతో యుద్ధరంగము నుండి పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు. రాముడు అంతటితో ఊరుకోకుండా అగ్నిజ్వాలల వంటి తన బాణములతో రాక్షససేనలను సర్వనాశనం చేసాడు. రాముడికి ఎదురుగా వచ్చిన ఏ రాక్షసుడూ ప్రాణాలతో బయటపడలేదు. ఆ చీకట్లో రామ బాణములు ఎగురుతూ వచ్చి రాక్షసులను చంపుతుంటే, కాళరాత్రిలో మిణుగురు పురుగులు ఎగురుతున్నట్టు ఉంది.

మహా పరాక్రమ వంతుడైన రావణ కుమారుడు ఇంద్రజిత్తును అంగదుడు ఎదిరించాడు. అంగదుడు ఇంద్రజిత్తు ఎక్కిన రథమును విరుగగొట్టాడు, రథ సారథిని, అశ్వములను చంపాడు. చేసేది లేక ఇంద్రజిత్తు తనమాయచే అంతర్ధానముచెంది యుద్ధభూమి నుండి పారిపోయాడు. ఇంద్రజిత్తును చిత్తు చేసిన అంగదుని రామలక్ష్మణులు, విభీషణుడు ప్రశంసించారు. ఇంద్రజిత్తు లాంటి వాడిని ఓడించిన అంగదుని వానరవీరులందరూ పొగిడారు.

ఒక వానరుని చేతిలో ఓడిపోయిన ఇంద్రజిత్తు కోపంతో ఊగిపోయాడు. అతడు మాయా యుద్ధం చేయడం మొదలెట్టాడు. ఎవరికీ కనపడకుండూ వానరుల మీద బాణ వర్షము కురిపిస్తున్నాడు. ఘోరమైన విషసర్పములు ఆవాహనము చేయబడిన ఇంద్రజిత్తు బాణములు వానరులను, రామలక్ష్మణులను బాధించాయి. వారి చర్మాన్ని చీల్చాయి. ఇంద్రజిత్తు ఎవరికీ కనపడకపోవడం వల్ల అతని మీద బాణములు వదలడం వీలు కావడం లేదు. ఈ లోపల ఇంద్రజిత్తు తన సర్పశరములతో రామలక్ష్మణులను బంధించాడు. రామలక్ష్మణులను ఎదురుగా నిలబడి యుద్ధం చేసే శక్తి లేక, ఇంద్రజిత్తు, మాయా యుద్ధంలో రామలక్ష్మణులను తన సర్పశరములతో బంధించాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నలుబది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నలుబది ఐదవ సర్గ.

తనతో యుద్ధమే చేసి పారిపోయిన ఇంద్రజిత్తును జాడ తెలుసుకొని రమ్మని పదిమంది వానరులను పంపాడు రాముడు. రాముని ఆజ్ఞ మేరకు సుషేణుని కుమారులు ఇద్దరు, నీలుడు, అంగదుడు, శరభుడు, ద్వివిదుడు, హనుమంతుడు, సానుప్రస్థుడు, ఋషభుడు, ఋషభస్కంధుడు ఇంద్రజిత్తును వెదుకడానికి వెళ్లారు. వారు పెద్ద పెద్ద వృక్షములను ఆయుధములుగా ధరించి నలుదిక్కులు వెదుకుతూ ఆకాశంలోకి ప్రవేశించారు. కాని వారికి ఇంద్రజిత్తు కనపడలేదు. కాని ఇంద్రజిత్తు ప్రయోగించిన నారాచబాణములు ఆ వానరులను గాయపరచసాగాయి. అసలే చీకటి. అందులో ఇంద్రజిత్తు మాయావి. మాయా యుద్ధము చేస్తున్నాడు.

తరువాత ఇంద్రజిత్తు ఈ వానరులను వదిలి తన బాణములను రాముని మీద లక్ష్మణుని మీద ప్రయోగించాడు. రామలక్ష్మణుల శరీరములలో గుచ్చుకొనేటట్టు సర్పరూపబాణములు ప్రయోగించాడు ఇంద్రజిత్తు. రామలక్ష్మణుల శరీరాలు ఇంద్రజిత్తు కొట్టిన బాణములతో నిండిపోయాయి. ఇంద్రజిత్తు రామలక్ష్మణులతో వారికి కనపడకుండా ఇలా అన్నాడు. “ఓ నరులారా! నేను మాయాయుద్ధము చేస్తుంటే సాక్షాత్తు దేవేంద్రుడు కూడా తట్టుకోలేడు. ఇంక మానవులు మీరెంత? మీరు నా ముందు నిలువలేరు. ఇప్పుడే మీ ఇద్దరినీ నా బాణములతో కొట్టి యమపురికి పంపుతాను.” అని పలికిన ఇంద్రజిత్తు వాడి అయిన బాణములతో రామలక్ష్మణులతో మర్మస్థానములలో కొట్టాడు. రామ లక్ష్మణులను శరబంధనము చేసాడు ఇంద్రజిత్తు. తరువాత సింహనాదము చేసాడు.

రామలక్ష్మణుల దేహములు ఇంద్రజిత్తు ప్రయోగించిన సర్ప బాణములతో కప్పబడి పోయింది. రామలక్ష్మణులు నేల మీదికి ఒరిగిపోయారు. రామలక్ష్మణుల శరీరంలో బాణములు గుచ్చుకోని ప్రదేశము అంగుళము మాత్రము కూడా లేదు. ఇంద్రజిత్తు రామలక్ష్మణుల శరీరాలు తూట్లుపడేటట్టు కొట్టాడు. రామలక్ష్మణుల శరీరములలో నుండి రక్తము ధారగా ప్రవహిస్తూ ఉంది. రాముడు కింద పడి పోయిన తరువాత కూడా ఇంద్రజిత్తు రాముని నారాచములు, అర్ధనారాచములు, భల్లములు, అంజలికములు, వత్సదంతములు, సింహదంష్ట్రములు, క్షురములు అనే బాణములతో కొట్టాడు. ఆ బాణముల దెబ్బలకు రాముడు కిందపడపడగానే రాముని చేతిలోని విల్లు కూడా ఎగిరి అల్లంతదూరంలో పడింది. రాముడు వీరశయనము అలంకరించాడు.

రాముడు పడిపోవడం చూచి లక్ష్మణుడు దు:ఖించాడు. రామలక్ష్మణులకు పట్టిన దుస్థితి చూచి వానర సేనానాయకులు శోకించ సాగారు. అందరూ పెద్దగా ఏడుస్తున్నారు. హనుమంతుడు, సుగ్రీవుడు, జాంబవంతుడు మొదలగు వానరవీరులు రామలక్ష్మణుల చుట్టు నిలబడి శోకిస్తున్నారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నలుబది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# యుద్ధకాండము

## నలుబది ఆరవ సర్గ.

ఒళ్లంతా బాణము దెబ్బలతో పడి ఉన్న రామలక్ష్మణులను చూచిన వానరులకు ఏమి చెయ్యాలో తోచడం లేదు. రామలక్ష్మణులను పడగొట్టి ఇంద్రజిత్తు వెళ్లిపోయిన తరువాత సుగ్రీవుడు, విభీషణుడు అక్కడకు వచ్చారు. వారు రామలక్ష్మణులను చూచి దు:ఖించారు. నీలుడు, ద్వివిదుడు, మైందుడు, సుషేణుడు, కుముదుడు, అంగదుడు, హనుమంతుడు రామలక్ష్మణుల పక్కనే నిలబడి ఉన్నారు. వారి దు:ఖానికి అంతులేదు. రామలక్ష్మణులకు ఊపిరి తీసుకోడం కూడా కష్టంగా ఉంది. శరీరం అంతా బాణములు తగలడం వల్ల వారు అటు ఇటు కదలలేకపోతున్నారు. విభీషణునికి కూడా ఏమి చెయ్యాలో తోచడం లేదు.

విభీషణుడు కూడా రాక్షసుడే కాబట్టి ఇంద్రజిత్తు మాయలన్నీ విభీషణునికి తెలుసు. అదే మాయను ప్రయోగించి ఇంద్రజిత్తు కోసం వెదికాడు. ఇంద్రజిత్తు రామలక్ష్మణులను పడగొట్టి నందుకు మహదా నందంగా ఉన్నాడు. రాక్షసులందరితో ఇలా అంటున్నాడు. "ఓ రాక్షస వీరులారా! నేను రామలక్ష్మణులను వీరశయనం పొందేట్టు చేసాను. ఖరదూషణులను సంహరించిన రాముడు నా చేత చంపబడ్డాడు. దేవతలుకానీ, అసురులుకానీ, ఋషులు కానీ రామలక్ష్మణులను నా శరబంధము నుండి విడిపించలేరు. ఈ రామలక్ష్మణుల వలననే నా తండ్రి రావణుడు నిద్రాహారాలు మాని వీరి గురించి ఆలోచిస్తున్నాడు. ఆ రామలక్ష్మణులను నేను చంపి నా తండ్రిని బాధావిముక్తుడిని చేసాను. ఇంక ఈ రామలక్ష్మణుల పరాక్రములు, వానరవీరుల పరాక్రములు వృధా అయ్యాయి." అని గట్టిగా పలికాడు.

తరువాత ఇంద్రజిత్తు మరలా మాయాయుద్ధము చేయ నారంభించాడు. వానర సేనానాయకులను తన వాడిఅయిన బాణములతో కొట్టాడు. బాణాలు ఎటునుండి వస్తున్నాయో తెలియని వానర వీరులు కంగారు పడుతున్నారు. బాణాల దెబ్బలకు బలి అవుతున్నారు. ఇంద్రజిత్తు నీలుడిని తొమ్మిది బాణములతోనూ, మైందుడిని, ద్వివిదుడిని, ఒక్కొక్కరిని మూడు బాణములతోనూ కొట్టాడు. జాంబవంతుడి వక్షస్థలాన్ని ఒకే ఒక బాణంతో చీల్చాడు. హనుమంతుని వక్షస్థలమును పదిబాణములతో కొట్టాడు. గవాక్షుడిని, శరభుడిని రెండేసి బాణములతో కొట్టాడు. అంత క్రితం తనను ఓడించిన అంగదుని మీద విరివిగా బాణాలు ప్రయోగించాడు ఇంద్రజిత్తు. ఆ ప్రకారంగా వానరవీరులను తన వాడిఅయిన బాణములతో గాయపరిచి సంహనాదము చేసాడు ఇంద్రజిత్తు. వానరుల దుస్థితి చూచి ఇంద్రజిత్తు వికటాట్టహాసం చేసాడు.

"ఓ రాక్షసులారా!చూడండి. రాముడు లక్ష్మణులను నా శరబంధంలో బంధించాను. చూడండి ఎలా స్పృహలేకుండా పడి ఉన్నారో!"అని పెద్దగా అరిచాడు. శరబంధంలో పడి ఉన్న రామలక్ష్మణులను చూచి రాక్షసులు సంతోషించారు వారు కూడా సింహనాదములుచేసారు. రాముడిని ఇంద్రజిత్తు చంపాడు అని తెలుసుకొని అందరూ ఇంద్రజిత్తును ప్రశంసించారు. ఇంద్రజిత్తు రామలక్ష్మణుల వంక చూచాడు. రామలక్ష్మణులు ఊపిరి తీసుకోడం లేదు. వారిద్దరూ మరణించారు అని నిర్ధారణ చేసుకున్నాడు ఇంద్రజిత్తు. విజయ దుందుభులు మోగించుకుంటూ, జయజయధ్వానాలు చేసుకుంటూ లంకానగరంలోకి ప్రవేశించాడు ఇంద్రజిత్తు.

చలనం లేకుండా పడి ఉన్న రామలక్ష్మణులను చూచిన సుగ్రీవునికి ఒళ్లంతా భయం ఆవహించింది. కళ్లనిండా నీళ్లు కమ్మాయి. దీనంగా రాముని వంక చూస్తున్నాడు. అటువంటి స్థితిలో ఉన్న సుగ్రీవుని చూచి విభీషణుడు ఇలా అన్నాడు.

"అదేమిటి సుగ్రీవా! ఈ మాత్రం దానికే భయపడితే ఎలా. యుద్ధం అంటే ఇలాగే ఉంటుంది. జయాపజయాలు దైవాధీనాలు కదా! మనం అదృష్టవంతులము అయితే రామలక్ష్మణులకు స్పృహ వస్తుంది. రాముడు సత్యవంతుడు. ధర్మాత్ముడు. అటువంటి రామునికి మృత్యు భయము లేదు. ధైర్యంగా ఉండు." అని తన చేత్తో సుగ్రీవుని కన్నీళ్లు తుడిచాడు విభీషణుడు.

"సుగ్రీవా! ఇది దు:ఖించుటకు సమయము కాదు. దు:ఖము అన్ని కార్యములను నాశనం చేస్తుంది. కాబట్టి దు:ఖాన్ని వదిలిపెట్టు. చేయవలసిన పనులను ఎలాచెయ్యాలో ఆలోచించు. సైన్యములకు తగిన ఆదేశాలు ఇవ్వు. సైన్యములో విశ్వాసాన్ని ఉత్సాహాన్ని రేకెత్తించు. రామలక్ష్మణులకు స్పృహ వచ్చేంత వరకూ వారిని మనము రక్షించాలి. తరువాత రామలక్ష్మణులు మనలను రక్షిస్తారు. అటుచూడు. రాముని ముఖంలో కాంతి ఇంకా అలాగే ఉంది. రాముడికి తప్పకుండా స్పృహ వస్తుంది. మరణము సంభవించిన వారి ముఖంలో ఇటువంటి కాంతి ఉండదు. కాబట్టి రాముడు మరణించలేదు. కాబట్టి ముందు నీవు పోయి రాముడు మరణించలేదు అని చెప్పి సేనలలో విశ్వాసాన్ని ఉత్సాహాన్ని కలిగించు." అని అన్నాడు.

సుగ్రీవుడు విభీషణుడు చెప్పిన మాదిరి "రాముడు మరణించలేదు, బతికే ఉన్నాడు" అని ప్రచారం చేసి, సైనికులలో నూతన ఉత్సాహాన్ని నింపడానికి ప్రయత్నించాడు.

అక్కడ లంకానగరంలో ఇంద్రజిత్తు జయజయధ్వానాలతో తన తండ్రి రావణుని వద్దకు వెళ్లాడు. రాముడు ఇంద్రజిత్తు చేతిలో మరణించాడు అన్న వార్త విన్న రావణుడు మహదానందభరితుడయ్యాడు. ఇంతలో ఇంద్రజిత్తు తండ్రి వద్దకు పోయి నమస్కరించి "తండ్రీ! నేను రామ లక్ష్మణులను చంపాను" అని చెప్పాడు. రావణుడు సింహాసనము నుండి ఒక్క ఉదుటున పైకి లేచి కిందికి దిగివచ్చి ఇంద్రజిత్తును గాఢంగా కౌగలించుకున్నాడు. అతని శిరస్సును మూర్కొని "కుమారా! నిజమా! రామలక్ష్మణులు మరణించారా! ఎంతటి శుభవార్త చెప్పావు. ఇంతకూ రామలక్ష్మణులను ఎలా చంపావు?" అని అడిగాడు రావణుడు. ఇంద్రజిత్తు తాను రాముని లక్ష్మణులను వాడి అయిన బాణములతో శరీరం అంతా తూట్లుపడేట్టు ఎలా కొట్టిందీ, ఎలా శరబంధనం చేసిందీ వివరంగా చెప్పాడు. ఇంద్రజిత్తు మాటలు విన్న రావణుడు ఎంతో సంతోషించాడు. ఇంద్రజిత్తును మనసారా అభినందించాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నలుబది ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నలుబది ఆరవ సర్గ.

వానర వీరులు అందరూ రాముని చుట్టు చేరి రామునికి రక్షణ వలయంగా నిలబడ్డారు. వానర సేనలకు అధిపతులైన హనుమంతుడు, అంగదుడు, నీలుడు, సుషేణుడు, కుముదుడు, నలుడు, గజుడు, గవాక్షుడు, పసనుడు, సానుప్రస్థుడు, జాంబవంతుడు, ఋషభుడు, సుందుడు, రంభుడు, శతబలి, పృథుడు మొదలగు సైన్యాధిపతులు తమ తమ వానర, భల్లూ సేనలను యుద్ధానికి సన్నద్ధం చేసారు. ఏ మాత్రం కదలిక కలిగినా అప్రమత్తంగా ఉన్నారు.

అక్కడ లంకలో రావణుడు విజయోత్సాహంతో వచ్చిన ఇంద్రజిత్తును అభినందించి పంపివేసాడు. తరువాత అశోక వనములో సీతకు కాపలా కాస్తున్న రాక్షస స్త్రీలను పిలిపించాడు. త్రిజట ఆధ్వర్యంలో రాక్షస స్త్రీలు రావణుని వద్దకు వచ్చారు. రావణుడు మహా సంతోషంగా ఉన్నాడు. రాక్షస స్త్రీలతో ఇలా అన్నాడు. "జాగ్రత్తగా వినండి. రాముడు, నా కుమారుడు ఇంద్రజిత్తు చేతిలో చంపబడ్డాడు. ఈ విషయం సీతకు తెలియజేయండి. సీతను మీరందరూ పుష్పక విమానము ఎక్కించి, రాముని వద్దకు తీసుకొని వెళ్లండి. ఆకాశం నుండి రాముని శవాన్ని ఆమెకు చూపించండి. రాముని శవంతో పాటు లక్ష్మణుని శవం కూడా సీతకు చూపించండి. ఇంత కాలమూ ఎవరు వచ్చి తనను రక్షిస్తారు అని సీత అనుకుంటూ ఉందో, ఆ రాముడు, ఆ లక్ష్మణుడు యుద్ధములో చంపబడ్డారు అని తెలియజెయ్యండి. ఇంక సీతకు నేను తప్ప నాధుడు లేడు. అందుకని సీతను బాగా అలంకరించి నా వద్దకు తీసుకొని రండి. రాముడు చని పోయిన తరువాత సీత తనంతట తానే నా వద్దకు వస్తుందని నాకు

నమ్మకం ఉంది. చనిపోయిన రామలక్ష్మణులను చూచిన సీతకు నేను తప్ప వేరే గత్యంతరము లేదు కాబట్టి నన్ను చేరడం నిజం."అని అన్నాడు రావణుడు. రావణుని మాటలు శ్రద్ధగా విన్న ఆ రాక్షస స్త్రీలు అలాగే చేస్తాము అని చెప్పి బయటకు వచ్చారు.

రావణుని ఆదేశము మేరకు సీతను పుష్పక విమానములో ఎక్కించుకొని, రాముడు పడి ఉన్న చోటికి తీసుకొని వెళ్లారు. అప్పటికే రావణుడు "రాముని ఇంద్రజిత్తు యుద్ధంలో చంపాడు" అన్న రాముని మరణ వార్తను లంకా నగరం అంతా తెలిసేటట్టు ఘోషణ చేయించాడు. ఊరంతా పతాకములతో అలంకరింప చేసాడు. యుద్ధం ముగిసి పోయిందని రాక్షసులు ఉత్సవాలు జరుపుకుంటున్నారు.

ఇదంతా చూస్తూ సీత పుష్పక విమానములో రాముడు పడి ఉన్న ప్రదేశమునకు వెళ్లింది. యుద్ధభూమిలో చచ్చి పడి ఉన్న వానర వీరులను చూచింది. యుద్ధ రంగములో కేరింతలు కొట్టుకుంటూ ఉత్సవాలు జరుపుకుంటున్న రాక్షసులను, విషాదవదనములతో ఉన్న వానరులను చూచింది. శరీరం అంతా బాణములతో కొట్టబడి నేల మీద పడి ఉన్న రాముని చూచింది సీత.

రామునికి స్పృహ లేదు. నిర్జీవంగా పడి ఉన్నాడు. లక్ష్మణుడు కూడా పక్కనే పడి ఉన్నాడు. వారి ధనుస్సులు దూరంగా పడి ఉన్నాయి. వారి శరీరాలు శరతల్పము మీద ఉన్నాయి.

శరతల్పము మీద పడి ఉన్న రామలక్ష్మణులను చూచి సీత ఘోరున విలపించింది. ఆమె శోకమునకు అంతులేకుండా పోయింది. రామలక్ష్మణులు మరణించినారు అని తెలుసుకున్న సీత శోకసముద్రంలో మునిగిపోయింది. ఏడుస్తూనే త్రిజటతో ఇలా అంది.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నలుబది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నలుబది ఎనిమిదవ సర్గ.

రాముడు, లక్ష్మణుడు అచేతనంగా పడి ఉండడం చూచిన సీత వారు మృతి చెందారని భ్రమించింది. దీనంగా ఏడ్చింది. "అయ్యో భగవంతుడా! నా చిన్నతనంలో నా జాతకము చూచిన జ్యోతిష్కులు నాకు పుత్ర సంతానము కలుగుననియూ, నాకు వైధవ్యములేదనియూ చెప్పి ఉన్నారు కదా! మరలా ఇదేమి ఘోరము. నా రాముడు నన్ను విడిచి వెళ్లిపోయాడు. ఆ పండితులు జ్యోతిష్యులు చెప్పిన మాటలు అన్నీ అసత్యములు అయినట్టే కదా! అదే జ్యోతిష్కులు నేను గొప్ప గొప్ప యజ్ఞములు యాగములు చేసిన మహారాజు కు భార్యను అవుతాను అని చెప్పారు. కాని నా రాముడు అకాల మరణం చెందడంతో అవన్నీ అబద్ధాలు అయినట్టే కదా!

వీరుల భార్యలందరిలోనూ నేను అత్యంత గౌరవానికి పాత్రురాలను అగుదును అని పండితులు చెప్పారు కదా. మరి ఆ మాటలన్నీ

వమ్ముఅయ్యాయా! వారు అసత్యం చెప్పారా! నేను నమస్కరించిన పండితులు దైవజ్ఞులు అందరూ అఖండ సౌభాగ్యవతి అని నన్ను దీవించారు కదా! మరి ఆ దీవనలన్నీ వృధా అయినట్టేనా! రాముని మరణంతో నా సౌభాగ్యము మంటగలిసినట్టేనా! నా పాదములలో పద్మములు ఉన్నాయనీ, నన్ను వివాహమాడిన వారు చక్రవర్తి అవుతారనీ సాముద్రిక వేత్తలు చెప్పారు కదా! మరి ఆ శుభలక్షణములు అన్నీ నా నుండి మాయం అయి పోయాయా! లోకములో వైధవ్యమును పొంద దగిన స్త్రీలకు ఉండవలసిన లక్షణములు ఏ ఒక్కటి కూడా నాలో మచ్చుకైనా కనిపించవు కదా! మరి నాకు ఈ అకాల వైధవ్యము ఎందుకు ప్రాప్తించినది! మరి నా శరీరములో అఖండ సౌభాగ్యవతికి ఉండవలసిన సాముద్రిక లక్షణములు అన్ని ఎక్కడ ఉండవలసినవి అక్కడ ఉన్నాయి కదా! మరి అవి అన్నీ వృధా అయిపోయినట్టేనా! నా కేశములు, నా శరీర భాగములు, నా నేత్రములు, చేతులు, కాళ్లు, మడిమలు, అన్నీ శుభలక్షణములతో కూడి ఉన్నవి కదా! మరి ఆ శుభలక్షణములు అన్నీ ఎక్కడకు పోయాయి. నాకు ఈ వైధవ్యము ఎందుకు వచ్చింది. నేను నా భర్తతో కలిసి చక్రవర్తి పీఠమును అలంకరిస్తాను అని జ్యోతిష్కులు చెప్పారు కదా! మరి వారి మాటలన్నీ వమ్మయిపోయాయా!

నా కొరకు జనస్థానము నుండి వెదుకుతూ వచ్చి, సముద్రమును దాటిన రాముడు, సాగరమును దాటి ఆవు పాదమంత గుంటలో పడ్డట్టు ఈ దుష్టుడి చేతిలో మరణించాడు కదా! రామలక్ష్మణుల వద్ద వారుణాస్త్రము, ఆగ్నేయాస్త్రము, ఇంద్ర అస్త్రము, వాయవ్యాస్త్రము, బ్రహ్మశిరోనామకాస్త్రము ఇంకా ఎన్నో దివ్యాస్త్రములు ఉన్నాయి కదా. మరి ఆ అస్త్రములు అన్నీ ఏమయిపోయాయి. అవునులే కనపడ్డ వారి మీద

అస్త్రములు ప్రయోగించవచ్చు కానీ, కనపడకుండా యుద్ధము చేసే మాయావుల మీద ఏ అస్త్రములు ప్రయోగించిన ఏమి ప్రయోజనము. యుద్ధములో రాముని ఎదుట నిలిచిన శత్రువు ప్రాణాలతో తిరిగి వెళ్లడు కానీ ఈ మాయావి రాముని కంటపడకుండా రాముని చంపాడు. రామలక్ష్మణులు అకాల మరణం చెందడం దైవఘటన కాక మరేమున్నది.

రాముని మరణ వార్త విని కౌసల్య ఎంతగా శోకిస్తుందో కదా! అరణ్యవాసము పూర్తి చేసుకొని అయోధ్యకు రామలక్ష్మణులు ఎప్పుడు తిరిగి వస్తారో అని ఎదురుచూస్తున్న కౌసల్యకు రామలక్ష్మణుల మరణ వార్త అశనిపాతంగా పరిణమిస్తుంది. ఆమెను ఎవరు ఓదారుస్తారు!" అని పరి పరి విధములుగా శోకిస్తున్న సీతను చూచి త్రిజట ఇలా అంది.

"ఎందుకమ్మా ఏడుస్తావు. నీ భర్త రాముడు చనిపోలేదు. బతికే ఉన్నాడు. ఒకసారి అటు చూడు. వానర నాయకులు అందరూ రామ లక్ష్మణుల దేహములను జాగ్రత్తగా రక్షిస్తున్నారు. వారి ముఖములలో దైన్యము శోకము కనపడుట లేదు. వారు అంతా రాముడు ఎప్పుడు స్పృహలోకి వస్తాడా అని ఎదురు చూస్తున్నారు. కాబట్టి నీ భర్త మరణించలేదు. నా మాటనమ్ము. నీవు అఖండ సౌభాగ్యవతివి అని నాకు నమ్మకం ఉంది. నా నోట అబద్ధము రాదు. నీ పాతివ్రత్యమే నిన్ను రక్షిస్తుంటుంది. నీ పాతివ్రత్యమే నన్ను నీ పట్ల ఆకర్షితురాలిగా చేసింది. అందుకే నీకు శుభం కలగాలని కోరుకుంటున్నాను. ఇంద్రాదులు వచ్చినా రామలక్ష్మణులను జయించలేరు. ఇది నిక్కువము. మరొక్కసారి రామలక్ష్మణుల ముఖములు చూడు. వారి ముఖములలో సహజమైన కాంతీ తేజస్సు తగ్గలేదు. రామలక్ష్మణులు కేవలం స్పృహ తప్పారే కానీ మరణించలేదు. ఈ మూర్ఖరాక్షసులకు స్పృహ తప్పడానికీ, మరణించడానికీ తేడా తెలియదు. మరణించిన వారి

ముఖములు వికృతంగా మారుతాయి. కానీ రామలక్ష్మణుల ముఖములు కాంతితో ప్రకాశిస్తున్నాయి. ముఖములు అలా ప్రకాశిస్తున్న వారు మరణించి నట్టు కాదు. కాబట్టి రామలక్ష్మణులు జీవించి ఉన్నారు. నీ శోకమును వదిలిపెట్టు. రామలక్ష్మణులు జీవించాలనీ ఆ దైవమును ప్రార్థించు." అని పలికింది త్రిజట.

త్రిజట మాటలు విన్న సీత ఆమెకు రెండు చేతులు జోడించి నమస్కరించింది. "త్రిజటా! నీ మాటలు యదార్థములు కావాలి." అని మనసులో అనుకొంది సీత. వెంటనే త్రిజట పుష్పకవిమానమును వెనక్కు తిప్పి లంకకు పోనిచ్చింది. అశోక వనములో సీత, త్రిజట పుష్పకమును దిగారు. తరువాత పుష్పకము రావణుని నివాసమునకు వెళ్లిపోయింది. తిరిగి శింశుపావృక్షము కింద కూర్చున్న సీత రామలక్ష్మణులు సంపూర్ణ ఆరోగ్యవంతులు కావాలని దైవమును ప్రార్థిస్తూ దీనంగా కూర్చుంది.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నలభైఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నలభైతొమ్మిదవ సర్గ.

రాముడు లక్ష్మణుని శరీరముల చుట్టు చేరిన వానర వీరులు దీనంగా చూస్తున్నారు. వారికి ఏం చెయ్యడానికీ తోచడం లేదు. ఆ శరబంధనం ఎలా వీడుతుందో తెలియడంలేదు. లక్షణుని కన్నా రామునికి

మానసిక స్థైర్యము ఎక్కువ. అందువలన రాముడు తొందరలోనే స్పృహలోకి వచ్చాడు. రక్తసిక్తమైనశరీరంతో నేలమీద పడి ఉన్న లక్ష్మణుని చూచాడు రాముడు. రాముడికి దు:ఖము ముంచుకొచ్చింది. లక్ష్మణునిచూచి భోరున విలపించాడు.

"నా లక్ష్మణుడు లేని నాకు ఈ జీవితము, నా సీత ఎందుకు వృధా. భూలోకములో పట్టుబట్టి వెతికితే సీతలాంటి భార్య కనపడవచ్చేమో కానీ లక్ష్మణుడి వంటి తమ్ముడు దొరకడం చాలా కష్టం. ఏ కారణం చేతనైనా లక్ష్మణుడు మరణిస్తే, ఈ వానరుల అందరి ముందరా నేను కూడా ప్రాణత్యాగం చేసుకుంటాను. నన్ను నమ్మి లక్ష్మణుని తల్లి సుమిత్ర లక్ష్మణుని నా వెంట పంపింది. ఇప్పుడు నేను ఒంటరిగా అయోధ్యకు వెళితే, సుమిత్ర నన్ను నిందిస్తుంది. ఆ నింద నేను భరించలేను. హాయిగా అయోధ్యలో ఉండక నా వెంట వచ్చి ఈ శరశయ్యమీద పడుకొని ఉన్నాడు. శర బంధనంలో బంధింపబడ్డాడు లక్ష్మణుడు. ఎంత దురదృష్టము.

ఓ లక్ష్మణా! నేను సీత గురించి శోకించినప్పుడు నువ్వు నన్ను ఓదార్చి నాకు ధైర్యము చెప్పేవాడివి ఇప్పుడు నీకోసం నేను ఏడుస్తున్నాను. లేచి నన్ను ఓదార్చు! ఈ రోజు యుద్ధములో నీవు ఎంతో మంది రాక్షసులను చంపావు. కానీ ఆ ఇంద్రజిత్తు చేతిలో మరణించావు. లక్ష్మణా! నీ ముఖంలో కళతగ్గలేదు. సంధ్యాసమయంలో సూర్యుడిలా ప్రకాశిస్తున్నావు. నీవు చావలేదు. నీ కళ్లలో కాంతి ఇంకా మెరుస్తూ ఉంది. నీవే కనుక యమపురికి వెళ్లవలసి వస్తే నేను కూడా నీ వెంట వస్తాను కానీ నిన్ను ఒంటరిగా వెళ్లనివ్వను. ఎందుకంటే నేను ఒంటరిగా అడవులకు వెళు తున్నాను అని నీవు నా వెంట వచ్చావుకదా! అందుకే నేను కూడా నీ వెంట వస్తాను.

లక్ష్మణా! నీ దురవస్థకు నేను కారణము. నా వలన నీకు ఇన్ని కష్టాలు వచ్చాయి. అందరికీ దూరంగా నా వెంట అడవులలో తిరుగుతున్నావు. తుదకు ప్రాణాల మీదికి తెచ్చుకున్నావు. కాని నీకు నా మీద కించిత్ కూడా కోపం రాలేదు. నాతో ఒక్క చెడ్డ మాటకూడా మాట్లాడలేదు. లక్ష్మణా! నీ పరాక్రమము నాకు తెలియనిదా! నీవు కార్తవీర్యార్జునుని కంటే పరాక్రమవంతుడవు. కానీ కాలం కలిసిరాక ఇంద్రజిత్తుచేతిలో ఓడిపోయావు. లక్ష్మణా! అయోధ్యలో పట్టుపరుపుల మీద పరుండవలసిన వాడివి ఇక్కడ ఈ శరతల్పము మీద పడుకున్నావా! ఇంద్రునే జయించగలవాడివి ఇంద్రజిత్తుచేతిలో ఓడిపోయావా!

ఓ సుగ్రీవా! నన్ను లక్ష్మణుని వదిలి వెళ్లిపొండి. రావణుడు మిమ్ములను ఏమీ చేయడు. రావణుని కోపం నా మీదనే కదా. మీరందరూ సముద్రము దాటి కిష్కింధకు వెళ్లిపొండి. నా కోసరము మీ ప్రాణాలు ఎందుకు బలిపెడతారు. ఇప్పటిదాకా మీరు నాకు చేసిన సాయమునకు కృతజ్ఞుడను. నువ్వు జాంబవంతుడు, అంగదుడు, మైందుడు, ద్వివిదుడు, కేసరి,సంపాతి, గవయుడు, గవాక్షుడు, శరభుడు, గజుడు, నా కోసరము రాక్షసులతో ఘోర యుద్ధము చేసారు. నా కొరకు మీ ప్రాణాలను సైతం లెక్కచెయ్యకుండా రాక్షసులతో యుద్ధం చేసారు. కాని మనము దైవ నిర్ణయమును అతిక్రమించలేము కదా! సుగ్రీవా! ఒక స్నేహితుడుగా నీవు నాకు చేయగలిగినది అంతా చేసావు. ఓ వానర ప్రముఖులారా! మీరందరూ నా కోసరం ఎంతో చేసారు. మీ అందరికీ కృతజ్ఞుడిని. నేను మీకు అనుమతి ఇస్తున్నాను. మీ మీ ప్రదేశములకు తిరిగి పొండు. ఇదే నా విన్నపము" అని కళ్ల వెంట నీరు కారుతుండగా రాముడు అందరికీ వీడ్కోలు పలికాడు.

రాముడి మాటలు విన్న ఏ వానరుడూ కన్నీరు పెట్టకుండా ఉండలేకపోయాడు. ఇంతలో విభీషణుడు చేతిలో గద ధరించి సైన్యములకు ధైర్యం చెబుతూ రాముడు ఉన్న చోటికి వచ్చాడు. రావణుడు, అతని తమ్ముడు విబీషణుడు ఒకే పోలికతో ఉండటం వలన, విభీషణుని అంతా రావణుడు అనుకొన్నారు. వారిలో భయం ప్రవేశించింది. ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపాడు. రావణుడు మనలను చంపడానికి వచ్చాడు అని అరుస్తూ వానరులు తలొకదిక్కుగా పారిపోయారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నలుబది తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
ఏబదవ సర్గ.

అది చూచిన సుగ్రీవుడు ఇలా అన్నాడు. "ఇదేమిటి. ఈ వానరులకు పిచ్చి పట్టిందా. లేక రావణుని భయం పట్టుకుందా. " అని అన్నాడు. దానికి అంగదుడు ఇలా అన్నాడు. మనకు నాయకులైన దశరథ కుమారులు రామలక్ష్మణులు శరతల్పగతులై ఉన్నారని తమరికి తెలియదా! మరి వానరులు భయపడరా!' అని అన్నాడు.

"ఆ విషయం అందరికీ తెలుసు కదా! వానరుల భయమునకు ఏదో వేరు కారణము ఉండి ఉంటుంది. అధిక బలవంతులైన వానరులు ఇలా పారిపోతున్నారంటే వారి భయానికి తగిన కారణం ఉండి ఉండాలి.

లేకపోతే ఈ వానరులు సిగ్గు లేకుండా భయంతో పారిపోతున్నారు. ఒకరిని ఒకరు తోసుకుంటూ పరుగెడుతున్నారు. ఎవరైనా కిందపడి పోతే వారిని తొక్కుకుంటూ వారి మీదినుండి పరుగెడుతున్నారు. ముందు వారిలో భయాన్ని పోగొట్టాలి." అని అన్నాడు.

ఇంతలో చేతిలో గద ధరించిన విభీషణుడు అక్కడికి వచ్చాడు. జయజయధ్వానాలు పలుకుతూ రాముడికి అభివాదము చేసాడు. సుగ్రీవునికి అప్పటికి అర్థం అయింది వానరుల భయకారణము. అపర రావణుని మాదిరి గదతో నడిచి వస్తున్న విభీషణుని చూచి అతడే రావణుడు అనుకొని వానరులు పారిపోతున్నారు అని తెలుసుకున్నాడు సుగ్రీవుడు. పక్కనే ఉన్న జాంబవంతుని చూచి ఇలా అన్నాడు. "జాంబవంతా! విభీషణుని చూచిన వానరులు అతడే రావణుడు అని కానీ, ఇంద్రజిత్తు అని కానీ అనుకొని పారిపోతున్నారు. మీరు వెళ్లి వారికి ధైర్యము చెప్పండి. వచ్చినవాడు విభీషణుడు అనీ, రావణుడు కానీ, ఇంద్రజిత్తు కానీ కాదు అని వారికి తెలియజెప్పండి." అని అన్నాడు.

సుగ్రీవుని ఆదేశము ప్రకారము జాంబవంతుడు వానరులకు ధైర్యముచెప్పడానికి వెళ్లాడు. వానరుల మధ్యకు వెళ్లి వారికి ధైర్యవచనాలు పలికాడు. అందరిలోకీ పెద్ద వాడైన జాంబవంతుని మాటలు విన్న వానరులు, నిజం తెలుసుకొని అందరూ వెనకకువచ్చారు.

విభీషణుడు రాముని, లక్ష్మణుని ఆ స్థితిలో చూచి చాలా బాధపడ్డాడు. తను కూడా వారి బాధలో పాలుపంచుకున్నాడు. విభీషణుడు సుగ్రీవునితో ఇలా అన్నాడు. "ఇంద్రజిత్తు రాక్షసుడు. మాయావి.

మాయాయుద్ధంలో ఆరితేరినవాడు. కుటిలయుద్ధంలో మేటి. రామలక్ష్మణులకు నేరుగా యుద్ధం చేయడం తెలుసు కానీ మాయాయుద్ధం తెలియదు. అందుకని ఇంద్రజిత్తు వీరిని జయించగలిగాడు. ఇంద్రజిత్తు వీరి శరీరం అంతా తూట్లుపడేట్టు కొట్టాడు. రామలక్ష్మణుల శరీరం అంతా రక్తసిక్తమయింది. అవసాన దశలో ఉన్నారు. నా అన్న నా శత్రువు అయిన రావణుడు గెలిచాడు. వాడి కోరిక తీరింది. సీత వాడి వశం అయింది." అని భోరున విలపించాడు విభీషణుడు.

సుగ్రీవుడు విభీషణుని చూచి ఇలా అన్నాడు. "విభీషణా! రామలక్ష్మణులు మరణించలేదు. కేవలము స్పృహ తప్పిఉన్నారు. వీరికి స్పృహ వచ్చిన తరువాత వీరు ఇద్దరూ రావణుని చంపగలరు. నిన్ను లంకాధీశునిగా అభిషేకించగలరు. ఊరట చెందుము." అని అన్నాడు. సుగ్రీవుడు తన పక్కనే ఉన్న తన మామగారు సుషేణుని చూచి ఇలా అన్నాడు. "ఈ పరిస్థితిలో రామలక్ష్మణులు ఇక్కడ ఉండటం మంచిది కాదు. నీవు వీరిని తీసుకొని కిష్కింధకు వెళ్లు. నేను నా సేనలతో ఇక్కడే ఉండి రావణుని బంధు పుత్ర మిత్ర సమేతంగా సంహరిస్తాను. సీతను తీసుకొని వస్తాను."అని అన్నాడు.

అప్పుడు సుషేణుడు ఇలా అన్నాడు. "సుగ్రీవా! నాకు మాయా యుద్ధము కొత్త కాదు. దేవాసుర యుద్ధము గురించి నాకు బాగా తెలుసు ఆ రోజుల్లో దానవులు బాణప్రయోగంలో ప్రవీణులు. దేవతలు కేవలం అస్త్రములు మాత్రము వాడేవారు. దానవులు తమ మాయాశక్తితో మాయం అయిపోయి, దేవతల మీద బాణవర్షము కురిపించి వారిని ఓడించారు. అసురుల దెబ్బకు దేవతలకు బాగా దెబ్బలు తగిలి స్పృ హ తప్పారు. కొంత మంది చనిపోయారు. అప్పుడు బృహస్పతి తనమంత్రశక్తిచేత, తనకు

తెలిసిన ఓషధుల చేత చికిత్స చేసి వారిని బతికించాడు. ఆ ఔషధముల గురించి సంపాతికి పనసునికి బాగా తెలుసు. వారికి సంజీవకరణి, దేవతలు ఉపయోగించిన విశల్యకరణి అనే దివ్య ఔషధముల గురించి బాగా తెలుసు. వారిని పంపి ఆ ఓషధులు తెప్పించు. అలాగే దేవ దానవులు మథించిన క్షీరసముద్రములో చంద్రము, ద్రోణము అనే పర్వతములు ఉన్నాయి ఆ పర్వతములను దేవతలు క్షీరసముద్రములో ఉంచారు. వాయుపుత్రుడైన హనుమంతుని అక్కడకు పంపు. ఆయనకు కూడా ఈ ఓషధుల గురించి బాగా తెలుసు." అని అన్నాడు సుషేణుడు.

ఇంతలో తీవ్రంగా గాలి వీచింది. మేఘములు దట్టంగా అలముకున్నాయి. కొన్ని కొన్ని మహావృక్షములు కూకటి వేళ్లతోసహా పెకలింపబడి సముద్రములో పడిపోతున్నాయి. సముద్రములో ఉన్న జంతువులు సర్పములు అల్లకల్లోలం అయ్యాయి. దీని కంతటికీ కారణము గరుడుని రాక. అతని రెక్కల వేగము వలన అంతటి ఝంఝూమారుతము వీచింది. ఆకాశంలో ఎగురుతూ వస్తున్న గరుడుడు వానరులకు కనపడ్డాడు. ఇంద్రజిత్తు రాముని మీద లక్ష్మణుని మీద నాగసర్పములు ఆవాహన చేసిన బాణములను ప్రయోగించాడు. ఆ సర్పబంధనంలో చిక్కుకున్న రామలక్ష్మణులు వాటి ప్రభావం వలన మృతప్రాయులయ్యారు. ఆ సంగతి వానరులకు తెలియదు. గరుడుని రాక చూచి రామలక్ష్మణులను బంధించిన సర్పములు భయపడిపోయాయి. వెంటనే ఆ సర్పములు అన్నీ చెల్లాచెదరయ్యాయి. తలా ఒక దిక్కుకుపారిపోయాయి. రాముని లక్ష్మణుని పట్టి ఉంచిన నాగ బంధములు విడిపోయాయి. రామలక్ష్మణులకు శరబంధమునుండి విముక్తి కలిగింది.

గరుడుడు కిందికి దిగి రామ లక్ష్మణుల వద్దకు వచ్చాడు. రామ లక్ష్మణుల శరీరములను తన చేతితో నిమిరాడు. వారి ముఖములను ప్రేమతో నిమిరాడు. గరుడుని స్పర్శతో రామలక్షణుల శరీరము మీద సర్పముల వంటి బాణములతో కలిగిన గాయములు అన్నీ మాయం అయ్యాయి. వారి శరీరం అంతకు ముందు కంటే కాంతి వంతంగా మెరిసిపోతూ ఉంది. రామ లక్ష్మణులకు పూర్వపు తేజస్సు పరాక్రమము, వీర్యము బలము ఉత్సాహము మొదలైన గుణములు అన్నీ మరలా సంక్రమించాయి. గరుడుడు రామ లక్ష్మణులను లేవదీసి కౌగలించు కున్నాడు. గరుడుని చూచి రాముడు ఇలా అన్నాడు.

“నీ ప్రసాదం చేత మేము ఇంద్రజిత్తు వలన కలిగిన ఆపద నుండి బయటపడగలిగాము. మా పూర్వపు బలపరాక్రమములు మాకు వచ్చాయి. నిన్ను చూస్తుంటే నా తండ్రి దశరథుడు, పితామహుడు అజమహారాజును చూచినట్టు ఉంది. ఇంతకూనీవు ఎవరు? ఎక్కడి నుండి వచ్చావు?” అని అడిగాడు రాముడు.

అప్పుడు గరుడుడు రాముని చూచి ఇలా అన్నాడు. “రామా! నేను నీకు మిత్రుడను. నా పేరు గరుడుడు. మీకు సాయం చేద్దామని వచ్చాను. రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు తన మాయతో మీ ఇద్దరినీ శరబంధం చేసాడు. ఈ శరబంధం నుండి విడిపించుకోవడం దేవతలకు కానీ, అసురులకు, గంధర్వులకు కానీ సాధ్యం కాదు. నీ మీద ఇంద్రజిత్తు ప్రయోగించినవి మామూలు బాణములు కావు. అవి కద్రువ కుమారులు అయిన నాగములు. అవి భయంకర విషసర్పాలు. ఇంద్రజిత్తు మాయా ప్రభావంతో ఆ విషసర్పములు బాణముల రూపంలో నిన్ను చుట్టుముట్టాయి. మీ ఇద్దరికీ స్పృహపోయేట్టు చేసాయి. అంతే కానీ మీ ప్రాణాలకు ఏమీ

ప్రమాదం లేదు. మీ ఇద్దరూ అజేయులు. మీ ఇద్దరూ ఈ ప్రకారము సర్పములతో ఆవహింపబడిన శరతల్పగతులైనారని తెలిసి వెంటనే వచ్చాను. నన్ను చూచి నా గర్భశత్రువులైన ఆ సర్పాలు పారిపోయాయి. మీకు స్మృహవచ్చింది. చాలా సంతోషము. ఇంక మీదట మీరు ఈ రాక్షస మాయలను తెలుసుకొని ప్రవర్తించండి.

కుటిల యుద్ధము, కపట యుద్ధము చేయడం రాక్షసుల స్వభావము. మీకు ఆ కుటిలత్వము కపటము తెలియవు. మీరు పరాక్రమాన్ని బలాన్ని నమ్ముకున్నారు. అదే మీకు బలము. రాక్షసులు ఎల్లప్పుడూ కుటిల స్వభావులు. ఇంద్రజిత్తు చేసిన యుద్ధమే దానికి తార్కాణము. యుద్ధము సమానమైన బలముకలవారి మధ్యజరగాలి అది యుద్ధధర్మము. కాని వారు మీకు తెలియని మాయాయుద్ధం చేసారు. కాబట్టి మీరు ఎప్పుడూ రాక్షసులను నమ్మకండి. ఇదే నా హితవు. ఇంక నాకు వెళ్లడానికి అనుజ్ఞ ఇవ్వండి. మన ఇద్దరికీ ఎలా స్నేహం ఏర్పడింది అని ఇప్పుడు మీరు నన్ను అడగ వద్దు. రామరావణ యుద్ధము ముగిసిన పిమ్మట ఆవిషయం మీకు తెలియగలదు. " అని రామునితో అన్నాడు గరుడుడు.

"నేను భవిష్యత్తును చెప్పుచున్నాను. నీవు ఈ యుద్ధములో లంకలో ఉన్న స్త్రీలు, బాలురు, వృద్ధులుతప్ప మిగిలిన రాక్షసులు అందరినీ సంహరించి, సీతను పొందగలవు." అని పలికాడు గరుడుడు. తరువాత రాముని అనుజ్ఞ పొంది, రామునికి ప్రదక్షిణము చేసి నమస్కరించి, ఆకాశంలోకి ఎగిరిపోయాడు గరుడుడు.

రాముడు, లక్ష్మణుడు తమ పూర్వ ఆకారములతో తమ ముందు నిలిచేటప్పటికి వానరనాయకుల ఆనందానికి అవధులు లేవు. అందరూ జయజయధ్వానాలుచేసారు. భేరీలు మ్రోగించారు. మృదంగములు వాయించారు. శంఖములు పూరించారు. తోకలు ఊపుతూ సింహ నాదాలు చేసారు. ఆనందంతో గంతులు వేసారు. రెట్టించిన ఉత్సాహంతో చేతికి దొరికిన వృక్షములను పెకలించి వాటిని ఆయుధములుగా ధరించి యుద్ధానికి సిద్ధం అయ్యారు ఆ వానరులు. రాక్షసుల గుండెల్లో భయం పుట్టేటట్టు అరుస్తూ అందరూ లంకానగర ద్వారముల వైపు పరుగెత్తారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము యాభయ్యవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## యాభైఒకటవ సర్గ.

వానరులు చేసే సింహనాదాలు, విజయ దుందుభుల మోతలు రాక్షసుల చెవిని బడ్డాయి. రావణుడి చెవులకు కూడా సోకాయి. వెంటనే రావణుడు మంత్రులను పిలిపించాడు.అత్యవసర సమావేశము నిర్వహించాడు. "విన్నారుగా ఆ వానరుల జయజయధ్వానాలు. వారికేదో గొప్ప సంతోషము కలిగే సంఘటన జరిగినట్టు ఉంది. సందేహము లేదు. ఆ వానరుల కేకలకు సముద్రము కూడా దద్దరిల్లుతూ ఉంది. మన ఇంద్రజిత్తు రామలక్ష్మణులను సర్పబాణములతో శరబంధనము చేసినాడు కదా! దీనవదనములతో శోకించక ఈ వానరులు చేసే

జయజయధ్వానాలు నాలో ఎన్నో అనుమానాలు రేకెత్తిస్తున్నాయి."అని పలికిన రావణుడు పక్కనే నిలబడి ఉన్న రాక్షస వీరులను చూచి ఇలా అన్నాడు.

"రామలక్ష్మణుల మృతికి శోకించవలసిన సమయములో వానరులు ఈ ప్రకారంగా సంతోషంగా కేరింతలు కొట్టడానికి గల కారణం తెలుసుకొని రండు." అని ఆదేశించాడు. వెంటనే ఆ రాక్షస వీరులు లంకా నగర ప్రాకారముల మీదికి ఎక్కారు. వానర సైన్యమును జాగ్రత్తగా పరిశీలించారు. శరబంధనంతో నిర్జీవులుగా ఉండవలసిన రాముడు లక్ష్మణుడు సలక్షణంగా ఉండటం చూచారు. రామలక్ష్మణులు ద్విగుణీకృత ఉత్సాహంతో ప్రకాశిస్తున్నారు. రాక్షసుల గుండెల్లో గుబులు రేగింది. వారందరూ ప్రాకారములు దిగి వడి వడిగా రావణుని వద్దకు వెళ్లారు. దిగాలు పడిన మొహాలతో రావణుని ముందు నిలబడ్డారు. తాము చూచింది చూచినట్టు రావణునికి విన్నవించుకున్నారు.

"రాక్షసేంద్రా! జయము జయము. ఇంద్రజిత్తులవారి చేతిలో సర్పబాణబంధీకృతులై మరణించిన రామలక్ష్మణులు తమ బంధనాలు వీడి పునర్జీవితులై ఉదయభానుడి వలె ప్రకాశిస్తున్నారు. కట్లు తెంచుకున్న ఏనుగుల వలె ఉత్సాహంగా ఉన్నారు. ఆ మాటలు విన్న రావణుడికి కోపము భయము ఒకేసారి ముంచుకొచ్చాయి. రావణుడు వివర్ణవదనుడయ్యాడు.

"ఏమిటీ! ఇది నిజమా! యుద్ధములో ఇంద్రజిత్తు రామ లక్ష్మణులను ఓడించాడు కదా! తన సర్పబాణములతో బంధించాడు కదా! వారు మృతప్రాయులయ్యారని నాకు చెప్పాడు కదా! మరలా ఇదేమి?

అస్త్రబంధములో చిక్కుకున్న రామలక్ష్మణులు బంధవిముక్తులు కావడాన్ని బట్టి చూస్తే మన రాక్షస బలగముల బలపరాక్రమములు సందేహాస్పద ములుగా ఉన్నాయి. మేము పూర్వము చేసిన యుద్ధములలో ఏ అస్త్రశస్త్రములు మాకు విజయాన్ని సంపాదించి పెట్టాయో అవే అస్త్ర శస్త్రములు ఇప్పుడు రామలక్ష్మణుల ముందు వ్యర్థమైపోయాయి. " అని పలికి ధూమ్రాక్షుడు అనే రాక్షసవీరుని పిలిచాడు.

"ధూమ్రాక్షా! నీవు నీ సైన్యముతో యుద్ధరంగమునకు వెళ్లు. రాముడిని లక్ష్మణుని వానర సేనలనుసర్వనాశనం చెయ్యి." అని ఆదేశించాడు. వెంటనే ధూమ్రాక్షుడు రాక్షస సైన్యాధ్యక్షుడిని చూచి "నేను రామలక్ష్మణుల మీదికి యుద్ధానికి వెళ్లాలి. సేనలను సిద్ధం చేయండి" అని అన్నాడు. సైన్యాధ్యక్షుడు ధూమ్రాక్షుడికి సేనలను సమకూర్చాడు. తన అపార సేనావాహినితో వానరుల మీదికి యుద్ధానికి బయలుదేరాడు ధూమ్రాక్షుడు. నల్లని మేఘాల వలె ఉన్న రాక్షస వీరులు, పెద్దగా గర్జిస్తూ, శూలములు, ముద్గరములు, గదలు, పట్టిసములు, ఇనుప ఆయుధములు, పరిఘలు, బల్లెములు, గొడ్డళ్లు తీసుకొని ధూమ్రాక్షుని వెంటయుద్ధానికి బయలు దేరారు. మరి కొందరు రాక్షస వీరులు గాడిదలు లాగుతున్న రథముల మీద యుద్ధానికి బయలుదేరారు. మరికొందరు రాక్షస వీరులు వాయు వేగముతో పరుగెత్తే గుర్రముల మీద, ఏనుగుల మీద బయలుదేరారు. ధూమ్రాక్షుడు కూడా గాడిదలు కట్టిన రథము మీద బయలుదేరాడు. వారందరూ పశ్చిమ ద్వారము వద్దకు చేరుకున్నారు.

అక్కడ హనుమంతుడు వానరసేనలతో మోహరించి ఉన్నాడు. గాడిదలుకట్టిన రథము మీద వెళుతున్న ధూమ్రాక్షునికి అనేక

అపశకునములు గోచరించాయి. ఒక భయంకరమైన గ్రద్ద ధూమ్రాక్షుని రథమునకు కట్టిన ధ్వజము మీద వాలింది. తలలేని మొండెము ఒకటి ధూమ్రాక్షుని రథము ముందు పడింది. వాయువు ప్రతికూల దిశలో వీచింది. ఈ దుశ్శకునములు చూచి ధూమ్రాక్షుని మనసు కలతచెందింది. అయినా ధైర్యంతో ముందుకు సాగాడు. వానర సేనను అంతా ఒక్కసారి పరిశీలించి చూచాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము యాభైఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము

యాభైరెండవ సర్గ.

ధూమ్రాక్షుడు యుద్ధానికి రావడం చూచి వానరులు సంతోషించారు. మరొక రాక్షసుడు బలి కాబోతున్నాడు అని ఆనంద పడ్డారు. వానరులు రాక్షసులు తలపడ్డారు. వానరులు పెద్ద పెద్ద బండరాళ్లను, మహావృక్షములను ఆయుధములుగా ధరించి యుద్ధం చేస్తుంటే, రాక్షసులు పట్టిసములు, శూలములు, ముద్గరలు ధరించారు. ఇరుపక్షముల వారు సమానంగా చస్తున్నారు. కాకపోతే రాక్షసుల చేతిలో బాణాలున్నాయి. వానరుల చేతిలో వృక్షములు బండరాళ్లు ఉన్నాయి. రాక్షసులు తమ వద్ద ఉన్న బల్లెములు, పట్టిసములు, బల్లెములతో వానరులను చీలుస్తున్నారు. కాని వానరులు ఏ మాత్రం భయపడక ముందుకు చొచ్చుకువస్తున్నారు. వానరులు విసిరే బండరాళ్లకింద వృక్షముల కింద పడి ఎంతోమంది రాక్షసులు మరణిస్తున్నారు. వానరులు రాక్షసులను తమ పేర్లు చెప్పి మరీ

చంపుతున్నారు రాక్షసులను. బండరాళ్ల కింద, వృక్షముల కింద పడ్డ రాక్షసులు రక్తం కక్కుకొని చస్తున్నారు. వేలకొలది రాక్షసులు మహా వృక్షముల కిందపడి నుగ్గు నుగ్గు అవుతున్నారు. రాక్షసులే కాదు, వానరులు విసిరిన బండరాళ్ల వృక్షముల కిందపడి హయములు, ఏనుగులు కూడా ఛిన్నాభిన్నం అవుతున్నాయి. వాటి మీద ఎక్కిన రాక్షస వీరులు కూడా వాటి కాళ్ల కింపడి నుగ్గు నుగ్గు అవుతున్నారు. ఆ ప్రదేశముఅంతా ఏనుగులు, గుర్రములు, రాక్షసులు, వానరుల మృతకళేబరములతో నిండి పోయింది.

వానరులు రాక్షసుల మీదికి ఎగిరి తమ వాడి అయిన గోళ్లతో వారిని రక్కి, చీలుస్తున్నారు. దానికి కోపించిన రాక్షసులు వానరులను తమ అరిచేతులతో కొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ రాక్షసులు తమను కొట్టకముందే వానరులు మహావేగంతో ఆ రాక్షసులను పిడికిళ్లతో పొడుస్తూ, పాదముల కింద పడేసి తొక్కుతూ, దంతములతో చీలుస్తున్నారు. వానరుల ధాటికి తట్టుకోలేక రాక్షస సైన్యము పారిపోతూ ఉంది.

ఇది చూచాడు ధూమ్రాక్షుడు. కోపోద్రేకంతో వానరులను ఊచకోత కోస్తున్నాడు. వానరులు ధూమ్రాక్షుడి దెబ్బకు తట్టకోలేక గుట్టలుగా పడి మరణిస్తున్నారు. రాక్షసులు కొట్టిన దెబ్బలకు వానరుల శరీరాలు రక్తసిక్తం అయ్యాయి. రాక్షసులు తాము ధరించిన త్రిశూలములతో చీలుస్తుంటే వానరుల శరీరంలోని పేగులు బయటకు వస్తున్నాయి. వానరులు రాక్షసుల మధ్య ఘోరంగా యుద్ధం జరుగుతూ ఉంది. యుద్ధంలో ముందు నిలబడ్డ ధూమ్రాక్షుడు నవ్వుతూ తన ధనుస్సు ఎక్కుబెట్టి వానరుల మీద బాణప్రయోగం చేస్తున్నాడు. ధూమ్రాక్షుని పరాక్రమానికి తట్టుకోలేక వానరులు పారిపోసాగారు.

ఇదంతా చూచిన హనుమంతుడు కోపోద్రేకంతో ఒక పెద్ద బండరాయిని తీసుకొని ధూమ్రాక్షుని వంకకు దూకాడు. ఆ రాయిని ధూమ్రాక్షుని రథంమీద బలంగా విసిరాడు. తన మీదికి వస్తున్న పెద్ద బండరాయిని చూచిన ధూమ్రాక్షుడు తన గద తీసుకొని రథము నుండి కిందికి దూకాడు. నేల మీద నిలబడ్డాడు. రథము మీద పడ్డ బండరాయి, ధూమ్రాక్షుని రథమును తుత్తునియలు చేసింది. తరువాత హనుమంతుడు చేతికందిన బండరాళ్లను, చెట్లను రాక్షసుల మీదికి విసురుతూ వారిని చంపుతున్నాడు. ఆ రాళ్ల దెబ్బకు రాక్షసుల తలలు బద్దలవుతున్నాయి. వృక్షముల కిందపడి రాక్షసులు మరణిస్తున్నారు. అది చూచి రాక్షస సైన్యము పారిపోతూఉంది.

హనుమంతుడు ఒక పెద్ద బండ రాయి తీసుకొని ధూమ్రాక్షుని వంకకు పరుగెత్తాడు. ధూమ్రాక్షుడు కూడా తన గద ఎత్తి పెద్దగా గర్జిస్తూ హనుమంతుని వంకకు పరుగెత్తాడు. ముళ్లతో నిండిన తన గదను ధూమ్రాక్షుడు హనుమంతుని పైకి విసిరాడు. ఆ దెబ్బను తప్పించుకొన్న హనుమంతుడు తాను తెచ్చిన బండశిలతో ధూమ్రాక్షుని తలపై మోదాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక ధూమ్రాక్షుడు నేల మీద వెల్లకిలా పడ్డాడు. రక్తం కక్కుకొని మరణించాడు. ధూమ్రాక్షుని మరణం చూచిన రాక్షస సేనలు లంక వైపుకు పారిపోయారు. వారిని వానరులు తరిమి తరిమి కొట్టి చంపారు. ఆ ప్రకారంగా హనుమంతుని చేతిలో ధూమ్రాక్షుడు దారుణంగా మరణించాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఏబది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## యుద్ధ కాండము

## (రెండవ భాగము)

సంస్కృత మూలము

భగవాన్ వాల్మీకి మహర్షి

తేటతెలుగులో

మొదలి వెంకట సుబ్రహ్మణ్యం

2-31, చైతన్యపురి,

హైదరాబాదు 500060

ఫో: 24048104

సెల్: 9391134792

# శ్రీమద్రామాయణము

## యుద్ధకాండము

## ఏబది మూడవ సర్గ.

రాక్షసరాజు రావణునికి ధూమ్రాక్షుని దారుణ మరణం గురించి తెలిసింది. నిర్ఘాంత పోయాడు. కోపం వచ్చింది. బుసలు కొట్టాడు. వజ్రదంష్ట్రుడు అనే రాక్షసుని పిలిపించాడు.

"నీవు మహావీరుడవు. ఎన్నో యుద్ధములలో పాల్గొన్నావు. నీవు కావలసినంత సైన్యమును తీసుకొని వెళ్లి, రాముడిని, లక్ష్మణుడిని, సుగ్రీవుడిని చంపి తిరిగిరా." అని అన్నాడు రావణుడు.

రావణుని ఆదేశము ప్రకారము కోట్లకొలది రాక్షస సైన్యముతో వజ్రదంష్ట్రుడు వానరుల మీదికి యుద్ధానికి బయలు దేరాడు. అతని సేనలో గజములు, అశ్వములు, గాడిదలు, ఒంటెలు, రథములు ఉన్నాయి. వాటిని ఎక్కిన రాక్షసులు మహా బలవంతులు పరాక్రమవంతులు. వజ్రదంష్ట్రుడు కూడా ఒక మహాధనుస్సును చేత ధరించి యుద్ధానికి బయలుదేరాడు. ఆయన వెంట అశేష రాక్షస సైన్యము బయలుదేరింది.

వారందరూ దక్షిణ ద్వారము నుండి బయటకు వచ్చారు. అక్కడ అంగదుడు తన సేనతో ఉన్నాడు. రాక్షసులకు దుశ్శకునములు గోచరించాయి. ఈ దుశ్శకునములను చూచి వజ్రదంష్ట్రుడు కలవర పడ్డాడు. అయినా ధైర్యంతో ముందుకు నడిచాడు. దక్షిణ ద్వారము

నుండి బయటకు వచ్చిన రాక్షస సైన్యమును వానరులు చుట్టు ముట్టారు. రాక్షసులకు వానరులకు ఘోరయుద్ధము జరిగింది. రాక్షసుల సైన్యములు, వానర సైన్యములు సమానంగా నశించాయి. వాటి శరీరముల నుండి కారిన రక్తంతో రణభూమి అంతా రక్తసిక్తమయింది. ఒకరిని మించి ఒకరు యుద్ధం చేస్తున్నారు.

వానరులు వృక్షములు పర్వత శిలలను ప్రయోగిస్తుంటే, రాక్షసులు ధనుర్బాణములు వాడుతున్నారు. కొంత మంది రాక్షసులు తన ధనుస్సులను కిందపడవేసి వానరులతో ముష్టియుద్ధానికి తలపడ్డారు. వానరులు మాత్రము రాళ్లతోనూ వృక్షములతోనూ రాక్షసులను హతమారుస్తున్నారు. వజ్రదంష్ట్రుడు ధనుర్బాణములను ధరించి అపర యముని వలె యుద్ధంచేస్తున్నాడు. రాక్షససేనలు కూడా అధిక సంఖ్యలో వానరులను సంహరిస్తున్నారు.

అది చూచిన అంగదుడు కోపంతో ఊగిపోయాడు. రాక్షసులను అందరినీ ఊచకోత కోసాడు. దొరికిన వాడిని దొరికినట్టు చంపాడు అంగదుడు. అంగదుని చేతిలో చిక్కిన రాక్షసులు ప్రాణాలతో తప్పించుకోవడం లేదు. మొదలు నరికిన చెట్లమాదిరి కూలి పోతున్నారు. అంగదుని ధాటికి రాక్షస సేనలు తట్టుకోలేకపోతున్నాయి.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఏబది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## ఏబది నాలుగవ సర్గ.

వానర నాయకుడు అంగదుని విజృంభణ, రాక్షస సైన్యము అంతకంతకూ తగ్గిపోవడం గమనించాడు వజ్రదంష్ట్రుడు. అతనిలో క్రోధము తారస్థాయికి చేరింది. తన ధనుస్సును ఎక్కుపెట్టి వానర సేనల మీద శరవర్షము కురిపించాడు. వజ్రదంష్ట్రుని అండచూచుకొని రాక్షసులు కూడా విజృంభించారు. ఇది చూచిన వానరులు చేతికి అందిన పర్వతశిలలను పెకలించి రాక్షసులమీదికి విసిరి, వారిని నుగ్గునుగ్గుచేస్తున్నారు.

రాక్షసులు వివిధ ఆయుధముల తోనూ వానరులు వృక్షములు, పర్వతశిలలతోనూ యుద్ధం చేస్తున్నారు. రాక్షసులు ప్రయోగించిన ఆయుధములను కాచుకుంటూ, పర్వతశిలలనూ, వృక్షములనూ రాక్షసుల మీదకు విసురుతున్నారు వానరులు. ఇరుపక్షములలో ఉన్న సైనికులకు తలలు తెగిపోయాయి. కాళ్లు చేతులు తెగిపోయాయి. వారి శరీరముల నుండి కారిన రక్తము ఏరులైపారుతూ ఉంది. ఆ శరీరములను తినడానికి కాకులు గద్దలు ఆకాశంలో తిరుగుతున్నాయి.

ఆ దృశ్యములను చూచిన పిరికి వారికి గుండె ఆగిపోవడం ఖాయం. అంత ఘోరంగా ఉంది రణరంగము. కాని ఎక్కువగా రాక్షససైన్యమునకే నష్టం జరిగింది. ఇది చూచిన వజ్రదంష్ట్రుడు తానే స్వయంగా వానర సేనను ఎదుర్కొన్నాడు. ఒక్కొక్క

బాణానికి ఐదుగురు, పదిమంది, వానరులను చంపుతున్నాడు. వానరుల తలలు బంతుల మాదిరి ఎగురుతున్నాయి.

ఇది చూచిన వానరులు అంగదుని వద్దకు పరుగెత్తారు. అంగదుడు విషయం తెలుసుకొని తానే స్వయంగా వజ్రదంష్ట్రుని ఎదుర్కొన్నాడు. ఇద్దరికీ ఘోరంగా యుద్ధం జరిగింది. వజ్రదంష్ట్రుడు తన బాణములతో అంగదుని శరీరం తూట్లు పడేట్టు కొట్టాడు. అంగదుడు కోపించి వజ్రదంష్ట్రుని మీదకు ఒక వృక్షాన్ని విసిరాడు. ఆ వృక్షాన్ని వజ్రదంష్ట్రుడు తన బాణములతో తుత్తునియలు చేసాడు. అంగదుడు ఒక పెద్ద పర్వతమును పెకలించి వజ్రదంష్ట్రుని మీదికి విసిరాడు. అది చూచిన వజ్రదంష్ట్రుడు గద తీసుకొని రథము నుండి కిందికి దుమికాడు.  అంగదుడు  విసిరిన పర్వతము వజ్రదంష్ట్రుని రథమును నుగ్గునుగ్గు చేసింది.

వజ్రదంష్ట్రుడు తన గదతో అంగదుని గుండెలమీద మోదాడు. తరువాత అంగదుడు, వజ్రదంష్ట్రుడు ఒకరితో ఒకరు ముష్టియుద్ధము చేసారు. అంగదుడు ఒక వృక్షమును పెకలించి చేత ధరించాడు. వజ్రదంష్ట్రుడు ఏమరిపాటుగా ఉన్నప్పుడు అంగదుడు ఆ వృక్షమును వజ్రదంష్ట్రుని మీదకు విసిరాడు. ఆ వృక్షము తగిలి వజ్రదంష్ట్రుడు కిందపడ్డాడు. తరువాత అంగదుడు ఒక కత్తితీసుకొని అతని తల తెగనరికాడు.  వజ్రదంష్ట్రుని శరీరం రెండు ముక్కలయింది. అతని ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి.

తమ నాయకుడు వజ్రదంష్ట్రుడు దారుణంగా మరణించడం చూసిన రాక్షస సైన్యము లంక వైపు పారిపోయారు. వజ్రదంష్ట్రుని చంపిన అంగదుని వానరనాయకులు అంతా ప్రశంసించారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఏబది నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
ఏబది ఐదవ సర్గ.

తాను పంపిన వజ్రదంష్ట్రుడు అంగదుని చేతిలో మరణించాడు అన్న వార్త రావణునికి తెలిసింది. వాడిని పంపినంత సేపు పట్టలేదు వాడు చచ్చాడు అన్న వార్త వినడానికి. మరొకడిని పంపడం కన్నా వేరే మార్గము కనిపించడం లేదు రావణునికి. రావణుడు వెంటనే అకంపనుడు అనే సేనానాయకుడిని పిలిపించాడు.

అకంపనుడు మహాయోధుడు. వాడికి యుద్ధము లేకపోతే నిద్రపట్టదు. రామలక్ష్మణులను, సుగ్రీవుడిని అకంపనుడు చంపగలడు అనే విశ్వాసము రావణునికి ఉంది. అకంపనుడి పరాక్రమం ముందు దేవతలు కూడా నిలువలేరు. అందుకని ఈసారి రామలక్ష్మణులను చంపే బాధ్యతను అకంపనుడికి అప్పగించాడు రావణుడు. రావణుని ఆజ్ఞను శిరసావహించిన అకంపనుడు తన అధీనంలో ఉన్న రాక్షస

సైన్యమును యుద్ధమునకు సిద్ధం చేసాడు. వారు రకరకాలైన ఆయుధములు ధరించి అకంపనుడి వెంట యుద్ధమునకు బయలుదేరారు.

అకంపనుడు తన రథమును ఎక్కి సైన్యమును ముందుండి నడిపించాడు. కాని ఎందుకో అకంపనుడి రథమునకు కట్టిన గుర్రములు దీనంగా కదులుతున్నాయి. దానికి తోడు అకంపనుడి ఎడమ కన్ను అదిరింది. ఎన్నో అపశకునములు కనిపించాయి. కాని అకంపనుడు తన పరాక్రమాన్ని నమ్ముకున్నాడు. ఈ అపశకునములను లెక్కచేయలేదు. కదనరంగానికి బయలుదేరాడు.

రాక్షస సేనలు అకంపనుడి నాయకత్వంలో రావడం చూచి వానరులు కొంచెం భయపడ్డారు. కాని అంతలో తేరుకొని రాక్షసులతో తలపడ్డారు. వానరులు రాక్షసులు సమ ఉజ్జీలే. ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు. వానరులు రాక్షసులు ఒకరితో ఒకరు యుద్ధం చేస్తుంటే వారి పాదఘట్టనలకు దుమ్ము పైకి లేచింది. ఆ దుమ్ములో ఎదుటి వారు కూడా కనపడటం లేదు. ఆ కారణంగా ఒక్కోసారి రాక్షసులను రాక్షసులు, వానరులను వానరులే చంపుకుంటున్నారు. వారి రక్తంతో తడిసిన యుద్ధభూమి అంతా బురద బురదగా మారింది.

వానరములు వృక్షములతోనూ, పెద్ద పెద్ద శిలలతోనూ, రాక్షసులు గదలు, పరిఘలు, తోమరములతోనూ, వానరులు తమ బాహువులతోనూ తమ శత్రువులను చంపుతున్నారు. రాక్షసులు తమచేతిలో ఉన్న ఆయుధములతో వానరులను కొట్టి చంపుతున్నారు.

అకంపనుడు కూడా వానరులను ఊచకోత కోస్తూ రాక్షస సేనలకు ఆనందం కలిగిస్తున్నాడు.

వానరులు కూడా పెద్ద పెద్ద శిలలను వృక్షములను రాక్షసుల మీదికి విసిరి వారిని నుగ్గు నుగ్గు చేస్తున్నారు. కుముదుడు, నలుడు, మైందుడు మహా వేగంతో కదులుతూ రాక్షసులను తునుమాడుతున్నారు. ఆ ప్రకారంగా వానరులకు రాక్షసులకు ఘోరంగా యుద్ధం జరుగుతూ ఉంది.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము యాభైఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## యాభై ఆరవ సర్గ.

వానర వీరులు  రాక్షస సేనలను ఊచకోత కోస్తూ ఉండడంతో అకంపనుడికి కోపం వచ్చింది.  దనుష్టంకారము కావించి తన సారథితో ఇలా అన్నాడు. "ఓ సారథీ! అక్కడ ఆ వానర వీరులు మన రాక్షస సేనలను చంపుతున్నారు. కేవలము ఏ ఆయుధమూ లేకుండా చెట్లను, బండరాళ్లను ఉపయోగించి మన వాళ్లను నుగ్గు నుగ్గు చేస్తున్నారు.  మన రథమును అక్కడకు పోనివ్వు." అని అన్నాడు. వెంటనే అకంపనుడి సారథి రథమును వారి వంకకు పోనిచ్చాడు.

అకంపనుడు తన ధనుస్సునుండి బాణములను వానరుల మీద  వర్షము వలె కురిపిస్తున్నాడు. అకంపనుడి శరముల ధాటికి

తట్టుకోలేక వానరులు పారిపోతున్నారు. దూరంనుండి ఇదంతా చూచాడు హనుమంతుడు. వెంటనే అకంపనుడు యుద్ధం చేసే చోటికి వెళ్లాడు హనుమంతుడు. హనుమంతుడు రావడం చూచిన వానరులు, ధైర్యం తెచ్చుకొని హనుమంతుడి చుట్టు చేరారు. హనుమంతుని చూడగానే వారి బలం రెట్టింపు అయింది. ఇది చూచిన అకంపనుడు హనుమంతుని మీద శరవర్షము కురిపించాడు. కాని హనుమంతుడు తన శరీరములో గుచ్చుకుంటున్న బాణములను లెక్కచేయడం లేదు. అకంపనుడిని ఎలా చంపడమా అని ఆలోచిస్తున్నాడు.

హనుమంతుడు పెద్దగా అరుస్తూ వికటాట్టహాసం చేస్తూ అకంపనుడి మీదికి వెళ్లాడు. అకంపనుడి మీదికి దూకుతున్న హనుమంతుడు అగ్నిగోళము మాదిరి ఉన్నాడు. పక్కనే ఉన్న ఒక కొండను  పెకలించాడు. దానిని గిరా గిరా తిప్పుతూ అకంపనుడి మీదికి వెళ్లాడు. ఇది చూచిన అకంపనుడు అర్ధచంద్రాకృతిలో ఉన్న బాణములతో ఆ కొండను చీల్చాడు. అది చూచిన హనుమంతునికి కోపం వచ్చింది. అటు ఇటు చూచి ఒక పెద్ద మద్దిచెట్టును కూకటి వేళ్లతో సహా పెకలించాడు. దానిని తన చేతులతో గిరా గిరా తిప్పాడు. ఆ మద్దిచెట్టుతో హనుమంతుడు రాక్షసులను, వారి రథములను, సారథులను, ఏనుగులను, హయములను  చావగొడుతున్నాడు. చేతిలో గద పట్టుకొని ఉన్న యముని మాదిరి హనుమంతుడు తన చేతిలోని మద్దిచెట్టుతో  రాక్షసులను సంహరిస్తున్నాడు. ఏ రాక్షసుడు కూడా  హనుమంతుడి ఎదుట పడటానికి సాహసించడం లేదు. పక్కకు తిరిగి పారిపోతున్నారు.

అది చూచిన అకంపనుడు బిగ్గరగా కేకలు పెట్టాడు. హనుమంతుడి మీద పదునాలుగు వాడి అయిన బాణములను ప్రయోగించాడు. ఆ బాణములు హనుమంతుని శరీరాన్ని చీల్చాయి. నారాచ బాణములు హనుమంతుని శరీరం నిండా గుచ్చుకున్నాయి. హనుమంతుడు మరొక వృక్షమును పెకలించి చేతిలో ధరించి, దానితో అకంపనుడి తలమీద బలంగా మోదాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక అకంపనుడు నేల మీద పడి గిలా గిలా కొట్టుకుంటూ మరణించాడు.

తమ నాయకుడు అకంపనుడు మరణించడం చూచిన రాక్షస వీరులు భయంతో వణికిపోయారు. పారి పోయారు. పారి పోతున్న రాక్షసులను వానరులు తరిమి తరిమి కొట్టారు. నేల మీద పడేసి ఈడ్చారు. కాళ్లతో మర్దించారు. రాక్షసులు ప్రాణాలు అరిచేతిలో పెట్టుకొని, మాటి మాటికీ వెనక్కు తిరిగి చూస్తూ, తమను వెంబడిస్తున్న వానరులను తప్పించుకుంటూ పరుగెడుతున్నారు. రాక్షసులందరూ లంకానగరంలోకి ప్రవేశించారు. అకంపనుడిని చంపిన హనుమంతు డిని వానర నాయకులు అందరూ వేనోళ్ల ప్రశంసించారు. రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు హనుమంతుని అభినందించారు. ఆ ప్రశంసలను, అభినందనలను వినయంగా స్వీకరించాడు హనుమంతుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము యాభైఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## యాభై ఏడవ సర్గ.

రామలక్ష్మణులను, సుగ్రీవుడిని చంపడానికి పంపబడిన అకంపనుడు హనుమంతుని చేతిలో వధింపబడ్డాడు అన్న విషయం తెలిసిన రావణుడుకి మతిపోయింది. కోపంతో ఊగిపోయాడు. కాని అంతలోనే రావణుని ముఖంలో దైన్యం తొంగి చూచింది. ఎందుకిలా జరుగుతూ ఉంది. ఇంతమంది వీరాధివీరులు ఎందుకు మరణిస్తున్నారు అని అంతర్మథనం చేసుకున్నాడు. కాని పైకి మాత్రం గంభీరంగా ఉన్నాడు. వెంటనే మంత్రి మండలిని పిలిపించాడు. వారితో మంతనాలు జరిపాడు.

సేనలను వారి వ్యూహములను సమీక్షించడానికి రాచమందిరం లో నుండి లంకానగరంలోకి వెళ్లాడు. సర్వసైన్యాధ్యక్షుడు ప్రహస్తుని చూచాడు. అతనితో ఇలా అన్నాడు. "ప్రహస్తా! లంకానగరాన్ని శత్రువులు ముట్టడించారు. మనకు యుద్ధం చేయడం తప్ప మరోమార్గం కనిపించడం లేదు. ఇప్పటి దాకా ఒకరి వెంట ఒకరు యోధానుయోధులు యుద్ధానికి వెళుతున్నారు, అందరూ మరణిస్తున్నారు. ఒక్కరూ విజయులై తిరిగి రావడం లేదు. గెలుపుజాడ కనపడటం లేదు.

సర్వసేనాధిపతి వైన నువ్వు, నికుంభుడు, నా తమ్ముడు కుంభకర్ణుడు, నా కుమారుడు ఇంద్రజిత్తు, ఆఖరున నేను, వీరు

మాత్రమే ఈ యుద్ధము అనే మహాసముద్రమును తరించగలము అనిపిస్తూ ఉంది. అందుకని నీవు సర్వసైన్యములతో వెళ్లి వానరులతో యుద్ధము చేసి విజయం సాధించు. నీవు వస్తున్నావని తెలిసి వానర సేన దిక్కులు పట్టి పారిపోగలదు. వానరులకు స్థిరత్వము లేదు. చపలులు, వారికి యుద్ధవిద్యలో శిక్షణ లేదు. ఆటవికులు. చెట్లు బండరాళ్లు వాళ్ల ఆయుధములు. మీరు యుద్ధవిద్యలో సుశిక్షితులు. మీరు వస్తున్నారని తెలిసి వానరులు పారిపోవడం నీవే కళ్లారా చూస్తావు. వానర సైన్యము పారిపోయిన తక్షణం రాముడు, లక్ష్మణుడు నీకు లొంగిపోతారు.

మరొక మాట. యుద్ధములో జయాపజయాలు దైవాధీనాలు. నీవు జయించవచ్చు పరాజయం పొందవచ్చు. కానీ యుద్ధం చేయడం మన ప్రస్తుత కర్తవ్యము. నీవు యుద్ధానికి వెళ్లకపోతే మనకు పరాజయం తప్పదు. నిశ్చిత మైన ఫలితం కన్నా, సందేహాస్పదమైన ఫలితం మేలు కదా! ఉన్న విషయాలు అన్నీ విపులంగా చెప్పాను. ఈ సమయంలో మనకు అనుకూలమైన నిర్ణయం తీసుకో." అని అన్నాడు రావణుడు.

ఆ మాటలు విన్న ప్రహస్తుడు ఇలా అన్నాడు. "ఓ రాక్షసేంద్రా! యుద్ధము విషయం గురించి మనం మంత్రి మండలిలో ఎన్నోసార్లు చర్చించాము. దీని గురించి మన మధ్య వాదోపవాదాలు జరిగాయి. మంత్రి మండలి సమావేశాలలో నేను "సీతను రామునికి ఇచ్చి యుద్ధం నివారించడం శ్రేయస్కరము" అని ఎన్నోసార్లు చెప్పాను. సీతను రామునికి ఇవ్వకపోతే యుద్ధం తప్పదని హెచ్చరించాను. కాని

నీ ఆగ్రహానికి గురి అయ్యాను.

ఓ రాజా! నేను నీ వద్ద పనిచేస్తున్నాను. నీ వలన ఎన్నో సన్మానాలు, సత్కారాలు, బహుమానాలు పొందాను. అటువంటి నీకు ఆపత్కాలంలో ఆదుకోకుండా ఉంటానా! నీ కొరకు నేను యుద్ధం చేస్తాను. నీ కొరకు ఆత్మార్పణము చేసుకుంటాను. నాకు నా భార్యబిడ్డలు, బంధువులు స్నేహితులు ముఖ్యం కాదు. నా రాజు, నా కర్తవ్య నిర్వహణ, నాకు ముఖ్యం. నీ మాట ప్రకారము నేను యుద్ధానికి వెళుతున్నాను." అని అన్నాడు ప్రహస్తుడు.

వెంటనే తన సైన్యాధ్యక్షులను సైన్యాలను సిద్ధం చేయ మన్నాడు. లంకా నగరంలో ఉన్న సైనికులు అందరూ యుద్ధానికి సిద్ధం అయ్యారు. రావణుని విజయం కొరకు యజ్ఞములు చేసారు. హోమాలు చేసారు. ఆ హోమాగ్నులలో పునీతమైన మాలలను రాక్షస వీరులు ధరించారు. ప్రహస్తుడు యుద్ధభేరీ మోగించాడు. ప్రహస్తుడు చక్కగా అలంకరింపబడిన రథాన్ని ఎక్కాడు. ఆ రథానికి మంచి జాతి అశ్వాలు కట్టబడి ఉన్నాయి. తన వెంట అశేష సైన్యము రాగా యుద్ధానికి బయలుదేరాడు ప్రహస్తుడు.

భేరీ నినాదాలు, శంఖధ్వనులు మిన్నుముట్టాయి. ప్రహస్తునికి నలువైపులా నరాంతకుడు, కుంభహనువు, మహానాదుడు, సమున్నతుడు, అనే రాక్షసనాయకులు వారి వారి రథాల మీద బయలుదేరారు. ప్రహస్తుడు లంకానగరము తూర్పుద్వారము నుండి బయటకు వచ్చాడు. ఆ ప్రకారంగా ప్రహస్తుడు యుద్ధానికి వెళుతూ ఉంటే, అపశకునాలు ఎన్నో కనపడ్డాయి. కాని ప్రహస్తుడు వాటిని

లక్ష్యపెట్టలేదు.

ప్రహస్తుని అతని సైన్యమును చూచారు వానరులు. చేతికి అందిన బండరాళ్లను, చెట్లను ఆయుధములుగా ధరించారు. అటు రాక్షసులు, ఇటు వానరులు భయంకరంగా అరుస్తున్నారు. కేకలు పెడుతున్నారు. తమదే విజయమని ఉత్సాహంగా రంకెలు వేస్తున్నారు. ప్రహస్తుడు తన రథాన్ని సుగ్రీవుడు ఉన్న వంకకు పోనిచ్చాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము యాభైఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## యాభైఎనిమిదవ సర్గ.

అట్టహాసంగా యుద్ధానికి వస్తున్న ప్రహస్తుని చూచాడు రాముడు. చిరునవ్వు నవ్వాడు. విభీషణునితో ఇలా అన్నాడు. "విభీషణా! ఈ రాక్షస వీరుడు, సైన్యాధిపతి ఎవరు? ఇతని పేరు ఏమిటి? ఇతని బలపరాక్రమములు ఎట్టివి? ఇతనిని గురించి సవిస్తరంగా చెప్పు." అని అని అడిగాడు రాముడు.

" ఇతని పేరు ప్రహస్తుడు. రావణుని రాక్షస సేనలకు అధిపతి. లంకలో ఉన్న మూడు వంతుల సేనలకు అధిపతి ఇతడే. ఇతడు మహా శూరుడు, పరాక్రమవంతుడు. అస్త్రవిద్యానిపుణుడు." అని అన్నాడు విభీషణుడు.

ఇంతలో ప్రహస్తుడు తన రాక్షస సేనలను వానర సేనల మీదికి పురికొల్పాడు. వానరులు పర్వతములను, బండరాళ్లను, వృక్షములను చేత ధరించి రాక్షసుల మీదికి పరుగెత్తారు. వానరులు రాక్షసులు ఒకరి మీద ఒకరు బండరాళ్లను, వృక్షములను, అస్త్రశస్త్రములను విసురుతున్నారు. వానరులకు రాక్షసులకు గొప్పయుద్ధము జరిగింది.

ఒకరిని ఒకరు చంపుకుంటున్నారు. ఇరు పక్కలా సైన్యం నష్టపోతున్నారు. రక్తం ఏరులైపారుతూ ఉంది. కొంతమంది శరీరాల్లో శూలాలు గుచ్చుకుంటున్నాయి. కొంతమంది పరిఘలతో కొట్టబడ్డారు. మరి కొంతమంది పర్వతశిఖరముల కిందపడి నలిగిపోతున్నారు. రాక్షసులు వానరులను తమ వద్ద ఉన్న  కత్తులతో రెండుగా చీలుస్తున్నారు. వానరులు చెట్ల తోనూ కొండలతోనూ రాక్షసులను పిండి పిండి చేస్తున్నారు. వానరులు చేతులతోనూ కాళ్లతోనూ మర్దిస్తుంటే రాక్షసులు మాంసపు ముద్దలుగా మారిపోతున్నారు. ఒక పక్క దీనాలాపాలు మరొక పక్క సింహనాదాలు, విజయలక్ష్మి అటు ఇటు దోబూచులాడుతూ ఉంది.

ప్రహస్తుని మంత్రులు అయిన నరాంతకుడు, కుంభహనువు, మహానాదుడు, సమున్నతుడు కలిసి కట్టుగా వానరులను ఊతకోత కోస్తున్నారు. ఇంతలో ద్వివిదుడు ఒక పర్వత శిఖరముతో నరాంతకుడిని తుదముట్టించాడు. దుర్ముఖుడు ఒక చెట్టును సమున్నతుడు అనే రాక్షసుని  మీదికి విసిరి వాడిని చంపాడు. జాంబవంతుడు ఒక పెద్ద బండరాయిని  మహానాదుని గుండెల మీద

పడేసాడు. దాని కింద పడి మహానాదుడు గుండెలు పగిలి చచ్చాడు. తారుడు ఒక పెద్ద చెట్టును పెకలించి దానిని కుంభహనువు మీదికి విసిరాడు. ఆ చెట్టు కిందపడి నలిగిపోయిన  కుంభహనువు కుంభాన్ని తన్నేసాడు.

తన అనుచరులు అంతా అంతం కాగా ప్రహస్తుడు చలించిపోయాడు. వానరుల మీద పట్టరాని కోపంతో శరవర్షం కురిపించాడు. ప్రహస్తుని వీరవిహారానికి వానరులు తట్టుకోలేక పోయారు. కుప్పలు కుప్పలుగా చచ్చి పడిపోతున్నారు. ప్రళయకాల రుద్రునిలా చెలరేగిపోతున్నాడు ప్రహస్తుడు. అతని బాణధాటికి వానరులు నిలువలేకపోయారు. వానర వీరులు కూడా రాక్షసులను అసంఖ్యాకంగా నేలకూలుస్తున్నారు. వానరుల, రాక్షసుల, మృత కళేబరాలతో యుద్ధభూమిలో భూమి కనపడటం లేదు. శవాల కుప్పలు పరిచినట్టు ఉంది. యుద్ధభూమి అంతా రక్తంతో బురద బురద గా తయారయింది. సైనికులు తిరగడానికి కూడా కష్టంగా ఉంది.

కాని ప్రహస్తుడు తన బాణవర్షము కురిపించడం మానలేదు. అది చూచాడు నీలుడు. ప్రహస్తుని నిలువరించకపోతే ఆ రాత్రే యుద్ధం అంతం అయేట్టు ఉందని అనుకున్నాడు. తెగించి ప్రహస్తుని రథం మీదికి దూసుకు వెళ్లాడు. ప్రహస్తుడు కూడా నీలుని లక్ష్యంగా చేసుకొని బాణప్రయోగం చేస్తున్నాడు. ప్రహస్తుడు ప్రయోగించిన బాణములు నీలుని శరీరాన్ని తాకి నేలమీద పడుతున్నాయి. నీలుడు ఒక పెద్ద వృక్షాన్ని పెకలించాడు. ఆ వృక్షంతో ప్రహస్తుని మోదాడు. ఆ దెబ్బ తప్పించుకున్న ప్రహస్తుడు నీలుని మీద శరవర్షము కురిపించాడు. చేసేది లేక ఆ బాణ వర్షంలో

తడుస్తున్నాడు నీలుడు.

ఓపఎడ్లయలరోలఅవకాశం కోసం ఎదురుచూస్తున్న నీలుడు పెద్ద సాలవృక్షములు పెకలించి దాని తో ముందు ప్రహస్తుని రథమునకు కట్టిన గుర్రములను చంపాడు. అదే సాలవృక్షంతో మరొక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు ప్రహస్తుని విల్లు విరిగింది. నీలుడు పెద్దగా సింహనాదం చేసాడు. విల్లు విరగ గానే ప్రహస్తుడు ఒక ముసలమును ఆయుధంగా తీసుకొని రథం దిగాడు. అటు నీలుడు ఇటు ప్రహస్తుడు ఇరువురి శరీరముల నిండా రక్తం కారుతూ ఉంది. ఒకరి ఎదురుగా ఒకరు రెండు కొండలవలె నిలబడి ఉన్నారు. మదం కారుతున్న ఏనుగుల వలె ఉన్నారు. ఒకరితో ఒకరు తలపడ్డారు. పులులు సింహాలు కొట్టుకుంటున్నట్టు కొట్టుకుంటున్నారు. ఇద్దరూ వీరులే. ఒకరిక ి ఒకరు తీసిపోరు.

ప్రహస్తుడు నీలుడి లలాటభాగం మీద ముసలంతో కొట్టాడు. నీలుడు ఒక వృక్షం తీసుకొని ప్రహస్తుని గుండెల మీద కొట్టాడు. ఆ దెబ్బను తప్పించుకొన్న ప్రహస్తుడు తన ముసలంతో నీలుని మీదికి ఉరికాడు. తన మీదికి వస్తున్న ప్రహస్తుని చూచి నీలుడు ఒక పెద్ద బండరాయి తీసుకున్నాడు. ఆ బండరాయితో ప్రహస్తుని తలమీద గట్టిగా మోదాడు. ఆ దెబ్బకు ప్రహస్తుని తల పగిలింది. ముక్కలు ముక్కలు అయింది. మొదలు నరికిన వృక్షం వలె ప్రహస్తుడు నేలకూలాడు. ప్రాణాలు వదిలాడు.

తమ సేనానాయకుడు నేలకూలడంతో రాక్షస సేనలకు ధైర్యం సడలిపోయింది. లంక వైపుకు పారిపోయారు. గట్టు తెగిన ఏరు

మాదిరి రాక్షస సేనలు పారిపోతున్నారు. వారిని లంకాద్వారం దాకా తరిమారు వానరులు. రాక్షసులు అందరూ రావణుని వద్దకు వెళ్లారు. కాని వాళ్లనోటమాట రాలేదు. రావణుని వంక అలా చూస్తూ నిలబడ్డారు. ఇక్కడ ప్రహస్తుని చంపిన నీలుని మీద ప్రశంసల జల్లు కురుస్తూ ఉంది. రామలక్ష్మణులు నీలుని మనసారా అభినందించారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఏబది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## ఏబది తొమ్మిదవ సర్గ.

నీలుడి చేతిలో ప్రహస్తుడు చావడం చూచిన రావణ సేనలు లంకలోకి పారిపోయాయి. అందరూ గబా గబా వెళ్లి నీలుడి చేతిలో ప్రహస్తుడు మరణించాడు అన్న వార్త రావణునితో చెప్పారు. రావణుని మనసులో కోపము, శోకము, బాధ అన్నీ ఒకేసారి కలిగాయి. ఇతర సేనాధి పతులను చూచి రావణుడు ఇలా అన్నాడు.

"సేనానాయకులారా! నేను ఇప్పటిదాకా ఓర్పు వహించాను. నా సహనం నశించింది. నా ప్రధాన సేనానాయకులను చంపిన వారిని నేను ఇంక ఎంత మాత్రమూ ఉపేక్షించలేను. నేను స్వయంగా యుద్ధరంగమునకు పోవలెనని నిశ్చయించుకున్నాను. అగ్నిగోళముల వంటి నా బాణములతో శత్రువులను నిర్మూలిస్తాను. వానరుల రక్తంతో భూదేవిని తృప్తిపరుస్తాను. రామలక్ష్మణులు నా బాణములకు ఆహుతి

కాక తప్పదు." అని పలికాడు వెంటనే తన రథమును ఎక్కాడు.

స్వయంగా రావణుడే యుద్ధరంగానికి బయలు దేరడం చూచిన రాక్షస సైన్యము ఉత్సాహంతో ఉరకలు వేసింది. తన సేనలు వెంటరాగా రావణుడు లంకా ద్వారము నుండి బయటకు వచ్చాడు. వానర సేనను తేరిపార చూచాడు. రాముడు రావణుని అతని సేనలను చూచాడు. విభీషణునితో ఇలా అన్నాడు. "ఇప్పుడు యుద్ధానికి వస్తున్నది ఎవరు? ఈ భయంకర సైన్యము ఎవరిది? ఇందులో ప్రముఖులు ఎవరు? ఇందులో గజబలము ఎక్కువగా ఉంది. సైన్యము అంతా ఖడ్గములు, శూలములు ధరించి ఉన్నారు. వీరిని గురించి వివరంగా చెప్పు." అని అడిగాడు.

దానికి విభీషణుడు ఇలా బదులు చెప్పాడు. "అదుగో ఏనుగును ఎక్కి వస్తున్నవాడు అకంపనుడు అనే రాక్షస సైన్యాధినేత. సింహమును తన ధ్వజముగా ధరించిన వాడు ఇంద్రజిత్తు. అతడు అజేయుడు. గొప్ప పరాక్రమ వంతుడు. వరగర్వి. ఆ పక్కనే వస్తున్న కొండంత శరీరము కలవాడు అతికాయుడు. ఏనుగును ఎక్కి ఉదయించిన సూర్యుని వలె ఎర్రగా ప్రకాశిస్తున్నవాడు మహోదరుడు. ప్రాసాయుధమును ధరించి, గుర్రము మీద ఠీవిగా వస్తున్నవాడు పిశాచుడు. వాడు పిడుగుతో సమానము. తెల్లటి ఎద్దును ఎక్కి, శూలమును చేతిలో ధరించి, వేగంగా వస్తున్నవాడు త్రిశిరస్కుడు. సర్పాన్ని చిహ్నంగా ధరించి ధనుష్టంకారము చేస్తున్నవాడు కుంభుడు. చేతిలో పరిఘను ధరించి ఉత్సాహంతో ఉరకలు వేస్తూ వస్తున్నవాడు నికుంభుడు. ఆ పక్కనే రథం మీద వస్తున్నవాడు నరాంతకుడు. వీడి ముందు దేవ,దానవ,గంధర్వ,యక్షులు నిలబడి యుద్ధం చేయలేరు.

అందుకని వీడు పర్వతములతో యుద్ధం చేస్తుంటాడు.

వారందరి మధ్యలో రౌద్రరూపంతో వెలిగిపోతున్నవాడు రావణుడు. లంకాధి నేత. ఈ యుద్ధానికి కారకుడు. అతని రథము మీద శ్వేతఛత్రము ఎగురుతూ ఉంది. రావణుడు, యముని దేవేంద్రుని గర్వం అణిచినవాడు. అపజయము ఎరుగని వాడు. అతడే నీ శత్రువు రావణుడు." అని పలికాడు విభీషణుడు.

రావణుని వంక అదేపనిగా చూచాడు రాముడు. "ఆహా! ఏమి తేజస్సు. మధ్యందిన మార్తాండుని ఎలా చూడలేమో అదే తేజస్సుతో ప్రకాశిస్తున్న రావణుడు కూడా చూడశక్యముకాకున్నాడు. కళ్లు మిరిమిట్లుకొలుపుతున్నాడు. దేవదానవులకు కూడా ఇంతటి ప్రకాశము, తేజస్సు ఉండదు. సాక్షాత్తు యమధర్మరాజు నడిచి వస్తున్నాడా అన్నట్టు ఉంది. విధి వశాత్తు ఈ పాపాత్ముడు నా కంటపడ్డాడు. వీడికి చావు తప్పదు." అనుకున్నాడు రాముడు.

రామలక్ష్మణులు తమ ధనుస్సులను సంధించారు. రావణుడు తన సేనానాయకులను చూచి "మీరందరూ నగర ద్వారములను, భవనములను, ప్రధాన మార్గములను రక్షించండి. నేను రామలక్ష్మణులను నిరోధిస్తాను." అని అన్నాడు. రావణుని ఆజ్ఞ ప్రకారము సేనానాయకులు నగర రక్షణ కొరకు వెళ్లారు. రావణుడు వానర సైన్యములోకి చొచ్చుకుపోయాడు. ఇది చూచిన సుగ్రీవుడు పెద్ద పర్వత శిఖరమును పెకలించి చేత ధరించి రావణుని వంకకు దూసుకుపోయాడు. ఆ పర్వత శిఖరమును రావణుని వంకకు

బలంగా విసిరాడు. రావణుడు ఆ పర్వతశిఖరమును తనబాణములతో ఛేదించాడు.

వెంటనే రావణుడు మహా సర్పము వంటి బాణమును సంధించి సుగ్రీవుని మీదికి ప్రయోగించాడు. ఆ బాణము సుగ్రీవుని శరీరాన్ని చీల్చింది. ఆ శరాఘాతానికి సుగ్రీవుడు పెద్దగా అరిచి స్పృహ తప్పి పడిపోయాడు. అది చూచి రాక్షససేనలు ఆనందంతో కేకలు వేసాయి. ఈ పరాణామాన్ని చూచిన గవాక్షుడు, గవయుడు, సుషేణుడు, ఋషభుడు, జ్యోతిర్ముఖుడు, నలుడు గబ గబా చేతికి అందిన పర్వతశిఖరములను తీసుకొని రావణుని వైపుకు పరుగెత్తారు. రావణుడు వారి చేతుల్లో ఉన్న పర్వత శిఖరములను తన వాడి అయిన అత్యంత శక్తివంతమైన బాణములతో నుగ్గు నుగ్గు చేసాడు. అంతే కాకుండా వాడి అయిన బాణములతో ఆ వానర వీరుల శరీరాలు తూట్లు పడేట్టు కొట్టాడు రావణుడు. ఆ బాణము దెబ్బలకు తట్టుకోలేక వానర వీరులు కిందపడిపోయారు. "రామా రామా రక్షించు రామా" అంటూ అరుస్తున్నారు.

ఇది చూచి కోపోద్రిక్తుడయ్యాడు రాముడు. వెంటనే తన బాణమును సంధించాడు. అది చూచిన లక్ష్మణుడు రాముడితో ఇలా అన్నాడు. "రామా! ఈ దుష్టుడిని చంపడానికి నీవు బాణం సంధించాలా! నేను లేనూ. నేను ఇతనిని సంహరిస్తాను. నాకు అవకాశం ఇవ్వు." అని అడిగాడు.

"లక్ష్మణా! అలాగే కానీ. కానీ చాలా జాగ్రత్తగా ఉండు. రావణుడు సామాన్యుడు కాడు. అమిత పరాక్రమవంతుడు. శక్తిమంతుడు. అతనికి ఎన్నోవిద్యలు మాయలు తెలుసు. రావణుడు

ఆగ్రహిస్తే మూడులోకాలను భస్మం చేయగలడు. కాబట్టి అతి జాగరూకతతో వ్యవహరించు. లక్ష్మణా! ముందు రావణుని పరిశీలించు. అతనిలో ఉన్న లోపము, బలహీనత గుర్తించు. అదే మాదిరి నీలో ఉన్న లోపాలు, బలహీనతలను కూడా గ్రహించు. తదనుగుణంగా యుద్ధం చేయి. నిన్ను నీవు రక్షించుకోడం మాత్రం మరిచిపోకు. ముందు స్వీయరక్షణ ప్రాధాన్యము. తరువాత శత్రువును చంపడం." అని అన్నాడు రాముడు.

లక్ష్మణుడు రాముడికి నమస్కరించి రావణునితో యుద్ధానికి వెళ్లాడు.ఆ సమయంలో రావణుడు వానరుల మీద బాణాలను వర్షంలాగా కురిపిస్తున్నాడు. ఆ బాణాల ధాటికి తట్టుకోలేక వానరులు చెల్లాచెదరు అయ్యారు. వానరులను చించి చెండాడుతున్న రావణుని చూచాడు లక్ష్మణుడు. రావణుడు వానరులను చంపడం చూచిన హనుమంతుడు రావణుని బాణధాటిని అడ్డుకోడానికి రావణుని మీదికి వెళ్లాడు. హనుమంతుడు వెళ్లి రావణుని రథం ముందు నిలబడి చేయి పైకెత్తి ఇలా అన్నాడు.

"ఓ రావణా! నీవు దేవ, దానవ, యక్ష, గంధర్వులనుండి చావు లేకుండా వరము పొందావు. కానీ మా వానరులను మరిచావు. వానరులంటే నీకు భయం కదా! నా కుడి చేయి నీ శరీరంలో నుండి జీవాత్మను వేరు చేయడం సత్యం. కాచుకో" అన్నాడు హనుమంతుడు.

ఆ మాటలకు రావణుని కళ్లు కోపంతో ఎర్రబడ్డాయి. "ఓ వానరా! నువ్వు అంత బలవంతుడివి అయితా రా! నన్ను కొట్టు. నీ బలం

ఏపాటిదో చూస్తాను. తరువాత నిన్ను చంపుతాను." అన్నాడు రావణుడు విలాసంగా.

"నువ్వు అంత మొనగాడివా! నేను నీ కుమారుడు అక్షయుని చంపాను గుర్తులేదా! అప్పుడేం చేసావు." అని హేళన చేసాడు హనుమంతుడు. ఆ మాటలకు కోపంతో ఊగిపోయాడు రావణుడు. తన అరిచేతితో హనుమంతుని గుండెలమీద చరిచాడు. ఆ దెబ్బకు ముందుకు తూలాడు హనుమంతుడు. కాసేపు నిలదొక్కుకొని హనుమంతుడు  తన అరిచేతితో రావణుని గుండెలమీద చరిచాడు. హనుమంతుని దెబ్బకు రావణుని శరీరం అంతా కంపించింది. పక్కకు తూలాడు. కాసేపు కళ్లు బైర్లు కమ్మాయి. అంతలో స్పృహ తెచ్చుకున్నాడు రావణుడు.

"ఓ వానరా! నీవు నాకు తగ్గ శత్రువు. నీ బలం అమోఘం. నీ పరాక్రమం అద్భుతం." అని అన్నాడు రావణుడు.

"రావణా! ఇదీ ఒక బలమేనా! నేను కొట్టిన దెబ్బకు, దెబ్బ తిన్న వాడు మరుక్షణం మరణించాలి. కాని నీవు ఇంకా జీవించి ఉన్నావంటే నా బలం అంత గొప్పది కాదు. రావణా! మరలా నన్ను ఒకసారి కొట్టు. ఆ కోపంతో తిరిగి నేను నిన్ను కొడతాను. అప్పుడు నీవు యమలోకం చేరుకుంటావు." అని అన్నాడు హనుమంతుడు.

హనుమంతుని మాటలకు రావణుని కోపం తారస్థాయికి చేరుకుంది. తన కుడి చేతి పిడికిలితో హనుమంతుని గుండెల మీద గట్టిగా మోదాడు. రావణుని దెబ్బకు తట్టుకోలేక హనుమంతుడు బాగా తూలిపోయాడు. స్పృహ తప్పాడు. రావణుడు హనుమంతుని వదిలి

నీలుడి వంకకు వెళ్లాడు. రావణుడు నీలుడి మీద సర్పములతో సమానమైన శక్తి కల బాణములను సంధించాడు. నీలుడు ఆ బాణధాటికి తప్పించుకుంటూ రావణుని మీద ఒక పర్వత శిఖరమును విసిరాడు. ఇంతలో  హనుమంతుడికి స్పృహ వచ్చింది. రావణుని వంక చూచాడు. ఆ సమయంలో రావణుడు నీలుడితో యుద్ధం చేస్తున్నాడు. ఇతరులతో యుద్ధం చేసేవాడితో తను యుద్ధం చేయడం మంచిది కాదనుకున్నాడు  హనుమంతుడు.

రావణుడు, నీలుడు తన మీదకు విసిరిన పర్వత శిఖరమును తన బాణములతో తుత్తునియలు చేసాడు. నీలుడు కోపంతో ఊగి పోయాడు. నీలుడు మద్దిచెట్లను, సాలవృక్షములను రావణుని మీదికి విసురుతున్నాడు. రావణుడు ఆ వృక్షములను చించి చెండాడుతూ, నీలుడి మీద శరవర్షము కురిపిస్తున్నాడు. నీలుడు తన శరీరమును చాలా చిన్నదిగా చేసాడు. ఎగురుకుంటూ వెళ్లి రావణుని ధ్వజము మీద కూర్చున్నాడు. నీలుడు ఎక్కడా కనపడలేదు పైకి చూచాడు రావణుడు. తన ధ్వజము మీద  కూర్చుని పెద్దగా అరుస్తున్న నీలుడిని చూచాడు రావణుడు. చిన్ని వానర రూపంలో ఉన్న నీలుడు రావణుని ధ్వజము మీది నుండి రావణుని ధనుస్సు మీదికి దూకి, ధనుస్సు చివర కూర్చున్నాడు, తరువాత రావణుని కిరీటము మీద వాలాడు.

నీలుడి కోతి చేష్టలు చూచి రాముడు, లక్ష్మణుడు, హనుమంతుడు ఆశ్చర్యపోయారు. అది చూచిన వానరులు ఆనందంతో అరుస్తూ గెంతులు వేస్తున్నారు.  నీలుడు అలా తన ఎదురుగా

చురుకుగా ఎగరడం చూచి రావణుడు ఆగ్నేయాస్త్రము తీసుకున్నాడు. వానరుల ఆర్భాటము చూచి రావణునికి ఏమి చెయ్యాలో తోచలేదు. రావణుడు ఆగ్నేయాస్త్రమును నీలుడి మీద సంధించాడు. నీలుని చూచి ఇలా అన్నాడు. "ఓ వానరుడా! నీవు నా ముందు నీ చురుకుదనము మాయలు చూపుతున్నావు. రక రకాల రూపాలతో ప్రత్యక్షం అవుతున్నావు. చేతనైతే ఈ అస్త్రమును కాచుకో. నీ ప్రాణాలు కాచుకో. నీవు ఎన్ని వేషాలు వేసినా ఈ అస్త్రము నీ ప్రాణాలు తీయడం తథ్యం." అని అస్త్రమును ప్రయోగించాడు.

రావణుడు సంధించిన ఆగ్నేయాస్త్రము నీలుడి వక్షస్థలము ను తాకింది. నీలుడు కిందపడిపోయాడు. అగ్నిదేవుని కుమారుడు అవడం వలన నీలుడు ప్రాణాలు పోలేదు. కాని నీలుడు మూర్ఛపోయాడు. రావణుడు నీలుని వదిలి లక్ష్మణుని వంకకు వెళ్లాడు. రావణుడు తన రథము మీద లక్ష్మణుని ముందు నిలిచి ధనుష్టంకారము చేసాడు.

రావణుని చూచి లక్ష్మణుడు ఇలా అన్నాడు. "ఓ రాక్షసరాజా! అస్త్రములంటే తెలియని ఈ వానరులతో యుద్ధము కాదు. నాతో యుద్ధానికి రా!" అని అరిచాడు. ఆ మాటలకు కోపించిన రావణుడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. " ఓ లక్ష్మణా! మరణించే ముందు అంతా ఇలాగే అంటారు. నీ మరణము దైవవశాత్తు నాచేతిలో ఉంది. నా శరముల దెబ్బకు ఇప్పుడే యమపురి చేరుకుంటావు." అని అన్నాడు. దానికి లక్ష్మణుడు దీటుగా జవాబు చెప్పాడు. "ఓ రావణా! పాపాత్ములు ఇలాగే మాట్లాడుతారు. నీతి మంతులు, పరాక్రమ వంతులు, ఇలా మాట్లాడరు. నీ వీర్యము, బలము, శౌర్యము ఏపాటిదో నాకు తెలియదా!

వృధా ప్రేలాపనలు కట్టిపెట్టి యుద్ధానికి దిగు." అని అన్నాడు లక్ష్మణుడు.

ఇంక రావణుడు బదులు చెప్పలేదు. బాణాలతోనే బదులు చెప్పాడు. లక్ష్మణుని మీద వాడి అయిన ఏడు బాణములు ప్రయోగించాడు. వాటిని మధ్యలోనే తుంచాడు లక్ష్మణుడు. తన బాణములు వృధా కావడం చూచి రావణుడు కోపించాడు. మరి కొన్ని వాడి అయిన బాణములను ప్రయోగించాడు రావణుడు. రావణుని విల్లునుండి బాణములు వెలువడగానే అవి లక్ష్మణుని బాణాలకు బలి అవుతున్నాయి. ఒక్కటీ లక్ష్మణుని చేరడం లేదు. లక్ష్మణుని వేగానికి, నిశితమైన లక్ష్యభేదనకు రావణుడు ఆశ్చర్యపోయాడు. మరలా మరలా వాడి అయిన బాణములను లక్ష్మణుని మీద ప్రయోగించాడు. లక్ష్మణుడు కూడా అంతకన్నా వాడి అయిన బాణములను రావణుని మీద ప్రయోగించాడు.

రావణుడు తనకు బ్రహ్మదేవుడు ప్రసాదించిన అస్త్రముతో లక్ష్మణుని లలాట భాగంలో కొట్టాడు. ఆ బాణము దెబ్బకు లక్ష్మణుని కళ్లు తిరిగాయి. చేతిలో ధనుస్సు పట్టుజారి పోయింది. అంతలోనే తేరుకున్నాడు లక్ష్మణుడు. వాడి అయిన ఒకే ఒక బాణంతో రావణుని ధనుస్సు ఖండించాడు. వెంటనే మరొక మూడు బాణములతో రావణుని కొట్టాడు లక్ష్మణుడు. లక్ష్మణుని బాణముల ధాటికి రావణుని శరీరం అంతా రక్తసిక్తమయింది. రావణుని కోపము తారస్థాయికి చేరింది. వెంటనే బ్రహ్మదేవుడు ఇచ్చిన శక్తి అనే అస్త్రమును తీసు కున్నాడు. లక్ష్మణుని మీద ప్రయోగించాడు. ఆ శక్తి అస్త్రము,నిప్పులు పొగలు చిమ్ముకుంటూ లక్షణుని మీదికి వెళ్లింది.

లక్ష్మణుడు ఆ అస్త్రమును నిరోధించడానికి శతవిధాలా ప్రయత్నించాడు. కానీ అతని వల్ల కాలేదు. ఆ శక్తి అస్త్రము లక్ష్మణుని వక్షస్థలమును తాకింది. లక్ష్మణుడు  నేల మీద పడిపోయాడు. కిందపడిపోయిన లక్ష్మణుని చూచిన రావణుడు తన రథమును దిగాడు. లక్ష్మణుని వద్దకు వచ్చాడు. లక్ష్మణుని తన బాహువులతో ఎత్తడానికి ప్రయత్నించాడు. కాని అతని వల్ల కాలేదు. లక్ష్మణుడు శక్తితో కొట్టబడినా స్పృహ కోల్పోలేదు. లోలోపల విష్ణునామ స్మరణ చేస్తున్నాడు. అందుకని శక్తి అస్త్రము లక్ష్మణుని మీద తన ప్రభావమును పూర్తిగా చూపడం లేదు.

రావణుడు శక్తిని ప్రయోగించడం, లక్ష్మణుడు పడిపోవడం, రావణుడు లక్ష్మణుని ఎత్తడం చూచాడు హనుమంతుడు. వెంటనే అక్కడకు వెళ్లాడు. తన పిడికిలి బిగించి రావణుని గుండెల మీద కొట్టాడు. రావణుడు హనుమంతుని దెబ్బకు చలించిపోయాడు. నేల మీద కూలబడిపోయాడు. రావణుని ముఖం నుండి చెవుల నుండి రక్తం కారుతూ ఉంది. క్రమక్రమంగా రావణుడు మూర్ఛపోయాడు. వెంటనే హనుమంతుడు లక్ష్మణుని తన బుజాల మీద ఎత్తుకొని రాముని వద్దకు తీసుకొని వచ్చాడు.

ఇంతలో రావణునికి తెలివి వచ్చింది. తన ధనుర్బాణములను తీసుకొని మరలా తన రథం ఎక్కాడు. నిరంతరము విష్ణునామ స్మరణ చెయ్యడం వల్ల లక్ష్మణుని శరీరంలో గుచ్చుకున్న శరములు అన్నీ నిర్వీర్యములు అయ్యాయి. వెంటనే రాముడు తన ధనుర్బాణములను తీసుకొని రావణుని వంకకు వెళ్లాడు. అది చూచిన హనుమంతుడు రాముని వద్దకు పోయి "రామా!

విష్ణువు గరుడుని మీద  ఎక్కినట్టు నువ్వు నా బుజాల మీద ఎక్కు. రావణుని సంహరించు." అని అన్నాడు. హనుమంతుడు రాముని ముందు మోకరిల్లాడు. రాముడు హనుమంతుని వీపు మీద కూర్చున్నాడు. హనుమంతుడు వాయువేగంతో పైకి ఎగిరాడు. రావణుడు ఉన్న ప్రదేశానికి వెళ్లాడు. రాముడు తన రథంలో కూర్చుని ఉన్న రావణుని చూచాడు. లక్ష్మణుని మీద శక్తిని ప్రయోగించిన రావణుని చూడగానే రామునికి కోపం ఆగలేదు. ధనుస్సును సంధించి రావణుని వంకకు దూసుకుపోయాడు.

రాముడు దిక్కులు పిక్కటిల్లేటట్టు ధనుష్టంకారము చేసాడు. రావణుని చూచి ఇలా అన్నాడు. "ఓ రావణా! నిలువు. పారిపోకు. నాకు ఇంత అపకారం చేసి నువ్వు నా నుండి తప్పించుకోలేవు. నా ఎదుట పడ్డ వాడిని ఇంద్రాది దేవతలు కూడా కాపాడలేరు. నిన్ను కాపాడటం ఆ త్రిమూర్తులకు కూడా శక్యం కాదు. నా తమ్ముడు లక్ష్మణుని నీ శక్తితో కొట్టి సంబరపడుతున్నావేమో. తొందరలోనే లక్ష్మణుడు లేచి నీ మీదికి రాగలడు. నిన్ను బంధుమిత్రసమేతంగా నాశనం చెయ్యగలడు. నా సంగతి నీకు తెలుసు కదా! జనస్థానములో 14000 మంది రాక్షసులను  ఒంటి చేత్తో చంపాను. ఇంక నీవెంత. నీ రాక్షస సేనలు ఎంత. తృటిలో నాశనం చేస్తాను." అని పలికాడు రాముడు.

ఆ మాటలు విన్న రావణుడు కోపంతో మండి పడ్డాడు. తన వాడి అయిన బాణములను రాముని వాహనంగా ఉన్న హనుమంతుని మీద ప్రయోగించాడు. రావణుని బాణముల దెబ్బలు తగిలిన హనుమంతుడు మరింత తేజస్సుతో ప్రకాశించాడు. తనను వదిలి హనుమంతుని మీద రావణుడు బాణములను ప్రయోగించడం చూచి

రాముడు కోపం తెచ్చుకున్నాడు. రాముడు తన వాడి అయిన బాణములతో రావణుని రథమును, రథమునకు కట్టిన గుర్రములను, సారథిని కొట్టాడు. తరువాత లెక్కలేని వాడి అయిన బాణములతో రావణుని వక్షస్థలమును ఛేధించాడు. రావణుని చేతిలోని ధనుస్సు కిందపడిపోయింది. పక్కకు తూలాడు రావణుడు. వెంటనే రాముడు ఒక అర్ధచంద్రబాణంతో రావణుని కిరీటాన్ని కొట్టాడు. రావణుని కిరీటం కిందపడిపోయింది. రావణుడు తన రథం మీద కూలబడ్డాడు.

అప్పుడు రావణుని చూచి రాముడు ఇలా అన్నాడు. "ఓ రావణా! నీవు లెక్కలేనన్ని పాపాలు చేసావు. ఎందరో వానర వీరులను చంపావు. ఇప్పుడు నిన్ను చంపగలను. కాని అలసి పోయి ఉన్నావు. అలసిపోయిన వారిని చంపడం ధర్మం కాదు. కాబట్టి నిన్ను చంపడం లేదు. ఈ రోజుకు లంకకు వెళ్లు. సేదదీరు. రేపు రా. మరొక రథం ఎక్కిరా. అప్పుడు నా పరాక్రమం ఎట్టిదో చూద్దువుగాని." అని అన్నాడు రాముడు.

రాముని మాటలతో రావణుని దర్పం అంతా దిగిపోయింది. దీనంగా చూస్తున్నాడు. మారు మాటాడ కుండా మరొక రథం ఎక్కి లంకకు వెళ్లిపోయాడు రావణుడు. రావణుడు వెళ్లిన తరువాత, రాముడు లక్ష్మణుని శరీరంలో దిగిన బాణములను, వానరుల దేహములో గుచ్చుకున్న బాణములను అన్నీ తీయించాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము యాభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## అరవయ్యవ సర్గ.

రాముడి చేతిలో ఓడి పోయిన రావణుడు అవమాన భారంతో లంకకు వెళ్లాడు. ఏమీ చెయ్యడానికి తోచడం లేదు. ఒక మానవుని చేతిలో ఓటమి రావణునికి చాలా బాధాకరంగా, అవమానకరంగా పరిణమించింది. రామ బాణాలను తలచుకుంటేనే రామునికి కంపరంగా ఉంది.

తన ఆంతరంగికులను పిలిచి ఇలా అన్నాడు. "ఈ రోజు నేను ఒక మానవుని చేతిలో ఓడిపోయాను. నా బలము, పరాక్రమము, నేను చేసిన తపస్సు అంతా వృధా అయిపోయాయి. నేను బ్రహ్మను వరము కోరునపుడు మానవులను బలహీనులుగా తలంచి వారి వలన కూడా చావు లేనట్టు వరకు కోరలేదు. అప్పుడే బ్రహ్మ నాకు మానవుల వలన కీడు ఉందని చెప్పాడు. ప్రస్తుత పరిణామములు అలాగే జరుగుతూ ఉన్నాయి. దేవ, దానవ, గంధర్వ, యక్ష, రాక్షస, పన్నగుల నుండి మరణము లేకుండా వరము కోరిన నేను మానవులను ఎందుకు విస్మరించాలి! మానవుల వలన కూడా మరణము లేకుండా వరము కోరి ఉంటే బాగుండేది.

ఇక్ష్వాకు వంశములో పుట్టిన అనరణ్యుడు నాతో అన్న మాటలు యదార్థములు అయ్యాయి. "ఓ రాక్షసుడా! నిన్ను, నీ వంశమును, నాశనము చేయగల వాడు నా వంశములో జన్మించగలడు" అని ఆరోజే అన్నాడు. ఆ మానవుడు రాముడే

కావచ్చును. అన్నీ ఇప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నవి. పూర్వము నేను వేదవతి అనే యువతిని అవమానించాను. ఆమే సీతగా జనకుని ఇంట జన్మించినది. అదీ కాకుండా నాకు ఉన్న శాపములు అన్నీ ఇన్నీ కావు. నందీశ్వరుడు, రంభ, పార్వతి, వరుణ పుత్రిక అందరూ నన్ను శపించారు. అవన్నీ ఈ రోజు నిజం అవుతున్నాయి కదా! వారి మాటలు పొల్లుపోతాయా!

కాబట్టి ఇవన్నీ దృష్టిలో ఉంచుకొని మనము ఇంక ప్రవర్తించాలి. నగరం అంతా కట్టుదిట్టమైన కాపలా పెట్టండి. నా తమ్ముడు కుంభకర్ణుని నిద్రలేపండి. ప్రహస్తుడు మరణించాడు. నేను రాముని చేతిలో ఓటమి పొందాను. తరువాత కుంభకర్ణుడు మాత్రమే రామునితో యుద్ధము చేయుటకు తగినవాడు. అతడొక్కడే యుద్ధములో వానరులను, రామలక్ష్మణులను చంపగలడు. అంత పరాక్రమ వంతుడైన కుంభకర్ణునికి ఈ పాడు నిద్ర ఒకటి దాపురించింది. అవసరానికి అందుబాటులో లేకుండా పోయాడు. ఈ సమయంలో యుద్ధం చేయక పోతే ఇంక కుంభకర్ణుని వలన ప్రయోజనం ఏమిటి? ఆపదలో ఉన్నప్పుడు సాయపడ్డవాడే కదా ఆప్తుడు, బంధువు. అందుకని, తొందరగా కుంభకర్ణుని నిద్రలేపండి." అని ఆజ్ఞాపించాడు. రావణుని ఆదేశముల మేరకు రాక్షసులు కుంభకర్ణుని నిద్రలేపడానికి వెళ్లారు.

కుంభకర్ణుని గృహము చాలా పెద్దది. శరీరాన్ని బట్టి ఇల్లు కదా! కుంభకర్ణుడు పట్టేంత ద్వారములతో, ఒక యోజనము వైశాల్యంతో నిర్మించబడింది. రాక్షసులు అందరూ కుంభకర్ణుని పడుకొని ఉన్న విశాలమైన గృహము లోనికి ప్రవేశించారు. కుంభకర్ణుని

ఉచ్ఛ్వాస నిశ్వాసములకు వారు గడ్డిపోచలవలె ఊగిపోతున్నారు. ఎలాగో నిలదొక్కుకుంటూ కుంభకర్ణుని దగ్గరకు వెళ్లారు. వెల్లకిలా పడుకొని నిద్రపోతున్న కుంభకర్ణుని చూచారు. ఆ కుంభకర్ణుని చూడగానే రాక్షసజాతికి చెందిన వారికి కూడా కడుపులో వికారం కలిగింది. ఒక పెద్ద పర్వతము నేల మీద పడిపోయి ఉందా అన్నట్టు ఉన్నాడు కుంభకర్ణుడు.

రాక్షసులు అందరూ తలోక దిక్కు చేరుకున్నారు. కుంభకర్ణుని నిద్రలేపడానికి పూనుకున్నారు. కుంభకర్ణుని శరీరము మీద ఉన్న వెంట్రుకలు కత్తులవలె నిక్కపొడుచుకొని ఉన్నాయి. కుంభకర్ణుడు ఊపిరి తీస్తుంటే పాములు బుసకొడుతున్నట్టు ఉంది. కుంభకర్ణుడు ఊపిరి విడుస్తుంటే ఆ గాలి తాకిడికి ఆ రాక్షసులు కొట్టుకుపోతున్నారు. కుంభకర్ణుని శరీరము నుండి మదపు వాసన వేస్తూ రాక్షసులకే వెగటు పుట్టిస్తూ ఉంది. కుంభకర్ణుడు లేవగానే తినడానికి చంపి తెచ్చిన లేళ్లు, దున్నపోతులు, వరాహములు మొదలగు మృగములను రాసులుగా పోసారు. వండిన అన్నమును రాసులుగా పోసారు. రకరకాలైన వండిన మాంసము నంజుళ్లను రాసులుగా పోసారు. తాగడానికి రక్తాన్ని కుండలతో నింపి పెట్టారు. కుంభకర్ణుని శరీరానికి చందనము పూసారు. పూలమాలలతో అలంకరించారు. ధూపం వేసారు. స్తోత్రపాఠాలు చదివారు. పెద్దగా అరిచారు. కుంభకర్ణుని చెవుల దగ్గరు శంఖములు ఊదారు. చెవుల దగ్గర పెద్దగా అరిచారు. కేకలు పెట్టారు. కుంభకర్ణుని చేతులు కాళ్లు పైకెత్తికిందపడేసారు. కాని కుంభకర్ణుడు లేవలేదు.

కుంభకర్ణుని లేపడానికి చేసిన ధ్వనులతో చుట్టుపక్కల

ఉన్న పక్షులు మృగములు భయంతో పారిపోయాయి. కొన్ని గిలా గిలా కొట్టుకొని మరణించాయి. ఇంక ఇలా ధ్వనులు చేసి లాభం లేదనుకొని, రాక్షసులు ముద్గరలు, ముసలములు, గదలతో కుంభకర్ణుని గుండెల మీద, చేతుల మీద, కాళ్ల మీద  కొట్టనారంభించారు. గదలు విరిగాయి కొట్టి కొట్టి రాక్షసుల చేతులు విరిగాయి.  కాని కుంభకర్ణుడు నిద్ర లేవలేదు. అలా కొట్టేటప్పుడు కుంభకర్ణుడు విడిచే శ్వాసకు రాక్షసులు ఎగిరిపోతున్నారు. అది తట్టుకొని కుంభకర్ణుని కొట్టడం చాలా కష్టంగా ఉంది రాక్షసులకు. అయినా ప్రయత్నిస్తున్నారు. అంతా కలిసి పదివేల మంది రాక్షసులు ఈ బృహత్కార్యంలో పాల్గొంటున్నారు. కాని ఫలితం కనిపించడం లేదు.

ఇలా కాదని, వారు,  గుర్రములను, ఏనుగులను, ఒంటెలను తీసుకొని వచ్చి కుంభకర్ణుని శరీరం మీద నడిపించారు.  ఒక పక్క భేరీమృదంగములు మోగుతున్నాయి. మరొక పక్క గదలతోనూ ముసలములతోనూ కొడుతున్నారు. మరొక పక్క ఏనుగులు, గుర్రములు, ఒంటెలు కుంభకర్ణుని శరీరం మీద నడుస్తున్నాయి తొక్కుతున్నాయి. కాని కుంభకర్ణుడు నిద్రలేవలేదు. ఈ కోలాహలానికి లంకానగరం అంతా మార్మోగిపోతూ ఉంది. కుంభకర్ణుని చెవుల దగ్గర భేరీలు అమర్చారు. వాటిని పెద్ద పెద్ద కర్రలతో మోగిస్తున్నారు.  ఎంత చేసినా శాపగ్రస్తుడైన కుంభకర్ణుడు నిద్రలేవలేదు.

రాక్షసులకు విపరీతమైన కోపం వచ్చింది. పదివేల మంది రాక్షసులు కుంభకర్ణుని మీద పడ్డారు. కొరికారు. రక్కారు. కొట్టారు. గుద్దారు. చితకబాదారు. కుండలతో నీళ్లు తెచ్చి చెవుల్లో పోసారు. అయినా కుంభకర్ణుడు నిద్రలేవలేదు. అయినా వారి ప్రయత్నములు

వీడలేదు. మరలా మొదలెట్టారు. శతఘ్నులు తెచ్చి పేల్చారు. ముద్గరలతో ముసలములతో కొట్టారు. ఏనుగులను కుంభకర్ణుని శరీరం మీద అటు ఇటు వేగంగా పరుగెత్తించారు.

అప్పుడు కొంచెం కదిలాడు కుంభకర్ణుడు. ఎవరో తనను లేపుతున్నట్టు స్పర్శద్వారా తెలుసుకున్నాడు. నిద్రమధ్యలో లేపినందుకు కుంభకర్ణుడికి కోపం వచ్చింది. ఆవులిస్తూ లేచి కూర్చున్నాడు. చేతులు రెండూ పైకెత్తి పెద్దగా ఆవులించాడు. కుంభకర్ణుడు ఆవులించినపుడు వెలువడ్డ గాలి రెండు కొండల మధ్యనుండి వీచే ప్రచండ ఝంఝూ మారుతంలా వీచింది. కుంభకర్ణుడు లేవగానే రాక్షసులు అతనికి తాము సేకరించి తెచ్చిన ఆహార పదార్థాలు చూపించారు. కుంభకర్ణుడు వాటిని అవలీలగా భక్షించాడు. రక్తమును, మద్యము తాగాడు. తృప్తిగా త్రేన్చాడు. హమ్మయ్య అనుకున్నారు రాక్షసులు.

కుంభకర్ణునికి నమస్కరించి అతని చుట్టు నిలబడ్డారు. సగం నిద్రలో లేవడం వలన కుంభకర్ణుడి కళ్లు మూతలు పడుతున్నాయి. తూలుతున్నాడు. తనను అర్ధాంతరంగా నిద్రలేపి నందుకు విసుక్కుంటూ నాలుగు పక్కలా చూచి, తన పక్కనే ఉన్న రాక్షసులతో ఇలా అన్నాడు కుంభకర్ణుడు.

“ నన్ను ఎందుకు బలవంతంగా నిద్ర లేపారు. రావణుడు క్షేమంగా ఉన్నాడు. ఏమీ ఉపద్రవము రాలేదు కదా! ఎవరన్నా శత్రువు మన లంక మీద దండయాత్ర చేసాడా! లేకపోతే నన్ను ఇంత బలవంతంగా ఎందుకు నిద్రలేపుతారు. పదండి విషయం కనుక్కుందాము. ఇంద్రుడు మరలా విజృంభించాడా!. వాడిని

అణిచివేస్తాను. అగ్నిని కాలుస్తాను.  ఏదో కారణం లేనిదే నన్ను నా అన్న నిద్రలేపమని ఆదేశము ఇవ్వడు. ఏం జరిగిందో త్వరగా చెప్పండి." అని గబా గబా అడిగాడు కుంభకర్ణుడు.

అప్పుడు రావణుని మంత్రి అయిన యూపాక్షుడు అనే రాక్షసుడు చేతులు జోడించి కుంభకర్ణునితో ఇలా అన్నాడు. "రాజా! మాకు దేవ,దానవ,గంధర్వుల వలన ఏలాంటి భయమూ లేదు. ప్రస్తుతము మానవులవల్లనే మాకు భయం పట్టుకుంది. ఈ మానవుల నుండి మేము పొందుతున్న భయము ఇదివరకు ఎవరి వలనా పొందలేదు. అంతగా భయపడుతున్నాము. మానవులకు వానరులు తోడైనారు. ఆ వానరులు సామాన్యులు కారు. ఒక్కొక్కరూ పర్వతముల వంటి శరీరములు కలవారు. కోట్లకొలది ఉన్న వానరులు లంకను ముట్టడించారు. రాముడు అనే రాకుమారుడు ఉన్నాడు. అతని భార్య సీతను రావణుడు అపహరించి తెచ్చి లంకలో ఉంచాడు. సీత కోసరం రాముడు వానరసేనతో లంకను దిగ్బంధం చేసాడు. సీతను వెదుకుతూ వచ్చిన ఒక వానరుడు అక్షకుమారుని చంపాడు. లంకను దహనం చేసాడు. నిన్న సాక్షాత్తు రావణుడే రామునితో యుద్ధానికి దిగాడు. అప్పుడు రాముడు రావణుని ఓడించి, "అలసి పోయిన వానితో నేను యుద్ధం చేయను. నేడు పోయి విశ్రాంతి తీసుకొని రేపురా!" అని చెప్పి పంపాడు రాముడు. రావణుడు ఆ అవమాన భారంతో కుమిలి పోతున్నాడు. రావణునికి ఇటువంటి దుస్థితి దేవ,దానవ,గంధర్వ, యక్ష,నాగుల వలన కలగ లేదు. ఈ నాటికి ఒక మానవుని వలన కలిగింది." అని చెప్పాడు యూపాక్షుడు.

ఆ మాటలు విన్న కుంభకర్ణుడు కోపంతో రెచ్చిపోయాడు. యూపాక్షునితో ఇలా అన్నాడు. "ఇప్పుడు నేను రావణుని వద్దకు రాను. నేరుగా యుద్ధభూమికి వెళ్తాను. వానరులను, మానవులను సంహరించి అప్పుడు రావణుని వద్దకు వస్తాను. మీ రాక్షసులు అంతా ఆ వానరుల రక్తము తాగి వానరుల మాంసము ఆరగించండి. నేను ఆ మానవుల రక్తమాంసములు ఆరగిస్తాను." అని అన్నాడు కుంభకర్ణుడు.

ఆ మాటలు విన్న మహోదరుడు ఇలా అన్నాడు. "నామాట కూడా కొంచెం వినండి. ముందు మనము రావణుని వద్దకు వెళదాము ఆయన ఏమి చెబుతాడో విని తరువాత తగిన విధంగా చేయండి." అని వినయంగా పలికాడు. అది యుక్తియుక్తముగా ఉన్నది అని అనుకున్న కుంభకర్ణుడు ఈ వార్త రావణునికి తెలియజెయ్యమని రాక్షసులను రావణుని వద్దకు పంపాడు. .

ఈ వార్త రావణునికి చెప్పడానికి రాక్షసులు  బయలు దేరి రావణుని వద్దకు వెళ్లారు. రావణునితో ఇలా అన్నారు. "మహారాజా! తమరి ఆదేశము ప్రకారము మేము కుంభకర్ణుని నిద్రలేపాము. ఆయన అటునుండి అటే యుద్ధ రంగమునకు వెళతాను అని అంటున్నాడు. కుంభకర్ణుడు యుద్ధరంగమునకు వెళ్లవలెనా, ఇక్కడకు రావలెనా తెలుపండి." అని అడిగారు.

కుంభకర్ణుడు నిద్రలేచాడు అని తెలియగానే రావణుడు ఎంతో సంతోషించాడు. ఇంక విజయం తనదే అనుకున్నాడు. "మేము కుంభకర్ణుని మా మందిరములో చూడాలని అనుకుంటున్నాము. ఆయనను తగు మర్యాదలతో ఇక్కడకు తీసుకొని రండి." అని

ఆదేశించాడు.ఆ రాక్షసులు వెంటనే కుంభకర్ణుని వద్దకు వెళ్లి ఇలా అన్నారు. "మహారాజా! తమరి కొరకు రావణుడు ఎదురుచూస్తున్నాడు." అని చెప్పారు. కుంభ కర్ణుడు తన ఆసనము మీది నుండి లేచాడు. కాలకృత్యములు తీర్చుకున్నాడు. చక్కగా అలంకరించుకున్నాడు. రెండువేల కుండల మద్యము తాగాడు. దానికి తగ్గట్టు మాంసము ఆరగించాడు. ప్రళయకాలంలో యమధర్మరాజు వలె కుంభకర్ణుడు అన్న రావణుని మందిరమునకు బయలుదేరాడు.

కుంభకర్ణుడు నడుస్తుంటే భూమి కంపిస్తూ ఉంది. కుంభకర్ణుడు రాజమార్గములో నడుస్తుంటే, కోటకు ఆవల ఉన్న వానరులు ఆ మహాకాయాన్ని చూచారు. వానరులకు కుంభకర్ణుని ఆకారం చూచి భయం కలిగింది. వెంటనే రాముని వద్దకు పోయి ఏదో ఒక మహాకాయము లంకలో నడుస్తూ ఉంది అని రామునితో చెప్పారు. కొంతమంది వానరులు వీడితో మనకెందుకు అని పారిపోయారు. ఒక పర్వతము నడిచివస్తున్నట్టు వస్తున్న కుంభకర్ణుని చూచి వానరులు భయంతో వణికిపోయారు.

శ్రీమద్రామాయణము

యుద్ధ కాండము అరవయ్యవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## అరవయ్యి ఒకటవ సర్గ.

రాముడు కూడా ఆకాశం అంత ఎత్తున ఉన్న కుంభకర్ణుని చూచాడు. ఆ అనూహ్యమైన ఆకారమును చూచి పారిపోతున్న వానరములను చూచాడు. ఆశ్చర్యపోయాడు. విభీషణుని చూచి ఇలా అన్నాడు. "విభీషణా! ఆకాశమంత ఎత్తున ఉన్న ఈ ఆకారము ఎవరు? ఇంత పెద్ద దేహము కలవాడు ఈ భూమి మీద వీడు ఒక్కడే ఉన్నట్టు ఉంది. వీడు ఎవరు? వీడి పేరేమి? వీడు అసురుడా, రాక్షసుడా, లేక వేరే జాతి ప్రాణియా. ఎందుకంటే నేను ఇంతవరకూ ఇటువంటి ప్రాణిని భూమి మీద చూడలేదు." అని అన్నాడు.

అప్పుడు విభీషణుడు ఇలా అన్నాడు. "ఓ రామా! ఇతని పేరు కుంభకర్ణుడు. రావణుని సోదరుడు. ఇతడు విశ్రవసుని కుమారుడు. యుద్ధములో ఇంద్రుని, యముడిని ఓడించాడు. రాక్షస జాతిలో ఇంత దేహము కల రాక్షసుడు ఎవరూ లేరు.  ఇతడు దేవతలను, గంధర్వులను, పన్నగులను, దానవులను, యక్షులను, విద్యాధరులను ఓడించాడు. ఇతడు శూలం ధరించి యుద్ధభూమిలో తిరుగుతుంటే సాక్షాత్తు యముడు తిరిగినట్టు ఉంటుంది.  ఇతడు సహజ బలసంపన్నుడు. ఈ కుంభకర్ణుడు పుట్టీ పుట్ట గానే వేలకొలది ప్రాణులను భక్షించాడు. వీడికి ఆకలి ఎక్కువ. దొరికిన దానిని దొరికినట్టు తినేసేవాడు. వాడు అలా తినడం మొదలెడితే భూమి మీద కొంతకాలానికి ప్రాణి అనేది మిగలదు అని తలచి ప్రజలందరూ ఇంద్రుని శరణు వేడారు. ఇంద్రుడు తన వజ్రాయుధముతో కుంభకర్ణుని

కొట్టాడు. అప్పుడు కుంభకర్ణుడు బిగ్గరగా అరిచాడు. ఆ అరుపులకు సగం జనం చచ్చారు. తరువాత కుంభకర్ణుడు ఇంద్రుడు ఎక్కిన ఐరావతము అనే ఏనుగు దంతమును ఊడపెరికి దానితో ఇంద్రుని వక్షస్థలము మీద పొడిచాడు. ఆ దెబ్బకు ఇంద్రుడు తల్లడిల్లిపోయాడు.

ఇంక ఇంద్రునితో లాభం లేదని దేవతలు అందరూ బ్రహ్మదేవుని వద్దకు వెళ్లారు. కుంభకర్ణుడు ముల్లోకములనూ పీడిస్తున్నాడనీ, దేవతలను ఎదిరిస్తున్నాడనీ, ఋషులను యజ్ఞ యాగములను చేసుకోనివ్వడం లేదనీ, ఆశ్రమములను నాశనం చేస్తున్నాడనీ,  ఇతరుల భార్యలను అపహరిస్తున్నాడనీ, బ్రహ్మతో మొరపెట్టుకున్నారు. ఈ ప్రకారంగా కుంభకర్ణుడు ప్రాణులను తింటూ ఉంటే కొంత కాలానికి ఈ లోకంలో ప్రాణికోటి లేకుండా పోతారు అని కూడా విన్నవించుకున్నారు.  వెంటనే బ్రహ్మ రావణుని, కుంభకర్ణుని, ఇతర రాక్షసులను తన దగ్గరకు పిలిపించుకున్నాడు.

కుంభకర్ణుని చూచి బ్రహ్మ ఆశ్చర్యపోయాడు. భయపడ్డాడు.  'ఆ విశ్రవసుడు నిన్ను ముల్లోకాలను నాశనం చెయ్యడానికే పుట్టించాడు రా!' అని మనసులో  అనుకున్నాడు. కుంభకర్ణునికి ఘోర శాపం ఇచ్చాడు. "ఈ రోజు నుండి నీవు అచేతనంగా పడి ఉండు" అని శపించాడు. బ్రహ్మదేవుని శాప మహిమ వలన వెంటనే కుంభకర్ణుడు నేలమీద పడిపోయాడు. చచ్చినవాడి మాదిరి పడిఉన్న కుంభకర్ణుని చూచి రావణుడు శోకించాడు. బ్రహ్మదేవుని చూచి ఇలా అన్నాడు. "ఓ బ్రహ్మదేవా! వీడు నీ ముని మనుమడు.  నీ మునిమనుమని ఇలా శపించడం ధర్మమా! కాని నీ శాపం అమోఘము. వీడి ఇలా నిద్రావస్థలో ఉండవలసినదే కానీ కొంచెం నీ శాపమునకు విరామము

ఇవ్వమని నా ప్రార్థన. వీడు జీవితాంతము నిద్రపోకుండా అప్పుడప్పుడు మేల్కొని ఉండేట్టు వరం ప్రసాదించు." అని ప్రార్థించాడు. అప్పుడు బ్రహ్మదేవుడు కరుణించి ఇలా అన్నాడు. "వీడు ఆరునెలలపాటు నిద్రలో ఉంటాడు. ఒక రోజు మాత్రం మెలుకువగా ఉంటాడు. ఆరోజున ఆహారం తీసుకుంటాడు. మరలా ఆరునెలలు నిగ్రపోతాడు." అని అన్నాడు. ఇదీ వీడి చరిత్ర. ప్రస్తుతము వీడు నిద్రపోవలసిన సమయము. కానీ నీ మీద భయంతో రావణుడు వీడిని నిద్రలేపాడు. ఇప్పుడు వీడు నిద్రలేచి రావణుని వద్దకు వెళుతున్నాడు. అపర మృత్యుదేవతలా ఉన్న వీడిని చూచి వానరులు భయంతో పారిపోతున్నారు. మరి వీడితో వానరులు ఎలా యుద్ధం చేస్తారో ఏమో తెలియకుండా ఉంది" అని అన్నాడు విభీషణుడు.

అప్పుడు రాముడు విభీషణునితో ఇలా అన్నాడు. "ఇతడు రాక్షసుడు అని చెప్పకండి. వీడు యుద్ధములో శవములను తీయుటకు అమర్చబడిన యంత్రము అని ప్రచారం చెయ్యండి. వానరులలో ఉన్న భయాన్ని పోగొట్టండి." అని అన్నాడు. రాముడు నీలుని చూచి ఇలా అన్నాడు. "నీలుడా! నీవు వానరసైన్యమును యుద్ధమునకు సమాయత్తం చెయ్యి. లంక అన్ని ద్వారముల వద్ద సైన్యమును అప్రమత్తం చెయ్యి. వానరములకు ఆయుధములైన పర్వత శిఖరములను, వృక్షములను, బండరాళ్లను ఒక చోట చేర్చండి. వానరులందరూ బండరాళ్లను, పర్వతములను, వృక్షములను ధరించి యుద్ధమునకు సన్నద్ధము అవుతారు." అని అన్నాడు రాముడు. నీలుడు రాముడు చెప్పిన ప్రకారము వానరులకు ధైర్యము చెప్పి వారిని యుద్ధోన్ముఖులను చేసాడు.

వానరులందరూ కుంభకర్ణుని వల్ల కలిగిన భయమును వదిలిపెట్టి ఆయుధములు చేతబట్టారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము అరవై ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత& ఓం తత్సత్

## యుద్ధకాండము
## అరవైరెండవ సర్గ.

కుంభకర్ణుడు లంకా నగర రాజమార్గములో నడుస్తున్నాడు. రావణుని మందిరము చేరుకున్నాడు. కుంభకర్ణుని దూరం నుండి చూచాడు రావణుడు. సింహాసనము మీది నుండి లేచి కుంభకర్ణునికి ఎదురుపోయి ప్రేమతో కౌగలించుకున్నాడు. కుంభకర్ణుడు రావణునికి పాదాభివందనము చేసాడు. “అన్నా రావణా! నన్ను ఎందుకునిద్ర లేపారు? నేను ఏమి చెయ్యాలి?” అని సూటిగా అడిగాడు.

అప్పుడు రావణుడు ఇలా అన్నాడు.“తమ్ముడా కుంభకర్ణా! నీవు చాలా కాలము కిందట నిద్రకు ఉపక్రమించావు. ఈ లోపల చాలా విషయాలు జరిగాయి. ఇటీవల నాకు రాముడు అనే నరుని వలన కలిగిన భయం గురించి నీకు తెలియదు. ఈ రాముడు అయోధ్య రాజైన దశరథుని కుమారుడు. ఇతని స్నేహితుడు సుగ్రీవుడు అనే వానరుడు. రాముడు, సుగ్రీవుని సాయంతో సముద్రమును దాటి లంకలో ప్రవేశించాడు. లంకానగరాన్ని ముట్టడించాడు. లంకను ఆక్రమించాడు. ఎక్కడ చూచినా వానరులే.  ఈ వానరయోధులు

మన రాక్షస వీరులను ప్రముఖులను ఎంతోమందిని చంపారు. వానరులకు కలిగిన నష్టం కంటే మనకు జరిగిన నష్టం అపారము. ఈ వానరులు ఎప్పుడూ యుద్ధం చేసినట్టు గానీ అందులో ఓడిపోయినట్టు గానీ కనపడదు. ఈ విధంగా నాకు నరులతో, వానరులతో భయం కలిగింది. నీవు యుద్ధంలో ఈ నరులను వానరులను చంపి నాకు మనశ్శాంతి కలిగించు. ఈ యుద్ధముతో మన కోశాగారము అంతా వ్యయము అయిపోయింది. లంకా నగరంలో స్త్రీలు, బాలురు, వృద్ధులు తప్ప ఎవరూ మిగలలేదు. కాబట్టి నా కోసం ఈ యుద్ధం చెయ్యి. నన్ను, లంకను, రక్షించు. ఇప్పటిదాకా నేను అందరినీ శాసించాను కానీ ఈ ప్రకారంగా ఎవరినీ కోరలేదు. కాబట్టి నా మాటలు మన్నించి యుద్ధం చెయ్యి.

ఓ తమ్ముడా! నీకు యుద్ధము కొత్త కాదు. దేవాసుర యుద్ధంలో నీవు రాక్షసుల పక్షాన పోరాడి వారికి విజయం సంపాదించి పెట్టావు. ఈ సమయంలో కూడా నీ పరాక్రమమును చూపించి నాకు విజయం చేకూర్చు. నీవు ఎలా యుద్ధం చేస్తావో నీ ఇష్టం. కానీ శత్రునాశనం మాత్రం జరగాలి. అదే నా ధ్యేయము." అని పలికాడు రావణుడు.

శ్రీమద్రామాయణము
అరవై రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధ కాండము

## అరువది మూడవ సర్గ.

ముల్లోకములను గడగడలాడించిన పరాక్రమవంతుడు అయిన రావణుడు తన ముందు అంత దీనంగా మాట్లాడటం చూచి కుంభకర్ణుడు బిగ్గరగా నవ్వాడు. రావణునితో ఇలా అన్నాడు. "అన్నా రావణా! నాకు చూడగా, నీవు నీ మంత్రులతో చర్చించినపుడు, వారు చెప్పిన మంచి మాటలను చెవిని పెట్టినట్టులేదు. అందుకే నీకు ఈ ఆపదకలిగింది. అవునా! ఇది ఎవరో చేసినది కాదు. నీవు చేసుకున్న దుష్కర్మ నీకు ఈ కష్టములను తెచ్చిపెట్టింది. నీవు దుష్కార్యమును చేసావు. అది చేయబోయే ముందు ఎవరితోనన్నా ఆలోచించావా! బాగోగులు విచారించావా! ఆ చేయబోయే పనికి ఫలితం ఎలా ఉంటుందో ఊహించావా! ఇవేమీ ఆలోచించకుండా చేయకూడని పనులు చేసి ఇప్పుడు చింతించి ఏమి ప్రయోజనము.

నీకు బలము, దర్పము, పరాక్రమము ఉంది కదా అని చేయకూడని పనులు చేస్తే ఫలితం ఇలాగే ఉంటుంది. ఇంకా దారుణంగా కూడా ఉంటుంది. నీవు లంకాధీశుడవు. నీకు తగ్గపనులు చెయ్యాలి కానీ, నీవు చేయకూడని పనులు చేయడం ధర్మమా! ఒక పని చేసే ముందు దేశ, కాలములు అనుకూలంగా ఉన్నవా లేవా అని చూచుకోవాలి కదా! ఏది పడితే అది, ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ  చేసెయ్యడమేనా!

ఏ పని చేసే ముందు అయినా మంత్రులతో మంచి చెడ్డలు విచారించి ఆయా పనులు చేస్తాడో అతడే నీతివంతుడైన రాజు. నీతి వంతుడైన రాజు తాను చేయబోయే పని గురించి ముందు తాను ఆలోచిస్తాడు. శాస్త్రములు ఏంచెప్పాయో తెలుసుకుంటాడు. తనువాత మంత్రులతో ఆలోచిస్తాడు. తరువాత సరి అయిన నిర్ణయం తీసుకుంటాడు. వాడే ఉత్తముడు నీతి మంతుడు అయిన రాజు.

ధర్మము, అర్థము, కామము మూడు పురుషార్థములు. వాటిని ఏ యే సమయములందు ఆచరించవలెనే ఆయాసమయము లలో ఆచరించు వాడు ఉత్తముడు. అలా చేయని వాడు ఎన్ని శాస్త్రములు చదివినా నిష్ప్రయోజనము. ఉపాయములు మూడు విధములు. సామ,దాన,భేదోపాయములు. ఆఖరుది దండోపాయము. వాటిని మంత్రుల సహకారంతో కాలానుగుణంగా ఉపయోగించాలి. అటువంటి రాజుకు ఎలాంటి ఆపదలు రావు. రాజు తాను చేయబోయే పనుల యొక్క యదార్థస్వరూపమును తెలుసుకొని, మంత్రులతో ఆలోచించి, తగు నిర్ణయం తీసుకోవాలి. తనకు ఏది హితము కలుగచేస్తుందో ఆ పనిని మాత్రమే చెయ్యాలి.

నాకు చూడ నీ మంత్రులు నీకు సరి అయిన ఆలోచనలు హితములు చెప్పినట్టు లేదు. అటువంటి వారి ఆలోచనలు ఇలాగే నిన్ను ఆపదలలోకి నెడుతాయి. బుద్ధిలేని వారితో ఆలోచిస్తే పరిణామాలు ఇలాగే ఉంటాయి. నిన్ను పొగిడే వాళ్లను, నీవు ఏం చెప్పినా ఎద్దులా తల ఊపేవాళ్లను దగ్గరకు చేరనీయవద్దు. అంతే కాకుండా శాస్త్ర జ్ఞానము, అర్థశాస్త్ర జ్ఞానము లేని వారిని దూరంగా ఉంచాలి. అలాంటి వారు నీకు

మంచి చేయకపోగా, నిన్ను ఆపదలలోకి నెడుతారు. కొంత మంది మంత్రులు శత్రువులతో చేతులు కలిపి రాజుతో చేయకూడని పనులు చేయించి అతనిని అప్రతిష్టపాలు చేస్తారు. అటువంటి వారిని దూరంగా ఉంచాలి. శత్రురాజుల నుండి కానుకలు పుచ్చుకొని, నీకు అనుకూలంగా ఉన్నట్టు నటిస్తూ నీకు ద్రోహం చేసేవారిని ఒక కంట కనిపెట్టి ఉండాలి. ఎలాంటి ఆలోచనా లేకుండా తొందరపాటుతో పనులు చేసే రాజును, శత్రువులు తొందరగా లొంగదీసుకుంటారు. శత్రువుల విషయంలో నిర్లక్ష్యంగా ఉంటూ తనను తాను నిర్లక్ష్యం చేసుకొనేవాడు, ఆపదలు పొందుతాడు.

ఆఖరుగా ఒక్కమాట. మన తమ్ముడు విభీషణుడు నీకు ఏమి చెప్పాడో అది చెయ్యి. లేకపోతే నీ ఇష్టం." అని ఊరుకున్నాడు కుంభకర్ణుడు.

కుంభకర్ణుని మాటలు విని రావణునికి కోపం వచ్చింది. "తమ్ముడా కుంభకర్ణా! ఏమిటి పెద్ద అన్నీ తెలిసిన వాడి మాదిరి మాట్లాడుతున్నావు. గురువు మాదిరి నాకు ఉపదేశిస్తున్నావు. అనవసరంగా మాట్లాడి నీ సమయం నా సమయం వృధా చెయ్యకు. ప్రస్తుతం వచ్చిన సమస్యకు పరిష్కారం ఆలోచించు. తగిన విధంగా ఆచరించు. తెలిసి చేసానో, తెలియక చేసానో, చిత్తభ్రమతో చేసానో, నా బలపరాక్రమముల మీద నమ్మకంతో చేసానో, రాముడి వద్దనుండి సీతను అపహరించి తెచ్చాను. ప్రస్తుతం దానిని గురించి ఆలోచించడం అనవసరము. నీకు నా యందు ప్రేమ ఉంటే, నాకు సాయం చెయ్యాలని నీకు అనిపిస్తే, ఈ కార్యము చేయతగినది అని నీకు అనిపిస్తే కేవలం నా పొరపాటు వలన సంభవించిన ఈ

ఆపదనుంచి నన్ను గట్టెక్కించు. అది నీ ఒక్కడి వల్లనే సాధ్యం అవుతుంది అని నా నమ్మకం. కుంభకర్ణా! నీవు నాకు తమ్ముడివే కాదు. మంచి స్నేహితుడివి కూడా! కష్టములలో ఉన్న వాడిని ఆదుకున్నవాడే స్నేహితుడు. నీతి తప్పి ప్రవర్తించినా, సహృదయంతో సాయం చేసినవాడే బంధువు. ప్రస్తుతము నేను కష్టాలలో ఉన్నాను. నన్ను రక్షించు." అని అన్నాడు.

తన మాటలకు రావణునికి కోపం వచ్చిందని తెలుసుకున్నాడు కుంభకర్ణుడు. అందుకని అన్నతో మృదువుగా మాట్లాడాడు. "అన్నయ్యా! రావణా! నా మాటలకు బాధపడకు. స్థిరచిత్తంతో ఉండు. నేను జీవించి ఉండగా నీకు ఏ ఆపదా రాదు. ధైర్యంగా ఉండు. ఎవరి వలన నీకు ఈ దు:ఖము కలిగిందో ఆ దు:ఖకారకుడిని నేను చంపుతాను. నీవు ఏ పరిస్థితులలో ఉన్నా నీకు హితము చెప్పడం నా ధర్మము. నీకు నాకు ఉన్న బంధుత్వము వలనా సోదర ప్రేమ వలనా. నాకు తోచిన మంచి మాటలు చెప్పాను. నీకు బాధ కలిగించి ఉంటే క్షమించు. ఇప్పుడు నీ సోదరుడిగా నేను నిన్ను ఆదుకుంటాను. నీ కోసరం యుద్ధం చేస్తాను. శత్రువులను సంహరిస్తాను. నేను రామలక్ష్మణులను యుద్ధంలో సంహరిస్తాను. అది చూచి వానరులు పారిపోతారు. నేను రాముని తలను ఖండించి తీసుకొని వస్తాను. నీకు సంతోషము, సీతకు దు:ఖము కలిగిస్తాను. రాముని చేతిలో చంపబడ్డ రాక్షసుల బంధువులు ఈ నాడు రాముని మరణమును కళ్లారా చూస్తారు. రామలక్ష్మణులనే కాదు, ఆ సుగ్రీవుని కూడా కిందపడవేసి నలిపివేస్తాను. నేను రాముని చంపాలని నిర్ణయం తీసుకున్న తరువాత కూడా ఎందుకు బాధపడుతున్నావు. రాముని

మరణం కళ్లారా చూడటానికి సిద్ధంగా ఉండు.

అన్నా రావణా! నేను బతికి ఉండగా రాముడు నిన్ను ఏమీ చెయ్యలేడు. నన్ను చంపిన తరువాతనే రాముడు నిన్ను చంపగలడు. నన్ను చంపడం ముల్లోకములలో ఎవరి తరమూ కాదు. ఇంక ఈ నర, వానరులు ఎంత. రాముడి వెంట ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, కుబేరుడు వచ్చినా నేను భయపడను. అందరినీ ఓడిస్తాను. నీకు జయం చేకూరుస్తాను. నేను గట్టిగా గర్జిస్తే ఇంద్రుడు కూడా గడ గడ వణికిపోతాడు. అసలు నేను ఆయుధమును కూడా పట్టుకోపని లేదు. నా ఎదుట నిలిస్తే చాలు. వాడి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోతాయి. నేను నా చేతులతోనే ఎవరినైనా చంపగలను. అంతశక్తి ఉంది నాకు. కాబట్టి నేను రాముని ఒకే ఒక్క పిడికిలి గుద్దుతో చంపుతాను. నా పిడికిలి గుద్దుకు కూడా రాముడు చావకపోతే, అప్పుడే నేను మారణాయుధములు, అస్త్రములు ఉపయోగించి రాముని చంపుతాను.

అన్నా రావణా! నేను ఇప్పుడే యుద్ధమునకు బయలుదేరుతున్నాను. రాముని గురించి భయం వదిలిపెట్టు. సంతోషంగా ఉండు. ఒక్క రాముని కాదు, వానర నాయకుడు సుగ్రీవుని, లంకను కాల్చిన హనుమంతుని చంపుతాను. వానరులను చుట్ట చుట్టి నోటిలో పెట్టుకొని తినేస్తాను. నాకు కోపం వస్తే ఇంద్రుడు, దేవతలు కూడా గడగడవణికిపోతారు. దేవతలు, అసురులు, గంధర్వులు చాలా కాలం తరువాత కుంభకర్ణుని పరాక్రమాన్ని చూస్తారు.

నీవు భయం వదిలిపెట్టు. మద్యం సేవించు. అందమైన స్త్రీలతో క్రీడించు. ఆనందాన్ని అనుభవించు. నేను రాముని చంపిన తరువాత సీత నీపక్కన చేరగలదు." అని అన్నాడు కుంభకర్ణుడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము అరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## అరువది నాలుగవ సర్గ.

కుంభకర్ణుడు రావణునితో పలికిన పలుకులు అన్నీ పక్కనే కూర్చుని ఉన్న మహోదరుడు విన్నాడు. మహోదరుడు కుంభకర్ణునితో ఇలా అన్నాడు. "ఓ కుంభకర్ణా! నీవు ఉన్నత వంశంలో జన్మించావు. కాని ఉన్నతంగా ఆలోచించడం లేదు. గర్వంతో ఎప్పుడు ఏమి చెయ్యాలో తెలియకుండా మాట్లాడుతున్నావు. రావణుడు మహారాజు. ఆయనకు తెలియని నీతి లేదు. నీవు ఇప్పుడు రావణునికి నీతులు చెప్ప పనిలేదు. ఏదో బాల్యచాపల్యంతో మాట్లాడుతున్నావు. రావణుడు లంకాధిపతి. దేశ కాలములను బాగా ఎరిగిన వాడు. ఎప్పుడు ఎక్కడ ఏ పని చెయ్యాలో తెలిసినవాడు. తాను చేయబోయే పని గురించి మంచి చెడ్డలు బాగా తెలిసినవాడు.

నీవు ధర్మము అర్థము కామము గురించి మాట్లాడావు. కానీ వాటి లక్షణముల గురించి, స్వరూప స్వభావముల గురించి

నీకు తెలుసా! సుఖం కలిగినా దు:ఖము కలిగినా, దానికి ముందు చేసిన కర్మలే కారణము. కానీ ఒక్కోసారి చెడ్డపనులు కూడా మంచి ఫలితాలను ఇస్తాయి. ధర్మం కోసరం చేసే పనులూ, అధర్మం కోసం చేసే పనులూ రెండూ శ్రేయస్సును కలుగచేస్తాయి. ఒక్కోసారి ధర్మం కొరకు చేసే పనులు కీడును కలిగిస్తాయి. పురుషులు ఈ లోకానికి పరలోకానికి పనికి వచ్చే కర్మలను కోరికలతో చేస్తూ ఉంటారు. ఆ కర్మలు సత్ఫలితాలను ఇస్తున్నాయి కదా! కాబట్టి మంచి పనులు చేస్తే పుణ్యం, చెడ్డ పనులు చేస్తే పాపం వస్తుంది అన్న మాట సరికాదు. ధర్మంగా కర్మలు చేస్తే శ్రేయస్సు కలుగుతుంది. అధర్మ ప్రవృత్తితో కర్మలు చేస్తే దు:ఖము కలుగుతుంది అని చెప్పడానికి కారణం ఏమీ లేదు. అందుకని రావణుడు తనకు తోచిన పని చేసాడు. మేమంతా దానికి సమ్మతించాము. దాని వలన యుద్ధం వచ్చింది. యుద్ధం చెయ్యాలి కానీ జరిగిన దానికి చింతించడం అవివేకము.

ఏదో నువ్వు ఒక్కడివే రాముడిని, లక్ష్మణుడిని, వానర సేనలను అందర్నీ చంపుతాను అని అంటున్నావు. కాని జనస్థానములో ఒంటి చేత్తో 14,000 మంది రాక్షసులను చంపిన రాముని నువ్వు ఎలా చంపగలవు. జనస్థానములో రాముడి చేతిలో నుండి చావు తప్పించుకొన్న రాక్షసులు ప్రస్తుతము లంకలో రాముని వలన భయంతో బతుకుతున్నారు. ఆ సంగతి నీకు తెలియదా! రాముడు నిద్రపోతున్న సింహము అని తెలిసికూడా ఆ సింహము జూలుపట్టుకొని లాగడానికి వెళుతున్నావు. రాముడికి కోపం వస్తే అతని ముందు ఎవరూ నిలువలేరు. కాబట్టి నువ్వు ఒక్కడివే యుద్ధం చేసి రాముని చంపుతాను అనడం సరికాదు. నీవు ఒంటరిగా యుద్ధానికి వెళ్లడానికి వీలులేదు. ప్రస్తుతము మన బలము క్షీణదశలో ఉంది. రాముని బలం

మెండుగా ఉంది. ఇటువంటి సమయంలో ఎవరైనా రామునితో యుద్ధానికి వెళతారా! రామునితో సమానమైన బలపరాక్రమములు కలవాడు ముల్లోకములలో లేడు. అట్టి రామునితో నీవు ఒంటరిగా ఎలా యుద్ధంచేయాలని అనుకుంటున్నావు?"అని పలికాడు మహోదరుడు.

తరువాత రావణుని చూచి మహోదరుడు ఇలా అన్నాడు. "లంకేశ్వరా! నీవు సీతను అపహరించి తెచ్చావు. సీత లంకలో నీ ఎదురుగా ఉంది. ఇంకా ఎందుకు ఆలస్యం చేస్తున్నావు. నీవు తలచుకుంటే సీతను అనుభవించడం క్షణంలో పని. సీతను లొంగదీసుకొనే ఉపాయము ఒకటి చెబుతాను విను.

రాముని మీదికి యుద్ధమునకు నేను, కుంభకర్ణుడు, మహోదరుడు, ద్విజిహ్వుడు, సంహ్రాది, వితర్దనుడు, ఈ ఐదుగురు వెళుతున్నారు అని లంకానగరంలో ప్రచారం చేయించు. మేము రామలక్ష్మణులను, వానరవీరులను జయిస్తే ఇంక ఏ ఉపాయముతో పని లేదు. ఒక వేళ, రాముడు విజయం సాధిస్తే, మేము మా ఒంటి మీద రామ బాణములతో గాయములు చేసుకొని యుద్ధభూమి నుండి వస్తాము. "మేము రామలక్ష్మణులను భక్షించాము" అని నీకు విన్నవించుకుంటాము. నీవు మాకు తగిన పారితోషికములను బహుమానములను ఇస్తావు. తరువాత రాముడు లక్ష్మణుడు సుగ్రీవుడు యుద్ధములో మరణించారు అని లంకానగరంలో ఘోషణ చేయించు. నీవు మహా సంతోషంతో ఉన్నట్టు నటించు. రాక్షస సేనలకు బహుమానాలు పంచిపెట్టు. అందరూ మద్యపానము చేస్తూ

ఆనందిస్తారు

తరువాత నీవు సీతను ఏకాంతంగా కలుసుకో. రామలక్ష్మణుల మరణ వార్త సీతకు చెప్పు. ఆమెకు ధనమును, రత్నమణిమాణిక్యాదులను ఆశచూపించు. దీనంగా బతిమాలుకో. వినకపోతే భయపెట్టు. చంపుతానని బెదిరించు. రాముడు ఎటూ మరణించాడు కాబట్టి సీత తనకు ఇష్టం లేకపోయినా, వేరు గత్యంతరము లేక నిన్ను వరిస్తుంది. ఎందుకంటే జీవితమంతా సుఖాలలో పెరిగిన సీత, 12 ఏళ్లు కష్టాలను అనుభవించింది. తను సుఖపడాలంటే నీకు లొంగాలని తెలుసుకున్న సీత సులభంగా నీకు లొంగిపోతుంది. ఇదంతా నేను బాగా ఆలోచించి వేసిన ప్రణాళిక. మనము రామునితో యుద్ధము చేయకుండానే సీతను దక్కించు కోవచ్చు. ఒక సారి సీత నీకు లొంగితే, రాముడు యుద్దం విరమిస్తాడు. వెనక్కుతిరిగి వెళ్లిపోతాడు. మనకు సైన్య నష్టం లేకుండా, యుద్ధము చేయకుండా, రాముని జయించ వచ్చును. నీకు సీత దక్కుతుంది. సీతతో పాటు కీర్తియశస్సు కూడా దక్కుతాయి. నీవు మనసు పడ్డ సీతతో సుఖిస్తావు." అని అన్నాడు మహోదరుడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము అరువది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## అరువది ఐదవ సర్గ.

మహోదరుని మాటలు విన్న కుంభకర్ణునికి మిక్కుటంగా కోపం వచ్చింది. మహోదరుని ఒక్కసారిగా విదిలించి కొట్టాడు. తన అన్న రావణుని చూచి ఇలా అన్నాడు. "రాక్షసేంద్రా! నీవు నిశ్చింతగా ఉండు. నేను యుద్ధభూమికి పోయి ఆ రామలక్ష్మణులను చంపి నీ భయాన్ని పోగొడతాను. నావంటి శూరులు నీరులేని మేఘముల వలె ఊరికే గర్జించరు. నేను నా పరాక్రమము యుద్ధభూమిలో చూపిస్తాను కానీ మాటలలో చూపించను. నా వంటి శూరుడు తనను తాను పొగుడుకోడు. తనకు శక్యము కాని పనులను కూడా చేసి చూపిస్తాడు.

ఓ మహోదరా! నీ వంటి వారు పలికే మాటలు తమను తాము గొప్పవారము అనుకొనే రాజులు వింటారు కానీ రావణుడు కాదు. మీరు పిరికి పందలు. మీకు యుద్ధము అంటే భయము. కుయుక్తులు, కుతంత్రములతో పని కానిద్దామంటారు. రాజు దగ్గర ప్రగల్భాలు పలుకుతూ రాజు మెప్పు పొందడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. రాజును అపకీర్తిపాలు చేస్తుంటారు. రావణుని హితం కోరేవారు, రామునికి మంచి సలహాలు చెప్పేవారు ఈ లంకలో లేనట్టుంది. పాపము రావణుడు ఒంటరివాడయ్యాడు. ఇప్పటి దాకా మీరు చేసిన తప్పులను నేను సరిదిద్దుతాను. ఇప్పుడే యుద్ధమునకు బయలుదేరుతున్నాను." అని అన్నాడు కుంభకర్ణుడు.

కుంభకర్ణుని మాటలు విని రావణుడు నవ్వాడు. "సహోదరా కుంభకర్ణా! నీవు చెప్పినది సత్యము. ఈ మహోదరుడు రామునికి భయపడుతున్నాడు. అందుకే రామునితో యుద్ధమునకు ఇష్టపడుటలేదు. రామునితో యుద్ధము చేయుటకు నీవే సమర్ధుడివి. శత్రువులను సంహరించి విజయుడవై తిరిగిరా! నాకు వేరు గత్యంతరము లేకనే కదా నిన్ను అర్ధాంతరంగా నిద్రలేపాను. ఆ రాజకుమారులను, వానరులను తనివితీరా భక్షించు. నీవు యుద్ధము చేయనక్కరలేదు. యుద్ధభూమిలో నిన్ను చూడగానే వానరులంతా పారిపోతారు. రామలక్ష్మణులకు గుండెలు పగులుతాయి. సునాయాసంగా యుద్ధము ముగిసిపోతుంది. నీకు విజయం సిద్ధిస్తుంది." అని పలికాడు రావణుడు.

తన అన్న రావణుడు పలికిన పలుకులకు కుంభకర్ణుడు మహదానందభరితుడయ్యాడు. యుద్ధమునకు పోవడానికి సన్నద్ధుడయ్యాడు. ఇనుముతో చేయబడిన తన ఆయుధము అయిన శూలమును తీసుకున్నాడు. రావణునితో ఇలా అన్నాడు. "రాక్షసేంద్రా! నాకు ఎవరి సాయమూ అక్కరలేదు. ఎలాంటి సైన్యసాయమూ అవసరము లేదు. నేను ఒంటరిగానేయుద్ధము చేయగలను. వానరులనందరినీ భక్షిస్తాను." అని అన్నాడు.

దానికి రావణుడు ఇలా అన్నాడు. "అలాకాదు. యుద్ధమునకు పోవడానికి సైనిక బలము అత్యావశ్యకము. నీ వెంట శూలములు, ముద్గరలు ధరించిన సైనికులు వస్తారు. వారు వానరులను కొరికి చంపుతారు. నీకు సాయంగా ఉంటారు. కాబట్టి నీవు రాక్షస సైన్యముతో కలిసి వెళ్లి రామలక్ష్మణులతో యుద్ధము

చెయ్యి." అని అన్నాడు రావణుడు.

తరువాత రావణుడు తన ఆసనము నుండి లేచాడు. మణులతో తయారు చేయబడిన ఒక కంకణమును కుంభకర్ణుని చేతికి కట్టాడు. కుంభకర్ణుడికి సకల అలంకారములు చేయించాడు. నిలబడి ఉన్న కుంభకర్ణుడు పాలసముద్రములో నిలబెట్టబడిన మంథర పర్వతము మాదిరి ఉన్నాడు. సర్వాలంకార భూషితుడైన కుంభకర్ణుడు అన్న రావణునికి ప్రదక్షిణము చేసి నమస్కరించాడు. రావణుడు కుంభకర్ణుని విజయోస్తు అని దీవించాడు. రణదుందుభులు, భేరీలు మోగుతుండగా, శంఖధ్వానములు మిన్నుముట్టగా, గజబలము, అశ్వికబలము, కాల్బలములతో కుంభకర్ణుడు యుద్ధమునకు బయలుదేరాడు.

చేత శూలము ధరించిన కుంభకర్ణుడు సేనలకు ముందు నడుస్తున్నాడు. ఆ రాక్షసుల చేతుల్లో శూలములు, కత్తులు, గండ్ర గొడ్డళ్లు, పరిఘలు, గదలు, ముసలములు, పెద్ద పెద్ద తాటి చెట్లు ఆయుధములుగా ఉన్నాయి. కుంభకర్ణుడు చూచేవారికి భయం కలిగించే ఆకారంలో ప్రకాశిస్తున్నాడు. కుంభకర్ణుని శరీరము చుట్టుకొలత నూరు ధనుస్సుల పొడుగు అనగా రెండువందల గజాల పొడుగు, ఆరువందల ధనుస్సుల ఎత్తు, 1200 గజాల ఎత్తు, కలిగి మహాపర్వతము మాదిరి ఉంది. అటువంటి భయంకరాకారము కలిగిన కుంభకర్ణుడు రాక్షసులతో ఇలా అన్నాడు. "ఇప్పుడు మనము వానరులతో యుద్ధం చేయబోతున్నాము. నేను వానరులను చిన్న చిన్న భాగములుగా చేసి కాల్చి తింటాను. ఈ వానరులు అడవులలో,

ఉద్యానవనములతో తిరిగేవారు. నిజానికి వారు నాకు ఏ అపకారమూ చేయలేదు. ఆ వానరులను చంపడం వృధా. దీని కంతటికీ రాముడు మూలము. కాబట్టి ముందు రాముని చంపుతాను. రాముని చంపితే అందరినీ చంపినట్టే. అందుకని మన దృష్టి అంతా రాముని మీద ఉండాలి." అని పలికాడు కుంభకర్ణుడు. ఆమాటలకు రాక్షసులు పెద్దగా హర్షధ్వానాలు చేసారు.

కుంభకర్ణుడు యుద్ధమునకు బయలుదేరగానే, ఇదివరకు మాదిరిగానే ఎన్నో దుశ్శకునములు గోచరించాయి. ఉల్కాపాతం జరిగింది. ఆకాశంలో నల్లటి మేఘాలు కమ్ముకున్నాయి. తీవ్రమైన గాలులు వీచాయి. పిడుగులు పడ్డాయి. నక్కలు వికృతంగా అరుస్తున్నాయి. ఆకాశంలో పక్షులు అపసవ్యంగా తిరుగుతున్నాయి. కుంభకర్ణుని శూలము మీద ఒక గద్ద వాలింది. అతని ఎడమ కన్ను ఎడమ భుజము అదిరింది. సూర్యుడు మబ్బులచాటుకు పోయాడు. అమిత బలపరాక్రమములు కలిగిన కుంభకర్ణుడు ఈ దుర్నిమిత్తము లను ఏ మాత్రమూ లెక్కచెయ్యలేదు.

పెద్ద పర్వతము మాదిరి నడుస్తున్న కుంభకర్ణుడు లంకా నగర ప్రాకారమును, చిన్న బండరాయిని దాటినట్టు తన పాదములతో దాటాడు. ప్రాకారము వెలుపల మోహరించి ఉన్న వానరసైన్యము ముందు నిలబడ్డాడు. పెద్ద పర్వతము తమ ముందు నిలబడి ఉందా అని భ్రమపడ్డ వానరులు కుంభకర్ణుని చూడగానే దిక్కులు పట్టిపారిపోయారు. తనను చూచి పారిపోతున్న వానరులను చూచి కుంభకర్ణుడు పెద్దగా వికటాట్టహాసము చేసాడు. మేఘము ఉరిమినట్టు గర్జించాడు. కుంభకర్ణుని వికటాట్టహాసము, గర్జన వల్ల

పుట్టిన విపరీతమైన ధ్వనికి వానరులు ఎక్కడి వాళ్లు అక్కడ కూలిపోయారు. చేత శూలము ధరించిన కుంభకర్ణుడు గద ధరించిన యమధర్మరాజు మాదిరి యుద్ధభూమిలో నిలబడ్డాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము అరువది ఐదవ సర్గ సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము

అరువది ఆరవ సర్గ.

కుంభకర్ణుని చూచి పారిపోతున్న వానరులలో వానర ప్రముఖులైన నలుడు, నీలుడు, గవాక్షుడు, కుముదుడు మొదలగువారు ఉన్నారు. ఆ ప్రకారంగా పారిపోతున్న వానర ప్రముఖులను చూచి అంగదుడు ఇలా అన్నాడు. “ఓ వానరవీరులారా! ఒక రాక్షసుని చూచి ఇలా పారిపోవడం ధర్మమా! మీరు ఎంతటి ఉన్నత కుటుంబంలో జన్మించారు. ఒక నీచ రాక్షసునికి భయపడు తున్నారా! అయిన పారిపోయి ఎక్కడికి పోతారు! ఎంత దూరం పోతారు! వెనక్కురండి. ఇతడు రాక్షసుడు కాడు. మనలను భయపెట్టడానికి రాక్షసులు సృష్టించిన పెద్ద విగ్రహము. రండి. మనమందరమూ కలిసి ఈ బొమ్మను తునాతునకలు చేద్దాము.” అని ఎలుగెత్తి అరిచాడు.

అంగదుని మాటలకు వానరులకు ధైర్యము వచ్చింది. పారిపోయిన వాళ్లు తిరిగి వచ్చారు. చేతికి అందిన వృక్షములను,

పర్వత శిఖరములను పట్టుకొని యుద్ధమునకు సిద్ధం అయ్యారు. ఆ కుంభకర్ణుని చుట్టూ చేరి వాడిని వృక్షములతో పర్వతశిఖరములతో కొట్టారు. ఆ వానరులు కొట్టే దెబ్బలు కుంభకర్ణునికి చీమకుట్టినట్టయినా లేదు. కుంభకర్ణుని మీదకు విసిరిన వృక్షములు, పర్వతశిఖరములు కుంభకర్ణుని శరీరమునకు తగిలి తునాతునకలై పోతున్నాయి. కుంభకర్ణుడు కోపించి వానరసేనలను తన చేతులతో నలిపేస్తున్నాడు. యుద్ధభూమి అంతా వానరుల శవాలతో నిండిపోయింది. కుంభకర్ణుని చేతిలోపడకుండా తప్పించుకున్న వానరులు  కొంతమంది పారిపోయారు. కొంతమంది సముద్రంలో దూకారు. మరి కొంత మంది ఆకాశంలోకి ఎగిరిపోయారు. దొరికిన వారిని దొరికినట్టు చంపుతున్నాడు కుంభకర్ణుడు.

కుంభకర్ణుని ధాటికి తట్టుకోలేక భల్లూకములు కొన్ని చెట్టు ఎక్కాయి. కొన్ని పర్వతముల మీదికి పారిపోయాయి. మరి కొన్ని కొండగుహలలో తలదాచుకున్నాయి. మరి కొంత మంది వానరులు, భల్లూకములు చచ్చినట్టు నేలమీద కదలకుండా పడుకున్నారు. ఇలా ఎవరి దోవన వారు పారిపోతున్న వానరులను చూచి అంగదుడు బిగ్గరగా అరుస్తున్నాడు.

“ఓ వానరవీరులారా! భయపడకండి పారిపోకండి. యుద్ధము చేయండి. ఎక్కడికి పోయి ప్రాణాలు రక్షించుకుంటారు. వెనక్కురండి. యుద్ధమునుండి పారిపోయి వచ్చిన మిమ్మల్ని చూచి మీ భార్యలు పరిహాసం చేస్తారు. ఆ అవమానం కంటే యుద్ధంలో చావడం మేలు కదా! మనమందరమూ ఉత్తమ కులంలో పుట్టాము. సాధారణ వానరుల వలె పారిపోవడం భావ్యమా! అది గౌరవ ప్రతిష్ఠలను

తెచ్చిపెడుతుందా! యుద్ధానికి బయలుదేరేముందు మీరు అన్న మాటలు పలికిన వీరాలాపాలు ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకోండి. ఇప్పుడు ఆ వీరాలాపాలు అన్నీ ఎక్కడికి పోయాయి. యుద్ధము నుండి పారిపోయి, పదిమంది చేత ఛీ అనిపించుకోడం కన్నా, యుద్ధంలో మరణించి వీరస్వర్గం పొందడం మేలు కదా!

ఓ వానరవీరులారా! మనకు ఆయుర్దాయము లేకపోతే ఎక్కడ ఉన్నా చస్తాము. ఆయుర్దాయము ఉంటే యుద్ధములో విజయం సాధిస్తాము. ఒక్కమాట! మనము యుద్ధంలో గెలిస్తే కీర్తిపొందుతాము. మరణిస్తే వీరస్వర్గము పొందుతాము. కాని పారిపోతే దిక్కులేని చావు చస్తాము. కాబట్టి పారి పోకండి. వెనుకకు రండి. రాముడి పరాక్రమము ముందు ఈ రాక్షసుడు ఎంత! క్షణంలో నాశనమై పోతాడు.

ఇప్పటి దాకా మనము ఎంతో మంది రాక్షస వీరులను జయించాము. ఈ ఒక్కడికి భయపడి పారిపోతే మనము ఇప్పటిదాకా గడించిన కీర్తి అంతా బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది. రండి. వెనుదిరగండి. యుద్ధము చేయండి" అని అరుస్తున్నాడు కానీ ఎవరూ అతని అరుపులు పట్టించుకోవడం లేదు.

కాని కొంతమంది వానర వీరులు అంగదునితో ఇలా అన్నాడు. "అంగదా! ఇప్పటిదాకా చేసిన యుద్ధము చాలు. మాకు ఈ యుద్ధము అక్కరలేదు. మా ప్రాణాలే మాకు తీపి. నీవుకావలిస్తే ఆ భయంకరాకారుడితో యుద్ధం చెయ్యి" అని పలికి పారిపోయారు.

కాని అంగదుడు తన ప్రయత్నము మానుకోలేదు. పోయిన వారు పోగా మిగిలిన వారిని బతిమాలి వెనుకకు తీసుకొని వస్తున్నాడు. వెనకకు వచ్చినవారంతా అంగదుని ఆజ్ఞల కొరకు ఎదురుచూస్తున్నారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము అరువది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
అరువది ఏడవ సర్గ.

పారిపోయి తిరిగివచ్చిన వానర వీరులు ప్రాణాలకు తెగించి యుద్ధంచేస్తున్నారు. వారు పెద్ద పెద్ద వృక్షములను, గండ శిలలను, పర్వత శిఖరములను తీసుకొని కుంభకర్ణుని మీదికి విసురుతున్నారు. కుంభకర్ణుడు తన గదను అటు ఇటు ఊపుతూ వానరులను చెదరగొడుతున్నాడు. ఆ చెదర గొట్టడంలో వందలు వేలు వానరులు దూరంగా విసిరివేయబడుతున్నారు. కుంభ కర్ణుడు వందల కొద్దీ వానరులను రెండు చేతులతో పట్టుకొని నోట్లో కుక్కుకొని తింటున్నాడు. అయినా వానరులు కుంభకర్ణుని మీదికి వృక్షములు, రాళ్లు విసురుతూ యుద్ధం చేస్తున్నారు.

ఇంతలో ద్వివిదుడు ఒక పర్వత శిఖరమును పెకలించి చేతపట్టుకొని కుంభకర్ణుని వైపుకు పరుగెత్తాడు. ద్వివిదుడు ఆ పర్వతమును తీసుకొని పైకి ఎగిరి దానిని కుంభకర్ణుని మీదికి విసిరాడు. ఆ పర్వత శిఖరము కుంభకర్ణుని మీద పడకుండా

రాక్షససేనల మీద పడింది. ఆ పర్వతము కిందపడి వందలకొద్దీ రాక్షసులు మరణించారు. అది చూచిన రాక్షస సైనికులు వానరుల మీద పడి బాణములతో వానరుల శిరస్సులను బంతుల మాదిరి ఎగురగొడుతున్నారు. వానరులు కూడా పెద్ద పెద్దవృక్షములను బండరాళ్లను తీసుకొని రాక్షసులను చంపుతున్నారు.

హనుమంతుడు ఆకాశంలోకి ఎగిరి పైనుండి కుంభకర్ణుని మీదికి బండరాళ్లను, వృక్షములను విసురుతున్నాడు. కుంభకర్ణుడు తన శూలముతో వాటిని అటు ఇటు చెదరగొడుతున్నాడు. హనుమంతుడు పెద్ద పర్వత శిఖరమును చేతబట్టుకొని కుంభకర్ణుని ముందు నిలబడ్డాడు. తన శరీరాన్ని కుంభకర్ణునితో సమానంగా పెంచాడు. ఆ పర్వతశిఖరంతో కుంభకర్ణుని శిరస్సు బద్దలు కొట్టాడు. కుంభకర్ణుని శరీరం అంతా రక్తసిక్తము అయింది. దానికి కోపించిన కుంభకర్ణుడు తన శూలముతో హనుమంతుని గుండెల మీద కొట్టాడు. ఆ దెబ్బకు హనుమంతుని ముఖం నుండి రక్తం స్రవించింది. హనుమంతుడు పెద్దగా అరుస్తున్నాడు. రక్తం కక్కుతున్న హనుమంతుని చూడగానే రాక్షసులు ఆనందంతో కేరింతలు కొట్టారు. హనుమంతుని చూచిన మిగిలిన వానర సేనలు భయంతో పారిపోయారు.

ఇది చూచిన నీలుడు వానర సైన్యమునకు ధైర్యము చెప్పి వారిని వెనక్కు మళ్లించాడు. కుంభకర్ణునిమీదికి ఒక పెద్ద పర్వత శిఖరమును విసిరాడు. అది చూచిన కుంభకర్ణుడు పిడికిలి బిగించి ఆ పర్వత శిఖరమును గట్టిగా గుద్దాడు. ఆ గుద్దుకు పర్వతశిఖరము

బద్దలైపోయింది. ఇంతలో ఋషభుడు, శరభుడు, నీలుడు, గవాక్షుడు, గంధమాధనుడు ఒక్కుమ్మడిగా కుంభకర్ణుని మీదికి వెళ్లారు. వారందరూ వృక్షములతోనూ. పర్వతశిఖరములతోనూ కుంభకర్ణుని నలువైపులా మోదారు. ఆ దెబ్బలకు కుంభకర్ణుడు చలించలేదు. ఋషభుడిని కుంభకర్ణుడు గట్టిగా పట్టుకున్నాడు. తన చేతులతో నలిపేసాడు. ఋషభుడు రక్తం కక్కుకుంటూ నేలమీద పడ్డాడు. కుంభకర్ణుడు కోపించి శరభుడిని తన పిడికిలితోనూ, నీలుడిని తన మోకాలితోనూ, గవాక్షుడిని తన అరిచేతితోనూ, గంధమాధనుడిని కాలితోనూ తన్నాడు. ఆ దెబ్బలకు తట్టుకోలేక ఆ వానరవీరులు కింద పడి గిలా గిలా కొట్టుకున్నారు.

ఇంక తెగించిన వానరులు వేల కొద్దీ కుంభకర్ణుని మీదికి పరుగెత్తారు. వారందరూ అతని చేతికి కాలికి దొరకకుండా కుంభకర్ణుని మీదికి ఎక్కారు. అతని శరీరం అంతా గోళ్లతోరక్కారు. కొరికారు. పిడికిళ్లు బిగించి కొట్టారు. కుంభకర్ణుడి ఒంటినిండా వానరులు పాకుతున్నారు. కుంభకర్ణుడు ఆ వానరులను చేతికి దొరికిన వారిని దొరికినట్టు నోట్లో పెట్టుకొని తింటున్నాడు. కుంభకర్ణుని నోట్లోకి పోయిన వానరులు కుంభకర్ణుని ముక్కు, చెవి రంధ్రములలోనుండి బయటకు వస్తున్నారు. కుంభకర్ణుని కాళ్ల కిందపడి చాలా మంది వానరులు మరణిస్తున్నారు.

కుంభకర్ణుడు ఎంతకూ లొంగడం లేదని వానరులు అందరూ రాముని వద్దకు పరుగెత్తారు. ఇంతలో అంగదుడు ఒక పెద్ద పర్వత శిఖరమును తీసుకొని కుంభకర్ణుని తలమీద మోదాడు. ఆ దెబ్బతిన్న కుంభకర్ణుడు కోపంతో అంగదుని వైపు పరుగెత్తాడు. తన

శూలమును అంగదుని మీదికి విసిరాడు. కాని అంగదుడు పక్కకు ఎగిరి ఆ శూలమును తప్పించుకున్నాడు. అంగదుడు పైకి ఎగిరి కుంభకర్ణుని వక్షస్థలము మీద బలంగా చరిచాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడు కళ్లు బైర్లు కమ్మాయి. తూలిపోయాడు. అంతలోనే తేరుకున్న కుంభకర్ణుడు పిడికిలి బిగించి అంగదుని గుద్దాడు. ఆ దెబ్బకు అంగదుడు నేల మీద పడి  మూర్ఛపోయాడు.

తరువాత కుంభకర్ణుడు తన శూలము తీసుకొని సుగ్రీవుడు ఉన్న వైపుకు వెళ్లాడు. కుంభకర్ణుడు తన వైపుకు రావడం చూచిన సుగ్రీవుడు ఒక పెద్ద పర్వతమును చేత్తో పట్టుకొని పైకి ఎగిరాడు. కుంభకర్ణుని వైపుకు వేగంగా వెళ్లాడు. తన వైపు వస్తున్న సుగ్రీవుని చూచి కుంభకర్ణుడు రొమ్ము విరుచుకొని నిలబడ్డాడు. అప్పుడు కుంభకర్ణుని చూచి సుగ్రీవుడు ఇలా అన్నాడు.

"ఓ కుంభకర్ణా! సాధారణ వానరులను ఎందుకు చంపుతావు. అది ఒక కీర్తి అనుకుంటున్నావా! నేను నీ మీదికి ఈ పర్వతమును విసురుతున్నాను. ఈ దెబ్బకాచుకో!" అన్నాడు సుగ్రీవుడు.

ఆ మాటలు విన్న కుంభకర్ణుడు ఇలా అన్నాడు. "ఓ సుగ్రీవా! నీవు బ్రహ్మదేవుని మనుమడివి. ఋక్షరజస్సు కుమారుడివి. ఊరికే ఎందుకు అరుస్తావు. నీకు చేతనయింది చెయ్యి." అన్నాడు కుంభకర్ణుడు.

అప్పుడు సుగ్రీవుడు తన చేతిలో ఉన్న పర్వతమును కుంభకర్ణుని వక్షస్థలము మీదికి విసిరాడు. ఆ పర్వతము కుంభకర్ణుని గుండెలకు తగిలేలా నుగ్గు నుగ్గు అయిపోయింది. అది చూచి రాక్షసులు పెద్దగా కేకలు పెట్టారు. వానరులు దిగులుతో దిగాలు పడ్డారు. కుంభకర్ణుడు తన శూలమును సుగ్రీవుని మీదికి బలంగా విసిరాడు. ఇంతలో సుగ్రీవుడు పైకి ఎగిరి ఆ శూలమును చేత్తో పట్టుకొని రెండుగా విరిచాడు. అది చూచి వానరులు హర్షధ్వానాలు చేసారు. తన చేతిలో ఉన్న శూలం విరిగిపోవడంతో కుంభకర్ణుడు కలవరపడ్డాడు. కుంభకర్ణుడు ఒక పర్వత శిఖరమును పెకలించి సుగ్రీవుని మీదికి విసిరాడు. ఆ దెబ్బకు సుగ్రీవుడు కిందపడి మూర్ఛపోయాడు. రాక్షసులు పెద్దగా కేకలు పెట్టి కుంభకర్ణుని పొగిడారు.

కుంభకర్ణుడు సుగ్రీవుడిని పైకి ఎత్తుకున్నాడు. అక్కడి నుండి వెళ్లిపోతున్నాడు. "వీడిని చంపితే వానర సైన్యము అంతా పారిపోతుంది." అని అనుకున్నాడు కుంభకర్ణుడు. సుగ్రీవుడిని కుంభకర్ణుడు మోసుకొని పోవడం, అది చూచి వానర సేనలు పారిపోవడం, చూచాడు హనుమంతుడు. ఇలా ఆలోచించాడు. "అయ్యో! సుగ్రీవుని కుంభకర్ణుడు తీసుకొని పోతున్నాడు. వానరులు పారిపోతున్నారు. ఇప్పుడే నేనేంచెయ్యాలి. నా శరీరాన్ని పెంచి కుంభకర్ణుని శరీరాన్ని పిడికిళ్లతో గుద్ది చంపేస్తాను. సుగ్రీవుడిని విడిపిస్తాను. అప్పుడు వానరులు అంతా సంతోషిస్తారు. కుంభకర్ణుడు కొట్టిన దెబ్బకు సుగ్రీవుడు స్పృహ కోల్పోయాడు. లేకపోతే సుగ్రీవుడు దేవతలు, దానవులు, గంధర్వులు పట్టుకున్నా విడిపించుకోగల సమర్థుడు. సుగ్రీవునికి స్పృహ వస్తే చాలు, తనంత తాను కుంభకర్ణుని

నుండి విడిపించుకోగల సమర్ధుడు. ఇప్పుడు నేను సుగ్రీవుని విడిపిస్తే అతనికి అపకీర్తి తెచ్చినవాడిని అవుతాను. నేను విడిపించడం సుగ్రీవునికి రుచించకపోవచ్చు. అందుకని సుగ్రీవునికి స్పృహ వచ్చేవరకూ వేచిఉండక తప్పదు. ఈ లోపల పారిపోతున్న వానరసేనలకు ధైర్యం చెప్పడం అవసరం.” అని అనుకున్నాడు హనుమంతుడు.

వెంటనే హనుమంతుడు పారిపోతున్న వానర సేనలకు ధైర్యము చెప్పి వెనుకకు మళ్లించాడు. ఈ లోగా కుంభకర్ణుడు సుగ్రీవుని తీసుకొని లంకానగరంలోకి వెళ్లిపోయాడు. సుగ్రీవుని బందీగా తీసుకొని వచ్చిన కుంభకర్ణుని మీద లంకా నగరవాసులు పుష్పవర్షము కురిపించారు. చల్లగా పూలు, గంధము నీరు తన మీద పడటంతో సుగ్రీవునికి మెల్లగా స్పృహవచ్చింది. తాను కుంభకర్ణుని బుజంమీద ఉన్నట్టు తెలుసుకున్నాడు సుగ్రీవుడు. ఇలా అనుకున్నాడు.

“నన్ను కుంభకర్ణుడు బందీగా పట్టుకున్నాడు. ఇప్పుడు నేనేం చెయ్యాలి.” అని క్షణకాలం ఆలోచించాడు. ఆలస్యం చేయకుండా తన గోళ్లతోనూ, దంతాలతోనూ కుంభకర్ణుని చెవులను కొరికాడు. పీకాడు. ముక్కును శరీరాన్ని చీల్చాడు. ఆ బాధ తట్టుకోలేక కుంభకర్ణుడు సుగ్రీవుని నేలకేసి కొట్టాడు. వెంటనే సుగ్రీవుడు బంతి మాదిరి ఆకాశంలోకి ఎగిరాడు. లంకా నగరం అవతల సేనల మధ్యలో ఉన్న రాముని దగ్గర పడ్డాడు.

చెవులూ ముక్కు కొరకబడిన కుంభకర్ణుని శరీరం రక్తసిక్తం అయింది. మరలా యుద్ధరంగానికి పరుగెత్తాడు కుంభకర్ణుడు. తన చేతిలో ఒక ముద్గరను తీసుకున్నాడు. మరలా వానరులను పట్టుకొని తినడం మొదలెట్టాడు కుంభకర్ణుడు. వారూ వీరూ అని చూడటం లేదు. దొరికిన వాళ్లను దొరికినట్టు తింటున్నాడు. వానరులను, ఎలుగుబంట్లను, రాక్షసులను కూడా తినేస్తున్నాడు. ఒక పక్కనుండి వానరులు పర్వతశిఖరములతో, వృక్షములతో కొడుతూ ఉంటే మరొక పక్క కుంభకర్ణుడు వానరులను భక్షిస్తూ ఉన్నాడు.

వానరులందరూ గబ గబా రాముని వద్దకు వెళ్లారు. తమను కుంభకర్ణుని బారి నుండి కాపాడమని రాముని శరణువేడారు. ఇదేమీ పట్టని కుంభకర్ణుడు తన ఆకలి తీరేట్టు వానరులను తింటూఉన్నాడు. ఒక్కో పట్టుకు పది, ఇరవై, యాభై మంది వానరులను పట్టుకొని నోట్లో కుక్కుకుంటున్నాడు. కుంభకర్ణుని నోటి నుండి దంతముల నుండి వానరుల పేగులు వేలాడుతున్నాయి. అతని శరీరం అంతా వానరుల రక్తంతో తడిసిపోయింది.

అది చూచిన లక్ష్మణుడు కుంభకర్ణునితో యుద్ధానికి తలపడ్డాడు. మొదటగా ఏడు బాణములను కుంభకర్ణుని శరీరంలో నాటాడు. ఇంకా పెక్కు బాణములను కుంభకర్ణుని మీద ప్రయోగించాడు. కాని ఆ బాణములు కుంభకర్ణుని ఏమీ చేయలేకపోయాయి. వాటిని చేతితో విదిలించుకున్నాడు కుంభకర్ణుడు. లక్ష్మణునికి కోపం వచ్చింది. కుంభకర్ణుని శరీరం అంతా తన బాణములను నాటాడు. కుంభకర్ణుని శరీరం అంతా బాణములతో నిండిపోయింది.

అది చూచి కుంభకర్ణుడు లక్ష్మణుని తో ఇలా అన్నాడు. "కుమారా! నీ ధైర్యానికి పరాక్రమానికి నాకు చాలా సంతోషంగా ఉంది. యముడు కూడా నా ఎదుట నిలబడ్డానికి భయపడతాడు. అటువంటిది నువ్వు నా ఎదురుగా ధైర్యం గా నిలబడి నా మీద బాణవర్షము కురిపించావు. నా ఎదుట ధైర్యంగా నిలబడ్డందుకే నిన్ను గౌరవించాలి. ఇంక యుద్ధం కూడా చేసినందుకు చెప్పపనిలేదు. ఇప్పటి దాకా నాతో చేసిన యుద్ధము చాలు. ఇంక నీవు రాముని వద్దకు వెళ్లు. నీ వంటి ధైర్యవంతుడిని, పరాక్రమవంతుడిని  చంపడం నాకు ఇష్టం లేదు. నా గురి రాముని మీదనే. రాముని చంపితే అందరినీ చంపినట్టే కదా! ముందు నేను రాముణ్ణి చంపుతాను. తరువాత మా సైనికులు మిగిలిన వాళ్లను చంపుతారు." అని అన్నాడు.

కుంభకర్ణుడు తనను తాను పొగుడుకుంటూ పలికిన మాటలకు లక్ష్మణుడు బిగ్గరగా నవ్వాడు. "ఓ రాక్షస వీరుడా! ఇది యుద్ధ భూమి. పౌరుషము పరాక్రమము చూపించవలసిన సమయము. నీ ముందు ఇంద్రుడు మొదలగు దేవతలు నిలువలేరని పలికావు. అది నిజమే కావచ్చు. ఎందుకంటే ఇప్పటిదాకా నీ పరాక్రమమును కళ్లారా చూచాము. కాని నీ పరాక్రమము, పౌరుషము పర్వతము మాదిరి నిలబడి ఉన్న రాముని ముందు గడ్డిపోచతో సమానము. నీ వీరత్వము రాముని మీద చూపించు." అని అన్నాడు లక్ష్మణుడు.

ఆమాటలకు కోపించిన కుంభకర్ణుడు లక్ష్మణుని వదిలి రాముని వైపుకు దూసుకు వెళ్లాడు. తన వంక వస్తున్న కుంభకర్ణుని

మీద రాముడు రౌద్రాస్త్ర అస్త్రమును ప్రయోగించాడు. అది కుంభకర్ణుని వక్షస్థలమును తాకింది. ఆ దెబ్బ తిన్న కుంభకర్ణుని ముఖము నుండి అగ్ని గోళములు వెలువడ్డాయి. రౌద్రాస్త్రము దెబ్బతిన్న కుంభకర్ణుడు పెద్దగా అరుస్తూ రాముని వంకకు పరుగెత్తాడు. రాముడు మరలా వాడి అయిన బాణములను కుంభకర్ణుని వక్షస్థలమునకు గురి చూచి కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుని చేతిలోని గదజారిపోయింది. రాముడు కుంభకర్ణుని మీద ఎడతెరిపి లేకుండా బాణవర్షము కురిపిస్తున్నాడు. కుంభకర్ణుని శరీరం అంతా రక్తంతో తడిసిపోయింది. సెలయేరు మాదిరి రక్తం ప్రవహిస్తూ ఉంది. అయినా కుంభకర్ణుడు చేతి కందిన వానరులను, భల్లూకములను తినడం మానలేదు.

కుంభకర్ణుడు ఒక పర్వత శిఖరమును పెకలించి రాముని మీదికి విసిరాడు. రాముడు ఏడు బాణములతో ఆ పర్వతశిఖరమును ఖండించాడు. ఆ శిఖరము కిందపడి రెండు వందల మంది వానరులు చనిపోయారు. అప్పుడు లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! ఇతడికి వానరులు ఎవరో రాక్షసులు ఎవరో తెలియడం లేదు. రాక్షసులను కూడా భక్షిస్తున్నాడు. మన వానరులు అందరూ ఈ కుంభకర్ణుని మీదికి అన్ని వైపుల నుండీ ఎక్కుతారు. మన వానర సేనానాయకులు వీడి చుట్టు చేరి ఇతడికి దిక్కుతోచకుండా చేస్తారు. వానరుల బరువుకు వీడు నిలబడలేక నేల మీద పడిపోతాడు. అప్పుడు వీడు మన వానరులను చంపలేడు." అని అన్నాడు.

ఆ మాటలు విన్న వానరులు సంతోషంతో గంతులు వేసారు. అందరూ అన్ని వైపుల నుండి కుంభకర్ణుని చుట్టు ముట్టి వాడికి మీదికి ఎక్కారు. వాడి శరీరం అంతా వానరులతో నిండి పోయింది. కుంభ

కర్ణుడు తన మీదకు ఎక్కిన వానరులను చీమలు దులిపినట్టు దులిపేసాడు.

ఈ ఉపాయం కూడా పనిచేయకపోవడంతో రాముడు మరలా తన ధనుస్సును తీసుకున్నాడు. లక్ష్మణుడు వెంట రాగా కుంభకర్ణుని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. వానర వీరులు రామలక్ష్మణులను అనుసరించారు. కుంభకర్ణుని చుట్టూ రాక్షసులు వలయంలా రక్షణ కవచంలా నిలబడ్డారు. వారందరూ వానరులను తరుముతున్నారు. మధ్యలో ఉన్న కుంభకర్ణుడు వానరులను భక్షిస్తూ, తన నాలుకతో పెదాలకు అంటుకున్న రక్తాన్ని నాక్కుంటున్నాడు. రాముడు కుంభకర్ణుని సమీపించి ధనుష్టంకారము చేసాడు. ఆ ధ్వని విన్న కుంభకర్ణుడు తలతిప్పి రాముని వంక చూచాడు. రాముని వైపుకు నడిచాడు.

అప్పుడు రాముడు కుంభకర్ణుని చూచి ఇలా అన్నాడు. "ఓ రాక్షస వీరుడా! నాతో యుద్ధానికిరా. చావబోతున్నానని దిగులుపడకు. నేను ధనుస్సు పట్టుకొని నీ ఎదుట నిలబడ్డాను. నిన్నేకాదు నీ రాక్షస వంశమును పూర్తిగా నాశనం చేస్తాను.  ఇంకొద్దిసేపట్లో నీ ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి." అని అన్నాడు రాముడు.

కుంభకర్ణుడు రాముని తేరిపార చూచాడు. అతని వైపు అడుగులు వేసాడు. పెద్దగా వికాటాట్టహాసం చేసాడు. రామునితో ఇలా అన్నాడు. "నువ్వేనా రాముడివి. ఓ రామా! నేను విరాధుడిని, కబంధుడిని, ఖరుడిని, మారీచుడిని, వాలిని కాను. నన్ను వాళ్ల మాదిరి

అనుకోకు. నేను కుంభకర్ణుడను. నీ చేతిలో ధనుస్సు ఉంటే నాచేతిలో ముద్గర ఉంది. దీనితో నేను  దేవతలను, దానవులను  జయించాను. నాముక్కు చెవులు మీ వానరులు తినేసారు. కాని నాకు ఏ బాధా లేదు. నీకు పరాక్రమము ఉంటే నా శరీరం అంతా కొట్టు. నీ బలపరాక్రమములను చూచిన తరువాత నిన్ను భక్షిస్తాను." అని గర్వంగా పలికాడు కుంభకర్ణుడు.

రాముడు మారు మాట్లాడకుండా కుంభకర్ణుని మీద వాడి అయిన బాణములను ప్రయోగించాడు. కాని రాముని బాణములు కుంభకర్ణునికి ఏమీ బాధ కలిగించలేదు. కుంభకర్ణుడు తన ముద్గరను వేగంగా తిప్పుతూ ఆ బాణములను మధ్యలోనే తునాతునకలు చేస్తున్నాడు.  ఒక పక్క రాముని బాణములను అడ్డుకుంటూ మరొక పక్క ముద్గరతో వానరులను తరుముతున్నాడు కుంభకర్ణుడు. రాముడు వెంటనే వాయవ్యాస్త్రమును సంధించాడు. ముద్గర ఉన్న కుంభకర్ణుని చేతిని భుజము దగ్గర ఖండించాడు. కుంభకర్ణుని చేయి ముద్గరతో సహా ఎగిరి అవతల పడింది. కుంభకర్ణుడు పెద్దగా కేకపెట్టాడు. ఎగిరి పడ్డ కుంభకర్ణుని చేతి కిందపడి వందలకొద్దీ వానరులు మరణించారు.  మిగిలిన వానరులు పక్కలకు పరుగెత్తి రాముడు, కుంభకర్ణుని యుద్ధమును ఆసక్తిగా చూస్తున్నారు.

ఒక చేతిని పోగొట్టుకున్న కుంభకర్ణుడు రెండవ  చేత్తో ఒక వృక్షమును పెకలించి, దానిని చేతబట్టుకొని, రాముని మీదికి పరుగెత్తాడు. రాముడు ఇంద్ర అస్త్రమును  ప్రయోగించి కుంభకర్ణుని రెండవచేతిని వృక్షముతో సహా ఖండించాడు. కుంభకర్ణుడి చేయి భుజము దాకా తెగి కిందపడింది. రెండు చేతులు లేకపోయినా,

కుంభకర్ణుడు రంకెలు వేస్తూ వానర సైన్యము మీదికి పరుగెడు తున్నాడు. రాముడు రెండు అర్ధచంద్రబాణములతో కుంభ కర్ణుని రెండు కాళ్లు ఖండించాడు. మొదలు నరికిన వృక్షము వలె కుంభకర్ణుడు నేలమీద పడిపోయాడు. కుంభకర్ణుని రెండు కాళ్లు రెండు వైపులకు విసిరివేయబడ్డాయి. అయినా కుంభకర్ణుని పౌరుషము చావలేదు. పాక్కుంటూ, దేక్కుంటూ రాముని వైపుకు వెళుతున్నాడు. రాముడు వాడి అయిన బాణములను కుంభకర్ణుని ముఖం నిండా కొట్టాడు. కుంభకర్ణునికి అరవడానికి కూడా వీలులేదు. ఆ స్థితిలో కుంభకర్ణుడు మూర్ఛపోయాడు.

తరువాత రాముడు ఇంద్ర అస్త్రమును తీసుకున్నాడు. అది వాయువేగము కలది. సూర్యుని వలె ప్రకాశవంతమైనది. ఆ అస్త్రమును రాముడు కుంభకర్ణుని మీద ప్రయోగించాడు. ఇంద్రుని వజ్రాయుధ మును పోలిన ఆ అస్త్రము కుంభకర్ణుని మీదికి దూసుకొని వెళ్లింది. కుంభకర్ణుని శిరస్సును ఖండించింది. చేతులు కాళ్లు తల లేని కుంభకర్ణుని మొండెము నేల మీద పడిపోయింది. కిరీటముతోనూ కుండలములతోనూ ప్రకాశిస్తున్న కుంభకర్ణుని తల ఎగిరి ప్రాకారము అవతల పడింది. ఆ శిరస్సుదెబ్బకు లంకా ప్రాకారము కూడా విరిగిపోయింది.

లోకకంటకుడైన ఒక మహారాక్షసుని మరణానికి దేవతలు, ఋషులు, గంధర్వులు, యక్షులు, ఆకాశము నుండి రాముని మీద పుష్పములు కురిపించారు. రాముని పరాక్రమమునకు ఎంతో సంతోషించారు. కుంభకర్ణుడు మరణించడం చూచి రాక్షసులు

బిగ్గరగా అరిచారు. ఏడిచారు. భయంతో పరుగెట్టారు. వానరులందరూ సంతోషంతో కేరింతలు కొట్టారు. బిగ్గరగా హర్షధ్వానాలు చేసారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము అరవై ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
అరవై ఎనిమిదవ సర్గ.

కుంభకర్ణుడు మరణించడం కళ్లారా చూచిన రాక్షసులు పరుగు పరుగున లంకా నగరం వైపు పరుగెత్తారు. రావణునికి ఈ వార్త చెప్పారు. “లంకేశ్వరా! మహావీరుడు కుంభకర్ణుడు ఎంతో మంది వానరులను చంపి, భక్షించి, కాలవశమున వీరగతి పొందాడు. కుంభకర్ణుడు తన పరాక్రమమును ప్రదర్శించి, తుదకు రాముని బాణములకు హతమైనాడు. చేతులు, కాళ్లు తెగి పడి, ముక్కు చెవులు కొరకబడి, శిరస్సు తెగి, మాంసపు ముద్ద వలె పడిఉన్నాడు. ” అని వివరించారు.

కుంభకర్ణుని మరణ వార్త విని రావణుడు నిర్ఘాంత పోయాడు. నేల మీద పడి మూర్ఛపోయాడు. తమ పినతండ్రి మరణించిన వార్త విన్న త్రిశిరుడు, దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు రోదించారు. మహెూదరుడు, మహాపార్శ్వుడు చింతించారు.

రావణునికి తెలివి వచ్చింది. కుంభకర్ణుని తలచుకుంటూ రోదిస్తున్నాడు. "తమ్ముడా కుంభకర్ణా! నీవు శత్రువులను చంపి నాకు సంతోషము కలిగిస్తావు అని అనుకున్నాను కానీ నన్ను విడిచి యముడిని కలుసుకోడానికి పోతావని అనుకోలేదు. నాకు శత్రువులనుండి విముక్తి కలిగించ కుండానే నన్ను ఒంటరిగా వదిలి ఎక్కడికి వెళ్లిపోయావు. నీ మరణంతో నా కుడిభుజము పడిపోయి నట్టు అయింది. దేవతలను, దానవులను జయించిన వాడివి, నిన్ను ఒక మానవుడు ఎలా చంపగలిగాడో అర్థం కావడం లేదు. దేవేంద్రుడి వజ్రాయుధము కూడా నిన్ను ఏమీ చేయలేకపోయింది. అటువంటిది ఒక మానవుడైన రాముని బాణములకు బలిఅయిపోయావా! నీకు ఇంతబలము ఇంత శౌర్యము ఉండి కూడా దైవ వశమున యమలోకమునకు వెళ్లిపోయావా! హంసతూలికా తల్పము మీద తప్ప శయనించని వాడవు, కటికనేలమీద పడి ఉన్నావా!

దేవతలు, ఋషులు, యక్షులు, గంధర్వులు ఆకాశంలో నిలబడి నీ మరణ వార్త విని హర్షధ్వానాలు చేస్తున్నారు. నీవు మరణించగానే ఆ వానరులకు అడ్డు ఆపు లేకుండా పోతుంది. లంకానగర ప్రాకారములు ఎక్కి లంకానగరంలోకి ప్రవేశిస్తారు. నీవులేని నాకు ఈ లంకా రాజ్యము ఎందుకు? ఈ సీత ఎందుకు? ఆ రాక్షస సైన్యము ఎందుకు? నీవులేని నాకు ఈ జీవితము మీద కూడా ఆసక్తి లేదు. నా సోదరుడు కుంభకర్ణుని చంపిన రాముని చంపి పగతీర్చుకుంటాను. లేకపోతే నేను జీవించి ఉండి కూడా వృథా! నేను తక్షణం నా తమ్ముడిని చూడాలి. నేను అక్కడకు వెళ్లాలి. నేను నా తమ్ముడిని విడిచి క్షణకాలం కూడా ఉండలేను. నీ అండలేని నన్ను

చూచి దేవతలు నవ్వుతారు. పరిహాసం చేస్తారు. నువ్వు లేకుండా నేను ఇంద్రుని మీదికి ఎలా యుద్ధానికి పోగలను. ఇంద్రుని ఎలా జయించగలను.

ఆనాడు విభీషణుడు చెప్పిన మాటలు నేను నా అజ్ఞానంతో పెడచెవిని పెట్టాను. ఆ మాటలు ఈనాడు నిజం అయ్యాయి. కుంభకర్ణుడు, ప్రహస్తుడు ప్రాణాలు కోల్పోయారు. విభీషణుని మాటలు ఒక్కొక్కటీ నిజం అవుతున్నాయి. నేను నా తమ్ముని అవమానించిన దానికి ఫలితం ఇప్పుడు అనుభవిస్తున్నాను. మహావీరుడైన నా తమ్ముడు కుంభకర్ణుని పోగొట్టుకున్నాను." అలా పరి పరి విధాలుగా విలపిస్తూ రావణుడు మూర్ఛపోయాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము అరవై ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## అరవై తొమ్మిదవ సర్గ.

రావణుని తమ్ముడు, మహావీరుడు, కుంభకర్ణుడు, రాముని చేతిలో మరణించాడు. కుంభకర్ణుడు మరణించాడని తెలిసి రావణుడు భోరున విలపించాడు. అప్పుడు త్రిశిరుడు రావణుని చూచి ఇలా అన్నాడు. "ఓ రాక్షస రాజా! కుంభకర్ణుడు మరణించాడు. నిజమే. కాని వీరుడవైన నీవు ఈ మాదిరి శోకించడం తగదు. నీవు మూడు లోకములను గెలువ సమర్థుడవు. అట్టి నీవు ఒక సామాన్యుని వలె

ఇలా శోకించడం తగదు. నీ వద్ద బ్రహ్మదేవుడు ప్రసాదించిన అస్త్రములు, శక్తి కవచము, ధనుస్సు, దివ్యమైన రథము ఉన్నాయి కదా. మరి చింత ఎందుకు. ఓ రావణా! నీవు పెక్కు సార్లు దేవతలను, దానవులను ఓడించావు. అట్టి నీవు నీ వద్ద ఉన్న అస్త్రములు, శస్త్రములతో రాముని ఓడించలేవా! పైగా మేమంతా నీ వెంట ఉన్నప్పుడు నీకు దిగులు ఎందుకు. ఇప్పుడే నేను రణభూమికి వెళ్తాను. నీ శత్రువులను సంహరిస్తాను. విజయంతో తిరిగి వస్తాను. నాచేత చంపబడ్డ రాముని నీవు చూడగలవు." అని పలికాడు త్రిశిరుడు.

త్రిశిరుని మాటలకు రావణుడు ఎంతో సంతోషించాడు. త్రిశిరుని వెంట దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు బయలుదేరారు. వారి వెంట రావణుని కుమారులు కూడా యుద్ధానికి బయలుదేరారు. వారందరూ ఆకాశంలో ఎగరగల సమర్థత ఉన్నవారు. పైగా మాయాయుద్ధములో ఆరితేరినవారు. అందరూ దేవతలతోనూ, దానవులతోనూ, యక్షులు, గంధర్వులు, పన్నగులతోనూ యుద్ధము చేసి వారిని ఓడించిన పరాక్రమవంతులు. అందరికీ అస్త్రవిద్య బాగా తెలుసు. పైగా అందరూ వరములు పొందినవారే. రావణుడు తన కుమారులను కౌగలించుకొని వారిని ఆశీర్వదించి యుద్ధమునకు పంపాడు. రావణుడు తన కుమారుల రక్షణ కొరకు ప్రత్యేకంగా తన సోదరులు, యుద్ధోన్మత్తుడు అయిన మహోదరుని, మత్తుడు అయిన మహాపార్శ్వుడిని పంపాడు. త్రిశిరుడు, అతికాయుడు, దేవాంతకుడు, నరాంతకుడు, మహోదరుడు, మహాపార్శ్వుడు యుద్ధానికి మహోత్సాహంతో బయలుదేరారు.

మహోదరుడు ఐరావతమును పోలిన ఏనుగును ఎక్కి యుద్ధానికి వెళ్లాడు. రావణుని కుమారుడు త్రిశిరుడు రథము మీద బయలుదేరాడు. (త్రిశిరుడు అంటే మూడు తలలు కలవాడు అని అర్థం చెప్పుకోవచ్చు. తరువాతి శ్లోకంలో వాడు మూడు కిరీటములు ధరించాడు అని ఉంది. కాబట్టి వాడికి మూడు తలలు ఉన్నాయని చెప్పవచ్చును.) రావణుని కుమారుడు అతికాయుడు కూడా రథము మీద బయలుదేరాడు. నరాంతకుడు తెల్లటి గుర్రమును ఎక్కి యుద్ధానికి బయలుదేరాడు. చేతిలో ప్రాస అనే ఆయుధమును ధరించాడు. దేవాంతకుడు పరిఘ అనే ఆయుధమును ధరించి బయలు దేరాడు. మహాపార్శ్వుడు గదను చేత ధరించి బయలు దేరాడు. వారి వెనక రాక్షస సైన్యము బయలు దేరింది. వారందరూ, వస్తే విజయులై తిరిగిరావాలి లేకపోతే యుద్ధములో మరణించి వీరస్వర్గము పొందాలి, అనే కృతనిశ్చయంతో బయలుదేరారు. వారందరూ పెద్దగా గర్జిస్తూ సింహనాదాలు చేస్తూ వెళుతున్నారు. వాళ్ల అరుపులతోనూ సింహనాదాలతోనూ భూమి ఆకాశము బద్దలవు తున్నాయా అన్నట్టు ఉంది.

వారందరూ లంకానగరము వెలుపలికి వచ్చి వానర సైన్యమును చూచారు. వానరులు కూడా రాక్షససైన్యమును చూచారు. వానరులు అందరూ తమ తమ చేతులలో పెద్ద పెద్ద వృక్షములను పర్వతములను ఎత్తి పట్టుకొని అరుస్తున్నారు. యుద్ధానికి సన్నద్ధము అవుతున్నారు. వానరుల అరుపులు విన్న రాక్షసులు వారి కన్నా ఇంకా పెద్దగా అరుస్తున్నారు. గర్జిస్తున్నారు. వికటాట్టహాసం చేస్తున్నారు. వానరులు కొంత మంది నేల మీదా మరి కొంతమంది ఆకాశంలోకి ఎగిరి యుద్ధం చేస్తున్నారు. రాక్షసుల మీద వృక్షములను,

రాళ్లను, విసురుతున్నారు. రాక్షసులు వదులుతున్న బాణములను ఎదుర్కొంటూ రాక్షసుల మీదికి పర్వతములను విసురుతున్నారు. వానరులు విసురుతున్న పర్వతముల కిందపడి రాక్షసులు పొడి పొడి అవుతున్నారు. వానరులు విజృంభించి కవచములను ధరించిన రాక్షసులను వెతికి వెతికి మరీ చంపుతున్నారు. వారి రథములను విరగ్గొడుతున్నారు. మరి కొందరు వానర వీరులు గుర్రములను, ఏనుగులను, వాటి మీద ఎక్కిన వారిని చంపుతున్నారు. రాక్షసులు బాణాలు వేసే లోపల వారి మీద పెద్ద పెద్ద పర్వతశిఖరములు పడుతున్నాయి. ఆ దెబ్బకు వారు చేతిలో బాణములు చేతిలోనే ఉన్నట్టు మరణిస్తున్నారు. కింద పడ్డ రాక్షసులను వానరులు గోళ్లతో చీలుస్తున్నారు, పిడికిళ్లతో గుద్దుతున్నారు. రాక్షసులు కూడా వాడి అయిన బాణములతో వానరుల శరీరములను చీలుస్తున్నారు. శూలములతోనూ ముద్గరలతోనూ, కత్తులతోనూ కొడుతున్నారు. చంపుతున్నారు.

ఆ ప్రకారంగా వానరులు రాక్షసులు, వారి వారి ప్రభువులకు జయము సంపాదించి పెట్టడానికి, ఒకరిని ఒకరు దారుణంగా చంపుకుంటున్నారు. రణభూమి అంతా రక్తసిక్తమయింది. రణభూమి అంతా వానరుల యొక్క రాక్షసుల యొక్క మృతకళేబరములతో నిండి పోయింది. తమ తమ ఆయుధములు విరిగి పోగా రాక్షసులు వానరులతో ద్వంద్వయుద్ధము చేస్తున్నారు. ఒకరిని ఒకరు చంపుకుంటున్నారు. రాక్షసుల మీదికి విసరడానికి వానరులు తెచ్చిన వృక్షములను, పర్వతములను వారి నుండి లాక్కుని రాక్షసులు వానరులను చంపుతున్నారు. అలాగే వానరులు కూడా రాక్షసుల చేతిలో ఉన్న ఆయుధములను లాక్కొని, వాటి తోనే రాక్షసులను

చంపుతున్నారు. వానరులు రాక్షసులు ఒకరి శరీరములను ఒకరు బద్దలు కొట్టుకుంటున్నారు. సింహనాదాలు చేస్తున్నారు. యుద్ధము చేయడానికి వృక్షములు, పర్వతములు దొరకని వానరులు, విరిగిన రథములను, ఏనుగు కళేబరములను ఆయుధములుగా చేసుకొని రాక్షసులను చంపుతున్నారు. వానరులు విసురుతున్న వృక్షములను, పర్వతశిఖరములను రాక్షసులు అర్ధచంద్రబాణము లతోనూ, భల్లబాణములతోనూ పిండి పిండి చేస్తున్నారు. యుద్ధభూమి అంతా వానరులు, రాక్షసుల కళేబరాలతోనూ, ఏనుగులు, గుర్రముల కళేబరములతోనూ, విరిగిన రథములతోనూ నిండి పోయి నడవడానికి కూడా వీలుకాకుండా ఉంది.

వానరులు ఇంక తెగించారు. రాక్షసులతో తెగించి పోరాడుతున్నారు. వానరుల దెబ్బకు రాక్షసులు వందలు వేలు మరణిస్తున్నారు. వానరులు హర్షధ్వానాలు చేస్తున్నారు. పైనుండి దేవతలు, గంధర్వులు, యక్షులు రాక్షసుల పరాజయాన్ని చూచి సంతోషిస్తున్నారు. ఇది చూచిన నరాంతకుడికి కోపం మిన్నుముట్టింది. తన గుర్రము మీద ప్రాస అనే ఆయుధమును ధరించి వాయువేగంతో యుద్ధభూమి అంతా కలయదిరుగుతున్నాడు. నరాంతకుడు తన ప్రాస ఆయుధంతో దెబ్బకు ఏడువందలమంది వానరులను చంపుతున్నాడు. వానరులు అతడిని ఎదుర్కోవాలి అనుకునే లోపలనే నరాంతకుడు వారిని చంపుతున్నాడు. అంతవేగంగా తిరుగుతున్నాడు నరాంతకుడు. వానరులు వృక్షములను, కొండలను పెకలించే లోపే నరాంతకుని ప్రాసకు బలి అవుతున్నారు. కార్చిచ్చు అరణ్యమును కాల్చినట్టు నరాంతకుడు వానర సేనలను కాలరాస్తున్నాడు.

నరాంతకుడు ఆ ప్రాసను ఎత్తుకొని గుర్రంమీద తిరుగుతుంటే వానరులు మాటలాడుకోడానికి కానీ, నిలబడుటకు కానీ వీలు కావడం లేదు. నిలబడ్డవారిని నిలబడ్డట్టు, ఎగిరిన వారిని ఎగిరినట్టు కొడుతున్నాడు నరాంతకుడు. ఆ నరాంతకుడు వానరాంతకుడుగా ప్రకాశిస్తున్నాడు. నరాంతకుని ప్రాస ఆయుధము ధాటికి తట్టుకోలేక వానరులు పెద్ద గా కేకలు పెడుతున్నారు. వారందరూ సుగ్రీవుని వద్దకు పరుగెత్తారు. సుగ్రీవుడికి నరాంతకునికి భయపడి పారిపోతున్న వానరసేన కంటబడింది. వారి వెంట గుర్రము ఎక్కి తరుముతున్న నరాంతకుడు కనపడ్డాడు.

వెంటనే అంగదుని చూచి సుగ్రీవుడు ఇలా అన్నాడు. “అంగదా! అటు చూడు. ఆ గుర్రము మీద ఎక్కి వానరులను తరుముతున్న ఆ రాక్షసుడిని చూడు. వాడిని వెంటనే చంపు. వానరులను వెనక్కు మళ్లించు.” అని అన్నాడు. వెంటనే అంగదుడు ఆకాశంలోకి ఎగిరాడు. నరాంతకుని ముందు నిలిచాడు. వాడితో ఇలా అన్నాడు. “నీ ప్రాస ప్రతాపము సామాన్య వానరుల మీద కాదు. నీ ప్రాసను నా మీదికి విసురు.” అని రొమ్ము విరుచుకొని నిలబడ్డాడు. ఆమాటలు విన్న నరాంతకుడుతన ప్రాసను అంగదుని మీదికి విసిరాడు. అది అంగదుని వక్షస్థలమును తాకి రెండు ముక్కలై కిందపడి పోయింది. వెంటనే అంగదుడు తన అరిచేతితో నరాంతకుడు ఎక్కిన గుర్రము తలమీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు ఆ గుర్రము కిందపడి పోయింది. గిలా గిలా కొట్టుకొని మరణించింది.

తన గుర్రము చావడం చూచిన నరాంతకుడు తన పిడికిలితో అంగదుని తలమీద కొట్టాడు. ఆ దెబ్బకు అంగదుని తల పగిలింది. రక్తం కారింది. స్పృహ తప్పింది. అంతలోనే తెలివి వచ్చిన అంగదుడు తన పిడికిలి బిగించి నరాంతకుని వక్షస్థలము మీద బలంగా మోదాడు. ఆ దెబ్బకు నరాంతకుడి గుండెలు బద్దలయ్యాయి. కింతపడిపోయాడు. గిలా గిలా కొట్టుకొని మరణించాడు. అంగదుని చేతిలో నరాంతకుడు చావగానే వానరులు హర్షధ్వానాలు చేసారు. నరాంతకుని చంపినందుకు రాముడు అంగదుని ప్రశంసించాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము అరవై తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
డెబ్బయ్యవ సర్గ.

నరాంతకుడు మరణించడం చూచిన దేవాంతకుడు, త్రిశిరస్సు, మహోదరుడు పెద్దగా శోకించారు. మహోదరుడికి కోపం మిన్ను ముట్టింది. ఒక పర్వతము మాదిరి ఉన్న పెద్ద ఏనుగును ఎక్కి అంగదుని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. తన అన్నయ్య మరణాన్ని కళ్లారా చూచిన దేవాంతకుడు అంగదుని మీద పగ తీర్చుకోవాలని అనుకున్నాడు. తన పరిఘను తీసుకొని అంగదుని మీదికి ఉరికాడు. త్రిశిరస్సుడు కూడా తన రథము మీద ఎక్కి అంగదుని మీదికి వెళ్లాడు. ఈ ముగ్గురు రాక్షస వీరులు ఒక్కుమ్మడిగా అంగదుని చుట్టు ముట్టారు.

ఇది చూచిన అంగదుడు ఒక పెద్ద చెట్టును పెకలించాడు. ఆ చెట్టును దేవాంతకుని మీదికి విసిరాడు అంగదుడు. త్రిశిరస్సుడు ఆ చెట్టును తన బాణములతో ఛేదించాడు. అది చూచిన అంగదుడు ఆకాశంలోకి ఎగిరాడు. ఆకాశంనుండి అంగదుడు చెట్లను, బండరాళ్లను వర్షం మాదిరి కురిపించాడు. త్రిశిరస్సుడు వాటిని తన బాణములతో నుగ్గు నుగ్గుచేసాడు. మహెదరుడు తన మీదికి విసిరిన వృక్షములను తన పరిఘతో విరుగగొట్టాడు. త్రిశిరస్సుడు బాణములను అంగదుని మీద వర్షిస్తూ అతనిమీదికి వెళ్లాడు.  మహెూదరుడు తన ఏనుగు మీద అంగదుని వద్దకు పోయి తన తోమరము అనే ఆయుధముతో అంగదుని గుండెలమీద కొట్టాడు. దేవాంతకుడు కూడా తన పరిఘుతో అంగదుని కొట్టి దూరంగా పారిపోయాడు.

ఆ ప్రకారంగా ముగ్గురు రాక్షస వీరులు ఒక్కుమ్మడిగా తనను చుట్టుముట్టి బాధపెడుతున్నా అంగదుడు చలించలేదు. అంగదుడు సమయం చూచి తన అరిచేతితో దేవాంతకుడు ఎక్కిన ఏనుగును  బలంగా మోదాడు. ఆ దెబ్బకు ఆ ఏనుగు కిందపడి చచ్చిపోయింది. అంగదుడు ఆ ఏనుగు దంతమును ఊడపీకి, దానినే ఆయుధముగా ధరించి దేవాంతకుని కొట్టాడు. ఆ దెబ్బకు దేవాంతకుడికి దిమ్మతిరిగి రక్తం కక్కుకున్నాడు. అంతలోనే తేరుకున్న దేవాంతకుడు తన పరిఘను తీసుకొని అంగదుని కొట్టాడు.ఆ పరిఘ దెబ్బకు అంగదుడు బోర్లాపడ్డాడు. వెంటనే పైకి లేచాడు. ఆకాశంలోకి ఎగిరాడు. అలా ఎగురుతున్న అంగదుని లలాటమునకు గురిపెట్టి మూడు బాణములను కొట్టాడు త్రిశిరస్సుడు.

ఆప్రకారంగా ముగ్గురు రాక్షస వీరులు అంగదుని చుట్టుముట్టడం చూచిన హనుమంతుడు, నీలుడు అంగదునికి సాయంగా వెళ్లారు. నీలుడు ఒక పర్వతమును ఎత్తి త్రిశిరస్సుని మీదకు విసిరాడు. దానిని త్రిశిరస్సుడు తన బాణాలతో బద్దలు కొట్టాడు. ఇంతలో దేవాంతకుడు పరిఘను చేత ధరించి హనుమంతుని మీదికి వెళ్లాడు. అది చూచిన హనుమంతుడు వేగంగా పైకి ఎగిరి తన పిడికిలితో దేవాంతకుని తలమీద కొట్టాడు. హనుమంతుడు కొట్టిన దెబ్బకు దేవాంతకుని తల ముక్కలైపోయింది. దేవాంతకుడు నేలమీద పడి ప్రాణాలు వదిలాడు.

అది చూచిన త్రిశిరస్సుడు నీలుని వక్షస్థలమునకు గురిచూచి బాణాలు వదిలాడు. మహోదరుడు కూడా తన ఏనుగును ఎక్కి నీలుని మీద శరవర్షము కురిపించాడు. ఆ ఇరువురు రాక్షస వీరులు కురిపించిన శరవర్షమునకు నీలుని శరీరం తూట్లు పడిపోయింది. నీలుడు కదలలేక కూలబడిపోయాడు. స్పృహ తప్పాడు. అంతలోనే తేరుకొని, నీలుడు ఒక పర్వతమును పెకలించి గాలిలోకి ఎగిరాడు. ఆ పర్వతముతో మహోదరుని తల మీద మోదాడు. ఆ దెబ్బకు మహోదరుని తల బద్దలు అయింది. నేల మీద పడి మరణించాడు.

మహోదరుని మరణం చూచిన త్రిశిరస్సుడు కోపంతో ఊగిపోయాడు. తన ధనుస్సును సంధించి హనుమంతుని మీద వాడి అయిన బాణములను ప్రయోగించాడు. హనుమంతుడు ఒక పెద్ద పర్వత శిఖరమును ఎత్తి త్రిశిరస్సుడి మీదికి విసిరాడు. త్రిశిరస్సుడు ఆ పర్వత శిఖరమును తన బాణములతో ముక్కలు చేసాడు. తాను

విసిరిన పర్వతశిఖరము వృధాకావడం చూచిన హనుమంతుడు వృక్షములను పెకలించి త్రిశిరస్సుడి మీదికి వేగంగా విసురుతున్నాడు. తన మీదికి వేగంగా వస్తున్న వృక్షములను త్రిశిరస్సుడు తన బాణములతో ఖండిస్తున్నాడు. హనుమంతునికి కోపం మిన్నుముట్టింది. వేగంగా త్రిశిరస్సుడి రథం మీదికి దూకి రథమునకు కట్టిన గుర్రములను తన గోళ్లతో చీల్చాడు. అది చూచిన త్రిశిరస్సుడు శక్తి ఆయుధమును హనుమంతుని మీద ప్రయోగించాడు. హనుమంతుడు ఆ శక్తి ఆయుధమును ఒడుపుగా తన చేతితో పట్టుకొని రెండుగా విరిచాడు. అది చూచిన వానరులు హర్షధ్వానాలు చేసారు కేరింతలు కొట్టారు.

వారి కేరింతలు విన్న త్రిశిరస్సుడు కోపంతో తన కత్తిని హనుమంతుని గుండెల్లో గుచ్చాడు. ఆ దెబ్బను తప్పించుకున్న హనుమంతుడు తన అరిచేతితో త్రిశిరస్సుని గుండెల మీద చరిచాడు. ఆ దెబ్బకు త్రిశిరస్సుడు చేతిలోని ఆయుధము కిందపడిపోయింది. వాడికి స్పృహ తప్పింది. హనుమంతుడు కిందపడిపోయిన త్రిశిరస్సుని ఖడ్గమును తీసుకొని పెద్దగా అరిచాడు. అంతలోనే స్పృహవచ్చిన త్రిశిరస్సుడు గాలిలోకి ఎగిరి హనుమంతుడిని తన పిడికిలితో మోదాడు. ఆ దెబ్బను తప్పించుకున్న హనుమంతుడు తన చేతిలోని కత్తితో త్రిశిరస్సుని శిరస్సులను ఖండించాడు. త్రిశిరస్సుని మూడు తలలూ నేలమీదపడి దొర్లాయి.

త్రిశిరస్సుని మరణమును కళ్లారా చూచిన రాక్షసులు లంకా నగరం వైపుకు పారిపోయారు. వానరులు హర్షధ్వానాలు చేస్తూ పారిపోతున్న రాక్షసులను తరుముతున్నారు.

ఇంక మహాపార్శ్వుడు మిగిలాడు. మహాపార్శ్వుడు తన గదను చేత ధరించాడు. పూర్వము ఆ గదతో మహాపార్శ్వుడు ఇంద్రుని ఐరావతమును కూడా కొట్టాడు. అటువంటి గదను చేత ధరించి మహాపార్శ్వుడు వానరుల మీదికి వెళ్లాడు. అది చూచిన ఋషభుడు అనే వానర వీరుడు ఎగిరి వచ్చి మహాపార్శ్వుడి ముందు నిలబడ్డాడు. మహాపార్శ్వుడు తన గదతో ఋషభుని గుండెలమీద మోదాడు. ఆ దెబ్బకు ఋషభుని గుండెలు బద్దలయ్యాయి. రక్తం కారుతూ ఉంది. ఋషభుడు స్పృహ తప్పిపోయాడు.

చాలాసేపటికి కానీ అతనికి స్పృహ రాలేదు. తనకు స్పృహరాగానే ఋషభుడు మహాపార్శ్వుడు కోసం వెదికాడు. మహాపార్శ్వుడు కనపడగానే ఋషభుడు తన పిడికిలి బిగించి మహాపార్శ్వుని గుండెల మీద బలంగా మోదాడు. ఆ దెబ్బకు మహాపార్శ్వుడు మొదలు నరికిన చెట్టు మాదిరి కిందపడి మూర్ఛపోయాడు. ఋషభుడు వెంటనే ఆ రాక్షసుని గదను తీసుకొని భయంకరంగా అరిచాడు.

ఇంతలోనే స్పృహ వచ్చిన మహాపార్శ్వుడు ఋషభుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బకు కోపించిన ఋషభుడు తన చేతిలో ఉన్న గదతో మహాపార్శ్వుని గుండెలమీద మోదాడు. ఆ గదా ఘాతానికి మహాపార్శ్వుని గుండెలు బద్దలయ్యాయి. అంతటితో ఆగకుండా ఋషభుడు మహాపార్శ్వుని, గదతో కొట్టిన చోట కొట్టకుండా, కొట్టాడు. ఆ దెబ్బలకు మహాపార్శ్వుడు మరణించాడు.

తిరుగులేని రాక్షస వీరుడు మహాపార్శ్వుడు కూడా మరణించడం చూచిన రాక్షస సేనలు తమ ప్రాణాలు రక్షించుకోడానికి పారిపోయాయి.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము డెబ్బయ్యవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
డెబ్బైఒకటవ సర్గ.

ఇంక మిగిలిన వాడు అతికాయుడు. వాడు సామాన్యుడు కాడు. బ్రహ్మచేత వరములను పొందిన వాడు. దేవతలను, దానవులను జయించిన వాడు. అటువంటి అతికాయుడు తన వాళ్లు అందరూ మరణించడం చూచి ఆగ్రహోదగ్రుడు అయ్యాడు. వెంటనే తన రథము ఎక్కి వానరుల మీదికి యుద్ధానికి బయలుదేరాడు. పెద్దగా సింహనాదం చేస్తున్నాడు.

అతికాయుని శరీరము, అరుపులు, ధనుష్టంకారములు వానరుల గుండెల్లో గుబులుపుట్టించాయి. అతికాయుని చూడగానే కుంభకర్ణుడు మరలా లేచి వచ్చాడా అన్నట్టు అనిపించింది వానరులకు. ఇదంతా రాముడు దూరంనుండి చూచాడు. కుంభకర్ణుని వంటి దేహము కల అతికాయుని చూచిన రాముడు విభీషణుని చూచి ఇలా అన్నాడు. "విభీషణా! కుంభకర్ణుడు మరలా బతికి వచ్చాడా అన్నట్టు

ఉన్న ఈ రాక్షసుడు ఎవరు? వీడు పర్వతము వలె ఉన్నాడు. వీడు రథం మీద వస్తుంటే మృత్యుదేవత వస్తున్నట్టు ఉంది. వీడి రథము కూడా విచిత్రంగా ఉంది. దానికి వెయ్యి అశ్వములు కట్టారు. నలుగురు సారథులు ఉన్నారు. వీడి రథము నిండా ధనుస్సులు అస్త్రములు, శస్త్రములు సమృద్ధిగా ఉన్నాయి. వీడి చేతిలో ఉన్న ఒక్కొక్క ఖడ్గము పదిచేతుల పొడుగు ఉంది. ఇంతకూ వీడు ఎవరు? వీడి చరిత్ర ఏమిటి? ఎందుకంటే వీడిని చూచి వానరులు అంతా పారిపోతున్నారు. వీడిని త్వరగా సంహరించకపోతే వానరులు యుద్ధం చేసేటట్టు లేరు."అని అన్నాడు రాముడు.

విభీషణుడు రామునితో ఇలా అన్నాడు. "ఓ రామా! రావణుడు, కుబేరుడు అన్నదమ్ములు. రావణునికి ధాన్యమాలికి పుట్టిన వాడు ఈ అతికాయుడు. వీడు అత్యంత శక్తిమంతుడు. ఇతడు రావణునితో సమానమైన బలపరాక్రమములు కలవాడు. వేదాధ్యనము చేసినవాడు. సకల శాస్త్రపారంగతుడు. అస్త్ర,శస్త్ర విద్యలు తెలిసినవాడు. మంచి ఆలోచనా పరుడు. నీతిమంతుడు. ఇతని బాహు బలముతోనే లంక సురక్షితంగా ఉంది. ఇతడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి వరములను పొందాడు. దేవ, దానవులను, యక్షులను యుద్ధములో ఓడించాడు. రాక్షసులను సదా రక్షిస్తూ ఉంటాడు. తన అస్త్రములతో ఇంద్రుని కూడా కదలకుండా చేసిన మహావీరుడు అతికాయుడు. ఇతడిని వరుణ పాశము కూడా ఏమీ చేయలేదు. ఓ రామా! నీవు ఇతనిని తొందరగా చంపాలి. లేకపోతే వానర సేనలకు అపార నష్టం కలుగుతుంది." అన్నిఅన్నాడు విభీషణుడు.

ఒక పక్క విభీషణుడు ఈ మాటలు రామునితో అంటూ ఉండగానే అతికాయుడు తన రథం మీద సింహము లేళ్లగుంపు లోకి చొరబడ్డట్టు వానర సేనలోకి చొరబడ్డాడు. తనతో యుద్ధం చేయడానికి వచ్చిన వానరులను తన బాణాలతో కొడుతున్నాడు. ఇది చూచిన కుముదుడు, ద్వివిదుడు, మైందుడు, నీలుడు, శరభుడు అందరూ కలిసి ఒక్కుమ్మడిగా వృక్షములతోనూ, పర్వత శిఖరముల తోనూ అతికాయుని మీద దాడి చేసారు. అతికాయుడు తన వాడి అయిన బాణములతో ఆ వృక్షములను, పర్వత శిఖరములను పగలకొడుతున్నాడు. అంతే కాకుండా తన వాడి అయిన బాణములతో వానర వీరుల శరీరములను కొడుతున్నాడు. అతికాయుని బాణముల ధాటికి వానర వీరుల శరీరములు శిథిలమైపోయాయి.

అతి కాయుడు ఒక నియమాన్ని పాటిస్తున్నాడు. కేవలం తనతో యుద్ధముచేస్తున్నవారి మీదనే బాణప్రయోగము చేస్తున్నాడు. ఇతరుల వంక కన్నెత్తి కూడా చూడ్డం లేదు. అతికాయుని ధాటికి భయపడి ఎవరూ అతని ఎదుటికి పోవడం లేదు. అందుకని అతికాయుడు తన రథాన్ని రాముని వద్దకు పోనిచ్చాడు. రాముని ఎదుట నిలిచి ఇలా అన్నాడు.

“ఓరామా! ఈ చిన్న చిన్న వానరులను చంపి ఏమి ప్రయోజనము. నేను నీ ఎదుట నిలబడి ఉన్నాను. నీకు శక్తి, ఉత్సాహము, పరాక్రమము వీరత్వము ఉంటే నాతో యుద్ధం చెయ్యి.” అని రాముని యుద్ధానికి పిలిచాడు. ఆ మాటలకు లక్ష్మణునికి కోపం వచ్చింది. వెంటనే లక్ష్మణుడు అతికాయుని ఎదుట నిలబడి

ధనుష్టంకారము చేసాడు. అతికాయుడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! నాతో పోలిస్తే నీవు బాలుడవు.. యుద్ధవిద్యలో నీకు నేర్పు లేదు. అనుభవమూ లేదు. కాలయముని వంటి నాతో నీవు యుద్ధము చేయలేవు. నా ధనుస్సు నుండి వెలువడిన బాణములకు హిమవత్పర్వతము కూడా ఎదురు నిలువ లేదు. నా వాడి అయిన శరములకు భూమ్యాకాశాలు బద్దలు అవుతాయి. నాలో ఉన్న ప్రళయాగ్నిని నిద్రలేపకు. దయచేసి వెళ్లిపో. నీ ప్రాణాలు దక్కించుకో. నా లక్ష్యం రాముడు కానీ నువ్వు కాదు. వెళ్లు. నా మాట వినకుండా మొండిగా ఇలాగే ఉన్నావనుకో, నేను ఏమీ చెయ్యలేను-- నీతో యుద్ధంచేసి నిన్ను చంపడం తప్ప. యముని సందర్శనమునకు సిద్ధంగా ఉండు. నీకు మరొక సారి చెబుతున్నాను. నా బాణములు సామాన్యమైనవి కావు. నా బాణములు పరమేశ్వరుని పాశు పతాస్త్రముతో సమానములు. నిన్ను క్షణంలో కూలుస్తాయి. కాచుకో" అని అన్నాడు అతికాయుడు.

లక్ష్మణుని మీద బాణమును సంధించాడు. అతి కాయుని మాటలు విన్న లక్ష్మణుడు ఇలా అన్నాడు. "ఓ రాక్షసాధమా! నేను నీ ఎదుట నిలిచి ఉన్నాను. చేతనైతే నీ బలం పరాక్రమం చూపించు. కేవలం నిన్ను నీవు పొగుడుకోవడం వల్ల ప్రయోజనం లేదు. ఎవరిని వారు పొగుడుకొనేవారు ఉత్తములు కారు. పరాక్రమం చూపేవాడినే శూరుడు అంటారు కానీ కేవలం మాటలతో పొద్దుపుచ్చేవాడిని కాదు. ఇక్కడ నోరు కాదు, బాణాలు మాట్లాడాలి. నీవు రథం మీద ఉన్నావు. అన్ని రకములైన అస్త్ర శస్త్రములు కలిగి ఉన్నావు. ఇంకెందుకు ఆలస్యం. శరప్రయోగం చెయ్యి. ఆ తరువాత నా పరాక్రమము ఏపాటిదో చూద్దువుగానీ! నేను కొట్టిన ఒకే ఒక బాణమునకు, పక్వమైన తాటి

పండు చెట్టునుండి పడినట్టు నీ తల తెగి నేలమీద పడుతుంది. నా బాణాలు నీ రక్తం తనివిదీరా తాగుతాయి. నీవు చెప్పినట్టు నేను నీ కన్నా చిన్నవాడినే. కాని గట్టి వాడను. చిన్న వాడు అని చులకనగా చూడకు. నేను చిన్నవాడినైనా వృద్ధుడను అయినా నీ పాలిట మృత్యువును. మృత్యువుకు వయోబేధం లేదు కదా! బాలుడైన వామనుడు బలి చక్రవర్తిని పాతాళానికి అణగత్రొక్కడం నీవు వినలేదా! నేనూ అంతే." అని ముగించాడు లక్ష్మణుడు.

ఏదో చిన్నవాడు కదా, చెబితే వింటాడు కదా అని అనుకున్నాడు అతికాయుడు. కానీ లక్ష్మణుడు రెచ్చిపోవడం చూచి సహించలేకపోయాడు. ఆగ్రహోదగ్రుడయ్యాడు. వెంటనే బాణమును సంధించాడు. ఏం జరుగుతుందో ఏమో అని ఆకాశం నుండి దేవతలు, గంధర్వులు, యక్షులు, ఋషులు ఆతురతగా ఎదురుచూస్తున్నారు. అతికాయుడు ఒక వాడి అయిన బాణమును లక్ష్మణుని మీదకు వదిలాడు. తన మీదికి దూసుకువస్తున్న ఆ అస్త్రమును లక్ష్మణుడు ఒక అర్ధచంద్రబాణంతో రెండుగా ఖండించాడు. తాను విడిచిన శరము వృథా కావడంతో అతికాయుడికి కోపం వచ్చింది. వెంటనే లక్ష్మణుని మీద ఐదుబాణములను సంధించాడు. దానికి సిద్ధంగా ఉన్న లక్ష్మణుడు ఆ బాణములను కూడా మధ్యలోనే విరిచాడు. అతికాయుడు ఆశ్చర్యపోయాడు. లక్ష్మణుడు ఆలస్యం చేయకుండా మరొక వాడి అయిన బాణంతో అతికాయుని నుదుటి భాగమునకు గురి చూచి కొట్టాడు. లక్ష్మణుని బాణము అతికాయుని నుదుటిలో లోతుగా దిగబడింది. రక్తం ధారగా కారుతూ ఉంది.

ఆ దెబ్బకు అతి కాయుడు అటు ఇటు తూలాడు. అంతలోనే సర్దుకున్నాడు. లక్ష్మణుని వంక ప్రశంసాపూర్వకంగా చూచాడు. "ఇన్నాళ్లకు నాకు సరి అయిన శత్రువు దొరికావు. నీ అస్త్రలాఘవానికి మెచ్చుకుంటున్నాను. కానీ నా నుండి తప్పించుకోలేవు. కాచుకో." అన్నాడు అతికాయుడు. వెంటనే తన ధనుస్సు నుండి వరుసగా రెండు, ఐదు, ఏడు బాణములను ఒకే సారి సంధించి వేగంగా లక్ష్మణుని మీదికి విడిచిపెట్టాడు. తన మీదికి దూసుకువస్తున్న వాడి అయిన ఆ బాణములను చూచి లక్ష్మణుడు ఏ మాత్రం కంగారు పడలేదు. తాను కూడా వాటికి దీటుగా బాణములను సంధించి అతికాయుడు సంధించిన బాణములను అన్నిటినీ మధ్యలోనే తుంచాడు.

ఒకే ఒక బాణంతో లక్ష్మణుని చంపవచ్చు అనుకున్న అతికాయునకు. తన బాణములు అన్నీ వృథా కావడం చూచి మండిపోయింది. ఈ సారి అమోఘము వాడి అయిన బాణం ఒకటి తీసాడు. ఆ బాణమును లక్ష్మణుని గుండెలకు గురిచూచి కొట్టాడు. ఆ బాణము  సూటిగా వచ్చి లక్ష్మణుని వక్షస్థలమును తాకింది. రక్తం ధారగా కారింది.  లక్ష్మణుడు ఆ బాణమును తన శరీరమునుండి లాగేసాడు. లక్షణుడు ఒక బాణమును తీసి దాని మీద ఆగ్నేయాస్త్రమును సంధించి అతికాయుని మీదకు ప్రయోగించాడు. దానికి ప్రతిగా అతికాయుడు తన బాణము మీద సౌరాస్త్రమును ఆహ్వానించి సంధించాడు. లక్ష్మణునికి గురిచూచి వదిలాడు. లక్ష్మణుడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రము అతికాయుడు ప్రయోగించిన సూర్యాస్త్రము ఆకాశంలో ఒకదానిని ఒకటి ఢీకొన్నాయి.  రెండు అస్త్రములు కాలిపోయి నేలమీద పడ్డాయి.

తన అస్త్రము వృథా కావడం చూచిన అతికాయుడు మరొక అస్త్రమును సంధించి దాని మీద త్వష్ట అనే దేవతను ఆహ్వానించి, లక్ష్మణుని మీదికి ప్రయోగించాడు. అప్పుడు లక్ష్మణుడు ఆ అస్త్రమును ఇంద్రాస్త్రముతో నిర్వీర్యము గావించాడు. అతికాయుడు మరొక బాణం మీద యముడిని ఆహ్వానించి దానిని లక్ష్మణుని మీదికి విడిచిపెట్టాడు. లక్ష్మణుడు ఆ యమ అస్త్రమును వాయవ్యాస్త్రముతో ఛేదించాడు. రెండు అస్త్రములు పనికిరాకుండా పోయాయి.

ఇలా అస్త్రములతో లాభం లేదని లక్ష్మణుడు అతికాయుని మీద శరవర్షము కురిపించాడు. ఎడతెరిపి లేకుండా బాణవర్షము కురిపించాడు. లక్ష్మణుడు ప్రయోగించిన బాణములు అన్నీ అతికాయుని కవచమునకు తగిలి విరిగిపోతున్నాయి. అయినా లక్ష్మణుడు తన పట్టువిడువలేదు. మరొక వేయి బాణములను అతికాయుని మీద వర్షము వలె కురిపించాడు. కాని ఆ బాణముల బారి నుండి అతికాయుని దివ్య కవచము రక్షిస్తూ ఉంది. కాబట్టి లక్ష్మణుని బాణ పరంపరకు అతికాయుడు ఏ మాత్రం బెదరడం లేదు. అతికాయుడు సర్పము వంటి బాణము ఒకదానిని తీసుకొని దానిని లక్ష్మణుని మీద ప్రయోగించాడు.

ఆ బాణము దెబ్బకు లక్ష్మణుడు క్షణకాలము మూర్ఛపోయాడు. వెంటనే తేరుకున్నాడు. అతి కాయుడిని వదిలి పెట్టి వాడి రథము మీద పడ్డాడు. నాలుగు బాణములతో అతికాయుని రథము మీద జెండాను విరగగొట్టాడు. మరొక నాలుగు బాణములతో అతికాయుని రథమునకు కట్టిన హయములను చంపాడు. మరొక బాణంతో సారథిని చంపాడు. ఇప్పుడు అతికాయుడు విరథుడు

అయ్యాడు. తరువాత లక్ష్మణుడు ఎన్నోబాణములను అతికాయుని చంపడానికి ప్రయోగించాడు కానీ ఆ బాణములు అతికాయుని ఏమీ చెయ్యలేకపోయాయి. అప్పుడు వాయుదేవుడు లక్ష్మణుని మీదుగా వీస్తూ అతని చెవిలో ఇలా అన్నాడు. "కుమారా! ఇతడు బ్రహ్మదేవుని గురించి తపస్సుచేసి వరములు పొందాడు. ఆ కవచము బ్రహ్మదేవుడు ప్రసాదించింది. నీవు ఎన్ని బాణములు వేసినను అతనిని ఏమీ చేయలేవు. ఆ కవచమును బ్రహ్మాస్త్రముతో ఛేదించు. అతని కవచము ఉన్నంతవరకూ నీవు అతనిని చంపలేవు." అని అన్నాడు వాయుదేవుడు.

వెంటనే లక్ష్మణుడు ఒక బాణమును సంధించి దాని మీద బ్రహ్మాస్త్రమును ఆవాహనం చేసాడు. బ్రహ్మాస్త్రమును అతికాయుని మీద సంధించాడు. తన మీదికి నిప్పులు చిమ్ముకుంటూ వస్తున్న బ్రహ్మాస్త్రమును చూచాడు అతికాయుడు. తన దగ్గర ఉన్న అన్ని రకములైన బాణములతో ఆ బ్రహ్మాస్త్రమును కొట్టాడు. కానీ ప్రయోజనం లేకపోయింది. బ్రహ్మాస్త్రము అతికాయుని సమీపించింది. అతి కాయుడు ఏ మాత్రం కంగారు పడలేదు. తన వద్ద ఉన్న అన్ని అస్త్ర శస్త్రములను ప్రయోగించాడు. ఆ ఆయుధములు అన్నీ వృథా అయ్యాయి. బ్రహ్మాస్త్రము అతికాయుని సమీపించింది. దివ్యమైన కిరీటమును కుండలములను ధరించిన అతికాయుని శిరస్సును ఖండించింది. అతికాయుని శిరస్సు నేలమీద పడిపోయింది. శిరస్సు తెగిపోగానే అతి కాయుని మొండెము పెద్ద వృక్షము కూలినట్టు నేలమీద కూలిపోయింది.

అతికాయుని మరణము చూచిన రాక్షసులు శోకించారు. వారికి భయంపట్టుకుంది. ఆ భయంతో పెద్ద పెద్దగా అరుస్తున్నారు. కేకలు పెడుతున్నారు. నలువైపులా పరుగెట్టారు. కొంత మంది లంకానగరం వైపు పారిపోయారు. వానర వీరులు, వానరులు లక్ష్మణుని చుట్టు చేరి అతనిని శ్లాఘించారు. వానరులందరితో కలిసి లక్ష్మణుడు రాముని వద్దకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము డెబ్భయ్యి ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## డెబ్భయ్యి రెండవ సర్గ.

అతికాయుని మరణవార్త విన్న రావణునికి ఒంట్లో భయం ప్రవేశించింది. మంత్రులను పిలిపించాడు. వారితో ఇలా అన్నాడు. "ధూమ్రాక్షుడు, అకంపనుడు, ప్రహస్తుడు, కుంభకర్ణుడు వీరందరూ మహాబలవంతులు. కానీ మానవుడైన రాముని చేతిలో చంపబడ్డారు. వీరే కాదు వీరిని అనుసరించిన రాక్షస సైన్యము కూడా నాశనం అయింది. ఒకరోజు నా కుమారుడైన ఇంద్రజిత్తు రామలక్ష్మణులను సర్పబాణములతో శరబంధము చేసాడు. వారిరువురిని మూర్ఛపోయేట్టు చేసాడు. ఇంద్రజిత్తు చేసిన శరబంధము నుండి రామలక్ష్మణులను విడిపించడం, దేవ,దానవ,గంధర్వ,యక్ష, కిన్నర,సాధ్య,సిద్ధులకు కూడా సాధ్యము కాదు. కాని ఏజరిగిందో ఏమిటో అర్థం కాలేదు. రామలక్ష్మణులు ఆ శరబంధం నుండి విడిపించుకున్నారు. అది వాళ్ల

మహిమో, లేక ఏమన్నా మాయచేసారో, వేరేవాళ్ల ప్రభావమో అర్థం కావడం లేదు. నా ఆదేశము ప్రకారము యుద్ధమునకు వెళ్లిన రాక్షస యోధులు అందరూ ఆ వానరుల చేతిలో మరణించారు. ప్రస్తుతము రామలక్ష్మణులను, సుగ్రీవుని, విభీషణుని వానరులను చంపదగిన వీరుడు పరాక్రమవంతుడు లంకలో నాకు కనపడటం లేదు.

కేవలము రాముని పరాక్రమము చేత రాక్షసయోధు లందరూ మరణించారు. అట్టి రాముని పరాక్రమము ఎంత గొప్పది. అతని అస్త్రముల శక్తి అమోఘము. కాబట్టి మనము లంకను, లంకలో ఉన్న సీతను, సీత ఉన్న అశోక వనమును అనుక్షణము అప్రమత్తంగా రక్షించుకొనాలి. ఏ క్షణంలో నైనా వానరులు లంకా నగరమును స్వాధీనం చేసుకోవచ్చు. లంకానగరంలో నుండి బయటకు వెళ్లేవాళ్లను, లోపలకు వచ్చేవాళ్లను నిశితంగా పరిశీలించి మరీ వదలండి. ఏమరిపాటు తగదు. మీరందరూ వానరుల సంచారమును ఒక కంట కనిపెట్టి ఉండండి. వారి మాయలకు లోబడకండి. పగలు కానీ, రాత్రి కానీ అన్ని యామములు అప్రమత్తంగా ఉండండి. వానరుడు కనపడితే చంపండి దయాదాక్షిణ్యము చూపకండి. లంకా నగరమును ముట్టడించిన వానరుల నందరినీ ఒక కంట కనిపెట్టి ఉండండి. వారి వ్యూహములను ఎప్పటికప్పుడు తెలుసుకోండి. ఎప్పుడు యుద్ధానికి తయారవుతున్నారు. ఏ పక్కనుంచి వస్తున్నారు. ఎవరి నాయకత్వంలో వస్తున్నారు మొదలగు విషయాలను తెలుసుకోండి. జాగ్రత్తగా ఉండండి." అని ఆదేశాలు ఇచ్చాడు రావణుడు.

రాక్షస వీరులు రావణుని ఆదేశాలను ఖచ్చితంగా పాటిస్తామని ప్రతిజ్ఞచేసారు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా రావణునికి

కన్నకుమారులను, తన వారు అన్నవారందరినీ పోగొట్టుకున్న దు:ఖము మనసులో నుండి తొలగిపోలేదు. విచార వదనంనతో అంత:పురము నకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము డెబ్బది రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము

డెబ్బది మూడవ సర్గ.

దేవాంతకుడు, నరాంతకుడు, త్రిశిరస్సు, అతికాయుడు మొదలగు యోధాను యోధులు యుద్ధములో మరణించారు అన్న వార్త రావణుని కుమారుడు ఇంద్రజిత్తుకు తెలిసింది. వెంటనే తన తండ్రి రావణుని వద్దకు వెళ్లాడు. చింతాక్రాంత వదనంతో ఉన్న రావణుని చూచి ఇలా అన్నాడు.

"తండ్రీ! మీరు ఈ రాక్షస రాజ్యమునకు సర్వాధికారులు. మీరు ఇలా చింతించడం తగదు. ఎంతమంది యోధులు మరణించినా నేను ఇంకా జీవించి ఉన్నాను కదా! నా చేతి బాణముల బారిన పడిన వాడు జీవించడం అరుదు. ఈ రోజే నేను యుద్ధమునకు వెళ్లి రామలక్ష్మణులను సంహరిస్తాను. ఈ రోజే యుద్ధము పరిసమాప్తి చేస్తాను. రామలక్ష్మణులు విగతజీవులై యుద్ధరంగములో పడిఉండటం నీవు కళ్లారా చూస్తావు. తండ్రీ! ఇదే నా ప్రతిజ్ఞ. ఈరోజు రామలక్ష్మణులను శరీరములను నా వాడియైన

శరములతో కప్పివేస్తాను. నాకు ఇంద్రుడు, యముడు, విష్ణువు, రుద్రుడు, సాధ్యులు, అగ్ని, వరుణుడు, సూర్యచంద్రులు వీరితో సమానమైన బలపరాక్రమములు ఉన్నాయి. నా పరాక్రమాన్ని రామలక్ష్మణులకు రుచి చూపిస్తాను. మీరు నిశ్చింతగా ఉండండి." అని పలికాడు ఇంద్రజిత్తు.

వెంటనే గాడిదలు కట్టిన రథాన్ని ఎక్కాడు. తండ్రి అనుమతి తీసుకొని యుద్ధరంగమునకు వెళ్లాడు. వెళ్లే ముందు రావణుడు ఇంద్రజిత్తుతో ఇలా అన్నాడు. "కుమారా! నీ బలపరాక్రమములు నాకు తెలియనివి కావు. నిన్ను జయించగలవాడు ముల్లోకములలో లేడు. నీవు దేవతల రాజైన దేవేంద్రుని జయించిన వాడవు. అటువంటి నీకు ఒక మానవుడు రాముడిని జయించడం పెద్ద పనికాదు. విజయుడవై తిరిగిరా" అని ఆశీర్వదించాడు.

తండ్రి ఆశీర్వాదము తీసుకొని ఇంద్రజిత్తు యుద్ధానికి బయలుదేరాడు. ఇంద్రజిత్తు వెంట రాక్షస సేన బయలుదేరింది. వారు ధనుస్సులు, ముద్గరలు, ప్రాసలు, పరిఘలు ధరించి ఇంద్రజిత్తు వెంట బయలుదేరారు. రకరకాలైన వాహనముల మీద వెళ్లారు. కొంతమంది నడిచి వెళ్లారు. అంతా యుద్ధరంగము చేరుకున్నారు. యుద్ధభేరీ మ్రోగించారు. ఇంద్రజిత్తు తన శంఖమును పూరించాడు. అంతా యుద్ధానికి సన్నద్ధము అయ్యారు.

అప్పుడు ఇంద్రజిత్తు యుద్ధరంగము నుండి బయలుదేరి యజ్ఞశాలకు చేరుకున్నాడు. శుచి అయ్యాడు. అగ్నిని రగిల్చాడు. అభిచార హోమం చెయ్యడం మొదలెట్టాడు. బిగ్గరగా మంత్రాలు

చదువుతూ హెూమం చేస్తున్నాడు. హవిస్సును, పేలాలను, ఎర్రటి పుష్పములను, సుగంధ ద్రవ్యములను అగ్నిలో హెూమం చేసాడు. ఆ హెూమం చేసేటప్పుడు ఇంద్రజిత్తు శస్త్రములను, శరపత్రములను, విభీతర వృక్షముల నుండి సేకరించిన సమిధలను, ఎర్రటి గుడ్డలను, అగ్నిలో హెూమం చేసాడు. హెూమం చేసేటప్పుడు ఇనప గరిటెలను ఉపయోగించాడు. అగ్నిహెూత్రము చుట్టు శరపత్రములను, తోమరములు అనే ఆయుధములను పరిచాడు. ఒక నల్లని మేకను బలి ఇచ్చాడు. ఆ మేక మాంసమును అగ్నిలో హెూమం చేసాడు. అప్పుడు హెూమాగ్ని భగ్గుమని పైకి లేచింది. అది విజయసూచకంగా కనపడింది ఇంద్రజిత్తుకు. తరువాత తన ధనుస్సును, బాణములను అగ్ని ముందు ఉంచాడు. తన రథమును కూడా అగ్ని ముందు నిలబెట్టాడు. ధనుర్బాణములను, రథమును అభిమంత్రించాడు. తరువాత బ్రహ్మాస్త్రమును ఆవాహన చేసాడు. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ఆవాహన చేస్తుంటే భూమి చలించింది.

ఆ ప్రకారంగా బ్రహ్మాస్త్రమును ఆవాహన చేసిన ఇంద్రజిత్తు హెూమమును పూర్తి చేసాడు. తరువాత తన రథమును ఎక్కి ధనుర్బాణములను తీసుకున్నాడు. తన మంత్రమహిమతో ఆకాశంలోకి ఎగిరిపోయాడు. యుద్ధరంగము చేరుకున్నాడు. అప్పటికే రాక్షస సైన్యము వానరులతో యుద్ధం చేస్తున్నారు. ఇంద్రజిత్తు అక్కడకు చేరుకొని ఒక్క వానరుని కూడా వదలకుండా చంపమని రాక్షసులను ఉత్సాహపరుస్తున్నాడు. రెట్టించిన ఉత్సాహంతో రాక్షస వీరులు వానరుల మీద శరవర్షము కురిపిస్తున్నారు. ఇంద్రజిత్తు కూడా రక రకాలైన బాణములతో వానరులను చంపుతున్నాడు. రాక్షసులు కూడా

గదలతోనూ, ముసలములతోనూ వానరులను చంపుతున్నారు. వానరులు తమ చేతులలో వృక్షములు బండరాళ్లు ధరించి రాక్షసులతో యుద్ధము చేస్తున్నారు. రాక్షసుల ధాటికి వానర సైన్యము నశించి పోతూ ఉంది. ఇంద్రజిత్తు తాను వదిలే ఒకొక్కబాణానికి ఇద్దరు, ముగ్గురు ఐదుగురు ఏడుగురు చొప్పున వానరులను చంపుతున్నాడు. ఇది చూచిన వానర వీరులు ఇంద్రజిత్తు మీదికి ఒక్కుమ్మడిగా వెళ్లారు. కాని ఇంద్రజిత్తు ధాటికి తట్టుకోలేక పారిపోయారు. యుద్ధభూమి అంతా వానరుల మృతకళేబరాలతో నిండిపోయింది. రక్తం ఏరులై ప్రవహిస్తూ ఉంది.

పారి పోయిన వానరులు పారి పోగా, మిగిలిన వానరులు రాముని కొరకు రాక్షసులతో యుద్ధం చేసి మరణిస్తున్నారు. మరి కొంతమంది వానరులు ఇంద్రజిత్తు చుట్టు చేరి వృక్షములను, పర్వతశిఖరములను ఇంద్రజిత్తు మీదికి విసురుతున్నారు. కాని ఇంద్రజిత్తు ఆ వృక్షములను, పర్వతశిఖరములను తన బాణములతో చూర్ణం చేస్తున్నాడు. వానరవీరుల మీద సర్పములవంటి బాణములను ప్రయోగిస్తున్నాడు. పదునెనిమిది బాణములతో గంధమాధనుడిని, తొమ్మిది బాణములతో నలుడిని కొట్టాడు ఇంద్రజిత్తు. ఏడు బాణములతో మైందుడిని, ఐదు బాణములతో గజుడిని కొట్టాడు. జాంబవంతుడిని పదిబాణములతోనూ, నీలుడిని ముప్పది బాణములతోనూ కొట్టాడు. మహాబలవంతులైన సుగ్రీవుడిని, ఋషభుడిని, అంగదుణ్ణి స్పృహలేకుండా చేసాడు. వారినే కాకుండా ఇతర వానర వీరులను కూడా తన బాణాలతో ఎడతెరిపి లేకుండా కొట్టాడు. వానర వీరులంతా రక్తపు మడుగులతో తేలియాడుతుంటే ఇంద్రజిత్తు సంతోషంతో అరుస్తున్నాడు.

అంతే కాకుండా ఇంద్రజిత్తు తన మాయాయుద్ధంతో నలువైపుల నుండి వానరుల మీద శరవర్షము కురిపించాడు. ఇంద్రజిత్తు ఎక్కడ ఉన్నాడో తెలియదు. కాని బాణములు మాత్రం వర్షము వలె కురుస్తున్నాయి. ఆ బాణములు తమ శరీరములను చీలుస్తుంటే వానరులు నేలకూలుతున్నారు. ఇంద్రజిత్తు తమకు కనపడకపోవడం వల్ల వానరులు ఇంద్రజిత్తును కొట్టలేకపోతున్నారు. తన మాయాయుద్ధంతో ఇంద్రజిత్తు వానరులను తన బాణములతో చీలుస్తున్నాడు. ఒక్క బాణములనే కాదు శూలములను గండ్ర గొడ్డళ్లను, ఖడ్గములను నలుదిక్కులనుండి ప్రయోగిస్తున్నాడు ఇంద్రజిత్తు. నలువైపుల నుండి బాణములు వచ్చి గుచ్చుకుంటుంటే వానరులు వికృతంగా అరుస్తున్నారు. ఆ బాణాలు ఎక్కడి నుండి వస్తున్నాయో తెలీక ఆకాశం వంక దీనంగా చూస్తూ కింద పడి ప్రాణాలు వదులుతున్నారు వానరులు.

అంతటితో ఆగలేదు ఇంద్రజిత్తు. తన వద్దఉన్న అన్ని ఆయుధముల మీద అంటే ప్రాసలు, శూలములు,బాణముల మీద బ్రహ్మాస్త్రమును అభిమంత్రించి వానర వీరులయిన హనుమంతుడు, అంగదుడు, సుగ్రీవుడు, గంధమాధనుడు, జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శుడు, మైందుడు, ద్వివిదుడు, నీలుడు, గవాక్షుడు, నీలుడు, గవయుడు, కేసరి, హరిలోముడు, విద్యుద్దంష్ట్రుడు, సూర్యాననుడు, జ్యోతిముఖుడు, దధిముఖుడు, పావకాక్షుడు, నలుడు, కుముదుడు మొదలగు వానరవీరుల మీద వదులుతున్నాడు. తరువాత రామలక్ష్మణుల మీద కూడా వాడి అయిన బాణములను వర్షము మాదిరి కురిపించాడు.

ఇది చూచిన రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. “లక్ష్మణా! ఈ రాక్షసుడు తన బాణముల మీద బ్రహ్మాస్త్రమును అభిమంత్రించి వానరులను చంపుతున్నాడు. మన మీద కూడా శరవర్షము కురిపిస్తున్నాడు. ఇతడు బ్రహ్మవరప్రసాది. ఇతనిని ఎలా జయించాలో తెలియకున్నది. ఇతడు ప్రయోగిస్తున్న అస్త్రములకు శస్త్రములకు అధి దేవత బ్రహ్మదేవుడు. వీటిని మనము అడ్డుకోలేము. లక్ష్మణా! నీవు ఈ అస్త్రములకు భయపడకు నా వెంట ఉండు. ఈ బ్రహ్మాస్త్రప్రభావం చేత మనము ఇద్దరమూ కిందపడి పోయి మూర్ఛపోదాము. అప్పుడు ఆ రాక్షస వీరుడు సంతోషంతో బాణప్రయోగాన్ని ఆపుతాడు. విజయ గర్వంతో లంకానగరానికి తిరిగి వెళతాడు. ప్రస్తుతానికి ఈ ఆపద గట్టెక్కవచ్చును. లేకపోతే ఇతని చేతిలో మన వానర సేన పూర్తిగా నాశనం అయిపోతుంది.” అని అన్నాడు. దానికి లక్ష్మణుడు అంగీకరించాడు.

ఇంద్రజిత్తు బాణములు వేస్తుంటే రామలక్ష్మణులు సహిస్తున్నారు. ఇంద్రజిత్తు సంతోషంతో హర్షధ్వానాలు చేస్తున్నాడు. రామలక్ష్మణులు కిందపడిపోయారు. కదలకమెదలక పడిఉన్నారు. రాక్షసులు ఇంద్రజిత్తును పొగుడుతూ కేరింతలు కొడుతున్నారు. రాక్షస సేనలు లంకానగరం వైపుకు సాగిపోయారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము డెబ్బదిమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## డెబ్బది నాలుగవ సర్గ.

ఇంద్రజిత్తు ప్రయోగిస్తున్న బ్రహ్మాస్త్రముల ధాటికి తట్టుకోలేక రామలక్ష్మణులు, వానర నాయకులు మూర్ఛపోయారు. అది చూచిన వానర వీరులు కలవరపడ్డారు. ఇంతలో విభీషణుడు అతనితో ఇలా అన్నాడు. "మీరు ఏమీ దిగులుపడకండి. రాముడు, లక్ష్మణుడు బ్రహ్మాస్త్రమును మన్నించి మూర్ఛపోయారు. ఈ బ్రహ్మాస్త్రమును బ్రహ్మదేవుడు ఇంద్రజిత్తుకు ప్రసాదించాడు. ఆ బ్రహ్మాస్త్రమును ఇంద్రజిత్తు దుర్వినియోగపరుస్తున్నాడు. బ్రహ్మదేవుని అస్త్రమును ఏ అస్త్రమూ వెనుకకు మళ్లించలేదు. కాబట్టి రామలక్ష్మణులు కేవలము మూర్ఛిల్లారు. మీరు దిగులుపడకండి." అని అన్నాడు.

ఇంతలో హనుమంతుడు బ్రహ్మాస్త్రమునకు కొంచెం సేపు కట్టుబడి తరువాత మూర్ఛనుండి తేరుకున్నాడు. విభీషణుని మాటలు విన్నాడు. "విభీషణా! వానర సైన్యము అంతా బ్రహ్మాస్త్ర ప్రభావంలో ఉంది. వీళ్లలో ఎంతమంది ప్రాణాలతో ఉన్నారో చూడాలి." అని అన్నాడు. తరవాత హనుమంతుడు, విభీషణుడు చేతిలో కాగడాలు ధరించి ఒక్కొక్క వానరుడిని పరీక్షిస్తున్నారు. యుద్ధభూమి అంతా వెదుకు తున్నారు. యుద్ధభూమి అంతా వానర వీరుల మృతశరీరములో తెగిపడిన కాళ్లు చేతులతో నిండి ఉంది. వారు బ్రహ్మాస్త్రమునకు కట్టుబడి ఉన్న సుగ్రీవుడు, మైందుడు, ద్వివిదుడు, అంగదుడు, నీలుడు, శరభుడు, గంధమాధనుడు, గవాక్షుడు, సుషేణుడు, వేగదర్శుడు, నలుడు, జ్యోతిముఖుడు మొదలగు వానర వీరులను చూచాడు.

ఆ రోజు ఇంద్రజిత్తు అరవైఏడు కోట్ల వానరములను కొట్టాడు. ఇంతలో వృద్ధుడైన జాంబవంతుడు కూడా అక్కడకు వచ్చాడు.

జాంబవంతుని చూచి విభీషణుడు ఇలా అన్నాడు. "జాంబవంతా మీకు క్షేమమే కదా!" అని అడిగాడు. "లేదు విభీషణా! నా శరీరం అంతా బాణములు గుచ్చుకున్నాయి. కదలలేకుండా ఉన్నాను. నా కళ్లుకూడా కనపడడం లేదు. నీ కంఠస్వరమును బట్టి నిన్ను గుర్తు పట్టాను. విభీషణా! హనుమంతుడు క్షేమమేనా! అతనిని నువ్వు చూచావా!" అని అడిగాడు. విభీషణునికి ఆశ్చర్యం వేసింది. ఇదేమిటి! జాంబవంతుడు రామలక్ష్మణుల క్షేమం గురించి అడగకుండా హనుమంతుని గురించి అడుగుతున్నాడు అని అనుకున్నాడు. ఆతురత ఆపుకోలేక అడిగేసాడు.

"జాంబవంతా! నీవు రామలక్ష్మణుల క్షేమము అడగకుండా, సుగ్రీవుని క్షేమము అడగకుండా కేవలము హనుమంతుని మీద ఎందుకు అధికమైన ప్రేమ చూపుతున్నావు. తెలుసుకోవచ్చునా!" అని అడిగాడు. దానికి జాంబవంతుడు ఇలా అన్నాడు. "విభీషణా! హనుమంతుడు జీవించి ఉంటే మొత్తము వానర సైన్యము జీవించి ఉన్నట్టే. అతడు మరణిస్తే యుద్ధము ముగిసినట్టే. అందుకని అడిగాను. వాయుపుత్రుడైన హనుమ జీవించి ఉంటే మన జీవితములకు భయం లేదు." అని అన్నాడు.

అప్పుడు హనుమంతుడు వినయంగా వృద్ధుడైన జాంబవంతుని పాదాలకు నమస్కరించాడు. భారంగా కనురెప్పలు ఎత్తి హనుమంతుని చూచిన జాంబవంతుడు తాను పునర్జన్మఎత్తినట్టు

సంతోషించాడు. "హనుమా! వచ్చావా. రా నాయనా. వానర వీరులను రక్షించు. ఇప్పుడు నీ బలపరాక్రమములు చూపే సమయం వచ్చింది. రామలక్ష్మణుల శరీరములో గుచ్చుకున్న బాణములను తొలగించు. హనుమా! ఇప్పుడు నీవు హిమవత్పర్వతమునకు వెళ్లాలి. అక్కడ ఋషభము అనే పర్వతము, కైలాస శిఖరము కనపడతాయి.. ఆ రెండింటి మధ్య ఓషధీ పర్వతము ఉంది. ఆ పర్వత శిఖరము మీద నాలుగు ఓషధీ మొక్కలు ఉన్నాయి. అవి దివ్యంగా ప్రకాశిస్తూ ఉంటాయి. అవే మృతసంజీవని, విశల్యకరణి, సువర్ణకరణి, సంధాన కరణి అనే ఓషధులు. నీవు వెళ్లి ఆ ఓషధులను తీసుకొని రా! అప్పుడు ఈ వానరులందరూ బతుకుతారు." అని అన్నాడు.

ఆ మాటలు విన్న హనుమంతుడు హిమాలయ పర్వతమునకు వెళ్లడానికి ఉద్యుక్తుడయ్యాడు. పక్కనే ఉన్న ఒక పర్వతము మీదికి ఎక్కాడు. కాళ్లతో పర్వతమును తన్ని పెట్టాడు. పెద్దగా గర్జించాడు. తన తోకను పైకి ఎత్తాడు. రెండు చేతులు ముందుకు చాచి ఒక్క ఉదుటున పైకి ఎగిరాడు. ఆ ఊపుకు పర్వతము ఊగిసలాడింది. భూమి కంపించి లంకా నగరము వణికిపోయింది. రాక్షసులు దిక్కుతోచకుండా అటు ఇటు పరుగులు తీసారు. హనుమంతుడు ఉత్తరదిశగా ఉన్న హిమవత్పర్వతము వైపుకు సాగిపోయాడు. హనుమంతుడు పర్వతములను, అడవులను, జనపదములను, నదులను, సరస్సులను దాటుకుంటూ ఆకాశ మార్గంలో వెళుతున్నాడు.

అతి స్వల్పకాలంలోనే హిమవద్పర్వతమును చేరుకున్నాడు. హిమవత్పర్వతము మీద ఎన్నో గుహలు, జల ప్రవాహములు కనపడ్డాయి. తెల్లటి మంచుతో కప్పబడిన పర్వత శిఖరములు ప్రకాశిస్తున్నాయి. హిమత్పర్వత శిఖరముల మీద ఉన్న దేవతా సమూహములను, ఋషి సమూహములను, మునుల ఆశ్రమములను చూచాడు. హిమవత్పర్వతము మీద ఉన్న బ్రహ్మదేవుని నివాసమును, కైలాస పర్వతమును, ఇంద్రుని నివాసమును, రుద్రుని క్రీడాస్థలమును, హయగ్రీవుని ఆరాధనా ప్రదేశమును, చూచాడు. అవే కాకుండా బ్రహ్మదేవుడు ఇంద్రునకు వజ్రాయుధము ఇచ్చిన ప్రదేశమును, కుబేరుని నివాసమును, విశ్వకర్మ సూర్యుని బంధించిన స్థానమును, బ్రహ్మ యొక్క ఆసనమును, శంకరుడు తన ధనుస్సును, బాణమును పెట్టుకొనె స్థలమును, పాతాళమునకు వెళ్లుద్వారమును చూచాడు.

హనుమంతుడు కైలాస పర్వతమును, హిమవత్పర్వత శిఖరములను, ఋషభ పర్వతమును, మేరుపర్వతమును, ఓషధీ పర్వతమును చూచాడు. హనుమంతుడు ఓషధీ పర్వతము మీదికి దిగాడు. అక్కడ ఉన్న ఓషధులను వెతికాడు. ఎవరో తమకోసం వెదుకుతున్నారు అని తెలుసుకున్న ఓషధులు హనుమంతునికి కనపడకుండా మాయం అయ్యాయి. అప్పటి దాకా మిలా మిలా మెరుస్తూ ఉన్న ఓషధులు ఒక్కసారిగా అదృశ్యం అయ్యేసరికి హనుమంతునికి కోపం వచ్చింది. గట్టిగా అరిచాడు. కేకలు పెట్టాడు. "ఓ ఓషధీ పర్వతమా! ఈ ఓషధులు రాముని కొరకు తీసుకొని పోవుటకు వచ్చాను. కాని నీవు జాలి చూపడం లేదు. కాని నేను వదలను. నిన్ను పెకలించి తీసుకొని పోతాను. అప్పుడు ఎలా నా వెంట రారో చూస్తాను." అంటూ తన రెండు చేతులతో ఆ ఓషధీపర్వతమును

పెకలించాడు. చేతులతో ఎత్తుకొని పైకి ఎగిరాడు. గరుడుని మాదిరి భయంకరమైన వేగంతో లంక వైపు సాగిపోయాడు. హనుమంతుని చేతిలో ఉన్న ఆ పర్వతము రెండవ సూర్యుని వలె ప్రకాశిస్తూ ఉంది. ఆ పర్వతమును తీసుకొని పోతున్న హనుమంతుడు విష్ణుమూర్తి చేతిలో ఉన్న సుదర్శన చక్రము మాదిరి ప్రకాశించాడు.

హనుమంతుడు సముద్రమును దాటి లంకను చేరుకున్నాడు. ఆకాశంలో ఉన్న హనుమంతుని చూచి కింద ఉన్న వానరసేనలు పెద్దగా కేకలు పెట్టాయి హర్షధ్వానాలు చేసాయి. ఆ కేకలకు లంకలో నిద్రపోతున్న రాక్షసులు కంగారుగా నిద్రలేచారు. హనుమంతుడు మెల్లగా వానర సైన్యము మధ్య దిగాడు. ఆ ఓషధీ పర్వతము మీద ఉన్న ఓషధుల వాసన తగలగానే, ఆ ప్రభావానికి ఇంద్రజిత్తు చేతిలో చంపబడిన, గాయపడిన, వానరులు అందరి శరీరములలో నుండి బాణములు తొలగి పోయాయి. గాయములు మానిపోయాయి. అందరూ నిద్రనుండి లేచినట్టు పైకి లేచారు. రామలక్ష్మణుల శరీరములలో గుచ్చుకున్న బాణములు అన్నీ ఊడి కిందపడ్డాయి. రామలక్ష్మణులు ఆరోగ్యవంతులై లేచి కూర్చున్నారు.

వీరే కాకుండా రాక్షసులతో వానరుల యుద్ధము మొదలైనది మొదలు ఆ రోజు వరకూ రాక్షసుల చేతిలో మరణించిన వానరులందరూ ఆ ఓషధుల ప్రభావానికి పునర్జీవితులయ్యారు. కాని ఒక్క రాక్షసుడు కూడా బతకలేదు. దానికి కారణం, రాక్షసులు ప్రతిరోజూ యుద్ధములో వానరుల చేతిలో చచ్చిన రాక్షస సైనికులను ఏ రోజుకు ఆ రోజు రావణుని ఆజ్ఞ మేరకు, సముద్రములో

పారవేసేవారు. అందువలన ఆ సమయంలో ఒక్క రాక్షసుని మృతదేహము కూడా యుద్ధభూమిలో లేదు. అందువలన యుద్ధములో చనిపోయిన ఒక్క రాక్షసుడు కూడా, ఓషధీ ప్రభావంతో బతికే అవకాశం లేకపోయింది.

వెంటనే హనుమంతుడు ఆ ఓషధీ పర్వతమును తీసుకొని పోయి దాని యథాస్థానములో ఉంచి వచ్చాడు. వచ్చి రాముని ముందు నిలిచి, రామునికి నమస్కరించాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము డెబ్బది నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
డెబ్బది ఐదవ సర్గ.

ఆ ప్రకారంగా వానర సేనలు అందరూ పునర్జీవితులయ్యారు. సుగ్రీవుడు హనుమంతుని చూచి ఇలా అన్నాడు. "హనుమా! కుంభకర్ణుడు యుద్ధములో మరణించాడు. ప్రస్తుతము లంకనుండి మనతో యుద్ధము చేయడానికి వచ్చే వాళ్లు ఎవరూ ఉన్నట్టు కనపడటం లేదు. ఈ సమయంలో మన వానరులు అందరూ ఈ రాత్రికి లంకలో ప్రవేశించి రావణుని నివాసమును కాల్చివేస్తారు. ఇది నా ఆజ్ఞ." అని ఆదేశించాడు.

సుగ్రీవుని ఆదేశము ప్రకారము కొంత మంది వానర

వీరులు చేతిలో కాగడాలు ధరించి, చీకటి పడగానే లంక వైపుకు వెళ్లారు. ఆ వానరులను చూచి లంకకు కాపలాగా ఉన్న రాక్షసులు పారిపోయారు. చేతిలో కాగడాలు ధరించిన వానరులు లంకా నగరంలో ప్రవేశించారు. లంకలోని నివాసములకు, మేడలకు, చైత్యములకు అన్నిటికి నిప్పుపెట్టారు. లంకా నగరం అంతా తగలబడిపోయింది. ఎన్నో భవనములు చైత్యములు అగ్నిగి ఆహుతి అయ్యాయి. ఆయుధములు, రథములు, కవచములు, కత్తులు, డాళ్లు, ధనుస్సులు, బాణములు,, వస్త్రములు,  అన్నీ కాలిబూడిదఅయ్యాయి. రాక్షస పౌరులందరూ భార్యా పిల్లలతో ప్రాణాలు దక్కించుకోడానికి పరుగులు పెడుతున్నారు. అగ్ని ఒక భవనము నుండి మరొక భవనమునకు వ్యాపిస్తూ అన్నిటినీ దహిస్తూ ఉంది. రాక్షస స్త్రీలందరూ వీధుల్లో పరుగులుపెడుతున్నారు. ఏనుగుల శాలలలో ఉన్న ఏనుగు లను, గుర్రపు శాలలలో ఉన్న గుర్రములను వాటి రక్షకులు కట్టు విప్పి పారి పొమ్మని సైగలు చేస్తున్నారు. ఏనుగులు, గుర్రములు తమ కట్లువిప్పగానే పారిపోతున్నాయి. కొన్ని ఏనుగులు, గుర్రములు బలవంతంగా కట్లు తెంచుకొని పారిపోతున్నాయి. కొద్ది సేపట్లోనే సుందరమైన లంకా నగరమంతా బూడిద అయింది. స్త్రీలు, పిల్లలు చేస్తున్న ఆర్తనాదాలతో లంక అంతా మార్మోగుతోంది.

ఇక్కడ రాముడు, లక్ష్మణుడు రాక్షసుల మీదికి యుద్ధానికి సన్నద్ధము అవుతున్నారు. తమ తమ ధనుస్సులను సారిస్తున్నారు. ధనుష్టంకారములు చేస్తున్నారు. ఒక పక్క ఇళ్లు వాకిళ్లు దగ్ధం అయిపోతుంటే, మరొక పక్క రాక్షస సైనికులు యుద్ధరంగానికి వెళు తున్నారు.  రామలక్ష్మణులు లంకా నగరం మీదికి తమ బాణాలు

వదులుతున్నారు. ఆ బాణాల దెబ్బకు లంకా నగరంలోని పెద్ద పెద్ద చైత్యములు గోపురములు కూలిపోతున్నాయి. రాక్షస నాయకులకు ఆ రాత్రి కాళరాత్రి అయింది.

సుగ్రీవుడు వానర నాయకులనందరినీ సమావేశ పరిచి వారితో ఇలాఅన్నాడు. "వానర నాయకులారా! మీరందరూ మీ మీ స్థానములలో నిలబడి యుద్ధం చేయండి. ఎవరూ నా ఆజ్ఞను ధిక్కరించరాదు" అని ఆదేశించాడు. ఆ ప్రకారము వానర వీరులు తమ తమ సైన్యములతో చేత కాగడాలు ధరించి యుద్ధం చేస్తున్నారు. లంకా నగర ద్వారముల దాకా వచ్చిన వానర వీరులను చూచి రావణుడు కోపంతో ఊగిపోయాడు. వెంటనే కుంభకర్ణుని కుమారులైన కుంభుడు, నికుంభుడు అనే వారిని రాక్షస సేనలతో యుద్ధానికి పంపాడు. వారి వెంట యూపాక్షుడు, శోణితాక్షుడు, ప్రజంఘుడు, కంపనుడు అనే రాక్షస వీరులను కూడా పంపాడు. వారందరూ సింహనాదాలు చేస్తూ వానరుల మీదికి యుద్ధానికి బయలుదేరారు.

చంద్రుడు ప్రసరించే వెన్నెలలో, నక్షత్రాల కాంతిలో, చేతిలో ఉన్న కాగడాల కాంతిలో వారు ఒకరితో ఒకరు యుద్ధం చేస్తున్నారు. రాక్షసులు పరిఘలు, ప్రాసలు ధరించి యుద్ధము చేస్తున్నారు. వానరులు తమ చేతులలో వృక్షములు, పెద్ద పెద్ద బండరాళ్లు ధరించి యుద్ధము చేస్తున్నారు. దగ్గరకు వచ్చిన రాక్షసులను గోళ్లతో చీలుస్తున్నారు. రాక్షసులు తమ చేతిలో ఉన్న ధనస్సుల నుండి బాణములు సంధించి వానరులను చంపుతున్నారు. వానరులు రాక్షసుల చెవులను కొరుకుతున్నారు. తలలు పగలగొడుతున్నారు.

శరీరాలను రాళ్లతో మోదుతున్నారు. కొట్టండి, చంపండి, నిలవండి, వాడిని చంపు వీడిని చంపు అనే మాటలతో యుద్ధరంగము మార్మోగిపోతోంది. కొన్ని బాణములు సూటిగా వచ్చి తగులుతుంటే చాలా మటుకు గురితప్పి వ్యర్థము అవుతున్నాయి. ఈ ప్రకారంగా ఆ రాత్రి రాక్షసులు వానరులు ఒకరితో ఒకరు భీకరంగా పోరాడుతున్నారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము డెబ్బది ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
డెబ్బది ఆరవ సర్గ.

రాక్షసులు వానరులు ఆ ప్రకారంగా ఘోరయుద్ధము చేస్తుంటే అంగదుడు, రాక్షస వీరుడు కంపనునితో యుద్ధము చేస్తున్నాడు. అంగదుడు కంపనుని తన గదతో మోదాడు. ఆ దెబ్బకు కంపనుడు చలించిపోయాడు. కాసేపు కళ్లు బైర్లు కమ్మాయి. అంతలోనే తేరుకున్నాడు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని అంగదుడు కంపనుడి మీద ఒక పర్వత శిఖరమును విసిరాడు. ఆ దెబ్బకు కంపనుడు నేలకూలాడు. గిలా గిలా కొట్టుకొని ప్రాణాలు వదిలాడు.

కంపనుడి మరణమును కళ్లారా చూచిన శోణితాక్షుడు

తన రథాన్ని అంగదుని మీదికి పోనిచ్చాడు. కాలాగ్నితో సమానమైన బాణములను అంగదుని మీద ప్రయోగించాడు. క్షురములు, నారాచములు, వత్సదంతములు, శిలీముఖములు మొదలగు వాడి అయిన బాణములను అంగదుని మీద ప్రయోగించాడు. దానికి ప్రతిగా అంగదుడు శోణితాక్షుని ధనుస్సును, బాణములను, రథమును విరగ్గొట్టాడు. అప్పుడు శోణితాక్షుడు రథమును దిగి తన ఖడ్గము, డాలు తీసుకొని ఆకాశంలోకి ఎగిరాడు. అంగదుడు వాడి కన్నా ఎత్తుకు ఎగిరి, వాడి చేతిలోని ఖడ్గము లాక్కుని పెద్దగా అరిచాడు. తన చేతిలో ఉన్న ఖడ్గముతో అంగదుడు శోణితాక్షుని భుజం దగ్గర నరికాడు. శోణితాక్షుడు నేల మీద పడి మూర్ఛపోయాడు.

ఆ ప్రకారంగా శోణితాక్షుని నేలకూల్చిన అంగదుడు చేతిలో ఉన్న ఖడ్గముతో సింహనాదము చేసాడు. రాక్షస సేనలమీదికి వెళ్లాడు. ఇది చూచిన యూపాక్షుడు, ప్రజంఘునుడు ఇద్దరూ అంగదుని మీదికి దూకారు.  ఇంతలో మూర్ఛనుండి తేరుకున్న శోణితాక్షుడు ఒక గదను తీసుకొని అంగదుని ఎదుర్కొన్నాడు. మరొక పక్కనుండి ప్రజంఘుడు తన గదతీసుకొని అంగదుని మీదికి వెళ్లాడు. ఆ ప్రకారంగా ఆ ముగ్గురు రాక్షస వీరులు అంగదుని చుట్టుముట్టారు.

ఇది చూచిన  మైందుడు, ద్వివిదుడు అంగదుని రక్షణ కోసరం అతని వద్దకు వచ్చారు. ఆ ముగ్గురు రాక్షస వీరులకు, ముగ్గురు వానర వీరులకు ఘోరమైన యుద్ధము జరిగింది. ఆ వానర వీరులు రాక్షసుల మీదికి వృక్షములు, పర్వతశిఖరములు విసురుతుంటే, యూపాక్షుడు తన బాణములతో వాటిని నాశనం చేస్తున్నాడు. ద్వివిదుడు, మైందుడు పెద్ద పెద్ద పర్వత శిఖరములను పెకలించి

రాక్షస వీరుల మీదికి విసురుతుంటే వాటిని శోణితాక్షుడు తన గదతో ఎదుర్కొంటున్నాడు. ప్రజంఘుడు తన ఖడ్గము తీసుకొని అంగదుని మీదికి వెళ్లాడు. ప్రజంఘుని తన దగ్గరగా రానిచ్చి, అంగదుడు ఒక పెద్ద మద్దిచెట్టుతో వాడిని తలమీద కొట్టాడు. తరువాత ప్రజంఘుని కత్తిపట్టుకున్న చేతిని విరిచాడు. ప్రజంఘుని ఖడ్గము నేలమీద పడిపోయింది. చేతిలో ఏమీ లేకపోవడంతో ప్రజంఘుడు పిడికిలి బిగించి అంగదుని మీదికి దూకాడు. అంగదుని నుదుటి మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు అంగదుడు స్మృహ తప్పాడు. అంతలోనే తేరుకున్న అంగదుడు ప్రజంఘుని తలనుపట్టుకొని గిరా గిరా తిప్పి మొండెము నుండి వేరు చేసాడు. ప్రజంఘుని తల నేల మీద దొర్లింది.

ప్రజంఘుడు యూపాక్షునికి పినతండ్రి అవుతాడు. కళ్లముందే పినతండ్రి తల నేల కూలడం చూచిన యూపాక్షుడు చలించిపోయాడు. అప్పటికే అతని వద్ద ఉన్న బాణములు అయిపోయాయి. అందువలన ఖడ్గము చేతిలోకి తీసుకొని రథము నుండి కిందికి దిగాడు. ద్వివిదుడిని ఎదుర్కొన్నాడు. ద్వివిదుడు వాడిని గట్టిగా పట్టుకొని గుండెల మీద కొట్టాడు. తన సోదరుడైన యూపాక్షుని ద్వివిదుడు పట్టుకోడం చూచి, శోణితాక్షుడు ద్వివిదుడిని వక్షస్థలం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు ద్వివిదుడు తొట్రుపడ్డాడు. ద్వివిదుడిని కొట్టడానికి శోణితాక్షుడు గద పైకెత్తాడు. ద్వివిదుడు ఆ గదను లాక్కున్నాడు. ఇంతలో మైందుడు ద్వివిదునికి సాయంగా వచ్చాడు. తన అరిచేతితో యూపాక్షుడిని గుండెల మీద కొట్టాడు. ఒక పక్క మైందుడు, ద్వివిదుడు, మరొక పక్క శోణితాక్షుడు, యూపాక్షుడు ఘోరంగా యుద్ధం చేస్తున్నారు. ద్వివిదుడు శోణితాక్షుని

ముఖం అంతా తన గోళ్లతో రక్కాడు. కిందపడేసి తొక్కాడు. శోణితాక్షుడు మరలా లేవలేదు.

మైందుడు యూపాక్షుణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. గట్టిగా నలిపేసాడు. మైందుడి చేతుల్లో నలిగిన యూపాక్షుడు ప్రాణాలు కోల్పోయాడు. యూపాక్షుడు, శోణితాక్షుడు చావడం చూచిన రాక్షస సేనలు కుంభకర్ణుని కుమారుడు కుంభుని వైపు పరుగెత్తారు. వారిని చూచిన కుంభుడు వారికి ధైర్యము చెప్పి వారిని యుద్ధోన్ముఖులను చేసాడు. కుంభుడు తన ధనుస్సును తీసుకొని అత్యంత విషపూరితము లైన సర్పములతో సమానమైన బాణములను(అంటే విషము పూసిన బాణములు) వానర సేనల మీదికి సంధించాడు. మొదటిసారిగా ద్వివిదుడిని కొట్టాడు. ఆ దెబ్బకు ద్వివిదుడు తూలి కిందపడ్డాడు. అది చూచిన మైందుడు ఒక పెద్ద గండశిలను తీసుకొని కుంభుడి మీదికి విసిరాడు. కుంభుడు ఆ శిలను తన బాణములతో ముక్కలు చేసాడు. కుంభుడు మైందుని వక్షస్థలము చీల్చేటట్టు ఒక బాణమును సంధించాడు. ఆదెబ్బకు మైందుడు కిందపడి మూర్ఛపోయాడు.

ఇది చూచిన అంగదుడు కుంభుని మీదికి ఉరికాడు. కుంభుడు ఐదు నాచారములను అంగదుని మీదికి ప్రయోగించాడు. అంగదుడు ఆ బాణములకు భయపడకుండా వృక్షములతోనూ బండరాళ్లతోనూ కుంభుని కొట్టాడు. అంగదుడు తన మీదికి విసిరిన వక్షములను, రాళ్లను తన బాణములతో పొడి పొడి చేసాడు కుంభుడు. అంతే కాకుండా రెండు బాణములతో అంగదుని ఫాలభాగమున కొట్టాడు. తన నుదురు నుండి రక్తం కారుతూ ఉంటే అంగదునికి కళ్లు కనిపించడం లేదు. రక్తం తుడుచుకుంటున్నాడు. అలాంటి స్థితిలో

కూడా అంగదుడు ఒక పెద్ద సాలవృక్షమును పెకలించి తీసుకొని కుంభుని మీదికి విసిరాడు. కుంభుడు ఆ సాలవృక్షమును రెండుగా ఖండించాడు.

నుదుటి మీద గాయంతో అంగదుడు అలసిపోయాడు. యుద్ధం చేయలేకపోతున్నాడు. ఈ విషయాన్ని వానరులు రామునికి తెలిపారు. రాముడు జాంబవంతుని వానర సేనలతో అంగదునికి సాయంగా పంపాడు. వానరులందరూ చేతులలో వృక్షములు, రాళ్లు తీసుకొని కుంభుని వైపు పరుగెత్తారు. వారి వెంట జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి అంగదునికి సాయంగా వెళ్లారు. ఇది చూచిన కుంభుడు ఆ వానర నాయకుల మీద శరవర్షము కురిపించాడు. ఆ వానర నాయకులు కుంభుని బాణముల ధాటికి తట్టుకోలేకపోతున్నారు. ఇది గమనించిన సుగ్రీవుడు తాను కూడా అంగదునికి సాయంగా వెళ్లాడు.

సుగ్రీవుడు చేతికందిన వృక్షములను పెకలించి కుంభుని మీదికి వరుసగా ఎడతెరిపి లేకుండా విసురుతున్నాడు. తన మీద వర్షము వలె పడుతున్న ఆ వృక్షములను కుంభుడు తన శరవర్షముతో ఛేదించాడు. తాను విసిరిన వృక్షములు వృధా కావడం చూచిన సుగ్రవుడు, రెట్టించిన ఉత్సాహంతో కుంభుని మీదికి దూకాడు. వాడి ధనుస్సును విరిచాడు. కుంభుని పట్టుకొని ఇలా అన్నాడు.

“ఓ వీరుడా! నీ యుద్ధము ప్రశంసనీయము. నీ

శరప్రయోగము అభినందనీయము. యుద్ధములో నీవు, రావణుడు సరిసమానులే. నీ తండ్రికి తగ్గ కుమారుడవు అనిపించుకున్నావు. కాని ఇప్పుడు నేను నీతో యుద్ధము చేస్తున్నాను. నా పరాక్రమం కూడా చూడు. నీ తండ్రి కుంభకర్ణుడు తన సహజ పరాక్రమంతో మమ్ములను ఎదిరించాడు. కాని నీ పినతండ్రి రావణుడు వరబలంతో మమ్ములను ఎదిరించాడు. నువ్వు కూడా నీ తండ్రి మాదిరి సహజమైన బల పరాక్రమములు కలిగిన వాడవు. పరాక్రమంలో రావణుని, బాణ ప్రయోగంలో ఇంద్రజిత్తును మరిపిస్తున్నావు. ఇప్పటి దాకా నేను చూచిన రాక్షస వీరులలో నీవే గొప్పవాడివి. అటువంటి నిన్ను నేను యుద్ధంలో ఎదుర్కొంటున్నాను. ఇప్పటిదాకా నీ అస్త్ర శస్త్ర నైపుణ్యంతో వానర వీరులను నిస్తేజులుగా చేసావు. నీవు ఇప్పటి దాకా వానర వీరులతో యుద్ధం చేయడం వలన అలసినట్టున్నావు, కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని నాతో యుద్ధానికి తలపడు. అప్పుడు మనం ఇద్దరం బలాబలాలు చూసుకుందాము." అని అన్నాడు సుగ్రీవుడు.

ఈ మాటలు విన్న కుంభునికి అగ్నిలో ఆజ్యం పోసినట్ట యింది. మారు మాటాడకుండా కుంభుడు తన ఎదురుగా ఉన్న సుగ్రీవుని తన బాహువుల మధ్య గట్టిగా పట్టుకున్నాడు. సుగ్రీవుడు కుంభుడు ద్వంద్వ యుద్ధం చేస్తున్నారు. సుగ్రీవుడు కుంభుని పైకి ఎత్తి గిరా గిరా తిప్పి సముద్రంలోకి గిరాటు వేసాడు. సముద్రంలో పడ్డ కుంభుడు బంతి మాదిరి లేచి వచ్చి సుగ్రీవుని వక్షస్థలము మీద పిడికిలితో మోదాడు. ఆ దెబ్బకు సుగ్రీవుని గుండెల నుండి రక్తం స్రవిస్తూ ఉంది. దెబ్బ తిన్న సుగ్రీవుడు కోపంతో పిడికిలి బిగించాడు. కుంభుని వక్షస్థలము మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బను తట్టుకోలేక కుంభుడు నేలమీద పడిపోయాడు. కుంభుని గుండెలు బద్దలయ్యాయి.

కుంభుడు గిలా గిలా కొట్టుకొని మరణించాడు. కుంభుని మరణం చూడగానే రాక్షస వీరులు భయంతో వణికిపోయారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము డెబ్బై ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
డెబ్బై ఏడవ సర్గ.

కుంభుని సోదరుడు నికుంభుడు. తన సోదరుని మరణం కళ్లారా చూచిన నికుంభుడు కోపంతో రగిలిపోయాడు. ఒక పరిఘను తీసుకున్నాడు. పెద్దగా అరిచాడు. గర్జించాడు. వాడిని వాడి పరిఘను వానరులు అంతా ఆసక్తిగా చూస్తున్నారు. హనుమంతుడు వాడి ముందు రొమ్ము విరుచుకొని నిలబడ్డాడు. నికుంభుడు తన చేతిలో ఉన్న పరిఘను హనుమంతుని వక్షస్థలమునకు గురి చూచి విసిరాడు. హనుమంతుని వక్షస్థలమునకు తగిలి ఆ పరిఘ ముక్కలయింది.

ఆ పరిఘ దెబ్బకు హనుమంతుడు కూడా కొంచెం చలించాడు. కాని అంతలోనే నిలదొక్కుకున్నాడు. వెంటనే పిడికిలి బిగించాడు. బిగించిన పిడికిలితో హనుమ నికుంభుని గుండెల మీద చాచి ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు నికుంభుని కవచము బద్దలయింది. వాడి గుండెలు పగిలి రక్తం కారింది. నికుంభుని కళ్ల

ముందు మెరుపు మెరిసినట్టయింది. కొంచెంసేపటికి తేరుకున్న నికుంభుడు హనుమను పట్టుకున్నాడు. పైకి లేపాడు. అది చూచి రాక్షసులు పెద్దగా అరుస్తూ కేరింతలు కొట్టారు. అప్పుడు హనుమంతుడు తన పిడికిలి బిగించి నికుంభుని తలమీద మోదాడు. వాడు హనుమను కిందికి జారవిడిచాడు. కింద పడ్డ హనుమంతుడు పైకి లేచి అదే ఊపుతో నికుంబుని కింద పడదోసాడు. హనుమ పైకి ఎగిరి వాడి గుండెల  మీద పడ్డాడు. హనుమ నికుంభుని మెడ పట్టుకొని పిసికాడు. వాడి తలను బలవంతంగా శరీరం నుండి వేరు చేసాడు. ఆ ప్రకారంగా నికుంభుడు హనుమ చేతిలో మరణించాడు.

నికుంభుని చావు చూచిన వానరులు హనుమను పొగిడారు. హర్షధ్వానాలు చేసారు. రాక్షసులకు మనసులో భయం పట్టుకుంది.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము డెబ్బైఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## డెబ్బైఎనిమిదవ సర్గ.

కుంభ, నికుంభుల మరణవార్త రావణునికి తెలిసింది. వరుసగా రాక్షస వీరుల మరణ వార్తలు వినడం అలవాటైపోయింది రావణునికి. అతని దు:ఖానికి అంతులేదు. అయినా పట్టినపట్టు వీడలేదు. అమీ తుమీ తేల్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. జన

స్థానంలో రాముని చేతిలో చంపబడ్డ ఖరుని కుమారుడు అయిన మకరాక్షుడిని పిలిపించాడు. రాముని మీదికి యుద్ధానికి వెళ్లమని ఆజ్ఞాపించాడు. మకరాక్షుడు కూడా సంతోషంగా అంగీకరించాడు. వెంటనే తన రథమును. సైన్యమును సిద్ధం చేయమని సేనానాయకునికి ఆదేశాలు ఇచ్చాడు. వెంటనే మకరాక్షునికి ఒక రథము, రాక్షస సైన్యమును సమకూర్చారు. మకరాక్షుడు తన రథమునకు ప్రదక్షిణము చేసి రథము ఎక్కాడు. రాక్షస సేనలను చూచి ఇలా అన్నాడు.

"ఓ రాక్షస వీరులారా! రాక్షసరాజు రావణుని ఆజ్ఞమేరకు మనము రాముని మీదికి యుద్ధానికి పోతున్నాము. మీరందరూ మీ మీ ప్రాణాలు పణంగా పెట్టి వానర సేనలతో యుద్ధం చేయండి. నేను రామలక్ష్మణులతోనూ, సుగ్రీవునితోనూ, ఇతర వానర వీరులతోనూ యుద్ధం చేస్తాను. మనము వానర సైన్యమును అడవిని కార్చిచ్చు కాల్చినట్టు కాల్చివేయాలి." అని సేనలను ఉత్సాహపరిచాడు. రాక్షస సేనలు యుద్ధానికి సన్నద్ధులయ్యారు. భేరీ నినాదాలు మిన్నుముట్టాయి. శంఖములు పూరించారు. సింహ నాదాలు చేసారు. ఉత్సాహంతో యుద్ధభూమికి వెళ్లారు.

అంతలోనే కొన్ని దుశ్శకునములు కనిపించాయి. మకరాక్షుని సారథి చేతిలోని కొరడా జారి కిందపడింది. అతడి ధ్వజము విరిగి కిందపడింది. పెనుగాలులు వీచాయి. కాని మకరాక్షుడు ఆ శకునములను లెక్కచేయలేదు. ముందుకు కదిలాడు. అతని వెంట రాక్షస సేనలు కత్తులు ఝళిపిస్తూ, జయజయధ్వానాలు

చేస్తూ కదిలారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము డెబ్బైఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
డెబ్బైతొమ్మిదవ సర్గ.

కొత్తగా వచ్చిన మకరాక్షుడిని వింతగా చూస్తున్నారు వానరులు. వచ్చినవాడు వచ్చినట్టు యమలోకానికి ప్రయాణం కట్టడం యుద్ధము మొదలైనప్పటినుండి ఆనవాయితీ. అందుకని వీడు ఎంతసేపు నిలుస్తాడా అని లెక్కలు వేసుకుంటున్నారు వానరులు. యుద్ధము మొదలయింది. భీకరంగా పోరాడుతున్నారు రాక్షసులు, వానరులు. వానరుల చేతిలో వృక్షములు, శిలలు ఉంటే రాక్షసుల చేతిలో శూలములు, పరిఘలు ఉన్నాయి. వాటితో ఒకరిని ఒకరు పొడుచు కుంటున్నారు, నరుక్కుంటున్నారు.

రాత్రి అయినా కూడా వాళ్లు యుద్ధం ఆపలేదు. రాక్షసులు తమ చేతులలో వివిధ రకకములైన ఆయుధములను ధరించి వానరులను చంపుతున్నారు. వానరులు రాక్షసుల మీద వృక్షములను కొండ శిలలను విసిరి చంపుతున్నారు. ఫలితం నరమేధం. దానికి తోడు మకరాక్షుడు తన బాణములతో వానర సేనలను చికాకు పరుస్తున్నాడు. అతని శరవర్షమునకు భయపడి పారిపోతున్నారు వానరులు. పారిపోతున్న వానరులను చూచి రాక్షసులు హర్షధ్వానాలు

చేస్తున్నారు రాక్షసులు.

ఇది చూచాడు రాముడు. తాను రంగంలోకి దిగాడు. రాక్షస సైన్యం మీద బాణవర్షము కురిపించాడు. రాక్షస సేనలు ముందుకు చొచ్చుకు రాకుండా నిలువరించాడు. మకరాక్షుడు రాముని చూచి ఇలా అన్నాడు.

"ఓ రామా! నీవేనా నా తండ్రిని చంపిన నరుడివి. రా! నా ముందుకు రా! మనం ఇద్దరం యుద్ధం చేద్దాము. నా ధనుస్సునుండి వెలువడిన బాణము నీ ప్రాణాలు తీయగలదు. ఆ నాడు దండకా రణ్యములో తన మానాన తాను బతుకుతున్న నా తండ్రిని అకారణంగా చంపావు. నా తండ్రిని చంపిన దానికి ప్రతీకారము తీర్చుకొనే సమయం వచ్చింది. ఇన్నాళ్లు నీ కోసం నేను మృగము కొరకు సింహము వెదుకుతున్నట్టు వెదుకుతున్నాను. ఆ దేవుడు పంపినట్టు నువ్వే నా ఎదురుగా నిలబడ్డాడు. ఇంక నిన్ను ఎవరూ రక్షించలేరు. నీ చావు నాచేతిలో ఉంది. నిన్ను చంపి నా తండ్రి ఆత్మకు శాంతి చేకూరుస్తాను. నీవు చంపిన రాక్షసులు నీ కొరకు యమలోకంలో ఎదురుచూస్తున్నారు. నీ చేతిలో చచ్చిన నా వాళ్లను కలుసుకో.

రామా! మనం ఎలా యుద్ధం చేయాలో నువ్వే నిర్ణయించు. అస్త్రములా, శస్త్రములా, ద్వంద్వయుద్ధమా, లేక నీకు నచ్చిన, నీవు నేర్చిన యుద్ధవిద్య ప్రదర్శించు. దేనికైనా నేను సిద్ధముగా ఉన్నాను." అని ప్రగల్భాలు పలికాడు మకరాక్షుడు.

ఆ మాటలకు రాముడు నవ్వుకున్నాడు. మకరాక్షునితో ఇలా అన్నాడు. "కుమారా! శూరులు మాట్లాడరు. శౌర్యము ప్రదర్శిస్తారు.

నీవేమో యుద్ధం చేయడం మాని నీ వాక్చాతుర్యాన్ని వాగాడంబరాన్ని ప్రదర్శిస్తున్నావు. నీవు నన్ను ఏ విధంగా కూడా జయించలేవు. నేను దండకారణ్యములో నీ తండ్రినే కాదు, దూషణుని, త్రిశిరుడిని, పదునాలుగువేలమంది రాక్షస వీరులను చంపాను. ఇంక నీ వంతు వచ్చింది. రా. యుద్ధం చెయ్యి. వృథా మాటలు కట్టిపెట్టు." అని అన్నాడు రాముడు.

రాముని మాటలకు బదులుచెప్పకుండా మకరాక్షుడు రాముని మీద శరవర్షము కురిపించాడు. రాముడు ఆ బాణములను తన బాణములతో మార్గమధ్యములోనే విరిచాడు. రాముడు, మకరాక్షుడు ఒకరితో ఒకరు బాణములతో యుద్ధము చేస్తున్నారు. ఇద్దరి ధనుస్సుల నుండి వెలువడిన బాణములు ఒకదానితో ఒకటి కొట్టుకొని ఉరుములు ఉరిమినట్టు శబ్దం చేస్తున్నాయి. వారి యుద్ధమును చూడటానికి దేవతలు, గంధర్వులు, యక్షులు ఆకాశంలో బారులు తీరి నిలబడ్డారు.

రాముడు, మకరాక్షుడు ఒకరితో ఒకరు తీసిపోకుండా యుద్ధము చేస్తున్నారు. ఒకరు ప్రయోగించిన అస్త్రములను మరొకరు నిర్వీర్యం చేస్తున్నారు. వారు ఒకరి మీద ఒకరు వేసుకుంటున్న బాణములతో ఆకాశం అంతా కప్పబడి పోయింది. ఇలా కాదని రాముడు ఒకే ఒక బాణంతో మకరాక్షుని ధనుస్సును విరిచాడు. ఎనిమిది నారాచములతో సారథిని కొట్టాడు. తరువాత వరుస బాణాలతో రథమును విరిచాడు. రథమునకు కట్టిన గుర్రములను చంపాడు. మకరాక్షుడు రథము మీది నుండి దూకి కింద నిలబడ్డాడు. ఒక శూలమును తీసుకున్నాడు. మకరాక్షుడు ఆ శూలమును గిరా

గిరా తిప్పి రాముని మీదికి విసిరాడు. రాముడు నాలుగు బాణములతో ఆ శూలమును విరిచాడు. చేతిలో ఉన్న ఆయుధము కూడా విరిగి పోవడంతో మకరాక్షుడు తన పిడికిలి బిగించి రాముని మీదికి దూకాడు. తన మీదికి దూకుతున్న మకరాక్షుని మీదికి ఆగ్నేయాస్త్ర మును ప్రయోగించాడు రాముడు. ఆ అస్త్రము మకరాక్షుని దహించి వేసింది. మకరాక్షుడు కిందపడి మరణించాడు.

మకరాక్షుని మరణమును చూచిన రాక్షసులు రాముని బాణముల బారి నుండి తప్పించుకోడానికి లంకలోకి పారిపోయారు. మకరాక్షుని మరణానికి దేవతలు, గంధర్వులు, యక్షులు అమితానందము పొందారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము డెబ్బైతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ఎనభయ్యవ సర్గ.

మకరాక్షుని మరణాన్ని కూడా యధావిధిగా రావణునికి తెలియజేసారు. రావణునికి దు:ఖం రాలేదు. కాని గుండెల్లో భయం పట్టుకుంది. యుద్ధానికి వెళ్లిన వారు తిరిగి రావడం లేదు. వెళ్లినవాడు వెళ్లినట్టే యుద్ధభూమికి బలి అవుతున్నాడు. అయినా పట్టినపట్టు విడవడం లేదు రావణుడు. తన కుమారుడు ఇంద్రజిత్తును పిలిపించాడు.

"కుమారా! రామలక్ష్మణులను ప్రత్యక్ష యుద్ధములో జయించడం సాధ్యంకాదు అనిపిస్తూ ఉంది. కాబట్టి మన రాక్షస మాయలు, మాయా యుద్ధమే శరణ్యము. మాయాయుద్ధములో నీవు సమర్ధుడవు. కాబట్టి నీవు అంతర్హితుడవై రామలక్ష్మణులతో యుద్ధము చేసి వారిని సంహరించు. మాయా యుద్ధము వారికి చేత కాదు. నీవు మాయాయుద్ధములో ప్రవీణుడవు. మాయావి అయిన ఇంద్రుడినే జయించిన సమర్ధుడివి. అటువంటిది ఇద్దరు మానవులు నీకు ఒక లెక్కా! కాబట్టి జయం మనకే దక్కుతుంది. విజయోస్తు." అని ఆశీర్వదించాడు రావణుడు.

రావణుని ఆజ్ఞమేరకు ఇంద్రజిత్తు రాముని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. ముందు యజ్ఞవాటిక వద్దకు వెళ్లాడు. శత్రునాశనము కోరు అభిచార హోమము చేయ సంకల్పించాడు. రాక్షసులు దానికి కావలసిన సంభారములు సిద్ధం చేసారు. ఇంద్రజిత్తు హోమగుండంలో అగ్నిని వేల్చాడు. హోమగుండం చుట్టు రెల్లుగడ్డిని పరిచాడు. విభీతక వృక్షమునుండి సేకరించిన ఎండు పుల్లలను సమిధలుగా ఉపయోగించాడు. తాను ఎర్రని వస్త్రములు కట్టుకున్నాడు. హోమం చెయ్యడానికి ఇనుముతో చేసిన గరిటెను తీసుకున్నాడు. ఒక నల్ల మేకను తీసుకొని వచ్చారు ఇంద్రజిత్తు ఆ నల్లమేకను బలిఇచ్చాడు. నల్లమేక రక్తంతో హోమం చేసాడు. హోమాగ్ని సుడులు తిరుగుతూ పైకి లేచింది. ఏమాత్రం పొగ లేకుండా భగభగ మండుతూ ఉంది. అగ్ని కూడా ప్రదక్షిణపూర్వకంగా సుడులు తిరగడం చూచిన ఇంద్రజిత్తు అది శుభసూచకంగా భావించాడు. ఆ ప్రకారంగా హోమం చేసి దేవతలకు, రాక్షసులకు, దానవులకు

హవిస్సులు సమర్పించాడు. తనకు మాత్రమే కనపడుతూ ఇతరులకు కనపడని రథాన్ని తెప్పించాడు. అందులో తనకు కావలసిన ఆయుధములను పెట్టించాడు. ఇంద్రజిత్తు ఆ రథం ఎక్కగానే తాను కూడా మాయం అయ్యాడు. అతని రథము కానీ, అతడు కానీ ఎవరికీ కనిపించడం లేదు.

ఇంద్రజిత్తు తన రాక్షస సేనలతో ఇలా అన్నాడు. “మనకు ఇంత క్షోభకలిగించిన ఆ రామలక్ష్మణులను ఈ రోజు చంపుతాను. వానరుడు అనే వాడు భూమి మీద లేకుండా చేస్తాను.”అని పలికి రథముతో కూడా అంతర్ధానము అయ్యాడు ఇంద్రజిత్తు. ఇంద్రజిత్తు ఎవరికీ కనపడకుండా నారాచబాణములను వానరుల మీద ప్రయోగిస్తున్నాడు. రామలక్ష్మణులు కూడా ఆ బాణములు వస్తున్న దిక్కుకు బాణాలు వదులుతున్నారు. దానికి ప్రతిగా ఇంద్రజిత్తు తన బాణములతో రామలక్ష్మణులను కప్పివేసాడు. ఇంద్రజిత్తు ఎవరికీ కనపడకుండా ఆకాశంలో తిరుగుతూ రామలక్ష్మణుల మీద శరవర్షము కురిపిస్తున్నాడు. వాటిని రామలక్ష్మణులు తమ వద్ద ఉన్న దివ్యాస్త్రములను ప్రయోగించి తిప్పికొడుతున్నారు.

ఇంద్రజిత్తు వేసిన బాణములను ఎదుర్కొంటున్నారు కానీ, ఇంద్రజిత్తును గురి చూచి కొట్టలేకపోతున్నారు రామలక్ష్మణులు. ఎందుకంటే వారికి ఇంద్రజిత్తు కనపడటం లేదు. కనపడని లక్ష్యాన్ని బేధించడం కష్టం కదా! కాని రామలక్ష్మణులు వేసిన బాణములు ఇంద్రజిత్తుకు తగిలాయి అనడానికి గుర్తుగా అవి రక్తంతో తడిసి కిందపడుతున్నాయి. రామ లక్ష్మణులకు, తమ మీద ఇంద్రజిత్తు ప్రయోగిస్తున్న బాణములు కనపడుతున్నాయి కాబట్టి వాటిని మధ్యలోనే

భల్లబాణములతో ఛేదిస్తున్నారు. రామలక్ష్మణులు ఇంద్రజిత్తు ప్రయోగిస్తున్న బాణములు వస్తున్న దిక్కుకు అస్త్రప్రయోగం చేస్తున్నారు. కాని ఇంద్రజిత్తు ఆకాశంలో తన రథం మీద ఉన్నచోట ఉండకుండా వేగంగా తిరుగుతున్నాడు. అందుకని రామలక్ష్మణుల బాణాలు వృధా అవుతున్నాయి. కాని ఇంద్రజిత్తు రామలక్ష్మణుల మీద గురిచూసి వేస్తున్న బాణములు వారి శరీరములకు తగిలి గాయాలు కలుగజేస్తున్నాయి. రామలక్ష్మణులు కానీ, వానర వీరులు గానీ, ఇంద్రజిత్తు గమన వేగాన్ని కానీ, అతడు ఉన్న దిక్కును కానీ, అతని రూపమును కానీ తెలుసుకోలేకపోతున్నారు. కాని ఇంద్రజిత్తు ప్రయోగిస్తున్న బాణముల ధాటికి వందలకొద్దీ వానరులు మరణిస్తున్నారు.

ఇది చూచి లక్ష్మణునికి కోపం వచ్చింది. రాముని చూచి "అన్నయ్యా! ఇంక లాభం లేదు. భూమి మీద ఉన్న రాక్షస జాతిని మొత్తం నాశనం చెయ్యడానికి బ్రహ్మాస్త్ర ప్రయోగమే ఉత్తమమైన మార్గము. దానిని ప్రయోగిస్తాను." అని అన్నాడు.

ఆ మాటలకు రాముడు నవ్వి ఇలా అన్నాడు. "లక్ష్మణా! కేవలం దుర్మార్గులైన రావణుడు, ఇంద్రజిత్తులను చంపడం కోసరం, లోకంలో ఉన్న అమాయకులైన రాక్షస జాతిని నాశనం చెయ్యడం ధర్మం కాదు కదా! యుద్ధసమయంలో నీతో యుద్ధము చేయని వానిని కానీ, దాగి ఉన్న వానిని కానీ, నమస్కారం చేయుచున్నవాడిని కానీ, నిన్ను శరణు వేడిన వాడిని కానీ, పలాయనం చేస్తున్న వాడిని కానీ, చంపడం ధర్మం కాదు. ఇప్పుడు ఇంద్రజిత్తు మనకు కనపడకుండా యుద్ధం

చేస్తున్నాడు. కాని మనతో యుద్దం చేస్తున్నాడు. ముందు మనము ఇంద్రజిత్తును చంపడానికి ప్రయత్నించాలి. వాడు కనపడకుండా యుద్ధం చేస్తున్నాడు కాబట్టి మన వానర వీరులు ఏమీ చేయలేక పోతున్నారు. అదే ఇంద్రజిత్తు ఎదుట నిలబడి యుద్ధం చేస్తే మన వానర వీరులు ఎప్పుడో అతనిని అంతమొందించి ఉండేవాళ్లు. మనదాకా రానివ్వరు.

వీడు కనపడకుండా యుద్ధం చేస్తూ మనలను బాధపెడుతున్నాడు కాబట్టి వీడిని మనం చంపక తప్పదు. వీడు ముల్లోకములలో ఎక్కడ దాక్కున్నా నా అస్త్రముల ధాటికి బలికాక తప్పదు." అని అన్నాడు రాముడు.

తరువాత వానర నాయకులతో కలిసి ఇంద్రజిత్తును ఎలా చంపాలా అని ఆలోచిస్తున్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఎనభయ్యవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## ఎనభైఒకటవ సర్గ.

ఆకాశంలో నిలబడి ఎవరికీ కనపడకుండా యుద్ధము చేస్తున్న ఇంద్రజిత్తుకు ఈ యుద్ధం ఒక పట్టాన ముగిసేటట్టు కనపడలేదు. పైగా రామలక్ష్మణులు తనను ఓడించడానికి ఉపాయాలు ఆలోచిస్తున్నట్టు గ్రహించాడు. తను కూడా ఒక మాయోపాయం పన్నాలని అనుకున్నాడు. కాసేపు యుద్ధం ఆపి లంకా నగరంలోకి ప్రవేశించాడు. ఒక మాయాసీతను సృష్టించాడు. ఆ మాయాసీతను తన రథం మీద ఎక్కించుకొని చుట్టు రాక్షసులు వెంట రాగా పడమటి ద్వారము గుండా లంకా నగరము నుండి బయటకు వచ్చాడు. తన రథాన్ని వానరులు ఉన్న వైపుకు పోనిచ్చాడు.

ఇంద్రజిత్తు తమ వైపు రావడం చూచి వానరులు రాళ్లు, వృక్షములు చేత ధరించి యుద్ధమునకు సిద్ధంగా ఉన్నారు. హనుమంతుడు కూడా ఒక పెద్ద పర్వత శిఖరమును చేత ధరించి ఇంద్రజిత్తు ఎదురుగా వెళ్లాడు. అంతలోనే హనుమంతునికి ఇంద్రజిత్తు రథంలో ఉన్న సీత కనపడింది. తాను అశోకవనములో శింశుపా వృక్షము కింద ఉండగా చూచిన సీత ఎలా ఉందో అలాగే ఉంది. ఒంటి జడ, నలిగిపోయిన చీర, దీనమైన ముఖము, తైల సంస్కారము లేని జుట్టు, ఒంటి మీద పేరుకుపోయిన దుమ్ము, సరిగ్గా అలాగే ఉంది.

యుద్ధభూమిలో ఇంద్రజిత్తు రథంమీద సీతను చూడగానే ఆశ్చర్యపోయాడు హనుమంతుడు.  ఈ సీత ఇంద్రజిత్తు పక్కన కూర్చుని ఉంది. "ఇప్పుడు ఈ దుర్మార్గుడు ఈ సీతను ఏమి చేస్తాడో అని

కలవరపడ్డాడు హనుమంతుడు. ఈ విషయాన్ని వానర వీరులందరికీ చెప్పాడు. అందరూ కలిసి ఇంద్రజిత్తు రథం వైపు వెళ్లారు. వానరులు అంతా తన రథం వైపు రావడం, సీత వంక ఆసక్తిగా చూడటం గమనించాడు ఇంద్రజిత్తు. వెంటనే మాయా సీత జుట్టుపట్టుకుని కిందికి లాగాడు. అప్పుడు మాయా సీత “రామా రామా రక్షించు రామా” అని ఏడుస్తూ ఉంది. సీత దుస్థితి చూచి హనుమంతుడు కన్నీరు కారుస్తున్నాడు. ఇంక తట్టుకోలేకపోయాడు. ఇంద్రజిత్తుతో ఇలా అన్నాడు.

“ఓరి దుర్మార్గుడా! పేరుకు బ్రాహ్మణ కులంలో జన్మించావు. కాని రాక్షసత్వము అవలంబించావు. నీ నాశనాన్ని చేజేతులా ఆహ్వానిస్తూ సీత జుట్టుపట్టుకొని లాగుతున్నావు. నీ మరణం తప్పదు. నీవు క్రూరుడవు. అనార్యుడవు. దుర్మార్గుడవు. నీచుడివి. నీకు జాలి దయ ఏకోశానా లేవు. నీవు పాపాత్ముడవు. లేకపోతే ఇంతటి పాపకార్యమునకు ఒడిగట్టవు.

ఈమె నీకు ఏమి అపకారము చేసింది రా ఈమెను అలా కొడుతున్నావు, జుట్టుపట్టుకొని ఈడుస్తున్నావు. రాజ్యము పోగొట్టుకుంది. భర్తకు దూరం అయింది. ఇంకా నీకు జాలిలేదా! ఆ ప్రకారము ఆమెను హింసిస్తున్నావు. నీవు సీతను చంపడానికి కత్తి ఎత్తుతున్నావు. జాగ్రత్త. సీతను చంపిన తరువాత నీవు క్షణకాలం కూడా జీవించలేవు. అందుకే నా ముందు ఇంతటి పాపమునకు ఒడిగట్టుతున్నావు.” అని తిడుతూ హనుమంతుడు ఇంద్రజిత్తు మీదికి వెళ్లాడు.

కాని చుట్టు ఉన్న రాక్షస సేనలు హనుమంతుని వానరులను ముందుకు రాకుండా నిలువరించాయి. అది చూచిన ఇంద్రజిత్తు వానర సేనల మీద బాణవర్షము కురిపించి వారు ముందుకు రాకుండా చేసాడు.

అప్పుడు ఇంద్రజిత్తు హనుమంతుని చూచి ఇలా అన్నాడు. "ఏ సీత కోసరం నువ్వు నూరుయోజనముల దూరం ఉన్న సముద్రమును దాటి లంకకు వచ్చావో, ఏ సీత కోసం సుగ్రీవుడు, రాముడు, నువ్వు ఇక్కడకు వచ్చారో, ఆ సీతను ఇప్పుడే నీ కళ్లముందే చంపుతున్నాను. చూడు. సీతను చంపిన తరువాత నిన్ను, సుగ్రీవుని, విభీషణుని, రాముని కూడా ఇలాగే చంపుతాను. స్త్రీలను చంపకూడదు అని నీవు అన్నావు కదా. కానీ ఈ స్త్రీ లంకను సర్వనాశనం చేసింది. కాబట్టి సీతను చంపడంలో దోషం లేదు." అంటూ ఇంద్రజిత్తు తన చేతిలో ఉన్న కత్తితో, మాయాసీత జుట్టు పట్టుకొని ఆమె మెడను నరికాడు. మాయాసీత నేలమీద పడి మరణించింది.

ఇంద్రజిత్తు మరలా హనుమను చూచి ఇలా అన్నాడు. "రాముని భార్య సీతను నేను నా కత్తితో నరికాను. చంపాను. సీత మరణించింది. మీరు ఇక్కడకు వచ్చిన శ్రమ అంతా వృధా అయింది. ఈ విషయం పోయి నీ రామునితో చెప్పు. ఇంక యుద్ధం అనవసరం అని చెప్పు." అని ఇంద్రజిత్తు పెద్ద పెద్ద గా అరుస్తున్నాడు.

సీత మరణించింది అన్న వార్త వానర సేనలలో దావానలంలా వ్యాపించింది. వానరులలో నిరాశ నిస్పృహ పుట్టాయి ఎవరి దారిన వారు పారిపోయారు. తన పాచిక పారినందుకు ఇంద్రజిత్తు పరమానందభరితుడయ్యాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఎనభైఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ఎనభైరెండవ సర్గ.

వానరులంతా తలొక దిక్కుకు పారి పోవడం చూచి హనుమంతుడు ఇలా అన్నాడు. "ఓ వానరులారా! ఎందుకు పారిపోతున్నారు. ఇప్పుడు ఏమయింది. యుద్ధము చేద్దాము రండి. మీ పరాక్రమము అంతాఏమయింది. యుద్ధములో నేను ముందుంటాను. మీరంతా ఉత్తమకులంలో పుట్టారు ఇలా పారిపోవడం ధర్మంకాదు." అంటూ వానరులను యుద్ధానికి ఉత్తేజపరిచాడు. తాను కూడా రాక్షస సేనలతో పోరాడుతున్నాడు. ప్రళయ కాలములో యముని మాదిరి విజృంభించి రాక్షస సంహారం చేస్తున్నాడు. చేతికి అందిన పెద్ద కొండ శిలను తీసుకొని ఇంద్రజిత్తు రథం మీద వేసాడు. ఇంద్రజిత్తు రథసారథి రథమును పక్కకు తప్పించాడు. హనుమంతుడు విసిరిన ఆ బండరాయి రథం పక్కన పడి నేలలో పెద్ద సొరంగం చేసింది. ఆ బండరాయి కిందపడి వందలకొద్దీరాక్షసులు మరణించారు.

ఇది చూచిన ఇంద్రజిత్తు తన ధనుస్సును తీసుకొని వానరసేనలోకి చొచ్చుకుపోయాడు. వానర సేన మీద శరవర్షము కురిపించి వానరులను చంపుతున్నాడు. ఇది చూచిన రాక్షసులు రెట్టించిన ఉత్సాహంతో తమ చేతులలో ఉన్న శూలములు, ఖడ్గములు, ముద్గరలతో వానరులను చంపుతున్నారు. హనుమంతుడు పెద్ద పెద్ద వృక్షములను కొమ్మలను తెచ్చి వాటితో రాక్షసులను మోది చంపు తున్నాడు. హనుమంతుని ధాటికి తట్టుకోలేక రాక్షస సైన్యము వెనుకకు తగ్గింది.

అప్పుడు హనుమంతుడు వానరులతో ఇలా అన్నాడు. "ఇంక యుద్ధం ఆపండి. ఈ రాక్షసులను చంపి ప్రయోజనము లేదు. ఇంత కాలమూ మనము ప్రాణాలకు తెగించి ఎవరికోసరం యుద్ధం చేసామో ఆ సీతను ఇంద్రజిత్తు చంపాడు. ఈ విషయం మనము రామునికి సుగ్రీవునికి చెప్పి వారు ఏమి చెయ్యమంటారో అది చేద్దాము." అని అన్నాడు. హనుమంతుని మాటలు విన్న వానరులు యుద్ధం విరమించారు. అందరూ రాముని వద్దకు వెళ్లారు. హనుమంతుడు యుద్ధం విరమించి వెళ్లడం చూచిన ఇంద్రజిత్తు తాను కూడా వెనుదిరిగాడు. నికుంభిల అనే దేవత ఉన్న దేవాలయమునకు వెళ్లాడు. నికుంభిల అనే దేవత ప్రీతిగా యజ్ఞం చేయడం మొదలెట్టాడు. హోమగుండంలో రక్తము, మాంసము వేసాడు. రక్తమాంసములతో తృప్తిచెందిన అగ్నిజ్వాలలు నలుదిక్కుకు ప్రజ్వరిల్లాయి. తరువాత ఇంద్రజిత్తు రాక్షసుల విజయము కొరకు హోమం చేసాడు.

శ్రీమద్రామాయణము యుద్ధకాండము ఎనభైరెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## ఎనభైమూడవ సర్గ.

హనుమంతుడు ఉన్న యుద్ధభూమిలో జరుగుతున్న కోలాహలము చూచిన రాముడు జాంబవంతుని తో ఇలా అన్నాడు. “జాంబవంతా! హనుమంతుడు ఉన్న చోట ఏదో జరిగినట్టుంది. వానరులంతా పెద్దగా అరుస్తున్నారు. హనుమంతుడు ఏదో ఆపదలో ఉన్నట్టున్నాడు. నీవు నీ సేనలతో హనుమంతునికి సాయంగా వెళ్లు.” అని అన్నాడు. వెంటనే జాంబవంతుడు తన సేనలతో హనుమంతుడు ఉన్న పశ్చిమ ద్వారం వైపుకు వెళ్లాడు. సగం దూరం వెళ్లేసరికి హనుమంతుడు తన సేనలతో ఎదురుగా రావడం చూచాడు. అందరూ కలిసి రాముని వద్దకు వచ్చారు.

రాముని చూచిన  హనుమంతునికి దు:ఖం ఆగడం లేదు. సీత మరణించింది అని రామునితో ఎలా చెప్పడమా అని మధనపడుతున్నాడు. తుదకు దు:ఖము ఆపుకొని రామునితో ఇలా అన్నాడు. “రామా! ఘోరం జరిగిపోయింది.  ఆ దుర్మార్గుడు ఇంద్రజిత్తు సీతను తన రథం మీద తీసుకొని వచ్చి మా కళ్ల ఎదుట కత్తితో ఆమెను నరికి చంపాడు సీతను అలా చంపడం చూచి నేను దు:ఖించాను. వెంటనే యుద్ధము విరమించి ఈవిషయం చెప్పడానికి తమరి వద్దకు వచ్చాను.” అని అన్నాడు.

సీత మరణవార్త విన్న రాముడు కుప్పకూలిపోయాడు. అందరూ రాముని చుట్టు గుమి గూడారు. నీళ్లు తీసుకొని వచ్చి రాముని ముఖం మీద చల్లారు. లక్ష్మణుడు రాముని పక్కనే కూర్చుని

రాముని తలను ఒడిలోపెట్టుకొని ఇల అన్నాడు.

"రామా! నీవు ధర్మాత్ముడవు. ధర్మం తప్పకుండా నడుచు కున్నావు. కానీ ఆ ధర్మం నిన్ను కాపాడలేకపోయింది. ధర్మం అనేది అగోచరము. ఎవరికీ కనపడదు. అందుకని ధర్మం ధర్మం అని పట్టుకొని పాకులాడటం వృధా. అసలు ధర్మం అనేది లేదు. ఒకవేళ ఉన్నా మనం ఆచరించవలసిన పని లేదు. లేకపోతే ధర్మాత్ముడివి అయిన నీకు ఇన్ని ఆపదలు చుట్టుముడతాయా!అధర్మం తప్ప ధర్మం అంటే ఏమిటో ఎరుగని రావణునికి ఆపద అంటే ఏమిటో తెలియదా! . ధర్మాన్ని నమ్ముకున్న నీకు ఈ విధంగా కష్టాలు ఎందుకు కలుగుతాయి. రావణుడు అధర్మపరుడైనా సుఖంగా ఉన్నాడు. ఎందుకంటే, అధర్మము సుఖాన్ని ఇస్తుంది. నువ్వు ధర్మాత్ముడివి కాబట్టి కష్టాలపాలయ్యావు. అందుకని ధర్మము కష్టములను కలిగిస్తుంది. ఇదే పరమసత్యము.

ధర్మాన్ని ఆచరిస్తే మంచిఫలితాలు కలుగుతాయి, అధర్మం ఆచరిస్తే చెడ్డ ఫలితాలు కలుగుతాయి అనేది నిజం అయితే జనులు ఎందుకు అధర్మం పట్ల ఆసక్తి చూపుతున్నారు. ఎందుకంటే, అధర్మపరులకు మంచిఫలితాలు వస్తున్నాయి కాబట్టి. ధర్మంగా నడుచుకుంటే మంచి ఫలితాలు వస్తే, జనం ఎందుకు అధర్మం పట్ల ఆసక్తి చూపుతారు. అధర్మపరులకు సిరిసంపదలు భోగభాగ్యాలు అభివృద్ధిచెందుతున్నాయి. ధర్మప్రవృత్తి కలవారికి ఆపదలు అభివృద్ధిచెందుతున్నాయి. కాబట్టి ధర్మం, అధర్మం అని అనుకోవడం వల్ల ఎటువంటి ప్రయోజనము లేదు.

ఓ రామా! ధర్మం చచ్చిపోయింది. అధర్మం ప్రజ్వరిల్లుతూ ఉంది. ధర్మాత్ములు అధర్మపరుల చేత వధింపబడుతున్నారు. అధర్మం ధర్మాన్ని నాశనం చేస్తూ ఉంది. ధర్మం నిస్సహాయంగా చూస్తూ ఉంది. ఇంకా మనం ధర్మం ధర్మం అని పాకులాడటం వృధా.

రామా! స్వర్గప్రాప్తికి, మోక్షప్రాప్తికి వేదములలో ఎన్నో యజ్ఞములు, యాగములు, వ్రతములు, పుణ్యకార్యములు చెప్పబడ్డాయి. అలాగే శత్రునాశనమునకు కూడా ఎన్నో హెూమములు వేదములలో చెప్పబడ్డాయి. ఆ హెూమములు చెయ్యడం అధర్మమయినా, అవి వేదములో చెప్పబడ్డాయి కాబట్టి వేదవిహితములే కదా! అవి అధర్మము ఎలా అవుతాయి. కాబట్టి ధర్మం లేదు. అధర్మంలేదు. అంతా ఒకటే.

రావణుడు అతని కుమారుడు ఇంద్రజిత్తు పాపాలు చేస్తున్నారు. చెడ్డ పనులు చేస్తున్నారు. ధర్మమార్గంలో వాటిని మనం ఎదుర్కోలేకపోతున్నాము. ధర్మం అధర్మాన్ని రూపుమాపలేకపోతోంది. ధర్మం అనేది ఉంటే ధర్మపరుడవైన నీకు ఏ అపకారమూ జరగకూడదు. కానీ అన్ని ఆపదలూ నీకే వస్తున్నాయి. కాబట్టి ధర్మం అనేది లేనే లేదు. ఒక వేళ ధర్మం అనేది ఉంటే అది దుర్మార్గులచేతిలో బందీ అయి పోయింది. అటువంటి ధర్మము నిన్ను ఎలా రక్షించగలదు. కాబట్టి ఆ అశక్తురాలైన ధర్మాన్ని నమ్ముకోవడం కన్నా దానిని వదిలిపెట్టడమే శ్రేయస్కరము.

ఓ రామా! ధర్మం ఆచరించి నందువలన ఎటువంటి ప్రయోజనము లేనప్పుడు మనం ధర్మాన్ని వదిలి మన బలాన్ని

నమ్ముకుంటే మంచిది.

ధర్మాత్ములను రక్షించాలి. అధర్మపరులను శిక్షించాలి అనేది నిజమైతే, అబద్ధం చెప్పడం అధర్మం అయితే, ముందు నీకు రాజ్యం ఇస్తానని చెప్పి, తరువాత భార్య మాటలు విని నీకు రాజ్యం ఇవ్వను అని అబద్దం చెప్పి మాటతప్పిన నీ తండ్రిని నీవు ఎందుకు శిక్షించలేదు?

ఓ రామా! ఇంద్రుడు విశ్వరూపుడు అనే మునిని చంపాడు. తరువాత యజ్ఞం చేసాడు. ధర్మాచరణమే ఇంద్రుని కర్తవ్యము అయితే అతడు ధర్మమయిన యజ్ఞం మాత్రమే చేసేవాడు. మరి విశ్వరూపుని చంపి అధర్మానికి ఎందుకు పాల్పడ్డాడు. ఇంద్రుడికి అధర్మం చేయడమే కర్తవ్యము అయితే ఇంద్రుడు విశ్వరూపుని మాత్రమే చంపి ధర్మకార్యమైన యజ్ఞమును చేసి ఉండే వాడు కాదు. కాని ఇంద్రుడు ధర్మకార్యము, అధర్మకార్యము రెండూ చేసాడు. కాబట్టి, క్షత్రియుడు ధర్మాధర్మములు రెండూ ఆచరించాలి. కేవలం ధర్మం అని కూర్చుంటే ఇదిగో ఇలాగే కష్టాలపాలవుతాము.

నీ తండ్రి నీకు రాజ్యము ఇవ్వకుండా అధర్మానికి పాల్పడ్డప్పుడు, ధర్మం ధర్మం అంటూ అడవులకు రాకుండా, అధర్మము అయినా సరే నీ తండ్రి మాటను ధిక్కరించి, నీ రాజ్యాన్ని దక్కించుకొని, అడవులకు రాకుండా ఉంటే మనకు ఇన్ని కష్టాలు రావు కదా! ధర్మం ధర్మం అంటూ నీవు రాజ్యాన్ని పోగొట్టుకున్నావు. దాని ద్వారా సంక్రమించే ధనాన్ని పోగొట్టుకున్నావు. చేతిలో ధనం ఉంటే కదా ధర్మకార్యాలు. దాన ధర్మాలు చేయడానికి వీలుకలిగేది. దానధర్మాలు చేయడం ధర్మకార్యం అయినపుడు, నీవు ఆచరించిన ధర్మం వలన

దానధర్మాలు అనే ధర్మకార్యాలు చేయడానికి వీలులేకుండా పోయింది.

రాజ్యము, ధనము ఉంటే మిత్రులు, బంధువులు పక్కన చేరతారు. ఈ లోకంలో ధనంతో అన్నీ సమకూరుతాయి. ధనం ఉన్న వాడికి ధైర్యము, పరాక్రమము, పాండిత్యము అన్నీ అబ్బుతాయి. చేతిలో ధనం ఉంటే ధర్మము, అర్థము, కామము వాటంతట అవే సిద్ధిస్తాయి. ధనం ఉన్న వాడికి కామము, దర్పము, క్రోధము, ఏది ఉన్నా అది శోభిస్తుంది. అటువంటి ధనమును నీవు, ధర్మం ధర్మం అంటూ రాజ్యాన్ని వదిలిపెట్టి, చేజేతులా పోగొట్టుకున్నావు. నీవు ఆనాడు రాజ్యమును వద్దు అన్నప్పుడు కేవలం ధర్మాన్ని ఆలోచించావు కానీ ఈ పరిణామాలను గూర్చి ఆలోచించలేదు. నీవు ధర్మానికి, నీ తండ్రి మాటకు కట్టుబడి, రాజ్యాన్ని, ధనాన్ని వదులుకొని అడవులకు రావడం వల్ల కదా నీ భార్యను ఆ రాక్షసుడు ఎత్తుకుపోయాడు. చివరకు చంపేసాడు.

కాబట్టి రామా! ఇంక ధర్మాధర్మాల ప్రసక్తి లేదు. ఆ పాపాత్ముడైన ఇంద్రజిత్తును అధర్మమార్గంలోనే వధిస్తాను. రామా! లే! సీతను వధించారు అన్న మాట విన్న తరువాత నా మనసు ఆగడం లేదు. ఇప్పుడే పోయి లంకను సర్వనాశనం చేస్తాను." అని శోకం, పౌరుషం, శౌర్యము, పరాక్రమం ఒక్క సారిగా ముంచుకొస్తే, ఆ భ్రమలో పడి ధర్మాధర్మవిచక్షణ కోల్పోయి మాట్లాడుతున్నాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఎనభైమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## ఎనభైనాలుగవ సర్గ.

రాముడి  పక్కన కూర్చున్న లక్ష్మణుడు ఇలా విలపిస్తుంటే, అంతకు ముందు రాముడు ఇచ్చిన ఆదేశముల మేరకు  విభీషణుడు సైనికులకు, సేనాపతులకు తగిన సూచనలు ఇచ్చి ఆ విషయం రామునికి చెప్పడానికి, రాముని వద్దకు వచ్చాడు. అక్కడ అంతా విషాద వాతావరణము నెలకొని ఉండటం చూచాడు. లక్ష్మణుడితో సహా అక్కడ అంతా ఏడుస్తున్నారు. ఎందుకో అర్థం కాలేదు విభీషణుడికి. లక్ష్మణుడి ఒడిలో స్పృహలేకుండా పడి ఉన్న రాముడిని చూచాడు.

"ఏమిటిది! రాముడికి ఏమయింది? అందరూ ఎందుకు శోకిస్తున్నారు?" అని ఆతురతగా అడిగాడు.

అప్పుడు లక్ష్మణుడు ఇలా అన్నాడు. "సీతను రణభూమికి తీసుకొని వచ్చి హనుమంతుడు ఇతర వానర నాయకుల ఎదురు గుండా ఇంద్రజిత్తు సీతను చంపాడు. ఆ విషయాన్ని హనుమంతుడు రామునికి చెప్పాడు. రాముడు మూర్ఛపోయాడు. వానర నాయకు లంతా శోకిస్తున్నారు. ..............." అని ఇంకా ఏదో చెప్పబోతుంటే విభీషణుడు ఇలా అన్నాడు.

"ఓ రామా! సముద్రము ఎండి పోయింది అని చెబితే ఎలా ఉంటుందో సీతను ఇంద్రజిత్తు చంపాడు అని చెబితే అలాగే ఉంటుంది. సీతమీద ఈగ వాలినా రావణుడు సహించడు. ఆ విషయం నాకు

బాగా తెలుసు. అటువంటిది ఇంద్రజిత్తు సీతను చంపడానికి ఎలా ఒప్పుకుంటాడు? సీతను ఇంత దూరం తీసుకొని వచ్చింది, సీత కోసరం ఇంత యుద్ధం చేస్తున్నది సీతను చంపుకోడానికి కాదు కదా! నేను రావణునితో సీతను విడిచిపెట్టమని ఎన్నోమార్లు చెప్పినా, బతిమాలినా, రావణుడు ససేమిరా అన్నాడు. అసలు సీతను రావణుడు ఎక్కడ ఉంచిందీ ఎవరికీ తెలియదు. ఇంద్రజిత్తుకు కూడా తెలియదు. ఇదంతా ఇంద్రజిత్తు పన్నిన రాక్షస మాయ. అది మీరు తెలుసుకోలేక పోయారు. ఆమె మాయా సీత. సీతను పోలిన రాక్షస స్త్రీ. ఇంద్రజిత్తు మిమ్ములను సమ్మోహితులను చేసాడు. ఇంక సీత విషయం గురించి శోకించడం ఆపి అసలు విషయం వినండి.

ఇప్పుడు ఇంద్రజిత్తు నికుంభిల దేవి ఆలయమునకు వెళ్లాడు. అక్కడ హెూమం చేస్తున్నాడు. ఆ హెూమం పూర్తి అయితే ఇంద్రజిత్తును ఓడించడానికి ఇంద్రుడి తరం కూడా కాదు. తాను చేయబోయే హెూమమునకు వానరులు విఘ్నం కలుగచేయకుండా, వారిని శోక సముద్రంలో ముంచి వారి దృష్టిని మరల్చడానికి సీతను చంపడం అనే మాయను పన్నాడు. మీరు ఆ మాయలో పడ్డారు. ఇంద్రజిత్తు చేస్తున్న హెూమం పూర్తి అయేలోగా మనము మన సైన్యములతో అక్కడికి చేరుకోవాలి.

రామా! నీవు అకారణంగా ఇలా శోకిస్తుంటే వానర సేనా నాయకులు అంతా శోకిస్తున్నారు. నీ సీత క్షేమంగా ఉంది. ఆమెకు ఏమీ కాలేదు. నీవు ఇక్కడే ఉండు. లక్ష్మణుని మా వెంట పంపు. మేము నికుంభిలా దేవాలయమునకు వెళతాము. లక్ష్మణుడు తన బాణములతో ఆ యజ్ఞమును విఘ్నము చేయగలడు. అప్పుడు

మనము ఇంద్రజిత్తును సులభంగా చంపవచ్చును. మాకు ఆజ్ఞ ఇమ్ము. నీ ఆదేశము కొరకు ఎదురుచూస్తున్నాము. ఇంద్రజిత్తు వధకు అనుజ్ఞ ఇమ్ము." అని పలికాడు విభీషణుడు.

నిజం తెలుసుకున్న రాముడు తన శోకాన్ని విడిచిపెట్టాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఎనభైనాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
ఎనభైఐదవ సర్గ.

"సీత క్షేమంగా ఉంది. ఆమెకు ఏమీ కాలేదు." అన్నమాట మాత్రం వినబడింది రాముడికి. ఆ ఆనందంలో విభీషణుడు ఏమి చెబుతున్నాడో దేని గురించి చెబుతున్నాడో అర్థం కాలేదు కాసేపటికి రాముడు లేచి కూర్చున్నాడు. విభీషణునితో ఇలా అన్నాడు.

"విభీషణా! నీవు ఏమి చెప్పావో నేను సరిగా వినలేదు. ఏదీ మరలా ఒకసారి చెప్పు." అని అడిగాడు.

విభీషణుడు మరలా చెప్పనారంభించాడు. "ఓ రామా! నీవు నన్ను సేనలను నిర్ణీత ప్రదేశములలో నిలుపమని చెప్పావు కదా. నేను ఆ పనిలో ఉన్నాను. సైన్యములను విభాగములుగా చేసి వాటిని నిర్ణీత

స్థలములలో నిలిపి సేనానాయకులకు తగిన సూచనలు ఇచ్చాను. ఆ విషయము నీతో చెప్పడానికి వస్తే ఇక్కడ నువ్వు ఈ స్థితిలో ఉన్నావు. నీవు అకారణంగా శోకిస్తున్నావు. నీవు ఇలా శోకిస్తున్నావు అని తెలిస్తే ఇంద్రజిత్తు ఇంకా రెచ్చిపోతాడు. కాబట్టి నీ శోకము మాను. కర్తవ్యమును ఆలోచించు. మనము రాక్షసులను సంహరించి సీతను దక్కించుకోవాలంటే ముందు దు:ఖించడం మానుకోవాలి. మనసంతా సంతోషం నింపుకోవాలి. అప్పుడే సరి అయిన నిర్ణయం తీసుకోగలము. ప్రస్తుతము ఇంద్రజిత్తు నికుంభిల అనే దేవి ఆలయములో ఉన్నాడు. ఇంద్రజిత్తును చంపడానికి ఇదే తగిన సమయము. ఆ పనిమీద లక్ష్మణుని నా వెంట పంపు. ఇంద్రజిత్తు తాను తలపెట్టిన హెూమమును నికుంభిల ఆలయములో పూర్తిచేస్తే అతనిని చంపడం ఎవరికీ సాధ్యం కాదు. అతడు మనలను అందరినీ చంపుతాడు. మన మరణము తథ్యము.

దీనికి ఒక కారణం ఉంది. ఇంద్రజిత్తు బ్రహ్మను గూర్చి తపస్సు చేస్తే బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయ్యాడు. “ఓ ఇంద్రజిత్! నీవు నికుంభిల ఆలయంలో హెూమం చెయ్యి. అప్పుడు నీవు అజేయుడవు అవుతావు. కానీ, నికుంభిల ఆలయం చేరక ముందుకానీ, చేరిన తరువాత, ఆ హెూమం చేయకముందుకానీ, ఎవడైతే నిన్ను ఎదిరిస్తాడో అతడే నిన్ను చంపుతాడు. అతడే నీ మృత్యువు. కాబట్టి ఆ హెూమాన్ని రహస్యంగా చెయ్యి” అని బ్రహ్మదేవుడు చెప్పాడు. ఇప్పుడు ఇంద్రజిత్తు నికుంభిల ఆలయంలో ఆ హెూమం చేయబోతున్నాడు. ఆ విషయం నేను నా మంత్రుల ద్వారా తెలుసుకున్నాను. కాబట్టి మనం తొందరగా నికుంభిల ఆలయానికి సైన్యాలతో చేరుకోవాలి. దానికి లక్ష్మణుడు నాయకత్వం వహించాలి. లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్తు చంపబడితే,

రావణుడు కూడా చంపబడినట్లే." అని అన్నాడు విభీషణుడు.

అప్పుడు రాముడు ఇలా అన్నాడు. "ఓ విభీషణా! రాక్షస మాయలు నాకు కొత్త కాదు. కానీ సీతను తన కళ్లముందే వధించడం గురించి హనుమంతుడు చెప్పగా విని మూర్ఛపోయాను. ఇంద్రజిత్తు సామాన్యుడు కాడు. ఎన్నోమాయలు తెలిసిన వాడు, మహా పరాక్రమవంతుడు. బ్రహ్మాస్త్రప్రయోగము తెలిసినవాడు. యుద్ధములో వరుణుని కూడా ఓడించగల సమర్ధుడు. ఎవరికీ కనపడకుండా మాయాయుద్ధము చేయడంలో ఇంద్రజిత్తు దిట్ట. కాబట్టి మీరు జాగ్రత్తగా ఉండాలి. లక్ష్మణా! నీవు, సుగ్రీవుడు, జాంబవంతుడు, హనుమంతుడు అంతా కలిసి వెళ్లండి. ఇంద్రజిత్తు మాయలు, యుద్ధతంత్రములు బాగా ఎరిగిన విభీషణుడు, అతని అనుచరులు మీ వెంట ఉంటారు. ఇంద్రజిత్తును సంహరించండి. విజేతలై తిరిగి రండి." అని ఇంద్రజిత్తును చంపడానికి అనుజ్ఞ ఇచ్చాడు రాముడు.

వెంటనే లక్ష్మణుడు తన ధనుర్బాణములు తీసుకున్నాడు. కవచము ధరించాడు. ఖడ్గము నడుముకు బిగించాడు. రాముని పాదాలకు నమస్కరించి ఇలా అన్నాడు. "రామా! నేను నా పదునైన బాణములతో ఇంద్రజిత్తును సంహరిస్తాను." అని పలికాడు. తరువాత ఇంద్రజిత్తు హెూమం చేస్తున్న నికుంభిల ఆలయమునకు వెళ్లాడు. సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు, హనుమంతుడు లక్ష్మణుని వెంట వెళ్లారు. వారి వెంట వేలకొద్దీ వానర సైన్యము అనుసరించింది.

నికుంభిల ఆలయము చుట్టు మోహరించి ఉన్న రాక్షస

సైన్యమును చూచాడు  లక్ష్మణుడు. ఎలాగైనా ఆలయమునకు చేరుకోక ముందే లేక హెూమము పూర్తి కాకముందే  ఇంద్రజిత్తును చంపడానికి నిశ్చయించుకున్నాడు లక్ష్మణుడు.  వానర సేనలు రాక్షస సేనలను ఎదుర్కొన్నాయి.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఎనభై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము

ఎనభై ఆరవ సర్గ.

విభీషణుడు వానర సేనా నాయకులతో ఇలా అన్నాడు. "రాక్షససేనలు ఇంద్రజిత్తుకు రక్షణ కల్పిస్తున్నారు. మీరు ఎలాగైనా వారు మీతో యుద్ధం చేసేటట్టు రెచ్చగొట్టండి. వారు మీతో యుద్ధం చేస్తున్న సమయంలో మేము ఇంద్రజిత్తును ముట్టడిస్తాము." అని అన్నాడు.

తరువాత లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా!ఇంద్రజిత్తు సైన్యం మధ్యలో ఉన్నాడు.  నీవు నీ యుద్ధవిద్యాకౌశలంలో ఈ సైన్యాన్ని చీల్చుకుంటూ ఇంద్రజిత్తును పట్టుకో. ఇంద్రజిత్తు హెూమం చెయ్యడానికి వెళ్లక ముందే నీవు ఇంద్రజిత్తును సంహరించాలి. ఇంద్రజిత్తును చంపడంలో అధర్మము పాపం లేదు ఎందుకంటే వాడు మాయావి. దుర్మార్గుడు, క్రూరుడు. లోకాలన్నీ వాడిని చూచి భయపడుతున్నాయి. అట్టి వానిని చంపడంలో దోషం లేదు." అని అన్నాడు.

ఆ మాటలు విన్న లక్ష్మణుడు వెంటనే రాక్షస సేనల మీద శరవర్షము కురిపించడం మొదలెట్టాడు. వానర సేనలు భల్లూక సేనలు కూడా వృక్షములతోనూ పెద్ద పెద్ద బండరాళ్లతోనూ రాక్షసులతో యుద్ధం చేస్తున్నారు. రాక్షసులు కూడా ఖడ్గములు, శక్తి ఆయుధములు, తోమరములు ధరించి వానరులతో యుద్ధం చేస్తున్నారు. రాక్షసులకు వానరులకు మధ్య ఘోరమైన యుద్ధం జరుగుతూ ఉంది. ఇరుపక్షముల వారు ఒకరి మీద ఒకరు విసురుకుంటున్న ఆయుధములతో ఆకాశం కప్పబడి పోయిందా అన్నట్టు ఉంది. వానరులు పెద్ద పెద్ద వృక్షములను, కొండ శిలలను చేతులలో ధరించి రాక్షసులను కొట్టి కొట్టి చంపుతున్నారు. తమతో యుద్ధం చేస్తున్న భల్లూకములను, వానరములను చూచి రాక్షసులకు భయం కలిగింది. రాక్షస సేనలు పారిపోసాగాయి.

అప్పటికి ఇంద్రజిత్తు హోమం చెయ్యడానికి కూర్చోబో తున్నాడు. ఇంతలో రాక్షసులు వానరులు, భల్లూకముల ధాటికి తట్టుకోలేక పారిపోతున్నారు అన్న వర్తమానం అందింది. ఇంద్రజిత్తు హోమం ప్రారంభించకుండానే లేచాడు. తన రథము ఎక్కాడు. ధనుర్బాణములు ధరించాడు. వానరుల మీదికి యుద్ధానికి బయలుదేరాడు. తమ నాయకుడు యుద్ధము చేయడానికి వచ్చాడు అని తెలియగానే పారిపోతున్న రాక్షస సేనలు వెనక్కు తిరిగాయి. అమితోత్సాహంతో వానరుల మీదికి దుమికాయి.

అప్పుడు హనుమంతుడు ఒక పెద్ద వృక్షమును పెకలించి దానితో రాక్షసులను చితకబాదుతున్నాడు. హనుమంతుని ధాటికి రాక్షస సైన్యము చనిపోవడమో మూర్ఛపోవడమో జరుగుతూ ఉంది.

ఆ ప్రకారంగా రాక్షస సేనలను చంపుతున్న హనుమంతుని చూచిన రాక్షస సేనలు ఒక్కుమ్మడిగా హనుమంతుని చుట్టు ముట్టాయి. హనుమంతుని మీద శూలములను, ఖడ్గములను, శక్తి ఆయుధములను, పట్టిశములను, పరిఘలు, గదలు, కుంతములు, శతఘ్నులు, ఇనుముతో చేసిన ముద్గరలు, గండ్రగొడ్డళ్లు మొదలగు ఆయుధములను ప్రయోగించారు రాక్షసులు. ఆ ఆయుధముల బారి నుండి తప్పించుకుంటూ హనుమంతుడు చేతికందిన రాక్షసుని అందినట్టు చంపుతున్నాడు.

అలా ముందుకు చొచ్చుకుపోతున్న హనుమంతునికి రథము మీద ఉన్న ఇంద్రజిత్తు కనపడ్డాడు. రాక్షసులను మట్టికరిపిస్తున్న హనుమంతుని చూచాడు ఇంద్రజిత్తు. తన రథమును హనుమంతుని ఉన్నచోటికి పోనిచ్చాడు. ఇంద్రజిత్తు హనుమంతుడు ఎదురు ఎదురుగా వచ్చారు. అప్పుడు ఇంద్రజిత్తు హనుమంతుని మీద బాణములు, ఖడ్గములు, పట్టిశములు, గండ్రగొడ్డళ్లు వర్షంలా కురిపించాడు. ఆ ఆయుధములను లెక్కపెట్టలేదు హనుమంతుడు. ఇంద్రజిత్తును చూచి ఇలా అన్నాడు.

"ఓ రాక్షసాధమా! వీరుడవైతే, చేతనైతే యుద్ధం చెయ్యి. నాముందు నిలబడ్డవాడు ప్రాణాలతో వెనుదిరిగిపోలేడు. రా! నీ రథం దిగిరా. నాతో ద్వంద్వ యుద్ధం చెయ్యి. నా వేగాన్ని తట్టుకొని నిలబడు. వీరుడవు అనిపించుకో!" అని ఇంద్రజిత్తు మీదికి దూకాడు.

అప్పుడు ఇంద్రజిత్తు తన ధనుస్సు ఎత్తి హనుమంతుని మీద దివ్యాస్త్రములను ప్రయోగించడానికి సిద్ధం అయ్యాడు. ఇదంతా దూరం నుండి చూస్తున్న విభీషణుడు లక్ష్మణునితో "లక్ష్మణా! ఇంద్రజిత్తు హనుమంతుని చంపడానికి వెళుతున్నాడు. ఇంద్రజిత్తు మీద నీ వద్ద ఉన్న అస్త్రములను ప్రయోగించు. ఇంద్రజిత్తును అంతమొందించు." అని అన్నాడు.

విభీషణుని మాటలు విన్న లక్ష్మణుడు ఇంద్రజిత్తు మీద దృష్టి సారించాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఎనభైఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ఎనభై ఏడవ సర్గ.

లక్ష్మణుడు, విభీషణుడు ఇంద్రజిత్తు ఉన్న వైపుకు వెళ్లారు. కాని వారు ఇంద్రజిత్తుతో యుద్ధం చేయలేదు. ఇంద్రజిత్తు హెూమం చేయబోయే ప్రదేశమునకు వెళ్లారు. ఆ ప్రదేశము పెద్ద వనము మధ్యలో ఉంది. అక్కడ బాగా విస్తరించిన మర్రిచెట్టును లక్ష్మణునకు చూపాడు విభీషణుడు. "లక్ష్మణా! ఇంద్రజిత్తు యుద్ధానికి బయలుదేరేటప్పుడు అక్కడే భూత బలులు ఇచ్చి యుద్ధమునకు బయలుదేరుతాడు. అప్పటి నుండి ఇంద్రజిత్తు ఎవరికీ కనపడకుండా యుద్ధం చేస్తాడు. అతడు వేసే బాణాలు కనపడతాయి కానీ అతను

కనపడడు. ఇంద్రజిత్తు ఈ మర్రిచెట్టు దగ్గరకు రాక ముందే అతనిని చంపాలి." అని అన్నాడు విభీషణుడు.

లక్ష్మణుడు తన ధనుస్సును ఎత్తి నారిని సారించి, ఇంద్రజిత్తు కోసరం వేచి ఉన్నాడు. ఇంతలో రథమును ఎక్కి ఖడ్గమును ధరించిన ఇంద్రజిత్తు రావడం కనిపించింది. లక్ష్మణుడు ఇంద్రజిత్తు ముందు నిలబడ్డాడు. "నేను నీతో యుద్ధానికి వచ్చాను. నాతో యుద్ధం చెయ్యి." అని ఇంద్రజిత్తును యుద్ధానికి ఆహ్వానించాడు.

తాను అక్కడకు వస్తున్నట్టు, హోమం చేస్తున్నట్టు లక్ష్మణునికి ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపోయాడు ఇంద్రజిత్తు. ఇంతలో లక్ష్మణుని పక్కనే ఉన్న విభీషణుని చూచాడు. ఇంద్రజిత్తు కోపం మిన్నుముట్టింది. విభీషణుని చూచి ఇలా అన్నాడు.

"ఓ విభీషణా! నీవు రాక్షస కులంలో పుట్టావు. లంకలో పుట్టి పెరిగావు. నా తండ్రికి తమ్ముడివి. నాకు తండ్రితో సమానుడవు. అటువంటి నీవు, నీ కుమారుడనైన నాకే ద్రోహం తలపెట్టడానికి నీకు మనసెలా ఒప్పింది.  అయిన వాళ్లను అందరినీ కాదని శత్రువులతో చేతులు కలిపినందుకు నిన్ను చూస్తే నాకు జాలి కలుగుతూ ఉంది. సాటి వాళ్లు నిన్ను ఎన్నటికీ క్షమించరు. నీకు అసలు బుద్ధి లేదు. ఉన్నా అది పనిచేయడం లేదు. లేకపోతే బంధువులకు శత్రువులకు తేడా తెలియదా నీకు! బంధువులను వదిలి శత్రువులతో చేతులు కలిపిన నిన్ను బంధువు అని చెప్పుకోడానికి మనసు రావడం లేదు.

నీ శత్రువులు గుణవంతులే కావచ్చు నీ స్వజనులు నీచులే కావచ్చు. కాని గుణవంతులైన శత్రువులకన్నా గుణములేని స్వజనులే మేలు అని తెలియదా! శత్రువు ఎన్నటికీ శత్రువే అని గుర్తుపెట్టుకో! తన వాళ్లను వదిలి శత్రు పక్షము చేరిన వానిని, అవసరం ఉన్నంతవరకూ ఉపయోగించుకొని, అవసరం తీరగానే ఆ శత్రువులే నిన్ను చంపుతారు. అదే రాజనీతి. ఆ మాత్రం తెలియదా నీకు!

నీకు జాలి, దయ లేదు. అందుకే లక్ష్మణుని ఈ రహస్య ప్రదేశానికి తీసుకొని వచ్చావు. నీవు పౌరుషహీనుడవు. పైగా జ్ఞాతివి. అందుకే ఇంతటి హేయమైన పనికి ఒడిగట్టావు. నీ ముఖం చూడడం కూడా మహాపాపము." అని అన్నాడు ఇంద్రజిత్తు.

ఆ పరుషమైన మాటలకు విభీషణుడు ఇలా అన్నాడు. "కుమారా! ఎందుకు అలా మితిమీరి మాట్లాడతావు. నా గురించి, నా గుణగణముల గురించి, నా స్వభావము గురించి నీకు తెలియదా! నేను నీ తండ్రి సోదరుడను అన్న గౌరవం కూడా లేకుండా మాట్లాడుతున్నావు. నేను దుర్మార్గపు వంశమైన రాక్షస వంశములో జన్మించాను. కాని మానవులకు సహజంగా ఉండే శీలాన్ని, సుగుణాలను స్వంతం చేసుకున్నాను. రాక్షస గుణములను విడిచిపెట్టాను. రాక్షసులకు స్వభావసిద్ధమైన దారుణమైన పనులు చేయడం నాకు ఇష్టం లేదు. అధర్మంగా ప్రవర్తించడం అసలు నచ్చదు. కేవలం నేను మంచి వాడిని అనే నెపంతో, తానే చేసే చెడ్డ పనులను సమర్థించలేదనే నెపంతో, నీ తండ్రి నన్ను వెళ్లగొట్టాడు. ఏ అన్న అయినా తమ్ముడిని వెళ్లగొడతాడా! అదీ నా మంచికే జరిగింది. దుర్మార్గులను వదిలి సన్మార్గుల పంచన చేరాను. సుఖంగా ఉన్నాను.

ఇతరుల ధనాన్ని అపహరించేవాళ్లను, ఇతరుల భార్యలను కోరుకొనేవాడిని వెంటనే విడిచిపెట్టమన్నారు పెద్దలు. ఎందుకంటే ఇతరుల ధనాన్ని కోరడం, ఇతరుల భార్యలమీద కోరిక పెంచుకోవడం, మంచి వాళ్లను అనుమానించడం మంచి లక్షణములు కావు. అవి వినాశహేతువులు.

నీవు, నీ తండ్రి, నీ వాళ్లు చేసిన పనులు ఏమిటి! మహర్షులను చంపడం, దేవతలతో విరోధం పెంచుకోవడం, నా కన్నా గొప్పవాడు లేడని అహంకరించడం, అందరితో శత్రుత్వము పెట్టుకోవడం, ఇవే కదా. ఈ దుర్గుణాలే నిన్ను నీ తండ్రిని చెడుమార్గం పట్టించాయి. ఆ మార్గంలో నేను నడవదలచుకోలేదు. అందుకనే బయటకు వచ్చాను. నీవు నీ తండ్రి ఈ లంకానగర నాశనమునకు కంకణం కట్టుకున్నారు అందుకే నా మాట విని సీతను రామునికి ఇవ్వకుండా, యుద్ధానికి పాల్పడ్డారు.

ఓ కుమారా! నీ తండ్రి మాదిరి నీవు కూడా అహంకారివి. మూర్ఖుడవు. నీకు తెలియదు. ఒకరు చెబితే వినవు. నీకు పెద్దల ఎడల గౌరవము వినయము మచ్చుకైనా లేవు. నీకు యమలోకము సందర్శించు కాలము సమీపించినది. అందుకే నీ ఇష్టం వచ్చినట్టు మాట్లాడుతున్నావు.

ఓ ఇంద్రజిత్తూ! నీ వినాశనం దాపురించింది. నీవు ఈ మర్రిచెట్టులో ప్రవేశించలేవు. లక్ష్మణుణ్ణి ఎదిరించలేవు. జయించలేవు. చేతనైతే యుద్ధం చేసి, లక్ష్మణుడి బాణాలకు బలి కా! యమలోకంలో నీవు చేయవలసిన పనులు చాలా ఉన్నాయి. నీ కన్నా ముందు

యమలోకం చేరిన నీ వాళ్లు, నీకోసరం ఎదురు చూస్తున్నారు. త్వరగా వెళ్లు." అని పలికాడు విభీషణుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము
ఎనభైఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్రామాయణము

## యుద్ధ కాండము

(మూడవ భాగము)

సంస్కృత మూలము

భగవాన్ వాల్మీకి మహర్షి

తేటతెలుగులో

మొదలి వెంకట సుబ్రహ్మణ్యం

2-31, చైతన్యపురి,

హైదరాబాదు 500060

ఫో: 24048104

సెల్: 9391134792

# శ్రీమద్రామాయణము

## యుద్ధకాండము

## ఎనభై ఎనిమిదవ సర్గ.

తాను రహస్యంగా హోమం చేసే ప్రదేశాన్ని తన శత్రువులకు తెలిపినందుకు ఇంద్రజిత్తు తన చిన్నాన్న విభీషణుని మీద మండి పడ్డాడు. నోటికి వచ్చినట్టు దూషించాడు. దానికి తగినట్టు సమాధానం చెప్పాడు విభీషణుడు. మాటలతో లాభం లేదని ఇంద్రజిత్తు లక్ష్మణునితో యుద్ధానికి దిగాడు. ఆ సమయంలో  ఇంద్రజిత్తు తన రథం మీద ఉన్నాడు. లక్ష్మణుడు హనుమంతుని వీపుమీద ఎక్కికూర్చుని ఉన్నాడు.

ఇంద్రజిత్తు విభీషణుని, లక్ష్మణుని, వానర సేనానాయకులను చూచి ఇలా అన్నాడు. "ఇప్పటిదాకా మాటలు మాట్లాడాను ఇంక నా యుద్ధంకౌశలం చూపిస్తాను చూడండి. ఆకాశము నుండి కుంభవృష్టి కురిసినట్టు మీ మీద శరవర్షము కురిపిస్తాను. సాధారణంగా వర్షంలో తడుస్తారు. కాని నా బాణవర్షంలో మీరందరూ మాడి మసి అయి పోతారు. మీరందరూ యమసదనమునకు వెళ్లడానికి సిద్ధంగా ఉ ఒడండి. నా పేరే మేఘనాధుడు. నేను మేఘము వలె గర్జిస్తూ బాణములు వర్షం మాదిరి కురిపిస్తుంటే నా ముందు ఎవడు ఆగగలడు?

కొన్ని రోజుల క్రితం నా చేతిలో పడి నువ్వు నీ అన్న రాముడు మూర్ఛపోయి చావుకు దగ్గరగా వెళ్లారు. అప్పుడే మర్చిపోయారా! ఏదో విధివశాత్తు బతికి బయటపడ్డారు. లేకపోతే ఆ నాడే యుద్ధము పరిసమాప్తి అయి ఉండేది. మరలా ఏముఖం

పెట్టుకొని నాతో యుద్ధానికి వచ్చావు? నా చేతిలో చావాలనే కోరికతో వచ్చిఉంటావు. చావడానికి సిద్ధంగా ఉండు. సిద్ధంగా ఉండటమేమిటి! నీవు ఈ పాటికి యమలోకంచేరుకున్నావు."అని బీరములు పలికాడు ఇంద్రజిత్తు.

ఇంద్రజిత్తు పలికిన పలుకులు అన్నీ సావధానంగా విన్నాడు లక్ష్మణుడు. ఇంద్రజిత్తుతో ఇలా అన్నాడు. "ఓ రాక్షసా! నీవు కేవలము మాటలతోనే కాలం గడుపుతున్నావు. అనుకున్నది చేసేవాడే బుద్ధి మంతుడు. కేవలం మాటలతో పొద్దుపుచ్చేవాడు పిరికివాడు. నీవు పలికేవన్నీ ధర్మపన్నాలు, చేసేవి దుష్టకార్యాలు. ఎదురుగా నిలబడి యుద్ధం చేసేవాడే వీరుడు, పరాక్రవంతుడు. నీమాదిరి కనపడకుండా యుద్ధం చేసేవాడు చోరుడు. పిరికి పంద. నీ లాంటి దొంగ, ఎదురుగా నిలబడి యుద్ధం చేయడానికి భయపడి అదృశ్యంగా ఉండి యుద్ధం చేస్తాడు. అలా యుద్ధం చేయడం వీరులకు, వీరత్వానికే సిగ్గుచేటు.

ఓ రాక్షసాధమా! నేను నీ ఎదురుగా ధనుర్బాణములు పట్టుకొని నిలబడిఉన్నాను. నీవు కూడా మాటలు కట్టిపెట్టి నా ఎదురుగా నిలబడి యుద్ధం చెయ్యి. చచ్చేముందు వీరుడవు అనిపించుకో. కనపడకుండా యుద్ధం చేసి దొంగలా చావకు." అన్నాడు లక్ష్మణుడు.

ఆమాటలకు ఇంద్రజిత్తుకు కోపము, రోషము, పౌరుషము కలిగాయి. మారు మాటాడకుండా లక్ష్మణుని మీద శరప్రయోగము చేసాడు. విషసర్పముల వంటి బాణములను ప్రయోగించాడు. కాని వాటన్నిటినీ లక్ష్మణుడు తన బాణములతో నిర్వీర్యము చేసాడు.

ఇంద్రజిత్తు కొడుతున్న బాణముల దెబ్బకు లక్ష్మణుని శరీరం రక్తసిక్తము అయింది.

"ఓ లక్ష్మణా! చూచావా నా అస్త్రవిద్యాకౌశలము. ఇవిగో ఈ నారాచములతో నీ ప్రాణం తీస్తాను కాచుకో. చచ్చిన నీ శరీరం మీద డేగలు గద్దలు వాలి నీ శరీరాన్నిపీక్కుతింటాయి. అది నేను కళ్లారా చూస్తాను. తను నా చేతిలో చస్తాను అనే భయంతో నీచుడైన రాముడు నిన్ను నా మీదికి యుద్ధానికి పంపాడు. అది నీవు తెలుసు కోలేక తగుదునమ్మా అంటూ నా మీదికి యుద్ధానికి వచ్చావు. నీ తల తెగి నేలమీద దొర్లుతుంటే, అది చూడానికి రాముడు ఇప్పుడు వస్తాడు. చూస్తూ ఉండు." అంటూ వాడి అయిన బాణముల వంటి మాటలు విసురుతున్నాడు ఇంద్రజిత్తు.

ఆ మాటలకు లక్ష్మణుడు నవ్వుతూ " ఏం రాక్షసా! ఊరికే మాట్లాడట మేనా. యుద్ధం చేయడం ఏమన్నా ఉందా. నీ గొప్పలు నీవు చెప్పుకుంటే ప్రయోజనం ఏముంటుంది. అవి చేతలలో చేసి చూపిస్తేనే ప్రజలు నమ్ముతారు. నీ మాదిరి నేను ప్రగల్భములు పలుకను. అలా పలకడం కూడా నా చేత కాదు. నీ మాటలకు నా బాణాలే సమాధానం చెబుతాయి" అంటూ లక్ష్మణుడు ఐదు నారాచబాణములను ఇంద్రజిత్తు మీద ప్రయోగించాడు. అవి సూటిగా వెళ్లి ఇంద్రజిత్తు వక్షస్థలంలో గుచ్చుకున్నాయి. వెంటనే ఇంద్రజిత్తు మూడు బాణములతో లక్ష్మణుని కొట్టాడు.

ఇరువురి మధ్య పోరు భయంకరంగా సాగుతూ ఉంది.

లక్ష్మణుడు, ఇంద్రజిత్తు ఒకరికి ఒకరు తీసిపోనట్టుగా పోరాడుతున్నారు. కాక పోతే లక్ష్మణుడు మానవుడు. ఇంద్రజిత్తు రాక్షసుడు. లక్ష్మణుడికి ఎదురుగా నిలబడి యుద్ధం చెయ్యడం తెలుసు. ఇంద్రజిత్తుకు మాయాయుద్ధం తెలుసు.  లక్ష్మణుడు ఇంద్రజిత్తు మీద పగ తీర్చుకోడానికా అన్నట్టు బాణవర్షముకురిపిస్తున్నాడు. ఆ బాణముల ధాటికి ఇంద్రజిత్తు తట్టుకోలేక పోయాడు. కాస్త వెనుకంజ వేస్తున్నట్టు కనపడింది.

వెంటనే విభీషణుడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఇంద్రజిత్తు అలసిపోయాడు. ఇదే మంచి సమయము. నీవు తొందరపడు. ఇంద్రజిత్తు మీద అస్త్రప్రయోగం చెయ్యి" అని అన్నాడు విభీషణుడు. వెంటనే లక్ష్మణుడు సర్పముల వంటి బాణములను ఇంద్రజిత్తు మీద ప్రయోగించాడు. ఆ బాణముల దెబ్బకు ఇంద్రజిత్తు స్పృహ తప్పి కిందపడ్డాడు. వెంటనే తెలివి వచ్చింది. ఎదురుగా రథము మీద స్థిరంగా నిలబడి ఉన్న లక్ష్మణుని చూచాడు ఇంద్రజిత్తు. లక్ష్మణుని మాటలతో నిర్వీర్యుడిని చెయ్యాలని అనుకున్నాడు ఇంద్రజిత్తు. లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

"ఓ లక్ష్మణా! అప్పుడే మరిచిపోయావా! యుద్ధము జరిగిన మొదటి రోజు నా శరముల ప్రభావానికి నువ్వు నీ అన్న స్పృహ తప్పి నేల మీద పడ్డారు కదా! నా బాణముల రుచి అప్పుడే మరిచిపోయావా! ఈ రోజు అలా చెయ్యను సరాసరి నిన్ను యమసదానానికి పంపుతాను. ఆ రోజు నువ్వు నాపరాక్రమాన్ని పూర్తిగా చవిచూడలేదు. ఆ ముచ్చట ఈరోజు తీరుస్తాను. బహుశా ఆ రోజు జరిగినది నీకు జ్ఞాపకం లేక ఈ రోజు నాతో యుద్ధానికి వచ్చావు. బతకాలని ఉంటే పారిపో. లేకపోతే నా

బాణాలకు బలి అవుతావు. కాచుకో” అంటూ లక్ష్మణుని మీద ఏడు బాణములను సంధించి వదిలాడు. మరో పదిబాణములతో హనుమంతుని కొట్టాడు. దీని కంతకీ కారణమయిన విభీషణుని మీద నూరు బాణములు ప్రయోగించాడు. ఆ బాణములను అన్నిటినీ లక్ష్మణుడు అవలీలగా ఛేదించాడు. మరలా ఇంద్రజిత్తు మీద వాడి అయిన బాణములను ప్రయోగించాడు.

“ఓ రాక్షసా! ఇవేమి బాణములు.నా మీద పువ్వుల మాదిరి పడుతున్నాయి. ఇంతకన్నా వాడి అయిన బాణములు నీ దగ్గర లేవా! నా దగ్గర చూడు ఎంతటి వాడి అయిన బాణాలు ఉన్నాయో” అని ఇంద్రజిత్తు మీద వాడి అయిన బాణములు ప్రయోగించాడు. లక్ష్మణుని బాణముల దెబ్బకు ఇంద్రజిత్తు ధరించిన కవచము ముక్కలయింది. ఇంద్రజిత్తు గుండెల్లో బాణాలు గుచ్చుకొని గాయం అయింది. ఇంద్రజిత్తు కోపంతో ఊగిపోయాడు. లక్ష్మణుని మీద ఒకే సారి వెయ్యి బాణాలు ప్రయోగించాడు. ఇంద్రజిత్తు వేసిన బాణములకు లక్ష్మణుని కవచము కూడా బద్దలయింది. ఇద్దరూ సమానంగా ఉన్నారు. ఇరువురి దేహములలో బాణాలు దిగబడ్డాయి. రక్తం కారుతూ ఉంది. ఒకరితో ఒకరు అలసట అనేది లేకుండా పోరాడుతున్నారు. వారు ఒకరి మీద ఒరకు వేసుకొనే బాణములతో ఆకాశము కప్పబడి పోయింది. ఆ ప్రకారంగా ఒకరితో ఒకరు ఘోరంగా యుద్ధము చేస్తున్నారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము ఎనభై ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము
## ఎనభై తొమ్మిదవసర్గ.

లక్ష్మణుడు ఇంద్రజిత్తు ఒకరితో ఒకరు ఘోరంగా యుద్ధము చేస్తుంటే. పక్కనేఉన్న విభీషణుడు తన వంతు సహకారాన్ని అందించాడు. తాను కూడా ధనుస్సు చేత పట్టి రాక్షసులను సంహరిస్తున్నాడు. రాక్షసుల ఆనుపానులు తెలిసిన విభీషణుడి బాణముల ధాటికి రాక్షసులు కుప్పలుకుప్పలుగా చచ్చిపడుతున్నారు. విభీషణుడు రాక్షసులను చంపుతుంటే, విభీషణుని నలుగురు మంత్రులు కూడా కత్తులు చేత బట్టి రాక్షసులను నరుకుతున్నారు. విబీషణుడు కూడా వాళ్లను ప్రోత్సహిస్తూ ఇలా అంటున్నాడు.

"ఓ వానరవీరులారా! రావణునికి వీడొక్కడే గతి. వీడు చస్తే రావణుని పక్షాన  యుద్ధం చేసే వాళ్లు ఎవరూ లేరు. రాక్షస వీరులైన ప్రహస్తుడూ, నికుంభుడూ, కుంభకర్ణుడూ, కుంభుడూ, ధూమ్రాక్షుడు, జంబుమాలి, మహామాలి, అశనిప్రభుడూ.సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ, వజ్రదంష్ట్రుడూ, సంహాది, వికటుడూ, తపనుడూ, మందుడు, ప్రఘాసుడు, ప్రఘసుడూ, జంఘుడూ, ప్రజంఘుడూ, అగ్నికేతువూ, రశ్మికేతువూ, విద్యుజ్జిహ్వుడు, ద్విజిహ్వుడు, సూర్యశత్రువు, అకంపనుడు, సుపార్శ్వుడు, చక్రమాలి, కంపనుడు, దేవాంతకుడు, నరాంతకుడు అందరూ మన చేతిలో చంపబడ్డారు. ఇంక లంకలో మనతో యుద్ధం చేయగల వీరులు ఎవరూ లేదు.  ముందుకు దూకండి ఇంద్రజిత్తును చంపండి. రాక్షసులను తునుమాడండి. రాక్షసులతో చేసిన యుద్ధములో యోధానుయోధులను చంపాము. నూరుయోజనముల సముద్రమును దాటిన మీకు  ఈ ఇంద్రజిత్తు,  ఆవు పాదము

(గోష్పాదము)తో ఏర్పడిన చిన్న గుంటలాంటి వాడు. . వీడిని చంపడం మనకు లెక్కలోనిది కాదు.

నేనే ఇతనిని చంపగలను. కాని నాకు ఇతడు కుమారుడు. నేను వీడికి తండ్రిని. వీడి మీదున్న పుత్రవాత్సల్యము నన్ను అడ్డుకుంటూ ఉంది. వీడిని చంపాలని అనుకున్నప్పుడల్లా నా కళ్లలో నీళ్లు సుళ్లు తిరుగుతున్నాయి. కాబట్టి లక్ష్మణుడే వీడిని చంపగలడు. ముందు మీరందరూ ఇంద్రజిత్తు చుట్టుమోహరించి ఉన్న రాక్షసులను చంపండి. తరువాత లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపగలడు" అని వానర వీరులను ప్రేరేపించాడు విభీషణుడు.

విభీషణుని మాటలతో వానరులలో ఉత్సాహం పెల్లుబికింది. సింహనాదాలు చేస్తున్నారు. వానరులు, భల్లూకములు ఒక్కసారిగా రాక్షస సేనల మీద పడ్డారు. వారిని రక్కారు, పీకారు. కొరికారు. రాళ్లతో కొట్టారు. జాంబవంతుడు కూడా యధాశక్తి రాక్షసులను చంపు తున్నాడు.  రాక్షసు లందరూ జాంబవంతుని చుట్టు ముట్టారు. తమ చేతులలో ఉన్న పట్టిసములతోనూ, గండ్రగొడ్డళ్లతోనూ, కత్తులతోనూ దారుణంగా కొట్టారు. జాంబవంతుడుకూడా వారికి తగురీతిలో సమాధానం చెప్పాడు. వానరులకు రాక్షసులకూ యుద్ధం తీవ్రస్థాయిలో జరుగుతూ ఉంది.

అప్పటిదాకా లక్ష్మణుని తన వీపు మీద మోస్తున్న హనుమంతుడు, లక్ష్మణుని కిందికి దింపి, ఒక పెద్ద బండరాయిని చేతిలోకి తీసుకున్నాడు. ఆ బండరాతితో మోదుతూ హనుమంతుడు రాక్షసులను చంపుతున్నాడు. విభీషణుడితో యుద్ధం చేస్తున్న

ఇంద్రజిత్తు, ఆయనను వదిలి లక్ష్మణుని మీదికి వెళ్లాడు.

లక్ష్మణుడికి ఇంద్రజిత్తుకు సమరం సంకులంగా మారింది. ఒకరి మీద ఒకరు బాణవర్షము కురిపిస్తున్నారు. ఇద్దరూసమానమైన యుద్ధకౌశలాన్ని ప్రదర్శిస్తున్నారు. వారు సంధించిన బాణములతో ఆకాశం కప్పబడిపోయింది. ఒక సారి లక్ష్మణుడిది పైచేయిగా ఉంటే ఇంకాసేపటికి ఇంద్రజిత్తు విజయకేతనం ఎగరవేస్తున్నాడు. అంతలోనే లక్ష్మణుడు ఇంద్రజిత్తు మీద పట్టుసాధిస్తున్నాడు. జయాపజయాలు ఇద్దరి మధ్య అటు ఇటు పరుగెడుతున్నాయి. లక్ష్మణుడు, ఇంద్రజిత్తు ఒకరి మీద ఒకరు వేసుకుంటున్న బాణములతో ఆకాశం కప్పబడిపోయింది. చీకట్లు కమ్ముకున్నాయి. వానరులు రాక్షసుల రక్తంతో అక్కడ రక్తపుటేరులు ప్రవహిస్తున్నాయి.

ఆ సమయంలో లక్ష్మణుడు నాలుగు బాణములతో ఇంద్రజిత్తు రథానికి కట్టిన గుర్రములను చంపాడు. మరొక భల్లబాణంతో ఇంద్రజిత్తు సారథిని చంపాడు. ఇంద్రజిత్తు మరొక రథాన్ని ఎక్కి తన రథమును తానే తోలుకుంటూ లక్ష్మణునితో యుద్ధం చేస్తున్నాడు. ఆ సమయంలో లక్ష్మణుడు ఇంద్రజిత్తు మీద తన వాడి అయిన బాణములను ప్రయోగించాడు. మరలా రథమునకు కట్టిన గుర్రములను తన బాణములతో కొట్టాడు లక్ష్మణుడు. అవకాశం దొరకడం ఆలస్యం లక్ష్మణుడు ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటూ ఇంద్రజిత్తును దెబ్బతీస్తున్నాడు.

ఇంద్రజిత్తుకు క్రమక్రమంగా సామర్థ్యం సన్నగిల్లింది. అలసిపోతున్నాడు. ఇది చూచిన వానర నాయకులు హర్షధ్వానాలు

చేసారు. ఇంతలో ప్రమాథి, రభసుడు, శరభుడు, గంధమాధనుడు అనే వానర శ్రేష్ఠులు ఇంద్రజిత్తు మీదికి దూకారు. ఎగురుకుంటూ వెళ్లి ఇంద్రజిత్తు రథం మీద కూర్చున్నారు. ఇంద్రజిత్తు రథమునకు కట్టిన గుర్రములను బలంగా కొట్టారు. అవి రక్తం కక్కుకున్నాయి. కిందపడి మరణించాయి. తరువాత ఆ నలుగురు వానర వీరులు ఇంద్రజిత్తు ఎక్కిన రథమును ముక్కలు ముక్కలుగా విరుగ గొట్టారు. మరలా వెనక్కు ఎగిరి లక్ష్మణుని పక్కన నిలబడ్డారు. ఇదంతా క్షణాలలో జరిగిపోయింది.

ఆ వానర వీరుల వేగానికి ఇంద్రజిత్తు ఆశ్చర్యపోయాడు. విరిగిన రథము నుండి కిందికి దుమికి వేగంగా బాణములు విసురుతూ లక్ష్మణుని మీదికి వెళ్లాడు ఇంద్రజిత్తు. ఇంద్రజిత్తు తన మీద సంధిస్తున్న బాణములను మధ్యలోనే ఖండిస్తూ, ఇంద్రజిత్తును ముందుకు రాకుండా కట్టడి చేస్తున్నాడు లక్ష్మణుడు.

ఓమద్రామాయణము

యుద్ధకాండము ఎనభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము

తొంభయ్యవ సర్గ.

రథం విరిగిపోయింది. గుర్రములు నేలకూలాయి. ఒంటరిగా నేలమీద నిలబడి ఉన్నాడు ఇంద్రజిత్తు. అయినా తన ధైర్యాన్ని

కోల్పోలేదు. లక్ష్మణుని మీదికి బాణాలు వదులుతున్నాడు. ఇద్దరూ నేల మీద నిలబడి ఒకరి మీద ఒకరు బాణములు సంధించుకుంటున్నారు. రెండు మత్తగజముల మాదిరి పోరాడుతున్నారు. వీరిని చూచి వానరులు, రాక్షసులుకూడా ఒకరితో ఒకరు పోరాడుతూ చంపుకుంటున్నారు.

ఇంద్రజిత్తు రాక్షస వీరులతో ఇలా అన్నాడు. "చీకటి పడుతూ ఉంది. ఈ చీకట్లో ఎవరెవరో తెలియడం లేదు. మీరు పోరాడుతూ ఉండండి. నేను లంకా నగరములోకి వెళ్లి  మరొక రథమును ఎక్కి వస్తాను. అప్పటి వరకూ నేను ఇక్కడ లేనట్టు తెలియనీయకండి. వానరులు నా వెంటపడకుండా చూడండి. " అని అన్నాడు.

వెంటనే  ఇంద్రజిత్తు రాక్షసులను అడ్డం పెట్టుకొని వెనక నుండి లంకా నగరం వైపు వెళ్లాడు. ఇంద్రజిత్తు రాగానే మరొక రథాన్ని సిద్ధం చేసారు సైనికులు. రథం నిండా ధనుస్సులు, బాణములు, ఆయుధములు పెట్టారు. ఉత్తమ  జాతి గుర్రములను కట్టారు. ఆ రథమును ఎక్కి మరలా యుద్ధరంగమునకు వచ్చాడు ఇంద్రజిత్తు. కనుమూసి తెరిచేంతలో మరొక రథముమీద ప్రత్యక్షం అయిన ఇంద్రజిత్తును చూచి, అతని వేగానికి  లక్ష్మణుడు, విభీషణుడు, వానర వీరులు ఆశ్చర్యపోయారు.

రెట్టించిన ఉత్సాహంతో రణరంగమునకు వచ్చి ఇంద్రజిత్తు తన బాణములతో వానరులను నిర్దాక్షిణ్యంగా చంపుతున్నాడు. వేల కొలదీ వానరులు ఇంద్రజిత్తు బాణాలకు బలి అవుతున్నారు.  ఇంద్రజిత్తు పరాక్రమానికి తట్టుకోలేక వానర వీరులు లక్ష్మణుని వద్దకు వచ్చారు.

ఇంక లాభం లేదని, లక్ష్మణుడు ఇంద్రజిత్తు ధనుస్సును విరగ్గొట్టాడు. ఇంద్రజిత్తు మరొక ధనుస్సును తీసుకున్నాడు. వెంటనే లక్ష్మణుడు ఆ ధనుస్సును కూడా మూడు బాణములతో విరిచాడు. ఇంద్రజిత్తు మరొక ధనుస్సును తీసుకొనే లోపల లక్ష్మణుడు ఐదుబాణములను ఇంద్రజిత్తు గుండెలకు గురిచూచి కొట్టాడు. ఆ బాణములు ఇంద్రజిత్తు గుండెల్లో లోతుగా గుచ్చుకున్నాయి. ముఖం నుండి గుండెల నుండీ రక్తం కారుతూ ఉంది.

అలాగే మరొక ధనుస్సును తీసుకున్నాడు ఇంద్రజిత్తు. లక్ష్మణుడి మీద శరవర్షము కురిపించాడు. లక్షణుడు ఆ బాణముల నన్నిటినీ మధ్యలోనే విరిచాడు. లక్ష్మణుడు విజృంభించాడు. వాడి అయిన బాణములతో రాక్షసులను, ఇంద్రజిత్తును కొట్టాడు. ఇంద్రజిత్తు కూడా వాడిగా ఉన్న బాణములను లక్ష్మణుడి మీద ప్రయోగించాడు. ఆ బాణములను మధ్యలోనే ఛేదించిన లక్ష్మణుడు, ఒక భల్లబాణముతో ఇంద్రజిత్తు సారథి తలను ఖండించాడు. సారథి మరణించినా కూడా ఇంద్రజిత్తు రథమునకు కట్టిన గుర్రములు ఏ మాత్రమూ కంగారు పడలేదు. సారథి ఉన్నట్టే పరుగెడుతున్నాయి. అది చూచిన లక్ష్మణుడు, ఇంద్రజిత్తు రథమునకు కట్టిన గుర్రములను కూడా కొట్టాడు.

ఇది చూచి సహించలేని ఇంద్రజిత్తు లక్ష్మణుని గుండెలకు గురిపెట్టి పది బాణములను కొట్టాడు. ఆ బాణములు లక్ష్మణుని కవచమునకు తగిలి కిందపడిపోయాయి. లక్ష్మణుడు ధరించిన కవచము దుర్భేద్యము అని ఇంద్రజిత్తుకు అర్థం అయింది. ఇంద్రజిత్తు మూడుబాణములను లక్ష్మణుడి నుదుటికి గురిపెట్టి కొట్టాడు. దానికి ప్రతిగా లక్ష్మణుడు ఇంద్రజిత్తు ముఖాన్ని గురి చూచి ఐదు బాణములను

కొట్టాడు. ఈ ప్రకారంగా లక్ష్మణుడు, ఇంద్రజిత్తు ఒకరిమీద ఒకరు వాడి అయిన బాణములను సంధించుకుంటున్నారు. ఇద్దరిశరీరములు రక్తసిక్తములు అయ్యాయి.

ఇదంతా విభీషణుని వలన వచ్చినదన్న కోపంతో ఇంద్రజిత్తు విభీషణుని మీద వాడిఅయిన బాణములను ప్రయోగించాడు. విభీషణుడికి కోపం వచ్చింది. ఒక గద తీసుకొని ఇంద్రజిత్తు రథమునకు కట్టిన గుర్రములను చంపాడు. అసలే సారథి లేడు. ఇప్పుడు గుర్రములు కూడా లేవు. అందుకని ఇంద్రజిత్తు రథమును దిగాడు. నేల మీద నిలబడ్డాడు. యముడు తనకు ఇచ్చిన దివ్యమైన అస్త్రమును సంధించాడు. అది చూచిన లక్ష్మణుడు కుబేరుడు తనకు ఇచ్చిన దివ్యాస్త్రమును సంధించాడు.

లక్ష్మణుడు, ఇంద్రజిత్తు ఒకరి మీద ఒకరు దివ్యాస్త్రములను ప్రయోగించుకున్నారు. ఆ రెండు అస్త్రములు ఒకదానితో ఒకటి ఢీకొని అగ్ని కణములు రాలాయి. రెండు అస్త్రములు ముక్కలై కిందపడ్డాయి. లక్ష్మణుడు ఇంద్రజిత్తు మీద వారుణాస్త్రమును ప్రయోగించాడు. ఇంద్రజిత్తు రౌద్రాస్త్రమును లక్ష్మణుడి మీద ప్రయోగించాడు. రౌద్రాస్త్రము వారుణాస్త్రమును కొట్టేసింది. తరువాత ఇంద్రజిత్తు లక్ష్మణుని మీద ఆగ్నేయాస్త్రమును ప్రయోగించాడు. వెంటనే లక్ష్మణుడు సూర్య అస్త్రమును ప్రయోగించి ఆగ్నేయాస్త్రమును నిర్వీర్యము చేసాడు.

ఇంద్రజిత్తుకు కోపం వచ్చింది. వెంటనే అసుర బాణమును ప్రయోగించాడు. ఆ అసుర బాణము నుండి అసంఖ్యాకంగా వివిధ రకములైన ఆయుధములు పుట్టాయి. ఆ ఆయుధములు అన్నీ లక్ష్మణుని

వైపుకు దూసుకొని వస్తున్నాయి. అది చూచిన లక్ష్మణుడు మహేశ్వర అస్త్రమును ప్రయోగించి అసుర అస్త్రమును నివారించాడు. ఇరువురి మధ్య జరుగుతున్న ఈ అస్త్రయుద్ధము లోక వినాశకరంగా పరిణమించింది. ఆ అస్త్రముల తాకిడికి ఆకాశం అంతా కాంతితో నిండిపోయింది.

తరువాత లక్ష్మణుడు అగ్నితో సమానమైన మరొక అస్త్రమును సంధించాడు. దాని పేరు ఇంద్ర అస్త్రము. ఆ అస్త్రముతోనే పూర్వము దేవాసుర యుద్ధములో ఇంద్రుడు దానవులను జయించాడు. ఆ ఇంద్రఅస్త్రమును సంధించి లక్ష్మణుడు ఇలా అన్నాడు. "ఓ దివ్యాస్త్రమా!రాముడు, దశరథుని కుమారుడు,  సత్యసంధుడు, ధర్మాత్ముడు, పరాక్రమవంతుడు, పౌరుషవంతుడు అయితే నీవు ఇంద్రజిత్తును చంపు." అని ధనుస్సును చెవిదాకా లాగి,  ఇంద్ర అస్త్రమును వదిలాడు. ఆ ఇంద్రఅస్త్రమును వాయువేగంతో వెళ్లి, కిరీటము, కుండలములతో శోభాయమానంగాఉన్న ఇంద్రజిత్తు తలను మొండెము నుండి వేరు చేసింది. ఇంద్రజిత్తు తల నేలమీద దొర్లింది. ఇంద్రునే జయించిన ఇంద్రజిత్తు ఇంద్ర అస్త్రముతో మరణించాడు. ఇంద్రజిత్తు శరీరము చేతిలో ధనుస్సుతోసహా నేలకూలింది.

ఆ దృశ్యము చూచి వానరులు సంతోషంతో కేరింతలు కొట్టారు. ఆకాశం నుండి దేవతలు, ఋషులు, గంధర్వులు జయజయధ్వానాలు చేసారు. ఇంద్రజిత్తు మరణించడం చూచిన రాక్షస సేనలు తలొక దిక్కుగా పారిపోయాయి. చేతిలో ఆయుధములు ఉంటే వానరులు చంపుతారేమోఅని ఆయుధములను పారవేసి పారిపోయారు రాక్షసులు. వారిని వానరులు తరిమారు. కొంత మంది

రాక్షసులు సముద్రంలో దూకారు. కొంతమంది లంకానగరంలోకి పారిపోయారు. మరి కొందరు రాక్షసులు చెట్లు ఎక్కారు. కొందరు పర్వతగుహల్లోకి దూరారు. అప్పటి దాకా వేలకొలది రాక్షసులతో నిండుగా ఉన్న రణభూమిలో ఒక్క రాక్షసుడు కూడా కనిపించడం లేదు.

వానర సేనానాయకులు లక్ష్మణుని అభినందనలతో ముంచెత్తారు. విభీషణుడు, హనుమంతుడు, జాంబవంతుడు, లక్ష్మణుని ప్రశంసలతో ముంచెత్తారు. వానరులంతా పెద్దగా అరుస్తూ సింహనాదాలు చేస్తూ లక్ష్మణుని చుట్టుచేరారు. వానరులు వారిలో వారు ఒకరిని ఒకరు కౌగలించుకొని ప్రశంసించుకుంటున్నారు. ఆకాశంలో ఉన్న దేవతలు కూడా ఇంద్రజిత్తు మరణానికి ఎంతో సంతోషించారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము తొంభయ్యవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
తొంభై ఒకటవ సర్గ.

తన అవక్రపరాక్రమంతో ఇంద్రజిత్తును చంపిన లక్ష్మణుడు తన కన్నా పెద్దవారైన జాంబవంతునికి, హనుమంతునికి, వానరులకు నమస్కరించాడు. బాగా గాయపడ్డ లక్ష్మణుడు హనుమంతుని ఊతగా పట్టుకొని రాముని వద్దకు వెళ్లాడు. రామునికి నమస్కరించి

వినయంగా పక్కన నిలబడ్డాడు లక్ష్మణుడు.

విభీషణుడు రామునితో “ఇంద్రజిత్తు తల మన లక్ష్మణుని చేత ఖండింపబడినది” అని చెప్పాడు. అప్పటికే బాగా అలసి ఉన్న లక్ష్మణుడు  తాను ఇంద్రజిత్తును ఎలా సంహరించింది రామునితో వివరంగా చెప్పాడు. అప్పుడు రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు.

“తమ్ముడా లక్ష్మణా! నీ విజయ వార్త విని చాలా సంతోషించాను. నాకు కూడా వల్ల కాని పనిని నీవు సునాయాసంగా ముగించావు. ఇంద్రజిత్తు మరణంతో మనమార్గము సుగమము అయింది. ఇంక రావణుని జయించడం చాలా తేలిక. ఎందు కంటే ఇంద్రజిత్తు చావడం అంటే రావణుడు కూడా చచ్చినట్టే. ఇంద్రజిత్తు చావుతో రావణునికి కుడిభుజము ఖండించినట్టు అయింది. నీ ఈ విజయానికి విభీషణుడు, హనుమంతుడు కూడా చాలా సాయం చేసారు. వారి సాయం లేకపోతే ఇంద్రజిత్తును చంపడం కష్టం. తన కుమారుని మరణ వార్త విని రావణుడు తానే స్వయంగా యుద్ధానికి వస్తాడు. పుత్రశోకంతో కుంగి ఉన్న రావణుని చంపడం చాలాతేలిక. నీ వంటి తమ్ముడు నా పక్కన ఉంటే నేను ఒక్కసీతనే కాదు దేనినైనా సాధించగలను.”అని అన్నాడు.

తరువాత లక్ష్మణుని గాఢంగా కౌగలించుకొని వాత్సల్యంతో లక్ష్మణుని  శిరమును ముద్దుపెట్టుకొని తన పక్కనే కూర్చోపెట్టుకున్నాడు రాముడు. లక్ష్మణుని శరీరం నిండా బాణములు గుచ్చుకొని చాలా బాధపెడుతున్నాయి. వెంటనే సుషేణుడిని పిలిచి లక్ష్మణునికి త్వరగా

చికిత్సచేయించమని ఆదేశించాడు.

"వెంటనే లక్ష్మణుని, విభీషణుని శరీరములలో గుచ్చుకున్న బాణములను తొలగించండి. గాయములకు చికిత్సచేయండి. వీరికే కాదు ఈ యుద్ధములో గాయపడ్డ వానరులందరికీ చికిత్స చేయించండి." అని సుషేణుని ఆజ్ఞాపించాడు. వెంటనే సుషేణుడు లక్ష్మణుని ముక్కు ద్వారా ఒక ఔషధమును లోపలకు పంపాడు ఆ ఔషధ ప్రభావంతో లక్ష్మణుని శరీరంలో గుచ్చుకున్న బాణములు అన్నీ ఊడి కిందపడ్డాయి. గాయములు మానాయి. నొప్పికూడా తగ్గిపోయింది. తరువాత సుషేణుడు విభీషణునికి తక్కిన వానరులకు కూడా చికిత్సచేసాడు. కొద్దికాలంలోనే వారందరూ నొప్పి తగ్గి, గాయములు మాని, స్వస్థత పొందారు.

లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్తు మరణించాడు అన్న విషయం విన్న సుగ్రీవుని ఆనందానికి అవధులు లేవు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము తొంభైఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## తొంభై రెండవ సర్గ.

ఇక్కడ పరిస్థితి ఇలా ఉంటే రాక్షసులనుండి ఇంద్రజిత్తు మరణించాడు అన్న వార్త తెలుసుకున్న రావణుని మంత్రులు ఈ

విషయాన్ని ధృవపరచుకున్న తరువాత, రావణుని వద్దకు పోయి ఇంద్రజిత్తుమరణాన్ని గురించి చెప్పారు.

"ఓ రాక్షసేంద్రా! నీ తమ్ముడు విభీషణుని సాయం చేత, లక్ష్మణుడు నీ కుమారుడు ఇంద్రజిత్తును మా కళ్ల ఎదుట చంపాడు. దేవతలకు అధిపతి అయిన ఇంద్రుని జయించిన ఇంద్రజిత్తు ఒక సాధారణమానవుని చేతిలో వీరగతిపొంది వీరస్వర్గము చేరుకున్నాడు." అని చెప్పారు.

దారుణమైన ఆవార్త విన్న రావణుడు మూర్ఛపోయాడు. కాసేపటికి స్పృహలోకి వచ్చాడు. వీరుడైన పుత్రుని కొరకు కన్నీరు మున్నీరుగా శోకిస్తున్నాడు. "ఓ మహావీరా! ఇంద్రునే జయించిన నీవు ఒక సాధారణ మానవుని చేతిలో ఎలా ఓడిపోయావు? యముడిని కూడా జయించగల నీవు లక్ష్మణుని జయించలేకపోయావా! మృత్యువుకే మృత్యువు అయిన నీకు మృత్యువు కల్పించిన ఆ యముడు నిశ్చయముగా నీ కన్నా గొప్పవాడు. నీవు, నీ ప్రభువు అయిన నా కొరకు, యుద్ధములో నీ ప్రాణాలుఅర్పించావు. నీకు వీరస్వర్గము ప్రాప్తిస్తుంది. నాయనా! మేఘనాధా! నీ కొరకు అంత:పుర స్త్రీలు ఎలా విలపిస్తున్నారో చూడు. నీ మరణంతో దేవతలు, గంధర్వులు భయంలేకుండా సుఖంగా జీవిస్తారులే! నా కుమారా! నీ తండ్రిని, తల్లిని, ఈ రాజ్యమును, రాక్షసులను విడిచి పెట్టి ఎక్కడకు వెళ్లావురా! వెళ్లడానికి నీకు ఎలా మనసొప్పిందిరా! తండ్రిమరణించిన తరువాత, పితృకార్యములు చేయవలసిన వాడవు, నీ అపర కర్మలు నేను చేయవలసి వచ్చినది కదా! ఎంత దురదృష్టము! రామలక్ష్మణులను, సుగ్రీవుని చంపి నాకు

శత్రుభయం లేకుండా చేస్తానని అని ప్రతిజ్ఞచేసావు కదా!. కాని ఆ ప్రతిజ్ఞను నెరవేర్చకుండానే వెళ్లిపోయావుకదా!" అని పరి పరి విధాలా దు:ఖిస్తున్నాడు రావణుడు.

రావణునికి ఆ దు:ఖంలో నుండి కోపం ఆవిర్భవించింది. అసలే రావణుడు మహా కోపిష్టి. దానికి తోడు కుమారుని మరణ వార్త విన్నాడు. రావణుని కోపం మిన్నుముట్టింది. తన కుమారుని చావుకు కారణం అయిన వారిమీద పగ తీర్చుకోవాలని శపథం చేసాడు. తన కుమారుని మరణానికి కారణం సీత. ముందుగా సీతను చంపాలి అని అనుకున్నాడు రావణుడు. కోపంతో రావణుని కళ్లు ఎరుపెక్కాయి. కళ్లనుండి నిప్పులురాలుతున్నట్టు ఉన్నాయి. పళ్లు పటాపటా కొరికాడు. ఆ విధంగా కోపంతో ఊగి పోతున్న రావణుని చూచి రాక్షసులు భయంతో పక్కకు ఒదిగి ఒదిగినిలబడ్డారు. వారిని చూచి రావణుడు ఇలా అన్నాడు.

"నేను బ్రహ్మ దేవుని గూర్చి తపస్సు చేసాను. వరములు పొందాను. ఆ వరప్రభావంతో నాకు దేవతల నుండి కానీ, అసురుల నుండి కానీ ప్రాణ భయము లేదు. నాకు బ్రహ్మదేవుడు ఇచ్చిన కవచమును ఇంద్రుని వజ్రాయుధము కూడా బద్దలు కొట్టలేదు. నేను ఆ కవచము ధరించి యుద్ధభూమిలో నిలబడితే గెలవడం ఆ దేవేంద్రుని తరం కూడా కాదు. నా పరాక్రమానికి మెచ్చిన బ్రహ్మదేవుడు దివ్యమైన ధనుర్బాణములను ప్రసాదించాడు. వాటిని ఉపయోగించే అవసరం ఇంతవరకూ రాలేదు. ఇప్పుడు రామలక్ష్మణులను చంపడానికి వాటిని ఉపయోగిస్తాను. వాటిని పూజాగృహమునుండి తీసుకొని రండి. " అని ఆదేశించాడు.

ఇంతలో రావణుని బుద్ధికి మరొక ఆలోచనవచ్చింది. దీని కంతటికీ కారణం సీత. సీతను వెంటనే చంపాలి అనిఅనుకున్నాడు. వెంటనే రాక్షసులను చూచి ఇలా అన్నాడు. "నా కుమారుడైన ఇంద్రజిత్తు వానరులను మోసం చేయడానికి మాయాసీతను రణభూమికి తీసుకొని పోయి వానరుల ఎదుట వధించాడు. ఇప్పుడు నా కుమారుడే వధింపబడ్డాడు. నా కుమారుడే లేనపుడు నాకు సీత ఎందుకు. నా కుమారునికి ఇష్టం అయిన సీత వధను నేను చేసి చూపిస్తాను. సీతను కసిదీరా వధిస్తాను. ." అని చేతిలో ఖడ్గం ధరించి బయలుదేరాడు రావణుడు.

రావణుని చూచి రాక్షసులు సింహనాదములు చేసారు. వారిలో వారు ఇలా అనుకున్నారు. "ఇప్పుడు రావణుని చూచి రామలక్ష్మణులు భయంతో వణికిపోతారు. వానరులు పారిపోతారు. రావణునికి ముల్లోకములలో ఎదురు లేదు. తనకు కావలసిన దానిని అనుభవించగలడు. ఈ సీత ఎంత." అని అనుకొన్నారు. కాని కొంతమంది రావణుని మేలుగోరుస్నేహితులు అతనిని వారించారు. కాని రావణుడు వారిని లక్ష్యపెట్టలేదు. సీత ఉన్న చోటికి వెళుతున్నాడు. అశోక వనంలో ప్రవేశించాడు.

చేతిలో ఖడ్గం పట్టుకొని తన వంక వేగంగా వస్తున్న రావణుని చూచింది సీత. భయంతో వణికి పోయింది. "ఈ దుర్మార్గుడు నా మీద కోపంతో నన్ను చంపడానికి  వస్తున్నాడు. ఇన్నిరోజులు నన్ను "నాకు భార్యవు కా" అని అడిగాడు. నేను వ్యతిరేకించాను. ఇన్నాళ్లు వేచి ఉన్న వీడు, విసుగుపుట్టి నన్ను చంపాలని నిశ్చయించుకున్నట్టున్నాడు. లేదా ఈ రోజుయుద్ధములో వీడు

రామలక్ష్మణులను చంపి ఉంటాడు. ఆవిషయాన్ని నాకుచెప్పడానికి వస్తున్నాడు. ఎందుకంటే రామలక్ష్మణుల మరణ వార్త విన్న, రాక్షసులు పెద్దగా అరవడం కేరింతలుకొట్టడం, హర్షధ్వానాలు చెయ్యడం వినపడుతూ ఉంది. నామూలంగా రామలక్ష్మణులు తమ ప్రాణాలు ఈ దుర్మార్గుడిచేతిలో పోగొట్టుకున్నారుకదా!

అదీ కాదేమో! రామలక్ష్మణులు వీడికుమారుడు ఇంద్రజిత్తును చంపితే, ఆ దు:ఖాన్ని తట్టుకోలేక నన్ను చంపడానికి వస్తున్నాడేమో! ఏదైనా కావచ్చు. ఆ నాడు హనుమంతుని మాట విని ఆయన వీపుమీద కూర్చుని కిష్కింధకు వెళ్లి ఉంటే, రామలక్ష్మణులకు ఇన్ని కష్టాలురావు కదా! నాక ఇంత దు:ఖము ఉండేది కాదు కదా! ఎంత పొరపాటు చేసాను. యుద్ధములో రాముడు మరణించాడు అన్న వార్త విన్న కౌసల్య గుండెలు బద్దలు కాక మానుతాయా! రాముడి బాల్య చేష్టలను, రాముని గుణగణాలను తలచుకుంటూ ఆమె కుమిలిపోతుంది కదా! కుమారుని మరణవార్త విన్న కౌసల్య ప్రాణత్యాగం చేసుకుంటుంది. అసలు దీని కంతటికీ మూలకారణం ఆ గూనిది మంథర. దాని వలననే మాకు ఇన్నికష్టాలు వచ్చాయి." ఈ ప్రకారంగా సీత ఒకదానితో ఒకటి పొంతన లేకుండా వస్తున్న ఆలోచనలతో సతమతమవుతూ ఉంది.

ఆ సమయంలో రావణుని మంత్రి అయిన సుపార్శ్వుడు రావణుని వద్దకు వచ్చాడు. రావణునితో ఇలా అన్నాడు. "రావణా! నీవు సామాన్యుడికి కావు. సాక్షాత్తు కుబేరుని సోదరుడవు. తాత్కాలికంగా వచ్చిన కోపంతో సీతను చంపాలనుకోవడం తగునా! ఈ విధంగా చంపడానికేనా నీవు సీతను తీసుకొని వచ్చింది. నీవు వేదములను, శాస్త్రములను చదువుకున్నావు. ఆ వేదాధ్యయనము, శాస్త్రపరిజ్ఞానము

అంతా ఎక్కడికి పోయింది. ఇంతటి నీచ కార్యానికి ఒడిగడుతున్నావు. నీ పరాక్రమాన్ని రాముని మీద చూపించు అంతే గానీ అబల అయిన సీతను చంపడం పరాక్రమం అనిపించుకోదు. రాక్షసేంద్రా! ఈ రోజు కృష్ణ చతుర్దశి. రేపు అమావాస్య. ఈ రోజే రాముని మీదికి యుద్ధానికి బయలు దేరు, అమావాస్యనాడు రామునికి మరణాన్ని ప్రసాదించు. విజయుడివై తిరిగి రా! నీవు వీరుడివి, శూరుడివి అయితే రాముని చంపి సీతను పొందు. అంతేకానీ సీతను చంపితే ఏమి లాభం." అని అనునయించాడు.

రావణుడికి అతనిమాటలు బాగా నచ్చాయి. సీతను చంపేకార్యక్రమాన్ని వదిలిపెట్టి యుద్ధతంత్రములను ఆలోచించడానికి సభకు వెళ్లాడు రావణుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము తొంభైరెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
తొంభైమూడవ సర్గ.

సీతను చంపడం అనే కార్యక్రమాన్ని విరమించిన రావణుడు తిరిగి తన సభాభవనంలో అడుగు పెట్టాడు. ఒక పక్క దు:ఖము మరొక పక్కకోపము, ఏమిచెయ్యాలో తోచని పరిస్థితుల్లో బుసలుకొడుతున్నాడు రావణుడు. అంతలోనే నిట్టూరుస్తున్నాడు. రావణుడు ఏమి చెబుతాడా అని చావగా మిగిలినసేనానాయకులు

ఎదురు చూస్తున్నారు. వారికి నమస్కరించి ఇలా చెప్పసాగాడు రావణుడు.

"మనం ఆఖరి పోరాటం సాగించాలి. మీరందరూ యుద్ధానికి సన్నద్ధులై మీ మీ సైన్యములతో యుద్ధభూమికి రండి. మీ పని ఒక్కటే. రాముని చుట్టుముట్టడం.చంపడం. కేవలం రాముని చంపడం. మిగిలిన వారి సంగతి మీకు అనవసరం. రాముడు చావాలి. అదే నాకు కావాలి. లేకపోతే మరొక పని చేయండి. మీరు ఈ రోజంతా రాముని తో యుద్ధము చేసి రాముని ఘోరంగా గాయముల పాలు చేయండి. రాముడు అలసిపోవాలి. గాయములతో తల్లడిల్లిపోవాలి. రేపు నేను రామునితో యుద్ధము చేసి అవలీలగా చంపేస్తాను. ఏదో ఒకటి చెయ్యండి." అని అన్నాడు రావణుడు.

రావణుని ఆదేశము మేరకు సైన్యాధిపతులు అందరూ తమ తమ సేనలతో యుద్ధభూమికి వెళ్లారు. రాక్షస సేనలు వానరుల మీదికి బాణములను, పరిఘలను, కత్తులను, గొడ్డళ్లను విసురుతున్నారు. వానరులు వృక్షములను బండరాళ్లను, పర్వతశిఖరములను విసురుతున్నారు. రాక్షసులకు వానరులకు ఘోరంగా యుద్ధం జరుగుతూ ఉంది. రక్తం వరదగా ప్రవహిస్తూ ఉంది. వానరులు ఆకాశంలో ఎగురుతూ రాక్షసుల రథముల మీద ధ్వజములను విరగ్గొడుతున్నారు. రాక్షసుల కవచములను, రథములను విరగ్గొడుతున్నారు. అశ్వములను చంపుతున్నారు. చేతికి దొరికిన రాక్షసుల ముక్కులను చెవులను కొరుకుతున్నారు. వాడి అయిన గోళ్లతో రక్కుతున్నారు. ఒక్కొక్క రాక్షసుని నూరుగురు వానరములు పంచుకొని చంపుతున్నారు.

రాక్షసులు కూడా తమ దగ్గరగా వచ్చిన వానరములను గదలతోనూ, గొడ్డళ్లతోనూ కొట్టి చంపుతున్నారు. కొన్ని వానరములు పోయి రాముని శరణువేడాయి. వారికి అండగా రాముడు రాక్షస సేనల మీద బాణములను వర్షముగా కురిపించాడు. రాముని బాణముల ధాటికి తట్టుకోలేక రాక్షస సేనలు వెనక్కు మరలాయి. రాముని బాణముల దెబ్బకు రాక్షసుల రథములు విరుగుతున్నాయి. కవచములు పగులుతున్నాయి. అశ్వములు చస్తున్నాయి. సారథులు నేలకూలుతున్నారు.

రాక్షస నాయకులకు ఎవరికీ రాముని ఎదుట పడటానికి సాహసం లేకపోయింది. రణభూమి అంతా తానే అయి రాముడు రాక్షసులను చంపుతున్నాడు. అడుగో అక్కడ రాముడు గజసేనను చంపుతున్నాడు అని కొంతమంది రాక్షసులు అరిస్తే, ఇడుగో రాముడు ఇక్కడ ఉన్న అశ్వసేనలను నాశనం చేసున్నాడు అని అరుస్తున్నారు. ఎవరికి వారు రాముడు తమ ఎదుటనే ఉండియుద్ధం చేస్తున్నాడు అని భ్రమపడుతున్నారు. రాముడు రాక్షస సేనల మీద గాంధర్వాస్త్రమును ప్రయోగించాడు. ఆ అస్త్రప్రభావం చేత రాముడు రాక్షసులందరికీ వేలకొద్ది రాముడులు గా కనపడుతున్నాడు. ఎవరికి వారే రాముడు తమ ముందే ఉన్నట్టు అనుకుంటున్నారు.

నిరంతరము బాణములను సంధిస్తున్న రాముని ధనుస్సు వలయాకారంలో, మృత్యు చక్రము వలె  కనపడుతూ ఉంది. రాముడు ఎప్పుడు బాణము సంధిస్తున్నాడో, ఎప్పుడు నారి లాగుతున్నాడో ఎప్పుడు బాణము వదులుతున్నాడో ఎవరికీ తెలియడం లేదు. రాముని విల్లు నుండి వెలుబడిన బాణములు మాత్రము అగ్నిజ్వాలల మాదిరి

దూసుకుపోతున్నాయి. రాముడు ఒక జాము కాలములో పదివేల రథాలను విరిచాడు, పదునెనిమిది వేల ఏనుగులను, పదునాలుగు వేల గుర్రములను, రెండు లక్షల మంది రాక్షస సైనికులను చంపాడు. చావగా మిగిలిన రాక్షసులు రాముని ఎదుట పడలేక లంకానగరం వైపు పారిపోయారు. రణభూమి రుద్ర భూమిలాగా తయారయింది.

అప్పుడు రాముడు విభీషణుని, లక్ష్మణుని, సుగ్రీవుని చూచి "ఈ దివ్యాస్త్ర ప్రయోగము నాకు, ఈశ్వరునికి మాత్రమే తెలుసు." అని చెప్పాడు. రాముని దివ్యాస్త్రప్రయోగమునకు, విభీషణుడు, సుగ్రీవుడు, వానరులు అందరూ రాముని ప్రశంసలతో ముంచెత్తారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము తొంభైమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## తొంభైనాలుగవ సర్గ.

ఆ రోజు మరణించి నంతగా రాక్షసులు ఏ రోజూ మరణించలేదు. చావగా మిగిలిన రాక్షసులు లంకా నగరమునకు పోయి చచ్చిన వారి బంధువులకు వారి మరణవార్త చెప్పారు. మరణించిన సైనికుల భార్యలు, తల్లులు, తండ్రులు, కుమారులు, బంధువులు, మిత్రులు అందరూ ఎంతగానో విలపించారు. వారంతా ఈ యుద్ధమునకు కారణములను ఎవరికి తోచినట్టు వారు అనుకుంటున్నారు.

ఆ ముసలి శూర్పణఖ, ఆ కురూపి శూర్పణఖ, ఒక మూల కూర్చోకుండా తగుదునమ్మా అని రాముని వద్దకు ఎందుకు వెళ్లాలి? రాముని ఎందుకు మోహించాలి? మంచి వాడైన రాముని మీద దానికి ఎందుకు మోహం పుట్టిందో? దానికి పుట్టిన దుర్బుద్ధి వలన కదా ఖరదూషణులు, 14,000 వేలమంది రాక్షసులు జనస్థానములో మరణించినది. దానిచావు అది చచ్చింది. అంతటితో ఊరుకోకుండా రావణుని వద్దకు వచ్చి లేని పోని మాటలు చెప్పడం ఎందుకు? రావణుడు పోయి సీతను అపహరించి తీసుకు రావడం ఎందుకు? రావణుడు తన చావు తాను కొని తెచ్చుకోవడమే కాకుండా, లంకా నగరంలో ఉన్న రాక్షసుల చావుకు కూడా కారణం అయ్యాడు. రామణుడికి సీత దక్కలేదు కానీ, రాముడితో వైరం మాత్రం దక్కింది.

సీతను పట్టుకున్న విరాధుడి చావు చూచి కూడా రావణుడు సీతను తాకడం ఏమిటి? ఈ నిదర్శనం చాలదా రామునితో వైరం ఎంత వినాశకరమైనదో!

జనస్థానములో రాముడి చేతిలో, 14,000రాక్షసులు, ఖరుడు, దూషణుడు, త్రిశిరస్సు, వారి సేనానాయకులు చచ్చారు కదా! ఈ నిదర్శనము చాలదా!

ఇంకా రావణుడు బుద్ధిలేకుండా సీతను అపహరించడం ఏమిటి? రాముడు సామాన్యుడా! అరణ్యములో కబంధుని చంపాడు. ఇక్కడ ఇంద్రజిత్తును చంపాడు. ఈ నిదర్శనము చాలదా రామునితో వైరం ఎంత ప్రమాదకరమో!

అదీకాకుండా ఇంద్రుని కొడుకు, మహా బలవంతుడు అయిన  వాలిని రాముడు అవలీలగా చంపాడు.  ఈ నిదర్శనము చాలదా!

సుగ్రీవునితో మైత్రి చేసి, వాలిని చంపి, సుగ్రీవుని కిష్కింధకు రాజును చేసాడు. ఈ నిదర్శనం చాలదా!

సీతను రామునికి ఇచ్చి వేసి, లంకను కాపాడమని విభీషణుడు ఎన్నోసార్లు చెప్పాడు. కాని మూర్ఖుడైన  రావణుడు వినలేదు. విభీషణుడు చెప్పిన మాటలను విని ఉంటే లంక ఈ నాడు శ్మశానంగా మారేది కాదు. కనీసము కుంభకర్ణుని చావుతో నైనా ఇంద్రజిత్తు చావుతో నైనా రావణునికి జ్ఞానోదయం కలగలేదు. మరలా ఈ రోజు కూడా యుద్ధం చేసి రాక్షసులకు అపార ప్రాణనష్టం కలుగచేసాడు." అని రాక్షస స్త్రీలు రావణుని మూర్ఖత్వం గురించి పరిపరి విధాలుగా అనుకుంటున్నారు.

నాకొడుకుపోయాడని ఒకామె, నా భర్త పోయాడని ఒకామె, నాసోదరులు మరణించారని ఒకామె ఏడుస్తున్నారు. మరి కొంత మంది రాక్షసులు,  విష్ణువో, ఇంద్రుడో,రుద్రుడో రాముని రూపంలో వచ్చి రాక్షసులను చంపుతున్నాడు అని అనుకుంటున్నారు.

"ఎవరు చంపినా నష్టం మనకే కదా కలిగింది. భర్తలను, కుమారులను, సోదరులను, బంధువులను,మిత్రులను పోగొట్టుకొని అనాధలము అయ్యాయు" అని ఆక్రోశిస్తున్నారు.

"రావణుడు తనకు బ్రహ్మ ఇచ్చిన వరములు ఉన్నాయి అని విర్రవీగుతున్నాడు కానీ, రాముని పరాక్రమం గురించి, రాముని వలన తనకు పట్టిన భయం గురించి, తెలుసుకోలేకపోతున్నాడు." అని మరి కొంతమంది అభిప్రాయపడుతున్నారు.

"రాముడి ఎదుట పడిన వాడు, వాడు రాక్షసుడైనా, అసురుడైనా, దానవుడైనా, పిశాచి అయినా, బతికి బయటపడటం కష్టం." అని అనుకుంటున్నారు.

"కనీసం యుద్ధానికి వెళ్లేటప్పుడు కనిపించిన అపశకునములను, దుశ్శకునములను చూచి అయినా రాముడు యుద్ధమును విరమించి ఉంటే బాగుండేది" అని శకున శాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు.

"రావణుడు ఎంత గర్విష్టి, తెలివితక్కువాడు కాకపోతే, దేవ,దానవ,గంధర్వ,యక్షుల నుండి మరణం సంభవించకుండా వరం కోరినవాడు, మానవులను ఎందుకు వదిలేసాడు. అదే ఇప్పుడు రావణుని కొంపముంచింది." అని వాపోతున్నారు.

"అది కాదు. నాకు తెలియక అడుగుతాను! బ్రహ్మవలన వరాలు పొందినంత మాత్రాన, దేవతలను, సత్పురుషులను బాధించాలని, చంపాలని, వారి యజ్ఞములు భగ్నం చెయ్యాలని లేదుకదా! అందుకే దేవతలు ఈశ్వరుని గురించి తపస్సు చేసారు. వారికి ఈశ్వరుడు వరాలు ఇచ్చాడు. "రాక్షసులను నాశనం

చెయ్యడానికి కారణం అయిన స్త్రీ పుడుతుంది. ఆమె రాక్షసుల వినాశనానికి కారణం అవుతుంది." అని ఈశ్వరుడు చెప్పాడట! ఇప్పుడు అదే నిజం అయింది కదా!" అని అనుకుంటున్నారు.

(ఈ సందర్భంలో ఆ స్త్రీ సీత అని కొంతమంది రాసారు. కాని శూర్పణఖ అనికూడా అనుకోవచ్చు. ఎందుకంటే దీనికంతటికీ కారణం శూర్పణఖ. ఆమె రాముని మోహించకుండా, వెంటపడకుండా ఉంటే, ఎవరి పాటికి వాళ్లు ఉండేవాళ్లు, జనస్థానంలో ఉన్న రాక్షసుల గురించి రామునికి తెలిసేది కాదు. ఏది ఏమైనా ఒక స్త్రీ కారణంగా రాక్షస వంశం నాశనం అయింది అనేది నిర్వివాదాంశము).

"ఇంతకూ ఈ రావణుని చెడ్డ ప్రవర్తన, పరస్త్రీవ్యామోహమే లంకకు చేటుతెచ్చింది. ఈ సమయంలో లంకను, లంకలో ఉన్న రాక్షస జాతినీ రక్షించే వాడు ఎవడున్నాడు? మన పరిస్థితి కార్చిచ్చు చుట్టుముట్టిన అడవిలో ఉన్న జంతువుల మాదిరి అయింది. లంకను చుట్టుముట్టిన వానరసేనలతో లంక మొత్తం తగలబడిపోతోంది. ఇదంతా ముందే ఊహించే, విభీషణుడు ముందు జాగ్రత్త పడ్డాడు. రాముని శరణు జొచ్చాడు. ప్రాణాలు దక్కించుకున్నాడు. " అని కొంత మంది అనుకొన్నారు. ఈ ప్రకారంగా లంకలో ఉన్నరాక్షసులు,రాక్షస స్త్రీలు, ఎవరికి తోచినట్టు వారు అనుకుంటూ, పోయిన వారికోసం కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము తొంభైనాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## తొంభై ఐదవ సర్గ.

లంకా వాసులు రావణుని గురించి ఇలా అనుకుంటుంటే, రావణుడు మాత్రం తన పట్టు వదల లేదు. లంకా నగరంలో ఉన్న ఇండ్లలో నుండి ఏడుపులు వినపడుతున్నా అతని మనస్సు చలించలేదు. పైగా క్రోధంతో ఊగిపోతున్నాడు. పళ్లు పటపట కొరుకుతున్నాడు. రావణుడు తన మంత్రులు అయిన మహెూదరుని, మహాపార్శ్వుడిని, విరూపాక్షుడిని వెంటనే బయలు దేరి రమ్మని వర్తమానము పంపాడు. వెంటనే ఆ రాక్షస వీరులు రావణుని వద్దకు వచ్చి చేతులుకట్టుకొని నిలబడ్డారు. (ఇదే పేర్లు ఇదివరకు వచ్చాయి. వాళ్లు సైన్యాధిపతులు, రావణుని సోదరులు. వీళ్లు రావణుని మంత్రులు).

"ఈ రోజు నేను రాముడిని యమలోకమునకు అతిథిగా పంపుతాను. ఈ రోజు నేను, ఖరుడు, కుంభకర్ణుడు, ప్రహస్తుడు, ఇంద్రజిత్తును చంపినందుకు రాముని మీద ప్రతీకారము తీర్చుకుంటాను. నా బాణములతో అన్ని లోకములను కప్పివేస్తాను. ఒక్కొక్క వానర నాయకుని, అతని సేనలను విడి విడి గా చంపుతాను. నా రథము వాయు వేగంతో ప్రయాణిస్తుంటే, నేను వానరసేనలను ఊచకోత కోస్తాను. వానర సేనల కళేబరములతో ఈ భూమినంతా నింపుతాను. అసలు నేల అనేది కనపడకుండా చేస్తాను. నా ఒక్కొక్క బాణమునకు నూరుమంది వానరులు బలి అవుతారు. నా శత్రువులైన రామలక్ష్మణులను చంపి లంకావాసుల కన్నీళ్లు తుడుస్తాను. నా చేత

చంపబడిన వానర సేనల శరీరములతో ఆకాశంలో తిరిగే గ్రద్దలు, డేగలు ఇంకా ఇతర పక్షులు విందుచేసుకుంటాయి. ఇంక ఆలస్యంచేయకండి నా రథము సిద్ధం చేయండి. నా ధనుర్బాణము లను సిద్ధం చేయండి. లంకలో మిగిలిన సేనలు అన్నీ నా వెంట బయలుదేరాలి." అని ఆదేశాలు ఇచ్చాడు రావణుడు.

మహాపార్శ్వుడు వెంటనే సైన్యాధిపతులను పిలిపించి సేనలను సిద్ధం చేయమన్నాడు. రాక్షస సైన్యాధిపతులు సైనికుల ఇళ్లకు వెళ్లి వారిని యుద్ధానికి సన్నద్ధం చేసారు. రావణుని కోసరం ఎనిమిది గుర్రములను కట్టిన రథాన్ని సిద్ధం చేసారు. ఆ రథము నిండా రకరకాల ఆయుధములను, బాణములను పెట్టారు. రావణుడు ఆ రథమును ఎక్కాడు. రాక్షస సేనలు వెంటరాగా, రావణుడు వానరుల మీదికి యుద్ధానికి బయలుదేరాడు. రాక్షస సేనలు భేరీలు, మృదంగములు, శంఖములు మోగించారు. రావణుని రాకతో రాక్షససేనలలో నూతనోత్సాహం వెల్లివిరిసింది.  హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. రాక్షస సేనల పదఘట్టనలకు భూమి అదిరిపోయింది. ఆ శబ్దానికి వానరులు భయపడ్డారు.

రావణుని వెంట రావణుని మంత్రులు అయిన మహాపార్శ్వుడు, మహోదరుడు కూడా తమ తమ రథముల మీద యుద్ధానికి బయలుదేరారు. రావణుడు తన రథమును రాముడు, లక్ష్మణుడు ఉన్న ద్వారము వద్దకు పోనివ్వమన్నాడు. ఆ సమయంలో ఎన్నో దుశ్శకునములు గోచరించాయి. సూర్యకాంతి తగ్గిపోయింది. దిక్కులన్నీ చీకట్లు ఆవరించాయి. పక్షులు వికృతంగా అరుస్తున్నాయి. భూమి కంపించింది. రక్తవర్షము కురిసింది. నక్కలు వికారంగా

కూస్తున్నాయి. రావణుని రథమునకు కట్టిన ధ్వజము మీద గ్రద్దవాలింది. రావణునికి ఎడమ కన్ను అదిరింది. కాని రావణుడు ఈ దుశ్శకునములను లెక్కచేయలేదు. ముందుకుకదిలాడు.

రాక్షస సేనలు, వానర సేనలు ఒకరిని ఒకరు ఢీకొన్నారు. పోరు భీకరంగా సాగుతూ ఉంది. రావణుడు తన వాడి అయిన బాణములతో వానరులను విచక్షణా రహితంగా చంపుతున్నాడు. కొందరి తలలు తెంచుతున్నాడు. మరి కొందరి గుండెలు చీలుస్తున్నాడు. వానరులను ఊపిరి ఆడకుండా చంపుతున్నాడు. రావణుని ముందు ఎవరూ నిలువలేకపోతున్నారు. రావణుని ఎదురుపడ్డవాడు ప్రాణాలతో బయటపడటం లేదు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము తొంభై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## తొంభై ఆరవ సర్గ.

రావణుని ధాటికి వానరులు నిలువలేక పోతున్నారు. వానరుల మృతశరీరములతో యుద్ధభూమి అంతా కప్పబడి పోయింది. రావణుని బాణములకు వానరులు అగ్నిలో పడ్డ పురుగుల మాదిరి మాడిపోతున్నారు. కొంత మంది పారిపోతున్నారు. మరి కొందరు రాముని వద్దకు సుగ్రీవుని వద్దకు పారిపోయారు.

వానరులు అందరూ రాముడు ఉన్న వైపుకు పారిపోవడం చూచిన రావణుడు తన రథము రాముడు ఉన్న వైపుకు పోనిచ్చాడు. దూరంనుండి ఇదిచూచాడు సుగ్రీవుడు. సుషేణుని పిలిచి తన బదులు అక్కడ యుద్ధం చేయమని చెప్పి తాను రావణుడు ఉన్న వైపుకు వెళ్లాడు. సుగ్రీవుడు రావణుని వైపుకు వెళ్లడం చూచిన వానరులు తలా ఒక వృక్షమును, పర్వతశిఖరములు పట్టుకొని సుగ్రీవుని వెంట బయలుదేరారు.

సుగ్రీవుడు పెద్దగా అరుస్తూ అడ్డం వచ్చిన రాక్షసులను చంపుతూ రావణుని వంక దూసుకుపోతున్నాడు. వడగళ్ల వాన కురిసినట్టు రాక్షసుల మీద బండరాళ్లను వర్షంలా విసురుతున్నాడు. సుగ్రీవుని ధాటికి రాక్షసులు తలలు తెగి, కాళ్లు చేతులు విరిగి నేలకూలుతున్నారు. ఇది చూచిన విరూపాక్షుడు తన రథము దిగి ఒక పెద్ద ఏనుగు ఎక్కాడు. తన ఏనుగును వానర సేనల మీదికి పోనిచ్చాడు. సుగ్రీవుని మీద వాడిఅయిన బాణములను ప్రయోగించాడు. పారిపోతున్న రాక్షసులకు ధైర్యం కలిగించాడు.

విరూపాక్షుడు ప్రయోగించిన బాణములను తిప్పికొట్టిన సుగ్రీవుడు విరూపాక్షుని చంపాలని నిశ్చయించుకున్నాడు. సుగ్రీవుడు ఒక పెద్ద చెట్టును చేతిలోకి తీసుకున్నాడు. ఒక్క ఉదుటునపైకి ఎగిరి ఆ చెట్టుతో విరూపాక్షుడు ఎక్కిన ఏనుగు కుంభస్థలము మీద కొట్టాడు. ఆ దెబ్బకు ఆ ఏనుగు తూలి కిందపడి భీకరంగా అరిచింది. గిలా గిలా కొట్టుకుంటూ ప్రాణాలు వదిలింది. విరూపాక్షుడు ఏనుగు మీదినుండి కిందికి దిగాడు. ఖడ్గము, డాలు తీసుకున్నాడు. పెద్దగా అరుస్తూ సుగ్రీవుని మీదికి దూకాడు. వాడి దూకుడుచూసిన సుగ్రీవుడు ఒక పెద్ద

బండరాయి తీసుకొని వాడి తల మీద మోదాడు. విరూపాక్షుడు పక్కకు తొలగి ఆ దెబ్బ తప్పించుకున్నాడు. తిరిగి విరూపాక్షుడు సుగ్రీవుని గుండెల మీద పిడికిలితోకొట్టాడు. వెంటనే సుగ్రీవుడు విరూపాక్షుని ముఖం మీద అరిచేతితో చరిచాడు. ఆ దెబ్బకు విరూపాక్షుని ముక్కుల నుండి చెవుల నుండి రక్తం కారింది. కిందపడిపోయాడు. రక్తం కక్కుకుంటున్నాడు. కాళ్లు చేతులుకొట్టుకుంటున్నాడు. కాసేపటికి ప్రాణాలు విడిచాడు. ఆ విధంగా విరూపాక్షుడు సుగ్రీవుని చేతిలో మరణించాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము తొంబది ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## తొంబది ఏడవ సర్గ.

మరొక చోట యుద్ధముచేస్తున్న రావణునికి విరూపాక్షుని మరణ వార్త తెలిసింది. రావణుడుకోపంతో మండిపడ్డాడు. పక్కనేఉన్న మహోదరుని చూచి ఇలా అన్నాడు. "మహోదరా! నా ఆశలన్నీ నీ మీదనే ఉన్నాయి.నీవే ఈ శత్రు సైన్యమును చంపాలి. ఈ రోజు నీవు ప్రాణాల మీద ఆశవదిలి యుద్ధం చెయ్యి. నీ చక్రవర్తి ఋణం తీర్చుకో." అని అన్నాడు.

రావణుని మాటలకు మహోదరుడు కోపంతో రెచ్చిపోయాడు. "రాక్షసేంద్రా! ఈ రోజు నా పరాక్రమం అంతా చూపించి

వానరసేనలను తుదముట్టిస్తాను." అంటూ తన సేనలతో వానరసేనలోకి చొచ్చుకొని పోయాడు. వానరులను తన బాణములకు ఆహుతి చేస్తున్నాడు. వానరులు కూడా విరూపాక్షుని మరణంతో రెచ్చిపోయారు. చేతికి అందిన వృక్షములను, బండరాళ్లను తీసుకొని రాక్షసులను మోదుతున్నారు. మహోదరుడు కూడా తన వాడి అయిన బాణములతో వానరులను చంపుతున్నాడు.

మహోదరుని ధాటికి తట్టుకోలేక వానర సేనలు సుగ్రీవుని వద్దకు పరుగెత్తారు. విరూపాక్షుని చంపి సేదతీరుతున్న సుగ్రీవుడు మహోదరుని విజృంభణకు వానరులు బెదిరి పోవడం చూచి సహించలేకపోయాడు. మహోదరుని మీదికి దూకాడు. పర్వతంతో సమానమైన రాతిని మహోదరుని మీదికి విసిరాడు. మహోదరుడు ఆ రాయిని తన బాణములతో నుగ్గు నుగ్గు చేసాడు. సుగ్రీవుడు ఒక పెద్ద సాలవృక్షమును తీసుకొని మహోదరుని మీదికి విసిరాడు. మహోదరుడు ఆ వృక్షమునుకూడా ఖండించాడు. తరువాత వాడి అయిన బాణములతో సుగ్రీవుని శరీరం అంతా చీరుకుపోయేట్టు కొట్టాడు మహోదరుడు.

అప్పుడు సుగ్రీవునికి కిందపడి ఉన్న పరిఘ ఒకటి కనిపించింది. సుగ్రీవుడు ఆపరిఘను తీసుకొని ఆ పరిఘతో మహోదరుని రథమునకు కట్టిన గుర్రములనుచంపాడు. వెంటనే మహోదరుడు రథమునుండి దూకి గదను చేతిలోకి తీసుకున్నాడు. సుగ్రీవుడు పరిఘతోనూ, మహోదరుడు గదతోనూ యుద్ధము చేస్తున్నారు.

మహోదరుడు తన గదను సుగ్రీవుని మీదికి విసిరాడు. సుగ్రీవుడు ఆ గదను తన చేతిలో ఉన్న పరిఘతో కొట్టాడు. మహోదరుని గదాఘాతమునకు పరిఘ విరిగిపోయింది. తరువాత సుగ్రీవుడు ఒక ముసలమును తీసుకొన్నాడు. దానిని మహోదరుని మీదికి విసిరాడు. మహోదరుడు మరొక గదను సుగ్రీవుని మీదికి విసిరాడు. రెండూ ఒకదానితో ఒకటి కొట్టుకొని కిందపడ్డాయి.

ఇప్పుడు ఇద్దరి చేతులలోనూ ఆయుధములు లేవు. ఇద్దరూ నేల మీద నిలబడి ముష్టియుద్ధము చేస్తున్నారు. కింద పడుతున్నారు పైకి లేస్తున్నారు. గుద్దుకుంటున్నారు. కొట్టుకుంటున్నారు.

ఇంతలో మహోదరుడు అక్కడే పడి ఉన్న కత్తిని డాలును చేతిలోకి తీసుకున్నాడు. యుద్ధరంగంలో ఎన్నో కత్తులు డాలులు పడి ఉన్నాయి. సుగ్రీవుడు కూడా ఒక కత్తి డాలు తీసుకున్నాడు. ఇద్దరూ కత్తియుద్ధం చేయడం మొదలెట్టారు.

మహోదరుడు తన కత్తిని సుగ్రీవుని డాలు మీదికి విసిరాడు. అది సుగ్రీవుని చేతిలోని డాలులోకి దిగబడింది. మహోదరుడు ఆ కత్తిని లాగుతున్నాడు. అదే అదనుగా సుగ్రీవుడు తన చేతిలోని ఖడ్గముతో మహోదరుని తలను ఖండించాడు. మహోదరుని శిరస్సు నేలమీద దొర్లుతూ ఉంది.

మహోదరుని మరణం చూచిన రాక్షససేనలు రావణుని వద్దకు పారిపోయారు. వానరులు మహోదరుని మరణం చూచి జయజయ ధ్వానాలుచేస్తున్నారు.

వానరవీరులు అందరూ మహోదరుని చంపిన సుగ్రీవునిపొగడ్తలతో ముంచెత్తుతున్నారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము తొంబది ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
తొంబది ఎనిమిదవ సర్గ.

మహోదరుడు మరణించడం చూచాడు మహాపార్శ్వుడు. కోపంతో మండి పోయాడు. వానర సైన్యాన్ని అల్లకల్లోలం చేసాడు. వృక్షముల నుండి పండ్లను రాలగొట్టినట్టు వానరుల శరీరముల నుండి వారి శిరస్సులను తన బాణములతో రాలగొడుతున్నాడు మహాపార్శ్వుడు కొందరి చేతులను, కొందరి కాళ్లను విరగగొడుతున్నాడు. మహాపార్శ్వుడి దెబ్బకు చాలా మంది వానరులు స్పృహ తప్పిపడిపోయారు.

ఇంతలో అంగదుడు ఒక పరిఘను తీసుకొని మహాపార్శ్వుడినికొట్టాడు. ఆ దెబ్బకు మహా పార్శ్వుడు మూర్ఛపోయాడు. రథం నుండి కిందపడ్డాడు. వెంటనే జాంబవంతుడు ఎగిరి అతడి రథం ముందు పడ్డాడు. ఒక పెద్ద బండ శిలతో మహాపార్శ్వుని రథమునకు కట్టిన గుర్రములను చంపాడు. రథాన్ని విరుగగొట్టాడు. ఇంతలో మహాపార్శ్వుడు మూర్ఛనుండి తేరుకున్నాడు. మరలా అంగదుని మీద బాణ ప్రయోగం చేసాడు. జాంబవంతుడి మీద

మూడు బాణములు, గవాక్షుడి మీద లెక్కలేనన్ని బాణములు ప్రయోగించాడు. ఇంతలో అంగదుడు ఒక పరిఘను చేతిలోకి తీసుకున్నాడు. ఆ ఇనుప పరిఘను రెండు చేతులతో గిరా గిరా తిప్పి మహాపార్శ్వుని మీదికి బలంగా విసిరాడు. ఆ పరిఘ మహాపార్శ్వునికి తగిలి అతని ధనుస్సును విరిచింది. కిరీటాన్ని పడగొట్టింది.

వెంటనే అంగదుడు అతని మీదికి దూకి అరి చేతితో మహాపార్శ్వుని కణత మీద బలంగా మోదాడు. ఆ దెబ్బను తప్పించుకున్న మహాపార్శ్వుడు ఒక గండ్రగొడ్డలిని తీసుకొని అంగదుని మీదికి విసిరాడు. అంగదుడు ఆ వేటును తప్పించుకున్నాడు. పిడికిలి బిగించాడు. మహాపార్శ్వుని గుండెల మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు మహాపార్శ్వుడి గుండెలు పగిలిపోయాయి. వాడు కిందపడి గిలా గిలా కొట్టుకొని మరణించాడు.

మహాపార్శ్వుడి మరణం చూచిన వానరులు పెద్దగా కేరింతలు కొట్టారు. హర్షధ్వానాలు చేసారు. అంగదుని పొగడ్తలతో ముంచెత్తారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము తొంభై ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము
## తొంభైతొమ్మిదవ సర్గ.

తనతో వచ్చిన విరూపాక్షుడు, మహోదరుడు, మహాపార్శ్వుడు మరణించడం గురించి రావణునికి తెలిసింది. తాను రణభూమిలో ఒంటరిగా మిగిలిపోయాడు. అయినా తనమూర్ఖపుపట్టు విడవలేదు. రావణుడు.యుద్ధాన్నికొనసాగించాడు. సారథిని చూచి ఇలా అన్నాడు.

"ఈరోజు నేను రాముడిని లక్ష్మణుడిని సంహరించి, ఈ యుద్ధములో చనిపోయిన రాక్షస వీరుల ఋణం తీర్చుకుంటాను. సుగ్రీవుడు, జాంబవంతుడు, కుముదుడు, నలుడు, ద్వివిదుడు, మైందుడు, అంగదుడు, గంధమాధనుడు, హనుమంతుడు, సుషేణుడు, మొదలగు వానర వీరులను ఈరోజు చంపుతాను. నారథమును రాముని మీదికి మళ్లించు" అని పలికాడు.

రావణుని రథం రాముడు ఉన్న చోటికి వెళ్లింది. రావణుడు తనకు బ్రహ్మదేవుడు ప్రసాదించిన భయంకరమైన తామసాస్త్రమును వానరుల మీదా ప్రయోగించాడు. ఆ అస్త్రము వానరులను మలా మలా మాడ్చివేసింది. ఆ అస్త్రము ధాటికి తట్టుకోలేక వానరులు పారిపో సాగారు. ఇది చూచిన రాముడు రావణుని ఎదురుగా నిలిచాడు.

రావణుడు తన ఎదురుగా నిలబడి ఉన్న రాముని తేరిపార చూచాడు. తామర రేకుల వంటి కళ్లు, ఆజానుబాహువులు, అఖండమైన తేజస్సుతో వెలిగిపోతున్న రాముని చూచాడు రావణుడు.

తన మీదికి వస్తున్న రావణుని చూచాడు రాముడు. రాముని పక్కనే నిలబడి ఉన్నాడు లక్ష్మణుడు. రాముడు ధనుష్టంకారము చేసాడు. ఆ ధ్వనిని భరించలేక రాక్షసులు వేల కొద్దీ కిందపడిపోయారు. ఒకపక్క రాముడు మరొక పక్క లక్ష్మణుడు మధ్యలో రావణుడు, సూర్యచంద్రుల మధ్య రాహువు వలె ఉన్నాడు.

ముందుగా లక్ష్మణుడు వాడిఅయిన బాణములను రావణుని మీదికి సంధించాడు. కాని రావణుడు ఆ బాణములను మధ్యలోనే విరిచాడు. రావణుడు లక్ష్మణుడిని వదిలి పెట్టి రాముడితో తలపడ్డాడు. రాముడి మీద ఎడతెరిపి లేకుండా బాణవర్షము కురిపించాడు. రాముడు కూడా భల్లబాణములను సంధించి రావణుడు సంధించిన బాణములను మధ్యలోనే విరిచాడు.

రాముడు, రావణుడు ఒకరి మీద ఒకరు శరవర్షము కురిపిస్తున్నారు. ఇద్దరూ తమ తమ రథముల మీద గుండ్రగా తిరుగుతూ బాణాలు సంధించుకుంటున్నారు. వారు వదులుతున్న బాణములతో ఆకాశం కప్పబడి పోయింది. సూర్యుని వెలుగు ప్రసరించకుండా చీకట్లు కమ్ముకున్నాయి. ఇద్దరూ గొప్ప ధనుర్ధారులే. అస్త్రవిద్యలో ప్రవీణులే. ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు.

రావణుడు రాముని నుదుటిమీద మూడు నారాచ బాణములను నాటాడు. దానికి ప్రతిగా రాముడు రౌద్రాస్త్రమును సంధించి, మంత్రము జపించి ప్రయోగించాడు. కాని ఆ రౌద్రాస్త్రము

కూడా  రావణుని దివ్యకవచమును భేదించలేకపోయింది.

తరువాత రాముడు ఒక అస్త్రమును ప్రయోగించి రావణుని లలాటభాగమును కొట్టాడు. కాని రావణుడు ఆ బాణములను తిప్పి కొట్టాడు. రావణుడు అసురాస్త్రమును ప్రయోగించాడు. రావణుడు సింహము, పులి, నక్క, తోడేలు మొదలగు భయంకరమైన మృగముల ముఖముల మాదిరి ఉన్న బాణములను రాముని మీద ప్రయోగించాడు. సర్పముఖముల మాదిరి బుసలుకొడుతున్న బాణములను ప్రయోగించాడు. గాడిద, వరాహము, కుక్క,కోడి, మకరము, మొదలగు జుగుప్సాకరములైన ముఖముల మాదిరి కనపడుతున్న బాణములను ప్రయోగించాడు.

రావణుడు ప్రయోగించిన అస్త్రములకన్నిటికీ సమాధానంగా రాముడు పావకాస్త్రమును ప్రయోగించాడు. ఆ పావకాస్త్రము మహిమకు రావణుని అస్త్రములు అన్నీ బూడిదఅయ్యాయి. రాముడు అగ్ని ముఖములు, సూర్యముఖము, చంద్రము, అర్ధచంద్రము, ధూమకేతు మొదలగు ఆకారములు మొనలుగా గల బాణములను రావణుని మీద ప్రయోగించాడు. ఆ ప్రకారంగా ఒకరు వేసిన అస్త్రములను ఒకరు భగ్నం చేసుకుంటున్నారు. రావణుని అస్త్రములు భగ్నం అయినపుడు వానరులు, రాముని అస్త్రముల భగ్నం అయినపుడు రాక్షసులు హర్షధ్వానాలు చేస్తున్నారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము తొంభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నూరవ సర్గ.

తను ప్రయోగించిన అస్త్రములను అన్నీ వృధా కావడం చూచిన రావణుడు కోపంతో చెలరేగిపోయాడు. మయుడు నిర్మించిన ఒక గొప్ప అస్త్రమును రావణుడు రాముని మీద ప్రయోగించాడు. ఆ అస్త్రము నుండి శూలములు, గదలు, ముసలములు దూసుకుపోతున్నాయి. కాని రాముడు ఆ అస్త్రమును గాంధర్వాస్త్రముతో ఛేదించాడు. రావణుడికి కోపం నసాళానికి అంటింది. వెంటనే సౌర అస్త్రమును రాముని మీద ప్రయోగించాడు. ఆ అస్త్రము నుండి సూర్యుని మాదిరి వెలుగుతున్న చక్రములు నలువైపులకు దూసుకుపోతున్నాయి. రాముడు ఆ అస్త్రమును తన బాణములతో ఖండించాడు.

ఇలా కాదని రావణుడు తన బాణములతో రాముని మర్మస్థానములయందు కొట్టసాగాడు. ఆ బాణములను మధ్యలోనే విరిచి రాముడు కూడా రావణుని మర్మస్థానములలో కొట్టాడు. ఇంతలో లక్ష్మణుడు ఏడు బాణములతో రావణుని ధ్వజమును విరిచాడు. మరొక బాణంతో రావణుని విల్లు విరగ్గొట్టాడు. విభీషణుడు తన గదతో రావణుని రథమునకు కట్టిన గుర్రములను చంపాడు.

తన తమ్ముడే ఇలా చెయ్యడం చూచి ఓర్వలేకపోయాడు రావణుడు. రథము నుండి కిందికి దుమికాడు. వజ్రాయుధముతో సమానమైనశక్తి గల శక్తి అనే అస్త్రమును విభీషణుని మీద ప్రయోగించాడు. కాని లక్ష్మణుడు ఆ అస్త్రము విభీషణుని చేరకముందే

మధ్యలోనే తుంచాడు. తరువాత రావణుడు యముడు కూడా భయపడే ఒక మహాశక్తి బాణమునుతీసుకున్నాడు. ఆ శక్తి బాణము రావణుని చేతిలోనే అగ్ని కణాలు విరజిమ్ముతూఉంది. రావణుడు ఆ అస్త్రమును  విభీషణుని మీదికి విడిచి పెట్టకముందే లక్ష్మణుడు రావణుని చేతిని తన బాణములతో కొట్టాడు. రావణుడు ఆ శక్తిని సంధించలేకపోయాడు. ఇంక విభీషణుని చంపే కార్యక్రమమును విరమించాడు రావణుడు.

రావణుడు లక్ష్మణుని మీద పడ్డాడు. లక్ష్మణునితో ఇలా అన్నాడు. "ఓ లక్ష్మణా! నీవు ఈ మహాశక్తినుండి విభీషణుని రక్షించావు. కాని ఈ శక్తిని నీ మీదికి వదులుతున్నాను. ఈ శక్తి నిన్ను చంపి నన్ను చేరుతుంది. చేతనైతే నిన్ను నీవు రక్షించుకో!' అంటూ ఆ మహాశక్తిని లక్ష్మణుని మీదికి ప్రయోగించాడు. వజ్రాయుధముతో సమానమైన ఆ శక్తి అస్త్రము లక్ష్మణుని వైపుకు మహావేగంతో దూసుకువస్తూ ఉంది. ఆ శక్తి సరాసరి వచ్చి లక్ష్మణుని వక్షస్థలములో దిగబడింది. లక్ష్మణుడు నేలమీద పడిపోయాడు. మూర్ఛపోయాడు.

అది చూచిన రామునికి కోపము మిన్నుముట్టింది. ఒక పక్క లక్ష్మణుని పరిస్థితికి శోకము, మరొక పక్క రావణుని మీద కోపము ఒకే సారి వచ్చాయి. రాముడు తమాయించుకున్నాడు.  "ఇది దు:ఖించడానికి సమయం కాదు, ముందు రావణుని ఆపాలి." అనుకున్నాడు రాముడు. లక్ష్మణుని గుండెల్లోకి దిగిన శక్తి బాణమును బయటకు లాగాలి అని అనుకున్నాడు రాముడు. అది వారి వల్ల కాలేదు. అప్పటికే వానర యోధుల శరీరముల నిండా బాణములు దిగబడి ఉన్నాయి. రావణుడు ప్రయోగించిన శక్తి లక్ష్మణుని గుండెల్లోకి

దూసుకొనిపోయి కింద నేలలో కూడా దిగబడింది. అదిచూచి రాముడికి కోపం వచ్చింది. రెండు చేతులతో బలంగా లాగాడు. లక్ష్మణుని శరీరంలో నుండి శక్తి బాణం ఊడి వచ్చింది. దానిని రెండు ముక్కలుగా విరిచాడు రాముడు. రాముడు లక్ష్మణుని శరీరంలో నుండి శక్తి బాణమును లాగుతూ ఉండగా, ఇదే సమయమని రావణుడు రాముని మర్మ స్థానముల మీద శరములను ప్రయోగించాడు.

కాని రాముడు వాటిని లెక్కచేయలేదు. సుగ్రీవుని, హనుమంతుని చూచి ఇలా అన్నాడు. "మీరు లక్ష్మణుని చుట్టు నిలిచి ఆయనను రక్షిస్తూ ఉండండి. నేను రావణునితో యుద్ధం చేస్తాను. ఇంక కొద్దిసేపట్లో ఈ భూమి మీద రాముడో రావణుడో ఎవరో ఒకరే ఉంటారు. ఇది సత్యము. నా గురించి మీకు తెలుసు. రాజ్యం పోగొట్టుకున్నాను. అడవులలో తిరుగుతున్నాను. భార్యను పోగొట్టుకున్నాను. ఇంతకంటే దు:ఖము ఇంకేమి ఉంటుంది. ఇప్పుడు రావణుని సంహరించి ఆ దు:ఖమును పోగొట్టుకుంటాను.

ఓ సుగ్రీవా! ఎవరి కోసరం నేను నీతో  స్నేహం చేసానో, ఎవరి కోసరం నూరుయోజనముల సముద్రం మీద వారధి కట్టానో, ఎవరి కోసరం వానరసేనలతో సహా వారధిని దాటి లంకను ముట్టడించానో, ఆ రావణుడు ఇప్పుడు నా కంట బడ్డాడు. వీడిని నేను విడువను. వీడి జీవితం ఈరోజుతో సమాప్తం. మీరు అనవసరంగా యుద్ధం చేసి మీ ప్రాణాలు పోగొట్టుకోకండి. దూరాన నిలబడి రామరావణయుద్ధం చూడండి. ఈ రామరావణ యుద్ధమును మీరే కాదు దేవ,గంధర్వ,ఋషిగణములు కూడా చూస్తున్నాయి. ఈభూమి

ఉన్నంత వరకూ రామరావణ యుద్ధము గురించి జనం చెప్పుకుంటారు. " అని అన్నాడు రాముడు.

తరువాత వాడి అయిన బాణములను తన ధనుస్సుకు సంధించి రావణుని మీదికి వదిలాడు. రావణుడు కూడా నారాచ బాణములను, ముసలములను, రాముని మీద వర్షం లాగా కురిపించాడు. రాముడు రావణుడు ఒకరి మీద ఒకరు వేసుకుంటున్న బాణములు ఒకదానితో ఒకటి ఢీకొని పెద్ద శబ్దం కలుగుతూ ఉంది. రాముడు, రావణుడు, ప్రయోగించిన బాణములు ఆకాశమును కప్పేసాయి.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూట ఒకటవ సర్గ.

లక్ష్మణుడు పడిపోవడంతో రాముడి దు:ఖానికి అంతులేదు. కానీ ఉగ్గపట్టుకొని రావణునితో యుద్ధం చేస్తున్నాడు. ఒక పక్క రావణుని మీద బాణాలుసంధిస్తూ, హనుమంతుని, సుషేణుని పిలిచి ఇలా అన్నాడు. "నా తమ్ముడు లక్ష్మణుడు నేల మీద పడి ఎలా కొట్టుకుంటున్నాడో చూడండి. వాడిని చూస్తుంటే నాకు దు:ఖం ఆగడం లేదు. లక్ష్మణుడు నా ప్రాణానికి ప్రాణం. లక్ష్మణుడిని ఈ పరిస్థితిలో చూస్తూ నేను యుద్ధము చేయలేను. నా లక్ష్మణుడు మరణించిన

తరువాత నేను రావణునితో యుద్ధము చేసి ఏమి ప్రయోజనము. లక్ష్మణుడు లేకపోతే నేను జీవించి ఉండటం వృధా! లక్ష్మణుని ఈ పరిస్థితులలో చూస్తుంటే నా ధనుస్సు చేతిలో నుండి జారిపోతూ ఉంది. బాణములు సంధించలేకున్నాను. పట్టు చిక్కడం లేదు. కళ్లనిండా నీరు కమ్మి లక్ష్యము కనపడటం లేదు. నా అవయవములు స్వాధీనం తప్పుతున్నాయి. జీవితేచ్ఛనశించింది. ఆ దుర్మార్గుడైన రావణుడు నా లక్ష్మణుని మర్మస్థానములలో కొట్టాడు. అతడు జీవించడం దుర్లభం అనుకుంటాను.

చూడండి నా లక్ష్మణుడు ఎలా దుమ్ములో పడి కొట్టుకుంటున్నాడో. నేను రావణుని వధించి విజయం సాధించినా, లక్ష్మణుడు లేకుండా  అది నాకు సంతోషం కలిగించదు. అందుకని నాకు ఈ యుద్ధం ఎందుకు? ఎవరి కోసరం? నేను బతికి ఉండటం ఎవరి కోసరం? లక్ష్మణుడు చచ్చినట్టు భూమిమీద పడి ఉంటే నేను ఎలా యుద్ధం చేయగలను?

(ఇక్కడి నుండి ఉన్న శ్లోకములు ప్రాచ్యప్రతిలో లేవు అని,తరువాతి కాలంలో చేర్చబడి ఉంటాయని పండితుల అభిప్రాయం. పాఠకుల సౌకర్యం కోసరం వాటిని కూడా ఇస్తున్నాను. సరదాగా చదువుకోండి.)

నేను అరణ్యములకు వెళుతుంటే ఈ లక్ష్మణుడు ఎలా నావెంట వచ్చాడో అలాగే నేనుకూడా లక్ష్మణుని వెంట యమలోకమునకు వెళతాను. ధర్మయుద్ధం చేస్తున్న లక్ష్మణుని కపట యుద్ధంతో శత్రువులు పడగొట్టారు. భార్యలు, బంధువులు ఎక్కడైనా, ఎంతమందైనా దొరుకుతారు కానీ లక్ష్మణుని వంటి సోదరులు

దొరకడం కష్టంకదా! లక్ష్మణుడు లేకుండా నేను ఒంటరిగా  అయోధ్యకు వెళ్లి సుమిత్రకు ఏమని సమాధానం చెప్పాలి. నా కుమారుడిని ఏమి చేసావు అని సుమిత్ర నన్ను నిందిస్తే నేను ఏమనాలి. లక్ష్మణుని తో కూడా అరణ్యములకు వెళ్లినవాడివి అతను లేకుండా ఎందుకుతిరిగి వచ్చావు అని భరతుడు శత్రుఘ్నుడు అడిగితే ఏమి సమాధానం చెప్పాలి. తల్లుల చేతా, సోదరుల చేత నిందలు పడటం కన్నా ఇక్కడే చావడం మంచిది. నా తమ్ముడు ఈ విధంగా శవం లాగా పడి ఉండగా చూడటానికి  నేను  ముందు జన్మలలో ఏమి పాపం చేసానో కదా! లక్ష్మణా! ఏమిటయ్యా ఇది? నన్ను వదిలి పరలోకానికి ఎందుకు వెళ్లావు? లక్ష్మణా! నేను నీ అన్నను. నీతో మాట్లాడుతున్నాను.జవాబు చెప్పు. కళ్లు విప్పి నన్ను చూడు. నా బాధను చూడు. నేను అరణ్యములో దిక్కుతోచకుండా తిరుగుతుంటే నాకు ధైర్యం చెప్పేవాడివి కదా! ఇప్పుడు కూడా నేను దు:ఖిస్తున్నాను. లేచి నాకుధైర్యం చెప్పు. లే లక్ష్మణా! లేచి నాతో మాట్లాడు."అని విలపిస్తున్నాడు రాముడు.
(ఇక్కడి దాకా ఉన్న శ్లోకములు సందర్భానికి అనుగుణంగా లేవు. ఒక పక్క రావణుని తో యుద్ధం చేస్తూ ఇంత సుదీర్ఘమైన సంభాషణలు పలకడం సందర్భోచితంగా లేదు. అందుకని ఇవి ప్రక్షిప్తములు కావచ్చు అని పండితుల అభిప్రాయం.)

రాముని శోకముతో కూడిన మాటలు విన్న సుషేణుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! ఏమిటీవెర్రి! ఇప్పుడు లక్ష్మణునికి ఏమి అయింది. ఏమీ కాలేదు. కేవలం మూర్ఛపోయాడు. మరణించలేదు. లక్ష్మణుని ముఖంలో కళ తగ్గలేదు. శరీరం నల్లబడలేదు. చల్లబడలేదు. కళ్లు కూడా తేజోవంతంగా ఉన్నాయి. మరణించిన వారి శరీర లక్షణములు ఈ విధంగా ఉండవు. ఇంకా

ప్రాణం ఉంది. లక్ష్మణుని గుండె ఇంకా కొట్టుకుంటూ ఉంది. కాబట్టి నీ దు:ఖము వదిలిపెట్టు. " అని అన్నాడు సుషేణుడు. సుషేణుడు పక్కనే ఉన్న హనుమంతుని పిలిచి "హనుమా! నీవు ఇదివరకు జాంబవంతుడు చెప్పగా, ఒకసారి ఓషధీ పర్వతమును తీసుకొని వచ్చావు కదా. మరలా అక్కడికి పోయి, ఆ పర్వతము దక్షిణ శిఖరము మీద ఉన్న విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి, సంధాన కరణి అనే ఓషధములను తీసుకొనిరా. లక్ష్మణుడు బతుకుతాడు." అని అన్నాడు.

చెప్పినదే తడవుగా హనుమంతుడు వాయు వేగంతో ఓషధీ పర్వతమునకు వెళ్లాడు. దక్షిణ శిఖరంమీద దిగాడు. మరలా ఆ ఓషధులు హనుమకు కనిపించలేదు. వాటిని హనుమ గుర్తుపట్టలేక పోయాడు. "వీటికోసరం వెదకడం ఎందుకు. సుషేణుడు చెప్పిన ప్రకారము ఆ ఓషధులు ఈ దక్షిణ శిఖరము మీదనే ఉంటాయి కదా! అందుకని ఈ శిఖరమును పెకలించి తీసుకొనిపోతే బాగుంటుంది కదా! నేను ఈ ఓషధుల కోసరం వెదుకుతుంటే అక్కడ లక్ష్మణునికి ప్రాణాపాయం కలగవచ్చు. అప్పుడు నేను ఈ ఓషధులు తీసుకొని పోయి కూడా ప్రయోజనం లేదు." అని అనుకున్నాడు.

ఈవిధంగా ఆలోచించిన హనుమంతుడు ఆ శిఖరమును పట్టుకొని అటు ఇటు ఊపాడు. ఆ శిఖరము పర్వతము నుండి ఊడి వచ్చింది. దానిని తన చేతులతో పైకి ఎత్తాడు. రివ్వున ఆకాశంలోకి ఎగిరాడు. వాయువేగంతో లంకకు తిరిగి వచ్చాడు. ఆ పర్వత శిఖరమును నేల మీద పెట్టి సుషేణునితో ఇలా అన్నాడు. "ఓ వానరోత్తమా! ఈ సారి కూడా ఆ ఓషధులను గుర్తించలేకపోయాను. అందుకని నీవు చెప్పినట్టు దక్షిణ శిఖరమును తీసుకొని వచ్చాను. నీకు

కావనసిన ఓషధులను సేకరించు." అని అన్నాడు. వెంటనే సుషేణుడు ఆ పర్వత శిఖరము మీదికి పోయి ఆ ఓషధులను గుర్తించాడు. ఆ ఓషధులను పెకలించి తెచ్చాడు. సుషేణుడు ఆ ఓషధులను బాగా నలగ గొట్టి వాటిరసాన్ని లక్ష్మణునికి ముక్కుద్వారా ఇచ్చాడు.ఆ ఓషధుల రసం పీల్చగానే, నిద్రలో నుండి లేచి నట్టు లక్ష్మణుడు లేచికూర్చున్నాడు. లక్ష్మణుడు జీవించడం చూచి వానరులు ఎంతో సంతోషించారు.

రాముడు లక్ష్మణుని గట్టిగా కౌగలించుకున్నాడు. "లక్ష్మణా! మృత్యుముఖము నుండి తప్పించుకొని వచ్చిన నిన్ను చూడటం నాకు చాలా ఆనందంగా ఉంది. లక్ష్మణా! నీవు లేని నాకు ఈ విజయంతో గానీ, సీతతో గానీ, తుదకు నా జీవితంతో కానీ పని ఏముంది." అని అన్నాడు రాముడు.

రాముని వాత్సల్యమును చూచి లక్ష్మణుడు ఇలా అన్నాడు. "అదేమిటి అన్నయ్యా! రావణుని చంపుతాను అని శపధం చేసావు కదా. మరలా ఇదేమిటి ఒక సామాన్య మానవుని వలె ఇలా మాట్లాడుతున్నావు. నేను ఉన్నా లేకపోయినా నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలి కదా! అదే కదా క్షత్రియ ధర్మము. నీవు సత్యవాక్పరిపాలకుడవు. నీవే ఇలా మాట్లాడితే ఎలా! నా కొరకు నీవు ఇలా నిరాశ పడటం తగదు. ప్రస్తుత నీ కర్తవ్యము రావణ సంహారము. నీ బాణముల బారిన పడిన రావణుడు తిరిగి లంకకు వెళ్లడు. ఈ రోజు సూర్యాస్తమయము లోగా నీవు రావణుని చంపుతావు. నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకుంటావు. అదే నేను కోరుకునేది.

ఓ రామా! నీకు నిజంగా నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలి అనే కోరిక బలంగా ఉంటే, రావణుని చంపవలెనని కోరిక ఉంటే, సీతను పొందవలెనని కోరిక ఉంటే, నా కోసరం చింతించకుండా రావణునితో యుద్ధమునకుఉపక్రమించు" అని అన్నాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూట ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము
నూటరెండవ సర్గ.

లక్ష్మణుని మాటలతో రాముడు యుద్ధోన్ముఖుడు అయ్యాడు. ధనుస్సును తీసుకున్నాడు. బాణములను సంధించాడు. రావణుడు కూడా రాముని తన బాణములతో ఎదుర్కొన్నాడు. రథము మీద ఉన్న రావణుడు వాడి అయిన బాణములతో రాముని కొడుతున్నాడు. రాముడు కూడా అగ్నితో సమానమైన బాణములను రావణుని మీద వర్షంలా కురిపించాడు. రామ రావణ యుద్ధమును పైనుండి చూస్తున్న దేవతలకు, గంధర్వులకు, యక్షులకు ఒక అనుమానం వచ్చింది. రాముడు నేల మీద ఉండి యుద్ధం చేస్తున్నాడు. రావణుడు రథం మీద ఉండి యుద్ధం చేస్తున్నాడు. ఇద్దరి మధ్య సమన్వయం కుదరడం లేదని తెలుసుకున్నారు. వారిలో వారు దీనిని గురించి తర్కించుకుంటున్నారు. వీరి మాటలను ఇంద్రుడు విన్నాడు. ఇంద్రునికి కూడా ఇది అన్యాయంగా తోచింది. తన సారథి మాతలిని పిలిచాడు.

"మాతలీ! నీవు వెంటనే నా రథమును తీసుకొని భూలోకమునకు వెళ్లు. అక్కడ రాముడు నేల మీద నిలబడి రావణునితో యుద్ధం చేస్తున్నాడు. రాముని నా రథము మీద ఎక్కి రావణునితో యుద్ధం చేయమని నా మాటగా చెప్పు." అని అన్నాడు.

వెంటనే మాతలి ఇంద్రుని ఆజ్ఞానుసారము రథమును తీసుకొని రాముని వద్దకు వెళ్లాడు. ఇంద్రుని రథము బంగారు వర్ణములో ఉంది. రథము నిండా చిరుగంటలు అలంకరింపబడి ఉన్నాయి. ఆ రథమునకు ఉత్తమ జాతికి చెందిన అశ్వములు కట్టబడి ఉన్నాయి. అవి చక్కగా అలంకరింపబడి ఉన్నాయి. మాతలి రథమును రాముని ముందు ఆపి ఇలా అన్నాడు. "రామా! యుద్ధములో నీ విజయమును కోరిన ఇంద్రుడు తన రథమును నీకుపంపాడు. నీవు ఈ రథము మీద ఎక్కియుద్ధము చెయ్యి. నేను సారథ్యము వహిస్తాను. దానితో పాటు దివ్యమైన కవచము, గొప్ప ధనుస్సు, సూర్యశక్తితో సమానమైన బాణములు, శక్తి బాణములను కూడా పంపాడు.నా సారథ్యములో నువ్వు రావణుని సంహరించు." అని పలికాడు మాతలి.

రాముడు దేవేంద్రుడు పంపిన రథానికి ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించాడు. ఆ రథమును ఎక్కాడు. రావణునితో యుద్ధానికి తలపడ్డాడు. రామ రావణులకు ఘోరయుద్ధము జరిగింది. రావణుడు ప్రయోగించిన గాంధర్వాస్త్రమును రాముడు గాంధర్వాస్త్రము చేతనూ, దైవాస్త్రమును అదే అస్త్రము చేతనూ నివారించాడు. రావణుడు కోపంతో రాక్షసాస్త్రమును ప్రయోగించాడు. ఆ అస్త్రము మహా వేగంతో సర్పములను వెదజల్లుతూ రాముని మీదికి రాసాగింది. ఆ సర్పములు తమ పడగలు విప్పి విషమును కక్కుతూ రాముని మీదికి

దూసుకొనివస్తున్నాయి. అది చూచిన రాముడు గరుడాస్త్రమును ప్రయోగించాడు. రాముడు ప్రయోగించిన అస్త్రమునుండి వేలకొలదీ గరుడులు వెలువడ్డాయి. రావణుని బాణముతో బయటకు వచ్చిన సర్పములు గరుత్మంతులను చూచి పారిపోయాయి. తన అస్త్రము వృధా కావడం చూచిన రావణుడు రాముని మీద బాణవర్షము కురిపించాడు.మరి కొన్ని బాణములతో మాతలిని కూడా కొట్టాడు. ఒక బాణంతో రాముని రథానికి ఉన్న ధ్వజాన్ని కొట్టాడు. మరి కొన్ని బాణములతో ఇంద్రుని రథమునకు కట్టబడిన అశ్వములను కొట్టాడు.

ఇంద్రుని రథము కూడా ఎందుకూ పనికి రాకపోవడం చూచిన వానరవీరులు దిగులు చెందారు. దానికి తగ్గట్టు రావణుడు తన నిజమైన అవతారము ఎత్తాడు. పది ముఖములతో రథంమీద ఠీవిగా పర్వతం మాదిరి నిలబడ్డాడు. రావణుడు రాముని మీద ఎడతెరిపి లేకుండా బాణములను సంధిస్తున్నాడు. ఆ వేగానికి రాముడు బాణములను సంధించలేకపోయాడు. రాముడు కోపం తెచ్చుకున్నాడు. రాముని కోపానికి సకల ప్రాణులు భయంతో వణికిపోయాయి.

రాముని కోపంతో జేవురించిన ముఖం చూచి రావణుడు కూడా భయపడ్డాడు. రావణుడు రాముని మీదికి విసరడానికి ఒక పెద్ద శూలాన్ని తీసుకున్నాడు. మధ్యలో పట్టుకున్నాడు. పెద్దగా సింహనాదం చేసాడు. రామునితో ఇలా అన్నాడు. “ఓ రామా! ఈ రోజుతో నీ చరిత్ర పరిసమాప్తి. ఈ శూలము నిన్ను నీ తమ్ముని లక్ష్మణుని బలితీసు కుంటుంది. రామా! అక్కడే నిలబడు. ఈ శూలమును నీ మీదికి విసురుతున్నాను.”అంటూ ఆ శూలమును రాముని మీదికి గురి చూచి విసిరాడు. రావణుని చేతి నుండి వెలువడిన ఆ శూలము నిప్పులు

విరజిమ్ముతూ వస్తోంది. రాముడు ఏ మాత్రమూ భయపడక తన బాణములతో ఆ శూలాన్ని నివారించడానికి బాణాలు ప్రయోగించాడు. కానీ రాముని బాణములు అన్నీ ఆ శూలము నుండి వెలువడే అగ్నిజ్వాలలో భస్మం అయ్యాయి.

అది చూచి రాముడు కోపించాడు. దేవేంద్రుడు తనకు పంపిన శక్తి అస్త్రమును చేతిలోకి తీసుకున్నాడు. ధనుస్సులో సంధించాడు. ఆ శక్తి ప్రళయ కాలంలో వలె మంటలు వెదజల్లుతూ ఉంది. రాముడు ఆ శక్తిని రావణుడు ప్రయోగించిన శూలం మీదికి వదిలాడు. దేవేంద్రుని శక్తి ఆయుధము రావణుని శూలమును మధ్యలోనే విరిచింది. అప్పుడు రాముడు రావణుడు ఎక్కిన రథమునకు కట్టబడిన గుర్రములను తన బాణములతో కొట్టాడు. రాముడు తన వాడి అయిన బాణములతో రావణుని గుండెలకు గురి చూచి కొట్టాడు. మరి కొన్ని బాణములతో రావణుని లలాటము మీద నాటేట్టు కొట్టాడు. రావణుని శరీరము నుండి రక్తము ధారాపాతంగా కారుతూ ఉంది. రావణుడికి కోపమూ, అలసటా రెండూ ఒకేసారి కలిగాయి.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూటరెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నూటమూడవ సర్గ.

అలసట కలిగినా రావణుడు ఊరుకోలేదు. రాముని మీద బాణ వర్షము కురిపిస్తూనే ఉన్నాడు. కోపంతో దహించుకుపోతున్నాడు. రావణుడు వేసే బాణములను అన్నిటినీ రాముడు తన బాణములతో అడ్డుకుంటున్నాడు. రావణుడు రాముని వక్షస్థలమునకు గురిపెట్టి వేలకొలది బాణములను ప్రయోగించాడు. రాముని శరీరము నుండి రక్తము ధారగా ప్రవహిస్తూ ఉంది. రాముడు కూడా రావణుని మర్మస్థానములకు గురి చూచి బాణములను ప్రయోగించాడు. ఆ ప్రకారంగా రాముడు రావణుడు ఒకరి మీద ఒకరు వాడి అయిన బాణములను ప్రయోగించుకుంటున్నారు. రాముడు రావణుడు ఎదురు ఎదురుగా నిలబడి ఉన్నారు. అప్పుడు రాముడు రావణుని చూచి ఇలా అన్నాడు.

“ఓరీ రాక్షసా! నీవూ ఒక మగాడివేనా! నీదీ ఒక పౌరుషమేనా! భర్త ఇంట లేని సమయమున భార్యను అపహరించి తేవడం పరాక్రమము అనిపించుకుంటుందా! ఇతరుల భార్యలను అపహరించి తేవడం శూరత్వమా! రక్షణ లేని స్త్రీలను వీరులు తాకరు. కానీ నీవుదానికి పాల్పడ్డావు. అది నీచులు చేసేపని. కాని అదేదో ఘనకార్యము, శూరత్వము అనుకుంటున్నావు. సిగ్గు లేకుండా ఇంకా యుద్ధానికి వచ్చావా! వీరులు వీరగతిని పొందుతారు. కానీ నీకు నీచమైన మరణం రాసి పెట్టి ఉంది. అనుభవించు. నీవు కుబేరుని సోదరుడవు. ఎన్నో యజ్ఞాలు యాగాలు చేసావు. తపస్సులు చేసావు. సాటి వారిలో గొప్పయశస్సునుసాధించావు.

కాని ఏం లాభం! ఆ కీర్తి అంతా నీవు చేసిన ఈ ఒక్క పాడు పనితో పటాపంచలయింది. నీవు చేసిన దుర్మార్గానికి తగిన ఫలితం ఇప్పుడే అనుభవిస్తావు. మగవారు ఇంటలేని సమయమున దొంగ వలె ఇంట్లో దూరి, పరుల భార్యను అపహరించడం శూరత్వము అనుకుంటున్నావా! ఆ పని చేయడానికి నీకు సిగ్గువేయడం లేదా! ఆసమయంలో నేను ఆశ్రమంలో ఉంటే, అప్పుడు నిన్ను నీ సోదరుడు, ఖరుని వద్దకు పంపి ఉండేవాడిని. ఆ రోజు తప్పించుకున్న నీవు ఈ రోజు నా కంట పడ్డావు. నిన్ను వదలను. నా వాడి అయిన బాణములతో నిన్ను యమపురికి పంపుతాను. ఈ రోజు రాత్రికి నీ శిరస్సుతో క్రూరమృగములు విందుచేసుకుంటాయి. నీ శరీరమును గ్రద్దలు పీక్కుతింటాయి." అని పలుకుతూ రాముడు రావణుని మీద శరవర్షముకురిపించాడు.

రాముడు రావణుని మీద తనకు మనసులో స్ఫురించిన అన్ని అస్త్రములను ప్రయోగిస్తున్నాడు. రాముడు ఇలా అస్త్రములు ప్రయోగిస్తుంటే, వానరులు రాళ్లతోనూ, వృక్షములతోనూ రావణుని మోదుతున్నారు. రావణునికి ఊపిరి ఆడటం లేదు. రాముని మాటలతో సగం చచ్చిపోయాడు. ధనుస్సు సంధించలేకపోయాడు. అతని మనస్సు బాగా వ్యాకులము అయింది. రావణుని పరిస్థితిని చూచాడు సారథి. రథమును మెల్లిగా యుద్ధభూమి నుండి ఆవలకు తీసుకొని వెళ్లాడు. రావణుని రథము యుద్ధభూమిని విడిచి పెట్టి లంకానగరం వైపు వెళ్లిపోయింది.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూటమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## నూటనాలుగవ సర్గ.

ఏం జరుగుతూ ఉందో రావణునికి తెలియడం లేదు. ఏదో మైకం కమ్మినట్టయింది. తెలివి వచ్చి చూచేసరికి తాను యుద్ధభూమిలో లేడు. దూరంగా ఉన్నాడు. సారథిని చూచి ఇలా అన్నాడు." ఓసారథీ! ఏమిటిది! నేను ఎక్కడున్నాను? రాముడు ఎక్కడ?" అని అడిగాడు. సారథి జరిగింది చెప్పాడు. రావణుని రక్షించడానికి రథమును రణభూమి నుండి పక్కకు మరల్చాను అని అన్నాడు. రావణుని కోపం తారస్థాయికి చేరింది. కళ్లు నిప్పులు కక్కుతూ ఇలా అన్నాడు.

"ఓరి దుర్మార్గుడా! నేను ఏమన్నా సామాన్యుడిని అనుకున్నావా! అసమర్థుడిని, పౌరుషహీనుడిని, పరాక్రమం లేని వాడిని, భయం కలవాడిని అనుకున్నావా! నేను రావణుడిని! నీ ఇష్టం వచ్చినట్టు రథం తీసుకురావడానికి నీకు అనుమతి ఎవరిచ్చారు? శత్రువుల ముందు నాకు ఎంత అవమానం జరిగిందో నీవు ఊహించావా! నన్ను అడగకుండా, నా అభిప్రాయము తెలుసుకోకుండా రథమును ఎందుకు మళ్లించావు? నేను ఇన్నాళ్లు ఇన్నేళ్లు సంపాదించుకున్న కీర్తిని ఒక్కరోజులో నాశనం చేసావు. నన్ను ఒక భీరువుగా, పరాక్రమ హీనుడిగా, నీచుడిగా చేసావు.

నీవు చేసిన పని శత్రువులు చేయదగినది కానీ మిత్రులు చేయదగినది కాదు. నాకూ చూడ నిన్ను నా శత్రువులు ధనము ఇచ్చి వశం చేసుకున్నట్టు కనపడుతూ ఉంది. నీవు నా దగ్గర చాలా కాలం

నుండి సారథిగా పని చేస్తుంటే, నా సంగతి నీకు పూర్తిగా తెలిసి ఉంటే, వెంటనే రథమును రాముడి వద్దకు తీసుకొని వెళ్లు. రాముడు యుద్ధభూమి నుండి వెళ్లిపోక ముందే త్వరగా రాముని ఎదుటికి రథమునుపోనివ్వు." అని ఆజ్ఞాపించాడు రావణుడు.

రావణుని మాటలకు సారథి భయపడిపోయాడు. రావణుని క్షమాపణ కోరుకున్నాడు. "మహారాజా! నేను ఎవరికీ భయపడలేదు. నన్ను శత్రువులు వశపరచుకోలేదు.నేను శత్రువుల నుండి ఎటువంటి ధనము తీసుకోలేదు. నేనంత మిత్రద్రోహిని కాను. నేను తమరి వద్ద ఎంతో కాలము నుండి పని చేస్తున్నాను. మీరు నాకు చేసిన సహాయములను మరువలేను. నేను తమరి మంచి కోరి, తమరి ప్రాణములను శత్రువుల నుండి రక్షించడానికి ఈ పని చేసాను. నేను చేసిన పని మీకు ఇష్టము ఉండదని తెలుసు. కాని సారథిగా నా ధర్మము నేను నెరవేర్చాను. మీరు నన్ను అకారణంగా, ఒక దుర్మార్గుడిని దూషించినట్టు దూషించకండి. నేను యుద్ధరంగమునుండి తమరి రథమును ఎందుకుపక్కకు తీసుకొని వచ్చానో వివరంగా చెబుతాను వినండి.

తమరు శత్రువుతో యుద్ధముచేసి బాగా అలసి పోయారు. మీరు యుద్ధమునకు సుముఖంగా లేరని తెలుసుకున్నాను. అప్పుడు శత్రువు విజృంభించడం చూచాను. పైగా తమరి రథమునకు కట్టిన అశ్వములు కూడా బాగా అలసిపోయి ఉన్నాయి. రథమును వేగంగా లాగలేకుండా ఉన్నాయి. ఒక్కోసారి అసలు కదలడం లేదు. తరువాత నాకు దుశ్శకునములు కూడా గోచరించాయి. రాక్షసేంద్రా! మంచి సారథి రథికుని యొక్క పరిస్థితిని, అలసటను, ఉత్సాహమును

గమనించి రథము నడపాలి. రథికుని ముఖకళవళికలను బట్టి ఆయన మనసును తెలుసుకొని రథము నడపాలి. సారథి అయిన వాడు ఒక్క రథికుని మానసిక పరిస్థితులే కాదు. ఎదురుగా ఉన్న శత్రువు యొక్క బలాబలములను గమనించి కూడా రథము తోలాలి.

సారథి రథము తోలు మార్గమును కూడా నిశితంగా గమనించాలి. ఎప్పుడు శత్రువుకు దగ్గరగా వెళ్లాలి, ఎప్పుడు శత్రువుకు దూరంగా వెళ్లాలి అనే విషయమును సారథి తెలుసుకోనాలి. తమ యొక్క అలసటను తీర్చి మరలా తమరిని యుద్ధమునకు ఆయత్తము చేయు నిమిత్తము రథమును పక్కకు తీసుకొని వచ్చాను. ఒక తెలివైన సారథి ఆ పరిస్థితులలో ఏమి చెయ్యాలో అదే చేసాను. నేను తమరి మీద భక్తితో గౌరవంతోనే ఈ పని చేసాను కానీ, నా ఇష్టం వచ్చినట్టు చేయలేదు. ఇప్పుడు చెప్పండి. నేను ఏమి చేయాలో. తమరి రథమును తమరి ఇష్టం వచ్చినట్టు నడిపి తమరి ఋణం తీర్చుకుంటాను." అని పలికాడు సారథి.

రావణుడు కూడా బాగా ఆలోచించాడు. తానుకోపం పట్టలేక అన్నాడే కానీ, సారథి తప్పు ఏమీ లేదని తెలుసుకున్నాడు. "సారథీ! రథమును రాముని ఎదుటికి తీసుకొని వెళ్లు. ఈ రావణుడు శత్రువును చంపకుండా వెనుదిరిగి వెళ్లడు." అని అన్నాడు. సారథి అమితోత్సాహంతో రథమును రాముని వంకకు పరుగెత్తించాడు. క్షణకాలంలో రావణుని రథము రాముని ఎదుట నిలిచింది.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూటనాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నూట ఐదవ సర్గ.

రావణుడు అలసిపోయినట్టే రాముడు కూడా అలసిపోయాడు. అలసిన రావణుని సారథిపక్కకుతీసుకొని వెళ్లాడు. కాస్త విశ్రాంతి తీసుకొని రావణుడు మరలా యుద్ధానికి వచ్చాడు. కాని రాముడు రావణునితో యుద్ధం చేసే పరిస్థితిలో లేడు. పైనుండి రామరావణ యుద్ధాన్ని చూస్తున్న దేవతలు, గంధర్వులతో పాటు అగస్త్య మహాముని కూడా ఉన్నాడు. వెంటనే రామునికి సాయం చేయదలచి అగస్త్య మహాముని రాముని వద్దకు వచ్చాడు. రామునితో ఇలా అన్నాడు.

"రామా! ఈ సమయంలో నీకు ఒక మహా స్తోత్రము గురించి చెబుతాను. దానిని చక్కగా పఠించు. తీనిని పఠిస్తే శత్రువులతో చేసే యుద్ధంలో జయం కలుగుతుంది. దీనిపేరు ఆదిత్య హృదయము. దీనిని నిత్యమూ పఠిస్తే సకల శత్రువులను నాశనం చేస్తుంది. విజయం కలుగజేస్తుంది. కాని ఇది చాలా పవిత్రమైనది. అన్ని స్రోత్రములలో కెల్లా ఈ ఆదిత్య హృదయము చాలా మంగళకరమైనది. దీనివలన ఆయుష్షు కూడా వృద్ధిచెందుతుంది. దీనిని నీకు ఉపదేశిస్తాను. ఇది సూర్యుని గురించి చేసే స్తోత్రము. సూర్యుడు లోకముల కెల్లా ఆరాధ్యుడు. ప్రతి రోజూ ఉదయ పర్వతము మీద ఉదయిస్తాడు. ఒక్క మానవులే కాదు దేవతలు, గంధర్వులు, యక్షులు అందరూ సూర్యుని ఉపాసిస్తారు. లోకానికి కాంతిని, ప్రాణాన్ని ప్రసాదిస్తాడు సూర్యుడు. మీ వంశకర్త. అట్టి సూర్యుని ఆరాధించు. విజయం సాధించు. అని మొదలు పెట్టి అగస్త్యుడు రామునికి ఆదిత్య హృదయం ఉపదేశించాడు.

1.రశ్మిమన్తం సముద్యన్తం దేవాసురనమస్కృతం,
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరం
2.సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావన:
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభి:
3.ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివ: స్కన్ద: ప్రజాపతి:,
మహేన్ద్రో ధనద: కాలో యమ: సోమో హ్యపాంపతి:.
4.పితరో వసవ: సాధ్యా అశ్వినౌ మరుతోమను:
వాయుర్వహ్ని: ప్రజా: ప్రాణ ఋతుకర్తాప్రభాకర:
5.ఆదిత్య: సవితా సూర్య: ఖగ: పూషా గభస్తిమాన్
సువర్ణసదృశో భానుర్హిరణ్యరేతా దివాకర:
6.హరిదశ్వ: సహస్రార్చి: సప్తసప్తిర్మరీచిమాన్
తిమిరోన్మథన: శమ్భుస్త్వష్టా మార్తణ్డకో అంశుమాన్
7.హిరణ్యగర్భ: శిశిరస్తపనో అహస్కరో రవి:
అగ్నిగర్భో అదితే: పుత్ర: శఙ్ఖ: శిశిరనాశన:
8 వ్యోమనాథస్తమోభేదీఋగ్యజుసామపారగ:
ఘనవృష్టిరపాం మిత్రో విన్ధ్యవీథీప్లవంగమ:
9.అతపీ మణ్డలీ మృత్యు: పిఙ్గల: సర్వతాపన:
కవిర్విశ్వో మహాతేజా రక్త: సర్వభవోద్భవ:
10.నక్షత్రగ్రహతారాణామధిపో విశ్వభావన:
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమో2స్తుతే
11.నమ: పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయే నమ:
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమ:
12.జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమ:
నమోనమ: సహస్రాంశో ఆదిత్యాయ నమో నమ:

13.నమ ఉగ్రాయ వీరాయ సారఙ్గాయ నమోనమ:
నమ: పద్మప్రబోధాయ ప్రచణ్డాయ నమోऽస్తు తే.
14.బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమ:
15.తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమ:
16.తప్తచామీకరాభాయ హరయే విశ్వకర్మణే
నమస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే
17.నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభు:
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభి:
18.ఏష సుప్తేషుజాగర్తి భూతేషు పరినిష్ఠిత:
ఏష చైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్
19.దేవాశ్చ క్రతవశ్చైవ క్రతూనాంఫలమేవ చ
యాని కృత్యాని లోకేషు సర్వేషు పరమప్రభు:

ఓ రామా! ఇది ఆదిత్యహృదయము అనే స్తోత్రము. ఈ స్తోత్రమును ఆపదలలోగానీ, దుర్గమ ప్రదేశములలో ప్రయాణం చేయునప్పుడు గానీ, భయపడే సమయములలో గానీ, పఠిస్తే అతనికి ఏ భయమూ ఉండదు. విజయాన్ని పొందుతాడు. నీవు కూడా ఈ జగత్తునకు ప్రభువైన సూర్యుడిని పూజించు. ఈ ఆదిత్య హృదయ స్తోత్రమును మూడుమార్లు జపించు. రావణ సంహారం చెయ్యి. నీకు విజయం సిద్ధిస్తుంది." అని అగస్త్యుడు రామునికి ఆదిత్య హృదయము అనే స్తోత్రమును ఉపదేశించి వెళ్లిపోయాడు.

రాముడు చాలా సంతోషించాడు. ఆదిత్య హృదయమును నిశ్చలమైన మనస్సుతో ఏకాగ్రతతో మూడు సార్లు పఠించాడు. సూర్యుడికి నమస్కరించాడు. ధనుస్సును చేతిలోకి తీసుకున్నాడు. రావణుని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. తనను స్తోత్రము చేయుచున్న రాముని అనుగ్రహించాడు సూర్యుడు. త్వరగా రావణుని మీదికి యుద్ధమునకు వెళ్లు అని ప్రేరేపించాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూట ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## నూట ఆరవ సర్గ.

(ఇంత విషయం జరుగుతూ ఉంటే రావణుడు ఊరుకున్నాడా అని మీకు సందేహము రావచ్చు. కాని వాల్మీకి మహర్షి ఆ సందేహానికి మొదటి శ్లోకంలోనే సమాధానం చెప్పాడు. రాముడు యుద్ధానికి సిద్ధం అయేటప్పటికి రావణుని సారథి రథమును నడుపుకుంటూ రాముడి వద్దకు వచ్చాడు అని ప్రారంభించాడు. అంటే అక్కడ రావణుడు సారథిని తిట్టడం, సారథి సమాధానం ఇవ్వడం, రావణుడు తృప్తిపడటం జరిగే సమయంలో ఇక్కడ అగస్త్యుడు రావడం, ఆదిత్య హృదయం ఉపదేశించడం, రాముడు మూడుసార్లు పఠించడం జరిగాయి. ఇది సంభవమే కదా!)

రావణుని మాటలకు సారథి సంతోషించి రథమును నడుపుకుంటూ రాముని వద్దకు వచ్చాడు.  అమిత వేగంతో వస్తున్న రావణుని రథమును చూచాడు రాముడు. రావణుని రథమునకు నల్లని గుర్రములు కట్టబడి ఉన్నాయి. రావణుని ధనుస్సునుండి బాణములు వర్షంలా కురుస్తున్నాయి. అది చూచిన రాముడు సారథి మాతలితో ఇలా అన్నాడు.

"మాతలీ! అటు చూడు. రావణుడు మహావేగంతో యుద్ధానికి వస్తున్నాడు. బాణాలు వర్షంలా కురిపిస్తున్నాడు. నీవు కూడా మన రథమును రావణుని రథమునకు ఎదురుగా తీసుకొని వెళ్లు. ఈ రోజు రావణుని చరిత్ర సమాప్తమవుతుంది. జాగ్రత్తగా రథాన్ని నడుపు. ఇంద్రుని సారథివైన నీకు నేనుచెప్పబనిలేదు. నా ఏకాగ్రత దెబ్బతినకుండా రథమును నడపమని కోరుతున్నాను." అని అన్నాడు రాముడు.

రాముని మాటలలో ఆంతర్యమును గ్రహించిన మాతలి రాముని మనసును బట్టి రథమును నడుపుతున్నాడు. మాతలి ఒక్కసారి తన అశ్వములను ముందుకు ఉరికించాడు. దుమ్ములేపుకుంటూ రాముని రథము రావణుని రథం చుట్టు ప్రదక్షిణంగా తిరిగింది.  ఆ దుమ్ము రావణుని రథాన్ని కమ్మేసింది. ఆ చర్యకు కోపించిన రావణుడు రాముని మీద శరవర్షము కురిపించాడు. రాముడు ఇంద్రుడు తనకు పంపిన దివ్య ధనుస్సును చేతిలోకి తీసుకున్నాడు. ఇంద్రబాణములను సంధించాడు. రావణుని విచక్షణా రహితంగా కొట్టాడు. ఇద్దరి మధ్య పోరు ఘోరంగా జరిగింది. రెట్టించిన ఉత్సాహంతో పోరుతున్న రామరావణ యుద్ధము

చూడటానికి దేవతలు, గంధర్వులు,సిద్ధులు, మహర్షులు ఆకాశంలో నిలబడి ఉన్నారు.

ఇంతలో కొన్ని ఉత్పాతాలు కనిపించాయి. ప్రత్యేకించి రావణుని రథము మీద రక్తపు వర్షము కురిసింది. సుడి గాలి రావణుని రథమును చుట్టు తిరిగింది. ఆకాశంలో గ్రద్దలు ఎగురుతూ రావణుని రథం ఎటు తిరుగుతుందో అటు వేపుకు తిరుగుతున్నాయి. అప్పటికి సాయం సంధ్య అయింది. సాయంకాలపు ఎండ ఎర్రగా పడమటి దిక్కు మండుతున్నట్టు ఉంది. ఉరుములు ఉరుముతున్నాయి. ఉల్కలు ఆకాశంనుండి జారిపడుతున్నాయి. భూమి స్వల్పంగా కంపించింది. యుద్ధభూమిలో నక్కలు నోళ్లు తెరుచుకొని రావణుని రథం వంక చూస్తూ అరుస్తున్నాయి. యుద్ధభూమిలో గాలి విపరీతంగా వీస్తూ దుమ్ము లేస్తూ ఉంది. ఆ దుమ్ములో రావణునికి ఎదురుగా ఉన్న రాముని రథం సరిగా కనపడటం లేదు. ఆకాశంలో మేఘములు లేవు. కానీ ఉరుములు ఉరుముతున్నాయి. మెరుపులు మెరుస్తున్నాయి. పిడుగులు పడుతున్నాయి. చుట్టు చీకట్లు కమ్ముతున్నాయి. ఆకాశం అంతా దుమ్ముతో నిండిపోయింది. ధూళి మేఘాలు కమ్ముకున్నాయి. రావణుని రథమునకు కట్టిన గుర్రముల కళ్లనుండి నీళ్లు కారుతున్నాయి. ఈ అపశకునములు అన్నీ రావణుని వినాశనాన్ని, రాముని విజయాన్ని సూచిస్తున్నాయి. ఈ దుర్నిమిత్తములను చూచి రాముడు  ఈరోజు రావణుని వధ తప్పదు అని అనుకున్నాడు. తన పరాక్రమాన్ని ద్విగుణీకృతం చేసాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూట ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నూట ఏడవ సర్గ

రామ రావణయుద్ధము ఘోరంగా క్రూరంగా సాగుతూ ఉంది. ఆ యుగములోనే అది ఒక గొప్ప యుద్ధము. ఒక పక్క రామ రావణులు, మరొక పక్క వానర సేన రాక్షస సేన ఘోరంగా పోరాడుతున్నారు. ఒక పక్క నర, రాక్షసులు, మరొక పక్క వానర, రాక్షసులు. రామ రావణ యుద్ధం పాకాన పడింది. వానరులు రాక్షసులు యుద్ధం చేయడం మానేసారు. వారి వారి నాయకుల యుద్ధము చూస్తున్నారు. రాముడు రావణుడు ఎవరికి వారు తామే గెలుస్తామని అనుకుంటున్నారు.

రావణుడు తన బాణములను రాముని రథమునకు కట్టిన ధ్వజము మీదకు ప్రయోగించాడు. కాని రావణుని బాణములు శక్తివంతమైన ఇంద్రుని రథమును తాకకుండానే కిందపడ్డాయి. దానికి ప్రతిగా రాముడు రావణుని ధ్వజమునకు గురి చూచి కొట్టాడు. రాముని బాణము రావణుని రథమునకు కట్టిన ధ్వజమును విరిచింది. ధ్వజము కిందపడిపోయింది.

అది చూచిన రావణుడు రాముని మీద శరవర్షము కురిపించాడు. రాముని గుర్రములకు గురి చూచి కొట్టాడు. ఇంద్రుని రథమునకు కట్టిన ఆ అశ్వములు ఏమాత్రం తొణకలేదు. నిశ్చలంగా ఉన్నాయి. అది చూచిన రావణుడు కోపించి రాముని రథము మీద వాడి అయిన బాణములను ప్రయోగించాడు. రావణుడు తన మాయచేత బాణములనే కాకుండా గదలను, పరిఘలను,

చక్రములను, ముసలములను శూలములను ప్రయోగిస్తున్నట్టు భ్రమకల్పించాడు. రావణుని మాయవలన పెద్ద ధ్వని చేస్తూ ఆయుధములు, బాణములు రాముని మీదికి వర్షం లాగ పడుతున్నాయి.

రావణుడు రాముని వదిలి వానర సేన మీద మాయాయుద్ధము చేస్తున్నాడు. వేలకొలది బాణములు వర్షంలాగా పడుతున్నట్టు భ్రమకల్పించాడు. ఆ రోజు రావణుడు చావో బతుకో తేల్చుకోవాలని నిర్ణయించుకున్నాడు. రావణుని ప్రయాస చూచి రాముడు నవ్వుకున్నాడు. ఆ మాయాయుద్ధము మర్మము ఎరిగిన వాడు కాబట్టి రాముడు రావణుని మాయాయుద్ధమునకు భయపడ లేదు. రాముడు కూడా రావణుని బాణములకు తగు రీతిలో సమాధానం చెప్పాడు. తన బాణములతో రావణుని కప్పేసాడు. రాముడు రావణుడు వేసుకున్న బాణములు గురి తప్పకుండా ఒకరి బాణములతో ఒకటి కొట్టుకొని కిందపడిపోతూ ఉన్నాయి. వారిద్దరూ రెండు చేతులతో బాణములను సంధిస్తున్నారు. ఎడతెరిపి లేకుండా వర్షం కురిసినట్టు బాణములను వేసుకుంటున్నారు.

రావణుని గుర్రములను రాముడు కొడితే, రావణుడు రాముని గుర్రములను కొట్టాడు. ఒకరు చేసిన పని మరొకరు చేస్తున్నారు. బదులుకు బదులు తీర్చుకుంటున్నారు. రాముడు తన రథము మీద ఉన్న ధ్వజమును కూల్చడం చూచిన రావణుడు కోపంతో రగిలిపోయాడు. రాముని మీద వాడి అయిన బాణములను కురిపిస్తున్నాడు. వారి రథములు ఒక దాని చుట్టు ఒకటి గుండ్రంగా తిరుగుతున్నాయి. ఒకదానికి ఒకటి ఎదురు పడుతున్నాయి. అంతలోనే

పక్కకు తిరుగుతున్నాయి. ఒకరిని ఒకరు దెబ్బతీయాలని శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. కాని సాధ్యం కావడం లేదు. ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు. వారిరథములు ఎదురు ఎదురుగా నిలబడి ఒకదానితో ఒకటి ఢీకొంటున్నాయి.

రాముడు తన ధనుస్సునుండి నాలుగు వాడి అయిన బాణములతో రావణుని గుర్రములనుకొట్టాడు. ఆ దెబ్బకు రావణుని రథం వెనక్కు తగ్గింది. అది చూచిన రావణుడు రాముని రథాన్ని కూడా వెనక్కు నెట్టాడు. కాని రాముడు  ఏ మాత్రం తొట్రుపడకుండా రావణునితో యుద్ధం చేస్తున్నాడు. ఇలా కాదని రావణుడు మాతలి మీద వాడి అయిన బాణములను ప్రయోగించాడు. కాని ఆ బాణములు మాతలికి తగలకుండానే కిందపడిపోయాయి. ఎప్పుడైతే రావణుడు మాతలి మీద బాణప్రయోగం చేసాడో రాముడు మండిపడ్డాడు. రాముడు రావణుని రథము మీద వెయ్యిబాణములను ప్రయోగించాడు. దానికి ప్రతిగా రావణుడు రాముని రథము మీద గదలను ముసలములను ప్రయోగించాడు.

వారు ఒకరి మీద ఒకరు ప్రయోగించుకొను అస్త్రములతో లోకాలు తల్లడిల్లిపోతున్నాయి. ఇది చూచిన దేవతలు, గంధర్వులు, యక్షులు లోకాలకు ఏమవుతుందో అని చింతిస్తున్నారు. ఋషులు దేవతలు లోకముల శాంతి కొరకు   స్వస్తివాచకములు పలుకు తున్నారు. కాని రామరావణ యుద్ధము ఆగలేదు.

ఇంతలో రాముడు ఒక వాడి అయిన బాణమును రావణుని కంఠమునకు గురిపెట్టి కొట్టాడు. రావణుని తల కిరీటముతో సహా

భూమి మీద పడింది. కాని అంతలోనే రాముని శిరస్సు తెగిన చోట మరొక శిరస్సు పుట్టింది. రాముడు మరలా మరొక బాణంతో ఆ శిరస్సును కూడా తెగ నరికాడు. ఆ స్థానంలో మరొక శిరస్సు పుట్టింది. ఈ ప్రకారంగా రాముడు రావణుని శిరస్సులను తెగగొడుతుంటే, అదే స్థానంలో శిరస్సులు మొలుస్తున్నాయి. ఆ ప్రకారంగా నూరు సార్లు జరిగింది. రావణుడు యధాప్రకారము యుద్ధం చేస్తున్నాడు.

ఎన్ని సార్లు రావణుని శిరస్సు ఛేదించినా, రావణుడు చావకపోవడంతో రాముడు చింతాక్రాంతుడయ్యాడు. "ఏ బాణాలతో మారీచుని, ఖర,దూషణులను, కబంధుని, విరాధుని, వాలిని, సాలవృక్షములను ఛేదించానో, ఆ బాణములు రావణుని పట్ల వృధా అవుతున్నాయి. కారణం తెలియడం లేదు."అని ఆలోచిస్తూ రావణుని మీద బాణములను వర్షంలా కురిపిస్తున్నాడు రాముడు.

ఆ ప్రకారంగా రాముడికి రావణుడికి మధ్య ఏడురోజులు పగలు రాత్రి అనే విచక్షణ లేకుండా యుద్ధం జరిగింది. కాని గెలుపు ఎవరిదో తెలియడం లేదు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూట ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నూట ఎనిమిదవ సర్గ.

రామ రావణ యుద్ధమును నిశితంగా పరిశీలిస్తున్నాడు మాతలి. రామ రావణ యుద్ధము ఎంతటికీ ముగియడం లేదు. అప్పుడు మాతలి రామునితో ఇలా అన్నాడు. "రామా! ఏమిటి ఈ రాక్షసునితో ఇంతకాలం యుద్ధం కొనసాగిస్తున్నావు. నీకు ఏమీ తెలియకనా లేక తెలిసీ ఇలా చేస్తున్నావా! ఇతడు బ్రహ్మ వర ప్రసాది. ఇతనిని ఒక్క బ్రహ్మాస్త్రము తప్ప వేరు అస్త్రములు చంపలేవు. నీ వద్ద ఉన్న బ్రహ్మాస్త్రమును ప్రయోగించు. ఈ రాక్షసుని సంహరించు." అని గుర్తుచేసాడు మాతలి.

అగస్త్యుడు తనకు బ్రహ్మాస్త్రమును ఇచ్చిన సంగతి రామునికి గుర్తుకు వచ్చింది. తన అమ్ముల పొదిలో నుండి బ్రహ్మాస్త్రము ను బయటకు తీసాడు. ఆ బ్రహ్మాస్త్రమును పూర్వము బ్రహ్మ ఇంద్రునికి ఇచ్చాడు. ఆ బ్రహ్మాస్త్రమునకు  అగ్ని, సూర్యుడు, మేరు పర్వతము, మంధర పర్వతము అధిష్ఠాన దేవతలు. ఆ బ్రహ్మాస్త్రము అంతా బ్రహ్మ మయము. ఆ బ్రహ్మాస్త్రము బంగారు వర్ణంతో మెరుస్తూ ఉంటుంది. సకల భూతముల యొక్క తేజస్సు ఆ బ్రహ్మాస్త్రములో నిక్షిప్తమై ఉంది.

రాముడు ఆ బ్రహ్మాస్త్రమును అభిమంత్రించి ధనుస్సు మీద సంధించాడు. విల్లుత్రాటిని ఆకర్ణాంతము లాగి ఆ బ్రహ్మాస్త్రమును రావణునికి గురి చూచి ప్రయోగించాడు. రామునిచేత ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రము సూటిగా వెళ్లి రావణుని వక్షస్థములో గుచ్చుకుంది. రావణుని గుండెలు బద్దలయ్యాయి. ఆ బ్రహ్మాస్త్రము రావణుని

ప్రాణములను తీసుకొని భూమిలోకి ప్రవేశించింది. తరువాత పైకి లేచి తిరిగి వచ్చి రాముని అమ్ముల పొదిలోకి వచ్చి చేరింది.

బ్రహ్మాస్త్రము చేత రావణుడు సంహరింపబడ్డాడు.

రావణుడు తన రథము నుండి నేల మీదికి దొర్లాడు. రావణుడు మరణించి భూమి మీద పడటం చూచిన రాక్షస సేనలు భయభ్రాంతులయ్యాయి. అన్ని దిక్కులకూ పారిపోయాయి. వానర సేనలు రాక్షసులను తరిమి తరిమి కొట్టారు. రావణుని మరణం చూచిన వానర సేనలు హర్షధ్వానాలు చేసారు. రాక్షస సేనలు పారిపోయి లంకలో ప్రవేశించాయి. ఆకాశంలో దేవ దుందుభులు మోగాయి. పూల వర్షము కురిసింది. దేవతలందరూ రాక్షస సంహారం చేసిన రాముని స్తుతించారు. సుగ్రీవుడు, అంగదుడు, లక్ష్మణుడు, ఇతర వానర ప్రముఖులు రావణుని సంహరించినందుకు గాను రాముడిని ప్రశంసలతో ముంచెత్తారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూట ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## నూటతొమ్మిదవ సర్గ.

సకలభోగములు అనుభవించిన రాక్షస చక్రవర్తి, లంకాధినేత, ముల్లోకములను గడగడలాడించిన వీరుడు, రావణుడు నేల మీద దిక్కులేకుండా పడిఉండటం చూచిన రావణుని తమ్ముడు

విభీషణుడు ఎంతో వ్యధ చెందాడు. శోకం కట్టలు తెంచుకుంది. చెప్పిన మాట వినకుండా కోరి కోరి మరణాన్ని కొనితెచ్చుకున్న అన్నను చూచి శోకిస్తున్నాడు విభీషణుడు. రావణుని మృత దేహం పక్కన కూర్చుని ఇలా విలపిస్తున్నాడు.

"ఓ మహా వీరా! రావణా! పట్టు పరుపుల మీద హంస తూలికా తల్పముల మీద శయనించవలసిన వాడవు ఇలా భూమి మీద శయనించి ఉన్నావా! అయ్యో పూజాగృహములో పూజింపబడ్డ నీ కిరీటము నేల మీద దొర్లుతూ ఉంది గదా! అన్నా రావణా! నేను నీకు ఎన్నోసార్లు చెప్పాను రాముడి చేతిలో నీకు మరణం తప్పదని. నా మాటలు నీకు రుచించలేదు. ఇవ్వాళ అదే జరిగింది. నాడు నేను చెప్పిన మాటలను నీవు గానీ, ప్రహస్తుడు, ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు, అతికాయుడు ఎవరూ అంగీకరించలేదు. కాని దాని ఫలితం ఈ రోజు కనపడింది కదా! రావణా! నీవు నీతి కోవిదుడవు. ధర్మాత్ముడవు. బలవంతుడవు. కాని ఒక్క స్త్రీలోలత్వము నీలోని అన్ని మంచి గుణములను నశింపచేసింది. ముల్లోకాలలో ఎవరికీ తలవంచని రావణుడు ఈ నాడు దిక్కులేకుండా నేల మీద పడి ఉన్నాడు. రావణుడు అనే మదగజము రాముడు అనే సింహము చేత కొట్టబడి నేల మీద పడుకున్నట్టు ఉంది." అని పరి పరి విధముల అన్న రావణుని గుణ గణములను, ధైర్య, పరాక్రమములను తలచుకొని ఏడుస్తున్నాడు విభీషణుడు.

విభీషణుడు ఇలా శోకించడం చూచాడు రాముడు. విభీషణుని ఓదార్చాడు. "మిత్రమా విభీషణా! నీ అన్న రావణుడు మహా వీరుడు. తన పరాక్రమాన్ని వీరత్వాన్ని చూపాడు. యుద్ధం లో

మరణించాడు కానీ పిరికి వాడి మాదిరి పారిపోయి మరణించలేదు. భయం అనేది తెలియని రావణుడు, వీరోచితంగా మరణించాడు. ఆ ప్రకారంగా వీరోచితంగా మరణించిన వారి గురించి శోకించడం నీ వంటి బుద్ధిమంతులకు తగదు.

విభీషణా! నీ అన్న రావణుడు సామాన్యుడు కాదు. ముల్లోకములను గడగడలాడించాడు. అట్టి వీరుని మరణమునకు దు:ఖించడం తగదు. యుద్ధము అన్న తరువాత చంపడం చావడం అనేవి రెండే ఉంటాయి. అందుకని యుద్ధములో వీరోచితంగా మరణించడం వీరునికి ఉచితమైనది. అటువంటి శూరుడిని గూర్చి విచారించకూడదు. కాబట్టి విభీషణా! నీ శోకము మాని కాగల కార్యమును గురించి విచారించు." అని అన్నాడు రాముడు.

రాముని ఓదార్పు మాటలతో కొద్దిగా ఉపశమించాడు విభీషణుడు.

"రామా! నా అన్న రావణుడు దేవతలకు, గంధర్వులకు, యక్షులకు భయపడలేదు. వారిచేతిలో ఎన్నడూ ఓడిపోలేదు. కాని నీ చేతిలో ఓడిపోయాడు. నా అన్న రావణుడు ఎన్నో యజ్ఞములు యాగములు చేసాడు. దానధర్మాలు చేసాడు. తపస్సుచేసాడు. వేదములను కూలంకషంగా అభ్యసించాడు. వైదిక కర్మలు నిష్టతో చేసాడు. అటువంటి నా అన్నకు ఇప్పుడు నేను మరణానంతర క్రియలను నీ అనుమతితో నెరవేర్చవలసి ఉన్నది. నీ అనుజ్ఞ కోసరం ఎదురుచూస్తున్నాను." అని అన్నాడు.

"విభీషణా! నీ అన్న రావణునితో నా వైరము రావణుని మరణంతోనే సమసిపోయింది. రావణుడు నీ మాదిరి నాకు కూడా సోదరుడే. ఆయన స్వర్గలోక ప్రాప్తికొరకు అంతిమ సంస్కారములు యధావిధిగా నెరవేర్చు." అని అనుజ్ఞ ఇచ్చాడు రాముడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూటతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూటపదవ సర్గ.

రావణుని మరణం గురించి లంకలోని అంత:పుర స్త్రీలకు తెలిసింది. వారి దు:ఖానికి అంతులేదు. వారు అంత:పురము నుండి బయటకు వచ్చారు. లంకానగర ఉత్తర ద్వారము వద్దకు వచ్చారు. రణరంగమును సమీపించారు. రావణుడు విగత జీవుడై పడి ఉన్న చోటికి వచ్చారు. పెద్దది నల్లనిది అయిన రావణుని మృతదేహం చూడగానే వారి దు:ఖము కట్టలు తెంచుకుంది. భోరున విలపించారు. రావణుని శరీరం మీద పడి తలలు బాదుకుంటున్నారు.

ఒకామె రావణుని కౌగలించుకొని ఏడుస్తూ ఉంది. మరొకామె రావణుని పాదములను పట్టుకొని ఏడుస్తూ ఉంది. మరొకామె రావణుని తలను ఒడిలో పెట్టుకొని ఏడుస్తూ ఉంది. ఒకామె నేల మీద దొర్లి దొర్లి ఏడుస్తూ ఉంది. మరొక స్త్రీ రావణుని మృతదేహాన్ని

చూచి మూర్ఛపోయింది. ఒకామె తన కన్నీటితో రావణుని ముఖాన్ని తడుపుతూ ఉంది. ఈ విధంగా రావణుని భార్యలు వలా వలా ఏడుస్తున్నారు.

"ఎవడైతే దేవేంద్రుడిని భయపెట్టాడో,ఎవడైతే కుబేరుని జయించి అతని వద్దనుండి పుష్పకమును తీసుకొని వచ్చాడో, ఎవడైతే గంధర్వులకు, ఋషులకు సింహస్వప్నంగా నిలిచాడో, ఎవడైతే దేవతలను యుద్ధంలో ఓడించాడో ఆ రావణుడు, నేడు నేల మీద దిక్కులేకుండా దుమ్ములో ధూళిలో పడి ఉన్నాడు. ఎంత విధివైచిత్ర్యము. ఏ రావణుడికి దేవతలన్నా గంధర్వులన్నా యక్షులన్నా ఏ మాత్రం భయం లేదో అట్టి రావణుడు ఒక మానవునికి భయపడ్డాడు. ఏ రావణుడైతే దేవ, దానవ, యక్ష, గంధర్వులకు చంపశక్యము కాడో అట్టి రావణుడు ఒక సామాన్య మానవునిచేత చంపబడ్డాడు. విధి బలీయము కదా!"అని రావణుని భార్యలు విలపిస్తున్నారు.

మరి కొందరు రావణుని చేష్టలను నిందిస్తున్నారు. "ఓ ప్రభూ! నీకు ఇంత మంది మంత్రులు, మిత్రులుఉన్నారు కదా! వారి మాటలు వినకుండా సీతను ఎందుకు అపహరించి తెచ్చావు. నీ చావును నీవే అపహరించి తెచ్చుకున్నావా! నీవు చావడమే కాదు కోట్ల కొలది రాక్షసుల మృతికి కారణమైనావు. పోనీ సీతను అపహరించావు. ఆమెను అనుభవించావా! అదీ లేదు! నీ తమ్ముడు విభీషణుడు ఎన్నోసార్లు చెప్పాడు కదా సీతను రామునికి అప్పగించి లంకను రక్షించమని. నీవు ఆయన మాటలు వినలేదు. ఫలితం మేము విధవలము అయ్యాము. లంకా నగరం అంతా విధవరాండ్రతో నిండి పోయింది. నీ మూర్ఖత్వానికి ఫలితం ఇదేనా! నీవు విభీషణుని మాట

విని ఉంటే మాకు, లంకానగరస్త్రీలకు వైధవ్యము తప్పిఉండేది కదా! నీవు అపహరించింది, బంధించింది ఒక్క సీతనే. కాని దానికి ఫలితం మేమంతా అనుభవించాము.

అయినా నిన్ను అనుకొని ఏమి లాభము. ఆ దైవమే నీచేత ఈ పనులు చేయించింది. లేకపోతే సకల శాస్త్రపారంగతుడివి, శివపూజాదురంధరుడివి నీవు ఒక సామాన్య మానవ స్త్రీకోసం పాకులాడటం ఏమిటి. విపరీతం కాకపోతే! యుగాంతం సంభవించింది. వానరులు రాక్షసులు ఒకరితో ఒకరు కొట్టుకొని చచ్చారు. ఇదంతా దైవఘటన తప్ప వేరు కాదు. దైవనిర్ణయమును ఏమి చేసినా మార్చలేము కదా!"అని కొంతమంది వేదాంతమును వల్లిస్తూ ఏడుస్తున్నారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూటపదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## నూటపదకొండవ సర్గ.

ఇంతమంది రావణుని భార్యలు ఇలా విలపిస్తూ ఉంటే రావణుని పట్టమహిషి పెద్ద భార్య మండోదరి మౌనంగా నిలబడిఉంది. లోలోపల దు:ఖపడుతూ ఉంది. రాముని చేతిలో మరణించిన తన భర్తరావణుని చూచి లోలోపల కుమిలిపోతూ ఉంది.

" మహారాజా! నీవు దీర్ఘబాహువు. కుబేరుని తమ్ముడివి. నీకు దేవేంద్రుడు కూడా భయపడతాడు. నీ పరాక్రమానికి భయపడి ఋషులు, మునులు, గంధర్వులు దిక్కుతోచకుండా పారిపోయారు. అటువంటి పరాక్రమ వంతుడివి.... ఒక మానవుని చేతిలో మరణించినందుకు సిగ్గుపడటం లేదా! ముల్లోకములను గడగడ లాడించిన నిన్ను అడవులు పట్టి తిరిగే మానవుడు ఒకడు ఎలా చంపగలిగాడు! ఆశ్చర్యంగా లేదూ!

సందర్భాన్ని బట్టి రూపాలను మారుస్తూ, మనుష్యులు కూడా అడుగుపెట్టలేని ప్రదేశములలోకూడా సంచరించే నీవు మానవుడైన రాముని చేతిలో చావడం ఏం బాగాలేదు. నీ సైనిక బలం సామాన్యమైనది కాదు. అపారమైనది. నీవు కూడా మహాపరాక్రమ వంతుడివి. నీవు యుద్ధంలో నిలబడితే నీ ఎదుట బడటానికి ఎవరూ సాహసించరు. అట్టినిన్ను ఒక మానవుడు రాముడు చంపగలిగాడు అంటే నమ్మలేకపోతున్నాను.

జనస్థానములో నీ సోదరుడు ఖరుని, 14,000 మంది రాక్షసులను చంపాడు అని తెలిసినపుడే రాముని శక్తిని గురించి నీవు తెలుసుకొని ఉండాల్సింది. రాముడు మానవ మాత్రుడు కాడు ఏదో దైవశక్తి అని ఊహించి తగు చర్యలు తీసుకోవాల్సింది. దేవతలు కూడా ప్రవేశించడానికి భయపడే లంకానగరంలో ఒక వానరము ప్రవేశించి, అక్షకుమారుని చంపి, లంకను తగలపెట్టిన నాడే మేము కీడును శంకించాము. వానరులు నూరుయోజనముల దూరము వారధిని కట్టి లంకలో ప్రవేశించారు అని విన్న నాడే నాకు రాముడు సాధారణ

మానవుడుకాడు అని  అనుమానం కలిగింది. సాక్షాత్తు యమధర్మరాజే నిన్ను చంపడానికి రాముని రూపంలో వచ్చాడా అని నాకు అనుమానంగా ఉంది.

నిన్ను చూడ్డానికి కూడా భయపడే దేవేంద్రుడు ఇంత పని చేయలేడు. దేవేంద్రునికి అంత శక్తి లేదు. కాని ఒక మానవమాత్రుడైన రాముడు నిన్ను చంపలేడు. కాబట్టి నిన్ను చంపిన రాముడు ఒక మహాయోగి, చావు లేని వాడు, ఎల్లప్పుడూ ఉండే వాడు, ఆది అంతము లేని వాడు, సర్వజనపోషకుడు, శంఖచక్రగదాధారి, శ్రీవత్సమను మచ్చను వక్షమున కలిగిన వాడు. లక్ష్మీసమేతుడు అయిన ఆ పరమాత్మ తప్ప వేరు కాదు. ఈ వానరులు అంతా రాముని సాయం చేయడానికి వచ్చిన దేవతామూర్తులు. కాబట్టే ఇంత మంది రాక్షసులను సంహరించి నిన్నుకూడా చంపగలిగాడు. వేరొకరికి సాధ్యం కాని పని తాను చేసాడు.

ఓ నాథా! పూర్వము నీవు బ్రహ్మ గురించి, శివుని గురించి తపస్సు చేసినపుడు నీ ఇంద్రియములను అదుపులో పెట్టుకున్నావు. కాని ఇప్పుడా ఆ ఇంద్రియముల వలన పుట్టిన కోరికలే నిన్ను జయించాయి. నిన్ను, నీతోపాటు లంకను సర్వనాశనం చేసాయి. నీకు గుర్తు ఉందో లేదో! నేను కూడా నీతో,  రామునితో మైత్రి చేసుకోమని, సీతను రాముని వద్దకు పంపమనీ, చెప్పాను. కానీ నీవు వినలేదు. ఫలితం అనుభవించావు.

ఓ లంకాధిపా! నీ నాశనమును నీవే సీతరూపంలో కొని తెచ్చుకున్నావు. నీ ఐశ్వర్యము, నీ సంపదలు, నీ బంధుజనము నాశనం

అవడానికే నీవు సీతను తెచ్చి లంకలో పెట్టావు. నీకు సీత మీద కోరిక పుట్టింది నీ నాశనానికే అని గ్రహించలేకపోయావు.

సీత అంటే ఎవరనుకున్నావు. లోకముల అన్నింటి చేతా ఆరాధింపతగినది. భూదేవికే క్షమాగుణం నేర్పగల నేర్పరి. లక్ష్మికే లక్ష్మి. ఆమెకు భర్త అంటే అంతులేని ప్రేమ. వెతికిచూచినా ఆమెలో ఎట్టిదోషము కనపడదు.  అటువంటి సీత మీద చెయ్యివేసావు. తన మానాన తాను అడవిలో కందమూలములు తిని బతుకుతున్న సీతను పనిగట్టుకొని అపహరించావు.  ఫలితం అనుభవించావు. సీతను అనుభవించాలి అని అనుకోవడమే నీ మరణానికి కారణం. నిన్ను రాముడు చంపలేదు. సీత పాతివ్రత్యము చేతనే నువ్వు చంపబడ్డావు.

ప్రతి వాడికీ మంచి పనికి మంచి ఫలము, చెడ్డ పనికి చెడ్డఫలము ఇంద్రుడు, అగ్ని మొదలగు దేవతలు ఇస్తూ ఉంటారు. నీకు కూడా సీతను అపహరించగానే నీకు తగిన ఫలం ఇవ్వాల్సిఉంది. కాని దేవతలు నీకు భయపడి ఆచెడ్డఫలమును నీకు ఇవ్వలేదు. అందుకే ఇన్నాళ్లు బతికావు.  దేవతలు భయపడ్డా కాలము భయపడదు కదా. నీకు ఇప్పుడు కాలం సమీపించింది. పోయావు. విభీషణుడు మంచి కార్యములు చేసాడు. లంకకు రాజు కాబోతున్నాడు. నీవు చెడ్డ కార్యములు చేసావు లంకాధిపతిగా పరిపాలించే అర్హతను కోల్పోయావు.

నాధా! నీకు సౌందర్యవతులైన స్త్రీలకు కొదవ ఏమున్నది. నీ అంత:పురము నిండా వివిధజాతులకు చెందిన  లోకోత్తర సౌందర్యవతులు కోకొల్లలుగా ఉన్నారు. కాని నిన్ను కామపిశాచి

ఆవహించినది. వారి సౌందర్యము నీ కంటపడలేదు.

అంత దాకా ఎందుకు. అందములో గానీ, ఐశ్వర్యములో గానీ, వంశములో గానీ ఆ సీత నా కాలి గోటికి కూడా సరిపోదు. ఎదురుగా ఉన్న నన్ను వదిలి నీవు ఆ సీత వెంట బడ్డావు. నీ అజ్ఞానము కాక మరేమున్నది. పుట్టడం యాదృచ్ఛికమే కానీ చావు మాత్రం ఏదో కారణం లేనిది రాదు. నీకు సీత రూపంలో నీ మరణం సంభవించింది. నీకు మృత్యువు ఆసన్నం కాబట్టే ఎక్కడో దండకారణ్యంలో జనస్థానంలో తన మానానతాను కందమూలములు తిని బతుకుతున్న సీతను మోసంతో అపహరించి తెచ్చావు. నీ చావును నీవే తెచ్చి నీ పక్కనే పెట్టుకున్నావు. అదును చూచి ఆ చావు నిన్ను మానుండి అపహరించింది.

ఓ లంకేశ్వరా! నేను నీ తో కలిసి విమానముల మీద కైలాసపర్వతము మీద, మేరు పర్వతము మీద, ఉద్యానవనములలోనూ, విహరించాను. ఎన్నోదేశములు తిరిగాను అక్కడి వింతలు విశేషాలు చూచాను. నీ మరణంతో నా వైభవము అంతా అంతరించింది. వైధవ్యము ప్రాప్తించింది. నీ కామ కోరికలకు నేను బలి అయ్యాను. రాచభోగములు చంచలములు అని తెలుసుకోలేకపోయాను.

నాధా! ప్రతిరోజూ అందమైన వస్త్రములు ధరించి, మైపూతలు పూసుకొని, మద్యము సేవిస్తూ హంసతూలికా తల్పము మీద పరుండే వాడివి ఇప్పుడు ఈ కటికనేలమీద, దుమ్ములో ధూళిలో పడుకొని ఉన్నావా! విధి ఎంత చిత్రమైనది. ఇన్నాళ్లు నీ తో కూడి సురలోకభోగములు అనుభవించాను. అవన్నీ శాశ్వతము

అనుకున్నాను. నీకు మరణమే లేదనుకున్నాను. కానీ నీ అకాల మరణంతో నాకు వైధవ్యము ప్రాప్తిస్తుందని కలలో కూడా ఊహించలేదు. నా తండ్రి దానవులకు ప్రభువు అనీ, నాభర్త రాక్షసులకు ప్రభువుఅనీ, దేవతలను జయించినవాడు అనీ గర్వంతో తలెత్తుకు తిరిగేదాన్ని. నా తండ్రికి గానీ, నా భర్తకు గానీ ముల్లోకము లలో ఎదురు లేదని అనుకొనేదాన్ని. అటువంటి నీకు ఒక మానవుని వలన ఈ భయం ఎలా వచ్చిందో అర్థం కాకుండా ఉంది.

ఆలోచిస్తుంటే ఇదంతా ఒక స్వప్నంలా ఉంది. నిజంగా నువ్వు చచ్చిపోయావా! నీవు మరణించావు అంటే నమ్మలేకుండా ఉన్నాను. అదీ ఒక మానవుడు అయిన రాముని చేత చంపబడ్డావు అంటే నమ్మశక్యంగా లేదు. మృత్యువుకే మృత్యువుగా ప్రసిద్ధిచెందిన నీవు ఆమృత్యువుకే లొంగిపోయావా!

నా భర్త రావణుడు సామాన్యుడు కాడు. మూడు లోకములలో ఉన్న ఐశ్వర్యముల నన్నిటినీ తన పాదాక్రాంతము చేసుకున్నవాడు. మూడు లోకములను భయపెట్టినవాడు. దిక్పాలకులను తన వాకిట నిలబెట్టినవాడు. కైలాసపర్వతమును కదిపినవాడు. తన ఎదుట ఎవడైనా గర్వంతో నిలబడితే వాడి గర్వాన్ని హరించిన వాడు. శత్రువులను సంహరించి తన వాళ్లను రక్షించుకొనేవాడు. దానవులను, యక్షులను సంహరించిన వాడు. రాక్షసజాతిని రక్షించిన వాడు. నా భర్త ఋషులు చేసే యజ్ఞములను పాడు చేసేవాడు. అధర్మాన్ని ఆచరించేవాడు. మాయాయుద్ధంలో నిపుణుడు. ఏయే దేశాలను జయిస్తాడో ఆయాదేశాల నుండి

దేవ,దానవ,గంధర్వ కన్యలను తీసుకొచ్చి అనుభవించినవాడు. ఈ లంకా ద్వీపమునకు రక్షకుడు. ఇట్టి నా భర్తను రాముడు చంపాడు అంటే ఎలా నమ్మడం. అలాంటి భర్త మరణించి శవంగా నేల మీద పడి ఉండటం చూచిన నేను ఇంకా బతికి ఉన్నాను అంటే ఎలా నమ్మడం. నేను చాలా మొండిదానను అందుకే ఇంత ఘోరం జరిగినా ఇంకా బతికి ఉన్నాను.

ఓ రాక్షస రాజా! ఈ దుమ్ములో ధూళిలో ఎలా పడుకొని ఉన్నావయ్యా! అలా పడుకోడానికి నీకు మనసు ఎలా ఒప్పిందయ్యా! నీ కుమారుడు ఇంద్రజిత్తును లక్ష్మణుడు చంపినపుడే నేను సగం మరణించాను. నీ మరణంతో పూర్తిగా మరణించాను. జీవచ్ఛవంలా మిగిలి ఉన్నాను. నీవు లేకుండా, నీతో కామభోగములు అనుభవించకుండా శేషజీవితం అంతా దు:ఖిస్తూ, జీవచ్ఛవంలా బతకాలా నేను. నా వల్ల కాదు. కాబట్టి నేను కూడా నీ వెంట వస్తాను. నన్ను కూడా నీ వెంట తీసుకొని వెళ్లు. అసలు నన్ను ఒంటరిగా ఇక్కడ వదిలిపెట్టి నీవు ఎలా వెళ్లగలిగావు. నేను ఇంతగా విలపిస్తున్నా నాతో ఒక్కమాట కూడా మాట్లాడటం లేదు ఎందుకని.

అంత:పురంలో ఉన్న నేను నీవు మరణించావని తెలియగానే మేలి ముసుగు కూడా లేకుండా, పాదచారిన్నై పరుగుపరుగున వచ్చానని నా మీద కోపమా నాథా! నేనే కాదు. అటు చూడు. నీ భార్యలందరూ రాచమర్యాదలను అతిక్రమించి ఎలా నీ కోసం విలపిస్తున్నారో ఒక్కసారి చూడు. నాతో పాటు వాళ్లను కూడా కోప్పడు. వాళ్లను కూడా నిందించు. నీ కోసరం వాళ్లందరూ ఎలా కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నారో చూడు. వాళ్లను ఓదార్చు. వాళ్లంటే నీకు

ఇష్టం లేదా! ఉంటే ఎందుకు వారితో మాట్లాడవు.

నాథా! నాకు ఒకటి తోస్తూ ఉంది. నీవు ఎంతమందినో చంపి ఉంటావు. వారి భార్యలలో ఎంతో మంది పతివ్రతలు ఉండి ఉంటారు. వారి శాపములు అన్నీ నీకు తగిలి ఉంటాయి. వారు కార్చిన కన్నీరు వృథా పోతుందా! అందుకే ఇలా అకాలమరణం చెందావు. మా అందరినీ విధవలను చేసావు.

ఇంతకూ నాకు అర్థం కాని విషయం ఏమిటంటే... మూడులోకములను జయించిన నీవు, అత్యంత పరాక్రమవంతుడ వైన నీవు, ఒక ఆడుదానిని ఎలా దొంగతనంగా తీసుకొని వచ్చావు? ధైర్యంగా ఆమె భర్తకు తెలిసే తీసుకురావచ్చు కదా! నీవు ఇంత పిరికివాడికి అని నాకు తెలియదు. నీవు ఎప్పుడుకానీ, ఏ యుద్ధములో కానీ, ఎవరికి కానీ భయపడినట్టు నాకు తెలియదు. కానీ, సీత భర్తకు భయపడ్డావు. అదే నీ పాలిటమృత్యువు అయింది. నీవు సీతను తీసుకురాగానే నీ తమ్ముడు విభీషణుడు బాగా ఆలోచించి నీ స్త్రీ వ్యామోహంతో లంకానగరానికి చేటు వచ్చింది అని అన్నాడుకదా! ఆనాడు విభీషణుని మాట ఎందుకు వినలేదు? ఈ రాక్షస కులమును ఎందుకు సర్వనాశనం చేసావు?

నాథా! నీవు వీరమరణం పొందావు. నిజానికి నీ గురించి నేను దు:ఖించకూడదు. శోకించకూడదు.. విచారించకూడదు. కాని నేను స్త్రీని. నీ భార్యను. అందుకే దు:ఖము ఆపుకోలేక ఏమోమో అంటున్నాను. నామనస్సు మనసులో లేదు. నీవు పుణ్యం చేసావు. పాపాలు చేసావు. నీ పుణ్యపాపములను మోసుకొని నీ దారిన నీవు

వెళ్లిపోయావు. నీ మరణం చేత నాకు దు:ఖం మిగిలింది. అందుకే ఈ విచారమంతా!

ఆనాడు నీ బంధుమిత్రులు చెప్పిన మాటలు విని ఉంటే నీకు మాకు లంకకు ఇంతచేటు దాపురించదు కదా! కనీసం నీ తమ్ముడు విభీషణుని మాటలు విన్నా బాగుపడి ఉండేవాడివి. మాకు ఈ దు:ఖము కలిగేది కాదు. నాడు మారీచుని మాట విన్నా బాగుండేది. నా మాట విన్నా బాగుండేది. కనీసం నా తండ్రి గారి మాట విన్నా బాగుండేది. ఇంత అనర్థము జరిగేది కాదు. ఎవరి మాటా వినని ఫలితం ఈ నాడు అనుభవిస్తున్నావు.

ఏమిటి నాధా ఇది! నేను ఇంతగా అడుగుతుంటే. శోకిస్తుంటే, ఆ ప్రకారం దుమ్ములో ధూళిలో పడి ఉన్నావు కానీ ఒక్క మాట కూడా అనడం లేదు. నా మీద కోపమా నాధా! పోనీ నిద్రపోతున్నావా! నేను మేల్కొలుపుతున్నాను కదా! మరి నిద్రలేవవా! నాతో మాట్లాడవా! యుద్ధములో  ఎన్నడూ భయంతో వెనుకంజవేయని నీవు నాతో మాట్లాడటానికి భయపడుతున్నావా! నీకు భయపడి సూర్యుడు ఎన్నడూ లంకలో తన కిరణములను తీక్షణంగా ప్రసరించలేదు. ఈ నాడు నీవు లేవని చూడు సూర్యుడు ఎంత తీవ్రంగా ప్రకాశిస్తున్నాడో!

నాధా! నాకన్నా ఈ యుద్ధభూమి ఎక్కువయిందా. ఈ ప్రకారంగా గాఢంగా కౌగలించుకొని పడుకొని ఉన్నావు. కనీసం నాతో ఒక్కమాట కూడా మాట్లాడటం లేదు. నా కన్నా భూమి ఎక్కువ అయిందా నీకు. అవునులే. నేనుకఠినాత్మురాలను.  అందుకే నీవు నాతో

మాట్లాడటం లేదు. లేకపోతే నీ మరణం కళ్లారా చూచి కూడా నా గుండెలు బద్దలు కాలేదంటే నా గుండె బండరాయి కన్నా కఠినం కదా! " అని రావణుని శరీరం మీద పడి మండోదరి పరిపరి విధాల విలపిస్తూ ఉంది.

అలా ఏడ్చి ఏడ్చి రావణుని వక్షస్థలముమీద పడి మూర్ఛపోయింది. రావణుని భార్యలు ఆమెను లేపి కూర్చుండబెట్టి సేదదీర్చారు. ఆమెనుమంచి మాటలతో ఓదారుస్తున్నారు.

"అమ్మా మండోదరీ! నీకు తెలియనిది ఏమున్నది. ఈ లోకమే అస్థిరము కదా. మరి ఈ లోకములో ఉన్న జీవులు కూడా అస్థిరములే కదా. ఈ జీవుల ఐశ్వర్యములు భోగభాగ్యములు కూడా అస్థిరములు, చంచలములే కదా. నిన్న ఉన్న రాచభోగములు ఈ రోజు లేవు కదా. విధి వైపరీత్యము. వీటి కోసరం మనము శోకించి ప్రయోజనము లేదు." అని మండోదరిని ఓదారుస్తున్నారు. కాని మండోదరి ఏడుపు మానలేదు.

ఇదంతా చూస్తున్న రాముడు విభీషణుని చూచి ఇలా అన్నాడు. "మిత్రమా విభీషణా! నీవు రావణుని భార్యలను ఓదార్చు. నీ అన్న రావణునికి అంతిమ సంస్కారములకు ఏర్పాట్లు చెయ్యి." అని అన్నాడు.

"రామా! నా అన్న ధర్మము తప్పాడు. అతి క్రూరుడుగా ప్రవర్తించాడు. సత్యము పలకడానికి ఏనాడూ ఆసక్తి చూపలేదు. ఇతరుల భార్యల పట్ల మక్కువ పెంచుకున్నాడు. ఇటువంటి దుర్మార్గునికి అంతిమసంస్కారములు నేను చేయలేను. నా కన్నా పెద్దవాడు.

కాదనను. కానీ, ఇతడు పెద్దవాడు, పూజ్యుడు అని చెప్ప తగ్గ వాడు కాదు. మంచి మాటలు చెప్పినందుకు నన్ను రాజ్యము నుండి వెళ్లగొట్టాడు. ఇతడు నాకు సోదరరూపంలో ఉన్న శత్రువు. కాని ఒక విషయానికి నేను భయపడుతున్నాను. ఇతని కుమారులందరూ చని పోయారు. నేను తప్ప రావణునికి అంతిమ సంస్కారములు చేయడానికి ఎవరూ లేరు. ఇప్పుడు నేను నిరాకరిస్తే లోకం అంతా నన్ను కనీసము అన్నకు అగ్ని సంస్కారము చేయనందుకు నిందిస్తుంది. కాని లోకం ఇటువంటి దుర్మార్గుడికి అంతిమ సంస్కారములు చేయ నిరాకరించినందుకు నన్ను పొగుడుతుంది కూడా. నిర్ణయం నీది. నీవు ఏమి చెయ్యమంటే అది చేస్తాను." అని అన్నాడు విభీషణుడు.

అప్పుడు రాముడు ఇలా అన్నాడు. "విభీషణా! నేను నీకు మిత్రుడను కదా. నీ సహాయము వలననే నేను లంకను జయించగలిగాను. నీ అన్న రావణుడు అధర్మ వర్తనుడు, అసత్యవాది కావచ్చును. కానీ ఇతడు మహాపరాక్రమ వంతుడు శూరుడు. వీరుడు. యుద్ధములో వీరుడిగా మరణించాడు. ఇతనిని సాక్షాత్తు దేవేంద్రుడు కూడా జయించలేకపోయాడని విన్నాము కదా! పైగా అతడు నీకు అన్న. నీ చేత దహన సంస్కారములు చేయించుకొనే అర్హత అతనికి ఉంది. దానిని నీవు కాదనలేవు. ఇటువంటి వీరునికి దహన సంస్కారములు చేస్తే నీకు కీర్తిప్రతిష్టలు కూడా లభిస్తాయి. తరువాత నీ ఇష్టం." అని అన్నాడు రాముడు.

రాముని మాటలను శిరసావహించాడు విభీషణుడు. వెంటనే తన అన్న రావణునికి దహన సంస్కారములు చేయడానికి ఏర్పాట్లు చేసాడు.

(మొదట్లో రావణుని మరణానికి ఎంతగానో దు:ఖించిన విభీషణుడు ఇప్పుడు తన అన్నకు దహన సంస్కారములు చేయడానికి నిరాకరించడం అంత సమంజసంగా లేదు. పైగా ఈ శ్లోకములు ప్రాచ్యప్రతిలో లేవు. కాబట్టి ఇవి తరువాత చేర్చి ఉండవచ్చును అని పండితుల అభిప్రాయము).

విభీషణుడు రావణుని ఇంటి నుండి అగ్నిహోత్రమును తెప్పించాడు. కాల్చడానికి కట్టెలను తెప్పించాడు. ఋత్విక్కులను పిలిపించాడు. అగరు, చందనము మొదలగు సుగంధ ద్రవ్యములను తెప్పించాడు. మణులను, ముత్యములను తెప్పించాడు. తరువాత శాస్త్ర ప్రకారము మాల్యవంతునితో రావణుని అంత్య క్రియలను నిర్వహించాడు.

రావణుని శరీరాన్ని బాగా అలంకరించిన బంగారు పల్లకీలో ఎక్కించారు. భేరీ మృదంగములు వాయించారు. పూలు చల్లారు. వంది మాగధులు రావణుని గుణగణములను స్తోత్రం చేస్తున్నారు. విభీషణుడు అగ్ని పట్టుకొని ముందు నడువగా, రావణుని పల్లకీ వెనుక బయలుదేరింది. అందరూ శ్మశానం చేరుకున్నారు. అంత:పుర స్త్రీలు అందరూ వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. రావణుని కడసారి చూపులు చూచుకున్నారు. ఒక పవిత్రమైన ప్రదేశములో చితి పేర్చారు. దాని మీద మెత్తని వస్త్రములను పరిచారు. వాటిని సుగంధ ద్రవ్యములతో తడిపారు. రావణుని మృతదేహాన్ని ఆ చితిమీద ఉంచారు. అగ్నిని ఆగ్నేయదిశలో ఏర్పరిచిన వేదిక మీద ఉంచారు. పెరుగు నెయ్యి కలిపి ఆయన బుజాలకు రుద్దారు. ఒక శకటమును పాదాల దగ్గర

ఉంచారు. ఒక రోలును తొడల దగ్గర పెట్టారు. కర్రలతో చేసిన గిన్నెలను, అరణిని, ఉత్తర అరణిని (యజ్ఞము కొరకు నిప్పు పుట్టించడానికి ఉపయోగించే సాధనములు) ఒక రోకలిని వాటి వాటి స్థానములలో ఉంచారు.

విభీషణుడు మొదలగు వారు చితిచుట్టు ప్రదక్షిణం చేసారు. రావణుని చితి దగ్గర ఒక పశువును బలి ఇచ్చారు. దాని శరీరమును చీల్చి దాని కడుపులో ఉండే పదార్థములను నేతితో తడిపి రావణుని ముఖం మీద ఉంచారు. రావణుని మీద పుష్పములు గంధము అక్షతలు సుగంధ ద్రవ్యములు ఉంచారు. పేలాలు చల్లారు. విభీషణుడు శాస్త్రోక్తముగా రావణుని చితికి నిప్పు అంటించాడు. తరువాత స్నానం చేసి తడి వస్త్రములతో దర్భలు, నువ్వులను, నీళ్లతో సమర్పించి జలతర్పణము విడిచాడు. కడసారిగా తన అన్న రావణునికి భక్తితో తల వంచి నమస్కారము చేసాడు. అప్పటి దాకా ఏడుస్తున్న అంత:పుర స్త్రీలను ఓదార్చి అంత:పురములకు పంపాడు. స్త్రీలందరూ వారి వారి గృహములకు వెళ్లిన మీదట విభీషణుడు రాముని వద్దకు వచ్చి నిలబడ్డాడు. విబీషణుడు తన అన్న రావణునికి యధావిధిగా దహన సంస్కారములు జరిపి రావణునికి ఉత్తమ గతులు కలిగించినందుకు చాలా సంతోషించాడు రాముడు. శత్రు సంహారం జరిగింది. విజయము లభించింది. రాముడు తన కోపాన్ని విడిచిపెట్టాడు. ధనుర్బాణములను, కవచమును విడిచిపెట్టాడు. శాంతమూర్తిగా సౌమ్యతను పొందాడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూటపదకొండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నూటపన్నెండవ సర్గ.

రామ రావణయుద్ధమును చూడటానికి వచ్చిన దేవ, దానవ, గంధర్వులు రావణ సంహారమునుచూచి సంతోషించి తమ తమ స్థానములకు వెళ్లిపోయారు. ఇంద్రుడు తనకు పంపిన దివ్యరథమును రాముడు మాతలికి ఇచ్చివేసాడు. మాతలిని సముచితంగా గౌరవించి స్వర్గలోకమునకు పంపాడు. రాముని అనుజ్ఞ తీసుకొని మాతలి రథము తో సహా ఇంద్రుని వద్దకు వెళ్లాడు.

తరువాత రాముడు తన స్నేహితుడు అయిన సుగ్రీవుని గాఢంగా ప్రేమతో కౌగలించుకున్నాడు. తరువాత లక్ష్మణునితో సహా తన నివాసమునకు వెళ్లాడు. రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. “లక్ష్మణా! మనకు విభీషణుడు ఎంతో ఉపకారము చేసాడు. రావణుని మరణం తరువాత లంకారాజ్య సింహాసనమును అధిష్ఠించుటకు విభీషణుడు తప్ప వేరెవరూ లేరు. కాబట్టి నీవు విభీషణుని లంకారాజ్యమునకు పట్టాభిషిక్తుని చెయ్యి. నేను విభీషణునికి ఆ విధంగా మాట ఇచ్చాను. నా మాటను నెరవేర్చు. విభీషణుని లంకారాజ్యమునకు రాజుగా చూడవలెనని కోరికగా ఉంది.” అని అన్నాడు రాముడు.

లక్ష్మణుడు రాముని ఆజ్ఞను శిరసావహించాడు. వెంటనే ఒక బంగారు పాత్రను తెప్పించాడు. వానరుల చేత ఆ పాత్రనిండా సముద్రజలమును తెప్పించాడు. వానరులు వెంటనే వెళ్లి ఆ బంగారుపాత్రనిండా సముద్రజలమును తీసుకొని వచ్చారు. లక్ష్మణుడు

విభీషణుని లంకారాజ్య సింహాసనము మీద కూర్చుండబెట్టాడు. బంగారు పాత్రనిండా తెప్పించిన సముద్రజలముతో లక్ష్మణుడు విభీషణుని వేదోక్తవిధి ప్రకారము లంకారాజ్యమునకు రాజుగా అభిషిక్తుని చేసాడు. వానరులు రాక్షసులు హర్షధ్వానాలు చేసారు. తనకు విధేయులుగా ఉన్న నలుగురు మంత్రులతో విభీషణుడు లంకారాజ్యము పరిపాలించసాగాడు.

విభీషణుడు లంకారాజ్యమునకు అభిషిక్తుడు అయ్యాడని తెలిసి రాముడు ఎంతో సంతోషించాడు. విభీషణుడు కూడా రాముడు తన మాట ప్రకారము, లంకా రాజ్యమును తనకు ఇచ్చినందుకు రాముని ఎడల ఎంతో కృతజ్ఞతాభావమును చూపించాడు.

రాజ్యాభిషిక్తుడైన తరువాత విభీషణుడు తన మంత్రులతో సహా రాముని వద్దకు వచ్చాడు. ఆయన వెంట రాక్షసులు రాముని కొరకు శుభసూచకంగా లాజలు, పెరుగు, మధురమైన పదార్థములు, ఫలములు, పుష్పములు తీసుకొని వచ్చారు. విభీషణుడు ఆ మంగళ ద్రవ్యములను రామునికి లక్ష్మణునికి భక్తితో సమర్పించాడు. రాముడు సంతోషంతో వాటిని స్వీకరించాడు.

తరువాత రాముడు పక్కనే ఉన్న హనుమంతుని చూచి ఇలా అన్నాడు. "హనుమా! నీవు లంకాధి పతి అయిన విభీషణుని అనుమతి తీసుకొని, లంకలో ప్రవేశించి, సీతను చూచి. సీతకు నా గురించి, నా క్షేమము గురించి తెలియజెయ్యి. హనుమా! ఇక్కడ నేను, లక్ష్మణుడు, సుగ్రీవుడు క్షేమంగా ఉన్నట్టు సీతకు తెలియజెయ్యి. నా మాటలు విన్న తరువాత సీత ఏమి చెబుతుందో విని, తిరిగి వచ్చి, ఆ

మాటలు నాకు చెప్పు." అని అన్నాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూటపన్నెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూటపదమూడవ సర్గ.

రాముని చేత ఆజ్ఞాపించబడిన హనుమంతుడు, రాక్షసులు తన వెంట రాగా, సీత ఉన్న అశోకవనమునకు బయలుదేరాడు. హనుమంతుడు అశోక వనమును ప్రవేశించే ముందు విభీషణుని అనుమతి తీసుకున్నాడు. అశోక వనములో ప్రవేశించిన హనుమంతుడు శింశుపా వృక్షము కింద కూర్చుని ఉన్న సీతను చూచాడు. ఆమె వద్దకు పోయి ఆమెకు నమస్కరించి నిలబడ్డాడు.

మొదట సీత హనుమంతుని గుర్తించలేదు. తరువాత హనుమంతుని గుర్తించి సంతోషించింది. అప్పుడు హనుమంతుడు రాముని సందేశమును సీతకు వినిపించసాగాడు. "అమ్మా సీతమ్మ తల్లీ! రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు క్షేమంగా ఉన్నారు. వానర సేనలు కూడా క్షేమంగా ఉన్నారు. రాముడు తన శత్రువు అయిన రావణుని సంహరించి విజయుడైనాడు. నీకు తన క్షేమములు తెలుపమని నన్ను పంపాడు. రాముని క్షేమము గురించి నీకు తెలిపినందుకు నాకు చాలాసంతోషంగా ఉంది. ఇంక నీవు

దు:ఖమును వదిలిపెట్టి సంతోషంగా ఉండు. ఇక్కడ నిన్ను బాధపెట్టేవారు ఎవరూ లేరు. రావణుడు చంపబడ్డాడు. లంకా నగరము విభీషణుని వశము అయింది. నీ కోసరమే రాముడు నూరు యోజనముల దూరము సేతువును నిర్మించి లంకా నగరం చేరుకున్నాడు. అమ్మా! ఇప్పుడు నీకు ఎటువంటి భయము లేదు. ఎందుకంటే ఇప్పుడు లంకా రాజ్యము విభీషణుని అధీనములో ఉంది. ఇప్పుడు నీవు నీ స్వగృహములో ఉన్నట్టు ఏ భయమూ లేకుండా ఉండవచ్చును. విభీషణుడు కూడా తమరి దర్శనము చేసుకొనవలెనని కుతూహలపడుతున్నాడు." అని పలికాడు హనుమంతుడు.

హనుమంతుని మాటలు సీతకు పరమసంతోషాన్ని కలుగజేసాయి. ఆ ఆనందంలో ఆమెకు నోటి వెంట మాటలు రాలేదు. సీతా దేవి నుండి ఏమీ సమాధానము రాకపోవడంతో హనుమంతుడు కంగారుపడ్డాడు. "అమ్మా సీతాదేవీ! ఏమమ్మా మాటలాడటం లేదు. నేను ఏమన్నా తప్పుగామాట్లాడానా! ఎందుకమ్మా నాతో మాట్లాడటం లేదు." అని ఆతురతగా అన్నాడు హనుమంతుడు.

అప్పుడు సీత ఆనందభాష్పములు తుడుచుకుంటూ ఇలా అంది. "హనుమా! నీవు చెప్పిన మాటలకు నా ఆనందం హద్దులు దాటింది. ఆనందంతో నోట మాట రాలేదు. గొంతు బొంగురుబోయింది. ఒక్క క్షణం పాటు నన్ను నేను మరిచిపోయాను. ఇంతటి మంచి వార్తను తెచ్చిన నీకు బహుమతిగా ఇవ్వడానికి నా వద్ద ఏమియు లేదు. నీవు చెప్పిన పరమానందకరమైన విషయమునకు ఈ భూమి మీద దొరికే ఏ వస్తువు ఇచ్చినా అది తక్కువే అవుతుంది. వెండి బంగారములు కానీ, మణిమాణిక్యములు కానీ, రత్నభూషణములు,

సకల సంపదలు కానీ నీ మాటలకు సాటిరావు." అని పలికింది సీత.

సీత మాటలకు హనుమంతుని ఆనందానికి అవధులు లేవు. సంతోషంతో ఉప్పొంగిపోయాడు. "ఎల్లప్పుడూ నీ భర్త క్షేమాన్నే కోరుకొనే దానవు. నీ భర్తను తప్ప పరపురుషుని కన్నెత్తిచూడని దానవు. అట్టి నీకే ఇలా స్నేహపూరితమైనమాటలు మాట్లాడటం చెల్లింది. అమ్మా! నీవు ఈ దాసుని మీద ప్రేమ అభిమానముతో చెప్పిన మాటలే నాకు రత్నములు, మణులు, మాణిక్యములు, సకల సంపదలతో సమానము. శత్రుసంహారము జరిగిన తరువాత రాముని మొహంలో కనిపించిన సంతోషము, రాముడు క్షేమంగా ఉన్నాడన్న వార్త విన్న తరువాత నీ మొహంలో కనపడ్డ సంతోషము, నాకు త్రిలోకాధిపత్యము లభించినంత ఆనందము కలుగచేసాయి. ఇతకన్నా మీరు నాకు ఇచ్చే బహుమానము ఏమి ఉంటుంది." అని అన్నాడు హనుమంతుడు.

ఆమాటలు విన్న సీత హనుమంతునితో ఇలా అంది. "హనుమా! బుద్ధిమంతుడవైన నీకే ఇలా మాట్లాడటం చెల్లింది. నీవు సామాన్యుడవు కావు. వాయుదేవుని కుమారుడవు. బలవంతుడవు. శౌర్యవంతుడవు. పరాక్రమవంతుడవు. నీకు అధికమైన నేర్పు ఓర్పు ధైర్యము, వినయము ఉన్నాయి. అందు వలననే నీవు సముద్రము దాటి లంకకు వచ్చినన్ను చూచి, ఆ విషయం రామునికి చెప్పి రాముని ఇక్కడకు తీసుకొని రాగలిగావు." అని హనుమంతుని శ్లాఘించింది సీత.

ఆ మాటలు విన్న హనుమంతుడు చుట్టు పక్కల చూచాడు. అప్పటి దాకా సీతకు కాపలాగా ఉన్న  వికృతాకారులైన రాక్షసస్త్రీలు కనపడ్డారు.  "అమ్మా సీతమ్మ తల్లీ!  వీళ్లే కదా ఇన్నాళ్లు నిన్ను నానా బాధలు పెట్టింది. భయపెట్టింది. రావణుని వరించమని బలవంతపెట్టింది. వీరందరినీ ఇప్పుడు ఈ క్షణమే చంపుతాను. ఎందుకంటే వీళ్లు నిన్ను అన్నమాటలు అన్నీ నేను ఈ చెట్టు మీద కూర్చుని విన్నాను. నిన్ను పెట్టిన బాధలు అన్నీ కళ్లారా చూచాను. వారి మాటలు విని నీవు అమితంగా శోకించడం చూచి నాలో నేను బాధపడ్డాను.

అమ్మా!నాకు అనుమతి ప్రసాదించు. వీళ్లందరినీ నా చేతులతో కొట్టి చంపుతాను. నీకు అపకారము చేసిన వీళ్లను పిడికిళ్లతో గుద్ది చంపుతాను. రక్కుతాను. కొరుకుతాను. జుట్టు పీకుతాను. వీళ్లను కిందపడేసి ఎగిరెగిరి వీళ్లమీద పడి మర్దిస్తాను. ఎముకలు విరుస్తాను. ఏకీలుకాకీలు విడగొట్టి చంపుతాను.  వీళ్లు నిన్ను పెట్టిన బాధలకు ఇదే సరిఅయిన శిక్ష. వీళ్లు ఇన్నాళ్లు నిన్ను ఎన్ని బాధలు పెట్టారో అన్ని బాధలూ వీళ్లు అనుభవించాలి." అని కోపంతో అన్నాడు హనుమంతుడు.

సహజంగా దయాగుణము, ఓర్పు కల సీత హనుమంతుని మాటలు విని ఇలా అన్నది. "హనుమా!  వీళ్లు కేవలము రావణుని సేవికలు. రావణుడు చెప్పినట్టు చేసారు. ఇందులో వీరి తప్పు ఏముంది. రావణుని ఆజ్ఞ అతిక్రమిస్తే రావణుడు వీళ్లను చంపుతాడు. రావణుని చేతిలో దండనకు భయపడి అలా ప్రవర్తించారే కానీ, ఇందులో వీరి తప్పు ఏమీలేదు. అదీ కాకుండా, నా కాలము బాగా లేదు. అందుకని

ఇన్ని బాధలు అనుభవించాను. వీళ్లు కేవలం నిమిత్తమాత్రులు. నేను పూర్వము ఎవరిని ఎన్ని బాధలు పెట్టానో అవి అన్నీ ఇప్పుడు అనుభవించాను. కర్మఫలము అనుభవించకుండా తప్పించుకోవడం ఎవరికీ సాధ్యంకాదు కదా! నేను ఇన్ని కష్టములు ఇన్ని రోజులు అనుభవించవలెనని నా మొహాన రాసి పెట్టి ఉంది. దానిని తప్పించడం ఎవరి తరమూ కాదు కదా! అందుకనే నేను ఈ రావణుని దాసీలు ఎన్ని బాధలు పెట్టినా సహించాను. వారిని ఒక్కమాటకూడా అనలేదు.

ఇప్పుడు రావణుడు లేడు. ఇంక వీళ్లు కూడా నన్ను ఏ బాధలూ పెట్టరు. ఏమీ అనరు. ఎందుకంటే ఇప్పుడు రావణుని భయం వీళ్లకు లేదు. ఈ సందర్భంలో నీకు ఒక పెద్దపులితో ఎలుగుబంటి చెప్పిన విషయము చెబుతాను సావధానంగా విను. సత్పురుషులు ఎప్పుడూ పరులకు అపకారము చెయ్యరు. చేతనైనే ఉపకారం చేస్తారు. అదీ కాకుండా. తమకు అపకారము చేసిన వారికి కూడా అపకారము చెయ్యరు. ఎవరి పాపఫలము వారే అనుభవిస్తారు అని అనుకుంటారు. అదీ సత్పురుషుల లక్షణము. సత్పురుషులు పాపాత్ములను, పుణ్యాత్ములను సమానంగా చూస్తారు. చంపదగిన వారి పట్లకూడా దయాగుణము ప్రసరిస్తారు. ఎందుకంటే తప్పులు చేయడం ప్రాణులకు సహజలక్షణము కదా! కేవలం ఇతరులను హింసించడమే పనిగాపెట్టుకున్న వారిమీద కూడా దయచూపించడం సత్పురుషుల లక్షణము." అని పలికింది సీత.

సీత దయాగుణానికి ఎంతో సంతోషించాడు హనుమంతుడు. "అమ్మా! నీవు రామునికి తగ్గ ధర్మపత్నివి. అందుకే ఇంతటి దయాగుణమును కలిగి ఉన్నావు. రామునికి ఏమైనా

సందేశము ఇస్తే తీసుకొని వెళ్లిరామునికి వినిపిస్తాను." అని అన్నాడు హనుమంతుడు.

"హనుమా! నేను వెంటనే నా భర్త రాముని చూడవలెనని ఉవ్విళ్లూరుతున్నాను. ఇదే నా సందేశము." అని పలికింది సీత.

ఆమాటలు విన్న హనుమంతుడు సీతలో ఇలా అన్నాడు. "అమ్మా! ఇంక ఆలస్యం ఎందుకు ఇప్పుడే నీవు రాముడిని చూడగలవు. ఇప్పుడే వెళ్లి నీ సందేశమును రామునికి వినిపిస్తాను." అని హనుమంతుడు. వాయువేగంతో రాముని వద్దకు వెళ్లాడు. సీత చెప్పిన ఏకవాక్య సందేశమును రామునికి వినిపించాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూటపదమూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూటపదునాలుగవ సర్గ.

రాముని వద్దకు వచ్చిన హనుమంతుడు రామునికి నమస్కరించి రామునితో ఇలా అన్నాడు. "ఓ రామా! ఎవరికోసరం నీవు ఇన్నాళ్లు పరితపిస్తున్నావో, ఎవరికోసరం సేతువును నిర్మించావో, ఎవరికోసరం రావణవధచేసావో ఆ సీత నిన్ను తక్షణమే చూడవలెనని కోరికగా ఉంది. అందుకని నీవు వెంటనే సీతను చూడాలి. ఆమెను ఓదార్చాలి. ఆమెకు సంతోషమును చేకూర్చాలి. నీ విజయ వార్త విన్న సీత

సంతోషంతో ఉప్పొంగి పోయింది. నిన్ను ఎప్పుడెప్పుడు చూస్తానా అని ఎదురు చూస్తూ ఉంది. ఆమె చెప్ప మన్న మాట ఏమంటే-- "కష్టసాధ్యమైన కార్యమును సాధించిన రాముని, లక్ష్మణుని నేను వెంటనే చూడవలెనని కోరుకుంటున్నాను." అని ఏకవాక్యంగా నాతో చెప్పింది." అని హనుమంతుడు. రామునితో సీతా సందేశమును వినిపించాడు.

సీత మాటలు విన్న రామునికి కన్నీళ్ల పర్యంతము అయింది. పక్కనే ఉన్న విభీషణుని చూచి "లంకాధిపా విభీషణా! నీవు వెంటనే సర్వాలంకారభూషితురాలైన సీతను నా వద్దకు తీసుకొని వచ్చుటకు తగిన ఏర్పాట్లు చెయ్యి." అని ఆదేశించాడు. వెంటనే విభీషణుడు లంకా నగరములోకి వెళ్లాడు. తన అంత:పురములోనికి పోయి అక్కడిస్త్రీలతో ఈ విషయం చెప్పాడు. వెంటనే తన అంత:పుర స్త్రీలను తీసుకొని సీత వద్దకు వెళ్లాడు. అంత:పుర స్త్రీల ద్వారా రాముని మాటలను సీతకు వినిపించాడు. తరువాత రాక్షస రాజు అయిన విభీషణుడు చేతులు కట్టుకొని సీత ముందు నిలబడి ఇలా అన్నాడు.

"అమ్మాసీతాదేవీ! నీవు వెంటనే స్నానపానాదులు ఆచరించి మైపూతలు పూసుకొని, దివ్యాభరణములు, పట్టుపీతాంబరములు ధరించి, రాముని వద్దకు వెళ్లుటకు వాహనమును ఎక్కుము. నీ భర్త రాముడు నిన్ను చూడవలెనని ఆతురతగా ఉన్నాడు."అని వినయంగా పలికాడు.

ఆ మాటలు విన్న సీత విభీషణునితో ఇలా అంది. "ఓ రాక్షస రాజా విభీషణా! నేను ఉన్నపళంగానే నా భర్త రాముని చూడవలెనని

అనుకుంటున్నాను. నేను ఇంతకాలము ఎలా ఉన్నానో రామునికి తెలియాలి." అని అంది.

దానికి విభీషణుడు "అమ్మా సీతా! రాముడుచెప్పినట్టు చేయడం మంచిదేమో!" అని అన్నాడు. రాముని ఆదేశము పాటించడం తన ధర్మము అని తలచిన సీత రాముడు చెప్పినట్టే చేయుటకు నిర్ణయించుకుంది. విభీషణుడు దానికి తగిన ఏర్పాట్లు చేసాడు. సీతాదేవి అభ్యంగన స్నానము చేసి, మంచి వస్త్రములు, దివ్యాభరణములు ధరించి, రాక్షసులు మోయుచున్న పల్లకీ ఎక్కింది. విభీషణుడు పక్కనే ఉండి సీత ఎక్కిన పల్లకీని రాక్షసుల చేత మోయించుకొని రాముని వద్దకు సీతను తీసుకొని వచ్చాడు.

ఆసమయంలో రాముడు ఏదో ఆలోచిస్తున్నాడు. విభీషణుడు రాముని వద్దకు పోయి "రామా! నీ భార్య సీత వచ్చింది." అని అన్నాడు.

(ఇక్కడ రాముడు సీతను ఎలా చూచాడు అప్పుడు రాముని మనోభావాలు ఏమిటి అన్న విషయాన్ని వాల్మీకి ఈ క్రింది శ్లోకంలో చెప్పాడు.

తామాగతాముపశ్రుత్య రక్షోగృహచిరోషితామ్,
హర్షో దైన్యం చ రోషశ్చ త్రయం రాఘవమావిశత్॥

చాలాకాలంపాటు రాక్షసుని అధీనంలో, రావణుని గృహంలో ఉన్న సీత వచ్చింది అన్న మాట వినగానే రామునికి ఆనందము, దు:ఖము, రోషము మూడు భావనలు ఒకేసారి కలిగాయి.

పైకి మాత్రము నిర్వికారంగా ఉన్నాడు. సీత వచ్చింది అని తెలియగానే వానరులు అంతా గుమిగూడారు. ఎందుకంటే వాళ్లు అప్పటిదాకా సీతను చూడలేదు. సీత ఎలా ఉంటుందో చూద్దామని ఉత్సుకతతో ఉన్నారు.

రాముడు పక్కనేఉన్న విభీషణుని చూచి ఇలా అన్నాడు. "విభీషణా! సీతను త్వరగా నా వద్దకు తీసుకొని రా!" అని అన్నాడు.

విభీషణుడు పక్కనే ఉన్న భటులవైపు చూచాడు. వారు కర్రలు పట్టుకొని గుమిగూడినవారిని పక్కకు నెడుతున్నారు. తోస్తున్నారు. తొలగిస్తున్నారు. అప్పుడు వానరులు భల్లూకములు ఒకరిని ఒకరు తోసుకుంటున్నారు. కిందపడుతున్నారు. సీతను చూడవలెనని తలలు పైకెత్తి చూస్తున్నారు.

ఇది చూచి రామునికి కోపం వచ్చింది. విభీషణుని చూచి "వాళ్లను ఎందుకు అలా తోసేస్తున్నారు. వాళ్లందరూ నా వాళ్లు నా కోసం ప్రాణాలకు తెగించి వచ్చారు. వాళ్లను ఏమీ అనవద్దు. వాళ్లందరూ సీతను చూడవలెనని కోరుకుంటున్నారు. అంత:పుర స్త్రీలకు మంచి నడవడికయే అలంకారము కానీ, ప్రాసాదములు, వస్త్రములు, తెరలు కాదు. స్వయంవరములందు, యజ్ఞయాగములందు, వివాహ సమయములయందు, విపరీత పరిస్థితులయందు అంత:పుర స్త్రీలు పరుల కంటపడటంలో తప్పులేదు.

ఇంతకాలము సీత పరపురుషుని ఇంట ఉన్నది. ఇప్పుడు నా దగ్గరకు వచ్చింది. ఈ సమయంలో ఆమెను అందరూ చూడటంలో ఏ

మాత్రమూ దోషము లేదు. వాళ్లను అలా దూరంగా తోయవద్దు. సీత ఎన్నో కష్టములు పడింది. ఆమె ఎలా ఉన్నదో చూడాలని అనుకోడంలో తప్పులేదు. పైగా ఆమె భర్తను నేను పక్కన ఉండగా చూడటంలో దోషం లేదు. అందుకని విభీషణా! సీతను పల్లకీ దిగి నడుచుకుంటూ నా వద్దకు రమ్మనండి. ఆమెను దగ్గరనుండి వానరులు అందరూ చూచే అవకాశం కలుగుతుంది." అనిపలికాడు రాముడు.

ఆ మాటలు విన్న విభీషణుడు సీత వద్దకు పోయి ఆమెను సవినయంగా పల్లకీ లోనుండి దింపి రాముని వద్దకు తీసుకొని వచ్చాడు. సీత వచ్చింది అన్న సంతోషము రాముని ముఖంలో కనిపించడం లేదు. పైగా గంభీరంగా ఉన్నాడు. ఆయన ముఖ కళవళికలను చూచి లక్ష్మణుడు, హనుమంతుడు కంగారు పడ్డారు. సీత సిగ్గుతో తల వంచుకొని విభీషణుడు వెంట రాగా రాముని వద్దకు నడిచింది.

రాముని ఎదురుగా నిలబడ్డ సీత కను రెప్పలు పైకి ఎత్తి రాముని వంక చూచింది. చాలా కాలం తరువాత భర్తను చూచిన సీత మనసు ఆనందసాగరంలో తేలిపోయింది.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూటపధ్నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నూడపదునైదవ సర్గ.

రాముడు సీత వంక చూచి ఇలా అన్నాడు. “ఓ సీతా! నిన్ను రావణుడు అనే రాక్షసుడు నా వద్దనుండి అపహరించుకొని తీసుకొని వెళ్లాడు. నేను పురుష ప్రయత్నంతో రావణుని జయించి నిన్ను మరలా దక్కించుకున్నాను. నేను నీ భర్తను, పురుషుడిని కాబట్టి నాకు తగ్గ ధర్మము నేనునెరవేర్చాను. ఇప్పుడు నాకు రావణుని వలన జరిగిన అవమానము తొలగిపోయినది. రావణ వధతో  నా కోపము కూడా ఉపశమించినది.   రావణుని చంపి నిన్ను దకించుకోడంతో నా పౌరుషాన్ని లోకానికి చాటి చెప్పాను. నా ప్రతిజ్ఞ నేరవేర్చుకున్నాను.

నేను ఇంటలేని సమయంలో నిన్ను అపహరించి రావణుడు తప్పుచేసాడు. అది దైవికము. ఆ తప్పును  నేను నా పురుషప్రయత్నంతో సరిదిద్దాను. తనకు జరిగిన అవమానమును ఎవడైతో తన పురుషప్రయత్నంతో తొలగించుకోడో, వాడికి ఎంత పౌరుషము ఉండీ ఏమీ ప్రయోజనము లేదు. నేను కాదు. హనుమంతుడు కూడా తన అపారమైన శక్తితో నూరుయోజనముల దూరం ఉన్న సముద్రమును దాటి, నిన్ను చూచి, లంకను కాల్చి, గొప్ప కార్యమును నిర్వర్తించాడు. హనుమంతుని శ్రమ కూడా నేడుసఫలం అయింది. అలాగే అపారమైన వానర సేనలను, భల్లూకసేనలను సమకూర్చి వారథి కట్టి, లంకనుచేరి, రాక్షసులను సంహరించి సుగ్రీవుడు కూడా ఎంతో శ్రమ పడ్డాడు. సుగ్రీవుని శ్రమకూడా నేడు ఫలించింది. అలాగే దుర్మార్గుడైన అన్నను విడిచి నన్ను చేరిన విభీషణుని త్యాగం కూడా నేడు సఫలమయింది.” అని అందరికీ కృతజ్ఞతలు చెబుతున్న రాముని చూచిన సీతకు కళ్లలో

ఆనందభాష్పాలు రాలుతున్నాయి. ఇంతమందితనకోసం కష్టపడ్డారా అని ఆశ్చర్యపోయింది.  అన్ని మాటలు పలికిన రాముడు కొంచెంసేపు ఆగాడు. రాముని హృదయంలో రెండు విధములైన భావములు చెలరేగుతున్నాయి. తుదకు రాముడు ఇలా అన్నాడు.

"నా గౌరవాన్ని కాపాడుకోటానికి, నా కోపము తీర్చుకోడానికి. నా ప్రతిజ్ఞను నెరవేర్చుకోడానికి, నాపౌరుషమును లోకానికి చాటి చెప్పడానికి నేను రావణుని సంహరించి నిన్ను రాక్షస చెరనుండి విడిపించాను. ఒక సాధారణ మానవుడు, పౌరుషవంతుడు, వీరుడు అయిన మానవుడు ఏమి చేస్తాడో అదే నేనూ చేసాను. శత్రువును జయించి నిన్ను రక్షించాను.

సీతా! ఒక్క విషయం గుర్తుపెట్టుకో. నేను ఇదంతా నీ కోసరం చేయలేదు.  ఇక్ష్వాకు వంశములో పుట్టిన రాముడు తుదకు, ఇతరులు అపహరించిన  భార్యను కూడా రక్షించుకోలేకపోయాడు అన్న అపవాదును తొలగించుకోడానికే ఈ యుద్ధము చేసాను. నా వంశ గౌరవాన్ని ప్రతిష్టను కాపాడుకోడానికే ఈ యుద్ధం చేసాను. అంతే కానీ నీకొరకు కాదు.

(ఇక్కడ సీతను ఉద్దేశించి రాముడు అన్న మాటలను వాల్మీకి ఎలా రాసాడో చూడండి.)

ప్రాప్తచారిత్రసందేహా మమ ప్రతిముఖే స్థితా,
దీపో నేత్రాతురస్యేవప్రతికూలాసి మే దృఢమ్.

ఈ కొద్దికాలంలో నీ చరిత్ర సందేహాస్పదము అయింది. నీవు నా ఎదురుగా నిలబడి ఉంటే చూడలేకున్నాను. కంటిజబ్బుతో బాధపడుతున్న వాడికి తేజోవంతమైన దీపం చూస్తే ఎంత బాధగా, నొప్పిగాఉంటుందో అలా ఉంది నాకు." అని అన్నాడు.

(ఇక్కడ కూడా రాముడు సీతను తక్కువ చేయలేదు. సీతను దేదీప్యమానంగా వెలుగుతున్న దీపంతోనూ తనను కంటిజబ్బు ఉన్న మానవునితోనూ పోల్చుకున్నాడు. ప్రస్తుతము రాముడు సీతచరిత్రను సందేహించడం అనే జబ్బుతో బాధపడుతున్నాడు అని ఉపమానంగా చెప్పాడు వాల్మీకి.)

ఓ సీతా! నీకు అనుమతి ఇస్తున్నాను. నీవు నీ ఇష్టం వచ్చినచోటికి వెళ్లవచ్చు. నిన్ను రక్షించడంతో నా పని అయిపోయింది. ఇంక నీతో నాకు  పని ఏమీ లేదు.
(ఇక్కడ రాముడు అసలు విషయం బయట పెట్టాడు.)

క: పుమాంస్తు  కులే జాత: స్త్రియం పరగృహోషితామ్
తేజస్వీ పునరాదద్యాత్ సుహృల్లేఖ్యేన చేతసా

ఉన్నతకులములో పుట్టిన ఏ మగాడైనా కొంతకాలము పరులగృహంలో ఉన్న భార్యను, ఆసక్తిగా తిరిగి స్వీకరిస్తాడా!

(ఇప్పుడు ఇంకొంచెం దిగజారాడు రాముడు)

రావణాఙ్కపరిక్లిష్టాం దృష్టాం దుష్టేన చక్షుసా
కథం త్వాం పునరాదద్యాం కులం వ్యపదిశన్ మహత్॥

ఇన్నిరోజులూ రావణుని ఒడిలో నలిగినదానవు. రావణుడు నిన్ను తన కామదృష్టితో నిరంతరమూ నిన్ను చూచి ఉంటాడు. అటువంటి నిన్ను ఉన్నత కులంలో పుట్టిన నేను ఎలా స్వీకరిస్తాను.

( ఇలాంటి పరిస్థితి వస్తుందని ఊహించిన సీత, తాను ఈ 12 నెలలు ఏకవస్త్రగా, తైలసంస్కారము లేని జుట్టుతో, ఒంటి జడతో, మట్టి దుమ్ముకొట్టుకున్న శరీరంతో రాముని వద్దకు వస్తాను అని చెప్పింది. కాని మధ్యలో విభీషణుడు ఇచ్చిన ఉచిత సలహా కారణంగా ఆమె సర్వాలంకారభూషితురాలై రాముని ఎదుటికి వచ్చింది.)

ఓ సీతా! నా కుల గౌరమును, వంశ ప్రతిష్టను కాపాడుకోడానికే రావణుని సంహరించి నిన్ను రాక్షస చెరనుండి విడిపించాను. కీర్తి సంపాదించుకున్నాను. నీ మీద నాకు ఎలాంటి ఆసక్తి లేదు. అందుచేత నీవు నీ ఇష్టం వచ్చినచోటికి వెళ్లవచ్చును. ఈ నిర్ణయము నేను తొందరపాటుతో తీసుకున్న నిర్ణయం కాదు. బాగా ఆలోచించి తీసుకున్న నిర్ణయము.

(సీత ఎవరి దగ్గరకు వెళ్లాలో, ఎవరిసంరక్షణలో ఉండాలో కూడా నిర్ణయించాడు రాముడు)

కాబట్టి నీవు లక్ష్మణుని సంరక్షణలో కానీ, భరతుని సంరక్షణలో కానీ ఉండవచ్చును. అదీ కాక పోతే నీవు శత్రుఘ్నుని సంరక్షణలో కానీ,

సుగ్రీవుని సంరక్షణలో కానీ, లేక విభీషణుని సంరక్షణలో కానీ ఉండవచ్చును. అదీ కాకపోతే నీ ఇష్టం వచ్చిన వారి సంరక్షణలో ఉండవచ్చును.

ఓ సీతా! నీవు సౌందర్యాధిదేవతవు. ఇన్నాళ్లు రావణుని అదీనంలో ఉన్నదానవు. ఇంతటి సౌందర్యరాసిని ఎదురుగా పెట్టుకొని కామమోహితుడు అయిన రావణుడు ఊరుకుంటాడా!" అని అన్నాడు రాముడు.

("ఊరుకోడు. నిన్ను ఏదో చేసి ఉంటాడు." అని రాముని అనుమానము.
(అనుమానము పెనుభూతము. అది మనసులో నాటుకుంటే చాలు మహావృక్షము అవుతుంది. దానికి రాముడు కూడా మినహాయింపు కాదు అని వాల్మీకి అభిప్రాయము)

రాముడు ఎప్పుడూ రావణుని వైపునుంచి ఆలోచించాడు కానీ, సీత వైపునుండి ఆలోచించలేదు. ఇన్నాళ్లు తనతో కాపురం చేసిన సీత, అన్ని రాచరికపు సుఖాలు వదులుకొని తనతో అడవులకు వచ్చిన సీత, 13 ఏళ్లపాటు తనతో అష్టకష్టములు పడుతూ తన వెన్నంటి ఉన్న సీత, అయోనిజ అయిన సీత, తత్త్వవేత్త అయిన జనకుని కుమార్తె సీత, తాను ప్రాణాధికంగా ప్రేమించిన సీత, కేవలం సంవత్సరకాలం రావణుని వద్ద ఉన్న కారణంగా, రావణుని విలాసాలకు ఆడంబరాలకు లొంగి పోతుందని రాముడు ఎలా అనుకున్నాడు---- అనేది జవాబు లేని ప్రశ్న.

అదీ కాకుండా “నువ్వు లక్ష్మణుడి సంరక్షణలో ఉండు” అని కూడా అన్నాడు. పాపం లక్ష్మణుడు అటు సీత చేతిలో చీవాట్లు తిన్నాడు. ఇటు రాముని చేతిలో అవమాన పడ్డాడు. రాముడు మాయాలేడి వెంట పడ్డప్పుడు, రాముని ఆర్తనాదం విని లక్ష్మణుని వెళ్లమంటే, అన్న ఆజ్ఞ జవదాటను అని అన్నప్పుడు సీత అన్నమాటలు గుర్తుకు తెచ్చుకోండి. “నీవు నన్ను పొందాలని అనుకుంటున్నావు. అందుకే మా వెంట అడవులకు వచ్చావు. నేను చావనన్న చస్తాను కానీ నీకు లొంగను.” అని లక్ష్మణుని మీద నిందలు వేసింది సీత. ఇప్పుడు రాముడు కూడా సీతతో, అదీ లక్ష్మణుని ఎదురుగుండా, నీవు లక్ష్మణుని సంరక్షణలో ఉండాలను కుంటే ఉండు అని అన్నాడు. ఇప్పుడు లక్ష్మణుని పరిస్థితి ఏమటి? వాల్మీకి రాయలేదు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూటపదిహేనవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూటపదహారవ సర్గ.

రాముని నోటి నుండి వచ్చిన అనకూడని, వినకూడని మాటలు విన్న సీత పెనుగాలి తాకిడికి అల్లల్లాడిన లతలా గజా గజా వణికిపోయింది. తనను భయపెట్టే విధంగా అత్యంత కఠినంగా రాముడు పలికిన పలుకులకు సీత మనసు తీరని వ్యధచెందింది. అంత మందిలో తనను, తన భర్త అయిన రాముడు, తనకు పుత్రసమానులు అయిన లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల సంరక్షణలో ఉండు

అని అన్నాడు. అంతే కాకుండా, తనకు ఏమాత్రం సంబంధంలేని సుగ్రీవుడు, విభీషణుడు సంరక్షణలో ఉండు అని వాళ్ల ఎదురుగానే, అన్నమాటలకు సిగ్గుతో కుచించుకు పోయింది. భూమి బద్దలైపోయి, అందులోకి తాను కూరుకుపోతోందా అన్నభావన కలిగింది సీతకు. ఒకేసారి వేలాది బాణములు తన శరీరంలో గుచ్చుకున్నాయా అన్న బాధతో కన్నీరు కార్చింది. క్షణకాలంలో తేరుకొని బొంగురు పోయిన గొంతుతో రాముని తో ఇలా అంది.

"కిం మామసదృశం వాక్యమీదృశం శ్రోత్రదారుణమ్
రూక్షం శ్రావయసే వీర ప్రాకృత: ప్రాకృతామివ"

సీత రాముని "ఓ వీరుడా!" అనిసంబోధించింది.

తరువాత రెండు మాటలు అంది.

"నీవు ఒక సామాన్యుడు మరొక సామాన్య స్త్రీతో మాట్లాడినట్టు మాట్లాడుతున్నావు."

(సీత రాముని 'వీరుడా!' అని పిలిచింది. అంతలోనే ' అంతటి వీరుడవైఉండి కూడా ఏమీటీ! ఒక సామాన్య మానవుడు మరొక సామాన్య స్త్రీతో మాట్లాడి నట్టు మాట్లాడుతున్నావు' అని ఎత్తిపొడిచింది. ఎందుకంటే.......

రాముడు సకల శాస్త్ర పారంగతుడు. వేదవేదాంగములు కులగురువు వసిష్టుని వద్ద చదువుకున్నాడు. విశ్వామిత్రుని వద్ద సకల అస్త్రశస్త్రములు అభ్యసించాడు. ఉన్నత వంశం అయిన ఇక్ష్వాకు వంశంలో పుట్టాడు. రాముని పూర్వీకులు చక్రవర్తులు. సామాన్యులు కారు. అటువంటి రాముడు ఒక సామాన్యుని వలె, ఏమీ తెలియని వాడి వలె మాట్లాడటమా!

సీత తన గురించి కూడా తాను ఒక సామాన్య స్త్రీని కానని చెప్పుకుంది. (సీత ఎలాంటిదో పైన వివరించి ఉన్నాను.) ఇంక రాముడు అన్న మాటలు ఎలాంటివో సీత ఇలా చెప్పింది.

"అనకూడని, వినకూడని, చెవులకు వినడానికి దారుణంగా ఉండే మాటలు, చాలా పరుషమైన వాక్యములు మాట్లాడావు." అని అంది.

(నీవు సామాన్యుడివికావు. నేనుసామాన్యురాలిని కాను. కాని ఒక సామాన్యుడు, ఒక సామాన్య స్త్రీతో మాట్లాడినట్టు మాట్లాడుతున్నావు. అంటే...... ఒక చక్రవర్తి కుమారుడు, ఒక వీరుడు, వసిష్ట,విశ్వామిత్రుల శిష్యుడు, దశరథుని కుమారుడు, ఇక్ష్వాకు వంశంలో పుట్టిన వాడు మాట్లాడాల్సిన మాటలా ఇవి. అదీకూడా, జనకుని కుమార్తెతో, దశరథ మహారాజు కోడలితో, దాదాపు ఇరవై ఏళ్లు నీతో కాపురం చేసిన అనుకూలవతి అయిన భార్యతో మాట్లాడాల్సిన మాటలా ఇవి. అని పరోక్షంగా ఎత్తిపొడిచింది. ఈ ఒక్క శ్లోకం చాలు రాముడు అన్న మాటలకు సీత ఇచ్చిన ఘాటైన సమాధానం. అంతటితో ఆగలేదు సీత.)

"ఓ రామా! నేను నీవు అనుకుంటున్నట్టు నీచంగా ప్రవర్తించలేదు. నన్ను నమ్ము. నేను నా పుట్టినింటిలో గానీ అత్తవారి ఇంటిలోగానీ సంపాదించుకున్న సత్ప్రవర్తన మీద ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను.

ఓ రామా! నీవు సామాన్య స్త్రీల ప్రవర్తనను చూచి, నన్ను కూడా ఆమాదిరే అనుకుంటున్నావు. మొత్తము స్త్రీజాతినే శంకించు చున్నావు. నాతో వివాహం అయినప్పటినుండీ నా గురించి, నా సత్ప్రవర్తన గురించి ఆలోచించి నీ అనుమానమును విడిచిపెట్టు.

ఓ రామా! పర్ణశాలలో రావణుడు నా ఎదుట నిలిచినపుడు ఆ భయంకర రూపము చూచి నేను స్పృహ కోల్పోయాను. ఆ పరిస్థితిలో రావణుడు నన్ను తాకిఉండవచ్చు. అది దైవికము. అంతేకానీ, నేనేమీ కావాలని, ఎటువంటి కామ వాంఛతో రావణుని తాకలేదు కదా! నా హృదయము మాత్రము సదా నీ అధీనములోనే ఉన్నది. నిన్ను స్మరిస్తూ ఉంది. నా అధీనములో లేని శరీరమును పరపురుషుడు తాకడం నా అశక్తత వలననే జరిగింది. దానికి నేనేమి చేయగలను.

(అసలు విషయం ఇప్పుడు చెప్పింది సీత.)
సహసంవృద్ధభావేన సంసర్గేణ చ మానద
యదితే అహం న విజ్ఞాతా హతా తేనాస్మి శాశ్వతమ్॥

మన వివాహము అయినప్పటినుండీ మనము ఇద్దరమూ కలిసిమెలిసి ఉన్నాము. ఇంకా నేను ఎటువంటిదాననో నువ్వు అర్థం చేసుకో లేదంటే, నేను బతికి కూడా వృథా.

ఓ రామా! నీవు నన్ను వెదకడానికి హనుమంతుని పంపావు. హనుమంతుడు వచ్చి నన్ను లంకలో రావణుని అధీనంలో ఉండగా చూచాడు. ఆ విషయం నీకు వచ్చి చెప్పాడు. అప్పుడే నీవు నన్ను వదిలిపెట్టి ఉండాల్సింది. ఇంతదూరం వచ్చి, రావణుని చంపి నన్ను

ఎందుకు రక్షించావు? అప్పుడే నీవు కనుక నన్ను వదిలిపెట్టిఉంటే నేను వెంటనే నా ప్రాణాల్ని విడిచి ఉండేదాన్ని. ఆనాడే నేను ప్రాణత్యాగము చేసి ఉంటే ఈ నాడు నువ్వు నన్ను అనుమానించి వ్యర్థముగా, ఇన్ని కర్ణ కఠోరమైన మాటలు మాట్లాడే అవసరం, శ్రమ  ఉండేది కాదు కదా! నీ మాటలు విన్న నీ బంధుమిత్రుల మనసుకు కూడా ఎంతో కష్టము కలిగించావు కదా!

ఓ నృపశార్దూలమా! (రాజులలో పెద్దపులి లాంటి వాడా!) నీవు, ఒక  సామాన్య మానవునికి కోపం వస్తే ఒక సామాన్యస్త్రీతో ఎలా మాట్లాడతాడో అలామాట్లాడావు. నన్ను ఒక సామాన్య స్త్రీ అనుకుంటున్నావు.

ఓ వృత్తజ్ఞ! (మంచి ఆచారవ్యవహారములు తెలిసిన వాడా!) నేను ఎవరో నీకు తెలియదా! నేను జనకుని కుమార్తెను అని లోకానికి తెలుసు. కాని నేను అయోనిజను. భూమిలో నుండి జన్మించాను. కనీసం నా పుట్టుకకు కానీ, నా ప్రవర్తనకు కానీ నీవు గౌరవం ఇవ్వలేదు. నేను నా బాల్యములో ఉండగానే నీ చెయ్యిపట్టుకొని నీ ఇంటికి వచ్చాను. ఈ నాటి వరకూ నీతోనే ఉన్నాను. నీ ఎడల నా భక్తిని, నా శీలమును కూడా పరిగణించకుండా నన్ను అనరాని మాటలు అన్నావు. ఇది నీకు ధర్మమా!" అని పలికింది సీత.

ఇంక దు:ఖమును ఆపుకోలేకపోయింది.  రాముని పక్కనే తల వంచుకొని నిలబడి ఉన్న లక్ష్మణుని చూచి "లక్ష్మణా! వెంటనే చితిపేర్పించు. ఇప్పుడు నేను పడుతున్న కష్టములకు అదే దివ్యౌషధము. ఇన్ని మాటలు పడ్డ తరువాత ఇంక జీవించడం వృధా. నాకూ

జీవించాలని ఆశలేదు. నా గుణగణములు నా పాతివ్రత్యము నా రామునికి సంతోషము కలిగించలేదు. నన్ను నా ఇష్టం చోటికి వెళ్లమన్నాడు. నా ఇష్టం వచ్చిన చోటు అగ్నిప్రవేశమే. పదిమందిలో భర్తతో అవమానింపబడి, విడిచిపెట్టబడిన భార్యకు అగ్నిప్రవేశమే ఉచితమైన మార్గము. అందుకే అగ్నిప్రవేశము చేయదలచుకున్నాను. వెంటనే చితిపేర్పించు." అని లక్ష్మణుని ఆదేశించింది సీత.

ఇందాకటి నుండి జరుగుతున్నదంతా చూస్తున్న లక్ష్మణుడికి కోపం కట్టలు తెంచుకొని వస్తోంది. రాముడి వంక తీక్షణంగా కాల్చివేసేట్టు చూచాడు లక్ష్మణుడు. రామునితో ఒక్క మాట కూడా మాట్లాడలేదు. వెంటనే సీత అగ్నిప్రవేశానికి చితి సిద్ధం చేసాడు. ఒక్క లక్ష్మణుడే కాదు, అక్కడ ఉన్న వారెవరూ రామునితో మాట్లాడటానికి కానీ, వద్దు అని చెప్పడానికి కానీ ఇష్టపడలేదు.

అగ్ని భగా భగా మండుతూ ఉంది. సీత రాముడి చుట్టు ప్రదక్షిణం చేసింది. చితి దగ్గరకు వెళ్లింది. చేతులు పైకెత్తి దేవతలకు, బ్రాహ్మణులకు నమస్కరించింది. చేతులు జోడించి అగ్నిదేవునికి నమస్కరించింది.

"ఓ అగ్ని దేవా! నా మనస్సు ఎప్పుడూ నా భర్త రాముని యందు లగ్నం అయి ఉంటే, నేను కలలో కూడా పరపురుషుని తలవనిదానను అయితే, ఈ అగ్ని నన్ను రక్షించుగాక! సచ్ఛరిత్రను, పాతివ్రత్యమును కల నేను రాముడు అనుకున్నట్టు దుష్ట చరిత్ర కలదానిని అయితే, ఈ అగ్ని నన్ను రక్షించుగాక! నేను మనసా, వాచా, కర్మణా (త్రికరణశుద్ధిగా) రాముని తప్ప పరపురుషుని తలవని దానను

అయితే, నన్ను ఈ అగ్ని రక్షించుగాక! కర్మసాక్షి అయిన సూర్యుడు, చంద్రుడు, భూమి, వాయువు, నువ్వు, సూర్యాస్తమయాలు నా పాతివ్రత్యాన్ని, రాముని యందు నాకు ఉన్న భక్తిని తెలిసినవారైతే ఈ అగ్ని నన్ను రక్షించుగాక!"అని పలికిన సీత, ఏ మాత్రము భయం లేకుండా అగ్నిలో ప్రవేశించింది.

సీత అగ్ని ప్రవేశము చెయ్యడం చూచి అక్కడ ఉన్న వారంతా హాహాకారాలు చేసారు. సీత అగ్నిప్రవేశానికి పంచభూతములు సాక్షిగా నిలిచాయి. అగ్నిలో ప్రవేశిస్తున్న సీతను చూచి అక్కడ ఉన్న స్త్రీలందరూ పెద్ద పెద్ద గా అరుస్తున్నారు. ఏడుస్తున్నారు. అక్కడ ఉన్న వానర సైన్యము, వానరవీరులు, రాక్షస స్త్రీలు సీత అగ్ని ప్రవేశం చేయడాన్ని చూచి అయ్యో అయ్యో అంటూ పెద్దగా అరిచారు. ఏడిచారు. అక్కడున్న వారే కాదు, పైనుండి దేవతలు, ఋషులు, గంధర్వులు శాపగ్రస్తఅయిన దేవకన్యమాదిరి ఉన్న సీత అగ్నిప్రవేశం చేయడం చూచారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూటపదహారవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూటపదిహేడవ సర్గ.

ఇదంతా చూస్తున్న రామునికి ఏమి చేయడానికి తోచలేదు. కన్నీళ్లు ధారాపాతంగా కారుతున్నాయి. అలా నిశ్చేష్టుడయి

నిలబడిపోయాడు. భూలోకంలో పరిస్థితి ఇలా ఉంటే ఊర్ధ్వలోకము లలో బ్రహ్మదేవుడు, కుబేరుడు, యముడు, ఇంద్రుడు, వరుణుడు, మహేశ్వరుడు, అందరూ కలుసుకున్నారు. అందరూ విమానముల మీద లంకానగరానికి వచ్చారు. విమానాలు దిగి రాముని వద్దకు వచ్చారు. వారందరినీ చూచి రాముడు చేతులెత్తి నమస్కరించాడు. వారిని చూచి బ్రహ్మదేవుడు, మిగిలిన దేవతామూర్తులు రామునితో ఇలా అన్నారు.

"ఓ రామా! నీవు ఎవరో నీకు తెలియదా? నీ గురించి నీవు ఎందుకు తెలుసుకోనలేదు. నీవు సకల లోకములకు కర్తవు. జ్ఞానివి. అందరిలోకి శ్రేష్టుడవు. అట్టి నీవు సీత అగ్ని ప్రవేశము చేస్తుంటే ఎందుకు చూస్తూ ఊరుకున్నావు. నీవు పూర్వ కల్పములో ఋతధాముడు అనే వసువువు. నీవు ప్రజాపతివి. రుద్రులలో నీవు ఎనిమిదవ రుద్రుడవు. సాధ్యులలో ఐదవ వాడవు. నీ చెవులే అశ్వినీ దేవతలు. సూర్య చంద్రులే నీ నేత్రములు.

ఓ రామా! నీకు నాశము లేదు. నీవు ఈ సృష్టికి ముందు ఉన్నావు. ఈ సృష్టి అంతం అయిన తరువాత కూడా ఉంటావు. కాని ఒక ఇటువంటి నీవు ఒక సామాన్యమానవుని వలె సీతతో అలా ఎందుకు మాట్లాడావు?" అని అడిగారు.

దానికి రాముడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. "ఓ బ్రహ్మదేవా! నాకు తెలిసినంతవరకూ నేను దశరథపుత్రుడను. రాముడిని. ఒక మానవుడిని. నా గురించి ఇంకా ఏమైనా మీకు తెలిస్తే చెప్పండి." అని అడిగాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు ఇలా చెప్పసాగాడు. “రామా! నీవు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడవు. నీవు వరాహ మూర్తివి. భూతభవిష్యత్కాలములలో దుష్టులను శిక్షించడానికి అవతారాలు ఎత్తుతున్నావు. నీవు ఆది మధ్యాంతరహితుడవు. బ్రహ్మస్వరూపుడవు. యజ్ఞపురుషుడవు. నీకు నాలుగు భుజములు ఉన్నాయి. నీవు సర్వవ్యాపివి. నీవు నీ ఇంద్రియములను నిగ్రహించుకోగలవు. నీ భక్తుల హృదయములలో సదా నివసిస్తుంటావు. పురుషులలో ఉత్తమ పురుషుడవు. నీవు ఉపేంద్రుడివి. నీవే మధుసూదనుడవు. త్రిలోకసేనాధిపతివి నీవే. లోకంలో ఉన్న గ్రామములకు అధిపతివి నీవే. మానవులలో ఉన్న బుద్ధి, ఓర్పు నీవే. సృష్టి, స్థితి, లయములకు కారకుడవు నీవే.

నీవు ఇంద్రుడవు. నాభియందు పద్మము కల పద్మనాభుడవు నీవే. వినాశకారకుడవు నీవే. నీ శరణుజొచ్చిన వారిని రక్షించేవాడివి నీవే. మూడులోకములకు సృష్టికర్తవు నీవే. నీవు స్వతంత్రుడవు. శాఖోపశాఖలుగా విస్తరించిన వేదములు నీవే. సిద్ధులకు, సాధ్యులకు ఆశ్రయము నీవే. యజ్ఞము నీవే. వషట్కారము నీవే. ఓంకారము నీవే. అందరిలోకీ శ్రేష్టుడివి నీవే. నీకు పుట్టుక, నాశము లేవు. నీవు ఎవరవో ఎవరికీ తెలియదు. నీవు అందరిలో ఉన్నావు. గోవులలోనూ బ్రాహ్మణులలోనూ, అన్ని దిక్కులలోనూ, ఆకాశంలోనూ, పర్వతముల లోనూ, నదులలోనూ ఉన్నావు. నీవు వేలకొలదిపాదములు, వేలకొలది చేతులు. వందలకొద్దీ తలలు. వేలకొలదీ నేత్రములు కలిగి ఉన్నావు. నీవు ఈ భూమినీ, అందులోని సమస్త ప్రాణులను ధరించి ఉన్నావు.

ఓ రామా! నీవు భూమికి అట్టగుడున ఆదిశేషుని రూపంలో మూడులోకములను ధరించి ఉన్నావు. రామా! బ్రహ్మనైన నేను నీ హృదయము. నీ నాలుక సరస్వతి. నీరోమములు సమస్తదేవతలు. నీవు కన్ను తెరిస్తే పగలు, కన్ను మూస్తే రాత్రి. నీ సంస్కారములే వేదములు. నీవు అన్నిటిలోనూ ఉన్నావు నీవు లేని చోటు లేదు. ఈ జగత్తే నీ శరీరము. నీ స్థైర్యమే ఈ భూమి. నీ కోపమే అగ్ని. నీ శాంతమే చంద్రుడు. నీవే మహావిష్ణువు. పూర్వము నీవు వామనావతారములో బలి చక్రవర్తిని మూడు అడుగుల భూమి దానంగా తీసుకొని, బలిని పాతాళానికి అణగదొక్కి, మహేంద్రుని స్వర్గానికి అధిపతిని చేసావు. ఈ సీత ఎవరో కాదు. సాక్షాత్తు లక్ష్మీదేవి. నీవే శ్రీమహావిష్ణువు. కేవలం రావణ వధ నిమిత్తము రామునికి అవతారం దాల్చావు.

రామా! రావణ వధతో నీ అవతారము పూర్తి అయింది. ఇంక స్వర్గానికి తిరిగి రా! ఓ రామా! నీ వీరత్వము, నీ పరాక్రమము, నీ దర్శనము అమోఘము. నిన్ను స్తుతించుట ఇంకా అమోఘము. ఈ భూలోకంలో నీ మీద భక్తి కల వారి జీవితం సార్థకం అవుతుంది. నీ యందు భక్తి కలవారికి ఈ లోకంలో కానీ, పరలోకంలో కానీ సమస్త సుఖాలు లభిస్తాయి. వారి కోరికలు అన్నీ తీరుతాయి. పురాతనమైన ఈ ఇతిహాసమునకు సంబంధించిన ఈ స్తోత్రమును పఠించు మానవులకు సకల శుభములు చేకూరుతాయి.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూటపదిహేడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(ఈ సర్గలో రాముడు సాక్షాత్తు విష్ణువు అవతారము అని చెప్పబడింది. కానీ ఇప్పటిదాకా నడిచిన రామాయణ మహా కావ్యంలో వాల్మీకి ఎక్కడా, ఏ సందర్భంలో కూడా రాముడు విష్ణువు అవతారము అని రాయలేదు. కాబట్టి రాముడు విష్ణువు అవతారము అని నిరూపించడానికి ఎవరో ఔత్సాహిక కవి చేసిన ప్రయత్నము అని కనపడుతూ ఉంది. ఇటువంటి ప్రయత్నాలే మనం ఇదివరలో కూడా చూచాము. కొన్ని వేల సంవత్సరాల కింద రాయబడిన మహాకావ్యంలో ఇటువంటి చేర్పులు మార్పులు సహజం. దీనికి కారణాలు వివరిస్తాను. ఈ సర్గ మొదట్లో బ్రహ్మదేవుడు, ఇతర దేవతలు రాముని ఋతధాముడు అనే వసువు అన్నారు. ప్రజాపతి అన్నారు. ఎనిమిదవ రుద్రుడు అన్నాడు. ఐదవ సాధ్యుడు అన్నారు. (సిద్ధులు,సాధ్యులు అని మనం చదువుకున్నాము). అశ్వినీ దేవతలు నీ చెవులు అన్నారు.

ఇంతలో రాముడు 'ఇంతకూ నేను ఎవరినో చెప్పండి' అనగానే బ్రహ్మదేవుడు నీవు విష్ణువు అని మొదలెట్టాడు. విష్ణువు లక్షణాలన్నీ రామునికి ఆపాదించాడు. మొదట ఒకటి చెప్పి, వెనువెంటనే మరొకటి చెప్పడం వాల్మీకి చెయ్యడు. ఆఖరులో, ఇది స్తోత్రము అనీ, దీనిని చదివితే మంచి ఫలితాలు కలుగుతాయని ఫలశ్రుతి కూడా చెప్పారు. మరొక విషయం ఏమిటంటే. 116 వ సర్గ చివరలో సీత అగ్ని ప్రవేశం చేస్తుంది. ఇది 117 వ సర్గ. 118 సర్గ మొదట్లో, అగ్ని ప్రవేశం చేసిన సీతను తీసుకొని అగ్ని దేవుడు రాముని వద్దకు వస్తాడు. అంటే 116 సర్గ తరువాత 118 వస్తుంది.117 వ సర్గ తరువాత చేర్చబడినది అని అనుకోవచ్చు. ఇదివరలో కూడా కుంభకర్ణుడు నిద్రలేవక ముందే కుంభకర్ణుడు రావణునికి హితబోధ చేసినట్టు ఉంది. తరువాత నాలుగు సర్గల తరువాత నానాయాతన పడి

కుంభకర్ణుని నిద్రలేపారు అని మనం చదువుకున్నాము. అలాంటిదే ఇది కూడా అని అనుకోవచ్చు.).

## యుద్ధ కాండము

## పదునెనిమిదవ సర్గ.

రాముడు ఆడిన కర్ణకఠోరమైన మాటలు విని మనస్తాపము చెందిన సీత అగ్ని ప్రవేశము చేసింది.

(ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. రాముడు సీతను శీలపరీక్ష కోరి అగ్ని పరీక్ష చేయమన్నాడని అక్కడక్కడా ప్రచారంలో ఉంది. కాని వాల్మీకి రామాయణం ప్రకారము రాముడు సీతను కేవలం అనుమానించాడు, ని ఇష్టం వచ్చిన చోటికి వెళ్లమన్నాడు తప్ప అగ్ని ప్రవేశముచేయమన లేదు.)

అగ్ని భగా భగా మండింది. సీతను తనలో కలుపుకుంది. అగ్ని దేవుడు మానవ రూపంతో సీతను ఒక తండ్రి తన కుమార్తెను తీసుకొని వచ్చినట్టు తీసుకొని వచ్చాడు. సీత కూడా అప్పుడే ఉదయించిన సూర్యుని వలె ప్రకాశిస్తూ ఉంది. దోషరహితురాలైన సీతను అగ్నిదేవుడు తీసుకొని వచ్చాడు. రామునికి అప్పగించాడు. హవ్యవాహనుడైన అగ్ని రామునితో ఇలా అన్నాడు.

"ఓ రామా! ఇదుగో నీ సీత. నీకే క్షేమంగాఅప్పగిస్తున్నాను. ఈమె ఏ పాపమూ చేయలేదు. ఈమె చరిత్ర పవిత్రమైనది. ఈ సీత త్రికరణశుద్ధిగా నిన్నే నమ్ముకుంది. నిన్నే మనసులో నిలుపుకుంది.

పరపురుషుని గురించి కలలో కూడా తలపలేదు. నీవు పర్ణశాలలో లేని సమయములో దుర్మార్గుడైన రావణుడు ఈమెను దొంగతనంగా అపహరించాడు. ఈమెను లంకకు తీసుకొనిపోయి అంత:పురములో ఉంచాడు. రాక్షస స్త్రీలను కాపలా పెట్టాడు. రావణుడు నయానా భయానా సీతను తన వైపుకు తిప్పుకోవాలని చూచాడు. కానీ మనసా, వాచా, కర్మణా నిన్నే నమ్మిన సీత రావణుని ప్రలోభాలకు, బెదిరింపులకు లొంగలేదు. ఆ రాక్షసుడిని ఒక గడ్డిపోచమాదిరి చూచింది. ఈమె మనసులో ఎటువంటి పాపభావన ప్రవేశించలేదు. ఈమెను ఏమీ అనకుండాస్వీకరించు. ఇది నా ఆజ్ఞ." అని ఆదేశించాడు అగ్నిదేవుడు.

రాముడు అనుమానంతో కూడిన కోపంలో ఏమేమో అన్నాడే కానీ, మనసులో కుమిలిపోతున్నాడు. కంటివెంట నీళ్లుధారాపాతంగా కారుతున్నాయి. అగ్ని దేవునికి నమస్కరించి ఇలా అన్నాడు.

"నా సీత గురించి నాకు బాగా తెలుసు. కానీ, చాలా కాలము పరాయి గృహములో ఉండటం వలన, అలా అనక తప్పలేదు. నా సీత తాను పరిశుద్ధురాలను అని నిరూపించుకుంది. అలా కాకుండా సీత నా వద్దకురాగానే నేను స్వీకరించి ఉంటే, ఇక్ష్వాకు వంశములో పుట్టిన రాముడు, దశరథతనయుడు రాముడు, కామాతురుడై రాజధర్మమును మరచి ప్రవర్తించాడు అని ప్రజలు నన్ను నిందించి ఉండేవారు. ఇన్నాళ్లు నన్ను అనుసరించి ఉన్నసీత గురించి నాకు బాగా తెలుసు. ఆమె పాతివ్రత్యమును నేను ఏనాడూ శంకించలేదు. సీతను రావణుడు చెయ్యివేసి ముట్టుకోలేడని నాకు బాగాతెలుసు. రావణునికి సీతను కనీసం మనసులో తలచుకోడానికి కూడా శక్తి లేదు. ఆగర్భశ్రీమంతురాలైన సీతకు రావణుని

ఐశ్వర్యములతో పని ఏముంటుంది. సూర్యుని నుండి తేజస్సు ఎలా విడివడదో అలాగే సీత కూడా నా నుండి విడివడదు. నన్ను తప్ప పరపురుషుని తలుచుకోదు. సీతతో సమానమైన పవిత్రురాలు ముల్లోకములలో లేదని నాకు తెలుసు. అటువంటి సీతను నేను ఎలా వదులుకోగలను. అందుకనే ఆమెకోసం ఇన్నికష్టములకు ఓర్చి రావణ సంహారము చేసాను. కాని, సత్యమునకు, ధర్మమునకు కట్టుబడిన నేను సీత అగ్నిప్రవేశము చేస్తూ ఉన్నా చూస్తూ ఊరుకున్నానే గానీ ఆపలేదు. మీరు నాకు నా సీతను తిరిగి ప్రసాదించారు. నేను మీ మాటలను తప్పకుండా పాటిస్తాను." అని రాముడు సీతను అగ్నిదేవుని నుండి సంతోషంగా స్వీకరించాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూటపద్దెనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

(రామాయణము మొదలు పెట్టినప్పటినుండీ మనకు ఒక అభిప్రాయం ఉంది. రాముడు కేవలం మానవమాత్రుడు అని. రాముడు తన ప్రవర్తన ద్వారా మానవులు తమ దైనందిన జీవితంలో ఎలా నడుచుకోవాలో మార్గం చూపాడని. దానినే రామాయణం, రామ అయనం, రాముని మార్గము అంటారని మనం చదువుకున్నాము. మరి ఇప్పుడు రాముడు తనతో 20 ఏళ్లు పైగా కాపురం చేసిన సీతను అనుమానించాడు. అవమానించాడు. మరి ఇది కూడా మనం రాముని మార్గం గానే భావించాలా! ఆ మార్గంలో నడవాలా అనే సందేహం కలగడం సహజం.

లోకంలో మంచీ చెడూ రెండూ పక్క పక్కనే ఉంటాయి. భగవంతుడు అన్నింటిలోనూ ఉంటాడు. అలాగే రాముడు మనకు ధర్మమార్గంలో నడవడం ఎంత ఆవశ్యకమని చెప్పాడో అలాగే అధర్మ మార్గంలో నడవడం అనర్ధదాయకము అని ఈ సంఘటన ద్వారా వాల్మీకి నిరూపించాడు. లేకపోతే వాల్మీకి ఈ ఘట్టం రాయనవసరం లేదు. విభీషణుడు సీతను తీసుకురాగానే, రాముడు స్వీకరించి, అయోధ్యకు వెళ్ల వచ్చు. అప్పుడు రాముడికి వచ్చిన అనుమానం లోకంలో ఉన్న అందరికీ వస్తుంది. వాల్మీకి రామాయణం చదివిన అందరికీ వస్తుంది. అది గ్రహించిన వాల్మీకి మహర్షి, మనకు రాబోయే అనుమానాన్ని రాముని ద్వారా బహిర్గతం చేయించి, దానికి సీత ద్వారా ఘాటుగా సమాధానం ఇప్పించి, అగ్ని దేవుని ద్వారా సాక్ష్యం ఇప్పించి సీతను మరలా రామునికి అప్పగించాడు. సంవత్సరాల కొద్దీ కలిసి కాపురం చేసిన భార్యలను అనుమానించడం అనర్ధదాయకం, అలా అనుమానిస్తే భార్యలు శాశ్వతంగా దూరమైపోవచ్చు, రాముడికే తప్పలేదు ఇంక సామాన్య మానవులు ఎంత! అనే సత్యాన్ని ప్రజలకు తెలియజేసాడు వాల్మీకి. అందుకే రామాయణంలో ఈ ఘట్టం అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకుంది.

మనకు ఇంకో సందేహం రావచ్చు. సామాన్యమానవులు, చదువుకోని వారు ఇలా భార్యల మీద అనుమాన పడడం సహజం కానీ బాగా చదువుకున్న రాముడు, ధర్మం తెలిసిన రాముడు ఇలా ఎందుకుచేసాడు అనేది మన సందేహం.

అనుమానం పెనుభూతం. అనుమానం అణువు రూపంలో ప్రవేశించి పెనుభూతంగా మారుతుంది. దానితో పాటు అసూయ,

ద్వేషము వచ్చి  చేరుతాయి. వీటి వల్ల కోపం పుట్టుకొస్తుంది. ఆ కోపంలో ఏమి మాట్లాడతామో ఏమి చేస్తామో మనకే తెలియదు. రాముడు అదే పరిస్థితిలో ఉన్నాడు. రాముడిలో అనుమానం ప్రవేశించింది. కామాతురుడైన రావణుడు తన దగ్గర ఉన్న అందమైన సీతను అనుభవించకుండా ఊరుకుంటాడా అన్నదే ఆ అనుమానం. అది అలా అలా పెరిగిపోయింది. తన సీత తనకు కాకుండా పోతుందే అనే కోపం, ద్వేషం ప్రబలింది. ఇష్టంవచ్చినట్టు మాట్లాడాడు. అప్పుడు రామునికి తాను నేర్చుకున్న విద్య, ధర్మములు గుర్తుకు రాలేదు. రావు కూడా. అది మానవ సహజం కూడా.  అందుకనే సీత రామునితో అత్యంత ప్రతిభావంతంగా తర్కిస్తుంటే, తన తప్పు నిరూపించమని నిలదీస్తే రాముడు బదులు చెప్పలేకపోయాడు.

ఇలాగే, దమయంతి కూడా తనను అర్ధాంతరంగా అడవులలో ఎందుకు విడిచి వెళ్లావు అని నలుని నిలదీసింది. తనను జూదంలో ఎందుకు ఒడ్డావు నీకేం అధికారం ఉంది అనీ ద్రౌపది ధర్మరాజును నిలదీసింది. అప్పుడు వాళ్లు కూడా సమాధానం చెప్పలేక తలలు వంచుకున్నారు.

కాబట్టి ఈ అనుమానం, కోపం, ద్వేషం,పగ ఇవన్నీ అన్ని యుగాలలోనూ తమ ప్రభావాన్ని మానవుల మీద చూపిస్తూనే ఉన్నాయి అనడంలో అతిశయోక్తి లేదు. అలా చెయ్యడం తప్పు అని చెప్పడానికే వాల్మీకి మహర్షి రామునిచేత సీతమ్మను అనుమానింపజేసాడు. ఈ రోజుల్లో కూడా ఇటువంటి అనుమానపడే వారిని మనం చూస్తూ ఉంటాము. బాగా చదువుకున్న వాళ్లు, ఉన్నత విద్యను అభ్యసించిన

వారు, పెద్ద పెద్ద ఉద్యోగాలలో ఉండి లక్షలు సంపాదిస్తున్న వారు, కోటీశ్వరులుకూడా ఈ అనుమానము అనే పెనుభూతానికి బానిసలే. పాతికేళ్లు తనతో కాపురం చేసిన భార్య పాలవాడితోనూ కూరల వాడితోనో చనువుగా నవ్వుతూ మాట్లాడితే అనుమానించే భర్తలు కోకొల్లలు. ఆఫీసుకు పోతూ భార్యను ఇంట్లోపెట్టి తాళం వేసి, సాయంత్రం వచ్చి తలుపుతీసే భర్తలు లేకపోలేదు. అయిన దానికీ కాని దానికీ భార్యను అనుమానిస్తూ మానసికంగా శారీరకంగా హింసించే భర్తలు దాదాపు యాభైశాతం ఉన్నారు. భార్యల ప్రవర్తన మీద నిఘాపెట్టడానికి డిటెక్టివులను నియమించే వాళ్లు లేకపోలేదు. కేవలం అనుమానం మీద విడాకుల దాకా వెళ్లిన వాళ్లు, అంతదాకా ఎందుకని, సమయం వస్తే అడ్డంగా నరికేసేవాళ్లు, మనం వార్తల్లో చూస్తుంటాము.

కాబట్టి ఈ అనుమానం, కోపం, ద్వేషం అనేవి అనర్థహేతువులు, వీటికి మానవుడు లోబడకూడదు, రామునికే తప్పలేదు ఇంక మీరెంత! అని నిరూపించ డానికి వాల్మీకి చేసిన ప్రయత్నమే ఈ సీతను అనుమానించే ఘట్టం. అంతేకానీ రాముని తక్కువ చేసి చూపడం వాల్మీకి ఉద్దేశం కాదు. ఇటువంటి ఆటుపోట్లు అన్నీ తట్టుకొని నిలబడ్డారు కాబట్టే సీతారాములు ఈనాటికీ ప్రతి ఇంట్లో, ప్రతి ఊరిలో, వాడవాడలా, పూజింప బడుతున్నారు. అందరికీ ఆరాధ్యదేవుళ్లయ్యారు.).

# యుద్ధకాండము

## నూటపంతొమ్మిదవ సర్గ.

ఆ సమయంలో అక్కడకు వచ్చిన మహేశ్వరుడు రాముని చూచి ఇలా అన్నాడు. "ఓ రామా! దైవ యోగము వలన ఇప్పటి వరకూ అన్నీ సక్రమంగానే జరిగాయి. ముల్లోకములకు రాక్షసుడైన రావణుని భయం తొలగిపోయింది. నీవు వెంటనే సీతాలక్ష్మణులతో సహా అయోధ్యకు వెళ్లి నీ తల్లి కౌసల్యకు, సుమిత్రకు సంతోషమును కలిగించు. అయోధ్యను పాలించు. అశ్వమేధయాగము చేసి, తుదకు స్వర్గమునకు వెళ్లు. అడుగో! నీ తండ్రి దశరథుడు స్వర్గమునుండి విమానములో నిన్ను చూచుటకు వచ్చాడు. విమానములో ఉన్నాడు. నీవు, లక్ష్మణుడు ఆయనకు నమస్కరించి, ఆయన ఆశీస్సులు తీసుకోండి." అని అన్నాడు.

వెంటనే రామలక్ష్మణులు విమానంలో ఉన్న దశరథునికి నమస్కరించారు. దశరథుడు తన కుమారులను ఇద్దరినీ ప్రేమతో కౌగలించుకున్నాడు. రామునితో ఇలా అన్నాడు. "రామా! నీవు నా దగ్గరలేకుండా నాకు ఈ స్వర్గసుఖములు అన్నీ వ్యర్థములే కదా! నా పుత్రుడవై పుట్టి నువ్వు నన్ను తరింపజేసావు. రావణుని వధ కొరకు నీవే కాదు దేవతలు కూడా యజ్ఞములు చేసారు. రావణ సంహారముచేసి విజయుడవై తిరిగి వస్తున్న నిన్ను చూచి నీ తల్లి కౌసల్యల ఎంత ఆనందిస్తుందో కదా! నిన్ను అయోధ్యాధిపతిగా చూడబోవు అయోధ్యావాసులు ఎంత అదృష్టవంతులో కదా! నీవు అయోధ్యకు వెళ్లి నీ తమ్ముని భరతుని కలిస్తే చూడవలెనని కోరికగా

ఉంది. నీవు, నీ భార్య సీతతోనూ, తమ్ముడు లక్ష్మణునితోనూ 14 సంవత్సరములు అరణ్యములలో గడిపావు. వనవాసమును పూర్తిచేసి నీవు నాకు ఇచ్చిన మాట నిలుపుకున్నావు. రావణసంహారము చేసి లోకాలకు మేలుకలిగించావు. ముల్లోకములలో కీర్తి గడించావు. దీర్ఘాయుష్మంతుడవై వర్ధిల్లు." అని దీవించాడు దశరథుడు.

అప్పుడు రాముడు దశరథునితో ఇలా అన్నాడు. "తండ్రీ! నా మీద దయయుంచి భరతుని మీద, కైకేయి మీద దయచూపించు. నేను అరణ్యవాసమునకు వెళ్లే సమయంలో తమరు వారిని "ఈ రోజునుండి నిన్ను, నీ కుమారుడిని వదిలివేస్తున్నాను" అని అన్నారు. దయచేసి ఈ శాపవచనము వారికి తగలకుండా చూడండి." అని పలికాడు రాముడు. రాముని ఔదార్యానికి సంతోషించి దశరథుడు అట్లే అగుగాక అని వరం ఇచ్చాడు.

తరువాత లక్ష్మణుని ప్రేమగా దగ్గరకు తీసుకొని ఇలా అన్నాడు. "కుమారా! లక్ష్మణా! నీవు నీ అన్న వదిలను అయిన సీతారాములను సేవించి నాకు ఎంతోసంతోషం కలిగించావు. ధర్మాన్ని నిలబెట్టావు. నీకు అఖండమైన కీర్తిలభిష్తుంది. రాముని కృపవలన పొందలేనిది ఏదీ లేదు. (రామునితో పాటు లక్ష్మణుడు కూడా ఇంటింటా, వాడవాడలా పూజలందుకుంటున్నాడు కదా!) లక్ష్మణా! ఎల్లప్పుడూ తన స్వార్థమును మరిచి, లోకక్షేమం కొరకు పాటు పడే రాముని సేవించి తరించు. దేవతలు, సిద్ధులు, మహర్షులు, రాముని సన్నిధి చేరడానికి తహతహలాడుతుంటారు. సీతాసమేతంగా ఉన్న రాముని భక్తితో సేవించుచుతన్న నీవు కీర్తిమంతుడవు అవుతావు." అని లక్ష్మణుని దీవించాడు.

తరువాత రాముని పక్కనే తలవంచుకొని నిలబడి ఉన్న సీతను చూచి ఇలా అన్నాడు. “పుత్రీ! సీతా! కోపావేశంలో నిన్ను అనుమానించి వదిలివేసిన రాముని మీద కోపించకు. నీ మంచి కోరి, నిన్ను పరిశుద్ధురాలుగా నిరూపించడానికే అలా చేసాడు కానీ నీ మీద ప్రేమ అభిమానము లేక కాదు. కానీ నీవు చేసిన పని లోకాతీతమైనది. అందరి స్త్రీలకు ఆదర్శప్రాయమైనది. నీ పతిభక్తిని ఎవరూ శంకించలేరు. నీకురాముడే పరమ దైవము. రాముని సేవించి తరించు.” అని దశరథుడు సీతకు హితబోధ చేసాడు. తరువాత దశరథుడు విమంనం ఎక్కి ఇంద్రలోకము వెళ్లిపోయాడు.

శ్రీమద్రాయామణము

యుద్ధకాండము నూటపంతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## నూటఇరవయ్యవ సర్గ

దశరథుడు వెళ్లిపోగానే ఇంద్రుడు రాముని చూచి ఇలాఅన్నాడు. “రామా! నీవు రావణ కుంభకర్ణులను, ఇంద్రజిత్తును సంహారము చేసి దేవతలకు ఎంతో మేలు చేసావు. ఈ సంతోష సమయంలో ఏదైనా వరం కోరుకో ఇస్తాను.” అని అన్నాడు. అప్పుడు రాముడు ఇంద్రునితో ఇలా అన్నాడు. “మహేంద్రా! నీకు నా యందు ప్రేమ అభిమానము ఉంటే ఈ యుద్ధములో నా కొరకు తమ ప్రాణములను పణంగా పెట్టిన వానరులనందరినీ తిరిగి జీవించేట్లు

చెయ్యి. ఈ యుద్ధంలో చనిపోయిన వానరులందరినీ పునర్జీవితులను చెయ్యి. ఇదే నా కోరిక. ఎందుకంటే వీరందరూ భూమి నాలుగుచెరగుల నుండీ తమ భార్యా బిడ్డలను వదిలి కేవలం నాకోసరం ఇక్కడకు వచ్చారు. నా కోసరం తమ ప్రాణాలను అర్పించారు. ఈ వానరులందరూ ప్రాణభయం లేనివారు. యుద్ధము అంటే ఉత్సాహంగా ముందుకు దూకేవారు. వారందరూ రాక్షసులతో యుద్ధం చేస్తూ మరణించారు. వారిలో వానరులే కాదు, భల్లూకములు, గోలాంగూలములు, ఇంకా ఎన్నో ఇతర జాతుల వానరములు కూడా ఉన్నాయి.   వారందరూ సంతోషంగా ఉండాలని నేను కోరుకుంటున్నాను. నీ అనుగ్రహంతో వారందరూ పునర్జీవితులు కావాలి." అని ప్రార్థించాడు రాముడు.

ఆ మాటలు విన్న మహేంద్రుడు చాలా సంతోషించాడు. "రామా! నీవు కోరిన వరము చాలా గొప్పది. నీవు కోరిన వరమును ప్రసాదించాను. ఈ యుద్ధములో చనిపోయిన వారందరూ పునర్జీవితులు అవుతారు. అంతే కాదు, గాయపడ్డవారు కూడా సంపూర్ణ ఆరోగ్యవంతులు అవుతారు. వారందరూ తమ తమ బంధుమిత్రులను సంతోషంగా కలుసుకుంటారు. ఈ ప్రాంతమంతా సస్యశ్యామలము అవుతుంది." అని వరం ప్రసాదించాడు. తక్షణమే అప్పటిదాకా చచ్చి పడి ఉన్న వారు, గాయాలతో బాధపడుతున్నవారు. సంపూర్ణ ఆరోగ్యంతో లేచి కూర్చున్నారు. ఈ హటాత్పరిణామానికి వారు ఆశ్చర్యపోయారు. ఒకరిని ఒకరు అభినందించుకుంటున్నారు.

ఆ సమయంలో దేవతలు అందరూ రామునితో ఇలా అన్నారు. "ఓ రామా! నీవు వచ్చిన పని పూర్తి  అయినది. ఇక్కడి నుండి

అయోధ్యకు వెళ్లు. వానరములను వారి వారి స్వస్థలములకు పంపివేయి. నీ భార్య సీతను ఓదార్చు. నీకోసరము నిత్యముపూజలు వ్రతములు చేస్తున్న భరతుడిని, నీ తమ్ముడు శత్రుఘ్నుడిని, నీ తల్లులను సంతోషపెట్టు. అయోధ్యా పౌరులకు ఆనందం కలిగించు." అని అన్నారు. తరువాత దేవేంద్రుడు, దేవతలతో కలిసి స్వర్గలోకమునకు వెళ్లిపోయాడు. రాముడు వానరులందరినీ విశ్రాంతి తీసుకోమని అనుమతి ఇచ్చాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూట ఇరవయ్యవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూట ఇరవై ఒకటవ సర్గ.

ఆరాత్రి అంతా అందరూ సుఖంగా సంతోషంగా నిద్రించారు. విభీషణుడుకూడా ఆ రాత్రి అక్కడే రామలక్ష్మణుల వద్ద ఉన్నాడు. తెల్ల వారింది. విభీషణుడు రాముని వద్దకు పోయి చేతులుకట్టుకొని నిలబడ్డాడు. "రామా! నీ సేవ కొరకు, నీకు స్నానము చేయించుట కొరకు ఈ స్త్రీలు నిలబడిఉన్నారు. వీరు నీకు స్నానము చేయిస్తారు. మీరు సిద్ధం కండి" అని అన్నాడు.

అప్పుడు రాముడు "విభీషణా! నాతో పాటు లక్ష్మణుడు,సుగ్రీవుడు ఇంకా వానర ప్రముఖులు ఉన్నారు కదా. వారిని కూడా స్నానమునకు ఆహ్వానించు. అయినా ఇప్పుడు నాకు

మంగళస్నానములు ఏమిటి విభీషణా! అయోధ్యలో భరతుడు నా కొరకు ఎదురుచూస్తున్నాడు. ముందు నేను భరతుని కలుసుకోవాలి. తరువాతనే ఈ మంగళస్నానములు, మైపూతలు, అలంకారములు, అమూల్యవస్త్రధారణ. ఇంతకూ మేము అయోధ్యకు తొందరగా వెళ్లుటకు మార్గము ఏమున్నది. నడిచి వెళితే ప్రయాణము చాలా కష్టము. పైగా చాలా కాలము పడుతుంది." అని అన్నాడు రాముడు.

"రామా! అయోధ్యకు వెళ్లడం గురించి నీవు దిగులు చెందకు. ఒక్కరోజులో మీ అందరినీ నేను అయోధ్యకు చేరుస్తాను. యక్షులకు అధిపతి కుబేరుడు నాకు, రావణునికి అన్నగారు అని తెలుసుకదా! ఆ కుబేరుని వద్ద పుష్పకము అనే విమానము ఉండేది. నా సోదరుడు రావణుడు కుబేరుని యుద్ధములో జయించి ఆ విమానమును స్వాధీనం చేసుకున్నాడు. అది ప్రస్తుతం నా అధీనంలో లంకలో ఉంది. దానిని నీ అధీనం చేస్తాను. నీవు నీ పరివారము అందరూ ఒక్కరోజులో ఆ పుష్పక విమానము మీద అయోధ్యకు చేరవచ్చును. అందుకని అయోధ్యకు వెళ్లడం గురించి ఆలోచించవద్దు. నీవు, సీత, లక్ష్మణుడు నా అతిథులుగా కొన్నాళ్లు ఇక్కడే ఉండి, నేను అర్పించే అతిథి సత్కారములు అందుకొని నన్ను కృతార్థునిగా చెయ్యండి. సుగ్రీవుడు కూడా తన సమస్త సైన్యములతో లంకలో ఉండి నా ఆతిధ్యము స్వీకరించేట్టు చెయ్యి. రామా! నేను నీకు సేవకుడను. ఈ లంకారాజ్యాధిపత్యము నీవు నాకు పెట్టిన భిక్ష. ఇది నా అభ్యర్థన, ఆజ్ఞ కాదు. " అనిప్రార్థించాడు విభీషణుడు.

ఆమాటలు విన్న రాముడు అందరూ వింటూ ఉండగా విభీషణునితో ఇలా అన్నాడు. "విభీషణా! నీవు నాతో స్నేహం చేయడమే

నాకు ఒక అతిథి సత్కారము. నీవు నాకు ఈ యుద్ధములో ఎంతో సహాయము చేసావు. నీవు లేకపోతే నేను ఈ యుద్ధము గెలిచి ఉండేవాడినికాదు. కాబట్టి నీవు అనునిత్యము నన్ను పూజిస్తూనే ఉన్నావు. అతిథి సత్కారములు చేస్తూనే ఉన్నావు. నీకోరికను నేను తప్పకుండా మన్నిస్తాను. కాని నా మనసు భరతుని చూడవలెనని చాలా తొందరపడుతూ ఉంది. నా తల్లులు, నా మిత్రుడు గుహుడు, నా అయోధ్య ప్రజలు నా కోసరం ఎదురుచూస్తూ ఉంటారు. కాబట్టి నన్ను త్వరగా అయోధ్యకు చేర్చు. నీవు అర్పించిన అతిథి సత్కారములు నేను అందుకొనినట్టే భావించు. అన్యథా భావించవద్దు.

విభీషణా! నేను వచ్చిన పని పూర్తి అయింది. ఇంకా ఈ వానర సేనలను ఇక్కడే ఉంచి బాధపెట్టడం నాకు ఇష్టం లేదు. నేను కూడా ఇక్కడ ఎక్కువ కాలం ఉండటం భావ్యం కాదు కదా. కాబట్టి వెంటనే విమానం తెప్పించు." అని అన్నాడు రాముడు.

రాముని మాటలను కాదనలేకపోయాడు విభీషణుడు. వెంటనే పుష్పకవిమానమును తెప్పించాడు. ఆ విమానము సూర్యకాంతితో సమానంగా వెలిగిపోతూ ఉంది. మణులతో, రత్నములతో, ముత్యములతో అలంకరింపబడి ఉంది. ఆ విమానమునకు కట్టిన చిరుగంటలు పిల్లగాలికి మృధుమధురంగా సవ్వడి చేస్తున్నాయి. ఆ విమానములో కూర్చోడానికి మెత్తటి ఆసనములు అమర్చబడి ఉన్నాయి.

విమానము వచ్చినట్టు రామునికి తెలిపి విభీషణుడు రాముని పక్కనే నిలబడ్డాడు. రాముడు పుష్పక విమానము వద్దకు వచ్చాడు. ఎత్తైన పర్వతము మాదిరి ఉన్న ఆ విమానమును చూచి రాముడు లక్ష్మణుడు ఆశ్చర్యపోయారు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూట ఇరవై ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూట ఇరవై రెండవ సర్గ.

పుష్పక విమానమును తెచ్చి తన ముందు నిలిపి, తన ఆజ్ఞ కోసరం ఎదురు చూస్తున్న విభీషణుని చూచి రాముడు ఆదరంతో ఇలా అన్నాడు. "విభీషణా! ఈ వానరములు భల్లూకములు నా కొరకు ఇంత శ్రమపడి వచ్చారు. వారిని అందరినీ ఆభరణములతో, రత్నముల తోనూ, మణులతోనూ, మాణిక్యములతోనూ, ధనముతోనూ నీకు తోచినట్టు సత్కరించు. ఎందుకంటే లంకను జయించడం వీరి త్యాగఫలము మాత్రమే. నేనుచేసింది ఏమీ లేదు. కాబట్టి వీరి త్యాగమునకు తగిన ప్రతిఫలము వారికి బహుమానముల రూపములలో ఇవ్వు. వారందరూ ఆనందిస్తారు. నిన్ను శ్లాఘిస్తారు.

విభీషణా! ++++++++++ ధనము, ఐశ్వర్యము లభించగానే సరికాదు. ఆ ధనమును ఐశ్వర్యమును సాటి వారితో పంచుకొంటేనే

ఆనందం కలుగుతుంది. రాజు తన సైన్యాధిపతులను, సైనికులను ప్రేమించాలి, ఆదరించాలి. అలా కాకుండా ఒక నియంతలాగా యుద్ధాలు చేస్తూ సైన్యమును యుద్ధములో చంపిస్తుంటే, ఆ రాజుకు సైనికులు ఎదురు తిరుగుతారు. త్వరగా విడిచిపెడతారు. " అని అన్నాడు రాముడు.

విభీషణుడు వెంటనే అపారమైన ధనరాసులను, మణి మాణిక్యములను తెప్పించి వానర సేనలకు పంచి పెట్టాడు. వానరులందరూ పరమానందభరితులయ్యారు. విభీషణుని వేనోళ్ల శ్లాఘించారు. అప్పుడు రాముడు పుష్పక విమానమును అధిరోహించాడు. సీతను కూడా చెయ్యిపట్టుకొని ఎక్కించి తన పక్కనే కూర్చుండపెట్టుకున్నాడు. వారి వెంట లక్ష్మణుడు ఎక్కాడు. తరువాత రాముడు సుగ్రీవుని, విభీషణుని, వానర వీరులను, వానరులను చూచి ఇలా అన్నాడు.

"మీరంతా నాకు మిత్రులు. మిత్రకార్యమును సాధించడానికి వచ్చారు. వచ్చిన కార్యము ఫలవంతమైనది. ఇంక మీరందరూ మీ మీ స్వగృహములకు వెళ్లండి. సుగ్రీవా! నీవుకూడా నీ సేనలతో మిత్రులతో కిష్కింధకు వెళ్లు. విభీషణా! నీవు ప్రజారంజకంగా లంకారాజ్యమును ధర్మబద్ధంగా పాలించు. అప్పుడు నిన్ను ఎవరూ ఏమీ చేయలేరు. అందరూ నిన్ను ఆదరిస్తారు. నేను మీ అందరి దగ్గరా సెలవు తీసుకొని నా తండ్రిగారి రాజధాని అయోధ్యకు వెళుతున్నాను. నాకు అనుమతి ఇవ్వండి." అని అన్నాడు.

అప్పుడు వానర నాయకులు, వానరులు ముక్తకంఠంతో ఇలా అన్నారు. "రామా! మేమందరమూ అయోధ్యను చూడాలని కోరుకుంటున్నాము. అక్కడ ఉన్న వనములలో విహరించాలని మా కోరిక. మా కోరిక మన్నించు. నీవు అయోధ్యారాజ్యమునకు పట్టాభిషిక్తుడివి కావడం మాకు చూడాలని ఉంది. నీ పట్టాభిషేక మహోత్సవమును చూచిన తరువాత, మీ తల్లి కౌసల్యకు నమస్కరించి, ఆమె ఆశీర్వాదము తీసుకొని మేము తిరిగి మా మా స్వస్థానములకు వెళ్లిపోతాము. కాబట్టి  మేము అయోధ్యకు రావడానికి అనుమతి ఇవ్వు." అని ప్రార్థించారు.

అప్పుడు రాముడు వానరులతో ఇలా అన్నాడు. "మీరందరూ అయోధ్యకు వచ్చి నా ఆతిధ్యము స్వీకరించడం కన్నా నాకు ప్రియం కలిగించే విషయం ఇంకా  ఏముంటుంది. మీరందరికీ ఇదే నా ఆహ్వానము. మీరందరూ అయోధ్యకు రండి. సుగ్రీవా! నీవు, నీ వానరనాయకులు, వానర సైన్యముతో సహా విమానము ఎక్కు. విభీషణా, నీవు నీ సచివులు, నీ అనుచరులతో సహా విమానము ఎక్కు." అని అన్నాడు. అంతే.

బిలబిల మంటూ వానరవీరులు, రాక్షస వీరులు అందరూ ఆ విమానము ఎక్కారు. అందరూ ఎక్కిన తరువాత ఆ విమానము గాలిలోకి ఎగిరింది. ఆ విమానములో వానరులు, భల్లూకములు, రాక్షసులు అందరూ ఏమాత్రం అసౌకర్యం లేకుండా హాయిగా కూర్చుని ప్రయాణం చేస్తున్నారు.

(పుష్పకవిమానములో ఎంతమంది ఎక్కినా మరొకరికి చోటు ఉ ంటుంది అని మనకు నానుడి. అది కేవలం పుష్పక విమానము చాలాపెద్దది అని చెప్పడానికి అతిశయోక్తి గా అనుకోవచ్చు.).

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూట ఇరవై ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము

## ఇరవై రెండవ సర్గ.

సీతారామలక్ష్మణులు, సుగ్రీవాదులు వానర సైన్యము ఎక్కిన పుష్పక విమానము ఆకాశంలో ఎగురుతూ అయోధ్యవైపు నెమ్మదిగా సాగిపోతూ ఉంది. రాముడు సీతను తన పక్కన కూర్చోబెట్టుకొని ఇలా అంటున్నాడు.

"సీతా! అటు చూడు! ఆకాశంలో నుండి లంక ఎంత సుందరంగా కనపడుతూ ఉందో. అది విశ్వకర్మ త్రికూట పర్వత శిఖరము మీద అందంగానిర్మించిన స్వర్ణ లంక. అదుగో. అదే యుద్ధభూమి. అక్కడే కోటాను కోట్ల మంది రాక్షసులను తన మూర్ఖత్వానికి బలిపెట్టాడు రావణుడు. వాళ్ల రక్తం ఏరుల్లాగా పారించాడు. అక్కడే రావణుడు నా చేతిలో మరణించాడు. అదుగో అక్కడే కుంభకర్ణుడు పడిపోయాడు. ఇక్కడ ప్రహస్తుడు చంపబడ్డాడు. ఇదిగో ఇక్కడే హనుమంతుడు ధూమ్రాక్షుని సంహరించాడు. అదుగో అక్కడే లక్ష్మణుడు ఇంద్రజిత్తునుచంపాడు. ఆ పక్కనే అంగదుడు

వికటుడు అనే రాక్షసుని చంపాడు. ఈ యుద్ధభూమిలోనే విరూపాక్షుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, అకంపనుడు, త్రిశిరస్సు, అతికాయుడు, దేవాంతకుడు, నరాంతకుడు, మొదలగు రాక్షస వీరులు చంపబడ్డారు. వారే కాదు మత్తుడు, కుంభకర్ణుని కుమారులైన నికుంభుడు, కుంభుడు, వజ్రదంష్ట్రుడు, దంష్ట్రుడు ఇంకా చాలా మంది రాక్షస వీరులు చంపబడ్డారు.

అదుగో అక్కడే నేను మకరాక్షుడిని చంపాను. అకంపనుడు, శోణితాక్షుడు, యూపాక్షుడు, ప్రజంఘుడు, విద్యుజ్జిహ్వుడు, యజ్ఞశత్రువు, సుప్తఘ్నుడు,సూర్యశత్రుడు, బ్రహ్మశత్రువు కూడా ఇక్కడే చంపబడ్డారు. సీతా! అక్కడే రావణుని కళేబరము పడి ఉంటే, రావణుని భార్య మండోదరి రావణుని శరీరము మీద పడి ఏడిచింది.

సేతువు మీద మేము సముద్రమును దాటిన తరువాత మేమందరమూ అక్కడే విడిది చేసాము. అదే సగర చక్రవర్తి మనుమలు తవ్విన సముద్రము. దాని మీదనే నలుడు సేతువును నిర్మించాడు. సీతా! చూడు ఈ సముద్రము ఎంత విశాలంగా ఉందో. సీతా! అదే మైనాక పర్వతము. ఆ పర్వతమే హనుమంతుడు నిన్ను వెతుకుతూ సముద్రము దాటుతుంటే, ఆయనకు ఆశ్రయము ఇవ్వడానికి ప్రయత్నించింది. అక్కడే వానర సేన సేతువు మీదుగా సముద్రమును దాటారు. అదుగో అక్కడే విభీషణుడు నా వద్దకు వచ్చి నన్ను కలిసాడు. ఆ ప్రదేశము నుండే సేతువును కట్టడం మొదలెట్టాము. దానినే సేతుబంధము అంటారు. (ప్రస్తుతము ధనుష్కోటి అనే ప్రదేశముగా చెబుతారు.) అది పరమ పవిత్రమైన పుణ్యస్థలము. సీతా

సీతా! అటుచూడు! మనకు కిష్కింధకు వస్తున్నాము. ఆ కనిపించేదే కిష్కింధా నగరము. ఆ నగర పరిసరములలోనే నేను వాలిని చంపాను." అని అన్నాడు రాముడు.

ఆ కిష్కింధా నగరమును చూచి సీత రామునితో ఇలా అంది. "మనము ఈ కిష్కింధలో ఆగి సుగ్రీవుని అంత:పుర స్త్రీలు అయిన తార మొదలగు వారిని కలుసుకొని, వారిని కూడా అయోధ్యకు తీసుకొని వెళదాము." అని అన్నది. దానికి రాముడు సంతోషంగా ఒప్పుకున్నాడు. పుష్పక విమానము కిష్కింధలో ఆగింది. అప్పుడు రాముడు సుగ్రీవునితో ఇలా అన్నాడు. "సుగ్రీవా! మీరు, వానర నాయకులు తమతమ భార్యలను కూడా తీసుకురండి. అందరూ కలిసి పుష్పకము ఎక్కండి అయోధ్యకు పోదాము. సుగ్రీవా! నీ భార్యలను తీసుకురమ్మని సీత పదే పదే చెప్పింది. త్వరగా తీసుకురా! " అని అన్నాడు రాముడు.

వెంటనే సుగ్రీవుడు తన అంత:పురమునకు వెళ్లాడు. తారనుచూచి ఇలా అన్నాడు. "తారా! నిన్ను, నా ఇతర భార్యలను కూడా అయోధ్యకు తీసుకు రమ్మని రాముడు ఆదేశించాడు. నీవు త్వరగా ప్రయాణమునకు సిద్ధం కండి. మీరందరూ అయోధ్యలో రాముని తల్లులను చూడవచ్చును." అని పలికాడు సుగ్రీవుడు.

ఆ మాటలు విన్న తార, సుగ్రీవుని భార్యలందరనీ పిలిచింది. "రాముని ఆదేశాను సారము మనమందరమూ అయోధ్యకు పోతున్నాము. అక్కడ రాముని వైభవమును చూద్దాము. త్వరగా రండి." అని పలికింది. వెంటనే తారతో సహా అంత:పుర కాంతలందరూ పుష్పక

విమానము ఎక్కారు. విమానము పైకి ఎగిరింది. ఋష్యమూక పర్వతము మీద ఎగురుతూ ఉంది. అప్పుడు రాముడు ఇలా అన్నాడు.

"సీతా! ఆ కనపడునదే ఋష్యమూక పర్వతము. ఇక్కడే నేను సుగ్రీవుని కలుసుకున్నాను. మాకు మైత్రీ బంధము ఇక్కడే జరిగింది. అదే పంపానదీ తీరము. ఇక్కడ కనపడే సుందర దృశ్యములనుచూచి నేను నిన్ను తలచుకుంటూ ఎంతగానో విలపించాను. ఈ పంపాతీరమున ఉన్నదే శబరి ఆశ్రమము. అక్కడే నేను శబరిని కలుసుకున్నాను. అదుగో అక్కడే నేను కబంధుని చంపాను. అతడే నన్ను సుగ్రీవుని కలుసుకోమని చెప్పాడు.

సీతా! మనం జనస్థానమునకు వచ్చాము. నిన్ను వెతుకుకుంటూ వస్తుంటే ఇక్కడే మేము జటాయువును కలుసు కున్నాము. నీ కోసరము జటాయువు తన ప్రాణాలు అర్పించింది ఇక్కడే. అదుగో పర్ణశాల. అక్కడే నిన్ను రావణుడు నేను లేని సమయములో అపహరించాడు. నీకు తెలుసు కదా! నేను అక్కడే కదా త్రిశిరస్సునూ, ఖరుడిని, దూషణుడిని, వారి సైన్యమును హతమార్చింది. మనం గోదావరీ తీరంలో పోతున్నాము. అదుగో అదే అగస్త్యుని ఆశ్రమము. ఆ పక్కదే సుతీక్ష్ణుని ఆశ్రమము. అదే శరభంగాశ్రమము. ఇక్కడికే ఆ నాడు దేవేంద్రుడు వచ్చాడు. అటు చూడు.,, ఆ ఆశ్రమ ప్రాంతములలో మునులు అటు ఇటు తిరుగుతున్నారు.

ఇప్పుడు మనము విరాధుడిని చంపిన ప్రదేశమునకు వచ్చాము. ఇక్కడే అత్రి మహాముని ఆశ్రమము ఉంది. ఇక్కడే నువ్వు అనసూయను చూచావు. ఇప్పుడు మనము చిత్రకూట

పర్వతప్రాంతమును చేరుకున్నాము. ఇక్కడే నన్ను భరతుడు తిరిగి రాజ్యభారము వహించమని వేడుకున్నాడు.

సీతా! అదే యమునా నది ఒడ్డున ఉన్న భరద్వాజుని ఆశ్రమము.  అది దాటగానే కనిపించేది పరమ పవిత్రమైన గంగానది. ఆ గంగానదీ తీరమున ఉన్నదే గుహుడు పరిపాలించే శృంగిభేర పురము. అదే సరయూ నది. అయోధ్యా నగరము పక్కనుండి ప్రవహించే సరయూ నది. సీతా! చూడు. మనము అయోధ్యకు వచ్చాము. అదే అయోధ్య. నమస్కరించు. ఇదే మా తండ్రిగారు దశరథుడు పరిపాలించిన అయోధ్యానగరము.” అని అన్నాడు రాముడు.

రాముడు ఆ మాటలు అనగానే విభీషణుడు, సుగ్రీవుడు, వానరులు, రాక్షసులు బిలా బిలా పైకి లేచారు. అందరూ ఆకాశం నుండి అయోధ్యా నగర సౌందర్యములను కనులారా చూస్తున్నారు. తెల్లని మేడల వరుసలు, విశాలమైన రాజవీధులు, ఏనుగులు, గుర్రములు అటు ఇటూ తిరుగుతుంటే ఇంద్రుని రాజధాని అమరావతివలె శోభిల్లుతున్న అయోధ్యానగరమును అందరూ పుష్పకవిమానము నుండి చూచారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూటిరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

# యుద్ధకాండము
## ఇరువది నాలుగవ సర్గ.

రాముడు వెంటనే అయోధ్యలో దిగలేదు. విమానమును భరద్వాజుని ఆశ్రమ పరిసరములలో దింపించాడు. పదునాలుగు సంవత్సరముల తరువాత, పంచమీ తిథి యందు రాముడు భరద్వాజ ఆశ్రమములో అడుగుపెట్టాడు. భరద్వాజమునికి నమస్కరించాడు. ఆయన ఆశీర్వాదములను అందుకున్నాడు. "మునీంద్రా! తమరు క్షేమమే కదా! అయోధ్యలో అందరూ క్షేమమే కదా! భరతుడు, శత్రుఘ్నుడు, మా తల్లులు కౌసల్య,సుమిత్ర,కైకేయి క్షేమంగా ఉన్నారా! భరతుడు పరిపాలన చక్కగా సాగిస్తున్నాడా!" అని అడిగాడు.

రాముడు అడిగిన ప్రశ్నలకు భరద్వాజుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. "రామా! భరతుడు నీకోసరమే కళ్లలో వత్తులు వేసుకొని ఎదురుచూస్తున్నాడు. పాదుకలను సింహాసనము మీద పెట్టి నీ బదులు రాజ్యపాలన సాగిస్తున్నాడు. అంత:పురములో అందరూ క్షేమంగా ఉన్నారు.  రామా! నీ తండ్రి మాట ప్రకారము నీవు సీత, లక్ష్మణులతో సహా అరణ్యములకు వెళుతుంటే నాకు చాలా జాలి కలిగింది. కాని ఇప్పుడు నీవు రాక్షస సంహారము చేసి విజయుడవై వచ్చిన తరువాత అపరిమితమైన ఆనందం కలిగింది.

నీవు జనస్థానములో ఉండగా  రాక్షసులను చంపడం, నీ భార్య సీతను రాక్షసుడు అపహరించడం తెలిసి చాలా బాధపడ్డాను. మారీచుడు మాయాలేడి రూపంలో నిన్ను దూరంగా తీసుకొని వెళితే,

నీ భార్య సీతను, రాక్షసరాజు అపహరించడం, లంకకు తీసుకొని వెళ్లడం, నీవు కబంధుని చూడటం, సుగ్రీవునితో స్నేహం చేయడం, వాలిని వధించడం, సీత కోసరం వానరులు వెళ్లడం, హనుమంతుడు సీతను చూడటం, లంకను కాల్చడం, నీవు లంకకు పోయి రావణుని సంహరించడం, ఇవన్నీ నేను నా తపోబలముతో తెలుసుకున్నాను. అయోధ్యనుండి వచ్చే నా శిష్యులు నాకు అయోధ్యలో వార్తలు ఎప్పటికప్పుడు తెలియబరుస్తుంటారు. నీవు ఈ రోజు ఇక్కడే ఉండి రేపు అయోధ్యకు వెళ్లు. ఈ సమయంలో ఏదైనా వరము కోరుకో! అని అన్నాడు భరద్వాజుడు.

"ఓ మహామునీ! మీరుచెప్పినట్టు ఈ రోజు ఇక్కడేఉంటాను. ఇక్కడి నుండి అయోధ్య వరకూ ఉండే రహదారుల వెంట ఉన్న వృక్షములు అన్నిఋతువులలోనూ ఫలపుష్పములతో, తేనెపట్టులతో కళకళలాడుతూ ఉండే వరమును ప్రసాదించండి." అని అడిగాడు. భరద్వాజుడు రాముని కోరికను మన్నించాడు. భరద్వాజుని అనుగ్రహంతో, అయోధ్య నుండి భరద్వాజ ఆశ్రమమునకు మధ్య ఉన్న మూడుయోజనముల దూరములో కల వృక్షములు అన్నీ ఫలములతో పుష్పములతో,  కళకళలాడాయి.. తేనెలు కురుస్తున్నాయి. రాముడు తనతో వచ్చిన వానరులను దృష్టిలో పెట్టుకొని ఆ వరం అడిగాడు. వెంటనే వానరములు అన్నీ ఆ వృక్షములకు కాసిన కాయలను పండ్లను, తేనె పట్టులను తృప్తిగా ఆరగించారు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూట ఇరువది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# యుద్ధకాండము

## నూట ఇరువది ఐదవ సర్గ.

రాముడు అయోధ్య దరిదాపులకు చేరుకున్నాడు. ఇప్పుడు ఏం చెయ్యాలి. భరతునికి ఈ వార్త ఎలా తెలపాలి అని ఆలోచించాడు. హనుమంతుని పిలిచాడు. అతనితో ఇలా అన్నాడు.

"హనుమా! నీవు ఇక్కడి నుండి శృంగిభేరపురము వెళ్లు. అక్కడ నా మిత్రుడు గుహుడు అనే నిషాదులకు రాజు ఉన్నాడు. అతని క్షేమములు అడుగు. అతనికి నా రాక గురించి చెప్పు. నేను క్షేమంగా ఉన్నానని గుహునికి తెలియజెయ్యి. అతడు నీకు అయోధ్యకు వెళ్లే మార్గము గురించి, భరతుడు ఉన్న ప్రదేశము గురించి చెప్పగలడు. తరువాత అక్కడి నుండి అయోధ్యకు వెళ్లు. అయోధ్యలో ఉన్న వారి క్షేమములను అడుగు. అక్కడి నుండి నీవు భరతుని వద్దకు వెళ్లు. భరతునికి నా క్షేమము గురించి సీతా లక్ష్మణుల క్షేమము గురించి చెప్పు.

నేను నా తండ్రి మాట ప్రకారము 14 ఏళ్లు అరణ్య వాసమును పూర్తిచేసుకొని అయోధ్య చేరుకున్నాను అని చెప్పు. రావణుడు సీతను అపహరించడం, నేను సుగ్రీవునితో స్నేహం చెయ్యడం, వాలిని వధించడం, నీవు సముద్రమును దాటి సీతను చూడటం, నేను వానర సైన్యముతో వారధి దాటి లంకను చేరుకోవడం, రావణుని సంహరించడం, దేవతలు వరాలివ్వడం, నేను నా తండ్రి గారిని కలుసుకోవడం, అన్నీ వివరంగా చెప్పు. నేను విభీషణునితోనూ, సుగ్రీవునితోనూ, కలిసి అయోధ్యకు వచ్చినట్టు చెప్పు.

రాముడు శత్రుసంహారము చేసి విజయుడై తన మిత్రులతో సహా అయోధ్యకు వచ్చాడని చెప్పు.

నీవు ఈ మాటలు చెబుతూ ఉంటే భరతుని ముఖకళవళికలు గమనించు. నా గురించి భరతుడు మనసులో ఏమనుకుంటున్నాడో అతని చూపులు బట్టి, ముఖములో మారే రంగులను బట్టి, భరతుని మాటలను బట్టి, తెలుసుకో. ఎందుకంటే రాజ్యము ఎవరికి అక్కరలేదు? ఏనుగులు, గుర్రములు, వంశపారంపర్యంగా వచ్చే రాజ్యము, రాజభోగములు ఎవరికి ఇష్టం ఉండదు చెప్పు. రాజ్యాధికారము ఎంతటి వారినైనా ప్రలోభ పెడుతుంది. మనసు మారేట్టు చేస్తుంది.

నా ప్రతినిధిగా భరతుడు రాజ్యం చేసినా, 14 ఏళ్లపాటు భరతుడు అయోధ్యను పాలించాడు. అన్నిభోగాలు అనుభవించాడు. ఇంక మీదట కూడా తానే రాజ్యము పాలించవలెను అని అనుకోవచ్చు. భరతునికి ఆ కోరికే ఉంటే, భరతునే అయోధ్యను పాలించమని చెప్పు. కాబట్టి భరతుని మనసులోని ఆలోచనలను తెలుసుకొని రా! అప్పుడు నేను అయోధ్యకు రావాలా లేక మరలా అయోధ్యను వదిలి వెళ్లాలా అనే విషయం నిర్ణయించు కుంటాను. కాబట్టి త్వరగా ఈ విషయం తెలుసుకొని రా!" అని అన్నాడు రాముడు.

(ఇక్కడ కూడా రాముడు ఒక సామాన్య మానవునిలా ప్రవర్తించాడు. భరతుని సత్యనిష్ఠనే శంకించాడు. కానీ రాజనీతిని పాటించాడు. కైక కోరిన వరాలు రెండు. ఒకటి భరతునికి అయోధ్య రాజ్య పట్టాభిషేకము. రెండు రామునికి 14 ఏళ్లు వనవాసము.

వనవాసము తరువాత రాముడు వచ్చి అడిగితే భరతుడు తిరిగి రాజ్యము ఇవ్వాలని ఆ ఒప్పందంలో లేదు. కాబట్టి రాముడు 14 ఏళ్ల తరువాత వచ్చి అడిగినా భరతుడు రామునికి రాజ్యం ఇవ్వనవసరం లేదు. ఇవ్వకపోతే ఊరుకోవడమో, యుద్ధం చేయడమో రెండే మార్గాలు. అంతే కాకుండా ఆ నాటి ధర్మం ప్రకారం 14 ఏళ్ల పాటు ఎవరైనా తమ ఆస్తిని, రాజ్యాన్ని అన్యాక్రాంతం చేసి, చూస్తూ ఊరుకుంటే, ఆ తరువాత ఆ ఆస్తిమీద రాజ్యంమీద హక్కు కోల్పోతాడు. అది ద్వాపరంలో 12 ఏళ్లు, కలియుగంలో 12 ఏళ్లుగా ఉంది. (లిమిటేషన్ యాక్టులో పొందుపరచబడిన రూల్ ఆఫ్ అడ్వర్స్ పొసెషన్).

ఇవన్నీ తెలిసిన రాముడు, మర్యాదపూర్వకంగా రాజనీతిని పాటించాడు. ముందు హనుమంతుని ద్వారా తాను తండ్రి మాటప్రకారము 14 ఏళ్ల వనవాసము పూర్తి చేసుకొని వచ్చినట్టు తెలియపరిచాడు. ఇదే పద్ధతిని పాండవులుకూడా పాటించారు. అరణ్యఅజ్ఞాత వాసములు పూర్తిచేసుకొని వచ్చిన తరువాత ద్రుపద పురోహితుని రాయబారిగా పంపారు. తరువాత కృష్ణుడు రాయబారానికి వెళ్లాడు. కాకపోతే, రామాయణంలో భరతుడు అనుకున్న మాట ప్రకారం రాజ్యం రామునికి ఇచ్చాడు, సుయోధనుడు యుద్ధం చేసి మరణించాడు, ఇంతే తేడా).

ఆ ప్రకారంగా రాముని వద్దనుండి ఆజ్ఞలను పొందిన హనుమంతుడు, మనుష్య రూపంలో బయలు దేరాడు. ముందు గంగాతీరంలో ఉన్న శృంగిభేర పుర రాజు గుహుని వద్దకు వెళ్లాడు.

రాముని క్షేమములు తెలిపి, రాముడు భరద్వాజ ఆశ్రమంలో ఉన్నాడని తెలిపాడు. పంచమినాడు ఆశ్రమములో ఉండి, మరునాడు బయలుదేరి వస్తున్నాడు అని కూడా చెప్పాడు. తరువాత హనుమంతుడు అక్కడి నుండి బయలు దేరి, భరతుడు నివసిస్తున్న నందిగ్రామమునకు చేరుకున్నాడు.

నందిగ్రామము అయోధ్యా నగరానికి క్రోసెడు దూరంలో ఉ ంది. అక్కడ భరతుడు మునివృత్తిలో ఉన్నాడు. నార చీరలు ధరించాడు. రాముని అరణ్యవాస క్లేశమును తాను కూడా అనుభవిస్తున్నాడా అన్నట్టు బాగా కృశించిపోయాడు. జడలుకట్టిన వెంట్రుకలతో, కేవలం ఫలములను మాత్రమే ఆహారంగా తీసుకుంటూ, ఇంద్రియములను అదుపులో ఉంచుకుంటూ,తాపస ధర్మమును స్వీకరించి, రామ పాదుకలను సింహాసనము మీద ఉంచి, రామునికి మారుగా అయోధ్య రాజ్యమును పాలించుచున్న భరతుని చూచాడు హనుమంతుడు.

రాజుతో పాటే సేవకులు అన్నట్టు, భరతుని మంత్రులు, సేనాధి పతులు, రాజోద్యోగులు కూడా కాషాయములు ధరించి ఉన్నారు. వారితో పాటే అయోధ్యా పౌరులుకూడా భోగములకు దూరంగాఉంటూ నారచీరలు ధరించి ఉండటం చూచాడు హనుమంతుడు. భరతుని సమీపించిన హనుమంతుడు భరతునికి నమస్కరించి ఇలా పలికాడు.

"మహారాజా! దండకారణ్యములో నార చీరలు ధరించి వనవాసము చేయుచున్న ఏ రాముని గురించి నీవు కూడా

నారచీరలు ధరించి మునివృత్తి నవలంబించావో ఆ రాముడు వనవాస కాలమును పూర్తిచేసుకొని భరద్వాజుని ఆశ్రమములో ఉన్నాడు. రేపు ఇక్కడకు రాగలడు. రాముడు నీ క్షేమమును విచారించమని నన్నుపంపాడు.

భరతా! నీ శోకమును, మునివృత్తిని విడచిపెట్టు. రాముడు రేపే ఇక్కడకు వస్తున్నాడు. 14 ఏళ్ల తరువాత రాముని నీవు కలుసుకోబోతున్నావు. రాముడు రాక్షస సంహారం చేసి, తన మిత్రులతో సహా వస్తున్నాడు. సీతాదేవి, లక్ష్మణులతో సహా వస్తున్నాడు." అనిపలికాడు హనుమంతుడు.

ఒక్కసారిగా అంతటిసంతోషకరమైన వార్త విన్న భరతుడు పట్టుతప్పి నేల మీద పడిపోయాడు. ఆనంద భాష్పాలు భరతుని కళ్లనుండి జాలువారుతున్నాయి. ఆనందంతో భరతుని ముఖం వెలిగిపోతూఉంది. హర్షాతిరేకంతో మూర్ఛపోయాడు. క్షణకాలంలో మూర్ఛనుండి తేరుకున్నాడు. ఆనందంతో హనుమంతుని గట్టిగా కౌగలించుకున్నాడు. తన కళ్ల నుండి కారుతున్న ఆనందభాష్పాలతో హనుమంతుని తడిపేసాడు. హనుమంతుని చూచి ఇలా అన్నాడు.

"మహాత్మా! నీవు మనుష్యుడవా! లేక మానుష రూపంలో ఉన్న దేవతా మూర్తివా! నాకు ఇంతటి ప్రియమైన వార్త చెప్పిన నీకు ఏమి ఇవ్వగలను. వెంటనే లక్షగోవులను, నూరు గ్రామాలను బహుమానంగా ఇస్తున్నాను. పదహారు మంది కన్యలను ఇచ్చి నీకు వివాహం చేస్తాను. అంతకు రెట్టింపు సంఖ్యలో అందమైన స్త్రీలను నీకు దాసీలుగా పంపుతాను." అని అన్నాడు.

రాముడు వస్తున్నాడు అనే సంతోషంలో భరతుడు మునిగిపోయాడు.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము నూట ఇరవై ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## నూట ఇరవై ఆరవ సర్గ.

రాముడు వస్తున్నాడు అన్న వార్త విన్న భరతుడు ఆనందాన్ని పట్టలేకపోతున్నాడు. హనుమంతునితో ఇలా అంటున్నాడు.

"మహానుభావా! చాలా కాలము కిందట అడవులకు వెళ్లిన నా రాముని గురించి సంతోషకరమైన వార్తలు వింటున్నాను. మానవుడు జీవించి ఉంటే ఏనాటికైనా మంచి వార్తలు వింటాడు అన్న ఆర్యోక్తి నిజం అయింది. రాముడు వానరుల సాయంతో రావణుని జయించాడు అన్నావు కదా! మానవుడైన రామునికి, వానరులకు మైత్రి ఎలా ఏర్పడింది. నాకు వివరంగా తెలపండి." అని అడిగాడు భరతుడు. అప్పుడు హనుమంతుడు భరతునితో ఇలా చెప్పసాగాడు.

"మహారాజా! నీ తల్లి వరములు కోరినప్పటినుండి, ఆ వరముల ప్రకారము రాముడు అడవులకు వెళ్లడం వరకూ నీకు తెలుసు కదా! నీవు అన్నగారి పాదుకలను తీసుకొని అయోధ్యకు

వచ్చావు. తరువాత కథ చెబుతాను విను.

తరువాత రాముడు, లక్ష్మణుడు, సీతతో కూడి వనవాస కాలము గడపడానికి దండకారణ్యములోకి ప్రవేశించాడు. వారికి విరాధుడు అనే రాక్షసుడు కనపడ్డాడు. రాముడు, లక్ష్మణుడు ఆ విరాధుని చంపి పూడ్చిపెట్టారు. తరువాత శరభంగ మహాముని ఆశ్రమమునకు వెళ్లారు. తరువాత జనస్థానము చేరుకున్నారు. అక్కడ శూర్పణఖ అనే రాక్షస స్త్రీ రామలక్ష్మణులను మోహించి సీతను భక్షించబోగా, లక్ష్మణుడు ఆమె ముక్కు చెవులు కోసాడు. ఆమె ఏడుస్తూ వెళ్లిపోయింది. ఆమె సోదరులు ఖరదూషణులు, 14,000 మంది రాక్షసులతో రాముని మీదికి యుద్ధానికి వచ్చారు. వారి నందరినీ రాముడు సంహరించాడు.

తన వారందరినీ కోల్పోయిన శూర్పణఖ, లంకాధీశుడైన తన అన్న రావణుని వద్దకు పోయి జరిగిన సంగతి చెప్పి సీతను అపహరించి పగతీర్చుకొమ్మని ప్రోత్సహించింది. రావణుడు మారీచుడి అనే రాక్షసుని మాయాలేడి రూపంలో సీత వద్దకు పంపాడు. ఆ లేడి తనకు కావాలని సీత కోరడంతో రాముడు ఆ లేడిని తరుముకుంటూ వెళ్లాడు. తరువాత లక్ష్మణుడు వెళ్లాడు. ఆశ్రమంలో ఒంటరిగా ఉన్న సీతను రావణుడు సన్యాసి వేషంలో అపహరించాడు. రావణుడు సీతను లంకానగరమునకు తీసుకొని వెళ్లాడు. తన మందిరములో ఉంచాడు. తనను వరించమని బతిమాలుకున్నాడు. సీత రావణునికి లొంగలేదు. తరువాత ఆమెను అశోకవనములో ఉంచాడు.

అక్కడ రాముడు, లక్ష్మణుడు మాయాలేడి రూపంలో ఉన్న మారీచుని చంపి ఆశ్రమానికి వచ్చారు. సీత కనపడలేదు. సీతను వెతుకుతుంటే వారికి  రావణుని చేతిలో మరణించిన జటాయువు కనిపించాడు. తరువాత రామలక్ష్మణులు గోదావరీ తీరం అంతా సీత కోసరం వెతికారు. అలా వెతుకకుతూ ఉంటే వారికికబంధుడు అనే రాక్షసుడు కనిపించాడు. అతడు చెప్పిన ప్రకారము రామలక్ష్మణులు ఋష్యమూక పర్వతము మీద ఉన్న సుగ్రీవుని కలుసుకున్నారు. ఇద్దరి మధ్య గాఢమైన స్నేహం కలిగింది. వారి మధ్య జరిగిన ఒప్పందం ప్రకారం రాముడు సుగ్రీవుని అన్న వాలిని చంపి, సుగ్రీవుని భార్య రుమను అతని వద్దకు వచ్చేట్టు చేసాడు. అలాగే సుగ్రీవుని కిష్కింధకు రాజును చేసాడు. దానికి బదులుగా సుగ్రీవుడు, తన అధీనంలో ఉన్న పదికోట్ల మంది వానరులను  నలుదిక్కులకూ  పంపి సీత కోసరం వెతికించాడు.

దక్షిణ దిక్కుగా వెళ్లిన వానరులలో నేనూ ఒకడిని. నా పేరు హనుమంతుడు. మేము సీతను వెతుకుతూ వెళుతుండగా, సంపాతి అనే జటాయువు సోదరుడు మాకు రావణుని గురించి చెప్పాడు. నేను నూరుయోజనముల దూరం ఉన్న సముద్రమును దాటి లంకలో ప్రవేశించి, అశోకవనంలో రాక్షస స్త్రీల మధ్య ఉన్న సీతను చూచాను. రాముడు గుర్తుగా ఇచ్చిన ఉంగరమును ఆమెకు ఇచ్చాను. ఆమె కూడా నాకు తాను ధరించిన చూడామణిని ఆనవాలుగా ఇచ్చింది. నేను ఆ చూడామణిని తెచ్చి రామునికి ఇచ్చాను. సీతను చూచాను అని తెలియజేసాను. రాముడు ఎంతో సంతోషించాడు.  లంక మీదికి దండెత్తడానికి నిర్ణయించుకున్నాడు రాముడు.

సుగ్రీవునితో సహా కోటాను కోట్ల మంది వానరులతో అందరం దక్షిణ సముద్ర తీరం చేరుకున్నాము. సముద్రమునకు అడ్డంగా సేతువును నిర్మించాము. ఆ సేతువు మీదుగా సముద్రమును దాటి లంకలో ప్రవేశించాము. వానరులకు రాక్షసులకు ఘోరయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాముడు రావణుని, కుంభకర్ణుని, ఇంద్రజిత్తును, చంపాడు. తరువాత దేవతలందరూ వచ్చి రాముని శ్లాఘించి వరాలు ఇచ్చారు. తరువాత రాముడు సీత తో సహా పుష్పకవిమానమును ఎక్కి, వానరులలో, రాక్షసులతో సహా కిష్కింధ మీదుగా అయోధ్యకు వచ్చాడు. ప్రస్తుతము భరద్వాజ ఆశ్రమములో ఉ న్నాడు. రేపు పుష్యమీ నక్షత్రము నందు నీవురాముని చూడగలవు." అని హనుమంతుడు రామకథను సంక్షిప్తంగా, మృదుమధురంగా వివరించాడు.

రామకథను విన్న భరతుడు ఆనందంతో పరవశించి పోయాడు. రాముని చూడాలన్న తన కోరిక ఇంక ఒక్క దినములో తీరబోతున్నందుకు భరతుని మనసు ఆనందడోలికలలో తేలిపోయింది.

శ్రీమద్రామాయణము
యుద్ధకాండము ఇరవై ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## యుద్ధకాండము
## ఇరవై ఏడవ సర్గ.

భరతునికి సర్వం అవగతమయింది. రాముని స్వాగతించడానికి ఘనంగా ఏర్పాట్లు చేయసాగాడు. వెంటనే తన తమ్ముడు శత్రుఘ్నుని పిలిచాడు. అతనికి ఈ విధంగా ఆజ్ఞలు ఇచ్చాడు.

"శత్రుఘ్నా! మన అన్న రామునికి ఘనస్వాగతం చెప్పాలి. అయోధ్యను దేవేంద్రనగరం వలె అలంకరించాలి. దేవతా పూజలు జరిపించు. నాలుగు రోడ్ల కూడలిలో ఉన్న మండపములను పూలతో అలంకరించు. వాద్యగోష్టులు ఏర్పాటుచేయించు. సూతుల చేత పురాణ ప్రవచనములు ఏర్పాటు చేయించు. వంది మాగధులను పిలిపించు. వారు ఇక్ష్వాకు వంశమువారి స్తోత్రపాఠములను వల్లించాలి. నానా రకములైన వాద్యములతో నగరం మార్మోగిపోవాలి. వేశ్యలతో నృత్యగీతములు ఏర్పాటు చేయించు. రామునికి స్వాగతం పలకడానికి నగరంలో ఉన్న అమాత్యులు, అంత:పుర స్త్రీలు, రాజమాతలు, సైన్యాధికారులు, సైన్యములు, జానపద స్త్రీలు, వేదబ్రాహ్మణులు, క్షత్రియ కుమారులు, గణ నాయకులు, అందరూ బయలుదేరాలి. అందరూ రామునికి ఘనస్వాగతం చెప్పాలి." అని ఆదేశించాడు.

శత్రుఘ్నుడు వెంటనే ఆయాపనులుచేసేవారిని పిలిపించి వారికి ఆయాపనులుచేయమని అప్పగించాడు. అయోధ్యా నగరంనుండి నంద్రిగ్రామము వరకు ఉన్న దారులను గోతులను పూడ్చి శుభ్రం చేసారు. కస్తూరి కలిపిన నీరు జల్లారు. శుభప్రదంగా పేలాలు, పూలుచల్లారు. అయోధ్యానగరం నిండా విజయ పతాకములను ఎగురవేసారు.

ఇంక అయోధ్యానగర పౌరులు తమ తమ ఇండ్లను తమ ఇంట్లో పెళ్లి జరుగుతుంటే ఎలా అలంకరించుకుంటారో ఆ విధంగా అలంకరించారు. రాజ మార్గములను చల్లని నీటితో తడిపి, రంగవల్లరులు తీర్చిదిద్దారు. మార్గముల ఇరు పక్కలా పూలమాలలలో అలంకరించారు. జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలకుడు, సుమంత్రుడు మొదలగు మంత్రులు రామునికి ఎదురు వెళ్లారు. కొంతమంది ఏనుగుల మీద, కొంత మంది గుర్రములమీద, మరి కొంత మంది రథముల మీద వెళ్లారు. చేతిలో ఆయుధములు ధరించిన కాల్బలము కూడా వారి వెంట బయలు దేరింది.

దశరథుని భార్యలు కౌసల్య, సుమిత్ర, కైకేయి, ఇతర అంత:పుర స్త్రీలతో సహా నందిగ్రామము చేరుకున్నారు. భరతుడు రాముని పాదుకలను శిరస్సుమీద పెట్టుకొని రామునికి ఎదురు వెళ్లాడు. ఆయన వెంట తెల్ల గొడుగులు, తెల్ల వింజామరలు, రాజలాంఛనాలు వెళ్లాయి. భేరీమృదంగ ధ్వానములు మిన్నుముట్టాయి. వంది మాగధులు రఘువంశ చరిత్రను కీర్తిస్తున్నారు. బ్రాహ్మణులు వేదములను వల్లిస్తున్నారు. వర్తకులు చేతిలో పూలమాలలతో రామునికి స్వాగతం పలకడానికి సిద్ధంగా ఉన్నారు. గుర్రపు డెక్కల చప్పుళ్లతోనూ, ఏనుగు ఘీంకారాలతోనూ, రథముల ధ్వనులతోనూ ఆ ప్రాంతం అంతా మార్మోగిపోతూ ఉంది.

రామునికి స్వాగతం పలకడానికి సర్వం సిద్ధం అయింది. ఇంకా రాముడు రాలేదు. భరతునికి అనుమానం వచ్చింది. హనుమంతుని పిలిచి ఇలా అన్నాడు. "నీ మాటలు నమ్మి నేను ఇన్ని

ఏర్పాట్లు చేసాను. రాముడు ఇంకా రాలేదు. నీవు నీ వానరసహజమైన చపల చిత్తంతో ఇదంతా చెప్పలేదు కదా! లేకపోతే రాముడు ఇంకా ఎందుకు రాడు?" అని అన్నాడు.

హనుమంతుడు భరతుని చూచి ఇలా అన్నాడు.
"మహారాజా! భరద్వాజముని ఆశ్రమము పొడుగునా ఫలవృక్షములు, వాటికి ఫలములు, తేనెపట్టులు ఉన్నాయి కదా. వాటిని ఆస్వాదిస్తూ మార్గమధ్యంలో వస్తూ ఉన్న వానరుల కలకలము వినబడుతూ ఉంది కదా! ప్రస్తుతము వానరసేనలు గోమతీ నదిని దాటుతున్నాయి. త్వరలోనే ఇక్కడకు చేరుకుంటాయి. భరద్వాజమునికి ఇంద్రుడు ఇచ్చిన వరం చేత దారి పొడుగునా ఫలవృక్షములు, తేనెపట్టులు సమృద్ధిగా ఉన్నాయి. ఆ కారణంగానే పూర్వము నీకు, నీ సేనలకు భరద్వాజ ముని ఆతిధ్యం ఇవ్వగలిగాడు. అదుగో అక్కడు దుమ్ము పైకి రేగుతూ ఉంది. వానరులు ఆ వనములో ప్రవేశించి ఉంటారు.

మహారాజా! అదుగో పుష్పక విమానము. పూర్వము విశ్వకర్మనిర్మించి, బ్రహ్మకు ఇస్తే దానిని బ్రహ్మ కుబేరునికి ఇచ్చాడు. ప్రస్తుతము అది రావణుని తమ్ముడు, లంకకురాజు అయిన విభీషణుని వద్ద ఉంది. అందులోనే మేమందరమూ లంకనుండి ఇక్కడకు వచ్చాము. ఆ విమానములోనే రాముడు, సీత, లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు, అంత:పుర స్త్రీలు అందరూ ఉన్నారు.

అంతలో పుష్పకము నేల మీదికి దిగుతూ ఉంది. కింద ఉన్న వారు అదుగో రాముడు వచ్చేసాడు అని కేరింతలుకొడుతున్నారు.

హర్షధ్వానాలు చేస్తున్నారు. అందరూ తలలు పైకి ఎత్తి విమానము వంక చూస్తున్నారు. భరతుడు చేతులు జోడించి పైకెత్తి రాముని వంక చూస్తున్నాడు. విమానము కిందికి దిగింది. విమానము పైన నిలబడి ఉన్న రామునికి భరతుడు కింది నుండి నమస్కరించాడు. పుష్పకము నెమ్మదిగా నేలమీదికి దిగింది.

భరతుడు విమానము పైకి ఎక్కి రామునికి అభివాదము చేసాడు. రాముడు భరతుడిని రెండు బుజములు పట్టుకొని లేవనెత్తి గట్టిగా కౌగలించుకున్నాడు. తరువాత భరతుడు లక్ష్మణుని వద్దకు, సీత వద్దకు పోయి తన ప్రవర చెప్పుకుంటూ నమస్కరించాడు. తరువాత భరతుడు సుగ్రీవుని, జాంబవంతుని, అంగదుని, మైందుని, ద్వివిదుని, ఋషభుని మొదలగు వానరవీరులను కలుసుకొని వారిని కౌగలించుకున్నాడు. తరువాత సుషేణుని, నలుని, గవాక్షుని, గంధమాధనుడిని, శరభుని, పనసుని కూడా కౌగలించుకొని తన అభినందనలు తెలిపాడు. అప్పుడు ఆ వానరులు అందరూ మానుష రూపంలో భరతునికి నమస్కరించారు. కుశలము అడిగారు.

తరువాత భరతుడు కిష్కింధాధిపతి సుగ్రీవుని కౌగలించుకొని ఇలా అన్నాడు. "సుగ్రీవా! ఈ రోజునుండి మేము అన్నదమ్ములము నలుగురము కాము. నీతో పాటు ఐదుగురము. నీవు మా నలుగురికీ సోదర సమానుడివి. విబీషణా! మా అదృష్టము చేత నీవు నీ అన్నను వదిలి రాముని పక్షాన చేరి రామునికి సాయం చేసావు. లేకపోతే రాముని కార్యముచాలా కష్టం అయి ఉండేది." అని అన్నాడు. వెంటనే శత్రుఘ్నుడు రామలక్ష్మణులకు నమస్కరించాడు.

వదిన సీతకు నమస్కరించాడు. రాముడు పక్కనే నిలబడిఉన్న తన తల్లి కౌసల్య వద్దకు వెళ్లాడు. ఆమె పాదములకు నమస్కరించి ఆమె ఆశీర్వాదము తీసుకున్నాడు. తరువాత సుమిత్ర, కైకలకు నమస్కరించాడు. తరువాత కులగురువు వశిష్టునికి నమస్కరించాడు. తరువాత పురజనులను చూచి అభివాదము చేసాడు. వారందరూ పెద్దగా ముక్తకంఠంతో రామునికి స్వాగతం పలికారు. అశేషప్రజానీకము ఎత్తిన చేతులు పట్టిన దోసిళ్లతో ఆ ప్రాంతము పద్మసరోవరము మాదిరి భాసించింది.

తరువాత భరతుడు తాను దండకారణ్యములో రాముని వద్దనుండి తీసుకున్న పాదుకలను మరలా రాముని పాదములకు తొడిగాడు. రామునితో ఇలాఅన్నాడు. "రామా! ఆ నాడు నేను నీ వద్దనుండి నీ పాదుకలను తీసుకున్నాను. మరలా ఈ నాడు నీ రాజ్యమును, నీ పాదుకలను నీకే భక్తితో సమర్పిస్తున్నాను. నీవు అయోధ్యకు తిరిగి వచ్చి అయోధ్యను పరిపాలించవలెనని కోరుతున్నాను. నీ రాజ్యము నీకు అప్పగించి నాజన్మ చరితార్థము చేసుకున్నాను. నీవు నాకు రాజ్యము అప్పగించిన తరువాత ఈపదునాలుగేళ్లలో కోశాగారమును, గృహములను, సైన్యమును పదింతలు పెంచాను. " అని రాజ్యమును రామునికి అప్పగించాడు భరతుడు.

తరువాత రాముడు పుష్పక విమానమును భరతుని ఆశ్రమమునకు పోనిచ్చాడు. విమానము భరతుని ఆశ్రమము చేరుకుంది. రాముడు, సీత, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు, వానర

ప్రముఖులు, వానర సైన్యము అంతా విమానము దిగారు. తరువాత రాముడు  పుష్పక విమానమునకు నమస్కరించి "ఓ విమానమా! నీవు కుబేరునికి చెందిన దానవు. తిరిగి నీవు నీ అధిపతి కుబేరుని వద్దకు పో." అని ఆదేశించాడు. రాముని ఆదేశము ప్రకారము ఆ పుష్పక విమానము  తన పూర్వపు యజమాని కుబేరుని వద్దకు ఎగిరిపోయింది.

తరువాత రాముడు తన కులగురువు వశిష్టుని పాదములకు భక్తితో నమస్కరించాడు. అందరితో పాటు ఆశీనుడయ్యాడు రాముడు.

శ్రీమద్రామాయణము

యుద్ధకాండము నూట ఇరువది ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

యుద్ధకాండము

నూట ఇరువది ఎనిమిదవ సర్గ.

నలుగురుఅన్నదమ్ములు, ముగ్గురు తల్లులు, కులగురువు వసిష్టుడు ఆశీనులయ్యారు. ముందుగా భరతుడు లేచి రామునికి నమస్కరించి ఇలా అన్నాడు.

"రామా! 14 ఏళ్లకిందట మా తల్లిగారి మాట మన్నించి నాకు ఈ రాజ్యము అప్పగించావు. ఆనాడు నీవు నాకు ఇచ్చిన రాజ్యమును 14 ఏళ్ల తరువాత తిరిగి నీకే అప్పగిస్తున్నాను.  నీతో పోలిస్తే

నేను లేగదూడను. నీవంటి బలము కలిగిన వృషభము మోయగలిగిన ఈ రాజ్యభారమును నా వంటి లేగదూడ మోయలేదు.

పుత్రసంతానము లేని మన తండ్రి గారు. తన రాజ్యమునకు ఉత్తరాదికార్ధి కోసరము యజ్ఞయాగములు చేసి నలుగురు పుత్రులను కన్నాడు. అందులో పెద్దవాడివై న నీవు ఈ అయోధ్యకు ఉత్తరాధి కారివి. ఆ ఫలితమును చూడకుండానే మన తండ్రిగారుపరమపదించారు. ఆయన కోరికను నీవు తీర్చకపోతే ఆయన పడ్డ శ్రమకు ఫలితం దక్కదు. మామిడి మొక్కను తెచ్చి పాతి పోషించి అది పెద్దదై ఫలములు ఇవ్వక పోతే ఎలా ఉంటుందో, అలాగే నీవు రాజ్యము చేయకపోతే అలా ఉంటుంది. మన తండ్రగారి కోరికనెరవేరదు.

అంతే కాదు ఈ అయోధ్య ప్రజలందరూ నిన్ను రాజుగా చూడాలని కోరికతో ఉన్నారు. వారి కోరిక తీర్చు. ఆకాశములో సూర్యచంద్రులు, జ్యోతిశ్చక్రము ఉన్నంతకాలము నీవు ఈ భూమిని పాలించాలి. కాబట్టి రామా! ఈ రోజుకు విశ్రాంతి తీసుకో. రేపే నీ పట్టాభిషేకము. పొద్దుటే మంగళస్నానము ఆచరించాలి. అందుకని తొందరగా నిద్రకు ఉపక్రమించు.  రేపుఉదయం మంగళవాద్యములతో, వందిమాగధుల కైవారములతో నిద్రలేద్దువుగాని." అని అన్నాడు భరతుడు.

భరతుని మాట మన్నించాడు రాముడు. మరునాడు ఉదయం రాముడు క్షురకర్మచేయించుకున్నాడు. ముందుగా భరతుడు మంగళ స్నానము చేసాడు. తరువాత రాముని చేత మంగల స్నానం చేయించారు. ఒంటికి చందనాదులు పులిమారు. రాముని

పుష్పమాలలతో అలంకరించారు. విలువైన వస్త్రములను రాముని చేత ధరింపజేసారు. శత్రుఘ్నుడు దగ్గర ఉండి రామునికి, లక్ష్మణునికి అలంకరణలు చేయించాడు. అంత:పురములో అత్తగార్లు ముగ్గురూ సీతకు మంగళ స్నానం చేయించి, జగన్మోహనంగా అలంకరించారు. తరువాత కౌసల్య వానర వీరుల భార్యలందరికీ మంచి మంచి వస్త్రములు, ఆభరణములు ఇచ్చి అలంకరింపజేసింది.

తరువాత శత్రుఘ్నుడు రథమును తీసుకొని వచ్చాడు. ఆ రథమునకు సుమంత్రుడు సారథిగా ఉన్నాడు. రాముడు ఆ రథమును ఎక్కాడు. రామునితో పాటు సుగ్రీవుడు., విభీషణుడు, అంగదుడు కూడా స్నానపానాదులు గావించి, అలంకరించుకొని వెళ్లారు. సుగ్రీవుని భార్యలు, సీతతో కలిసి అయోధ్యానగరము చూడవలెనని వెళ్లారు. అక్కడ అయోధ్యలో మంత్రులందరూ వసిస్ఠుని కలిసి పట్టాభిషేకమునకు చేయవలసిన ఏర్పాట్లు గురించి ఆలోచిస్తున్నారు.

మంత్రులైన అశోకుడు, విజయుడు, సిద్ధార్థుడు నగరములో చేయవలసిన పనులు గురించి ఆలోచిస్తున్నారు. రామపట్టాభిషేకము అత్యంత వైభవంగా చేయవలెనని నిర్ణయించారు. తరువాత మంత్రులందరూ రాముని కలుసుకోడానికి రాముని వద్దకు బయలుదేరారు. రాముడు కూడా రథమునెక్కి అయోధ్యకు బయలుదేరాడు. భరతుడు రథం నడుపుతున్నాడు. శత్రుఘ్నుడు రామునికి గొడుగుపట్టాడు. లక్ష్మణుడు రాముని పక్కన నిలబడి వింజామరలు వీస్తున్నాడు. లంకాధీశుడు, రాక్షసరాజు విభీషణుడు మరొక పక్క నిలబడి రామునికి వింజామర వీస్తున్నాడు. ఆకాశంలో దేవతలు ఋషులు నిలబడి రాముని ఆశీర్వదిస్తున్నారు.

సుగ్రీవుడు ఒక ఏనుగును ఎక్కి రాముని అనుసరించాడు. వానరులందరూ మనుషుల రూపంలో ఏనుగుల మీద బయలు దేరారు. దుందుభులు, శంఖములు ధ్వనిస్తూ ఉండగా రాముడు అయోధ్యా నగరమునకు బయలుదేరాడు. ముందు కాల్బలము నడుస్తూ ఉంది. వెనుక రాముని రథం వస్తూ ఉంది. అయోధ్య పురవీధులగుండా వెళుతుంటే అయోధ్య ప్రజలు రాముని నయనానందకరంగా చూస్తున్నారు.

పౌరులందరూ జయజయ ధ్వానాలు చేస్తున్నారు. రాముని వెనుక పౌరులు కూడా నగరానికి బయలుదేరారు. తన చుట్టూ ఉన్న మంత్రులు, బ్రాహ్మణులతో రాముడు ఇంద్రుని వలె ప్రకాశించాడు. ముందు మంగళ వాద్యములు, తూర్యనాదములు, వెనుక వందిమాగధుల స్తోత్రపాఠములు, ఆ వెనుక బ్రాహ్మణుల వేదఘోషలు మిన్నుముట్టగా రాముడు అయోధ్యానగర ప్రవేశము చేసాడు. అక్షతలు, బంగారము, గోవులు, వారి వెంట మనుషులు, కన్యలు, బ్రాహ్మణులు, వారి వెనుక పండ్లు,మధురమైన భక్ష్యములతో వాహకులు నడుస్తున్నారు.

రాముడు తన మంత్రులతో సుగ్రీవునితో తన స్నేహము గురించి హనుమంతుడు చేసిన సాహస కృత్యముల గురించి విపులంగా చెప్పాడు. వానరుల మహత్కార్యములను సాహస కృత్యములను విని అయోధ్యావాసులు ఆశ్చర్యపోయారు. రాముడు తనకు విభీషణునికి జరిగిన మైత్రి గురించి, విభీషణుడు తనకు చేసిన సాయము గురించి కూడా చెప్పాడు. అలా అన్ని విషయములను ముచ్చటించుకుంటూ రాముడు అయోధ్యానగరములోకి ప్రవేశించాడు.

ముందుగా రాముడు తన తండ్రి దశరథుడు నివసించిన మందిరమును చేరుకున్నాడు. భరతునితో ఇలా అన్నాడు. “భరతా! నా నివాసమును సుగ్రీవుడుఉండటానికి విడిదిగా ఇవ్వు.” అని అన్నాడు. వెంటనే భరతుడు సుగ్రీవుని తీసుకొని పోయి రాముని నివాసములో ప్రవేశపెట్టాడు. సుగ్రీవుని నివాసములో శత్రుఘ్నుడు సకల సౌకర్యములు కల్పించాడు.

ఇంక పట్టాభిషేకమునకు కావలసిన ఏర్పాట్లు మొదలయ్యాయి. సుగ్రీవుడు నలుగురు వానరులను నాలుగు బంగారు కలశములతో సిద్ధం చేసాడు. “మీరు వెళ్లి నాలుగు సముద్రజలములను తెల్లవారేసరికితీసుకొని రండి” అని ఆజ్ఞాపించాడు. ఆ వానరులు వెంటనే బంగారు కలశములతో ఆకాశములోకి ఎగిరారు. జాంబవంతుడు, వేగదర్శి,ఋషభుడు కలిసి ఐదువందల నదుల జలములను బంగారుకలశములలో సేకరించారు. సుషేణుడు తూర్పు సముద్రము నుండి జలమును తీసుకొని వచ్చాడు. ఋషభుడు దక్షిణ సముద్రము నుండి, గవయుడు పడమటి సముద్రమునుండి, నలుడు ఉత్తర సముద్రమునుండి జలములను తీసుకొని వచ్చారు. వానరులు తీసుకొని వచ్చిన జలకలశములను వరుసగా పెట్టారు. అభిషేక జలము సిద్ధంగా ఉందని వసిష్ఠునికి తెలిపారు.

అప్పుడు వసిష్టుడు సీతా రాములను రత్నములు పొదిగిన పీఠము మీద కూర్చోపెట్టాడు. వసిష్టుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు, విజయుడు, అనే ఎనిమిది మంది మునులు రామునికి సముద్ర జలములు, నదీజలములతో అభిషేకము చేసారు. ముందుగా ఋత్విక్కుల చేత,

తరువాత కన్యల చేత, మంత్రులచేతా, యోధులచేతా, దేవతలచేత, లోకపాలకుల చేతా, అభిషేకము చేయించారు. వీరంతా సముద్ర జలములతోనూ, నదీ జలములతోనూ, ఓషధులు కలిపిన జలములతోనూ రాముని అభిషేకించారు.

తరువాత వసిష్ఠుడు బ్రహ్మచేత నిర్మించబడిన రత్నఖచితమైన రాజ కిరీటమును సభామధ్యంలో ఒక రత్నపీఠము మీద ఉంచాడు. పూర్వము మనుచక్రవర్తి, తరువాత వంశ పరంపరగా చక్రవర్తులు ఆ కిరీటమును ధరిస్తూ వచ్చారు. తుదకు అది దశరథుని వద్దకు చేరింది. ఇప్పుడు రాముని శిరస్సును అలంకరించబోతూఉంది. తరువాత వసిష్ఠుడు ఆ రత్న కిరీటమును వేదోక్తముగా రాముని శిరస్సు మీద ఉంచాడు. రాముని శిరస్సు మీద ఉన్న ఆ కిరీటము శోభాయమానంగా ప్రకాశించింది.

శత్రుఘ్నుడు రాజలాంఛనమైన ధవళ ఛత్రమును పట్టుకొని రాముని పక్కన నిలబడ్డాడు. వానర రాజు సుగ్రీవుడు తెల్లని వింజామరను పటుకున్నాడు. రాక్షసరాజు, లంకాధినేత అయిన విభీషణుడు మరొక వింజామరనుపట్టుకున్నాడు. దేవేంద్రుని చేత ఆదేశింపబడిన వాయుదేవుడు రామునికి బాగా ప్రకాశిస్తున్న నూరు పద్మముల మాలను, ఒక ముక్తాహారమును కానుకగా ఇచ్చాడు.

ఆ పట్టాభిషేక సమయమున దేవతలు,గంధర్వులు పాటలు పాడారు. అప్సరసలు నాట్యం చేసారు. రాముని పాలనలో భూమి సస్యశ్యామలంగా సంవత్సరానికి మూడు పంటలతో ఫల పుష్పములతో కూడిన వృక్షములతో శోభించింది. పట్టాభిషేక సమయమున

రాముడు బ్రాహ్మణులకు లక్ష గోవులను, నూరు ఎద్దులను, లక్ష గుర్రములను, దానంగా ఇచ్చాడు. అంతే కాకుండా రాముడు బ్రాహ్మణులకు ముప్పది కోట్ల బంగారు నాణెములను, బంగారు ఆభరణములను, విలువైన వస్త్రములను దానంగా ఇచ్చాడు. మణిమాణిక్యములతో ప్రకాశిస్తున్న మాలను ఒక దానిని సుగ్రీవునికి బహుమానంగా ఇచ్చాడు రాముడు. రత్నఖచితములైన భుజకీర్తులను అంగదునికి బహుమానంగా ఇచ్చాడు. మణులు, ముత్యములతో కూడిన హారములను, దివ్యములైన వస్త్రములను సీతకు ఇచ్చాడు రాముడు.

సీత హనుమంతుని వంక చూచింది. హనుమకు ఏదైనా ఇవ్వాలని అనుకుంది. రాముడు ఇచ్చిన ముత్యాలహారమును తన చేతిలోకి తీసుకొంది సీత. రాముని వంక, సభలో ఉన్న వానరుల వంక చూచింది. సీత అభిప్రాయమును గ్రహించాడు రాముడు. "సీతా! ఈ హారము ఎవరికి ఇస్తే నీకు సంతోషము కలుగుతుందో, ఎవరంటే నీకు ఎక్కువ ఇష్టమో, ఎవరి యందు వినయము, పరాక్రమము, తేజస్సు, ధైర్యము, పౌరుషము ఉన్నాయో, అతనికి ఈ హారమును కానుకగా ఇవ్వు." అని అన్నాడు.

వెంటనే సీత హనుమంతుని పిలిచి ఆ హారము హనుమకు కానుకగా ఇచ్చింది. తెల్లని ఆ హారమును ధరించిన హనుమంతుడు సూర్యుని కాంతికి మెరిసిపోతున్న హిమవత్పర్వత శిఖరము మాదిరి ప్రకాశిస్తున్నాడు. రాముడు తక్కిన వానర ప్రముఖులను, వానరులను సముచితరీతిలో సత్కరించాడు. ప్రత్యేకంగా మైందునికి, ద్వివిదునికి, నీలునికి అనేక విలువైన కానుకలు ఇచ్చాడురాముడు.

తరువాత రాముడు విభీషణుని, సుగ్రీవుని, హనుమంతుని, జాంబవంతుని, వానర సేనానాయకులను వారి వారికి తగినట్టు బంగారు ఆభరణాలు, విలువైన వస్త్రములు ఇచ్చి సత్కరించాడు. తరువాత వానరులందరూ రాముని వద్ద సెలవు తీసుకొని కిష్కింధకు వెళ్లిపోయారు. వానర రాజు సుగ్రీవుడు రామపట్టాభిషేకమును కనులారా చూచి, భార్యలతో సహా కిష్కింధకు వెళ్లిపోయాడు. రాక్షస రాజు అయిన విభీషణుడు తన మంత్రులతో, తనతో వచ్చిన రాక్షస వీరులతో కలిసి లంకకు వెళ్లిపోయాడు. రాముడు అయోధ్యను జనరంజకంగాపరిపాలిస్తున్నాడు.

కొన్ని రోజులు గడిచిన తరువాత ఒక రోజురాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "మన పూర్వపు రాజులు పాటించిన ఆచారము ప్రకారము చక్రవర్తితో పాటు యువరాజు ఉండి రాజ్యపాలనలో పాలు పంచుకోవడం సంప్రదాయం. కాబట్టి నిన్ను అయోధ్యకు యువరాజును చేస్తాను. నీవు కూడా యువరాజు పట్టాభిషేకము చేసుకొని నాకు రాజ్యపాలనలో సాయంగా ఉండు." అని అన్నాడు.

కాని లక్ష్మణుడు అందుకు ఒప్పుకోలేదు. అప్పటిదాకా భరతుడు రాజ్యభారమును మోసాడు కాబట్టి భరతునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయడం యుక్తము అని అన్నాడు. లక్ష్మణుని మాట ప్రకారము రాముడు భరతుని యువరాజుగా అభిషేకించాడు. రాముడు తరువాత పౌండరీకములు, అశ్వమేధములు, వాజపేయము అనే యజ్ఞములను చేసాడు. రాముడు పదివేల సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. లక్ష్మణుడు సదా రాముని పక్కనే

ఉండి రామునికి అన్ని విధములా సహకరించాడు.

రాముని రాజ్యములో స్త్రీలు వైధవ్యమును పొందలేదు. అంటే వయసులో పెద్దవాళ్ల కన్నా ముందు చిన్న వాళ్లు చనిపోవడం లేదు. వయసులో ఉన్న వాళ్లు చిన్న వాళ్లకు ప్రేతకార్యములు చేసే అవసరం రావడం లేదు. వ్యాధులు ప్రబలడం లేదు. క్రూరమృగములు జానపదులను బాధించడం లేదు. దొంగతనాలు అసలే లేవు. ధర్మం రాజ్యం అంతటా వెల్లివిరుస్తోంది. రాముడు వేసే శిక్షలకు భయపడి ప్రజలు ఒకరిని ఒకరు కొట్టుకోవడం తిట్టుకోవడం, చంపుకోవడం మానేసారు. రామ రాజ్యంలో రోగములు గానీ, బాధలుకానీ లేవు.

ప్రజలు రామ కథలను గానం చేసుకొనే వారు. రామరాజ్యం సర్వం రామమయంగా భాసిల్లింది. వృక్షములు ఫలపుష్పములతో కళకళలాడుతూ ఉన్నాయి. వర్షములు సకాలంలో కురుస్తున్నాయి. బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్య, శూద్రులు తమ తమ కులములకు తగ్గ వృత్తులు చేసుకుంటూ సుఖంగా జీవిస్తున్నారు. ప్రజలలో సత్యవాక్పరిపాలన ఎక్కువ. ఎవరూ అబద్ధం ఆడటం లేదు. అబద్ధం ఆడే అవసరం కూడా రాలేదు. రామరాజ్యంలో ప్రజలందరూ ధర్మమునందు ఆసక్తి కలిగి, ఉత్తమ లక్షణములతో సుఖసంతోషాలతో జీవించారు. ఆ ప్రకారంగా రాముడు 10,000 సంవత్సరములు రాజ్యపాలన సాగించాడు.

ఈ రామకథను వాల్మీకి పూర్వము ఆదికావ్యముగా రచించాడు. ఆదికావ్యమైన రామాయణము ధర్మములతో నిండి ఉంది. ఈ రామాయణ కావ్యమును చదివితే కీర్తివంతులు, ధనవంతులు,

ఆయుష్మంతులు అవుతారు. రాజ్యలాభము కలుగుతుంది. ఈ ఆది కావ్యమును చదివినా, వినినా, వారికి సమస్తపాపముల నుండి విముక్తి లభిస్తుంది.

రామజననం నుండి, రామ పట్టాభిషేకము వరకు ఉన్న ఈరామాయణ మహా కావ్యము కల్పవృక్షము లాంటిది. పుత్రులు కావలసిన వారికి పుత్రులను, ధనము కావలసిన వారికి ధనమును, రాజ్యము కావలసిన వారికి రాజ్యమును లభింపజేస్తుంది. కౌసల్యా,సుమిత్ర,కైకేయిలు వారి కడుపు చల్లగా, జీవించి ఉన్న పుత్రులతో కలకాలము జీవించారు కాబట్టి ఈ ఆది కావ్యమును చదివిన, విన్న స్త్రీలు కూడా, జీవించి ఉన్న పుత్రులుకలవారై ఆయుష్మంతులవుతారు. ఈ రామాయణమును చదివిన, విన్న పురుషులు కూడా దీర్ఘాయుష్మంతులు అవుతారు.

ఈ ఆదికావ్యమును చదివినవారు, విన్న వారు కోపమును జయిస్తారు. వారి కష్టములు తీరుతాయి. దూరపు బంధువులను కలుసుకుంటారు. రాముని అనుగ్రహమునకు, సమస్త దేవతల అనుగ్రహమునకు పాత్రులవుతారు. ఈ రామాయణకావ్యమును చదివిన ఇంట్లో దుష్టగ్రహబాధలు ఉండవు. ఈ రామాయణ కావ్యమును విన్న స్త్రీలు సంతానవతులౌతారు. ఈ రామాయణ గాధను విన్న వారు రోగములు లేకుండా దీర్ఘకాలము జీవిస్తారు.

ఈ రామాయణ మహాకావ్యమును బ్రాహ్మణుల ముఖతా తలవంచి భక్తిశ్రద్ధలతో వినాలి. ఈ రామాయణ మహాకావ్యమును

నిరంతరమూ వినువారికి ఐశ్వర్యము, పుత్రలాభము కలుగుతుంది. రామాయణ మహాకావ్యము పఠించడం వల్ల రాముడు సంతోషిస్తాడు.

రాముడే విష్ణు స్వరూపుడు, లక్ష్మణుడే ఆదిశేషువు. ఈ రామాయణ మహాకావ్యమును అడిగిన వారికి భక్తిశ్రద్ధలతో చెప్పండి. మీకు సదా క్షేమం కలుగుతుంది. ఈ రామాయణమును వినినా, చదివినా పితృదేవతలు సంతోషిస్తారు. వాల్మీకి మహర్షి రచించిన ఈ రామాయణ మహా కావ్య సంహితను భక్తితో రాసేవారికి శాశ్వత స్వర్గలోక ప్రాప్తికలుగుతుంది.

ఈ మహాకావ్యమును చదివిన వారికి, భక్తి శ్రద్ధలతో నియమపూర్వకంగా విన్నవారికి కుటుంబం వృద్ధిచెందుతుంది. ధన,ధాన్యములు వృద్ధిచెందుతాయి. ఉత్తమ స్త్రీలు భార్యలుగా దొరుకుతారు. వారికి సకల కార్యములు సిద్ధిస్తాయి. ఆయుష్షు వృద్ధిచెందుతుంది. ఆరోగ్యవంతులవుతారు. సోదర ప్రేమను పెంచుతుంది. మంచి బుద్ధిని కలిగిస్తుంది. తేజస్సును పెంచుతుంది. సకల శుభాలు చేకూరుస్తుంది.

శ్రీమద్రాయాయణము

యుద్ధకాండము నూట ఇరవై ఎనిమిదవ సర్గ సంపూర్ణము.

శ్రీమద్రామాయణము సర్వం సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్ .

# శ్రీమద్రామాయణము

## ఉత్తరకాండము

మొదటి భాగము.

సంస్కృత మూలము

భగవాన్ వాల్మీకి మహర్షి

తేటతెలుగులో

మొదలి వెంకట సుబ్రహ్మణ్యం
2-31, చైతన్యపురి,
హైదరాబాదు 500060
ఫో: 24048104
సెల్: 9391134792

# శ్రీమద్రామాయణము
## ఉత్తర కాండము.
## తరువాత చేర్చబడినవి అను ఐదు సర్గలు.

రాముడు అగస్త్యునితో ఇలా అన్నాడు. "అగస్త్య మహర్షీ! తమరు చెప్పిన ప్రకారము ఋక్షరజస్సు వాలి సుగ్రీవుల తండ్రి కదా! మరి వారి తల్లి ఎవరు? ఆ అన్నదమ్ములకు వాలి, సుగ్రీవుడు అనే పేర్లు ఎలా వచ్చాయి?" అని అడిగాడు.

అప్పుడు అగస్త్యుడు ఇలా చెప్ప సాగాడు. "రామా! వాలి సుగ్రీవుల పూర్వవృత్తాంతమును సవిస్తరముగా చెబుతాను విను. ఒక సారి నారదుడు లోక సంచారముచేస్తూ నా ఆశ్రమమునకు వచ్చాడు. నేను నారదుడికి అర్ఘ్య పాద్యములు ఇచ్చి సత్కరించాను. నీ మాదిరి నేను కూడా వాలి సుగ్రీవుల గురించి అడిగాను. నారదుడు నాతో ఈ విధంగా చెప్పాడు.

"ఓ అగస్త్య మహర్షీ! ఉత్తర దిక్కున మేరు పర్వతము ఉన్నది. అది బంగారు కాంతితో మెరుస్తూ ఉంటుంది. ఆ మేరు పర్వతము మీద బ్రహ్మ దేవుని దివ్య భవనము ఉంది. ఆ భవనములోనే బ్రహ్మ గారు దేవతలతో సభ చేస్తూ ఉంటాడు. ఒకసారి బ్రహ్మదేవుడు యోగాభ్యాసము చేస్తున్నాడు. అప్పుడు బ్రహ్మదేవునికి కళ్లనుండి నీరు కారింది. బ్రహ్మదేవుడు ఆ కన్నీటి బొట్టును కొనగోటితో తీసి నేలమీద విదిల్చాడు. ఆ కన్నీటి బొట్టు నుండి ఒక వానరుడు పుట్టాడు.

ఆ వానరము బ్రహ్మదేవునికి నమస్కరించి నిలబడింది. అప్పుడు బ్రహ్మ ఆ వానరముతో ఇలా అన్నాడు. “ఈ పర్వత శిఖరము మీద అనేక ఫల వృక్షములు ఉన్నాయి. ఆ వృక్షముల నుండి ఫలములు కోసుకొని తింటూ నువ్వు ఇక్కడే ఉండు. నీకు అంతా మంచి జరుగుతుంది.” అని అన్నాడు. “అలాగే చేస్తాను” అని అన్నాడు వానరుడు.

ఆ వానరము ఆ ఫల వృక్షముల మీద తిరుగుతూ దుముకుతూ ఫలములు తింటూ హాయిగా కాలం గడుపుతున్నాడు. ప్రతిరోజూ ఉదయము సాయంత్రము బ్రహ్మ సభకు వెళ్లి బ్రహ్మదేవుని దర్శనము చేసుకుంటూ ఉండేవాడు. వెళ్లేటప్పుడు కొన్ని ఫలములను తీసుకొని వెళ్లి బ్రహ్మదేవునికి సమర్పించేవాడు. అలా కొంత కాలం గడిచింది.

ఒక రోజు అ వానరమునకు దాహం వేసింది. నీరు కోసరం వెదుక్కుంటూ వెళ్లిన ఆ వానరమునకు నిర్మల మైన జలము కల ఒక సరస్సు కనిపించింది. ఆ సరస్సులో జలము నిశ్చలంగా కదలకుండా ఉంది. ఆ వానరము నీళ్లుతాగడానికి ఆ సరస్సులోకి దిగబోతుంటే ఆ వానరానికి సరస్సులో తన ప్రతిబింబము కనిపించింది. “వామ్మో! వీడెవడో నాకు శత్రువు లాగా ఉన్నాడు. నా మాదిరి నేల మీద కాకుండా నీటిలో ఉంటున్నాడు.” అని అనుకొన్నాడు. నీటితో తన ప్రతిబింబాన్ని చూచి అరిచాడు. ఆ ప్రతి బింబం కూడా అరిచింది. “వామ్మో వీడెవడో నన్ను అవమానిస్తున్నాడు. వీడు పరమ దుర్మార్గుడులా ఉన్నాడు. ఈ సరస్సులో వీడు నివసిస్తూ ఉంటాడు కామాల్ను. వీడిని ఎలాగైనా పట్టుకోవాలి” అని అనుకొన్నాడు.

సహజంగా ఉన్న వానరచాపల్యము చేత తన ప్రతి బింబాన్ని పట్టుకోడానికి ఆ సరస్సులోకి దూకాడు ఆ వానరుడు. సరస్సులో ఎవరూ కనపడలేదు. వెంటనే నీటిలోనుండి పైకిలేచాడు. ఆ వానరము ఒక అందమైన స్త్రీగామారి పోయింది. అంతటి అందగత్తె మూడులోకములలో లేదు. ఆ స్త్రీ సాక్షాత్తు సరస్వతీ, లక్ష్మీ, పార్వతి లాగా ప్రకాశిస్తూ ఉంది.

ఆ సమయంలో ఇంద్రుడు బ్రహ్మసభనుండి స్వర్గానికి ఆమార్గంలో వెళుతున్నాడు. మార్గమధ్యములో ఆ స్త్రీని చూచాడు. అదే సమయంలో సూర్యుడు కూడా ఆ మార్గంలో వెళుతున్నాడు. సూర్యుడు కూడా ఆమెను చూచాడు.  ఆమె కూడా దేవేంద్రుని, సూర్యుని చూచింది. ఆమెను చూచి దేవేంద్రునికి, సూర్యునికి మోహావేశము పుట్టింది. ఇద్దరి మనస్సులు కోరికలతో దహించుకుపోతున్నాయి. ఆ మోహావేశంలో ఇంద్రునికి వీర్య స్ఖలనము అయింది. ఇంద్రుని వీర్యము ఆమెవాలము మీద పడింది. . అప్పుడు ఆ స్త్రీ ఒక బలవంతుడైన వానరమును ప్రసవించింది. ఇంద్రుని రేతస్సు వాలము మీదపడింది కాబట్టి అతనికి వాలి అనిపేరు వచ్చింది.

దేవేంద్రుడికి మాదిరి సూర్యునికి కూడా రేతస్సు పతనం అయింది. ఆ రేతస్సు ఆమె కంఠము మీద పడింది. సూర్యుని రేతస్సు ప్రభావంతో ఆమె ఒక బలవంతుడైన కుమారుని ప్రసవించింది. రేతస్సు కంఠము మీద పడింది కాబట్టి అతని పేరు సుగ్రీవుడు (మంచి కంఠము కలవాడు)అనిపేరు వచ్చింది.. రేతస్సు పతనం కాగానే మహేంద్రుడికి, సూర్యుడికి కామవాంఛలు తగ్గిపోయాయి. ఎవరి దారిన వారు వెళ్లారు.

పోతూ పోతూ ఇంద్రుడు వాలికి ఒక బంగారుమాలను బహూకరించి వెళ్లాడు. సూర్యుడు సుగ్రీవునికి హనుమంతుడు మిత్రుడు అవుతాడు అని వరం ఇచ్చి వెళ్లిపోయాడు.

మరునాడు తెల్లవారగానే  వాలి, సుగ్రీవులకు జన్మనిచ్చిన ఆ అందమైన స్త్రీ మరలా వానరంగా మారిపోయింది. తనకు పుట్టిన బలవంతుడైన వానరములను చూచింది. వాటికి తేనె ఆహారంగా ఇచ్చింది. ఆ వానరము పేరు ఋక్షరజస్సు. ఋక్షరజస్సు స్త్రీగా ఉన్నప్పుడు పుట్టిన వారే వాలి, సుగ్రీవులు. ఋక్షరజస్సు తన పుత్రులను తీసుకొని బ్రహ్మదేవుని వద్దకు వెళ్లాడు. బ్రహ్మదేవుడు వారిని కిష్కింధా పురమునకు పోయి వానరులకు రాజుగా కిష్కింధను ఏలుకోమన్నాడు.

తన పక్కనే ఉన్న దేవదూతను పిలిచి అతనితో ఇలా అన్నాడు. "ఓ దేవదూతా! నీవు వీరిని కిష్కింధా నగరమునకు తీసుకొని వెళ్లు. ఆ నగరము విశ్వకర్మ నిర్మించాడు. అది శత్రు దుర్భేద్యమైన నగరము. ఆ నగరంలో బంగారము, వజ్రములు, కోకొల్లలుగా ఉన్నాయి. ఆ నగరంలో కామరూపులైన రకరకాల వానరులు నివసిస్తున్నారు. నీవు వీరిని కిష్కింధకు తీసుకొని వెళ్లి ఆ వానరులకు పరిచయం చెయ్యి. ఆ వానరులకు రాజు ఇతనే అని చెప్పు. ఈ ఋక్షరజస్సును సింహాసనము మీద కూర్చోబెట్టి కిష్కింధకు రాజుగా పట్టాభిషిక్తుని చెయ్యి. వానరులందరూ ఇతనికి వశులై ఉండాలని నా ఆజ్ఞగా చెప్పు." అని అన్నాడు.

బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు ఆ దేవదూత ఋక్షరజస్సును, అతని కుమారులు అయిన వాలి సుగ్రీవులను తీసుకొని కిష్కింధకు వెళ్లాడు. బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారము ఋక్షరజస్సును కిష్కింధకు రాజుగా పట్టాభిషిక్తుని చేసాడు. లోకంలో ఉన్న వానరులకు, భల్లూకములకు అతనిని రాజుగా ప్రకటించాడు. ఆ విధంగా ఋక్షరజస్సు వాలి, సుగ్రీవులకు తల్లి, తండ్రి తానే అయ్యాడు. కిష్కింధకు రాజు అయ్యాడు. వానరులకు, భల్లూకములకు అధిపతి అయ్యాడు. రామా! ఆ విధంగా వాలి సుగ్రీవులు ఋక్షరజస్సుకు జన్మించారు" అని అగస్త్యుడు రామునికి వాలి సుగ్రీవుల జన్మవృత్తాంతమును వినిపించాడు.

రాముడు వాలి సుగ్రీవుల జన్మవృత్తాంతము విని ఆశ్చర్యచకితుడయ్యాడు. అప్పుడు అగస్త్యుడు రాముని తో ఇలా అన్నాడు. "రామా! ఇదే కాదు. ఇంకా ఆశ్చకరమైన విషయములు ఎన్నో ఉన్నాయి. అసలు రావణుడు సీతను ఎందుకు అపహరించాడో తెలుసా! దాని వెనుక ఒక పూర్వగాధ ఒకటి ఉంది. అది కూడా చెబుతాను విను. ఈ రావణుడు కృతయుగము నుండి ఉన్నాడు. ఆ కృతయుగంలో ఒక నాడు రావణుడు బ్రహ్మమానసపుత్రుడైన సనత్కుమారుని ఒకచోట కూర్చుని ఉండగా చూచాడు. రావణుడు సనత్కుమారుని చూడగానే రెండు చేతులు జోడించి నమస్కరించాడు. ఆయనతో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! అన్ని యుద్ధములలో దేవతలు విజయం పొందుతుంటారు కదా. ఎవరిని ఆశ్రయించి వారు ఆ విధంగా విజయం పొందుతున్నారు. దేవతలలో కెల్లా అత్యధికమైన బలము కలవాడు ఎవరు? బ్రాహ్మణులు ప్రతి నిత్యము ఎవరిని పూజిస్తూ ఉంటారు? యోగులు ఎవరిని ధ్యానిస్తూ ఉంటారు.

నాకు ఈ సందేహాలు మనసులో మెదులుతున్నాయి. మీరు నా సందేహములను తీర్చమని కోరుకుంటున్నాను." అని అడిగాడు రావణుడు. దానికి సనత్కుమారుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఎవరినైతే నువ్వు నిరంతరమూ ద్వేషిస్తున్నావో ఆ శ్రీమహావిష్ణువే లోక వ్యాపకుడు. ఈ విశ్వానికంతా ప్రభువు. ఆయన ఎప్పుడు పుట్టాడో ఎవరికీ తెలియదు. దేవతలే కాదు అసురులు కూడా ప్రతినిత్యము ఆయనను పూజిస్తూ ఉంటారు. ఆయన ఎల్లప్పుడూ నీళ్లలో పడుకొని ఉంటాడు. ఆయనను ధ్యానిస్తే సకల పాపములు హరించి పోతాయి. విష్ణువు నాభి నుండి పుట్టిన కమలములో నుండి బ్రహ్మదేవుడు స్వయంభువుగా జన్మించాడు. ఈ సకల చరాచర జగత్తును విష్ణువే సృష్టించాడు. ఆ విష్ణువు కొరకు యజ్ఞములు యాగములు చేస్తూ ఉంటారు. దైవత్వమును పొందుతూ ఉంటారు. అందరూ విష్ణువునే పూజిస్తూ ఉంటారు. ఈ విషయమునే వేదములు, పురాణములు, శాస్త్రములు ఘోషిస్తున్నాయి. విష్ణువు ధర్మపక్షపాతి. దేవతలు ధర్మపరులు అందుకని విష్ణువు దేవతల పక్షం వహించాడు. రాక్షసులను, దైత్యులను, అసురులను జయించాడు. అందుకే దేవతలు విష్ణువును ఆశ్రయించుకొని ఉంటారు. నిత్యమూపూజిస్తూ ఉంటారు." అని అన్నాడు సనత్కుమారుడు.

అప్పుడు రావణుడు ఇలా అడిగాడు. "ఓ మహర్షీ! విష్ణువు రాక్షసులను, అసురులను, దైత్యులను యుద్ధములో చంపుతుంటాడు కదా! వారి మరణానంతరము వారికి ఏ గతి కలుగుతుంది? వారు ఎక్కడకు వెళతారు. స్వర్గానికా లేక నరకానికా?" అని అడిగాడు

రావణుడు.

"యుద్ధములో దేవతల చేత చంపబడిన వాళ్లు అందరూ స్వర్గానికే వెళతారు. అందులో సందేహము లేదు. వారు సంపాదించుకున్న పుణ్యము అయి పోయిన తరువాత వారు చేసిన పాపకర్మములకు తగిన ఫలములను అనుభవిస్తారు. తరువాత మరలా మనుష్యలోకంలో పుడతారు. మరలా పాపపుణ్యాలు చేస్తారు. చనిపోయిన తరువాత వాటికి తగిన ఫలములను అనుభవిస్తారు. ఈప్రకారంగా జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉంటారు. కాని శ్రీమహావిష్ణువు చేతిలో మరణించిన వారు నేరుగా వైకుంఠమునకు వెళతారు. వారికి ఇంక పుట్టుక చావు లేదు. అందుకనే శ్రీమహావిష్ణువుకు కోపం వచ్చినా అది ఎదుటి వారికి వరంగా పరిణమిస్తుంది." అని అన్నాడు సనత్కుమారుడు.

అప్పుడు రావణునికి ఒక ఆలోచన వచ్చింది. ఈ విధంగా పుట్టడం చావడం మరలా పుట్టడం కన్నా ఒకే సారి శ్రీమహావిష్ణువు చేతిలో మరణిస్తే ఇంక చావుపుట్టుకలు ఉండవు కదా. శ్రీమహావిష్ణువు చేతిలో చావడంఎలాగా! అని ఆలోచించాడు. రావణుడు ఇలా ఆలోచిస్తూ ఉండగా, సనత్కుమారుడు రావణునితో ఇలా అన్నాడు. "రావణా! నీ మనసులో మెదిలో భావాలు నాకు అర్థం అయ్యాయి. నీ కోరిక సిద్ధిస్తుంది. కాని కొంతకాలం ఆగాలి." అని అన్నాడు. రావణుని మనసు తృప్తి పడింది. అసలు ఆవిష్ణువు గురించి తెలుసుకోవాలి అని అనుకున్నాడు రావణుడు.

"ఓ మహర్షీ! మీరు శ్రీమహావిష్ణువు గురించి చెప్పారు కదా! ఆయన ఎలా ఉంటాడు? ఆయనను ఎలా గుర్తు పట్టాలి?" అని అడిగాడు. అప్పుడు సనత్కుమారుడు రావణునితో ఇలా అన్నాడు. "శ్రీమహావిష్ణువు సర్వవ్యాపకుడు. అంతటా ఉన్నాడు. ఇక్కడ ఉన్నాడు అక్కడ లేడు అన్న మాట లేదు. కాని మన ఇంద్రియములకు గోచరము కాడు. కంటితో చూడలేము. కాని ఈ చరాచర జగత్తు అంతటా తానే అయి ఉన్నాడు. అందుకని ఇక్కడ ఉన్నాడు అక్కడ లేడు అని చెప్పలేము.

ఆయనకు ఒక రూపము లేదు. అన్ని రూపములు ఆయనవే! భూమి, స్వర్గము, పాతాళము, పర్వతములు, కొండలు, నదీనదములు, అరణ్యములు, జనపదములు, నగరములు అన్ని చోట్లా నిండి నిబిడీకృతమై ఉన్నాడు శ్రీమహావిష్ణువు. ఆయన స్వరూపము ఓంకారము. ఆయన స్థావరము సత్యము, ధర్మము. ఆయనే సకల దేవతలస్వరూపము. ఈ భూమిని తన తలమీద ధరించిన ఆదిశేషువుకూడా ఆయన స్వరూపమే. మనకు సంభవించే పగలు, రాత్రి, మాసములు, సంవత్సరములు, కాలము అన్నీ ఆయనే. ఆయన కాలస్వరూపుడు. మనము నిత్యము చూచే సూర్యుడు, చంద్రుడు ఆయనే. యముడు, వరుణుడు, వాయువు, అగ్ని, రుద్రుడు, ఇంద్రుడు, పంచభూతములు అన్నీ ఆయన స్వరూపాలే. ఆయన అవినాశి. నాశనము లేని వాడు. నిత్యుడు. ఆయనను ప్రార్థిస్తే ఈ సంసార దు:ఖముల నుండి బయటపడేస్తాడు.

ఆయన ఈ సమస్త జగత్తును ప్రకాశింపచేస్తున్నాడు. ఈ లోకములను సృష్టించి, పోషించి, లయం చేసే కర్త ఆయనే. సృష్టి స్థితి

లయాలు ఆయనకు ఒక ఆటవంటిది. సర్వవ్యాపి అయిన విష్ణువు గురించి ఎంత చెప్పినా తక్కువే. ఆఖరుకు మేఘాలలో దాగి ఉన్నమెరుపు, ఉరుము కూడా ఆయనే.

ఆయనను మానవ రూపంలో దర్శించాలంటే ఆయన మేఘము వలె శ్యామల వర్ణంలో ఉంటాడు. ఆయన కళ్లు తామర రేకుల వలె ఉంటాయి. ఆయన వక్షస్థలము మీద శ్రీవత్సము అనే పుట్టు మచ్చ ఒకటి ఉంటుంది. యుద్ధములో విజయమును,  అందరికీ ఐశ్వర్యమును ప్రసాదించే లక్ష్మీదేవి ఆయన వక్షస్థలములో కొలువుదీరి ఉంటుంది. ఆ విష్ణుస్వరూపమును దేవ,దానవ,గంధర్వ,యక్షమానవులు ఎవరూ చూడలేరు. కేవలం ఆయన అనుగ్రహం ఉంటేనే చూడగలరు. ఆ విష్ణువు అనుగ్రహం లేకుండా, ఎన్ని యజ్ఞాలు చేసినా, యాగాలు చేసినా, ఎంత తపస్సు చేసినా, ఎన్ని దానాలు ధర్మాలు చేసినా విష్ణువును చూడ్డం సాధ్యం కాదు.

కాబట్టి ముందు ఆ విష్ణువు అనుగ్రహానికి పాత్రులవడం అత్యంత ముఖ్యం. దానికి ఒకటే మార్గం. పూర్తిగా ఆ విష్ణువుకు తనను తాను అర్పించుకోవడం. ఆయనమీదనే మనసు నిలపడం. ఆయననే తన రక్షకుడుగా భావించడం. చేసిన పాపములను పుణ్యకార్యములతో ప్రక్షాళన చేసుకోవడం. కొత్త పాపాలు చేయకుండా ఉండటం. ఆ విష్ణువు మీద అచంచలమైన భక్తి విశ్వాసం కలిగి ఉండటం. ఈ మార్గం ద్వారానే విష్ణువును చూడగలరు.

ఓ రావణా! నీవు విష్ణువును చూడాలి అని అంటున్నావు కాబట్టి నీకు ఒక మార్గం చెబుతాను విను. ఇప్పుడు కృతయుగము నడుస్తూ ఉంది. కృత యుగము అయిపోగానే త్రేతాయుగము వస్తుంది. అప్పుడు విష్ణువు ఇక్ష్వాకు వంశములో దశరథ మహారాజు అనే క్షత్రియుడు అయోధ్యను రాజధానిగా చేసుకొని పరిపాలన చేస్తుంటాడు. ఆయనకు కుమారుడుగా రాముడు అనే పేరుతో విష్ణువు లోక కల్యాణము కొరకు జన్మిస్తాడు. ఆ రాముడు గొప్ప బలశాలి బుద్ధిశాలి. పరాక్రమ వంతుడు. ధైర్య సాహసములు కలవాడు. విష్ణువు నరుడిగా రాముడు అనే పేరుతో అవతరిస్తాడు. రామునికి జనకుడు అనే మిథిలా నగర చక్రవర్తి కూతురు సీత అనే కన్య భార్య అవుతుంది. సాక్షాత్తు లక్ష్మీ దేవి సీతగా అవతరించి రాముని వివాహం చేసుకుంటుంది. సీత రాముని విడిచి పెట్టి క్షణకాలం కూడా ఉండలేదు. కాలవశమున, రాముని తండ్రి దశరథుడు రాముని అడవులకు పంపుతాడు. అప్పుడు రాముడు దండకారణ్యములో పర్ణశాల నిర్మించు కొని, తన భార్య సీత, తమ్ముడు లక్ష్మణునితో సహా అందులో నివసిస్తూ ఉంటాడు. రావణా! ఇదీ విష్ణుమూర్తి ప్రభావము." అని చెప్పాడు సనత్కుమారుడు.

అప్పటి నుండి రావణుని మనసులో ఒక ఆలోచన మెదిలింది. మామూలుగా మరణిస్తే మరలా పుట్టక తప్పదు. అదే విష్ణువు చేతిలో మరణిస్తే ఈ జనన మరణ చక్రం నుండి విముక్తి కలుగుతుంది. శాశ్వత వైకుంఠలోక ప్రాప్తికలుగుతుంది. కాబట్టి రామావతారంలో విష్ణువుతో వైరం ఎలా పెట్టుకోవాలి. విష్ణువు చేతిలో ఎలా మరణించాలి అని ఆలోచించసాగాడు. " అని అగస్త్యుడు రాముడికి రావణుని వృత్తాంతము

చెప్పాడు. ఇది విని రాముడు ఆశ్చర్యపోయాడు. "ఓ మహర్షీ! తరువాత ఏం జరిగింది వివరంగా చెప్పండి." అని అడిగాడు.

అప్పుడు అగస్త్యుడు ఇలా చెప్పసాగాడు. "తరువాత ఏముంది. నీతో ఎలా వైరం పెట్టుకోవాలా అని ఆలోచించిన రావణుడు, నువ్వు, సీత, లక్ష్మణుడు ఒంటరిగా దండకారణ్యంలో ఉన్నట్టు తెలుసుకున్నాడు. నిన్ను, లక్ష్మణుని మారీచుని సాయంతో బయటకు పంపి, నీ భార్య సీతను అపహరించి, నీకు ఆగ్రహం తెప్పించాడు. నీతో వైరం పెంచుకున్నాడు.

రామా! రావణునినైజం నీకు తెలిసినదే కదా! అతనికి బలం, పరాక్రమం ఉంది. అందుకు తగ్గట్టు బ్రహ్మఇచ్చిన వరాల ప్రభావం కూడా ఉంది. అందుకని లోకంలో ఉన్న రాజులందరినీ యుద్ధానికి పిలిచేవాడు. వారితో యుద్ధం చేసి ఓడించి తనకు దాసులుగా చేసుకొనే వాడు. వారి వద్ద ఉన్న కన్యలను అపహరించేవాడు. ఆ ప్రకారంగా జైత్రయాత్ర సాగిస్తున్న రావణునికి ఒక రోజు నారదుడు తారసిల్లాడు. రావణుడు నారదునికి నమస్కరించాడు. నారదుని ఇలా అడిగాడు. "ఓ నారద మహర్షీ! తమరు ముల్లోకములు సంచరిస్తూ ఉంటారు కదా! నాతో యుద్ధం చేసి గెలవ గల యోధుడు ఎవరైనా ఉన్నాడా! ఉంటే వాడు ఎక్కడ ఉంటాడో చెప్పండి" అని అడిగాడు. ఆ మాటలు విన్న రావణుడు నారదునితో ఇలా అన్నాడు.

"ఓ దానవేంద్రా! క్షీరసముద్రము దగ్గర ఒక ద్వీపము ఒకటి ఉంది. ఆ ద్వీపములో నివసించే మానవులు తెల్లగా ఉంటారు. వారి

శరీరాలు భారీగాఉంటాయి. వారు మాట్లాడుతుంటే ఉరిమినట్టు ఉంటుంది. వారు చాలా ధైర్యవంతులు. పరాక్రమవంతులు. వారు నీతో యుద్ధము చేయడానికి సమర్థులు అని నా అభిప్రాయము." అని అన్నాడు నారదుడు.

అప్పుడు రావణునికి ఒక అనుమానం వచ్చింది. "ఓ మహర్షీ! ఆ ద్వీపంలో అంతటి మహావీరులు తెల్లటి దేహాలతో ఎలా పుట్టారు. వారు అక్కడే ఎందుకు నివాసం ఉంటున్నారు." అని అడిగాడు. "ఏమీ లేదు రావణా! వారందరూ నారాయణుని భక్తులు. వారు ఎల్లప్పుడూ నారాయణ నామం జపిస్తూ, నారాయణుని గురించి తలుచుకుంటూ, ఏ చీకూ చింతా లేకుండా బతుకుతున్నారు. వారికి అదే ఉత్తమ గతి. నీకో విషయం తెలుసా! సతతం నారాయణ నామస్మరణ చేస్తూ నారాయణుని మనసులో ధ్యానించే వారికే ఆ శ్వేతద్వీపంలోకి ప్రవేశం కలుగుతుంది. అలాంటి వారే అక్కడ ఉండడానికి అర్హులు. మానవుల పూర్వపుణ్యఫలము చేతనే వారికి శ్వేతద్వీప నివాసము సిద్ధిస్తుంది. అంతే కాకుండా విష్ణువు చేతిలో, విష్ణువు సంధించిన బాణములతో మరణించిన వారికి కూడా ఈ శ్వేతద్వీములో నివాసము లభిస్తుంది. శ్వేత ద్వీప నివాసము యజ్ఞములు చేస్తే, యాగములు చేస్తే తపస్సు చేస్తే పొందలేరు. కేవలము వారి వారి పుణ్యఫలములచేత, విష్ణువు చేతిలో మరణించడం చేతనే పొందగలరు." అని చెప్పాడు నారదుడు.

వెంటనే రావణుడు "అలాగైతే నేను వెంటనే ఆ శ్వేతద్వీపమునకు పోయి విష్ణువుతో యుద్ధమే చేసి ఆయన చేతిలో

మరణించి శాశ్వతముగా శ్వేత ద్వీప నివాసము పొందుతాను." అని మనసులో అనుకొన్న రావణుడు. శ్వేత ద్వీపానికి బయలుదేరాడు. రావణుని దూకుడు చూచి నారదుడు ఆశ్చర్యపోయాడు. అక్కడ ఏంజరుగుతుందో చూద్దామని నారదుడు కూడా శ్వేతద్వీపానికి వెళ్లాడు. రావణుడు తన రాక్షస సేనలతో మంత్రులతో సేనాపతులతో శ్వేతద్వీపానికి చేరుకున్నాడు.

ఆ శ్వేత ద్వీపము మహా తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంది. రావణుని పుష్పక విమానము ఆ ద్వీపం దరిదాపులకు కూడా వెళ్లలేకపోయింది. ఆ శ్వేతద్వీప మహత్తును చూచి రావణుని మంత్రులు సేనాపతులు వణికిపోయారు. "రాజా! మా వల్ల కావడం లేదు. శరీరాలు పట్టు తప్పుతున్నాయి. స్పృహ తప్పిపోతూ ఉంది. ఈ పరిస్థితులలో మేము యుద్ధం చేయలేము." అని విన్నవించుకున్నారు. రావణునికి ఏమీ తోచలేదు. పుష్పకము కదలడం లేదు. మంత్రులు సేనాపతులు,సైన్యము యుద్ధం చేయమని మొరాయిస్తున్నారు. అందుకని రావణుడు మొండి ధైర్యంతో పుష్పకము దిగి, ఒంటరిగా ఖడ్గం చేత ధరించి శ్వేతద్వీపము వైపు వెళ్లాడు.

ఇంతా చేస్తే ఆ శ్వేతద్వీపంలో అంతా ఆడవాళ్లు ఉన్నారు. అత్యంత సౌందర్యంతో మెరిసిపోతున్నారు. అందులో ఒక స్త్రీ రావణుని చేయి పట్టుకొని "నీవు ఎవరు? ఇక్కడకు ఎందుకు వచ్చావు? నీ తల్లి తండ్రులు ఎవరు? నిన్ను ఇక్కడకు ఎవరు పంపారు?" అని ప్రశ్నల వర్షం కురిపించింది. ఒక ఆడది తనను అన్ని ప్రశ్నలు వేయడం సహించలేక

పోయాడు రావణుడు. కోపంతో ఊగిపోయాడు. "నేను విశ్రవసుని పుత్రుడను. పులస్త్య బ్రహ్మ పౌత్రుడను. రావణుడను. నాకు యుద్ధము అంటే ప్రాణం. నేను యుద్ధం చేయడానికి ఇక్కడకు వచ్చాను. కాని ఇక్కడ నాతో యుద్ధం చేయగల మగాడు కనిపించడం లేదు." అని అన్నాడు. ఆ మాటలకు ఆ స్త్రీలు కిలా కిలా నవ్వారు. నీతో యుద్ధం చేయడానికి మగాళ్లు కావాలా! మేము లేమా!" అంటూ ఆ స్త్రీ రావణుని చిన్న పిల్ల వాడిని పట్టుకున్నట్టు రెండు చేతులతో నడుము దగ్గర పట్టుకొని పైకి ఎగరేసింది. రావణుడు బాలుని మాదిరి పైకి ఎగిరాడు. ఆ ఎగిరిన రావణుని మరొక స్త్రీ పట్టుకుంది. ఆ స్త్రీ రావణుని మరలా పైకి ఎగరేసింది. మరొక స్త్రీ పట్టుకొంది. అలా ఆ స్త్రీలందరూ రావణుని బంతిలా ఎగరేస్తూ పట్టుకుంటూ ఆడుకున్నారు.

అందులో ఒకామె "ఒసేయ్! వీడికి పదితలలు, ఇరవై చేతులు ఉన్నాయే. వీడు పురుగులా ఉన్నాడే. వీడిని పట్టుకుంటాను చూడు" అంటూ రావణుని చిన్న పురుగును పట్టుకున్నట్టు పట్టుకొని గిరాటేసింది. రావణుని మరొక స్త్రీ పట్టుకొని పైకి విసిరేసింది. అలా రావణునితో వారందరూ ఆడుకుంటున్నారు. ఈ హింసను తట్టుకోలేక రావణుడు ఒక స్త్రీ చేతిని పట్టుకొని పళ్లతో కొరికాడు. "ఛీ ఛీ" అంటూ ఆ స్త్రీ రావణుని విసిరేసింది. అది చూచి మరొక స్త్రీ రావణుని పురుగును పట్టుకున్నట్టు పట్టుకొని ఆకాశంలోకి ఎగిరింది. రావణుని కోపం మిన్నుముట్టింది. ఆ స్త్రీని కూడా రావణుడు గోళ్లతో పీకాడు. "ఛీ పాడు" అంటూ ఆ స్త్రీ రావణుని విదిలించి కొట్టింది. ఆ విదిలించిన వేగానికి రావణుడు సముద్రంలో పడిపోయాడు.

ఆ విధంగా రావణుని ఈ స్త్రీలు బంతాట ఆడుకున్నారు. రావణుని అవస్త చూచిన నారదుడు రావణుని ఎదుట నిలిచి పెద్దగా నవ్వుతూ నృత్యం చేసాడు." అని చెప్పాడు అగస్త్యుడు. ఈ కథంతా విని రాముడు ఆశ్చర్యపోయాడు. అగస్త్యుడు రాముని చూచి ఇలా అన్నాడు. " రామా! ఇన్ని అవస్థలు పడ్డ రావణుడు నీ చేతిలో మరణించడానికే నీ భార్య సీతను అపహరించాడు. రావణుడికి నీవే నారాయుడివి అని తెలుసు. నీవు రాక్షససంహారము కొరకు రాముడిగా అవతరించావు అని కూడా తెలుసు. కానీ నీవే నీ అవతార రహస్యమును తెలుసుకోలేక పోతున్నావు.

కాబట్టి రామా! ఇప్పటి కన్నా నీవు విష్ణువు అవతారము అని తెలుసుకో! నీవు త్రికాలములు తెలిసిన వాడవు. నీవు మూడు వేదములతో కీర్తింపబడుతున్నావు. మూడు అడుగులు బలిని దానం అడిగి మూడులోకములు ఆక్రమించావు. నీవు సనాతనుడవు అయిన విష్ణువు. లోక కల్యాణార్థము రామునిగా అవతరించావు. దేవతల కార్యములు నిర్వర్తించావు. లోక కంటకుడైన రావణుని, పుత్ర,మంత్రి, సామంత,పరివార సమేతంగా వధించావు. లోక కల్యాణము చేకూర్చావు. నీవు చేసిన పని వలన దేవతలు, ఋషులు, మునులు ఎంతో సంతోషించారు. ఇప్పుడు ముల్లోకములు రాక్షసుల వలన ఎలాంటి భయం లేకుండా ప్రశాంతంగా జీవిస్తున్నాయి. నీ భార్య సీత సాక్షాత్తు లక్ష్మీదేవి అవతారము. నీ కొరకే ఆమె జనకుని ఇంట జన్మించింది. రావణుడు సీతను లంకలో ఉంచి జాగ్రత్తగా రక్షించాడు. ఒక తల్లిని కొడుకు ఎలా చూచుకుంటాడో అలా చూచుకున్నాడు రావణుడు. పూర్వము ఈ కథను సనత్కుమారుడు

రావణునికి చెబితే, నారదుడు నాకు చెప్పాడు." అని అగస్త్యుడు రామునికి రావణ వృత్తాంతమును సవిస్తరంగా చెప్పాడు. రామ,లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు ఈ కథవిని ఆశ్చర్యపోయారు. సీతాపహరణం వెనుక ఇంత కథ ఉందా అని అనుకున్నారు. ఈ కథవిన్న సుగ్రీవుడు మొదలగు వానర ప్రముఖులు, విభీషణుడు, అతని మంత్రులు, రాముని సామంత రాజులు, పుర ప్రముఖులు అందరూ  ఆనంద పరవశులయ్యారు. అప్పుడు అగస్త్యుడు రాముని వద్ద సెలవు తీసుకొని తన ఆశ్రమమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ప్రక్షిప్త సర్గలు సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## ముప్పది ఎనిమిదవ సర్గ.

ఇక్ష్వాకు కులతిలకుడైన శ్రీరామచంద్రుడు అయోధ్యానగరానికి పట్టాభిషిక్తుడయ్యాడు. ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలిస్తున్నాడు. ఎవరికి తగిన పనులను వారికి అప్పగిస్తూ అందరి చేతా పనులు చేయించు కుంటున్నాడు. ఇలా కొన్ని రోజులు గడిచాయి. పట్టాభిషేక మహోత్సవము నకు వచ్చిన ఆహుతులందరూ ఎవరి నగరములకు వారు వెళ్లిపోయారు. ఒక రోజు రాముడు తన మామగారు జనకమహారాజును చూచి ఇలా అన్నాడు. "ఓ జనకమహారాజా! మీ ఆశీస్సులవలననే నేను రాక్షస సంహారం

చేయగలిగాను. మీ ఆశీస్సుల వలననే నేను అయోధ్యారాజ్యమును జనరంజకంగా పరిపాలిస్తున్నాను. మా ఇక్ష్వాకు వంశస్థులకు, మిథిలా నగర వాసులకు కల సంబంధము అద్వితీయము. మీరు నాచే ఇవ్వబడే కానుకలను స్వీకరించండి. భరతుడు మిథిలా నగరం వరకూ మీకు సాయంగా మీతో వస్తాడు." అని అన్నాడు. జనకుడు సరే అన్నాడు. మిథిలకు ప్రయాణము అయ్యాడు. రాముడు తనకు ఇచ్చిన బహుమతులను రత్నములను, బంగారమును, విలువగల వస్తువులు అన్నింటినీ తన కుమార్తెలకు ఇచ్చాడు. జనకుడు మిథిలకు వెళ్లిపోయాడు.

తరువాత భరతుని మేనమామ అయిన కేకయ రాజును చూచి రాముడు ఇలా అన్నాడు. "నీ ఆశీర్వాదము వలననే భరతుడు ఇన్నాళ్లు రాజ్యపాలన చేసాడు. తరువాత నాకు రాజ్యము అప్పగించాడు. ఇప్పుడు యువరాజుగా నాతో పాటు పాలనా బాధ్యతలు స్వీకరించాడు. ఇదంతా మీ శుభాశీస్సులవలననే జరిగింది. కేకయ దేశములో మీ తండ్రిగారు మీ కొరకు అనుదినము ఎదురుచూస్తూ ఉంటారు. నా శక్తికొలది మీకు ధనము, బంగారము, మణిమాణిక్యాదులు బహుమతిగా ఇస్తున్నాను. వాటిని తీసుకొని లక్ష్మణుడు తమ వెంట వస్తున్నాడు." అని అన్నాడు రాముడు. దానికి భరతుని మేనమామ యుధాజిత్తు ఇలా అన్నాడు. "రామా! నాకెందుకయ్యా ఈ బహుమానములు. అవన్నీ ఇక్కడే ఉండనీ." అని అన్నాడు. తరువాత రాముని వద్ద సెలవు తీసుకొని యుధాజిత్తు కేకయ రాజ్యమునకు వెళ్లిపోయాడు. ఆయనకు తోడుగా లక్ష్మణుడు ఆయన వెంట వెళ్లాడు.

తరువాత కాశీరాజు ప్రతర్ధనుడిని చూచి రాముడు ఇలా అన్నాడు. "రాజా! మీ సహాయ సహకారముల వలన భరతుడు ఈ 14 ఏళ్లు రాజ్యపాలన చేయగలిగాడు. ఇన్నాళ్లు అయోధ్యలో ఉండటం వలన అక్కడ కాశీరాజ్యములో పరిపాలన సక్రమంగా జరుగుతున్నట్టు లేదు. అందుకని తమరు కాశీరాజ్యమునకు వెళ్లడం ఉత్తమం." అని కాశీరాజుకు అనేక బహుమానములు ఇచ్చాడు. ఆ బహుమానములను తీసుకొని కాశీరాజు వారణాసికి ప్రయాణమై వెళ్లాడు.

తరువాత తనకు సామంతులు, పట్టాభిషేక మహోత్సవమును చూడటానికి వచ్చిన 300 మంది రాజులను చూచి రాముడు ఇలా అన్నాడు. "ఓ రాజోత్తములారా! మీ అందరి శుభాశీస్సులతో నేను రాక్షస సంహారము చేయగలిగాను. మీ అందరి సహాయ సహకారాలు లేకుండా నేను ఏమీ చేయగలిగే వాడిని కాదు. నేను దండకారణ్యములో ఉండగా రావణుడు సీతను అపహరించాడు అని తెలిసిన భరతుడు నాకు సాయంగా మిమ్ములను అందరినీ పిలిపించాడు. కాని నాకు మీ సాయము తీసుకోవలసిన అవసరమురాలేదు. అందుకని ఈసంవత్సర కాలము మీరు ఇక్కడే ఉండిపోయారు. ఇంక మీరు మీ మీ రాజ్యములకు వెళ్లండి." అని అన్నాడు రాముడు.  రాముని మాట మేరకు అందరూ వారి వారి రాజ్యములకు వెళ్లిపోయారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ముప్పది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## ముప్పది తొమ్మిదవ సర్గ.

అయోధ్యనుండి వెళ్లిన ఆ రాజులు రామునికి యధాతథముగా కానుకలు కప్పములు పంపారు. ఆ రాజులను అనుసరించి వెళ్లిన భరత శత్రుఘ్నులు ఆ కానుకలు అన్నీ అయోధ్యకు తీసుకొని వచ్చారు. రామునికి ఇచ్చారు. రాముడు ఆకానుకలను అన్నీ సుగ్రీవునికి, విభీషణునికి, వానర వీరులకు పంచి  ఇచ్చాడు.

తరువాత రాముడు అంగదుని, హనుమంతుని చూచి సుగ్రీవునితో ఇలా అన్నాడు. "సుగ్రీవా! వాలి పుత్రుడు అయిన అంగదుడు నీకు కూడా కుమారుడే. ఈ హనుమంతుడు నీకు సచివుడు. వీరికి కూడా నీకు చేసిన సత్కారములే చెయ్యాలి." అని పలికిన రాముడు అంగదునికి, హనుమకు తన ఒంటి మీద ధరించిన అమూల్యములైన రత్నహారములను తీసి అంగదునికి హనుమకు ధరింపచేసాడు. తరువాత రాముడు వానర వీరులైన నీలుడు, నలుడు,కేసరి, కుముదుడు, గంధమాధనుడు, సుషేణుడు, పనసుడు, మైందుడు, ద్వివిదుడు, జాంబవంతుడు, గవాక్షుడు, వినతుడు,ధూమ్రుడు, వలీముఖుడు ,ప్రజంఘుడు, సంనాదుడు,మహాబలుడు, దధీముఖుడు, ఇంద్రజానుడు తదితర వానర వీరులను పేరుపేరునా పిలిచి సత్కరించాడు రాముడు. వారితో ఇలా అన్నాడు.

"ఓ వానరవీరులారా! మీ వలననే నేను ఈ మహత్కార్యమును చేయగలిగాను. మీరే లేకపోతే నాకు సీత జాడ తెలిసేది కాదు. ఈయుద్ధము జరిగేది కాదు. మీరందరూ నాకు సోదర సమానులు. మీ నాయకుడు సుగ్రీవుడు ధన్యుడు." అని వారిని పిలిచి ప్రేమతో వారినందరినీ విడివిడిగా కౌగలించుకున్నాడు. తరువాత ఆ వానర వీరులు, వానరులు కొంత కాలము అయోధ్యలో ఉన్నారు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ముప్పది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## నలుబదియవ సర్గ.

ఆ ప్రకారంగా వానరులు వానర వీరులు అయోధ్యలో సకలసౌకర్యముడు అనుభవిస్తూ ఉన్నప్పుడు ఒక రోజు రాముడు సుగ్రీవుని చూచి ఇలా అన్నాడు. "సుగ్రీవా! మీరు వచ్చి చాలాకాలము అయింది. అక్కడ కిష్కింధ ఎలా ఉందో ఏమో. మీరు వెంటనే కిష్కింధకు వెళ్లండి. మీ రాజ్యమును వానర రంజకంగా పాలించండి. అంగదుడిని, హనుమను, నలుడిని ప్రేమానురాగాలతో చూచుకో. నీ మామగారు సుషేణుడిని, తారుడిని, కుముదుడిని, నీలుడిని, శతబలిని, మైందుడిని, ద్వివిదుడిని, గజుడిని, గవాక్షుడిని, గవయుడు, శరభులను,

జాంబవంతుడిని, గంధమాధనుడిని, ఋషభుడిని, సుపాటలుడిని, కేసరిని, శరభుడిని, శంఖచూడుని, వీరే కాదు నా కోసం ప్రాణాలకు కూడా తెగించి యుద్ధం చేసిన అందరినీ ప్రేమతో చూచుకో." అని అన్నాడు రాముడు. రాముని మాటలను శ్రద్ధగా విన్నాడు సుగ్రీవుడు.

తరువాత రాముడు విభీషణుని చూచి ఇలా అన్నాడు. "విభీషణా! నీవు లంకను ధర్మమును అనుసరించి పాలించు. నీకు ధర్మము అధర్మము గురించి నేను చెప్ప పనిలేదు. నీ సోదరుడు కుబేరుని ఆదరంతో చూచుకో. లంకా నగరంలోని నీ ప్రజలను ఆదరంతో పాలించు. ఏ సమయంలో కూడా నీ బుద్ధిని పెడతోవ పట్టనీయకు. అధర్మం జోలికి వెళ్లకు. రాజసుఖములలో పడి నన్ను, సుగ్రీవుని మరిచిపోవద్దు." అని విభీషణుడికి హితోపదేశము చేసాడు రాముడు.

రాముని మాటలు విన్న రాక్షసులు వానరులు రాముని ఎంతగానో ప్రశంసించారు. ఆ సమయంలో హనుమంతుడు రామునికి నమస్కరించి ఇలా అన్నాడు. "రామా! నా మనసు, బుద్ధి ఎల్లప్పుడూ నీ మీదనే ఉండేటట్టు నన్ను అనుగ్రహించు. రామ చరిత్ర ఈ లోకంలో ప్రచారంలో ఉన్నంత కాలము నేను జీవించి ఉండేటట్టు నాకు వరం ప్రసాదించు. నేను నిరంతరమూ నీ నామము, నీ చరిత్రను జపిస్తూనే ఉంటాను. వింటూఉంటాను. పాడుతూ ఉంటాను. రామ నామాన్ని జపిస్తూ, రామ చరితను వింటూ నా బాధలను, కష్టాలను మరిచిపోతాను. నిత్యం సంతోషంగా ఉంటాను." అని ఆర్తితో అంటున్న హనుమను చూచి రాముడు తన సింహాసనము నుండి లేచి వచ్చి

హనుమను గట్టిగా కౌగలించుకున్నాడు. "హనుమా! నీవు కోరిన విధముగా అన్నీ జరుగుతాయి. సందేహము లేదు. రామ కథ ఈ లోకంలో ఎంతకాలము నిలిచి ఉంటుందో అంతకాలము నీ కీర్తి నిలిచి ఉంటుంది. అంత కాలము నీవు చిరంజీవిగా ఉండగలవు. రామ కథ సూర్య చంద్రులు ఉన్నంత కాలము ఈ లోకంలో నిలిచి ఉండగలదు. హనుమా! నీవు నాకు చేసిన ఉపకారములకు ఒక్కొక్కదానికీ నా ప్రాణములు ఇచ్చినా సరిపోదు. అప్పుడు మిగిలిన ఉపకారములకు నేను ఏమి ఇవ్వగలను. నీవు నాకు చేసిన ఉపకారములకు ప్రత్యుపకారము చేయడం అంటే నిన్ను, నీవు చేసిన ఉపకారములను అవమాన పరచడమే అవుతుంది. అందుకని నీవు నాకు చేసిన ఉపకారములను నాలోనే జీర్ణం చేసుకుంటాను. నీకు జీవితాంతము ఋణపడి ఉంటాను." అని అన్నాడు రాముడు. వెంటనే తన మెడలోని రత్నహారమును తీసి హనుమ మెడలో వేసాడు.

తరువాత వానర వీరులు అందరూ రామునికి నమస్కరించి కిష్కింధకు బయలుదేరారు. సుగ్రీవుడు, విభీషణుడు, హనుమంతుడు రాముని విడువ లేక విడువ లేక విడిచి వెళ్లారు. వారి ఆత్మలన్నీ రాముని వద్దనే విడిచి పెట్టి కేవలం వారి దేహములు మాత్రమే అయోధ్యను విడిచిపెట్టి వెళ్ళాయి. వారందరూ రామునికి నమస్కారములు చేసి తమ తమ గృహములకు వెళ్లిపోయారు

. శ్రీమద్రామాయణము

ఉత్తరకాండమునలుబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## నలుబది ఒకటవ సర్గ.

పట్టాభిషేక మహెూత్సవానికి వచ్చిన వారందరూ వెళ్లిపోయారు. రాముడు పరిపాలనా కార్యములలో నిమగ్నం అయ్యాడు. ఒక రోజు రాముడు తన మందిరము పైభాగం మీద కూర్చొని తన తమ్ములతో మాట్లాడుతూ ఉంటే ఆకాశంలో పుష్పక విమానము కనిపించింది. పుష్పకములో నుండి మాటలు వినిపించాయి.

"నేను పుష్పకమును. కుబేరుడి వద్దనుండి వచ్చాను. తమరి ఆజ్ఞమేరకు నేను కుబేరుని వద్దకు వెళ్లాను. ఆయన నాతో ఇలా అన్నాడు. "ఓ పుష్పక విమానమా! నిన్ను రావణుడు నాతో యుద్ధం చేసి అపహరించాడు. ఇన్నాళ్లు నీవు రావణుని అధీనంలో ఉన్నావు. ఇప్పుడు రాముడు రావణుని చంపాడు. రావణుని రాజ్యము, ఆస్తి రాముని వశం అయింది. నీవు రావణుని సొత్తు కాబట్టి రావణుని మరణం తరువాత నీవు రాముని సొత్తు అయ్యావు. కాబట్టి నీవు రాముని వద్దకు వెళ్లు. రాముని సేవించు. అదే నా కోరిక." అని అన్నాడు. నేనుకుబేరుని ఆదేశానుసారము తమరి వద్దకువచ్చాను. నన్ను స్వీకరించండి." అని పుష్పకము పలికింది.

ఆమాటలు విన్న రాముడు ఆశ్చర్యపోయాడు. పుష్పకమును అయోధ్యలో దిగమన్నాడు. "ఓ పుష్పక విమానమా! నీకు స్వాగతము. రావణుడు నిన్ను కుబేరుని వద్దనుండి అపహరించాడు కాబట్టి నిన్ను నీ

అసలు యజమాని అయిన కుబేరుని వద్దకు పంపాను. కుబేరుడే తిరిగి నిన్ను నా వద్దకు పంపాడు కాబట్టి నీవు నా దగ్గర ఉండవచ్చును. నేను నిన్ను అవసరము వచ్చినప్పుడు ఉపయోగించుకుంటాను. నేను పిలిచినప్పుడు నా వద్దకు రా”అని అన్నాడు. తరువాత రాముడు తన తమ్ములతో సహా పుష్పక విమానమును పుష్పములతో పూజించాడు. పుష్పకము రాముని పూజలు అందుకొని తన దారిన తాను వెళ్లింది.

అప్పుడు భరతుడు రాముని చూచి ఇలా అన్నాడు. “రామా! నీ పరిపాలనలో ప్రజలు సుఖంగా ఉన్నారు. జంతువులు పక్షులు కూడా మనుష్య భాషలో మాట్లాడటం గమనించాను. రాజ్యములో రోగముల బాధలేదు. అంతా ఆరోగ్యంగా ఉన్నారు. మరణాలు కూడా బాగా తగ్గిపోయాయి. మానవుల ఆయు:ప్రమాణము పెరిగింది. స్త్రీలు కూడా ఆరోగ్యవంతులయిన బిడ్డలను ప్రసవిస్తున్నారు. శిశు మరణాలు తగ్గిపోయాయి. మేఘములు కూడా సకాలంలో వర్షాలుకురుస్తున్నాయి. పంటలుబాగా పండుతున్నాయి. రాముని వంటిరాజు మాకు కావాలని ప్రజలు అనుకుంటున్నారు.” అని పలికాడు భరతుడు.

(భరతుని మాటలు గమనించండి. రాముని రాజ్యంలో ఆరోగ్య శాఖ, మాతా శిశు సంరక్షణ శాఖ, వ్యవసాయ శాఖ ఎంత సమర్థవంతంగా పనిచేస్తున్నాయో అర్థం అవుతోంది కదా! సరిగ్గా ఈ శాఖలే ఈ నాడు నిర్లక్ష్యానికి గురి అవుతున్నాయి. రోగాలు రాకుండా ఆరోగ్యశాఖ ముందస్తు చర్యలు తీసుకోదు. కాలువలు నాలాలు బాగు చెయ్యరు. అక్కడ రోగక్రిములు, దోమలు తామర తంపరగా పుట్టి

యధాశక్తి రోగాలు వ్యాప్తిచేస్తున్నాయి. రోగాలు వస్తే హాస్పిటల్సులో డాక్టర్లు ఉండరు. మందులుండవు. రోగనిర్ధారణకే వేలకు వేలు ఖర్చువుతోంది. ఇంకమందులు సరేసరి. ఉన్న ధనం అంతా కాట్రాక్టర్లకు దోచిపెట్టడానికి, వారి వద్ద నుండి వాటాలు పుచ్చుకోడానికే సరిపోదు. ఇంక వైద్యానికి డబ్బు ఎక్కడినుండి వస్తుంది. రాజకీయనాయకులకు ఇవేమీ పట్టవు తమ స్వార్ధం తప్ప. ఇంక రామరాజ్యం రమ్మంటే ఎలా వస్తుంది.)

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభై ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

నలభై రెండవ సర్గ.

ఒక రోజు రాముడు ఉద్యాన వనములో ప్రవేశించాడు. దాని పేరు అశోక వనము. ఆ వనములో అనేక రకములైన లతలు, వృక్షములు పెరుగుతున్నాయి. చంపక, పున్నాగ, అశోక, మధూక, పనస, చూత, జామ, పారిజత వృక్షములు పెరుగుతున్నాయి. పుష్పములతో ఫలములతో శోభాయమానంగా ఉన్నాయి. ఇవే కాకుండా ఆ వనము అరటి, అర్జున, నాగ, లోధ్ర, నీవ (వేప) గురివెంద, మందార, వృక్షములతోనూ తీగలతోనూ శోభిల్లుతూ ఉంది. అశోక వనములో వృక్షములు అన్ని కాలములలోనూ ఫలములతో, పూలతో, నిండుగా ఉంది. ఆ వనమును రక్షించే వారు ఆ వనములోని చెట్లను రకరకాలుగా కత్తిరించి

మృగములు, తోరణములు ఆకారములలో మలిచారు. ఆ వనములో అన్ని రకాల పక్షులు, కోయిలలు, చిలుకలు నివాస మేర్పరచుకొని నివసిస్తున్నాయి. మామిడి చిగుళ్లు తింటూ కోయిలలు మనోహరంగా కూస్తుంటే వినసొంపుగా ఉండేది.

ఆ వనమునకు నీరు కావాలి కదా. అందుకని అనేకములైన బావులు, దిగుడు బావులు తవ్వించారు. ఆ వనములో అందమైన పచ్చికబీళ్లు దర్శనం ఇస్తాయి. అశోక వృక్షములు ఒకదానితో ఒకటి పోటీ పడుతూ ఆకాశాన్నంటేటట్టు పెరుగుతున్నాయి. రాముని ఆధ్వర్యంలో పెంచబడుతున్న ఆ ఉద్యానవనము స్వర్గలోకంలో ఉన్న నందనవనమును తలపిస్తూ ఉంది.

(లంకలో అశోక వనము, అయోధ్యలో అశోక వనము... నాటి రాజులు వృక్షములు, మొక్కలు పెంపకం మీద ఎంత శ్రద్ధ పెట్టారో, ప్రకృతి పరిరక్షణ కొరకు ఎంతగా పాటుపడుతున్నారో, మనకు తెలుస్తోంది కదా! ఈ రోజుల్లో ఇంత టెక్నాలజీ ఉండికూడా, ఎక్కడో ఒకటి రెండు పార్కులు తప్ప, మిగిలిన పార్కులలో పచ్చదనం కరువయింది. ఎండి పోయిన చెట్లు, మొక్కలు దర్శనం ఇస్తున్నాయి. పార్కులకు ఉపయోగించే స్థలంలో కూడా అపార్టుమెంట్లు కట్టేసి, పచ్చదనాన్ని పాడుచేస్తున్నారు నేటి వ్యాపారవేత్తలు. చెరువులను పూడ్చి బావులను పూడ్చి ఆస్థలంలో బహుళ అంతస్థుల భవనాలు లేపుతున్నారు. పునాదులు సరిలేక అవి అలాగే కుంగి పోవడం మనం చూస్తూనే ఉన్నాం. ఇదీ నేటి తీరు.)

ఒకరోజు రాముడు సీత ఆ వనములో విహరిస్తున్నారు. రాముడు, సీత ముందు నర్తకీమణులు నృత్యం చేస్తున్నారు. రాముడు, సీత ఆరగించడానిక ఫలములు, వండిన పదార్థములు సిద్ధం చేసారు. ఆ ప్రకారంగా సీతా రాములు ఆనందంగా కాలం గడుపుతున్నారు. రాముడు పదివేల సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. రాముడు ప్రతి రోజూ తెల్లవారు జామున లేచి కాలకృత్యములు తీర్చుకొని స్నానాదులు కావించి సంధ్యావందనము చేసి, రాచ కార్యములు అన్నీ పగలు పూర్తి చేసుకొని, సాయం సమయానికి సీతాదేవి వద్దకు వచ్చేవాడు. రాముని భార్య సీత కూడా పొద్దుటే లేచి స్నానాదులు ఆచరించి దేవతార్చన చేసి, తరువాత తన ముగ్గురు అత్తగార్ల వద్దకు పోయి వారికి తగు సేవలు చేసి, సాయం కాలానికి సకలాలంకార భూషితురాలై రాముని రాక కొరకు ఎదురు చూస్తూ ఉండేది.

సర్వమంగళ అయిన సీతను చూచి రాముడు పరమానందము చెందేవాడు. ఆమె అందచందములను మెచ్చుకొనేవాడు. ఇంతలో సీత గర్భవతి అయింది. ఈ సంగతి రామునికి తెలిసింది. రాముడు పరమానంద భరితుడయ్యాడు. "ఓసీతా! నీ వలన నాకు ఉత్తమ సంతానము కలుగబోతున్నారు. ఈ సమయంలో ఆడవాళ్ల ఏవేవో కోరికలు ఉంటాయి అంటారు కదా! నీకు కూడా ఏవైనా కోరికలు ఉంటే చెప్పు తీరుస్తాను." అని అన్నాడు రాముడు. అప్పుడు సీత రామునితో ఇలా అంది. "నాకు ఈ సమయములో గంగా తీరమున ఉండే పరమ పవిత్రములైన తపోవనములలో విహరించాలని, అక్కడి మునులు, ఋషుల ఆశీర్వాదము తీసుకోవాలనీ, వారి పాదధూళి శిరస్సున

ధరించాలని చాలాకోరికగా ఉంది. సాధారణంగా ఈ సమయములో ఆడవాళ్లు పుట్టింట్లో నిదుర చేయాలని అంటారు. కానీ నాకు గంగాతీరములో ఉండే ముని ఆశ్రమములలో ఒక్క రాత్రి అన్నా నిద్ర చేయాలని కోరికగా ఉంది. ఇదే నా కోరిక." అంది సీత.

" ఇంతేనా! నీ కోరిక తప్పక తీరుస్తాను. రేపే మనము గంగానదీ తీరాన ఉన్న ఋషుల ఆశ్రమములకు వెళుదాము." అని అన్నాడు రాముడు. తరువాత రాముడు తన స్నేహితులతో గడపడానికి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము నలభైరెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము
## నలభై మూడవ సర్గ.

రాముడు ఉన్నతమైన ఆసనము మీద కూర్చుని ఉన్నాడు రాముని చుట్టు అతని స్నేహితులు కూర్చుని ఉన్నారు. అంతా సరదాగా మాట్లాడుకుంటూ నవ్వుకుంటూ ఉన్నారు. రాముని చుట్టు విజయుడు, మధుమత్తుడు, కాశ్యపుడు, మంగళుడు, కులుడు, సురాజి, కాలియుడు, భద్రుడు, దంతవక్త్రుడు, సుమాగధుడు అనే పేరుగల వాళ్లు కూర్చుని ఉన్నారు. అంతా సరదాగా మాట్లాడుకుంటున్నారు. మాటల సందర్భంలో రాముడు భద్రుని

వంక చూచి "ఏం భద్రా! అయోధ్యానగరం ఎలా ఉంది. ఏమని అనుకుంటున్నారు? దేశంలో ప్రజలు నా గురించి ఏమనుకుంటున్నారు? అయోధ్యలో, ఇంకా ఇతర పురములలో, గ్రామములలో, జనపదములలో ప్రజలు నా గురించి సీతను గురించి, లక్ష్మణ, భరతుల గురించి ఏమనుకుంటున్నారు? రాముని రాజ్య పాలన గురించి ఏమన్నా విమర్శలు వినపడుతున్నాయా! మా తల్లి కైకేయి గురించి నాకు వనవాసము ప్రాప్తించింది కదా? ఆమెను గూర్చి ఏమనుకుంటున్నారు? 14 సంవత్సరాల తరువాత రాజ్యానికి వచ్చాను కదా! ఈ కొత్త రాజును గురించి ప్రజలు ఏమనుకుంటున్నారు?"అని అడిగాడు రాముడు.

దానికి భద్రుడు ఇలా అన్నాడు. "రామా! ప్రజలందరు నీ విజయగాధలను గానం చేస్తున్నారు. నీవు రావణుని చంపడం సీతను తీసుకు రావడం అంతా కధలు కధలు గా చెప్పుకుంటున్నారు." అని అన్నాడు భద్రుడు. "అది కాదుభద్రా! వారు ఏమనుకుంటున్నారు వారి మాటలలోనే చెప్పు. ఎందుకంటే అంతా మంచి అనుకోరు కదా. కాస్త చెడ్డగా కూడా అనుకుంటారు. అదిసహజమే కదా! ప్రజల మనోభావాలు నాకు తెలిస్తే, నేను వారికి ఇష్టం లేని పనులు చేయకుండా జాగ్రత్త పడతాను. ఎల్లప్పుడూ వారికి ఇష్టమైన పనులే చేయడానికి ప్రయత్నిస్తాను. ఏ విషయాలలో ప్రజలకు నా పాలన సంతృప్తి కలిగించడం లేదు. పట్టణాలలో, పల్లెలలో ప్రజలు నా గురించి నా పాలన గురించి ఏమనుకుంటున్నారో నిర్భయంగా, ఏ మాత్రం సంకోచం లేకుండా చెప్పు." అని అడిగాడు రాముడు.

రాముని మాటలు విన్న భద్రుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! అయోధ్యలోనూ ఇతర గ్రామాలు, పట్టణాలలోనూ ప్రజలు నాలుగు వీధులు కలిసే చోట, రచ్చబండల వద్ద, ఉద్యానవనములలోనూ నీ గురించి ఏమేమి మాట్లాడుకుంటున్నారో చెబుతాను విను. నీవు సముద్రము మీద సేతువును కట్టావు కదా. అలాంటి పని దేవతలు గానీ దానవులు గానీ పూర్వము ఎవరూ చేయలేదని నిన్ను వేనోళ్ల శ్లాఘిస్తున్నారు. పైగా నీవు వానరములను, భల్లూకములను మచ్చిక చేసుకోవడం, రావణుని చంపడం, వాటి సాయంతో రావణుని చంపడం అంతా విడ్డూరంగా ఆశ్చర్యంగా చెప్పుకుంటున్నారు. ఇంకా కొంతమంది "రాముడు రావణుని చంపి, రావణుని వద్ద ఉన్న సీతను తీసుకొని వచ్చాడు. రావణుడు ఇన్నాళ్లు సీతను తాకినా లెక్కచేయకుండా సీతను మరలా స్వీకరించాడు. రాముడికి సీత మీద అంత వల్లమాలిన ప్రేమ ఉందేమో! రామునికి సీత వల్ల అంత సుఖం కలుగుతుందేమో! అయినా రావణుడు సీతను తన ఒడిలో కూర్చుండబెట్టుకొని లంకకు తీసుకొని వెళ్లాడు కదా! అక్కడ అశోక వనములో ఉంచాడు కదా! మరి అన్నాళ్లు రాక్షసుల మధ్య ఉన్న సీతను రాముడు అసహ్యించుకోకుండా ఎలా ఉండగలుగుతున్నాడో అర్థం కావడం లేదు! రాముడే అలా చేసాడు కాబట్టి మనం కూడా మన భార్యలు ఎక్కడ తిరిగి వచ్చినా ఏమీ అనకుండా ఏలుకోవాలేమో! ఎందుకంటే రాజుగారు ఏమి చేస్తే ప్రజలు అలా చెయ్యాలి కదా!" ఈ ప్రకారంగా ప్రజలు నానా విధాలుగా అనుకుంటున్నారు రామా!" అని చెప్పాడు భద్రుడు.

రామునికి దు:ఖం పొర్లుకొచ్చింది. కాని బయట పడలేదు. తక్కిన మిత్రుల వంక చూచి "ఇదంతా నిజమేనా! ఇలాంటి మాటలు అనడం  మీరు కూడా విన్నా రా!" అని అడిగాడు. "అవును రామా! భద్రుడు చెప్పినది అంతా అక్షరాలా నిజం మేము కూడా ప్రజలు ఇలా అనుకోవడం స్వయంగా విన్నాము." అని చెప్పారు. రాముని మనసంతా అల్లకల్లోలం అయింది. ఇంక స్నేహితుల మధ్య ఉండలేకపోయాడు.  రాముడు తన స్నేహితుల నందరినీ పంపివేసి తన అంత:పురమునకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలుబది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## నలుబది నాలుగవ సర్గ.

రాముడు తన మిత్రులను అందరినీ పంపి వేసి తాను అంత:పురమునకు వెళ్లాడు. ప్రతీహారిని పిలిచాడు."నీవు వెంటనే పోయి లక్ష్మణుని, భరతుని,శత్రుఘ్నుని నేను పిలిచానని చెప్పి వెంటనే తీసుకొనిరా. నేను వారితో కొన్ని అత్యవసరమైన రాచకార్యములు మాట్లాడవలసిన అవసరం ఉంది." అని అన్నాడు.  ఆ ప్రతీహారి వెనువెంటనే లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు మందిరములకు వెళ్లి "మహారాజా! మిమ్ములను రాముల వారు అత్యవసరంగా తోడ్కొని రమ్మన్నారు." అని చెప్పాడు. వారందరూ వెంటనే రాముని అంత:పురమునకు వెళ్లారు. రాముని

మందిరము బయట ఉండి తాము అందరమూ వచ్చామని రామునికి వర్తమానము పంపారు. రాముడు తనతమ్ములను లోపలికి రమ్మన్నాడు. లక్ష్మణ,భరత,శత్రుఘ్నులు లోపలకు పోయి రామునికి నమస్కరించి తమ తమ ఆసనముల మీద కూర్చున్నారు. రాముని ముఖంలోకి చూచారు.

రాముని ముఖంలో విషాదచ్ఛాయలు కమ్ముకొని ఉన్నాయి. కళ్ల వెంట నీరు కారుతూ ఉంది. వీరికి విషయం అర్థం కావడం లేదు. రాముడు ఎందుకు బాధపడుతున్నాడా అని ముగ్గురూ ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. తమవల్ల ఏదైనా తప్పుజరిగిందేమోఅని ముగ్గురు తమ్ముళ్లు రాముని పాదాల మీద పడ్డారు. రాముడు వారిని లేవనెత్తి అక్కున చేర్చుకున్నాడు. వారిని తమ తమ ఆసనముల మీద కూర్చోబెట్టాడు. "తమ్ములారా! ఈ అయోధ్యకు నేనే కాదు మీరందరూ మహారాజులే. ఈ అయోధ్య మీది. మీరే పాలకులు. మీరు నాకు ఇచ్చిన రాజ్యమును నిమిత్తమాత్రంగా పరిపాలిస్తున్నాను. ఓ అయోధ్యాధి పతులారా! మీరంతా బాగా చదువుకున్న వారు. వేదములను, శాస్త్రములను అధ్యయనం చేసారు. నాకు ఒక ధర్మ సంకటము వచ్చింది. దానిని మీరు పరిష్కరించాలి. ఏమి చెయ్యాలో నాకు ఏమీ తోచడం లేదు." అని అన్నాడు రాముడు. చక్కగా సాగి పోతున్న రాముని జీవితంలో ఏమి ఉత్పాతం జరిగిందా అని వారిలో వారు తర్కించుకుంటున్నారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభైనాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# ఉత్తరకాండము

## నలభైఐదవ సర్గ

ఒక్కసారి తమ్ముళ్ల ముఖాల వంక చూచి రాముడు మరలా చెప్పడం మొదలెట్టాడు. "నేను నా రాజ్యములో నా గురించి ఏమను కుంటున్నారో తెలుసుకోవాలని నా స్నేహితులను అడిగాను. వారు నిర్మొహ మాటంగా కొన్ని నిజాలు వెల్లడించారు. వాటిని నేను నమ్ముతున్నాను. మీరుకూడా నమ్ముతారు అని అనుకుంటున్నాను. నా మీద, సీత మీద అయోధ్యారాజ్యములో ఉన్న పౌరులలో జానపదులలో ఒక అపవాదు బయలుదేరింది. ఆ అపవాదు బాగా ప్రచారంలోకి వచ్చింది. అది నా హృదయాన్ని కలిచివేస్తూ ఉంది. తట్టకోలేక పోతున్నాను.

తమ్ములారా! నేను ఇక్ష్వాకు వంశంలో ప్రసిద్ధుడైన దశరథమహారాజుకు కుమారుడిగా జన్మించాను. సీత కూడా మిథిలా నగరానికి ప్రభువు అయిన రాజర్షి జనకునికి కుమార్తెగా జన్మించింది. ఇద్దరమూ ఉన్నతమైన, సంస్కారవంతమైన వంశములలో జన్మించిన వారమే! భరత శత్రుఘ్నులారా! మీకు తెలియక పోవచ్చును. కాని లక్ష్మణుడు నా వనవాసకాలము 14 ఏళ్లు నా వెంటనే ఉన్నాడు. లక్ష్మణుడికి అన్ని విషయములు తెలుసు. లక్ష్మణా! మనము దండకారణ్యములో ఉన్నప్పుడు సీతను రావణుడు అనే రాక్షసుడు ఎలా అపహరించాడో నీకు తెలుసు కదా! ఆ రావణుని నేను ఎన్ని కష్టాలు పడి చంపానో నీకు తెలుసు కదా! రావణ సంహారము అయిన తరువాత సీత నా దగ్గరకు వచ్చినప్పుడు ఒక సంవత్సరము రాక్షసుల మధ్య ఉన్న సీతను నేను ఎలా అయోధ్యకు

తీసుకొని పోగలను అని ఆలోచించాను. ఆ మాట నేను అన్నప్పుడు సీత అగ్ని ప్రవేశము చేసి తాను పునీతురాలను అని నిరూపించుకున్నది అన్న విషయం నీవు కళ్లారా చూచావు కదా! అప్పుడు నన్ను అభినందించడానికి వచ్చి దేవతా గణములు కూడా సీత పవిత్రురాలు అని చెప్పారు కదా. అగ్నిదేవుడు, వాయు దేవుడుకూడా సీత పతివ్రతకు సాక్ష్యం ఇచ్చారు కదా! అగ్నిలో ప్రవేశించి పరిశుద్ధురాలైన సీతను నేను అయోధ్యకు తీసుకొని వచ్చాను.

ఈ విషయములన్నీ నీకూ నాకూ తెలుసు. కాని అయోధ్యా వాసులకు, జానపదులకు తెలియవు. నేను మాత్రము సీత విషయంలో వివాదం తలెత్తుతుందని మనసులో ఒక మూల శంకిస్తూనే ఉన్నాను. నేను అనుకున్నట్టే జరిగింది. సీత విషయంలో ఒక అపవాదు ప్రచారంలోకి వచ్చింది. ధర్మశాస్త్రము ప్రకారము ఎవడి మీదనైనా ఒక అపవాదు వస్తే వాడు లోకంలో ఆ అపవాదు ప్రచారంలో ఉన్నంత వరకూ నరకంలో పడి ఉంటాడు. కీర్తి వంతుడిని లోకంలో అందరూ పూజిస్తారు. ఆకాశానికి ఎత్తేస్తారు. కాని అపవాదు వస్తే మాత్రం అంతా ఈసడించుకుంటారు. పాతాళానికి అణగదొక్కుతారు. ఇదీ ప్రజల నైజం. అందుకే పెద్ద వాళ్లు అందరూ తమ మీద ఏమాత్రం అపవాదు రాకుండా జాగ్రత్తపడుతుంటారు.

ఓ తమ్ములారా! నా మీద ఇప్పుడు ఒక అపవాదు వచ్చింది. ఒక రాక్షసుడు తన తొడమీద కూర్చో పెట్టుకొని తీసుకుపోయిన సీతను, ఒక సంవత్సరం పాటు రాక్షసుల చెరలో ఉన్న సీతను, సీత మీద కోరికతో, కామంతో, ఆమెను వదిలిపెట్టడం ఇష్టం లేక, నేను తిరిగి స్వీకరించాను

అని ఆ అపవాదు. దానిని పోగొట్టు కోడానికి నేను నా జీవితమును గానీ, మీ అందరిని కానీ త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను. ఇంక సీతను త్యాగం చెయ్యడం అనేది ఒక సమస్యకాదు. సీతాపహరణం జరిగినప్పుడు కూడా, సీతా వియోగం లో కూడా నేను ఇంతటి దు:ఖమును అనుభవించలేదు. ఈ అపవాదు అంతటి దు:ఖమునకు కారణం అయింది. ఈ అపవాదు పోవాలంటే సీతా పరిత్యాగమే పరిష్కారము.

లక్ష్మణా! సీత కూడా నిన్నని దినమున, తాను గంగా తీరమున ఉన్న ఋషి ఆశ్రమములను సందర్శించవలెననీ, వారి ఆశీర్వాదములు తీసుకొన వలెననీ కోరికగా ఉందని చెప్పింది. ఆ మిషమీద, రేపు ఉదయమే నీవు సుమంతుని రథం సిద్ధం చేయమను. సీతను తీసుకొని పోయి అయోధ్యా రాజ్యము అవతల అరణ్యములలో విడిచి పెట్టి రా! అయోధ్యా రాజ్య సరిహద్దుల వద్ద తమసానదీ తీరంలో మహాఋషి వాల్మీకి ఆశ్రమం ఉంది. సీతను వాల్మీకి ఆశ్రమ పరిసరాలలో విడిచి పెట్టిరా!

లక్ష్మణా! ఇది నా ఆజ్ఞ. కాదు, కూడదు, తప్పు, పాపము, అన్యాయము అనే మాటలు మాట్లాడవద్దు. నేను అన్నీ ఆలోచించి ఈ నిర్ణయం తీసుకున్నాను. మరో ఆలోచనకు తావు లేదు. నీవు కూడా వేరే ఆలోచనలు పెట్టుకోవద్దు. నా నిర్ణయానికి మీలో ఎవరైనా అడ్డు చెబితే నాకు చాలా కోపం వస్తుంది. నా మీద ఒట్టు పెట్టుకొని చెబుతున్నాను. మీరు నా నిర్ణయాన్ని కాదనవద్దు. నా మాటకు అడ్డు చెప్పడం కానీ, నన్ను బతిమాలడం కానీ, చేస్తే వారిని నేను నా శత్రువులుగా పరిగణిస్తాను. ఇది నా స్వవిషయం. నిర్ణయం నాది. రాజాజ్ఞను అమలు చేయడమే నీ

బాధ్యత. ఇటువంటి కఠిన నిర్ణయం తీసుకున్నందుకు మీరంతా నన్ను మన్నించండి. తప్పని సరి పరిస్థితులలోనే ఇటువంటినిర్ణయం తీసుకోవలసి వచ్చింది. కాదనకండి. నా మాట ప్రకారం చెయ్యండి. దీని వలన నా మీద వచ్చిన అపవాదు సమసి పోతుంది. ఋష్యాశ్రమములు చూడవలెనన్న సీత కోరికా తీరుతుంది."

రాముడు ఈ ప్రకారంగా ఎవరికీ మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా చెబుతుంటే, రాముని కళ్ల వెంట నీరు ధారాపాతంగా కారుతున్నాయి. ఇంక తట్టుకోలేక రాముడు అక్కడి నుండి లోపలకు వెళ్లిపోయాడు. బరువెక్కిన హృదయాలతో లక్ష్మణ,భరత,శత్రుఘ్నులు అక్కడి నుండి వెళ్లిపోయారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## నలభై ఆరవ సర్గ.

మరునాడు తెల్లవారింది. నలుగురు అన్నదమ్ములు ఆ రాత్రి నిద్రపోలేదు. ఏ పాపమూ ఎరుగని సీత హాయిగా నిద్రపోయింది. ఉదయమే లక్ష్మణుడు రాముని సారథి  సుమంతుని పిలిచాడు. రథం సిద్ధం చేయమన్నాడు.

“సుమంతా! మా వదిన సీతా దేవి ఋష్యాశ్రమములు చూడవలెనని కోరికగా ఉందట. ఆమెను ఋష్యాశ్రమములకు తీసుకొని వెళ్లాలి. రథం సిద్ధం చేయి. ఆమె కూర్చోడానికి మెత్తని ఆసనములు ఏర్పాటు చెయ్యి. రథము త్వరగా సిద్ధము చేసి తీసుకొనిరా! ఇది రాజాజ్ఞ. ఆలస్యము పనికి రాదు.” అని ఆదేశించాడు లక్ష్మణుడు. ఈ ప్రయాణములో ఆంతర్యము తెలియని సుమంతుడు “అలాగే సిద్ధం చేస్తాను.” అని అన్నాడు. క్షణాల్లో రధాన్ని సిద్ధం చేసుకొని వచ్చి లక్ష్మణుని ముందు నిలబెట్టాడు. “లక్ష్మణా! రథం సిద్ధంగా ఉంది. ఇప్పుడు నేను ఏం చెయ్యాలి.” అని అడిగాడు.

సుమంతుని అక్కడే ఉండమని లక్ష్మణుడు సీతా దేవి అంత:పురమునకు వెళ్లాడు. “అమ్మా! నీవు అయోధ్యాధిపతి రాముని ఒక వరం కోరావట. గంగానదీ తీరమున ఉన్న ఋషివాటికలకు వెళ్లవలెనని, అక్కడ ఋషుల, ఋషిపత్నుల ఆశీర్వాదములు తీసుకొనవలెనని అన్నావట. నిన్ను గంగానదీతీరమున ఉన్న ఆశ్రమములకు తీసుకొని వెళ్లమని నన్ను ప్రభువు అయిన రాముడు ఆజ్ఞాపించాడు. రథము సిద్ధంగా ఉంది. తమరు సిద్దంగా ఉంటే మనము బయలుదేరుదాము.” అని అన్నాడు.

రాముడు తన కోరికను వెనువెంటనే నెరవేర్చుతున్నందుకు సీత మనసులో ఉప్పొంగిపోయింది. అక్కడ ఋషులకు ఋషిపత్నులకు బహూకరించుటకు విలువైన ఆభరణములు, వస్త్రములు తీసుకొంది. అన్నీ రథంలో పెట్టించింది. తనకు కూడా అవసరమైన వస్త్రములు ఆభరణములు ధరించింది. ఇవన్నీ చూస్తున్న లక్ష్మణుడికి దు:ఖం ఆగడం

లేదు. కాని మనసులోనే అణుచుకుంటున్నాడు. సీత లక్ష్మణుని వెంట వచ్చి రథము ఎక్కింది. సుమంతుడు రథం తోలుతున్నాడు. సీత, లక్ష్మణుడు అయోధ్య విడిచి అరణ్యమార్గంలో వెళుతున్నారు. కాని సీతకు కొన్ని అపశకునములు గోచరించాయి.ఆమె ఎడమ కన్ను అదరసాగింది. శరీరం అంతా ఏదో తెలియని బాధ ఆవరించింది. స్వల్పంగా వణుకుతూ ఉంది. కాని ప్రయాణం వలన కలిగే ఉద్వేగము అని సరిపెట్టుకుంది సీత. కాని ఉండబట్టలేకపోయింది. లక్ష్మణుని ఇలా అడిగింది.

"లక్ష్మణా! నాకు కొన్ని దుర్నిమిత్తములు గోచరిస్తున్నాయి. రామునికి క్షేమమే కదా! రాజమాతలందరికీ కుశలమే కదా! మన రాజ్యములో ప్రజలందరూ సుఖంగాఉన్నారు కదా! వారికేమీ ఆపదలు కలుగలేదు కదా! నాకెందుకో మనసంతా అల్లకల్లోలంగా ఉంది. కారణం అర్థం కావడం లేదు. సకల దేవతలు అయోధ్యను రక్షించుగాక!" అని దేవతలందరికీ పేరుపేరునా నమస్కారం చేసింది సీత.

లక్ష్మణుడు తన బాధను మనసులోనే దాచుకొని, సీతకు నమస్కారము చేసి "అమ్మా! అందరూ క్షేమంగానే ఉన్నారు. ఎవరికీ ఎటువంటి ఆపదా లేదు." అని అన్నాడు. వారు గోమతీనదీ తీరమునకు చేరుకున్నారు. అంతలో సూర్యుడు అస్తమించాడు. ఆ రాత్రికి వారు నదీ తీరమున ఉన్న ఒక ఋషి ఆశ్రమములో విడిది చేసారు. మరునాడు ఉదయమే లేచారు. అందరూ గంగా స్నానం చేయాలని అనుకున్నారు. సీతను రథం ఎక్కించి, లక్ష్మణుడు రథంఎక్కాడు. సుమంతుడు రథం తోలుతున్నాడు. రథం గంగానదీ తీరమును చేరుకుంది. పవిత్రమైన

గంగాజలమును చూడగానే సీత హృదయం పులకించి పోయింది. సీతను విడువ వలసిన సమయం వచ్చినందుకు లక్ష్మణునికి ఏడుపు ఆగలేదు. సీతనుచూచి పెద్దగా ఏడ్చాడు. సీత ఆశ్చర్యపోయింది.

"అదేమి లక్ష్మణా! పవిత్రమైన గంగానదీ జలాలను సమీపించినందుకు సంతోషించాల్సింది పోయి అలా దు:ఖిస్తున్నావు ఎందుకు? ఎన్నాళ్ల తరువాతనో గంగానదీని దర్శించు కున్న నాకు, సంతోషము కలుగవలసింది పోయి నిన్ను చూచి దు:ఖము కలుగుతూ ఉంది. నీవు ఏడ్చి నన్ను కూడా ఏడిపిస్తున్నావు. ఓహో! అదా సంగతి. ఎల్లప్పుడూ రాముని విడిచి ఉండని నీవు ఒక్కరోజు రాముని విడిచి ఉండేసరికి బెంగ పెట్టుకున్నావా! మీ అన్నాదమ్ముల అనుబంధం అటువంటిది. నేనుచూడు. నాకూ రాముడు అంటే ప్రాణం. నేను రాముని నా ప్రాణం కంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను. కాని ఒక్కరోజు వియోగానికే నేను నీమాదిరి ఏడవడం లేదు కదా! ఊరుకో లక్ష్మణా! మరీ అంత ధైర్యం లేకపోతే ఎలా! ఇంత బేలతనం పనికిరాదు." అంది సీత నవ్వుతూ లక్ష్మణునితో.

లక్ష్మణుడు ఏమీ జవాబు చెప్పలేదు. ముఖం తుడుచుకున్నాడు.

"అది సరే. ముందు మనం గంగానదిని దాటి ఆవల ఒడ్డుకు చేరుకుందాము. అక్కడే ముని ఆశ్రమములు అన్నీ ఉన్నాయి. మనం తొందరగా అక్కడికి చేరుకొని ముని పత్నులకు నేను తెచ్చిన ఆభరణములు వస్త్రములు బహూకరిస్తాను. అక్కడ ఈ రాత్రికి ఉండి రేపు

పొద్దుటే బయలుదేరి  అయోధ్యకు వెళ్లుదాము. నీ దు:ఖము చూస్తుంటే నాకు కూడా ఎప్పుడెప్పుడు రాముని చూద్దామా అని ఆతురతగా ఉంది. వచ్చిన పని ముగించుకొని త్వరత్వరగా అయోధ్యకు వెళుదాము. నన్ను విడిచి రాముడు ఒక్క క్షణం కూడా ఉండలేడు." అంది సీత.

సీత మాటలు వింటుంటే లక్ష్మణునికి దు:ఖముపొర్లుకొస్తూ ఉంది. కాని ఆపుకుంటు న్నాడు.  గంగానదిఒడ్డున ఉన్న పడవ వారిని పిలిచాడు. వారు వెంటనే ఒక పడవను సిద్ధం చేసారు. సీత, లక్ష్మణుడు ఆ పడవలోకి ఎక్కారు. సీత, లక్ష్మణుడు ఎక్కిన ఆ పడవ గంగానది ఆవల ఒడ్డుకు చేరుకుంది.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభై ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## నలభై ఏడవ సర్గ.

పడవ వాడు తీసుకొచ్చిన పడవలో ముందు సీతమ్మను ఎక్కించి తరువాత తాను ఎక్కాడు లక్ష్మణుడు. సుమంత్రుని అక్కడే ఉన్నమన్నాడు. పడవను పోనిమ్మన్నాడు, పడవ గంగానది ఆవల ఒడ్డుకు చేరింది. లక్ష్మణుడు ముందు తాను దిగి తరువాత సీతమ్మను దింపాడు. తరువాత చేతులు జోడించి, కళ్లవెంట నీళ్లు ధారాపాతంగా కారుతూ

ఉంటే, వెక్కి వెక్కి ఏడుస్తూ, సీతమ్మతో ఇలా అన్నాడు.

"అమ్మా! సీతమ్మ తల్లీ! రాముడు ఈ రోజు నన్ను లోకనిందకు గురి చేసాడమ్మా! చేయకూడని పని నాతో చేయిస్తున్నాడు. ఈ పని నా జీవితాంతము నా హృదయంలో శూలంలా గుచ్చుకుంటూ నిరంతరము బాధకు గురిచేస్తూ ఉంటుంది. ఇంతకన్నా నాకు మరణము దానికి సమానమైనది కానీ అంతకన్నా పెద్దది కానీ శిక్ష విధించి ఉంటే సంతోషంగా అనుభవించి ఉండేవాడిని. అమ్మా! నేనేమీ తప్పు చేయడం లేదు. ఈ తప్పు, ఈ పాపం నాది కాదు.నన్ను క్షమించు." అని సీత కాళ్ల మీద పడ్డాడు లక్ష్మణుడు. సీతకు ఏమీ అర్థం కావడం లేదు. లక్ష్మణుడు ఎందుకు ఏడుస్తున్నాడు.

సీత ఆలోచనలో పడింది. "ఇప్పుడు ఏం జరిగింది. నిన్న తనే కదా రాముని ఋషి ఆశ్రమములకు తీసుకు వెళ్లమని అడిగింది. రాముడు సరే అన్నాడు. ఈ రోజు లక్ష్మణుని తోడు ఇచ్చి గంగానదీ తీరానికి పంపాడు. ఇందులో లక్ష్మణుడు దు:ఖించవలసిన అవసరం ఏమొచ్చింది. ఏమిటో ఏమీ అర్థం కావడం లేదు." అని తనలో తాను తర్కించుకుంటూ లక్ష్మణుని చూచి ఇలా అడిగింది.

"లక్ష్మణా! నాకు ఏమీ అర్థం కావడం లేదు. అసలు ఏం జరిగింది? నీ దు:ఖానికి కారణం ఏమి?నీకు ఆరోగ్యం సరిగా లేదు! అయోధ్యాధిపతి రాముడు ఆరోగ్యంగా ఉన్నాడా? రాజుకు క్షేమమే కదా! అన్ని సక్రమంగా ఉంటే నీవు ఎందుకు దు:ఖిస్తున్నావో అర్థం కావడం లేదు.

మహారాజు మీద ఒట్టుపెట్టి అడుగుతున్నాను. ఏంజరిగిందో నిజం చెప్పు అయోధ్యాధిపతి రాముని భార్యగా ఆజ్ఞాపిస్తున్నాను.!" అని అడిగింది సీత.

లక్ష్మణుడిని నోటి నుండి మాట పెగలడం లేదు. గొంతు పూడుకుపోతోంది. ఏదోవిధం మాట పెగుల్చుకొని ఇలా అన్నాడు. "అమ్మా! సీతమ్మ తల్లీ! ఈ మాటలు చెప్పడానికి నాకు నోరు రావడంలేదు. అయోధ్యానగరంలోనూ, పట్టణాలలోనూ, పల్లెలలోనూ ఒక అపవాదు వ్యాపించిందట! ఆ లోకోపవాదం గురించి మంత్రి పరిషత్తులో ప్రస్తావన వచ్చిందట. ఆ అపవాదును పోగొట్టుకోడానికి నిన్ను అడవిలో వదిలి రమ్మన్నాడు రాముడు. ఆ అపవాదు ఏమిటో నేను నా నోటితో చెప్పలేను. అంత పాపం చేయలేను. లోకోపవాదుకు భయపడి రాముడు నిన్ను విడిచిపెట్టినాడు. అయినా గంగానదీ తీరమున ఉన్న ఋషి ఆశ్రమములు చూడవలెనని నీవు స్వయంగా కోరుకున్నావట కదా! అందుకే నిన్ను గంగానదీ తీరంలో విడిచిరమ్మన్నాడు. నేను కేవలం రాజాజ్ఞను అమలు చేస్తున్నాను. ఇంతకన్నా మరణమే శరణ్యముఅని అనుకుంటున్నాను. " అని అన్నాడు లక్ష్మణుడు.

ఆ మాటలు విన్న సీత ఒక్కసారి కొయ్యబారి పోయింది. తన సౌభాగ్యము అంతా గంగలో కలిసిపోయిందేమో అని అనుకొంది. సీతకు నోటమాట రాలేదు. ఇంతలో లక్ష్మణుడు సీతతో ఇలా అన్నాడు. "అమ్మ! ఇదే గంగా నదీ తీరము. అవిగో ఆ కనపడేవే ఋషి ఆశ్రమములు. మా తండ్రి, నీకు మామగారు అయిన దశరథ మహారాజుకు పరమ మిత్రుడు, తపోధనుడు మహాఋషి అయిన వాల్మీకి మహర్షి ఆశ్రమము ఇక్కడకు

దగ్గరలోనే ఉంది. నీవు ఆయన ఆశ్రమములో తలదాచుకోవచ్చును. ఆ మహాత్ముని పాదముల దగ్గర ధర్మాచరణము చేస్తూ, నీ భర్త రాముని నిత్యం తలచుకుంటూ, పతివ్రతా ధర్మమును పాటిస్తూ నీవు సుఖంగా కాలం గడపవచ్చును. అదే ప్రస్తుతము శ్రేయస్కరమైన మార్గము." అని అన్నాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభై ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## నలభై ఎనిమిదవ సర్గ.

లక్ష్మణుడు తన దారిన తాను చెప్పుకు పోతున్నాడు. ఇంతలో ఆ మాటలు భరించలేక వివశురాలైన సీత స్పృహ తప్పి నేలమీద పడిపోయింది. లక్ష్మణుడు ఆమె ముఖమున గంగాజలమును చిలకరించి ఆమె సేద తీర్చాడు. నీళ్లు నిండిన కళ్లతో సీత లక్ష్మణుని చూచి గద్గద స్వరంతో దీనంగా ఇలా అంది.

"లక్ష్మణా! నేను కేవలం కష్టాలు దు:ఖాలు అనుభవించడానికే పుట్టినట్టున్నాను. బ్రహ్మదేవుడు నా ముఖాన కష్టాలు అనుభవించమని రాసినట్టున్నాడు. పద్నాలుగేళ్ల వనవాసం తరువాత మరలా ఈ శాశ్వత వనవాసం ఏమిటి? నేను ఏం తప్పుచేసానని నాకు ఈ శిక్ష? రాముని

తప్ప మరొకరిని తలవని నేను ఏం నేరం చేసానని నాకీ శిక్ష? నేను పూర్వజన్మలో ఎవరికి భార్యను దూరం చేసానో ఈ జన్మలో భర్తకు దూరం అవుతున్నాను. లక్ష్మణా! నీకు తెలుసుకదా! వనవాస కాలంలో నేను రాముని ఆశ్రయించుకొని ఆశ్రమములలో ఉంటూ ఎలా కాలం గడిపింది. 14 ఏళ్లపాటు బంధువులకు దూరంగా ఉన్నాను. మరలా ఇప్పుడు కూడా అందరికీ తుదకు భర్తకు కూడా దూరం అయ్యాను. నా భర్తే నన్ను విడిచిపెడితే, ప్రజలను రక్షించవలసిన రాజే అడవులకు పొమ్మంటే, నా కష్టాల గురించి ఎవరికి చెప్పకోవాలి.

లక్ష్మణా! నీవు చెప్పినట్టు నేను వాల్మీకి ఆశ్రమానికి వెళుతాను. అమ్మా! ఏం తప్పుచేసావని నిన్ను నీ భర్త అయిన రాముడు అడవులకు పంపాడు అని అడిగితే ఏమని సమాధానం చెప్పాలి? నేను ఏమి తప్పుచేసానని వారితో చెప్పాలి? పోనీ ఈ కష్టాలు భరించడం కన్నా గంగలో దూకి ప్రాణత్యాగం చేద్దామంటే, నా కడుపులో పెరుగుతున్న రాముని వంశాంకురం నన్ను ఆ పని చెయ్యనివ్వదు. నాకు ఈ బాధలు, కష్టాలు భరిస్తూ మరణించేదాకా జీవించడం తప్ప మరోమార్గం లేదు.

లక్ష్మణా! నా గురించి నీవు దు:ఖించకు. ఇందులో నీ తప్పుఏమీ లేదు. నీవు రాజాజ్ఞను అమలుపరిచావు. నేను చెప్పే మాటలు యధాతథంగా, మా అత్తగార్లకు, మహారాజుకుచెప్పు. నేను రెండు చేతులు జోడించి నాముగ్గురు అత్తలకు ఏ మాత్రం బేధభావం లేకుండా నమస్కరించానని చెప్పు. రాజుగారి క్షేమమును అడిగినట్టు చెప్పు. రాముడితో నా మాటగా ఈ విధంగా చెప్పు.

"రామా! నా గురించి, నాపాతివ్రత్యము గురించి, నా మనస్సు పరిశుద్ధమైనది అని నీకు తెలుసు. నేను సర్వకాలసర్వావస్థలలోనూ నీ క్షేమము కోరుకుంటాను అని కూడా నీకు తెలుసు. కేవలం ప్రజలు నా గురించి ఏదో అనుకున్నారని విని,  నా మీద, నీ మీద పడ్డ అపవాదుకు భయపడి నన్ను  అడవులలో విడిచిపెట్టావు. నీ మీద పడ్డ అపవాదు తొలగి పోవాలంటే నీవు నన్ను విడిచిపెట్టడమే మేలైన మార్గము. అదే నీవు చేసావు. భర్త మీద పడ్డ అపవాదు తొలగించడం భార్యగా అది నా బాధ్యత.

రాజా! ఇంక నా గురించి ఏ మాత్రం దిగులు పడవద్దు. నీ ప్రజలను, నీ తమ్ములను కన్నబిడ్డలవలె చూచుకో. ప్రజలను స్వంత బిడ్డలవలె చూచుకొనడం రాజు యొక్క పరమధర్మము. అది నీవు నిర్వర్తించు. నేను నా గురించి విచారించడం లేదు. నీ మీద పడ్డ అపవాదును తొలగించ డానికి నీకు దూరంగా ఉండటానికి నిర్ణయించుకున్నాను. ఎందుకంటే భార్యకు భర్తయే తల్లి, తండ్రి, గురువు, దైవము. భర్తకు ఇష్టమైన, మేలు చేకూర్చే పనులు చేయడమే భార్యకు ఉత్తమమైన ధర్మము. ఆ ధర్మాచరణములో నా ప్రాణాలు పోయినా నేను లెక్కచెయ్యను. నాకు నా భర్త క్షేమమే ముఖ్యము.

లక్ష్మణా! మరొక్క మాట. నేను ఇప్పుడు గర్భవతిని. నీవు నన్ను అడవులలో విడిచివెళ్లునప్పుడు నేను గర్భవతిని అన్న విషయం గుర్తుపెట్టుకో. మరొక అపవాదుకు తావు ఇవ్వకుండా చూడు." అని పలికింది సీత.

సీత చెబుతున్న మాటలు వింటున్నంతసేపూ లక్ష్మణునికి దు:ఖం ఆగడం లేదు. దీనంగా సీత వంక చూస్తున్నాడు. లక్ష్మణునికి నోటమాట రావడం లేదు. కళ్లనీళ్లు కారుస్తూనే సీత చుట్టు తిరిగి ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించాడు. తరువాత లక్ష్మణుడు సీతలో ఇలా అన్నాడు.
"అమ్మా!మీరు ఇప్పుడు ఏమన్నారు. మీరు గర్భవతిని అన్న విషయం చూడమన్నారు కదా! అమ్మా! నేను ఇంతవరకూ మీ వంక కన్నెత్తి కూడా చూడలేదు. కేవలం మీ పాదాలు మాత్రమే చూచాను. రాముడు పక్కన ఉండగానే మీ వంక చూడని వాడిని, రాముడు పక్కన లేనపుడు మీ వంక ఎలా చూడగలను." అని అన్నాడు.

ఇంక ఏమీ మాట్లాడలేక లక్ష్మణుడు మౌనంగా వెళ్లి పడవ ఎక్కాడు. ఆ పడవ లక్ష్మణుని గంగానది ఆవలి ఒడ్డుకు తీసుకొని వెళ్లింది. పడవ గంగానదిని దాటుతున్నంతసేపూ లక్ష్మణుడు సీత వంక తిరిగి ఆమెను చూస్తూనే ఉన్నాడు. సీత కూడా పడవలో వెళుతున్న లక్ష్మణుని వంక కన్నీటితో చూస్తూనే ఉంది. లక్ష్మణుడు గంగానదిని దాటాడు. పడవ కనపడుతున్నంత సేపూ సీత లక్ష్మణుడి వెళుతున్న వంక చూస్తూనే ఉంది. లక్ష్మణుడు గంగ ఆవల ఒడ్డుకు చేరుకున్నాడు.

సీతకు దిక్కుతోచడం లేదు. మనసంతా దు:ఖంతో నిండిపోయింది. భర్తకు దూరం అయింది. నా అన్నవాళ్లు కనుచూపుమేరలో లేరు. ఒంటరి తనం. ఏమి చెయ్యాలో తోచని స్థితి. కడుపులో దు:ఖం, ఏడుపు రూపంలో పైకి తన్నుకొచ్చింది. పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది సీత. సీత ఏడుస్తున్న ఏడుపుకు ఆ అడవిలో

ఉన్న జంతువులు, నెమళ్లు, కూడా కన్నీరు కార్చాయి.

శ్రీమద్రామాయణం
ఉత్తరకాండము నలభై ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
నలభై తొమ్మిదవ సర్గ.

అదే సమయంలో వాల్మీకి మహర్షి శిష్యులు సమిధల కోసరం ఆ పరిసర ప్రాంతాలలో తిరుగుతున్నారు. వారికి సీత ఏడుపు వినిపించింది. వారికి భయం పుట్టింది. వెంటనే పరుగెత్తుకుంటూ వెళ్లి ఆ విషయం వాల్మీకికి చెప్పారు. "గురుదేవా! ఎవరో స్త్రీ అడవిలో ఒక చెట్టు కింద కూర్చుని బిగ్గరగా ఏడుస్తూ ఉంది. ఆమెను మేము ఇదివరకు ఎప్పుడూ చూడలేదు ఆమె చూడటానికి మహాలక్ష్మిలాగా ఉంది. ఆమె ఏదో గొప్ప దు:ఖంలో ఉన్నట్టు ఉంది. ఆమెకు ఎవరూ లేనట్టు ఉంది. చుట్టుపక్కల ఎవరూ కనపడలేదు.. ఒంటరిగా ఉంది. మాకు చూడా ఆమె మానవ కాంత లాగా కనపడలేదు. ఎవరో దేవకాంత అయి ఉండవచ్చు. ఆమె మన ఆశ్రమ సమీపమున కూర్చుని దు:ఖిస్తూ ఉందంటే మన రక్షణ కోరుతోంది అని అర్థం అవుతోంది. కాబట్టి తమరు వెంటనే రావాలి." అని గబగబా చెప్పారు.

శిష్యుల మాటలు విన్న వాల్మీకి కళ్లుమూసుకున్నాడు. దివ్యదృష్టితో జరిగింది తెలుసుకున్నాడు. వెంటనే తన శిష్యులను వెంటబెట్టుకొని సీత ఉన్న చోటికి వెళ్లాడు. గంగానదీ తీరంలో ఒంటరిగా కూర్చుని దు:ఖిస్తున్న సీతను చూచాడు వాల్మీకి. ఆమెను చూచి ఇలా అన్నాడు. "అమ్మా! నీవు ఎవరో నాకు తెలుసు. నీవు అయోధ్యాధిపతి అయిన దశరథమహారాజు కోడలివి. జనకమహారాజు కూతురివి. రాముని భార్యవు. సీతవు. నీకు ఇదే స్వాగతము. నీవు ఇక్కడకు ఎందుకు వచ్చావో ఏ కారణం చేత వచ్చావో నేను నా తపోబలంతో తెలుసుకున్నాను. నాకు సమస్తమూ అవగతమయింది. నీవు ఏ పాపమూ చెయ్యలేదు. నీవు పునీతవు. నీవు నా ఆశ్రమంలో ఉండవచ్చును. నీకు ఎలాంటి భయం లేదు. నా ఆశ్రమంలో కొంత మంది స్త్రీలు తపోవృత్తిలో ఉన్నారు. వారు నిన్ను సంరక్షిస్తూ ఉంటారు. అమ్మా సీతా! నీవు మా స్వాగత సత్కారములు స్వీకరించి నీ పుట్టినింటికి వచ్చినట్టు మా ఆశ్రమమునకు రా! నన్ను నీ తండ్రి జనకమహారాజుగానే భావించు."అని అన్నాడు వాల్మీకి.

వాల్మీకి చెప్పిన మాటలు విన్న సీత ఆయనకు రెండు చేతులు జోడించి భక్తితో ఆయన పాదాలకు నమస్కరించింది. "తండ్రీ! మీరు చెప్పినట్టే చేస్తాను" అని పలికింది. ముందు వాల్మీకి నడుస్తుంటే, ఆయన వెనక సీత, సీత వెనక శిష్యులు నడుచుకుంటూ వెళ్లారు. అందరూ వాల్మీకి ఆశ్రమం చేరుకున్నారు. ఆశ్రమంలో ఉన్న ముని కాంతలు సీతను చూచి ఆమెను ఆప్యాయంగా పలకరించారు. వాల్మీకి ఆ ముని కాంతలతో ఇలా అన్నాడు. "ఈమె దశరథుని కోడలు. జనకుని కుమార్తె. అయోధ్యాధి పతి రాముని భార్య సీత. ఉత్తమురాలు. మహా పతివ్రత. ఏ పాపమూ ఎరుగని

ఈమెను ఈమె భర్త లోకాపవాదమునకు భయపడి ఇక్కడ వదిలి పెట్టాడు. ఈమెను మన ఆశ్రమానికి తీసుకొని వచ్చాను. ఇంక ఈమె ఇక్కడే ఉంటుంది. మీరు ఆమెను కంటికి రెప్పలా కాపాడాలి. ఈమె రాజకుమార్తె. చక్రవర్తి భార్య. ఈమె గౌరవమునకు ఏ లోటూ రాకుండా చూచుకోండి." అని పలికాడు వాల్మీకి. సీతను ముని కాంతలకు అప్పగించి వాల్మీకి తన శిష్యులతో సహా ఆశ్రమమునకు  వచ్చాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము నలభై తొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
ఏబదియవ సర్గ.

పడవ ఎక్కి గంగానదిని దాటిన లక్ష్మణుడు అక్కడే నిలబడ్డాడు. సీత ఏమి చేస్తుంది. సీత దగ్గరకు ఎవరు వస్తారు అని చూస్తున్నాడు. సీత దగ్గరకు మునికుమారులు రావడం, వారు వెళ్లడం, తరువాత వాల్మీకి మహర్షి రావడం, వారి వెంట సీత వెళ్లడం చూచి లక్ష్మణుని మనసు కుదుట పడింది. లక్ష్మణుడురథం ఎక్కాడు. అయోధ్యకు పోనిమ్మన్నాడు. రథం అయోధ్య వైపు సాగి పోయింది.  రథములో కూర్చున్న లక్ష్మణుడు సారథి సుమంత్రుని చూచి ఇలాఅన్నాడు.

"సుమంత్రా! సీత వాల్మీకి ఆశ్రమం చేరుకుంది. రాముడు అయోధ్యలో ఉన్నాడు. సీతా వియోగం రామునికి ఎంత బాధాకరమో కదా! ఏ పాపమూ ఎరుగని భార్యను విడిచిన రామునికి ఇంతకంటే దు:ఖము వేరే ఉంటుందా! రామునికి ఈ భార్యావియోగము కేవలం దైవఘటన కాక మరేముంటుంది. వనవాసకాలములో మాయామృగము, ఇప్పుడు ఈ అపవాదు, సీతావియోగమునకు కారణం అయింది. రావణుని సంహరించిన రాముడు దైవఘటనకు బద్ధుడు కాక తప్పలేదు. తండ్రి మాట విని అరణ్యమునకు వెళ్లినప్పుడు కూడా సీత భర్తను విడిచి ఉండలేక వనవాస క్లేశమును అనుభవించింది. కాని ఇప్పుడు ఒంటరిగా వనవాసము చేస్తూ ఉంది. కాని రాముడు చేసిన పనిమంచిది కాదు. ఎవరో ఏమో అన్నారని కట్టుకున్న భార్యను అడవులకుపంపడం దారుణం. పౌరులు వేసిన అపవాదుకు సీతను శిక్షించడం ధర్మం కాదు కదా! సీత గురించి అపవాదులు వేసిన పౌరులు బాగానే ఉన్నారు. రాముడు అంత:పురములో ఉన్నాడు. ఏ పాపమూ ఎరుగని సీత వనవాసము చేస్తూ ఉంది. ఇది ధర్మమా!" అని అడుగుతున్న లక్ష్మణుడికి సుమంత్రుడు ఇలా అన్నాడు.

"లక్ష్మణా! మనము సీత విషయమున బాధపడవలసిన పని లేదు. ఆమె వాల్మీకి ఆశ్రమములో సురక్షితముగా ఉండగలదు. ఈ విషయం గురించి పూర్వము బ్రాహ్మణులు నీ తండ్రితో చెపుతుంటే నేను విన్నాను. రాముడి జాతకంలో దు:ఖములు, కష్టములు రాసి పెట్టి ఉన్నాయట. రామునికి తనకు కావాల్సిన వాళ్లు దూరం అవుతారట. ఇప్పుడు సీతను విడిచి పెట్టాడు. కొంత కాలము తరువాత రాముడు నిన్ను, భరత

శత్రుఘ్నులను కూడా విడిచి పెడతాడట. అదంతా ఆ బ్రాహ్మణుడు మీ తండ్రి గారితో చెబుతుంటే నేను విన్నాను.

లక్ష్మణా! అంతేకాదు, ఒకసారి దుర్వాస మహాముని వద్దకు మీ తండ్రి గారి వద్దకు వెళ్లాడు. అప్పుడే నేను కూడా అక్కడే ఉన్నాను. దుర్వాసుడు మీ తండ్రి గారితోనూ, మీ కులగురువు వసిష్ఠుల వారితోనూ చెప్పిన మాటలు నేను విన్నాను. ఆ మాటలు నేను విన్నాను అని తెలిసి మీ తండ్రి దశరథుడు ఆ మాటలు నేను ఎక్కడా ఎవరితోనూ చెప్పకూడదని నాతో ఒట్టు వేయించుకున్నాడు. అందుకని, ఆమాటలు నేను ఎవరితోనూ ఎక్కడా చెప్పకూడదు. కానీ ఇప్పుడు దశరథుడు లేడు. ఆ ఒట్టుకు విలువలేదు. నీకు వినవలెనని కుతూహలము ఉంటే ఆ మాటలు నేను చెబుతాను. శ్రద్ధగా విను. కాని నేను నీతో ఈ విధంగా చెప్పినట్టు నీ తమ్ములు భరతునికి శత్రుఘ్నునికి చెప్పకూడదు. ఇది అంతా దైవఘటన అని సరిపెట్టుకోవాలి." అని అన్నాడు సుమంత్రుడు.

అప్పుడు లక్ష్మణుడు సుమంత్రుని చూచి "సుమంత్రా! నీవు దుర్వాసుల వలన విన్న విషయములు నాకు యథాతథంగా చెప్పు. నిజం చెప్పు." అని అన్నాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభయ్యవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

యాభైఒకటవ సర్గ.

సుమంత్రుడు తాను దుర్వాస మహాముని వద్దనుండి విన్న మాటలను  లక్ష్మణునికి చెప్పనారంభించాడు. "ఓ లక్ష్మణా! ఒక సారి, అత్రి మహార్షి కుమారుడైన దుర్వాస మహర్షి చాతుర్మాస్య వ్రతమును ఆచరించడానికి వసిష్ఠుని ఆశ్రమానికి వచ్చాడు. ఆ సమయంలో తన కుల గురువు వసిష్ఠుని చూడటానికి  దశరథుడు వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్లాడు. ఆయన వెంట నేనూ వెళ్లాను. అక్కడ ఉన్న దుర్వాసమహర్షిని చూచి మీ తండ్రి గారు భక్తితో నమస్కరించారు. వసిష్ఠుడు, దుర్వాసుడు మీతండ్రి గారిని ఆహ్వానించారు. అందరూ కూర్చుని ఇష్టాగోష్టిగా మాట్లాడుకుంటున్నారు.

ఆ సమయములో మీ తండ్రి గారు త్రికాలవేది అయిన దుర్వాసుని ఈ విధంగా అడిగాడు. "ఓ మహర్షీ! నా గురించి, నా పుత్రుల గురించి, పౌత్రుల గురించి, నా వంశము గురించి చెప్పండి. మాఇక్ష్వాకు వంశము ఎంత కాలము ఉంటుంది? నా కుమారుడు రాముడు ఎంతకాలము జీవిస్తాడు. లక్ష్మణ,భరత,శత్రుఘ్నుల ఆయు:పరిమాణము ఎంత? నాకు మనుమలు కలుగుతారా! నా మనుమల ఆయుర్దాయము ఎంత? రామునికి ఎంతమంది కుమారులు కలుగుతారు? మా వంశము యొక్క భవిష్యత్తు గురించి దయచేసి నాకు తెలుపండి." అని వినయంగా అడిగాడు దశరథుడు.

దశరథుని మాటలు విన్న దుర్వాసుడు కొంచెంసేపు ఆలోచించి ఇలా అన్నాడు. "ఓ దశరథ మహారాజా! నీకు ఒక పూర్వ వృత్తాంతమును చెబుతాను విను. పూర్వము దేవతలకు అసురులకు యుద్ధం జరిగింది. అసురులు ఓడిపోయారు. వారందరూ భృగు మహర్షి భార్య వద్దకు పోయి ఆమె శరణు కోరారు. ఆమె వారికి ఆశ్రయం ఇచ్చింది. వాళ్లు దేవతల నుండి ఏ మాత్రము భయం లేకుండా భృగు మహర్షి ఆశ్రమంలో ఆయన భార్య ఆశ్రయంలో ఉన్నారు. ఈ సంగతి విష్ణువుకు తెలిసింది. ఆయన కోపం ప్రజ్వరిల్లింది. వెంటనే విష్ణువు, తన చక్రాయుధంతో, అసురులకు ఆశ్రయం ఇచ్చిన భృగు మహర్షి భార్య తలను, నరికివేసాడు. తన భార్య తలను విష్ణువు తన చక్రాయుధంతో నరకడం కళ్లారా చూచిన భృగువు విష్ణువును శపించాడు. "నీవు నా భార్యను చంపి నాకు భార్యావియోగము కలిగించావు. నీవు కూడా భూలోకంలో పుట్టి చాలాకాలము భార్యను పోగొట్టుకొని భార్యవియోగమును అనుభవిస్తావు." అని శపించాడు.

భార్యను చంపాడు అన్న కోపంలో విష్ణువుకు శాపం ఇచ్చాడే కానీ తరువాత పశ్చాత్తాప బడ్డాడు భృగు. తరువాత విష్ణువును పూజించాడు. భృగువు పూజకు మెచ్చిన విష్ణువు "ఓ భృగు మహర్షీ! నీవు నాకు శాపం ఇచ్చాను అని దిగులు చెందకు. రాబోయే అవతారంలో లోక కల్యాణము కొరకు అది నాకు వరంగా పరిణమిస్తుంది." అని అన్నాడు. ఓ దశరథ మహారాజా! ఆ ప్రకారంగా భృగు చేత శపించ బడ్డ విష్ణువు నీకు కుమారుడిగా జన్మించాడు. రామునికి భార్యావియోగం తరచు సంభవిస్తుంది. అది తప్పదు. రాముడు చాలా కాలము అయోధ్యను

పాలిస్తాడు. రాముడు అయోధ్యను 11,000 సంవత్సరములు పాలించి తరువాత బ్రహ్మలోకం చేరుకుంటాడు. తన జీవిత కాలంలో రాముడు ఎన్నో యజ్ఞములను, యాగములను చేస్తాడు. అశ్వమేధ యాగములను చేస్తాడు. రాముడికి సీత యందు ఇద్దరు కుమారులు జన్మిస్తారు." అని చెప్పాడు దుర్వాసుడు. తన భవిష్యత్తు, తన కుమారుల భవిష్యత్తు తెలుసుకున్న మీ తండ్రి దశరథుడు తరువాత అయోధ్యకు తిరిగి వచ్చాడు. దుర్వాసుడు నీ తండ్రి దశరథునితో చెప్పిన మాటలను నేను విన్నాను. ఆ మాటలే నీకు చెప్పాను. కాబట్టి రాముని విషయంలో కానీ సీత విషయంలో కానీ మనము దు:ఖించనవసరం లేదు." అని సుమంత్రుడు చెప్పాడు.

ఆ మాటలు విన్న లక్ష్మణుడు మనసుకుదుట పరచుకున్నాడు. అప్పటికి సాయంత్రం అయింది. లక్ష్మణుడు సుమంత్రుడు కేశినీ నదీ తీరంలో ఆ రాత్రికి విశ్రాంతి తీసుకున్నారు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము యాభైఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## యాభైరెండవ సర్గ.

ఆ రాత్రికి కేశినీ నదీ తీరంలో నిద్రించిన లక్ష్మణుడు, సుమంత్రుడు మరునాడు ఉదయమే ప్రయాణమై మధ్యాహ్న సమయానికి అయోధ్యకు చేరుకున్నారు. లక్ష్మణుడు రాముని అంత:పురమునకు వెళ్లాడు. “ఇప్పుడు రామునికి నేను ఏమని చెప్పాలి?” అని మధన పడసాగాడు. రాముడు ఒక ఆసనము మీద కూర్చుని ఉన్నాడు. లక్ష్మణుడు తలవంచుకొని రాముని ఎదురుగా నిలబడ్డాడు. రాముని పాదాల మీద పడ్డాడు. రామునితో ఇలా అన్నాడు. “మహారాజా! నీ ఆజ్ఞ ప్రకారము నేను సీతను గంగానదీ తీరప్రాంతమున ఉన్న వాల్మీకి ఆశ్రమము దగ్గర విడిచి వచ్చాను. రామా! సీతను విడిచిపెట్టినందుకు దు:ఖపడవద్దు. అంతా దైవనిర్ణయం. విధివిధానము. మన చేతిలో ఏమీ లేదు. మనము నిమిత్తమాత్రులము. ఎంత ధనము కూడబెట్టినా అది ఒక నాటికి కరిగిపోతుంది. అలాగే ఎంత ఉన్నత స్థితికి చేరుకున్నా, ఆఖరుకు పతనం తప్పదు. భార్య భర్తలు ఎంత అన్యోన్యంగా ఉన్నా, మరణ కాలంలో ఒకరిని ఒకరు విడిచి పోక తప్పదు కదా! కాబట్టి భార్య, పుత్రులు, బంధువులు, స్నేహితుల విషయంలో అధిక మోహము, అధిక ప్రేమ చూపకూడదు. జీవితం అన్న తరువాత  సంయోగ వియోగాలు తప్పవు కదా!

కాబట్టి! రామా! నీ మనసును కుదుట పరచుకో. సీతా వియోగమునకు చింతించకు. సీత దు:ఖంలో పడి రాజ్యపాలన విస్మరించకు.  నీ వంటి మహాపురుషులు కేవలం భార్య దూరం

అయిందని వ్యధ చెందరు. ధైర్యాన్ని కోల్పోరు. రామా! నీవు ఈ ప్రకారంగా నీ భార్యను తలచుకుంటూ, దు:ఖిస్తూ, రాచ కార్యములను నిర్లక్ష్యం చేస్తే, నీకు మరొక అపవాదు చుట్టుకుంటుంది. భార్యామోహంలో పడి రాచకార్యములను విస్మరించాడు అన్న అపవాదు వస్తుంది. ఒక అపవాదుకు తోడు మరొక అపవాదును భరించాలి. కాబట్టి మనసులో దు:ఖము ఉన్నా దానిని మనసులోనే అణుచుకోవాలి. బయట పడకూడదు." అని రాముడికి హితబోధ చేసాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలు విన్న రాముడు ఎంతో సంతోషించాడు. "లక్ష్మణా! నీవు చెప్పినది అక్షర సత్యము. తాత్కాలికమైన మోహంలో పడ్డాను. నీవు నాకు కర్తవ్యబోధ చేసావు. రాజుగా నా కర్తవ్యమును నేను సమర్థవంతంగా నిర్వర్తిస్తాను. నాలోని శోకమును వదిలిపెట్టాను. నీ మాటలు నాకు మార్గదర్శకమైనాయి." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము యాభైరెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## యాభైమూడవ సర్గ.

రాముడు లక్ష్మణునితో ఇంకా ఇలా అన్నాడు. "నీవు నాకు తమ్ముడివే కాదు.స్నేహితుడివి కూడా. నీవంటి స్నేహితుడు లభించడం

చాలా కష్టం. నా మనసులో ఉన్న మాట చెబుతున్నాను విను. సీతను అడవులకు పంపిన తరువాత ఈ నాలుగురోజులు నేను సీతా వియోగ బాధతో రాచ కార్యములు చూడలేదు. రాజ సభకు వెళ్లలేదు. నీ మాటలు విన్న తరువాత నేను ఎంత తప్పుచేసానో అని బాధపడుతున్నాను. వ్యక్తిగతంగా ఎన్ని బాధలు ఉన్నా, రాజకార్యములు మానడం క్షమించరాని నేరం అని నా మనసు ఘోషిస్తూ ఉంది. లక్ష్మణా! నేను ఈ రోజు నుండి రాజ సభకు వస్తున్నానని మంత్రులకు చెప్పు. రాజ పురోహితుని, మంత్రులను వెంటనే పిలిపించు. ప్రతి దినము పౌరుల కార్యములు వారి బాగోగులు చూడని రాజు నరకానికి పోతాడు." అని అన్నాడు రాముడు.

(5 సంవత్సరాలు ప్రజాసేవ చేస్తానని ఓట్లు వేయించుకొని గెలిచిన ప్రజాప్రతినిధులు, ప్రజలకు సంబంధించిన కార్యక్రమములు చిత్తశుద్ధితో నిర్వహిస్తామని ప్రమాణం చేసిన మంత్రులు, తమ తమ విధులను మరిచి ప్రజల ముఖం చూడకుండా, అసెంబ్లీ, పార్లమెంటు ముఖం చూడకుండా, ఒక వేళ వచ్చినా నిద్రపోతూ, తమ తమ స్వంత వ్యాపారాలు చేసుకుంటూ, అక్రమార్జనలో మునిగితేలుతూ, ప్రజలను ప్రజాసేవను మరిచిపోయే ప్రజాప్రతినిధులకు, మంత్రులకు, రాముడి మాటలు ఒక గుణపాఠం. వ్యక్తిగతంగా ఎన్ని బాధలు కష్టాలుఉన్నా, రాజకార్యాలు మానకూడదు అన్న సూత్రానికి కట్టుబడినదే రామరాజ్యం. రామరాజ్యం తెస్తామని రంకెలు వేస్తున్న నేటి ప్రజాప్రతినిధులు, కార్యాలయాలలో పనిచేస్తున్న ఉన్నత అధికారులు, ఆఫీసర్లు, ఉద్యోగులు ఆచరించవలసిన విధి, కర్తవ్యము.).

రాముడు లక్ష్మణునితో ఇంకా ఇలా అన్నాడు. "లక్ష్మణా! పూర్వము నృగుడు అనే మహారాజు ఉండేవాడు. అతను ప్రజలను చక్కగా పాలించేవాడు. బ్రాహ్మణులను గౌరవించేవాడు. ధార్మికుడు. ఎట్టి విపత్కర పరిస్థితులలో కూడా అసత్యము పలికేవాడు కాదు. అతడు పర్వ దినములలో గోవులను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చేవాడు. ఒకసారి ఒక బ్రాహ్మణునికి చెందిన ఆవు, దూడతో సహా మేత మెయ్యడానికి ఊరిబయటకు వెళ్లింది. ఆ సమయంలో రాజు గారు దానం ఇవ్వడానికి, రాజభటులు గోవులను తీసుకొని వెళుతున్నారు. ఈ బ్రాహ్మణుడికి చెందిన ఆవు, దూడ ఆ గోవులలో కలిసిపోయాయి. రాజభటులు ఆ గోవులను రాజ ప్రాసాదమునకు తీసుకొని వెళ్లారు. తన గోవు, దూడ కనపడలేదని ఈ బ్రాహ్మణుడు ఊరూ వాడా వెదుకుతున్నాడు.

మరునాడు పర్వదినం కావడం వలన, నృగమహారాజు బ్రాహ్మణులకు యధావిధిగా గోవులను దానం చేసాడు. బ్రాహ్మణునికి చెందిన ఆవును, దూడను కూడా మరొక బ్రాహ్మణునికి దానం చేసాడు. దానం తీసుకున్న బ్రాహ్మణుడు తనకు ఇచ్చిన ఆవును దూడను తీసుకొని తన ఇంటికి వెళ్లాడు. తన వద్ద నుండి తప్పిపోయిన ఆవును వెతుక్కుంటూ, ఆ బ్రాహ్మణుడు దానం స్వీకరించిన బ్రాహ్మణుని ఇంటి వద్దకు వచ్చాడు. తన గోవు అక్కడ ఉన్నదని చూచాడు. ఆ గోవును "శబలా!" అని పిలిచాడు. తన అసలు యజమాని కంఠస్వరము విన్న ఆ గోవు పరుగెత్తుకుంటూ ఆ బ్రాహ్మణుని వద్దకు వచ్చింది. వెంటనే ఆ బ్రాహ్మణుడు, దానం తీసుకున్న బ్రాహ్మణునితో ఇలా అన్నాడు. "ఈ గోవు, దూడ నావి, ఇవి మీ వద్దకు ఎలా వచ్చాయి." అని అడిగాడు. "ఈ గోవును,

దూడను నాకు నృగమహారాజు దానంగా ఇచ్చాడు." అని బదులు చెప్పాడు. "నా గోవును, దూడను దానంగా ఇవ్వడానికిరాజు ఎవరు. పదండి రాజు వద్దనేతేల్చుకుందాము" అని ఆ బ్రాహ్మణులు ఇద్దరూ గోవు, దూడతో సహా రాజమందిరానికి వెళ్లారు. నృగమహారాజును చూడాలని రాజభటులకు చెప్పారు. ఎన్ని రోజులు ఉన్నా వారికి రాజుగారిని చూడటానికి అనుమతి లభించలేదు. ఆ బ్రాహ్మణులకు కోపం వచ్చింది. "ప్రజల కష్టసుఖాలు విచారించని రాజు, పనిమీద వచ్చిన ప్రజలకు దర్శనం ఇవ్వని రాజు వృధా. అందుకని  ఓ నృగు మహారాజా! నీవు తొండగా మారి, చాలా కాలము బావులలో పడి ఉండు." అని శపించారు. ఈ విషయం తెలిసిన నృగు మహారాజు వచ్చి ఆ బ్రాహ్మణుల శరణు వేడాడు. శాంతించిన ఆ బ్రాహ్మణులు శాపవిమోచన అనుగ్రహించారు. "ఓ నృగు మహారాజా! ద్వాపర యుగంలో యాదవ వంశంలో శ్రీమహావిష్ణువు,  దేవకీ వసుదేవులకు పుత్రుడుగా జన్మించగలడు. ఆయన నిన్ను ముట్టుకోగానే నీకు శాపవిమోచన కలుగుతుంది." అని అనుగ్రహించారు.

తరువాత ఆ గోవు వివాదము ఎటూ తేలక పోవడంతో, ఆ బ్రాహ్మణులు ఇద్దరూ ఆ గోవును మరొక బ్రాహ్మణునికి దానంగా ఇచ్చి వెళ్లిపోయారు. ఈ నృగుమహారాజు బ్రాహ్మణ శాపమును అనుభవిస్తున్నాడు. అందువలన లక్ష్మణా! రాజుకు ఎన్ని స్వంత పనులు ఉన్ననూ, మనసులో సుఖదు:ఖములు ఉన్ననూ, వాటిని పక్కన బెట్టి, ముందు రాచకార్యములకు ప్రాధాన్యం ఇవ్వాలి.

కాబట్టి లక్ష్మణా! ముందు నీవు పోయి న్యాయం కోసం గానీ, రాజుతో పని ఉండి గానీ వచ్చిన వారిని వెంటనే రాజసభలో ప్రవేశపెట్టమను." అని పలికాడు రాముడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము యాభైమూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
యాభై నాలుగవ సర్గ.

నృగు మహారాజు కథ విన్న లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "రాజా! అంత చిన్న అపరాధమునకు ఆ బ్రాహ్మణులు అంత పెద్ద శిక్ష విధించారు కదా! మరి ఆ నృగు మహారాజు ఆ బ్రాహ్మణశాపమును ఏ విధంగా అనుభవించాడు." అని అడిగాడు. రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "నృగు మహారాజు వెంటనే తన కుమారుడిని రాజ్యాభిషిక్తుని చేసాడు. రాజ్యభారాన్ని కుమారుడికి అప్పగించాడు. తాను తొండగా ఏ బావిలోనో ఉడడం కన్నా అటువంటి బావులను తనే స్వయంగా తవ్వించాడు. తాను తొండ రూపంలో అన్ని కాలాలలోనూ సుఖకరంగా ఉండటానికి తగిన గోతులు తవ్వించుకున్నాడు. వర్షాకాలంలో తడవకుండా ఉండేట్టు సౌకర్యంగా ఒక గోతిని తవ్వించాడు. చలికాలంలో వెచ్చగా ఉండేటట్టు మరొక గోతిని నిర్మాణం చేయించాడు. వేసవి కాలంలో చల్లగా ఉండేటట్టు మరొక గోతిని నిర్మాణం చేయించాడు. ఆ

గోతుల చుట్టు ఒక యోజనము దూరం వరకూ పళ్లు పూలు సమృద్ధిగా కాచే చెట్లతో కూడిన  ఒక ఉద్యానవనమును ఏర్పాటుచేయించాడు. తాను తవ్వించిన విశాలమైన గోతుల లోపల గోడలకు సుందరమైన చిత్రములను చెక్కించాడు. ఆ గోతులలోకి సుగంధము వచ్చేటట్టు చుట్టు ఉన్న ఉద్యాన వనములో పరిమళభరితమైన పూల మొక్కలు నాటించాడు. రాజ్యాభిషిక్తుడైన పుత్రునికి తగు జాగ్రత్తలు చెప్పాడు. రాజ్య పాలనలోనూ, ప్రజల కష్టములు విచారించడంలోనూ ఏమాత్రం అలసత్వము చూపగూడదనీ, అలా చేసినందువలననే తాను శాపగ్రస్తుడను అయ్యానని చెప్పాడు.

ఇంకా తన కుమారునికి ఇలా చెప్పాడు. "కుమారా! చేసిన కర్మకు ఫలమును అనుభవించకుండా తప్పించుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. పూర్వజన్మలో గానీ ఈ జన్మలో గానీ చేసిన కర్మలకు ఫలితము అనుభవించియే తీరవలెను. కష్టములు వచ్చినపుడు దు:ఖించడం, సుఖాలు వచ్చినపుడు ఆనందపడటం రాజుకు మంచిది కాదు. కాబట్టి నాకోసము దు:ఖించకు." అని చెప్పాడు. తరువాత తన శాపఫలమును అనుభవించడానికి తొండ రూపంతో ఆ గోతులలోకి వెళ్లిపోయాడు.

(ఇది చదివిన తరువాత మీకు ఏమి గుర్తుకు వస్తూ ఉంది. పెద్ద పెద్ద వాళ్లు ఏదో కేసులో అరెస్టు అయినపుడు వెంటనే వారికి గుండె నొప్పి వస్తుంది. హాస్పిటల్‌లో చేరి జైలు కూడు తప్పించుకుంటారు. ఇంకా కొంత మంది తమ పలుకుబడి ఉపయోగించి జైల్లోనే అన్ని సౌకర్యాలు కల్పించుకుంటారు. ఇంటిభోజనం, సెల్ ఫోన్, లాప్‌టాప్, ఫాను, ఏ.సి.ఈ

సౌకర్యాలు పొందుతారు. నృగు మహారాజు కూడా తన శాపకాలమును సుఖవంతం చేసుకున్నాడు కదా! యుగాలు మారినా మనుషులు వారి బుద్ధులు మారవు అనడానికి ఇది చక్కని ఉదాహరణ).

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము యాభైనాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
యాభై ఐదవ సర్గ.

నృగ చక్రవర్తికి వచ్చిన శాపమును గురించి చెప్పిన రాముడు, లక్ష్మణుడికి మరొక కథ కూడా చెప్ప నారంభించాడు. లక్ష్మణుడు కూడా శ్రద్ధతో రాముడు చెప్పే కథలు వింటున్నాడు. "లక్ష్మణా! మన ఇక్ష్వాకు వంశంలో నిమి అనే మహారాజు ఉండేవాడు. ఆయన రాజధాని వైజయంతి అనే నగరము. ఆయనకు చాలాకాలము సాగే ఒక యజ్ఞము చెయ్యాలని సంకల్పము కలిగింది. దానికి తన తండ్రి ఇక్ష్వాకును ఆహ్వానించాడు. ఆ యాగమునకు ఋత్విక్కుగా బ్రహ్మర్షి వసిష్ఠుని నియమించాడు. వసిష్టునికి సహాయకులుగా అత్రిని, అంగిరసుని, భృగువును కూడా ఆహ్వానించాడు. నిమి వసిష్టుని దగ్గరకు పోయి తన యాగమునకు ఋత్విక్కుగా ఉండమని అడిగాడు. "నేను దేవేంద్రుడు చేసే యాగంలో ఉన్నాను. ఈ యాగం కాగానే నీ యాగం జరిపిస్తాను" అని అన్నాడు.

అంత ఆలస్యం భరించలేక, నిమి చక్రవర్తి, తనకు అందుబాటులో ఉన్న గౌతముని ఋత్విక్కుగా నియమించాడు. అక్కడ ఇంద్ర యజ్ఞము పూర్తి అయింది. వసిష్టుడు నిమి చేత యజ్ఞము చేయించడానికి వచ్చాడు. తన స్థానంలో గౌతముడు యజ్ఞం జరిపిస్తూ ఉండటం చూచాడు. వసిష్ఠునికి కోపం వచ్చింది. నిమి చక్రవర్తికి తాను వచ్చినట్టు వర్తమానము పంపాడు. అప్పటికే యజ్ఞకార్యములలో అలసి పోయిన నిమిచక్రవర్తి గాఢ నిద్రలో ఉన్నాడు. అందుకని వసిష్ఠుని వద్దకు వెంటనే రాలేకపోయాడు. దాంతో వసిష్ఠుని కోపం ఇంకా పెరిగిపోయింది. "ఓ రాజా! నువ్వు నన్ను అవమానించావు. నేను పిలిచినా రాకుండా జడుడి మాదిరి ఉన్నావు. కాబట్టి నీ దేహము చైతన్యము కోల్పోయి జడమై పోవుగాక!" అని శాపం పెట్టాడు.

నిమి మహారాజు మేల్కొన్న తరువాత మంత్రులు ఆయనకు వసిష్ఠుడు ఇచ్చిన శాపం గురించి తెలియజేసారు. నిమికి కూడా కోపం వచ్చింది. "నేను ప్రాణులకు సహజమైన నిద్రావస్థలో ఉన్నానని తెలిసి కూడా నన్ను దారుణంగా శపించావు. అందుకని నీ దేహం కూడా చైతన్యము కోల్పోయి జడపదార్థంగా తయారవుతుంది" అని తిరుగు శాపం ఇచ్చాడు. ఈ ప్రకారంగా వసిష్ఠుడు, నిమి ఒకరిని ఒకరు శపించుకున్నారు. ఆ శాపాల కారణంగా ఇద్దరూ తమ దేహాలు వదిలి గాలిలో సంచరిస్తున్నారు." అని రాముడు లక్ష్మణునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## యాభై ఆరవ సర్గ.

రాముడు లక్ష్మణునితో ఇలా చెప్పసాగాడు. "లక్ష్మణా! దేహం లేకుండా బాధపడుతున్న వసిష్ట మహాముని మరొక దేహము కొరకు తన తండ్రి అయిన బ్రహ్మదేవుని వద్దకు వెళ్లాడు. " తండ్రీ! బ్రహ్మదేవా! నిమి శాపం వలన నేను నా దేహాన్ని కోల్పోయాను. వాయురూపంలో తిరుగుతున్నాను. దేహం లేకుండా నిత్య కర్మలు చేయడం సాధ్యం కాదు కదా! ప్రస్తుతము నేను ఏ పనీ చేయలేకుండా ఉన్నాను. కాబట్టి నాకు మరొక దేహము అనుగ్రహించండి." అని అడిగాడు. దానికి బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు. "కుమారా! నీవు మిత్రావరుణుల వద్దకు పోయి వారి తేజస్సులో ప్రవేశించు. " అని అన్నాడు. గాలి రూపంలో ఉన్న వసిష్ఠుడు మిత్రా వరుణుల వద్దకు వెళ్లాడు.

అక్కడ మిత్ర వరుణుల వద్ద మరొక కథ నడుస్తూ ఉంది. దేవ లోకంలో ఊర్వశి అనే అప్సరస ఉంది. ఆమెను మిత్రుడు వరించాడు. కాని ఊర్వశి మనసుమాత్రం వరుణినిక అర్పించింది. ఒక రోజు ఊర్వశి చక్కగా అలంకరించుకొని మిత్రుడు వద్దకు వెళుతూ ఉంది. మధ్యలో వరుణుడు అడ్డగించాడు. తనతో లైంగిక సంపర్కము జరపమని కోరాడు. అప్పుడు ఊర్వశి ఇలా అంది. "వరుణా! నన్ను ముందుగా మిత్రుడు పిలిచాడు. ఆయన దగ్గరకు వెళుతున్నాను. నేను అతనికి చెందిన దానను. కానీ నా మనసు మాత్రము నీ మీదనే లగ్నం అయి ఉంది. నా కోరిక కూడా నీ మీదనే. కాని ముందుగా మిత్రుడు నన్ను పిలిచాడు కాబట్టి ఈ

శరీరము మాత్రము మిత్రుడికి ఇవ్వాలి కదా. ఇప్పుడు నువ్వు కావాలి అంటే ఏం చెయ్యను." అని పలికింది ఊర్వసి.

"నేను మాత్రం ఏం చెయ్యను. నిన్ను నీ అందం చూడగానే నాకు కూడా వీర్యము పతనం అయ్యేటట్టు ఉంది. నా వీర్యమును ఒక కుండలో విడుస్తాను. నీవు నాతో కలవడానికి ఇష్టం లేకపోయినా, నా కోరిక తీర్చు." అని అన్నాడు. దానికి ఊర్వశి సంతోషంగా ఒప్పుకుంది. వరుణుడు తన వీర్యాన్ని ఒక కుండలో విడిచాడు. తరువాత ఊర్వశి మిత్రుడి వద్దకు వెళ్లింది. జరిగింది అంతా అప్పటికే మిత్రుడికి తెలిసిపోయింది. మిత్రుడు కోపంతో ఊర్వశితో ఇలా అన్నాడు. "నేను ముందుగా నిన్ను పిలిచాను కదా! దారిలో వరుణుడు కనపడగానే ఆయన వద్దకు వెళతావా! ఈ చెడ్డ పని చేయడానికి నీ మనసెలా ఒప్పింది. నిన్ను శపిస్తున్నాను. నువ్వు మానవలోకంలో పుట్టు. కాశీరాజ్యాన్ని పురూరవుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. నీవు ఆయనకు భార్యగా ఉండు." అని శపించాడు.

మిత్రుడి శాప కారణంగా ఊర్వశి కాశీరాజు పురూరవునికి భార్య అయింది. పురూరవునికి ఊర్వశికి ఒక కుమారుడు కలిగాడు. వాడి పేరు ఆయువు. ఆ ఆయువు కుమారుడు నహుషుడు. ఇంద్రుడు వృత్రాసురుని చంపిన కారణంగా ఇంద్రునికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంది. అప్పటి ఇంద్రుడిని ఆ పదవి నుండి తొలగించారు. ఆ సందర్భంలో నహుషుడు ఇంద్ర పదవికి ఎంపిక అయ్యాడు. ఆ ప్రకారంగా నహుషుడు ఇంద్రపదవిని అధిష్టించాడు. లక్ష సంవత్సరములు ఇంద్రుడిగా

ఉన్నాడు. ఊర్వశి కూడా చాలా సంవత్సరములు భూలోకములో గడిపి తన శాప కాలము పూర్తికాగానే ఇంద్రలోకము చేరుకుంది." అని రాముడు లక్ష్మణునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభైఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

ఉత్తర కాండము

యాభై ఏడవ సర్గ.

వసిష్ఠుడు, నిమి ఒకరికి ఒకరు శపించు కున్న విషయం పక్కన పెట్టి రాముడు ఊర్వశి కథ చెప్పడంతో లక్ష్మణుడు తికమక పడ్డాడు. తనకు వశిష్టుడు, నిమిల శాపం గురించి చెప్పమని అడిగాడు. అప్పుడు రాముడు ఇలా చెప్పసాగాడు. "లక్ష్మణా! దానికే వస్తున్నా. ఇది వరకు నీకు, ఊర్వశిని చూచి వరుణుడు కామోద్రేకంతో తన వీర్యాన్ని ఒక కుండలో విడిచిపెట్టాడు అని చెప్పాను కదా! ఆ కుండలో నుండి ఇరువురు బ్రాహ్మణులు జన్మించారు. ఆ కుండలో నుండి ముందుగా అగస్త్యుడు అనే మహాఋషి జన్మించాడు. వెంటనే ఆయన తపస్సుకు వెళ్లిపోయాడు. తరువాత ఆ కుంభము నుండి వశిష్టుడు జన్మించాడు. ఆ వశిష్టుడే ఇక్ష్వాకులకు కుల గురువు అయ్యాడు. ఆ ప్రకారంగా వసిష్టుడు తన కొత్త దేహాన్ని పొందాడు.

ఇంక నిమి దేహం లేకుండా ఉన్నాడు కదా!. ఆయనకు ఋషులు యోగదీక్షను ఇచ్చారు. నిమి రాజ్యంలో ఉన్న పౌరులు, ఆయన మంత్రులు అందరూ నిర్జీవమైన నిమి శరీరమును సుగంధ ద్రవ్యములు, లేపనములు పూసి చెడిపోకుండా రక్షిస్తున్నారు. గాలిలో తిరుగుతున్న నిమి యోగదీక్షను పూర్తి చేసాడు. అప్పుడు దేవతలు నిమి వద్దకు పోయి "నీ యోగదీక్ష పూర్తి అయింది. నీకు శరీరం వస్తుంది. నీవు ఎక్కడ ఉండాలో నిర్ణయించుకో" అని అడిగారు.

నేను ఈ సృష్టిలో ఉన్న సకల ప్రాణుల కంటి రెప్పల మీద ఉంటాను" అని అన్నాడు నిమి. దేవతలు అలాగే అనుగ్రహించారు. "నీవు అదృశ్యరూపంలో అన్ని ప్రాణుల కంటి రెప్పల మీద నివసిస్తావు. ప్రాణులు విశ్రాంతి కావాలి అనుకున్నప్పుడు వారి కంటి రెప్పలు నీ మూలంగానే మూసుకుంటాయి." అని వరం ఇచ్చారు. తరువాత దేవతలు వెళ్లిపోయారు. (కనురెప్పపాటు సమయాన్ని నిమేషము అని అంటారు. (మన వాడుకలో ఉన్న నిమిషము కాదు.) నిమి నుంచి నిమేషము అనే పదం పుట్టింది.) ఇప్పుడు నిమి దేహము అలాగే ఉంది. రాజ్యానికి వారసుడు లేడు. ఆ దేహానికి ఒక కుమారుని పుట్టించాలి అని అనుకున్నారు. ఆ దేహమును బయట ఉంచి, యజ్ఞం చేస్తూ, హోమాలు చేస్తూ, వేద మంత్రాలు చదువుతూ, నిమి దేహమును ఒక అరణితో బలంగా మర్దించారు. ( అరణి అనగా, యజ్ఞము చేయుటకు ముందు అగ్నిని పుట్టించడానికి రెండు కర్రలను రాపాడిస్తారు. అందులో నుండి అగ్ని పుడుతుంది. దానికి ఉపయోగించే పొడుగాటి కర్రను అరణి అంటారు) ఆ రాపిడికి నిర్జీవమైన నిమి శరీరం నుండి ఒక పురుషుడు జన్మించాడు.

అతడే జనక మహారాజు. నిర్జీవ శరీరాన్ని మథించడం వల్ల పుట్టిన వాడు కాబట్టి ఆయన రాజ్యానికి మిథిల అనే పేరు వచ్చింది. స్త్రీదేహము లేకుండా జన్మించాడు కాబట్టి ఆయనకు వైదేహుడు అనే పేరు కూడా వచ్చింది. ఆయన రాజ్యమునకు విదేహ రాజ్యము అనే పేరు సార్థకం అయింది. ఆ ప్రకారంగా వసిష్ఠుడు, నిమి మహారాజు తిరిగి జన్మించారు." అని రాముడు లక్ష్మణునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభైఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

యాభై ఎనిమిదవ సర్గ.

ఆశ్చర్యకరమైన వసిష్టుడు నిమి వృత్తాంతములను విన్న లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! దీని కంతటికీ కారణం వసిష్టుడు నిమికి ఇచ్చిన శాపము. వసిష్టుడు రాని కారణంగా గౌతముని ఋత్విక్కుగా పెట్టుకున్నాడు. ఇందులో అతని తప్పు ఏముంది. పైగా యాగ దీక్షలో ఉన్న నిమిని శపించడం వసిష్టుని తప్పు కాదా!" అని అన్నాడు. దానికి రాముడు ఇలా చెప్పాడు. "లక్ష్మణా! అందరికీ ఓర్పు సహనము ఉండవు. వీరే కాదు ఇంకా ఎంతో మంది ఓర్పును సహనాన్ని కోల్పోయి కష్టాలలో చిక్కుకున్నారు. కాని యయాతి మహారాజు సత్వగుణ సంపన్నుడు. ఆయన ఓర్పును ఎలా ప్రదర్శించాడో చెబుతాను విను.

పురూరవుడి మనుమడు, ఆయుషునకు కుమారుడు, నహుషుడు అనే రాజు గురించి చెప్పానుకదా. ఆ నహుషుని కుమారుడే యయాతి. ఆయనకు ఇద్దరు భార్యలు. (ఈ యయాతి గురించి మనము భారతంలో విపులంగా చదువుకున్నాము.) రాక్షస రాజైన వృషపర్వుని కుమార్తె శర్మిష్ట. రాక్షస గురువు శుక్రాచార్యుని కుమార్తె అయిన దేవయాని. కాని యయాతికి శర్మిష్ట యందు ఎక్కువ ప్రేమ. యయాతికి దేవయాని అంటే అంత ప్రేమలేదు. యయాతికి శర్మిష్ట యందు పూరువుడు, దేవయాని యందు యదువు జన్మించారు. యయాతికి శర్మిష్ట అంటే ఎంతో ఇష్టం. అలాగే శర్మిష్టకు పుట్టిన పూరువు అంటే కూడా చాలా ఇష్టం. దానికి తోడు పూరువు కూడా సకల సద్గుణ సంపన్నుడు. యయాతి కి దేవయూని అంటే ఇష్టం లేదుకాబట్టి ఆమె కుమారుడు యదువు అంటే కూడా ఇష్టం లేదు. యదువును దగ్గరకు రానిచ్చేవాడుకాదు. అది చూచి యదువుకు దు:ఖం ముంచుకొచ్చింది.

ఒక రోజు తల్లి దేవయాని వద్దకు పోయి ఇలా అన్నాడు. “అమ్మా! నాన్న గారికి నీవు అన్నా నేను అన్నా అస్సలు ఇష్టం లేదు. ఎందుకమ్మా మనం ఇక్కడ ఉండటం. మనం వెళ్లిపోదాము. అయినా మనకేం తక్కువ అమ్మా నువ్వు రాక్షసులకు గురువు అయిన శుక్రాచార్యుల వారి కుమార్తెవు. నేను ఆయనకు మనుమడిని. అమ్మా ఈ దు:ఖమును అవమానమును ఇంక సహించలేమమ్మా. ఇన్ని అవమానములు భరించి ఇక్కడ ఉండేదానికన్నా అగ్నిలో దూకడం మేలు. తండ్రిగారిని పూరువుతోనూ, వాడి తల్లితోనూ సుఖపడనీ. అమ్మా! ఈ అవమానమునుసహించి నువ్వు ఉండగలిగితే ఉండు. నేను మాత్రం

ఉండను. ఈ అవమానమును భరించడం కన్నా నాకు మరణమే శరణ్యము" అని ఏడుస్తూ అన్నాడు యదువు.

కుమారుడి దు:ఖాన్ని చూచి తట్టుకోలేకపోయింది దేవయాని. వెంటనే తండ్రి శుక్రాచార్యుని మనసులో స్మరించుకుంది. వెంటనే శుక్రాచార్యుడు కుమార్తె ముందు ప్రత్యక్షం అయ్యాడు. దు:ఖంతో కుంగి పోతున్న కుమార్తెను, మనుమడిని చూచి "ఏమమ్మా! ఏమి జరిగింది!" అని అడిగాడు. "తండ్రీ! నాకు ఇక్కడ జరుగుతున్న అవమానమునకు నేను నీళ్లలోగానీ, అగ్నిలో గానీ దూకి మరణిస్తాను. లేదా విషము తిని చస్తాను. అంతే కానీ అనుదినమూ ఈ అవమానములను భరించలేను. తండ్రీ! నీవు రాక్షసులకు గురువు. అందరికీ పూజనీయుడవు. నాకుజరిగిన అవమానము నీకు జరిగినట్టు కాదా! నా భర్త యయాతి నన్ను తిరస్కరించి నన్ను అవమానించాడు. తద్వారా నిన్నూ అవమానించాడు. ఈ ఇంట్లో నాకు ఏ మాత్రం గౌరవము లేదు, అనాదరము తప్ప." అని ఏడుస్తూ చెప్పింది దేవయాని.

కుమార్తె శోకమును చూచి తట్టుకోలేకపోయాడు శుక్రుడు. యయాతిని పిలిపించావు. "యయాతి మహారాజా! నీవు నీ వయస్సును, యవ్వనమును, అందమును చూచుకొని గర్వపడుతూ, రాజకుమార్తె అయిన శర్మిష్ఠను ఆమె కుమారుడిని ఆదరిస్తూ, నా కుమార్తెను నిరాదరణకు గురి చేసావు. అవమానించావు. నా కూతురిని అవమానిస్తే నన్ను కూడా అవమానించినట్టే. కాబట్టి నిన్ను ఈ క్షణం నుండి ముసలి తనము ఆవహిస్తుంది. రోజురోజుకూ నీ శరీరం శిథిలము అయిపోతుంది.

నీవు ఏ సుఖాలను అనుభవించలేవు." అని శపించాడు. శుక్రాచార్యుడు ఆ ప్రకారము తన అల్లుడు యయాతిని శపించి, కుమార్తె దేవయానిని ఓదార్చి, తన ఇంటికి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము యాభైఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

యాభైతొమ్మిదవ సర్గ.

శాపగ్రస్తుడైన యయాతిని ముసలి తనం ఆవహించింది. శరీరం శిథిలం అయింది. యయాతికి దు:ఖము ముంచుకొచ్చింది. దేవయాని దేవయాని కుమారుడు యదువును పిలిచి ఇలా అడిగాడు. "కుమారా! నీ తాతగారి శాపవశాత్తు నేను ముసలివాడిని అయ్యాను. నాకు ఇంకా ఇహలోక భోగములు అనుభవించవలెనని కోరికగా ఉంది. నాకు సాయం చెయ్యగలవా! నా ముసలి తనమును నీవు తీసుకొని నీ యవ్వనమును నాకు ఇమ్ము. నేను భోగములు అనుభవించిన తరువాత మరలా నీ యవ్వనమును నీకు ఇస్తాను." అని అడిగాడు.

"అదేంటి తండ్రీ! ఈ మాత్రం దానికి నేను ఎందుకూ. తమరి ప్రియపుత్రుడు పూరువు ఉన్నాడు కదా! ఆయన మీకు తన యవ్వనాన్ని ఇస్తాడు లెండి. తండ్రీ! నన్ను మీతో పాటు భోజనం చేయనిచ్చారా!

రాచకార్యములలో పాల్గొననిచ్చారా! మీకు అన్నీ ఆ పూరువే కదా! ఈ సాయం కూడా ఆ పూరువే చేస్తాడు లెండి. నేనెందుకూ!" అని అన్నాడు వెటకారంగా.

వెంటనే యయాతి శర్మిష్ట కుమారుడు పూరువు వద్దకు వెళ్లాడు. "కుమారా! నీ ముసలి తనమును తీసుకొని నీ యవ్వనమును నాకు ఇమ్ము. నేను భోగములు అన్నీ తనివితీరా అనుభవించి, తరువాత నీ యవ్వనమును నీకు తిరిగి ఇస్తాను. ఇది నీకు సమ్మతమేనా!" అని అన్నాడు. వెంటనే పూరువు "తండ్రీ! ఇన్నిరోజులకు తమరి ఋణం తీర్చుకొనే సమయం వచ్చింది. మీకు సేవ చేసుకొనే భాగ్యాన్ని నాకు కల్పించి నన్ను ధన్యుడిని చేసారు.  నా యవ్వనాన్ని మీకు సంతోషంగా ఇస్తున్నాను స్వీకరించండి." అని అన్నాడు. వెంటనే యయాతి తన ముసలి తనమును తన కుమారుడు పూరువుకు ఇచ్చి అతని యవ్వనాన్ని స్వీకరించాడు. చాలాకాలం పాటు యయాతి ఇహలోక సుఖాలు అనుభవించాడు.

తరువాత తన కుమారుడు పూరువును  పిలిచి "కుమారా! నేను నీ వద్ద ఉంచిన నా ముసలి తనమును నాకు తిరిగి ఇమ్ము. నీ యవ్వనమును తీసుకొమ్ము." అని అన్నాడు. వెంటనే పూరువు తన తండ్రి ముసలి తనమును ఆయనకు ఇచ్చి తన యవ్వనాన్ని తిరిగి స్వీకరించాడు. తరువాత తన కుమారులు పూరువు, యదువును చూచి ఇలా అన్నాడు. "కుమారా పూరువూ! తండ్రి ఆజ్ఞను పాలించి, నా కోర్కెను తీర్చావు. తండ్రి ఋణం తీర్చుకున్నావు. నాకు చాలా సంతోషంగా ఉంది. నా సామ్రాజ్యానికి నిన్ను పట్టాభిషిక్తుని చేస్తున్నాను. నీ పుత్రపౌత్ర పర్యంతము

ఈ రాజ్యాని ఏలుకో!" అని అన్నాడు. (ఆ పూరుడే పూరు వంశమునకు మూలకర్త.). తరువాత యయాతి యదువును చూచి ఇలా అన్నాడు. "నీవు నా కుమారుడివి కావు. క్షత్రియుడివి అసలే కావు. నా కుమారుడి రూపంలో ఉన్న రాక్షసుడివి. అందుకే తండ్రి మాటను ధిక్కరించావు. కాబట్టి నీకు రాక్షసులే సంతానంగా పుడతారు. నీవంశము రాక్షస వంశము అవుతుంది. నీ వంశము కూడా మారి పోతుంది. ఇంక నుండి నీది చంద్రవంశము కాదు. యదువంశము." అని కుమారుడిని శపించాడు. తరువాత తన కుమారుడు పూరువును రాజ్యాభిషిక్తుని చేసి యయాతి వానప్రస్థమునకు వెళ్లిపోయాడు. తరువాత మరణించి స్వర్గానికి వెళ్లాడు.

పూరువు కాశీ రాజ్యములో ప్రతిష్ఠాన పురము అనే పురమును నిర్మించి, దానిని రాజధానిగా చేసుకొని కాశీరాజ్యమును పరిపాలించాడుపూరువు. రాజవంశమునుండి బహిష్కరింపబడిన యదువుకు రాక్షసులు పుత్రులుగా  జన్మించారు. (మహాభారతములో యయాతి కథ వేరేవిధంగా ఉంది.)  లక్ష్మణా! యయాతికి ఉన్న ఓర్పు,సహనం నిమికి లేదు. అందుకే తన శరీరాన్ని పోగొట్టుకున్నాడు." అని అన్నాడురాముడు.

తరువాత రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఇప్పటికే ఆలస్యం అయింది. నేను కూడా నృగ మహారాజు మాదిరి నా కోసం వచ్చిన వారిని నిర్లక్ష్యం చేయకుండా వెను వెంటనే వారి సమస్యలు పరిష్కరిస్తాను. వెంటనే రాజ సభ ఏర్పాటే చేయించు." అని అన్నాడు. తన

మాట రాముడు మన్నించి నందుకు లక్ష్మణుడు ఆనందంతో రాజాజ్ఞను పాటించడానికి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము యాభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(దీని తరువాత వచ్చే మూడు సర్గలు తరువాత చేర్చబడినవి,
మూలంలో లేవు  అని పెద్దల అభిప్రాయము.
కానీ పాఠకుల సౌకర్యార్థము ఆ మూడు సర్గలను
ఒకేసర్గగా ఇస్తున్నాను. చదవండి.)

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము ప్రక్షిప్త సర్గలు.

మరునాడు ఉదయం తెల్లవారింది. రాముడు ఉదయం పూట చేయవలసిన పూజాకార్యక్రమములు నిర్వర్తించుకొని మంత్రి పురోహితులతో రాజ సభకు వెళ్లాడు. ధర్మాసనము మీద కూర్చుని  పౌరుల మధ్య జరిగిన తగాదాలను విచారించడానికి సిద్ధంగా ఉన్నాడు. లక్ష్మణుడు రాజ సభ బయట ఉండి న్యాయం కోసం వచ్చిన వారి గురించి విచారిస్తున్నాడు. కాని అక్కడ ఎక్కువ మంది లేరు. రాముని రాజ్యంలో ఎవరికీ అన్యాయం జరగడం లేదు. అందరూ ధర్మంగా

నడుచుకుంటున్నారు. కాలం తీరకుండా ఎవరూ మరణించడం లేదు. అకాల మరణాలు లేవు. ఎవరూ తనకు అన్యాయం జరిగింది అని మరొకరి మీద ఆరోపణలు చెయ్యడం లేదు. లక్ష్మణుడు లోపలకు వచ్చి అదే విషయాన్ని రామునికి చెప్పాడు.

"లక్ష్మణా!న్యాయం కోసరం వచ్చే వాళ్లు నిర్ణీత సమయంలో రారు కదా. ఎప్పుడు అన్యాయం జరిగితే అప్పుడు వస్తారు. కాబట్టి, నీవు బయటనే ఉండి న్యాయార్థులను, కార్యార్థులను వెంటనే విచారించి లోపలకు పంపించు. నేను రాజసభలోనే ఉంటాను. లక్ష్మణా! మన రాజ్యంలో ప్రజలందరూ నీతిగా నిజాయితీగా తమకు విధించిన పనులను చేసుకుంటున్నారు. అందరూ సఖ్యంగా ఉంటున్నారు. ఇంక తగాదాలు ఎందుకు ఉంటాయి చెప్పు. పైగా తప్పుచేస్తే శిక్షలు కఠినంగా ఉంటాయని వాళ్లకు తెలుసు. అందుకని ఎవరూ తప్పు చేయడానికి సాహసించరు. నీవు కూడా నిరంతరమూ జాకరూకుడవై నగరాన్ని రక్షిస్తున్నావు. అయినా కూడా మన జాగ్రత్తలో మనం ఉండాలి. నీవు రాజ సభ బయటనే ఉండి న్యాయం కోసం వచ్చిన వాళ్లను విచారించి లోపలకు పంపు. నేను మంత్రులతో వేరే విషయాలను చర్చిస్తూ ఉంటాను." అని అన్నాడు రాముడు.

రాముని ఆదేశము మేరకు లక్ష్మణుడు రాజ సభ బయటకు వచ్చాడు. అక్కడ ఒక కుక్క నిలబడి ఉంది. లక్ష్మణుని చూచి గట్టిగా మొరిగింది. లక్ష్మణుడు ఆ కుక్కను చూచి "ఏమి పని మీద వచ్చావు. నీకు ఏం కావాలి." అని అడిగాడు. అప్పుడు ఆ కుక్క ఈవిధంగా

బదులుచెప్పింది. “నేను న్యాయం కోరి వచ్చాను. ఈ రాజ్యానికి రాజు రాముడు. నా అభియోగము రామునికే చెబుతాను.” అని చెప్పింది. రాముడు సభలోపలికి వెళ్లాడు. రామునికి కుక్క విషయం చెప్పి బయటకు వచ్చి కుక్కను రాజసభలోకి వెళ్లమన్నాడు. అప్పుడు ఆ కుక్క ఇలా అంది. “లక్ష్మణా! నేను నీచయోనిలో పుట్టాను. మాకు రాజసభలలోకి, దేవతా గృహములలోకి, బ్రాహ్మణుల ఇళ్లలోకీ వెళ్లే అర్హత లేదు. కాబట్టి నేను రాజసభలోకి రాలేను. రాముడు సకల ప్రాణులను సమంగా చూడగలిగినవాడు. రాముడు స్వయంగా ఆజ్ఞాపిస్తే గానీ నేను లోపలకు రాను. నీవు పోయి రాముని అనుజ్ఞ తీసుకొని రా” అని చెప్పింది.

లక్ష్మణునికి విసుగు పుట్టింది. కానీ ఓపికగా ఉన్నాడు. రాముని వద్దకు వెళ్లాడు. “రామా! ఒక కుక్క వచ్చి రాజ సభ బయట నిలబడి ఉంది. నీ అనుమతి లేనిది లోపలకు రాదట” అని అన్నాడు. “నేను అనుమతి ఇచ్చాను అని చెప్పి ఆ కుక్కను లోపలకు తీసుకొని రా” అని అన్నాడు. లక్ష్మణుడు బయటకు వెళ్లి ఆ కుక్కను రాజసభలోకి తీసుకొని వచ్చాడు. రాముడు ఆ కుక్కను చూచి “నీవు చెప్పదలచుకున్న విషయము ఏమీ భయము లేకుండా నిర్భయంగా చెప్పు.” అని అన్నాడు. రాముడు ఆ కుక్క తలమీద రక్తం కారుతున్న గాయం చూచాడు.

ఆ శునకము రామునితో ఇలా అంది. “ఓ రాజా! నీవు ప్రజారక్షకుడివి. నిరంతరమూ రాత్రింబగళ్లు ప్రజలను రక్షిస్తూ ఉంటావు. రాజు ప్రజలకందరికీ తండ్రి వంటి వాడు. ధారణాత్ ధర్మమ్ ఇతి అని అంటారు కదా! అంటే ధరించునది కావున ధర్మము అని అంటారు. ఆ

ధర్మమే మూడు లోకములలో నిలిచి ఉంది. జీవుడు మరణించిన తరువాత కూడా అతని ధర్మమే అతనిని కాపాడుతుంది. పుణ్యలోకాలకు చేరుస్తుంది. అటువంటి ధర్మమును నీవు చక్కగా పాటిస్తున్నావు. ధర్మం నీకు బాగా తెలుసు. నీ వంటి వాడి ముందు నేను ధర్మం గురించి మాట్లాడటం నా అజ్ఞానమే అవుతుంది. అందుకే నీకు నేను భక్తితో నమస్కరిస్తున్నాను." అని పలికింది ఆ శునకము.

"నీకు ఏమి అన్యాయం జరిగిందో ధైర్యంగా నిర్భయంగా చెప్పు" అని అన్నాడు రాముడు. "ఓ రాజా! బ్రాహ్మణులు నివసించే ప్రదేశములో ఉన్న సర్వార్థసిద్ధుడు అనే సన్యాసి నన్ను అకారణంగా కొట్టాడు. నేను అతని పట్ల ఏమీ అపరాధము చేయలేదు." అని పలికింది. వెంటనే రాముడు భటులను పంపించి ఆ సర్వార్థసిద్ధుడు అనే బ్రాహ్మణుని సభకు పిలిపించాడు. "రాజా! నన్ను ఎందుకు పిలిపించారు. నేను ఏమి చెయ్యాలి." అని అడిగాడు. "ఓ బ్రాహ్మణోత్తమా! నీవు ఈ శునకమును కొట్టినావని నీ మీద అభియోగము. ఈ శునకము ఏమి తప్పు చేసిందని కొట్టావు." అని అడిగాడు రాముడు. "రాజా! నేను కోపం పట్టలేకకొట్టాను." అని అన్నాడు.

అప్పుడు రాముడు ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణోత్తమా! కోపము అనర్థదాయకము అని తెలియదా! కోపము ప్రాణములను సైతం తీసే శత్రువు లాంటిది. కోపము మిత్రుడు వలె ఎప్పుడూ వెంట ఉన్నా అది మానవునికి ప్రబల శత్రువు. కోపము కత్తిలాంటిది. కోపము అనర్థదాయకము. ఎన్ని యజ్ఞములు, యాగములు చేసినా, ఎంత తపస్సు

చేసినా, కోపాన్ని వదిలిపెట్టకపోతే అవన్నీ ఎందుకూ పనికిరావు. అందుకే ముందు కోపాన్ని విడిచిపెట్టాలి. తాను కోరుకున్నది దక్కకపోతే కోపం వస్తుంది. అందుకనే కోరికలను విడిచిపెట్టాలి. ఇంద్రియములను మనసును అదుపులో ఉంచుకోవాలి. మానవుడు తన మనోవాక్కాయ కర్మలతో ఎదుటి వారికి మేలు చేయాలి కానీ కీడు చేయకూడదు. అటువంటి వాడు ఎవరినీ ద్వేషించడు అందుకే వాడికి ఎవరి మీదా కోపం రాదు. మనసును అదుపులో పెట్టుకోకపోతే మనిషిలో కోపం దావానలంలా ప్రజ్వరిల్లుతుంది. ఆ కోపము వాడి అయిన కత్తితో, తోకతొక్కిన పాముతో, పక్కలో ఉన్న శత్రువుతో సమానము. కోపం అటువంటిది అని తెలిసికూడా ఎందుకుకోపం తెచ్చుకున్నావు." అని అడిగాడు రాముడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు ఇలా బదులు చెప్పాడు. "రాజా! నేను భిక్ష కొరకు అన్ని ఇళ్లకు వెళ్లాను. కానీ ఎక్కడా బిక్ష దొరకలేదు. కడుపులో ఆకలిగా ఉంది. అప్పుడు నాకు ఈ కుక్క అడ్డం వచ్చింది. నేను ఈ కుక్కను అవతలకు వెళ్లమని తోలాను. కాని ఈ కుక్క తన ఇష్టం వచ్చినట్టు అటు ఇటు తిరుగుతూ దారికి అడ్డంగా నిలబడింది. ఆ కోపంలో నేను ఈ కుక్కను కొట్టాను. నేను చేసిన అపరాధమును క్షమించండి." అని అన్నాడు. అప్పుడు రాముడు రాజ పురోహితుని, మంత్రులను చూచి ఇతనికి ఏమి శిక్ష వెయ్యాలి అనిఅడిగాడు. "రాజా! బ్రాహ్మణులు దండనకు తగిన వారు కాదు. బ్రాహ్మణులను శిక్షించ కూడదు. " అని అన్నారు.

అప్పుడు ఆ శునకము ఇలా అంది. “ఓ రాజా! మీరు అనుమతిస్తే ఇతనికి తగిన శిక్షను నేను చెబుతాను.” అని అంది. “ఏమిటి?” అని అడిగాడు రాముడు. “ఇతనిని కులపతిగా నియమించండి. అదే ఇతనికి తగిన శిక్ష.” అని పలికింది కుక్క. ఆ శునకము అంతరంగమును బాగుగా తెలిసిన రాముడు ఆ బ్రాహ్మణుని కులపతిగా నియమించాడు. ఆ బ్రాహ్మణుడు చాలా సంతోషించి కులపతిత్వమును స్వీకరించడానికి వెళ్లాడు.

రాముడి తీర్పు విని సభాసదులందరూ ఆశ్చర్యపోయారు. ఒక మంత్రి లేచి ఇలా అడిగాడు. “మహారాజా! మేమంతా అతడు బ్రాహ్మణుడు కాబట్టి శిక్షించకుండా వదిలిపెడతారు అనుకుంటే అతనిని కులపతిగా నియమించారు. ఇది అతనికి వరం ఇచ్చినట్టు కదా!” అని అడిగారు. ఆ మాటలకు రాముడు నవ్వి మీ ప్రశ్నకు ఈ శునకమే సమాధానము ఇవ్వగలదు” అని అన్నాడు. అప్పుడు ఆ శునకము ఇలా పలికింది. “సభాసదులారా! నేను పోయిన జన్మలో కులపతిని. దేవతలకు, బ్రాహ్మణులకు తృప్తిగా భోజనముపెట్టిన తరువాత మిగిలిన ఆహారమును నేను తినేవాడిని. ఇంకా మిగిలితే ఇతరులకు ఇచ్చేవాడిని. దేవతలకు చెందిన సొమ్మును దుర్వినియోగం కాకుండా రక్షించేవాడిని. నా స్వప్రయోజనమునకు కించిత్ కూడా వాడుకొనే వాడిని కాదు. అటువంటి నాకే కేవలం కులపతిగా ఉండినందుకు ఈ శునక జన్మ వచ్చింది. ఇంక ఈ కోపిష్టి అయిన బ్రాహ్మణుడు కులపతి అయితే ఇతని అవినీతికి అంతు ఉండదు. ఇతడు చనిపోయిన తరువాత నరకం ప్రాప్తిస్తుంది. ఇదే అతనికి సరిఅయిన శిక్ష. కాబట్టి మహారాజా! మీకు ఎవరినన్నా శిక్షించాలి అని

అనుకుంటే వానిని దేవాలయ ధర్మకర్త గానో, కులపతిగానో, బ్రాహ్మణుల ఆస్తులను రక్షించే ఉద్యోగిగానో నియమించండి. వాడి పతనానికి అదే దగ్గరి దారి. వాడికి చావు తరువాత నరకం తథ్యం." అని పలికింది ఆ శునకము. తరువాత ఆ శునకము తన దారిన తాను వెళ్లిపోయింది. తరువాత ఆ శునకము వారణాసి నగరంలో ప్రాయోపవేశం చేసి ప్రాణాలు వదిలింది.

ఒక అరణ్యములో ఒక గ్రద్ద ఒక గుడ్లగూబ నివసిస్తున్నాయి. ఒక సారి ఆ గ్రద్దకు గుడ్లగూబకు ఒక ఇంటిని గురించి తగువు వచ్చింది. ఆ ఇల్లు ఎవరిదో తేల్చుకోడానికి ఆ గ్రద్ద గుడ్లగూబ రాముని దగ్గరకు వెళ్లాయి. ముందు గ్రద్ద రాముని చూచి ఇలా అంది. "రాజా! నీవు బుద్ధిలో బృహస్పతి కంటే, గొప్పవాడివి. కాబట్టి మా తగవును మీరే తీర్చాలి. ఆ అరణ్యములో నేను ఒక ఇల్లు కట్టుకున్నాను. కాని ఈ గుడ్లగూబ తన బలంతో నా ఇంటిని ఆక్రమించుకుంది. ఈ గుడ్లగూబను శిక్షించి నా ఇల్లు నాకు ఇప్పించండి." అని అడిగింది.

తరువాత గుడ్లగూబ ఇలా చెప్పింది. "మహారాజా! నీవు సాక్షాత్తు నారాయణ స్వరూపుడవు. అందుకని నీవే మా తగవు తీర్చాలి. ఈ గ్రద్ద నా ఇంటి లో ప్రవేశించి నన్ను ఇబ్బంది పెడుతూ ఉంది. కాబట్టి ఈ గ్రద్ద బారి నుండి నన్ను రక్షించండి." అని మొరపెట్టుకుంది.

రాముడు మంత్రులతో ఆలోచించాడు. తరువాత రాముడు గ్రద్దను ఇలా అడిగాడు. "నీవు నీ ఇంటిని నిర్మించి ఎన్నాళ్లు అయింది" అని

అడిగాడు. "రామా! ఈ భూమి అంతా మానవులతో ఎప్పుడు నిండిపోయిందో అప్పటి నుండి నేను ఆ ఇంటిలో ఉంటున్నాను." అని చెప్పింది. వెంటనే గుడ్లగూబ "రాజా! ఈ భూమి మీద ఎప్పటి నుండి వృక్షజాతులు పుట్టాయో అప్పటి నుండి నేను  ఆ ఇంట్లో ఉంటున్నాను." అని పలికింది. ఆ మాటలు విన్న రాముడు సభాసదులతో ఇలా అన్నాడు.

"సభాసదులారా! సభలో వృద్ధులు లేకపోతే అది సభకాదు. ఆ వృద్ధులు ధర్మం చెప్పకపోతే వారు వృద్ధులు కాదు. సత్యము లేకపోతే ధర్మము నిలువదు. కపటపు మాటలతో సత్యము చెప్పలేరు. ఈ సభలో ఉన్న వారు ఇది అధర్మము అని తెలిసి కూడా దానిని బహిరంగంగా చెప్పరో, వారు అబద్ధాలు చెప్పినట్టే. అంతేకాదు. కోపం వలన గానీ, కామప్రకోపము వలన గానీ, తెలిసి కూడా తెలియనట్టు ఉంటారో వారికి వరుణపాశములు చుట్టుకుంటాయి. కాబట్టి మీరు ఇరువురి వాదనలు విన్నారు కదా. ఏది సత్యమో, ఏది ధర్మమో వివరంగా చెప్పండి." అని అడిగాడు రాముడు.

తరువాత సభాసదులు అందరూ ఆలోచించి "రాజా! గుడ్లగూబ చెప్పినది సత్యము, గ్రద్ద చెప్పినది అసత్యము. తరువాత మీకు తోచిన నిర్ణయం చెయ్యండి." అని ముక్తకంఠంతో చెప్పారు. తరువాత రాముడు ఇలా అన్నాడు. "ఈ సందర్భంలో పురాణాలలో చెప్పబడిన విషయములను మీకు చెబుతాను. సావధానంగా వినండి. ఒకప్పుడు ఈ మూడు లోకములు నీటిలో మునిగిపోయాయి. ప్రపంచం అంతా జలమయం అయింది. భూదేవి విష్ణుమూర్తి ఉదరంలోకి ప్రవేశించింది. భూమిని తన

ఉదరములో ఉంచుకొన్న విష్ణువు యోగనిద్రలో ఉన్నాడు. అనేక సంవత్సరములు గడిచిపోయాయి. అప్పుడు బ్రహ్మదేవుడు విష్ణువు ఉదరములోకి ప్రవేశించాడు. విష్ణువు గర్భంలో ఉన్న జలములో నుండి ఒక పద్మము పుట్టింది. అది విష్ణువు నాభి ద్వారా బయటకు వచ్చింది. ఆ పద్మము యొక్క నాళము (తామర తూడు) లో నుండి బ్రహ్మ బయటకు వచ్చాడు. ఆ పద్మములో కూర్చున్నాడు. తరువాత బ్రహ్మ తపస్సు చేసాడు. భూమిని, వాయువును, పర్వతములను, వృక్షములను, సృష్టించాడు. తరువాత మనుష్యులను, జంతువులను పాకే జంతువులను, ఎగిరే పక్షులను సృష్టించాడు. అండములనుండి పుట్టే వాటిని, గర్భములో నుండి బయటకు వచ్చేవాటిని, చెమట నుండి పుట్టే వాటిని, భూమి నుండి పుట్టే వాటిని సృష్టించాడు.

బ్రహ్మ యొక్కచెవిలో నుండి మధు, కైటభులు అనే రాక్షసులు పుట్టారు. వారు బ్రహ్మదేవుని చూచి కోపంతో ఊగిపోయారు. ఆ మధుకైటభులు బ్రహ్మ మీదికి వచ్చారు. అప్పుడు బ్రహ్మ పెద్దగా అరిచాడు. ఆ శబ్దము విని శివుడు, విష్ణువు అక్కడకు వచ్చారు. విష్ణువు తన చక్రాయుధముతో ఆ మధు కైటభులు అనే రాక్షసులను సంహరించాడు. ఆ రాక్షసుల శరీరంలో నుండి బయటకు వచ్చిన కొవ్వుతో ఈ భూమి అంతా నిండి పోయింది. అందులో నుండి వృక్షములు, ఓషధులు, సస్యములలో భూమి నిండి పోయింది. ఆ రాక్షసుల కొవ్వు (మేధ) తో నిండి పోయింది కాబట్టి భూమికి మేధ అనే పేరు వచ్చింది. పై కారణాల వలన  గుడ్డగూబ వృక్షములు పుట్టిన తరువాత ఇల్లు కట్టుకొంది. అంతకు ముందు వృక్షములు లేవు కాబట్టి గ్రద్ద ఇల్లు కట్టుకొనే అవకాశము లేదు.

కాబట్టి ఈ ఇల్లు గుడ్లగూబది కానీ గ్రద్దది కాదు. అబద్ధము చెప్పిన ఈ గ్రద్దను దండించాలి." అని అన్నాడు రాముడు.

ఆ సమయంలో ఆకాశం నుండి ఇలా వినపడింది. "రామా! ఈ గ్రద్ద ను చంపకుము. ఈ గ్రద్ద పేరు బ్రహ్మదత్తుడు. ఎల్లప్పుడూ సత్యమునే పలికెడి వాడు. ధర్మాత్ముడు.

ఒక సారి ఒక బ్రాహ్మణుడు బ్రహ్మదత్తుని ఇంటికి వచ్చాడు. తనకు నూరు సంవత్సరముల పాటు భోజనము పెట్టమని అడిగాడు. బ్రహ్మదత్తుడు ఆ బ్రాహ్మణునికి అర్ఘ్యము పాద్యము ఆసనము సమర్పించాడు. అతని భోజనానికి తగిన ఏర్పాట్లు చేసాడు. కాని అతనికి పెట్టిన ఆహారములో మాంసాహారము కూడా కలిసింది. దానికి ఆ బ్రాహ్మణుడు కోపించాడు. నీవు గ్రద్దలు తినే మాంసాహారము పెట్టావు కాబట్టి నీవు గ్రద్దగా జీవించు." అని శపించాడు. అప్పుడు బ్రహ్మదత్తుడు ఆ బ్రాహ్మణుని కాళ్ల మీద పడి తన అపరాధమును మన్నించి తనకు శాపవిమోచనము కలుగచేయమని వేడుకున్నాడు. "రాబోవు త్రేతాయుగములో ఇక్ష్వాకు వంశములో రాముడు అనే రాజు జన్మిస్తాడు. అతని స్పర్శతో నీకుశాపవిమోచన అవుతుంది." అని ఆ బ్రాహ్మణుడు బ్రహ్మదత్తునికి శాపవిమోచన అనుగ్రహించాడు. కాబట్టి రామా! ఇతనికి శాపవిమోచన కలిగించు" అని ఆకాశవాణి పలికింది.

అప్పుడు రాముడు సంతోషంగా ఆ గ్రద్దకు శాపవిమోచన కలిగించాడు. అప్పుడు ఆ గ్రద్ద బ్రహ్మదత్తుడిగా మారి పోయాడు.

"రామా! నీ అనుగ్రహము వలన నాకు శాపవిమోచన కలిగింది." అని రాముడికి నమస్కరించి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము ప్రక్షిప్త సర్గలు సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
అరవయ్యవ సర్గ.

రాముడు జనరంజకంగా రాజ్యపాలన సాగిస్తుంటే వసంత ఋతువు వచ్చింది. ఒకరోజు భార్గవుడు, చ్యవనుడు తదితర మహా మునులు అందరూ రాముని చూడటానికి వచ్చారు. రాముడు వారిని సాదరంగా ఆహ్వానించాడు. అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించాడు. అందరికీ ఉచితాసనములు మీద ఆసీనులను చేసాడు. ఆ మహా మునులు తాము సేవించిన పుణ్యతీర్థములలో జలములను రామునికి సమర్పించారు.

రాముడు ఆ మునులను చూచి ఇలా అన్నాడు. "మహామునులారా! తమరు వచ్చిన పని ఏమి? మీరు ఏమి కోరినా చెయ్యడానికి నేను సిద్ధంగా ఉన్నాను. నా సమస్తరాజ్యము, నేను బ్రాహ్మణుల అధీనము. ఆజ్ఞాపించండి" అని అన్నాడు రాముడు. రాముని మాటలు విన్న ఆ మహామునులు ఎంతో సంతోషించారు.

"రామా! ఇలామాట్లాడటం నీ వంటి వారికే తగి ఉన్నది. నీ కన్నా ముందు ఈ భూమిని ఎందరో రాజులు పరిపాలించారు. వారందరూ మేము అడగబోయే కార్యము ఏమిటో ఆలోచించి గానీ ఆ కార్యము చేస్తానని మాట ఇచ్చేవారు కాదు. నీవు మాత్రము మేము ఏమి అడుగుతామో తెలుసుకోకుండానే మాట ఇచ్చావు. నీకు బ్రాహ్మణుల మీద ఉన్న భక్తి అనంతమైనది. ప్రస్తుతము మేము భయాందోళనలతో ఉన్నాము. మమ్ములను ఆ భయం నుండి దూరం చేసి మా అందరినీరక్షించు." అని అన్నారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవయ్యవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## అరవయ్యవ ఒకటవ సర్గ.

ఈ బ్రాహ్మణుల మాటలు వినిన రాముడు "మీరు ఏమీ దిగులుచెందనవసరం లేదు. ఈ క్షణం నుండి మీకు భయం నుండి విముక్తి కలిగిస్తాను. మీ భయకారణం చెప్పండి." అని అన్నాడు. అప్పుడు ఆ మునులు రామునితో ఇలా అన్నారు. "రామా! పూర్వము కృతయుగములో మధువు అనే దైత్యుడు ఉండేవాడు. ఆ మధువు బ్రాహ్మణులను పూజించేవాడు. ధర్మాత్ముడు. దేవతలకు ప్రీతి పాత్రుడు. మంచి పరాక్రమ వంతుడు. అతని గుణగణములకు మెచ్చి రుద్రుడు అతనికి ఒక వరం కూడా ఇచ్చాడు. రుద్రుడు అతనికి ఒక దివ్యమైన ప్రతిభావంతమైన

శూలమును ఇచ్చాడు. "నీ సత్యనిష్ఠను, ధర్మనిరతిని చూచి నీకు ఈ శూలమును బహూకరిస్తున్నాను. నీవు ఎప్పటిదాకా దేవతలను బ్రాహ్మణులను ద్వేషించవో అప్పటిదాకా ఈశూలము నీ దగ్గర ఉంటుంది. నీలో దేవ, బ్రాహ్మణ ద్వేషము మొదలైననాడు ఈ శూలము నీ దగ్గర నుండి మాయమై  నా దగ్గరకు చేరుతుంది. నీవు ధర్మంగా న్యాయంగా ఉన్నంతకాలము నిన్ను ఎవరైనా అన్యాయంగా అక్రమంగా, దుర్మార్గంగా ఎదిరిస్తే ఈ శూలం వాడిని భస్మం చేస్తుంది." అని శూలాన్ని రుద్రుడు మధువుకు ఇచ్చాడు. అప్పుడు మధువు రుద్రునికి నమస్కరించి ఇలా అన్నాడు. "ఓ దేవదేవా! ఈ శూలము నాకే కాదు మా తరతరాలకు మా వంశములోనే ఉండేటట్టు వరం ప్రసాదించు." అని అడిగాడు. "అది సంభవం కాదు. కాని నీవు అడిగావు కాబట్టి నీ తరువాత నీ కుమారునికి మాత్రమే చెందుతుంది. ఈ శూలము నీ కుమారుని చేతిలో ఉన్నంతకాలము అతనిని కూడా ఎవరూ ఎదిరింలేరు, చంపలేరు." అని వరం ఇచ్చాడు రుద్రుడు.

ఈ ప్రకారంగా రుద్రునివలన అత్యంత మహిమగల శూలమును పొందిన మధువు, ఒక దివ్యమైన భవనమును నిర్మించుకున్నాడు. ఆ మధువు భార్యపేరు కుంభీనసి. మధువుకు, కుంభీనసికి లవణుడు అనే కుమారుడు జన్మించాడు. వాడు మధువు మాదిరి ధర్మాత్ముడు కాడు. పరమ దుర్మార్గుడు. బాల్యము నుండి అతడు బ్రాహ్మణులను బాధించేవాడు. అందరినీ హింసించేవాడు. కుమారుని దుర్మార్గాలకు మధువుకు కోపం వచ్చేది. కాని పుత్రవ్యామోహంతో ఏమీ అనేవాడు కాదు. రుద్రుడు తనకు ఇచ్చిన శూలమును తన కుమారుడు లవణుడికి ఇచ్చి,

దాని మహిమలను కుమారుడికి చెప్పి, మధువు వరుణలోకమునకు వెళ్లిపోయాడు. లవణుడు అసలే దుర్మార్గుడు దానికి తోడు అజేయమైన శూలము అతని చేతిలో ఉంది. అతని దుర్మార్గాలకు పట్టపగ్గాలు లేకుండాపోయాయి. అతడు ఋషులను, మునులను, బ్రాహ్మణులను బాధించసాగాడు. ఓ రామా! మీరు మమ్ములను ఆ లవణుడి నుండి రక్షించాలి. నీ దగ్గరకు రాక ముందు మేము చాలా మంది రాజుల దగ్గరకుపోయి రక్షణ కల్పించమని అడిగాము. కానీ ఏ రాజూ లవణుడికి భయపడి మమ్మల్ని రక్షించడానికి ముందుకు రాలేదు. నీవు రావణుడు అనే రాక్షసుని సంహరించి నట్టు విని మీ దగ్గరకు వచ్చాము. నీవే ఈ కార్యమును నెరవేర్చుటకు సమర్థుడవు అన్న నమ్మకంతో వచ్చాము. ఈ భూలోకములో మమ్ములను రక్షించేవాడు నీవు తప్ప మరొకడు లేడు. తరువాత నీ ఇష్టం." అని చెప్పి మౌనం వహించారు ఆ మునులు.

"ఓ మహా ఋషులారా! ఆ లవణుడు ఎక్కడ ఉంటాడు. వాడి ఆహార అలవాట్లు ఏమిటి? వాడు ఎక్కడెక్క తిరుగుతుంటాడు. ఏం పనులుచేస్తుంటాడు. వివరంగా చెప్పండి." అని అడిగాడు. ఆ ఋషులు లవణుడి గురించి ఇలా చెప్పారు. "వాడు మాంసాహారి. అన్ని రకములైన ప్రాణులను చంపి తింటాడు. ఎక్కువగా మునులను బాధిస్తుంటాడు. వాడు అతి క్రూరుడు. వాడు ఉండేది మధువనంలో. వాడికి అది ఇదీ అని లేదు. జంతువులను, మనుషులను చంపి తింటాడు." అని అన్నారు ఆ ఋషులు. రాముడు వారికి అభయం ఇచ్చాడు.

తరువాత రాముడు తన సోదరులను చూచి ఇలా అన్నాడు. "మీలో ఎవరు లవణుని చంపగలరు. భరతుడా లేక శత్రుఘ్నుడా!" అని అన్నాడు. వెంటనే భరతుడు "అన్నయ్యా! వాడిని నా పాల బడనివ్వండి. వాడిని నేను చంపుతాను." అని అన్నాడు భరతుడు. వెంటనే శత్రుఘ్నుడు లేచి "అన్నయ్యా! భరతుడు మీరు లేని రోజుల్లో ఈ రాజ్యభారము వహించి అలసి పోయాడు.  ఇంకా ఆయనను ఈ యుద్ధాలతో కష్టపెట్టకండి. ఆయనకు విశ్రాంతినివ్వండి. ఆ లవణుని నేను చంపుతాను. ఆ అవకాశం నాకు ఇవ్వండి." అని అన్నాడు. ఆ మాటలకు రాముడు ఎంతో సంతోషించాడు. "శత్రుఘ్నా! ఆ ప్రకారమే కానిమ్ము. నీవు ఆ లవణుని చంపు. నిన్ను ఆ మధునగరమునకు రాజుగా చేస్తాను. ఒక రాజ్యమును జయించిన తరువాత ఆ రాజ్యమునకు పాలకుడిని నియమించకపోతే, జయించిన వాడికి నరకం తప్పదు. అదీ కాకుండా  నీవు కూడా నీ పరాక్రమముతో, సామర్థ్యముతో ఒక రాజ్యము ఏర్పరుచుకున్నట్టు అవుతుంది. అదే వీరుడి లక్షణము. అన్న కష్టపడకూడదు అన్న నీ భావన ఎంతో శ్లాఘనీయము. నీవు లవణుని జయించి, వాడిని సంహరించి, ఆ రాజ్యమును స్వాధీనం చేసుకో. యమునా నదీ తీరంలో ఉద్యాన వనములను, సుందరమైన నగరములను నిర్మించు. ఇక్ష్వాకుల రాజ్యమును విస్తరించు.  మధునగరాన్ని పాలించు. నీ విజయ వార్త విని నేను తమ్ములు, వసిష్టుడు మొదలగు వారు వచ్చి నీకు పట్టాభిషేకమును జరిపిస్తాము." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవైరెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## అరవై మూడవ సర్గ.

రాముడు తనను పొడుగుతూ ఒక రాజ్యానికి రాజును చేస్తానంటే శత్రుఘ్నుడు కొంచెం సిగ్గు పడ్డాడు. "అన్నయ్యా! నేను అందరిలోకీ చిన్న వాడిని కేవలం లవణుడిని సంహరిస్తాను అన్నాను. కానీ నన్ను రాజును చెయ్యడం ఏమిటి. నా కన్నా పెద్దవాళ్లు ఉన్నారు కదా! పెద్దవాళ్లు ఉండగా చిన్న వాళ్లు పట్టాభిషిక్తులుకావడం ధర్మమా! కానీ నీ ఆజ్ఞ తప్పక పాటిస్తాను. లవణునితో యుద్ధం చేస్తాను. కానీ నాకన్నా ముందు భరతుడు లవణుని చంపుతాను అన్నప్పుడు నేను మధ్యలో అడ్డుకోవడం పొరపాటు. ఈ అవకాశము భరతుడికి ఇవ్వకుండా నేను లవణుడిని చంపుతాను అనడం నేను చేసిన తప్పు. అన్న మాటలకు ఎదురు చెప్పకూడదు అని తెలిసి కూడా నేను భరతుని మాటలకు విరుద్ధంగా మాట్లాడాను. ఒక సారి భరతుని మాటలను కాదని నేను లవణున్ని చంపుతాను అని తప్పుచేసాను. ఇప్పుడు నీ మాటను కూడా కాదని మరొక తప్పు చేయను. నీ ఆజ్ఞప్రకారమే నడుచుకుంటాను." అని అన్నాడు శత్రుఘ్నుడు.

అతనిమాటలు విన్న రాముడు లక్ష్మణునితో, భరతునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! భరతా! శత్రుఘ్నుని పరాక్రమము నాకు తెలియును. అతడు లవణుని చంపగలడు. కాబట్టి ఇప్పుడే ఇక్కడే శత్రుఘ్నునికి పట్టాభిషేకం జరిపిస్తాను. తగిన సంభారములను తీసుకొని రండి. వసిష్టుని ఋత్విక్కులను పిలిపించండి. " అని ఆదేశించాడు.

(విభీషణుడికి కూడా రావణ సంహారం ముందే లంకకు పట్టాభిషిక్తుని చేసాడుకదా! రాముడు ఏదైనా సంకల్పిస్తే దానికి తిరుగు ఉండదు.) శత్రుఘ్నుని మధు నగరమునకు పట్టాభిషిక్తుని చేయడానికి ఏర్పాట్లు చకా చకా సాగిపోయాయి. రాముడు శత్రుఘ్నుని మధునగరమునకు రాజుగా పట్టాభిషిక్తుని చేసాడు. అయోధ్యానగర పౌరులు ఈ పట్టాభిషేక మహోత్సవమును చూచి మహదానందభరితులయ్యారు. కౌసల్య, సుమిత్ర, కైక ఇంకా ఇతర రాజమాతలు, అంత:పుర కాంతలు శత్రుఘ్నునికి మంగళహారతులు ఇచ్చారు. శత్రుఘ్నుడు మధునగరానికి పట్టాభిషిక్తుడు అయ్యాడు అన్న వార్త తెలిసిన మహాఋషులు "ఇంక లవణుని చావు తథ్యం" అని అనుకున్నారు.

అప్పుడు రాముడు శత్రుఘ్నుడిని చూచి ఇలా అన్నాడు. "శత్రుఘ్నా! నీకు నా శుభాకాంక్షలు. నీవు లవణాసురుని మీదికి యుద్ధానికి వెళుతున్నావు. వాడి దగ్గర ఒక దివ్యమైన శూలం ఉంది. దానికి దీటుగా నేను నీకు ఒక దివ్యమైన అస్త్రమును ఇస్తున్నాను. ఇది శత్రువులను నాశనం చేస్తుంది. దీనితో లవణాసురుడిని సంహరించు. కల్పాంతమున శ్రీమహావిష్ణువు మహాసముద్రములో  పడుకొని ఉన్నప్పుడు ఆయనకు రక్షణగా ఈ అస్త్రము సృష్టించబడింది. దీనిని దేవతలు కానీ, దానవులుకానీ చూడలేరు. ఎల్లప్పుడూ ఈ అస్త్రము అదృశ్యరూపంలో ఉంటుంది. శ్రీమహావిష్ణువు మధు కైటభులను చంపడానికి, రాక్షస సంహారానికి ఈ అస్త్రమును సృష్టించాడు. ఈ అస్త్రముతో మధు, కైటభులు అనే రాక్షసులను చంపి ఈ లోకాలను సృష్టించాడు విష్ణువు. నేను రావణునితో యుద్ధం చేసే సమయంలో ఈ అస్త్రమును

ప్రయోగిద్దామని అనుకున్నాను. కాని ఈ అస్త్రమును ప్రయోగిస్తే విపరీతంగా ప్రాణనష్టము సంభవిస్తుంది. కేవలం రావణుని గురించి అమాయకులైన రాక్షసులను చంపడం ఇష్టంలేక ఈ అస్త్రమును రావణుని మీద ప్రయోగించలేదు. నేను సేకరించిన సమాచారము ప్రకారము లవణుడు తనకు తండ్రివలన లభించిన పరమేశ్వరదత్త శూలమును పూజా గృహములో భద్రపరిచి నిత్యము పూజలు చేస్తూ ఉంటాడు. దానిని బయటకు తీయడు. ఎవడైనా తనను ఎదిరించి నపుడు, తనతో యుద్ధానికి వచ్చినపుడు మాత్రమే ఆ శూలమును ధరించి శత్రువులను చంపుతాడు.  తాను ఆహారము కొరకు బయటకు వెళ్లేటప్పుడు కూడా దానిని పూజా మందిరములో భద్రపరిచి బయటకు వెళుతాడు. ఆ దివ్యమైన శూలము అతని చేతిలో లేకపోతే అతనిని సులభంగా చంప వచ్చును. కాబట్టి నీవు ఆయుధములను ధరించి, లవణుడు ఆహారము కోసరము బయటకు వెళ్లగానే అతని నగర ద్వారము దగ్గర పొంచి ఉండు. అతడు ఆహారమును సేకరించుకొని తిరిగి వచ్చునపుడు అతనితోయుద్ధానికి తలపడు. లవణుడికి లోపలికి వెళ్లి శూలమును తెచ్చుకొనే వ్యవధి ఇవ్వకు. అతడు తన మందిరములోనికి ప్రవేశించక ముందే అతనితో యుద్ధము చేసి సంహరించు. మరొక విధంగా అతనిని చంపడం అసాధ్యము. పరమేశ్వరుని శూలమును జయించడం ఎవరి తరమూ కాదు." అని చెప్పాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## అరువది నాలుగవ సర్గ.

ఆ ప్రకారంగా రాముడు శత్రుఘ్నునికి లవణాసురుని ఎలా చంపాలో వివరంగా చెప్పాడు. శత్రుఘ్నునికి సాయంగా 4000 గుర్రాలు, రెండు వేల రథాలు, నూరు ఏనుగులు, ఇంకా కాల్బలము పంపాడు రాముడు. సైన్యమును పోషించడానికి అతని వెంట లక్ష బంగారు నాణెములు కల బండ్లను పంపాడు. వినోదము కొరకు అనేక మంది నర్తకీమణులను పంపాడు. రాముడు శత్రుఘ్నునకు మరొక విషయం కూడా చెప్పాడు. "శత్రుఘ్నా! ముందు సైన్యాన్ని పంపు. ఆ సైన్యము ఎవరిదో తెలియనియ్యకు. తరువాత నీవు వెళ్లు.  నీవు లవణుని మీదికి దండయాత్రకు వస్తున్నట్టు లవణునికి తెలియనివ్వకు. వాడికి నీ మీద ఎటువంటి అనుమానము రానీయకు. అప్పుడే వాడిని నీవు చంపగలవు. ఒకసారి వాడికి నీవు ఎవరో తెలిస్తే నిన్ను బతుకనివ్వడు. ఇప్పుడు గ్రీష్మఋతువు. వర్షఋతువు ప్రారంభం కాగానే అతనిని చంపడానికి బయలుదేరు. నీ సైన్యములను గ్రీష్మఋతువులోనే గంగానదిని దాటించు. వర్షములు మొదలయితే గంగానదిని దాటడం కష్టం. నీ సైన్యమును గంగానదీ తీరంలో విడిది చేయించు నువ్వు ఒంటరిగా వాడి దగ్గరకు వెళ్లు. అవసరం అయితే నీకు సాయంగా నీ సైన్యం వస్తారు. ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటేనే గానీ నీవు వాడిని చంపలేవు." అని పలికాడు రాముడు.

రాముని మాటలను శ్రద్ధగా విన్నాడు రాముడు. వెంటనే తన సేనాధి పతులను పిలిచాడు. వారికి రాముడు చెప్పిన సూచనలు అన్నీ ఇచ్చాడు. ముందు సైన్యమును పంపాడు. శత్రుఘ్నుడు తన తల్లులు అయిన కౌసల్య, కైకేయి, సుమిత్రల ఆశీర్వాదము తీసుకున్నాడు. కులగురువు వసిష్టుల వారికి నమస్కరించి ఆయన ఆశీర్వాదము తీసుకున్నాడు. రాముడికి నమస్కరించాడు. ముందు తన సేనలను పంపి వారి వెంట తనుకూడా బయలుదేరాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము అరవైనాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## అరవై ఐదవ సర్గ.

శత్రుఘ్నుడు మధు పురానికి వెళుతూ, రెండు రోజుల ప్రయాణం తరువాత, మార్గ మధ్యలో గంగానదీ తీరంలో ఉన్న వాల్మీకి ఆశ్రమానికి వెళ్లాడు. శత్రుఘ్నుడు వాల్మీకి మహర్షికి నమస్కరించి తాను ఆ రాత్రికి వాల్మీకి ఆశ్రమంలో విశ్రాంతి తీసుకోడానికి అనుమతి కోరాడు. వాల్మీకి మహర్షి శత్రుఘ్నుని సాదరంగా ఆహ్వానించి అర్ఘ్యము పాద్యము సమర్పించాడు. శత్రుఘ్నునితో ఇలా అన్నాడు. "శత్రుఘ్నా! ఈ ఆశ్రమము ఇక్ష్వాకుల పాలనలో ఉంది. కాబట్టి ఇది నీ ఆశ్రమమే అనుకో. ఇక్కడ నీవు యధేచ్ఛగా ఉండవచ్చును. ఈ ఫలములను తిని ఈ రాత్రికి ఇక్కడ

విశ్రాంతి తీసుకో." అని అన్నాడు వాల్మీకి. శత్రుఘ్నుడు చాలా సంతోషించాడు. వాల్మీకి ఆతిథ్యాన్ని స్వీకరించాడు. శత్రుఘ్నుడు పరిసరప్రాంతాల్లో తిరుగుతూ ఉంటే అక్కడ శత్రుఘ్నునికి ఒకయజ్ఞవాటిక కనపడింది. అది ఎవరిది అని వాల్మీకి మహర్షిని అడిగాడు శత్రుఘ్నుడు. అప్పుడు వాల్మీకి శత్రుఘ్నునికి ఇలా చెప్పాడు.

"శత్రుఘ్నా! మీ పూర్వీకులలో సుదాసు అనే రాజు ఉండేవాడు. అతడు పరమ ధార్మికుడు. అతని కుమారుడు మిత్రసహుడు. అతనినే సౌదాసుడు అని కూడా అంటారు. ఒకరోజు సౌదాసుడు వేటకై అడవికి వెళ్లాడు. అక్కడ ఇద్దరు రాక్షసులను చూచాడు. ఆ ఇద్దరు రాక్షసులు ఆ అరణ్యములో నివసిస్తున్నారు. వారు ఇద్దరూ పెద్దపులుల ఆకారములు ధరించి ఆ అరణ్యములో ఉన్న మృగములను విచక్షణారహితంగా చంపి తింటున్నారు. కొంత కాలానికి ఆ అడవిలో మృగజాతి అంతా అంతరించి పోతూ ఉంది. ఈ సంగతి తెలిసిన సౌదాసుడు ఆ ఇద్దరు రాక్షసులను తన బాణములతో కొట్టాడు. ఆ బాణముల దెబ్బకు ఒక రాక్షసుడు మరణించాడు. మరొకడు పారిపోయాడు. తన మిత్రుని చంపిన సౌదాసుకు ప్రతిక్రియ చేయాలని అనుకున్నాడు. సమయం కోసరం వేచి చూస్తున్నాడు.

సుదాసుని తరువాత సౌదాసుడు రాజయ్యాడు. సౌదాసుడు ఇక్కడే అశ్వమేధ యాగము చేసాడు. ఆ యజ్ఞమునకు వసిష్ఠుడు ఆధ్వర్యము వహించాడు. అవకాశము కోసరం ఎదురుచూస్తున్న ఆ రాక్షసుడు ఒక రోజు వసిష్ఠుని రూపంలో సౌదాసుని వద్దకు వచ్చాడు.

"రాజా! బాగా ఆకలిగా ఉంది. నాకు మాంసముతో భోజనము వడ్డించు." అని అన్నాడు. వసిష్ఠుడు బ్రాహ్మణుడు. శాఖాహారి. మాంసము ఎందుకు వడ్డించమన్నాడో అర్థం కాలేదు. అయినా ఆయనే కోరాడు కదా అని వంట వాళ్లను పిలిచి వషిష్ఠునికి మంచి రుచికరమైన మాంసాహారమును తయారు చేసి వడ్డించమన్నాడు. వంటవాడు సరే అని వంటింట్లోకి వెళ్లాడు. వసిష్ఠుని రూపంలో ఉన్న రాక్షసుడు మాయం అయ్యాడు. ఆ వంట వాడిలో ప్రవేశించాడు. మాంసాహారానికి బదులు మనుష్య మాంసముతో చేసిన వంటకములను తయారు చేసాడు. ఇంతలో అసలు వసిష్టుడు భోజనానికి వచ్చాడు. సౌదాసుడు ఆయన భార్య మదయంతి, వంటవాడి రూపంలో ఉన్న రాక్షసుడు వండిన మనుష్య మాంసాహార మును వసిష్ఠునికి వడ్డించారు. తనకు వడ్డించినది మనుష్య మాంసము అని వసిష్ఠుడు గ్రహించాడు. సౌదాసుడు చేసిన అకృత్యానికి కోపం వచ్చింది. వెంటనే సౌదాసునితో "రాజా! నేను బ్రాహ్మణుడిని శాకాహారిని అని కూడా చూడకుండా నాకు మనుష్య మాంసమును ఆహారంగా వడ్డిస్తావా. ఇంకనుండి నీవు మనుషులను చంపి తింటూ ఉండు ఇదే నీకు ఆహారము." అని శపించాడు.

తన తప్పు ఏమీ లేకపోయినా తనను వసిష్ఠుడు శపించడం చూచి సౌదాసుడు కోపంతో ఊగి పోయాడు. వసిష్ఠునికి ప్రతిశాపం ఇవ్వబోయాడు. అప్పుడు అతని భార్య మదయంతి ఆయనను వారించింది. "నాధా! వసిష్ఠుడు శాంతమూర్తి. మీకు గురువు. పురోహితుడు. మనక్షేమం కోరేవాడు. ఆయనకు శాపం ఇవ్వడం తగదు. ఇందులో ఏదో మోసం ఉంది. విచారించండి." అని పలికింది.

సౌదాసుడు తన చేతిలో ఉన్న శాపజలాన్ని తన కాళ్ల మీదకు విడిచిపెట్టాడు. ఆ శాపజలము ప్రభావానికి సౌదాసుని కాళ్లు నల్లగా కమిలిపోయాయి. అప్పటినుండి సౌదాసునికి కల్మాషపాదుడు అనే పేరు వచ్చింది. తరువాత సౌదాసుడు, ఆయన భార్య మదయంతి వసిష్ఠునికి నమస్కరించి జరిగిన విషయం చెప్పారు. తను మాంసభోజనం కోరడం ఏమిటా అని వసిష్ఠునికి సందేహం వచ్చింది. వెంటనే దివ్యదృష్టితో చూచి అసలు విషయం తెలుసుకున్నాడు. ఇదంతా ఆ రాక్షసుడు ఆడిన నాటకం అని గ్రహించాడు వసిష్ఠుడు. అనవసరంగా సౌదామునికి శాపం ఇచ్చానే అని బాధపడ్డాడు.

"రాజా! పొరపాటున నీకు ఇచ్చిన నా శాపాన్ని వెనక్కు తీసుకోలేను. కాని నీకు ఒక వరం ఇస్తాను. నేను నీకు ఇచ్చిన శాపము 12 సంవత్సరములుమాత్రమే ఉంటుంది. ఆ తరువాత నీవు నీ నిజస్వరూపమును పొందగలవు. నీవు రాక్షసుడిగా ఉన్నప్పుడు చేసిన పనులు గానీ, తిన్న ఆహారము గురించి గానీ నీకు ఏమీ గుర్తు ఉండదు. ఈ రోజు తరువాత ఆ రోజు వచ్చినట్టు ఉంటుంది." అని అన్నాడు వసిష్ఠుడు. ఆ తరువాత సౌదాసుడు వసిష్ఠుడు ఇచ్చిన శాపమును అనుభవించి తరువాత మరలా రాజై రాజ్యము చేసాడు. నీవు చూసిన యజ్ఞవాటిక ఆ నాడు సౌదాసుడు చేసిన అశ్వమేధయాగ యజ్ఞవాటిక."అని చెప్పాడు వాల్మీకి.

ఆ కథ విన్న శత్రుఘ్నుడు ఆశ్చర్యపోయాడు. కేవలం చిన్న అపోహతో నిరపరాధి అయిన సౌదాసుడు అంత పెద్ద శిక్ష

అనుభవించాడు అని అనుకున్నాడు. శత్రుఘ్నుడుఆ రాత్రికి వాల్మీకి ఆశ్రమంలో విశ్రాంతి తీసుకున్నాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవై అయిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

అరవై ఆరవ సర్గ.

శత్రుఘ్నుడు ఆ రాత్రి నిద్రించిన వాల్మీకి ఆశ్రమమునకు సమీపములోనే సీతాదేవి, ఇతర ముని కాంతలు నివసిస్తున్న ఆశ్రమములు ఉన్నాయి. శత్రుఘ్నుడు వాల్మీకి ఆశ్రమంలో నిద్రించిన రాత్రి అక్కడ సీతాదేవికి నెలలు నిండి, ఇద్దరు మగశిశువులను ప్రసవించింది. ముని కుమారుడు ఆ విషయమును వెంటనే ఆ అర్ధరాత్రి వాల్మీకికి తెలియజేసారు.  వాల్మీకి చాలా సంతోషించాడు.

మరునాడు ఉదయమే వాల్మీకి  సీతాదేవి ఉన్న ఆశ్రమానికి వెళ్లాడు. వాల్మీకి ఆ శిశువులకు భూతబాధను నివారించడానికి రక్షలు కట్టాడు. సీతాదేవికి పుట్టిన ఆ ఇరువురు పుత్రులు మహాతేజంతో ప్రకాశిస్తున్నారు. ముని కుమారులు దర్భలను వేళ్లతో సహా తీసుకొని వచ్చారు. దర్భల వేళ్ల భాగములను లవములు అంటారు. దర్భల కొస భాగములను కుశములు అంటారు. వాటితో వాల్మీకి ఆ బిడ్డలకు రక్ష

చేసాడు. అంటే ఆ దర్భలను వారి ఒంటి మీద మార్జనం చేసాడు అంటే తుడిచాడు. ముందు పుట్టిన వాడికి దర్భకుశలతో మార్జనం చేసాడు కాబట్టి అతనికి కుశుడు అనే నామకరణం చేసాడు. తరువాత పుట్టిన వాడికి దర్భ మొదళ్లతో అంటే లవములతో మార్జనం చేసాడు కాబట్టి లవుడు అనే నామకరణం చేసాడు.  ఆ ప్రకారంగా వృద్ధస్త్రీలు ఆ శిశువులకు మార్జనం చేసారు. అప్పటి నుండి సీతాదేవి కుమారులు కుశలవులు అనే పేరుతో పిలువబడ్డారు.

(కొన్ని రామాయణాల్లో శత్రుఘ్నుడు సీతాదేవి ఆశ్రమానికి వచ్చి బిడ్డలను చూచినట్టు ఉంది. మరి కొన్నింటిలో తన పర్ణశాలలోనే ఉండి "తల్లీ నీవు బిడ్డలతో సుఖంగా ఉన్నావు" అని మనసులోనే అనుకున్నట్టు ఉంది. అంతదూరం వచ్చి, తన వదిన సీతకు ఇద్దరు శిశువులు కలిగారు అని తెలిసిన శత్రుఘ్నుడు అక్కడకు రాకుండా ఉంటాడా! దీనికి రాముడి అనుమతి అక్కరలేదు. కాబట్టి శత్రుఘ్నుడు వచ్చి సీతను చూచి బిడ్డలను ఆశీర్వదించాడు అని అనుకుందాము. తప్పేముంది. ఇందులో మరొక విశేషం కూడా ఉంది. ఆ శావణమాసరాత్రి తొందరగా గడిచిపోయింది అని రాయబడింది. అంటే కుశలవులు శ్రావణమాసంలో జన్మించారు అని అర్థం అవుతూ ఉంది. రాముడు చైత్రమాసంలో పుట్టాడు. సరిగ్గా నాలుగు మాసాల తరువాత శ్రావణబహుళ అష్టమి నాడు కృష్ణుడు పుట్టాడు. అదే శ్రావణమాసంలో కుశలవులుకూడా పుట్టారు. అందుకే చైత్రమాసము, శ్రావణ మాసము అంత పవిత్రం అయ్యాయి.)

మరునాడు శత్రుఘ్నుడు వాల్మీకి వద్ద సెలవు తీసుకొని పశ్చిమ దిశగా ప్రయాణం అయ్యాడు. ఏడు రోజులు ప్రయాణం చేసి యమునా తీరం చేరుకున్నాడు శత్రుఘ్నుడు. యమునా తీరంలో కల ఋషీశ్వరుల ఆశ్రమాలలో విశ్రాంతి తీసుకున్నాడు. చ్యవనుడు మొదలైన మహామునులను కలిసి వారితో అన్ని విషయాలు చర్చించాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవైఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

అరవై ఏడవ సర్గ.

శత్రుఘ్నుడు చ్యవన మహర్షితో చర్చల సందర్భంగా లవణుని గురించి, అతని బలము గురించి, ఇంతకు పూర్వము లవణుడితో ఎవరెవరు యుద్ధం చేసారు, ఎంతమందిని లవణుడు ఈశ్వరదత్తమైన దివ్యశూలంతో చంపాడు, ఎలా చంపాడు, అన్న విషయాలు అడిగాడు. అప్పుడు చ్యవనుడు ఈ విధంగా చెప్పసాగాడు.

“శత్రుఘ్నా! లవణుడితో యుద్ధం చేసి చచ్చిన వాళ్లు ఎంత మందో లెక్కతెలియదు. చాలామంది మరణించారు. అందులో మీ వంశమునకు చెందిన ఒక రాజును గురించి చెబుతాను. విను.

పూర్వము అయోధ్యను యవనాశ్వుని పుత్రుడైన మాంధాత పరిపాలిస్తూ ఉండేవాడు. మాంధాత గొప్ప చక్రవర్తి. భూలోకము నంతా జయించాడు. దేవలోకమును కూడా జయించవలెనని ప్రయత్నించాడు. ఇదివినిన ఇంద్రుడికి, దేవతలకు భయం పట్టుకుంది. తన సైన్యాలతో దేవలోకానికి వచ్చిన మాంధాతతో రాజీప్రయత్నాలు మొదలుపెట్టారు. స్వర్గంలో సగం, దేవేంద్రుని సింహాసనములో సగం ఇస్తాము అని అన్నారు. కాని మాంధాత ఒప్పుకోలేదు. తనకు స్వర్గలోకాధిపత్యము సంపూర్ణంగా కావాలని పట్టుబట్టాడు.

ఇంద్రుడు ఆయనను స్వస్థత పరుస్తూ ఇలా అన్నాడు. “ఓ రాజా! నీవు భూలోకములోనే రాజువు. నీవు భూలోకమును అంతా జయించాను అనుకుంటున్నావు. అది పొరపాటు. నీవు భూలోకమును పూర్తిగా జయించలేదు. భూలోకమును పూర్తిగా జయించి నీ పాలనలోకి తీసుకొచ్చిన తరువాత దేవ లోకాధిపత్యము కోరుకొనుము.” అని అన్నాడు.

ఆ మాటలకు మాంధాతకు అనుమానం వచ్చింది. “ఇంద్రా! నేను భూమి నంతా జయించాను. భూలోకం అంతా నా స్వాధీనంలో ఉంది. భూలోకంలో ఎక్కడ ఏ ప్రాంతంలో నా ఆధిపత్యం అధికారము కొనసాగడం లేదు. చెప్పు” అని నిలదీసాడు. “ఓ రాజా! మధు వనములో నివసిస్తున్న మధువు అనే రాక్షసుని కుమారుడు లవణుడు నీ మాటను మన్నించడంలేదు. స్వతంత్రంగా వ్యవహరిస్తున్నాడు. ముందు వాడిని జయించి తరువాత దేవలోకము వంక చూడు.” అని అన్నాడు.

మాంధాత అవమానంతో తల వంచుకున్నాడు. మరలా భూలోకమునకు వచ్చాడు.  సైన్యాలను సమీకరించాడు.  వెంటనే లవణుని మీద యుద్ధం ప్రకటించాడు. లవణుని వద్దకు ఒక దూతను పంపాడు. తనకు లొంగిపొమ్మని చెప్పాడు. లవణాసుడు ఆ దూతను చంపి ఉపాహారంగా  తినేసాడు. ఇది విన్నమాంధాత తన సైన్యముతో మధువనమును చుట్టుముట్టాడు. లవణాసురుని మీద బాణవర్షము కురిపించాడు. లవణాసురుడు తన వద్ద ఉన్న దివ్యశూలమును మాంధాత మీద, అతని సేనలమీదా ప్రయోగించాడు. ఆ శూలము నిప్పులు కక్కుకుంటూ వెళ్లి మాంధాతను, అతని సైన్యమును సమూలంగా నాశనం చేసి తిరిగి లవణుని వద్దకు వచ్చి చేరింది.

కాబట్టి ఓ శత్రుఘ్నా! ఆ శూలము మహిమ అంత గొప్పది. కాబట్టి లవణుని తెలివిగా చంపాలి కానీ ఎదురు పడి చంపకూడదు. అతని చేతిలో శూలం లేని సమయంలోనే అతనిని చంపాలి. ఉదయం పూట అతని చేతిలో శూలం ఉండదు. లవణుడిని చంపడానికి అదే సరి అయిన సమయం. నీవు తప్పకుండా లవణునికి చంపగలవు.  లవణుని చావు వలన లోకాలకు మేలు జరుగుతుంది.

శత్రుఘ్నా! లవణుని గురించి పూర్తి వివరాలు నీకు చెప్పాను. పరమేశ్వరుడు ఇచ్చిన శూలమే అతని బలము. ఇంద్రుడు తాను మాంధాతను చంపలేక, లవణుని మీదికి పురికొల్పి అతని చేత మాంధాతను చంపించాడు. నీవు కూడా కపటముతోనే లవణుని చంపాలి.

రేపు ఉదయము అతడు శూలం లేకుండా నగరం బయటకు ఆహారం కోసరం వస్తాడు. ఆ సమయంలోనే నీవు అతనిని చంపగలవు. నీకు జయం కలుగుతుంది." అని ఆశీర్వదించాడు చ్యవనుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవై ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

అరవై ఎనిమిదవ సర్గ.

ఆరాత్రి గడిచిపోయింది. మరునాడు తెల్లవారగానే యధావిధిగా లవణుడు ఆహారము కొరకు నగరము విడిచి బయలుదేరాడు. ఇదే సమయమని శత్రుఘ్నుడు ధనుర్బాణములు ధరించి, యమునా నదిని దాటి, మధునగరము ముఖద్వారము దగ్గరకు వచ్చాడు. మధ్యాహ్న సమయానికి లవణుడు కొన్ని వేల జంతువులను వేటాడి వాటిని తీసుకొని నగరానికి వచ్చాడు. నగర ద్వారము దగ్గర ధనుర్బాణములను ధరించి నిలబడ్డ శత్రుఘ్నుని చూచాడు. అతని వద్ద ఉన్న ధనుర్బాణములను చూచాడు.

"ఓరీ నరాధమా! ఈ ఆయుధముతో నన్నేమి చేస్తావురా! నీ లాంటి వారిని నేను కొన్ని వేల మందిని చంపి తిన్నాను. నీకు కాలము మూడి నా దగ్గరకు వచ్చావు. ఈ రోజు నాకు నరమాంసము చాలినంతగా

దొరకలేదు.  రా నిన్ను కూడా తింటాను.” అని అన్నాడు లవణుడు.

“ఓరీ రాక్షసుడా! రారా. నాతో యుద్ధం చెయ్యి. ఈరోజు నీ చావు నా చేతిలో ఉంది. నేను ఎవరో తెలుసా. ఇక్ష్వాకు వంశ చక్రవర్తి దశరథమహారాజు కుమారుడను. రాముని సోదరుడను. శత్రుఘ్నుడను. నిన్ను చంపడానికే అయోధ్య నుండి ఇక్కడకు వచ్చాను. నిన్ను చంపి ఈ లోకానికి పట్టిన పీడ వదిలిస్తాను.” అని అన్నాడు.

ఆ మాటలకు లవణుడు పెద్దగా నవ్వాడు. “అవును అంత దూరం నుండి నా చేతిలో చావడానికి నా దగ్గరకు వచ్చావు. నీ రాముడు చంపిన రావణుడు నాకు మేనమామ. మా అమ్మ సోదరుడు. రాముడు ఒక ఆడుదాని గురించి నా మేనమామను చంపాడు. రావణ కులమును నాశనం చేసాడు. అయినా నేను రాముని క్షమించాను. నాకు రాముడు అంటే లెక్కలేదు. నా ముందు రాముడు ఒక అల్పజీవి. రాముడి లాంటి వాళ్లను ఎంతో మందిని నేను చంపాను. నువ్వు నీ రాముడు నా ముందు గడ్డిపరకల లాంటివాళ్లు. నాతో యుద్ధము చేస్తాను అన్నావు కదా. కాసేపు ఉండు నేను లోపలకు పోయి ఆయుధమును తెచ్చుకుంటాను. నేను ఆయుధమును చేతబూని యుద్ధమునకు సిద్ధం అయ్యేవరకూ ఆగు.” అని అన్నాడు లవణుడు.

“నేను ఇక్కడ ఉండగా నువ్వు ఎక్కడకు పోతావు. ఇప్పుడే ఇక్కడే యుద్ధం చెయ్యి. చేత చిక్కిన శత్రువును విడిచి పెట్టడానికి నేను వెర్రివాడను కాను. నీ మాటలను బట్టి చూస్తే నీవు నాకే కాదు రామునికి

కూడా శత్రువు. నిన్ను విడువకూడదు. నిన్ను ఇప్పుడే చంపుతాను.కాచుకో. ఈ లోకమును ఇప్పుడే తనివిదీరా చూచుకో! " అని అన్నాడు శత్రుఘ్నుడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము అరవై ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

ఉత్తర కాండము
అరవై తొమ్మిదవ సర్గ.

"నిన్ను చంపడానికి నాకు వేరే ఆయుధము ఎందుకురా! నిన్ను ఇప్పుడే చంపుతాను" అంటూ లవణుడు రెండు అరిచేతులను చరచుకుంటున్నాడు.

"ఒరేయ్! నీవు ఎంతో మందిని చంపాను అని ప్రగల్భాలు పలుకుతున్నావు కదా! అప్పుడు నేనుపుట్టలేదు. ఇప్పుడు నేను నీ ఎదుట ఉన్నాను. ఇంక చావడమే కానీ చంపడం నీ తరం కాదు. నా బాణాలదెబ్బకు యమలోకం దాకా పరుగెత్తు. రాముడు రావణుని చంపుతున్నప్పుడు ఆకాశంలో నిలిచి దేవతలు, ఋషులు చూచి ఎలా ఆనందించారో అలాగే నేను నిన్ను చంపుతుంటే ఆకాశం నుండి దేవతలు గంధర్వులు చూచి ఆనందిస్తారు. నీవు నా బాణముల దెబ్బలు తిని నేలకూలగానే ఈ లోకం అంతా ఆనందిస్తుంది. నా ధనుస్సు నుండి వెలువడ్డ బాణాలు నీ గుండెల్లో దిగబడి నిన్ను హతమారుస్తాయి. " అని

అన్నాడు శత్రుఘ్నుడు.

ఇన్నాళ్లు తనను చూచి గడగడవణికిన వాళ్లే కానీ ఎదురు నిలిచి మాట్లాడిన వాళ్లు లేరు. అందుకని లవణునికి రోషం పెల్లుబికింది. మారుమాట్లాడకుండా పక్కనే ఉన్న ఒక పెద్ద వృక్షమును పెరికి శత్రుఘ్నుని గుండెలకు గురిపెట్టి విసిరాడు. శత్రుఘ్నుడు తన బాణములతో ఆ వృక్షమును ముక్క ముక్కలుగా నరికాడు. లవణుడు ఈ సారి రెండు చేతులతో వృక్షములను పెకలించి శత్రుఘ్నుడు మీదికి విసిరాడు. శత్రుఘ్నుడు తన మీదికి వస్తున్న వృక్షములను తన బాణములతో ముక్కల కింద నరుకుతున్నాడు. అంతే కాకుండా శత్రుఘ్నుడు లవణుని మీద బాణములను వర్షము మాదిరి కురిపించాడు. ఆ బాణముల బారి నుండి తప్పించుకున్న శత్రుఘ్నుడు మరొక వృక్షమును పెరికి శత్రుఘ్నుని తల మీద మోదాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక శత్రుఘ్నుడు కింద పడ్డాడు. లవణుడు పెద్దగా అట్టహాసం చేసాడు.

శత్రుఘ్నుడు పడి పోగానే పరుగు పరుగున తన గృహమునకు పోయి తన దివ్యమైన శూలమును తెచ్చుకొనే అవకాశము ఉన్నా కూడా లవణుడు ఆ అవకాశాన్ని వినియోగించుకోలేదు.  శత్రుఘ్నుని లెక్కచేయలేదు. శత్రుఘ్నుడు తన చేతిలో హతం అయ్యాడు అని అనుకున్నాడు. తాను వేటాడి తెచ్చిన మృగములను పైకి ఎత్తుకున్నాడు. ఇంతలో మూర్ఛనుండి తేరుకున్న శత్రుఘ్నుడుపైకి లేచి ధనుర్బాణములను ధరించి నగర ద్వారమునకు అడ్డంగా నిలబడ్డాడు. రాముడు తనకు ఇచ్చిన అస్త్రమును విల్లుకు సంధించాడు. ఆ అస్త్రము ఎర్రగా భగా భగా

మండుతూ ఉంది. ఆ అస్త్రమును లవణుని మీదికి ప్రయోగించడానికి సిద్ధంగా ఉన్నాడు. . ఆ దివ్యమైన అస్త్రము ప్రళయాగ్ని వలె మండుతూ ఉండడం చూచి ప్రాణి కోటి గడగడలాడింది. దేవతలు గంధర్వులు మునులు అందరూ బ్రహ్మ దగ్గరకు వెళ్లారు. లోకాలు నశించిపోతాయేమో అయి అందరూ భయపడ్డారు. వారు బ్రహ్మతో ఇలా అన్నారు. "ఓ బ్రహ్మదేవా! ముల్లోకములకు ప్రళయం సంభవించినట్టు ఉంది. ఏమిటీ విపరీతము. లోకాలన్నీ భగభగ మండుతున్నాయి. ఇదివరకు ఇంతటి ప్రళయాన్ని మేము ఎప్పుడూ చూడలేదు."అని అన్నాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు జరిగిన విషయం వారితో చెప్పాడు. "లవణుడు అనే లోక కంటకుని చంపడానికి రాముని తమ్ముడు శత్రుఘ్నుడు దివ్యమైన అస్త్రమును సంధించాడు.దాని తేజస్సుతోనే ఇంతటి ప్రళయం సంభవించింది. ఇది మహావిష్ణువు బాణము. మహాశక్తివంత మైనది. పూర్వము విష్ణువు మధు, కైటభులను వధించడానికి ఈ అస్త్రమును సృష్టించాడు. ఈ అస్త్రమును గురించి విష్ణువు ఒక్కడికే తెలుసు. అసలు ఈ అస్త్రము విష్ణు స్వరూపము. మీరందరూ వెళ్లి ఆ దివ్యమైన అస్త్రముతో లవణాసురుడు ఎలాచస్తాడో చూడండి." అని అన్నాడు.

ఆ మాటలు విన్న దేవతలు, గంధర్వులు శత్రుఘ్నుడు లవణుడు యుద్ధం చేసే ప్రదేశానికి వచ్చారు. ఆకాశంలో నిలబడి వారి యుద్ధమును చూస్తున్నారు. శత్రుఘ్నుడు పెద్దగా సింహనాదం చేసాడు. లవణుని యుద్ధానికి పిలిచాడు. లవణుడు శత్రుఘ్నునితో యుద్ధానికి సిద్ధం

అయ్యాడు. శత్రుఘ్నుడు తనకు రాముడు ఇచ్చిన దివ్యాస్త్రమును విల్లుపై ఎక్కుపెట్టి, వింటి నారిని ఆకర్ణాంతము లాగి ఆ అస్త్రమును లవణుని గుండెలకు గురిపెట్టి విడిచాడు. క్షణంలో ఆ దివ్యాస్త్రము లవణుని గుండెలను చీల్చుకొని భూమిలోకి ప్రవేశించింది. మరలా అదేవేగంతో వెనుకకు వచ్చి శత్రుఘ్నుని అమ్ములపొదిలోకి చేరింది. యుగయుగాల నుండి పరమేశ్వరుడు ప్రసాదించిన శూలముతో వేలకు వేలమందిని చంపిన లవణాసురుడు, శత్రుఘ్నుడు ప్రయోగించిన దివ్యాస్త్రము దెబ్బకు గుండెలు పగిలి పర్వతము మాదిరి నేలకూలి మరణించాడు.

లవణుని మృతితో, అప్పటి దాకా లవణుని పూజామందిరములో పూజలందుకుంటున్న ఆ దివ్యమైన పరమేశ్వరుని శూలము, పైకి ఎగిరి కైలాసము చేరుకొని పరమేశ్వరునిలో లీనం అయింది. దేవతలు, గంధర్వులు,ఋషులు శత్రుసంహారం చేసిన శత్రుఘ్నుని వేనోళ్లపొగిడారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవై తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## డెబ్భయ్యవ సర్గ.

లవణాసురుని సంహారంతో దేవతాగణములు హర్షం ప్రకటించాయి. స్వయంగా దేవేంద్రుడు శత్రుఘ్నునితో ఇలా అన్నాడు. "కుమారా! మా అదృష్ట వశాత్తు నీవు లవణుని చంపి విజయుడవు అయ్యావు. లవణుని బారి నుండి ముల్లోకములకు విముక్తి కల్పించావు. నీకు ఏద్దైనా వరం ఇవ్వాలని అనుకుంటున్నాను. కోరుకో!" అని అన్నాడు. అప్పుడు శత్రుఘ్నుడు ఇంద్రునితో ఇలా అన్నాడు. "మహేంద్రా! ఈ మధు నగరాన్ని ఇప్పటిదాకా ఈ లవణాసురుడు పరిపాలించాడు. ఈ మధు నగరాన్ని నాకు రాజధానిగా చెయ్యండి." అని అడిగాడు. దానికి ఇంద్రుడు సమ్మతించాడు. శత్రుఘ్నుడికి కోరిన వరాలు ఇచ్చి ఇంద్రుడు దేవతలు స్వర్గానికి వెళ్లిపోయారు. శత్రుఘ్నుడు శ్రావణమాసంలో మధురానగరానికి పట్టాభిషిక్తుడు అయ్యాడు. అప్పటి నుండి శత్రుఘ్నుడు మధు నగరమును రాజధానిగా చేసుకొని లవణాసురుని రాజ్యమును జనరంజకంగా పరిపాలించాడు. 12 సంవత్సరాలు గడిచాయి. ఈ 12 సంవత్సరములలో ప్రజలు సుఖసంతోషాలతో జీవించారు.

ఇక్కడ వాల్మీకి కూడా మధు నగరాన్ని మధురాపురీ అనిరాసాడు.

తస్యబుద్ధి:సముత్పన్నా నివేశ్య మధురాం పురీమ్
రామపాదం నిరీక్షేహం వర్షే ద్వాదశ ఆగతే.

మధురాపురమును ఏర్పరిచిన 12 సంవత్సరముల తరువాత శత్రుఘ్నునికి రాముని చూడాలని అనిపించింది. (యమునా నదీ తీరంలో ఉన్న ప్రస్తుత

మధుర అప్పటి మధురానగరం అయి ఉండవచ్చు అనడంలో సందేహం లేదు.ఈ మధురా నగరమే నాటి కంసుని రాజధాని. శ్రీకృష్ణుని జన్మస్థలము.) శత్రుఘ్నుడు వెంటనే అయోధ్యకు బయలుదేరాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము డెబ్బదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
డెబ్బది ఒకటవ సర్గ.

లవణాసురుని సంహరించి, మధురా నగరమును రాజధానిగా చేసుకొని పన్నెండు సంవత్సరములు పరిపాలించిన తరువాత శత్రుఘ్నుడు రాముని చూడవలెనని కొద్దిగా సైన్యమును వెంటతీసుకొని అయోధ్యకు బయలుదేరాడు. ఏడు రోజుల తరువాత శత్రుఘ్నుడు గంగాతీరంలో ఉండే వాల్మీకి ఆశ్రమానికి చేరుకున్నాడు. (అప్పటికి వాల్మీకి ఆశ్రమంలో పెరుగుతున్న కుశలవులు 12 ఏళ్ల వాళ్లు అయ్యారు) శత్రుఘ్నుడు ఆ రాత్రికి వాల్మీకి ఆశ్రమంలో విడిది చేసాడు. శత్రుఘ్నుడు వాల్మీకి వద్దకు పోయి అభివాదముచేసాడు ఆయన ఇచ్చిన అర్ఘ్యము పాద్యము స్వీకరించాడు.

వాల్మీకి శత్రుఘ్నుని చూచి ఇలా అన్నాడు. "కుమారా! నీవు లవణాసురుని చంపావని తెలిసి చాలా సంతోషించాను. ఎందుకంటే లవణాసురుడు ఇప్పటిదాకా వేలకొలది రాజులను, వారి సైన్యములను

నిర్మూలించాడు. అతడిని జయించేవాడు లేడు అనుకుంటూ ఉండగా నువ్వు ఉపాయంతో లవణుడిని సంహరించావు. ముల్లోకములకు శాంతి చేకూర్చావు. రావణ వధ తరువాత అటువంటి రాక్షసుని నీవు చంపావు. నీవు లవణాసురునితో  యుద్ధం చేస్తున్నప్పుడు నేను ఇంద్ర సభలో ఉన్నాను. అక్కడి నుండి మీరిరువురి యుద్ధమును చూచాను." అని చెప్పి వాల్మీకి శత్రుఘ్నుని శిరస్సును  ఆఘ్రాణించి ఆశీర్వదించాడు.

ఆ రాత్రికి శత్రుఘ్నుడు వాల్మీకి మహర్షి ఇచ్చిన ఆతిథ్యమును స్వీకరించాడు. తీరిగ్గా కూర్చుని వాల్మీకి రచించిన రాముని కథను మునికుమారులు గానం చేస్తుంటే కర్ణపేయంగా విన్నాడు. రామకథ ఎలా జరిగిందో యథాతథంగా మునికుమారులు గానం చేస్తుంటే శత్రుఘ్నుని కళ్లవెంట నీళ్లుకారు తున్నాయి. రామ కథ మరలా తన కళ్ల ముందు జరుగుతున్నట్టు భావించాడు. శత్రుఘ్నుని వెంట ఉన్న మంత్రులు సేనాపతులు కూడా రామ కథ తమ ఎదుట మరలా జరుగుతున్నట్టు భావించారు.

"జరిగింది జరిగినట్టు రామ కథను గానం చేస్తున్నారు. మనం కలగంటున్నామా!" అని ఆశ్చర్యపోయారు. వారు శత్రుఘ్నుని వద్దకు పోయి "మహారాజా! ఈ రామకథ ఉన్నది ఉన్నట్టు జరిగింది జరిగినట్టు ఎలా రాయబడింది, ఎలా గానం చేయబడిందో వాల్మీకి మహర్షిని అడిగి తెలుసుకోండి." అని అడిగారు.

దానికి శత్రుఘ్నుడు వారితో ఇలా అన్నాడు. "మనం వారికి

అతిథులుగా వచ్చాము. రామ కథ మృదుమధురంగా గానం చేస్తుంటే విన్నాము. అంతే కానీ ఇలాంటి విషయాలు అడగకూడదు. మునుల ఆశ్రమములలో ఎన్నోవిషయాలు జరుగుతూ ఉంటాయి. వాటి గురించి మనం అడగడం బాగుండదు." అని మందలించాడు. తరువాత శత్రుఘ్నుడు వాల్మీకి మహర్షికి నమస్కరించి తనకు ఏర్పరిచిన శయనాగారమునకు వెళ్లిపోయాడు.(ఇప్పటి దాకా వాల్మీకి రామాయణ గాధను ఎవరు గానం చేసారో చెప్పలేదు. సంగీత బద్ధంగా గానం చేసారు అన్నాడే గానీ, ఎవరు గానం చేసారు అన్న విషయాన్ని సస్పెన్సులో ఉంచాడు వాల్మీకి.)

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము డెబ్బైఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

డెబ్బైరెండవ సర్గ.

శత్రుఘ్నుడు తన శయ్య మీద పడుకున్నాడే కానీ ఆ మృదుమధురగానం వినిపిస్తూనే ఉంది. చెవిలో మార్మోగుతూనే ఉంది. శత్రుఘ్నుడుకి ఎంతకూ నిద్ర రాలేదు. ఆ గానం చేసింది ఎవరా అని ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాడు. మరునాడు ఉదయం శత్రుఘ్నుడు వాల్మీకి వద్దకు పోయి "ఓ మహర్షీ! నాకు రాముని చూడవలెనని కోరికగా ఉంది. అందుకని నాకు అయోధ్యకు వెళ్లడానికి

అనుమతి ఇవ్వండి" అని అడిగాడు. వాల్మీకి శత్రుఘ్నుని ఆశీర్వదించి అతను అయోధ్యకు పోవడానికి అనుమతి ఇచ్చాడు. శత్రుఘ్నుడు వెంటనే తన సైన్యముతో అయోధ్యకు బయలుదేరాడు.

అయోధ్యలో ప్రవేశించగానే శత్రుఘ్నుడు రాముని మందిరమునకు వెళ్లాడు. రాముని చూడగానే శత్రుఘ్నుడు రెండు చేతులు జోడించి నమస్కరించి ఆయనతో ఇలా అన్నాడు. "రామా! నీ ఆజ్ఞను సారము నేను మధుపురమునకు పోయి, లవణునితో యుద్ధము చేసి అతనిని సంహరించారు. తరువాత నాకు దేవేంద్రుడు మధుర పురము అనే రాజధానిని నిర్మించి ఇచ్చాడు. ఆ నగరమును రాజధానిగా చేసుకొని నేను లవణుని రాజ్యమును 12 సంవత్సరములు పరిపాలించాను. నిన్ను చూడవలెనని కోరికతో వచ్చాను. రామా! నిన్ను వదిలి నేను ఉండలేను. నేను నీ వద్దనే ఉంటాను." అని అన్నాడు.

దానికి రాముడు ఇలా అన్నాడు. "నీవు మధురా నగరమునకు రాజువు. నీవు అక్కడే ఉండాలి. నన్ను చూడటానికి వచ్చావు కాబట్టి కొన్ని రోజులు ఉండి వెళ్లు. నన్ను చూడాలని అనిపించినప్పుడల్లా అయోధ్యకు వచ్చి నన్ను చూచి వెళుతూ ఉండు. క్షత్రియులకు ప్రజాపాలనే విద్యుక్త ధర్మము. క్షత్రియులు తమ స్వధర్మమును మరిచిపోరాదు. నీవు లేకపోతే రాజ్యములో అరాచకము ప్రబలుతుంది. నీ వలన ప్రజలు కష్టాల పాలవుతారు. కాబట్టి ప్రజాపాలనే నీ కర్తవ్యము. నాకు కూడా నిన్ను నా వద్దనే ఉంచుకొనవలెనని ఉంది. కానీ మనకు ప్రజాపాలన ముఖ్యం కదా. అందువలన నీవు ఇక్కడ ఏడు రోజులు ఉండి తరువాత నీ సేనలతో

మధురా పురికి వెళ్లు." అని అన్నాడు రాముడు.

శత్రుఘ్నుడు రామునికి నమస్కరించి "అలాగే చేస్తాను రామా!" అని అన్నాడు. రాముని ఆజ్ఞ ప్రకారము ఏడు రాత్రులు అయోధ్యలో గడిపి శత్రుఘ్నుడు మధురా పురికి ప్రయాణం అయ్యాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము డెబ్బది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## డెబ్బది మూడవ సర్గ.

నిరాఘాటంగా జనరంజకంగా సాగుతున్న రాముని పాలనలో ఒక చిన్న అపశృతి దొర్లింది. ఒక రోజు ఒక బ్రాహ్మణుడు తన కుమారుని శవమును తీసుకొని రాముని మందిర ద్వారము దగ్గరకు వచ్చాడు. రాజ ద్వారము వద్ద కూర్చుని కొడుకును తల్చుకుంటూ ఏడుస్తున్నాడు. "నేను ఏ జన్మలో ఏమి పాపం చేసానో ఏమో పసి వయస్సులోనే నా కుమారుని పోగొట్టుకున్నాను. నా ఒక్కగానొక్క కుమారుడు బాల్యములోనే మరణించాడు. ఈ పుత్రశోకము నేను నా భార్య భరించలేము. కుమారుని కోసరం శోకించి శోకించి నేను నా భార్యకూడా మరణిస్తాము. నేను ఏ నాడూ ఎవరికీ ఎటువంటి అపకారమూ చేయలేదు. అబద్ధం చెప్పలేదు. ఎవరినీ హింసించలేదు. ఎవరినీ చంపలేదు. మరి నాకు ఇటువంటి

పుత్రశోకము ఎందుకు కలిగిందో తెలియదు. నా కుమారుడు నాకు కర్మకాండలు చేస్తాడని, ప్రతి సంవత్సరము నాకు శ్రాద్ధము పెడతాడనీ కలలు కన్నాను. అటువంటిది నేను నా కుమారునికి కర్మకాండలు నిర్వర్తించాల్సిన ఖర్మ దాపురించింది. రాముడు పరిపాలించే రాజ్యములో ఇటువంటి ఘోరములు జరగడం వింతగా ఉంది. ఇదివరకు ఎప్పుడూ పెద్ద వాళ్లు బతికి ఉండగా చిన్న వాళ్లు మరణించడం ఎరుగము. అటువంటిది నా విషయంలోనే ఇలా జరిగింది. దీనికి కారణం ఎక్కడో ఏదో పాపం జరిగింది. అది రాముడు చేసిన పాపమో లేక రామరాజ్యంలో జరుగుతున్న పాపమో తెలియదు.

కాబట్టి ఓ రామా! నీవు నీ రాజ్యములో జరుగుతున్న పాపమును పరిహరించి మరణించిన నా కుమారుని బతికించు. లేకపోతే నేను నా భార్య ఇక్కడే నిరాహారులుగా ఉండి మరణిస్తాము. బ్రహ్మహత్యాపాతకము నీకు చుట్టుకుంటుంది. నువ్వు మాత్రము నీ సోదరులతో సుఖంగా ఉండు. దశరథుని పాలనలో ఇలాంటి ఘోరం జరగ లేదు. ఇదిగో రాముడు వచ్చాడు. ఇలాంటి ఘోరాలు జరుగుతున్నాయి. రాముడి పాలనలో అయోధ్య అనాథ అయింది. రాముడు శాస్త్రప్రకారము పరిపాలన సాగిస్తే ఇలాంటి అనర్థాలు జరగవు కదా! రాజు పాపాలు చేస్తేనే ఇటువంటి అకాల మరణాలు సంభవిస్తాయి. రాముని కాలంలో ప్రజలకు రక్షణ లేకుండా పోయింది. అకృత్యాలు ప్రబలిపోయాయి. ఇది తప్పక రాజు చేసిన దోషమే. సందేహము లేదు. అందు చేతనే రాముని రాజ్యములో ఇటువంటి అకాల మరణాలు, బాల్య మరణాలు సంభవిస్తున్నాయి." అని ఆ బ్రాహ్మణుడు పరి పరి విధాల

రాముని,రాముని పాలననూ నిందిస్తూ శోకిస్తున్నాడు.
(రాముని పాలనలో ప్రజలు 10,000 సంవత్సరాలు బాగానే ఉన్నారు. సుఖపడ్డారు. ప్రజల కోసరం రాముడు తన భార్యనే వదులుకున్నాడు. కానీ, ఈ ఒక్క సంఘటనతో అంతా మట్టికొట్టుకుపోయింది. ఈనాడు కూడా అంతే కదా! ప్రభుత్వము ఎన్ని మంచి పనులుచేసినా ఎవరూ పట్టించుకోరు. ఏ చిన్న సంఘటన జరిగినా ప్రభుత్వ వైఫల్యము, పోలీసుల అసమర్థత అని ప్రతిపక్షాలు దుమ్మెత్తిపోస్తుంటాయి. మంచి జరిగితే పట్టించుకోరు. ఏ చిన్న తప్పుజరిగినా భూతద్దంలో చూస్తారు. అమాయకులైన అమ్మాయిల మీద యాసిడ్ దాడులు చేస్తే ప్రజలకు రక్షణ లేదు అంటారు. ఆ యాసిడ్ పోసిన వాడిని నాలుగు తగిలిస్తే, పౌరహక్కుల ఉల్లంఘన అంటారు. నాడూ నేడూ ఇదే వరస!)

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము డెబ్బది మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## డెబ్బది నాలుగవ సర్గ.

బ్రాహ్మణ బాలుడు మరణించడం, ఆ బ్రాహ్మణుడు శోకించడం తనను నిందించడం రాముడికి తెలిసింది. రాముడు దు:ఖంతో క్రుంగిపోయాడు. వెంటనే సభ ఏర్పాటు చేసాడు. రాజ పురోహితులను మంత్రులను,పురప్రముఖులను పిలిపించాడు. వారితో సమాలోచనలు

జరిపాడు. ఆ సభకు వసిష్ఠుడు, మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు,జాబాలి, గౌతముడు, నారదుడు విచ్చేసారు. రాముడు ఆ బ్రాహ్మణుని సమస్యను అందరికీ వివరించాడు. "ఆ బ్రాహ్మణుడు తన కుమారుని పునరుజ్జీవితుని చెయ్యమని మొండి పట్టు పట్టాడు. ఏమిచెయ్యాలి. దీనికి తరుణోపాయము ఏమిటి?" అని అడిగాడు. అప్పుడు నారదుడు లేచి ఇలా అన్నాడు.

"రాజా! ఆ బ్రాహ్మణ కుమారునికి అకాల మరణం ఎలా సంప్రాప్తించిందో వివరిస్తాను. నేను చెప్పినది విని, నీకు తోచినది చెయ్యి. కృతయుగములో కేవలము బ్రాహ్మణులు మాత్రమే తపస్సు చేసుకొనే వారు. బ్రాహ్మణులు కాని వారు తపస్సు చేసుకొనే వారు కాదు. అప్పుడు ధర్మము నాలుగు పాదములతో నడిచేది. అకాల మరణాలు లేవు. సర్వమూ బ్రహ్మ మయంగా ఉండేది. త్రేతాయుగంలో యుగ ధర్మము మారింది. బ్రాహ్మణులతో పాటు క్షత్రియులు కూడా తపస్సు చేస్తున్నారు. కృతయుగములే బ్రాహ్మణులకే పరిమితమైన తపస్సు త్రేతాయుగంలో క్షత్రియులకు కూడా ఆచరణయోగ్యమయింది. కాని త్రేతాయుగములో తపస్సు చేసిన క్షత్రియులు, కృతయుగములో ఉన్న తాపసులైన బ్రాహ్మణుల కంటే తక్కువ వారే! ఇంకా వివరంగా చెప్పాలంటే కృతయుగములో బ్రాహ్మణులు తమ తపస్సు చేతా, వీరత్వము చేతా అధికంగా ఉండేవారు. క్షత్రియ జాతి బ్రాహ్మణుల కన్నా తక్కువగా ఉండేవారు. (అందుకే క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రాహ్మణులకే పరిమితమైన బ్రహ్మర్షి పదవి కోసరం నానా తంటాలు పడ్డాడు.)

త్రేతాయుగంలో క్షత్రియులు కూడా తపస్సు చేయడంతో రెండు జాతులూ తపస్సులోనూ, వీరత్వములోనూ సమానమయ్యాయి. కాని కృతయుగ బ్రాహ్మణ జాతి కన్నా త్రేతాయుగ బ్రాహ్మణులు కింది వరసలో ఉండేవారు. ఆ కారణం చేత అందరూ కలిసి అందరికి యోగ్యమైన, సమ్మత మైన చాతుర్వర్ణ వ్యవస్థను ఏర్పాటు చేసారు. తరువాత త్రేతాయుగములో అధర్మము ఒక పాదమును మోపింది. ప్రజలలో అసత్యములు పలకడం ఎక్కువ అయింది. దానికి అనుగుణంగా త్రేతాయుగములో ప్రజల ఆయు:ప్రమాణము కూడా తగ్గిపోయింది. ఒక పక్క అసత్యములు పలకడం అలవాటుగా మారినప్పటికినీ, లోకములో ప్రజలు సత్యము,ధర్మముల మీద ఆసక్తి చూపడం మానలేదు. మంచి పనులను చేయడంలో ఆసక్తి చూపుతుండేవారు.

యుగధర్మము ప్రకారము త్రేతాయుగములో బ్రాహ్మణులు, క్షత్రియులు మాత్రమే తపస్సు చేసేవారు, ఇతర జాతుల వారు వారికి తగిన సామగ్రిని, సేవలను సమకూర్చేవారు. బ్రాహ్మణులకు, క్షత్రియులకు సేవ చేయడం వైశ్యులు, శూద్రులు తమ ధర్మంగా భావించేవారు. శూద్రులు, బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు సేవ చేయడం తమ ధర్మంగా భావించేవారు. కాల క్రమేణా వైశ్య, శూద్రులు తమకు నిర్దేశించిన ధర్మం తప్పడం, అసత్యములు ఆడటం మొదలు పెట్టారు. దాని ప్రభావంతో బ్రాహ్మణ క్షత్రియులలో కూడా వారి తేజము తగ్గిపోయింది. అధర్మం తన ప్రభావం చూపసాగింది.

తరువాత అధర్మము తన రెండవ పాదం కూడా భూమి మీద మోపింది. అప్పుడు ద్వాపరము మొదలయింది. ద్వాపర యుగంలో అబద్ధాలు ఆడటం, ధర్మం తప్పి చరించడం ఎక్కువ అయింది. ఒకరికి ఒకరు మోసం చేసుకోవడం మితిమీరి పోయింది. ద్వాపరంలో వైశ్యులు కూడా తపస్సు చేయడం మొదలు పెట్టారు. ఈ ప్రకారంగా మూడు యుగములలో మూడు వర్ణములలో తపస్సు వృద్ధిపొందింది. కాబట్టి కృత,త్రేత,ద్వాపర యుగములలో కూడా శూద్రులకు తపస్సు చేసే అధికారము సంక్రమించలేదు. అదీ కాకుండా శూద్రులు తపస్సు చేయడానికి  ఎన్నడూ ఉద్యుక్తులు కాలేదు.  కలి యుగంలో శూద్రులుకూడా  తపస్సు చేస్తారేమో చూడాలి.

అందుచేత రామా!  ద్వాపరంలో కూడా శూద్రులు తపస్సు చేయడం అధర్మము. ఈ కారణంగా నీ రాజ్యంలో ఎక్కడో అధర్మము జరుగుతూ ఉంది. ఎవరో శూద్రుడు తపస్సు చేస్తూ ఉండిఉంటాడు. అందువలననే ఇంతటి అధర్మము జరిగింది. తండ్రి బతికి ఉండగానే బాలుడు మృతి చెందాడు. ఏ రాజ్యములో నైనా ఏ పౌరుడైనా అధర్మమునకు పాల్పడ్డా, చేయకూడని పని చేసినా, ఆ రాజ్యములో సంపద ఉండదు.  ఆ రాజ్యమును ఏలే రాజు నరకంలో పడతాడు. ఎందుకంటే, రాజ్యములో ఉన్న ప్రజలు చేసే పాపపుణ్యాలలో రాజుకు ఆరవ వంతు వచ్చి చేరుతుంది. పౌరులు చేసిన పుణ్యములో, వారు ఆర్జించిన ధనములో  ఆరవ వంతు స్వీకరిస్తున్న నీకు నీపౌరులను రక్షించవలసిన బాధ్యత ఉంది. కాబట్టి నువ్వు నీ రాజ్యమంతా వెదికి నీ రాజ్యములో ఎవరు ఎక్కడ అధర్మానికి పాల్పడుతున్నారో, ఎవరు చేయకూడని పని చేస్తున్నారో

కనిపెట్టి వారిని శిక్షించు. అదే నీ బాధ్యత. అప్పుడే అకాల మరణం పొందిన ఈ బాలుడు కూడా జీవిస్తాడు."అని అన్నాడు నారదుడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము డెబ్బది నాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
డెబ్బది ఐదవ సర్గ.

అధర్మము ఎక్కడ జరుగుతుందో తెలుసుకోడానికి రాముడు స్వయంగా బయలుదేరాడు. పుష్పకమును తలచుకున్నాడు. పుష్పకము వచ్చి రాముని ఎదుట నిలిచింది. రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! నీవు పోయి పుత్రశోకముతో బాధపడుతున్న ఆ బ్రాహ్మణ దంపతులను ఓదార్చు. ఆ బాలుని శవముచెడిపోకుండా తైలములు, సుగంధ ద్రవ్యములు పూసి ఒక ద్రోణిలో భద్రపరచు. ఎట్టి పరిస్థితులలోనూ ఆ బాలుని శరీరము ఏ భాగానికి ఆ భాగము విడిపోకుండా చూడు. (డికంపోజ్). నగర రక్షణకు లక్ష్మణుని, భరతుని నియమించాడు. తరువాత రాముడు సభికులకు, మునులకు, కులగురువుకు నమస్కరించి పుష్పక విమానము ఎక్కాడు. పశ్చిమదిక్కుగా పోనిచ్చాడు. అక్కడనుండి ఉత్తర దిక్కుకు తరువాత తూర్పు దిక్కుకు వెళ్లాడు. తరువాత దక్షిణ దిక్కుగా మళ్లాడు. దక్షిణ దిక్కు అంతా వెతుకుతున్నాడు. అక్కడ శైవల పర్వతము పక్కనే ఉన్న ఒక సరస్సును చూచాడు. ఆ సరస్సులో

తల కిందికి పెట్టి కాళ్లు పైకెత్తి తపస్సు చేస్తున్న ఒక ఋషిని చూచాడు. వెంటనే పుష్పకమును దిగి ఆయన వద్దకు వెళ్లాడు. ఆయనకు నమస్కరించాడు. "మునివర్యా! నేను ఈ రాజ్యమును ఏలే రాజును. నా పేరు రాముడు. తమరు ఎవరు! తమరి నామధేయము, కులగోత్రములు ఏమి? తమరు ఇంత ఘోర తపస్సు చేయడం స్వర్గసుఖాలుపొందడం కోసరమేనా! లేక వేరుకోరికలుఉన్నాయా! తమరు ఏకోరిక కోరి ఈ తపస్సు చేస్తున్నారో తెలుసుకో గోరుతున్నాను.నీవు నాలుగు వర్ణములలో ఏ వర్ణమునకు చెందినవాడివి. నిజం చెప్పండి." అని ఆ ముని వివరాలు అడిగాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము డెబ్బది అయిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## డెబ్బది ఆరవ సర్గ.

రాముని చూచి కూడా, రాముని మాటలు విని కూడా ఆ ముని తనతపస్సు మానలేదు. తలకిందులుగా ఉండి రామునికి ఇలాసమాధానం చెప్పాడు. "రాజా! నేను శూద్రుడను. నా పేరు శంబూకుడు. నాకు ఈ శరీరంతో స్వర్గమునకు పోవాలని కోరిక. దేవ లోకమును జయించవలెనని కోరిక. అందునిమిత్తము ఈ తపస్సు చేస్తున్నాను." అని అన్నాడు.

రాముడు మారు మాట్లాడలేదు. తన ఖడ్గము తీసి ఆ ముని శిరస్సును ఖండించాడు. శూద్రజాతికి చెందిన ఆ ముని మరణించాడు. ఆకాశమునుండి దేవతలు పుష్పవృష్టి కురిపించారు. దేవతలు రాముని వద్దకు వచ్చి "రామా! నీవు ధర్మమును కాపాడావు. బొందితో స్వర్గము ఎవరికీ సాధ్యము కాదు. నీకు ఏం వరం కావాలో కోరుకో!" అని అన్నాడు. వెంటనే రాముడు "ఇతడు స్వర్గమును చేరుకోడానికి ఈ తపస్సు చేస్తున్నాడు. అతని కోరిక నెరవేర్చండి ఇతనికి శాశ్వత స్వర్గలోక నివాసము ప్రసాదించండి." అని అన్నాడు. "రామా! నీచేతిలో మరణంచడంతోనే అతనికి స్వర్గలోక ప్రవేశ అర్హత వచ్చింది. మేము ఇతనిని స్వర్గమునకు తీసుకొని పోయి అతనికోరిక నెరవేరుస్తాము." అని అన్నారు. వెంటనే రాముడు దేవతల పక్కన ఉన్న ఇంద్రుని చూచి "మహేంద్రా! ఇతడు తపస్సు చేయడం మూలాన అధర్మము తలెత్తి ముని కుమారుడు మరణించాడు. నేను ఆ కుమారుని బతికిస్తాను అని ఆ బ్రాహ్మణునికి మాట ఇచ్చాను. నా మాట వృధా కారాదు. కాబట్టి, తమరు నా మీద దయయుంచి ఆ ముని కుమారుని బతికించండి." అని అన్నాడు. "రామా! దీని కోసరం నీవు ఇంతగా అడగవలెనా! ఈ ముని మరణించిన క్షణమే ఆ బాలుడు బతికాడు. తోటిపిల్లలతో ఆడుకుంటున్నాడు. ఇంక మేము వెళ్లి వస్తాము. మీరు ఇక్కడకు దగ్గరలోనే ఉన్న అగస్త్య ఆశ్రమమునకు వెళ్లి ఆయన దర్శనము చేసుకోండి.శుభం జరుగుతుంది. అగస్త్యుడు 12 సంవత్సరముల దీక్ష పట్టాడు. ఆయనదీక్ష సమాప్తము అయింది. మేము కూడా ఆ మహామునిని కలుసుకొని అభినందించడానికి వెళుతున్నాము. మీరు కూడా ఆ మహామునిని సందర్శించండి."అని అన్నారు.

రాముడు దేవేంద్రుడికి, దేవతలకు నమస్కరించాడు. పుష్పకము ఎక్కాడు. దేవతలు వెళుతున్న విమానము వెనకనే తన పుష్పకము మీద రాముడు అగస్త్యమహాముని వద్దకు వెళ్లాడు.

అగస్త్యుడు తన ఆశ్రమమునకు వచ్చిన దేవేంద్రునకు, దేవతలకు, అర్ఘ్యము పాద్యము ఆసనములు ఇచ్చి సత్కరించాడు. దేవతలందరూ అగస్త్యుని ఆతిధ్యమును స్వీకరించి, ఆయనను అభినందించి స్వర్గమునకు వెళ్లిపోయారు. తరువాత రాముడు తన పుష్పకము దిగి అగస్త్యుని వద్దకు పోయి ఆయనకు నమస్కరించాడు. అగస్త్యుడు రామునికి స్వాగత సత్కారాలు చేసాడు. అగస్త్యుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! నా పూర్వపుణ్యవశమున నాకు నీ దర్శనభాగ్యము కలిగింది. నీవు పూజించ తగ్గ వాడవు. నిత్యము నా హృదయంలో నీవే ఉన్నావు. నీవు తన ధర్మమును మరిచి తపస్సు చేస్తున్న ఆ శూద్రుని సంహరించి, ఆ బాలుని బతికించావు. నీవు ఈ రాత్రికి ఇక్కడే ఉండి విశ్రాంతి తీసుకో. రేపు అయోధ్యకు వెళ్లవచ్చును." అని అన్నాడు అగస్త్యుడు. తరువాత రామునికి ఒక దివ్యమైన ఆభరణమును ఇచ్చాడు.

"రామా! ఈ దివ్యమైన ఆభరణము పూర్వము విశ్వకర్మ తయారు చేసాడు. దీనిని స్వీకరించు. దీనిని నేను ఉపయోగించలేదు. అందుకనే నీకు ఇస్తున్నాను. స్వీకరించు" అని అన్నాడు.

దానికి రాముడు ఇలా అన్నాడు. “ఓ మహర్షి! క్షత్రియులకు ఒకరికి ఇవ్వడం ధర్మం. బ్రాహ్మణులకు తీసుకోవడం ధర్మం. క్షత్రియుడనైన నేను ఇతరులు ఇచ్చినది ఎలా స్వీకరించను. నేను మీకు ఇవ్వాల్సింది పోయి మీవద్దనుండి కానుకలు స్వీకరించడం ధర్మం కాదు కదా! బ్రాహ్మణుల వద్దనుండి కానుకలు తీసుకోవడం ఘోరమైన తప్పు. ఆ తప్పు నేను చేయలేను.”అని మర్యాదపూర్వకంగా అగస్త్యుడు ఇచ్చిన కానుకను తిరస్కరించాడు రాముడు.

అప్పుడు అగస్త్యుడు రామునితో ఇలా అన్నాడు. “రామా! కృయుగములో రాజు అనే వాడు లేడు. దేవతలకు రాజుగా ఇంద్రుడు ఉండేవాడు. కృతయుగంలో ఎవరికి వారు తమ తమ విద్యుక్త ధర్మములు నిర్వర్తించేవారు. ఒక రాజు ఉండి చెప్పవలసిన, చేయక పోతే దండించవలసిన అవసరం ఉండేది కాదు. కాబట్టి కృతయుగంలో రాజు యొక్క అవసరం లేకపోయింది.  దేవతలకే ఒక అధిపతి ఉన్నప్పుడు మనకు కూడా ఒక అధిపతి ఎందుకు ఉండకూడదు అని తలంచి ప్రజలందరూ బ్రహ్మదేవుని వద్దకు పోయి, “దేవా! నీవు దేవతలకు రాజుగా ఇంద్రుడిని స్థాపించావు. మాకు కూడా నరులలో ఉత్తమమైన వాడిని రాజును ఇవ్వండి. మేము అతనిని సేవిస్తాము. రాజు లేకుండా మేము స్వయంగా పరిపాలించుకోలేకపోతున్నాము.” అని అడిగారు.

రాజు కావాలంటే అతనికి దైవాంశ ఉండాలి. కాబట్టి బ్రహ్మ, ఇంద్రుడు, మొదలగు లోక పాలకులను పిలిచాడు. వారి వారి తేజస్సునుండి కొంత భాగం ఇమ్మన్నాడు. వారు అలాగే తమ తమ

తేజస్సులలో కొంతభాగము బ్రహ్మదేవునికి ఇచ్చారు. ఇంతలో బ్రహ్మదేవునికి తుమ్మువచ్చింది. ఆ వేగవంతమైన తుమ్ములో నుండి ఒకడు పుట్టాడు. వాడి పేరు క్షుపుడు. బ్రహ్మదేవుడు లోకపాలకుల నుండి సంగ్రహించిన అంశలను ఆ క్షుపుడిలో ప్రవేశ పెట్టాడు. అతనిని ప్రజలకు రాజును చేసాడు. అప్పుడు క్షుపుడు రాజ్యాధి కారమును స్వీకరించాడు.

ఇంద్రుని అంశతో పరిపాలనా బాధ్యతలను రూపొందించాడు. వరుణుని అంశతో భూమిని సస్యశ్యామలం చేసి అందరికీ పోషణ కల్పించాడు. యముని అంశతో దండనీతిని, దండనాధి కారాన్ని రూపొందించాడు. కుబేరుని అంశతో ధనము, వినిమయము, వాణిజ్యము దానికి సంబంధించిన శాస్త్రములను రూపొందించాడు.

రామా! ఇంద్రుని అంశ పరిపాలనా బాధ్యత అని చెప్పానుకదా! పరిపాలనలో రాజు ప్రజలనుండి స్వీకరించడం కూడా ధర్మమే. ఆ ధర్మము ప్రకారమే ఈ దివ్యమైన ఆభరణమును స్వీకరించు. నీకు శుభం కలుగుతుంది."అని అన్నాడు అగస్త్యుడు.

రాముడు మారు మాట్లాడలేకపోయాడు. ఆ మహాముని ఇచ్చిన ఆభరణమును స్వీకరించాడు. అప్పుడు రామునికి ఒక సందేహము కలిగింది. అసలు ఈ ఆభరణము ఈ ముని చేతికి ఎలా వచ్చింది. ఎవరు ఇచ్చారు. ఎందుకు ఇచ్చారు. తెలుసుకోవాలని అనుకున్నాడు. అగస్త్యమహా మునిని ఇలా అడిగాడు.

"ఓ మునీంద్రా! ఈ ఆభరణము తమరి దగ్గరకు ఎలా వచ్చింది. ఎవరు ఇచ్చారు దయతో చెప్పండి." అని అడిగాడు. దానికి అగస్త్యుడు ఇలా చెప్పసాగాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము డెబ్బది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## డెబ్బది ఏడవసర్గ.

పూర్వము ఈ పక్కనే ఉన్న భూమి మీద నూరు యోజనముల దూరము, చెట్లు గుట్టలు పర్వతములు కొండలు,మృగములు, పక్షులు ఉండేవి కావు. భూమి చదునుగా ఉండేది. దాని పక్కనే ఉన్న అరణ్యములో నేను తపస్సు చేసుకుంటూ ఉండేవాడిని. నేను తపస్సు చేసుకుంటున్న అరణ్యము ఫల వృక్షములతోనూ, స్వచ్ఛమైన నీటి సరోవరములతోనూ, పుష్పజాతులతోనూ నిండి ఉండేది.

ఆ అరణ్యములో ఒక పురాతన ఆశ్రమము ఉండేది. ఆ ఆశ్రమములో ఎవరూ లేరు. నిర్మానుష్యంగా ఉండేది. ఆ ఆశ్రమము పక్కనే ఒక సరస్సు ఉంది. నేను ఆ సరస్సు దగ్గరకు వెళ్లాను. ఆ సరస్సులో ఒక శవం తేలుతూ ఉంది. కాని ఆ శవం ఏ మాత్రం చెడి పోలేదు.అప్పుడే ప్రాణం పోయినట్టు ఉంది.  ఇది ఎవరి శవమూ అని ఆలోచిస్తూ అక్కడే

నిలబడ్డాను. ఒక ముహూర్త కాలానికి అక్కడికి ఒక దివ్యమైన విమానము వచ్చింది. ఆ విమానములో ఒక దేవతా పురుషుడు ఉన్నాడు. అతనిని అప్సరసలు సేవిస్తున్నారు. కొందరు పాటలు పాడుతున్నారు. కొందరు నృత్యం చేస్తున్నారు. కొందరు అప్సరసలు ఆ పురుషునికి చామరములు వీస్తున్నారు. ఇదంతా నేను చూస్తున్నాను.

ఇంతలో ఆపురుషుడు విమానం దిగి ఆ సరస్సు దగ్గరకు వచ్చాడు. ఆ శవమును భక్షిస్తున్నాడు. తనకు కావలసినంత మాంసమును తృప్తిగా తిన్న తరువాత ఆ పురుషుడు ఆ సరస్సులోకి దిగి నీరు తాగుతున్నాడు. తరువాత ఆ పురుషుడు విమానము దగ్గరకు వెళ్లి విమానము ఎక్కబోతున్నాడు. అత్యాశ్చకరమైన ఆ దృశ్యమును చూచిన నేను ఉండబట్టలేక ఆ పురుషుని వద్దకు పోయి ఇలా అడిగాడు. "నీవు ఎవరు? ఈ శవాన్ని ఎందుకు భక్షించావు. దీనికి కారణం ఏమైనా ఉందా! నీవు చూడబోతే దేవతామూర్తి వలె ఉన్నావు. కాని నిషిద్ధమైన ఆహారమును తిన్నావు. చాలా ఆశ్చర్యంగా ఉంది. ఈ శవము తినడానికి యోగ్యము అని నేను అనుకోడం లేదు. ఇందులో రహస్యము ఏమిటి? నాకు చెప్పగలవా!" అని అడిగాను.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము డెబ్బది ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## డెబ్బది ఎనిమిదవ సర్గ.

"రామా! నేను ఆ ప్రకారము అడుగగా, ఆ దివ్యపురుషుడు ఇలా అన్నాడు. "ఓ బ్రహ్మర్షీ! ఇది నా పూర్వ జీవితమునకు సంబంధించినది. నా తండ్రి పేరు సుదేవుడు. ఆయన విదర్భకు మహారాజు. ఆయనకు ఇద్దరు భార్యలు. ఆ ఇద్దరికీ ఇద్దరు కుమారులు కలిగారు. నా పేరు శ్వేతుడు. నాకన్నా చిన్న వాడి పేరు సురథుడు. నా తండ్రి చనిపోయిన తరువాత నన్ను రాజును చేసారు. నేను ధర్మబద్ధంగా, జనరంజకంగా పరిపాలించాను.

ఒక సారి నాకు ఒక వింత కోరిక కలిగింది. నా ఆయుర్దాయము ఎంత. నేను ఎప్పుడు మరణిస్తాను అని తెలుసుకోవాలని అనుకున్నాను. వెంటనే నా తమ్ముడు సురథుడిని రాజ్యానికి పట్టాభిషిక్తుని చేసాను. నా మరణం గురించి తెలుసుకోడానికి ఈ అరణ్యములోకి వచ్చాను. తపస్సు చేసాను. మూడు వేల సంవత్సరములు గడిచాయి. నా తపస్సు ఫలితంగా నేను నా శరీరమును వదిలి, బ్రహ్మలోకమునకు వెళ్లాను. నా శరీరం ఈ సరస్సులో పడింది. నేను బ్రహ్మలోకములో ఉన్నా నాకు ఆకలి దప్పిక కలుగుతూనే ఉన్నాయి. నాకు దైవత్వము సిద్ధించలేదు. వెంటనే నేను బ్రహ్మదేవుని వద్దకు పోయి ఇలా అడిగాను.

"ఓ బ్రహ్మదేవా! ఈ లోకములో ఆకలి దప్పిక ఉండవు కదా. మరి నాకు ఆకలి వేస్తూ ఉంది. దాహం వేస్తూ ఉంది. ఎందువలన? నాకు

ఇక్కడ ఏమి ఆహారము దొరుకుతుంది. నేను ఏమి తినాలి. ఏమి తాగాలి. అసలు నాకు ఆకలి దప్పిక ఎందుకు కలుగుతున్నాయి." అని అడిగాడు.

దానికి బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు. "ఈ లోకంలో ఆహారం ఉండదు. కాబట్టి నీ మాంసమే నీకు ఆహారము. దానినే నీవు భక్షించాలి. నీవు కూర్చుని తపస్సు చేసి నీ శరీరమును బాగా పెంచావు. నీవు దాన ధర్మములు చేయలేదు. కేవలం తపస్సు చేసావు. నీవు ఒకరికి పెడితే కదా నీకు ఆహారం లభించేది. నీవు ఒకరికి పెట్టలేదు. నీకు ఆహారం లభించదు. ఆ కారణం చేతనే నీకు ఆకలి దప్పులు కలుగుతున్నాయి. కాబట్టి నీవు నీ దేహమునే ఆహారముగా స్వీకరించు. అగస్త్య మహాముని నీవు ఉండు అరణ్యమునకు వస్తాడు. అప్పుడు నీకు ఈ బాధ తప్పుతుంది. ఎందుకంటే ఆ అగస్త్యుడు మహా ఋషి. దేవతలను కూడా తరింప జేస్తాడు. ఇంక నీ ఆకలి దప్పికలను నివారించలేడా!" అన్నాడు బ్రహ్మదేవుడు. ఆ రోజు నుండి బ్రహ్మదేవుని మాట ప్రకారము నేను ప్రతి రోజూ ఇక్కడకు వచ్చి   నా శవమును ఆహారంగా తింటున్నాను. ఇన్ని సంవత్సరముల నుండి తింటున్నా ఈ శవము తరగడం లేదు. పైగా నాకు చాలా తృప్తిగా ఉంటూ ఉంది. నా బాధ తీర్చడానికి మీరు ఇక్కడకు వచ్చారు. తమరు కరుణించి నన్ను ఈదుస్థితి నుండి కాపాడండి. మీకు నేనుఏమీ ఇచ్చుకోలేను. ఈ ఆభరణమును స్వీకరించి నన్ను ధన్యుడిని చేయండి. ఇంకా మీకు కావాలంటే బంగారమును, ధనమును వస్త్రములను ఇస్తాను. నన్ను తరింపజేయండి." అని అన్నాడు.

నేను అతనిని తరింపజేయడానికి ఈ ఆభరణమును అతని వద్దనుండి స్వీకరించాను. నేను ఈ ఆభరణమును స్వీకరించిన వెంటనే అతని మనుష్యదేహమైన శవము నశించిపోయింది. అతడు స్వర్గమునకు వెళ్లిపోయాడు. అతడు నాకు ఇచ్చిన ఆభరణము ఇదే. ఇప్పుడు ఇది నీకు ఇస్తున్నాను." అని అన్నాడు అగస్త్యుడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము డెబ్బది ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## డెబ్బది తొమ్మిదవ సర్గ.

అగస్త్యుడు చెప్పిన వృత్తాంతమును విని రామునికి ఆశ్చర్యం కలిగింది. ఇటువంటి కధలు కూడా ఉంటాయా అని అనుకున్నాడు. కాని రామునికి మరొక అనుమానం కలిగింది. "ఓ మునీంద్రా! మీరు తపస్సు చేసుకుంటున్న వనము ఫలవృక్షములతోనూ, పూల మొక్కలతోనూ, వన్య మృగములతోనూ శోభిల్లుతూ ఉంది కదా మరి ఆ రాజర్షి తపస్సు చేసిన ప్రదేశములో ఒక్క చెట్టు లేదు మొక్క లేదు, ఒక్క పక్షిగానీ, జంతువు గానీ లేదు. ఎందు చేత?ఆ రాజు వృక్షమృగ,పక్షి శూన్యమైన చోట తపస్సు చేయాలని ఎందుకు అనుకున్నాడు." అని అడిగాడు. అగస్త్యుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! కృతయుగములో మనువు ఈ భూమిని పరిపాలించేవాడు. అతని కుమారుడు ఇక్ష్వాకువు. "ఈ భూమిలో రాజ వంశములనుస్థాపించు" అని చెప్పి మనువు ఇక్ష్వాకువును రాజును చేసాడు. అతని పేరుతో ఇక్ష్వాకు వంశము మొదలయింది. రాజ్యాధి కారము ఇచ్చిన తరువాత మనువు ఇక్ష్వాకువుతో ఇలా అన్నాడు. "రాజుకు దండనాధి కారము ఉండవలసినదే కానీ అకారణంగా ఎవరినీ దండించ కూడదు. అపరాధుల విషయంలో కూడా అతడు చేసిన తప్పుకు సరి అయిన దండన విధించవలెనే కానీ, క్రూరంగా దండించకూడదు. కాబట్టి నీవు దండనీతిని అనుసరించునపుడు చాలా అప్రమత్తంగా ఉండాలి. అప్పుడే ధర్మం వర్ధిల్లుతుంది. నిన్ను ప్రజలు గౌరవిస్తారు." అని ఇక్ష్వాకువుకు రాజనీతిని దండనీతిని ఉపదేశించి, మనువు బ్రహ్మలోకమునకు వెళ్లిపోయాడు. అప్పుడు ఇక్ష్వాకువు తన వంశమును ఎలా వృధ్ధిచేయ వలెనా అని ఆలోచించాడు.

తరువాత ఇక్ష్వాకువు నూర్గురు పుత్రులను కన్నాడు. ఆ నూర్గురిలో చిన్న వాడు పరమ మూర్ఖుడు. పెద్దల మాట వినేవాడు కాదు. దుర్మార్గుడు. చదువు మీద శ్రద్ధలేదు. వీడిని ఎవరో బాగా దండిస్తారు అని తెలుసుకున్న ఇక్ష్వాకువు వాడికి దండుడు అని పేరు సార్ధకంచేసాడు.

వాడికి తగిన రాజ్యము కనపడలేదు. అందుకని ఇక్ష్వాకువు దండుని వింధ్యపర్వతప్రాంతములకు రాజును చేసాడు. ఆ దండుడు ఆ పర్వత ప్రాంతములో ఒక నగరమును ఏర్పాటు చేసుకొని రాజ్యపాలన చేస్తున్నాడు. ఆ నగరము పేరు మధుమంతము.

దండుని కుల గురువు శుక్రాచార్యుడు. ఆయనకు ఒకకుమార్తె ఉంది.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము డెబ్బది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

ఎనుబదవ సర్గ.

దండుడు అనేక సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. ఒకరోజు దండుడు తన గురువు శుక్రాచార్యుని ఇంటికి వెళ్లాడు. అక్కడ ఒకసుందరాంగిని చూచాడు. ఆమె శుక్రాచార్యుల వారి కుమార్తె అని దండునికి తెలియదు. ఆమెను మోహించాడు. దండుని మన్మధుడు ఆవహించాడు. మన్మధ బాణములతో పరవశుడయ్యాడు దండుడు. ఆ సుందరాంగిని చూచి ఇలా అడిగాడు.

"ఓ లలనా! నీవుఎవరు? ఇక్కడ ఎందుకుఉన్నావు? నీ తల్లితండ్రులు ఎవరు? నాకు నీ మీద మోహము కలిగింది. నా కోరిక తీర్చు." అని అడిగాడు. ఆ మాటలకు ఆ సుందరాంగి ఇలా బదులు చెప్పింది.

"రాజా! నేను నీ గురువు శుక్రాచార్యుని కుమార్తెను. నా పేరు అరజ. నేను ఈ ఆశ్రమములో ఉంటాను. నేను నీ గురువుగారి పుత్రికను.

నేను నా తండ్రి గారి సంరక్షణలో ఉన్నాను. నాకు ఇంకా పెళ్లి కాలేదు. నన్నుకోరడం తగదు. ఈ విషయం నా తండ్రికి తెలిస్తే నిన్ను శపిస్తాడు. అంతగా నా మీద నీకు కోరిక ఉంటే నీవు నా తండ్రిని అడిగి ఆయన ఒప్పుకుంటే నన్ను వివాహమాడి నీ కోరిక తీర్చుకో. అలా కాకుండా నన్ను బలవంతంగా అనుభవిస్తే నీకు పరాభవము తప్పదు. నా తండ్రి శుక్రాచార్యునకు కోపంవస్తే మూడులోకములను భస్మం చేస్తాడు. నీవు ఈ రాజ్యమునకు రాజువు. నీవు కోరితే నా తండ్రి తప్పకుండా నన్ను నీకు ఇచ్చి వివాహముచేస్తాడు. నా మాట విను."అని పరి పరి విధాల బతిమాలింది.

కాని మోహపరవశుడు, కామాతురుడు అయిన దండుడు ఆమె మాటలు వినలేదు. "ఓ లలనామణీ! నిన్ను చూచినప్పటినుండీ మన్మధుడు నన్ను కాల్చివేస్తున్నాడు. నేను ఇంక ఒక్క క్షణం కూడా తట్టుకోలేను. ఒక్కసారి నిన్ను అనుభవించిన తరువాత నేను చచ్చినా, నా సర్వస్వము నాశనం అయినా నాకు చింతలేదు. నేను నీ దాసుడిని నన్ను అనుగ్రహించు." అని బలవంతంగా ఆమెను ఆక్రమించుకున్నాడు. ఆమెను ఎంత వద్దని వారిస్తున్నా, ఆమెను బలవంతంగా అనుభవించాడు. తరువాత ఏమీ ఎరుగనట్టు తన నగరానికి వెళ్లిపోయాడు.

శుక్రాచార్యుని కుమార్తె అరజ ఏడుస్తూ తన తండ్రి శుక్రాచార్యుని రాక కోసం ఎదురుచూడసాగింది.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనుబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## ఎనుబది ఒకటవ సర్గ.

శుక్రాచార్యుడు రాగానే అరజ జరిగినది అంతా తండ్రికి చెప్పింది. శుక్రాచార్యుడు కోపంతో మండిపడ్డాడు. "వీడు నా కుమార్తెనే అవమానిస్తాడా! వీడికి నాశనం అయ్యే కాలం దాపురించింది. వీడు ఘోరమైన అపరాధము చేసాడు. దానికి తగినఫలం అనుభవిస్తాడు. నేటి నుండి ఏడురోజుల లోపల ఈ దండుడు తన పుత్రుల సహితంగా, పరివార సమేతంగా నాశనం అవుతాడు. ఈ దండుని రాజ్యమునకు నూరు యోజనముల విస్తీర్ణములో ధూళిమేఘములు కమ్ముకొని సర్వనాశనం చేస్తాయి. ఒక్క మానవులే కాదు సమస్తజంతుజాలము కూడా పశుపక్ష్యాదులు కూడా, వృక్షములు కూడా ఆ ధూళిలో పడి మాడిపోతాయి. ఈ ప్రాంతము నిర్మానుష్యము అవుతుంది. ఈ దండుని రాజ్య సరిహద్దులదాకా ధూళిమేఘాలు కప్పివేస్తాయి." అని శపించాడు. వెంటనే తన శిష్యులను చూచి "మీ రందరూ దండుని రాజ్యము విడిచి వెళ్లండి. రాజ్యము సరిహద్దుల అవతల నివసించండి." అని అన్నాడు. శుక్రాచార్యుని మాట ప్రకారము శిష్యులు అందరూ ఆశ్రమం విడిచి వెళ్లిపోయారు.

శుక్రాచార్యుడు తన కుమార్తెను చూచి ఇలా అన్నాడు. "ఇందులో నీ దోషం కూడా ఉంది కాబట్టి నీవు ఈ ఆశ్రమము నందు యోగాభ్యాసము చేస్తూ ఇక్కడే ఉండు. నిన్ను ఆ ధూళిరేణువులు తాకవు. వాటి వలన నీకు ఏమీ భయము లేదు." అని అన్నాడు.

తరువాత శుక్రాచార్యులు దండుని రాజ్యము విడిచిపెట్టి వెళ్లిపోయాడు. శుక్రాచార్యుని శాపప్రభావము వలన దండుని రాజ్యము అతని పరివారము సహా ఏడురోజులలో సర్వనాశనం అయింది. అప్పటి నుండి వింధ్య పర్వతము శైవల పర్వతము మధ్య ఉన్న ఈ ప్రదేశము దండుని పేరు మీద దండకారణ్యము అని పిలువబడింది. ఇక్కడ మునులు నివసించే ప్రదేశమును జనస్థానము అని పిలుస్తారు. రామా! ఇదీ ఆ ప్రాంతచరిత్ర. సాయం సంధ్యకు వేళఅయింది. నీవు వెళ్లి సంధ్యోపాసన చేయుము." అని అన్నాడు అగస్త్యుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ఎనభై ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## ఎనభైరెండవ సర్గ.

రాముడు సంధ్యోపాసనకు పక్కనే ఉన్నసరస్సుకు వెళ్లాడు. సాయంసంధ్యాకార్యక్రమములు ముగించుకొని ఆశ్రమంలో ప్రవేశించాడు. ఆ రాత్రికి అక్కడే విశ్రాంతి తీసుకున్నాడు. మరునాడుఉదయమే వెళ్లి అగస్త్యునికి నమస్కరించి అయోధ్యకు వెళ్లడానికి అనుమతి కోరాడు. "రామా! నీవు ఏ క్లేశములు లేకుండా ధర్మబద్ధంగా రాజ్యమును పరిపాలించు." అని అన్నాడు. రాముడు అగస్త్యుని ఆశీర్వాదము తీసుకొని పుష్పక విమానము ఎక్కి అయోధ్యకు బయలు దేరాడు.

అయోధ్యలోదిగిన తరువాత పుష్పకమును పంపించి వేసాడు. తనమందిరమునకు వెళ్లాడు. ద్వారపాలకుని పిలిచి వెంటనే లక్ష్మణుని భరతుని తన వద్దకు తీసుకొని రమ్మని చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనభై రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## ఎనభై మూడవ సర్గ.

రాముడు అయోధ్యకు వచ్చాడని ద్వారపాలకుని ద్వారా తెలుసుకున్న లక్ష్మణుడు భరతుడు వెంటనే రాముని వద్దకు వచ్చారు. రాముడు వారిని చూచి ఇలా అన్నాడు.

"నేను అధర్మమును ఆచరించుచున్న శంబూకుని చంపి బ్రాహ్మణ కుమారుని పునర్జీవితుని చేయగలిగాను. మీ ఇరువురిసాయంతో నేను రాజసూయ యాగమును చేయవలెనని అనుకుంటున్నాను. క్షత్రియులకు రాజసూయము చేయడం అత్యుత్తమమైన ధర్మము. పూర్వము మిత్రుడు రాజసూవయము చేసి వరుణత్వాన్ని పొందాడు. సోముడుకూడా రాజసూయము నిర్వహించి శాశ్వత కీర్తిని సంపాదించు కున్నాడు. కాని రాజసూయము చేయడం సామాన్యమైన పనికాదు. కాబట్టి మీరిరువురూ బాగా ఆలోచించి నిర్ణయం తీసుకోండి." అని అన్నాడు రాముడు.

అప్పుడు భరతుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! నీవు ధర్మస్వరూపుడవు. నీయందు ధర్మము,కీర్తి నిలిచి ఉంది. నీవు రాజులలో కెల్లా శ్రేష్టుడవు. లోకములకు నాధుడవు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించుచున్నావు. రాజసూయము వలన భూమి మీద ఉన్న రాజ్యములను అన్నిటినీ మనము జయించవలెను. అప్పుడు రక్తపాతము, జనక్షయము తప్పదు. క్షత్రియ వంశము నాశనమౌతుంది. అటువంటి రాజసూయమును నీవు ఎందుకు చేస్తావు. రాజసూయము చేస్తే ఎందరో రాజులు మనకు శత్రువులు అవుతారు. దాని వలన వినాశము సంభవిస్తుంది.

అయినా రామా! ఇప్పుడు నీ మాట కాదంటున్న వారు ఎవరు? అందరు రాజులూ నీ మాటమీరడం లేదు కదా. కొత్తగా రాజసూయం చేసి వారిని చంపడం ధర్మమా!" అని అన్నాడు భరతుడు. భరతుని మాటలు సమంజసంగా అనిపించాయి రామునికి. "భరతా! నీవు చక్కగా చెప్పావు. నీ మాటలు నాకు ఎంతో ఆనందం కలిగించాయి. ధర్మాన్ని చక్కగా, నిర్భయంగా చెప్పావు. రాజసూయం చేస్తే రాబోయే దుష్పరిణామాలను చక్కగా వివరించావు. నీ మాట ప్రకారము నేను రాజసూయ యాగము చేయవలెను అన్న సంకల్పాన్ని విరమించు కుంటున్నాను. నీవు చిన్న వాడి వైనా చక్కటి మాట చెప్పావు. నిన్ను నేను అభినందిస్తున్నాను." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనభైమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## ఎనభై నాలుగవ సర్గ.

రాముడు రాజసూయ యాగము చేయడం లేదు అని తెలుసుకున్న లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! తమరు అనుక్నుట్టు రాజసూయము చేయడం లేదు కాబట్టి అశ్వమేధ యాగము చేయడం మంచిదేమో ఆలోచించండి. అశ్వమేధ యాగము పవిత్రమైనది సర్వ పాపములను హరిస్తుంది. నీకు ఇష్టం అయితే అశ్వమేధ యాగమును చేయవచ్చును. పూర్వము ఇంద్రుడు అశ్వమేధ యాగము చేసి తన బ్రహ్మహత్యాపాతకమును పోగొట్టుకున్నాడు కదా! ఆ కథ వివరిస్తాను.

రామా! పూర్వము వృత్రుడు అనే దైత్యుడు ఉండేవాడు. అతడు ధర్మాత్ముడు. మూడులోకములవారు అతనిని అభిమానించేవారు. అతనికి ధర్మములు బాగా తెలుసు కృతజ్ఞుడు. బుద్ధిమంతుడు.  ఈ భూమిని అంతా ధర్మబద్ధంగా పరిపాలించాడు. అతని పాలనలో ప్రజలు సంతోషంగా జీవించేవారు. వానలు కురిసి పంటలు బాగా పండేవి. కరువుకాటకాలు ఉండేవి కావు.

ఈ ప్రాపంచిక సుఖముల కన్నా తపస్సు చేయడం శ్రేష్ఠమని అనుకున్నాడు వృత్రుడు. వెంటనే తన పెద్ద కుమారుడు మధురుడు అనే వాడికి రాజ్యము అప్పగించి తాను తపస్సుకు వెళ్లాడు. ఉగ్రమైన తపస్సు చేసాడు. ఎవరు తపస్సు చేసినా ముందు ఇంద్రుడికి అసూయ

కలుగుతుంది. అసూయతోపాటు తన పదవికి ఎక్కడ ముప్పు వస్తుందో అనే భయం కూడా కలిగింది ఇంద్రుడికి. వెంటనే ఇంద్రుడు విష్ణువు దగ్గరకు పరుగెత్తాడు.

"ఓ విష్ణూ! వృత్రుడు ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. అతడు ముల్లోకములను జయించాడు. అతను నా మాట వినడం లేదు. అతనిని శాసించడం నా వల్ల కావడం లేదు. అతడు తన తపస్సును ఇలాగే కొనసాగిస్తే అతనికి ముల్లోకాధిపత్యము సిద్ధిస్తుంది. అప్పుడు నా గతేమిటి. నీవు మాత్రం చూచీచూడనట్టు ఉన్నావు. నీవే కనుక కోపగిస్తే వాడు ఇంత కాలము తపస్సు చేసేవాడు కాదు. నాకు తెలుసు. వృత్రుడు నీకు మిత్రుడు, భక్తుడు. అందుకనే అతనిని ఉపేక్షిస్తున్నావు. అందుకే అతడు మూడు లోకముల వారిచేత ఆదరింపబడుతున్నాడు. నన్ను అనుగ్రహించు. అతని తపస్సును ఆపుచెయ్యి. లేకపోతే అతనిని చంపు. వృత్రుడిని చంపి దేవలోకమునకు శాంతి ప్రసాదించు. దేవతలు అందరూ వృత్రాసుర సంహారము కొరకు ఎదురుచూస్తున్నారు. నీవు ఒక్కడివే ఈ పని చేయగల సమర్థుడివి. గతిలేని వాళ్లకు నీవే గతి కదా! కాబట్టి ఈ పని చేసి పెట్టి, దేవతలను ఉద్ధరించు." అని దీనంగా వేడుకున్నాడు ఇంద్రుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ఎనభై నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము
## ఎనభై ఐదవ సర్గ.

ఇంద్రుని మాటలు విన్న విష్ణువు ఇలా అన్నాడు. “మహేంద్రా! నాకూ వృత్రునికి స్నేహం ఉంది అని నీకు తెలుసు కదా! అందుకని నేను వృత్రుని చంపలేను. కానీ నీకు సాయం చెయ్యక తప్పడం లేదు. అందుకని వృత్రుని చంపడానికి సాయం చేస్తాను. నేను నా శక్తిని మూడు భాగములుగా విభజిస్తాను. ఒకటి మహేంద్రునిలోనూ, మరొక అంశ వజ్రాయుధములోనూ, మూడవ అంశ భూమిలోనూ నిక్షిప్తం చేస్తాను. అప్పుడు ఇంద్రుడు వృత్రుని చంపగలడు.” అని అన్నాడు. ఆ మాటలకు దేవేంద్రుడు, దేవతలు సంతోషించారు. విష్ణువు తన తేజస్సును మహేంద్రునిలో ప్రవేశపెట్టాడు. అందరూ వృత్రుని చంపడానికి వెళ్లారు.

అప్పుడు వృత్రుడు ఒక మహారణ్యములో తపస్సు చేసుకుంటున్నాడు. అతని తేజస్సు ముల్లోకాలలో వెలిగిపోతూ ఉంది. ఇతనిని ఎలా చంపడమా అని దేవతలు మధనపడుతున్నారు. ఇంతలో దేవేంద్రుడు తన వజ్రాయుధమును రెండు చేతులతో పట్టుకొని ఒకే వేటుతో వృత్రుని తల నరికాడు. వృత్రుని తల తెగి కింద పడగానే భూమి కంపించింది. దేవేంద్రుడు కూడా భయంతో కంపించి పోయాడు. వెంటనే భూమి చివరి అంచుదాకా పరుగెట్టాడు. వృత్రుడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణుని చంపితే వచ్చే బ్రహ్మహత్యాపాతకము ఇంద్రుని తరిమింది. ఇంద్రుడి అన్ని అవయవములలో ప్రవేశించింది. ఇంద్రుడు నిర్వీర్యుడు

అయ్యాడు. దు:ఖంతో కుచించుకుపోతున్నాడు ఇంద్రుడు.

వృత్రాసురుడు మరణించాడు. ఇంద్రుడు కనపడటం లేదు. దేవతలకు ఏమి చెయ్యాలో తోచలేదు. వృత్రాసురుడు మరణించినందుకు దేవతలు అందరూ విష్ణువును పూజించారు. మహేంద్రుడిని బ్రహ్మహత్యా పాతకము నుండి విడిపించమని విష్ణువును ప్రార్థించారు. అప్పుడు విష్ణువు తరుణోపాయము చెప్పాడు.

"ఇంద్రుడు అశ్వమేధయాగము చేసి నన్ను పూజిస్తే వెంటనే అతనికి బ్రహ్మహత్యాపాతకము నుండి విముక్తి కలుగుతుంది." అని వరం ఇచ్చాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనభై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

ఎనభై ఆరవ సర్గ.

బ్రహ్మహత్యాపాతకము ఇంద్రుని శరీరం అంతా పాకిపోయింది. ఇంద్రునికి మూర్ఛవచ్చినట్టయింది. కింద పడి దొర్లుతున్నాడు. లోకపాలకుడు ఇంద్రుడు లేక పోవడం వల్ల వర్షాలు కురవడం లేదు. పంటలు ఎండిపోతున్నాయి. నదులలో, సరస్సులలో నీరు ఎండి పోయింది.

ప్రజలు దాహంతో అల్లాడుతున్నారు. అనావృష్టి సంభవించింది. దేవతలు అందరూ కలిసి ఇంద్రుని వద్దకు వెళ్లారు. ఇంద్రుడిని ముందు ఉంచుకొని అశ్వమేధ యాగము చేసారు. యజ్ఞముపూర్తి కాగానే బ్రహ్మహత్యా పాతకము ఇంద్రుని విడిచిపెట్టింది. "నేను ఎవరిని ఆవహించాలి." అని అడిగింది. అప్పుడు దేవతలు ఇలా అన్నారు.

"ఓ బ్రహ్మహత్యాపాతకమా! నిన్ను నీవు నాలుగు భాగములుగా విభజించుకో! ఒక భాగము వర్షాకాలము నాలుగు మాసములు పవిత్ర పుణ్య నదీ జలములలో ఆవహించు. నీలో స్నానం చేసే వారి పాపములను తొలగించు. రెండవ అంశను ఎండి పోయి బీడు పడ్డ చవిటి నేలలలో ఆవహించు. వాటిని సస్యశ్యామలం చెయ్యి. మూడవ అంశను యౌవనవతులు, ప్రౌఢలు అయిన స్త్రీలలో వారి బహిష్టు మూడురోజులు ఆవహించు. ఆ మూడురోజులు వారిని ఏ దుష్ట గ్రహదోషములు, పీడలు లేకుండా కాపాడుతూ ఉండు. నాల్గవ అంశను ఏ పాపమూ ఎరుగని బ్రాహ్మణులను ఎవరు పీడించి చంపుతారో వాళ్లని ఆశ్రయించి వారిని తగు విధముగా శిక్షించు. ఈ విధంగా లోక కల్యాణము గావించు." అని పలికారు దేవతలు. బ్రహ్మహత్యాపాతకము దానికి ఒప్పుకొని ఆ ప్రకారమే చేసింది. బ్రహ్మహత్యాపాతకము తొలగిపోగానే ఇంద్రుడు దేవతలతో స్వర్గానికి వెళ్లాడు. రామా! అశ్వమేధ యాగమ మహిమ అంత గొప్పది." అని లక్ష్మణుడు రామునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనభై ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## ఎనభై ఏడవ సర్గ.

లక్ష్మణుడు చెప్పిన వృత్రాసురుని వృత్తాంతము విన్న రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్షణా! యదార్ధము చెప్పావు. అశ్వమేధ యాగ ఫలము చాలా గొప్పది. ఇదే కాదు. అశ్వమేధ యాగ మహిమను చెప్పే వృత్తాంతము మరొకటి ఉంది. పూర్వము కర్దమ ప్రజాపతి కుమారుడు ఇలుడు అనే వాడు వాహ్లి దేశమును పాలిస్తున్నాడు. అతడు ధర్మం తప్పకుండా ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలిస్తున్నాడు. దేవతలు, దైత్యులు, నాగులు, రాక్షసులు, గంధర్వులు, యక్షులు అందరూ అతని ఎడల భయం భక్తి కలిగి ఉండేవారు. అతడు ఎంత దయకలవాడో అంత కోపిష్టి. కోపం వస్తే ప్రళయకాలరుద్రుడు అవుతాడు. అందుకని ఎవరూ తప్పుచేయడానికి భయపడేవారు.

ఒక సారి ఆయన వేటకు వెళ్లాడు. అలా వేటాడుతూ కుమారస్వామి జన్మస్థలమయిన కైలాస శిఖరమునకు వెళ్లాడు. అక్కడ మహాశివుడు, పార్వతితో కలిసి విహరిస్తున్నాడు. పార్వతీ పరమేశ్వరులు తమ కేళీవిలాసములలో భాగంగా శివుడు స్త్రీవేషం ధరించాడు. శివుడు ఎప్పుడు స్త్రీరూపం ధరించాడో పరిసరాలలో ఉన్న మృగములు, పక్షులు, అన్నీ స్త్రీరూపం ధరించాయి. ప్రతి వస్తువుకూ స్త్రీత్వము ఆవహించింది. ఇది తెలియని ఇలుడు, అతని పరివారమూ అక్కడకు వచ్చారు. ఆ ప్రదేశమునకు రాగానే ఇలుడు అతని పరివారమూ కూడా స్త్రీలుగా మారిపోయారు. అది శివుని మహిమ అని తెలుసుకొన్న ఇలుడు

పరమశివుని శరణు వేడాడు. ఇది వినిన శివునికి నవ్వు వచ్చింది. ఏదో తాను పార్వతిని సంతోషపెట్టడానికి స్త్రీరూపం ధరిస్తే ఈ విపరీతం జరిగినందుకు నవ్వాడు శివుడు. కాని ఒక సారి స్త్రీగా మారిన తరువాత అతనికి పురుషత్వము ఇవ్వడం సాధ్యం కాదు. అందుకని శివుడు ఇలునితో ఇలా అన్నాడు.

"రాజా! నీకు పురుషత్వం సిద్ధించడం తప్ప వేరు ఏవరం అయిన కోరుకో ఇస్తాను" అని అన్నాడు. ఇలుడు ఏవరమూ కోరలేదు. కాని పార్వతీదేవిని భక్తితో ప్రార్థించాడు. "అమ్మా! జగజ్జననీ! నా తప్పు ఏమీ లేకుండా నాకు స్త్రీత్వము సంప్రాప్తించింది. నన్ను కరుణించు." అని వేడుకున్నాడు. అయ్య కాదన్నా అమ్మ ఊరుకోదు కదా! "రాజా! శివుడు నిన్ను స్త్రీగా మార్చాడు. నేను ఆయనలో సగం కదా. అందుకని నీలో సగం భాగాన్ని పురుషుడిగా నేను మారుస్తాను. మరి ఎప్పుడు ఎలా ఉండాలో నీవే నిర్ణయించుకో." అని వరం ఇచ్చింది పార్వతి.

పార్వతి ఇచ్చిన వరానికి ఎంతో సంతోషించాడు ఇలుడు. "అమ్మా! నేను ఒక నెల స్త్రీగానూ, ఒక నెల పురుషుడుగానూ ఉండేట్టు వరం ప్రసాదించు." అని అడిగాడు.

పార్వతీ దేవి అలాగే అని వరం ఇచ్చింది."రాజా! నీవు స్త్రీగా ఉన్నప్పుడు నీవు పురుషుడవు అనే విషయం గుర్తుకు రాదు. అలాగే నీవు పురుషుడుగా ఉన్నప్పుడు నీవు స్త్రీవి అనే విషయం గుర్తుకు రాదు. లేకపోతే మనోవ్యధతో కుంగిపోతావు. ఈ  పద్ధతి నీకే కాదు నీ పరివారము

అందరికీ వర్తిస్తుంది" అని మరొక వరం కూడా ప్రసాదించింది పార్వతీదేవి.

ఆ ప్రకారంగా ఇలుడు,అతని పరి వారము ఒకమాసము పురుషులు గానూ, మరొక మాసము స్త్రీలు గానూ కాలం గడిపారు. ఇలుడు ఒక నెల ఇలమహారాజుగా, మరొక మాసము ఇలాదేవిగా కాలంగడిపాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము ఎనభైఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
ఎనభై ఎనిమిదవ సర్గ.

రాముడు చెబుతున్న కథను లక్ష్మణుడు భరతుడు ఆశ్చర్యంగా వింటున్నారు. "లక్షణా! భరతా! ఇలుడు అతని పరివారము స్త్రీలుగా మారి పోయారు అని చెప్పాను కదా! స్త్రీగా ఉన్న మొదటి మాసము ఇలాదేవి, తనతోపాటు స్త్రీలుగా మారిపోయిన పరివారముతో గడిపింది. తరువాత ఇలమహారాజుగా ఉన్నప్పుడు పురుషులుగా మారిన తన పరివారముతో గడిపింది. ఒక సారి, ఇలాదేవిగా ఉన్నప్పుడు ఆమె తన పరివారముతో విహరిస్తూ ఉండగా, ఒక సరస్సులో తపస్సు చేసుకుంటున్న బుధుడిని చూచింది. అప్పుడు బుధుడు మంచి యవ్వనంలో ఉన్నాడు.

పూర్ణచంద్రుని మాదిరి ప్రకాశిస్తున్న బుధుని చూచిన ఇలాదేవి మోహంలో పడిపోయింది. ఇలాదేవి ఆ సరస్సులోకి దిగి జలకాలాట ఆడింది. ఆమెను చూచిన బుద్ధుడు కూడా ఆమెను మోహించాడు.

"ఆహా! ఈమె ఎవరు? లోకోత్తరసౌందర్యముతో ప్రకాశిస్తూ ఉంది. ఆమెను చూచి నా మనసు పరవశించి పోయింది. దేవతలలో గానీ, గంధర్వులలోగానీ, అప్సరసలలో గానీ ఇంతటి సౌందర్యవతిని చూడలేదు. ఈమెకు వివాహము కాకపోతే నేను ఈమెను నాదానిగా చేసుకుంటాను." అని అనుకున్నాడు బుధుడు. వెంటనే నీటిలోనుండి బయటకు వచ్చాడు బుధుడు.

ఇలాదేవి వెంట ఉన్న స్త్రీల వద్దకు పోయి "ఈమె ఎవరు. మీరు ఎవరు" అని అడిగాడు. "ఈమె మాకు మహారాణి. మేము ఈమెకు చెలులము. ఈమెకు ఇంకా వివాహము కాలేదు. మేమంతా అరణ్యములలో వినోదంగా విహరిస్తున్నాము." అని అన్నారు. కాని బుధునికి నమ్మకము కుదరలేదు. ఆయన తన దివ్యదృష్టితో చూచాడు. అసలు విషయం తెలుసుకున్నాడు. వారంతా విధివశాత్తు స్త్రీలుగా మారిన పురుషులు అని తెలుసుకున్నాడు. వారితో ఇలా అన్నాడు.

"మీరందరూ కింపురుషీలుగా పిలువబడతారు. ఈ పక్కనే ఉన్న పర్వతము మీద నివాసం ఉండండి. మీకు కింపురుషులు అనే వాళ్లు భర్తలుగా దొరుకుతారు." అని అన్నాడు.

బుధుని మాటలతో వారందరూ కిపురుషీలుగా మారిపోయారు. అందరూ ఆ పర్వతము మీదికి వెళ్లారు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము ఎనభైఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము
## ఎనభైతొమ్మిదవ సర్గ.

రాముడు ఇలాదేవి కధను ఇలా చెప్ప సాగాడు. "తరువాత ఒక నాడు బుధుడు ఇలాదేవితోనూ ఆమె పరివారముతోనూ నవ్వుతూ ఇలా అన్నాడు. "నేను చంద్రుని కుమారుడను. నా పేరు బుధుడు. నాకు ఇలా దేవిమీద మోహము కలిగినది. నా ప్రేమను అంగీకరించు." అని అన్నాడు. అప్పుడు ఇలాదేవి అతనితో ఇలా అంది. "మేము ఇక్కడ స్వేచ్ఛగా విహరిస్తున్నాము. నేను కూడా నిన్ను చూచి మోహించాను. నీవు ఎలా చెబితే అలా చేస్తాను." అని పలికింది ఇలాదేవి. తరువాత బుధుడు, ఇలాదేవి ఆ వనములో స్వేచ్ఛగా విహరించారు. కామకేళీవిలాసములలో తేలియాడారు. అలా ఒక నెల గడిచిపోయింది.

నెల గడిచిన మరునాడు సూర్యోదయమునకు పూర్వమే నిద్రలేచిన బుధుడు తపస్సుకు వెళ్లిపోయాడు. మాసము గడిచిపోగానే ఇలా దేవి ఇల మహారాజుగా నిద్రలేచాడు.  ఇలమహారాజు సరస్సులో ఏ

ఆధారమూ లేకుండా నీటి మీద నిలబడి తపస్సుచేస్తున్న బుధుడిని చూచాడు. ఇలమహారాజుకు ఏమీ గుర్తు లేదు. బుధుడిని చూచి ఇలా అన్నాడు. “మహాత్మా! నేను నా పరివారము వేటకు వచ్చాము. దారి తప్పాము. నా పరివారము కనిపించడం లేదు. మీరు చూచారా!” అని అడిగాడు. ఇలమహారాజుకు ఏమీ గుర్తులేదు అని తెలుసుకున్నాడు బుధుడు.

“రాజా! పెద్ద వాన వచ్చింది. ఆ వానకు తట్టుకోలేక నీ వారందరూ మరణించారు. నీవు మాత్రము మిగిలావు. నీవు నా ఆశ్రమంలో నిద్రపోయావు. అందుకే బతికావు. నీవు ఇక్కడే నాతోపాటు ఉ ండు.” అని అన్నాడు బుధుడు. దానికి ఇల మహారాజు సమ్మతించలేదు. “నా పరివారము లేని చోట నేను ఉండలేను. నేను వెంటనే నా నగరానికి పోతాను.” అని అన్నాడు. కాని బుధుడు అతనిని బలవంతం చేసాడు. “నీవుఒక్క సంవత్సరము ఇక్కడ ఉంటే నీకు మేలుఅవుతుంది.” అని అన్నాడు. చేసేది లేక ఇలమహారాజు అక్కడ ఉండటానికి నిశ్చయించు కున్నాడు. తరువాత స్త్రీగా ఉన్న మాసము రోజులు బుధుడు, ఇలాదేవి కామక్రీడలలో తేలియాడుతున్నారు, పురుషుడు గా ఉన్న మాసము రోజులు విడిగా ఉంటున్నారు. ఇలాదేవికి బుధునికి ఒక కుమారుడు కలిగాడు అతని పేరే పురూరవసుడు. ఇలాదేవి తన పుత్రుడు పురూరవసుని బుధునికి అప్పగించింది.” అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ఎనభైతొమ్మిదవ సర్గ. సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్ .

ఉత్తర కాండము

తొంభయ్యవ సర్గ.

ఇలుడి కథ వింటుంటే లక్ష్మణునికి భరతునికి ఆశ్చర్యం కలుగుతూ ఉంది. ఉత్సాహంగా కుతూహలంగా వింటున్నారు. "రామా! ఇలుడు బుధుని వద్ద ఒక సంవత్సరము ఉన్నాడు కదా! తరువాత ఏమి జరిగింది." అని అడిగారు.

"సంవత్సరము తరువాత ఇలుడు తన పురుషత్వాన్ని పొందాడు. తరువాత బుధుడు సంవర్తునిడిని, చ్యవనుడిని, అరిష్టనేమిని,దుర్వాసుని మొదలగు మహామునులను పిలిపించాడు. వారితో ఇలా అన్నాడు. "మహామునులారా! ఈయన కర్దమ ప్రజాపతి పుత్రుడైన ఇలుడు. ఈయన విషయంలో ఒక విపరీతము జరిగింది."అని చెబుతూ ఉండగానే కర్దముడు  కొంతమంది బ్రాహ్మణులతో కలిసి అక్కడకు వచ్చాడు. కర్దమునితో పాటు పులస్త్యుడు, క్రతువు, వషట్కారుడు, ఓంకారుడు కూడా అక్కడకు వచ్చారు.

కర్దముడు వారితో ఇలా అన్నాడు. "నేను చెప్పేది వినండి. ఈ రాజుకు ఏది హితమో అది చేయండి. దీనికంతటికీ కారణము శివుడు. శివునికి అశ్వమేధ యాగము ప్రీతి పాత్రమైనది. అందుకని ఇలారాజు క్షేమముకోరి మనం అందరం అశ్వమేధ యజ్ఞము నిర్వహిద్దాము." అని అన్నాడు కర్దముడు. కర్దముని సంకల్పానికి అందరూ అంగీకరించారు. సంవర్తనుని శిష్యుడు అయిన మరుత్తు ఆ యజ్ఞానికి కావాల్సిన ఏర్పాట్లు

చేసారు. బుధుని ఆశ్రమము దగ్గర అశ్వమేధయాగము చేసారు. ఆ యాగమునకు రుద్రుడు వచ్చి హవిర్భాగములనుస్వీకరించాడు. అప్పుడు రుద్రుడు ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణోత్తములారా! ఈ అశ్వమేధ యాగము చేసి నన్ను తృప్తిపరిచారు. నేను ఇలునికి ఏమి చెయ్యాలో చెప్పండి." అని అడిగాడు. "మహాదేవా! ఇలుడు తమ దగ్గరకు రాక ముందు పురుషుడు. మీ దగ్గరకు వచ్చిన తరువాత స్త్రీగా మారిపోయాడు. తరువాత పార్వతీ దేవి వరము వలన మాసము స్త్రీగానూ, మాసము పురుషుడు గానూ మారుతున్నాడు. తమరు దయయుంచి ఇలుని పూర్ణపురుషుడుగా మార్చండి." అని వేడుకున్నాడు.

పరమశివుడు ఇలునికి సంపూర్ణ పురుషత్వము ఇచ్చి కైలాసము వెళ్లిపోయాడు. తరువాత యాగ నిర్వహణమునకు వచ్చి బ్రాహ్మణులు కూడా ఎవరి ఆశ్రమములకు వారు వెళ్లారు. తరువాత ఇలుడు తన పూర్వ రాజధాని బాహ్లిక దేశమును తన కుమారుడు శశబిందువుకు వదిలిపెట్టాడు. తను ప్రతిష్ఠాన పురము అనే కొత్త రాజధానిని ఏర్పాటుచేసుకున్నాడు. తండ్రి ప్రతిష్ఠానమును, కుమారుడు బాహ్లికదేశమును పరిపాలిస్తున్నారు.

కొంత కాలము తరువాత ఇలుడు రాజ్యాధి కారమును తనకుమారుడు పురూరవునికి అప్పగించి తాను బ్రహ్మలోకమునకు వెళ్లిపోయాడు. ఇలుడు, బుధుని పుత్రుడైన పురూరవసుడు ప్రతిష్ఠానపురమునకు రాజయ్యాడు.

లక్ష్మణా! అశ్వమేధయాగమునకు అంతటి మహత్తు ఉంది." అని రాముడు అశ్వమేధయాగ మహిమను తన తమ్ములు లక్ష్మణుడు, భరతునికి వివరించాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము తొంబదియవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము
## తొంబది ఒకటవ సర్గ.

రాముడు అశ్వమేధ యాగము చేయడానికి నిర్ణయం జరిగింది. దానికి చేయవలసిన ఏర్పాట్లు గురించి రాముడు, లక్ష్మణుడు, భరతునితో చర్చించాడు. "లక్ష్మణా! నీవు మన కుల గురువు వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కశ్యపుడు, ఇంకా ఇతర బ్రాహ్మణులను పిలిపించి వారితో అశ్వమేధ యాగము నిర్వహణ గురించి చర్చించు. కావలసిన ఏర్పాట్లు చెయ్యి. ఒక ఉత్తమ అశ్వమును మనము వదలవలసి ఉంటుంది. ఆకార్యక్రమమునకు మంచి ముహూర్తము నిర్ణయించమని వసిష్ఠుల వారికి చెప్పు." అని అన్నాడు.

వెంటనే లక్ష్మణుడు ఆ ఏర్పాట్లు చేసాడు. రాముడు చెప్పిన బ్రాహ్మణోత్తముల నందరినీ రావించాడు. రాముడు వారందరి పాదములకు నమస్కరించాడు. వారు రాముని ఆశీర్వదించారు.

రాముడు తాను అశ్వమేధ యాగము చేయదలచుకున్నానని వారితో అన్నాడు. రాముని సంకల్పమును వారందరూ శ్లాఘించారు. బ్రాహ్మణులందరికీ వారు వారు చేయదగిన పనులను అప్పచెప్పాడు రాముడు. సుగ్రీవునికి ఆహ్వానము పంపమని లక్ష్మణునికి చెప్పాడు.

"లక్ష్మణా! నీవు సుగ్రీవునికి, వానర నాయకులకు అశ్వమేధ యాగమునకు రమ్మని వేరువేరుగా ఆహ్వానములను పంపించు. విభీషణుడికి, ఇతర రాక్షస వీరులకు అశ్వమేధ యాగమునకు రమ్మని ఆహ్వానము పంపించు. మనకు సామంత రాజులైన వారందరికీ ఆహ్వానాలు పంపించు. దేశదేశములలో ఉన్న ఉత్తములైన బ్రాహ్మణులకు వేదపండితులకు ఆహ్వానాలు పంపించు. మనదేశములో ఉండి, తమ పనుల మీద ఇతర దేశములకు వెళ్లిన బ్రాహ్మణులకు కూడా ఆహ్వానాలు పంపించు. ఇంకా నటులను, నర్తకులను ఆహ్వానించు.

మనము ఈ యజ్ఞమును పవిత్రమైన నైమిశారణ్యములో చేసెదము. అక్క గోమతీ నదీ తీరంలో ఒక పెద్ద యజ్ఞశాల నిర్మించు. ఆ యజ్ఞశాలలో వందలకొద్దీ ఆహూతులు కూర్చుని యజ్ఞమును తిలకించుటకు ఏర్పాట్లు చేయించు. వచ్చిన వారందరికీ తగిన మర్యాదలు చేయడానికి ఏర్పాట్లు చేయించు. మంచి బియ్యమును ఒక లక్ష వాహనములలోనూ, తిలలు, పెసలు, శెనగలు ఇంకా ఇతరములైన తృణధాన్యములను, తైలములను, సుగంధ ద్రవ్యములను సమృద్ధిగా యజ్ఞశాలకు తరలించు.  వెండి, బంగారు నాణెములను నూరు కోట్లు బండ్లమీద యజ్ఞశాలకు తరలించు. వాటికి రక్షణగా భరతుడు వెళ్తాడు.

యజ్ఞము జరిగే చోట అంగళ్లను తెరవడానికి వర్తకులను, వండి వార్చడానికి వంటవాళ్లను, వినోదము అందించడానికి నర్తకులను గాయకులను, వార కాంతలను తరలించండి. ఈ ఏర్పాట్లు భరతుడు స్వయంగా పర్యవేక్షిస్తాడు.

పౌరసంఘముఖ్యులను, కార్యనిర్వాహకులను, పర్యవేక్షకులను, ధనాగారముల అధ్యక్షులను, ఇతర ఉద్యోగులను, అంతఃపుర కాంతలను, మన తల్లులను, నా భార్య సీత యొక్క బంగారు ప్రతిమను, వీరందరినీ తీసుకొని భరతుడు ముందుగా యజ్ఞశాలకు చేరుకుంటాడు. యజ్ఞవాటిక దగ్గర ఆహూతులైన బ్రాహ్మణులకు, వివిధ దేశాధీశులకు వసతి, భోజన సదుపాయములు సమకూర్చండి." అని రాముడు లక్ష్మణునికి భరతునికి తగిన ఆదేశాలు ఇచ్చాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము తొంభై ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము
## తొంభై రెండవ సర్గ.

అశ్వమేధ యాగమునకు కావలసిన ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. ఒక సుముహూర్తమున యాగాశ్వమును వదిలారు. యాగాశ్వము వెంట లక్ష్మణుడు పరిమిత సైన్యముతోనూ ఋత్విక్కుల

తోనూ వెళ్లాడు. రాముడు నైమిశారణ్యములో ఏర్పాటుచేయబడిన యజ్ఞవాటిక వద్దకు వచ్చాడు. అక్కడ యజ్ఞవాటిక నిర్మాణమును, ఏర్పాట్లును చూచి తన సంతృప్తిని వ్యక్తంచేసాడు.

రాజులందరూ ఒకరొక్కరుగా యజ్ఞవాటిక వద్దకు చేరుకుంటున్నారు. అందరికన్నా ముందుగా శత్రుఘ్నుడు వచ్చాడు. అన్న భరతునికి సాయంగా ఉన్నాడు. వచ్చిన రాజులందరూ తెచ్చిన కానుకలను స్వీకరిస్తున్నాడు రాముడు. వచ్చిన రాజులందరికీ భరతుడు, శత్రుఘ్నుడు భోజన, వసతి ఏర్పాట్లను చేస్తున్నారు. సుగ్రీవుడు మొదలగు వానర వీరులు కిష్కింధనుండి వచ్చారు. వారు కూడా యజ్ఞము పనులలో పాలుపంచుకుంటున్నారు. లంకా నగరము నుండి విభీషణుడు తన రాక్షస వీరులతో వచ్చాడు. విభీషణుడు యజ్ఞమునకు వచ్చిన బ్రాహ్మణులను భక్తితో సేవిస్తున్నాడు. వారికి కావలసిన అవసరములను తీరుస్తున్నాడు.

లక్ష్మణునిచేత రక్షింపబడుతున్న యాగాశ్వము తన సంచారమును ముగించుకొని యజ్ఞవాటికకు తిరిగి వచ్చింది. ఆ యజ్ఞములో యాచకులకు ఇంక చాలు అన్నదాకా అన్నం పెడుతున్నారు. ధనము బహూకరిస్తున్నారు. “అడిగినవారికి అడిగినంత ఇవ్వండి” అన్న మాట తప్ప “ఇంకలేదు” అన్న పదమే వినపడటం లేదు. యజ్ఞమునకు వచ్చిన వారందరికీ తృప్తిగా భోజనములు వడ్డించబడ్డాయి. యజ్ఞమునకు వచ్చిన వారు ఇది కావాలి అని అడగకముందే వారు కోరినవి సమకూర్చబడుతున్నాయి. ఆ యజ్ఞములో తృప్తి చెందని వాడు

ఎవడూ లేడు అంటే అతిశయోక్తి లేదు. ఆ యజ్ఞమునకు వచ్చిన మునులు, ఋషులు, బ్రాహ్మణులు నోటి వెంట "ఇటువంటి యజ్ఞమును మేము ఇంతవరకూ చూడలేదు" అన్నమాటే వినబడుతూ ఉంది. యాచకులకు ఆహూతులకు ఎన్ని కానుకలు, బహుమానములు ఇచ్చినా ఇంకా ఇవ్వవలసిన బంగారు నాణెములు, వస్త్రములు రాసులు రాసులుగా కనపడుతున్నాయి. వానరులు, రాక్షసులు ఎక్కడ చూచినా సిద్ధంగా నిలిచి ఉండి యజ్ఞమునకు వచ్చిన వారి సేవలలో నిమగ్నమై ఉన్నారు. ఈ విధంగా ఒక సంవత్సరము పాటు ఆ యజ్ఞము సాగింది.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము తొంభై రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## తొంభై మూడవ సర్గ.

రాముడు చేస్తున్న అశ్వమేధ యాగానికి వాల్మీకి తన శిష్యులతో సహా వచ్చాడు. వాల్మీకి తన శిష్యులతో సహా ఉండటానికి ఋషులు ఋత్విక్కులు ఉండేచోట ఒక పర్ణశాలను నిర్మించారు. ఆయన పర్ణశాలలో మధురమైన ఫలములు, శాకాహారములు సమకూర్చారు. రాముడు వాల్మీకికి నమస్కరించి ఆయన ఆశీర్వాదము తీసుకున్నాడు. వాల్మీకి శిష్యులైన కుశలవులు కూడా ఆయన వెంట వచ్చారు.

వాల్మీకి కుశలవులను చూచి ఇలాఅన్నాడు. "మీరు ఇద్దరూ నేను మీకు నేర్పించిన రామాయణ కావ్యమును, ఋషులు, బ్రాహ్మణులు నివసించే చోట మృదుమధురంగా గానం చెయ్యండి. గృహముల ముందు, నాలుగు వీధులు కలిసే చోట, రాజుల నివాసములలో గానం చేయండి. ముఖ్యంగా అశ్వమేధ యాగము జరిగేచోట, ఋత్విక్కుల ఎదుట, రాముని ఎదుట గానం చేయండి.

మీ వెంట మీరు తినడానికి ఫలములను తీసుకొని వెళ్లండి. ఎవరు ఏమి ఇచ్చినా తీసుకోకండి. రాజుగారు అయిన రాముడు మిమ్ములను రామాయణ కావ్యము గానం చేయడానికి పిలిపిస్తే వెళ్లండి. ఆయన ఎదుట ఋత్విక్కుల ఎదుట రామాయణ కావ్యమును గానం చేయండి. రోజుకు ఇరవై సర్గలు మాత్రమే గానంచేయండి. ఎవరైనా ధనం ఇస్తే తీసుకోకండి. వనములలో నివసించే మునులకు ధనముతో పనిలేదుకదా!

మీ గానమును విన్న రాముడు, మీ తల్లి తండుల గురించి గానీ, కులగోత్రముల గురించి గానీ అడిగితే మేము వాల్మీకి శిష్యులము అని మాత్రమే చెప్పండి. మీరు ఎవరికీ భయపడవద్దు. నిర్భయంగా రామాయణ కావ్యమును శృతి లయ బద్ధంగా గానం చేయండి.

రాజు అడిగితే గానం చేయను అని చెప్పకండి. రాజు మనలకందరికీ తండ్రి వంటి వాడు. మీకు కూడా తండ్రి వంటి వాడు. ఆయనను నిరాదరించవద్దు. మీ రామాయణ కావ్య గానమును రేపు

ఉదయమునుండి మొదలు పెట్టండి." అని లవకుశులకు చెప్పాడు వాల్మీకి.

సీతామాత పుత్రులయిన కుశలవులు వాల్మీకికి నమస్కరించి తమరు చెప్పినట్లే చేస్తాము అని మాట ఇచ్చారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము తొంభైమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## తొంభైనాలుగవ సర్గ.

మరునాడు రాముడు సభామంటపంలో కూర్చుని ఉన్నాడు. ఆ సభకు అనేక మంది వచ్చారు. మహామునులు, రాజులు, పండితులు, పౌరసంఘముల అధ్యక్షులు, విద్యావేత్తలైన బ్రాహ్మణులు, సంగీతజ్ఞానము కల వాళ్లు, సంగీతము మీద ఆసక్తి కలవాళ్లు, గాంధర్వ శాస్త్రములో నిష్ణాతులైన వాళ్లు, ఛందోబద్ధంగా కవిత్వము చెప్పగలిగిన వాళ్లు, స్వరజ్ఞానముకలవాళ్లు, జ్యోతిష శాస్త్రములోనూ, అలంకార శాస్త్రములోనూ నిపుణులు, కావ్యరచనలో దిట్టలు, బహుభాషాప్రవీణులు, మనస్తత్వ శాస్త్రవేత్తలు, వర్తకులు, లౌకికులు, న్యాయశాస్త్ర ప్రవీణులు, ఇతర శాస్త్రములయందు జ్ఞానము సముపార్జించినవారు, పురాణములు చదివిన వారు, వేదపండితులు, చిత్రకళలో ప్రావీణ్యులు, నృత్య,గానముల

యందు ఆసక్తి ఉన్న వారు, నీతి శాస్త్ర వేత్తలు, వేదాంత అర్థములను విశధీకరించి చెప్పగలిగిన నిష్ణాతులు, ఇంకా ఇతర మేధావులు ఆ సభను అలంకరించి ఉన్నారు. కుశలవుల రామాయణ కావ్య గానాన్ని నిండు సభలో రాముడు విన్నాడు. ఆ చిన్ని బాలలు ఇద్దరూ సంగీతబద్ధంగా పాడుతున్న గానాన్ని విని ముగ్ధుడయ్యాడు రాముడు. వీణలు వాయిస్తూ కుశలవులు సంగీత ప్రమాణములు తప్పకుండా పాడుతుంటే రాముడు చాలా కుతూహలంగా విన్నాడు. ఆ సభలోని వివిధశాస్త్రములలో నిష్ణాతులందరూ కుశలవుల గానానికి ముగ్ధులయ్యారు. ఎంత సేపు విన్నా వారికి తృప్తి కలగడం లేదు.

కాని ఆ సభలో ఉన్న వారందరికీ ఒకే ఒక విషయం ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంది. కుశలవులు ఇద్దరూ అచ్చు రాముని ప్రతిబింబముల మాదిరి ఉన్నారు. కుశలవులు నారబట్టలు జటాజూటములు ధరించక పోతే అచ్చం రాముని మాదిరే ఉన్నారు. రామునికి ఆ బాలురకు ఏమీ భేదము కనిపించడం లేదు. అది ఎలా సాధ్యం అన్నది వారి మనసులో మెదులుతున్న ప్రశ్న.

ఇంతలో రామాయణకథాగానంలో మొదటి ఇరవైసర్గలు పూర్తి అయ్యాయి. వాల్మీకి చెప్పినట్టు ఇరవై సర్గలు పూర్తి కాగానే కుశలవులు రామాయణ కావ్యము గానం చేయడం ఆపారు. ఇంతలో సూర్యుడు అస్తమించాడు. రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. “లక్ష్మణా! ఈ ముని కుమారులకు 18,000 బంగారు నాణెములు, ఇంకా వారికి ఏమి కావాలంటే దానిని వారికి ఇమ్ము.” అని ఆదేశించాడు.

రాముని ఆదేశము ప్రకారము లక్ష్మణుడు వారికి బంగారు నాణెములు వారికి ఇచ్చాడు. కాని వారు తీసుకోలేదు. "మేము మునికుమారులకు. అడవులలో కందమూలములు తినువారము. మాకు ఈ బంగారము ఎందుకు. దీనితో మేము ఏమి చేసుకుంటాము." అని అన్నాడు. బంగారము ఇస్తుంటే వద్దనే వాళ్లను చూచి రాముడు, సభాసదులు ఆశ్చర్యపోయారు. రాముడు కుశలవులనుచూచి ఇలా అన్నాడు.

"బాలలూ! మీరుఎవ్వరు? ఈ కావ్యమును ఎవరు రచించారు? ఆయన ఎక్కడ ఉంటాడు? ఆయన దేశము ఏది?" అని అడిగాడు. కుశలవులు రామునికి ఈ విధంగా సమాధానం ఇచ్చారు.

"రాజా! ఈ కావ్యమును రాసిన వారు వాల్మీకి మహర్షి. ఈ యజ్ఞమునకు వారు కూడా వచ్చారు. ఇది తమరి యొక్క కధ. దీనిని వాల్మీకి మహర్షి 24,000 శ్లోకములలో రచించాడు. ఇందులో నూరు ఉపాఖ్యానాలు ఉన్నాయి. ఈ రామాయణ కావ్యంలో ఐదు కాండములు ఉన్నాయి. ఉత్తర కాండతో సహా ఆరు కాండములు ఉన్నాయి. ఈ ఆరు కాండములలో 500 సర్గలు ఉన్నాయి. ఈ కావ్యమునకు నాయకుడు రాముడు. అంటే మీరు. మీ జీవితము ఎంతవరకు ఉందో అంతవరకుఉన్న కథ ఈ రామాయణ కావ్యంలో రాయబడింది. తమరికి వినవలెనని కోరిక ఉంటే ఈ యజ్ఞము జరుగుతున్న సమయంలో తమ్ములతో సహా ఈ రామాయణ కావ్యమును సభాసదులందరితో కలిసి వినండి. మేము గానం చేయడానికి సిద్ధంగా ఉన్నాము." అని అన్నారు.

దానికి రాముడు సమ్మతించాడు. సాయంత్రం కావడంతో కుశలవులు వాల్మీకి వద్దకు వెళ్లారు. రాముడు కూడా యజ్ఞశాలకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము తొంభైనాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

ఉత్తర కాండము

తొంభై ఐదవ సర్గ.

ఆ ప్రకారంగా రాముడు సభాసదులతో కలిసి రామాయణ కావ్యగానాన్ని చాలారోజులు విన్నాడు. కుశలవుల ముఖకళవళికలను బట్టి, వారి రూపములను బట్టి వారు తాను వాల్మీకి మహర్షి ఆశ్రమ ప్రాంతంలో విడిచి రమ్మన్న సీతకు జన్మించిన కుమారులు అని గ్రహించాడు రాముడు. ఒక రోజు సభామధ్యలో కూర్చుని ఇరువురి దూతలను పిలిపించాడు. వారితో ఇలా అన్నాడు. "మీరు వాల్మీకి మహర్షి వద్దకు వెళ్లండి. ఆయన వద్ద నా భార్య సీత ఉంది. మీరు వాల్మీకి మహర్షితో ఇలా చెప్పండి.

"నా భార్య సీత ఏ పాపము ఎరుగనిది ఐతే, ఆమె పరిశుద్ధమైన ప్రవర్తన కలది ఐతే, వాల్మీకి మహర్షితో కలిసి సీత ఇక్కడికి వచ్చి తన పరిశుద్ధత్వమును నిరూపించుకోవాలి. అప్పుడు నేను ఆమెను తిరిగి నా

వద్దకు స్వీకరిస్తాను." అని చెప్పండి.

వాల్మీకి అభిప్రాయమును, సీతయొక్క మనస్సులో ఉన్న భావాన్ని తెలుసుకొని వచ్చి నాకు చెప్పండి. సీత ఒప్పుకుంటే, రేపు ఉదయము ఈ సభాపరిషత్తు మధ్యలో నిలబడిసీత తన నిర్దోషిత్వాన్ని నిరూపిస్తూ ప్రతిజ్ఞ చేయాలి." అని అన్నాడు రాముడు.

రాముని మాటలను ఆశ్చర్యంతో విన్నారు సభాసదులు. వెంటనే ఆ దూతలు వాల్మీకి వద్దకు వెళ్లారు. రాముడి మాటలను యధాతథంగా వాల్మీకి మహర్షితో చెప్పారు. ఆ మాటలను విన్నాడు వాల్మీకి. రాముని హృదయంలో మెదులుతున్న భావాన్ని గ్రహించాడు. ఆ దూతలతో ఇలా అన్నాడు. "దూతలారా! రామునితో నా మాటగా చెప్పండి. స్త్రీకి పతియే దైవము. అందుకని సీత రాముడు చెప్పినట్టు సభామధ్యలో నిలబడి ప్రతిజ్ఞ చేస్తుంది." అని అన్నాడు. ఆ దూతలు రాముని వద్దకు వచ్చి వాల్మీకి మహర్షి చెప్పిన మాటలను చెప్పారు.

అప్పుడు రాముడు సభాసదులను చూచి ఇలా అన్నాడు. "సభాసదులారా! మహా ఋషులారా! పురప్రముఖులారా! నీతి కోవిదులారా! రేపటి దినమున సీత సభాభవన మధ్యలో మీ అందరి ఎదుట నిలబడి తన నిర్దోషిత్వమును నిరూపించుకుంటూ ప్రతిజ్ఞ చేస్తుంది. మీరందరూ వచ్చి సీత చేయబోవు ప్రతిజ్ఞను వినండి." అని అన్నాడు.

"రామా! ఇలా చేయడం నీకే తగునయ్యా! ఇలా చేయడం భూమి మీద ఎవరి తరమూ కాదు!" అని సభాసదులందరూ ముక్త కంఠంతో అరిచారు.

( "ఉపపన్నం నరశ్రేష్ఠ! త్వయ్యేవ భువి నాన్యత:" ఈ మాటలలో శ్లేష గమనించండి.)

తరువాత రాముడు సభ మరునాడు సమావేశమవుతుంది అని ప్రకటించి యాగశాలకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము తొంభై ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
తొంభై ఆరవ సర్గ.

మరునాడు తెల్లవారింది. అందరూ సభకు వచ్చారు. వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కశ్యపుడు, విశ్వామిత్రుడు, దుర్వాసుడు, పులస్త్యుడు, శక్తి, భార్గవుడు, వామనుడు, మార్కండేయుడు, మౌద్గల్యుడు, గర్గుడు, చ్యవనుడు, శతానందుడు, భరద్వాజుడు, అగ్నిపుత్రుడు, నారదుడు, పర్వతుడు, గౌతముడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, అగస్త్యుడు, ఇంకా ఇతర మునులు వేదవేదాంగపారంగతులైన బ్రాహ్మణోత్తములు, ఆ సభకు

వచ్చారు. వానరులు, వానర వీరులు, విభీషణుడు అతనితో వచ్చిన రాక్షస ప్రముఖులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, జ్ఞానులు, యోగులు, వీరందరూ సీత చేయబోవు ప్రతిజ్ఞను వినడానికి వేలాది మందిగా వచ్చారు.

రాముడు సింహాసనము మీద కూర్చుని ఉన్నాడు. వాల్మీకి సభలోకి ప్రవేశించాడు. ఆయన వెంట సీత కళ్లలో కన్నీరు నిండగా మనసులో రాముని స్మరించుకుంటూ సభామధ్యకు వచ్చింది. సీతనుచూచిన సభాసదులు ఆశ్చర్యంతో ఆమెను చూస్తున్నారు. వారందరూ జీవితమంతా కష్టములు పడుతున్న సీతను చూచి దు:ఖించారు. సభలో ఉన్న వారు కొంత మంది రాముని చర్యను పొగిడితే, మరి కొందరు సీతను సమర్థించారు. మరి కొందరు సీతారాములకు జయజయధ్వానాలు చేసారు.
ఆ సన్నివేశాన్ని వాల్మీకి ఈ విధంగా వర్ణించాడు.
సాధు రామేతి కేచిత్తు సాధు సీతేతి చాపరే
ఉభావేవ చ తత్రాన్యే ప్రేక్షకా: సంప్రచుక్రుశ:

వాల్మీకి సభామధ్యమున నిలిచి రామునితో ఇలా అన్నాడు.

"రామా! ఉత్తమురాలు, ధర్మము తప్పనిది అయిన నీ భార్య సీతను, లోకాపవాదమునకు భయపడి నీవు నా ఆశ్రమము దగ్గర ఒంటరిగా వదిలి వెళ్లావు. నీవు అనుమతి ఇస్తే  లోకాపవాదము వలన భయ పడ్డ నీకు, సీత తన పాతివ్రత్యమును, నిర్దోషిత్వమును

నిరూపించుకోగలదు. ఈ కవలలు, కుశలవులు సీతకు జన్మించిన నీ పుత్రులు. వీరిద్దరూ నీ కుమారులు. ఇది సత్యము. నేను ఎప్పుడూ అసత్యము పలకలేదు. వీరిద్దరూ నీ కుమారులు అని ప్రమాణము చేసి చెబుతున్నాను. నన్ను నమ్ము. నేను కొన్ని వేల సంవత్సరములు తపస్సు చేసాను. నీ భార్య సీతలో ఏదైనా దోషం ఉంటే నేను చేసిన ఇన్ని సంవత్సరాల తపస్సు ఎందుకూ పనికిరాకుండా అయిపోతుంది.

నేను ఇప్పటి వరకూ నా మనో వాక్కు శరీరములతో ఏ పాపమూ చేయలేదు. సీతకు ఏ పాపము తెలియదు అని నిశ్చయంగా చెబుతున్నాను. నేను సీతను అరణ్యములో చూచి నపుడు ఆమె పరిశు ద్ధురాలని గ్రహించి ఆమెకు ఆశ్రయం ఇచ్చాను. నాటి నుండి నేటి వరకూ సీత నిన్ను మనసా వాచా కర్మణా స్మరిస్తూ ఉంది. పతిదేవునిగా ఆరాధిస్తూ ఉంది. లోకాపవాదంతో భయపడుతున్న నీకు సీత తన పాతివ్రత్యమును నిరూపించుకొనే శపథం చేస్తుంది.

రామా! సీతలో ఏ దోషమూ లేదని నీకూ తెలుసు. కానీ లోకాపవాదమునకు భయపడి నీవు సీతను విడిచిపెట్టావు. నేను దివ్యదృష్టితో చూచి చెబుతున్నాను. సీత ఉత్తమురాలు, మహా పతివ్రత. ఆమెలో ఏ దోషమూ లేదు. అని నీకు తెలియజేస్తున్నాను." అని అన్నాడు వాల్మీకి.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము తొంభై ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## తొంబై ఏడవ సర్గ.

వాల్మీకి మహర్షి చెప్పిన మాటలను సావధానంగా విన్నాడు రాముడు. వాల్మీకి వెనక ఒదిగి నిలబడి ఉన్న సీతను చూచాడు. వాల్మీకి మహర్షికి భక్తితో నమస్కరించి ఇలా అన్నాడు. "మహర్షీ! తమరు పలికిన పలుకులు యదార్థములు. తమరి పలికిన పలుకుల మీద నాకు పరిపూర్ణ విశ్వాసము, నమ్మకమూ ఉన్నాయి. లంకా నగరం వద్ద, దేవతల సమక్షంలో సీత అగ్ని ప్రవేశము చేసి తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకుంది. అందుచేతనే ఆమెను స్వీకరించాను. కానీ, అయోధ్యలో మరొక సారి ఆమె మీద నిందమోపబడింది. లోకులు వేసిన నింద చాలా బలంగా ఉంది. అందుచేత లోకాపవాదమునకు భయపడి నేను సీతను తమరి దగ్గర విడిచిపెట్టాను. సీత ఏ పాపమూ ఎరుగదనీ, ఆమెలో ఏ దోషమూ లేదని తెలిసి కూడా లోకాపవాదమునకు వెరచి ఆమెను వదిలిపెట్టాను. దీనికి మీరు నన్ను క్షమించాలి. రామాయణకావ్యమును గానం చేసిన కవలలు నా కుమారులు అని నాకు తెలుసు. సీత అందరి మధ్య దోషము లేనిదిగా నిరూపితమైతే గానీ నేను ఆమెను తిరిగి స్వీకరించలేను." అని అన్నాడు రాముడు.

ఇంతలో దేవేంద్రుడు, దేవతలు, ఆదిత్యులు, మరుత్తులు, రుద్రులు, విశ్వేదేవతలు, సమస్తదేవతలు, సిద్ధులు, సాధ్యులు, నాగులు, మొదలగు దేవతా గణములు సీత చేయబోవు శపథమును వినుటకు అక్కడకు చేరుకున్నారు. అక్కడు వచ్చిన దేవతలందరినీ చూచి రాముడు

మరలా ఇలాఅన్నాడు.

"దేవతలారా! నాకు వాల్మీకి మహర్షి మాటల యందు నమ్మకం ఉంది. కాని జనవాక్యమునకు కట్టుబడిన నేను స్వంత నిర్ణయము తీసుకోలేను. కాబట్టి తన నిర్దోషిత్వమును నిరూపించుకోడానికి సీత ప్రమాణము చేయక తప్పదు." అని అన్నాడు రాముడు.

సభఅంతా నిశ్వబ్దంగా ఉంది. అప్పుడు కాషాయ వస్త్రములను కట్టుకున్న సీత తల వంచుకొని సభా మధ్యకు వచ్చి నిలబడింది. సీత ఇలా అన్నది.

(సీత పలికిన పలుకులు యధాతథంగా మనం తెలుసుకుందాము.)
యథాహం రాఘవాదన్యంమనసాపి న చిన్తయే
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి.
(నేను నా మనసులో రాముని తప్ప మరొకరిని తలవని దానినయితే భూదేవి నాకు దారి ఇచ్చుగాక!)
మనసా కర్మణా వాచా యథా రామం సమర్చయే
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి
(నేను నా మనస్సుచేతా వాక్కుచేతా, కర్మ చేతా ఎల్లప్పుడూ రాముని పూజించెదనేని, భూదేవి నాకు దారి ఇచ్చు గాక!)
యథైతత్సత్యముక్తం మే వేద్మి రామాత్ పరం న చ,
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి
(నేను చెప్పిది అంతా నిజం అయితే, నాకు రాముడు తప్ప మరొక వ్యక్తిని తెలియనట్లయితే, భూదేవి నాకు దారి ఇచ్చుగాక)

పైవిధంగా సీతాదేవి సభామధ్యలో నిలబడి సభాముఖంగా పలికింది. సీత ఆ మాదిరి శపథం చేయుచుండగా ఒక అద్భుతము జరిగింది. ఒక దివ్యమైన సింహాసనము భూమిని చీల్చుకుంటూ భూమి లో నుండి పైకి వచ్చింది. ఆ సింహాసనాన్ని నాగులు మోస్తున్నాయి. ఆ సింహాసనము మీద భూదేవి కూర్చుని ఉంది. ఆమె తన చేతులు రెండూ సీత కోసం చాచింది. సీతను తన వద్దకు రమ్మని పిలిచింది. సీత తన తల్లి భూదేవివద్దకు వెళ్లింది. భూదేవి తన కుమార్తె అయిన సీతను తన కౌగిట్లోకి తీసుకుంది. తన పక్కన సింహాసనము మీద కూర్చోబెట్టుకుంది. వెంటనే ఆ సింహాసనము భూదేవి, సీతాదేవిలతో సహా రసాతలమునకు వెళ్లిపోయింది. ఆ ప్రదేశంలో భూమి మామూలుగా అయింది.

క్షణకాలంలో జరిగిన ఆ దృశ్యమును చూచిన దేవతలు పులకించి పుష్పవృష్టిని కురిపించారు. దేవతలందరూ "ఓ సీతా! నీవు ధన్యురాలవు. నీ శీలము గొప్పది" అని పెద్దగా శ్లాఘించారు.

సభలో కూర్చున్న వారందరూ ఈ దృశ్యాన్ని కళ్లప్పగించి చూస్తున్నారు. కనురెప్పపాటులో జరిగిపోయిన ఆ అద్భుతాన్ని వారు ఆశ్చర్యంతో వీక్షించారు. కొంత మంది "ఇది కలా! నిజమా!" అని ఆలోచనలో పడ్డారు. కొందరు రాముడి వంకా, సీత వెళ్లిన వంకా చూస్తున్నారు.

సీత ఆకస్మికంగా రసాతలంలో ప్రవేశించడం చూచి అందరూ ఆశ్చర్యచకితు లయ్యారు. అందరికీ స్పృహ తప్పినట్టు అయింది. సభఅంతా నిశ్శబ్దంగా మారింది.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము తొంభై ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత& ఓంతత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
తొంభై ఎనిమిదవ సర్గ.

అంతా క్షణంలో జరిగిపోయింది. అందరికళ్లముందే, అందరూ చూస్తూ ఉండగానే సీత రసాతలంలో ప్రవేశించింది. ఎవరి కోసరం తాము ప్రాణాలకు తెగించి రాక్షసులతో పోరాడామో అ సీత రాముని విడిచి తమ ఎదురుగుండా రసాతలానికి వెళ్లి పోవడం చూచిన వానరులు పెద్దగా ఏడ్చారు. అక్కడ చేరిన మునులు మాత్రం చాలా బాగా జరిగింది అని ఆమె పాతివ్రత్యాన్ని కొనియాడారు. రాముడు మాత్రం అలాగే కూలబడి పోయాడు. యజ్ఞదండాన్ని ఆనుకొని తలదించుకొని ఏడుస్తున్నాడు.

రాముడి కళ్లనుండి నీరు ధారాపాతంగా కారుతూ ఉంది. ఏదో ప్రజల కోసం ప్రమాణం చెయ్యమన్నాడే కానీ సీత ఇంత దారుణమైన నిర్ణయం తీసుకుంటుందని, తనకుశాశ్వతంగా దూరం అవుతుందనీ

అనుకోలేదు. ఆనాడు లంకలో "నీ ఇష్టంవచ్చిన వారి దగ్గరకుపో" అన్నప్పుడు "ఎక్కడికో ఎందుకు అగ్ని దేవుని వద్దకు వెళతాను" అని అగ్నిలో దూకింది సీత. ఈ నాడు ప్రమాణం చెయ్యమన్నందుకు ఏకంగా శాశ్వతంగా తన పుట్టినింటికి వెళ్లి పోయింది. ఇదంతా తలచుకుంటూ రాముడు ఏడుస్తున్నాడు.

రాముని శోకానికి అంతం లేకుండా పోయింది. ఆ శోకంలో నుండి క్రోధం పుట్టకొచ్చింది. "నా భార్య సీత. అపర లక్ష్మీదేవి. నేను చూస్తూ ఉండగానే రసాతలానికి వెళ్లిపోయింది. నా కళ్లముందే అదృశ్యం అయింది. నేను పర్ణశాలలో లేనపుడు రావణుడు నా సీతను అపహరించుకు పోయాడు. నేను సముద్రము దాటి లంకకు పోయి రావణుని చంపి నా సీతను తిరిగి తెచ్చుకున్నాను. ఇప్పుడు ఈ రోజు నా కళ్లఎదురుగుండా నేను చూస్తూ ఉండగానే భూదేవి నా సీతను తీసుకొని పోయింది. నేను ఊరుకుంటానా! రావణాసురుడినే చంపిన వాడిని. ఈ భూదేవి ఎంత? ఓ భూదేవీ! నా సీతను తిరిగి నాకు ఇవ్వు. లేకపోతే నేనేమిటో నా పరాక్రమము ఏమిటో నీకు రుచి చూపిస్తాను. ఒక విధంగా నీవు నాకు కన్యనిచ్చిన తల్లివి. (అత్తగారివి). నా సీత నీ నుండి పుట్టింది కదా! నా సీతను నాకు తిరిగి ఇమ్ము. లేదా నాకు కూడా దారి ఇమ్ము. రసాతలంలో గానీ, స్వర్గంలో కానీ నేను నా సీతతోనే ఉంటాను. నా సీత కోసరం నేను పిచ్చివాడినయ్యాను. ఈ కోపంలో నేను ఏమైనా చేస్తాను. నా సీతను నాకు తిరిగి ఇస్తావా లేక ఈ భూమి అంతా జలమయం చెయ్యమంటావా! పర్వతాలు, కొండలు, అడవులు, చెట్లు అన్నీ చదును చెయ్యమంటావా! అగ్నితో దగ్ధం చెయ్యమంటావా! ఏం చెయ్యమంటావో చెప్పు?" అని

కోపంతో ఊగిపోతూ రాముడు పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నాడు.

రాముని ఓదార్చడానికి కానీ రాముని కోపాన్ని శాంత పరచడానికి కానీ ఎవరికీ ధైర్యం చాలలేదు. అప్పుడు బ్రహ్మదేవుడు రాముని వద్దకు వచ్చాడు. "రామా! ఏమిటీ పామరత్వము. నీవు ఎవరవో నీకు తెలియదా! తెలిసే ఇలా శోకిస్తున్నావా! నీవు ఎవరివో ఒక్కసారి గుర్తు తెచ్చుకో. నేను నీకు చెప్పడం లేదు. నీవే ఆలోచించు. నీ భార్య సీత నాగలోకము చేరుకుంది. నీవు స్వర్గము చేరుకున్న తరువాత ఆమె నీ దగ్గరకు వస్తుంది. ఇప్పటి దాకా నీవు వినిన రామాయణ కావ్యము నీ సందేహములు అన్నీ తీర్చగలదు. రామాయణము పూర్తిగా విను. నీవు పుట్టినది మొదలు, నీ చరిత్ర పూర్తిగా వాల్మీకి తన రామాయణంలో పొందుపరిచాడు. వాల్మీకిచే రచింపబడిన ఈ ఆది కావ్యము నీ యందే ప్రతిష్ఠితమై ఉంది. నీ గురించే చెప్పబడింది. రామాయణ కావ్యంలో నీ కీర్తి ప్రతిష్టలు వర్ణింపబడ్డాయి. రామాయణమును పూర్తిగా వింటే నీ సందేహాలు తొలగి పోతాయి. నేను, దేవతలు కలిసి నీ చరిత్రను పూర్తిగా విన్నాము. కాబట్టి నీవు కూడా రామాయణ కధను పూర్తిగా విను. నీవు ఇప్పటి దాకా చూచిన, విన్న రామాయణము తరువాతి భాగమునకు ఉత్తర కాండము అని పేరు. జరగబోవు రామ కధను నీవు ఋషులతో కలిసి విను. భవిష్యత్తులో జరగబోవు ఈ ఉత్తర కాండమును ముందు నీవు మాత్రమే వినవలెను. తరువాతనే లోకమునకు తెలియాలి."అని పలికిన బ్రహ్మదేవుడు దేవతలతో కలిసి స్వర్గలోకమునకు వెళ్లిపోయాడు.

బ్రహ్మదేవుని మాటలతో రాముడు శాంతించాడు. తన శోకాన్ని విడిచిపెట్టాడు. ఉత్తర రామ కథను వినుటకు మునులు అందరూ బ్రహ్మదేవుని అనుజ్ఞ పొంది రాముని దగ్గర కూర్చున్నారు. రామ కథ భవిష్యత్తులో ఎన్నిమలుపులు తిరగబోతుందో అని అంతా ఆతురతగా ఎదురుచూస్తున్నారు. రాముడు కూడా రాబోవుకాలములో జరగబోవు తన కథను వినడానికి మునులతో సహా కూర్చున్నాడు.

అప్పుడు భూమి లోనుండి ఒక ధ్వని వినబడింది.

"రామా! నీకు కలిగిన శోకము దైవికము. దానిని వదిలిపెట్టు. నీవు సీతను చేజేతులా పోగొట్టుకున్నావు. ఇప్పుడు నీవు కావాలని కోరినా ఆమె నీకు దక్కదు. ఆమె ప్రస్తుతము నాగలోకంలో నాగులపూజలు అందుకుంటూ ఉంది. ఆమె త్రిలోకములలో పూజలందుకుంటుంది.

ఆమె ఎవరోకాదు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు వక్షస్థలములో నివసిస్తున్న లక్ష్మీదేవి అవతారము. కాబట్టి ఆమెను చూడాలని కానీ, తిరిగి ఆమె పొందాలని కానీ అనుకోకు. ఆ ఆలోచన విరమించుకో. నీ కుమారులు, సీతాదేవి పుత్రులు, అయిన కుశలవులలో ఆమెను చూచుకో. వారు ఆమెకు ప్రతిరూపము. ఆ ప్రకారంగా సీతారాములు ఎల్లప్పుడూ శాశ్వతంగా ప్రజల హృదయాలలో నిలిచి ఉంటారు. ఈ రోజు అంత:పురమునకు వెళ్లు. రేపు వచ్చి రామాయణంలో జరగబోవు కథను విను."అని వినబడింది.

రాముడు అదే ప్రకారంగా సభ రేపటి రోజు జరుగుతుంది అని ప్రకటించాడు. వాల్మీకి కుశలవులను తీసుకొని తనపర్ణశాలకు వెళ్లిపోయాడు. రాముడు రాత్రి అంతా సీతను గురించి ఆలోచనలతోనే గడిపాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండముతొంభై ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

తొంభై తొమ్మిదవ సర్గ.

సీతాదేవి రసాతలంలో ప్రవేశించిన మరునాడు రాముడు సభకు వచ్చాడు. వాల్మీకిని ఆయన శిష్యులను పిలిపించాడు. రామాయణ కావ్య గానమును కొనసాగించమని చెప్పాడు. రాముని ఆదేశము మేరకు కుశలవులు రామాయణ కావ్యమును శ్రావ్యంగా గానం చేస్తున్నారు.

సీత రసాతలములో ప్రవేశించింది. అశ్వమేధ యాగము పూర్తి అయింది. కాని సీతను గురించి రాముని శోకమునకు అంతులేకుండా పోయింది. సీత ఈ లోకంలో లేదు అన్న భావనతో రాముడికి ఈ లోకం అంతా శూన్యంగా తోచింది. రాముడికి మన:శాంతి కరువయింది. తన దు:ఖమును అంతా మనసులో దాచుకొని పైకి గంభీరంగా దైనందిన కార్యములను నిర్వర్తిస్తున్నాడు. యజ్ఞమునకు వచ్చిన కిష్కింధా వాసులను,

లంకా నగర వాసులను తగిన కానుకలు ఇచ్చి పంపాడు. బ్రాహ్మణులకు దానాలు చేసాడు. మనసులో సీతను నిలుపుకొని అయోధ్యలో ప్రవేశించాడు. రాముడు తన జీవితములో మరొక స్త్రీని పరిగ్రహించలేదు. సీతకు మారుగా ఒక బంగారు ప్రతిమను అచ్చు సీత రూపంలో తయారు చేయించాడు. భార్యతో చేయవలసిన యజ్ఞ యాగములు క్రతువులు అన్నీ సీత యొక్క బంగారు ప్రతిమను పక్కన పెట్టుకొని, సీత తన పక్కనే సజీవంగా కూర్చుని ఉన్నదని భావించుకుంటూ చేసేవాడు.

ఆ ప్రకారంగా రాముడు పదివేల సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. ఈ పదివేల సంవత్సరములలో లెక్కలేనన్ని అశ్వమేధ యాగములు, వాజపేయములు చేసాడు. దాన ధర్మాలు విరివిగా చేసాడు. అగ్నిష్టోమము, అతి రాత్రము, గోసవము మొదలగు యజ్ఞములను చేసాడు. ఇలా చాలాకాలము గడిచిపోయింది. రాముని రాజ్యపాలనలో ప్రజలు సామంత రాజులు ఎంతో సంతోషంగా ఉండేవారు. సకాలంలో మేఘాలు వర్షాలు కురిసేవి. గ్రామములు, పట్టణములు, నగరములు ధన ధాన్యములతో సమృద్ధిగా ఉండేవి. రాముని రాజ్యములో అకాల మరణములు లేవు. వ్యాధులు లేవు. కరువు కాటకములు లేవు. అనర్థములు లేవు. అంతాసుభిక్షంగా ఉండేది.

కొంత కాలానికి రాముని తల్లి కౌసల్య మరణించింది. ఆమె తరువాత సుమిత్ర, కైకేయికూడా మరణించారు. వారుముగ్గురూ మరణించి స్వర్గంలో ఉన్న దశరథమహారాజును కలుసుకున్నారు. రాముడు తన తల్లులు ముగ్గురికీ కర్మక్రతువులు, జలతర్పణములు, దాన

ధర్మాలు యధావిధిగా చేసాడు. ఈ ప్రకారంగా రాముడు కొన్ని వేల సంవత్సరములు సుఖంగా రాజ్యపాలన చేసాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము తొంభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
నూరవ సర్గ.

కొంత కాలము తరువాత కేకయ దేశపు రాజు యుధాజిత్తు, తన పురోహితుడైన గార్గ్యుడిని రాముని వద్దకు పంపాడు. ఆ పురోహితుడి ద్వారా యుధాజిత్తు రామునికి వెలలేని కానుకలు ఎన్నో పంపాడు. రాముడు గార్గ్యుడిని సాదరంగా ఆహ్వానించాడు. పూజించాడు.

"మహాత్మా! మీరు మా భరతుని మేనమామ వద్దనుండి వచ్చారు. ఆయన వద్దనుండి ఏమి సందేశము తీసుకొని వచ్చారు." అని అడిగాడు రాముడు. "రామా! మీ మేనమామ చెప్పిన మాటలను చెబుతాను విను. మా కేకయ దేశము పక్కన ఉన్న సింధునదికి ఇరుపక్కలా గంధర్వులు నివసిస్తున్నారు. (అదే గాంధార దేశము. శకుని పాలించిన దేశము.  నేటి ఖాందహార్). ఆ దేశము ఫలపుష్పములతో చాలా అందంగా ఉంటుంది. శైలూషుడు అనే గంధర్వుడు ఆ దేశాన్ని పరిపాలిస్తున్నాడు. ఆ దేశంలో మూడుకోట్ల మంది గంధర్వులు ఉన్నారు. ఆ

గంధర్వ రాజ్యము మన సరిహద్దులో ఉన్నందున, కేకయ రాజు దానిని ఆక్రమించుకోవాలని అనుకుంటున్నాడు. మీరు మీ సైన్యములతో వచ్చి ఆ గాంధార రాజ్యమును జయించి, అక్కడ రెండు మహానగరాలను నిర్మించాలి. ఆ గాంధార రాజ్యమును నీవు చూస్తే వదిలిపెట్టవు. నీవు తప్ప మరొకరు ఆ రాజ్యమును ఆక్రమించలేరు." అని అన్నాడు.

రాముడు భరతుని వంక చూచాడు. భరతుడు సరే అన్నట్టు తలూపాడు. "తప్పకుండా అలాగే చేద్దాము. మాభరతుడు తన కుమారులైన తక్షుడు, పుష్కలుడు తో సహా గాంధార దేశమును జయించి ఆక్రమించుకుంటారు. తరువాత మా భరతుడు మీరుకోరినట్టు రెండు నగరములను నిర్మించి తన కుమారులను ఆ నగరములకు పట్టాభిషిక్తులను చేసి తిరిగి నా వద్దకు రాగలడు." అని అన్నాడు రాముడు.

రాముడు వెంటనే భరతుని కుమారులను పిలిపించి, వారిని తాను గాంధార దేశమును జయించి నిర్మించబోవు మహానగరములకు పట్టాభిషిక్తులను చేసాడు. తరువాత భరతుడు, తన కుమారులతోనూ అపార సేనావాహినితోనూ గాంధార రాజ్యం మీదికి దండయాత్రకు బయలుదేరాడు. భరతుడు ఒకటిన్నర నెలలు ప్రయాణం చేసి కేకయ దేశము చేరుకున్నాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## నూటొకటవ సర్గ.

తన కోరికను మన్నించి అపార సేనావాహినితో వచ్చిన భరతుని, అతని కుమారులను సాదరంగా ఆహ్వానించాడు భరతుని మేనమామ యుధాజిత్తు. తన వద్ద ఉన్న సైన్యమును కూడా భరతుని సైన్యముతో కలిపాడు. రెండు సైన్యాలు కలిసి గాంధార దేశము మీదికి యుద్ధానికి వెళ్లాయి. కేకయ దేశపురాజు తమ మీదికి యుద్ధానికి వచ్చాడని తెలిసి గంధర్వులు కూడా యుద్ధానికి సన్నద్ధం అయ్యారు. కేకయసేనలకు గంధర్వుల సేనలకు ఏడు రోజులు యుద్ధం జరిగింది. ఇరు పక్షముల వారు ఖడ్గములను, శక్తి ఆయుధములను, ధనుస్సులను, ఉపయోగించి యుద్ధం చేసారు. ఎవరినీ గెలుపు వరించలేదు. తుదకు భరతుడు పరమ దారుణమైన కాలాస్త్రమును ప్రయోగించాడు. ఆ అస్త్రము ధాటికి మూడుకోట్ల మంది గంధర్వులు నశించిపోయారు. గాంధర్వ దేశము భరతుడు స్వాధీనపరచుకున్నాడు.

గాంధర్వదేశములో రెండు మహానగరములను నిర్మించాడు భరతుడు. ఒకదానికి తన కుమారుడు తక్షుని రాజుగా చేసాడు. తక్షుని పేర ఆ నగరము తక్షశిల అనే పేరుతో సార్ధకము అయింది.(ఈ తక్షశిల క్రీస్తు పూర్వమునుండి విశ్వవిద్యాలయపీఠముగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడే చాణక్యుడు చదువుకున్నాడు. అక్కడే ఆచార్యుడుగా పనిచేసాడు.) తరువాత మరొక నగరానికి తన రెండవ కుమారుడు పుష్కలుడిని రాజుగా చేసాడు. పుష్కలుడిపేరిట ఆ నగరము పుష్కలావతి అని ప్రసిద్ధి

చెందింది. (తరువాతకుషానుల కాలంలో పురుషపురం అయింది. అదే నేటి పెషావర్ నగరము. ఈ రెండు నగరములు ప్రస్తుతం పాకిస్తాన్ లో ఉన్నాయి.)

ఆ రెండు నగరములు ధనధాన్యములతోనూ భోగభాగ్యములతోనూ, చక్కని ఉద్యానవనములతోనూ, విశాలమైన రాజవీధులతోనూ,ఎత్తైన గృహములతోనూ, దేవాలయములతోనూ, అలరారాయి. భరతుడు ఐదుసంవత్సరములు అక్కడే ఉండి. తరువాత అయోధ్యకు తిరిగి వచ్చాడు. రామునితో తాను గంధర్వులను ఎలా జయించినదీ, ఎలా రెండు నగరములను నిర్మించినదీ, వాటికి తన కుమారులను పట్టాభిషిక్తులను చేసినదీ వివరంగా చెప్పాడు. రాముడు భరతుడు చెప్పిన మాటలను విని చాలా సంతోషించాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము నూట ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
నూటరెండవ సర్గ.

రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. “లక్ష్మణా! నీ కుమారులు అంగదుడు, చంద్రకేతువు బాగా ధర్మము తెలిసిన వారు. వీరులు. పరాక్రమవంతులు. రాజ్యపాలనకు తగినవారు. వారిని కూడా

రాజ్యాభిషిక్తులను చేస్తే వారు కూడా సుఖంగా ఉంటారు. వారికి తగిన రాజ్యములను గురించి ఆలోచించు. వారికి సరిహద్దులలో ఉన్న రాజుల నుండి ఎలాంటి భయము తగాదాలు ఉండకూడదు. ఆ రాజ్యము సకల సౌభాగ్యములతో సమృద్ధిగా ఉండాలి. అటువంటి రాజ్యము కొరకు అన్వేషించు." అని అన్నాడు రాముడు.

ఆ మాటలు విని భరతుడు ఇలా అన్నాడు. "రామా! కారుపథము అనే దేశము ఉంది. అది సస్యశ్యామలంగా ఉంది. దానికి శత్రు రాజుల వలన భయం లేదు. అక్కడ మనము ఒక రాజధానిని నిర్మించి దానికి అంగదుని రాజుగా చేద్దాము. చంద్రకేతువునకు మరొక నగరమును నిర్మించి దానికి ఆయనను పట్టాభిషిక్తుని చేద్దాము." అని అన్నాడు.

రాముడు వెంటనే ఆ దేశము మీద యుద్ధము ప్రకటించి ఆ రాజ్యమును స్వాధీనము చేసుకున్నాడు. అంగదుని కొరకు అంగదీయము అనే పురమునునిర్మించాడు. దానికి అంగదుని రాజును చేసాడు. చంద్రకేతువు కొరకు అమరావతిని తలదన్నే మరొక నగరమును నిర్మింపజేసాడు. దానికి చంద్రకేతుని రాజుగా చేసాడు. ఇరువురి పట్టాభిషేక మహోత్సవములు వైభవంగా జరిపించాడు రాముడు. అంగదునికి రక్షణగా లక్ష్మణుడు, చంద్రకేతుకు రక్షణగా భరతుడు వెళ్లారు. లక్ష్మణుడు, భరతుడు వారి దగ్గర ఒక సంవత్సరము పాటు ఉండి, అంగదుడు, చంద్రకేతు వారి వారి రాజ్యములలోస్థిరపడిన తరువాత, అయోధ్యకు తిరిగి వచ్చారు.

ఆ ప్రకారంగా పదివేల సంవత్సరములు గడిచిపోయాయి. రాముడు అయోధ్యను పాలిస్తుంటే, లక్ష్మణుడు, భరతుడు రామునికి సాయంగా ఉంటూ, ముగ్గురు మూడు అగ్నులవలె ప్రకాశించారు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము నూటరెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
నూట మూడవ సర్గ.

అలా కాలం గడుస్తూ ఉండగా ఒక నాడు కాల పురుషుడు ఒక ముని రూపంలో రాముని వద్దకు వచ్చాడు. లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! నేను ఒక మహానుభావుని దూతను. ఆ మహానుభావుడు ఎవరో చెప్పను. నేను వచ్చినట్టు రామునికి తెలియజెయ్యి." అని అన్నాడు. లక్ష్మణుడు వెంటనే వెళ్లి ఈ విషయం రామునికి తెలిపాడు. ఆ మునికి స్వాగత సత్కారాలుచెయ్యమని రాముడు లక్ష్మణుని ఆదేశించాడు. లక్ష్మణుడు ఆ మునిని సాదరంగా రాజ మందిరములోని ఆహ్వానించాడు. అర్ఘ్యము పాద్యము ఆసనము ఇచ్చిసత్కరించాడు.

రాముడు వచ్చి కాలపురుషునికి నమస్కరించాడు. కాలపురుషుడు రాముని ఆశీర్వదించాడు. రాముడు కాల పురుషునితో ఇలా అన్నాడు. "ఓ మహామునీ! తమరు ఎవరి దూతగా వచ్చారో వారి

యొక్క వాక్కులు నాకు వినిపించు.” అని అడిగాడు.

“రామా! నేను చెప్పబోవు విషయములు అత్యంత రహస్యములు. వాటిని ఎవరూ వినకూడదు. మనము మాటలాడుకుంటున్నప్పుడు ఎవరైనా మన దగ్గరకు వచ్చినా, మనలను చూచినా, మనము మాట్లాడుకొనే మాటలను విన్నా, వారిని నీవు చంపాలి. దీనికి ఒప్పుకుంటేనే నేను నీతో మాట్లాడతాను.” అని అన్నాడు. రాముడు దానికి అంగీకరించాడు.

లక్ష్మణుని పిలిచాడు. “లక్ష్మణా! నేను ఈ మునితో కొన్ని రహస్యములు మాట్లాడవలసి ఉన్నది. నీవు ద్వార పాలకుని పంపి వేసి, నీవే స్వయంగా ద్వారము వద్ద ఉండు. ఎవరినీ ఎట్టి పరిస్థితులలోగానీ లోపలకు రానీయకు. నీవుకూడా, నేను పిలిచేంతవరకూ లోపలకు రాకు. ఇది నా ఆజ్ఞ. దీనిని అతిక్రమిస్తే మరణదండన విధింపబడుతుంది.” అని అన్నాడు.

లక్ష్మణుడు అంగీకరించాడు. రాముడు ఆదేశించిన ప్రకారము ద్వారపాలకుని పంపివేసి తానే స్వయంగా ద్వారము దగ్గర ఉన్నాడు. రాముడు కాల పురుషుని వద్ద కూర్చుని “ఇంక తమరు చెప్పడం ప్రారంభించండి.” అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూటమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## నూట నాలుగవ సర్గ.

"రామా! నేను కాల పురుషుడను. నేను బ్రహ్మదేవుడు పంపగా నీ వద్దకు వచ్చాను. నీతో బ్రహ్మదేవుడు ఈ మాటలు చెప్పమన్నాడు.

"రామా! లోక రక్షణార్థము నీవు రామావతారము ఎత్తావు. నీవు శ్రీమహావిష్ణువు. కల్పాంతంలో ఈ లోకం అంతా జలమయం కాగా, నీవు ఆ జలంలో శయనించి ముందుగా నన్ను సృష్టించావు. తరువాత ఆదిశేషుని సృష్టించావు. మధు,కైటభులు అనే రాక్షసుల ఎముకలతో ఈ భూమి పర్వతములతో నిండిపోయింది. నీ నాభిలోనుండి పుట్టిన పద్మములో నుండి నేను ఉద్భవించాను. నువ్వు నన్ను ప్రజాపతిగా నియమించావు. అప్పుడు నేను నిన్ను ప్రార్థించాను. నీ గురించి తపస్సు చేసాను. అప్పుడు నువ్వు నీ తేజస్సును నాకు ప్రసాదించావు. తరువాత నీవు విష్ణుత్వమును పొంది సర్వవ్యాపకుడవు అయ్యావు. నీవు అదితి గర్భంలో నుండి ఉపేంద్రుగా అవతరించి దేవతలకు సాయంచేసావు. ముల్లోకములలో ఉన్న ప్రాణులు రావణుని చేత నానా బాధలు పడుతుండగా రావణ సంహారము కొరకు నీవు రామునిగా అవతరించావు. పదకొండు వేల సంవత్సరములు భూమి మీద నివసిస్తానని నియమం పెట్టుకున్నావు. నీనియమం పూర్తి అయింది. నీవు ఇంక వైకుంఠమునకు రావలసిన సమయం ఆసన్నమయింది.

రామా! నీకు ఇంకా భూలోకంలో ఉండి ప్రజలను రక్షించవలె అనికోరిక ఉంటే అలాగే చెయ్యి. నీవు సర్వాధికారివి. అలా కాకుండా అవతార పరిసమాప్తి చెయ్యదలచుకుంటే రామావతారము చాలించి, వైకుంఠమునకు వచ్చి దేవతా గణములను పాలించు."

రామా! ఇది బ్రహ్మదేవుని సందేశము." అని అన్నాడు కాలపురుషుడు.

కాల పురుషుని మాటలు సావధానంగా విన్న రాముడు ఇలా అన్నాడు. "బ్రహ్మదేవుని పలుకులు నీ నోట వినడం నాకు చాలా ఆనందం కలిగించింది. నేను వచ్చిన పని పూర్తి అయింది. మూడు లోకములు సురక్షితంగా ఉన్నాయి. నేను ఎక్కడి నుండి వచ్చానో అక్కడికే చేరుకుంటాను. ఈ విషయంలో మరో ఆలోచన లేదు. భూలోకంలో ఎంత కాలం ఉన్నా, చివరకు నేను దేవతలను పాలించవలసిన వాడినే కదా!" అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము నూటనాల్గవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## నూట ఐదవ సర్గ.

రాముడు ఈ ప్రకారంగా కాలపురుషునితో మాట్లాడుతూ ఉండగా, దుర్వాసుడు లక్ష్మణుడు నిలబడి కాపలా కాస్తున్న ద్వారం వద్దకు వచ్చాడు. "కుమారా! నేను వెంటనే రాముని చూడాలి. నా రాకను గురించి రామునికి తెలియజెయ్యి. లేకపోతే నన్ను లోపలికి పోనివ్వు." అని అన్నాడు. లక్ష్మణుడు దుర్వాసునికి వినయంగా నమస్కరించి ఇలా అన్నాడు. "మహాత్మా! నన్ను మన్నించండి. తమరు ఏ పని మీద వచ్చారో చెబితే దానిని నేనే తమరికి చేసి పెడతాను. రాముడు ప్రస్తుతము మరొక అవసరమైన పని మీద ఉన్నాడు. తమరు కొంచెం సేపు నిరీక్షించండి. రాముడే బయటకు వస్తాడు." అని అన్నాడు లక్ష్మణుడు.

దుర్వాసుడు కోపంతో మండిపోయాడు కళ్లనుండి నిప్పులు రాలుతున్నట్టు లక్ష్మణుని వంక చూచాడు. "లక్ష్మణా! నేను వచ్చానని తక్షణమే రామునికి తెలియజెయ్యి. లేక పోతే, రాముని, నిన్ను, నీ సోదరులను, సుతులను నీ రాజ్యమును సర్వనాశనం అయేట్టు శపిస్తాను. నేను నా కోపాన్ని అణచుకోలేక పోతున్నాను." అని ఉరిమాడు దుర్వాసుడు.

లక్ష్మణుడు మనసులో ఇలా అనుకున్నాడు. "రాముడి దగ్గరకు వెళితే నన్ను ఒకడినే రాముడు చంపుతాడు. రాముడి దగ్గరకు వెళ్లకపోతే ఈ ముని అందరినీ సర్వనాశనం చేస్తాడు. నా ఒక్కడి ప్రాణం కోసం

ఇంతమందిని బలిపెట్టలేను. నేనే వెళతాను." అని అనుకున్నాడు.

ద్వారం తీసుకొని లోపలకు వెళ్లాడు. కాలపురుషుడు మాట్లాడటం ఆపేసాడు. రాముడు లక్ష్మణుని చూచాడు. కాలపురుషుడు వెళ్లిపోయాడు. లక్ష్మణుడు దుర్వాసుని రాక గురించి రామునికి చెప్పాడు. రాముడు వెంటనే దుర్వాసుని వద్దకు వచ్చాడు. ఆయనను సత్కరించాడు.

రాముని చూడగానే దుర్వాసుని కోపం ఎగిరిపోయింది. "ఏమీ లేదు రామా! నేను ఒక వ్రతం చేసాను. ఈ నాటితో అది పరిసమాప్తి అయింది. నీ ఇంట్లో భోజనము చేయవలెనని వచ్చాను. ఇప్పుడు ఈ క్షణంలో ఏది ఉంటే అది పెట్టు. తింటాను." అని అన్నాడు దుర్వాసుడు. రాముడు వెంటనే దుర్వాసునికి భోజన ఏర్పాట్లు చేసాడు. దుర్వాసుడు రాముని మందిరములో భోజనము చేసి వెళ్లిపోయాడు.

అప్పుడు రాముడికి కాలపురుషుడు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. శోకంతో కుంగి పోయూడు.  కాలపురుషునికి ఇచ్చిన మాట ప్రకారం ఇప్పుడు తను లక్ష్మణునికి మరణ దండన విధించాలి. ఎలాగ" అని దు:ఖిస్తున్నాడు. రాముడికి నోట మాట రావడం లేదు. మౌనంగా తనలో తాను కుమిలిపోతున్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూట ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర రామాయణము

## నూట ఆరవ సర్గ.

చింతాక్రాంతుడై ఉన్న రాముని చూచి లక్ష్మణుడు ఇలా అన్నాడు. "రామా! కాల గతిని ఎవరు మార్చ గలరు. అంతా విధిలిఖితము. అలా జరగాల్సి ఉంది. జరిగింది. లేకపోతే ఆ సమయంలోనే దుర్వాసుడు అక్కడకు రావలెనా! నీ నియమము ప్రకారము నీవు నన్ను చంపాలి. చంపు. సందేహించకు. చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చకపోతే నరకానికిపోతారు అని నీవే కదా పదే పదే చెబుతావు. కాబట్టి నీవు అన్నమాట నెరవేర్చుకో." అని అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాట విన్న సభాసదులు ఏమీ మాట్లాడలేదు. కుల గురువు వసిష్టుడు లేచి ఇలా అన్నాడు. "ఈ విషయం గురించి నాకు ముందే తెలుసు. కాబట్టి లక్ష్మణుడి చంపడంకన్నా దేశబహిష్కరణ ఉత్తమము. రామా! నీవు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చు. ధర్మస్వరూపుడవు నీవే ధర్మం తప్పితే ఇంక ప్రజలు ఎలా ధర్మంపాటిస్తారు. నీవే ధర్మం తప్పితే మూడులోకములు ధర్మం తప్పుతాయి. నీవు ఇప్పుడు లక్ష్మణుని విడిపెట్టడం ద్వారా ధర్మం రక్షింపబడుతుంది. ఎందుకంటే లక్ష్మణుడు సత్పురుషుడు. నీ తమ్ముడు. వధించడం, విడిచిపెట్టడం రెండూ సమనమే.కాబట్టి లక్ష్మణుని వదిలిపెట్టు. నీ ప్రతిజ్ఞ నెరవేరుతుంది." అని అన్నాడు వసిష్ఠుడు.

రాముడు ఆలోచించి ఇలా అన్నాడు. "కుల గురువు వసిష్ఠుల వారు చెప్పినది యదార్థము. వధించడం, విడిచిపెట్టడం రెండూ

సమానమే. కాబట్టి నేను లక్ష్మణుని వదిలివేస్తున్నాను." అని అన్నాడు.

ఆ మాట విన్న లక్ష్మణుడికి ఒక్క సారిగా కళ్లనిండుగా నీళ్లు వచ్చాయి. పుట్టినప్పటినుండి ఒక్కరోజుకూడా రాముని విడిచి ఉండలేదు. కాని ఈ రోజు రాముని శాశ్వతంగా విడిచిపెట్ట వలసి వచ్చింది. దీని కన్నా మరణం మేలుకదా అని అనుకున్నాడు. కాని రామాజ్ఞను తప్పకూడదు. అందుకని ఇంటికి కూడా వెళ్లకుండా అటునుండి అటే బయటకు వెళ్లిపోయాడు.

సరయూనదీ తీరానికి వెళ్లాడు. ఒక సమతల ప్రదేశంలో కూర్చున్నాడు. శరీరములోని నవరంధ్రములను నిగ్రహించాడు. ఊపిరి బయటకు పోకుండా బిగపట్టాడు. లక్ష్మణుడికి ఉచ్ఛ్వాసము నిఃశ్వాసము నిలిచిపోయాయి. యోగసమాధిలో ఉన్నాడు లక్ష్మణుడు. ఇంద్రుడు, దేవతలు లక్ష్మణుని సశరీరంగా స్వర్గానికి తీసుకొని పోయారు. దేవతలందరూ విష్ణువులో నాలుగవ అంశ తిరిగి స్వస్థానము చేరిందని సంతోషించారు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూట ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## నూట ఏడవ సర్గ.

లక్ష్మణుని వదిలివేసిన తరువాత రాముడు ఏకాకి అయ్యాడు. రాజ సభకు వచ్చాడు. రాజ సభలో ఉన్న మంత్రులు సేనాపతులు పురప్రముఖులను ఉద్దేశించి ఇలా అన్నాడు. "నేను భరతుని అయోధ్యకు రాజ్యాభిషిక్తుని చేసి వానప్రస్థము వెళ్లదలచుకున్నాను. లక్ష్మణుడు పోయిన మార్గములోనే నేనూ పోతాను."అని అన్నాడు.

రాముని నిర్ణయం విని సభాసదులు నిశ్చేష్టులయ్యారు. కొంతమంది మూర్ఛపోయారు. భరతునికి ఏమి మాట్లాడాలో తోచలేదు. "రామా! నీవులేని ఈ రాజ్యము నాకు అవసరం లేదు. నాకు నీ తోటిదే లోకము. తమరు ఒక పని చేయండి. కుశుని దక్షిణ కోసల దేశమునకు. లవుని ఉత్తర కోసల దేశమునకు పట్టాభిషిక్తులుగా చేయండి. వెంటనే శత్రుఘ్నుని వద్దకు వార్తాహరులను పంపుదాము. శత్రుఘ్నుడు కూడా మనతో వస్తాడు." అని అన్నాడు భరతుడు.

ఆ మాటలు విన్న వసిష్ఠుడు, మౌనంగా ఉన్న సభికులను చూచి, రామునితో ఇలా అన్నాడు. "రామా! ఇన్నాళ్లు అయోధ్యను పాలించావు. ఇప్పుడు వానప్రస్థము వెళతాను అంటున్నావు. ఈ సభికులు ఎలా చెబితే అలా చెయ్యడం ఉత్తమము. ప్రజల మాట పాలకులకు శిరోధార్యము కదా!" అని అన్నాడు వసిష్ఠుడు.

రాముడు సభాసదులను చూచి ఇలా అన్నాడు. "సభాసదులారా! నేను నా తమ్ములతో వానప్రస్థము వెళ్లదలచుకున్నాను. మీ అభిప్రాయము ఏమి?" అని అడిగాడు.

సభికులంతా ముక్తకంఠంతో "మీరు ఎక్కడికి పోతే మేమూ అక్కడికే వస్తాము. మేమేకాదు మా భార్యాపుత్రులతో మిమ్ములను అనుసరిస్తాము. మీరు ఎక్కడికిపోతే అక్కడకు వస్తాము. మీరు లేని అయోధ్యలో మేము ఉండలేము. మిమ్ము అనుసరించి ఉండటమే మాకు ఆనందము. మీరు ఎక్కడ ఉంటే అదే మాకు అయోధ్య. అదే మాకు స్వర్గము." అని అన్నారు.

రాముడు అందుకు సమ్మతించాడు. తరువాత కుశలవుల పట్టాభిషేకమునకు ఏర్పాట్లు చకా చకా చేసారు. కుశుని దక్షిణ కోసల దేశమునకు, లవుని ఉత్తర కోసల దేశమునకు రాజులుగా అభిషేకించారు. వింధ్య పర్వత సమీపములో కుశావతి అనే నగరము రాజధానిగా దక్షిణకోసల దేశమునకు కుశుడు అభిషిక్తుడు అయ్యాడు. శ్రావస్తి అనే నగరము రాజధానిగా లవుడు ఉత్తర కోసల దేశమునకు అభిషిక్తుడు అయ్యాడు. రాముడు వారికి వేలకొలది అశ్వములను, ఏనుగులను, రథములను, అపారమైన ధనరాసులను ఇచ్చాడు. రాముడు కుశలవులను వారి వారి రాజధాని నగరములకు సాగనంపాడు. శత్రుఘ్నుని కొరకు దూతలను పంపాడు.

శ్రీమద్రామాయణము ఉత్తరకాండము

నూట ఏడవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## నూట ఎనిమిదవ సర్గ.

రాముడు పంపిన దూతలు మధురా నగరమునకు వెళ్లారు. మూడురోజులు ప్రయాణం చేసి మధురా నగరం చేరుకున్నారు. అయోధ్యలో జరిగిన పరిణామాలన్నీ విశదంగా శత్రుఘ్నుడికి చెప్పారు. రాముడు చేసిన ప్రతిజ్ఞను అనుసరించి, రాముడు లక్ష్మణుని వదిలివేయడం, కుశలవుల పట్టాభిషేకము, రాముని వాన ప్రస్థ నిర్ణయము, అయోధ్యలోని పౌరులందరూ రాముని అనుసరించడానికి నిర్ణయం తీసుకోవడం, అయోధ్యానగరం నిర్మానుష్యం కాబోతోందన్న విషయము,  అన్నీ వివరంగా చెప్పారు. శత్రుఘ్నుని త్వరగా బయలు దేరమని తొందర చేసారు.

శత్రుఘ్నునికి విషయం అర్థం అయింది. తాను కూడా రాముని అనుసరించవలసిన సమయం వచ్చిందని తెలుసుకున్నాడు. వెంటనే మంత్రులను పురోహితులను, పురప్రముఖులను పిలిపించాడు. అయోధ్యలో జరిగిన పరిణామాలన్నీ వారికి వివరించాడు. తాను కూడా రాముని అనుసరించవలసిన సమయం వచ్చిందని తెలియజేసాడు. వెంటనే శత్రుఘ్నుడు తన కుమారులను ఇద్దరినీ రాజ్యాభిషిక్తులను చేసాడు. పెద్దకుమారుడు సుబాహువును మధురకు, చిన్న వాడు శత్రుఘాతిని వైదిశా నగరానికి రాజులుగా చేసాడు. తనకు ఉన్న ధనాగారమును, సైన్యమును రెండు భాగాలుగా చేసి ఇద్దరు కుమారులకు సమంగా పంచి ఇచ్చాడు. ఇద్దరు కుమారులను వారి వారి రాజధానులకు

పంపి తాను అయోధ్యకు బయలుదేరాడు శత్రుఘ్నుడు.

శత్రుఘ్నుడు అయోధ్యకే చేరేటప్పటికి రాముడు తెల్లని వస్త్రములు ధరించి, మునుల మధ్యకూర్చుని ఉన్నాడు. శత్రుఘ్నుడు రాముని చూచి ఇలా అన్నాడు.

"రామా! నేను కూడా నిన్ను అనుసరిస్తాను. నా కుమారు లిద్దరినీ పట్టాభిషిక్తులను చేసి వచ్చాను. నీవు ఎక్కడికి పోతే అక్కడకు నేనూ వస్తాను." అని అన్నాడు. రాముడు దానికి సమ్మతించాడు.

రాముని వానప్రస్థ నిర్ణయము దావాగ్నిలా అటు కిష్కింధకు ఇటు లంకకు పాకిపోయింది.. కిష్కింధనుండి సుగ్రీవుడు, హనుమంతుడు మొదలగు వానరులు, లంకనుండి విభీషణుడు, రామభక్తులైన రాక్షసులు అయోధ్యకు చేరుకున్నారు. వానరులు రాక్షసులు అందరూ రామునికి నమస్కరించి ఇలా అన్నారు.

"రాజా! మేము కూడా నీతో వస్తాము. మేము లేకుండా నీవు ఒక్కడివే వెళితే మమ్ములను చంపినంత ఒట్టు." అని ఒట్టుకూడా పెట్టుకున్నారు.

సుగ్రీవుని రామునితో ఇలా అన్నాడు. "రామా! నేను కూడా అంగదుని కిష్కింధకు పట్టాభిషిక్తుని గావించి, రాజ్యము అతనికి అప్పగించి వచ్చాను. నేను కూడా నిన్ను అనుసరిస్తాను. కాదనకు." అని

అన్నాడు. రాముడు ఆ మాటలకు చలించిపోయాడు.

"మిత్రమా! సుగ్రీవా! నేను కూడా అంతే. నీవు లేకుండా స్వర్గమునకు కూడా వెళ్లను. నీవు నాతో రావచ్చును." అని అన్నాడు.

రాముడు విభీషణుని చూచి ఇలా అన్నాడు. "విభీషణా! నీవు లంకలో లేకపోతే లంకకు దిక్కు ఎవ్వరు? కాబట్టి నీవు లంకకు పోయి లంకను పాలించు. నీతో నాకు ఉన్న స్నేహభావంతో నిన్ను ఆదేశిస్తున్నాను. నీవు వెంటనే లంకకు వెళ్లు. నా మాటకు ఎదురు చెప్పవద్దు. నీకు ఆ జగన్నాధుడే శరణ్యము. నీవు నిరంతరమూ ఆ జగన్నాధుని ఆరాధించు. భజించు నీకు శుభం కలుగుతుంది." అని అన్నాడు. విభీషణుడు రాముని ఆదేశమును శిరసావహించాడు.

రాముడు హనుమంతుని తన దగ్గరగా పిలిచి ఇలా అన్నాడు. "హనుమా! నీకు బ్రహ్మదేవుడు దీర్ఘాయువును ఇచ్చాడు. నీవు బ్రహ్మగారి మాటను వృధా చేయకు. రామాయణము ఈ లోకములో ప్రచారంలో ఉన్నంతవరకూ నీవు జీవించి ఉంటావు. నీవు చిరంజీవివి." అని ఆశీర్వదించాడు రాముడు.

ఆ మాటలు విన్న హనుమ రామునితో ఇలా అన్నాడు. "రామా! నీవు చెప్పినట్లే చేసెదను. రామ కథ ఈ లోకములో నిలిచి ఉన్నంత వరకూ నేను కూడా భూమి మీద జీవించి ఉండెదను." అని అన్నాడు.

తరువాత రాముడు జాంబవంతునికి, మైందునికి ద్వివిదునికి వారు కలియుగము వచ్చువరకూ జీవించి ఉందురని వరం ఇచ్చాడు. వారు తప్ప మిగిలిన వానరములను, ఎలుగుబంట్లను తనతో రావడానికి అనుజ్ఞ ఇచ్చాడు రాముడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము నూట ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
నూటతొమ్మిదవ సర్గ.

మరునాడు తెల్లవారగానే రాముడు పురోహితుని పిలిచి ఇలా అన్నాడు. "ఇంక నేను బయలు దేరు సమయం ఆసన్నమయింది. నా ముందు బ్రాహ్మణులు అగ్నిహోత్రము తీసుకొని నడుస్తారు. నేను వాజపేయము చేసినందుకు లభించిన వాజపేయఛత్రము నా ముందు తీసుకువెళ్లండి." అని ఆదేశించాడు.

కులగురువు వసిష్ఠుడు రాముని వానప్రస్థమునకు చేయవలసిన క్రతువులు అన్నీ పూర్తిచేసాడు. తరువాత రాముడు తెల్లని వస్త్రములు ధరించి, దర్భలు చేత పట్టుకొని సరయూ నదీ తీరానికి వెళ్లాడు. రాముడు మౌనంగా నడుస్తున్నాడు. ఎవరితో ఏమీ మాట్లాడటం లేదు. రాముని ధనుస్సు (కోదండము) మనుష్య రూపము ధరించి

రాముని వెంట నడిచింది. వేదములు, గాయత్రి, ఓంకారము, వషట్కారములు అందరూ బ్రాహ్మణ రూపములతో రాముని అనుసరించారు. ఋషులు, మునులు, బ్రాహ్మణులు, రాముడిని అనుసరించి వెళుతున్నారు. వారి వెంట అంత:పుర స్త్రీలు, పరిచారికలు, వెళుతున్నారు. భరతుడు, శత్రుఘ్నుడు తమ అంత:పుర కాంతలతో కలిసి తమ తమ అగ్నిహెూత్రములతో సహా రాముని వెంట వెళుతున్నారు. వారి వెనుక మంత్రులు సేనాధి పతులు, సామంతులు, వారి అనుచరులు, భార్యాపిల్లలతో కలిసి రాముని వెంట వెళుతున్నారు. రాముని వెంట వెళు తున్న స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు అంతా అమితోత్సాహంతో రాముని అనుసరిస్తున్నారు. రాముడు ఎక్కడకు వెళితో అక్కడకు వెళ్లడానికి సిద్ధమే అన్నట్టు రాముని వెంట వెళుతున్నారు. వారిలో "అయ్యో ఎందుకు వెళుతున్నామా" అని అనుకున్న వాడు లేడు. ఎవరికీ దు:ఖము లేదు. అందరూ ఆనందంతో రాముని అనుసరిస్తున్నారు. రాముడు వెళు తున్న దారిలో ఉన్న పల్లెలలో ఉన్న ప్రజలు కూడా తమ తమ పనులు వదిలిపెట్టి రాముని అనుసరించారు. అయోధ్యలో ఉన్న ప్రజలు అందరూ రాముని అనుసరించారు. వారివెంట వానరములు భల్లూకములు, రాక్షసులు అనుసరించారు. రాముడు వెళుతుంటే వృక్షములు, కొండలు గుట్టలు కూడా కన్నీరు కార్చాయి. ఇంతెందుకు అయోధ్యా నగరంలో గాలిపీల్చే ఒక్క ప్రాణి కూడా లేదు. అన్నీ రాముని అనుసరించాయి. అయోధ్య నిర్మానుష్యం అయింది.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నూటతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## నూటపదవ సర్గ.

అయోధ్యకు ఒకటిన్నర యోజనముల దూరంలో ఉన్న సరయూనదీ తీరానికి చేరుకున్నాడు రాముడు. ఆ కాలంలో సరయూ నది పవిత్రజలాలతో నిండుగా పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తూ ఉంది. ఆ సమయంలో బ్రహ్మదేవుడు దేవతలతో సహా రాముడు వద్దకు వచ్చి ఆకాశంలో నిలబడ్డాడు. బ్రహ్మదేవుని తేజస్సుతో ఆకాశం అంతా తేజోమయం అయింది. దేవతలు రాముని మీద పుష్పవర్షము కురిపిస్తున్నారు. వాయుదేవుడు మంద్రంగా వీస్తున్నాడు. గంధర్వులు మృదుమధురంగా గానం చేస్తున్నారు. అప్సరసలు నృత్యం చేస్తున్నారు.

బ్రహ్మ దేవుడు ఆకాశము నుండి రామునికి వినబడేటట్టుగా "ఓ శ్రీ మహా విష్ణూ! స్వర్గలోకానికి నీకు స్వాగతం. మా భాగ్యవశంతో మరలా నీవు మరలా స్వర్గలోక ప్రవేశం చేస్తున్నావు. రామా! నీ సోదరులతో సహా నీ పూర్వదేహంలో ప్రవేశించు. నీవు నిరాకారమూ, సర్వవ్యాపకమూ అయిన వైష్ణవ తేజంలో కానీ, శుద్ధసత్వగుణప్రధానమైన బ్రహ్మస్వరూపములో గానీ ప్రవేశించు. నీ ఇష్టం." అని పలికాడు బ్రహ్మ.

రాముడు తన తమ్ములతో సహా సర్వవ్యాపకము అయిన వైష్ణవ తేజంలో సశరీరంగా ప్రవేశించాడు.
రామావతారం పరిసమాప్తి అయింది. ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్
ఓం శాంతి: ఓం శాంతి: ఓం శాంతి:.

విష్ణుతేజంలో లీనమైపోయిన రాముని దేవతలు, సిద్ధులు, సాధ్యులు, మరుద్గణములు, ఇంద్రుడు, అగ్ని, ఋషులు, గంధర్వులు, అప్సరసలు, గరుడుడు, నాగులు,యక్షులు, దైత్యులు, దానవులు మొదలగు వారు భక్తితో పూజించారు. రాముడు వైష్ణవ తేజంలో ప్రవేశించడంతో స్వర్గం పరిపుష్ఠమయింది.

వైష్ణవ తేజంలో ప్రవేశించిన రాముడు బ్రహ్మతో ఇలా అన్నాడు. "నా తోపాటు అయోధ్యావాసులు, వానరులు, రాక్షసులు ఇంకా చాలామంది వచ్చారు. నామీద భక్తితో వారు నన్ను అనుసరించారు. నా కోసం తమ శరీరాలను వదిలిపెట్టారు. వారందరికీ ఉత్తమ లోకములు ప్రసాదించు." అని పలికాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు వారికోసం సంతానకము అనే లోకాన్ని సృష్టించాడు. వారిని ఆ లోకానికి పంపాడు. "ఓ విష్ణూ! నిన్ను అనుసరించి నీ కోసం దేహాలు వదిలిన ప్రాణులన్నీ సంతానకము అనే  పుణ్య లోకాన్ని పొందుతారు." అని అన్నాడు.

బ్రహ్మవాక్కు ప్రకారము రాముని అనుసరించిన వారందరూ సంతానకమనే లోకంలోకి ప్రవేశించారు. సుగ్రీవుడు సూర్యలోకంలో ప్రవేశించాడు. దేవతా అంశలతో పుట్టిన వానరులు తమ తమ పితృ అంశలలో ప్రవేశించారు.

బ్రహ్మదేవుడు ఈ విధంగా పలుకుతూ ఉంటే రామునితో వచ్చిన అయోధ్యావాసులు సరయూనదిలో ప్రవేశించారు. తమ తమ మానుష శరీరాలను వదిలి పెట్టి దేవతలు తెచ్చిన విమానాలలో ఎక్కి సంతాన లోకమునకు వెళ్లిపోయారు. కేవలం మానవులే కాదు రాముని అనుసరించిన పశువులు, మృగములు పక్షులు కూడా సరయూనదిలో దూకి, ప్రాణత్యాగము చేసి ఉత్తమ లోకములకు వెళ్లిపోయాయి. సరయూనదీ జలాలను తాకిన వెంటనే వాటికి ముక్తిలభించింది. రాముని వెంట వచ్చిన ప్రాణులన్నింటికీ స్వర్గలోక ప్రాప్తి కలిగించి, బ్రహ్మదేవుడు దేవతలతో సహా బ్రహ్మలోకమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నూటపదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

నూటపదకొండవ సర్గ.

శ్రీమద్రామాయణ మహాత్మ్యము.

ఉత్తరాకాండ సహితమైన ఈ రామాయణ మహా కావ్యము బ్రహ్మపూజితము. రామాయణము అనే పేరుతో ఈ మహాకావ్యము వాల్మీకి మహర్షిచేత రచింపబడినది. ఈ అనంత విశ్వంలో అణువుఅణువునా వ్యాపించి ఉన్న శ్రీమహావిష్ణువు రామావతారము చాలించి తన పూర్వరూపమైన విష్ణుతేజమును పొందాడు. స్వర్గంలో ప్రతిష్ఠితుడయ్యాడు.

ఇది శ్రీమహావిష్ణువు రామావతార చరిత్ర. దీనిని స్వర్గలోకములో దేవతలు, మునులు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు నిత్యం పారాయణ చేస్తుంటారు.

ఈ రామాయణ కావ్యము చదివినా, వినినా, గానం చేసినా, వారికి ఆయుష్షు వృద్ధిఅవుతుంది. నిత్య సౌభాగ్యంతో తులతూగుతారు. పుత్రసంతానం కలుగుతుంది. ధనము లేని వారికి ధనము వృద్ధి చెందుతుంది.

ఈ రామాయణ కావ్యంలో కనీసం ఒక్క శ్లోకం చదివినా, వారు చేసిన పాపాలన్నీ పటాపంచలవుతాయి. అంతేకాదు, ప్రతిదినము పాపం చేసేవాడు కూడా, రోజూ ఈ రామాయణంలో ఒక్క శ్లోకం చదివితే ఆ రోజు చేసిన పాపాలు పోతాయి.

ఈ రామాయణ కావ్యము వేదముతో సమానమైనది. శ్రాద్ధసమయములలో రామాయణము పఠించతగినది.

ఈ రామాయణము బ్రాహ్మణులచేత చదివించుకొనవలెను. చదివిన వారికి గోవులు, బంగారము, ధనము దానంగా ఇవ్వాలి. ఈ రామాయణము చదివిన వాడు సంతోషిస్తే దేవతలు కూడా సంతోషిస్తారు. ఆయుష్షును పెంచే ఈ రామాయణమును చదివే వాడు పుత్ర పౌత్ర సమేతంగా ఈలోకంలో పూజింపబడతాడు. మరణించిన తరువాత ఉత్తమ లోకములను పొందుతాడు.

ఉదయం సమయంలో గానీ, మధ్యాహ్న సమయంలో గానీ, సాయం సమయంలో గానీ రామాయణము పఠించు వాడు ఎన్నటికీ చెడిపోడు.

ఈ రామాయణములో కనీసం ఒక్క సర్గ చదివినా వినినా వేయి అశ్వమేధయాగములు చేసిన పుణ్యం లభిస్తుంది.

రామాయణము వింటే గంగానదీలోస్నానం చేసిన పుణ్యము, కాశీ, గయా, ప్రయాగ మొదలగు క్షేత్రములు దర్శించినపుణ్యము లభిస్తుంది.

రామాయణము చదివినా, విన్నా, వానికి గ్రహణ కాలములో కురుక్షేత్రములో బంగారము దానం చేసిన పుణ్యం లభిస్తుంది.

ఈ రామాయణాన్ని శ్రద్ధతో చదివినా, విన్నా, మరణానంతరము వాడు విష్ణుసాయుజ్యము పొందుతాడు. అతని భార్యా పుత్రులు సంతానము తోనూ, సంపదలతోనూ వృద్ధి పొందుతారు.

ఈ రామాయణ మహా కావ్యము గాయత్రీ స్వరూపము. ఈ సత్యమును గ్రహించి రామాయణమును పరిశుద్ధమైన అంత:కరణముతో చదవాలి.

రామాయణము ప్రతిదినము పఠించే వాడు దీర్ఘాయుష్షను పొందుతాడు. కాబట్టి ప్రతి మానవుడు ప్రతిరోజూ రాముని స్మరించాలి. రాముని ధ్యానించాలి. రామాయణము చదవాలి. ఇతరులకు వినిపించాలి.

రామాయణమును చదివినవారే కాదు, వారి తండ్రులు, తాతలు, ముత్తాతలు కూడా విష్ణుసాయుజ్యం పొందుతారు. చదివినవారి పుణ్యం వారికీ లభిస్తుంది.

రామాయణ మహా కావ్యము ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే నాలుగు పురుషార్థములను ఇస్తుంది. కాబట్టి రామాయణ నిత్య పారాయణము ప్రతి మానవుని కర్తవ్యము.

రాముని అవతార పరిసమాప్తి అయిన తరువాత చాలా సంవత్సరములు అయోధ్య నిర్మానుష్యంగా ఉంటుంది. తరువాత ఋషభుడు అనే రాజు వచ్చి అయోధ్యను పాలిస్తాడు. క్రమక్రమంగా అయోధ్య మనుష్యులతో, ఇతర ప్రాణులతో క్రిక్కిరిసిపోతుంది. అయోధ్య భారతదేశంలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతుంది.

భవిష్యత్కథతోనూ ఉత్తర కాండతోనూ నిండిన ఈ రామాయణ కావ్యము ప్రచేతసుని పుత్రుడైన వాల్మీకి మహర్షిచేత రచింప బడి, బ్రహ్మచేత ఆమోదింపబడి, దీనిని పఠించిన, విన్న, సర్వజనులకు ఆయుర్వర్ధకము, మంగళకరము అవుతుంది. ఇది బ్రహ్మవాక్కు.

ఈ విషయాన్ని మనమందరమూ ఎలుగెత్తి ముక్తకంఠంతో లోకానికి చాటిచెప్పాలి. ఇది ప్రతి మానవుడి తక్షణ కర్తవ్యము.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూటపదకొండవసర్గ సంపూర్ణము.

శ్రీమద్రామాయణ మహా కావ్యము సర్వం సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉపసంహారము

ఈ రామాయణ కావ్యమును రాయమని నన్ను

శ్రీ పరిటాల గోపీకృష్ణగారు ప్రేరేపించారు.

శ్రీ కె.వి.ఆర్.రావుగారు ప్రోత్సహించారు.

భక్తిపేజెస్‌కు కృష్ణార్జునులు అయిన

శ్రీ విష్ణుప్రసాద్ గారు, శ్రీ కె.వి.ఆర్.రావుగారు సహకరించారు.

సీతాలక్ష్మణభరతశత్రుఘ్న ఆంజనేయసమేత

శ్రీరామచంద్రమూర్తి ఆశీర్వదించాడు.

వీరందరి ఆశీర్వచన బలంతో నేను ఈ రామాయణ రచనను

నిర్విఘ్నంగా నిరాటంకంగా పూర్తిచేయగలిగాను.

వీరందరికీ నా కృతజ్ఞతాభివందనములు.

ఓం శాంతి: ఓం శాంతి: ఓం శాంతి:.

# శ్రీమద్రామాయణము

## ఉత్తరకాండము

మొదటి భాగము.

సంస్కృత మూలము

భగవాన్ వాల్మీకి మహర్షి

తేటతెలుగులో

మొదలి వెంకట సుబ్రహ్మణ్యం
2-31, చైతన్యపురి,
హైదరాబాదు 500060
ఫో: 24048104
సెల్: 9391134792

# శ్రీమద్రామాయణము

## ఉత్తర కాండము.

## తరువాత చేర్చబడినవి అను ఐదు సర్గలు.

రాముడు అగస్త్యునితో ఇలా అన్నాడు. "అగస్త్య మహర్షీ! తమరు చెప్పిన ప్రకారము ఋక్షరజస్సు వాలి సుగ్రీవుల తండ్రి కదా! మరి వారి తల్లి ఎవరు? ఆ అన్నదమ్ములకు వాలి, సుగ్రీవుడు అనే పేర్లు ఎలా వచ్చాయి?" అని అడిగాడు.

అప్పుడు అగస్త్యుడు ఇలా చెప్ప సాగాడు. "రామా! వాలి సుగ్రీవుల పూర్వవృత్తాంతమును సవిస్తరముగా చెబుతాను విను. ఒక సారి నారదుడు లోక సంచారముచేస్తూ నా ఆశ్రమమునకు వచ్చాడు. నేను నారదుడికి అర్ఘ్య పాద్యములు ఇచ్చి సత్కరించాను. నీ మాదిరి నేను కూడా వాలి సుగ్రీవుల గురించి అడిగాను. నారదుడు నాతో ఈ విధంగా చెప్పాడు.

"ఓ అగస్త్య మహర్షీ! ఉత్తర దిక్కున మేరు పర్వతము ఉన్నది. అది బంగారు కాంతితో మెరుస్తూ ఉంటుంది. ఆ మేరు పర్వతము మీద బ్రహ్మ దేవుని దివ్య భవనము ఉంది. ఆ భవనములోనే బ్రహ్మ గారు దేవతలతో సభ చేస్తూ ఉంటాడు. ఒకసారి బ్రహ్మదేవుడు యోగాభ్యాసము చేస్తున్నాడు. అప్పుడు బ్రహ్మదేవునికి కళ్లనుండి నీరు కారింది.  బ్రహ్మదేవుడు ఆ కన్నీటి బొట్టును కొనగోటితో తీసి నేలమీద విదిల్చాడు.  ఆ కన్నీటి బొట్టు నుండి ఒక వానరుడు పుట్టాడు.

ఆ వానరము బ్రహ్మదేవునికి నమస్కరించి నిలబడింది. అప్పుడు బ్రహ్మ ఆ వానరముతో ఇలా అన్నాడు. “ఈ పర్వత శిఖరము మీద అనేక ఫల వృక్షములు ఉన్నాయి.  ఆ వృక్షముల నుండి ఫలములు కోసుకొని తింటూ నువ్వు ఇక్కడే ఉండు. నీకు అంతా మంచి జరుగుతుంది.” అని అన్నాడు.  “అలాగే చేస్తాను” అని అన్నాడు వానరుడు.

ఆ వానరము ఆ ఫల వృక్షముల మీద తిరుగుతూ దుముకుతూ ఫలములు తింటూ హాయిగా కాలం గడుపుతున్నాడు. ప్రతిరోజూ ఉదయము సాయంత్రము బ్రహ్మ సభకు వెళ్లి బ్రహ్మదేవుని దర్శనము చేసుకుంటూ ఉండేవాడు. వెళ్లేటప్పుడు కొన్ని ఫలములను తీసుకొని వెళ్లి బ్రహ్మదేవునికి సమర్పించేవాడు. అలా కొంత కాలం గడిచింది.

ఒక రోజు అ వానరమునకు దాహం వేసింది. నీరు కోసరం వెదుక్కుంటూ వెళ్లిన ఆ వానరమునకు  నిర్మల మైన జలము కల ఒక సరస్సు కనిపించింది. ఆ సరస్సులో జలము నిశ్చలంగా కదలకుండా ఉంది. ఆ వానరము నీళ్లుతాగడానికి ఆ సరస్సులోకి దిగబోతుంటే ఆ వానరానికి సరస్సులో తన ప్రతిబింబము కనిపించింది. “వామ్మో! వీడెవడో నాకు శత్రువు లాగా ఉన్నాడు. నా మాదిరి నేల మీద కాకుండా నీటిలో ఉంటున్నాడు.” అని అనుకొన్నాడు. నీటితో తన ప్రతిబింబాన్ని చూచి అరిచాడు. ఆ ప్రతి బింబం కూడా అరిచింది. “వామ్మో వీడెవడో నన్ను అవమానిస్తున్నాడు. వీడు పరమ దుర్మార్గుడులా ఉన్నాడు. ఈ సరస్సులో వీడు నివసిస్తూ ఉంటాడు కామాల్సు. వీడిని ఎలాగైనా పట్టుకోవాలి” అని అనుకొన్నాడు.

సహజంగా ఉన్న వానరచాపల్యము చేత తన ప్రతి బింబాన్ని పట్టుకోడానికి ఆ సరస్సులోకి దూకాడు ఆ వానరుడు. సరస్సులో ఎవరూ కనపడలేదు. వెంటనే నీటిలోనుండి పైకిలేచాడు. ఆ వానరము ఒక అందమైన స్త్రీగామారి పోయింది. అంతటి అందగత్తె మూడులోకములలో లేదు. ఆ స్త్రీ సాక్షాత్తు సరస్వతీ, లక్ష్మీ, పార్వతి లాగా ప్రకాశిస్తూ ఉంది.

ఆ సమయంలో ఇంద్రుడు బ్రహ్మసభనుండి స్వర్గానికి ఆమార్గంలో వెళుతున్నాడు. మార్గమధ్యములో ఆ స్త్రీని చూచాడు. అదే సమయంలో సూర్యుడు కూడా ఆ మార్గంలో వెళుతున్నాడు. సూర్యుడు కూడా ఆమెను చూచాడు.  ఆమె కూడా దేవేంద్రుని, సూర్యుని చూచింది. ఆమెను చూచి దేవేంద్రునికి, సూర్యునికి మోహావేశము పుట్టింది. ఇద్దరి మనస్సులు కోరికలతో దహించుకుపోతున్నాయి. ఆ మోహావేశంలో ఇంద్రునికి వీర్య స్ఖలనము అయింది. ఇంద్రుని వీర్యము ఆమెవాలము మీద పడింది. . అప్పుడు ఆ స్త్రీ ఒక బలవంతుడైన వానరమును ప్రసవించింది. ఇంద్రుని రేతస్సు వాలము మీదపడింది కాబట్టి అతనికి వాలి అనిపేరు వచ్చింది.

దేవేంద్రుడికి మాదిరి సూర్యునికి కూడా రేతస్సు పతనం అయింది. ఆ రేతస్సు ఆమె కంఠము మీద పడింది. సూర్యుని రేతస్సు ప్రభావంతో ఆమె ఒక బలవంతుడైన కుమారుని ప్రసవించింది. రేతస్సు కంఠము మీద పడింది కాబట్టి అతని పేరు సుగ్రీవుడు (మంచి కంఠము కలవాడు)అనిపేరు వచ్చింది.. రేతస్సు పతనం కాగానే మహేంద్రుడికి, సూర్యుడికి కామవాంఛలు తగ్గిపోయాయి. ఎవరి దారిన వారు వెళ్లారు.

పోతూ పోతూ ఇంద్రుడు వాలికి ఒక బంగారుమాలను బహూకరించి వెళ్లాడు. సూర్యుడు సుగ్రీవునికి హనుమంతుడు మిత్రుడు అవుతాడు అని వరం ఇచ్చి వెళ్లిపోయాడు.

మరునాడు తెల్లవారగానే  వాలి, సుగ్రీవులకు జన్మనిచ్చిన ఆ అందమైన స్త్రీ మరలా వానరంగా మారిపోయింది. తనకు పుట్టిన బలవంతుడైన వానరములను చూచింది. వాటికి తేనె ఆహారంగా ఇచ్చింది. ఆ వానరము పేరు ఋక్షరజస్సు. ఋక్షరజస్సు స్త్రీగా ఉన్నప్పుడు పుట్టిన వారే వాలి, సుగ్రీవులు. ఋక్షరజస్సు తన పుత్రులను తీసుకొని బ్రహ్మదేవుని వద్దకు వెళ్లాడు. బ్రహ్మదేవుడు వారిని కిష్కింధా పురమునకు పోయి వానరులకు రాజుగా కిష్కింధను ఏలుకోమన్నాడు.

తన పక్కనే ఉన్న దేవదూతను పిలిచి అతనితో ఇలా అన్నాడు. “ఓ దేవదూతా! నీవు వీరిని కిష్కింధా నగరమునకు తీసుకొని వెళ్లు. ఆ నగరము విశ్వకర్మ నిర్మించాడు. అది శత్రు దుర్భేద్యమైన నగరము. ఆ నగరంలో బంగారము, వజ్రములు, కోకొల్లలుగా ఉన్నాయి. ఆ నగరంలో కామరూపులైన రకరకాల వానరులు నివసిస్తున్నారు. నీవు వీరిని కిష్కింధకు తీసుకొని వెళ్లి ఆ వానరులకు పరిచయం చెయ్యి. ఆ వానరులకు రాజు ఇతనే అని చెప్పు. ఈ ఋక్షరజస్సును సింహాసనము మీద కూర్చోబెట్టి కిష్కింధకు రాజుగా పట్టాభిషిక్తుని చెయ్యి. వానరులందరూ ఇతనికి వశులై ఉండాలని నా ఆజ్ఞగా చెప్పు.” అని అన్నాడు.

బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు ఆ దేవదూత ఋక్షరజస్సును, అతని కుమారులు అయిన వాలి సుగ్రీవులను తీసుకొని కిష్కింధకు వెళ్లాడు. బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారము ఋక్షరజస్సును కిష్కింధకు రాజుగా పట్టాభిషిక్తుని చేసాడు. లోకంలో ఉన్న వానరులకు, భల్లూకములకు అతనిని రాజుగా ప్రకటించాడు. ఆ విధంగా ఋక్షరజస్సు వాలి, సుగ్రీవులకు తల్లి, తండ్రి తానే అయ్యాడు. కిష్కింధకు రాజు అయ్యాడు. వానరులకు, భల్లూకములకు అధిపతి అయ్యాడు. రామా! ఆ విధంగా వాలి సుగ్రీవులు ఋక్షరజస్సుకు జన్మించారు" అని అగస్త్యుడు రామునికి వాలి సుగ్రీవుల జన్మవృత్తాంతమును వినిపించాడు.

రాముడు వాలి సుగ్రీవుల జన్మవృత్తాంతము విని ఆశ్చర్యచకితుడయ్యాడు. అప్పుడు అగస్త్యుడు రాముని తో ఇలా అన్నాడు. "రామా! ఇదే కాదు. ఇంకా ఆశ్చకరమైన విషయములు ఎన్నో ఉన్నాయి. అసలు రావణుడు సీతను ఎందుకు అపహరించాడో తెలుసా! దాని వెనుక ఒక పూర్వగాథ ఒకటి ఉంది. అది కూడా చెబుతాను విను. ఈ రావణుడు కృతయుగము నుండి ఉన్నాడు. ఆ కృతయుగంలో ఒక నాడు రావణుడు బ్రహ్మమానసపుత్రుడైన సనత్కుమారుని ఒకచోట కూర్చుని ఉండగా చూచాడు. రావణుడు సనత్కుమారుని చూడగానే రెండు చేతులు జోడించి నమస్కరించాడు. ఆయనతో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! అన్ని యుద్ధములలో దేవతలు విజయం పొందుతుంటారు కదా. ఎవరిని ఆశ్రయించి వారు ఆ విధంగా విజయం పొందుతున్నారు. దేవతలలో కెల్లా అత్యధికమైన బలము కలవాడు ఎవరు? బ్రాహ్మణులు ప్రతి నిత్యము ఎవరిని పూజిస్తూ ఉంటారు? యోగులు ఎవరిని ధ్యానిస్తూ ఉంటారు.

నాకు ఈ సందేహాలు మనసులో మెదులుతున్నాయి. మీరు నా సందేహములను తీర్చమని కోరుకుంటున్నాను.” అని అడిగాడు రావణుడు. దానికి సనత్కుమారుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

“ఎవరినైతే నువ్వు నిరంతరమూ ద్వేషిస్తున్నావో ఆ శ్రీమహావిష్ణువే లోక వ్యాపకుడు. ఈ విశ్వానికంతా ప్రభువు. ఆయన ఎప్పుడు పుట్టాడో ఎవరికీ తెలియదు. దేవతలే కాదు అసురులు కూడా ప్రతినిత్యము ఆయనను పూజిస్తూ ఉంటారు. ఆయన ఎల్లప్పుడూ నీళ్లలో పడుకొని ఉంటాడు. ఆయనను ధ్యానిస్తే సకల పాపములు హరించి పోతాయి.  విష్ణువు నాభి నుండి పుట్టిన కమలములో నుండి బ్రహ్మదేవుడు స్వయంభువుగా జన్మించాడు. ఈ సకల చరాచర జగత్తును విష్ణువే సృష్టించాడు. ఆ విష్ణువు కొరకు యజ్ఞములు యాగములు చేస్తూ ఉంటారు. దైవత్వమును పొందుతూ ఉంటారు.  అందరూ విష్ణువునే పూజిస్తూ ఉంటారు. ఈ విషయమునే వేదములు, పురాణములు, శాస్త్రములు ఘోషిస్తున్నాయి. విష్ణువు ధర్మపక్షపాతి. దేవతలు ధర్మపరులు అందుకని విష్ణువు దేవతల పక్షం వహించాడు. రాక్షసులను, దైత్యులను, అసురులను జయించాడు. అందుకే దేవతలు విష్ణువును ఆశ్రయించుకొని ఉంటారు. నిత్యమూపూజిస్తూ ఉంటారు.” అని అన్నాడు సనత్కుమారుడు.

అప్పుడు రావణుడు ఇలా అడిగాడు. “ఓ మహర్షీ! విష్ణువు రాక్షసులను, అసురులను, దైత్యులను యుద్ధములో చంపుతుంటాడు కదా! వారి మరణానంతరము వారికి ఏ గతి కలుగుతుంది? వారు ఎక్కడకు వెళతారు. స్వర్గానికా లేక నరకానికా?” అని అడిగాడు

రావణుడు.

"యుద్ధములో దేవతల చేత చంపబడిన వాళ్లు అందరూ స్వర్గానికే వెళతారు. అందులో సందేహము లేదు. వారు సంపాదించుకున్న పుణ్యము అయి పోయిన తరువాత వారు చేసిన పాపకర్మములకు తగిన ఫలములను అనుభవిస్తారు. తరువాత మరలా మనుష్యలోకంలో పుడతారు. మరలా పాపపుణ్యాలు చేస్తారు. చనిపోయిన తరువాత వాటికి తగిన ఫలములను అనుభవిస్తారు. ఈప్రకారంగా జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉంటారు. కాని శ్రీమహావిష్ణువు చేతిలో మరణించిన వారు నేరుగా వైకుంఠమునకు వెళతారు. వారికి ఇంక పుట్టుక చావు లేదు. అందుకనే శ్రీమహావిష్ణువుకు కోపం వచ్చినా అది ఎదుటి వారికి వరంగా పరిణమిస్తుంది." అని అన్నాడు సనత్కుమారుడు.

అప్పుడు రావణునికి ఒక ఆలోచన వచ్చింది. ఈ విధంగా పుట్టడం చావడం మరలా పుట్టడం కన్నా ఒకే సారి శ్రీమహావిష్ణువు చేతిలో మరణిస్తే ఇంక చావుపుట్టుకలు ఉండవు కదా. శ్రీమహావిష్ణువు చేతిలో చావడంఎలాగా! అని ఆలోచించాడు. రావణుడు ఇలా ఆలోచిస్తూ ఉండగా, సనత్కుమారుడు రావణునితో ఇలా అన్నాడు. "రావణా! నీ మనసులో మెదిలో భావాలు నాకు అర్థం అయ్యాయి. నీ కోరిక సిద్ధిస్తుంది. కాని కొంతకాలం ఆగాలి." అని అన్నాడు. రావణుని మనసు తృప్తి పడింది. అసలు ఆవిష్ణువు గురించి తెలుసుకోవాలి అని అనుకున్నాడు రావణుడు.

"ఓ మహర్షీ! మీరు శ్రీమహావిష్ణువు గురించి చెప్పారు కదా! ఆయన ఎలా ఉంటాడు? ఆయనను ఎలా గుర్తు పట్టాలి?" అని అడిగాడు. అప్పుడు సనత్కుమారుడు రావణునితో ఇలా అన్నాడు. "శ్రీమహావిష్ణువు సర్వవ్యాపకుడు. అంతటా ఉన్నాడు. ఇక్కడ ఉన్నాడు అక్కడ లేడు అన్న మాట లేదు. కాని మన ఇంద్రియములకు గోచరము కాడు. కంటితో చూడలేము. కాని ఈ చరాచర జగత్తు అంతటా తానే అయి ఉన్నాడు. అందుకని ఇక్కడ ఉన్నాడు అక్కడ లేడు అని చెప్పలేము.

ఆయనకు ఒక రూపము లేదు. అన్ని రూపములు ఆయనవే! భూమి, స్వర్గము, పాతాళము, పర్వతములు, కొండలు, నదీనదములు, అరణ్యములు, జనపదములు, నగరములు అన్ని చోట్లా నిండి నిబిడీకృతమై ఉన్నాడు శ్రీమహావిష్ణువు. ఆయన స్వరూపము ఓంకారము. ఆయన స్థావరము సత్యము, ధర్మము. ఆయనే సకల దేవతలస్వరూపము. ఈ భూమిని తన తలమీద ధరించిన ఆదిశేషువుకూడా ఆయన స్వరూపమే. మనకు సంభవించే పగలు, రాత్రి, మాసములు, సంవత్సరములు, కాలము అన్నీ ఆయనే. ఆయన కాలస్వరూపుడు. మనము నిత్యము చూచే సూర్యుడు, చంద్రుడు ఆయనే. యముడు, వరుణుడు, వాయువు, అగ్ని, రుద్రుడు, ఇంద్రుడు, పంచభూతములు అన్నీ ఆయన స్వరూపాలే. ఆయన అవినాశి. నాశనము లేని వాడు. నిత్యుడు. ఆయనను ప్రార్థిస్తే ఈ సంసార దు:ఖముల నుండి బయటపడేస్తాడు.

ఆయన ఈ సమస్త జగత్తును ప్రకాశింపచేస్తున్నాడు. ఈ లోకములను సృష్టించి, పోషించి, లయం చేసే కర్త ఆయనే. సృష్టి స్థితి

లయాలు ఆయనకు ఒక ఆటవంటిది. సర్వవ్యాపి అయిన విష్ణువు గురించి ఎంత చెప్పినా తక్కువే. ఆఖరుకు మేఘాలలో దాగి ఉన్నమెరుపు, ఉరుము కూడా ఆయనే.

ఆయనను మానవ రూపంలో దర్శించాలంటే ఆయన మేఘము వలె శ్యామల వర్ణంలో ఉంటాడు. ఆయన కళ్లు తామర రేకుల వలె ఉంటాయి. ఆయన వక్షస్థలము మీద శ్రీవత్సము అనే పుట్టు మచ్చ ఒకటి ఉంటుంది. యుద్ధములో విజయమును, అందరికీ ఐశ్వర్యమును ప్రసాదించే లక్ష్మీదేవి ఆయన వక్షస్థలములో కొలువుదీరి ఉంటుంది. ఆ విష్ణుస్వరూపమును దేవ,దానవ,గంధర్వ,యక్ష,మానవులు ఎవరూ చూడలేరు. కేవలం ఆయన అనుగ్రహం ఉంటేనే చూడగలరు. ఆ విష్ణువు అనుగ్రహం లేకుండా, ఎన్ని యజ్ఞాలు చేసినా, యాగాలు చేసినా, ఎంత తపస్సు చేసినా, ఎన్ని దానాలు ధర్మాలు చేసినా విష్ణువును చూడ్డం సాధ్యం కాదు.

కాబట్టి ముందు ఆ విష్ణువు అనుగ్రహానికి పాత్రులవడం అత్యంత ముఖ్యం. దానికి ఒకటే మార్గం. పూర్తిగా ఆ విష్ణువుకు తనను తాను అర్పించుకోవడం. ఆయనమీదనే మనసు నిలపడం. ఆయననే తన రక్షకుడుగా భావించడం. చేసిన పాపములను పుణ్యకార్యములతో ప్రక్షాళన చేసుకోవడం. కొత్త పాపాలు చేయకుండా ఉండటం. ఆ విష్ణువు మీద అచంచలమైన భక్తి విశ్వాసం కలిగి ఉండటం. ఈ మార్గం ద్వారానే విష్ణువును చూడగలరు.

ఓ రావణా! నీవు విష్ణువును చూడాలి అని అంటున్నావు కాబట్టి నీకు ఒక మార్గం చెబుతాను విను. ఇప్పుడు కృతయుగము నడుస్తూ ఉంది. కృత యుగము అయిపోగానే త్రేతాయుగము వస్తుంది. అప్పుడు విష్ణువు ఇక్ష్వాకు వంశములో దశరథ మహారాజు అనే క్షత్రియుడు అయోధ్యను రాజధానిగా చేసుకొని పరిపాలన చేస్తుంటాడు. ఆయనకు కుమారుడుగా రాముడు అనే పేరుతో విష్ణువు లోక కల్యాణము కొరకు జన్మిస్తాడు. ఆ రాముడు గొప్ప బలశాలి బుద్ధిశాలి. పరాక్రమ వంతుడు. ధైర్య సాహసములు కలవాడు. విష్ణువు నరుడిగా రాముడు అనే పేరుతో అవతరిస్తాడు. రామునికి జనకుడు అనే మిథిలా నగర చక్రవర్తి కూతురు సీత అనే కన్య భార్య అవుతుంది. సాక్షాత్తు లక్ష్మీ దేవి సీతగా అవతరించి రాముని వివాహం చేసుకుంటుంది. సీత రాముని విడిచి పెట్టి క్షణకాలం కూడా ఉండలేదు. కాలవశమున, రాముని తండ్రి దశరథుడు రాముని అడవులకు పంపుతాడు. అప్పుడు రాముడు దండకారణ్యములో పర్ణశాల నిర్మించు కొని, తన భార్య సీత, తమ్ముడు లక్ష్మణునితో సహా అందులో నివసిస్తూ ఉంటాడు. రావణా! ఇదీ విష్ణుమూర్తి ప్రభావము." అని చెప్పాడు సనత్కుమారుడు.

అప్పటి నుండి రావణుని మనసులో ఒక ఆలోచన మెదిలింది. మామూలుగా మరణిస్తే మరలా పుట్టక తప్పదు. అదే విష్ణువు చేతిలో మరణిస్తే ఈ జనన మరణ చక్రం నుండి విముక్తి కలుగుతుంది. శాశ్వత వైకుంఠలోక ప్రాప్తికలుగుతుంది. కాబట్టి రామావతారంలో విష్ణువుతో వైరం ఎలా పెట్టుకోవాలి. విష్ణువు చేతిలో ఎలా మరణించాలి అని ఆలోచించసాగాడు. " అని అగస్త్యుడు రాముడికి రావణుని వృత్తాంతము

చెప్పాడు. ఇది విని రాముడు ఆశ్చర్యపోయాడు. "ఓ మహర్షీ! తరువాత ఏం జరిగింది వివరంగా చెప్పండి." అని అడిగాడు.

అప్పుడు అగస్త్యుడు ఇలా చెప్పసాగాడు. "తరువాత ఏముంది. నీతో ఎలా వైరం పెట్టుకోవాలా అని ఆలోచించిన రావణుడు, నువ్వు, సీత, లక్ష్మణుడు ఒంటరిగా దండకారణ్యంలో ఉన్నట్టు తెలుసుకున్నాడు. నిన్ను, లక్ష్మణుని మారీచుని సాయంతో బయటకు పంపి, నీ భార్య సీతను అపహరించి, నీకు ఆగ్రహం తెప్పించాడు. నీతో వైరం పెంచుకున్నాడు.

రామా! రావణునినైజం నీకు తెలిసినదే కదా! అతనికి బలం, పరాక్రమం ఉంది. అందుకు తగ్గట్టు బ్రహ్మఇచ్చిన వరాల ప్రభావం కూడా ఉంది. అందుకని లోకంలో ఉన్న రాజులందరినీ యుద్ధానికి పిలిచేవాడు. వారితో యుద్ధం చేసి ఓడించి తనకు దాసులుగా చేసుకొనే వాడు. వారి వద్ద ఉన్న కన్యలను అపహరించేవాడు. ఆ ప్రకారంగా జైత్రయాత్ర సాగిస్తున్న రావణునికి ఒక రోజు నారదుడు తారసిల్లాడు. రావణుడు నారదునికి నమస్కరించాడు. నారదుని ఇలా అడిగాడు. "ఓ నారద మహర్షీ! తమరు ముల్లోకములు సంచరిస్తూ ఉంటారు కదా! నాతో యుద్ధం చేసి గెలవ గల యోధుడు ఎవరైనా ఉన్నాడా! ఉంటే వాడు ఎక్కడ ఉంటాడో చెప్పండి" అని అడిగాడు. ఆ మాటలు విన్న రావణుడు నారదునితో ఇలా అన్నాడు.

"ఓ దానవేంద్రా! క్షీరసముద్రము దగ్గర ఒక ద్వీపము ఒకటి ఉంది. ఆ ద్వీపములో నివసించే మానవులు తెల్లగా ఉంటారు. వారి

శరీరాలు భారీగాఉంటాయి. వారు మాట్లాడుతుంటే ఉరిమినట్టు ఉంటుంది. వారు చాలా ధైర్యవంతులు. పరాక్రమవంతులు.  వారు నీతో యుద్ధము చేయడానికి సమర్ధులు అని నా అభిప్రాయము." అని అన్నాడు నారదుడు.

అప్పుడు రావణునికి ఒక అనుమానం వచ్చింది. "ఓ మహర్షీ! ఆ ద్వీపంలో అంతటి మహావీరులు తెల్లటి దేహాలతో ఎలా పుట్టారు. వారు అక్కడే ఎందుకు నివాసం ఉంటున్నారు." అని అడిగాడు. "ఏమీ లేదు రావణా! వారందరూ నారాయణుని భక్తులు. వారు ఎల్లప్పుడూ నారాయణ నామం జపిస్తూ, నారాయణుని గురించి తలుచుకుంటూ,  ఏ చీకూ చింతా లేకుండా బతుకుతున్నారు. వారికి అదే ఉత్తమ గతి. నీకో విషయం తెలుసా! సతతం నారాయణ నామస్మరణ చేస్తూ నారాయణుని మనసులో ధ్యానించే వారికే ఆ శ్వేతద్వీపంలోకి ప్రవేశం కలుగుతుంది. అలాంటి వారే అక్కడ ఉండడానికి అర్హులు. మానవుల పూర్వపుణ్యఫలము చేతనే వారికి శ్వేతద్వీప నివాసము సిద్ధిస్తుంది. అంతే కాకుండా విష్ణువు చేతిలో, విష్ణువు సంధించిన బాణములతో మరణించిన వారికి కూడా ఈ శ్వేతద్వీములో నివాసము లభిస్తుంది. శ్వేత ద్వీప నివాసము యజ్ఞములు చేస్తే, యాగములు చేస్తే తపస్సు చేస్తే పొందలేరు. కేవలము వారి వారి పుణ్యఫలములచేత, విష్ణువు చేతిలో మరణించడం చేతనే పొందగలరు." అని చెప్పాడు నారదుడు.

వెంటనే రావణుడు "అలాగైతే నేను వెంటనే ఆ శ్వేతద్వీపమునకు పోయి విష్ణువుతో యుద్ధమే చేసి ఆయన చేతిలో

మరణించి శాశ్వతముగా శ్వేత ద్వీప నివాసము పొందుతాను." అని మనసులో అనుకొన్న రావణుడు. శ్వేత ద్వీపానికి బయలుదేరాడు. రావణుని దూకుడు చూచి నారదుడు ఆశ్చర్యపోయాడు. అక్కడ ఏంజరుగుతుందో చూద్దామని నారదుడు కూడా శ్వేతద్వీపానికి వెళ్లాడు. రావణుడు తన రాక్షస సేనలతో మంత్రులతో సేనాపతులతో శ్వేతద్వీపానికి చేరుకున్నాడు.

ఆ శ్వేత ద్వీపము మహా తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంది. రావణుని పుష్పక విమానము ఆ ద్వీపం దరిదాపులకు కూడా వెళ్లలేకపోయింది. ఆ శ్వేతద్వీప మహత్తును చూచి రావణుని మంత్రులు సేనాపతులు వణికిపోయారు. "రాజా! మా వల్ల కావడం లేదు. శరీరాలు పట్టు తప్పుతున్నాయి. స్పృహ తప్పిపోతూ ఉంది. ఈ పరిస్థితులలో మేము యుద్ధం చేయలేము." అని విన్నవించుకున్నారు. రావణునికి ఏమీ తోచలేదు. పుష్పకము కదలడం లేదు. మంత్రులు సేనాపతులు,సైన్యము యుద్ధం చేయమని మొరాయిస్తున్నారు. అందుకని రావణుడు మొండి ధైర్యంతో పుష్పకము దిగి, ఒంటరిగా ఖడ్గం చేత ధరించి శ్వేతద్వీపము వైపు వెళ్లాడు.

ఇంతా చేస్తే ఆ శ్వేతద్వీపంలో అంతా ఆడవాళ్లు ఉన్నారు. అత్యంత సౌందర్యంతో మెరిసిపోతున్నారు. అందులో ఒక స్త్రీ రావణుని చేయి పట్టుకొని "నీవు ఎవరు? ఇక్కడకు ఎందుకు వచ్చావు? నీ తల్లి తండ్రులు ఎవరు? నిన్ను ఇక్కడకు ఎవరు పంపారు?" అని ప్రశ్నల వర్షం కురిపించింది. ఒక ఆడది తనను అన్ని ప్రశ్నలు వేయడం సహించలేక

పోయాడు రావణుడు. కోపంతో ఊగిపోయాడు. "నేను విశ్రవసుని పుత్రుడను. పులస్త్య బ్రహ్మ పౌత్రుడను. రావణుడను. నాకు యుద్ధము అంటే ప్రాణం. నేను యుద్ధం చేయడానికి ఇక్కడకు వచ్చాను. కాని ఇక్కడ నాతో యుద్ధం చేయగల మగాడు కనిపించడం లేదు." అని అన్నాడు. ఆ మాటలకు ఆ స్త్రీలు కిలా కిలా నవ్వారు. నీతో యుద్ధం చేయడానికి మగాళ్లు కావాలా! మేము లేమా!" అంటూ ఆ స్త్రీ రావణుని చిన్న పిల్ల వాడిని పట్టుకున్నట్టు రెండు చేతులతో నడుము దగ్గర పట్టుకొని పైకి ఎగరేసింది. రావణుడు బాలుని మాదిరి పైకి ఎగిరాడు. ఆ ఎగిరిన రావణుని మరొక స్త్రీ పట్టుకుంది. ఆ స్త్రీ రావణుని మరలా పైకి ఎగరేసింది. మరొక స్త్రీ పట్టుకొంది. అలా ఆ స్త్రీలందరూ రావణుని బంతిలా ఎగరేస్తూ పట్టుకుంటూ ఆడుకున్నారు.

అందులో ఒకామె "ఒసేయ్! వీడికి పదితలలు, ఇరవై చేతులు ఉన్నాయే. వీడు పురుగులా ఉన్నాడే. వీడిని పట్టుకుంటాను చూడు" అంటూ రావణుని చిన్న పురుగును పట్టుకున్నట్టు పట్టుకొని గిరాటేసింది. రావణుని మరొక స్త్రీ పట్టుకొని పైకి విసిరేసింది. అలా రావణునితో వారందరూ ఆడుకుంటున్నారు. ఈ హింసను తట్టుకోలేక రావణుడు ఒక స్త్రీ చేతిని పట్టుకొని పళ్లతో కొరికాడు. "ఛీ ఛీ" అంటూ ఆ స్త్రీ రావణుని విసిరేసింది. అది చూచి మరొక స్త్రీ రావణుని పురుగును పట్టుకున్నట్టు పట్టుకొని ఆకాశంలోకి ఎగిరింది. రావణుని కోపం మిన్నుముట్టింది. ఆ స్త్రీని కూడా రావణుడు గోళ్లతో పీకాడు. "ఛీ పాడు" అంటూ ఆ స్త్రీ రావణుని విదిలించి కొట్టింది. ఆ విదిలించిన వేగానికి రావణుడు సముద్రంలో పడిపోయాడు.

ఆ విధంగా రావణుని ఈ స్త్రీలు బంతాట ఆడుకున్నారు. రావణుని అవస్త చూచిన నారదుడు రావణుని ఎదుట నిలిచి పెద్దగా నవ్వుతూ నృత్యం చేసాడు." అని చెప్పాడు అగస్త్యుడు. ఈ కథంతా విని రాముడు ఆశ్చర్యపోయాడు. అగస్త్యుడు రాముని చూచి ఇలా అన్నాడు. " రామా! ఇన్ని అవస్థలు పడ్డ రావణుడు నీ చేతిలో మరణించడానికే నీ భార్య సీతను అపహరించాడు. రావణుడికి నీవే నారాయుడివి అని తెలుసు. నీవు రాక్షససంహారము కొరకు రాముడిగా అవతరించావు అని కూడా తెలుసు. కానీ నీవే నీ అవతార రహస్యమును తెలుసుకోలేక పోతున్నావు.

కాబట్టి రామా! ఇప్పటి కన్నా నీవు విష్ణువు అవతారము అని తెలుసుకో! నీవు త్రికాలములు తెలిసిన వాడవు. నీవు మూడు వేదములతో కీర్తింపబడుతున్నావు. మూడు అడుగులు బలిని దానం అడిగి మూడులోకములు ఆక్రమించావు. నీవు సనాతనుడవు అయిన విష్ణువు. లోక కల్యాణార్థము రామునిగా అవతరించావు. దేవతల కార్యములు నిర్వర్తించావు. లోక కంటకుడైన రావణుని, పుత్ర,మంత్రి, సామంత,పరివార సమేతంగా వధించావు. లోక కల్యాణము చేకూర్చావు. నీవు చేసిన పని వలన దేవతలు, ఋషులు, మునులు ఎంతో సంతోషించారు. ఇప్పుడు ముల్లోకములు రాక్షసుల వలన ఎలాంటి భయం లేకుండా ప్రశాంతంగా జీవిస్తున్నాయి. నీ భార్య సీత సాక్షాత్తు లక్ష్మీదేవి అవతారము. నీ కొరకే ఆమె జనకుని ఇంట జన్మించింది. రావణుడు సీతను లంకలో ఉంచి జాగ్రత్తగా రక్షించాడు. ఒక తల్లిని కొడుకు ఎలా చూచుకుంటాడో అలా చూచుకున్నాడు రావణుడు. పూర్వము ఈ కథను సనత్కుమారుడు

రావణునికి చెబితే, నారదుడు నాకు చెప్పాడు." అని అగస్త్యుడు రామునికి రావణ వృత్తాంతమును సవిస్తరంగా చెప్పాడు. రామ,లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు ఈ కధవిని ఆశ్చర్యపోయారు. సీతాపహరణం వెనుక ఇంత కధ ఉందా అని అనుకున్నారు. ఈ కధవిన్న సుగ్రీవుడు మొదలగు వానర ప్రముఖులు, విభీషణుడు, అతని మంత్రులు, రాముని సామంత రాజులు, పుర ప్రముఖులు అందరూ  ఆనంద పరవశులయ్యారు. అప్పుడు అగస్త్యుడు రాముని వద్ద సెలవు తీసుకొని తన ఆశ్రమమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ప్రక్షిప్త సర్గలు సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## ముప్పది ఎనిమిదవ సర్గ.

ఇక్ష్వాకు కులతిలకుడైన శ్రీరామచంద్రుడు అయోధ్యానగరానికి పట్టాభిషిక్తుడయ్యాడు. ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలిస్తున్నాడు. ఎవరికి తగిన పనులను వారికి అప్పగిస్తూ అందరి చేతా పనులు చేయించు కుంటున్నాడు. ఇలా కొన్ని రోజులు గడిచాయి. పట్టాభిషేక మహోత్సవము నకు వచ్చిన ఆహుతులందరూ ఎవరి నగరములకు వారు వెళ్లిపోయారు. ఒక రోజు రాముడు తన మామగారు జనకమహారాజును చూచి ఇలా అన్నాడు. "ఓ జనకమహారాజా! మీ ఆశీస్సులవలననే నేను రాక్షస సంహారం

చేయగలిగాను. మీ ఆశీస్సుల వలననే నేను అయోధ్యారాజ్యమును జనరంజకంగా పరిపాలిస్తున్నాను. మా ఇక్ష్వాకు వంశస్థులకు, మిథిలా నగర వాసులకు కల సంబంధము అద్వితీయము. మీరు నాచే ఇవ్వబడే కానుకలను స్వీకరించండి. భరతుడు మిథిలా నగరం వరకూ మీకు సాయంగా మీతో వస్తాడు." అని అన్నాడు. జనకుడు సరే అన్నాడు. మిథిలకు ప్రయాణము అయ్యాడు. రాముడు తనకు ఇచ్చిన బహుమతులను రత్నములను, బంగారమును, విలువగల వస్తువులు అన్నింటినీ తన కుమార్తెలకు ఇచ్చాడు. జనకుడు మిథిలకు వెళ్లిపోయాడు.

తరువాత  భరతుని మేనమామ అయిన కేకయ రాజును చూచి రాముడు ఇలా అన్నాడు. "నీ ఆశీర్వాదము వలననే భరతుడు ఇన్నాళ్లు రాజ్యపాలన చేసాడు. తరువాత నాకు రాజ్యము అప్పగించాడు. ఇప్పుడు యువరాజుగా నాతో పాటు పాలనా బాధ్యతలు స్వీకరించాడు. ఇదంతా మీ శుభాశీస్సులవలననే జరిగింది. కేకయ దేశములో మీ తండ్రిగారు మీ కొరకు అనుదినము ఎదురుచూస్తూ ఉంటారు. నా శక్తికొలది మీకు ధనము, బంగారము, మణిమాణిక్యాదులు బహుమతిగా ఇస్తున్నాను. వాటిని తీసుకొని లక్ష్మణుడు తమ వెంట వస్తున్నాడు." అని అన్నాడు రాముడు.  దానికి భరతుని మేనమామ యుధాజిత్తు ఇలా అన్నాడు. "రామా! నాకెందుకయ్యా ఈ బహుమానములు. అవన్నీ ఇక్కడే ఉండనీ." అని అన్నాడు. తరువాత రాముని వద్ద సెలవు తీసుకొని యుధాజిత్తు కేకయ రాజ్యమునకు వెళ్లిపోయాడు. ఆయనకు తోడుగా లక్ష్మణుడు ఆయన వెంట వెళ్లాడు.

తరువాత కాశీరాజు ప్రతర్ధనుడిని చూచి రాముడు ఇలా అన్నాడు. "రాజా! మీ సహాయ సహకారముల వలన భరతుడు ఈ 14 ఏళ్లు రాజ్యపాలన చేయగలిగాడు. ఇన్నాళ్లు అయోధ్యలో ఉండటం వలన అక్కడ కాశీరాజ్యములో పరిపాలన సక్రమంగా జరుగుతున్నట్టు లేదు. అందుకని తమరు కాశీరాజ్యమునకు వెళ్లడం ఉత్తమం." అని కాశీరాజుకు అనేక బహుమానములు ఇచ్చాడు. ఆ బహుమానములను తీసుకొని కాశీరాజు వారణాసికి ప్రయాణమై వెళ్లాడు.

తరువాత తనకు సామంతులు, పట్టాభిషేక మహోత్సవమును చూడటానికి వచ్చిన 300 మంది రాజులను చూచి రాముడు ఇలా అన్నాడు. "ఓ రాజోత్తములారా! మీ అందరి శుభాశీస్సులతో నేను రాక్షస సంహారము చేయగలిగాను. మీ అందరి సహాయ సహకారాలు లేకుండా నేను ఏమీ చేయగలిగే వాడిని కాదు. నేను దండకారణ్యములో ఉండగా రావణుడు సీతను అపహరించాడు అని తెలిసిన భరతుడు నాకు సాయంగా మిమ్ములను అందరినీ పిలిపించాడు. కాని నాకు మీ సాయము తీసుకోవలసిన అవసరమురాలేదు. అందుకని ఈసంవత్సర కాలము మీరు ఇక్కడే ఉండిపోయారు. ఇంక మీరు మీ మీ రాజ్యములకు వెళ్లండి." అని అన్నాడు రాముడు. రాముని మాట మేరకు అందరూ వారి వారి రాజ్యములకు వెళ్లిపోయారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ముప్పది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## ముప్పది తొమ్మిదవ సర్గ.

అయోధ్యనుండి వెళ్లిన ఆ రాజులు రామునికి యథాతథముగా కానుకలు కప్పములు పంపారు. ఆ రాజులను అనుసరించి వెళ్లిన భరత శత్రుఘ్నులు ఆ కానుకలు అన్నీ అయోధ్యకు తీసుకొని వచ్చారు. రామునికి ఇచ్చారు. రాముడు ఆకానుకలను అన్నీ సుగ్రీవునికి, విభీషణునికి, వానర వీరులకు పంచి ఇచ్చాడు.

తరువాత రాముడు అంగదుని, హనుమంతుని చూచి సుగ్రీవునితో ఇలా అన్నాడు. "సుగ్రీవా! వాలి పుత్రుడు అయిన అంగదుడు నీకు కూడా కుమారుడే. ఈ హనుమంతుడు నీకు సచివుడు. వీరికి కూడా నీకు చేసిన సత్కారములే చెయ్యాలి." అని పలికిన రాముడు అంగదునికి, హనుమకు తన ఒంటి మీద ధరించిన అమూల్యములైన రత్నహారములను తీసి అంగదునికి హనుమకు ధరింపచేసాడు. తరువాత రాముడు వానర వీరులైన నీలుడు, నలుడు,కేసరి, కుముదుడు, గంధమాధనుడు, సుషేణుడు, పనసుడు, మైందుడు, ద్వివిదుడు, జాంబవంతుడు, గవాక్షుడు, వినతుడు,ధూమ్రుడు, వలీముఖుడు ,ప్రజంఘుడు, సంనాదుడు,మహాబలుడు, దధీముఖుడు, ఇంద్రజానుడు తదితర వానర వీరులను పేరుపేరునా పిలిచి సత్కరించాడు రాముడు. వారితో ఇలా అన్నాడు.

"ఓ వానరవీరులారా! మీ వలననే నేను ఈ మహత్కార్యమును చేయగలిగాను. మీరే లేకపోతే నాకు సీత జాడ తెలిసేది కాదు. ఈయుద్ధము జరిగేది కాదు. మీరందరూ నాకు సోదర సమానులు. మీ నాయకుడు సుగ్రీవుడు ధన్యుడు." అని వారిని పిలిచి ప్రేమతో వారినందరినీ విడివిడిగా కౌగలించుకున్నాడు. తరువాత ఆ వానర వీరులు, వానరులు కొంత కాలము అయోధ్యలో ఉన్నారు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ముప్పది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## నలుబదియవ సర్గ.

ఆ ప్రకారంగా వానరులు వానర వీరులు అయోధ్యలో సకలసౌకర్యముడు అనుభవిస్తూ ఉన్నప్పుడు ఒక రోజు రాముడు సుగ్రీవుని చూచి ఇలా అన్నాడు. "సుగ్రీవా! మీరు వచ్చి చాలాకాలము అయింది. అక్కడ కిష్కింధ ఎలా ఉందో ఏమో. మీరు వెంటనే కిష్కింధకు వెళ్లండి. మీ రాజ్యమును వానర రంజకంగా పాలించండి. అంగదుడిని, హనుమను, నలుడిని ప్రేమానురాగాలతో చూచుకో. నీ మామగారు సుషేణుడిని, తారుడిని, కుముదుడిని, నీలుడిని, శతబలిని, మైందుడిని, ద్వివిదుడిని, గజుడిని, గవాక్షుడిని, గవయుడు, శరభులను,

జాంబవంతుడిని, గంధమాధనుడిని, ఋషభుడిని, సుపాటలుడిని, కేసరిని, శరభుడిని, శంఖచూడుని, వీరే కాదు నా కోసం ప్రాణాలకు కూడా తెగించి యుద్ధం చేసిన అందరినీ ప్రేమతో చూచుకో." అని అన్నాడు రాముడు. రాముని మాటలను శ్రద్ధగా విన్నాడు సుగ్రీవుడు.

తరువాత రాముడు విభీషణుని చూచి ఇలా అన్నాడు. "విభీషణా! నీవు లంకను ధర్మమును అనుసరించి పాలించు. నీకు ధర్మము అధర్మము గురించి నేను చెప్ప పనిలేదు. నీ సోదరుడు కుబేరుని ఆదరంతో చూచుకో. లంకా నగరంలోని నీ ప్రజలను ఆదరంతో పాలించు. ఏ సమయంలో కూడా నీ బుద్ధిని పెడతోవ పట్టనీయకు. అధర్మం జోలికి వెళ్లకు. రాజసుఖములలో పడి నన్ను, సుగ్రీవుని మరిచిపోవద్దు." అని విభీషణుడికి హితోపదేశము చేసాడు రాముడు.

రాముని మాటలు విన్న రాక్షసులు వానరులు రాముని ఎంతగానో ప్రశంసించారు. ఆ సమయంలో హనుమంతుడు రామునికి నమస్కరించి ఇలా అన్నాడు. "రామా! నా మనసు, బుద్ధి ఎల్లప్పుడూ నీ మీదనే ఉండేటట్టు నన్ను అనుగ్రహించు. రామ చరిత్ర ఈ లోకంలో ప్రచారంలో ఉన్నంత కాలము నేను జీవించి ఉండేటట్టు నాకు వరం ప్రసాదించు. నేను నిరంతరమూ నీ నామము, నీ చరిత్రను జపిస్తూనే ఉంటాను. వింటూఉంటాను. పాడుతూ ఉంటాను. రామ నామాన్ని జపిస్తూ, రామ చరితను వింటూ నా బాధలను, కష్టాలను మరిచిపోతాను. నిత్యం సంతోషంగా ఉంటాను." అని ఆర్తితో అంటున్న హనుమను చూచి రాముడు తన సింహాసనము నుండి లేచి వచ్చి

హనుమను గట్టిగా కౌగలించుకున్నాడు. "హనుమా! నీవు కోరిన విధముగా అన్నీ జరుగుతాయి. సందేహము లేదు. రామ కథ ఈ లోకంలో ఎంతకాలము నిలిచి ఉంటుందో అంతకాలము నీ కీర్తి నిలిచి ఉంటుంది. అంత కాలము నీవు చిరంజీవిగా ఉండగలవు. రామ కథ సూర్య చంద్రులు ఉన్నంత కాలము  ఈ లోకంలో నిలిచి ఉండగలదు. హనుమా! నీవు నాకు చేసిన ఉపకారములకు ఒక్కొక్కదానికీ నా ప్రాణములు ఇచ్చినా సరిపోదు. అప్పుడు మిగిలిన ఉపకారములకు నేను ఏమి ఇవ్వగలను. నీవు నాకు చేసిన ఉపకారములకు ప్రత్యుపకారము చేయడం అంటే  నిన్ను, నీవు చేసిన ఉపకారములను అవమాన పరచడమే అవుతుంది. అందుకని నీవు నాకు చేసిన ఉపకారములను నాలోనే జీర్ణం చేసుకుంటాను. నీకు జీవితాంతము ఋణపడి ఉంటాను." అని అన్నాడు రాముడు. వెంటనే తన మెడలోని రత్నహారమును తీసి హనుమ మెడలో వేసాడు.

తరువాత వానర వీరులు అందరూ రామునికి నమస్కరించి కిష్కింధకు బయలుదేరారు. సుగ్రీవుడు, విభీషణుడు, హనుమంతుడు రాముని విడువ లేక విడువ లేక విడిచి వెళ్లారు. వారి ఆత్మలన్నీ రాముని వద్దనే విడిచి పెట్టి కేవలం వారి దేహములు మాత్రమే అయోధ్యను విడిచిపెట్టి వెళ్ళాయి. వారందరూ రామునికి నమస్కారములు చేసి తమ తమ గృహములకు వెళ్లిపోయారు

. శ్రీమద్రామాయణము

ఉత్తరకాండమునలుబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## నలుబది ఒకటవ సర్గ.

పట్టాభిషేక మహెూత్సవానికి వచ్చిన వారందరూ వెళ్లిపోయారు. రాముడు పరిపాలనా కార్యములలో నిమగ్నం అయ్యాడు. ఒక రోజు రాముడు తన మందిరము పైభాగం మీద కూర్చొని తన తమ్ములతో మాట్లాడుతూ ఉంటే ఆకాశంలో పుష్పక విమానము కనిపించింది. పుష్పకములో నుండి మాటలు వినిపించాయి.

"నేను పుష్పకమును. కుబేరుడి వద్దనుండి వచ్చాను. తమరి ఆజ్ఞమేరకు నేను కుబేరుని వద్దకు వెళ్లాను. ఆయన నాతో ఇలా అన్నాడు. "ఓ పుష్పక విమానమా! నిన్ను రావణుడు నాతో యుద్ధం చేసి అపహరించాడు. ఇన్నాళ్లు నీవు రావణుని అధీనంలో ఉన్నావు. ఇప్పుడు రాముడు రావణుని చంపాడు. రావణుని రాజ్యము, ఆస్తి రాముని వశం అయింది. నీవు రావణుని సొత్తు కాబట్టి రావణుని మరణం తరువాత నీవు రాముని సొత్తు అయ్యావు. కాబట్టి నీవు రాముని వద్దకు వెళ్లు. రాముని సేవించు. అదే నా కోరిక." అని అన్నాడు. నేనుకుబేరుని ఆదేశానుసారము తమరి వద్దకువచ్చాను. నన్ను స్వీకరించండి." అని పుష్పకము పలికింది.

ఆమాటలు విన్న రాముడు ఆశ్చర్యపోయాడు. పుష్పకమును అయోధ్యలో దిగమన్నాడు. "ఓ పుష్పక విమానమా! నీకు స్వాగతము. రావణుడు నిన్ను కుబేరుని వద్దనుండి అపహరించాడు కాబట్టి నిన్ను నీ

అసలు యజమాని అయిన కుబేరుని వద్దకు పంపాను. కుబేరుడే తిరిగి నిన్ను నా వద్దకు పంపాడు కాబట్టి నీవు నా దగ్గర ఉండవచ్చును. నేను నిన్ను అవసరము వచ్చినప్పుడు ఉపయోగించుకుంటాను. నేను పిలిచినప్పుడు నా వద్దకు రా"అని అన్నాడు. తరువాత రాముడు తన తమ్ములతో సహా పుష్పక విమానమును పుష్పములతో పూజించాడు. పుష్పకము రాముని పూజలు అందుకొని తన దారిన తాను వెళ్లింది.

అప్పుడు భరతుడు రాముని చూచి ఇలా అన్నాడు. "రామా! నీ పరిపాలనలో ప్రజలు సుఖంగా ఉన్నారు. జంతువులు పక్షులు కూడా మనుష్య భాషలో మాట్లాడటం గమనించాను. రాజ్యములో రోగముల బాధలేదు. అంతా ఆరోగ్యంగా ఉన్నారు. మరణాలు కూడా బాగా తగ్గిపోయాయి. మానవుల ఆయు:ప్రమాణము పెరిగింది. స్త్రీలు కూడా ఆరోగ్యవంతులయిన బిడ్డలను ప్రసవిస్తున్నారు. శిశు మరణాలు తగ్గిపోయాయి. మేఘములు కూడా సకాలంలో వర్షాలుకురుస్తున్నాయి. పంటలుబాగా పండుతున్నాయి. రాముని వంటిరాజు మాకు కావాలని ప్రజలు అనుకుంటున్నారు." అని పలికాడు భరతుడు.

(భరతుని మాటలు గమనించండి. రాముని రాజ్యంలో ఆరోగ్య శాఖ, మాతా శిశు సంరక్షణ శాఖ, వ్యవసాయ శాఖ ఎంత సమర్థవంతంగా పనిచేస్తున్నాయో అర్థం అవుతోంది కదా! సరిగ్గా ఈ శాఖలే ఈ నాడు నిర్లక్ష్యానికి గురి అవుతున్నాయి. రోగాలు రాకుండా ఆరోగ్యశాఖ ముందస్తు చర్యలు తీసుకోదు. కాలువలు నాలాలు బాగు చెయ్యరు. అక్కడ రోగక్రిములు, దోమలు తామర తంపరగా పుట్టి

యధాశక్తి రోగాలు వ్యాప్తిచేస్తున్నాయి. రోగాలు వస్తే హాస్పిటల్సులో డాక్టర్లు ఉండరు. మందులుండవు. రోగనిర్ధారణకే వేలకు వేలు ఖర్చువుతోంది. ఇంకమందులు సరేసరి. ఉన్న ధనం అంతా కార్పొరేట్లకు దోచిపెట్టడానికి, వారి వద్ద నుండి వాటాలు పుచ్చుకోడానికే సరిపోదు. ఇంక వైద్యానికి డబ్బు ఎక్కడినుండి వస్తుంది. రాజకీయనాయకులకు ఇవేమీ పట్టవు తమ స్వార్ధం తప్ప. ఇంక రామరాజ్యం రమ్మంటే ఎలా వస్తుంది.)

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభై ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

నలభై రెండవ సర్గ.

ఒక రోజు రాముడు ఉద్యాన వనములో ప్రవేశించాడు. దాని పేరు అశోక వనము. ఆ వనములో అనేక రకములైన లతలు, వృక్షములు పెరుగుతున్నాయి. చంపక, పున్నాగ, అశోక, మధూక, పనస, చూత, జామ, పారిజత వృక్షములు పెరుగుతున్నాయి. పుష్పములతో ఫలములతో శోభాయమానంగా ఉన్నాయి. ఇవే కాకుండా ఆ వనము అరటి, అర్జున, నాగ, లోధ్ర, నీవ (వేప) గురివెంద, మందార, వృక్షములతోనూ తీగలతోనూ శోభిల్లుతూ ఉంది. అశోక వనములో వృక్షములు అన్ని కాలములలోనూ ఫలములతో, పూలతో, నిండుగా ఉంది. ఆ వనమును రక్షించే వారు ఆ వనములోని చెట్లను రకరకాలుగా కత్తిరించి

మృగములు, తోరణములు ఆకారములలో మలిచారు. ఆ వనములో అన్ని రకాల పక్షులు, కోయిలలు, చిలుకలు నివాస మేర్పరచుకొని నివసిస్తున్నాయి. మామిడి చిగుళ్లు తింటూ కోయిలలు మనోహరంగా కూస్తుంటే వినసొంపుగా ఉండేది.

ఆ వనమునకు నీరు కావాలి కదా. అందుకని అనేకములైన బావులు, దిగుడు బావులు తవ్వించారు. ఆ వనములో అందమైన పచ్చికబీళ్లు దర్శనం ఇస్తాయి. అశోక వృక్షములు ఒకదానితో ఒకటి పోటీ పడుతూ ఆకాశాన్నంటేటట్టు పెరుగుతున్నాయి. రాముని ఆధ్వర్యంలో పెంచబడుతున్న ఆ ఉద్యానవనము స్వర్గలోకంలో ఉన్న నందనవనమును తలపిస్తూ ఉంది.

(లంకలో అశోక వనము, అయోధ్యలో అశోక వనము... నాటి రాజులు వృక్షములు, మొక్కలు పెంపకం మీద ఎంత శ్రద్ధ పెట్టారో, ప్రకృతి పరిరక్షణ కొరకు ఎంతగా పాటుపడుతున్నారో, మనకు తెలుస్తోంది కదా! ఈ రోజుల్లో ఇంత టెక్నాలజీ ఉండికూడా, ఎక్కడో ఒకటీ రెండు పార్కులు తప్ప, మిగిలిన పార్కులలో పచ్చదనం కరువయింది. ఎండి పోయిన చెట్లు, మొక్కలు దర్శనం ఇస్తున్నాయి. పార్కులకు ఉపయోగించే స్థలంలో కూడా అపార్టుమెంట్లు కట్టేసి, పచ్చదనాన్ని పాడుచేస్తున్నారు నేటి వ్యాపారవేత్తలు. చెరువులను పూడ్చి బావులను పూడ్చి ఆస్థలంలో బహుళ అంతస్థుల భవనాలు లేపుతున్నారు. పునాదులు సరిలేక అవి అలాగే కుంగి పోవడం మనం చూస్తూనే ఉన్నాం. ఇదీ నేటి తీరు.)

ఒకరోజు రాముడు సీత ఆ వనములో విహరిస్తున్నారు. రాముడు, సీత ముందు నర్తకీమణులు నృత్యం చేస్తున్నారు. రాముడు, సీత ఆరగించడానిక ఫలములు, వండిన పదార్థములు సిద్ధం చేసారు. ఆ ప్రకారంగా సీతా రాములు ఆనందంగా కాలం గడుపుతున్నారు. రాముడు పదివేల సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. రాముడు ప్రతి రోజూ తెల్లవారు జామున లేచి కాలకృత్యములు తీర్చుకొని స్నానాదులు కావించి సంధ్యావందనము చేసి, రాచ కార్యములు అన్నీ పగలు పూర్తి చేసుకొని, సాయం సమయానికి సీతాదేవి వద్దకు వచ్చేవాడు. రాముని భార్య సీత కూడా పొద్దుటే లేచి స్నానాదులు ఆచరించి దేవతార్చన చేసి, తరువాత తన ముగ్గురు అత్తగార్ల వద్దకు పోయి వారికి తగు సేవలు చేసి, సాయం కాలానికి సకలాలంకార భూషితురాలై రాముని రాక కొరకు ఎదురు చూస్తూ ఉండేది.

సర్వమంగళ అయిన సీతను చూచి రాముడు పరమానందము చెందేవాడు. ఆమె అందచందములను మెచ్చుకొనేవాడు. ఇంతలో సీత గర్భవతి అయింది. ఈ సంగతి రామునికి తెలిసింది. రాముడు పరమానంద భరితుడయ్యాడు. "ఓసీతా! నీ వలన నాకు ఉత్తమ సంతానము కలుగబోతున్నారు. ఈ సమయంలో ఆడవాళ్ల ఏవేవో కోరికలు ఉంటాయి అంటారు కదా! నీకు కూడా ఏవైనా కోరికలు ఉంటే చెప్పు తీరుస్తాను." అని అన్నాడు రాముడు. అప్పుడు సీత రామునితో ఇలా అంది. "నాకు ఈ సమయములో గంగా తీరమున ఉండే పరమ పవిత్రములైన తపోవనములలో విహరించాలని, అక్కడి మునులు, ఋషుల ఆశీర్వాదము తీసుకోవాలనీ, వారి పాదధూళి శిరస్సున

ధరించాలని చాలాకోరికగా ఉంది. సాధారణంగా ఈ సమయములో ఆడవాళ్లు పుట్టింట్లో నిదుర చేయాలని అంటారు. కానీ నాకు గంగాతీరములో ఉండే ముని ఆశ్రమములలో ఒక్క రాత్రి అన్నా నిద్ర చేయాలని కోరికగా ఉంది. ఇదే నా కోరిక." అంది సీత.

" ఇంతేనా! నీ కోరిక తప్పక తీరుస్తాను. రేపే మనము గంగానదీ తీరాన ఉన్న ఋషుల ఆశ్రమములకు వెళుదాము." అని అన్నాడు రాముడు. తరువాత రాముడు తన స్నేహితులతో గడపడానికి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము నలభైరెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
నలభై మూడవ సర్గ.

రాముడు ఉన్నతమైన ఆసనము మీద కూర్చుని ఉన్నాడు రాముని చుట్టు అతని స్నేహితులు కూర్చుని ఉన్నారు. అంతా సరదాగా మాట్లాడుకుంటూ నవ్వుకుంటూ ఉన్నారు. రాముని చుట్టు విజయుడు, మధుమత్తుడు, కాశ్యపుడు, మంగళుడు, కులుడు, సురాజి, కాలియుడు, భద్రుడు, దంతవక్త్రుడు, సుమాగధుడు అనే పేరుగల వాళ్లు కూర్చుని ఉన్నారు. అంతా సరదాగా మాట్లాడుకుంటున్నారు. మాటల సందర్భంలో రాముడు భద్రుని

వంక చూచి "ఏం భద్రా! అయోధ్యానగరం ఎలా ఉంది. ఏమని అనుకుంటున్నారు? దేశంలో ప్రజలు నా గురించి ఏమనుకుంటున్నారు? అయోధ్యలో, ఇంకా ఇతర పురములలో, గ్రామములలో, జనపదములలో ప్రజలు నా గురించి సీతను గురించి, లక్ష్మణ, భరతుల గురించి ఏమనుకుంటున్నారు? రాముని రాజ్య పాలన గురించి ఏమన్నా విమర్శలు వినపడుతున్నాయా! మా తల్లి కైకేయి గురించి నాకు వనవాసము ప్రాప్తించింది కదా? ఆమెను గూర్చి ఏమనుకుంటున్నారు? 14 సంవత్సరాల తరువాత రాజ్యానికి వచ్చాను కదా! ఈ కొత్త రాజును గురించి ప్రజలు ఏమనుకుంటున్నారు?"అని అడిగాడు రాముడు.

దానికి భద్రుడు ఇలా అన్నాడు. "రామా! ప్రజలందరు నీ విజయగాధలను గానం చేస్తున్నారు. నీవు రావణుని చంపడం సీతను తీసుకు రావడం అంతా కథలు కథలు గా చెప్పుకుంటున్నారు." అని అన్నాడు భద్రుడు. "అది కాదుభద్రా! వారు ఏమనుకుంటున్నారు వారి మాటలలోనే చెప్పు. ఎందుకంటే అంతా మంచి అనుకోరు కదా. కొస్త చెడ్డగా కూడా అనుకుంటారు. అదిసహజమే కదా! ప్రజల మనోభావాలు నాకు తెలిస్తే, నేను వారికి ఇష్టం లేని పనులు చేయకుండా జాగ్రత్త పడతాను. ఎల్లప్పుడూ వారికి ఇష్టమైన పనులే చేయడానికి ప్రయత్నిస్తాను. ఏ విషయాలలో ప్రజలకు నా పాలన సంతృప్తి కలిగించడం లేదు. పట్టణాలలో, పల్లెలలో ప్రజలు నా గురించి నా పాలన గురించి ఏమనుకుంటున్నారో  నిర్భయంగా, ఏ మాత్రం సంకోచం లేకుండా చెప్పు." అని అడిగాడు రాముడు.

రాముని మాటలు విన్న భద్రుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! అయోధ్యలోనూ ఇతర గ్రామాలు, పట్టణాలలోనూ ప్రజలు నాలుగు వీధులు కలిసే చోట, రచ్చబండల వద్ద, ఉద్యానవనములలోనూ నీ గురించి ఏమేమి మాట్లాడుకుంటున్నారో చెబుతాను విను. నీవు సముద్రము మీద సేతువును కట్టావు కదా. అలాంటి పని దేవతలు గానీ దానవులు గానీ పూర్వము ఎవరూ చేయలేదని నిన్ను వేనోళ్ల శ్లాఘిస్తున్నారు. పైగా నీవు వానరములను, భల్లూకములను మచ్చిక చేసుకోవడం, రావణుని చంపడం, వాటి సాయంతో రావణుని చంపడం అంతా విడ్డూరంగా ఆశ్చర్యంగా చెప్పుకుంటున్నారు. ఇంకా కొంతమంది "రాముడు రావణుని చంపి, రావణుని వద్ద ఉన్న సీతను తీసుకొని వచ్చాడు. రావణుడు ఇన్నాళ్లు సీతను తాకినా లెక్కచేయకుండా సీతను మరలా స్వీకరించాడు. రాముడికి సీత మీద అంత వల్లమాలిన ప్రేమ ఉందేమో! రామునికి సీత వల్ల అంత సుఖం కలుగుతుందేమో! అయినా రావణుడు సీతను తన ఒడిలో కూర్చుండబెట్టుకొని లంకకు తీసుకొని వెళ్లాడు కదా! అక్కడ అశోక వనములో ఉంచాడు కదా! మరి అన్నాళ్లు రాక్షసుల మధ్య ఉన్న సీతను రాముడు అసహ్యించుకోకుండా ఎలా ఉండగలుగుతున్నాడో అర్థం కావడం లేదు! రాముడే అలా చేసాడు కాబట్టి మనం కూడా మన భార్యలు ఎక్కడ తిరిగి వచ్చినా ఏమీ అనకుండా ఏలుకోవాలేమో! ఎందుకంటే రాజుగారు ఏమి చేస్తే ప్రజలు అలా చెయ్యాలి కదా!" ఈ ప్రకారంగా ప్రజలు నానా విధాలుగా అనుకుంటున్నారు రామా!" అని చెప్పాడు భద్రుడు.

రామునికి దు:ఖం పొర్లుకొచ్చింది. కాని బయట పడలేదు. తక్కిన మిత్రుల వంక చూచి "ఇదంతా నిజమేనా! ఇలాంటి మాటలు అనడం మీరు కూడా విన్నా రా!" అని అడిగాడు. "అవును రామా! భద్రుడు చెప్పినది అంతా అక్షరాలా నిజం మేము కూడా ప్రజలు ఇలా అనుకోవడం స్వయంగా విన్నాము." అని చెప్పారు. రాముని మనసంతా అల్లకల్లోలం అయింది. ఇంక స్నేహితుల మధ్య ఉండలేకపోయాడు. రాముడు తన స్నేహితుల నందరినీ పంపివేసి తన అంత:పురమునకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలుబది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## నలుబది నాలుగవ సర్గ.

రాముడు తన మిత్రులను అందరినీ పంపి వేసి తాను అంత:పురమునకు వెళ్లాడు. ప్రతీహారిని పిలిచాడు."నీవు వెంటనే పోయి లక్ష్మణుని, భరతుని,శత్రుఘ్నుని నేను పిలిచానని చెప్పి వెంటనే తీసుకొనిరా. నేను వారితో కొన్ని అత్యవసరమైన రాచకార్యములు మాట్లాడవలసిన అవసరం ఉంది." అని అన్నాడు. ఆ ప్రతీహారి వెనువెంటనే లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు మందిరములకు వెళ్లి "మహారాజా! మిమ్ములను రాముల వారు అత్యవసరంగా తోడ్కొని రమ్మన్నారు." అని చెప్పాడు. వారందరూ వెంటనే రాముని అంత:పురమునకు వెళ్లారు. రాముని

మందిరము బయట ఉండి తాము అందరమూ వచ్చామని రామునికి వర్తమానము పంపారు. రాముడు తనతమ్ములను లోపలికి రమ్మన్నాడు. లక్ష్మణ,భరత,శత్రుఘ్నులు లోపలకు పోయి రామునికి నమస్కరించి తమ తమ ఆసనముల మీద కూర్చున్నారు. రాముని ముఖంలోకి చూచారు.

రాముని ముఖంలో విషాదచ్ఛాయలు కమ్ముకొని ఉన్నాయి. కళ్ల వెంట నీరు కారుతూ ఉంది. వీరికి విషయం అర్థం కావడం లేదు. రాముడు ఎందుకు బాధపడుతున్నాడా అని ముగ్గురూ ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. తమవల్ల ఏదైనా తప్పుజరిగిందేమోఅని ముగ్గురు తమ్ముళ్లు రాముని పాదాల మీద పడ్డారు. రాముడు వారిని లేవనెత్తి అక్కున చేర్చుకున్నాడు. వారిని తమ తమ ఆసనముల మీద కూర్చోబెట్టాడు. “తమ్ములారా! ఈ అయోధ్యకు నేనే కాదు మీరందరూ మహారాజులే. ఈ అయోధ్య మీది. మీరే పాలకులు. మీరు నాకు ఇచ్చిన రాజ్యమును నిమిత్తమాత్రంగా పరిపాలిస్తున్నాను. ఓ అయోధ్యాధి పతులారా! మీరంతా బాగా చదువుకున్న వారు. వేదములను, శాస్త్రములను అధ్యయనం చేసారు. నాకు ఒక ధర్మ సంకటము వచ్చింది. దానిని మీరు పరిష్కరించాలి. ఏమి చెయ్యాలో నాకు ఏమీ తోచడం లేదు.” అని అన్నాడు రాముడు. చక్కగా సాగి పోతున్న రాముని జీవితంలో ఏమి ఉత్పాతం జరిగిందా అని వారిలో వారు తర్కించుకుంటున్నారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభైనాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# ఉత్తరకాండము

## నలభైఐదవ సర్గ

ఒక్కసారి తమ్ముళ్ల ముఖాల వంక చూచి రాముడు మరలా చెప్పడం మొదలెట్టాడు. "నేను నా రాజ్యములో నా గురించి ఏమను కుంటున్నారో తెలుసుకోవాలని నా స్నేహితులను అడిగాను. వారు నిర్మొహ మాటంగా కొన్ని నిజాలు వెల్లడించారు. వాటిని నేను నమ్ముతున్నాను. మీరుకూడా నమ్ముతారు అని అనుకుంటున్నాను. నా మీద, సీత మీద అయోధ్యారాజ్యములో ఉన్న పౌరులలో జానపదులలో ఒక అపవాదు బయలుదేరింది. ఆ అపవాదు బాగా ప్రచారంలోకి వచ్చింది. అది నా హృదయాన్ని కలిచివేస్తూ ఉంది. తట్టకోలేక పోతున్నాను.

తమ్ముళారా! నేను ఇక్ష్వాకు వంశంలో ప్రసిద్ధుడైన దశరథమహారాజుకు కుమారుడిగా జన్మించాను. సీత కూడా మిథిలా నగరానికి ప్రభువు అయిన రాజర్షి జనకునికి కుమార్తెగా జన్మించింది. ఇద్దరమూ ఉన్నతమైన, సంస్కారవంతమైన వంశములలో జన్మించిన వారమే! భరత శత్రుఘ్నులారా! మీకు తెలియక పోవచ్చును. కాని లక్ష్మణుడు నా వనవాసకాలము 14 ఏళ్లు నా వెంటనే ఉన్నాడు. లక్ష్మణుడికి అన్ని విషయములు తెలుసు. లక్ష్మణా! మనము దండకారణ్యములో ఉన్నప్పుడు సీతను రావణుడు అనే రాక్షసుడు ఎలా అపహరించాడో నీకు తెలుసు కదా! ఆ రావణుని నేను ఎన్ని కష్టాలు పడి చంపానో నీకు తెలుసు కదా! రావణ సంహారము అయిన తరువాత సీత నా దగ్గరకు వచ్చినప్పుడు ఒక సంవత్సరము రాక్షసుల మధ్య ఉన్న సీతను నేను ఎలా అయోధ్యకు

తీసుకొని పోగలను అని ఆలోచించాను. ఆ మాట నేను అన్నప్పుడు సీత అగ్ని ప్రవేశము చేసి తాను పునీతురాలను అని నిరూపించుకున్నది అన్న విషయం నీవు కళ్లారా చూచావు కదా! అప్పుడు నన్ను అభినందించడానికి వచ్చి దేవతా గణములు కూడా సీత పవిత్రురాలు అని చెప్పారు కదా. అగ్నిదేవుడు, వాయు దేవుడుకూడా సీత పతివ్రతకు సాక్ష్యం ఇచ్చారు కదా! అగ్నిలో ప్రవేశించి పరిశుద్ధురాలైన సీతను నేను అయోధ్యకు తీసుకొని వచ్చాను.

ఈ విషయములన్నీ నీకూ నాకూ తెలుసు. కాని అయోధ్యా వాసులకు, జానపదులకు తెలియవు. నేను మాత్రము సీత విషయంలో వివాదం తలెత్తుతుందని మనసులో ఒక మూల శంకిస్తూనే ఉన్నాను. నేను అనుకున్నట్టే జరిగింది. సీత విషయంలో ఒక అపవాదు ప్రచారంలోకి వచ్చింది. ధర్మశాస్త్రము ప్రకారము ఎవడి మీదనైనా ఒక అపవాదు వస్తే వాడు లోకంలో ఆ అపవాదు ప్రచారంలో ఉన్నంత వరకూ నరకంలో పడి ఉంటాడు. కీర్తి వంతుడిని లోకంలో అందరూ పూజిస్తారు. ఆకాశానికి ఎత్తేస్తారు. కాని అపవాదు వస్తే మాత్రం అంతా ఈసడించుకుంటారు. పాతాళానికి అణగదొక్కుతారు. ఇదీ ప్రజల నైజం. అందుకే పెద్ద వాళ్లు అందరూ తమ మీద ఏమాత్రం అపవాదు రాకుండా జాగ్రత్తపడుతుంటారు.

ఓ తమ్ములారా! నా మీద ఇప్పుడు ఒక అపవాదు వచ్చింది. ఒక రాక్షసుడు తన తొడమీద కూర్చో పెట్టుకొని తీసుకుపోయిన సీతను, ఒక సంవత్సరం పాటు రాక్షసుల చెరలో ఉన్న సీతను, సీత మీద కోరికతో, కామంతో, ఆమెను వదిలిపెట్టడం ఇష్టం లేక, నేను తిరిగి స్వీకరించాను

అని ఆ అపవాదు. దానిని పోగొట్టు కోడానికి నేను నా జీవితమును గానీ, మీ అందరిని కానీ త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను. ఇంక సీతను త్యాగం చెయ్యడం అనేది ఒక సమస్యకాదు. సీతాపహరణం జరిగినప్పుడు కూడా, సీతా వియోగం లో కూడా నేను ఇంతటి దు:ఖమును అనుభవించలేదు. ఈ అపవాదు అంతటి దు:ఖమునకు కారణం అయింది. ఈ అపవాదు పోవాలంటే సీతా పరిత్యాగమే పరిష్కారము.

లక్ష్మణా! సీత కూడా నిన్నని దినమున, తాను గంగా తీరమున ఉన్న ఋషి ఆశ్రమములను సందర్శించవలెననీ, వారి ఆశీర్వాదములు తీసుకొన వలెననీ కోరికగా ఉందని చెప్పింది. ఆ మిషమీద, రేపు ఉదయమే నీవు సుమంతుని రథం సిద్ధం చేయమను. సీతను తీసుకొని పోయి అయోధ్యా రాజ్యము అవతల అరణ్యములలో విడిచి పెట్టి రా! అయోధ్యా రాజ్య సరిహద్దుల వద్ద తమసానదీ తీరంలో మహాఋషి వాల్మీకి ఆశ్రమం ఉంది. సీతను వాల్మీకి ఆశ్రమ పరిసరాలలో విడిచి పెట్టిరా!

లక్ష్మణా! ఇది నా ఆజ్ఞ. కాదు, కూడదు, తప్పు, పాపము, అన్యాయము అనే మాటలు మాట్లాడవద్దు. నేను అన్నీ ఆలోచించి ఈ నిర్ణయం తీసుకున్నాను. మరో ఆలోచనకు తావు లేదు. నీవు కూడా వేరే ఆలోచనలు పెట్టుకోవద్దు. నా నిర్ణయానికి మీలో ఎవరైనా అడ్డు చెబితే నాకు చాలా కోపం వస్తుంది. నా మీద ఒట్టు పెట్టుకొని చెబుతున్నాను. మీరు నా నిర్ణయాన్ని కాదనవద్దు. నా మాటకు అడ్డు చెప్పడం కానీ, నన్ను బతిమాలడం కానీ, చేస్తే వారిని నేను నా శత్రువులుగా పరిగణిస్తాను. ఇది నా స్వవిషయం. నిర్ణయం నాది. రాజాజ్ఞను అమలు చేయడమే నీ

బాధ్యత. ఇటువంటి కఠిన నిర్ణయం తీసుకున్నందుకు మీరంతా నన్ను మన్నించండి. తప్పని సరి పరిస్థితులలోనే ఇటువంటినిర్ణయం తీసుకోవలసి వచ్చింది. కాదనకండి. నా మాట ప్రకారం చెయ్యండి. దీని వలన నా మీద వచ్చిన అపవాదు సమసి పోతుంది. ఋష్యాశ్రమములు చూడవలెనన్న సీత కోరికా తీరుతుంది."

రాముడు ఈ ప్రకారంగా ఎవరికీ మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా చెబుతుంటే, రాముని కళ్ల వెంట నీరు ధారాపాతంగా కారుతున్నాయి. ఇంక తట్టుకోలేక రాముడు అక్కడి నుండి లోపలకు వెళ్లిపోయాడు. బరువెక్కిన హృదయాలతో లక్ష్మణ,భరత,శత్రుఘ్నులు అక్కడి నుండి వెళ్లిపోయారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## నలభై ఆరవ సర్గ.

మరునాడు తెల్లవారింది. నలుగురు అన్నదమ్ములు ఆ రాత్రి నిద్రపోలేదు. ఏ పాపమూ ఎరుగని సీత హాయిగా నిద్రపోయింది. ఉదయమే లక్ష్మణుడు రాముని సారథి  సుమంతుని పిలిచాడు. రథం సిద్ధం చేయమన్నాడు.

“సుమంతా! మా వదిన సీతా దేవి ఋష్యాశ్రమములు చూడవలెనని కోరికగా ఉందట. ఆమెను ఋష్యాశ్రమములకు తీసుకొని వెళ్లాలి. రథం సిద్ధం చేయి. ఆమె కూర్చోడానికి మెత్తని ఆసనములు ఏర్పాటు చెయ్యి. రథము త్వరగా సిద్ధము చేసి తీసుకొనిరా! ఇది రాజాజ్ఞ. ఆలస్యము పనికి రాదు.” అని ఆదేశించాడు లక్ష్మణుడు. ఈ ప్రయాణములో ఆంతర్యము తెలియని సుమంతుడు “అలాగే సిద్ధం చేస్తాను.” అని అన్నాడు. క్షణాల్లో రధాన్ని సిద్ధం చేసుకొని వచ్చి లక్ష్మణుని ముందు నిలబెట్టాడు. “లక్ష్మణా! రథం సిద్ధంగా ఉంది. ఇప్పుడు నేను ఏం చెయ్యాలి.” అని అడిగాడు.

సుమంతుని అక్కడే ఉండమని లక్ష్మణుడు సీతా దేవి అంత:పురమునకు వెళ్లాడు. “అమ్మా! నీవు అయోధ్యాధిపతి రాముని ఒక వరం కోరావట. గంగానదీ తీరమున ఉన్న ఋషివాటికలకు వెళ్లవలెనని, అక్కడ ఋషుల, ఋషిపత్నుల ఆశీర్వాదములు తీసుకొనవలెనని అన్నావట. నిన్ను గంగానదీతీరమున ఉన్న ఆశ్రమములకు తీసుకొని వెళ్లమని నన్ను ప్రభువు అయిన రాముడు ఆజ్ఞాపించాడు. రథము సిద్ధంగా ఉంది. తమరు సిద్దంగా ఉంటే మనము బయలుదేరుదాము.” అని అన్నాడు.

రాముడు తన కోరికను వెనువెంటనే నెరవేర్చుతున్నందుకు సీత మనసులో ఉప్పొంగిపోయింది. అక్కడ ఋషులకు ఋషిపత్నులకు బహూకరించుటకు విలువైన ఆభరణములు, వస్త్రములు తీసుకొంది. అన్నీ రథంలో పెట్టించింది. తనకు కూడా అవసరమైన వస్త్రములు ఆభరణములు ధరించింది. ఇవన్నీ చూస్తున్న లక్ష్మణుడికి దు:ఖం ఆగడం

లేదు. కాని మనసులోనే అణుచుకుంటున్నాడు. సీత లక్ష్మణుని వెంట వచ్చి రథము ఎక్కింది. సుమంతుడు రథం తోలుతున్నాడు. సీత, లక్ష్మణుడు అయోధ్య విడిచి అరణ్యమార్గంలో వెళుతున్నారు. కాని సీతకు కొన్ని అపశకునములు గోచరించాయి.ఆమె ఎడమ కన్ను అదరసాగింది. శరీరం అంతా ఏదో తెలియని బాధ ఆవరించింది. స్వల్పంగా వణుకుతూ ఉంది. కాని ప్రయాణం వలన కలిగే ఉద్వేగము అని సరిపెట్టుకుంది సీత. కాని ఉండబట్టలేకపోయింది. లక్ష్మణుని ఇలా అడిగింది.

"లక్ష్మణా! నాకు కొన్ని దుర్నిమిత్తములు గోచరిస్తున్నాయి. రామునికి క్షేమమే కదా! రాజమాతలందరికీ కుశలమే కదా! మన రాజ్యములో ప్రజలందరూ సుఖంగాఉన్నారు కదా! వారికేమీ ఆపదలు కలుగలేదు కదా!  నాకెందుకో మనసంతా అల్లకల్లోలంగా ఉంది. కారణం అర్థం కావడం లేదు. సకల దేవతలు అయోధ్యను రక్షించుగాక!" అని దేవతలందరికీ పేరుపేరునా నమస్కారం చేసింది సీత.

లక్ష్మణుడు తన బాధను మనసులోనే దాచుకొని, సీతకు నమస్కారము చేసి "అమ్మా! అందరూ క్షేమంగానే ఉన్నారు. ఎవరికీ ఎటువంటి ఆపదా లేదు." అని అన్నాడు. వారు గోమతీనదీ తీరమునకు చేరుకున్నారు. అంతలో సూర్యుడు అస్తమించాడు. ఆ రాత్రికి వారు నదీ తీరమున ఉన్న ఒక ఋషి ఆశ్రమములో విడిది చేసారు. మరునాడు ఉదయమే లేచారు. అందరూ గంగా స్నానం చేయాలని అనుకున్నారు. సీతను రథం ఎక్కించి, లక్ష్మణుడు రథంఎక్కాడు. సుమంతుడు రథం తోలుతున్నాడు. రథం గంగానదీ తీరమును చేరుకుంది. పవిత్రమైన

గంగాజలమును చూడగానే సీత హృదయం పులకించి పోయింది. సీతను విడువ వలసిన సమయం వచ్చినందుకు లక్ష్మణునికి ఏడుపు ఆగలేదు. సీతనుచూచి పెద్దగా ఏడ్చాడు. సీత ఆశ్చర్యపోయింది.

"అదేమి లక్ష్మణా! పవిత్రమైన గంగానదీ జలాలను సమీపించినందుకు సంతోషించాల్సింది పోయి అలా దు:ఖిస్తున్నావు ఎందుకు? ఎన్నాళ్ల తరువాతనో గంగానదీని దర్శించు కున్న నాకు, సంతోషము కలుగవలసింది పోయి నిన్ను చూచి దు:ఖము కలుగుతూ ఉంది. నీవు ఏడ్చి నన్ను కూడా ఏడిపిస్తున్నావు. ఓహో! అదా సంగతి. ఎల్లప్పుడూ రాముని విడిచి ఉండని నీవు ఒక్కరోజు రాముని విడిచి ఉండేసరికి బెంగ పెట్టుకున్నావా! మీ అన్నాదమ్ముల అనుబంధం అటువంటిది. నేనుచూడు. నాకూ రాముడు అంటే ప్రాణం. నేను రాముని నా ప్రాణం కంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను. కాని ఒక్కరోజు వియోగానికే నేను నీమాదిరి ఏడవడం లేదు కదా! ఊరుకో లక్ష్మణా! మరీ అంత ధైర్యం లేకపోతే ఎలా!  ఇంత బేలతనం పనికిరాదు." అంది సీత నవ్వుతూ లక్ష్మణునితో.

లక్ష్మణుడు ఏమీ జవాబు చెప్పలేదు. ముఖం తుడుచుకున్నాడు.

"అది సరే. ముందు మనం గంగానదిని దాటి ఆవల ఒడ్డుకు చేరుకుందాము. అక్కడే ముని ఆశ్రమములు అన్నీ ఉన్నాయి. మనం తొందరగా అక్కడికి చేరుకొని ముని పత్నులకు నేను తెచ్చిన ఆభరణములు వస్త్రములు బహూకరిస్తాను. అక్కడ ఈ రాత్రికి ఉండి రేపు

పొద్దుటే బయలుదేరి  అయోధ్యకు వెళ్లుదాము. నీ దు:ఖము చూస్తుంటే నాకు కూడా ఎప్పుడెప్పుడు రాముని చూద్దామా అని ఆతురతగా ఉంది. వచ్చిన పని ముగించుకొని త్వరత్వరగా అయోధ్యకు వెళుదాము. నన్ను విడిచి రాముడు ఒక్క క్షణం కూడా ఉండలేడు." అంది సీత.

సీత మాటలు వింటుంటే లక్ష్మణునికి దు:ఖముపొర్లుకొస్తూ ఉంది. కాని ఆపుకుంటు న్నాడు.  గంగానదిఒడ్డున ఉన్న పడవ వారిని పిలిచాడు. వారు వెంటనే ఒక పడవను సిద్ధం చేసారు. సీత, లక్ష్మణుడు ఆ పడవలోకి ఎక్కారు. సీత, లక్ష్మణుడు ఎక్కిన ఆ పడవ గంగానది ఆవల ఒడ్డుకు చేరుకుంది.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభై ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

నలభై ఏడవ సర్గ.

పడవ వాడు తీసుకొచ్చిన పడవలో ముందు సీతమ్మను ఎక్కించి తరువాత తాను ఎక్కాడు లక్ష్మణుడు. సుమంత్రుని అక్కడే ఉన్నమన్నాడు. పడవను పోనిమ్మన్నాడు, పడవ గంగానది ఆవల ఒడ్డుకు చేరింది. లక్ష్మణుడు ముందు తాను దిగి తరువాత సీతమ్మను దింపాడు. తరువాత చేతులు జోడించి, కళ్లవెంట నీళ్లు ధారాపాతంగా కారుతూ

ఉంటే, వెక్కి వెక్కి ఏడుస్తూ, సీతమ్మతో ఇలా అన్నాడు.

"అమ్మా! సీతమ్మ తల్లీ! రాముడు ఈ రోజు నన్ను లోకనిందకు గురి చేసాడమ్మా! చేయకూడని పని నాతో చేయిస్తున్నాడు. ఈ పని నా జీవితాంతము నా హృదయంలో శూలంలా గుచ్చుకుంటూ నిరంతరము బాధకు గురిచేస్తూ ఉంటుంది. ఇంతకన్నా నాకు మరణము దానికి సమానమైనది కానీ అంతకన్నా పెద్దది కానీ శిక్ష విధించి ఉంటే సంతోషంగా అనుభవించి ఉండేవాడిని. అమ్మా! నేనేమీ తప్పు చేయడం లేదు. ఈ తప్పు, ఈ పాపం నాది కాదు.నన్ను క్షమించు." అని సీత కాళ్ల మీద పడ్డాడు లక్ష్మణుడు. సీతకు ఏమీ అర్థం కావడం లేదు. లక్ష్మణుడు ఎందుకు ఏడుస్తున్నాడు.

సీత ఆలోచనలో పడింది. "ఇప్పుడు ఏం జరిగింది. నిన్న తనే కదా రాముని ఋషి ఆశ్రమములకు తీసుకు వెళ్లమని అడిగింది. రాముడు సరే అన్నాడు. ఈ రోజు లక్ష్మణుని తోడు ఇచ్చి గంగానదీ తీరానికి పంపాడు. ఇందులో లక్ష్మణుడు దు:ఖించవలసిన అవసరం ఏమొచ్చింది. ఏమిటో ఏమీ అర్థం కావడం లేదు." అని తనలో తాను తర్కించుకుంటూ లక్ష్మణుని చూచి ఇలా అడిగింది.

"లక్ష్మణా! నాకు ఏమీ అర్థం కావడం లేదు. అసలు ఏం జరిగింది? నీ దు:ఖానికి కారణం ఏమి?నీకు ఆరోగ్యం సరిగా లేదు! అయోధ్యాధిపతి రాముడు ఆరోగ్యంగా ఉన్నాడా? రాజుకు క్షేమమే కదా! అన్ని సక్రమంగా ఉంటే నీవు ఎందుకు దు:ఖిస్తున్నావో అర్థం కావడం లేదు.

మహారాజు మీద ఒట్టుపెట్టి అడుగుతున్నాను. ఏంజరిగిందో నిజం చెప్పు అయోధ్యాధిపతి రాముని భార్యగా ఆజ్ఞాపిస్తున్నాను.!" అని అడిగింది సీత.

లక్ష్మణుడిని నోటి నుండి మాట పెగలడం లేదు. గొంతు పూడుకుపోతోంది. ఏదోవిధం మాట పెగుల్చుకొని ఇలా అన్నాడు. "అమ్మా! సీతమ్మ తల్లీ! ఈ మాటలు చెప్పడానికి నాకు నోరు రావడంలేదు. అయోధ్యానగరంలోనూ, పట్టణాలలోనూ, పల్లెలలోనూ ఒక అపవాదు వ్యాపించిందట! ఆ లోకోపవాదం గురించి మంత్రి పరిషత్తులో ప్రస్తావన వచ్చిందట. ఆ అపవాదును పోగొట్టుకోడానికి నిన్ను అడవిలో వదిలి రమ్మన్నాడు రాముడు. ఆ అపవాదు ఏమిటో నేను నా నోటితో చెప్పలేను. అంత పాపం చేయలేను. లోకోపవాదుకు భయపడి రాముడు నిన్ను విడిచిపెట్టినాడు. అయినా గంగానదీ తీరమున ఉన్న ఋషి ఆశ్రమములు చూడవలెనని నీవు స్వయంగా కోరుకున్నావట కదా! అందుకే నిన్ను గంగానదీ తీరంలో విడిచిరమ్మన్నాడు. నేను కేవలం రాజాజ్ఞను అమలు చేస్తున్నాను. ఇంతకన్నా మరణమే శరణ్యముఅని అనుకుంటున్నాను. " అని అన్నాడు లక్ష్మణుడు.

ఆ మాటలు విన్న సీత ఒక్కసారి కొయ్యబారి పోయింది. తన సౌభాగ్యము అంతా గంగలో కలిసిపోయిందేమో అని అనుకొంది. సీతకు నోటమాట రాలేదు. ఇంతలో లక్ష్మణుడు సీతతో ఇలా అన్నాడు. "అమ్మ! ఇదే గంగా నదీ తీరము. అవిగో ఆ కనపడేవే ఋషి ఆశ్రమములు. మా తండ్రి, నీకు మామగారు అయిన దశరథ మహారాజుకు పరమ మిత్రుడు, తపోధనుడు మహాఋషి అయిన వాల్మీకి మహర్షి ఆశ్రమము ఇక్కడకు

దగ్గరలోనే ఉంది. నీవు ఆయన ఆశ్రమములో తలదాచుకోవచ్చును. ఆ మహాత్ముని పాదముల దగ్గర ధర్మాచరణము చేస్తూ, నీ భర్త రాముని నిత్యం తలచుకుంటూ, పతివ్రతా ధర్మమును పాటిస్తూ నీవు సుఖంగా కాలం గడపవచ్చును. అదే ప్రస్తుతము శ్రేయస్కరమైన మార్గము." అని అన్నాడు లక్ష్మణుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నలభై ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## నలభై ఎనిమిదవ సర్గ.

లక్ష్మణుడు తన దారిన తాను చెప్పకు పోతున్నాడు. ఇంతలో ఆ మాటలు భరించలేక వివశురాలైన సీత స్పృహ తప్పి నేలమీద పడిపోయింది. లక్ష్మణుడు ఆమె ముఖమున గంగాజలమును చిలకరించి ఆమె సేద తీర్చాడు. నీళ్లు నిండిన కళ్లతో సీత లక్ష్మణుని చూచి గద్గద స్వరంతో దీనంగా ఇలా అంది.

"లక్ష్మణా! నేను కేవలం కష్టాలు దు:ఖాలు అనుభవించడానికే పుట్టినట్టున్నాను. బ్రహ్మదేవుడు నా ముఖాన కష్టాలు అనుభవించమని రాసినట్టున్నాడు. పద్నాలుగేళ్ల వనవాసం తరువాత మరలా ఈ శాశ్వత వనవాసం ఏమిటి? నేను ఏం తప్పుచేసానని నాకు ఈ శిక్ష? రాముని

తప్ప మరొకరిని తలవని నేను ఏం నేరం చేసానని నాకీ శిక్ష? నేను పూర్వజన్మలో ఎవరికి భార్యను దూరం చేసానో ఈ జన్మలో భర్తకు దూరం అవుతున్నాను. లక్ష్మణా! నీకు తెలుసుకదా! వనవాస కాలంలో నేను రాముని ఆశ్రయించుకొని ఆశ్రమములలో ఉంటూ ఎలా కాలం గడిపింది. 14 ఏళ్లపాటు బంధువులకు దూరంగా ఉన్నాను. మరలా ఇప్పుడు కూడా అందరికీ తుదకు భర్తకు కూడా దూరం అయ్యాను. నా భర్తే నన్ను విడిచిపెడితే, ప్రజలను రక్షించవలసిన రాజే అడవులకు పొమ్మంటే, నా కష్టాల గురించి ఎవరికి చెప్పకోవాలి.

లక్ష్మణా! నీవు చెప్పినట్టు నేను వాల్మీకి ఆశ్రమానికి వెళుతాను. అమ్మా! ఏం తప్పుచేసావని నిన్ను నీ భర్త అయిన రాముడు అడవులకు పంపాడు అని అడిగితే ఏమని సమాధానం చెప్పాలి? నేను ఏమి తప్పుచేసానని వారితో చెప్పాలి? పోనీ ఈ కష్టాలు భరించడం కన్నా గంగలో దూకి ప్రాణత్యాగం చేద్దామంటే, నా కడుపులో పెరుగుతున్న రాముని వంశాంకురం నన్ను ఆ పని చెయ్యనివ్వదు. నాకు ఈ బాధలు, కష్టాలు భరిస్తూ మరణించేదాకా జీవించడం తప్ప మరోమార్గం లేదు.

లక్ష్మణా! నా గురించి నీవు దు:ఖించకు. ఇందులో నీ తప్పుఏమీ లేదు. నీవు రాజాజ్ఞను అమలుపరిచావు. నేను చెప్పే మాటలు యధాతథంగా, మా అత్తగార్లకు, మహారాజుకుచెప్పు. నేను రెండు చేతులు జోడించి నాముగ్గురు అత్తలకు ఏ మాత్రం బేధభావం లేకుండా నమస్కరించానని చెప్పు. రాజుగారి క్షేమమును అడిగినట్టు చెప్పు. రాముడితో నా మాటగా ఈ విధంగా చెప్పు.

“రామా! నా గురించి, నాపాతివ్రత్యము గురించి, నా మనస్సు పరిశుద్ధమైనది అని నీకు తెలుసు. నేను సర్వకాలసర్వావస్థలలోనూ నీ క్షేమము కోరుకుంటాను అని కూడా నీకు తెలుసు. కేవలం ప్రజలు నా గురించి ఏదో అనుకున్నారని విని, నా మీద, నీ మీద పడ్డ అపవాదుకు భయపడి నన్ను అడవులలో విడిచిపెట్టావు. నీ మీద పడ్డ అపవాదు తొలగి పోవాలంటే నీవు నన్ను విడిచిపెట్టడమే మేలైన మార్గము. అదే నీవు చేసావు. భర్త మీద పడ్డ అపవాదు తొలగించడం భార్యగా అది నా బాధ్యత.

రాజా! ఇంక నా గురించి ఏ మాత్రం దిగులు పడవద్దు. నీ ప్రజలను, నీ తమ్ములను కన్నబిడ్డలవలె చూచుకో. ప్రజలను స్వంత బిడ్డలవలె చూచుకొనడం రాజు యొక్క పరమధర్మము. అది నీవు నిర్వర్తించు. నేను నా గురించి విచారించడం లేదు. నీ మీద పడ్డ అపవాదును తొలగించ డానికి నీకు దూరంగా ఉండటానికి నిర్ణయించుకున్నాను. ఎందుకంటే భార్యకు భర్తయే తల్లి, తండ్రి, గురువు, దైవము. భర్తకు ఇష్టమైన, మేలు చేకూర్చే పనులు చేయడమే భార్యకు ఉత్తమమైన ధర్మము. ఆ ధర్మాచరణములో నా ప్రాణాలు పోయినా నేను లెక్కచెయ్యను. నాకు నా భర్త క్షేమమే ముఖ్యము.

లక్ష్మణా! మరొక్క మాట. నేను ఇప్పుడు గర్భవతిని. నీవు నన్ను అడవులలో విడిచివెళ్లినప్పుడు నేను గర్భవతిని అన్న విషయం గుర్తుపెట్టుకో. మరొక అపవాదుకు తావు ఇవ్వకుండా చూడు.” అని పలికింది సీత.

సీత చెబుతున్న మాటలు వింటున్నంతసేపూ లక్ష్మణునికి దు:ఖం ఆగడం లేదు. దీనంగా సీత వంక చూస్తున్నాడు. లక్ష్మణునికి నోటమాట రావడం లేదు. కళ్లనీళ్లు కారుస్తూనే సీత చుట్టు తిరిగి ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించాడు. తరువాత లక్ష్మణుడు సీతతో ఇలా అన్నాడు. “అమ్మా!మీరు ఇప్పుడు ఏమన్నారు. మీరు గర్భవతిని అన్న విషయం చూడమన్నారు కదా! అమ్మా! నేను ఇంతవరకూ మీ వంక కన్నెత్తి కూడా చూడలేదు. కేవలం మీ పాదాలు మాత్రమే చూచాను. రాముడు పక్కన ఉండగానే మీ వంక చూడని వాడిని, రాముడు పక్కన లేనపుడు మీ వంక ఎలా చూడగలను.” అని అన్నాడు.

ఇంక ఏమీ మాట్లాడలేక లక్ష్మణుడు మౌనంగా వెళ్లి పడవ ఎక్కాడు. ఆ పడవ లక్ష్మణుని గంగానది ఆవలి ఒడ్డుకు తీసుకొని వెళ్లింది. పడవ గంగానదిని దాటుతున్నంతసేపూ లక్ష్మణుడు సీత వంక తిరిగి ఆమెను చూస్తూనే ఉన్నాడు. సీత కూడా పడవలో వెళుతున్న లక్ష్మణుని వంక కన్నీటితో చూస్తూనే ఉంది. లక్ష్మణుడు గంగానదిని దాటాడు. పడవ కనపడుతున్నంత సేపూ సీత లక్ష్మణుడి వెళుతున్న వంక చూస్తూనే ఉంది. లక్ష్మణుడు గంగ ఆవల ఒడ్డుకు చేరుకున్నాడు.

సీతకు దిక్కుతోచడం లేదు. మనసంతా దు:ఖంతో నిండిపోయింది. భర్తకు దూరం అయింది. నా అన్నవాళ్లు కనుచూపుమేరలో లేరు. ఒంటరి తనం. ఏమి చెయ్యాలో తోచని స్థితి. కడుపులో దు:ఖం, ఏడుపు రూపంలో పైకి తన్నుకొచ్చింది. పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది సీత. సీత ఏడుస్తున్న ఏడుపుకు ఆ అడవిలో

ఉన్న జంతువులు, నెమళ్లు, కూడా కన్నీరు కార్చాయి.

శ్రీమద్రామాయణం
ఉత్తరకాండము నలభై ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## నలభై తొమ్మిదవ సర్గ.

అదే సమయంలో వాల్మీకి మహర్షి శిష్యులు సమిధల కోసరం ఆ పరిసర ప్రాంతాలలో తిరుగుతున్నారు. వారికి సీత ఏడుపు వినిపించింది. వారికి భయం పుట్టింది. వెంటనే పరుగెత్తుకుంటూ వెళ్లి ఆ విషయం వాల్మీకికి చెప్పారు. "గురుదేవా! ఎవరో స్త్రీ అడవిలో ఒక చెట్టు కింద కూర్చుని బిగ్గరగా ఏడుస్తూ ఉంది. ఆమెను మేము ఇదివరకు ఎప్పుడూ చూడలేదు ఆమె చూడటానికి మహాలక్ష్మిలాగా ఉంది. ఆమె ఏదో గొప్ప దు:ఖంలో ఉన్నట్టు ఉంది. ఆమెకు ఎవరూ లేనట్టు ఉంది. చుట్టుపక్కల ఎవరూ కనపడలేదు.. ఒంటరిగా ఉంది. మాకు చూడా ఆమె మానవ కాంత లాగా కనపడలేదు. ఎవరో దేవకాంత అయి ఉండవచ్చు. ఆమె మన ఆశ్రమ సమీపమున కూర్చుని దు:ఖిస్తూ ఉందంటే మన రక్షణ కోరుతోంది అని అర్థం అవుతోంది. కాబట్టి తమరు వెంటనే రావాలి." అని గబగబా చెప్పారు.

శిష్యుల మాటలు విన్న వాల్మీకి కళ్లుమూసుకున్నాడు. దివ్యదృష్టితో జరిగింది తెలుసుకున్నాడు. వెంటనే తన శిష్యులను వెంటబెట్టుకొని సీత ఉన్న చోటికి వెళ్లాడు. గంగానదీ తీరంలో ఒంటరిగా కూర్చుని దు:ఖిస్తున్న సీతను చూచాడు వాల్మీకి. ఆమెను చూచి ఇలా అన్నాడు. "అమ్మా! నీవు ఎవరో నాకు తెలుసు. నీవు అయోధ్యాధిపతి అయిన దశరథమహారాజు కోడలివి. జనకమహారాజు కూతురివి. రాముని భార్యవు. సీతవు. నీకు ఇదే స్వాగతము. నీవు ఇక్కడకు ఎందుకు వచ్చావో ఏ కారణం చేత వచ్చావో నేను నా తపోబలంతో తెలుసుకున్నాను. నాకు సమస్తమూ అవగతమయింది. నీవు ఏ పాపమూ చెయ్యలేదు. నీవు పునీతవు. నీవు నా ఆశ్రమంలో ఉండవచ్చును. నీకు ఎలాంటి భయం లేదు. నా ఆశ్రమంలో కొంత మంది స్త్రీలు తపోవృత్తిలో ఉన్నారు. వారు నిన్ను సంరక్షిస్తూ ఉంటారు. అమ్మా సీతా! నీవు మా స్వాగత సత్కారములు స్వీకరించి నీ పుట్టినింటికి వచ్చినట్టు మా ఆశ్రమమునకు రా! నన్ను నీ తండ్రి జనకమహారాజుగానే భావించు."అని అన్నాడు వాల్మీకి.

వాల్మీకి చెప్పిన మాటలు విన్న సీత ఆయనకు రెండు చేతులు జోడించి భక్తితో ఆయన పాదాలకు నమస్కరించింది. "తండ్రీ! మీరు చెప్పినట్టే చేస్తాను" అని పలికింది. ముందు వాల్మీకి నడుస్తుంటే, ఆయన వెనక సీత, సీత వెనక శిష్యులు నడుచుకుంటూ వెళ్లారు. అందరూ వాల్మీకి ఆశ్రమం చేరుకున్నారు. ఆశ్రమంలో ఉన్న ముని కాంతలు సీతను చూచి ఆమెను ఆప్యాయంగా పలకరించారు. వాల్మీకి ఆ ముని కాంతలతో ఇలా అన్నాడు. "ఈమె దశరథుని కోడలు. జనకుని కుమార్తె. అయోధ్యాధి పతి రాముని భార్య సీత. ఉత్తమురాలు. మహా పతివ్రత. ఏ పాపమూ ఎరుగని

ఈమెను ఈమె భర్త లోకాపవాదమునకు భయపడి ఇక్కడ వదిలి పెట్టాడు. ఈమెను మన ఆశ్రమానికి తీసుకొని వచ్చాను. ఇంక ఈమె ఇక్కడే ఉంటుంది. మీరు ఆమెను కంటికి రెప్పలా కాపాడాలి. ఈమె రాజకుమార్తె. చక్రవర్తి భార్య. ఈమె గౌరవమునకు ఏ లోటూ రాకుండా చూచుకోండి.” అని పలికాడు వాల్మీకి. సీతను ముని కాంతలకు అప్పగించి వాల్మీకి తన శిష్యులతో సహా ఆశ్రమమునకు  వచ్చాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నలభై తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

ఏబదియవ సర్గ.

పడవ ఎక్కి గంగానదిని దాటిన లక్ష్మణుడు అక్కడే నిలబడ్డాడు. సీత ఏమి చేస్తుంది. సీత దగ్గరకు ఎవరు వస్తారు అని చూస్తున్నాడు. సీత దగ్గరకు మునికుమారులు రావడం, వారు వెళ్లడం, తరువాత వాల్మీకి మహర్షి రావడం, వారి వెంట సీత వెళ్లడం చూచి లక్ష్మణుని మనసు కుదుట పడింది. లక్ష్మణుడురథం ఎక్కాడు. అయోధ్యకు పోనిమ్మన్నాడు. రథం అయోధ్య వైపు సాగి పోయింది.  రథములో కూర్చున్న లక్ష్మణుడు సారథి సుమంత్రుని చూచి ఇలాఅన్నాడు.

"సుమంత్రా! సీత వాల్మీకి ఆశ్రమం చేరుకుంది. రాముడు అయోధ్యలో ఉన్నాడు. సీతా వియోగం రామునికి ఎంత బాధాకరమో కదా! ఏ పాపమూ ఎరుగని భార్యను విడిచిన రామునికి ఇంతకంటే దు:ఖము వేరే ఉంటుందా! రామునికి ఈ భార్యావియోగము కేవలం దైవఘటన కాక మరేముంటుంది. వనవాసకాలములో మాయామృగము, ఇప్పుడు ఈ అపవాదు, సీతావియోగమునకు కారణం అయింది. రావణుని సంహరించిన రాముడు దైవఘటనకు బద్ధుడు కాక తప్పలేదు. తండ్రి మాట విని అరణ్యమునకు వెళ్లినప్పుడు కూడా సీత భర్తను విడిచి ఉండలేక వనవాస క్లేశమును అనుభవించింది. కాని ఇప్పుడు ఒంటరిగా వనవాసము చేస్తూ ఉంది. కాని రాముడు చేసిన పనిమంచిది కాదు. ఎవరో ఏమో అన్నారని కట్టుకున్న భార్యను అడవులకుపంపడం దారుణం. పౌరులు వేసిన అపవాదుకు సీతను శిక్షించడం ధర్మం కాదు కదా! సీత గురించి అపవాదులు వేసిన పౌరులు బాగానే ఉన్నారు. రాముడు అంత:పురములో ఉన్నాడు. ఏ పాపమూ ఎరుగని సీత వనవాసము చేస్తూ ఉంది. ఇది ధర్మమా!" అని అడుగుతున్న లక్ష్మణుడికి సుమంత్రుడు ఇలా అన్నాడు.

"లక్ష్మణా! మనము సీత విషయమున బాధపడవలసిన పని లేదు. ఆమె వాల్మీకి ఆశ్రమములో సురక్షితముగా ఉండగలదు. ఈ విషయం గురించి పూర్వము బ్రాహ్మణులు నీ తండ్రితో చెపుతుంటే నేను విన్నాను. రాముడి జాతకంలో దు:ఖములు, కష్టములు రాసి పెట్టి ఉన్నాయట. రామునికి తనకు కావాల్సిన వాళ్లు దూరం అవుతారట. ఇప్పుడు సీతను విడిచి పెట్టాడు. కొంత కాలము తరువాత రాముడు నిన్ను, భరత

శత్రుఘ్నులను కూడా విడిచి పెడతాడట. అదంతా ఆ బ్రాహ్మణుడు మీ తండ్రి గారితో చెబుతుంటే నేను విన్నాను.

లక్ష్మణా! అంతేకాదు, ఒకసారి దుర్వాస మహాముని వద్దకు మీ తండ్రి గారి వద్దకు వెళ్లాడు. అప్పుడే నేను కూడా అక్కడే ఉన్నాను. దుర్వాసుడు మీ తండ్రి గారితోనూ, మీ కులగురువు వసిష్ఠుల వారితోనూ చెప్పిన మాటలు నేను విన్నాను. ఆ మాటలు నేను విన్నాను అని తెలిసి మీ తండ్రి దశరథుడు ఆ మాటలు నేను ఎక్కడా ఎవరితోనూ చెప్పకూడదని నాతో ఒట్టు వేయించుకున్నాడు.  అందుకని, ఆమాటలు నేను ఎవరితోనూ ఎక్కడా చెప్పకూడదు.  కానీ ఇప్పుడు దశరథుడు లేడు. ఆ ఒట్టుకు విలువలేదు. నీకు వినవలెనని కుతూహలము ఉంటే ఆ మాటలు నేను చెబుతాను. శ్రద్ధగా విను. కాని నేను నీతో ఈ విధంగా చెప్పినట్టు నీ తమ్ములు భరతునికి శత్రుఘ్నునికి చెప్పకూడదు. ఇది అంతా దైవఘటన అని సరిపెట్టుకోవాలి." అని అన్నాడు సుమంత్రుడు.

అప్పుడు లక్ష్మణుడు సుమంత్రుని చూచి "సుమంత్రా! నీవు దుర్వాసుల వలన విన్న విషయములు నాకు యధాతథంగా చెప్పు. నిజం చెప్పు." అని అన్నాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభయ్యవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## యాభైఒకటవ సర్గ.

సుమంత్రుడు తాను దుర్వాస మహాముని వద్దనుండి విన్న మాటలను  లక్ష్మణునికి చెప్పనారంభించాడు. “ఓ లక్ష్మణా! ఒక సారి, అత్రి మహార్షి కుమారుడైన దుర్వాస మహర్షి చాతుర్మాస్య వ్రతమును ఆచరించడానికి వసిష్ఠుని ఆశ్రమానికి వచ్చాడు. ఆ సమయంలో తన కుల గురువు వసిష్ఠుని చూడటానికి  దశరథుడు వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్లాడు. ఆయన వెంట నేనూ వెళ్లాను. అక్కడ ఉన్న దుర్వాసమహర్షిని చూచి మీ తండ్రి గారు భక్తితో నమస్కరించారు. వసిష్ఠుడు, దుర్వాసుడు మీతండ్రి గారిని ఆహ్వానించారు. అందరూ కూర్చుని ఇష్టాగోష్టిగా మాట్లాడుకుంటున్నారు.

ఆ సమయములో మీ తండ్రి గారు త్రికాలవేది అయిన దుర్వాసుని ఈ విధంగా అడిగాడు. “ఓ మహర్షీ! నా గురించి, నా పుత్రుల గురించి, పౌత్రుల గురించి, నా వంశము గురించి చెప్పండి. మాఇక్ష్వాకు వంశము ఎంత కాలము ఉంటుంది? నా కుమారుడు రాముడు ఎంతకాలము జీవిస్తాడు. లక్ష్మణ,భరత,శత్రుఘ్నుల ఆయు:పరిమాణము ఎంత? నాకు మనుమలు కలుగుతారా! నా మనుమల ఆయుర్దాయము ఎంత? రామునికి ఎంతమంది కుమారులు కలుగుతారు? మా వంశము యొక్క భవిష్యత్తు గురించి దయచేసి నాకు తెలుపండి.” అని వినయంగా అడిగాడు దశరథుడు.

దశరథుని మాటలు విన్న దుర్వాసుడు కొంచెంసేపు ఆలోచించి ఇలా అన్నాడు. "ఓ దశరథ మహారాజా! నీకు ఒక పూర్వ వృత్తాంతమును చెబుతాను విను. పూర్వము దేవతలకు అసురులకు యుద్ధం జరిగింది. అసురులు ఓడిపోయారు. వారందరూ భృగు మహర్షి భార్య వద్దకు పోయి ఆమె శరణు కోరారు. ఆమె వారికి ఆశ్రయం ఇచ్చింది. వాళ్లు దేవతల నుండి ఏ మాత్రము భయం లేకుండా భృగు మహర్షి ఆశ్రమంలో ఆయన భార్య ఆశ్రయంలో ఉన్నారు. ఈ సంగతి విష్ణువుకు తెలిసింది. ఆయన కోపం ప్రజ్వరిల్లింది. వెంటనే విష్ణువు, తన చక్రాయుధంతో, అసురులకు ఆశ్రయం ఇచ్చిన భృగు మహర్షి భార్య తలను, నరికివేసాడు. తన భార్య తలను విష్ణువు తన చక్రాయుధంతో నరకడం కళ్లారా చూచిన భృగువు విష్ణువును శపించాడు. "నీవు నా భార్యను చంపి నాకు భార్యావియోగము కలిగించావు. నీవు కూడా భూలోకంలో పుట్టి చాలాకాలము భార్యను పోగొట్టుకొని భార్యవియోగమును అనుభవిస్తావు." అని శపించాడు.

భార్యను చంపాడు అన్న కోపంలో విష్ణువుకు శాపం ఇచ్చాడే కానీ తరువాత పశ్చాత్తాప బడ్డాడు భృగు. తరువాత విష్ణువును పూజించాడు. భృగువు పూజకు మెచ్చిన విష్ణువు "ఓ భృగు మహర్షీ! నీవు నాకు శాపం ఇచ్చాను అని దిగులు చెందకు. రాబోయే అవతారంలో లోక కల్యాణము కొరకు అది నాకు వరంగా పరిణమిస్తుంది." అని అన్నాడు. ఓ దశరథ మహారాజా! ఆ ప్రకారంగా భృగు చేత శపించ బడ్డ విష్ణువు నీకు కుమారుడిగా జన్మించాడు. రామునికి భార్యావియోగం తరచు సంభవిస్తుంది. అది తప్పదు. రాముడు చాలా కాలము అయోధ్యను

పాలిస్తాడు. రాముడు అయోధ్యను 11,000 సంవత్సరములు పాలించి తరువాత బ్రహ్మలోకం చేరుకుంటాడు. తన జీవిత కాలంలో రాముడు ఎన్నో యజ్ఞములను, యాగములను చేస్తాడు. అశ్వమేధ యాగములను చేస్తాడు. రాముడికి సీత యందు ఇద్దరు కుమారులు జన్మిస్తారు." అని చెప్పాడు దుర్వాసుడు. తన భవిష్యత్తు, తన కుమారుల భవిష్యత్తు తెలుసుకున్న మీ తండ్రి దశరథుడు తరువాత అయోధ్యకు తిరిగి వచ్చాడు. దుర్వాసుడు నీ తండ్రి దశరథునితో చెప్పిన మాటలను నేను విన్నాను. ఆ మాటలే నీకు చెప్పాను. కాబట్టి రాముని విషయంలో కానీ సీత విషయంలో కానీ మనము దు:ఖించనవసరం లేదు." అని సుమంత్రుడు చెప్పాడు.

ఆ మాటలు విన్న లక్ష్మణుడు మనసుకుదుట పరచుకున్నాడు. అప్పటికి సాయంత్రం అయింది. లక్ష్మణుడు సుమంత్రుడు కేశినీ నదీ తీరంలో ఆ రాత్రికి విశ్రాంతి తీసుకున్నారు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము యాభైఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## యాభైరెండవ సర్గ.

ఆ రాత్రికి కేశినీ నదీ తీరంలో నిద్రించిన లక్ష్మణుడు, సుమంత్రుడు మరునాడు ఉదయమే ప్రయాణమై మధ్యాహ్న సమయానికి అయోధ్యకు చేరుకున్నారు. లక్ష్మణుడు రాముని అంత:పురమునకు వెళ్లాడు. “ఇప్పుడు రామునికి నేను ఏమని చెప్పాలి?” అని మధన పడసాగాడు. రాముడు ఒక ఆసనము మీద కూర్చుని ఉన్నాడు. లక్ష్మణుడు తలవంచుకొని రాముని ఎదురుగా నిలబడ్డాడు. రాముని పాదాల మీద పడ్డాడు. రామునితో ఇలా అన్నాడు. “మహారాజా! నీ ఆజ్ఞ ప్రకారము నేను సీతను గంగానదీ తీరప్రాంతమున ఉన్న వాల్మీకి ఆశ్రమము దగ్గర విడిచి వచ్చాను. రామా! సీతను విడిచిపెట్టినందుకు దు:ఖపడవద్దు. అంతా దైవనిర్ణయం. విధివిధానము. మన చేతిలో ఏమీ లేదు. మనము నిమిత్తమాత్రులము. ఎంత ధనము కూడబెట్టినా అది ఒక నాటికి కరిగిపోతుంది. అలాగే ఎంత ఉన్నత స్థితికి చేరుకున్నా, ఆఖరుకు పతనం తప్పదు. భార్య భర్తలు ఎంత అన్యోన్యంగా ఉన్నా, మరణ కాలంలో ఒకరిని ఒకరు విడిచి పోక తప్పదు కదా! కాబట్టి భార్య, పుత్రులు, బంధువులు, స్నేహితుల విషయంలో అధిక మోహము, అధిక ప్రేమ చూపకూడదు. జీవితం అన్న తరువాత  సంయోగ వియోగాలు తప్పవు కదా!

కాబట్టి! రామా! నీ మనసును కుదుట పరచుకో. సీతా వియోగమునకు చింతించకు. సీత దు:ఖంలో పడి రాజ్యపాలన విస్మరించకు.  నీ వంటి మహాపురుషులు కేవలం భార్య దూరం

అయిందని వ్యధ చెందరు. ధైర్యాన్ని కోల్పోరు. రామా! నీవు ఈ ప్రకారంగా నీ భార్యను తలచుకుంటూ, దు:ఖిస్తూ, రాచ కార్యములను నిర్లక్ష్యం చేస్తే, నీకు మరొక అపవాదు చుట్టుకుంటుంది. భార్యామోహంలో పడి రాచకార్యములను విస్మరించాడు అన్న అపవాదు వస్తుంది. ఒక అపవాదుకు తోడు మరొక అపవాదును భరించాలి. కాబట్టి మనసులో దు:ఖము ఉన్నా దానిని మనసులోనే అణుచుకోవాలి. బయట పడకూడదు." అని రాముడికి హితబోధ చేసాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలు విన్న రాముడు ఎంతో సంతోషించాడు. "లక్ష్మణా! నీవు చెప్పినది అక్షర సత్యము. తాత్కాలికమైన మోహంలో పడ్డాను. నీవు నాకు కర్తవ్యబోధ చేసావు. రాజుగా నా కర్తవ్యమును నేను సమర్థవంతంగా నిర్వర్తిస్తాను. నాలోని శోకమును వదిలిపెట్టాను. నీ మాటలు నాకు మార్గదర్శకమైనాయి." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము యాభైరెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము
## యాభైమూడవ సర్గ.

రాముడు లక్ష్మణునితో ఇంకా ఇలా అన్నాడు. "నీవు నాకు తమ్ముడివే కాదు.స్నేహితుడివి కూడా. నీవంటి స్నేహితుడు లభించడం

చాలా కష్టం. నా మనసులో ఉన్న మాట చెబుతున్నాను విను. సీతను అడవులకు పంపిన తరువాత ఈ నాలుగురోజులు నేను సీతా వియోగ బాధతో రాచ కార్యములు చూడలేదు. రాజ సభకు వెళ్లలేదు. నీ మాటలు విన్న తరువాత నేను ఎంత తప్పుచేసానో అని బాధపడుతున్నాను. వ్యక్తిగతంగా ఎన్ని బాధలు ఉన్నా, రాజకార్యములు మానడం క్షమించరాని నేరం అని నా మనసు ఘోషిస్తూ ఉంది. లక్ష్మణా! నేను ఈ రోజు నుండి రాజ సభకు వస్తున్నానని మంత్రులకు చెప్పు. రాజ పురోహితుని, మంత్రులను వెంటనే పిలిపించు. ప్రతి దినము పౌరుల కార్యములు వారి బాగోగులు చూడని రాజు నరకానికి పోతాడు." అని అన్నాడు రాముడు.

(5 సంవత్సరాలు ప్రజాసేవ చేస్తానని ఓట్లు వేయించుకొని గెలిచిన ప్రజాప్రతినిధులు, ప్రజలకు సంబంధించిన కార్యక్రమములు చిత్తశుద్ధితో నిర్వహిస్తామని ప్రమాణం చేసిన మంత్రులు, తమ తమ విధులను మరిచి ప్రజల ముఖం చూడకుండా, అసెంబ్లీ, పార్లమెంటు ముఖం చూడకుండా, ఒక వేళ వచ్చినా నిద్రపోతూ, తమ తమ స్వంత వ్యాపారాలు చేసుకుంటూ, అక్రమార్జనలో మునిగితేలుతూ, ప్రజలను ప్రజాసేవను మరిచిపోయే ప్రజాప్రతినిధులకు, మంత్రులకు, రాముడి మాటలు ఒక గుణపాఠం. వ్యక్తిగతంగా ఎన్ని బాధలు కష్టాలుఉన్నా, రాజకార్యాలు మానకూడదు అన్న సూత్రానికి కట్టుబడినదే రామరాజ్యం. రామరాజ్యం తెస్తామని రంకెలు వేస్తున్న నేటి ప్రజాప్రతినిధులు, కార్యాలయాలలో పనిచేస్తున్న ఉన్నత అధికారులు, ఆఫీసర్లు, ఉద్యోగులు ఆచరించవలసిన విధి, కర్తవ్యము.).

రాముడు లక్ష్మణునితో ఇంకా ఇలా అన్నాడు. "లక్ష్మణా! పూర్వము నృగుడు అనే మహారాజు ఉండేవాడు. అతను ప్రజలను చక్కగా పాలించేవాడు. బ్రాహ్మణులను గౌరవించేవాడు. ధార్మికుడు. ఎట్టి విపత్కర పరిస్థితులలో కూడా అసత్యము పలికేవాడు కాదు. అతడు పర్వ దినములలో గోవులను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చేవాడు. ఒకసారి ఒక బ్రాహ్మణునికి చెందిన ఆవు, దూడతో సహా మేత మెయ్యడానికి ఊరిబయటకు వెళ్లింది. ఆ సమయంలో రాజు గారు దానం ఇవ్వడానికి, రాజభటులు గోవులను తీసుకొని వెళుతున్నారు. ఈ బ్రాహ్మణుడికి చెందిన ఆవు, దూడ ఆ గోవులలో కలిసిపోయాయి. రాజభటులు ఆ గోవులను రాజ ప్రాసాదమునకు తీసుకొని వెళ్లారు. తన గోవు, దూడ కనపడలేదని ఈ బ్రాహ్మణుడు ఊరూ వాడా వెదుకుతున్నాడు.

మరునాడు పర్వదినం కావడం వలన, నృగమహారాజు బ్రాహ్మణులకు యధావిధిగా గోవులను దానం చేసాడు. బ్రాహ్మణునికి చెందిన ఆవును, దూడను కూడా మరొక బ్రాహ్మణునికి దానం చేసాడు. దానం తీసుకున్న బ్రాహ్మణుడు తనకు ఇచ్చిన ఆవును దూడను తీసుకొని తన ఇంటికి వెళ్లాడు. తన వద్ద నుండి తప్పిపోయిన ఆవును వెతుక్కుంటూ, ఆ బ్రాహ్మణుడు దానం స్వీకరించిన బ్రాహ్మణుని ఇంటి వద్దకు వచ్చాడు. తన గోవు అక్కడ ఉన్నదని చూచాడు. ఆ గోవును "శబలా!" అని పిలిచాడు. తన అసలు యజమాని కంఠస్వరము విన్న ఆ గోవు పరుగెత్తుకుంటూ ఆ బ్రాహ్మణుని వద్దకు వచ్చింది. వెంటనే ఆ బ్రాహ్మణుడు, దానం తీసుకున్న బ్రాహ్మణునితో ఇలా అన్నాడు. "ఈ గోవు, దూడ నావి, ఇవి మీ వద్దకు ఎలా వచ్చాయి." అని అడిగాడు. "ఈ గోవును,

దూడను నాకు నృగమహారాజు దానంగా ఇచ్చాడు." అని బదులు చెప్పాడు. "నా గోవును, దూడను దానంగా ఇవ్వడానికిరాజు ఎవరు. పదండి రాజు వద్దనేతేల్చుకుందాము" అని ఆ బ్రాహ్మణులు ఇద్దరూ గోవు, దూడతో సహా రాజమందిరానికి వెళ్లారు. నృగమహారాజును చూడాలని రాజభటులకు చెప్పారు. ఎన్ని రోజులు ఉన్నా వారికి రాజుగారిని చూడటానికి అనుమతి లభించలేదు. ఆ బ్రాహ్మణులకు కోపం వచ్చింది. "ప్రజల కష్టసుఖాలు విచారించని రాజు, పనిమీద వచ్చిన ప్రజలకు దర్శనం ఇవ్వని రాజు వృధా. అందుకని  ఓ నృగు మహారాజా! నీవు తొండగా మారి, చాలా కాలము బావులలో పడి ఉండు." అని శపించారు. ఈ విషయం తెలిసిన నృగు మహారాజు వచ్చి ఆ బ్రాహ్మణుల శరణు వేడాడు. శాంతించిన ఆ బ్రాహ్మణులు శాపవిమోచన అనుగ్రహించారు. "ఓ నృగు మహారాజా! ద్వాపర యుగంలో యాదవ వంశంలో శ్రీమహావిష్ణువు,  దేవకీ వసుదేవులకు పుత్రుడుగా జన్మించగలడు. ఆయన నిన్ను ముట్టుకోగానే నీకు శాపవిమోచన కలుగుతుంది." అని అనుగ్రహించారు.

తరువాత ఆ గోవు వివాదము ఎటూ తేలక పోవడంతో, ఆ బ్రాహ్మణులు ఇద్దరూ ఆ గోవును మరొక బ్రాహ్మణునికి దానంగా ఇచ్చి వెళ్లిపోయారు. ఈ నృగుమహారాజు బ్రాహ్మణ శాపమును అనుభవిస్తున్నాడు. అందువలన లక్ష్మణా! రాజుకు ఎన్ని స్వంత పనులు ఉన్ననూ, మనసులో సుఖదు:ఖములు ఉన్ననూ, వాటిని పక్కన బెట్టి, ముందు రాచకార్యములకు ప్రాధాన్యం ఇవ్వాలి.

కాబట్టి లక్ష్మణా! ముందు నీవు పోయి న్యాయం కోసం గానీ, రాజుతో పని ఉండి గానీ వచ్చిన వారిని వెంటనే రాజసభలో ప్రవేశపెట్టమను." అని పలికాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభైమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

యాభై నాలుగవ సర్గ.

నృగు మహారాజు కథ విన్న లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "రాజా! అంత చిన్న అపరాధమునకు ఆ బ్రాహ్మణులు అంత పెద్ద శిక్ష విధించారు కదా! మరి ఆ నృగు మహారాజు ఆ బ్రాహ్మణశాపమును ఏ విధంగా అనుభవించాడు." అని అడిగాడు. రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "నృగు మహారాజు వెంటనే తన కుమారుడిని రాజ్యాభిషిక్తుని చేసాడు. రాజ్యభారాన్ని కుమారుడికి అప్పగించాడు. తాను తొండగా ఏ బావిలోనో ఉడడం కన్నా అటువంటి బావులను తనే స్వయంగా తవ్వించాడు. తాను తొండ రూపంలో అన్ని కాలాలలోనూ సుఖకరంగా ఉండటానికి తగిన గోతులు తవ్వించుకున్నాడు. వర్షాకాలంలో తడవకుండా ఉండేట్టు సౌకర్యంగా ఒక గోతిని తవ్వించాడు. చలికాలంలో వెచ్చగా ఉండేటట్టు మరొక గోతిని నిర్మాణం చేయించాడు. వేసవి కాలంలో చల్లగా ఉండేటట్టు మరొక గోతిని నిర్మాణం చేయించాడు. ఆ

గోతుల చుట్టు ఒక యోజనము దూరం వరకూ పళ్ళు పూలు సమృద్ధిగా కాచే చెట్లతో కూడిన  ఒక ఉద్యానవనమును ఏర్పాటుచేయించాడు. తాను తవ్వించిన విశాలమైన గోతుల లోపల గోడలకు సుందరమైన చిత్రములను చెక్కించాడు. ఆ గోతులలోకి సుగంధము వచ్చేటట్టు చుట్టు ఉన్న ఉద్యాన వనములో పరిమళభరితమైన పూల మొక్కలు నాటించాడు. రాజ్యాభిషిక్తుడైన పుత్రునికి తగు జాగ్రత్తలు చెప్పాడు. రాజ్య పాలనలోనూ, ప్రజల కష్టములు విచారించడంలోనూ ఏమాత్రం అలసత్వము చూపగూడదనీ, అలా చేసినందువలననే తాను శాపగ్రస్తుడను అయ్యానని చెప్పాడు.

ఇంకా తన కుమారునికి ఇలా చెప్పాడు. “కుమారా! చేసిన కర్మకు ఫలమును అనుభవించకుండా తప్పించుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. పూర్వజన్మలో గానీ ఈ జన్మలో గానీ చేసిన కర్మలకు ఫలితము అనుభవించియే తీరవలెను. కష్టములు వచ్చినపుడు దు:ఖించడం, సుఖాలు వచ్చినపుడు ఆనందపడటం రాజుకు మంచిది కాదు. కాబట్టి నాకోసము దు:ఖించకు.” అని చెప్పాడు. తరువాత తన శాపఫలమును అనుభవించడానికి తొండ రూపంతో ఆ గోతులలోకి వెళ్లిపోయాడు.

(ఇది చదివిన తరువాత మీకు ఏమి గుర్తుకు వస్తూ ఉంది. పెద్ద పెద్ద వాళ్లు ఏదో కేసులో అరెస్టు అయినపుడు వెంటనే వారికి గుండె నొప్పి వస్తుంది. హాస్పిటల్‌లో చేరి జైలు కూడు తప్పించుకుంటారు. ఇంకా కొంత మంది తమ పలుకుబడి ఉపయోగించి జైల్లోనే అన్ని సౌకర్యాలు కల్పించుకుంటారు. ఇంటిభోజనం, సెల్ ఫోన్, లాప్‌టాప్, ఫాను, ఏ.సి.ఈ

సౌకర్యాలు పొందుతారు. నృగు మహారాజు కూడా తన శాపకాలమును సుఖవంతం చేసుకున్నాడు కదా! యుగాలు మారినా మనుషులు వారి బుద్ధులు మారవు అనడానికి ఇది చక్కని ఉదాహరణ).

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభైనాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

యాభై ఐదవ సర్గ.

నృగ చక్రవర్తికి వచ్చిన శాపమును గురించి చెప్పిన రాముడు, లక్ష్మణుడికి మరొక కథ కూడా చెప్ప నారంభించాడు. లక్ష్మణుడు కూడా శ్రద్ధతో రాముడు చెప్పే కథలు వింటున్నాడు. "లక్ష్మణా! మన ఇక్ష్వాకు వంశంలో నిమి అనే మహారాజు ఉండేవాడు. ఆయన రాజధాని వైజయంతి అనే నగరము. ఆయనకు చాలాకాలము సాగే ఒక యజ్ఞము చెయ్యాలని సంకల్పము కలిగింది. దానికి తన తండ్రి ఇక్ష్వాకును ఆహ్వానించాడు. ఆ యాగమునకు ఋత్విక్కుగా బ్రహ్మర్షి వసిష్ఠుని నియమించాడు. వసిష్టునికి సహాయకులుగా అత్రిని, అంగిరసుని, భృగువును కూడా ఆహ్వానించాడు. నిమి వసిష్టుని దగ్గరకు పోయి తన యాగమునకు ఋత్విక్కుగా ఉండమని అడిగాడు. "నేను దేవేంద్రుడు చేసే యాగంలో ఉన్నాను. ఈ యాగం కాగానే నీ యాగం జరిపిస్తాను" అని అన్నాడు.

అంత ఆలస్యం భరించలేక, నిమి చక్రవర్తి, తనకు అందుబాటులో ఉన్న గౌతముని ఋత్విక్కుగా నియమించాడు. అక్కడ ఇంద్ర యజ్ఞము పూర్తి అయింది. వసిష్టుడు నిమి చేత యజ్ఞము చేయించడానికి వచ్చాడు. తన స్థానంలో గౌతముడు యజ్ఞం జరిపిస్తూ ఉండటం చూచాడు. వసిష్ఠునికి కోపం వచ్చింది. నిమి చక్రవర్తికి తాను వచ్చినట్టు వర్తమానము పంపాడు. అప్పటికే యజ్ఞకార్యములలో అలసి పోయిన నిమిచక్రవర్తి గాఢ నిద్రలో ఉన్నాడు. అందుకని వసిష్ఠుని వద్దకు వెంటనే రాలేకపోయాడు. దాంతో వసిష్ఠుని కోపం ఇంకా పెరిగిపోయింది. “ఓ రాజా! నువ్వు నన్ను అవమానించావు. నేను పిలిచినా రాకుండా జడుడి మాదిరి ఉన్నావు. కాబట్టి నీ దేహము చైతన్యము కోల్పోయి జడమై పోవుగాక!” అని శాపం పెట్టాడు.

నిమి మహారాజు మేల్కొన్న తరువాత మంత్రులు ఆయనకు వసిష్ఠుడు ఇచ్చిన శాపం గురించి తెలియజేసారు. నిమికి కూడా కోపం వచ్చింది. “నేను ప్రాణులకు సహజమైన నిద్రావస్థలో ఉన్నానని తెలిసి కూడా నన్ను దారుణంగా శపించావు. అందుకని నీ దేహం కూడా చైతన్యము కోల్పోయి జడపదార్థంగా తయారవుతుంది” అని తిరుగు శాపం ఇచ్చాడు. ఈ ప్రకారంగా వసిష్ఠుడు, నిమి ఒకరిని ఒకరు శపించుకున్నారు. ఆ శాపాల కారణంగా ఇద్దరూ తమ దేహాలు వదిలి గాలిలో సంచరిస్తున్నారు.” అని రాముడు లక్ష్మణునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## యాభై ఆరవ సర్గ.

రాముడు లక్ష్మణునితో ఇలా చెప్పసాగాడు. "లక్ష్మణా! దేహం లేకుండా బాధపడుతున్న వసిష్ట మహాముని మరొక దేహము కొరకు తన తండ్రి అయిన బ్రహ్మదేవుని వద్దకు వెళ్లాడు. " తండ్రీ! బ్రహ్మదేవా! నిమి శాపం వలన నేను నా దేహాన్ని కోల్పోయాను. వాయురూపంలో తిరుగుతున్నాను. దేహం లేకుండా నిత్య కర్మలు చేయడం సాధ్యం కాదు కదా! ప్రస్తుతము నేను ఏ పనీ చేయలేకుండా ఉన్నాను. కాబట్టి నాకు మరొక దేహము అనుగ్రహించండి." అని అడిగాడు. దానికి బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు. "కుమారా! నీవు మిత్రావరుణుల వద్దకు పోయి వారి తేజస్సులో ప్రవేశించు. " అని అన్నాడు. గాలి రూపంలో ఉన్న వసిష్ఠుడు మిత్రా వరుణుల వద్దకు వెళ్లాడు.

అక్కడ మిత్ర వరుణుల వద్ద మరొక కథ నడుస్తూ ఉంది. దేవ లోకంలో ఊర్వశి అనే అప్సరస ఉంది. ఆమెను మిత్రుడు వరించాడు. కాని ఊర్వశి మనసుమాత్రం వరుణినిక అర్పించింది. ఒక రోజు ఊర్వశి చక్కగా అలంకరించుకొని మిత్రుడు వద్దకు వెళుతూ ఉంది. మధ్యలో వరుణుడు అడ్డగించాడు. తనతో లైంగిక సంపర్కము జరపమని కోరాడు. అప్పుడు ఊర్వశి ఇలా అంది. "వరుణా! నన్ను ముందుగా మిత్రుడు పిలిచాడు. ఆయన దగ్గరకు వెళుతున్నాను. నేను అతనికి చెందిన దానను. కానీ నా మనసు మాత్రము నీ మీదనే లగ్నం అయి ఉంది. నా కోరిక కూడా నీ మీదనే. కాని ముందుగా మిత్రుడు నన్ను పిలిచాడు కాబట్టి ఈ

శరీరము మాత్రము మిత్రుడికి ఇవ్వాలి కదా. ఇప్పుడు నువ్వు కావాలి అంటే ఏం చెయ్యను." అని పలికింది ఊర్వసి.

"నేను మాత్రం ఏం చెయ్యను. నిన్ను నీ అందం చూడగానే నాకు కూడా వీర్యము పతనం అయ్యేటట్టు ఉంది. నా వీర్యమును ఒక కుండలో విడుస్తాను. నీవు నాతో కలవడానికి ఇష్టం లేకపోయినా, నా కోరిక తీర్చు." అని అన్నాడు. దానికి ఊర్వశి సంతోషంగా ఒప్పుకుంది. వరుణుడు తన వీర్యాన్ని ఒక కుండలో విడిచాడు. తరువాత ఊర్వశి మిత్రుడి వద్దకు వెళ్లింది. జరిగింది అంతా అప్పటికే మిత్రుడికి తెలిసిపోయింది. మిత్రుడు కోపంతో ఊర్వశితో ఇలా అన్నాడు. "నేను ముందుగా నిన్ను పిలిచాను కదా! దారిలో వరుణుడు కనపడగానే ఆయన వద్దకు వెళతావా! ఈ చెడ్డ పని చేయడానికి నీ మనసెలా ఒప్పింది. నిన్ను శపిస్తున్నాను. నువ్వు మానవలోకంలో పుట్టు. కాశీరాజ్యాన్ని పురూరవుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. నీవు ఆయనకు భార్యగా ఉండు." అని శపించాడు.

మిత్రుడి శాప కారణంగా ఊర్వశి కాశీరాజు పురూరవునికి భార్య అయింది. పురూరవునికి ఊర్వశికి ఒక కుమారుడు కలిగాడు. వాడి పేరు ఆయువు. ఆ ఆయువు కుమారుడు నహుషుడు. ఇంద్రుడు వృత్రాసురుని చంపిన కారణంగా ఇంద్రునికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంది. అప్పటి ఇంద్రుడిని ఆ పదవి నుండి తొలగించారు. ఆ సందర్భంలో నహుషుడు ఇంద్ర పదవికి ఎంపిక అయ్యాడు. ఆ ప్రకారంగా నహుషుడు ఇంద్రపదవిని అధిష్టించాడు. లక్ష సంవత్సరములు ఇంద్రుడిగా

ఉన్నాడు. ఊర్వశి కూడా చాలా సంవత్సరములు భూలోకములో గడిపి తన శాప కాలము పూర్తికాగానే ఇంద్రలోకము చేరుకుంది." అని రాముడు లక్ష్మణునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము యాభైఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

## ఉత్తర కాండము
## యాభై ఏడవ సర్గ.

వసిష్ఠుడు, నిమి ఒకరికి ఒకరు శపించు కున్న విషయం పక్కన పెట్టి రాముడు ఊర్వశి కథ చెప్పడంతో లక్ష్మణుడు తికమక పడ్డాడు. తనకు వశిష్టుడు, నిమిల శాపం గురించి చెప్పమని అడిగాడు. అప్పుడు రాముడు ఇలా చెప్పసాగాడు. "లక్ష్మణా! దానికే వస్తున్నా. ఇది వరకు నీకు, ఊర్వశిని చూచి వరుణుడు కామోద్రేకంతో తన వీర్యాన్ని ఒక కుండలో విడిచిపెట్టాడు అని చెప్పాను కదా! ఆ కుండలో నుండి ఇరువురు బ్రాహ్మణులు జన్మించారు. ఆ కుండలో నుండి ముందుగా అగస్త్యుడు అనే మహాఋషి జన్మించాడు. వెంటనే ఆయన తపస్సుకు వెళ్లిపోయాడు. తరువాత ఆ కుంభము నుండి వశిష్టుడు జన్మించాడు. ఆ వశిష్టుడే ఇక్ష్వాకులకు కుల గురువు అయ్యాడు. ఆ ప్రకారంగా వసిష్టుడు తన కొత్త దేహాన్ని పొందాడు.

ఇంక నిమి దేహం లేకుండా ఉన్నాడు కదా!. ఆయనకు ఋషులు యోగదీక్షను ఇచ్చారు. నిమి రాజ్యంలో ఉన్న పౌరులు, ఆయన మంత్రులు అందరూ నిర్జీవమైన నిమి శరీరమును సుగంధ ద్రవ్యములు, లేపనములు పూసి చెడిపోకుండా రక్షిస్తున్నారు. గాలిలో తిరుగుతున్న నిమి యోగదీక్షను పూర్తి చేసాడు. అప్పుడు దేవతలు నిమి వద్దకు పోయి "నీ యోగదీక్ష పూర్తి అయింది. నీకు శరీరం వస్తుంది. నీవు ఎక్కడ ఉండాలో నిర్ణయించుకో" అని అడిగారు.

నేను ఈ సృష్టిలో ఉన్న సకల ప్రాణుల కంటి రెప్పల మీద ఉంటాను" అని అన్నాడు నిమి. దేవతలు అలాగే అనుగ్రహించారు. "నీవు అదృశ్యరూపంలో అన్ని ప్రాణుల కంటి రెప్పల మీద నివసిస్తావు. ప్రాణులు విశ్రాంతి కావాలి అనుకున్నప్పుడు వారి కంటి రెప్పలు నీ మూలంగానే మూసుకుంటాయి." అని వరం ఇచ్చారు. తరువాత దేవతలు వెళ్లిపోయారు. (కనురెప్పపాటు సమయాన్ని నిమేషము అని అంటారు. (మన వాడుకలో ఉన్న నిమిషము కాదు.) నిమి నుంచి నిమేషము అనే పదం పుట్టింది.) ఇప్పుడు నిమి దేహము అలాగే ఉంది. రాజ్యానికి వారసుడు లేడు. ఆ దేహానికి ఒక కుమారుని పుట్టించాలి అని అనుకున్నారు. ఆ దేహమును బయట ఉంచి, యజ్ఞం చేస్తూ, హెూమాలు చేస్తూ, వేద మంత్రాలు చదువుతూ, నిమి దేహమును ఒక అరణితో బలంగా మర్దించారు. ( అరణి అనగా, యజ్ఞము చేయుటకు ముందు అగ్నిని పుట్టించడానికి రెండు కర్రలను రాపాడిస్తారు. అందులో నుండి అగ్ని పుడుతుంది. దానికి ఉపయోగించే పొడుగాటి కర్రను అరణి అంటారు) ఆ రాపిడికి నిర్జీవమైన నిమి శరీరం నుండి ఒక పురుషుడు జన్మించాడు.

అతడే జనక మహారాజు. నిర్జీవ శరీరాన్ని మథించడం వల్ల పుట్టిన వాడు కాబట్టి ఆయన రాజ్యానికి మిథిల అనే పేరు వచ్చింది. స్త్రీదేహము లేకుండా జన్మించాడు కాబట్టి ఆయనకు వైదేహుడు అనే పేరు కూడా వచ్చింది. ఆయన రాజ్యమునకు విదేహ రాజ్యము అనే పేరు సార్థకం అయింది. ఆ ప్రకారంగా వసిష్ఠుడు, నిమి మహారాజు తిరిగి జన్మించారు." అని రాముడు లక్ష్మణునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభైఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

యాభై ఎనిమిదవ సర్గ.

ఆశ్చర్యకరమైన వసిష్టుడు నిమి వృత్తాంతములను విన్న లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! దీని కంతటికీ కారణం వసిష్టుడు నిమికి ఇచ్చిన శాపము. వసిష్టుడు రాని కారణంగా గౌతముని ఋత్విక్కుగా పెట్టుకున్నాడు. ఇందులో అతని తప్పు ఏముంది. పైగా యాగ దీక్షలో ఉన్న నిమిని శపించడం వసిష్టుని తప్పు కాదా!" అని అన్నాడు. దానికి రాముడు ఇలా చెప్పాడు. "లక్ష్మణా! అందరికీ ఓర్పు సహనము ఉండవు. వీరే కాదు ఇంకా ఎంతో మంది ఓర్పును సహనాన్ని కోల్పోయి కష్టాలలో చిక్కుకున్నారు. కాని యయాతి మహారాజు సత్వగుణ సంపన్నుడు. ఆయన ఓర్పును ఎలా ప్రదర్శించాడో చెబుతాను విను.

పురూరవుడి మనుమడు, ఆయుషునకు కుమారుడు, నహుషుడు అనే రాజు గురించి చెప్పానుకదా. ఆ నహుషుని కుమారుడే యయాతి. ఆయనకు ఇద్దరు భార్యలు. (ఈ యయాతి గురించి మనము భారతంలో విపులంగా చదువుకున్నాము.) రాక్షస రాజైన వృషపర్వుని కుమార్తె శర్మిష్ట. రాక్షస గురువు శుక్రాచార్యుని కుమార్తె అయిన దేవయాని. కాని యయాతికి శర్మిష్ట యందు ఎక్కువ ప్రేమ. యయాతికి దేవయాని అంటే అంత ప్రేమలేదు. యయాతికి శర్మిష్ట యందు పూరువుడు, దేవయాని యందు యదువు జన్మించారు. యయాతికి శర్మిష్ట అంటే ఎంతో ఇష్టం. అలాగే శర్మిష్టకు పుట్టిన పూరువు అంటే కూడా చాలా ఇష్టం. దానికి తోడు పూరువు కూడా సకల సద్గుణ సంపన్నుడు. యయాతి కి దేవయూని అంటే ఇష్టం లేదుకాబట్టి ఆమె కుమారుడు యదువు అంటే కూడా ఇష్టం లేదు. యదువును దగ్గరకు రానిచ్చేవాడుకాదు. అది చూచి యదువుకు దు:ఖం ముంచుకొచ్చింది.

ఒక రోజు తల్లి దేవయాని వద్దకు పోయి ఇలా అన్నాడు. “అమ్మా! నాన్న గారికి నీవు అన్నా నేను అన్నా అస్సలు ఇష్టం లేదు. ఎందుకమ్మా మనం ఇక్కడ ఉండటం. మనం వెళ్లిపోదాము. అయినా మనకేం తక్కువ అమ్మా నువ్వు రాక్షసులకు గురువు అయిన శుక్రాచార్యుల వారి కుమార్తెవు. నేను ఆయనకు మనుమడిని. అమ్మా ఈ దు:ఖమును అవమానమును ఇంక సహించలేమమ్మా. ఇన్ని అవమానములు భరించి ఇక్కడ ఉండేదానికన్నా అగ్నిలో దూకడం మేలు. తండ్రిగారిని పూరువుతోనూ, వాడి తల్లితోనూ సుఖపడనీ. అమ్మా! ఈ అవమానమునుసహించి నువ్వు ఉండగలిగితే ఉండు. నేను మాత్రం

ఉండను. ఈ అవమానమును భరించడం కన్నా నాకు మరణమే శరణ్యము” అని ఏడుస్తూ అన్నాడు యదువు.

కుమారుడి దు:ఖాన్ని చూచి తట్టుకోలేకపోయింది దేవయాని. వెంటనే తండ్రి శుక్రాచార్యుని మనసులో స్మరించుకుంది. వెంటనే శుక్రాచార్యుడు కుమార్తె ముందు ప్రత్యక్షం అయ్యాడు. దు:ఖంతో కుంగి పోతున్న కుమార్తెను, మనుమడిని చూచి “ఏమమ్మా! ఏమి జరిగింది!” అని అడిగాడు. “తండ్రీ! నాకు ఇక్కడ జరుగుతున్న అవమానమునకు నేను నీళ్లలోగానీ, అగ్నిలో గానీ దూకి మరణిస్తాను. లేదా విషము తిని చస్తాను. అంతే కానీ అనుదినమూ ఈ అవమానములను భరించలేను. తండ్రీ! నీవు రాక్షసులకు గురువు. అందరికీ పూజనీయుడవు. నాకుజరిగిన అవమానము నీకు జరిగినట్టు కాదా! నా భర్త యయాతి నన్ను తిరస్కరించి నన్ను అవమానించాడు. తద్వారా నిన్నూ అవమానించాడు. ఈ ఇంట్లో నాకు ఏ మాత్రం గౌరవము లేదు, అనాదరము తప్ప.” అని ఏడుస్తూ చెప్పింది దేవయాని.

కుమార్తె శోకమును చూచి తట్టుకోలేకపోయాడు శుక్రుడు. యయాతిని పిలిపించాడు. “యయాతి మహారాజా! నీవు నీ వయస్సును, యవ్వనమును, అందమును చూచుకొని గర్వపడుతూ, రాజకుమార్తె అయిన శర్మిష్ఠను ఆమె కుమారుడిని ఆదరిస్తూ, నా కుమార్తెను నిరాదరణకు గురి చేసావు. అవమానించావు. నా కూతురిని అవమానిస్తే నన్ను కూడా అవమానించినట్టే. కాబట్టి నిన్ను ఈ క్షణం నుండి ముసలి తనము ఆవహిస్తుంది. రోజురోజుకూ నీ శరీరం శిథిలము అయిపోతుంది.

నీవు ఏ సుఖాలను అనుభవించలేవు." అని శపించాడు. శుక్రాచార్యుడు ఆ ప్రకారము తన అల్లుడు యయాతిని శపించి, కుమార్తె దేవయానిని ఓదార్చి, తన ఇంటికి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము యాభైఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

యాభైతొమ్మిదవ సర్గ.

శాపగ్రస్తుడైన యయాతిని ముసలి తనం ఆవహించింది. శరీరం శిథిలం అయింది. యయాతికి దు:ఖము ముంచుకొచ్చింది. దేవయాని  దేవయాని కుమారుడు యదువును పిలిచి ఇలా అడిగాడు. "కుమారా! నీ తాతగారి శాపవశాత్తు నేను ముసలివాడిని అయ్యాను. నాకు ఇంకా ఇహలోక భోగములు అనుభవించవలెనని కోరికగా ఉంది. నాకు సాయం చెయ్యగలవా! నా ముసలి తనమును నీవు తీసుకొని నీ యవ్వనమును నాకు ఇమ్ము. నేను భోగములు అనుభవించిన తరువాత మరలా నీ యవ్వనమును నీకు ఇస్తాను." అని అడిగాడు.

"అదేంటి తండ్రీ! ఈ మాత్రం దానికి నేను ఎందుకూ. తమరి ప్రియపుత్రుడు పూరువు ఉన్నాడు కదా! ఆయన మీకు తన యవ్వనాన్ని ఇస్తాడు లెండి. తండ్రీ! నన్ను మీతో పాటు భోజనం చేయనిచ్చారా!

రాచకార్యములలో పాల్గొననిచ్చారా! మీకు అన్నీ ఆ పూరువే కదా! ఈ సాయం కూడా ఆ పూరువే చేస్తాడు లెండి. నేనెందుకూ!" అని అన్నాడు వెటకారంగా.

వెంటనే యయాతి శర్మిష్ట కుమారుడు పూరువు వద్దకు వెళ్లాడు. "కుమారా! నీ ముసలి తనమును తీసుకొని నీ యవ్వనమును నాకు ఇమ్ము. నేను భోగములు అన్నీ తనివితీరా అనుభవించి, తరువాత నీ యవ్వనమును నీకు తిరిగి ఇస్తాను. ఇది నీకు సమ్మతమేనా!" అని అన్నాడు. వెంటనే పూరువు "తండ్రీ! ఇన్నిరోజులకు తమరి ఋణం తీర్చుకొనే సమయం వచ్చింది. మీకు సేవ చేసుకొనే భాగ్యాన్ని నాకు కల్పించి నన్ను ధన్యుడిని చేసారు.  నా యవ్వనాన్ని మీకు సంతోషంగా ఇస్తున్నాను స్వీకరించండి." అని అన్నాడు. వెంటనే యయాతి తన ముసలి తనమును తన కుమారుడు పూరువుకు ఇచ్చి అతని యవ్వనాన్ని స్వీకరించాడు. చాలాకాలం పాటు యయాతి ఇహలోక సుఖాలు అనుభవించాడు.

తరువాత తన కుమారుడు పూరువును  పిలిచి "కుమారా! నేను నీ వద్ద ఉంచిన నా ముసలి తనమును నాకు తిరిగి ఇమ్ము. నీ యవ్వనమును తీసుకొమ్ము." అని అన్నాడు. వెంటనే పూరువు తన తండ్రి ముసలి తనమును ఆయనకు ఇచ్చి తన యవ్వనాన్ని తిరిగి స్వీకరించాడు. తరువాత తన కుమారులు పూరువు, యదువును చూచి ఇలా అన్నాడు. "కుమారా పూరువూ! తండ్రి ఆజ్ఞను పాలించి, నా కోర్కెను తీర్చావు. తండ్రి ఋణం తీర్చుకున్నావు. నాకు చాలా సంతోషంగా ఉంది. నా సామ్రాజ్యానికి నిన్ను పట్టాభిషిక్తుని చేస్తున్నాను. నీ పుత్రపౌత్ర పర్యంతము

ఈ రాజ్యాని ఏలుకో!" అని అన్నాడు. (ఆ పూరుడే పూరు వంశమునకు మూలకర్త.). తరువాత యయాతి యదువును చూచి ఇలా అన్నాడు. "నీవు నా కుమారుడివి కావు. క్షత్రియుడివి అసలే కావు. నా కుమారుడి రూపంలో ఉన్న రాక్షసుడివి. అందుకే తండ్రి మాటను ధిక్కరించావు. కాబట్టి నీకు రాక్షసులే సంతానంగా పుడతారు. నీవంశము రాక్షస వంశము అవుతుంది. నీ వంశము కూడా మారి పోతుంది. ఇంక నుండి నీది చంద్రవంశము కాదు. యదువంశము." అని కుమారుడిని శపించాడు. తరువాత తన కుమారుడు పూరువును రాజ్యాభిషిక్తుని చేసి యయాతి వానప్రస్థమునకు వెళ్లిపోయాడు. తరువాత మరణించి స్వర్గానికి వెళ్లాడు.

పూరువు కాశీ రాజ్యములో ప్రతిష్ఠాన పురము అనే పురమును నిర్మించి, దానిని రాజధానిగా చేసుకొని కాశీరాజ్యమును పరిపాలించాడుపూరువు. రాజవంశమునుండి బహిష్కరింపబడిన యదువుకు రాక్షసులు పుత్రులుగా  జన్మించారు. (మహాభారతములో యయాతి కథ వేరేవిధంగా ఉంది.)  లక్ష్మణా! యయాతికి ఉన్న ఓర్పు,సహనం నిమికి లేదు. అందుకే తన శరీరాన్ని పోగొట్టుకున్నాడు." అని అన్నాడురాముడు.

తరువాత రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! ఇప్పటికే ఆలస్యం అయింది. నేను కూడా నృగ మహారాజు మాదిరి నా కోసం వచ్చిన వారిని నిర్లక్ష్యం చేయకుండా వెను వెంటనే వారి సమస్యలు పరిష్కరిస్తాను. వెంటనే రాజ సభ ఏర్పాటే చేయించు." అని అన్నాడు. తన

మాట రాముడు మన్నించి నందుకు లక్ష్మణుడు ఆనందంతో రాజాజ్ఞను పాటించడానికి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము యాభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(దీని తరువాత వచ్చే మూడు సర్గలు తరువాత చేర్చబడినవి,

మూలంలో లేవు అని పెద్దల అభిప్రాయము.

కానీ పాఠకుల సౌకర్యార్థము ఆ మూడు సర్గలను

ఒకేసర్గగా ఇస్తున్నాను. చదవండి.)

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ప్రక్షిప్త సర్గలు.

మరునాడు ఉదయం తెల్లవారింది. రాముడు ఉదయం పూట చేయవలసిన పూజాకార్యక్రమములు నిర్వర్తించుకొని మంత్రి పురోహితులతో రాజ సభకు వెళ్లాడు. ధర్మాసనము మీద కూర్చుని పౌరుల మధ్య జరిగిన తగాదాలను విచారించడానికి సిద్ధంగా ఉన్నాడు. లక్ష్మణుడు రాజ సభ బయట ఉండి న్యాయం కోసం వచ్చిన వారి గురించి విచారిస్తున్నాడు. కాని అక్కడ ఎక్కువ మంది లేరు. రాముని రాజ్యంలో ఎవరికీ అన్యాయం జరగడం లేదు. అందరూ ధర్మంగా

నడుచుకుంటున్నారు. కాలం తీరకుండా ఎవరూ మరణించడం లేదు. అకాల మరణాలు లేవు. ఎవరూ తనకు అన్యాయం జరిగింది అని మరొకరి మీద ఆరోపణలు చెయ్యడం లేదు. లక్ష్మణుడు లోపలకు వచ్చి అదే విషయాన్ని రామునికి చెప్పాడు.

"లక్ష్మణా!న్యాయం కోసరం వచ్చే వాళ్లు నిర్ణీత సమయంలో రారు కదా. ఎప్పుడు అన్యాయం జరిగితే అప్పుడు వస్తారు. కాబట్టి, నీవు బయటనే ఉండి న్యాయార్ధులను, కార్యార్ధులను వెంటనే విచారించి లోపలకు పంపించు. నేను రాజసభలోనే ఉంటాను. లక్ష్మణా! మన రాజ్యంలో ప్రజలందరూ నీతిగా నిజాయితీగా తమకు విధించిన పనులను చేసుకుంటున్నారు. అందరూ సఖ్యంగా ఉంటున్నారు. ఇంక తగాదాలు ఎందుకు ఉంటాయి చెప్పు. పైగా తప్పుచేస్తే శిక్షలు కఠినంగా ఉంటాయని వాళ్లకు తెలుసు. అందుకని ఎవరూ తప్పు చేయడానికి సాహసించరు. నీవు కూడా నిరంతరమూ జాకరూకుడవై నగరాన్ని రక్షిస్తున్నావు. అయినా కూడా మన జాగ్రత్తలో మనం ఉండాలి. నీవు రాజ సభ బయటనే ఉండి న్యాయం కోసం వచ్చిన వాళ్లను విచారించి లోపలకు పంపు. నేను మంత్రులతో వేరే విషయాలను చర్చిస్తూ ఉంటాను." అని అన్నాడు రాముడు.

రాముని ఆదేశము మేరకు లక్ష్మణుడు రాజ సభ బయటకు వచ్చాడు. అక్కడ ఒక కుక్క నిలబడి ఉంది. లక్ష్మణుని చూచి గట్టిగా మొరిగింది. లక్ష్మణుడు ఆ కుక్కను చూచి "ఏమి పని మీద వచ్చావు. నీకు ఏం కావాలి." అని అడిగాడు. అప్పుడు ఆ కుక్క ఈవిధంగా

బదులుచెప్పింది. "నేను న్యాయం కోరి వచ్చాను. ఈ రాజ్యానికి రాజు రాముడు. నా అభియోగము రామునికే చెబుతాను." అని చెప్పింది. రాముడు సభలోపలికి వెళ్లాడు. రామునికి కుక్క విషయం చెప్పి బయటకు వచ్చి  కుక్కను రాజసభలోకి వెళ్లమన్నాడు. అప్పుడు ఆ కుక్క ఇలా అంది. "లక్ష్మణా! నేను నీచయోనిలో పుట్టాను. మాకు రాజసభలలోకి, దేవతా గృహములలోకి, బ్రాహ్మణుల ఇళ్లలోకీ  వెళ్లే అర్హత లేదు. కాబట్టి నేను రాజసభలోకి రాలేను. రాముడు సకల ప్రాణులను సమంగా చూడగలిగినవాడు. రాముడు స్వయంగా ఆజ్ఞాపిస్తే గానీ నేను లోపలకు రాను. నీవు పోయి రాముని అనుజ్ఞ తీసుకొని రా" అని చెప్పింది.

లక్ష్మణునికి విసుగు పుట్టింది. కానీ ఓపికగా ఉన్నాడు. రాముని వద్దకు వెళ్లాడు. "రామా! ఒక కుక్క వచ్చి రాజ సభ బయట నిలబడి ఉంది. నీ అనుమతి లేనిది లోపలకు రాదట" అని అన్నాడు. "నేను అనుమతి ఇచ్చాను అని చెప్పి ఆ కుక్కను లోపలకు తీసుకొని రా" అని అన్నాడు. లక్ష్మణుడు బయటకు వెళ్లి ఆ కుక్కను రాజసభలోకి తీసుకొని వచ్చాడు. రాముడు ఆ కుక్కను చూచి "నీవు చెప్పదలచుకున్న విషయము ఏమీ భయము లేకుండా నిర్భయంగా చెప్పు." అని అన్నాడు. రాముడు ఆ కుక్క తలమీద రక్తం కారుతున్న గాయం చూచాడు.

ఆ శునకము రామునితో ఇలా అంది. "ఓ రాజా! నీవు ప్రజారక్షకుడివి. నిరంతరమూ రాత్రింబగళ్లు ప్రజలను రక్షిస్తూ ఉంటావు. రాజు ప్రజలకందరికీ తండ్రి వంటి వాడు. ధారణాత్ ధర్మమ్ ఇతి అని అంటారు కదా! అంటే  ధరించునది కావున ధర్మము అని అంటారు. ఆ

ధర్మమే మూడు లోకములలో నిలిచి ఉంది. జీవుడు మరణించిన తరువాత కూడా అతని ధర్మమే అతనిని కాపాడుతుంది. పుణ్యలోకాలకు చేరుస్తుంది. అటువంటి ధర్మమును నీవు చక్కగా పాటిస్తున్నావు. ధర్మం నీకు బాగా తెలుసు. నీ వంటి వాడి ముందు నేను ధర్మం గురించి మాట్లాడటం నా అజ్ఞానమే అవుతుంది. అందుకే నీకు నేను భక్తితో నమస్కరిస్తున్నాను." అని పలికింది ఆ శునకము.

"నీకు ఏమి అన్యాయం జరిగిందో ధైర్యంగా నిర్భయంగా చెప్పు" అని అన్నాడు రాముడు. "ఓ రాజా! బ్రాహ్మణులు నివసించే ప్రదేశములో ఉన్న సర్వార్థసిద్ధుడు అనే సన్యాసి నన్ను అకారణంగా కొట్టాడు. నేను అతని పట్ల ఏమీ అపరాధము చేయలేదు." అని పలికింది. వెంటనే రాముడు భటులను పంపించి ఆ సర్వార్థసిద్ధుడు అనే బ్రాహ్మణుని సభకు పిలిపించాడు. "రాజా! నన్ను ఎందుకు పిలిపించారు. నేను ఏమి చెయ్యాలి." అని అడిగాడు. "ఓ బ్రాహ్మణోత్తమా! నీవు ఈ శునకమును కొట్టినావని నీ మీద అభియోగము. ఈ శునకము ఏమి తప్పు చేసిందని కొట్టావు." అని అడిగాడు రాముడు. "రాజా! నేను కోపం పట్టలేకకొట్టాను." అని అన్నాడు.

అప్పుడు రాముడు ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణోత్తమా! కోపము అనర్థదాయకము అని తెలియదా! కోపము ప్రాణములను సైతం తీసే శత్రువు లాంటిది. కోపము మిత్రుడు వలె ఎప్పుడూ వెంట ఉన్నా అది మానవునికి ప్రబల శత్రువు. కోపము కత్తిలాంటిది. కోపము అనర్థదాయకము. ఎన్ని యజ్ఞములు, యాగములు చేసినా, ఎంత తపస్సు

చేసినా, కోపాన్ని వదిలిపెట్టకపోతే అవన్నీ ఎందుకూ పనికిరావు. అందుకే ముందు కోపాన్ని విడిచిపెట్టాలి. తాను కోరుకున్నది దక్కకపోతే కోపం వస్తుంది. అందుకనే కోరికలను విడిచిపెట్టాలి. ఇంద్రియములను మనసును అదుపులో ఉంచుకోవాలి. మానవుడు తన మనోవాక్కాయ కర్మలతో ఎదుటి వారికి మేలు చేయాలి కానీ కీడు చేయకూడదు. అటువంటి వాడు ఎవరినీ ద్వేషించడు అందుకే వాడికి ఎవరి మీదా కోపం రాదు. మనసును అదుపులో పెట్టుకోకపోతే మనిషిలో కోపం దావానలంలా ప్రజ్వరిల్లుతుంది. ఆ కోపము వాడి అయిన కత్తితో, తోకతొక్కిన పాముతో, పక్కలో ఉన్న శత్రువుతో సమానము. కోపం అటువంటిది అని తెలిసికూడా ఎందుకుకోపం తెచ్చుకున్నావు." అని అడిగాడు రాముడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు ఇలా బదులు చెప్పాడు. "రాజా! నేను భిక్ష కొరకు అన్ని ఇళ్లకు వెళ్లాను. కానీ ఎక్కడా బిక్ష దొరకలేదు. కడుపులో ఆకలిగా ఉంది. అప్పుడు నాకు ఈ కుక్క అడ్డం వచ్చింది. నేను ఈ కుక్కను అవతలకు వెళ్లమని తోలాను. కాని ఈ కుక్క తన ఇష్టం వచ్చినట్టు అటు ఇటు తిరుగుతూ దారికి అడ్డంగా నిలబడింది. ఆ కోపంలో నేను ఈ కుక్కను కొట్టాను. నేను చేసిన అపరాధమును క్షమించండి." అని అన్నాడు. అప్పుడు రాముడు రాజ పురోహితుని, మంత్రులను చూచి ఇతనికి ఏమి శిక్ష వెయ్యాలి అనిఅడిగాడు. "రాజా! బ్రాహ్మణులు దండనకు తగిన వారు కాదు. బ్రాహ్మణులను శిక్షించ కూడదు. " అని అన్నారు.

అప్పుడు ఆ శునకము ఇలా అంది. "ఓ రాజా! మీరు అనుమతిస్తే ఇతనికి తగిన శిక్షను నేను చెబుతాను." అని అంది. "ఏమిటి?" అని అడిగాడు రాముడు. "ఇతనిని కులపతిగా నియమించండి. అదే ఇతనికి తగిన శిక్ష" అని పలికింది కుక్క. ఆ శునకము అంతరంగమును బాగుగా తెలిసిన రాముడు ఆ బ్రాహ్మణుని కులపతిగా నియమించాడు. ఆ బ్రాహ్మణుడు చాలా సంతోషించి కులపతిత్వమును స్వీకరించడానికి వెళ్లాడు.

రాముడి తీర్పు విని సభాసదులందరూ ఆశ్చర్యపోయారు. ఒక మంత్రి లేచి ఇలా అడిగాడు. "మహారాజా! మేమంతా అతడు బ్రాహ్మణుడు కాబట్టి శిక్షించకుండా వదిలిపెడతారు అనుకుంటే అతనిని కులపతిగా నియమించారు. ఇది అతనికి వరం ఇచ్చినట్టు కదా!" అని అడిగారు. ఆ మాటలకు రాముడు నవ్వి మీ ప్రశ్నకు ఈ శునకమే సమాధానము ఇవ్వగలదు" అని అన్నాడు. అప్పుడు ఆ శునకము ఇలా పలికింది. "సభాసదులారా! నేను పోయిన జన్మలో కులపతిని. దేవతలకు, బ్రాహ్మణులకు తృప్తిగా భోజనముపెట్టిన తరువాత మిగిలిన ఆహారమును నేను తినేవాడిని. ఇంకా మిగిలితే ఇతరులకు ఇచ్చేవాడిని. దేవతలకు చెందిన సొమ్మును దుర్వినియోగం కాకుండా రక్షించేవాడిని. నా స్వప్రయోజనమునకు కించిత్ కూడా వాడుకొనే వాడిని కాదు. అటువంటి నాకే కేవలం కులపతిగా ఉండినందుకు ఈ శునక జన్మ వచ్చింది. ఇంక ఈ కోపిష్టి అయిన బ్రాహ్మణుడు కులపతి అయితే ఇతని అవినీతికి అంతు ఉండదు. ఇతడు చనిపోయిన తరువాత నరకం ప్రాప్తిస్తుంది. ఇదే అతనికి సరిఅయిన శిక్ష. కాబట్టి మహారాజా! మీకు ఎవరినన్నా శిక్షించాలి అని

అనుకుంటే వానిని దేవాలయ ధర్మకర్త గానో, కులపతిగానో, బ్రాహ్మణుల ఆస్తులను రక్షించే ఉద్యోగిగానో నియమించండి. వాడి పతనానికి అదే దగ్గరి దారి. వాడికి చావు తరువాత నరకం తథ్యం." అని పలికింది ఆ శునకము. తరువాత ఆ శునకము తన దారిన తాను వెళ్లిపోయింది. తరువాత ఆ శునకము వారణాసి నగరంలో ప్రాయోపవేశం చేసి ప్రాణాలు వదిలింది.

ఒక అరణ్యములో ఒక గ్రద్ద ఒక గుడ్లగూబ నివసిస్తున్నాయి. ఒక సారి ఆ గ్రద్దకు గుడ్లగూబకు ఒక ఇంటిని గురించి తగువు వచ్చింది. ఆ ఇల్లు ఎవరిదో తేల్చుకోడానికి ఆ గ్రద్ద గుడ్లగూబ రాముని దగ్గరకు వెళ్లాయి. ముందు గ్రద్ద రాముని చూచి ఇలా అంది. "రాజా! నీవు బుద్ధిలో బృహస్పతి కంటే, గొప్పవాడివి. కాబట్టి మా తగవును మీరే తీర్చాలి. ఆ అరణ్యములో నేను ఒక ఇల్లు కట్టుకున్నాను. కాని ఈ గుడ్లగూబ తన బలంతో నా ఇంటిని ఆక్రమించుకుంది. ఈ గుడ్లగూబను శిక్షించి నా ఇల్లు నాకు ఇప్పించండి." అని అడిగింది.

తరువాత గుడ్లగూబ ఇలా చెప్పింది. "మహారాజా! నీవు సాక్షాత్తు నారాయణ స్వరూపుడవు. అందుకని నీవే మా తగవు తీర్చాలి. ఈ గ్రద్ద నా ఇంటి లో ప్రవేశించి నన్ను ఇబ్బంది పెడుతూ ఉంది. కాబట్టి ఈ గ్రద్ద బారి నుండి నన్ను రక్షించండి." అని మొరపెట్టుకుంది.

రాముడు మంత్రులతో ఆలోచించాడు. తరువాత రాముడు గ్రద్దను ఇలా అడిగాడు. "నీవు నీ ఇంటిని నిర్మించి ఎన్నాళ్లు అయింది" అని

అడిగాడు. "రామా! ఈ భూమి అంతా మానవులతో ఎప్పుడు నిండిపోయిందో అప్పటి నుండి నేను ఆ ఇంటిలో ఉంటున్నాను." అని చెప్పింది. వెంటనే గుడ్లగూబ "రాజా! ఈ భూమి మీద ఎప్పటి నుండి వృక్షజాతులు పుట్టాయో అప్పటి నుండి నేను ఆ ఇంట్లో ఉంటున్నాను." అని పలికింది. ఆ మాటలు విన్న రాముడు సభాసదులతో ఇలా అన్నాడు.

"సభాసదులారా! సభలో వృద్ధులు లేకపోతే అది సభకాదు. ఆ వృద్ధులు ధర్మం చెప్పకపోతే వారు వృద్ధులు కాదు. సత్యము లేకపోతే ధర్మము నిలువదు. కపటపు మాటలతో సత్యము చెప్పలేరు. ఈ సభలో ఉన్న వారు ఇది అధర్మము అని తెలిసి కూడా దానిని బహిరంగంగా చెప్పరో, వారు అబద్ధాలు చెప్పినట్టే. అంతేకాదు. కోపం వలన గానీ, కామప్రకోపము వలన గానీ, తెలిసి కూడా తెలియనట్టు ఉంటారో వారికి వరుణపాశములు చుట్టుకుంటాయి. కాబట్టి మీరు ఇరువురి వాదనలు విన్నారు కదా. ఏది సత్యమో, ఏది ధర్మమో వివరంగా చెప్పండి." అని అడిగాడు రాముడు.

తరువాత సభాసదులు అందరూ ఆలోచించి "రాజా! గుడ్లగూబ చెప్పినది సత్యము, గ్రద్ద చెప్పినది అసత్యము. తరువాత మీకు తోచిన నిర్ణయం చెయ్యండి." అని ముక్తకంఠంతో చెప్పారు. తరువాత రాముడు ఇలా అన్నాడు. "ఈ సందర్భంలో పురాణాలలో చెప్పబడిన విషయములను మీకు చెబుతాను. సావధానంగా వినండి. ఒకప్పుడు ఈ మూడు లోకములు నీటిలో మునిగిపోయాయి. ప్రపంచం అంతా జలమయం అయింది. భూదేవి విష్ణుమూర్తి ఉదరంలోకి ప్రవేశించింది. భూమిని తన

ఉదరములో ఉంచుకొన్న విష్ణువు యోగనిద్రలో ఉన్నాడు. అనేక సంవత్సరములు గడిచిపోయాయి. అప్పుడు బ్రహ్మదేవుడు విష్ణువు ఉదరములోకి ప్రవేశించాడు. విష్ణువు గర్భంలో ఉన్న జలములో నుండి ఒక పద్మము పుట్టింది. అది విష్ణువు నాభి ద్వారా బయటకు వచ్చింది. ఆ పద్మము యొక్క నాళము (తామర తూడు) లో నుండి బ్రహ్మ బయటకు వచ్చాడు. ఆ పద్మములో కూర్చున్నాడు. తరువాత బ్రహ్మ తపస్సు చేసాడు. భూమిని, వాయువును, పర్వతములను, వృక్షములను, సృష్టించాడు. తరువాత మనుష్యులను, జంతువులను పాకే జంతువులను, ఎగిరే పక్షులను సృష్టించాడు. అండములనుండి పుట్టే వాటిని, గర్భములో నుండి బయటకు వచ్చేవాటిని, చెమట నుండి పుట్టే వాటిని, భూమి నుండి పుట్టే వాటిని సృష్టించాడు.

బ్రహ్మ యొక్కచెవిలో నుండి మధు, కైటభులు అనే రాక్షసులు పుట్టారు. వారు బ్రహ్మదేవుని చూచి కోపంతో ఊగిపోయారు. ఆ మధుకైటభులు బ్రహ్మ మీదికి వచ్చారు. అప్పుడు బ్రహ్మ పెద్దగా అరిచాడు. ఆ శబ్దము విని శివుడు, విష్ణువు అక్కడకు వచ్చారు. విష్ణువు తన చక్రాయుధముతో ఆ మధు కైటభులు అనే రాక్షసులను సంహరించాడు. ఆ రాక్షసుల శరీరంలో నుండి బయటకు వచ్చిన కొవ్వుతో ఈ భూమి అంతా నిండి పోయింది. అందులో నుండి వృక్షములు, ఓషధులు, సస్యములలో భూమి నిండి పోయింది. ఆ రాక్షసుల కొవ్వు (మేధ) తో నిండి పోయింది కాబట్టి భూమికి మేధ అనే పేరు వచ్చింది. పై కారణాల వలన  గుడ్డగూబ వృక్షములు పుట్టిన తరువాత ఇల్లు కట్టుకొంది. అంతకు ముందు వృక్షములు లేవు కాబట్టి గ్రద్ద ఇల్లు కట్టుకొనే అవకాశము లేదు.

కాబట్టి ఈ ఇల్లు గుడ్లగూబది కానీ గ్రద్దది కాదు. అబద్ధము చెప్పిన ఈ గ్రద్దను దండించాలి." అని అన్నాడు రాముడు.

ఆ సమయంలో ఆకాశం నుండి ఇలా వినపడింది. "రామా! ఈ గ్రద్ద ను చంపకుము. ఈ గ్రద్ద పేరు బ్రహ్మదత్తుడు. ఎల్లప్పుడూ సత్యమునే పలికెడి వాడు. ధర్మాత్ముడు.

ఒక సారి ఒక బ్రాహ్మణుడు బ్రహ్మదత్తుని ఇంటికి వచ్చాడు. తనకు నూరు సంవత్సరముల పాటు భోజనము పెట్టమని అడిగాడు. బ్రహ్మదత్తుడు ఆ బ్రాహ్మణునికి అర్ఘ్యము పాద్యము ఆసనము సమర్పించాడు. అతని భోజనానికి తగిన ఏర్పాట్లు చేసాడు. కాని అతనికి పెట్టిన ఆహారములో మాంసాహారము కూడా కలిసింది. దానికి ఆ బ్రాహ్మణుడు కోపించాడు. నీవు గ్రద్దలు తినే మాంసాహారము పెట్టావు కాబట్టి నీవు గ్రద్దగా జీవించు." అని శపించాడు. అప్పుడు బ్రహ్మదత్తుడు  ఆ బ్రాహ్మణుని కాళ్ల మీద పడి తన అపరాధమును మన్నించి తనకు శాపవిమోచనము కలుగచేయమని వేడుకున్నాడు. "రాబోవు త్రేతాయుగములో ఇక్ష్వాకు వంశములో రాముడు అనే రాజు జన్మిస్తాడు. అతని స్పర్శతో నీకుశాపవిమోచన అవుతుంది." అని ఆ బ్రాహ్మణుడు బ్రహ్మదత్తునికి శాపవిమోచన అనుగ్రహించాడు. కాబట్టి రామా! ఇతనికి శాపవిమోచన కలిగించు" అని ఆకాశవాణి పలికింది.

అప్పుడు రాముడు సంతోషంగా ఆ గ్రద్దకు శాపవిమోచన కలిగించాడు. అప్పుడు ఆ గ్రద్ద బ్రహ్మదత్తుడిగా మారి పోయాడు.

"రామా! నీ అనుగ్రహము వలన నాకు శాపవిమోచన కలిగింది." అని రాముడికి నమస్కరించి వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ప్రక్షిప్త సర్గలు సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## అరవయ్యవ సర్గ.

రాముడు జనరంజకంగా రాజ్యపాలన సాగిస్తుంటే వసంత ఋతువు వచ్చింది. ఒకరోజు భార్గవుడు, చ్యవనుడు తదితర మహా మునులు అందరూ రాముని చూడటానికి వచ్చారు. రాముడు వారిని సాదరంగా ఆహ్వానించాడు. అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించాడు. అందరికీ ఉచితాసనములు మీద ఆసీనులను చేసాడు. ఆ మహా మునులు తాము సేవించిన పుణ్యతీర్థములలో జలములను రామునికి సమర్పించారు.

రాముడు ఆ మునులను చూచి ఇలా అన్నాడు. "మహామునులారా! తమరు వచ్చిన పని ఏమి? మీరు ఏమి కోరినా చెయ్యడానికి నేను సిద్ధంగా ఉన్నాను. నా సమస్తరాజ్యము, నేను బ్రాహ్మణుల అధీనము. ఆజ్ఞాపించండి" అని అన్నాడు రాముడు. రాముని మాటలు విన్న ఆ మహామునులు ఎంతో సంతోషించారు.

"రామా! ఇలామాట్లాడటం నీ వంటి వారికే తగి ఉన్నది. నీ కన్నా ముందు ఈ భూమిని ఎందరో రాజులు పరిపాలించారు. వారందరూ మేము అడగబోయే కార్యము ఏమిటో ఆలోచించి గానీ ఆ కార్యము చేస్తానని మాట ఇచ్చేవారు కాదు. నీవు మాత్రము మేము ఏమి అడుగుతామో తెలుసుకోకుండానే మాట ఇచ్చావు. నీకు బ్రాహ్మణుల మీద ఉన్న భక్తి అనంతమైనది. ప్రస్తుతము మేము భయాందోళనలతో ఉన్నాము. మమ్ములను ఆ భయం నుండి దూరం చేసి మా అందరినీరక్షించు." అని అన్నారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవయ్యవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## అరవయ్యవ ఒకటవ సర్గ.

ఈ బ్రాహ్మణుల మాటలు వినిన రాముడు "మీరు ఏమీ దిగులుచెందనవసరం లేదు. ఈ క్షణం నుండి మీకు భయం నుండి విముక్తి కలిగిస్తాను. మీ భయకారణం చెప్పండి." అని అన్నాడు. అప్పుడు ఆ మునులు రామునితో ఇలా అన్నారు. "రామా! పూర్వము కృతయుగములో మధువు అనే దైత్యుడు ఉండేవాడు. ఆ మధువు బ్రాహ్మణులను పూజించేవాడు. ధర్మాత్ముడు. దేవతలకు ప్రీతి పాత్రుడు. మంచి పరాక్రమ వంతుడు. అతని గుణగణములకు మెచ్చి రుద్రుడు అతనికి ఒక వరం కూడా ఇచ్చాడు. రుద్రుడు అతనికి ఒక దివ్యమైన ప్రతిభావంతమైన

శూలమును ఇచ్చాడు. "నీ సత్యనిష్ఠను, ధర్మనిరతిని చూచి నీకు ఈ శూలమును బహూకరిస్తున్నాను. నీవు ఎప్పటిదాకా దేవతలను బ్రాహ్మణులను ద్వేషించవో అప్పటిదాకా ఈశూలము నీ దగ్గర ఉంటుంది. నీలో దేవ, బ్రాహ్మణ ద్వేషము మొదలైననాడు ఈ శూలము నీ దగ్గర నుండి మాయమై  నా దగ్గరకు చేరుతుంది. నీవు ధర్మంగా న్యాయంగా ఉన్నంతకాలము నిన్ను ఎవరైనా అన్యాయంగా అక్రమంగా, దుర్మార్గంగా ఎదిరిస్తే ఈ శూలం వాడిని భస్మం చేస్తుంది." అని శూలాన్ని రుద్రుడు మధువుకు ఇచ్చాడు. అప్పుడు మధువు రుద్రునికి నమస్కరించి ఇలా అన్నాడు. "ఓ దేవదేవా! ఈ శూలము నాకే కాదు మా తరతరాలకు మా వంశములోనే ఉండేటట్టు వరం ప్రసాదించు." అని అడిగాడు. "అది సంభవం కాదు. కాని నీవు అడిగావు కాబట్టి నీ తరువాత నీ కుమారునికి మాత్రమే చెందుతుంది. ఈ శూలము నీ కుమారుని చేతిలో ఉన్నంతకాలము అతనిని కూడా ఎవరూ ఎదిరింలేరు, చంపలేరు." అని వరం ఇచ్చాడు రుద్రుడు.

ఈ ప్రకారంగా రుద్రునివలన అత్యంత మహిమగల శూలమును పొందిన మధువు, ఒక దివ్యమైన భవనమును నిర్మించుకున్నాడు. ఆ మధువు భార్యపేరు కుంభీనసి. మధువుకు, కుంభీనసికి లవణుడు అనే కుమారుడు జన్మించాడు. వాడు మధువు మాదిరి ధర్మాత్ముడు కాడు. పరమ దుర్మార్గుడు. బాల్యము నుండి అతడు బ్రాహ్మణులను బాధించేవాడు. అందరినీ హింసించేవాడు. కుమారుని దుర్మార్గాలకు మధువుకు కోపం వచ్చేది. కాని పుత్రవ్యామోహంతో ఏమీ అనేవాడు కాదు. రుద్రుడు తనకు ఇచ్చిన శూలమును తన కుమారుడు లవణుడికి ఇచ్చి,

దాని మహిమలను కుమారుడికి చెప్పి, మధువు వరుణలోకమునకు వెళ్లిపోయాడు. లవణుడు అసలే దుర్మార్గుడు దానికి తోడు అజేయమైన శూలము అతని చేతిలో ఉంది. అతని దుర్మార్గాలకు పట్టపగ్గాలు లేకుండాపోయాయి. అతడు ఋషులను, మునులను, బ్రాహ్మణులను బాధించసాగాడు. ఓ రామా! మీరు మమ్ములను ఆ లవణుడి నుండి రక్షించాలి. నీ దగ్గరకు రాక ముందు మేము చాలా మంది రాజుల దగ్గరకుపోయి రక్షణ కల్పించమని అడిగాము. కానీ ఏ రాజూ లవణుడికి భయపడి మమ్మల్ని రక్షించడానికి ముందుకు రాలేదు. నీవు రావణుడు అనే రాక్షసుని సంహరించి నట్టు విని మీ దగ్గరకు వచ్చాము. నీవే ఈ కార్యమును నెరవేర్చుటకు సమర్థుడవు అన్న నమ్మకంతో వచ్చాము. ఈ భూలోకములో మమ్ములను రక్షించేవాడు నీవు తప్ప మరొకడు లేడు. తరువాత నీ ఇష్టం." అని చెప్పి మౌనం వహించారు ఆ మునులు.

"ఓ మహా ఋషులారా! ఆ లవణుడు ఎక్కడ ఉంటాడు. వాడి ఆహార అలవాట్లు ఏమిటి? వాడు ఎక్కడెక్క తిరుగుతుంటాడు. ఏం పనులుచేస్తుంటాడు. వివరంగా చెప్పండి." అని అడిగాడు. ఆ ఋషులు లవణుడి గురించి ఇలా చెప్పారు. "వాడు మాంసాహారి. అన్ని రకములైన ప్రాణులను చంపి తింటాడు. ఎక్కువగా మునులను బాధిస్తుంటాడు. వాడు అతి క్రూరుడు. వాడు ఉండేది మధువనంలో. వాడికి అది ఇదీ అని లేదు. జంతువులను, మనుషులను చంపి తింటాడు." అని అన్నారు ఆ ఋషులు. రాముడు వారికి అభయం ఇచ్చాడు.

తరువాత రాముడు తన సోదరులను చూచి ఇలా అన్నాడు. “మీలో ఎవరు లవణుని చంపగలరు. భరతుడా లేక శత్రుఘ్నుడా!” అని అన్నాడు. వెంటనే భరతుడు “అన్నయ్యా! వాడిని నా పాల బడనివ్వండి. వాడిని నేను చంపుతాను.” అని అన్నాడు భరతుడు. వెంటనే శత్రుఘ్నుడు లేచి “అన్నయ్యా! భరతుడు మీరు లేని రోజుల్లో ఈ రాజ్యభారము వహించి అలసి పోయాడు. ఇంకా ఆయనను ఈ యుద్ధాలతో కష్టపెట్టకండి. ఆయనకు విశ్రాంతినివ్వండి. ఆ లవణుని నేను చంపుతాను. ఆ అవకాశం నాకు ఇవ్వండి.” అని అన్నాడు. ఆ మాటలకు రాముడు ఎంతో సంతోషించాడు. “శత్రుఘ్నా! ఆ ప్రకారమే కానిమ్ము. నీవు ఆ లవణుని చంపు. నిన్ను ఆ మధునగరమునకు రాజుగా చేస్తాను. ఒక రాజ్యమును జయించిన తరువాత ఆ రాజ్యమునకు పాలకుడిని నియమించకపోతే, జయించిన వాడికి నరకం తప్పదు. అదీ కాకుండా నీవు కూడా నీ పరాక్రమముతో, సామర్థ్యముతో ఒక రాజ్యము ఏర్పరుచుకున్నట్టు అవుతుంది. అదే వీరుడి లక్షణము. అన్న కష్టపడకూడదు అన్న నీ భావన ఎంతో శ్లాఘనీయము. నీవు లవణుని జయించి, వాడిని సంహరించి, ఆ రాజ్యమును స్వాధీనం చేసుకో. యమునా నదీ తీరంలో ఉద్యాన వనములను, సుందరమైన నగరములను నిర్మించు. ఇక్ష్వాకుల రాజ్యమును విస్తరించు. మధునగరాన్ని పాలించు. నీ విజయ వార్త విని నేను తమ్ములు, వసిష్టుడు మొదలగు వారు వచ్చి నీకు పట్టాభిషేకమును జరిపిస్తాము.” అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవైరెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## అరవై మూడవ సర్గ.

రాముడు తనను పొడుగుతూ ఒక రాజ్యానికి రాజును చేస్తానంటే శత్రుఘ్నుడు కొంచెం సిగ్గు పడ్డాడు. "అన్నయ్యా! నేను అందరిలోకీ చిన్న వాడిని కేవలం లవణుడిని సంహరిస్తాను అన్నాను. కానీ నన్ను రాజును చెయ్యడం ఏమిటి. నా కన్నా పెద్దవాళ్లు ఉన్నారు కదా! పెద్దవాళ్లు ఉండగా చిన్న వాళ్లు పట్టాభిషిక్తులుకావడం ధర్మమా! కానీ నీ ఆజ్ఞ తప్పక పాటిస్తాను. లవణునితో యుద్ధం చేస్తాను. కానీ నాకన్నా ముందు భరతుడు లవణుని చంపుతాను అన్నప్పుడు నేను మధ్యలో అడ్డుకోవడం పొరపాటు. ఈ అవకాశము భరతుడికి ఇవ్వకుండా నేను లవణుడిని చంపుతాను అనడం నేను చేసిన తప్పు. అన్న మాటలకు ఎదురు చెప్పకూడదు అని తెలిసి కూడా నేను భరతుని మాటలకు విరుద్ధంగా మాట్లాడాను. ఒక సారి భరతుని మాటలను కాదని నేను లవణున్ని చంపుతాను అని తప్పుచేసాను. ఇప్పుడు నీ మాటను కూడా కాదని మరొక తప్పు చేయను. నీ ఆజ్ఞప్రకారమే నడుచుకుంటాను." అని అన్నాడు శత్రుఘ్నుడు.

అతనిమాటలు విన్న రాముడు లక్ష్మణునితో, భరతునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! భరతా! శత్రుఘ్నుని పరాక్రమము నాకు తెలియును. అతడు లవణుని చంపగలడు. కాబట్టి ఇప్పుడే ఇక్కడే శత్రుఘ్నునికి పట్టాభిషేకం జరిపిస్తాను. తగిన సంభారములను తీసుకొని రండి. వసిష్ఠుని ఋత్విక్కులను పిలిపించండి. " అని ఆదేశించాడు.

(విభీషణుడికి కూడా రావణ సంహారం ముందే లంకకు పట్టాభిషిక్తుని చేసాడుకదా! రాముడు ఏదైనా సంకల్పిస్తే దానికి తిరుగు ఉండదు.) శత్రుఘ్నుని మధు నగరమునకు పట్టాభిషిక్తుని చేయడానికి ఏర్పాట్లు చకా చకా సాగిపోయాయి. రాముడు శత్రుఘ్నుని మధునగరమునకు రాజుగా పట్టాభిషిక్తుని చేసాడు. అయోధ్యానగర పౌరులు ఈ పట్టాభిషేక మహోత్సవమును చూచి మహదానందభరితులయ్యారు. కౌసల్య, సుమిత్ర, కైక ఇంకా ఇతర రాజమాతలు, అంత:పుర కాంతలు శత్రుఘ్నునికి మంగళహారతులు ఇచ్చారు. శత్రుఘ్నుడు మధునగరానికి పట్టాభిషిక్తుడు అయ్యాడు అన్న వార్త తెలిసిన మహాఋషులు "ఇంక లవణుని చావు తథ్యం" అని అనుకున్నారు.

అప్పుడు రాముడు శత్రుఘ్నుడిని చూచి ఇలా అన్నాడు. "శత్రుఘ్నా! నీకు నా శుభాకాంక్షలు. నీవు లవణాసురుని మీదికి యుద్ధానికి వెళుతున్నావు. వాడి దగ్గర ఒక దివ్యమైన శూలం ఉంది. దానికి దీటుగా నేను నీకు ఒక దివ్యమైన అస్త్రమును ఇస్తున్నాను. ఇది శత్రువులను నాశనం చేస్తుంది. దీనితో లవణాసురుడిని సంహరించు. కల్పాంతమున శ్రీమహావిష్ణువు మహాసముద్రములో పడుకొని ఉన్నప్పుడు ఆయనకు రక్షణగా ఈ అస్త్రము సృష్టించబడింది. దీనిని దేవతలు కానీ, దానవులుకానీ చూడలేరు. ఎల్లప్పుడూ ఈ అస్త్రము అదృశ్యరూపంలో ఉంటుంది. శ్రీమహావిష్ణువు మధు కైటభులను చంపడానికి, రాక్షస సంహారానికి ఈ అస్త్రమును సృష్టించాడు. ఈ అస్త్రముతో మధు, కైటభులు అనే రాక్షసులను చంపి ఈ లోకాలను సృష్టించాడు విష్ణువు. నేను రావణునితో యుద్ధం చేసే సమయంలో ఈ అస్త్రమును

ప్రయోగిద్దామని అనుకున్నాను. కాని ఈ అస్త్రమును ప్రయోగిస్తే విపరీతంగా ప్రాణనష్టము సంభవిస్తుంది. కేవలం రావణుని గురించి అమాయకులైన రాక్షసులను చంపడం ఇష్టంలేక ఈ అస్త్రమును రావణుని మీద ప్రయోగించలేదు. నేను సేకరించిన సమాచారము ప్రకారము లవణుడు తనకు తండ్రివలన లభించిన పరమేశ్వరదత్త శూలమును పూజా గృహములో భద్రపరిచి నిత్యము పూజలు చేస్తూ ఉంటాడు. దానిని బయటకు తీయడు. ఎవడైనా తనను ఎదిరించి నపుడు, తనతో యుద్ధానికి వచ్చినపుడు మాత్రమే ఆ శూలమును ధరించి శత్రువులను చంపుతాడు. తాను ఆహారము కొరకు బయటకు వెళ్లేటప్పుడు కూడా దానిని పూజా మందిరములో భద్రపరిచి బయటకు వెళుతాడు. ఆ దివ్యమైన శూలము అతని చేతిలో లేకపోతే అతనిని సులభంగా చంప వచ్చును. కాబట్టి నీవు ఆయుధములను ధరించి, లవణుడు ఆహారము కోసరము బయటకు వెళ్లగానే అతని నగర ద్వారము దగ్గర పొంచి ఉండు. అతడు ఆహారమును సేకరించుకొని తిరిగి వచ్చునపుడు అతనితోయుద్ధానికి తలపడు. లవణుడికి లోపలికి వెళ్లి శూలమును తెచ్చుకొనే వ్యవధి ఇవ్వకు. అతడు తన మందిరములోనికి ప్రవేశించక ముందే అతనితో యుద్ధము చేసి సంహరించు. మరొక విధంగా అతనిని చంపడం అసాధ్యము. పరమేశ్వరుని శూలమును జయించడం ఎవరి తరమూ కాదు.” అని చెప్పాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరువది మూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## అరువది నాలుగవ సర్గ.

ఆ ప్రకారంగా రాముడు శత్రుఘ్నునికి లవణాసురుని ఎలా చంపాలో వివరంగా చెప్పాడు. శత్రుఘ్నునికి సాయంగా 4000 గుర్రాలు, రెండు వేల రథాలు, నూరు ఏనుగులు, ఇంకా కాల్బలము పంపాడు రాముడు. సైన్యమును పోషించడానికి అతని వెంట లక్ష బంగారు నాణెములు కల బండ్లను పంపాడు. వినోదము కొరకు అనేక మంది నర్తకీమణులను పంపాడు. రాముడు శత్రుఘ్ననకు మరొక విషయం కూడా చెప్పాడు. "శత్రుఘ్నా! ముందు సైన్యాన్ని పంపు. ఆ సైన్యము ఎవరిదో తెలియనియ్యకు. తరువాత నీవు వెళ్లు. నీవు లవణుని మీదికి దండయాత్రకు వస్తున్నట్టు లవణునికి తెలియనివ్వకు. వాడికి నీ మీద ఎటువంటి అనుమానము రానీయకు. అప్పుడే వాడిని నీవు చంపగలవు. ఒకసారి వాడికి నీవు ఎవరో తెలిస్తే నిన్ను బతుకనివ్వడు. ఇప్పుడు గ్రీష్మఋతువు. వర్షఋతువు ప్రారంభం కాగానే అతనిని చంపడానికి బయలుదేరు. నీ సైన్యములను గ్రీష్మఋతువులోనే గంగానదిని దాటించు. వర్షములు మొదలయితే గంగానదిని దాటడం కష్టం. నీ సైన్యమును గంగానదీ తీరంలో విడిది చేయించు నువ్వు ఒంటరిగా వాడి దగ్గరకు వెళ్లు. అవసరం అయితే నీకు సాయంగా నీ సైన్యం వస్తారు. ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటేనే గానీ నీవు వాడిని చంపలేవు." అని పలికాడు రాముడు.

రాముని మాటలను శ్రద్ధగా విన్నాడు రాముడు. వెంటనే తన సేనాధి పతులను పిలిచాడు. వారికి రాముడు చెప్పిన సూచనలు అన్నీ ఇచ్చాడు. ముందు సైన్యమును పంపాడు. శత్రుఘ్నుడు తన తల్లులు అయిన కౌసల్య, కైకేయి, సుమిత్రల ఆశీర్వాదము తీసుకున్నాడు. కులగురువు వసిష్టుల వారికి నమస్కరించి ఆయన ఆశీర్వాదము తీసుకున్నాడు. రాముడికి నమస్కరించాడు. ముందు తన సేనలను పంపి వారి వెంట తనుకూడా బయలుదేరాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము అరవైనాలుగవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## అరవై ఐదవ సర్గ.

శత్రుఘ్నుడు మధు పురానికి వెళుతూ, రెండు రోజుల ప్రయాణం తరువాత,  మార్గ మధ్యలో గంగానదీ తీరంలో ఉన్న వాల్మీకి ఆశ్రమానికి వెళ్లాడు. శత్రుఘ్నుడు వాల్మీకి మహర్షికి నమస్కరించి తాను ఆ రాత్రికి వాల్మీకి ఆశ్రమంలో విశ్రాంతి తీసుకోడానికి అనుమతి కోరాడు. వాల్మీకి మహర్షి శత్రుఘ్నుని సాదరంగా ఆహ్వానించి అర్ఘ్యము పాద్యము సమర్పించాడు. శత్రుఘ్నునితో ఇలా అన్నాడు. "శత్రుఘ్నా!  ఈ ఆశ్రమము ఇక్ష్వాకుల పాలనలో ఉంది. కాబట్టి ఇది నీ ఆశ్రమమే అనుకో. ఇక్కడ నీవు యధేచ్ఛగా ఉండవచ్చును. ఈ ఫలములను తిని ఈ రాత్రికి ఇక్కడ

విశ్రాంతి తీసుకో." అని అన్నాడు వాల్మీకి. శత్రుఘ్నుడు చాలా సంతోషించాడు. వాల్మీకి ఆతిథ్యాన్ని స్వీకరించాడు. శత్రుఘ్నుడు పరిసరప్రాంతాల్లో తిరుగుతూ ఉంటే అక్కడ శత్రుఘ్నునికి ఒకయజ్ఞవాటిక కనపడింది. అది ఎవరిది అని వాల్మీకి మహర్షిని అడిగాడు శత్రుఘ్నుడు. అప్పుడు వాల్మీకి శత్రుఘ్నునికి ఇలా చెప్పాడు.

"శత్రుఘ్నా! మీ పూర్వీకులలో సుదాసు అనే రాజు ఉండేవాడు. అతడు పరమ ధార్మికుడు. అతని కుమారుడు మిత్రసహుడు. అతనినే సౌదాసుడు అని కూడా అంటారు. ఒకరోజు సౌదాసుడు వేటకై అడవికి వెళ్లాడు. అక్కడ ఇద్దరు రాక్షసులను చూచాడు. ఆ ఇద్దరు రాక్షసులు ఆ అరణ్యములో నివసిస్తున్నారు. వారు ఇద్దరూ పెద్దపులుల ఆకారములు ధరించి ఆ అరణ్యములో ఉన్న మృగములను విచక్షణారహితంగా చంపి తింటున్నారు. కొంత కాలానికి ఆ అడవిలో మృగజాతి అంతా అంతరించి పోతూ ఉంది. ఈ సంగతి తెలిసిన సౌదాసుడు ఆ ఇద్దరు రాక్షసులను తన బాణములతో కొట్టాడు. ఆ బాణముల దెబ్బకు ఒక రాక్షసుడు మరణించాడు. మరొకడు పారిపోయాడు. తన మిత్రుని చంపిన సౌదాసుకు ప్రతిక్రియ చేయాలని అనుకున్నాడు. సమయం కోసరం వేచి చూస్తున్నాడు.

సుదాసుని తరువాత సౌదాసుడు రాజయ్యాడు. సౌదాసుడు ఇక్కడే అశ్వమేధ యాగము చేసాడు. ఆ యజ్ఞమునకు వసిష్ఠుడు ఆధ్వర్యము వహించాడు. అవకాశము కోసరం ఎదురుచూస్తున్న ఆ రాక్షసుడు ఒక రోజు వసిష్ఠుని రూపంలో సౌదాసుని వద్దకు వచ్చాడు.

"రాజా! బాగా ఆకలిగా ఉంది. నాకు మాంసముతో భోజనము వడ్డించు." అని అన్నాడు. వసిష్ఠుడు బ్రాహ్మణుడు. శాఖాహారి. మాంసము ఎందుకు వడ్డించమన్నాడో అర్థం కాలేదు. అయినా ఆయనే కోరాడు కదా అని వంట వాళ్లను పిలిచి వషిష్ఠునికి మంచి రుచికరమైన మాంసాహారమును తయారు చేసి వడ్డించమన్నాడు. వంటవాడు సరే అని వంటింట్లోకి వెళ్లాడు. వసిష్ఠుని రూపంలో ఉన్న రాక్షసుడు మాయం అయ్యాడు. ఆ వంట వాడిలో ప్రవేశించాడు. మాంసాహారానికి బదులు మనుష్య మాంసముతో చేసిన వంటకములను తయారు చేసాడు. ఇంతలో అసలు వసిష్టుడు భోజనానికి వచ్చాడు. సౌదాసుడు ఆయన భార్య మదయంతి, వంటవాడి రూపంలో ఉన్న రాక్షసుడు వండిన మనుష్య మాంసాహార మును వసిష్ఠునికి వడ్డించారు. తనకు వడ్డించినది మనుష్య మాంసము అని వసిష్ఠుడు గ్రహించాడు. సౌదాసుడు చేసిన అకృత్యానికి కోపం వచ్చింది. వెంటనే సౌదాసునితో "రాజా! నేను బ్రాహ్మణుడిని శాకాహారిని అని కూడా చూడకుండా నాకు మనుష్య మాంసమును ఆహారంగా వడ్డిస్తావా. ఇంకనుండి నీవు మనుషులను చంపి తింటూ ఉండు ఇదే నీకు ఆహారము." అని శపించాడు.

తన తప్పు ఏమీ లేకపోయినా తనను వసిష్ఠుడు శపించడం చూచి సౌదాసుడు కోపంతో ఊగి పోయాడు. వసిష్ఠునికి ప్రతిశాపం ఇవ్వబోయాడు. అప్పుడు అతని భార్య మదయంతి ఆయనను వారించింది. "నాథా! వసిష్ఠుడు శాంతమూర్తి. మీకు గురువు. పురోహితుడు. మనక్షేమం కోరేవాడు. ఆయనకు శాపం ఇవ్వడం తగదు. ఇందులో ఏదో మోసం ఉంది. విచారించండి." అని పలికింది.

సౌదాసుడు తన చేతిలో ఉన్న శాపజలాన్ని తన కాళ్ల మీదకు విడిచిపెట్టాడు. ఆ శాపజలము ప్రభావానికి సౌదాసుని కాళ్లు నల్లగా కమిలిపోయాయి. అప్పటినుండి సౌదాసునికి కల్మాషపాదుడు అనే పేరు వచ్చింది. తరువాత సౌదాసుడు, ఆయన భార్య మదయంతి వసిష్ఠునికి నమస్కరించి జరిగిన విషయం చెప్పారు. తను మాంసభోజనం కోరడం ఏమిటా అని వసిష్ఠునికి సందేహం వచ్చింది. వెంటనే దివ్యదృష్టితో చూచి అసలు విషయం తెలుసుకున్నాడు. ఇదంతా ఆ రాక్షసుడు ఆడిన నాటకం అని గ్రహించాడు వసిష్ఠుడు. అనవసరంగా సౌదామునికి శాపం ఇచ్చానే అని బాధపడ్డాడు.

"రాజా! పొరపాటున నీకు ఇచ్చిన నా శాపాన్ని వెనక్కు తీసుకోలేను. కాని నీకు ఒక వరం ఇస్తాను. నేను నీకు ఇచ్చిన శాపము 12 సంవత్సరములుమాత్రమే ఉంటుంది. ఆ తరువాత నీవు నీ నిజస్వరూపమును పొందగలవు. నీవు రాక్షసుడిగా ఉన్నప్పుడు చేసిన పనులు గానీ, తిన్న ఆహారము గురించి గానీ నీకు ఏమీ గుర్తు ఉండదు. ఈ రోజు తరువాత ఆ రోజు వచ్చినట్టు ఉంటుంది." అని అన్నాడు వసిష్ఠుడు. ఆ తరువాత సౌదాసుడు వసిష్ఠుడు ఇచ్చిన శాపమును అనుభవించి తరువాత మరలా రాజై రాజ్యము చేసాడు. నీవు చూసిన యజ్ఞవాటిక ఆ నాడు సౌదాసుడు చేసిన అశ్వమేధయాగ యజ్ఞవాటిక."అని చెప్పాడు వాల్మీకి.

ఆ కథ విన్న శత్రుఘ్నుడు ఆశ్చర్యపోయాడు. కేవలం చిన్న అపోహతో నిరపరాధి అయిన సౌదాసుడు అంత పెద్ద శిక్ష

అనుభవించాడు అని అనుకున్నాడు. శత్రుఘ్నుడుఆ రాత్రికి వాల్మీకి ఆశ్రమంలో విశ్రాంతి తీసుకున్నాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము అరవై అయిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము
## అరవై ఆరవ సర్గ.

శత్రుఘ్నుడు ఆ రాత్రి నిద్రించిన వాల్మీకి ఆశ్రమమునకు సమీపములోనే సీతాదేవి, ఇతర ముని కాంతలు నివసిస్తున్న ఆశ్రమములు ఉన్నాయి. శత్రుఘ్నుడు వాల్మీకి ఆశ్రమంలో నిద్రించిన రాత్రి అక్కడ సీతాదేవికి నెలలు నిండి, ఇద్దరు మగశిశువులను ప్రసవించింది. ముని కుమారుడు ఆ విషయమును వెంటనే ఆ అర్ధరాత్రి వాల్మీకికి తెలియజేసారు. వాల్మీకి చాలా సంతోషించాడు.

మరునాడు ఉదయమే వాల్మీకి సీతాదేవి ఉన్న ఆశ్రమానికి వెళ్లాడు. వాల్మీకి ఆ శిశువులకు భూతబాధను నివారించడానికి రక్షలు కట్టాడు. సీతాదేవికి పుట్టిన ఆ ఇరువురు పుత్రులు మహాతేజంతో ప్రకాశిస్తున్నారు. ముని కుమారులు దర్భలను వేళ్లతో సహా తీసుకొని వచ్చారు. దర్భల వేళ్ల భాగములను లవములు అంటారు. దర్భల కొస భాగములను కుశములు అంటారు. వాటితో వాల్మీకి ఆ బిడ్డలకు రక్ష

చేసాడు. అంటే ఆ దర్భలను వారి ఒంటి మీద మార్జనం చేసాడు అంటే తుడిచాడు. ముందు పుట్టిన వాడికి దర్భకుశలతో మార్జనం చేసాడు కాబట్టి అతనికి కుశుడు అనే నామకరణం చేసాడు. తరువాత పుట్టిన వాడికి దర్భ మొదళ్లతో అంటే లవములతో మార్జనం చేసాడు కాబట్టి లవుడు అనే నామకరణం చేసాడు. ఆ ప్రకారంగా వృద్ధస్త్రీలు ఆ శిశు వులకు మార్జనం చేసారు. అప్పటి నుండి సీతాదేవి కుమారులు కుశలవులు అనే పేరుతో పిలువబడ్డారు.

(కొన్ని రామాయణాల్లో శత్రుఘ్నుడు సీతాదేవి ఆశ్రమానికి వచ్చి బిడ్డలను చూచినట్టు ఉంది. మరి కొన్నింటిలో తన పర్ణశాలలోనే ఉండి "తల్లీ నీవు బిడ్డలతో సుఖంగా ఉన్నావు" అని మనసులోనే అనుకున్నట్టు ఉంది. అంతదూరం వచ్చి, తన వదిన సీతకు ఇద్దరు శిశువులు కలిగారు అని తెలిసిన శత్రుఘ్నుడు అక్కడకు రాకుండా ఉంటాడా! దీనికి రాముడి అనుమతి అక్కరలేదు. కాబట్టి శత్రుఘ్నుడు వచ్చి సీతను చూచి బిడ్డలను ఆశీర్వదించాడు అని అనుకుందాము. తప్పేముంది. ఇందులో మరొక విశేషం కూడా ఉంది. ఆ శావణమాసరాత్రి తొందరగా గడిచిపోయింది అని రాయబడింది. అంటే కుశలవులు శ్రావణమాసంలో జన్మించారు అని అర్థం అవుతూ ఉంది. రాముడు చైత్రమాసంలో పుట్టాడు. సరిగ్గా నాలుగు మాసాల తరువాత శ్రావణబహుళ అష్టమి నాడు కృష్ణుడు పుట్టాడు. అదే శ్రావణమాసంలో కుశలవులుకూడా పుట్టారు. అందుకే చైత్రమాసము, శ్రావణ మాసము అంత పవిత్రం అయ్యాయి.)

మరునాడు శత్రుఘ్నుడు వాల్మీకి వద్ద సెలవు తీసుకొని పశ్చిమ దిశగా ప్రయాణం అయ్యాడు. ఏడు రోజులు ప్రయాణం చేసి యమునా తీరం చేరుకున్నాడు శత్రుఘ్నుడు. యమునా తీరంలో కల ఋషీశ్వరుల ఆశ్రమాలలో విశ్రాంతి తీసుకున్నాడు. చ్యవనుడు మొదలైన మహామునులను కలిసి వారితో అన్ని విషయాలు  చర్చించాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవైఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## అరవై ఏడవ సర్గ.

శత్రుఘ్నుడు చ్యవన మహర్షితో చర్చల సందర్భంగా లవణుని గురించి, అతని బలము గురించి, ఇంతకు పూర్వము లవణుడితో ఎవరెవరు యుద్ధం చేసారు, ఎంతమందిని లవణుడు ఈశ్వరదత్తమైన దివ్యశూలంతో చంపాడు, ఎలా చంపాడు, అన్న విషయాలు అడిగాడు. అప్పుడు చ్యవనుడు ఈ విధంగా చెప్పసాగాడు.

"శత్రుఘ్నా! లవణుడితో యుద్ధం చేసి చచ్చిన వాళ్లు ఎంత మందో లెక్కతెలియదు. చాలామంది మరణించారు. అందులో మీ వంశమునకు చెందిన ఒక రాజును గురించి చెబుతాను. విను.

పూర్వము అయోధ్యను యవనాశ్వుని పుత్రుడైన మాంధాత పరిపాలిస్తూ ఉండేవాడు. మాంధాత గొప్ప చక్రవర్తి. భూలోకము నంతా జయించాడు. దేవలోకమును కూడా జయించవలెనని ప్రయత్నించాడు. ఇదివినిన ఇంద్రుడికి, దేవతలకు భయం పట్టుకుంది. తన సైన్యాలతో దేవలోకానికి వచ్చిన మాంధాతతో రాజీప్రయత్నాలు మొదలుపెట్టారు. స్వర్గంలో సగం, దేవేంద్రుని సింహాసనములో సగం ఇస్తాము అని అన్నారు. కాని మాంధాత ఒప్పుకోలేదు. తనకు స్వర్గలోకాధిపత్యము సంపూర్ణంగా కావాలని పట్టుబట్టాడు.

ఇంద్రుడు ఆయనను స్వస్థత పరుస్తూ ఇలా అన్నాడు. “ఓ రాజా! నీవు భూలోకములోనే రాజువు. నీవు భూలోకమును అంతా జయించాను అనుకుంటున్నావు. అది పొరపాటు. నీవు భూలోకమును పూర్తిగా జయించలేదు. భూలోకమును పూర్తిగా జయించి నీ పాలనలోకి తీసుకొచ్చిన తరువాత దేవ లోకాధిపత్యము కోరుకొనుము.” అని అన్నాడు.

ఆ మాటలకు మాంధాతకు అనుమానం వచ్చింది. “ఇంద్రా! నేను భూమి నంతా జయించాను. భూలోకం అంతా నా స్వాధీనంలో ఉంది. భూలోకంలో ఎక్కడ ఏ ప్రాంతంలో నా ఆధిపత్యం అధికారము కొనసాగడం లేదు. చెప్పు” అని నిలదీసాడు. “ఓ రాజా! మధు వనములో నివసిస్తున్న మధువు అనే రాక్షసుని కుమారుడు లవణుడు నీ మాటను మన్నించడంలేదు. స్వతంత్రంగా వ్యవహరిస్తున్నాడు. ముందు వాడిని జయించి తరువాత దేవలోకము వంక చూడు.” అని అన్నాడు.

మాంధాత అవమానంతో తల వంచుకున్నాడు. మరలా భూలోకమునకు వచ్చాడు. సైన్యాలను సమీకరించాడు. వెంటనే లవణుని మీద యుద్ధం ప్రకటించాడు. లవణుని వద్దకు ఒక దూతను పంపాడు. తనకు లొంగిపొమ్మని చెప్పాడు. లవణాసుడు ఆ దూతను చంపి ఉపాహారంగా తినేసాడు. ఇది విన్నమాంధాత తన సైన్యముతో మధువనమును చుట్టుముట్టాడు. లవణాసురుని మీద బాణవర్షము కురిపించాడు. లవణాసురుడు తన వద్ద ఉన్న దివ్యశూలమును మాంధాత మీద, అతని సేనలమీదా ప్రయోగించాడు. ఆ శూలము నిప్పులు కక్కుకుంటూ వెళ్లి మాంధాతను, అతని సైన్యమును సమూలంగా నాశనం చేసి తిరిగి లవణుని వద్దకు వచ్చి చేరింది.

కాబట్టి ఓ శత్రుఘ్నా! ఆ శూలము మహిమ అంత గొప్పది. కాబట్టి లవణుని తెలివిగా చంపాలి కానీ ఎదురు పడి చంపకూడదు. అతని చేతిలో శూలం లేని సమయంలోనే అతనిని చంపాలి. ఉదయం పూట అతని చేతిలో శూలం ఉండదు. లవణుడిని చంపడానికి అదే సరి అయిన సమయం. నీవు తప్పకుండా లవణునికి చంపగలవు. లవణుని చావు వలన లోకాలకు మేలు జరుగుతుంది.

శత్రుఘ్నా! లవణుని గురించి పూర్తి వివరాలు నీకు చెప్పాను. పరమేశ్వరుడు ఇచ్చిన శూలమే అతని బలము. ఇంద్రుడు తాను మాంధాతను చంపలేక, లవణుని మీదికి పురికొల్పి అతని చేత మాంధాతను చంపించాడు. నీవు కూడా కపటముతోనే లవణుని చంపాలి.

రేపు ఉదయము అతడు శూలం లేకుండా నగరం బయటకు ఆహారం కోసరం వస్తాడు. ఆ సమయంలోనే నీవు అతనిని చంపగలవు. నీకు జయం కలుగుతుంది." అని ఆశీర్వదించాడు చ్యవనుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవై ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

అరవై ఎనిమిదవ సర్గ.

ఆరాత్రి గడిచిపోయింది. మరునాడు తెల్లవారగానే యధావిధిగా లవణుడు ఆహారము కొరకు నగరము విడిచి బయలుదేరాడు. ఇదే సమయమని శత్రుఘ్నుడు ధనుర్బాణములు ధరించి, యమునా నదిని దాటి, మధునగరము ముఖద్వారము దగ్గరకు వచ్చాడు. మధ్యాహ్న సమయానికి లవణుడు కొన్ని వేల జంతువులను వేటాడి వాటిని తీసుకొని నగరానికి వచ్చాడు. నగర ద్వారము దగ్గర ధనుర్బాణములను ధరించి నిలబడ్డ శత్రుఘ్నుని చూచాడు. అతని వద్ద ఉన్న ధనుర్బాణములను చూచాడు.

"ఓరీ నరాధమా! ఈ ఆయుధముతో నన్నేమి చేస్తావురా! నీ లాంటి వారిని నేను కొన్ని వేల మందిని చంపి తిన్నాను. నీకు కాలము మూడి నా దగ్గరకు వచ్చావు. ఈ రోజు నాకు నరమాంసము చాలినంతగా

దొరకలేదు. రా నిన్ను కూడా తింటాను." అని అన్నాడు లవణుడు.

"ఓరీ రాక్షసుడా! రారా. నాతో యుద్ధం చెయ్యి. ఈరోజు నీ చావు నా చేతిలో ఉంది. నేను ఎవరో తెలుసా. ఇక్ష్వాకు వంశ చక్రవర్తి దశరథమహారాజు కుమారుడను. రాముని సోదరుడను. శత్రుఘ్నుడను. నిన్ను చంపడానికే అయోధ్య నుండి ఇక్కడకు వచ్చాను. నిన్ను చంపి ఈ లోకానికి పట్టిన పీడ వదిలిస్తాను." అని అన్నాడు.

ఆ మాటలకు లవణుడు పెద్దగా నవ్వాడు. "అవును అంత దూరం నుండి నా చేతిలో చావడానికి నా దగ్గరకు వచ్చావు. నీ రాముడు చంపిన రావణుడు నాకు మేనమామ. మా అమ్మ సోదరుడు. రాముడు ఒక ఆడుదాని గురించి నా మేనమామను చంపాడు. రావణ కులమును నాశనం చేసాడు. అయినా నేను రాముని క్షమించాను. నాకు రాముడు అంటే లెక్కలేదు. నా ముందు రాముడు ఒక అల్పజీవి. రాముడి లాంటి వాళ్లను ఎంతో మందిని నేను చంపాను. నువ్వు నీ రాముడు నా ముందు గడ్డిపరకల లాంటివాళ్లు. నాతో యుద్ధము చేస్తాను అన్నావు కదా. కాసేపు ఉండు నేను లోపలకు పోయి ఆయుధమును తెచ్చుకుంటాను. నేను ఆయుధమును చేతబూని యుద్ధమునకు సిద్ధం అయ్యేవరకూ ఆగు." అని అన్నాడు లవణుడు.

"నేను ఇక్కడ ఉండగా నువ్వు ఎక్కడకు పోతావు. ఇప్పుడే ఇక్కడే యుద్ధం చెయ్యి. చేత చిక్కిన శత్రువును విడిచి పెట్టడానికి నేను వెర్రివాడను కాను. నీ మాటలను బట్టి చూస్తే నీవు నాకే కాదు రామునికి

కూడా శత్రువు. నిన్ను విడువకూడదు. నిన్ను ఇప్పుడే చంపుతాను.కాచుకో. ఈ లోకమును ఇప్పుడే తనివిదీరా చూచుకో! " అని అన్నాడు శత్రుఘ్నుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము అరవై ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

## ఉత్తర కాండము

## అరవై తొమ్మిదవ సర్గ.

"నిన్ను చంపడానికి నాకు వేరే ఆయుధము ఎందుకురా! నిన్ను ఇప్పుడే చంపుతాను" అంటూ లవణుడు రెండు అరిచేతులను చరచుకుంటున్నాడు.

"ఒరేయ్! నీవు ఎంతో మందిని చంపాను అని ప్రగల్భాలు పలుకుతున్నావు కదా! అప్పుడు నేనుపుట్టలేదు. ఇప్పుడు నేను నీ ఎదుట ఉన్నాను. ఇంక చావడమే కానీ చంపడం నీ తరం కాదు. నా బాణాలదెబ్బకు యమలోకం దాకా పరుగెత్తు. రాముడు రావణుని చంపుతున్నప్పుడు ఆకాశంలో నిలిచి దేవతలు, ఋషులు చూచి ఎలా ఆనందించారో అలాగే నేను నిన్ను చంపుతుంటే ఆకాశం నుండి దేవతలు గంధర్వులు చూచి ఆనందిస్తారు. నీవు నా బాణముల దెబ్బలు తిని నేలకూలగానే ఈ లోకం అంతా ఆనందిస్తుంది. నా ధనుస్సు నుండి వెలువడ్డ బాణాలు నీ గుండెల్లో దిగబడి నిన్ను హతమారుస్తాయి. " అని

అన్నాడు శత్రుఘ్నుడు.

ఇన్నాళ్లు తనను చూచి గడగడవణికిన వాళ్లే కానీ ఎదురు నిలిచి మాట్లాడిన వాళ్లు లేరు. అందుకని లవణునికి రోషం పెల్లుబికింది. మారుమాట్లాడకుండా పక్కనే ఉన్న ఒక పెద్ద వృక్షమును పెరికి శత్రుఘ్నుని గుండెలకు గురిపెట్టి విసిరాడు. శత్రుఘ్నుడు తన బాణములతో ఆ వృక్షమును ముక్క ముక్కలుగా నరికాడు. లవణుడు ఈ సారి రెండు చేతులతో వృక్షములను పెకలించి శత్రుఘ్నుడు మీదికి విసిరాడు. శత్రుఘ్నుడు తన మీదికి వస్తున్న వృక్షములను తన బాణములతో ముక్కల కింద నరుకుతున్నాడు. అంతే కాకుండా శత్రుఘ్నుడు లవణుని మీద బాణములను వర్షము మాదిరి కురిపించాడు. ఆ బాణముల బారి నుండి తప్పించుకున్న శత్రుఘ్నుడు మరొక వృక్షమును పెరికి శత్రుఘ్నుని తల మీద మోదాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక శత్రుఘ్నుడు కింద పడ్డాడు. లవణుడు పెద్దగా అట్టహాసం చేసాడు.

శత్రుఘ్నుడు పడి పోగానే పరుగు పరుగున తన గృహమునకు పోయి తన దివ్యమైన శూలమును తెచ్చుకొనే అవకాశము ఉన్నా కూడా లవణుడు ఆ అవకాశాన్ని వినియోగించుకోలేదు.  శత్రుఘ్నుని లెక్కచేయలేదు. శత్రుఘ్నుడు తన చేతిలో హతం అయ్యాడు అని అనుకున్నాడు. తాను వేటాడి తెచ్చిన మృగములను పైకి ఎత్తుకున్నాడు. ఇంతలో మూర్ఛనుండి తేరుకున్న శత్రుఘ్నుడుపైకి లేచి ధనుర్బాణములను ధరించి నగర ద్వారమునకు అడ్డంగా నిలబడ్డాడు. రాముడు తనకు ఇచ్చిన అస్త్రమును విల్లుకు సంధించాడు. ఆ అస్త్రము ఎర్రగా భగా భగా

మండుతూ ఉంది. ఆ అస్త్రమును లవణుని మీదికి ప్రయోగించడానికి సిద్ధంగా ఉన్నాడు. . ఆ దివ్యమైన అస్త్రము ప్రళయాగ్ని వలె మండుతూ ఉండడం చూచి ప్రాణి కోటి గడగడలాడింది. దేవతలు గంధర్వులు మునులు అందరూ బ్రహ్మ దగ్గరకు వెళ్లారు. లోకాలు నశించిపోతాయేమో అని అందరూ భయపడ్డారు. వారు బ్రహ్మతో ఇలా అన్నారు. "ఓ బ్రహ్మదేవా! ముల్లోకములకు ప్రళయం సంభవించినట్టు ఉంది. ఏమిటీ విపరీతము. లోకాలన్నీ భగభగ మండుతున్నాయి. ఇదివరకు ఇంతటి ప్రళయాన్ని మేము ఎప్పుడూ చూడలేదు."అని అన్నాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు జరిగిన విషయం వారితో చెప్పాడు. "లవణుడు అనే లోక కంటకుని చంపడానికి రాముని తమ్ముడు శత్రుఘ్నుడు దివ్యమైన అస్త్రమును సంధించాడు.దాని తేజస్సుతోనే ఇంతటి ప్రళయం సంభవించింది. ఇది మహావిష్ణువు బాణము. మహాశక్తివంత మైనది. పూర్వము విష్ణువు మధు, కైటభులను వధించడానికి ఈ అస్త్రమును సృష్టించాడు. ఈ అస్త్రమును గురించి విష్ణువు ఒక్కడికే తెలుసు. అసలు ఈ అస్త్రము విష్ణు స్వరూపము. మీరందరూ వెళ్లి ఆ దివ్యమైన అస్త్రముతో లవణాసురుడు ఎలాచస్తాడో చూడండి." అని అన్నాడు.

ఆ మాటలు విన్న దేవతలు, గంధర్వులు శత్రుఘ్నుడు లవణుడు యుద్ధం చేసే ప్రదేశానికి వచ్చారు. ఆకాశంలో నిలబడి వారి యుద్ధమును చూస్తున్నారు. శత్రుఘ్నుడు పెద్దగా సింహనాదం చేసాడు. లవణుని యుద్ధానికి పిలిచాడు. లవణుడు శత్రుఘ్నునితో యుద్ధానికి సిద్ధం

అయ్యాడు. శత్రుఘ్నుడు తనకు రాముడు ఇచ్చిన దివ్యాస్త్రమును విల్లుపై ఎక్కుపెట్టి, వింటి నారిని ఆకర్ణాంతము లాగి ఆ అస్త్రమును లవణుని గుండెలకు గురిపెట్టి విడిచాడు.  క్షణంలో ఆ దివ్యాస్త్రము లవణుని గుండెలను చీల్చుకొని భూమిలోకి ప్రవేశించింది. మరలా అదేవేగంతో వెనుకకు వచ్చి శత్రుఘ్నుని అమ్ములపొదిలోకి చేరింది. యుగయుగాల నుండి పరమేశ్వరుడు ప్రసాదించిన శూలముతో  వేలకు వేలమందిని చంపిన లవణాసురుడు, శత్రుఘ్నుడు ప్రయోగించిన దివ్యాస్త్రము దెబ్బకు గుండెలు పగిలి పర్వతము మాదిరి నేలకూలి మరణించాడు.

లవణుని మృతితో,  అప్పటి దాకా లవణుని పూజామందిరములో పూజలందుకుంటున్న ఆ దివ్యమైన పరమేశ్వరుని శూలము, పైకి ఎగిరి కైలాసము చేరుకొని పరమేశ్వరునిలో లీనం అయింది. దేవతలు, గంధర్వులు,ఋషులు శత్రుసంహారం చేసిన శత్రుఘ్నుని వేనోళ్లపొగిడారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము అరవై తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## డెబ్బయ్యవ సర్గ.

లవణాసురుని సంహారంతో దేవతాగణములు హర్షం ప్రకటించాయి. స్వయంగా దేవేంద్రుడు శత్రుఘ్నునితో ఇలా అన్నాడు. “కుమారా! మా అదృష్ట వశాత్తు నీవు లవణుని చంపి విజయుడవు అయ్యావు. లవణుని బారి నుండి ముల్లోకములకు విముక్తి కల్పించావు. నీకు ఏదైనా వరం ఇవ్వాలని అనుకుంటున్నాను. కోరుకో!” అని అన్నాడు. అప్పుడు శత్రుఘ్నుడు ఇంద్రునితో ఇలా అన్నాడు. “మహేంద్రా! ఈ మధు నగరాన్ని ఇప్పటిదాకా ఈ లవణాసురుడు పరిపాలించాడు. ఈ మధు నగరాన్ని నాకు రాజధానిగా చెయ్యండి.” అని అడిగాడు. దానికి ఇంద్రుడు సమ్మతించాడు. శత్రుఘ్నుడికి కోరిన వరాలు ఇచ్చి ఇంద్రుడు దేవతలు స్వర్గానికి వెళ్లిపోయారు. శత్రుఘ్నుడు శ్రావణమాసంలో మధురానగరానికి పట్టాభిషిక్తుడు అయ్యాడు. అప్పటి నుండి శత్రుఘ్నుడు మధు నగరమును రాజధానిగా చేసుకొని లవణాసురుని రాజ్యమును జనరంజకంగా పరిపాలించాడు. 12 సంవత్సరాలు గడిచాయి. ఈ 12 సంవత్సరములలో ప్రజలు సుఖసంతోషాలతో జీవించారు.

ఇక్కడ వాల్మీకి కూడా మధు నగరాన్ని మధురాపురీ అనిరాసాడు.

తస్యబుద్ధి:సముత్పన్నా నివేశ్య మధురాం పురీమ్
రామపాదం నిరీక్షేహం వర్షే ద్వాదశ ఆగతే.

మధురాపురమును ఏర్పరిచిన 12 సంవత్సరముల తరువాత శత్రుఘ్నునికి రాముని చూడాలని అనిపించింది. (యమునా నదీ తీరంలో ఉన్న ప్రస్తుత

మధుర అప్పటి మధురానగరం అయి ఉండవచ్చు అనడంలో సందేహం లేదు.ఈ మధురా నగరమే నాటి కంసుని రాజధాని. శ్రీకృష్ణుని జన్మస్థలము.) శత్రుఘ్నుడు వెంటనే అయోధ్యకు బయలుదేరాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము డెబ్బదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## డెబ్బది ఒకటవ సర్గ.

లవణాసురుని సంహరించి, మధురా నగరమును రాజధానిగా చేసుకొని పన్నెండు సంవత్సరములు పరిపాలించిన తరువాత శత్రుఘ్నుడు రాముని చూడవలెనని కొద్దిగా సైన్యమును వెంటతీసుకొని అయోధ్యకు బయలుదేరాడు. ఏడు రోజుల తరువాత శత్రుఘ్నుడు గంగాతీరంలో ఉండే వాల్మీకి ఆశ్రమానికి చేరుకున్నాడు. (అప్పటికి  వాల్మీకి ఆశ్రమంలో పెరుగుతున్న కుశలవులు 12 ఏళ్ల వాళ్లు అయ్యారు) శత్రుఘ్నుడు ఆ రాత్రికి వాల్మీకి ఆశ్రమంలో విడిది చేసాడు. శత్రుఘ్నుడు వాల్మీకి వద్దకు పోయి అభివాదముచేసాడు ఆయన ఇచ్చిన అర్ఘ్యము పాద్యము స్వీకరించాడు.

వాల్మీకి శత్రుఘ్నుని చూచి ఇలా అన్నాడు. "కుమారా! నీవు లవణాసురుని చంపావని తెలిసి చాలా సంతోషించాను. ఎందుకంటే లవణాసురుడు ఇప్పటిదాకా వేలకొలది రాజులను, వారి సైన్యములను

నిర్మూలించాడు. అతడిని జయించేవాడు లేడు అనుకుంటూ ఉండగా నువ్వు ఉపాయంతో లవణుడిని సంహరించావు. ముల్లోకములకు శాంతి చేకూర్చావు. రావణ వధ తరువాత అటువంటి రాక్షసుని నీవు చంపావు. నీవు లవణాసురునితో యుద్ధం చేస్తున్నప్పుడు నేను ఇంద్ర సభలో ఉన్నాను. అక్కడి నుండి మీరిరువురి యుద్ధమును చూచాను." అని చెప్పి వాల్మీకి శత్రుఘ్నుని శిరస్సును ఆఘ్రాణించి ఆశీర్వదించాడు.

ఆ రాత్రికి శత్రుఘ్నుడు వాల్మీకి మహర్షి ఇచ్చిన ఆతిథ్యమును స్వీకరించాడు. తీరిగ్గా కూర్చుని వాల్మీకి రచించిన రాముని కథను మునికుమారులు గానం చేస్తుంటే కర్ణపేయంగా విన్నాడు. రామకథ ఎలా జరిగిందో యథాతథంగా మునికుమారులు గానం చేస్తుంటే శత్రుఘ్నుని కళ్లవెంట నీళ్లుకారు తున్నాయి. రామ కథ మరలా తన కళ్ల ముందు జరుగుతున్నట్టు భావించాడు. శత్రుఘ్నుని వెంట ఉన్న మంత్రులు సేనాపతులు కూడా రామ కథ తమ ఎదుట మరలా జరుగుతున్నట్టు భావించారు.

"జరిగింది జరిగినట్టు రామ కథను గానం చేస్తున్నారు. మనం కలగంటున్నామా!" అని ఆశ్చర్యపోయారు. వారు శత్రుఘ్నుని వద్దకు పోయి "మహారాజా! ఈ రామకథ ఉన్నది ఉన్నట్టు జరిగింది జరిగినట్టు ఎలా రాయబడింది, ఎలా గానం చేయబడిందో వాల్మీకి మహర్షిని అడిగి తెలుసుకోండి." అని అడిగారు.

దానికి శత్రుఘ్నుడు వారితో ఇలా అన్నాడు. "మనం వారికి

అతిథులుగా వచ్చాము. రామ కథ మృదుమధురంగా గానం చేస్తుంటే విన్నాము. అంతే కానీ ఇలాంటి విషయాలు అడగకూడదు. మునుల ఆశ్రమములలో ఎన్నోవిషయాలు జరుగుతూ ఉంటాయి. వాటి గురించి మనం అడగడం బాగుండదు." అని మందలించాడు. తరువాత శత్రుఘ్నుడు వాల్మీకి మహర్షికి నమస్కరించి తనకు ఏర్పరిచిన శయనాగారమునకు వెళ్లిపోయాడు.(ఇప్పటి దాకా వాల్మీకి రామాయణ గాధను ఎవరు గానం చేసారో చెప్పలేదు. సంగీత బద్ధంగా గానం చేసారు అన్నాడే గానీ, ఎవరు గానం చేసారు అన్న విషయాన్ని సస్పెన్సులో ఉంచాడు వాల్మీకి.)

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము డెబ్బైఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## డెబ్బైరెండవ సర్గ.

శత్రుఘ్నుడు తన శయ్యు మీద పడుకున్నాడే కానీ ఆ మృదుమధురగానం వినిపిస్తూనే ఉంది. చెవిలో మార్మోగుతూనే ఉంది. శత్రుఘ్నుడుకి ఎంతకూ నిద్ర రాలేదు. ఆ గానం చేసింది ఎవరా అని ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాడు. మరునాడు ఉదయం శత్రుఘ్నుడు వాల్మీకి వద్దకు పోయి "ఓ మహర్షీ! నాకు రాముని చూడవలెనని కోరికగా ఉంది. అందుకని నాకు అయోధ్యకు వెళ్లడానికి

అనుమతి ఇవ్వండి" అని అడిగాడు. వాల్మీకి శత్రుఘ్నుని ఆశీర్వదించి అతను అయోధ్యకు పోవడానికి అనుమతి ఇచ్చాడు. శత్రుఘ్నుడు వెంటనే తన సైన్యముతో అయోధ్యకు బయలుదేరాడు.

అయోధ్యలో ప్రవేశించగానే శత్రుఘ్నుడు రాముని మందిరమునకు వెళ్లాడు. రాముని చూడగానే శత్రుఘ్నుడు రెండు చేతులు జోడించి నమస్కరించి ఆయనతో ఇలా అన్నాడు. "రామా! నీ ఆజ్ఞను సారము నేను మధుపురమునకు పోయి, లవణునితో యుద్ధము చేసి అతనిని సంహరించాను. తరువాత నాకు దేవేంద్రుడు మధుర పురము అనే రాజధానిని నిర్మించి ఇచ్చాడు. ఆ నగరమును రాజధానిగా చేసుకొని నేను లవణుని రాజ్యమును 12 సంవత్సరములు పరిపాలించాను. నిన్ను చూడవలెనని కోరికతో వచ్చాను. రామా! నిన్ను వదిలి నేను ఉండలేను. నేను నీ వద్దనే ఉంటాను." అని అన్నాడు.

దానికి రాముడు ఇలా అన్నాడు. "నీవు మధురా నగరమునకు రాజువు. నీవు అక్కడే ఉండాలి. నన్ను చూడటానికి వచ్చావు కాబట్టి కొన్ని రోజులు ఉండి వెళ్లు. నన్ను చూడాలని అనిపించినప్పుడల్లా అయోధ్యకు వచ్చి నన్ను చూచి వెళుతూ ఉండు. క్షత్రియులకు ప్రజాపాలనే విద్యుక్త ధర్మము. క్షత్రియులు తమ స్వధర్మమును మరిచిపోరాదు. నీవు లేకపోతే రాజ్యములో అరాచకము ప్రబలుతుంది. నీ వలన ప్రజలు కష్టాల పాలవుతారు. కాబట్టి ప్రజాపాలనే నీ కర్తవ్యము. నాకు కూడా నిన్ను నా వద్దనే ఉంచుకొనవలెనని ఉంది. కానీ మనకు ప్రజాపాలన ముఖ్యం కదా. అందువలన నీవు ఇక్కడ ఏడు రోజులు ఉండి తరువాత నీ సేనలతో

మధురా పురికి వెళ్లు." అని అన్నాడు రాముడు.

శత్రుఘ్నుడు రామునికి నమస్కరించి "అలాగే చేస్తాను రామా!" అని అన్నాడు. రాముని ఆజ్ఞ ప్రకారము ఏడు రాత్రులు అయోధ్యలో గడిపి శత్రుఘ్నుడు మధురా పురికి ప్రయాణం అయ్యాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము డెబ్బది రెండవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
డెబ్బది మూడవ సర్గ.

నిరాఘాటంగా జనరంజకంగా సాగుతున్న రాముని పాలనలో ఒక చిన్న అపశృతి దొర్లింది. ఒక రోజు ఒక బ్రాహ్మణుడు తన కుమారుని శవమును తీసుకొని రాముని మందిర ద్వారము దగ్గరకు వచ్చాడు. రాజ ద్వారము వద్ద కూర్చుని కొడుకును తల్చుకుంటూ ఏడుస్తున్నాడు. "నేను ఏ జన్మలో ఏమి పాపం చేసానో ఏమో పసి వయస్సులోనే నా కుమారుని పోగొట్టుకున్నాను. నా ఒక్కగానొక్క కుమారుడు బాల్యములోనే మరణించాడు. ఈ పుత్రశోకము నేను నా భార్య భరించలేము. కుమారుని కోసరం శోకించి శోకించి నేను నా భార్యకూడా మరణిస్తాము. నేను ఏ నాడూ ఎవరికీ ఎటువంటి అపకారమూ చేయలేదు. అబద్ధం చెప్పలేదు. ఎవరినీ హింసించలేదు. ఎవరినీ చంపలేదు. మరి నాకు ఇటువంటి

పుత్రశోకము ఎందుకు  కలిగిందో తెలియదు. నా కుమారుడు నాకు కర్మకాండలు చేస్తాడని, ప్రతి సంవత్సరము నాకు శ్రాద్ధము పెడతాడనీ కలలు కన్నాను. అటువంటిది నేను నా కుమారునికి కర్మకాండలు నిర్వర్తించాల్సిన ఖర్మ దాపురించింది. రాముడు పరిపాలించే రాజ్యములో ఇటువంటి ఘోరములు జరగడం వింతగా ఉంది. ఇదివరకు ఎప్పుడూ పెద్ద వాళ్లు బతికి ఉండగా చిన్న వాళ్లు మరణించడం ఎరుగము. అటువంటిది నా విషయంలోనే ఇలా జరిగింది.  దీనికి కారణం ఎక్కడో ఏదో పాపం జరిగింది. అది రాముడు చేసిన పాపమో లేక రామరాజ్యంలో జరుగుతున్న పాపమో తెలియదు.

కాబట్టి ఓ రామా! నీవు నీ రాజ్యములో జరుగుతున్న పాపమును పరిహరించి మరణించిన నా కుమారుని బతికించు. లేకపోతే నేను నా భార్య ఇక్కడే నిరాహారులుగా ఉండి మరణిస్తాము. బ్రహ్మహత్యాపాతకము నీకు చుట్టుకుంటుంది. నువ్వు మాత్రము నీ సోదరులతో సుఖంగా ఉండు. దశరథుని పాలనలో ఇలాంటి ఘోరం జరగ లేదు. ఇదిగో రాముడు వచ్చాడు. ఇలాంటి ఘోరాలు జరుగుతున్నాయి. రాముడి పాలనలో అయోధ్య అనాధ అయింది. రాముడు శాస్త్రప్రకారము పరిపాలన సాగిస్తే ఇలాంటి అనర్ధాలు జరగవు కదా! రాజు పాపాలు చేస్తేనే ఇటువంటి అకాల మరణాలు సంభవిస్తాయి. రాముని కాలంలో ప్రజలకు రక్షణ లేకుండా పోయింది. అకృత్యాలు ప్రబలిపోయాయి. ఇది తప్పక రాజు చేసిన దోషమే. సందేహము లేదు. అందు చేతనే రాముని రాజ్యములో ఇటువంటి అకాల మరణాలు, బాల్య మరణాలు సంభవిస్తున్నాయి." అని ఆ బ్రాహ్మణుడు పరి పరి విధాల

రాముని,రాముని పాలననూ నిందిస్తూ శోకిస్తున్నాడు.
(రాముని పాలనలో ప్రజలు 10,000 సంవత్సరాలు బాగానే ఉన్నారు. సుఖపడ్డారు. ప్రజల కోసరం రాముడు తన భార్యనే వదులుకున్నాడు. కానీ, ఈ ఒక్క సంఘటనతో అంతా మట్టికొట్టుకుపోయింది. ఈనాడు కూడా అంతే కదా! ప్రభుత్వము ఎన్ని మంచి పనులుచేసినా ఎవరూ పట్టించుకోరు. ఏ చిన్న సంఘటన జరిగినా ప్రభుత్వ వైఫల్యము, పోలీసుల అసమర్థత అని ప్రతిపక్షాలు దుమ్మెత్తిపోస్తుంటాయి. మంచి జరిగితే పట్టించుకోరు. ఏ చిన్న తప్పుజరిగినా భూతద్దంలో చూస్తారు. అమాయకులైన అమ్మాయిల మీద యాసిడ్ దాడులు చేస్తే ప్రజలకు రక్షణ లేదు అంటారు. ఆ యాసిడ్ పోసిన వాడిని నాలుగు తగిలిస్తే, పౌరహక్కుల ఉల్లంఘన అంటారు. నాడూ నేడూ ఇదే వరస!)

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము డెబ్బది మూడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## డెబ్బది నాలుగవ సర్గ.

బ్రాహ్మణ బాలుడు మరణించడం, ఆ బ్రాహ్మణుడు శోకించడం తనను నిందించడం రాముడికి తెలిసింది. రాముడు దు:ఖంతో క్రుంగిపోయాడు. వెంటనే సభ ఏర్పాటు చేసాడు. రాజ పురోహితులను మంత్రులను,పురప్రముఖులను పిలిపించాడు. వారితో సమాలోచనలు

జరిపాడు.  ఆ సభకు వసిష్ఠుడు, మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు,జాబాలి, గౌతముడు, నారదుడు విచ్చేసారు. రాముడు ఆ బ్రాహ్మణుని సమస్యను అందరికీ వివరించాడు. "ఆ బ్రాహ్మణుడు తన కుమారుని పునరుజ్జీవితుని చెయ్యమని మొండి పట్టు పట్టాడు. ఏమిచెయ్యాలి. దీనికి తరుణోపాయము ఏమిటి?" అని అడిగాడు. అప్పుడు నారదుడు లేచి ఇలా అన్నాడు.

"రాజా! ఆ బ్రాహ్మణ కుమారునికి అకాల మరణం ఎలా సంప్రాప్తించిందో వివరిస్తాను. నేను చెప్పినది విని, నీకు తోచినది చెయ్యి. కృతయుగములో కేవలము బ్రాహ్మణులు మాత్రమే తపస్సు చేసుకొనే వారు. బ్రాహ్మణులు కాని వారు తపస్సు చేసుకొనే వారు కాదు. అప్పుడు ధర్మము నాలుగు పాదములతో నడిచేది. అకాల మరణాలు లేవు. సర్వమూ బ్రహ్మ మయంగా ఉండేది. త్రేతాయుగంలో యుగ ధర్మము మారింది. బ్రాహ్మణులతో పాటు క్షత్రియులు కూడా తపస్సు చేస్తున్నారు. కృతయుగములే బ్రాహ్మణులకే పరిమితమైన తపస్సు త్రేతాయుగంలో క్షత్రియులకు కూడా ఆచరణయోగ్యమయింది. కాని త్రేతాయుగములో తపస్సు చేసిన క్షత్రియులు, కృతయుగములో ఉన్న తాపసులైన బ్రాహ్మణుల కంటే  తక్కువ వారే!  ఇంకా వివరంగా చెప్పాలంటే  కృతయుగములో బ్రాహ్మణులు తమ తపస్సు చేతా, వీరత్వము చేతా అధికంగా ఉండేవారు. క్షత్రియ జాతి బ్రాహ్మణుల కన్నా తక్కువగా ఉండేవారు. (అందుకే క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రాహ్మణులకే పరిమితమైన  బ్రహ్మర్షి పదవి కోసరం  నానా తంటాలు పడ్డాడు.)

త్రేతాయుగంలో క్షత్రియులు కూడా తపస్సు చేయడంతో రెండు జాతులూ తపస్సులోనూ, వీరత్వములోనూ సమానమయ్యాయి. కాని కృతయుగ బ్రాహ్మణ జాతి కన్నా త్రేతాయుగ బ్రాహ్మణులు కింది వరసలో ఉండేవారు. ఆ కారణం చేత అందరూ కలిసి అందరికి యోగ్యమైన, సమ్మత మైన చాతుర్వర్ణ వ్యవస్థను ఏర్పాటు చేసారు. తరువాత త్రేతాయుగములో అధర్మము ఒక పాదమును మోపింది. ప్రజలలో అసత్యములు పలకడం ఎక్కువ అయింది. దానికి అనుగుణంగా త్రేతాయుగములో ప్రజల ఆయు:ప్రమాణము కూడా తగ్గిపోయింది. ఒక పక్క అసత్యములు పలకడం అలవాటుగా మారినప్పటికినీ, లోకములో ప్రజలు సత్యము,ధర్మముల మీద ఆసక్తి చూపడం మానలేదు. మంచి పనులను చేయడంలో ఆసక్తి చూపుతుండేవారు.

యుగధర్మము ప్రకారము త్రేతాయుగములో బ్రాహ్మణులు, క్షత్రియులు మాత్రమే తపస్సు చేసేవారు, ఇతర జాతుల వారు వారికి తగిన సామగ్రిని, సేవలను సమకూర్చేవారు. బ్రాహ్మణులకు, క్షత్రియులకు సేవ చేయడం వైశ్యులు, శూద్రులు తమ ధర్మంగా భావించేవారు. శూద్రులు, బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు సేవ చేయడం తమ ధర్మంగా భావించేవారు. కాల క్రమేణా వైశ్య, శూద్రులు తమకు నిర్దేశించిన ధర్మం తప్పడం, అసత్యములు ఆడటం మొదలు పెట్టారు. దాని ప్రభావంతో బ్రాహ్మణ క్షత్రియులలో కూడా వారి తేజము తగ్గిపోయింది. అధర్మం తన ప్రభావం చూపసాగింది.

తరువాత అధర్మము తన రెండవ పాదం కూడా భూమి మీద మోపింది. అప్పుడు ద్వాపరము మొదలయింది. ద్వాపర యుగంలో అబద్ధాలు ఆడటం, ధర్మం తప్పి చరించడం ఎక్కువ అయింది. ఒకరికి ఒకరు మోసం చేసుకోవడం మితిమీరి పోయింది. ద్వాపరంలో వైశ్యులు కూడా తపస్సు చేయడం మొదలు పెట్టారు. ఈ ప్రకారంగా మూడు యుగములలో మూడు వర్ణములలో తపస్సు వృద్ధిపొందింది. కాబట్టి కృత,త్రేత,ద్వాపర యుగములలో కూడా శూద్రులకు తపస్సు చేసే అధికారము సంక్రమించలేదు. అదీ కాకుండా శూద్రులు తపస్సు చేయడానికి  ఎన్నడూ ఉద్యుక్తులు కాలేదు.  కలి యుగంలో శూద్రులుకూడా  తపస్సు చేస్తారేమో చూడాలి.

అందుచేత రామా!  ద్వాపరంలో కూడా శూద్రులు తపస్సు చేయడం అధర్మము. ఈ కారణంగా నీ రాజ్యంలో ఎక్కడో అధర్మము జరుగుతూ ఉంది. ఎవరో శూద్రుడు తపస్సు చేస్తూ ఉండిఉంటాడు. అందువలననే ఇంతటి అధర్మము జరిగింది. తండ్రి బతికి ఉండగానే బాలుడు మృతి చెందాడు. ఏ రాజ్యములో నైనా ఏ పౌరుడైనా అధర్మమునకు పాల్పడ్డా, చేయకూడని పని చేసినా, ఆ రాజ్యములో సంపద ఉండదు.  ఆ రాజ్యమును ఏలే రాజు నరకంలో పడతాడు. ఎందుకంటే, రాజ్యములో ఉన్న ప్రజలు చేసే పాపపుణ్యాలలో రాజుకు ఆరవ వంతు వచ్చి చేరుతుంది. పౌరులు చేసిన పుణ్యములో, వారు ఆర్జించిన ధనములో  ఆరవ వంతు స్వీకరిస్తున్న నీకు నీపౌరులను రక్షించవలసిన బాధ్యత ఉంది. కాబట్టి నువ్వు నీ రాజ్యమంతా వెదికి నీ రాజ్యములో ఎవరు ఎక్కడ అధర్మానికి పాల్పడుతున్నారో, ఎవరు చేయకూడని పని చేస్తున్నారో

కనిపెట్టి వారిని శిక్షించు. అదే నీ బాధ్యత. అప్పుడే అకాల మరణం పొందిన ఈ బాలుడు కూడా జీవిస్తాడు."అని అన్నాడు నారదుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము డెబ్బది నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

డెబ్బది ఐదవ సర్గ.

అధర్మము ఎక్కడ జరుగుతుందో తెలుసుకోడానికి రాముడు స్వయంగా బయలుదేరాడు. పుష్పకమును తలచుకున్నాడు. పుష్పకము వచ్చి రాముని ఎదుట నిలిచింది. రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! నీవు పోయి పుత్రశోకముతో బాధపడుతున్న ఆ బ్రాహ్మణ దంపతులను ఓదార్చు. ఆ బాలుని శవముచెడిపోకుండా తైలములు, సుగంధ ద్రవ్యములు పూసి ఒక ద్రోణిలో భద్రపరచు. ఎట్టి పరిస్థితులలోనూ ఆ బాలుని శరీరము ఏ భాగానికి ఆ భాగము విడిపోకుండా చూడు. (డికంపోజ్). నగర రక్షణకు లక్ష్మణుని, భరతుని నియమించాడు. తరువాత రాముడు సభికులకు, మునులకు, కులగురువుకు నమస్కరించి పుష్పక విమానము ఎక్కాడు. పశ్చిమదిక్కుగా పోనిచ్చాడు. అక్కడనుండి ఉత్తర దిక్కుకు తరువాత తూర్పు దిక్కుకు వెళ్లాడు. తరువాత దక్షిణ దిక్కుగా మళ్లాడు. దక్షిణ దిక్కు అంతా వెతుకుతున్నాడు. అక్కడ శైవల పర్వతము పక్కనే ఉన్న ఒక సరస్సును చూచాడు. ఆ సరస్సులో

తల కిందికి పెట్టి కాళ్లు పైకెత్తి తపస్సు చేస్తున్న ఒక ఋషిని చూచాడు. వెంటనే పుష్పకమును దిగి ఆయన వద్దకు వెళ్లాడు. ఆయనకు నమస్కరించాడు. "మునివర్యా! నేను ఈ రాజ్యమును ఏలే రాజును. నా పేరు రాముడు. తమరు ఎవరు! తమరి నామధేయము, కులగోత్రములు ఏమి? తమరు ఇంత ఘోర తపస్సు చేయడం స్వర్గసుఖాలుపొందడం కోసరమేనా! లేక వేరుకోరికలుఉన్నాయా! తమరు ఏకోరిక కోరి ఈ తపస్సు చేస్తున్నారో తెలుసుకో గోరుతున్నాను.నీవు నాలుగు వర్ణములలో ఏ వర్ణమునకు చెందినవాడివి. నిజం చెప్పండి." అని ఆ ముని వివరాలు అడిగాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము డెబ్బది అయిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## డెబ్బది ఆరవ సర్గ.

రాముని చూచి కూడా, రాముని మాటలు విని కూడా ఆ ముని తనతపస్సు మానలేదు. తలకిందులుగా ఉండి రామునికి ఇలాసమాధానం చెప్పాడు. "రాజా! నేను శూద్రుడను. నా పేరు శంబూకుడు. నాకు ఈ శరీరంతో స్వర్గమునకు పోవాలని కోరిక. దేవ లోకమును జయించవలెనని కోరిక. అందునిమిత్తము ఈ తపస్సు చేస్తున్నాను." అని అన్నాడు.

రాముడు మారు మాట్లాడలేదు. తన ఖడ్గము తీసి ఆ ముని శిరస్సును ఖండించాడు. శూద్రజాతికి చెందిన ఆ ముని మరణించాడు. ఆకాశమునుండి దేవతలు పుష్పవృష్టి కురిపించారు. దేవతలు రాముని వద్దకు వచ్చి "రామా! నీవు ధర్మమును కాపాడావు. బొందితో స్వర్గము ఎవరికీ సాధ్యము కాదు. నీకు ఏం వరం కావాలో కోరుకో!" అని అన్నాడు. వెంటనే రాముడు "ఇతడు స్వర్గమును చేరుకోడానికి ఈ తపస్సు చేస్తున్నాడు. అతని కోరిక నెరవేర్చండి ఇతనికి శాశ్వత స్వర్గలోక నివాసము ప్రసాదించండి." అని అన్నాడు. "రామా! నీచేతిలో మరణంచడంతోనే అతనికి స్వర్గలోక ప్రవేశ అర్హత వచ్చింది. మేము ఇతనిని స్వర్గమునకు తీసుకొని పోయి అతనికోరిక నెరవేరుస్తాము." అని అన్నారు. వెంటనే రాముడు దేవతల పక్కన ఉన్న ఇంద్రుని చూచి "మహేంద్రా! ఇతడు తపస్సు చేయడం మూలాన అధర్మము తలెత్తి ముని కుమారుడు మరణించాడు. నేను ఆ కుమారుని బతికిస్తాను అని ఆ బ్రాహ్మణునికి మాట ఇచ్చాను. నా మాట వృథా కారాదు. కాబట్టి, తమరు నా మీద దయయుంచి ఆ ముని కుమారుని బతికించండి." అని అన్నాడు. "రామా! దీని కోసరం నీవు ఇంతగా అడగవలెనా! ఈ ముని మరణించిన క్షణమే ఆ బాలుడు బతికాడు. తోటిపిల్లలతో ఆడుకుంటున్నాడు. ఇంక మేము వెళ్లి వస్తాము. మీరు ఇక్కడకు దగ్గరలోనే ఉన్న అగస్త్య ఆశ్రమమునకు వెళ్లి ఆయన దర్శనము చేసుకోండి.శుభం జరుగుతుంది. అగస్త్యుడు 12 సంవత్సరముల దీక్ష పట్టాడు. ఆయనదీక్ష సమాప్తము అయింది. మేము కూడా ఆ మహామునిని కలుసుకొని అభినందించడానికి వెళుతున్నాము. మీరు కూడా ఆ మహామునిని సందర్శించండి."అని అన్నారు.

రాముడు దేవేంద్రుడికి, దేవతలకు నమస్కరించాడు. పుష్పకము ఎక్కాడు. దేవతలు వెళుతున్న విమానము వెనకనే తన పుష్పకము మీద రాముడు అగస్త్యమహాముని వద్దకు వెళ్లాడు.

అగస్త్యుడు తన ఆశ్రమమునకు వచ్చిన దేవేంద్రునకు, దేవతలకు, అర్ఘ్యము పాద్యము ఆసనములు ఇచ్చి సత్కరించాడు. దేవతలందరూ అగస్త్యుని ఆతిధ్యమును స్వీకరించి, ఆయనను అభినందించి స్వర్గమునకు వెళ్లిపోయారు. తరువాత రాముడు తన పుష్పకము దిగి అగస్త్యుని వద్దకు పోయి ఆయనకు నమస్కరించాడు. అగస్త్యుడు రామునికి స్వాగత సత్కారాలు చేసాడు. అగస్త్యుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! నా పూర్వపుణ్యవశమున నాకు నీ దర్శనభాగ్యము కలిగింది. నీవు పూజించ తగ్గ వాడవు. నిత్యము నా హృదయంలో నీవే ఉన్నావు. నీవు తన ధర్మమును మరిచి తపస్సు చేస్తున్న ఆ శూద్రుని సంహరించి, ఆ బాలుని బతికించావు. నీవు ఈ రాత్రికి ఇక్కడే ఉండి విశ్రాంతి తీసుకో. రేపు అయోధ్యకు వెళ్లవచ్చును." అని అన్నాడు అగస్త్యుడు. తరువాత రామునికి ఒక దివ్యమైన ఆభరణమును ఇచ్చాడు.

"రామా! ఈ దివ్యమైన ఆభరణము పూర్వము విశ్వకర్మ తయారు చేసాడు. దీనిని స్వీకరించు. దీనిని నేను ఉపయోగించలేదు. అందుకనే నీకు ఇస్తున్నాను. స్వీకరించు" అని అన్నాడు.

దానికి రాముడు ఇలా అన్నాడు. "ఓ మహర్షి! క్షత్రియులకు ఒకరికి ఇవ్వడం ధర్మం. బ్రాహ్మణులకు తీసుకోవడం ధర్మం. క్షత్రియుడనైన నేను ఇతరులు ఇచ్చినది ఎలా స్వీకరించను. నేను మీకు ఇవ్వాల్సింది పోయి మీవద్దనుండి కానుకలు స్వీకరించడం ధర్మం కాదు కదా! బ్రాహ్మణుల వద్దనుండి కానుకలు తీసుకోవడం ఘోరమైన తప్పు. ఆ తప్పు నేను చేయలేను."అని మర్యాదపూర్వకంగా అగస్త్యుడు ఇచ్చిన కానుకను తిరస్కరించాడు రాముడు.

అప్పుడు అగస్త్యుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! కృయుగములో రాజు అనే వాడు లేడు. దేవతలకు రాజుగా ఇంద్రుడు ఉండేవాడు. కృతయుగంలో ఎవరికి వారు తమ తమ విద్యుక్త ధర్మములు నిర్వర్తించేవారు. ఒక రాజు ఉండి చెప్పవలసిన, చేయక పోతే దండించవలసిన అవసరం ఉండేది కాదు. కాబట్టి కృతయుగంలో రాజు యొక్క అవసరం లేకపోయింది. దేవతలకే ఒక అధిపతి ఉన్నప్పుడు మనకు కూడా ఒక అధిపతి ఎందుకు ఉండకూడదు అని తలంచి ప్రజలందరూ బ్రహ్మదేవుని వద్దకు పోయి, "దేవా! నీవు దేవతలకు రాజుగా ఇంద్రుడిని స్థాపించావు. మాకు కూడా నరులలో ఉత్తమమైన వాడిని రాజును ఇవ్వండి. మేము అతనిని సేవిస్తాము. రాజు లేకుండా మేము స్వయంగా పరిపాలించుకోలేకపోతున్నాము." అని అడిగారు.

రాజు కావాలంటే అతనికి దైవాంశ ఉండాలి. కాబట్టి బ్రహ్మ, ఇంద్రుడు, మొదలగు లోక పాలకులను పిలిచాడు. వారి వారి తేజస్సునుండి కొంత భాగం ఇమ్మన్నాడు. వారు అలాగే తమ తమ

తేజస్సులలో కొంతభాగము బ్రహ్మదేవునికి ఇచ్చారు. ఇంతలో బ్రహ్మదేవునికి తుమ్ముమొచ్చింది. ఆ వేగవంతమైన తుమ్ములో నుండి ఒకడు పుట్టాడు. వాడి పేరు క్షుపుడు. బ్రహ్మదేవుడు లోకపాలకుల నుండి సంగ్రహించిన అంశలను ఆ క్షుపుడిలో ప్రవేశ పెట్టాడు. అతనిని ప్రజలకు రాజును చేసాడు. అప్పుడు క్షుపుడు రాజ్యాధి కారమును స్వీకరించాడు.

ఇంద్రుని అంశతో పరిపాలనా బాధ్యతలను రూపొందించాడు. వరుణుని అంశతో భూమిని సస్యశ్యామలం చేసి అందరికీ పోషణ కల్పించాడు. యముని అంశతో దండనీతిని, దండనాధి కారాన్ని రూపొందించాడు. కుబేరుని అంశతో ధనము, వినిమయము, వాణిజ్యము దానికి సంబంధించిన శాస్త్రములను రూపొందించాడు.

రామా! ఇంద్రుని అంశ పరిపాలనా బాధ్యత అని చెప్పానుకదా! పరిపాలనలో రాజు ప్రజలనుండి స్వీకరించడం కూడా ధర్మమే. ఆ ధర్మము ప్రకారమే ఈ దివ్యమైన ఆభరణమును స్వీకరించు. నీకు శుభం కలుగుతుంది."అని అన్నాడు అగస్త్యుడు.

రాముడు మారు మాట్లాడలేకపోయాడు. ఆ మహాముని ఇచ్చిన ఆభరణమును స్వీకరించాడు. అప్పుడు రామునికి ఒక సందేహము కలిగింది. అసలు ఈ ఆభరణము ఈ ముని చేతికి ఎలా వచ్చింది. ఎవరు ఇచ్చారు. ఎందుకు ఇచ్చారు. తెలుసుకోవాలని అనుకున్నాడు. అగస్త్యమహా మునిని ఇలా అడిగాడు.

"ఓ మునీంద్రా! ఈ ఆభరణము తమరి దగ్గరకు ఎలా వచ్చింది. ఎవరు ఇచ్చారు దయతో చెప్పండి." అని అడిగాడు. దానికి అగస్త్యుడు ఇలా చెప్పసాగాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము డెబ్బది ఆరవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
డెబ్బది ఏడవసర్గ.

పూర్వము ఈ పక్కనే ఉన్న భూమి మీద నూరు యోజనముల దూరము, చెట్లు గుట్టలు పర్వతములు కొండలు,మృగములు, పక్షులు ఉండేవి కావు. భూమి చదునుగా ఉండేది. దాని పక్కనే ఉన్న అరణ్యములో నేను తపస్సు చేసుకుంటూ ఉండేవాడిని. నేను తపస్సు చేసుకుంటున్న అరణ్యము ఫల వృక్షములతోనూ, స్వచ్ఛమైన నీటి సరోవరములతోనూ, పుష్పజాతులతోనూ నిండి ఉండేది.

ఆ అరణ్యములో ఒక పురాతన ఆశ్రమము ఉండేది. ఆ ఆశ్రమములో ఎవరూ లేరు. నిర్మానుష్యంగా ఉండేది. ఆ ఆశ్రమము పక్కనే ఒక సరస్సు ఉంది. నేను ఆ సరస్సు దగ్గరకు వెళ్లాను. ఆ సరస్సులో ఒక శవం తేలుతూ ఉంది. కాని ఆ శవం ఏ మాత్రం చెడి పోలేదు.అప్పుడే ప్రాణం పోయినట్టు ఉంది.  ఇది ఎవరి శవమూ అని ఆలోచిస్తూ అక్కడే

నిలబడ్డాను. ఒక ముహూర్త కాలానికి అక్కడికి ఒక  దివ్యమైన విమానము వచ్చింది. ఆ విమానములో ఒక దేవతా పురుషుడు ఉన్నాడు. అతనిని అప్సరసలు సేవిస్తున్నారు. కొందరు పాటలు పాడుతున్నారు. కొందరు నృత్యం చేస్తున్నారు. కొందరు అప్సరసలు ఆ పురుషునికి చామరములు వీస్తున్నారు.  ఇదంతా నేను చూస్తున్నాను.

ఇంతలో ఆపురుషుడు విమానం దిగి ఆ సరస్సు దగ్గరకు వచ్చాడు. ఆ శవమును భక్షిస్తున్నాడు. తనకు కావలసినంత మాంసమును తృప్తిగా తిన్న తరువాత  ఆ పురుషుడు ఆ సరస్సులోకి దిగి నీరు తాగుతున్నాడు. తరువాత ఆ పురుషుడు విమానము దగ్గరకు వెళ్లి విమానము ఎక్కబోతున్నాడు. అత్యాశ్చకరమైన ఆ దృశ్యమును చూచిన నేను ఉండబట్టలేక ఆ పురుషుని వద్దకు పోయి ఇలా అడిగాడు. “నీవు ఎవరు? ఈ శవాన్ని ఎందుకు భక్షించావు. దీనికి కారణం ఏమైనా ఉందా! నీవు చూడబోతే దేవతామూర్తి వలె ఉన్నావు. కాని నిషిద్ధమైన ఆహారమును తిన్నావు. చాలా ఆశ్చర్యంగా ఉంది. ఈ శవము తినడానికి యోగ్యము అని నేను అనుకోడం లేదు. ఇందులో రహస్యము ఏమిటి? నాకు చెప్పగలవా!” అని అడిగాను.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము డెబ్బది ఏడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## డెబ్బది ఎనిమిదవ సర్గ.

"రామా! నేను ఆ ప్రకారము అడుగగా, ఆ దివ్యపురుషుడు ఇలా అన్నాడు. "ఓ బ్రహ్మర్షీ! ఇది నా పూర్వ జీవితమునకు సంబంధించినది. నా తండ్రి పేరు సుదేవుడు. ఆయన విదర్భకు మహారాజు. ఆయనకు ఇద్దరు భార్యలు. ఆ ఇద్దరికీ ఇద్దరు కుమారులు కలిగారు. నా పేరు శ్వేతుడు. నాకన్నా చిన్న వాడి పేరు సురథుడు. నా తండ్రి చనిపోయిన తరువాత నన్ను రాజును చేసారు. నేను ధర్మబద్ధంగా, జనరంజకంగా పరిపాలించాను.

ఒక సారి నాకు ఒక వింత కోరిక కలిగింది. నా ఆయుర్దా యము ఎంత. నేను ఎప్పుడు మరణిస్తాను అని తెలుసుకోవాలని అను కున్నాను. వెంటనే నా తమ్ముడు సురథుడిని రాజ్యానికి పట్టాభిషిక్తుని చేసాను. నా మరణం గురించి తెలుసుకోడానికి ఈ అరణ్యములోకి వచ్చాను. తపస్సు చేసాను. మూడు వేల సంవత్సరములు గడిచాయి. నా తపస్సు ఫలితంగా నేను నా శరీరమును వదిలి, బ్రహ్మలోకమునకు వెళ్లాను. నా శరీరం ఈ సరస్సులో పడింది. నేను బ్రహ్మలోకములో ఉన్నా నాకు ఆకలి దప్పిక కలుగుతూనే ఉన్నాయి. నాకు దైవత్వము సిద్ధించలేదు. వెంటనే నేను బ్రహ్మదేవుని వద్దకు పోయి ఇలా అడిగాను.

"ఓ బ్రహ్మదేవా! ఈ లోకములో ఆకలి దప్పిక ఉండవు కదా. మరి నాకు ఆకలి వేస్తూ ఉంది. దాహం వేస్తూ ఉంది. ఎందువలన? నాకు

ఇక్కడ ఏమి ఆహారము దొరుకుతుంది. నేను ఏమి తినాలి. ఏమి తాగాలి. అసలు నాకు ఆకలి దప్పిక ఎందుకు కలుగుతున్నాయి." అని అడిగాడు.

దానికి బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు. "ఈ లోకంలో ఆహారం ఉండదు. కాబట్టి నీ మాంసమే నీకు ఆహారము. దానినే నీవు భక్షించాలి. నీవు కూర్చుని తపస్సు చేసి నీ శరీరమును బాగా పెంచావు. నీవు దాన ధర్మములు చేయలేదు. కేవలం తపస్సు చేసావు. నీవు ఒకరికి పెడితే కదా నీకు ఆహారం లభించేది. నీవు ఒకరికి పెట్టలేదు. నీకు ఆహారం లభించదు. ఆ కారణం చేతనే నీకు ఆకలి దప్పులు కలుగుతున్నాయి. కాబట్టి నీవు నీ దేహమునే ఆహారముగా స్వీకరించు. అగస్త్య మహాముని నీవు ఉండు అరణ్యమునకు వస్తాడు. అప్పుడు నీకు ఈ బాధ తప్పుతుంది. ఎందుకంటే ఆ అగస్త్యుడు మహా ఋషి. దేవతలను కూడా తరింప జేస్తాడు. ఇంక నీ ఆకలి దప్పికలను నివారించలేడా!" అన్నాడు బ్రహ్మదేవుడు. ఆ రోజు నుండి బ్రహ్మదేవుని మాట ప్రకారము నేను ప్రతి రోజూ ఇక్కడకు వచ్చి   నా శవమును ఆహారంగా తింటున్నాను. ఇన్ని సంవత్సరముల నుండి తింటున్నా ఈ శవము తరగడం లేదు. పైగా నాకు చాలా తృప్తిగా ఉంటూ ఉంది. నా బాధ తీర్చడానికి మీరు ఇక్కడకు వచ్చారు. తమరు కరుణించి నన్ను ఈదుస్థితి నుండి కాపాడండి. మీకు నేనుఏమీ ఇచ్చుకోలేను. ఈ ఆభరణమును స్వీకరించి నన్ను ధన్యుడిని చేయండి. ఇంకా మీకు కావాలంటే బంగారమును, ధనమును వస్త్రములను ఇస్తాను. నన్ను తరింపజేయండి." అని అన్నాడు.

నేను అతనిని తరింపజేయడానికి ఈ ఆభరణమును అతని వద్దనుండి స్వీకరించాను. నేను ఈ ఆభరణమును స్వీకరించిన వెంటనే అతని మనుష్యదేహమైన శవము నశించిపోయింది. అతడు స్వర్గమునకు వెళ్లిపోయాడు. అతడు నాకు ఇచ్చిన ఆభరణము ఇదే. ఇప్పుడు ఇది నీకు ఇస్తున్నాను." అని అన్నాడు అగస్త్యుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము డెబ్బది ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## డెబ్బది తొమ్మిదవ సర్గ.

అగస్త్యుడు చెప్పిన వృత్తాంతమును విని రామునికి ఆశ్చర్యం కలిగింది. ఇటువంటి కధలు కూడా ఉంటాయా అని అనుకున్నాడు. కాని రామునికి మరొక అనుమానం కలిగింది. "ఓ మునీంద్రా! మీరు తపస్సు చేసుకుంటున్న వనము ఫలవృక్షములతోనూ, పూల మొక్కలతోనూ, వన్య మృగములతోనూ శోభిల్లుతూ ఉంది కదా మరి ఆ రాజర్షి తపస్సు చేసిన ప్రదేశములో ఒక్క చెట్టు లేదు మొక్క లేదు, ఒక్క పక్షిగానీ, జంతువు గానీ లేదు. ఎందు చేత?ఆ రాజు వృక్షమృగ,పక్షి శూన్యమైన చోట తపస్సు చేయాలని ఎందుకు అనుకున్నాడు." అని అడిగాడు. అగస్త్యుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! కృతయుగములో మనువు ఈ భూమిని పరిపాలించేవాడు. అతని కుమారుడు ఇక్ష్వాకువు. "ఈ భూమిలో రాజ వంశములనుస్థాపించు" అని చెప్పి మనువు ఇక్ష్వాకువును రాజును చేసాడు. అతని పేరుతో ఇక్ష్వాకు వంశము మొదలయింది. రాజ్యాధి కారము ఇచ్చిన తరువాత మనువు ఇక్ష్వాకువుతో ఇలా అన్నాడు. "రాజుకు దండనాధి కారము ఉండవలసినదే కానీ అకారణంగా ఎవరినీ దండించ కూడదు. అపరాధుల విషయంలో కూడా అతడు చేసిన తప్పుకు సరి అయిన దండన విధించవలెనే కానీ, క్రూరంగా దండించకూడదు. కాబట్టి నీవు దండనీతిని అనుసరించునపుడు చాలా అప్రమత్తంగా ఉండాలి. అప్పుడే ధర్మం వర్ధిల్లుతుంది. నిన్ను ప్రజలు గౌరవిస్తారు." అని ఇక్ష్వాకువుకు రాజనీతిని దండనీతిని ఉపదేశించి, మనువు బ్రహ్మలోకమునకు వెళ్లిపోయాడు. అప్పుడు ఇక్ష్వాకువు తన వంశమును ఎలా వృద్ధిచేయ వలెనా అని ఆలోచించాడు.

తరువాత ఇక్ష్వాకువు నూర్గురు పుత్రులను కన్నాడు. ఆ నూర్గురిలో చిన్న వాడు పరమ మూర్ఖుడు. పెద్దల మాట వినేవాడు కాదు. దుర్మార్గుడు. చదువు మీద శ్రద్ధలేదు. వీడిని ఎవరో బాగా దండిస్తారు అని తెలుసుకున్న ఇక్ష్వాకువు వాడికి దండుడు అని పేరు సార్థకంచేసాడు.

వాడికి తగిన రాజ్యము కనపడలేదు. అందుకని ఇక్ష్వాకువు దండుని వింధ్యపర్వతప్రాంతములకు రాజును చేసాడు. ఆ దండుడు ఆ పర్వత ప్రాంతములో ఒక నగరమును ఏర్పాటు చేసుకొని రాజ్యపాలన చేస్తున్నాడు. ఆ నగరము పేరు మధుమంతము.

దండుని కుల గురువు శుక్రాచార్యుడు. ఆయనకు ఒకకుమార్తె ఉంది.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము డెబ్బది తొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## ఎనుబదవ సర్గ.

దండుడు అనేక సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. ఒకరోజు దండుడు తన గురువు శుక్రాచార్యుని ఇంటికి వెళ్లాడు. అక్కడ ఒకసుందరాంగిని చూచాడు. ఆమె శుక్రాచార్యుల వారి కుమార్తె అని దండునికి తెలియదు. ఆమెను మోహించాడు. దండుని మన్మథుడు ఆవహించాడు. మన్మథ బాణములతో పరవశుడయ్యాడు దండుడు. ఆ సుందరాంగిని చూచి ఇలా అడిగాడు.

"ఓ లలనా! నీవుఎవరు? ఇక్కడ ఎందుకుఉన్నావు? నీ తల్లితండ్రులు ఎవరు? నాకు నీ మీద మోహము కలిగింది. నా కోరిక తీర్చు." అని అడిగాడు. ఆ మాటలకు ఆ సుందరాంగి ఇలా బదులు చెప్పింది.

"రాజా! నేను నీ గురువు శుక్రాచార్యుని కుమార్తెను. నా పేరు అరజ. నేను ఈ ఆశ్రమములో ఉంటాను. నేను నీ గురువుగారి పుత్రికను.

నేను నా తండ్రి గారి సంరక్షణలో ఉన్నాను. నాకు ఇంకా పెళ్లి కాలేదు. నన్నుకోరడం తగదు. ఈ విషయం నా తండ్రికి తెలిస్తే నిన్ను శపిస్తాడు. అంతగా నా మీద నీకు కోరిక ఉంటే నీవు నా తండ్రిని అడిగి ఆయన ఒప్పుకుంటే నన్ను వివాహమాడి నీ కోరిక తీర్చుకో. అలా కాకుండా నన్ను బలవంతంగా అనుభవిస్తే నీకు పరాభవము తప్పదు. నా తండ్రి శుక్రాచార్యునకు కోపంవస్తే మూడులోకములను భస్మం చేస్తాడు. నీవు ఈ రాజ్యమునకు రాజువు. నీవు కోరితే నా తండ్రి తప్పకుండా నన్ను నీకు ఇచ్చి వివాహముచేస్తాడు. నా మాట విను."అని పరి పరి విధాల బతిమాలింది.

కాని మోహపరవశుడు, కామాతురుడు అయిన దండుడు ఆమె మాటలు వినలేదు. "ఓ లలనామణీ! నిన్ను చూచినప్పటినుండీ మన్మధుడు నన్ను కాల్చివేస్తున్నాడు. నేను ఇంక ఒక్క క్షణం కూడా తట్టుకోలేను. ఒక్కసారి నిన్ను అనుభవించిన తరువాత నేను చచ్చినా, నా సర్వస్వము నాశనం అయినా నాకు చింతలేదు. నేను నీ దాసుడిని నన్ను అనుగ్రహించు." అని బలవంతంగా ఆమెను ఆక్రమించుకున్నాడు. ఆమెను ఎంత వద్దని వారిస్తున్నా, ఆమెను బలవంతంగా అనుభవించాడు. తరువాత ఏమీ ఎరుగనట్టు తన నగరానికి వెళ్లిపోయాడు.

శుక్రాచార్యుని కుమార్తె అరజ ఏడుస్తూ తన తండ్రి శుక్రాచార్యుని రాక కోసం ఎదురుచూడసాగింది.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనుబదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## ఎనుబది ఒకటవ సర్గ.

శుక్రాచార్యుడు రాగానే అరజ జరిగినది అంతా తండ్రికి చెప్పింది. శుక్రాచార్యుడు కోపంతో మండిపడ్డాడు. "వీడు నా కుమార్తెనే అవమానిస్తాడా! వీడికి నాశనం అయ్యే కాలం దాపురించింది. వీడు ఘోరమైన అపరాధము చేసాడు. దానికి తగినఫలం అనుభవిస్తాడు. నేటి నుండి ఏడురోజుల లోపల ఈ దండుడు తన పుత్రుల సహితంగా, పరివార సమేతంగా నాశనం అవుతాడు. ఈ దండుని రాజ్యమునకు నూరు యోజనముల విస్తీర్ణములో ధూళిమేఘములు కమ్ముకొని సర్వనాశనం చేస్తాయి. ఒక్క మానవులే కాదు సమస్తజంతుజాలము కూడా పశుపక్ష్యాదులు కూడా, వృక్షములు కూడా ఆ ధూళిలో పడి మాడిపోతాయి. ఈ ప్రాంతము నిర్మానుష్యము అవుతుంది. ఈ దండుని రాజ్య సరిహద్దులదాకా ధూళిమేఘాలు కప్పివేస్తాయి." అని శపించాడు. వెంటనే తన శిష్యులను చూచి "మీ రందరూ దండుని రాజ్యము విడిచి వెళ్లండి. రాజ్యము సరిహద్దుల అవతల నివసించండి." అని అన్నాడు. శు క్రాచార్యుని మాట ప్రకారము శిష్యులు అందరూ ఆశ్రమం విడిచి వెళ్లిపోయారు.

శుక్రాచార్యుడు తన కుమార్తెను చూచి ఇలా అన్నాడు. "ఇందులో నీ దోషం కూడా ఉంది కాబట్టి నీవు ఈ ఆశ్రమము నందు యోగాభ్యాసము చేస్తూ ఇక్కడే ఉండు. నిన్ను ఆ ధూళిరేణువులు తాకవు. వాటి వలన నీకు ఏమీ భయము లేదు." అని అన్నాడు.

తరువాత శుక్రాచార్యులు దండుని రాజ్యము విడిచిపెట్టి వెళ్లిపోయాడు. శుక్రాచార్యుని శాపప్రభావము వలన దండుని రాజ్యము అతని పరివారము సహా ఏడురోజులలో సర్వనాశనం అయింది. అప్పటి నుండి వింధ్య పర్వతము శైవల పర్వతము మధ్య ఉన్న ఈ ప్రదేశము దండుని పేరు మీద దండకారణ్యము అని పిలువబడింది. ఇక్కడ మునులు నివసించే ప్రదేశమును జనస్థానము అని పిలుస్తారు. రామా! ఇదీ ఆ ప్రాంతచరిత్ర. సాయం సంధ్యకు వేళఅయింది. నీవు వెళ్లి సంధ్యోపాసన చేయుము." అని అన్నాడు అగస్త్యుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ఎనభై ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## ఎనభైరెండవ సర్గ.

రాముడు సంధ్యోపాసనకు పక్కనే ఉన్నసరస్సుకు వెళ్లాడు. సాయంసంధ్యాకార్యక్రమములు ముగించుకొని ఆశ్రమంలో ప్రవేశించాడు. ఆ రాత్రికి అక్కడే విశ్రాంతి తీసుకున్నాడు. మరునాడుఉదయమే వెళ్లి అగస్త్యునికి నమస్కరించి అయోధ్యకు వెళ్లడానికి అనుమతి కోరాడు. "రామా! నీవు ఏ క్లేశములు లేకుండా ధర్మబద్ధంగా రాజ్యమును పరిపాలించు." అని అన్నాడు. రాముడు అగస్త్యుని ఆశీర్వాదము తీసుకొని పుష్పక విమానము ఎక్కి అయోధ్యకు బయలు దేరాడు.

అయోధ్యలోదిగిన తరువాత పుష్పకమును పంపించి వేసాడు. తనమందిరమునకు వెళ్లాడు. ద్వారపాలకుని పిలిచి వెంటనే లక్ష్మణుని భరతుని తన వద్దకు తీసుకొని రమ్మని చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనభై రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము

ఎనభై మూడవ సర్గ.

రాముడు అయోధ్యకు వచ్చాడని ద్వారపాలకుని ద్వారా తెలుసుకున్న లక్ష్మణుడు భరతుడు వెంటనే రాముని వద్దకు వచ్చారు. రాముడు వారిని చూచి ఇలా అన్నాడు.

"నేను అధర్మమును ఆచరించుచున్న శంబూకుని చంపి బ్రాహ్మణ కుమారుని పునర్జీవితుని చేయగలిగాను. మీ ఇరువురిసాయంతో నేను రాజసూయ యాగమును చేయవలెనని అనుకుంటున్నాను. క్షత్రియులకు రాజసూయము చేయడం అత్యుత్తమమైన ధర్మము. పూర్వము మిత్రుడు రాజసూవయము చేసి వరుణత్వాన్ని పొందాడు. సోముడుకూడా రాజసూయము నిర్వహించి శాశ్వత కీర్తిని సంపాదించు కున్నాడు. కాని రాజసూయము చేయడం సామాన్యమైన పనికాదు. కాబట్టి మీరిరువురూ బాగా ఆలోచించి నిర్ణయం తీసుకోండి." అని అన్నాడు రాముడు.

అప్పుడు భరతుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! నీవు ధర్మస్వరూపుడవు. నీయందు ధర్మము,కీర్తి నిలిచి ఉంది. నీవు రాజులలో కెల్లా శ్రేష్టుడవు. లోకములకు నాధుడవు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించుచున్నావు. రాజసూయము వలన భూమి మీద ఉన్న రాజ్యములను అన్నిటినీ మనము జయించవలెను. అప్పుడు రక్తపాతము, జనక్షయము తప్పదు. క్షత్రియ వంశము నాశనమౌతుంది. అటువంటి రాజసూయమును నీవు ఎందుకు చేస్తావు. రాజసూయము చేస్తే ఎందరో రాజులు మనకు శత్రువులు అవుతారు. దాని వలన వినాశము సంభవిస్తుంది.

అయినా రామా! ఇప్పుడు నీ మాట కాదంటున్న వారు ఎవరు? అందరు రాజులూ నీ మాటమీరడం లేదు కదా. కొత్తగా రాజసూయం చేసి వారిని చంపడం ధర్మమా!" అని అన్నాడు భరతుడు. భరతుని మాటలు సమంజసంగా అనిపించాయి రామునికి. "భరతా! నీవు చక్కగా చెప్పావు. నీ మాటలు నాకు ఎంతో ఆనందం కలిగించాయి. ధర్మాన్ని చక్కగా, నిర్భయంగా చెప్పావు. రాజసూయం చేస్తే రాబోయే దుష్పరిణామాలను చక్కగా వివరించావు. నీ మాట ప్రకారము నేను రాజసూయ యాగము చేయవలెను అన్న సంకల్పాన్ని విరమించు కుంటున్నాను. నీవు చిన్న వాడి వైనా చక్కటి మాట చెప్పావు. నిన్ను నేను అభినందిస్తున్నాను." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనభైమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## ఎనభై నాలుగవ సర్గ.

రాముడు రాజసూయ యాగము చేయడం లేదు అని తెలుసుకున్న లక్ష్మణుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! తమరు అనుకున్నట్టు రాజసూయము చేయడం లేదు కాబట్టి అశ్వమేధ యాగము చేయడం మంచిదేమో ఆలోచించండి. అశ్వమేధ యాగము పవిత్రమైనది సర్వ పాపములను హరిస్తుంది. నీకు ఇష్టం అయితే అశ్వమేధ యాగమును చేయవచ్చును. పూర్వము ఇంద్రుడు అశ్వమేధ యాగము చేసి తన బ్రహ్మహత్యాపాతకమును పోగొట్టుకున్నాడు కదా! ఆ కథ వివరిస్తాను.

రామా! పూర్వము వృత్రుడు అనే దైత్యుడు ఉండేవాడు. అతడు ధర్మాత్ముడు. మూడులోకములవారు అతనిని అభిమానించేవారు. అతనికి ధర్మములు బాగా తెలుసు కృతజ్ఞుడు. బుద్ధిమంతుడు. ఈ భూమిని అంతా ధర్మబద్ధంగా పరిపాలించాడు. అతని పాలనలో ప్రజలు సంతోషంగా జీవించేవారు. వానలు కురిసి పంటలు బాగా పండేవి. కరువుకాటకాలు ఉండేవి కావు.

ఈ ప్రాపంచిక సుఖముల కన్నా తపస్సు చేయడం శ్రేష్ఠమని అనుకున్నాడు వృత్రుడు. వెంటనే తన పెద్ద కుమారుడు మధురుడు అనే వాడికి రాజ్యము అప్పగించి తాను తపస్సుకు వెళ్లాడు. ఉగ్రమైన తపస్సు చేసాడు. ఎవరు తపస్సు చేసినా ముందు ఇంద్రుడికి అసూయ

కలుగుతుంది. అసూయతోపాటు తన పదవికి ఎక్కడ ముప్పు వస్తుందో అనే భయం కూడా కలిగింది ఇంద్రుడికి. వెంటనే ఇంద్రుడు విష్ణువు దగ్గరకు పరుగెత్తాడు.

"ఓ విష్ణూ! వృత్రుడు ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. అతడు ముల్లోకములను జయించాడు. అతను నా మాట వినడం లేదు. అతనిని శాసించడం నా వల్ల కావడం లేదు. అతడు తన తపస్సును ఇలాగే కొనసాగిస్తే అతనికి ముల్లోకాధిపత్యము సిద్ధిస్తుంది. అప్పుడు నా గతేమిటి. నీవు మాత్రం చూచీచూడనట్టు ఉన్నావు. నీవే కనుక కోపగిస్తే వాడు ఇంత కాలము తపస్సు చేసేవాడు కాదు. నాకు తెలుసు. వృత్రుడు నీకు మిత్రుడు, భక్తుడు. అందుకనే అతనిని ఉపేక్షిస్తున్నావు. అందుకే అతడు మూడు లోకముల వారిచేత ఆదరింపబడుతున్నాడు. నన్ను అనుగ్రహించు. అతని తపస్సును ఆపుచెయ్యి. లేకపోతే అతనిని చంపు. వృత్రుడిని చంపి దేవలోకమునకు శాంతి ప్రసాదించు. దేవతలు అందరూ వృత్రాసుర సంహారము కొరకు ఎదురుచూస్తున్నారు. నీవు ఒక్కడివే ఈ పని చేయగల సమర్థుడివి. గతిలేని వాళ్లకు నీవే గతి కదా! కాబట్టి ఈ పని చేసి పెట్టి, దేవతలను ఉద్ధరించు." అని దీనంగా వేడుకున్నాడు ఇంద్రుడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ఎనభై నాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము
## ఎనభై ఐదవ సర్గ.

ఇంద్రుని మాటలు విన్న విష్ణువు ఇలా అన్నాడు. "మహేంద్రా! నాకూ వృత్రునికి స్నేహం ఉంది అని నీకు తెలుసు కదా! అందుకని నేను వృత్రుని చంపలేను. కానీ నీకు సాయం చెయ్యక తప్పడం లేదు. అందుకని వృత్రుని చంపడానికి సాయం చేస్తాను. నేను నా శక్తిని మూడు భాగములుగా విభజిస్తాను. ఒకటి మహేంద్రునిలోనూ, మరొక అంశ వజ్రాయుధములోనూ, మూడవ అంశ భూమిలోనూ నిక్షిప్తం చేస్తాను. అప్పుడు ఇంద్రుడు వృత్రుని చంపగలడు." అని అన్నాడు. ఆ మాటలకు దేవేంద్రుడు, దేవతలు సంతోషించారు. విష్ణువు తన తేజస్సును మహేంద్రునిలో ప్రవేశపెట్టాడు. అందరూ వృత్రుని చంపడానికి వెళ్లారు.

అప్పుడు వృత్రుడు ఒక మహారణ్యములో తపస్సు చేసుకుంటున్నాడు. అతని తేజస్సు ముల్లోకాలలో వెలిగిపోతూ ఉంది. ఇతనిని ఎలా చంపడమా అని దేవతలు మధనపడుతున్నారు. ఇంతలో దేవేంద్రుడు తన వజ్రాయుధమును రెండు చేతులతో పట్టుకొని ఒకే వేటుతో వృత్రుని తల నరికాడు. వృత్రుని తల తెగి కింద పడగానే భూమి కంపించింది. దేవేంద్రుడు కూడా భయంతో కంపించి పోయాడు. వెంటనే భూమి చివరి అంచుదాకా పరుగెట్టాడు. వృత్రుడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణుని చంపితే వచ్చే బ్రహ్మహత్యాపాతకము ఇంద్రుని తరిమింది. ఇంద్రుడి అన్ని అవయవములలో ప్రవేశించింది. ఇంద్రుడు నిర్వీర్యుడు

అయ్యాడు. దు:ఖంతో కుచించుకుపోతున్నాడు ఇంద్రుడు.

వృత్రాసురుడు మరణించాడు. ఇంద్రుడు కనపడటం లేదు. దేవతలకు ఏమి చెయ్యాలో తోచలేదు. వృత్రాసురుడు మరణించినందుకు దేవతలు అందరూ విష్ణువును పూజించారు. మహేంద్రుడిని బ్రహ్మహత్యా పాతకము నుండి విడిపించమని విష్ణువును ప్రార్థించారు. అప్పుడు విష్ణువు తరుణోపాయము చెప్పాడు.

"ఇంద్రుడు అశ్వమేధయాగము చేసి నన్ను పూజిస్తే వెంటనే అతనికి బ్రహ్మహత్యాపాతకము నుండి విముక్తి కలుగుతుంది." అని వరం ఇచ్చాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనభై ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

ఎనభై ఆరవ సర్గ.

బ్రహ్మహత్యాపాతకము ఇంద్రుని శరీరం అంతా పాకిపోయింది. ఇంద్రునికి మూర్ఛవచ్చినట్టయింది. కింద పడి దొర్లుతున్నాడు. లోకపాలకుడు ఇంద్రుడు లేక పోవడం వల్ల వర్షాలు కురవడం లేదు. పంటలు ఎండిపోతున్నాయి. నదులలో, సరస్సులలో నీరు ఎండి పోయింది.

ప్రజలు దాహంతో అల్లాడుతున్నారు. అనావృష్టి సంభవించింది. దేవతలు అందరూ కలిసి ఇంద్రుని వద్దకు వెళ్లారు. ఇంద్రుడిని ముందు ఉంచుకొని అశ్వమేధ యాగము చేసారు. యజ్ఞముపూర్తి కాగానే బ్రహ్మహత్యా పాతకము ఇంద్రుని విడిచిపెట్టింది. "నేను ఎవరిని ఆవహించాలి." అని అడిగింది. అప్పుడు దేవతలు ఇలా అన్నారు.

"ఓ బ్రహ్మహత్యాపాతకమా! నిన్ను నీవు నాలుగు భాగములుగా విభజించుకో! ఒక భాగము వర్షాకాలము నాలుగు మాసములు పవిత్ర పుణ్య నదీ జలములలో ఆవహించు. నీలో స్నానం చేసే వారి పాపములను తొలగించు. రెండవ అంశను ఎండి పోయి బీడు పడ్డ చవిటి నేలలలో ఆవహించు. వాటిని సస్యశ్యామలం చెయ్యి. మూడవ అంశను యౌవనవతులు, ప్రౌఢలు అయిన స్త్రీలలో వారి బహిష్టు మూడురోజులు ఆవహించు. ఆ మూడురోజులు వారిని ఏ దుష్ట గ్రహదోషములు, పీడలు లేకుండా కాపాడుతూ ఉండు. నాల్గవ అంశను ఏ పాపమూ ఎరుగని బ్రాహ్మణులను ఎవరు పీడించి చంపుతారో వాళ్లని ఆశ్రయించి వారిని తగు విధముగా శిక్షించు. ఈ విధంగా లోక కల్యాణము గావించు." అని పలికారు దేవతలు. బ్రహ్మహత్యాపాతకము దానికి ఒప్పుకొని ఆ ప్రకారమే చేసింది. బ్రహ్మహత్యాపాతకము తొలగిపోగానే ఇంద్రుడు దేవతలతో స్వర్గానికి వెళ్లాడు. రామా! అశ్వమేధ యాగమ మహిమ అంత గొప్పది." అని లక్ష్మణుడు రామునితో చెప్పాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము ఎనభై ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## ఎనభై ఏడవ సర్గ.

లక్ష్మణుడు చెప్పిన వృత్రాసురుని వృత్తాంతము విన్న రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! యదార్థము చెప్పావు. అశ్వమేధ యాగ ఫలము చాలా గొప్పది. ఇదే కాదు. అశ్వమేధ యాగ మహిమను చెప్పే వృత్తాంతము మరొకటి ఉంది. పూర్వము కర్దమ ప్రజాపతి కుమారుడు ఇలుడు అనే వాడు వాహ్లి దేశమును పాలిస్తున్నాడు. అతడు ధర్మం తప్పకుండా ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలిస్తున్నాడు. దేవతలు, దైత్యులు, నాగులు, రాక్షసులు, గంధర్వులు, యక్షులు అందరూ అతని ఎడల భయం భక్తి కలిగి ఉండేవారు. అతడు ఎంత దయకలవాడో అంత కోపిష్టి. కోపం వస్తే ప్రళయకాలరుద్రుడు అవుతాడు. అందుకని ఎవరూ తప్పుచేయడానికి భయపడేవారు.

ఒక సారి ఆయన వేటకు వెళ్లాడు. అలా వేటాడుతూ కుమారస్వామి జన్మస్థలమయిన కైలాస శిఖరమునకు వెళ్లాడు. అక్కడ మహాశివుడు, పార్వతితో కలిసి విహరిస్తున్నాడు. పార్వతీ పరమేశ్వరులు తమ కేళీవిలాసములలో భాగంగా శివుడు స్త్రీవేషం ధరించాడు. శివుడు ఎప్పుడు స్త్రీరూపం ధరించాడో పరిసరాలలో ఉన్న మృగములు, పక్షులు, అన్నీ స్త్రీరూపం ధరించాయి. ప్రతి వస్తువుకూ స్త్రీత్వము ఆవహించింది. ఇది తెలియని ఇలుడు, అతని పరివారమూ అక్కడకు వచ్చారు. ఆ ప్రదేశమునకు రాగానే ఇలుడు అతని పరివారమూ కూడా స్త్రీలుగా మారిపోయారు. అది శివుని మహిమ అని తెలుసుకొన్న ఇలుడు

పరమశివుని శరణు వేడాడు. ఇది వినిన శివునికి నవ్వు వచ్చింది. ఏదో తాను పార్వతిని సంతోషపెట్టడానికి స్త్రీరూపం ధరిస్తే ఈ విపరీతం జరిగినందుకు నవ్వాడు శివుడు. కాని ఒక సారి స్త్రీగా మారిన తరువాత అతనికి పురుషత్వము ఇవ్వడం సాధ్యం కాదు. అందుకని శివుడు ఇలునితో ఇలా అన్నాడు.

"రాజా! నీకు పురుషత్వం సిద్ధించడం తప్ప వేరు ఏవరం అయిన కోరుకో ఇస్తాను" అని అన్నాడు. ఇలుడు ఏవరమూ కోరలేదు. కాని పార్వతీదేవిని భక్తితో ప్రార్థించాడు. "అమ్మా! జగజ్జననీ! నా తప్పు ఏమీ లేకుండా నాకు స్త్రీత్వము సంప్రాప్తించింది. నన్ను కరుణించు." అని వేడుకున్నాడు. అయ్య కాదన్నా అమ్మ ఊరుకోదు కదా! "రాజా! శివుడు నిన్ను స్త్రీగా మార్చాడు. నేను ఆయనలో సగం కదా. అందుకని నీలో సగం భాగాన్ని పురుషుడిగా నేను మారుస్తాను. మరి ఎప్పుడు ఎలా ఉండాలో నీవే నిర్ణయించుకో." అని వరం ఇచ్చింది పార్వతి.

పార్వతి ఇచ్చిన వరానికి ఎంతో సంతోషించాడు ఇలుడు. "అమ్మా! నేను ఒక నెల స్త్రీగానూ, ఒక నెల పురుషుడుగానూ ఉండేట్టు వరం ప్రసాదించు." అని అడిగాడు.

పార్వతీ దేవి అలాగే అని వరం ఇచ్చింది."రాజా! నీవు స్త్రీగా ఉన్నప్పుడు నీవు పురుషుడవు అనే విషయం గుర్తుకు రాదు. అలాగే నీవు పురుషుడుగా ఉన్నప్పుడు నీవు స్త్రీవి అనే విషయం గుర్తుకు రాదు. లేకపోతే మనోవ్యధతో కుంగిపోతావు. ఈ పద్ధతి నీకే కాదు నీ పరివారము

అందరికీ వర్తిస్తుంది" అని మరొక వరం కూడా ప్రసాదించింది పార్వతీదేవి.

ఆ ప్రకారంగా ఇలుడు,అతని పరి వారము  ఒకమాసము పురుషులు గానూ, మరొక మాసము స్త్రీలు గానూ కాలం గడిపారు. ఇలుడు ఒక నెల  ఇలమహారాజుగా,  మరొక మాసము ఇలాదేవిగా కాలంగడిపాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము ఎనభైఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
ఎనభై ఎనిమిదవ సర్గ.

రాముడు చెబుతున్న కథను లక్ష్మణుడు భరతుడు ఆశ్చర్యంగా వింటున్నారు. "లక్ష్మణా! భరతా! ఇలుడు అతని పరివారము స్త్రీలుగా మారి పోయారు అని చెప్పాను కదా! స్త్రీగా ఉన్న మొదటి మాసము ఇలాదేవి, తనతోపాటు స్త్రీలుగా మారిపోయిన పరివారముతో గడిపింది. తరువాత ఇలమహారాజుగా ఉన్నప్పుడు పురుషులుగా మారిన తన పరివారముతో గడిపింది. ఒక సారి, ఇలాదేవిగా ఉన్నప్పుడు ఆమె తన పరివారముతో విహరిస్తూ ఉండగా, ఒక సరస్సులో తపస్సు చేసుకుంటున్న బుధుడిని చూచింది. అప్పుడు బుధుడు మంచి యవ్వనంలో ఉన్నాడు.

పూర్ణచంద్రుని మాదిరి ప్రకాశిస్తున్న బుధుని చూచిన ఇలాదేవి మోహంలో పడిపోయింది. ఇలాదేవి ఆ సరస్సులోకి దిగి జలకాలాట ఆడింది. ఆమెను చూచిన బుద్ధుడు కూడా ఆమెను మోహించాడు.

"ఆహా! ఈమె ఎవరు? లోకోత్తరసౌందర్యముతో ప్రకాశిస్తూ ఉంది. ఆమెను చూచి నా మనసు పరవశించి పోయింది. దేవతలలో గానీ, గంధర్వులలోగానీ, అప్సరసలలో గానీ ఇంతటి సౌందర్యవతిని చూడలేదు. ఈమెకు వివాహము కాకపోతే నేను ఈమెను నాదానిగా చేసుకుంటాను." అని అనుకున్నాడు బుధుడు. వెంటనే నీటిలోనుండి బయటకు వచ్చాడు బుధుడు.

ఇలాదేవి వెంట ఉన్న స్త్రీల వద్దకు పోయి "ఈమె ఎవరు. మీరు ఎవరు" అని అడిగాడు. "ఈమె మాకు మహారాణి. మేము ఈమెకు చెలులము. ఈమెకు ఇంకా వివాహము కాలేదు. మేమంతా అరణ్యములలో వినోదంగా విహరిస్తున్నాము." అని అన్నారు. కాని బుధునికి నమ్మకము కుదరలేదు. ఆయన తన దివ్యదృష్టితో చూచాడు. అసలు విషయం తెలుసుకున్నాడు. వారంతా విధివశాత్తు స్త్రీలుగా మారిన పురుషులు అని తెలుసుకున్నాడు. వారితో ఇలా అన్నాడు.

"మీరందరూ కింపురుషీలుగా పిలువబడతారు. ఈ పక్కనే ఉన్న పర్వతము మీద నివాసం ఉండండి. మీకు కింపురుషులు అనే వాళ్లు భర్తలుగా దొరుకుతారు." అని అన్నాడు.

బుధుని మాటలతో వారందరూ కిపురుషీలుగా మారిపోయారు. అందరూ ఆ పర్వతము మీదికి వెళ్లారు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము ఎనభైఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
ఎనభైతొమ్మిదవ సర్గ.

రాముడు ఇలాదేవి కధను ఇలా చెప్ప సాగాడు. "తరువాత ఒక నాడు బుధుడు ఇలాదేవితోనూ ఆమె పరివారముతోనూ నవ్వుతూ ఇలా అన్నాడు. "నేను చంద్రుని కుమారుడను. నా పేరు బుధుడు. నాకు ఇలా దేవిమీద మోహము కలిగినది. నా ప్రేమను అంగీకరించు." అని అన్నాడు. అప్పుడు ఇలాదేవి అతనితో ఇలా అంది. "మేము ఇక్కడ స్వేచ్ఛగా విహరిస్తున్నాము. నేను కూడా నిన్ను చూచి మోహించాను. నీవు ఎలా చెబితే అలా చేస్తాను." అని పలికింది ఇలాదేవి. తరువాత బుధుడు, ఇలాదేవి ఆ వనములో స్వేచ్ఛగా విహరించారు. కామకేళీవిలాసములలో తేలియాడారు. అలా ఒక నెల గడిచిపోయింది.

నెల గడిచిన మరునాడు సూర్యోదయమునకు పూర్వమే నిద్రలేచిన బుధుడు తపస్సుకు వెళ్లిపోయాడు. మాసము గడిచిపోగానే ఇలా దేవి ఇల మహారాజుగా నిద్రలేచాడు.  ఇలమహారాజు సరస్సులో ఏ

ఆధారమూ లేకుండా నీటి మీద నిలబడి తపస్సుచేస్తున్న బుధుడిని చూచాడు. ఇలమహారాజుకు ఏమీ గుర్తు లేదు. బుధుడిని చూచి ఇలా అన్నాడు. "మహాత్మా! నేను నా పరివారము వేటకు వచ్చాము. దారి తప్పాము. నా పరివారము కనిపించడం లేదు. మీరు చూచారా!" అని అడిగాడు. ఇలమహారాజుకు ఏమీ గుర్తులేదు అని తెలుసుకున్నాడు బుధుడు.

"రాజా! పెద్ద వాన వచ్చింది. ఆ వానకు తట్టుకోలేక నీ వారందరూ మరణించారు. నీవు మాత్రము మిగిలావు. నీవు నా ఆశ్రమంలో నిద్రపోయావు. అందుకే బతికావు. నీవు ఇక్కడే నాతోపాటు ఉండు." అని అన్నాడు బుధుడు. దానికి ఇల మహారాజు సమ్మతించలేదు. "నా పరివారము లేని చోట నేను ఉండలేను. నేను వెంటనే నా నగరానికి పోతాను." అని అన్నాడు. కాని బుధుడు అతనిని బలవంతం చేసాడు. "నీవుఒక్క సంవత్సరము ఇక్కడ ఉంటే నీకు మేలుఅవుతుంది." అని అన్నాడు. చేసేది లేక ఇలమహారాజు అక్కడ ఉండటానికి నిశ్చయించు కున్నాడు. తరువాత స్త్రీగా ఉన్న మాసము రోజులు బుధుడు, ఇలాదేవి కామక్రీడలలో తేలియాడుతున్నారు, పురుషుడు గా ఉన్న మాసము రోజులు విడిగా ఉంటున్నారు. ఇలాదేవికి బుధునికి ఒక కుమారుడు కలిగాడు అతని పేరే పురూరవసుడు. ఇలాదేవి తన పుత్రుడు పురూరవసుని బుధునికి అప్పగించింది." అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము ఎనభైతొమ్మిదవ సర్గ. సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్ .

# ఉత్తర కాండము

## తొంభయ్యవ సర్గ.

ఇలుడి కథ వింటుంటే లక్ష్మణునికి భరతునికి ఆశ్చర్యం కలుగుతూ ఉంది. ఉత్సాహంగా కుతూహలంగా వింటున్నారు. "రామా! ఇలుడు బుధుని వద్ద ఒక సంవత్సరము ఉన్నాడు కదా! తరువాత ఏమి జరిగింది." అని అడిగారు.

"సంవత్సరము తరువాత ఇలుడు తన పురుషత్వాన్ని పొందాడు. తరువాత బుధుడు సంవర్తునిడిని, చ్యవనుడిని, అరిష్టనేమిని,దుర్వాసుని మొదలగు మహామునులను పిలిపించాడు. వారితో ఇలా అన్నాడు. "మహామునులారా! ఈయన కర్దమ ప్రజాపతి పుత్రుడైన ఇలుడు. ఈయన విషయంలో ఒక విపరీతము జరిగింది."అని చెబుతూ ఉండగానే కర్దముడు  కొంతమంది బ్రాహ్మణులతో కలిసి అక్కడకు వచ్చాడు. కర్దమునితో పాటు పులస్త్యుడు, క్రతువు, వషట్కారుడు, ఓంకారుడు కూడా అక్కడకు వచ్చారు.

కర్దముడు వారితో ఇలా అన్నాడు. "నేను చెప్పేది వినండి. ఈ రాజుకు ఏది హితమో అది చేయండి. దీనికంతటికీ కారణము శివుడు. శివునికి అశ్వమేధ యాగము ప్రీతి పాత్రమైనది. అందుకని ఇలారాజు క్షేమముకోరి మనం అందరం అశ్వమేధ యజ్ఞము నిర్వహిద్దాము." అని అన్నాడు కర్దముడు. కర్దముని సంకల్పానికి అందరూ అంగీకరించారు. సంవర్తనుని శిష్యుడు అయిన మరుత్తు ఆ యజ్ఞానికి కావాల్సిన ఏర్పాట్లు

చేసారు. బుధుని ఆశ్రమము దగ్గర అశ్వమేధయాగము చేసారు. ఆ యాగమునకు రుద్రుడు వచ్చి హవిర్భాగములనుస్వీకరించాడు. అప్పుడు రుద్రుడు ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణోత్తములారా! ఈ అశ్వమేధ యాగము చేసి నన్ను తృప్తిపరిచారు. నేను ఇలునికి ఏమి చెయ్యాలో చెప్పండి." అని అడిగాడు. "మహాదేవా! ఇలుడు తమ దగ్గరకు రాక ముందు పురుషుడు. మీ దగ్గరకు వచ్చిన తరువాత స్త్రీగా మారిపోయాడు. తరువాత పార్వతీ దేవి వరము వలన మాసము స్త్రీగానూ, మాసము పురుషుడు గానూ మారుతున్నాడు. తమరు దయయుంచి ఇలుని పూర్ణపురుషుడుగా మార్చండి." అని వేడుకున్నాడు.

పరమశివుడు ఇలునికి సంపూర్ణ పురుషత్వము ఇచ్చి కైలాసము వెళ్లిపోయాడు. తరువాత యాగ నిర్వహణమునకు వచ్చి బ్రాహ్మణులు కూడా ఎవరి ఆశ్రమములకు వారు వెళ్లారు. తరువాత ఇలుడు తన పూర్వ రాజధాని బాహ్లిక దేశమును తన కుమారుడు శశబిందువుకు వదిలిపెట్టాడు. తను ప్రతిష్ఠాన పురము అనే కొత్త రాజధానిని ఏర్పాటుచేసుకున్నాడు. తండ్రి ప్రతిష్ఠానమును, కుమారుడు బాహ్లికదేశమును పరిపాలిస్తున్నారు.

కొంత కాలము తరువాత ఇలుడు రాజ్యాధి కారమును తనకుమారుడు పురూరవునికి అప్పగించి తాను బ్రహ్మలోకమునకు వెళ్లిపోయాడు. ఇలుడు, బుధుని పుత్రుడైన పురూరవసుడు ప్రతిష్ఠానపురమునకు రాజయ్యాడు.

లక్ష్మణా! అశ్వమేధయాగమునకు అంతటి మహత్తు ఉంది." అని రాముడు అశ్వమేధయాగ మహిమను తన తమ్ములు లక్ష్మణుడు, భరతునికి వివరించాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము తొంబదియవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తరకాండము
తొంబది ఒకటవ సర్గ.

రాముడు అశ్వమేధ యాగము చేయడానికి నిర్ణయం జరిగింది. దానికి చేయవలసిన ఏర్పాట్లు గురించి రాముడు, లక్ష్మణుడు, భరతునితో చర్చించాడు. "లక్ష్మణా! నీవు మన కుల గురువు వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కశ్యపుడు, ఇంకా ఇతర బ్రాహ్మణులను పిలిపించి వారితో అశ్వమేధ యాగము నిర్వహణ గురించి చర్చించు. కావలసిన ఏర్పాట్లు చెయ్యి. ఒక ఉత్తమ అశ్వమును మనము వదలవలసి ఉంటుంది. ఆకార్యక్రమమునకు మంచి ముహూర్తము నిర్ణయించమని వసిష్ఠుల వారికి చెప్పు." అని అన్నాడు.

వెంటనే లక్ష్మణుడు ఆ ఏర్పాట్లు చేసాడు. రాముడు చెప్పిన బ్రాహ్మణోత్తముల నందరినీ రావించాడు. రాముడు వారందరి పాదములకు నమస్కరించాడు. వారు రాముని ఆశీర్వదించారు.

రాముడు తాను అశ్వమేధ యాగము చేయదలచుకున్నానని వారితో అన్నాడు. రాముని సంకల్పమును వారందరూ శ్లాఘించారు. బ్రాహ్మణులందరికీ వారు వారు చేయదగిన పనులను అప్పచెప్పాడు రాముడు. సుగ్రీవునికి ఆహ్వానము పంపమని లక్ష్మణునికి చెప్పాడు.

"లక్ష్మణా! నీవు సుగ్రీవునికి, వానర నాయకులకు అశ్వమేధ యాగమునకు రమ్మని వేరువేరుగా ఆహ్వానములను పంపించు. విభీషణుడికి, ఇతర రాక్షస వీరులకు అశ్వమేధ యాగమునకు రమ్మని ఆహ్వానము పంపించు. మనకు సామంత రాజులైన వారందరికీ ఆహ్వానాలు పంపించు. దేశదేశములలో ఉన్న ఉత్తములైన బ్రాహ్మణులకు వేదపండితులకు ఆహ్వానాలు పంపించు. మనదేశములో ఉండి, తమ పనుల మీద ఇతర దేశములకు వెళ్లిన బ్రాహ్మణులకు కూడా ఆహ్వానాలు పంపించు. ఇంకా నటులను, నర్తకులను ఆహ్వానించు.

మనము ఈ యజ్ఞమును పవిత్రమైన నైమిశారణ్యములో చేసెదము. అక్క గోమతీ నదీ తీరంలో ఒక పెద్ద యజ్ఞశాల నిర్మించు. ఆ యజ్ఞశాలలో వందలకొద్దీ ఆహూతులు కూర్చుని యజ్ఞమును తిలకించుటకు ఏర్పాట్లు చేయించు. వచ్చిన వారందరికీ తగిన మర్యాదలు చేయడానికి ఏర్పాట్లు చేయించు. మంచి బియ్యమును ఒక లక్ష వాహనములలోనూ, తిలలు, పెసలు, శెనగలు ఇంకా ఇతరములైన తృణధాన్యములను, తైలములను, సుగంధ ద్రవ్యములను సమృద్ధిగా యజ్ఞశాలకు తరలించు. వెండి, బంగారు నాణెములను నూరు కోట్లు బండ్లమీద యజ్ఞశాలకు తరలించు. వాటికి రక్షణగా భరతుడు వెళ్తాడు.

యజ్ఞము జరిగే చోట అంగళ్లను తెరవడానికి వర్తకులను, వండి వార్చడానికి వంటవాళ్లను, వినోదము అందించడానికి నర్తకులను గాయకులను, వార కాంతలను తరలించండి. ఈ ఏర్పాట్లు భరతుడు స్వయంగా పర్యవేక్షిస్తాడు.

పౌరసంఘముఖ్యులను, కార్యనిర్వాహకులను, పర్యవేక్షకులను, ధనాగారముల అధ్యక్షులను, ఇతర ఉద్యోగులను, అంతఃపుర కాంతలను, మన తల్లులను, నా భార్య సీత యొక్క బంగారు ప్రతిమను, వీరందరినీ తీసుకొని భరతుడు ముందుగా యజ్ఞశాలకు చేరుకుంటాడు. యజ్ఞవాటిక దగ్గర ఆహూతులైన బ్రాహ్మణులకు, వివిధ దేశాధీశులకు వసతి, భోజన సదుపాయములు సమకూర్చండి." అని రాముడు లక్ష్మణునికి భరతునికి తగిన ఆదేశాలు ఇచ్చాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము తొంబై ఒకటవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము
## తొంబై రెండవ సర్గ.

అశ్వమేధ యాగమునకు కావలసిన ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. ఒక సుముహూర్తమున యాగాశ్వమును వదిలారు. యాగాశ్వము వెంట లక్ష్మణుడు పరిమిత సైన్యముతోనూ ఋత్విక్కుల

తోనూ వెళ్లాడు. రాముడు నైమిశారణ్యములో ఏర్పాటుచేయబడిన యజ్ఞవాటిక వద్దకు వచ్చాడు. అక్కడ యజ్ఞవాటిక నిర్మాణమును, ఏర్పాట్లను చూచి తన సంతృప్తిని వ్యక్తంచేసాడు.

రాజులందరూ ఒకరొక్కరుగా యజ్ఞవాటిక వద్దకు చేరుకుంటున్నారు. అందరికన్నా ముందుగా శత్రుఘ్నుడు వచ్చాడు. అన్న భరతునికి సాయంగా ఉన్నాడు. వచ్చిన రాజులందరూ తెచ్చిన కానుకలను స్వీకరిస్తున్నాడు రాముడు. వచ్చిన రాజులందరికీ భరతుడు, శత్రుఘ్నుడు భోజన, వసతి ఏర్పాట్లను చేస్తున్నారు. సుగ్రీవుడు మొదలగు వానర వీరులు కిష్కింధనుండి వచ్చారు. వారు కూడా యజ్ఞము పనులలో పాలుపంచుకుంటున్నారు. లంకా నగరము నుండి విభీషణుడు తన రాక్షస వీరులతో వచ్చాడు. విభీషణుడు యజ్ఞమునకు వచ్చిన బ్రాహ్మణులను భక్తితో సేవిస్తున్నాడు. వారికి కావలసిన అవసరములను తీరుస్తున్నాడు.

లక్ష్మణునిచేత రక్షింపబడుతున్న యాగాశ్వము తన సంచారమును ముగించుకొని యజ్ఞవాటికకు తిరిగి వచ్చింది. ఆ యజ్ఞములో యాచకులకు ఇంక చాలు అన్నదాకా అన్నం పెడుతున్నారు. ధనము బహూకరిస్తున్నారు. “అడిగినవారికి అడిగినంత ఇవ్వండి” అన్న మాట తప్ప “ఇంకలేదు” అన్న పదమే వినపడటం లేదు. యజ్ఞమునకు వచ్చిన వారందరికీ తృప్తిగా భోజనములు వడ్డించబడ్డాయి. యజ్ఞమునకు వచ్చిన వారు ఇది కావాలి అని అడగకముందే వారు కోరినవి సమకూర్చబడుతున్నాయి. ఆ యజ్ఞములో తృప్తి చెందని వాడు

ఎవడూ లేడు అంటే అతిశయోక్తి లేదు. ఆ యజ్ఞమునకు వచ్చిన మునులు, ఋషులు, బ్రాహ్మణులు నోటి వెంట "ఇటువంటి యజ్ఞమును మేము ఇంతవరకూ చూడలేదు" అన్నమాటే వినబడుతూ ఉంది. యాచకులకు ఆహూతులకు ఎన్ని కానుకలు, బహుమానములు ఇచ్చినా ఇంకా ఇవ్వవలసిన బంగారు నాణెములు, వస్త్రములు రాసులు రాసులుగా కనపడుతున్నాయి. వానరులు, రాక్షసులు ఎక్కడ చూచినా సిద్ధంగా నిలిచి ఉండి యజ్ఞమునకు వచ్చిన వారి సేవలలో నిమగ్నమై ఉన్నారు. ఈ విధంగా ఒక సంవత్సరము పాటు ఆ యజ్ఞము సాగింది.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము తొంభై రెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము

## తొంభై మూడవ సర్గ.

రాముడు చేస్తున్న అశ్వమేధ యాగానికి వాల్మీకి తన శిష్యులతో సహా వచ్చాడు. వాల్మీకి తన శిష్యులతో సహా ఉండటానికి ఋషులు ఋత్విక్కులు ఉండేచోట ఒక పర్ణశాలను నిర్మించారు. ఆయన పర్ణశాలలో మధురమైన ఫలములు, శాకాహారములు సమకూర్చారు. రాముడు వాల్మీకికి నమస్కరించి ఆయన ఆశీర్వాదము తీసుకున్నాడు. వాల్మీకి శిష్యులైన కుశలవులు కూడా ఆయన వెంట వచ్చారు.

వాల్మీకి కుశలవులను చూచి ఇలాఅన్నాడు. "మీరు ఇద్దరూ నేను మీకు నేర్పించిన రామాయణ కావ్యమును, ఋషులు, బ్రాహ్మణులు నివసించే చోట  మృదుమధురంగా గానం చెయ్యండి.   గృహముల ముందు, నాలుగు వీధులు కలిసే చోట, రాజుల నివాసములలో గానం చేయండి. ముఖ్యంగా అశ్వమేధ యాగము జరిగేచోట, ఋత్విక్కుల ఎదుట, రాముని ఎదుట గానం చేయండి.

మీ వెంట మీరు తినడానికి ఫలములను తీసుకొని వెళ్లండి. ఎవరు ఏమి ఇచ్చినా తీసుకోకండి. రాజుగారు అయిన రాముడు మిమ్ములను రామాయణ కావ్యము గానం చేయడానికి పిలిపిస్తే వెళ్లండి. ఆయన ఎదుట ఋత్విక్కుల ఎదుట రామాయణ కావ్యమును గానం చేయండి. రోజుకు ఇరవై సర్గలు మాత్రమే గానంచేయండి. ఎవరైనా ధనం ఇస్తే తీసుకోకండి. వనములలో నివసించే మునులకు ధనముతో పనిలేదుకదా!

మీ గానమును విన్న రాముడు,  మీ తల్లి తండుల గురించి గానీ, కులగోత్రముల గురించి గానీ అడిగితే మేము వాల్మీకి శిష్యులము అని మాత్రమే చెప్పండి. మీరు ఎవరికీ భయపడవద్దు. నిర్భయంగా రామాయణ కావ్యమును శృతి లయ బద్ధంగా గానం చేయండి.

రాజు అడిగితే గానం చేయును అని చెప్పకండి. రాజు మనలకందరికీ తండ్రి వంటి వాడు. మీకు కూడా తండ్రి వంటి వాడు. ఆయనను నిరాదరించవద్దు.  మీ రామాయణ కావ్య గానమును రేపు

ఉదయమునుండి మొదలు పెట్టండి." అని లవకుశులకు చెప్పాడు వాల్మీకి.

సీతామాత పుత్రులయిన కుశలవులు వాల్మీకికి నమస్కరించి తమరు చెప్పినట్లే చేస్తాము అని మాట ఇచ్చారు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము తొంభైమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

తొంభైనాలుగవ సర్గ.

మరునాడు రాముడు సభామంటపంలో కూర్చుని ఉన్నాడు. ఆ సభకు అనేక మంది వచ్చారు. మహామునులు, రాజులు, పండితులు, పౌరసంఘముల అధ్యక్షులు, విద్యావేత్తలైన బ్రాహ్మణులు, సంగీతజ్ఞానము కల వాళ్లు, సంగీతము మీద ఆసక్తి కలవాళ్లు, గాంధర్వ శాస్త్రములో నిష్ణాతులైన వాళ్లు, ఛందోబద్ధంగా కవిత్వము చెప్పగలిగిన వాళ్లు, స్వరజ్ఞానముకలవాళ్లు, జ్యోతిష శాస్త్రములోనూ, అలంకార శాస్త్రములోనూ నిపుణులు, కావ్యరచనలో దిట్టలు, బహుభాషాప్రవీణులు, మనస్తత్వ శాస్త్రవేత్తలు, వర్తకులు, లౌకికులు, న్యాయశాస్త్ర ప్రవీణులు, ఇతర శాస్త్రములయందు జ్ఞానము సముపార్జించినవారు, పురాణములు చదివిన వారు, వేదపండితులు, చిత్రకళలో ప్రావీణ్యులు, నృత్య,గానముల

యందు ఆసక్తి ఉన్న వారు, నీతి శాస్త్ర వేత్తలు, వేదాంత అర్థములను విశదీకరించి చెప్పగలిగిన నిష్ణాతులు, ఇంకా ఇతర మేధావులు ఆ సభను అలంకరించి ఉన్నారు.  కుశలవుల రామాయణ కావ్య గానాన్ని నిండు సభలో రాముడు విన్నాడు. ఆ చిన్ని బాలలు ఇద్దరూ సంగీతబద్ధంగా పాడుతున్న గానాన్ని విని ముగ్ధుడయ్యాడు రాముడు. వీణలు వాయిస్తూ కుశలవులు సంగీత ప్రమాణములు తప్పకుండా పాడుతుంటే రాముడు చాలా కుతూహలంగా విన్నాడు.  ఆ  సభలోని వివిధశాస్త్రములలో నిష్ణాతులందరూ కుశలవుల గానానికి ముగ్ధులయ్యారు.  ఎంత సేపు విన్నా వారికి తృప్తి కలగడం లేదు.

కాని  ఆ సభలో ఉన్న వారందరికీ ఒకే ఒక విషయం ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంది. కుశలవులు ఇద్దరూ అచ్చు రాముని ప్రతిబింబముల మాదిరి ఉన్నారు. కుశలవులు నారబట్టలు జటాజూటములు ధరించక పోతే అచ్చం రాముని మాదిరే ఉన్నారు. రామునికి ఆ బాలురకు ఏమీ భేదము కనిపించడం లేదు. అది ఎలా సాధ్యం అన్నది వారి మనసులో మెదులుతున్న ప్రశ్న.

ఇంతలో రామాయణకథాగానంలో మొదటి  ఇరవైసర్గలు పూర్తి అయ్యాయి. వాల్మీకి చెప్పినట్టు ఇరవై సర్గలు పూర్తి కాగానే కుశలవులు రామాయణ కావ్యము గానం చేయడం ఆపారు.  ఇంతలో సూర్యుడు అస్తమించాడు. రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. “లక్ష్మణా! ఈ ముని కుమారులకు 18,000 బంగారు నాణెములు, ఇంకా వారికి ఏమి కావాలంటే దానిని వారికి ఇమ్ము.” అని ఆదేశించాడు.

రాముని ఆదేశము ప్రకారము లక్ష్మణుడు వారికి బంగారు నాణెములు వారికి ఇచ్చాడు. కాని వారు తీసుకోలేదు. “మేము మునికుమారులకు. అడవులలో కందమూలములు తినువారము. మాకు ఈ బంగారము ఎందుకు. దీనితో మేము ఏమి చేసుకుంటాము.” అని అన్నాడు. బంగారము ఇస్తుంటే వద్దనే వాళ్లను చూచి రాముడు, సభాసదులు ఆశ్చర్యపోయారు. రాముడు కుశలవులనుచూచి ఇలా అన్నాడు.

“బాలలూ! మీరుఎవ్వరు? ఈ కావ్యమును ఎవరు రచించారు? ఆయన ఎక్కడ ఉంటాడు? ఆయన దేశము ఏది?” అని అడిగాడు. కుశలవులు రామునికి ఈ విధంగా సమాధానం ఇచ్చారు.

“రాజా! ఈ కావ్యమును రాసిన వారు వాల్మీకి మహర్షి. ఈ యజ్ఞమునకు వారు కూడా వచ్చారు. ఇది తమరి యొక్క కధ. దీనిని వాల్మీకి మహర్షి 24,000 శ్లోకములలో రచించాడు. ఇందులో నూరు ఉపాఖ్యానాలు ఉన్నాయి. ఈ రామాయణ కావ్యంలో ఐదు కాండములు ఉన్నాయి. ఉత్తర కాండతో సహా ఆరు కాండములు ఉన్నాయి. ఈ ఆరు కాండములలో 500 సర్గలు ఉన్నాయి. ఈ కావ్యమునకు నాయకుడు రాముడు. అంటే మీరు. మీ జీవితము ఎంతవరకు ఉందో అంతవరకుఉన్న కథ ఈ రామాయణ కావ్యంలో రాయబడింది. తమరికి వినవలెనని కోరిక ఉంటే ఈ యజ్ఞము జరుగుతున్న సమయంలో తమ్ములతో సహా ఈ రామాయణ కావ్యమును సభాసదులందరితో కలిసి వినండి. మేము గానం చేయడానికి సిద్ధంగా ఉన్నాము.” అని అన్నారు.

దానికి రాముడు సమ్మతించాడు. సాయంత్రం కావడంతో కుశలవులు వాల్మీకి వద్దకు వెళ్లారు. రాముడు కూడా యజ్ఞశాలకు వెళ్లాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము తొంభైనాలుగవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

ఉత్తర కాండము

తొంభై ఐదవ సర్గ.

ఆ ప్రకారంగా రాముడు సభాసదులతో కలిసి రామాయణ కావ్యగానాన్ని చాలారోజులు విన్నాడు. కుశలవుల ముఖకళవళికలను బట్టి, వారి రూపములను బట్టి వారు తాను వాల్మీకి మహర్షి ఆశ్రమ ప్రాంతంలో విడిచి రమ్మన్న సీతకు జన్మించిన కుమారులు అని గ్రహించాడు రాముడు. ఒక రోజు సభామధ్యలో కూర్చుని ఇరువురి దూతలను పిలిపించాడు. వారితో ఇలా అన్నాడు. "మీరు వాల్మీకి మహర్షి వద్దకు వెళ్లండి. ఆయన వద్ద నా భార్య సీత ఉంది. మీరు వాల్మీకి మహర్షితో ఇలా చెప్పండి.

"నా భార్య సీత ఏ పాపము ఎరుగనిది ఐతే, ఆమె పరిశుద్ధమైన ప్రవర్తన కలది ఐతే, వాల్మీకి మహర్షితో కలిసి సీత ఇక్కడికి వచ్చి తన పరిశుద్ధత్వమును నిరూపించుకోవాలి. అప్పుడు నేను ఆమెను తిరిగి నా

వద్దకు స్వీకరిస్తాను." అని చెప్పండి.

వాల్మీకి అభిప్రాయమును, సీతయొక్క మనస్సులో ఉన్న భావాన్ని తెలుసుకొని వచ్చి నాకు చెప్పండి. సీత ఒప్పుకుంటే, రేపు ఉదయము ఈ సభాపరిషత్తు మధ్యలో నిలబడిసీత తన నిర్దోషిత్వాన్ని నిరూపిస్తూ ప్రతిజ్ఞ చేయాలి." అని అన్నాడు రాముడు.

రాముని మాటలను ఆశ్చర్యంతో విన్నారు సభాసదులు. వెంటనే ఆ దూతలు వాల్మీకి వద్దకు వెళ్లారు. రాముడి మాటలను యధాతథంగా వాల్మీకి మహర్షితో చెప్పారు. ఆ మాటలను విన్నాడు వాల్మీకి. రాముని హృదయంలో మెదులుతున్న భావాన్ని గ్రహించాడు. ఆ దూతలతో ఇలా అన్నాడు. "దూతలారా! రామునితో నా మాటగా చెప్పండి. స్త్రీకి పతియే దైవము. అందుకని సీత రాముడు చెప్పినట్టు సభామధ్యలో నిలబడి ప్రతిజ్ఞ చేస్తుంది." అని అన్నాడు. ఆ దూతలు రాముని వద్దకు వచ్చి వాల్మీకి మహర్షి చెప్పిన మాటలను చెప్పారు.

అప్పుడు రాముడు సభాసదులను చూచి ఇలా అన్నాడు. "సభాసదులారా! మహా ఋషులారా! పురప్రముఖులారా! నీతి కోవిదులారా! రేపటి దినమున సీత సభాభవన మధ్యలో మీ అందరి ఎదుట నిలబడి తన నిర్దోషిత్వమును నిరూపించుకుంటూ ప్రతిజ్ఞ చేస్తుంది. మీరందరూ వచ్చి సీత చేయబోవు ప్రతిజ్ఞను వినండి." అని అన్నాడు.

"రామా! ఇలా చేయడం నీకే తగునయ్యా! ఇలా చేయడం భూమి మీద ఎవరి తరమూ కాదు!" అని సభాసదులందరూ ముక్త కంఠంతో అరిచారు.

( "ఉపపన్నం నరశ్రేష్ట! త్వయ్యేవ భువి నాన్యత:" ఈ మాటలలో శ్లేష గమనించండి.)

తరువాత రాముడు సభ మరునాడు సమావేశమవుతుంది అని ప్రకటించి యాగశాలకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తరకాండము తొంబై ఐదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తరకాండము
## తొంబై ఆరవ సర్గ.

మరునాడు తెల్లవారింది. అందరూ సభకు వచ్చారు. వసిష్టుడు, వామదేవుడు, జాబాలి, కశ్యపుడు, విశ్వామిత్రుడు, దుర్వాసుడు, పులస్త్యుడు, శక్తి, భార్గవుడు, వామనుడు, మార్కండేయుడు, మౌద్గల్యుడు, గర్గుడు, చ్యవనుడు, శతానందుడు, భరద్వాజుడు, అగ్నిపుత్రుడు, నారదుడు, పర్వతుడు, గౌతముడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, అగస్త్యుడు, ఇంకా ఇతర మునులు వేదవేదాంగపారంగతులైన బ్రాహ్మణోత్తములు, ఆ సభకు

వచ్చారు. వానరులు, వానర వీరులు, విభీషణుడు అతనితో వచ్చిన రాక్షస ప్రముఖులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, జ్ఞానులు, యోగులు, వీరందరూ సీత చేయబోవు ప్రతిజ్ఞను వినడానికి వేలాది మందిగా వచ్చారు.

రాముడు సింహాసనము మీద కూర్చుని ఉన్నాడు. వాల్మీకి సభలోకి ప్రవేశించాడు. ఆయన వెంట సీత కళ్లలో కన్నీరు నిండగా మనసులో రాముని స్మరించుకుంటూ సభామధ్యకు వచ్చింది. సీతనుచూచిన సభాసదులు ఆశ్చర్యంతో ఆమెను చూస్తున్నారు. వారందరూ జీవితమంతా కష్టములు పడుతున్న సీతను చూచి దు:ఖించారు. సభలో ఉన్న వారు కొంత మంది రాముని చర్యను పొగిడితే, మరి కొందరు సీతను సమర్ధించారు. మరి కొందరు సీతారాములకు జయజయధ్వానాలు చేసారు.
ఆ సన్నివేశాన్ని వాల్మీకి ఈ విధంగా వర్ణించాడు.
సాధు రామేతి కేచిత్తు సాధు సీతేతి చాపరే
ఉభావేవ చ తత్రాన్యే ప్రేక్షకా: సంప్రచుక్రుశ:

వాల్మీకి సభామధ్యమున నిలిచి రామునితో ఇలా అన్నాడు.

"రామా! ఉత్తమురాలు, ధర్మము తప్పనిది అయిన నీ భార్య సీతను, లోకాపవాదమునకు భయపడి నీవు నా ఆశ్రమము దగ్గర ఒంటరిగా వదిలి వెళ్లావు. నీవు అనుమతి ఇస్తే లోకాపవాదము వలన భయ పడ్డ నీకు, సీత తన పాతివ్రత్యమును, నిర్దోషిత్వమును

నిరూపించుకోగలదు. ఈ కవలలు, కుశలవులు సీతకు జన్మించిన నీ పుత్రులు. వీరిద్దరూ నీ కుమారులు. ఇది సత్యము. నేను ఎప్పుడూ అసత్యము పలకలేదు. వీరిద్దరూ నీ కుమారులు అని ప్రమాణము చేసి చెబుతున్నాను. నన్ను నమ్ము. నేను కొన్ని వేల సంవత్సరములు తపస్సు చేసాను. నీ భార్య సీతలో ఏదైనా దోషం ఉంటే నేను చేసిన ఇన్ని సంవత్సరాల తపస్సు ఎందుకూ పనికిరాకుండా అయిపోతుంది.

నేను ఇప్పటి వరకూ నా మనో వాక్కు శరీరములతో ఏ పాపమూ చేయలేదు. సీతకు ఏ పాపము తెలియదు అని నిశ్చయంగా చెబుతున్నాను. నేను సీతను అరణ్యములో చూచి నపుడు ఆమె పరిశు ద్ధురాలని గ్రహించి ఆమెకు ఆశ్రయం ఇచ్చాను. నాటి నుండి నేటి వరకూ సీత నిన్ను మనసా వాచా కర్మణా స్మరిస్తూ ఉంది. పతిదేవునిగా ఆరాధిస్తూ ఉంది. లోకాపవాదంతో భయపడుతున్న నీకు సీత తన పాతివ్రత్యమును నిరూపించుకొనే శపధం చేస్తుంది.

రామా! సీతలో ఏ దోషమూ లేదని నీకూ తెలుసు. కానీ లోకాపవాదమునకు భయపడి నీవు సీతను విడిచిపెట్టావు. నేను దివ్యదృష్టితో చూచి చెబుతున్నాను. సీత ఉత్తమురాలు, మహా పతివ్రత. ఆమెలో ఏ దోషమూ లేదు. అని నీకు తెలియజేస్తున్నాను." అని అన్నాడు వాల్మీకి.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము తొంభై ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## తొంభై ఏడవ సర్గ.

వాల్మీకి మహర్షి చెప్పిన మాటలను సావధానంగా విన్నాడు రాముడు. వాల్మీకి వెనక ఒదిగి నిలబడి ఉన్న సీతను చూచాడు. వాల్మీకి మహర్షికి భక్తితో నమస్కరించి ఇలా అన్నాడు. "మహర్షీ! తమరు పలికిన పలుకులు యదార్థములు. తమరి పలికిన పలుకుల మీద నాకు పరిపూర్ణ విశ్వాసము, నమ్మకమూ ఉన్నాయి. లంకా నగరం వద్ద, దేవతల సమక్షంలో సీత అగ్ని ప్రవేశము చేసి తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకుంది. అందుచేతనే ఆమెను స్వీకరించాను. కానీ, అయోధ్యలో మరొక సారి ఆమె మీద నిందమోపబడింది. లోకులు వేసిన నింద చాలా బలంగా ఉంది. అందుచేత లోకాపవాదమునకు భయపడి నేను సీతను తమరి దగ్గర విడిచిపెట్టాను. సీత ఏ పాపమూ ఎరుగదనీ, ఆమెలో ఏ దోషమూ లేదని తెలిసి కూడా లోకాపవాదమునకు వెరచి ఆమెను వదిలిపెట్టాను. దీనికి మీరు నన్ను క్షమించాలి. రామాయణకావ్యమును గానం చేసిన కవలలు నా కుమారులు అని నాకు తెలుసు. సీత అందరి మధ్య దోషము లేనిదిగా నిరూపితమైతే గానీ నేను ఆమెను తిరిగి స్వీకరించలేను." అని అన్నాడు రాముడు.

ఇంతలో దేవేంద్రుడు, దేవతలు, ఆదిత్యులు, మరుత్తులు, రుద్రులు, విశ్వేదేవతలు, సమస్తదేవతలు, సిద్ధులు, సాధ్యులు, నాగులు, మొదలగు దేవతా గణములు సీత చేయబోవు శపథమును వినుటకు అక్కడకు చేరుకున్నారు. అక్కడు వచ్చిన దేవతలందరినీ చూచి రాముడు

మరలా ఇలాఅన్నాడు.

"దేవతలారా! నాకు వాల్మీకి మహర్షి మాటల యందు నమ్మకం ఉంది. కాని జనవాక్యమునకు కట్టుబడిన నేను స్వంత నిర్ణయము తీసుకోలేను. కాబట్టి తన నిర్దోషిత్వమును నిరూపించుకోడానికి సీత ప్రమాణము చేయక తప్పదు." అని అన్నాడు రాముడు.

సభఅంతా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడు కాషాయ వస్త్రములను కట్టుకున్న సీత తల వంచుకొని సభా మధ్యకు వచ్చి నిలబడింది. సీత ఇలా అన్నది.

(సీత పలికిన పలుకులు యధాతథంగా మనం తెలుసుకుందాము.)

యథాహం రాఘవాదన్యంమనసాపి న చిన్తయే
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి.
(నేను నా మనసులో రాముని తప్ప మరొకరిని తలవని దానినయితే భూదేవి నాకు దారి ఇచ్చుగాక!)
మనసా కర్మణా వాచా యథా రామం సమర్చయే
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి
(నేను నా మనస్సుచేతా వాక్కుచేతా, కర్మ చేతా ఎల్లప్పుడూ రాముని పూజించెదనేని, భూదేవి నాకు దారి ఇచ్చు గాక!)
యథైతత్సత్యముక్తం మే వేద్మి రామాత్ పరం న చ,
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి
(నేను చెప్పేది అంతా నిజం అయితే, నాకు రాముడు తప్ప మరొక వ్యక్తిని తెలియనట్లయితే, భూదేవి నాకు దారి ఇచ్చుగాక)

పైవిధంగా సీతాదేవి సభామధ్యలో నిలబడి సభాముఖంగా పలికింది. సీత ఆ మాదిరి శపథం చేయుచుండగా ఒక అద్భుతము జరిగింది. ఒక దివ్యమైన సింహాసనము భూమిని చీల్చుకుంటూ భూమి లో నుండి పైకి వచ్చింది. ఆ సింహాసనాన్ని నాగులు మోస్తున్నాయి. ఆ సింహాసనము మీద భూదేవి కూర్చుని ఉంది. ఆమె తన చేతులు రెండూ సీత కోసం చాచింది. సీతను తన వద్దకు రమ్మని పిలిచింది. సీత తన తల్లి భూదేవివద్దకు వెళ్లింది. భూదేవి తన కుమార్తె అయిన సీతను తన కౌగిట్లోకి తీసుకుంది. తన పక్కన సింహాసనము మీద కూర్చోబెట్టుకుంది. వెంటనే ఆ సింహాసనము భూదేవి, సీతాదేవిలతో సహా రసాతలమునకు వెళ్లిపోయింది. ఆ ప్రదేశంలో భూమి మామూలుగా అయింది.

క్షణకాలంలో జరిగిన ఆ దృశ్యమును చూచిన దేవతలు పులకించి పుష్పవృష్టిని కురిపించారు. దేవతలందరూ "ఓ సీతా! నీవు ధన్యురాలవు. నీ శీలము గొప్పది" అని పెద్దగా శ్లాఘించారు.

సభలో కూర్చున్న వారందరూ ఈ దృశ్యాన్ని కళ్లప్పగించి చూస్తున్నారు. కనురెప్పపాటులో జరిగిపోయిన ఆ అద్భుతాన్ని వారు ఆశ్చర్యంతో వీక్షించారు. కొంత మంది "ఇది కలా! నిజమా!" అని ఆలోచనలో పడ్డారు. కొందరు రాముడి వంకా, సీత వెళ్లిన వంకా చూస్తున్నారు.

సీత ఆకస్మికంగా రసాతలంలో ప్రవేశించడం చూచి అందరూ ఆశ్చర్యచకితు లయ్యారు. అందరికీ స్పృహ తప్పినట్టు అయింది. సభఅంతా నిశ్శబ్దంగా మారింది.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము తొంభై ఏడవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత& ఓంతత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
తొంభై ఎనిమిదవ సర్గ.

అంతా క్షణంలో జరిగిపోయింది. అందరికళ్లముందే, అందరూ చూస్తూ ఉండగానే సీత రసాతలంలో ప్రవేశించింది. ఎవరి కోసరం తాము ప్రాణాలకు తెగించి రాక్షసులతో పోరాడామో అ సీత రాముని విడిచి తమ ఎదురుగుండా రసాతలానికి వెళ్లి పోవడం చూచిన వానరులు పెద్దగా ఏడ్చారు. అక్కడ చేరిన మునులు మాత్రం చాలా బాగా జరిగింది అని ఆమె పాతివ్రత్యాన్ని కొనియాడారు. రాముడు మాత్రం అలాగే కూలబడి పోయాడు. యజ్ఞదండాన్ని ఆనుకొని తలదించుకొని ఏడుస్తున్నాడు.

రాముడి కళ్లనుండి నీరు ధారాపాతంగా కారుతూ ఉంది. ఏదో ప్రజల కోసం ప్రమాణం చెయ్యమన్నాడే కానీ సీత ఇంత దారుణమైన నిర్ణయం తీసుకుంటుందని, తనకుశాశ్వతంగా దూరం అవుతుందనీ

అనుకోలేదు. ఆనాడు లంకలో "నీ ఇష్టంవచ్చిన వారి దగ్గరకుపో" అన్నప్పుడు "ఎక్కడికో ఎందుకు అగ్ని దేవుని వద్దకు వెళతాను" అని అగ్నిలో దూకింది సీత. ఈ నాడు ప్రమాణం చెయ్యమన్నందుకు ఏకంగా శాశ్వతంగా తన పుట్టినింటికి వెళ్లి పోయింది. ఇదంతా తలచుకుంటూ రాముడు ఏడుస్తున్నాడు.

రాముని శోకానికి అంతం లేకుండా పోయింది. ఆ శోకంలో నుండి క్రోధం పుట్టకొచ్చింది. "నా భార్య సీత. అపర లక్ష్మీదేవి. నేను చూస్తూ ఉండగానే రసాతలానికి వెళ్లిపోయింది. నా కళ్లముందే అదృశ్యం అయింది. నేను పర్ణశాలలో లేనపుడు రావణుడు నా సీతను అపహరించుకు పోయాడు. నేను సముద్రము దాటి లంకకు పోయి రావణుని చంపి నా సీతను తిరిగి తెచ్చుకున్నాను. ఇప్పుడు ఈ రోజు నా కళ్లఎదురుగుండా నేను చూస్తూ ఉండగానే భూదేవి నా సీతను తీసుకొని పోయింది. నేను ఊరుకుంటానా! రావణాసురుడినే చంపిన వాడిని. ఈ భూదేవి ఎంత? ఓ భూదేవీ! నా సీతను తిరిగి నాకు ఇవ్వు. లేకపోతే నేనేమిటో నా పరాక్రమము ఏమిటో నీకు రుచి చూపిస్తాను. ఒక విధంగా నీవు నాకు కన్యనిచ్చిన తల్లివి. (అత్తగారివి). నా సీత నీ నుండి పుట్టింది కదా! నా సీతను నాకు తిరిగి ఇమ్ము. లేదా నాకు కూడా దారి ఇమ్ము. రసాతలంలో గానీ, స్వర్గంలో కానీ నేను నా సీతతోనే ఉంటాను. నా సీత కోసరం నేను పిచ్చివాడినయ్యాను. ఈ కోపంలో నేను ఏమైనా చేస్తాను. నా సీతను నాకు తిరిగి ఇస్తావా లేక ఈ భూమి అంతా జలమయం చెయ్యమంటావా! పర్వతాలు, కొండలు, అడవులు, చెట్లు అన్నీ చదును చెయ్యమంటావా! అగ్నితో దగ్ధం చెయ్యమంటావా! ఏం చెయ్యమంటావో చెప్పు?" అని

కోపంతో ఊగిపోతూ రాముడు పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నాడు.

రాముని ఓదార్చడానికి కానీ రాముని కోపాన్ని శాంత పరచడానికి కానీ ఎవరికీ ధైర్యం చాలలేదు. అప్పుడు బ్రహ్మదేవుడు రాముని వద్దకు వచ్చాడు. "రామా! ఏమిటీ పామరత్వము. నీవు ఎవరవో నీకు తెలియదా! తెలిసే ఇలా శోకిస్తున్నావా! నీవు ఎవరివో ఒక్కసారి గుర్తు తెచ్చుకో. నేను నీకు చెప్పడం లేదు. నీవే ఆలోచించు. నీ భార్య సీత నాగలోకము చేరుకుంది. నీవు స్వర్గము చేరుకున్న తరువాత ఆమె నీ దగ్గరకు వస్తుంది. ఇప్పటి దాకా నీవు వినిన రామాయణ కావ్యము నీ సందేహములు అన్నీ తీర్చగలదు. రామాయణము పూర్తిగా విను. నీవు పుట్టినది మొదలు, నీ చరిత్ర పూర్తిగా వాల్మీకి తన రామాయణంలో పొందుపరిచాడు. వాల్మీకిచే రచింపబడిన ఈ ఆది కావ్యము నీ యందే ప్రతిష్ఠితమై ఉంది. నీ గురించే చెప్పబడింది. రామాయణ కావ్యంలో నీ కీర్తి ప్రతిష్టలు వర్ణింపబడ్డాయి. రామాయణమును పూర్తిగా వింటే నీ సందేహాలు తొలగి పోతాయి. నేను, దేవతలు కలిసి నీ చరిత్రను పూర్తిగా విన్నాము. కాబట్టి నీవు కూడా రామాయణ కధను పూర్తిగా విను. నీవు ఇప్పటి దాకా చూచిన, విన్న రామాయణము తరువాతి భాగమునకు ఉత్తర కాండము అని పేరు. జరగబోవు రామ కధను నీవు ఋషులతో కలిసి విను. భవిష్యత్తులో జరగబోవు ఈ ఉత్తర కాండమును ముందు నీవు మాత్రమే వినవలెను. తరువాతనే లోకమునకు తెలియాలి."అని పలికిన బ్రహ్మదేవుడు దేవతలతో కలిసి స్వర్గలోకమునకు వెళ్లిపోయాడు.

బ్రహ్మదేవుని మాటలతో రాముడు శాంతించాడు. తన శోకాన్ని విడిచిపెట్టాడు. ఉత్తర రామ కథను వినుటకు మునులు అందరూ బ్రహ్మదేవుని అనుజ్ఞ పొంది రాముని దగ్గర కూర్చున్నారు. రామ కథ భవిష్యత్తులో ఎన్నిమలుపులు తిరగబోతుందో అని అంతా ఆతురతగా ఎదురుచూస్తున్నారు. రాముడు కూడా రాబోవుకాలములో జరగబోవు తన కథను వినడానికి మునులతో సహా కూర్చున్నాడు.

అప్పుడు భూమి లోనుండి ఒక ధ్వని వినబడింది.

"రామా! నీకు కలిగిన శోకము దైవికము. దానిని వదిలిపెట్టు. నీవు సీతను చేజేతులా పోగొట్టుకున్నావు. ఇప్పుడు నీవు కావాలని కోరినా ఆమె నీకు దక్కదు. ఆమె ప్రస్తుతము నాగలోకంలో నాగులపూజలు అందుకుంటూ ఉంది. ఆమె త్రిలోకములలో పూజలందుకుంటుంది.

ఆమె ఎవరోకాదు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు వక్షస్థలములో నివసిస్తున్న లక్ష్మీదేవి అవతారము. కాబట్టి ఆమెను చూడాలని కానీ, తిరిగి ఆమె పొందాలని కానీ అనుకోకు. ఆ ఆలోచన విరమించుకో. నీ కుమారులు, సీతాదేవి పుత్రులు, అయిన కుశలవులలో ఆమెను చూచుకో. వారు ఆమెకు ప్రతిరూపము. ఆ ప్రకారంగా సీతారాములు ఎల్లప్పుడూ శాశ్వతంగా ప్రజల హృదయాలలో నిలిచి ఉంటారు. ఈ రోజు అంత:పురమునకు వెళ్లు. రేపు వచ్చి రామాయణంలో జరగబోవు కథను విను."అని వినబడింది.

రాముడు అదే ప్రకారంగా సభ రేపటి రోజు జరుగుతుంది అని ప్రకటించాడు. వాల్మీకి కుశలవులను తీసుకొని తనపర్ణశాలకు వెళ్లిపోయాడు. రాముడు రాత్రి అంతా సీతను గురించి ఆలోచనలతోనే గడిపాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండముతొంభై ఎనిమిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము

తొంభై తొమ్మిదవ సర్గ.

సీతాదేవి రసాతలంలో ప్రవేశించిన మరునాడు రాముడు సభకు వచ్చాడు. వాల్మీకిని ఆయన శిష్యులను పిలిపించాడు. రామాయణ కావ్య గానమును కొనసాగించమని చెప్పాడు. రాముని ఆదేశము మేరకు కుశలవులు రామాయణ కావ్యమును శ్రావ్యంగా గానం చేస్తున్నారు.

సీత రసాతలములో ప్రవేశించింది. అశ్వమేధ యాగము పూర్తి అయింది. కాని సీతను గురించి రాముని శోకమునకు అంతులేకుండా పోయింది. సీత ఈ లోకంలో లేదు అన్న భావనతో రాముడికి ఈ లోకం అంతా శూన్యంగా తోచింది. రాముడికి మన:శాంతి కరువయింది. తన దు:ఖమును అంతా మనసులో దాచుకొని పైకి గంభీరంగా దైనందిన కార్యములను నిర్వర్తిస్తున్నాడు. యజ్ఞమునకు వచ్చిన కిష్కింధా వాసులను,

లంకా నగర వాసులను తగిన కానుకలు ఇచ్చి పంపాడు. బ్రాహ్మణులకు దానాలు చేసాడు. మనసులో సీతను నిలుపుకొని అయోధ్యలో ప్రవేశించాడు. రాముడు తన జీవితములో మరొక స్త్రీని పరిగ్రహించలేదు. సీతకు మారుగా ఒక బంగారు ప్రతిమను అచ్చు సీత రూపంలో తయారు చేయించాడు. భార్యతో చేయవలసిన యజ్ఞ యాగములు క్రతువులు అన్నీ సీత యొక్క బంగారు ప్రతిమను పక్కన పెట్టుకొని, సీత తన పక్కనే సజీవంగా కూర్చుని ఉన్నదని భావించుకుంటూ చేసేవాడు.

ఆ ప్రకారంగా రాముడు పదివేల సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. ఈ పదివేల సంవత్సరములలో లెక్కలేనన్ని అశ్వమేధ యాగములు, వాజపేయములు చేసాడు. దాన ధర్మాలు విరివిగా చేసాడు. అగ్నిష్టోమము, అతి రాత్రము, గోసవము మొదలగు యజ్ఞములను చేసాడు.  ఇలా చాలాకాలము గడిచిపోయింది. రాముని రాజ్యపాలనలో ప్రజలు సామంత రాజులు ఎంతో సంతోషంగా ఉండేవారు. సకాలంలో మేఘాలు వర్షాలు కురిసేవి. గ్రామములు, పట్టణములు, నగరములు ధన ధాన్యములతో సమృద్ధిగా ఉండేవి. రాముని రాజ్యములో అకాల మరణములు లేవు. వ్యాధులు లేవు. కరువు కాటకములు లేవు. అనర్థములు లేవు. అంతాసుభిక్షంగా ఉండేది.

కొంత కాలానికి రాముని తల్లి కౌసల్య మరణించింది. ఆమె తరువాత సుమిత్ర, కైకేయికూడా మరణించారు. వారుముగ్గురూ మరణించి స్వర్గంలో ఉన్న దశరథమహారాజును కలుసుకున్నారు. రాముడు తన తల్లులు ముగ్గురికీ కర్మక్రతువులు, జలతర్పణములు, దాన

ధర్మాలు యధావిధిగా చేసాడు. ఈ ప్రకారంగా రాముడు కొన్ని వేల సంవత్సరములు సుఖంగా రాజ్యపాలన చేసాడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము తొంభైతొమ్మిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
నూరవ సర్గ.

కొంత కాలము తరువాత కేకయ దేశపు రాజు యుధాజిత్తు, తన పురోహితుడైన గార్గ్యుడిని రాముని వద్దకు పంపాడు. ఆ పురోహితుడి ద్వారా యుధాజిత్తు రామునికి వెలలేని కానుకలు ఎన్నో పంపాడు. రాముడు గార్గ్యుడిని సాదరంగా ఆహ్వానించాడు. పూజించాడు.

"మహాత్మా! మీరు మా భరతుని మేనమామ వద్దనుండి వచ్చారు. ఆయన వద్దనుండి ఏమి సందేశము తీసుకొని వచ్చారు." అని అడిగాడు రాముడు. "రామా! మీ మేనమామ చెప్పిన మాటలను చెబుతాను విను. మా కేకయ దేశము పక్కన ఉన్న సింధునదికి ఇరుపక్కలా గంధర్వులు నివసిస్తున్నారు. (అదే గాంధార దేశము. శకుని పాలించిన దేశము.  నేటి ఖాందహార్). ఆ దేశము ఫలపుష్పములతో చాలా అందంగా ఉంటుంది. శైలూషుడు అనే గంధర్వుడు ఆ దేశాన్ని పరిపాలిస్తున్నాడు. ఆ దేశంలో మూడుకోట్ల మంది గంధర్వులు ఉన్నారు. ఆ

గంధర్వ రాజ్యము మన సరిహద్దులో ఉన్నందున, కేకయ రాజు దానిని ఆక్రమించుకోవాలని అనుకుంటున్నాడు. మీరు మీ సైన్యములతో వచ్చి ఆ గాంధార రాజ్యమును జయించి, అక్కడ రెండు మహానగరాలను నిర్మించాలి. ఆ గాంధార రాజ్యమును నీవు చూస్తే వదిలిపెట్టవు. నీవు తప్ప మరొకరు ఆ రాజ్యమును ఆక్రమించలేరు." అని అన్నాడు.

రాముడు భరతుని వంక చూచాడు. భరతుడు సరే అన్నట్టు తలూపాడు. "తప్పకుండా అలాగే చేద్దాము. మాభరతుడు తన కుమారులైన తక్షుడు, పుష్కలుడు తో సహా గాంధార దేశమును జయించి ఆక్రమించుకుంటారు. తరువాత మా భరతుడు మీరుకోరినట్టు రెండు నగరములను నిర్మించి తన కుమారులను ఆ నగరములకు పట్టాభిషిక్తులను చేసి తిరిగి నా వద్దకు రాగలడు." అని అన్నాడు రాముడు.

రాముడు వెంటనే భరతుని కుమారులను పిలిపించి, వారిని తాను గాంధార దేశమును జయించి నిర్మించబోవు మహానగరములకు పట్టాభిషిక్తులను చేసాడు. తరువాత భరతుడు, తన కుమారులతోనూ అపార సేనావాహినితోనూ గాంధార రాజ్యం మీదికి దండయాత్రకు బయలుదేరాడు. భరతుడు ఒకటిన్నర నెలలు ప్రయాణం చేసి కేకయ దేశము చేరుకున్నాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## నూటొకటవ సర్గ.

తన కోరికను మన్నించి అపార సేనావాహినితో వచ్చిన భరతుని, అతని కుమారులను సాదరంగా ఆహ్వానించాడు భరతుని మేనమామ యుధాజిత్తు. తన వద్ద ఉన్న సైన్యమును కూడా భరతుని సైన్యముతో కలిపాడు. రెండు సైన్యాలు కలిసి గాంధార దేశము మీదికి యుద్ధానికి వెళ్లాయి. కేకయ దేశపురాజు తమ మీదికి యుద్ధానికి వచ్చాడని తెలిసి గంధర్వులు కూడా యుద్ధానికి సన్నద్ధం అయ్యారు. కేకయసేనలకు గంధర్వుల సేనలకు ఏడు రోజులు యుద్ధం జరిగింది. ఇరు పక్షముల వారు ఖడ్గములను, శక్తి ఆయుధములను, ధనుస్సులను, ఉపయోగించి యుద్ధం చేసారు. ఎవరినీ గెలుపు వరించలేదు. తుదకు భరతుడు పరమ దారుణమైన కాలాస్త్రమును ప్రయోగించాడు. ఆ అస్త్రము ధాటికి మూడుకోట్ల మంది గంధర్వులు నశించిపోయారు. గాంధర్వ దేశము భరతుడు స్వాధీనపరచుకున్నాడు.

గాంధర్వదేశములో రెండు మహానగరములను నిర్మించాడు భరతుడు. ఒకదానికి తన కుమారుడు తక్షుని రాజుగా చేసాడు. తక్షుని పేర ఆ నగరము తక్షశిల అనే పేరుతో సార్ధకము అయింది.(ఈ తక్షశిల క్రీస్తు పూర్వమునుండి విశ్వవిద్యాలయపీఠముగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడే చాణక్యుడు చదువుకున్నాడు. అక్కడే ఆచార్యుడుగా పనిచేసాడు.) తరువాత మరొక నగరానికి తన రెండవ కుమారుడు పుష్కలుడిని రాజుగా చేసాడు. పుష్కలుడిపేరిట ఆ నగరము పుష్కలావతి అని ప్రసిద్ధి

చెందింది. (తరువాతకుషానుల కాలంలో పురుషపురం అయింది. అదే నేటి పెషావర్ నగరము. ఈ రెండు నగరములు ప్రస్తుతం పాకిస్తాన్ లో ఉన్నాయి.)

ఆ రెండు నగరములు ధనధాన్యములతోనూ భోగభాగ్యములతోనూ, చక్కని ఉద్యానవనములతోనూ, విశాలమైన రాజవీధులతోనూ,ఎత్తైన గృహములతోనూ, దేవాలయములతోనూ, అలరారాయి. భరతుడు ఐదుసంవత్సరములు అక్కడే ఉండి. తరువాత అయోధ్యకు తిరిగి వచ్చాడు. రామునితో తాను గంధర్వులను ఎలా జయించినదీ, ఎలా రెండు నగరములను నిర్మించినదీ, వాటికి తన కుమారులను పట్టాభిషిక్తులను చేసినదీ వివరంగా చెప్పాడు. రాముడు భరతుడు చెప్పిన మాటలను విని చాలా సంతోషించాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూట ఒకటవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## నూటరెండవ సర్గ.

రాముడు లక్ష్మణుని చూచి ఇలా అన్నాడు. "లక్ష్మణా! నీ కుమారులు అంగదుడు, చంద్రకేతువు బాగా ధర్మము తెలిసిన వారు. వీరులు. పరాక్రమవంతులు. రాజ్యపాలనకు తగినవారు. వారిని కూడా

రాజ్యాభిషిక్తులను చేస్తే వారు కూడా సుఖంగా ఉంటారు. వారికి తగిన రాజ్యములను గురించి ఆలోచించు. వారికి సరిహద్దులలో ఉన్న రాజుల నుండి ఎలాంటి భయము తగాదాలు ఉండకూడదు. ఆ రాజ్యము సకల సౌభాగ్యములతో సమృద్ధిగా ఉండాలి. అటువంటి రాజ్యము కొరకు అన్వేషించు." అని అన్నాడు రాముడు.

ఆ మాటలు విని భరతుడు ఇలా అన్నాడు. "రామా! కారుపథము అనే దేశము ఉంది. అది సస్యశ్యామలంగా ఉంది. దానికి శత్రు రాజుల వలన భయం లేదు. అక్కడ మనము ఒక రాజధానిని నిర్మించి దానికి అంగదుని రాజుగా చేద్దాము. చంద్రకేతువునకు మరొక నగరమును నిర్మించి దానికి ఆయనను పట్టాభిషిక్తుని చేద్దాము." అని అన్నాడు.

రాముడు వెంటనే ఆ దేశము మీద యుద్ధము ప్రకటించి ఆ రాజ్యమును స్వాధీనము చేసుకున్నాడు. అంగదుని కొరకు అంగదీయము అనే పురమునునిర్మించాడు. దానికి అంగదుని రాజును చేసాడు. చంద్రకేతువు కొరకు అమరావతిని తలదన్నే మరొక నగరమును నిర్మింపజేసాడు. దానికి చంద్రకేతుని రాజుగా చేసాడు. ఇరువురి పట్టాభిషేక మహోత్సవములు వైభవంగా జరిపించాడు రాముడు. అంగదునికి రక్షణగా లక్ష్మణుడు, చంద్రకేతుకు రక్షణగా భరతుడు వెళ్లారు. లక్ష్మణుడు, భరతుడు వారి దగ్గర ఒక సంవత్సరము పాటు ఉండి, అంగదుడు, చంద్రకేతు వారి వారి రాజ్యములలోస్థిరపడిన తరువాత, అయోధ్యకు తిరిగి వచ్చారు.

ఆ ప్రకారంగా పదివేల సంవత్సరములు గడిచిపోయాయి. రాముడు అయోధ్యను పాలిస్తుంటే, లక్ష్మణుడు, భరతుడు రామునికి సాయంగా ఉంటూ, ముగ్గురు మూడు అగ్నులవలె ప్రకాశించారు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూటరెండవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## నూట మూడవ సర్గ.

అలా కాలం గడుస్తూ ఉండగా ఒక నాడు కాల పురుషుడు ఒక ముని రూపంలో రాముని వద్దకు వచ్చాడు. లక్ష్మణునితో ఇలా అన్నాడు. "లక్ష్మణా! నేను ఒక మహానుభావుని దూతను. ఆ మహానుభావుడు ఎవరో చెప్పను. నేను వచ్చినట్టు రామునికి తెలియజెయ్యి." అని అన్నాడు. లక్ష్మణుడు వెంటనే వెళ్లి ఈ విషయం రామునికి తెలిపాడు. ఆ మునికి స్వాగత సత్కారాలుచెయ్యమని రాముడు లక్ష్మణుని ఆదేశించాడు. లక్ష్మణుడు ఆ మునిని సాదరంగా రాజ మందిరములోని ఆహ్వానించాడు. అర్ఘ్యము పాద్యము ఆసనము ఇచ్చిసత్కరించాడు.

రాముడు వచ్చి కాలపురుషునికి నమస్కరించాడు. కాలపురుషుడు రాముని ఆశీర్వదించాడు. రాముడు కాల పురుషునితో ఇలా అన్నాడు. "ఓ మహామునీ! తమరు ఎవరి దూతగా వచ్చారో వారి

యొక్క వాక్కులు నాకు వినిపించు.” అని అడిగాడు.

“రామా! నేను చెప్పబోవు విషయములు అత్యంత రహస్యములు. వాటిని ఎవరూ వినకూడదు. మనము మాటలాడుకుంటున్నప్పుడు ఎవరైనా మన దగ్గరకు వచ్చినా, మనలను చూచినా, మనము మాట్లాడుకొనే మాటలను విన్నా, వారిని నీవు చంపాలి. దీనికి ఒప్పుకుంటేనే నేను నీతో మాట్లాడతాను.” అని అన్నాడు. రాముడు దానికి అంగీకరించాడు.

లక్ష్మణుని పిలిచాడు. “లక్ష్మణా! నేను ఈ మునితో కొన్ని రహస్యములు మాట్లాడవలసి ఉన్నది. నీవు ద్వార పాలకుని పంపి వేసి, నీవే స్వయంగా ద్వారము వద్ద ఉండు. ఎవరినీ ఎట్టి పరిస్తితులలోగానీ లోపలకు రానీయకు. నీవుకూడా, నేను పిలిచేంతవరకూ లోపలకు రాకు. ఇది నా ఆజ్ఞ. దీనిని అతిక్రమిస్తే మరణదండన విధింపబడుతుంది.” అని అన్నాడు.

లక్ష్మణుడు అంగీకరించాడు. రాముడు ఆదేశించిన ప్రకారము ద్వారపాలకుని పంపివేసి తానే స్వయంగా ద్వారము దగ్గర ఉన్నాడు. రాముడు కాల పురుషుని వద్ద కూర్చుని “ఇంక తమరు చెప్పడం ప్రారంభించండి.” అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూటమూడవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## నూట నాలుగవ సర్గ.

"రామా! నేను కాల పురుషుడను. నేను బ్రహ్మదేవుడు పంపగా నీ వద్దకు వచ్చాను. నీతో బ్రహ్మదేవుడు ఈ మాటలు చెప్పమన్నాడు.

"రామా! లోక రక్షణార్థము నీవు రామావతారము ఎత్తావు. నీవు శ్రీమహావిష్ణువు. కల్పాంతంలో ఈ లోకం అంతా జలమయం కాగా, నీవు ఆ జలంలో శయనించి ముందుగా నన్ను సృష్టించావు. తరువాత ఆదిశేషుని సృష్టించావు. మధు,కైటభులు అనే రాక్షసుల ఎముకలతో ఈ భూమి పర్వతములతో నిండిపోయింది. నీ నాభిలోనుండి పుట్టిన పద్మములో నుండి నేను ఉద్భవించాను. నువ్వు నన్ను ప్రజాపతిగా నియమించావు. అప్పుడు నేను నిన్ను ప్రార్థించాను. నీ గురించి తపస్సు చేసాను. అప్పుడు నువ్వు నీ తేజస్సును నాకు ప్రసాదించావు. తరువాత నీవు విష్ణుత్వమును పొంది సర్వవ్యాపకుడవు అయ్యావు. నీవు అదితి గర్భంలో నుండి ఉపేంద్రుగా అవతరించి దేవతలకు సాయంచేసావు. ముల్లోకములలో ఉన్న ప్రాణులు రావణుని చేత నానా బాధలు పడుతుండగా రావణ సంహారము కొరకు నీవు రామునిగా అవతరించావు. పదకొండు వేల సంవత్సరములు భూమి మీద నివసిస్తానని నియమం పెట్టుకున్నావు. నీనియమం పూర్తి అయింది. నీవు ఇంక వైకుంఠమునకు రావలసిన సమయం ఆసన్నమయింది.

రామా! నీకు ఇంకా భూలోకంలో ఉండి ప్రజలను రక్షించవలె అనికోరిక ఉంటే అలాగే చెయ్యి. నీవు సర్వాధికారివి. అలా కాకుండా అవతార పరిసమాప్తి చెయ్యదలచుకుంటే రామావతారము చాలించి, వైకుంఠమునకు వచ్చి దేవతా గణములను పాలించు."

రామా! ఇది బ్రహ్మదేవుని సందేశము." అని అన్నాడు కాలపురుషుడు.

కాల పురుషుని మాటలు సావధానంగా విన్న రాముడు ఇలా అన్నాడు. "బ్రహ్మదేవుని పలుకులు నీ నోట వినడం నాకు చాలా ఆనందం కలిగించింది. నేను వచ్చిన పని పూర్తి అయింది. మూడు లోకములు సురక్షితంగా ఉన్నాయి. నేను ఎక్కడి నుండి వచ్చానో అక్కడికే చేరుకుంటాను. ఈ విషయంలో మరో ఆలోచన లేదు. భూలోకంలో ఎంత కాలం ఉన్నా, చివరకు నేను దేవతలను పాలించవలసిన వాడినే కదా!" అని అన్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నూటనాల్గవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## నూట ఐదవ సర్గ.

రాముడు ఈ ప్రకారంగా కాలపురుషునితో మాట్లాడుతూ ఉండగా, దుర్వాసుడు లక్ష్మణుడు నిలబడి కాపలా కాస్తున్న ద్వారం వద్దకు వచ్చాడు. "కుమారా! నేను వెంటనే రాముని చూడాలి. నా రాకను గురించి రామునికి తెలియజెయ్యి. లేకపోతే నన్ను లోపలికి పోనివ్వు." అని అన్నాడు. లక్ష్మణుడు దుర్వాసునికి వినయంగా నమస్కరించి ఇలా అన్నాడు. "మహాత్మా! నన్ను మన్నించండి. తమరు ఏ పని మీద వచ్చారో చెబితే దానిని నేనే తమరికి చేసి పెడతాను. రాముడు ప్రస్తుతము మరొక అవసరమైన పని మీద ఉన్నాడు. తమరు కొంచెం సేపు నిరీక్షించండి. రాముడే బయటకు వస్తాడు." అని అన్నాడు లక్ష్మణుడు.

దుర్వాసుడు కోపంతో మండిపోయాడు కళ్లనుండి నిప్పులు రాలుతున్నట్టు లక్ష్మణుని వంక చూచాడు. "లక్ష్మణా! నేను వచ్చానని తక్షణమే రామునికి తెలియజెయ్యి. లేక పోతే, రాముని, నిన్ను, నీ సోదరులను, సుతులను నీ రాజ్యమును సర్వనాశనం అయేట్టు శపిస్తాను. నేను నా కోపాన్ని అణచుకోలేక పోతున్నాను." అని ఉరిమాడు దుర్వాసుడు.

లక్ష్మణుడు మనసులో ఇలా అనుకున్నాడు. "రాముడి దగ్గరకు వెళితే నన్ను ఒకడినే రాముడు చంపుతాడు. రాముడి దగ్గరకు వెళ్లకపోతే ఈ ముని అందరినీ సర్వనాశనం చేస్తాడు. నా ఒక్కడి ప్రాణం కోసం

ఇంతమందిని బలిపెట్టలేను. నేనే వెళతాను.” అని అనుకున్నాడు.

ద్వారం తీసుకొని లోపలకు వెళ్లాడు. కాలపురుషుడు మాట్లాడటం ఆపేసాడు. రాముడు లక్ష్మణుని చూచాడు. కాలపురుషుడు వెళ్లిపోయాడు. లక్ష్మణుడు దుర్వాసుని రాక గురించి రామునికి చెప్పాడు. రాముడు వెంటనే దుర్వాసుని వద్దకు వచ్చాడు. ఆయనను సత్కరించాడు.

రాముని చూడగానే దుర్వాసుని కోపం ఎగిరిపోయింది. “ఏమీ లేదు రామా! నేను ఒక వ్రతం చేసాను. ఈ నాటితో అది పరిసమాప్తి అయింది. నీ ఇంట్లో భోజనము చేయవలెనని వచ్చాను. ఇప్పుడు ఈ క్షణంలో ఏది ఉంటే అది పెట్టు. తింటాను.” అని అన్నాడు దుర్వాసుడు. రాముడు వెంటనే దుర్వాసునికి భోజన ఏర్పాట్లు చేసాడు. దుర్వాసుడు రాముని మందిరములో భోజనము చేసి వెళ్లిపోయాడు.

అప్పుడు రాముడికి కాలపురుషుడు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. శోకంతో కుంగి పోయూడు.  కాలపురుషునికి ఇచ్చిన మాట ప్రకారం ఇప్పుడు తను లక్ష్మణునికి మరణ దండన విధించాలి. ఎలాగ” అని దు:ఖిస్తున్నాడు. రాముడికి నోట మాట రావడం లేదు. మౌనంగా తనలో తాను కుమిలిపోతున్నాడు రాముడు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూట ఐదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర రామాయణము

## నూట ఆరవ సర్గ.

చింతాక్రాంతుడై ఉన్న రాముని చూచి లక్ష్మణుడు ఇలా అన్నాడు. “రామా! కాల గతిని ఎవరు మార్చ గలరు. అంతా విధిలిఖితము. అలా జరగాల్సి ఉంది. జరిగింది. లేకపోతే ఆ సమయంలోనే దుర్వాసుడు అక్కడకు రావలెనా! నీ నియమము ప్రకారము నీవు నన్ను చంపాలి. చంపు. సందేహించకు. చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చకపోతే నరకానికిపోతారు అని నీవే కదా పదే పదే చెబుతావు. కాబట్టి నీవు అన్నమాట నెరవేర్చుకో.” అని అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాట విన్న సభాసదులు ఏమీ మాట్లాడలేదు. కుల గురువు వసిష్టుడు లేచి ఇలా అన్నాడు. “ఈ విషయం గురించి నాకు ముందే తెలుసు. కాబట్టి లక్ష్మణుడి చంపడంకన్నా దేశబహిష్కరణ ఉత్తమము. రామా! నీవు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చు. ధర్మస్వరూపుడవు నీవే ధర్మం తప్పితే ఇంక ప్రజలు ఎలా ధర్మంపాటిస్తారు. నీవే ధర్మం తప్పితే మూడులోకములు ధర్మం తప్పుతాయి. నీవు ఇప్పుడు లక్ష్మణుని విడిపెట్టడం ద్వారా ధర్మం రక్షింపబడుతుంది. ఎందుకంటే లక్ష్మణుడు సత్పురుషుడు. నీ తమ్ముడు. వధించడం, విడిచిపెట్టడం రెండూ సమనమే.కాబట్టి లక్ష్మణుని వదిలిపెట్టు. నీ ప్రతిజ్ఞ నెరవేరుతుంది.” అని అన్నాడు వసిష్ఠుడు.

రాముడు ఆలోచించి ఇలా అన్నాడు. “కుల గురువు వసిష్ఠుల వారు చెప్పినది యదార్థము. వధించడం, విడిచిపెట్టడం రెండూ

సమానమే. కాబట్టి నేను లక్ష్మణుని వదిలివేస్తున్నాను." అని అన్నాడు.

ఆ మాట విన్న లక్ష్మణుడికి ఒక్క సారిగా కళ్లనిండుగా నీళ్లు వచ్చాయి. పుట్టినప్పటినుండి ఒక్కరోజుకూడా రాముని విడిచి ఉండలేదు. కాని ఈ రోజు రాముని శాశ్వతంగా విడిచిపెట్ట వలసి వచ్చింది. దీని కన్నా మరణం మేలుకదా అని అనుకున్నాడు. కాని రామాజ్ఞను తప్పకూడదు. అందుకని ఇంటికి కూడా వెళ్లకుండా అటునుండి అటే బయటకు వెళ్లిపోయాడు.

సరయూనదీ తీరానికి వెళ్లాడు. ఒక సమతల ప్రదేశంలో కూర్చున్నాడు. శరీరములోని నవరంధ్రములను నిగ్రహించాడు. ఊపిరి బయటకు పోకుండా బిగపట్టాడు. లక్ష్మణుడికి ఉచ్ఛ్వాసము నిఃశ్వాసము నిలిచిపోయాయి. యోగసమాధిలో ఉన్నాడు లక్ష్మణుడు. ఇంద్రుడు, దేవతలు లక్ష్మణుని సశరీరంగా స్వర్గానికి తీసుకొని పోయారు. దేవతలందరూ విష్ణువులో నాలుగవ అంశ తిరిగి స్వస్థానము చేరిందని సంతోషించారు.

శ్రీమద్రామాయణము

ఉత్తర కాండము నూట ఆరవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తర కాండము

## నూట ఏడవ సర్గ.

లక్ష్మణుని వదిలివేసిన తరువాత రాముడు ఏకాకి అయ్యాడు. రాజ సభకు వచ్చాడు. రాజ సభలో ఉన్న మంత్రులు సేనాపతులు పురప్రముఖులను ఉద్దేశించి ఇలా అన్నాడు. "నేను భరతుని అయోధ్యకు రాజ్యాభిషిక్తుని చేసి వానప్రస్థము వెళ్లదలచుకున్నాను. లక్ష్మణుడు పోయిన మార్గములోనే నేనూ పోతాను."అని అన్నాడు.

రాముని నిర్ణయం విని సభాసదులు నిశ్చేష్టులయ్యారు. కొంతమంది మూర్ఛపోయారు. భరతునికి ఏమి మాట్లాడాలో తోచలేదు. "రామా! నీవులేని ఈ రాజ్యము నాకు అవసరం లేదు. నాకు నీ తోటిదే లోకము. తమరు ఒక పని చేయండి. కుశుని దక్షిణ కోసల దేశమునకు. లవుని ఉత్తర కోసల దేశమునకు పట్టాభిషిక్తులుగా చేయండి. వెంటనే శత్రుఘ్నుని వద్దకు వార్తాహరులను పంపుదాము. శత్రుఘ్నుడు కూడా మనతో వస్తాడు." అని అన్నాడు భరతుడు.

ఆ మాటలు విన్న వసిష్ఠుడు, మౌనంగా ఉన్న సభికులను చూచి, రామునితో ఇలా అన్నాడు. "రామా! ఇన్నాళ్లు అయోధ్యను పాలించావు. ఇప్పుడు వానప్రస్థము వెళతాను అంటున్నావు. ఈ సభికులు ఎలా చెబితే అలా చెయ్యడం ఉత్తమము. ప్రజల మాట పాలకులకు శిరోధార్యము కదా!" అని అన్నాడు వసిష్ఠుడు.

రాముడు సభాసదులను చూచి ఇలా అన్నాడు. "సభాసదులారా! నేను నా తమ్ములతో వానప్రస్థము వెళ్లదలచుకున్నాను. మీ అభిప్రాయము ఏమి?" అని అడిగాడు.

సభికులంతా ముక్తకంఠంతో "మీరు ఎక్కడికి పోతే మేమూ అక్కడికే వస్తాము. మేమేకాదు మా భార్యాపుత్రులతో మిమ్ములను అనుసరిస్తాము. మీరు ఎక్కడికిపోతే అక్కడకు వస్తాము. మీరు లేని అయోధ్యలో మేము ఉండలేము. మిమ్ము అనుసరించి ఉండటమే మాకు ఆనందము. మీరు ఎక్కడ ఉంటే అదే మాకు అయోధ్య. అదే మాకు స్వర్గము." అని అన్నారు.

రాముడు అందుకు సమ్మతించాడు. తరువాత కుశలవుల పట్టాభిషేకమునకు ఏర్పాట్లు చకా చకా చేసారు. కుశుని దక్షిణ కోసల దేశమునకు, లవుని ఉత్తర కోసల దేశమునకు రాజులుగా అభిషేకించారు. వింధ్య పర్వత సమీపములో కుశావతి అనే నగరము రాజధానిగా దక్షిణకోసల దేశమునకు కుశుడు అభిషిక్తుడు అయ్యాడు. శ్రావస్తి అనే నగరము రాజధానిగా లవుడు ఉత్తర కోసల దేశమునకు అభిషిక్తుడు అయ్యాడు. రాముడు వారికి వేలకొలది అశ్వములను, ఏనుగులను, రథములను, అపారమైన ధనరాసులను ఇచ్చాడు. రాముడు కుశలవులను వారి వారి రాజధాని నగరములకు సాగనంపాడు. శత్రుఘ్నుని కొరకు దూతలను పంపాడు.

శ్రీమద్రామాయణము ఉత్తరకాండము

నూట ఏడవ సర్గ సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## నూట ఎనిమిదవ సర్గ.

రాముడు పంపిన దూతలు మధురా నగరమునకు వెళ్లారు. మూడురోజులు ప్రయాణం చేసి మధురా నగరం చేరుకున్నారు. అయోధ్యలో జరిగిన పరిణామాలన్నీ విశదంగా శత్రుఘ్నుడికి చెప్పారు. రాముడు చేసిన ప్రతిజ్ఞను అనుసరించి, రాముడు లక్ష్మణుని వదిలివేయడం, కుశలవుల పట్టాభిషేకము, రాముని వాన ప్రస్థ నిర్ణయము, అయోధ్యలోని పౌరులందరూ రాముని అనుసరించడానికి నిర్ణయం తీసుకోవడం, అయోధ్యానగరం నిర్మానుష్యం కాబోతోందన్న విషయము,  అన్నీ వివరంగా చెప్పారు. శత్రుఘ్నుని త్వరగా బయలు దేరమని తొందర చేసారు.

శత్రుఘ్నునికి విషయం అర్థం అయింది. తాను కూడా రాముని అనుసరించవలసిన సమయం వచ్చిందని తెలుసుకున్నాడు. వెంటనే మంత్రులను పురోహితులను, పురప్రముఖులను పిలిపించాడు. అయోధ్యలో జరిగిన పరిణామాలన్నీ వారికి వివరించాడు. తాను కూడా రాముని అనుసరించవలసిన సమయం వచ్చిందని తెలియజేసాడు. వెంటనే శత్రుఘ్నుడు తన కుమారులను ఇద్దరినీ రాజ్యాభిషిక్తులను చేసాడు. పెద్దకుమారుడు సుబాహువును మధురకు, చిన్న వాడు శత్రుఘాతిని వైదిశా నగరానికి రాజులుగా చేసాడు. తనకు ఉన్న ధనాగారమును, సైన్యమును రెండు భాగాలుగా చేసి ఇద్దరు కుమారులకు సమంగా పంచి ఇచ్చాడు. ఇద్దరు కుమారులను వారి వారి రాజధానులకు

పంపి తాను అయోధ్యకు బయలుదేరాడు శత్రుఘ్నుడు.

శత్రుఘ్నుడు అయోధ్యకే చేరేటప్పటికి రాముడు తెల్లని వస్త్రములు ధరించి, మునుల మధ్యకూర్చుని ఉన్నాడు. శత్రుఘ్నుడు రాముని చూచి ఇలా అన్నాడు.

"రామా! నేను కూడా నిన్ను అనుసరిస్తాను. నా కుమారు లిద్దరినీ పట్టాభిషిక్తులను చేసి వచ్చాను. నీవు ఎక్కడికి పోతే అక్కడకు నేనూ వస్తాను." అని అన్నాడు. రాముడు దానికి సమ్మతించాడు.

రాముని వానప్రస్థ నిర్ణయము దావాగ్నిలా అటు కిష్కింధకు ఇటు లంకకు పాకిపోయింది.. కిష్కింధనుండి సుగ్రీవుడు, హనుమంతుడు మొదలగు వానరులు, లంకనుండి విభీషణుడు, రామభక్తులైన రాక్షసులు అయోధ్యకు చేరుకున్నారు. వానరులు రాక్షసులు అందరూ రామునికి నమస్కరించి ఇలా అన్నారు.

"రాజా! మేము కూడా నీతో వస్తాము. మేము లేకుండా నీవు ఒక్కడివే వెళితే మమ్ములను చంపినంత ఒట్టు." అని ఒట్టుకూడా పెట్టుకున్నారు.

సుగ్రీవుని రామునితో ఇలా అన్నాడు. "రామా! నేను కూడా అంగదుని కిష్కింధకు పట్టాభిషిక్తుని గావించి, రాజ్యము అతనికి అప్పగించి వచ్చాను. నేను కూడా నిన్ను అనుసరిస్తాను. కాదనకు." అని

అన్నాడు. రాముడు ఆ మాటలకు చలించిపోయాడు.

"మిత్రమా! సుగ్రీవా! నేను కూడా అంతే. నీవు లేకుండా స్వర్గమునకు కూడా వెళ్లను. నీవు నాతో రావచ్చును." అని అన్నాడు.

రాముడు విభీషణుని చూచి ఇలా అన్నాడు. "విభీషణా! నీవు లంకలో లేకపోతే లంకకు దిక్కు ఎవ్వరు? కాబట్టి నీవు లంకకు పోయి లంకను పాలించు. నీతో నాకు ఉన్న స్నేహభావంతో నిన్ను ఆదేశిస్తున్నాను. నీవు వెంటనే లంకకు వెళ్లు. నా మాటకు ఎదురు చెప్పవద్దు. నీకు ఆ జగన్నాథుడే శరణ్యము. నీవు నిరంతరమూ ఆ జగన్నాథుని ఆరాధించు. భజించు నీకు శుభం కలుగుతుంది." అని అన్నాడు. విభీషణుడు రాముని ఆదేశమును శిరసావహించాడు.

రాముడు హనుమంతుని తన దగ్గరగా పిలిచి ఇలా అన్నాడు. "హనుమా! నీకు బ్రహ్మదేవుడు దీర్ఘాయువును ఇచ్చాడు. నీవు బ్రహ్మగారి మాటను వృథా చేయకు. రామాయణము ఈ లోకములో ప్రచారంలో ఉన్నంతవరకూ నీవు జీవించి ఉంటావు. నీవు చిరంజీవివి." అని ఆశీర్వదించాడు రాముడు.

ఆ మాటలు విన్న హనుమ రామునితో ఇలా అన్నాడు. "రామా! నీవు చెప్పినట్లే చేసెదను. రామ కథ ఈ లోకములో నిలిచి ఉన్నంత వరకూ నేను కూడా భూమి మీద జీవించి ఉండెదను." అని అన్నాడు.

తరువాత రాముడు జాంబవంతునికి, మైందునికి ద్వివిదునికి వారు కలియుగము వచ్చువరకూ జీవించి ఉందురని వరం ఇచ్చాడు. వారు తప్ప మిగిలిన వానరములను, ఎలుగుబంట్లను తనతో రావడానికి అనుజ్ఞ ఇచ్చాడు రాముడు.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము నూట ఎనిమిదవ సర్గ సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉత్తర కాండము
నూటతొమ్మిదవ సర్గ.

మరునాడు తెల్లవారగానే రాముడు పురోహితుని పిలిచి ఇలా అన్నాడు. "ఇంక నేను బయలు దేరు సమయం ఆసన్నమయింది. నా ముందు బ్రాహ్మణులు అగ్నిహోత్రము తీసుకొని నడుస్తారు. నేను వాజపేయము చేసినందుకు లభించిన వాజపేయఛత్రము నా ముందు తీసుకువెళ్లండి." అని ఆదేశించాడు.

కులగురువు వసిష్ఠుడు రాముని వానప్రస్థమునకు చేయవలసిన క్రతువులు అన్నీ పూర్తిచేసాడు. తరువాత రాముడు తెల్లని వస్త్రములు ధరించి, దర్భలు చేత పట్టుకొని సరయూ నదీ తీరానికి వెళ్లాడు. రాముడు మౌనంగా నడుస్తున్నాడు. ఎవరితో ఏమీ మాట్లాడటం లేదు. రాముని ధనుస్సు (కోదండము) మనుష్య రూపము ధరించి

రాముని వెంట నడిచింది. వేదములు, గాయత్రి, ఓంకారము, వషట్కారములు అందరూ బ్రాహ్మణ రూపములతో రాముని అనుసరించారు. ఋషులు, మునులు, బ్రాహ్మణులు, రాముడిని అనుసరించి వెళుతున్నారు. వారి వెంట అంత:పుర స్త్రీలు, పరిచారికలు, వెళుతున్నారు. భరతుడు, శత్రుఘ్నుడు తమ అంత:పుర కాంతలతో కలిసి తమ తమ అగ్నిహోత్రములతో సహా రాముని వెంట వెళుతున్నారు. వారి వెనుక మంత్రులు సేనాధి పతులు, సామంతులు, వారి అనుచరులు, భార్యాపిల్లలతో కలిసి రాముని వెంట వెళుతున్నారు. రాముని వెంట వెళు తున్న స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు అంతా అమితోత్సాహంతో రాముని అనుసరిస్తున్నారు. రాముడు ఎక్కడకు వెళితో అక్కడకు వెళ్లడానికి సిద్ధమే అన్నట్టు రాముని వెంట వెళుతున్నారు. వారిలో "అయ్యో ఎందుకు వెళుతున్నామా" అని అనుకున్న వాడు లేడు. ఎవరికీ దు:ఖము లేదు. అందరూ ఆనందంతో రాముని అనుసరిస్తున్నారు. రాముడు వెళు తున్న దారిలో ఉన్న పల్లెలలో ఉన్న ప్రజలు కూడా తమ తమ పనులు వదిలిపెట్టి రాముని అనుసరించారు. అయోధ్యలో ఉన్న ప్రజలు అందరూ రాముని అనుసరించారు. వారివెంట వానరములు భల్లూకములు, రాక్షసులు అనుసరించారు. రాముడు వెళుతుంటే వృక్షములు, కొండలు గుట్టలు కూడా కన్నీరు కార్చాయి. ఇంతెందుకు అయోధ్యా నగరంలో గాలిపీల్చే ఒక్క ప్రాణి కూడా లేదు. అన్నీ రాముని అనుసరించాయి. అయోధ్య నిర్మానుష్యం అయింది.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నూటతొమ్మిదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# ఉత్తరకాండము

## నూటపదవ సర్గ.

అయోధ్యకు ఒకటిన్నర యోజనముల దూరంలో ఉన్న సరయూనదీ తీరానికి చేరుకున్నాడు రాముడు. ఆ కాలంలో సరయూ నది పవిత్రజలాలతో నిండుగా పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తూ ఉంది. ఆ సమయంలో బ్రహ్మదేవుడు దేవతలతో సహా రాముడు వద్దకు వచ్చి ఆకాశంలో నిలబడ్డాడు. బ్రహ్మదేవుని తేజస్సుతో ఆకాశం అంతా తేజోమయం అయింది. దేవతలు రాముని మీద పుష్పవర్షము కురిపిస్తున్నారు. వాయుదేవుడు మంద్రంగా వీస్తున్నాడు. గంధర్వులు మృదుమధురంగా గానం చేస్తున్నారు. అప్సరసలు నృత్యం చేస్తున్నారు.

బ్రహ్మ దేవుడు ఆకాశము నుండి రామునికి వినబడేటట్టుగా "ఓ శ్రీ మహా విష్ణూ! స్వర్గలోకానికి నీకు స్వాగతం. మా భాగ్యవశంతో మరలా నీవు మరలా స్వర్గలోక ప్రవేశం చేస్తున్నావు. రామా! నీ సోదరులతో సహా నీ పూర్వదేహంలో ప్రవేశించు. నీవు నిరాకారమూ, సర్వవ్యాపకమూ అయిన  వైష్ణవ తేజంలో కానీ, శుద్ధసత్వగుణప్రధానమైన బ్రహ్మస్వరూపములో గానీ ప్రవేశించు. నీ ఇష్టం." అని పలికాడు బ్రహ్మ.

రాముడు తన తమ్ములతో సహా సర్వవ్యాపకము అయిన వైష్ణవ తేజంలో  సశరీరంగా ప్రవేశించాడు.

రామావతారం పరిసమాప్తి అయింది. ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఓం శాంతి: ఓం శాంతి: ఓం శాంతి:.

విష్ణుతేజంలో లీనమైపోయిన రాముని దేవతలు, సిద్ధులు, సాధ్యులు, మరుద్గణములు, ఇంద్రుడు, అగ్ని, ఋషులు, గంధర్వులు, అప్సరసలు, గరుడుడు, నాగులు,యక్షులు, దైత్యులు, దానవులు మొదలగు వారు భక్తితో పూజించారు. రాముడు వైష్ణవ తేజంలో ప్రవేశించడంతో స్వర్గం పరిపుష్టమయింది.

వైష్ణవ తేజంలో ప్రవేశించిన రాముడు బ్రహ్మతో ఇలా అన్నాడు. “నా తోపాటు అయోధ్యావాసులు, వానరులు, రాక్షసులు ఇంకా చాలామంది వచ్చారు. నామీద భక్తితో వారు నన్ను అనుసరించారు. నా కోసం తమ శరీరాలను వదిలిపెట్టారు. వారందరికీ ఉత్తమ లోకములు ప్రసాదించు.” అని పలికాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు వారికోసం సంతానకము అనే లోకాన్ని సృష్టించాడు. వారిని ఆ లోకానికి పంపాడు. “ఓ విష్ణూ! నిన్ను అనుసరించి నీ కోసం దేహాలు వదిలిన ప్రాణులన్నీ సంతానకము అనే  పుణ్య లోకాన్ని పొందుతారు.” అని అన్నాడు.

బ్రహ్మవాక్కు ప్రకారము రాముని అనుసరించిన వారందరూ సంతానకమనే లోకంలోకి ప్రవేశించారు. సుగ్రీవుడు సూర్యలోకంలో ప్రవేశించాడు. దేవతా అంశలతో పుట్టిన వానరులు తమ తమ పితృ అంశలలో ప్రవేశించారు.

బ్రహ్మదేవుడు ఈ విధంగా పలుకుతూ ఉంటే రాముని తో వచ్చిన అయోధ్యావాసులు సరయూనదిలో ప్రవేశించారు. తమ తమ మానుష శరీరాలను వదిలి పెట్టి దేవతలు తెచ్చిన విమానాలలో ఎక్కి సంతాన లోకమునకు వెళ్లిపోయారు. కేవలం మానవులే కాదు రాముని అనుసరించిన పశువులు, మృగములు పక్షులు కూడా సరయూనదిలో దూకి, ప్రాణత్యాగము చేసి ఉత్తమ లోకములకు వెళ్లిపోయాయి. సరయూనదీ జలాలను తాకిన వెంటనే వాటికి ముక్తిలభించింది. రాముని వెంట వచ్చిన ప్రాణులన్నింటికీ స్వర్గలోక ప్రాప్తి కలిగించి, బ్రహ్మదేవుడు దేవతలతో సహా బ్రహ్మలోకమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్రామాయణము

ఉత్తరకాండము నూటపదవ సర్గ సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## ఉత్తర కాండము

## నూటపదకొండవ సర్గ.

## శ్రీమద్రామాయణ మహాత్మ్యము.

ఉత్తరాకాండ సహితమైన ఈ రామాయణ మహా కావ్యము బ్రహ్మపూజితము. రామాయణము అనే పేరుతో ఈ మహాకావ్యము వాల్మీకి మహర్షిచేత రచింపబడినది. ఈ అనంత విశ్వంలో అణువుఅణువునా వ్యాపించి ఉన్న శ్రీమహావిష్ణువు రామావతారము చాలించి తన పూర్వరూపమైన విష్ణుతేజమును పొందాడు. స్వర్గంలో ప్రతిష్ఠితుడయ్యాడు.

ఇది శ్రీమహావిష్ణువు రామావతార చరిత్ర. దీనిని స్వర్గలోకములో దేవతలు, మునులు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు నిత్యం పారాయణ చేస్తుంటారు.

ఈ రామాయణ కావ్యము చదివినా, వినినా, గానం చేసినా, వారికి ఆయుష్షు వృద్ధిఅవుతుంది. నిత్య సౌభాగ్యంతో తులతూగుతారు. పుత్రసంతానం కలుగుతుంది. ధనము లేని వారికి ధనము వృద్ధి చెందుతుంది.

ఈ రామాయణ కావ్యంలో కనీసం ఒక్క శ్లోకం చదివినా, వారు చేసిన పాపాలన్నీ పటాపంచలవుతాయి. అంతేకాదు, ప్రతిదినము పాపం చేసేవాడు కూడా, రోజూ ఈ రామాయణంలో ఒక్క శ్లోకం చదివితే ఆ రోజు చేసిన పాపాలు పోతాయి.

ఈ రామాయణ కావ్యము వేదముతో సమానమైనది. శ్రాద్ధసమయములలో రామాయణము పఠించతగినది.

ఈ రామాయణము బ్రాహ్మణులచేత చదివించుకొనవలెను. చదివిన వారికి గోవులు, బంగారము, ధనము దానంగా ఇవ్వాలి. ఈ రామాయణము చదివిన వాడు సంతోషిస్తే దేవతలు కూడా సంతోషిస్తారు. ఆయుష్షును పెంచే ఈ రామాయణమును చదివే వాడు పుత్ర పౌత్ర సమేతంగా ఈలోకంలో పూజింపబడతాడు. మరణించిన తరువాత ఉత్తమ లోకములను పొందుతాడు.

ఉదయం సమయంలో గానీ, మధ్యాహ్న సమయంలో గానీ, సాయం సమయంలో గానీ రామాయణము పఠించు వాడు ఎన్నటికీ చెడిపోడు.

ఈ రామాయణములో కనీసం ఒక్క సర్గ చదివినా వినినా వేయి అశ్వమేధయాగములు చేసిన పుణ్యం లభిస్తుంది.

రామాయణము వింటే గంగానదిలోస్నానం చేసిన పుణ్యము, కాశీ, గయా, ప్రయాగ మొదలగు క్షేత్రములు దర్శించినపుణ్యము లభిస్తుంది.

రామాయణము చదివినా, విన్నా, వానికి గ్రహణ కాలములో కురుక్షేత్రములో బంగారము దానం చేసిన పుణ్యం లభిస్తుంది.

ఈ రామాయణాన్ని శ్రద్ధతో చదివినా, విన్నా, మరణానంతరము వాడు విష్ణుసాయుజ్యము పొందుతాడు. అతని భార్యా పుత్రులు సంతానము తోనూ, సంపదలతోనూ వృద్ధి పొందుతారు.

ఈ రామాయణ మహా కావ్యము గాయత్రీ స్వరూపము. ఈ సత్యమును గ్రహించి రామాయణమును పరిశుద్ధమైన అంత:కరణముతో చదవాలి.

రామాయణము ప్రతిదినము పఠించే వాడు దీర్ఘాయుష్షను పొందుతాడు. కాబట్టి ప్రతి మానవుడు ప్రతిరోజూ రాముని స్మరించాలి. రాముని ధ్యానించాలి. రామాయణము చదవాలి. ఇతరులకు వినిపించాలి.

రామాయణమును చదివినవారే కాదు, వారి తండ్రులు, తాతలు, ముత్తాతలు కూడా విష్ణుసాయుజ్యం పొందుతారు. చదివినవారి పుణ్యం వారికీ లభిస్తుంది.

రామాయణ మహా కావ్యము ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే నాలుగు పురుషార్థములను ఇస్తుంది. కాబట్టి రామాయణ నిత్య పారాయణము ప్రతి మానవుని కర్తవ్యము.

రాముని అవతార పరిసమాప్తి అయిన తరువాత చాలా సంవత్సరములు అయోధ్య నిర్మానుష్యంగా ఉంటుంది. తరువాత ఋషభుడు అనే రాజు వచ్చి అయోధ్యను పాలిస్తాడు. క్రమక్రమంగా అయోధ్య మనుష్యులతో, ఇతర ప్రాణులతో క్రిక్కిరిసిపోతుంది. అయోధ్య భారతదేశంలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతుంది.

భవిష్యత్కథతోనూ ఉత్తర కాండతోనూ నిండిన ఈ రామాయణ కావ్యము ప్రచేతసుని పుత్రుడైన వాల్మీకి మహర్షిచేత రచింప బడి, బ్రహ్మచేత ఆమోదింపబడి, దీనిని పఠించిన, విన్న, సర్వజనులకు ఆయుర్వర్ధకము, మంగళకరము అవుతుంది. ఇది బ్రహ్మవాక్కు.

ఈ విషయాన్ని మనమందరమూ ఎలుగెత్తి ముక్తకంఠంతో లోకానికి చాటిచెప్పాలి. ఇది ప్రతి మానవుడి తక్షణ కర్తవ్యము.

శ్రీమద్రామాయణము
ఉత్తర కాండము నూటపదకొండవసర్గ సంపూర్ణము.
శ్రీమద్రామాయణ మహా కావ్యము సర్వం సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

ఉపసంహారము

ఈ రామాయణ కావ్యమును రాయమని నన్ను
శ్రీ పరిటాల గోపీకృష్ణగారు ప్రేరేపించారు.
శ్రీ కె.వి.ఆర్.రావుగారు ప్రోత్సహించారు.
భక్తిపేజెస్‌కు కృష్ణార్జునులు అయిన
శ్రీ విష్ణుప్రసాద్ గారు, శ్రీ కె.వి.ఆర్.రావుగారు సహకరించారు.
సీతాలక్ష్మణభరతశత్రుఘ్న ఆంజనేయసమేత
శ్రీరామచంద్రమూర్తి ఆశీర్వదించాడు.
వీరందరి ఆశీర్వచన బలంతో నేను ఈ రామాయణ రచనను
నిర్విఘ్నంగా నిరాటంకంగా పూర్తిచేయగలిగాను.
వీరందరికీ నా కృతజ్ఞతాభివందనములు.
ఓం శాంతి: ఓం శాంతి: ఓం శాంతి:.

0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మీ | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

24. శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం 63-00
25. ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు 15-00
26. షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం 99-00
27. సాయిసత్యవ్రతం 30-00
28. సాయి అనుగ్రహమ్ 120-00
29. నవగురువారాల వ్రతకల్పము 15-00
30. శ్రీదత్తలీలామృతము 99-00
31. హృదయంలో సాయి 15-00
32. శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్ఛరిత్ర) 120-00
33. గజాననమహరాజ్ చరిత్ర 99-00

## 4. జ్యోతిషాలు

1. 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) 72-00
2. గ్రహభూమి పంచాంగము (గార్గేయ) 108.00
3. ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) 63.00
4. ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) 50.00
5. ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి 12.00
6. కాలచక్రంజ్యోతిషక్యాలండర్ 25.00
7. గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) 25.00
8. శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ 25.00
9. సాదా క్యాలండర్ 5.00
10. పాకెట్ క్యాలండర్ 15.00
11. తాజకనీలకంఠీయమ్ 100-00
12. కేరళ జ్యోతిష రహస్యాలు 180-00
13. జ్యోతిష బ్రహ్మ రహస్యాలు 180-00
14. మానసాగరి జాతకపద్ధతి 180-00
15. వరాహమిహిర జాతకపద్ధతి 180-00
16. వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు 99-00
17. సింపుల్ రెమిడీస్ 180-00
18. శంభు హోరప్రకాశిక 250-00
19. పూర్వ పరాశరి 100-00
20. పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం 200-00
21. ప్రశ్న సింధు 99-00
22. నక్షత్ర విశేష ఫలితాలు 63-00
23. సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? 180-00
24. దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? 180-00

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | | |
|---|---|---|
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోష్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

### బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్థరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

